శ్రీ

# ఆముక్తమాల్యద

నామాంతరము

## విష్ణుచిత్తీయము

శ్రీకృష్ణదేవరాయ మహారాయప్రణీతము

[illegible]

వేదము వేంకటరాయశాస్త్రిప్రణీతము

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్
౪ మల్లికేశ్వరస్వామిగుడిసందు, మదరాసు - 1



Rs. 50/-

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద-సంజీవనీవ్యాఖ్యాసమేతము

## ఉపోద్ఘాతము

### ఏతద్వ్యాఖ్యాప్రసక్తి

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో ఆముక్తమాల్యదంగూర్చి వ్యాఖ్యలును సూచికలును కొన్ని కలవు. అవియన్నియు కొన్ని భాగములకే వివరణోద్యమములు. ఈ ప్రబంధరాజమును సుబోధము సేయుటకై ఆధునికులలో అత్యుత్తమకృషి గావించినవారు మచిలీబందరు జిల్లా జడ్జి సి. పి. బ్రౌను దొరగారు. వారికి తోడ్పడిన మహాపండితులు, మనువస్వాది ప్రబంధవ్యాఖ్యాత జూలూరి అప్పయ్యపంతులవారు. మఱి లోకులకు కడచిన 40-50 సంవత్సరములలో ఈ మహాప్రబంధపుఁదత్త్వము కీర్తిశేషులైన వావిళ్ల రామస్వామిశాస్త్రి గారిచే ప్రెసిడెన్సీ కాలేజిలో ఆంధ్ర పండితులుగానుండిన చదలవాడ సీతారామశాస్త్రులు అను విద్వద్వరేణ్యుల తోడ్పాటున ముద్రిత ప్రకాశితమైన పుస్తకమువలన, ఉపలబ్ధమగుచుండినది.—వారికి ప్రథమముద్రణార్థము వ్రాతప్రతి దొరకిన ప్రకారము-గ్రంథము ప్రణీతమైన నన్నూఱు వత్సరములు అప్పుడప్పుడు వ్యాఖ్యలుకూడ పండితనిర్మితము అగుచుండినవి. 50ఏండ్లక్రిందట వానినన్నిఁటిని సంపాదించి నెల్లూరు నవాబుపేట వాస్తవ్యులు, కీర్తిశేషులు శ్రీమాన్ వింజమూరి నరసింహాచార్యులవారు బహుప్రాచీనవ్యాఖ్యా సమాకలన ప్రాయముగా నొకవ్యాఖ్యను సిద్ధపఱుచుకొనియుండిరి. అట్లుండ ఒకప్పుడు నెల్లూరిలో మూలప్పేటలో మూలస్థానేశ్వరుని కోనేటిలో కొండమీఁది నరసింహస్వామికి భక్తమండలి తెప్పతిరునాళ్ల మహోత్సవము జరుపుచుండఁగా మిళితమయిన విద్వత్పరిషత్తులో మహిమ్మమయిన గోష్ఠి విరాజిల్లుచుండుడు-నరసింహాచార్యులవారు తన సమకూర్చిన యీ వ్యాఖ్యను రామస్వామి శాస్త్రులవారికి ముద్రణ ప్రకాశనాదికమునకై ఇయ్య నంగీకారమును దెలిపిరి. అనంతరము వారివలన శ్రీశాస్త్రులవారు దానింగైకొని ఆ చదలవాడ సీతారామశాస్త్రులవారి తోడ్పాటున ముద్రణకృత్యమును నెఱవేర్చిరి. ఈవృత్తాంతము మద్గురువరేణ్యులైన యీ చదలవాడ సీతారామశాస్త్రులవారే నాకు వక్కాణించిరి. నాఁటినుండి నేఁటివఱకు ఆ వ్యాఖ్య ప్రసిద్ధమై విద్యార్థికామధేనువుగా భాసిల్లుచుండినది. ఆ వ్యాఖ్య లేనిచో ఈ ప్రబంధము ఎప్పుడో అంతరించియుండును.

ఆముక్తమాల్యదా గూఢార్థప్రకాశనకై అత్యంతమయిన కృషి గావించిన మహావిద్వాంసులలో కీర్తిశేషులు మద్గురువర్యులు వర్తమానశతాబ్దినన్నయాచార్యులవారు శబ్దరత్నాకర నిఘంటు నిర్మాణకర్తలు శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు. వీరు ఏతద్గ్రంథ తత్త్వప్రకాశకమయిన నిజకృషి నెల్ల ఆ నిజనిఘంటువులోనే నాటియున్నారు. మఱియు, ఏమతి తత్త్వమును నెలకొల్పుటకై మహాభినివేశముతో ఈకావ్యము నిర్మితమో ఆ విశిష్టాద్వైత తత్త్వమును ఈ పూర్వవ్యాఖ్యానములలో నేదియు తడవమిం జేసి ఆమతమును సరిగా వివరించుటకే ఈ మదీయవ్యాఖ్య ఆవశ్యకమయినది. కడమ కేవల కావ్యమార్గమందు సయితము విస్తరము వలసివచ్చినది.

మూలగ్రంథము అతి ప్రౌఢమగుటంబట్టి, ఆ వ్యాఖ్యలు చాలక యున్నందునను ఎంత విస్తరముగా నేని వ్యాఖ్యవలసియే యుండుటంబట్టియు ఆంధ్రభారతీ పాదపద్మారాధకుఁడనై యథామతి ఈ విపుల వ్యాఖ్యను 'సంజీవని' యను పేర రచియించి ప్రకటించినాఁడ.

నేను ఈవ్యాఖ్యను ఇప్పటికి పది పండ్రెండు సంవత్సరములకు ముందే నిర్మింప నారంభించితిని. వ్యాఖ్య ఈపాటి విపులమగునని ఆదిలో నేను ఊహించుకొనలేదు. రెండాశ్వాసములకు వ్రాసిచూడఁగా, 'బావిత్రవ్వఁగా బేతాళములు వెలువడినట్టు' అయినది. గ్రంథమునకెల్ల జీర్ణోద్ధారమే కావలసివచ్చినది. అందులకై సమగ్రసంస్కరణ-సాధుపాఠ నిర్ధారణ-కువ్యాఖ్యావిషమారణ-సమంజసార్థావిష్కరణ-పూర్వక విపులవ్యాఖ్యానమును వ్రాయనుద్యమించితిని. ఈ నావ్యాఖ్యానము పూర్తిం జెంది ఇప్పటికి అయిదారేండ్లయినవి.

## ఏతన్ముద్రణమునకు ధనప్రాప్తి.

ఒకానొకప్పుడు పోలీసువారు అశ్లీలగ్రంథవ్యాపారులపై నభియోగము కావింప నుద్యుక్తులై యుండఁగా ఆ విషయమున దొరతనమువారికి కొన్ని విన్నపములు చేయుటకై పచ్చైయప్ప కాలేజిలో పండితసభ కూడిన దినమున, ఆ సభకు, పీఠికాపురము మహారాజావారు, సర్వవిద్యాపోషకులు, మహావదాన్యులు, ఆధునిక కృష్ణదేవరాయలు,-

## శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు,

విచ్చేసియుండి సభాకార్యానంతరము,-నన్ను, "ఇప్పుడు మీరు ఏమి వ్రాయుచున్నారు?" అని యడిగిరి. ఇప్పుడు నేను ఆముక్తమాల్యదపై వ్యాఖ్య వ్రాయుచున్నాను." అని మహారాజావారికి విన్నపించితిని. "దానిని మేము వ్రాయింపఁ దలంచియున్నామే" అని వారు సెలవిచ్చిరి. "ఎవ్వరు వ్రాసినను తమరు వ్రాయించినదే కానేరదా?" అని నేను వచించితిని. అనంతరము వారి దివాను గారిచే లేఖముఖముగా "దాని ముద్రణమున కెంతపట్టును?" అని యడిగించిరి. అప్పటికి గ్రంథము ఇంత విపులమగునని ఊహింపనందున, ఆ కాలపు వెలలను ముద్రణభృతులనుం బట్టి ఇంచుమించుగా, రు. 1200 పట్టునని తెలిపితిని. ఆమొత్తమును తన్ముద్రణనిమిత్తము పారితోషికముగా వారు వెంటనే నాకు పంపిరి. ఆ మహితౌదార్యమునకు నా కృతజ్ఞతను శ్రీ శ్రీ మహారాజావారికి వెంటనే జాబుచే తెలిపికొంటిని. ఈవృత్తాంతము జర్మనుయుద్ధమునకు పూర్వము జరిగినది.

గ్రంథము పూర్వసంకల్పితమునకన్న పెక్కుమడుంగు లగుటయు, యుద్ధానంతరము ఘట్టితపటాది మూల్యములును, ముద్రణభృతులును మునుపటికన్న పెక్కుమడుంగు లగుటయు సంభవించినది. మహారాజావారొసంగిన ధనము ఆముక్తపు వ్రాఁతప్రతులను విలుచుటకును, ఓరియంటల్ లైబ్రరీలో గ్రంథశోధనలు చేయించుటకును వ్యయమైనది. అట్టిసమయమున ఆంధ్రవిద్యాపారగులును ఆంధ్రభాషాపోషకులును అగు.—

## శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎమ్. ఏ.

(ఇపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు) ఈగ్రంథము ప్రకటనార్హమని భావించి, అందులకై ధనసాహాయ్యము చేయుండని నిజమిత్త్రులను కొందఱను హెచ్చరించిరి. వారిలో ఒక్కరుమాత్రము-హైకోర్టు న్యాయవాదిపదమున కలంకారభూతులు, ప్రతిభాబృహస్పతులు, కరుణామయులు, పరోపకారపారీణులు, బహువిద్యార్థిపోషకులు, దేశోపకారులు, ఇదానీంతన

దానకర్ణులు, నాకు ఆప్తశిష్యులు, ఆప్తబంధువులు, మత్ప్రభృతి వైన పురూరిద్రావిడ సంఘమునకు చూడామణులు, బాల్యప్రభృతి నాకు అత్యంతప్రేమపాత్రము, జ్ఞానవృద్ధులు నగు-

మ-రా-రా-శ్రీ, శ్రీయుత అల్లాడి కృష్ణస్వామయ్య, బి. ఏ., బి. ఎల్., గారు.

ఏతద్గ్రంథ ముద్రణాదికమునకై రూ. 1000 లు సాయము పంపినారు. నేను జీవికయు ఆయతియు లేక ఏతద్గ్రంథ ముద్రణభారముక్రింద క్రుంగిపోవుచున్న యీ నడిమిదినములలో ఈ క్రింద పేర్కొన్న రసజ్ఞులు నాకు శతాధికరూప్యములుగా ధనము లిచ్చి నాకష్టమును తొలగించుచుండిరి. శ్రీగద్వాల సంస్థానప్రభువు

శ్రీ శ్రీ సీతారామభూపాలరావు బహద్దరువారు

తోడా జోడుశాలువలు రూ. 600 లు నొసంగిరి.

మ-రా-రా-శ్రీ, కాశీనాథుని నాగేశ్వరరావుగారు, 'ఆంధ్రపత్రి' కాధిపతి.
,, అల్లాడి సూర్యరామయ్యగారు, బి. ఏ., (వకీల్)
,, నేలటూరు వేంకటరమణయ్యగారు, ఎం. ఏ.,
,, తదనుజులు రాఘవయ్యగారు, ఎం. ఏ.,
,, దొడ్డ వేంకటరామరెడ్డిగారు. (కావలి)
,, దొడ్డ రామిరెడ్డిగారు, నిధిపతి (నెల్లూరు)
,, గోవిందరెడ్డిగారు, Dr. M. B. B. S.
,, తూములూరి శివరామయ్యగారు, బి. ఏ., బి. ఎల్.,
,, పొణకా వీరారెడ్డిగారు, (అల్లూరు)
,, చతుర్వేదుల వేంకటరాఘవయ్యగారు.
,, చతుర్వేదుల శ్రీరామయ్యగారు.

ఇట్టి యీవులచేత ఆకష్టకాలములో కుటుంబమును పోషించుకొనుచుంటిని. ఇంకను మత్సహాయులు ఎందఱో గలరు.

ఇట్లు కొందఱు వదాన్యులు ధనమిచ్చినను, ఒకప్పటికి కూడినధనము ముద్రణాదికృత్యములకు పర్యాప్తము గాకయుండినది. ఆంధ్రగీర్వాణ గ్రంథములనే రమారమి రూ. 900 లకు కొనవలసి వచ్చినది. దుర్దైవవశమున మందదృష్టినైతిని. దానంజేసి కార్యసహాయులకై రూ. 1500 ఎక్కుడుగానే వ్యయమయినది. ఆసమయమున, నేను రిక్తుఁడను రుగ్ణుఁడను నిరాయతిని బహుకుటుంబిని, ఉక్తకారణములచేత బహువ్యయుండనుంగాన, ముద్రణమునకు తక్కువపడిన ధనమును వ్యయించుటకు స్వశక్తిలేకయు నుంటిని. దాని నెఱింగి యీగ్రంథము తప్పక ముద్రితమగుఁగాక యని నెల్లూరుజిల్లా కావలితాలూకా ఇందుపూరు గ్రామవాస్తవ్యులు, భూస్వాములు—

శ్రీయుతులు ఎఱ్ఱబ్రోలు రామచంద్రారెడ్డిగారు

ఏతన్మూలకథాప్రభావంబును, ఏతద్వ్యాఖ్యాన వైపుల్యంబును తిలకించి, అవశ్యమిది ముద్రితమగుఁగాక యని పూనినవారై ఏతత్కార్య నిర్వాహముకై కావించిన యీవికి వివరణము.—

వారి ప్రథమగృహిణికి దామవర వంశాలంకారభూతులైన శ్రీమత్కమలాంబా రామిరెడ్డి నామ విఖ్యాతదంపతుల పుత్రికామణి యగు—

## శ్రీ శ్రీదేవమ్మగారికి,

పుణ్యశేషురాలికి, పతికి ప్రాణములో ప్రాణముగాను, మనస్సులో మనస్సుగాను ఉండిన వివేకశాలినికి భాగ్యశాలినికి, ఆ గౌరీమహాలక్ష్ములవలె పావనరూపసంపన్నురైన ఆశ్రితపోషణ సేవక వాత్సల్య దేవబ్రాహ్మణభక్తి దీనానుకంపా సద్విద్యారసగ్రహణ ప్రజ్ఞలచే విరాజిల్లిన మహనీయురాలికి, తేజవరాలికి, శాశ్వత పుణ్యలోకనివాసము కల్గునట్లుగా ధర్మవ్యయము చేయ సంకల్పించి యుంచిన ధనమునుండి నాకు ఏతద్గ్రంథముద్రణపూర్తికై అప్పుడప్పుడు రూ. 2500 ల పరిమితిం జెందువఱకు విరాళ మొసంగిరి. అట్టి యా విద్యాభిమానులు శ్రీ రెడ్డిగారు నన్ను కోరిన దేమనఁగా—

మర్త్యులు ఎంతకాలము మర్త్యలోకమున స్మరింపఁబడుదురో అంతకాలము వారికి స్వర్లోకనివాసభాగ్యము కలుగును.—

'క్షితి నెవ్వనినామము స। త్కృతి నెన్ని దినంబు లుండు దివి నాపుణ్య
వ్రతుఁ డంతకాల ముండును, । ధృతి నింద్రద్యుమ్నునికి దృష్టాంతముగా.'

అను ధర్మవచనమును ప్రమాణీకరించినవారై తమ యాదేవేరికి ఆమహాభాగ్యము కలుగునట్లుగా తద్గుణసంపత్ప్రస్తావపూర్వకముగా ఈ గ్రంథమున తచ్ఛుభనామ సంఘటనము గావింప నన్నుం గోరినారు. పురుషుల విద్యాభిమానగుణసంపదలకన్న ఇట్టి యిల్లాండ్ర వైదుష్యమహిమను స్త్రీవిద్య కొఱవడుచున్న మనదేశమున అభినందించుట అత్యంతప్రధానము గదా యని నేనును పరమసంతోషముతో ఆభాగ్యశాలినిని ఏతద్ధర్మ నిదానముగా ఇందు నిరూపించినాఁడను.

ఆనుషంగికముగా నిచట మదీయ మహోపకారులును మత్పోషకప్రాయులును అయిన రసికవిద్వచ్ఛిఖామణులను కీర్తిశేషులైన,

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజా
శ్రీ వెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రబహద్దరు, కె. సి. ఐ. ఇ.,

వారిని స్మరించునందులకు విద్యాభిమానులు నాపై కినియరు గావుత. ఆ ప్రభువు నాకు ఉపకృతి చేసిన ప్రకారము ఒండు విశదీకరించెద.

నేను నా యాంధ్రాభిజ్ఞాన శాకుంతలమును ప్రకటించి వారికి ఒకప్రతి పంపితిని. అంతట వారు నాతో సమావేశముం గోరి మదరాసు మౌంటురోడ్డు మోతీమహలులో నాకు దర్శన మొసంగి, సల్లాపానంతరము నాకు కొంతధనము పారితోషిక మొసంగవచ్చిరి. నేను వారిని ఇట్లు ప్రశ్నించితిని. ''ఈ గ్రంథము ముద్రితమైనది. దీనికై యిప్పుడు నేను అధమర్ణుఁడనుగాను. జీవనముకై నాకు క్రిస్టియన్ కాలేజిలో కొలువున్నది. ఏల ఏలినవారు నాకు ఈ ధన మీయవలయును; ఏల నేను కైకొనవలయును'' అంతట వారు సెలవిచ్చిరి.—

''మీకు కాలేజిలో జీతము స్వల్పము. అది మీకు కుటుంబభరణమునకే చాలదు. మీరు పుస్తకములు అచ్చువేయించుటకు ఋణములు చేసి ఇబ్బందిపడుదురేని మఱిపుస్తకములు వ్రాయరు. మీరు వ్రాయవలసినది, మేము ముద్రింపింపవలసినది. మన మిరువురము పరస్పరసాహాయ్యముతో ఈతీరున లోకోపకారము చేయవలసినవారము. కావున మీరు ఈ లేశమును గ్రహించుట యుక్తము''. ఆ మాటకును ఆప్రసాదమునకును నేను అత్యంతము సంతుష్టుఁడనై ఆపైకమును గ్రహించితిని. అప్పటి



**The late Sri Sridevamma Garu**

*Wife of Sri Yerrabrolu Ramachandra Reddy Garu of Nellore Dt.*

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద - విషయసూచిక

## ప్రకాశకవిజ్ఞప్తి



## పీఠిక

ఆముక్తమాల్యద



**Sri Krishnadeva Raya & his Queens Chinnadevi & Tirumaladevi**

( Metal Images at Tirumala )

*—By courtesy of The Archaeological Survey of India, Madras.*

# ప్రకాశక విజ్ఞప్తి

ఈయాముక్తమాల్యదా సంజీవనీవ్యాఖ్యను మాతాతగారు ప్రకటించి (1927) నేటికి ముప్పదియాఱేండ్లు. ఒక్క వేయిప్రతులే ముద్రింపఁబడినవి. మఱల పునర్ముద్రణభాగ్య మిన్నాళ్లకు కలిగినది. ఈప్రబంధమును రచియించిన మహాకవి సర్వదక్షిణాపథ చక్రవర్తిగా ఇరువదేండ్లు వెలింగిన శ్రీకృష్ణదేవరాయలు. ప్రథమముద్రణావసరమున మాతాతగారు ప్రత్యేకముగా తారీఖులతోడి కవిజీవితచరితాదులను వ్రాయలేదు. నాఁటికింకను చరిత్ర ఎంతో తెలిసికొనవలసిన స్థితియందుండినది. తర్వాత చాల పరిశోధన జరిగినది. రాయలవారినిగుఱించి వ్రాయుటకు నేఁడెంతో సామగ్రి దొరకియున్నది; తామ్రపట్టికలును శిలాశాసనములును దాదాఁపు ఐదువందలవఱకు కలవట. ఇవి సంస్కృతాంధ్రద్రావిడ కర్ణాటభాషలలో నున్నవి. నాఁటి కవీశ్వరులును పండితులును ప్రభువులను కొనియాడుచు గ్రంథములు వ్రాసియున్నారు. సమకాలిక మహమ్మదీయులును విదేశీయవర్తకులుగా వచ్చిన పోర్చుగీసువారును విజయనగరముపై విస్తారముగా వ్రాసియున్నారు. ఇవిగాక దేశమందలి గ్రామములలోని దండకవిలెలును కైఫీయతులును విస్తారము దొరకినవి. అన్నిటికిని మకుటాయమానముగా రాయలవారి యాముక్తమాల్యద ఆనాఁటి జనజీవనమును మనకు కన్నులకు కట్టినట్లు తెలుపుచున్నది. వీనినెల్ల సమన్వయించి చరిత్రకారులు పలువురు చక్కని గ్రంథములు రచించియున్నారు. వారువారురచించిన విషయముల సారాంశముల ననుబంధించుచు నాకుఁ దోఁచిన నూతనాంశములను లఘువుగా హెచ్చరింప యత్నించెద.

## ౧ విజయనగర సామ్రాజ్యము

క్రీ. శ. 1336 వ సం॥ శ్రీవిద్యారణ్యస్వాములవారు తుంగభద్రానదీదక్షిణతీరమున విజయనగర నిర్మాణమునకు శంకుస్థాపన మొనర్చి ఆసమయమందే శా.శ. 1258 ధాతు వైశాఖ శు.7 పుష్యమీనక్షత్ర సింహలగ్నమున శనివారమునందు (క్రీ.శ. 1336 మే 1 శనివారము) హరిహరరాయలకు పట్టాభిషేక మొనర్చిరి. ఇది నాఁటిరాజకీయచరిత్రలో నొక మహాకార్యముగా గణింపఁబడినది. ఎందులకనఁగా విజయనగరస్థాపనము ఊరక రాజ్యకాంక్ష వలన నేర్పడినది కాదు. ఆనాఁడు హిందూధర్మమును మహమ్మదీయులబారినుండి కాపాడవలసిన యావశ్యకత ఎంతేనియు ఉండినది. ఓరుగంటి కాకతీయరాజ్యము పడిపోఁగానే హిందువులకు నిలువనీడ లేకపోయినది. అట్టి తరుణమున హిందూధర్మ పునరుద్ధరణమునకే యీ విజయనగరరాజ్యమును శ్రీ మాధవ విద్యారణ్యస్వాములవారు స్థాపించిరి. వీరే లేనిచో హిందూధర్మ మేమైయుండెడివో!

ఇట్లు స్వామివారిచే స్థాపింపఁబడిన యీ సామ్రాజ్యమును మొదట సంగమవంశపురాజులు హరిహరరాయలు మొదలు ప్రౌఢదేవరాయలవఱకు పాలించిరి. ఇతనికడనుండి దేశక్షేమార్థము సాళువగుండ నరసింహరాయలు రాజ్యమును హరించెను. ఇతఁడు మహాజేత: ఆఱేండ్లు సామ్రాజ్యాధినాయకుఁడుగానుండి అవసానకాలమున తన సేనానాయకుఁడైన తుళువ నరసానాయకుని స్వాధీనమునకీరాజ్యమును బాలురైన తనకుమారులను, తిమ్మరాయ తమ్మరాయలనువారలను, ఉంచి వారిని రక్షించి వారిలో యోగ్యునికి పట్టాభిషేకము సేయవలసినదని కోరి తాను ప్రాణములు వదలెను. కార్యకర్తయు రక్షకుఁడునుగా నేర్పడిన తుళువనరసనాయకుఁడు మొదట క్రీ.శ. 1486లో

తిమ్మభూపాలుని సింహాసన మెక్కించెను. కాని రక్షకుఁడైన నరసానాయకుని శత్రువొకఁడా బాలుని విషప్రయోగముచే చంపఁగా నాతనితమ్ముని తిమ్మరాయని ఇమ్మడి నరసింహరాయలను పేర సింహాసన మెక్కించెను. ఈ యువకుఁడు క్రమముగా కుట్రగోరులమాటలువిని నరసానాయకుని యధికారమును సహింపక అతనిని తొలఁగఁద్రోయుటకు ప్రయత్నించెను. పరిస్థితులు విషమింపఁగా నొకదినము నరసానాయకుఁడు వేఁటకని మిషపెట్టి మార్గాంతరమున విజయనగరమునుండి వెలువడి గొప్పదండుతో మరలివచ్చి ముట్టడించి, తనశత్రువులను తఱిమి, రాజధానిని కైకొని, తనయధి కారమును మునుపటికన్నను చక్కఁగా గట్టిపరచుకొనెను. ఈవిషయమునే ముక్కుతిమ్మన పారిజాతాపహరణమున 'ఖంతలేశ్వరుఁడు సిక్కువడంగ విద్యాపురంబుఁ గైకొని నిజప్రౌఢి నెరపె.' అని చెప్పినాఁడు.

తర్వాత తిమ్మరాయఁడు (ఇమ్మడి నరసింహుఁడు) ఊరకుండక ఏదో యొకచిక్కు తెచ్చి పెట్టుచునేయుండుటనుచూచి అతనిని రక్షణకొఱకని మిషపెట్టి, నరసానాయకుఁడు పెనుగొండ దుర్గములో నుంచెను; ఆదుర్గమునకు ఇరువదివేలసైన్యముతో తిమ్మపనాయుఁడను నతని కాపుంచెను. తన మరణకాలమువఱకు (క్రీ. శ. 1503) తానే ప్రభువుగా వ్యవహరించెను. ఇతనితర్వాత నితని పెద్దకుమారుఁడు ఇమ్మడి నరసానాయకుఁడు సంరక్షకుఁడై కొన్నాళ్లుండి క్రీ. శ. 1506 లో తిమ్మయదేవుఁడను సాళువ ఇమ్మడి నరసింహరాయలను చంపించి వీరనరసింహరాయ లనుపేరు వహించి తానే విజయనగరసింహాసనాసీనుఁడాయెను; క్రీ. శ. 1505 నుండి 1509 వఱకు పాలించెను. ఇతఁడు రాజ్యమును అపహరించినాఁడనుటచేత కాఁబోలు దేశమున అల్లరులు లేచినవి. సామంతులు తిరుగఁబడిరి. అట్టిసందర్భమున బిజాపురసుల్తాను యూసఫ్ ఆడిల్ ఖాను ఎత్తి వచ్చెను. ఈసమయమున ఆరెవీటి రామరాజును అతనికుమారుఁడు తిమ్మరాజును నరసింహరాయలకు అండఁగా నిలిచిరి. రామరాజు ఆడిల్ ఖానుని పాఱద్రోలెను. ఆదవని కర్నూలు మొదలైనప్రదేశములను మరల స్వాధీనముచేసికొనెను. కర్ణాటకమున తిరుగఁబడినవారు ఉమ్మత్తూరినాయకులు. మైసూరు, బెంగుళూరు, టుంకూరు, కోయంబత్తూరు, సేలము జిల్లాలభాగములు వీరి యేలుబడిలో నుండినవి. వీరనరసింహరాయఁడు తనరాజధానియైన విజయనగరమును తనతమ్ముఁడైన శ్రీకృష్ణదేవ రాయలరక్షణ కొప్పగించి, తాను తనయితరసోదరులైన అచ్యుతరాయ శ్రీరంగరాయండ్రతో ఉమ్మత్తూరిమీఁదికి ఎత్తిపోయెను. మూఁడునెలలు ముట్టడించియు సాధ్యపడక ఉమ్మత్తూరినివదలి శ్రీరంగపట్టణమును ముట్టడించెను. అచ్చటను పరాజయమునంది వెనుదిరిగెను. ఇట్లు ఉమ్మత్తూరు స్వాధీనము కాకపోయినను వీరనరసింహరాయలు తుళువరాజ్యమును జయించి, మంగుళూరులో కొంతకాల ముండెను. కాని ఉమ్మత్తూరు శ్రీరంగపట్టణములకడ నొందిన పరాభవ మీతనిహృదయము బాధించుచుండెను. అందులకై గొప్పసైన్యమును యుద్ధసామగ్రులను ప్రోగుచేయ నారంభించెను. సైన్యముయొక్క శక్తిసామర్థ్యములను పెంపొందించుటకు తగుప్రయత్నములు చేసెను; అశ్వికదళమును వృద్ధిపరచెను; వర్ణవ్యవస్థ లేకసైన్యమునందు వీరుల నెందఱనో చేర్చుకొనెను; వీరోచితకార్యములకు రాజసన్మానము లిచ్చుచుండెను. ఇట్లుచేసి తాను పరిపాలించినది కొలఁదికాల మేయైనను దేశమును కట్టుదిట్టములు చేసిపోఁగా శ్రీకృష్ణదేవరాయలు తర్వాత అధిపతియాయెను.

## ౨ రాయలవంశము

చంద్రవంశక్షత్రియులలో తుర్వసు వంశమందు జనించిన రాజులు క్రమముగా తుళువవంశమువారైరట. వీరిలో ప్రసిద్ధుఁడు తిమ్మరాజు. అతనిరాణి దేవకి. వీరికొమారుఁడు ఈశ్వరరాజు.

ఇతనిరాణి బుక్కమ్మ. వీరి తనయుఁడు నరసానాయకుఁడు. ఇతనికి ముగ్గురు రాణులు - తిప్పాంబ, నాగాంబ, ఓబాంబ. వీరిలో మొదటియిరువురకు క్రమముగా వీరనరసింహరాయలును, శ్రీకృష్ణదేవరాయలును, మూఁడవరాణికి శ్రీరంగరాయ అచ్యుతరాయంద్రును పుట్టిరి. వీరు మొదట తుళుదేశమువారు. అట్లని వరాహపురాణమందును ఆముక్తమాల్యదయందును కలదు. తుర్వసు ప్రస్తావము మొట్టమొదటి పర్యాయము రాయలకాలమందే వచ్చినది. మొదట వీరికి 'రాయ' బిరుదముకూడ లేదు. 'నాయక' లనియే. ఈశ్వరనాయకుఁడును నరసానాయకుఁడును నాయక అనఁబడిరి. వీరిలో రాయసింహాసన మాక్రమించిన కారణముచేత వీరనరసింహుఁడు మొట్టమొదటి రాయలు. వీరి పౌరాణిక వంశవృక్షము కల్పితమని ప్రత్యేకముగా చెప్పనక్కఱలేదు. వీరు క్షత్రియు లనియు కారనియు అభిప్రాయభేదము లున్నవి. వీరాంధ్రులు కారనికొందఱందురుగాని చిరకాల నివాసముచేత ఆంధ్రత్వ మలవడి ఆంధ్రరాజవంశములతో సంబంధబాంధవ్యములు చేసినవారును ఆంధ్రవాఙ్మయమును తమదిగా భావించి పోషించినవారును ఆంధ్రులు కాకపోవుట యెట్టిది? వీరు చంద్రగిరియందలి సాళువరాజుల నాశ్రయించి యచటనే స్థిరనివాస మేర్పఱచుకొనిరి. ఇట్లు ఆంధ్రులైన ఆంధ్రేతరు లెందఱో గలరుగాన నిదియొక చర్చనీయాంశము గాదు.

## 3 కృష్ణదేవరాయల జననకాలము

ఈయంశమును స్పష్టముగా తెలుపునట్టి ప్రమాణమేదియు నింతవఱకును దొరకలేదు. సమకాలికుఁడైన పోర్చుగీసు వర్తకుఁడు న్యూనిజు రాయలు రాజ్యమునకు వచ్చినప్పుడు ఇరువదియేండ్లకు పైఁబడిన వయసువాఁడని వ్రాసినందున, ఇతని రాజ్యారంభకాలము క్రీ.శ. 1509 కి కుదురుచున్నందున, అంతకు ఇరువది యేండ్లు, అనఁగా క్రీ.శ. 1489 ప్రాంతమో లేక అంతకు కొంతముందో అని యొక యభిప్రాయమేర్పడి యుండినది. కాని మనదేశమందే పరంపరగా వచ్చుచున్న విషయములను చూడఁగా పరస్పర విరుద్ధాభిప్రాయములు కనఁబడుచున్నవి. అందుచేత వీనినెల్ల ఎంత సమన్వయింపఁ బ్రయత్నించినను చరిత్రకారులు ఒకనిర్ణయమునకు ఒప్పుకొనలేక భిన్నాభిప్రాయులై యున్నారు. కాని ఒకపాటి నిర్దేశము స్థూలముగా చేయవచ్చునేమో.

పరంపరగా అల్లసానిపెద్దన చాటుధారయని ఈపద్యము నుదాహరింతురు—

"భోరనయాచక ప్రతతి భూరి విపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహన శకాబ్దము లద్రియుగాబ్ధి సోములం
దారణ వత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
ష్ఠీ రవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు చేరెస్వర్గముఁ
ద్వారకనున్న కృష్ణుఁ డవతార సమాప్తము నొందునైవడిన్"

ఈతారణ క్రీ.శ. 1524 అగుచున్నది. దీనినిబట్టి రాయలు క్రీ.శ. 1484 లో జనించియుండునని తలంచిరిగాని రాయలు 1529-30 వఱకు జీవించియుండినటుల శాసనము లుండుటచేత ఈ చాటువు త్యక్తమైనది. ఇదిగాక మఱియొకచాటువు జననమునుగూర్చియే యున్నది—

"అందలి శాలివాహన శకాబ్దము లద్రివసుత్రిసోములన్
వందితమైన యవ్వికృతి వత్సరమందలి పుష్యమాస మం
దుందగు కృష్ణపక్షమున నుండెడి ద్వాదశి శుక్రవాసరం
బం దుదయించెఁ గృష్ణుఁడు శుభాన్వితుఁ డానరసింహమూర్తికిన్"

దీనింబట్టి శా. శ. 1387 వికృతి పుష్య బహుళద్వాదశీ శుక్రవారము (క్రీ. శ. 1465) రాయల జనన మగుచున్నది. కాని 1887 శా. శకము వికృతికాదు. తారణయో పార్థివయో. వారము కుదురుటలేదు. వికృతి కావలయునేని శకము 1392 అగును. అందులకు 'ద్వినవత్రిసోము లకా' అని కొందఱు దిద్దిరి. శకమే యుండవలయునన్న 1387+78=1465 అగును. ఇది న్యూనిజు వ్రాఁతకు, రాజ్యమునకు వచ్చినప్పుడు ఇంచుమించు ఇరువదియేండ్లన్న దానికి, కుదురదు. నలువది నాలుగేండ్లగుచున్నది. అందువలన ఈచాటువుకూడ త్యజింపవలసి వచ్చినది. న్యూనిజునే యాధారముగా గ్రహించి దానికి ఇతరసందర్భములను ముడిపెట్టి కొందఱు (క్రీ. శ. 1487 ప్రాంతము రాయల జననకాలమని నిర్ణయించిరి) కొందఱు పండితులు వరాహపురాణము నాధారపఱచుకొని అందు నరసనాయకుని చెంత వీరనరసింహరాయలు వర్ణింపఁబడినాఁడు గాని కృష్ణదేవరాయలు లేఁడు గాన నాఁటి కితఁడు జనింపలేదనియు, నరసానాయకుఁడు సాళువనరసింహరాయల సేనాధిపతిగా కనఁబడుచున్నాఁడు గాన నీకావ్యము క్రీ. శ. 1486_1492 నడుమ రచితము, కాఁబట్టి రాయలజననకాలము క్రీ.శ. 1486 ప్రాంతము కావచ్చును_అని సిద్ధాంతీకరించినారు. ఆపద్య మిది.

సీ. అష్టభాషా కవిత్వాబ్జ సంఘవులైన సుకవి పుంగవులు సంస్తుతులు సేయ,
సంకీర్ణరాగ రంజకులైన గాణలగములు గీతప్రబంధములుపాడ,
కలకంకణక్వాణ కరసరోరుహలైన రమణులు వింజామరములువీవ,
వరబలాధికులైన శరణాగతారాతి సామంతు లుభయ పార్శ్వములఁగొలువ,
గూర్శితనయుండు నరసయ్యగుణనిధాన, మంతికంబున సేవింప నలఁజికొనిన
సురభికాశ్మీరగంధంబు సోడుముట్ట, నుండెఁబెరోలగము నయనోత్సకముగ.

ఇదికూడ న్యూనిజు వ్రాఁతకు అనుకూలముగా నున్నదని భావించి, "రాయలు భోగకాంతాతనయుఁ డగుటచే వరాహపురాణకర్తలాతనిం బేర్కొనలేదనువాద మంగీకార్యము కాదు... ఈతఁ డప్పటికి జన్మింపక పోయియుండును"అని నిర్ణయించిరి. చాలయుక్తియుక్తముగానే కనఁబడుచున్నది.

కాని ఇటీవల ఈవిషయములను కూలంకషముగా చర్చించి శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు 'రాయలు మరణకాలమప్పుడు నలువదియేండ్లవాఁడని తలంచుట కేయాధారమును కానరాదు....ముసలివాఁ డగునంతవఱకు జీవించియుండె ననుటకుఁ గొంతయాధారము గలదు.' అని నిర్ణయించినారు. (భారతి. విరోధి, చైత్రము.) దాని నిట నుదాహరించెద. "రాయల వయస్సునుగుఱించిన ప్రస్తావము న్యూనిజుగ్రంథమున నొకటిరెండు తావుల గానవచ్చుచున్నది. కృష్ణరాయల కుమారునివిషయము చెప్పుచు న్యూనిజిట్లు వ్రాసియున్నాఁడు.—'రాజు (కృష్ణరాయలు) దీనిని (కలుబరిగె దండయాత్రను) ముగించి, తనశత్రువు లందరిపై భూరివిజయములను బడసినపిమ్మట, తాను అప్పటికే వృద్ధుఁడగుటచే దనవార్ధక్యమునందు విశ్రాంతిసందవలయుననియు, దన మరణానంతరము దనపుత్త్రుఁడు రాజుగావలయుననియుఁ గోరి యాతఁ డాఱేండ్లబాలుఁ డగుటవలన దాను గతించిన వెనుక స్థితిగతు లెట్లుండునో యని శంకించి బ్రతికయుండఁగనే యతని రాజునుజేయ నిశ్చయించుకొనెను. ఆకారణమువలన నతఁడు దనసింహాసనమును, యావదధికారకారమును (రాజ) నామమును త్యజించి, వానిని తనకుమారునికిచ్చి తా నతనికిఁ బ్రధానియై యంతకుముందు తనకుఁ బ్రధానియైయుండిన సాల్వతినిదను దనకు మంత్రినిగావించుకొని యతని పుత్త్రులం దొక్కని (రాజ్యమున) మహాసామంతుని గావించెను."

కలుబరిగె దండయాత్రకాలము రాయచూరు విజయానంతరము. కాన క్రీ. శ. 1522 లో కలుబరిగెవిజయము. ఇది తర్వాత. రాయలవారికి క్రీ. శ. 1517 వఱకు పుత్రసంతానము లేదు. 1518 లో కుమారుఁడు కలిగినట్లు శాసనములు గలవు. పుత్రునికి క్రీ. శ. 1524 నాఁటికి ఆఱేండ్లు. నాఁటికే రాయలు వృద్ధుఁడని న్యూనిజు అభిప్రాయమని తెలుచున్నది అను నభిప్రాయమునిచ్చి శ్రీ వెంకటరమణయ్యగారు ఎంతవృద్ధుఁడుగా నుండుననుటనుగూర్చి యిట్లు చర్చించినారు. "ఎన్నియేండ్ల వృద్ధుఁడో చెప్పుటకు వీలులేదు. కాని న్యూనిజు తన గ్రంథమునం దొకచోట వీరనరసింహరాయల మరణసమయమున కృష్ణరాయల వయసిరువదేండ్లకు పైబడియుండెనని వ్రాసినాఁడు. వీరనరసింహరాయలు శకాబ్దము 1431-వ సం॥ (+78=1509) కాలధర్మము నొందెను. అప్పుడు కృష్ణరాయలు ఇరువదియేండ్లకు పైబడిన వయసుగలవాఁడైనచో శకాబ్దము 1411-వ సం॥మునకు ముందు పుట్టియుండవలయును. ఎంతకుముందో చెప్పుటకు వీలులేదు. ...కృష్ణదేవరాయలు దన నలువదవయేట పరలోకగతుఁ డాయెనని యెంచుటకు వలనుపడదు. ఏలన సమకాలికుఁడైన న్యూనిజు రాయలు తనపుత్రుని రాజునుచేసినప్పుడే వృద్ధుఁడని చెప్పియున్నాఁడు. నలువదియేండ్లవయసుగల మనుష్యు నెవఁడును వృద్ధుఁడని చెప్పఁడు. ఏఁబదియేండ్లవయసుగలవానినిగూడ వృద్ధుఁడనిచెప్పుట యరుదు. ఇంచుమించుగ నఱువదియేండ్లప్రాయముగలవానినే లోకులు వృద్ధుఁడందురు. శకము 1411-వ సం॥మున న్యూనిజు కృష్ణరాయలవయస్సు ముప్పదియనిచెప్పక ఇరువదియేండ్లకు పైఁబడియుండెనని చెప్పియుండుటవలన నతనివయసప్పు డిరువదియేఁడ్లకెక్కువగను, ముప్పదేండ్లకు తక్కువగను నుండెనని మనము గ్రహింపవచ్చును. అతని ప్రాయ మప్పు డిరువదితొమ్మిదేండ్లై యుండెనని యనుకొన్నను కుమారునికి రాజ్యాధికార మొసంగినప్పుడు అనఁగా శకము 1446-వ సం॥మున నతఁడు నలువదిరెండేండ్లవాఁడై యుండును. అట్లయిన కృష్ణరాయల జననకాలము శకాబ్దము 1404 సం॥ కావలయును. కాని నలువదిరెండేండ్ల వయసుగల కృష్ణరాయలను న్యూనిజు వృద్ధుఁడనిచెప్పుట యసంగతము. కావున ఇరువదియేండ్ల పైబడినవాఁడని చెప్పుటలో న్యూనిజు ఉద్దేశము. అతనివయసును లెక్కింపవలయునని కాదు; అతఁడు రాజ్యాధిపత్యమును వహించుట కర్హవయస్కుఁ డని తెల్పుటయే. ఈ యభిప్రాయము సరియైనచో శకాబ్దము 1411 లో నిరువదేండ్లకుమించిన వయసుగల కృష్ణరాయలు మఱి పండ్రెండేండ్లు గడచినతరువాత శకాబ్దము 1446 లో వృద్ధుఁడగుటలో వింత లేదు. అతనివయస్సప్పు డేఁబదిసంవత్సరములని యెంచిన నతఁడు శకాబ్దము 1396 ప్రాంతమున (క్రీ. శ. 1474) బుట్టియుండవచ్చును. కాని యిది కేవలము నిరాధారమైన యూహ. లభ్యమైన సాక్ష్యము నాధారపరచుకొని ఇంతకంటె కచ్చితముగ నతని జన్మకాలమును నిర్ణయించి చెప్పుటకు వీలులేదు."

ఈపరిశోధనచే రాయలు ఒకపాటి పెద్దవయసు వాఁడైన వెనుకనే గతించెనని తెలియుచున్నది. ఇదివరలో పండితులు 'అందఱ శాలివాహన' పద్యమును న్యూనిజువ్రాఁతతో సరిపడదనందుచేతగదా త్యజించిరి. ఇందులకు అనుగుణముగా అళియరామరాయల వయసును పరిశీలించినయెడల వాస్తవము గోచరించును. అళియరామరాయలు రక్కసితంగడిలో, మహమ్మదీయులతోడి పోరాటమున క్రీ.శ. 1565 సం॥మున తన తొంబదియాఱవయేట మరణించెనని చరిత్రకారు లొప్పుకొని యున్నారు. ఇందులకు కూటో అను పోర్చుగీసువాని వ్రాఁత సాక్ష్యము. ఇతఁడు విజయనగరమున ఆనాఁడుండి స్వయముగా చూచి వ్రాసినవాఁడు. సీవెల్, హీరాసు, మొదలైన చరిత్రకారు లందఱు ఇతనినే ప్రమాణముగా గ్రహించినారు. దీనిని బట్టి వెనుకకు లెక్క వేయుదుమేని కృష్ణ

రాయల నిర్యాణకాలమున (క్రీ.శ. 1530 నాటికి) రామరాయలవయస్సు (96-35=)61. ఈతఁడు 1469 లో జనించి యుండవలెను. కృష్ణరాయలకన్న పెద్దవాఁడా! అంతటిరాయలు తన చిన్న కొమార్తెను అంత వయసు మీఱిన వానికా ఇచ్చినాఁడు! ఇది వాస్తవమేని ఆశ్చర్యపడ వలసిన విషయముగదా! దీనిని బట్టి ఒకటి తేలుచున్నది, - రాయల జననకాలము 1487, 1470 ల నుండి చాలవెనుకకు పోవలయును, లేదా రామరాయలు అంతటి వృద్ధుఁడు కాఁడేమో అనవలయును. ఈవిషయమున ప్రాచీనరచయితల నిట్లు హీరాస్ గారు ఉదాహరించినారు. ఫెరిస్తా, రామరాయలకు వయసు మరణకాలమున డెబ్బది యన్నాఁడట; బుర్ హాన్ - ఇ - మాసిర్, ఎనుబది; కూటో తొంబదియాఱు. కంటితో చూచినవాఁడు కూటో గాన కూటో మాటయే నిజమని హీరాసుగారు గ్రహించిరి. వీరింబట్టి చూచిన రామరాయల జన్మకాలము క్రీ.శ. 1495, 1485, 1469 అగుచున్నది. ఇందుదేనిని గ్రహించుట? కూటో ఒకఁడే చరిత్రకారులకు పనికి వచ్చినాఁడు. కాబట్టి రాయలు 1465 కు చాలముందు జనించి యుండవలయును గదా. మరణకాలమునకు దాదాఁపు డెబ్బదియేండ్ల వృద్ధుఁడు. న్యూనిజు రెండవవ్రాత సాధువే. పట్టాభిషేకకాలమున ఇరువదికి పైఁబడిన వయసువాఁడనఁగా పరిపాలన యోగ్యుఁడని యర్థము.

మఱి కూటో, న్యూనిజులతో సమానముగా వరాహపురాణకర్తలు సమకాలికులుగదా; వారి మాటయేమి? అను ప్రశ్న ఉదయించునుగదా. సమాధానమేమి? తండ్రియోలగమున దాదాఁపు ముప్పదేండ్ల కుమారుఁడుండక పోవుట యెట్లేర్పడినది. రాయలు దాసీపుత్త్రుఁడని ఏవేవో కథ లున్నవిగదా వానిని నమ్ముటయా? అది ఎంతమాత్రము సరిపడదు. రాయలతల్లి భోగస్త్రీ కాదని వీరనరసింహరాయల శాసనములచేత స్పష్టముగా తెలియుచున్నదనియు, అట్టి రహస్యమేదైన నుండిన న్యూనిజు తప్పక చెప్పియుండెడివాఁడనియు శ్రీ వెంకటరమణయ్యగారే వ్రాసియున్నారు. (చూ. పై భారతి)

"తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్ర స్తస్మా త్పంక్తి రథాదివ
వీరౌ వినయినౌ రామలక్ష్మణౌ వివనందనౌ
జాతౌ వీరనృసింహేన్ద్రః కృష్ణరాయమహీపతీ."

(శ్రీ కంచి కామకోటి శంకరాచార్యులవారియొద్ద నుండు తామ్రశాసనములు)

"తస్మాన్నరసరాజేంద్రా త్తిప్పాజీనాగమాంబయోః
క్రమాద్వీరనృసింహేంద్ర కృష్ణరాయౌ బభూవతుః,
అన్యోన్యోపమయోస్సర్గ సద్గుణౌఘ సముద్రయోః
తయోర్వీరనృసింహేంద్రః పిత్ర్యంసింహాసనం శ్రితః"

(ఎపిగ్రాఫియా కర్ణాటికా సం. 10-77)

ఇట్లు రామలక్ష్మణులవలె నుండువారు తండ్రిసభలో కలసియుండియుండవలదా? ఇందులకు జన్మవిషయము కారణముగాదు. నాగలాదేవియు సత్కులసంజాతయే. మఱేదికారణము? తండ్రి మరణానంతరము వీరనరసింహరాయల కాలమునుండియు రాయలకు ప్రాముఖ్యము కనఁబడుచున్నది గాని తత్పూర్వము తండ్రికాలమున నాతఁడు ఎందును ప్రవేశింపకయుండెనని చెప్పుట కవకాశము కలదు. ఏలయనఁగా,

మొదటిది - ఈకవీశ్వరుల రచనలను పూర్తిగా విశ్వసింపరాదు. వీరి ప్రధానోద్దేశము స్తోత్రపారాయణము. పెద్దనాదులుకూడ నరసానాయకుని ఇరువురు దేవేరులనే పేర్కొని ఓబాంబను ఆమెకుమారులను శ్రీరంగాచ్యుతరాయేంద్రను స్మరింపలేదుగదా. ఈ శాసనములకును ఆ కావ్యములకును తర్వాత వారు పుట్టియుండరుగదా. కంటియెదుట ఉండిన వీరి నేవదలినట్టి కవుల వలెనే కృష్ణరాయనిపేరు వరాహపురాణ రచయితలు వదలినంతమాత్రమున అతఁడు నాఁటికి లేఁడనరాదు. పెద్దన, తిప్పాంబా నాగాంబలను ఊరక పేర్కొని ఓబాంబనువదలఁగా ముక్కు తిమ్మన వీరిని ఇరువురను 'కులసతు'లని భావగర్భముగా ప్రయోగించినాఁడు—

"అనరసమహీమహిళా, జానికి గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బా నాగాంబిక లిరువురు, దానవ దమనునకురమయు ధరయునుబోలెన్"

ఓబాంబ కులసతికాదా? శాంతమ్ పాపమ్. ఆమె కులసతియే. ఏదో యన్యాయము జరిగియుండును. ధార్మికుఁడు రాయలు తనకుతర్వాత, తన అల్లుఁడు రామరాయ లుండినను, తనతమ్మునికి అచ్యుత రాయలకు రాజ్య మిప్పించినాఁడు. వీనికెల్ల మూఁడఁగా వీరనరసింహరాయలు తండ్రియనంతరము కృష్ణరాయలకు చాలమర్యాద నిచ్చినాఁడని స్పష్టముగాఁ దెలియుచున్నది. అందులకు కారణము తెలియుటలేదుగాని న్యూనిజు రచనవలన కృష్ణరాయనిరాజ్యమున కేదో హక్కుండిన ట్లొకధ్వని కనఁబడుచున్నది.

రెండవది - న్యూనిజువ్రాఁతలను జాగ్రతగా పరిశీలించిన యెడల రాయలు తాను రాజగుదునని యెన్నడును తలంపలేదని యొక రహస్యము వెలువడుచున్నది. వీరనరసింహరాయలు తన యవసానకాలమున కృష్ణరాయలకండ్లు తీయించి తనకు చూపి తనకుమారునికి పట్టము గట్టుమని తిమ్మరుసును కోరినప్పుడు ఆమంత్రి రాయని రహస్యముగా గుఱ్ఱపుసాలకు కొనిపోయి ఆసంగతి తెలుపఁగా రాయలు ఇట్లనెనట—(Nuniz, Sewell) "Crisnarao said that he did not seek to be king, nor to be anything in the kingdom even though it should come to him right; that his desire was to pass through the world as a jogi (ascetic, recluse) and that he should not put his eyes out seeing that he had not deserved that of his brother." ఇందలి చివరి మాటలు కూడ సాభిప్రాయములు. తానెంతో స్నేహము చూపుచు తోడ్పడుచుండఁగా అన్న యిట్లాజ్ఞాపించుటయా యను ధ్వని ఇమిడి యున్నది.

న్యూనిజు మఱియొకచోట రాయల బాల్యచేష్టల నిట్లు వర్ణించినాఁడు.—(చిన్నమదేవికథ) "Now this king Crisnarao, when he was young and growing up in this city of Bisnagar had an intrigue with a courtesan...Chinnadavidy...promised many times if ever he became king he would marry her; and though he said this in jest, it afterwards became true, so the history records...." (నూరొలు పుట 862) దేశమందు రాయలను గుఱించి గాండ్లసంగికథ యొకటి దీనితో సంవదించునది యుండుటచే నిది కొంత వాస్తవమనియే చరిత్రకారమతము. ఈ కథల నిజానిజముల నటుంచి న్యూనిజు సమకాలికుఁడుగాన అతనిరచనకు కొంత ప్రామాణికత యున్నది.

మూఁడవది - శ్రీ గురుజాడవారి కవిజీవితములలో నొక కథ, రాయలు చాటుగా తిమ్మరుసునింట శత్రుభయముచే పెరిగనని కలదు. అదేదనఁగా నరసానాయకుని ఉదకపాత్రమం దొక

నక్షత్రమురాలుట, ఆనీటి నాతఁడు తిమ్మరుసు సలహాపై త్రాగుట, ఆటువెనుక రాణి చింతలేని కారణమున నొకచేటితో కలియుట, కృష్ణరాయలజననము, తండ్రియభిమానము, ఇతరరాణులు రాయని చంపయత్నించుట, తండ్రియాజ్ఞచే అప్పాజీ అతనినిపెంచి పెద్దఁజేయుట- అనునది. ఇందెంతో త్రోసివేయఁదగినదున్నను అప్పాజీ రాయలబాల్యగురువనుట పారంపర్యముగా లోకులు చెప్పకొనుచుండినదే.

"అయ్యా యనిపించుకొంటివి, నెయ్యంబున కృష్ణరాయ నృపపుంగవుచే
నయ్యా నీసరియేరీ, తియ్యని విలుకాఁడవయ్య తిమ్మరుసయ్యా"

నాలుగవది - వీరనరసింహరాయల యభివృద్ధిలో కృష్ణరాయల కొక ప్రాముఖ్యమువచ్చినదని గుర్తించితిమిగదా. వీరనరసింహరాయలు చాలవృద్ధుఁడై మరణించినట్లు కానరాఁడు. పైగా అతని మరణము ఆకస్మాత్తు. ఆకస్మికముగా ఎవరుగుచూడనిపరిస్థితిలో కృష్ణరాయలకు రాజ్యప్రాప్తి. అతనికి రాజ్యకాంక్ష లేదు సరిగదా వచ్చునని తలంచుటకుకూడ నవకాశములేదు. తండ్రి నరసానాయకునికాలమున రాజ్యమునకు తాము వారసులమని తలంచుటకు వీరికి బొత్తిగా అవకాశములేదు. కారణము నరసానాయకుఁడు ఎంతబలవంతుఁడైనను మంత్రిమాత్రుఁడే. ఇమ్మడి సాళువనరసింహుఁడు బందిలోనున్నను రాజే. తండ్రిమరణానంతరము వీరనరసింహరాయఁడు మంత్రియు రక్షకుఁడునుగానుండి రాజ్యమును హరించినాఁడు. ఇదిమొదలు (1505) రాయలకు రాజ్యకాంక్ష ఉదయించియుండునాయన్న నదియులేనట్లే తెలియుచున్నది. ఏలన అన్నకు యుద్ధాదికములలో సాయపడియుండెనేగాని ఎదురుతిరిగిన జాడలేదు. ఆదినుండియు సరసుఁడును సాత్వికుఁడును. వీరనరసింహరాయలే శంకించి ఈతనికి ఎక్కువమర్యాద చేయుచుండినట్లు కనఁబడుచున్నది. లేకున్న అన్న బ్రదికియుండఁగానే శాసనకర్త ఈతని 'మహీపతి' యని యెట్లనఁగలఁడు. వీరనరసింహరాయఁడు తా నారోగ్యవంతుఁడుగా నున్నంతవఱకు నూరకుండి మరణ మాసన్న మైనంతనే కుమారునికొఱకు తమ్మునివిషయమున ద్రోహభావము పూనియుండును. రాయలు ఇవేవియు తలపెట్టకయుండి చిన్నాదేవితోను కావ్యశాస్త్రాదివిషయములలోను కాలము పుచ్చుచుండెను.

ఐదవది - రాయలు అప్పాజికడ నేమినేర్చెనో గ్రహించుటకు కథల సాక్ష్యమేగాని గ్రంథప్రామాణ్యము కానరాదుగాని బాల్యములో పెద్దల సద్గోష్ఠిలో కాలము గడపుచుండెననుటకు మాత్రము సాక్ష్యము కలదు. మాధ్వగురువర్యులైన శ్రీరాఘవేంద్రస్వామివారి పూర్వులలో నొకఁడైన కృష్ణాచార్యులకడ రాయలు వీణవాయింప నేర్చుకొనెనఁట. రాయలు బాల్యములో కత్తిసాములలోను యుద్ధవిద్యలయందును మాత్రమేగాక సంగీతసాహిత్యాది విద్యలనుకూడ అనన్యమనస్కుఁడై నేర్చినట్లున్నాఁడు. అట్టి వాఁడు కావునను, రాజకీయాదికములలో శ్రద్ధవహింపలేదు గావునను వరాహపురాణ కర్త ఈతని పేరెత్తలేదు. నాటికి రాయలు జనింపలేదని చెప్పలేము.

## ౪ అళియ రామరాయలు

వరాహపురాణ రచనాకాలమున రాయ లుండెననుటకు అళియ రామరాయల వయస్సు సాక్ష్య మిచ్చుచున్నది. ఇతఁడు క్రీ.శ. 1570 లో జనించియుండిన రాయలు అంతకు పదేండ్లైనను పెద్దవాఁడై యుండవలెను. రాయల మరణకాలమున ఈతనికే వయస్సెంతవది. అళియ రామరాయలను రాయ లెప్పుడు చేరదీసెను, ఎప్పుడు తనకుమార్తె నిచ్చి పెండ్లిచేసెను? రాయల జీవితకాలమందే; రాయలు రాజ్యమునకు వచ్చిన ఏడెనిమిదేండ్ల లోపలనే. శ్రీవెంకటరమణయ్య

గారు విజయ, వైశాఖ, భారతిలో నిట్లు (పుట 402) వ్రా   య. 'రామరాజు ఆర్వీటి బుక్కరాజు మునుమనుమఁడు, రామరాజు మనుమఁడు, శ్రీరంగ రాజు పుత్త్రుఁడు. మొట్టమొదట నితఁడు గోల్కొండసుల్తాను కులీకుతుబుశాహు కొలువునం దుండెను; క్రీ.శ. 1515 ప్రాంతమున సుల్తాను కులీ విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చి గడిసీమలఁ గొన్నిటిని జయించి స్వాధీనము చేసికొని యాసీమలపై ప్రభుత్వమునకు మహమ్మదీయులను నియమించుట యుక్తముగాదని తలఁచి రామరాజు నచట నెలకొల్పెను. తరువాత నాప్రాంతముపై నాదిల్షాను దెత్తివచ్చెను. అతని ధాటి కోర్వజాలక రామరాజు గోల్కొండకు బాఱిరాఁగా సుల్తాను కులీ యాతని పందతనమున కది నిదర్శనమని తలంచి నిజరాజ్యమునుండి వెడలిపోవ నాజ్ఞాపించెను. అంతట నతఁడు విజయనగరమున కేతెంచెను. కృష్ణరాయ లతని శక్తిసామర్థ్యములను గ్రహించి గౌరవించి కూఁతురు తిరుమలాంబ నిచ్చి యుద్వాహ మొనర్చెను.'' (Briggs Ferishta III pp. 380-81)

కాని రాయల మరణానంతరము తిరుమలదేవి తనకుమార్తెను రామరాయలకిచ్చి పెండ్లి చేసినదని నడిమిదొడ్డిపాళెం కైఫీయతులో నున్నది. కాని అది నమ్మఁదగినది కాదు. అరువది దాఁటిన వానికా పిల్లనిచ్చుట? అందును రాయలకూఁతును? మఱి రాయలవారి కాలములోనే యైయుండిన రాయ లేల యాతనికి రాజ్యమీయలే దను ప్రశ్న యుదయించును. రామరాయలు కృష్ణరాయల యల్లుఁడై యుండెనే గాని రాజ్యపాలనమం దెచ్చటను ప్రసిద్ధుఁడుగా కానరాఁడు. రాయలవారి యవసానకాలమున వారికి పదునెనిమిది నెలల కుమారుఁ డుండెను. తమ్ముఁడు అచ్యుతరాయలు పెద్దవాఁడు చంద్రగిరిలో నుండెను. తనవెనుక రాజ్యమునకు పోరాటములు జరుగునని రాయలు ఎఱిఁగి యుండెను. ఈవిషయమై శ్రీ వెంకటరమణయ్యగారిట్లు విశదీకరించియున్నారు. "వీరందరి గుణములును శక్తిసామర్థ్యములును కృష్ణరాయ లెఱుంగనివి గావు. దీర్ఘము వితర్కించి వితర్కించి వీరందఱిలోను దనయనంతరము సింహాసన మధిష్ఠింపఁ దగినవాఁ డచ్యుతరాయలే యని నిశ్చయించుకొనెను. ఇట్లు నిశ్చయించినది కృష్ణరాయలు జాడ్యగ్రస్తుఁడై ప్రాణముపై నాసవిడిచి మృత్యువు నెదురుచూచుచున్న సమయమందని న్యూనిజు వచించియున్నాఁడు. ఇది సరికాదు. మరణకాలమునకు రెండుమూఁడేండ్లకు ముందే రాజ్య వారసత్వనిర్ణయము జరిగియుండవలయును. ఇట్లు నిశ్చయించుకొన్న పిమ్మట నచ్యుతరాయల బంధనము వాపి యతఁడె తనయనంతరము వజ్రసింహాసనాధిపతి యని ప్రకటించెను. తన నియామకము సర్వసమ్మతము కాదని కృష్ణరాయలు శంకించెను. కావున నది నిర్విఘ్నముగ నెఱవేరుటకు గొన్నియేర్పాటులు గావించెను...'' (భారతి, అదే)

అళియరామరాయల వివాహము క్రీ.శ. 1530 ప్రాంతముగాక 1515 కు కొంత తర్వాతనని తేలుటచేత రామరాయలకు ఆనాఁటికి కూటోవ్రాత ప్రకారము 45 యేండ్లు. ఇదియు కొంత విచిత్రముగనే యున్నను అసంభవము కాదు. ఫెరిస్తావ్రాఁత నిజమైనచో నాఁటికి ఇరువదియగును. నాఁటికి ఎంతలేదన్నను రాయలకు అల్లునికన్న పదేండ్లైన పైన నుండవలదా. అనఁగా రాజ్యమునకు వచ్చినప్పుడు రాయలకు దాదాఁపు ఇరువదియొనిమిది ఇరువదితొమ్మిది యుండవచ్చును. అవసానకాలమునకు నలువదితొమ్మిది లేక యేబది సమీపము. పైగా న్యూనిజు వ్రాఁతనుగాని కూటోవ్రాఁతనుగాని ఫెరిస్తావ్రాఁతనుగాని ఒకపాటివిశేషణములేక గ్రహింపరాదు. ఆవేవియు చర్చకు సరిగా నిలుచునట్లులేదు. రాయల వృద్ధాప్యవిషయమునుకూడ ఒకపాటి విశేషణముతో గ్రహించిన రాయలు అంత ఎక్కువ వయసు చెల్లినవాఁడు కాకపోయినను తన కవసానకాలము సమీపించు చున్నదనియు, గ్రహించి

యుండును. తాను పట్టాభిషేకముచేసి తనకు వారసుగా నుంచిన కుమారుఁడు విషమపరిస్థితులలో చనిపోవుట, తాను ఘోరప్రమాదమునకు లోనై తన్ను ఇంతవానిని చేసిన అప్పాజి నేత్రములు తీయించుట, తాను చేసిన ఇంతపనియు పాడై తనవెనుక దేశము మరల మ్లేచ్ఛాక్రాంత మగునేమో యను దిగులు, అంతఃపురములోను చుట్టును రాజ్యమునకు శత్రులు—వీనిచేత చాల చీకాకుపడి ఆరోగ్యముచెడి శీఘ్రముగా మృత్యువువాత పడియుండును. శ్రీవెంకటరమణయ్యగారు ప్రతిపాదించినట్లు ఉజ్జాయింపుగా రాయలజననము క్రీ.శ. 1474 అగునేని, రాజ్యమునకు వచ్చినప్పుడు ముప్పదియైదేండ్లును అళియరామరాయలు అతనికి పదియేండ్లు చిన్నవాఁడై రక్కసి తంగళినాటికి దాదాఁపు ఎనుబది యేండ్లవాఁడునుగా నుండవచ్చును. ఇది బుర్హాన్ ఇమాసిజ్ తారీఖుకు సరిగానున్నది.

## ౫ కృష్ణరాయల పట్టాభిషేకము

దీనింగూర్చికూడ భిన్నాభిప్రాయములున్నవి. క్రీ.శ. 1509 జూలై 22 తేది వఱకు వీరనరసింహరాయలు విజయనగరమందు రాజ్యముచేయుచుండినట్లు శాసనములు గలవు. కృష్ణరాయల మొదటిశాసనము (గుర్కు) క్రీ.శ. 1509 జూలై 26_వ తారీఖుతో దొరకియున్నది. దీనింబట్టి రాయలు ఈ 22_26 తేదుల నడుమ రాజ్యమునకు వచ్చెనని తేలుచున్నది. రాయల పట్టాభిషేక ప్రస్తావము మొట్టమొదట క్రీ.శ. 1510 జనవరి 24 తేదినాఁటి హంపీశాసనమున కనఁబడుచున్నది. కాని ఇది పట్టాభిషేకమునాఁటి శాసనముకాదనియు తర్వాతి దనియు నొకయభిప్రాయము కలదు. పైగా పరిపాలన యారంభమైన యాఱునెలలకా పట్టాభిషేకము. రాయల పైమొదటి శాసనమునకు తర్వాతితారీఖులతోడి వీరనరసింహరాయల శాసనములను ఒకటి రెండింటిని చూపికొందఱు, రాయల పట్టాభిషేకము 1510 జనవరి 24 తారీఖుననే జరిగెనని నిర్ణయించినారు. ఆ శాసనములు సందేహాస్పదములు. పట్టాభిషేకశాసనమని తలంపఁబడు దీనియందు రాయలు 'ప్రతివర్ష ప్రవర్తిత కనకవసన్తమహోత్సవేన' అని పొగడఁబడియున్నాఁడు. అప్పుడే పట్టాభిషేకమైన రాజునుగుఱించి ఇది చెల్లునా? లేక రాయలుపట్టాభిషేకమునకు మునుపటినుండియు వసంతోత్సవము చేయించుచుండెనా? మఱి రాజుండఁగా నితరులు చేయింపవచ్చునా? కావున నీశాసనము కొంత చర్చనీయమే. శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు 'విజయనగరసామ్రాజ్యము' అను పాళెపట్టు కడితమునం దుండునట్లు "శాలివాహనశకము 1432 అగు నేటి శుక్లసంవత్సరం ఆవణిమాసం శ్రీజయంతినాఁడు కృష్ణదేవమహారాయలు విజయనగరమందు పట్టాభిషిక్తుఁడైవేంచేసిరి"అనుటయే సరియని, దీనింబట్టి క్రీ.శ. 1509 ఆగస్టునెల 7_వ తేది మంగళవారమనియు నిర్ణయించిరి. మఱియు నిట్లువ్రాసిరి. "కృష్ణదేవరాయలు శ్రీకృష్ణుని యవతారమని యప్పటివారి నమ్మకము. మఱియు నాతఁడు పరమవైష్ణవుఁడు. కావున క్రీ.శ. 1509 జూలై 22 తేది తరువాత రాజ్యభారము వహించినను నటుపిమ్మట నొకపక్షము రోజులలో వచ్చుచుండిన శ్రీకృష్ణజన్మాష్టమి వఱకు తన పట్టాభిషేకము నాపుదల జేసికొనుటయందు వింత యేమియులేదు. క్రీ.శ. 1509 ఆగస్టు 7 తేదినాఁడు కృష్ణరాయల పట్టాభిషేకము వాస్తవముగ జరిగెనని మనము విశ్వసింపవచ్చును" (భారతి, విరోధి, చైత్రము).

రాయలు పదునైదుదినములు తాళి పట్టాభిషేకము చేసికొనుటలో నర్థములేక పోలేదు. కృష్ణజన్మాష్టమియేగాక రాజులకు, (బ్రాహ్మణేతరులకు) పదుమూఁడుదినములు ఆశౌచము. చివరి

దినపు క్రతువులతో నది తీరిపోఁగా పదునాలవదినము శుభస్వీకరణ కార్యముతోఁగూడ పట్టాభిషేకముజరుపుట ఆచారము. చాళుక్యచక్రవర్తి మొదటిసోమేశ్వరుఁడు క్రీ.శ. 1068 మార్చి 27 వ తారీఖు ఆదివారము గతింపఁగా ఆ పదునాలవతిథిదినము అతనికుమారునికి రెండవసోమేశ్వరునికి ఏప్రిలు 9 తారీఖు శుక్రవారము పట్టాభిషేకము జరిగినది. (E. C. VII. Sk 136). అట్లే రాయల పట్టాభిషేకము చాలవైభవముగా జరిగినట్లు కృష్ణరాయవిజయాదులయందు వర్ణింపఁబడినది. రాయలు రాజ్యము స్వీకరించుచునే, తన యన్నకుమారుని, సోదరులను చంద్రగిరిదుర్గములో బంధించి శత్రువులను హద్దులో నుంచెను.

## ౬ రాయల దేవేరులు

రాయలకు పట్టాభిషేకమునాటికి వివాహమై సంతానముకూడనుండినది. క్రీ.శ. 1515-16 నాటికే అళియరామరాయలకు ఈయఁదగిన కుమార్తె యుండినదనఁగా అతనికి పట్టాభిషేకమునకు (1509) చాలముందే వివాహమైయుండును. రామరాయలకిచ్చిన కుమారి శిశుప్రాయగా నుండునని నూయెలు తలంచెనుగాని అందుల కాధారములేదు. పట్టాభిషేకము తిరుమలదేవీ చిన్నాదేవుల తోనే. పెద్దన మనుచరిత్రమం దిట్లు వ్రాసినాఁడు—

"అవిభు ననంతరంబ ధ, రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల, దేవియునుం దనకుఁగూర్చు దేవేరులుగాఁ"

చిన్నాదేవి వెలయాలనియు రాయలామెను చేపట్టి, తాను రాజైనయెడల పెండ్లియే చేసికొని తనకు రాణినిగా చేసికొందునని, అట్లే చేసెనని నూయెలుచరిత్రలో కలదు (పుటలు 362-3). కాన పెద్దన పద్యమునుబట్టి ఆమె దేవేరియనియు పట్టాభిషేకమునాటికే కలదనియు తెలిసెడి. అదే ఆముక్తమాల్యదలో రాయలను సఖ్యు లిట్లు సంబోధించినట్లు కలదు—

"అవిభు ననంతరంబ ధ,రావలయముఁ బూనితీవు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా, దేవియుఁ గమలాబ్జముఖియు దేవేరులుగాఁ."

ఇందు చిన్నాదేవి పేరులేదు కాన నామె ఆముక్తరచనాకాలమునాటికి గతించియుండునని కొంద ఱూహించిరి. కాని యిది పట్టాభిషేకమునాటి సంగతిగదా. కాలము మాఱుకొలఁదియు పద్యములను మార్చుచుపోవుటలో నర్థమేమి? మనుచరిత్రపద్యమున కిది భిన్నము. రెండును పెద్దనపద్యములనుటలో సందేహముండ నక్కఱలేదు. కమలాబ్జముఖియే చిన్నాదేవియగునా? ఏలయన అందఱిలో నామెనేగదా సౌందర్యవతియని రాయలు మెచ్చియుండెను. ఈకవీశ్వరులను పూర్తిగా విశ్వసించుటకునులేదు. ఏలయన ఓబాంబను అచ్యుతరాయ శ్రీరంగరాయలను వదలియే వేసినవారు వీరేమి చేయరు? కాని యిట్లు వీరువ్రాయుటలో నేదియో యర్థముండవలెను. ఏదోరహస్యము దాఁగియున్నది.

న్యూనిజు గ్రహించినవిషయములో కొంత తారుమారున్నది. ఇతఁడు రాయలవారికి నలువురు ధర్మపత్నులన్నాఁడు. పేయస్ పండ్రెండుగు రన్నాఁడు. పైగా ఈవివాహములు కొన్ని తర్వాత జరిగినను చిన్నాదేవి తిరుమలదేవులవివాహము ముందే యైయుండవలెను. వేశ్యావృత్తాంత మొకటి రాయలతో సంబంధపడియున్నది. అది గాండ్లసఁగికథ. రామరాయలు తిరుమలదేవికి 'అళియ' గావునను, కృష్ణరాయవిజయము ననుసరించి తిరుమలదేవియే రాయలకు దిగ్విజయార్థము 'కప్పురపు దీవెనవీడె మొసంగి' పంపినది గావునను ఆమెయే పట్టమహిషి యనియు, రామరాయల కిచ్చిన కుమారికి క్రీ.శ. 1516 నాటికి పదునాలేండ్ల వయసుండినను, వీరి వివాహము క్రీ.శ. 1500 నాఁటికి జరిగియుండవలయుననియు, వేశ్యావృత్తాంతము, అంతకుమునుపటి దైనయెడల చిన్నా

దేవీతగులము అంతకును ముందుదై రాయలజన్మకాలము అంతకును చాలముందై క్రీ.శ. 1480 ప్రాంతమో ఇంకను ముందో యనియు స్థిరపడుచున్నది.

చిన్నాదేవి తల్లిదండ్రు లెవరోగాని తిరుమలదేవిమాత్రము శ్రీరంగపట్టణ ప్రభువుయొక్క కొమార్తెయని తలంచుటకు మార్గము లున్నవి. శ్రీరంగపట్టణప్రభువు కొమార్తె యొకరాణియని విదేశయాత్రికులు వ్రాసియున్నారు. (నూనెలు పు. 247). రాయల పట్టాభిషేకమునకు ముందు వెనుకల శ్రీరంగపట్టణముతో యుద్ధములేర్పడి యుండినందునను, రాయల మొదటిభార్య సాళువ నరసింగరాయని బంధువని న్యూనిజు వ్రాసియుండుటచేతను, తర్వాత రాయలు ఉమ్మత్తూరిని పరాక్రమము చేతనేగాక భేదోపాయముచేతఁ గూడ సాధించినట్లు తెలియుటచేత తిరుమలదేవి తండ్రి ఈతఁడే యేమో!

పైగా ఈవివాహము నరసానాయకుని కాలమందే జరిగియుండునాయని యొక సందేహము కలుగుచున్నది. నరసానాయకుఁడు 'శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవినోదంబు హొయ్సళేంద్రునకుఁ జూపి' నవాఁడు (తిమ్మనపారిజా) కొంగుదేశరాజాక్కళ్ చరిత్రమునుండి శ్రీ వేలటూరి వెంకటరమణయ్యగారు ఈ క్రిందివిషయములను ఉద్ధరించి విమర్శించియున్నారు.—"కర్ణాటక దేశములో నుండు పాళెగాండ్రును దండనాయకులును కప్పమీయక పోయినందున నుద్దండుడనుమంత్రి రాజుగారి యుత్తరువు ప్రకారము చతురంగ సేనలతోగూడ కర్ణాటకదేశమునకు పోయి వారితో యుద్ధముచేసి జీవగ్రాహుని పట్టుకొని యాదేశములో తానే పట్టముగట్టుకొని యా పాళెగాండ్రచేత కప్పముగొని......" (Further Sources No. 95) ఇందు ఉద్దండుఁడను విజయనగరమంత్రిచే జీవగ్రాహుఁడు పట్టుఁబడినట్లు చెప్పియున్నది. ఈయుద్దండుఁడు ఎవ్వఁడో తెలియదు. జీవగ్రాహుఁడు శ్రీరంగపట్టణాధిపతియగు హొయ్సళేంద్రుఁడేగాని యన్యుఁడు గాఁడు. 'జీవగ్రాహంగృహీత్వా' యను శాసనవాక్యమునకు సరియైన యర్థమును గ్రహింపఁజాలక కొంగుదేశరాజాక్కళ్ చరిత్రరచయిత యదియొక వ్యక్తియొక్క నామమని తలఁచి జీవగ్రాహుఁడని వ్రాసెను. శ్రీరంగపట్టణమును మాత్రమేకాదు. ఉమ్మత్తూరునుగూడ జయించినట్లు ఈగ్రంథమున మఱియొక సందర్భమున జెప్పియున్నది. 'అట్లావుండగా మీతండ్రి నరసింహరాయడు బలంచాత జయించి కప్పం తీస్కునిపోయెను.' అని 'త్యాగరాజు' నుడివెనట. పైనుదాహరింపఁబడిన శాసనాద్యాధారములచేత నరసానాయకునికాలముననగూడ ఉమ్మత్తూరుదొరలు కప్పమీయక తిరుగబడిరనియు వారిని బలముచే నిర్జించి నరసానాయకుఁడు కప్పము గొనెననియు దెల్లమగుచున్నది." తిరుమలదేవితో రాయలవివాహము 1509కి పదేండ్లు ముందే యైయుండినయెడల అది 1499 క్రీ.శ. లోనో అంతకుముందో శ్రీరంగపట్టణమును జయించిన సందర్భముననై యుండవలయుననియు, ఆ యుద్దండ మంత్రి తిమ్మరసమహామాత్యుఁడే యైయుండునా యనియు నొకయూహ, నిరాధారమైనదే, పొడసూపుచున్నది. ఇమ్మడిదేవణ్ణ ఒడయుల రెండవకుమారుఁడైన మల్లరాజను పేరుగల చిక్కరాయలు కృష్ణరాయలమిత్రుఁడై యుండుటయు, ఉమ్మత్తూరు ప్రాంతమును జయించి ఈతని నచట పాలకుఁడుగా రాయలుంచుటయు నిందులకు కొంతబలము నిచ్చుచున్నది. భావి పరిశోధనచే తేలవలయును.

రాయలరాణులు నలుగురని న్యూనిజును పండ్రెండుగురని పేయసును వ్రాసియున్నారు. పట్టమహిషులు నలువురనుటయే సరియేమో. రాయలప్రథమభార్య గజపతికూఁతురని యొకతుక్కాదేవి,

లేక రుచీదేవి లేక వరదరాజమ్మకథ యొకటి శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములలో కనఁబడుచున్నది. రాయలు ఉత్కలగజపతికూఁతురు జగన్మోహినిని వివాహమాడెనని రాయవాచక కృష్ణరాయ విజయములందు కలదు. ఈమె పేరు 'లుఖ'యని 'భద్ర' యని భిన్నరీతుల గ్రంథములలో కనఁబడుచున్నది. లక్ష్మియని 'విజయనగరసామ్రాజ్యమున' నుండుటచేత 'లక్ష్మి' లక్షాయై, లుక్షాయై, తుదకు తుక్షాయైయుండునని శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయము. ఆముక్తమాల్యదలో అన్నపూర్ణాదేవియు కమలాదేవియు కనఁబడుచున్నారు. అన్నపూర్ణ యెవరో తెలియుటలేదు; చిన్నాదేవి పేరులేదు. కాన నామెగతించియుండునని యొకయభిప్రాయముకలదని గ్రహించితిమిగదా. కాని పద్యభావము పట్టాభిషేక కాలమున వీరుండిరనిగాని కావ్యరచనాకాలమందు కాదుగదా. చిన్నాదేవి ఎప్పుడు గతించినదో చెప్పుటకాధారములేదు. పైగా హంపీ అనంతపురము పాతకవిలెలో రాయల వారితర్వాత చిన్నాదేవీ తిరుమలదేవు లిరువురును రామరాయలను చేరదీసినట్లున్నది. ఎంతవఱకు నిజమో తెలియదుగాని చిన్నాదేవి ముందే గతించినట్లుమాత్రము ఎచ్చటను లేదు. చూడఁగా చిన్నాదేవి, తిరుమలదేవి, లక్ష్మీదేవి (=లుఖ, తుఖ, భద్ర) అన్నపూర్ణ, కమలయని, నలుగురకు బదులు ఐదుగురగుచున్నారు. 'కమలాబ్జముఖులు' అను పాఠము సరిగాదుగాన కమలాబ్జముఖియే. కావున చిన్నాదేవియే కమల, చంద్రవదన (అంతటిసౌందర్యవతి) కావలయును లేదా న్యూనిజా ప్రకారము మఱియేడుగురు ఎవరెవరో ఉండియుందురు.

## ౨ పట్టాభిషేకకాలమున రాయలు

ఇంతదూరము చర్చించినందువలన తేలినదేమనఁగా పట్టాభిషేక కాలమునకు రాయలు మధ్య వయస్కుఁడు. బాలుఁడో యువకుఁడో కాఁడు. జీవితములో ఒకపాటియనుభవము సంపాదించిన వాఁడే. తండ్రికి రెండవకుమారుఁడైనందుచేతను ఇతర రాజకీయకారణములచేతను రాజ్యకాంక్ష లేక అప్పాజీకడ పెరిగినవాఁడు. ఒకపాటి రసికుఁడేగాని వ్యసనిగాఁడు. స్త్రీలోలుఁడేగాక కవితాస్త్రీలోలుఁడుకూడ. వివాహితుఁడుమాత్రమేగాక సంతానవంతుఁడును. కవనకళారహస్యము లెఱింగినవాఁడు. కావ్యనాటకాలంకార మర్మజ్ఞుఁడు. నాటికే పెద్దనాదు లితనికి మిత్రులైయుందురు. గొప్పగురువుకడ సంగీతమభ్యసించినవాఁడు, వీణావాదనకుశలుఁడు, ధర్మజ్ఞుఁడు. తొలుత రాజ్యమే వలదన్నవాఁడు. రాజైన వెనుక అన్నకుమారుని, చంపక, తమ్ములతో చంద్రగిరికిపంపినవాఁడు. తనకు తర్వాత రాజ్యమును అల్లునికీయక తమ్మునికే ఇచ్చినట్టి ధార్మికబుద్ధి బాల్యమునుండియు కలవాఁడు. అన్నిటినిమించి మహావీరుఁడు. 'వ్యాయామస్థిర సంధిబంధుఁడు' తిమ్మరసు విషయములో చివరిదినములలో జరిగినది వాస్తవమైనయెడల 'ప్రమాదోఽధీమతామపి' అపిశబ్దస్వారస్యముచేత 'ధీమతామేవ' అని అట్టి గొప్పవారికే అంతటి ప్రమాదమని యర్థము చెప్పకొనవలయును.

తర్వాత రాయలను సముఖమునదర్శించిన పేయసు ఇట్లు వ్రాయుచున్నాఁడు. (శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి శ్రీకృష్ణరాయచరిత్ర, 1908, నుండి) "ఈరాజు శ్రీకృష్ణదేవరాయలు మిక్కిలి పొట్టియును గాక పొడవును గాక సామాన్యపుఎత్తు గలిగి సొగసుగుల్కు ముఖవర్చస్సును స్థూలకాయమును గలిగి సుందరాకారముతో నొప్పుచుండెను. వానిముఖముమీఁద స్ఫోటకపు మచ్చలుగలవు. ఆతఁడు భయముగలిగించునట్టియు పూర్ణప్రజ్ఞ గలిగినట్టియు సంతోషస్వాంతుఁడుగా నున్నట్టి, మిక్కిలి యుల్లాసముగలట్టియు రాజుగానుండెను. విదేశీయులను సన్మానించుటకును వారల దయతో నాదరించుటకును వారిస్థితిగతు లెట్టివైనను వారివ్యాపారములనుగుఱించి దెలిసికొనుటకు నపేక్షించువాఁడు

గానున్నాఁడు. అతఁడు న్యాయబుద్ధిగల గొప్పప్రభువుగా నున్నాఁడుగాని యొక్కొక్కప్పుడు ఆకస్మికముగా దురహంకారమును బొందుచుండును. ఇతనికి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పూర్వదక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, శ్రీకృష్ణదేవరాయలని బిరుదము లనేకములుగలవు. సేవలోగాని రాజ్యములోగాని యాతనికన్న నధికముగాఁ గలవాఁడు మఱియొకఁడు లేనందునను సమస్తవిషయములయందును పరిపూర్ణసామర్థ్యముగలవాఁడయి యుండుటవలనను, అట్టిబిరుదములను వహించియుండెను.

"ఈరాజు సూర్యోదయమునకుముందుగా ప్రతిదినము కొంచెమించుమించుగా సోలెడు నువ్వులనూనె త్రాగుట కలవాటుపడినవాఁడు. ఆనువ్వులనూనెతోనే దేహమంతయు నలముకొనును. తరువాత నడుమునకొక చిన్నగుడ్డకట్టుకొని మంటితోఁజేయఁబడిన బరువులను భుజముమీఁద నుంచుకొనును. అటుపిమ్మట కత్తితీసుకొని చమురంతయు దేహమున నింకుపర్యంతము సాము చేయుచుండును. తరువాత తన వస్తాదులలో నొకనితోఁ గుస్తీపట్టును. ఈపని జరిగించినతరువాత నశ్వారూఢుండై తెల్లవాఱువఱకు విశాలమగు బయలులో నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకు సవారు చేయుచుండును. సూర్యోదయమునకుఁ బూర్వముననే యింతపనియుఁ బూర్తిచేసికొనును. తరువాత స్నానముచేయుటకుఁ బోవును.

"అప్పుడు మిక్కిలి భాగ్యవంతుఁడును తనకిష్టుఁడును, అతనివలనఁ బవిత్రుఁడుగా జూడఁబడువాఁడునగు నొక బ్రాహ్మణునివలన స్నానముచేయింపఁబడును. స్నానముచేసినతర్వాత అంతఃపురము లోపలనున్న దేవాలయమునకుఁబోయి కులాచారము ననుసరించి ప్రార్థనాదికర్మములను గావించుకొనును. పిమ్మట......రాజకీయవ్యవహారములం బరిష్కరింపుచు నగరములను బరిపాలించుచు తన కిష్టులగువారితో ముచ్చటించుచుండును. అతని కిష్టులగు వారిలో ముఖ్యుఁడు తిమ్మరసు (మంత్రియగు సాళువ తిమ్మరాజు) నానొక్క వృద్ధబ్రాహ్మణుఁడు గలఁడు.

"అతఁడే గృహనిర్వాహక భారము సమస్తమును వహించి నెఱవేర్చుచుండును. ప్రభువరులెల్లఱును రాయలపట్ల నేరీతిగా సంచరించెదరో యీతనిపట్లగూడ నట్లే ప్రవర్తింతురు. వీరలతో తన కిచ్చివచ్చిన ప్రసంగమును జరిపినతర్వాత రాజు ప్రభువులును సేనాపతులును వచ్చుట కనుజ్ఞ యిచ్చును. వారు రాజునకు వందనముచేయుటకు రాజుసమ్ముఖమునకు వత్తురు. వచ్చినతోడనే రాజునకు వందనము లాచరించి దూరముగానుండు గోడలపాడుగునను నిలువంబడుదురు. వారలొకరితో నొకరు మాట్లాడరు. తాంబూల చర్వణముచేయరు. తమచేతులను చొక్కాయి జేబులలోనుంచుకొని కన్నుదృష్టి భూమిపై నిగుడఁ దలవాంచి నిలువంబడియుందురు. రాజెవనితోనైన మాటలాడఁ దలచినయెడల రెండవమనుష్యునిద్వారా మాటలాడుచుండును. రాజెవనిఁ బలుకరించునో యాతఁడు కన్నులెత్తి రాజడిగిన ప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరములిచ్చి మరల నెప్పటివలె నిలువంబడును. రాజు సెలవిచ్చుపర్యంతము వారచటనే నిలువంబడియుందురు. తరువాత నతనియుత్తరవునుబొంది యతనికి నమస్కరించి యావలకుఁ బోవుదురు.

"వారిలో నధికమర్యాద సూచకమై యనుశ్రుతముగా వచ్చుచున్న నమస్కారమనఁగాఁ జేతులురెండును దగ్గఱగాఁ జోడించుకొని సాధ్యమగునంతవఱకు దలకుపైఁగా నెత్తుటగా నున్నయది......రాజు తన స్వజనమును జూచినట్లుగానే మమ్ముజూచి...మాపట్లగూడ సాదరహృదయముగలవాఁడై ...రాజు మమ్ము స్పర్శించునంతసమీపములో నుంటిమి....

"రాజు సువర్ణమయములగు గులాబీపుష్పములతోఁ జిత్రింపఁబడిన శ్వేతాంబరములను ధరించియుండెను. అమూల్యమయినట్టి వజ్రాలపతకమును మెడలో నలంకరించికొనియుండెను. సాగ

సయిన పట్టుతో మూయఁబడియున్న గలీసియాదేశపు శిరస్త్రాణమువంటి సరిగబుట్టా వేసిన పట్టు కుళ్లాయి శిరస్సున ధరించియుండెను. ఎవ్వఁడును పాదరక్షలు తొడుగుకొని యాతని సన్నిధానమునకు రారాదు. దేశములో చెక్కుండ్రు పాదరక్షలు లేకయే తిరుగుచుందురు.''

ఇందులకు భిన్నముగా రాయలదినచర్య యిట్లుండవలయునని రాయలే ఆముక్తమాల్యదలో వచించిన పద్యమున్నది. ('సౌఖశాయనిక' చూ. ఆ 4-271 ఇందుల తాత్పర్యము చూడు వ్యాఖ్య.) 'రాజునకు దినచర్య ఇట్లుండవలయును. ప్రాతఃకాలమందు సుఖనిద్ర నడుగువారును వైద్యులును, జోస్యులును రాజును దర్శింపవలయును. రాజు వారితో సల్లాపించి యారోగ్యమునకును గ్రహానుకూల్యమునకును వలయువిశేషములు ఎఱుంగవలయును; జాముప్రొద్దు ఎక్కినంతట మంత్రిసామంతులతోను ధనార్జననియుక్తులయిన కరణాలతోను కొంతసేపు గోష్ఠినుండి మంత్రాలోచనాదికము గావించి ఆయవ్యయవిశేషము లెఱుంగవలయును. అంగమర్దనము, మల్లురతో వ్యాయామము, వంటవాండ్రతోను వేఁటకాండ్రతోను తెచ్చిన మాంసములను తేవలసినవానిని విచారించుకొని, తెచ్చినవానిని వండవలసినప్రకార విశేషములనుగూర్చి యాజ్ఞాపింపవలయును; అపరాహ్ణమున దేవతార్చనసమయాన పెద్దలతోను ధర్మాధికారులతోను సన్న్యాసులతోను సల్లాపము, భోజనానంతరము విదూషకుని వినోదమును, పౌరాణికులతో కవులతో గోష్ఠి, సాలభంజామున చారులకు దర్శనము, పాటకచ్చేరి; రాత్రి సుఖనిద్ర ప్రేయసీ సల్లాపములు.''

ఇందులకు సమన్వయ మెట్లో? సూర్యోదయమునకుముందే శరీరవ్యాయామము ముగియునని విదేశీయులు వ్రాయుచుండ మంత్రాలోచనాదికము లైనతర్వాత అంగమర్దన ముండవలయునని పద్యము చెప్పుచున్నది. ఒకవేళ ఇదంతయు అనుకూలము ప్రకారము రాయలు మార్చుకొనుచు ఆముక్త రచననాటికి ఈ యభిప్రాయమునకు వచ్చెనేమో. వీరనరసింహరాయల దినచర్య ఇందులకు సరిపోవునట్లే యున్నది. (రాయవాచకము)

''వీరనరసింహరాయలవారు విద్యానగరమందు బ్రాంహ్మీ ముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళులున్ను అధ్యాత్మ సంకీర్తనలున్ను పాండవగీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్షము భారత సావిత్రి దధివామనస్తోత్రము గంగావతరణము నదీప్రార్థనమున్ను భారతభాగవతరామాయణం ముచికుందస్తుతి అక్రూరస్తుతి భీష్మస్తుతి సంజయనీతి విదురనీతి చాణక్యనీతి ఇవి మొదలైనవిన్ని వైరాగ్య శతకం పురాణశ్రవణమున్ను రాజనీతు లన్నియువిని, దర్పణావలోకనానంతరం కన్యకామణులు కపిల కామధేనువను స్పర్శనంబుచేసి విప్రవరుల దర్శనంబు జేసినపిమ్మట దంతధావన ముఖమజ్జనామతీర్థమై విభూతిధరియించి పేరోలగంబై కూర్చుండగాను, నూటయెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థప్రసాదములున్ను డెబ్బైరెండు దేవస్థలాలనుంచి విభూతిగంధప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రత్యుత్థానము చేసి అంజలిచే నందుకొని శిరసావహించి స్థలాంతరాలనుంచి వచ్చిన అయ్యంగార్లున్ను ఆరాధ్యపీఠంవారలనున్ను వుచితాసనములయందు కూర్చుండ నియమించి అష్టస్వయంవ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణ్యం పుష్కరక్షేత్రం ఇవి మొదలైనస్థలాలకు సురక్షితముగలవా అని అడిగినందుకు దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయాస్థలాంతరముల వున్న ముద్రకర్తలు వొక్కటికొకటి కొదువలేకుండా నడుపుతావున్నారు; నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నవి అని అయ్యంగార్లు పలుకగా, పృథివ్యాపస్తేజోవాయు రాకాశాత్మకమైన యేకాంమ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరం మొదలైన డెబ్బైరెండు దేవస్థళాలకున్ను పదునెనిమిది

శత్రులకున్ను నిండుపడితరములు గలిగి నిత్యోత్సవములు గలిగివున్నదనేటట్టుగా ఆరాధ్యులు దెలుపంగా, విన్నవారై చాల సంతోషభరితుండై వార్లకు పట్టెలుయిచ్చి ధర్మాసనం ధర్మయ్యను పిలువనంపగా ఆయనవచ్చి నిలిచి దేవరవారు ఆనతిచ్చినప్రకారం ద్రావిడరాజ్యములోగల అగ్రహారములకున్ను, ఆంధ్రదేశం, హాయసనదేశం, మొరసునాడు మేల్నాడు కర్ణాటకం ఘట్టంకీను చేర చోళ పాండ్య మగధ మలయాళ అగ్రహారములకున్ను అవధిఆటంకములులేక నిత్యకర్మానుష్ఠానపరులై ఋగ్యజుస్సామాథర్వణ పారీణులయి పంచయజ్ఞపరాయణులై అతిథి సంతర్పణలు చేసుకొని నిర్విచారులై సుఖవసతిగా వున్నారని విన్నపంశాయగా, రాయలవారు విన నవధరించి దళనాయకుల పిలువనంపగా వారువచ్చి పాడగని నిలిచి వినయముతోడట్టుసింహాసనరాజ్యములో గల గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గములయందు కావలికట్లు ప్రహరి బడగిరములున్ను బీగముద్రలు స్వామివారి ప్రతాపమువల్ల జతనమై వున్నవి; సామంతరాచకార్యములు విశేషముగా లేవు; అని విన్నపంశాయగా; ఆవెంబడిగా తిలారి జంగమయ్యవచ్చి రాయలవారిసముఖానకు అడ్డపడి చేతులు కట్టుకొని నిలిచి దళనాయకులతోను విద్యానగరిపట్టణములోనున్ను వెలిపాళ్యములయందున్ను యీూది హెచ్చరికలుగలిగి రాత్రిపగళ్లు తిలార్లు జతనమై జాగ్రతగా కాస్తావున్నారు. గనక పట్టణములో గల అష్టాదశవర్ణాదులవారున్ను అత్యంతసంతోషపరులై అతివైభవములతోడట్టు నిత్యకల్యాణములున్ను పచ్చతోరణములున్ను గల్గివున్నారని విన్నపంశాయంగా దళనాయకులు విని రాయలవారికి విన్నపంజేసినారు.

ఆపిమ్మట విఠల విరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది. రథోత్సవానకు విజయం శాయవలెను అని విన్నపంశాయంగా దగ్గరవున్న దళనాయకులు ఆతీసన్నె రాయలవారు విచ్చేస్తావున్నారు. స్వామి రథారూఢు లయినతోడుతోనేవచ్చి విన్నపంశాయుమని అంపించి రాయల నగరి తొమ్మిదిసంప్రతులనున్ను పిలువనంపగా కరణాలువచ్చి పదునెనిమిదిరేవుల లెఖ్ఖలున్ను వినిపించినతర్వాత రాయలవారు దిక్కులనుంచివచ్చిన కమ్మకాగితములు యేకాంతముగా వినుపించ్చగా విని ప్రధానులను దళవాయిని రప్పించుక కొంతతడవు యేకాంతపు కొలువుగానుండి ఆపిమ్మట నిండుకొలువునకు వచ్చినవారై సకలసామాజికులను రప్పించుక నాలుగారుఘడియలు పేరోలగంబై కూర్చుండివుండగా నగరి అళ్లుండ్లు కొమాళ్లు దొరమన్నీలు ప్రభువులు పాళ్యగార్లు అమరనాయకులు ఆప్తులు ఆశ్రితులు విద్వాంసులు పురోహితులు ఆచార్యపురుషులు జియ్యంగార్లు యతీశ్వరులు దైవజ్ఞులు భేషజులు కౌతులు మావతులు చెర్వగార్లు రాజులు వందిమైతాళికులు పాటకులు పఠాణీకులు శాస్త్రజ్ఞులు నాటకాలంకారులు విద్యార్థులు వీణాధరులు ఇవి మొదలుగాగల దెబ్బైరెండు వినియోగాలవారున్ను వచ్చి కొలువుండగా దైవజ్ఞులున్ను లక్షణికులున్ను దళనాయకులతోను ఆగతానాగత భూతభవిష్యద్వర్తమానములు ప్రశంస శాయంగా...''

వీనింబట్టి రాయలు దినచర్యలో ప్రాచీనసంప్రదాయమునుండి సమయోచితపు మార్పులుండెడివని తోఁచుచున్నది.

## ౮ రాయల దిగ్విజయములు

వీరనరసింహరాయల కాలమునుండియు స్పష్టముగా నన్నిరాచకార్యములలోను పాల్గొనుచుండిన కృష్ణదేవరాయలను తిమ్మరసు రాజునుచేయుటలో నాశ్చర్యములేదు. నరసానాయకునిశక్తి వీరనరసింహరాయలకు లేదు. పైగా నితఁడు రాయసింహాసనము నాక్రమించిన కారణముచేతఁ



**The Pampapati Temple, Hampi ruins**

*—By courtesy of The Archaeological Survey of India, Madras.*

గాబోలు సామంతులు తిరుగఁబడిరి. ఆదోని దుర్గాధీశుఁడు కాచప్పఒడయుఁడు తిరుగఁబడఁగా ఆరవీటిరామరాజు అతనిని అతని సహాయులను కర్నూలుకడ జయించి తర్వాత పెన్నంటి కాచప్పను సంహరించి ఆదవనిని స్వాధీనము చేసికొనెను. తర్వాత తుళువరాజులు గర్వించి కప్పమీయకుండఁగా నరసింహరాయలు మంగళూరులో కొంతకాలముండి వారిని జయించెను. కర్ణాటకమున ఉమత్తూరు శ్రీరంగపట్టణములు సాధ్యపడలేదు. ఇంతలో వ్యాధిగ్రస్తుఁడై యాతఁడు మరణించెను. శాసనములనుబట్టి కృష్ణరాయనియెడ స్నేహము నెఱపుచుండినటులున్నను (న్యూనిజు ప్రకారము) మరణ మాసన్నమైనప్పుడు ద్రోహబుద్ధి యైనట్లున్నాఁడు. దేశక్షేమములను అపేక్షించిన తిమ్మరసు రాయల శక్తిసామర్థ్యములను చక్కఁగా నెఱిఁగినవాఁడు రాయలకే పట్టాభిషేకముచేసి వెంటనే దిగ్విజయ దీక్షితునిఁజేసెను. రాయలే రానిచో సామ్రాజ్యమే పోయియుండును. వీరనరసింహరాయలు చేయుచుండిన యుద్ధప్రయత్నములెల్ల నీతనికి చక్కఁగా ఉపయోగపడినవి. పోర్చుగీసు వారిని ఆదరించి వారుతెచ్చు గుఱ్ఱము లన్నింటిని విజయనగరము వారికే విక్రయింపవలసినదని వారితో నొడంబడిక చేసికొని గుఱ్ఱము విదేశమునుండి బ్రతికివచ్చినను మార్గమున చచ్చినను పూర్తి వెల యిచ్చుచుండిన వీరనరసింహరాయలమార్గము కృష్ణరాయలకును నచ్చినది. అట్లే జాతిమత భేదములను గణింపక ఎల్లవారిని రౌతులుగా సైన్యమున చేర్చుకొను పద్ధతియు వీరనరసింహరాయలదే.

రాయలంగూర్చి విశేషపరిశ్రమ చేసినవారు శ్రీ నేలటూరు వెంకటరమణయ్యగారు. వారి పరిశ్రమ ననుసరించి దిగ్విజయముల విషయమును సంగ్రహముగా నిటవ్రాయుచున్నాను. రాయలు పట్టాభిషేకమైన తర్వాత ఒకటియు నరసంవత్సరకాలము రాజ్యవ్యవహారములను చూచుకొనుచు రాజధానియందే యుండెనని న్యూనిజు వ్రాసినాఁడుగాని 'పట్టాభిషేకపుతడి మేనిపై ఆరియు ఆరకమునుపే సామ్రాజ్యరక్షణకై కత్తి దూయవలసివచ్చిన'దని చరిత్రచే తెలియుచున్నది. బహమనీసుల్తాను మహ్మూదుశాహ విజయనగరముమీఁదికి తనసామంతులతో నెత్తివచ్చెను. గడిదేశమున కృష్ణరాయలు వారిని ఎదిరించి తరిమి కోవెలకొండసమీపమున విజాపురపు యూసఫ్ ఆదిల్ ఖానుని వధించెను. ఈవిషయము ఆముక్తమాల్యదలోని యీపద్యమున నున్నది—

"అలుకన్ ఘోటక ధట్టికాఖురపుటీ హల్యన్ ఖురాసాని పు
చ్ఛాలుఁబోదున్ని చలచ్చమూ గజమదాసారప్లుతిన్గీర్తి పు
ష్పలసస్యంబిడి యేకధాటి బళిరా! కట్టించితౌ దృష్టికే
దులఖానోగ్ర కపాల మర్ధపహరి మ్మాభాంగల శ్రేణికిన్" ౧-౪౨

తర్వాత ఆదిల్ ఖానునికుమారుఁడు విజృంభించి కలుబరిగెను జయించి బీదరుపై నెత్తిపోయి సుల్తాను మహమ్మదుశాహును బంధించెను. బహ్మనీసామంతులు బిజాపురమును ఎదిరించిరి; ఆరాజ్యమందు అల్లరులు చెలరేఁగసాగినవి. బెల్గాముపురమువారు రాయలసాయ మర్థించిరి. అంతట రాయలు బిజాపురముపై దండయాత్ర సాగించి రాయచూరును ఆక్రమించి, గుల్బర్గను గ్రహించి, బీదరుపై నడచి దానిని సాధించి మహ్మూదుశాహును విడిపించి మరల సింహాసనమందు ప్రతిష్ఠించి 'యవనరాజ్యస్థాపనాచార్య' బిరుదు వహించెను.

ఇంచుమించుగా నీకాలముననే రాయలు ఉమత్తూరు శివసముద్రములను సాధించెను. దానియధిపతి గంగరాయ ఒడయలు ఎంతో పోరి తుదకు కావేరిలోపడి మరణించెను. తర్వాత రాయలు శ్రీరంగపట్టణమును సాధించి ఈరాష్ట్రమునంతటిని పాలించుట కేర్పాట్లుచేసెను. ఇదం

తయు రాజ్యమునకువచ్చిన రెండేండ్లలో జరిగినది. అటుతర్వాత కళింగజైత్రయాత్ర. కళింగము మీఁదికి ఏకధాటిగాపోయి (ఒక్కయాత్రలోనే) రాయలు జయింపలేదు. ఐదుఘట్టములు గలవని చరిత్రకారనిర్ణయము. 'తొలుదొల్త నుదయాద్రి' యాత్ర, క్రీ. శ. 1513 జనవరిలో రాయలు బయలుదేరెను. ఈదుర్గము ముట్టడి ఒకటియొనర సంవత్సరము సాగినట్లున్నది. ఈనడుమ ప్రతాపరుద్రగజపతి ఎత్తిరాఁగా అతనిని కొండవీటివఱకు పాఱద్రోలి ఉదయగిరిని సాధించి ఆ దుర్గాధిపతి తిరుమలరాయ రాహుత్తరాయని చెఱఁగొనెను. తర్వాత కొండవీటిమీఁదికి ఎత్తిపోయెను. ఇది రెండవఘట్టము. కొండవీటికిపోవుచు రాయలు కందుకూరు, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునునికొండ, తంగెడ కేతవరము మొదలైన చిన్నదుర్గములను స్వాధీనము చేసికొనెను. కొండవీటిని రాయలును తిమ్మరుసును చేరి ముట్టడించినప్పుడు ప్రతాపరుద్రగజపతి యొక్క రాణియొక్కతెయు, పుత్త్రుఁడు వీరభద్రగజపతియు రాయలకు పట్టువడిరి. కృష్ణకు దక్షిణమందలి తూర్పుతీరదేశమంతయు స్వాధీనమాయెను. ఈతర్వాత నాలుగవఘట్టము ప్రారంభమగుచున్నది. రాయలసైన్యములు కృష్ణనుదాటి బెజవాడను పుచ్చుకొని కొండపల్లిని ముట్టడించెను. ఇంతలో ప్రతాపరుద్రగజపతి వెనుకనుండి తాఁకుటకురాఁగా వెనుదిరిగి అతని నోడించి తర్వాత కొండపల్లిని పట్టుకొనెను. ఇచ్చటినుండి నాలుగవ ఘట్టముగా చరిత్రజ్ఞులు నిర్ణయించినారు. సైన్యమందుండి ఒకవాహిని తెలంగాణముపై దండువెడలెను. కంబము మెట్టుపై నడచెను. అచ్చట చిత్తాపఖానను ప్రభువును ఓడించెను. తరువాత అనంతగిరి, ఉంద్రకొండ, ఉర్లకొండ, అరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, నలగొండ, రాచకొండ, దేవరకొండ, కనకగిరి, శంకరగిరి దుర్గములను సాధించెను. జమ్మిలోయగుండ సింహాద్రివైపు తరలెను. జమ్మిలోయను తగులఁబెట్టెను. కొండపల్లియందుండిన రెండవ వాహిని కృష్ణా గోదావరుల నడిమిదేశమును జయించి రాజమహేంద్రవరమును స్వాధీనముచేసికొని కృష్ణరాయలనుకలసికొనెను. సైన్యము ఏకమై కోనసీమను తగులఁబెట్టి కొట్టామునుజయించి పొట్నూరికిపోయెను. ఆఱునెలలకాలము రాయలసైన్యము యుద్ధమునకు గజపతిని ఎదురుచూచెను. గజపతి రాకపోఁగా పొట్నూరులో జయస్తంభమును నాటి రాయలు మరల విజయనగరమునకుపోయెను. ఈనడుమజరిగినది కెంబావియుద్ధము. క్రీ.శ. 1516 పొట్నూరిలో విజయస్తంభము నాటినకాలమున మహమ్మదీయులు రేఁగి కోవెలకొండ, పానుగల్లు, దేవరకొండ, గణపురము దుర్గములను స్వాధీనము చేసికొనిరి. ఈసందర్భమున రాయలు బయలుదేరి కెంబావి అహమ్మదునగరముకడ శత్రువులను జయించి మరల కటకమునకుపోయెను. ఇటుపైన ఐదవఘట్టము. రాయలు కటకముమీఁదికి బయలువెడలెను. ప్రతాపరుద్ర గజపతి పాఱిపోయెను. రాయసైన్యము కటకమును కాల్చెను. ఇఁక ప్రయోజనములేదని తలఁచి గజపతిరాయలకు తనకుమార్తెనిచ్చి పెండ్లిచేసి రాయలతో సంధిచేసికొనెను. అంతట రాయలు కృష్ణకుత్తరము నందలిదేశమునంతయు గజపతికిచ్చి తాను విజయనగరమునకు పోయెను. ఇదంతయు క్రీ.శ. 1513-1518 నడుమ జరిగినది.

తర్వాత రాయలు దక్షిణతీర్థయాత్ర బయలుదేరెను. ఈసందర్భమున శాటూరు సింహాళము అను జయించెను. సింహాళాధిపతి కప్పముచెల్లించెను. (1518) తర్వాత రాయలు 1519 లో విజయనగరమునకువచ్చి రాయచూరు దండయాత్ర బయలుదేరి రాయచూరును ముట్టడించెను. (క్రీ. శ. 1520) బిజాపురపు సుల్తానులైన ఇస్మాయిల్ ఆదిల్ ఖానుఁడు రాయలను ఎదిరించుటకు సన్నద్ధుఁడాయెను. రాయలు రాయచూరుకడ కొంతరాణువనుంచి ఆదిల్ ఖానుని గొబ్బూరికడ ఎదిర్చెను. మహాసంగ్రామము ప్రవర్తిల్లఁగా ఆదిల్ ఖానుఁడు పూర్తిగా ఓడిపోయెను. అతనిసైన్యమును, సహా

యులు కొందఱును పారిపోయిరి; కొందఱు రాయలచేత చెఱపట్టఁబడిరి. తర్వాత రాయలు రాయచూరును సాధించెను. అంతర్వేదియంతయు రాయల స్వాధీనమాయెను. రాయలను ఈసందర్భమున హిందువులేగాక పాశ్చాత్యులు సైతము కొనియాడిరి.

తర్వాత రాయలు విజయాపుర కలుబరగిపట్టణములను జయించెను. ఆదిల్ ఖానుఁడు సంధిచేసికొన గోరెనుగాని సంధిషరతులను నెఱవేర్పనందున రాయ లాతనిపై కోపించి దండెత్తి బిజాపురమును ముట్టడించెను. అచటి నీటియెద్దడిచేత ఉండలేక ముదుగల్లునకు వచ్చెను. మరల సంధిప్రయత్నములు జరిగినవిగాని కుదురలేదు. రాయలు ఇనుమడించిన కోపముతో కలుబరగిని ముట్టడించి, పట్టుకొని, అందు ఆదిల్ ఖానుఁడు బంధించియున్న బహమనీసుల్తాను పుత్రులను విడిపించి వారి తండ్రి రాజ్యమందుంచి వారిని వారియంతస్తులకు తగినట్లు సత్కరించెను.

ప్రబంధాదులనుబట్టి రాయలవారి యుద్ధయాత్రలో కలబరిగియే చివరిదిగా కనఁబడుచున్నది. అటుతర్వాత రాయ లెవరిమీఁదికిని దండయాత్ర వెడలినట్లు కానరాదు. మనుచరిత్రాది కావ్యములలోకూడ కలబరిగియే చివరిదిగా చెప్పఁబడియున్నది. ఆముక్తమాల్యదలోని 'అలుకన్ఘోటక ఘట్టికా' పద్యము కలబరిగిని గూర్చినదానికి తర్వాతనున్నను అది తొలుదొల్తటి విజయములనుం గూర్చిన దగుటచే 'తొలుదొల్తనుదయాద్రి' పద్యమునకు ముందుండవలసినది ఏకారణముచేతనో ఇచ్చటపడినది. కలబరిగి సంగ్రామమున నొక ఏదులఖానుఁ డున్నను అతఁడు చావలేదు. తర్వాత చాలకాలమున్నట్లే చరిత్ర కలదు. ఆముక్తమాల్యదా ప్రతులలోని యాశ్వాసాంత పద్యములలో కొంత తారుమారు లుండుటచేత ఈపద్యముకూడ అస్థానగతమైనదేమోకాని ఈచారిత్రక సమన్వయములో నిముడనివి కొన్నిగలవు. ఆది మనుచరిత్ర 'ఉదయాచలేంద్రంబు' పద్యములోని "నావాడపతి శకంధర సింధురాధ్యక్షు లరిగాపు లెవ్వాని ఖరతరాసి, కాపంచ గౌడధాత్రీపదం బెవ్వాని కసివాలుగా నేగునట్టి బయలు" అను పంక్తి. దీనింగూర్చి చర్చించి యిదివరలో శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారు 'నావాడపతి' 'శకంధర' 'సింధురాధ్యక్షు'లు అను పదములచే కవి కొన్ని చరిత్రాంశములు సూచించినాఁడని వ్రాసి నావాడపతి యనఁగా నావాడదేశపు రాజనియు, శకంధరుఁడన సికందరను సుల్తాననియు, ఈ సుల్తాను గుజరాతును క్రీ. శ. 1526 లో ఫిబ్రవరి, మార్చి, ఏప్రిలు అను మూఁడునెలలే పాలించినందున ఆకాలమున రాయలు అతనిని జయించి యుండవలయు ననియు, ఆ పంచగౌడధాత్రీపద మనఁగా పంచగౌడ దేశమువఱకు... కృష్ణరాయుని యుత్తరదిగ్విజయ యాత్రను సూచించుచున్న దనియు" వ్రాసినారు. ఈవిషయమై రాయల గయశాసనమునుగూర్చి చర్చించుచు శ్రీ వెంకటరమణయ్యగారు ఇట్లువ్రాసినారు. 'ఇబ్రహింలోడి ఢిల్లీసింహాసన మధిష్ఠించినది క్రీ.శ. 1517 వ సంవత్సరమునందు. తత్పూర్వము అతని తండ్రి సికందర్ లోడి రాజ్యాధిపతియై యుండెను. కృష్ణరాయలు క్రీ.శ. 1509 మొదలుకొని 1529-30 వఱకును రాజ్యము సల్పియుండుటచేత నతనికి క్రీ.శ. 1509-1517 లలో సికందరు లోడియు 1517-1526 లలో ఇబ్రాహింలోడియు సమకాలికులగుదురు. కావున కృష్ణరాయల కరిగాపని పెద్దనార్యునిచే చేర్కొనఁబడిన శకంధరుడు సికందర్ లోడీ కావచ్చును. ఇం దసంగతి మేమియులేదు." "......'అసి వాలుగా నేగునట్టి బయలు' అను వాక్యము కృష్ణరాయలు ఉత్తర హిందూస్థానముపై దండునడచిన దొక్కపర్యాయముగాదు పెక్కుసారులని సూచించుచున్నది....కృష్ణరాయలకు కప్పముకట్ట నొప్పుకొని చేసికొనిన యొడంబడిక ప్రకారము అతని కుమారుఁడు ఇబ్రాహీము ప్రవర్తింపక పోవుటవలననో మఱి యేకారణముననో కృష్ణరాయలు క్రీ.శ.

1521 వ సంవత్సరమున మరల ఉత్తరహిందూస్థానముపై దండువెడలిన ట్లున్నది. ఇది విజయవంతముగ కొనసాగెననుటకు ప్రస్తుత గయశిలాశాసనమె సాక్షి" (భారతి.) ఈగయాశాసనము ఇటీవల బయలుపడినది. దీని తారీఖు క్రీ. శ. 1522 (శా. శక. 1414 వృష ఆషాఢ బ 18. జయశాసనమని యున్నది. 'తిరుమలదేవీవల్లభ...' ఇత్యాది పారిజాతాపహరణ పద్యముండుటయేగాక చివర 'యీశాసనము ముక్కుతిమ్మయ వ్రాసెను' అని యున్నది. పారిజాతాపహరణ మనుచరిత్రాముక్తమాల్యదలలో కలబరిగి యుద్ధము వర్ణింపఁబడి యుండుటచేతను, రాయవాచక కృష్ణరాయ విజయములు కలబరిగి యుద్ధానంతరము రాయలు కృతినందిన విషయమునుచెప్పి అముక్తమాల్యదను చెప్పనందునను, రాయలు కలబరిగి యుద్ధానంతరము (ఇది క్రీ.శ. 1522 సం॥ జరిగినది.) పారిజాతమను చరిత్రము నంకితమందినది నిశ్చయము. ఆతరువాతనే అముక్తమాల్యదా ప్రకాశనము. అన్నియు కలబరిగి తరువాతనే. గయశాసనముకూడ అసంవత్సరముననే యుండుటచేత కలబరిగి యుద్ధమై రాయలు గ్రంథముల నంకితమంది ఆవెనువెంటనే కాలయాపన చేయక ఉత్తరదేశమునకు దండుపంపి యుండవలెను. ఆదండుతోకూడ ముక్కుతిమ్మనయు పోయియుండును. ఈదండయాత్ర రాయలు స్వయముగా నేగినదో లేక దండునుమాత్రము పంపినదో చెప్పలేముగాని ఇబ్రాహీంలోడిని శిక్షించుటకని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారి యభిప్రాయము సమంజసముగానే యున్నది. ఏలయన విజాపురముపై రాయలు దండయాత్ర సలుపుచుండిన కాలమున సంధిరాయబారములు జరుగుచుండినవి. దక్షిణాపథమందలి మహమ్మదీయ సామంతరాజులు కొందఱు రాయలను వెనుదిరిగి పొమ్మనియు అట్లుపోకున్న తామందఱము ఎత్తివచ్చి ఆదిల్షానునికి సాయము చేయుదుమనియు వ్రాసిరి. వారికి రాయలవారు, ఎత్తివచ్చునంతటి శ్రమపడనక్కఱలేకయే తానే వారికడకు రాగలనని, బదులుచెప్పి వెంటనే దండెత్తిరి. దీనింబట్టి మహమ్మదీయప్రభువులు ఏకమై రాయలనెదిరింపఁ దలంచియు బలమును ధైర్యమునులేక మానుకొన్నట్లు విశదము. వీరితో ఉత్తరహిందూస్థానమువా రెవరైన చేరిరో లేదో తెలియదుగాని ఈసమయమందే ఈ ఉత్తరదిగ్విజయమును అందుముఖ్యముగా 'శాసదప్పవరగండాంకా'యను బిరుదుండుటయు గుర్తింపఁదగినది.

## ౯ అముక్తమాల్యద రచనాకాలము

కలుబరగిని సాధించుటతో రాయలదిగ్విజయములు సమాప్తినందినవి. పారిజాతాపహరణమను చరిత్రములను రాయలు సర్వదిగ్విజయానంతర మంకితమందెనని రాయవాచ కృష్ణరాయ విజయములలో నున్నది. మనుసంభవాముక్తములలోని కలబరిగిప్రస్తావముచేత నది రూఢియగుచున్నది. మనుచరిత్రమందు అముక్తప్రస్తావములేదు. పైగా అముక్తములో మనుచరిత్రపద్యము లుదాహృతములు. కాన మనుచరిత్రయే ముందుది. పారిజాతాపహరణమున కలుబరిగెవృత్తాంతము కానరాదు. ఆపేరే లేదు. పైగా సింహాద్రి పొట్నూరివృత్తాంతములుకూడ స్ఫుటముగా కానరావు. స్థూలముగా 'ఉత్కల భూమీధవదర్పహరణ'అనియు'బలనికాయము కాలిమట్టలనడంచు కటకమును వింకననుచు నుత్కల మహీశుఁ డనుదినమ్మును వెఱచు నెవ్వనికి'ననియు 'కొండపలి కొండవీటిమండల కటకోర్వీసింధుకంధర వసుధరా' అనియు నుండుటచేతను కళింగవిజయము పారిజాతాపహరణమునాఁటికి పూర్తికాలేదని, కొండవీటివిజయమువఱకు సమగ్రముగా వర్ణించిన యీకవి తర్వాత వ్రాసియుండినయెడల వానినింకను చక్కఁగ వర్ణింపక వదలివేయునా, అని కొందఱు తలంచుచున్నారు. కాని సర్వదిగ్విజయానంతరమే మనుసంభవపారిజాతాపహరణములను రాయ లంకితమందె నన్న రాయవాచక కృష్ణరాయ



**Sri Krishnadeva Raya**

( Stone image in a niche on the North Gopuram at Chidambaram )

*—By courtesy of The Archaeological Survey of India, Madras.*

విజయములను కాదనుట కాధారములులేవు. భువనవిజయనిర్మాణ ప్రస్తావముండుటవలన పారిజాతాపహరణము కటకవిజయానంతరమే రచితము. ఈరెండుగ్రంథములను ఆముక్తమాల్యద పేరైన నెత్తవు. అసలు కృష్ణరాయలు కవియని యీగ్రంథములలో బొత్తిగా లేకపోవుట యాశ్చర్యము! కుమారధూర్జటి ఆముక్తమాల్యద నెఱుఁగఁడా? కృష్ణరాయల మనోజ్ఞసభలో తన పెదతాతయొక్క గొప్పను వర్ణించుకొన్నవాఁడు ఆముక్తమును ఎఱిఁగియే రాయలుకవి యని చెప్పలేదని తలంపవలసి యున్నది. ఆముక్తమాల్యదలో మూఁడవ రాయచూరుయుద్ధమునుగుఱించిగాని ఉత్తరాపథమునకు (గయాప్రాంతమునకు) పోయిన విషయమునుగుఱించిగాని లేక మిగిలినవిజయము లన్నిఁటినిగూర్చి యున్నందున క్రీ. శ. 1520 లేక 21 నాఁటికి పూర్తియై స్వామికి అంకితమైనది. మఱి రాయల యంతటిచక్రవర్తి తిరుమలలో భగవత్సన్నిధానములోఁగదా అంకితము చేసియుండవలెను. అట్లు తెల్పు శాసనముగాని ఉదంతముగాని ఎచ్చటను కానరాదు. తిరుమలలో రాయల చివరిశాసనము 17-2-1521 తారీఖుది. రాయచూరు విజయానంతరము రాయలు దేవునిదర్శించి దానము లిచ్చి యున్నాఁడు. అటుతర్వాత 1524 జనవరి 12లో వ్యాసతీర్థ శ్రీపాదులవారికి ఇండ్లు, నివేశనములు, కొన్ని ప్రసాదములు మొదలైనవి దానమిచ్చియున్నాఁడు (చూ. దేవస్థానమువారి రిపోర్టు I-పు. 166) రాయల క్షేత్రయాత్రా ప్రస్తావములోకూడ రాయలు ఆముక్తమాల్యదను దేవుని కర్పించినట్లు లేకపోవుట విచిత్రము. ఇంతెందులకు తర్వాతికవులలో ఒక్కఁడుకూడ రాయలు ఆముక్తకవి యని చెప్పకపోవుట చాలచిత్రము. అట్టిది, ఉండవలసినది, లేకపోవుటచేత, ఆముక్తరచనా కాలము గూర్చి ఊహింపవలసి యేర్పడినది.

కాని ఆముక్తమాల్యద ప్రారంభకాలముం జూతము. 'మున్నే కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి ...... హరివాసరోపవాసం బచ్చట గావింప' పలువురు పండితులు ఈ హరివాసరమును వెదుకుటకు ప్రారంభించిరి. కొందఱు పరిశోధకులు కటక విజయానంతరము అనఁగా క్రీ.శ. 1519 నాఁటికి ఉండునని తలంచిరి. శ్రీ చాగంటి శేషయ్యగారు ఇతరుల యభిప్రాయముల నుద్ఘాటించి, ఆ యభిప్రాయమును అంగీకరింపక "కృత్యాదిరచనకుఁ జాలపూర్వము శ్రీకాకుళేశ్వరుని దర్శనమును జేసినట్లు 'మున్ను' అనుశబ్దముచే రాయలు సూచించినాఁడు. అప్పటి కాతని హృదయమునఁ గళింగదేశమును జయింపవలయునను కోర్కెకలదు. అంతియేకాని కళింగదేశమును జయించినపిమ్మట స్వామి స్వప్నములో దర్శనమిచ్చి యుండలేదు" అనివ్రాసి, తిరుపతిశాసనములను ఉదాహరించి, క్రీ.శ. 1514 జూలై 6-వ తేది, 1515 అక్టోబరు 25 తేదులలో బెజవాడకు వచ్చినట్లు లేనందునను, 1517 జనవరి 2-వ తేదిగల దానిలో 'కళింగదేశ దిగ్విజయార్థమై బెజవాడకువిచ్చేసి' అని యుండుటవలనను ఆమాటలే 'కళింగదేశ విజిగీషామనీషం... విజయవాటిం గొన్నివాసరంబులుండి' అని మార్పుచెందినవనియు, అందులోనే సింహాద్రి జయస్తంభ ప్రస్తావముండుటవలన, పై తిరుపతి శాసనములకును, సింహాద్రి మొదటిశాసనపు తారీఖు 1516 మార్చి 26-కును నడుమ బెజవాడ యుదంతమని తేల్చినారు. అటువెనుక "రాయలు విజయనగరమునుండి యువసంవత్సర కార్తికమాసాదిని బయలువెడలి కార్తిక బ 3 నాఁటికిఁ దిరుపతికి వచ్చి యటనుండి పుష్య శు15 శుక్రవారమునాఁటి కహోబలమునకేఁగి (21 డిసం. 1515) యచ్చట శాసనము వ్రాయించెను. అహోబలమునుండి బెజవాడకు మాఘ శుక్ల పాడ్యమికి వచ్చియుండును. అటఁ గొన్నివాసరంబులుండి మాఘ శు॥ (15 జనవరి 1516) నాఁటికి శ్రీకాకుళమునకేఁగి యుపవాసమొనర్చెననియు, నారాత్రియే స్వప్నమున స్వామి రాయలకు దర్శనమొసంగి యుండుననియుఁ

తిరుపతి దేవస్థానపు రిపోర్టుకార్యకర్తలు వ్రాసియున్నారు. ఇది చాలసమంజసముగనున్నది. ఇది సత్యమనుటకు సంశయింపఁబనిలేదు'' అని వ్రాసినారు. (పు. 124) ఇందులకు రాయల అహోబల శాసనము కొండమరసయ్య బెజవాడశాసనము వారికి ఆధారములు.

ఇది చాలఁటుకు మానవల్లిగారి యభిప్రాయమునకు సరిపచ్చుచున్నది. పీఠికలో (పుట 66) నిట్లువ్రాసియున్నారు. 'మతి రాయఁడు కళింగదేశ విజిగీషామనీషఁ దండెత్తిపోయి ఇంకను మధ్యేమార్గము, విజయవాటికడనే కటకమునకు బహుయోజనముల దూరమున ఇవతలనే ఉన్నప్పుడే, విద్వాంసులు అతనితో అతఁడు కళింగమును అప్పటికే జయించినట్లును గజరాజు వింధ్యవాటికిం బలాయితుఁ డయినట్లును వర్ణించినారే అదియెట్లు? సంఘటిల్లును? ...'' అని ఇత్యాది వ్రాసి 'విజిగీషా' అనుటచే ఇదే మొదటిపర్యాయమను నభిప్రాయమును వ్రాసినారు. 'విజిగీషామనీష' కాఁబట్టి అతర్వాత చెప్పిన విజయములు నాఁటికి జరుగలేదనియు 'ఈ విద్వదుక్తి రాయకర్తృకతావిశ్వాసోత్పాదనార్థ కల్పితమయినకథ' అనియు వ్రాసినారు.

ఈ ప్రయాణము రాయలకు మొదటిది కాకపోయినయెడల, అనఁగా కటకవిజయమునకు పూర్వపుదికానిచో తర్వాతివచనమున కర్థము కనఁబడదు-''నిండోలగంబుండి...అస్వప్నం బనేక శోభన పరంపరలం దెలుపుచున్నయది...ఇలోధికభక్తియు, ...... ఇలోధికాద్వితీయ సితచ్ఛత్త్రయు...ఇలోధిక బహుప్రేయసీప్రాప్తియు, ...ఇలోధికాపత్య పరమాయుఃప్రాప్తియు నగు...' ఇదంతయు రాబోవుశుభమును చెప్పుచుండ అంతయు ముగిసినవెనుక భగవద్దర్శనమనుట పొసఁగదు. లేకపోయిన 'మున్నే' అనుదానికి, పూర్వము బెజవాడలో విడిసినప్పటి స్వప్నవృత్తాంతమును, సకలదిగ్విజయానంతరము చెప్పి ప్రబంధరచన కారంభించె ననవలసి యున్నది. అట్లు చెప్పకొన్న 'మేల్కని వెలుఁగులోఁడిభక్తి... వేగుటయుఁ గల్యకరణీయ విధులుదీర్చి' అను మాటలు నిరర్థకము లగును. స్వప్నము వచ్చుటయు, తెల్లవాఱఁగానే సభలో చెప్పుటయు, సభ్యులు దిగ్విజయాదులఁ బ్రశంసించుటయు జరిగినది. దీనింబట్టి చూడఁగా ఒకదానికొకటి సరిపోవుటలేదు. భవిష్యత్తును చెప్పుచు తర్వాత భూతవృత్తమును చెప్పుట పరస్పరవిరుద్ధముగా నున్నది. తర్వాత 'అలుకన్నోటక' పద్యము దాని స్థానమునలేదు. మిగిలిన విషయములను ఒక వరుసలో చెప్పి మొదట రావలసిన దానిని చివర బెట్టినట్లున్నది. వంశవర్ణనయంతయు మనుచరిత్రదే కొద్దిమార్పులతో నిండున్నది. గ్రంథమందును మనుచరిత్రలోని పద్యములు కనఁబడుచున్నవి.

వీని నంతయు చూడఁగా రాయలు (క్రీ.శ. 1515-16) బెజవాడకుపోయి, అటనుండి ఆంధ్రవిష్ణుదర్శనానంతరము ఆముక్తమాల్యదారచనకు ప్రారంభించి ఆయా యాశ్వాసాంత పద్యములలో చెప్పినరీతిని గ్రంథమును సకలదిగ్విజయానంతరము, క్రీ.శ. 1520-21 మనుచరిత్రాదుల నందికొన్న తర్వాత పూర్తిచేసియుండును. అంకిత మెట్లుజరిగెనో తెలియదు. ఆవెనుక పెద్దనపద్యములను అందు వ్రాయసగాండ్రో రాయలో చేర్చియుందురు. ఈయభిప్రాయమునే మానవల్లిగారు తమ పీఠికలో విశదీకరించినారు. పారిజాతాపహరణ,మనుసంభవ, ఆముక్తమాల్యదా కృష్ణరాయవిజయ రాయవాచకములనుండి ఉదాహరించి''ఈ యేనింటినిం బరిశీలింపఁగా పారిజాత మనుసంభవాముక్తమాల్యదలు మూఁడును సర్వదిగ్విజయ తీర్థయాత్రానంతరమే రచితములనియు, దీనిలో మనుసంభవాముక్తమాల్యదల పౌర్వాపర్యము వంశవర్ణనోద్ధారము చేతఁదప్ప ఒం డుపాయమున సిద్ధాంతపడ దనియు తెల్లమగును. లేదా ఆముక్తములోని కృష్ణరాయ తద్వంశ తద్విజయాది ప్రస్తావనసర్వమును పిమ్మట ఎప్పుడో ప్రక్షిప్తము గావలయును.'' ఈపద్యములును చొప్పించినట్లే యున్నవి.

పారిజాతాపహరణ మనుచరిత్రములలో అముక్తమాల్యద ప్రస్తావము లేదు. సర్వదిగ్విజయానంతరమే గదా యివిరచితములు. తర్వాత వ్రాయఁబడిన యాముక్తమున పైరెంటిని చెప్పియుండవచ్చునుగదా యన్న ఇంచుమించు రాయలుకూడ సమకాలముననే తనరచనను పూర్తిచేసియుండును. ఏకకాలజనితములుగాన వీనిలో ఒకదాన మఱియొకదాని ప్రస్తావము లేదేమో.

## ౧౦ కర్తృత్వ విచారము

ఆముక్తమాల్యద రాయలవారిది కాదనునభిప్రాయము రాయలవారికాలమునుండియే వచ్చి నేఁడు వివాదముల కవకాశమిచ్చినది. ఆవివాదమునంతయు మరల తడవుట యనవసరము. ఈ గ్రంథపీఠికలో దానింగూర్చి చాలవిపులముగా మాతాతగారు చర్చించి రెండువిధముల వాదములను ప్రదర్శించి తుదకు 'వాదములెట్లున్నను,—రాయలవారు తొంటిభర్తృహరివోలె మహాప్రతిభులు, కలావంతులు, కవితాస్త్రీలోలురును; కానిచో అష్టదిగ్గజములను ఏల చేర్పుదురు? అట్టి కవితారసమగ్నులు కవనమును సహవాసబలము చేతనేనియు అల్లనుగూడ సమర్థులగుదురు. వారేరచించినట్లు గ్రంథములోనున్నది. కొండంతస్వప్నకథయు నిబద్ధము. కావున దీనిని పెద్దనగారి తోడ్పాటున రాయనివారు రచించి యుందురనియు నెన్నవచ్చును. పెద్దనగారి యనుప్రవేశము తప్పదుగావున, ఇందు తప్పులున్నవనుట న్యాయముగాదు.' ...... రాయఁడును తాను పల్లకీలో నునిచి యెత్తిన యాంధ్రకవితా పితామహునికిం దెలియనీక ముచ్చుఁదనముగా నిట్టి లోకోత్తరమహాప్రబంధమును రచించునా – పెద్దనగారును తనకుం బ్రాణమిత్రమయిన రాయనికి అకీర్తి రాకుండునట్లును, మహాకీర్తియగునట్లును తదీయకవనమును సంస్కరింపక యొప్పరికింతురా?' అని తేల్చినారు.

తాతగారి యీ యభిప్రాయమును పూర్తిగా ఆమోదించినవారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిమహాశయులు. నేను వ్రాసిన 'వేంకటరాయశాస్త్రి జీవితచరితము'న కుపోద్ఘాతముగా వ్రాసిన 'గురుపూజ' యను వ్యాసమున ఇట్లు వ్రాసిరి. "శ్రీ శాస్త్రులవారికి సరస్వతీప్రసన్నమే గాని లక్ష్మీకటాక్షము ప్రాప్తింపలేదు. ఆముక్తమాల్యదకు ఉత్కృష్టవ్యాఖ్యను, సంజీవనీనామకమును, రచించి ముద్రణకార్యమునకై ధనసాహాయ్యముంగూర్చి నన్ను హెచ్చరించిరి...... వ్యాఖ్యానమెట్లో ముద్రితమైనది. శ్రీ శాస్త్రులవారు నాయందలి వాత్సల్యాతిశయముచే, ఏతద్వ్యాఖ్యానరంగాధిరోహణమహోత్సవమును అగ్రపీఠమునుండి నడుపవలసినదిగా నన్నుం గోరిరి. నాకా అర్హత లేదు. సంస్కృతాంధ్రపారంగతులైన శాస్త్రులవారి పరిపక్వామోఘ వ్యాఖ్యానమెక్కడ! తెలిసియుఁ దెలియక పల్కు నే నెక్కడ! ఐనను గురువులయాజ్ఞ, అనుల్లంఘ్యము. ఒప్పుకొంటిని. సభ మద్రాసులో జరిగెను. విద్యాశేఖర ఉమాకాన్తముగారు మొదలగు విద్వద్వరేణ్యులు వచ్చిరి. 'కనకపుసింహాసనమున' నేను గూర్చుంటిని. అందఱియెదుట, జంకుపాటుతో, ఆ గ్రంథమును పఠించియు, వ్యాఖ్యానమునుబట్టియు, శ్రీ శాస్త్రులవారిజీవితమును, వారిభాషాదోహదాది కౌశల్యమునుగూర్చియు వచించుచు, ఏమాత్రము బ్రాహ్మణేతరకవులకు మనభాషాచరిత్రలో తక్కువ పాటు ఉద్దేశపూర్వముగనో లేక నిరుద్దేశ్యముగనో సంభవించినదో అది విచారణీయమని సాహసించి నివేదించితిని. ఆముక్తమాల్యదయొక్క కర్తృత్వము అల్లసాని పెద్దనకు కొందఱిచే అర్పింపఁబడియుండుట న్యాయము కాదనియు, అది కృష్ణదేవరాయకృతము యనియు, సిద్ధాంతీకరించినవారగుట శ్రీ శాస్త్రులవారికి నేను బహిరంగపఱచిన మీమాంస ఆశ్చర్యమును కలిగింపలేదు; అసహ్యము కాలేదు. కాని కొందఱుపండితులు కోపపడిరి. సహజమేకద. నూతనాభిప్రాయములు అలవాటు

వను వచ్చుటకు కాలముపట్టునుగదా. ఈమధ్యలో నవి కొన్నియెడల కొందఱిలో మనస్తాపము కలిగింపకయుండునా? కాని శ్రీ శాస్త్రులవారియొక్క మనోవైశాల్యము కొలఁదికిమించినది. ఏవిషయమైననుసరే, క్రొత్తదిగానుండనీ, ఆగమాచారములకు విరుద్ధముకానీ, వేగిరపడక, ఆగ్రహింపక, శాంతముగా ఆమూలాగ్రముగ పరిశీలించి, సత్యశోధనపరాయణత్వమును ప్రకటించువారిలో వీరు అగ్రగణ్యులు. కావుననే వీరియభిప్రాయములు సమరసములు సహృదయసమ్మతములునై యున్నవి.'' శ్రీ తేకుమళ్ల అచ్యుతరావుగారుకూడ ఇట్లే అభిప్రాయపడిరి. (వి. సామ్రా. చరిత్ర. పు. 52)

శ్రీ రెడ్డిగారికన్న కృష్ణరాయపక్షపాతి యుండఁడు. అట్టివీరే తాతగారి యుపోద్ఘాతమును పఠించి ఇట్టి యభిప్రాయమును సభాముఖమున నిచ్చియుండఁగా ఇటీవల కొందఱు తాతగారి యభిప్రాయమును చక్కఁగా గ్రహింపక, తాతగారు సశాస్త్రీయమైన విమర్శకమార్గమున (Scientific method) రాయవాదులయు పెద్దనవాదులయు వాదములను రెంటిని, చారిత్రకవిమర్శలతో, ప్రదర్శించి తమయభిప్రాయమును చివర చెప్పియుండఁగా, దాని నొప్పరికించి పెద్దనవాదమే వీరి వాదమని భ్రమించి ప్రతివిమర్శలు వ్రాసియున్నారు. వారికి జవాబు అనవసరముగాన శ్రీ రామలింగరెడ్డిగారి వాక్యములను మాత్రముదాహరించితిని.

ప్రాచీనకాలమున దేశమందు జనులలో అట్టి కింవదంతి యుండినది. తెనాలిరామకృష్ణకవి చాటువు కల్పితమని భావించినను కోకటము కైఫీయతులోకూడ పెద్దన వ్రాసినట్లే యున్నది. ''...తర్వాత మరికొన్ని దినములకు విజయనగరం సింహాసనాధీశ్వరుండైన శ్రీ వీరకృష్ణరాయ మహారాయలు వారివద్ద బ్రాంహ్మడు నందవరీకుడు అళ్లసానిచొక్కరాజుంగారి కొమారుడు అళ్లసాని పెద్దయ్యంగారు ఆనేకవీశ్వరుఁడు శ్రేష్ఠమయిన వాడుగనుక రాయలవారి అంకితం...మనుచరిత్ర, విష్ణుచిత్తీయం, ఈ రెండ్డుపాకృతం, తెనుగు చరిత్రలు— చేసినందున రాయలవారు చాలా బుజ్జగించి వుండేవారు. అప్పుడు యీకోటకమనేగ్రామం, యీకవీశ్వరునికి వుంబళిగాను యిచ్చివుండగాను, యీకవీశ్వరుడు శ్రీ వైష్ణవమతం పుచ్చుకొని, యీగ్రామం శ్రీ వైష్ణవులకు అగ్రహారం చేసి యిచ్చి, యీకోటకగ్రామానికి ప్రతినామం శఠగోపపురమనే నామమువుంచెను. గాని యీకవీశ్వరుడు యీఅగ్రహారంచేసిన శాసనంలేదు. యీదేశంవారున్ను యీగ్రామస్థులున్ను, యీకవీశ్వరుడు బ్రాంహ్మలకు అగ్రహారం యిచ్చినట్టుగా వాడుతున్నారు. యీకవీశ్వరుడు చేసిన పద్యాలలో కోకట అగ్రహారం చేసినట్లు చెప్పినాడు. ఈకవీశ్వరుడు దేశములో బహుప్రసిద్ధిగా ఆంధ్రకవితా పితామహుండు అల్లసాని పెద్దన అని పద్యాలలోవున్నది. యీకవీశ్వరుడు సమర్థుడు అని పెద్దలు ప్రసిద్ధిగా వాడుతున్నారు, తర్వాతను యీ కృష్ణరాయల ప్రభుత్వంలోనే యీఅల్లసాని పెద్దన ఆనేకవీశ్వరుడు, శాలివాహన శకవర్షంబులు 1440 బహుధాన్యసంవత్సర వైశాఖ శు 15 యీగ్రామములోవుండే సకలేశ్వర దేవునికి నైవేద్య దీపారాధనలకుగాను చేను ఖ 2 గండుపుట్లు ధారపోసి యిచ్చి సదరుదేవాలయంలో శిలాశాసనం వేయించినాడు. యిదిగాక యీదేవళం ప్రాకారం లోతట్టుగానే చంనకేశవస్వామి దేవునికి యీశకంలోనే కార్తీక శుద్ధ 12లు చంనకేశవస్వామికి ఖ 4½ చేను ధారపోసి యిచ్చి శాసనంవేయించినాడు.'' (లోకలురికార్డ్సు 10 పు. 99_100) (చూ. Further Sources by Dr. N. Venkataramanayya.) కైఫీయతు ఇట్లుండ చాటువు ఆముక్తమాల్యద పెద్దనయొక్క తొలిరచన యనుచున్నది.

''కృష్ణరాయలపేరు నిడి నీవురచియించితివి తొల్త విష్ణుచిత్తీయమనఁగ,
గాఠిన్యమర్థంబు గ్రాహ్యంబుగాదు సాధారణులకని భూధవుఁడుపలుకఁ

తరువాత మనుచరిత్రము నొనరించి యుత్తమకావ్యము మహోద్భుతముగఁ దిదపఁ
వెక్కు కావ్యంబులు పెంపెక్క విరచించి మంటివి రాజసన్మానమునను
భంగ మొందినయల రామలింగముఖులు, సాటిరాఁగలవారె నీతోటివార
యాంధ్రకవితాపితామహ యల్లసాని, పెద్దనార్య విశేషవివేకధుర్య’’

ఇందులకు విరుద్ధముగా తెనాలిరామలింగకవిపేరిటి చాటువు ‘ముదిమదిదప్పి’ యని యున్నది. కాని ‘అమవసనిశి’ ‘ముదిమదిదప్పి’ అను నివి ఆముక్తపద్యములోని మాటలే. రామలింగయ్య చెప్పి యుండవచ్చును. కాని అతఁడు వయసులో చిన్నవాఁడైనందున ‘భంగమొందిన’ యనుటవలన నీ పద్యము తర్వాతివా రెవరో వ్రాసియుందురు.

ఇందలి శఠకోపపురము పెద్దనగారిగురువు శఠకోపయతి పేరటనే యని వేఱుగ చెప్ప నక్కఱ లేదు. మనుచరిత్రలో శఠకోపయతి కలఁడు.

‘‘కొలుతున్ మద్గురువిద్యా, నిలయుం గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా
దళితాశ్రిత జనదురిత, చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్.’’

పైశకాబ్దములు 1440 క్రీ. శ. 1518 అగును. మనుచరిత్రరచనకు, లేక అంకితమునకు, మునుపే రాయలు పెద్దనకు కోకటగ్రామ మిచ్చెనేమో. అట్లే తిమ్మనగారును తమప్రబంధము పూర్తియగుటకు మునుపే ‘కృష్ణరాయక్షితీశ కరుణాసమాలబ్ధ ఘనచతురంతయాన మహాగ్రహార సన్మానయుతుఁడు’.

దొరకిన యాధారములను బట్టిచూడఁగా రాయలవారికిని పెద్దనగారికిని ఒకవిధమైన అభేద ప్రతిపత్తి యుండినట్లు కనఁబడుచున్నది. సింహాసనమునకు వచ్చుటకు మునుపటినుండియు, రాయలును పెద్దనయు జంటకవులవలె వ్యవహరించి యుండవలెను. నాటికే జంటకవులు తెలుఁగులో నేర్పడి యుండిరనుటకును, పెద్దనరాయల ఇరువురకంటె యెనుటనే వారికి మార్గదర్శకులుగా నుండి రనుటకును, నందిమల్లయ్య ఘంటసింగయ్యలు సాక్షి. పైగా రాయల దిగ్విజయములను గుఱించి చమత్కారముగా వ్రాయుటకు నాఁటి భావనాప్రపంచమునకు వరాహపురాణకర్తలు మార్గదర్శకు లనుట వారిగ్రంథమును చూచిన తెలియును. ఒక యుదాహరణము; వరాహపురాణమున—

‘‘ఉదయాద్రి భేదించె, హుత్తరి నిర్జించె, గండికోట పురంబుఁ గదలఁద్రవ్వె,
పెనుగొండ సాధించె, బెంగుళూరు హరించెఁ, గోవెల గుంటూరు గుంటు పఱిచెఁ.
గుండాణి విదళించె, గొడుగుచింత జయించె, బాగూరు పంచము పాడు చేసె.
వరుగొండ పెకలించె, నామూరు మర్దించె, సీరంగ పట్నంబు చూరిసమరె.
రాయచౌహత్తమల్ల ధరావరాహ మోహనమురారి బర్బరబాహుసాళ్వ
నారసింహప్రతాపసన్నాహుఁడగుచు విశ్వహితకారి తిమ్మయయీశ్వరుండు.’’

‘భేదించె’, ‘నిర్జించె’, ‘పాడుచేసె’ ఇత్యాది క్రియాపదములను సాభిప్రాయముగా, పునరుక్తి లేక ప్రయోగించినసైపుణి తిమ్మనపెద్దనాదులకు సంక్రమించినది.

రాయలును పెద్దనయు జంటగా నుండిరనుటకు ప్రపంచదర్పణమే సాక్షి. రాయలవిగా ఆముక్తములో చెప్పఁబడిన గ్రంథములు పెద్దనవిగా నిందులో నున్నవి. రాయలు కవి కాఁడనఁ జాలము. ఆయన నాటకకర్త కూడ. జాంబవతీపరిణయనాటక మొకటి ఆయనది కలదు. ‘ఉదయం బస్తనగంబు’ అను చాటువొకటి రాయలదిగా జగత్ప్రసిద్ధము. పైగా రాయలు పట్టాభిషేకము నాఁటికి బాలుఁడు కాఁడనియు నలువదియేండ్లు దాఁటిన వాఁడనియు, తేలినదిగదా. పెద్దనకు ఇంచుమించు సమవయస్కుఁడో లేక ఐదాఱేండ్లు పెద్దయో! పట్టాభిషేకమునాటికే కావ్యనాట

కాలంకార మర్మజ్ఞుఁడుగావునను, ఒకప్పుడు తాను రాజగురుడనని తలంపలేదు గావునను నిశ్చింతగా విహరించుచుండినకాలమున చక్కనికవితను ఉభయభాషలలోను పెద్దనాదులతో కలసి అభ్యసించి యుండుననుటలో సందేహము లేదు. కవిత్వప్రపంచమున రాయలే పెద్దన, పెద్దనయే రాయలు. మనుచరిత్రలో రాయల హస్తమున్నదని ఎవరైన మున్ముందు ఒకసిద్ధాంతమును ప్రతిపాదించినను నాకు ఆశ్చర్యము లేదు. ఏలయన అందొక్కదాననే ఆముక్తపద్యము లున్నవి. ఉభయులను రచించి ఒకటి పెద్దన పేరిటను ఒకటి రాయల పేరిటను ప్రకటించికొనిరిగావలయు. ఇది కొంత ఊహయేయైనను బొత్తిగా అసంభావ్యముకాదని తలంచెను. నేఁటి ఉర్దూకవిత్వముల గోష్ఠులలో (ముషైరా) ఒకరొక వాక్యముచెప్పిన మఱియొకరు మఱియొకటిచెప్పుచు కవిత్వము చెప్పుచుండుటవలె రాయలవారి రచనను పెద్దనగారు పరిచూచియు కొంతచేర్చియు నుందురనుటకు సందేహము లేదు; తాతగారి సిద్ధాంతమే శ్రీరామలింగారెడ్డిగారన్నట్లు తుదకు నిలుచునట్లున్నది. నాఁటి కవితాగోష్ఠులలో రాయలవారు కవిగానిచో పాల్గొని యుండఁగలరా?

## ౧౧ రాయలవారి సాహిత్యగోష్ఠి – అష్టదిగ్గజములు

రాయలవారి యాస్థానమున ఆంధ్రసరస్వతి ఒక మెఱుపు మెఱసినది. కవి గానట్టి ప్రభువులే సారస్వతాభివృద్ధికెంతో తోడ్పడియుండ స్వయము కవియైన యాతనిచెంత చెప్పవలయునా? రాయలవారి యాస్థానమున అష్టదిగ్గజము లనఁబడు నాంధ్రకవితల్లజు లుండిరని పెద్దలసుద్ది. కాని ఒక్క యాంధ్రమునేగాక సంస్కృత ద్రావిడ కర్ణాటకములను పోషించినవాఁడుగాన అష్టదిగ్గజములలో ఒక్క యాంధ్రులేగాక ఇతరులును ఉండియుండవలెనని కొందఱు తలంచిరి. కాని ఆంధ్రకవులే యనుటకు ఆధారము కలదు. కడపమండలములో తిప్పలూరుగ్రామము అష్టదిగ్గజ కవీశ్వరుల కీయఁబడిన యగ్రహారమైనట్లు క్రీ. శ. సోమవారము 26 ఆగస్టు, 1527 సం॥ పు రాయల శిలాశాసనముచే తెలియుచున్నది. (A- R- no 282, 1987-88) ఈఅష్టగజ కవులెవరో వారి పేర్లు ఆశాసనమున లేవు, ఆనాదిగ అష్టదిగ్గజకవులు ఆంధ్రులేయని మనవారు తలంచుచుండుటయు, తమిళాదీతర వాఙ్మయములందు ఇట్టిస్మరణయే లేకపోవుటయు నొకసాక్ష్యము. ఈ ఎనమండ్రును–అల్లసాని పెద్దన, నందితిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయగారిమల్లన, తెనాలిరామకృష్ణుఁడు, పింగళి సూరన, రామరాజభూషణుఁడు–నని. అష్టదిగ్గజము లెవరనుటను గూర్చి పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. కొందఱు పింగళిసూరనను వదలి కందుకూరి రుద్రకవిని, కొందఱు మాదయగారి మల్లనను వదలి చింతలపూడి ఎల్లనను, (రాధామాధవ కవిని) కొందఱు రామభద్రకవిని శంకరకవిని రామరాజభూషణుని వదలియు గ్రహించియు నీసంఖ్యను సరిపరచిరి. ఈవాడుక ఎప్పటినుండి యున్నదో తెలియదుగాని చాలప్రాచీనమే. రాయవాచక (1600) కృష్ణరాయవిజయము (1625) ములు రెండును అష్టదిగ్గజము లనుపేరు చెప్పకపోయినను అల్లసాని పెద్దన ముక్కుతిమ్మన మాదయగారి మల్లన అనుమువ్వురు కవీశ్వరులను పేర్కొని, 'మొదలైన కవీశ్వరులనుటచే ఇతరులనుకూడ సూచించెనని తలంపవలసియున్నది. అయ్యలరాజు రామభద్రుఁడు రాయలయాజ్ఞచే తాను సకలకథాసారసంగ్రహమును రచించినట్లు చెప్పుకొన్నందున నాతఁడొకఁడు. ధూర్జటి 'కృష్ణరాయల మనోజ్ఞసభ'యం దుండెనని కుమారధూర్జటియే తన కృష్ణరాయ విజయమందు చెప్పియున్నాఁడు. తెనాలిరామలింగ (కృష్ణ) కవినిగుఱించి వీరేశలింగముపంతులు వారు సందేహించిరిగాని ఈవిషయమును చర్చించి అష్టదిగ్గజవర్ధంతిసందర్భమున శ్రీ సేటూరి

వెంకటరమణయ్యగారు 'పాండురంగమాహాత్మ్య కృతిపతియగు వేదాద్రిమంత్రియు నతనిగురువైన కందాళ యప్పలాచార్యులును క్రీ. శ. 1540_1550 ల మధ్యనుండిరని తెల్లమగుచున్నది. తెనాలి రామకృష్ణకవియు నప్పటివాఁడే కావలయును. కృష్ణదేవరాయల మరణానంతరము పది పదునాలుగేండ్లలోపల పాండురంగమాహాత్మ్యమువంటి యుత్కృష్టమహాకావ్యమును రచించిన రామకృష్ణకవి కృష్ణదేవరాయలకు సమకాలికుఁడై యతనిసభాభవన కవివర్గములలో నొక్కఁడైయుండుట అసంభవముకాదుగదా.' అని వ్రాసియున్నారు. అట్లే బట్టుమూర్తినిగుఱించి చర్చించి యిట్లు తేల్చినారు. "రామరాజభూషణుఁడు అళియరామరాజు అధికారమునకు వచ్చునప్పటికి కవియని ఖ్యాతినిగడించిన సూచనలుగలవు. ఒకవేళ నతఁడు యౌవనదశయందు కృష్ణరాయల యాస్థానమునందుండి యుండవచ్చును. ఇది యసంభవముగాదు. కృష్ణదేవరాయలనుగూర్చియు, సాళువ తిమ్మరసుమంత్రినిగూర్చియు, రామరాజభూషణుఁడు చెప్పినవనఁబడు చాటువులు కొన్ని నేఁడును లోకమున వాడుకలోనున్నవి. మఱియు మండ లక్ష్మీనరసింహాచార్య విరచితమైన యర్వాచీన లక్షణగ్రంథమున బట్టుమూర్తియనఁగా రామరాజభూషణుఁడు అల్లసాని పెద్దనార్యశిష్యుఁడని చెప్పియున్నది. ఈ యైతిహ్యము వాస్తవమైనచో రామరాజభూషణుఁడు దనకవిత్వ ప్రారంభదశను కృష్ణదేవరాయల సభాస్థానమున గడపెనని యెంచవలసియున్నది."

అటుతర్వాత పింగళి సూరనార్యునిగుఱించి వీరేశలింగము పంతులవారి యభిప్రాయము_సూరనార్యుఁడు కృష్ణరాయలకాలమువాఁడు కాఁడు_అనునది సమంజసముగానే యున్నదని యిట్లు వ్రాసిరి. "కళాపూర్ణోదయ కృతిపతి (నంద్యాల కృష్ణమరాజు) చరిత్రరంగమున పొడసూపినది క్రీ. శ. 1585 ప్రాంతమున...అప్పటికి పింగళి సూరనార్యుఁడు అపరవయస్కుఁడై యుండవలయును. ఏలనఁగా కళాపూర్ణోదయమునకంటె ముందరిరచనయైన రాఘవపాండవీయము క్రీ. శ. 16 వ శతాబ్ద మధ్యమున వ్రాయఁబడెనని తెలుపుసూచనలందు కొన్నిగలవు. అప్పటికింకను కర్ణాటసామ్రాజ్యమునకు రాజధానియైన విజయనగర ముచ్ఛస్థితియం దుండెను. క్రీ. శ. 1564 లో జరిగిన రక్కసితంగడి యుద్ధానంతరము విజయనగరము తురకలచే నాశముసేయఁబడి క్రమక్రమముగ పాడుపడిపోయెనని యందఱెఱింగినవిషయమే. కావున రాఘవపాండవీయము 1564 నకు ముందరి రచనయని నిశ్చయింపవచ్చును. 'రాఘవపాండవీయము నీకవి 1550 వ సంవత్సరము 1550 వ సంవత్సర ప్రాంతముయందు మంచిపడుచుతనములో రచించియుండును.' అను వీరేశలింగము పంతులవారి యభిప్రాయముతో మన మేకీభవింపవచ్చును. రాఘవపాండవీయము సూరనార్యుని తొల్లిటిరచనకాదు. అతని మొదటిరచన గరుడపురాణము, గరుడపురాణ మితని బాల్యరచనయని వీరేశలింగము పంతులవారి యభిప్రాయము. రాఘవపాండవీయమును వ్రాయునప్పటి కితనివయస్సు ముప్పదియేండ్లుండునని యూహించితిమేని 1520 ప్రాంతమున నితఁడు జన్మించియుండునని మన మనుకొనవచ్చును. అగునేని కృష్ణరాయల యవతారసమాప్తి యగునప్పటి కితఁడు కడుతరుణవయస్కుఁడై యుండును. విద్యాభ్యాసము నయితము పూర్తిచేసియుండఁజాలఁడు. కావున నితఁడు రాయల సభాస్థానమందలి యష్టదిగ్గజకవులలో నొక్కఁడగుట యసంభవము." (అష్టదిగ్గజవర్ధంత్యుత్సవోపన్యాస సంపుటి. పు. 17.)

తర్వాత పుట 18 లో నిట్లు వ్రాసియున్నారు. "కంసాలి రుద్రకవియని కొందఱు చెప్పుదురు. అగునేమో చూతము. రుద్రకవి సంతతికడనుంచి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు సంతరించిన యాతనిచరిత్ర మిట్లున్నది: 'రుద్రకవి కృష్ణరాయలనాఁటివాఁడు. రాయల యాస్థాన

మున కీయనను తత్రత్యులు మంత్రులు రానీయరైరి. రాయల సన్నిహితభృత్యుఁడగు మంగల కొండోజీ అనువాని తోడ్పాటున రాయలసందర్శనము పొసఁగఁగా రుద్రకవి యీ క్రిందిపద్యము చెప్పినాఁడు.

'ఎంగిలిముచ్చుగులాముల, సంగతిగాఁ గులము చెఱుపఁ జనుదెంచిరయా
యింగిత మెఱిఁగిన ఘనుఁడీ, మంగలకొండోజీ మేలు మంత్రులకన్నన్'

అటుమీఁద రాయలవారి గురువైన తాతాచార్యులుగారితో నితనికి వాదము గలిగెను. అం దితనికి విజయము చేకూఱఁగా రాయలవా రితనిని అష్టదిగ్గజకవులలో నీశాన్య సింహాసనారూఢుని గావించెను. రుద్రకవి రాయలయాస్థానమున పండ్రెండేండ్లు వసించెను......'' రుద్రకవి యష్టదిగ్గజకవులలో నొక్కఁడగుట నిక్కమేని యతఁడు కృష్ణరాయలకాలమువాఁడని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.'' అని వ్రాసి శకాబ్దము 1480 జయ,లో రుద్రకవికి మల్లిక్ ఇబ్రహీము కుతుబుషా రెంట చింతలపాలెమును దానమిచ్చె ననుటలో తారీఖు శక 1480కి కాళయుక్తి గాని జయ గాదనియు, ఆ సుల్తానుపాలనకాలములో జయయే రాలేదనియు, క్రీ.శ. 1580-81 వఱకును ఇబ్రాహీం కుతుబుషాయొక్క యధికారము కృష్ణకు దక్షిణమున చెల్లలేదు, కాఁబట్టి పై చింతలపాలెమువిషయము సందేహాస్పదమని తేల్చినారు. రుద్రకవిసంగతి యింకను పరిశోధింపవలసియున్నది. వీరుగాక తాళ్లపాకవారుకూడ కొందఱుండినట్లు తెలియుచున్నది

ఈయాంధ్రకవులుగాక సంస్కృతద్రావిడకర్ణాటక కవులును పండితులును పలువురు రాయలయాస్థాన మందుండిరి. రాయలే మదాలస చరితాది గ్రంథకర్తగదా. రాయలు కొండవీడు జయించినప్పుడు రాయలకడ చేరినవాఁడు లొల్లలక్ష్మీధర పండితుఁడు. ఈతఁడు ఆంధ్రవైదికి. కటకములో ప్రతాపరుద్ర గజపతి యాస్థానమందు తనపూర్వ జీవితమును గడపినవాఁడు. కొంచం ఎల్లయ్యతో కలని దైవజ్ఞవిలాసమను సర్వస్వమువంటి గ్రంథమును, శ్రీశంకరాచార్యులవారి శివానందలహరి మొదలైన వానికి మంచివ్యాఖ్యలను వ్రాసెను. ఈకాలముననే దివాకరపండితుఁడు భారతమిత్ర కావ్యమును, ఈశ్వరదీక్షితుఁడు వాల్మీకిరామాయణటీకను రచియించిరి. లక్ష్మీనారాయణుఁడను సంగీతవిద్వాంసుఁడు కటకమువాఁడు రాయల నాశ్రయించి విజయనగరమునకు వచ్చెను. రాయలు బాల్యములో వీణనువాయింప నేర్చుకొన్నవాఁడుగదా. మహామంత్రి తిమ్మరసు కూడ ఎందులోను తగ్గినవాఁడుకాఁడు. అతఁడును అతని మేనల్లుఁడు నాదిండ్ల గోపమంత్రియు గొప్పపండితులు. తిమ్మరసు అగస్త్యకవి రచించిన భారతమునకు వ్యాఖ్య రచించెను. గోపామాత్యుఁడు కొండవీటిలో నుండఁగా మల్లన రామకృష్ణకవుల నాదరించెను.

ఈకాలములోనే వల్లభదేవుఁడు, జైనగురువు అభినవవాది విద్యానందుఁడును రాయలసభలో విజయముల గాంచిరి. చైతన్యస్వామికూడ రాయలయాస్థానమునకు వచ్చినట్లు భూదానశాసన నిదర్శనము కలదు. మాధ్వగురువు శ్రీవ్యాసరాయలకాలము వాఁడే. కన్నడవాఙ్మయమున ప్రసిద్ధుఁడైన తిమ్మణ్ణ యనుకవీశ్వరుఁడు కుమారవ్యాసుని భారతమును శాంత్యాదిపర్వములను రచించి పూరించి రాయల కంకితమొనర్చెను. చాటు విఠలనాథుఁడు కూడ ఈకాలమువాఁడే.

రాయలు తమిళమునుకూడ ఆదరించెను. కుమారసరస్వతి యనుకవి రాయల గజపతికుమారీ పరిణయమును వర్ణించెను. వెల్లాళకవి హరిహరదాసుఁడు 'ఇరుసమయవిళక్కం' అను మతగ్రంథమును రచించెను. మండలపురుదర్ జ్ఞానప్రకాశర్ అను జైననైఘంటికుఁడును, 'మంజరిప్పా' రచయితయు, తిరువారూరు తత్వప్రకాశర్ అను వాఁడును రాయలచే పోషింపఁబడినవారే.



**The "Maharnavami Dibba" Hampi ruins**

*—By courtesy of The Archaeological Survey of India, Madras.*

రాయలు తనదిగ్విజయానంతరము (క్రీ.శ. 1520 లో) భువనవిజయమను భవనమును నిర్మించి అందు తనకవులతో కవితాగోష్ఠులు చేయువాఁడు. దీనినే ముక్కుతిమ్మన ఇట్లు చెప్పియున్నాఁడు. (పారిజా. గ్రంథాంతము.)

"భువనవిజయాఖ్య సంసన్నవరత్న విభా ప్రభాత నలినాప్త, రమా
ధవ చరణకమల సేవా ప్రవణమతీ, వీరభద్ర పర్వతవజ్రీ."

ఇందు అష్టదిగ్గజముల కొక్కొక స్థానముండెడిదనియు కందుకూరి రుద్రకవికి ఈశాన్యస్థానమొసఁగఁ బడినదనియు చెప్పుదురు. ఈభువనవిజయము యొక్క కవిత్వ పాండిత్యాదులకు మాత్రమేగాక కళలకుగూడ నిలయమైయుండెను. సంగీతనృత్యములకు రాయలు ఎంతో దోహద మిచ్చెను. రాయల సంగీతపిపాసను ఎఱిఁగి పోర్చుగీసువర్తకులు అతనికి తమదేశపు వాద్యములను కానుక యిచ్చిరఁట, అతఁడు చాల సంతోషించెనఁట. ఆకాలపు నాట్యములలో కోలాటము చాల విశేషముగా నుండెడిది. అదేచిత్రములందును కనఁబడుచున్నది. రాయలే 'నృత్తమత్తల్లిహల్లీసక' యని ప్రయోగించినాఁడు. హల్లీసకమన కోలాటము. వీథి నాటకములుకూడ నుండెడివి. తర్వాత తంజావూరిలో విరివిగా నాడఁబడుచుండిన యక్షగానములు ఈనాఁడు పైకివచ్చుచుండినవి. తాయికొండ నాటకమనుదానిని ఆడినందులకు చేగయ్యకొమారుఁడు నట్టువనాగయ్యకు రాయ లిచ్చిన సన్మానశాసనము దొరకియున్నది. క్రీ.శ. 1514. పోతవరపు నట్టువతిమ్మయ్యకూతురు ఒక పాత్రియఁట. గంగావతారమనఁబడు మఱియొక నాటకముకూడ నాడినట్లు తెలియుచున్నది. నాటకశాలలు ప్రత్యేకముగా నుండెనని ప్రబంధములవలనఁ దెలియుచున్నది. ఈనాటకములే గాక ఆనాఁడు సంస్కృతనాటకములనుకూడ ఎక్కువగా నాడుచుండిరి. రాయలే జాంబవతీపరిణయనాటక కర్తగదా. ఈ నాటకములాడు సంగీతసంఘములకు మేళములని పేరు, భాగవతమేళములని. వీనిని వసంతోత్సవ బ్రహ్మోత్సవాదికాలములలో నాడుచుండిరి. సూత్రధార నాందీ ప్రస్తావనలు కనఁబడుచున్నవి. జనసామాన్యముకొఱకేగాక, ప్రభువుల రాణివాసములకొఱకు మీఁద అంతఃపుర ప్రాంగణములలోకూడ నాడువారఁట. ఘోషాస్త్రీలు చూచుటకు ప్రత్యేకస్థలము లుండెడివి. ఇవిగాక బొమ్మలాటలని యుండెడివి. బొమ్మలాటవిరూపాక్షయ్య కొమారుఁడు బొమ్మలాటకాశయ్య రాయలవారికి చాల ఆప్తుఁడు. త్రాళ్లతో బొమ్మల నాడించుచుండ నొక పాఠకుఁడు పాడుచుండ ప్రసంగి యొకఁడు కథచెప్పుచుండును. ఇవిగాక రాయలపోషణ నందిన దొమ్మరవారు విప్రవినోదులు మొదలగువారెందఱో.

రాయలు స్వయము చదరంగమాడుటలో నేర్పరియఁట. బొడ్డుచెర్ల తిమ్మనయొక్క చదరంగపు నేర్పునకు మెచ్చి రాయ లాతనికి కొప్పోలు అగ్రహార మిచ్చెను. ఈ తిమ్మన్న కవీశ్వరుఁడు కూడ నఁట. చదరంగముకన్న పాచికలాడుట సామాన్యజనులలో ఎక్కువ.

రాయలు సంగీతసాహిత్యాది వినోదములనేగాక శిల్పము నెక్కుడుగా పోషించెను. భువనవిజయమేగాక కళింగవిజయానంతరము రాయలు ఎన్నో దేవాలయములను ఉద్ధరించెను, ఎన్నిఁటికో గోపురములు కట్టించెను; తన తల్లియైన నాగలాదేవి పేరిట బ్రహ్మాండమైన నగరమునే నిర్మించెను. చంద్రగిరి పెనుగొండ మొదలయిన స్థలములలో ప్రాసాదములు కట్టించెను. మంటపములకు లెక్కయేలేదు. రాయలు అంతఃపురమునకై నిర్మించిన హజార రామస్వామిదేవాలయమును విఠ్ఠలస్వామియాలయమును విజయనగర శిల్పకళాఖండములు. రాజ్యమునకు వచ్చినవెంటనే రాయలు హంపీ

విరూపాక్షస్వామి గోపురమును బాగుచేసెను. క్రీ.శ. 1513 లో ఉదయగిరిని జయించినప్పుడు బాలకృష్ణవిగ్రహమును కొనిపోయి విజయనగరములో ప్రతిష్ఠించెను. ఇదియే నేటికృష్ణస్వామి దేవాలయము. చిదంబరము, తిరువణ్ణామలై మొదలైన క్షేత్రములగోపురములు రాయగోపురములే.

చిత్రలేఖనమును ఎంతో పోషింపఁబడినవి. భారత భాగవత రామాయణ పురాణాదుల నుండి కథలను దేవాలయములలోను, ఇండ్లలోను చిత్రించుచుండిరి. ఇవి నేడు పాడైపోవుచున్నవి, చరిత్ర కెంతో నష్టము. సకలకళలకు ఆస్పదమైయుండిన విజయనగర రాజ్యవైభవముంగూర్చి జిజ్ఞాసువులు చరిత్రగ్రంథములలో హెచ్చుగా చదువుకొందురుగాక. ఇవన్నియు చేయించి వానికి ఇరువదియేండ్లు నాథుఁడుగానుండిన కృష్ణదేవరాయల యీ యాముక్తమాల్యదలో రాయల స్వానుభవము ఎంతో గ్రంథస్థమైయుండుట యొక యాశ్చర్యముగాదు.

## ౧౨ ఆముక్తమాల్యదా హృదయము

'ప్రయోజనమనుద్దిశ్య నమన్దోఽపి ప్రవర్తతే' అని పెద్దలసూక్తి. అట్లుండ రాయలవంటి చక్రవర్తి ఆముక్తమాల్యదాప్రబంధమును నిర్మించుటలో గొప్పప్రయోజనమునే ఉద్దేశించియుండును. మనుచరిత్ర వ్రాయుమని పెద్దన్నను కోరినప్పుడు రాయలవాక్యము లివి—

"సప్తసంతానములలోఁ ప్రశస్తిగాంచి, ఖిలముగాకుండునది ధాత్రిఁ గృతియకాన
గృతిరచింపుము మాకు శిరీషకుసుమ, పేశల సుధామయోక్తుల పెద్దనార్య."

రాయలు యశఃకాముఁడు. తర్వాత వ్యవహారబోధ, శివేతరక్షతి, సద్యఃపరనిర్వృతి-ఇవి వలసినవే. హిందూమతమును హిందువులను మ్లేచ్ఛులనుండి రక్షించిన చక్రవర్తి పరమభాగవతశిఖామణి యైనాఁడు. ఆయనతోఁగూడ ఆయన 'హితుఁడు, చతురవచోనిధి, అతులపురాణేతిహాస కథార్థస్మృతియుతుఁడు' అలసాని పెద్దనయు వైష్ణవుఁడైనాఁడు. ఇరువురును 'కరుణాకర వేంకటవిభు చరణస్మరణ ప్రసంగసంగతమతు' లైనారు. లెక్కలేనిపర్యాయములు ఆ భగవంతుని దర్శనము చేసికొన్నారు. ఇంతటిభక్తునికి భగవంతుఁడే అనుగ్రహించి ప్రబంధమును రచింపుమని కోరెను. తన జీవితానుభవమునంతయు రాయలు ఈ గ్రంథకరండములో నిక్షేపింపఁ దలంచినాఁడు. అందులకు ప్రబంధ మాయనకొకసాధన మైనది. వర్ణనీయాంశములైన యష్టాదశవర్ణనలును సకలవిషయ సమాకలనపూర్వకముగా నీతి నుపదేశించుట కాయనకు తోడ్పడినవి. పట్టాభిషేకమై రాజ్యమునకు వచ్చినవెంటనే రాయలు మంత్రిని అప్పాజి నిట్లడిగెనఁట.

"సింహాసనప్రభు శీల మేక్రియనుండు, పాలించుటేరీతి ప్రజలనెల్ల
బాంధవపరిజన ప్రతతిఁ బ్రోచుటయెట్లు, ధనములార్జించు సాధనములేవి
యెటువలె వ్యయమొనర్చుటకును మర్యాద, యేదారిశత్రుల నేపణంప
నాత్మరక్షణ కర్హులగుదురెవ్వార లా, ప్తుల నవాప్తుల లెస్సఁ దెలియుటెట్టుల
రాజలక్షణమెయ్యది రాజ్యలక్ష్మి, శాశ్వతంబుగనుండు పేసరణి రాజ
నీతు లెన్నివిధంబులు నిఖిలమెఱుఁగఁ, దెలుపుమెంతయు నామది తేటపడఁగ."

ఇట్లు అడిగి విన్నరాజనీతిని, తన స్వానుభవమును కలిపి యామునప్రభు రాజనీతిగా ఎనుబదినాలుగు పద్యములలో గ్రంథస్థము చేసినాఁడు.

రాయల రాజనీతినిగురించి కీ. శే. శ్రీ వంగూరి సుబ్బారావుగారు 1915లో ఇట్లు వ్రాసిరి. "శ్రీ రాయలవారొనరించిన రాజ్యనీతియందుఁ జాలభాగము ప్రాచీన రాజనీతిగ్రంథములనుండి

సేకరించినట్లు సాకుఁ బొడకట్టుచున్నది....(అని యుదాహరణములనుచూపి) ఇట్లు కొంచెము భేదములతోఁ జాలభాగము - చాలభాగ మన నేల? — ఏ పది యిరువదిపద్యములయందుఁ జూపినయట్టి ప్రాయములోతప్ప తక్కినవన్నియు నితరగ్రంథములయం దున్నవాని కించుక భేదములే? పరివర్తనములే! దీనివలన మనము గ్రహింపవలసిన దేమనఁగా (శ్రీ రాయలవారు సంస్కృతవాఙ్మయమునం దున్న నీతిశాస్త్రగ్రంథము లన్నియుఁ బఠించి, యాచరించి, యందుఁ దాను కనుఁగొనిన నూతన విషయముల ననుభవములఁ జేర్చి, పై జెప్పిన మూఁడవవిధమున నీ నీతిని వ్రాసెనని తలంపవలసి యున్నది.) కొన్నివిషయములు బహుస్వల్పముగనున్న నపూర్వములును, మేధావంతములునై యున్నవి. కొన్ని శ్రీ రాయలవారి యనుభవములే యైయుండును...."

(రాయల యుదాహరణములు ఆయన లోకజ్ఞతకు సాక్ష్యములు. రాజనీతిలో గౌతమునికథ, అల్పకారణమునకే కోపగించు భిల్లునికథ, ద్రుపదమహారాజుకథ, అవకతవక ప్రభువు దోషినివదలి నిర్దోషిని లావుపాటిసెట్టిని శిక్షించినకథ, వీనిచేత తన లోకానుభవమును చాటినాఁడు. వీనిలో ఒకపాటిహాస్యమును మిళితమై యున్నది. రాయలు విశేషముగా పోర్చుగీసువారికడనుండి గుఱ్ఱములు కొనువాఁ డనునది గుఱ్ఱములనుగురించి ఆయన వ్రాసినవానిచే విశదము. 'రేవుల్గావు మతంగజంబును ...వాణిజ్యము పెంచి యేలఁగనగున్' (4-245) 'సింధురమహాశ్వముఖ్యముల్ చేర్చు దొలదీవి వణిజుల నూళ్లు సద్గృహములు పురిఁగొలువుఁ దేజంబు వెలమేలుగలుగఁ బ్రాఁతవారిగాఁ జేయు నరివవి చేరకుండ' (4-258) ద్వీపాంతరములనుండి తెచ్చు వర్తకులగుఱ్ఱములను పూర్తిగా, ఒక్కటికూడ శత్రువులకు చేరనీయక రాయలు కొనువాఁడుగదా. 262వ పద్యములో "గజహయముల వెలకు మేఁతకు, బంట్లజీతమునకు......అగునట్టి ధనవ్యయమును వృథావ్యయమని తలంపఁగూడదు. ఆ వ్యయమును ధారాళముగా చేయవలసినదే." అశ్వహృదయము రాయలకు తెలిసినంత చక్కఁగా ఇతరుల కెట్లు తెలియును? ఆసంగతిని 'పూచినమావులన్' అనుపద్యమున చక్కఁగా తెలిపినాఁడు. గుఱ్ఱములు వన్నెమాఱిన యజమానునికి కీడు కలుగునఁట. అట్టివానిని అమ్మివేయవలయునఁట. కాని దైవము అనుకూలముగానున్న అట్టిగుఱ్ఱములతోనే శత్రువులను జయింపవచ్చునఁట. (5-120) ఇంత సూక్ష్మపరిశీలనము ఆత్మానుభవమేగదా; రాయలకు 'తింగణా' యను పొట్టిగుఱ్ఱములమీఁదకూడ మక్కువ - యెక్కువ. 'సంగతియె యేయి ఇసుమంత తింగణావు.' ఇవి టాంక్విన్ దేశమునుండి వచ్చెడివి. (మా. వ్యాఖ్య. 4-61)

ఈ వ్యాఖ్యయొక్క పీఠికలో గ్రంథగుణములు గ్రంథదోషములు అనుభాగములలో రాయ శ్రీ యాముక్తమాల్యద నెందులకు వ్రాసెనో విశదముగా తెలుపఁబడియున్నది. 'భగవదనుగ్రహమునకు భక్తిప్రధానముగాని జాతి ప్రధానముగాదు' అని బోధించుటకే. లేకున్న కథతో సంబంధములేని యీకథ నెందులకుచొప్పించును. ఇంకను బుద్ధిపూర్వకముగా రాయలు ఎన్నోమార్పులు కూర్పులును చేసియున్నవాఁడు. వాని ప్రయోజనము పీఠికవలననే తెలియఁగలదు. ఇచట మరల వ్రాయుట యనవసరము. వైష్ణవమత ప్రాశస్త్యమే యీ గ్రంథముయొక్క ప్రధానోద్దేశము గాన కాలక్రమమును రాయ లెట్లుమార్చెనో తెలియుటకు కొంత తచ్చరిత్రమును మూలగ్రంథముల నుండి గ్రహించుట యుక్తము. చివరిదినములలో రాజ్యరక్షణకై రాయలహృదయావేదన యెట్టిదో ఆయనచేసిన యేర్పాటులచే తెలియునట్లుగా భావి ప్రభువులకు రాజ్యరక్షణవిధానమును బోధించుటకు ఈ గ్రంథము రచితమనియు రాయలు నిరంతరము రాజకీయములలో నిమగ్నుఁడైయుండి వ్యవధిదొరకినప్పు డందందు కొంతకొంతగా వ్రాయుచుండెనని తోఁచుచున్నది.

## ౧౩ రాయల చరమదశ

ఆముక్తమాల్యదారచన సర్వదిగ్విజయానంతరమే పూర్తియైనది. కాని తిరుపతికి రాయలు పోయి దానిని దేవునికి సమర్పించినట్లు శాసనముగాని మఱి యే చారిత్రకప్రమాణముగాని దొరకలేదు. బహుశః అచటికిపోవులోపలనే గతించెనేమో. నాఁటికి కలుబరిగ దండయాత్రాదులన్నియు నైనవి. మనుచరిత్ర పారిజాతాపహరణాదుల నంకిత మందినట్లు ఆముక్తమున లేదు. అందులోవచ్చుట కవకాశముకూడ లేదేమో. కాని యింతలో తనవెనుక రాజ్య మేమగునో యను చింత రాయలను వేధించినట్లున్నది. క్రీ. శ. 1521-22 తర్వాతివిషయము లివి. యుద్ధములయందును సామ్రాజ్యవిస్తరమందును విరామములేక పదిపండ్రెండేండ్లు గడచినవి. కుమారుఁడు కలుగలేదనుచింత యుండినది. క్రీ. శ. 1517-18 లో రాయలకు కుమారుఁడు కలుగుటకొఱకు కొండమరుసయ్య దానాదులు చేసియున్నాఁడు. ఆ మఱుసటిసంవత్సరము తిరుమలదేవి తనపుత్త్రుని మేలును గోరి దానములు చేసియున్నది. తర్వాత బాలునియభివృద్ధియు దిగ్విజయసమాప్తియు క్రీ.శ. 1524 ప్రాంతమున నైనట్లున్నవి. ఆదిల్లానుఁడు పూర్తిగా పరాజితుఁడైనాఁడు. రాయలు తనకుమారునికి పట్టాభిషేకముచేసి ముద్దుమురిపెములు చూడఁదలఁచినాఁడు. అట్లే కుమారునికి రాజ్యమిచ్చి, తాను మంత్రియై, తనకు తిమ్మరసును మంత్రినిజేసికొని కార్యనిర్వహణ మారంభించెను. ఇందుల కనుగుణముగా తిరుమలరాయల శాసనములు ఆ కాలమువి గలవు. దీని ననుసరించియే కాఁబోలు రాయలు తారణవత్సరము (క్రీ. శ. 1524) గతించెనని 'భోగనయాచకప్రతతి' పద్యము నెవరో కల్పించిరి. తిరుమలదేవరాయల రాజ్యాభిషేకోత్సవములు ఎనిమిదినెలలకాలము వైభవముగా జరిగినవఁట. ఈ మధ్యకాలమున నాబాలుఁడు వ్యాధిగ్రస్తుఁడై అచిరకాలమున మరణించెను. రాయలకు కుమారునిమరణ మొక పిడుగుదెబ్బవలె తగిలినట్లున్నది. ఆదుఃఖమున నాతఁడుండ బాలునికి తిమ్మరుసుకుమారుఁడే విషప్రయోగము చేయించినాఁడని యొకచాడీ యెవరో చెప్పిరి. ఆగ్రహపరవశుఁడై రాయలు తిమ్మరసును, అతనితమ్ముని గోవింద దండనాయకుని, కుమారుని తిమ్మయ దండనాయకుని చెఱఁబెట్టెను. వారిబంధువులకును ఇదేగతి యాయెను.

మూఁడేండ్లతర్వాత అప్పాజీకుమారుఁడు తప్పించుకొని తిరుగఁబడుటయు, రాయ లాతని పట్టించి తెప్పించి అప్పాజీతోకూడ వారికండ్లు తీయించుటయు నను కథలుగలవు. కాని తిమ్మరసు తర్వాత బ్రతికియుండినట్లు శాసనములు గలవు. రాయలకు చివరిదినములలో అశాంతి యేర్పడినది వాస్తవము. వారసుపోయినాఁడు, మంత్రి యిట్లయినాఁడు. రాజ్యమునకు అల్లుఁడును దాయాదులును పోరాడుదురని యెఱిఁగి, అప్పాజని విడిపించి, తమ్ముని అచ్యుతరాయలను చంద్రగిరి బందినుండి విడుదలచేసి, తనవెనుక నాతఁడే చక్రవర్తియని చాటెను. ఇంతలో ఆదిల్లాముఁడు మఱల ఎత్తివచ్చెను, కాని రాయలు బయలుదేఱి వచ్చుటచూచి పాఱిపోయెను. ఆతర్వాత కొద్దికాలమునకే జబ్బుపడి రాయలు వృద్ధాప్యముననే మరణించెను. క్రీ. శ. 1529 అక్టోబరు 27 ఆఖరుతారీఖు. ఆముక్తమాల్యదతో తిరుమలకుపోకయే గతించెను గాఁబోలు. పెద్దనార్యుఁడుమాత్రము 'జీవచ్ఛవంబుగా' బ్రతికియుండెను.

27-10-68 విజయదశమి
మదరాసు—1

శాస్త్రిమనుమఁడు
వేదము వేంకటరాయశాస్త్రి

# పీఠిక

## [ఆముక్తమాల్యద - సంజీవనీవ్యాఖ్య.]

## గ్రంథగుణములు

ఇందు మూఁడవ యాశ్వాస మంతటను విశిష్టాద్వైతసిద్ధాంతసారము, మాలదాసరి యొక్క చిత్తశుద్ధి, స్నిగ్ధభక్తి, జ్ఞానమహిమ, జ్ఞానబోధనము, అతఁడు అనుగ్రహించిన మాత్రాన బ్రహ్మరాక్షసునకు వైష్ణవోత్తమత్వము కలుగుట, గోదాదేవియొక్క భక్తితోఁగూడిన శృంగారమును వర్ణితములు. ఈ కబ్బమున లోకానుభవము సమగ్రము, ఉపాదేయమే నిబద్ధము, ఎటనుం బ్రల్లదము లేదు. పేలవము గాదు, పాండిత్య మపారము, అద్వితీయము:—ఔపనిషదవిద్య కరతలామలకము—క. వాదపహతపాష్మా 3(12), సీ. జగదుద్గతికిని 3(8).—భగవదనుగ్రహమునకు భక్తి ప్రధానము గాని, జాతి ప్రధానము గాదు, అని మాలదాసరికథవలని బోధ. ఇందు మర్త్యకోటి కెల్ల తారక మగు శ్రీవిష్ణుధ్యానప్రకారము 'శరగిందు' 3 (86) ఇత్యాది చేత నుపదిష్ట మయినది.

రాజనీతి:—శా. "విల్లుం దాలుచు' 4(228); క. 'అపాలుఁ గూటనే' 4 (224); తే. 'అటవిక కశ్యకలన' 4(225); 'ఆజ్ఞ వలయు' 4(206); తే. 'రాష్ట్ర మెరియింపు' 4(267).

కృష్ణరాయని (ఆము. 4-267) యీ యనుశాసనమును మీఱినందున ఇతని యల్లుఁడు రామరాజు, తాను రణనిహతుఁడై హిందూరాజ్యమును కలిలో నష్టమింపఁ జేసినాఁడు. అదియే యిపుడు విజయనగర సామ్రాజ్యనష్టము నాటకముగా *నాడఁబడుచున్నది. రాజనీతి అనుభవసిద్ధము, శాంతి పర్వాద్యుపదేశానుసారి, అతినిపుణము. అందులో విప్రముఖ్యత యుపదిష్టము.

విప్రముఖ్యత.—తే. 'బ్రహ్మక్షత్రంబు...ద్విజాన్యుఁ డల్క కా' 4(205); క. 'దుర్గములా ప్తద్విజవరు' 4(217), చ. 'ధరణిపుఁ డెంత...' 4(255); ఇతరులు (క్షత్రియాదులు) తిరుగఁబడుదురు, విప్రులు విశ్వసనీయులు ప్రభుహితులు అని భావము. అయినను, అయోగ్యుఁడైన బ్రాహ్మణునిఁ జేర్పరాదని అటనే కలదు; క. 'తక్కుము మిగుల' 4(210). ఔచిత్య మంతటను బోషింపఁబడెను ఉత్ప్రేక్షయందు నైషధ రాఘవ పాండవీయాది కావ్యవంశాదులతో ఇది తులదూఁగును.—చూ. 'స్వసుఖరతి' 4(104) 'అలుకకు మున్న' 5(83). పాదపూరణార్థమయిన పెంపకము మెండుగను లేదు. స్వభావోక్తియందు అద్వితీయము. ఈకవికి విశిష్టాద్వైతవాఙ్మయము నాలుక నున్నలకొని యున్నది. సంగీత - తర్క - తంత్ర - జ్యోతిష - ధర్మశాస్త్ర స్పర్శ - కలదు. కర్మార - కళాద - కర్మ పరిశీలనమును - స్వప్నశాస్త్రపరిజ్ఞానమును గలవు.

ఇందు కల్పితము లైన నూతన కవన ఫక్కికలకు ఇవియే పరమావధి:—'ఖనటత్' 1(3), 'స్యందనసిధి'4(27),'వనికాంచెల'7(27),'కాంచెల'6(15),'అహ్వావాక్'4(6),'మరుమాఘ'5(118).

---

*ఇట్టినాటకము లాడరాదని శాస్త్రిగారి యభిప్రాయము. చూ. ఆంధ్రగ్రంథవిమర్శన ప్రకారలేశము పు. 20; భారతాభారతిరూపకమర్యాదలు పు. 42. ఆంధ్రసాహిత్యపరిషత్తు 1919 అధ్యక్షోపన్యాసము. ఇందే టీక ఆ 4_ ప. 267 చూడుడు.

తెలుఁగున ఇంతకన్న ప్రౌఢ మయిన ప్రబంధము వేఱులేదు: — 'శాకోదరాహితుల', 'స్థూల పరిపక్వ', 'గురుగు', 'మణియష్టి', 'కదళి దివియించె'.

ఇమిడికయును బిగువునయును ఆంధ్రవాఙ్మయములో నిది అగ్రగణ్యము:—'తునియలు', 'విల్లుం దానును', 'ఒకటికి'.

'వర్షార్థ మష్ట ప్రయతేత మాసాన్, । నిశార్థ మర్థం దివసే యతేత,
వార్థక్యహేతో ర్వయసా నవేన, । పరత్ర హేతో రిహ జన్మనా చ.'

అను శ్లోకమునకై - 'వినిరొ సెలల్' 2(76) అను నిందలి చంపకము. దానికి_

సీ. రాత్రుల కొనరు నర్థము లెన్ని యున్నియు । ఘటియింపవలయుఁ బగళ్లయంద,
వానకాలమునకు వలసిన యవి యెల్ల । నార్జింపవలయు మాసాష్టకమున,
నపర వయోయోగ్య మగువస్తుజాలంబు । సాధింపవలయును జవ్వనమునఁ,
బరలోకమునకు సంపాద్య మెయ్యది యది । గడియింపవలయు నీ యొడలియంద,
తే. యని ధరిత్రీసురోత్తముఁ డఖిలశాస్త్ర । సార మగునీతిఁ దనకు విస్పష్టముగను
దెలుపుటయు విని యా జగతీతలేంద్రుఁ । డింతయును దప్ప దని మెచ్చి యింటి కరిగె.

(411). అను పరమయోగివిలాస పద్యము సమార్థకము.

షష్ఠ్యంతములును ఆశ్వాసాంతపద్యములును* సాటిలేనివి. పెద్దనగారు మనువును ముందు రచించి అనంతరము అందలి రాయవంశావళిని రచించిరనియు, ఆముక్తము ఆయన కవనములో మనుసంభవరాయవంశము లనెడి మొదటి రెండుమెట్లపై మూఁడవమెట్టుగా ఇమిడికను సాధించిన దనియు కొందఱు తలంతురు.

ఋతువర్ణనకు ఈకబ్బము ప్రథమగణ్యము.

ఆంధ్ర కవన విద్యా మునిత్రయమును తచ్ఛిష్యవర్గముతో సాటికి దించుట తగవు గాదు. ఏతదనుగుణముగా ఇతిహాస పురాణ వాఙ్మయము ప్రబంధవాఙ్మయము అని ఒకపాటిభేదము నంగీకరింతము. పురాణములును గొన్ని ప్రబంధఫక్కికం బొరసి నెగడుచున్నవి.—ఆముక్తకవి 'అలికంబున యతిని దాఁచినట్టి సర్వజ్ఞునిం' బ్రతిభానమం దేమి శబ్దధోరణియం దేమి పోలినవాఁడు. అట్లే కవివీరుఁ డయిన శృంగారనైషధ నిర్మాతతోను సరితూఁగఁ గలవాఁడు. అల్లికబిల్లికలలో అల్లసాని పెద్దనగారికన్నను పూర్వోక్తగుణంబులందు న్యూనుఁడు గాఁడు. శ్లేషను నవనీత మంజులముగా నాస్వాద్యముం గావించిన యద్భుత సాహిత్యనిధి యగు రామరాజభూషణునకన్న, ఆ గుణంబులో నధికుఁడే. మఱి, ముక్కుతిమ్మనార్యుని పలుకుల ముద్దును, చేమకూర పాకరుచులును, పాండురంగ విజయుని దిట్టతనమును ఒరులకు రావు. కాన వారితో పోటి వలదు. ఈ చెప్పిన ప్రతిభాన ప్రభావమును ఇందలి ఋతువర్ణనలయందును, స్వభావ వర్ణనములోను, గోదాదేవీ వర్ణనలోనుం గనవచ్చును. పెద్దనగారి 'సహసానఖంపచస్తనము' వలె అల్లఁబోయి సింగరార్యుఁడు విల్హణీయములో తెల్లఁబోయినాఁడు. ముక్కుతిమ్మన్నగారి 'జీర్ణపర్ణద్రుమ'మువలె నల్లఁబోయి తారాశశాంకములో శేషము వేంకటపతి చదికిలం బడినాఁడు. ఈ యాముక్తకవి, పురుషవశంగు లను నాయికల పాదములలో వ్రాల్పక నారాయణుని పాదములలో వ్రాల్చినాఁడు.—

మఱి, స్వాభావికవృత్త వర్ణనములందు ఈ గ్రంథము ప్రాతిభ దృష్ట్యేక గోచరములైన వర్ణ్యగుణచర్యా విశేషములను చేర్పెడు గురువుగా నున్నది.

* హర్షనైషధాశ్వాసాంతపద్యముల ననుకరించుచున్నవి.

## గ్రంథదోషములు

[ఇందు లక్షణ విరోధములు కల వని కొందఱు అందురు; కాని, లే వని నామతము. దాని చర్చ ముం దున్నది.]

ప్రసక్తంబు డిందుపడి అప్రసక్తము మెండుకొన్న దనియు, ఆక్షేపము కలదు. పెరియాళ్వారు, యామునాచార్యులు, ఋతువర్ణనవిస్తరము, రాజనీతి, ఇంచుక గోద, మాల, రాకాసి, ఇంచుకగోద, అని వర్ణనములు.

రెండుమూఁడు మాఱులు రెడ్లనుగూర్చి హేళనము గలదు. పేద లని, లుబ్ధు లని, విలాసరిక్తు లని,— 'గురుగుం జెంచలి'; దానివెంబడినే నృపుల వర్ణన— 'మణియష్టిఁ గేలి బర్హిణ' 4(185); ఇది కృష్ణరాయని నిజవృత్తము గా నోపు. వ. 'ఇన్నడవడిం బ్రభిన్నకటం బగు వేదండంబునుం బోలె, మదాంధుండ నై యల్పవిద్యాలబ్ధి, విడువ ముడువ వేసరని మీసంబుగల రెడ్డియుం బోలె, నచ్చుదువె పరబ్రహ్మం బై పెద్దలం జెనకి.'— 'వసతు ల్వెల్వడి' 4 (133) అను పద్యము సైతము రెడ్లహేళనమే యని కొందఱు పలికిరి గాని నాకు అట్లు స్ఫురింపలేదు, కేవలము సేద్యగాండ్రవృత్తము చమత్కారముగా వర్ణింపఁబడిన దని నాతలంపు. 'మణియష్టి' త్యాది సీసమందు వ్యతిరేకస్ఫూర్తిచే రెడ్లహేళనము సూచితము.—

మణియష్టి×[మంచపుఁగోడు]; బర్హిణ×క్రేఁపుల్; షడ్జసుధ వీను లోలాడ×మెయిక్ నాక; ప్రాద్దెక్కి మేలుకాంచి; అంగమర్దన×లేదు; శిరోష్ణమజ్జనము×లేదు ; మిసిమి దువ్వలువ - బన్నసరంబు - మొగలిజేకలు (రాజులవర్షాచర్య); కొలువోసంగి×మంచ మెక్కి ; జాంగలామిషము×గురుగు - చెంచలి - తుమ్మి - లేఁతయగిసాకు [పా. లేఁ దగిరసాకు] - చింత చిగురు [అన్నియు నొకచో కూర?] శాల్యన్నము×కుట్టారిగ ; అధిక హైయంగవీనము×నూనియలు; ఆరగించి×మెక్కి [ఓగిరము లనుట హేళనము]; సాగరుహసంతి×మేకెరువుం గుంపటి [హసంతి×కుంపటి]; వెలుగ×[పొగయ], మృగమదము...తములంపుటీరులు×లేదు; సౌధ×[క్రేఁపులం జెప్పినందున మేడ గా దని తెలియుచున్నది.]; అవరోధములతోడ నగిరి×కొమల్ పాలము వోౘ; అచిరరుగంకు సతిదృక్×పాలములో [పిడుగులలో]; తోడౘ×పోౘ; నృపులు (క్షత్రియులు)×ప్రభుత్వకాప్తి రెడ్లు; 'కో ట్లింటిపై గూయు' అని పఠించిన కవికి తినివి లేఱును గావలయు. రాయఁడు పరకీయ గుణగ్రాహి తన ప్రజలుగానేని తనచే పరాజితులుగానేని యున్న రెడ్డిప్రభువులను ఇట్లు దిగఁబలికి యుండునా? తత్ప్రీతి కలుగునని యెంచిన యన్యకవియే ఈపద్యములను అల్లియుండునని కొందఱు తలంతురు.

ఇట్లు రెడ్లనుంబోలె మఱికొంకరులఁ బెద్దలం గూడ సుకుమారముగానే ఈకవి హేళనము సేసియున్నాఁడు.— 'పడుక మఱఁడు వెడవెడనె యార్వ నొగిలి రజ్జడిని గృహులు' 4(127).

"శరనిధుల మాఘ్యములు దీటౙ మఱన కట్టి । యనరున జయింతు మని కదా యద్దినాళిఁ
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ దద్వైరిఁ గనియుఁ । బెద్ద లివురాకఁబట్టైన పెట్టు వడిరి. 5(111)

ఇట్లు పెద్దలంగూడ జెల్లకొట్టుట హేళనపరతచేతం గా దనియు, చమత్కారముగా లోకవృత్తముం దెలుపుట కనియుఁ, దలంప నగు.

ఆనుషంగిక కథలలో కాలక్రమము వ్యత్యస్తము; — పెరియాళ్వారికంటె యామునాచార్యులు పూర్వు లనుట. ఇందు విష్ణుదేవుఁడు ఆత్మస్తుతి పరనిందాపరుఁడు - అని యాక్షిప్తి;

## ఇత్వసంధి (23) ప్రయోగములు.

### క్త్వార్థేకారసంధి (4 ప్రయోగములు)

2(22) ఆందిచ్చు, 4(216) ఒదిఁగుండిన, 6(25) అందీఁ, 7(21) చించిచ్చువారి.

### ఇతరేకారసంధి (19)

| | | |
|---|---|---|
| 1(83) ఆతనింట | 3(83) కూయిడఁ | 155 పొరలాడ |
| 2(32) నింగిటు(నింగియు), | 3(148) కమ్మచ్చున, | 6(6) పచ్చిత్తితోలు |
| 35 ఒకచై | 285 పోఁడిమహి | 7(8) తిత్తొకటియు |
| 59 దోయిలొగ్గుచుఁ | 252 మిక్కిలిడుకొంట | 21 గంజిండ్ల[వ్యస్తములు] |
| 60 ఆవిరెగయ | 5(53) తాడువంటతివ [తాటి మైయతివ] | 39 ఐనయెవ్వానికక్షేంద్రియ వితతికిని |
| 61 ఒంటొల్లె | | |
| 3(4) తరవాయుడుగ | 66 ఒక్కటయి | 45 పెండ్లగుటకు |

ఇందులకు యథామతి సమాధానము నిరూపించెద. దీని పీఠికలో "మూలమును లేఖక ప్రమాదాదులచేత నానావిధపాఠములుగా నుండెను...ఇట్టి యీగ్రంథమును జాలినంత ప్రయాసపడి భిన్నదేశపుస్తకములను దెప్పించి శక్యమైనవఱకు శోధించి...ముద్రించి"—అని యున్నది. అట్లే సమాధానములను నిరూపించుటలో నేనును ఎటనేని యించుక శోధింతునేని (అనఁగా సవరింతునేని) అందులకై క్షంతవ్యుఁడ నని విన్నవించుకొనుచున్నాను.

2(9) 'గంగనుకాసె' 'గంగనుగాసె' అని వ్యస్తరూపకము గావించుకొన్న సరిపడును.

7(13) 'పాతకులారని' - 'పాపులారా' యనవచ్చును.

2(29) 'లఘిమందకీర్తి' - 'లఘిమఁ విగీతి' అని పఠింపఁదగును. 'లఘువందకీర్తి' అని పా. లఘ్వారోహణమం దని యర్థము. - పుస్తకములో 'లగువందకీర్తి' అని పా. ముద్రితము.

5(19) 'పతాకన'-'పతాకగ' అనుట సరి.

4(118) 'చేష్టుడిగి'-'చేష్టడిగి' అని పఠింపందగును.

డిగుడించులు త్యాగవాచకములు [14 ఉదా.] 'భువనసంక్షోభముగఁ జలంబును బలంబు। డిగక నలువుమైఁ బోరె నాడియు బకంబు." మార్కండే, 2(12). "జీవితేశ్వరుండు డించిన యోగిరమ్మును దత్స సేయక భుజియింపవలయు.' కాశీ. 2(75)

"ప్రతికూలాచరితంబు నావలన నల్పం బైనను గాంచితే।
ప్రతికూలాచరితంబు నీవలన నల్పం బైన నేఁ గంటినే।
కృత మెన్నండును లేనిచంద మిది లక్ష్మీపుత్త్ర నీయందు న।
న్నతిదుఃఖాన్విత డించిపోవఁ దగవా యధ్వానవుం బట్టునఁ." హారవిలాస 3(86)

"కవచటుడించి" ఆముక్తమందే 7(17). "జాయ వని డించి" రామాభ్యు. 5(217)

"వాలుగంటి నొంటి డించి" రామాభ్యు. 5(216)

"ఇలు డించి" భోజరాజీయము 2(16)

'మహాత్త్వముం దిగ దత్కశాపమున' శ్రీరంగ. 3(598), [దిగునకు రూ. డిగు].

'తప్పు లేక రాజు తను డించి' క. క. ర. 4(196).

"తపమును జపమంత్ర తంత్రముల్ దిగనాడి" నెల్లూరి శంకరవి హరి. 1(109)

"ఖలము దిగఁదాఁచి యీ మాలెతల వరించి" 2(183) "పిదప నాతని బంధించి పెంపు డించి" 4(91) "తాల్మి దిగనాడి" 4(191)

"అసు దిగఁగా రయంబున రేసి యేసె" ఉ. హ. 4(245)

ఈ 'డిగె' ప్రయోగమున కాశ్రయమైనపద్యము ఆముక్తముద్రణములో నిట్లున్నది.:—

"తడి తల డిగ్గి ముంచి జడతం దుదలెప్పలఁ గన్ను విప్పి పు
ల్పొడుచుచు నీరు ముంగలిపోలిక ముక్కునఁ గూఁట నోటఁ గొం
తొడియుచు గూఁటికట్టు మొసగ త్తుచు లెక్కవిముప్పు మున్నుగా
వడఁకులె గాక చేష్టుడిగె వక్షము పక్షులు జానువుల్ సారణ."

ఇందు నేఁ గన్న పా.—విప్పి × వీఁడి; కట్టు × కట్టె; నోట × నోర; చేష్టు × చేష్ట; వక్షము పక్షులు × పక్షులు వక్షము - ఇందలి 'చేష్ట' పైయట్లు సరిపడుచున్నది.

7(44) ఈరంగథర్త్రంచు - "ఈరంగధృత్తంచు" అనవచ్చును.

4(170) "పఱచు శరదభ్రములమేని పాండి మమరె" "వఱలె శరదభ్రములమేని పాండి మంబు" - మూలములో 'పఱచు' అప్రయోజకము.

## అత్వసంధి సామాన్యమునకు

"బొబ్బిడి యార్చెన్" భార. ఆది. 6(212); "చిగురుఁ గొమ్మైన" - మను. (150); "తామరతంపరై" - మను 3(29); "చిలువాకె" మను 3(84); "కానుకిచ్చి" మను 4(15); "గొడవగు" మను 4(63); "పాలాన" [పాల + ఆనన్] మను 4(99); "గోరం[illegible]" మను 6(8); "ఏచూ లెవ్వండు గొన్న నిత్తు." ఉ. హ. నా. సో. 3(32),

## క్త్వార్థత్సంధికల్పములు

2(22) అందిచ్చు, 6(25) అందీన్;

'అందిచ్చు' అను శబ్దసముదాయము శబ్దపల్లవము, 'అందు + ఇచ్చు' అని యేని, 'అంది + ఇచ్చు' అని యేని - ఎట్లుచ్ఛేదించినను నిర్దోషము. ఇందులకు తార్కాణము - ఇచ్చుధాతువుతోనే అందుధాతువు ఈతీరున భాషాప్రపంచమున పరశ్శతములుగా ప్రయుక్తమై యుండుటయు, వేలు క్త్వార్థేకారసంధులు ఎటనుం బ్రయోగింపని తిక్కనాదులు దీనిని విశృంఖలముగాఁ బ్రయోగించుటయు, ఇట్లే క్త్వార్థేకారసంధిగా 'అందేఁగెన్', 'అందక్కడ', 'అందుందెన్' ఇట్టివి ఎందును లేమియు, ఇట్టులే 'పారలాదెదు' మను. 3(64), లోనగునవియు.

అందిచ్చుటకు ప్రయోగములు (17)-

"నమ్మును కైదువుమా పగు। జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం
దిమ్మనుడుఁ జేయునది లే। కమ్ముగుం డమ్మహీజ మలసత నెక్కెన్." భార. విరా.

'అందీక' - కాశీ. 5(161); 'మడిచి యందిచ్చినపుడు' - శృం. నై. 8(84), "వెన్నెల నిగ్గులు వెదచల్లెడిమడుంగు। లందిచ్చె నొక్కపూర్ణేందువదన" పారి. 2(12). ఈమూఁటి కవులును క్త్వార్థేకారసంధి చేయనివారే.- ఇఁక నెందఱోకవులు ప్రామాణికులు దీనిం ప్రయోగించి

యున్నారు: — "అందియ్య శివుఁడు తగ నానందింపుచు నారగించి" కాశి. 3(90); "కాల్చిన కోలామిషఖండములు దనకు భక్షింపఁగ నందిచ్చినన్"—105; "పశ్చిమాంగన చేతి కందిచ్చు నిద్దంపు టద్దమనఁగ" భోజ.(108); "ఇంపారఁ బ్రియుల కందిచ్చునవియు" (107); "నోటి కందియ్య" కువలయాశ్వ. 3(77). "లాజలందిచ్చునట్టి సోయగము" 4(81); "బుడుత లందిచ్చు తెలనాకుమడుపు" 5(5); "మడుపు నందించ్చుదారి" 25; "వెలఁది కందిచ్చుచును రామవిభుఁడు వేడ్క" దశావ. 7(243 - 6 పం); "తెలియాకుంజుట్ట లందిచ్చుచో" (15) "కీలుజడ కేలి కందియ్య బాల నగియె" 8(318 - 5 క్రిందినుండి); "అందిచ్చువారు" - కృ. రా. వి. 3(64); 'అందియ్య' బసవ 3(175). ఇట్టివి వాఙ్మయములో ఇసుకపాతరగానున్నవి, చదువువారికి ఒకరుచూపనక్కఱలేదు.

4(192) "తారాడు నత్తెలజల్లులు"-'తారాడు' అందిచ్చువలెనే శబ్దపల్లవము. 'తారి + ఆడు' అని విభాగము. ఇదియే ప్రమాణము - శ. ర., ఇట్టివియు వాఙ్మయములో నవారిగాఁ గలవు. 'తేలాడు' - భార. విరా. 5(60) "తేలి + ఆడు" - శ. ర. "మిట్టాడు" - (మిట్టి + ఆడు)=సంచరించు. "అంగళ్లయందు మి + ట్టాడ మానిసి లేక" - కాశీ. 5 శ. ర. "మిట్టాడంగ నరుండు లేని యడవిన్" మను. 4(58) "ఏల దురంతవేదనమెయిం బొరలాడెదు" మను. 3(64). "పొరలాడు"...(పొరలి+ఆడు) పొరలు. "బిడ్డలు వచ్చి వసుంధరాస్థలిన్ బడి పొరలాడుచున్ బడెడుపాటులు నూడవు." శేష. ౧ ఆ. శ. ర. "ఎన్నగేంద్రపుఁ జలుల్విన్నంది పెన్నంది కోరాడు తనగుబ్బకొమ్ము లొడ్డి" మను 4(37).

"కోరాడు...(కోరి+ఆడు)..."తేంట్లు పఱవఁ గోరాడెఁ గరులు"-"ఆము." శ. ర.

"వెరఁజాడు...(వెరఁజి+ఆడు) కొరుకొను..."వెరఁజి వెరఁజి వెన్న వెరఁజాడుచున్నాఁడు। నీసుతుండు మమ్ము నిలువనీక" వి. పు. 7.-శ. ర.

ఇట్టివి వాఙ్మయములో పెక్కులు కలవు. కావున ఈ ప్రపంచమందు శ్రీసోమయాజుల వారు "అందిచ్చిన" చాపము - కుంభజానునికి పిశాచి అందిచ్చిన కఱకుట్లను, దయాళులు "చించిచ్చిన" చీరలను కాపాడుచున్నది. తప్పు సేయనివారగు పెద్దనగారు ఆచాపమునే కేలంగొని "మిట్టాడి" "పొరలాడి" "కోరాడి" - ఇట్టి యూఘాయిత్యము లెన్నియో కావించినవారై "వెన్నుని వెరఁజాడిన" వెన్నలను అంగీకరించి, అహల్యాజారుని 'కోడాట'ను ఇంక నిట్టియాటలను ఎన్నింటినో కాపాడినారు.

వినతయొక్క "సవతాలు" - "విడిదిండ్లను," "కోమటిండ్లను," "తాడువంటలిటను" - ఇట్టి సమస్తమునుం గాపాడుచున్నది.

ఇక్కడి యీనిర్ణయము ప్రకృతకావ్యకర్తృనిరూపణార్థమే గాని ఇత్సంధిసిద్ధాంతము గాదు. అందులకై వేఱుచర్చ వలయును.

పరిశీలనార్థము పనికివచ్చును గాక యని ఈచర్చలో బుద్ధిస్థములైన మఱికొన్ని యిత్సంధులను ప్రదర్శించుచున్నాఁడ. అందుం గొన్ని యీ యుదాహృతపూర్వములకే ఆశ్రయముగా నున్న నుండును.

"చంపి తిత్తొలిచి గాలి గొనవైచిన కుక్కకడిమంబు" భార. శాం. 3(285) విశ్వామిత్ర చండాలసంవాదము. "తోలొలిచి" అని పా. అని అధోజ్ఞాపిక. "దిననాథనందనుఁ

దిత్తొల్చి తోలుప। చ్చడము చేసి'' - కాశీ. 6(184). ''తిమిరగజాసురు వధించి తిత్తొలిచిన''- శ. క. ర. 4(132). ''ప్రయ్యిడి'' కాశీ. 5(163); ''పత్తిరిడి'' కాశీ. 8(105);''తివిరి యం గంబులఁ దిమ్మిరెత్తకమున్న'' 177. ''కౌఁగిలియ్యదు'' నరస. 2(25). ''వసుధామరనూతికిఁ గౌఁగిలిచ్చి'' నిరంకు. 4(42). ''చతుర్థుఁ డొకజాతిఁ బెండ్లాడి'' వరాహ. 9(128). పెండ్ల యిననాఁటినుండి'' వరాహ. 3(30) ''రేవెలందుకఁ బెండ్లాడ × రిక్కరాయఁ డేఁగుదేఁగలఁ డని'' నీలా. 8(4). ''ధర్మతత్పరులకు గెల్పు బ్రాఁతే'' భార. శల్య. ౧. ''ఇమ్మెయి ముక్తి బ్రాఁతె బ్రాహ్మణులకును రాజులకును.'' భార. అశ్వ ౧. ''కేళివనినుం దేతెంచి'' పాండు 4(257). ''మాడలు వేయే నిచ్చును'' కాశీ. 3(146). ''పురిలోనుం డిటువత్తురే'' - కృ. రా. వి. 2(85).

అనతిచ్చు - ఈప్రకృతి భూయిష్ఠముగా నానారూపములం గబ్బములం బ్రయుక్తము.- ఒకకొన్ని యుదాహరణములు.—[55 ఉదా.] నృసింహ. 1(60), 3(60). 5(192). ''అనతీ కృపతో''-శృం. శాకుం. 3 తుదను. ''అనతిచ్చినది'' భోజ 6(200), (201); కృ. రా. వి. 2(62). ''అనతియ్య'' చంద్రికా. 3(104), 5(72); 5(125). ''అనతిమ్ము'' వరాహ. 1(134), 151; 2(138), 88; 7(114); 8(2), 59, 111; 9(4), 153; 10(10),72, 128;11(5),135. కళాపూ. 1(191); 2(152), 157; 3(132),273; 4(127), 137, 135; 5(53); 6(161).''అన తీవలయును'' మను 1(80). ''అనతిచ్చె'' కాశీ. 2(7). ''అనతిత్తురే'' కాశీ. 2(84). ''అనతిచ్చితి'' భోజ. 1(183). ''అనతిమ్ము'' పరమయోగి. 4(4) దశావతార 85(28) 134(4). 216(7) ''అని ధాతపడంతియె యానతిచ్చె'' కళా. 4 శ. ర. బసవపురాణము - 3(177), 246; 4(91), 143, 171; 5(126), 173, 208; 6(98), 99, 262.

''వానికౌఁగిలది యెక్కడ'' మను. 3(5); ''ఒక్కరాతి రిచట నున్న'' - కేయూర. 3(41) ''పనేమి'' కువలయాశ్వ. 5(20) ''అరమాని సాత్త్వవిస్తారము'' పాండు. 1(115). ''ఇన్నని'' పాండు. 4(147). ''మన్నింపంగఁ బాడింతటతో'' నరస. 3(135).''మ నవేటికి నూతనమా'', నరస. 4(84). ''ఈచెలఁ దీపాము నిభము'' కాశీ. 4(157). ''ఊఁగా డు'' శ. ర., ''పాలసాడు'' శ. ర. ''దోఁగాడు'' - ''మెదలాడె గండుదుమ్మెదలబారు'' కృ. రా. వి. 4(42) ''భువనైకమోహాంబు పొదలాడ'' చంద్రికా. 6(64). ''సవతాలికి'' - భార. అను. 1(204) సవతి + ఆలు శ. ర. ''సవతాలికొడుకు'' కాశీ. 4(266) ''విడిదిండ్లతో''- కాశీ. 4(68). ''కోమటిండ్లతో''-పాండు. 4(149). ''కులిశాయుధునిఁ బట్టి కోడాటలాడించి'' విక్ర. 5(11). ''అనయమ్ము దాల్చు వానన్నఁ జెనకి.'' నరస. ''అత్తవారింటికి'' - పరమ, 2(165). శృం. నై. 7(18). 'కంచంత కాపురము' పాండు. 3(81); 'మాపటిసందునతో'- కాశీ. 4(100) 'తాటాకుల చప్పళ్లకు' - వరాహ. 3(55). 'అత్తవారింటి కరిగెడు నాలతాం గి.' శృం. శా. 4(13). 'పెండ్లింటికడకు' - కృ. రా. వి. 4(116). 'గ్రుడ్డవ్వ' - హరవి. 2(87); 'ముసలమ్మ' - 2(89). 6(85) 'చించిచ్చు' -దీనిని కూడ శబ్దపల్లవముగాఁ గొనఁదగును; ప్రయోగబాహుళ్యభావాభావములు కాకతాళీయములు. ఇట్లే దశావతార చరిత్రలో 'పంచిమ్ము' 82 పుట 16 పంక్తి. 'అమృతము సరిగా నీ వీ × యెడఁ బంచిమ్ము'.

'రాతిరెల్ల' భార. ఆది. 6(160); విరాట. 1(78). 'ప్రొయ్యిడు' విరా. 1(78) 'పదాఱు' కళా. 1(124) 'వెఱ్ఱివేలయితి' - శృం. నై. 7(72). 'పెండిలయ్యె' మార్కండేయ

4(88), 4(61). 'బ్రాఁతే' - మార్క. 5(242). 'పదేసి' మార్క. 4(8). 'తొమ్మిదేసి'. మార్క. 4(140, 190). 'రాతి రిచట'- మంచన. కేయూర. 3(41) 'పూరిల్లు' మంచన.1(9)

## తత్సమేకారసంధి.

తెనుఁగున 6(10) 'ఐన నెవ్వాని శక్తీంద్రి × యవితతికిని', - అని సవర్ణదీర్ఘసంధియేని, 'శక్త్యింద్రియ' అని పరరూప సంధియేని, రెండును ఘోరములే. 'అయిన నెవ్వానిశక్తి యింద్రియ వితతికి' అనుట సరి. 6 (51) పుట్టునీఁగద - ఈఁగు×నీఁగు.—

ఉపోద్ఘాతములో దుష్టసంధుల కుదాహరింపఁబడిన ప్రయోగములలో నొక్కటి యిట చర్చించెద; కడమ యిప్పటికే చర్చితపూర్వములు.

'పుట్టునీఁగద'-ఇందులకు 'పుట్టున్ × ఈఁగదన్' అని పదచ్ఛేద మనియు, 'పుట్టు నీఁగదన్' అని యుండవలయు ననియు ప్రతిపాదించినారు. పుట్టునీఁగదన్' అను ప్రయోగము దుష్టముగాదు. వీరిముద్రణములో ఉపోద్ఘాతమందును వ్యాఖ్యానమందును మూలగ్రంథమందును 'నీఁగద'లో అరసున్న లేదు; అది యుండవలయును. ఇట పదచ్ఛేదము 'పుట్టున్ + నీఁగదన్' అని. 'నీఁగదన్' అని యిట పదము. 'నీఁగు' అనునది తొలిరూపము, దానికి 'ఈఁగు' అనునది రూ. కలదు.

"నీఁగు - దే. స. క్రి. నివర్తించు. 'ఉ. ఇక్కథ భక్తితో వినిన + నెప్పుడుఁ గీర్తన చేసినన్ జనుల్। నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురు భవ్యభద్రముల్.' భార. ఆర. 5ఆ. శ. ర. బ్రౌనుదొరగారి టీకలోను 'నీఁగదన్' అని నకారాదిగానే ఛేదము.

"నీఁగుట: V. a. to get rid of. 'వొక్కతపస్వి వొక్కవ్రతిరాఁడే చూడఁడే తత్కృపన్। బుట్టు నీ(ఁ)గదన్. 'అనఁగా యీరాక్షస జన్మమును పోఁగొట్టు కొనెదను' - బ్రౌణ్యము.

రాయకర్తృకతావాదాభాసనిరాసముచే ఉపోద్ఘాతములో 3 (39) 'రెణ్ణాళ్లు' 4 (13) 'కల్గొన' అను రూపములు 'మఱికొన్ని చిత్రప్రయోగములు' గా ప్రదర్శింపఁబడినవి. ఈప్రయోగములలో దోష మేమియు లేదు. 'మఱికొన్ని' యను పదములచే నివి దుష్టములుగా నెన్నఁబడినట్లు కనఁబడుచున్నది. ఇందు చిత్రమయినను ఏమియు లేదు.—ఎట్లన—'రెణ్ణాళ్లు' అను పదమున ఉపోద్ఘాతములో ణద్వయము ముద్రితము, మూలమున నద్వయమే కలదు. నద్వయమే శిష్టసమ్మతము. ప్రౌ. వ్యా. సంధి 15 - చూ.

"కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వపదాంత్యడకారంబు నకారం బగు ఉ. రెన్నాళ్లు. 'క. పనిదనము లైదుప్రాదులు। పదపడి రెన్నాళ్లు నొక్కపవలున్ రేయున్;' భార. ఆది. 1(69). మూన్నాళ్లు-ఎ. గీ. 'చెఱఁగుమాసినమూన్నాళ్లు సిగ్గుతోడఁ। బతివిలోకన మార్గంబు పరిహరించి'—కాశీ. 2(72). పెన్నిల్లు, తే. ఏళ్లినిల్లి నొండె వేనీళ్ల నొండెఁ గడువ జాతిఁ దోషునఁ గలుగు శుద్ధి.' మార్క. ౬. ఇంచుకంత హెచ్చుకుందులుగా నీతీరుం బొరసిన ప్రయోగములు వాఙ్మయమందు సమృద్ధిగాఁ గలవు.

'నెల రెన్నెల్లకుఁ జీరచిక్క' కాశీ. 2 (79) [ఇట 'రెణ్ణెల్లకు' అని ణత్వముద్రణము అసాధువు.] 'నరవరోత్తము నేఁటిమూనాళ్ల నుండి' మను 4 (73) [ఇందు 'మూనాళ్ల నుండి' అనుముద్రణము ప్రామాదికము.]

'తాను మూన్నాళ్లు మూఁడేండ్లుగాను గడపి' - దశావ. 6(192 - 2); 'మూన్నెలవుల యెడ' - పాండు 2(104). 'ఏన్నాళ్లనుండియు' 4(158). ఇట్టి యీసుశబ్దమును ప్రయోగించి నందున జఘన్యత యేమియులేదు.

'కళ్లాన' - ఇట్టిరూపము శిష్టసమ్మతము, కడుం బ్రసిద్ధము. ఇట్టి ప్రయోగము ఆముక్తములో ఇదియొక్కటియ గాదు, ఇంకనుం గనవచ్చును:—తారసానకు 3(32), మోహానాలతో 1(88), శ్రీభండారానకౌ 2(95) సోణాలు 5(50), కప్రానన 5(89),ఏతాల 6(18), రెండాన 5(48), 4(261), రెంటాన 6(19),గందాన 7(62); ఈరూపములు సూత్రసిద్ధములు. సూత్రము పీఠికలోనే ఉదాహృతము 'వికృతౌ క్వచిచ్చ లోపో మోర్ద్ధ్రశ్చాత ఆదిమస్య భవేత్' అని; ఇందులకు టీకలోనే భారతప్రయోగ ముదాహృతము.-'మానుగధృతరాష్ట్రుఁడు ప్రాణానం గలుగంగ' అని.

దీని ప్రయోగబాహుళ్యము నించుకంత నిరూపించెద.— 'అడవిమెకాలతోఁ గదుపులై' - మను. 5(52). 'పంతాలు' - రామాభ్యు. 7(128). 'మంచుఁ గుంచానఁ గొలుక' పాల్కురికిసోమన్న ప్ర. ర. 14. 'వీఁడు ప్రాణాన నరిగిన వెదకి వెదకి। మనల నెప మోర్చుఁ గాకేల మనఁగనిచ్చు.' కాశీ. 7(252). 'పూచినకొరవిపూఁ బోదరింటి చందానఁ। గత్తెర యొకచోటఁ గదలకుండె' కాశీ. 1(138) 'కుండలీశక్తి నాఁగఁజకోర శేత్ర। పాముచందాన నుండెడు ప్రథమధమని.' కాశీ. 2(125) 'జంకించి పరపృథక్జనకోటిచందానఁ। గఱకుఁ జీకటివెన్ను చఱచునాఁడు' కాశీ. 3 (234). 'నారువోసినచందాననాటి యేంద్రు' కాశీ. 5(182). 'కన్య గండానఁ బుట్టిన కారణమున.' కాశీ. 5(329).

సంబారాలు, వడియాలు, 2(121); ముత్యాల 4(78), లాతాల 5(10),చుట్టాలు 5(19), రత్నాల 6(44), వజ్రాల 6(45), ఉండ్రాలు, బొండాలు. ఖండాలు 6(55), వేసాల 7(188)- ఈపదునొకండును హరవిలాసములోనివి.

'చుట్టాల సురభికి సుందరీమణికి' - హరి. ద్వి. 'చిలుకగుత్తాల' కువలయాశ్వ. 3(94) 'వేయితులాలలోహము' నా. పంచ 1(537). 'ఇనుపకచ్చడాలు గట్టుకొను మునిముచ్చులెల్ల। తామరసనేత్రులిండ్ల బందాలు గారె.' మను. చక్కిలాలు 3(168), చరణాల్ 3(236), స్నానాలకాంక్ష 3(380), నిష్ఫన్నాల్ 4(149), బోనాలు 4(158), నిజాలభక్తుఁడు 4(165)-ఈయాఱును బసవపురాణములోనివి. 'వనగురివెండకన్నానఁదూరి'_మల్లయవిప్ర. 2(56) 'వడిగొని యడిదాన వైచి కందానఁ। దుడుచురౌతులు' గౌరనహరి. ద్వి. 'ఊడిగాలు' కువలయాశ్వ. 1(93) 'పంతాలాడు' కళా. 1(42). 'పూసగ్రుచ్చిన చందానఁ బొసఁగఁ జెప్పె' కాశీ. 6(232). 'పెరిఁగినతెవు లడఁగఁజూడు పెద్దతనానఁ' రామాభ్యు. 7(75), 'ఈ। పాలానఁ జెన్నొబ్బలానలేక పోవ నీవు దోఁచితో' మను. 4(98); 'భార్గవునైన। చింతాన చిలిపింతు రంకమునకు' మను. 1(50). ఇవి రెండును పెద్దనగారివే. ఇంకనుం జిత్రమా? 'విఘ్నంబుఁ గావించు పాపానఁ బోవుదాన' భోజ. 4(250) 'నాయాన నడుచుసుకృతివి। నాయాన యతిక్రమించి' రామాభ్యు. 5(27). 'అడలున నోదానఁ బడు నవ్యగజముల కరణిని' రామాభ్యు. 7(44). 'ముత్తియంపుహజారాన' కువల; 3(20) 'చల్లఁదనాన' చంద్రికా. 2 - 69 170 ; 'చక్కఁదనాన' చంద్రికా 100, 'కాయకాలానఁ గలిగిన గౌరవంబు, పాండు. 4(42). 'ఊడిగానకు' పరమయోగి. 8(157). 'జగానఁ గానము సమాను జనుల'

తారా. 1(58). 'దీని కెనయ్యెఁ జూచాన జగానఁ గాన' 'డెందానం జెయివెట్టుకొని యతఁడు నిద్రించుచుణ్,' 'వాన లేనికతాన వాడి వత్తులవలె। సకలసస్యంబులు సమసిపోయె.'-వరా.7(52).

ఈ క్రిందివి రెండు అళికంబున యతిని డాఁచినట్టి సర్వజ్ఞుని ప్రయోగములు. —

'సికతాసేతువు నిమ్నగా రయముచేఁ జిం దైనచందాన' ఉ. హ. 4(124).

'చందన ధరణీరుహాంబు చందాన ననిణ్' ఉ. హ. 5(265).

'నీనామమేమి। యేకతాన వచ్చితిరా కిరాత' వరాహ. 2(46). 'పా। పానకు నొడి కట్టుకొనెం। గా నేఁడు విధాత.' వరాహ. 66. 'కాలానణ్' వరాహ. 80. 'తగిలివచ్చిన చందాన' వరాహ. 3(50). 'అతనిఫాలానఁ గ్రుచ్చె భాగ్యాక్షరములు' వరాహ. 57. 'విచ్చినమెట్టదమ్మి కమటానణ్' వరాహ. 91. 'నాతి పుష్పములకుఁ గా వ। నాన నాసపెట్టుకొనకు' వరాహ. 91. 'చిలుపచిలుపనీరువిధాన నెన్నెలలు మొనసి' వరాహ. 4(147) 'ఎట్లో యొక్కచందాన వీడ్కొనియెణ్' వరాహ. 7(94). 'ఒండొంటిఁ బాసిపోవుండ దానికిఁ గట్టు వైచినచందాన వళులసొంపు' వరాహ 128. 'జగతినెందును లేని చక్కఁదనాన సొం। పగు చిన్న ముద్దునెమ్మొగముతోడ' వరాహ 161. 'చందాన'-శృం. శా. 3,4(130) 'ముచ్చుఁదనాల పుట్టినయిండ్లు' - ప్రభావ. 1(108). 'ఏనుఁగుఁగంబానకుఁ దిగిచినట్లు'- ప్రభావ. 5(29). 'కదలితరంగల బెఁడగారుచందాన' కృ. రా. వి. 3(28). 'అట్లనే రేపు జగడాన కరుగుదెంచి' 3(108) 'కయ్యానకుఁ గాలుద్రవ్వుచు' కూచి. రుక్మి. 'తలవంక న్నెలవంక గల్గుదొరచందానణ్' దశావ. బల 238(8) 'పోనిపో మనవాఁడుగా యనుచు మాగపుణ్యానకుణ్ వచ్చినణ్' దశావ. కృష్ణ. 313(8). 'కాలానకు' హరవి. 4(25), 'అంతఃపురానకు' 4(55). 'జంత్రాన' 1(22). 'కుంతాన' కువ. 2(136), హజారాన' 3(20), 'చందాన' నారా. పంచ. 1(357).

ఇట్టి శాస్త్రోపదిష్ట - ప్రయోగప్రసిద్ధ - పెద్దనార్యప్రయుక్త రూపమును - 'చిత్రము, పెద్దనోచితము గాదు, రాయప్రయుక్త దుష్టరూపము' - అను ప్రత్యక్షవిరుద్ధవాదమునకు ఏమి చేయఁగలము.

## అచ్ఛులో సంబుద్ధి డుజ్జునకు లోపము.

'కృష్ణరాయ' - 1(31, 34, 35, 40, 41.) ఈలోపము బహుప్రబంధసిద్ధము. మనువులో: — 'సుకేశేఖద్రుమ కృష్ణరాయ లీలామదనా.' 2(1); 'శ్రీకృష్ణరాయ, గుణరత్నాకల్పా' 4(1). వసువులో - 'శ్రీ తిరుమలరాయ' 2(1); 'తిరుమల మహారాయా' 3(1),'తిరుమలరాయ' - 4(1). నరసరాజీయములో - ఔబళనరసా, ఓబధారుణీశ్వరనరసా, ఓబపార్థివనరసా, ఇత్యాదులు పెక్కులు కలవు. శృం. నైషధములో-'కేళాదిరాయ' 1(112); 'మామిడిశింగా' - 8(1)-అని పల్కాఱు కలదు; జక్కన విక్రమార్కచరిత్రలో - 'జన్నయసిద్దా' అని పలుమాఱు కలదు.

ఇట్లు అనేకమహాకవిసమ్మత మగుటంబట్టి యీ డుజ్లోపమును సాధువుగాఁ గొనందగును.

## వ ల్ల ప ం చ మి.

4(120) 'అడి వహించెఁ జూలు మబ్బుల నిల ముంచు నీలఘనపుంజమువల్ల బలాకమాలికల్' - ఇది పెద్దనగారి 'చలిమలవల్ల' వంటి దందురు. కానిందు 'కొలనిలో' అనుటకు

‘కొల్నిలో’ అని ప్రయోగము కలదు. అట్లే ‘వలన’ అనుదానికి రూపాంతరముగా ‘వల్న’ అని వాఙ్మయమందు అరుదుగా ప్రయుక్తమై యుండును. దానిని అధునిక ‘వల్ల’ వ్యవహారబాహుళ్యముంబట్టి యాధునికులు ‘వల్లగా’ వ్రాయుట,తలంచుట,ముద్రించుటయు సంభవింపనోపు. ఒండె-‘పట్లన్’ అని ఆయాయితావుల కవులు కావించిన క్వాచిత్కప్రయోగములు అక్షరరూపసామ్యముచేత, ‘అవిఘ్నమస్తు’ ‘లపిప్రసుస్న’ అయినట్లుగా, అర్థానుగుణ్యముచేతను బహుళవ్యవహారగోచరమయిన ‘వల్ల’గా మాఱియుండ నోపు.

బ, వ, ల్లు వర్ణకమున ఉల్లోపము.

సంధిలో బ. వ. లువర్ణకోల్లోపము కృతమని యాక్షిప్తి. 1(71) నిరుకోల్లొక్కలకొల 4(133); అంబల్లొమ్రుచుచున్;5(124) సుళ్లువతి; 6(61) ఎన్నిహుల్గాణము.-ఇది మహాకవిజుష్టము.

కొనికి కాదేశము ప్రయుక్తమని యాక్షిప్తి.

ఇది పెక్కింట లేఖకాదుల ప్రభావముగానే యుండును. 6(22) ఒడ్డుకయుండు - ‘ఒడ్డుచునుండు’, లేక, ‘ఒడ్డియయుండు’ అనుట యొప్పును.

6(18) బొమికె లెత్తుక పాఱిపోవుకునుల-‘బొమికలఁగొని’ అనునది. 7(21) అంగుళులఁ బట్టుక - ‘బట్టుచు’ అనునది. 6 పెట్టుక - ‘పెట్టుచు’ అనుఁడు. 16 పెట్టుకుండు - ‘పెట్టుచుండు’ అనుఁడు. 7 తలయంటుకాడు - ‘అంగడిలోఁ దలంటాడుతడవు’ అనియుంట యొప్పు. 20 మోచుచేగుచో-‘మోచుకొంచుఁ బోన్’ అనుట మెఱుఁగు.

కొనన్ అనుటకు కోన్ అనుట సమ్మతమే.

3(23) మాన్పుకోన్, 4(248),4(87) ముంచికోన్; 6(40) త్రొక్కొఱికికోన్;ఇందులకు-‘కన్గోఁజాలక’ వసు.; ‘కాముం జీరికిఁగోక’ హరవిలాస. 5(32); కొల్లలు గొనక్తాదెడు’ క. క. ర. 8(215).

ఔపవిభక్తికకార్యము రామి.

2(9) పోరునన్; 2(31) తేరునన్; 1(80) నీరుబుగ్గ. - ఇందులకు - ‘విల్లునేర్పు’ భార. ఆది. 5(222), ‘విలువిద్య’ (225, 236. 239, 241. 244. 245), ‘మన్నన’......(232). ‘విల్లువేఁట’ మను. 4(37). ‘గోరున’ రామాభ్యు. 5(179); ‘ప్రోలున’ రామాభ్యు. 1(137); ‘పోరునన్’ పారిజా. 8(74).

సమాసమున ఉత్తుపై టుక్కుసుక్కులు రామి.

2(8) మందాకు; 2(17) కరుంజువిదలు; 4(80) పిడుగుక్కు;4(230)బండారిలు; 4(288) వెలుఁగాళన్; 5(46) లావెద. - ఇందులకు - ‘నునుఁజివురాకు’ మను. 3(82); ‘రాజుమోమెదుట’—,,—5(81); ‘తెల్లనిగట్టుఱుత’—,,...4(16).

సమాసమున లట్టునకు లోపము వచ్చుట.

1(14) నవదండ; (53) ఏనికదోయి; (56) చెంగల్వడిగ్గియు. చన్దోయి, (71) వాలుగమొత్తము, మెడగుంపుల వంపులు;(74)పసిండి మువ్వగమి; (75) చెంగలువదండలఁ దోలుదురు; (76) దొప్పగమి; (62) కూఱపసుపు. 2(5) సంపెంగదండవోలె; (9) మల్లుపోరునన్; (97)

**శారివిశంగాయకములు; 4(148) వెండిసలాకపిండు; (156) తెల్లుగంటల; 5(25) ఊరుపుపిండు వలపులు; (91) పలువన్నెముగ్గు; 4(89) పలువన్నెకట్ల జెట్టిది—**

ఇవన్నియు 'అంచపిండు' భార. 'పక్కతండము', 'పచ్చతాచట్టుగమి', 'ఉడుము గతిమిడి కొక్కదండడియు। వెల్లయెలుక గల్లెక్కతఱచు' మను. లోనగువాని వంటివి.

6(21) 'కేవగటివేళ' – అప్రాణివాచక శబ్దఘటిత ద్వంద్వము ఏకవచనాంతంబు నగు. చూ. ప్రౌఢవ్యా. సమాస. 30.

4(190) 'యజ్ఞోపవీత పద్మాక్షమాలికతోడ.'—'...మాలలతోడ' అన్న అశ్లీల మవిధయమేని, 'యజ్ఞోపవీతముతోడి పద్మాక్షమాలిక' అని విగ్రహించుకొనవచ్చును.

## సమాసమున అన్వాదులకు ఉలోపము.

1(65) అన్నవి; (84) అన్నాటలుః; 2(6) చన్నంజ్ఞ; (52) అన్నతిః, 3(8) అన్నీలు వాదిః, అన్ శ్రుత్యుదూక్తి; 3(70) వాసనల న్నూళి;4(7) అన్వారు, (80) అన్నొక్కలిమి; 4(146) అన్కతకంబు;4(200) అన్నవ్రిథ, 4(261) మన్నివ్వజాల;5(183) రాగమన్నలమున; 7(14)చన్త్రోవ.– ఇంగులకు 'బ్రహ్మాండమ న్నరడిః' మను. 3(59). చూ. ప్రౌ. వ్యా. సంధి. 73. 'జడిగొన్నొక్కయ్కలు' ప్రౌ. వ్యా.

## సమాసమున ముగాగములోపము.

2(10) గందపట్టెలు; 5(106) సరపువ్వులందు. ఇందులకు – '(దంతంపు) సరకట్టులు' మను. 1(15) 'గందవోడి' మను. 3(75); 'ఎడ్డాకొ గందపట్టెగతి నుండ న్నాదుకేల్' కళాపూ. 'బోనకావడి' క. క. ర. 5(339), 'బోనపుట్టిక' క. క. ర. 5(340); 'అమరుల బోనపుట్టిక' పారిజా. 2(40).

## సమాసమున పుంప్వాదేశమునకు స్వరము పరమైన టుగాగమము రాదు.

4(161) కంజహితాస్తోదయ వెలసంజ. 6(82), సరిూపపూరసె 6(121), పక్షిప్రధాన పాపవాహ్యంబు. ఇందులకు—'తములపాకు' జగత్ప్రసిద్ధము. 'తామరపాకు' శృం. నైష. 'పట్టపేనుంగు' పారిజా. 3(88), పరమయో. 4(35).

### సమాసమున తదర్థక విశేషణోకారమునకు హల్లున నుగాగమము.

1(82) 'ఊరుంగాయలు' – ఇది 'ఊరుబిండి' పాం. రం. 4(184) వంటిది. ఇట్టిదే 4(95) '(పసిండి తగటుం) జగడుం బువులేకమొత్తముల్' – అనునదియు. పెద్దనగారు మనువులో 'పాల్పగుం జవిక' 5(76) అని ప్రయోగించినారు. వాడుకలో 'ఊరగాయ' యనియే. ['ఊరుగా'-అఱవము.]

4(115) పుట్టంగొడుగట్లు? అందురా? అది అలుక్సమాసము – 'ఊరబిచ్చుక' వంటిది.

## క్రియాజన్యవిశేషణములతో తత్క్రియాకర్తృ షష్ఠీసమాసముం బొందుట.

5(40) మీపాడిన హరిచందంబులు, 5(27) కంతునియిడిన పత్త్రికేళ 6(32), మాపఠింపని శాస్త్రములు—ఇవి అద్భుతపాండిత్య స్ఫోరకములుగాని దుష్టములుగావు.—'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన'మను.1(48). 'తనచేసినదానం బడకపోవ శివునకు వశమే."

మహాత్ములవు విశేషణములైన యమహాద్వాచకములకును అట్టి నపుంసక లింగములకును, అట్టి మహాద్వాచక శబ్దాంత సమాసములకును, ఉభయథా విభక్తికల్పనము. 13 ప్రయో.— 1(37) నృపశేఖర, (38) నృపపంజర, (78) భారత భూమిసుర వతంసంబు, (98) భక్తవ్యా ద్భ్రిమత్పణదాత్ర; 2(33) నిగమభూధరముల్, (39) విద్వద్వతంసంబు, (40) ఇందుకులావతంసంబు, (41) మధురాస్పదుండు, 6(50) భాగవతవతంసంబు, (59) తత్త్వసంశయలవిత్ర, (100) సమస్తలోక సముదయాధారుఁ, (122) నాసీరుఁడగుచు, (31)సకల దురితావతంసయుగు హింస.

## ఉభయథా అన్నందులకు 25 ప్రమాణములు.

'పార్థివవంశశేఖరుఁడు' భార. ఆది. 3 ఆ., శ్రీవాణీ లీలాస్పద—,,—3; పాండవ సింహంబు—,,—6; శాపమోక్షకారణుండు—,,—8; 'అకుమారసింహంబు' ఉ. హ. 5(253); భావుకకారణా—,,—6(278); 'శ. సృష్టిస్థితి లయకారణుండు'—మార్కం.1(9); 'ధరణీకాంతావతంసంబు' కేయూర. 3(301); 'శత్రురాణ్మనజాలా' - పాండు. 4(310); 'ప్రేమాస్పదులు'—,,—5(166); 'అంబురుహ గర్భకులాభరణంబు' మను. 1(51); 'గృహస్థ రత్నంబ'—,,— (72) 'వచోగాంభీర్యలీలాస్పదా' —,,—81; 'మరుపాన్థ శిరోరత్న ము[ఁ]'—,,—2(25); 'సుధీశేఖద్రుమ'—,,—2(1); 'కింపురుష వృషభుండు'—,,— 'జగతీనాథవతంసము'—,,—5(93); 'గుణరత్నాకరుఁడు'—,,—6(57); 'హరిణోత్తంసం బు'—,,—6(75); 'సారంగాంగనారత్నంబు'—,,—6(86); 'సుగుణరత్నానీక రత్నాకరుఁ'—,,—6(96); 'భువి దివి నీవలనఁ బొడమెఁ బురుషవతంసా.'—,,—'మానికులావతంస'—మల్ల. వి.ప్ర. 3(18). 6(31) 'దురితావతంస' అన్నచో మహతీభావము కూడ స్పష్టీకృతము. వినను త్రిధా యనియుఁ జెప్పనక్కఱలేదు. ఱ. స. గాఁ గొనవచ్చును.

అసమస్తమునకు - 'నాసీరమై వచ్చు నళినబాంధవు టెక్కియంబుపై దీపించునర్ధమ నఁగ' మను. 'అనినవారికి నరుజుండనియె; మమ్ము ననఘ తాపత్యులని పల్కి తత్తిమదమున, నేము కాంతేయులము మఱియెట్లు సెప్పమయ్య తపతి కపత్యులమైన తెఱఁగు.' భార. ఆది. 7(66). [ఇందు కవిప్రయుక్తము లెన్నియో, లేఖకాది జనితము లెన్నియో?]

## ఉపమానపూర్వపద కర్మధారయము.

1(16) 'పాదాబ్జ ఫాలాలంకార కచావళిమకర దీవ్యత్కుండలాంచన్ముఖా.'—పాద = తననాలవభాగమయిన-అబ్జ = చంద్రుఁడుగలది - అనఁగా చంద్రునికన్న నాలుగుమడుంగులు శోభావంతము - అట్టి- ఫాల=లలాటమునకు - అలంకార = భూషణమయిన - కచావళి = కుంతల భరము చేతను - మకర దీవ్యత్కుండల = మొసలివాచేత ప్రకాశించుచున్న - కుండల = తమ్మం టులచేత - అంచత్ = ఒప్పుచున్న - ముఖా = వదనము కలవాఁడా.

2(34) 'వజ్రదోఃపరిఘ వశీకృతాన్య వరపాలకులు.' - వజ్ర = పవివంటిదైన - దోః = బాహువుకలది (బ. స. పరిఘకు విశేషణము) విన - పరిఘ = కట్లగుదియచేత - 'పరిఘ కలదిబాహువు'అని అన్వయము గాదు - బాహువు గలది పరిఘ యని యన్వయము, ప్రౌఢము.

4(165) పుంగవకకుత్స్థుండు - పుమాఁ గౌరివ-గౌర్నామ చన్ద్రః - పురుషశ్రేష్ఠ ఇత్యర్థః- 'గౌః కృతౌ వృషభే చన్ద్రే' నానా. పుంగవుఁడైన కకుత్స్థుఁడు - అనుట.

### సమాసములో ఏకాక్షరశబ్దంబునకు హ్రస్వమువచ్చుట.

5(67) 'నిస్తులాస్య శ్రీవయఃస్తంభ నిక్షిప్త నింబచ్ఛదభ్రూవల్లంబు నిక్క.' 8(28) 'వచ్చి రిపుఁ జూపున నెచ్చరఁ బుచ్చుచు సిరిఁగొంట మగుడఁ, బాడమాట రుష మొచ్చిచ్చునను వెచ్చమరి వి। ద్యుచ్చలచాపజ్యఁ దూపుఁ దొడుగుచుఁ బలికెన్.' 'భ్రూవు' 'జ్యా' అని దీర్ఘముగానే యుండవలసినట్లు శాస్త్ర మున్నను సమాసాంతమున శ్రుతిసుభగతా కారణంబున, హ్రస్వీకరించుటయే మెఱుఁగు అని కవి బుద్ధిపూర్వకముగానే ఇట్లు ప్రయోగించినాఁడో, యని సందేహము. ఒండె - 'నింబచ్ఛదభ్రూవు నిక్కసుంత', 'చాపలత', 'చాపమున' అనునిట్టి రూపములం బ్రయుక్తములై యుండి లేఖకాదులచే ముద్రితప్రకారముగా మార్పువొందినవో - 'విద్యుచ్చల' అను విశేషణము చాపమునకుం జెల్లును, చలనము విశిఖప్రేరణార్థమయిన నమనాకర్షణలచేత కలుగును. చలనమునకుం గనుఁడు.—

'న నమయితు మధిజ్య మస్మి శక్తో। ధను రిద మాహితసాయకం మృగేషు,' శాకుం.

విద్యుత్సామ్యము అనుసంధాన ప్రయోగ బోధకము.—

"గాండీవ మేతేన ముహు ర్వికృష్టం। హ్రస్వం చ దీర్ఘం చ బభూవ యుద్ధే
తులా మి వార్ణేన త దాధిరోఢుం। స్వనామధేయస్థితి కాలినేవ" భార. చ.

'ఇటు చూపటు నటు చూపిటుఁ; బటురయమున నేసె నాసుభద్రార్జునుఁడున్' విజయవి.

విద్యుత్సామ్యమునకు.—

శా. 'విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ విల్లందమై యుండ, న
ష్టద్యోధావళిమానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి శా
కుద్యోగించుట కేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్.' భార. ఉద్యో. 2(143).

'మెఱసి యుదయించు గ్రహముల। తఱచు ప్రభలఁ గ్రేణిసేసి దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలె నావిండ్లన్। మెఱుఁగులు నృపతనయుదృష్టి మిఱుమిట్లు గొనన్'
భార. విరా. 4(114).

జ్యానుచెప్పకయే శరసంధానముం జెప్పుటకు—

'అచమూరువు యూధంబుఁ ద్రోచి పఱచె। వింట న మ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుమ
లోలజిహ్వాకరాళ విశాలముఖత। మోవిభీతేందు మృగశాబమో యనంగ.' పాం. రం.

2(61) తమదు కూర్పరములు, 5(45) మీదుపాటలందు - ఇవి సాధువులెట్లు?-ఈ దుగాగమము యుష్మదస్మదాత్మార్థములకని సూత్రమున విహితము. కావున ఏకత్వ బహుత్వముల రెంటను రాఁదగును. అట్లే-'మును మాదగువృత్తాంతంబులు వినిపింపవలయు' మను. 5(16). 'మీదు విమర్శల్' - భోజరాజీయ 1(16, 7). 'మీదు సన్నిధిన్' బసవపురాణము. 8(191) 'తమదు ప్రాణలింగంబు లని'—,,—4(225). 'మొల్లలు మల్లెలు మొదలైన శబ్దముల్ బహుతను దమదు పుష్పములఁ దెలుపు' ఆం. భా 'మీదు బ్రతుకు'—,,—4(226) 178 పు.

## సమాసములో న్యస్తపదములు.

**5(60) మామిఁడి పనిలేని కసరు. 2(23) సాంకవ మొప్పు పాణిపాటల మగు దంతపుం గరపటంబు 4(45). అలపుట్టరాని ముక్తామణివరకులము.—ఇట్టివి కవిత్రయేతర ప్రయోగ సిద్ధములు. చూ. ప్రౌ. వ్యా. సమా. ౧౮.**

ఇంకను ఇతరవిధంబులం గల్గు సామాసిక వ్యత్యాసములకు చూ. ప్రౌ. వ్యా. సమా. పరిచ్ఛేదము. సమాసముల మతిపారిభాషిక పదములయందు ఆరూఢివ్యవహారమే సాధువు. ఇది అనుకృతము వంటిది–4(43). వీరభద్రపల్లెరములు. ఆరాధ్యదేవళ్లు. శంకరదాసమయ్య – 'పలుమఱు దాసమయ్య పదపద్మయుగ ప్రణతుల్ ఘటించుచున్.' బసవ 4(135) 'కావలె జియ్య భక్తజనకల్పక శంకరదాసమయ్య మద్దేవ'—,,—(136).

వాక్యములందు ఈ క్రిందితీరు లర్హములా? 4(229) పసుల గాచి తెప్పింతును; 4(197) మమ్ముం గాన్పింపుఁడు; అతనిం గాన్పించుకొని; 2(13) చిల్లులు వృత్తులు తెమ్ము; 2(38) కలాపులను గఱులు నివిరి; 6(52) ఇత్తనువుల బారిణసేయుము.—

ఇందు తొలిదాని – ఆడి యనుపదము అర్చిఅని యుండెనో?

"కెంగేలు కేలితోఁ గీలించి నెయ్యంపు మాటలఁ దగు ముఱుమాటలాస్తి." భారా. విరా. ౨. (శ. ర.) కడమవి వ్యాకరణశాస్త్రసిద్ధము లయిన భిన్నప్రయోగములు.

'కంటె'ను అంతర్భావిత విభక్త్యంతర తత్సంబంధ పదార్థముగా ప్రయోగించుట.— 3(80)–ఉండు నప్రాణులం దొక్కించు కారికి! నాహగ్రేణిఁ, దజ్జాతికంటె......ఇట్టిది సాధువా?—'ఆజాతియందున్న శక్తికంటె' అని యర్థము.—ఇట్లే ఈసీసమందెల్ల 'కంటె' లకు అర్థము గ్రహింపవలయును. ఇది మహాకవి ప్రౌఢ్యతిశయముచేత అత్యంత సంక్షేపార్థము కావించిన ప్రయోగ విశేషము; సోఢవ్య మని నామతము.

ఉదంత తదర్థవిశేషముపై సుబుత్పత్తి. ఉ. 5(41) ఉడికించుకంటె, – ఇది సాధువా? ఇది మహాకవి మార్గానుగృహీతము.–మను. 5(11) కైకొనుకంటె, 6(89) తలంచుకంటె.

## రచన వ్యత్యాసములు.

2(21) 'ఏ వేఁడుటకు నీవు బుతు వేల చెప్పెద! వువిద మే మందాఁక నోర్వఁగల మె.' 4(46) ఇచ్చకు లగు బ్రాహ్మణౌఘ మెల్ల! చొరఁ దొడఁగిరి. 4(120) ధవళాంశు కరావళి తాము, 4(155) లబ్ధలక్ష్యంబులైన! స్వాన్వయాశరాళిచేఁ గీర్తిచాలఁగ నెనో. 4(162) కీరాళి వొలిచె...చే లనంగ.—ఇందులకు – 2(21) 'ఏము వేఁడుట కీవు' అనుట సరి. 4(46) 'ఇచ్చకమున...దొడఁగెను' అనుట సరి. 4(120); 'ధవళాంశు కరాళులు తాము'–అనుట సరి 4(155) 'స్వాన్వయ శరాళిచేఁ జాలయశముఁ గనెనో' అనుట సరి–'స్వకులశరపాళిచేఁ గీర్తిఁ జాలఁ గనెనో' అన్నను సరి. 4(162) 'కీరాళు లొప్పె...చే లనంగ' అన్న సరి.

## వర్ణ్యము లేని వర్ణన.

'ఖండిత పూగీనాగర! ఖండంబులు ఘనశశాంక ఖండంబులచే
హిండితములు గావించి య! ఖండస్థిరభక్తి నొసఁగి కదలి చెలులతోఁ' 5(98)

'హిండిత మాతాంబూల ము' అని పఠించిన తాంబూలము సిద్ధించును.

## విభక్తివ్యత్యయములు.

6(18) 'భామిక లెత్తుచుఁ బాఱిపోవు శునులన్', 'అంగలార్చు కపులన్'.—

'శునులచేత' 'కపులచేతను' అని యర్థము. ఇట్లు తృతీయార్థమున అజడమునకు ద్వితీయ రావచ్చునా? అజడమునకు బహుత్వమున తృతీయాసప్తములయందు ద్వితీయ చూపట్టెడు నని ప్రౌ. వ్యా. కార. ౧౮. అందు ఉదాహరణము.—'అతనిదోర్దర్ధ్యసరసి నోలాడుచున్న। ఘనతరస్తనచక్రవాకముల నలరు। నంబ నసురేంద్రుకూఁతు రింపారఁ గనియె.' హరి. ఉ. 7 ఆ.

1(77) పద్మ; 2(16) ఇనోష్మ, 2(28) ఊష్మం జనియించు, 2(67) ఊష్మన్మల్లికల్, 4(87) అత్యోష్మన్, 5(85) ఉష్మంజూడి, 5(96) మత్కృతోష్మకు, 5(107) వక్త్రవిషజ్వలనోష్మన్, 5(150) ఊష్మకు నంగలార్చుచున్; 5(97) తనూష్మ, 5(152) తదూష్మకు, 5(104) తక్కూష్మముల్, 5(135) మహోష్మ మడఁగ.—ఇట ములోపము.—

ఇందులకు — 'ఊష్మ జగత్త్రయంబునన్' హర. విలా. 6(62) 'తదూష్మలన్' — క. క. ర. 4(187). 1(35) లక్ష్మీరమణీలలామ—ఇది నాంత శబ్దము. 'లలామం చ లలామ చ' అమ.

6(61) తనున్ (=తనువున్); 4(83), (103) రాహు; 5(50) బాహు. ప్రౌ. వ్యా.లో రాహుబాహులపైని మాత్రమే ఈకార్యము చెప్పఁబడినది. చూ. శబ్ద. 26. కాని పెల్లుగా వాఙ్మయమున ఇతరములును ఇట్టివి కలవు. 'సేతునన్' భార. ఆది. 4(163). 'రజ్జునన్' భార. అను. 1(204); 'అంశున్' రామాభ్యు 5(129); 'అఖుతోన్' కాశీ. 2(43). 'పరశుతో' — ఉ. హ. 2(276); 'చంచునన్' నృసింహ. 1(66).

### అవిహిత మయిన పువిభక్తి.

1(65) బాతువులు.—ఇది కవిప్రీతిచే సిద్ధము. కొన్నియుదంత శబ్దములకు అచ్చులో సయితము కొందఱు కవులు ప్రియపడి తుదిని పుకారముం బెట్టుదురు. ఇట్లే రమాలునకు 'రమాలువు' కువలయాశ్వ. 5(8), 4(201), 212; 5(28), 91. 'ఆడెలుబాతనంగనగుశరారి' ఆం. భా.

ఈక్రిందివి దుష్టప్రయోగములు గావా?—1(58) సూత్రపట్టిన (ములోపము); 4(117) చూపట్టె (పులోపము); 4(204) కూపెట్టిన (యిలోపము); 6(68) బహివడ్డ (బహిస్ అను సాంతావ్యయమును తెనుగునం బ్రయోగించుట); 4(29) 'దున నేటికి' — (దున్నులో ద్విత్వలోపము); 7(13) ఒలె (ద్విత్వలోపము); 1(82) ముకు మందు?

కావు. ఇందులకు—'సూత్రపట్టినమాడ్కిఁ జూడ్కి వెలుఁగ' రామాభ్యు. 6(92); 'తాపించె ధనదువదనము। కూపెట్టఁగఁ గాలకంతు కొడుకు' కాశీ 7(90).—అట్టివే 'చూపెట్టు', 'మోపెట్టు', 'మాపట్టు'.

'బహివెట్టి నతని యన్నమును...అభోజ్యమండ్రు' భార. శాం. ౧. (శ.ర.) [అప్రేరణమున 'బహివడ్డ'.] దున్నులో ద్విత్వలోపము విష్ణుచిత్తీయకారునికే కాక అతనికి ముందే 'అరణ్యపర్వమున శేషము' చెప్పిన 'చిత్రకవిత్వ వాగ్విభవజృంభితు'నికి ఆంధ్రవిద్యా తృతీయమునికి శ్రీప్రబంధపరమేశ్వరునికిం గూడ ప్రియమై యుండినది:—దును — దే. స. క్రి. దున్నునకు రూ. 'దునకయు విదపెట్టకయుఁ । దనరె నఖిల సస్యములును. హరి. పూ. శ.ర.

ఒలె (ఒల్లె) భాషాస్వభావముంబట్టి యిది శ.ర.లో కైకొనఁబడినది. 'ముదు' నకు— 'పఱచునొక కడితిఁ బతి ముదు చెరమలకై యేయ'—మను.4(45).

కొన్నిరూప విశేషములు:—4(199) నూలన్—'నూలు' ఔప., కాన నిరూపము. 4(45) ఒక్కొట—'ఇట నవ్వరూథినియు నొ।క్కొటఁ గతిపయసఖులు తన్నుఁగొలిచి నడువఁగా' మను 3 (190), అనాదు (=అనదు). 'సర్వ మనవ్యా మనా సెఱుంగవే'—మను. 3(99) 'పట్టణ మేలు...దిక్తటీ। వాట్టచరత్ ప్రతాప వారిదభ్యుఁ డనా యువనాశ్వుఁ డున్నతిన్' క.క.ర 1(26). 'భూరిరజో గుణస్ఫురిత పద్మజుఁ డనా' [ఈ సీసమున 4 అనాలు] నృసింహ. 1(65). 6(3) పుణ్యభూమియందులకు (=పుణ్యభూమికి అని తాత్పర్యము.)— పుణ్యభూమికి వ్యస్తము చేసి దాని తర్వాత అర్థవశంబున 'కలదే' అని యూహించుకొనవలయును.

## స్త్రీత్వ సృష్టి.

2(31) కురంగీమద—ఇందు స్త్రీత్వ మెట్లు సరిపడును? కస్తూరి మగ లేడినుండియే కలుగు నని తలంపక చేసిన ప్రయోగముగా కానిపించుచున్నది. కాని ఇందు స్త్రీలింగము కవి సమ్మతము.:— 'నవ్యవసుధాసతి...కృష్ణరాయ నృపచంద్రుని బాహువునందు భూషణోజ్జ్వల మణులన్ మృగీమదము వాసనయుం గని ధూర్తలంగనల్' పారి. 1(20).

## స్త్రీత్వ నష్టి.

3(85) కరివర కరోరురుచిర జంఘ రమణీయు.—'జంఘామనోజ్ఞా' అని వ్యాఖ్యాతలు అధోజ్ఞాపికలో వైచినది సాధుపాఠము. 7(31) పతాక రణన్మణికింకిణీ కలాలాపములన్— పతాకయొక్క రణన్మణి కింకిణీకలాలాపములు అని సాధ్యసమాసముగా చేసికోవచ్చును. 'పతాక' అనుట టీకాకారులది. 'వితాన' అను పా. కలదని వారే తెలుపుచున్నారు.

4(27) క్రాంతరథ్య నిరంతరచ్ఛాయదములు—'ఛాయా' అని యుండవలదా? వలదు. ఎట్లన—'ప్రచ్ఛాయ సులభనిద్రాః'—ప్రకృష్టా ఛాయా యత్ర అని విగ్రహము; అట్లే ఇటను 'నిరంతరా ఛాయా యత్ర నిరన్తరచ్ఛాయమ్ - తద్దదాతి' అనియేని, లేదా, నిరంతరాణాం ఛాయా నిరన్తరచ్ఛాయమ్ అని ష. స. గా చేసి విగ్రహించుకొనవచ్చును.

4(120) 'బలాకమాలికల్'—పుల్లింగ మెట్లు? బలాక శబ్దమునుం గలదు. 'ఆభాతి సంహత గృహీత బలాకశఙ్ఖః,' మృచ్ఛకటి; 'హంసబలాక సారసారవ' భార. ఆది. 6(234).

6(87) కాషాయ యుగితోడ—బొందకము యుగి(?) జోడనఁ బొల్పుగాంచు' ఆం. భా. 'కుచయుగీ హారాళనీలత్వ సంపదతో'—నిరంకుశ. 1(86) 'కుచకలశయుగీమణ్డలమ్' పంచ బాణవిజయము. లేదా, ప్రకృత ప్రయోగమును—'కాషాయములతోడ' అని పఠింపవచ్చును. యుగత్వము ఆచారముచేత గమ్యమే యగును.

## ప్రకీర్ణము.

5(88) బాహిరము—ఇది భారతసిద్ధము— 'బాహిరములైనఁ గొలనికెగ్గులు.'—విరాట 1(187) కాటి 1(65), 73, 4(188), 5(141)—పరిధాన వస్త్రమాత్రపరముగా ఈ శబ్దము కలదా? 'తళుకుదుకూలకాటి కటిఁదాలిచి'—మను. 5(78). 'యగడ్తనీరు పద్మావళి ప్రాఁత తోడి కరకంచుగ నొప్పుచుఁ గోటకాటిలా।గై వఱలంగ. కళాపూ. 1(16). 5(137) ఊడుకొను-

ఊడుకొనఁగ నైవుఁ దుర్వ్యధ్రముల' నృసింహ. 4(178). 6(78) గనపరాకులు (నిగిడ్చి—'కనప రాకులు-గన్నెరాకమ్ము' అని బ్రౌను దొరగారు. సీతారామాచార్యులవారు దీనిని పఠింపలేదు. భోజరాజీయమున 'ఇనుపరాగోలల నిఱికించి'—5(321) అని యున్నది. 'గనప' అనఁగా పెద్ద; ప్రకృతమున గనపరాకోలల నిఱికి' అని యుండనోపు.

6(82). నోరిసని—ఈసని మనువులోని 'సీరాముసేన' వంటిది. 5(159) కోనిరి—'కోనేరి' అనుటకు సంస్కృతములో ఎకారము (హ్రస్వము) లేనందున ఇకారము పఠించుట. 'కోనెటి చిన్న తిమ్మ నృపకుంజరు' రామాభ్యు. పీఠిక 41; 'కోనెటి తిమ్మభూవిభుని కూఁతురు'- రామాభ్యు. పీఠిక 93. 6(17) దూళ్ల-(=దూళుల)-(ధూళ్ల) పిప్పల్యాది. 4(94) తాళ్లనే కలయ వాకిళ్లఁ జల్లి—ఇందు 'తాలన్' అనుటకు 'రాళ్ల' అనుట దుష్టము, లేదా 'ఇంటిముందటి పందిటి రాడుల చేరువను' అని యర్థము చేసికొనవలయును, లేదా 'తాలనే గలయ ద్వారాలఁ జల్లి' అని పఠింపవచ్చును. 5(20) కేళ్లు- ఇరులు కేలు శబ్దములు నిత్య బ. వ. నాంతములు గావని ప్రౌ. వ్యా. శబ్ద. ౭. సూ. కావున, 'కేళ్లు' సాధువే. అటనే కళా., క. క. ర. ప్రయోగములు ఉదాహృతములు. 2(24) ఉవ్వ, 6(77) ఊవు: 'ఏఱులుగఁ దద్వహు తాల ఉవ్వి ఉవ్వి' 2(24) 'దేవాయుధంబులు ఊవు వారు'—పువ్వు × పూవు, నొవ్వు × నోవు, ఎల్లిదము×ఏలిదము, తెప్ప × తేఁప, కొప్పు × కోపు — ఇత్యాదులయందుంబోలె ద్వైరూప్యము. 5(44) 'పొందు'-ఒందునకు రూ. అని టీక. 'జలచార స్తబ్ధరోమత్వకే। సరిత ల్పొండకతార దంభమున నాచ్ఛాదించుఁ దాఁ బ్రౌఢిమన్'. 'ఒందు' అనుటకు 'పొందు' అని వ్యవహారము వేఱువాడులందు ఉండెను గావలయు. లేక - 'పొందు' అని యుండెడిని. 'జలచార... పొందు' అని షష్ఠీసమాసము. పొందు = ప్రాప్తి.—లట్టుమీది యత్తునకు లోపము. 'తూలె రజనిచరభాస్కర బింబముల్ రుచుల్.' రామాభ్యు. 5. అని ప్రౌ. వ్యా. 5(44). ప్రౌఢిమన్ - ఈ పదమున ఇమనిచ్చు అసాధు వని వామన సూత్రము; ఇది ఆంధ్ర ప్రబంధములం గనఁబడుచున్నది, 'ప్రౌఢిచేన్' అన్న నిర్బాధము. 'మిగులఁ బ్రౌఢిమమునఁ గాలిక నిల్చి కోలము నటింప.' అనుచో 'యామరఁ గాలిక' యని పఠించిన సరిపడును. 6(99) నమస్సు, 4(221) మిథము - ఇవి 'ఇహము' 'బహి' ఇత్యాదులవలె ప్రయుక్తములు.

4(196) కొన్నాళ్లు, 4(203) ఇన్నాళ్లు, 6(54) ఎన్నాళ్లు - ఇటనెల్ల ని లోప మెట్లు సాధువు? ప్రాచుర్యముచేత సాధువు. 'కొన్నాళ్లు' - 2(11) అనిరుద్ధ; 'కొన్నాళ్లకు గర్భిణియై' దశావ. 8(289), 'కొన్నాళ్లు వసించుటొప్పు.' అందే, 6(189-12 పంక్తి); 'ఇన్నాళ్లు' కాశీ. 8(73), కువలయాశ్వ. 5(35,105). 'తన కెన్నాళ్లుండియు' - బద్దెన నీతి. (24) పా 'ఇన్నాళ్లవలె' భోజ 5(105).

1(33). తిరుమద్దేవి (=తిరుమలదేవి) - ఇందు అత్వలోపమునకు గతియేమి? సంజ్ఞాపదముల రూపములను కవులు 'అపి మాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం నకారయేత్' అను న్యాయంబున ఛందోనుకూలముగా మార్చి ప్రయోగించుట ప్రసిద్ధము. ప్రకృతపదమునంబోలె అ లోప వంతములు. 'మాదద్దేవి', 'మాచద్దేవి', 'సోద్దేవి'.

“అనఘసింగక్షితిపతి । మానవతీ తిలక యైన మాదద్దేవిన్
ఘనుత సమస్తగుణాల । క్ష్మీనిధిఁ దగఁ బెండ్లియాడెఁ గీర్తి దలిర్పన్.”

O. L. Mss! Vol. II. కళాధరోపాఖ్యాన.

“ద్వీపాంతంబుననుండి వచ్చితివె భూదేవా ‘ప్రశాన్తం మహా
పాపమ్!’ సర్వజగత్ప్రసిద్ధ సుమనో బాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయుఁ బ్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగవయ్యెదవు మాచల్దేవి వారాంగనన్.” క్రీడాభిరామము.

అట్లే నరసరాజీయములో— ‘అభూపతి సోద్దేవేరియందుఁ బ్రబలునిఁ దిమ్మ క్షితిపాలునిఁ గాంచెను.’ 1(61). లేదా, ‘తతోఽభూద్బుక్కభూజాని రీశ్వర క్షితిపాలకః। అత్రాస మగుణభ్రంశం మౌళిరత్నం మహీభుజామ్.’ ప్రా. లే. మా, 109. అమ. ‘బుక్కమా’ ప్రయోగము బడి ‘రహిఁ దిర్మలమా’ అని పఠింపఁదగు. ప్రాచీన లేఖకులలో ‘వల్లామ్బికా ముదవహాత్’, ‘శ్రుతం వల్లభాలభత,’ అనియు, వల్లభాదేవి యనుటకుం బ్రయోగములు. ‘మాదల్దేవి’ కళాధరోపాఖ్యానము. వల్లూరి నరసింహకవి నాగ్నచిత్తీపరిణయములో ‘పేర్రాజు’ అని ప్రయోగించియున్నాఁడు. అట్లే ‘బస్వరాజు’

4(4) ‘జానుదఘ్న’ ‘జానుదఘ్ని’ అని యుండవలయును. దఘ్నచ్చుపై టాప్పు రాదు. జీప్పువచ్చును.

5(8). శ్యామాత్వంబు - ‘ఇట పుంవద్భావము రామి యెట్లు?’ ఇత్యాది చర్చ కలదు. ‘శ్యామాంకంబు’ (=శ్యామ యను సంజ్ఞ) అని యున్న సరిపడును, అంకము = నామధేయము. ‘ఓ భూసురవంశ్య, పుణ్యజన పుణ్యజనాంకము తావకీనమే। పో సమకూరెడిం గులముపాత్తున దైత్యుల కెల్ల నంకతన్’ 6(51).

2(21) అనుభవతకు—‘పద్మాక్షిఁ బురి ననుభవతకు నీవ యెత్తులు వెట్టె దనఁగరావలపె నిటకు’—‘ననుభవమున కీవ’ అని పఠించుట సరి.

2(13) ఒకహారతన్ - హారము లెన్నియే నగును గాని హారతి మాత్రము ఒక్కటే: కావున ‘ఒగి హారతన్’ అని పఠింపవలయును.

4(269) కపట మానిసి - అపశబ్దము - ‘కవుడు మానిసి’ అనునది.

2(98). భూనాయక సభ—‘సభా రాజా మనుష్యపూర్వా’ అను సూత్రముచేత ‘భూనాయకసభమ్’ అయి, తెనుఁగున ‘భూనాయక సభము’ అని కావలయును. కావున దీనిని సిద్ధసమాసముగా చేయక ‘భూనాయకు సభ’ అని సాధ్య సమాసము కావించికొనవలయును.

4(104) ‘స్వరు ఖర...దధ్యుదాకరముల’ - ఉదాకరము - ఈ యుదాదేశ మెట్లు? ‘ఉదకస్యోదః సంజ్ఞాయామ్.’

4(96) ద్రుహిణాండ కరండక ధూర్వహ - ‘ఋక్పూరబ్ధూః పథామానక్షే.’ అను సూత్రముచేత ‘కరండక ధురావహ’ అని యుండవలదా? అని యాక్షేపింతురు. ‘కరండక’ శబ్దమునకు ‘ధూర్వహ’ శబ్దముతో సమాసము గాని ధూశ్శబ్దముతోఁ గాదు. కావున ఉన్న రూపము సిద్ధము.

2(99) దోర్ధూర్ధృత - అన్నచో - దోః=బాహువుయొక్క - ధూః = భరముచేత - అను టీక సరిగాదు. ఆ పక్షమున ‘దోర్ధురాధృత’ అని యేర్పడవలయును. ఇచట ధూః శబ్దము అక్షవాచకమే. దోః = బాహువనెడి - ధూః = కాడిచేత (లేక కాడివంటి బాహువుచేత) అని యన్వయించుకొనవలయును.

4(165) ప్రభగ్న శాల్యవనిన్ - 'ప్రభగ్న = విఱుచుటచేత - శాలి = ఒప్పుచున్న' - అను టీక సమంజసముకాదు. కావున 'ప్రభగ్న = దున్నఁబడిన - శాలి అవనిన్ = వరిపొలమందు' - అని యర్థము చెప్పవలయును.

4(29) సప్తరాత్రముల్ - ద్విగుత్వప్రాప్త మయిన యేకవచనాంతత్వము ఇట తెనుఁగున నుపేక్షితము. ఇచట ఏడుదినములు అని యర్థము - బహువచనముచేత ఎన్నియో ఏడులు అర్థము కావచ్చును. కావున 'సప్తరాత్రమున్' అనుట శ్రేయము.

## కొన్నిటికి అర్థనిర్ణయము.

2(19) పద్మినులు - 'జాతులే వంబుజేక్షణ పద్మినులు సైతము నున్నయెడ జాతు లునికి యరుదె.' ఒక పక్షమున పద్మినీజాతిస్త్రీలు అని యర్థము సరిపడుచున్నది; రెండవ పక్షమున పద్మములు అనునర్థ మెట్లు వచ్చును? అని యాక్షేపింతురు. ఇచట మత్వర్థీయము సమూహార్థకము నయితము. 'పద్మినీ యోషి దన్తరే। అబ్జేఽబ్జిన్యాం సరస్యాం చ' హేమ., 'పద్మినీ పద్మసంఘాతే స్త్రీవిశేషే సరోఽమ్బుజే.' నానా.

2(8) జలజపత్రములు - 'తరుణశైవాల జలజపత్రములు పొదువ'; 'జలజదళస్థతోయములు' 4(151); 'జలజదళముల' 4(149).— ఈమాఁటను తామరాకులు అర్థము కావలయును. ఆపదము లకు తామరరేకులు గదా అర్థము. ఆయాకులకు 'పద్మినీపత్త్రమ్' ఇత్యాది వ్యవహారము ప్రసిద్ధము. రేకునకు.—'శతపత్త్రేక్షణ' మను. 'అమ్భోజపత్త్రాయతలోచనానామ్' భోజప్రబంధ. ఆకునకు - 'స్థిత మురసి విశాలం పద్మినీపత్త్ర మేతత్' రత్నావళి; 'ఉత్సృజ్య కుసుమ శయనం నళినీదళ కల్పిత స్తనావరణమ్' శాకుం.; 'ఆనీర మె ముక్త మట్లు నళినీదళ సంస్థిత మై తనర్చు' భర్తృ.; 'న్యస్తో మన్మథ లేఖ ఏష నళినీపత్త్రే నఖైరర్పితః' శా. 'అనరాళ నాళనళినీ పత్త్రాతపత్త్రం ధృతమ్.' మాలతి. ఇత్యాద్యుదాహరణములు పెక్కులు కలవు.

'సౌవర్ణే రాజతే పాత్రే తామ్రే పద్మపలాశయోః। భోజనే భోజనేనైవ త్రిరాత్రాత్ఫల మశ్నుతే' పైఠీనసి. "య ఇచ్ఛే దూర్ధ్వగామిత్వం పరం స్థానం చ శాశ్వతమ్। పద్మపత్త్రేషు భోక్తవ్యం మాస మేకం నిరన్తరమ్' స్మృతిచంద్రిక.

2(78). ఘృతపిండ నిభకర్కరీ ఖండములతోడ - కర్కరి యనఁగా దోస యని యిట టీక గలదు. ఇందుకై అనుబంధములో కర్కరీశబ్దముం జూచునది.

5(121) జ్యోత్స్నీ గవి - ఉరుశక్తి న్మధుమాసదోగ్ధ పిదుకన్ జ్యోత్స్నీగవి చంద్రమః స్ఫురదూధః ప్రవిముక్త మైన నిబిడజ్యోత్స్నపయః పూరమున్' - 'జ్యౌత్స్నీ చన్ద్రికయాన్వితా' అను నమరవాక్యముచేత 'జ్యౌ' అని ఔకార ముండఁగా యతికై జ్యో యని ప్రయోగించుట శబ్దధ్వంసము చేయుటగాదా? కాదు. 'జ్యోత్స్నీ' అని వృద్ధిహీనరూపము కూడ సాధువే. 'జ్యోత్స్నాదిభ్య ఉపసంఖ్యానమ్' అను వార్తికముచేత ఈ శబ్దము నిష్పన్న మయినది. సంజ్ఞాపూర్వకత్వమువలన వృద్ధి లేమింజేసి పక్షమున జ్యోత్స్నీ అని రూ; చూ. రామాశ్రమీయము.

6(67) కళల్ పదునాల్గు నేర్చి - విద్యలనుటకు కళ లనుట చక్కఁగా లే దని ఆక్షేపింతురు.- 'ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి' అని పూర్వముద్రితపాఠము. కళల్ = విద్యలు అని టీక. 'ఒకయూరను విద్యల నెల్ల నేర్చి' అను దానిని పదు

నాల్గు సంఖ్యకొఱవ ఇట్లు మార్చియుండురు, అని తలంపఁదగియున్నది. లేదా గౌణప్రయోగ ముగాఁ గొనునది.

5(180) జడిసెన్ (= కురిసెను, వర్షించెను). 'జడియు - దీనికి వర్షించు అను నర్థము శబ్దార్థకల్పతరువునందు వ్రాయఁబడియున్నదిగాని ప్రయోగ మగపడలేదు.' అని శ. ర. లో సీతారామాచార్యులవారు వ్రాసినారు. ఇదియే ప్రయోగము. జడిసేయు అనునర్థమున జడియు అని కవియు చమత్కారముగా ప్రయోగించినాఁడు.

4(50) 'నాభిఁ దుడిచి కప్పురపునాభిఁ బెట్టు' - నాభి శబ్దమునకు తిలకార్థ మెట్లు కలుగును? ఈ యర్థము పెక్కు నిఘంటువులలో కనఁబడలేదు. నైఘంటుకమగుఁగాక, కాకపోవుఁగాక.- 'నాభిర్ముఖ్యనృపే చక్రమధ్య క్షత్రియయోః పుమాన్ । ద్వయోః ప్రాణిప్రతీకే స్యాత్ స్త్రియాం కస్తూరికామదే' మేదిని. 'ఖం వీజ్యతే మణిమయైరివ తాళవృన్తైః' మృచ్ఛకటి. 'విటులార్చునుశీరపుఁ దాళవృంతముల్' ఆముక్త. ఇత్యాది వ్యవహారమందు తాళవృంతము ఎట్లు విసనకఱ్ఱకు పేరయినదో అట్లే ఈ నాభిప్రయోగమును దలంపవచ్చును. మఱియు నాభి శబ్దము తిలకవాచకంబుగానుం గలదు.

2(46) నిద్రితద్రుచ్ఛాయ - ద్రువు నిద్రితమా, ఛాయ నిద్రితమా? అని యాక్షేపింతురు గావలయును. ఈ రెండునుం గావు. నిద్రితుని (నిద్రపోయినవాని) ద్రువు అని విగ్రహము. అర్థవశమున ఏద్రువుక్రింద నిద్రితుఁడో ఆద్రువే అతని ద్రువు.

ఈ క్రింది పద్యములో 'రొంపులు నంటి' యనుచో ను శబ్దప్రయోగము పాదపూరణార్థకము గాదా? అని యాక్షేపింతురా?—

'సరి యగు నిట్టివెట్టలను సర్వము నం చటవీఁదిస్పృష్టికై
శరధిపదిజ్మరుజ్జ్వలిత చండతరాతపవహ్ని నాఱఁగా
గరువు లజుండు వీనిపయిఁ గట్టె నన న్ననుపట్టె వెట్టలన్
గరి కిరి కాసరాంగములఁ గప్పిన రొంపులు నంటియాఱఁగన్.'

కడమరొంపులే గాక వీనిం గప్పిన యీరొంపులు సైతము ఆఱినందున ఇట్లుత్ప్రేక్షింప నాయెను. అని తత్సముచ్చయార్థవిశేషము. లేదా, 'పంకము లంటి' అని పఠించుకొనవచ్చును.

2(58) పందిరియు చేరి.—ఇందు అవధారణార్థకమయిన - అ - ఏల? వెట్టకతంబున మఱియొచ్చుటను ఈపాటియేనియు మదనోద్దీపనము లేదాయె నని భావపుష్టి. కొందఱు 'పందిరె' అని ఏకారాంతశబ్దము నూహింతురు.

## అప్రయుక్తములు

ఇందు అప్రయుక్తము లయిన కటి గల్లబుగ్గలు ప్రయుక్తములు.—

'పామరులభాష గ్రామ్యము। భామినికటి గల్లములు విభాసిల్లు ననన్' నరస.

'శుకవాణి బుగ్గలు ముకురంబు లన రాదు' అప్పకవి.-

ప్రకృతప్రయోగములు. 1(50) చెంగల్వడిగ్గియనీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి. 4(153) కటి దెసలు నిక్క [కటి ఏనుఁగుకటి], 4(90) కటిం జందురకావిజీ బమర, 6(80) కటి నుండి చనుమర గడిగాఁగ[దొంగల రాయనికటి]; 6(64) కటిసీమఁ గనకమేఖలఁ దాల్చి;3(85) అతికమ్రగల్లభాగా భోగఫాలాఢ్య; 5(125) నించుబుగ్గలన్ దొరసె మధుప్రపూర్ణత.

వీనిని మహాకవు లెందఱో ప్రయోగించినారు.-

'కట్టు రింగులు వాఱఁ గటిభాగమునయందు' - కాశీ. 3(118); 'కటీభార శాటీభవ త్సింధురక్రవ్యభుక్కృత్తి' కాశీ. 7(73), 'కటీతటిం బెట్టినమోటకత్తులును' - మను. 4(33), 'వేణీభరం బట్టిట్టె కటిఁ జిమ్మచీకటులుగా' మను. 4(68), 'ప్రోతాసి వాతాశన ప్రారజ్యత్కటిచక్ర' మను. 71, 'చీరగఁటి బింకపుఁజన్నులఁ జేర్చుకొంచు' మను. 5(68), 'కటీవిలోలద్రశనాకలాపా' ది. సూ. చ 6(49), 'ఒక నేత్రాంబుజ మొక్కగల్లము'-మను - 5(60), 'అతివేలమణితయాచ్ఛార్థ గల్లచపేటము' మను. 3(116), 'గల్లభాగద్వయీ' క. క. ర. 5(193), 'గల్లములఁ గుండలద్యుతి' మను. (195).

'సావష్టమ్భ నికుమ్భ సంభ్రమ నమద్భూగోళ నిష్పీడన
న్యఞ్చత్కర్పర కూర్మకమ్ప విదళద్బ్రహ్మాణ్డఖణ్డస్థితి
పాతాళప్రతిమల్ల గల్ల వివర ప్రక్షిప్తసప్తార్ణవం
వన్దే నన్దితనీలకణ్ఠ పరిషద్వ్యక్తర్ధి తవ క్రీడితమ్.' మాలతి 5(22).
'ఇప్పుడా మొగ్గలం బోనిబుగ్గలం దగ్గలిక నూపు' మను 3(28).
'చిన్నిబుగ్గల లేఁత చిఱునవ్వుల' - హరవిలా. 2(115).
'పాలబుగ్గలకాంతి పల్లవంబులతోడ' - కాశీ. 3(240).

## దుర్బోధములు

4(154) 'గండద్వంద్వ'...(ప్రకీర్ణకములై)-యుక్తిసాపేక్షము - 'వేదండంబుల్పువుదంతులౌట (చుఁ?) దెలిపెఁ దండెత్త భూపాలికిఁ'— 'జయదంతులౌట' అని పఠించిన సుగమముగా నుండును. కప్రమంటిన కరాళమదరేఖల్ రెండవ జత దంతములు, తత్సంపర్కపుఁ దెలిరేఖలు చెవులందు ప్రకీర్ణకములు - 'చామరం తు ప్రకీర్ణకమ్'. 5(119) 'ద్విజతగాంచియు'-ప్రక్షిప్తమా? ఈ దోషములు నిస్వనముల ట్లు? 4(179) 'క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు' ఈ గ్రుడ్లు హంసగ్రుడ్లు.

## ప్రక్రమభంగములు

2(30) 'ముడివిప్ప'- 'తమ్ములనె వ్రాలుటఁ దేంట్లు పెన్నెఱులగుట' అని పఠించిన సరిపడును. 5(107) 'చిలువసుధారసాధరల' - ముందు ఆకు రాలును, తలిరు లనంతరము పొడమును. ఆక్రమము ఉత్తరార్థమున నిరూఢము; సుధారస విషజ్వాలనలకు క్రమము లేదు, కావున యథాక్రమానుదేశంబును లేదు. చూ.-

'ఇద మసులభవస్తు ప్రార్థనా దుర్నివారం।
ప్రథమ మపి మనో మే పఞ్చబాణః క్షిణోతి
కిముత మలయవాతోన్మూలితా పాణ్డుపత్త్రై
రుపవనసహకారై ర్దర్శితే ష్వఙ్కురేషు.' వి. ఊ.

'పండిన యాకు డుల్ల, నవపల్లవముల్ తిలకింప,'- నృ. పు.

## పెద్దన్న కవనముపై యాక్షేపములు

పెద్దనవాదులను తత్పక్షమున సమాధానము చెప్పవలసిన తదీయ ప్రయోగములు మనువులో కొన్ని కలవు.-(1) లాలాటికము ('పాటనసేయుమికఁ') = తిలకవాచకము, (2) గ్రహయాళి

('చకితైణాహుతి') - ఈ రూపము హరవిలాసమునందునుం గలదు, (గృహాయాళు - సాధు రూపము). అంకస్థాయి - ('రారాపిళ్ళ'), అంకస్థాయినిన్ అనవలయు. (4) సలీలన్ (అత్యయీభావము) (స్త్రీత్వమెట్లు?) (5) పణినసూను [శ్బం. నై. లో 'పణిసాపత్య'] [పాణిని పాణినసూనుఁడు గాని పణినసూనుఁడు గాఁడు.

## రాయవాద విమర్శ - లింగసామ్యము

ఆయుపోద్ఘాతములో రాయకర్తృకత్వమును సిద్ధాంతించుటకైన వాదములలో 'ఈకవి మార్గము తక్కినకవుల మార్గమునకు కేవలవిజాతీయముగాఁ గానవచ్చుచున్నది' అని తొడంగిన విజాతీయాధికరణములో నుదాహరింపఁబడిన మార్గములు ప్రాయికముగా సజాతీయములే గాని విజాతీయములు గావు. వానిలో మొదటిది.—

కొన్నిచోట్ల విశేషణములు విశేష్యముయొక్క లింగవచనాదికముం బొరయుట - ఇందుకు ఉపోద్ఘాతకారు లొసంగిన ప్రయోగములు:—

4(29) 'ఆయతయుష్మదాకృతిక×రాగ్రనగాంచల వాంత వారిధా।రాయుత చంద్రకాంతి ఫలకావళిబింబిత యై' - ఇందు 'బింబిత అను పదము ఆకృతికి విశేషణమై స్త్రీలింగంబునం బ్రయుక్తము. ఇది ముద్రణమాత్రశరణము-'బింబితమై' అనియు పఠింప నగు, ముద్రింపను నగు.

3(74) 'పాత్త్వి। కపుమనోగతి యెయ్యది×గలదు దాని బ్రహ్మసంబంధినిగఁ జేయు× ప్రౌఢి చూవె. ఇట 'బ్రహ్మసంబంధిని' 'మనోగతి'కి విశేషణమై స్త్రీలింగంబునం బ్రయుక్తమఁట, అగుఁగాక. ఈ 'సంబంధిని' ద్వితీయగా నేనియుం గొనవచ్చును. కావున ఈ యుదాహరణమును అకించిత్కరమే.

## లింగసామ్యము

4(36) 'కవచితకుథాకర్బుర లగుకరివర కరేణుకంధరలన్' - ఇచట 'కంధరల'కు విశేషణ మగుటచే 'కర్బురలు' అని స్త్రీత్వమఁట; సరియే; కాని, ఇదియును ముద్రణశరణమే. ఈవచనములో 'కర్బురము లగు' అని ముద్రించినను నిర్బాధము.

ఇట్లు ఆయుదాహరణము లన్నియు విఫలములు. ఇట్టివి గాక గణయతిప్రాసాదినియంత్రితములై సఫలము లగునవియు ఇందు సమృద్ధిగానే గలవు. వానిం గొన్నింటిం బ్రదర్శించెద:-

1(7) 'అట్టి కా।మోదక మోదకీలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్'.

2(3) 'అక్షోభ్యవప్ర। దవరు దక్షిణమధుర సాంద్ర ద్రుమధుర.'

4(154) 'గండద్వంద్వ గళత్కరాళ మదరేఖల్ ఫుల్లసప్తచ్ఛదా। ఖండక్షోదసితల్.'

5(87) 'తామరసాప్త తామ్ర ముఖి.'

[ఈ సామ్యము లేని ప్రయోగములును ఇందు బహుళముగాఁ గలవు.] ఈ సమత ఇతర కవన సజాతీయమే యై ఈ కవియొక్క అఖండ గైర్వాణ పాండిత్యమును నిరూపించుచున్నది. సజాతీయమే యనుటకు.—

(౧) 'స్వకీయ యగు చంద్రిక నిల్లడ వెట్టెనో' కాశీ. 3(196) [ముద్రణశరణము.]

(౨) 'స్నానంబు సిద్ధించునే వారాణస్యుపకంఠదేశ విలుఠద్వార్వేణి వీచీఘటా। ధ్వాన పరంపరాకలకలోద్విఘ్నాఘ భాగీరథిన్.' 5(82). [ఉద్విగ్నాఘన్ భాగీరథిన్ అని ఛేదము - ముద్రణ శరణము గాదు.]

(౩) 'గ్రస్తసమస్తలోక ప్రపంచయై మాయ' — 5(71). [ముద్రణ శరణము].

(౪) 'అరుగుదెంచెఁ। గాశి నగరికి నికటభాగ ప్రకీర్ణ। గగనగంగా తరంగిణీ కనకకమల। పరిమళోద్గారిణికి మహాభైరవుండు'.—5(121). [ముద్రణ శరణము గాదు].

(౫) 'బ్రహ్మమయ పయఃప్రపూరభర సురతటినిఁ' 5(41) [ముద్రణ శరణము గాదు.]

(౬) 'సాకార యగు బ్రహ్మహత్యతోఁ జనుదేర' —5(123). [ముద్రణశరణము.]

(౭) 'నిఖిల యగు తనూభృద్రాజికి'.—6(77). [ముద్రణశరణము.]

(౮) 'అదవీయసి మోక్షపదవి యధికవివేకా'.— 6(282).

(౯) 'గజ। శాలలు ప్రథవించె నతివిశాలలు పెక్కుల్' 4(113). వరాహపురాణము. [ముద్రణశరణము గాదు]. ఇట్టివి వాఙ్మయములో నెన్ని లేవు !

## విజాతీయములలో రెండవ ప్రకారము
## గౌణప్రయోగములు.

నిష్ఠ్యూతాది శబ్దములు వాచ్యవృత్తిలో గ్రామ్య కష్ట్య విగాహులై, గౌణవృత్తిలో అతి సుందరము లగుట సంస్కృత మర్యాద గదా. అది యిందు తెనుఁగున నవలంబిత మని ప్రతిపాదించి, అందులకు నుదాహరణముగా, ఉపోద్ఘాతకారులు 'ఉమిసిన' అను నీక్రింది ప్రయోగమును చూపినారు.

4(118) 'ఉరువిద్యుద్దీపకళిక లుమిసిన ఘూమ స్ఫురణ.' ఇదియు ఇతరకవన సజాతీయమే కాని విజాతీయము గాదు:- 'ఉమిసి'యే గాక, క్రాసి, క్రక్కి, మేసి. ఓకిలించి ఈనిన ప్రయోగములు నయితము గలవు.

(౧) 'ఎఱమంట లుమియుచు నెసఁగు చూడ్కులచేత।
ప్రళయాగ్ని మార్గ్యంతరములు వోలె.'—నృసిం. 4(46).

ఇది ప్రహ్లాదుని మడియింప హిరణ్యకశిపుఁ డంపిన యేనుఁగుల వర్ణనము.

(౨) 'చిచ్చు లుమియు శిలీముఖంబు లొడలఁ గ్రుచ్చి.' కాశీ.4(221).

(౩) 'ధవళ లాంగూల పల్లవ చాలనంబులు కౌముదీచ్ఛాయలఁ గ్రాసియుమియ.'-(269)

(౪) 'మానినులపైఁ గడు నాగ్రహమెత్తి యంగభూ
భిల్లచయంబు కోపమునఁ బావకకీలలు గ్రక్కెనో యనఁ' తపతీ సంవరణము 4.

(౫) 'ఉగ్రవిషానలం బుమియుచున్న' భా. ఆర. ఆ.6. ప.315.

(౬) 'కొలఁది యెఱుంగక తిని కో। కిలకామిని వెడలఁ గ్రాసెఁ గిసలయ ఖండం। బులు
విరహిజనులపైని। ప్పులు గ్రక్కెడు ననఁగఁ జూడు పుష్పసుగంధీ.' వరా.3(88)

(౭) 'ఘనసువర్ణ పలాశక వాసనాగతిఁ। గలసి రజఃస్ఫులింగములు గ్రక్కుచు వీవలి వేగ
చేరి రాఁ.' చంద్రికా. 4(53).

(౮) 'శిరమున మించుఁదీవఁ నసిఁ మిసిమిారెడు కెంపుఁజెన్నడల్
కరమున వాఁడివాల్ మెఱుఁగు గ్రక్కెడు గొడ్డలి గల్గి పొల్చు న
ప్పరమతపః ప్రభావు భృగువంశ వివర్ధను క్షత్రియాంతకుఁ
మరగి నమస్కరించితి సముత్సుము నెమ్మెయి యొగ్గి నిల్చితిఁ.' కర్ణ.

(౯) 'ఖడ్గము। గ్గలికిఁ దడిల్లతల్ వెడలఁ గ్రాయు.' కళా. 1(89).

(౧౦) 'కమ్మవిల్తునిఁ జేసినకన్ను' శృం. శాకుం. 4.
(౧౧) 'నలునిఁ జూచినపిదప మన్మథునిఁ జూడ ।
నాకనిలయుల నయనంబు లోకిలించె' శృం. నై.
(౧౨) 'వికటారకూట వల్లికడార మగుపెద్ద ।
మకటంబు లేయెండ జిగుల నీన'—శృం. శా. 4.
(౧౩) 'తరుణాంగుళిచ్ఛాయ దంతంపు సరకట్టు ।
లింగిలీకపువింత రంగు లీన'-మను. 1(5).
(౧౪) 'ఇందీవరంబుల నీను గ్రాల్గన్నుల శరదిందు
ముఖులు చామరము లిడఁగ'—12.
(౧౫) దేహకాంతులు బాలచంద్రికల నీన ।
జడలు మోకుద్రుపల్లవ శంకఁజేయ.' పారిజా.
(౧౬) 'అందంబుగ నళికమం దొప్పు తిరుమణి ।
తిరుచూర్ణములు వింత మెఱుఁగు లీన'—కృ.రా.వి. 2(2).

## విజాతీయములలో మూఁడవ ప్రకారము. ద్రావిడజాతీయము

'ద్రావిడజాతీయము' - ఇందులకు ఉపోద్ఘాతకారుల యుదాహరణము: 'పదింబదిగా' 3(55) 'మీరును నా కనురక్తుల్ । పరికించి పదింబదిగా । నరయుఁడు మది నెద్ది మేలు ప్రార్థించుటకున్.'—ఇట 'పదింబదిగా' ననునది ద్రావిడజాతీయ మఁట. ఇది యేజాతీయ మైన నగుఁగాక విజాతీయముమాత్రము గాదు. ఈయుదాహరణములం గనుఁడు.—

౧ 'విరుసును జూపి యనేకవిధంబులఁ । బెక్కులు వక్కియుఁ జూచితి నీ
కరుణకుఁ బాత్రుఁడుగాఁడు పదింబది । గాఁ గనివచ్చినవాఁడఁ దుదిన్.' రాఘ. 4(161)
౨ 'ఇంక దీనికిఁ గర్తవ్యమెద్ది మనకుఁ, బదియుఁ బదియును గా నీతిపదవి నరసి ।
తెలియఁ దగు నని యిట్లని పలికె మఱియు.' - కళా. 7(89).
౩ 'అనఘుఁడ నిన్ను సోదగొనునంతటిదాన నె యేను? దప్పులే (లెం?)
దును, దలపోయ నీవలన దోసమె? యాత్మను బాయకున్నవా
రని బలుకొక్కమా అనుసరించుట మే లది వింద నేఁ దొలం
గని పెనుఁదప్పు నాయదియకాక పదింబదిగాఁగ నెంచినన్.' ప్రభా. ప్ర. 5(122)
౪ 'మదిరాక్షుల నమ్మకు, నయ। విదుఁడవు గద, వేగిరంబు పెరవరిఁ జెఱుచున్,
బదరకుమీ, లెస్స పది। బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీ.' సారంగ. 2(259)
౫ 'చాలు విచారము ల్పదిగ శంభునిఁగూరిచి.' - హరవి. 4(82)

వాఙ్మయమున నెమకుదుమేని ఈపద సముచ్చయమునకు ఇంక నెన్ని ప్రయోగములు దొరకునో! దీనిని ఆంధ్రమర్యాద గా దనుట యెట్లు?

పూర్వముద్రణమందలి యుపోద్ఘాతమున రాయకర్తృకతాస్థాపనకై విజాతీయము అని నిర్దిష్టలింగములలో నాలవది ద్రావిడపద ప్రయోగము, ఇదియు ఇతరకవి సాధారణమే—

క. 'ఉణ్ణాములె జగదంబిక । నణ్ణాములె విశ్వనాథు నారాధించెన్
మణ్ణాసయుఁ బొన్నాసయుఁ । బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్.' శా. 8(180)

[ఉణ్ణాములై=అపీతకుచాంబ, అణ్ణామలై=అరుణాచలము.]

'వైశాలియింటికే' మార్కండేయ, అఱవమున 'అవిశాలి' = యనఁగా జారిణి.

పారివిళంగాయ 2(97), అఱువారు 2(94), మన్నవారు 5(92), పెన్దిరువడి 4(80)— ఈయఱవపదములు ఆముక్తమాల్యదలో కలవు. వీనిలో 'పారివిళంగాయ' శ. ర. లో లేదు, ఇవి శ్రీవైష్ణవగృహవ్యవహారమున నతిప్రసిద్ధము లగుటంజేసి ఝుడితి అర్థస్ఫూర్తికై ప్రయుక్తములు; కవియొక్క జ్ఞానాతిశయమును బుద్ధికౌశలమునుం దెలుపుచున్నవి. ఇందుంబోలె 'పారివిళంగాయలు' హంసవింశతిలోనుం గలవు.

పారివిళంగాయలు.— బ్రౌణ్యములో కలదు. "A Sort of cakes (A Tamil word) A 2(14) (ఒకవిధమైన భక్ష్యము - అఱవ పదము) 'భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి। కట్టిన పారివిళంగాయగమియు' వేఁచిన బియ్యపుపిండి విసిరి బెల్లము పాకముపట్టి వుండలు చేసినది. H. I. 116. (...పారివిళంగాయలు తేమనంబులును.")

ఈ క్రిందివి ఆముక్తములోఁ గలవు.–తేఁడు(=వెదకు, కోరు.)

'జూదంబుఁ బన్నిదంబును। వాదును బతితోడఁ దేఁడ వలవదు కడుఁబో

రాదయ్యెనేని భృత్యులు। భేదము గాకుండు గెలుపు పెనుపఁగవలయున్.' భోజ.

'తేఁడు' అనఁగా వెదకుట అని యఱవమున ప్రసిద్ధము; ఆయర్థమున శ. ర.లో లేదు.

పణ్యారము(=భక్ష్యము.) 'మహోవిషంబులో నద్దిన పణ్యారంబు' అహల్యా. అని బ్రౌను. శ. ర. ములో (1) వానఁబ్రప్పు, (2 భక్ష్యము, అని యర్థములు కలవు. భక్ష్యార్థమున అఱవమున వాడుక.

ఒడమె (ధనము.) 'ఒడమె గల వెడఁగు నైనను। పుడమిం గలవార లెల్ల భూషింతురు' - ఒడమె యని తులంకారమునకు అఱవములో వాడుక.

ఎరియు (=మండు) - 'మనం బెరియఁగ నసహ్యపడున। న్నరుఁడు దెబ్బలు లేని వేదనం బడు నధిపా.' అఱవములో 'ఎరియు' అనఁగా మండుట,

సావి (= బీగము, తాళపుం జెవి. కుంచిక.) 'తిరుసావుల వైచితిమి.' 'బీగములు వైచి పదిలము కావించితి మనుట.' చె. మల్ల. విప్ర. 5(12).

'సాపడి'–,,–2(88) (వైష్ణవ సంప్రదాయమున వచ్చిన యఱవ పదము, భుజించి యనుట).

మొరము[=చేట]–'గురుసేవ రోఁకలి చేతఁబూని, దురహంకారము పొట్టూడదంచి,...శ్రీమారామానుజుల తిరుమంత్రము నే మంచిమొరము నానించి, దురితంపుకామక్రోధము పొల్లుగాఁ జెరిగి,...' భక్తిబోధక సువ్విపాట.

నంజు [విషము.] 'నంజుమురిచ్చాన్' ఇది విషహరమైన యొకయోషధికి అఱవపేరు. 'నంజుండస్వామి' - శివుని పేరు కన్నడము; నాలుకబంతి వ్రేలఁబడి నంజున డోఁగి' - మను.

పూర్వకవులు ప్రసక్తి యున్నను లేకున్నను అన్యభాషాపదములను తెమాషా కేఁగినట్లెల్ల ప్రయోగించుచుండిరి.–అందు కన్నడ పదములకు శ్రీకాళహస్తి మాహాత్మ్యము 'బిజమాడు దేవర' లోనగు సీసపద్య మొకయుదాహరణము. హిందుస్థానీపదములకు పెద్దనగారే యున్నారు.— 'సకుటుంబముగ వీఁగి చరమశైలము చేరు। తుహినాంశు దుముదారు దొరయనంగ.' మను 3(54).

'ఖుసి మీఱన్ సురధాణ నిందుకొలువై కూర్చున్నచోన్.' అని హరవిలాసము పీఠిక.(22)

పని [=ఆఁకలి, అఱవమాట.]

'ప్రబలపన్నగకులరాజ్య పట్టభద్రుఁ। డెన్ని పని వీఁడ నొకప్రక్క నిన్ను మెసవి।
లేఁడు పొమ్మని యనకున్న వాఁడుగాన। దళిత పాంథవిహార శీతలసమీర-' కువ. 4(82).

### ద్రావిడజాతీయభేదము—సంధ్య విరహోద్దీపకము కాదఁట.

'చరమసంధ్యా సమయము విరహిణులకు మదనోద్దీపక మని వర్ణించుట ద్రావిడ కవి సమయ సిద్ధమే గాని సంస్కృతకవిసమయ సిద్ధము కాదు' - అని ఉపో. అందులకుం బ్రదర్శిత మయిన యుదాహరణము 'తామరసాప్త తామ్రముఖి' ఇత్యాది పద్యము. ఇదియు విజాతీయము కాదు, సంస్కృత కవీంద్ర సంప్రదాయోపదిష్టమే, కనుఁడు.-

(౧) ఆర్యా సప్తశతి. 592 శ్లో. సాది 9 అవతారిక - వియోగిన్యాః సాయన్తనసమయః అత్యన్త దుఃఖద ఇతి నాయికా సఖీం వక్తి:—

'సాయం రవి రనల మస్తా। మదనశరం స చ వియోగినీచేతః।
ఇద మపి తమస్సమూహం। సోఽపి నభో నిర్భరం విశతి.'

టీక.- 'సాయమితి; అత్ర సఖీతి - పదానుపాదానం తావద్వర్ణోచ్చారణేఽపి కాలాతిపాతో భవతీతి భావిసాయన్తనసమయస్యాతిదుఃఖదత్వ మిత్యావేదయతి.'

(౨) 'పరిపతతి పయోనిధౌ పతఙ్గః। సరసిరుహా ముదరేషు మత్తభృఙ్గః।
ఉపవనతరుకోటరే విహఙ్గః। యువతిజనేషు శనైశ్శనై రనఙ్గః' - భోజ ప్రబంధము.

(3) 'పతతి రవి రపూర్వ వారిరాశౌ। హృది పథికస్య యథాత్మభూ ర్హుతాశః।
ప్రసరతి చరమాం తమః ప్రరోహః। ప్రతిపద మస్య యథా మనోవిమోహః' సు. ర.

ఈ చెప్పినది పురుషునికి మాత్రమే వివక్షిత మనఁగూడదు; కనుండు:-

(౪) 'గాఢం ప్రౌఢాంగనాభిః సురత రత మనస్సమ్మదోత్సారితాక్షం
ముగ్ధాభి స్త్రస్తనేత్రం రతిసమరభయం చిన్తయన్తీభి రేవ।
పాన్థానా మఙ్గనాభిః ససలిల నయనం శూన్యచిత్తాభి రుచ్చైః।
కష్టం దృష్టోఽస్తశైలం భృశ మభజ దయం మణ్డల శ్చణ్డభానోః.' సుర. భా. 476 (72).

(౫) 'అరుణకిరణ కేసరాభిరామం। వరుణదిగన్తరలమ్బి భానుబిమ్బం।
త్రిభువన విజిగీషుణాస్త్ర మద్భాత్। ప్రసవ ఇవ ప్రసవేషుణా ప్రయుక్తమ్,'

(౬) 'ఆపూరితే సంధ్యారాగేణ జీవలోకే, కుసుమాయుధానల దహ్యమాన హృదయసహస్ర ధూమ ఇవ జనితమానినీనయనవారిణి విస్తార్యమాణే తరుణ తరతమాలత్విషి తిమిరే.' కాదం.

(౭) 'శోకకామినీ కరుణకూజితే విరహిజన మనోదుఃఖే వికచ దళారవిన్ద మరన్ద నిష్యన్ద సుగన్ధ గన్ధవహానన్దిత దశదిశి ప్రదోషసమయే, వికసిత కుసుమామోద ముకుళిత మానినీ మానగ్రహోన్మోచనహస్తే కుసుమాయుధే.' కాదంబరి.

### రసతరంగిణియందలి నిబంధనము

శృఙ్గారస్య ఉద్దీపనవిభావః। తత్ర భరతః। -
'ఋతుమాలాలంకారైః। ప్రియజన గాన్ధర్వకావ్య సేవాభిః
ఉపవన గమనవిహారైః। శృఙ్గార స్సముద్భవతి.'
చన్ద్రచన్దనాదయ ఊహనీయాః। యథా—

'సంధ్యాశోణామ్బరజవనికా, కామినోః ప్రేమనాట్యం,
నాన్దీ భ్రామ్యద్భ్రమరవిరుతం, మారిషః కోఽపి కాలః,
తారాః పుష్పాఞ్జలి మివకిరన్, సూచయన్ పుష్పకేతోః
నృత్యారమ్భం, ప్రవిశతి సుధాదీధితిః సూత్రధారః.'

## అపూర్వశబ్దములు.

### ఝాటము.

'ఈకవికి ఝాటశబ్దమును (సమూహవాచిని) తఱచుగా వాడుకచేయు నలవాటు గలిగి యున్నది.' అని యుపోద్ఘాతము. (తఱచుగా=వాడుకచేయుట=అలవాటు); ఈ ప్రతిపాదనయొక్క యుద్దేశ్యమేమో వాచ్యభంగిగా నిరూపితము గాదు. ఆముక్తములో ఈశబ్దము మూఁడుమాఱులే వచ్చినది. ఇంతగ్రంథములో నింతమాత్రమే తఱచా? అలవాటా? ఇది యితరకవు లెవ్వరును ప్రయోగింపని వనికూర్చిన పదములపట్టికలో పతితము. చూ. అనుబంధము. ఇతరులు కావించిన దీని ప్రయోగములను పట్టికావిమర్శలో ౧౫ టిని ప్రదర్శించియున్నాఁడ. అందులో నిందుంబోలె నిరంకుశోపాఖ్యానకవి దీనిని మూఁడుమాఱులు ప్రయోగించినాఁడు. నిరంకుశమందు 421 పద్యములు; ఇందు రమారమి 872. అందువలన అతిఱచును అయలవాటును గుణితముచే ఇక్కవికన్న ఇనుమడుంగులు గలవారునుం గలరు. కాన నిరంకుశకవియే ఆముక్తమును గావించి యుండునా?

### తృణతా.

మఱియు ఆముక్తమాల్యద మనుకారప్రణీతము కాదను నుపోద్ఘాతి విస్తరములో — "తృణతా=ధనువు - మొదలగు సంస్కృతపదములుగాని 'తెండి' (శయనించి) మొదలగు నాంధ్ర పదములు గాని మాఱుమూలవి. ఏనిఘంటువులయందును గానరానివి. సామాన్యముగాఁ గవు లెవ్వరును వాఙ్మయమునం దిట్టిపదముల నుపయోగింపరు" అని ప్రతిపాదితము.

ఇందు తృణతాశబ్దమును (చూ. అనుబంధము), గోవిందాంతర్వాణి రుక్మిణీపాణిగ్రహణమందు రెండుమాఱులును, అభినవ కాళిదాసుఁడు చంపూభాగవతమున రెండుమార్లును, ప్రయోగించియున్నాఁ రని పట్టికావిమర్శమందే తెలిపియున్నాఁడను. అయినను. ఇంకనుం, ప్రయోగాదికమును చూపెదను.—

'కావ్యేషు మాఘః కవికాళిదాసః' అని యాభాణకము.

'దణ్డినః పదలాలిత్యం భారవే రర్థగౌరవమ్,।
ఉపమా కాళిదాసస్య మాఘ స్యైతే త్రయో గుణాః' అని యొుజ్జలయాదేశము.

"జైనమేరుతుఙ్గాచార్యేణ 1361 సంవత్సరే ప్రణీతే ప్రబన్ధచిన్తామణౌ చ - 'అథ శ్రీ భోజరాజః శ్రీమాఘపణ్డిత విద్వత్తాం పుణ్యవత్తాం చ సతత మాకర్ణ్య, తద్దర్శనోత్సుకతయా రాజాదేశైః సతతం ప్రేష్యమాణైః శ్రీమాలనగరా ద్ధిమసమయే సమానీయ, సబహుమానం భోజనాదిభిః సత్కృత్య, తదను, రాజోచితా న్వినోదా న్దర్శయన్ రాత్రావారాత్రికా వసరానన్తరం సన్నిహితే స్వసన్నిభే పల్యఙ్కే మాఘపణ్డితం నియోజ్య, తస్మై స్వశీతరక్షా ముపనీయ ప్రియాలాపాం శ్చిరం కుర్వాణః సుఖం సుష్వాప.'" అని శ్రీజయపుర మహారాజాశ్రిత శ్రీపణ్డిత వ్రజలాలపుత్ర శ్రీపణ్డిత దుర్గాదాసుని మాఘకావ్యోపోద్ఘాతములో, నిదర్శితము.

'తస్య శ్రీభోజభూపాలబాలమిత్త్రం కవీశ్వరః।
శ్రీమాఘో నన్దనో బ్రాహ్మీస్యన్దనః శీలచన్దనః।
ఐదంయుగీనలోకస్య సారసారస్వతాయితమ్।
శిశుపాలవధంకావ్యం ప్రశస్తిర్యస్య శాశ్వతీ,
శ్రీమాఘోస్త్వాఘధీః శ్లాఘ్యః ప్రశస్యః కస్య నాభవత్।
చిత్తజాడ్యహరా యస్య కావ్యగఙ్గోర్మివిప్రుషః.'

ఇట్లు విద్వన్నుతింబడసిన శ్రీభోజరాజపూజిత సిద్ధర్షి చరిత ప్రశంసిత శ్రీమాఘకవి ప్రయోగముం బ్రదర్శించెద.—

'స్వగుణైరాఫలప్రాప్తేరాకృష్య గణికా ఇవ।
కాముకానివ నాలీకాం స్త్రిణతాః సహసాఽముచన్.' 19(61).

ఇందులకు— "త్రిషు స్థానేషు మధ్యేషు నతాః త్రిణతాః శార్ఙ్గాణి। 'పూర్వపదాత్సంజ్ఞాయా' మితి ణత్వమ్" అని మల్లినాథ టీక.— ఇందుపై జయపుర రాజకీయ పాఠశాలాధ్యాపక శ్రీ శివదత్త పండితుని జ్ఞాపిక. — "(1299) శకలిఖిత పుస్తకే తు 'తృణతాః' ఇతిపాఠ ఉపలభ్యతే। అత ఏవ 'తృణతా తృణత్వే కార్ముకేపి చ' ఇతి హైమకోశ వ్యాఖ్యావసరే కార్ముకార్థే ఇమమేవ శ్లోక ముదాహృత్య వల్లభ స్తు 'ధనుషి త్రిషు నతాః త్రిణతాః' ఇత్యాహ। 'తత్ర గణికాపక్షే ణత్వం చిన్త్య' మిత్య నేకార్థకైరవాకర కౌముదీ." అని. ఇందువలన నుదాహృత మాఘశ్లోకమందు 'తృణతా' అనురూపంబునుం గలదనియు, అది హేమవల్లభాదులచే నుపాత్త మనియు, విశద మగుచున్నది. సిద్ధర్షి చరితమువలన నీపదము సారస్వతసార మనియు, చిత్తజాడ్యహార మనియు, తెల్లమాయెం గదా, ఇప్పటికేనియు దీనికి నిఘంటువు లేదను వాదు శమింపదా? హేమముకన్నను నిఘంటువా? అయినను, ఇంకనుం బ్రదర్శించెద:—[ఇట త్రిణతాశబ్దమునకు 'తృణతా'రూపము పృషోదరాదిత్వసిద్ధ మనియు, గణికావిశేషణముగా త్రిణతాశబ్దమును మాఘకవి యుద్దేశింపలే దనియు, నెన్నందగును.]

'త్రిణతా-a bow' ఆప్టె నిఘంటువు. 'తృణతా తు ధనుష్యపి' నానార్థరత్నమాల.— దానికి పుదూరి వాందారిపాపన శాస్త్రులవారి టీక:—'తృణతా స్త్రీ. ఇది ధనుస్సునకును—అపిశబ్దము వలన తృణభావమునకును పేరు' అని.

ఇంకనుం జూడుండు.— 'తృణతా తు ధనుష్యపీతి భాస్కరః.' 'ధర్మో నాతృణతా స్త్రియామ్। అస్త్రియాం చాపధనుషా వితి వైజయన్తీ' అని బాలభాగవత టీక. 'స్థావరం తు ధనుర్గుణే। శరావాపో ధనుః స్త్రీ స్యాత్। తృణతా త్రిణతాపి చ.' అని త్రికాండశేషము.

ఈతీరున మాఘపండిత - హేమచంద్ర - వల్లభ - మల్లినాథ - భాస్కర - వైజయన్తీ - ఇరుగపదండనాథ - ఆప్ట్యాది మహావిద్వాంసుల సమాదరమునకు భాజనమైన (ఇందు 5గురు నిఘంటుకారులు) యీనుడువును జనసామాన్య పండితమ్మన్యాసులభ మయిన యమృతంపుమడువును ఆముక్తమాల్యదాతీర్థకముగా ఆంధ్రలోకమున కెల్ల గంగాఝురమును భగీరథుండునుంబోలె, తెచ్చియిచ్చిన మహాపురుషుని వేనోళ్లం బొగడం గానక, ఈమడువును ఇవురంగొట్ట సమకట్టుటయు, దీనిని సుప్రాపము చేసినవానిని కాకవి యని కేకరించుటయు, పైగా, కాకవి కావున నే కృష్ణరాయండే యని బూకరించుటయు, సమంజసము గాదు.

ఆముక్తమాల్యదాకవి శార్ఙ్గధనుర్లతను త్రివక్రతంబోల్చి 'పిడికెఁడు' పద్యమును [1(8)] రచించునప్పుడు 'త్రిషు స్థానేషు నతాః త్రిణతాః శార్ఙ్గిణి' అను మాఘటీకా వాక్యమును స్మరించుచుండె ననియుం దోఁచుచున్నది. ఆపద్యము.—

'పిడికెడు కానుఁగొప్పఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి తేఁ,
బిడికెఁడుకానుఁ గొప్పఁ బయిఁబెచ్చు గుణంబును గంటి నంచు, నే
ర్పడర నిజత్రివక్రతయుఁబాపఁగ మ్రొక్కెడునా సుమాలిపై
జడిగొన నమ్ము లీను హరిశార్ఙ్గధనుర్లత గాచుఁ గావుతన్.' 1(8)

[ఇందు-'నేర్పడర' ఇత్యాదిపాదములో యతికి కపాలమోక్షము అయినది. 'చొప్పడఁగ' అని పఠించిన ఇంకను భూమిమీఁద నే యుండును.]

'తెండి' - ఇదియు మాఱుమూలపద మఁట? ఇది ముక్కు తిమ్మనార్యుని ముద్దుఁబలుకు. 'నందిని యట్టు నాకుచుం బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపుటావు చూచితే.' పారి. 4(95). దీనికిని ఆక్షేపమా! ఇఁక నాంధ్రభారతికి గతి యేమి? ఈ బ్రౌణ్యముం జూడుఁడు.—

'తెండుట. V. N. To Sleep నిద్రించెను. D.'

ఇట D అనఁగా మామిడివెంకయ్యప్రణీత మయిన యాంధ్రదీపిక. ఆయన ఈధాతువును కవనమందు చూచియే నిఘంటువున నెక్కించె నన ఈ బ్రౌను వాక్యములం గనుఁడు.—

The Dipica gives a mere selection of the words used in Telugu Poetry. The ordinary Telugu of common life is but slightly noticed.

'తెండు. దే. అ. క్రి. పరుండు శయనించు (చూ. తేఁడు)' శ. ర.

'తేఁడు. దే. అ. క్రి. తెండు, శయనించు 'గీ. అతివ పూర్ణేందుభితిఁ దదశ్మశాలఁ దేఁడి... (గొన్నిప్రతులందు 'తెండి' అని పాఠమున్నది.) ఆము. 5, అనియు, శ. ర. ఆంధ్రవాఙ్మయమును సేవించుచు, ఈ తృణతా తెండులను ఎగ్గించుట, పెరుఁగన్నముం దినుచు అందలి మీఁగడను గుడ్డపేలిక యని పాఱవైచుటగా నున్నది.

ఉపోద్ఘాతములో ఆముక్తమాల్యదకు కృష్ణరాయప్రణీతత్వము స్థాపించుటకై అందులోనివి 'కన్కిసరు' 'హిండిర' శబ్దములు కన్నడపదము లని వ్రాయఁబడియున్నది. వానిలో - 'కిసరు' నకు ఇందలిపద్యము:—

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం। గొసరి జనుల్ వారిధినీరు గ్రోలితి, వీనిం
బసికై మా కిమ్మని క। న్కిసరుడుగం గావ నప్పగించెదు మాడ్కిన్.' 4(175)

'కిసరు' మదరాసులోనే కలదు. శ. ర. మునందునుం గలదు. బ్రాహ్మణోత్తములయిన మదరాసు వెలనాటివారియిండ్లలో వాడుకలో ప్రసిద్ధము. మఱి 'కన్ను' తెనుఁగే. ఈ రెంటి సమాహారము ఆంధ్రజాతీయము గా దనియు కన్నడజాతీయముమాత్రమే అనియు వాదింతురేని అదియుట 'కణ్కిసరు' అని ణత్వవంతముగా నుండక 'కన్కిసరు' అని నత్వయుక్తముగా ఆంధ్రీకృతమై యున్నది. పెద్దనగారును దానిం బ్రయోగింప నర్హులే. వారు నందవరపురవంశోత్తంసులు. నందవరీకులు బళ్లారిజిల్లావారు. బళ్లారిజిల్లాలో కన్నడభాషయు ప్రచురమే; అన్యదేశ్యములను పెద్దనగారు ముట్టనివారు గారు.—'సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు। తుహినాంశుఁడుదుముదారు దొరయనంగ' - మను. 3(54) ఇట 'దుముదారు' అనునది హిందుస్తానీపదము. [దుముదారు

దొర యనఁగా సేనానాయకుఁడు అను మనుటీక సరిగాదు. 'సేనాపృష్ఠనాయకుఁడు' అనవలయును. చూ. బ్రౌను. మిశ్ర. నిఘం. 'దుముదారు...The rear of an army.']; దానిం బ్రయోగించినవారు స్వదేశీయము నేల ప్రయోగింపరు? ఇందుకై 'కనరా' వాఁడే రావలయునా? అతఁడును తరములబడి కనరా వదలినవాఁడే. ఈయుపోద్ఘాతములో 'పెద్దనాదులవలన రచింపఁబడలేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.' అని యొకవాక్యము కలదు. 'వలన' ప్రత్యయము కర్తను జెప్పుట 'By' ఆంగ్లేయభాషా మర్యాదగాని ఆంధ్రభాషాసమ్మతము గాదు. ఎట్లన - By=వలన; 'బీవై బై వలన,' 'బీవై బై వలన' అని ఎడ్యుకేటెడ్డు ఆంధ్రుల బాల్యపాఠము. ఈ ప్రయోగముచే ఆయుపోద్ఘాతము రచించినవారు ఆంగ్లేయులే యని సిద్ధాంత మగునా? 'కన్క్లూసరు చేత' ఏతత్కావి తులువరాయఁడే అగునేని 'పదింబది'చే పింగళిసూరనయు చేమకూర వేంకటపతియు అటువలని సిద్ధాంతము కాదా; వాస్తవమున మదరాసు 'కసరు' 'కన్క్లూసరు'గా నేయుండి-సేతు వన రామసేతువు, ఆలయ మన శివాలయము ఇత్యాది వ్యవహారములందుంబోలె 'కస' రని సంక్షిప్తమైనదా. దృష్టితాఁకుడు అర్థము. దృష్టితాఁకుడు సంక్షేపముగా దృష్టి యనఁబడును గదా. ఇందు తాఁకుడు పోయి దృష్టి నిలిచినది. అందు కన్ను పోయి కసరు నిలిచినది. ఇందువలన కన్క్లూసరు రాయనిదే యన వలనుపడదు.

హిండితము.—ఇది పండిత మనుటకు కన్నడమా? చూ.

'ఖండితపూగీనాగర। ఖండంబులు ఘనశశాంక ఖండంబులచే
హిండితములు గావించి య। ఖండస్థిరభక్తి నొసఁగి కదలె చెలులతోఁ.'

ఈ పద్యములో ఆ యొసఁగిన వస్తు వేదో లేదు. వ్రాఁతలలో మాఱిపోయినది. గావలయు. 'హిండిత మగు తాంబూల మఖండ' అని పఠించినయెడల తాంబూలము దొరకును.—[టీక. హిండితములు గావించి = కలియఁగూర్చి.] ఇందే 'పరిహిండితంబును' 'హిండన' యుం 'గండపెండెరంబునం బాడము నఖండ ప్రభామండలంబునం బరిహిండితంబులై మత్తిపండుల వడువు గల మడముల బెడంగుపడి భావి నిజకమఠావతార సూచకంబులుంబోలెఁ గొదమ తాఁబేళ్ల మేళ్లనగు మీఁగాళ్లతో' - 6(98). [టీక. - మండలంబునన్ = సమూహముచేత - పరిహిండితంబులై.]

'కొండయుఁబోలె భక్తి వల ♦ గొంచు నె వాఁడు నిజద్రుమభ్రమీ
హిండన వ్రాలుపాకలపు ♦ శేనుఁగువోలె నొసల్త దంష్ట్రులం
దుండ రోదల్మహీగిరులు ♦ హోరనఁ బ్రస్తుతివ్రాలి' - 6(47)
[టీక.—భ్రమీ=చుట్టు తిరుగుటయొక్క - హిండనన్=ఆవృత్తిచేత.]

మను 4(60) లో 'వెండికొండలఁ జండకరకరహిండనంబునం బాండుప్రభలు నిండ.' [కర=కిరణములయొక్క - హిండనంబునన్=వ్యాపనచేత.]

శ్రీకాళహస్తిమాహాత్మ్యములో [దాపిని రాజు తల గోరిగింపఁగా దానిశిరమునం దద్వత్సలుఁడు పరమశివుఁడు హస్తమును ఉంపఁగా,] 1(52, 53)

ఉ. 'ఎత్తిన నింద్రజాలగురుఁ ♦ డెత్తినబర్హ మనంగ, మస్తకం
డెత్తిన పువ్వువింటిమద ♦ మెత్తినతుమ్మెద పిండునారి నాఁ

జితజరాజ్యలక్ష్మి కభి ♦ షేకము సేయ శివుండు కాంతకై
రొత్తిన నీలకంధరుచి ♦ హిండనమో యన నద్భుతంబుగాన్;

క. 'నెఱి మిగులఁ గలిగి నలువై। తఱచై మదన ప్రతాప దావాగ్ని శిఖన్
మెఱయు నవధూమ మనఁగా।దెఱవఁ గచభరము వచ్చె దేవునికరుణన్.'

మరియు దశావతారచరిత్ర - నృసింహావతార కథలో—

'చండవాతోద్ధత భూరజోహిండనమునఁ। గొండ మెండునఁ గదలక యుండు దైత్య
మండలేంద్రుని దేహ ముద్దండముగను। గండకండూతి నొరయు వేదండగణము.' పు. 29

పారిజాతాపహరణచంపువు (3 పు.) - 1(13-14) లవ నడిమిగద్యలో—'ప్రచణ్డ భుజ దణ్డ చణ్డ మాకర్ణకుణ్డలిత కోదణ్డ హిణ్డమాన కాణ్డప్రకాణ్డ తాణ్డవాడమ్బరోద్దణ్డ ఖణ్డితారిముణ్డ పుణ్డరీక ఖ(మ?)ణ్డ మణ్డితాఖణ్డ భూమణ్డలః'—

'పక్షిణ ఆహిణ్డన్తి' స్వప్నవాసవదత్త; 'ఇతస్తతో వ్యాహిణ్డన్తే;' మృచ్ఛకటీ.

'అత్యంత కఠోరమూర్తులు మహీ ♦ హాలాహలజ్వాలధూ
మ్రశ్మశ్రుల్ భుజదండ హిండితకుఠా ♦ రప్రాసఖడ్గార్గళా
రశిప్రాతముతోడ వెల్వడిరి రు ♦ ద్రక్రూరగాత్రంబునన్
గూశ్మాండాగ్నివసి (?) పిశాచగణర ♦ క్షోభూతబేతాళముల్.' వరాహ. 5(106)

'మండువా బెడందకోట ♦ మాహురాది మేదినీ
మండలేశ్వరస్తుతాస ♦ మానమానుషోదయా
భండనాజిత ప్రచండ ♦ పటహ (వాద్య?) నిస్వనార్భటీ
హిండితాష్టదిక్కుడుంగ ♦ యీశ్వరాత్మసంభవా'—,,—1(154)

'సంధ్యాతాండవ చండఖండపరశు ♦ స్ఫాయజ్జటామండలీ
సంధ్యాహిండిత గాంగభంగజమిథ ♦ స్సంఘర్ష పుంజీకృతా
వంధ్యారావ ఘుమంఘుమోన్నతిసదృ ♦ గ్వాచాలపుణ్యాకృతీ
వింధ్యక్ష్మాధరకూటకోటివిచర ♦ ద్విద్వేషియోషిత్తతీ.' కువలయాశ్వ. 4(217)

'తాండవఖేలనోద్దండ ఖండపరశు జటామండలాగ్ర హిండమాన పుండరీక' 1(17)

'హిండనము. సం. వి. అ. న 1. వ్యాప్తి., 2. భ్రమణము; 3. సురతము,' శ. ర.

'హిండితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపించినది.' శ. ర.

"హిండనము N. S. spread, extension, wandering; వ్యాప్తి, ప్రసరించడము, తిరగడము, (హిండనము, రతే, లేఖనే, §Sc) Swa, 4(60) 'వెండికొండ' [ఇత్యాది పూర్వోదాహృతము.] Calahasti mahatyam 1(60) 'నీలరుచి హిండనమో యన.' A. 6(58) 'నిజద్రుమ భ్రమిహిండన వ్రాలు పాకలపు టేనుఁగువోలె''-బ్రౌణ్యము.

'హిండితము - వ్యాపించే, తిరిగే [ఇట్లర్థము వ్రాసి బ్రౌనుదొరగారు అందులకు తారాశశాంకవిజయము 1(65), వసుచరిత్ర 6(60) అను సంఖ్యలతో 'హిండితకీర్తియుక్తి', 'మదాకర వంశ హిండితంబు' అను ప్రయోగములను, ఆముక్తమాల్యదలోని 'ఖండిత పూగినాగ' రేత్యాది పద్యమును - ఉదాహరించినారు.] [హిండితములు గావించి = సమ్మేళనము చేసి అని వారిటీక.] ఆతారాశశాంక పద్యము:—

'పండిత మండలీహృదయ ♦ పంకజభానుఁడు బుచ్చికృష్ణయా
ర్యుండును సీనమారమణి ♦ యొక్క దొలి నోఁచిన నోముపంటగా
హిండితకీర్తియుక్తి జని ♦ యించెను వేంకటరాఘవాధ్వరీం
ద్రుండు విభాసమానగుణ రుంద్రుఁడు వంగలవంశ చంద్రుఁడై.'

ఆ వసుచరిత్ర ప్రయోగపాదము:—

'మాణిక్యసారంబు లాణిముత్తెములు సు। మ్మివి మదాకరవంశ హిండితములు 6(37)

[దీనిటీక.—'ఇవి - మదాకర=నాదు ఆకరమైన - వంశ=కులమందు - హిండితములు సుమ్మీ =ప్రవర్ధమానములైనవిసుమీ యనియర్థము. మత్ = నాసంబంధమయిన - ఆకర=గనులయందును - వంశ=వెదుళ్ళయందును - ప్రవర్ధమానములైనవి - అని యర్థాంతరము.']

'మన్మథః—సఖే సాంఖ్యాయన, విప్రలబ్ధోఽసి పూర్వేద్యురగ్రభోజనసముత్సాహేన యన్నదృష్టం దర్శనీయం త్వయా.

'విదూషకః—వయస్య, త్వయా తావత్ అమధ్యాహ్నం వృక్షంవృక్షం ప్రతి హిణ్డమానేన బుభుక్షా పరిశుష్క ముఖేన సమాసాదితం సాహిత్యమ్.' రతిమన్మథ.

'నారదః - దమ్పత్యో రనురక్తయోరపి మిషాత్ సంపాదితం వాకలిం
ప్రక్రాన్తం సహసా నియుద్ధ మథవా భక్ష్యోత్సుకై ర్బాలకైః
ఉష్ణో వాథ చతుష్పథేఽభిపతతో యోద్ధుం విషాణోద్ధురా
పశ్య న్నిర్వృత మానసోఽనవరతం హిణ్డే మహీమణ్డలే'—,,—భా.

'విదూషకః - వనరాజి ష్వాహిణ్డ్యతే అటవీతోఽటవీమ్,' శాకుంతల.

'విదూషకః - (ఛా) త్వం తావత్ అటవీతః అటవీ మాహిణ్డమానః నరనాసికామిష లోలుపస్య కస్యచి జీరర జణతు స్య ముఖే నిపతిష్యసి'—

'అవికుణ్ఠవేగ హయమణ్డలికా। ఖురషణ్డ తాణ్డవిత ముణ్డశతమ్
భుజదణ్డ ఖణ్డలిత చణ్డధను। శ్చ్యుతకాణ్డ హిణ్డిత విశుణ్డగజమ్.' అచ్యుతరాయ 4(17)

[టీక.—కాణ్డై ర్బాణై ర్హిణ్డితాః దూరతో నిరస్తాః విశుణ్డా శ్ఛిన్నకరాః గజాః యస్మిం స్తత్.] 'త్వం తావన్నత్రాహిణ్డసే.' ప్రతిజ్ఞాయౌగన్ధరాయణ.

హాలాయుధుని కవిరహస్యమునందు—

'హిణ్డన్తె యే మృషా రాత్రౌ పరస్త్రీషు హిడన్తి యే।
హేడతే నీతిసంపన్నో బాన్ధవా నపి తా నసౌ.'

'అయి కురఙ్గి, కిమకాణ్డ మితస్తతో హిణ్డసే' యశస్తిలక. 2(350 పు)

ఈ ప్రమాణములవలన 'హిండితములు' అనుపదమునకు 'వ్యాప్తములు' అని యర్థమనియు, 'శశాంక ఖండంబులచే హిండితములు గావించి' అనఁగా 'కర్పూరపుఁ దునియలతో మిశ్రము చేసి' అని భావమనియు, స్పష్టము. 'ఖండములచే' అను పదమందలి 'చేత' ప్రత్యయము కర్తను తెలుపుచున్నది. 'హిండితము'లో కర్త్రర్థమందు క్త ప్రత్యయము. 'హిండితము'నకు అవ్యుత్పన్న కర్ణాటకపదముగా 'కూర్చుట' యర్థమేని 'ఖండంబుల ఘనశశాంకఖండంబులనుఁ' అని ద్వితీయయేని 'ఘనశశాంక ఖండంబులతో' అని తోడతృతీయయేని ప్రయుక్తమైయుండును. మఱియు, అన్యదేశ్యమునకు 'పరి' యని యుపసర్గసయితము వచ్చునా? 'వంశహిండితంబులు, "జటామండలీ

సంధ్యాహిండితగాంగభంగ' అను స్థలములందు సంస్కృతసమాసములో ఇది యెట్లు చేరును. ఆకర్ణాటకకవిసాధారణంబును అగు నీపదముచే కర్ణాటకకవిని సాధించుట శక్యముగాదు.

## శైలి

శైలి.—ఉపోద్ఘాతమందు అముక్తశైలీపరీక్షలో 'ఈ గ్రంథకర్తవలె నింతగాఢ సంస్కృతము నెవ్వరును వాడుక చేయలేదు.' అనియున్నది. అందులకు తార్కాణముగా (1) 'స్యందనస్థిత', (2) 'అర్ధావాగ్విబుధ,' (3) 'చనికాంచెక' – అనుపద్యము లుదాహృతములు.—ఇట గాఢత్వమున ద్రాఘిష్ఠసంస్కృత సమాసభూయిష్ఠత్వమా, దీర్ఘ సమాసము లున్నను లేకపోయినను పద్యమందు సంస్కృతశబ్దములే మిక్కుటముగా పిక్కటిల్లుటయా ? మఱి 'స్యందనస్థిత' వంటిది పాదమెల్ల నొక్కటే దీర్ఘ సమాస మయినసీసము ఇదిగాక యీ గ్రంథమందు 'ఖనటత్పయోధి' 1 (3) అను గరుడస్తుతిపద్య మొండు కలదు. ఇంచుమించుగా పద్యమెల్లను ఒక్కటే దీర్ఘ సంస్కృతసమాసముగా నున్నట్టిది, 'చనికాంచెక' వంటిది, ఇందు 'కాంచెన్వైష్ణవుఁడు' 6(15)అను నది ఇంకొక్కటియే కలదు. ఈ రెండవది మాలదాసరి దఱిసిన 'వటక్ష్మాజ' వర్ణనము. 'అర్ధావాగ్విబుధ'ము వంటిది సంస్కృత బహువ్రీహులు గుప్పించినట్టిది యీ గ్రంథమున మఱిలేదు. ఒక్కొక్క పెద్దపాదము రెండేసి సంస్కృతసమాసములుగా విఱిగినట్టి సీసములు ఇందు రెండు మాత్రమే కలవు. అవి 'మరుదూషమలహూహి' 5(118) అను తుమ్మెదలవర్ణనము, 'క్ష్మావళారక్త' 5(110) అను చిగురాకువర్ణనయు; ఇతరకవులు పెక్కురు ఇట్టిగాఢబంధంబులం గవనము చేసియున్నారు. 'అర్ధావాగ్విబుధ'మువలె ఏకవర్ణ్యమునకే విశేషణములకు పెక్కు సంస్కృతబహువ్రీహులు గలది మనువులో 'చక్రితైణాహుతి' 4(33) అని మృగయా క్షుబ్ధ మృగచేష్టాగరిష్ఠ వన వర్ణన పరము కలదు. ఇట్టివి పెక్కులు పెక్కుగ్రంథములందు సులభములు. మఱియెవ్వరు నిట్లు ప్రయోగింప లేదనుట నామనస్సునకు నచ్చకున్నది.—ఇంక కొన్ని యుదాహరణములను వాఙ్మయములోఁ జూపెద:—

'స్యందనస్థిత' వంటివి – మను. 1(25) 'అని యట్లుండె' నిత్యాదివచనము. పారిజాత 1(95) 'కృతకాద్రికందరా' 2(85), 'జీర్ణపర్ణద్రు'; జైమినిభార. 2(4) 'స్ఫాటికమణి;' ఉ. హరి. 4(28) 'ప్రబల దంష్ట్రా', 6(266) 'మానినీమంజుల,' 6(269) 'గళితమదోదక'; హర వి. పీఠిక 5 'కఠిన కుండాదండ,' 6 'వేదండవదన,' 3(30) 'గంగాప్రవాహ', 4(74) 'సంతానకద్రు', 5(38) 'నిర్ఘరాంభఃకేళి'; మల్ల. విప్ర. 4(99). నిరంకు. 1(65) 'అభ్యాగతారాధ'' 3(5) 'కఠినకాకోలూకికా,' 4(5) 'సరసీరుహ నవీన', 4(7) 'వదనచత్వర,' 4(105) 'చామరగ్రాహిణీ'; కాశీ. 2(126) దోర్దండ ఘట్టన'; భీమేశ్వర. 3(17). హంసవిం 5 ఆ. 'చండవేగోద్ధూత' నారా. పంచ. 1(35) 'త్రిభువనాలంకార', 1(48) 'వేదశాస్త్ర'; ఋతుచక్రము—ప్రథమారము. 146. వసుచ. 'లలనాజనాపాంగ', 180. వైజయంతీ. 'అంగజకృత్తాంతరంగ' 'క్ష్మారజ' 204. ముకుంద. 'సురసాల,' 243. రుక్మిణీ. 'ఘనసార,' 290 యాదవ. 'సురసాల,' 289. తారాశ. 'ఏలాలతాజాల'; 293. మిత్రవిందా. 'కుంజఘనాఘన';

వరాహ. 11(80); కళాపూ. 8(208) 'అమృతపూరాశ్చర్యతమ;' దశావ. 43. పు.(1) క్రిందిపంక్తి), 84(3.పం. క్రిం.),207 (క్రిం), 254 (4పం. క్రిం). 'గంధర్వభామినీ', 'వజ్రమౌక్తికరత'; 'హారిబింబరమా'; 'మదకల ప్రతిమల్ల'.

అర్థావాగ్విబుధంబువంటివి.—మను. 4(88) 'చకితైణాహుతి'; ఉ. హ. 6(116) 'ఈశ్వ రాయ,' 6(115) కృష్ణాజ్ఞాయ;' దశావ. 41 - పు. (6 పం. క్రి.) 'శ్రీమానాకృతయేనమో.' భాస్క. రామా. కిష్కింధా. వర్షా. 381 'ధృతశక్రాయుధ,, 382 'యమునద్గంగగము';

'చనితాంచేణ' వంటివి—కళాపూ. 7(177) 'హేమంతంబంత' భార. విరా. 3(78) 'హాళిస్రక్'. నన్నెచోడ కుమార. 8(3) 'హరివాణీ,' 8(46) 'ఫణభృన్నాథోత్తమాంగ,' 11(962) హారఫాలాంబక ; ఋతుచక్రము, ప్రథమారము 170 చంద్రభాను. 'అంతదిగంత'; 192 చారి. 'తనరె వసంత' ఉ.హ. 2(27); 'గాండీవారావ'; క.క.ర. 6(107) 'కనిరంత ర్మగ్న', 16(218) 'ప్రస్తుత్య'; నిరంకు. 1(44) 'మాణిక్య'; తారాశ. 5(80) 'కనిరీతు'; చంద్రికా. 1(167),3(68) 'అలసులిగాంచెఁజెంత,' 'కలఁడత్యుత్కట.' హం.విం. 5 ఆ. 'వరుణాశాగత', నృసింహ. 2(89) 'శ్రీస్తనకుంభము', 3(3) కనిరుగ్రగ్రాహ.'

'పాషాణకల్పతను' (అనఁగా కఠినతను) గూర్చి విస్తరము పిమ్మట చెప్పెద:—దీనిని భేదించి యర్థముం బడయుటచే మెండయిన బుద్ధికుశలత కలుగును. గ్రంథము ధారణార్హ మగును, ధృతము నగును. కఠినతకు ఇమిడికయు, అభిధేయోత్కృష్టత్వంబును, అధికారము చాల మియు, కారణములు. ఉదా. 3 ఆ. (8) 'జగదుద్గతికి' - 12 'పాదపహత' - (18) 'ఆకేశ ధ్వజాఁడంత' - (64) 'ఏనవిద్యవలన' - అనువానియందు (8) లో అయిదు సూత్రములు శ్రుతి సాంఖ్యాదిదర్శన సిద్ధాంతములు ఖండనములును కలవు. (12) లో సుబాలోపనిషత్తు పరామృష్టము; (18, 64) లలో ఈశోపనిషత్తు పరామృష్టము. ఈ సూత్రాదివాఙ్మయము నెఱింగిన వారికి అవి సుబోధములు, హృదయంగమములు, ఆనంద నిష్యందములును; ఎఱుంగనివారికి దుర్బోధములే. ఎల్లకాలమును 'రారానందకుమారక,' 'ఓయమ్మ నీకుమారుఁడు,' అనియే పలుకు చుండవలయునా? అధికారికిని క్లేశావహ మయిన విస్సారకఠినత దోషముగాని, అనధికారికి అధికారము నొసంగున దైన సారభూయిష్ఠతావినిర్మితమయిన యాముక్తమువంటి కఠినగ్రంథము పుణ్యలభ్యము.

మఱి పైవాక్యసరణిలో నారికేళపాకముంగూర్చి ఉపోద్ఘాతకారుల యప్రీతి కనఁబడు చున్నది. 'పాకమా నారికేళపాకము' అనువాక్యధాటిలో నారికేళపాక మనుమాట నిందాగర్భము గా నున్నది. నారికేళపాకము నికృష్టమా? నైషధము నారికేళపాకము గాదా? నారికేళ పాకము మహాకవిజుష్టము గాదా? నారికేళపాకము మనుచరిత్రలో లేదా? ఈ క్రింది మల్లినాథ సూరిసూక్తిని పరికింపుఁడు:—

'నారికేళఫలసమ్మితం వచో। భారవే స్సపది త ద్విభజ్యతే
స్వాదయన్తు రసగర్భనిర్భరం। సార మస్య రసికా యథేప్సితమ్.'

ఈ క్రింది శ్రీనాథ శ్రీహర్షు లనూక్తుల నరయుఁడు:—

'పనివడి నారికేళఫలపాకమునం జవిచైన భట్టహా
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొందఱయ్యలౌ
నని కొనియాడ నేర; రది యట్టిద; తేజవరాలు చెక్కఁగేఁ
టిన పసవల్పు బాలకుఁడు దెందమునం గలఁగంగ నేర్చునే.'

'మదుక్తిశ్చేదన్తర్మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామ స్యాదరసపురుషానాదరభరైః
యథా యూనస్తద్వత్పరమరమణీయాపి రమణీ
కుమారాణామన్తఃకరణహరణం నైవ కురుతే.'

శ్రీహర్షుఁడు తననైషధములో ముడులేల పెట్టెనో తానే చెప్పినాఁడు:—

'గ్రన్థగ్రన్థిరిహ క్వచిత్క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్యమనా హఠేన పఠితీ మాస్మిన్ ఖలః ఖేలతు,
శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రన్థిః సమాసాదయ
త్వేతత్కావ్యరసోర్మిమజ్జనసుఖవ్యాసజ్జనం సజ్జనః.'

ఈసూక్తి ఆముక్తమునకును జెల్లును. నారికేళపాకమయినచో రసము పంచపాత్రలతోను టంబ్లర్లతోను త్రాగవలసినదిగాఁ గదా యుండును. ఆనీరు జలుబు సేయును, గావునను, కొబ్బెరపిప్పిని ఉమియవలసి యుండునుగావునను, ఆముక్తమాల్యదను నేను నారికేళపాకమనను; మఱి యే మందు నన, పరిపక్వ పనస ఫల పాక మందును. తేటగాఁ జెప్పిన పనసపండుపాక మగును, పచనమయిన గింజను కూడ త్యజింప నక్కఱలేదు.

మఱియు రాయవాదములో ఉపోద్ఘాతకారులు కృత్యాదియందు గ్రంథకర్తృవంశమును వర్ణించుట పరమావశ్యక మనియు, ఆచార మనియు, అందువలన కృష్ణప్రభువు దానిని మానలేకయు, ఆత్మశ్లాఘాపరాఙ్ముఖుఁ డయిన ధీరోదాత్తుఁ డగుటంబట్టి, దానిని తానే రచించికొన నిష్టపడకయు, ఆవర్ణనను పెద్దనగారి మనుచరిత్రనుండి కైకొనె ననియు, నుపపాదించినారు. ఈవ్రాత నామదికి నందకయున్నది. ఎట్లనఁగా—గ్రంథకర్త నిజవంశమును వర్ణించుకొనుట ఆవశ్యకము కాదు, ఆచారమును గాదు; నన్నయ్య తనతండ్రి తాతలపేళ్లు భారతములో చెప్పుకొన్నాఁడా? ఆచారమయేని దోష మేల యగును? ఆచారపరాఙ్ముఖుఁడు పాపికాఁడా? ఆచారమైనశ్లాఘ ఏల దోష మగును? తన పెద్దల గుణాతిశయముం జెప్పుట ఆత్మశ్లాఘయా? నిజవంశమును వర్ణించుకొన్నవారెవ్వరేని కలరేని వారు ధీరోదాత్తులు కారా? ఆత్మశ్లాఘాదూషితులా? 'చతుర్విధకవితామతల్లికాల్లసాని...పెద్దనార్య' అని, 'శతలేఖినీపద్య సంధానధౌరేయ ఘటికాశతగ్రంథ కరణధుర్య!...నను బుధ విధేయు శుభమూర్తి నామధేయు' అని, 'తనకులబ్రాహ్మణు...అవిరళజపహోమతత్పరు ... ఉభయభాషా కావ్యరచనాభిశోభితు। ... సత్ప్రతిభాభియోగ్య ... మత్యమరాధిపాచార్య! నన్నపార్య' అని, 'వాణీం కాణభుజీ మజీగణత్' అని, 'మీమాంసే బహుసేవితాసి' అనియు, గ్రంథాదులయందు వ్రాసికొన్నవారందఱు పామరులా? తిక్కనాదుల గ్రంథములలో నెందయినను తదీయవంశవర్ణనములు కలవా? ఆత్మశ్లాఘాపరాఙ్ముఖులు శ్రీరాయలవారు తాము ప్రతియాశ్వాసాంతమునకు పద్యరూపముల అగ్గలిక మీఱ ఆత్మోత్కర్షం జెప్పుకొనలేదా? 'ఇభరాడుదయోర్వీధర తత్పితృవ్య కృత నవ్యోపాయనోష్ణీష.' 'వీరభద్రజన జీవగ్రాహరాహూయమాణ...భుజ.' 'ఉత్కలానీకగుప్త దివిస్పృక్కటుయంత్ర కొండపలి వ్యాద్ఘాటనీ,' 'ఆంధ్రోక్తి యథార్థనామ యవనాస్పృశ్యపర్ణ కెంబావి...విభూతి క్రియాస్పద.'' ఇవి ఆశ్వాసాంతపద్యముల ప్రతీకములు, ఆపద్యములను సమగ్రముగా చదివిన ఆయాత్మశ్లాఘాపటిమ బోధపడును.

ఇట మఱియొక విశేషము — రాయఁడు నిజవంశ వర్ణనమును మనువునుండి తెచ్చికొనె ననుట పరిగాదు. తన సభ్యులు ఆవర్ణనం బాడి రని ఆముక్తములో ఆతఁడే తెలిపినాఁడు. వారు పాడిన పాటను ఈయన లోపలకుం దెలియుటకై యనువదించినాఁడు, కాని, నిజవంశవర్ణనకై తాను దెచ్చికొన్నవాఁడు గాఁడు. ఆ సభలో 'కృష్ణరాయనితో దివి శేఁగలేక వసుధ జీవచ్ఛవంబనంగ బ్రదికిన' పెద్దనయును ఉండుట సుఘటము గావున, ఆయనయే అందఱిలో నుం బెద్దన గావునను, ఆయనయే తనకు గ్రుడ్డిపాఠముగా నున్న యాపద్యములను బాడియుండును. సభ్యులు పాడిరని కయుక్తిగా మిథ్యయే గ్రంథమందు రాయఁడు చెప్పెనని వాదమేని, ఆప్రకారమున, కలయు మిథ్యయే కవనమును మిథ్యయే కావచ్చును. ఎవరి కృతియేని యగుఁ గాక రాయకృతి యని గ్రంథమందు నిబద్ధమై యుండఁ దీనియందు దోషములను పెద్దనయుండ నిచ్చునా? ఇందు దోషములు కలవను ఘోషకు కతముండునా?

## పాకము.

(ఉపోద్ఘాతములో మను విష్ణుచిత్తీయముల కవనముల పరస్పర వైలక్షణ్యముం జెప్పు ప్రకరణమున 'ఆముక్తమాల్యద యన్ననో పాషాణ కల్పము, పాకమా నారికేళ పాకము' అని యొక యుద్ఘాటనము కలదు, ఇందు పాషాణకల్ప మనుట అత్యుక్తి. ప్రౌఢ మనిన సమంజసముగా నుండును. రసికులకు ప్రౌఢి కర మపేక్షణీయము గాని యుద్వేజకము గాదు. ప్రౌఢిచే అద్భుతమయిన యుత్కర్ష కలుగును!—

'యత్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం।
తచ్చే దస్తి తత స్త దేవ గమకం పాణ్డిత్య వైదగ్ధ్యయోః'—(మాలతి).

అనెడు భవభూతిసూక్తిని అనుసంధింపుఁడు. మనుచరిత్రము ప్రౌఢము గాదా? దాని యర్థమును వ్యాఖ్యానముఖమున మహనీయులు జూలూరు అప్పయ్య పంతులవారు ఎల్లరకు దెల్లము గావింపనియెడ, నదియును పాషాణకల్పము గాదా? మఱి, రాఘవపాండవీయ వసుచరిత్రముల మాట చెప్పవలయునా?

మఱి రాయవాదాభినివేశముచే అప్రమాపితము లగు తేదులచే వృత్తాంతములును, అట్టివి యగు వృత్తాంతములచేత తేదులును ఉట్టిపడునట్టి బెట్టిదపు ఘట్టములో ఈ క్రిందివాక్యముగలదు,- "కృష్ణదేవరాయలు రాచూరు ముట్టడించి ఏడిల్ షాను జయించె ననియు, బీజపురసుల్తానుమీఁదికి దండెత్తిపోయి కలుబర్గ సాగరు మొదలగుపట్టణములను గైకొని తురుష్కులం బాఱదోలె ననియు, మనుచరిత్రలో చెప్పియుండక పోవుటను, పైయుద్ధవృత్తాంతముల నాముక్తమాల్యదలో నుదాహరించి యుండుటను, చూడఁగా, నాయుద్ధములకుఁ బూర్వమునందు మనుచరిత్రయు, తరువాత నాముక్తమాల్యదయు రచితములైనట్లు స్పష్టమగుచున్నది."

ఇందేమి స్పష్టమో గాని కృష్ణరాయఁడు కలబరగిని కొట్టినవృత్తాంతము మనువులో లేదనుట పొరఁబాటు; 'ప్రళయ ఘనాఘన ఘోష జయానక భాంకృతి భీమచపేట లుఠత్ । కలబరగీ కటకక్షితిరక్షక కన్నడరాజ్య రమారమణా' మను. 2(78).

మనువున కలబరగివిజయప్రస్తావము లేదను నీవాదము 'తొల్లి విష్ణుచిత్తీయమును తర్వాత మనువును రచించితివి' - అని అజ్ఞాతకర్తృకమయిన యొకానొక సీసమందు పెద్దనంగూర్చినస్తుతిగా నిబద్ధమయిన ప్రస్తావమును ఖండించుటకై కల్పింపఁబడినది.

ఈ రెండుగ్రంథముల పౌర్వాపర్యమును వంశావళీ పద్యములచేతఁ దప్ప ఒండుపాయముచే సాధించుట సులువుగాదు:—ఏలయన, పారిజాత - మను - విష్ణుచిత్తీయ - రాయవాచక - కృష్ణరాజ విజయములను పరిశీలించిన నిది యేర్పడును.—

## పారిజాతాపహరణము.

తిమ్మనార్యుఁడు కావించిన కృష్ణరాయ ప్రశంసనుండి లేశములు:— రాయఁడు కావేరీ తోయమును అహితోర్వీనాథరక్తంబున వన్నె గావించెను 1(18) [శ్రీరంగేంద్రునివాఖి]- కొండవీటికడ వీరరుద్రుని ఓడించి కాచెను। (21) [మునుకొని], 'ఉత్కలభూమీధవదర్పహరణ' [8(1) శ్రీమహిత గేహ-]; 'విదళితకాళింగ సింధుర' (60);

'మరుద్వ్రాతాతటస్థ శత్రుమండలీ గళాంతర । స్ఫురన్నవాసృ గాప గాభిసారికాదృతాంబుధీ' (61) 'శ్రీవేంకటగిరివల్లభ...కవితాప్రావీణ్యఫణీశ' - 4(1) 'ఉమ్మత్తూరిశివం సముద్రపుర వప్రోన్మూలనా' 2(103); 'చండతరమూరు...కొండపలికొండవీటీ...కటకేశసింధుమందరవధరా' 3(91) 'ద్విరదాకరదారణవీరబలా'—42 ఏకచ్ఛత్త్రిత సర్వభూవలయ..., శ్రీకర్ణాట మహీశ... 5(108) 'వీరరుద్రపర్వతవజ్రీ.' 109. 'ధరావలయశరణ్య' 5(1).

## మనుచరిత్రము.

'ఆవిభునంతరంబ ధరావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా । దేవియు శుభమతిఁ దిరుమల...' 1(33). 'తొలుదొల్త నుదయాద్రి...మతి కొండవీడెక్కి...నటసాఁగి జమ్మి... గొన...గొట్టాన...కనకగిరి...గౌతమి...పొట్నూర మాడెములు...ఒడ్డాది...కటకపురిఁ గ్రాచెఁ గజరాజు గలఁగి పఱవ...' (87) 'ధరఁ గెంధూళులు...వింధ్యగహ్వరముల్...వీరరుద్రగజరాట్సుద్ధాంత ముగ్ధాంగనల్....' (88)

'కృష్ణరాయఁడు...పొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధరప్రభు కళింగమేదినీ...' (89); 'కవితా స్త్రీలోలునకున్' 45. 'నిమిషార్ధగృహీతకళింగరాజ తనయాగ్రణికిన్' 46. కవితాస్త్రీకి కవి తండ్రిగాని వల్లభుఁడు గాఁడు. దీనివలన రాయఁడు కవనరసజ్ఞుఁడుగాని కవి కాఁడని సూచితము. 'గంగాస్వచ్ఛ...నిరంతర ప్రతికలప్రాభిప్రియంభావుకా । గాంగేయాచల... వచో గాంభీర్య లీలాస్పదా। బంగాళాంగ కళింగ భూపసుభటాభ్రశ్రేణి ఝుంఝూనిలా' 81.

'మండలిక తపనశోభిత మండలిపతి శయనకర్ణమండిలిత రసాఖండ కవికావ్య...' 82, [అతఁడే కవి యనమిచేత అప్పటికి రాయని నిజకృతిగా ఖ్యాతమైన యాముక్తము లేదని తెలియనగుచున్నది.] 'మమర...ఆంధ్ర...అంగ వంగ సింగళేశ.' 83. 'శ్రీఖండ...విద్యాకేళనభోజ...' 2(1). 'నిస్తంద్రప్రతిభా...సుధీనుత ... సైన్యస్థోమోత్థ రజోవ్రజస్థగిత కృష్ణా గౌతమీ మధ్యభూ మ్యుత్కోత్కల రాట్పరిహారణ...' 79. 'నల నృగురంతి...జయానక భాంకృతి భీమచపేటలురత్ కలబరగికటజత్కితిరత్కకి కన్నడరాజ్య రమారమణా' 81. 'హిందూరాజ్య యవనక్షోణీ ధవస్థాప నామందీభూత ... అసకృన్నాద్యత్కళింగాంగనా (కళింగేందిరా) బందీగ్రాహవిగాహితో త్తరకవాటీ సమాటీకనా' 3(142), 'బహువీర...వహావభ్రమ...భుజయుగళ...గజపత్యహిపహారణ తార్క్ష్య...'—4(122) 'అతులక్షాంతిగభీర...భోజతుమాపతి విద్యాపరిపాక...కాంతాపాతిత కాళింగ వరేశ.' 5(105).

'కర్పూర దళవిరామా' 6(1) [చూ. హమ్మీరమదమర్దన.]
'వ్యాయామస్థిర సంధిబంధ కటకాధ్యక్షానుగ క్షోణిభృ
త్కాయ గ్రావభిదా విధాభిదురదోః ఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయః కీర్తిభర ప్రపంచ, వరపంచారామ రామామణీ
గేయామేయజయాంక, పంకజదృగంగీకార ధీరాకృతీ'_6(121)

## ఆముక్తమాల్యద.

'సనకాది...తిరుగు హరిపురి...భృతకలబరిగనగర । నగరపురవర పరిబృఢ... యవనపృతన భవదసి ననిఁ దెగి' 1(41). తిరుమల్దేవియును...దనకుఁగూర్చు దేవేరులుగాన్' 1(33).

['తొలుదొల్త నుదయాద్రి ... గజరాజు గలఁగిపఱచ' 36. ఇందువలన నప్పటికి కటక జయము కటకరాజ కన్యావివాహమును భూతవృత్తము అని తెలియుచున్నది.] 'చిత్రము... నిలింపకామినులవాడకుఁ గాపులువోదు రుత్కలక్షు । త్రియ పాత్రులెల్ల ...సూత్రము పన్నినారొ బలనూదనువీటికిఁ గొండవీటికిన్'__37. 'సూరిమిఁ గృష్ణరాయ నృపకుంజర,... చేరెఁ గళింగ రాజ్యల । శ్రీ రమణీలలామ...మోహనాలతో...వావిసెడఁజెందునె సోదరుఁడైన రుద్రునిన్'- 38, 'కచసక్త ఫణికంచుకము...పాగ, మర్కట కీటకృతమైన మగ్గంబు నేత్రసంపద... అళిక చిక్కణాస్రపంకముచెంద్రమై తనులగ్నబర్హిబర్హంబు...మువ్వన్నెచుంగై ...అచటు విడుచు గజ రాజు నీధాటి వింధ్యవాటి' 39. [= కాంతారపాతిత కాళింగపలేశ]. 'అభిరతి...పొట్టునూరి కడ నిల్పిన కంబము సింహభూధర...' 40. 'అలుకన్ ...కట్టించి తా దృష్టి కేదుల ఖానోగ్ర కపాల మరపహరిద్భూజాంగల శ్రేణికిన్' 42. 'సాహితీ సమరాంగణ సార్వభౌమ కృష్ణరా యేంద్ర' 44. 'ఇది కర్ణాట ధరాధృతిస్థిర భుజా హేవాకలబ్ధధరా డుదయోర్వీధర' — 39, 'ఇది భూమండన కొండవీటి...ఘాంచద్భుజ'__2(111). 'ఇది పాత్రప్రహారేశ్వర ... గుప్త గివిస్పృక్పటుయంత్ర కొండపలి వ్యాద్బాహాసి...కృష్ణరాయ...' __3(93). 'ఇది సింహాచల దంభకేసరిపదాభీష్టార్చనా లబ్ధపుణ్య దురుట్టంకణపొట్టునూరి విజయస్తంభోపలోట్టంకితాంక... 4(269). 'ఇది...కెంబావి...విఘాతక్రియా । స్పదసేనాగ్రగ కృష్ణరాయ' 5(160). 'ఇది సైరావన యావనావని ధవాహీనాభ్రచుంబి...).

## కృష్ణరాయ విజయము.

1 దిగ్విజయప్రస్థానము. 2 తిరుమలదేవి కర్పూరతాంబూల మిచ్చి పంపును. 3 శివంసముద్రపుర మేలుచున్న గంగరాయనొడయని జయించెను. 4 ఆదవని, ముదిగల్లు, రాచూరు దుర్గము లందు కాపుంచెను. 5 కృష్ణకడ బీజాపూరు అహమదాబాదు గోలకొండ సుల్తానుల నోడించెను. 6 ఉదయగిరి, 7 కందుకూరు, 8 కొండవీడు, 9 కొండపల్లి, 10 వినుకొండలను పట్టెను._11 కూడ ముక్కుతిమ్మన, పెద్దన, మాదయ్యగారిమల్లన, అను కవులు పోవుచుండిరి. 12 అహమదు నగరము నుండి కటకమునకుంబోవుదారిలో చితాపుఖానుఁ డెదిరింప వానిం గూల్చెను. 13 పొట్టునూర సింహాచలముకడ విడిసెను. 14 భేదప్రయోగము. 15 గజపతిపలాయనము. 16 అతనికూఁతును తుక్కారమణీమణిని రాయఁడు వివాహమాయెను. 17 మరలి వచ్చుచు కలబరగినిం గొట్టెను. 18 తీర్థ క్షేత్రయాత్ర, 19 విద్యానగర ప్రవేశము. 20 పారిజాత మనుచరిత్రాదులను కృతి నందుట.

## రా య వా చ క ము.

అశ్వపతి గంగాతీరమువాఁడు - (అగరా?)

రాయఁడు వరుసగా - ఉదయగిరి, కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, అహమదాబాదు అను గూల్చెను. అటనుండి కటకమునకుం బోవుదారిలో చితాపుఖాను అను తురకం గూల్చెను. పొట్టునూరు సింహాచలములకడ విడిసెను, కటకముకడకుం బోయెను.—భేదోపాయము.—ముకుంద గజపతి వింధ్యారణ్యమునకుం బలాయితుఁడగుట. తత్పుత్త్రిని జగన్మోహినిని రాయఁడు పెండ్లి యాడుట. పొట్టునూరి విజయస్తంభము. నిజదేశమునకై మరలి వచ్చుచు తిరుపతికడనుండి కలు బరగిమీఁదికి దాడిసేయును. దానింగూల్చును.

అనంతరము తిరుపతిలో వేంకటాచలపతి దర్శనము; కాలహస్తి, త్రిపురాసురులు కొలిచినదైవమును సేవించుట, నందీశ్వరుని దర్శించుట, మధుర.

## ద ం డ యా త్ర.

అళఘురు, విలుఁబుత్తూరు, సంపఁగిమన్నారుస్వామి, కరవనల్లూరులో శంకరనారాయణ స్వామి; తెన్కాశి - త్రికూటాచలము - ఆకాశగంగాస్నానము, చిత్రసభ - అనఁగా అగస్త్య పర్వతము, కృష్ణరాయ సముద్రమను నగ్రహారమును నిర్మించుట. రామలింగస్వామి, పర్వతవర్ధన్యంబ, కాశీవిశ్వేశ్వర - రామలింగ - గోకర్ణ బృహదంబ, శ్రీరంగపట్టణము, విద్యానగరము, చేరినదినము బహుమానములు; మఱునాఁడు పారిజాత మనుచరిత్రకృతుల నంకితంబందుట.

ఈయేనింటివిం బరిశీలింపఁగా పారిజాత మనుసంభ వాముక్తమాల్యదలు మూఁడును సర్వ దిగ్విజయ తీర్థయాత్రానంతరమే రచితములనియు, దీనిలో మనుసంభవాముక్తమాల్యదల పౌర్వాపర్యము వంశవర్ణనోద్ధారముచేతఁ దప్ప ఒండుపాయమున సిద్ధాంతపడదనియు తెల్లమగును. లేదా ఆముక్తములోని కృష్ణరాయ తద్వంశ తద్విజయాది ప్రస్తావన సర్వమును పిమ్మట ఎప్పుడో ప్రక్షిప్తము గావలయు.

మఱి రాయఁడు కళింగదేశ విజిగీషా మనీషఁ దండెత్తిపోయి, ఇంకను మధ్యేమార్గము, విజయవాటికడనే కటకమునకు బహుయోజనములదూరమున ఇవతలనే ఉన్నప్పుడే, విద్వాంసులు అతనితో అతఁడు కళింగమును అప్పటికే జయించినట్లును గజరాజు వింధ్యవాటికిం బలాయితుఁడయినట్లును వక్కాణించినారే, అది యెట్లు సంఘటిల్లును? ఇందులకు ఎవ్వరేని యీ క్రిందియట్లు సమాధానముం బన్నుదురు గావలయు. 'అసకృన్మాద్యత్కళింగాంగనా' ఇత్యాది మనువాక్యముచే పెక్కు దండయాత్రలు ఉక్తములు. అందు కళింగాంగనా వివాహముతో ముగిసినట్టిది ఒకటి. ఇది దానితర్వాతిది మఱియొకటి, అని; కాని, అందులకు ఈ ప్రతిహతిం గనుఁడు. అసకృత్తను విశేషణము మాద్యత్తను శత్రంతమునకే. రాయఁడు స్వయముగాఁ బోయిన దండయాత్ర ఒక్కటే; లేదా అవి యెన్నియైనను దీనికి పూర్వములే. ఆ యసకృత్త్వము వివాహమయిన దండయాత్ర ముగిసి మరల రాజధానిం జేరిన వెంటనే చెప్పినమాట. కావున నది అటుతర్వాతి వృత్తాంతములకుఁ జెల్లదు. మఱియు 'మున్నే కళింగదేశ విజిగీషా మనీషఁ' ఇత్యాది వాక్యంపుధోరణింబట్టి ఒకటే తాఁకిన దండయాత్రగా తోఁచుచున్నది. కానిచో ఈదండయాత్రనాఁటికి, కాళింగులు రాయజితము లయిన తమ తొంటి దుర్గాదులను

మరల నాక్రమించినా రని, లేదా ఎట్లో ఉపద్రవపెట్టుచున్నా రని తద్దండనార్థము ఈ దండయాత్ర యనియు, నేర్పడును. ఆపక్షమున 'విజిగీషా మనీషా' యను పదరచన సొంపారదు, 'దండనార్థము' అనియే యుండును. మఱియు ఆపక్షమున ఆ విద్వాంసులు లంఘనాలలో మనుగుడుపుల వర్ణనగా, భగ్నప్రాయము లయిన యా పూర్వజయములం బ్రస్తావించుట అరయిక చాలమిగా నుండును. అదియుం గాక వారి వాగ్ధోరణిచే ఆ జయములకు భంగము ఏమాత్రమును కలిగినట్లు కనఁబడదు. మఱియు రాయని కాలమున కనంతరము ఎప్పుడో తదీయచరిత్రమును రచించిన కృష్ణరాజవిజయ రాజవాచక కర్తలు జయము స్థిరపడని యీ వివాహ తీర్థయాత్రాంత దండయాత్రతోనే ఏల తమ ప్రబంధములను సమాప్తిఁ జెందింతురు? కావున సరియయిన సమాధాన మేమనఁగా ఈ విద్వగుక్తి రాయకర్తృకతా విశ్వాసోత్పాదనార్థ కల్పిత మయిన కథ. దీనితో దృఢసంబద్ధమయి యున్న స్వప్నంబును అట్టిదిగానే యున్నను ఉండవచ్చును.

మనువులో కలబరిగి జోలి లేదన్నట్లే, మనుచరిత్ర నాఁటికి రాచూరిని రాయఁడు కొట్టలే దని ఒక ప్రతిపాదనము ఉపోద్ఘాతములో అంతర్గడువుగా నున్నది. ఎట్లన రాయఁడు దిగ్విజయానంతరము మనువుం గృతినందె ననియు, దిగ్విజయారంభములోనే రాచూరిని (అప్పటి వఱకు ఏదిల్ ఖానుని వశములో నుండినట్టిదానిని) రాయఁడు పట్టుకొనె ననియు, కృ. రా. వి. యందు చెప్పఁబడియున్నది. చూ.—

'అమ్మహీమండలాఖండలుండు తొంటి రఘుమహారాజు చందంబున నిఖిలరాజులు తనకు హస్తగతంబులు సేయ, నాదువని, ముదిగల్లు, రాచూరు మొదలైన స్థలంబుల నిజబలంబు లుంచి మించి గోలకొండపురంబుపై నుద్దండ వేదండకాండ భట ప్రకాండంబులతో నురవడించునవసరంబున.' 2(9).

అప్పటికి రాచూరు రాయనివారిది కాదేని అచట వారు దండును కాపుంచి పోవుట యెట్లు ఘటించును? కావున ఈ యుపోద్ఘాత వాక్యమంతయు పటిమ చాలకయున్నది.

పెద్దనాదికాగోచరతా వాద పరాస్తము.

మఱియు బ్రాహ్మణజాత్యసంభావ్య మగు వర్ణ్యము నొక్కటిని ఆముక్తమునుండి యుదాహరించి, తన్మూలముగా రాయవాదులు రాయఁడే తత్కృతి గాని పెద్దన కానేరఁడని వాదించుచున్నారు. ఆవర్ణన :—చేఁపవేఁపడము - "తారుణ్యాతిగ" 2(69); ఈచేఁపవేఁపడపుఁగవనమును మత్స్యభోజియే గాని యితరుఁడు అల్ల లేఁడఁట ; ఆపక్షమున పరమశివుఁడు మెచ్చునట్లు సిరియాళుఁడు చేయించిన యతనినిసుఁగు నేమ్మేని దివ్యపాకమును చక్కఁగా వర్ణించుటకు శ్రీనాథుఁడు అట్టినిసుఁగుల నెందఱను వండి భుజించియుండెనో!

శ్రీనాథుఁడు శృం. నైషధములో -

క. సేవించి రొకటి తొలఁగం। ద్రోవక జంబీరరసముతో నూనియతో
నావం బెట్టిన కిటివ। ఘ్రాణావలయము నమృతమధుర రస ఖండంబుల్.

అని పెండ్లిభోజనమును వర్ణించినాఁడు. ఇందులమూలములో వరాహప్రస్తావము లేదు - కాన నిట నితఁడు స్వతంత్రించినాఁ డని తోఁచుచున్నది. కావ్యానుశాసనములో హేమంత స్వభావాఖ్యానమందు—

'వరాహ వధ్ర్రాణి సవౌదనాని। దధీని సన్నద్ధరసాని చాత్ర।
సుకోమలాః సర్షపకన్దళీశ్చ। భుక్త్వా జనో నిన్దతి వైద్యవిద్యామ్.'

అని చెప్పఁబడియున్నది - శ్రీనాథుఁడు ఈయడవిపందిపాల స్వారస్యమును స్వయముగా భుజించియే యెఱింగినవాఁడా? ఇట మూలములో అవ మాత్ర మున్నది, దాని కీతఁడు పంది వధ్ర్రణను జేర్చినాఁడు. ఇది జాణతనము గాని మూఢత్వము గాదు.

ఎన్ని చేఁపలనో ఎందఱుశిశువులనో వండి భుజింపక ఈవర్ణనలస్వారస్యమును వ్యాఖాతృ విద్యార్థి ప్రభృతులేనియు నెట్లు గ్రహింతురు? సారాయిమైకమును గ్రంథమున వర్ణించుటకై 'నీరు బొట్టు కలప నీక' గ్రుడ్డుఱుకునట్లుగా బుడ్డి సేవించి యుడ్డుగుడుచుచు కూర్చుండ నక్కఱలేదు. అట్లు కూర్చున్నచో వర్ణన కుదురదు. దానిని రంగమున ఆడుటకు నటుఁడును సారాయిపీపాయై ప్రవేశింప నక్కఱలేదు. ఈచేఁపకనరు వృత్తాంతపువర్ణనంబును అట్లె యని గ్రహించుట న్యాయ్యము. క్షత్రియాదులకు ఈకనరువోలె గౌడేతరవిప్రులకు ఆవకాయ కనరును కిచ్చిలియూరఁ గాయకనరునుం గలవు. చల్లలోనగు పేయములచే దానిని శమింపంజేసికొనుటయుం గలదు. ఉత్తమజాతివివేకికి మిత్రగోష్ఠిలో ఈబుసుపోక కగుప్రసక్తానుప్రసక్తప్రస్తావములో ఈమాత్స్యచ్ఛేదపాకాదికము వంటివి రావచ్చును. అనంతరము వర్ణనార్థమై సూదసంవాదముచే పరిశీలనచేసికొనవచ్చును. పెక్కులు దృష్టములునుం గావచ్చును. పెద్దనగారు మనువులో నాలవయాశ్వాసమున మృగయానంతర పలలభేదవిభజన మర్యాదా పచనభర్జన నైపుణీ నివేదన భోజనాది విశేషములను మిక్కిలి హృద్యముగా వర్ణించినారు. ఇందుచే వారు పలలసేవి యనుట లేదు. ఆవిస్తరము వోలె నీమాత్స్యవృత్తాంతంబును విని కని యెఱుంగఁదగినదే.

కృష్ణరాయనివారు సహకారఫలరసముతోడి సారాయిని ఆస్వాదించు స్వారస్యమును స్వయ మనుభవింపకయే, అరెంటిపండ్ల కదంబమును స్వయముగా మోవులం బరిశీలింపకయే, దానిని - ''సహకారఫలరసస్ఫురత్సౌరభ్యములఁగూడి। మాధ్వీమోవులఁ గదంబముగ వలవ'' 5(143) అని యెట్లు వ్రాయగల్గిరి? పరత్వ్వత్వమును ఇన్నివిధముల నీగ్రంథమున నెలకొల్పిన యారాజర్షి సురాసేవియా! శాంతము పాపము!—

మఱియు వసంతములో మాధ్వీస్వారస్యమును, నిదాఘమందు 'నారికేళాసవపుఁదీపు'ను, అని భేదముం బాటించి, రాణివాసములకుం గూడ త్రావించినారు గావలయు! కిరాతార్జునీయ శిశుపాలవధ కథాసరిత్సాగరములయందు సురాపానమహిమ విరివిగా వర్ణితము. అందువలనఁ దత్కర్తలు సురాపానరతు లని చెప్పఁదగునా? ఇదియునుంగాక ఇంత ముదిరినవైష్ణవములో మునుంగుచుం దేలుచున్న రాయనివారికి చేఁపకనరునోలె నారికేళాంబుపానమే సంధ్యావందనమా? లేక, ఆ నారికేళాంబువులతోనే కనరుం బోవునట్లుగా సురలు నైచ్చునట్లుగా తియ్యని యాచమనీయములతో సందెను వార్చిరో?—

ఇదియునుంగాక కృష్ణరాయఁడు తనయింటికి తానే వంటవాఁడా? చేఁపవేఁపడమున ఇంత అవాంతరక్రమము నెట్లెఱింగినాఁడు? ఆయనకు చేఁపలవిషయమునమాత్రము స్వయంపాకనియమమా?

## సాజముగా కృష్ణదేవరాయని కలవడని వర్ణనలు

1(56) శయపూజాంబుజముల్. 59 సవలయధ్వనిగాఁగ. 76 ఎదురేఁగి సాష్టాంగ మెఱఁగి. 82 చట్టి (?) చుం యనునాదాఱని కూరగుంపు [చట్టి - దీనిం జర్చించునది] - ఇంత శిష్టునియింట చట్టిలో కూర వంటయా? 2(46) నిర్ఝరప్రబలవేణిక లింక, ['పెన్నేటు లెగయ' అనుట మేలు.] 53 నులివాడు నాఁచు. 54 మీటగు మీలనెల్ల. 68 తారుణ్యాతిగ చూత. 97 భక్తిఁ ద్రోవకు సాధ్వి. 4(127) ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి. 118 తడితల డిగ్గి ముంప జడతం దుదలెప్పల. 113 వసతు ల్వెల్వడి వానకై గొడుగు మోవఁగ రాక. 134 గురుగుం జెంచలిఁ దుమ్మి. 117 మును నవల్ దమిఁబట్టి. 6(6) చమురైన తోల్కుబుసంబు. 18 ఇడిసిన యిడుపుల. 17 ఎలనీటిబొండలంబులఁ బోలె. 67 ఉండుదుఁ జోళభూమి. 69 బహిఃకద్ద్వీజాన కల్పపుఁబాచితం బిడి. 71 వెలివాడపని క్రొత్తమలకడాల్. 77 పస లేదు నిల రోరి పాతకులా రని. 78 తోడువింటివాఁడు సత్త్రోవఁ బోవక.

### —*ఉ ప సం హా ర ము*—

(1) ఆముక్తమాల్యదకు పెద్దనయే కర్త యను వారిచే రాయనివారికి, ఆముక్తమాల్యదలో మదాలసచరిత్ర, సత్యభామాప్రీణనము, జ్ఞానచింతామణి, సకలకథాసారసంగ్రహంబు, రసమంజరి అని నాలుగు సంస్కృత గ్రంథములు ఆరోపితములు; కాని ఇవి దేశములో ఎక్కడను లేవఁట. వ్యాఖ్యానాదులయందును ఎటను పరామృష్టములు గావఁట; అందొకదానిపేర భానుసూరి విరచితము ఒక గ్రంథము రసమంజరి కలదు. (ఒకఁడు తన గ్రంథమునకుఁ బెట్టుకొన్న నామమును ఇంకొకఁడు తనగ్రంథమున కేల పెట్టుకొనును.?)

(2) మఱియు, రాయఁడు తెనుఁగును తెనుఁగునృపుల గోష్ఠిలో నేర్చినవాఁడే గాని, అది యా తనియింటి భాష గాదు, గురుశిక్షితమునుం గాదు; అట్టివాఁడు తన తెలుఁగుం గబ్బమును ఇట్లు వాఙ్మయమున కెల్ల, ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయమున కెల్ల, ఎల్లయై యుండునట్లుగా రచించినాఁడటను విశ్వసనీయము గాదు. గురు శిక్షితుల కబ్బములందుఁ గలదోషములు ఇందు లేవు.

(3) రాయనికిని పెద్దనకును సమకాలికుఁడైన రామలింగకవి ఆముక్తము పెద్దన కృతమే యని తెలిపినాఁడు; ఈతఁడు తత్సమకాలికుఁ డని యితని యుద్భటారాధ్య చరిత్రమునం దెలియును.

(4) ఆముక్తము పెద్దనకృత మని రాయనివారికంటె అర్వాచీనుఁడైన యప్పకవి తెల్పుట:— "ఆంధ్రకవితాపితామహుఁడు 'కానియె'నుటకు 'కాన' నని చెప్పె...విష్ణుచిత్తీయమునందు, 'పూని ముకుందునాజ్ఞ కనుబొమ్మనె గాంచి యజాండభాండముల్ । వానను మీఁదఁ బోవ నడువఁగ గానెఁ దన్నన.'' అప్పకవీయము (343, 345), —

సీ. ప్రౌఢదీర్ఘసమాసపదములు గూర్చిశ్రీ। నాథుండు కులార్చె నైషధంబు,
దానితల్లిగ నల్ల సానిపెద్దన తెల్పె । ముది మది దప్పి యాముక్తమాల్య,
నూహించి తెలియరా కుండ సూరపరాజు । భ్రమఁ గళాపూర్ణోదయము రచించె,
నతి శ్లేషశబ్దవా గాడంబరం బొప్పఁ। పస ఘటించెను మూర్తి వసుచరిత్ర,
తే. నిట్టికవులకు నేను వాకట్టుకొఱకుఁ । జెప్పినాఁడ మదీయవైచిత్రి మెఱయఁ
బాండురంగ విజయమును బటిమ దనర । విష్ణువరిష్ఠుఁడను రామకృష్ణకవిని.

[‘ఆముక్తమాల్య’మన్నచో నామైకదేశమున నామగ్రహణము. అతి=అత్యంతము ‘ప్రతి’ అని తెనుఁగుగా ఎఱ్ఱాప్రగడ ప్రయోగించినాఁడు, కావున తీకి గురుత్వము లేదు. పాండు రంగకవి ఆముక్తమాల్యదా వసుచరిత్రలను పాండురంగకృతిలో ప్రస్తావించినాఁడు.]

‘యమదండచండ మగుభుజ। గమునకు వెఱచఱచి యాఖు కన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ। తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్.’ పాం.4(244)
‘గిరికానుషక్త బుద్ధి ను। పరిచరునింబోలె నొక్క పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటనుండియొ। మురమర్దనుదివ్య భవనమున కేతెంచెన్.’—242.

(5) వ్యాఖ్యాతృపరంపరయు దీనిని పెద్దనకృతమే యనుట.—
‘ఉరు వసువిష్ణుచిత్తతన యోద్వహనంబును సంస్కృతాంధ్రవా
గ్గరిమ నలంక్రియారససఖం బగునట్లుగఁ బెద్దనార్యుఁ డు
ద్ధురఫణితిన్ రచించె, నది దుర్ఘటబోధము గావునన్, ధరన్
స్థిర మగుచుండునట్లుగను జేసెదఁ డీక సవిస్తరంబుగన్.’—శ్రీనివాసవ్యాఖ్య.

(6) గుడిపాటి వేంకటకవి యని యొకప్రాచీనపండితుఁడు ఆముక్తమాల్యదకు టీకవ్రాసె ననియు, అందు ఉపోద్ఘాతమున ఇట్లు న్నదనియు, ఆంధ్రపత్రిక.—1916- 28 ఆ.

చ. నను గుడిపాటివెంకన ననారతసద్గురుభక్తియుక్తునిన్
ఘనఘృణి కృష్టిపాటికుల కంధిసుధాఘృణి చెన్నమంత్రి
నందను గణి వేంకటాద్రిని బ్రధానశిఖామణిఁ బిల్వఁబంచి యి
ట్లనియె సుధారసంబు గురియన్ మధురోక్తుల నాదరించుచున్.

గీ. పేర్మి నల్లసానిపెద్దన్న యాముక్త। మాల్యదాఖ్యకృతి సముచితముగఁ
జేసె, నీవు టీక సేయుము, చెఱకునఁ। బండుపండినట్లె యుండుఁ గాక.

క. ఏవంవిధ బహుసుగుణ। శ్రీవననిధి వైన నీవు చెలఁగి యభేద్యం
బౌవరకృతికిం జేయం। గావలయున్ డీక యనఁగఁ గడు ముద మయ్యెన్.

సీ. కరమర్థిఁ గవిరాయగండపెండేరంబు। చెల్లించుకొన్నట్టి బల్లిదుండు,
కవులలోపల నాంధ్రకవితాపితామహ। బిరుదాంకుఁ డైనగంభీరమూర్తి,
మనుచరిత్రాది సమ్యక్కావ్యరచనము। సలిపినవైష్ణవ చక్రవర్తి,
కృష్ణరాయఁడు తన కేల్దమ్మిచే నెత్తఁ। బల్లకీ యెక్కిన భాగ్యశాలి.

గీ. అలఘుఁ డలసానిపెద్దన, యాఘనుండు। మహిమఁ జేసినయాముక్తమాల్యదాప్ర
బంధ మేడ, మదీయధీపటిమయేడ, । నాకు శక్యంబె దానికిఁ డీకసేయ.

క. వినఁ దదీయ దయాసం। తానంబునఁ దోఁచినంత తద్దయుఁ దద్వ్యా
ఖ్యానము చేసెద నీమది। కానందం బైనఁజాలు నని హర్షమునన్.’
ఆముక్త ప్రథమముద్రణ పీఠికయందుఁ గల హెచ్చరిక వాక్యము బరికించునది.—

(7) ‘దీని యాశ్వాసాంతములయందుఁ గరాటక దేశాధిపతిగా నున్న శ్రీకృష్ణదేవరా యఁడు దీనిని రచించినట్లున్నను, అతని సభయం దష్టదిగ్గజము లని బిరుదు వహించియున్న యష్ట

కవులలో నాంధ్రకవితాపితామహుం డని నుతి కెక్కిన యల్లసాని పెద్దనగారు రచించినట్లు సంప్రదాయజ్ఞు లైన పండితులు వాడుకొనుచున్నారు.'—ప్రథ యి ట్లుండుట;

(8) రాయకీర్తిప్రఖ్యాపనకొఱకే వ్రాసిన గ్రంథము లగు కృష్ణరాయవిజయ రాయ వాచకములలో రాయకృతము లన్నయాసంస్కృత గ్రంథములనేని ఆముక్తమాల్యదనేని ప్రస్తావింపమియు;

(9) తిమ్మన పెద్దనలును ఏతత్కృత గ్రంథమును దేనినిగాని పేర్కొనమి. కీర్తి తత్కృత గ్రంథముం బేర్కొనుటవలనఁ గలుగునట్లు సామాన్యస్తుతిచే కలుగదుగదా.

రాయనిని పెద్దనగారు ఎంతవర్ణించినను విద్యావంతుఁ డన్నారేగాని కవి యనలేదు. ఆయనకన్న పటువుగా తిమ్మనార్యుఁడు 'కవితాప్రావీణ్య ఫణీశ' అనలేదా? యందురేని—ఈ నుడియు రాయఁడు కావ్యాలంకార మర్మజ్ఞుం డని తెల్పుచున్నదే గాని, కృతి రచించినాఁ డన్నమాట గాదు. తిమ్మన్నగారే రాయని 'ఏకచ్ఛత్రిత సర్వభూవలయ' అని సంభోధించినారు; రాయఁడు అట్టిఁడా? అగునేని, ఢిల్లీసుల్తాన్ పారసీక యవన తురుష్కాంగ్లేయాది దేశముల ప్రభువుల మాట యేమి? 'కవితా ప్రావీణ్య ఫణీశ' అను తిమ్మనకృత విశేషణము 'కవితాస్త్రీలోలునకన్' అను పెద్దన కృతవిశేషణమునకు సమార్థకము. అట్లే పెద్దనగారు 'భోజక్షమాపతి విద్యాపరిపాక,' 'ప్రతికల ప్రౌఢిప్రియంభావుకా,' 'నిస్తంద్ర ప్రతిభా.' అనియు సంబోధించినారు గాని 'కవి' యనలేదు. మఱియు పెద్దన తాను రాయనిపైఁ జెప్పిన చరమ సంకీర్తనమందేనియు రాయఁడు ఆముక్తమాల్యదా కవి యను మహోన్నతిసూచక వృత్తాంతమును పిగలనీయలేదు.

(10) ఆముక్తమాల్యదాకవి వీరవైష్ణవుఁడు. శివునిని శైవమును సహింపఁడు. రాయఁడు శివుని సహింపనివాఁడు గాఁడు, దిగ్విజయానంతరము శివక్షేత్రములనుంగూడ సేవించి సత్కరించినాఁడు.

గీ. 'కల్బరిగ కోటమీఁద లగ్గలకు నెక్కి । కార్య మొనరించి జయలక్ష్మిఁ గాంచి యచట,
నుండి తనరాజ్యమునఁగల్గు నోఱపుమీఱు । మంచిదేవస్థలములు వీక్షించి పెంచి.

సీ. శ్రీశైల కాళహస్తి చిదంబరాదిక । రమణీయ శైవస్థలములఁ జూచి,...
శ్రీరంగ కాంచికా శేషాచలప్రముఖ । ముఖ్యమైన విష్ణుస్థలములఁజూచి,...
...విజయనగరంబు చేరె దిగ్విజయకేలి। ప్రజలు వర్ణింప నలకృష్ణ రాయనృపతి.'

అని కృ. రా. వి. - ఇంకను రాయవాచకమునం గనుఁడు. ఆముక్తము అట్టియుభయ దేవతాభక్తునికృతి కా నేరదు.

(11) ఆముక్తములో రాజదినచర్యలో రాజునకు కావ్యరచనార్థము అవకాశము లేమి చూ.4(27) 'సౌఖశాయనిక.'

(12) రాజనీతి రాజే చేయ నక్కఱలేదు. చాణక్యుఁడు నీతిగురువులలో నగ్రేసరుఁడు, బ్రాహ్మణుఁడు. మఱియు ఈరాజనీతి ఘట్టమున పెక్కు భాగములు శాంతిపర్వ, శుక్రనీతి సార, చాణక్య నీతిశాస్త్రములనుండి గృహీతము లనియు, ఆకరము తెలియనివి కొంచెపాటివే యనియు, నెఱుంగనగును. మఱియు రాయలు మెచ్చెడు నయమార్గము సన్నిధానవర్తికి పెద్ద నామాత్యునికిని తెలియుచునే యుండును.

(13) పెద్దనగారు మనువులో శివస్తుతియుఁ గావించినారు. వారు దీనికర్తయని యెట్లు తలంపవచ్చును? అని రాయవాదుల యాక్షేపము. అందులకు పెద్దనవాదులు ఇట్లు బదులు పల్కుదురు. 'పెద్దనగారు మనువులోనే తనవిశిష్టాద్వైతమును శఠకోపయతిని గురువుంగా పేర్కొనుటచేతను, కడపట 'శేషభూత సమస్తశేషి' అనుటచేతను, ప్రకటించికొన్నారు. లౌకికుల వైష్ణవము ఉన్నట్టే ఉండి ముదురుటయుం గలదు. అది ముదిరినకొలఁదియు శివనిరసనమును బలపడును. అట్టి యుత్తర దశలో ఆముక్తమును వ్రాసియుండవచ్చును. 'ముది మది దప్పి' అనియుం గలదు గదా.' అని.

(14) అధిగత తత్త్వనికే గాని ఆముక్తరచన సాధ్యము గామియు, అట్టియధిగమనము నకు రాయనికి అవకాశము లేమియు,-ఎందును రాయఁడట్టిఁడని చెప్పమియు,—[ఇతని విద్యా విశేషము నుగ్గడించుతావుల "గజపతిగజ కూటపాకలేన విదిత నానాకలేన వదన విజితామ్భోజేన భోజే నాపరేణ కావ్యనాటకాలంకార మర్మజ్ఞేన ధర్మజ్ఞేన" - ఎందును రాయఁడు కృతి కావ్యుఁ డన్నమాట లేమియు,]

(15) రాయనివారికి ప్రాయికముగా గోచరింపని లోకవృత్తములే ఇందు పెక్కులు సవిశేషముగాను ఉండుటయు, పెద్దనగారు చరమ పద్యములోనేని రాయలవారిని ఆముక్తప్రణేత యనమియు,

(16) మఱియు ఆముక్తములో బ్రహ్మసూత్రములు శ్రుతులును ఉదాహృతములు. ఈరాజు అక్షత్త్రియాపుత్త్రుఁడనియు ప్రథ కలదు. తదనుగుణముగా, ఏతత్సహోదరుఁ డయిన యచ్యుత రాయలభార్యయొక్క సోదరి చెవిరెడ్డిభార్య, తత్సంతతి తంజావూరివిష్ణుపాద పద్మోద్భవ రాజోత్తములైరి. దీని నెల్లం బరికింప. ఆబ్రాహ్మవిద్యా సూత్రాద్యుదాహృతులు ఈయనవి కానేరవు, అనియు వాదింతురు.

(17) పెద్దనగారుదక్క వీరిసభలోఁగాని దేశములోఁగాని ఆకాలములో ఆముక్తమాల్యదఁ జేయఁగల పాటివాఁడు వేఱొకఁడు లేమియు, ఇవి యన్నియును-పెద్దనయే ఆముక్తకవి యని నిర్ధారించుసాధనములని పలువురు వాదింతురు.

వాదము లెట్లున్నను,—రాయనివారు తొంటిభర్తృహరివోలె మహాప్రతిభులు, కలావంతులు, కవితాస్త్రీలోలురును; కానిచో అష్టదిగ్గజములను ఏల చేర్చుదురు? వారి నేల నిరంతరము బహూకరింతురు? అట్టి కవితారసమగ్నులు కవనమును సహవాసబలముచేత నేనియు అల్లను గూడ సమర్థులగుదురు. వారే రచించినట్లు గ్రంథములో నున్నది. కొండంత స్వప్నకథయు నిబద్ధము. కావున దీనిని పెద్దనగారి తోడ్పాటున రాయనివారు రచించియుందు రనియు నెన్నవచ్చును. పెద్దనగారి యనుప్రవేశము తప్పదుగావున, ఇందు తప్పు లున్న వనుట న్యాయ్యము గాదు.

గ్రంథమున కర్త వీరవైష్ణవుఁడుగా నగపడుచున్నాఁడు. అంతటి మతావేశము శివస్తుతి చేసిన పెద్దనగారియందును, శైవక్షేత్రములకుఁ గొప్ప శాశ్వత కైంకర్యములు చేసిన కృష్ణరాయని యందును పొసఁగునా - అని కొందఱు ఆక్షేపింతురు. అందులకు కొందఱు, 'ఇరువురును జీవితములో ఉత్తరకాలమున వీరవైష్ణవులై ఆ విష్ణుపారమ్యాభినివేశముచే ఒండొరుల హెచ్చరికలు మెచ్చొంద ఈ ప్రబంధమును నిర్మింపఁ బోలుదు'రని వచింతురు. తెనాలిరామకృష్ణ కవీంద్రుఁ

డును ఆదిలో వీరశైవుఁడుగా నుండి ఉద్భటారాధ్య చరిత్రమును రచించి, అనంతరము వీరవైష్ణవుఁడై, పాండురంగ మాహాత్మ్యమును నిర్మించినట్లును, అతని జీవిత చరిత్రమువలనఁ దేటపడును. అతఁడు పెద్దనకాలమువాఁడే కావున ఆముక్తము పెద్దనరచిత మని అతఁడు ఆ సీసపద్యములో చెప్పినమాటను నమ్మకుండుటకు నిమిత్తము గానరాదు. రాయఁడును తాను పల్లకిలో నునిచి యెత్తిన యాంధ్రకవితా పితామహునికిం దెలియక మ్రుచ్చుఁదనముగా నిట్టి లోకోత్తర మహాప్రబంధమును రచించునా - పెద్దనగారును తనకుం బ్రాణ మిత్రమయిన రాయనికి అకీర్తి కాకుండునట్లును, మహాకీర్తి యగునట్లును తదీయ కవనమును సంస్కరింపక యొప్పరికింతురా?

“మూఁడేండ్లకుముందు విశాఖపట్టణ మండలమున ‘ప్రపంచదర్పణ’ మను పేరుగల సంస్కృత గ్రంథ మొకటి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారికి...దొరికినది. అందొకచోట

“అల్లసాని పెద్దనార్యేణ సత్యావధూపరిణయే:—
‘అఙ్గులీషు కరఙ్గాక్ష్యా శోభతే ముద్రికావలిః।
ప్రోతేన బాణైః పుష్పేషో న్నూనత్సు లక్ష్యపరమ్పరా॥’ అనియు, మఱొకచోట
“అల్లసాని పెద్దనార్యేణాప్యేవ ముక్తం రసమఞ్జర్యామ్:—
‘ఉడురాజ ముఖీ మృగరాజకటి ర్గజరాజగతిః స్తనభారనతా।
యది సా రమణీ హృదయే రమతే। క్వ జపః క్వ తపః క్వ సమాధిరతి॥’ అనియుఁ గలదు.

ఆముక్తమాల్యదలో ‘పలికి తుత్తేరిఁకోపమల’ ఇత్యాదిపద్యమున— ‘భావధ్వని వ్యంగ్య సేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు మఱియు రసమంజరీముఖ్య మధురకావ్య రచన మెప్పించుకొంటి గీర్వాణభాష’ - అని కలదుగదా! ప్రపంచదర్పణోద్ధృతము అగు మీఁది శ్లోకము లీపద్యమందుఁ బేర్కొనఁబడిన సత్యావధూప్రీణన రసమంజరులలోనివి కాఁదగు ననవచ్చునుగదా! ఆముక్తమాల్యదలో నాగ్రంథములు రాయలు రచియించినట్లుండఁగా నిందుఁ బెద్దనార్యుని పేరనుండె నేమి?”

దుర్మతి మాఘ శు. ౧ శనివారపు టాంధ్రపత్రికలో మన్మిత్రవర్యులు బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు ప్రకటించిన పైవ్యాసము ఆముక్తము పెద్దనప్రణీత మను నాభాణకమునకు కైదండ యొసంగుచున్నది. సర్వజ్ఞులైన పెద్దలు ఈ విషయమున పరమసిద్ధాంతమును నెలకొల్పుదురుగాక'

# ఆముక్తమాల్యద; పీఠికానుబంధము.

క్రీ.శ. 1914-వ సంవత్సరమునం బ్రకటింపఁబడిన యాముక్తమాల్యదా చతుర్థ ముద్రణములో అపూర్వము ఒక యుపోద్ఘాతము 79 పుటలది కన్పట్టుచున్నది. అందు మూఁడు ప్రధానవిషయములు ఉపన్యస్తములు. (1) మతవిషయము, (2) చరిత్రాది విషయము, (3) కవన విషయము. తొలిదాన అభ్యుపగంతవ్యములు సందడించుచున్నవి. కడమ రెంటను నా మతము వేఱుపడియున్నది. [ఆ పూర్వముద్రణోపోద్ఘాతమందు మతవిషయము దప్ప కడమ వ్రాఁతయెల్ల-ఆముక్తమాల్యదా కర్త పెద్దన కాఁడనియు, కృష్ణదేవరాయఁడే యనియు, నిర్ధారించు నుద్యమముతోడి యుపన్యాసముగా నగపడుచున్నది: అందు 54-వ పుటలో 'ఇందుఁ బ్రయోగింపఁబడిన సంస్కృతపదములు కాని ఆంధ్రపదములు గాని సంస్కృతభాషలోని యే చంపూ కావ్య నాటకాదులయందును తెనుఁగు ప్రబంధములయందును గానరావు. అట్టి శబ్దముల పట్టిక నొకదాని నీక్రిందఁ బొందుపఱచియున్నాను.' అని యున్నది. దీని కనంతరము 61 సంస్కృత పదములును, 43 తెలుఁగు పదములును, రెండు పట్టికలుగా ముద్రితములై యున్నవి. పట్టికలలో ఆ పదములకు ఆశ్వాస గద్య పద్యాదిసంఖ్య నిరూపితముగా నుండ లేదు. అందువలన వానిని గ్రంథమందు కనిపట్టుట కరము క్లేశకరమయినది. కనిపట్టిన పిమ్మటను ఇందు భిన్నార్థములయందు పెక్కుతావుల నున్న యేకపదము ఏ యర్థమందు అప్రయుక్తమని యభిప్రాయమో, ఆ యన్ని యర్థములందును అప్రయుక్తమే యని యభిప్రాయమో, అదియు విదితము గాకయున్నది. పదములముద్రణములో అవి గ్రంథమున వచ్చిన క్రమమేనియు అనుసృతముగాదు; అకారాది క్రమమేనియు లేదు. ఇందు పదముల వర్ణక్రమము పెక్కుంట మూలగ్రంథమునకు వేర్పడి యున్నది. మఱియు పట్టికలకు అవతారిక యగు నుద్ధృతవాక్యముంబట్టి, ఆముక్తమాల్యదలోని యేపదముగాని ఇతర కవులు ప్రయోగించినది కాదని, అనఁగా - 'పూని ముకుందునాజ్ఞ' ఇత్యాది పద్యములోనివి - పూనుధాతువు, ముకుందశబ్దము, ఆజ్ఞాశబ్దమును ఇత్యాదులు అనఁగా ఆముక్తమాల్యదలోని సకల శబ్దంబులును ఉభయ భాషలయందు (ఏకావ్యనాటకాదులయందును) లేవని యుపోద్ఘాత రచయితగారి యభిప్రాయముగాఁ గొనవలసివచ్చును. మఱియు ఈ యప్రయుక్తతాఖ్యాపనము గ్రంథమందు దోషారోపణకో గుణారోపణకో మఱి యేప్రయోజనమునకో అచట వ్రాయఁబడియుండలేదు. అయినను వైలక్షణ్యము గాన దోషారోపణకే, రాయకర్తృకతా స్థాపనకే, ఉద్దిష్టమని యెన్నఁదగియున్నది. పట్టికలం జదువఁగా అందలి పదములు ప్రాయికముగా అన్యగ్రంథ ప్రయుక్తములుగానే స్ఫురింపందొడంగినవి; కతిపయ పదములు ఇతర గ్రంథములందు ప్రయుక్తములు గామికి కారణము స్పష్టముగానే కనఁబడినది. అది యెల్ల నెట్లన్న—

85. ప్రథమపట్టికలో 'పాదూవాహుక'[ఆపదములను సులువుగా నెఱుంగుటకై అకారాది క్రమముగా ఇందు ఆపట్టికలను అనువదించినాఁడను.] దీనియర్థము 'పాదరక్షలను మోచువానిని' అని; అనఁగా - 'తాము రాజసభలోనికి పోవునపుడు బయట వదలిన తమ పాద రక్షలను అపహృతములు గాకయుండునట్లు తనచేతం బట్టుకొనియుండి, తాము సభనుండి

వెలువడి రాఁగానే, తమ పాదములకడ నిడుకట్టి తమ సేవకుని' అని ప్రకరణానుసారియైన వివరణము. దీనినే తెనుఁగుపదములచే 'చెప్పులమోపరి' అని చెప్పనొప్పును; పాదూశబ్దము ప్రసిద్ధమే, వహధాతువును ప్రసిద్ధమే. ప్రసక్త వివక్షితార్థబోధకై కవి కల్పించికొన్న యీనుడిమొత్తము మఱి యెందునేని ఏల యుండవలయునో దురూహముగా నున్నది. ఇది యిట్లు యౌగికముగా కూర్చుకోఁదగిన దౌటను ఈక్రింది 'పాదుకాధారక' ప్రయోగము సూచించుచున్నది:— 'వేంచేయు నవసరంబున...తాంబూలిక తాళవృంతిక నరవాహక చ్ఛాత్రిక చామరిక కాళాచిక కరదీపికాధారక కాంతారిక కారవాలిక పాదుకాధారక నర్తక గాయక వైణిక కావనిక...' ప్ర. వేం. వి.వి. 78.

(14) ఇట్లే 'కస్థల(ము)' అర్థము—క=నీటియొక్క - స్థలము=తావు; ఇట్టిదే 'కవి' శబ్దము జలపక్షిపర్యాయము.

'కరబదరసదృశ మఖిలం। భువనతలం యత్ప్రసాదతః కవయః।
పశ్యన్తి సూక్ష్మమతయః। సా జయతి సరస్వతీదేవీ.' వాసవదత్త పీఠిక.
[కం జలం విః పక్షీ తత్ర బహువచనమ్- కవయః జలపక్షిణః' అని దానిటీక.]
'కవి యల్లసాని పెద్దన। కవి తిక్కనసోమయాజి గణుతింపంగా,
కవి నేను రామకృష్ణుఁడఁ। గవి యనునామంబు నీరుకాకికి లేదే?'—రామకృష్ణుఁడు.

'కం శిరోఽమ్బుసుఖే క్లీబం తత్రైవ చ క మవ్యయమ్' అని నానార్థరత్నమాల. 'క-న॥ ఇది శిరస్సనుటను ఉదకమనుటను సుఖమనుటను పేరు. ఈ యర్థములయందే 'కమ్' అని యవ్యయముఁ గలదు.' అని తట్టీక. ప్రకృతమున 'కస్థల' అనునది 'నీటితావు' అను నర్థమున కవి కల్పించుకొనిన సమాసము. ఇది మఱి యేగ్రంథమందును లేదనుట పూర్వోక్తము వంటిదే. (21) 'ఘర్మగవి' ఇందుల పద్యము—

ఆ. 'తనువు గొరిజఁ గొమ్ముఁ గొనకుండ మలఁపుచుఁ। జప్పుడేఁసగఁ దోఁక నప్పళించి,
శోణితంబుఁ గ్రోలుచునె నేర్పుమై ఘర్మ। గవిని గవికి నీడ్చు నవసరమున.'

'ఘర్మగవిః = యాగధేనువును' అని టీక. 'ఘర్మగవి' యను మొత్త మప్రయుక్తమనియో, 'ఘర్మ'శబ్ద మప్రయుక్త మనియో, 'గో'శబ్ద మప్రయుక్త మనియో, భావ మెఱుకవడకున్నది. మొత్తము పూర్వోక్తములవంటిదే. 'ఘర్మ'శబ్దమాత్రమే వివక్షితమేని ఆశుశుక్షణ్యాదులవలె గ్రహింపఁ దగు నని మన్నతము. 'ఛాన్దసానామపి క్వచిద్భాషాయాం ప్రయోగః'—'అధ్వర్యుక్రతుః' 'ఇతిజ్ఞాపకాత్' అని రామాశ్రమి. 'గిరిశ' శబ్దంబును నిట్టిద. [ఇదియే 3(19)లోని 'ఘర్మధేనువు' నకును సమాధానము.] కాళిదాసు 'త్రియమ్బకం సంయమినం దదర్శ' అని ప్రయోగించుకొనిన విధమున నని యేనియు సమాధానపడఁదగును.

(4) 'అయనిష్ట' అని యొకపదము; ఇందు టకారము తకారమునకు బదులుగా పొరఁబాటని గ్రహించిన, 'అయనిష్ఠ' అనునది. 'అయనిష్ఠ ధవళాతపత్రి దగునయ్యాగంబు' ఇత్యాది 4 ఆ. 165. పద్యములోనిది. 'అయనిష్ఠః=శుభావహ విధి నిష్ఠచేతను. 'అయశ్శుభావహోవిధిః' అని యమరము. అని యందుల టీక. రఘు. 4(26) చూ. 'స గుప్తమూలప్రత్యన్తః శుద్ధపార్ష్ణిరయాన్వితః। షడ్విధం బల మాదాయ ప్రతస్థే దిగ్జిగీషయా.'

౩. 'స్వగుణై రాఫలప్రాప్తే రాకృష్య గణికా ఇవ
కాముకానివ నాళీకాం స్త్రీణతా స్సహసా౽ముచన్.' మాఘ. 19(60)
(ఇందలి వర్ణభేదమునకు ఈ విమర్శలో ఈశ్లోకముం గూర్చిన చర్చం బరికించునది.)

౪. 'అహం భువనయోని స్స భీమ శ్చాయం ధనఞ్జయః
తృణతాలమ్బినో దగ్ధుం జాతా స్త్రేతాగ్ని తేజసః'
ఇది బాలభాగవతమున 5 (109)— (శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధునికడకు మాఱు వేసములంబోఁగా, అతఁడు మీరెవరని యడుగఁగా, కృష్ణుఁడు వచించినయుత్తరము)

౫. 'నిర్భిన్నం శతశ శ్శరై స్తవ వపు ర్బాణై ర్మదీయైః పునః
సంధాస్య త్యచిరా జ్జరేతి యమతే మైనాం దురాశాం కృథాః
నో కామార్యపి పాలనం తవ పరా శక్తిః ర్విధాతుం క్షమా
ప్రాణః స్యాత్ తృణతావలమ్బిని భవ త్యాకృష్ణవర్త్మాశ్రయాత్.'
(కంసుంగూర్చి కృష్ణవాక్యము-జరా = రాక్షసీవార్ధకం చ...కామారీ = స్కన్దసంబన్ధినీ-శక్తిః = ఆయుధవిశేషః - అన్యత్ర - కామారీ శక్తిర్యౌవనబలమ్ - యౌవనశక్తిరేవత్వాం రక్షితుమశక్తా కిముతజరేతి ధ్వనిః - తృణతావలమ్బిని = ధనుర్ధారిణి. ని. 'ధర్మో నా తృణతా స్త్రియామ్-అస్త్రియాం చాపధనుషా వి'తి వైజయన్తీ. కృష్ణవర్త్మా-శ్రయః-కృష్ణేనసహకలహః (వానితో పోరుపెట్టుకొనుటయు అనుటకు వానిదారిని పోవుట యందురు) అన్యత్ర తృణతా తృణత్వం తదవలమ్బిని తృణేన ఇత్యర్థః...అకృష్ణవర్త్మాశ్రయాత్ అగ్నిసంపర్కపర్యన్తం ప్రాణ శ్శక్తిః స్యాదితి. చమ్పూ భాగవత 4(59) టీక.—'తృణతా తు ధనుష్య పీతి భాస్కరః.'

౬. 'అనూపస్థలమివ బహుతృణతానిబిడమ్ అనవధి
బలమథనదిశ మభి బల ముదచలత్. వేమ. III-పు. 128

ఇప్పటికి ఈ ప్రథమపట్టికలోనిపదములు మహాకవిప్రేష్ఠము లనియు, ఇవి వాఙ్మయకలశ పాథోనిధిలోని యమృతంపుంగరుళ్లనియు, కవనమధువుకట్టిన కలకండపెళ్ల లనియు, భారతీదేవతాగ్రైవేయక మహాభాస్వర ముక్తాఫలంబు లనియు, విశదీకరించితి నని తలంచుచున్నాను.

అప్రయుక్తము లని నడి వెట్టుటచేత నివి భావికవులకు ప్రయోగానర్హములై నష్టప్రాయము లగు నని ఏతద్రక్షణార్థము ఈ యారంభముం గావించితిని గాక. ఈపట్టికంగూర్చి నా తెలిపిన సామాన్య మెల్ల ఇందలి రెండవపట్టికకును జెల్లుననియు హెచ్చరించుచున్నాఁడ.

ఇఁక రెండవపట్టిక నించుక విమర్శించెద.

అచ్చ తెలుఁగు పట్టికలోని శబ్దములలో - లాఁపరా, తూఁపరాణి, పాత్రేను - ఇందు తొలిరెంటికిని ఆంధ్రనిఘంటువులలో ఆముక్తమాల్యదా ప్రయోగములే ఉదాహృతములు; ఇవి రెండును లాపర, లాపరా, తూపరాణము, తూపురాని అనురూపములతోను, 'జలసూత్రములో నాళబంధపుపలక' 'నీళ్లుపారేతూము' అనునర్థములతోను బ్రౌనుదొరగారిచే పఠితములు. ఆ యర్థములకు వారు మామిడివెంకయ్య యాంధ్రదీపికకు అనుబంధము గాఁదగు 'దేశీయతెలుగులు' అను నిఘంటువును ప్రమాణీకరించినారు.

'తూపరాణపుటమ్ముతూ మొప్పరముజల । దారియంచనఁగను దనరునుజల
నిర్గమము తన్ముఖంబున నీటితోడ । వచ్చుతృణములఁజొరనీని పలక పేరు
లాఁపరాయంచు జనులుపల్కఁగను వెలయు.' ఆం. భా.

'పాట్రేను'నకు సీతారామాచార్యులవారు (పాట్టి+రేను)—ఒకదినుసుచెట్టు అని వ్రాసి వారు. మఱియు, ఈమూఁడింటికిం గాక కడమ 40 టికిని బహుళప్రయోగములం జూపెదను.—

అచ్చతెనుఁగు పదముల పట్టిక

(1) 'అడ్డిగము' - లడ్డిగ(?) ౨

(ఈశబ్దము ఆముక్తమాల్యదలో లేదు. ఇది. శ. ర. మందును లేదు. ఇది 'అడ్డిగ'కు వచ్చిన పొరఁబాటు గావలయు.)

'నేతిలడ్డిగలు ను.' (97) ('లడ్డిగలు - కూచిమూతి పిడతలు' - టీక.)

౧. 'నేతిలడ్డిగ నీళ్లునించినసారకాయ.' హంసవిం. 1

౨. 'సరకులుంచినమాత్రసంచితో నంటఁగట్టినయట్టి నేతిలడ్డిగ దనర్ప.' బ్రౌను,

(23) 'జడి.' ౧౮

'గగనము నీరుబుగ్గ కెనఁగా జడివట్టిననాళ్లు.' 1(80) 'దివిఁ గ్రాయుమౌక్తికంబులజడి.' 4(96) 'నొగిలి రజ్జడిని గృహులు' 4(127); 'నాన్చెఁ జేడ్పడ జడిమేఘుఁడు' 4(129) 'కంపటిమంచ మెక్కి-రి... రెడ్లజడిన్' 4(134) (ఇందెల్ల జడి యనఁగా ముసురు,వర్షము, A torrent of rain' అని బ్రౌను.)

౧. 'ఎం దుండుగురివెందపందిళ్లు పూఁదేనె। జడి యిందుశిలలందు జాలువాఱు.' మను.

౨. 'జడిగొనిసమ్మదాశ్రుకణ జాలములొల్కఁగఁ.' పారి. 3(5)

౩. 'వానయవశ్య। మింకబహువాసరముల్ జడిపట్టునం చొగిన్.' హరవిలాసము. 2(18)

౪. 'ముయ్యేడువాసరంబు లకాలవర్షంబు। జడిపట్టి; కురియఁ బర్జన్యుఁ బనిచి'—,,—

౫. 'జడివట్టి కుసుమవర్షములు గురియ.' శ్రీరం. మ. 2(382)

౬. 'జడిగొనుమధూళికా సారముల పూరముల' - రా. పాం. 2(6)

౭. 'నిచ్చలం బైన తేనియ వానజడిసొంపు। లాలితదానధారాళి గాఁగ.'—,,—౭

౮. 'వెడవిలుతుచేత నగునలజడియుఁ దేనె। జడియుఁ గమ్మని తెమ్మెర ల్దొడరుజడియు.'
కువలయాశ్వ. 3(82)

౯. 'వెన్నెల జడివానగాఁ దలఁచి.' చంద్రికా. 4(107). ౧౦. 'జడిగొనిపరిప్లవత్వంబు'

౧౧. 'వానకాలము వచ్చె వర్షంబులందందు। జడివట్టికురిసె నానావియందు.' కాశీ. 7(40)

౧౨. 'వృథాలాపప్రబంధంబులన్ । జడివెట్టం బనిలేదు' 4(50)

౧౩. 'ముమ్మరపుం దేనియజడి । చెమ్మలవనవీథు లెల్లఁ జెన్నగుటఁ జూమీ
కమ్మవిరితావి మోపరి । తెమ్మెర లొయ్యొయ్య వెఱచి తిరుగుట లెల్లన్.' క. క. ర.

౧౪. 'కంపితశాఖిశాఖాశిఖాపత్త్ర। కుసుమముల్ జడివట్టికొనికురియఁగ' దశావ-కు.

౧౫. 'హిమంబుపేరిటన్ । జడిగొన నొప్పునత్తుహినశైలము.' వామన.

౧౬. 'పెన్బగయు నీసును దోషము నెమ్మనంబులో। జడిగొనియుండుఁ గావున.' నృసిం.

౧౭. 'కెంజిగిన్ । జడిగొనుపద్మరాగమణిసౌధములం దలిరాకుమ్రాకులు.' కళాపూ. 8(216)

౧౮. 'ఈకమ్మపూఁదోఁట యీ తేనియలజల్లు। నీకోమలపుగాడ్పు లీవెన్నెలబయళ్లు' ప్రభా. 5(152)

(4) 'ఉలియ.' ౨

'గల్లుమం చులియ' 1(74) 'తూర్యము లులియన్' 4(34) ['ఉలియన్ = ధ్వనిచేయుచుండఁగా' - టీక.]

౧. 'కలకంఠి యెలుఁగ్రోవిఁ గాఁగిటిలోఁ జేర్చు। గంకణఝుణఝుణత్కారములియ.' విక్ర.8(64)

౨. 'ఘోరకోపవేగధీరోత్థ లఘులియుంగఁ। బలుకు నిట్టుక్షేత్రపాలకుండు.' పాం. రం. 5(134)

(36.) 'బారాసి' [బారాది? బారసి?] ౩

'బారాసిదినంబులు' [బారాసి = పండ్రెండు' - టీక.]

[ఈపదము శబ్దరత్నాకరములో లేదు. మూఁడు వ్రాఁతప్రతులలో 'బారాది' అని యున్నది. శ. ర. లో 'బారాది' శబ్దమున్నది. దానికి 'అధికము' అర్థముగా తెలుపఁబడియున్నది.]

౧. 'ఎగువపొలిమేర బారాదియగుమూరం బేఁగఁ బోఁగువాఁటించి.' మను. 4(37)
['బారాది = అధికము' - టీక.]

౨. 'బారాదిసొమ్ము లుండఁగ। హారము గైకొనుచుఁ జనియెనండజము.' పాం. రం. 4(232)
['హారము నే' - పా.]

శ. ర. లో బారాదిపదమునకు పై రెండర్థములును, అందులకుపై రెండు ప్రయోగములును వ్రాయఁబడి యున్నవి. ఇందువలన ఆముక్తమాల్యదామూలటీకలయందు 'బారాసి' రూపము ప్రామాదికమనియు ఉపోద్ఘాతపట్టికయందు తదనువాదమాత్రత యనియు నెన్నఁదగియున్నది. పట్టికాకారులు 'బారసి'ని ప్రమాదవశంబున 'బారాసి' యని పఠించిరను పక్షమున-'బారసి పోసీను' 4(50) [బారసి = ద్వాదశీవ్రతము' - టీక.]

౩. 'బారసి దాఁటెడు భయమునసలిల। పారణ గావించెఁ బార్థివుం డంత.' [శ. ర.]

ఈరెంటను ద్వాదశీతిథియర్థము. పండ్రెం డనునర్థంబును దీనికిసంబంధించినదే; 'బారసికి' ప్రకృతి 'ద్వాదశి' యనియు పండ్రెండవ తిథియర్థమనియు వైకృతదీపిక. ఇచట 'బారసి పోసీను' అనుచో ద్వాదశీవ్రతి మని టీకలో నున్నది. వ్రతార్థము ఎక్కువగా లక్షణచే లబ్ధము. 'బారాసి'ని దీనికి రూపాంతరముగాఁ గొనునెడల, తద్భవములు అర్థమున సంచించుక మూలాతిక్రమణము నొందుట అపూర్వము గాదు; గావున 'బారాసి' అనఁగా పండ్రెండు అనియు నర్థము ఉండవచ్చును. మఱియు 3(15) పద్యములో బ్రౌనుదొరగారు 'బారాది' యనియే పఠించి దానికే పండ్రెండు అని టీక ప్రతిపాదించియున్నారు.

(22) 'చుయ్యంకి' ౧ 'డక్కచుయ్యంకి లోనగు... వాదిత్రత్రితయపరంపరలు మొరయ.' 4(35) [ఇట బ్రౌనుదొరగారిపాఠము. 'ఢక్కచుయ్యంకి' - అని]

౧. 'తప్పెట గిడిబిడి తుడుము చక్కచుయ్యంకియును దాళ మహోత్తాళంబులును.' హంసవిం.3

41. 'సన్నగాళె' ౧ 'కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె' 4(35) [దీనికి శ.ర.లో ప్రయోగము లేదు]

౧. 'కాంస్యశృంగ కాహళంబులును సన్నగాళె నఫీరు కరకొమ్ము నాగసరము...' హంసవిం. 3.

(5.) 'ఎడకాండ్రు' ౮ 'తమకుం బరికిం జనుదెంచినవ్వ డెల్ల నెడకాండ్రగుట' 4(35) [కుంటెనకాండ్రు' అని టీక.]

'మును వారిఁ గూర్చునెడకాఁ డెటకో.' 2(52) శ. ర.లో ఈపదముగలదుగాని, దీనికిం బ్రయోగము లేదు.

౧. 'ఆమరుఁ డెడకాఁడుగా నొకతె మక్కువఁగన్గొనె సిగ్గు నుండఁబో
దిమఁగఁ జటుక్కవిశ్వనృపతీ.' కావ్య. చూ. 2(23)

౨. 'అట మట మేల నేలికొమంగన; నంగదభంగు లయ్యెన
క్కట కటకంబు లింతి కెడకత్తెలు నీకడనాడి పాడిరే.'—,,—(73)

౩. 'హితయనుజాతుర్యమతియును నైనస్ఫు । గాలిక దా నెడకత్తె గాఁగ.' దశ. 6(180)

౪. 'ఎడకాఁటతనములు నడుచుకత్తెరకాండ్ర । కిచ్చకమ్ములు గాఁగ మెచ్చు లొసఁగి.'
ప్ర. రా. వే. వి. వి. 675

(10) 'కక్కసము' ౨ 'కక్కసము గుదింప' [కక్కసము - కఠినము - టీక.]
'కక్కసాన నిటు త్రొక్కించి' 4(85) ['కక్కసంబునన్ = బహుసంకటముచే]

౧. 'ఉక్కళ మైనమంచిమనువొప్పెడు నాహయరత్న మెక్కినన్
గక్కస మేమి లేక రవగాలును జోడన యడ్డవేడెముల్
డుక్కు దువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి రా
జక్కడ వన్నెసోఁకనటుపోయనినన్ గదలెన్ జరీలునన్.' సారంగ. 1(82)

౨. 'కక్కసపు వంకగోరులఁ ద్రొక్కి త్రొక్కి । కఱకు ముక్కున నందంద గఱచికఱచి
పూసయొకటియుఁ బోఁగునఁ బొందనీక । చెఱిపె ముత్యాలపేరు పిచ్చికపుఁ బులుఁగు.'
పాం. రం. 4(289)

ఈ ప్రయోగములును, శ. ర. లో ప్రదర్శింపఁబడిన యితరములును అన్నియుఁ ఇంచుమించుగా తుల్యార్థములే.

(7) 'ఇఱ్ఱింకులు' ౩ 'గృహాద్రైవతంబు లిఱ్ఱింకులింక' 4(43)

౧. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకు లింకించె । గంభీరహుంకార గర్జనమున' భీమే.

౨. 'కన్నుఁగోనలం దంకురితంబులైనదరహాసలవంబులు పద్మనేత్ర యి
ఱ్ఱింకులు సేసెఁ బక్ష్ములయూరమిఁ గాటుకచిమ్ముచీకటిన్.' శృం. నై. 7(193)

౩. 'ఈక్షింపఁగా నేర్చె నిఱ్ఱింకుఁజూపుల। మోవిఁగూర్పఁగ నేర్చె మొలకనగవు.' క.క.ర.3(226)
ఈ యన్నిటను ప్రస్తుతశబ్దార్థము లించుమించుగా ప్రకృత్యనుగతములే.

(40) 'వింగడము' ౬ 'వింగడంబైనట్టి ముంగిట.' 4(50); 'వింగడమైన యొక్కవనవీథి.' 4(5)

ఈశబ్దమునకు ఇవే ప్రయోగములు శ. ర.లో నుదాహృతములు. ఇందు తొలిదానికి సుందరమనియు రెండవదానికి విస్తీర్ణమనియు శ. ర. నిరూపితార్థములు. ఈభేదమునకుం బ్రమాణము శ. ర. లో నుపన్యస్తముగాదు. ఇది వికటశబ్దభవ మని సీతారామాచార్యులవారి వైకృతదీపికలో నున్నది. ఇట తొలిదానికి వ్యాఖ్యలో విరళ మని యర్థమున్నది గాని, సుందర మని లేదు. శ. ర. లోని యర్థములు వైకృతదీపిక ప్రకారము తత్ప్రకృతియైన వికటశబ్దమునకు సంస్కృతమునందే కలవు. 'వికటః పృథులే రమ్యే విశాలవికరాలయోః.' నానా. ఇందలి కడపటి యర్థమున వింగడశబ్దమునకు ఈక్రింది ప్రయోగము శ. ర. లోనే దత్తము:—

౧. 'అంగజహరుని ప్రసాదము । నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁ డాదిగ మా
వంగడమున నది యిప్పుడు । వింగడమై తూఁతు రుద్భవించె న్నాకున్.' విజయ. 2(8)

'వింగడించు' అని ధాతువు గలదు శ. ర. లో సకర్మకముగా మాత్రమే పఠితము:—'వేఱుపఱుచు, విభజించు' అని యర్థము.

౨. 'అమరవరత్నమాపరవరాంచితవృత్తులు వింగడించి' - హ. స. 2 ఆ. శ. ర.
అయినను అకర్మకముగాఁ గూడను ప్రయోగములు కలవు:—

౩. 'విడిచినయంత మల్లు లటు వెన్కకుఁ జెంగునవింగడించుచున్
బడిబడి మీసలంటి మెలిఁబట్టుచు దండల నిల్చి కమ్మచున్

బిడికిళులూఁది పట్టుకొనిబిట్టుగఁ గేకలువేయుచున్ బోమల్
ముడిగొనఁ బండ్లు గీటుచు సముద్ధతిచేఁ జెయిసోఁక మీటుచున్.' ప్ర. వేం. వి. వి. 84.

౪. 'గిబ్బ లెదిర్చి కొమ్ముల ధకీలు ధకీలునఁ గుమ్ములాడు దా
రబ్బిక యైనచిత్తరుల హత్తిఁ బెనంగుచు బొందెకోల బల్
దెబ్బలు ఖేటకోపరితతిన్ గళిపెళ్ళుగఁ దాఁకఁ బోరి పె
ల్లుబ్బుచు వింగళించి తగ నుద్దిగ నిల్వ బహూకరించుచున్.'—,,—92

ఈరెంటను వేఱుపడుట యర్థము ఈధాతువునకు, కృదంతమును గలదు.

౫. 'దండనిల్కడ కద లుదుటు కలయ మెలఁకువ వింగళింపు దిశాప దిశలు... మొదలగువిత్తు
లెఱింగి'—,,—78

౬. 'బంగరుఁదాటి ప్రాఁకులకు బోసటబాహులు, రూప మారయన్
సింగము, సన్న నెన్నడుము, చెల్వగుఁ బ్రక్కలఁ దార్క్ష్యపక్షముల్
వింగడపుంగను ల్గలవు, విష్ణుఁడు కాఁడగునొక్కొ! నాదుక
న్నుంగవ నాహరించెడు ననుంగు తెఱంగున నెవ్వఁడో గదా.'

['వింగడపు' విశాల మైన.] మధ్యమవ్యాయోగము. వేటూరి ప్రభాకరశాస్త్రి కృతము.

(32) 'నిట్రు' 3

'దశామినాఁ దెకభి(భు?)క్తముఁ జేసియవలినాఁ డోర్చి జాగరముతో నుండు నిట్రు.' 4(50) ['ఉండునిట్రు = ఉపవాసముండును.' టీక.] [ఈశబ్దమునకు శబ్దరత్నాకరములో ఇదే ప్రయోగము, వేఱు లేదు.]

౧. 'అక్కటా యేమిచెప్ప వింధ్యాద్రిదమన। కాశిలో నేడునాళ్లు నిష్కారణంబ
శిష్యులును నేను నిట్రుపాసెంబు వడితి।మమర గంగానదీసైకతములయందు.' భీమేశ్వ.2(100)

నిట్రుశబ్దము విశేషణ మైనప్పుడు శుష్కవాచక మని శ.ర.; అందులకు నిట్రుపాసము అని అందే ఉదాహృతము. కావున నిట్రుశబ్దము వృక్షపర్ణాదులకు నిట్రువృక్షము నిట్రుపర్ణము అని శుష్కవాచకముగా విశేషణముగా ప్రయోగములుండవనియు, ఉపవాసమునకే విశేషణ మగు ననియు సూచితము. నిట్రువృక్షము, నిట్రుపర్ణము ఇట్టివ్యవహారము లేదు. ప్రకృతిలో నీశబ్దము అత్యంతార్థవాచకమయిన నగుఁగాక, రూఢిచే ప్రకృతార్థమున నియంత్రితము. దానంజేసి యిది విశేష్యత నొందినప్పుడు నిట్రుపాస మనఁగా శుష్కోపవాసరూపమయిన యుపవాస మని యర్థము; గావున పౌనరుక్త్యదోషము లే దని యెఱుంగ నగును.

'సతతంబు నిట్రుపాసములతోఁ నత్యుగ్ర। తపము గావించుచు' వరాహ. 7(73)

"ఎన్నఁడుఁ జూడమున్ వినము నిట్టిమహాద్భుత మేమి చెప్పుదున్
గిన్నరకంఠ యొట్టిడినకీలునఁ గాశిపురంబునందు భి
క్షాన్నము లేదు నీయడుగు లాన నిజంబుగ విన్నవించెదన్
నిన్నటినుండి యేము నిరుసీఁగియు నుంటిమి నిట్టుపాసముల్" కాశీ. 7(179)

'నిట్టుపాసముల్' అని కడపటిముద్రణము. ['నట్టుపాసముల్ - అని పూర్వముద్రణము.] నిట్టు నిట్రు శబ్దములు రెండునుం గలవు. నిట్టునకు నిట్రు రూపాంతర మని శ.ర. కావున ఈచోట ఏరూప మున్నను దానిని ఇతరమునకు గ్రాహకముగాఁ గొనవచ్చును.

(25) 'తపారంబు' ౧

'తపారపుఁజూంగులు' 2(75) 'వెలిదపారంబుమించు' 4(58) [తపారంబు = పొగా.]

[బ్రౌనుదొర తపారమునకు తపాళము రూపాంతరమనియు, వర్షాయి యర్థమనియు, తెలిపి, అందులకు.—౧. 'మాపునం బడిళము, జుంజుఉుం దలఁ దపాళము.' వెంకళరాజు పంచతం. (29) అను ప్రయోగము నుదాహరించినాఁడు.]

(7) 'ఎలగోలు' ౯

'ఎలగోలుజల్లు' [మొదటవచ్చినవానజల్లు' - టీక] 4(91) 'గాలియెలగోలుచేఁ గొమ్మగదలి' ['ఎలగోలుగాలిచేతను' అని టీక.]

౧. 'అగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలనూపెఁ। జూపుదనుక నెల్లచోటఁ దోఁట యందు దామ యగుచు నమ్మరునెలగోలు। పోఁజులనఁగఁ జూడ్కి పండు వగుచు.' పారి.3(51)

౨. 'మరుఁ డొనర్పఁగల కోల్తలకుం దివురు తమకపు ముంగలిపోఁజులు నిగిడించుక్రొవ్వాడి తూపులరూపున నొండొరువుల మఱుపెట్టి చూచునెలగోలుచూపుల నితరేతరధైర్యంబులు గంటివడ నొంటిం బచ్చెనయోవరుల వనియించువధూవరులును'—,,—2(52)

౩. 'చెనుముకి యగ్గి జానకిత్రాటిమిడుఁగుఱు।గ్గొరలెడునది యెలగోలుమూఁక.'; వసలయా.2(127)

౪. 'అరిగి మహాభయంకరతరాహవదోహాలబాహవప్రతా
పరుచులు వోలుచెందిరపుఁబావడచేఁ బుఱచేయి వీచి సు
స్థిరమతి నంపపెట్టుకొలఁదిఁ గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగో లొనర్పఁగ నిశాచరుల న్నియమించినంతటఁ.' 2(128)

౫. 'చిత్తజుని సేన లెలగోలు చేసినట్లు। కలుకఁబలుకలఁ జిలుకలకొలికి పలికె.' మల్ల.విప్ర.3(87)

౬. 'పుష్కలావర్తకాంభోధర వ్రాతంబు । లెలగోలువర్షించు నెన్నఁ దేని.'—,—కాశీ. (52)

౭. 'రాలఁ దుపాకులఁ బలుఫిరంగుల భంగము నొందఁ జేసి గ।
గ్గోలుపడం గడంగి యెలగోలు బలంబు చలం బెలర్పఁగఁ' కృ. రా. వి. 3(71)

౮. 'అళగరన్న తొలూవు యెలగోలు తుపాకిజనం ఆరు వేలు।ఒడ్డుతీరితుపాకులచేత అని వేయసాగిరి'

౯. 'ఏకోజీవగై రాయెలగోలు తుపాకులజనం ఎనిమిదివేలున్ను' తంజా. రాజుల చరిత్ర.

(43) 'హదను' ౨ ('ఆహదనం జెలంగుజనము')

౧. 'పదను దొరకొనుఁడుఁ జెచ్చెర । వదలక వెదవెట్టుహాలిక వర్గముఁరీతిఁ ।
హదను దొరకొనుడుఁ గార్యము। వదలక తా నిర్వహింపవలయుఁ బతికిఁ.' బద్దెనసీతి.

౨. 'చదువులకు మేర యెయ్యది? । చదివినమాత్రంబె చాలు సరసవచస్సం।
పద దా నేర్చినకొలఁదిని । హదనఁ గవితఁ జెప్పిహారికి సర్పింపఁ దగుఁ.'

పీఠిక ప ౧౫-అబ్బయామాత్యుని యనిరుద్ధచరిత్రము.

(9) 'ఓహరిసాహరి' ౫ 'ఓహరిసాహరిం బ్రథమ మొల్కొడుధారల.' 4(93)

౧. 'ఇట్లోహరిసాహరిం బెనఁగు హరార్జునులయందు' హరవిలా. 7(73)

౨. 'ఓహరిసాహరి నయ్యాలచేరుగా। వెనుకొంచుఁ దెరలుచుఁ బెనగుకెడలు' భార.విరా. 8(165)

౩. 'ఉభయబలంబులుం బురికొని యోహరిసాహరిం బెనఁగుచుండె' ద్రోణ. 3(140)

౪. 'ఆహరిఁజూచి వేలుపు లహంకరణంబుల దైత్యసేనతో।నోహరిసాహరిం బెనఁగ' వరా.6(115)

౫. 'ఓహారిసాహారిం బెరసి యుండొరు నోర్వక యస్త్రశస్త్రని
ర్వాహమునన్ రథద్విపతురంగపదాతులఁ బిల్కుమార్చన
య్యాహవసీమలం బ్రకుపితాంతకునట్లు పరాక్రమించునా
కోహటపాటు దోఁచెడు నయో! మది నిత్తఱినేమిహేతువో?'

భాసునికర్ణభారము వేటూరి ప్రభాకరశాస్త్ర్యాంధ్రీకృతము.

(14) 'కెలసము' ౬ 'ఘట్టరాఁ గెలసమొ నాఁగ' 4(96) [కెలసము=అక్కఱ, పని.]

౧. 'ఇంతటికెలసంబుఁ దీర్పవలదే' భార. అర. 6.—అని శ. ర.

౨. 'ఏను నీ చుట్టమనై భుజాబలముసొంపున నీకెలసంబుఁ దీర్చెదన్'—,,—5(228)

౩. 'అక్కెలసం బెవ్వరి కెఱిగింతు'—సౌప్తి. 1(28)-అని బ్రౌణ్యము.

౪. 'చెలువ రతాంతవేళ బలుసిగ్గున నంగము దాఁచుకొంచు దు।
వ్వలువ గ్రహించి కట్టుకొన వల్లభుఁ డొయ్యఁ జెఱంగువట్టి యో।
కలికిరొ యింతసేపు పొడ గానని సిగ్గిపు డెట్లువచ్చెనే।
కెలసము దీఱె నంచుఁ గనుగీటితొ ముగ్గడ నుండు ప్రీడకన్.' దశా. 7(161)

౫. 'మఱియున్ బెక్కుఋషంబులఁ బట్టిరి। యక్కెలసము మాని తనిసి
రది సందగుటన్'-వెంగళరాజుపంచతంత్రము - అని బ్రౌణ్యము

౬. 'కెలసము చేసియు నవసియుఁ। గొలిచినబుణ మెట్ల యీనికవలయపతి య
క్కాలు వేల యుత్తరోత్తర। ఫలసారమె రాజసేవ బద్దెనరేంద్రా.' బద్దె. నీతి. 70

౭. 'సమరంబున రావణు వధించి యందు నాకెలసంబునకు మెచ్చి' భా. అర. 3 ఆ. 131

(13) 'కిసరు' 'కన్కిసరుడుగం గావ నప్పగించెదుమాడ్కిన్' 4(175)

['కిసరు=కోపప్రయుక్తమైన నేత్రదోషము. ఈశబ్దము తెనుంగుననుం గలదు. మదరాసులో ఉత్తమకుటుంబములలోను వాడుకలో నున్నది. శిశువులు, నిద్ర పోక చిరమేడ్చుచుండిన 'కిసరు తగిలినది' అందురు; అందులకై దిగఁదుడుపులు, మంత్రితవిభూతిని లలాటాద్యవయవములందు పెట్టుట, లోనగుపరిహారములు సేయుదురు. కావున నిది కేవలము తులుకబాసయొయనం బనిలేదు.]

(17) 'గండె' ౨

'జిగురుగండెలఁ బోలె నల్లుకొని'4(35) [ఇటజిగురు తర్వాత అరసున్నమూలగ్రంథములో ముద్రితముగాదు.] 'గండెయును నల్ల దాసరి గాఁడు కిరియు' 5(41) 'గండెయనుమత్స్యమును'-టీక.

ఇట రెండవప్రయోగమునే బ్రౌనుదొరగారు 'కండె' యని గ్రహించి మత్స్యవిశేషమర్థ మని తెలిపినారు. మఱియు దీనికి 'గెండి'_గెండియ-గెండె-అనిరూపాంతరముల నిచ్చినారు. కాకి గెండె-కాకిటిగెండె అను తద్విశేషవాచకములను సయితము పఠించినారు.

హంసవింశతిలో భద్రసేన యనుక్ష్వరజాయ కథలో_'కొరడు దాసరికొయ్య' అను సీసపద్యములో, మత్స్యజాతి విశేషపరిగణనములో, తుదను.—

'మోర పక్కెర దొండును గూరముక్క। పుల్లరుజు గజ్జెగండయు బొమ్మడాయ
యాల్లె దమ్ముప్పుఁజేఁపయు గొల్లదొందు।పరిగ రొయ్యాది యగు మీలఁ బట్టునతఁడు'

అనుగీతములో కవి 'గండె' నే 'గెండ' యని పఠించినాఁడు. ఇది బ్రౌనుగారు చెప్పని మఱియొక రూపాంతరమేనియు నగును. ముద్రణములో నున్నదానిని ఉన్నట్లే 'గెండ' యనియే

యుదాహరించినాఁడను; దోషభూయిష్ఠమైన యీముద్రణములో 'గండె' [లేక గండి 'గండియ' గండె] గండ యని పడుట ఆశ్చర్యముగాదు. పయిగా ఈ యెత్వాత్వములకు తుదకు చెంబడి వ్యవహారమే ప్రమాణము. ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసములో ప్రస్తుతరూపమే ప్రయుక్తమై యున్నది. ముద్రణమం దిట్లున్నది:—

౧. 'నల్లె గండె రొయ్య పర కాదిగ చేఁపల బట్టి బెట్టుగన్'

పట్టికలో 'జిగురుగండెలు' అను ప్రయోగములోని 'గండె.' యే యభిప్రేతమేని—

౨. 'స్వజాతిద్విజాతుల రాఁబిలుచు పులుఁగుల దీములు గట్టియు జిగురుఁగండె లమర్చియు
చంద్రికా. 2(18) ఇట అరసున్నకలిమిలేములు సంపాదకమతభేదప్రయుక్తములు.

(19) 'గార' ౧ 'మహీసంరక్షకై గార యీబలె' 420 ['గార=గచ్చు'-టీక]

౧. 'చటులకృపీటసంస్థితరసాస్థలి వ్రీలక యుండ గార యి
చ్చుటకును బోలె శంఖమణిశుక్తికదంబము నుగ్గుగా.' మను. 6(105)

(16) 'కొడిమెలు' ౨ 'కొడిమెలు గట్టకుఁడి' 5(58) ['కొడిమెలు=లేనినిందలు'-టీక]

౧. 'జడముడి జాహ్నవీతటనికాకరపోతముఁ జూచి యెవ్వరీ
కొడిమలు గట్టి పెండ్లికొడుకుం గడియారము మోవఁ జేసి రం
చడుగ వివాహవేదిపయి నంబిక నెచ్చెలిఁ జూచినవ్వినా
మృడుఁడు నృసింహశౌరికి సమిజ్జయముల్ దయసేయుఁగావుతన్.' జైమిని. 1(2)

ఇందలి తుదియత్వము ముద్రకప్రయుక్తము. ఎత్వమే సీతారామాచార్య పతితము. ఏపాపమును ఎఱుఁగనివానిని పాపముచేసినాఁడనుటయే వట్టినింద. ఆముక్తమాల్యదటీకలో జైమినిభారతమునుండి యీప్రయోగము ఉదాహృతమైయున్నది. అట్లున్నను దీనిని అప్రయుక్తములపట్టికలో ఉపోద్ఘాతకారులు ఏల చేర్చిరో!

౨. 'మిగుల వెఱఁగంది యంతట నగుచు మీరు। సృష్టికర్త లెట్టైనను జేయఁగలరు।
మదికి వలసినయట్ల సేయుదురుగాని।వట్టికొడిమెలు నాకును గట్టఁజనదు.' కళాపూ. 5(56)

(29) 'తాపెకత్తె' ౨ 'ఈలువుటాండ్రకుఁ దాపికత్తెవై' 5(70) (పట్టికలో పాకెత్వము. ఇత్వముండవలయును. 'తాపికాఁడు. N. S. A Pimp. Satyabh. 8(115)' బ్రౌణ్యము.

౧. 'తాపికాఁడైన పాదలి మందడీఁడు' నవనాథోపాఖ్యానము.

౨. 'తాన చోరులకును దాఁపికాఁడై వేష। ధారి మిన్నకేనిఁ దపముసేయు
చున్నయట్టు వలుకకున్న వాఁడని యెగ్గు।లాడి యారెకులు నయంబులేక' భార. ఆది. 4(268)
'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు' బాల.

(11) 'కరుసులు' 'కంపలను వ్రేలెడుకరుసులు' 6(17) [పచ్చిచర్మము అని టీక.]
దీనిని చర్మార్థమున బ్రౌణ్యశబ్దరత్నాకరములు సరళాదిగా పఠించుచున్నవి.

(21) 'చావడము' 'గుజ్జుపుఁ జావడములమీఁద' 5(96) 'గోడిగల జావడంబులకున్'
ఇట రెంటను తట్టు అర్థము. ఈరెంటిలో 'చావడము' శ.ర. లో లేదు, 'జావడ'మున్నది.

(24) 'టెంకి'—

'చమురైనతోల్కుబుసంబు టెంకియును' 6(6) ['టెంకి=కళ్లాయి' టీక] ఈశబ్దము ఈయర్థమున శ.ర.లో లేదు. దానంజేసి యిది సీతారామాచార్యులవారు అంగీకరించినది కాదని

తెలియనగుచున్నది. దాసరిపళ్లాయికి వాచకముగా వారు 'టెక్కి' శబ్దమును పఠించియున్నారు. ఆంధ్రదీపికానుబంధంబునఁ 'టెంకి' యనుశబ్దము టోపికి వాచకముగా పఠితమని బ్రౌను దొరవారు తమ నిఘంటువులో తెలిపినారు. ప్రకృతవాక్యమున 'పబుసంపుఁడెక్కి' యని మదరాసు రాజకీయ పౌరస్త్య గ్రంథభాండాగారమందలి (G. O. M. L) రెండు వ్రాఁతప్రతులపాఠము. అందే మఱియొక వ్రాఁతప్రతిలో 'పబుసంపుఁడక్కి' అని పాఠము. ఆముక్తముద్రణములోనే 'గాదగట్టుకసెచేరుల టెక్కియు' అని ప్రయోగమున్నది. అట 'టెక్కియున్ = పళ్లాయియు' అని టీక. ఇదియెల్లం బరికింపఁగా 'టెంకి' పాఠము సరిగాదనియు 'టెక్కి' యని పఠింపవలయుననియుఁ దోఁచుచున్నది.

(37) 'మరులుఁదీఁగ' ౨ 'మరులుఁదీఁగ మెట్టి'

శ. ర. లో 'మరలుఁదీఁగ' యని పఠితము. అందులకు ఈపద్యమే ప్రమాణీకృతము. ఇటం బట్టి కాతన్మూలములందలి యరసున్నలకలిమిలేములను పరికించునది. శ. ర. లో 'మరులుఁదీఁగ', మరులుజడ, మరులుమాతంగియు పర్యాయపదములు. మరులు గలిగించు(ట ప్రాతిస్వికగుణముగాఁ గలుగు)నోషధి గాన 'మరులుదీఁగ' యని యౌగికముగా ప్రయుక్తము. అట్లే తట్టీకలో 'వెఱ్ఱితీఁగెను' అని వివృతము. అదియు దానిసంజ్ఞాభేద మయినను గాఁదగును. యోగముచే ప్రకృతార్థస్ఫోరకముగాను ఉన్నది. ఇదియును నట్టే. ప్రసిద్ధ సంజ్ఞ 'మరులుమాతంగి' యనునది. అందులకుం బ్రయోగము.

౧. 'గంబూరమును జాజికాయ లున్మెత్తవిత్తులు మర్లుమాతంగి కలుపగడ్డ' హంసవిం. 5
౨. 'జాజికాయయుఁ గురాసానియోమమువస । చెంగల్వ మర్లుమాతంగి పచ్చయెన్నులు-''
ప్ర. రా. వేం. 640.

'మరులుఁదీఁగ' యను నీప్రస్తుతసమాసము 'ఇంద్రనీలము'నుటకు 'ఇంద్రమణి' యనుటవంటి దనియేని తలంపనగును.

(12) కాడువడి 3 తమిస్రఁ గాడుపడి పొలంబు లెల్లఁదిరిగి' 6(12)
['కాడుపడి=త్రోవఁదప్పి, కలవరపోయి'-టీక]

బ్రౌణ్యనిఘంటువులో 'కాడుపడుట, అనుపదమునకు 'దిగ్భ్రమపడుట' అని యర్థమును, అందులకు ఇదే ప్రయోగమును గలవు. శ. ర. లో కలఁతపడు' అని యీయర్థమే యీఁబడినది. అందులకు ఈ క్రింది ప్రయోగము లుదాహృతములు:—

౧ 'కూడమ్మికొండ్రు జనములు । బాడబు లాగమను లమ్మి బ్రదుకుదు రెందున్ ।
'జేడియ లమ్ముదురచ్చోటు । కాడుపడినకలియుగమునఁ గౌరవముఖ్యా.' హరివం. ఉ. 9
౨. 'కాలుకొన్నంతయుఁ గడువేగమునఁ బాఱికనుకని దెసలందుఁ గాడుపడియు.' నిర్వ 4(76)
శ. ర. మందే ఈయర్థమునకే 'కాడ్పడు' అనురూపమునకుం బ్రయోగము:—
3. 'వృత్రునిఁ జంపినప్పుడె సురేంద్రుని మేకొనె బ్రహ్మహత్య త ।
ద్గాత్రము కంపమొందె మది కాడ్పడియెన్.' ఉ. రా. 7.

(3) 'ఉరు.' 'ఎరవుగ నిచ్చునది మిథము నెట్టయిన నురున్'4(21) ఇది పోవుటే యురున్.6(28)
['ఉరున్=మేలగును'-టీక.]

ఈధాతువునకు సీతారామాచార్యులవారు 'శ్రేష్ఠమగు, 2 'తగు' అని యర్థములు వ్రాసి

‘నమ్మిమియయుఱుక్’ అను ప్రయోగమును ప్రదర్శించినారు. ఈ ప్రయోగముగల పద్యము సటీక నీతిసంగ్రహములో నిట్లు కన్పట్టుచున్నది:—

౧. ‘నరవర సరసాన్నంబులుఁ । బరిమళసద్వస్తువులును బరమ శయన వి
స్తరములుఁ గాలాధీనత ।నరుఁ బొందుం బాయు వాని నమ్మిమియ యుఱుక్.’

[‘ఉఱుక్=తగును.’] ఇట నీ పదము మూలములో అలఘురేఫముతోను టీకలో లఘురేఫతోను ముద్రితము. ఆభేదము ప్రామాదిక మని చెప్పవలయునా ? ఈ యుదాహరణమందు లఘురేఫమునే సీతారామాచార్యులవారు పఠించినారు. వారు ‘ఉరవు’ అనుకృదంతరూపమును బట్టి దీని యందు లఘురేఫమును సాధించినారు. గురురేఫము సయితము ప్రయోగాంతరములచే సిద్ధము.

౨. ‘వెఱచితి రాఁగ దే యనిన వెండి కదా పగఁదీర్తు నీవు నా
వెఱపెటు లున్న నీరథికవీరులు వా పెద రొల్ల నిన్ను నీ
యుఱుకడ కేఁగి తోడుపడు మొడ్లకు నెవ్వరి కేనినన్న నేర్తుఱ.’.........

భార. ఉద్యో. 4(179).

(6) ‘ఎఱవు.’ ౨ ‘పసులయెరవు టెఱలకు’ 2(53)

‘మేకెఱువుంగుంపటిమంచ మెక్కిరి’ 4(134)

‘ఎరవుగ నిచ్చునది మిథము నెళ్లైనురక్’ 4(221)

‘ఎరవుగఁ బూవు సొమ్మిడి’ 5(124)

ఇట నీశబ్దము ఏయర్థమం దప్రయుక్తమనిపట్టికలోఁ జేర్చినారో. మఱి, పెంట యనునర్థమున అకారమధ్యముగా 2(53) లోను, ఉకారమధ్యముగా 4(134) లోను, ముద్రితమై యున్నది. ఇందేది నియతము? శ. ర. లో పెంటయర్థమున ఉకారమధ్యముగాని అకారమధ్యము గాదు. అకారమధ్యమున ఉపయాచితక మర్థము.

౧. ‘పద నెర వైనవా తెఱలు’ - జక్కన విక్ర. 5(37)

౨. ‘ఏను మీచెలి నింతేల యెరవుసేయ.’ శృం. శా. 2 [=లాఁతినిగాఁ జూడ]

(15) ‘కొంగవాలు’ ౨ ‘కొంగవాల్నలకులు’ 6(85)

౧. ‘మదను ముద్గరంబు లన శంబరారి కఠారంబు లన సంగభవు కొంగవాలు లన’ భీమే. 1(117)

౨. కఠారమ్ము దరవలి కొంగవా రడిదమ్ము గండగొడ్డలి. ఉ. హ. 4(209)

(18) ‘గసపరాకులు’ ‘గసపరాకులు నిగిడ్చి చెప్పాటట్లు శోధించి.’ 7(14)

[గన్నెరాకులవంటియమ్ములయలుఁగులను లోపలదూర్చి—,,—టీక.]

ఇచట పట్టికయందును మూలములోను టీకలోను ఈపదము గకారాదిగానే యున్నది. ఈ గ్రంథమునకు టీకను, అకారాదిగా పదములపట్టికను, వ్రాయించినవారగు బ్రౌనుదొరగారు దీనిని ‘కసపరాకులు’ అని కాదిగా తమ నిఘంటువులలో పఠించి, యీయర్థమునే ఒసంగినారు. ఈ పదము గాదిగానేని కాదిగానేని శ. ర. లో లేదు. ఈ తెలుంగుపట్టికలోని పెక్కుపదములకు ఆముక్తమాల్యదాప్రయోగములనే ప్రమాణించిన సీతారామాచార్యులవారు దీనిని పఠింపమికి కారణ మరయవలయును. వారిప్రతిలో ఈరెంట నేరూపము గాని లేదనియు, ఈరెండు రూపములును ప్రామాదికములని వారిమత మనియు, ఆప్రతిలో వారు నిఘంటువులో పఠించిన ‘గన్నెరాకమ్ము’ నకు పర్యాయముగా ‘గన్నెరాకు’ శబ్దమే యుండిన దనియు, నూహింపఁదగియున్నది. ‘గన్నెరాకమ్ము’ నకు.

౧. 'కువలయాక్షులు ముత్యాలచవికలోన ।
జలకమార్చిరి నిజకులాచారసరణిఁ ।
బసిఁడిపీఠంబుపై నుంచి పద్మనయనఁ ।
జెలువ మగుకన్నెరాకమ్ము చేతి కిచ్చి' శృం. నై. 6(38)

౨. 'అట్లు దాఁకిన నతండు దొరలకన్నెరాకమ్ములఁ జీకాకుపఱిచె' భార. భీష్మ. శ. ర.
'ఒండె ప్రకృతమున కనపరాగోలలితికి' అనియున్న మేలు.

(8.) 'ఒరుదలకాఁడు' ౧

'ఒరుదలకానిం జెదరంగా నాడక' 4(220) [కొండెగాని-నని టీక.]

౧. 'ఒరుదలగా వచ్చి యొగి మఱుంగువడంగఁ । జెవి నిల్లుగట్టుక చెప్పిరేని—
పదర కధిపతి తెలియంగఁ బాడి యగును.' మల్ల. విప్ర. 5(40)

(42.) 'సరపణి' ౧౦

'నిజలక్ష్మిచే సరిపణుల్ మొరయంగ.' 2(15) 'సరపణుల్జనుల ట్లిడి పెంపఁగాబలెఁ' 5(140) ['సరపణుల్=గొలుసులను'] 'చరణంపుసరపణి మొరపంబు' 7(30) [శ. ర. లో ఈశబ్దమునకు రూపాంతరములుగా 'సరిపణీ-సరిపెణ'లు పఠితములు.]

౧. 'సరపణులఁ బట్టి తెచ్చినజాగిలములు' మను. 4(31)

౨. 'సరిపెనతోడిసజ్జ బలుసందిటితాయితులు.' హంసవిం. 5
[ఈపుస్తకమందు అచ్చుతప్పులు మెండు. ఈపాదముననే 'తాయెతు' లనుటకు 'తాయితులు' అని ముద్రితము. అశ్లో ఆదిపదములో ణకారమునకు నకారము పడియుండును. ఇది యాభరణవిశేషమునకుం బేరగుట, అది గొలుసుగా నుండుటంబట్టి. ఉ. మురిడీగొలుసులు, కాలిగొలుసులు, పురుచ్చేరిగొలుసులు. 'సరి+పెన...(సంధిని వర్ణవికారము)' శ. ర.]

౩. 'పచ్చలకడెంబులును సరిపణులు పూని' క. క. ర. ౩

౪. 'భ్రమరపంక్తులు పైసరిపణులు గాఁగ.' రాఘ. పాం. 2(5)

౫. 'అంకుశపుటలుగుల క్రిందికొంకులములుకులు తగులుకొనిన యినుపసరిపెణల పెనఁకువ గల యిత్తికొమ్ముసింగోటుల గుప్పుడులును.' ప్ర. వే. వి. 78.

౬. 'పసిఁడిగంటలమొలనూళ్లు బాహుపురులు।సరిపెణలు ముత్తియంపుముంగఱలు తాళి'—,,—278

౭. 'బుగడలు నానుగ్రోవులు తీఁగమెడనూలు । కుతికంటు సరిపణ గుండ్లపేరు' హంసవిం. 2.
[ఇచట 'సరిపణ' అనురూపమును ముద్రణదోషముగానేని, రూపాంతరముగానేని ఎన్నఁదగును.]

౮. తళుకుగలమేల్మి సరిపెణుల్ దయనొసంగి'
[ఇది యథాముద్రితముగా నుద్ధృతము]-కృ. రా. వి. 1(31)

౯. 'మెఱుఁగుఁగడెంబులుఁ దళుకుమించిన కంటసరుల్ తురాయులుఁ
సరిపెణ లుంగరంబులును నాల్గునగల్ చరణాంగదంబులుఁ
దురగము లాదిగాఁగ దయతో బిరుదుల్ వెలయంగనిచ్చె—,,—2(145)

౧౦. 'నునుపెడందయురంబునను జీనిసరిపెణల్ ।
మిన్నజన్నిదముతో మెలగొనంగ' దశావ. రామా.

(20,) 'గిరవుంచుట' ౬

'పురిఁ గిఱవుంచె వార్ధినాఁ' 1(54)

పట్టికలో 'గిరవు' శబ్దమున లఘురేఫము ముద్రితము. గ్రంథములో మూలటీకలలో 'గిఱవు' అని గురురేఫము ముద్రితము. ఈశబ్దమున శ. ర. లో లఘురేఫమే. పదువ యర్థము.

౧ 'కనుదోయి మెఱుఁగులు కంతుతూపులకడ।
గిరవుగాఁబెట్టితే హరిణీనయన.' జక్క. విక్ర. 7(62)

౨ 'పుత్త్రుల గిరవులు పుత్తెంచి బ్రదికిరి।
పంతలావంతీశపదుర విభులు.' 4(60)

3. 'పాంచాలభూపాలుఁ బ్రతిరోపితినిఁ జేసెఁ। గేరళాధిపునూను గిరవువట్టె.' 5(98).

౪. 'హరిణ కరి హరి చమరంబు లక్ష్మీ పంథ।
మధ్య వాలాకృతులు దెచ్చి మనుపుకొఱప।
భిల్లపతియింటగిరవులు వెట్టె ననఁగ।
దృక్కుచ వలగ్న చికుర చారిమల నొప్పు.' వరా. 2(113)

౫. 'నామాత్రుర ప్రమాణదినంబులకుఁ దేర
గిరవున్న ముద్రయుంగరము చూచి.' శృం. శా. 4

౬. 'కోరి గిరవులువెట్టి కొలుచుజగతీపతులు'—,,—3(రగడ)

(33) 'పాగడము' ౨ ['పాగడపుఁబొదంబొప్పు' 1(56)]

౧. 'పాగడము పూస నాఁ మెట్టె బవిరి పడఁగ।
చుక్కబొట్టనఁ జిటిపొటిసొమ్ము గలిగి' పంచ. వేం. ౪. ఆ_అని శ. ర.

౨. 'తొగరునూపటడుగుల జోడించినపాలవెండి పాగడమ్ములు' ప్ర. రా. వేం. వి. 78

(31) 'దునికిలుట' 3

'హస్తము సెమర్చ సారెకు లస్తకంబు దునికిలఁగ.' 2(65)
[దునికిలఁగఁ = 'జాఱిపోఁగా']

౧. 'దునికిల జాఱుచీకటుల నూకొనుచుం డెడుకీలుగండు పైఁ।
బను పొనరించునిగ్గు గలఫాలతలంబున జాదుబొట్టు.' హంసవిం. 4
[దీని ముద్రణములో తప్పులుమెండు. 'దునికిలఁబాఱు' అని యుండెంగావలయు.]

౨. 'జాతినవెండ్రుకల్ సవరించి కట్టిన। పసిఁడిప్రాఁతరుమాలు దునికిలంగ' నిరం. 2(21)

3. 'ఎసఁగినబాహ్యసంచరణ మెల్లను మాన్చి మరల్చి యొద్దెసం
దునికిలనీక నెమ్మనముతోఁ బిరిగొల్పినచూపు దేవతా
విసరశిరోవతంస మగువిష్ణునిపై నిడి నిస్సమీరణ।
ప్రసరణదేశదీపరుచితస్థితి నిశ్చలయోగయుక్తుఁడై.' శ్రీరంగ. 2(296)

౪. 'బిసరుహ బంధునందనవిభీషణు లమ్మలికంబుతోడ వె।
క్కసముగ బాష్పధార లొలుకం గని పీరవినోదచాతురీ।
రసికుల రామలక్ష్మణుల రాజకుమారుల మోసపుచ్చె నే।
దునికిలి డాగిపోయి యొకతుచ్ఛుఁడు నేఁ డని చింతనొందుచున్.' రామాభ్యు. 8(20)

(34) 'పెరంజు' ౧౦

'కిన్కాం బెరంజానిత్రస్తూరభవన్నభావళులు' 4(22)

[ఈశబ్దము ఇచట మూలటీకాపట్టికలలో మూఁటను పాదిగా ముద్రితము. శ. ర. లో ఇది వాది గాని పాది గాదు. వెరఁజు ధాతువునను జవురుకొనుట యర్థము.

౧. 'వెలయాలివలపు కడుకో । వెలవక వగ లేక వాఁడు వెసఁ జీకటులన్ ।
కలవారియిండ్ల చెలులకుఁ । గలవారపుసొమ్ము వెరఁజి కైకొనిఁ జొచ్చెన్'- శేష. 4

౨. 'చక్కనిచొక్కపు వెన్నెలరసంబు వెరంజ ప్రియాంగనాళికిన్ ।
గ్రక్కున నోరికిచ్చి తమిఁ గౌఁగిటఁజేర్చుచు రెక్క లార్చుచున్
ముక్కున ముక్కుఁ గూర్చి రవముల్ నిగిడించుచుఁ దోన పాయుచున్,
మక్కువ డాయుచున్ గలసి మంపిలు నార చకోరదంపతుల్'- ప్ర. రా. వేం. 114

[దొరకిన ముద్రణములో 'బిరంజి' అని యున్నది. 'బిరంజి' 'పిరంజు' ధాతువులు శ. ర. పఠితములు గావు. 'బీరాంజు' అను నఱవమునకే 'వెరంజు' తెనుఁగు గానోపు.]

౩. 'ఈవె మన్నీఁడ నీ వీకాన వెరఁజుము'- ౩౩. [3(58)

౪. 'జననియొగ్గునఁ దృప్తిసనక నిన్నటిదాఁక । వెరఁజితి వ్రేపల్లె వెన్న లెల్ల' - జై. భార.

౫. 'గురివెంద వదె గిలుబుకొనియోఁ బయ్యరదొంగ ।
విరులఁ గరికుంభకుచ వెరఁజు మై యురగ్రుంగ' మను. 3(84)

౬. 'గవిఁ దూఱి యొక్క కర్కరము తమంబులో వెరఁజి'—,,—4(52)

౭. 'మడు వెల్ల స్వైరఁజాడి మందుకయినన్ మత్స్యంబు లేకుండ' కేయూర. 3(161)

౮. 'క్రొత్తగ దీర్ఘికానికటకుంజగృహంబులఁ దల్పకల్పనా
యత్తము లైనమత్తకరు లాత్త కరాగ్రములెత్తి పల్లవో
పాత్తమనస్కతన్ వెరఁజియాడఁగఁ జొచ్చె బరిభ్రమించుభూ
భృత్తరువాటికావిటపబృందమిళజ్జరఠాతపంబులన్'- క. క. ర. 4(69)

౯. 'వెదకి వెదకి వెన్న వెరఁజాడుచున్నాఁడు
నీసుతుండు మమ్ము నిలువనీక' విష్ణు. 7(130)

౧౦. 'జలములు ద్రిక్కఁగ సకలరత్నంబులు ।
వెరఁజి సాగరములు పీడుకొలిపి', నృసింహపు. 2(121)

(27) 'తెండి'

'అతివ పూర్ణేందుభీతిఁ దదశ్శ శాలఁ దెండి',5(146) [తెండి=శయనించి']

౧. 'నందినియఖ్ఖనాకుచున్ బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపుటావుఁ జూచితే.
[పాౘ. 2(95)]

## శ్రీకృష్ణదేవరాయనివారు నిజపట్టాభిషేక మహోత్సవసమయమున శ్రీ విరూపాక్షస్వామికింగా వించిన భూదాన శాసనము.

['తతోఽ]ప్య[వా]ర్యవీర్యః శ్రీకృష్ణరాయమహీపతిః
బిభర్తి మణికేయూరనిర్వి[శేషం] మహీం భుజే.
రోషకృత ప్రతిపార్థివదణ్డః । శేషభుజః క్షితిరక్షణశౌణ్డః
భాషగె తప్పువరాయర గణ్డ । స్తోషకృదర్థిషు యో రణచణ్డః'

హిన్దురాయసురత్రాణో । దుష్టశార్దూలమర్దనః
గజౌఘగణ్డభేరుణ్డ[ఇ] ఇత్యాదిబిరుదాన్వితః,
ఆలోకయ మహారాజ జయ జీ వేతి వాదిభిః
అఙ్గవఙ్గకళిఙ్గాద్యైః రాజభి స్సేవ్యతే చ యః

స్తుత్యౌదార్య స్సుధీభి స్స్వవిజయనగరే రత్నసిం [హాసనస్థః]
క్ష్మాపాలాన్ కృష్ణరాయక్షితిపతి రధరీకృత్య నీత్యా నృగాదీన్,
ఆపూర్వాద్రే రథాస్త[క్షి]తిధరకటకాదా చ హేమాచలా న్తా
దాసేతో ర్దర్థిసార్థశ్రియమిహ బహుళీకృత్య కీర్త్యాసమిద్ధే.

ఇహ కిల జగతి నిఖిలకవికులాభినన్ద్యమా నౌదార్య ధైర్యాది జనిత యశఃపూర కర్పూర పూరిత బ్రహ్మాణ్డ కరణ్డేన సమరచణ్డేన విహసిత నృగ నల నహుష నాభాగ దున్దుమార మాన్ధాతృ భరత భగీరథ దశరథ రామాదిచరితేన కృతభూసురత్రాణేన పరిభూత సురత్రాణేన । గజపతిగజకూటపాకలేన విది(త నానాక)లేన వదనవిజితామ్భోజేన భోజేనాపరేణ, కావ్యనాటకాలంకారమర్మజ్ఞేన ధర్మజ్ఞేన, ప్రతివర్ష ప్రవర్తి[త]కనకవసన్త మహోత్సవేన సవేన కృతార్థితవిప్రసార్థే[న]సార్థేన నిఖిలభూపతిమూర్ధన్యేన ధన్యేన, నాగామ్బికానరసనృపనన్దనేన నిఖిలహృదయానన్దేన,(నన్దనేన)। సమరముఖవిజయేన విజయేన దిశాం, విజయనగరే సింహాసన మారుహ్య శాసతా సకలాంభువం । భుజవిజితసామ్బ్రరాయేణ కృష్ణదేవమహారాయేణ, భువనభరణసావధానాయ శ్రీవిరూపాక్షాభిధానాయ వినతజన వితీర్ణహేమకూటాయ హేమకూటాయతనశాలినే శూలినే మధురఫలా పూపాది హృద్యాయ నైవేద్యాయ సిఙ్గనాయకనహాలలీతి విఖ్యాతనామా చతురసీమాభిరామోగ్రామో దత్తో, విత్తోపకారిణా రవితనయానుకారిణా రఙ్గమణ్డపోఽపి విరచిత స్తస్యైవ దేవస్య తేనైవ ప్రకటితనరజనుషా ప్రసూనధ[ను]షా ।

త దిద మవనీవనీపకవినుతధరాయస్య కృష్ణరాయస్య శాసన మతి బలశాసనతరుకర దానస్య [సా]పదానస్య స్వస్తిశ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్ష 1430 సందమేలె నడవ శుక్ల సంవత్సరద మాఘ శు. 14లు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ వీర కృష్ణరాయ మహారాజరు పట్టాభిషేకోత్సవ పుణ్యకాలదలు శ్రీవిరూపాక్షదేవర 'ఇత్యాది దేశభాషాయా మపి సర్వం ప్రాగుక్త మనూదితమ్.'

కృష్ణరాయనితల్లి నాగమ్మ (దీపాల) నాగమాంబిక నాగలాదేవి;
తిప్పాజీనాగలాదేవ్యోః, కౌసల్యాశ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేన్ద్రా త్తస్మా త్పఙ్క్తిరథాదివ.
వీరౌ వినయినౌ రామలక్ష్మణావివ నన్దనౌ
వీరశ్రీనరసింహేన్ద్రా త్కృష్ణరాయమహీపతీ. ॥ కంచి కామకోటి-శాసన.

---

## వ్యాఖ్యాతంగూర్చి ఆర్యోక్తి.

సీ. శృంగార నైషధ శ్రీ విరాజిల్లంగ సర్వంకషవ్యాఖ్య సలిపినాఁడు,
సర్వాంధ్రబుధపరిషత్ 'షకటప' మహోపాధ్యాయబిరుదంబు నందినాఁడు,
యువరాజుచేత రత్నోజ్జ్వలసౌవర్ణవలయంబు దుశ్శాలు వడసినాఁడు,
నెల్లూరునగర మనీషులచే నవమల్లినాథాఖ్య భాసిల్లినాఁడు,

గీ. పతికృతిచేత దుర్గ్రహప్రౌఢికతనఁ
వ్యక్తమయిన యాముక్తమాల్యదకు విపుల
వివరణంబును వేడ్కఁ గావించినాఁడు,
రసగరిష్ఠుండు వేంకటరాయశాస్త్రి.

[షకటప=1116 రూప్యములు.]

తే. నలువకుం బోలె నెవనికి నలువరాణి
తలఁపులోన మెలంగు సంతసము మీఱఁ
దత్కృతమ్ములు కవిలోకతారకములు
కలవు పంచాశ దధికముల్ గ్రంథనిధులు.

గద్వాలసంస్థాన పండితాగ్రేసరులు శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యులవారు. ఈ వ్యాఖ్యాతను గుఱించి రచించిన సూక్తిరత్నములలో నొకానొకటి.—

శ్లో. ఈదృ గ్గతీ శాస్త్రే । గైర్వాణగ్రన్థజాలే చ
అన్ధ్రగ్రన్థేషు తథా । నహి దృష్టః శ్రుతచరో వాపి.

# ఉదాహృతగ్రంథములు

## సంస్కృత గ్రంథములు

అజయనిఘంటువు
అనేకార్థకైరవాకరకౌముది
అభిధానరత్నమాల
అభిజ్ఞానశాకుంతలము
అభినవకాదంబరి
అమ. అమరము
అమృతోదయము
అలంకారసర్వస్వము
అచ్యుతరాయాభ్యుదయము
అద్భుతదర్పణనాటకము
అధ్యాత్మోపనిషత్తు
అవ్యక్తోపనిషత్తు
అశ్వశాస్త్రము
అష్టాంగహృదయము
అష్టాధ్యాయి
ఆదిత్యపురాణము
ఆత్మబోధ
ఆప్తినిఘంటువు
ఆర్యాసప్తశతి
ఇంద్రజాలతంత్రము
ఇంద్రజాలవిద్యాసంగ్రహము
ఈశోపనిషత్తు
ఈశ్వరకృష్ణకారికలు
ఉదారరాఘవము
ఉత్తరకాండము
ఉత్తరరామచరితనాటకము
ఋతుచక్రము
ఋతుసంహారము
ఋగ్వేదసంహిత
కంసవధనాటకము
కఠోపనిషత్తు
కథాసరిత్సాగరము
కవికల్పలత
కవికల్పద్రుమ వ్యాఖ్య
కవిరాక్షసీయము
కర్ణసుందరి
కర్పూరమంజరి (ప్రాకృత)
కర్మవిపాకగ్రంథము
కల్యాణకావ్యము
కాదంబరి
కామందకము
కామరత్నము
కామశాస్త్రము
కాళికాపురాణము
కావ్యకల్పలత
కావ్యప్రకాశము
కావ్యాదర్శము
కావ్యానుశాసనము
కీర్తికౌముది
కుమారపాలచరిత్ర (ప్రాకృ)
కుమారసంభవము
కువలయానందము
కృష్ణలీలాతరంగిణి
కౌశికపురాణము
ఖండనఖండఖాద్యము
గంగాలహరి
గంగాధ్యానము
గంగాస్తుతి
గద్యచింతామణి
గాథాసప్తశతి (ప్రాకృ)
గీతగోవిందము
గోళాధ్యాయము
గౌడపాదకారికలు
ఘటకర్పరకావ్యము
చండకౌశికము
చంద్రాలోకము

చరకసంహిత
చాటువులు
చైతన్యచంద్రోదయము
ఛాందోగ్యోపనిషత్తు
జానకీపరిణయనాటకము
జానకీహరణము
తపతీసంవరణము
తర్కదీపిక
తార్కికరక్ష
తైత్తిరీయోపనిషత్తు
త్రికాండశేషము
దశకుమారచరితము
దశరూపకము
దర్శనోపనిషత్తు
దివ్యసూరిచరిత
దేవీపురాణము
దేశీనామమాల
దోహదశాస్త్రము
ధరణినిఘంటువు
ధర్మవిజయనాటకము
ధాతుపాఠము
ధ్యానబిందూపనిషత్తు
నవసాహసాంకచరితము
నక్షత్రసూత్రము
నానార్థరత్నమాల (పుదూరి వాందార్కిపాపన్న శాస్త్రులవారి టీక)
నారదసంగీతశాస్త్రము
నారాయణీయోపనిషత్తు
నీతివాక్యామృతము
నీతిశాస్త్రము
నైషధము
నైషధ మల్లినాథవ్యాఖ్య
పంచతంత్రము
పంచబాణవిజయభాణము
పరాశరభట్టరు శ్రీసూక్తి
పరాశరస్మృతి
పద్మపురాణము
పాంచరాత్రము
పారిజాతాపహరణచంపువు
పాలకాప్యము
పురుషసూక్తము
పైఠీనసస్మృతి
ప్రతాపరుద్రకల్యాణనాటకము
ప్రపంచదర్పణము
ప్రబంధచింతామణి
ప్రబోధచంద్రోదయము
ప్రసన్నరాఘవము
ప్రాచీనలేఖమాలా (ప్రా. లే. మా.)
(ప్రాచీనశాసనముల సంపుటి, నిర్ణయసాగర ముద్రణము 1892)
బాలభారతము
బాలరామాయణనాటకము
బిల్హణీయము
బృహదభిధానము
బృహదారణ్యకోపనిషత్తు
బృహత్సంహిత
బృహస్పతి
బ్రహ్మసూత్రము
బ్రహ్మాండపురాణము
భగవద్గీత
భరతనాట్యసూత్రములు
భట్టికావ్యము
భర్తృహరి
భాగవతము
భామినీవిలాసము
భారతము
భారతచంపువు
భారవి (కిరాతార్జునీయము)
భావప్రకాశిక
భోజచంపువు
భోజప్రబంధము
మందారమరందచంపువు
మదనపాలనిఘంటువు
మదనవిజయభాణము

# ఉదాహృతగ్రంథములు

శ్రీగుణరత్నకోశము
శ్రీనివాసచంపువు
శ్రీభాష్యము
శ్రీసూక్తము
శ్వేతాశ్వతరోపనిషత్తు
షట్కర్మదీపిక
సనత్సుజాతీయము
సమయమాతృక
సరస్వతీకంఠాభరణము
సత్యహరిశ్చంద్రనాటకము
సర్వదర్శనసంగ్రహము
సర్వవేదాంతసిద్ధాంతసంగ్రహము
సర్వశబ్దసంబోధిని
సర్వజ్ఞసోమేశ్వరుఁడు
సాంఖ్యకారికలు
సాంఖ్యసారము
సావిత్రీచరితము
సాహిత్యదర్పణము
సాహిత్యరత్నాకరము
సిద్ధాంతకౌముది
సిద్ధనాగార్జునకక్షపుటి
సిద్ధర్షిచరితము
సుబాలోపనిషత్తు
సుభద్రాహరణము
సుభాషితరత్నభాండాగారము
సుశ్రుతము
సౌందర్యలహరి
స్మృతిచంద్రిక
స్మృతిముక్తాఫలము
స్వప్నశాస్త్రము
స్వప్నారిష్టములు
స్కాందపురాణము
హలాయుధము
హమ్మీరకావ్యము
హమ్మీరమదమర్దనము
హర్షచరితము
హారీతస్మృతి
హాలాస్యము
హాస్య-చూడామణి
హితోపదేశము
హేమచంద్రనిఘంటువు

## ఆంధ్రగ్రంథములు

అచలాత్మజాపరిణయము
అనిరుద్ధచరిత్ర
అప్పకవీయము
అభిషిక్తరాఘవము
అలంకారసారసంగ్రహము
ఆంధ్రభాషార్ణవము
ఆంధ్రమహాభారతము
ఆనుశాసనికపర్వము
ఉషానాటకము
ఉత్తరహరివంశము
ఉత్తరరామచరిత్రనాటకము
ఉత్తరరామాయణము
ఋతుచక్రము
కర్ణభారము
కవికర్ణరసాయనము
కళాధరోపాఖ్యానము
కళాపూర్ణోదయము
కావ్యాలంకారములు
కాశీఖండము
కువలయాశ్వచరిత్ర
కృష్ణరాయవిజయము
కేయూరబాహుచరిత్ర
క్షేత్రజ్ఞపదములు
క్రీడాభిరామము
గజేంద్రమోక్షము
చంద్రాంగదాపరిణయము
చంద్రికాపరిణయము
చమత్కారరామాయణము
చెన్నబసవపురాణము
జక్కన విక్రమార్కచరిత్రము
జైమినిభారతము

జోగి జగన్నాథపండితుని యాముక్త వ్యాఖ్య
తంజావూరురాజులచరిత్ర
తారాశశాంకము
దశావతారచరిత్ర
నన్నెచోడీయము
నరసభూపాలీయము
నిరంకుశోపాఖ్యానము
నిర్వచనోత్తరరామాయణము
నీలాసుందరీపరిణయము
నృసింహపురాణము
పరమయోగివిలాసము
పంచతంత్రము, నారాయణకవి
పండితారాధ్యచరిత్ర
పాండురంగమాహాత్మ్యము
పారిజాతాపహరణము
ప్రబంధరత్నావళి
ప్రబంధరాజ వేంకటేశవిజయవిలాసము
ప్రభావతీప్రద్యుమ్నము
ప్రౌఢవ్యాకరణము ప్రౌ. వ్యా.
బద్దెనీతిశాస్త్రము (బద్దె. నీతి.)
బసవపురాణము, పిడుపర్తి సోమన. (బసవ)
బాలవ్యాకరణము
భక్తిబోధక సువ్విపాట
భాగవతము - ఆంధ్ర
భారతము (భార)
భాస్కరరామాయణము
భోజరాజీయము
భీమేశ్వరపురాణము
మధ్యమవ్యాయోగము
మనుచరిత్రము
మరున్నందనశతకము
మార్కండేయపురాణము
యయాతిచరిత్ర
రత్నశాస్త్రము
రాఘవపాండవీయము
రాధాకృష్ణసంవాదము
రామాభ్యుదయము
రుక్మిణీపరిణయము, కూచిమంచి (కూచి. రుక్మి)
లక్ష్మీసహస్రము
వనవిహారము
వసుచరిత్రము
వరాహపురాణము
విక్రమార్కచరిత్ర
విజయవిలాసము
విప్రనారాయణచరిత్ర
విష్ణుపురాణము
వేంకటాచలమాహాత్మ్యము
వైకృతదీపిక బ. సీ.
వైజయంతీవిలాసము
శబ్దరత్నాకరము
శబ్దార్థకల్పతరువు
శాంతిపర్వము
శృంగారనైషధము
శృంగారశాకుంతలము
శ్రీకాళహస్తిమాహాత్మ్యము
శ్రీరంగమాహాత్మ్యము
సారంగధరచరిత్ర
హంసవింశతి
హరవిలాసము
హరివంశము
హరిశ్చంద్ర ద్విపద (గౌరన)
హరిశ్చంద్రచరిత్ర (శంకరకవి)

ఇతరములు

సి. పి. బ్రౌనుదొరగారి నిఘంటువు- బ్రౌణ్యము
శ్రీకృష్ణదేవరాయలవారి పట్టాభిషేక శాసనము
ఆప్తినిఘంటువు
ఆంధ్రదీపిక - మామిడి వెంకయ్య
ఆంధ్రపత్రికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి వ్యాసము
O. Mss. L. Reports.
(ఇంకను ప్రకరణవశమున వ్యాఖ్యలును టీకలును ఉదాహృతములు)

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుత్యాదికము

ఉ. శ్రీకమనీయ హార మణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దా కమలా వధూటియు నుదారతఁ దోఁపఁ, బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతు లచ్ఛతఁ బైకిఁ దోఁచి, య
స్తోకత నందుఁ దోఁచె నన, శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్. 1

శ్రీ ...... ణిన్, - శ్రీ = లక్ష్మియొక్క - కమనీయ = మనోహరమయిన (మణికి విశేషణము) - హార = ముత్తెపుఁబేరుయొక్క ('హారో ముక్తావళీ' అమ.) - మణిన్ = నాయకరత్నమందు ('మణిః స్త్రీపుంసయో రశ్మజాతౌ ముక్తాదికేపి చ' మేదిని.) చెన్నుగన్ = స్ఫుటముగా, తానున్ = వేంకట భర్తయు, కౌస్తుభంబునందున్ = (క్షీరసాగరోత్పన్నమై హరవక్షఃస్థలాలంకారభూతమయిన) కౌస్తుభాఖ్యమణివిశేషమందు, ఆ కమలా వధూటియున్ = ప్రసిద్ధురాలయిన లక్ష్మీ యువతియు ('లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీ ర్హరిప్రియా' అమ. 'వధూటచిరణ్టీ శబ్దౌ యౌవనవాచినౌ' సి. కౌ.), ఉదారతన్ = స్ఫుటముగా, తోఁపన్ = అగపడఁగా, పరస్పర ఆత్మలందున్ = ఒండొరుల హృదయములయందు ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధి స్స్వభావో బ్రహ్మ వర్ష్మ చ'...) ('ఆత్మా యత్న ధృతి స్వాన్త స్వభావ పరమాత్మసు । జీవ బుద్ధి శరీరేషు.' నానా.; 'చిత్తం తు చేతో హృదయం స్వాన్తం హృ న్మానసం మనః' అమ.), ఆకలితంబులు = నెలకొల్పఁబడినవి, ఐన - తమ యాకృతులు = మహాలక్ష్మీవేంకటభర్తలయొక్క స్వరూపములు, అచ్ఛతన్ = (దేహములయొక్క) స్వచ్ఛత్వముచేత, పైకిన్ = వెలుపలికి, తోఁచి = అగపడి, అస్తోకతన్ = గొప్పతనముచేత ('స్తోకాల్ప క్షుల్లకాః' అమ.) అందున్ = ఆ నాయకమణియందును ఆకౌస్తుభమందును, తోఁచెన్ = అగపడినవి, అనన్ = అనునట్లుగా, శోభిలు వేంకటభర్తన్ = ప్రకాశించుచున్న వేంకటేశ్వరుని, కొల్చెదన్ = సేవించుచున్నాను. [వేం పాపం - కటతి ఆవృణోతి హరతి ఇతి వేఙ్కటః - వేంకటమని శేషశైలమునకు పేరు. పాపమును హరించును అని ఆపదమున కర్థము. ఆకొండకు దొర (అందు నివసించువాఁడు) గాన వేంకటభర్తయని భగవంతునికి పేరు.]

లక్ష్మీ వేంకటేశ్వరులు ఒండొరుల కెదురుగాఁ గూర్చున్నప్పుడు, లక్ష్మియొక్క ముత్యాలసరంపునాయకమణియందు వేంకటేశ్వరస్వామి స్ఫుటముగా ప్రతిబింబించెను, అట్లే వేంకటేశ్వరస్వామి హృదయమందలికౌస్తుభమణియందు లక్ష్మి చక్కఁగా ప్రతిబింబించినది. ఆప్రతిబింబించుట ఎట్టు లుండె ననఁగా—ఆమెహృదయమం దున్న వేంకటభర్త ఆహృదయము స్వచ్ఛముగావున అందుండి వెలికి తోఁచి అట వెలుపల నున్న స్వచ్ఛనాయకమణియందు అగపడినట్లును,

ఆయనహృదయమందున్న లక్ష్మి ఆహృదయముయొక్క స్వచ్ఛతచేత వెలికి అగపడి అటవెలుపల కౌస్తుభమణియందు అగపడినట్లును ఉండెను. అట్లు లక్ష్మీయుక్తుఁడై మహానందములోనున్న వేంకటేశ్వరస్వామిని సకలమంగళప్రాప్త్యర్థమై కొలిచెదను.

ఇట లక్ష్మీనారాయణులు ఒండొరులను స్వాభిముఖవ్యక్త్యంతరములనుగా భావించుట గాదు. మఱి యేమన - పూర్ణతృప్త్యర్థమై అభేదభావన వహించి రనవలయు. అనఁగా శ్రీ తన్ను హరినిగాను హరి తన్ను శ్రీనిగాను భావించుట చెప్పఁబడినది. అట్లైననేగాని హరికౌస్తుభమందలి లక్ష్మీముఖమును, లక్ష్మీమణియందలి హరిముఖంబును బహిర్దృశ్యములు గావు.

ఈపద్యమందు లక్ష్మీవిశిష్టుని వేంకటభర్తను ప్రధానీకరించుటచేత కవి ఈప్రబంధమందు విశిష్టాద్వైతమతము ప్రతిపాద్యమని సూచించినాఁడు.

విష్ణువుయొక్కయవతారాది విశేషములు ఎన్నియో యుండఁగా అందు వేంకటభర్తనే కవి యిటం గొలుచుటకుం గారణము "నీ కల వేంకటపతి యిష్టమైనవేల్పగుటన్" అని వక్ష్యమాణ భగవద్వాక్యము (౧ ఆ. ౧౬ ప.) చే స్పష్టము.

ఇందు శ్రీహరుల యన్యోన్యసానందాభిముఖ్యావస్థను జెప్పుటచేత పరస్పరాత్యంతానురక్తి సూచితము.

ఇందు ప్రతిబింబములను పైకగపడిన మనోగతమూర్తులనుగా సంభావించినందున ఉత్ప్రేక్షాలంకారము; 'అనన్' - తద్వాచకము.

"ఫలతను హేతుత వస్తుత । నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్." అలం.

సకలశుభార్థము కావ్యాదిని శ్రీకారము ప్రయోగింపఁబడినది.—

"వేదములకెల్ల నోంకార మాదియైన । కరణిఁగృతులకునెల్ల శ్రీకార మాది;
కానఁ గవివరులెల్లను దానిఁదక్క । నితరవర్ణంబు లిడరు సత్కృతులమొదల."

"పదపడి శ్రీకారము కృతి । మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును । గదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్."

"శుభదేవతాత్రయంబును । శుభఖచరత్రయము గలిగి శుభవాచకమై
యభినుతిఁగాంచినకతమున । శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే." అప్ప.

ఇందు ఉత్పలమాలావృత్తము.—

"ఉత్పలమాలలో భరన లొప్పును భారవలుం దిశాయతిన్."

కావ్యాదియందలి భగణమునకు ఫలము.—

"రసము హాస్యంబు, వన్నియు రజతనిభము, ఫలము ధన హేమ మణి వస్త్ర పశు తనూజ
పరిజనాశ్వాది సంప్రాప్తి, భగణమునకు దానవవినాశ కామెపల్లి నివేశ." అప్ప.

ద్వితీయపాదమందు 'ఉదార' శబ్దమునందు 'ఉత్ ఆర' అని ఛేదము. 'ఉత్' అనునది యుపసర్గగాన దానిమీఁది యా (ఆ) కారమునకు ఉపసర్గయతి వచ్చినది.

'ఆంధ్రమునకుఁ జేరని పరాజవులు మూఁడు గాక తక్కిన యుపసర్గకముల తలల
స్వరము లదికిన వాని కవ్వలను నిలుచు నచ్చుయిన హల్లయినఁ బ్రాదియతి యనంగ.' అప్ప.

ప్రతిబింబకల్పనచేత నలంకారకల్పన యితర గ్రంథములందునుం గలదు; అందులకు రెండుమూఁడు ఉదాహరణములు:—

'శ్రీలీలావతి దా నురోమణి సభాసింహాసనత్కౌస్తుభా
వేలాభా ప్రతిబింబితాంగి యగుచు న్వే ఱొక్కతెం దాల్చినాఁ
డౌ లే యంచుఁ దలంచునో యని యమందానందుఁడై లక్ష్మి నే
వేళం గౌఁగిటఁ జేర్చు శౌరి నరసోర్వీనాయకుం బ్రోచుతన్.' నరస.

'శ్రీభూపుత్త్రివివాహవేళ నిజమంజీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తవరాంఘ్రిరేణుభవకన్యాలీల యంచున్ మదిన్
దా భావింప శుభక్రమాకలనచేఁ దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోచుత న్దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్.' వసు.

'శ్రీరామాంశజయైన జానకి యురస్సీమాంత రాత్యంతవి
స్తారప్రోజ్జ్వలహారనాయకమణీసందర్శితం బౌ నిజా
కారం బారసి యన్యకాంత యను శంకం జెందు నం చెంచి త
న్నారీరత్నము నంకపీఠి నిడుసీతాభర్త నన్ బ్రోచుతన్.' హంస.

'వక్షఃపీఠే నిరీక్ష్య స్ఫటికమణిశిలామణ్డల స్వచ్ఛభాసి
స్వచ్ఛాయాం సాభ్యసూయా త్వ మియ మితి ముహుః సత్య మాఖ్యాసి తాపి
వామే మే దక్షిణేస్యాః శ్రవసి కువలయం నాహ మి త్యాలపన్తీ
దత్తాశ్లేషా సహాసం మదనవిజయినా పార్వతీ వః పునాతు.'

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి, హరి ద న్జేర న్బ్రహర్షించు ను
ర్వరకు న్వంచనఁ గూడఁ గాఁ గలుగు భాస్వచ్చంద్రశాలా పరం
పర లయ్యె న్బఱ పైన యెవ్వని ఫణా పఙ్క్తుల్ భజింతు న్నిరం
తరముం దాంతుని నయ్యనంతుని నతీత బ్రహ్మకల్పాంతునిన్. 2

పఱ......క్తులు - పఱపు = విస్తీర్ణములు - ఐన - ఎవ్వని = ఏయనంతునియొక్క - ఫణా = పడగలయొక్క ('స్ఫటాయాంతు ఫణా ద్వయోః' అమ.) - పంక్తులు = వరుసలు, హరి = నారాయణుఁడు, సిరిన్ = లక్ష్మిని, ఒక్కప్పుడు = ఎప్పుడేని, కను మొఱంగి = కనుఁబ్రామి (అనఁగా లక్ష్మికి కనఁబడకుండ), తనున్ = తన్ను (భూమిని), చేరన్ = కలియఁగా, ప్ర......రకున్ - ప్రహర్షించు = సంతోషించునట్టి - ఉర్వరకున్ = భూమికి ('ఉర్వరాతు భూమాత్రే సర్వసస్యాఢ్య భువ్యపి' హేమ.), వంచనన్ = మోసముగా (అనఁగా లక్ష్మిని మోసగించి), కూడఁగాన్ = పొందుటకై, కలు.....రలు - కలుగు = ఉన్నట్టి - భాస్వత్ = ప్రకాశముగల - చంద్రశాలా = మేడలయొక్క 'చన్ద్రశాలా శిరోగృహమ్.' హలా.), పరంపరలు = పంక్తులుగా, అయ్యెన్ = అయినవో (ఉపయోగపడినవో), దాంతునిన్ = ఇంద్రియనిగ్రహము కలవాఁడును, అతీ...తునిన్ - అతీత = దాఁటఁబడిన - బ్రహ్మ = బ్రహ్మయొక్క - కల్పాంతునిన్ = ప్రళయములు గలవాఁడును ('సంవర్తః ప్రళయః కల్పః క్షయః కల్పాన్త ఇత్యపి.' అమ.), (అయిన, అయనంతునిన్ = ఆశేషాహిని ('శేషోనన్తః' అమ.), నిరంతరమున్ = సర్వదా, భజింతున్ = సేవించెదను.

హరికి లక్ష్మియు భూమియు భార్యలు. అందు లక్ష్మి యెప్పుడును ఆయనయొక్క వక్షఃస్థలమందు ఉండును. కావున ఆమె యెఱుకలేక భూదేవిని కూడుట హరికి శక్యముగాదు. భూమిని హరి కూడుట లక్ష్మికి సవతికి ఇష్టము గాదు. ఇట్టిదశలో ఎప్పుడేని లక్ష్మికి తెలియనీయక హరి తన్ను కూడునేని అందులకై హర్షించుచు ఆయనం బొందుటకై భూదేవికి ఏయనంతుని విశాలపుం బడగలపంక్తులు ప్రకాశమానములయిన మేడల వరుస లనుగ నొప్పుచున్నవో ఆయనంతుని జితేంద్రియుని బ్రహ్మకల్పముకన్న నెక్కుడు కాలముండువానిని ఎల్లప్పుడును సేవించెదను.

'ఒక్కప్పుడు' అనుటచే అరుదుగా ననియు, సిరిని కనుమొఱంగుట తఱచుగా ఘటిల్లదనియు, భా. మొఱంగుటకును చేరుటకును కర్తనుగా 'హరిని' జెప్పుటచే హరికి భూదేవియందుఁగల ప్రేమాతిశయము సూచితము. ఆ ప్రేమాతిశయమునకే భూదేవి 'ప్ర=మిక్కిలి - హర్షించుట'. సర్వసస్యాఢ్యయను నర్థముగల 'యుర్వరా' శబ్దప్రయోగముచేత అలంకృత యని సూచితము. 'ప్రహర్షించు నుర్వర' యనుటచే సస్యరూపమైన రోమాంచము దాల్చినదనియు భా. వంచనన్'- వాస్తవమయిన చంద్రశాల లగునేని అందుందురని శంకగలుగును, పడగలుగావున అట్టిశంక గలుగదు; అట్లుశంకకు అవకాశము లేకుండఁ జేసికొనుటయే వంచన. 'భాస్వత్' - పగడలు మణులుగల వగుటచేత...దాంతునిన్' - తనయందే భూహరులు విహరించుచున్నను నిర్వికారుఁడనుట. అట్టిమహనీయుఁడు గావునను, హరికిని భూదేవికిని అట్టిమహోపకారిగావునను తదనుగ్రహముచేత 'అతీతబ్రహ్మకల్పాంతుఁడు,' అవశ్యసేవ్యుఁడనుట.

ఇందు ఫణములను చంద్రశాలలనుగా సంభావించినందున ఉత్ప్రేక్షాలంకారము.

'కన్నుమొఱంగి' - 'కుఱు నులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు'. (బా. ప్ర. 8.) కావున 'కనుమొఱంగి' అని యేర్పడి, 'పదాంతంబుల యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' (బా. ప్ర. 16) అను సూత్రముచే 'కన్మొఱంగి' అయినది._ 'తనుఁజేరన్' అనియుండఁగా, బా. ప్ర. 16. చేత ఉత్వలోపము రాఁగా, 'పాలఁతి' ఇత్యాదులయందు అత్వముతోఁగూడ తదాశ్రితమగునరకున్న పోయి 'పాత్తి' అయినట్లే, 'తన్జేరన్' అని యైనది - 'పఱపు' - స్త్రీసమంబులగు విశేషణంబులయు...బహువచనంబున కేకవచనంబు బహుళంబుగానగు' (బా. కా. 20); కావున 'పఱపులైన' యనియుం జెప్పనగు.- 'సిరిని కన్మొఱంగి' - ఇట ద్వికర్మకత్వ మంగీకర్తవ్యము. - 'పంక్తుల్' - బా. ప్ర. 16.

సీ. ఖ నట త్పయోబ్ధి వీక్ష్య రసాతలాన్యోన్య
పిండీకృ తాంగ భీ తాండజములు,
ధృత కులాయార్థ ఖండిత సమి ల్లవరూప
చరణాంతికభ్రమ త్తరువరములు,
ఘన గుహా ఘటిత ఝాంకరణ లోకైక ద్వి
దుందుభీకృత మేరు మందరములు,
చటుల ఝంపా తర స్స్వ నగరీ విపరీత
పాతితాశాకోణ పరిబృఢములు,

తే. ప్రబలతర బాడబీకృతేరమ్మదములు,
భాస్వరేరమ్మదీకృత బాడబములు,
పతగ సమ్రాట్పతత్త్ర ప్రభంజనములు,
వృజినతూలౌఘములఁ దూల విసరుఁగాత. 3

1. ఖ......లు - ఖ = ఆకాశమందు - నటత్ = తాండవించుచున్న - పయః = నీరుగల - అబ్ధి = సముద్రమునందు - వీక్ష్య = చూడఁదగిన (కనఁబడుచున్న) - రసాతల = పాతాళమందు ('అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్' అమ.) - అన్యోన్య = ఒండొకటితో - పిండీకృత = ముద్దగాఁ జేసికొనఁబడిన (చుట్టచుట్టుకొనఁబడిన)-అంగ = దేహములుగలవైన ('అఙ్గం గాత్రా న్తికో పాయ ప్రతీకేష్వప్రధానకే' నానా.) - భీత = భయపడిన - అండజములు = పాములు గలవియు ('పక్షిసర్పాదయోఽణ్డజాః' అమ.) - గరుత్మంతుని ఱెక్కల గాలిదెబ్బకు సముద్రములోనినీ రంతయు ఎగసి మింట అల్లకల్లోలములుగా దుముకుచుండెననియు, అట్లు జలములేమిచే బయలైన పాతాళమందు గరుడునికి భయపడి పాములు ఒక దానినొకటి చుట్టుకొని ముడుంగుచు కనఁబడుచుండె ననియు భా. అత్యుక్త్యలంకారము. కొందఱమతంబున సంబంధాతిశయోక్తి.

'శూరుప వద్భుతమిథ్యా । శూరతోదారతాది సాబ గత్యుక్తిః.' అలం.

భీతిచేత సర్పములొండొంటిం బెనఁచికొని చుట్టుకొనె ననుట స్వభావోక్తి.

2. ధృ......లు. - కలాయ అర్ధ = గూఁటికొఱకు ('కులాయో నీడ మస్త్రియామ్' అమ.) - ఖండిత = విఱువఁబడినవై - ధృత = ధరింపఁబడిన - సమిత్ = చిదుగులయొక్క - లవ = లేశములయొక్క (చిన్నచిదుగులయొక్కయనుట - 'ఇధ్మనం త్వేధ ఇధ్మ మేధః సమిత్ స్త్రియామ్.' అమ.) - రూప = ఆకారమువంటియాకారము గలవై - చరణ = పాదములయొక్క - అంతిక = సమీపమందు - భ్రమత్ = చలించుచున్న - తరువరములు = శ్రేష్ఠవృక్షములు (మహావృక్షము లనుట) కలవియు - ఎగయుచున్న గరుడుని ఱెక్కలగాలికి మహావృక్షములు పెల్లగిల్లి యతని కాళ్లకడ సుడియుచు ఎట్లగపడిన వనఁగా, ఆయన గూఁడు కట్టుకొనుటకై చెట్లనుండి విఱుచుకొని కాళ్లలో ఇఱికించుకొని కొనిపోవుచున్న చిన్నచిన్నచిదుగులో యనునట్లుండెను. - 'సమిల్లవరూప' అనుసమాసముచేత ఔపమ్యము చెప్పఁబడినను సంభావనయందే తాత్పర్యముగాన నుత్ప్రేక్షాలంకారము. ['ప్రశంసాయాం రూపప్' అను సూత్రముచే 'ప్రశస్తమయిన సమిల్లవములు (=చిన్నచిదుగులు) అని యర్థముగా రూపప్ ప్రత్యయమేని యగుఁగాక.] ఆయుత్ప్రేక్ష-చెట్లుపెల్లగిల్లి గరుడుని కాళ్లకడ భ్రమించుచున్నవి అనెడు నతిశయోక్తిని ఉపజీవించుచున్నది.

3. ఘన...లు - ఘన = గొప్పవైన - గుహా = గవులయందు ('దేవఖాతబిలేగుహా' అమ.) - ఘటిత = కూర్పఁబడిన (= కలిగింపఁబడిన) - ఘూంకరణ = ఘూంకారముచేత - లోక = విశ్వమునకు (అంతటికిని) ('లోకో విశ్వే జనే' హేమ.) - ఏక = ఒక్కటియే యగు - ద్విదుందుభీకృత = జంట భేరిగాఁ జేయఁబడిన (ద్విదుందుభి - సమాహారద్విగువు.) ('భేరీ స్త్రీ దున్దుభిః పుమాన్' అమ.) - మేరు మందరములు = మేరుపర్వతమును మందరపర్వతమును గలవియు.— మేరుగుహాయందును మందరగుహాయందును ఱెక్కల గాలిచే ఘూంకరణము ఒక్కమ్మడినే ఆయెనని వేగాద్యతిశయవర్ణన. అమ్మోఁతతోడి యా రెండు పర్వతములును ప్రపంచమునకెల్ల నొక్కటే జంటభేరి రూపముగా నొప్పుచుండెనని భా. - రూపకము.

4. చటుల ... ములు.—చటుల = తీవ్రమయిన - ఝంపా = దాఁటుయొక్క - తరస్ = బలముచేత ('తరో జవే బలే' - హేమ.) - స్వ = తమ తమ - నగరీ = పట్టణములనుండి విపరీత - వ్యత్యాసముగా - పాతిత = వైవఁబడిన - ఆశా = దిక్కులయొక్కయు ('ఆశా దిగతి తృష్ణయోః' అమ.) - కోణ = మూలలయొక్కయు - పరి బృఢములు = ఏలికలుగలవి - ఈయన మహావేగముతో దాఁటులు దాటుచుండగా జనించినగాలిబలముచేత అష్టదిక్పాలకులును తమ తమ పట్టణములనుండి విపరీత దిక్పట్టణములలో పోయిపడిరఁట.—అత్యుక్తి.

"అరయ నద్భుత మిథ్యా శూరత్వౌదార్యరచనను మత్యుక్తిన్" అలం.

ప్రబ ... ములు - ప్రబలతర = అతిబలిష్ఠములయిన - బాడబీకృత = బడబాగ్నులుగాఁ జేయఁబడిన - ఇరమ్మదములు = మేఘజ్యోతులుగలవియు, భాస్వ...లు — భాస్వర = ప్రకాశమానములైన - ఇరమ్మదీకృత = మేఘాగ్నులుగాఁ జేయఁబడిన - బాడబములు = బడబానలములు గలవియు (ఈయన ఱెక్కలగాలిదెబ్బకు మేఘములలోని జ్యోతి సముద్రమునడుగున బడబానలస్థానమునం బడెననియు, అచటిబడబానలము మేఘములందు జ్యోతిస్సుగాఁ బడెననియు భా. - అత్యుక్తి.), (ఇట్టివైన) పత...ములు - పతగసమ్రాట్=పక్షిరాజుయొక్క (గరుడదేవునియొక్క) - పతత్త్ర = ఱెక్కలయొక్క ('గరుత్పక్షచ్ఛదాః పత్త్రం పతత్త్రం చ తనూరుహామ్' అమ.) - ప్రభంజనములు = వాయువులు, వృ...లన్ - వృజిన = పాపములనెడి ('కలుషంవృజినైనోఘమంహోదురితదుష్కృతమ్.' అమ.) - తూల = దూదియొక్క - ఓఘ = మొత్తములను ('ఓఘోబృన్దేఽమ్భసాం రయే' అమ.), తూలన్ = చెదరి పోవునట్లు, విసరుఁగాత = వీచునుగాక (పాపములను పోనడంచును గాకయనుట.).

ఝమ్పా - ఇంగ్లీషు Jump - జంప్.*

—* విష్వక్సేనుని బెత్తమునకు వందనము సల్పుట *—

ఉ. పూని ముకుందు నాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి యజాండభాండము
ల్వానను మీఁదఁ బోవ నడువ న్గొనెఁ ద న్నన నగ్రనిశ్చల
త్వానచలత్వనిష్ఠలె సమస్తజగంబుల జాడ్యచేతన
ల్గా నుతికెక్కుసైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్. 4

ముకుందునాజ్ఞన్ =విష్ణువుయొక్క యానతిని, కనుబొమ్మనె=భ్రూసంజ్ఞచేతనే, కాంచి=కనిపట్టినదై, పూని=ప్రయత్న పూర్వకముగా, అజ అండ భాండముల్=బ్రహ్మాండము లనెడు కుండలను, వానన్ = చేయుటకును (సృజించుటకును), మీఁదన్ = పిమ్మట, పోవనడువన్ = పోఁగొట్టుటకును (సంహరించుటకును), తన్నున్ (=వేత్రమును), కొనెన్ = గ్రహించెను, అనన్=అనునట్లుగా (ఉత్ప్రేక్షావాచకము), అగ్ర......లె-అగ్ర=తనతుదయొక్క-నిశ్చలత్వ=కదలమి యొక్కయు - అనచలత్వ=కదలికయొక్కయు - నిష్ఠలె=వ్యవస్థలే ('నిష్ఠోత్పత్తి వ్యవస్థయోః' మేది.), సమస్త జగంబుల జాడ్యచేతనల్=ఎల్లలోకముల యొక్కయు నిర్వ్యాపారతయు సవ్యాపారతయు, కాన్=అనునట్లుగా, నుతికెక్కు = పొగడ్త నొందుచున్నదైన - సైన్యపతి =

* 'గభీరే తే నాభీసరసి కృతఝమ్పో మనసిజః' సౌందర్యలహరి. 77

విష్ణుసేనా నాయకుఁడయిన విష్వక్సేనుని యొక్క - కాంచనవేత్రమున్ = సైనాపత్యాధికార సూచకమయిన బంగారపు బెత్తమును, ఆశ్రయించెదన్ = సేవించెదను.

శ్రీమన్నారాయణునియొక్క సేనాపతియై తదీయ సర్వకార్యనిర్వాహకుఁడయిన విష్వక్సేనుని చేతి బెత్తముయొక్క కొన కదలినప్పుడు లోకము లెల్ల చేతనం బొరయుటయు కదలక నిలిచినప్పుడు జడత్వము వహించుటయుం జూడఁగా, ఏమని సంభావింపఁ దగియున్న దనఁగా, ఆ బెత్తమే నారాయణుని కనుబొమ సంజ్ఞ నుగ్రహించి తనచివరయొక్క కదలిక చేత సృష్టియు, కదలికను మానుటచేత సంహారమును చేయఁగల యంత మహిమగలది గదా, యని తలంచి దానిని ఆవిష్వక్సేనదేవుఁడు చేతఁబూనినాఁడా యని సంభావింపఁ దగియున్నది.-ఉత్ప్రేక్షాలంకారము.

ఇచట బ్రహ్మాండములు కుండలుగాను, వేత్రము కుమ్మరసారెం ద్రిప్పు కోలగాను, విష్వక్సేనుఁడు కుమ్మరిగాను రూపకము-ఏకదేశవివర్తి; తదనుప్రాణితము ఉత్ప్రేక్షాలంకారము. 'అనుచలత్వ' అను పాఠమందు-తర్వాతి కదలికయని యర్థము. 'అనచలత్వ' అను పాఠమున నఞ్ద్వయము కలదు. అచలత్వమే నిశ్చలత్వము, దాని ప్రతిషేధము మొదటి నఞ్చేత తెలుపఁబడినది. 'వాను' ధాతువు కుండలు చేయుటయందు ప్రసిద్ధము. ముకుందుఁడు - ముకమ్=మోక్షమును దదాతి=ఇచ్చువాఁడు.

—* పాంచజన్యవర్ణన *—

మ. హరి పూరింపఁ దదాస్య మారుత సుగంధాకృష్టమై నాభిపం
కరుహక్రోడమిళిందబృంద మెదు రెక్కం దుష్క్రియాపంక సం
కర దైత్యాసు పరంపరం గముచు రేఖం బొల్చు రాకా నిశా
కరగౌరద్యుతి పాంచజన్య మొసఁగుం గల్యాణ సాకల్యమున్. 5

హరి = శ్రీవిష్ణువు, పూరింపన్ = ఊఁదినప్పుడు, త...ము - తత్ = ఆయనయొక్క - ఆస్య = నోటియొక్క - మారుత = ఊరుపుయొక్క - సుగంధ = నెత్తావి చేత - ఆకృష్టము = లాగఁబడినది, ఐ, నా...ము - నాభి = బొడ్డునందలి - పంకరుహ = తామరయొక్క - క్రోడ = ఒడియందలి (లోనిప్రదేశమందలి యనుట - 'క్రోడో నా సూకరే క్లీబ ముత్సఙ్గే వక్షసి ద్వయోః' నానా.) - మిళింద = తుమ్మెదలయొక్క - బృందము = మొత్తము, ఎదురుఎక్కన్ = (పాంచజన్యమునకు) ఎదురుగా పోవుచుండఁగా, దుష్క్రి...రన్ - దుష్క్రియా=చెడుపనులయొక్క - పంక = పాపముతోడి ('పఙ్కోఽస్త్రీ కర్దమే పాపే' మేది.) - సంకర = కూడికగలదైన - దైత్య = అసురులయొక్క - అసు = ప్రాణములయొక్క ('పుంసి భూమ్న్యసవః ప్రాణాః' అమ.) - పరంపరన్ = వరుసను, కముచురేఖన్ = కవ్వుకొను రీతిగా, పొల్చు = ప్రకాశించుచున్నట్టిది, రాకా...తి - రాకా = నిండుపూర్ణిమయందలి-నిశాకర = చంద్రునివలె - గౌర = తెల్లని - ద్యుతి= కాంతిగలది (ఉపమ), (ఐన), పాంచజన్యము = నారాయణునిశంఖము, కల్యాణసాకల్యమున్ = మంగళములయొక్క సమగ్రత్వమును (ఎల్లమంగళములను అనుట), ఒసఁగున్=ఇచ్చునుగాక.

పంచజనుఁ డను నొకానొక దైత్యుఁడు శ్రీకృష్ణునికి ఎగ్గుచేసెను. అంత నాభగవంతుఁడు వానిని సంహరించి వానిమెడయెముకతో శంఖము చేసికొనెను. కావున ఆశంఖమునకు పాంచజన్యమని పేరు కలిగినది.

దైత్యారియగు శ్రీహరి దైత్యసంహారార్థము కడంగి పాంచజన్యమును ఊఁదుడు దానియందు నిండిన యాయననముఖవాయువుయొక్క నెత్తావికై పొక్కిటి తమ్మిలోపలినుండి తుమ్మెదలు బారులుగా నెగిరిపోయి యాపాంచజన్యము పైఁబడుట యెట్టు లుండు ననఁగా ఆపాంచజన్యము పాపకళంకితములయిన దైత్యప్రాణములవరుసలను గ్రసించుచున్నదో యనునట్లుండును. అట్లొప్పుచున్న యాపాంచజన్యము పున్నమరేయిటి చందురునివలె తెల్లనయినట్టిది సకలమంగళములను ఇచ్చునుగాక.

'క్రోడ'-ఒడి యనుటచేత లోపలిమకరందమును త్రాగుచున్నట్టి వని భా. 'అసు' - ప్రాణములు వాయుస్వరూపములు, వానికి రూపములేదు, అయినను వాని నంటియున్న పాపము నలుపుగావున నల్లనిప్రాణము లనునట్లున్నవని తుమ్మెదలకు ఉత్ప్రేక్ష. 'కముచు' -దానిధ్వనికే ఎందఱోగుండె బ్రద్దలై చత్తురు గావున, అదియే వారిప్రాణములను గ్రసించుచున్నట్లున్నదని యుత్ప్రేక్ష. 'రాకానిశాకర' సామ్యము 'గౌర' త్వాతిశయద్యోతనార్థము. మఱియు, ఇట గౌరత మాత్రమే సామాన్య ధర్మముగా కంఠోక్తమయినను, పాపసంకీర్ణములయిన యసువులు కళంకమువలె నున్న వనియు భావము కలదు; కావున 'రాకా' ప్రయోగము కలంకోత్కట త్వార్థము కూడ. 'కల్యాణ' - దుష్క్రియాపంకము వ్యాతమయినచో కల్యాణమునకు ఏలోపమునుండదు.

'పొల్చురాకా...ద్యుతి' - ఇందు 'రాకా...ద్యుతి' - అనునది బహువ్రీహిసమాసము. 'పాంచజన్య'మునకు విశేషణము; దానికి 'పొలుచు' అను తదర్ధాద్యర్థకవిశేషణముతో విశేషణోభయపదకర్మధారయసమాసము - 'పాంచజన్యము.' వ్యస్తపదము కానిచో 'రాకా... ద్యుతి' అను విశేషణమందు అవిమృష్టవిధేయాంశతాదోషము సంభవించును. 'ఒసఁగుత' - తదర్ధాద్యర్థములలో ఆశీస్సుకూడఁ జేరియున్నది.

ఇందు వృత్త్యనుప్రాసములు గలవు.

## —* నందకవర్ణన *—

మ. ప్రతతోర్ధ్వాధరభాగ పీఠ యుగళీ భాస్వత్త్సరు స్తంభ సం
స్థితిఁ దీండ్రించెడు జాళువా మొసలివా దీప్తార్చిగాఁ గజ్జలా
న్వితధూమాసిత రేఖ పైయలుఁగుగా విజ్ఞాన దీపాంకురా
కృతి నందం బగు నందకం బఘలతాశ్రేణి చ్ఛిదం జేయుతన్. 6

ప్రత......తిన్ - ప్రతత = పఱపైన - ఊర్ధ్వ = మీఁది - అధర = క్రింది - భాగ = అవయవములయిన - పీఠ = పీఠములయొక్క (గుండ్రని చదును భాగములయొక్క) - యుగళీ = దోయిచే - భాస్వత్ = వెలుంగుగలదైన ('భాస్వాన్ దీప్తేరవా' మేది.) త్సరు = పిడియనెడి ('త్సరుఃఖడ్గాదిముష్టౌస్యాత్' అమ.) - స్తంభ = కంబమందు - సంస్థితిన్ = ఉనికిచేత, తీండ్రించెడు = వెలుంగుచున్న - జాళువా = బంగారపు - మొసలివా = మొసలినోరనెడి పేరుగల భాగము, దీప్తార్చి - దీప్త = జ్వలించుచున్న - అర్చి = జాల్వ ('జ్వాలా భాసో ర్నపుం స్యర్చిః' అమ. అర్చిశ్శబ్దము సకారాంతము), కాన్ = అగుచుండఁగా, పైయలుఁగు = మీఁది యనుపచివర, క......ఖ - కజ్జల = కాటుకతో - అన్విత = కూడుకొన్న - ధూమ = పొగయొక్క - అసిత = నల్లని - రేఖ = గీఱ (కొడి), కాన్ = అగుచుండఁగా, విజ్ఞాన దీప అంకుర ఆకృతిన్ = ఎఱుకయనెడు

దివ్వె మొలకయొక్క యాకారముతో, అందంబు అగునందకంబు = ఒప్పారుచున్న విష్ణుఖడ్గము, అ...దన్ - అఘ=పాపములనెడు - లతా=తీఁగలయొక్క - శ్రేణి=వరుసయొక్క - ఛిదన్ = కోఁతను, చేయుతన్ = కావించును గావుత.

పిడికిటికి క్రిందుమీఁదులనుండు గుండ్రని చదునుబిళ్లలతోడిపిడి దీపస్తంభమువలెను, అటుపై మొసలివాయియాకారముగలదై మొసలివాయి యను పేరంబరఁగుచుండు బంగారపుభాగము దీపజ్వాలవలెను దానిపైనుండునట్టియలుఁగు దీపపుఁబొగరేఖవలెను ఒప్పుచుండఁగా, తాను విజ్ఞాన దీపాంకురమోయన నొప్పుచున్న నందకము పాపము లనెడి తీఁగల పరంపరను కోసివైచునుగాక యని ప్రార్థన.

ఇచట - నందకమందు విజ్ఞాన దీపాంకురత్వము సంభావింపఁబడినది, కావున ఉత్ప్రేక్షా లంకారము. దానిభాగములయందు దీపస్తంభత్వాద్యారోపము రూపకాలంకారము.

'కజ్జలాన్విత ధూమాసితరేఖ పైయలుఁగుగాన్' అనుచో ప్రక్రమభంగముం బరికించునది.

—* కౌమోదకీవర్ణనము *—

ఉ. యాదవసార్వభౌమ భయదాయత బాహునియుక్తిఁ జేసి యెం
దే దనుజేంద్ర సాళ్వపుర హేమమణీవరణంబు సంగతం
బై దివి నాత్మకంకణము లం దొక కంకణ మయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. 7

యాదవ...జేసి - యాదవ = యదువంశజుఁడయిన - సార్వభౌమ = సర్వభూమీశ్వరుని యొక్క (శ్రీకృష్ణునియొక్క అనుట) - భయద = బెట్టిదమయిన - ఆయత = నిడుపయిన - బాహు = భుజముయొక్క - నియుక్తిఁజేసి = ప్రయోగముచేత, ఎందేని = ఏకౌమోదకియందు, దను...బు - దనుజేంద్ర = దానవశ్రేష్ఠుఁడయిన - సాల్వ = సాళ్వునియొక్క - పుర = పట్టణముయొక్క - హేమ మణీ వరణంబు = బంగారముయొక్కయు రత్నములయొక్కయు (తన్నిర్మితమయిన యనుట) ప్రాకారము ('ప్రాకారో వరణః సాలః' అమ.) సంగతంబు ఐ = అంటు కొన్నదై, దివిన్ = ఆకాశమునందు, ఆత్మ = తనయొక్క (కౌమోదకియొక్క) - కంకణము లందున్ = వలయములనడుమ, ఒకకంకణము = తానును ఒకవలయముగా, అయ్యెన్ = ఒప్పెనో, మో...ల్యన్ - మోద = సంతోషముచేత - కీలిత = తగిలింపఁబడిన - సముజ్జ్వల = వెలుంగుచున్న - కల్పకమాల్యన్ = ఈవిమ్రాని పూవులదండకలదైన, అట్టి కౌమోదకిన్ = అటువంటి విష్ణుగదను ('కౌమోదకీ గదా' అమ.), కొల్చెదన్ = సేవించుచున్నాను.

శిశుపాలుని మిత్త్రులలోనొకఁడు సాల్వుఁడనువాఁడు లోకమున యాదవులు లేకుండం జేసెదనని ప్రతిజ్ఞచేసి శివునిఁగూర్చి తపసించి వరముగా దేవాసురాదిదురాసదమును సౌభకమను వ్యోమగామిపురమును బడసి దానిలోఁ బోయి ద్వారకపైఁ బడెను. ఇంతలో శ్రీకృష్ణుఁడు ధర్మజరాజసూయమునుండి వచ్చి కౌమోదకితో సౌభకమును సాళ్వుని నుఱుమాడెను. ఆకథ నిట ననుసంధించికొనవలయును. శ్రీ కృష్ణులవారు కౌమోదకితో సౌభకమును గొట్టినప్పుడు ఆగద ముందఱ దానిప్రభావ మెందులకును కొఱగాక దానిహేమమణిప్రాకారము తన్ను భేదించిన యా

గదయందు తదీయాలంకారభూతము లైయున్న వలయములతో తాను నొకవలయ మనునట్లుండెను. అట్టిజయోత్కృష్ట మగుటచే దేవతలు సంతోషముచే ఆగదను కల్పకమాల్యములు గురిసి యలంకరించినారు. అట్టి యాగదను సేవించెదను అని పద్యార్థము. ఈకామోదక్యాదిస్తుతులచేత శ్రీకృష్ణరాయల వైరులును ఆయాకామోదక్యాది దేవతా ప్రసాదముచేత రూపఱుదురుగాక యని కవి యాశయము.

ఇందు హేమరత్నమయమైన సౌధకసాలము కామోదకీవలయముగా సంభావితము గావున నుత్ప్రేక్ష; వాచకములేనందున గమ్య. 'మోదకి మోదకీ' అనుచో వృత్త్యనుప్రాసము.

'ఎందు ఏని దనుజేంద్ర' అనియుండఁగా 'అపిశబ్దార్థ స్యేతః' అనుసూత్రముచే వికల్పముగా ఏనిశబ్దఇవర్ణమునకు లోపము రాఁగా, 'ఎందేన్ దనుజేంద్ర' అయి, అనంతరము సరళము పరమై యున్న కారణంబున ద్రుతలోపము కలిగి, 'ఎందేదనుజేంద్ర' అయినది.

'సార్వభౌమ' - సర్వభూమీశ్వరుఁడైన నారాయణుఁడు గాని 'యాదవ' మాత్రుఁడు గాఁడనుట. 'ఆయత' - (మహాపురుషుఁడు) ఆజానుబాహువనుట. 'దివిన్' - గద మిన్నంటునంత గొప్పది యనుట. 'సముజ్జ్వలములు' - అప్పుడే కోసిన పువ్వులతో రచితములు గావున. సాళ్వుని నాశము ఇట్లు దేవతలకుసయితము ప్రియతమ మయ్యెఁగావున వాఁడు ఆబల్లిదుఁడు దనుజమాత్రుఁడు గాఁడు, దను 'జేంద్రుఁడే'. సాలము వలయాకారమును, సౌవర్ణమును, మణిఖచితంబును; కంకణమును అట్టిదే; కావున సాలమునకు కంకణసామ్యము.

—* శార్ఙ్గవర్ణనము *—

చ. పిడికెఁడు కౌనుఁ గొప్పుఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి, తేఁ
బిడికెఁడు కౌనుఁ గొప్పుఁ బయిఁ బెచ్చు గుణంబును గంటి నంచు, నే
ర్పడఁగ నిజత్రివక్రతయుఁ బాపఁగ మ్రొక్కెడు నా, సుమాలిపైఁ
జడిగొన నమ్ములీనుహరి శార్ఙ్గధనుర్లత గాచుఁ గావుతన్. 8

**పిడికెఁడు కౌనున్ = పిడికిట నిముడు నడుమును - కొప్పున్ = తుఱుమును - కని, ప్రేమన్ = అనురక్తిచే, త్రివక్రన్ = (మూఁడువంకరలు కల దగుటచేత) త్రివక్రయను పేరొందిన గుజ్జుదానిని, సమ అంగిన్ = తిన్నని (అవంకరలులేని) మేనుగలదానినిగా, చేసితి = చేసితివి; ఏన్ = నేను, పిడికెఁడుకౌనున్ = పిడికిట నిముడునట్టి మధ్యమును, కొప్పున్ = అగ్రంబును, పయిపెచ్చు = అంతకన్ననధికముగా, గుణంబునున్ = మంచితనమును కూడను (అల్లెత్రాటిని కూడను - 'మౌర్వీ జ్యా శిఞ్జినీ గుణః' అమ.), కంటిన్ = పొందియున్నాను, అంచున్ = అని; ఏర్పడఁగన్ = స్పష్టపడుచుండఁగా, నిజత్రివక్రతయున్ - నిజ = తనదైన - త్రివక్రతయున్ = మూఁడువంకరలు కలదైయుండుటనుకూడ, పాపఁగన్ = పోఁగొట్టుమని, మ్రొక్కెడున్ నాన్ = (శ్రీహరికి) నమస్కరించుచున్నదో యనునట్లుగా (నమస్కరించుటయందు దేహము వంగును, బాణములం బ్రయోగించునపుడు ధనుస్సు వంగును, కావున నిట్లుచెప్పుట), సుమాలిపైన్ = సుమాలియను నసురునిమీఁద, జడిగొనన్ = నిరంతరముగా (దట్టంపువానగా), అమ్ములు ఈను = బాణములను ప్రేరించుచున్న —హరి = నారాయణునియొక్క - శార్ఙ్గ ధనుర్లత = తీఁగ వంటిదైన (అంత సులువుగా సన్నగా ఆయనచేత మెలఁగుచున్న) శార్ఙ్గ మనిపేరి విల్లు, కాచున్ కావుతన్ = రక్షించునుగాక.**

త్రివక్ర యనునది మథురాపతి యగుకంసునికి మైపూఁతలు సమకూర్చు దాసి, మఱుగుజ్జది. శ్రీరామకృష్ణులు మథురం జొచ్చుచో త్రివక్ర కంసునికి విలేపనములం గొనిపోవుచుండెను. శ్రీకృష్ణుఁడు వానిం దన కిమ్మని యడుగ నాకుబ్జ ప్రీతిపూర్వకముగా వానిని రామకృష్ణులకు సమర్పించెను. శ్రీకృష్ణులవారు వాని నలంది హర్షించి యా త్రివక్రను అవక్రను సుందరి గావించిరి.—

సీ. "తత్పదంబులమీఁదఁ దన పదంబులు ద్రొక్కి, । హస్తాంగుళి ద్వయ మబలగౌద
క్రింద విప్పుగ నిడి, కృష్ణుఁడు మీఁదికి । నెత్తిన, వక్రత లెల్ల మాని,
ఆ. చక్కనైన చిత్తజన్ము బాణము క్రియఁ । గొమరు మిగిలి పిఱుఁదుఁ గుచయుగంబు
సొంపుసేయఁ, దరుణి సుందరమూర్తియై, । కమలనయనుఁజూచెఁ గాంక్షతోడ॥" భాగవతము

కుబ్జకు త్రివక్రత సరియే - శార్ఙ్గధనుర్లత కది యెట్లు? అమ్ములీనుతఱిని అది కలుగును. ఈవిషయము ఇందలి ౫ (౧౪౫) పద్యములోని తృణతాశబ్దముం గూర్చి పీఠికలో నా వ్రాసిన విస్తరమువలన సయితము తెలియ నగును.

త్రివక్ర ద్వాపరాంతముది, సుమాలి కృతయుగమువాఁడు. ఇట కాలసంగతి కల్పాంతర సంగతిచే గ్రాహ్యము. ప్రతికల్పమందును బ్రహ్మ మునుపటివలెనే సృజించు నని శ్రుతి.

వంగుట మ్రొక్కుటగా సంభావింపఁ బడినది గావున నుత్ప్రేక్షాలంకారము.

శ్రీహరి సుమాలిపై అమ్ములు వర్షించునప్పుడు శార్ఙ్గము మండలీకృత మగుచుండెను. అట్లగుట శ్రీహరింగూర్చి మ్రొక్కుటయో యనున ట్లుండెను. మ్రొక్కుట యేలయన తన త్రివక్రతను బాపుమని. ఆదేవుఁడు త్రివక్రతం బాపునా యనిన కృష్ణావతారములోఁ గుబ్జకుం బాపలేదా? అటయిన కుబ్జకు పిడికెఁడు కౌను కొప్పును ఉండినవి. వానియందముచే ననురక్తుఁడై శ్రీహరి దాని త్రివక్రతంబాపెను, అట్టియోగ్యత నీయందు కలదా? యనిన, నాయందు అవియే గాక పైగా గుణముకూడ కలదు, కావున నా త్రివక్రతను తప్పక తీర్చును అని సంభావన. 'కుబ్జ ఉవిద, ఉవిదయందు అనురాగము సహజము, నీవో?' యనిన, 'నేనును ఉవిదనే, నేను ధనుర్లతను, మహిళాహ్వయనుగదా ('లతాగోవర్ధనీ గున్ద్రా శ్యామాతు మహిళాహ్వయా' అమ.), అందుకొఱకే లతాసామ్యమును లతాశబ్దమును తదీయ స్త్రీత్వమును ఘటితములు.

'జడిగొను' - జడిశబ్దముచేత శ్రీహరి సజలజలదశ్యాముఁడనియు, శార్ఙ్గము ఇంద్రధనుః సకాశమనియు, 'జడిగొన, ఈను' అనుటచే మేఘోదరమునుండి ధారాసంపాతమువోలె సంధాన మోక్షములు గానరాక ఒక్కుమ్మడి లెక్కలేని యమ్ములు వెలువడుచుండె ననియు, స్ఫురణ.

—*సుదర్శనవర్ణన*—

చ. అడరు గళాస్రధారలు మహాముఖ వాంత సుధాంబు ధారలు
న్బొడవగు వహ్నికీలములుఁ బొంగును గాఁ, బెఱదైత్యకోటికి
న్బెడిదపుఁ గిన్కతో నెసరు వెట్టినపెద్దపనంటిఁబోలె, నె
క్కుడు వెస రాహు మస్తకముఁ గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. 9

అడ...లున్ - అడరు = ఉబుకుచున్న (ఉఱుకుచున్న) - గళ = గొంతుయొక్క - అస్ర = నెత్తుటియొక్క - ధారలున్ = ప్రవాహములును, మ......లున్ - మహాత్ = గొప్పదైన - ముఖ =

నోటిచేత - వాంత = క్రక్కఁబడిన - సుధా అంబు = అమృతోదకముయొక్క - ధారలున్ = ప్రవాహములును, పొడవు అగు = ఉన్నతములయిన - వహ్నికీలములున్ = నిప్పుమంటలును, పొంగునున్ = ఎసటియొక్క యుల్బణమును, కాన్ = అగుచుండఁగా, పెఱ దైత్య కోటికిన్ = కడమ యసుర సమూహమునకు, ఎసరువెట్టిన = ఎసరెక్కించినట్టి - పెద్ద - పనంటిఁబోలెన్ = కుండనో యనునట్లుగా, బెడిదపుఁగిన్క తోన్ = కడిఁదికోపముతో, ఎక్కుడు వెసన్ = అతి శీఘ్రముగా, రాహు మస్తకమున్ = రాహు (వను నసురు)ని శిరమును, కొన్న = ఖండించిన - సుదర్శనదేవున్ = (శ్రీహరియొక్క) చక్రాయుధ మనెడు వేల్పును, ('శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రం సుదర్శనం', అమ.) కొల్చెదన్ = సేవించుచున్నాను.

పూర్వము క్షీరసముద్రమథనోత్పన్న మయినయమృతమును నారాయణుఁడు మోహినీరూపముదాల్చి అసురులను వంచించి దేవతలకు త్రాగ నొసంగుచున్నసమయమున రాహువను నసురుఁడు దేవతామండలములోఁ జొచ్చిమాయచే తానును దానిం ద్రాగం దొడంగెను. ఆమోసము నంతలో గ్రహించి నారాయణుఁడు అయ్యమృతము కంఠము దిగకముందే చక్రాయుధముచే వానితలం దెగ నేసెను; అప్పుడు వానినోటినుండి వెలికింబడిన యమృతము ఎసటిపొంగు వలెను, దేహమునుండి వేర్పడి ఎగసినశిరమునకుం గ్రింద గొంతునుండి ఊర్ధ్వముఖముగా దుముకుచున్న నెత్తుటిధారలు ప్రొయ్యినిప్పుమంటలవలెను, ఆశిరము కడమయసురులమొత్తమునకు బోనమువండుటకై ఎసరుపెట్టిన పెద్దవంటకుండవలెను, దానిని ఘోరకోపముతో చరాలునం గొనుట వైరు లగువాయసురులకు అన్నము లేకుండఁ జేయుటకై వారి యావంటకుండను ఘోరకోపముతో చరాలున హరించుటపోలెను, ఒప్పెను. అట్టి మహిమాన్వితుని ఆసుదర్శనదేవుని సేవించెద ననుట.

మంట లెప్పుడును ఊర్ధ్వముఖముగానే యుండునుగావున తత్సామ్యసిద్ధికొఱకు నిలువుగా దుముకుట 'అడరు' శబ్దముచే చెప్పఁబడుచున్నది. 'మహోముఖ' - (మహత్తు) గొప్పది కావున నే 'పెద్ద' పనఁటివలె నున్నది. 'వాంత' - ఈపదము ఇచట వాస్తవముగాఁ గ్రక్కుటను చెప్పనందున గ్రామ్యము గాదు, మఱి ఖండితముఖమునుండి సుదర్శనహతివేగముచేత వెలి కొలికి పడిపోవుట అను గౌణార్థమునం బ్రయోగము గాన మనోహరమై యున్నది. 'పెఱ' - ఇతరులకొఱకు అనుటచే రాహువు అమృతమును సాధించిన తమకుం దెచ్చి యిచ్చు నని కడమయసురులు ఆస పెట్టుకొని యుండిరని స్ఫురణ. 'కిన్క' - మోసము చేసినందులకు. 'వెస' - అమృతము కంఠము దిగినచో వానికి అమరత్వము కలుగు నని. 'పొంగు'ను చెప్పుటచేత సిద్ధప్రాయ మని భా. 'కిన్కతో' కొనుట గాని, 'పెట్టు'ట గాదు.

రాహుమస్తకము పెఱదైత్యకోటికి ఎసరు వెట్టినపనంటిగా నుత్ప్రేక్షింపఁబడినది. అందులకు 'అడరు......పొంగునుగాన్' అనురూపకము అంగ మయి యున్నది.

—* పన్నిద్దఱు సూరులం దలంచుట *—

మ. అల పన్నిద్దఱు సూరులందును సముద్యచ్ఛ్రీలఁ గాపున్న వె
గ్గలపుం దాపముఁ బాప నా, నిజమనః కంజాత సంజాత పు
ష్కలమాధ్వీకఝరి స్మరారి సొగియంగాఁ జొక్కి ధన్యాత్ము లౌ
నిల పన్నిద్దఱుసూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్. 10

మురారి = శ్రీహరి, అల......లందునన్ - ఆ (ప్రసిద్ధులయిన) పదునిరువురు సూర్యులయందును ('సూర సూర్యార్య మాదిత్య ద్వాదశాత్మ దివాకరాః' అమ.), సముద్యత్ లీలన్ = ఏచుచున్న విలాసముతో ('లీలా విలాస క్రియయోః' అమ. ఇట నివసించిన నెట్లుండునో చూతము అనుపతూహలముచేత ననుట), కాపు ఉన్న వెగ్గలపుం దాపమున్ = నివాసముచేసిన మిక్కుటంపు వేఁడిమిని, పాపన్ నాన్ = పోఁగొట్టుకొనుటకో యనునట్లుగా, నిజ......ఝురిన్ - నిజ = తమవైన - మనః కంజాత = హృదయ కమలములందు - సంజాత = పుట్టినట్టి - పుష్కల = నిండారిన (పుష్కలస్తు పూర్ణే శ్రేష్ఠే' హేమ.) - మాధ్వీక = మకరందముయొక్క ('మధు మాధ్వీక మద్యయోః' అమ.) - ఝురిన్ = ప్రవాహమందు 'ప్రవాహో నిర్ఝరో ఝురః' అమ. ఝురా... ఝురిః...ఝురీ చ' రామా.), సొగియంగాన్ = సుఖించుచుండఁగా, చొక్కి = (ఆనంద) పరవశులై, ధన్య ఆత్ములు ఐ = పుణ్యమూర్తులగునట్టి ('సుకృతీ పుణ్యవాన్ ధన్యః' - 'ఆత్మాయత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.) - దివ్యులన్ = దేవతాస్వరూపులను, ఇల పన్నిద్దఱు సూరులన్ = భూమియందలి పన్నిద్దఱుజ్ఞానులను (పన్నిద్దఱాళ్వారులను), మోక్ష ఇచ్ఛామతిన్ = అపవర్గమందలి కోరికతోడి మనస్సుతో, తలఁతున్ = స్మరించుచున్నాను.

పన్నిద్దఱు సూర్యులు - 'ధాతామిత్రోర్యమారుద్రోవరుణఃసూర్యఏవచ । భగోవివస్వాన్ పూషాచ సవితాదశమఃస్మృతః । ఏకాదశస్తథాత్వష్టా విష్ణుర్ద్వాదశఉచ్యతే॥'

పన్నిద్దఱు ఆళ్వారులు: - సరో - భూత - భక్తిసార - మధురకవి - శఠకోప - కులశేఖర - విష్ణుచిత్త - గోదాదేవి - భక్తాంఘ్రిరేణు - ప్రాణనాథ - పరకాళ - తిరుమంగ యోగులు. (చూ. పీఠిక పు. 4)

వీరిలో 'పెరియాళ్వా' రని నామాంతరముగల విష్ణుచిత్తులవారి దివ్యచరిత్రము ఈగ్రంథమున వర్ణితము. వారివలననే దీనికి విష్ణుచిత్తీయమని పేరువచ్చినది. వీరి కూఁతురే 'ఆండాళ్' అని నామాంతరముగలదైన గోదాదేవి. ఆమెయే ఆముక్తమాల్యద, ఇందు కథానాయికయు.

'సవితృమణ్డల మధ్యవర్తీ నారాయణః' ఇత్యాది శ్రుతిప్రమాణములచే నారాయణుఁడు సూర్యునియందు వసించును. సూర్యులు పన్నిద్దఱు. అట్లే నారాయణుఁడు ఆళ్వారుల హృదయములందును వసించును, వారును పన్నిద్దఱు మహాత్ములు. 'హృదయకమలమకరంద ప్రవాహమందు సొగియుట' యనఁగా నచట నత్యంతప్రీతి వహించుట, - అనఁగా - 'సదా పశ్యన్తి సూరయః' అనుశ్రుతిప్రకారము ధ్యేయ మయినతనస్వరూపము వారిహృదయములయందు సదా ప్రస్ఫుటముగా నెలకొనుట. అందువలన వారు అత్యంత ధన్యులై యానందపరవశు లగుదురు. అట్లు ఆ పన్నిద్దఱ హృదయములయందును శ్రీహరి సొగియుట, ఆపన్నిద్దఱాదిత్యులయందు నివసించుటవలనం గలిగిన తాపముం బాపుకొననో యనున ట్లుండును. వీరి హృదయవసతి ఆదిత్యమండల వసతికన్న అంతయుత్కృష్టము. ఆసూరులు మోక్షసామ్రాజ్యధురంధరులు గావున మోక్షార్థమై కవి వారి నాశ్రయించుచున్నాఁడు.

ఇందు ఆళ్వారులహృదయములందు వసించుటకు ఫలము గానట్టిది ద్వాదశాదిత్యమండల నివాస తాపాపనోదనము ఫలముగాఁ జెప్పఁబడినది గావున ఫలోత్ప్రేక్ష; అట్టితాప తచ్ఛాంతులు లేవు గావున అసిద్ధవిషయ.

'సూరులందునన్' - ఇచట సముచ్చయ నువర్ణము కలదు, దానిచే ఆసూర్యులందఱయందు నని యర్థము లభించుచున్నది. 'అలపన్నిద్దఱుసూరులందును.' 'ఇలపన్నిద్దఱు సూరులన్' - 'సర్వ

నామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులం దెయ్యది ముందుఁ బ్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.' నను (బా. వ్యా. కా. 26) సూత్రముచే తొలిదాన 'పన్నిద్దఱు' అని ప్రథమ వచ్చినది. రెండవదాన 'పన్నిద్దఱ' అని పా. కలదు.

వ. అని యిష్టదేవతావందనంబుఁ జేసి మున్నేఁ గళింగదేశ విజిగీషా మనీషం దండెత్తి పోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున. 11

[ఇష్టదేవతావందనేత్యాది - ఇంతటివీరవైష్ణవుఁడు తనయాచార్యునిం బేర్కొనమియు, తన తెలుఁగు మునిషీనైనను తలంపమియు పూర్వకవిస్తుతి సేయమియు ఆశ్చర్యముగా నున్నది.]

......మున్ను = పూర్వము, ఏన్ = నేను, కళింగదేశ విజిగీషా మనీషన్ = కళింగదేశమును జయింప నిచ్ఛచేత, (కళింగదేశమునకు పూర్వకాలములో కళింగపట్టణమనునదే రాజధానిగా నుండెను. కృష్ణరాయ నిర్దిష్టమయిన కళింగదేశము ఇట గంజాముజిల్లాలోని యధికభాగముతోఁ గూడిన యుత్కలదేశభాగము. జగన్నాథక్షేత్రము అందులోనిదే. దానియేలికకు గజపతియని బహుకాలపు బిరుదనామము. కృష్ణరాయఁడోర్చిన కళింగనాథుఁడు ముకుందగజపతి యనునాతఁడు. నెల్లూరుజిల్లాలోని యుదయగిరివఱకు అతనిరాజ్యము వ్యాపించియుండెను.)... విజయవాటిన్ = బెజవాడయందు,...శ్రీకాకుళ నికేతనుండు = శ్రీకాకుళము (అను నగరము) నివాసముగాఁ గలవాఁడు ('గృహ గేహోదవసితం వేశ్మ నికేతనమ్' అమ. - అనఁగా - శ్రీకాకుళ క్షేత్రమందు వెలసియున్న దేవుఁడు.) అగు - ఆంధ్రమధుమథునున్ = తెలుఁగు విష్ణుని ('పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః' అమ. - ఆ స్వామికి తెలుఁగువల్లభరాయఁడని పేరు, కావున నాంధ్రవిశేషణము.),......హరివాసర ఉపవాసంబు = ఏకాదశి నిట్రు, అచ్చటన్ = ఆశ్రీకాకుళ క్షేత్రమందు, కావింపన్ = చేసినంతట,ఆపుణ్యరాత్ర చతుర్థయామంబునన్ = పుణ్యమయిన యారాత్రియొక్క నాలవజామునందు, 'అహస్సర్వైకదేశసంఖ్యాత పుణ్యాచ్చ రాత్రేః' సూ. 5-4-87. రాత్రిశబ్దమునకు...పుణ్యశబ్దము పైని సమాసమందు అచ్ప్రత్యయము రాఁగా 'పుణ్యరాత్రము' అని అకారాంతరూపము ఏర్పడును.)

ఈశ్రీకాకుళము గంజాము జిల్లాలోనిది గాదు. ఇది ఈవచనమందే ''విజయవాటిం గొన్నివాసరంబు లుండి'' అనుటంబట్టి బెజవాడ సీమలోనిదిగా నున్నది. - అది భోజరాజీయము ౧ (40) లో ఇట్లు ప్రస్తుతము:—

''సీ. విలసితం బగు కృష్ణవే ణ్య (ణి ?) మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందుఁ
దనరు నదీత్రయాంతర్వేది యనుపావనక్షేత్రమున...

తే. నెమ్మిఁ బ్రత్యక్ష పరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు...''

వచనమందలి సప్తమ్యంతసమాసము క్రియావిశేషణముగా అనంతరపద్యములోని 'కలఁ దదంధ్రజలజాక్షుఁ డిట్లని యానతిచ్చె.' అనువాక్యముతో నన్వయించును. కల వచ్చిన కాలము

చతుర్థయామం బని తెలుపుటచేత ఆకల శీఘ్రములో ఫలించునట్టిదని యెఱుంగ నగును. స్వప్న శాస్త్రమం దిట్లు చెప్పఁబడినది.—

"స్వప్న స్తు ప్రథమే యామే వత్సరేణ విపాకభాక్,
ద్వితీయే చాష్టభి ర్మాసైః, స్త్రిభి ర్మాసై స్తృతీయకే,
అరుణోదయ వేళాయాం దశాహేన ఫలం భవేత్
గోవిసర్జనవేళాయాం సద్యః స్వప్నఫలం భవేత్."

ఈవచనమందలి 'మున్ను' అను పదము 45వ వచనమునందలి క్రియాపదములతో నన్వయించును. మఱియు 'ఇష్టదేవతావందనంబుఁ జేసి' అను ప్రకృతవచనమునందలి 'చేసి' కి (క్త్వార్థకమునకు) 50-వ వచనములోని 'నావిన్నవింపం బూను' అను భాగముతో నన్వయము.

—* కలలో ప్రత్యక్షమైన తెనుఁగు వల్లభరాయని వర్ణన *—

సీ. నీలమేఘముడాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ,
నరవిందములకచ్చు లడఁగించుజిగి హెచ్చు
నాయతం బగు కన్నుదోయి తోడఁ,
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరవెట్టు
హొంబట్టుజిలుఁగు రెంటెంబుతోడ,
నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు
దొరలంగ నాడుకౌస్తుభముతోడ,
తే. దక్షిణకే లుండఁ బెఱకేల దండ యిచ్చు
లేము లుడిపెడులేఁజూపులేమతోడఁ
దోలఁకుచుయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గల ద
దంధ్ర జలజాక్షుఁ డి ట్లని యాన తిచ్చె. 12

1. నీలమేఘముడాలుఁ = నల్లమబ్బుకాంతిని (నీటితోనిండినమబ్బు నల్లఁగా నుండును నీ రెడలినం దెల్లఁబడును.), డీలుసేయఁగఁ = పసలేని దానినిగాఁ జేయుటకు, చాలు...... తోడఁ - చాలు = సమర్థమైన - మెఱుఁగు = తళుకుగల - చామనచాయ = శ్యామలవర్ణముగల - మేనితోడఁ = దేహముగలవాఁడై (సంస్కృతమందు వపుః శబ్దమెట్లో అట్లే తెనుఁగున మేను శబ్దము అందమైన దేహమునకుం బ్రయోగింపఁబడును, - చామనచాయ అనేకులకుండునుగాని దాన మెఱుఁగుమాత్రము శ్రీహరికే; మేఘశ్యాముఁ డనుట.)

2. అరవిందముల కచ్చులు = కమలములయొక్క గర్వములను, అడఁగించు జిగి = పోఁగొట్టునట్టి కాంతి, హెచ్చు = మిక్కుటముగా నున్నట్టియు - ఆయతంబు = దీర్ఘమును - అగు కన్నుదోయితోడఁ = నేత్రద్వయము కలవాఁడై - పుండరీకాక్షుఁ డనుట;

3. పులుఁగు రాయని చట్టుపల వన్నెఁ = పక్షిరాజుయొక్క (=గరుత్మంతునియొక్క) ఱెక్కలయొక్క (చెట్టుపలు అని రూ.) వర్ణమును, ఒరవెట్టు హొంబట్టు జిలుఁగు రెంటెంబు

తోడన్ = పరీక్షించునట్టి (అంతకన్న హెచ్చు వన్నె గలదైన) బంగారు తోడి (హొన్ను = పొన్ను = బంగారము) పట్టు అయినట్టి సన్నని (రెట్టినేఁత) వస్త్రముగలవాఁడై; - పీతాంబరుఁడనుట;

4. ఉదయ......పున్ - ఉదయ అర్క బింబంబు = పొడుపుసూర్యుని యొక్క ('ఉదయః పూర్వశైలే స్యా దున్నతేఽప్యుద్గతా వపి' నానా.) - ఒఱపున్ = సొంపును, విడంబంబు దొరలంగన్ = వెక్కిరింత మీఱ, ఆడు కౌస్తుభముతోడన్ = నిందించుచున్న కౌస్తుభమణి గలవాఁడై; ('ఉదయ' అనుట ఆరుణ్యార్థము; ఆరుణ్యము కౌస్తుభసామ్యార్థము; కౌస్తుభము పద్మరాగ మగుటచేత అరుణము.

'కౌస్తుభాఖ్య మభూ ద్రత్నం పద్మరాగో మహోదధేః
తస్మిన్ హరిః స్పృహాం చక్రే వక్షోఽలంకరణే మణౌ'. భాగవతము.

అత్లై కవ్యంతరసంవాదము;—

'జయన్తి జగతాం మాతుః స్తనకుఙ్కుమ బిన్దవః
ముకున్దాశ్లేషసంక్రాన్త కౌస్తుభశ్రీ విడమ్బినః.' వసంత.)

తమ్మికేలు = పద్మముతోడి హస్తము, ఉండన్ = అటుండఁగా, పెఱకేలన్ = వేఱుచేతితో, దండ = కైదండ, ఇచ్చు = ఒసంగుచున్నట్టి - లేములు ఊడిపెడు లేఁజూపులేమతోడన్ = దారిద్ర్యములను పోఁగొట్టెడు కటాక్షములు గల కోమలి (మహాలక్ష్మి యనుట) కలవాఁడై;

(మహాలక్ష్మి కేలఁ బద్మముం దాల్చియుండును.—

'కేలఁ దమ్మి ఘటించి పాలమున్నీటిలోఁ బొడమినజవరాలిఁబోలె నొకతె.' వసు.

'దివ్యానా మపి కృతవిస్మయాం పురస్తా । దమ్భస్తః స్ఫురదరవిన్దచారు హస్తామ్ ।
ఉద్వీక్ష్య శ్రియమివ కాఞ్చి దుత్తరన్తీ । మస్మార్షీ జ్జలనిధిమన్థనస్య శౌరిః.' మాఘ.
'నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాఙ్గల్యయుక్తా.' శ్రీసూక్తము.)

తొలఁకుదయన్ = పైకుబుకుచున్నకరుణను, తెల్పు చిఱునవ్వుతోడన్ = సూచించుచున్న మందహాసముకలవాఁడై, కలన్ = స్వప్నములో, తత్ ఆంధ్ర జలజాక్షుఁడు = ఆ తెలుఁగు వల్లభ రాయఁడు (జలజాక్షుఁడు = పుండరీకాక్షుఁడు - 'దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దః' అమ.), ఇట్లు అని = ఈపైఁ జెప్పంబడు ప్రకారమున, ఆనతి ఇచ్చెన్ = సెలవిచ్చినాఁడు.

మేఘశ్యాముఁడు పుండరీకాక్షుఁడు పీతాంబరుఁడు కౌస్తుభధరుఁడు నై శ్రీహరి మహాలక్ష్మియొక్క కైదండ నూఁదుకొని, ఆమె కడమకేల పద్మముం దాలిచి లేము లుడుపుచూపులతో ననుం గటాక్షించుచుండఁగా, తాను దయాతిరేక సూచకమయిన లేఁతనవ్వునవ్వుచు స్వప్నమందు ఆ తెలుఁగువల్లభరాయస్వామి సాక్షాత్కరించి యీవక్ష్యమాణ ప్రకారమున ఆనతిచ్చెను.

ఇందు సీసపాదములందు ఉపమాలంకారము; 'డీలు సేయఁగఁ జాలు,' 'కచ్చు లడఁగించు' ఇత్యాదులు తద్వాచకములు.

'ఉపమయగు రెంట సాదృ । శ్యపుసిరి వాచ్యముగ - మోము శశివలె వెలుఁగున్.' అలం.

'లేము లుడిపెడులేఁజూపులేమ' యనుట మహాలక్ష్మి యనుటకు రమణీయ మయిన భంగ్యంతరము గావున పర్యాయోక్తాలంకారము.

'పర్యాయోక్తము మిషచేఁ గార్యోక్తియు నన్యభంగి గమ్యోక్తియునున్.' అలం.

'హొంబట్టు' = 'హొన్ను + పట్టు' - 'చెందొవ' ఇత్యాదులందుంబోలె ప్రాఁతాది కార్యము. బా. వ్యా. సం. 35, 36, ఇట్లే లేఁజూపు. 'హెచ్చు నాయతంబగు కన్నుదోయి', 'ఇచ్చు లేము లుడిపెడు లేఁజూపు.'—ఈసమాసములందు 'హెచ్చు' 'ఇచ్చు' అను (తద్ధర్మారక) విశేషణముల కును 'కన్నుదోయి', 'లేమ' అనియెడు త ద్విశేష్యములకును ఇతరపదములచే వ్యవధానము కలిగి యున్నది; 'ఇట్టిప్రయోగములు కవిత్రయమువారి కృతులందు దొరకినవి కావు.' అని ప్రౌ. వ్యా. సమా. 18.

ఈ పద్యముంబోలిన పద్యములు కళాపూ. ౧౨(౯౧), మను. ౬(౧౦౫), పరమయోగి. 3(౭౯౯) - ఉపోద్ఘాతమున నుద్ధృతములు.

—* భగవద్వాక్యము *—

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెం పెక్క
రసికు లౌ నన మదాలసచరిత్ర,
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూప్రీణనంబు, *
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు,
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగరచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి,
తే. మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష,
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియముగాఁగ. 13

1. ఉత్ప్రేక్షోపమలు = ఉత్ప్రేక్షాలంకారమును ఉపమాలంకారమును, జాతి = స్వభావోక్త్యలంకారమును, పెంపు = అతిశయమును, ఎక్కన్ = పొందునట్లుగా, రసికులు = రసజ్ఞులు, ఔను అనన్ = మెచ్చునట్లుగా, మదాలసచరిత్రన్ = (మదాలసయొక్క కథయైన) మదాలసచరిత్ర యను ప్రబంధమును, పలికితివి = రచించితివి;

ఉపమోత్ప్రేక్షల లక్షణములు పూర్వపద్యములలో చెప్పఁబడినవి. 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.' అను లక్షణము చేత జాత్యాది స్వభావ వర్ణనయే స్వభావోక్తి గాన అది జాత్యలంకార మనియు వ్యవహరింపఁబడుచున్నది.

2. భా......గన్ - భావ = అభిప్రాయము - ధ్వని = వాచ్యాతిశాయి యయిన వ్యంగ్యముగల రచన - వ్యంగ్య = లాక్షణికార్థ ప్రయోజన రూప మగువ్యంగ్యార్థము - వీనికి - సేవధి = నిధి ('నిధి ర్నా సేవధిః' అమ.) - కాఁగన్ = అగునట్లుగా, సత్యా వధూ ప్రీణనంబు = సత్యభామను ప్రీతినొందించుట ఇతివృత్తముగాఁగల ప్రబంధమును ('తర్పణం ప్రీణ నావనే' అమ;

* ఈకాలమున నీకథ పలువుర నాక్షరించినట్లున్నది. ఉదా. ముక్కుతిమ్మన పారిజాతాపహరణము. ఇందే 'దివిజ ద్రుప్రసవంబు' ఆ. ౪-74.

సత్యయనఁగా సత్యభామ; 'శబ్దా అవయవే ష్వపి వర్తన్తే ఇతి న్యాయా దనుగోద మితి పద్దైకదేశ ప్రయోగోయం భీమోభీమసేనః సత్యాసత్యభామా ఇతి.' అని రఘువంశ చారిత్రవర్ధన వ్యాఖ్య.)

3. శ్రుతి పురాణ ఉపసంహితలు = వేదములు ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః.' అమ.) పంచలక్షణములు (మత్స్యపురాణాదికములు – 'పురాణం పఞ్చలక్షణమ్' అమ.) ఉపపురాణములును, ఏర్చి = ఏర్పరించి, సకలకథాసారసంగ్రహంబు = ఆపేరి గ్రంథమును, కూర్చితి = రచించితివి;

4. శ్రో......లు – శ్రోతృ = వినువారి – అఘ = పాపములయొక్క – ఛటలు = సమూహములు, విచ్చుగ = చెల్లాచెద రగునట్లుగా, సూక్తి నైపుణిన్ = మంచిమాటల నేర్పుచేత, జ్ఞానచింతామణికృతిన్ = జ్ఞానచింతాణి యనెడు గ్రంథమును, రచించితి = చేసినాఁడవు;

మఱియున్ = ఇవిగాక, రసమంజరీ ముఖ్య మధుర కావ్య రచనన్ = రసమంజరి లోనుగాఁగల మనోహరకావ్యముల రచనచేత, గీర్వాణభాషన్ = దేవభాషయందు (సంస్కృతభాషయందనుట), మెప్పించికొంటి = మెప్పుపొందితివి; (అట్టిసమర్థునికి నీకు) ఆంధ్రభాషన్ = తెనుఁగులో (కృతిరచించుట), అసాధ్యంబె = అశక్యమా, (కాదనుట), ఇఁకన్ = ఇటుమీఁద, మాకుఁ బ్రియముగాఁగన్ = మా ప్రీతియే ప్రధానోద్దేశ్యముగా (అనఁగా మాకు ప్రియమయిన మాకథగా), అందున్ = ఆంధ్రభాషయందుఁగూడ, ఒక్కకృతిన్ = ఒక ప్రబంధమును, వినిర్మింపుము.

సంస్కృతమందు మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి, లోనుగాఁగల యద్భుత ప్రబంధములను రచించిన మహాకవికి నీకు తెలుఁగొకలక్ష్యమా ? కాన తెలుఁగులోఁగూడ మాప్రీతికై యొక గ్రంథముం జేయుము.

'సంస్కృతమందే అట్టిప్రబంధములు రచించినవానికి ఆంధ్రభాషలో రచించుట యసాధ్యమా' అనుట యర్థాపత్త్యలంకారము.

'కైముత్యముచే నన్యా । ర్థామననము కావ్యపూర్వకార్థాపత్తిన్;
నీమోవి బంధుజీవము । నే మోడుచు నన్యజీవ మెడపుటయరుదే.' అలం.

ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న, విను, మే మును దాల్చినమాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పుము, మున్ను గొంటి నే
వ న్ననదండ యొక్క మగవాఁ డిడ, నేను దెలుంగురాయఁడ,
న్గన్నడరాయ, యక్కొఁదువఁ గప్పు ప్రియాపరిభుక్తభాక్కథన్. 14

ఎన్నినన్ = ఏనిన్ను, కూర్తున్ అన్నన్ = ఉద్దేశించినకథను వర్ణింతును అని యడుగుదువేని, వినుము = ఆకర్ణింపుమా; ఏన్ = నేనును, మునుదాల్చినమాల్యము ఇచ్చునప్పిన్నది = తాను ముందుగా ధరించినదండను నాకు పిమ్మట సమర్పించుచుండినయాబాలికయు (ఆముక్తమాల్యద యనుట. చూడికుడుత్తనాచ్చారు' అని అఱవము. ఆమెపేరు గోదాదేవియని ఉత్తర గ్రంథములో తెలియును.), రంగమందున్ = శ్రీరంగమందు, అయినపెండిలి = చేసికొనిన వివాహమును, చెప్పుము = వర్ణింపుము; మున్ను = పూర్వము (కృష్ణావతారములో ననుట), ననదండ = పూలసరమును, ఒక్కమగవాఁడు = ఒకానొకపురుషుఁడు (సుదాముఁడను మాలికుఁడనుట), ఇడన్ = ఇయ్యఁగా, ఏవన్ = జుగుప్సతో, కొంటిన్ = గ్రహించితిని. నేను, తెలుంగురాయఁడన్ = తెలుఁగు వల్లభరాయఁడను; కన్నడరాయ = ఓయికర్ణాటరాజా, ప్రి...థన్...ప్రియా = వల్లభచేత – పరిభుక్త = చక్కఁగ అనుభవింపఁబడిన (చక్కఁగ ధరింపఁబడిన యనుట) దానిని –

భాక్ = పొందిన రంగమన్నారుస్వామియొక్క - కథన్ = కతచేత, అక్కొదువ = ఆకొఱఁతను, కప్పుము = ఆచ్ఛాదింపుము (తొలఁగింపు మనుట).

'నీ యర్చావతారము లనేకములు, అందు ఏయవతారమును గూర్చి కృతిరచింతును?' అని యడుగుదువేమో? విను; పూర్వము నేను కృష్ణావతారమందు సుదాముఁ డనుమాలాకారుఁడీయఁగా, పూదండలను మగవానిచేతినుండి కొనవలసివచ్చెను గదా యని మనస్సులో నేవగించుచు కయికొంటిని. ఆకొదువ యిప్పటికిని నామనంబున నున్నది. తా మున్ను దాల్చినమాల్యమును నాకర్పించిన చూడికుడుత్తదేవియు నేనును అయిన వివాహమును చెప్పుము. ప్రియాపరిభుక్తమాల్యముం దాల్చి నే నానందించిన యాకథచే పైఁజెప్పిన యాకొదువం దొలఁగింపుము. ఎంతటివానికొదువను అంతటివాఁడే తీర్ప సమర్థుఁడు. అట్లే నేను తెనుంగు రాయఁడను, నీవు నాయంతటి వాఁడవు కన్నడరాయఁడవు. 'ఆవివాహములో ఆకొదువ తీఱిపోలేదా? ఇంకనున్నదా?' అందువేమో, వివాహముచేత నయితము తీఱనియాకొదువ నీచేయు తత్కథా వర్ణనముచేత తీఱును. నీకవనసౌభాగ్యము అట్టిది, కావున నిన్ను ఆ కృతి నడుగుచున్నాను.

'గోదాదేవి' యనక 'మునుదాల్చినమాల్యమిచ్చునప్పిన్నది' అని రమ్యతరభగ్యంతర స్వీకారముచే పర్యాయోక్తాలంకారము. ఈభంగిచేత ఆమెను దెలుపుచు భగవంతుఁడును 'ఎవ్వఁడును భార్యను పేర్కొనరా' దను లోకశాస్త్ర మర్యాదను గౌరవించినాఁడు.—

"ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ
శ్రేయఃకామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్య కళత్రయోః"

'మాల్యము' = సౌదలం దాల్చు పూదండ ('మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని' అమ. ఇట రామాశ్రమీయములో 'సౌదల' నని నిశ్చయము లేదను నర్థముగా 'మూర్ధ్ని శిరసి, ఇద మతన్త్రమ్' అని వివరింపఁబడియున్నను, ప్రయోగములును తదనుసారులుగానే యున్నను, ఆముక్తమాల్యద ౫ ఆ. ౩౭ ప.

సీ. '.........కట్టెడు కమ్మ చెంగల్వవిరుల
తోమాలె లలకలు దువ్వి కంతునకునా । ర్ద్రనిబద్ధఖేటకంబనఁగ నీల

తే. వృషకవద్రేఖ నెడమ కొక్కింతి యొఱఁగ । నిడినధమ్మిల్ల వలయంబునడుగునందు
గొంతసే పర్థిఁ గీలించి కూపవారి । నీడ నీక్షించి క్రమ్మఱ గూడనునుచు.'
'పిత్రుబద్ధలతాంతము లర్థిఁగొప్పునం । బూని యొకింతసే పునిచి పుచ్చి.'

ఇత్యాదికథాంశముచేత మూర్ధధార్యమే యిట చెప్పంబడిన దని యెన్నవగును.) 'తెనుంగు రాయఁడన్ కన్నడరాయ' అని తుల్యసంజ్ఞా ప్రయోగము తుల్యప్రభావ ధ్వననార్థము. - 'రాయ' శబ్దము ఆచ్ఛికము మగాదిగణీయము; మగాదులకు డుజ్జగును గాని ఉత్వంబు లేదు, కావున 'రాయఁడు' అని రూపము గాని 'రాయుఁడు' అనిరాదు.

'.....కృష్ణరా । యనికిన్ వారణరాజవక్త్రుడు కృపాయత్తైక చిత్తాబ్జుఁడై.' పారి.
'...............................శ్రీకృష్ణరా
యలకాహోమృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్.' మను.

ఇది బల్లిదాది గణీయముకానందున, సంస్కృతతుల్యంబు గాదు, కావున (బా. వ్యా. సూత్రమర్యాదచే సంబుద్ధిడుజ్జునకులోపంబురాదు; 'మగఁడా' అని సంబుద్ధిగాని 'మగా' అని

గాదు; అట్లే ఇటఁ 'రాయఁడా' యనవలయునుగాని 'రాయా' అనరాదు; అయినను పెద్దనాదుల ప్రయోగములయందు దీనిసంబుద్ధి డుజ్ఞునకు లోపము గనఁబడుచున్నది—

'శ్రీకృష్ణరాయ గుణర। త్నాకల్పా' మను. ౪. ఆ. ౧ ప. 'శ్రీతిరుమలరాయ జయ। శ్రీతరుణీరమణ' వసు. ౨ ఆ. ౧ ప. 'ధీరాద్భుత సాంపరాయ తిరుమలరాయా' వసు. ౪ ఆ. ౧ ప. ఇత్యాదిప్రయోగము లనేకములు గలవు.

'రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచే.' అప్ప. 'కృష్ణరాయ యభ్యుదయమొంది.' 'భవదసి ననిఁదెగి కృష్ణరాయ.' 'శ్రీకృష్ణరాయ నిన్ను.' 'అభిరతిఁ గృష్ణరాయ.' అని యీగ్రంథమందే కలవు. ఇట్టి మఱికొన్ని యాచ్ఛికశబ్దంబులకును ఇట్టిసంబుద్ధి ప్రయోగములు అందం దగపడుచున్నది.—

'మారారి పదాబ్జభృంగ మామిడి సింగా.' శృం. నై.
'అలఘురణోత్సాహ సరస యాబళనరసా.' నరస.
'లోకములో నేకవి కగు। నీకవనపుఠీవి? యబ్బనే కూపనటద్
భేకములకు నాకధునీ। శీకరములచెమ్మ నందిసింగయతిమ్మా.'

ఆ. తెలుఁగ దేల యన్న ? దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ,
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. 15

తెలుఁగు అది ఏల అన్నన్ = తెలుఁగులో కృతిసేయు మనుటయేలయనిశంకయేని. దేశంబు తెలుఁగు = ఇది తెలుఁగుదేశము, ఏను తెలుఁగు వల్లభుండన్ = నేను తెలుఁగువల్లభరాయ నామము కలవాఁడను, తెలుఁగొ = తెలుఁగు భాషయన్ననో, కండ = పులకండము, ఎల్ల నృపులున్ కొలువన్, బాస ఆడి = సంభాషించి, దేశభాషలందున్, తెలుఁగు = తెలుఁగు, లెస్స = ఉత్కృష్టము, ఎఱుఁగవే = ఎఱుంగుదువుగదా.

'దేశంబు తెలుఁగు' - త్రిలింగ మని శ్రీశైల కాళేశ్వర దాక్షారామ లింగములు వెలసి యున్న దేశమునకు (ఆంధ్రదేశమునకు) పేరు.

'శ్రీక్షితిధర కాళేశ్వర। దాక్షారామంబు లనఁగ దనరారెడునీ
త్రిక్షేత్రంబుల లింగము। లీక్షితిని ద్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్.' అప్ప,
ఆదేశముపేరే తెలుఁగని అచటిభాషకును వచ్చినది.

కన్నడరాయఁడవైన నిన్ను కన్నడములో చెప్పుమనక మఱియేభాషలోఁగాని చెప్పుమనక తెనుఁగుననే చెప్పుమనియెద నేల యనఁగా అందులకు ఈవక్ష్యమాణకారణము లున్నవి. ఒకకారణము - ఇది తెలుఁగుదేశము, రెండవకారణము - నేను తెలుఁదేశము నభిమానించిన వల్లభరాయఁడను, మూఁడవకారణము ఆరెంటికంటెను గొప్పది. అది ఏమన, తెలుఁగుబాసయనఁగా పులకండముగదా; నానాభాషలాడు రాజులు నిన్నుఁ గొలుచునప్పుడు వారితో నాయాభాషలాడి దేశభాష లన్నిటిలోను తెలుఁగుయొక్క యాయుత్కర్షను నీవు కనిపట్టియుండలేదా.

'కండ' - 'ఖండ' శబ్దభవ మనియు పులకండ మర్థమనియు బ. సీ. వైకృతదీపిక.

'సీ. చింపి వల్కములేమి చేసెడి వనఁ గావు। నెఱపైనకండ మందెగలుగాని.'

[జై. 8. ఆ. శబ్దరత్నాకరధృతము.

'ఖణ్డోఽర్ధ ఐక్షవే । మణి దోషేచ.' హేమ.
'ఖణ్డోఽస్త్రీ శకలే చేక్షువికార మణిదోషయోః.' మేది.
'ఖణ్డ మస్త్రీ మణేర్దోషే శకలేక్షువికారయోః.' నానా.
'మత్స్యణ్డికా ఖణ్డసితాః క్రమేణగుణవత్తమాః.
యథాయథా హినైర్మల్యం మధురత్వం తథా తథా.' వైశేషిక.
'వృష్యాః క్షతక్షీణ హితా రక్తపిత్తానిలాపహాః
మత్స్యణ్డికాఖణ్డసితాః క్రమేణగుణవత్తమాః.' వాగ్భట.

వ్యా. - మత్స్యణ్డికాదయస్త్రయో వృష్యాః తథా క్షతక్షీణహితాః రక్తపిత్తానిలాపహాశ్చ; తథా క్రమేణగుణవత్తమాః, ధాతగుడాదపి మత్స్యణ్డికా గుణకలీనిర్మలతరత్వాత్, తతోఽపి ఖణ్డో గుణవత్తరః, ఖణ్డాదపి శర్కరా గుణవత్తమా నిర్మలతమత్వాత్.'

'ఆడి' - తెనుఁగును రాజులతో ఆడి నేర్చినేగాని చదివి నేర్చినవాఁడు గాఁడు - 'నృపులు' అనుటచే తెనుఁగు అతని ఇంటిభాష గాదు.

క. అంకితమో యన నీ కల, । వేంకటపతి యిష్ట మైన వేల్పగుటఁ దదీ
యాంకితముసేయు మొక్కొక । సంకేతముగా కతఁడ రస న్నేఁ గానే. 16

అంకితమో = అంకితము ఎవరికి చేయనగును, అనన్ = అనిన, నీకున్......వేల్పు = దేవత, అగుటన్ = అయినందున, తదీయ అంకితము = అతని సంబంధియగు నంకితమును, చేయుము, ఒక్కొక సంకేతముగాక = 'వేంకటపతి' 'వల్లభరాయఁడు' అని వేఱువేఱు సంజ్ఞలే గాని, రసన్ = భూమియందు ('రసా విశ్వమ్భరా స్థిరా' అమ.) నేన్, అతఁడన్ = ఆవేంకటపతిని, కానే = కానా (అగుదును అనుట).

తే. పాత్ర మిటు సేయ నీ కుత్తరోత్తరాభి
వృద్ధి యని పోవ మేల్కని వెఱఁగుతోడి
భక్తిఁ దద్గృహాగోపుర ప్రణతిఁ జేసి
వేగుటయుఁ గల్యకరణీయ విధులు దీర్చి. 17

ఇటు = పైఁజెప్పినప్రకారమున, పాత్రము=కృతిని, చేయన్=చేసినంతట, నీకున్, ఉత్తర ఉత్తర అభివృద్ధి = అభ్యుదయము వెంబడి దానికన్న నభ్యుదయము, (కలుగును అని శేషము.) అని = అనిపల్కి, పోవన్ = ఆదేవుఁడు అంతర్ధానము కాఁగా, (నేను), మేల్కని, వెఱఁగు తోడి = ఆశ్చర్యముతోఁ గూడుకొన్న - భక్తిన్ = తత్పరత్వముచేత, తత్ గృహాగోపుర ప్రణతి = ఆస్వామియాలయముయొక్క ద్వారమునకు ('ద్వారమాత్రేతు గోపురమ్.' అమ.) నమస్కారము, చేసి, వేగుటయున్ = తెల్లవాఱినంతట, కల్యకరణీయ విధులు = వేకువయందు ('ప్రత్యూషోఽహర్ముఖం కల్యమ్' అమ.) కావింపవలసినసంధ్యావందనాద్యనుష్ఠానములను ('విధిర్విధానే దైవే చ' అమ.), తీర్చి = కావించికొని.

వ. నిండోలగం బుండి దండనాథ సామంత సందోహంబులం బిలిపించి చెందలకడన మందిరంబుల కనిపి వివిధ వేదాగమవిదులగు విద్వజ్జనంబులఁ గాని

పించికొని నమస్కరించి యాశుభస్వప్నంబు వినిపించిన హర్షించి వారును సవిస్మయస్వాంతులై 'దేవా, దేవదేవుండు విజయంబు చేసిన యాస్వప్నం బనేక శోభనపరంపరలం దెలుపుచున్నయది. ఎట్లనిన, ప్రథమ మ ప్పద్మేక్షణుస్వప్న సాక్షాత్కారం బితోధికభక్తియు, నతండు ప్రబంధనిబంధనంబుఁ గావింపు మనుట యితోధికాగాధసారస్వతోద్బోధంబును, నతని దేవీసమాగమం బితోధికాఖండభాండాగారసమృద్ధియు, నతని యాసలిచేతి విశదశతచ్ఛదం బితోధికాద్వితీయసితచ్ఛత్రతయు, నతం డశేషనృపసేవం దత్తద్భాష లెఱుంగవె యనుట యితోధిక సమస్తసామంత సమాజ సమాకర్షణంబును, ప్రయోఃభోగ పరిశిష్ట భోగం బింపనుట యితోధిక బహుప్రేయసీప్రాప్తియు, కృతిచెప్ప నుత్తరోత్తరాభివృద్ధియగుననుట యితోధికాపత్య పరమాయురవాప్తియు, నగు. నఖర్వమహిమాతిధూర్వహుఁడగు తుర్వసువంశంబునం బుట్టినట్టి నీకిట్టి శోభనపరంపర లేమద్భుతంబు, లవధరింపుము. 18

నిండు ఓలగంబు ఉండి=నిండుసభతీరి ('ఓలగంబు' - ఓలగంబుగా అని యర్థముగా క్రియా విశేషణముగా గ్రహింపవలయును), దం......లన్ - దండనాథ = సేనాపతులయొక్కయు - సామంత=అరిగాఁపు దొరలయొక్కయు - సందోహంబులన్=బృందములను, పెందలకడన=ప్రాతఃకాలమందే, మందిరంబులకున్ = ఇండ్లకు (బసలకు), అనిపి = పంపి; వివి......లు - వివిధ = పలువగల - వేద = శ్రుతులును ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః' అమ). - ఆగమ = శాస్త్రమాత్రములును (లేక దేవపూజావిధాన తత్సంబన్ధి విషయములను తెలుపునట్టి పాంచరాత్రాది గ్రంథములను-

'సర్వ వేదః క్రియామూలం ఋషిభి ర్బహు ధోదితః
కాలో దేశః క్రియా కర్తా కారణం కార్య మాగమః
సిద్ధం సిద్ధైః ప్రమాణై స్తు హితం వాత్ర పరత్ర వా
ఆగమః శాస్త్ర మాప్తానా మాప్తా స్తత్త్వార్థ వేదినః
శృణ్వతాం జాయతే భక్తిః తతోగురు ముపాసతే,
స చ విద్యాగమాన్ వక్తి విద్యాయుక్ స్యాశ్రితో నృపః.')

విదులు = ఎఱింగినవారు - అగు విద్వజ్జనంబులన్ = పండితులను, కానిపించికొని = తనదర్శనము చేయించుకొని,......స......లై - సవిస్మయ = ఆశ్చర్యముతోఁ గూడుకొన్న ('విస్మయోద్భుత మాశ్చర్యమ్' అమ.) - స్వాంతులు=మనస్సుగల వారు ('స్వాన్తం హృ న్మానసం మనః' అమ.), ఐ, (ఆశ్చర్యపడి యనుట),......దేవా = ఓరాజా ('రాజా భట్టారకో దేవః' అమ. ఈసంబుద్ధి మొదలుకొని ౧౮-వ పద్యములో 'కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపుము' అనువఱకును విద్వాంసుల వాక్యము.), దేవ దేవుండు = నారాయణుఁడు, విజయంబు చేసిన = వచ్చిన......శోభన = కల్యాణ,......అప్ప...బు. - అప్పద్మేక్షణు = ఆపుండరీకాక్షునియొక్క - స్వప్న = కలలోని - సాక్షాత్కారంబు = అగపడుట (ఆపుండరీకాక్షుఁడు కలలో అగపడుట యనుట), ఇతఃఅధిక భక్తియున్ = ఇప్పటి తత్పరత్వమున కన్న ఎక్కుడగు తత్పరత్వమును,

"దృశ్యతే భగవాన్ యస్య స్వప్నే సర్వశుభావహః
తస్మిన్నేవ దృఢా భక్తి ర్జాయతే తస్య సంతతమ్."

అతండు = ఆదేవదేవుండు, ప్రబంధ నిబంధనంబున్ = కావ్య రచనను, కావింపుము = చేయుము, అనుట = అని యానతిచ్చుట, ఇతో......ను - ఇతః = ఇప్పటి (విద్య) కంటె - అధిక = ఎక్కుడు - అగాధ = లోఁతయిన ('అగాధ మతలస్పర్శే' అమ.), సారస్వత = విద్యయొక్క - ఉద్బోధనంబును = ప్రాప్తియు, అత...బు - అతని = ఆ నారాయణునియొక్క - దేవీ = దేవియగు మహాలక్ష్మియొక్క - సమాగమంబు = రాక, ఇతో.....యున్ - ఇతః = ఇప్పుడున్నదాని కంటె - అధిక = ఎక్కుడగు - అఖండ = తెంపులేని - భాండ అగార = బొక్కసపుటిండ్ల యొక్క - సమృద్ధియున్ = నింపును, అత......బు - అతని (యొక్క) - ఆసతిచేతి = ఆభార్యచేత నున్న - విశద = తెల్లని ('శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్యేతపాణ్డురాః' అమ.) - శతచ్ఛదంబు = నూఱు రేకులతామర ('సహస్రపత్త్రం కమలం శతపత్త్రం కుశేశయమ్' అమ.), ఇతో...యున్ - ఇతోధిక - అద్వితీయ = రెండవదికాని (మఱెవ్వరికిని లేని) - సిత = తెల్లని - ఛత్త్రతయున్ = గొడుగు కలిగియుండుటయును (ఏకచ్ఛత్త్రాధిపత్యమనుట. ఇంక ననేక దేశముల నేలుట యని భా.), అతండు, అశేష నృప సేవన్ = సకలరాజుల కొలువుచేత (ఎల్లరాజులును సేవించుచుండుటచేత ననుట), తత్ తత్ భాషలు = ఆయా దేశభాషలను, ఎఱుంగవే = తెలిసికొన్న వాఁడవు కదా, అనుట=అనిపలుకుట, ఇతో......బును - ఇతోధిక - సమస్తసామంత=ఎల్ల యిరుగు పొరుగు రాజులయొక్క - సమాజ = సమూహముయొక్క ('పశూనాం సమజోఽన్యేషాం సమాజః' అమ.) - సమాకర్షణంబును = రప్పించుకొనుటయు (వశపఱుచుకొనుటయు ననుట), ప్రియా.....ము - ప్రియా = కాంతయొక్క (చూడికుడుత్త దేవియొక్క) - ఉపభోగ = అనుభవమునుండి - పరిశిష్ట = మిగిలినదానియొక్క (ముందు ఆమెచే అనుభవింపఁబడినదై పిమ్మట ఈఁబడినదాని - అనఁగా ఆట్టిమాల్యముయొక్క యనుట) - భోగంబు = అనుభవము (ప్రియ ముందుగా ధరించినమాల్యమును తాను పిమ్మట ధరించుట), ఇంపు = ఇష్టము, అనుట = అని వచించుట, ఇతో...యున్ - ఇతోధిక - ఇప్పటివారికన్న ఎక్కువయగు - బహు = పలువురు - ప్రేయసీ = ప్రియతమలయొక్క - ప్రాప్తియున్ = లాభమును, కృతి = కావ్యమును, చెప్పన్ = రచించినచో, నీకున్, ఉత్తర ఉత్తర అభివృద్ధి = ఒకనాఁటికంటె ఒకనాఁటికి అభ్యుదయము, అగున్ అనుట = కలుగు నని చెప్పుట. ఇతః అధిక అపత్య పరమ ఆయుః అవాప్తియున్ = ఇప్పటికంటె ఎక్కువయగు సంతానముతోడి పూర్ణాయువు యొక్క ప్రాప్తియును, అగున్ = అయియున్నది. ['అగున్' అనునీక్రియ 'భక్తి' 'ఉద్బోధనంబు' ఇత్యాదిపదములతో పై లఘు వాక్యములందెల్ల నన్వయించును; సాక్షాత్కారమే ఇతోధికభక్తి యగు ననుటచే, అనఁగా సూచ్య సూచకములకు అభేదము చెప్పుటచే, సాక్షాత్కారము తప్పకుండ ఇతోధికభక్తిని సూచించుచున్నదని భా. ఇట్లే యీకడమ వాక్యములందును అన్వయించుకొనవలయును.] అఖ......డు - అఖర్వ = పెల్లయిన - మహిమ = ప్రభావమునకు - అతిధూర్వహుఁడు = మిక్కిలి ధురంధరుఁడు (అత్యంతప్రభావశాలియనుట. 'ఖర్వోహ్రస్వశ్చవామనః' అమ. ఖర్వమనఁగా కుఱుచది - దానికి విరుద్ధమయినది అఖర్వము - అనఁగా ఉన్నతమయినది - అనఁగా మిక్కిలి గొప్పది యనుట. విరోధము కూడ నక్షున కర్థము :—

'తత్సాదృశ్య మభావ శ్చ తద్విరోధ స్త దల్పతా।
తదన్యత్వం నిషేధ శ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః.')

**అను** - తుర్వసు వంశంబునన్ = తుర్వసుఁడను రాజుకులములో (తుర్వసుఁడు యయాతికొడుకు - యదువునకు తమ్ముఁడు. ఈశబ్దమును దకారాదిగా వ్యవహరించుట పొరఁబాటు), ...

సీ. కలశపాథోరాశిగర్భ వీచిమతల్లి
గడుపార నెవ్వానిఁ గన్నతల్లి,
యనలాక్షు ఘనజటా వనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టునవార్తవంపుఁబువ్వు,
సకలదైవత బుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టు కామని లేని మెట్టపంట,
కటికి చీకటితిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁజేయు,
తే. నతఁడు వొగడొందు మధుకైటభారిమఱఁది,
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు,
మిసిమిపరసీమ వలరాజు మేనమామ,
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. 19

1. కల...ల్లి - కలశపాథోరాశి = పాలకడలియొక్క - గర్భ = కడుపులోని - వీచిమతల్లి = శ్రేష్ఠమయినకరుడు ('మతల్లికా మచర్చికా ప్రకాణ్డ ముద్ఘతల్లజౌ, ప్రశస్తవాచకాన్యమూని,' 'భఙ్గ స్తరఙ్గ ఊర్మిః స్యాత్ స్త్రియాం వీచిః' అమ. 'గర్భవీచి' యనుటచే అంతఃపురకాంతారత్నమని ధ్వనించుచున్నది.), ఎవ్వానిన్ = ఏచంద్రుని, కడుపు - ఆరన్ = తనియునట్లుగా, కన్నతల్లియో (పాలసంద్రమునం బుట్టిన భాగ్యవంతుఁ డనుట); ['పాథః' = నీరు - 'ఉదకం పాథః' త్రచ్చుటకు క్షీరసాగరము కలశముగానుండెను గావున కలశాబ్ధి యిత్యాది పదములు క్షీరసాగరమును చెప్పు నని కొందఱమతము;

'కడఁగి యమృతజలధిఁ గలశంబు గావించి
త్రచ్చునవసరమునఁ దలఁపు లమర.' శ్రీభాగ. 8 (192)

'కలసము' శసాభేదముచే అదియే కలశము, పాలసంద్రపు టమృతమును పోసియుంచుటకై విశ్వకర్మచే నిర్మింపఁబడిన ఘటము - దానికి సంబంధించినదిగాన కలశోదధి యనం బాలకడలియని మఱియొక మతము.

'సాగరేమథ్యమానేతు పీయూషార్థం సురాసురైః
పీయూష ధారణార్థాయ నిర్మితా విశ్వకర్మణా
కలాః కలా స్తు దేవానా మసితా స్తాః పృథక్పృథక్
యతః కృతా స్తు కలశా స్తత స్తే పరికీర్తితాః.' (కాళికాపు.)
'కలశస్తు త్రిషు ద్వయోః । ఘటః' అమ.

'తాలవ్యా అపి దన్త్యాశ్చ శమ్బ సూకర పాంశవః
కలశః శమ్బలం చైవ జిహ్వాయాం రశనా తథా.' రామాశ్రమిధృతము.)

ఈపాదమున పరిణామాలంకారము. కనుటయను క్రియకొఱకు వీచిమతల్లి విషయి తల్లిరూపమున పరిణతిం గోరుచున్నది.

2. ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు, అన......కిన్ - అనల = నిప్పు - అక్షు = కంటఁ గలవాఁడయిన ముక్కంటియొక్క - ఘన = దట్టమయిన ('ఘనం నిరన్తరం సాన్ద్రమ్' అమ.) - జటా = జడ లనెడి ('మూలే లగ్నః కచే జటా' అమ.) - వనవాటికిన్ = అడవివరుసకు, వన్నె=శోభను - పెట్టు...వ్వు - పెట్టు = కలిగించునట్టి - అ నార్తవంపు = ఋతుసంబంధి కానట్టి (తరు లతాదులం దుద్భవించు పుష్పములకు ఋతునియమము కలదు, అట్టినియమము లేకుండ ఎల్ల ఋతువులయందును ఉండునట్టియనుట) - పువ్వు = పుష్పమో; (శివుఁడు చంద్రుని జౌదలం దాల్చె ననుట.) రూపకము.

3. ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు, సకల......కిన్ - సకల = ఎల్ల - దైవత = దేవతలయొక్క ('బృన్దారకా దైవతాని' అమ.) - బుభుక్షా = ఆఁకటియొక్క - పూర్తికిన్ = తీఱుటకు, పుట్టుక = మొలచుటయు, ఆమని = నుఱిపిడియు - లేని (చల్లక నుఱవక సిద్ధముగానున్న యనుట) - మెట్టపంట = మెరకపంటగానున్నదో (మెట్టపంట యనుటచే వఱపుచే చెడని దనుట. బ్రహ్మ చంద్రుని దేవతలకు ఆహారార్థము సృజించినాఁడు.—

'భక్ష్యార్థం సర్వ దేవానాం సోమః సృష్టః స్వయంభువా,
తత్రస్థ మమృతం చాపి సంభూతం సూర్య తేజసా;
త్రయశ్చ త్రిశతం చైవ త్రయస్త్రింశ త్తథైవచ
త్రయ శ్చ త్రిసహస్రా శ్చ దేవా స్సోమం పిబన్తివై.' దేవీపు.)

పరిణామాలంకారము.

4. ఎవ్వాఁడు = ఏచంద్రుఁడు, కటికి...తన్ - కటికి = గాఢమయిన - చీకటి = అంధకారము - తిండి = ఆహారముగాఁగల (అనఁగా గాఢాంధకారము నడంచునట్టి) - కరముల = కిరణములయొక్క (చేతులయొక్కయనియు - 'బలిహస్తాంశవః కరాః' అమ.) - గిలిగింతన్ = స్పృశించుటచేత (చక్కిలిగింతచేత), తొగకన్నెన్ = కలువమొగ్గను (కలువయనెడు కన్యను), నవ్వఁజేయున్ = వికసింపించునో (నవ్వించునో - చంద్రకిరణములు సోఁకినఁ గలువమొగ్గ విరియునని భా.) [తొగ యనఁగా కలువతీఁగ యని గ్రహించు పక్షమున దానిని నవ్వించుట యనఁగా దాని మొగ్గలను వికసిల్లం జేయుట. 'నవ్వు తెలుపని కవిసమయము గాన నవ్వించుట యనుమాట తెల్లగలువ వికాసమునకు మాత్రమైనం జెల్లును గాని, నల్లగలువలకును ఎఱ్ఱగలువలకును ఎట్లు చెల్లును ?' అనగా.

'సామాన్య గ్రహణే వారిముచాం కృష్ణత్వ మేవహి
రక్తత్వ మేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్య మేవచ.' కా. క. ల.

[అనుటచే సామాన్యగ్రహణమందు పుష్పముల శౌక్ల్యేతరవర్ణములు అవివక్షితము లని తలంప వలయును;] రూపకాలంకారము.

మధు......ది - మధుకైటభ = మధువు కైటభుఁడు అనునసురులకు - అరి = శత్రువైన నారాయణునికి - మఱఁది = భార్యయగు మహాలక్ష్మికి తోడఁబుట్టిన వాఁడు. జననక్రమముచేత అన్న:—

'చిన్ని వెన్నెలకందు వెన్ను దన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ తోఁబుట్టు మాకు.' మను.

'తతః శతసహస్రాంశు ర్మథ్యమానా త్తు సాగరాత్
ప్రసన్నాత్మా సముత్పన్నః సోమః శీతాంశు రుజ్జ్వలః
శ్రీ రనన్తర ముత్పన్నా ఘృతా త్పాణ్డరవాసినీ.' - భార. 1).

క......డు - కళలకు

('కళా స్యాన్మూల రైవృద్ధౌ శిల్పాదా వంశమాత్రకే
షోడశాంశే చ చన్ద్రస్య కలనా కాలమానయోః.' మేది)-

నెలవు = ఉనికిపట్టు - అగువాఁడు (చంద్రునికి పదునాఱుకళ లనియు అవి తిథిక్రమమున శుక్లపక్షమున ఒకటొకటి ఎక్కుచు కృష్ణపక్షమున ఒకటొకటి తగ్గుచు నుండు ననియు, ఒకకళ యెప్పుడును శివశిరమున నుండు ననియు ప్రసిద్ధి. ఇతిహాసాగమకావ్యాలంకారాదులకు నఱువది నాలుగు కళలకును ఉనికి అనఁగా మహావిద్వాంసుఁడనియు.), చుక్కలకున్ = నక్షత్రములకు - ఱేఁడు = ఏలిక, మిసి......మ - మిసిమి = కాంతికి - పర = అవతలి - సీమ = హద్దు. (ఇతని కన్న హెచ్చుకాంతి ఎవరికిని లే దనుట - 'సీమ సీమే స్త్రియాం క్షేత్రే కూల మర్యాదయో రపి' నానా.), వల...మ - వలరాజు = మన్మథునియొక్క (తల్లియగు మహాలక్ష్మికి తోఁబుట్టువు గావున) మేనమామ, - వేవెలుంగుల దొర జోడు = వేయికిరణములు గలవాఁ డగుప్రభువునకు (అనఁగా సూర్యునికి) ఉద్ది, అతఁడు రే వెలుంగు = ఆచంద్రుఁడుఁ 'జాబిల్లి రేవెల్గు చందమామ' ఆం. సం.). పొగడు = స్తుతిని, ఒందున్ = పొందును (మిక్కిలి యుత్కృష్టుఁ డనుట.)

ఈ పద్యమందు చంద్రునికి (రేవెలుంగునకు) చెప్పిన విశేషణములచేత క్రమముగా మహాకులీనత్వము సౌభాగ్యము ఔదార్యము రసికత్వము గొప్పబంధువులుకలిమి వైదుష్యము ఐశ్వర్యము దేహకాంతి సౌందర్యము గొప్పతనము సత్స్వభావమును సూచితములు.

తే. ఆసుధాధాము విభవ మహాంబురాశి
కుబ్బు మీఱంగ నందనుఁ డుదయ మయ్యె
వేద వేదాంగశాస్త్రార్థ విశదవాస
నాత్తధిషణాధురంధరుం డైనబుధుఁడు. 20

ఆసు......కిన్ - ఆ = పూర్వోక్తుఁడైన - సుధాధాము = చంద్రునియొక్క ('విధుః సుధాంశుః శుభ్రాంశుః' అమ.) - విభవ = ఐశ్వర్య మనెడు - మహాంబురాశికిన్ = గొప్పసముద్రమునకు, ఉబ్బు = పొంగు - మీఱంగన్ = అతిశయించునట్లుగా, నందనుఁడు = కుమారుఁడు, వేద......డు - వేద = (ఋగ్యజుస్సామాథర్వము లను నాలుగు) శ్రుతులయు ('శ్రుతి స్త్రీ వేద ఆమ్నాయః' అమ.) - వేద అంగ = (శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్త జ్యోతిష కల్పము లనెడి యాఱు) వేదాంగములయు - శాస్త్ర = తర్క వ్యాకరణ ధర్మ మీమాంసా జ్యోతిషము లను నాఱు) నియమన గ్రంథములయొక్కయు - అర్థ = అభిధేయములయొక్క ('అర్థోభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు' అమ.) - విశద = స్వచ్ఛమయిన ('విశదః పాణ్డరే వ్యక్తే' హేమ.) - వాసనా = సంస్కారముచేత - ఆత్త = పొందఁబడిన - ధిషణా = బుద్ధియొక్క ('బుద్ధి ర్మనీషా ధిషణా' అమ.) - ధురంధరుండు = భారవాహి, ఐన - బుధుఁడు = బుధుఁ డను వాఁడు (బుధగ్రహము), ఉదయమయ్యెన్ = జనించెను.

చంద్రునిసుతుఁడు బుధుఁడు, అతఁడు సకలవేదవేదాంగశాస్త్రములయందు మహాప్రవీణుఁడు. కావుననే బుధధ్యాన శ్లోకమందు 'జ్ఞః' అని తద్విశేషణము :—

'ఉదఙ్ముఖో మాగధజో హరిస్థ శ్చాత్రేయగోత్ర శ్శరమణ్డలస్థః
స ఖడ్గచర్మోరు గదాధరో జ్ఞ స్త్వీశాన భాగే వరద స్సుపీతః
పీతామ్బరః పీతవపుః కిరీటీ చతుర్భుజో దణ్డధర శ్చ సౌమ్యః
చర్మాసిధృ త్సోమసుతః సుమేరుః సింహాధిరూఢో వరదో బుధ శ్చ.'

'విభవమహాంబురాశి' – రూపకము.

క. వానికిఁ బురూరవుఁడు ప్ర। జ్ఞానిధి జనియించె సింహసదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం। డానృపతికి తనయుఁడై యయాతి జనించెన్. 21

వానికిన్ = ఆబుధునికి, ప్రజ్ఞానిధి = త్రైకాల్యజ్ఞానముకలవాఁడును
['స్మృతిర్వ్యతీతవిషయా, మతిరాగామిగోచరా,
బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా, ప్రజ్ఞా త్రైకాల్యగోచరా,
ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః.']'

సింహసదృశుఁడు = (విక్రమమందు) సింహములో తుల్యుఁడును, అగు – పురూరవుఁడు = పురూరవోమహారాజు, జనియించెన్ = పుట్టెను; తత్ భూజానికిన్ = ఆరాజునకు (భూమి జాయగాఁ గలవాఁడు భూజాని. బ. స.), ఆయువు=ఆయువనురాజు, తనయుండు=కొడుకై,...... ఆనృపతికిన్ = ఆయాయురాజునకు, తనయుఁడై = కొడుకుగా, యయాతి = యయాతి యను రాజు, జనించెన్ = పుట్టెను.

క. అతనికి యదు తుర్వసులను। సుతు లుద్భవమంది రహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి। శ్రుతకీర్తిన్ వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై.

అతనికిన్ = ఆయయాతికి, అహిత సూదనులు = శత్రువులను మ్రందించువారు, కళాన్విత మతులు = శిల్పాదులతో కూడుకొన్న తెలివి గలవారును, (అయిన) – యదు తుర్వసులు = యదువు తుర్వసువు అను – సుతులు = కొడుకులు, ఉద్భవము అందిరి = పుట్టుకను పొందిరి (పుట్టి రనుట), వారిలోన్ = ఆయిద్దఱిలో, తుర్వసుఁడు, గుణనిధి ఐ = గుణములకు నిక్షేపమై, విశ్రుత కీర్తిన్ = ప్రసిద్ధమైన కీర్తిని, వహించెను.

'అతనికి...సుతు లుద్భవమందిరి' – ఇట 'అపాయాది' సూత్రముచే 'అతనివలన' అని వలన వర్ణకంబు వచ్చును, తట్టీకంబట్టి కి (కు) షష్ఠియు వచ్చును. బా. వ్యా. కా. 9.

ఇట తుర్వసువు అని తకారాదియు ఉకారాంతమును అగుఁ గాని, దకారాదియు అకారాంతమును గాదు; సంస్కృత భాగవతములో

'యదుం చ తుర్వసుం చైవ దేవయానీ వ్యజాయత.' ix – 18 (32)
'ప్రతీచ్యాం తుర్వసుం చక్రే.' ix – 19 (22)

తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె,
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది

నిఖిల భువన ప్రపూర్ణ నిర్ణిద్రకీర్తి
నధిపు లైరి తదీయాన్వయమునఁ బుట్టి. 23

వాని వంశంబు = ఆ తుర్వసుకులము, తుళువ అన్వవాయము = తుళువ [అను పేరుగల రాజ] సంతతి ('వంశోఽన్వవాయః సన్తానః' అమ.) అయ్యెను; అందున్ = ఆతుళువ కులమందు, పెక్కండ్రు నృపులు = పలువురు రాజులు, ఉదయంబున్ ఒంది = జనించి, నిఖిల...... ర్తిన్ నిఖిల = ఎల్ల - భువన = లోకములందు - ప్రపూర్ణ = నిండిన - నిర్ణిద్ర = ప్రకాశమానమయిన - కీర్తిన్ = ఖ్యాతి చేతను, అధిపులు ఐరి = గొప్పవారుగా నుండిరి; తదీయ అన్వయమునన్ = ఆతులువరాజుల దైన వంశమందు('సంతతిర్గోత్ర జనన కులా న్యభిజనాన్వయౌ' అమ.), పుట్టి (తర్వాతిపద్యముతో నన్వయము).

'తుర్వసు' అనుశబ్దమే వంశనామముగా తుళువ అని తద్భవమాయె నని కవిహృదయము.

మహాస్రగ్ధర.

ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శఠకమఠగ్రావ సంఘాతవాతా
శనరాడాశాంతదంతి స్థవిరకిరుల జంజాటముల్ మాన్చి యిమ్మే
దిని దోర్దండైకపీఠిన్ దిరముపఱిచి కీర్తిద్యుతుల్ రోదసిన్ బ
ర్వ నరాతు ల్నమ్రులై పార్శ్వములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు సూపెన్.

తిమ్మక్షితి ఈశ అగ్రణి = తిమ్మరాజశ్రేష్ఠుఁడు, ఘనుఁడు ఐ = గొప్పవాఁడై, శఠ...... టముల్ - శఠ = వంచకములయిన (చక్కఁగా మోచుటకు శక్తి లేకున్నను బడాయికై మోచుచు శ్రమపెట్టుట వంచన - 'నికృతి స్త్వనృజుః శఠః' అమ.) - కమఠ = (ఆది) కూర్మము - గ్రావసంఘాత = కొండలసమూహము - ('గ్రావాణౌ శైలపాషాణౌ', - 'స్తోమౌఘ నికరవ్యూహ వార సంఘాత సంచయాః' అమ.) - వాతాశన రాట్ = నాగశ్రేష్ఠుఁ డయిన శేషుఁడు (వాత = గాలి - అశన = ఆహారముగాఁ గలవి, వాతాశనములు సర్పములు - 'ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః' అమ. సర్పములకు రాజు వాసుకి గాని అనంతుఁడు గాఁడు, కావున నిట రాట్ఛబ్దమునకు శ్రేష్ఠార్థత చెప్పఁబడినది. - 'శేషోఽనన్తః వాసుకిస్తు సర్పరాజః' అమ. భూమిని మోచువాఁడు అనంతుఁడుగాని వాసుకి గాఁడు.) - ఆశా అంత దంతి = దిగంతములందలి యేనుఁగులు ('దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః,' 'దన్తీ దన్తావళో హస్తీ.' అమ.) - స్థవిర కిరుల = ముసలి పంది ('ప్రవయాః స్థవిరో వృద్ధః,' 'వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః' అమ.) - అనువానియొక్క - జంజాటముల్ = ఆటోపములను, మాన్చి = మాన్పించి, ఇమ్మేదినిన్ = ఈ భూమిని, దోః దండ ఏక పీఠిన్ = దండమువంటి (దక్షిణ) బాహు వనెడి ఒకటేయాసనమందు, తిరము పఱిచి = కుదురుగా నెలకొలిపి, కీర్తిద్యుతుల్ = యశముయొక్క కాంతులు (దానాది ప్రభవము కీర్తి యనియు ప్రతాపప్రభవము యశమనియు భేద మున్నను కవులు ప్రాయికముగా దానిం బాటించుట లేదు. - 'శోభా కాన్తి ర్ద్యుతి శ్ఛవిః' అమ.) రోదసిన్ = భూమ్యాకాశములయందు ('ద్యావాపృథివ్యౌ రోదస్యౌ' అమ.), పర్వన్ = వ్యాపింపఁగాను, అరాతుల్ = శత్రువులు ('అభియాతి పరారాతి ప్రత్యర్థి పరిపన్థినః' అమ.) నమ్రులు ఐ = మ్రొక్కినవారై, పార్శ్వములన్ = సూరెలయందు, కొలువన్ = తన్ను సేవించుచుండఁగా, తీవ్ర ప్రతాపంబు = తీక్ష్ణమయిన తేజమును ('స ప్రతాపః ప్రభావ శ్చ యత్తేజః కోశదణ్డజమ్' అమ.), చూపెన్ = ప్రకటించెను.

తులువవంశములోఁ బుట్టి తిమ్మరాజు గొప్పవాఁడై యేమిచేసె ననఁగా - ఆదికూర్మము, ఏడు కులపర్వతములు, అనంతుఁడు, ఎనిమిది దిగ్గజములు, ఆదివరాహము - ఈపదునెనిమిదియు భూదేవిని మోవలేక మోవఁజాల మని చెప్పక బడాయికై మోచుచు శ్రమపడుచుండఁగా వారి యాయాడంబరమును తొలఁగించి యామెను దండమువంటి తనదక్షిణ బాహు వనెడి యొకశే యాసనమందు హాయిగా నెలకొల్పి, లోకమందంతట తనకీర్తి నెగడించిన వాఁడై, శత్రువులు తనకు మ్రొక్కుచు తనపార్శ్వములందు కొలుచుచుండునట్లుగా తీక్ష్ణమయిన తేజమును ప్రకాశింపఁజేసెను.

'తిమ్మఁడు = తిరుమల+ఁడు' అని శబ్దరత్నాకరము. మేదిని = మేదముగలది - 'మేదమ్' అని మేదఃశబ్దము అకారాంతమునుం గలదనుటకు - 'మదఘ్నో మేద కష్ఠహా' అని శాలిహోత్ర వచనము రామాశ్రమ్యుద్ధృతము.- 'మధుకైటభదానవేన్ద్ర మేదః ప్లవవిస్రావిష మైవ మేదినీయమ్.' అని మురారి. 'తిరము' - స్థిరశబ్దభవము. - పద్యపూర్వార్ధములో 'చక్కఁగా పరిపాలించినాఁ' డను గమ్యమును భంగ్యంతరమునం జెప్పినందున పర్యాయోక్తాలంకారము.

క. వితరణఖని యత్తిమ్మ । క్షితిప గ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వర ప్రభుఁ । డతిపుణ్యుఁడు పుట్టె సజ్జనావనపరుఁడై. 25

వితరణఖని=ఈవికి గని (మిక్కిలి ఇచ్చువాఁడు - 'ఖనిః స్త్రియా మాకరః స్యాత్' అమ.), (అగు), అత్తిమ్మక్షితిపగ్రామణికిన్ = ఆతిమ్మరాజోత్తమునికిని ('గ్రామణీ ర్నాపితే పుంసి త్రిషు శ్రేష్ఠేఽధిపే త్రిషు.' అమ.), దేవకీదేవికిన్ = దేవకీదేవి యనెడిపేరి యాతని దేవేరికిని, అంచిత మూర్తి =మహనీయమయిన మేనుగలవాఁడును ('పూజితేఽఞ్చితః' 'స్త్రియాంమూర్తి స్తను స్తనూః.' అమ.), అతిపుణ్యుఁడు=అత్యంతసుకృతము కలవాఁడును (పుణ్యంతు సున్దరే। సుకృతే పావనే ధర్మే' మేది.), (అయిన) - ఈశ్వరప్రభుఁడు = ఈశ్వరరాజు, సజ్జన అవన పరుఁడు ఐ = సాధు జనులరక్షణము ఉత్తమముగాఁ గలవాఁడు (సాధుజనరక్షణాసక్తుఁడనుట—'దూరానాత్మోత్తమాః పరః' అమ.)

దేవకీదేవికిని తిమ్మరాయలకును మహానుభావుఁడు ఈశ్వరరాయలుజనించెను.

'వితరణఖని' - అని షష్ఠీకిం బ్రథమ. 'ఒకానొకచో విశేషణంబులషష్ఠీకిం బ్రథమ విభాష నగు.' బా. వ్యా. కా. 27.

చ. బలమదమత్తదుష్ట పురభంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలఁ దయిఁ బొంటియీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప రూపఱన్
జలరుహనేత్రలన్ వొఱఁగి శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెడు శత్రుభూవరులు మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. 26

బల......డై - బల = సామర్థ్యముచేతనైన ('స్థౌల్యసామర్థ్యసైన్యేషు బలం నా కాక సీరిణోః' అమ.) - మద=హర్షముచేత ('మద స్రేజసి కస్తూర్యాం గర్వే హర్షేభదానయోః' అమ.)- మత్త=పొగరెక్కిన వారైన - దుష్ట=చెనఁటులయొక్క (చెడ్డరాజులయొక్క - అసురులయొక్క యనియు భా.) - పుర = పట్టణములను (త్రిపురములు నని మహేశ్వర పరము.) - భంజనుఁడు = కూల్చినవాఁడు - ఐ, పరి...డై - పరిపాలిత=రక్షింపఁబడిన (ఏలఁబడిన) - ఆర్యుఁడు=సత్పురు

షులుకలవాఁడు (మహాకుల కులీనార్యసభ్యసజ్జన సాధవః.' అమ. మహేశ్వర పరముగా పార్వతి కలవాఁ డని యర్థము—'ఆర్యా దాక్షాయణీ చైవ.' అమ.) - ఐ, ఇల పయిన్ = భూమిమీఁద ('గౌరిలాకుమ్భినీక్షమా' అమ.), తొంటి యీశ్వరుఁడే=పురాణపురుషుఁడైన యామహేశ్వరుఁడే ('శివః శూలీ మహేశ్వరః ఈశ్వరః శర్వ ఈశానః' అమ.), ఈశ్వరుఁడై = ఈశ్వర రాయలుగా, జనియింపన్ = పుట్టఁగా (అవతరింపఁగా), [ఏమివిశేషము జరిగె ననఁగా?] జలరుహనేత్రలన్ = కాంతలను, తొరఁగి = విడనాడి, శైలవనంబులన్ = కొండలందును అడవులయందును, భీతచిత్తులు ఐ = (ఈతనివలన) భయపడిన మనస్సు గలవారై, మెలఁగెడు శత్రుభూవరులు = సంచరించెడువైరిరాజులు, మేనులన్ = దేహములయందు, తాల్చిన = ధరించిన - మన్మథ అంకముల్ = (కాంతాలింగనాదులచేఁ గలిగిన కుచకస్తూరీముద్రాదులయిన) మదనచిహ్నము లనెడు మన్మథుని గుర్తులు, రూపఱెన్ = క్షయించెను. మహేశ్వరపక్షమున మదనుఁడు గుర్తులేకుండ తెగటాఱె నని యర్థము.)

పూర్వము శివుఁడు అసురులత్రిపురములను దహించి పార్వతిని ఏలినాఁడు, అట్లే ఇప్పుడు ఈశ్వరరాయలు దుష్టవైరుల పురములను కూల్చినాఁడు, సాధువులను కాపాడినాఁడు; శివునిచేత మన్మథుఁడు గుర్తే లేనట్లుగా తెగటాఱినాఁడు, ఈశ్వరరాయలకు వెఱచి వైరులు కాంతలను విడిచి అడవులంబట్టి కామక్రీడా చిహ్నరహితు లయినారు.

శ్లేషానుప్రాణితమయిన రూపకాలంకారము.

సీ. నిజభుజాశ్రిత ధారుణీ వజ్రకవచంబు
దుష్ట భుజంగాహితుండికుండు,
వనజేక్షణా మనోధన పశ్యతోహరుం
డరిహంస సంసద్భ్రాగమంబు,
మార్గణగణపిక మధుమాస దివసంబు
గుణరత్నరోహణ క్షోణిధరము,
బాంధవసందోహ పద్మవనీహేళి
కారుణ్యరసనిమ్నగా కళత్రుఁ,
తే. డన జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁగాంచె
* ధరణిధవదత్తవివిధోపదా విధాస
మార్జిత శ్రీవినిర్జిత నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి యీశ్వరుండు. 27

ధరణి...రుఁడు - ధరణిధవ=రాజులచేత - దత్త=అర్పింపఁబడిన - వివిధ=పలుతెఱంగుల - ఉపదా = కానుకలయొక్క ('ఉపాయన ముపగ్రాహ్య ముపహారస్తథోపదా' అమ.) - విధా = పెంపుచేత ('విధా గజాన్నే బుద్ధౌచ ప్రకారే వేతనే విధా' విశ్వ.) - సమార్జిత=సంపాదింపఁబడిన - శ్రీ = సంపదచేత ('అథసంపది। సంపత్తిః శ్రీశ్చ లక్ష్మీశ్చ' అమ.) - వినిర్జిత = ఓడింపఁబడిన - నిర్జర ఆలయ = స్వర్గముయొక్క ('స్వ రవ్యయం స్వర్గ నాక త్రిదివ త్రిదశాలయాః'

* సీసాంతమున విగువు - చూ. పీఠిక పు. 7.

అమ.) - ఈశ్వరుఁడు=ఏలికయయిన యింద్రుఁడు కలవాఁడు - ఐశ్వర్యమందు ఇంద్రుని మించిన వాఁడనుట), (అయిన) - తిమ్మభూపతి యీశ్వరుండు=తిమ్మరాజు కుమారుఁడైన యీశ్వరరాజు,—

1. నిజ...బు - నిజ=తనదైన (ఈశ్వరరాజుదైన) - భుజ=బాహువును - ఆశ్రిత=అండ గొన్నట్టి - ధారుణీ = భూమికి - వజ్ర కవచంబు = మగరాతిమైమఱువు (ఈతఁడేలు దేశమును పరు లెవ్వరును ఎంతమాత్రమును పీడింపలే రనుట); దుష్ట...డు - దుష్ట=చెనటుల నెడి - భుజంగ= పాములకు - అహితుండికుండు = పాములవాఁడు. (పాములవాఁడు పామును నిర్విషముం గావించినట్లు దుష్టులను దండించి సాధువులనుగాఁ జేసినాఁడనుట. - అహితుణ్డేన దీవ్యతీతి ఆహితుణ్డికః ఆహితుణ్డికశ్చ; అహితుణ్డమనఁగా పాముపడగ, దానితో క్రీడించువాఁడు అహితుండికుఁడు, ఆహితుండికుఁడును. అహితుండి కాపమానోక్తిచేత దుష్టులను తానుకష్టపడక ఆటగానే దమించినాఁడనుట.)

2. వన.....డు - వనజేక్షణా = తామరసనేత్రలయొక్క (సొబగుకత్తెలయొక్క) - మనః = చిత్తమనెడు - ధన = లిబ్బికి - పశ్యతోహరుండు = పచ్చెపుదొంగ (స్త్రీలు ఇతనిం జూచిన మాత్రాన ఇతనిని వలతు రనుట, అత్యంత సుందరుఁ డనుట - పట్టి దొంగయనక పచ్చెపు దొంగయనుటచే సౌందర్యాతిశయము ఫలించుచున్నది. - పశ్యతోహరః = పశ్యన్తమనాదృత్య హరతి = చూచువానిని ఏమఱించి హరించువాఁడు), అరి......బు - అరి = వైరు లనెడి - హంస = అంచలయొక్క - సంసత్ = సమూహమునకు ('సభాసమితిసంసదః' అమ.) - అభ్ర ఆగమంబు = మేఘములరాక (వర్షర్తువనుట. - జలరధసమయే మానసం యాన్తిహంసాః' - అని కవిసమయము; వర్షర్తువురాఁగా హంసలు మానసమున కేఁగును. - ఇతనిశత్రువులు పటాపంచలై పోయినా రని భా.)

3. మార్గ...బు - మార్గణ = యాచకులయొక్క 'వనీపకో యాచనకో మార్గణో యాచకార్థినౌ' అమ.) - గణ = సమూహ మనెడు - పిక = కోయిలలకు - మధుమాస = చైత్రమునయొక్క

('మధు క్షౌద్రే జలే క్షీరే మద్యే పుష్పరసే మధుః
దైత్యే చైత్రే వసన్తే చ జీవాశోకే మధుద్రుమే.' విశ్వ.) -

దివసంబు = దినము (కోయిలలకు చైత్రమాసపుదినమువలన ఎట్లు చూతపల్లవమకరందాద్యభీష్ట భోజనము తనివి తీఱ దొరకునో అట్లే ఈరాజువలన యాచకులకు సకలాభీష్టములును తనివి తీఱ దొరకు ననుట); గుణ......ము - గుణ = సుగుణము లనెడు - రత్న = మణులకు - రోహణ క్షోణీధరము = రత్నపర్వతము ('రత్నాచలో రోహణాద్రిః' అని నైషధ వ్యాఖ్యలో మల్లినాథుఁడు. - ఈరాజు సకలసుగుణనిధి యనుట.)

4. బాంధ......హేళి - బాంధవ = చుట్టాలయొక్క (బంధువులే బాంధవులు - సందోహ=సమూహమనియెడు ('సమూహ నివహ వ్యూహ సందోహ విసర వ్రజాః'అమ.)-పద్మవనీ = తామరతంపరకు - హేళి = సూర్యుఁడు ('హేళి రాలిఙ్గనేఽర్కేచ' నానా. సూర్యునికి పద్మములతోడి మైత్రి కవిసమయ ప్రసిద్ధము - ఈశ్వరరాజు సకలబంధుపోషకుఁ డని భా.)-కారుణ్య ......డు - కారుణ్య = దయయనెడు (కరుణయే కారుణ్యము) - రస = జలమునకు 'రసో గన్ధరసే జలే' హేమ.) - నిమ్నగాకళత్రుఁడు = సముద్రుఁడు (నిమ్నగలు కళత్రములుగాఁ గలవాఁడు - అనఁగా నదులు భార్యలుగాఁ గలవాడు - 'సముద్రోఽబ్ధి రకూపారః పారావారః సరిత్పతిః' అమ. - అపార మయిన కరుణకలవాఁ డనుట.)

అనన్ = అని, జగంబులన్ = లోకములలో (పా. 'అన జనంబులు' - జనంబులు = లోకులు-అనన్ = అని వచించుచుండఁగా), ప్రఖ్యాతిన్ = కీర్తిని, కాంచెన్ = పొందెను.

రాజు లిచ్చుకానుకలచేత ఈశ్వరరాజు ఇంద్రునివలె నైశ్వర్యవంతుఁ డాయెను. ఆ రాజు తన రాష్ట్రమును వైరులనుండి రక్షించెను, దుష్టులను సాధువులనుగాఁ జేసెను; ఆయన అత్యంత సుందరుఁడు, శత్రువులను పాఱఁదోలినాఁడు, మహోదాత, సకల సుగుణములుం గలవాఁడు, బంధురంజనుఁడు, కరుణానిధి ఇట్లని లోకములందు కీర్తిఁ జెందినవాఁడు.

ఇందు సీసపాదములందు మాలారూపకము, గీతమందు ఉపమ, ఆరెంటికిని సంసృష్టి. 'వినిర్జిత' అనునది ఉపమావాచకము.

క. ఆయీశ్వర నృపతికిఁ బు। ణ్యాయతమతియైన బుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి। ధీయుతు లగునారసింహ తిమ్మనరేంద్రుల్. 28

ఆయీశ్వర (నృపతికిన్ = ) రాజునకును, పుణ్య ఆయతమతి = పుణ్యములయందు (పుణ్యములు చేయుటయందు) - ఆయత = దీర్ఘమయిన ('దీర్ఘమాయతమ్' అమ.) - మతి = మనస్సు గలది (పుణ్యములు సేయుటయందు మిక్కిలి ఆసక్తి కలదియనుట), ఐన - బుక్కమాంబకును, తేజ......లు - తేజః=దీప్తిచేతను - తోయజహితులు = సూర్యులగువారు (సూర్యసమతేజులు)ను, ధీయుతులు = ప్రజ్ఞావంతులును ('ధీః ప్రజ్ఞా శేముషీ మతిః' అమ.), అగు - నారసింహ తిమ్మనరేంద్రుల్ = నరసరాజును తిమ్మరాజును, ఉదయించిరి = పుట్టిరి.

పుణ్యకర్మలు సేయుచుండెడి బుక్కమదేవియందు ఆయీశ్వరరాజునకు సూర్యతేజులును ప్రజ్ఞావంతులు నగు నారసింహరాజును తిమ్మరాజును జనించిరి.

'బుక్కమాంబ' - బుక్క + అమ + అమ్బా అని శబ్దనిష్పత్తి. అంబ యన అమ్మయే గాన ఇట్టి ప్రయోగములు పునరుక్తిదూషితము లని కొందఱ యభిప్రాయము. నామాంతావయవమయిన 'యమ్మ' శబ్దమునకు పూజ్యవాచకత్వము వివక్షాధీన మగుటచే తదవివక్షాపక్షమందు పూజార్థము వేఱు అంబాశబ్దము అనుప్రయుక్త మయినందున పౌనరుక్త్యదోషము లే దనుట యొప్పును. 'నృపతికి...బుక్కమాంబకు...ఉదయించిరి' ఇందలి షష్ఠికై బా. వ్యా. కా. 9. టీకను చూ.

క. అందు నరసప్రభుఁడు హారి। చందన మందార కుంద చంద్రాంశు నిభా
స్పంద యశస్తుందిల ది। క్కందరుఁడై ధాత్రి యేలెఁ గలుషము లడఁగన్. 29

అందున్ = ఆయిరువురయందు, నరసప్రభుఁడు = నరసరాజు, హారి......డు - హారిచందన = చందనవిశేషము.

'హరిచన్దన మస్త్రీ స్యా త్త్రిదశానాం మహీరుహే
నపుంసకంతు గోశీర్షే జ్యోత్స్నా కుఙ్కుమయో రపి.' మేది.)-

మందార = కల్పవృక్ష పుష్పములు - కుంద = మొల్లలు - చంద్రాంశు = చంద్రకిరణములు-(వీనితో)- నిభ = సమానమయిన - అస్పంద=కదలని (స్థిరమయిన) - యశః = కీర్తిచేత - తుందిల = పొట్ట పెరిఁగిన - దిక్ = దెసలయొక్క - కందరుఁడు = గుహలు (ప్రదేశములు) గలవాఁడు, ఐ, కలుషములు = పాపములు, అడఁగన్ = నశించునట్లుగా, ధాత్రి = భూమిని, ఏలెన్ = పాలించెను.

నరసరాజు మహాకీర్తి గలవాఁడై పాపము లడఁచి భూమిం బరిపాలించెను.

'హరిచందన' - చందనవృక్షములకు పూవులను చెప్పఁగూడదు - 'న చ కుసుమ ఫలే గన్ధసారద్రుమాణామ్' సా. ద.- 'మందార' - 'ఫలేలుక్' - 'పుష్పమూలేషు బహుళమ్' అను సూత్రవార్త్తికములచే మందారపుష్పము అర్థము కాఁదగును; కావ్యకల్పలతలో 'ప్రాసాద సౌధకైలాస మన్దారద్రు హిమాద్రయః' అని శుభ్రగణములో మందారవృక్షము పఠింపఁబడియున్నది.- ఇట్టి తావులం గల యిట్టి యుపమానాధిక్యముచేత అపుష్టార్థతాదోష మని వామనోక్తి.- ఇందు ఉపమాలంకారము, వృత్త్యనుప్రాసంబును గలదు.

సీ. అంభోధి వసన విశ్వంభరావలయంబు
ఘనబాహుపురి మరకతముఁ జేసె;
కకుబంత నిఖిల రాణ్ణికరంబుఁ
జరణ మంజీరంపు సాలభంజికలఁ జేసె;
మహనీయ నిజ వినిర్మల యశస్సరసికి
గగనంబుఁ గలహంసకంబుఁ జేసె
నశ్రాంత విశ్రాణ నాసారలక్ష్మికిఁ
గవికదంబముఁ జాతకములఁ జేసె;

తే. నతిశిత కృపాణ కృత్త మత్తారివీర
మండలేశ సకుండల మకుటనూత్న
మస్తమాల్య పరంపరా మండనార్చి
తేశ్వరుండగు నారసింహేశ్వరుండు. 30

అతి......డు - అతిశిత=మిగులవాఁడియైన ('నిశిత క్ష్ణుత శాతాని తేజితే' అమ.) - కృపాణ=కత్తిచేత - కృత్త=ఛేదింపఁబడిన - మత్త=పొగరెక్కిన - అరివీర=వైరిశూరులగు - మండలేశ = మాండలికులయొక్క (మండలాధీశ్వరులయొక్క) - సకుండల మకుట = చెవిపోఁగులతోను కిరీటములతోను గూడుకొన్న - నూత్న=క్రొత్త (అప్పుడే నఱికిన) - మస్త=శిరములయొక్క(తన్మయమయిన) - మాల్య = పిగదండల ('మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని' అమ.) - పరంపరా = శ్రేణి యనెడి - మండన = అలంకారముచేత - అర్చిత = పూజింపఁబడిన - ఈశ్వరుండు = శివుఁడు గలవాఁడు (మత్తులైయుండుట సంహరణకారణము - సకుండలమకుటత్వముచే పూజాద్రవ్యోత్కర్ష - 'నూత్న' మనుటచే వాడని దనుట - ఈశ్వరుఁడు పునుకపేరుదాల్పు గావున ఈమండనము ఆయనకు ప్రియమయిన దనుట), అగు - నారసింహేశ్వరుండు = నరసింహదేవ రాయలు - [ఈగీతము 'మండలీకర మేఘమార్తండ బిరుద' పారి. ౧ ఆ ౧౩, 'మండలీకభాస్కర' పారి. ౩ ఆ. ౬౦, 'మండలికతపన' మను. ౧ ఆ. ౭౩. ఇత్యాది బిరుదములకుం దెలివిడి.]

1. అం......బుళ్ - అంభోధి=సముద్రము - వసన=వస్త్రముగాఁ గలదైన - విశ్వంభరా=భూమియొక్క - వలయంబుళ్ = చక్రమును (భూమి నెల్ల ననుట), ఘన......ముళ్ - ఘన = గొప్పదైన (గొప్పదగుట బాహువుయొక్క వలుదతనముచేత) - బాహుపురి = భుజకీర్తియందలి - మరకతముళ్=పచ్చనుగా, చేసెళ్; [కొందఱు 'మరతకము' అను రూపము నవలం

బించి 'తనబాహుపురి' అని పఠింతురు. 'మరకత' పర్యాయము 'మరతక' శబ్దముం గలదు. దానికి 'మరం తక త్యనేన' - దీనిచే మరణమును కొట్టును - అని వ్యుత్పత్తి; విషహార మనుట. మరకత మణి శుభప్రదమని రత్నశాస్త్రము:—'శుక వంశపత్ర కదళీ శిరీషకుసుమప్రభం గుణోపేతమ్। సురపితృకార్యే మరకత మతీవ శుభదం నృణాం విధృతమ్.' బృ. సం. 'మరకతము' అను రూపమునకు 'మరకం తరన్త్యనేన' అనఁగా 'దీనిచే మరణమును దాఁటుదురు' అని వ్యుత్పత్తి; ఐనను ప్రకృతము తనబాహుపురియే గావున 'తన' యని నిర్దేశము మందము, అపుష్టార్థకమును; 'ఘన' యనుటచే పీవరతయు దానిచే వైరివిజయమును సూచితము లగుటచే అర్థపుష్టి కలదు. అలంకారముగా ధరించె ననుటచే మహీమండలమునెల్ల ఏలుటయందు అశ్రమయు, ప్రీతియు, సొంపును భావములు. మరకతత్వారోపము భూమికి నైల్యముచేత. - మనుచరిత్రలో ప్రథమపద్యంబున కస్తూరిముద్ర భూదేవిగా తోఁచునట్లు వర్ణన కలదు. సంవాదార్థము:—

'దృప్యద్దైత్యనితమ్బినీజన మనఃసన్తోష సంకోచనః
కుర్యా ద్విశ్వ మనశ్వరం స భగవా న్క్రోడావతారో హరిః
యద్దంష్ట్రాఙ్కురకోటి కోటరకుటీ కోణాన్తర స్థేయసీ
పృథ్వీభా త్యవదాత కేతక దళాళీనేవ భృఙ్గాఙ్గనా.' సు. భా, 27 (28)]

—రూపకాలంకారము.

2. కకు...బున్ - కకుప్ = దిక్కులయొక్క - అంత = తుదలయొక్క - నిఖిల = సకలమయిన - రాట్ = రాజులయొక్క ('రాజ్ఞి రాట్ పార్థివ క్ష్మాభృ న్నృప భూప మహీక్షితః' అమ.) - నికరంబున్ = సమూహమును ('స్తోమౌఘ నికర వ్రాత వార సంఘాత సంచయాః' అమ.), చర...లన్ - చరణ = పాదముయొక్క - మంజీరంపు = గండపెండేరముయొక్క ('పాదాఙ్గదం తులాకోటి మఞ్జీరో నూపురోఽస్త్రియామ్.' అమ.) - సాలభంజికలన్ = బొమ్మలనుగా ('సాలభఞ్జికా స్త్రియాం వేశ్యాయాం కాష్ఠాది పుత్త్ర్యా' మితి శబ్దాబ్ధిః అని నైషధమల్లినాథవ్యాఖ్య - గండపెండేరమందు వారిశిరములను చెక్కించె నని చరిత్రము.) ఈపాదమందు వస్తుకథనమేగాని రూపకముగాదు. రాజులకును తదీయప్రతిమలకును అభేదోపచారము, (వారినెల్లను జయించినాఁడని యెఱుంగునది).

3. మహ......సికిన్ - మహనీయ = పూజనీయమైన ('మహ పూజాయామ్' ధా. పా.) - నిజ = తనదైన - వినిర్మల = మిక్కిలి శుభ్రమైన - యశః = కీర్తియనెడి - సరసికిన్ = కొలనికి ('కాసారః సరసీ సరః' అమ.), గగనంబున్ = ఆకాశమును ('నభో న్తరిక్షం గగనమ్' అమ.), కలహంసకంబున్ = రాజహంసనుగా ('కలహంసస్తు కాదమ్బే రాజహంసే నృపోత్తమే' మేది.), చేసెన్. (ఈతని యశస్సు ఆకాశమునకన్నను ఎన్నియో మడుంగులు ఎక్కుడువిరివిగలది యనుట. రూపకాలంకారము; అధికాలంకార సంకీర్ణము; ఆధేయమయిన గగనముకన్న ఆధారమయిన కీర్తియందు మహత్త్వము చెప్పఁబడినది గావున అధికాలంకారము.)

4. అశ్రా.....కిన్ - అశ్రాంత=ఏడతెంపు లేని ('సతతా నార తాశ్రాన్త సంతతా విరతానిశమ్.' అమ.) - విశ్రాణన = ఈవియనెడి ('విశ్రాణనమ్ వితరణమ్' అమ.) - ఆసార = జడివాన యొక్క ('ధారాసంపాత ఆసారః' అమ.) - లక్ష్మికిన్ = సమృద్ధికి, కవికదంబమున్ =

కవుల సమూహమును ('కదమ్బం నికరమ్బే స్యాన్నీప సర్షపయోః పుమాన్' మేది. - కవులకు నిరంతరము మితిలేనిధన మిచ్చుచుండె ననుట.) - రూపకము.

దుష్టులయిన వైరి మాండలికుల శిరములం దునిమి వానిని సిగదండగా గ్రుచ్చి ఆసిగదండను పూజార్థము శివుని శిరమందు సమర్పించిన వాఁడయిన నరసరాజు భూమండలము నెల్లను అవలీలగా నేలినాఁడు, దిగంతములనుండు సకలరాజులను తనకు పాదాక్రాంతులం గావించి కొన్నాఁడు, అకసముకంటెను విరివియగు కీర్తిని సంపాదించినాఁడు, కవులకు నిరంతరము మహాధనము వర్షించినాఁడు.

తే. ఆనృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె,
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాయతాంశజు శ్రీకృష్ణరాయ నిన్ను. 31

తిప్పాంబా నాగాంబలు నరసింహరాజు దేవేరులు. అచ్యుత ఆయత అంశజున్ = శ్రీకృష్ణునియొక్క ఎక్కుడయిన యంశమువలనం బుట్టినవాఁడవైన. శ్రీకృష్ణరాయ - డులోపమునకు ౧౮ ప. టీకను చూ.

క. వీరనృసింహుఁడు నిజభుజ। దారుణ కరవాల పరుష ధారాహత వీ
రారి యగుచు నేకాతప। వారణముగ నేలె ధర నవారణమహిన్. 32

వీరనృసింహుఁడు, నిజ......రి - నిజ = తనదయిన - భుజ = బాహువు నందలి - దారుణ = భీషణమయిన ('దారుణం భీషణం భీష్మమ్.' అమ.) - కరవాల = కత్తియొక్క ('కౌక్షేయకో మణ్డలాగ్రః కరవాలః కృపాణవత్' అమ.) - పరుష = కఠినమయిన - ధారా = వాదరచేత.

('ధారా పుంః శాపి సేనాగ్రం పతదమ్బ్వాది సంతతిః
ఖడ్గాది నిశిత ప్రాన్తే తురఙ్గగతి పఞ్చకే.' నానా.)-

హత = నఱకఁబడిన - వీర = శూరులగు - అరి = శత్రువులు గలవాఁడు, అగుచున్, ధరన్ = భూమిని, అవారణమహిమన్ అడ్డులేని ప్రభావముతో, ఏక ఆతప వారణముగన్ = ఒకచే గొడుగుగా (తనగొడుగునకు ఎగురుగొడుగు లేకుండ), ఏలెన్.

క. ఆవిభునసంతరంబ ధ। రావలయముఁ బూని తీవు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా। దేవియుఁ గమలాబ్జముఖియు దేవేరులుగాన్. 33

ఆవిభు ననంతరంబ = వీరనరసింహరాయల తర్వాత, ......ఈవు, తిరుమల దేవియు, అన్నపూర్ణాదేవియు, కమలా అబ్జముఖియున్ = కమలయనెడి కమలవదనయు (లేక చంద్రవదనయు), దేవేరులుగాన్ = రాణులుగా, రహిమైన్ = హర్షముతో, ధరావలయమున్ = భూమండలమును, పూనితి = బుజముననంగొంటివి (మోవందొడంగితి, ఏలందొడంగితి ననుట.)

పూర్వముద్రణమందు 'కమలాబ్జముఖులు' అనిపాఠము. దానికి 'కమలము వంటియు చంద్రునివంటియు ముఖము గలవారు.' అని యర్థము. దేవేరుల వదనముల యుపమానములయందు చెప్పఁబడిన యీభేదమునకు నిమిత్తమగపడదు. మఱి యీవిశేషము లేకున్నను లోపములేదు. 'తిరుమల్దేవి' - ఇందు లకారముపై అకారమునకు లోపమునకును పీఠికం జదువుఁడు.

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు,
నతివృష్టి దోషభయంబు వాసెఁ,
గంటకాగమభీతి గడచెఁ, నుద్ధత భూమి
భృత్కటకంబెల్ల నెత్తువడియె,
మానె నఘస్ఫూర్తి, మరుభూములందును
నెలమూఁడు వానలు నిండఁ గురిసెఁ,
నాబాల గోపాల మఖిల సద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ,
తే. ప్రజల కెల్లను గడు రామరాజ్యమయ్యెఁ,
జారుసత్త్వాఢ్య, యీశ్వర నారసింహ
భూవిభుని కృష్ణరాయ యభ్యుదయ మొంది
పెంపుతో నీవు ధాత్రిఁ బాలింపఁగాను. 34

చారు......రాయ - చారు = మేలయిన - సత్త్వ = వ్యవసాయముచేత ('ద్రవ్యాసు వ్యవసాయేషు సత్త్వమస్త్రీ తు జన్తుషు' అమ.) - ఆఢ్య = ధనికుఁడయిన (- సత్త్వాధికుఁ డయిన- 'ఇభ్య ఆఢ్యో ధని' అమ.) - ఈశ్వరనారసింహ భూవిభుని కృష్ణరాయ = ఈశ్వరరాజు కొమరుఁ డయిన నారసింహరాజుయొక్క కుమారుఁడ వయిన కృష్ణరాయఁడా, నీవు, అభ్యుదయము = మేలును, ఒంది = పొంది.

('పూనె నెగసెఁ బొదలెఁ బొనరెఁ బొందె నటన్న। పలుకులందు మొదలఁగలుగు నట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు। నిలుచు వలయునపుడు నీరజాక్షి.' అప్ప.),

పెంపుతోన్ = అభివృద్ధితో, ధాత్రిన్ = భూమిని, పాలింపఁగాన్ = ఏలుచుండఁగా (ఇంపు గాగమలోలుభులు 'పాలింపుచుండ' అని పఠించికొందురు. ఇంచుగాగమమందు చకారమునకు పత్వము వచ్చిన రూపములంగని లక్ష్యమాత్రప్రమాణకంబుగా కొందఱు ఇంపుగాగమమునుం గల్పించి కొన్నారు;)

1. జనులకున్, ధూమకేతు క్షోభ = తోఁకచుక్క బాధ ('అగ్న్యుత్పాతో ధూమకేతూ' అమ.), తొలఁగెను; అతివృష్టిదోష భయంబు = అధికవర్షమనెడు దోషమువలని వెఱపు, పాసెన్ = పోయెను. - అతివృష్టి ఈతిబాధలలో నొకటి - ౨ ఆ (౮౩) చూ.

2. కంట......తి - కంటక = (పిండారి దండు వంటి) క్షుద్రశత్రువులయొక్క ('కణ్టకః పులకే వేణౌ ద్రుమాఙ్గే క్షుద్రవైరిణి' నానా.) - ఆగమ = రాకవలని - భీతి=భయము, కడచెన్=పోయెను; ఉద్ధ......లన్ - ఉద్ధత = గర్వించిన - భూమిభృత్ = రాజులయొక్క - కటకంబు ఎల్లన్ = రాజధాను లన్నియు (లేక - శిబిరము లన్నియు - లేక - సేన లన్నియు - 'కటకః శిబిరమ్' అని మాఘములో [5-59] మల్లినాథవ్యాఖ్య - 'కటక స్త్వద్రి నితమ్బే బాహు భూషణే। సేనాయాం రాజధాన్యాంచ' హేమ.), ఎత్తువడియెన్ = బలహీనము లయ్యెను; (కటకంబు ఏకవచనమయినను ఎల్ల శబ్దముచేత బహుత్వమర్థ మగుచున్నది.)

3. అఘస్ఫూర్తి = పాపముయొక్క ('అంహో దుఃఖ వ్యసనే ష్వఘమ్' అమ.) ప్రసారము మాసెన్ = అడఁగిపోయెను; మరుభూములందునన్ = నిర్జలప్రదేశములందు సయితము ('మరు ర్నా గిరి ధన్వనోః' మేది.), నెలన్ మూఁడు వానలు = నెలకు మూఁడేసి వర్షములు, నిండన్ = తనివితీరు నట్లుగా, కురిసెన్ = వర్షించినవి.

4. అఖి......యఁన్ - అఖిల = సమస్తమయిన - సత్ = మంచి - వ్రజమునన్ = జనులును (సజ్జనులసమూహ మంతయు అనుట), ఆబాలగోపాలము = పసులకాపరిపిల్లవాండ్రు మొదలుగా, ఆనందమునన్ మన్కిన్ = సంతోషముతోడి బ్రదుకుచేత, అతిశయిల్లెన్ = వర్ధిల్లెను, ప్రజలకెల్లన్ = జనుల కందఱకును, కడున్ = మిక్కిలి, రామరాజ్యము = శ్రీరాముల వారి రాజ్యములె అకాలమరణాదిరహితమై సుఖమైన రాజ్యము, అయ్యెను.

క. తునియలు తొమ్మిది యఁట పదు
నెనమండ్రఁట మోచువా రనేకప కిటి కూ
ర్మ నగాహు లేటి లావరు
లని తావకబాహు వొకటి యవని భరించెన్. 35

తునియలు = (భూమియొక్క) ఖండములు, తొమ్మిది యఁట (కొంచెపాటివే యని తిరస్కారము అఁటశబ్ద భా.) మోచువారు, అనేకప కిటి కూర్మ నగ అహులు = ఎనిమిది దిక్కులయే నుఁగులు (దన్తీ దన్తావళో హస్తీ ద్విరదోఽనేకపో ద్విపః' అమ.) - పంది ('వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః' అమ.) - తాఁబేలు ('కూర్మే కమఠ కచ్ఛపౌ' అమ.) - ఏడు పర్వతములు - ఆదిశేషుఁడును - పదునెనమండ్రఁట (అసమర్థులని హేళనము అఁటశబ్ద భావము.), ఏఁటిలావరులు = ఏపాటిబలవంతులు (ఇసీ కేవలము దుర్బలు లనుట), అని = అనుకారణముచేత, తావకబాహువు = నీ (దక్షిణ) భుజము, ఒకటి, అవనిన్ = భూమిని, భరించెన్ = మోచెను.

ఓకృష్ణరాయఁడా నీవు చక్కఁగా సకల భూమిని పాలింపం దొరకొంటివి అని భా.

గమ్యమైన యీయేలుటను భుజమున మోచుటయని అంతకన్న చారుతరంబైన విధమునం జెప్పుట చేత పర్యాయోక్తాలంకారము; ఆమోచుటకు అనేకపాదు లందలి తిరస్కారము కారణముగాఁ జెప్పుటచేత హేతూత్ప్రేక్ష; రెంటికిని సంకరము. వానికన్న బాహువు బలాధికమని వ్యతిరేకాలంకారము వ్యంగ్యము.

'తునియలు' - 'ఇన్ద్రద్వీప కశేరు తామ్ర గభస్తి నాగ సౌమ్య గన్ధర్వ చారణ భారతాఖ్య నవఖణ్డ మణ్డితే' అని మహాసంకల్పము. అష్టదిగ్గజములు—

'ఐరావతః పుణ్డరీకో వామనః కుముదోఽఞ్జనః
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకస్తు దిగ్గజాః.' అమ.

సప్తకులపర్వతములు.—

'మహేన్ద్రో మలయః సహ్యః శుక్తిమా నృక్షపర్వతః
విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః.'

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి కెరలు నీ
యసి లోహమున వెచ్చనై జనించె;

మఱికొండవీ డెక్కి మార్కొని నలిగైన
యల కసవాపాత్రు నంటి రాఁజె;
నటసాఁగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ,
గోన బిట్టేర్చెఁ; గొట్టానఁ దగిలెఁ;
గనకగిరి స్ఫూర్తిఁ గరచె; గౌతమిఁ గ్రాఁచె:
నవుల నాపొట్నూర రవులుకొనియె;
తే. మాడెములు వ్రేల్చె; నోడ్డాది మసి యొనర్చెఁ;
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁక చిచ్చన; నౌర నీ దురవగాహ
ఖేలదుగ్ర ప్రతాపాగ్ని కృష్ణరాయ. 36

కృష్ణరాయ (సంబుద్ధి), నీ......గ్ని - నీ (యొక్క) - దురవగాహ = చొరరానిదై - ఖేలత్ = క్రీడించుచున్న - ఉగ్ర = తీక్ష్ణమయిన - ప్రతాప = తేజమనెడు - అగ్ని = నిప్పు, తోఁకచిచ్చు = నిడుదనిప్పు (పొలములో చల్లాఱకుండుటకు పిడక వెంబడి పిడకగా పెట్టిన నిప్పు), అనన్ = అనునట్లుగా,—

1. తొలుదొల్తన్ = మొట్ట మొదట, ఉద...రన్ - ఉదయాద్రి = ఉదయగిరి దుర్గమనెడి (ఇది నెల్లూరుజిల్లాలోనిది) - శిలన్ = చెకుముకి రాతిని, తాఁకి = తగిలి, కె...నన్ - కెరలు = తీండ్రించిన - నీ (యొక్క) - అసి = కత్తియనెడు - లోహమునన్ = ఇనుమునందు, వెచ్చన ఐ జనించెన్ (దళసరియైన యినుపరేకుతో చెకుముకి రాతిమీఁద కొట్టిన నిప్పు జనించు విధముగా కృష్ణరాయని కత్తి ఉదయగిరిం గొట్టఁగా అతని ప్రతాపము జ్వలింపఁదొడంగె నని యర్థము; - అతఁడు దిగ్విజయములో తొలుత ఉదయగిరి దుర్గముం బట్టెనని భా. 'వెచ్చనై జనించెన్' - ప్రతాపమున 'వెచ్చనం' జెప్పుట కవిసమయము. - 'ప్రతాపే రక్తతోష్ణత్వే' - కా. క. ల.)

2. మఱి = పిమ్మట, కొండవీడు = కొండవీటి దుర్గమును, ఎక్కి (కర్త - ప్రతాపాగ్ని) (కొండమీఁది యింటిని తగులుకొని అనియును), మార్కొని = ఎదిరించి (కర్త-కసవాపాత్రుఁడు), నలిగైన = యుద్ధములో నుగ్గునూచమయిన (పొడుము అయిన అనియు) - అల = ఆ (ప్రసిద్ధుఁడయిన) - కసవాపాత్రున్ = ఆ పేరి గజపతిరాజ సేనానిని (కసవయిన యాపాత్రుని అనియు), అంటి, రాఁజెన్.

3. అటన్ = అచటినుండి, చాఁగి = జరగి, జమ్మి లోయన్ = జామి యనుపురముతోఁ గూడు కొన్న పల్లపుసీమయందు (జమ్మిచెట్లు గల పల్లపునాటియందు అనియు), పడి=చొచ్చి, వేగ=వడిగా ('వేఁగి' అనిపా. వేఁగిదేశము నని యర్థము.), దహించెన్ = కాల్చెను; కోనన్ = కోనసీమను (అడవిని అనియు), బిట్టు = తీవ్రముగా, ఏర్చెన్ = కాల్చెను, కొట్టానన్ = కొట్టము అను పేరి పురమును (పసుల శాలను అనియు), తగిలెన్ = అంటుకొనెను;

4. కనకగిరి స్ఫూర్తిన్ = కనకగిరి దుర్గముయొక్క (బంగారపుఁ గొండయొక్క - అనఁగా బంగారుముద్దలయొక్క అనియు) ప్రకాశమును, కరఁచెన్ = కరఁగించెను; గౌతమిన్ = సప్త గోదా

వరములో గౌతములవారు తెచ్చుకొన్నపాయయగు గౌతమిని, ద్రాఁచెన్ = దాఁగఁజేసెను (గౌతమీ తీరదేశమును జయించెను - నీటిని దాఁచె ననియు); అవులన్ = అటుపిమ్మట ('అవలన్' అనుటకు రూపాంతరము జఘన్యము - 'అవలన్' అని ప్రాయికము, 'ఆవలనన్' అనుదానికి క్షీణరూపము), ఆపొట్నూరన్ = పొట్నూరను పేరి ప్రసిద్ధపట్టణమున (ఊనుక గలయూర ననియు ఊరు శబ్దము వలన ఔపవిభక్తికకార్యము), గవులుకొనియెన్ = మండెను.

మాడెములు = మాడెము లనెడుసీమను (మాడుగు * లని ఇప్పటివ్యవహారము - ఈరూపము నకు మేడ లనియు అర్థము), ప్రేల్చెన్, ఒడ్డాదిన్ = ఆపేరినగరమును (ఒడ్డు = వైరులసేనావ్యూహ మును, ఆదిన్ = తొలుతను), మసిఒనర్చెన్ = దగ్ధము చేసెను; గజరాజు = ఉత్కల కళింగదేశముల యేలికయైనగజపతి (పరికాఁ డనియు), కలఁగి = బెదరి - పఱవన్ = పలాయితుఁ డగునట్లు (పలాయిత మగునట్లు), కటకపురిన్ = ఉత్కల రాజధానియైన కటకమును (కటక మనఁగా శిబిరమునుం గావున శిబిరపుఁ బురమును అనియు - లేక - పురివంటి సైత్యము ననియు), కాల్చెన్ = దహించెను; ఔర = ఆశ్చర్యము.

ఇందు ప్రతాపము వాలాగ్నిగా నుత్ప్రేక్షింపఁబడినది; 'అనన్' తద్వాచకము. అందులకు రూపకము అంతటను అంగముగా నున్నది. 'ఉదయాద్రిశిల' 'అసిలోహము' ఇత్యాదులందు శబ్ద భేదముచేతను, 'కొండవీఁడు,' 'నలి' ఇత్యాదులందు శ్లేషచేతను ఆరూపకము నిరూఢమయినది.— 'వెచ్చనై జనించె' 'రాఁజె' లోనగు క్రియాపదములు దాహ వాచకములు, ప్రతాప పరముగా వానికి శత్రువిజయమే అర్థము.

కృష్ణదేవరాయలు కళింగవిజయములో క్రమముగా - ఉదయగిరి, కొండవీఁడు, జమ్మి, కోన, కొట్టాము, కనకగిరి, గౌతమి, పొట్నూరు, మాడెములు (మాడుగులు), ఒడ్డాది, కటకము - వీనిని జయించెను. - ఈధాటి ఉదయగిరిమొదలు కటకమువఱకు ఋజురేఖగా నుండక కుడియెడమలకు జరుగుచును కొన్నిసమయములలో వెనుకకుంగూడ కొంతకొంత నడచుచును కావింపఁబడినది గావున వంకగలంబట్టియు తోఁకతోఁ బోల్చుట.

ఉ. చిత్రము కృష్ణరాయనృపశేఖర నీదగు ధాటి కోడి స
ర్వత్ర నిలింప కామినుల వాడకుఁ గాఁపులు వోయి రుత్కల
క్షత్రియపాత్రులెల్లఁ గనుగందని మేనులఁ దొంటిపెద్ద లే
సూత్రముఁ బన్నినారొ బలసూదనువీఁటికిఁ గొండవీఁటికిన్. 37

కృష్ణ.....ర = రాజోత్తముఁడ వైనకృష్ణరాయా, ఉత్కలక్షత్రియపాత్రులు ఎల్లన్ = పాత్రబిరుదాంకితు లయినయోధక్షత్రియులు అందఱును, నీది = నీయది - అగు - ధాటికిన్ = దాడికి ('శత్రుసేనావమర్దాయ సద్యః సుభట ఘోటకైః । విజిగీషోః ప్రవృత్తిర్యా సా ధాటీతి నిగద్యతే.' 'నీజయధాటికిన్' అని పా.), సర్వత్ర = ఎల్లెడలను (బా. వ్యా. తత్స. 23 లో 'సర్వత్ర విభావనగు' - అనుటచే సర్వత్ర ప్రయోగార్హమైనది), ఓడి = పరాజితులై, నిలింప కామినుల వాడకున్ = దేవాంగనల గృహపంక్తికి (వీరస్వర్గమున కనుట - పిమ్మట బలసూదనువీ డనుటచేత రాజమహేంద్రవరము చెంగటి యడవులలోని శబరస్త్రీల గూడెముల కనియు -

* 'కలశమిడ్డట్లుగా మొగమాడు । వమరంగ శ్రీయుద్ధమల్లుజొత్తించె'
యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము. (తమిళము 'మేడై' 'మాడి.')

'సురపతి ర్బలారాతిః శచీపతిః' అమ.), కసుగందని = కసురుఁదనము (లేఁతదనము చెడని - యుద్ధపుగాయములు తగులని) - మేనులన్ = దేహములతో, కాఁపులు పోయిరి = కాఁపురములు పోయినారు; చిత్రము = ఇది చిత్రముగా నున్నది; తొంటిపెద్దలు = పూర్వకాలపు మహానుభావులు కొండవీఁటికిన్ = కొండవీఁటి దుర్గమునకును, బలసూదనువీఁటికిన్ = ఇంద్రునిపురమునకును (స్వర్గమున కనుట - రాజమహేంద్రవరమున కనుటయు - కొందఱు అమరావతి కనియు, కొందఱు అమరారామమున కనియు అర్థము చెప్పుదురు.), ఏసూత్రము = ఏరహస్యమార్గమును, పన్నినారో = కల్పించినారో ('శీఘ్రబుద్ధిః పలాయన' మను రాజనీతి సూత్రము నని భా.)

కృష్ణరాయనిదాడికి ఎల్లయెడలను ఓడి ఓఢ్రదేశపుఁ బాత్ర బిరుదాంకిత క్షత్త్రియు లందఱు కొండవీటినుండి ఇంచుకేనిపోరి గాయములు పొందకయే వీరస్వర్గమున సురాంగనల యిండ్లకేఁగిరి. లోకములో వీరులు పోరితమున ఎదురుగాయములుపడి మృతులై స్వర్గమున సురాంగనలం గూడుట ప్రసిద్ధము. వీరు అట్టి శ్రమ లేకయే వారిం గూడుట చిత్రముగా నున్నది. కొండవీఁటినుండి ఆయింద్రపురికిం బోవుటకు వీరిపెద్దలు ఏ రహస్యమార్గమును కల్పించినారో గదా. పలాయితులై రాజమహేంద్రవరపుఁ గానలలో చెంచుగూడెములలో దాఁగి రని భా.

వీరస్వర్గపర మయిన యర్థమున విరోధము శబరపల్లీపర మయిన యర్థముచేత ఆభాసించినందున విరోధాభాసాలంకారము.

'కసుగందని మేనులన్'-పూరిగఱవని దేహములతో నని యితరులు వ్రాసిన యర్థము కసవు శబ్దములేనందున పొసఁగమిచే త్యక్తవ్యము. -

ఇచట జోగిజగన్నాథ పండిత వ్యాఖ్య. - 'కృష్ణదేవరాయలవారు కొండవీటి దుర్గముం బుచ్చుకొని ఆపట్టణమందు ధర్మధ్వజమెత్తించి దానిక్రిందికి వచ్చిన వారికి అభయప్రదాన మని ఘోషింపఁ జేసినారు, అని ప్రసిద్ధము గనుక ఉత్కల దేశాధీశులు యుద్ధభయ భ్రాంతులై ఆజెండా క్రిందికి వచ్చియుండు వఱకు, ఆయూనికియే దేవతాస్త్రీలవాడకు కాపులు ఉన్నట్టుగా నున్నది; ఎందుచేతననఁగా, ప్రబలు లయిన వీరే జడిసిరి గనుక, ఇతరదేశాధీశులు మానుకొని అరయప్పనములు ఇచ్చిరి గనుకను, లోకములో యుద్ధము లేకపోయినందున దేవతాస్త్రీలవాడకు ఎవరును వెళ్ళువారు లేకుండఁ చేయుటకు కారణము వీరే గనుకను, కొండవీటియందు ఉనికియే యింద్రపట్టణమునకు కాఁపు ఆయెను. కనుక ఆశ్చర్యము అనుట.' - ఈయూహ కొంత చమత్కారముగా నున్నను, కాఁ పుండుటకు కసుగందవలసిన నియమము లేనందునను, ఈయర్థమునకు 'కాఁపులు పోయి' రనుటకన్న 'కాఁపులు నిల్చిరి' అనవలసియుండుట చేతను, ఈమతము త్యక్తవ్యము.

ఉ. కూరిమిఁ గృష్ణరాయ నృపకుంజర చేరెఁ గళింగ రాజ్యల
క్ష్మీ రమణీ లలామ నిను మిన్నులు ముట్టిన మోహనాలతోఁ,
గారణ మట్ల లక్ష్మి గసుగందని వేడుకఁ గృష్ణరాయనిం
జేరునకాక, వావి సెడఁ, జెందునె సోదరుఁ డైన రుద్రునిన్? 38

కృ......ర = కృష్ణరాయ రాజోత్తమా (కుంజరశబ్దము ఉత్తరపదమైనప్పుడు పుల్లింగంబున శ్రేష్ఠార్థగోచర మగును. 'స్యురుత్తరపదే వ్యాఘ్ర పుఙ్గ వర్షభ కుఞ్జరాః సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అమ., నృపకుంజర - ఉపమానోత్తర కర్మధారయము -

కావున పూర్వపద ప్రధాన మయినది. దానం జేసి యదంత పుల్లింగ మహద్వాచక కార్యములు ఉత్వడుజ్జులు సంబుద్ధ్యకారము, డుజ్లోపము లోనగునవి.), కళింగరాజ్య లక్ష్మీ రమణీలలామ = కళింగరాజ్య లక్ష్మియనెడి సుందరీతిలకము -

['అశ్వ భూషా పుణ్డ్రి పుచ్ఛ శ్రేష్ఠ శృఙ్గార కేతుషు
లిఙ్గే ప్రభావే పురుషే లలామోఽ స్త్రీ లలామ చ.' నానా.

లలామ శబ్దము నకారాంత మయినను అకారాంత మయినను తెలుఁగున 'లలామము' అని మువర్ణకముం బొందవలయును; అట్లు పొందమిని చరితార్థిగణ పాఠముచేత నైనను, 'అత్మేమ నిజంత' సూత్రమందలి బహుళ గ్రహణము చేతనైనను సాధింపవచ్చును.], కూరిమిఁ = ప్రేమచేత - మిన్నులు ముట్టిన మోహనాలతోఁ = ఆకసమంటిన యేనుఁగులతో (కళింగరాజు గజపతి గావున కృష్ణరాయనికి అత్యున్నతము లయిన యేనుఁగులను కానుక పెట్టె నని భా.- టెక్కెములతో నని యొకటీక - 'మోహనే కేతు మూర్ఛే స్త్రీ' వైజయన్తి - అనురాగముతోడి యాసలతో ననియు, - 'మోహనా' లనఁగా కోటయందలి శత్రునిరసనసాధనము లని కొందఱటీక. ఆపక్షమున వానిం బెఱికి తెచ్చినాఁడని భా. - దేవాలయపుద్వారముమీఁది ఱాతిదూలమునకు మోహనరాయి యనిపేరు.), నినుఁ చేరెఁ = వచ్చి నిన్నుఁ గూడినది; కారణము అట్ల = ఇందులకు కారణము సరిగానున్నది; (ఎట్లన) - లక్ష్మి, కసుగందని వేడుకఁ = వాడిపోనియనురాగముతో, కృష్ణరాయనిఁ = సామియైన శ్రీకృష్ణుని (కృష్ణదేవరాయలను అనుటయు,) చేరునకాక = పొందునేకాని, వావి చెడఁ = వరుస చెడిపోవునట్లుగా, సోదరుఁడైన రుద్రునిఁ = తోఁబుట్టువయిన రుద్రుని (కళింగరాజయిన వీరరుద్రుని అనుటయు), చెందునె = కూడదు.

కృష్ణరాయా, కళింగలక్ష్మి తాను లక్ష్మి గావున కృష్ణుఁడవైన నిన్నుఁ గూడినది, రుద్రుఁడగుటచేత తనకుం దోఁబుట్టు వయిన కళింగరాజును (వీరరుద్రుని) కూడదాయెను. ఇట్లు చేయుటకు వావి సరియైన కారణమే గదా.

కళింగలక్ష్మీప్రాప్తికి కారణము గానట్టి వావిని తత్కారణముగాఁ జెప్పుటచేత హేతూత్ప్రేక్షాలంకారము - అందులకు కృష్ణరాయ వీరరుద్రులకు కృష్ణరుద్రులతోడి యభేదరూపకము అంగముగా నున్నది.

సీ. కచసక్తఫణికంచుకము మౌళి వీఁకే
దారంపుఁ బాగ చందంబు నొందఁ,
గలయ నంగమున మర్కటకీటకృత మైన
మగ్గంబు నేత్రసంపద వహింప,
ధ్వాంత గహ్వర శిలాతాడితాళికచిక్క
ణాస్రపంకము చంద్రమై పొసంగఁ,
దను భృశ శ్రాంతవేష్టన లగ్నబర్హి బ
ర్హంబు మువ్వన్నె చుంగై చెలంగ,
తే. నిద్ర మేల్కాంచి, సెలయేట నీడఁ గాంచి,
గోపవేషంబు సెడి, తొంటి భూపవేష

మగుట యవ్వనమహిమగా నలికి యచటు
విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి. 39

నీధాటిన్ = నీయొక్క విజయ యాత్రయందు, వింధ్యవాటిన్ = వింధారణ్యమందు, గజరాజు = (పలాయితుఁడై దాఁగియున్న) కళింగరాజు,

1. కచ......ము - కచ = తలవెండ్రుకలయందు ('కచః కేశః శిరోరుహః' అమ.) - సక్త = అంటుకొన్న - ఫణికంచుకము = పాఁప కుబుసము ('సమౌ కఞ్చుక నిర్మోకౌ' అమ.), మౌళిన్ = శిరమునందు, వీర కేదారంపుఁ బాగ చందంబున్ = వీరకేదార మనెడి (వీరకేదార మనఁగా రణరంగోచిత మయిన శిరస్త్రము అని బ్రౌన్యము.) తలపాగయొక్క తీరును, ఒందన్ = వహింపఁగా (అట్టిపాగగా అగపడఁగా అనుట),

2. కలయన్=అంతటను, అంగమునన్=దేహమందు, మర్కటకీట కృతము=సాలెపురుగు చేత చేయఁబడినది ('లూతా స్త్రీ తన్తువా యోర్ణనాభ మర్కటకాః సమాః' అమ.), ఐన - మగ్గంబు = నేత, నేత్రసంపదన్ = వలిపముయొక్క ('స్యాజ్జటాంశుకయో ర్నేత్రమ్' అమ.) సొంపును, వహింపన్ = తాల్పఁగా (వలిపవస్త్రముగా నగపడఁగా ననుట),

3. ధ్వాంత......ము - ధ్వాంత=చీఁకటితోడి ('అన్ధకారోఽస్త్రియాం ధ్వాన్తమ్' అమ.) - గహ్వర = గుహాయందలి ('దేవఖాతబిలే గుహా । గహ్వరమ్' అ.) - శిలా = ఱాతిచేత - తాడిత = కొట్టఁబడిన - అళిక=నుదుటి యందలి ('లలాట మళికం గోధిః' అమ.) - చిక్కణ=చిక్క నయిన ('చిక్కణం మసృణం స్నిగ్ధమ్' అమ.) - అస్ర = నెత్తుటి యొక్క ('అస్రః కోణే కచే పుంసి క్లీబ మశ్రుణి శోణితే' మేది.) పంకము=బురద, చంద్రము ఐ=సిందూర (తిలక)మై, పొసఁగన్ = ఒప్పఁగా - రాత్రి దాఁగుటకై దూఱిన చీకటిగుహలో నుదురు ఒక ఱాతికి తగులఁగా గాయమై కాఱి పేరుకొన్న నెత్తురు సిందూరతిలకమువలె నొప్పుచుండె ననుట;

4. తను......బు - తను=దేహముయొక్క - భృశ=మిక్కుటమైన - శ్రాంతి=బడలిక చేత నయిన - వేష్టన = పొర్లిగింతలయందు - లగ్న = అంటుకొన్న - బర్హి బర్హంబు = నెమలి పురి, మువ్వన్నెచుంగు ఐ=నీల రక్త పీతము లనెడి మూఁడు వన్నెలుగల యుత్తరీయపుఁజెఱఁగుగా, చెలఁగన్ = ఒప్పుచుండఁగా, నిద్ర మేల్కాంచి, సెలయేటన్ = కొండవాఁకయందు, నీడన్ = తన ప్రతిబింబమును, కాంచి=చూచి, గోపవేషంబు=(చొప్పుమార్చుటకై తాను ధరించి యుండిన) గొల్లవేషము, చెడి = మాఱి, తొంటి భూపవేషము = తన పూర్వపురాజవేషము, అగుట=కలుగుట, అవ్వన మహిమగాన్ = ఆయరణ్యముయొక్క ప్రభావముచేత నని, అలికి = భయపడి, అచటు = ఆప్రదేశమును, విడుచున్ = త్యజించును. (అచట నుండక యెటకేని యేగును.)

కృష్ణరాయని దాడికి వెఱచి గజరాజు గోపవేషమున వింధ్యారణ్యముంబట్టి పలాయితుఁడగుచు రాత్రి దాఁగుటకై ఒక చీఁకటి గుహం జొరఁబాఱి అటనిద్రించి సూర్యోదయవేళ మేలుకొని సెలయేట తననీడను చూచుకొనఁగా అతనికి గోపవేషము పోయి తొంటి భూషవేషమే వచ్చినట్లు భ్రమజనించెను. అందులవివరమెట్లనఁగా - రాత్రిగుహలో జుట్టున కంటుకొన్న పాఁప కుబుసము వీరకేదారంపుఁ బాగగా నగపడెను, ఒడలనంతట సాలెపురువు లల్లినపట్టు వలిపంపు వలువగా నగపడెను, చీకటిలో నుదురు ఱాతికి తగులఁగా కాఱిపేరిన నెత్తురు సిందూరతిలకముగా దోఁచెను, శ్రమచే తాను పొర్లినప్పు డంటుకొన్న నెమలిపురి మువ్వన్నెచుంగుగాఁ దోఁచెను.

అట్లు భ్రమపడి యారాజు ఆవనమం దేదో తెచ్చికోలు వేసముం బోనడఁచి వాస్తవవేష మును గలిగించు మహిమ కల దని తలంచి భయమున ఆచోటు వదలి మఱియొక చోటికిం బలా యితుఁ డాయెను.

'విడుచు గజరాజు నీధాటి వింధ్యవాటి' రాయఁడు అప్పటికి గజరాజును (కటకపురీశుని= కాళింగుని) కొట్టినాఁడా? దాడికి ముం దేగదా స్వప్నము? ఈదాడులు పెక్కులు. 'అసకృ ద్వాద్యత్కళింగాంగనా బందీగ్రాహ.' మను. 'కాంతారపాతిత కాళింగ కులేశ' మను.

నిర్జోకాదులు సామ్యమహిమచేత వీరకేదారాదులుగా తోఁచినందున భ్రాంతిమ దలంకారము.

చ. అభిరతిఁ గృష్ణరాయ, విజయాంకము లీవు లిఖించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం డిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తి కజ్జలము వేమఱు పెట్టి పఠించు నిచ్చలున్. 40

కృష్ణరాయ, ఈవు, విజయఅంకములు=(నీ) గెలుపు బిరుదములను ('అఙ్కో నాటక విచ్ఛేదే సంఖ్యాయాం యుధి భూషణే। సమీపే రూపకే స్థానే మన్తా వుత్సఙ్గ చిహ్నయోః.' నానా.), లిఖించి,= చెక్కించి, పొట్టునూరికడన్ = పొట్టునూ రను పురము చెంత, తాళసన్నిభముగన్ = తాటిచెట్టుతో సమానముగా (అంతపొడవుగా), నిల్పిన కంబము = నాటించిన స్తంభమును (అనఁగా స్తంభమందలి వ్రాఁతను), సింహ......కున్ - సింహభూధర = సింహాచల మనెడు క్షేత్రముయొక్క - ప్రభు = స్వామియయిన యప్పనియొక్క - తిరునాళ్లకున్ = ఉత్సవములకు, డిగు = స్వర్గమునుండి యవతరించు - సురప్రకరంబు = దేవసమూహము, కళిం.........మున్ - కళింగ మేదినీవిభు = కళింగరాజయిన గజపతియొక్క - అపకీర్తి = దుర్యశమనెడి - కజ్జలమున్ = కాటుకను ('అఞ్జనం కజ్జలమ్' హేమ.), వేమఱు = పలుమాఱు, పెట్టి = (అక్షరములు స్పష్టముగా తెలియుటకై) పూసి, నిచ్చలున్ = సర్వదా, అభిరతిన్ = ఆసక్తితో, పఠించున్.

కృష్ణరాయఁడా, నీవు పొట్టునూరియొద్ద తాటిచెట్టు వంతపొడవుగలదిగా నిలిపిన నీజయ స్తంభమునందు నీవు చెక్కించిన నీజయ శాసనములకు సింహాద్రియప్పని యుత్సవములకై వచ్చెడి యింద్రాదిదేవతలు అక్షరములు స్ఫుటముగా తెలియుటకై కళింగరాజయిన గజపతియొక్క యప కీర్తి కాటుకను పలుమాఱు చమరి సర్వదా ప్రీతితో పఠింతురు. - ఆజయస్తంభ శాసనములచేత నీకీర్తియు అతని యపకీర్తియు స్పష్టము అని భా.

సురలు కజ్జలము పెట్టి పఠించుట యబద్ధముగాన సంబంధాతిశయోక్తి; దానికి 'అపకీర్తి కజ్జల' మనుచో రూపకము అంగము. [రాయ - ఇట్లు దేశ్యములకు సంబుద్ధిదుల్లోపము కృష్ణ రాయాదులకాలపుఁ గవనములలో ప్రచురము.]

సీ. సనకాది దివిజ మస్కరి ఫాల గోపి చం
దనపుండ్రవల్లిక ల్మాకి నాకి,
సెలసి హాహాహూహూవుల దండియల తంత్రి
డ్రెవ్వ సింగిణులుగాఁ దివిచి తివిచి,

సప్తర్షికృతవియఝ్ఝర వాలుకాలింగ
సమితి ముచ్చెలకాళ్లఁ జమరి చమరి,
రంభా ప్రధానాప్సరఃపృథూరోజకుం
భంబు లెచ్చటఁ గన్నఁ బట్టి పట్టి,
తే. తిరుగు హరిపురి సురతరు సురల మరగి
బహుళ హళహళి భృత కలబరిగనగర
సగర పురవర పరిబృఢ జవన యవన
పృతన భవ దసి ననిఁ దెగి కృష్ణరాయ. 41

కృష్ణరాయ, అనిన్ = యుద్ధములో, భవత్ అసిన్ = నీకత్తిచేత, బహు...తన - బహుళ = అధికమయిన - హళహళి = సందడితో - భృత = నిండిన - కలబరిగనగర = కలబరిగపట్టణము యొక్కయు - సగరపురవర = సాగరు పట్టణముయొక్కయు - పరిబృఢ = సుల్తానుయొక్క (ప్రభుః పరిబృఢోఽధిపః' అమ.) - జవన = వడిగల - యవనపృతన = తురకదండు ('పృతనా వాహినీ చమూః' అమ.), తెగి = ఖండితమయి, హరిపురిన్ = ఇంద్రుని పట్టణమందు (అమరావతియందు - వీరస్వర్గమం దనుట), సురతరు సురలన్ = కల్పవృక్షపు సారాయిలను, మరగి = రుచిగని;

1. సన...కల్ - సనక = సనకముని - ఆది = లోనగు - దివిజమస్కరి = వేల్పుయతుల ('భిక్షుః పరివ్రాట్ కర్మన్దీ పారాశర్యపి మస్కరీ' అమ.) - ఫాల = నొసళ్లయందలి - గోపిచందన పుండ్ర వల్లికల్ = తీఁగలవంటి గోపిచందనపు నిలువుబొట్లను, నాకినాకి = మాటిమాటికిని నాకి;

2. హాహా హూహూవుల దండియలన్ = హాహాయు హూహూవు అనెడి దేవగాయనుల యొక్క వీణలను ('హాహా హూహూ శ్చైవమాద్యాః గన్ధర్వా స్త్రిదివౌకసామ్.' అమ.), సెలసి = ఒడిసికొని, తంత్రి త్రెవ్వన్ = తంతువులు తెగునట్లుగా, సింగిణులు గాన్ = కొమ్ము విండ్లు అగునట్లుగా, తిగిచి తిగిచి = మాటిమాటికిని లాగి;

3. సప్త.....తిన్ - సప్తర్షి = (కశ్యపాదులగు) నేడుగురు సత్యవచసులచేత (ఋషయః సత్యవచసః' అమ, —'కశ్యపోఽత్రి ర్భరద్వాజో విశ్వామిత్ర శ్చ గౌతమః జమదగ్ని ర్వసిష్ఠ శ్చ సప్తైతే ఋషయః స్మృతాః') - కృత = చేయఁబడిన (లింగములకు విశేషణము) - వియత్ ఝర = ఆకాశ గంగయందలి ('వియ ద్విష్ణుపదమ్', 'ప్రవాహో నిర్ఝరో ఝరః' అమ.) - వాలుకా లింగ సమితిన్ = ఇసుక లింగములయొక్క సమూహమును ('సికతాః స్యు ర్వాలుకా అపి' అమ.), ముచ్చెల కాళ్లన్ = పైజారు జోళ్లతోడి పాదములతో, చమరి చమరి = మాటిమాటికి త్రొక్కి;

4. రం...లు - రంభా = రంభయను నచ్చర - ప్రధాన = ముఖ్యురాలుగాఁ గల - అప్సరః = అచ్చరలయొక్క - పృథు = గొప్ప - ఉరోజకుంభంబులు = చనుఁగుండలను, ఎచ్చటఁ గన్నన్ = కనఁబడిన చోటనెల్ల, పట్టిపట్టి = పిసికిపిసికి, - తిరుగున్ = సంచరించును - (కర్తృ పృతన).

ఓకృష్ణరాయా, కలబరగియొక్కయు సాగరుపట్టణముయొక్కయు తురకయేలికల రాణువ తురకలు నీకత్తిచేత అనిలో మడిసి, స్వర్గమున కేఁగి అచటను పూర్వవాసన వదలక, కల్పవృక్షపు సురలం ద్రాగి సనకాది దివ్యయతుల మొగములందలి గోపిచందన త్రిపుండ్రములను చెడ

నాడుచు, దేవగాయకులచేతి వీణలను ఒడిసి పుచ్చుకొని కొమ్ముపిండ్లవలె గుండ్రముగా నగునట్లుగాను తంతులు తెగునట్లుగాను చెడ లాగుచును, ఆకాశగంగా సైకతములయందు సప్తర్షులు చేసికొన్నయిసుకలింగములను పైజారుకాళ్లతోఁ జెడఁ ద్రొక్కుచును, రంభాది సురాంగనల పెద్ద చనుఁగుండ్లు ఎక్కడ కనఁబడిన నక్కడ చెడఁ బిసుకుచును, తిరుగుచుందురు.—స్వభావోక్త్యతిశయోక్తులకు సంకరము.

మ. అలుక న్ఘోటక ధట్టికా ఖురపుటీ హాల్య న్ఖురాసాని పు
చ్ఛలు వోఁ దున్ని, చలచ్చమూ గజ మదాసార ప్లుతి న్కీర్తి పు
ష్కల సస్యం బిడి, యేకధాటి బళిరా కట్టించి తౌ దృష్టి కే
దులఖా నోగ్ర కపాల మర్థప హరి ద్భూ జాంగల శ్రేణికన్. 42

(కృష్ణరాయఁడా నీవు) అలుకన్ = కోపముతో, ఏకధాటిన్ = ఒకటే దాడిచేత, అర్థ......కన్ - అర్థప=కుబేరుని - హరిత్=దిక్కునందలి - భూ=భూమియనెడి - జాంగల = మెట్టచేలయొక్క ('జాఙ్గలో జలనిర్ముక్తదేశే' విశ్వ.) - శ్రేణికన్=వరుసయందు, ఘో...ల్యన్ - ఘోటక=గుఱ్ఱములయొక్క - ధట్టికా=సేనలయొక్క - ఖురపుటీ=గొరిజడొప్పలనెడు - హాల్యన్ = నాఁగేటిమొత్తముచేత ('లాఙ్గలం హలమ్', 'హాల్యా హలానామ్.' అమ. - హలానాం సమూహో హాల్యా = హలములమొత్తము హాల్య), ఖురాసాని పుచ్ఛలు = ఖురాసాన్ దేశపు పుచ్చకాయల వంటి వగు సశిరస్త్రమ్లేచ్ఛశిరస్సులను, పోన్ = పాడగునట్లు, దున్ని, చల......తిన్-చలత్ = నడుచుచున్న-చమూ=సేనయందలి-గజ=ఏనుఁగులయొక్క-మద=దానజలముయొక్క - ఆసార = జడివానయొక్క - ప్లుతిన్ =తడుపుతో, కీర్తి......బు - కీర్తి=యశస్సనెడి - పుష్కల=నిండయిన - సస్యంబు = పైరును, ఇడి = పెట్టి, ఏదులఖాన ఉగ్రకపాలము = బిజాపురపుసుల్తానయిన యేదులషాహు అను వానియొక్క భయంకరమైన పునుకను, దృష్టికిన్ = దృష్టిదోషపరిహారార్థమైన వెఱబొమ్మగా, కట్టించితి (వి), ఔన్ బళిరా=ఔరా బళి=ఆశ్చర్యముగా నున్నదిసుమా.

కృష్ణరాయనిమీఁదికి బీజాపురపుసుల్తాను ఏదులషా అనువాఁడును గోలకొండ నిజాము షాహును అహమదునగరసుల్తానును కలసివచ్చి యతనిచే కృష్ణకడ నిహతులైరి. అవృత్తాంతము ఇట ననుసంధింపఁబడియున్నది.

కృష్ణరాయఁడా నీప్రతాపము నేమని పొగడుదును! నీవు ఒక్కదాడిలో తురకల శిరములను పుచ్చతోఁటలనుం బోలె - గుఱ్ఱముల గొరిజలతో నాఁగేళ్లతోనుం బోలె - దున్ని వైచి యేనుఁగు దండుల దానధారలచేత వర్షముచేతనుం బోలె-ఉత్తరదిగ్భూములను మెట్టచేలనుంబోలె-తడిపి, ఆపదనులో కీర్తిని పైరునుంబోలె-నాటి, అచట ఏదులషాయొక్క తలకాయను దృష్టిపిడతం బోలె - నిలిపితివి. రూపకాలంకారము.

'ఖురాసానులనెడు మ్లేచ్ఛుల' నువ్యాఖ్య సంగతము కాదు, ఖురాసాని దేశము కాబూలునకు పూర్వోత్తరమున నున్నది. కనుక ఖురాసాని పుచ్ఛలన్నచో ఆదేశపు భటులు ఏదిలఖానుని సేనలో నుండి రని తలంపనగును. మఱియు * కృష్ణరాయని దాడి దక్కనును దాఁటలే దని తదీయ

* ఇటీవలి పరిశోధనచే రాయఁడు ఆర్యావర్తమును జయించినట్లే - చూ. నందితిమ్మన గయశాసనము, నేలటూరి వెంకటరమణయ్యగారి వ్యాసము భారతి, అక్టోబరు, 1959.

ఈ తిమ్మనయే 'ఏకచ్ఛత్రిత సర్వభూవలయు' అన్నవాఁడు.

చరిత్రకారులు వ్రాసినను, అందులకు "బంగాళాంగ కళింగభూప సుభటాభ్రశ్రేణి ఝంఝానిలా" అనుమనుచరిత్రగత రాయ విశేషణము భంజకము. 'అర్థపహారి ద్వ్యాజాంగల' మన్నందులకు 'కురుజాంగలములు' అను భారతవ్యవహారముం బరికింపుఁడు.

చ. సుమతిఁ బునఃపునా రచిత షోడశదాన పరంపరా వసం
తముల ననంత విత్తము ననంత ననంత మహాగ్రహార బృం
దమును నొసంగు నిన్నొరసి తారెన రాక కదా నిలింప భూ
జములు వహించు దుర్యశము షట్పద కోకిల కైతవంబునన్. 43

పునః...లన్ - పునః పునః=మాటిమాటికి - రచిత=కావింపఁబడిన - షోడశ=పదునాఱు - దాన=ఈవులయొక్క-పరంపరా=వరుసయనెడి - వసంతములన్ = ఆమనులయందు, అనంత = కడలేని-విత్తమున్=ధనమును, అనంతన్=కడలేని (అమహత్స్త్రీలింగ విశేషణముగాన పాక్షికస్త్రీత్వము.) - అనంతన్ = భూమిని ('భూ ర్భూమి రచలానన్తా' అమ.), మ...నున్ - మహత్ = గొప్ప-అగ్రహార=నల్లిండ్లయొక్క (బ్రాహ్మణగ్రామములయొక్క. 'అగ్రం బ్రాహ్మణ భోజనం, తదర్థం హ్రియన్తే రాజధనాత్ పృథక్క్రియన్తే తే క్షేత్రాదయః'-నీలకణ్ఠః; 'గ్రామభేదశ్చ'-తారానాథ తర్కవాచస్పతిః.) - బృందమునున్=సమూహమును, సుమతిన్=ప్రీతితో, ఒసంగు (=ఇచ్చెడు) నిన్ను, ఒరసి = ద్వేషించి, తారు = తాము (అనఁగా కల్పవృక్షములు), ఎన=సాటి-రాక కదా = రానిహేతువుచేతఁ జుమా, నిలింప భూజములు = దేవ తరువులు (=కల్పవృక్షములు), షట్పద కోకిలకైతవంబునన్ =తుమ్మెదలు కోయిలలు అనెడి మిషచేత, దుర్యశమున్=అపకీర్తిని, వహించున్ = తాల్చియున్నవి.

ఓకృష్ణరాయఁడా, మాటిమాటికి నీవు రచించెడి షోడశ మహాదానము లనెడి వసంతర్తువుల యందు అనంత మయిన ధనమును భూమిని అనంతమయిన గొప్ప యగ్రహార సమూహమును ప్రీతితో ఇచ్చువాఁడ వయిన నీతో దానమందు స్పర్ధవహించి సాటిరాలేకకదా కల్పవృక్షములు తమ యపకీర్తిని తుమ్మెదలు కోయిలలు అను మిషచేతఁ దాల్చియున్నవి.—అపకీర్తి నలుపనియు, తుమ్మెదలును కోకిలలును వసంతర్తువునందు వృక్షములందు మెండుకొను ననియు ననుసంధించుకొన వలయును.

ద్వితీయపాదమున బిందుయతి, అందులకు 'అనంత' యనునది నఞ్సమాస మగుటచే పాక్షికముగా నంగీకృత మయిన వ్యంజన యతియైనది.

'పనిఁ బూని నిలుచుఁ దమతమ యనునాసికములకు బిందుయతు లన వెనుకన్
గనుపట్టు నాల్గు లిపులును వెను కున్నలు తమకు డాసి పిఱుఁద గదియుచోన్.' అప్ప.

* 'షోడశదాన పరంపరా వసంతములన్' - రూపకము; కడమ హేతూత్ప్రేక్ష సాపహ్నవ; 'ఎనరామి' ప్రతీప విశేషము.

తే. ప్రబల రాజాధిరాజ వీరప్రతాప రాజపరమేశ్వ రార్థదుర్గానలేశ
సాహితీసమరాంగణసార్వభౌమ కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపు' మనిరి. 44

* షోడశదానములు — గో, భూ, తిల, హిరణ్య, రత్న, విద్యా, కన్యా, దాసీ, శయ్యా, గృహ, అగ్రహార, రథ, గజ, అశ్వ, ఛాగ, మహిషీ, దానములు. శ. ర.

ప్రబ... శేశ - ప్రబలరాజాధిరాజ=ప్రబలు లయినరాజులకు పై రాజవును - వీరప్రతాప - వీర = శ్రేష్ఠమయిన (సర్వాతిశాయియైన) ప్రతాప = తేజము కలవాఁడవును - రాజపరమేశ్వర = రాజులకు పరమశివుఁడవును - అర్థ......శ - అర్థ=పురుషార్థము లనెడి - దుర్గా=పార్వతికి - వశేశ=శివుఁడవును - సా......మ - † సాహితీ=వైదుష్యమందును - సమరాంగణ=యుద్ధక్షేత్రమందును - సార్వభౌమ = చక్రవర్తివియు - నయిన ('చక్రవర్తీ సార్వభౌమః' అమ.) - కృష్ణరాయేంద్ర=కృష్ణరాయప్రభుఁడా, కృతి=ప్రబంధమును, వినిర్మింపుము=రచింపుము, అనిరి [కర్త (౧౫) వచనములో 'విద్వజ్జనంబులను' పరామృశించుచున్న 'వారు' అనునది - ఆ విద్వాంసులిట్లని రని భా.].

'ప్రబల...భౌమ' - ఇదంతయు నాల్గు బిరుదాంకముల సమాసము - 'ప్రబలరాజాధిరాజులైన వీరప్రతాపులైన రాజపరమేశ్వరు లనెడి అర్ధ దుర్గా=అర్ధశరీరమైన పార్వతికి - వశేశ=రుద్రునివంటివాఁడా.' అని శ్రీనివాస వ్యాఖ్య.

వ. అంతఁ బ్రహృష్టాంతరంగుండనై. 45

అంతన్ = వారట్లు హెచ్చరింపఁగా ('అనివిన్నవించినన్' అని పూర్వముద్రణపాఠము - వివిధ వేదాగమవిదు లగు విద్వజ్జనులు తనకు 'విన్నవించి' రని కృష్ణరాయఁడు చెప్పుకొనుట నిజావినీతి స్ఫోరకమైయున్నది. కావున 'అంతన్' అని మార్పు చేసికొనఁబడినది), ప్ర.....డన్ - ప్రహృష్ట = సంతోషపడిన - అంతరంగుండన్ = హృదయము కలవాఁడను;

—* షష్ఠ్యంతములు *—

క. అంభోధి కన్యకా కుచ । కుంభోంభిత ఘుసృణమసృణ గురువక్షునకున్
జంభారి ముఖాధ్యక్షున । కంభోజాక్షునకు సామి హర్యక్షునకున్. 46

అం......నకున్ - అంభోధి = సముద్రముయొక్క - కన్యకా = కూఁతు రయిన లక్ష్మియొక్క - కుచకుంభ = చనుగిండులయందు - ఉంభిత = నింపఁబడిన (నిండుగా పూయఁబడిన - 'ఉమ్భ పూరణే' ధా. పా.) - ఘుసృణ=కుంకుమముచేత - మసృణ=నిగ్గుగల ('మసృణం కర్కశే స్నిగ్ధే' నానా.) - గురు=విశాలమయిన ('గురుస్త్రిలిఙ్గ్యాం మహతి దుర్జరా లఘునోరపి' మేది.) - వక్షునకున్ = ఱొమ్ముకలవానికి, జం...కున్ - జంభారి = ఇంద్రుఁడు ('జమ్భభేదీ హరిహయః స్వారాణ్ణముచిసూదనః' అమ.)-ముఖ=ప్రధానుఁడుగాఁ గలవారికి (ఇంద్రాదులకు అనుట - అధ్యక్షునకున్ = దొర యగువానికి, అంభోజ అక్షునకున్ = కమలములవంటి కన్నులు గలవానికి ('దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దో గరుడధ్వజః' అమ.), సామిహర్యక్షునకున్=సగముసింగమైన వానికి (నరసింహావతారుని కని భా. - 'సామి త్వర్ధే జుగుప్సితే,' 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః' అమ.) - అంత్యానుప్రాసము; వృత్త్యనుప్రా.

క. మర్దితకాళియఫణికిఁ గ । పర్దభృదజ బింబితాచ్ఛపదనఖఘృణికిన్
దోర్దండశార్ఙ్గకిణి కఘ । కర్దమదినమణికి దనుజకరివరసృణికిన్. 47

† పట్టాభిషేకము నాటికే 'సమరచణ్డుఁడు' 'కావ్యనాటకాలంకారమర్మజ్ఞుఁడు' చూ. పీఠికలో పట్టాభిషేకశాసనము.

మ...కిన్ - మర్దిత=మర్దింపఁబడిన ('మృద క్షోదే' ధా. పా. నుగ్గుసేయుట) - కాళియ= (యమునయందలి మడుగులోని) కాళియుఁ డనెడి - ఫణికిన్ = పాము కలవానికి, కప...కిన్ - కపర్దభృత్ = శివుఁడు (కపర్దమును అనఁగా జటాజూటమును ధరించినవాఁడు - 'కపర్దోఽస్య జటాజూటః.' అమ.) - అజ = బ్రహ్మ ('అజా విష్ణు హర చ్ఛాగాః' అమ.) - (అనువారిచేత) - బింబిత=సంజాత ప్రతిబింబ మయిన (వారు ప్రతిబింబించి రనుట - 'బిమ్బం తు ప్రతిబిమ్బే స్యా న్మణ్డలే బిమ్బికాఫలే' హేమ.) - అచ్ఛ = అమల మయిన ('ప్రసన్నోఽచ్ఛః' అమ.) - పదనఖ ఘృణికిన్=పాదములయొక్క గోళ్లయొక్క కాంతులు గలవానికి ('అగ్న్యర్చిషోర్ఘృణిః' నానా. - బ్రహ్మయు శివుఁడును వేంకటాచలపతిపాదములకు నమస్కరింతు రనుట. ఈయర్థమునే మనోహర మయిన ప్రకారాంతరమునం జెప్పినందున పర్యాయోక్తాలంకారము.), దో......కిన్ - దోర్దండ= గుదియవంటి ('దణ్డోఽస్త్రీ లగుడేఽపి స్యాత్' అమ.) బాహువు నందలి ('భుజ బాహూ ప్రవేష్టో దోః' అమ.) - శార్ఙ్గ = శార్ఙ్గ మనెడి ధనుస్సుయొక్క ('చాపః శార్ఙ్గం మురారేస్తు' అమ. విష్ణుదేవునివింటికి శార్ఙ్గ మనిపేరు.) - కిణికిన్=(నారి దెబ్బల) గాయపుఁగాయలు గలవానికి ('కిణో మాంసగ్రన్థిః వ్రణజం చిహ్నంచ' రామాశ్రమి), అ...కిన్ - అఘ = పాపమనెడి ('అంహోదుఃఖ వ్యసనే ష్వఘమ్' అమ.) - కర్దమ = బురదకు ('పఙ్కోఽస్త్రీ శాద కర్దమౌ' అమ.) - దినమణికిన్ = సూర్యుఁడయినవానికి ('ప్రద్యోతనో దినమణిః ఖద్యోతో లోకబాన్ధవః' అమ. - సూర్యుఁడు బురదను పోఁగొట్టునట్లు శ్రీహరి పాపమును హరించు నని భా. - రూపకము.), ద...కిన్ - దనుజ = అసురు లనెడి ('అసురా దైత్య దైతేయ దనుజేన్ద్రారి దానవాః' అమ.) - కరివర=మేటియేనుఁగులకు - సృణికిన్ =అంకుశమయినవానికి ('అఙ్కుశోఽస్త్రీ సృణిః స్త్రియామ్.' అమ. అంకుశము ఏప్రకారము ఏనుఁగులను దండించునో ఆప్రకారము అసురులను దండించు వాఁడని భా. రూపకము; అంత్యానుప్రాసము స్పష్టము.

క. గుహపుష్కరిణీతటఘన । గహనగుహాఖేటవంచకపుళిందునకున్
ద్రుహిణాండతుందున కయా । వహదీర్ఘాపాంగదృక్కృపాస్యందునకున్. 48

గుహ...నకున్ - గుహ=కుమారస్వామియొక్క ('పార్వతీనన్దనః స్కన్దః సేనానీ రగ్నిభూ ర్గుహః' అమ.) పుష్కరిణీ=కోనేటియొక్క ('పుష్కరిణ్యాంతు ఖాతంస్యాత్' అమ.) - తట= గట్టునందలి ('కూలం రోధ శ్చ తీరంచ ప్రతీరంచ తటం త్రిషు.' అమ.) - ఘన = దట్టమయిన ('ఘనం నిరన్తరం సాన్ద్రమ్' అమ.) - గహన=అడవియందును ('గహనం కాననం వనమ్' అమ.) - గుహా=గవులయందును - ఆఖేట = వేఁటలాడుటయందు - వంచక పుళిందునకున్ = మాయ బోయ యయినవానికి, ద్రుహిణ అండ తుందునకున్ = బ్రహ్మాండములు బొజ్జలోఁ గలవానికి ('ధాతా బ్జయోని ర్ద్రుహిణః,' - పిచణ్డకుక్షీ జఠరోదరతున్దమ్' అమ.), అ...నకున్ - అయ = శుభములను ('అయః శుభావహో విధిః' అమ.) - ఆవహ = సమకూర్చెడు - దీర్ఘ = వాలికయైన - అపాంగ = కడకంటి - దృక్ = చూపుయొక్క - కృపా = కనికరముయొక్క - స్యందునకున్ = ఓడిక కల వానికి ('కరుణవాః స్యందునకున్, అనిపూర్వముద్రణపాఠము. దయావాచకము 'కరుణా' అని స్త్రీలింగమును, శోకస్థాయిభావక రసవాచకము 'కరుణ' అని పుల్లింగమును, అని నియమము - 'కరుణో రసవృక్షయోః। కరుణా తు కృపాయాం స్యాత్' హేమ. మఱియు, 'దయ యనెడు నీరు'

అనుటలో సొంపేమున్నది? కనులలో సదానీళ్లు కాఱుచుండవలయునా? కావున నిట 'దృక్కృపా' అని మార్పు కావించుకొనఁబడినది.)—అంత్యానుప్రాసము.

క. బంధురరథాంగధారా । గంధవహాప్తజ్వలచ్ఛిఖాపటలపున
స్సంధుక్షణఘృతరాహుప । లాంధోసృక్స్రుతికి వేంకటాచలపతికిన్. 49

బం......తికిన్ - బంధుర=సొంపయిన ('బన్ధురబన్ధురౌ రమ్యే నమ్రే హంసే తు బన్ధురః' విశ్వ.) - రథాంగ = సుదర్శన మనుపేరి చక్రాయుధముయొక్క ('చక్రం రథాఙ్గమ్' - 'శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రంసుదర్శనమ్.' అమ.) - ధారా=వాదరయొక్క - గంధవహ ఆప్త= (వాయువునకు చెలికాఁడయిన) యగ్నియొక్క ('లోహితాశ్వో వాయుసఖః శిఖావా నాశుశుక్షణిః' అమ.) - జ్వలత్=ఎరియుచున్న - శిఖా=జ్వాలలయొక్క - పటల=సమూహముయొక్క - పునస్సంధుక్షణ=మరల నెరియించెడు కర్తయందు - ఘృత=నేయియైన - రాహు=రాహు వనెడు - పలాంధః=రాక్షసునియొక్క (పల=మాంసమే = అంధః=అన్నముగాఁ గలవాఁడు) - అసృక్= రక్తముయొక్క ('రుధిరేఽసృ గ్లోహితాస్ర రక్త క్షతజ శోణితమ్' అమ.) - స్రుతికిన్=ఓడికలవానికి, వేంకట అచల పతికిన్ = వేంకట మనెడిపర్వతమునకు దొరయగువానికి (అనఁగా వేంకటేశ్వరస్వామికి.) రూపకము, అంత్యానుప్రాసంబును.

ఈచెప్పిన షష్ఠ్యంతము లన్నియు వేంకటాచలపతికి విశేషణము లని స్పష్టము.

## —* కథా ప్రా రం భ ము *—

వ. నా విన్నవింపఁ బూను నాముక్తమాల్యదా మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 50

నావిన్నవింపఁ బూను = నేను అంకితముసేయ నుద్యమించిన (ఇట్టి తావులందు కర్తృపదములో నివ్విధమున షష్ఠీసమాసము ప్రయోగసిద్ధము. - 'అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన స్వారోచిష మనుసంభవంబు' 'తన చేసినదానంబడక పోవ శివునకు వసమే.') - ఆము...నకున్ = ఆముక్తమాల్యద యనెడి గొప్పకావ్యమునకు [ఆముక్త = ధరించిన ('రత్నాన్యాముఞ్చ సందీప్తే హావి ర్జుహుధి పావకే' భట్టి. - 'ఆముక్తః ప్రతిముక్తశ్చ పినద్ధశ్చా పినద్ధవత్' అమ. - చెరువుకొన్న యనుట.) - మాల్య=వీగదండను - దా = (శ్రీవిలుపుత్తూరిలోని మన్నారుస్వామికి) ఇచ్చునదిగాన ఏతత్కథానాయిక యైన గోదాదేవికి ఆపేరు కలిగినది, ఆమెను గూర్చినట్టిది యౌట చేత ఈగ్రంథమునకును ఆమెపేరే కలిగినది. ఆమెకు అఱవపేరు 'చూడికుడుత్తనాచ్చారు].

## —* విలుబుత్తూరివర్ణన *—

మ. లలితోద్యాన పరంపరా పిక శుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీ నీల హరి న్మణీ పికశుక స్వానభ్రమం బూన్ప మి
న్నులతో రాయు సువర్ణ సౌధముల నెందుం జూడఁ జెన్నొందు శ్రీ
విలుబుత్తూరు సెలంగుఁ బాండ్య నగరోర్వీరత్నసీమంతమై. 51

శ్రీ - విలుబుత్తూరు (అను) పట్టణము, లలి......ముల్ - లలిత=మనోహరమయిన (లలిత మిప్సితే మేది.) - ఉద్యాన = ఉపవనములయొక్క (పుమాన్ క్రీడ ఉద్యానం రాజ్ఞః సాధా

రణం వనమ్.' అమ.) - పరంపరా=వరుసలయందలి - పిక=కోయిలలయొక్కయు ('కోకిలః పిక ఇత్యపి' అమ.) - శుక=చిలుకలయొక్కయు ('కీర శుకౌసమౌ' అమ.) - ఆలాప = పలుకులయొక్క ('స్యా దాభాషణ మాలాపః' అమ.) - ప్రతిధ్వానముల్=ప్రతిధ్వనులు, వల...మన్ - వలభీ= ఇంటికప్పుమీఁది ['వలభౌ ఆచ్ఛాదనే ఉపరిభాగ ఇత్యర్థః' అని మేఘవ్యా. మల్లి. - లేక చంద్రశాలల (శిరోగృహములయందలి - 'శుద్ధాన్తే వలభీ చన్ద్రశాలే సౌధోర్ధ్వవేశ్మని' రభసుఁడు, 'వలభీ రుపరివసతిః' అని మాఘవ్యాఖ్యలో వల్లభదేవుఁడు.] ఉపవన వృక్షశాఖలు వలభులంతయున్నతములై తత్సమీపమం దుండును. - 'వలభివ్యాసంగి తుంగద్రుశాఖలలోనుండి' ౫౪ ప. - 'బల భిన్మణుల' అను పాఠమున ఇంద్రనీలమణు లర్థము] - నీల (మణీ) = నీలమణులయు - హారిన్మణీ = పచ్చలయు (అనఁగా ఆమణులచే రచితము లయిన) - పికశుకస్వాన=కోయిలలయు చిలుకలయు ధ్వనులయొక్క (ధ్వనులనెడు) - భ్రమను (చరితాది ము లోపము), పూన్పన్ = (వీథిలో పోవుచుండు వారికి) కలుగఁజేయుచుండఁగా, మిన్నులతోరాయు=ఆకసమంటుచున్న (అత్యున్నతములైన)-సువర్ణసౌధములన్=బంగారపు మేడలచేత, ఎందున్ చూడన్=ఎల్లయెడలను, చెన్నొందిః= సొంపారుచు, పాండ్య......ము - పాండ్య=పాండ్య దేశముయొక్క - నగర=పట్టణమయిన (పట్టణమాత్రమువలె కడుసులువుగాను చక్కఁగాను ఏలఁబడుచున్న) - ఉర్వీ=భూమికి (భూదేవి కనుట - 'సర్వంసహా వసుమతీ వసుధోర్వీ వసుధరా' అమ.) - రత్నసీమంత=మణిపాపటబొట్టుగా (సీమన్తమస్త్రియాం మస్తకేశవీథ్యాముదాహృతమ్.' అమ.), ఐ=ఒప్పుచు [లేక - నగర=రాజధానియైనమధురాపురముయొక్కయేలుబడిలోనున్న ...ఇట్లనుటచే మధురకన్న శ్రీవిలుబుత్తూరు శోభావిభవాదియుక్త మని భా,], చెలంగున్=ఒప్పుచున్నది.

పాండ్యదేశమందలి నగరములలో మేలుబంతి విలుబుత్తూరనునది కలదు. అం దెల్లెడలను మిన్నంటెడు బంగారపు మేడ లున్నవి. వానివలభులయందు నీలమరకతరచితము లయిన పికశుకము లున్నవి. అందలి యుద్యానములలోని శుకపికములకూఁతలకు ఆమేడలందు ప్రతిధ్వను లుప్పతిల్లుచుండును. అప్రతిధ్వనులు ఆమేడలమీఁది యాకృత్రిమ పికశుకములధ్వను లని వీథులం బోవువారు భ్రమపడుచుందురు.—ఇందు బుద్ధిం జెప్పినందున ఉదాత్తాలంకారము, తదంగములు భ్రాంతిమంతమును యథాసంఖ్యమును.

ఈపురమునకు ధన్వి (=విల్లుఁగలది) అని సంస్కృత నామము; చూ. పరమయోగివిలాసము. ౪ (౨౩).

చ. మలిచి పయోజ కోశముల మాడ్కి నొనర్చిన పద్మరాగపుం
గలశపు టొజ్జడా ల్బొమిడికంబులతో నపరంజి యోడుబి
ల్లల నల వైజయంతముఁ జలంబున గెల్వఁగ దంటతంబు లై
నిలిచిన యట్లు మాడువు లనేకము లుల్లసిలు న్పురంబునన్. 52

పురంబునన్ = ఆ విల్లుబుత్తూరియందు, అనేకములు మాడువులు = పెక్కులుమేడలు, మలిచి = చెక్కి (చెక్కడపుఁబనిచేత), పయోజ కోశములమాడ్కిన్ = తామర మొగ్గలతీరుగా, ఒనర్చిన=చేసినట్టి - పద్మరాగపుంగలశపు=కెంపుగిండులనెడి - ఠొజ్జ - డాలు=కాంతిగల - బొమిడికంబులతోన్=శిరస్త్రములతోను, అపరంజి ఓడుబిల్లలన్=మేలిబంగారపుఁ బెంకులతోను (మేలిబంగారపుఁ బెంకులకప్పుతోను), అలవైజయంతమున్ = ప్రసిద్ధమయిన యింద్రప్రాసాదమును,

ఘూర్ణాంతంబునఁ గలదు) - వ్యాసంగి = కూడియున్న - తుంగ = ఎత్తయిన - ద్రు = చెట్లయొక్క ('పలాశీ ద్రు ద్రుమాగమాః' అమ.) - శాఖలలోనుండి = కొమ్మలనుండి, గుబాలునన్ = గుబాలు మను శబ్దముతోఁగూడ, క్రందై = గుంపులుగా, పడుచున్ లేచుచున్ = పడుచు లేచుచు ఉండును.

ఆపురమందు ఉపవనవృక్షములశాఖలు వలభుల (చంద్రశాలల - లేక - వానిచూరుల) వలెను పర్వి వానికి అంటి యుండఁగా, అందుండు లకుముకులు మొత్తములుగా వీథిలో నీల మణిమయమైన తల్లియొలుగలవై ఆయొలువలెను తేటనీరు గొప్పబావులలోనికి మీలకై గుబాలున మునుకుచు లేచుచు నుండుట యెట్లుండు ననఁగా - ఆగృహలక్ష్మి తా నొరుల కగపడకయే యుండి, ఆచటి ద్రావిడస్త్రీలసహవాసముచే వారాడెడు బంతులయాట తానును ఆడుచున్నదా- యనునట్లుండును. లకుముకులు బంతులవలె నుండును, మొత్తముగా ననుట యేలయన, నాలుగైదు బంతుల నొక్కమాఱే ఆడిన ట్లుండుటకు; పెక్కుబంతుల నొక్కమాఱే ఆడుటచే గొప్పనేర్పు సూచితము; వలభికి తగులు శాఖలనుండి వ్రాలుటం జెప్పుట వలభినుండియే గృహలక్ష్మి చేతినుండియే వచ్చిన ట్లుండుటకు. ద్రావిడస్త్రీలు బంతియాడుట ప్రసిద్ధము, లకుముకులు మీలం బట్టుట ప్రసిద్ధము,—

'మెరమెరని కొలనిదరి మీలంచు లకుముకులు
మరగ నీకనుదోయి, మాయింపు చకచకలు' మను.

ఒలు 'నీల' మయముగా నుండుట భ్రమరయొలువలె నుండుటకు; తేటతనమును నీరుపైకుండుటయు మీలగపడుటకు. - ఉత్ప్రేక్ష.

మహాస్రగ్ధర.

స్వ నిలింపావాస దత్త్వాశన దతల మిథ స్తారతమ్యంబు లీ రెం
డును దీను ల్గాంచు నమ్మాడువులన యడుగం డోఁగు నుద్యద్రతోన్మే
శన సిద్ధ ద్వంద్వ బృందాలయ బిలతట కల్యాణమంథాప్రలో నా
వనజాక్షుస్యందనద్వంద్వము లిఖిత నరావాప్త దాంపత్య మొప్పున్. 53

లిఖి.....ము - లిఖిత = చిత్తరువున వ్రాయఁబడిన - నర = నారులచేతను నరులచేతను (ఏకశేషవృత్తి - నారీ చ నర శ్చ నరౌ - నరాభ్యామ్ అని విగ్రహము) - అవాప్త = పొందఁబడిన - దాంపత్యము = భార్యాపతి భావముకలది (అనఁగా భార్యాపతులుగా వ్రాయఁబడిన మనుష్యుల చిత్తరువులుగలది), (అగు), వన.....ము-వనజాక్షియొక్కయు వనజాక్షునియొక్కయు (లక్ష్మీ నారాయణులయొక్క యనుట - ఏకశేషవృత్తి - వనజాక్షీచ వనజాక్షశ్చ వనజాక్షౌ తయోః అని విగ్రహము.) -స్యందన= తేరులయొక్క - ద్వంద్వము=ద్వయము (వారిరెండు తేరులు ననుట), (ఎట్లున్నదనఁగా), స్వని.....లు - స్వ=తమయొక్క - నిలింప=దేవతలకు - ఆవాసదత్వ = నివాసమును ఇచ్చుటయొక్కయును - అశన దతల = ఆహారమును ఇచ్చుటయొక్కయును (ఇందలి 'అ' ద్వంద్వాంతమందలి బహువచన లడాగము,) - మిథః = ఒండొంటి - తారతమ్యంబులు = ఎక్కువతక్కువలు, ఈరెండును = నివాసమిచ్చుటయు ఆహారమొసంగుటయు అనెడి రెండుధర్మములను, దీనుల్ = రిక్తులు, కాంచు నమ్మాడువులన = జేనివలనం బొందుచున్నారో ఆ మేడలనే ('దీను' అనుటకు 'మిన్ను' అని పా. మిన్నుల్గాంచు = మిన్నంటుచున్న అనఁగా మిక్కుటముగా

విలసిల్లుచున్న యని యర్థము), అడుగన్ = అడిగి తెలిసికొనుటకై, డోఁగు = వినయపూర్వకముగా మోఁకాళ్ల మీఁద నడిచివచ్చిన - ఉద్య...లో - ఉద్యత్ = ఒప్పుచున్న - రత = కామక్రీడల యందలి - ఉన్మేళన = కూడికలుగల - సిద్ధ = సిద్ధలయొక్కయు సిద్ధులయొక్కయు - ద్వంద్వ = మిథునములయొక్క - బృంద = సమూహములయొక్క - ఆలయ = నివాసములయిన - బిల = గుహలును - తట = దరులును గలవైన - కల్యాణ = బంగారముయొక్కయు ('కల్యాణం హేమ్ని మఙ్గళే' మేది.) - మంథ = త్రచ్చుటయొక్కయు - అద్రులో = కొండలో, నాన్ = అనునట్లు, ఒప్పున్ = వెలయుచున్నది.—స త త న స ర ర గ, 9,7 - మహాస్రగ్ధర.

అపురమందు లక్ష్మి కొకరథమును నారాయణుని కొకరథమును కలవు; వానియందు నరదంపతుల చిత్తరువులు గలవు; అట్టియారథము లట నెట్లొప్పుచున్న వనఁగా - మేరు పర్వతము దేవతలకు నివాసము నొసంగినది, మందరపర్వతము వారికి ఆహారమయిన యమృతము నిచ్చినది; రెంటియందును సిద్ధదంపతులకు ఆలయము లయిన బిలతటములు కలవు; ఆపురమునందలి మాడుగులును నివాసమిచ్చు నవియు భోజన మిడునవియుంగా నున్నవి. కావున పైఁజెప్పిన యీతమరెండుధర్మములం గల తారతమ్యమును ఆమాడుగులనే అడుగుద మని వచ్చిన మేరుమందర పర్వతములో యనునట్లుగా ఆరెండు తేరులును ఒప్పుచున్నవి. తేరులయందలి నరదంపతి ప్రతిమలు మేరు మందరములందలి బిలతటములలోని సిద్ధదంపతులవలె నొప్పుచున్నవి. - ఉత్ప్రేక్ష. మాడువుల యందలి దంపతులును సిద్ధదంపతులను మించినవా రని సిద్ధించుచున్నది.

పూర్వముద్రణమునందు ద్వితీయపాదమున 'యడుగం దోఁచు' అను పాఠమున యతిభంగము; కావున 'దోఁగు' శబ్దరూపాంతరమయిన 'డోఁగు' శబ్దము ఇట స్వీకరింపఁబడినది; డోఁగుట వినయముచేత. (లేదా) 'మన్కువలనె యడుగందోఁచు' అని పఠింపఁదగు.

'ఏకపదంబున విరతు ల । నేకంబులు గలిగియుండు నేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ । బ్రాకటముగ నిలుచు సీసపదములఁ దక్కన్.' అప్ప.

సీ. సవలయధ్వని గాఁగ సారె వ్రేయు నదల్పు
యతినైన గుండె జల్లనఁ గలంప,
సుడిసిన మొగమెత్తి చూడకుండు పరాకు
కుసుమబాణుని నైనఁ గుపితుఁ జేయ,
శ్రీకార్య పరులఁ గాంచిన లేచి మ్రొక్కు నం
జలికి నింద్రుండు నక్కొలువుఁ గోర,
హరిగృహావసరశంఖాకర్ణనకుఁ ద్రిప్పఁ
గడగంటి జిగి ప్రజఁ గాఁడి పాఱఁ,
తే. గవఁఱ లుంకించి వ్రేయఁ గొ ప్పవియ నవలి
కరమున నమర్పఁ బైఁటలో మరుని బటువు
బిల్లక్రియఁ బట్టుఁగంచెలఁ బిగువుఁజన్ను
నిక్కఁ దిన్నెలఁ బాత్రాళి నెత్తమాడు. 59

1. సవలయధ్వని = కంకణముల క్వణనముతోఁ గూడుకొన్నది, కాఁగన్ = అగునట్లుగా, సారెన్ = పాచికను, వ్రేయు నదల్పు = వైచునట్టి యదలింపు, యతిసైనన్ = (విరక్తుఁడగు) సన్న్యాసిని సయితము, గుండె, జల్లు అనన్ = వశము తప్పునట్లుగా, కలంపన్ = మారవికారము నొందించుచుండఁగా;

2. సుడిసినన్ = ఎదురైనంతట, మొగము ఎత్తి చూడక ఉండు - పరాకు = తత్పరత్వము (ఆటయందే ఆసక్తి కలిగియుండుట), కుసుమబాణునిన్ ఐనన్ = మన్మథుని సయితము, కవిటున్ = కొఱగాని పల్లవునిఁగా (తాను సౌభాగ్యహీనుఁడని తలంచుకొనునట్లుగా), చేయన్ = కావింపఁగా;

3. (ఇంత తత్పరత్వముతో ఆడుచునే), శ్రీకార్యపరులన్ = భగవత్కైంకర్యాసక్తు లగు వారిని, కాంచినన్ = చూచినయెడల, (ఆటనిలిపి), లేచి, మ్రొక్కనంజలికిన్ = మ్రొక్కుటకైన కేల్మోడ్పు తనకై చేయుదురుగాక యని యభిలషించి, ఇంద్రుండున్ = ఇంద్రుఁడు సయితము, అక్కొలుపున్ = ఆభగవత్కైంకర్యమును, కోరన్ = అభిలషించుచుండఁగా (అయ్యంజలి అంత మోహకముగా నున్నఁ దనుట);

4. హరి...కన్ - హరిగృహ = విష్ణ్వాలయమునందలి - అవసర = పూజాసమయవిశేషముల యొక్క - శంఖ = శంఖధ్వానముయొక్క - ఆకర్ణనకున్ = వినుటకై, త్రిప్పు - కడగంటిజిగి = కనుఁగొన తళుకు, ప్రజన్ = జనులను, కాఁడి = దూసి, పాఱన్ = నిగుడుచుండగా (అంతవాడి యనుట);

కవఱులు = పాచికలను, ఉంకించి = ఊఁచి, వ్రేయన్ = వైవఁగా, కొప్పు, అవియన్ = సడలఁగా, అవలికరమునన్ = రెండవచేతితో, అమర్పన్ = కొప్పును సవరించుకొనునప్పుడు, పైఁటలోన్ = పయ్యెదనుండి, మరుని బటువు విల్లు క్రియన్ = మన్మథుని విల్లుతలగడయో యను నట్లు, పట్టుఁగంచెలన్ = పట్టురవికలోపల, బిగువుఁజన్ను, నిక్కన్ = నిక్కుచుండఁగా, తిన్నెలన్ = అరఁగులయందు, పాత్రఆళి = ఆటవెలఁదుల సమూహము, నెత్తమున్ = జూదము, ఆడున్ = ఆడును. ('పాత్రముల్' అను బ. వ. పాఠమున క్రియకు 'ఆడున్' అని ఏ. వ. దుర్ఘటము).

'సవలయధ్వని' - బంగారుగాజుల శింజితము అతిమనోహర మనియు దారింబోవువారు వారం గాంచి దానిని విని వారికి లోనగుదు రనియు భా. 'యతిసైన' 'కుసుమబాణునిసైన' 'ఇంద్రుఁడైన' అనుటచే ఇతరులమాట చెప్పవలయునాయనుట సిద్ధము గావున కావ్యార్థాపత్త్యలంకారములు. 'సారె' - పూర్వముద్రణమున 'అడ్డసాళు' లను బహువచనముంబట్టి 'సాలి' యని ఏకవచనపాఠము కల్పింపఁబడినది. 'అడ్డసాళు' లనునది నిత్యబహువచనముగాన దానికి 'అడ్డసాలి' యని యేకవచనము లేదు. కావున ప్రసిద్ధమయిన 'సారె' పదమే యిట నుపాత్తము.

"క. సారె యదె పొడువు మని యొక । సారె యొకతె యక్షకేళిసమయంబున ని [సా.
చ్ఛారతి నొకతెకుఁ జెప్పిన । సారె కనకపంజరమున సాధ్వస మందెన్." శాల్ప్=పగ

"సీ. సారె యంచన నడ్డ సారె యంచనఁగను సొగటు మంచనఁగను జనును గూర్చి కట్టిన
తే. పాచిక యనంగఁ గవఱనాఁ బాశకమగు." ఆం. 2 (305) ౦ ఆవఱుల్=పండ్ల

శ్రీకార్య.....మ్రొక్కుట తాము విష్ణుదాసీజన మగుటచే, తమకు విష్ణు=రాచికొను చున్న గావునను. 'పైఁటలో' - పయ్యెద ఇంచుక ఒత్తిగిల్లఁగా కంచెల గాన్పించె.బడి, మూర్ఛా అలస= గంచెల బిల్లయొక్క యొఱగాను కుచము బిల్లగాను ఉత్ప్రేక్షితములు.—ఏనట్లు. అమరన్ = ఒప్పు వోక్తియు కలదు.

సీ. వీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెల గాయ,
  వరిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ,
నొరసి యొత్తిన మణుంగొందక మైనె ని
  గ్గులు దేరఁ బసు పిడి జలక మాడ,
ముదుక గాకుండఁ బయ్యెదలోనె కేలార్చి,
  కలయఁ జంటను నొట్టఁ గలప మలఁద,
రతిరయచ్ఛిన్న సూత్రమునఁ జిక్కక ముత్తె
  ములు రాల గరగరికలు వహింపఁ,

తే. బొలసినన యెట్టినరునైనఁ గులముఁ దెలియఁ
బ్రభుత చెడి పల్లవుఁడు పేద వడిన నేర,
నృపతివెలియంతిపురముగా నెన్న మెలఁగ,
బాసఁ గృతి సెప్ప వలఁతు లప్పద్మముఖులు. 60

ధనాశాపరులు కారు గుణవతులు

1. అప్పద్మముఖులు = ఆతామరసవదనలు (ఆవేశ్యలనుట), పలువరుసన్ = దంతపంక్తిని, వీడెంపుఁ బలుకెంపు = తాంబూలముయొక్క (తాంబూలము నమలినందువలనఁ గలిగిన) మిక్కుటపు టెఱుపు, విరిసి = తొలఁగి (తొలఁగు నట్లును అందువలన), వెన్నెలగాయన్ = ధవళకాంతి వ్యాపించునట్లునుంగా, వరిగింజన్ ఒకటన్ = ఒకటేవరిగింజతో, తోమన్ = తోముకొనుటయును;

2. ఒరసి = రాచి, ఒత్తినన్ = అదిమినప్పటికిని (సముచ్చయ నకారము స్థిరమగుటచే దానికి పూర్వమున్న ప్రత్యయనకారము లోపించినది.), మణుంగు = పరిశుద్ధవస్త్రమునకు. ఒందక = అంటక, మైనె = దేహమందే, నిగ్గులుదేరన్ = డాలు ఒలయునట్లు, పసుపు, ఇడి = పూసికొని, జలకము ఆడన్ = స్నానము చేయుటయును;

3. పయ్యెదలోనె = పైఁట లోపలనె, కేలు ఆర్చి = చేతిని ఆడించి, ముదుక గాకుండన్ = పలుచనగానే, కలయన్ = అంతటను, ఒట్టన్ = అంటునట్లుగా, చంటన్ = స్తనములకు, కలపము = పరిమళద్రవ్య మిశ్రమయిన చందనమును, అలందన్ = పూసికొనుటయును;

4. రతి......నన్ - రతిరయ = సురతవేగముచేత - ఛిన్న = త్రెస్సిన - సూత్రమునన్ = దారమునందు, చిక్కక = నిలువక, (హారమందలి), ముత్తెములు, రాలన్ = (నేలకు) రాలిపోఁగా, కలు = సరకుసేయమిని - వహింపన్ = తాల్చుటయును (సరకుసేయకుండుట కనుట);

లసినన = తారసిల్లినమాత్రాననే, ఎట్టి నరుఁన్ ఐనన్, కులము, తెలియన్ = తెలిసి ప్రభుత = ఐశ్వర్యము, చెడి, పల్లవుఁడు = విటుఁడు ('అథ పల్లవః । అస్త్రీ ప్రవాళే
తే. గవః), పేదవడినన్ = దరిద్రుఁడాయె నేని, ఏదన్ = పోషించుటయును; నృ......
కరము రాజుయొక్క - వెలి = బయటి - అంతిపురముగాన్ = రాణివాసములని, ఎన్నన్ =
కరాణివాసముగా ననుట), మెలఁగన్ = వర్తించుటయును, బాసన్ = సంభా
బిల్లక్రి ... ఏర్పరించిన నియమము ప్రకారము; దేశభాషలయం దని యొక వ్యా.),
నిక్కఁ దిగ్గ చెప్పుటయును, వలఁతులు = నేర్పుగలవారు.

ఇట సర్వత్ర యథావద్వస్తువర్ణన మనియు దానంజేసి స్వభావోక్త్యలంకార మనియు జోగి జగన్నాథ వ్యాఖ్య.

ఉ. అంచిత హారవల్లి వలయాభరణంబుల తక్కఁ ద్రోయుఁ జి
ల్మంచుఁ బసిండి, యేణమద మంగముఁ జేర్చుట తక్క రోయు జి
డ్డంచు జవాది, ధూపితమ యందుట తక్క విదుర్చుఁ బూవుఁ జె
మ్మంచు, జిలుంగె దక్క నగు యౌవత మొత్తు నటంచు నన్యముల్. 61

యౌవతము = (వార) యువతీసమూహము, అం...క్కన్ - అంచిత = మేలయిన - హార వల్లి = తీఁగలవంటి హారముల (తోఁజేయఁబడిన) - వలయ ఆభరణంబుల తక్కన్ = కటక భూషణ ములనే (ధరించునుగాని), పసిండిన్ = బంగారమును, చిలుము అంచున్ = లోహమగుటచేత చిలుము పట్టు నను కారణముచేత, త్రోయున్ = విసర్జించును; ఏణమదము = కస్తూరిని; అంగము చేర్చుట తక్కన్ = దేహమున నలందునేగాని, జవాదిన్ = పునుఁగును, జిడ్డు అంచున్, రోయున్ = ఏవగించును; ధూపితమ = ధూపమును మాత్రము, అందుట తక్కన్ = గ్రహించునుగాని, పూవున్, చెమ్మ అంచున్, విదుర్చున్ = విసరిపాఱవైచును; జిలుంగె దక్కన్ = సూక్ష్మ వస్త్రమును ధరించునే గాని, అన్యమున్ = ఇతరవస్త్రమును, ఒత్తును అటంచున్, నగున్ = తిరస్కరించును.

అందలి వారయువతులు ముత్యాలహారములను ముత్యాలకటకములను ధరింతురే గాని చిలుము పట్టునని బంగారు నగలను ధరింపరు; దేహమునకు కస్తురి యలందుకొందురేగాని జిడ్డని పునుఁగుం దగులనీయరు; ధూపములు వైచికొందురేగాని పువ్వులను తెమ్మయని ధరింపరు; సూక్ష్మ వస్త్రమునుతాల్తురేగాని ఇతరవస్త్రమును ఒత్తు కొను నని తాల్పరు. - కరము సౌకుమార్యము కలవా రనుట. [ఇట ప్రతివాక్యమందును పరిసంఖ్యాలంకారము కలదు; పసిండిని జవాదిని పువ్వులను అన్యమును త్రోయుట వాస్తవము కాదు గావున సంబంధాతిశయోక్తియును గలదు. వాస్తవము కాదనుటకు అనంతరపద్యమందు చెప్పఁబడిన పుష్పధారణమే తార్కాణము.]

ఉ. వేవిన మేడఁబై వలభి వేణికఁ జంట నపేంచి విప్పగాఁ
బూవులు గోట మీటుతఱిఁ బోయెడు తేఁటుల మ్రోఁత కామి కిం
కావహ మౌఁ గృతాభ్యసన లౌటను దంతపు మెట్ల వెంబడిం
జే వడి వీణ మీటుటయుఁ జిక్కెడలించుటయు న్మరింబడన్.

వేవినన్ = (రూ. వేగినన్ - అచ్చతెలుఁగులో అరుదుగా గాకు వా వచ్చును.). 65
నంతట, మేడన్ = మేడమీఁద, పైవలభిన్ = పైగదియందు (వాతాయనము కడనేన్నిఁదోపి [పా. 'వల భ్యుపరికుటీ' అని మాలతిలో జగద్ధరవ్యాఖ్య. 'వలభి' అనుటచేతనే మొక్కాల్ప=పైగ చుండఁగా మరల 'పై'వలభియననేలయన 'ప్రాసాదానా ముపరివలభీ' లుబక్కు చూర్చి కట్టిన మాలతీపద్యములో ఉపరిశబ్దముంబోలె ఈ పై శబ్దము స్పష్టార్థము.), వేణిక, సల ఆవళుల్ = పండ్ల వహించి, విప్పఁగా = విప్పునప్పుడు, పూవులు = పూవులను, గోటన్ = గోళ్ళ = రాచికొను చున్న వీణావాదన కనుగుణము), మీటు తఱిన్ = తొలఁగఁజిమ్ము సమయమువ్వాజఁబడి, మూర్ఛ ఆలస = మ్రోఁత = పరిమళాకృష్టములై యాపువ్వులపై ముసరికొనియుండి సినునట్లు. అమరన్ = ఓప్పు పోయెడి తుమ్మెదల రొద, కృత అభ్యసనలు = చేయఁబడిన వీణ

యాంద్రు వీణాభ్యాసము చేసినవారు), ఔటన్ = అయిన హేతువుచేత, దంతపు - మెట్లవెం బడిన్ = సరకట్లమీఁదుగా, చేన్ = చేతితో, వడిన్ = వేగముగా, వీణన్, మీటుటయున్ = వాయించుటయు, చిక్కు = చిక్కును, ఎడలించుటయున్ = తీసికొనుటయును, సరింబడన్ = సమానమైయుండుటచేత, కా...ము - కామి = వీథిలోఁ బోవుచున్నకాముకులకు, శంకా = వీణ వాయించుచున్నా రను భ్రమను-ఆవహము = కలిగించునట్టిది, ఔన్.

ఆపురియందు తెల్లవాఱఁగానే వారయువతులు మేడపై వలభియందు కూర్చుండి జడ విప్పు కొనుచు అందు తుఱిమియున్న పువ్వులను గోళ్లతో తొలఁగఁజిమ్మునప్పుడు ఆపువ్వులపై పరిమళముకై ముసరియుండి లేచిపోవుచున్నతుమ్మెదలరొద వీణానాదమువలెను, పువ్వులు దంతపు సరకట్లవలెను, ఉండును. ఆచెలువలును వీణావాదనమందు ఎన్నికగన్నవారు, చేతితో చిక్కు ఎడలించుకొనుట హస్తలాఘవముతో వీణమీటుటవలె దూరమున కగపడును; కావున వీథిబడి నేఁగు కాముకులు ఆస్త్రీల వీణావాదన నైపుణి నెఱింగినవారు గావున పూర్వోక్తసాదృశ్యములచే ఆతీరెల్లను వీణవాయించుటయే యని భ్రమింతురు. - భ్రాంతిమదలంకారము.

ఈపద్యమందు 'వహించి' ఇత్యాదికమునకు కర్త లేదు. పూర్వపద్యమునుండి బహ్వర్థముగా 'యౌవతము' నధ్యాహరించుకొనవలయును. 'కామి' - కాముకులు గానివారికి ఈ వెలవెలంగల వీణావాదన కౌశలము ఎఱుకపడు ప్రసక్తి లేదు, కాముకు లన్ననో ప్రత్యాసక్తితో తెలిసికొనియుందురు. 'పోయెడి' - నిశ్చలముగానున్నప్పుడు భ్రమరమునకు మ్రోఁతయుండదు. 'దంతపు' - దంతము తెలుపు, కవిసమయముచేత పుష్పములకు శౌక్ల్యమే గావున పుష్పములకు దంతపుమెట్లతో సామ్యము. ('రక్తత్వమేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్య మేవ చ' కా. క. ల.). 'చంట' వహించుట నిజదృగ్గోచర మగుటకు, చంట వహించినందుననే వేణికయందు కాముకులకు వీణా భ్రాంతి. 'చేవడిన్' - వీణావాదనాభ్యాస పాటవ లబ్ధమైన హస్తలాఘవము ఆయుల వాటుచేత చిక్కెడలించుటయందును కనఁబడును. 'కృతాభ్యసనలు' - ఇట్టి కలానైపుణి వారయువతులకు సాధారణము, కులాంగనలకు అరుదు.

క. అళివచఃకార్పణ్యం। బా లేమల చెవులు సోఁక వధమాన్వయ జీ
పరిం ర్ణాలావణ్యుల పిలుపున। కై లాభముఁ దెలిపెనేని నవి శ్రీలగుటన్. 63

లాభమున్ తెలిపెన్ ఏనిన్=లాభము కలుగు ననియెఱుకపఱుచుచున్నను, అళి......బు- దారమునళిక త్తెయొక్క - వచః = విన్నపమందలి - కార్పణ్యంబు = లౌభ్యము, /అధ...కై - 'కలు = ` = తక్కువజాతివానియొక్కయు - జీర్ణ = ముసలివానియొక్కయు ('ప్రవయాః అసినసే జీర్ణో జరన్నపి' అమ.) - అలావణ్యుల = సౌందర్యరహితునియొక్కయు - ప్రభుత్వటకొఱకు, ఆలేమల = ఆవారయువతులయొక్క - చెవులు = కర్ణములను,
తే. గవు), ౣలు=లక్ష్ములు (శ్రీకారతుల్యాకారము లనియు), అగుటన్=అగుహేతువు

కరము, గాజులే
కరాఁన ఎంత ధనాదికము లభించునట్లున్నను వారిని రప్పించుటకై చెలి
బిల్లక్రియ లేఁరాంగనల చెవులలో చొరదు. ఏలచొరదన అవి శ్రీలు. హేతువు
నిక్కఁ దిస్సెచెప్పజెప్పినందున హేతూత్ప్రేక్షాలంకారము.

చ. *ద్రవిడకుటుంబినుల్పసుపు రాచిన రత్నపుఁ దాపక్రింద నం
బువు దెరవాఱఁగా నిదుర వోయి గరుత్తతి పచ్చఁబాఱినన్
భవనసరోమరాళములు భర్మమయచ్ఛదగుచ్ఛవిస్ఫుర
ద్దివిజధునీ మరాళ వితతి భ్రమఁ బూన్చుఁ బురి న్భ్రమించుచున్. 64

భ.....లు - భవన=ఇండ్లయొక్క - సరః=కొలఁకులయందలి - మరాళములు=హంసలు, - ద్రవిడ కుటుంబినులు = అఱవయిల్లాండ్రు, పసుపు=పసుపుఁ గొమ్మును, రా...దన్ - రాచిన = (జలకమాడుటకై పూసికొనుటకుగాను) అఱుఁగఁదీసికొన్న - రత్నపుఁదాపక్రిందన్=రత్నమయమయిన మెట్టుక్రిందికి, అంబువు=ఆపసుపునీరు, తెరవాఱఁగాన్=పొరలఁగా (అచట), నిదుర వోయి (మరాళములుకర్త), గరుత్ తతి=ఱెక్కలమొత్తము, పచ్చఁబాఱినన్ = పసుపువన్నెం బొరయఁగా, పురిన్=ఆపట్టణమందు, భ్రమించుచున్ = సంచరించుచు, (పౌరులకు), భర్మ... మన్ - భర్మమయ = బంగారపు ('భర్మ స్యాత్ కాఞ్చనే భృతౌ' మేది.) - ఛద = ఱెక్కలయొక్క - గుచ్ఛ = గుత్తులచే - విస్ఫురత్ = ప్రకాశించుచున్న - దివిజధునీ = దేవనదియందలి - మరాళ వితతి = హంస సమూహమనెడి - భ్రమన్ = భ్రాంతిని, పూన్చున్ = కలిగించును.

ఆపురియందు గృహారామములందలి కొలంకులలో అఱవయిల్లాండ్రు జలకమాడుటకు బంగారు మెట్టుమీఁద పసుపుఁగొమ్ము నఱుఁగఁదీసికొనఁగా ఆపసుపు నీరు ఆమెట్టుక్రిందికి పొరలి ఆక్రింద నిద్రించుచున్న హంసల ఱెక్కలపైఁ బడి వానిని పసిమి సేయఁగా, ఆయంచలు పిమ్మట ఊరిలో సంచరించుచు పౌరులకు స్వర్గంగలోని బంగారు ఱెక్కల హంస లనెడి భ్రమను జనింపఁ జేయును. భ్రాంతిమదలంకారము; 'రత్నపుఁ దాప' - ఉదాత్తాలంకారము.

'కుటుంబినుల్' అనఁగా పుత్త్రాదిమతు లయిన సుమంగలులు - వారిం జెప్పుట, వారికే గాని వితంతువులకు పసుపుతో పనిలేదు గావున; 'నిదురం' జెప్పుట మేల్కొని యున్నచో సందడిచే నవలికిం దొలంగును గావున; 'తెరవాఱుట' అనఁగా 'జిడ్డుదేఱి తెరగట్టుట' అని సీతారామాచార్యులవారు.

మ. తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుష స్స్నాతప్రయాతద్విజా
వలి పిండీకృత శాటు లివి దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసఁ బాఱువానిఁ గని నవ్వ న్నాలిగోపౌఘముల్. 65

బాతువులు=బాతులు, తలన్, పక్షచ్ఛటన్ = ఱెక్కమొత్తమునందు, గ్రుచ్చి=దోపి [పా. క్రుక్కి, పా. క్రుంగ (న్)=అడంగఁగా], కే...లిన్ - కేదారంపు=వరిమళ్లయొక్క - కుల్యా=('కేదారః క్షేత్రే శైలభే దాలవాలయోః' నానా.) - కుల్యా = కాలువలయొక్కయు కూర్చి కట్టిన కృత్రిమా సరిత్' అమ.) - అంతర = నడిమిదైన - స్థలిన్ - ప్రదేశమందు, సల ఆవళుల్=పండ్ల నిద్రించుచుండఁగా, ఆరెకులు = అరతుకులు (ఊరికాపరులు), చూచి, ఉషః=రాచికొను చున్న వేకువయందు - స్నాత=స్నానమాడినవారై - ప్రయాత= చనినట్టి - ద్విజఁబడి, మూర్ఛా అలస= (దన్త విప్రాణ్డజా ద్విజాః' అమ.) - ఆవళి = సమూహముయొక్క - పిసనట్లు. అమరన్ = ఒప్పు

* భిక్ష - 65, 66, 67, 68.

జేయఁబడిన - శాటికల్ = వస్త్రములు, సవి = అని, తత్ ఆవాసంబుల్ = వారి యిండ్లకు, చేర్పంగన్ = కొనిపోయి ఇచ్చుటకై, రేవులన్ = నీరాట రేవులలోనికి, డిగ్గన్ = దిగఁగా, వెసన్ = తటాలున, పాఱువానిన్ = పాఱిపోవుచున్న యాబాతులను, కని, శాలిగోపీ ఓఘముల్ = పైరుకాపరి చెలువల యొక్క సమూహములు (ఓఘో బృన్దేఽమ్భసాంరయే' అమ.), నవ్వున్ = హసించును. ('బాతువు' - రూ. బాతు.)

ఆపురియొక్క మాగాణులలో, వరిమళ్లకుఁ బాఱు నీటికాలువల మధ్యభాగములో, ప్రాతఃకాలమందు బాతులు ఱెక్కమొత్తములో తలదూర్చుకొని నిద్రించుచుండఁగా, ఆరెకులు చూచి అవి అంతకుముందే అట స్నానము చేసిపోయిన బ్రాహ్మణుల వస్త్రపు పిడుచలని భ్రమించి, వారికిం జేర్చుటకై కొనిపోవుద మని రేవులలో దిగఁగానే, ఆసందడికి అవి మేల్కాని అవలికి ఈఁదుకొని పోవం దొడంగుటం గని, అచటి పైరుకాపరి వెలఁదులు నవ్వుదురు. - బ్రాహ్మణులు అరుణోదయస్నాతలు, ఆరెకులు సాధువులు, పైరుపంటలకు జలము సమృద్ధము అని భా. - నిద్రాసమయమందు తలను ఱెక్కలం గ్రుక్కుట బాతుల స్వభావము, ఇట దానిం జెప్పుట ఆరెకుల భ్రమకు కారణార్థము, నిద్రించుటం జెప్పుట నిశ్చలత్వలబ్ధికి. 'శాటికల్సవి' - పూర్వముద్రణమున 'శాటులన్సవిన్' అని పాఠమును, సవిన్ అనఁగా భ్రమచే అని యర్థమును గలవు. 'సవి' * అను పదము భ్రమార్థకము ఎటను లేదు. 'సవిసావి । యని యన నిత్యర్థమై తనర్చు' అని యాంధ్రభాషార్ణవము. బ్రౌనుదొరగారును సీతారామాచార్యులుగారును ఈశబ్దమునకు ఈయవ్యయార్థమునే (సవి = అని) వ్రాసి ఈపద్యమున 'శాటికల్సవి' అని పఠించినారు సీ. దత్తోదాహరణము:—

'నాకు నిచ్చియున్న నా మెడహారంబు । నిజనఖాంకురముల నిగిడికొనుచు,
సరభసముగఁ జనియె సవి రాత్రి నేఁ గల । కంటి, నపుడ మేలుకంటి ననఘ.' లక్ష్మీ. ౩, ఆ.

బ్రౌ. దత్తోదాహరణము:—కళాపూర్ణోదయావతారిక.-

మ. 'వలకేలం బలికిం గుచస్తబకసేవాలోలతం బోవ, డా
పలికేలన్ సిగ్గున మాన్ప, నల్క సవి తత్పార్శ్వంపులేఁ జెక్కుఁగో
మలపాదంబును మొట్టుచున్ వలచు బ్రహ్మం బర్ధనారీశ్వరం
బెలమి న్నిత్యముఁ బ్రోచుఁ గృష్ణవసుధాధీశు న్నృసింహాత్మజున్.'

పూర్వముద్రణ వ్యాఖ్యాత 'అల్కసవిన్' అని పఠించికొని 'అల్క భ్రమచే, అని యర్థము చేసికొనియెం గావలయు. - 'శాటికామతిఁ దదావాసంబు' అని యొక పాఠము. - బాతులవృత్తము స్వభావోక్తి, ఆరెకులు వానిని వస్త్రపుఁ బిడుచ లని తలంచి రను వర్ణనలో భ్రాంతిమంతము; శాలిగోపికలు నవ్వుటయు స్వభావోక్తి యనం జనును.

మ. సొరిదిం బేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులు న్పుష్పమం
జరులు న్మామిడిగుత్తులు న్గుసుమము ల్పంపెంగలు న్పచ్చగ
ప్పురులు న్బాళలు గల్గి రాజనపుఁ గాంతిం దారు ము ల్వ్యాపి చే
తే. గవ) నార న్నగుఁ బావుఁదోఁటల బలాకానీకదంభంబునన్. 66

కరము..ములు (చేను - ఏ. వ.), సొరిదిన్ = వరుసగా, పేర్చిన = వర్ధిల్లినట్టి (ఈవిశేషణ బిల్లక్రియ..న్వయించును), తీఁగమల్లియలున్ = తీఁగగా ప్రాఁకెడు మల్లెమొక్కల

నిక్కుఁ దిస్సెచెప్ప. 'హరివికచాను... రాహుసావి...' ౧-3

పువ్వులును, ఖర్జూరంబులున్ =ఖర్జూరపుఁబువ్వులును, పుష్పమంజరులున్ =పూరెమ్మలును, మామిడి గుత్తులున్ = మామిడిపూగుత్తులును, కుసుమముల్ = (ఇతర) పుష్పములును, సంపెంగలున్, పచ్చ గన్నెరులున్, పొళలున్ = (పోఁక లోనగువాని) కప్పడుతోడి పూగుత్తులును (ఈ చెప్పిన వన్నియు పుష్పవిశేషములు - ఈ పేరుల వరులునుం గలవు), కలిగి=కలవై, (రాజనమను పేరి పూవు లేదు గావున) రాజనపుఁ గాంతిన్ =రాజాన్న మనెడి వరియొక్క ప్రకాశముచేత, తారు=ఆచేలు, ముల్ నూపి=హెచ్చై (తూనికలో బరు వెక్కువదానివైపు త్రాసుయొక్క ముల్లు మొగ్గును - రాజనపువరికి సహజముగా ముల్లుగలదు - రాజనము పూఁదోఁటలకు లేక వరిచేలకుం గలిగియున్న హెచ్చు అని భా.), పూవుదోఁటలన్, అరుదు ఆరన్ =ఆశ్చర్యము ఒప్పునట్లుగా, బ...నన్ - బలాకా = బెగ్గురులయొక్క - ఆనీక = సమూహము లనెడి - దంభంబునన్ = వ్యాజముచేతను, నగున్ = పరిహసించును.

పూఁదోఁటలయందు తీఁగమల్లెలు లోనగు పుష్పములు గలవు, వరిచేలయందును ఆ పేరులు గల వరులు గలవు, అంతవఱకు తోఁటలకును చేలకును సమత్వమే గాని ఎక్కువ తక్కువలు లేవు. అయిన, చేలకు రాజనము కలదు. ఆ పేరు పువ్వులలో లేదు. కావున తోఁటలకు అది యొక లోపము. ఆహేతువుచేత తోఁటలే చేలకు ఓడిపోయినవి. కావున చేలు బలాకా పంక్తి మిషచే తోఁటలను పరిహసించుచున్నవి. బలాకలు తోఁటలలోనుండవు, పొలాలలో నీటికడ నుండును, కావున చేలే పరిహసించినట్లు చెప్పుట సరిపడుచున్నది. పూఁదోఁటలును వరిచేలును నానా పుష్ప శాలిసమృద్ధములై యున్నవి. దేశము సుభిక్షముగా నున్నది - అని తా.

'సారిదిన్ ......ముల్నూపి' - వ్యతిరేకాలంకారము. 'నగున్ ...దంభంబునన్'-సాపహ్నవోత్ప్రేక్ష. హాసము కవిసమయముచేత తెలుపు గాన బలాకలును దెలుపుగాన బలాకలు హాసముగా నుత్ప్రేక్షింపఁబడినవి. - 'ముల్' - 'ముల్లు' శబ్దమున 'అకారము క్రిం'దీత్యాది బా. వ్యా. ప్ర. 7. సూత్రమువలన క్రింది లకారము లోపింపఁగా 'ములు' అయినది. తర్వాత 'పదాంతంబుల యి' ఇత్యాది బా. వ్యా. ప్ర. 16. సూత్రమువలన 'ముల్' అయినది.

పా. 'గన్నెరు పూఁబాళలు; 'పేర్చిన'-పా. చేర్చిన (= సమకూర్చిన); "పచ్చగన్నెరు తీఁగమల్లియ। బుడమ రాజనము నాఁ బొలుపుగాంచు। వ్రీహిభేదమ్ములు." అం. భా. 2 (284); "పండినపుష్పమంజరుల్ । రుచిదళుకొత్త ముత్తెపుసరుల్ గనుపట్టు విచిత్రవైఖరిన్" రామాభ్యు. 'ముల్నూపి'-"సత్యము వలనన ములు నూపు గౌరవంబున పేర్మిన్" *[చూ. పీఠిక పు. 7. 36]

చ. బలసిన హాళ్లకచ్ఛటలపైఁ దమ జుంజుఱుముండ్లు రాయఁగాఁ,
గలమము ళుందుఁ బండి యొఱగంబడి నీ రెడలింపఁ దృష్ణ లోఁ
దల కొన, వంగి ముగ్ జలముఁ ద్రావెడు క్రిందటిప్రేళ్లు వి
నిలిపి, మరంద మాను కరణి న్నికటోపవనానిలాహతిన్ వ్వలు కూర్చి కట్టిన

నన్ -
- పొల్చు=ఒప్పు

కలమములు = వరిపైరులు, పండి, నీరు = మడిలోనిజలమును, ఎడలిఁ ఫల ఆవళుల్ =పండ్ల పొలము ఎండుటకుఁగాను సేద్యగాండ్రు) మడినుండి (ముఱుగుడు కాలువలకున్ =రాచికొను చున్న ఒఱగంబడి = (వెన్నుబరువుచే) వ్రాలి, నిక......తిన్ - నికట=చేరఁబడి, మూర్ఛా అలస= సన్నసన్నికృష్ట సనీడవత్' అమ.) - ఉపవన = ఉద్యానములయొక్క అనునట్లు. అమరన్ = ఒప్పు ('గన్ధవా హానిలాశుగాః' అమ.) - ఆహతిన్ =దెబ్బచేత, బల....

(లేక - బలిసిన=పుష్టిగా ఎదిగియున్న), హల్లక=చెంగలువల ('హల్లకం రక్తసంధ్యకమ్' అమ.) - ఛటలపైన్ = సమూహములమీఁద, తమ...ముండ్లు = కలమములయొక్క (జుంజుఱు=) చింపిఱు అయిన వాఁడికొనలు, రాయఁగాన్ = (ఇటునటు) ఒరసికొనుచుండఁగా (ఎట్లుండు ననఁగా), లోన్ = (ఒడలి) లోపల, తృష్ణతలకొనన్ = దప్పియెత్తఁగా (దప్పి తలకెక్కఁగా ననియు); వంగి=(త్రాగుటకై) ఒఱగి (బడలికచేత సోలి యనియు), మున్=పూర్వము (నీ రెడలింపనపుడు), జలముత్రావెడు క్రిందటి వ్రేళ్లు (ఉద్భిజ్జములు వ్రేళ్లతో జలము పీల్చును), మీఁదటన్ = తమశిరములయందు, నిలిపి = ఉంచుకొని (అనఁగా ఆవ్రేళ్లను తలమీఁదికి తెచ్చుకొని - వానితో) మరందము=ఆచెంగలువలలోనిమకరందమును, అనుకరణిన్ =త్రాగుచున్నవోయనునట్లు, ఉండున్.

ఆపురవరంబున పైరులకు జలసమృద్ధియు దానంజేసి పంటసమృద్ధియుఁ గలవు. వరిమడుల చుట్టును పంటకాలువలును వానియందు చెంగలువలును ఉండును. పంటకాపులు కోఁతకై మడుల నెండించుటకై వానియందలి నీటిని సేద్యగాండ్రు వెలికి పాఱించినప్పుడు ఆపైరులు ఎన్నులభారముచేత ఒఱగినవై చెంగటి యుద్యానముల గాలిచేత ఆచెంగలువలపై తమతలనుండు జుంజుఱు ముండ్లను ఇటునటు రాచుకొనుచునుండుట ఎట్లుండు ననఁగా, అవి నిరంతరము నీటనే యుండునవిగాన ఇప్పుడు నీరే లేనందున కరము దప్పిగొని ఆదప్పిచే సోలిపోయి పూర్వము క్రిందినుండి నీరు త్రాగుటకు సాధనములుగా నుండిన తమవ్రేళ్లను ఇప్పుడు నెత్తిమీఁదికి తెచ్చుకొని వానితో ఆచెంగలువలమకరందమును త్రాగుచున్నవో యనునట్లుండును. 'హల్లక' ములం జెప్పుట ఊరివెంబడి నుండిన భూమి యెల్లను ఉర్వర యని తెలుపుటకు. - ఉత్ప్రేక్షాలంకారము.

ఏతత్సదృశశ్లోకము.—

"కలమాః పాకవినమ్రాః । మూలతలాఘ్రాత సురభికల్హారాః
పవనాకమ్పిత శిరసః । ప్రాయః కుర్వన్తి పరిమళశ్లాఘామ్."

చ. అడుగునఁ బండి వ్రీలి యసలై మధువుట్టఁగఁ, ద్రావఁ దేంట్లు మ
ల్లడిఁ గొని చుట్టు రాఁ, బనసల న్వ్రేలుచు న్గలుగుండ్లతోడ నీ
డ్వడు పెనుఁబండ్లు, భిన్నకట పాంసుల భూరి మదాంబుసేచనా
జడదృఢశృంఖలాయుత వసంత నృపద్విరదాధిపాకృతిన్. 68

పనసలన్ =(వేరు) పనసచెట్లయందు, కలుగుండ్లతోడన్ = గండశిలలతో, ఈడ్వడు = సమానతపొందునట్టి - పెనుబండ్లు = పెద్దపెద్ద ఫలములు, అడుగునన్ = భూమిలోనే, పండి = పక్వములై, వ్రీలి = బద్దలై, అసలు ఐ = బురదకాఁగా, మధువు = తేనె, ఉట్టఁగన్ = కాఱుచుండఁగా (పా. ఉబ్బఁగన్), తేంట్లు = తుమ్మెదలు, త్రావన్ = త్రాగుటకు (పా. తావిన్ = పరిమళముచేత), మల్లడిగొని = పెనగొని, చుట్టున్ = అన్ని ప్రక్కలను, రాన్ = ముసురుకొనఁగా, (అప్పుడు ఎట్లు ఒప్పుచుండు ననఁగా), భిన్న...కృతిన్ - భిన్న =మదము ఓడుచున్న - కట=గండస్థలములు గలవియు ('భిన్నాః ప్రవన్మదాః కటాః గణ్డాః యేషాం తైః' రఘు. 4 స. 88. వ్యా. మల్లి), పాంసుల = దుమ్ముగలిగినవియు - భూరి=మిక్కుటమైన - మద అంబు=దానజలమును - సేచన=కార్చుచున్నవియు - అజడ=చలించుచున్న - దృఢ=గట్టిదైన - శృంఖలా = గొలుసుతో - యుత కూడుకొన్నవియు - నైన - వసంతనృప = ఆమనిదొరయొక్క - ద్విరద అధిప = ఏనుఁగు మేటియొక్క - (పట్టపు టేనుఁగుయొక్క) ఆకృతిన్ = ఆకారముతో (ఆకారముకలవై - అవియో యనునట్లు), పొలుచున్ = ఒప్పును.

ఆ పురియందు గండశిలలంతలేసి వేరుఁ బనసకాయలు భూమిలోనే పండి పగిలి అందునుండి పైకూరుతేనెచే నేల బురదయై ఇంకను తేనె ఉబుకుచుండఁగా దానిం ద్రాగుటకై తేంట్లు ఒండొకటి నారనికొనుచు చుట్టు రా ముసురుకొనఁగా ఆపండ్లు ఎట్లు ఒప్పుచుండు ననఁగా, చెక్కిళ్లనుండి మదము ఉప్పతిల్లి ధూళిధూసరములై మిక్కుటముగా మదము కార్చుచు తమ్ము కట్టిన గట్టి యినుప గొలుసులు చలించుచున్న వసంతుని మదపుటేనుఁగులో యనున ట్లుండును.— ఉత్ప్రేక్షాలంకారము. 'పెను...బండ్లు' - ఉపమ.

[ఇందు - 'పండిప్రీలి' - 'భిన్నకట', 'ఆసలై' - 'పాంసుల', 'మధువుట్టఁగ' - 'భూరిమదాంబుసేచన', 'మల్లడిగొన', - 'దృఢ', 'తేంట్లు' - 'శృంఖలా', 'చుట్టురాఁ' - 'యుత', 'పెనుబండ్లు' - 'వసంతమదద్విరదాధిప', అను వానియందలి పరస్పర సామ్యసంపదను పరికింపఁ దగును. మఱియు, మధూద్భేదముచేతనే అస లగుచుండఁగా, 'అసలై' అని వేఱుగా చెప్పుటచేత, ఏనుఁగునకు కటప్రభేదమువోలె, తొలితొలిదైన మధూద్భేదము చెప్పఁబడినది. అనంతరము ఏనుఁగునకు ఇంక నితరావయవంబులనుండియు మదము స్రవించినట్లే ('కరా త్కటాభ్యాం మేఢ్రా చ్చ నేత్రాభ్యాం చ మద స్రుతిః' - 'కరాత్ నాసారన్ధ్రాభ్యా మిత్యర్థః.' రఘు. 4 స 23. వ్యా. మల్లి.) పండునుండి ఇంకం బెక్కుతావుల మధువు ఉబుకుచుండుట 'మధువుట్టఁగ' అని చెప్పఁబడినది. 'వసంతు'నిఁ జెప్పుట ఈపండ్లు ఆఋతువుననే పండుట చేతను.]

పూర్వముద్రణమున ' మధు = తేనె, పుట్టఁగన్ = కల్గఁగా' అని వ్యాఖ్య. ఇందు పువర్ణక లోపమునకు ప్రమాణము లేదు. పయిగా, 'ఉట్టు' ధాతువు స్రవణార్థకము కలదు; కావున 'మధువు ఉట్టన్ ' అని విడఁదీయుటయే సరి. 'కలుగుండ్లు' = కల్లుగుండ్లు - క్రిందిలలోపమునకు బా. వ్యా. ప్ర. 7. 'ఈడ్వడు' = ఈడువడు = ఈడుపడు - ఇట ఉత్వలోపము 'పదాంతంబులయి యసంయుక్తంబులయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' (బా. వ్యా. ప్ర. 16) అనుచోఁ గల బహుళగ్రహణముచేత సాధ్యము. ద్విరదము—ద్వి=రెండు - రదము=రదములు అనఁగా దంతములుకలది. 'పెనుఁబండ్లు' - ఇట్టితావుల 'పెను' శబ్దము వృత్తియందు 'పెనుపు' శబ్దమున మిగిలిన రూప మని సీతారామాచార్యులవారి వివరణము.

ఉ. చాల దళంబుగాఁ బృథుల చంపక కీలనఁ బొల్చు బొందుఁ దో
మాలె లనంగఁ బండి మహిమండలిఁ జీఱుచు వ్రాలి గంధ మూ
ర్చాలస మైన భృంగతతి నాఁ దుద క ప్పమర న్ఫలావళు
ల్వ్రీలి గెల ల్సుగంధికదళీ వన పంక్తుల నొప్పు నప్పురిన్. 69

అప్పురిన్=శ్రీవిల్లుబుత్తూరియందు, సుగంధికదళీ వన పంక్తులన్=సుగంధు లనుపేరి యరఁటుల తోఁటల వరుసలలో, చాలన్ = మిక్కిలి, దళంబుగాన్ = దట్టముగా, పృ......నన్ - పృథుల=పెద్ద - చంపక=సంపెంగపువ్వుల - కీలనన్=కూర్పుచేత, పొ......లు - పొల్చు=ఒప్పుచున్న - బొందు = లావుపాటి - తోమాలెలు = కట్టుమాలెలు (ఆకులఁ పువ్వులు కూర్చి కట్టిన మాలెలు), అనంగన్=అనునట్లుగా, గెలల్=గొలలు, పండి=పరిపక్వములై, ఫల ఆవళుల్=పండ్ల పంక్తులు, ప్రీలన్=విరియఁగా, మహిమండలిన్=భూతలమును - చీఱుచున్=రాచికొను చున్నట్టినై, తుద కప్పు = పండ్లచివరనుండు నలుపు, వ్రాలి = చంపకముల మీఁదఁబడి, మూర్ఛా అలస=సొమ్మచేత వికళము వివ(ట్టి)...తతి = తుమ్మెదపిండు, నాన్ = అనునట్లు. అమరన్ = ఒప్పుచుండఁగా, ఒప్పున్ = శోభి...87, 818.

ఆపురమందు సుగంధియరఁటితోఁటలలో గెలలు వృక్షాగ్రమునుండి నేలవఱకును నిడుపులై నేలను పొడిచికొనుచుండును, పండ్లు పాకమహిమచే విరిసియుండును; అట్టి యాగెలలు మిక్కిలి యెత్తుగా పెదపెద్ద సంపెంగపూవులతోఁ గట్టిన లావుపాటి తోమాలెలవలె నుండును. పండ్లతుద నుండు తెలుపు చంపకముపై వ్రాలి మూర్ఛిల్లిన తేఁటిగుంపువలె నుండును.— గెలలకును తోమాలెలకును స్థౌల్యదైర్ఘ్యవర్ణపరిమళములును ఆఁదోకపాటును సామ్యము. చంపకము తేంట్లకు ప్రాణహరమనుటకు పారిజాతాపహరణము 3. ఆ. 57.

చ. 'తనుఁ గనుఁ బ్రామి యొండొక లతం బతి వే ఱొక తేఁటిబోటి పా
త్తున విరిదేనె గ్రోలఁగ నెదుర్పడి సంపఁగతావి వెల్లిలోఁ
గనలునఁ గూలఁ బోవునళికామిని సాహస మేమి చెప్పు! న
య్యనుఁగుఁ బ్రియుండు నెచ్చెలులు నాఁగిన మూన దరాళకుంతలా.'

సంపెంగపై తుమ్మెదలు వ్రాల వని 'నానాసూనవితానవాసనల' నిత్యాది కవనములచే స్పష్టము. కావున విట తెలియక వ్రాలి సొమ్మసిల్లి పడియున్నట్టివని గ్రహింపవలయును. ఉత్ప్రేక్షా ద్వయము. – 'నాన్' అనుచో స్వరమునకు ప్లుతయతి. 'మూర్ఛాలసము' అను పాఠంబున మహాశిఖరస్త్రీలింగవిశేషణమగుటచే సాధువే.

చ. మన కనురక్తి హెచ్చ నిదె మం దని కంఠముఁ గౌఁగిలించి ని
క్కినఫణిరాజవల్లి యెఱిఁగింపఁగ నో యనఁ బూగము ల్భరం
బునఁ బడు మట్టచేఁ జెఱకు ముత్తియము ల్చిటిలించి తద్రసం
బనిశము వండు నంతికతలాంతికఁ జూర్ణముఁ జేయు నప్పురిన్. 70

పూగముల్ = పోఁకమ్రాఁకులు ('పూగః క్రముక బృన్దయోః' అమ.), కంఠమున్ = తమకంఠమును, కౌఁగిలించి = ఆలింగించి, నిక్కిన = (ఎగఁబ్రాఁకి) నిగిడినట్టి – ఫణిరాజవల్లి = తమలతీఁగ ('తామ్బూలవల్లీ తామ్బూలీ నాగవల్ల్యపి' అమ.), మనకున్ = నీకును నాకును (తమలతీఁగ పోఁకతో చెప్పుట), అనురక్తి = ప్రేమ (ఎఱుపు), హెచ్చన్ = అతిశయించుటకు, ఇదె = ఈ చెఱకు ముత్తెపు సున్నమే, మందు, అని ఎఱిఁగింపఁగనో – అనన్ = అనునట్లుగా, భరంబునన్ = బరువుచేత, పడు = రాలిన – మట్టచేన్, చెఱకు ముత్తియముల్ = చెఱకు గడలలో జనించునట్టి ముత్తెములను, చిటిలించి = రాల్చి, తత్ రసంబు = చెఱకుగడలపాలను, అనిశము = నిరంతరము, వం...కన్ – వండు = బెల్లముగా పాకము చేయునట్టి – అంతికతల = చెంగటిస్థలమందలి – అంతికన్ = ప్రొయ్యిలో ('అశ్మన్త ముద్ధాన మధిశ్రయణీ చుల్లిరన్తికా' అమ.) చూర్ణము = సున్నము (చూర్ణౌ ధూళీ క్షార భేదే చూర్ణాని వాసయుక్తిషు' మేది.), చేయున్.

ఆ పురమందు చెఱకుఁ దోఁటలలోనే పోఁకమ్రాఁకులును తమల తీఁగలును పెరుఁగుచుండును, తమల తీఁగలు పోఁకమ్రాఁకులమీఁద కొన వఱకుం బ్రాఁకి నిగిడి యుండును. పోఁకమట్టలు ముఁగిరి బరువెక్కి చెట్టునుండి సడలి క్రింది చెఱకుగడలమీఁద పడును. ఆపాటుచే గడలు విఱిగి అందలి ముత్తెములు చెదరి ఆసమీపముననే చెఱకుపాలను బెల్లము కాఁచుచుండెడు ప్రొయ్యిలో పడి సున్నమగుచుండును. పోఁకచెక్కలును తమలపాకులును [illegible] కలిసి యెఱుపుం బొందుట తెల్లము. – ఈవృత్తమెల్ల నెట్లు ఒప్పుచున్న దనఁగా. నాయిక) పోఁక (నాయకుని)

మెడ కవుంగిలించుకొని దానితో 'క్రింద నున్న యీచెలువలలోని ముత్తెముల సున్నమే సుమా మనకు ప్రేమను (ఎఱుపును) పెంచుటకు మందు' అని హెచ్చరించినట్లును ఆహెచ్చరిక చేతనే పోఁక క్రిందికి బరువైన మట్టలను రాల్చి చెలువగడలను విఱిచి వానిలోని ముత్తెములను చెంగటి తెల్లపుఁ బ్రొయ్యిలోనికి చెదిరించి సున్నము చేయుచున్నట్లును, ఒప్పుచున్నది. మూలికా విశేషాది చూర్ణాదులను తాంబూలములో సున్నములోనగు వానియందు కలిపి ఇడి వశీకరించుట లోకములోఁ గలదు గాన నిట కవి సున్నమును అట్టిమందుగా నూహించినాఁడు. - హేతూత్ప్రేక్ష. తమలతీఁగయందును, పోఁకమ్రాఁకునందును అనురక్తి శబ్దగతశ్లేషచేతను ఇతరవిధములచేతను, నాయికానాయక వృత్తస్ఫురణ సమాసోక్త్యలంకారము, అది ఉత్ప్రేక్షకు అంగము.

'రాజ' అనుటచే తమలతీఁగ రాజకుమారి యగునాయికగాను, దానింబట్టి పూగములు రాజకుమారులగు నాయకులుగాను స్ఫురణ కలదు.

చెఱకునందును ముత్తెములు పుట్టు ననుటకు రత్నశాస్త్రమునుండి ప్రమాణము:—

'జలధర ఫణిఫణ కీచక । జలచర కరిమస్తకేక్షు శంఖ వరాహో

జ్జ్వల దంష్ట్రా శుక్తి భవం । బులు ముత్తెము లొప్పు వర్ణముల వివిధములై.'

'గజకుమ్భేషు వంశేషు ఫణాసు జలదేషుచ । శుక్తికాయా మిక్షుదణ్డే షోఢా మౌక్తిక సంభవః...ఇక్షుదణ్డే పీతవర్ణాః మణయో మౌక్తికాః స్మృతాః॥' సర్వజ్ఞ సోమేశ్వరుఁడు. *

చ. అలరుఁ బురంబునం దొగల నంతరదామరఁ బ్రాఁచిఁ గప్రపుం
వలపులు మీఱ, లో వలుద వాలుగమొత్తము పోర, నీరుకో
ళ్లోర్కుల కొల మంచుఁ గ్రుంకుమెడ గుంపుల వంపులు దోఁప, మావితోఁ
పుల విరుల న్బయి న్నడువఁ బొల్చు పురాతనతీర్థకుండముల్. 71

పురంబునన్ = ఆపట్టణమందు, మావితోఁపులన్ = మామిడితోఁటలయందు, తొగలన్ = కలువలచేతను, అంతరదామరన్ = అంతరదామరచేతను (అంతరదామరయనునది వేరు నేలకు తగులక నీటిమీఁదనే మొలచి నీటిమీఁదనే తేలుచుండునట్టి యాకుమొలక), ప్రాఁచిన్ = ప్రాచి చేతను, కప్రపు న్వలపులు = కర్పూరపు వాసనలు, మీఱన్ = వ్యాపించుచుండఁగా లోన్ = అడుగున, వలుదవాలుగమొత్తము = పెద్ద వాలుగచేఁపలగుంపు, పోరన్ = జగడమాడుచుండగా, నీరుకోళ్లు, కొలకొలమంచున్ = కొలకొలయని కూయుచు, క్రుంకు మెడగుంపుల వంపులు = మునుంగునప్పుడు ఒడలెల్లమునింగి మెడమాత్రము మునుంగకముందు అవంపుమెడలు మాత్రము, తోఁపన్ = (వినోదకరముగా) కంటికి అగపడుచుండఁగా, విరులన్ = పూవులచేత, పయిన్ = నీటిమీఁద, నడువన్ పొలుచు = నడుచుటకు వలనయినట్టి - పురాతనతీర్థకుండముల్ = ప్రాఁత నీటిగుంటలు, అలరున్ = చెన్నారుచుండును.

ఆపట్టణములో మామిడితోఁపులలో నీటిగుంటలు ప్రాఁతవి గలవు; అందుండి కలువల చేతను అంతరదామరచేతను ప్రాఁచిచేతను కర్పూరపు వాసన పర్వుచుండును; లోఁతు నీ రుండుట చేత నీటిలోపల పెద్దపెద్ద వాలుగచేఁపలు పోరుచుండును; పైని నీరుకోళ్లు కొలకొల మనుచు సంచరించుచు మెడలు వంచి నీళ్లలో మునుంగుచుండును; అట్లు మునుంగునప్పుడు వాని అవంపు

* చూ. పుటలు 99, 187, 318, 361, 429, వ్యాఖ్య.

పెడలుమాత్రము కంటికి అగపడి చూపఱకు వినోద మొసంగును. మామిడిపువ్వులు నీళ్లపై ఎంత దట్టముగా రాలియుండు ననఁగా ధారాళముగా వానిపైని నడచిపోఁదగినంతదట్టముగా రాలియుండును.—స్వభావోక్తి.

'కప్రపున్వలపులు' - ఇది 'గరువపు న్మరువు' వంటిది;—పుగాగముపై నుగాగమము పరుష సరళములకుముందే విహితముగాని స్థిరములకుముందు విహితముగాదు; అయినను ఇట స్థిరమునకు ముందు ప్రయోగింపఁబడినది.- 'నీరుకోళ్లక్కొలకొల'—'కోళ్లు' అనుటకు 'కోళ్' అని ప్రయోగము - ఇటను ఉత్వలోపము బహుళగ్రహణముచేత సాధ్యము, దాన 'నీరు కోళ్' అగును, అనంతరము శ్రవణాభేదముకతమున అకించిత్కర మగుటచేత నేని బహుళగ్రహణముచేతనయేని లకారము త్యక్తము. 'కొలకొలమంచు' - సంధిలో ఈమకారాగమము శిష్టసమ్మతము.

శా. సాయంకాలములం దదీశ మురజి త్సద్మస్వనద్దుందుభి
స్ఫాయత్కాహళికాప్రతిస్వనత దోఁప న్కుంజగర్భంబుల
న్మ్రోయుం గేళివనిం గులాయ గమన ప్రోత్తిష్ఠ దన్తస్సర
స్థాయి శ్వేతగరు ద్గరుత్పటపటాత్కారంబుఁ గ్రేంకారముల్. 72

(ఆపురమందు), సాయంకాలములన్ = కడసంజసమయములయందు, కేళివనిన్ = క్రీడావనమందు, కులా...బు - కులాయ=గూండ్లకు ('కులాయో నీడ మస్త్రియామ్' అమ.) - గమన= పోవుటకు - ప్రోత్తిష్ఠత్ = లేచుచున్న - అంతః సరః = కొలనియందు - స్థాయి = ఉండునట్టి - శ్వేతగరుత్ = హంసలయొక్క ('హంసాః స్యుః శ్వేతగరుతః' అమ.) - గరుత్ = ఱెక్కలయొక్క ('గరు త్పత్క్ష చ్ఛదాః పత్త్రం పతత్త్రం చ తనూరుహమ్' అమ.),-పటపటాత్కారంబు= పటపట మను ఱెక్కధ్వనియు, క్రేంకారముల్ = 'క్రేమ్ క్రేమ్' అనెడు కంఠధ్వనియు, కుంజ గర్భంబులన్-కుంజ=పొదరిండ్లయొక్క ('నికుఞ్జ కుఞ్జౌవా క్లీబే లతాది పిహితోదరే' అమ.) - గర్భంబులన్ = లోపలి ప్రదేశములందు, తదీ...త - తత్ = ఆపట్టణముయొక్క - ఈశ = ఒడయఁడైన - మురజిత్ =(మన్నారుకృష్ణ నాయక) హరియొక్క (మురాసురుని జయించినవాఁడని వ్యు.) - సద్మ=నివాసమునందు (కోవెలయం దనుట) - స్వనత్ =మ్రోయుచున్న-దుందుభే= భేరియొక్కయు (భేరీధ్వనియొక్క యనుట - 'భేరీ స్త్రీదున్దుభిః పుమాన్' అమ.) - స్ఫాయత్ = ఏచుచున్న ('స్ఫాయీ ఓప్యాయీవృద్ధౌ' ధా. పా.)-కాహళికా= కాళెలయొక్క (కాహళ ధ్వనులయొక్క యనుట) - ప్రతిస్వనత = ప్రతిధ్వనిత్వము, తోఁపన్ = (మనున్పన) స్ఫురించు నట్లుగా (ప్రతిధ్వని యనునట్లుగా ననుట), మ్రోయున్ = ధ్వనించును.

సాయంకాలములయందు ఆపట్టణములో దాని యొడయఁడైన మన్నారుకృష్ణస్వామి యొక్క దేవళములో భేరి వాయింతురు, కాళెల నూఁదుదురు. క్రీడావనమందలి కాసారముల నుండి హంసలు తరలి ఱెక్కలతో పటపట ధ్వని సేయుచు క్రేంక్రేమని కూయుచు తముగూండ్లకేఁగును. ఈపటపటాత్కారక్రేంకారములు ఆక్రీడావనమందలి పొదరిండ్లయందు ప్రతిధ్వనిం బొందును. శ్రోతలు ఈప్రతిధ్వనులను కోవెలలో మ్రోయుచున్న భేరీకాహళల ప్రతిధ్వను లని భ్రమింతురు. 'స్ఫాయత్' - ఇది ఆత్మనేపది యైనను ఇట పరస్మైపదిగా ప్రయోగింపఁబడినది; - "స్ఫాయన్నిర్మోక సన్ధీ'తి గణకృతానిత్యత్వాత్." కవికల్పద్రుమవ్యాఖ్య.

'కాహళం భృశ శుష్కయోః । వాద్య భాణ్డ విశేషేతు కాహళః కాహళా ఖళే॥' విశ్వ. 'గాయస్త్రీభిః కాహళం కాహళాభిః' మాఘ 18 (54). 'కాహళికా' - సీతారామాచార్యుల వారు కాహళా శబ్దమును స్త్రీలింగముగా పఠించి ఆంధ్రకావ్యములందు తఱుచుగా పుల్లింగముగా కనఁబడుచున్న దని వ్రాసినారు.

ఉత్ప్రేక్షా భ్రాంతిమంతములకు సందేహసంకరము.

మ. పాలయుం గాడ్పు లుదఙ్మహాలయవదంభోజాక్షవక్షస్స్థల
స్యలఘుస్రఙ్మకరందబిందువులఁ బణ్యారంపుఁ బుణ్యంపుఁ గం
పులఁ దాపత్రయి మీటి వీటన్నటన ప్రోద్యోగసజ్జీభవ
ల్లలనావర్జిత కైశిక స్ఫురిత కహ్లారాళి నల్లార్చుచున్. 73

వీటన్ = ఆపురియందు, గాడ్పులు = తెమ్మెరలు, నట...ళిన్ - నటన = నాట్యమనెడి - ప్రోద్యోగ = ఉత్కృష్టవ్యాపారమునకు - సజ్జీభవత్ = ఆయితపడుచున్న - లలనా = నాగవాసముల చేత - ఆవర్జిత = ఒరగింపఁబడిన (ఒక ప్రక్కకు ఒరగునట్టు ముడుఁచుకొనఁబడిన) కైశిక = కొప్పుల నుండి - స్ఫురిత = జాఱిన - కహ్లార ఆళిన్ = చెంగలువ మొత్తమును, అల్లార్చుచున్ = ఆడించుచు; ఉద...లన్ - ఉదక్ మహత్ ఆలయ వత్ = ఉత్తరపు గొప్పకోవెల గలవాఁడయిన (ఇది 'వడ పెరుం గోవి లుడైయాన్' అను నఱవ వ్యవహారమునకు సంస్కృతము) - అంభోజాక్ష = హరి యొక్క - వక్షః = హృదయమునందలి - తులసీ = తులసియొక్క - అలఘు = గొప్పవైన - స్రక్ = మాలి కలయొక్క - మకరంద = తేనెయొక్క - బిందువులన్ = బొట్లచేతను, పణ్యారంపుఁ బుణ్యంపుఁ గంపులన్ = (నైవేద్యము చేయఁబడిన) పిండివంటలయొక్క పావనమైన పరిమళముల చేతను, తాపత్రయిన్ - (ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనెడి) మూఁడువిధము లయిన దుఃఖమును; మీటి = పోఁగొట్టి, పాలయున్ = వీచును.

ఆపురమందు తెమ్మెరలు వడపెరుంగోవి లుడైయాన్ అను ద్రవిడనామముగల మన్నారు కృష్ణస్వామియొక్క వక్షస్తులసీమాలా మకరంద బిందువులచేత నైన శైత్యముచేతను, ఆ స్వామికి నివేదించిన పిండివంటల పరిమళముచేతను, స్వామిమ్రోల నాట్యార్థమై యలంకరించుకొనుచున్న దేవదాసీజనము డాపలి కొరుగంగ ముడిచికొన్న కొప్పున వెలికి నిగిడియున్న చెంగలువల నూఁపుటచేఁ గలిగిన మాంద్యముచేతను జనులయొక్క దుఃఖత్రయమును పోనడుచుచు వీచును.—తెమ్మెరయందు శైత్య మాంద్య సౌరభములను వర్ణించుట కవి సంప్రదాయము. ఇట ఆమూఁడు గుణముల చేతను ఆమూఁడు దుఃఖములను పోనడుచు నని హృదయము.—స్వభావోక్త్యలంకారము.

'స్రక్' - 'మాల్యం మాలాస్రజౌ మూర్ధ్ని' అమ. 'మూర్ధ్ని' యనుట ప్రాయోవాదము.—'కంపు' శబ్దము భారతమందు గంధమాత్రపరముగాఁ బ్రయుక్తము; 'చనదిటు లంటకింపెలుఁగఁ జాలదు నానిక' భార. అశ్వ. ౨ ఆ. ౩౦. చూ. శబ్దరత్నా. 'పొగడ పూవంటికంపుల మదాంబువులును' అని మను ౪(౯౭). 'తాపత్రయి' - ఆధ్యాత్మిక దుఃఖము తన మనస్సు వలననే తనకుం గలుగునది, ఆధిభౌతిక దుఃఖము పంచభూతముల వలనఁ గలుగునది, ఆధిదైవిక దుఃఖము దైవమువలనఁ గలుగునట్టిది. - వేశ్యలకొప్పుల చెంగలువల నూఁపుటచేత గాలి పాపము నడుచు ననఁగా దేవుని మ్రోల నటనార్థమైన సజ్జనములోని కొప్పుకలువలు గావున పోనడుచును.

చ. మలయపుగాలి రేలు వనమాలి విమానపతాక ఘల్లుమం
చులియఁ, బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప, నుల్కి మి
న్నలము తదీయ హేమ వరణాంచలచంపకశాఖలందుఁ బ
క్షులు రొద సేయ, వేగె నని కూడుదు రల్కలు తీఱి దంపతుల్. 74

(ఆపురమందు), రేలు = రాత్రులందు, మలయపుగాలి = మలయమారుతము (మలయములు నాలుగు కలవు), వన...కన్ - వనమాలి = మన్నారు కృష్ణునియొక్క ('వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః' అమ.) - విమాన = ఆలయమునందలి ('విమానోఽస్త్రీ దేవయానే సప్త భూమిక సద్మని' నానా. ఇట లక్షణచే సద్మమాత్రము.) - పతాకన్ = ధ్వజస్తంభమందు, పసిండి మువ్వగమిన్ = బంగారపుఁ జిఱుగంటల గుంపును (మూఁడువాలుగలది మువ్వ), ఘల్లుమంచున్ ఉలియన్ = ఘల్లుమని శబ్దించునట్లుగా, ఒక్కొక్కమాటు = అప్పుడప్పుడు, కదల్పన్ = కదలింపఁగా, మిన్ను = ఆకాశమును, అల...దున్ - అలము = ఆక్రమించుచున్న - తదీయ = ఆదేవళముదైన - వరణ = ప్రాకారముయొక్క ('ప్రాకారో వరణః సాలః' అమ.) - అంచల = కొనల యందలి - చంపక = సంపెంగచెట్లయొక్క - శాఖలందున్ = కొమ్మలందు, పక్షులు, ఉల్కి = అయులికిపడి భయపడి, రొదసేయన్ = గొల్లుగా కూయఁగా, దంపతులు = భార్యాభర్తలు, వేగెన్ అని = తెల్లవాఱె నని భ్రమపడి, అల్కలు తీఱి = ప్రణయకోపములు నివర్తించి, కూడుదురు = కలియుదురు.

ఆపురమందు రాత్రులలో మలయమారుతము మన్నారుకృష్ణుని యాలయమునందలి ధ్వజస్తంభముయొక్క చిఱుగంటలను అప్పుడప్పుడు కదలించి శబ్దింపఁ జేయఁగా, ఆశబ్దమునకు ఆకోవెలయొక్క ప్రాకారపు టంచులమీఁది సంపెంగచెట్ల కొమ్మలలో నిద్రించుచున్న పక్షులు భయపడి మేల్కొని రొదసేయఁగా, ఆరొదను వేకువను పక్షులు సేయురొదనుగా తలంచి వేగె నని భ్రమపడి, దంపతులు అలుకలు మాని కూడుదురు. - అన్యకాలపురొదను వేకువరొదనుగా తలంచుట భ్రాంతిమదలంకారము. చిరకాలము ప్రణయకోపమును నిర్వహింపలేక వేగలేదని యెఱింగియు వేగె నని మృష పల్కి కూడుదు రనియేని చెప్పవచ్చు. ఆపక్షమున అలంకారము ఛేకాపహ్నుతి విశేష మగును.

చ. కలమపుబెండుగుల్ ద్రవిడకన్యలు ముంగిటఁ గాచుచుండి,త
జ్జలరుహనాభగేహ రురుశాబము సారెకు బొక్కులాడఁ, గొం
డెలపయి కష్ట గ్రామ్యతరుణీతతి డించిన పేఁపగంపలం
దల మగుచున్న చెంగలువ దండలఁ దోలుదు రప్పురంబునన్. 75

అప్పురంబునన్ = ఆపట్టణమునందు, ద్రవిడ కన్యలు = ద్రావిడ బాలికలు, ముంగిటన్ = ఇంటిలోని ముందరి చిన్నబయటిలో, కలమపుబెండుగల్ = ఎండఁ బోసిన సన్నవరిని, కాచుచున్నవారై, తజ్జ...ము - తత్ = అందలి - జలరుహనాభ = విష్ణుదేవునియొక్క ('పద్మనాభో మధురిపు ర్వాసుదేవ స్త్రివిక్రమః' అమ. జలరుహము అనఁగా పద్మము నాభియందు కలవాఁడు అని వ్యు.) గేహ = ఆలయముయొక్క - రురుశాబము = దుప్పిపిల్ల ('పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః శిశుః' అమ.), సారెకున్ = మాటిమాటికి, బొక్కులాడన్ = (ఆవరిని) బొక్కుచుండఁగా,

కొండెల పయికిన్ = మూని సిగలమీఁద కట్టుకొనుటకై, అమ్మన్ = విక్రయించుటకు, గ్రామ్యతరుణీతతి = పల్లెటూళ్లయువిదల గుంపు, డించిన = ఆముంగిట దింపుకొన్న - పేఁప గంపలన్ = బెత్తపుఁదట్టలయందు, దలము అగుచున్ = మెండుగానున్నట్టి - చెంగలువ దండలన్ = ఎఱ్ఱగలువ సరముల తోనే, తోలుదురు.

ఆపురమందు ఇండ్లముంగిళ్లలో ఎండఁబోసిన ధాన్యమును కాచుచున్న కన్నెలు వెన్నునిదేవళపు దుప్పిపిల్ల మాటిమాటికి ఆధాన్యమును బొక్కుచుండఁగా, దానిని దేనితో తోలుదురనఁగా, తమకు కొండెలమీఁదఁ దాల్చుటకుగాను అమ్ముటకొఱకు పల్లెటూళ్ల చేడెలు ముంగిళ్లందింపుకొని యున్న పేఁపగంపనిండ నున్నట్టి చెంగలువదండలతోఁ దోలుదురు. — తమకొండెలమీఁదికి లేకపోయినం బోవుఁ గాక, మఱి దేనితోఁ గొట్టినను ఆదుప్పిపిల్లకు నొప్పి తగులునను భయముచే ఆదండలతోనే తోలుదురు. కృష్ణస్వామిగుడి దుప్పిపిల్ల గావున దానిపై ఆపనిబాలికలకు సయితము అట్టి వాత్సల్య మని భా. - స్వభావోక్తి.

'కలమపు బెండుగుల్' అనఁగా 'ఎండఁ బోసిన సన్నవరి' అని సీతారామాచార్యులవారి వ్యాఖ్య. పూర్వముద్రణ వ్యాఖ్యానమున 'కలమపు బెండుగలు' అని పాఠమును 'రాజనపు వడ్లుపోసిన యెండుగలను' అని యర్థమును కలవు. ఇయ్యర్థంబున ఎండుగ ననఁగా 'ఎండుపుఁదట్టలు' అను నభిప్రాయముగాఁ గానిపించుచున్నది. కాని ఎండుగ అను శబ్దమేలేదు. కావున శుష్కధాన్య వాచక మయిన 'యెండుగు' శబ్దము తోడిది బ్రౌను సీతారామాచార్యపఠిత పాఠమే స్వీకరింపఁ బడినది.

—* భాగవతులు *—

సీ. ఎదు రేఁగి సాష్టాంగ మెరఁగి పాద్యం బిచ్చి,
నారికేళకటాసనముల నునిచి,
నునుఁ బోఁకపాత్రిఁ గుట్టిన దొప్పగమితోడ
రంభావిశాలపర్ణములు వఱచి,
శాల్యన్న సూ పాజ్యకుల్యా బహువ్యంజ
న క్షీరదధు లర్పణంబు చేసి,
వార్చినపిదప సంవాహన మంఘ్రుల
కొనరిచి, తాంబూల మొసఁగి, కుశల
తే. మడిగి, పోయెద మన్న ద వ్వనిచి, సిరికిఁ
దగినసత్కృతి చేసి, ఖేదమున మగిడి
యర్చ గావింతు రెపుడు ని ట్లతిథు లైన
భాగవతులకు నప్పురి భాగవతులు. 76

అప్పురిన్ = ఆపట్టణమందు, భాగవతులు = భగవంతునియందు భక్తులగువారు, అతిథులు = ఆగంతుకులు ('స్యు రావేశిక ఆగన్తు స్త్వతిథిర్నా గృహాగతే' అమ.) - ఐన - భాగవతులకున్ = భగవద్భక్తులకు,

1. ఎదురేఁగి, సాష్టాంగము = ఎనిమిది యవయవములతోఁ గూడుకొన్నట్లుగా - ఎఱఁగి = నమస్కరించి (సాష్టాంగ దండప్రణామంబు గావించి యనుట - సాష్టాంగ నమస్కార స్వరూపము.—

'కరయుగమును చరణంబులు, నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కినఁ, బరువడి సాష్టాంగ మండ్రు పరమమునీంద్రుల్.'),

పాద్యంబు=పాద (ప్రక్షాళనార్థమైన) జలమును, ఇచ్చి, నా...లన్ - నారికేళ = టెంకాయ యాకుల (పుల్లింగమందు టెంకాయచెట్టును, నపుంసకలింగమందు దానికాయ - ఆకు - పుష్పమును అర్థములు.—'ద్విహీనం ప్రసవే సర్వమ్' అమ.) - కట = చాఁప లనెడి ('కటకిలిఞ్జకా' అమ.) - ఆసనములన్ = కూర్చుండుసాధనములమీఁద, ఉనిచి=కూర్చుండఁ బెట్టి,

2. నును... త్రిన్ - నును=నున్నని - పోఁక పాత్రిన్ =పోఁకమట్టయొక్క కప్పడముతో - కట్టిన - దొప్ప = దొన్నెలయొక్క - గమితోడన్ = సమూహముతో (నున్నని పోఁక పాత్రి దొన్నెలు సమృద్ధిగా పెట్టి), రం...లు - రంభా = అరఁటులయొక్క - విశాల = వెడలుపయిన, పర్ణములు = ఆకులు (పెద్దయరఁటాకులు అనుట), పఱచి = వైచి;

3. శాల్య...లు - శాలి అన్న = రాజనపువరియన్నము ('శాలయః కలమాద్యాశ్చ షష్టికాద్యాశ్చ' అమ.) - సూప = ప్రప్పు - ఆజ్య కుల్యా = నేతికాలువలు - బహు = పెక్కు - వ్యంజన = కూరలు - క్షీర = పాలు - దధులు = పెరుఁగు (ద్వంద్వాంతబహువచనము), అర్పణంబు చేసి = వడ్డించి;

4. వార్చినపిదప్ = ఆచమించిన పిమ్మట (భోజనానంతరము హస్తపాదప్రక్షాళనము చేసికొని శుద్ధాచమనము చేసిన యనంతర మనుట), అంఘ్రులకున్ = పాదములకు ('పదఙ్ఘ్రి శ్చరణోఽస్త్రియామ్' అమ.) - సంవాహనము ఒనరిచి=ఒత్తుటను కావించి (పాదము లొత్తియనుట- 'స్యాన్మర్దనం సంవాహనమ్' అమ. - 'సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ' శాకుం. - 'సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానామ్' మేఘ.), తాంబూలము, ఒసఁగి = ఇచ్చి,

... (ఆయతిథులే) పోయెదమన్నన్ (గృహస్థులు పొమ్మన రనుట), దవ్వు = దూరము, అనిచి = సాగనంపి (కూడఁబోయి), సిరికిన్ తగిన = తమ యైశ్వర్యము కొలఁది-సత్కృతిచేసి= సంభావన యిచ్చి, ఖేదమునన్=అట్టి దొడ్డ యతిథుల నెడఁబాసిన దుఃఖముతో, మగిడి = వెనుకకు మరలి, ఇట్లు = ఈచెప్పిన విధమున, ఎపుడున్=ప్రతిదినమును, అర్చ = పూజను, కావింతురు = చేయుదురు.—భాగవత స్వభావోక్తి. 'ఆజ్యకుల్యా' - అతిశయోక్తి.

'నారికేళకట' - ఇతరములు అంతపవిత్రములును అంత సులభములును అంత సుఖములును గావు; 'పోఁకపాత్రి' దొన్నెలు అరఁటి దొన్నెలకన్న గట్టిగాను నాణెముగాను ఉండును; 'విశాల' - పెక్కుపదార్థములు వడ్డించుటకు తావు చాలుటకు. 'శాల్యన్న' - మే లని వరిం జెప్పుట - జొన్న గిన్నగా దనుట; 'కుల్యా' - సమృద్ధి సూచితము. 'అర్చ' - 'ఎదు రేఁగి' మొదలు 'మగిడి' వఱకుం జెప్పిన దెల్ల అర్చ. 'అతిథి' - 'అతతి సతతం గచ్ఛతీ త్యతిథిః - అత సాతత్య గమనే - ఎప్పుడు తిరుగువాఁడు.' లింగా. అస్థితి (స్థితిలేనివాఁడు - అనఁగా ఒకచోట నిలుకడలేనివాఁడు) అతిథియని మనుస్మృతి.

—* విష్ణుచిత్తుఁడు *—

శా. అందుండుం ద్వయసద్మపద్మవదనుం డద్వంద్వుఁ డశ్రాంతయో
గాందూబద్ధమధుద్విషద్ద్విరదుఁ డన్వర్థాభిధానుం డురు
చ్ఛందోబృందతదంతవాగపఠనా సంజాతతజ్జన్యని
ష్పందద్వైతసుసంవిదాలయుఁడు నిష్ఠ న్విష్ణుచిత్తుం డనన్. 77

అందున్=ఆపురమునందు, ద్వయసద్మ=ద్వయ (మనెడు శ్రీవైష్ణవ మంత్ర) మునకు గృహమైనవాఁడు ('గృహం గేహో దవసిత వేశ్మ సద్మ నికేతనమ్' అమ.), పద్మవదనుండు = కమలము వంటి ముఖము గలవాఁడు (పుణ్యపురుషుఁడు గావున ముఖమందు అట్టి వర్చస్సు కలదు.), అద్వంద్వుఁడు=శీతోష్ణములు సుఖదుఃఖములు లోనగు జంటలు లేనివాఁడు, అశ్రాం...డు - అశ్రాంత= ఎడతెగని - యోగ = ధ్యాన మనెడి ('యోగ స్సన్నహనోపాయ ధ్యాన సంగతి యుక్తిషు' అమ.) - అందూ = గొలుసుచేత ['అన్దూస్తు శృఙ్ఖలాయాం స్త్రీ' వైజ. 'గజమన్దూరివ నిశ్చలం చకార' మాఘ. 20 (51)] - బద్ధ=కట్టఁబడిన - మధుద్విషత్=విష్ణుదేవుఁ డనెడి ('పద్మనాభో మధురిపుః' అమ.) - ద్విరదుఁడు = ఏనుఁగు గలవాఁడు (ఏనుఁగును తబేలాలో బారీతో కట్టివైచినట్లు విష్ణుదేవుని తనహృదయములో ధ్యానముచేత కట్టివైచినవాఁడు - నిరంతరము విష్ణువును సంప్రజ్ఞాత సమాధిచేత సాక్షాత్కరించుకొనుచుండువాఁ డనుట. — రూపకాలంకారము,) ఉరు...డు - ఉరు=గొప్పవైన - ఛందః=వేదములయొక్క ('ఛన్దాంసి త్రిష్టుభాదీని శ్రుతీచ్ఛానుసయా అపి' నానా.) - బృంద = సమూహమును - తత్ = ఆవేదములయొక్క - అంత = కడపటి భాగము లయిన యుపనిషత్తులయొక్క - వాక్=వాక్యములయొక్క - అపఠనా=చదువుట కన్న వేఱయిన కారణముచేత (చదువకయె జన్మాంతర పుణ్యముచేత ననుట -

'తత్సాదృశ్య మభావ శ్చ తదన్యత్వం తదల్పతా
అప్రశస్తి ర్విరోధ శ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః.') -

సంజాత = కలిగినట్టిదియు - తత్ = ఆవేద వేదాంతములవలన - జన్య = కలుగ వలసినదియునైన - నిష్పంద=స్థిరమైన - ద్వైత=జీవేశ్వర భేదముయొక్క - సుసంవిత్=మంచి జ్ఞానమునకు ('స్త్రీ సంవిజ్జ్ఞాన సంభాషా క్రియాకారాజి నామసు' అమ.) - ఆలయుఁడు = ఇల్లయినవాఁడు, విష్ణుచిత్తుండు అనన్ = విష్ణుచిత్తుఁ డని, అన్వర్థ నాముండు = (విష్ణుదేవుఁడు చిత్తమందుఁ గలవాఁడు అని), సార్థకనామధేయుఁడు, నిష్ఠన్ = సదాచార నివృత్తితో ('నిష్ఠా నిష్పత్తినాశాన్తాః' అమ.), ఉండున్ = నివసించుచుండెను.

ఆపట్టణమందు పూర్వోక్త భాగవతులలో నుత్తమోత్తముఁడు నిరంతరము ద్వయానుసంధానపరుఁడు ప్రకృష్టమయిన ముఖవర్చస్సు కలవాఁడు శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములను దాఁటినవాఁడు సదా ధ్యానయోగముచేత శ్రీహరిని హృదయమందు సాక్షాత్కరించుకొని యుండువాఁడు అనంతము లయిన వేద వేదాంతములు చదువకయె పూర్వపుణ్య విశేషంబున తల్లభ్యమయిన జీవేశ్వర భేదజ్ఞానము కలవాఁడు, విష్ణుచిత్తుం డని నైష్ఠికుఁడు వసించుచుండెను.

వ. అమ్మహీసురవరుండు ప్రకృతికంటెఁ బరుం డగుతన్నును, దనకంటెఁ బరుండగుపరమేశ్వరుం, బరమేశ్వరప్రసాద బహుజననకృత సుకృతఫలరూపయగు

నాచార్యకృప గుప్తదానంబు నిధానంబుఁ దెలిపినగతిం దెలుపఁగా, నాత్మీయ తదీయ శేషశేషిత్వసంబంధం బనాద్యంబుగాఁ దెలిసి; "యీతెలివి గలిగి యఖండనిర్వృతిం గాంచి సుఖించు పరమయోగికి బహుక్లేశదంబు లగుచదువులం బనియేమి ? యీ వివేకంబు లేనివాని హేతువాదంబు ధాతువాదంబు, కాణాదంబు ప్రాణాదంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస హింస, వ్యాకరణం బకరణం; బటుగాక చదువ దొరకొనిన నరునకుఁ గాలంబు నాలంబు, విఘ్నంబులు సకలోద్యమఘ్నంబు, లందులకు సామగ్రి గిటగిటన; కొంతెఱుంగ నగుమదంబు పుటపుటన; దుదముట్టం జదివె నేనియు సముత్పన్నవిజ్ఞానుండై త్రైగుణ్యవిషయంబు లగువాని నాసీతధాన్యుండు నిష్ఫలంబైన పలాలంబును లబ్ధమధుండు సిక్థకంబును విడుచువడువున విడువవలయుఁ గావున శాంతిదాంతి పరతంత్రతఁ బరస్వైకాంగి నైన నాకు మొదల నివి యధిగమింపం దుద విసర్జింప నేమిప్రయోజనంబు; వాదిభంజనంబు రాజరంజనంబును జేయుచుఁ బునర్జననంబులకు విసువనిజనంబులకుఁ గానిమ్ము, మాదృశులకుఁ దదీయ ఖ్యాతి యీతి, లాభంబు క్షోభంబు, పూజనం బుద్వేజనం", బని వితర్కించి యుర్విపైఁ బూర్వంబున సౌవీరభూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కనిచిన భరతభూమిసురవతంసంబునుబోలె సర్వభావ్యబోధుండై పరమపదంబునను భాగవతుల కప్రాకృతంబు లగుబహుభద్రమూర్తులు భరియించి భగవత్పరిచర్య సేయుటయ పరమపురుషార్థం బగుట యెఱింగి యచటి రథచరణపాణిమాలికాకరణ కైంకర్యంబున కంకురితకౌతూహలుండై చేయుచుండె. మఱియును, 78

అమహీసురవరుండు=ఆబ్రాహ్మణోత్తముఁడు (విష్ణుచిత్తుఁడనుట - 'ద్విజన్మాగ్రజన్మభూదేవ బాడబాః' అమ.), ప్రకృతికంటెన్ = మహదాది సప్తకమునకును బుద్ధీంద్రియాది వికృతి షోడశకమునకును మూలకారణ మయిన ప్రధానముకంటె (చతుర్వింశతి తత్త్వాత్మకమైన యచిత్తుకంటె ననుట), పరుండు=వేఱు - అగు, తన్నున్=జీవునిని. తనకంటెన్=జీవునికంటెను, పరుండు= వేఱు - అగు - పరమేశ్వరున్ =

['పురుషః ప్రకృతే రన్యః పురుషా దన్య ఈశ్వరః
ఏత ద్యో వేత్తి తత్త్వేన స నర స్తత్త్వ విత్తమః.'
'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.'

ఇత్యాది వచనంబులం జెప్పిన ప్రకారమున] సర్వాంతర్యామియగు బ్రహ్మమును - పర...కృప - పరమేశ్వర ప్రసాద = భగవత్కృపయొక్కయు - బహుజననకృత సుకృతి = పెక్కుఁబుట్టువులందు చేయఁబడిన పుణ్యముయొక్కయు - ఫలరూప=ఫలమేరూపముగాఁ గలది (తత్ఫలమైన దనుట), ఆచార్యకృప = దేశికుని యనుగ్రహము, గుప్తదానంబు (పూర్వజన్మమందు) రహస్యముగా నిచ్చిన యీవి (తిరుమంత్రద్వయ చరమోపదేశమనుట—

'మన్త్రరాజం మన్త్రరత్నం చరమార్థం నిగోపయేత్
రహసి ప్రదదౌ తత్త్వం శిష్యేభ్యః ఖలు దేశికః'.

అని యాజ్ఞవల్క్యులు), నిధానంబుఁ=నిక్షేపమును, తెలిపిన గతిన్=(ఈజన్మమందు) చూపిన విధముగా, తెలుపఁగాన్ = బోధింపఁగా (పూర్వజన్మంబున గుప్తదానము చేసినవానికి ఈజన్మమున నిధానము కనఁబడునట్లు, పరమేశ్వర...కృపచేత విష్ణుచిత్తునికి చిదచిదీశ్వరస్వరూపము చక్కఁగా తెలిసినదని భా. ఆచార్యకృపనే కర్తనుగాఁ జెప్పుటచేత తత్త్వజ్ఞానమునకు ఆచార్య కృపయే సాధన మనిభా. 'ఆచార్యః స హరిః సాక్షా న్నరరూపీ న సంశయః' అన్నందున), ఆత్మీ...బు - ఆత్మీయ=తనదియు - తదీయ=ఆప్పరమేశ్వరునిదియు - (అగు) - శేషశేషిత్వసంబంధము = భృత్యుఁడు స్వామి యనెడు సంబంధము (తాను జీవుఁడు భృత్యుఁడు - పరమేశ్వరుఁడు స్వామి - ఇరువురకుంగల యీసంబంధము అనుట) - [అందులకుం బ్రమాణము -

'ప్రధాన పురుషత్వా చ్ఛ శేషిత్వం పరమాత్మనః
తదధీనతయా శశ్వ జ్జీవే శేషత్వ ముచ్యతే.'
'అప్రధానతయా జీవో బుధైః శేష ఇతీరితః
ప్రధానత్వేన దేవేశః శేషీతి వ్యపదిశ్యతే.' హారీతస్మృతిః.]

అనాద్యంబుగాన్ = నిత్యమైన దని, తెలిసి = ఎఱిఁగి (చిదచిదీశ్వర స్వరూపము తెలియఁగానే అనాదిగా తనకు ఈశ్వరుఁడు స్వామి యనియు తాను ఈశ్వరునికి భృత్యుఁ డనియు ఆమహీసురునికి విదితమాయె ననుట);

[పూర్వోక్త జ్ఞానము కలిగినంతట ఆభాగవతోత్తముఁడు ఏమని వితర్కించె ననఁగా :-]

ఈ తెలివి= శేష శేషిత్వ సంబంధంబు అనాద్యం బను నీజ్ఞానము, కలిగి, అఖండనిర్వృతిన్ = సంపూర్ణమయిన సుఖముచేత ('సుఖ నాశౌతు నిర్వృతీ' నానా.), సుఖించుపరమయోగికిన్ = చొక్కుచుండెడి యుత్తమ భక్తునికి, బహుక్లేశదంబులు = మెండుప్రయాసను ఇచ్చునవి, అగు - చదువులన్ = వేద వేదాంతాది పఠనంబులచేతి, పనియేమి = ప్రయోజనము లేదు. ('శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలనకారణమ్.'),

ఈవివేకంబు=పూర్వోక్త జ్ఞానము, లేనివాని (కి), హేతువాదంబు=కారణచర్చ, ధాతువాదంబు=(ఇతరలోహములను బంగారు చేయునట్లు వంచించు)రసవాదవిద్యవంటిది [నిరర్థకమనుట.

క. 'తారు నిర్ధను లై యుండి ధాతువాద మొకరికిం జేయు విప్రలంభకులు వోలె.'

శృం. నైష. ౭(౨౭)],

కాణాదంబు = (కణభు క్ప్రణీతమైన) వైశేషిక శాస్త్రము, ప్రాణాదంబు = ప్రాణములను భక్షించునది (చంపునది, సాధించుట మిక్కిలి కష్ట మనుట); కాపిలంబు = (కపిల మహాముని ప్రణీతమయి పంచవింశతి తత్త్వ సంఖ్యా నాత్మకమైన) సాంఖ్యశాస్త్రము 'సాంఖ్యస్తు కాపిలః' హేమ.), చాపలంబు = అస్థిరము (సేశ్వర నిరీశ్వర భేదములచేత అనైకాంతికము); మీమాంస = పూర్వమీమాంసాశాస్త్రము ('అగ్నీషోమీయం పశుమాలభేత' ఇత్యాది ప్రకారంబున అగ్నిష్టోమాది కర్మకాండ విషయకమయిన శాస్త్రము జైమినిముని ప్రణీతము పూర్వమీమాంస యని ప్రసిద్ధము), హింస=యజ్ఞమందు పశువులను చంపు మని బోధించునది; వ్యాకరణంబు = శబ్దశాస్త్రము, అకరణంబు=సాధనముగాదు ('కరణం సాధకతమం క్షేత్రగాత్రేన్ద్రియేషు చ'అమ.);

నాచార్యకృప గుప్తదానంబు నిధానంబుఁ దెలిపినగతిం దెలుపఁగా, నాత్మీయ తదీయ శేష శేషిత్వసంబంధం బనాద్యంబుగాఁ దెలిసి; "యీతెలివి గలిగి యఖండనిర్వృతిం గాంచి సుఖించు పరమయోగికి బహుక్లేశదంబు లగుచదువులం బనియేమి? యీ వివేకంబు లేనివాని హేతువాదంబు ధాతువాదంబు, కాణాదంబు ప్రాణాదంబు, కాపిలంబు చాపలంబు, మీమాంస హింస, వ్యాకరణం బకరణం; బటు గాక చదువ దొరకొనిన నరునకుఁ గాలంబు నాలంబు, విఘ్నంబులు సకలోద్యమఘ్నంబు, లందులకు సామగ్రి గిటగిటన; కొంతెఱుంగ నగుమనంబు పుటపుటన; దుదముట్టం జదివెనేనియు సముత్పన్న విజ్ఞానుండై త్రైగుణ్యవిషయంబు లగువాని నాసీతధాన్యుండు నిష్ఫలం బైన పలాలంబును లబ్ధమధుండు సిక్థకంబును విడుచువడువున విడువవలయుఁ గావున శాంతిదాంతి పరతంత్రతఁ బరమైకాంగి నైన నాకు మొదల నివి యధిగమింపం బదప విసర్జింప నేమిప్రయోజనంబు; వాదిభంజనంబు రాజరంజనంబును జేయుచుఁ బునర్జననంబులకు విసువనిజనంబులకుఁ గానిమ్ము, మాదృశులకుఁ దదీయ ఖ్యాతి యీతి, లాభంబు క్షోభంబు, పూజనం బుద్వేజనం", బని వితర్కించి యుర్వరఁ బూర్వంబున సౌవీరభూరమణునకు గౌరవం బంగీకరించి బోధించి ముక్తి కనిచిన భరతభూమిసురవతంసంబునుబోలె దుర్విభావ్యబోధుండై సవమానంబునను భాగవతుల కప్రాకృతంబు లగుబహుభద్రమూర్తులు భరియించి భగవత్పరిచర్య సేయుటయ పరమపురుషార్థం బగుట యెఱిఁగి యచటి రథచరణపాణిమాలికాకరణ కైంకర్యంబున కంకురితకౌతూహలుం డై చేయుచుండె. మఱియును, 78

అమహీసురవరుండు=ఆబ్రాహ్మణోత్తముఁడు (విష్ణుచిత్తుఁ డనుట - 'ద్విజాత్యగ్రజన్మభూదేవ బాడబాః' అమ.), ప్రకృతికంటెన్ = మహదాది సప్తకమునకును బుద్ధీంద్రియాది వికృతి షోడశకమునకును మూలకారణ మయిన ప్రధానముకంటె (చతుర్వింశతి తత్త్వాత్మకమైన యచిత్తుకంటె ననుట), పరుండు=వేఱు - అగు, తన్నునన్=జీవునిని, తనకంటెన్=జీవునికంటెను, పరుండు= వేఱు - అగు - పరమేశ్వరున్ =

['పురుషః ప్రకృతే రన్యః పురుషా దన్య ఈశ్వరః
ఏత ద్యో వేత్తి తత్త్వేన స నర స్తత్త్వవిత్తమః.'
'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.'

ఇత్యాది వచనంబులం జెప్పిన ప్రకారమున] సర్వాంతర్యామియగు బ్రహ్మమును - పర...కృప - పరమేశ్వర ప్రసాద = భగవత్కృపయొక్కయు - బహుజననకృత సుకృతి = పెక్కుఁబుట్టువులందు చేయఁబడిన పుణ్యముయొక్కయు - ఫలరూప=ఫలమేరూపముగాఁ గలది (తత్ఫలమైన యనుట), ఆచార్యకృప = దేశికుని యనుగ్రహము, గుప్తదానంబు (పూర్వజన్మమందు) రహస్యముగా నిచ్చిన యీవి (తిరుమంత్రద్వయ చరమోపదేశమనుట—

'మన్త్రరాజం మన్త్రరత్నం చరమార్థం నిగోపయేత్
రహసి ప్రదదౌ తత్త్వం శిష్యేభ్యః ఖలు దేశికః'.

అని యాజ్ఞవల్క్యులు), నిధానంబుఁ=నిక్షేపమును, తెలిపిన గతిఁ=(ఈజన్మమందు) చూపిన విధముగా, తెలుపఁగాఁ = బోధింపఁగా (పూర్వజన్మంబున గుప్తదానము చేసినవానికి ఈజన్మమున నిధానము కనఁబడునట్లు, పరమేశ్వర...కృపచేత విష్ణుచిత్తునికి చిదచిదీశ్వరస్వరూపము చక్కఁగా తెలిసినదని భా. ఆచార్యకృపనే కర్తనుగాఁ జెప్పుటచేత తత్త్వజ్ఞానమునకు ఆచార్య కృపయే సాధన మనిభా. 'ఆచార్యః స హరిః సాక్షా న్నరరూపీ న సంశయః' అన్నందున), ఆత్మీ...బు - ఆత్మీయ=తనదియు - తదీయ=అప్పరమేశ్వరునిదియు - (అగు) - శేషశేషిత్వసంబంధము = భృత్యుఁడు స్వామి యనెడు సంబంధము (తాను జీవుఁడు భృత్యుఁడు - పరమేశ్వరుఁడు స్వామి - ఇరువురకుంగల యీసంబంధము అనుట) - [అందులకుం బ్రమాణము -

'ప్రధాన పురుషత్వా చ్చ శేషిత్వం పరమాత్మనః
తదధీనతయా శశ్వ జ్జీవే శేషత్వ ముచ్యతే.'
'అప్రధానతయా జీవో బుధైః శేష ఇతీరితః
ప్రధానత్వేన దేవేశః శేషీతి వ్యపదిశ్యతే.' హారీతస్మృతిః.]

అనాద్యంబుగాఁ = నిత్యమైన దని, తెలిసి = ఎఱిఁగి (చిదచిదీశ్వర స్వరూపము తెలియఁగానే అనాదిగా తనకు ఈశ్వరుఁడు స్వామి యనియు తాను ఈశ్వరునికి భృత్యుఁ డనియు ఆమహీసురునికి విదితమాయె ననుట);

[పూర్వోక్త జ్ఞానము కలిగినంతట ఆభాగవతోత్తముఁడు ఏమని వితర్కించె ననఁగా :-]

ఈ తెలివి= శేష శేషిత్వ సంబంధంబు అనాద్యం బను నీజ్ఞానము, కలిగి, అఖండనిర్వృతిఁ = సంపూర్ణమయిన సుఖముచేత ('సుఖ నాశౌతు నిర్వృతీ' నానా.), సుఖించుపరమయోగికిఁ = చొక్కుచుండెడి యుత్తమ భక్తునికి, బహుక్లేశదంబులు = మెండుప్రయాసను ఇచ్చునవి, అగు - చదువులఁ = వేద వేదాంతాది పఠనంబులచేత, పనియేమి = ప్రయోజనము లేదు. ('శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలనకారణమ్.'),

ఈవివేకంబు=పూర్వోక్త జ్ఞానము, లేనివాని (కి), హేతువాదంబు=కారణచర్చ, ధాతువాదంబు=(ఇతరలోహములను బంగారు చేయునట్లు వంచించు)రసవాదవిద్యవంటిది [నిరర్థకమనుట.

క. 'తారు నిర్ధను లై యుండి ధాతువాద మొకరికిం జేయు విప్రలంభకులు వోలె.'

శృం. నైష. ౭(౨౬)],

కాణాదంబు = (కణభు క్ప్రణీతమైన) వైశేషిక శాస్త్రము, ప్రాణాదంబు = ప్రాణములను భక్షించునది (చంపునది, సాధించుట మిక్కిలి కష్ట మనుట); కాపిలంబు = (కపిల మహాముని ప్రణీతమయి పంచవింశతి తత్త్వ సంఖ్యా నాత్మకమైన) సాంఖ్యశాస్త్రము 'సాంఖ్యస్తు కాపిలః' హేమ.), చాపలంబు = అస్థిరము (సేశ్వర నిరీశ్వర భేదములచేత అనైకాంతికము); మీమాంస = పూర్వమీమాంసాశాస్త్రము ('అగ్నీషోమీయం పశుమాలభేత' ఇత్యాది ప్రకారంబున అగ్నిష్టోమాది కర్మకాండ విషయకమయిన శాస్త్రము జైమినిముని ప్రణీతము పూర్వమీమాంస యని ప్రసిద్ధము), హింస=యజ్ఞమందు పశువులను చంపు మని బోధించునది; వ్యాకరణంబు = శబ్దశాస్త్రము, అకరణంబు=సాధనముగాదు ('కరణం సాధకతమం క్షేత్రగాత్రేన్ద్రియేషు చ'అమ.);

చదువన్=పఠించుటకు, దొరకొనినన్=తొడంగినయెడల, కాలంబు, నాలంబు = న + అలమ్ = దీర్ఘముకాదు (చాల దనుట - 'అలం స్యా దనల్ప వారి తాళయోః' హేమ.), విఘ్నంబులు = అంతరాయములు, స...లు - సకల = సమస్తమైన - ఉద్యమ = ప్రయత్నంబులను - ఘ్నంబులు = పడఁగొట్టునవి. అందులకున్ = శాస్త్రములు చదువుటకు, సామగ్రి = సాధన సంపత్తి, గిట గిటన = సూక్ష్మము, కొంత ఎఱుంగన్ = అల్పజ్ఞానముచేత - అగు - మదంబు = గర్వము, పుటపుటన=అధికము. తుదముట్టన్, చదివెనేనియున్=చదివినప్పటికిని, సము...డు-సముత్పన్న = జనించిన - విజ్ఞానుండు = శాస్త్రజ్ఞానము కలవాఁడు ('మోక్షే ధీర్జ్ఞాన మన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః' అమ.), ఐ, త్రైగుణ్య విషయంబులు = సత్త్వరజస్తమోగుణ సంబంధమైన వానిని, అనీతధాన్యుఁడు = కైకొనఁబడిన వరికలవాఁడు, నిష్ఫలంబైన - పలాలంబును = గింజలేనివరిపోఁచను ('వాడీ నాళం చ కాణ్డోஉస్య పలాలోஉస్త్రీ స నిష్ఫలః' అమ.) లబ్ధ మధుండు = పొందఁబడిన తేనెకలవాఁడు, సిక్థకంబును=మైనమును ('మధూచ్ఛిష్టంతు సిక్థకమ్' అమ.), విడుచు - వడువునన్ = విధముగా, విడువ వలయున్ = (శాస్త్రజ్ఞానమును) త్యజింప వలయును;

కావునన్, శాం...తన్ - శాంతి = బహిరింద్రియ నిగ్రహంబునకును - దాంతి = అంతరింద్రియ నిగ్రహంబునకును - పరతంత్రతన్=పరాధీనుఁడ నగుటచేత = ('పరతన్త్రః పరాధీనః పరవా న్నాథవానపి' అమ.) - పరమ ఏకాంగిన్ = కేవలము విరక్తుఁడ నైనవిష్ణుభక్తుఁడను, ......అవి = ఈశాస్త్రములు, అధిగమింపన్=చదువుటచేతను, తుదన్ = కడపట, విసర్జింపన్ = త్యజించుటచేతను,......వాది భంజనంబు=ప్రతివాదుల నోర్చుటను, రాజరంజనంబును = రాజులను మెప్పించుటను........మాదృశులకు = నాబోంట్లకు, తదీయ = ఆవేదశాస్త్రజ్ఞానసంబంధియయిన - ఖ్యాతి=వాసి, ఈతి = కొల్లమొదలగు దేశోపద్రవము ('ఈతి ర్డిమ్బప్రవాసయోః' అమ. 'డిమ్బోవిప్లవః' రామాశ్రమి.), లాభంబు = రాజాదులవలనం గలుగుసంభావన, క్షోభంబు = కలఁత,...ఉద్వేజనంబు = భయంకరము;

అని, వితర్కించి = ఊహించి, ఉర్వరన్ = భూలోకములో ('ఉర్వరా సర్వసస్యాఢ్యా' అమ. ఇట లక్ష్యార్థము)......సౌవీర భూరమణునకున్ = సింధురాజయిన రహూగణుఁడను వానికి, గౌరవంబు = ఆతని వినయమును, అంగీకరించి = మోదించి (జడభరత మునిని సవతితల్లి కొడుకులు పొలము కావ నియమించిన నతఁడుం గాచుచుండ, ఆదారిని రహూగణుం డను సింధు దేశ భూపాలుఁడు సవారి యెక్కి పోవుచుండ, బోయలు ఈమునిని ఆసవారి మోవం జేసిరి. ఆపని యెఱుంగని యీతఁడు మోచుటచే తేనికి కుదుపుగల్గఁగా, ఆతఁడు బోయలను కారణ మడిగి, వారివలన ఈతఁడు చక్కఁగా మోచుటలే దని విని, ఇతనిని ధిక్కరించి పలికెను. అంతట నీముని ఆత్మతత్త్వము పలుకఁగా, భూపాలుఁడు వెఱచి పాదపతితుఁ డై భక్తి పూర్వకముగా నడిగి యీమునివలన తత్త్వోపదేశముం బొందెను.—ఈకథను ఆంధ్ర భాగవతము, ౫ స్కం. ౧ ఆ. నం జూడవచ్చును.), ముక్తికిన్ = మోక్షమునకు, అనిచిన = పంపిన - భరత భూమిసురవతంసంబునుంబోలె = జడభరతుఁ డనెడి బ్రాహ్మణోత్తమునివలె ('పుం స్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరేஉపి శేఖరే' అమ. - అవతంసమే వతంసము.), దుర్విభావ్యబోధుండు= ఊహింపరాని జ్ఞానము కలవాఁడు, ఐ, పరమపదంబునను = త్రిపా ద్విభూతియందు సయితము,

భాగవతులకున్, అప్రాకృతంబులు = ప్రకృతిపరిణామంబులు కానట్టివి, అగు - బహు భద్రమూర్తులు = పెక్కుమంగళ దేహములను, ధరియించి = తాల్చి, భగవత్పరిచర్య = విష్ణుసేవ, చేయుటయే, పరమపురుషార్థంబు = ఉత్తమోత్తమ మయిన పురుషప్రయోజనము ( - ఇందులకు శ్రీగుణరత్నకోశమునుండి—

"తస్యాం చ త్వత్కృపావ న్నిరవధి జనతా విశ్రమార్హావకాశం
సంకీర్ణం దాస్య తృష్ణా కలితపరికరైః పుమ్భి రానన్దనిఘ్నైః
స్నేహా దస్థాన రక్షావ్యసనిభి రభయం శార్ఙ్గ చక్రాసి ముఖ్యై
రానన్దైకార్ణవం శ్రీర్భగవతి యువయో రాహు రాస్థాన రత్నమ్."

"తే సాధ్యా స్సన్తి దేవా జననిగుణవపుర్వేష వృత్తస్వరూపై
ర్భోగై ర్వా నిర్విశేషై స్సవయస ఇవ యే నిత్యనిర్దోషగన్ధాః")

...రథ...నకున్ - రథచరణపాణి=చక్రపాణియొక్క (మన్నారుకృష్ణునియొక్క) - మాలికా= పూలదండలయొక్క - కరణ = చేఁత యనెడు - కైంకర్యంబునకున్ = సేవకు, అం...డు - అంచిత = పొడమిన - కౌతూహలుండు = తమికలవాఁడు, ఇ;...'హేతువాదంబుధాతువాదంబు' ఇత్యాది వాక్యములయందు అంత్యాను ప్రాసము కలదు...ఈవచనము ప్రక్షిప్త మని జోగిజగన్నాథ పండిత మతము.

క. న్యాయార్జితవిత్తంబున నాయోగీశ్వరుఁడు వెట్టు నన్నం బౌప్రా
లేయ పటీరాచల ప ద్యాయాతాయాత వైష్ణవావలి కెల్లన్. 79

ఆయోగీశ్వరుఁడు, న్యాయ ఆర్జిత విత్తంబునన్ = న్యాయమార్గముచేత ('అభ్రేష న్యాయ కల్పాస్తు దేశరూపం సమఞ్జసమ్' అమ. 'తనకు ఉచితమైన ధర్మమువలననుండి చలింపకుండుట' లింగా.) గడింపఁబడిన ధనముతో, ఆప్రా...కిన్ - ఆప్రాలేయ (అచల) పటీరఅచల = మంచు కొండ ('ప్రాలేయం మిహికా చ' అమ.) మొదలుకొని గందపుఁగొండ ('అద్రి గోత్ర గిరి గ్రావాచల శైల శిలోచ్చయాః' అమ.) వఱకుంగల

("వహతి విషధరాన్ పటీరజన్మా । శిరసి మసీ పటలం దధాతి దీపః
విధు రపి భజతేతరాం కళఙ్కం । పిశునజనం ఖలు బిభ్రతి క్షితీన్ద్రాః॥" భామి.
"పటీరజన్మాచన్దనః" టీక.

"పాటీరగిరి వనీవాటిఁ గ్రీడించియు నహిభయం బెఱుఁగఁ డావంతయైన." వరస.)

('ఆ - ఈయవ్యయము ఒకహద్దును చేర్చుకొని గాని చేర్చుకొనక గాని దానివఱకు అను నర్థమును తెలుపును. - 'ఆఙ్మర్యాదాభివిధ్యోః.') - పద్యా = దారియందు ('సరణిః పద్ధతిః పద్యా వర్త్మ న్యేకప దీతి చ' అమ.) - యాత ఆయాత=పోయినవారును వచ్చినవారును అగు - వైష్ణవ ఆవలికిన్=విష్ణుభక్తుల సమూహమునకు, ఎల్లన్=అంతటికిని ( - విష్ణుభక్తుల కందఱకును అనుట.), అన్నంబు పెట్టున్.

ఆభాగవతవతంసుఁడు హిమాచల మలయాచలముల మార్గములం బోవు వైష్ణవుల కందఱకు నాయూరఁ దనయింట న్యాయార్జిత ధనముతో నన్నదానము సేయుచుండును.

చ. గగనము నీటిబుగ్గ కెనగా జడివట్టిననాళ్లు భార్య క
న్బొగ సొరకుండ నారికెడపుంబొటియ ల్దగిలించి వండ న

య్యగపల ముంచిపెట్టుఁ గలమాన్నము నొల్చినప్రప్పు నాలు గే
న్పొగపినకూరలు న్వడియము ల్వరుగు ల్పెరుఁగు న్ఘృతప్లుతిన్. 80

(ఆయోగీశ్వరుఁడు), గగనము = ఆకాశము ('నభో౽న్తరిక్షం గగనమ్' అమ.), నీటి బుగ్గకన్ = పర్వతాదులయందుండి సంతతధారగా నీరు పైకుబికి వచ్చెడి యూటవలె, ఎనగాన్ = సమానముగా, జడి = ముసురు, పట్టిన—నాళ్లు = దినములయందు ('కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' బా. వ్యా.), భార్య = ఆభాగవతుని యిల్లాలు, కన్ = కంటిలోనికి, పొగచొరకుండన్ (పొగలేక మండుటచే కంటికి బాధలేక), నారికెడపుం బొఱియల్ = లోపలి నీరింకిపోయి యెండిన కొబ్బెర బొండ్లములను, తగిలించి = వంటచెఱకుగా మండించి, వండన్ = వంట చేయఁగా ఆయగపలన్ = ఆ టెంకాయ చిప్పల గరిటలతో, కలమాన్నమున్ = వరియన్నమును, ఒల్చిన ప్రప్పు = చాయపప్పు, నాలుగు ఏను = నాలుగైదు (సమృద్ధిగా, పెల్లుగా ననుట - నాలుగే, అయిదే, అని నిర్ధారణ గాదు.) - పొగపిన = సాతాళించిన (తాలింపు వైచిన)...ఘృతప్లుతిన్ = నేతివెల్లువతో, ముంచిపెట్టున్ (తత్పరత్వముచేత స్వయముగానే వడ్డించు ననుట).

'పొగసొరకుండ' - పొగ చొచ్చినచో ఆబాధచే వంటసౌష్ఠవము చెడును. 'ఘృతప్లుతి' - ఆదినుండియే వలసియున్నను దానిం గడపట చెప్పుట అది మాటిమాటికి ఒక్కొక్కదానిని కలుపుకొన్నప్పుడెల్ల వలసినదై యుండుటచేత. 'అగప' - రూ. అబక.

'నీటిబుగ్గకెనగా' అని 'ఎన' ఉపమా వాచక మయినను భావవిశేషమునుబట్టి యుత్ప్రేక్షాలంకారము. నీటిబుగ్గ - రూ. నీరుబుగ్గ.

చ. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యని చారులుఁ దిమ్మనంబులున్
బలుచనియంబళు ల్చెఱకుపా లెడనీళ్లు రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వడపిందెలు నీరుఁజల్లయున్
న్వెలయఁగఁ బెట్టు భోజనము వేసవిఁ జందనచర్చ మున్నుగన్. 81

వేసవిన్ = ఎండకాలమందు. చందనచర్చ = గందపుఁబూఁత, మున్ను = మొదటిది, కాన్ = అగునట్లు (మొదట గందము ఇచ్చి పూసికొనంజేసి), తెలినులివెచ్చ యోగిరమున్ = తెల్లనిదియు ఇంచుకయే వేఁడిదియు నగు నన్నంబును,...తిమ్మనంబులన్ = మజ్జిగ పులుసులును...ఎడనీళ్లు = లేఁత టెంకాయలోని తియ్యనీరును, రసావళుల్ = భక్ష్యవిశేషములును (ఇయ్యర్థమునకు బ్రౌను దొరగారిచ్చిన యుదాహరణము.—విష్ణు. 3. (382).

"క. తనయింట నప్పుడాయిత మొనరించిన కమ్మఁదావు లొలుకు రసావ
ళ్లును మినుపవడలుఁ జాఁపట్లును గోదుమపిండివంటలున్ గలవనినన్.'
-అతిరసములు గావలయు."),...

వడపిందెలున్ = వడను (తాపమును) పోఁగొట్టునట్టి యూరవేసిన మామిడి పిందెలును, నీరుఁజల్లయున్ = నీరు మజ్జిగయును, వెలయఁగన్ = నిండారునట్టుగా,...

మ. పునుఁగుందావి నవోదనంబు మిరియంపుం బొళ్లతోఁ జట్టి చు
య్యను నాదాఱనికూరగుంపు, ముకుమం దై యేర్చునావం జిగు

రొ్కనుపచ్చళ్లును, బాయసాన్నములు, నూరుంగాయలుఁ, జేసులు
క్కనునేయుం, జిలుపాలు వెల్లువగ నాహారం బిడు సీతునఁ. 82

సీతునఁ=శీతకాలమందు, పును...బుఁ - పునుఁగుందావి=పునుఁగు వాసనగల (రాజనపు బియ్యపుటన్నము పునుఁగువాసన గలది గావున ఆబియ్యముయొక్క యనుట) - నవ ఓదనంబు = క్రొత్తయన్నము (అప్పుడే వండినది, వేఁడివేఁడిది అనుట - రాజనపుటన్నము ఉష్ణము గనుక శీతకాలములో శీతనివారణార్థము దానిం బెట్టుట)....నాదు = ధ్వని, ఆఱని = శమిల్లనట్టి (అప్పుడే ప్రాయిమీఁదినుండి దించుచున్నట్టి),...ముకుమందు = నాసాజాడ్యమును హరించు నౌషధము,...ఏర్చు = చుఱుకుమనియెడు - ఆవఁ = ఆవచేత, చిగుర్కొను = పల్లవించుచున్న (చిగిరించుచున్నట్లొప్పుచున్న - రుచిగొల్పుచున్న యనుట), ...పాయసాన్నములుఁ = క్షీరాన్నములును, చేసేయి, చుఱుక్కను = వేఁడింబొందునట్టి,...నేయుఁ = ఆజ్యంబును,...చిలుపాలుఁ = ఇవురఁగాఁచిన పాలును, వెల్లువగఁ = సమృద్ధియగునట్లుగా,...మిరియంపుం బొడితోడి కూరలు లోనగునిచెప్పిన యాహారమెల్ల శీతనివారక మని యెఱుంగవలయు.

'ఊరుంగాయలు' - 'ఊరు' అనునది ఉదంత తదర్థక విశేషణము, అట్టి దానిపై హల్లు పరమగునపుడు నుగాగమము విహితము కాదు కావున 'ఊరుంగాయలు' అను రూపము సిద్ధింపదు. అయినను 'ఊరుఁగాయ' 'ఊరుఁబిండి' యనియే శ. ర.; పీఠికం గనుఁడు. వ్యవహారమందు 'ఊరఁగాయ' యనియే యున్నది. ఒండె - అవ్యవ్యవహారమగుటంబట్టి గ్రాహ్యము గావలయు. ఒండె - "చిగుర్కొను పచ్చళ్లును బాయసాన్నములు నూరంగాయలుఁ" అని పఠించిన నిర్బాధము. 'చిగుర్కొనుట' యే 'చిగుర్కొనుట.' - 'కొనుట' - అనఁగా పొందుట. ఊరవైచిన కాయలు ఊరంగాయలు. పూర్వపదము తుమున్నర్థకము.

చ. కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్పపిండిపైఁ
గుదురుగ నిల్పి, యోపుగతి గూనల నూనియ నించి, త్రాట ము
న్నుదికినకోటి వ్రేల, నని నొక్కటఁ గ్రుంకిడి వత్తు రెందఱే
నదలక యాతనింట శనివారమునఁ బరదేశివైష్ణవుల్. 83

ఆతనింటఁ, కదలక = వారక, శనివారమునఁ, ఎందఱేని = ఎందఱైనను, పరదేశివైష్ణవుల్=ఇతరదేశములనుండివచ్చిన విష్ణుభక్తులు, కద...టఁ - కదళి=అరఁటియొక్క - గభీర=లోఁతైన - పుష్ప=పువ్వులయొక్క - పుటికా=దొన్నెలయొక్క (దొన్నెలవంటి రేకులయొక్క) - ఛటఁ = సమూహమును, చేతులఁ = చేతులయందు, ఇప్పపిండిపైఁ = (ఒడలురుద్దుకొనుటకైనూరిన) యిప్పపిండి ముద్దమీఁద, కుదురుగఁ=కదలకయుండునట్లు, నిల్పి, ఓపుగతిఁ=ఆదొన్నె భరించునంతపాటి, గూనలనూనియఁ=గూనలలోని నూనెను, నించి=నిండించి,...ఒక్కటఁ = ఒక్కమాఱుగా, క్రుంకు ఇడి = మునిఁగి (స్నానమాడి యనుట)...వత్తురు.

ఆభాగవోత్తమునియింట పరదేశివైష్ణవులు పలువురు ఉడుగక శనివారమునందు, అభ్యంగస్నానార్థమై చేతియందు ఇప్పపిండిముద్దయు దానిని కుదురుగాచేసి అందుపై అరఁటిపూదొన్నెనిండ గూనలలో వీరికై పెట్టియున్న నూనెను కైకొని, త్రాటికొనయందు స్నానానంతరము ధరించుటకై ముందుగానే ఉదికి ఆఱవైచియున్నదోవతి వ్రేలుచుండఁగా, పోయి ఏట నొక్కమాఱుగా స్నానమాడి భోజనార్థమయి వత్తురు.

'పరదేశి' ఊరివారు రారు. ఆగంతుకులను అనిష్ఠానిధి 'ఎదుఱేఁగి...' తెచ్చును. 'వైష్ణవుల్' - స్మార్తాదులుగా రనుటయు. 'కదళి గభీరపుష్ప పుటికాచ్ఛటన్' - కదళీశబ్దము ఈకారాంత స్త్రీలింగము. దానికి ఇట హ్రస్వము 'నదిసుత గురు కర్ణ శల్య నాగపురీశుల్' ఇత్యాది స్థలములందుంబోలె దీర్ఘసమాసత్వముచేతఁ గావచ్చును. లేదా, 'కదళి' యని తత్సమ మయిన పిమ్మట సాధ్యసమాసము చేసికొనవచ్చును. రెండవపక్షమున ఈ 'కదళి' శబ్దమునకు 'ఆసుధాధామ విభవ మహాంబురాశికిన్' ఇత్యాది స్థలములయందుంబోలె నర్థసందర్భము లరసికొనునది. ఒండె - కదళీ శబ్దమునకు 'కదళః' అనియు రూపము కలదు:—'కదళశ్చ కదల్యసౌ' వ్యాడి.-

'కదలా కదలీ పృశ్న్యాం కదళీ కదలీ పునః
రమ్భావృక్షేఽథ కదళీ పతాకా మృగభేదయోః
కదలా డిమ్భికాయాం చ శాల్మలీ భూరుహేఽపిచ' మేది.

కావున 'కదళ గభీర అని పఠించిన నిర్దోషము. - 'గభీర' సమృద్ధిగా నూనెపట్టుటకు - గూనలలో ఈభాగవతులకై సేకరించి యుండుట ఈ యతిథిపూజయందు విష్ణుచిత్తునికింగల శ్రద్ధాతిశయమును తెలుపుచున్నది. 'నూనియ' వ్య. నువ్వులనేయి. నేయి స్నేహశబ్దభవము. 'త్రాటప్రేలుట' - మలినము గాకయు మైలపడకయు నుండుటకు. - 'మున్ను ఉదికిన' - విష్ణుచిత్తుఁడు తనవే తనయింటను వారికై ధౌతశుష్కములు గావించినట్టి వని భా. 'ఉదికిన' అన్ననే 'మున్ను' అని తెలియ నగుచుండఁగా 'మున్ను' అనుట 'పూర్వదినమున' అని తెలుపుటకు. నిన్నటిమడి నేఁడు కట్టుట అఱవయాచారము. 'వదలక' - ప్రతి శనివారము ఇట్లే అనుట. 'ఒక్కటన్' - ఏకకాలమందే ఇంటి కేఁగుట ఏకకాలమందే భుజించుటకు, ఏకపాకమందు పిమ్మట భుజించుట ఆచారముగాదు; భోక్తలకును శ్రమ, వడ్డించువారికిని శ్రమ, ఇంటివారికి శ్రమగాకుండుటకై కూడ అసాధువులందఱును భుక్తికి ఒక్కమాఱుగానే వత్తురు. 'ఎందతేవదలక'-ఎందతేన్ + వదలక - ఎందతేని + వదలక - 'అపిశబ్దార్థస్యైతః' అను వాంధ్రశబ్దచింతామణీ సూత్రము చేత 'ఏని' శబ్దమున వైకల్పికముగా ఇలోపము కలుగును. అనంతరము ఏనిశబ్ద ద్రుతకార్యము. ఉ. 'ఎందేడెందము,' 'ఎందే నింద్రియముల్' మను; పక్షంబున 'ఎందేని డెందము, ఎందేనియింద్రియముల్.' 'అతనింటన్' = అతని + ఇంటన్ - 'అత్తవారింటి కరిగెడు నవసరమున' నైష. ౪ ఆ. ౧౩. 'ననుజుమ్మువానిఁ గన్న నయమ్ముగల యింతి, ననయమ్ము దాల్చువానన్నఁ జెనకి' నరస. ౮ ఆ. ౭౮. - ఇత్యాదుల యందుంబోలె విభక్తిగతైత్వసంధిని సహింపవలయును., ఒండె, - 'వదలక వానియింట' అని పఠింపవచ్చును. 'వాఁడు' శబ్దము సంభాషణయందు అగౌరవమును సూచించినను కవనమందు అనియమములేదు; - 'వానికిఁ బురూరవుఁడు ప్రజ్ఞానిధి జనియించె' (వానికిన్=బుధునకు), 'వాని చక్కఁదనము వైరాగ్యమునఁజేసి' (వాని=ప్రవరునియొక్క),'ఇలు దీర్చఁగఁ గాఁపురమొప్ప వానికిన్' (వానికిన్ = ప్రవరునికి), మను. ౧. ఆ.

శా. అనిష్ఠానిధిగేహసీమ నడురే యాలించిన న్శ్రోత్రియు నెం
తేనాగేంద్రశయానుపుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్యానము నాస్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్య మన్నాటలున్. 84

ఆ...మన్ - ఆనిష్ఠానిధి=సదాచారమునకు నిక్షేపమయిన యావిష్ణుచిత్తునియొక్క - (ఇంతవఱకు మిశ్రసమాసము కర్మధారయము - దీనికి మరల 'గేహసీమ' యను సిద్ధసమాసముతో మిశ్రసమాసము - అంతియకాని 'నిష్ఠానిధిగేహసీమ' యని ఒకటే సిద్ధసమాసముగాదు.) - గేహసీమన్ =ఇంటిసమీపమందు ('సీమ సీమే ఇమే క్షేత్రే కూల మర్యాదయో రపి' నానా.), నడురే=అర్ధరాత్రి సమయమున ('రేయి' శబ్దమునకు 'రే' అని రూపాంతరము - ఈవిభాగముచేత ఇత్వసంధి నివారితము) - ఆలించినన్ = విన్నను (ఇందు సముచ్చయ నుశబ్దము ప్రశ్లిష్టమైయున్నది, దానిఫలము రే శబ్దమునకుఁ గలుగును - అర్ధరాత్రమందు సయితము విన్నయెడల అని భా. అంతవఱకుంగూడ మరల మరల పంక్తులు సాగించి భోజనము పెట్టుదు రనుట), నా...లున్ - నాగేంద్ర=అనంతునిపై - శయాను=నిద్రించువాఁడైన శ్రీహరియొక్క - పుణ్య=పావనమైన - కథలును ('శయాన' అని పా. అపక్షమున సిద్ధసమాసము.), ది...ము - దివ్యప్రబంధ=ద్రావిడవేదముయొక్క - అనుసంధాన=పారాయణముయొక్క - ధ్వానము=నాదంబును, శాకబహుళతా=కూరల పెల్లిదము - నాస్తి = లేదు (కూరలు పెక్కులుగా లేవు), ఉష్ణతా నాస్తి = వేఁడి లేదు (వంటయెల్ల చలాఱి పోయినది), అపూపః నాస్తి=పిండివంట ('పూపోఽపూపః పిష్టకః స్యాత్' అమ.), (ఏమియు), లేదు, ఓ...స్తి - ఓదన=అన్నముయొక్క ('భిస్సా స్త్రీ భక్త మన్ధోఽన్న మోదనోఽస్త్రీ సదీదివిః' అమ.) - సౌష్ఠవమ్ = ఒప్పిదము - నాస్తి, కృపయా = దయచేత, భోక్తవ్యం = భుజింపవలయును, అనుమాటలున్ = అను నుపచార వచనంబులును, ఎంతేని = మెండుగా - ప్రోయున్ = బిగ్గరగా వినఁబడుచుండును.

నిష్ఠాగరిష్ఠుఁ డయిన యావిష్ణుచిత్తునియింటియొద్ద అర్ధరాత్రమప్పుడుకూడ మెండుగా హరికథలును, ద్రావిడ వేదపారాయణనాదంబును, భోక్తనుగూర్చి గీర్వాణభాషలో 'అయ్యా, కూరలు పెక్కుగా లేవు, భోజనపదార్థములు చల్లాఱిపోయినవి, పణ్యారము లేవియు లేవు, అన్నముకూడ ఒప్పిదముగా నుండలేదు; మన్నించి కరుణతో భుజింపుఁడు' అని ఆభాగవతుఁడు పలికెడు మంచి మాటలును వినఁబడును. 'నడురే' యతిక్రమించుట అప్రశస్తము. 'ఆలించినన్' - చేదర్థము, నడురేయితో నన్వయించును. ఆలించు - రూ. ఆలకించు.

'నిష్ఠానిధి' కావుననే అతిథిపూజను అంత శ్రద్ధతో చేయుచున్నాఁడు. ఆయన వారికిం జెప్పుకొనెడు ఆలోపముచేత ఆతని యాపూజ కేవల సాత్త్విక మని స్పష్టపడుచున్నది. 'నాస్తి' 'నాస్తి' యనుట అవ్వారిగా పెట్టియు ఇంకను ఉత్కృష్టముగా పెట్టనయితినే అని యామహానుభావునికొదువను తెలుపుచున్నది. ఇట్టిది మనుచరిత్రలో ప్రవరుని కథలో

'వండ నలయదు వేవురు వచ్చిరేని । యన్నపూర్ణకు నుద్దియై యతని గృహిణి
అతిథు లేతేర నడికిరేయైనఁ బెట్టు । వలయు భోజ్యంబు లింట నవ్వారి గాఁగ.' ౧-౫౭

'ఎం । తే నాగేంద్ర...దివ్య...' - ఇట ఏనిశబ్దయతి వాల్లునకు వచ్చినది:—

'ఏని యను నాంధ్రశబ్దము । తో నదికిన పూర్వపదము తుదివ్రాయికి న
చ్చైనను వ్యంజనవర్ణం । బైనరచింపుదురు నిత్య యతులనుచుఁ గవుల్.' అప్ప.

'సం । ధాన...నాస్త్యుష్ణతా...' ఇట నాస్తి శబ్దమునకు నిత్యసమాసయతి వికల్పముగా వాల్లునకు బిందుయతిగా వచ్చినది.

తే. ఇత్తెఱంగున నవైష్ణవోత్తముండు
జాగరూకతఁ దైర్థిక భాగవతుల
కితర మెఱుఁగక యెవ్వరే మేమి వేఁడి
రలయ కవి పెట్టి సంతుష్టిసలుపుచుండె. 85

ఇత్తెఱంగునన్ = ఈవిధముగా,...జాగరూకతన్ = మెలఁకువతో (హెచ్చరికతో), తై...నన్ - తైర్థిక = యాత్రాపరులయిన...ఇతరము ఎఱుఁగక = వేఱుతలంపులేనివారై.

## —* ఆశ్వాసాంత పద్యములు *—

శా. బాలార్కాంశువిజృంభితామలశరత్పద్మాక్ష పద్మాక్షమా
నీళాజాంబవతీశ యీశ బలభి న్నీరేరుహోద్భూతదిక్
పాలామూల్యశిరోమణిద్యుతికనత్పాదాబ్జ పాదాబ్జఫా
లాలంకారకచావలీ మకరదీవ్యత్కుండలాంచన్ముఖా. 86

ఈ యాశ్వాసాంత పద్యములందు వేంకటేశ్వరస్వామికి సంబుద్ధి.—బా...క్ష - బాల = లేఁత - అర్క=సూర్యునియొక్క - అంశు=కిరణములచేత - విజృంభిత=విరిసిన (లేక విరియింపఁబడిన) - అమల = నిర్మలమైన - శరత్పద్మ = శరత్కాలపుఁ దామరలవంటి - అక్ష = నేత్రములు గలవాఁడా, పద్మా...శ - పద్మా = లక్ష్మి ('లక్ష్మీః పద్మాలయా పద్మా' అమ.) - క్షమా = భూమి ('గౌ రిలా కుమ్భినీ క్షమా' అమ.) - నీళా = నీలాదేవియు - జాంబవతీ = జాంబవంతునికూఁతు రయిన జాంబవతీదేవియు - (అనువారికి) - ఈశ = పెనిమిటివైనవాఁడా, ఈశ...బ్జ - ఈశ = శివుఁడు - బలభిత్ = ఇంద్రుఁడు - నీరేరుహోద్భూతుఁడు = తమ్మిచూలి (బ్రహ్మ) - దిక్పాల = అగ్న్యాది దిక్పాలకులు - అనువీరియొక్క - అమూల్య = వెలలేని ('మూల్యం వస్నోఽప్యవక్రయః' - శిరోమణి=చూడారత్నములయొక్క - ద్యుతి = ప్రభలచేత ('ద్యుతిస్తు శోభా దీధితో్యః' అమ.) - కనత్=వెలుఁగుచున్న - పాదాబ్జ=అడుగుఁ దామరలు కలవాఁడా, (ఈ చెప్పిన యీశాదులు వేంకటేశ్వరునికి మ్రొక్కుదు రనుట, ఈయన వారికి దేవుఁ డనుట.), పా...భా - పాద = చతుర్థభాగమయిన ('పాదా రశ్మ్యఙ్ఘ్రి తుర్యాంశాః' అమ.) - అబ్జ = చవుతినాఁటి చంద్రునివలె (సుందరమైన) - ('అబ్జో జైవాతృకః సోమః' అమ.) - ఫాల=లలాటమునకు - అలంకార=మండనములయిన - కచఆవళీ=ముంగురుల వరుసకలవాఁడా, మక...ఖా - మకర=మొసలి (యాకారము) చే - దీవ్యత్ = ప్రకాశించుచున్న - కుండల = పోఁగులచేతను ('కుణ్డలం కర్ణవేష్టనమ్' అమ.) - అంచత్=అందగించుచున్న - ముఖా = వదనము కలవాఁడా.

బాలార్కుని చెప్పుట భగవన్నేత్రములందుంబోలె శరత్పద్మములందును ఎఱ్ఱగీత లుండుటకు. శరత్పద్మములను చెప్పుట 'శరత్పఙ్కజ లక్షణా' అన్నట్టు పద్మమునకు శరత్కాలమందు కడమకాలములలో లేనిశోభ కలుగును గావున. 'పాదాబ్జ ఫాల' అన్నచోట సంస్కృతమందు ఉపమాన పూర్వపద కర్మధారయము లేదు గావున 'పాదాబ్జ సుందర ఫాల' అని విగ్రహముగా మధ్యమపదలోపి సమాసముం జేయవలయును.—పద్మాక్ష - పాదాబ్జఫాల - ఉపమలు

'పద్మాక్ష', 'పద్మాక్ష', 'ఈశ,' 'ఈశ' 'పాదాబ్జ' - 'పాదాబ్జ,',—ముక్తపదగ్రస్తములు.

క. జలచర కిటి హరి వటు భృగు । కుల రఘుకుల సీరి బుద్ధ ఘోటి ప్రముఖో
జ్జ్వల జనికృత జనరక్షా । యలమేల్మంగాభిధేందిరాలయవక్షా. 87

...జల...క్షా - జలచర = (నీటఁ జరించునవైన) మీనకూర్మములు - కిటి = వరాహము (‘వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః’ అమ.) - హరిః = సింహము (నరసింహావతార మనుట. ‘సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః’ అమ.) - వటు=బ్రహ్మచారియైన వామనమూర్తి (‘వటవో బ్రహ్మచారిణః’ అమ.) - భృగుకుల = భృగువంశమువాఁడైన పరశురాముఁడు - రఘుకుల = రఘువంశ్యుఁడగు శ్రీరాముఁడు - సీరి = హలాయుధుఁడయిన బలరాముఁడు (‘సంకర్షణః సీరపాణిః కాళిన్దీ భేదనో బలః’ అమ. ‘హల మిగ్గ కరా సీరా’ రఘ.) - బుద్ధ = బుద్ధదేవుఁడు - ఘోటి = గుఱ్ఱముకలవాఁడైన కల్కియు (‘ఘోట సైన్ధవ గన్ధర్వా హయ వాజి తురఙ్గమాః’ రఘ. ఘోటము = గుఱ్ఱము - అది కలవాఁడు ఘోటి.) - ప్రముఖ = మొదలగు - ఉజ్జ్వల = ప్రకాశమానములగు - జని = జన్మములచేత (అవతారములచేత ననుట - ‘జనిరుత్పత్తి రుద్భవః’ అమ.) - కృత=చేయఁబడిన - జన=లోకులయొక్క - రక్షా=కాపాడుట కలవాఁడా (నానావతారములెత్తి జనులను కాపాడినవాఁడా - ‘ప్రముఖ’ శబ్దముచేత కృష్ణావతారము చెప్పఁబడినది.—

“యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్.”
“పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.”

అని గీతయందు భగవద్వచనము,), అల...క్షా - అలమేల్మంగా = అలమేలుమంగ యనెడు - అభిధా=నామముగల - ఇందిరా = లక్ష్మికి - ఆలయ = ఇల్లయిన - వక్షా = వక్షస్థలము కలవాఁడా, అలమేలుమంగయని వేంకటేశ్వరస్వామి భార్యకు అఱవపేరు - (మహద్వాచక సాంతశబ్దంబు గావున, ‘వక్షుసుఁడా’ అని రూపాంతరము - బా. వ్యా. తత్స. 81.).

రక్షా - వక్షా - అని అంత్యానుప్రాసము.

ఇందు కృష్ణావతారము నేల కవి వదలినాఁడు ? మహాకవులును దశావతారములలో కొందఱు కృష్ణునిమాని బలరాముని పఠింతురు; మఱికొందఱు బలరాముని కృష్ణుని పఠింతురు.

“మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ (లేక-కృష్ణశ్చ) బుద్ధః కల్కి చ తే దశ.”
“వేదా నుద్ధరతే, జగ న్నివహతే, భూలోక ముద్బిభ్రతే,
దైత్యం దారయతే, బలిం ఛలయతే, క్షత్త్రక్షయం కుర్వతే,
పౌలస్త్యం జయతే, హలంకలయతే, కారుణ్య మాతన్వతే,
మ్లేచ్ఛాన్మూర్ఛయతే, దశాకృతి మతే కృష్ణాయ తుభ్యం నమః.” జయదేవః.
“యస్యాలీయత వల్కసీమ్ని జలధిః పృష్ఠే జగన్మణ్డలం
దంష్ట్రాయాం ధరణీ నఖే దితిసుతాధీశః పదే రోదసీ
క్రోధేక్షత్త్రగణః శరే దశముఖః పాణౌ ప్రలమ్బాసురః
ధ్యానే విశ్వ మసా వధార్మికకులం కస్మై చిదస్మై నమః.”

"పాఠీనః కమఠః కిటి ర్నరహరిః ఖర్వాకృతి ర్భార్గవో
రామః కంసనిషూదనో దశబలః కల్కి శ్చ నారాయణః
యుష్మాకం సవిభూతయేఽస్తు భగవా న్సేతుర్భవామ్భోనిధౌ
పుత్త్రారాయ యుగేయుగే యుగపతి స్త్రైలోక్యనాథో హరిః."
"వేదా యేన సముద్ధృతా వసుమతీ పృష్ఠే ధృతా ప్యుద్ధృతా
దైత్యేశో నఖరైర్హతః ఫణిపతే ర్లోకం బలిః ప్రాపితః
క్ష్మాఽక్షత్త్రా జగతీ దశాస్య రహితా మాతా కృతా రోహిణీ
హింసా దోషవతీ ధరాప్యయవనా పాయా త్స నారాయణః."

ప్రకృతపద్యమందు 'సీరి' కి 'శౌరి' అని పాఠాంతరము కల్పించికొనిన రెండవతారములును వచ్చును. అట్లే కవి హృదయమేమో?

భుజంగప్రయాతము. బలద్విడ్వినిర్దిష్టపాథోధరోరూ
పలాసారధారాతపత్త్రీకృతాద్రీ
ఫలన్మూర్ధచాణూర భంగోగ్రబాహో
కలాకృత్తకంసా శిఖండావతంసా. 88

బల...ద్రీ - బలద్విట్ = ఇంద్రునిచేత ('వాస్తోష్పతి స్సురపతి ర్బలారాతి శ్శచీపతిః' అమ.) - వినిర్దిష్ట=పంపఁబడిన - పాథోధర=మేఘములయొక్క (ఇంద్రుఁడు మేఘములం బంపుట అవి తనవాహనము లగుటచే తన కధీనములు గావున) - ఉరు=గొప్ప - ఉపల=ఱాలయొక్క - ఆసార=సంతత ధారావృష్టికి (అడ్డముగా) - ఆతపత్త్రీకృత=గొడుగుగాఁ జేయఁ బడిన ('ఛత్త్రం త్వాతపత్రమ్' అమ.) - అద్రీ = (గోవర్ధన) పర్వతము కలవాఁడా (ఒకానొకప్పుడు గోపకులు ఇంద్రునికై యుద్దేశించిన పూజోపహారములను శ్రీకృష్ణుఁడు ఇంద్రుని కిడనీయక మాన్పించి తనకుం బెట్టించుకొని తా నారగించెను. అందులకు క్రుద్ధుఁడై ఇంద్రుఁడు గోబృందములను గోపకులను నాశము చేయుటకై మేఘములచే ఱాలు గురియింపఁగా శ్రీకృష్ణుఁడు ఏడు దినములు గోవర్ధనపర్వతమును ఆశిలావర్షమునకు అడ్డముగా ఎత్తి ఒకవ్రేలిపై నిలుపుకొని గోగోపక బృందములను రక్షించెను. ఈకథను విస్తరముగ భాగ. ౧౦. స్కం. లో చూ.), ఫ...హో - ఫలత్=పగులుచున్న - మూర్ధ=శిరము కలవాఁడైన - చాణూర=చాణూరుఁ డనెడు జెట్టియొక్క (జెట్టిని) - భంగ=కీటణఁగించుటయందు - ఉగ్ర=రౌద్రమయిన ('రౌద్రం తూగ్రమ్' అమ.) - బాహో = బాహువులు కలవాఁడా (కంసుఁడు శ్రీకృష్ణులవారి మీఁదికి చాణూరమల్లుని పంపెను. శ్రీకృష్ణులవారు వానితోఁ బోరి కడపట వానికరంబులు పట్టి గిరగిర ద్రిప్పి నేలం గొట్టిరి. అంతట వాఁడు తలపగిలి నోర నెత్తురు గ్రక్కుకొని యమసదనంబున కేఁగెను. భాగ. ౧౦ స్కం.), క...సా - కలా=క్షణములోని ముప్పదియవ భాగములో (అత్యల్పకాలములో ననుట.—'అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా త్రింశత్తు తాః కలా । తాస్తు త్రింశత్క్షణః' అమ.) - కృత్త = ఛేదింపఁబడిన - కంసా=కంసుఁడు కలవాఁడా (శ్రీకృష్ణులవారు తన్నుం జంప నుద్యుక్తుఁడైన తనమేనమామను కంసుని చంపిన కథను భాగ. ౧౦ స్కం. లో చూ.), శి...సా - శిఖండ=నెమలిపురి ('శిఖణ్డో బర్హ చూడయోః' హేమ.) - అవతంసా = సిగపూవుగాఁ గలవాఁడా.—అంత్యానుప్రాసము.—భుజంగప్రయాత వృత్తము-'భుజంగ ప్రయాతంబునన్ యైలయాయా.' (ఛందస్సు)

మ. ఇది కర్ణాటధరాధృతిస్థిరభుజాహేవాకలబ్ధేభరా
డుదయోర్వీధర తత్పితృవ్యకృత నవ్యోపాయనోష్ణీషర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహిం బొల్పగున్.

కర్ణా...దన్ - కర్ణాట = కర్ణాటమనెడి (కన్నడదేశమనుట) - ధరా = భూమియొక్క (దేశముయొక్క యనుట) - ధృతి=ధరణమందు (ఆభూమిని మోచుటయందు - ఆదేశమును ఒరులచేతఁ బడనీయక ఏలుటయందు) - స్థిర = నిశ్చలమైన - భుజా = బాహువుయొక్క - హేవాక = ఇచ్ఛామాత్రముచేత - లబ్ధ=పొందఁబడిన - ఇభరాట్=గజపతియైన ప్రతాపరుద్రునియొక్క - ఉదయ ఉర్వీధర=ఉదయగిరి దుర్గమందు - తత్ =ఆ గజపతికి - పితృవ్య=పినతండ్రియైన ప్రహారేశ్వరపాత్రునిచేత - కృత = చేయఁబడిన - నవ్య = నూతనమైన - ఉపాయన = కానుకయైన - ఉష్ణీష = కిరీటముయొక్క ('ఉష్ణీషం శిరోవేష్ట కిరీటయోః' అమ.) - రత్న = మణు లనెడి - దృక్=చూపులతో - అంచత్ =ఒప్పుచున్న - పద=పాదములుగలవాఁడైన - కృష్ణరాయ(ఁడనెడి) - వసుధాధ్యక్ష=ఱేనిచేత - ఉదిత=చెప్పఁబడిన (రచింపఁబడిన యనుట) - ఆముక్తమాల్యదన్= ఆముక్తమాల్యద యను ప్రబంధములో - ఆశ్వాసము ఇది=ఈ యాశ్వాసము, హృద్యపద్యములన్= మనోహరములయిన పద్యములతో - ఆద్యంబై = మొదటిదియై - మనోహర పద్యములకు మేలుబంతి యై యనియు), మహిన్ = లోకములో, పొల్పు అగున్ = సొంపారును.

కృష్ణదేవరాయలు దిగ్విజయములో ఉదయగిరిదుర్గమును ముట్టడించినప్పుడు అందు ప్రహారేశ్వర పాత్రుఁ డనువాఁడు గజపతికి పినతండ్రి తా వుండి కడుసమర్థుఁడై ఎన్నాళ్లకును దుర్గమును లోఁబడనీయక పోరాడుచుండెను. అంతనొకనాఁడు కృష్ణరాయఁడు 'ఈదినము ప్రహారేశ్వరుని తలఁ ద్రొక్కక స్నానము చేయను' అని ప్రతిజ్ఞ చేసి స్వయముగా ముట్టడి నడుపఁగా ప్రహారేశ్వరుఁడు భయపడి లోఁబడి తనతలకుమాఱుగా తనకిరీటమును పంపఁగా రాజు దానిం ద్రొక్కి మాధ్యాహ్నికము గావించె నని యైతిహ్యము. దాని నిట ననుసంధించికొన వలయును.

*'హేవాక' - బిల్హణ కల్హణులకంటె పూర్వకవులు ప్రయోగింప లేదనియు దానంజేసి యిది అరబ్బీనుండియో పారసీనుండియో వచ్చియుండు ననియు శబ్దప్రకృత్యన్వేషు లయిన పండితులు వక్కాణించు చున్నారు. పైయిరువుర ప్రయోగములందును నిది ఇచ్ఛాపరముగాఁ గనఁబడుచున్నది.—

'నీలచ్ఛత్రో న్మదగజ ఘటా పాత్ర మత్రస్త చోళా
చ్చాలుక్యేన్ద్రా ద్దలభత కృతీ యో౽త్ర విద్యాపతిత్వమ్
అస్మి న్నాసీ త్తదను నిబిడా శ్లేష హేవాకలీలా
వేల్ల ద్బాహు క్వణిత వలయా సంతతం రాజలక్ష్మీః.' బిల్హణ., విక్ర. ౧౮ (౧౦౧).

* చూ. "భావపరిశుద్ధి కలనా ప్రావీణ్యామృత గిరీశ పావన పదరా
జీవయుగ భక్తి తత్పర సేవాహేవాకనిరత సిద్ధయపాత్రా" జక్కన. విక్ర 5 - 228.

'జాయన్తే మహతా మహో నిరుపమ ప్రస్థాన హేవాకినాం
నిస్సామాన్య మహత్త్వయోగ పిశునా వార్తా విపత్తావపి.' కల్హణ.

ముద్రిత దశరూప పుస్తకములలో హావలక్షణము.—'హేవాకసస్తు శృఙ్గారో హావోఽక్షి భ్రూవికారకృత్' అనియున్నది. ఇట 'హేవాక సస్తు' అని 'సహేవాకస్తు' అనుటకు అచ్చు తప్పని యెన్నఁదగియున్నది.—

'భ్రూనేత్రాది వికారైస్తు సంభోగేచ్ఛా ప్రకాశకః
భావ ఏవాల్ప సంలక్ష్యో వికారో హావ ఉచ్యతే.' సా. ద.

'సహేవాక = ఇచ్ఛాప్రకాశనసహితః' అని వ్యాఖ్యచేయఁదగును. ప్రకృత స్థలమందు కృష్ణరాయని బాహువు కోరినమాత్రాననే ఉదయగిరి దుర్గంబును ప్రహరేశ్వర కిరీటంబును లభించె నని భా.

'రత్నదృక్'—కిరీటము ప్రహరేశ్వరుని తలకు బదులుగా వచ్చినది గావున అందలి రత్నములు తలయందలి కన్నులకు బదులుగా నొప్పుచున్న వని స్వారస్యము.

ప్రథమాశ్వాసము సమాప్తము.

---

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## ద్వితీయాశ్వాసము

క. శ్రీనయనకువలయుగళానూనజ్యోత్స్నాయితస్మితోజ్జ్వలముఖ దై
త్యానీతసురశ్రీ పునరానయనక్రమణ వేంకటాచలరమణా. 1

శ్రీ...ఖ - శ్రీ = లక్ష్మీదేవియొక్క - నయనకువల = కలువలవంటి నేత్రములయొక్క - ('కువలం చోత్పలే ముక్తాఫలేఽపి బదరీఫలే' మేది.) - యుగల=ద్వయమునకు - అనూన=కొఱవడని - జ్యోత్స్నాయిత=వెన్నెలవలె నాచరించుచున్న - స్మిత=మందహాసముచేత -ఉజ్జ్వల= వెలుంగుచున్న - ముఖ=వదనముకలవాఁడా, దై...ణ - దైత్య=దానవునిచేత (బలిచేతననుట)- ఆనీత = అపహరింపఁబడిన - సుర = దేవతలయొక్క - శ్రీ = సిరియొక్క (సిరిని) - పునః = మరల - ఆనయన = తెచ్చునవైన - క్రమణ = అంజలు కలవాఁడా ('క్రము పాద విక్షేపే' ధా. పా. - వామనావతారవృత్తాంతము ననుసంధించుకొనవలయును - పాదముతో తెచ్చినవాఁడా అని స్వారస్యము),

వ. అవధరింపు మాసమయంబునఁ బాండ్యమండలంబున. 2

అవధరింపు = చిత్తగింపుము, ఆసమయంబునన్ = (విష్ణుచిత్తుఁడు ఆవిధమున అతిథి పూజలు సల్పుచు సుఖంబున్న) యాకాలమందు, పాండ్యమండలంబునన్ = పాండ్యదేశమందు

('స్యాన్మణ్డలం ద్వాశరాజకే చ దేశే చ బిమ్బే చ కదమ్బకే చ
కుష్ఠప్రభేదేఽప్యుపసూర్యకే చ భుజఙ్గభేదే శుని మణ్డలః స్యాత్.' విశ్వ.).

సీ. ఏవీట సతులపాలిండ్లపై గంబూర
నవహారములచిప్పకవుచు మాన్చు,
మలయజం బేవీటఁ దొలుఁజెక్కు డులిచి మే
డల కిడ్డమిగులు భూములకు డిగ్గుఁ,
గలఁచు నేవీటిసింహళగజంబులగాలి
చైత్రవేళ నుదగ్దిశాగజంబుఁ,
దాల్తు రేవీటి ప్రాక్తనభూపనిర్మాల్య
మరకతంబులు వెలిధరణిపతులు,
తే. కపివర నియుక్త గిరిసన్ధ్గహననిలయ
గాత్రగాహితకనకముక్తాకవాట

గోపురావేదితోచ్ఛ్రితాక్షోభ్యవప్ర-
దనరు దక్షిణమధుర సాంద్రద్రుమధుర. 3

1. ఏ...ర - ఏవీటఁ=ఏమధురా పట్టణమందు, సతుల=వెలఁదులయొక్క ('సతీసాధ్వీ పతివ్రతా' అమ. - ఇట లక్ష్యార్థము) - పాలిండ్లపైఁ=స్తనములమీఁద, కంబూర=కర్పూరము (కంబూరము - కంబురా - కంబురము - అని రూ,), న...చుఁ - నవ=నూతనమైన (ముక్తాకరమైన తామ్రపర్ణీనదిసమీపమునఁ గనుక ముత్తెపుఁ జిప్పలనుండి ముత్తెములను తీసి అప్పుడే గ్రుచ్చుకొన్నట్టి యనుట) - హారముల=ముత్తెపుఁ బేరులయొక్క - చిప్పకవుచుఁ=ముత్తెపుఁ జిప్పలయొక్క నీచువాసనను (ఇంకను ముత్తెములనుండితొలఁగనట్టిదానిని), మాన్చుఁ=పోఁగొట్టును.—ఆదేశమునంటిన తూర్పుసంద్రములోను ఆదేశమున బాఱు తామ్రపర్ణిలోను ముత్తెములు పుట్టును. కావున ఇతరులకు దుర్లభములయినముత్తెములు వీరికి అత్యంత సులభములు - వీరిభాగ్యము అంతగొప్పది అని భా. కాచువదలకముందే ధరించుట అటనే పుట్టుటచేతను అపూర్వగుణవిశేషముచేతను - సంబంధాతిశయోక్తి.

2. ఏవీటఁ - మలయజంబు = చందనము ('గంధసారో మలయజో భద్రశ్రీశ్చందనోఽస్త్రియామ్.' అమ.), తొలుఁజెక్క=మొదటి చెక్కను, దులిచి=తివిచి, మేడలకుఁ - ఇడ్డమిగులు=మేడలం గట్టుటకు వినియోగింపఁగా శేషించినభాగము—(అచట మేడలన్నియు గందపుఁగలపతోఁ గట్టిన వనుట-గందపు మ్రాఁకుల యడవులుగల మలయపర్వతము ఆదేశములోనిది గావున అట్లు జరుగును.) భూములకుఁ = ఇతరదేశములకు, డిగ్గుఁ = వచ్చును;- సంబంధాతిశయోక్తి.

3. ఏ...లి - ఏపట్టణమందలి - సింహళ గజంబుల = సింహళద్వీపమునుండి తేఁబడిన యేనుఁగుల (మదముయొక్క వాసనతోఁ గూడుకొన్నట్టి) గాలి, చైత్రవేళఁ = చైత్రసమయమందు (వసంతారంభమందు అనుట) ఉదక్దిశాగజంబుఁ = అంగన యను పేరి యుత్తర దిగ్గజమును, కలఁచుఁ = క్షోభపెట్టును:- ఏనుఁగులు తమకన్న బలిష్ఠమైన యేనుఁగుయొక్క మదవాసన సోఁకినచో కలంగి పలాయితములగును -

'సప్తచ్ఛద క్షీరకటుప్రవాహ మసహ్య మాఘ్రాయ మదం తదీయమ్
విలఙ్ఘితాధోరణతీవ్రయత్నా స్సేనాగజేన్ద్రా విముఖా బభూవుః.' రఘు. 5-48.

చైత్రమాసమందు గాలి దక్షిణమునుండి ఉత్తరమునకు వీవ నారంభించును; అంతకుముందు ఉత్తరమునుండి దక్షిణమునకు వీచుచుండును. చైత్రమారుతము సింహళ గజముల మదవాసనతో ఉత్తరమునకు వీవఁగా ఆవాసనకు ఆయుత్తర దిగ్గజము భయపడును. వసంతమందెల్ల దక్షిణపుగాలియే వీచుచున్నను అందులో పూర్వమాసమైన చైత్రముం జెప్పుట ఆరంభములో కలఁక ఎక్కువ గావునను, అనంతరము అలవాటై పోవునుగావునను; ఇచటి గజములు దిగ్గజముల కన్న బలిష్ఠము లని భా.

'సింహళగజంబులు' - సింహళదేశమందు ఏనుఁగులయుత్పత్తి ప్రసిద్ధము; ఆగజముల గాలి యీవీటినుండి వీచుననుటచేత ఆదేశము ఈదేశపురాజు క్రింద నున్న దనియు అందలియుత్తమగజములు ఈతని రాజధానియందే యున్నవనియు భా.—కలఁచుట అవాస్తవముగాన సంబంధాతిశయోక్త్యలంకారము. సింహళగజములుగాన సింహవాసనగలవి అనుటీక అనుపపన్నము.

4. ఏ...లు - ఏవీటి - ప్రాక్తనభూప=తొంటిరాజులయొక్క - నిర్మాల్య=ధృతత్యక్తములయిన - మరకతంబులు = పచ్చలను, పెఱ ధరణీపతులు = కడమరాజులు, తాల్తురో;—పచ్చలను సింహళమందు పుట్టును; అందును అచ్చటి తొంటిరాజులు ధరించి అంతకన్న మే లయినవి దొరకినపుడు పాఱవైచిన మునుపటి పచ్చలు మాత్రమే ఇతరరాజులకు దొరకు ననుట; - సంబంధాతిశయోక్తి.

కపి...వప్ర - కపివర = సుగ్రీవునిచేత - నియుక్త = పనుపుపెట్టఁబడిన - గిరిసదృక్ = కొండలవంటి (కొండలంత లేసి) - గహననిలయ = క్రోఁతులయొక్క (గహన = అడవి - నిలయ= నివాసస్థానముగాఁ గలవి) - గాత్ర = దేహములచేత - గాహిత = ప్రవేశింపఁబడిన - కనకముక్తా కవాట = బంగారము తోడి ముత్యాల తలుపుగలదైన (మధురాపురమునకు కవాటము ముక్తామయమనుటకు 'ముక్తా కవాటం పాణ్డ్యానాం తత్ర ద్రక్ష్యథ వానరాః' అని వానరులం గూర్చిన సుగ్రీవోక్తి నరయుఁడు) - గోపుర = పురద్వారముచేత ('పురద్వారంతు గోపురమ్' అమ.) - ఆవేదిత= తెలుపఁబడిన - ఉచ్ఛ్రితా=ఔన్నత్యముచేత - అక్షోభ్య=దుర్ధర్షమైన - వప్ర=ప్రాకారము (కోట) గలదియు ('వప్రః ప్రాకార రోధసోః' హేమ.), సాం...ర - సాంద్ర=దట్టమైన - ద్రుమ=వృక్షములయొక్క ('పలాశీ ద్రు ద్రుమాగమాః' అమ.) - ధుర=భారముకలదియు. ఐన - దక్షిణ మధుర (శూరసేన దేశమందు యమునయొడ్డున నున్న మధుర=ఉత్తరమధుర), తనరుఁ= ఒప్పుచున్నది.

* 'మధుర' - రూ. మధూర. పీఠికచూ. మధుర మోక్షదాయకపురములలో నొకటి;—

'అయోధ్యా మధురా మాయా కాశీ కాఞ్చ్య హ్యవన్తికా
పురీ ద్వారవతీచైవ సప్తైతా మోక్షదాయికాః.'

ఒండె శూరసేనరాజధాని కానిది ధకారమధ్యనామకము ఉత్తరమున నొకటియుండి తదపేక్షచేత దీనిని దక్షిణమధుర యని ధకారమధ్యనామకముగానే కవి వ్యవహరించి నాఁడని యేని తలంపవలయును. కడపట అంత్యానుప్రాసము.

క. శమనరిపుత్రిపురభిదో । ద్యమవద్దోర్వర్జ్యవలయితస్వర్ణగిరి
భ్రమదంబై కాంచనవ । ప్రముదీప్రంబగుచు నప్పురంబున కొప్పుఁ. 4

అప్పురంబునకుఁ = ఆ మధురానగరమునకు, కాంచన వప్రము = బంగారపుఁగోట, దీప్రంబగుచుఁ = ప్రకాశమానమై, - శమ......బై - శమనరిపు = శివునియొక్క (శమన = యమునియొక్క - రిపు=శత్రువైన - శివుఁడు శమనరిపుఁడు) - త్రిపుర=అసురులవైన (బంగారు పురము, వెండిపురము, ఇనుపపురమును అయిన) మూఁడుపురములయొక్క - భిదా = ధ్వంసనమందు - ఉద్యమవత్ = ప్రయత్నవంతమయిన - దోః = బాహువుచేత - వర్జ్య=విడువఁబడిన -

---

* తమిళ 'సంగం' వాఙ్మయములో నేటి మధురకు ఉత్తరమధుర యనిపేరు, తొలుతటి మధుర సముద్రమున మునిఁగి పోఁగా పాండ్యులు కపాటపురమును నిర్మించుకొనిరఁట. అదియు మునిఁగిపోఁగా భగవంతుఁడు సర్పాకారమున చూపిన గీతపై ఈ మధురను నిర్మించుకొనిరఁట. దీనికి అందుచేత తిరువాలవాయి యనియు ఉత్తరమధుర యనియు పేళ్లు. రాయలవారు ఇది యెఱిఁగి వ్రాసినట్లు కానరాదు. అట్లే జావా ద్వీపమున నొక మధురకలదు. ఇదేదో తమిళశబ్దము. కాని కవి యిచట శూరసేనరాజధానినే హృదయమందుంచుకొని దీనిని దక్షిణమధుర యన్నట్లున్నది.

వలయిత = మండలీ కృతమయిన (మిక్కిలి వంపఁబడిన) - స్వర్ణగిరి = బంగారుకొండ (మేరు పర్వతము) యొక్క - భ్రమ = భ్రాంతిని - దంబు = ఇచ్చునది, ఐ, ఒప్పుౘ.

పురిచుట్టును బంగరుకోట యెట్లున్న దనఁగా.—త్రిపురములపై దాహార్థము బాణమేయు టకై శివుఁడు మండలాకారముగా ఆకర్షించి దాహమైన పిమ్మట నిట పాఱవైచిన మేరుచాపము సుమా యిది అను భ్రమను కలిగించుచున్నది. ఈయర్థమునకు 'వర్జ్య' కన్న 'త్యక్త' అనుట మేలు.- ఉత్ప్రేక్షాలంకారము. 'ద్యుమవద్దోర్దండవలయిత,' 'ద్యుమదోర్దండైకవలయిత,' 'ద్యుమ వద్దోర్వజ్రవలయిత' అని పా.

తే. సొరిదిఁ గనుపట్టు హేమరశ్ములు సెలంగఁ
బొడవుకతమున సూక్ష్మమై పొల్చుఁ జూడఁ
బట్టణము కోటకొమ్మలపంక్తి గగన
మండలశ్రీకి సంపంగిదండవోలె. 5

పట్టణము కోట కొమ్మల పంక్తి = ఆ యూరి కోట బురుజులవరుస, సొరిదిౘ = క్రమ ముగా, కను...లు - కనుపట్టు = అగపడెడి - హేమ = బంగారపు - రశ్ములు = కాంతులు ('రశ్మిః పుమాౘ దీధితౌ స్యా త్పక్ష్మప్రగ్రహయో రపి' మేది.) చెలంగౘ = ఒప్పుచుండఁగా, పొడవుకతమునౘ = ఔన్నత్య కారణముచేత, సూక్ష్మమై = చిన్నవస్తువుగా కనఁబడుచు, చూడౘ = చూచుటకు (దృష్టికి), గగనమండల శ్రీకిౘ = ఆకాశ ప్రదేశ లక్ష్మియొక్క, సం పెంగ పూవుల దండపోలెౘ, పొల్చుౘ.

ఆపురి కోటకొమ్మలు సౌవర్ణములు, సంపెంగపువ్వులును బంగారువన్నె కలవి, దూరపు వస్తువులు చిన్నవిగా నగపడును. ఆబంగారపు కోటకొమ్మలు అత్యౌన్నత్యము (అతిదూరము) చేత (సంపెంగపువ్వులవన్నెతో) సంపెంగపువ్వులంతలేవిగాను దూరముచేతనే దగ్గఱదగ్గఱగా వరుసగాను అగపడుటచేత అవి ఆకాశలక్ష్మియొక్క సంపెంగ పూదండయో యనున ట్లొప్పును.— కోట అత్యున్నత మని భా.—ఉత్ప్రేక్షాలంకారము. 'సొరిదిఁ గనుపట్టుట' - గ్రుచ్చినట్టుండు టకు. 'సంపంగిదండవోలె' - సంపంగిదండ కచధార్యము, కావున ఆకాశమెంత యున్నతమో కోట అంతకన్న నున్నత మని భా.—'పట్టణముకోట' - ముపర్ణకంబునకు పుంపులు 'కర్మధార యంబులయందు' మాత్రమే విహితము లయినను, 'కర్మధారయంబులందు' అను బహువచనంపు స్వారస్యముచే అన్యసమాసములందును గన్పట్టుచున్నవి; 'పరిపరివిధంపు జన్నంపుఁ బరికరంపు సొంపు సంపద' మను. 'పణ్యారంపుఁ బుణ్యంపుఁ గంపుల' ఆము. కావున 'పట్టణపుఁగోట' అని వైకల్పికముగాఁ జెప్పవచ్చును.

మ. పరిఖం దత్పురకామినీజనము లంభఃకేళిసల్పంగఁ ద
ద్గురువక్షోరుహ లిప్తసంకుమదకస్తూరీమిళచ్చందనా
గురుపంకంబుల సౌరభంబులఁ జుమీ కుంభీనసావాస ని
ర్జరకల్లోలిని కందు భోగవతి నాఁ జన్పంజ్ఞ గల్గె న్దగౘ. 6

తత్ పురకామినీ జనములు = ఆపట్టణపు యువతీబృందములు, పరిఖౘ = అగడితయందు ('ఖేయంతు పరిఖా' అమ.—పరితః ఖన్యతే ఇతిపరిఖా. వర్గద్వితీయ మధ్యముగాని వర్గచతుర్థ

మధ్యముగాదు), అంభః కేళిన్ = జలక్రీడను, సల్పంగన్ = కావించినందువలన, తత్ ...లన్ - తత్ = ఆయువతులయొక్క - గురు = గొప్పవైన - వక్షోరుహ = స్తనములయందు (వక్షః = ఱొమ్మున - రుహ = మొలచునట్టివి) - లిప్త = పూయఁబడిన - సంకుమద = జవ్వాదితోను - కస్తూరీ = మృగనాభితోను - మిళత్ = కూడుచున్న - చందన = మంచి గంధములయొక్కయు - అగురు = అగరుగంధముయొక్కయు - పంకంబుల = బురదలయొక్క (మైపూఁతలయొక్క) - సౌరభంబులన్ = పరిమళములచేతను, చుమీ, కుం...కిన్ - కుంభీనస = పాములయొక్క (చిన్నకుంభమువంటి ముక్కు కలది 'శేలి హానో ద్విరసనో వ్యాళః కుమ్భీనసో హరిః' అమ.) - ఆవాస = నివాస = నివాసస్థానమైన పాతాళమందలి - నిర్జరకల్లోలినికిన్ = దేవనదికి, అందున్ = ఆపాతాళమందు, భోగవతి

('గృహం శయ్యా చ వస్త్రం చ తథాభరణ మేవ చ
స్త్రీ పుష్పం గన్ధ తామ్బూలే అష్టౌ భోగాః ప్రకీర్తితాః.'

అనెడి యష్టభోగములలోనిదైన గంధము కలదిగావున) భోగము కలది ('నదీ నగర్యో ర్నాగానాం భోగవతీ' అమ.) - సంజ్ఞ = అనఁనొప్పు పేరు - తగన్ = ఉచితముగా, కల్గెన్.

మధురాపుర యువతులు అగడ్తలో జలక మాడఁగా జవ్వాజియు కస్తూరియు కలపిన చందనాగురువుల మైపూఁత వారికుచములం దలందికొన్నట్టిది, కరఁగి ఆనీటం గలయఁగా, అనీటిలో కలసియున్న పాతాళగంగకు అష్టభోగములలో నొకటియైన యాగంధముయొక్క సంపర్కముచేత భోగవతి యను నన్వర్థనామము కలిగినది.—పరిఖ అరసాతలగంభీర మని భా.—కావున అతిశయోక్తి ధ్వని; భోగవతీశబ్దమునకు యోగముచే నర్థాంతరకల్పన చేసినందున నిరుక్త్యలంకారము. 'యోగముచే నామములకు । బాగగు నన్వర్థకల్పి పరఁగు నిరుక్తిన్.' అలం.

'కామినీ' అనుట అకాములగు వృద్ధాదులకు ఈ చెప్పిన మైపూఁతయుండదు గావున. కాములు గావుననే 'కేళి' యు; 'నిర్జర కల్లోలిని'—దేవనదియే మూఁడు లోకములందును మూఁడు నామములం బరఁగుచున్నది.—

'దేవ స్యాత్మభువః కమణ్డలు జల స్రోతాంసి మన్దాకినీ
గఙ్గా భోగవతీమయాని పునతే యావ త్త్రిలోకీ మిమామ్.' అనర్ఘ.

'చన్సంజ్ఞ = చనుసంజ్ఞ - 'అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లుపరం బగునపుడు లోపంబు వైకల్పికంబు,' ప్రౌ. వ్యా. 'అగురు' - రూ. అగరు.

"చం. మరువకగంధిలంబులును మంద రవిద్యుతులుం దుపార ధూ
సరములు సర్వవాంఛిత హసంతికముల్ సముదగ్రసార భా
గరు పరిలిప్త భోగియువకంఠతలంబులునై తలిర్చె వా
సరములు దంతసీత్కృతి వశంవదముల్ తుహినాగమంబునన్." రామాభ్యు. 5 (125).

తే. కాద్రవేయులు భూమియుఁ గైకొనంగ
నురగలోకంబు వెడలి తత్పరిఖనీట
నెగసి తోడనె క్రుంకుదు ర్నిలువ లేక
తత్తటాబద్ధగారుత్మతముల కులికి. 7

కాద్రవేయులు = నాగులు ('నాగాః కాద్రవేయాః' అమ. - కద్ర్వా అపత్యాని = కద్రువయొక్క సంతతి(, భూమియున్ = భూలోకమునుగూడ, కైకొనంగన్ = ఆక్రమించుటకై, ఉరగ

లోకంబున్ = నాగ ('ఉరగః పన్నగో భోగీ' అమ.) లోకమునుండి (పాతాళ లోకమునుండి) తత్ ...వఙ్ - వెడలి=తరలి, తత్ = ఆపరిఖయొక్క - తట = దరులయందు - ఆబద్ధ=అంతటను, (మెట్లుగా) కట్టఁబడినట్టి - గారుత్మతములకున్ = గరుడపచ్చలకు, ఉలికి = భయపడి నిలువలేక, తోడనే=వెంటనే, క్రుంకుదుర్ = క్రుంకుదురు = మునుఁగుదురు.

నాగులు భూలోకమునుగూడ ఆక్రమించుటకై పాతాళలోకమునుండి ఆయగడ్తనీటి దారిని పైకి వచ్చి దానిదరులకు మెట్లుగా కట్టఁబడియుండు గారుత్మతములం గాంచి భయపడి మఱి యట నిలువలేక వెంటనే మునుంగుదురు.

'యఙ్' - పాతాళమునే గాక యనియర్థము. గరుడపచ్చలు సర్పవిషమును హరించుటయు వానికి సర్పములు భయపడుటయు ప్రసిద్ధము.—

'యస్మైదదాతి వివరం భూమిః ఫూత్కార మాత్ర భీతేవ
ఆశీవిషః సదైవా ద్రౌమ్బకరణ్డే నితిం సహతే.' సు. భా.

ద్రౌమ్బ కరణ్డే = గారుత్మత కరణ్డే, అని తట్టీక. 'నెగయు' - రూ. ఎగయు - 'బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు। నీరిలోననుండి నెగయుదెంచె.' - భార. ఆది ౫(౧౨౩). అప్ప. - అతిశయోక్తి.

తే. తరుణశైవాలజలజపత్త్రములు వొదువ
మరకతచ్ఛాయఁ బొల్చుఁ దత్పరిఖజలము
కోట బంగారు సేయుటకొఱకు మున్ను
బ్రహ్మ పిడిచినమందాకు పస రనంగ. ౮

తత్ పరిఖజలము=ఆయగడితనీరు, తరు...లు - తరుణ=లేఁతవైన - శైవాల=నాచులును ('జలనీలీతు శేవాలం శైవలః' అమ ) - జలజపత్త్రములు = తామరాకులును, పొదువన్ = కప్పుకొనఁగా, కోటన్ = ప్రాకారమును, బంగారు సేయుటకొఱకు (పా. బంగారుగాఁ జేయు కొఱకు), మున్ను = పూర్వము, బ్రహ్మ పిడిచిన మందాకు పస రనంగన్, మరకతచ్ఛాయన్ = పచ్చలకాంతితో, పొల్చున్. లేఁతనాచును తామరాకులును కప్పుకొనియుండుటచేత ఆయగడ్త నీరు గరుడపచ్చలవన్నె గలిగి ఎట్లుండు ననఁగా, ఆకోటను బంగారుకోటఁగాఁ జేయుటకై బ్రహ్మ పూర్వము పిడిచిన మందాకుపసరో యనునట్లు ప్రకాశించుచుండును.—ఉత్ప్రేక్షాలంకారము; 'మరకత చ్ఛాయన్ బొల్చున్' అనుట పదార్థవృత్తి నిదర్శన. శైవాల జలజినీ పత్త్రచ్ఛాయ జలమునకుఁ గలుగుట తద్గుణాలంకారము.

'జలజపత్త్రములు'—'బిసినీచ్ఛదములు' - అని పా. కల్పించుకొనవచ్చును. - 'వా పుంసి పద్మం నళినమ్...పుష్క రామ్భోరుహాణిచ' అమ. 'పద్మశబ్దము మొదలు 16 తామర పువ్వుల పేరులు' అని లింగా. 'నళిన్యాంతు బిసినీపద్మినీముఖమ్' అమ. 'నళినీశబ్దము మొదలు 3 పద్మములు గలదేశమునకుఁగాని పద్మసమూహమునకుఁగాని తామరతీఁగకుఁగాని పేరులు. ముఖ మన్నందున అబ్జినీ కమలినీ సరోజిన్యాది శబ్దములు గ్రహింపఁబడుచున్నవి.' లింగా.—ఇందువలన తామరరేకులను జలజపత్త్రము లనియు, తామరాకులను జలజినీపత్త్రము లనియు వ్యవహరించుట న్యాయ్యము. పత్త్రశబ్దము రేకులకును వాచక మగుట సహస్రపత్త్ర శతపత్త్ర శబ్దములవలన నే స్పష్టము. అట్లే బహుళ ప్రయోగములు గానంబడియెడి.

'అమ్భోజపత్త్రాయత లోచనానా । మమ్భోధి దీర్ఘాస్విహ దీర్ఘికాసు
సమాగతానాం కుటిలై రపాఙ్గై । రనఙ్గ బాణైః ప్రహతా యువానః.' భోజప్ర.

మ. 'అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్త్రేక్షణఁ జంచరీక చికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభి న్నవలా నొకానొక మరున్నారీశిరోరత్నమున్'. మను.

'స్థిత మురసి విశాలం పద్మినీపత్త్ర మేతత్
కథయతి నతథాన్త ర్మన్మథోత్థా మవస్థామ్
అతిశయ పరితాపగ్లాపితాభ్యాం యథాఽస్యాః
స్తనయుగపరిణాహం మణ్డలాభ్యాం బ్రవీతి.' రత్నా.

'ఆ నీరమె ముక్తమ్ముల్లు నళినీదళసంస్థితమై తనర్చు-' తె. భ. హ.

'నళినీదళగతజల మతి తరళం । తద్వజ్జీవిత మతిశయచపలమ్.'

'ఉత్సృజ్య కుసుమశయనం । నళినీదళకల్పిత స్తనావరణమ్
కథమాతపే గమిష్యసి । పరిబాధా పేశలై రఙ్గైః.' శాకుంత.

'క్లాన్తో మన్మథలేఖ ఏష నళినీ । పత్త్రే నఖై రర్పితః' శాకుంత.
'యత్స్నేహా దనరాళనాళ నళినీ । పత్త్రాతపత్త్రం ధృతమ్'. ఉ. రా. చ.

అయినను ప్రకృతపద్యగత ప్రయోగము శిష్టసమ్మతముగాను ప్రకరణముచే సుగమముగాను ఉన్నది కావున ఆక్షేపణీయముకా కున్నది - ఎట్లన -

'సౌవర్ణే రాజతే పాత్త్రే తామ్రే పద్మ పలాశయోః
భోజనే భోజనే నైవ త్రిరాత్రాత్ఫల మశ్నుతే.' పైఠీనసిస్మృతి.

'య ఇచ్ఛే దూర్ధ్వగామిత్వం పరం స్థానం చ శాశ్వతం ।
పద్మపత్త్రే తు భోక్తవ్యం మాస మేకం నిరన్తరమ్.'—స్మృతిచంద్రికలో పురాణవచనము.

'నైవేద్య పాత్త్రం వక్ష్యామి కేశవాయ మహాత్మనే
హైరణ్యం రాజతం కాంస్యం తామ్రం మృణ్మయ మేవ వా
పాలాశం పద్మపత్త్రం వా పాత్త్రం విష్ణో రతిప్రియమ్.' పద్మపురాణము.

'మరకతచ్ఛాయ', 'పసరు'—'కమలినీ హరితై స్సరోభిః' శాకుంతలము.

చ. అడుగున నుండియు న్బదిలమై చద లంటెడుకోట నొప్పు ప్రో
ల్చెడనికడంక దంచనపుఁ జేతుల గంగను గాసెఁ దూఱఁగా
నడుమన యున్కిఁ జేసి యల నాకపురిన్ సరికై పెనంగి లా
వెడలఁగఁ బట్టిప్రేయుటకు నెత్తె నన న్జను మల్లుపోరిలోన్. 9

అడుగున నుండియున్ = పునాది మొదలుకొని, పదిలమై = దృఢమై, చదలు అంటెడు కోటన్ = ఆకాశమునొరయు ప్రాకారముకలదై, ఒప్పు ప్రోలు = శోభిల్లుచున్న యాపట్టణము, దంచనపుఁ జేతులు = కోటమీఁది పెద్దపిరంగులనెడు చేతులు, గంగన్ కాసెన్ = మిన్నేఱనెడి దట్టి

కొకను, తూఱన్=చొరఁగా, (ఎట్లున్నదనఁగా), (అప్రోలు), సరికై=తనతో సాటి నటించినందులకై, ఆలనాకపురిన్ = ఆస్వర్గపట్టణమును (అమరావతిని), చెడని కడంకన్ = అప్రతిహతమైన పూనికతో, మల్లు పోరిలోన్ = జెట్టి యుద్ధమందు, అడుగుననుండియున్ = అడుగిడి నిలిచిన విధము మొదలుకొని, పదిలమై = తన్ను కాచికొనుచు, చదలు అంటెడుకోటన్ = కోట వంటి మహోన్నత కాయముతో (ఒప్పుచు), నడుమన్ అ=(తన) దంచనపుఁ జేతుల మధ్యప్రదేశములోనే, ఉనిక్కిఁజేసి = (అనాకపురి) ఉండుటంబట్టి (తనబాహువులకు ఆనాకపురిపట్టుపడినందున) - గంగ అను కాసె నాకపురీ దేహావలగ్నమందు ఉన్నందున అనియు, పెనంగి = పెనఁచికొని, లావు ఎడలఁగన్=నాకపురియొక్క బలము క్షీణింపఁగా, (దానిని), వ్రేయుటకున్ = నేల వ్రేసికొట్టుటకై, పట్టి=కాసెలో పట్టుకొని, ఎత్తెననన్ జనున్=ఎత్తినదో యను ట్లొప్పుచున్నది.

ఆకాశగంగ స్వర్గపట్టణమును అగడ్తవలె చుట్టుకొని యున్నది. మధురాపురికోటబురుజుల మీఁది పెద్దపిరంగులు ఆగంగకును స్వర్గమునకును నడుమ చొచ్చుకొన్నవి. ఊరికోట పునాది మొదలు దృఢమై మహోన్నతమై యున్నది. స్వర్గము ఆపిరంగుల నడుమ ఇఱుకుకొని యూర్ధ్వమందున్నది.—ఈతీరెల్ల నెట్లుగానున్నదనఁగా—మధురాపురి యను మహోన్నత దృఢకాయుఁడగు జెట్టి స్వర్గపుర మను జెట్టిని తనతో సాటినటించినందులకై జెట్టిపోర సాధింపం గడంగి, అడుగిడు విధములోఁగూడ తన్ను కాచుకొనుచు, కోటకొమ్ములందలి పెద్ద పిరంగులనెడి తనహస్తములను స్వర్గపుజెట్టియొక్క కాసెయగు గంగకును ఆజెట్టిదేహములకును నడుమ చొప్పించిన - ఈ ప్రకారము తన చేతులనడుమ పట్టువడిన-యాజెట్టిని తనచేతులతో పట్టి పెనఁచి, బలమెడలిన యాతనిని నేలవైచి కొట్టుటకు అతనిదేహమునడుమ నున్న యాకాసెచేఁ బట్టి పైకెత్తెనో యనునట్లున్నది. మధురాపుర సౌధములు మహోన్నతము లనియు అపురి స్వర్గమునకన్న భోగవంత మనియు భా.—రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

'దంచనములు' అనఁగా పరమారకయంత్రవిశేషణము లని యొకవ్యా., ఇనుప గొలుసులతోడిపాషాణ విశేషములని మఱియొక వ్యా.; పెద్దపిరంగు లని బ. సీ; సీ. 'ఎవని మాత్తురు లగ్గలెక్కకుండంగఁ దా । ర్చినకాంచనంపు దంచనపుఁజేతు । లు' కువలయాశ్వ. ౪ (18). 'గంగను కాసెన్' - 'గంగ + అను' అని విడఁదీయుచో పూర్వకావ్యంబుల నప్రసిద్ధం బయిన సంస్కృతీయ సంధి సంభవించును. స్వర్గము మొదట క్రింద నుండినది, ఈపురము దానిని పాఱవైవ నెత్తినది. చందనములకు ఆకాశగంగ క్రిందనుండినది. 'నాక' - (న + అక) - 'నాకాదులు నిత్యసమసనము లంద్రు బుధుల్' అప్ప. నిత్యసమాసయతి అచ్చునకేని చెల్లునుగావున నిటహల్లున కిడఁబడినది. 'పోరునన్' అను పూర్వముద్రణ పాఠమున పోరు శబ్దమునకు ఔపవిభక్తికమునకు అనౌపవిభక్తికరూపము.

తే. ఉదుటుగుబ్బలు గలతల్పుటురము సూచి
గంవపట్టెలు సూచి బంగారు సూచి
వీటివాకిటిచోటనే విడువ కెపుడు
సుట్లు వెట్టుచు నుందురు సోమరవులు. 10

సోమరవులు=చంద్రసూర్యులు, ('అబ్జో జైవాతృకః సోమో గ్లౌ ర్మృగాఙ్కః కలానిధిః' 'తపన స్సవితా రవిః-' అమ,), ఉ......లు - ఉదుటు=నిక్కిఁ బొడుచుకొనియున్న - గుబ్బలు=

గుండ్రనివై మొనగలవైన మేకతలలు - అనెడి - గుబ్బలు = వృత్తస్తనములు, కలతల్పుటురము = కలదైన తలుపనెడి వక్షమును, చూచి, గందపట్టెలు=తలుపుమీఁద నమర్చిన యడ్డుకొయ్య లనెడి - గందపట్టెలు=గందపు గీఱలను, చూచి, బంగారు=తలుపున తాపఁబడిన బంగారు తగడులనెడి - బంగారు = బంగారపునగలను, చూచి, వీటివాకిటి చోటనే = పురద్వారము కడనే = (ఊరనెడి నాయికయొక్క యింటివాకిటి ప్రదేశమునే), విడువక = వదలక, ఎపుడుఁ = సర్వదా, చుట్లు పెట్టుచు నుందురు = చుట్టురా దిరుగుచున్నారు.

లోకములో ఎటనేని ఎన్నికగన్న వన్నెలాడియున్నచో కాముకులు దాని గడపవెంటనే నిరంతరము ఇటునటు సంచరించుచు సారెసారెకు తదీయదర్శనము ననుభవించుచుండుట ప్రసిద్ధము. సూర్యచంద్రులు అట్లే మధురాపురీనాయికాసౌందర్యాకృష్టులై నిరంతరము ఆపురి వాకిటనే సుడియుచుందురు.—శ్లిష్టరూపకోత్థాపితోత్ప్రేక్ష.

'వీటివాకిటిచోట'—ఊరిగోపుర మత్యున్నత మగుటచేత దానిని సోమరవులు దాఁటలేక (అయన భేదములచే) దానికొకప్రక్కనే సంచరింతురు. సోమరవులయందు విటత్వమును పురియందు నాయికాత్వంబును ఘటితములు. సోమరవులకు విటత్వము చెప్పుటచే సామాన్యులకు తేరి చూడరాని శోభావతి యని భా. ఎపుడును వాకిటనే చుట్లువెట్టుచునుందు రనుటచే పురీనాయిక వారిని సరకుకొనదే దని విశదము.

మ. స్థిరసౌధాగ్రవిహారి యౌవతరతిచ్ఛిన్నాచ్ఛహారస్ఫుర
ద్గురుముక్తావళిఁ జేటిక ల్విరులతోఁ గూడంగఁ ద్రోయ, న్నిజో
దరలగ్నం బగుదాని, నెమ్మొగి లధస్థంబై తఱిఁ రాల్ప, నా
కర మభ్రం బని యండ్రుగా కుదధిఁ దక్క న్బుట్టునే ముత్తెముల్. 11

(ఆ మధురాపురమందు), సౌధా...లిఁ - సౌధ=మేడలయొక్క - అగ్ర=తుదలయందు విహారి = క్రీడించుచుండు - యౌవత = యువయువతీసమూహములయొక్క - రతి = కామకేళుల యందు - ఛిన్న = పెరిగిన (యౌవనముగనుక రతిలో నుత్సాహ మెక్కువ - కావుననే పేరులు పెరిగిపోవుట) - అచ్ఛ= తేటయైన (అనఁగా తళతళని నీరుగల) - హార=ముత్తెపుఁబేరులయొక్క - స్ఫురత్ =తారళ్యవంతము లయిన - గురు=పెద్దపెద్ద ('గురుస్త్రిలిఙ్గ్యాం మహతి దుర్జరాలఘునో రపి' మేది.) - ముక్తా = ముత్తెములయొక్క - ఆవళిఁ = మొత్తమును, చేటికలు = పరిచారికలు ('భృత్యే దాసేర దాసేయ దాస గోప్యక చేటకాః' అమ.), విరులతోఁ గూడంగఁ = (ఆదంప తులు రాత్రిధరించి వేకువను త్యజించినవి లోనగు) పువ్వులతోఁగూడ, త్రోయఁ = (ఆసౌధా గ్రములనుండి) తుడిచి పాఱవైవఁగా, మొగిలు = మేఘము, అధఃస్థంబు = (ఆ సౌధాగ్రములకు) క్రిందిప్రదేశములందు ఉన్నట్టిది, ఐ, నిజ ఉదర లగ్నంబు = తనకడుపులో తగులు కొన్నట్టిది, అగుదానినే=అయిన యామత్తెపు మొత్తమునే, తఱిఁ =వర్షర్తువునందు (వానతోఁగూడ ననుట), రాల్పఁ =కురియుటంజేసి, స్థిరఁ =భూమిలో (అనఁగా లోకులు - 'భూ ర్భూమి రచ లానన్తా రసా విశ్వమ్భరా స్థిరా' అమ.), అభ్రంబు = మేఘము ('అభ్రం మేఘో వారివాహః' అమ), ఆకరము = ముత్తెములకు జన్మస్థానము ('ఖని, స్త్రియా మాకరః స్యాత్' అమ.) అని, అండ్రు

గాక=అందురేగాని, ముత్తెములు, ఉదధిన్=సముద్రమందు ('ఉదన్వా నుదధిః సిన్ధుః సరస్వాన్ సాగరోఽర్ణవః' అమ.), తక్కన్ = తప్ప (కేటొకచోట), పుట్టునే = పుట్టవు.

ముత్తెములకు జలధరా ద్యాకరములు పెక్కు చెప్పఁబడియున్నవి (౧ ఆ. ౭౦ వ్యా. చూ.), కాని సముద్రమొక్కటియే వానికి వాస్తవమయిన యుత్పత్తిస్థానము. కడమ తావులందు అవి పుట్టవు. అందులో మేఘమందు పుట్టునని లోకులు భ్రమించుటకు కారణమును వినుఁడు; మధురాపుర సౌధాగ్రవిహారులగు యావతముయొక్క రతిరయచ్ఛిన్నసూత్రగళితము లయిన ముత్తెములను వేకువను నిర్మాల్య కుసుమముల కుప్పతోఁగూడ చేటికలు క్రిందికి ఊడ్చివేయఁగా ఆముత్తెములు క్రిందనున్న మేఘములపైఁబడి వాని కడుపులోనికిం జొచ్చి వానితోఁగూడ క్రిందికి రాలఁగా గాంచి జనులు అవి మేఘోత్పన్నములే యని భ్రమించుచున్నారు. – అతిశయోక్తి – కొందఱి మతంబున అత్యుక్తి.

'గురుముక్తా'—గొప్పవని చెప్పుట యేలయన, మేఘోద్భవము లయిన ముత్తెములు పెద్దవిగా నుండును,—

> 'వర్షోపలవ జ్జాతం వాయుస్కన్ధా చ్చ సప్తమా ద్భ్రష్టమ్
> హ్రియతే కిల ఖా ద్దివ్యై స్తటిత్ప్రభం మేఘసంభూతమ్,.' బృ. సం.

'వర్షోపలవత్' అనుటచే పెద్దదనియు మేఘోద్భవమనియు తెలియ నగుచున్నది. దానిని ఆకాశమందే దేవయోనులు హరింతు రనియు అది, మెఱుపుకాంతిగలయట్టి దనియు కారికార్థము. ఈ క్రింది పారిజాతాపహరణ పద్యములో 'నాణీయస్తర' ము లనుటచేతను విద్యాధర ధార్యము లనుటచేతను మేఘోద్భూత ముక్తాఫలములే కథితములు.—

> శా. 'ఏణీశాబవిలోలనేత్ర కనుఁ గొంకేఁ వీరు విద్యాధరుల్
> మాణిక్యోజ్జ్వలకర్ణకుండలులు సంబద్ధాసిధేనుల్ రణ
> ద్వీణాపాణులు చంద్రికామల శిరోవేష్టు ల్త్రిపుండ్రాంకితుల్
> నాణీయస్తర తారహారులు శివధ్యానైక నిష్ఠాపరుల్.' పారిజాతాపహరణము.

అణీయస్ = కడుంజిన్నది – న అణీయస్ = నాణీయస్ = కడుంబెద్దది – నాణీయస్తరములు = మఱియుం బెద్దవి = వర్షోపలములంత లేసి. 'నాణీయస్తన' అను బజాఱుముద్రణమును మదీయ ముద్రణంబున 'నాణీయస్తర' అని సవరించితిని. 'ఈయస్సు' మీఁద 'తరప్పు' వచ్చిన యుదాహరణాంతరము'—

> ''ఆస్థి తాహీంద్రశయ్యా దవీయస్తః ప్రస్థితాం ఘ్రి శ్రితవ్రాత చేతోఘదా
> కస్థలప్రస్ఫుర త్కాళియక్ష్వేళమూర్ధస్థలీనృత్త మత్తల్లిహల్లీసకా.' '—ఆము. ౪ ఆ. 92.

> మ. ఘనసౌధాళి వియద్ధునీజలధి వీఁక న్నావలై నీడ దోఁ
> ప నెలంత ల్వణిగాకృతి న్సరకు మార్ప న్గోలల న్గట్టి యి
> చ్చు నిజద్వీపవిచిత్రపట్టవసనస్తోమంబు నాఁ బొల్చుఁ బె
> ల్లనిలానోళ్యన్యవిమర్శితన్నగరనానాకానేక కేతుచ్ఛటల్. 12

ఘనసౌధ ఆళి=(మధురాస్వర్గముఁలయొక్క) గొప్పమేడల పంక్తి, వియ...దిన్ – వియత్ ధునీ = మిన్నే ఱనెడి ('వియ ద్విష్ణుపదం వా తు పుం స్యాకాశ విహాయసీ', 'తరఙ్గిణీ శైవలినీ

తటినీ ప్రోదినీ ధునీ' అమ.) - జలధిన్ = సముద్రములో, నీడన్ = (మేడల) ప్రతిబింబమందు, వీఁకన్=స్ఫుటముగా, నావలై=ఓడలుగా, తోఁపన్=అగపడఁగా, సెలంతల్=ఆయోడలలో నున్న ప్రతిబింబపు (మధురాస్వర్గ) యువతులు సరకు లిచ్చి అందులకు బదులుగా సరకులు కైకొనుటకై, కోలలన్=గడలకు, కట్టి, ఇచ్చు (నట్టి) - నిజద్వీప విచిత్ర పట్ట వసన స్తోమంబు నాన్= తిమ (తమ) దీవులయందలి యద్భుతపుఁ బట్టువస్త్రముల మొత్తమో యనునట్లు, అని...ర్ధి - అనిల= గాలిచేత - అన్యోన్య=ఒకరొంటిని - విమర్శి=ఒరసికొనుచున్న - తన్నగర=ఆ (మధురా) పురము యొక్కయు - నాక=స్వర్గముయొక్కయు - అనేక = పెక్కులయిన - కేతు=జెండాలయొక్క - ఘటలు = సమూహములు, పెల్లు = మిక్కిలి, పొల్చున్ = ప్రకాశించును.

సముద్రములో ఒకదీవి వర్తకనావలు మఱియొక దీవి వర్తకనావలను తారసిల్లినప్పుడు, ఒక దీవి యోడవర్తకులు తమదీవిసరకులను మచ్చుకై ఒకపట్టువలువలో ముడిఁచి ఆమూట నొక గడకుంగట్టి రెండవదీవి యోడవర్తకులకు వారియోడ మీఁదికి వ్రాల్చుటయు, వారు వీనిం గయికొని అందులకు బదులుగా తమసరకుల మచ్చును, నట్లేకట్టి వీరి యోడమీఁదికి వాల్చుటయు, (బేరము కుదిరిన యనంతరము సరకులం గొని సరకు లిచ్చుటయు) ప్రసిద్ధము. మధురాపురి మేడలు మిన్నేటికన్న నున్నతము లగుటచేత తమయందలి స్త్రీజనముతోఁగూడ, తమ జెండాలతోఁ గూడను, ఆమిన్నేటం బ్రతిబింబించినవి. నాకపురిమేడలును అట్లే అచ్చరలతోఁగూడ తమ జెండాలతోఁగూడను ఆమిన్నేటం బ్రతిబింబించినవి. మఱియు వాయువశమున నాకపురిమేడల జెండాల ప్రతిబింబములు మధురాపురి మేడల జెండాల ప్రతిబింబముల మీఁదికిని మధురాపురి మేడల జెండాల ప్రతిబింబములు నాకపురిమేడల జెండాల ప్రతిబింబముల మీఁదికిని, వ్రాలుచుండును. ఈవృత్తమెల్ల నెట్లున్నదనఁగా—మిన్నేఱు సముద్రమువలెను, మేడల ప్రతిబింబములు ఓడలవలెను, అందు సెలఁతల ప్రతిబింబము వర్తకులవలెను, నాకపుర సౌధప్రతిబింబములు ఒక దీవి యోడలుగాను మధురాసౌధ ప్రతిబింబములు మఱియొకదీవి యోడలుగాను, ప్రతిబింబమందు ఈజెండాలు ఆజెండాలకును ఆజెండాలు ఈజెండాలకును తగులుచుండుట సరకు మార్చుకొనుటకై ప్రతిదీవి వర్తకులు తమసరకుల మచ్చులను విచిత్రపట్టవస్త్రములందు ముడిఁచి గడలకుఁగట్టి కడమ దీవివర్తకుల కడకు వ్రాల్చుటగాను, ఉండును.—ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. సోరణగండ్ల రాఁ గొదమచుక్కలు పట్ట సతుల్ కవాటము
ల్చేరుప మౌక్తికంబు లని చిల్లులు వుత్తురు వమ్మటంచుఁ బో
ల్పారువితానహారములయం దొగి హారత వ్రేలి ప్రొద్దువోఁ
గా రతి డస్సి గాడ్పులకుఁగాఁ దెఱవ న్జను విచ్చి మేడలన్. 13

మేడలన్=మేడలయందు, కొదమ చుక్కలు=పిల్లనక్షత్రములు, సోరణగండ్లన్=గవాక్ష మార్గమున, రాన్=మేడలలోఁ జొచ్చినప్పుడు, సతుల్=అందలి స్త్రీలు, పట్టన్=ఆనక్షత్రములను పోనీక పట్టుకొనుటకై, కవాటముల్ = (కిటికీలయొక్క) తలుపులను, చేరుపన్ = మూసినంతట, తమ్మున్=ఆనక్షత్రములను, మౌక్తికంబులు అని=ముక్తాఫలము లని భ్రమించి, చిల్లులు వుత్తురు= బెజ్జము పొడుతురు, అటంచున్=అనిభయపడి, పొ...దున్ - పొల్పారు=అంద మయిన - వితాన= మేకలుకట్టుయొక్క ('అస్త్రీ వితాన ముల్లోచః' అమ.) - హారములయందున్ = ముత్తెపు సర

ములతోఁగూడ, ఒగిన్ = క్రమముగా, హారతన్ = సరరూపమున, వ్రేలి = వ్రేలాడి, పొద్దు వోఁగాన్ = కొంతకాల మయినతర్వాత, రతిన్ డస్సి=(అవిలాసవతులు) మదనక్రీడచేత బడలికం జెంది, గాడ్పులకుఁగాన్ = చల్లగాలికై, తెఱవన్ = (కిటికీలయొక్క) తలుపులను తెఱవఁగానే, విచ్చి = విడఁబడి (అనఁగా హారరూపమును మాని చెదరి) చనున్ = తప్పించుకొని పోవును.

మథురాపురమందు మేడలు నక్షత్రమండలము నతిక్రమించి యుండుటచేత పిల్లనక్షత్రములు మేడ లడ్డము కాఁగానే కిటికీలవలన ఆమేడలలోనికిం జొరఁబడును; అంతట నచటి విలాసవతులు వీనిం బట్టుటకై తలుపులు మూయుదురు. అంతట నివి తమ్ము వారు ముత్తెము లనుకొని పట్టి ధరించుటకై బెజ్జము పొడుతు రని భయపడి, వారిచేతినుండి తప్పించుకొనుటకై మేలుకట్టులో వ్రేలుచున్న హారములతోఁగూడ తాము ఒక హారముగా వ్రేలును, వారు అందువలన ఏమని పోదురు. పిమ్మట వారు కొంతసేపటికి రతిక్రీడలచే నలసి చల్లగాలికై తలుపులు తెఱతురు; ఆసమయమున ఈపిల్లచుక్కలు హారరూపమును మాని చెదరి, దేని దారి నది చూచుకొని పాఱిపోవును. 'కొదమ' యనఁగా పిల్ల; పిల్లలు గానిచో మేడలోఁ దూఱవు; పట్టుదు రని యూహించుకొని మేడకు ఒకప్రక్కగా నేఁగును. కొదమ శబ్దమునకు యౌవనము పొడమినట్టిదియునర్థముగాన ఆసతులమున వేడుకకై వచ్చి, కొదమలుగావున, ఉత్ప్రేక్షోపాయమును పన్నఁగలిగిన వని సమాధానము. 'ఒగి హారతన్' - 'ఒకహారతన్' అని పూర్వముద్రణపా. హారత సంఖ్యేయముగాదు. 'ఒకహారము' అను తెనుఁగు సమాసముపై మతల్ప్రత్యయము ఘటిల్లదు. పైగా 'ఒకటి' యని నియమమేల? - అత్యుక్తి.

ఉ. ఆపురి సౌధవీథి నధరాధరభూముల గర్జ మున్నుగా
నాపయికి న్వినంబడనియట్లుగ వ్రాలుఘనాళిఁ దార్చి లీ
లాపరతన్ ఘటింపుదురు లాస్యము సేయఁగ మేఘరంజి నా
లాపము సేసి పోషితకలాపిఁ గలాపికలాపకుంతలల్. 14

ఆపురిన్ = మథురలో, సౌధవీథిన్ = మేడలపంక్తియందు, కలా...ల్ - కలాపి = నెమళ్లయొక్క - కలాప = పురులవంటి ('కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అమ.)- కుంతలల్ =కేశపాశముకల స్త్రీలు (విలాసిను లనుట), అధర అధర భూములన్ = క్రిందిక్రింది ప్రదేశములందు ('భూమిః క్షితౌ స్థానమాత్రే' హేమ. - లేక - నిలువులయందు - నిలువుల కడ ననుట), గర్జ = ఉఱుము, మున్నుగాన్ = మొదలుకొని (పిడుగువలెను ననుట), ఆపయికిన్ = ఆవిలాసినులున్నపై భూమికలకు, వినంబడని యట్లుగ, వ్రాలు ఘన ఆళిన్ = క్రిందికి దిగియుండునట్టి మేఘపంక్తిని, మేఘరంజిన్ = మేఘరంజియను రాగమును, ఆలాపముచేసి=పాడి, తార్చి= తామున్నయున్నత భూములకు ఆకర్షించి, పోషితకలాపిన్ = పెంపుడు నెమలిని, లాస్యము సేయఁగ ఘటింపుదురు = నాట్యమాడింతురు.

* మేఘరంజిరాగము నాలాపించిన మేఘములు వచ్చును. మేఘ గర్జవిన్న నెమలియాడును. మేడలత్యున్నతము లగుటచే వాని పై నిలువులకు మిక్కిలి క్రిందినిలువులకడనుండు మేఘములగర్జ వినఁబడనందున, ఆ పైనిలువులలోని నెమళ్లు నర్తింపకుండఁగా, అచటి విలాసినులు మేఘరంజిం బాడి, క్రిందిమేఘముచు పైకి లాగి గర్జింపఁజేసి ఆగర్జచే నెమళ్ల నాడింపుదురు.—అతిశయోక్తి.

* 15 వ మేళకర్త - సరిగమనిస - సనిమగరిస. చూ. ౫ - ౧౮౫.

'గర్జ' - పిడుగుం జెప్పక గర్జంజెప్పుట యేల యనఁగా, పిడుగు ఉద్వేజకము, దానికి నెమళ్లు ఆడవు, గర్జకే నెమళ్లాడును; 'మేఘధ్వానేషు నాట్యం భవతిచ శిఖినాం' సా. ద. 'ఘనాళి'— 'ఆళి - అనుటచేత కాదంబిని చెప్పఁబడినది ('కాదమ్బినీ మేఘమాలా' అమ.) అందువలన చలువ యెక్కువ, దానిచే నెమలికి హర్ష మెక్కువ, దానిచే లాస్యమున సొంపెక్కువ. ఉఱుము పైనిలువులకు వినఁబడదే, మేఘరంజిమాత్రము క్రింది నిలువులకు వినఁబడునా? అనిన - గానకళాప్రభావముచే వినఁబడును, ఆకర్షణ కలుగును, అనియెఱుంగునది.

'మధురోద్ధత భేదేన తద్ద్వయం ద్వివిధం పునః
లాస్య తాణ్డవరూపేణ నాటకా ద్యుపకారకమ్.' దశ.

లాస్య తాండవములు క్రమముగా మృదూద్ధతములు స్త్రీపురుషోచితములు అనుటకుం బ్రమాణము.-

'పర్యాప్త ముద్ధతం స్మృత్వా స్వప్రయుక్తం తతో హరః
తణ్డునా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీ దిశత్
లాస్య మస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యై సమదీ దిశత్.' భర.

ఆటకు మగనెమలియే ('కలాపి' = కలాపము అనఁగా కుంచె కలది.) వలయును, (ఆడునెమలికి కుంచె లేదు. *కుంచె లేనియాట వెక్కిరించినట్లుండును.), అయినను కేశపాశము జల్తారు చెఱంగును భూషణంబులుం బోలె కుంచె వెలుంగుటంబట్టి మగనెమలికి స్త్రీనృత్యమే చెప్పఁబడినది; ఆడించువారు విలాసినులు గావునను, నెఱజాణలునుం గావునను, సొంపు హెచ్చునట్లుగానే సరిపఱుతురు.—అతిశయోక్తి.

చ. అనిమిషపట్టణంబు పురహర్మ్యపతాకలు మువ్వమ్రోఁతతోఁ
దనగృహపంక్తిపైఁ గలశతామరసంబులఁ గప్పఁ గ్రింద నుం
డును నిజలక్ష్మి చేసరిపణుల్ మొరయంగఁ దదీయలక్ష్మి శం
కను మొగ మెత్తి చూచుతఱిఁ గన్నులు కేళికి మూయఁగా బలెన్. 15

అనిమిష పట్టణంబు=దేవపురము (స్వర్గమనుట.—'అనిమేష శ్చానిమిషోఽప్యేతౌ ద్వౌ సుర మత్స్యయోః' నానా.), పుర హర్మ్యపతాకలు = మధురాపురసౌధముల జెండాలు ('హర్మ్యాది ధనినాం వాసః,' 'పతాకా వైజయన్తీ స్యా త్కేతనం ధ్వజ మస్త్రియామ్' అమ.), మువ్వమ్రోఁతతోన్ = చిఱుగంటల నిస్వనముతో, తన...లన్ = తన (స్వర్గ పురముయొక్క) యిండ్లవరుస మీఁది తామరమొగ్గల వంటి గిందులను, కప్పఁగా, క్రిందన్=ఆమధురా సౌధముల పతాకలకు క్రింద, (ఎట్లుండు ననఁగా), నిజలక్ష్మి=స్వర్గలక్ష్మి, చేసరిపణుల్=చేతిబంగారుగొలుసును, మొరయంగన్ = శబ్దింపఁగా, శంకన్ = ఎవతెయో ఇచ్చట మీఁద వచ్చియున్నది అను తలంపుతోడిజిజ్ఞాసచే, మొగ మెత్తి చూచుతఱిన్ ( = సమయమందు), తదీయలక్ష్మి = మధురాపురలక్ష్మి, కేళికిన్ = వేడుకకై, కన్నులు = స్వర్గలక్ష్మియొక్క నేత్రములను, మూయఁగా బలెన్ = మూసియున్నట్లుం బోలె, (క్రిందను) - ఉండును.—అతిశయోక్త్యనుప్రాణితమయిన యుత్ప్రేక్ష.

స్వర్గపురగృహపంక్తిపై తామరసాకారము లయిన కలశములు కలవు మధురాపుర హర్మ్య పతాకలు ఆకలశములను మువ్వమ్రోఁతతోఁ గప్పఁగా ఆపతాకలక్రింద స్వర్గపట్టణముండుట ఎట్లున్నదనఁగా, పై మువ్వమ్రోఁతను విని స్వర్గపురలక్ష్మి, ఎవతెదో చేసరిపణుల మ్రోఁత సుమా ఇది

* చూ. శృంగారనైషధ సర్వంకష వ్యాఖ్య పుట 719. 'ఆరామోరమణుల్'

యని జిజ్ఞాసచేత తనతలయెత్తి చూడఁగా, ఆమధురాపురలక్ష్మి తన చేతులతో స్వర్గపురలక్ష్మికన్నులను వేడుకకు మూయఁగా, ఆచేతులకు క్రిందనుండుట వలె నున్నది.—ఇట మువ్వప్రోఁత చేరి పణుల ప్రోఁతగాను, పతాకలు హస్తములుగాను, కలశతామరసంబులు కన్నులుగాను, కప్పాట కేళికి మూయుటగాను, కలశతామరసంబులు నిక్కియుండుట మొగమెత్తి చూచుటగాను, ఉత్ప్రేక్షింపఁబడినవి.—మధురాపుర గృహపతాకలు స్వర్గపురగృహకలశములకంటె పైకి నిగిడిన వనుట. పురసౌధౌన్నత్యవర్ణనము. అతిశయోక్తి; తదనుప్రాణిత మైన యుత్ప్రేక్షయు.

చ. ఘనగతశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి, పునుం గినోష్మ ద
ట్టినది యలఁది కైశికము తేవఁ బ్రభాతశశాంకు మోప వి
చ్చిననవహల్లకాళిఁ గయిసేసి, సతుల్ పతితో రమింతు, ర
మ్మునిజరఠాంగన ల్కలహము ల్కృప నేడ్వురుఁ దీర్ప మేడలన్. 16

మేడలన్ = మధురాపుర సౌధములయందు, సతులు = స్త్రీలు, ఆ ముని జరఠ అంగనల్ ఏడ్వురున్ = సప్తర్షులయొక్క (భార్య లయిన) యావృద్ధస్త్రీలు ఏడుగురును, కృపన్ = (సాన్నిధ్యపరిచయముచేతనయిన) వాత్సల్యముచేత, కలహములు తీర్పన్ = దంపతుల పొలయలుకలను మంచిమాటలచేత పోఁగొట్టఁగా, ఘన గత శంపన్ = మేఘమును ('మేఘే పుమాన్ ఘనః' నానా.) పొందినట్టి (మేఘమండలి) - మెఱపునందు ('శమ్పా శత హ్రదా' అమ.), కంచము = పళ్లెమును ఇడి=ఉంచి, కాటుకఁదీర్చి=ఆకంచమున కంటినట్టి కాటుకను కన్నులకుం బెట్టుకొని; (ప్రేయసి కాంతుని అనలంకృతగాఁ గలయఁగూడదు గావునను, పొలయలుక తీఱిన హర్షముం దెలుపుటకును, యథాసిద్ధమైన యలంకృతిం దాల్చుట), ఇన ఊష్మ దట్టినది పునుంగు = త్వరలో నుదయించువాఁడై ఊర్ధ్వమయూఖుఁడై వచ్చుచున్న సూర్యుని వేఁడి సోఁకి కరఁగినట్టి పునుఁగును (ఇట్లు చేఁత అతినాగరికవృత్తిని సూచించుచున్నది - వారి జాణతనమును గూడ), అలంది = పూసికొని, కైశికమున్ = కేశపాశమును ('తద్బృన్దే కైశికం కైశ్యమ్' అమ.), ప్రభాత శశాంకున్ = ప్రాతఃకాలపుఁ జంద్రునికి ('ప్రత్యూషోఽహర్ముఖం కల్య ముషః ప్రత్యుషసీ అపి, ప్రభాతంచ', 'ద్విజరాజః శశధరో నక్షత్రేశః క్షపాకరః' అమ.), మోపన్ = తగిలింపఁగా, విచ్చిన నవ హల్లక ఆళిన్=వికసించిన క్రొత్త చెంగలువల సమూహముతో, తేవన్=ఒప్పుగా, కయిసేసి=అలంకరించికొని, పతితోన్=మగనితో, రమింతురు (కర్త 'సతుల్' అని బహువచన మైనను 'పతులతో' అని బహువచనముం బెట్టమి అశ్లీలార్థస్ఫూర్తిం దప్పించుటకు).

మధురాపుర సౌధములయందు యువతులు రాత్రియెల్ల పొలయలుకలోనే గడచిపోయి నందునను, తెల్లవాఱినపిమ్మట కామక్రీడ కూడదు గావునను, తమ ప్రణయ కలహములను, సప్తర్షుల భార్య లయిన ముసలి పేరటాండ్రు ఇరుగుపొరుగుల మీఁది వాత్సల్యముచేత తీర్పఁగా, ఆదర బాదర క్షణములో సిద్ధించెడి సాధనములచే అలంకరించుకొని,—అది యెట్లన్న, మేఘమండలి మెఱుపుజ్వాలమీఁద కంచ ముంచి దాని కంటినమసితో కాటుక పెట్టుకొని, పునుఁగును ఉదయింపనున్న సూర్యునియొక్క యూర్ధ్వముఖమయూఖములకు చూపి, ఆవేఁడికిం గరంగినంతట దానిని అలందుకొని, చెంగలువ మొగ్గలను చంద్రుని కంటించి వికసింపఁజేసి, వానితో నొప్పుగా కొప్పు నలంకరించుకొని,—పతితో క్రీడింతురు. సప్తర్షి మండల పర్యంతము మేడలు వ్యాపించియున్న వని భా.—అతిశయోక్తి.—మేడలు మహోన్నతము లనుట.

'జరఠ'—ముదుసళ్లు గావున చీవాట్లు పెట్టుటకును అధికారిణులు. 'ఊష్మ' సోఁకించుట మెత్తఁబడకున్న పూసికొన నలవడదు, తావి పర్వదు. ['ఉగాగమంబు లేమి నాంతంబులకు అస్త్రీలింగంబులకుం బ్రథమైకవచన లోపంబులేదు.' అనుటవలన 'ఊష్మము' అనవలయును, ములోపమును చరితాది కార్యముగానో, ఇమనిజంతసూత్రగత బహుళ గ్రహణముచేతనో సాధింప వలయును;]. 'ప్రభాత' మగుటచే ముకుళించుకొన్నందున విరియించుటకై మోపవలసి వచ్చినది, రాత్రి శశాంకుఁడయిన దూరమునుండియే విరియించియే యుండును; 'మోపుట' = తగిలించుట;— ప్రాతస్తన శశాంకుఁడు గావున దుర్బలుఁడు. అందువలన గట్టిగా అద్దిననేగాని విరియింపఁ జాలఁ డని, 'నవ' ఆరాత్రిదే అనుట. 'హల్లక'—కలువకు రాత్రి వికాసము గాన; కమలముం జెప్పమి యేలన - అది పెద్ద దగుటచే ధమ్మిల్ల ప్రవేశనార్హము కానందునను, రాత్రి దానికి వికాసము లేనందునను. 'ఏడ్వురన్' - అలుక మిక్కుట మని సూచించుచున్నది. 'తీర్పన్' - వీరిమంచి మాటలు అలుకతీఱుటకు బయటికారణము, వాస్తవకారణము 'ప్రభాత'మే. 'సతుల్' అలుక వీరిదే యని సూచన. 'దానిని చూచితివి దీనిని వలచితివి' అని సతి పతిపై అలుగుట రసముగాని, 'వానిం గంటివి, వీనిం దగులుకొంటివి' అని పతి సతింబట్టి దట్టించుట సరసముకాదు. 'పతితోన్' - జాత్యేకవచనమని యొక వ్యాఖ్య. జాత్యేకవచనమయినచో బహుత్వమే వివక్షిత మగునుగాన అట్టి రసాభాసార్థ స్ఫూర్తి కాకుండుటకై యీయేక వచనప్రయోగ మని మదీయమతము.

చ. రవి యనుదివ్వెఁ గేతువు చెరంగున మూసి ధుతోర్ధ్వయంత్రవా
రవిరళఘర్మ మై కలరవాల్పరవోక్తుల వాంతధూపరా
జివరనిశ న్గనన్మదనచేతులఁ జాతురి నెయ్యపుంగురుం
జువిదలు దార్ప విష్ణుపద మొత్తుఁ బురీగృహలక్ష్మి నూత్న నాన్. 17

కనన్ = చూడఁగా, పురీగృహ లక్ష్మి=మథురాపుర మందిర శ్రీ, నూత్న నాన్=నవోఢయో (అనఁగా క్రొత్త పెండ్లికూఁతురో) యనునట్లుగా, వాం...శన్ - వాంత = వెలువరింపఁబడిన - ధూపరాజి=పరిమళ ద్రవ్య ధూప మనెడి - వరనిశన్=మంచిరాత్రిలో, నెయ్య...లు - నెయ్యపు= ప్రేమయుక్తలైన - కురుంజు=దూరములమీఁది గుజ్జు లనెడి - ఉవిదలు=చెలులు, చాతురిన్=మెల పుతో, మదనచేతులన్=కురుఁజులమీఁద నుంచెడు పట్టె లనెడు చేతులతో, తార్పన్=పెనిమిటి యగు విష్ణునికడకు చేర్పఁగా, రవియనుదివ్వెన్=సూర్యుఁ డనెడి దీపమును, కేతువుచెరంగునన్= జెండావలువ యనెడి కొంగుతో ('కేతు ర్నారుక్ పతాకారి గ్రహోత్పాతేషు లక్ష్మణి' మేది.), మూసి=కప్పి, ధు...ర్మ—ధుత=చిమ్మఁబడిన - ఊర్ధ్వ=మీఁది - యంత్ర=(జలమును పైకి దుమి కించెడి) యంత్రములయొక్క - వాః=నీ రనెడి (జలయంత్రములనుండి పైకెగయుచున్న నీ రనెడి) - అవిరళ=దట్టమైన - ఘర్మ=చెమట గలది ('ఘర్మః స్యాదాతపే గ్రీష్మేఽప్యుష్ణ స్వేదామ్బునో రపి' అమ.), ఐ, కల...లన్ - కలరవ=పావురములయొక్క ('పారావతః కలరవః కపోతః' అమ.)- అల్పరవ = మెల్లనికూఁత లనెడి - ఉక్తులన్ = పలుకులతో (పావురముల రవము లనెడి మాటల తోను మణితములతోను అనియు స్ఫురణము). విష్ణుపదము = ఆకాశమనెడి మహావిష్ణుచరణమును, కనన్మదన - కనత్=ప్రకాశించుచున్న - మదన=కామముకలదై (ఉదయత్కామయై), చేతులన్= హస్తములతో (అని శ్లేష), ఒత్తున్ = పట్టుచున్నది (ఆకాశమును త్రోయుచున్నదని శ్లేష).

మధురాపురలక్ష్మి క్రొత్త పెండ్లి కూఁతురో యనునట్లుగా, పరుంజాలనెడి యనుంగుఁజెలికత్తెలు మదనచేతులనెడి చేతులతో ఆమె పెనిమిటియైన విష్ణుదేవునికడకు కిటికీలనుండి వెలువడిన పరిమళ ధూపములనెడి నిశలో నేర్పుమైఁ దార్పఁగా, ప్రకాశముగా ఆయనతో విహరించుటకు లజ్జించి, అప్రకాశార్థమై సూర్యుఁడను దీపమును (దీపమును, ఆర్పఁగూడదు గావున) జెండావలువయనెడు కొంగులో మఱుఁగుపఱిచి, ఔత్ఖానాల నీటి తుంపురులనెడి నిండుక్రొంజెమరు గలదై, పావురముల నునుఁబల్కులేయనెడి తనపల్కులు గలదై, ఆకాశమనెడి యామహావిష్ణువుయొక్క పదమును ఒత్తుచున్నది.

లోకములో నవోఢ రాత్రిసమయమున చెలికత్తెలు పడుకటింట భర్తకడకు నేర్పుమెయిం జేతితో లాగికొని పోయి తార్పఁగా, ఎట్టకేలకుం జేరి దీపమునకు చాటుచేసి చెమర్చుచు పావురముల పలుకులవంటి నునుఁబల్కులు పల్కుచు చేతులతో భర్తపాదములొత్తును. మధురాపుర గృహలక్ష్మివృత్తమును అట్లేయున్న దని భా.—అతిశయోక్తి రూపకోత్థాపిలో త్ప్రేక్ష.

'రవి...మూని' - పురసౌధములు సూర్యమండాలాతిగాము లనుట. 'ఘర్మ' - ఇంతికి కాంతునిం గదిసినప్పుడు సత్త్వవికారముచే నుదయించు నెనిమిది సాత్త్వికభావములలో నొకటి, అయెనిమిదియు —

'స్తమ్భ ప్రళయ రోమాఞ్చాః స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.'

'కలరవ'—సౌధవలభులయందు పారావతయు లుండుట ప్రసిద్ధము—'తాం కస్యాంచి ద్భవన వలభౌ సుప్తపారవతాయామ్' - మేఘ. మణితము కపోతరవమువలె నుండు ననుటకు.—

'తచ్చ లాసక కపోత కోకిలా హంస కోక సదృశై రుతక్రమైః
మిశ్రితం ప్రహరణే ప్రయుజ్యతే చాన్యథాపి రుత మిష్యతే బుధైః'. కామశా.

మేఘములో 1 (42) 'తాంకస్యాంచిత్' ను శ్లోకము క్రింద మదీయ టీకం గనుఁడు. 'వాంత' - 'క్రక్కఁబడిన' అని వాచ్యార్థము - అదిగ్రామ్యము. ఇట గౌణార్థంబునం బ్రయుక్తముగాన నతిసుందరము.—

'నిష్ఠ్యూతోద్గీర్ణ వాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే'. దండి.

'వర - జ్యోతిశ్శాస్త్రము ప్రకారము శుభకాలమునం గలయుట ప్రసిద్ధము. మదనచేతులు పరుఁజాలపై నుండు నవి గావునను, గృహలక్ష్మి మదనచేతుల పయిని గూడ సాక్షాద్విష్ణుపదము కడకు పోయియున్నది గావునను, పరుంజాలను చెలులనుగాను, మదనచేతులను గృహలక్ష్మిని పడుకగదిలో పెనిమిటిచరణములకడకు నెట్టెడు (నయ్యువిదల) చేతులనుగాను, వర్ణించుట హృద్యముగానున్నది. 'ధూప'ము నలుపుగావునను, 'నిశ'యు చీకటిచే నలుపుగా తోఁచును గావునను, సామ్యము. 'ధుత—ఊర్ధ్వ' - చెమరును ఉన్నట్లుండి వెలికి ఉఱుకునదిగదా. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

'చెరంగు' - ఈశబ్దమును సీతారామాచార్యులవారు 'చెఱంగు' అని శకటరేఫ వంతముగా పఠించినారు. అందులకు ప్రమాణముగా శ్రీనాథప్రయోగమును శృంగారనైషధమునుండి

‘అవికరయుఁ బట్టుఁబుట్టము చెఱంగు’ అని ఒక్కదానికే యుదాహరించినారు. మఱియు ‘చెఱంగు శబ్దము నొకానొక కవి లఘురేఫముగా వాడె’ నని వ్రాసినారు కాని, ఆకవిపేరు వారు వ్రాయ లేదు; వారు తడవిన యాయితర ప్రయోగము ఆముక్తమాల్యదలోని యీ ‘చెఱంగే’ యేమో? మఱియు ‘అవిక’ యందలిశకటరేఫమును ‘చెఱంగు’ లోని యతిచేతను ‘చెరంగు’ లోనిశకటరేఫమును ‘అవిక’లోని యతిచేతను సాధింపఁ జూచినారు. ఇట్లు అన్యోన్యాశ్రయదోష దూషితంబగుటచే ఈశ్రీనాథప్రయోగము అసాధకమైనది. భారతాదిప్రమాణములచే శకటరేఫవంత మని నిర్ణీతమైన పాఱుధాతువును రేఫ యతిలో ‘శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బారెం బత్తులు’ అని మనుచరిత్రలో పెద్దన్నగారు ప్రయోగించినారు. ఈకవులు కడమతావుల రఱలకు మైత్రి చెప్పని వారైనందున ఈతావుల నీశబ్దములందు లఘురేఫమనియే తలంచిరని ఎన్నవలసి యున్నది. రఱయతికై పీఠికం గనుఁడు.

చ. గిఱికొనుగోపురాగ్రపరికీలితపంకజరాగరశ్మిఁ గ
ట్టెఱ యగుచాయఁ బొల్చుదివసేంద్రుఁడు సక్కనమింటఁ బోవుచో
మఱచి విధాత పాటలిమ మధ్యమసంధ్యకుఁ జేయలేని యా
కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు కొల్పినకైవడిఁ బట్టణంబునన్. 18

విధాత = బ్రహ్మ (‘విధాతా విశ్వసృడ్విధిః’ అమ.), మఱచి=పరాకుచేత, (సూర్యునికి); మధ్యమసంధ్యకున్ = నడిమిసంధ్యయందు (మధ్యాహ్నసంధ్యలో), పాటలిమన్ = ఆరుణ్యమును, చేయలేని యాకొఱఁతయుఁ దీర్చుకోన్ = చేయనట్టి యాలోపమును దిద్దుకొనువాఁడై, తొగరు కొల్పినకైవడిన్ = ఎఱుపెక్కించినాఁడో (ఎఱ్ఱవానినిగాఁ గావించినాఁడో) యనునట్లుగా, పట్టణంబునన్ = మథురయందు, దివస ఇంద్రుఁడు=దిననాథుఁడు (సూర్యుఁడు - ‘సూర సూర్యార్య మాదిత్య ద్వాదశాత్మ దివాకరాః’ అమ.), చక్కనన్ మింటఁ బోవుచోన్=సరిగా ఆయూరిమీఁది యాకాశమునం బోవునపుడు, గిఱి... శ్మిన్ - గిఱికొను=ఆవరించుచున్న (రశ్మికి విశేషణము - గిఱి = వలయాకారరేఖ) - గోపుర = గవనుయొక్క (‘గోపురం ద్వారి పూర్ద్వారి’ మేది.) - అగ్ర = తుదను - పరికీలిత = తాపింపఁబడిన - పంకజ రాగ = పద్మరాగ మణులయొక్క (పద్మరాగము ఎఱుపు - ‘శోణరత్నం లోహితకః పద్మరాగః’ అమ.) - రశ్మిన్ = కాంతులచేత (‘కిరణ ప్రగ్రహౌ రశ్మీ’ అమ.), కట్టెఱ = మిక్కిలి యెఱుపు, అగుచాయన్ = అగునట్టి కాంతిచేత, పొల్చున్ = ప్రకాశించును.

సూర్యుఁడు మధ్యాహ్నకాలమున నడిమింట ఆపురిగవనుమీఁదుగా పోవునపుడు అందు తాపింపఁబడిన పద్మరాగముల కాంతులు తన మెయిచుట్టుంబర్వుటచే కట్టెఱని వాఁడుగా నగపడును. అక్కడికి రాఁగానే అట్లు అగుట యెట్లున్న దనఁగా, సృష్ట్యాదిలో బ్రహ్మ సూర్యునికి సాయం ప్రాతః సంధ్యలయందు ఎఱుపుంజేసి మధ్యాహ్నసంధ్యయందు చేయం బరాకుపడిన లోపమును తీర్చుకొనువాఁడై అట్లు ప్రతిదినము ఆసంధ్యయందు సూర్యుని నెఱుపుగావించుచున్నాఁడో యనునట్లున్నది.

సూర్యుఁడు తనభాస్వరశుక్లతం గోలుపోయి పద్మరాగముల భాస్వరపాటలిమను బొందుట తద్గుణాలంకారము, తొగరుకొల్పె ననుట తదనుప్రాణితమైన యుత్ప్రేక్ష.

'సంధ్యకున్' - సప్తమ్యర్థమందు 'కు' షష్ఠి. 'కొఱఁతయున్' - యుశబ్దము వాక్యాలంకారము. 'తీర్చుకొన్' - 'ముజ్జు పరంబగు నపుడు కొశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' - బా. వ్యా. క్రి. 60. 'కన్గోఁజాల కుజృంభితస్తనయుగ్మంబు' అని వలె. - ఈపద్యమునందు శకటరేఫ ప్రాసము నిర్వహింపఁ బడినది. 'గిఱికొను' -

"చ. చఱిబడి తీవ్రఘర్షణ వశంబున నొక్కటఁ దీఁగచుట్లు నె
త్తఱు లయియున్న పాపతఱి త్రాటిమలంకల నిర్ఝరాంబువుల్
గిఱికొని మీఁదనుండి డిగఁ గిన్నరకింత్రి, పయోధిఁ ద్రచ్చున
త్తఱి ఫణిరాజు చుట్టినవిధంబున నున్నది చూడు మిగ్గిరిన్."

—* పు ష్ప లా వి క లు *—

సీ. వెలఁది, యీనీదండ వెలయెంత? నాదండ
కును వెలఁ బెట్ట నెవ్వనితరంబు?
కలువఁదావులు గాన మలికదంబక వేణి?
కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నాకిమ్ము పడఁతి యీగేదంగి
ననఁ, గడివోమి ముందఱికిఁ జూడు.
జాతు లేవంబుజేక్షణ? పద్మినులు నైత
మును నున్నయెడ జాతు లునికి యరుదె?
తే. యనుచుఁ దొలి నుడి నభిలాష లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మగర్భంబు గాఁగ
నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున. 19

విటులయు పుష్పలావికలయు సరసోక్తులు.—

1. విటప్రశ్న.— వెలఁది=ఓచెలువా, ఈనీ * దండ వెల=నీదయిన యీపూల సరమునకు (బాహువునకు అనియు - వానికి దండలు తిరిగియున్నవి, దండకడియములు ఇత్యాది వ్యవహారము ప్రమాణము) విలువ. ఎంత? పుష్పలావి కోత్తరము.— నాదండకున్ = నాపూల సరమునకు (నాబాహువున కనియు),...ఎవ్వనితరంబు=ఎవనికి శక్యము (ఎక్కువ వెలగల దని భా. నాతోఁ పొందునకు తగినధనమును ఎవఁడును ఇయ్య నేరఁడు - అనఁగా నా పొందు మిక్కిలి దొడ్డది అని భా. - పూర్వులు దండశబ్దమునకు బాహ్వర్థమును వ్రాయక సామీప్యార్థమును వ్రాసిరి. ఆ పక్షమందును పొందే అర్థము. బాహువును ఆలింగన ముఖముగా పొందునే తెలుపుచున్నది.)

---

* "ప్రాయపుగాఁడుకుల్ వెలసెపాన సెగాడిగఁ జూడ, 'సేర్పులా
రాయివి! దండమీఁద గొసరం దొరకొంటిరి! మంచిసాములే!
పో! యటులైనచో సరసముల్ గద మీకిపు' డంచు నప్పురిన్
గాయజుతూపులమ్ముదురు కందువమాటలఁ బుష్పలావికల్." చేమకూర. విజయ ౧-౩౯.

2. వి. - అలికదంబక వేణి=తుమ్మెదల మొత్తమువంటి జడగలదానా, కలువన్ = ఈ కలువ పుష్పమందు (కూడుటకు అనియు - కలఁగన్ - 'క్వచిద్గకారోవః' - కలువన్ - 'విసుము నరేంద్ర, విప్రుఁడలివెన్ ;' అనినట్లు కలుగుధాతువునకు కూడుటయు అర్థము -

"కలికీ మాటలు వేయునేటి కిఁక నీకాయంబుతో వానితోఁ

గలుగన్ భాగ్యము గల్గునన్న విభునిం గాఁ జేయుమీ వీని రాఁ

గలజన్మంబున..." అనిరుద్ధ. ౨ ఆ. - శబ్దరత్నాకరము). తావులు=పరిమళమును (ప్రదేశములు అనియు), కానము = చూడము (అగపడలేదు అనుట) - పూర్వులు 'కలువతావులు' అని పఠించి కలువకు స్థానములయిన సరస్సు లనియు దానిచే విషయనిగరణమువలన నాభులు సూచితము లనియు వ్రాసినారు. ఈపక్షమున బహుత్వము అవివక్షితము. గాంభీర్యమును బట్టి నాభికి సరస్యుపమ ప్రసిద్ధము. 'మెఱసె నాభి గభీరజలాశయంబనన్' వసు. 2 ఆ. 46. 'నాభిహ్రదైః పరిగృహీతరయాణి' మాఘ. 5 స. 29. 'గభీరే తే నాభీసరసి కృత ఝమ్పో మనసిజః'- సౌందర్యలహరి. 77 శ్లో. [ఒండె, కలువతావులు = సంగమ స్థానములు, కానము - మనకు సంగమించుటకు తా వెక్కడ? (కలువ = సంగమము అని నన్నెచోడుని ప్రయోగము కలదు)]. పు. - కలువతావులు = ఉత్పల పరిమళములు (పూర్వోక్త విధముననే నాభులు అనియు), వాడకయు కలుగునె=పువ్వు వాడునూపకుండఁగానే (పరిచయములేకయే) కలుగవు - (నాతో మైత్రి చేసి కొందువేని ఎన్నింటినేని మనకూటమికిం దగిన రహస్యప్రదేశములను నేను చెప్పఁగలను అనుట).

3. వి.—పడఁతి = ఓ వెలఁదీ, కడిపోదు = పరిమళము చెడదు, (నీపొందులేక నాకు కబళము దిగకయున్నది అనియు), ఈగేదంగి ననన్ = ఈ పైఁడి మొగలి పువ్వును (ఈనీవరాంగమును అనియు), నాకున్ ఇమ్ము; పు.—కడివోమిన్ = పరిమళము చెడమిని ... [ఇప్పుడు కబళము దిగని మాటకేమి నన్నుంగవని యెడఁబాసినంతట కబళము దిగనే దిగదు అనుటయు. —"కబళ పరీమళ శుత్యర్థములయందుఁ। గనుపట్టుచుండును గడియనంగ." ఆం. భా. 3 (61).*

"క. పడఁతికి గన్యా ధర్మం
బెడలినఁ గొఱయగునె వెండి? యెవ్వం డైనన్
కడివోయిన పువ్వులు మఱి
ముడుఁచునె రసికుఁడగువాఁడ మోఘవిచారా." భోజ. 4 (224).]

4. వి.—అంబుజ ఈక్షణ = తామరలవంటికన్నులు గలదానా, జాతులు = జాజులు (పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి అను స్త్రీజాతులు), ఏవి = కలవా? (నీవు ఆజాతులలో ఏజాతియందు చేరిన దానవు?) పు. - పద్మినులు సైతమునన్ = తామరల మొత్తములు కూడను ('పద్మినీ పద్మసంఘాతే స్త్రీ విశేషే సరోఽమ్బుజే' మేది. పద్మినీజాతి స్త్రీలు కూడను—తల్లక్షణము రతిరహస్యమున—

'కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగన్ధిః। సురతపయసి యస్యాః సౌరభం దివ్య మఙ్గే,
చకితమృగ దృగాభే ప్రాన్త రక్తే చ నేత్రే। స్తనయుగళ మనర్ఘ్యం శ్రీఫల శ్రీవిడమ్బి,
వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ। త్రివళిలలితమధ్యా హంసవాణీ సుకేశా,
మృదు శుచి లఘు భుక్తే మానినీ గాఢలజ్జా। ధవళకుసుమ వాసో వల్లభా పద్మినీ స్యాత్.'),
ఉన్నయెడన్ = ఉన్నతావున, జాతులు = జాజిపువ్వులు (హస్తినీ శంఖినీ చిత్రిణీ జాతులు), ఉనికి = ఉండుట, అరుదె = ఆశ్చర్యము గాదు (తప్పక యుండును.)

* తమిళములో కూడ నీయర్థములు గలవు, ఆంగ్ల. a bite = food, a mouthful.

అనుచున్=ఇట్లని, అప్పురమునన్=మధురలో, అభిలాషలు=పుష్పములమీఁదను (పుష్పలావికలమీఁదను) కోరికలు, ఎనయన్=పుట్టుచుండఁగా, మూఁగి=ఆపుష్పలావికలను కమ్ముకొని, తొలి నుడిన్=మొదటి మాటను, పలుకతోడనె=విటులు వచించిన వెంటనే (లేక మాటవెంబడినే), నర్మగర్భంబు గాఁగన్ = లోపలపరిహాసముగల యట్లుగా (పైకి పువ్వులం గూర్చియే పలికినట్లును లోపలికి ఎగతాళి యర్థ మగునట్లును—'ద్రవకేళిపరీహాసాః క్రీడా ఖేలా చ నర్మ చ, అమ.), పల్లవశ్రేణికిన్ = విటరాజికి ('అథ పల్లవః। అస్త్రీ ప్రవాళే నా షిద్గే' నానా. 'శ్రేణిః స్త్రీపుంసయోః పఙ్క్తౌ సమాన శిల్పి సంహతౌ' మేది.), ఒసఁగుచున్ = ఇచ్చుచు, పుష్పలావికలు = పువ్వులుకోసి యమ్మెడు స్త్రీలు, అలరులు = పువ్వులను, అమ్ముదురు.

"ఇట వ్యాజోక్తి—

క. తేజరిల వేడ్కతోన। వ్యాజసముద్భూత మైన వస్తువు నెలమిన్
వ్యాజముగఁ జేసి పలికిన,। వ్యాజోక్తి యనంగఁబరఁగు నది యెట్లన్నన్."

అని జోగి జగన్నాథ పండిత వ్యాఖ్య.

చ. సరసులనర్మ మింపుల నొసంగఁ గదంబపుదండఁ గట్టుచోఁ
గరఁగుటఁ దెల్పుదృక్తరళకాంతులు నుత్తర మిచ్చువంతరాం
తరముల నవ్వులు న్గలువతండము మొల్లలు నంచు మిన్నుగ్రు
చ్చి రహిని రిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. 20

పుష్పలావికల్=పువ్వులు కోసెడు (కోసియమ్మెడు) స్త్రీలు, సరసుల నర్మము=రసికు లయిన విటులయొక్క పరిహాస (వాక్య)ము, ఇంపులన్ ఒసఁగన్=తమకు ప్రీతిని గావించుచుండఁగా, కదంబపు దండన్=(ఆవిటులకై) మిశ్రమాల్యమును, కట్టుచోన్=తాము గ్రుచ్చునప్పుడు, కరఁగుటన్ = ఆవిటుల సరసోక్తులకు తమ మనస్సు కరంగి నందులకు, తెల్పు...లున్—తెల్పు = సూచకములయిన - దృక్ = కన్నులయొక్క - తరళ = తళుకుగల ('తరళం చఞ్చలే షిద్గే భాస్వరేఽపి త్రిలిఙ్గకమ్' మేది.) కాంతులున్ = ప్రభలును, ఉత్తరము = విటులమాటలకు జవాబు - ఇచ్చువంతరాంతరముల నవ్వులున్ = చెప్పునట్టి [ప్రత్యుత్తరమైన నడిమినడిమి హాసితంబులను, కలువతండము=తొగమొత్తము, మొల్లలున్=కుందములును (పా. మల్లెలు), అంచున్= అని భ్రమించి (తమ దృగ్రోచులను నల్లగలువలకు గాను తమ నవ్వులను మొల్లలనుగాను భ్రమపడి - యని క్రమాన్వయము - తత్తత్సాదృశ్యము ప్రసిద్ధము), మిన్నుగ్రుచ్చి = ఆకాశమును (అనఁగా ఆదృగ్రోచులను ఆనవ్వులను అవి స్పర్శహీనము లగుటంజేసి మింటివంటివే - వానిని) పూమాలగా గ్రుచ్చి, రహిన్=ఆసక్తితో, రిత్తనూలు=(పూమాలయను భ్రమచేత) పువ్వులు లేని వట్టి దారమును, ఒసఁగి=ఆవిటులకిచ్చి, సిగ్గు వహింతురు=అంతలో (తమపొరఁబాటు తమకుం దెలియఁగా) లజ్జపడుదురు.

ఆపురమందు పుష్పలావికలు కడుధూర్తలైనను, విటపుంగవులు వారిని సయితము మోహము పాలుసేయునట్టి సరసభాషణు లనుట.—భ్రాంతిమదలంకారము, యథాసంఖ్యంబును.

సీ. పద్మాస్య, పురి ననుభవితకు నీవ యె
త్తులు వెట్టె దనఁగ రావలసె నిటకుఁ;

దెలుపుమా, జాముండు నల రింపా ఘటికాద్వ
యం బుండు నల రింపా కంబుకంఠి?
యే వేడుటకు నీవు ఋతు వేళ చెప్పెద?
పువిద, మే మందాఁక నోర్వఁగలమె?
చేరఁగా రాదె, బాసికము గే ల్సోఁకిన,
యంతనే చెడునె యేణాయతాక్షి?

తే. యనుచుఁ, బరిభాషఁ బోలెఁ ద వ్వాస దోరల
నాడ, మోవిఁ జెఱం గిడి, యూఁగు నవ్వు
కంట నిగుడ, విరు ల్కానుకరణిఁ జల్లు
సరసపుజలంబె జాణల మరులు కొల్పు. 21

1. పద్మ ఆస్య = ఓ తామరస వదనా, పురే = ఈయూర, అనుభవితకు = భోగించు వానికి, నీవ = నీవే, ఎత్తులు వెట్టెదు = పూవుటెత్తులు (మాల్యములు) కట్టెదవు, అనఁగ ఇట కు రావలసె = అని విని నీకడకు వచ్చితిని (ఈయూర మాల్యము లనుభవించువారికి నీవూ వుటెత్తులే శ్రేష్ఠములు అని విని నీవలన వాని విలిచికొన వచ్చితిని అనుట - ఎత్తు = ఎదురు - అనఁగా వలపుకత్తెయే తన విటునికిచ్చు ధనము - కావున - నిన్ననుభవించువానికి నీవే ధనమిచ్చెద వని విని నిన్ను తనియించి నీవలన ఎదురు కైకొనఁగలవాఁడనై నీకడకు వచ్చితిని - అనియర్థాంతరము;)—'అనుభవిత' - అనుభవితృ శబ్దము ఋకారాంతము; నీవ' - అశబ్దమునకు అవధారణార్థము వలపుకానితలన ధనముం గైకొనక యని భా. 'ఎత్తులు పెట్టెదు' అనఁగా ప్రయత్నములు చేసెదవు అని కొందఱు అర్థము చెప్పుదురు; 'అనుభవితకు'-'అనుభవతకు' అను పా. పొరఁబాటు, దానికి అనుభవమునకు అనునర్థమును రాదు, అందలి తల్ప్రిత్యయము అప్రసక్తము అంతర్గడువు; 'అనుభవమున కీవ' అని సీతారామాచార్య పా.

2. కంబుకంఠి = శంఖమువంటి కంఠముకలదానా, జాము ఉండు నలరు ఇంపా = జాము సేపు (ఏడు నర గడియలకాలము) పరిమళము చెడక (వాడక) యుండునట్టి పుష్పము మనోజ్ఞమో, ఘటికాద్వయంబు = రెండుగడియలకాలము మాత్రమే - ఉండు నలరు ఇంపా = పరిమళము చెడక (వాడక) యుండునట్టి పువ్వు మనోజ్ఞమో, తెలుపుమా = చెప్పుమా; (నీపువ్వులు చాల సేపు చెడకయుండును గావున మాకు అవియే వలయు ననుట) - (గూఢార్థము. - అలరు అనఁగా సంతోషము - సంభోగము లక్ష్యము - నీకు జాముసేపు ఉండునట్టి సంభోగము మనోజ్ఞమా - అనఁగా అది కావలయునా, రెండు గడియలే యుండునట్టి సంభోగము మనోజ్ఞమా - అనఁగా ఇది కావలయునా, చెప్పుము. — ఒరులు రెండు గడియల సంభోగమునే యొసంగుదురు, నేను జామునే పుండుసంభోగము నొసంగుదును గావున నన్నే సేవింపు మనుట;

'ఏక వారావధి ర్యామో రతస్య పరమో మతః
చణ్డ శక్తిమతో ర్యూనో రుద్భట క్రమవర్తినోః' రతిసర్వస్వము.

3. ఊవిద = ఓజవరాలా, ఏన్ = నేను, వేఁడుటకున్ = కోరినందులకు, నీవు, ఋతువేళ = వసంతాది ఋతుకాలము రానిమ్ము అని, చెప్పెదవు, ఏము = మేము, అందాఁకన్ = ఆయాఋతువు వచ్చువఱకు ('గ్రీష్మాదౌ స్త్రీరజ స్యృతుః.' నానా.) ఓర్వఁ గలమె = ఓర్వలేము (పొగడ నడిగిన వసంతము రానిమ్మని, తామర నడిగిన శరత్తు రానిమ్మని, - ఇట్లు ఆయా పుష్పమునకు ఆయాఋతువు వఱకు వేచి యుండుమని చెప్పుచున్నావే, మాకు అని ఇప్పుడే కావలయును, మేము వేచనేరము, కావున దోహద విశేషములచే నీవు ఇప్పుడే పుష్పింపఁజేసి యా పుష్పములను మా కిమ్ము అని యర్థము;)—(గూఢార్థము — నేను నీతోడి పొందుం గోరినందులకు ఋతుస్నాన సమయమువఱకును నన్ను వేవు మనియెదవే, నేను అందాఁక వేవఁజాలను, కావున ఇప్పుడే నాకు సంభోగం బొసంగుము.) ; ['ఋతువు + ఏల' అనియేని గ్రహింపవచ్చును. లళలకు అభేదము కలదు.]

4. ఏణ ఆయత అక్షి = లేడివలె వాలిక కన్నులు గలదానా ('దీర్ఘమాయతమ్' అమ.
'కృష్ణ సార రురు న్యఙ్కు రఙ్కు శమ్బర రౌహిషాః
గోకర్ణ పృషతైణ ర్శ్య రోహితా శ్చమరో మృగాః.' అమ.),
చేరఁగారాదె = నేను నీపూవుచేరువకు రాఁగూడదా, కేలు సోఁకినయంతనె = నా చేయి తగిలిన మాత్రానకే, బాసికము = నీవు గ్రుచ్చి విక్రయార్థమై పెట్టుకొని యున్న యీ బాసిక దండ (వివాహకాలమందు వధూవరుల నొసటం గట్టఁబడునది మూఁడు ప్రక్కలు తీరినట్టి హారవిశేషము), చెడునె = వాడిపోవునా, - (గూఢార్థము.—నిన్ను నేను తగులఁ గూడదా, నీబాసికము అనఁగా ఊరుమూలము నాచేయి తగిలిన మాత్రాన వికృతి నొందునా?—అభిప్రాయము నూహించుకొనునది.);

అనుచున్ = పూర్వోక్తప్రకారంబున, పరిభాషఁ బోలెన్ = సంకేతపు మాటలచేతనుం బోలె, తమ్మున్ (పుష్ప లావికలను గూర్చి), ఆస దొరలన్ = కోరిక పొరలుచుండఁగా అత్యంతాభిలాషతో ననుట), ఆడన్ = విటులు పలుకఁగా, (అపుష్పలావికలు), మోవిన్ చెఱంగు ఇడి = తమ యధరోష్ఠమును పైఁటచెఱంగుతో కప్పుకొని, ఆఁగు నవ్వు = ఆఁపుకొనుచున్న హసితము, కంటన్ = కన్నులయందు, నిగుడన్ = వెలువడఁగా, విరులు = పువ్వులను, నాన్చు కరణిన్ = తడుపుట కనుమిషచేత, చల్లు = విటులమీఁదనుం బడునట్లు చిలుకరించు నట్టి, సరసపు జలంబె = సయ్యాట నీళ్లే (సరసా లాడుటగా చల్లిన నీళ్లే), జాణలన్ = రసజ్ఞు (లయిన యావిటు) లను, మరులుకొల్పున్ = మోహింపఁజేయును (వశపఱుచుకొను ననుట.)

ప్రకృతవస్తుగోపనార్థమైన యవాస్తవ హేతూక్తి కానందున వ్యాజోక్తి కాదు, శ్లేష మాత్రము. 'నాన్చుకరణిన్' - కైతవాపహ్నుతి.

'నీవు ఋతువు'—'ఋ ౠ వర్ణంబులు రల తుల్యంబులు' బా. వ్యా. - కావున సంధిలేదు. 'అందాఁకన్' = అంత + దాఁకన్ (= దనుకన్), మోవిం జెఱంగిడుట నవ్వును దాఁచుటకు, నవ్వును దాఁచుట తమ బెట్టు చెడకయుండుటకు. 'జాణఁడు' మగాదుల లోనిది.

సీ. ఇంద మస్తుఁడె దంతకుందాభఁ గూడి ని
చ్చలపుఁజూపులు మున్న సంభ్రమింప,
వెల యొప్ప కవలఁ బో విఱుచుమోవియుఁ గోప
మొదవెడుచూపు మోమోటఁ ద్రిప్పఁ,

దిరిగిన సస్మితోక్తియుఁ జూపుటొయ్యార
    ములు నగుఁ గా దను పలుకు లుడుప
నవి గాని కావో నీ కను పరసాపత్న్య
    సంపాదనం బుబ్బ నింపుఁ బెనుపఁ,
తే. జతురవచనవిలాసాంగసౌష్ఠవములఁ
బసిఁడిఁ దా నిచ్చినట్టి యప్పణఁతి మఱవఁ
బతికిఁ గైదువు లందిచ్చు రతివిధమున
విటుల కిత్తురు మఱి వారు విరులు పురిని. 22

1. ఇందము = పువ్వులు ఇవిగో పుచ్చుకొనుము, అన్తఁన్ = అనెడు సమయమందు, దం......భన్ - కుంద = మొల్లలవంటి - దంత = పండ్లయొక్క, - ఆభన్ = కాంతిని, కూడి = కలసికొని, నిచ్చలపుఁ జూపులు = నిర్దోషము లైన చూడ్కులు, మున్న = ఆదిలోనే, సంభ్రమింపన్ = పండువు సేయఁగా;

2. వెల, ఒప్పక = ఎక్కువయని, అవలన్ = మఱియొక పువ్వులావిక కడకు, పోన్ = విటుఁడు పోయినంతట, విఱుచు మోవియు = పెదవిని విఱుచు తీరును, కోప మొదవెడు చూపున్ = (ఆవిటునిమీఁద) కోపముతోఁ గూడిన పువ్వులావిక చూడ్కియు, మోమోటన్ ద్రిప్పన్ = దాక్షిణ్యము గలవాఁడై వెనుకకు వచ్చునట్లు చేయఁగా (ఆచూడ్కిచేతను ఆమోవి విఱుపుచేతను అతఁడు మోమోటపడి మరల ఆపువ్వులావిక కడకే వచ్చు నని భా.);

3. తిరిగినన్ = మరల తనకడకే ఆవిటుఁడు రాఁగా, సస్మిత ఉక్తియున్ = చిఱునవ్వుతోఁ గూడుకొన్న మాటయును, చూపు ఒయ్యారములున్ = చూపుయొక్క విలాసములును, అగున్ కాదు అను పలుకులు ఉడుపన్ = వెల సరి యనియేని హెచ్చు అనియేని పలుక నీయక చెప్పిన వెలకే కొనునట్లు చేయఁగా (అట్లు వశీకరించుచుండఁగా);

4. నీకున్, అవిగాని = ఆపువ్వులేగాని, కావో = వేఱుపువ్వులు పనికి రావా (గూఢార్థము — నీకు దాని పువ్వులేగాని నాపువ్వులు పనికి రావా - ఆపువ్వులావికలను మరులుకొని నన్నొప్పరికించెదవు అని భా.), అను = అని, పరసాపత్న్య సంపాదనంబు = అన్యపువ్వులావికతో తనకు సవతితనమును కల్పించుకొనుట (అదియు తానును ఆవిటునికి విటకత్తెలు అని కల్పించుట), ఉబ్బన్ = గర్వమును, ఇంపున్ = ప్రీతిని, పెనుపన్ = వర్ధిల్లఁ జేయుచుండఁగా;

చతుర...లన్ — చతురవచన = చదురు మాటలు - విలాస = ఒయ్యారములు - అంగసౌష్ఠవములన్ = అవయవసౌందర్యము - అనువాని (మూఁటి) చేతను, తాను = ఆవిటుఁడు, పసిడి ఇచ్చినట్టి అప్పణఁతిన్ = ఎవతెకు పువ్వులకొఱకు ముందుగా బంగారము సంచకారముగా ఇచ్చియున్నాఁడో ఆవనితను, మఱవన్ = ఆవిటుఁడు మఱచి పోఁగా, పతికిన్ = మన్మథునికి, కైదువులు = ఆయుధము లయిన పువ్వులను, అందిచ్చు రతి విధమునన్ = చైత్రయాత్రకై తెచ్చి చేత నుంచెడు రతివలె, వారు = ఆయూరి పువ్వులావికలు, విటులకున్, విరులు = పువ్వులను, ఇత్తురు. (రతిమన్మథోపమచే ఆవిటీవిటులు అతిసుందరులనియు, కైదువు లిచ్చున ట్లనుటచే ద్రష్టలకు ఆదర్శనము

మదనావేశకరముగా నున్నదనియు భా. జాణెతలౌ పువ్వులావికలు తమకడకు వచ్చిన విటుని ఎటు లేని వలపించి తనపువ్వులే కొనునట్లు చేయుదు రనుట.—స్వభావోక్తి; 'పతికి...విరులు'-ఉపమ.

'ఇందము' = నిపాత్యము ('హంద గృహాణార్థే' అని హేమచంద్రుని దేశీనామమాల యందుం గలదు.). 'సంభ్రమింప' - నామధాతువు - సంభ్రము = సంబరము = పండుగు (కన్నుల పండువుగా నుండఁగా ననుట). 'చూపుటొయ్యారము' - టుగాగమము 'వేల్పుటావు' ఇత్యాదుల యందుంబోలె. 'పరసాపత్న్య' - ఇట 'సర్వనామ్నాం వృత్తిమాత్రే పుంవద్భావః' అనుటచే పరాశబ్దమునకు పుంవద్భావము రాఁగా పై రూపము సిద్ధించును.

'ప్రభాత వాతాహత కమ్పితాకృతిః। కుముద్వతీ రేణు పిశఙ్గ విగ్రహామ్
నిరాస భృఙ్గం కుపి తేవ పద్మినీ। న మానినీ సంసహతేఽన్యసంగమమ్,' భట్టి.

ఇట 'అన్యాసంగమమ్' అనక 'అన్యసంగమమ్' అనుటం బరికించునది. సాపత్న్యము = సపత్నీభావము. 'అందిచ్చు' - దీనిని క్త్వార్థకార సంధిగా తత్కాలములు వాదింతురు; అందు ధాతువు ఇచ్చు ధాతువు ఇటుకలసి తఱచుగా ప్రయోగములం గానిపించుటచేత దీనిని శబ్దపల్లవముగా గ్రహింప నొప్పును.—'పిశాచి నీరు కఱుకు ట్లందీఁ' ఆము. ౬ ఆ. ౨౬. 'మడిచి యందిచ్చు నపుడు గోరిడుదుఁ గేల' నైష. 8 ఆ. 84. 'చాపము నాకందిమ్ము' అను భారత ప్రయోగమును ఇట్టిదియ. ఈ శబ్దపల్లవమునకు ప్రయోగములు ప్రబంధములలో పరశ్శతములు కలవు; కొన్నిటిని పీఠికయందుం గననగు.

చ. దల మగు చంద్రఖండములు దారలు, సాంకవ మొప్పుపాణిపా
టల మగుదంతపుంగరవటంబు శశాంకుఁడు, గుంకుమైనచీ
రలజిగి కెంపు, గా బయటి రథ్యల నొప్పుదు రిందుకాంతవే
దులపయి సంధ్యయే బహుతఁ దోఁచె నన న్పురి గట్టివా ల్సతుల్. 23

పురిన్ =మధురాపురమందు, బయటి రథ్యలన్ = వెలుపలి వీథులయందు - అనఁగా - పెద్ద వీథులయందు, గట్టివాల్ సతులు = పరిమళద్రవ్యము లమ్మెడు స్త్రీలు, దలము అగు చంద్రఖండములు=మెండయిన కప్పురపుం దునియలు ('అథ కర్పూర మస్త్రియాం ఘనసార శ్చన్ద్ర సంజ్ఞః' అమ.), తారలు = నక్షత్రములు ('నక్షత్ర మృక్షం భం తారా' అమ.), సాంకవము ఒప్పు = జవ్వాది దేనియందు ఒప్పుచున్నదో అట్టి (సంకు వనఁగా జవ్వాది పిల్లి, దానివలనం గలుగునది గాన సాంకవము జవ్వాది) - పాణి పాటలము=నిగనిగతోడి శ్వేతరక్తము (పాణి=ముత్తెపు నీరు - 'శ్వేతరక్తస్తు పాటలః' అమ.), అగు - దంతపుం గరవటంబు=ఏనుఁగు దంతముతో చేసిన బరణి, శశాంకుఁడు=చంద్రుఁడును, కుంకుమ ఐన చీరల జిగి=చెందిరము అంటిన కోకల డాలు, కెంపు= (సంధ్యా) రాగంబును, కాన్ =కాఁగా, ఇందుకాంతవేదుల పయిన్ =చంద్రకాంతపుఁ దిన్నెల మీఁద, సంధ్యయే = సంధ్యాకాలమే, బహుతన్ = అనేకత్వము పొంది, తోఁచెన్ = అగపడినది, అనునట్లుగా, ఒప్పుదురు.

ఆపురమందు బయటి వీథులలో చంద్రకాంతమయవేదికలయందు సంజప్రొద్దుల పరిమళద్రవ్యము లమ్మెడుస్త్రీలు - మెండయిన కప్పురపుం దునియలు గల్గి జవ్వాదితో నిండి నిగనిగలాడు పాటలవర్ణముతో నొప్పుచున్న దంతపు బరణియు, కుంకుమము తగిలిన చీరలకాంతియు, నొప్పారు.

చుండఁగా సెట్లు శోభింతు రనఁగా, ఒక్కటియ యైన సంధ్య పెక్కుసంధ్యలై, ఒకొక్కక్క సంధ్యయు చంద్రకాంతపు టరఁగులయందు పెక్కునక్షత్రములు, మచ్చతోడి యొక్కచంద్ర బింబము, రక్తిమయు, కలదై, అట కానిపించినదో అనునట్లు శోభిల్లుచుందురు.—రూపకాను ప్రాణితమయిన యుత్ప్రేక్ష.

'దలము'—కప్పురపుం దునియలు చవుక గావునను ఎక్కువగా అమ్ముడుపోవును గావునను అంగడిలో పెక్కులుగా నుండుట ప్రసిద్ధము; బహుత్వమును చెప్పుట సంఖ్యలోఁగూడ నక్షత్ర ములతో సామ్యముండుటకు. 'తారలు'—ఇట నీశబ్దమునకు చంద్రభార్యలయిన యిరువదియేడు నక్షత్రములు మాత్రమేగాక నక్షత్రసామాన్యము అర్థము, 'నక్షత్రతారాగ్రహా' అను ప్రయోగ మందు సమ్మతి మయినభేద మిచ్చట వివక్షితము గాదు. 'కరవటంబు'—ఏకత్వము చంద్రసంఖ్యా సామ్యముకొఱకు, పునుఁగు మిక్కిలి వెలపొడుగు వస్తువు గావునను ఇంచించుకయే అమ్ము డగును గావునను ఒకకరవటము పునుఁగైన పెక్కుదినములు విక్రయమునకు చాలుం గావునను అని ఒకకరవటమే ఉండును. 'సాంకవమొప్పు పాణిపాటల మగు దంతపుంగరవటంబు' - ఇందు 'సాంకవము' తృతీయార్థప్రథమ యని పూర్వముద్రణవ్యా.; అది హృద్యముకాదు; ఒప్పినది సాంకవమేగావున సాంకవమునకు ప్రథమ వచ్చినది; 'ఒప్పు' 'అగు' అను విశేషణోభయ పదంబులు కేవలక్రియాజన్య విశేషణ ఘటితంబులై సందర్భయోగ్యమయిన 'పాణి పాటలము' అనుపదముచే వ్యవహితము లయినవి. చూ. ప్రౌఢవ్యా. సమాస. 18 సూ. 'ఒప్పు' అనుధాతుజ విశేషణము అధికరణ ప్రాధాన్యవివక్షచేతను, 'అగు' అను ధాతుజవిశేషణము కర్తృప్రా ధాన్య వివక్షచేతను, 'దంతపుం గరవటంబు' అను విశేష్యంబుతో సమసించినవి. చూ. బా. సమా. 26. సూ. 'ఇందుకాంత' ముం జెప్పుట ప్రతిఫలనార్థము, ప్రతిఫలనము బహుత్వార్థము. అసతులు దృశ్యమానలు గావున సంధ్య తాను మూర్తీభవించి నిజలక్షణములతో ప్రతిఫలించిన దని యుత్ప్రేక్షాభిప్రాయము.'గట్టివాల్సతులు' అనుపదము భారతప్రసిద్ధ మని పూర్వముద్రణవ్యా. కాని భారతాది బహుగ్రంథములం దతినదీక్షు లయినసీతారామాచార్యులవారు 'గట్టువాలు' అని పఠించి దానికి సైరం ధ్ర్యర్థమునుమాత్రమే వ్రాసినారు.* బ్రౌనుదొరగారు 'గట్టివాల్ సతులు' అని పఠించి మామిడి వెంకన్న కృతాంధ్రదీపికయొక్క అనుబంధమునుండి పరిమళ ద్రవ్యము లమ్మెడుస్త్రీలు అని యర్థము వ్రాసినారు.

సీ. ఉపరిస్థజనవారణోక్తికిఁ జెవి దార్చి
యమ్మొగంబై బయ ల్చిమ్మి చిమ్మి,
గవను వె న్నొరయ మి న్నవియ దట్టించు తో
త్రధరు బందపుదాంట్లఁ దఱిమి తఱిమి,
చలువచే ద్వారవేదు లెఱింగి నిల్చి త
జ్జనబిఘృక్షుకుఁ గేలు సాఁచి సాఁచి,
డిండిమంబుల కుబ్బ గండాల్పదాన మే
లులుగఁ దద్వహు కాల లువ్వి లువ్వి,

* కన్నడము - గట్టివళతి = a toilet woman.

తే. వేణుకాహతులకు వీడు వెడలి వెడలి,
పరపథగజధ్వనికిఁ బోక తిరిగి తిరిగి,
దృక్పుటలు వైరులకుఁ బంపు కృత్య లన వ
శానుగతిఁ జేరు వెలిఁ గరు లగ్గలికల. 24

1. కరులు=ఏనుఁగులు, ఉపరి...కిన్ - ఉపరి = (మెడ) మీఁద - స్థ = (కూర్చుండి) ఉన్న - జన=మనుష్యునియొక్క (మావటివానియొక్క యనుట) - వారణఉక్తికిన్ = నివారణ వచనమునకు (అటు చేయవలదు అను నదలింపును), చెవిదార్చి = చెవియొగ్గి విని, అమ్మొగంబై= ఆమావటీనివైపు మొగముంచి (తలపైకెత్తి), బయల్ చిమ్మిచిమ్మి = ఆకాశమును మాటిమాటికిని మీటి;—చెవిదార్చుట మదమెక్కియుండుటచే అప్రయత్నముగా మావటీనిమాట వినఁబడవందున; అమ్మొగంబై బయల్చిమ్ముట నివారణసేయఁ గూడ దను నభిప్రాయమును అతనికి సూచించుటకు; 'చిమ్మిచిమ్మి'—ఆమ్రేడనము ముహురర్థకము.

2. మిన్ను అవియన్ = ఆకాశము బ్రద్ద లగునట్లుగా (పా. మన్నవియ=భూమి బ్రద్ద లగునట్లుగా), ద...రున్ - దట్టించు = అదలించుచున్నట్టి - తోత్రధరున్ = బరిగోల ('తోత్రం వైణుకమ్' అమ.) పూనినవానిని, గవను=పురద్వారము, వెన్ను=తనవీపును, ఒరయన్ = రాచుకొనునట్లుగా, బందపుదాంట్లన్=బందములుగల కాళ్లతో దాంట్లు వైచుచు, తతిమితతిమి = మాటిమాటికి తతిమి; [మిన్నవియ బిగ్గరగా దట్టించుట ఇతఁడు కడుబల్లిదుఁడు చావఁగొట్టును అని భయముగొల్పుటకు; గవను వెన్నొరయుట దాంట్లచేత; దాంట్లు బందములచేత.]

3. ద్వారవేదులు = వాకిళ్లకడనుండు తిన్నెలను, చలువచేన్ = అచ్చటి చల్లఁదనముచేత, ఎఱింగి, నిల్చి, తత్ జనజిఘృక్షన్ = అందలిమనుష్యులను పట్టుకొనునిచ్ఛచేత, కేలు = తుండమును, సాఁచిసాఁచి=మరలమరల పొడిగించి; 'చలువ'—కల్లాపిలోనగు కారణములచేత; చలువచే నెఱుంగ నేల, కంటికి కనఁబడవా యనిన, మదమెక్కియుండుటచే ముందువేదులవైపు సరిగా చూడలే దనియు, చలువచే వేదు లని తెలిసిన యనంతరము అటు చూచిన వనియు తలంపఁదగును; 'జిఘృక్ష' మదముచేత.

4. గండ అల్పదానము=చెక్కులలోని యించుక మదజలము, డిండిమంబులకున్ =రాయిడి గిడిగిడియను వాద్యముయొక్క ధ్వనుల (ను ఏనుఁగు వినుట) చేత, ఏటులుగన్ = ఏటులవలె - అనఁగా - మిక్కుటముగా, ఉబ్బన్ = ఉప్పొంగఁగా, తద్వహున్ = ఆడిండిమవాదకుని, తాలన్=శిలలతో, ఉవ్విఉవ్వి = మాటిమాటికిం గొట్టి; - డిండిమధ్వనిచే ఏనుఁగునకు కోపము వచ్చినందున దాన ముబ్బుటయు వాదకుని తాలం గొట్టుటయు.

వేణుక ఆహతులకున్ = వెదురుకోలల దెబ్బలచేత, వీడు వెడలి వెడలి= ఊరు వెలువడి మరల వచ్చి మరల వెలువడి, పరపథ గజధ్వనికిన్ = వేఱుదారిలోని యేనుఁగుల ఘీంకారముచేత, పోక= ఊరు వెడలిపోక, తిరిగితిరిగి=మరలమరల ఊరిలోనికి ప్రవేశించి, వశా అనుగతిన్ =పిడియేనుఁగును ('కరిణీ ధేనుకా వశా' అమ. పిడి=ఆఁడుమృగము.) వెంబడించుటచేత, వెలిన్ =ఊరివెలుపలికి, అగ్గలికలన్ = ఉత్సాహములతో, దృక్పుటలు = చూడ్కులసమూహములు, వైరులకున్ = శత్రురాజులమీఁదికి, పంపుకృత్యలు అనన్ =ఆపాండ్యరాజు పంపెడు సంహారకదేవతలు అనునట్లు ఒప్పుచుండఁగా (ఉత్ప్రేక్ష. 'కృత్యా క్రియా దేవతయోః, అమ. 'సంహారక దేవత' యని బ్రౌను.

'భార్గవ నిర్మితయైన కృత్యచేతం జంపింప సమకట్టిన' అని తద్దత్త విష్ణుపురాణ ప్రయోగము.), చేరుఁ=పోవును. [పిడియేనుఁగువలన వెలుపలి కేఁగునవిగాని ఒండువిధమున నేఁగింప నలవిగా దని భా. ఆపాండ్యునికి అట్టి మదపుటేనుఁగులు పెక్కులు గల వని భా.—మత్తగజస్వభావోక్తి.]

'ఏఱులుగన్ - ఇచ్చట క్రియావిశేషణమునకు నుజ్యంతం బగుధాతువు అనుప్రయుక్తమై హ్రస్వమును బొందినది. 'ఏఱులుకాఁగా' అనఁగా ఏఱులై ప్రవహింపఁగా అని యర్థమగునట్లుగా 'ఏఱులు' క్రియావిశేషణముగాక నుజ్యంతమునకుం గర్తయగునేని, ఆపక్షంబున 'కన్' అని హ్రస్వంబురాదు; కావున 'ఏఱులుగన్' అనునది ఉబ్బుటకు (క్రియా)విశేషణము కావలయును. పూర్వకాలికంబునకు 'ఉబ్బి' కి 'ఱువ్వి' తో సమానాశ్రయత్వము లేమింజేసి ఇప్రత్యయము ఘటిల్లదు, అందుకై 'ఉబ్బన్' అనియే పఠింపవలయును.

ఆపురమున మదపుటేనుఁగులు తమ్ము ఇచ్చవచ్చినట్లెల్ల పోనీయక మావటీఁడు అదలించు నందులకు కెరలుచు, బరిగోలతో పొడుచువానిని బందాలలోనే యుండియు దాంట్లతోనే మాటి మాటికి తఱుముచు, చలువచే ఇండ్లవాకిళ్ల తిన్నెల నెక్కి అందుండువారిని పట్టఁబోవుచు, డిండి మధ్వనికి గండమదము ఏఱులవలె నుబ్బుచుండఁగా, ఆడిండిమవాదకుని తాల ఱువ్వుచు, వెదురు కోలలపెట్లకు వీడువెడలియు, ఊరిలోనే వేఱుదారిం బోవు నేనుఁగు ఘీంకారము విని మరల ఊరిలోనికి తిరుగుచు, తుదకు పిడియేనుఁగు కనఁబడఁగా ఊరివెలుపలికి దానివెంట మహోత్సాహముతో పరువిడుచు, వైరిభయంకర మయినచూపులు చూచుచు పోవును.

ఉ. పై ననిశంబు సల్లుకొను పాంసువుపై ఖగతుండఖండితా
లానమహామహీరుహఫలచ్యుతబీజము లుత్క్షిపత్కరాం
భోనిబిడాప్లుతి న్మొలవఁ బొల్చు నగమ్యతఁ దూలుచు న్పురో
ద్యానముల న్మదేభములు ప్రాణముతోడినగంబులో యనన్. 25

పుర ఉద్యానములన్=ఊరి తోఁపులయందు, మద ఇభములు=మత్తగజములు, పైన్=తమ మొడలిమీఁద, అనిశంబు = సర్వదా ('సతతానారతాశ్రాన్త సన్తతావిరతానిశమ్' అమ.), చల్లుకొను పాంసువుపైన్ = తాము తొండముతో చల్లుకొనెడి దుమ్ముమీఁద ('రేణుర్ద్వయోః స్త్రియాం ధూళిః పాంసుర్నా న ద్వయో రజః' అమ. పా. పాంశుః), ఖగ...లు - ఖగ=పక్షుల యొక్క ('ఖగే విహఙ్గ విహగ విహఙ్గమ విహాయసః' అమ.) - తుణ్డ=నోళ్లచేత ('వక్త్రాస్య వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్' అమ.) - ఖండిత = కొఱకఁబడిన (ఫలవిశేషణము) - ఆలాన = (ఏనుఁగునకు) కట్టుఁగంబ మయిన ('ఆలానం బన్ధనస్తమ్భే' అమ.)—మహామహీరుహ=పెద్దచెట్టు యొక్క ('వృక్షో మహీరుహః శాఖీ' అమ.) - ఫల = పండ్లనుండి - చ్యుత = రాలిన - బీజములు = గింజలు, ఉత్...తిన్ - ఉత్క్షిపత్ = మీఁదచల్లుకొనెడి - కరఅంభః = తొండపునీటియొక్క - నిబిడ=దట్టమయిన - ఆప్లుతిన్=తడుపుటచేత, మొలవన్= మొలకలెత్తఁగా, అగమ్యతన్=సమీపింప రానివై (కొండలును అట్టివే), తూలుచున్ = ఊఁగులాడుచు, ప్రాణముతోడి నగంబులో యనన్=ప్రాణముగలవై సంచరించుచున్న కొండలో యనునట్లు, పొలుచున్=ఒప్పారుచుండును.

ఆపురమందు, ఊరితోఁపులలో మత్తేభములు- తాము నిరంతరము తొండములతో దేహము మీఁద చల్లుకొనెడి దుమ్ములో, తమకు కట్టుఁగంబములై యున్న మహావృక్షముల పండ్లను పక్షులు కొఱుకుటంజేసి, వానిగింజలు పడఁగా, తాము తొండములతో ఎత్తి పయిం జల్లుకొనెడి నీటి

దట్టంపుఁ బడిచేత మొలకలెత్తఁగా, అస్థితిలో చేరఁబో నెవరికిని శక్యము గాక, ప్రాణముతోడి పడగొండలవలె ఊఁగులాడుచు సంచరించుచుండును.—ఉత్ప్రేక్షాలంకారము.

శా. మౌనిక్రోధవిధూతపత్త్రముల మా మాతో సపత్త్రుల్గదా
కానీ రం డని కేకరాక్షిరుచిమొక్కల్ ప్రక్కలన్ శార్ఙ్గతూ
ణానల్పాహిపకల్పకాండతతులం దారం బురిం బొల్చు నా
జానేయంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చుచున్. 26

పురిన్=మధురాపురమందు, ఆజానేయంబులు=ఉత్తమజాతిగుఱ్ఱములు ('ఆజానేయాః కులీనాశ్వాః' అమ.), మా...లము—మౌని = శాలిహోత్రమునియొక్క - క్రోధ = కోపముచేత - విధూత=పోఁగొట్టఁబడిన - పత్త్రములము=ఱెక్కలుగలవారము (అనఁగా - ఱెక్కలులేనివారము—'పత్త్రం వాహనపక్షయోః' అమ.), ఔ మాతోన్, సపత్త్రుల్గదా = ఱెక్కలులేనివారలుగదా, కానీ రండు=వచ్చి వేగము చూపుఁడు, అని=అనుటయర్థముగా, కే...క్కల్ - కేకరఅక్షి=మెల్లకంటియొక్క ('వలిరః కేకరే' అమ.- అపాంగముకడకు ఒఱగిన తారక కలిగినకన్ను మెల్లకన్ను - ఆకేకరదృష్టిలక్షణము.-

'ఆకుఞ్చిత పుటాపాఙ్గసంగ తార్ధనిమీలితా
ముహుర్వ్యావృత్తతారాచ దృష్టి రాకేకరా మతా.')—

రుచి=కాంతులయొక్క - మొక్కల్=అంకురములు, ప్రక్కలన్=పార్శ్వములయందు, శా...లన్—శార్ఙ్గ=సింగిణి విండ్లతోఁ గూడిన - తూణ=అమ్ముల పొదులయందలి - అనల్ప=గొప్ప - అహిపకల్ప = పాపతేండ్లవంటి - కాండ = బాణములయొక్క - తతులన్ = సమూహములయందు, తారన్ = చొచ్చుచుండఁగా, ఫేనహాసము = నురుగనెడి నవ్వును, ఇడి = నవ్వి, కైజామోరలు = కళ్లెము పైకెత్తి బిగఁగట్టిన ముఖములను, అల్లార్చుచున్=ఊంకించుచు, పొల్చున్=ఒప్పుచున్నవి.

గుఱ్ఱములకు కడకంటి పార్శ్వదృష్టియు, నోటఫేనంబును, కళ్లెమెత్తి బిగఁగట్టినప్పుడు తల నుంకించుచుండుటయు స్వాభావికము. మఱియు వారికి పూర్వము ఱెక్కలుండి మునిశాపము వలనం బోయినవి. బాణములకు ఱెక్కలు గట్టియుండును. ఆపురియందలి యుత్తమజాత్యశ్వముల యాకేకరదృష్టులు తమప్రక్కలం గట్టియున్న సింగిణి విండ్లతోడియమ్ములపొదులలోని పాఁపతేండ్లవంటి బాణములమీఁదికి ప్రసరించుటయు, ఫేనంబును, తలయూంకించుటయు నెట్లున్న దనఁగా, 'మాకు మునిశాపమువలన ఱెక్కలుపోయినవి, మీకు ఉన్నవి, అయినను మీరు వేగములో మాతో రండు' అని యాబాణములను పరిహాసపూర్వముగా పందెమునకు పిలుచుచున్నవో యనున ట్లున్నది. అందలి గుఱ్ఱములు శరములకన్న వేగవంతము లని యర్థము. మహావేగము లనుట. - వాచకము లేమిచే గమ్యోత్ప్రేక్ష; 'అహిపకల్ప' - ఉపమ; 'ఫేనహాసము' - రూపకము.

'మౌని క్రోధ విధూతపత్త్రములము.'—

''పురా సపక్షా హరయో విచేరుః ఖేచరాః కిల,
గన్ధర్వేభ్యః సముత్పన్నాః సదా స్వచ్ఛన్దచారిణః.
తేజో వా య్వమ్బుదగన్ధై ర్లబ్ధరక్షితలక్షణాన్
వీక్ష్య శక్రో, జగా దేదం శాలిహోత్రం మహామునిమ్.

భిన్ధి పక్షా నమీషాం త్వం యథా స్యు ర్వాహనాని మే;
ఇషీకాస్త్రేణ సోఽప్యేషాం పక్షాం స్తత్ప్రీతయేఽచ్ఛినత్.
తతః ప్రసాదితస్తైస్తు ప్రాదా ద్వర మిమం మునిః
యుష్మత్పక్షోపమో వేగ శ్చరణానాం భవిష్యతి,
యూయం శక్రాదిదేవానాం వాహనత్వం గమిష్యథ,
తథా భూమి పతీనాం చ గౌరవేణ సమన్వితాః.''  శార్ఙ్గధరుఁడు.

'సపత్త్రల్' - స్త్రీత్వము తతులు అను మహతీతర స్త్రీలింగమునకు విశేషణమగుటచేత; పాక్షికముగా 'సపత్త్రములు' అనవచ్చును. 'సపత్త్రుల్' అను పా. అసాధువు. 'శార్ఙ్గ' ముం జెప్పుట వైణవమున కన్న శార్ఙ్గము బలిష్ఠముగావున; తదీయబాణములు దృఢతరములును వేగవత్తరములును గావున అంతకన్న వేగవంతము లగుట గుఱ్ఱములకు పరమోత్కర్ష. 'ఆజానేయంబులు' - 'ఆజాన' అని ఆఫ్రికాఖండములో నొకదేశము, అందు ఉత్తమాశ్వము లుత్పన్నములై యితర దేశములకుం దేఁబడును. ఆజానదేశ భవములు గావున, ఆజానేయసంజ్ఞ. అయినను 'అజగతిక్షేపణయోః - ఆజేన క్షేపేణ ఆనేయాః ప్రాపణీయాః ఆజానేయాః' అని నిఘంటువ్యాఖ్యాతలును,

'శక్తిభి ర్భిన్న హృదయాః స్ఖలన్త శ్చ పదేపదే
ఆజానన్తి యతః సంజ్ఞా మాజానేయా స్తతః స్మృతాః.'

అని అశ్వశాస్త్రకారులును వ్యుత్పత్తిని కల్పించుకొన్నారు. 'కానీ' = 'కానిమ్ము' ఇట్లది ఏకవచనమైనను అవ్యయమైపోయి యంగీకారమాత్రమును దెలుపుచున్నందున 'రం' డను బహువచనముతో ప్రయుక్తమైనది. 'కైజా' - 'ఖైజ్' అను పారసీక శబ్దమునుండి వచ్చిన దని బ్రౌను దొరగారు. 'శార్ఙ్గ' - వేగపుఁబందెములో సింగిణి విండ్లుచేరకున్నను వీని ప్రేరణలేక బాణములకు వేగము కలుగదుగావున వీనిం జెప్పుట.

చ. 'చలమున సింగిణీతరకసంబులఁ గట్టక మాన, రంపపె
న్నెలగతి మాగతి న్వెనుకఁ జిక్కక మానదు, తప్పిదారి వె
న్నొలసినఁ దారు ము న్నెఱుఁగకుండుట నొచ్చెము సాదికోటి' కం
దలమినచింతఁ ద్రవ్వికొను నంఘ్రితుద న్పురిలోనివాహముల్. 27

పురిలోనివాహముల్ = ఊరిలోని గుఱ్ఱములు ('వాజి వాహార్వగన్ధర్వ' అమ.), (ఇట్లు తలపోసిన వఁట) - చలమునన్ = వైరులమీఁది రోషముచేత, సింగిణీతరకసంబులన్ = సింగిణివిండ్లతోడి యమ్ములపొదులను, కట్టక మానరు = (మారౌతులు తప్పకుండ మాపార్శ్వములకు) కట్టుదురు; అంపపెనునెలగతి = బాణములయొక్క పెద్దయలుగుయొక్క గమనము, మాగతిన్ = మాగమనములో, వెనుకఁ జిక్కక మానదు, తప్పిదారి = ఒకవేళ, వెన్నొలసినన్ = (వీఁపునకు ఆప్రయోగించిన) బాణంపుటలుగు తగిలెనా, తారు మున్న ఎఱుఁగకుండుట = ఇట్లు అగు నని ఆరౌతులు తాము ముందుగా నూహించుకొనమి, సాదికోటికిన్ = ఆరౌతులసమూహమునకు ('అశ్వారోహాస్తు సాదినః' అమ.), ఒచ్చెము = కొఱఁత, అందున్ = ఇట్లని, అలమినచింతన్ = కమ్ముకొన్న విచారముచేత, అంఘ్రితుదన్ = పాదాగ్రముచేత, త్రవ్వికొనున్ = నేలను ద్రవ్వుకొనుచుండును.

లోకములో చింతాక్రాంతులయినవారు పాదాగ్రముతో నేలను గీచుచుండుట ప్రసిద్ధము; గుఱ్ఱములకు గొరిజలతో నేలఁ ద్రవ్వుచుండుట స్వాభావికము; కావున ఆపురిలోని గుఱ్ఱములు

అట్లు గొరిజలతో నేలం ద్రవ్వుచుండుటయె ట్లున్నదనఁగా—మా రౌతులు శత్రువులమీఁది రోషముచే వారిని సంహరించు సాధనము లయిన సింగిణులతోడి యమ్ములుగల పొదులను మా ప్రక్కలం గట్టుకొనక మానరు. మఱి వారు దవుడు సేయుచు బాణములం బ్రయోగించిన, ఆబాణములు మా వేగములో వెనుకఁబడుట తప్పదు. అట్లు వెనుకఁబడి వచ్చుచుండుటలో ఒకవేళ ఎట్టకేలకు (మమ్మువారు నిలుపుట లోనగు కారణములచేత) ఏదేనొక బాణము వీరివీఁపునకుం దగిలెనా, అట్లు అది తగులు నని తాము ముందుగా నూహించుకొనమి, అనఁగా మా వేగము బాణవేగముకన్న నెక్కుడని సమయాన తలంచుకొనని కొఱఁత, మా దొరలయిన రౌతులకుం గలుగును; అయ్యో! ఇందులకేమి సేయ నగు! — అని మెండుకొన్న విచారముచేత నేలను గొరిజలతో త్రవ్వుచున్నవో యన్నట్లుండును.— హేతూత్ప్రేక్ష-గమ్య.

'సింగిణీ తరకసంబులు' – 'అచ్ఛికంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు' బా. అట్లయినట్టి ద్వంద్వసమాస మిది. 'మానరు' అను వ్యతిరేక ప్రయోగముచేతి 'కట్టక' అనఁగా కట్టుట యని భావార్థమే పర్యవసించినది. 'సెల' – ఈపదము సమూహార్థకమని పూర్వముద్రణవ్యాఖ్య, కాని ఆకరములందు ఆయర్థము లేదు, బాణపుములికి యను నర్థము కలదు. * 'తప్పిదారి' – ఇట అప్రథమపై దాదేశము గసడదవాదేశ సూత్రమందలి బహుళగ్రహణము చేత సిద్ధము. ఇట్లే లోకమందు ఈ ప్రయోగము.—

'ఆషాఢ శుద్ధపఞ్చమ్యాం వచ్చెనే వృద్ధగౌతమీ
అథవా తప్పిదారేణ ద్వాదశ్యా మదితప్పదూ'.

నరసభూపాలీయములో యమకమున క్త్వార్థకారము పై తాకు దాదేశము కలదు:—

'కపురాల వన్నెచొక్కపురాల నగుమేని । కపురాలఁబోతుబింకంబు నణఁచి
దనరుచులు లోకములు నిండఁ దనరుచుండు.'

'తారు మున్నెఱుఁగకుండుట'—'తారు వెన్నెఱుఁగకుండుట' అని పూర్వముద్రణము. 'మాఱు వెన్నెఱుఁగకుండుట' అని ఒక పా. దానికి 'మాఱువెన్ను=వీఁపునగాయము' అని వ్యా. వ్రాయఁబడియున్నది. కాని ఆయర్థము ఆపదములకు ఆకరములం దెక్కడను గనఁబడలేదు. 'వెన్నొలసిన' ఒచ్చె మేమి యన, యుద్ధమునం బలాయితు లయి వచ్చువారికి వైరులు తఱుముకొనివచ్చి కొట్టుచో వెన్నున గాయము లేర్పడును; గాన ఈ రౌతులు అట్లు పలాయితులై వచ్చి రని ఆ వెనుగాయములం జూచువారు తలంతు రను నొచ్చెముగాని నొప్పికైన యొచ్చెముగాదు. 'మాఱువెన్ను' అనుపాఠముతో – వైరులకు అనభిముఖముగా నున్న వెన్నును వారి కభిముఖముగా మార్చుట, అనఁగా వైరులనుండి పాఱివచ్చుట, దాని నెఱుంగకుండుట ఆకార్యము ఎన్నఁడును చేయకుండుట. అప్పుడప్పుడు రణమునుండి పలాయితు లగువారికి వెనుగాయము అలవాటుపడి యుండుటచే ఒచ్చెము గాదుగాని అట్లు పలాయనము చేయ మని నియమముగల వీరులకు అది యొచ్చెము, తమ రౌతులు అట్టి నియమము గలవారు గాన వారికి వెనుగాయము ఒచ్చె మని ఆగుఱ్ఱములచింత. – అని వ్యాఖ్య చేయవచ్చును.

ఉ. అంజ సమానవాయుగణ మంతయు ఖంజతఁ జిక్క, నాజవో
ష్ఠం జని యుబ్బి చిక్కనిసమానపువాయువు లో నొకండు గ

* చూ. నన్నెచోడ. 'తప్పన దారులేని' 5-75. (= తెలిసియో తెలియకయో వేసి.)

ల్మిం జనియించు దుర్యశము మేల్కొని లేహనవేళ వాజు లూ
ర్ధ్వం జెదుమాణిబంధముకురంబుల కాళిమ పేరఁ గాఱ్కొనున్. 28

వాజులు=ఆపురియందలి గుఱ్ఱములు, అంజన్ =అంగలో (అంగ వేసినమాత్రాననే), సమాన వాయుగణము=తమకు సమానములని వాడఁబడిన గాడ్పులయొక్క సమూహమంతయు, ఖంజతన్ =కుంటుఁదనంబుచేత (వేగము చాలమిచేత ననుట-'ఖోడే ఖఞ్జః' అమ.), చిక్క=వెనుకఁబడఁగా, ఆ జవ ఊష్మన్ = ఆ వేగమువలని వేఁడితో, చని = పోయి (పర్విడి యనుట), ఉబ్బ=ఆజయమునకు కరము సంతోషించి, చిక్కని=వెనుకఁబడనట్టి, సమానపువాయువు=సమానమను పేరిగాలి (తమకు సాటియైన గాలి), ఒకండు = ఆ జితవాయుగణములోనిది గాక వేఱొకటి, లోన్=తమ కడుపులోనే, కల్మిన్=ఉండుటవలన, జనియించు దుర్యశము = పుట్టునట్టి యపకీర్తి, మేల్కొని=నిద్రలేచి, లేహనవేళన్=(ఉప్పుగండ్లను) నాకెడు సమయమున, ఊర్ధ్వన్ = (ఆగుఱ్ఱములు) శ్వాసమును పైకి పొలయింపఁగా, చెడు...లన్ - చెడు = వన్నె మాయునట్టి - మణిబంధ ముకురంబులన్ = అద్దములవంటి సైంధవలవణంపుఁ బెళ్లలయందు ('సైన్ధవోఽస్త్రీ శీతశివం మాణిబన్ధం చ సిన్ధుజే' అమ. - మణిబంధ మను గిరిలో పుట్టినది.), కాళిమ పేరన్ = నలుపనియెడి మిషచేత, కాఱ్కొనున్ = మెండుకొనును.

ఆయూరి గుఱ్ఱములు, ప్రతివాఁడును తాను తన సమానులలో నుత్తముఁడు కావలయు నని కోరునుగాన, అట్లే తమకు సమానము లని ప్రసిద్ధము లయిన వాయుగణముల నన్నిటిని తొలి యంజలోనే కుంటుపఱిచి, వెనుక విడిచియు, ఆవేగమువలని వేఁడిచే సంతోషంబునం బరువిడు చుండియు, సమాన మను పేరు గలదగుటచే సమానమైన మఱియొక వాయువు తా మెంతవడిగా పర్విడినను వెనుకఁ బడనట్టిది తమ కడుపులోనే యున్నదను నపకీర్తిని కడుపులో వహించి యున్నవి. అది ప్రాతఃకాలమందు అవి నాకెడు సైంధవలవణంపుఁ బెళ్లలయందు వానియూర్పుల చేత నలముకొన్నట్టి దట్టంపు నలు పనెడి మిషచేత స్పష్టపడుచున్నది. - కైతవాపహ్నుతి.

'గణ' మనుట - ఆవహాప్రవహాది సప్త భేదములంబట్టి.—

'భూవాయు రావహా ఇహ ప్రవహా స్తదూర్ధ్వః
స్యా దుద్వహా స్తదను సంవహ సంజ్ఞక శ్చ
అన్య స్తతోఽపి సువహః పరిపూర్వకోఽస్మాత్
బాహ్యః పరావహ ఇమే పవనాః ప్రసిద్ధాః'. గోళా.

'జవోష్మన్' - 'జయోష్మన్' అన్నను మెఱుఁగే 'జని యుబ్బి' - 'జనియించు' అని పూర్వ ముద్రణ పా. 'జని యుబ్బఁ జిక్కని' అని మఱియొకపాఠము. సమానవాయువు పంచప్రాణములలో నొకటి, దేహమున ఎప్పటికి నుండునదిగాని అప్పుడప్పుడు జనించునదికాదు. కావున 'జనియించు' పా. సరిగాదు. 'లో నొకండు'—

'ప్రాణోఽపానః సమాన శ్చోదానవ్యానౌ చ వాయవః,
హృది ప్రాణో గుదేఽపానః సమానో నాభిసంస్థితః
ఉదానః కణ్ఠదేశస్థో వ్యానః సర్వశరీరగః.' అమ.

'లేహనవేళ' - ప్రాతః కాలము - 'లవణస్యదోపవాహ్యావాయ విలేహ్యమాన మాణిమంథ శిలా శకలంబును' అని నైష. 8 ఆ. 14 లో 'విభాత లక్ష్మీవిలాస'మునకు విశేషణము.

'దీర్ఘేష్వమీ నియమితాః పటమణ్డపేషు
నిద్రాం విహాయ వనజాక్ష వనాయుదేశ్యాః
వక్త్రోష్మణా మలినయన్తి పురోగతాని
లేహ్యాని సైన్ధవశిలాశకలాని వాహాః.' రఘు. 5 (73).

'కల్తిం జనియించు' – 'వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి.' బా. కావున నిట సరళము పరముకాఁగా ద్రుతమునకు పూర్ణబిందువు. 'కాళిమ' – అపకీర్తి నలుపని కవిసమయము.

మ. ఇలఁ బాదద్వయి రాయ నల్కొసఁగు నెంతేఁ బాఱుచోఁ, నంకెవ
న్నెలు రెండై లఘువం దకీర్తియిడు మున్నే యెక్కుచోఁ, నిందు నెం
దుల కేమౌదు మటంచు సాదు లలయన్, దూర్ణోచ్చము ల్వాజు లం
దలరున్ బాహ్లీకపారసీకశకథట్టారట్ట ఘోట్టాణముల్. 29

(ఈగుఱ్ఱములు), పాఱుచోన్=పర్విడు సమయమందు, ఇలన్=నేలమీఁద, పాదద్వయి=మా రెండడుగులును, రాయన్ = రాచుకొనుటచేత, (మాకు), ఎంతేన్ = ఎంతేని = మిక్కిలి, అల్కు=భయమును, ఒసఁగున్ =కలిగించుచున్నవి; మున్నే=ఆదిలోనే, ఎక్కుచోన్=మేమెక్కునప్పుడు, అంకెవన్నెలు రెండు ఐ=(అంకెవన్నె యనఁగా రౌతు కాలుంచి యెక్కుటకుఁగాను గుఱ్ఱమునకు పార్శ్వమున వ్రేలఁగట్టెడి యినుప వలయముతోడి వాఱు) అంకెవన్నె క్రింద అంకెవన్నెయున్నవే గాని ఎక్కుట కసాధ్యంబై, లఘువందున్ = ఇంచుకలో (లేక - గంతునందు), అకీర్తి యిడున్ = మాకు సామర్థ్యము చాల దని అపకీర్తిని కలిగించుచున్నవి; ఇందున్ ఎందులకున్ ఏమి ఔదుమో=ఈ రెండుకష్టములలో దేనిచే నేమికీడుం బొందుదుమో, అంచున్=అని, సాదులు=రౌతులు, అలయన్=ఆయాసపడునట్లుగా, తూర్ణ ఉచ్చముల్=వేగవంతములును పొడవులు నయిన, వాజులు=గుఱ్ఱములు, బాహ్లీక పారసీక శక థట్టా ఆరట్ట ఘోట్టాణముల్=ఈ చెప్పిన బాహ్లికాది దేశోద్భవములు, అందున్ = ఆపురమందు, అలరున్ = ఒప్పుచున్నవి.

ఉత్తమాశ్వములు అతివేగముగా పర్విడునప్పుడు దేహము దీర్ఘమై కడుపు నేలకు తగులునట్లు తగ్గుటయు, అత్యున్నతాశ్వములకు నిచ్చెనవలె ఎక్కుటకై ప్రక్కకు రెండేసి అంకెవన్నెలు వేయుటయుం బ్రసిద్ధము; ఆతగ్గుటచేత రౌతునకు కాళ్లు నేలకు తగులునని భయము కలుగును, ఒకయంకెవన్నెనుండి ఇంకొక యంకవన్నెమీఁదుగా నిచ్చెన మెట్లెక్కినట్లు ఎక్కుటలో రౌతునకు లగువు లేనివాఁడని యపకీర్తి గలుగును. అతి వేగముచేతను అత్యౌన్నత్యముచేతను పైఁజెప్పిన భయాకీర్తులను వానివలని చింతను రౌతులకు కలిగించునట్టి గుఱ్ఱములు బాహ్లికాది దేశోద్భవములు ఆపట్టణమందు ప్రకాశించుచుండును. – అల్కొసఁగుట, అకీర్తియిడుట, అలయుటయు— అతిశయోక్తి.

'ఒసఁగు' పా. 'ఒదవు.' 'ఎంతే' – పా. 'ఎందే' 'లఘువందు' – పూర్వముద్రణ తద్వ్యాఖ్యలలో 'లఘిమందు' అని పా. 'లఘిమయందు' అని రూపము సిద్ధించునుగాని 'లఘిమందు' అని సిద్ధింపదు. 'లఘువు' అను శబ్దమునకే గంతు అను నర్థమును బ్రౌనుదొరగారు వ్రాసియున్నారు. ఆపక్షమున దీనిని ఆంధ్రవ్యవహారములో అర్థము మాఱిన సంస్కృతశబ్దములలో నొకటిగా భావింపవలయును; లగువను తద్భవశబ్దమునకును సప్తమిలో 'లగువందు' అని రూపము సిద్ధింపదు:

'లఘిమతః విగీతి' అని పఠించిన నిర్దోషము. 'తూర్ణోచ్చముల్' - పూర్వముద్రణ పా. 'రూపోచ్చముల్'; - ఇందు, అల్కనకుఁ గారణమును 'ఇందు నెందులకు' అని పరామర్శింపఁబడినదియు నగు తూర్ణతాగుణము రానందున ఈ పా. సరిగాదు. 'బాహ్లిక...ణముల్' - ప్రాయికముగా ఆయా దేశములనుండి తేఁబడిన యశ్వములకు భేదసూచకములుగా భవాద్యర్థక తద్ధిత ప్రత్యయ ఘటితములైగాని కాకగాని ఆయాదేశనామములే వ్యవహరింపఁబడుట ప్రసిద్ధము; ఇందు 'శక' 'ఘట్ట' 'ఘోట్టాణ' శబ్దములు తత్తద్దేశవాచకములు తత్తద్దేశజాతాశ్వ వాచకములు నై యున్నవి.

'వనాయుజాః పారసీకాః కామ్బోజా బాహ్లికా హయాః
ఆరట్టజా శ్చ తౌఖారాః సైన్ధవా శ్చేతి వాజినః.'

అన్యదేశ్యములందును ఇట్లు గలదు. టాంక్విన్ దేశపు గుఱ్ఱము పేరులు - ఠంగణా, టాకణా, తింగణా; ఈశబ్దములు పొట్టితనముచేత పొట్టివానికిని బాలునికిఁగూడ వాచకమైనవి. ఇందులోనే 'సంగతియె యోయి యిసుమంత తింగణావు' ర (౬౦); 'ఘట్టారట్ట' - 'ధారారట్ట' యని పూర్వముద్రణపా. తట్టువశబ్దము ఘట్టదేశపు గుఱ్ఱమునకు పేరుగానుండి. కుత్సితాశ్వమాత్రమునకు పేరయినదని యూహింపఁ దగియున్నది. ధార యనునది భోజరాజు రాజధాని.

—* ప ణ్య యు వ తు లు *—

సీ. ముడివిప్ప నడుగుఁదమ్ములనె వ్రాలుటఁ దేంట్లు
 నెఱికురు లగుట సందియము గలదె?
కన నెంతవాని లోఁగొనుట నాదర్శంబు
 నెమ్మొగం బగుట సందియము గలదె?
ఇఱిగొను మింటిపై మెఱయుటఁ జక్రద్వి
 తయి చన్ను లగుట సందియము గలదె?
పొలసు దొర్లఁగఁ జూచు కలికిచూపులమీలు
 దెలిగన్ను లగుట సందియము గలదె?
తే. పొలసినదె తావి బుగులుకో నలరుఁదీఁగ
తిన్ననిశరీర మగుట సందియము గలదె?
యనఁగఁ జెలువొంది సురత వైయాత్య నిధులు
పణ్యయువతులు పొలుతు రప్పట్టణమున. 30

1. ముడివిప్పన్ = కొమ్ముడిని విప్పఁగానే, అడుగుఁదమ్ములనె = పాదకమలములమీఁదనే, వ్రాలుటన్ = పడుటచేత (దేహమెంతపొడువో అంతనిడుద లని తలవెండ్రుకల ప్రాశస్త్యవర్ణనము - కమలములమీఁద వ్రాలుట తేంట్ల ధర్మముగావున), తేంట్లు=తుమ్మెదలు, నెఱికురు లగుట= (ఈయంగనల) కుటిల కుంతలము లగుటయందు, సందియము కలదె = సందేహములేదు. 'అడుగుఁదమ్ములు' - రూపకము.

2. కనన్ = తమ్ము చూడఁగానే, ఎంతవానిన్ = ఎంతటి ధీరు నేనియు, లోఁగొనుటన్= వశపఱుచుకొనుటచేత (అద్దంబుకూడ ఎంతటి గొప్పవస్తువులనైనను ప్రతిబింబరూపమున తన

యందుఁ బెట్టుకొనును, 'కొండ యద్దమందు కొంచెమై యుండదా, విశ్వ.' - కావున), ఆదర్శంబు= అద్దము, నెమ్మొగంబు = అందమయిన వదనము,...

3. ఇఱి...పైఁ - ఇఱిగొను = ఇఱియు (ఇఱియు = సన్నగిల్లెడు) కౌను = సన్నని నడుము అనియెడి - మింటిపైఁ = ఆకాశముమీఁద, మెఱయుటఁ = ప్రకాశించుటచేత (చక్రవాక మిథునములును పక్షు లగుటచేత ఆకాశముమీఁద మెఱయును, కావున), చక్రద్వితయి = జక్కవ దంపతులు,...; 'ఇఱిగొను మిన్ను' - రూపకము.

4. పొలసు = కౌటిల్యము (మత్స్యపరముగా-దాని దేహముమీఁదిపొట్టు), దొర్లఁగఁ = పొరలి వచ్చునట్లుగా (మత్స్యపరముగా - పొరలి వచ్చుచుండఁగా), చూచు కలికిచూపులఁ = చూచెడి మనోజ్ఞమైన చూపులు గల వగుటచేత (మత్స్యంబును పొలసు దొర్లుచుండఁగా మనోజ్ఞమయిన చూపులు చూచునది - కావున), మీలు = మత్స్యములు, తెలికన్నులు = తెల్లకాంతులు గల యువనితల నేత్రములు...;

పొలసినఁ = సమీపించినమాత్రాననె, తావి = పరిమళము, బుగులుకోఁ = బుగులు కొనఁ = గుప్పని కమ్ముకొనుచుండుటచేత (అలరుఁ దీఁగయు నట్లే), అలరుఁదీఁగ = పుష్పవల్లి, తిన్నని శరీరము = అందమయిన మేను,.....; అనఁగఁ =అనునట్లుగా, చెలువు ఒంది = సౌందర్యముగలవారై. సురతవైయాత్యనిధులు=కామకేళియందలి దిట్టతనమునకు స్థానములయిన ('ధృష్టే ధృష్ణగ్వియాతశ్చ' అమ.), పణ్యయువతులు = వెలజవరాండ్రు, ఆపట్టణమునఁ = మధురాపురి యందు, పొలుతురు = ఒప్పుచుందురు.

ప్రతి పెద్దపాదమందును గీత పూర్వార్ధమందును ఉత్ప్రేక్షాలంకారము. - గీతములోని 'అనఁగఁ' తద్వాచకము.

మనోహరమయిన యీపద్యమున ఉపలబ్ధ పుస్తకములలో 'దమ్ములపై నెవ్రాలుఁ బెన్నెఱులు తేంట్లగుట' యని పా. ఉన్నది. కడమ యన్నిపాదములందును కారణము మొదటిదిగాను ఉపమానము రెండవదిగాను, ఉపమేయమయిన వనితావయవము మూఁడవదిగాను ఈ క్రమమున చెప్పఁబడియున్నది. ప్రథమపాదమున ఆక్రమము తప్పియుండుట అందముగా నుండనందున, 'దమ్ములనె వ్రాలుటఁ దేంట్లు నెఱికురు లగుట' అని మార్పు చేయఁబడినది. ఈమార్పునందు 'నెఱికురులు' అనఁగా కుటిలకుంతలములు - 'కురులుశబ్దము ముంగురులనే గాక వెండ్రుకలను గూడ చెప్పును' అని సీతారామాచార్యులవారు,

'కొప్పు మెల్లనె విచ్చి కురుల చిక్కెడలించి
తలయంటె నేర్పుతోఁ బొలఁతి యొకతె.' య. ౪ ఆ.

అను నుదాహరణములోఁగూడ వ్రాసియున్నారు. ఇంక నుదాహరణములం బెక్కెంటి నటనటం గనవచ్చును. కేశకుటిలత శోభన మనుటకు—

'స్నిగ్ధ నీల మృదు కుఞ్చితైకజా । మూర్ధజాః సుఖకరాః (సమం శిరః.), బృ. సం.
'సస్మార సస్మరమతిః ప్రతినైషధీయం । త త్రామరాలయమరాళమరాళకేశీ.' నైష.
'అపరాధిని మయి దణ్డం । సంహరసి కి ముద్యతం కుటిలకేశి.' విక్రమో.

('కుటిలకేశి' అని ఊర్వశికి సంబోధన.)

మ. ప్రతత ప్రాంత పిశంగ కుంకుమ జటాపాళీ కురంగీమదా
సిత వీణాళికలస్వనంబు లెసఁగం జెన్నారు కర్పూరపుం

జ తతు ల్కంటికి నారదత్వమున మించ న్గామినీ కామి సం
తతి కేలా యెడ తెచ్చుఁ గంతుకలహోన్మాదంబు లా ప్రోలునన్. 31

అ - ప్రోలునన్ = పట్టణమందు, ప్రత...లు - ప్రతత = విస్తీర్ణములును (జటలకు విశేషణము) - ప్రాంత = తుదలయందు - పిశంగ = ఎఱుపుమించిన పసుపువన్నె కలవియు నయిన - కుంకుమ = కుంకుమ పువ్వులనెడి - జటా = జడలయొక్క - పాళీ = సమూహమును - కురంగీమద = కస్తూరియనెడి - అసితవీణా = నల్లనివీణయందలి - అళి = తుమ్మెదయొక్క - కలస్వనంబులున్ అవ్యక్త మధురధ్వను లనెడి - అళి స్వనంబులు = తుమ్మెద (ధ్వని) వలె నవ్యక్తమధురమైన ధ్వనులును, ఎసఁగన్ = ఒప్పుమీరుచుండఁగా, చె...ల్ - చెన్నారు = మనోహరములయిన - కర్పూర = పచ్చకర్పూరముయొక్క - పుంజ = రాసులయొక్క - తతుల్ = సమూహములు, కంటికిన్ = దృష్టికి, నారదత్వమునన్ = నారదమునిగా, మించన్ = అతిశయించుచుండఁగా, కామినీ కామి సంతతికిన్ = వలపు కత్తెలయొక్కయు వలపు కాండ్రయొక్కయు సమూహమునకు, కంతు కలహ ఉన్మాదంబులు = మరు దురముల యుద్రేకములు (కామక్రీడాడంబరము లనుట), ఏలా ఎడ తెచ్చున్ = ఎందువలన విరమించును - (విరమింపవనుట.)

ఆపురమున కాముకులయిన స్త్రీ పురుషులకు కంటియెదుట కలహములు పెట్టుటకు సమర్థుఁడైన నారదమహాముని కుంకుమపూ మొత్తములనెడి యెఱ్ఱకొసల నిడుద జడలతోను, కస్తురి వీణ యనెడి కస్తురి వీణయొక్క, తుమ్మెదల మధురనాదము లనెడి తుమ్మెదలనాదమువంటి, మధుర నాదంబుతోను, పచ్చకర్పూరపురాశిరూపమున ప్రత్యక్షమై యుండఁగా మదనకలహములకు ఏమి కొఱఁత?

కుంకుమపువ్వు కస్తురివీణలు అళినాదములు నను వీనితోడి పచ్చకర్పూరపు రాసులు కామోద్దీపకములు గావున (కంతు) కలహముం జేయించును; నారదుండును కలహము లాడించువాఁడు గావున అట్టి యాకర్పూరరాసులు నారదులుగా నుత్ప్రేక్షింపఁబడినవి. అందులకు కుంకుమ జటాది రూపకములు అంగములు.

'ప్రోలునన్' - ఔపవిభక్తిక కార్యము రామికి పేతికం గనునది. 'పిశంగ' - 'పిశఙ్గః పద్మధూళివత్' - తమ్మిపుప్పొడివంటి వర్ణము. 'కుంకుమ' - కుంకుమపూవు సన్నగా ఎఱ్ఱగా కేసరములుగా జడలవెండ్రుకలవలె నుండును, మొత్తము జటలవలె పెనఁచికొనియు నుండును. 'కురంగీమదాసిత వీణా' - ఇట 'కురంగీ' యని స్త్రీత్వము అవివక్షితము. కస్తూరి మగమృగము నుండి వచ్చునుగాని ఆఁడుదానినుండి రాదు. అట్లుండ, 'కురంగ మద' అనక 'కురంగీమద' అనుట చాపలము. ఇట్లే ముక్కుతిమ్మనగారును—

చ. 'అలఫణిభోగరత్నములు నాదిగిభోత్కటగండగంధముల్
తిలఁపునఁ బాఱి నవ్వు వసుధాసతి దా భుజకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రుని బాహువునందు భూషణో
జ్జ్వలమణులన్ మృగీమదమువాసనయుం గని; ధూర్తలంగనల్. పారి. 1. (20.)

కస్తురివీణె యనఁగా - 'కస్తూరి మృగముయొక్క కస్తురి యుండెడిబొడ్డుకాయ.' అట్టి కస్తురివీణె లనెడి కస్తురి వీణెలు వివక్షితములు. ఆకాయకు వాచకమయిన వీణెశబ్దముంబట్టి యీవ్యవహారము కలిగినది. 'అళి కలస్వనములు' - కస్తురికడ నళులు శబ్దించు చుండుటకు.—

'సమ మేణమదై ర్య దాపణే తులయా౯ సౌరభలోభ నిశ్చలమ్
పణితా న జనార్ఘదై రవై దపి కూజన్త మళిం మలీమసమ్' నైష. 2 (92.)

'శారదత్వము' - శారదమహాముని తెల్లనివాఁడు కావున కర్పూర సామ్యము.—

'శుభ్రాణి భారతీ ధర్మ శేషేశ తరుణేన్దవః
చన్ద్రిప్రథ సువిద్యాఖ్యా జిసేన్ద్రాః బలనారదాః.' కా. క. లం.

మఱియు, 'దధాన మమ్భోరుహ కేసర ద్యుతీః జటాః శరచ్చన్ద్ర మరీచి రోచిషమ్' అని మాఘ కావ్యములో నారదవర్ణనము.

తే. నింగియుఁ ద్రిశంకుకతన మాతంగవాటి
యయ్యె, నిఁక నుండఁ దగ దని యవని కరిగి
నట్టినక్షత్ర తారాగ్రహాలి యనఁగఁ
గాంతనవరత్న రాసు లంగళ్లఁ బొలుచు. 32

అంగళ్ల౯ = ఆపట్టణమందలి యాపణములయందు, కాంత నవరత్న రాసులు = మనోహరము లయిన తొమ్మిది మణులయొక్కయు ప్రోవులు, - నింగియు=పావనమయినయాకాశము సయితము, ఇటు=ఈవిధముగా, త్రిశంకుకతన౯=త్రిశంకుఁడను రాజు మూలముగా, మాతంగ వాటి=మాదిగ వాడ ('మాతఙ్గః శ్వపచే గజే' మేది.), అయ్యె౯=అయినది, ఇఁక నుండఁదగదు=ఇటు మీఁద మనకు నివసింపఁదగినతావు గాదు, అని=అనుకారణంబున, అవనికి౯ = భూమికి, ఎఱఁగినట్టి= దిగి (వచ్చి) నట్టి, - నక్ష...లి = నక్షత్ర తారా గ్రహములయొక్క సమూహము, అనఁగ౯ = అను నట్లుగా, పొలుచు౯ = ప్రకాశించుచుండును.

త్రిశంకుని నివాస మగుటచేత ఆకాశము మాదిగవాడ యైనది, ఇఁక నందు మనము నివ సింపఁ గూడదు, అని ఆలోచించుకొని భూమికి దిగి వచ్చిన నక్షత్ర తారాగ్రహసమూహములో యనునట్లు ఆపురమున అంగళ్లయందు అసంఖ్యాయ దేదీప్యమాన నవరత్న రాసులు విక్రయార్థము ఉండును. - ఉత్ప్రేక్షాలంకారము.

'నింగిటు'=నింగి+ఇటు - ఇత్వసంధి - 'వానికౌఁగి లది (కౌఁగిలి+అది) యెక్కుడ' మను. 3 ఆ. 4. 'తెలివొందు' నైష. 2 ఆ. 89. అను ప్రయోగమువంటిది. 'తెలివు+ఒందు' అని కల్పించు పక్షమునను, 'వాని కౌఁగిలది' యనుచో 'వానిఁ గౌఁగిలుట' యని మార్పవచ్చును అను పక్షమునను, ఇటను 'నింగియు'అని మార్పవచ్చును. యు శబ్దముచేత 'పరమ పవిత్రమయిన యాకా శము కూడ' అని యర్థవిశేషము స్ఫురించును. 'త్రిశంకు' - త్రిశంకుఁడు హరిశ్చంద్రుని తండ్రి. బొందితో స్వర్గమునకుం బోవలయు నని కోరి, అందులకు సాధనమయినయాగమును తనచే చేయింపు మని వసిష్ఠుని వేఁడఁగా, ఆయన తిరస్కరింపఁగా, తత్పుత్త్రులను నూర్గురను వేఁడఁగా వారును తిరస్కరింపఁగా, వారిని అతఁడు దూషించినాఁడు. అందులకు వారు కినిసి యాతని చండాలుఁడవు కమ్మని శపించినారు. ఆ చండాలత్వములోనే ఉండి విశ్వామిత్త్రుని సాహా య్యంబున ఆయాగంబుం గావించి స్వర్గమునకుం బోఁగా ఇంద్రుఁ డటనుండి తలక్రిందుగా త్రోయఁగా, ఆకాశమున దక్షిణ దిక్కున విశ్వామిత్త్ర సృష్టమయిన స్వర్గాంతరములో నివసించు చున్నాఁడు. ఆ కథ నిట ననుసంధించుకొన వలయును. ఇతనికి గుర్వాజ్ఞోల్లంఘనము, చండా లత్వము, నిషిద్ధవస్తు భోజనము అని మూఁడు శంకులు, అనఁగా మేకులు అనఁగా దోషములు

కలిగినందున త్రిశంకుఁడను పేరు గలిగినది. 'ఎతిఁగి' - 'అరిగి' అని పూ. ము. పా. 'గ్రహ' - తూర్పునుండి పడమటికి చరించుచో ఇతరములకు వెనుకఁ బడునట్టి సూర్యచంద్రాదికములు ఆఱు నొకటి; 'తార' లు చంద్రభార్య లయిన అశ్విన్యాదులు ఇరువదియేడు; ఆకాశమందు ప్రకాశమానములయిన కడమగోళములు నక్షత్రములు.—

'కామం నృపాః సన్తు సహస్రశోఽన్యే । రాజన్వతీ మాహు రనేన భూమిమ్;
నక్షత్ర తారా గ్రహ సంకు లాపి । జ్యోతిష్మతీ చన్ద్ర మసైవ రాత్రిః.' రఘు. 6 (22).

'నవరత్నములు' - 'ముక్తా మాణిక్య వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ నీల ప్రవాళ మరకతములు. ఇవి నానా వర్ణములు, అట్లే నక్షత్రాదులును, కావున సామ్యసంపద. 'గ్రహాళు' లవియు బహువచనము గావించిన సామ్యము మెఱుఁగెక్కును. రాశికి 'రాసుల'ని బహువచనమున సాదేశము.

చ. చిరసముపార్జితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో, కృతా
ధ్వరతఁ దదగ్ని మై నునికి దాన నొకంగము తాఁచుచేతనో,
పురధరణీసురు ల్నిగమభూధరము ల్జపయజ్ఞ శీలు రా
హరిధనదాదు లైన వలహస్తము సాఁపరు దానధారకుఁ. 33

నిగమభూధరముల్ = వేదపర్వతములును (అనఁగా అనంత వేదములను అపారముగా అధ్యయనము చేసినవారును. 'శణిక్పథః పురం వేదో నిగమః' అమ.), జపయజ్ఞ శీలురు=మంత్రా వర్తనములు యజ్ఞములుచేయించుట స్వభావముగాఁ గలవారును, (అగు) - పురధరణీసురుల్=ఆపట్టణపు బ్రాహ్మణులు ('ద్విజా త్యగ్రజన్మ భూదేవ బాడబాః' అమ.), (దాతలు), ఆ వారి ధనదాదులు= ఇంద్రుఁడు కుబేరుఁడు లోనగుమహనీయులు, ('య మాని లేన్ద్ర చన్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు । శు కాహి కపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు.', కుబేర స్త్ర్యమ్బకసఖో యక్షరాడ్గుహ్యకేశ్వరః । మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః.' అమ.), ఐనన్ = అయినను, దానధారకున్ = దానోదకధారను గ్రహించుటకు, వలహస్తమున్ = కుడిచేతిని, - చిర సముపార్జిత అగ్ని=చిరకాలమునుండి గడించుకొనియున్న నిప్పు, తడిఁజెంది=తడిసి, నశించున్ అటంచునో= ఆఱిపోవు నను కారణంబుననో, కృత అధ్వరతన్ = చేసిన యజ్ఞము కలవా రగుటచేత (యజ్ఞము చేసినవారైనందున—'యజ్ఞః సవోఽధ్వరో యాగః సప్తతన్తు ర్మఖః క్రతుః' అమ.), తదగ్ని = ఆయజ్ఞాగ్ని, మైన్ = తమదేహమందు, ఉనికిన్ = ఉన్నందువలన, దానన్ = ఆదక్షిణ హస్తమునందును, ఒక - అంగము = అవయవము (ఇచట ఆయగ్నియొక్క దక్షిణహస్తమనుట), తాచు చేతనో = ఇమిడ్చుకొని యున్నందుననో, - చాఁపరు.

వేదపారగులును జపయజ్ఞ తత్పరులు నయిన యా మథురాపుర బ్రాహ్మణులు ఆయింద్ర కుబేరాదులు ఇచ్చెద మన్నను దానము పుచ్చుకొనరు, (బ్రాహ్మణుల దక్షిణహస్తమందు అగ్ని యుండు నని వేద ప్రమాణము గావున) దానోధకధారా గ్రహణార్థమై కుడిచేతిని చాఁపరు; ఏకారణము చేత ననఁగా, - చిరకాలమునుండి అగ్నికర్మ చేత గడించుకొనఁగా దక్షిణ హస్తమందు నెలకొని యున్న యగ్ని ఆధారచేత తడిసి చల్లాఱి పోవునను కారణముచేతనో, లేక - యజ్ఞము చేసినవారై నందున ఆయజ్ఞాగ్ని తమ దేహమం దుండుటంబట్టి యథోచితముగా ఆయగ్నియొక్క దక్షిణహస్తము తమ దక్షిణహస్తమందు ఇమిడి యున్నందున తమ కుడిచేతిని తాము చాఁచుటచేత ఆ యగ్ని చేత తదీయ దక్షిణహస్తము దానధారాగ్రహణార్థము చాఁపఁ జేసినవారై అపరాధు లగుదు రను కార

ణంబునసో.— హేతూత్ప్రేక్ష. వికల్పితకారణ సందేహమేగాని సాదృశ్య మేళకమయిన విషయి విషయ విషయక సందేహముగావందున సందేహాలంకారము లేదు.

'చిర' - ఉపనయన మయినప్పటినుండి. 'జపయజ్ఞ శీలురు' - అదంత దీర్ఘపూర్వలోపథ మహత్తు గాన విభక్తి లకారమునకు రేఫము. బా. తత్స - ౪౯. 'హరి ధనద' - ఎంతటివారు ప్రార్థించినను మోమోటమింతెందక తమ మహిమచే కాపాడుకొందు రనుట. 'వల' - దానధారను సంప్రదానముయొక్క వల హస్తమునం బోయవలయును. 'హరి ధన దాదికైన' - (అనఁగా వారే వచ్చినను) అని పఠించిన వక్తవ్యము ఇంతకన్న స్ఫుటపడును.

చ. ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు మంత్రములందుఁ దక్క, సు
స్థిరభుజశక్తి నైదుపది సేయరు దత్తిన తక్క, మంటికై
పొరల రధీశుఁ డీకమలబుద్ధి ఖళూరికఁ దక్క, వజ్రదోః
పరిఘవశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్. 34

అప్పురిన్ = మథురాపురమందు, వజ్ర...లు - వజ్రాయుధమువలె (= పిడుగువలె) దారుణమైన ('వజ్రోఽస్త్రీ పవి హీరయోః' నానా.) - దోః పరిఘ = చేతి దెబ్బచేత ('భుజబాహూ ప్రవేష్టదోః' అమ. - 'పరిఘో యోగభేదేఽస్త్రీ విశేషేఽర్గళ ఘాతయోః' మేది.) - వశీకృత = లొంగఁదీయఁబడిన - అన్యనరపాలకులు = ఇతరరాజులు కలవారు, (అయిన) రాకుమారకుల్ = రాచ కుమారులు, కవచము = మై మఱువును ('ఉరశ్ఛదః కఙ్కటకో జగరః కవచోఽస్త్రియామ్' అమ.), మంత్రములందున్ తక్కన్ = మంత్రోపాసనలయందు ధరింతురేగాని, ఉరవడిన్ = వేగమున, పోరికై = యుద్ధము కొఱకు, ఒల్లరు = అంగీకరింపరు; దత్తిన్ + అ + తక్కన్ = దానమందుఁ దప్ప (అనఁగా దానము సేయునప్పుడు అయి దీవలసినచోట పదిగా ఇత్తురు - రెట్టిగా నిత్తురుగాని), సుస్థిర భుజశక్తిన్ = ఎప్పుడును తప్పని బాహు బలముచేత (అట్టి బాహుబలము కలవారగుటచేత - అనఁగా - వైరిని కొట్టి జయింపఁగలవారగుటచేత వైరినుండి), ఐదు పది సేయరు = వెనుకంజవేయరు (ముందు పాదమును వెనుక కిడుటచేత అనఁగా రెండుపాదములు ప్రక్క ప్రక్కగా నుంచి నిలుచుటచేత అయిదయిదుగానున్న వ్రేళ్లను పదిగా చేయరు - 'అయిదు పదిసేసె వెనుకముందయ్యె జాణిగ' అని ఆంధ్రనామశేషము - వైరిని శరణు వేఁడుటగా రెండుచేతులను జోడింపరు అని యొక వ్యాఖ్య.), ఖళూరికన్ తక్కన్ = గరడీలోఁ దప్ప (గరడీలో నేల దొర్లుదురుగాని), మంటికై = భూ జీవనములకొఱకు (జాగీరులు సామంత రాజ్యములు నిమ్మని), అమల బుద్ధిన్ = పరిశుద్ధ చిత్తముతో (అట్టి చిత్తము గలవారై), అధీశుఁడు ఈక = ఏలిక ఇయ్యనప్పుడు, పొరలరు = (ఇచ్చినప్పుడు కైకొందురు గాని ఎట్లయినను అతని హృదయమును కరఁగించి వానిని సంపాదించుకొందమని నేలఁబడి దండాలు పెట్టరు.

అయూరి రాజపుత్త్రులు పిడుగులవంటి దెబ్బదప్పు గ్రుద్దులచేతనే ఇతరరాజులను లొంగఁదీసినవారు, మంత్రోపాసనలయందు మంత్రకవచములను పఠింతురేగాని, యుద్ధమున కేఁగుచో దేహరక్షణార్థమయి మై మఱువుం దాల్పరు, తాము దానములు సేయుచో రెట్టింపుగా నిత్తురుగాని పోరిలో వైరినుండి వెనుకంజ యిడరు, గరడీలలో నేలఁబడి పొరలుదురేగాని తమయేలిక తమకు సామంతరాజ్యములు ఈయక విలంబించుచున్నయెడల ఎట్లయినను అతని దయఁబడసి వానిని

సంపాదించుకొందమని అందుకై దండాలు పెట్టక మంచి మనస్సు గలవారై అతఁడే ఇచ్చు వఱకు వేచి యుందురు. - పరిసంఖ్యాలంకారము.

'పోరికై' - షష్ఠీ విభక్తికము - 'పోరునకై' అనఁగూడదు. 'ఒల్లరు' - వలచుధాతువు- 'వలవరు' అని రూ. 'దత్తి' - దా (దానే) + క్తిన్ - స్త్రీ లింగము. 'ఖరూరికల్' గరడీ లలో పోర్లుట ప్రసిద్ధము. 'వజ్ర దోః పరిఘ' - వజ్రమువంటి దోః పరిఘము అని విగ్రహించుటకు సంస్కృతములో ఉపమాన పూర్వపద కర్మధారయము లేమింజేసి 'వజ్రదారుణమైన దోః పరిఘ' మని మధ్యమపద లోపి సమాసముగా విగ్రహింపవలసి వచ్చినది. 'పరిఘ' - దీనికి దెబ్బయు నినుపకట్ల గదియయు నర్థములు. కొందఱు ఇట నీరెండవ యర్థముం జెప్పుదురు. 'అన్య వరపాలకులు' - తమ యేలికకై యని యూహ్యము. 'రా కుమారకుల్' - 'రా' - వృత్తి యందు 'రాచ' శబ్దమునకు లుప్తశేషము, 'రాజ' శబ్దమునకు కాదు; ప్రాఁతాది గణోక్త లోపము గాదు, అట్లగునేని 'రాఁ గుమారకుల్' కావలయును. 'దత్తి' = దానము - 'తనుభృశ దమ నజ సుకృతము । ధనదత్తిన గొనఁగ వలయు.' ర (౨౫౦).

శా. దంభాపేతవితీర్ణితోయములు రథ్యం దొట్టి హట్టస్థిత
స్తంభంబు ల్చిగిరించుచున్నవి యన న్ధర్మైకనిత్యార్జనన్
సంభూతం బగుపైఁడికోటి కొకకై నానాఁటికిన్ హెచ్చు చ
య్యంభోదావళిఁ గప్పఁ గేతువులు వైశ్యశ్రేణి పొల్చున్ బురిన్. 35

పురిన్ = మథురయందు, వైశ్యశ్రేణి=కోమటులవీథి ('వీథ్యాళి రావళిః పఙ్క్తిః శ్రేణీ' అమ.), దం...లు - దంభ అపేత = వ్యాజమునుండి తొలఁగినట్టి (వ్యాజములేనట్టి - 'కపటోఽస్త్రీ వ్యాజ దమ్భోపధయ శ్ఛద్మ కైతవే' అమ.) - వితీర్ణి = దానముయొక్క (వితీర్ణిః = వితరణమ్) - తోయములు = ధారాజలములు, రథ్యన్ = నగరమధ్య మార్గమందు ('రథ్యాప్రతోళీ విశిఖా' అమ. 'త్రిణి గ్రామమధ్యమార్గస్య.' రామా.), తొట్టి = ఎగఁదొట్టి, హట్టస్థిత స్తంభంబుల్ = అంగడి వీథియందు ('హట్ట ఆపణః' అని రామాశ్రమి.) ఉన్నట్టి కంబములు, చిగిరించుచున్నవి=చిగురు లెత్తుచున్నవి (ఎత్తిన చిగురులో), అనన్=అనునట్లుగా, కేతువులు=టెక్కెములు, ధ...నన్ - ధర్మైక = ధర్మ ప్రధానమయిన - అర్జనన్=సంపాదనచేత, సంభూతంబు= కలిగినట్టిది (లభించినట్టిది), అగు - పైఁడి = బంగారముయొక్క (వరహాలయొక్క అనుట) - కోటికిన్ =కోటిసంఖ్యకు, ఒకటి ఐ = ఒక జెండా చొప్పున, నానాఁటికిన్ = దినదినమునకు, హెచ్చుచున్ = సంఖ్య ఎక్కువ యగుచు, అ యంభోద ఆవళిన్=ప్రసిద్ధమయిన మేఘపంక్తిని, కప్పన్ = ఆవరించుచుండఁగా, పొల్చున్ = శోభించును.

అపురమందు కోమట్లు న్యాయమార్గముననే ధన మార్జించువారు, మహాదాతలు, దినదినము కోటి వరాల లాభమునకు ఒక పడగ-చొప్పున పడగ లెత్తుచుందురు. వారు పారమార్థికముగా దానము లిచ్చునప్పుడు గ్రహీతలచేతంబోయు జలధారలు వీథి ఎగఁదట్టి యుండును. అందువలన వారు దినదినంబును ఎత్తెడు నాపడగలు (జెండాలు) ఎట్లున్నవనఁగా—ఆదానజలధారలవెల్లువ ఎగఁదట్టుటచే బజారులోని కొయ్యస్తంభములు చిగురుపట్టి దినదినమును వేసిన క్రొత్త చిగుళ్లా అనునట్లున్నవి.

గొప్పవర్తకులు కోటికి పడగయెత్తుటయు, కొన్ని కొయ్యలు తడికి మరల చిగుర్చుటయు ప్రసిద్ధము. చిగుళ్లకు (జెండాల) సన్నని యెఱ్ఱ వస్త్రములతో సామ్యంబు మనోరమము.

'ధున్వన్ కల్పద్రుమ కిసలయా న్యంశుకాని స్వవాతైః.' మేఘ. ఉత్ప్రేక్షాలంకారము.

'దంభ' - ఇట్లు మహాదానములు చేసినయెడల రాజేమేని బిరుదములును మర్యాదలును వచ్చుబడులును ఇచ్చునుగాక, లోకులు నమ్మి ధనమును నాయొద్ద దాఁచు కొందురుగాక, దాని నెల్ల నొక్కటే పెద్దమొత్తముగా హరించి దివాలా తీయుదునుగాక అని సంకల్పించుట దంభము. 'ధర్మ' - స్వవృత్తి ప్రకారమును బొంకకయు—'క్రయ విక్రయముల బొంకక సర్వసముఁడైన వైశ్యుండు గాంచుఁ గైవల్యపదవి.' దై. భా. నానాఁటికిన్ హెచ్చుచున్' - 'చెట్లు చిగుర్చు నప్పుడు చిగుళ్లును నానాఁటికి హెచ్చుచుండును. 'కప్పు కేతువులన్' అని పా. 'అంభోదావళిఁ గప్పన్' - వృక్షములును కడుంబర్వి మేఘములం గనఁబడనీయమియు ప్రసిద్ధమే. ఇట అతిశయోక్తి.

తే. నృపులపదహలరేఖల కెల్ల మాభు
జాగ్రహలరేఖలే మూల మనుచుఁ గోటి
కొండలుగ ధాన్యరాసులు పండుపీట
సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి. 36

కోటి కొండలుగన్ = లెక్కకు మీఱినవియు పర్వతముల వంటివియుంగా (అంతలేసి యనుట), ధాన్యరాసులు = వరిప్రోవులు, పండుపీటన్ = ఫలించుచున్నట్టి యాపట్టణమున. శూద్రజాతి, నృపుల పదహల రేఖలకెల్లన్=రాజుల చరణములయందలి నాఁగేటి రేఖలకంతయు. మాభుజ అగ్ర హలరేఖ=మాయొక్క బుజములమీఁది నాఁగేళ్లచాళ్లే ('లాఙ్గలం హలం గోదారణంచ సీరం స్యాత్' అమ.), మూలము=కారణము, అనుచున్, సుజన భజన ఏక విఖ్యాతి = సాధుజనులను సేవించుటచేత నయిన ముఖ్యకీర్తి గలదై, 'ఉన్నది' అని శేషము.

ఆపురిలోని శూద్రులు కొండలంతలేసి ధాన్యరాసులను కోటానకోట్లుగా పండించుచు. మాబుజాలమీఁది నాఁగేళ్లచాలుచేతఁ గదా రాజులయొక్క పాదములలో నాఁగేటిరేఖలు ఉండుట అని సంతోషించుచు పెద్దలను సేవించుటచే కీర్తి పొందుచు నుందురు.

'పదహలరేఖ' - పాదమందు హలరేఖ పంచమహాపురుషలక్షణములలో చెప్పఁబడినది. - 'హల ముసల గదాసి శఙ్ఖ చక్రః ద్విప మకర రాబ్జ రథాఙ్క లాఞ్ఛిహస్తః విభవ మపి జనోఽస్య భోభుజ్క్తి। క్షమతి హి న స్వజనం స్వతన్త్రబుద్ధిః.' బృ. సం. హలరేఖచే మహావిభవము చెప్పఁబడినది. పంటలు లేనిచో అది యెట్లు కలుగును? కావున రాజుల హలరేఖలకు రైతుల నాఁగేటి రేఖలే మూలము. 'పండన్' అని పా. సమన్వితము గాదు. 'భజన' - 'శూద్రస్య శుశ్రూషా ఇతరేషాం వర్ణానాం' అని ధర్మశాస్త్రము. 'రేఖలేమూలము' - రేఖలు మూలము గావు, పంటయు మూలము గాదు, ఈపంటలకే రాజుల పాద హలరేఖలు మూలము. - మూలముకాని దానికి మూలత్వముం జెప్పుట అసంబంధంబున సంబంధాతిశయోక్తి.

చ. ఉమియఁగఁ దన్న నవ్వ నన నొచ్చెము గాంచిన కొన్ని మ్రాఁకు లా
ప్రమదల నప్పగింపుఁ డని రంజిలుచేఁతలు గన్న చెట్లకున్

దమ కళిశృంఖలల్ బెనఁచి నమ్మక ముట్టెఁ బురంబుఁ గంతుసై
న్యముఁ గొని నా వెలిన్ శుకపికాదులఁ గేళివనాళి పొల్పగున్. 37

జవరాండ్రు చెట్లను పుష్పింపఁజేయుటకై దోహదములు చేయుటలో, - ఉమియఁగన్ = ఉమియుటచేతను, తన్నన్ = తన్నుటచేతను, నవ్వన్ = నవ్వుటచేతను (పరిహసించుట చేత నని యర్థాంతరము), అనన్ = పలుకరించుటచేతను (మాట లనుటచేత నని యర్థాంతరము), ఒచ్చెము = అవమానము, కాంచిన కొన్ని మ్రాఁకులు = పొందిన కొన్ని చెట్లు, ఆ ప్రమదలన్ = తమ్ము ట్లవమానించిన ప్రబలమదలను (పొగరుఁబోతు స్త్రీలను - ముదితలను - 'ప్రమదః సమ్మదే మత్తే స్త్రియాముత్తమ యోషితి', మేది.), అప్పగింపుఁడు = మాకు స్వాధీనపఱుపుఁడు, అని, రంజిలు చేఁతలు = ఏచేఁతలచేత చెట్లు రంజిల్లునో ఆచేఁతలు (అనఁగా ఆలింగనాదులు - అట్టి కమనీయ దోహదములను), కన్న = పొందిన - చెట్లకున్, తమకున్, అళిశృంఖలల్ = తుమ్మెదలనెడి గొలుసులను, పెనఁచి = కట్టి, నమ్మక = అప్పటికిని ఆచెట్లు వారిని తమకు అప్పగించు నని విశ్వసింపక, పురంబున్ = ఆపట్టణమునే, కంతుసైన్యముఁ గొని = మదనునిసేనను తోడు తెచ్చుకొని, వెలిన్ = ఊరిబయట, ముట్టెన్ నాన్ = ముట్టడి వైచినవో యనునట్లుగా, శుక పిక ఆదుల = చిలుకలచేతను కోయిలలచేతను సందడించుచున్నట్టివి - కేళి వన ఆళి = క్రీడోద్యానములపంక్తి, పొల్పు అగున్ = సొంపారుచుండును.

ప్రమదలు ఆకాలమున పుష్పింపఁజేయుటకై పదిజాతులచెట్లకు పది విధముల చేఁతలు చేయుదురు. అది యెట్లన.—అశోకమును తన్నుదురు, పొగడపై నోటిసుర నుమియుదురు, గోరంటను కవుంగిలింతురు, బొట్టుగుఁ జెట్టును చూతురు, మామిడిని చేతం దాఁకుదురు, చంపకముంగూర్చి ముఖమున రాగమూనుదురు, కొండగోఁగుతో సల్లాపింతురు, వావిలిపై ఊర్పుఁ బుత్తురు, ప్రియాళిమునకు (=మోరటి చెట్టునకు) పాడుదురు, సురపొన్నకు నవ్వుదురు. ఇందులకు కారిక—

'అశోక శ్చరణాహాత్యా వకుళో ముఖసీధునా। ఆలిఙ్గనా త్కురవక స్తిలకో వీక్షణేన చ॥
కరస్పర్శేన మాకన్దో ముఖరాగేణ చమ్పకః। సల్లాపతః కర్ణికారః సిన్దువారో ముఖానిలాత్॥
గీతాత్ప్రియాళు ర్నితరాం నమేరు ర్హసితేన చ.'

ఇందు వకుళాశోకనమేరు కర్ణికారములకు క్రమముగా ఉమియుట తన్నుట నవ్వుట (శ్లేషచే పరిహసించుట) పలుకుట (శ్లేషచే దూషించుట) అనునవి కరము అవమానకరమైన దోహదములు; కడమ కురవకాదులు ఆఱింటికి ఆలింగనాదులు అభిలషణీయమైన చేఁతలు. ఈ చెట్ల కన్నిటికిని వారు దోహదముచేయఁగా, అందులో అవమానపు దోహదము లొందిన వకుళాది వృక్షములు ఆ ప్రమదలను దండించుటకై వారిని తమ కప్పగింపుఁ డని వారిచే మంచి చేఁతలుపొందిన కురవకాదులకు తుమ్మెద బారులనెడి గొలుసులుకట్టి ఆచెట్లు తప్పించుకొనిపోక యుండునట్లు ఆగొలుసుల రెండవకొనను తమకే కట్టుకొని, అప్పటికిని అవి యప్పగించునను నమ్మకములేక, ఆపట్టణమును 'నీవే ఆప్రమదలను మాకు అప్పగింపుము' అని యదలించి మదనుని రాణువను సాయము తెచ్చుకొని దానితో ముట్టడివేసినవా ? యనునట్లు ఊరివెలుపల మదనసైన్యమయిన శుకపికములు గలవై ఊరినుండి రాకపోకలకు సందులేనియట్లుగా తుమ్మెదగొలుసు కట్టినచెట్లునుం గలవై క్రీడోద్యానములు శోభిల్లుచుండును. - ఉత్ప్రేక్షాలంకారము.

'ప్రమదలన్' - ప్రమదలకే ఈదోహదాద్యుత్సాహముగాని బాలలకును వృద్ధలకును ఇది యెక్కడిది? తమకు ఒచ్చెము గావించినందున ఈమ్రాఁకులు 'ప్రమదలు' అనఁగా పొగరుఁ

బోతులు అనుట. 'రంజిలు...చెట్లకు' - ఆచెట్లకు వారితో మైత్రి గావున ఇది వారిని సాధించి యీఁగల వని భా. 'తమకు' - ఆచెట్లు తప్పించుకొని పోకుండుటకు ఆదోహదముల చేత తమకుఁ గూడ పూఁతగలిగి తుష్టిదపిండు సాకర్షించినది గావున. 'నమ్మక' - వారిమిత్రములుగాన వారిని పట్టి యీక వారిని ఎక్కడికేని తప్పించుకొనిపొం డని హెచ్చరించు నని సందేహము. 'ముట్టక' - పురమును ముట్టుట పురమునుండి వారు దాఁటి పోకుండుటకు. 'వెలి' - వైరిరాజులు వచ్చి యొకరాజు పురమునకు ముట్టడిగా బయట విడిసి యున్నట్లుగా; శుకపికములు మదన సైన్యము. 'అళిశృంఖల' - అళులు దట్టముగా క్రమ్ముట తత్పేయమైన మకరంద సమృద్ధిని దానచే పుష్ప సమృద్ధిని తెల్పుచున్నది. 'శుకపికావల' - ఇంతవఱకు వేఱుపదము, 'కేళివనాళి'తో ఏకసమాసము గాదు; ఏకసమాసమైనచో అవిమృష్టవిధేయాంశతా దోషము ఘటిల్లును. శుకములచే ఫలములయు పికములచే చిగుళ్లయు పెంపు సూచితము. కేళివనములు ఫలకుసుమ కిసలయసంభృతములై శుకపికాకులములై మన్మథస్కంధావారముగా సర్వేంద్రియాహ్లాద కరముగా నున్న వని భా.

సీ. మదగంధతారతమ్యము యామ్యకరికిఁ ద
త్కరులకుం గనఁబలెఁ గటము లొరసి,
సురతశ్రమజ ఘూటఁ జూపోపకయుఁబలెఁ
గామినీమృదుగండఘర్మ ముడిపి,
పరిమళవాహేచ్ఛఁ బ్రాణమాఁబలెఁ జించు
మృగనాభిచర్మభస్త్రికలు దూఱి,
అహితపన్నగభేదు లనిబలె గృహవిటం
కపుఁగలాపుల నొయ్య గఱులు నిమిరి,
తే. వీటిసామగ్రిఁ గనుఁగొన వేగపడక,
నడవఁ దనదిక్కుపుష్పదంతద్విపంబు
నెక్కెనో యన జడగతి నెప్పుడుఁ బొలయు
నందుఁ జందనశిఖరిమందానిలుండు. 38

అందు = మధురాపురమందు, చందన శిఖరి మందానిలుండు = గందపుఁ గొండయొక్క మెల్లని తెమ్మెర (మంద మలయానిల మనుట),

1. యామ్యకరికి =దక్షిణ దిగ్గజమయిన వామనమునకును, తత్ కరులకు = ఆ యూరి యేనుఁగులకును, మద గంధ తారతమ్యము = దానజలముయొక్క పరిమళముయొక్క హెచ్చు తగ్గులను, కనన్ బలెన్ = పరీక్షించుటకో యను నట్లుగా, కటములు = ఆయూరియేనుఁగుల గండస్థలములను ('గజగణ్డ కటీ కటౌ' అమ.) ఒరసి = రాచుకొనుచు; 'యామ్య' = యమ సంబంధియయిన - యమదిశాసంబంధి యయిన యనుట ;

"ప్రాచ్య మాక్షిహిహాఞ్చక్రే ప్రహస్తో రావణాజ్ఞయా
ద్వారం రరక్షతు ర్యామ్యం మహాపార్శ్వ మహోదరౌ." భట్టి.

'గంధ' - ఏనుఁగు మదమునకు గంధము గలదు—

"సప్తచ్ఛదక్షీరకటుప్రవాహ మసహ్య మాఘ్రాయ మదం తదీయమ్
విలఙ్ఘితాధోరణ తీవ్రయత్నాః సేనాగజేన్ద్రా విముఖా బభూవుః." రఘు.

ఆయూరి యేనుఁగులు వామన దిగ్గజమునకు పాటి యనియు భా.

2. సు...ము - సురత = కామక్రీడచేత నయిన - శ్రమ = బడలికచేత - జము = పుట్టినది, కొటఁ = అగుటచేత, చూపు ఓపకయు బలెఁ = చూడలేనందున (కనికరముచేత) అను నట్లుగా (యు శబ్దము వాక్యాలంకారము), కా...ము - కామినీ = కాముకు రాండ్రయొక్క - మృదు = కోమలములైన - గండ = చెక్కిళ్లయొక్క - ఘర్మము = చెమటను ('ఘర్మః స్యా దాతపే గ్రీష్మే ఽప్యుష్ణ స్వేదామ్బునో రపి' మేదిని.), ఉడిపి = ఆర్పి;

3. పరిమళ వాహ ఇచ్ఛఁ = తావిని గ్రహించు కోరికచేత, ప్రాణమీ బలెఁ = ప్రాణమిచ్చుటకో యనునట్లు, చిం...లు - చించు = చింపఁబడిన - మృగ = కస్తూరి మృగముయొక్క - నాభి = బొడ్డు లనెడి - చర్మ భస్త్రికలు = తోలు సంచులను ('భస్త్రా చర్మ ప్రసేవికా' అమ.), తూఱి = చొచ్చి; - ఇవి బ్రదికినయెడల వీనికి వెండియు నాభియందు కస్తురి యుద్భవించును, అంతట దాని పరిమళమును నేను వహింపుదును గాక అను కోరికచేత కస్తూరి మృగములకు ప్రాణమిచ్చుచున్నదో యనునట్లుగా వానియొక్క చింపఁబడినట్టి నాభిసంచులయందుఁ దూఱి; నాభిసంచులం జించుట అందలి కస్తూరిని గ్రహించుటకు.

4. అ...లు. - అహిత = తనకు వైరు లయిన (తన్ను భక్షించెడు) - పన్నగ = పాములను - భేదులఁ = ఛేదించునవి (భక్షించునవి), అని బలెఁ = అనుకారణముచేత నను నట్లు, గృ...లఁ - గృహ = ఇండ్లయొక్క - విటంకపు = కొణిగల యందలి - కలాపులఁ = నెమళ్లను, ఒయ్యఁ = మెల్లనగా, గఱులు నిమిరి = ఱంచెలను నివిరి, వీటి సామగ్రిఁ = ఆయూరి సంపత్సమృద్ధిని, వేగపడక = నింపాదిగా (సమస్తము చక్కఁగాఁ దెలియు నట్లుగా), కనుఁగొనఁ = చూచుటకై, తనదిక్కు పుష్పదంత మను (గజగమనము మెల్లన గావున గజము నెక్కుట, తన దిక్కుది తనకు స్వాధీనముగాన దాని నెక్కుట), ఎక్కెనో యన, జడగతిఁ = మంద ప్రచారముతో, ఎపుడుఁ = సదా, పొలయుఁ = వీచును. సదా మలయమారుతము వీచుట ఆదేశముననే ఆపురిసమీపముననే మలయాచల ముండుటచేత.—'క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు' 39.

ఇచట మలయానిలమందు కవిసంప్రదాయముబడి శైత్య మాంద్య సౌరభంబులు చెప్పఁబడినవి; - కామినీ గండ ఘర్మముచేత శైత్యమును, గఱుల నిమురుటచేత మాంద్యంబును, కరిమద మృగమదములచేత సౌరభంబును కలిగినవి.—అంతటను ఉత్ప్రేక్షలు. 'కటములు' - ఏనుఁగుయొక్క మదస్థానము లేడింటిలో గండము ప్రధానస్థానము. 'కరాత్...' చూ. పుటలు 68-69 'చించు' - నాభిలోని కస్తూరికై కస్తూరి మృగమును చంపుదురు, దానినాభిని కోయుదురు.

'చర్మణి ద్వీపినం హన్తి దన్తయో ర్హన్తి కుఞ్జరమ్
కేశేషు చమరీం హన్తి సీమ్ని పుష్కలకో హతః.'

'ఐరావతః పుణ్డరీకో వామనః కుముదోఞ్జనః
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీకస్తు దిగ్గజాః.' అని దిగ్గజములు. అమ.

—* మత్స్యధ్వజుఁడు *—

సీ. ద్విదశరోమాపాయ ధీవిద్వదవతంసంబు,
షాడ్గుణ్యచాతురీ చక్రవర్తి,

క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు,
కనకాద్రిముద్రణ గ్రంథకర్త,
యందూనిబద్ధాభ్రబృందవేదండాళి,
వననిధిస్తంభ నాధునికరఘువు,
తామ్రపర్ణ్యమలపాథఃకేళిహంసంబు,
లంకేశమైత్రీప్రియంకరుండు,
తే. స్వస్తికృద్వాస్తవస్తుత్యగస్తి, మఘవ
మకుటమోటన శరకోటి మంత్రభృత్య,
భూతభూతాత్తశాంభవ భూమికుండు
దత్పురం బేలుఁ బాండ్య మత్స్యధ్వజుండు. 39

తత్పురంబు = ఆమధురాపురమును, పాండ్య మత్స్యధ్వజుండు = పాండ్యదేశరాజు మత్స్యధ్వజుఁ డను నాతఁడు, ఏలున్. ఆరా జెట్టివాఁ డనిన.—

1. ద్వి...బు-ద్వి=రెండు-ద్వయ=జంటల - ఉపాయ = (సామదాన భేదదండము లనెడి నాల్గు) ఉపాయముల ('సామదానే భేదదణ్డా విత్యుపాయ చతుష్టయమ్' అమ.- ఇందు శత్రువున కనుకూలములయిన సామదానములు రెండును ఒకజంట, శత్రువునకు ప్రతికూలమయిన భేదదండములు మఱియొకజంట; కావున నాలుగు అనక 'రెండుజంటలు' 'ద్విద్వయ' అనుట) - ధీ=చింతయందు - విద్వద్వతంసంబు=పండితశ్రేష్ఠుఁడు (వతంసంబు=అవతంసంబు); షా...ర్తి - షాడ్గుణ్య=సంధి విగ్రహ యా నాసన ద్వైధీభావ సమాశ్రయములయొక్క ('సంధిర్నా విగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయః । షడ్గుణాః' అమ. - షడ్గుణా ఏవ షాడ్గుణ్యమ్) - చాతురీ= నేర్పునందు - చక్రవర్తి = సార్వభౌముఁడు (అందఱికంటె పైవాఁ డనుట - 'చక్రవర్తీ సార్వభౌమః' అమ.);

2. క్రీ...జు. - క్రీడాచలీకృత=ఆటకొండఁగాఁ జేయఁబడిన - శ్రీఖండగిరి రాజు=చందన పర్వతరాజము కలవాఁడు. (మలయగిరి తన రాజ్యములోనిది గావున దానియందు క్రీడించువాఁడు. 'క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు' - ఇట నుపసర్జనత్వంబున రాజు అనురూపము ఎట్లు? అందు రేని, ఇట ఉపసర్జనత్వము లేదు. క్రీడాచలీకృత శ్రీఖణ్డగిరి శ్చాసౌ రాజా చేతి - కర్మధారయసమాసము.), కనకాద్రి ముద్రణ గ్రంథకర్త=బంగరు కొండపై (తన బిరుదములను) ముద్రించిన కవి-
('ఉదీచీం దిశమాక్రమ్య పాణ్డ్యః పరమధార్మికః
ప్రాప్య మేరుగిరిం తస్మిన్ లిలేఖ బిరుదాన్ స్వకాన్.' హాలాస్యము.
'అతఁడు మహా దిగంత విజయం బొనరించి సురాద్రియాల ను
న్నత నిజమీన లాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్ప న
ప్రతిమ తదీయ దోర్యుగ భరభ్రమితాచల శృంగసంగతా
మితజవ రూఢి నేఁడును భ్రమించుఁ దదగ్రగతల్ గ్రహావళుల్.'
అని నరసరాజీయములో కరికాలచోలుని వర్ణన.);

3. అం...లి అందూ = గొలుసులచేత - నిబద్ధ=కట్టఁబడిన - అభ్రబృంద = మేఘసమూహ ముగలిగిన - వేదండ ఆలి = ఏనుఁగులగుంపు గలవాఁడు (ఏనుఁగుల గుంపును గొలుసులతో కట్టి తనచేతులలో నుంచినట్లు మేఘములను వశపఱచుకొని సంకెలలు వైచినవాఁడు - రూపకాలంకారము), వన...వు - వననిధి=సముద్రముయొక్క - స్తంభన=కట్టుటయందు - ఆధునిక=ఇప్పటి - రఘువు= శ్రీరాముఁడు (రఘువంశమువాఁడు గావున ఉపచారముచే రఘు వనుట - అధునా = ఇప్పుడు - ఆధునిక = ఇప్పటి - 'ఏతర్హి సంప్రతీదానీ మధునా' అమ. - సముద్రమునకు అడ్డముగా ఈయన కట్ట కట్టినాఁ డనుట.);

4. తా...బు. - తామ్రపర్ణీ=తామ్రపర్ణీ నదియొక్క - అమల=నిర్మలమయిన - పాథః= నీటియందు - కేళి=ఆటగల - హంసంబు=రాయంచ (తామ్రపర్ణీనది తన రాజ్యములోనిది గాన అందు జలవిహారము సల్పువాఁ డనుట. - రూపకము.), లంకేశమైత్రీ ప్రియంకరుండు = లంకాపతియైన విభీషణునికి చెలిమిచేత ఇష్టము నెఱవేర్చువాఁడు;

స్వస్తి...స్తి - స్వస్తికృత్=ఆశీర్వాదము చేయుచున్న ('స్వస్త్యాశీః క్షేమ పుణ్యాదౌ' అమ.) - వాస్తవస్తుతి=సత్యమయిన పొగడ్తగల (సత్యమయినపొగడ్త చేయునట్టి) - అగస్తి= కుంభసంభవముని కలవాఁడు (అగస్త్యాశ్రమము ఈతనిరాజ్యమం దున్న దనియు, అగస్తిముని ఈతనికి మేలు కోరుచుండు ననియు భా. - అగ మస్యతీ త్యగస్తిః - వింధ్యపర్వతమును త్రోసినవాఁడు. 'అథాగస్త్యః కుమ్భయోని రగస్తిః కలశీసుతః' శబ్దార్ణవము.); మఘ...టి - మఘవ = ఇంద్రునియొక్క ('ఇన్ద్రో మరుత్వా న్మఘవా' అమ.) - మకుట = కిరీటమును ('అథ మకుటం కిరీటం పు న్నపుంసకమ్' అమ.) - మోటన=నుగ్గుచేయునట్టి ('ముట సంచూర్ణనే' ధా. పా.) - శరకోటి = బాణములసమూహములు కలవాఁడు. (అతిశయోక్తి), మం...డు - మంత్ర = మంత్రములచేత - భృత్యభూత = సేవకు లయినట్టి - భూత = బూచులచేత (బూచుల మూలముగా) - ఆత్త=పొందఁబడిన - శాంభవ=శివసంబంధియైన - భూమికుండు=వేషముకలవాఁడు (భూతములను పనిగొనుచు అపరశివుఁడోయన నున్నాఁ డనుట. - ఉపమ.).

నాలుగు ఉపాయములు ఆఱు గుణములు యథాయోగము ప్రయోగింప సమర్థుఁడు, మలయపర్వతమందు విహరించువాఁడు, మేరువుపై తన మీనలాంఛనమును చెక్కించినవాఁడు, ఏనుఁగులం బోలె మేఘములను గొలుసులం గట్టివైచినవాఁడు, రామునివలె సముద్రమున కొండొకచో కట్ట కట్టినవాఁడు, తామ్రపర్ణిలో జలకేళి సలుపువాఁడు, విభీషణుని చెలికాఁడు, అగస్తిమునియొక్క యాశీర్వచనంబులం బొందువాఁడు, ఇంద్రుని దండింపఁగల విలుకాఁడు, మంత్రములచే బూచులను వశీకరించి పనిగొనుచు అపర మహేశ్వరుఁడో యన నొప్పువాఁడు పాండ్య మత్స్యధ్వజుఁడు ఆపురము నేలుచుండెను.

ఉ. ఇందుకులావతంస మతఁ డేతఱి నేతరిగాఁ; డరిం బ్రజ
ల్కుందఁ గొనం; డొరుం డొరుతల న్వినిపించినమాట డెందముం
జెంద ముదంబు దక్కి చెడఁ జేయఁ డొరు; న్వినతాస్యుఁ డౌ నుతిం
పం దనుఁ; బందనుం గొఱఁత వల్కుఁడు శూరతఁ దాను మించియున్. 40

ఇందుకుల అవతంసము=చంద్రవంశ శేఖర మయిన, అతఁడు=ఆమత్స్యధ్వజుఁడు, ఏతఱిన్ = ఏసమయమందును, ఏతరి=నీతిమాలినవాఁడు, కాఁడు; ప్రజల్=జనులు, కందన్=నొచ్చునట్లుగా,

అరిక్ = పన్నును, కొనండు; ఒరుండు = ఎవఁడేని, ఒరుతలక్ = మఱియొకనిమీఁద, వినిపించినమాట = చెప్పినకొండెము, డెందమునం జెందక్ = తన మనస్సునకు తగులఁగా (అంగీకరించి), ముదంబు దక్కి = కోపము వహించి (ముదంబు = సంతోషము - 'ముత్' అని ప్రాతిపదికము), ఒరుక్ = అపుతిరొంకనిని, చెడఁ జేయఁడు = చెఱుపఁడు ('చేయఁడు' అను క్రియాపదమందలి వ్యతిరేకార్థము, దానితోఁ జేరిన పూర్వధాతువులకును అన్వయించును; దానంజేసి, డెందమునం జెందనీయఁడు, ముదంబు దక్కఁడు అని యర్థము.); తనుక్ = తన్ను, నుతింపక్ = పొగడఁగా, వినత ఆస్యుఁడు ఔక్ = వంగిన ముఖము కలవాఁడు అగును (మొగము వాంచును - 'మహాతాం కుఞ్జరాణాంచ పురఃస్తోత్రం నహి ప్రియమ్' అన్నట్లు ముఖస్తుతి సహింపక తలవంచుకొను ననుట;), శూరతక్ = శౌర్యముచేత, తాను, మించియుక్ = అతిక్రమించియును, పందనుక్ = పిఱికివానిం గూడ, కొఱఁతపల్కఁడు = న్యూనముగా పలుకఁడు.

చంద్రవంశ భూషణమైన యామత్స్యధ్వజ మహారాజు ఎప్పుడును నీతి తప్పఁడు, ప్రజలు నొవ్వకుండ పన్ను కైకొనును, కొండెములు విని ఎవరికిని చెఱుపు చేయఁడు, తన్ను ఎవరైన ముఖస్తుతి చేసినయెడల లజ్జచే మొగమును వాంచును, పరాక్రమమందు తానధికుఁడయ్యును పందను సయితము న్యూనముగా మాటలాడఁడు. - ధీరోదాత్తుఁ డనుట. - తల్లక్షణము—

'మహాసత్త్వోఽతి గమ్భీరః క్షమావా నవికత్థనః
స్థిరో నిగూఢాహంకారో ధీరోదాత్తో నిగద్యతే.' దశరూపకము.

వృత్త్యనుప్రాసము.

సీ. పాటీరగిరివనీ వాటిఁ గ్రీడించియు
నహిభయం బెఱుఁగఁ డావంతయైన;
నత్యంతమితభాష నవికత్థనుం డయ్యుఁ
బరులఁ గేరడమున భంగపఱుచుఁ;
బ్రేమఁ దాఁ దామ్రపర్ణికి నాథుఁ డయ్యును
సద్గోష్ఠిచే ననంజనత మెలఁగుఁ;
మహనీయమహిమఁ దా మధురాస్పదుం డయ్యు
లావణ్యకలన నుల్లాస మొందు;
తే. విషధిలహరిభిదోత్పతత్పృషతజటిల
వలదురుక్రమతిమివర వాలపతన
తులితపరబలకరిశిరస్థ్సలసముత్థ
బహుళముక్తావిముక్తాసిపాతుఁ డతఁడు. 41

అతఁడు = ఆమత్స్యధ్వజుఁడు, విష...తుఁడు - విషధి = సముద్రముయొక్క (విష = జల- 'విషంతు గరళే జలే' నానా. ఉ. 'విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాఙ్గనాః' చంద్రా.)- లహరి = పెద్ద యలల (పెద్ద కరటముల) యొక్క - భిదా = విఱుపునుండి ('విదళః స్ఫుటనం భిదా' అమ.) - ఉత్పతత్ = యెగయుచున్న—పృషత = నీటి బొట్లుచేత ('పృషన్తి బిన్దు

పృషతాః పుమాంసో విప్రుషః స్త్రియః' అమ.) - జటిల = దట్టమయిన (దట్టముగా అనీటిబొట్టులను లేఁచుచున్న అనుట - ఇది 'వాలపతన'మునకు విశేషణము) - వలత్) = వెనుకకు మరలుచున్న - ఉరు = గొప్ప - క్రమ = దాఁటుగల - తిమివర = నూఱామడనిడివి చేఁపమేటియొక్క - వాలపతన=తోఁకపాటు (తోఁకదెబ్బ) తో - తులిత = సంజాత సామ్యమయిన (సాటియైన - 'తులా రాశౌ పలశతే సామ్యేఽపి' నానా. ఇది అసిపాతమునకు విశేషణము) - పరబల = శత్రుసైన్యముయొక్క - కరి = ఏనుఁగులయొక్క - శిరఃస్థల = కుంభస్థలములనుండి - సముత్థ = ఎగురుచున్నట్టి - బహుళ = మెండయిన - ముక్తా = ముత్తెములచే - అవిముక్త = విడువఁబడని (అముత్తెములతోఁ గూడుకొన్న అనుట - 'పరిత్యక్తేఽపి ముక్తః స్యాన్ముక్తా ముక్తాఫలే స్త్రియామ్' నానా.) - అసి = కత్తియొక్క - పాతుఁడు = పడుటకలవాఁడు (అట్లుగా కత్తితోఁ గొట్టువాఁడు), (అయిన) అతఁడు = ఆరాజు,—

పరబలము మహాసముద్రము వంటిది, అందులో అతని బాహువు తిమివంటిది, కత్తి తిమివాలమువంటిది, ఏనుఁగులు మహాతరంగముల వంటివి, వాని కుంభస్థలములు ఆ తరంగముల పైభాగంపు విఱుపుల వంటివి, కొట్టినప్పుడు కత్తితోఁగూడ బాహువు వెనుకకు వచ్చుట తిమి తోఁకతో అలంగొట్టి వెనుకకు మరలిచి పెద్దదాఁటు దాఁటుట వంటిది, కత్తితో ఏనుఁగు శిరమును గొట్టుట తోఁకతో అలయొక్క విఱుపుం గొట్టుట వంటిది, కత్తిదెబ్బకు ముత్తెములు దట్టముగా లేచుట తోఁకదెబ్బకు నీటిబొట్టులు లేచుట వంటిది.—ఇందు ప్రతిపదమునకును ప్రయోజనము కలదు, దానిని ఇయ్యుపమయందలి సాదృశ్యలక్ష్మిని సులువుగా నరసికొనవచ్చును.—ఉపమాలంకారము.

'లహరి' - 'లహరి (రీ) స్త్రీ. తేన - ఇన్ద్రిణేవ హ్రియతే ఊర్ధ్వగమనాయ - హృ - కర్మణి ఇన్-వా జీప్ - మహాతరఙ్గే' శబ్దస్తోమ మహానిధి. 'తరఙ్గే భఙ్గ వీచ్యూర్మ్యుత్కలికా మహాలి త్వీహ । లహ ర్యుల్లోలాః' హేమ. - ఇందువలన లహరి శబ్దము హ్రస్వాంతము కూడ; దీనికి కొందఱు వ్రాసిన ప్రవాహార్థము గాణంబును గజోపమితికి పనికి రానిదియుంగా నున్నది. 'వలత్'—'యాన్త్యా ముహుర్వలిత కన్ధర మాననం త దావృత్త వృన్త శతపత్త్ర నిభం వహన్త్యా.' మాలతి. 1. 32. 'వలిత కన్ధరం పరివర్తిత గ్రీవం అతఏవ ఆవృత్త వృన్త శతపత్త్ర నిభం కుసుమబన్ధనా దపవృత్త వికచ పుణ్డరీక సదృశ మాననమ్' త్రిపురారి వ్యా. - ఇట్టిదే 'ఆసీ ద్వివృత్త వదనా చ విమోచయన్తీ' ఇత్యాది శాకుంతల పద్యములో 'వివృత్త వదనా' అను విశేషణము.
'తిమివర'—

'అస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన మాయతః
య స్తం గిళతి మత్స్య స్తు తతః ప్రోక్త స్తిమిఙ్గిలః
తిమిఙ్గిల గిలోఽప్యస్తి తద్గిలోఽ ప్యస్తి రాఘవః'

మహామత్స్యములు సముద్రములో నీటిని తోఁకతోఁ గొట్టుటయు ఆదెబ్బకు జలధార లెగయుటయు అవి ముత్తెపు రాసులవలె తెల్లగా నుండుటయు ప్రసిద్ధము.—

'కపట మత్స్యంబవై నీవు కడలి నడుమఁ । బుచ్ఛ మల్లార్ప నెగసిన భూరిజలము
మింటఁ గడుఁదెల్లనై పాఱుచుంటఁ జూచి । యత్రి నదియని వర్ణించె నఖిల జగము.'
సైష. 6 ఆ. 120.

ఏనుఁగు కుంభములనుండి ముత్తెములు పుట్టును - ౧ ఆ. ౩౦. వ్యా. చూ. పుట 67 'ఉత్పతత్'- పా. 'ఉత్ప్లవత్'

1. పా...టిన్ - పాటీర గిరి = గందపుఁగొండయందలి (చందనపర్వత మయిన మలయ పర్వతమునందలి) - వనీవాటిన్ = అడవుల శ్రేణిలో, క్రీడించియున్ = విహరించియు, ఆవంత (ఆవ + అంత) వినన్ = ఇంచుకేనియు, అహి భయంబు = పాములవలని వెఱపును (తన వారి వలననే కల్గు భయమును - 'రాజ్ఞా మహీభయం ప్రోక్తం స్వపక్ష ప్రభవం భయమ్', 'భుజఙ్గో ఽహి ర్భుజఙ్గమః' అమ.) ఎఱుఁగఁడు—

మలయములు నాలుగు, - అందు మొదటిది,—

'ఆమూలయష్టేః ఫణివేష్టితానాం సచ్చన్దనానాం జననన్దనానామ్
కక్కోల శైలా మరిచై ర్వృతానాం జాతీతరూణాం చ స జన్మభూమిః,,

రెండవ మలయము,—

'య స్యోత్తమాం మౌక్తిక కామధేను రుపత్యకా మర్చతి తామ్రపర్ణీ,
రత్నేశ్వరో రత్న మహా నిధానం కుమ్భోద్భవ స్తం మలయం పునాతి.'

మూఁడవది మఱియొకటి; నాలవది లంకాపురము. అన్నింటియందును (సర్పవేష్టితములు) చందన ద్రుమములు కల వని 'మలయ శ్చన్దనాలయః' అను నమరోక్తిచే నెఱుంగనగు. చందనద్రుమము లున్నచో పాము లుండును గాన (ద్వితీయ) మలయ వనములలో చరించియు పాములవలని యుపద్రవ మెట్టిదో ఎఱుంగమి విరోధము, అహిభయశబ్దమునకుంగల స్వపక్షమువలని భయము అను నర్థముచే తత్పరిహారము. కావున విరోధాభాసాలంకారము.

2. అత్యంత మితభాషన్ = మిక్కిలి అల్పసంభాషణచే (మిక్కిలి కొంచెముగా మాటలాడువాఁ డగుటచేత), అవికత్థనుండు=ఆత్మశ్లాఘా విముఖుఁడు ('అవికత్థనః=ఆత్మశ్లాఘా విముఖః' ప్రతాపరుద్రీయ మందర వ్యాఖ్య), అయ్యున్, పరులన్=ఇతరులను (వైరులను), కేరడమునన్ = పరిహాసపు మాటలయందు (కేరడ దేశమం దనియు - శడల కభేదము), భంగపఱుచున్ = ఓడించును. - అవికత్థనునికి పరపరిహాసపటిమ విరోధము, అర్థాంతరముచే నది పరిహృతము; కావున విరోధాభాసాలంకారము.

3. ప్రేమన్ = అనురాగముతో, తాను, తామ్రపర్ణికిన్ = ఆపేరి పడమటి దిగ్గజభార్యకు (ఆపేరి నదికి అనియు), నాథుఁడు అయ్యున్, సద్గోష్ఠిచేన్ = మంచి (వారితోడి) సహవాసముచేత, అనంజనతన్ = అంజన గజము కామిచేత (అంజనము అనఁగా అంటు, అనఁ మాలిన్యము, అది లేనివాఁడై) మెలఁగున్ = వర్తించును.

తామ్రపర్ణియను కరేణుకకు పెనిమిటియై అంజనమను పడమటి దిగ్గజము కాకుంట విరోధము, నదీ నిర్మాలిన్యార్థములచే తత్పరిహారము విరోధాభాసాలంకారము. అష్టదిగ్గజములను ౩౯ వ్యాఖ్యలో చూ. తద్భార్యల పేరులు,—

'కరిణ్యోఽభ్రముః కపిలా పిఙ్గళాఽనుపమా క్రమాత్
తామ్రపర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనా చాఞ్జనావతీ.' అమ.

మ...డు - మహనీయ=దివ్యమయిన - మహిమన్ = ప్రభావముచేత, తాను, మధుర ఆస్పదుండు= తీపునకు తావు (మధుర శబ్దము మధురరసమునకును అది కలదానికిని పేరు—

'తువరస్తు కషాయోఽస్త్రీ మధురో లవణః కటుః
తిక్తోఽమ్లశ్చ రసాః పుంసి తద్వత్సు షడమీ త్రిషు,' అమ.

మధురా = మధురాపురము - అప్పుడుండు = రాజధానిగాఁ గలవాఁడు), అయ్యుఁ, లావణ్య కలనన్ - లావణ్య = ఉప్పుదనముయొక్క (దేహకాంతి విశేషముయొక్క -

'ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మివాన్తరా
ప్రతిభాతి య దఙ్గేషు తల్లావణ్య మిహోచ్యతే.' - శబ్దకల్పద్రుమము.) -

కలనన్ = ప్రాప్తిచేత, ఉల్లాసము = ప్రకాశమును, పొందును - తీపు ఉప్పుచేరిన యెడల రుచి మీఱు ననుట విరోధము; మధురాపుర దేహకాంత్యర్థములచే తత్పరిహారము గాన విరోధాభాసాలంకారము.

ఇట 'మధుర' అని పాండ్యనగరనామము వర్గచతుర్థ మధ్యముగానున్నది. ఈ గ్రంథమందు మఱియొకచోట 'విధినిషేధంబు లెఱిఁగితే మధురకరిగ' అని ధప్రాసమును, ఇందే 'తనరు దక్షిణ మధుర సాంద్ర ద్రుమధుర' అని అంత్యానుప్రాసరూపయమకమును కలవు. శ్రీమజ్జగద్గురు ప్రణీత సౌందర్య లహరీస్తోత్రమందును,

'విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపాధారాధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టిస్తే బహునగర విస్తార విజయా
ధ్రువం తత్తన్నామ వ్యవహరణ యోగ్యా విజయతే.'

శ్లేషలో ధమధ్యమే కలగు. ఉణాదిసూత్ర నిష్పన్నమయిన మథురా (రూ. మథూరా) శబ్దము వర్గద్వితీయమధ్యము ఒకటికలదు. అది శ్రీకృష్ణులవా రుండిన పట్టణమునకు పేరుగా సుప్రసిద్ధమై యున్నది. తదనుగుణముగానే దానికి 'మట్రా' అని యింగ్లీషున వ్యవహారము, 'మడ్రా' అని కాదు. కావున అది దానికిని ఇది పాండ్యనగరికిని పేరు లని భేదము గ్రహింత మన్న - ఇందులోనే 'దక్షిణమధుర' అని వ్యవహరించినందునను,

'మధురం విషే ; మధుర స్తు ప్రియేస్వాదౌ రసేచ రసవ త్యపి
మధురా మథురాపుర్యాం యష్టీమేదామధూళిషు
మధు కర్కటికాయాంచ మిశ్రేయాశత పుష్పయోః'. హేమ.

అను నిఘంటువునందు మధురా మథురా శబ్దములకు పర్యాయత్వమే చెప్పఁబడినది. ఉత్తర మథురయం మథుం నా మాసురం రా తీతి అనువ్యుత్పత్తిచే థ మధ్యముగాను అంగీకృతము. ఈ రెండు నామములను రెండుపట్టణములకును గ్రహించుట యుచితము. *

శా. దానత్యాగపతత్రమై తొలుపతత్త్రంబంబుధార న్సదా
నానం, దత్సితకీర్తిహంసి చను మింటం; గ్రొత్త నా నేల, నా
నానీరార్ద్రపతత్ర యయ్యు వడి మింటం బొలు తజ్జాతి కే
లా నిల్చు న్గతి యన్యపత్త్రిగతిఁ బత్త్రైకప్రదేశాప్లతిన్? 42

దా...త్ర - దాన=ఉదకధారా పూర్వకమయిన యీవియు - త్యాగ=అప్రార్థితముగా ఉదకధారలేకయే యిచ్చునవియు - పతత్త్రము = ఱెక్కలుగాఁ గలది, ఐ, త...సి - తత్ =

* చూ. పుట 93. అధోజ్ఞాపిక.

ఆరాజుయొక్క - సిత=తెల్లని - కీర్తి=విఖ్యాతియనెడి - హంసి=అంచపెంటి, తొలుపతత్త్రంబు= మొదటఁ జేర్కొనంబడిన ఱెక్క (అనఁగా దానము), సదా = సర్వదా, అంబుధారన్ = నీటి పోఁతచేత, నానన్ = ఊరినను, మింటన్ చనున్ = ఆకాశమున ఎగయును; క్రొత్త నాన్ ఏల= ఇది వింత యనవలదు, నా...త్ర - నానా = పెక్కు ('నానా నేకో భయార్థయోః' అమ.) - నీర = నీళ్లచేత - ఆర్ద్ర = తడిసియున్న - పతత్త్ర = ఱెక్కలుగలది, అయ్యున్ = అయినప్పటికిని, వడిన్ = వేగముతో, మింటన్ బాఱు - తజ్జాతికిన్ = ఆహంసజాతికి, అన్యపత్త్రిగతిన్ = వేఱు పక్షికింబోలె, ప...తిన్ - పత్త్ర=ఱెక్కలయొక్క - ఏకప్రదేశ=ఒకభాగముయొక్క - ఆప్లుతిన్ = తడియుటచేత, గతి = సంచారము, ఏలా నిల్చున్ = నిలువదు.

ఉదకధారా పూర్వకమయిన యీవి ఒకఱెక్కగాను అప్రార్థితముగా (=అడుగఁబడక ఉదకధారలేకయే ఇచ్చునట్టి యీవి రెండవఱెక్కగాను కలదైన యాఱేని తెల్లని కీర్తిహంసి, ఆతొలిఱెక్క ఎల్లప్పుడును ఆనీటి ధారచేత నానుచున్నను ఆకాశమున సంచరించుచునే యున్నది; ఇది యొక వింతయని తలంపవలదు, ఏలయన,—రెండుఱెక్కలును నానాజలములలో నాను చున్నను వడిగా మింటంజను నాహంసజాతికి ఇతరపక్షులకుంబోలె ఒక్కఱెక్క తడిసినమాత్రాన సంచారము ప్రతిబద్ధము కానేరదు.—రూపకానుప్రాణితమయిన కావ్యార్థాపత్త్యలంకారము.

'కీర్తి'—'దానాదిప్రభవా కీర్తిః ప్రతాపప్రభవం యశః' - ఇట ఆదిశబ్దముచేత త్యాగము గ్రహింపఁబడును. 'కీర్తి' స్త్రీలింగముగాన భిన్నలింగతాదోషనివారణార్థము 'హంసి' యని స్త్రీలింగముం జెప్పుట. హంసినిగాఁ జెప్పుట ధావళ్యముచేతను దూరమేఁగుటచేతను. కీర్తి ధవళ మని కవి సమయము, కీర్తి దూరమేఁగుట యనఁగా దూర దూర దేశములవారు ఆయీవిని ప్రశంసించుట. 'అన్యపత్త్రిగతిన్' స్థలపక్షులు ఱెక్కతడిసిన నెగుర నేరవు. 'పత్త్ర' - పత్ + ష్ట్రన్, 'పతత్త్రః - పతత్ + త్రై + కః (పతన్తం త్రాయతే) అనువ్యుత్పత్తులచే ఈరెండు శబ్దములందును తకారద్వయరేఫ సంయోగము. తదనుగుణము 'పత్త్రి' యందు నట్లే.

సీ. శుకకదంబము గొలుసులచే నిబద్ధమై
వారాంగనాగార కారఁ బడఁగ,
గిరికానికాయంబు లరిశూన్యబహుపుర
హర్మ్యవాటికలఁ జెండాడుచుండఁ,
గ్రందుగా నితరేతరంబు రాయిడి సేయు,
రాజులు దననూపురమున నొదుఁగ,
నెగడు ననావృష్టి నిజబలేభస్పర్ధి
సమదాన్యకరటి గండములఁ జేర,
తే. దానవేళల నతివృష్టి తనకు హస్త
గతము గాఁగఁ, బ్రతాపాగ్నిఁ గ్రాఁగిపోవు
కంటకులయందు శలభత గలయ నడఁగ,
నేలు నాపాండ్యుఁడు మహీ నిరీతి గాఁగ. 43

1. శుకకదంబము=చిలుకలగుంపు ('కదమ్బం నికరమ్బ్యస్యా న్నీప సర్షపయోః పుమాన్' మేది.), గొలుసులచేన్, నిబద్ధమై=కట్టఁబడినదై, వా...రన్ - వార అంగనా = భోగపుఁజానలయొక్క ('వారస్త్రీ గణికా వేశ్యా రూపాజీవా' అమ.) - అగార=ఇండ్లనెడి (రూ. అగార- 'భవనాగారమన్దిరమ్' అమ.) - కారన్ = చెఱసాలయందు ('కారా స్యా ద్బన్ధనాలయే' అమ. - 'వారాంగనాగారకారన్' - రూపకాలంకారము.), పడఁగన్ = పడినందునను; - వారాంగనలు విలాసవతులు గావున వారు శుకాదులం బెంచుట ప్రసిద్ధము.

2. గి...బు-గిరికా=చిట్టెలుకలయొక్క ('గిరికా బాలమూషికా' అమ. - "క్షుద్రత్వాత్ బాలావాసౌ మూషికా చ - 'ఖర్వాఖు ర్బాలమూషికా' ఇతిదుర్గః" రామాశ్రమి) - నికాయంబులు=సమూహములు ('అథ సధర్మిణాం స్యా న్నికాయః' అమ.), అ...లన్ - అరి=శత్రువులచేత - శూన్య = రిక్తములయిన ('శూన్యంతు వశికం తుచ్ఛ రిక్తకే' అమ. - శత్రువులు త్యజించిపోయినందున పాడుపడిన యనుట) - బహు = పెక్కు - పుర = పట్టణములయందలి - హర్మ్యవాటికలన్ = మేడలవరుసలయందు, చెండాడుచుండన్ = చెండుచుండన్ = సమస్తమును కొఱికి నాశము చేయుచున్నందునను ('వేఁటాడుచుండన్' అని పా.);

3. క్రందుగాన్ = ఉపద్రవముగా, ఇతరేతరంబు=ఒండొరులతో, రాయిడిసేయు = ఘర్షణపడు - రాజులు, తన - నూపురమునన్=గండపెండారములో (అందులో వారి ప్రతిమలు చెక్కఁబడి యుండుటచేత), ఒదుఁగన్=అణఁగి పోయినందునను; (అత్యాపన్నులగు రాజులెల్లరు నణఁగి పోయినందునను; వారొండొరుల నొరసికొనుట ప్రతిమారూపమున నీతనియందెయుండే గాని బయట లేదనుట.)

4. నెగడు అనావృష్టి = మిక్కుటమగుచున్న వఱపు, ని...లన్ - నిజ = తనదైన - బల = దండులోని - ఇభ = ఏనుఁగులతో - స్పర్ధి=పోటిసేయు - సమద=మదించిన - అన్యకరటి = ఇతరుల గజములయొక్క ('కాకేభగణ్డౌ కరటౌ' అమ. కరటమనఁగా ఏనుఁగు గండస్థలము - అది కలది ఏనుఁగు.) - గండములన్ = చెక్కిళ్లయందు, చేరన్ = ప్రవేశించినందునను (ఈతని గజములను చూడఁగానే భీతిచే వైరిగజములమదము ఇంకిపోయిన దని భా.);

అతివృష్టి = మితిమీఱినవర్షము, దానవేళలన్ = ఉదకధారాపూర్వక మయిన యీవుల సమయమందు, తనకు హస్తగతము గాఁగన్-తనచేతిలో నుండఁగా (అమితముగా దాన మిచ్చుటచేత అమితముగా నుదకధార ప్రవహించు నని భా.), శలభత = మిడుత తనము, ప్రతాపాగ్నిన్ = తన ప్రతాప మనెడి నిప్పులో, క్రాఁగిపోవు = మండి పోవుచున్న - కంటకుల యందున్ = క్షుద్రశత్రువులయందు ('కణ్టకః పులకే వేణౌ ద్రుమాఙ్గే క్షుద్రవైరిణి' నానా.), కలయన్ = ఎల్లయెడలను, అడఁగన్ = అణఁగిపోయి నందునను (శలభములు అగ్నిలో పడి మడియుట ప్రసిద్ధము), ఆ పాండ్యుఁడు= ఆపాండ్యరాజు, మహిన్ = భూమిని, నిరీతిగాఁగన్ = ఈతిబాధలు లేనియట్లుగా, ఏలున్ = ఏలుచుండెను.

'అతివృష్టి రనావృష్టి ర్మూషికాః శలభాః శుకాః
అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః.'

ఇచట శుకాదీతిబాధలు అఱును ఆయాచెప్పిన తావుననేగాని వే ఱెక్కడను లే వని భావము గావున అంతటను పరిసంఖ్యాలంకారము. మఱియు ప్రసిద్ధ సాహచర్యము గలవయిన యీతులు అన్నియు నిటం జెప్పఁబడుట రత్నావళ్యలంకారము.

వ. అమ్మహీవల్లభుం డివ్విధంబున సామ్రాజ్యవైభవంబు లనుభవించుచుండఁ గొంతకాలంబున. 44

అమ్మహీవల్లభుండు = ఆరాజు, సామ్రాజ్యవైభవంబు = రాజాధిరాజైశ్వర్యమును —
'యేనేష్టం రాజసూయేన మణ్డలస్యేశ్వరశ్చ యః
శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞః స సమ్రా డితి కీర్తితః'.
రాజసూయకర్త మండలేశ్వరుఁడు రాజాధిరాజు ముగ్గురును సమ్రాట్టులే యని కొంద అందురు. ఈపదమున మకారమునకు సున్న రాదు, 'దాన్తేమోఽనసమ్రాజో మానేనుః' అని ముగ్ధబోధము.

తే. పాటలవసుంధరారుహ భాగధేయ
మాతతమరీచికాంబువర్షాగమంబు
ధరణిఁ బొడసూపె నంత నిదాఘసమయ
మదటుతోఁ శాల్మలీఫల విదళనంబు. 45

అంతన్ = అట్లు జరుగుచుండఁగా, పా...ము - పాటల వసుంధరారుహ = కలిగొట్టు చెట్లయొక్క ('పాటలా పాటలౌ స్త్రీ స్యా దస్యాః పుష్పే పునర్నవా' మేది.) - భాగధేయము = భాగ్యమును ('దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతి ర్విధిః' అమ. భాగ్యమే భాగధేయము.), ఆ...బు - ఆతత=విస్తీర్ణమయిన - మరీచికా=ఎండమావు లనెడి ('మృగతృష్ణా మరీచికా' అమ.) - అంబు=నీటికి - వర్షా=వర్షాకాలముయొక్క - ఆగమంబు=రాకయు ('స్త్రియాం ప్రావృట్ స్త్రియాం భూమ్ని వర్షాః' అమ. వర్షాకాలము వచ్చిన వానలనీరు ఎట్లువచ్చునో అట్లు వేసవి వచ్చిన నీళ్లవలె నగపడెడి యెండమావులు పొడచూపును.—ఆ...బు - రూపకము.), శాల్మలీ ఫల విదళనంబు = బూరుగు పండ్లను పగులఁగొట్టునదియు ('పిచ్ఛిలా పూరణీ మోచా స్థిరాయుః శాల్మలి ర్ద్వయోః' అమ.) - ద్వయోః అనుటచేత 'శాల్మలిః' అని పుల్లింగంబును 'శాల్మలీ' అని స్త్రీలింగంబును గలవు), (అయిన), నిదాఘసమయము= వేసవికాలము ('నిదాఘో గ్రీష్మకాలే స్యా దుష్ణస్వేదామ్బునోరపి' మేది. - 'సమయాః శపథాచార కాలసిద్ధాన్త సంవిదః' అమ.), అదటుతోన్ = గర్వముతో అనఁగా తీవ్రతతో, పొడసూపెన్ = వచ్చి కనఁబడెను.

వేసవి రాఁగానే పాటలవృక్షములు పూచును. ఎండమావులు అగపడును, బూరుగుపండ్లు పగులును; అట్టి యీవేసవి ఆసంవత్సరము అతితీవ్రతతో వచ్చినది. - స్వభావోక్తి.

'అదటు' - 'ఉదుటు' అని పా. = ఉద్ధతి.

సీ. నిర్ఝరప్రబలవేణికలింకఁ జట్రాల
బేరినప్రాఁచి పెన్పేటు లెగసె;
నెఱుకులు పడియనీ రివురఁ గుప్పలఁ బట్టఁ
బోయునీ రాడాడఁ బొలము నెఱసె;
సురగాలి దవదగ్ధ తరుపర్ణతతి రేఁపఁ
బావురా లని డేగపదుపు దూఱె;
నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరగ వెం
బడిన యధ్వగపంక్తి పొడలువెట్టె;

తే. క్షేత్రపాలున కుదికినచీర లాఁకు
చాకిరేవులగములయ్యె సకలదిశలుఁ
దెలుపులుగఁ దోఁచు నెండమావుల బయళ్లఁ;
గందె నివి యెండ నన దిఙ్ముఖములు రాఁజె. 46

1. ని...లు - నిర్ఝర=సెలయేళ్లయొక్క ('ఉత్సః ప్రస్రవణం వారి ప్రవాహో నిర్ఝరో ఝరిః' అమ. - 'ఉత్సాన్నిర్గత జలప్రవాహస్య - పఞ్చాపి పర్యాయా ఇత్యన్యే.' రామా.) - ప్రబల = పెల్లిదమయిన - వేణికలు = ప్రవాహములు ('వేణిః ప్రవాహే సరితామ్' నానా.), ఇంకఁ = ఇగిరిపోఁగా, చట్రాలఁ = (ఏటిలోని) చాఁపఱాలమీఁద, పేరిన = దట్టమయిన - ప్రాఁచి, పెన్పేటులు = పెద్దపెద్ద బెల్లులుగా (బీఁటలు అని పా. పగుళ్లు), ఎగసెఁ = లేచినది.
చట్టు ఱాలు = చట్రాలు.

శా. 'ఎట్రా శేషుఁడు పోతరించి సభలో నెగ్గాడెనా? రత్న మీఁ
డట్రా? వాసుకి తక్షకాది ధృతరాష్ట్రామాత్య కర్కోటకుల్
చుట్రా నిల్తురుగాక, నన్ను సమర క్షోణిఁ విజృంభించి యా
గట్రా చూలి విభుం డెదిర్చిన నహంకారంబు వారించెదఁ.' జైమినిభార. 7 (92).

ఇచట ప్రాసాక్షరముగల శబ్దములు - ఎట్రా (ఎటు+రా), అట్రా (అటు+రా), చుట్రా (చుట్టు+రా), గట్రా చూలి (గట్టు+రా చూలి) అనునవి. ఇందు రేఫపరకమయినంతట టకారద్వయములో నొకటికి 'ప్రాసః సర్వత్ర చైక ఏవ స్యాత్' అను నియమమున కనుగుణముగా లోపము చేయఁబడినది. లోపమునకు తెనుఁగున సూత్రము లేదందురేని, 'సర్వత్ర' 'ఏవ' అను పదముల స్వారస్యముచేత ఉక్తసూత్రము ప్రబల మగుటంజేసి ప్రయోగశరణముగా లోపమును కల్పించుకొనవలయును. అట్లే ఈజైమినిభారత పద్యమును బ. సీతారామాచార్యులవారు తమ నిఘంటువులో ఏక టకారరేఫ ప్రాసముతోనే ముద్రించినారు. 'చట్రాయి' శబ్దమునుకూడ అట్లే ఏక టకార రేఫములతో ముద్రించినారు. 'పెన్బేటులు' - పెనుపు+పేటులు - వృత్తిలో పెనుపు శబ్దమునకు పులోపము. అనంతరము ఉదంతస్త్రీ సమకార్యము. 'పెనుఁబేటులు' - అనంతరము పదాంత నువర్ణముమీఁద ఉకారలోపము బహుళము - ఆశ్రయ లోపముతో ఆశ్రయియైన యర్ధబిందువునకును లోపము - 'ఎగసె' - 'ఎగయు' అని పూర్వ ముద్రణపాఠమున ప్రక్రమభంగము.

2. ఎఱుకలు=బోయవాండ్రు (పిట్టలను పట్టెడు నొకజాతి), పడియనీరు=నీరునిలిచిన చిన్న పల్లముల జలము (పల్వలోదకము), ఇవురఁ = ఇగురఁ = ఎండిపోఁగా. గువ్వలఁబట్టఁ = అడవి పావురములను పట్టుకొనుటకై, పోయునీరు=పోసియుంచెడి జలము, ఆడాడఁ=అక్కడక్కడ, పొలము=అడవిని, నెఱసెఁ=వ్యాపించెను - పడియలో నీరు లేనందున ఈనీటింగాంచి యిందుకై వచ్చి పట్టుఁబడు నని ఇతరత్ర నీళ్లు పోసి పెట్టుట. —

'ఇవురఁ' - 'క్వచి ద్గకారో వః'. 'ఆడాడఁ' —

'అక్షర విలోపమై యుండు నట్టి పలుకు । గ్రామ్య మన నొప్పు నదె యపభ్రంశకంబు
ననఁగఁబడు, నాకడకు నాడ యనుచు మఱియు । నడుమ నున్నకకారంబు నుడువకున్న'.

అని యప్పకవి 'ఆడ' శబ్దమును గ్రామ్యముగాఁ జెప్పినను, 'ఏనేడ నింద్రాదులేడ' అను నరణ్య పర్వములోని నన్నయ ప్రయోగముంబట్టి యిదియు సాధువనియే గ్రాహ్యము. సీతారామాచార్యుల

వారును దీనిని అగ్రామ్యముగానే 'అక్కడ' యొక్క రూపాంతరముగా పఠించి మనుచరిత్ర రగడనుండి యీప్రయోగము నుదాహరించినారు:—

'అలమినను జివురునను నగునె కంటక మాడఁ
జాలుదు మనె వేఱొక్కచోటఁ గంటక మాడ.'

3. సురగాలి = సుడిగాలి, ద...తిన్ - దవ = దావాగ్నిచేత ('దవదావౌ వనారణ్యవహ్నీ' అమ.) - దగ్ధ = కాల్పఁబడిన - తరు = చెట్లయొక్క - పర్ణ = ఆకులయొక్క-తతిన్ = సమూహమును, రేఁపన్ = ఎగురఁగొట్టఁగా, పావురాలు (పా. పారువాలు) అని = ఆయాకులను పావురము లనుకొని, డేగ పదుపు = డేగల తండము - తూటెన్ = ఎగురుచున్న యాయాకుల నడుమను ప్రవేశించెను.

'మిడుతలగతి సురగరువలిఁ । బొడమిన కారాకు గముల పోలికి టెక్కల్
వడసిన భుజగంబులకై । వడిఁ దఱచుగ నమ్ము లేయువారము దివికిన్.' భోజ 5 (21).

భ్రాంతిమదలంకారము.

'పావురాలు' - కాలినదానికి పావురము వన్నె కలుగును—

'ఇతి చైన మువాచ దుఃఖితా సుహృదః పశ్య వసన్త కిం స్థితమ్
తదిదం కణశో వికీర్యతే పవనై ర్భస్మ కపోత కర్బురమ్.'

అని కుమారసంభవములో దగ్ధమదనుని భస్మరాశి వర్ణనము. డేగ పావురములను *వేఁటాడును.—

'...సహస్రాంశుండు వైచెన్ గరశ్యేనవ్రాతము...
ను। డ్డీనం బయ్యె నుడువ్రజంబు పరిపాటిం బారువాలో యనన్.' శృం. నై. 8 ఆ. 8.

4. ని.....యు - నిద్రిత = నిద్రితులయొక్క = నిద్రఁ బొందిన వారియొక్క - ద్రు = చెట్లయొక్క ('పలాశీ ద్రు ద్రుమాగమాః' అమ.) - ఛాయ = నీడ, నిలువక = స్థిరముగా నొక చోటనే యుండక, జరగన్ = అవలికి పోఁగా, వెంబడిన్ అ = ఆనీడవెంటనే, అధ్వగపంక్తి = బాటసారుల వరుస, పొడలువెట్టెన్ = పొరలి జరుగుచుండెను; చెట్లక్రింద నిద్రించుచుండు బాటసారులు వాని నీడ అవలికి జరగఁగానే తామును దాని క్రిందికే పొరలి జరుగుచుందు రనుట.

సకలదిశలున్ = దిక్కులన్నియు, తెలు...ళ్లన్ = తెల్లనివిగా నగపడుచున్న యెండమావులు గల బయళ్లచేత, క్షేత్రపాలునికిన్ = భైరవస్వామికి, ఉదికిన - చీరలు = వస్త్రములు- ఆఱు = ఎండుచున్న - చాకిరేవుల (యొక్క) - గములు = సమూహములు, అయ్యెను.

[భైరవుఁడు శివునియొక్క యవతార విశేషము.

'త్వం భైరవ సమాగమ్య పుణ్యక్షేత్రాణి పాలయ
క్షేత్రపాల ఇతి శ్రీమన్ త్రిషు లోకేషు విశ్రుతః.' స్కాంద.

అను ప్రమాణముంబట్టి పుణ్యక్షేత్రపాలనాధికారమును క్షేత్రపాలసంజ్ఞయు. అతఁడు శివుఁడుగాన దిగంబరుఁడు, కావున తెల్లనివిగా నగపడు బయళ్లు అతని యుదికిన దోవతులుగాను దిక్కులు ఆదోవతులు ఆఱవైచిన చాకిరేవులుగాను ఉత్ప్రేక్ష; ఎండమావులు - నిత్యబహువ.]

దిఙ్ముఖములు = దిక్కుల ప్రారంభము లనెడి మొగములు (పరిదృశ్యమాన దిగ్భాగములు), ఎండన్ = ఎండచేత, కందె ననన్ = నలుపెక్కె ననునట్లుగా, రాఁజెన్ = పొగసినవి. - ఉత్ప్రేక్ష.

సీసములో ప్రథమ ద్వితీయ చతుర్థ పాదములందు స్వభావోక్తి.

---

* చూ. శిబిచక్రవర్తి కథ.

చ. సరి యగు నిట్టివెట్ట నివి సర్వము నం చటమీఁదిసృష్టికై
శరధిప దిఙ్మరు జ్జ్వలిత చండతరాతపవహ్ని నాఱఁగాఁ
గరువు లజుండు వీనిపయిఁ గట్టె ననన్ గనుపట్టె వెచ్చల
న్గరి కిరి కాస రాంగములఁ గప్పిన ఱొంపులు నంటి యాఱఁగన్. 47

వెచ్చలన్ = ఎండలచేత, కరి...లు - కరి = ఏనుఁగులు - కిరి = వరాహములు ('వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః' అమ.) - కాసర=దున్నలు ('లులాయో మహిషోవాహ ద్విష త్కాసర సైరిభాః' అమ.) - అను వానియొక్క - అంగములన్ = దేహములను, కప్పిన - ఱొంపులున్ = బురదలుకూడ, అంటి = వానికి అంటికొనియే, ఆఱఁగన్ = ఎండుటం జూడఁగా, (ఎట్లు కనఁబడె ననఁగా,) అజుఁడు = బ్రహ్మదేవుఁడు ('అజా విష్ణు హరచ్ఛాగాః' అమ.), ఇట్టివెట్టన్ = ఇంత తీక్ష్ణమయిన వేఁడిమికి, ఇవి సర్వమున్ = ఈజంతువులన్నియు, సరియగున్ = నష్టమైపోవును, అంచున్ = అని భయమంది, అటమీఁది సృష్టికై = ఈవేసవి యణఁగిన తర్వాత వీనిని మరల సృజించు కొనుటకై, వీనిపయిన్ = ఈకరికిరికాసరాంగములపై, శర...హ్నిన్ - శరధిప = సముద్రపతియైన వరుణుని - దిక్ = దెసయైన పడమటి - మరుత్ = గాలిచేత - జ్వలిత = మండింపఁబడిన - చండతర = అతితీక్ష్ణమయిన - ఆతప = ఎండయనెడు - వహ్నిన్=నిప్పుచేత, ఆఱఁగాన్ = కాలునట్లుగా, ['ఁగాలఁగా' అనియే పఠించుట యొప్పు] కరువులు = మూసలను, కట్టె ననన్ = కట్టినాఁ డనునట్లుగా, కనుపట్టెన్ = అగపడెను.

బ్రహ్మదేవుఁడు ఆవేసవి వేండ్రమునకు ఆ కరికిరి కాసరము లెల్లను మాడిపోవు నని భయపడి ఆవేసవి తీఱినతర్వాత మరల వానిని సృజించుకొనుటకై ఇప్పుడు వాని దేహములపై మూసలు కట్టి ఆమూసలను పడమటిగాలిచే మండుచున్న యెండ యనుగాఢతరాగ్నిలో కాల్చుచున్నాఁడో యనునట్లుగా ఆజంతువుల దేహములకు దట్టముగానంటిన ఱొంపిపూఁత ఆదేహముల మీఁదనే ఆవెట్టలకు ఆఱుచుండెను. - ఉత్ప్రేక్ష. 'ఆతపవహ్ని' - రూపకము.

కరి కిరి కాసరములే ఆవెట్టకు నశించు నని బ్రహ్మ భయపడుట అవి వేఁడిని బొత్తిగా ఓర్వలేని వగుటచేత - ఓర్వలేనందుననే అవి వేసవిలో నిరంతరము చలువకై ఱొంపిలో మునింగి యుండుట. 'వెట్ట నివి సర్వము' - 'వెట్టలను సర్వము' - అని పా. 'శరధిప దిఙ్మరుత్' - పడమటి గాలి వీచుటచే ఎండ వేఁడి దుస్సహతరమగుట యనుభవసిద్ధము. 'జ్వలిత'-గాలియు అగ్నియు చెలికాండ్రుగాన, పడమటిగాలి ఎండ నిప్పును జ్వలింపఁజేయుచున్నది. 'వాయుసఖః' అను నగ్ని నామమును, 'విభావసుః సారథినేవ వాయునా' అను రఘువంశమందలి వర్ణనమును అరయుఁడు. 'వీనిపయిన్' - వానిపైని అచ్చులు గట్టిననే వాని యాకారము సరిగా వచ్చును. 'కరువులు' గనుక వానిపైనే ఆఱవలయును, ఆఱకముందు తీసినచో అచ్చుచెడును, అందలిపోఁత వీని రూపమునకు సరిపడక పోవును. 'నంటి'-పా.—'ఱొంపులున్ + అంటి' అని కొందఱు విభజించిరి. శబ్దరత్నాకరాది నిఘంటువులందును 'నంటు' ధాతువు కనఁబడలేదు, కాని 'అంటుకత్తె' 'అంటుకాఁడు' 'అంటు' ఈమూఁడు శబ్దములకును 'నంటుకత్తె' 'నంటుకాఁడు' 'నంటు' అని రూపాంతరములు నకారాదిశబ్దములలో నున్నవి. ఈమూఁటికిని స్నేహితురాలు స్నేహితుఁడు స్నేహమును అర్థములు. స్నేహముకూడికచేతనేగావున ఈయ (అ) కారాదులకుమూలముగా అంటు ధాతు వున్నట్లు నకారాదులకు మూలముగా నంటుధాతు వుండె నని యూహింపఁ దగియున్నది.

మఱియు 'సెగయు' 'ఎగయు' అయినట్లో' 'ఎగయు' 'సెగయు' ఐనట్లో, 'సంటు' 'అంటో' 'అంటు' 'సంటో' అయి యుండు నని యెన్నఁదగి యున్నది; కావున ఇట 'సంటి'యు గ్రాహ్యమే. 'బ్రోంపులన్' - నిరంతరము నీట నుండువానిని కూడ నను సముచ్చయము నిదాఘోగ్రతం దెలుపుచున్నది.

మ. దవధూమంపుఁదమంబులోఁ దమరస ద్రవ్యంబుఁ బంకేజబాం
ధవుభానుప్రతతుల్ హరింపఁ గుయివెంట న్వ్రేళ్లు శూన్యోరుకూ
పవితానం బనఁ జూడఁ జూడఁ బుడమి న్బాటిల్లి పై విప్పులై
యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళి రజశ్చక్రముల్. 48

తమ రస ద్రవ్యంబున్ = తమయొక్క (కూపములయొక్క యనుట) - రస = జలమనెడి ('శృఙ్గారముఖ్య మధురాది సువర్ణ రేతో నిర్యాస రాగ గరళ ద్రవపారదేషు
ఆస్వాదన ధ్వని సుధామ్బు రసాఖ్యధాతు ష్విష్ట్ రసోఽథ రసనా ధరణీరసాస్యాత్.'
నా. నా.) -

ద్రవ్యంబున్ = ధనమును ('ద్రవ్యం విత్తే గుణాశ్రయే' నా. నా.) పం...తుల్ - పంకేజ బాంధవు=సూర్యునియొక్క. ('అర్కేఽసహస్రాత్ ఖర ప్రభృతే రపి ఉష్ణైశ్య శ్చాంశవశ్చక్రాబ్జ దినేభ్యోఽపిబాన్ధవః.' కా. క. ల. - చక్రాబ్జదినములపై బాంధవంబునూర్యునిం జెప్పును.)— భాను=కిరణముల ('భానుః కరో మరీచిః స్త్రీ పుంసయో ర్దీధితిః ప్రమాన్' అమ.) - ప్రతతుల్ = సమూహములు, దవధూమంపుఁ దమంబులోన్ = దావాగ్నియొక్క పొగయనెడి చీకటిలో, హరింపన్ =దోఁచుకొనఁగా, కుయివెంటన్ = మొఱ యనెడుకార్యముకై (మొఱపెట్టుకొనుటకై), వ్రే...బు - వ్రేళ్లు = ఏఁగుచున్నట్టి - శూన్య = పాడు - ఉరు = గొప్ప - కూప = నూతులయొక్క - వితానంబు=సమూహమో ('క్రతు విస్తారయో రస్త్రీ వితానం త్రిషుతుచ్ఛకే' అమ.), అనన్ = అనునట్లుగా, వాత్యా ఆళిన్ =సుడిగాడ్పుల సమూహముచేత, రజః=ధూళియొక్క - చక్రముల్ = వలయములు (వలయాకారమయిన ధూళులు), చూడఁ జూడన్ =చూచిన కొలందియు, పుడమిన్ = భూమియందు, పాటిల్లి=జనించి, పైన్ =ఊర్ధ్వ భాగములందు, విప్పులు ఐ=విశాలములై, యవసంబు = గడ్డి ('ఘాసో యవసమ్' అమ.), అంచులన్ = కొనలయందు, ఆడఁగాన్ = చలించుచుండఁగా, నెగసెన్ = మింటి కెక్కెను.

సుడిగాడ్పులకు నేలనుండి ధూళిచక్రములు లేచి పైని విరివిచెంది అంచులలో గడ్డి యంటుకొని చలించుచుండఁగా మింటి కెగయుట యెట్లుండె ననఁగా, పెద్దబావులు జల మనెడి తమ ధనమును సూర్యుని కిరణములు దావాగ్ని పొగ యనెడి చీకటిలో దోఁచుకొనిపోఁగా సూర్యుని కడకు మొఱపెట్టుకొనుటకు పోవుచున్నవో యనునట్లు ఉండెను - రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

వేసవిలో సూర్యకిరణములు జలాశయములలోని జలమును ఆవిరిగా మార్చి పీల్చుటయు- ఆయావిరి మింట మేఘమై జలమై వృష్టిరూపమున మరల జలాశయములం జేరుటయు ననుభవసిద్ధము. ఆవిషయము నిట ననుసంధించుకొనవలయును. 'దవ' - దావాగ్నివ్యాప్తి నీరెండి పోవుటకు కరము సహకార మొనర్చినదని భా. 'తమంబు' - దొంగతనమునకు నానాకారణములచేత చీకటిరాత్రి అనుకూలకాలము. 'ఎరగలి పొగయే' అట్టి రాత్రిగా సూర్యకిరణము లనెడు దొంగ

లకు అనుకూలపడిన దనుట, పొగయు నీరు తగ్గుటకు కారణము గావున నట్లుచెప్పుట. 'పంకేజ బాంధవు' - సూర్యుఁడు తామరలకు మిత్త్రుఁడు, తామరకు ఆబావులు నివాసము, అందలి జలము జీవనము; తన కిరణములుచేసిన యాచౌర్యముచేత తనమిత్త్రము లయినతామరలు నశించునని పరితపించి సూర్యుఁడు బావులకెల్ల విన్నవెంటనే కిరణములవలననుండి ఆరసద్రవ్యమును వెండియు ఆబావులకు ఇప్పించు నని భా. ఆనీరు మరల వర్షమై కురియును గావునను 'ఆదిత్యాజ్జాయతే వృష్టిః, అనుటచేతను అట్లుచెప్పుట. దొడ్డప్రభువు తన నౌకరులు తన ప్రజలలో నెవ్వరి నేని కొల్లఁ బెట్టినయెడల ఆనౌకరులను దండించి వారిచేత ఆప్రజలకు హృతధనమును మరల నిప్పించునట్లు అని భా. 'కయి వెంటన్' - వెంట యనఁగా కార్య మనుటకు —

'కుటుంబ భారంబు సర్వంబు నాయంద సమర్పించి తాను నిర్భరులై యిష్టవిహారంబు
ల, నుండుదురు. ఏ నెల్ల వెంట నప్రమత్తనై వర్తింతు.' భార. అర. 5 ఆ. శ. ర.

ఇటం గొందఱు 'వెంట' అనఁగా కార్యమని యర్థమెఱుంగక. యతిభంగమునుం గానక 'కుయి వెట్టన్' అని పాఠము కల్పించుకొని, 'కయి వెంటన్' అనుదానిని పాఠాంతర మని వ్రాసినారు. 'ధట' లకేని 'ందట' లకేని యతిమైత్త్రి లేదు. 'ంధంట' లకు రెండును అనుస్వార సంబద్ధములగుటచే ఆసంబంధముచే సామ్యముకలిగి యతిమైత్త్రి కలుగును. అప్పకవి అనుస్వారసంబంధయతి నిట్లు వివరించినాఁడు. —

'ఆది పూర్ణయుతములై తట వర్గాక్ష । రములు తుదను గలుగు వ్రాలు దక్కఁ
బొసఁగు నొకటి కొకటి భువి ననుస్వార సం । బంధయతులు నాఁ బ్రబంధములను.'

ఇందులకు అతఁడు ఉదాహరించిన మూఁడు ప్రయోగములలో ప్రకృత పద్యమొకటి, కడమ రెంటను అనుస్వార సంబంధము రెండు తావులనుం గలదు, కావున ఇందు నట్లేయని యూహింపఁ దగును. మఱియు, ప్రయోగములం దెందును ఒకటమాత్త్రము నిందుసున్నయున్న ట త వర్గమైత్త్రి లేదు. కావున ఇతరు లన్నపాఠాంతరమే వాస్తవ పాఠము. 'వెళ్లు' - 'వెడలు' ధాతువే వెళ్లై ఇంచుక అర్థాంతరముం బొందినది; ఇట్లే 'నడలు' 'నళ్లు' అయినది. 'శూన్య' - రసమంతయు కొల్లఁ బోయె ననుట, కావున తప్పకపోయి మొఱవెట్టుకొనవలసి వచ్చినది. 'ఉరు' - అనుటచే దిగుడు బావులు సూచితములు, అవియే ఉక్త రజశ్చక్రములవలె క్రింద కొంచెముగాను పైని విరివిగాను ఉండును. వానియందైన తామరలు నుండును; కూపమాత్త్రములయందు అవియుండవు. 'వితానంబు' - ఇచట శబ్దముచేతనే బహుత్వము కథితము. 'చక్రముల్' అను పదమున బహువచనముచేత నది కథితము. 'పుడమిన్' - బావులు నేల నుండునవిగాన నేలనుండి లేవవలయును. 'యవసము' - ఇది పరాభూత చిహ్నము. పూరి గఱచికొని యేఁగుటచే శరణార్థిత సూచితము. 'అంచులన్' - నోళ్లయందు. 'వాత్యా+ఆళిన్' - వాతానామ్ సమూహో వాత్యా - 'పాశాదిభ్యోయః.' 'తస్యసమూహః'. వాతసమూహ విశేషమగుటచే సుడిగాలియు వాత్య యనఁబడును. 'వాత్యా వాతస్య మణ్డలీ' హలాయుధుఁడు.

'వాత్యా సంవేగ విష్వగ్వితత వలయిత స్ఫీతధూమ్యా ప్రకాశం
ప్రారమ్భేఽపి త్రియామా తరుణయతి నిజం నీలిమానం వనేషు.' మాలతీ.

'వాత్యానాం మణ్డలాకార వాయూనామ్' అని త్రిపురారి వ్యాఖ్య.

'ఉత్ఫుల్లస్థల నళినీవనా దముష్మా । దుద్ధూతః సరసిజ సంభవః పరాగః
వాత్యాభిర్వియతి వివర్తితః సమన్తా । దాధత్తే కనక మయాతపత్త్రలక్ష్మీమ్. భారవి.

'వివర్తితః' పరిమణ్డలీకృతః' మల్లి. వ్యా. రజశ్చక్రోపమచేత బావులలో ఇంచుకేనియు తడిలేక ధూళి రేఁగుచున్నదనియు భా.

చ. పడమర వెట్టునయ్యుడుకు ప్రాశన మొల్లక కూటిపేద లై
బడలిక నూడు నచ్చిలువ ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికిన్
ముడియిడఁ బిచ్చుగుంటు రథము న్నిలుప న్బయనంబు సాగమిన్
జడను వహించె నాఁగ దివసంబులు దీర్ఘము లయ్యె నత్తఱిన్. 49

(అయ్యెడన్ - పా,) అత్తఱిన్ = ఆగ్రీష్మకాలమందు, పడమర వెట్టు నయ్యుడుకు ప్రాశనము = పడమటిదిక్కు పెట్టుచున్న యావేఁడి యన్నమును [పడమటినుండి వీచుచున్న వేఁడిగాలి ననుట; గాలి పాములకు ఆహారము, సూర్య రథముయొక్క ప్రగ్గములు పాములు; 'ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః' అమ. 'ఉరగీ శిశవే బుభుక్షవే త్వ దిశ తూత్కృతి మానసా నిలేన' భవ.

'రథ స్యైకం చక్రం భుజగయమితాః సప్త తురగా
నిరాలమ్బో మార్గ శ్చరణవికలః సారథి రపి
రవి ర్యాత్యే వాన్తం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే.' భో. ప్ర.],

ఒల్లక = అంగీకరింపక (నోరు కాలుం గావున తినలేక), కూటిపేదలై, బడలికన్ = సొమ్మసిల్లుటచేత, ఊడు నచ్చిలువ ప్రగ్గములన్ = వీడిపోవుచున్న యా పాపత్రాళ్లను, రవియాజ్ఞన్ = సూర్యుని పంపున, పిచ్చుకుంటు = అనూరుఁడు ('సూర్యసూతో౽రుణోనూరుః' అమ.), ముడియిడన్ = ముడులు వేయుటకు, రథమున్ = సూర్యరథమును, మాటికిన్ = పలుమాఱు, నిలుపన్ = ఆఁపుటచేత, పయనంబు, సాగమిన్ = జరగనందున, జడను వహించెన్ నాఁగన్ = ఆలస్యమును పొందినవో యనునట్లుగా, దివసంబులు = పగళ్లు ('ఘస్రో దినా హనీ' అమ.), దీర్ఘములు అయ్యెన్ = నిడుద లాయెను (వేసవిలో రాత్రులకు పొడవు తగ్గును, పగళ్లకు హెచ్చును), - హేతూత్ప్రేక్షాలంకారము.

సూర్యుని తేరి ప్రగ్గములైన పాములు పడమటినుండి వచ్చుచున్న వేఁడిగాలి తినలేక ఉపవసించి సొమ్మసిల్లి పట్టుదప్పి పోవుచుండఁగా సూర్యుని యాజ్ఞచేత అనూరుఁడు ఆ పాప ప్రగ్గములను ముడులువైచుటకు మాటిమాటికిని రథమును నిలుపుచుండినందున ఉదయాద్రినుండి అస్తాద్రికిం బోవు మింటి పయనము నడుమ నడుమ ఎడపడుచుండినందుననో యనునట్లు పగళ్లుదీర్ఘములైనవి.

'పడమరవెట్టు' - 'పడమరవెట్టన్' పా. 'ఉడుకు ప్రాశనము' - ఇట 'ఉడుకు' తద్ధర్మక విశేషణము; 'ఉడు కెక్కినది' ఇత్యాది వాక్యములందుంబోలె నామవాచకపక్షమున 'ఉడుకుఁ బ్రాశనము' అనవలయును. 'కూడు తింటిని' 'కూడు పెట్టినారు' ఇత్యాది వ్యవహారము గ్రామ్యంబయినను 'కూటిపేద' ఇత్యాదులు శిష్టవ్యవహారముచే అగ్రామ్యంబులు; 'కూడుతింటి' నిత్యాదులు రూపకములందు నీచపాత్రవ్యవహారమున నుచితములే. 'ఊడు'-దేహము సొమ్మసిల్లుటచేత నొకటి నొకటి పట్టువిడినవనుట. 'రవియాజ్ఞ' - అదిలేక రథ మాఁపుటకు అస్వతంత్రత. రవికి కాలనియమ మనతిక్రమణీయము. ''యాతో౽స్తి పద్మనయనే సమయో మమైషః'' - రత్నా.

'మాటికిన్' అనుటచే పడమటిగాలిబాధ పడమటికి పోయినకొలఁదిం గలుగుచునే యున్న దని భా. సూర్యుఁడు దినకరుఁడు గాన అనఁగా సూర్యుఁ డగపడుచున్నంతకాలము ఆయాచోట్ల దినము గాన, ఎక్కువసేపు పయనించుటచే దినము ఎక్కువకాలముం బొందె నని భా.

క. తరణిఖరకిరణశిఖి జగ । మెరియింపఁగఁ బొడమి గాలి నెగసిన భసితో
త్కర మనఁగ శాల్మలీతరు । పరిణతఫలతూలమర్కపథమున నెరసెన్. 50

త...ఖి - తరణి = సూర్యునియొక్క ('ద్యుమణి స్తరణి ర్మిత్రమ్' అమ.) - ఖర = తీక్ష్ణమైన ('తిగ్మం తీక్ష్ణం ఖరమ్' అమ.) - కిరణ = వెలుఁగు లనెడి - శిఖి = నిప్పు ('శిఖినా వహ్ని బర్హిణౌ' అమ.), జగము = లోకమును, ఎరియింపఁగన్ = కాల్పఁగా, పొడమి = ఉత్పన్నమై, గాలిన్ = గాలిచేత, ఎగసిన - భ...ము - భసిత = బూడిదయొక్క (నిగులుయొక్క) - ఉత్కరము = సమూహము, అనఁగన్ = అనునట్లుగా, శా...ము - శాల్మలీ = బూరుగు - తరు = చెట్లయొక్క - పరిణత=పండిన - ఫల = కాయలయొక్క - తూలము = దూది, అర్కపథమునన్ = సూర్యమార్గమున ('ఆకాశమున ననుట - 'అర్కః స్ఫటిక సూర్యయోః' అమ.) నెరసెన్ = వ్యాపించెను. ('పథమున కెగసెన్' - పా.)

సూర్యకిరణము లనెడి నిప్పుచే లోకమెల్ల మండి దాని నిగులు గాలి కెగసినదో యను నట్లుగా పండి పగిలిన బూరుగుకాయల దూది ఆకాశమంతట వ్యాపించెను. - రూపకాను ప్రాణితవస్తూత్ప్రేక్ష.

'అర్కపథమున నెరసెన్'—ఆకాశ మంతటను వ్యాపించినందున జగమెరియింపఁగల దనుట. అర్క పథమునుండి చూచిన జగము కనఁబడుటలేదు తూలమే కనఁడుచున్న దని భా. 'పరిణత' - బూరుగుకాయ పక్వముకాకున్న పగులదు. బూరుగు దూది కడుం దేలిక యగుటచే చిరము మింటనే యెగయుచుండి యెట్టకేలకు నేలకు దిగును, కావున మింటనే నెరసె ననుట.

చ. భరితనిజాంబుబింబితవిభాకరబింబవిజృంభితప్రభాం
కురముల నధ్వనీనకృతకూపకపంక్తులు వొల్చె నప్డిరా
డ్విరహాభరంబున న్బొడముపెచ్చుకు శాంతి యొనర్ప వాహినీ
తరుణులు మేన దట్టముగఁ దాల్చినముత్తెపుఁబెరులో యనన్. 51

అ...లు. - అధ్వనీన = బాటసారులచేత ('అధ్వనీనోఽధ్వగోఽధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి' అమ.) - కృత = చేయఁబడిన - కూపక = చెలమలయొక్క ('కూపకాస్తు విదారకాః' అమ.) - పంక్తులు = వరుసలు, భ...లన్ - భరిత = నిండిన (బింబమునకు విశేషణము.) నిజ = తమదైన - అంబు = నీటియందు - బింబిత = ప్రతిబింబించిన - విభాకరబింబ = సూర్యమండలముయొక్క ('భాస్కరా హస్కరబ్రధ్న ప్రభాకర విభాకరాః' - 'బిమ్బోఽస్త్రీ మణ్డలం త్రిషు' అమ.) - విజృంభిత = వ్యాపించిన - ప్రభా అంకురములన్ = దీప్తులయొక్క మొలకలచేత, (ఎట్లు శోభిల్లె ననఁగా), వాహినీ తరుణులు = నదీయువతులు ('వాహినీ స్యాత్తరఙ్గిణ్యాం సేనా సైన్యప్రభేదయోః' మేది., 'తరుణీ యువతిః సమే' అమ.) అబ్ధి...నన్ - అబ్ధిరాట్ =తమ వల్లభుఁ డయినసముద్రునితోడి - విరహ=వియోగముయొక్క - భరంబునన్ =అతిశయముచేత ('అ థాతిశయో భరః' అమ.), పొడము పెచ్చుకున్ = జనించుచున్న తాపమునకు,

శాంతి బనర్పన్ = శమనము చేసికొనుటకై, మేనన్ = తమ దేహమందు, దట్టముగన్, తాల్చిన (=ధరించిన), ముత్తెపు - పేరులో యనన్, పొల్చెన్ = శోభిల్లెను.

ఏళ్లలో బాటసారులు త్రవ్వుకొన్న చెలమలు అందలి సూర్యబింబ ప్రతిబింబములచేత దేదీప్యమానములై యెట్లు పొలిచిన వనఁగా, ఆయేళ్లు తమకు తమ పతియైన సముద్రునితో, గలిగిన వియోగాతిశయమువలని తాపమును చల్లార్చుకొనుటకై దట్టముగా ధరించిన ముత్తెసరములా యనునట్లు పొలిచినవి. - వస్తూత్ప్రేక్ష.

'భరిత' - దీనిని బింబములకు విశేషణముగాఁ గొనుటవలన ప్రతిబింబము చెలమకు నిండి యున్నదనుట. అప్పటికప్పుడు అధ్వగులు తోడుకొన్న వగుటచేత చెలమలు చిన్నవి, అందలి నీరంతయు సూర్యప్రతిబింబముచేత ఆక్రాంతమై ప్రతిబింబమాత్రమే అగపడుచున్నది. దాని చుట్టు మన్నెగాని నీరులేదు - అని భా. అందువలన ఏఱును ఏఱు ధరించిన ముత్తె (సర) ములును గనఁబడునే గాని ముత్తెముల చుట్టును అప్రసక్తమయిన జలము కనఁబడదు. అందువలన వానికి సూర్యప్రతిబింబము లగుటచేత గుండ్రఁదనము సిద్ధముగావ ఆణిముత్తెములసామ్యమును, విజృంభిత ప్రభాంకురములం జెప్పుటచే (భావ మేమన-) రత్నాకరుని భార్య లయిన నదులకు లేని యుత్తమ రత్నములు మ రెవ్వరికి నుండవు కావున, మిక్కిలి శ్రేష్ఠమయిన పాణి కుపాణి ముత్తెముల సామ్యమును, లభించుచున్నవి. 'పంక్తులు' అనుటచే పెక్కు పేరులు సూచితములు, పెక్కులుగా ధరించుట త్వరగాను దేహమంతటను తాపము శమించుటకు. 'విరహ' - ఏళ్లకు సముద్రునితో విరహము, ఈఋతువులో ఏటిప్రవాహము సముద్రమువఱకుం బోక నడుమనే అంతరించుట; అట్టి చిన్నయేళ్లయందే చెలమల ప్రసక్తి. 'తరుణులు' గాననే విరహాభరము. 'దట్టముగా' - పేటలనేకము అనుట, అవే ఆ 'పంక్తులు.'

మ. అతివృష్టి స్మును వార్ధిఁ గూర్చునెడ కాఁ డౌటం దమిం గూర్చున
స్మతి లంచంబుగ హేమటంకములు మింటం బొల్చుపర్జన్యదే
వత కీ నెత్తినకే లనాఁ బొలిచె నిర్వారిప్రవంతి న్పయ
శ్చ్యుతి నమ్రచ్ఛదదృశ్యకర్ణికములై యున్నాళనాళికముల్. 52

మును=పూర్వము (వర్షర్తువులో ననుట), (ప్రవంతిని), అతివృష్టిన్ =అధికవర్షములచేత, వార్ధిన్ = సముద్రుని, కూర్చు ఎడకాఁడు=చేర్చునట్టి కుంటెనకాఁడు, ఔటన్ = అగుటంబట్టి, తమిన్ =కామాతిరేకము గలదైనందున, కూర్చు ననుమతిన్ = ఇప్పుడును తన్ను సముద్రునితో కూర్చును అనెడి యూహచేత, లంచంబుగన్ =ఉత్కోచముగా, హేమటంకములు=బంగారపు నాణెములను, మింటన్ = ఆకాశమందు, పొల్చు = ఉండెడి, పర్జన్యదేవతకున్ = మేఘదేవునికి, ('పర్జన్యౌ రసదబ్దేన్ద్రౌ', 'బృన్దారకా దైవతాని పుంసివా దేవతా స్త్రియామ్' అమ.), ఈన్ = ఇచ్చుటకై, ఎత్తిన, కేలు అనాన్ = చేతులో యనునట్లు, నిర్వారి ప్రవంతిన్ = నీళ్లులేని యేటియందు ('ఆపః స్త్రీభూమ్ని వా ర్వారి'. 'స్రవన్తీ నిమ్నగాపగా', అమ.), ఉన్నాళ నాళికముల్ - ఉత్ =ఉద్గత=పైకి నిగిడిన - నాళ=కాండ్లు కలవైన ('నాళో నాళమ్' అమ.) - నాళికముల్= కమలములు ('నాళీకం త్వబ్జే క్లీబం శరే పుమాన్' నానా.), ప...తిన్ - పయః=నీటియొక్క - చ్యుతిన్ =జాఱిపోయి నందున, నమ్ర...లు - నమ్ర=వాలిపోయిన - ఛద= ఱేకులుకలవై - (అందు

చేతనే) - దృశ్య = పైకింగనఁబడెడి - కర్ణికములు = దుద్దుకలవి ('కర్ణికా కర్ణభూషణే, కరిహస్తాఙ్గుళౌ పద్మబీజకోశ్యామ్' అమ.), ఐ, పొలిచెన్ = శోభించినవి.

పూర్వము అతివృష్టిచేత తమ్ము సముద్రునిలోఁ గూర్చిన కుంభెనగాఁ డయినమేఘుఁడు ఇప్పుడును లంచ మిచ్చిన మరల నట్లే కూర్చు నని తమిచే నూహించి, యేళ్లు మింట నున్నయాతని కిచ్చుటకై బంగారు నాణెముల నరచేతం బెట్టుకొని చాఁచుచున్న బాహువులో యన, నీరులేని యేళ్లలో నీ రెడలినందున వెనుకకు జేకులు వాలిపోఁగా దుద్దు లగపడుచున్న తామరసములు గాన్పించుచుండెను. - వస్తూత్ప్రేక్ష.

అతిగతమైన అనఁగా అధికమైన వృష్టిగలవాఁడైన వార్ధిని అని యోజించిన, 'స్రవంతులు' వృషస్యంతు లని భావ మేర్పడుచున్నది, 'అతి' - అతివృష్టిచేతం గలుగు రభసోత్కట సంయోగము వృష్టిమాత్రమునకుం గలుగదు. కావున కరముజాణయైన కుంభెనగాఁ డనుట. 'తమిన్' అప్పుడు కాలముగాన కూర్చినాఁడు, ఇప్పుడు కాలము గాదు, ఎట్లు కూర్చును? అని యూహింపమియు, కూర్చు ననియే యూహించుటయు, 'తమి' చేత. 'లంచము' - సం. లఞ్చః. కేలు - నిత్యైకవచనాంతము, కావున నాళికము లనుబహుత్వమునకు సరిగా చేతులు అని బహుత్వము గల యర్థము. రూపమున ఏకత్వము. అర్థము యథాయోగము అనుట 'పయచ్చ్యుతిన్' - నాళము లోని నీరు, జేకులయందలి నీరు, సమస్తము క్రిందికి జాఱి పోయినందున, 'నమ్రచ్ఛద' - జేకులు వెనుకకు వ్రాలిపోఁగా, తామర, వ్రేళ్లు చాఁచిన యరచేతివలె నున్నది. 'వ్రేళ్లు చాఁచుట' - చేత నున్నలంచము పర్జన్యునికి కంటి కగపడి యాతని చిత్తము నావర్జించుటకు. అందులకే లంచముగా ఎక్కువ విలువగలదైన ('హేమ') బంగారము ఈఁబడినది. 'ఉన్నాళ' - చాఁచిన బాహువువలె నుండుటకు, 'నాళికము' - హస్తము; 'కర్ణికము' - అరచేయి; - అందలి బీజములు హేమటంకములు.

సీ. నులివాడునాఁచువల్లుల గొంతొగర్చి లేఁ
 బోల వల్చు గాలి వే పోక నెఱేఁగి,
కడకు వెళ్లఁగ నొక్కకడనుండి త్రొక్కుచు
 నులుచలఁ జిఱుతగుల్లల నమలుచు,
నెండ్రకా లిఱికిన నెగసి యొక్కించుక
 తొలఁగి శితత్రోటిఁ దూఁటి తినుచుఁ,
వడి యింకునిలఁ జేమమడివోని తమ్మిగుం
 పులను జీలుగుల నెండలు గడపుచుఁ,
తే. దనరుబకపంక్తులకు జానువఘ్న మయ్యెఁ
జెరువుగమి; యుడుము లన రేల్దిరిగెఁ గుక్క
వసికి బావులఁ బడుటకుఁ బసులయొరువు
టెఱిలకు మొసళ్లు; మలుఁగుమీ నొబ్బెఱియఁ దూటె 53

1. ను...లన్ - నులి = ఇంచుక - వాడు = వాడిన - నాఁచువల్లులన్ = నాఁచుతీఁగల చేత (అనఁగా వానిం దినుటచేత), గొంతు, ఒగర్చి = ఒగరుగలదై, లేఁ బోల = లేఁత చేఁప

పొలపును, వల్చుగాలిన్ = వలచుచున్న గాలిచేత - (లేఁత పొలపుల గంధముగల గాలిచేత) - వేఁడిగా, పోక = చనక, నెఱేఁగి = ఒదిఁగి (ఆవాసనచే అట లేఁతమీను అను మంచిమేఁత యున్న దని యెఱేఁగి అది వెలువడునప్పుడు దానిం దినుటకు సంకుచితదేహ మై కనుపెట్టుకొని యుండి - అని యర్థము.);

'నులి' - మిక్కిలి వాడిన ఆ యొగరుండదు, పేరుచియు నుండదు; 'నాఁచువల్పులన్' అని పా. వల్పు లనఁగా బొబ్బర లని తద్వ్యాఖ్య, బొబ్బరయనఁగా పైబెరడు. ఇట్లు పఠించిన పూర్వముద్రకులు 'వల్లు' లనుట ప్రామాదిక మని 'వల్పు'లఁ బెట్టికొని 'ఒలుపు' శబ్దమునకు 'వలుపు' రూపమును 'ఒద్ద' కు 'వద్ద' నుం బోలె గ్రహించియుండ నోపుదురు. 'ఒలఁపు' = ఒలువఁబడు నది = తొట = బొబ్బర. ఒత్వమునకు వత్వము. ఒకఁడునకు వకఁడు అను తీరున గ్రామ్యము. ఈ 'వే' శబ్దము అవ్యయము, కళ.-ఒగర్చుటచే అది మంచి తిండిగాదు. గావున అవలికిపోఁ గమకింపఁగా, ఈ పొలవల్పుచేత అటనే మంచి తిండియైవచేఁప దొరకు నని నిలిచిన వనుట. - 'పొల వల్చుగాలికిఁ బోక మగిడి' అని యొక పా.-'పోక నెఱేఁగి' యని శబ్దరత్నాకర ధృతపాఠము; - 'నెఱుఁగుట' అనఁగా ఒదుఁగుట; ఇది ఎరియు (=మండు) వలె వ్యవహార ప్రసిద్ధమైన యఱవ ధాతువు. జ్ఞానార్థక మయిన యెఱుఁగు ధాతు వనుకొని, వేగుఁబోక ( = వేగుతఱి) యని 'వేపోక' ను మార్చుకొని యీపాఠమును కల్పించికొని రని తోఁచుచున్నది.

2. కడకున్ వెళ్లఁగన్ = తుదవఱకును, ఒక్కకడనుండి = ఒకచోటనుండి, త్రొక్కుచున్ = ఏవేని బురదలో అణఁగియున్నవో యని త్రొక్కిచూచుచు, ఉలుచలన్ = ఆపేరి చిన్నమీలను, చిఱుతగుల్లలన్ = చిన్న నత్తగుల్లలను, నములుచున్; - 'ఉలుచ = మిక్కిలి చాపల్యముగల మత్స్యము' అని శబ్దరత్నాకరము.

3. ఎండ్రి = ఎండ్రకాయ, కాలు ఇఱికినన్ = కాలిని పట్టుకొన్నయెడల, ఎగసి, ఒక్కించుక తొలఁగి = కొంచెముగానే అవలికిఁ జని, శితత్రోటిన్ = వాఁడిముక్కుతో ('దుర్బలే నిశితేస్యాశ్శాం శిత శాతౌ విమూత్రిషు' రభసుఁడు. - 'చఞ్చు స్త్రోటి రుభే స్త్రియా' అమ.), దూఁటి = పొడిచి, తినుచున్; - 'ఇఱికినన్' - ఇఱుకుధాతువు అకర్మకంబును సకర్మకంబును; ఎగయుట 'యేలయన' ఎగయకున్న ఎండ్రి తనముంగాళ్లతో కాలిని కత్తిరించి వైచును; 'ఒక్కించుక' ఏలయన ఎండ్రి తప్పించుకొని పో కుండుటకు;

4. తడియింకనిలన్ = తేమ యిగిరిపోయిన ప్రదేశమందు, చేమమడివోని = చేమ కాఁడల పొలమువంటివైన - తమ్మిగుంపులన్ = తామరగుబురులందును, (ఉపమాలంకారము), జీలుగులన్ = జీలుగుచెట్లయందును, ఎండలు = ఎండవేళలను, కడపుచున్; నీ రిగిరినచేమ మడి వివక్షితము, అద్భుతమైన యుపమానము. తడి లేదు, ఆకులు పసరువన్నె గలిగి విశాలములై తామరాకువలెనే ఉండును, వానికాఁడలు నీరులేనిచోటి తామరతూండ్లవలె నిగిడియుండును. తామరవలెనే చేమయు పండముగా నుండును; అందు ఆకులు ఎండను గుడారములవలె నివారించును; 'జీలుగులు' - అనూపజములు, నీటికడ నుండును, కావున సమీపగతములు.

తనరు బకపంక్తులకున్ = ఇట్లు వర్తించు కొంగ బారులకు, చెరువుగమి = తటాక సమూహము, జానుదఘ్నము = మోఁకాలిబంటి - అయ్యెన్ (నీళ్లు ఇగిరిపోయిన వనుట); మొసళ్లు = మకరములు, ఉడుము లనన్ = ఉడుములో యనునట్లు (ఉడుము మొసలి యాకృతి

గానే యుండును, - ఇది స్థలచరముగావునను, అవి జలచరము లయ్యును స్థలమందు సంచరించుచుండుటచేతను, - ఉత్ప్రేక్ష.), రేలు=రాత్రులందు, పక్కవసికిన్=పక్కల యుత్సాహమునకును (ఆమొసళ్లం బట్టుటకు పక్క లుత్సహించు ననుట), బావులఁ బడుటకున్ (కొన్ని మొసళ్లు స్థలచరములు గానందున ప్రమాదవశంబున బావులలోఁ బడును, కొన్ని మొసళ్లు పక్కలం దప్పించుకొనుటకై బావులలోఁ బడును, అనుట), పసులయెరువు టెఱలకున్ = పసులయెరువు నందలి మేఁతలకును (మొసళ్లు ఎరువులలోని పురుగులు లోనగు మేఁతకై ఇన్నిగండముల కోర్చి జలాశయములనుండి వెలుపడి సంచరించు ననుట), తిరిగెన్ = సంచరించెను, మలుఁగుమీను = పాఁపచేఁపలు (పాముపలె నిడుదగా నుండునవి), బొఱియన్ = (పాములవలెనే) బొక్కలలోఁ దూఱినవి. - 'చెరువు' - ఇందు లఘురేఫంబును గలదు. మా. శ. ర.—స్వభావోక్తి.

ఉ. మీటగుమీలనెల్ల మును మ్రింగి క్రమంబున నానె, నెండపె
న్బీటిక వెంటఁ దోఁచుతొగవేరుబడి న్గొడుపై చెలంగఁగాఁ
ద్రోటికఁ గర్దమద్రవముతో నెనయించిన బోమ్మడాయ డా
త్యూటకులంపులేజెన బకోటకులం బజలహ్రదంబులన్. 54

బకోటకులంబు = వాలుఁగొంగల ('బకోటస్తు మహాబకః') సమూహము, అజలహ్రదంబులన్ = నీళ్లులేని మడుగులలో ('జలాశయో జలాధార స్తత్రాగాధ జలేహ్రదః' అమ.), మును = ముందుగా, మీటు అగు మీలన్ ఎల్లన్ = పెద్ద వగు చేఁపల నన్నింటిని, మ్రింగి = భక్షించి, క్రమంబునన్ = అవరుసగా చివరను, ఎండ పెన్బీటిక వెంటన్=ఎండచేత నేర్పడిన పెద్ద పగులులో, తోఁచుతొగవేరుబడిన్ = అగపడుచున్న కలువవేరు వెంబడి, కొడుపు ఐ = కోపుగా, చెలంగఁగాన్ = ఒప్పుచుండఁగా, కర్దమ ద్రవముతోన్ = బురద తడితో ('నిషద్వరస్తు జమ్బాలః పఙ్కోఽస్త్రీ శాదకర్దమౌ' అమ.) - ఎనయించిన = కలిసిన - బో... జెనన్ - బోమ్మిడాయ = చిన్న చేఁపలయు ('బోమ్మడాయః సూక్ష్మమత్స్య డాత్యూట స్త్రీక్తమత్స్యకః' - విశ్వ.) - డాత్యూట = చేఁదుచేఁపలయు - కులంపు = సమూహముయొక్క - లేజెనన్ = లేఁత గ్రుడ్లసమూహమును, త్రోటికన్ = ముక్కుతో ('చఞ్చుస్త్రోటి రుభే స్త్రియౌ' అమ.), ఆనెన్ = త్రావెను. - 'క్రమంబున నైనయొండ', 'కర్దమద్రవముతోనె నశించిన', 'డాత్యూట కులంబులం దినె' పా. - ఎండచేత దినదినమునకు హెచ్చుచుండిన పెద్ద పగులులో బోమ్మడాయ డాత్యూటముల సమూహమునే తినెను అని యర్థము.

నీళ్లులేని మడుగులలో పెద్దకొంగలు ముందుగా మంచిమంచి చేఁపల నన్నిటిని తిన్నవి, ఈలోపల బురద ఎండుటలో తడి ఎంత క్రిందికిఁబోయిన బొమ్మడాయలును చేఁదుచేఁపలును అంత క్రిందికి పోయి ఒదుఁగుచుండినవి, తడి సున్న యగు నప్పటికి అవియు రూపటినవి; వాని గ్రుడ్ల సమూహము ఎండ బీటికలలో కలువ వేరువెంబడిని ఒక కోపువలె నుండఁగా, ఆకొంగలు అగ్రుడ్ల సమూహమును, ముక్కుతో లాఁగి నోట చప్పరించి తదీయద్రవమును పీల్వం దొడంగినవి. - పా. ఈలోపల బురద యొండినకొలఁది మడుగులో ఎండకు బీటికలు పడుచుండినవి; బొమ్మడాయియు ('బొమ్మడాయ = నేల నడఁగియుండు చేఁప' శబ్దరత్నాకరము.) చేఁదుచేఁపయు అబీటికలలో (నశించిన = పలాయన మగుచున్న) క్రిందిగి అణఁగు చుండినవి. అ ట్లణఁగి కడపట

బీటికలలో ద్రవము నిశ్శేషముకాఁగా చలువకై కలువవేరు వెంబడి అవి నిశ్చలముగా తోపుకలె చేరియుండఁగా దానిని ఆపెద్దకొంగలు ముక్కుతో లాగికొని భక్షించినవి. - స్వభావోక్తి.

'బకోట' - పెద్దకొంగగాన, 'మీటు' - పెద్దమీలు వలయును. 'ఎల్ల' - అవి నిశ్శేషమయి నంతట, బొమ్మిడాయి చేఁపలను (సూక్ష్మమత్స్య విశేషములను) తినుట సరియే - 'జలప్రాదం బులన్' అని పూర్వముద్రణ పా. ఈబొమ్మడాయశబ్దము అనేక సంస్కృత నిఘంటువులలో లేదు. దేశ్యమునుండి ఇట్లు సంస్కృతమునం జేరినట్లు తోఁచుచున్నది. సంస్కృత మయినచో 'బో' అని దీర్ఘ ముండవలయును. శబ్దరత్నాకరములో 'బొమ్మడాయ' అని దేశ్యరూపము, బ్రౌను నిఘంటువులో 'బొమ్మడాయ' అనునదిగాక 'బొమ్మిడము' 'బొమ్మిడాయి' యుం గలవు.

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళారామాంబుకుల్యాబహు
స్రోతస్సంధుల నంధుయంత్ర నతికృత్ప్రోద్గీత గేయౌఘముల్. 55

ప్రాతర్వేళలన్ = ప్రభాత సమయములయందు, అట్టివెట్టన్ = అట్టి యావేసవియందు, మరు...లన్ - మరుత్ = గాలిచేత ('మరుతౌ పవ నామరౌ' అమ.) అధః = క్రింద - పుంజీభవత్ = రాసులగుచున్నట్టి (అనఁగా దట్టముగా రాలుచున్న - 'పుఞ్జ రాశీ తూత్కరః కూట మస్త్రియామ్' అమ.) - పాటల = పాదిరి పువ్వులయొక్క - వ్రాత = సమూహముచేత - ఆమ్రేడిత = రెండు మూఁడు మాఱులుగా ('ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తమ్' అమ.) - సిక్త = తడుపఁబడిన - భూ = నేలచేత - సురభిళ = పరిమళవంత మయిన - ఆరామ = తోఁటయొక్క - అంబుకుల్యా = నీటి కాలువలయొక్క ('కుల్యాల్పా కృత్రిమా సరిత్' అమ.) - బహు = అనేకములయిన, స్రోతః = ప్రవాహములయొక్క ('స్రోత ఇన్ద్రియే నిమ్నగారయే' అమ.) - సంధులన్ = మధ్య ప్రదేశముల యందు, అం...ల్ - అంధు = బావులయొక్క (బావుల కడ నుండు - 'పుంస్యేవాన్ధుః ప్రహిః కూపః', అమ) - యంత్ర = ఏతములకు - నతికృత్ = వంగుటను చేయువారిచేత (ఏతములను త్రొక్కువారిచేత) - ప్రోద్గీత (ప్ర + ఉత్ + గీత) = మిక్కిలి ఉచ్చైః స్వరముగా పాడఁబడిన - గేయ = పాటలయొక్క - ఓఘముల్ = సమూహములు ('ఓఘో బృన్దేఽమ్భసాం రయే' అమ.) కుం...ని - కుంభ = బానలయొక్క, ఉంభన = ముంచుటచేత - ఉద్భూత = పుట్టిన - అంబుధ్వని = నీటి శబ్దము, వాద్యము ఐ = మద్దెలవాద్యము కాఁగా, సొగసు ఐ = మనోహరముగా, పాటిల్లెన్ = ఒప్పెను.

(అట్టి వేసవియందు తోఁటలలో ఏతము త్రొక్కువారు మిక్కిలియు ఊర్ధ్వస్వరమున పాడుచుండఁగాను, ఏతపుబానలు నీటిలో మునుఁగునట్టి శబ్దము మృదంగ వాదన ధ్వనివలె నొప్పుచుండఁగాను, మడవ కాలువల నడిమిప్రదేశములయందు పాటల వృక్షములనుండి రాలి దట్టంపు మొత్తములైన తత్పుష్పములచేత పరిమళించుచు, వాని మకరందముచేత రెండు మూఁడు తడులు తడిసిన చలువనేలలయందు ఉండి, వినుట మనోహరముగా నుండును. - స్వభావోక్తి. సొగసై పాటిల్లుట యనఁగా మనోహరంబగుట, గేయమునకు మనోహరత్వమును వాద్యము సంపాదించును, గావున, నిట, అంబుధ్వని, వాద్యరూప పరిమాణము నపేక్షించుచున్నది గావున పరిణామాలంకారంబును గలదు. పాటలపుష్పమకరందముచేత ఆమ్రేడిత సిక్తమనుటకు 'పాటల ల్ఘుసతం దేనియ సోనఁ గూర్చె.' ౭౭ ప. చూ.

తే. మెండుమీఱిన పగటి బీఱెండ దాఁకి । యొల్లఁబోయిన లేఁబోండుమల్లెపొదల
తుదలఁ జప్పటలై కడుదొడ్డ లగుచు । బొడమె మొగ్గల గము లగ్గిబొబ్బలట్లు. 56

మెండుమీఱిన పగటి బీఱెండ = మిక్కిలి తీక్ష్ణమయిన పగటి మిడియెండ, తాఁకి = తగిలినందున, ఒల్లబోయిన = మూర్ఛిల్లిన (వాడినట్టి) - లేబోండు (= లేఁతబోండు) - మల్లె పొదల - తుదలన్ = కొనలయందు, (మనుష్యుల దేహములమీఁదనుంబోలె), అగ్గిబొబ్బలట్ల = కాలిన బొబ్బలో యనునట్లుగా, మొగ్గల - గములు = సమూహములు, చప్పటలై = అణంగినవై, కడున్ = మిక్కిలి, దొడ్డలు అగుచున్ = పెద్దవై, పొడమెన్ = పుట్టెను. - ఉత్ప్రేక్ష.

ఆవేసవియందు పగటి బీఱెండకు వాడిన లేఁతబోండుమల్లెపొదల తుదలయందు చప్పటలును దొడ్డవియు నగుమొగ్గలు ఎండ యనెడి జ్వాల తగిలినందున దట్టముగా అగ్గిబొబ్బలు లేచినవో యనునట్లు జనించినవి.

'అగ్గిబొబ్బ' లనుటచేత 'బీఱెండ' అగ్నిజ్వాలవలె నున్నదని భా. ''బీఱు+ఎండ=బీఱెండ - 'బీఱు = పెద్ద''' అని సీతారామాచార్య వివృతి.

'కసటువో బీఱెండఁ గరఁగి కఱ్ఱల నంటి । గమగమకలచు చొక్కపుజవాజి' మను. 2 ఆ.

'నిప్పుత్రిపం బైన నీ ప్రతాపంబుతో । హెచ్చుకుందాడె బీఱెండ వేఁడి.' నైషధ. 8 ఆ.

'ఒల్లఁబోయిన' - ఎవతెయేని సుకుమారి జ్వాలతగిలి మూర్ఛిల్లినట్లు అని భా. 'లేఁతఁదనము' ఒల్లఁబోవుటకు ముఖ్యకారణము. తుదల చప్పట తనము దొడ్డతనమును అగ్గిబొబ్బలకు సిద్ధము. 'గములు' ఆబొబ్బలును మెండుగా లేచును.

మ. సుడి నాభిచ్ఛలన, స్సరోజములు చక్షుఃప్రక్రియ, న్నాఁచు క్రొ
మ్ముడి దంభంబునఁ, జక్రఫేనపటలంబు ల్చన్నులు న్నవ్వుఁగా,
నడరంజేసి నిదాఘభీతి సలిలం బాగామిబీజార్థమై
కడవం బెట్టిన వారిదేవతలు నాఁ గాంతాళి యొప్పు న్ప్రపన్. 57

ప్రపన్ = చలిపందిరులయందు, కాంతా ఆళి = ప్రమదల (ప్రపాపాలికల) సమూహము, - సుడి = ఆవర్తమును, నాభిచ్ఛలనన్ = పొక్కిలియను మిషచేతను, సరోజములు - తామరపువ్వులను, చక్షుఃప్రక్రియన్ = నేత్రములనెడు ప్రకారముచేతను, నాఁచు = శైవాలమును, క్రొమ్ముడి దంభంబునన్ = కొప్పనెడి వ్యాజముచేతను, చక్రఫేనపటలంబుల్ - చక్ర = జక్కవలయొ ('కోక శ్చక్ర శ్చక్రవాకో రథాఙ్గాహ్వయనామకః' అమ.) - ఫేన = నురుగుయొక్కయొ ('డిణ్డీరోఽబ్ధి కఫః ఫేనః' అమ. - లక్షణచే ఎల్లనురుగునకును పేరు.) - పటలంబుల్ = సమూహములను ('ఛది ర్నేత్రరుజోః క్లీబం సమూహే పటలం నవా' అమ.) చన్నులున్ నవ్వున్ కాన్ (చక్రములు చన్నులుగాను ఫేనము నవ్వుగాను అగునట్లుగా అని క్రమము), అడరంజేసి = అమరునట్లు కావించికొని, నిదాఘభీతిన్ = వేసవివలని భయముచేత (వేసవి ఈపూర్వోక్తములను వక్ష్యమాణమయిన సలిలమును సర్వమును రూపుమాపు నను భయముచేత ననుట - సలిలమును రూపుమాపుటచేత ఈచెప్పినవన్నియు రూపుమాయు ననియు - 'నిదాఘో గ్రీష్మకాలే స్యా దుష్ణస్వేదామ్బునో రపి' - అమ.), ఆ...మై - ఆగామి = రాఁగల కాలమున - బీజార్థమై = విత్తనము కొఱకు (లోకమునకు వలయునంత జలమును మరల ధాన్యాదులనుంబోలె వృద్ధిచేసికొని

పడకుండుటకు), కడవన్ = కుండలో; పట్టి = గ్రహించి యుంచుకొన్న ('పెట్టి' పా. వారి దేవతలు = నీ రనెడు దేవతలు (జలాధిష్ఠాన దేవతలు అనియు), నాన్ = అనుకొను నట్లుగా, ఒప్పెన్ = శోభించెను.

ఆవేసవిచే జలములన్నియు ఇగిరిపోవు నని భయపడి జలము లనెడి దేవతలు - వారే జలాధి దేవతలు - పిమ్మట మరల జలసమృద్ధిం గావించుకొనుటకై విత్తనముగా కడవలో కొంతజలము నుంచుకొన్నవారై, సుడులు, సరోజములు, నాఁచు, జక్కవలు, నురుగు ననువిశేషములను తమ దేహములలోనే, నాభులు, కన్నులు, శేవాలము, స్తనములు, హాసము, అను మిషచేత నుంచుకొని ఇట నున్న నిదాఘభీతి యుండ దని ఆచలిపందిరులలో ప్రవేశించినవారో యనునట్లుగా కడవలలో నీ రుంచుకొని యటం గాచియుండు ప్రపాపాలికలు కన్నులపండువులై అధ్వగులకు తాప శాంతి గావించుచుండిరి. - సాపహ్నవోత్ప్రేక్ష.

'ప్రపన్' - అక్కడనైన నిదాఘమును జయింపవచ్చు నని వారిదేవతలు సయితము వాని నాశ్రయించునంత చల్లఁగ నున్నవి. ప్రపాపాలికలను వారిదేవతలకుం బోల్చిన ప్రయోజన మే మనఁగా వా రున్నచోటు చలువలు వెదచల్లుచున్న దనుట. దేవతలకుం బోల్చుటచేత వారు సౌందర్యమున దేవాంగనలవంటి వారనియు, దేవతలు ప్రత్యక్షమై వరములిచ్చి రక్షించినట్లు కరుణాపూరిత చిత్తలై ఆదర పూర్వకముగా జలము లిచ్చి ప్రాణరక్షణము చేయుచున్నారనియు భా. 'నవ్వు' - దయాసూచకము. 'బీజ' - జలములలో శ్రేష్ఠమయిన వనుట. దొరకెడు నీళ్లలో ఉత్తమోత్తమములను సేకరించి రని భావము. 'క్రొమ్ముడి' = 'క్రొత్త + ముడి' అని సీతారామాచార్య ప్రముఖులు. కొన్ని వ్రాతప్రతులలో 'క్రమ్ముడి'యని కానిపించినది. 'క్రుంగు + ముడి' అనియేని మఱియెట్లేని వ్యుత్పాదించి 'క్రమ్ముడి'ని గ్రహింత మన్న, 'క్రొవ్వెద' ను గూడ 'క్రువ్వెద' యని మార్చుకొనవలసి వచ్చును. 'క్రొత్త + వెద (=కొప్పు) = క్రొవ్వెద' అని పూర్వ లాక్షణికుల వివరణము.

సీ. సెగ కుల్కి మఱుఁగుఁ జొచ్చినజహ్నురవిజల
సరణి మల్లెలతోడిజడలు మెఱయ,
వలిచన్నుఁ గొమరు మ్రుచ్చిలిన ది మ్మనుతెఱం
గున ముంచుగరిగ కాఁగుల మునుంగ,
ధారలోఁ దోఁచు కన్దళుకులు వాసితో
త్పలపత్త్రపతనసంభ్రాంతి నొసఁగ,
దెలిమోముపస మెచ్చి తలయూఁచు టెఱిఁగి మా
నక నవ్వు నేర్పు డెందములఁ గరఁపఁ,
తే. దెఱవ లిటు నీరు వోయుపందిరియ చేరి
యువలఁ గొఱగాక పిచ్చుగుం పైయనంగుఁ
దనుపు గొనఁ జొచ్చెఁ గల్లగు ట్టమర వారి
కధ్వగులు లాఁచి యుడువిడియములపేర. 58

1. పొగలన్ = వేఁడికి, ఉల్కి = భయపడి, మఱుఁగుఁ జొచ్చిన = ప్రపాపాలికల చాటునఁ బ్రవేశించిన (వారిని శరణుఁ జొచ్చినట్టి), జహ్నురవిజలసరణిన్ - జహ్ను = జహ్నుమునివలనను, రవి = సూర్యుని వలనను, జల = పుట్టినవైన గంగా యమునలయొక్క, సరణిన్ = మార్గమున (గంగా యమునలా యనునట్లుగా-'గఙ్గా విష్ణుపదీ జహ్నుతనయా సురనిమ్నగా,'- 'కాళిన్దీ సూర్యతనయా యమునా శమనస్వసా,' - అమ.—'సేరాహ శర్కరాశాలి దుగ్ధగఙ్గా సుధాజలమ్' అని శుభ్రగణమందును. 'మషీమద సురావారి యమునా సాఞ్జనాశ్రవః' అని కృష్ణగణమందును శా. క. ల.) మల్లెలతోడి జడలు, మెఱయన్ = ప్రకాశించుచుండఁగా; - ఉత్ప్రేక్ష.

2. వలిచన్నుకొమరు = చల్లని స్తనములయొక్క సౌందర్యమును [చల్లన యెట్లనఁగా: -

'కూపోదకం వటచ్ఛాయా తామ్బూలం తరుణీ స్తనమ్
శీతకాలే భవే దుష్ణ ముష్ణకాలే చ శీతలమ్.'

లేక వలి = వలుద (-అట్లని బ్రౌనుదొరగారు), లేక, వలి=వట్రువ-అని కొందఱు వ్యాఖ్యాతలు.

'వలిజక్కవల పెక్కువలు తక్కువగ నిక్కు। చనుదోయి కొకవింత చాయ దోఁచె.' పారి. ఈ ప్రయోగంబున పెక్కువ లని వేఱయుండుటచేత వలిశబ్దమునకు వట్రువయను నర్థమే సరిపడుచున్నది. నీట నుండుమాత్రాన చలువ ఘటిల్లదు], ముచ్చిలించినది = దొంగిలించినదానిని (ఇట కాఁగుదొంగ), ఇమ్మను తెఱంగునన్ = ఇమ్మని సోదించుచున్నారో యనునట్లుగా, ముంచుగరిగ = అధ్వగులకు జలమిచ్చుటకై కాఁగునీట ప్రపాపాలిక ముంచుచున్నట్టి చిన్నపాత్రము.-(లోకములో 'గరిగ' యని వ్యవహారము, 'గరగ' యని శబ్దరత్నా. బ్రౌనునిఘంటువులో రెండును గలవు.), కాఁగులన్ = పెద్ద బానలయందు, మునుంగన్ = నీళ్లలోనికి దిగుచుండఁగా; (కాఁగు వలిచంటికొమరును దొంగిలి లోపల నెక్కడ దాఁచుకొనియున్నదో యని లోపల గరిగతో శోధించుట.);

3. ధారలోన్ = బాటసారికి పానార్థము పోసెడి నీటిధారలో, తోఁచు = అగపడునట్టి, కన్దళుకులు = ప్రపాపాలికల నేత్రధాళధళ్యములు, వా...తిన్ - వాసిత = వాసనార్థమయిన, ఉత్పలపత్త్ర=కలువతేకులయొక్క, పతన=పడుటయొక్క (ఆకలువతేకులు పడుచున్నవనెడి) - భ్రాంతిన్ = భ్రమను, ఒసఁగన్ = కలిగించుచుండఁగా; - భ్రాంతిమదలంకారము.

4. తెలిమోముపసన్ = (ప్రపాపాలికలయొక్క) ప్రకాశమాన మయిన ముఖముయొక్క కాంతిని, మెచ్చి = (జలమానువాఁడు) మెచ్చుకొని, తల యూఁచుట = మెప్పునకు సూచకముగా శిరఃకంపము సేయఁగా, ఎఱిఁగి=(ఈశిరఃకంపము మెప్పుచేతఁగాని, దప్పితీఱుటచేతఁ గాదు, అని యావనితలు) తెలిసికొన్నవారై, మానక = నీరుపోయుటను నిలుపక, నవ్వునేర్పు = (అతని యానడువడికి ఆస్త్రీలు) హసించునట్టి చాతుర్యము, దెందములన్ = అధ్వగుల హృదయములను, కరఁపన్ = కరఁగునట్లు చేయుచుండఁగా; - సూక్ష్మాలంకారము.

'రూపింపఁగఁ బరహృదయ। జ్ఞాపరసాకూతచేష్ట యగు సూక్ష్మము నాన్
ఆ పద్మనయన నేఁ గనఁ। బాపట రతనమును గప్పెఁ బనివడి కురులన్.' అలం.

తెఱవలు = స్త్రీలు, ఇటు నీరుపోయు, పందిరియ = చలిపందిరినే, అనంగుఁడు = మదనుఁడు, చేరి=ప్రవేశించి, అవలన్=ఇతరస్థలములందు, కొఱగాక=కార్యసాధకుఁడు కా నేరక (కామో

ద్రేకమును కలిగింపనేరక), పిచ్చుగుంటు ఐ=కుంటివారై (చేతఁగానివారై), కల్లగుట్టు అమరన్ = లేని గౌరవము ఒప్పునట్లుగా (లేని యధికారమును చెల్లించుచున్నవారై), వారికిన్=ఆచెలువలకు, అధ్వగులు = ఆబాటసారులు. లాఁచి = కాంక్షించి (ప్రీతితో ననుట. ఇవి బ్రౌనుదొరగారి పాఠతదర్థములు - 'లాసి' యని సీతారామాచార్య పాఠము - 'ఉద్రేకించి' యని తదర్థము - చూ. శ. ర. అనుపు.), ఇడు విడియముల పేరన్=పెట్టునట్టి తాంబూలముల మిషచేత అనుపుగొనఁజొచ్చెన్= 'సుంకము పుచ్చుకో నుపక్రమించెను.' - సాపహ్నవోత్ప్రేక్ష - వాచ్యము లేనందున గమ్య.

గంగా యమునలు ఆవేసవికి ఎండిపోదు మని భీతిల్లి వచ్చి ఆ ప్రపాపాలికలను శరణుఁ జొచ్చినవో యనునట్లు వారి మల్లెలతోడి జడలు ఒప్పుచుండెను; మా వట్రువ కుచముల సౌభాగ్యములు మీరు దొంగిలిన దానిని ఎక్కడ దాఁచినారు తెం డని సోదించునట్లుగా కాఁగులలో గరిగలను ముంచుట ఒప్పుచుండెను; పోయు నీటిధారలో వారి నేత్రముల ధాళధళ్యములు ప్రతిబింబించుచు పరిమళార్థమై ఆనీళ్లలో వైచియున్న కలువల ఱేకు లనెడి భ్రమను గొలుపుచుండెను; ప్రకాశమానము లయిన వారి మోములను జూచి జలమానుచున్న యధ్వగులు తలయూఁపఁగా, ఆ తలయూఁచుట తమవదనసౌందర్యమునకేగాని దప్పి తీఱినందువలనఁ గా దని ఆచెలువ లెంచి, ఆయెఱుకచే నవ్వుచు, నీరుపోఁత మానక పోయుచునే యున్నందులకు అధ్వగుల హృదయము ఆవనితల విషయమై కరఁగుచుండెను.

ఈవిధముగా మదనుఁడు మఱియొటను ఈసమయములో తన ప్రతాపము సాగనందున అసమర్థుఁడై స్త్రీలు నీళ్లుపోసెడి పందిరులలో చేరి తన గౌరవమును కాపాడుకొనుచు, ఆ తెరువరులు ఉద్రేకముతో ఆ యువిదల కిడు తాంబూలముల మిషచేత సుంకము గైకొనుచుండెను.

చ. తోడిఁబడ నమ్మ లక్క లని తూలుచు దీనత దోయి లొగ్గుచున్,
వడ మఱి తేరఁదేర, నలవాక్యము లెన్నక, మోము గుబ్బలున్
గడుకొనుకక్షదీప్తులు నెగాదిగఁ గన్గొనుచిట్టకంపుఁద్రాఁ
గుడుఁ గని సన్నల న్నగిరి క్రోల్పక పాంథుఁ బ్రపాప్రపాలికల్. 59

తోడిఁబడన్=తొట్రుపడునట్లుగా, అమ్మలు అక్కలు అని=అమ్మలారా అక్కలారా అని, తూలుచున్ = నిలువలేక ఊఁగిపడుచు, దీనతన్ = ఆర్తతతో, దోయిలి = (నీళ్లకై) దోసిటిని, ఒగ్గుచున్=ఒడ్డి సమీపమున పట్టుచు, వడ=దప్పి, మఱి తేరఁదేరన్ = క్రమముగా తేరిన కొలంది, అలవాక్యములు = ఆవనితలను అమ్మా అక్కా అని పిలుచుటను, ఎన్నక = లెక్కసేయక (అమ్మను అక్కను సౌందర్య పరీక్ష సేయరాదుగాన ఇట్లుచెప్పుట), మోమున్, గుబ్బలున్ (స్తనములను), గడుకొను = మెండుకొనుచున్నట్టి, కక్షదీప్తులున్ = చంకలకాంతులును, ఎగాదిగన్ (రూ. ఎగదిగన్)=ఎగువకును దిగువకును, కన్గొనుచిట్టకంపుఁ ద్రాగుడున్=చూచుచున్న కపటపుఁ ద్రాగుటను, కని, పాంథున్=ఆతెరువరిని, క్రోల్పక=నీళ్లుగ్రోలింపక, ప్రపాపాలికలు, సన్నలన్నగిరి= ఒకరికొకరు సంజ్ఞలచే వాని వృత్తమును తెలుపుకొని నవ్విరి.

ఒక తెరువరి దప్పిచే తూలితూలి పడుచు లేచుచు వచ్చి 'అమ్మా రవంతనీరు పోయుము, అక్కా రవంతనీరు పోయుము,' అని అతి వినయముతో దోలిసి పట్టెను. వారును నీరు పోయఁగా వాఁడు దప్పితీరినకొలఁది, అమ్మ అక్క అని మున్ను తాఁ జేసిన యాసంబోధనలో, అమ్మ అక్క

అనిన వానిని గణింపక (మఱచి) ఆవానికి విరుద్ధముగా వారి మొగమును గుబ్బలను కక్షదీప్తులను ఎగాదిగఁ గన్గొనం దొడంగి, దప్పితీఱినను దోయిలి తీయక నీళ్లు త్రాగుచున్నట్లు నటించుచు వానినే అట్లే కాంచుచుండెను. ఆకపటమును వా రెఱింగి నీటిధారను చాలసేపు పోయుచునే యుండుటకై సన్నగింపఁజేసి ఒకరొకరికి సన్నలచే తెలుపుకొని నవ్వసాగిరి.— సూక్ష్మాలంకారము.

ఈపద్యము ఈక్రింది శ్లోకములయొక్క ఛాయం బొందియున్నది:—

'య థోర్ధ్వాక్షః పిబ త్యమ్బుః పథికో విరళాఙ్గుళిః
తథా ప్రపాపాలి కాపి ధారాం వితనుతే తనుమ్.'
'అఙ్గుళ్యగ్రనిరోధత స్తనుతరాం ధారా మియం కుర్వతీ
కర్కర్యా న పరం పయో నిపుణికా దాతుం ప్రపాపాలికా
విశ్లిష్టాఙ్గుళినా కరేణ దశనాపీడం శనైః పాన్థ, హే
నిష్పన్దోర్ధ్వవిలోచన స్త్వ మపి హా జానాసి పాతుం పయః.'

'క్రోల్వక' - 'నీటిపోఁతను మాని' అని చెప్పక 'క్రోల్వక' అనుటచే క్రోలుటకు చాలునంత పోయక బొట్టుబొట్టుగా సన్నసన్నగా పోయుచునేయుండి దర్శనసుఖమును దీర్ఘీకరించి రని స్వారస్యము. 'దోయి లొగ్గుచుఁ' - ఇత్వసంధి, 'కొఁగిలది' 'తెలివొందు' ఇత్యాదుల వంటిది. 'క్రోల్వక'—'కొందఱు' అను పా. నీరసము. 'కక్షదీప్తులు సెగా' - పా. 'కక్షదీధితు లెగా'

తే. ఎసఁగు కట్టావిక్రియ నావి రెగయ బగటి
యెండ యుడుకాఱకుండ భూమండలమునఁ
బొలిచె మాపటఁ బండువెన్నెల చకోర
పోతవితతికిఁ జాఁపట్టు వోసినట్లు. 60

ఎసఁగు = రేఁగునట్టి, కట్టావిక్రియన్ = పెనముమీఁద అట్లపిండి పోయఁగా లేచునట్టి పొగవలె, ఆవిరి = నేలనుండి పైకి లేచిపోవుచున్న సూక్ష్మరూపపుఁదేమ, ఎగయన్ = లేచుచుండఁగా, పగటియెండ (వలని) యుడుకు(= వేఁడి), ఆఱకుండు = ఆఱక యున్నట్టి, భూమండలమునన్ = భూవలయముమీఁద, మాపటన్ = రాత్రియందు, పండువెన్నెల = రాత్రియందలి తెఱపివెన్నెల, చకోరపోత వితతికిన్ = వెన్నెలపులుఁగులపిల్లల సమూహమునకు ('పోతః పాకోఽర్భకో డిమ్భః పృథుకః శాబకః' అమ.), చాఁపట్టు = చాఁప అట్టు = వెడల్పయిన దోసెను, పోసినట్లు, పొలిచెను.

రాత్రివేళ ఐ భూమినుండి ఆవిరి లేచుచునే యుండుటయు, ఎండవేఁడి యింకను ఆఱకున్నట్టి భూమండలమం దంతటను తెఱపివెన్నెల పర్వియుండుటయు, నెట్లుండె ననఁగా - కాలుచున్న పెనముమీఁద అట్లపిండి పోసి కట్టావి యెగయుచుండఁగా చకోరశాబకసమూహముకై ఎక్కడివి అక్కడనే తినుటకు అనుకూలముగా విశాలమైన పలుచని యట్టుం గాల్చిపెట్టినట్లుండెను. - వస్తూత్ప్రేక్షాలంకారము.

'ఉడుకాఱకుండు'— ఈవిశేషణము ప్రాయిమీఁద కాలుచున్న పెనముతో సామ్యమునకు. 'మండలమున'—మండలమనుటచే ప్రాయికముగా పెనముల కుండునట్టి గుండ్రఁదనము

లబ్ధము. వెన్నెలపోవుట వెన్నెలవచ్చుట లేదు గావున, ఒకయట్టే చెప్పఁబడినది. 'చాఁపట్టుం' జెప్పుట పోతములకుఁగాన పలుచఁదనమునకు, దళసరిగా నున్న నవి తినలేవు. 'చాఁపట్టు' - పెన మెంత విశాలమో ఇంచుక తక్కువగా అంతవిశాలము గావున, పుడమియంత పెనముమీఁదిది అంత పెద్దదిగావునను, ఎక్కడి చకోరశాబములు అక్కడనే దానిఁ గొఱికి తినవచ్చును.

'ఆవిరెసఁగ' - పా. 'శావిరెసంగ' - ఇత్వసంధి. 'ఉడుకాఱుకుండు' - పా. 'ఉడుకాఱు కుండ.' 'మాపటన్' - 'మాపటి' యని పూర్వముద్రణ పా. మాపటఁగాక పగలు పండువెన్నెల యెక్కడిది? 'మాపటన్' అనుట పగలు ఎండయెంత మెండుగాఁ గాసెనో రాత్రి వెన్నెల అంత దండిగాఁ గాసె నని దీటుం జూపుటకు.

సీ. పవలెల్లదీర్ఘికాంబువుచల్లుపోరాట
 నలసి, మృణాళికాజడము లైన
బాహువు లుత్తమదుకూర్పరముల కెదురుగా
 మలఁచి మూఁపులఁ గరతలము లునిచి,
ప్రాల్మాలి మిగుల నార్వని కన్ను మ్రొమ్ముడిఁ
 దని మొగ్గవిరవాదిదండ విరియ,
ఘ్రాతగంధామోదిశీతల స్తనముల
 వొందఁ గౌఁగిళ్లతో బోరగిల్లి,
తే. నారికేళాసవపుఁదీఁపుటూరు పొలయ,
వలిపెయొంటొల్లెతో నురస్థ్సలులఁ గూర్కు
ప్రియలవేకువఁ దోడ నెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపివెన్నెలబయళ్ల. 61

1. పవలెల్లన్ = పగలంతయు, దీ...టన్ - దీర్ఘికా = డిగ్గియలోని - అంబువు = నీటి యొక్క-చల్లు=ఒండొరులపై నీరుచల్లుట యనెడి - పోరాటన్ = కయ్యమాడుచుండుటచేత, అలసి = బడలి, మృ...లు - మృణాళికా = తామరతూఁటివలె ('అ ధ్వాస్త్రియాం మృణాళం బిసమ్' అని అస్త్రీలింగముగాఁ జెప్పియు అమరుఁడు 'స్త్రీ స్యాత్కాచి న్మృణాళ్యాది వివక్షాపచయే యది' అని అపచయవివక్షయందు స్త్రీత్వమును చెప్పినాఁడు. దానంజేసి గౌరాది జీష్ ప్రత్యయము వచ్చినది. అటుపైని స్వార్థకక ప్రత్యయము వచ్చి 'మృణాళికా' అని రూపము సిద్ధించినది;

'మృణాళికాపేలవ మేవమాదిభి। ర్వ్రతైః స్వ మజ్గం గ్లపయ స్యహర్నిశమ్.'

కుమా. 5 స. 29.) -

జడములు = చల్లనివి ('శీతంగుణే తద్వదర్థాః సుశీమః శిశిరో జడః' అమ.)—'అలసి...జడము' అని లడలకు అభేదప్రాసము;

'పెద్దళాకును దనకు నభేద మగుట। ళళలకు నభేద మట్లన గలుగుకతన
క్షితిని మూఁడవ సరళింబు యతులఁ బ్రాస। ములను లఘ్వలఘులకారమునకు నిలుచు.' అప్ప.

'మృణాళికోజ్జ్వలములైన, అని పూర్వముద్రణ పా.

2. ఐన - బాహువులన్ = ప్రియలభుజములను, తమదు = తమయొక్క (గీతాంతమండలి ధన్యులయొక్క-'యుష్మ దస్మ దాత్మార్థంబుల ఉత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు' బా. వ్యా. సమా. 11—బహువచనమందుం బ్రయోగములు విరళములు)-కూర్పరములన్ = మోఁచేతులకు, ఎదురుగా, మలఁచి = మరల్చి, మూఁపులన్ = బుజములపై (= అంసములపై), కరతలములు = అఱచేతులను, ఉనిచి = ఉంచి;

3. ప్రాల్మాలి = బద్ధకించి, మిగులన్ = ఎక్కువగా, ఆ...డిన్ - ఆర్పని = తడియాఱఁ జేయనట్టి, కమ్మ = పరిమళించుచున్న. క్రొమ్ముడిన్ = కొప్పునందు, తని...డ - తని = సన్నపాటి-మొగ్గవిరవాది=విరజాజి మొగ్గలయొక్క - దండ=సరము, విరియన్=వికసించుచుండఁగా;

4. ధౌ...లు - ధౌత = కడుగఁబడిన, గంధ = పరిమళ ద్రవ్యములు గలవి యయ్యు, ఆమోది = పరిమళించుచున్న, శీతల=చల్లని, స్తనములు, పొందన్ = తగులునట్లుగా, కాఁగిళ్లతో (నే), బోరగిల్లి = ఱొమ్మునఁ బరుండి;

నారికేళ ఆసవపుఁ దీఁపుటూరుపు = టెంకాయ సారాయియొక్క ('మైరేయ మాసవః శీధుః' అమ.) తియ్యని శ్వాసము, ఒలయన్ = కదియుచుండఁగా, వలిప ఒంటి ఒల్లెతోన్ = సన్నని యేకవస్త్రముదాల్చి, ఉరఃస్థలులన్ = ఎదల ప్రదేశములయందు, కూర్కు ప్రియులన్ = నిద్రించు దయితలను, వేకువన్ = వేగుజామున, తోడన్ = తోడం గదలించుటచేత, (పా. తోడ లెచ్చరించి), ఎచ్చరించి=హెచ్చరిక చేసి, తఱపి వెన్నెలబయళ్లన్=దట్టమైన వెన్నెలగల మైదానములయందు, ఎలమిన్=సంతోషముతో, ధన్యులు=కృతార్థులైన విలాసవంతులు, కలసిరి=కూడిరి.

కాంతలు కాంతులతో పగలంతయు వెట్టను చేరనీకుండుటకై, దిగుడు బావులలో ఒండొరులపై నీరుచల్లు పోటీలోఁ గడపి, ఆకారణంబున అలసి అట్లు నీటనే యుండుటచే తామర తూఁడ్లవలె చలువలైన తమ బాహువులను కాంతుల మోఁచేతులకు ఎదురుగా మరలించి, కాంతుల బుజములయందు తమ యఱచేతులనిడి ప్రాలుమాలికచేత చక్కఁగా తడియార్చుకోని కొప్పులో సన్నపాటి విరజాజిమొగ్గలసరము వికసింపఁగా, మేనం దాల్చిన కలపము నీటం గరఁగి పోయినను మనోహర పరిమళము శేషించియున్న చలువ చనుదోయి కాంతుల ఱొమ్మున నంటించి కాఁగిలితోనే బోరగిల్లి, టెంకాయ సారాయిచేత తీఁపులయిన యూర్పులం బుచ్చుచు, సన్నని యొంటివలువ దాల్చినవారై, కాంతుల ఱొమ్ములమీఁదనే నిద్రించుచుండ, వేగుజామున దట్టంపు వెన్నెల మైదానములందు ధన్యులయిన యాకాంతులు ఆజవ్వనులను తమ తోడం గదల్చుటచే నెచ్చరించి కూడిరి. - స్వభావోక్తి.

'పోరాడన్' - పా. 'పోరాడి'; 'అలసి' - పా. 'సొలసి'. - 'ఆర్పని', 'విరియ' - వికసించుటకు ఇంచుక తేమ యుండవలయును. 'విరవాది' ( = నోమాలిఆ) = గ్రీష్మ కుసుమము.

'ఫుల్లంచ ధూళికమ్బం । తేణ ఫుడాచే అ గిమ్మ సిరీ.' 5. [ఫుడాచే అ = లక్ష్మీకృత్యా]

'ఫుల్లచ్చ సుగన్ధచ్చి అ । లయాణ నోమాలిఆ బలే రమ్మా

జాకిర మల్లీ, జా ఇర । జహు, తేమయణ బాణా'. 6. కుమారపాల (4).

దీనికిని మల్లెకుంబోలె సాయంకాలము వికసన సమయము. 'తని' - సన్నఁదనము ఆచెలువల నాగరకతా విశేషముం దెలుపుచున్నది. 'శీతల స్తనములు' - శైత్యము నీట నున్నందుననేగాక, యువతులవిగావునను ఉష్ణకాలమందు చల్లఁగా నుండును. - చూ. ౫౦ వ్యా. 'నారికేళాసవము' -

చలువ. 'ఒంటొల్లె' - వేసవిలో ఎక్కువగా అవికలోనగు వలువలనుదాల్చుట సుఖము గాదు. 'ధన్యులు' - ఇట్టి కాంతల నిట్లు కవయం గల్గుటచేత నే ధన్యులు.

చ. హృదయము లెప్పుడు న్గదియకే తఱచౌ వెడకౌఁగిలింతలున్
గదిరెడు మేలుకార్యములఁ గల్గక మాటలయందె కల్గుపె
న్జదురులు వట్టిశైత్యములుఁ జాల ఘనం బయి మండువేసవిన్
బొదలఁగ నిల్చె దంపతుల పొందు లనార్యులపొందుకైవడిన్. 62

దంపతుల పొందులు=భార్యాభర్తల కూటములు, మండువేసవిన్=కాలుచున్న యీ వేసవి కాలమందు, హృదయములు ఎప్పుడున్ కదియకే = (ఉక్కచేత) ఱొమ్ములు ఒకమాటైనను అంటకయే (బాత్తిగా మనస్సులు కలియకయే - అన్యోన్యానురాగము ఇంచుకేనియు లేకయే - అని అనార్యపరము - 'ఉరస్యపిచ వుక్కాయాం హృదయం మానసేఽపిచ' త్రి. శే.), తఱచు = బహుళము, ఔ = అగునట్టి, వెడకౌఁగిలింతలున్ = వికృతపుఁ బరిరంభములును, కదిరెడు మేలు కార్యములన్ = సంప్రాప్తమయిన మోహపుంబనులయందు (మంచిపనులయందు అని అనార్య పరము), కల్గక=సంభవింపక, మాటలయందె=నుడువులయందు మాత్రమే, కల్గు, పెన్జదురులున్ = మిక్కుటంపు జాతుర్యములును (వాగాడంబరములును అని యనార్యపరము), వట్టిశైత్యములున్ = (కామకేళింగూర్పని వగుటచేత) వ్యర్థముగా (సమకూర్పఁబడిన) చలువలును (క్రియలేని తియ్యఁదనంబులును అని యనార్యపరము), చాలన్ ఘనంబు అయి పొదలఁగన్ = మిక్కిలి ఎక్కువగా వర్ధిల్లుచుండుటంబట్టి, అనార్యుల పొందుకైవడిన్ = దుర్జనుల చెలిమివలె, నిల్చెన్ = ఉండెను.

వేసవియొక్క వేండ్రము రాత్రులందును వ్యాపించి యుండుటచేత, ఱొమ్ములు తగులవే తగులనట్టి వికృతాలింగనములచేతను, మేలుపనిలో లేక మాటలయందు మాత్రమేగల నేర్పులచేతను, వట్టి చలువలచేతను, దంపతులపొందు, మనస్సులు కలియని యాలింగనములును పని సున్న యయిన రచ్చమాటలును కపటానురాగంబులును మెండయిన దుర్జనుల కూటమివలె నుండెను. - ఉపమాలంకారము.

'దంపతులు' - జాయయుం బతియు దంపతులు - ఈద్వంద్వసమాసమందు జాయా శబ్దమునకు దమ్భావము. 'అనార్యులు' శబ్దము పుల్లింగముగా నున్నను స్త్రీలో పురుషులో అవివక్షితము. స్త్రీయును పురుషుఁడు నని వివక్షయేని అనార్యయు అనార్యుఁడును అనార్యులు అని ఏకశేష వృత్తి చేయవలయును. అయర్థమునకన్న సామాన్యముగా మానిసులని గ్రహించుటయే సరసముగా కానిపించుచున్నది.

ఉ. తిలగు కంతువెంబడినె తెమ్మెరలు న్రవిదీప్తికల్కి పా
తాళముఁ బట్టుచుండఁ దమతావులు మ్రుచ్చిలఁ బట్టి యోషధీ
పాలున కప్పగించె ననఁ బై సురభిశ్వసనంబు నించెఁ గాం
తాలసవక్త్రసీమ విటు లార్చు నుశీరపుఁదాళవృంతముల్. 63

విటులు=విటకాండ్రు, కాం...మన్ - కాంతా=ప్రియులయొక్క, అలస=బడలికతోఁ గూడిన, వక్త్రసీమన్ =ముఖప్రదేశమందు ('సీమసీమే ఇమే క్షేత్రే కూలమర్యాదయోరపి, నానా.),

ఆర్చు ఉశీరపుఁ దాళవృంతములు = విసరుచున్న వట్టివేళ్ల విసనకఱ్ఱలు ('స్యాదీరణం వీరతరం మూలేఽస్యోశీర మస్త్రియామ్' - 'వ్యజనం తాలవృంతకమ్' అమ.), ఓలి అగు కంతు వెంబడి చని = అణఁగిన (ఓలి = అడఁకువ) మన్మథుని వెంటనే ('కన్తుః కామ కుసూలయోః' నానా.), తెమ్మెరలున్ = మలయ మారుతములును, రవిదీప్తికిన్ = సూర్యుని తేజమునకు (ఎండ కనుట), అల్కి = వెఱచి, పాతాళముఁ బట్టుచుండఁగన్ = పాతాళలోకమునకు పోవుచుండఁగా, తమ తావులు = ఆయుశీర తాళవృంతములయొక్క పరిమళములను, ముచ్చిలన్ = (తెమ్మెరలు) దొంగిలించినందులకై, పట్టి = (ఆ తెమ్మెరలను) పట్టుకొని, ఓషధీపాలునకున్ = తాము (వట్టివేరులు) ఓషధులుగావున తమ దొరయైన చంద్రునికి ('ఓషధీశో నిశాపతిః' అమ.), అప్పగించె ననన్ = దండింపుమని ఒప్పగించినవో యనునట్లుగా, పైన్ = (అకాంతలముఖము) మీఁద, సురభిశ్వసనంబు = తావిగాలిని, నించెన్ = పొలయించెను.

వేసవిలో మన్మథుఁడు ప్రతాపహీనుఁడై అడఁగఁగా అతనికి తోడయియుండిన మలయ మారుతంబును ఎండలకు వెఱచి పాతాళమునకుం బోవుచుండఁగా, విటులు కాంతయొక్క యల సిన సెమ్మోమునందు వీచుచున్న వట్టివేళ్ల వీవనలు తమ పరిమళముతోడి వాయువును కాంతా ముఖమందు నిండించుట ఎట్లుండె ననఁగా - వట్టివేళ్లు ఓషధులుగావునను, కాంతాముఖము చంద్రుఁడు గావునను, మలయమారుతము గంధవాహ మగుటచే తమపరిమళములను దొంగిలించినదిగావునను, దొంగిలించి పాఱిపోవుచున్న యాదొంగను దొంగిలించిన యాసొత్తుతోఁగూడ పట్టితెచ్చి తమ యేలికకు అప్పగించుచున్నవా యనునట్లు ఉండెను. - ఉత్ప్రేక్ష.

'కంతు వెంబడి చని' పోవుట అతనితో డగుటచేత.

'ఉపవనతరు నృత్యాధ్యాపనే లబ్ధవర్ణో । విరచిత జలకేళిః పద్మినీ కామినీభిః
ప్రియసుహృదసమేషో రాయయా యోగియోగ । స్థితివిదళనదక్షో దక్షిణో గన్ధవాహః.'

'మలయశిఖరాదా కైలాసం మనోభవశాసనా
ద్భువనవలయం జేతుంవాఞ్ఛన్ వసన్తసమీరణః
విహితవసతిం కైలాసాగ్రే భుజఙ్గధరం హరం
మనసి విమృశన్ భీతః శఙ్కే ప్రయాతి శనైః శనైః.'

'పాతాళముం బట్టుట' - అచట రవిదీప్తి యుండదుగాన. 'ఓషధీపాలునకున్' - 'విధుః సుధాంశుః శుభ్రాంశు రోషధీశో నిశాపతిః' అమ. 'అప్పగించె' - పా. 'ఒప్పగించె.' - 'ఆర్చు' - 'ఆడు' నకు ప్రే. 'తాళవృంతముల్' - ఉశీర నిర్మితంబయినను తాళవృంతమనుట రూఢిచేత, రూఢికిం గారణము ఆదిలో విసనకఱ్ఱలను తాటితోడిమతో చేయుచుండినందున. 'ఖం వీజ్యతే మణిమయై రివ తాళవృన్తైః.' మృచ్ఛకటి.

చ. సమసి కథావశిష్టమగు చందనశైలసమీరణంబుఁ గృ
త్రిమగతి నింద్రజాలమునఁ దేఁ దొడఁగెన్ భువిఁ దాలవృంతజా
లము; లది మాయ యౌటకుఁ దలంప దదీయమయూరపింఛికా
భ్రమణమె సాక్షిగాదె, నగరంబున నట్టికడింది వేసవిన్. 64

నగరంబునన్ = మధురాపురములో, అట్టి, కడిందివేసవిన్ = బెట్టిదమయిన వేసవికాలమునందు, సమసి = చచ్చి, కథా అవశిష్ట = కథలందుమాత్రమే మిగిలియున్నట్టిది, అగు, చందనశైల సమీరణంబున్ = మలయ మారుతమును ('మలయః శ్చన్దనాచలః' అమ.) తాలవృంత జాలములు = విసనకఱ్ఱల సమూహములు ('వ్యజనం తాలవృన్తకమ్'-'జాలం సమూహ ఆనాయో గవాక్షక్షారకా వపి' అమ.), భువిన్ = భూమిలో, ఇంద్రజాలమునన్ = కనుకట్టు విద్యచేత, కృత్రిమగతిన్ = కపట ప్రకారముచేతను, తేన్ తొడఁగెన్ = తెచ్చుటకు ఆరంభించెను; అది = అట్లు మలయానిలమును తెచ్చుట, మాయ పౌటకున్ = శాంబరి యయినందులకు ('స్యాన్మాయా శాంబరీ' అమ., 'ద్వే ఇన్ద్రజాలాదిమాయాయాః' రామాశ్రమి), తలంపన్ = ఆలోచించి చూడఁగా, తదీ...మె - తదీయ = ఆతాళవృంతములదైన, మయూరపింఛికా = నెమలిపురుల యొక్క, భ్రమణమె = తిరుగుటయే, సాక్షిగాదె = తార్కాణగదా.

ఆపట్టణమునందు ఆవేసవిచేత మలయమారుతము స్వరూప నాశము బొందినది. అంతట దానిని కపటముగా కనుకట్టువిద్యచేత భువిలో విసనకఱ్ఱలు తేఁదొడంగినవి. ఆతెచ్చుట మాయ యనుటకు ఆవిసనకఱ్ఱలు ఆడించెడు నెమలిపురి తార్కాణము గదా.

'సమసి' - ఇదియే 'కథావశిష్ట' మగుటకుం గారణము. దానికథయైనను లేనియెడల దానిం దెప్పించు యత్నముండదు, 'ఇంద్రజాలమునన్' - తత్స్వరూప మెట్టిదన:

'అదేశకాలా పరోక్ష్యం పరోక్షస్యైవ వస్తునః
య త్త్రౌషధాదిభిః సోఽయ మైన్ద్రజాలవిధిః స్మృతః.'

'భువిన్' - భూలోకమం దెక్కడను చందనశైల మారుతము లేకపోవుటయు, ఉండెనా ఈ కనుకట్టు విద్యచేతనే వచ్చుటయు భా. 'తాళవృంతజాలములు' - విసనకఱ్ఱలను నెమలిపురుల తోనుం జేయుదురు. 'మయూర పింఛికాభ్రమణమె సాక్షి' - ఇంద్రజాలమునకు నెమలిపురి యొక సాధనము :—

'ఆభాతి యత్కృతి రనేక విధప్రపఞ్చ । వ్యాజేన్ద్రజాల విధిసాధక పిఞ్ఛికేవ' - భో. చం,
'పఞ్చసాయక మహేన్ద్రజాలినా । పాణిపద్మ సముదఞ్చితా స్వయమ్
బద్ధనాయ మనసః ప్రగల్భతే । పిఞ్ఛికేవ మమ చఞ్చలేక్షణా.' మల్లిక. 1 అం.
'...బర్హిపిఞ్ఛేన సంస్పృశ్యో ల్లోలయేత్తు మహోఽనిలే.' ఇంద్రజాలశాస్త్రము.

'విద్యేశ్వరుఁడు (ఐంద్రజాలికుఁడు)...వాద్యములు మ్రోఁగుచుండఁగా...పాటకత్తియలు పాటరక్తిచే సామాజిక చిత్తవృత్తులను రంజించుచుండఁగా. నెమలికుంచె యాడించి పరివారముతోడి మహారాజును మోహపెట్టుచు-' దశకుమారచరిత్ర. 5. ఉ. అది చూచువారి మనస్సును కట్టునని ఇంద్రజాలమంత్రఖండమం దున్నది. 'కథావశిష్టము' - పా. 'కళావశిష్టము.'

తే. అట్టివేసవి బెడిదంపు వెట్టకలన
హస్తము నెమర్చి సారెకు లస్తకంబు
దుసికిలఁగఁ గాదె సవరింప వసము గాక
పుష్పబాణునిచెఱకువి ల్పుడమిఁ బడియె? 65

అట్టి, వేసవిన్ = గ్రీష్మమందు, వెడిదంపు వెట్టకతనన్ = కఠోరమయిన వేఁడిచేత, హస్తము = (మదనుని) చేయి, చెమర్చి = చెమట పట్టినందున, సారెకున్ = మాటిమాటికిని, లస్తకంబు = వింటిపిడికట్టు ('లస్తకస్తు ధనుర్మధ్యమ్' అమ.), దుసికిలఁగన్ గాదె = (అతని పిడికిటి నుండి) జాఱిపోయి నందుననే, సవరింపన్ = చేతనిలుచునట్లు చేసికొనుటకు, వసము = శక్యము, గాక = కానందున, పుష్పబాణుని = పూవుటమ్ములవాని (=మన్మథుని) - చెఱకువిల్లు, పుడమిఁబడియెన్ = నేలఁబడిపోయెను. (నిష్ప్రయోజన మాయెననుట).

ఆ వేసవి వెట్టకు మదనుని చేయి చెమర్చుచుండినందువలన చెఱకువింటి పిడికట్టు చేతినుండి జాఱిపోయినందున చెఱకువిల్లు నేలం గూలిపోయెను. - అది చెఱకు నఱకుడుకాలము గాన నట్లు వర్ణించుట. - హేతూత్ప్రేక్ష.

మ. 'తరుణు ల్దల్లియొఱ న్గుచంబు లునుపం దచ్ఛైత్యము ల్దీములై
పెర రేఁపం జనుదెంచెఁగాక ! రవిదీప్తిం గ్రుంగి పాతాళగ
హ్వరముల్ దూఱినవారి కీయనుకఁ ద్రాళ్లా తెచ్చు?' నా దీర్ఘత
చ్చిరకృష్టిం గనునీటిశైత్య మలరించె న్నూతులం దత్తఱిన్. 66

ఆత్తఱిన్ = ఆ (వేసవి) కాలమందు, నూతులందున్ = బావులలో, తరుణుల్ = జవ్వనులు, తల్లియొఱన్ = పైయొఱమీఁద, కుచంబులు = స్తనములను, ఉనుపన్ = ఉంచినంతట, తచ్ఛైత్యముల్ = ఆ స్తనములయొక్క చలువలు (చూ. ౫౮ వ్యా.), దీములు = ఆకర్షకములు(పక్షిమృగాదుల నాకర్షించుటకు వేఁటకాఁడు పెంచియుంచుకొను తత్తజ్జాతి పక్షిమృగాదులు.), ఐ, పెరరేఁపన్ = ప్రేరింపఁగా (ఆకర్షింపఁగా), చనుదెంచెఁగాక = వచ్చినవిగాని, రవిదీప్తిన్ = సూర్యుని దీధతిక (ఎండకు), క్రుంగి = అణఁగిపోయి, పాతాళగహ్వరముల్ = పాతాళలోకగుహాలందు ('గుహాదమ్భౌ గహ్వరే ద్వే' అమ.), దూఱినవారిన్ = చొచ్చియున్న జలమును ('ఆపః స్త్రీ భూమ్ని వా ర్వారి సలిలం కమలం జలమ్' అమ. - చొచ్చియున్నట్టి జనులను అని యర్థాంతరము), ఈయనుకఁ ద్రాళ్లా తెచ్చున్ = ముడులువైచిన యీ త్రాటిత్రుంపులు తేఁగలవా, నాన్ = అనునట్లుగా, ద...ష్టిన్ - దీర్ఘ = నిడుదలైన - తత్ = ఆ చేఁదత్రాళ్లయొక్క - చిర = చాలసేపయిన - కృష్టిన్ = లాగుటచేత, కను...ము - కను = ప్రాప్తమగునట్టి (కంటఁజూడనబ్బునట్టి), నీటి = నీళ్లయొక్క - శైత్యము; అలరించెన్ = సంతోషపెట్టెను.

ఆ వేసవియందు బావులలో జలము మిక్కిలి లోఁతునకుం బోయియుండెను; మిక్కిలి నిడివియైన త్రాటితో చాలసేపు చేఁదినం బయికి వచ్చుచుండెనేగాని, త్వరగా రాకుండెను; అదియెట్లుండెననఁగా—సూర్యతేజమునకు భయపడి పాతాళముం బట్టియున్న యాజలశైత్యము, పిట్టను దీమయిన పిట్ట ఆకర్షించినట్లు యువతులు తల్లియొఱపై నుంచిన కుచముల శైత్యములు ఆకర్షింపగా పయికి వచ్చినవేగాని, ఆయుదుకుల చేఁదత్రాళ్లతో చేఁదుటచేతఁ గాదు అనునట్లుండెను. అట్టి యాజలశైత్యము లోకులకు హర్షము నొసంగెను. - హేతూత్ప్రేక్ష.

'తరుణులు' - ఇతరల కుచములందు కాలభేదముంబట్టి ఉష్ణశీతభేద ముండదు; కావుననే, 'తరుణీకుచా' అన్నాఁడు. తరుణులు వేఁటకాని వంటివారు. కుచశైత్యము దీము. శైత్యము దీముగాన శైత్యమునే ఆకర్షించినది. 'పాతాళ...'-కావుననే త్రాడు నిడుద, కావుననే 'తచ్చిర

కృష్టి'. అటం దూఱుట అటవు సూర్యుఁడు పోలేఁడు గావున. 'వారిఁ' - పా. 'వాని', పా. 'దాని.' - వైరికి భయపడి వలసపోయినవారు సులువుగా మరలరామి ప్రసిద్ధము.

మ. స్వనిదానోగ్ర నిదాఘవైఖరినె యూష్మన్మల్లికల్ కామినీ
కనదానీలకచాగ్రపంక్తి నెఱియల్గాఁ బాపఁగాఁ, బాటల
ల్ఘనంత దేనియసోనఁ గూర్చె; నది యౌఁగా; నాభియు న్నిర్విషం
బును దోఁబుట్టువులయ్యు వేర్పడ గుణంబుల్ చూపఁగాఁ జూడమే? 67

స్వ...నె - స్వ = తమవు-నిదాన = ఆదికారణమయిన ('నిదానం త్వాదికారణే' అమ.) - ఉగ్ర = భయంకరమైన - నిదాఘవైఖరినె = వేసవివలెనే, మల్లికల్ = మల్లెలు, ఊష్మన్ = వేఁడిచేత ('గ్రీష్మోష్మబాష్ప ఊష్మాణః' నానా), కా...క్తిన్ - కామినీ = ప్రమదలయొక్క - కనత్ = ప్రకాశించుచున్న - ఆనీల = అంతటను నల్లనైన - కచ అగ్రపంక్తిన్ = తలవెండ్రుకల తుదల వరుసను (''వస్త్రలా మూర్ధజాస్త్వస్రా శ్చికురా శ్చిహురాః కచాః' ఇతి దుర్గః.'' రామాశ్రమి.), నెఱియల్గాన్ = చీలికలుగా, పాపఁగాన్ = విడఁదీయఁగా, పాటలల్ = కలిగొట్టుపువ్వులు ('పుష్పేక్లీబేఽపి పాటలా' అమ.). ఘనతన్ = దట్టముగా (అధికతచేత - అనఁగా ఔదార్యముచేత ననియు—

'కతివాధిక సాన్ద్రేషు వాద్యమధ్యమనృత్తయోః
ముస్తాముద్గర మూర్తేషు త్రిషుమేఘే పుమాన్ ఘనః.' నానా.),

తేనియసోనన్=మకరంద వర్షముచేత, కూర్చెన్=ఆకచాగ్రములను మరల కలియఁజేసెను; అది= అట్లు కలుపుట, ఔఁగా = సరియేకదా, నాభియున్ = విషమును ('నామైకదేశగ్రహణే నామగ్రహణ' మ్మను న్యాయంబున, నాభియే వత్సనాభి), నిర్విషంబును = అమృతంబును, తోఁబుట్టువు లయ్యున్ = సాగరోత్పన్నము లగుటచేత అన్నదమ్ము లయ్యును, వేర్పడన్ = భేదపడునట్లు, గుణంబుల్ = ఒకటి చంపెడు గుణమును రెండవది ప్రాణమిచ్చుగుణమును, చూపవే = చూపుచున్నవి గదా.

గ్రీష్మఋతువులో ఉవిదలు మల్లెలను పాటలములను కొప్పులోఁ దాల్తురు. అందు మల్లెలు తమ కారణమైన గ్రీష్మమెట్లు సర్వమును నెఱియలు పాపుచున్నదో అట్లే తాము తమ యూష్మముచేత ప్రమదల తలవెండ్రుకల యగ్రములను చీల్పం దొడంగుడు, ఉదారచిత్తము గలవైన పాటలలు తామును గ్రీష్మకారణములే అయ్యును, గొప్ప మనస్సు గలవై తమ మకరంద వర్షముచేత ఆచీలికలను మరల కూర్చినవి. ఇది సరియే. తోఁబుట్టువుల కిట్లు విరుద్ధగుణము లుండునా యనిన, ఉండును, సాగరోత్పన్నము లగుటచేత తోఁబుట్టువు లయిన కాలకూటామృతములయందు విరుద్ధగుణములు ప్రసిద్ధములేగదా.

ఇట మల్లీపాటలల విరుద్ధగుణము లనెడి విశేషమునకు తోఁబుట్టువుల విరుద్ధగుణము లనెడి సామాన్య ముపన్యస్తమై, ఆసామాన్యమునకు ఉదాహరణముగా వెండియు కాలకూటామృత విరుద్ధగుణము లనెడి విశేష ముపన్యస్తము గావున వికస్వరాలంకారము.

'నిదాన' - ఋత్వ్యుదకాది కారణము లెన్నియున్నను గ్రీష్మము వచ్చిననేగాని పుష్పింప వందున అది ఆదికారణము.

శా. తారుణ్యాతిగ చూత నూత్న ఫలయుక్తైలాభిఘార స్వన
ద్ధారా ధూపిత శుష్యదంబుహృత మాత్స్యచ్ఛేద పాకోద్గతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతర వాలుకా స్థిత హిమాంత ర్నారికేళాంబువుల్. 68

భోగులకున్ = భోగవంతు లయిన స్త్రీ పురుషులకు (ఏకశేషవృత్తి), సంధ్యావేళలన్ = సాయంకాలములందు, తా...రు-తారుణ్య = (పిందె, కాయ, దోరపండు, పండు, అను నాలుగు దశలలో) కాయదశను - అతిగ = దాటుచున్న (దోరపండు దశలో నున్నట్టి) - చూత=మామిడులయొక్క - నూత్న = క్రొత్తవైన (అనగా అప్పుడు కోసిన) - ఫల=కాయలతో - యుక్ = కూడుకొన్న - తైల అభిఘార = నూనెపోతయొక్క - స్వనత్ ధారా = శబ్దించుచున్న ధార చేత - ధూపిత = తిరుగబోత వేయబడిన - శుష్యత్ = ఇగురుచున్న, అంబు = నీళ్లుగలవై - హృత = (బాణలినుండి) తేబడిన - మాత్స్యచ్ఛేద = చేపతునుకలయొక్క - పాక = పరిణామము చేత (జీర్ణమగుచుండుట చేత) - ఉద్గత= వెలువడిన-ఉద్గారంపు = త్రేన్పులయొక్క - కనరు = ఒగరును, కేళి...వుల్ - కేళికాంతార = క్రీడావనముయొక్క - అభ్యంతర = మధ్యప్రదేశము లందు ('అభ్యంతరం త్వన్తరాళమ్' అమ.) - వాలుకా = ఇసుకయందు - స్థిత = ఉన్నట్టి (ఉంపబడినట్టి) - హిమ = చల్లని - అంతర్నారికేళ = టెంకాయలోపలి - అంబువుల్ = నీళ్లు, అర్చున్ = పోగొట్టును.

ఆవేసవియందు భోగులు మధ్యాహ్నమున దోరమామిడికాయలముక్కలతో చుయ్యని శబ్దాయమానమైన నూనెపోత తాలింపువైచి నీటితడి యిగురగానే తీసిన చేపబద్దల యిగురతో భుజించిరి. సాయంకాలమున ఆభోజనము జీర్ణమగునప్పుడు ఆచేప బద్దల కనరుత్రేన్పులు వచ్చుచుండినవి. అవి, చలువగొల్పుటకై యిసుకలో పెట్టియుండి అప్పుడుపగిల్చిన టెంకాయల లోని చల్లనినీళ్లను త్రాగుటచేత శాంతించినవి. - స్వభావోక్తి.

'తారుణ్యాతిగ' - 'అతిగ' దాటుట రుచ్యతిశయమునకు; 'పండినదేని ఇగురు కూరకు పనికిరాదు; కలసి ముద్దయై పోవును, బద్దబద్దగా భుజించుటకు వలనుపడదు. 'నూత్న'-అప్పుడు కోసిన - నవక మెదలని; 'అంబు' - మత్స్యఖండములలోనిది. 'వాలుకా' - ఇసుకలో నుంచుట చెట్టుకొన నెండలో నున్నం గలుగు వేడి తగ్గుటకు.

క. గ్రామగ్రామంబున నొక । సామంతునకిడినచలువ చప్పరములు త
న్వైప్ర మేదినిఁ గుంపటిలోఁ । దామరలుంబోలె నట్టితఱి నొప్పారెన్. 69

అట్టితఱిన్ = ఆకఠోరగ్రీష్మసమయమందు, గ్రామగ్రామంబునన్ = ప్రతియూరను, ఒక సామంతునకున్ = ఒకదొరకై, ఇడిన చలువ చప్పరములు = వైచిన చల్లని పందిళ్లు, మేదినిన్ = భూమియందు, తన్వైప్ర=తనువు ప్ర=సంతుష్టికరము లై, కుంపటిలోన్, తామరలుం బోలెన్, ఒప్పారెన్, - లోకమంతయు కుంపటివలె మండుచుండ, ఆ చప్పరములు తామరల వలె చలువలు వెదచల్లుచుండిన వనుట - అభూతోపమాలంకారమని యొకమతము, ఉత్ప్రేక్షయే యని మఱియొక మతము.

గ్రామంబునన్ గ్రామంబునన్ = గ్రామ గ్రామంబునన్ - ఆమ్రేడితము పరమైనందున విభక్తిలోపము. చూ. బా. వ్యా. సం. 40. ప్రతిగ్రామంబునను నొక సామంతుఁ డుండునా యనిన, ప్రతిదానియందును లేకున్నను పెక్కుగ్రామములం దుండు ననుట, ఏలయన కతిపయ గ్రామపతి సామంతుఁ డనంబడును. 'సామన్తసంభావనయైవ' - రఘు. 5. 28. 'సామన్తః కతిపయ గ్రామపతిః.' అని హేమాద్రివ్యా. 'సామన్తశిఖామణీనామ్' - రఘు. 6, 33. 'ద్విత్రిగ్రామాధీశః సామన్తః.' హేమాద్రివ్యా. 'ఇడిన' అనుట అతని గ్రామములలోనివారు అతనికై సామానుతెచ్చి పందిళ్లు వైచి రని భా. 'తన్పు' - తర్పై అని పూర్వముద్రణ పా. తఱచనుట 'గ్రామ గ్రామంబున' నను ద్విర్భావముచే గతార్థము.

'కలిగొట్లు ప్రాకు వేడ్కలె నీకుఁ దఱచెదను।
నలినాక్షి కడిమిగండమునకే వెఱచెదను.' మను. రగడ.

అను ప్రయోగమువలన 'తఱచు' అని అకార మధ్యముగానే యుండవలయు ననియు, కొందఱు 'తఱుచు' అని ఉకారమధ్యముగా వ్యవహరించిరిగాని అందులకుం బ్రమాణము కానరా దనియు శబ్దరత్నా. ఎటయినను అకారలోపముచేఁగాని ఉకారలోపముచేఁగాని సంయోగమందు తాకు రా రాఁగా 'తర్చు' అయినది; కాని యిట్లు అకారలోపము విరళము. 'కుంపటిలోఁ దామరలుం బోలె' - కుంపటిలో తామరలుండి, కుంపటి మండుచునేయుండి, తామర శీతలముగా యథాప్రకారమే ఉండిన ఆయునికి యెట్లుండునో మండుచున్న ధూమండలములో చల్లని యాచప్పరము లుండుట అట్టిదిగా నుండెను. 'కుంపటిలోఁ దామరలుంబోలె' అను నీసాటి కవిప్రియము:- పీఠికం జూచునది. మఱియు, బసవపురాణము. 5 (101).

'వినఁగఁ గల్గునె వెలివాడ వేదఘోష? । వసుధ జీమూత గుమ్మరావమునఁ గలదె?
అలరియుండునె కుంపటి నంబుజంబు? । గతవివేకుండ నాయందుఁ గలదె గుణము?'

తే. తోఁటఁ బగ లుండి, మల్లెలు దుఱిమి, కావు
లమర మాపైన నిక్షుయంత్రముల కొయ్యఁ
జేరుప్రజ వాల్చె భావివృష్టికిని గ్రుడ్లఁ
దో మధురిమేచ్ఛ డిగునెఱ్ఱచీమ లనఁగ. 70

తోఁటన్ = తోఁటలో, పగలు = పగటివేళ, ఉండి, మల్లెలు = మల్లెపువ్వులను, దుఱిమి = చెరవుకొని, కావులు = తాము దాల్చియున్న కావివస్త్రములు, అమరన్ = ఒప్పుచుండఁగా, మాపు పైనన్ = రాత్రి రాఁగానే, ఇక్షుయంత్రములకున్ = చెఱకు గానుఁగలకడకు, ఒయ్యన్ = వరుసగా, చేరుప్రజ = మూఁగుచున్న జనులు, భావివృష్టికిన్ = రాఁగల వర్షమునకు భయపడి, గ్రుడ్లతోన్ = గ్రుడ్లను మోచుకొని, మధురిమ ఇచ్ఛన్ = తీఁపునందలి కోరికచేత, డిగు = వచ్చుచున్నట్టి, ఎఱ్ఱచీమలు, అనఁగన్ = అనునట్లుగా, పొలిచెన్ = ఒప్పెను.

పగలంతయు చలువకై తోఁటలోనే కడపి, మల్లెలు శిరంబులం దాల్చి, కావివలువలతో చెఱకుగానుఁగలకడకు వరుసగా చేరుజనులు, రాఁబోవువానకు సూచకముగా గ్రుడ్లు మోచుచు మాధుర్యకాంక్షచేత ఆగానుఁగల కడకుంజేరుచున్న యెఱ్ఱచీమ లనునట్లు ఒప్పిరి. - ఉత్ప్రేక్షాలంకారము.

'పగలు' - 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమయగు.' బా. వ్యా. కా. 25. - 'మల్లెలం' దుఱుముట అవి గ్రీష్మములను తోఁటలో సులభములును భోగ్యములు నగుటచేత. *'కావులు' దాల్చుట చలువకై - 'హిమాంబుపూరంబులం గర్పూర పటీర కర్దమాసారంబులం జెంగావుల మృణాళభంగంబుల సంగంబులకుం జలువఁబుట్టింప' - మను 3 ఆ. 52. 'కావుల మర' పా. కావునిమిత్తమై అని తద్వ్యాఖ్య. 'మాపైనన్' - రాత్రి తరులనీడలందు శయనింపరాదు గావున 'ఇక్షుయంత్రములకున్' - చెఱకుపాలను త్రాగుటకు. 'భావివృష్టికిన్' - చీమలు గ్రుడ్డుమోచుట వెంటనే వాన వచ్చు నని సూచించును.—

'వినోపఘాతేన పిపీలికానా మణ్డోపసంక్రాన్తి రహివ్యవాయః
ద్రుమాధరోహా శ్చ భుజఙ్గమానాం వృష్టే ర్నిమిత్తాని గవాం ప్లుతం చ.' బృ. సం.

'డిగు' - ఉన్నచోట వర్షమువలన గ్రుడ్లకు ఉపద్రవము కలుగు నని వెఱచి వానిని చీమలు పదిలమైన మఱియొక తావునకుం గొనిపోవుట.- ప్రజను గ్రుడ్డుమోచెడు చీమలనుగా సంభావించుటచేత వారియవస్థ చూచినను వాన వచ్చు ననియే యూహ్య మని భా.—

'తదహని కురుతేఽమ్బు స్తోయకాలే వివస్వాన్
ప్రతిపతి యది వోచ్చైః ఖం గతోఽతీవ తీక్ష్ణః.' బృ. సం.

రవితీక్ష్ణతచేత నా వారు దినమెల్లను ఇండ్లయం దుండలేక తోఁటలం దుండుట. మల్లెలు తెల్లని గ్రుడ్లవంటివి. కావులు దాల్చినందున వారు ఎఱ్ఱచీమలవంటివారు అని భా.

—* పరదేశ విప్రుఁడు *—

క. అప్పెనువేసవి విభవము । విప్పుగఁ దన్నగరనికటవృషగిరి హరికిం
దెప్పతిరుణాళ్లఁ రా ముద । మొప న్బరదేశవిప్రుఁ డొక్కఁడు భక్తిన్. 71

అప్పెను వేసవిన్ = ఆమండువేసంగియందు, విభవము - విప్పుగన్ = విస్తారముగా (మహా విభవముతో ననుట), తత్ నగర నికట వృషగిరి హరికిన్ = ఆపట్టణమునకు (మధురకు) సమీపమందలి అళఘరిసుందరబాహుస్వామికి, తెప్పతిరునాళ్లు = ప్లవోత్సవము, రాన్ = రాఁగా, భక్తిన్ = భక్తిచేత, ముదము ఒప్పన్ = సంతసము మీఱ, పరదేశి విప్రుఁడు = వైదేశికుఁడైన బ్రాహ్మణుఁడు ఒక్కఁడు, (ముందటి కన్వయము.)

క. సేవించి పోవుతఱి మధు । రావిభవముఁ జూడ వచ్చి శ్రాంతిమెయిన్ మా
పా వైఘసీటఁ గృతసం । ధ్యావిధి యై నృపపురోహితావాసమునన్. 72

సేవించి = సుందరబాహుస్వామిని కొలిచి, పోవుతఱిన్ = మరల తన దేశమున కేఁగు నప్పుడు, శ్రాంతిమెయిన్ = బడలికచేత, మాపు = రాత్రియందు, ఆవైఘసీటన్ = ప్రసిద్ధమైన వైఘానదినీళ్లతో, కృతసంధ్యావిధి ఐ = చేయఁబడిన సంధ్యాకర్మగలవాఁడై (సాంధ్యానుష్ఠానము గావించికొని), నృపపురోహిత ఆవాసమునన్ = జేని పౌరోహితుని యింటియందు (ముందటి కన్వయము).—

సీ. పరిపక్వసురభిరంభాఫలంబులతోడ,
దళమెక్కు పనసపెందొలలతోడ,

*చూ. పారి. 'సన్నఁగావు లీవెంమను మానలేవు.' ౧-౧౧౫.

ఘృతపిండనిభ కర్కరీఖండములతోడఁ,
బలుదెఱంగుల మావిపండ్లతోడ,
గోస్తనీమృదుగుళుచ్ఛస్తోమములతోడఁ,
గప్పులేఱిన వడప్రప్పుతోడ,
సుమధురస్థూలదాడిమబీజములతోడ,
దనుపారు రసదాడిగనెలతోడఁ,
తే. పానకం బతిథుల కిడ్డఁ, దానుఁ గ్రోలి,
యర్చనాదత్త చందన చర్చఁ దేలి,
విరులు సిగఁ దాల్చి కర్పూరవీటిఁ జౌరు
గొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టుగాయ. 73

1. ప...డన్ - పరిపక్వ = చక్కఁగా పండిన, సురభి రంభా ఫలంబులతోడన్ = సుగంధ యరఁటి పండ్లతోను ('రమ్భా కదళ్యప్సరసోః' మేది.), ద...డన్ - దళితమెక్క = లావైన (తొనలకు విశేషణము) - పనస పెందొలలతోడన్ = పెద్దపెద్ద పనసతొనలతోను;

2. ఘృ...డన్ - ఘృతపిండనిభ = (పేరిన) నేతిముద్దలవంటి (కోసిపెట్టిన గడ్డనేతి ముక్కలో యనునట్లున్న యనుట) - కర్కరీ ఖండములతోడన్ = తెల్ల చెఱకుముక్కలతోను పలుదెఱంగుల= (*పీతర్, దిల్ఖుసంద్, దాడీఫసంద్, అంటుమామిడి లోనగు) పెక్కుజాతుల...; [కర్కరీ×కర్కటీ-చూ. పీఠిక. పట్టిక.]

3. గో...డన్ - గోస్తనీ = ద్రాక్షయొక్క, మృదు = మెత్తనయియున్న - గుళుచ్ఛ= గుత్తులయొక్క - స్తోమములతోడన్ = సమూహములతోను ('మృద్వీకా గోస్తనీ ద్రాక్షా' అమ.) క...డన్ - కప్పులు = నల్లనివానిని (గింజలు పొట్టు లోనగువానిని), ఏఱిన = ఎత్తితీసివైచినట్టి, వడప్రప్పుతోడన్ = వడను అనఁగా తాపమును పోఁగొట్టునట్టి నానఁబెట్టిన పెసర ప్రప్పుతోను;

4. సు...డన్ - సు మధుర = లెస్సగా తీయనైన, స్థూల = లావుపాటి - దాడిమబీజముల తోడన్ = దానిమ్మగింజలతోను, తనుపు ఆరు = చల్లనైన - రసదాడి = ఆ పేరుగల యరఁటిపండ్ల యొక్క - గనెలతోడన్=ఖండములతోను, అతిథులకున్-ఆగంతుకులకు ('స్యు రావేశిక ఆగన్తు రతిథిర్నా గృహాగతే' అమ.), పానకము, ఇడ్డన్=ఇయ్యఁగా, తానున్ గ్రోలి = తాను ద్రాగి, అ...ర్చన్ - అర్చనా = పూజార్థము - దత్త = ఈఁబడిన - చందనచర్చన్ = మంచి గంధంపు మైపూఁతయందు, తేలి = మునిఁగిలేచి (నిండుగా చందనమలందుకొని), విరుల = పూవులను, సిగన్ = జుట్టునకు, తాల్చి = ధరించి, కర్పూరవీటిన్ = పచ్చకప్పురముతోడి విడెమును, చౌరు కొట్టుచున్ = నములుచు, వెన్నెల, బిట్టు = మిక్కిలిగా, కాయన్ = ప్రకాశించుచుండఁగా, ద్విజుండు = ఆ బ్రాహ్మణుఁడు (ముందఱి కన్వయము).

'సురభిరంభ' - సుగంధయరఁటియని యర్థము వ్రాయుటకుఁ గారణము నాలవపాదమున 'రసదాడిం' జెప్పుట. 'దలము' - సుభోజ్యమును సుపుష్టికరమును అగుటకు. 'ఘృతపిండనిభ' -

* చూ. ఆంధ్రభాషాసర్వస్వార్థ నిఘంటుక తిపయములు పు. 10.

ఉపమ - నోటవైచికొనిన కరఁగిపోవునంత మృదువు అనియు భా. 'పలుదెఱంగుల' - ఒక్కొ తెఱంగయిన నెక్కుడుగా భుజింపరు. 'మృదు'త్వము పక్వతచేత, 'కప్పు దేరిన' పూ. ము. పా. 'మధుర' ఫుల్లనిదైనం దిన శక్యముకాదు. 'స్థూల' - రసము మెండుగా నుండుటకు, 'తను పారు' - పా. 'వనుపారు', 'తనరారు' పూర్వముద్రణపా. 'గనెలలోడఁగ' సులువుగా భుజించుటకై ముక్కలుగా తఱిగిపెట్టుట. 'తేలి' యనుట సమృద్ధిం దెలుపుచున్నది. 'చౌరు' - ప్రకృతోపయోగ్యర్థమున ఈపదము* ఏరూపమునను శబ్దరత్నాకరములో లేదు. 'జబురు' అని పూర్వముద్రణపా. దానికి తద్వ్యాఖ్యలో 'జబురు' కొట్టుకొనుచు అని యీపదమే యర్థముగా వ్రాయఁబడి యున్నది. బ్రౌనుదొరగారు నిఘంటువులో 'చౌరుకొట్టుట' 'చౌరుకొనుట' 'జబురుకొనుట' అనఁగా తెగఁదినుట అని ఆంధ్రదీపికానుబంధమునుండి వ్రాసి యీప్రయోగమునే ఉదాహరించినారు.—స్వభావోక్తి.

తే. మాత్రసంచి తలాడఁగా, మార్గవేది। నొక్కఁ డార్యలు, గీత లొండొకఁడు, దాసు
భాషితంబులుగాఁ, దోడి బ్రాహ్మణౌఘ।ముబుసుపోకకుఁ జదువఁ బరున్నవేళ. 74

మాత్రసంచి=అసిమిసంచి (బుజమున మోచికొనుటకు అనుకూలముగా రెండువైపులందును రెండుసంచు లగునట్లు నడుమ అడ్డముగా కుట్టిన నిడుపుసంచి), తలాడ=తలగడ, కాన్=కాఁగా (తలక్రింద ద్రిండుగా పెట్టుకొని), మార్గవేదిన్=దారిలోని యొకతిన్నెమీఁద, తోడి బ్రాహ్మణౌఘము=కూడనున్న బ్రాహ్మణుల సమూహములో, ఒక్కఁడు=ఒక బ్రాహ్మణుఁడు, ఆర్యలున్=ఆర్యావృత్తములును, ఒండొక్కఁడు=మఱియొక బ్రాహ్మణుఁడు, గీతలు = భగవద్గీతలును, తాన్ = పూర్వోక్త పరదేశిబ్రాహ్మణుఁడు, సుభాషితంబులుఁగాన్ = నీతివాక్యంబులుగాను, ఉబుసుపోకకున్ = పనిలేనికాలము కడచుటకై, చదువన్ = పఠించుటకు, పరున్నవేళన్ = అందఱు శయనించియున్న సమయంబున; (ముందఱి కన్వయము.)

—* రాజు భోగినికడకుం బోవుట *—

సీ. పన్నీటితోఁ గదంబము నేసి పూసిన
మృగనాభిపస రాచనగరు దెలుపఁ,
బాటలానిలము లార్పఁగఁ దపారపుఁజుంగు
లలరుఁదావికి మూఁగు నళులఁ జోఁప,
గణ్డోలామౌక్తికచ్ఛాయ లెగఁబ్రాఁకు
నురుహారరుచులఁ ద్రస్తరికిఁ దన్న,
శశికాంతి చెంగావి దశ మలంచిన కేల
స్వర్ణత్సరువువాఁడి వాలు మెఱయ,
తే. మెలఁత యడపముఁ దేఁ జరత్నేరు వనఁగ
దలవరులు గొంద ఱోలసి ముంగలఁ జనంగ,

* ఇది చర్వ ధాతుజమై యుండును. సందర్భము తాంబూలచర్వణమేగదా.

సర్థి రథ్యాన్త రాంతఃపురాంతరమున
భోగినీసంగతికి రాజు వోవుచుండె. 75

1. పన్నీటితోఁ = హిమాంబువుతో, కదంబము చేసి = మిశ్రముగావించి, పూసినమృగనాభిపస = అలందినకస్తూరి గమగమ, రాచనగరు = రాజమందిరమునుండి వచ్చుచున్నాఁ డని, తెలుపఁ (రాజునకేగాక అట్టి కస్తూరిమైపూఁత మఱియొకరికి అలవడ దనుట);

2. పాటల అనిలములు = కలిగొట్టుపువ్వుల (మీఁది) వాయువులు, ఆర్పఁగఁ = ఆడించుచుండుటంజేసి *తపారపుఁజుంగులు=టోపియొక్క కుచ్చుకొనలు, అలరుఁదావికిఁ=(సిగ) పువ్వుల పరిమళమునకై, మూఁగు (చున్న) - అళులఁ =తుమ్మెదలను, చోపఁ =తోలివైచుచుండఁగాను;

3. కర్ణ...లు - కర్ణ=చెవులయందు - డోలా=ఊఁగులాటలతోడి (లేక - ఉయ్యెలలైన= ఉయ్యెలలవలె నూఁగుచున్న) - మౌక్తిక=ముక్తాఫలములయొక్క - ఛాయలు=కాంతులు, ఎగఁబ్రాఁకు (చున్న) - ఉరు హార రుచులఁ = గొప్ప ముత్తెపుఁబేరుల కాంతులను, త్రస్తరికిఁ = క్రిందికి ('త్రిస్తరి = క్రిందు' అని ఆంధ్రదీపికానుబంధము - లేక - పరిహాసమునకు బలె), తన్నఁ = తన్నుచుండఁగా;

4. శశి...శఁ - శశికాంతి=(ఉదయించుచున్న) చంద్రుని కాంతివంటి కాంతిగలదైన- చెంగావి = ఎఱ్ఱవస్త్రముయొక్క - దశఁ = అంచును ('దశావస్థా దీపవర్త్యోర్వస్త్రాన్తే భూమ్ని యోషితి' మేది.), మలంచిన కేలఁ = మలఁపినహస్తమందు, స్వ...లు - స్వర్ణ = బంగారపు - త్సరువు=పిడితోడి - వాఁడి - వాలు=కత్తి, మెఱయఁ =ప్రకాశించుచుండఁగా (మహాప్రభువుగాన ఎప్పుడును ఆత్మరక్షణార్థము దుష్టశిక్షణార్థంబును కత్తింబూనియే యుండును);

మెలఁత=చెలువ (అడపకత్తె యనుట), అడపము=తాంబూలకరండమును, తేఁ =కైకొని కూడవచ్చుచుండఁగా, కొందఱు తలవరులు=ఆరక్షకులు, ఒలసి=వ్యాపించి, ముంగలఁ =ముందఱ. చనంగఁ =పోవుచుండఁగా, చరత్ మేరువు=సంచరించుచున్న బంగరుకొండయో, అనఁగఁ = అనునట్లుగా, రాజు = ఆమత్స్యధ్వజ మహారాజు (ఇతనికి పరమయోగివిలాసమున వల్లభదేవుఁ డని పేరు), అర్థిఁ = కోరికతో, ర...నఁ - రథ్యాన్తర = మఱియొకవీథిలోని - అంతఃపుర - అంతరమునఁ =వేఱు అంతఃపురమునందు, భోగినీసంగతికిఁ =పట్టాభిషేకము పొందని భార్యతోడి కూటమికై ('విహాయమహిషీ మన్యరాజయోషితి భోగినీ' మేది.), పోవుచుండె (ముందరఁ కన్వయము.).

'పస' - 'పసి' పా; 'త్రస్తరికి' - 'త్రస్తనికి' పా. 'దశమలంచిన' - 'దసిలిమించిన' పూర్వముద్రణ పా.

'దసిలీ' అనఁగా శబ్దరత్నాకరమందు 'ఒక దినుసుపట్టు' అని యర్థము కలదు, హ్రస్వాంతము అందులేదు. బ్రౌణ్యమిశ్రభాషా నిఘంటువులో - 'దసరి, దుశరి, దశిరీపంచె, దసిరీపట్టు పంచె' అను పదములును 'ఒకతిరహా పట్టుపంచె' అని యర్థంబును కలవు; - ఈపూర్వముద్రణ పాఠమున అప్రశస్తమయిన శసప్రాసము సంధిలించును. 'రథ్యాంతరము' (అన్యమయినరథ్య) - 'అంతఃపురాంతరము' (అన్యమయిన యంతఃపురము) అని విగ్రహములు.

చ. వినియె, నెల ల్చతుర్ద్వయిని వృష్టిదినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను, బూని, పరంబున కిప్పు, దుద్యమం

* విజయనగరాధిపులు ఒకవిధమైన కుళ్లాయిని ధరించుట మనకు బొమ్మలలో ప్రత్యక్షమే.

బనువుగఁ జేయఁగా వలయు' నంచుఁ బురోహితధర్మ మాత్మఁగీ
ల్కొన నలవిప్రుఁ డాద్విజులలోన సుభాషితము న్పఠింపఁగన్. 76

పూని = పూనికతో - వృష్టిదిన ఆళికిన్ = వానదినముల సమూహమునకై, నెలల్ చతుర్ద్వయిన్ = ఎనిమిది నెలలయందును (చతుర్ణాం ద్వయానాం సమాహారః చతుర్ద్వయీ, లేక చతసృణాం ద్వయీనాం సమాహారః చతుర్ద్వయి - సమాహార ద్విగువు), రాత్రికై, దివంబునన్ = పగటియందును, జరకై = ముదిమికాలమునకై, వయస్సునన్ = యౌవనమందును, పరంబునన్ = పరలోకమునకై, ఇప్పుడున్ = ఈలోకమందున్న యీకాలమందును, ఉద్యమంబు = ఉద్యోగమును, అనువుగన్ = చక్కఁగా, చేయఁగావలయున్, అంచున్, పు...ము - పురః = ముందటికి - హిత = మేలయిన - ధర్మము = నడవడి, ఆత్మన్ = మనస్సునందు, కీల్కొనన్ = నాటునట్లుగా, ఆద్విజులలోనన్ = (మార్గమందలి తిన్నెమీఁదఁ బరుండియున్న) యాబ్రాహ్మణులలో, అలవిప్రుఁడు = (తిరునాళ్లకు పోయివచ్చిన) యాబ్రాహ్మణుఁడు, అప్పుడు = రాజు ఆదారిని బోవుచున్నయాసమయంబున, సుభాషితమున్ = నీతివాక్యమును, పఠింపఁగాన్, వినియెన్ = (పూర్వపద్యములలోని 'రాజు' కర్త.).

రాజు భోగినిగృహమునకుఁ బోవుచుండఁగా, పూర్వోక్త బ్రాహ్మణులలో సుభాషితము పాడఁబూనిన బ్రాహ్మణుఁడు ఇట్లుపాడెను. - మనుష్యుఁడు వర్షాకాలమునకు వలయు సామగ్రిని కడమ యెనిమిది నెలలలోను, రాత్రికి వలయుదానిని పగటను, ముదిమిలో వలయుదానిని యౌవనములోను, చేర్చుకోవలయును; అట్లే పరలోక సుఖమునకు సాధకమయిన కార్యములను ఇహలోకములో నున్నప్పుడె చేసికొనవలయును; - అని. రాజు ఆసుభాషితమును వినెను.

ఈపద్యము ఈక్రింది శ్లోకమునకు ఆంధ్రముగా నున్నది.

'వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్, నిశార్థ మర్థం దివసే యతేత,
వార్ధక్యహేతో ర్వయసా నవేన, పరత్రహేతో రిహజన్మనాచ.'

దీనికి తెనుఁగయిన యిందలి చంపకమునకు ప్రతిగా, పరమయోగి విలాసమున ఒకసీస మున్నది - పీఠికం గనుఁడు. కవనభేదముకూడ తెలియును.

'పరంబున కిప్పు డుద్యమంబు' - పా. 'పరంబునకై యిహోద్యమంబు.' 'అలవిప్రుఁడు' - పా. 'అతఁడప్పుడు.'

క. విని, తద్గ్రంథార్థము నె। మ్మనమున నూహించి, తెలిసి, మ్రాన్పడి, కడకుం
దనమోసమునకు భయపడి, । జనపతి యటు చనక నిలిచి, సంతాపమునన్. 77

గ్రంథఅర్థము = ఆసుభాషితవాక్యముయొక్క భావమును, ... మ్రాన్పడి = చేష్టలుడిగి (ఏమియుఁ దోఁపక), కడకున్ = అంతమునన్, తన మోసమునకున్ = తనవంటదాఁ జేసికొన్న వంచనకు (పరలోక సాధకకార్యములను చేసికోనందులకు). ... అటు = భోగినీ గృహమునకు, చనక = వెళ్లక, సంతాపమునన్ = ఖేదముతో (ముందటి కన్వయము).

ఉ. "ఎక్కడిరాజ్యవైభవము? ఎక్కడిభోగము? లేటిసంభ్రమం?
బక్కట! బుద్బుదప్రతిమ మైనశరీరము నమ్మి మోసపుం

జక్కి గణింపకుంటి; యుగసంధుల నిల్చియుఁ గాలుచేతిబల్

త్రొక్కుల నమ్మనుప్రభృతులుం దుద రూపఱకుండ నేర్చిరే? 78

వైభవములు = ఐశ్వర్యములు, ... భోగములు = విషయ సుఖానుభవములు, ఏటి సంభ్రమంబు = ఎక్కడి వేగిరపాటు (సమౌ సంవేగ సంభ్రమౌ' - అమ.), అక్కట = అయ్యో, బు... ము - బుద్బుద = నీటిమీఁది బుడగ ('బుద్బుదో జలవికారః' రామాశ్రమి) - ప్రతిమము = సాటిగాఁగలది (క్షణభంగుర మనుట),... మోక్షపుం జక్కిన్ = అపవర్గ మార్గమును, గణింపక = విచారింపక, ...యుగసంధులన్ = యుగములందు మాత్రమేగాక యుగసంధ్యలయందుం గూడ (సంధ్యా సంధ్యాంశల యందుఁగూడ—

'చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాంతు కృతం యుగమ్

తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః.' - మను.

అను ప్రకారంబున కృతయుగమగు 4000 వర్షములుమాత్రమేగాక పైగా 800 వర్షములుకూడ అనుట) - నిల్చియున్ = బ్రదికియుండియు (అత్యంత దీర్ఘజీవులై యుండియు నని భా.), తుదన్ = కడపట (అంత్యకాలమందు), అమ్మనుప్రభృతులున్ = ప్రసిద్ధు లయిన మను మాంధాత్రాదులు సయితము, కాలుచేతి బల్ త్రొక్కులన్ = యమునిచేత నగునట్టి గొప్ప యాపదలచేత, రూపు అఱక ఉండన్ = చావక యుండుటకు, నేర్చిరే = సమర్థు లయినారా.

అయ్యో! ఈరాజ్యైశ్వర్యములవలన నేమిప్రయోజనము! ఈవిషయ సుఖానుభవము ఏల? వీనికై యీ వేగిరపాటేమి? నీటిబుడగవలె క్షణమో పగిలిపోయినదైన యీ దేహమును నమ్ముకొని, మోక్షమార్గమును అరయకుంటిని! యుగములకొలఁది జీవించిన యామనుమాంధాత్రాదులుకూడ కడపట యమునిచే చావక యుండఁగలిగినారా? మరణము రాకముందే మోక్షమార్గము నారయవలసినది.

'మనుప్రభృతులున్' సముచ్చయముచేత, నేను నాశరీరము అనుమాట చెప్పవలయునా యని కావ్యార్థాపత్త్యలంకారము.

'ఎక్కడి' - అక్కడ, ఇక్కడ, ఎక్కడ అను శబ్దముల కడపట వృత్తియందు ఇకారము వచ్చు నని శబ్దరత్నాకరము. 'ఏటి సంభ్రమంబు' - ఏమిశబ్దము షష్ఠీవిభక్తికము, 'ఏటిని - ఏమిటిని' ఇత్యాదిరూపములు గల్గును. సమాసమందు 'ఏమి' యనియు నిలుచును. 'ఏమి కులంబున వాఁడొకో' విరా. ౧. ఆ. - శబ్దరత్నాకరము. 'ఏటి' యను రూపము నిందనుంగూడఁ దెలుపును. 'మోక్షపుంజక్కి' - పుంపు విధాయకసూత్రములో 'కర్మధారయంబులందు' అను బహువచనముచేత ఇతర సమాసములందును ము వర్ణకమునకు పుంపులగు; ఉ. 'పరిపరి విధంపు జన్నంపుఁ బరికరంపు సొంపు సంపద.' మను. 'మను' - యుగసంధు లనుట ఉపలక్షణమాత్రము - మనువుల యాయుష్కాలము, —

'శిష్టే ర్ధాతో శ్చ నిష్ఠాన్తా చ్ఛిష్టశబ్దం ప్రచక్షతే

మన్వన్తరే తు యే శిష్టా ఇహ తిష్ఠన్తి ధార్మికాః

మనుః సప్తర్షయ శ్చైవ లోకసన్తాన కారిణః

తిష్ఠ న్తీహ చ ధర్మార్థం తాఞ్ఛిష్టా న్సంప్రచక్షతే.' మాత్స్యపు.

క. ఉన్నట్ల యుండ నద్దరి। కి న్నరులను నావ చేర్చుక్రియ వెసఁ దాఁ బో

కున్నట్ల యుండి కాలం। బు న్నరులకు వయసుఁ బుచ్చి మోసముఁ దెచ్చున్. 79

ఉన్నట్లయుండన్ = లోనివారికి అవిదితగతియై, నరులన్=తనలోఁ గూర్చున్న జనులను, అద్దరికిన్=అవతలిదరికి, నావ=పడవ, చేర్చు క్రియన్=చేర్చెడువిధముగా, కాలంబున్ = కాలము కూడ, తాను, ఉన్నట్లయుండి, నరులకున్. వయసు = ఆయుస్సును, పుచ్చి = కడపి, మోసము తెచ్చున్ = మృతి నొసంగును.

ఏవిధముగా దోనె తనకడుపులోనివారిని వారికి తెలియకుండఁగనే తెచ్చి, యేటి యవలి గట్టునంజేర్చునో, అప్రకారమే, కాలము, నరులకు తెలియకుండఁగనే, వారి యాయుష్కాలమును గడపి, మృతి నొడఁగూర్చును. కావున త్వరపడి మోక్షమార్గ మరసికొనవలయు ననుట. — ఉపమ. - 'నరులకున్' అను నప్రస్తుత సామాన్యమునకు ప్రస్తుత మయిన వక్తృవిషయమే ఆశ్రయముగావున అప్రస్తుతప్రశంసయును.

చ. సగరు నలుం బురూరవుఁ ద్రిశంకుసుతు న్పురుకుత్సుఁ గార్తవీ
ర్యు గయుఁ బృథుం భగీరథు సుహోత్రు శిబిం భరతుం దిలీపునిన్
భృగుకులు యౌవనాశ్వ శశిబిందు ననంగుని నంబరీషుఁ బూ
రుగురుని రంతి రాఘవు మరుత్తునిఁ గాలము కోలుపుచ్చదే? 80

సగరున్, నలున్, పురూరవున్ (రూ. పురూరవసున్ సకారాంతము), త్రిశంకుసుతున్ = హరిశ్చంద్రుని, పురుకుత్సున్, కార్తవీర్యున్=కార్తవీర్యార్జునుని, గయున్, పృథున్, భగీరథున్, సుహోత్రున్, శిబిన్, భరతున్, దిలీపునిన్, భృగుకులున్ = భార్గవుని (=పరశురాముని), యౌవనాశ్వున్ = యువనాశ్వ పుత్త్రుఁడైన మాంధాతను, శశిబిందున్, అనంగున్, అంబరీషున్, పూరుగురునిన్=పూరుని తండ్రియగు యయాతిని, రంతిన్, రాఘవున్=దశరథరాముని, మరుత్తునిన్, కాలము, కోలుపుచ్చదే = చంపలేదా.

కాలము, సగరాది షట్చక్రవర్తులను, గయాది షోడశమహారాజులను, కోలుపుచ్చ (=మృతినొందింప) లేదా ః

'హరిశ్చన్ద్రో నలో రాజా పురుకుత్సః పురూరవాః
సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః.'
'గయామ్బరీషౌ శిబి ద్వనఙ్గౌ పృథు ర్మరుత్తో భరత స్సుహోత్రః
రామా దిలీపో నృగ రన్తి దేవౌ యయాతి మాన్ధాతృ భగీరథాశ్చ.'

ఇందు షట్చక్రవర్తులును షోడశ మహారాజులును పేర్కొనఁబడి యున్నారు. ప్రసిద్ధ సాహచర్యము గలవారు గావున రత్నావళ్యలంకారము. తన్నుంగూడఁ గోలుపుచ్చునని ప్రకృతము అభిప్రాయము గావున అప్రస్తుతప్రశంసాలంకారంబును.

పరిగణనములో శ్లోకమందలి నృగునకు మారుగా ఇందు శిబి పఠితుఁడు ; ఇది మతభేదము గా నోపు. పూర్వముద్రణమున వ్యాఖ్యాతలు 'షోడశమహారాజులు' అని పదునేడుగురను చూపినారు. 'పూరుఁ గురుని' అని పఠించి, 'పూరుని కురుమహారాజును,' అని యిద్దఱను గా విడఁదీసినందున పదునేడుగురైరి. ఈలెక్క తప్పేగాక లఘువుపై సాధ్వబిందు గ ప్రాస మొకటి కలిగినది.

క. కానఁ దటిచ్చల మగురా । జ్యానందము మరగి యింద్రియారాముఁడ నై
పోఁ; నింతనుండి పరలో । కానందంబునకె యత్న మాపాదింతున్. 81

కానన్ = కాఁబట్టి, తటిత్ చలము = మెఱపువలె ('తటి త్సౌదామనీ విద్యుత్' అమ.) అస్థిరము - అగు - రాజ్య ఆనందమున్ = రాజ్యసుఖమును, మరగి=అంటుకొని, ఇంద్రియ ఆరాముఁడను ఐ = ఇంద్రియార్థములందు క్రీడించుచున్నవాఁడనై, పోను = పోవుచుండెదను, ఇంతనుండి = ఇఁకమీఁద, పరలోక ఆనందమునకె = ఆముష్మిక సుఖమునకె, యత్నము = ఉద్యమము, ఆపాదింతున్ = ఒనర్చెదను.

అంతటి మహామహులకే కాలగతి తప్పలేదు, నాకుం దప్పదు, కావున, మెఱుపువలె నస్థిరమయినయీరాజ్య సుఖమును ఇఁక వదలెదను. ఇంద్రియముల వశమున నిఁకనుండను, ఇఁకమీఁద ఆముష్మికానందమునకై యత్నించెదను.

'తటిచ్చలము' - ఉపమ ; అనంతరోక్త నిశ్చయమునకు ఇది హేతువుగాన కావ్యలింగాలంకారమును. 'కానన్' - ఇది ద్రుతప్రకృతికము ; ఇందులకుం బ్రయోగము—

'రసవత్ప్రియము లూర్జ। స్వి సమాహితములును నిచట వివరింపఁగ లే
దసమరస ప్రకరణమున। రసభావాద్యుపనిబద్ధ రసములు గానన్.' నరస. 5 ఆ. 280.

క. వర్గత్రయపరత ముహు। స్స్వర్గక్ష్మామధ్యమాధ్వజఙ్ఘాలకతా
దుర్గతియు నొల్ల; మఱి యప। వర్గదుఁ డేవేల్పెఱింగి వాని భజింతున్." 82

వర్గత్రయ పరతన్=ధర్మార్థ కామములనెడి త్రివర్గమే ప్రధానముగాఁ గలవాఁడ నగుటచేత (దీనికి 'ఒల్లన్' అను వ్యతిరేక క్రియతోడ సంబంధముగావున - ఇఁకమీఁద వర్గత్రయ పరుఁడను కాకుండెదను గావున- అని యర్థము సిద్ధించుచున్నది); ము...యున్ - ముహుః=మాటిమాటికి - స్వర్గ = సురలోకమునకును - క్ష్మా = భూలోకమునకును - మధ్యము=నడిమి - అధ్వ = మార్గమందలి ('అయనం వర్త్మమార్గాధ్వపన్థానః' - అమ.) - జంఘాలకతా - ధావకత్వము (పరుగెత్తుట-జఙ్ఘా= పిక్క - జఙ్ఘా వేగవతీ అస్త్యస్య - లచ్ -।జఙ్ఘాలః - పిక్కవడిగలవాఁడు - స ఏవ జఙ్ఘాలకః - తస్యభావః జఙ్ఘాలకతా) - అనెడి - దుర్గతి యున్ = నరకమును సైతము 'నిరయో దుర్గతిః స్త్రియామ్' - అమ.), ఒల్లన్ = అంగీకరింపను, మఱి = అటుగాక, అపవర్గదుఁడు=మోక్షమిచ్చువాఁడు ('మోక్షోఽపవర్గః' అమ.), ఏవేల్పొ = ఏదేవుఁడో, వానిన్ = ఆదేవుని, ఎఱిఁగి= తెలిసికొని, భజింతున్ = కొలిచెదను.

త్రివర్గము కోరను, దానిం గోరువారిగతి 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' అను నియమముచేత, స్వర్గమునుండి భూమికి భూమినుండి స్వర్గమునకుం బరువు లెత్తుచుండుట. అదియు నరకప్రాయమే గావున, దానిని సయితము నేను గోరను. మోక్షమును ఏవేల్పొసంగునో ఆవేల్పును సేవించి ముక్తుఁడ నయ్యెదను - 'జంఘాలకతా దుర్గతి' - రూపకము. 'భజింతున్' - పా. 'నుతింతున్.'

క. అని తలఁచి మెచ్చి, యవ్వి। ప్రునకు వీటీకరండమున ముద్రితమై
యునిచినయొకముడు పార। తునిచే నిప్పించి, నగరు సొచ్చి, నిశ చనన్. 83

మెచ్చి = ఆబ్రాహ్మణునిం గూర్చి ప్రీతుఁడై,...వీటీకరండమునన్ = తాంబూలపుఁబెట్టియందు ('భగ్నాశస్య కరణ్డ పణ్డితతనోః...భోగినః' భర్తృ.), ముద్రితమై = ముద్రవేయఁబడి

నదై, ముడుపు = ముల్లె, ఆరక్షునిచేతన్ = తలవరిచేత (ఈరాజును నగరు వెలువడఁగానే తలవరులు గలసికొనిరని 81 లో నున్నది),...నిశ = రాత్రి, చనన్ = కడచిన యనంతరము (తెల్లవాఱినపిమ్మట ననుట - ముందటి కన్వయము.), ['నిశ' - ఇందులకు 'నిశి' యని పూర్వముద్రణపా. అపశబ్దము - 'నిశా నిశీథినీ రాత్రిః' - అమ.]

క. కొలువై బహుసమయంబుల । మెలఁగెడు కోవిదులఁ గూర్చి 'మీమాశాస్త్రం
బులలో నెవ్వఁడు మోక్షం । బెలయించునొ చూచి నిశ్చయింపుఁ' డటంచున్. 84

కొలువు ఐ = ఓలగంబుండి, బహుసమయంబులన్ = నానా సిద్ధాంతములందు ('సమయాః శపథాచార కాలసిద్ధాన్త సంవిదః' అమ.), మెలఁగెడు కోవిదులఁగూర్చి = సంచరించుచున్న విద్వాంసులను ('విద్వా న్విపశ్చి ద్దోషజ్ఞః సన్ సుధీః కోవిదో బుధః' అమ.), మీమాశాస్త్రంబులలోన్ ఎవ్వఁడు = ఏశాస్త్రములో ఏదేవుఁడు, మోక్షంబు = ముక్తిని, ఎలయించునొ = పొందించునో, చూచి = పరికించి, నిశ్చయింపుఁడు=ఆదేవుని నిర్ధారణచేయుఁడు., అటంచున్ = అనిపలికి. (ముందటి కన్వయము).

తే. వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు । వాని కని బీఱపువ్వులఁబోని టంక
సాలవాటులు నించి యాస్థానిఁ గట్టఁ । గాలసర్పముగతి వ్రేలుజాలెఁ జూచి. 85

తత్త్వంబు = (అపవర్గదుఁడైన వేల్పు ఇతఁడే యని సిద్ధాంతమును, - తెలుపువానికిన్ = ఈటంకసాలవాటులు ఆతత్త్వమును తెలిపెడివానికి ఇచ్చుటకై ఇటం గట్టఁబడినవి, అని = అని చెప్పి, బీఱపువ్వులఁబోని టంకసాలవాటులు=బీఱపువ్వులవలె ప్రకాశించుచున్న (క్రొత్తవనుట- వానికాంతి ఆశోత్పాదకము-ఉపమ)బంగారు నాణెములను, నించి=(జాలె)నిండించి, ఆస్థానిన్ = సభలో ('సభా సమితి సంసదః । ఆస్థానీ క్లీబ మాస్థానమ్'-అమ.), కట్టన్ = వ్రేలఁగట్టఁగా, కాలసర్పముగతిన్ = నల్లత్రాచువలె, వ్రేలు - జాలెన్ = వలసంచిని, చూచి, (చూచినవారు ఆపండితులు - వలసంచిగావున గడులు గడులుగా నుండుపాఁపదేహమును పోలియుండును. ఆదేహమందు గడులవోలె ఇందులోని నాణెములు తళతళ మెఱయుచున్నవి. జాలె నాణెములబరువుచేత తలక్రిందుగా వ్రేలుచున్న పామువలె క్రింద లావుగాను పైని అఁదోకగాను ఉండును. ఉపమ.)

రాజు వరాలసంచిని కంబమునకుం గట్టించె నని పరమయోగివిలాసము.—

చ. 'అనుటయు మేదినీ రమణుఁ డానిగమాంత రహస్య కోవిద
త్వనిధులఁగూడఁ బెట్టుటకుఁ దా నొక త్రోవ గణించి చూచియున్,
గనకపుమూట యెంతయు ఘనంబుగ నాత్మ సభాగృహంబునన్
దనరెడు నొక్కకంబమునఁ దద్దయుఁ గట్టఁగఁ బంచి యిట్లనున్'. 4(18).

క. 'అనునంతలోనె యాయన । ఘనిముందటఁ బడియెఁ గొలువుఁగూటపుఁ గంబం
బునఁ గట్టినట్టి యుజ్జ్వల । కనకపుఁ బెనుముడుపు జనులు కడు వెరఁగందన్.' 4 (62).

క. హరు నొకఁ డన, నుమ నొకఁ డన,
హరి నొకఁ డన, శిఖి నొకఁ డన, నర్కు నొకఁ డనన్,

గరిముఖు నొకఁ డన, రజనీ
శ్వరు నొకఁ డన, నజు నొకఁ డన, వా దైనతఱిన్. 86

ఒకఁడు = ఒక్క విద్వాంసుఁడు, హరున్ అనన్ = (మోక్షప్రదుఁ డైనవేలుపు) శివుఁ డని చెప్పఁగా, ఉమన్ = శక్తిని ('శక్తి రస్త్రాన్తరే గౌర్యామ్' - మేది.)... శిఖిన్ = అగ్నిని, ('వాయుసఖః శిఖావాన్' అమ.), అర్కున్ = సూర్యుని, ... కరిముఖున్ = గజవదనుని = గణపతిని ('అ ప్యేకదన్త హేరమ్బ లమ్బోదర గజాననాః' - అమ.), ... రజనీశ్వరున్ = నిశాపతిని = చంద్రుని (విధుః సుధాంశు శ్శుభ్రాంశు రోషధీశో నిశాపతిః' - అమ), అజున్ = బ్రహ్మను ('విరిఞ్చో౽జో విరిఞ్చనః' అమ.) - వాదు = వాదము, ఐనతఱిన్ = కలిగిన సమయమునందు. 'వాదు' ప్ర. వాదః.

తే. విల్లిపుత్తూరిలోనల్ల విష్ణుచిత్తుఁ। డతులతులసీసుగంధిమాల్యమును మూల
మంత్రమున నక్కు సేర్పఁబో మన్ననా రుదారమధురోక్తి నవ్విధ మానతిచ్చి. 87

విల్లిపుత్తూరిలోన్, అల్ల విష్ణుచిత్తుఁడు = విష్ణుచిత్తుఁడను నాపూర్వోక్త భాగవతోత్తముఁడు, అతు...ను - అతుల = సాటిలేని - తులసీ = తులసీదళములయొక్క - సుగంధి = పరిమళయుక్తమైన - మాల్యమును = దండను, మూలమంత్రమునన్ = అష్టాక్షరీనామక ప్రధానమంత్ర జపపురస్సరంబుగా, అక్కు చేర్పఁబోన్ = స్వామియొక్క వక్షఃస్థలమున నర్పింపనుండఁగా, మన్ననారు = మన్నారు స్వామి, ఉదార మధుర ఉక్తిన్ = గంభీరమయిన తియ్యనిమాటగా, అవ్విధము = మధురలో రాజాస్థానియందు వాదమయిన ప్రకారము, ఆనతిచ్చి = సెలవిచ్చి (ముందఱికన్వయము).

శ్రీవిల్లిపుత్తూరిలో ఆవిష్ణుచిత్తుఁడు తులసీమాల్యమును అష్టాక్షర మహామంత్రోచ్చారణ పురస్సరంబుగా స్వామియొక్క వక్షమునం జేర్ప నుండఁగా, స్వామి అతనికి మధురలో రాజసభలో జరగుచున్న యావాదమును తెలిపి;

ఆనతిచ్చి - ఆనతి + ఇచ్చి = ఇత్వసంధి - అనేకమహాకవి ప్రయోగసిద్ధము. 'అతుల.' - పా. 'అమల' 'చేర్పఁబోన్' - పా. 'చేర్చుచో',

ఉ. 'నేఁడు, మహామతీ, మధుర నీవు రయంబునఁ జొచ్చి, యందుఁ బాం
డీఁడు దివాణము న్నెఱయ నించినఁ బ్రేలెడు దుర్మదాంధులన్
బోఁడిమి మాన్చి, మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్
వాఁడును గోసినాఁ డిహాము; వైష్ణవుఁగా నొనరింపు సత్కృపన్'. 88

మహామతీ = మహాప్రజ్ఞుఁడా, ('మతి రాగామిగోచరా' - మతి ప్రజ్ఞకు ఉపలక్షణము), రయంబునన్ = వేగముగా ('రంహ స్తరసీ తు రయః స్యదః' - అమ.), ... అందున్ = ఆమధురలో, పాండీఁడు = పాండ్యరాజు, దివాణమున్ = కొలువుకూటమును, నెఱయన్ = అంతటను. నించినన్ = నిండింపఁగా, ... దుర్మద అంధులన్ = కడింది పొగరుచేత గ్రుడ్డియైనవారిని, పోఁడిమి మాన్చి = రూపు మాపి, మత్ మహిమమున్ = నాప్రభావమును, ప్రకటించి = వెల్లడిచేసి, శుల్కమున్ = విద్యకై యాతఁ డేర్పరించిన యాజాలెలోని ధనమును; హరింపుము = కైకొనుము, వాఁడును =

ఆపాండిఁడును, ఇహముఁ = ఈలోకమును, రోసినాఁడు = ఏవగించినాఁడు, (వానిని), సత్కృపఁ = నిండుదయచేత, వైష్ణవుఁగాఁ = విష్ణుభక్తునిగా, ఒనరింపు = చేయుము.

తే. అనిన వడవడవడఁకి సాష్టాంగమెఱఁగి, । సమ్మదాశ్రులు పులకలు ముమ్మరింప
వినయవినమితగాత్రుఁడై విప్రవరుఁడు । వెన్నునకు భక్తి నిట్లని విన్నవించె. 89

అనినఁ=స్వామి యిట్లుపలుకఁగా, సాష్టాంగము - (చూ. ౧ ఆ. ౭౬), ఎఱఁగి=నమస్కరించి ... (తనతో స్వామి భాషించి తనకు బనుపిడినందులకు) - సమ్మద అశ్రులు=ఆనంద బాష్పములు, పులకలు=రోమాంచములు, ముమ్మరింపఁ=అగ్గలింపఁగా; - వినయ వినమిత గాత్రుఁడు ఐ = అణఁకువచేత ముందటికి వంపఁబడిన దేహముకలవాఁడై (వినయముతో ముందటికి వంగి), విప్రవరుఁడు = ఆ బ్రాహ్మణోత్తముఁడు, వెన్నునకుఁ = ఆవిష్ణు దేవునికి;...

'ముమ్మరింప' - 'ముమ్మరముగ' పూ. ము. పా. - ఇందు 'కఁ' అనుదానికి అశ్రులు పులకలునుం గర్తలైన 'కాఁ' అని యుండవలయును, 'కఁ' అనియే యున్న 'ముమ్మరము' అనునది క్రియావిశేషణ మగును, ఆపక్షమున సమన్వయము లేదు.

శా. 'స్వామీ, నన్ను, నితఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధు, నా
రామక్ష్మాఖననక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాదిఁ గాఁ బంపుచో
భూమీభృత్సభ నోట మైన నయశంబు ల్మీకుఁ గాకుండునే! 90

స్వామీ=ఓ భగవానుఁడా, ఇతః...ధుఁ - ఇతః = ఇంతకు - పురా = మున్ను - అపఠిత= చదువఁబడని - శాస్త్రగ్రంథ = తర్క వేదాంతాది శాస్త్రసందర్భములందు - జాత్యంధుఁ = పుట్టుగ్రుడ్డిని, ఆ...రుఁ - ఆరామ = (మీపూజకై వలయు పువ్వులకొఱకైన) యుద్యాన వనముయొక్క - క్ష్మా=భూమిలో - ఖనన=త్రవ్వుటయనెడు - క్రియా=పనియందు - ఖర = కఠినస్పర్శ గలదైన ('ఖరో రక్షో౽న్తరే తీక్ష్ణే దుఃస్పర్శేరాసభే౽పిచ' హేమ.) - ఖనిత్ర-గడ్డపాఱను లేక గుద్దలిని - గ్రాహిత = పట్టుకొనువాఁడ నగుటచేత - ఉత్యత్ = పొటమరించుచున్న - కిణ = కాయలయొక్క - స్తోమ = సమూహముచేత - అస్నిగ్ధ = నునుపులేని (గఱుకయిన) - కరుఁ = చేయిగలవానిని, భవత్ భవనదాసుఁ = మీయాలయంపు టూడిగీనిని, నన్నుఁ, వాదిఁగాఁ బంపుచోఁ = శాస్త్రవాదములు సేయుటకై పంపుపక్షమున, భూమీభృత్ సభఁ = (ఆ) రేని యాస్థానిలో, ఓటము = అపజయము, ఐనఁ = సంభవించెనేని, అయశంబుల్ = మిక్కుటమైన యపకీర్తి, మీకుఁ, కాక ఉండునే = సభవింపక ఉండునా.

స్వామీ నేను ఇంతకు మున్నెన్నఁడును శాస్త్రములు చదివినవాఁడనుగాను. కేవల మజ్ఞునఁడను. మీకొఱకయిన పూదోఁటలో గడ్డపాఱతో పనిచేసి చేత కాయలు కాచినవాఁడను గదా; మీదేవళపు టూడిగపువాఁడను, అట్టి నన్ను రాజసభకు వాదమునకుం బంపిన నాకు ఓటము కలిగిన మీకు మిక్కిలి యపకీర్తి కలుగదా.

ఈచెప్పిన విశేషణములు అసామర్థ్యాభిప్రాయ గర్భంబులుగావున పరికరాలంకారము. 'జాత్యంధుఁ' - చదివి మఱచినవాఁడుకాఁడు, చదువనే లేదు అనుట. 'కిణస్తోమ' -

నిరంతరము ఆరామకృత్యపరతం దెలుపుచున్నది. 'భూమిభృత్సభిన్' - సభారాజా మనుష్య పూర్వా' అను సూత్రముచే సభాశబ్దము షష్ఠీసమాసమున రాజపర్యాయపూర్వపద మయినప్పుడు నపుంసకలింగ మగును. కావున 'భూమిభృత్సభమునన్' అని కావలయును:

'శాలార్థాపి సభా రాజా మనుష్యార్థా దరాజకాత్
దాసీసభం నృపసభ రక్షఃసభ మిమా దిశః.' అమ.

అట్లుగాక స్త్రీలింగముగానే యుండుట, దశబాణములు శతశరములు ఇత్యాదులయందుంబోలె, ఆంధ్రకవుల సమాసశాస్త్రోల్లంఘనములలో చేరుచున్నది. 'భూమిట్సన్నిధి' అని మార్చిన పై యాక్షేపముండదు. 'జాత్యంధు' పా. - 'జాత్యాంధ్య'. 'అయశంబులీవు' - 'అయశంబున్నీవు' అని పూ. ము. పా. ఇందు సముచ్చయ మప్రయోజకము. 'అయశంబుల్' - బహుత్వము ఉత్కటత్వముం దెలుపును.

మ. గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ వాదము నాకు? లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్? 91

గృహసమ్మార్జనమో = దేవళముయొక్క యూడ్చుటయో, జల ఆహరణమో = తీర్థము యొక్క తెచ్చుటయో, శృంగారపల్యంకికా వహనంబో = విలాసార్థమయిన (నీ) పల్లకియొక్క మోచుటయో, వ...మో - వనమాలికా = పాదమువఱకు వ్రేలెడి మాలయొక్క రచించుటయో ('ఆపాదపద్మం యామాలా వనమాలేతి సా స్మృతా' ఇతి కళిఙ్గః - రామాశ్రమి.), వా...బో - వాల్లభ్య = అధ్యక్షతచేత (కోవెలలో నొకయధికారి నగుటచేత - 'వల్లభో దయితేఽధ్యక్షే సల్లక్షణ తురఙ్గమే' మేది.) లభ్య = పొందఁదగినదైన - ధ్వజ = (నీ) టెక్కెముయొక్క - గ్రహణంబో = మోచుటయో, వ్యజన ఆతపత్ర ధృతియో = వీవనయొక్కయు గొడుగుయొక్కయు తాల్చుటయో, ('ఛత్త్రం త్వాతపత్రమ్' అమ. 'ఆతపాత్ త్రాయత ఇత్యాతపత్రమ్'), ద్రా...మో - ద్రాక్ = వడిగా ('ద్రాఙ్ మఙ్క్షు సపది ద్రుతమ్' అమ.) - దీపికా = దీపములయొక్క - ఆరోపమో = పెట్టుటయో, (ఇట్టి పను లయిన నాకుం దగునుగాని), నృహరీ = ఓ నారసింహస్వామీ, వాదము నాకు = వాదమునకుఁ బొమ్మని అనకుము, నీ లీలకున్ = నీ క్రీడకు, పాత్రముల్ = తగినవిద్వాంసులు ('యోగ్యభాజనయోః పాత్రమ్' అమ.), ఇతరుల్ లేరె = వేఱెవ్వరును లేరా?

మీ దేవళము నూడ్చుట, మీకు స్నానార్థము తీర్థము దెచ్చుట, విలాసార్థము మీ యెక్కు పల్లకిని మోచుట, మీకై ఆపాదపద్మప్రాలంబి యగుమాలికను రచించుట, కోవెలలో నధ్యక్షుఁడనైన భాగ్యముచే ధ్వజమును మోచుట, మీ వింజామరను మీ గొడుగును పూనుట, వడిగా మీకై దివ్వెను వెలిగించియుంచుట, ఇవి మీ కోవెల యూడిగీఁడ నయిన నాచేత నగుపనులు. ఇందులో ఏది చెప్పినను చెప్పుము, నేను చేసెదను; కాని వాదమునకుఁ బొమ్మనకుము. నీ విలాసములకు తగినవిద్వాంసుల నెవ్వరి నేని వాదమునకు పంపుము.—'లభ్యలభ్య' ఛేకానుప్రాసము.

'ద్రాక్-' 'ప్రాక్' పూ. ము. పా. మందుగా. 'నాకు' = అనకుము - 'అగున కను కనులకు ముఙ్జేతులు పరం బగునపుడు కా, నా, కానలు విభాష నగు' బా. వ్యా. క్రి. 96. - 'వాదము నాకు' - 'వాదము లేల' - పూ. ము. పా.

—* మన్ననారు విష్ణుచిత్తు ననుగ్రహించుట *—

తే. అనినఁ దద్భక్తి కెద మెచ్చి యచ్యుతుండు
మొలకనగ వొప్ప శ్రీదేవి మోము సూచి,
'వా దితనిచేనె గెలిపింతు; నాదుమహిమ
మువిద కను' మని ప్రాభవంబొప్పఁ బలికె. 92

అనినన్ = విష్ణుచిత్తుఁ డిట్లుచెప్పఁగా...అచ్యుతుండు=నారాయణుఁడు, మొలకనగవు = అంకురమయిన నగవు = మందహాసము,...ఉవిద = ఓయువతీ, ఇతనిచేన్ ఎ = శాస్త్రము లెఱుంగని యీ భక్తునిచేతనే, వాదు = వాదమును, గెలిపింతున్ = జయింపింతును, నాదుమహిమము= నాప్రభావమును,...ప్రాభవంబు = దొరతనము,...పలికె (ముందఱికన్వయము).

'ఇతనిచేనె' - 'ఇతనిచేత' పూ. ము. పా. 'మహిమ యువిద' పూ. ము. పా. 'పలికె' - 'పలికె' పూ. ము. పా.

క. 'నీయిచ్చయె? మిన్నక పో । వోయి; మునిప్రవర, నిన్ను నొప్పింతును భూ
నాయకుసభ; నిందులకై । యేయడ్డము వలవ, దవల నే నున్నాఁడన్.' 93

మునిప్రవర = తాపసవరేణ్యా, నీయిచ్చయె = నీయిష్టమా, మిన్నక = ఊరక, పోవోయి= వెళ్లవోయి, నిన్నున్, భూనాయకుసభన్ = ఆ రేనియోలగములో, ఒప్పింతున్ = అంగీకరించునట్లు చేసెదను. (నిన్నొయొప్పింతును) ఇందులకై ఏయడ్డమువలవదు = వాదమునకుంబోవు విషయమై ఏమియు అడ్డమాడకుము. అవలన్ = నీ వటకుం బోయిన యనంతరము, ఏను ఉన్నాఁడన్ = నీకు నాతోడుగలదు.

ఓయి మునీంద్రుఁడా, నీకిష్టమయిన పనియే నీకు పెట్టుదుమా? స్వస్థచిత్తుఁడవై అటకుం బొమ్ము. ఆ రేని సభలో నీమాటనే యతఁ డంగీకరించునట్లు నేను చేసెదను. ఈపనుపునకు అడ్డము చెప్పకు; అట నేను నీకు సకల విద్యలను ఒడఁగూర్చెదను.

'ఒప్పింతును' - 'మెప్పింతును' అను పూ. ము. పాఠమున యతిభంగము. 'నొప్పింతునె'= 'పరాజయము నొందునట్లు చేయుదునా' అని మఱియొక పా. ఇందును నొచ్చుధాతువుగావున యతిభంగమే, 'ఏయడ్డము' - 'నీయత్నము' పూ. ము. పా. 'ఏయడ్డ' మనుపాఠమున ఏను శబ్దములోని యేకారముతో యతి. (భూనాయకుసభ - చూ. పీఠిక. ప్రకీర్ణము.)

ఆ. అనిన, మాఱు వలుక నలికి యయ్యాళువా
రియ్యకొనియెఁ బోవ; నింతలోనఁ
బద్మనయనుఁ డతని పయనంబుఁ దూఁగింపు
మనుచు నంబితోడ నానతిచ్చె. 94

అలికి = వెఱచి,...ఆళువారు = భక్తుఁడు,...ఇయ్యకొనియెన్ = అంగీకరించెను,... పద్మనయనుఁడు = పుండరీకాక్షుఁ డయిన శ్రీహరి,...అతని పయనంబు తూఁగింపుము = అతని

ప్రయాణమునకవలయు సన్నాహము చేయుము,...నంబితోడన్ = (విష్ణు) పూజారితో, ఆనతి ఇచ్చెన్ = ఆజ్ఞాపించెను.

## —* విష్ణుచిత్తుఁడు మధుర కేఁగుట *—

క. ఆనతిఁ బడి, శ్రీభండా । రాన స్సంబడముఁ దనదు ప్రాఁతందలమున్
స్థానికుఁ డొసంగి పనుపం । గా, నానతిబడిన నిమితకాండ్రు వహింపన్. 95

ఆనతిన్=శ్రీహరి నంబితో చెప్పినయాజ్ఞను, పడి=పొంది, స్థానికుఁడు=పారుపత్తెకాఁడు, శ్రీభండారానన్ = సంపద్యుక్తమయిన (స్వామి) బొక్కసమునుండి, సంబడమున్ = దారిబత్తెమును, తనదుప్రాఁత అందలమున్ = తనదైన ప్రాఁతపల్లకిని, ఒసంగి = యిచ్చి, పనుపంగాన్ = పంపఁగా, ఆనతిబడిన్ అ = (స్థానికుని) యాజ్ఞప్రకారమే, నిమితకాండ్రు = బోయలు, వహింపన్ = పల్లకిలోఁ గూర్చుండనిచ్చి మోచుచుండఁగా, (ముందటికన్వయము).

నంబివలన హర్యాజ్ఞనుపొంది పారుపత్తెకాఁడు విష్ణుచిత్తునికి కోవెల బొక్కసమునుండి దారిబత్తెంబిచ్చి తన ప్రాఁతపల్లకియు నిచ్చి తరలింపఁగా ఆపారుపత్తెకాని యాజ్ఞ చేత బోయలు ఆవిష్ణుచిత్తుని మోచికొనిపోయిరి.

క. లావు గలయద్దెగుజ్జుపుఁ । జావడములమీఁద మాత్రసంచులు దూలన్,
క్రేవల నేకాంగులు రా, । పీవధముల నఱిసె లవనివిభునకుఁగొనుచున్. 96

లావుగల = బలముగల - అద్దెగుజ్జు జావడములమీఁదన్ = బాడిగ గుజ్జుపుఁదట్టలపైని, మాత్రసంచులు = అనిమిసంచులు (చూ. ౭౪. టీక), తూలన్ = ఊఁగుచుండఁగా, క్రేవలన్ = పార్శ్వములయందు, ఏకాంగులు = పుత్త్రమిత్త్ర కళత్త్రాదులం బరిత్యజించి కావివస్త్రములంగట్టి భగవత్కైంకర్యమే చేయుచుండు విరక్తులు, రాన్ = వచ్చుచుండఁగా, అవనివిభునకున్ = రాజునకై, పీవధములన్ = కావళ్లలో ('పర్యాహారశ్చ మార్గశ్చ వివధా వీవధౌ చ తౌ' అమ.) అఱిసెలు = అతిరసము లనెడు భక్ష్యములను, కొనుచున్ = పట్టించుకొని (కర్త విష్ణుచిత్తుఁడు);

అద్దెగుజ్జుపుఁ దట్టులమీఁద వలయుసామగ్రి మాత్రసంచులలో వచ్చుచుండఁగాను, ఇరుప్రక్కలయందును కోవెల యధికారులు అయిన యేకాంగులు వచ్చుచుండఁగాను, రాజునకై కావళ్లలో భగవత్ప్రసాదములైన అఱిసెలం గానుకగా మోపించుకొని (ఆయాళ్వా రేఁగెను.)

'అద్దె' - 'అట్టి', పూ. ము. పా. 'పీవధముల' - 'వివిధముల' పూ. ము. పా.

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి
కట్టిన పొరివిళంగాయ గమియు,
నెసటిఁపోతలు గాఁగ నేర్పరించినచిరం
తనపుశాలి క్షేమతండులములు,
వడిఁబెట్టి లోఁ జెఱకడము సాఁబా లూన్పఁ
జెలఁగు సంబారంపుఁ జింతపండు,

పెల్లు లోహండికావళ్ల కొమ్ములవ్రేలు
గిడ్డిమొత్తపు నేతిలడ్డిగలును,
తే. బెరుఁగువడియంబులును, బచ్చివరుగు, బేడ,
లురుతరాచ్యుతపూజోపకరణపేటి
కలును, సాత్తిన సాత్తనికులము బలసి
విధినిషేధము లెఱిఁగి తే మథుర కరిగె. 97

1. సాధ్వి = పతివ్రతయైన తనభార్య, భక్తిన్ = పతిభక్తిచేత, త్రోవకున్ = మార్గమందు ఉపయోగార్థమై, పరికరంబులు = సంబారములు, పెట్టి = ఉంచి, కట్టిన = మూటకట్టియిచ్చిన - పొరివిళంగాయ గమియన్ = వేఁపుడు బియ్యపుఁబిండితో బెల్లపుఁబాకానఁ జేసిన యుండల సమూహంబును;

2. ఎసటి పోఁతలు కాఁగన్ = ఎసటిలో వేయుటకు తగినట్లుగా - ఏర్పరించిన = ఏఱి శుద్ధముచేసిన - చిరంతన = ప్రాఁత - శాలి = వడ్లయొక్క - క్షేమతండులములు = 'ప్రయాణకాలమందు వట్టిచేతఁ బోక యింటనుండి కొలఁదిగాఁ గట్టికొనిపోయెడు బియ్యము' (క్షేమార్థము తండులము క్షేమతండులము - మధ్యమపదలోపి సమాసము - క్రొత్తబియ్యము వాయువుచేయును; ప్రాఁతబియ్యము ఆరోగ్యకరము;)

3. వడిఁబెట్టి = శుద్ధముచేసి, లోన్ = లోపల, చెఱకడము = బెల్లమును, సాఁబాలు = సగముభాగము, ఊన్పన్ = కలుపఁగా, చెలఁగు = రమ్యమైయున్న - సంబారంపుఁజింతపండు = సంబారపు దినుసులుచేర్చి దంపిన చింతపండును; ఈపాఠము శబ్దరత్నాకరధృతము. సగము పాలు= సాఁబాలు. 'చెఱకడము' - 'జీరగుడము' పూ. ము. పా. = జీలకఱ్ఱతో మిశ్రమయిన బెల్లము.

4. లోహండి కావళ్లకొములన్ = వంటబిందెల కావడుల కొనలయందు, పెల్లు= మెండుగా, వ్రేలు=వ్రేలాడుచున్న (లడ్డిగలకు విశేషణము) - గిడ్డి మొత్తపు నేతి లడ్డిగలును=పెక్కుగోవుల నేతియొక్క సన్నమూతిపాత్రలును, - ['లోహండి' సమస్తపదము - 'లోవి' యగు హాండి - అనఁగా వంటపాత్ర మగు హండి - 'లోహండి' యైయుండనోపు, 'ఆయస్థిపేటికయు లోహాండియుఁ దండులంబులు' - కాశీ. 5 (62); (పాఠము సవరింపవలసినదిగాఁ దోఁచుచున్నది.) 'రాగిలోహండి నన్నాప్రియి లేకుండంగ। వండి దించిన యివుర్వంటకములు.' కాశీ. 3 (121)], పెరుఁగు వడియంబులును=పెరుఁగులోఁ జేసిన వడియములును, పచ్చివరుగులు=ఉడుకఁబెట్టని వరుగులును, బేడలు = ప్రప్పును, ఉరు...లును=పెద్దపెద్దవైన (పేటికలకు విశేషణము) విష్ణు పూజాసాధనముల పెట్టెలును (ఆపెట్టెలనిండ దేవతార్చన సామాను లున్నవనుట.), సాత్తిన = శిఖాయజ్ఞోపవీతములుధరించినట్టియు - *సాత్తని = వానిని ధరింపనట్టియు - కులమువారు = కులముల వారగు వైష్ణవులు, బలసి=పరివేష్టించి, విధినిషేధంబులు=పూర్వోక్త వస్తువులను, ఇతఁడు దీనిని తేవచ్చును, ఇతఁడు దీనిం దేఁగూడదు, అనెడు నాచార విధానములను, ఎఱిఁగి = ఎఱిఁగిన

* ఈసాతని శబ్దవ్యుత్పత్తింగూర్చి మామాతామహులు శ్రీ తా. మి. శేషగిరిశాస్త్రిగారు తమ యాంధ్రశబ్దతత్త్వము భా. I లో నిట్లు వ్రాసియున్నారు. చూ. పుటలు 11 - 13 అధోజ్ఞాపిక "దాసర్ అనుపదము దాసరి అని వికృతమయినట్లు దాసన్ అనుపదము దాసని అని వికృత

వారై = వానిని అనుసరించి, తేఁగా = మెచ్చుచుండఁగా, మధురవాక్, అరిగాక్ = (అవిష్ణుచిత్తుఁడు) ఏఁగెను.

చ. యమనియమాదిలభ్య, ద్రుహిణాది జరన్మరుదిభ్య, సంసృతి
శ్రమహరనామకీర్తన, మురప్రవికర్తన, పాతకావలీ
దమన, రమాంగనాకమన, తామరసాయతనేత్ర, భక్తహృ
ద్భ్రమతృణదాత్ర, భూయువతి రంజన; వర్ణజితాభ్రఖంజనా. 98

యమ నియమ ఆది లభ్య = యమ నియమాదులచేత పొందఁదగినవాఁడా, ద్రు...భ్య - ద్రుహిణ = బ్రహ్మ ('ధాతాబ్జయోని ర్ద్రుహిణః' అమ.) - ఆది = లోనుగాఁగల - జరత్ = ముసలి ('వర్షీయాన్ దశమీ జ్యాయాన్ జీనో జీర్ణో జరన్నపి' అమ.) - మరుత్ = దేవతలకు ('మరుతౌ పవనామరౌ' అమ) - ఇభ్య = దొరవైనవాఁడా ('ఇభ్య ఆఢ్యోధనీ' - అమ. లక్షణచేత స్వామి), సం...న - సంసృతి = జననమరణ ప్రవాహరూప సంసారమనెడి - శ్రమ=కష్టమును - హర = పోఁగొట్టునట్టి - నామకీర్తన = నామసంకీర్తనము కలవాఁడా (ఆతని నామమును కీర్తించువారికి సంసారబంధము వీడిపోవును అని భా.), మురప్రవికర్తన - ముర = మురుఁడనెడి యసురుని - ప్రవికర్తన = కోసివైచినవాఁడా, పాతక ఆవళీ దమన = పాతకములసమూహమును అణంచువాఁడా, రమా అంగనా కమన = లక్ష్మియనెడి సుందరిని కామించువాఁడా (లక్ష్మీపతీయనుట), తామరస ఆయత నేత్ర = తామరపూవులవంటి విశాలనయనములు కలవాఁడా (పుండరీకాక్షుఁడా యనుట), భ...త్ర - భక్త = నీయాశ్రితులయొక్క - హృత్ = హృదయములయందలి ('స్వాన్తం హృన్మానసం మనః' అమ.) - భ్రమ = అజ్ఞానమనెడి - తృణ = పచ్చికకు - దాత్ర = కొడవలి వైనవాఁడా), భూ యువతి రంజన = భూమియనెడి జవ్వనిని రంజింపఁజేయువాఁడా (భూదేవికి పతియైనవాఁడా), వ...నా - వర్ణ = దేహవర్ణముచేత -

---

మయ్యె. దాసనివాఁడు అనఁగా దాసుఁడయిన వాఁడు అని యర్థము. దాసానిపువ్వు అనఁగా దాసుఁడు దేవాలయమునకుఁ జేరిన తోఁటలో భగవత్పూజకుఁగాను పైరు చేసినపువ్వు. దాసనివాఁడు తన జీవనమునకై కుంకుమము, గంధపుపొడి, పల్లుపొడి, మొదలైనవానింజేసి అంగడియందమ్మును. అట్లు చేయఁబడిన పల్లుపొడికి దాసనిపొడి దాసనాపొడియని పేరువచ్చెను. ఈ దాసని అనుపదమె సాతనిఅని వికృతమయి భగవద్భక్తులయి భగవత్కైంకర్యమును జేసెడు బ్రాహ్మణేతరులకుఁ బేరయ్యె. పురాణములందు బ్రాహ్మణేతరులయిన భగవద్భక్తులకు తఱచుగా దాసశబ్దము పయోగింపఁ బడును......వాస్తవవ్యుత్పత్తి యిట్లుండఁగా సాతని అనుపదంబును సాత్తు అను ద్రవిడ ధాతువుయొక్క వ్యతిరేక నామవిశేషణ రూపముగాఁ దలఁచి, సాతనివాఁడు అనుపదమునకు యజ్ఞోపవీతము మొదలైన కర్మచిహ్నముల ధరింపనివాఁడు అని అర్థమును ఈకాలములోఁ జేయుదురు. దానికిఁ బ్రమాణముగా విష్ణుచిత్తీయము నందును

'పెరుగు వడియంబులును బచ్చివరుగు లోలుపుఁ
బప్పు మధుసూదనార్పోప కరణపేటి
కలును జాతిన చాతనికులము బలసి'

అని చెప్పఁబడి యున్నది. ఈవ్యుత్పత్తి కల్పితము''

జిత = జయింపఁబడిన - అభ్ర = మేఘంబును ('అభ్రం మేఘో వారివాహః' - అమ) - ఖంజన = కాటుకపిట్టయుం గలవాఁడా ('ఖఞ్జరీటస్తు ఖఞ్జనః' అమ. - నల్లనివాఁడా యనుట).

యోగసాధ్యుఁడా, పురాణులైన బ్రహ్మాదిదేవతలకును ఏలికవైనవాఁడా, సంసారక్లేశమును నిజనామకీర్తనచే తొలఁగించువాఁడా, మురహరా, పాపహరా, రమాపతీ, పుండరీకాక్షా, భక్తజ్ఞానప్రదా, భూదేవీవల్లభా, నీలవర్ణా.

ఇందు 'లభ్య-నిభ్య' యిత్యాదులు అంత్యానుప్రాసములు కలవు. 'యమనియమాది'-యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధులు ఎనిమిది యోగాంగములు.

క. దోర్ధూర్ధృతదుర్ధరగో । వర్ధన, రాధానురాగ వర్ధన, లీలా
వార్ధుషికా, యిషికాకృత । వార్ధశ్రవసైకనేత్ర వైకృతినిపుణా. 99

దోర్ధూ...న - ధూర్ = కాఁడివంటిదైన - దోస్ = బాహువుచేత ('భుజ బాహూ ప్రవేష్టదోః'-అమ.) - ధృత = ధరింపఁబడిన - దుర్ధర = (అన్యులకు) మోవశక్యముగాని - గోవర్ధన = గోవర్ధన మను పర్వతము కలవాఁడా, రాధా అనురాగవర్ధన = రాధకు అనురాగమును పెంచినవాఁడా (రాధామనోహరా యనుట), లీలావార్ధుషికా = విలాసార్థమై వడ్డివలన జీవించువాఁడా (వేంకటేశ్వరస్వామి వడ్డికాసులవాఁడు గావున నిట్లనుట) - (కుసీదకో వార్ధుషికో వృద్ధ్యాజీవశ్చ వార్ధుషిః' అమ. 'ప్రయచ్ఛతి గర్హ్యమ్' - ఇతి ఠక్ - 'వృద్ధే ర్వృధుషిభావః'), ఇషి...ణా - ఇషికా = తృణముతో - కృత = చేయఁబడిన - వార్ధశ్రవస = ఇంద్రపుత్త్రుఁ డయిన కాకాసురుని యొక్క - ఏకనేత్ర = ఒక్క కంటియొక్క - వైకృత = వైకల్యమునందు - నిపుణా = ప్రవీణుఁడా - చూ.__రఘు. 12 (23).

'తస్మిన్ వాస్థదిషీకాస్త్రం రామో రామావబోధితః
ఆత్మానం ముముచే తస్మా దేకనేత్రవ్యయేన సః.'

గోవర్ధనోద్ధారకుఁడా, రాధావల్లభుఁడా, వడ్డికాసులవాఁడా, పచ్చగడ్డి పోఁచతో కాకాసురుని యొకకంటిని పోఁగొట్టినవాఁడా. - ఇందలి వృత్త్యనుప్రాసము నరయవలయును.

ఇందు 'వృద్ధి' శబ్దములోనున్న దకారము దానినుండివచ్చిన 'వార్ధుషిక' శబ్దములో లేదు. 'వృద్ధశ్రవస్' శబ్దమునుండివచ్చిన 'వార్ధశ్రవస' శబ్దమునందు 'ఝరోఝరిసవర్ణే' అను సూత్రముచేత వికల్పముగా దలోపమురాఁగా 'వార్ధశ్రవస' అగును; కావున ప్రాసస్థానములయందు వ్యంజనాక్షరభేదము లేదు. - పూర్వముద్రణములో 'దోః = భుజములయొక్క - ధూః = భారముచేత' అని టీక యున్నది. 'ధూ'శ్శబ్దము భారవాచకమగు నేని సమాసాంతమందు అప్రత్యయము వచ్చి 'దోర్ధురా' అని యగును. కావున ఆయర్థము సరికాదు.

మాలిని. ద్రుహిణజముఖమౌనిస్తోమనిస్తంద్రభాస్వ
ద్దహరవిహరమాణాత్మప్రపాదాంబుజాతా,
బహిరబహిరపారప్రాణికోటిప్రపూర్ణా,
మహిమవినుతవాణీమాధురీవేద్యపర్ణా. 100

ద్రు...తా - ద్రుహిణ = బ్రహ్మవలన - జ = పుట్టినవాఁడగు నారదుఁడు - ముఖ = మొదలుగాఁగల, మౌని = సంయములయొక్క - స్తోమ = సమూహముయొక్క - నిస్తంద్ర = తూఁగులేని

(పరావలేని) - భాస్వత్ = ప్రకాశముగల - దహర = హృదయాకాశమందు - విహరమాణ = విహరించుచున్న - ఆతామ్ర = అంతటను నెఱ్ఱనయిన - పాద అంబుజాతా = చరణారవిందములు కలవాఁడా, బ...ర్ణా - బహిః = వెలుపలను - అబహిః = లోపలను - అపార = అంతములేని - ప్రాణికోటి = జంతుసముదాయమందు - ప్రపూర్ణా = నిండినవాఁడా, మ...ర్ణా - మహిమ = ప్రభావముయొక్క - వినుతి = స్తుతియైన - వాణీ = శివవాక్కుయొక్క - మాధురీ = తియ్యఁదనమును - వేది = ఎఱింగినదైన - అపర్ణా = పార్వతి కలవాఁడా ('అపర్ణా పార్వతీ దుర్గా' అమ.)

వారదాది సంయములు ఎవని పాదారవిందములను అప్రమత్తులై తమ హృదాకాశమందు ధ్యానించుచుందురో, ప్రాణికోటికి లోపలను వెలుపలను నిండినవాఁ డెవఁడో, ఎవనిమహిమను శివుఁడు పార్వతి కుపదేశింపఁగా ఆమె గ్రహించి పరమానందమును పొందునో, ఆస్వామి శ్రీ వేంకటేశ్వరా.

'స్వయ మన్త ర్బహి ర్వ్యాప్య భాసయ న్నిఖిలం జగత్
బ్రహ్మప్రకాశతే వహ్నిః ప్రతప్తాయసపిణ్డవత్.'

మ. ఇది భూమండనకొండవీడుధరణీభృద్దుర్గపూర్వాద్రిభా
స్వదిభేశాత్మజవీరభద్రజనజీవగ్రాహరాహూయమా
ణదృఢాంచద్భుజకృష్ణరాయమహీభృన్నామాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము ద్వితీయంబై మహిం బొల్పగున్. 101

హృద్యపద్యము = మనోహర పద్యములుగలదైన, ఇది ఆశ్వాసము = ఈ యాశ్వాసము, భూ...దన్ - భూ = భూమికి - మండన = అలంకారములయిన - కొండవీడు = కొండవీ డను పేరుగల - ధరణీభృత్ దుర్గ = కొండదుర్గమునందును - పూర్వాద్రి = ఉదయగిరి (దుర్గమున) యందును - భాస్వత్ = ప్రకాశముగల - ఇభేశ ఆత్మజ = గజపతికుమారుఁ డైన - వీరభద్ర = వీరభద్రపాత్రుని యొక్క - జన = జనులయొక్క - జీవ = ప్రాణమును - గ్రాహ = హరించుటయందు - రాహూయమాణ = రాహువువలె నాచరించుచున్న (ప్రాణము గాలిగావునను, పాము గాలిని భక్షించును గావునను, ఇట్లు చెప్పుట - ఉపమాలంకారము), దృఢ = దిట్టమయిన - అంచత్ = ఒప్పుచున్న - భుజ = బాహువులుగల - కృష్ణరాయ మహీభృత్ = కృష్ణరాయభూపతి యనెడి - నామ = పేరుగల - అస్మత్ = నాయొక్క (నారచించిన) - ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యను మహాకావ్యమునందు - ద్వితీయంబై = రెండవదై, మహిన్ = భూమిలో, పొల్పగున్ = శోభించును.

గజపతికొడుకైన వీరభద్రపాత్రుని సేనల నోడించి అతఁ డేలుచుండిన యుదయగిరి కొండవీడు దుర్గములను సాధించిన కృష్ణరాయఁ డనెడి నేను రచించిన యాముక్తమాల్యదలో మనోహరపదములుగలది ఇది రెండవ యాశ్వాసము.

'గ్రాహరాహూ' - 'హృద్యపద్యము' - వృత్త్యనుప్రాసము. 'కొండవీటిధరణీభృద్దుర్గ' అను పూ. ము. పా. 'కొండవీటి' అని ప్రాతిపదికము కానందున సిద్ధింపదు. 'మహీభృన్నామ' - 'మహీరాణ్ణామ' పూ. ము. పా.

ద్వితీయాశ్వాసము సమాప్తము.

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## తృతీయాశ్వాసము

క. శ్రీ క్షితి నీళా వర, దను
జోక్షప్రాణహర, దంష్ట్రికోత్కృత్తహిర
ణ్యాక్షక్షపాచర, కృపా
వీక్షాదృతబాహులేయ, వేంకటరాయా. 1

శ్రీ...వర - శ్రీ = లక్ష్మీదేవి - క్షితి = భూదేవి - నీళా = నీలాదేవి - అను వారికి - వర = భర్తవైనవాఁడా, దనుజ ఉక్ష ప్రాణ హర = అసురుఁడయిన ('అసురా దైత్యా దైతేయా దనుజే న్ద్రారి దానవాః' అమ.) ఎద్దుయొక్క ('ఉక్షా భద్రో బలీవర్ద ఋషభో వృషభో వృషః' అమ.) అసువులను హరించినవాఁడా, దం...ర - దంష్ట్రికా = కోఱలచేత - ఉత్కృత్త = ఎగ నఱుకఁబడిన - హిరణ్యాక్ష = ఆపేరి - క్షపాచర = రాక్షసుఁడు కలవాఁడా ('రాక్షసః కోణపః క్రవ్యా త్క్రవ్యాదోఽస్రప ఆశరః। రాత్రిఞ్చరో రాత్రిచరః' అమ.). కృ...య - కృపా=దయతోడి - వీక్షా=చూపుచేత - ఆదృత = ఆదరింపఁబడిన - బాహులేయ = కుమారస్వామికలవాఁడా ('బాహులేయ స్తారకజి ద్విశాఖ శ్శిఖివాహనః' అమ.). వేంకటేశ్వరుఁడా.

'నీళా' దేవి కుంభకుఁడను గొల్ల దొరకూఁతురు; కాలనేమికొడుకు లాఁబోతులై పుట్టి జగమును బాధించుచుండఁగా, వాని నుక్కడంచువానికిఁ దనతనయ నిచ్చెద నని కుంభకుఁడు చాటించెను. పలువురుగొల్లలు పట్టంబోయి భంగపడఁగా, శ్రీకృష్ణుఁడు ఆ యాలఁబోతులం గడపి నీలం బెండ్లియాడెను. - 'దనుజోక్ష' - అరిష్టుఁడను నసురుఁడు వృషభరూపమున మందమీఁదికి రాఁగా శ్రీకృష్ణులవారు వానిని సంహరించిరి. - 'హిరణ్యాక్ష' - సనకాదిమునుల శాపంబున వైకుంఠ ద్వారపాలకు లగు జయ విజయులు దితిగర్భంబున హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా నుద్భవించిరి. అందు హిరణ్యాక్షుఁడు యజ్ఞ వరాహమూర్తియైన నారాయణు నెదిరించి యాదేవునిచేత కోఱతో విహతుండయ్యె.

'దంష్ట్రికా' - హ్రస్వా దంష్ట్రా - దంష్ట్రాంతరము, - దంష్ట్రాగ్రము దంష్ట్రాలేశముచేతనే అవలీలగా నని భా. - 'క్షపాచర' - దానవులు, అసురులు, దైత్యులు, రాక్షసులును వేర్వేఱు తెగ లయినను కవులు అభేదముగా వ్యవహరించుటయుం గలదు; క్షపా = రాత్రియందు - చరః= సంచరించువాఁడు. - 'బాహులేయ' - కుమారస్వామి విష్ణుభక్తుఁ డని పురాణములందు ప్రసిద్ధము.- 'బహులానాం కృత్తికానా మపత్యం బాహులేయః'.

వ. అవధరింపు. మ ట్లరిగి యవ్విష్ణుచిత్తుండు. 2

అవధరింపుము = చిత్తగింపుము, అరిగి = పోయి.

## —* విష్ణుచిత్తుఁడు రాజసభ కేఁగుట *—

శా. నిత్యంబు న్బ్రతిహారి వాద మగుట న్విజ్ఞప్తి లేకంపఁ, దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతము న్శంకమైఁ
బ్రత్యుత్థానముఁ జేసి నిల్వఁగ, సభాభాగంబు సొత్తెంచి యౌ
న్నత్యప్రోజ్జ్వల రాజదత్తవరరత్నస్వర్ణ పీఠస్థుఁడై. 3

నిత్యంబున్ = ప్రతిదినమునను, వాదము = తేనియెదుట పండితుల వాదము, అగుటన్ = జరగుచుండుటచేత, ప్రతిహారి=దౌవారికుఁడు ('ద్వారి ద్వాస్థే ప్రతీహారః ప్రతిహార్యప్యన న్త్రరే' అమ.), విజ్ఞప్తి = 'విష్ణుచిత్తులవారు వచ్చియున్నారు' అని ప్రభువునకు విన్నపము, లేక = చేయకయే, అంపన్ = సభలోనికి పంపఁగా, తాన్ =ఆవిష్ణుచిత్తుఁడు, అతి ఊర్జస్వలుఁడు = మిక్కిలి తేజోవంతుఁడు ('ఊర్జస్వలస్స్యా దూర్జస్వీ యఊర్జాతిశయాన్వితః' అమ. బలవంతుఁడు), ఔటన్ = అయినందున, భూపతియున్ = రాజును, సభ్యవ్రాతమున్ = సభాసదుల ('సభాసద స్సభాస్తారాః సభ్యా స్సామాజికాశ్చతే' అమ.) సమూహంబును, శంకమైన్ =జంకుచేత, ప్రత్యుత్థానము = ఎదురుకొని లేచుటను, చేసి = కావించి, నిల్వఁగన్ = నిలిచియుండఁగా, సభాభాగంబు = ఆస్థానప్రదేశమును, చొత్తెంచి = ప్రవేశించి, ఔ...డు - ఔన్నత్య = ఎత్తుచేత-ప్ర ఉజ్జ్వల=మిక్కిలి ప్రకాశించుచున్నదైన - రాజదత్త = రాజుచేత ఈఁబడిన - వర = శ్రేష్ఠమయిన - రత్న = మణులయు - స్వర్ణ = బంగారముయొక్కయు - పీఠ = ఆసనమందు-స్థుఁడు = కూర్చున్నవాఁడు, ఐ (ముందటి కన్వయము).

ప్రతిదినమును రాజసభలో మోక్షప్రద దేవతానిర్ధారణార్థమై విద్వాంసులకు వాదము జరగుచుండుటచే దౌవారికుఁడు ముందుగా రాజువనుమతి నొందకయే లోనికిం బోనీయఁగా, ఆ విష్ణుచిత్తుఁడు ఆస్థానిం దఱియుచుండఁగా, ఆయనయొక్క యాదివ్యతేజముం గాంచి రాజును సభవారును జంకుపొంది ఆయన నెదుర్కొని లేచి నిలుచుండిరి. అంత నాతఁడు సభలోఁ బ్రవేశించి రాజనిర్దిష్ట మయిన సమున్నత జాజ్వల్యమాన రత్నఖచిత హేమపీఠమందు ఆసీనుఁడాయెను.

'ప్రతిహారి' - రూ. ప్రతీహారి - ఈరెండును పురుషుఁ డర్థమేని నకారాంతములు, ఇవే స్త్రీ యర్థమగునేని ఈకారాంతములు. 'నిల్వఁగన్' - పా. 'మ్రొక్కఁగన్'; 'ఔన్నత్య ప్రోజ్జ్వల' - ఉన్నత మయిన దాని ప్రకాశము మిక్కిలి బాగుగఁ గాన్పించును.

క. ఆతిథ్యము గొని, హరి తన । చేతోగతి నొలయ, రంతు సేయని విద్వ
ద్వ్రాతంబుఁ జూచి,'లాఁతుల । మా తరవా యుడుగ? మాటలాడుం' డనుచున్.

ఆతిథ్యమున్ = అర్ఘ్యాద్యతిథిసత్కారమును ('క్రమా దాతిథ్యాతిథేయే అతిథ్యర్థేఽత్ర సాధుని' అమ.), కొని = స్వీకరించినవాఁడై, తన (యొక్క), చేతోగతిన్ = చిత్తవృత్తియందు హరి = నారాయణుఁడు, ఒలయన్ = కదియఁగా, రంతు = శబ్దము, సేయని చేయకున్నట్టి (ఊరకున్నట్టి) - విద్వత్ వ్రాతంబున్ =విద్వాంసుల సమూహమును, చూచి = విలోకించి, తరవాయి = ఉపక్రమమును (మీరు ఆరంభించినదానిని), ఉడుగన్ = ఇట్లు మానియుండుటకు, లాఁతులమా = మనమేమి ఒకరికొకరము పరాయీలమా (లేక - మేమేమి మీకు అన్యులమా),

మాటలాడుండు = భాషింపుఁడు (చేయుచుండిన వాదమును జరుపుఁడు), అనుచున్ = అని (ముందటి కన్వయము.),

ఆయనకు అర్ఘ్యస్వాగతాద్యతిథిసత్కారములు రాజు కావించెను. అనంతర మాయన శ్రీహరిని స్మరించినవాఁడై తనరాకచే వాదముమాని యూరకయున్న యాపండితులంజూచి 'తరవాయి యేల నిలిపితిరి? నేనేమి మీకు లాఁతివాఁడనా? ఉపక్రమమును కొనసాగింపుఁడు' అని హెచ్చరించెను.

'ఆతిథ్య' = అతిథికొఱకైనది. 'తరవా యుడుగ' - ఇత్వసంధి; 'తరవాయి డిగ' అని పఠించిన నిర్బాధము. చతుర్థపాదమున ప్లుతయతి.

తే. కతిపయోక్తులలోనె తత్ప్రతిభఁ దెలిసి,
నగవు దళుకొత్త రాజు నెమ్మొగముఁ జూచి,
'యీవు మాధ్యస్థ్యమున నున్న నేము గొన్ని
నొడివెదము మాట' లని తదనుజ్ఞ వడసి

కతిపయ ఉక్తులలోనె = ఒక కొన్నిమాటలలోనే ('వ్యాహార ఉక్తి ర్లపితం భాషితం వచనం వచః' అమ.), తత్ ప్రతిభన్ = వారిప్రజ్ఞావిశేషమును, తెలిసి = గ్రహించినవాఁడై, నగవు = నవ్వు - తళుకు ఒత్తన్ = అంకురించుచుండఁగాఁ (చిఱునవ్వు నవ్వుచు ననుట), రాజు నెమ్మొగము = ఱేనియొక్క మనోజ్ఞవదనమును, చూచి, ఈవు = నీవు, మాధ్యస్థ్యమునన్ = మధ్యస్థభావమునందు - ఉన్నన్ (నీవు మధ్యవర్తివిగా నున్నయెడల), ఏము కొన్నిమాటలు, నొడివెదము = చెప్పెదము, అని = అనివచించి, తత్ అనుజ్ఞ = ఱేని యంగీకారమును, వడసి = పొంది, (ముందటికన్వయము.)

అంత నాయాళ్వారు నాలుగైదు వాక్యములు వారినోట రాఁగానే వారితెలివి యింతియ గదాయని గ్రహించినవాఁడై, లేఁతనవ్వు నవ్వుచు రాజుతో 'నీవు మధ్యవర్తివిగా నుందువేని కొన్ని మాటలు చెప్పెదము' అని చెప్పెను. రాజు అందుల కంగీకరించెను.

'ప్రతిభ' - వాదమందు ఆవశ్యము వలయును,—చూ. పుట 27 'స్మృతి... ప్రతిభాం విదుః'. 'నెమ్మొగము' = నెఱి + మొగము. 'మాధ్యస్థ్యము' = మధ్యస్థునిభావము - 'మధ్యస్థుఁడు' = నడుమనుండువాఁడు - వాదప్రతివాదముల సారాసారముల నిర్ణయించువాఁడు. 'తళుకొత్తు' = తళుక్కుమనుట - ఇంచుక యంకురించుట - ఎక్కువ నవ్వుట అధమలక్షణము, ఆయన మహాపురుషుఁడుగాన ఆయనకు ఉండదు.

—* విష్ణుచిత్తుల వాదము *—

సీ. అందులో నొకమేటి కభిముఖుం డై యాతఁ
డనిన వన్నియును ము న్ననువదించి;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొడఁబడఁగఁ బల్కి;

ప్రక్కమాటల నెన్న కొక్కొకమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలి వానికినె మగిడి;
తే. మఱి శ్రుతి స్మృతి సూత్ర సమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగ మెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితుఁ గావించి దయ వాని విడిచి పెట్టె. 6

1. అందులోన్ = ఆవాదులలో, ఒకమేటికిన్ = గొప్పవాని కొకనికి, అభిముఖుండు = ఎదురుమోముగా నున్నవాఁడు, ఐ,...అనువదించి = తాను మరలవచించి, (అట్లు వచించుట ఆమేటి వచించినది ఇదియే అని నిశ్చయము చేసికొనుటకు);

2. తొడఁగి = (ఖండనసేయుటకు) ఆరంభించి, అన్నిటికిన్ = అతఁడుచెప్పిన సకల విషయములకును, అన్నిదూషణంబులు = ప్రతివిషయమునకును ఒక్కొక్క దోషోద్ఘాటనమును, వేగపడక = తొందరపడక, (తొందరపడుటచే మతి తప్పి తనవాదమే చెడును, అన్యులకును తనయందు గుఱితప్పును, మచ్చరమెచ్చును.), తత్సభ = ఆసభ (లోనివారు), ఒడఁబడఁగన్ = ఈయనమాట సాధువని అంగీకరించునట్లుగా, పలికి;

3. ప్రక్కమాటలన్ = ఇతరులు నడుమనడుమ వచించు వాదాంశములను, ఎన్నక = సరకు గొనక, ఒక్కొకమాటనె = ఒక్కని మాటకు ఒక్క బదులుమాటచేతనే, నిగ్రహస్థానము = పరాజయ హేతువును, అనుగ్రహించి = అనుగ్రహపూర్వకముగా ఉద్ఘాటించి;

4. క్రందుగాన్ = (పలువురు ఒక్కమొగిని) దొమ్మిగా, రేఁగినన్ = వాదింపం జొరఁగా, కలఁగక = కలఁతపడక, అందఱన్, తేర్చి = సమాధానపఱిచి, నిలిపి = ఊరకుండునట్లుచేసి, ఆమొదలివానికినె, మగిడి = మరలి;

మఱి = విశేషించి, శ్రుతి స్మృతి సూత్రసమాజమునకున్ - శ్రుతి= వేదములయు ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః'అమ.)-స్మృతి = ధర్మశాస్త్రములయు ('స్మృతిస్తు ధర్మసంహితా' అమ.) - సూత్ర = బ్రహ్మసూత్రములయు - సమాజమునకున్ = సమూహమునకు, ఐక కంఠ్యంబు = ఏక కంఠత్వము = ఏకవాక్యత్వము = ఏకాభిప్రాయత్వమును, కల్పించి = వివరించి, ఆత్మమతమున్ = తనమతమును, జగము ఎఱుఁగంగన్ = లోకమెల్ల నెఱుంగునట్లు, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, వానిన్ = ఆవాదిని, విజితున్ = ఓడినవానింగా, కావించి, దయన్ = కరుణచేత, విడిచిపెట్టె.

ఇందు క్రమముగా పూర్వపక్షోపన్యాస తదనువాద తద్దూషణ స్వమతస్థాపనములు చెప్పఁబడినవి. 'అనుగ్రహించి' - ప్రక్కమాటలకు ఉత్తరము చెప్పవలసినన్యాయము లేకున్నను చెప్పుట యనుగ్రహముచేత. 'నిగ్రహస్థానము' - పరాజయహేతువు, ఎట్టిదోషమున్నం బరాజయము కలుగునో అట్టిదోషము:—

'అఖణ్డితాహంకృతినా పరాహంకార ఖణ్డనమ్
నిగ్రహ స్తన్నిమిత్తస్య నిగ్రహస్థాన తోచ్యతే.' తా. ర.

'ఏకకంఠ్యము'-శ్రుతి స్మృతి సూత్రములకు విరోధములు అజ్ఞులకుం గాన్పించుచుండును; ప్రాజ్ఞులకు వానివాని వాస్తవాభిప్రాయము తెలుంగుకతన ఏకమత్యమే గాన్పించును.

'బల్కి'-పా. 'జెప్పి.' 'ప్రక్క' - పా. 'పెక్కు.' 'దేర్చి.' - పా. 'దీర్చి.'

క. 'నీ వే మంటివి ర'మ్మం। చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి; యొకం డొకండు రా। నా విప్రుండు వాదసరణి నందఱ గెలిచెన్. 7

కావించి = (విజితుం) గావించి,...వాదసరణిన్ = వాదక్రమమున.

—* అన్యమత నిరసనము *—

సీ. 'జగదుద్గతికిని బీజము ప్రధాన' మన నీ
క్షత్యాది వీకు నశబ్దవాదిం,
బోరి 'నీశుం డేన నా భోగమాత్రే త్యాద్య
దాహృతిస్ఫూర్తి మాయావివాది,
'ఫలియించుం గ్రియయ' నా ఫలమత యిత్యాది
సర్వేశుం గొనని యపూర్వవాది,
'శాస్త్రయోనిత్వా'ది సరణి 'నీశ్వరునిం దె
ల్పెడు ననుమాన' మన్పీలువాది,
తే. 'నిత్యులం దెల్ల నిత్యుం' డన్ను శ్రుత్యురూక్తి
క్షణికసర్వజ్ఞతేషి సౌగత వివాది,
'ననుపపత్తేర్న' యనుసూత్ర మాది యైన
వాణి నృపతీశుం బ్రత్యక్ష వాది, గెలిచె. 8

1. జ...కిన్ - జగత్=లోకముయొక్క ('అథో జగతీ లోకో విష్టపం భువనం జగత్' అమ.) - ఉద్గతికిన్=పుట్టుకకు, ప్రధానము=ప్రకృతి ('ప్రధానం ప్రకృతిః స్త్రియామ్' అమ.), బీజము = కారణము ('హేతు ర్నా కారణం బీజమ్' అమ.), అనన్ = అని సాంఖ్యుండు వాదింపంగా, వీకున్ = విగతేకుని - అనంగా ఈశ్వరుండు జగత్కారణము కాండనువాండును, అశబ్దవాదిన్ - అశబ్ద = (దేనికి వేదశబ్దమే ప్రమాణము కాదో అది) ప్రధానము - వాదిన్ = జగత్కారణ మని వాదించువాండును అగు నాసాంఖ్యుని, ఈక్షత్యాదిన్ = 'ఈక్షతేర్నాశబ్దమ్' లోనగు సూత్రములచేతను, గెలిచెన్; సాంఖ్యమతము సంక్షేపముగా నిట్లు:—

'సంఖ్యాం ప్రకుర్వతే చైవ ప్రకృతిం చ ప్రచక్షతే
తత్త్వాని చ చతుర్వింశత్ తేన సాంఖ్యాః ప్రకీర్తితాః.' భార.

'సంఖ్యా సమ్యగ్వివేకే నాత్మకథనమ్.' విజ్ఞానభిక్షువు.

'మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త।
షోడశక స్తు వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః.' ఈశ్వరకృష్ణుఁడు.

అర్థములు నాల్గుతెఱఁగులు; ఒకటి కేవలప్రకృతి - అదియె ప్రధానాపరనామకము. ఏడుప్రకృతి వికృతులు (=తదుభయములు) - అవి మహత్తు అహంకారము పంచతన్మాత్రలును. పదునాఱు కేవల వికృతులు - పంచమహాభూతములు (=పృథివ్యప్తేజోవాయ్వాకాశములు), పంచజ్ఞానేంద్రియములు (= త్వక్చక్షుఃశ్రోత్రజిహ్వాఘ్రాణములు), పంచకర్మేంద్రియములు (= వాక్పాణి పాదపాయూపస్థములు), అంతఃకరణము, అనునవి. - ఈయిరువదినాల్గును చతుర్వింశతి తత్త్వము లనఁబడును. ప్రకృతియు వికృతియుఁ గానిది (= అనుభయము) పురుషుఁడు. పురుషులు పెక్కండ్రు. ఈశ్వరుఁడు లేఁడు; ప్రకృతి సృష్టి కర్త్రి. దుఃఖ త్రయాత్యంతికనాశము ముక్తి.

'అజా మేకాం లోహితశుక్లకృష్ణాం। బహ్వీః ప్రజాః జనయన్తీం సరూపా
అజో హ్యేకో జుషమాణోఽనుశేతే। జహా త్యేనాం భుక్తభోగా మజోఽన్యః.' శ్వేతా.

'రఙ్గస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్
పురుషస్య త థాత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః.' ఈశ్వరకృ.

ఈమతమును నిరసించిన ప్రకారము:—

బ్రహ్మసూత్రము:-''ఈక్షతే ర్నాశబ్దమ్.' 1; 1, 5 - యస్మిన్ శబ్ద ఏవ ప్రమాణం న భవతి త దశబ్దమ్ ఆనుమానికం ప్రధాన మి త్యర్థః - నతజ్జగత్కారణ వాదివాక్యప్రతిపాద్యమ్ - కుతః - ఈక్షతేః - సచ్ఛబ్దవాచ్యసమ్బన్ధి వ్యాపారవిశేషాభిధాయిన ఈక్షతేర్ధాతోః శ్రవణాత్ - శ్రు. 'త దైక్షత బహుస్యాం ప్రజాయే యేతి.' ఈక్షణ క్రియాయోగ శ్చాచేతనే ప్రధానే న సంభవతి - అతః ఈదృశేక్షణక్షమ శ్చేతనవిశేష స్సర్వజ్ఞ స్సర్వశక్తిః పురుషోత్తమ స్సచ్ఛబ్దాభిధేయః - తథా చ సర్వే ష్వేవ సృష్టిప్రకరణే ష్వీక్షాపూర్వి కైవ సృష్టిః ప్రతీయతే - శ్రు. 'స ఈక్షత లోకా న్నుసృజా ఇతి స ఇమా ల్లోకా నసృజత'. - శ్రు. 'స ఈక్షాం చక్రే' స ప్రాణ మసృజ తే' త్యా దిషు.'' శ్రీభాష్యము.

సృష్టిప్రకరణములం దెల్ల జగత్కారణమునకు ఈక్షణక్రియాయోగము చెప్పఁబడి యున్నది. ఈక్షణము అచేతన మయిన ప్రధానమునకు సంభవింపదు, కావున అది జగత్కారణముగాదు; మఱి తాదృశేక్షణక్షముఁడు చేతనవిశేషము, సర్వజ్ఞుఁడు సర్వశక్తి పురుషోత్తముఁడు, 'శ్రు. సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్...త దైక్షత బహుస్యాం ప్రజాయే యేతి' ఇత్యాదులగు శ్రుతులయందలి సచ్ఛబ్దమునకు వాచ్యుఁడు జగత్కారణము.

2. పొరిన్=దృఢముగా, ఈశుఁడు=ఈశ్వరుఁడు, ఏన=నేనే (జీవాత్మ పరమాత్మలకు అభేదము), నాన్ = అని (యద్వైతి) వాదింపఁగా, మాయావివాదిన్ = మాయయే అనఁగా భ్రమయే జగత్కారణ మని వాదించు నాయద్వైతిని, భో... ర్తిన్ = 'భోగమాత్ర సామ్య లిఙ్గాచ్చ' (ముక్తాత్మలకు జగత్సృష్ట్యాది వ్యాపారములేదు, భోగమాత్రమందే ఈశ్వర సామ్యము) అను సూత్రమును ఉదాహరించెడు స్ఫురణచేత, గెలిచెన్; అద్వైత మతసంక్షేప మేమన:—

మాయ జగత్కారణము, ఆత్మ కాఁడు. పరమాత్మ యొక్కఁడే కలఁడు, ఇతర మేమియు లేదు. జీవాత్మ పరమాత్మలకు భేదము లేదు. దృశ్యమెల్లను (నానాత్వమును భేదబుద్ధియు) ఎండమావులవలె అసత్తు. సత్తమబోధ భ్రమచేత; ఆభ్రమయొక్క ఆత్యంతిక నివృత్తియె మోక్షము:

'స్వప్నమాయే యథా దృష్టే గన్ధర్వ నగరం యథా
తథా విశ్వ మిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః.'
'జీవాత్మనో రనన్యత్వ మభేదేన ప్రశస్యతే
నానాత్వం నిన్ద్యతే యచ్చ త దేవం హి సమఞ్జసమ్.'
'నేహ నా నేతి చామ్నాయా దిన్ద్రో మాయాభి రిత్యపి
అజాయమానో బహుధా మాయయా జాయతే తు సః.'
'సతో హి మాయయా జన్మ యుజ్యతే న తు తత్త్వతః
తత్త్వతో జాయతే యస్య జాతం తస్య హి జాయతే.'
'అసతో మాయయా జన్మ తత్త్వతో నైవ యుజ్యతే
వన్ధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే.'
'స్వప్నదృక్ప్రచరన్ స్వప్నే దిక్షు వై దశసు స్థితాన్
అణ్డజాన్ స్వేదజాన్ వాపి జీవాన్ పశ్యతి యాన్ సదా.
స్వప్నదృక్చిత్తదృశ్యాస్తే న విద్యన్తే తతః పృథక్;
తథా తద్దృశ్యమే వేదం స్వప్నదృక్చిత్త మిష్యతే;
చరన్ జాగరితే జాగ్ర ద్దిక్షు వై దశసు స్థితాన్
అణ్డజాన్ స్వేదజాన్ వాపి జీవాన్ పశ్యతి యాన్ సదా,
జాగ్రచ్చిత్తే క్షణీయా స్తే న విద్యన్తే తతః పృథక్;
తథా త ద్దృశ్య మే వేదం జాగ్రత శ్చిత్త మిష్యతే.' గౌడ. కారి.

'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది మహావాక్యములుం గలవు.

పద్మపురాణమందు శివుఁడు పార్వతికి శైవాదిశాస్త్రముల యసత్త్వము నిట్లుబోధించినాఁడు:-

'శృణు దేవి ప్రవక్ష్యామి తామసాని యథాక్రమమ్,
యేషాం శ్రవణమాత్రేణ పాతిత్యం జ్ఞానినా మపి.
ప్రథమం హి మ యైవోక్తం శైవం పాశుపతాదికమ్
మచ్ఛక్త్యావేశితై ర్విప్రైః సంప్రోక్తాని తతః పరమ్.
కణాదేన తు సంప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్,
గౌతమేన తథా న్యాయం, సాంఖ్యం తు కపిలేన వై.
ద్విజన్మనా జైమినినా పూర్వం వేదమయార్థతః
నిరీశ్వరేణ వాదేన కృతం శాస్త్రం మహత్తరమ్.
ధిషణేన తథా ప్రోక్తం చార్వాక మతిగర్హితమ్.
దైత్యానాం నాశనార్థాయ విష్ణునా బుద్ధరూపిణా
బౌద్ధశాస్త్ర మసత్ప్రోక్తం నగ్ననీలపటాదికమ్,
మాయావాద మసచ్ఛాస్త్రం ప్రచ్ఛన్నం బౌద్ధ మేవ చ
మ యైవ కథితం దేవి కలౌ బ్రాహ్మణరూపిణా,
అపార్థం శ్రుతివాక్యానాం దర్శయన్ లోకగర్హితమ్.
కర్మస్వరూపత్యాజ్యత్వ మత్ర చ ప్రతిపాద్యతే.

సర్వకర్మపరిభ్రంశా న్నైష్కర్మ్యం తత్ర చోచ్యతే;
పరాత్మ జీవయో రైక్యం మ యాత్ర ప్రతిపాద్యతే.
బ్రహ్మణోఽస్య పరం రూపం నిర్గుణం దర్శితం మయా;
సర్వస్య జగతోఽప్యస్య నాశనార్థం కలౌ యుగే,
వేదార్థవ న్మహాశాస్త్రం మాయావాద మవైదికమ్
మ యైవ కథితం దేవి జగతాం నాశకారణాత్.'

దీనిని నిరసించినప్రకారము:—

బ్ర.సూ.—"భోగమాత్రసామ్యలిఙ్గాచ్చ.' 4.4.21. 'బ్రహ్మయాథాత్మ్యానుభవరూపభోగమాత్రే ముక్తస్య బ్రహ్మసామ్య ప్రతిపాదనా చ్చ లిఙ్గా జ్జగద్వ్యాపారవర్జమి త్యవగమ్యతే.. శ్రు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితే' తి. అతో ముక్తస్య పరమపురుషసామ్యం సత్యసంకల్పత్వం చ పరమపురుషాసాధారణనిఖిలజగన్నియమన ప్రత్యానుగణ్యేన వర్ణనీయ మితి జగద్వ్యాపారవర్జ మేవ ముక్తైశ్వర్యమ్." శ్రీభాష్యము.

3. క్రియయ = జ్యోతిష్టోమాదికర్మయే (ఈశ్వరుఁడు కాఁ డనుట), ఫలియించున్ = (ఆకర్మవలన నిష్పన్నమగునట్టి అపూర్వమునది ద్వారముగా) ఫలమొసంగును, నాన్ = అని మీమాంసకుఁడు వాదింపఁగా, సర్వేశున్ = ఈశ్వరుని - కొనని = అంగీకరింపనట్టి - అపూర్వవాదిన్ = అపూర్వమును వాదించెడు మీమాంసకుని, ఫలమత ఇత్యాదిన్ = (ఫలమ్=కర్మఫలము, అతః = పురుషోత్తమునివలన కలుగును, ఏలన, ఉపపత్తేః = అతఁ డిచ్చు ననుటయే యుక్తియుక్తముగా నున్నందున - అను నర్థముగల) 'ఫలమత ఉపపత్తేః' అను సూత్రముచేత గెలిచెను.

సంక్షిప్తముగా మీమాంసక మతస్వరూపము:—

లోకమునకు కర్తయు భర్తయు హర్తయు నగుదేవుఁ డెవఁడును లేఁడు; సకలజనులును నిజకర్మానురూప మయినశుభాశుభఫలములను పొందుదురు. వేదమునకు కర్త లేఁడు, ఏల యన. శబ్దములు నిత్యములు దానికూర్పును నిత్యమే; దాని ప్రామాణ్యము దానివలననే సిద్ధము; అనాదిసిద్ధ మగుదానికి ఇతరమునుండి ప్రామాణ్య మెట్లు కలుగును? ఆద్యంతశూన్య మయిన యీలోకప్రవాహమునందు జనులకు బీజాంకురన్యాయముచేత కర్మవలననే క్రియయెల్లఁ గలుగును, కర్మయు క్రియవలనఁ గలుగును, కావున ఆక్షేపము లేదు.

యజమానుం డొసఁగు నాహుతిని గ్రహించు బ్రహ్మాదిదేవతలు ఆయామంత్రములే యనియు, ఆవియే అన్నియు చరాచరమునకు కార్యవశమున భోగముం గలిగింతురనియు తెలివిడి.

'దేవో న కశ్చి ద్భువనస్య కర్తా । భర్తా న హర్తాపి చ కశ్చి దాస్తే;
కర్మానురూపాణి శుభాశుభాని । ప్రాప్నోతి సర్వోఽపి జనః ఫలాని.
వేదస్య కర్తా న చ కశ్చిదాస్తే, । నిత్యా హి శబ్దా, రచనాస్య నిత్యా
ప్రామాణ్య మస్మిన్ స్వత ఏవ సిద్ధమ్, । అనాదిసిద్ధేః పరతః కథం తత్.
ఆద్యన్తశూన్యేఽత్ర జగత్ప్రవాహే । క్రియాభవే త్కర్మత ఏవ సర్వా;
కర్మాపి పుంసాం భవతి క్రియాతో । బీజాఙ్కురన్యాయతయా న దోషః.
యాగాదికార్యాహుతిభాగభాజో । మన్త్రాత్మకా దేవగణా నియుక్తాః
బ్రహ్మాదయః కార్యవశేన భోగం । కుర్వన్తి సర్వేఽపి చరాచరస్య.' విద్వన్మోద.

మీమాంస ఈశ్వరునొల్ల దనుట నైషధములో ఉపమలో నిట్లు చమత్కారముగా చెప్పఁబడినది,-

'వేదై ర్వచోభి రఖిలైః కృతకీర్తిరత్నే । హేతుం వి నైవ ధృతనిత్యపరార్థయత్నే
మీమాంస యేవ భగవ త్యమృతాంశుమౌళౌ । తస్మి న్మహీభుజి తయానుమతి ర్న భేజే.'
11 స. 64.

ఈమతమును నిరసించిన ప్రకారము.—

బ్ర. సూ. - "ఫల మత ఉపపత్తేః' - '...తుల్యన్యాయతయా శాస్త్రీయ మైహికాముష్మిక మపి ఫలమ్ అత ఏవ. పరస్మాత్ పురుషాద్భవ తీతి సామాన్యేన. - శ్రు. 'ఫలమత ఇత్యుచ్యతే కుత ఏతత్ - (ఉపపత్తేః) స ఏవ హి సర్వజ్ఞః సర్వశక్తి ర్మహోదారో యాగదానహోమాదిభి రుపాసనేన చారాధిత ఐహికాముష్మిక భోగజాతం స్వస్వరూపావాప్తిరూప మపవర్గం చ దాతు మీష్టే - న వ్యాచేతనం కర్మ క్షణధ్వంసి కాలాన్తరభావిఫలసాధకం భవితు మర్హతి.''

4. ఈశ్వరునిన్, అనుమానమే = 'క్షిత్యఙ్కురాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్' అనునట్టి యనుమితి కరణమే (శబ్దప్రమాణము కాదనుట), తెల్పెడున్, అన్ = అను = అని వాదించునట్టి - పీలువాదిన్ = పరమాణు సంయోగక్రమమున జగత్తు ఏర్పడును అని వాదించు వైశేషికుని ('పీలుః ప్రసూనకాణ్డేభద్రుభేద పరమాణుషు' నా. నా.), శాస్త్రయోనిత్వ ఆది సరణిన్ = 'శాస్త్రయోనిత్వాత్' ఇత్యాది సూత్రముల మార్గములచేత, గెలిచెను.

అనుమానమే ఈశ్వర సద్భావమునకు ప్రమాణ మనుటకు తర్కదీపికయందు ఇట్లు విస్తరము :—

"న నీశ్వరస్య సద్భావే కిం ప్రమాణమ్? న తావత్ప్రత్యక్షమ్; తద్ధి బాహ్య మాభ్యంతరం వా? నాద్య మరూపిద్రవ్యత్వాత్; నాన్త్య మాత్మసుఖాది వ్యతిరిక్తత్వాత్. నా ప్యనుమానమ్; లిఙ్గాభావాత్. నాపి శబ్దః, శబ్దస్య వేదాత్మక స్యేశ్వరోక్తత్వేన ప్రామాణ్యా దీశ్వరాసిద్ధౌ తత్ప్రామాణ్యాసిద్ధే రితి చేన్న; క్షిత్యఙ్కురాదికం కర్తృజన్యం కార్యత్వా ద్ఘటవ దిత్యనుమానస్య ప్రమాణత్వాత్, ఉపాదానగోచ రాపరోక్షజ్ఞాన చికీర్షాకృతిమత్త్వం కర్తృత్వమ్, ఉపాదానం సమవాయికారణమ్; సకలపరమాణ్వాది సూక్ష్మదర్శిత్వా త్సర్వజ్ఞత్వమ్.''

పీలువాదము:—

వైశేషికమతము - పరమాణువులు నిత్యములు, వానిసంయోగమువలన పృథివ్యాదిమహాభూతములు జనించును, తద్విభాగమువలన నశించును; తత్క్రమముం జెప్పుచున్నాఁడు.

'నభస్వదన్తాః పరమాణురూపా । నిత్యా, అనిత్యా ద్వ్యణుకాదిరూపాః.
పఞ్చాపి నిత్యా గగనాదయోఽమీ । మనోఽణు రేషాం విభవః పరే తు.' వి. మో. త.

"ఇదానీం కార్యరూప పృథివ్యాది చతుష్టయ స్యోత్పత్తి వినాశక్రమః కథ్యతే. ఈశ్వరస్య చికీర్షావశా త్పరమాణుషు క్రియా జాయతే । తతః పరమాణుద్వయసంయోగే సతి ద్వ్యణుక ముత్పద్యతే । త్రిభి ర్ద్వ్యణుకై స్త్ర్యణుకమ్ । ఏవం చతురణుకాదిక్రమేణ మహతీ పృథివీ మహత్య ఆపో మహ త్తేజో మహాన్ వాయు రుత్పద్యతే। ఏవ ముత్పన్నస్య కార్యద్రవ్యస్య సంజిహీర్షావశా త్పరమాణుషు క్రియా । క్రియయా పరమాణుద్వయవిభాగే సతి ద్వ్యణుకనాశః। తత స్త్ర్యణుకనాశః । తత శ్చతురణుక స్యే త్యేవం మహాపృథివ్యాదినాశః । అసమవాయికారణ నాశా ద్ద్వ్యణుకనాశః। సమవాయి కారణనాశా త్త్ర్యణుకనాశ ఇతి సంప్రదాయః.''తర్కదీపిక.

నాశక్రమము శారీరకభాష్యమున నిట్లు చెప్పఁబడియున్నది:-''విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ. 2. 8. 14. ...విపర్యయేణ తు ప్రళయక్రమోఽత ఉత్పత్తిక్రమాద్భవితు

మర్హతి; తథాహి - లోకే దృశ్యతే యేన క్రమేణ సోపానమారూఢ స్తతో విపరీతక్రమే ణావరోహ తీతి; అపిచ దృశ్యతే మృదో జాతం ఘటశరావా ద్యప్యయకాలే మృద్భావమప్యేతి, అద్భ్య శ్చ జాతం హిమకరకా ద్యబ్భావ మప్యేతీతి । అత శ్చోపపద్యత ఏతద్యత్పృథివ్యద్భ్యో జాతా సతీ స్థితికాల వ్యతిక్రాన్తా వపోఽపీయాత్, ఆప శ్చ తేజసోఽజాతాః సత్య స్తేజ అపీయుః, ఏవంక్రమేణ సూక్ష్మం సూక్ష్మతరం చానన్తర మనన్తరతరం కారణమపీత్య సర్వం కార్యజాతం పరమకారణం పరమసూక్ష్మంచ బ్రహ్మాప్యేతీతి వేదితవ్యమ్ ।''

పీలువాదిమతము శ్రీభాష్యమున నిట్లు నిరస్తమైనది:—

“శాస్త్రయోనిత్వాత్. 1.1.3. శాస్త్రం యస్య యోనిః కారణం ప్రమాణం తచ్ఛాస్త్రయోని - తస్యభావః శాస్త్రయోనిత్వమ్ - తస్మాత్ బ్రహ్మజ్ఞానకారణత్వాత్ శాస్త్రస్య - తద్యోనిత్వం బ్రహ్మణః. అత్యన్తాతీన్ద్రియత్వేన ప్రత్యక్షాది ప్రమాణా విషయతయా బ్రహ్మణ శ్శాస్త్రైక ప్రమాణకత్వాత్ ఉక్తస్వరూపం బ్రహ్మణః - శ్రు. ‘యతో వా ఇమాని భూతానీ’త్యాదివాక్యం బోధయత్యేవే త్యర్థః''-‘ప్రత్యక్షాది’ అన్నచో ఆదిశబ్దముచేత ననుమానము గ్రాహ్యము.

క్షణిక సర్వార్థతా ఈషికా-క్షణిక=క్షణమాత్రము ఉండునవైన - సర్వ = సకలమైన - అర్థతా = పదార్థముల భావమును, ఈషికా = చూచువాఁడైన (సకలవస్తువులును క్షణికము లని తలంచునట్టి - ఈషగతి హింసా దర్శనేషు, ధా. పా.), సౌగతవివాదికా =బౌద్ధమతమునువాదించువానిని - బౌద్ధుని (‘సర్వజ్ఞ స్సుగతో బుద్ధః’ అమ.), నిత్యులం దెల్ల నిత్యుఁడు అన్ = ‘నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్’ అనెడి-శ్రుతి ఉరు ఉక్తికా - వేదముయొక్క మహావాక్యము చేతను, గెలిచెన్. - ‘సర్వార్థతేషికా’ - పా. ‘సర్వజ్ఞతేశ’.

సంక్షేపముగా బౌద్ధమతస్వరూపము:—

“తేచ బౌద్ధా శ్చతుర్విధయా భావనయా పరమపురుషార్థం కథయన్తి। తేచ మాధ్యమిక యోగాచార సౌత్రాన్తిక వైభాషిక సంజ్ఞాభిః ప్రసిద్ధా బౌద్ధా-యథాక్రమం సర్వశూన్యత్వ, బాహ్యశూన్యత్వ, బాహ్యార్థానుమేయత్వ, బాహ్యార్థ ప్రత్యక్షత్వ-వాదా నాతిష్ఠన్తే।సర్వం క్షణికం క్షణికం, దుఃఖం దుఃఖం. స్వలక్షణం స్వలక్షణం. శూన్యం శూన్యమితి భావనా చతుష్టయ ముపదిష్టం ద్రష్టవ్యమ్ ।'' ఇందులకు కారికలు:—

“బౌద్ధానాం సుగతో దేవో విశ్వం చ క్షణభఙ్గురమ్;
ఆర్యసత్త్వాఖ్యయా తత్త్వ చతుష్టయ మిదం క్రమాత్;
దుఃఖమాయతనం చైవ తతః సముదయో మతః
మార్గ శ్చేత్యస్య చ వ్యాఖ్యా క్రమేణ శ్రూయతా మతః.
దుఃఖం సంసారిణః స్కన్ధా స్తేచ పఞ్చ ప్రకీర్తితాః;
విజ్ఞానం వేదనా సంజ్ఞా సంస్కారో రూప మేవచ;
పఞ్చేన్ద్రియాణి శబ్దాద్యా విషయాః పఞ్చమానసమ్.
ధర్మాయతన మేతాని ద్వాదశాయతనానితు;
రాగాదీనాం గణోఽయః స్యాత్ సముదేతి నృణాం హృది
ఆత్మాత్మీయ స్వభావాఖ్యః స స్యాత్ సముదయఃపునః.
క్షణికాః సర్వసంస్కారా ఇతి యా వాసనా స్థిరా
స మార్గ ఇతి విజ్ఞేయః స చ మోక్షోఽభిధీయతే.

ప్రత్యక్ష మనుమానంచ ప్రమాణ ద్వితయం తథా.
చతుః ప్రస్థానికా బౌద్ధాః ఖ్యాతా వైభాషికాదయః.
అర్థో జ్ఞానాన్వితో వైభాషికేణ బహు మన్యతే;
సౌత్రాన్తికేన ప్రత్యక్ష గ్రాహ్యోఽర్థో న బహి ర్మతః;
ఆకార సహితాబుద్ధి ర్యోగాచారస్య సమ్మతా;
కేవలాం సంవిదం స్వస్థాం మన్యన్తే మధ్యమాః పునః;
రాగాది జ్ఞానసంతాన వాసనా చ్ఛేద సంభవా;
చతుర్ణా మపి బౌద్ధానాం ముక్తి రేషా ప్రకీర్తితా.
కృత్తిః కమణ్డలు ర్మౌణ్డ్యం చీరం పూర్వాహ్ణ భోజనమ్.
సంఘో రక్తాంబరత్వం చ శిశ్రియే బౌద్ధభిక్షుభిః''.

బౌద్ధులు సర్వము క్షణికము దుఃఖము స్వలక్షణము శూన్యము అని వాదింతురు. ప్రత్యక్షానుమానములు మాత్రమే వారికి ప్రమాణములు. రాగాదులయు జ్ఞానసంతానముయొక్కయు వాసనాచ్ఛేదమువలన ముక్తి కలుగును.

క్షణికత్వవాదమును ఆత్మనిత్యత్వమును చెప్పెడు శ్రుతులచే ఖండించె నని భా. ఉక్తశ్రుతి:—

''నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్
త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్'' కఠ. 5(13),

నృపతి ఈశుఁ = రాజే ఈశ్వరుఁ డని తలంచునట్టి, ప్రత్యక్షవాదిన్ = ప్రత్యక్షమే ప్రమాణమని వాదించువానిని, 'అనుపపత్తేర్న' అను సూత్రము ఆదియైన - వాణిన్ = వాక్కుచేత (వాక్యములచేతను), గెలిచెన్.

నృపతీశుఁడు చార్వాకుఁడు - తన్మతము సంగ్రహముగా:—

'అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదణ్డం భస్మగుణ్ఠనమ్
బుద్ధి పౌరుష హీనానాం జీవి కేతి బృహస్పతిః'.

''అత ఏవ కణ్టకాదిజన్యం దుఃఖమేవ నరకమ్, లోకసిద్ధో రాజా పరమేశ్వరః, దేహోచ్ఛేదో మోక్షః, దేహాత్మవాదే చ కృశోఽహం కృష్ణోఽహ మిత్యాది సామానాధికరణ్యోపపత్తిః। మమ శరీర మితి రాహోశ్శిర ఇత్యాదివ దౌపచారికః''. సర్వ. ద. సం.

'న స్వర్గో నైవ జ న్మాన్య దపి న నరకో నాప్యధర్మో న ధర్మః
కర్తా నైవాస్య కశ్చిత్ ప్రభవతి జగతో నైవభర్తా నహర్తా
ప్రత్యక్షాన్యన్నమానం న సకలఫలభు గ్దేహభిన్నోఽస్తి కశ్చిత్
(మిథ్యాభూతేసమ స్తేఽప్యనుభవతిజనః సర్వమేతద్ధి మోహాత్.)' స. ద. సం.

ఏతన్మత నిరసనము:—

బ్ర. సూ. - ''అనుపపత్తే స్తు న శారీరః'', 1. 2. 3. ''త మిమం గుణసాగరం పర్యాలోచయతాం ఖద్యోతకల్పస్య శరీరసంబన్ధ నిబన్ధనా పరిమితదుఃఖసమ్బన్ధయోగ్యస్య బద్ధముక్తావస్థస్య జీవస్య ప్రస్తుత గుణలేశసంబన్ధగన్ధోఽపి నోపపద్యతె ఇతి నాస్మిన్ ప్రకరణే శారీరపరిగ్రహాశఙ్కా జాయత ఇత్యర్థః''.

శా. విద్వద్వందితుఁ డాతఁ డిట్లు సుఖ సంవిత్తత్త్వబోధైకచుం
చుద్వైపాయనసూత్రసచ్ఛ్రుతుల నీశు న్మన్ని రూపించి, పైఁ

దద్విష్ణుత్వము దాని కన్య దివిషద్వ్యావర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప మాటాడెన్ బ్రమాణంబులన్. 9

విద్వత్ వందితుఁడు ఆతఁడు=కోవిదులచేత ('విద్వాన్ విపశ్చి ద్దోషజ్ఞః సన్ సుధీః కోవిదో బుధః' అమ.) పొగడఁబడిన ('వది అభివాదన స్తుత్యోః' ధా. పా.) యావిష్ణుచిత్తుఁడు, ఇట్లు = (ర - వ పద్యములోఁజెప్పిన) యీప్రకారంబున, సుఖ...లన్ - సుఖ ఆనంద (స్వరూప) ము ను - సంవిత్ = జ్ఞాన (స్వరూప) మును - ఐన - తత్త్వ = బ్రహ్మముయొక్క ('తత్త్వం విలమ్బ మానేస్యా త్స్వరూపే పరమాత్మని' నానా.) - బోధైకచుంచు = ముఖ్యబోధచేత ప్రఖ్యాత మైన (బోధవు ముఖ్యప్రఖ్యాతి సాధనము లయిన - 'తేన విత్త శ్చుఞ్చుప్చణపౌ' సూ.) - ద్వైపాయన = వ్యాసులయొక్క ("ద్వీప మయనం జన్మభూమి ర్యస్య ద్వీపాయనః - సఏవ - ప్రజ్ఞాద్యణ్ - 'ద్వీపే న్యస్త స్తయా బాల స్తస్మాద్ ద్వైపాయనోఽభవత్' ఇత్యుక్తే వ్యాసే") - సూత్ర = బ్రహ్మస్వరూప ప్రతిపాదక గ్రంథముచేతను —

('అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్
అస్తోభ్య మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః.')—

సత్ = మంచి (=అసందిగ్ధార్థము లయిన) - శ్రుతులన్ = వేదవాక్యములచేతను, మున్ = తొలుత, ఈశున్ = ఈశ్వరుని, నిరూపించి = తెలిపి, పైన్ = తర్వాత, తత్ = ఆయీశ్వరుని యొక్క - విష్ణుత్వము = వ్యాపకత్వమును (వేవేష్టీతి విష్ణుః - విష్ల వ్యాప్తౌ - వ్యాపించువాఁడు - సర్వాంతర్యామి యనుట), దానికిన్ = ఆవ్యాపకత్వమువలన, అన్యదివిషత్ వ్యావర్తనంబున్ = ఇతరదేవతలయొక్క భేదమును, విశిష్ట అద్వైతంబును = ఆతఁడు తద్విశిష్టుఁ డగుటచేత తద భిన్నుఁడుగా నెన్నఁబడుటయు, తేటగాన్ = స్పష్టముగా, తెలుపన్ = బోధించుటకు, ప్రమాణంబులన్ = ప్రమాకరణ వాక్యములచేత, మాట ఆడెన్ = ఉపన్యసించెను.

విద్వత్పూజితుఁ డైన యావిష్ణుచిత్తుఁడు ఉక్తప్రకారంబున సచ్చిదానందస్వరూపుని పరమాత్ముని బ్రహ్మసూత్రోపనిషద్వాక్యములచేత నిరూపించి, అనంతరము ఆపరమాత్మయొక్క సర్వ వ్యాపకత్వమును, తదితర దేవతలయొక్క తదాశ్రితత్వమును, తద్విశిష్టుఁ డగుటంబట్టి యాతఁడు తద భిన్నుఁడుగా వ్యవహరింపఁబడుచున్నాఁ డనియు, బహుప్రమాణములచేత స్పష్టముగా బోధించెను.

సీ. ఆదినారాయణుం డాయె నొక్కఁడ; బ్రహ్మ
లేఁడు, మహేశుండు లేఁడు, లేదు
రోదసి, లేఁడు సూర్యుఁడు, లేఁడు చంద్రుఁడు,
లేవు నక్షత్రము, ల్లేవు నీళ్లు,
లే దగ్ని; యట్లుండ 'లీల నేకాకిత
చనదు; పెక్కయ్యెద ననుచు నయ్యెఁ
జిదచిద్ద్వయంబు సొచ్చి' యని ఛాందోగ్యంబు
దెలిపెడు; నంతరాదిత్యవిద్య

తే. నర్కులోఁ బుండరీకాక్షుఁ డతఁడ యగుట
కక్షిణీ యని యష్టదృక్త్ర్యక్ష దశశ
తాక్ష విధి రుద్ర శక్రాదులందు నొకఁడు
కామి కాశ్రుతియే విలక్షణతఁ దెలిపె. 10

ఆదిన్ = తొట్టతొలుత, నారాయణుండు, ఒక్కఁడ = ఒక్కఁడే, ఆయెన్ = అయియుండెను; బ్రహ్మ = చతుర్ముఖుఁడు,...మహేశుండు = శివుఁడు,...రోదసి = భూమిగాని ఆకాశముగాని, లేదు,...లీలన్ = విలాసముచేత, ఏకాకిత = ఒంటితనము, చనదు = తగదు,...చిత్ అచిల్ ద్వయంబు - చిత్ = చేతనము లయిన జీవులును - అచిత్ =జడములయిన యితరములును - ద్వయంబు = అను నీ రెండుతెగలయందును, చొచ్చి, పెక్కు, అయ్యెన్ = ఆయెను,...ఛాందోగ్యంబు = ఛాందోగ్యోపనిషత్తు, తెలిపెడున్ = బోధించుచున్నది. అంతరాదిత్యవిద్యన్ = అంతరాదిత్య మనెడి విద్యయందు, అర్కులోన్ = సూర్యునియందలి - పుండరీకాక్షుఁడు అతఁడ = ఆనారాయణుఁడే, అగుటకును, అష్ట...దున్ - అష్టదృక్ = ఎనిమిదికన్నులవాఁడు - త్ర్యక్ష = ముక్కంటి - దశశతఅక్ష = వేగంటియు నయిన - విధి = బ్రహ్మ - రుద్ర = శివుఁడు - శక్ర = ఇంద్రుఁడు - ఆదులందున్ = లోనగువారిలో, ఒకఁడు, కామికిన్ = కానందులకును, ఆశ్రుతియే = ఆఛాందోగ్యోపనిషత్తే, అక్షిణీ = రెండుకన్నులు, అని, విలక్షణతన్ = భేదమును, తెలిపెన్.

పద్యమందు పరామర్శింపఁబడిన యుపనిషద్వచనములు.—

"స దేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మే వా ద్వితీయమ్ ... త దైక్షత బహు స్యాం ప్రజాయేయేతి। త త్తేజోఽసృజత త త్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి త దపోఽసృజత... తా ఆప ఐక్షన్త బహ్వ్యః స్యామ ప్రజాయేమ హీతి తా అన్న మసృజన్త..."
ఛాందో, 6, (2).

ఇందు సచ్ఛబ్దముచేత చెప్పఁబడినవాఁడు నారాయణుఁడే అనుటకు నారాయణోపనిషత్తునందు:—

"ఓమ్। అథ పురుషో హ వై నారాయణోఽకామయత। ప్రజాః సృజే యేతి। నారాయణా త్ప్రాణో జాయతే మన స్సర్వేన్ద్రియాణి చ ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ। నారాయణా ద్బ్రహ్మా జాయతే। నారాయణా ద్రుద్రో జాయతే. నారాయణా దిన్ద్రో జాయతే। నారాయణా త్ప్రజాపతిః। ప్రజాయతే। నారాయణా ద్ద్వాద శాదిత్యా రుద్రా వసవ స్సర్వాణి ఛన్దాంసి నారాయణా దేవ సముత్పద్యన్తే। నారాయణా త్ప్రవర్తన్తే। నారాయణే ప్రలీయన్తే। ఏత దృగ్వేదశిరోఽధీతే॥"

ఛాందోగ్యములో అంతరాదిత్య విద్యలో ని ట్లున్నది. "య ఏషో న్తరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వ ఏవ సువర్ణ స్తస్య యథా కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ త స్యోదితినామ। స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యో య ఏవం వేద." 1, 6, (6 - 7).

'లేఁడు మహేశుండు' ఇత్యాది—

'ఏకో హ వై నారాయణ ఆసీ న్న బ్రహ్మ నేశానో నాపో నాగ్నిషోమౌ నేమే ద్యావా పృథివీ న నక్షత్రాణి న సూర్యో న చన్ద్రమాః.' మహోప. 1 అ.

'లీల నేకాకిత చనదు'—

'స ఏకాకీ న రమేత, తస్య ధ్యానాన్తఃస్థస్య...జాయన్తే దశేన్ద్రియాణి.' మహోప. 1 అ.

'ప్రజాపతి ర్వా ఏకోఽగ్రేఽతిష్ఠ త్స నారమ తైక స్స ఆత్మాన మభిధ్యాయ బహ్వీః ప్రజా। అసృజత్.' మైత్రా. ఉ. 2.

'పెక్కయ్యెద ననుచు నయ్యె'—

'సోఽకామయత బహు స్యాం ప్రజాయే యేతి। స తపోఽతప్యత స తపస్తప్త్వా ఇదగ్ సర్వ మసృజత। య దిదం కించ। తత్సృష్ట్వా తదే వానుప్రావిశత్। త దనుప్రవిశ్య। సచ్చ త్యచ్చాభవత్।' తై. ఉ. 2, 6.

'ఏకో దేవో బహుధా నివిష్టః। అజాయమానో బహుధా విజాయతే.' ముద్గలోపనిషత్తు.

'అనే నైవ జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరోత్.' ఛాం. 6, 3.

మ. తుల లేకుండు స్వరూప రూపగుణ భూతు ల్దోఁచు నేతచ్ఛ్రుతిన్;
దల మై లో వెలిఁ దానె యున్కిఁ దెలిపె న్నారాయణం; బారుణం
బుల సామాన్యవిశేషరీతి నిఖిలంబు న్శబ్దజాలంబు ని
ర్మలనారాయణశబ్దమందునె తుద న్పర్యాప్త మయ్యె న్శ్రుతిన్. 11

ఏతత్ శ్రుతిన్ = ఈ ఛాందోగ్యోపనిషత్తునందు, తుల = సాటి - లేకుండు = లేనట్టి - స్వ...ల్ - స్వరూప = (నారాయణునియొక్క) స్వరూపమును - గుణ = గుణములును-భూతుల్ = ఐశ్వర్యములును, తోఁచున్ = అగపడుచున్నవి. దలము ఐ = నిండి, లోన్ = సకల చరాచరములయొక్క లోపలను, వెలిన్ = వెలుపలను, తానె = నారాయణుఁడే, ఉన్కిన్ = ఉండుటను, నారాయణంబు = నారాయణ మనుశ్రుతి, తెలిపెన్ = బోధించెను. శ్రుతిన్ = వేదమందు, ఆరుణంబులన్ = ఆరుణము లనెడి భాగములలో, అఖిలంబున్ శబ్దజాలంబు = (బ్రహ్మేంద్రాది) శబ్దసమూహ మంతయు, సామాన్యవిశేషరీతిన్ = (విశేషశబ్దము లన్నియు సామాన్యమునే చెప్పు ననెడి) సామాన్యవిశేషన్యాయముచేత, నిర్మల నారాయణ శబ్దమందునె = కేవల నారాయణ శబ్దమందే, తుదన్ = కడపట, పర్యాప్తము అయ్యెన్ = పర్యవసాయము బొందెను.

'నారాయణశబ్దమంత్రముతుదన్' - పా.

ఈ ఛాందోగ్యముచేత నారాయణునియందు సాటిలేనివి దివ్యస్వరూప దివ్యమంగళ విగ్రహానంతకల్యాణగు ణైశ్వర్యములు బోధపడినవి. నారాయణీయయాజ్ఞకోపనిషత్తుచేత నారాయణుఁడు అన్నిట లో వెలిఁ దాన యై యున్నాఁ డని తెలిసినది;—

"య చ్చ కిఞ్చి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా
అన్త ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"

శ్రుతియందు ఆరుణములలో బ్రహ్మేంద్రాది సకలశబ్దములును సామాన్యవిశేషముచేత నారాయణశబ్దమందే పర్యవసించుచున్నవి:—

"దేవాదిశబ్దానాం పరమాత్మపర్యన్తత్వ ముక్తం తత్త్వముక్తావళ్యాం చతురన్తరే చ।
'జీవం దేవాదిశబ్దో వదతి తదపృథ క్సిద్ధభావాభిధానం।
నిష్కర్షాకూతయుక్తో బహు రిహ చ దృష్టో లోకవేదప్రయోగః।

ఆత్మాసంబన్ధకాలే స్థితి రనవగతా దేవమర్త్యాదిమూర్తి।
ర్జీవాత్మానుప్రవేశా జ్జగతి విభు రపి వ్యాకరో న్నామరూపే.'' స. ద. సం.

శ్రీమద్రామానుజ విరచిత వేదార్థసంగ్రహంబున:—

''సర్వే శబ్దాః అచిజ్జీవవిశిష్టపరమాత్మనో వాచకాః ఇ త్యుక్తమ్ 'నామరూపేవ్యాకరవాణి' ఇత్యత్ర.''

క. వా 'దపహతపాప్మా ది। వ్యో దేవ' యనంగఁ బరఁగు సూక్తులమీఁదం
బౌ దగు నారాయణపద। మే దేవాంతరము లేమి కీ శ్రుతిఁ దీర్చెన్. 12

'అపహతపాప్మా దివ్యో దేవ' అనంగన్ పరఁగు సూక్తులమీఁదన్ = 'ఏష సర్వభూతాన్తరాత్మాఽఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః [ఏషః = ఈతఁడు, సర్వభూత అన్తరాత్మా = ఎల్లభూతములయు లోపలియాత్మ (అంతర్యామి) - అప...ణః - అపహత = పోఁగొట్టఁబడిన - పాప్మా = పాపములు గలవాఁడు ('అస్త్రీ పఙ్కం పుమా న్పాప్మా' అమ.) - దివ్యః = స్వర్గసంబంధ మైనవాఁడు, ఏకః దేవః = ఒక్క దేవుఁడు, నారాయణః = నారాయణుఁడు] - అను నిత్యాది - సూక్తులమీఁదన్ = మంచి మాటలమీఁద, పాదు అగు నారాయణ పదమే = కుదురుకొనియున్న నారాయణశబ్దమే, ఈశ్రుతిన్ = సుబాలోపనిషత్తులోని పై వాక్యమందు, దేవాంతరము లేమిన్ = నారాయణునికన్న వేఱుదేవుఁడు లేనందున (ఏకశబ్దము చేత లేఁ డని చెప్పఁబడినందున), వాదు = వాదమును, తీర్చెన్ = ముగియఁజేసెను.

అపహతేత్యాది (='సఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః.') సుబాలోపనిషద్వాక్యమందలి నారాయణశబ్దముచేత నారాయణునికన్న వేఱుదేవుఁడు లేఁ డని విష్ణుచిత్తుఁడు సిద్ధాంతము చేసెను.

వ. (1) ''తొల్లి జామదగ్న్యభయంబునఁ బరిత్యక్తరాజ్యుం డై వైరాగ్యంబున దివోదాసాత్మజుం డగు ప్రతర్దనుండు జనార్దను నెఱుంగక యపవర్గకాంక్షనింద్రు నారాధించిన నతండు సన్నిహితుం డై 'మా ముపాస్వ' యనుటయు; (2) మును గర్భమునందుండియు నఖండిత తపస్స్ఫురిత వామదేవుం డగు వామదేవుండు సూర్యోఽహం మను రహం కక్షీవా నహమ్మని శరీరవాచక శబ్దంబు శరీరిపర్యంతంబు పోవుటంచేసి చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముంగూర్చి యనుసంధించెననియుఁ దెలిసి; (3) చేతనుండైన తా జగత్కారణంబు గామి విబుధులం దెల్ల విజ్ఞానవృద్ధుం డగు నా వద్ధ్రశ్రవుండు తదనుసంధాన న్యాయంబున నుపదేశించెనని శ్రుతిసూత్ర ముఖంబుల నిగమాంతశాస్త్ర ఫక్కికఁ జాల వక్కాణింపంబడు; నాత్మయు నవనియు ననల పవన గగన కాల మృత్యు ప్రభృ త్యఖిల చిదచిత్ప్రపంచంబు లతనిశరీరంబు లనియు నంచె వినంబడు; నట్లగుట నశేష దివిషచ్ఛరీరంబు లన్నారాయణ శరీరంబులే కదా, (4) యని ముముక్షువున కప్పుండరీకాక్షుఁ దక్క నేవ్యక్తి నైన నుపాసింపవచ్చునే? విష్ణునకుఁ దత్త్వాల విగ్రహంబు లగుటం

ప్రహ్లా ద రుద్రార్జున వ్యాస భాను భార్గ వాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుల కయుక్తం బని స్మృతి చెప్పు; నదియునుంగాక, యీశ్వరునకుఁ జేతనునకు నిత్యసంబంధంబు 'మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణ' యని సమస్తంబునకుఁ బరాయణంబుగా నతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గల; దట్టి పరమేశ్వరుం గనుటకుం దగిన యోగంబుఁ జెప్పెద; ఖాండిక్య కేశిధ్వజ సంవాదంబు విను" మని యిట్లనియె.

1. తొల్లి = పూర్వకాలములో, జామదగ్న్య భయంబునన్ = పరశురామునివలని వెఱపుచేత, పరిత్యక్త రాజ్యుండై = వదలఁబడిన రాజ్యముకలవాఁడై (రాజ్యము వదలినవాఁడై), దివోదాస ఆత్మజుండు = దివోదాసుని కొడుకు ('ఆత్మజ స్తనయః సూనుః' అమ.),...జనార్దనున్ = శ్రీహరిని, అపవర్గకాంక్షన్ = మోక్షేచ్ఛచేత,...సన్నిహితుఁడై=సమీపగతుఁడై (ప్రత్యక్షమై), మామ్ = నన్ను, ఉపాస్వ = కొలువుము, అనుటయున్ = అన్నవృత్తాంతమును, [తన్నేకొలిచిన వానితో తన్నే కొలువుమనుటయందు అర్థవిశేష ముండవలయును, - తనకంతర్యామి యైన నారాయణుని కొలువు మని యర్థము అని అనంతరవాక్యమున తెల్ల మగుచున్నది - ఈ యింద్ర ప్రతర్దన వృత్తాంతము ఋగ్వేదమందు కాషీతకి బ్రాహ్మణోపనిషత్తున 'ప్రతర్దనో హ వై దైవోదాసి రింద్రస్య ప్రియం ధా మోపజగామ యుద్ధేన పౌరుషేణ చ। తం హేన్ద్ర ఉవాచ ప్రతర్దన వరం తే దదానీతి...మా మేవ విజానీ హ్యేత దే వాహం మనుష్యాయ హితతమం మన్యే యన్మాం విజానీయాం త్రిశీర్షాణం త్వాష్ట్ర మహనమ్...స యో మాం విజానీయా న్నాస్య కేన చ కర్మణా లోకో మీయతే న మాతృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా.' ఇత్యాది గ్రంథమునం జెప్పఁబడియున్నది.]

2. ...గర్భమునందున్ = తల్లికడుపునం గూడ,...అ...డు - అఖండిత = ఎడతెగని - తపః = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులచేత - తులిత = పోలఁబడిన - వామదేవుండు = శివుఁడుగలవాఁడు ('వామదేవో మహాదేవో విరూపాక్ష స్త్రిలోచనః' అమ.),...వామదేవుండు = ఆపేరిముని, అహమ్ = నేను, సూర్యః = సూర్యుఁడను, మనుః = చంద్రుఁడను, కక్షీవాన్ = కక్షీవంతుఁడను పేరిఋషిని ('సోమానం స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే, కక్షీవన్తం య ఔశిజః' అను శ్రుతికి నిరుక్తము - 'కక్షీవన్త మివ య ఔశిజః కక్షీవాన్ కక్ష్యావా నౌశిజః ఉశిజః పుత్రః') ['అహ మ్మని' - అనుకరణంబునం దహ మాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు.], శరీరవాచకశబ్దంబు = దేహమునకు పే రయిన (దేహమును తెలుపున దయిన) శబ్దము, శరీరిపర్యంతంబు = దేహాధిష్ఠాత యైనయాత్మవఱకును, పోవుటంజేసి = అన్వయించుటచేత (దేవదత్తుఁడు బలవంతుఁ డనుచో దేవదత్తశబ్దము దేహమును చెప్పినది, క్రోధనుఁడు అన్నచో ఆత్మను చెప్పినది; అట్లే). (ఇంద్రవాక్యమునందలి 'మామ్' అను నస్మచ్ఛబ్దము), చిత్ అచిత్ శరీరకుండు అగు = చిత్తు లగుజీవులును అచిత్తులగు శరీరములును తన శరీరముగాఁ గలవాఁ డైన - పరమాత్మం గూర్చి, అనుసంధంచెన్ = అన్వయించుకొనెను, అని తెలిసి = (ఇంద్రుఁడు) ఎఱింగి,...

వామదేవుఁడు తల్లికడుపులో నున్నప్పటినుండియు జీవన్ముక్తుఁడు జ్ఞాని యని ఈఋగ్వేదీ యైతరేయోపనిషత్తు చెప్పుచున్నది; - '...గర్భఏవై తచ్ఛయానో వామదేవ ఏవ మువాచ। స ఏవం విద్వా నస్మా చ్ఛరీరభేదా దూర్ధ్వ ఉత్క్రమ్యాముష్మిన్ లోకే సర్వాన్ కామా నాప్త్వాఽమృత స్సమభవత్.'

సకలనామధేయములును ప్రజ్ఞానరూప మయిన పరమాత్మనే చెప్పుచున్నవని - వామదేవాద్యాచార్య పరంపర నిర్ణయించినట్లు ఆయుపనిషత్తునందే తృతీయాధ్యాయమునందు చెప్పఁబడి యున్నది.

'చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముంగూర్చి' —

'ఈశ్వరశ్చిదచి చ్చేతి పదార్థత్రితయమ్;హరిః ఈశ్వర,శ్చిత ఇత్యుక్తో జీవా,దృశ్య మచిత్ పునః.'

'అశేష చిదచిద్వస్తు శేషిణే శేషశాయినే, నిర్మలానన్త కల్యాణ నిధయే విష్ణవే నమః.'

వే. సం. మంగళము.

3. చేతనుండు జీవమాత్రుఁడు,...తాను = ఇంద్రుఁడు,...కామిన్ = కాఁడని, విబుధులందు నెల్లన్ = ఎల్ల దేవతలయందును (లేక - ఎల్ల విద్వాంసులయందును),...విజ్ఞానవృద్ధుండు = విశిష్ట జ్ఞానముచేత ముసలి (జ్ఞానాధికుఁ డనుట),...వృద్ధశ్రవుండు = ఇంద్రుఁడు ('వృద్ధశ్రవా స్సునాసీరః పురుహూతః పురన్దరః' అమ. - వృద్ధేభ్యః శృణోతి - లేక - వృద్ధేషు శ్రవః యశోఽస్య - సాంతముగాన వృద్ధశ్రవసుండు అనియు రూ.), తత్ అనుసంధానన్యాయంబునన్ = ఆపరమాత్మయందు అన్వయ మనుమార్గమున, ఉపదేశించెన్ = ప్రతర్దనునికి నేర్పెను, అని శ్రుతిసూత్రముఖంబులన్ = వేదములును సూత్రములును ద్వారములుగా, నిగమ అంత శాస్త్ర పఙ్క్తికన్ = వేదాంతశాస్త్ర మార్గమందు. చాలన్ = పెల్లుగా, వక్కాణింపఁబడున్ = చెప్పఁబడియున్నది. ఆత్మ = జీవాత్మ, అవని = భూమి, అన...బు = అగ్ని గాలి ఆకాశము కాలము మృత్యువు మొదలయిన సమస్త చిదచిత్ సమూహములు, అతని = నారాయణుని యొక్క....అందే = ఆశ్రుతి సూత్రములందే...ఆశేష దివిష చ్ఛరీరంబులు = సకలదేవతాదేహములు,...శరీరంబుల = దేహములే.

'అన్తఃశరీరే నిహితో గుహాయా మజ ఏకో నిత్యో యస్య పృథివీ శరీరం, యః పృథివీ మన్తరే సంచరన్ యం పృథివీ నవేద, య స్యాప శ్శరీరం,...యస్య తేజ శ్శరీరం, ... యస్య వాయుః శరీరం, ...య స్యాకాశః శరీరం,...యస్య మనః శరీరం,...య స్యావ్యక్తం శరీరం,...య స్యాక్షరం శరీరం,...యస్య మృత్యుః శరీరం,...స ఏష సర్వభూతాన్తరాత్మాఽ పహతపాప్మాదివ్యో దేవ ఏకో నారాయణః.' సుబాలోపనిషత్తు.

4. ముముక్షువునకున్ = మోక్షము కోరినవానికి,...ఏవ్యక్తియైన = ఏమూర్తినిగాని, ఉపాసింపన్ వచ్చునె = సేవింపఁదగదు. తత్తత్కాలవిగ్రహంబులు=ఆయాసమయపుదేహములు, అగుటన్ = అగుటవలన, బ్రహ్మ...బు = చతుర్ముఖుఁడు, హరుఁడు, అర్జునుఁడు, వ్యాసుఁడు, సూర్యుఁడు, పరశురాముఁడు, లోనగువారిసేవ (కార్తవీర్యార్జునోపాస్తి ప్రసిద్ధము), త్రైవర్గికునకుం గాక = త్రివర్గశీలురకు (ధర్మార్థకామములు కోరువారికి) తగినదిగాని, అపవర్గకాంక్షులకున్ = మోక్షేచ్ఛువులకు,...స్మృతి = ధర్మశాస్త్రము,...చేతనునకున్ = జీవునకు,...మాతా = తల్లి - పితా = తండ్రి - భ్రాతా = సహోదరుఁడు - నివాసః = ఇల్లు, శరణమ్ = రక్షకుఁడు - సుహృత్ = చెలికాఁడు - గతిః = గమ్యపదము - నారాయణః = నారాయణుఁడే (ఈసంస్కృతవాక్యము సుబాలోపనిషత్తులోనిది),...పరాయణంబుగాన్ = పరమాశ్రయముగా ('పరాయణ మభిప్రేతే తత్పరే పరమాశ్రయే, అమ.), ఆతనిన్ = నారాయణుని, ప్రతిపాదించు = తెలుపునట్టి-శ్రుత్యంతరము = వేఱుశ్రుతి (సుబాలోపనిషత్తు 6.),...యోగంబు = ఉపాయమును ('యోగః సన్నహనోపాయ ధ్యానసంగతి యుక్తిషు, అమ.),...అనియెన్ (కర్త విష్ణుచిత్తుఁడు).

పూర్వము ప్రతర్దనుఁ డనురాజు పరశురామునికి వెఱచి రాజ్యము వదలుకొని పోయి మోక్షార్థమై ఇంద్రు నారాధింప, నాతఁడు ప్రత్యక్షమై 'నన్నుఁ గొలువుము' అని వచించెను. తన్నే కొలుచుచుండఁగా, తన్నుఁ గొలువు మన్న యభిప్రాయము తన కంతర్యామియగు నారాయణుం గొలువు మనుట. అందులకు ఉపపత్తిగా - శరీరవాచకము శరీరిపర్యంతముం బోవు ననియు, చిదచిద్రూపము లన్నియు నారాయణుని శరీరంబు లగుటంజేసి ఇంద్రాదివాచకంబు లన్నియు తచ్ఛరీరి యగు నారాయణుం జెప్పు ననియు, వామదేవముని యభిప్రాయము. ఇట్లని శ్రుతిసూత్రములందు స్పష్టీకృతము. ఆనారాయణుని సాక్షాదుపాస్తి మోక్షము నొసంగు ననియు, తత్తత్కాల విగ్రహంబులగు బ్రహ్మరుద్రాదుల భజనంబు త్రివర్గఫలము నిచ్చునేగాని మోక్షము నీయం జాల దనియు, స్మృతి చెప్పుచున్నది. మఱియు సమస్తమునకు నతఁడే పరమాశ్రయ మనియు, తల్లి తండ్రి సోదరుఁడు ఇల్లు రక్షకుఁడు చెలికాఁడు గంతవ్యుఁడును నారాయణుఁడె యనియు, సుబాలోపనిషత్తు చెప్పుచున్నది. ఇట్లని పాండ్యునికి బోధించి ఆవిష్ణుచిత్తుండు ఆతేనికి నారాయణదర్శనోపాయముం జెప్పెద నని యీఖాండిక్య కేశిధ్వజ సంవాదముం జెప్పం దొడంగెను.

—* ఖాండిక్య కేశిధ్వజ సంవాదము *—

మ. జనకాఖ్యాఖిలరాజ మొప్పు నిమివంశం; బందు ధర్మధ్వజుం
డను భూజాని మితధ్వజాఖ్య వసుధాధ్యక్షుం జగద్రక్షణా
వనజాతాక్షుఁ గృతధ్వజాఖ్యుఁ గనియెఁ; న్వారిద్దఱు న్గర్మఠుక్
ఘనవిజ్ఞానుఁ గ్రమంబునం గనిరి తత్ఖాండిక్యుఁ గేశిధ్వజున్. 14

జనక ఆఖ్య అఖిలరాజము = జనకు లనెడి సామాన్యనామము గలవారగు సకలరాజులుం గలది, నిమివంశంబు = నిమియను రాజుయొక్క సంతతి, ఒప్పున్ = ఉండెను; అందున్ = ఆవంశములో, ధర్మధ్వజుండు అను భూజాని = ధర్మధ్వజుఁడను పేరిభూపతి, మితధ్వజ ఆఖ్య వసుధా అధ్యక్షున్ = మితధ్వజుఁడను పేరిభూపతిని, జగత్ రక్షణా వనజాత అక్షున్ = లోకమును ఏలుటయందు పుండరీకాక్షుఁ డయిన (విష్ణుతుల్యుఁడైన) - కృతధ్వజ ఆఖ్యున్ = కృతధ్వజుఁ డను పేరు గలవానిని. కనియెను; వారు ఇద్దఱును, క్రమంబునన్ = వరుసగా, కర్మఠున్ = యాగాది కర్మశూరుఁ డైనట్టి, తత్ ఖాండిక్యున్ - ప్రసిద్ధుని ఖాండిక్యుఁ డనువానిని, ఘనవిజ్ఞానున్ = ఎక్కుడుజ్ఞానము గలవాఁ డయిన, కేశిధ్వజున్ - కేశిధ్వజుఁ డను వానిని, కనిరి.

నిమి యనురాజు సంతతిలోనిరాజుల కందఱకును జనకు లని సామాన్యనామము. ఆవంశములో ధర్మధ్వజుఁ డనుతేనికి మితధ్వజుఁడు కృతధ్వజుఁడు అని యిరువురు తనయులు గలిగిరి; మితధ్వజునికి కర్మశూరుఁ డగు ఖాండిక్యుండును, కృతధ్వజునికి మిక్కిలి బ్రహ్మజ్ఞానియగు కేశిధ్వజుఁడును కలిగిరి. - యథాసంఖ్యాలంకారము. 'జగద్రక్షణా వనజాతాక్షున్' రూపకము. 'భూజాని' - భూమి జాయగాఁ గలవాఁడు - బ. స.

క. వా రిరువురు దమలోపల । వేరముగొని, రాజ్యకాంక్ష విజిగీషువు లై
హోరాహోరిగఁ బోరిరి । బారాదిదినంబు లవని ప్రజలు దలంకన్. 15

వారిరువురు = ఆఖాండిక్య కేశిధ్వజులు, రాజ్యకాంక్షన్ - ఒకరిరాజ్యము ఒకరు హరింపవలయునని, తమలోపలన్ - ఒండొరులమీఁద, వేరముగొని = ద్వేషమువహించి (పా. బీరము

గొని = పరాక్రమము వహించి), విజిగీషువులు ఐ = జయింపఁ గోరినవారై, బారాదిదినంబులు = పెక్కుదినములు, అవనిప్రజలు = భూమిలోని జనులు, తలంకన్ = భయపడునట్లుగా, హోరాహోరిగన్ = ఎడతెంపు లేకుండ, పోరిరి = యుద్ధము చేసిరి.

ఆఖాండిక్య కేశిధ్వజులు ఒండొరుల రాజ్యమును హరింపఁగడంగి పెక్కుదినములు జనభయంకర మైన యుద్ధము చేసిరి.—

'బారాది' - 'క. బారాది సొమ్ములుండఁగ । హారముఁ గైకొనుచుఁ జనియె నండజము' పా. 4 ఆ. - పా. బారాని. 'తగు నవిచ్ఛిన్నార్థముగను హోరాహోరి' అం. 3 (72).

చ. పలపల వేఁగ నిచ్చలును బౌఁజులు దీర్చి యతండు నాతఁడున్
వెలువడి వచ్చి, యిక్షుమతివేణిక యేపిరిగాఁగ వీఁగుచున్
దలపడుచుం బెనంగఁగఁ, గృతధ్వజనందన సైనికావళీ
హాళిహాళికిం జెడ న్విఱిగె నార్తి మితధ్వజనందనుం డనిన్. 16

అతండున్ ఆతఁడున్ = ఆఖాండిక్య కేశిధ్వజులు, నిచ్చలును = నిత్యమును (ప్రతిదినము), పలపలవేఁగన్ = తెల్లవాఱఁగానే, పౌఁజులు తీర్చి = దండులను వ్యూహించుకొని, వెలువడి = స్కంధావారమునుండి తరలి, ఇక్షుమతివేణిక = ఇక్షుమతీనదీప్రవాహము ('వేణీ సేతు ప్రవాహయోః దేవతాడే కేశబన్ధే' హేమ.), ఏపిరిగాఁగన్ = హద్దుగా, వీఁగుచున్ = యుద్ధమునుండి పాఱుచును, తలపడుచున్ = మరల యుద్ధమారంభించుచును, పెనంగఁగన్ = పోరఁగా, అనిన్ = యుద్ధములో, కృ...కిన్ - కృతధ్వజనందన = కృతధ్వజునికొడుకైన కేశిధ్వజునియొక్క - సైనిక = సేనాంగములయొక్క - ఆవళి = సమూహముయొక్క - హాళిహాళికిన్ = ధాకకు, ఆర్తిన్ = పీడచేత, మితధ్వజ నందనుండు = ఖాండిక్యుఁడు, చెడన్ విఱిగెన్ = ఓడి పలాయితుఁ డాయెను.

వా రిరువురును ఇక్షుమతీనదికి ఇద్దరిని అద్దరిని విడిసిరి. తెల్లవాఱఁగానే విడిదలలనుండి తమతమ బలములను వ్యూహించుకొని వెలువడి తాఁకుచు రణరంగమునుండి మరల విడిదలల కేడయుచు నిత్యము పోరుచుండఁగా, తుదను కేశిధ్వజుని సేనాంగములధాకకు ఖాండిక్యుఁడు ఆఁగలేక ఆపన్నుఁడై పాఱిపోయెను.

'పౌఁజులు' - పౌఁజుశబ్దము హిందుస్తానీ - దండు అర్థము - బారుగాదు, దండు బారులు తీరి యుండునుగాన బారు లక్ష్యార్థము గానోపు. 'తీర్చి' = జయోచిత క్రమముగా రచించి. 'ఏపిరి' - ఈశబ్దము శబ్దరత్నాకర బ్రౌణ్యములందు లేదు - ఎల్ల అర్థ మని యొకవ్యా. కేవల పిరిశబ్దమేనియు ప్రకృతోపయోగ్యర్థమునం గానఁబడదు. 'విడిపోవు' అనునర్థమున 'పిరియు' అని అఱవ ధాతువు కలదు - తజ్జన్య కృదంతము 'పిరి' (=ఎడఁబాయుతావు) అని ఊహ్యము; ఆపక్షమున ఏకారము అవధారణార్థకము.

క. చెడ విఱిఁగి యడవిఁ బడి, యెడ
నెడఁ గట్టులతుదలఁ గోటి యిడి, లోఁగడకున్
దడుకు వొడిపించి, యాకుల
గుడిసెల వసియించె మంత్రిగురుభటయుతుఁ డై. 17

చెడ విఱిఁగి = పలాయితుఁడై, అడవిన్ పడి=అడవింబట్టి, ఎడనెడన్ = అక్కడక్కడ, కట్టులతుదలన్ = కొండలకొనలయందు, కోటి ఇడి = వేగు ఉంచి, లోఁగడకున్ = అంతరాళముకై, తడుకు పొడిపించి = (పాళెమున కావరణముగా) వెలుగు నాటించి, ఆకుల గుడిసెలన్ = పర్ణకుటీరములయందు, మంత్రి గురు భట యుతుఁడు = మంత్రులతోను గురువులతోను బంటులతోను కూడుకొన్నవాఁడు, ఐ, వసియించెన్ = కాఁపుర ముండెను.

ఆఖాండిక్యుఁడు పరాజితుఁడై అడవికి వలసపోయి దారిపొడుగునను శత్రువులరాకలు తను తెలుకవడుటకై కొండలకొనలయందు కోటికాండ్రను ఉంచి (మొదటికోటికాండ్రు శత్రువులరాకం గాంచి పెద్దజ్వాలచేతనో కూఁతలచేతనో అవలికోటికిం దెలుపుదురు. వారు నట్లే అటుపైకోటికిం దెలుపుదురు; ఈతీరున అవృత్తాంతము త్వరగా వలసపాళెమున కందును.), ఒకచోట పాళెమున కావరణముగా వెలుగునాటించి, ఆవరణములోపల ఆకుగుడిసెలలో ముఖ్యజనులతోఁగూడ నివసించుచుండెను. – 'కోటియిడి' – ఇది పెక్కువ్రాఁతపుస్తకములకు సమ్మతమైన సీతారామాచార్యపాఠము, 'కోవులిడి' అని పూ. ము. పా. ప్రకృతోచితార్థమున 'కోవు' శబ్దము మృగ్యము.

శా. ఆ కేశిధ్వజుఁ డంత నా నృపునిరాజ్యం బెల్లఁ జేర, స్ఫలం
బాకాంక్షింపక 'గెల్తు మృత్యువు నవిద్య, న్బుట్టకుండుం, దుదన్
జా కుందు న్వడి' నంచు యోగనియతిం జ్ఞానాశ్రయుం డై మఖా
నీకంబు ల్రచియించు చం దొకటికిం దీక్షించి తా నున్న చోన్. 18

...అనృపుని=ఆరాజుయొక్క (ఖాండిక్యునియొక్క)... చేరన్ =తనకురాఁగా, ఫలంబు= యజ్ఞాదికర్మలయొక్క ఫలమైన స్వర్గభోగమును, ఆకాంక్షింపక = కోరనివాఁడై, వడిన్ = త్వరగా, అవిద్యన్ = అగ్నిహోత్రాది కర్మచేత, మృత్యువున్ = స్వాభావిక ప్రమాదమును, గెల్తున్ = జయింతును, పుట్టకుండున్ తుదన్ చాకుంగున్ = జననమరణప్రవాహరూప మయిన సంసారమును, తలంగెదను, అంచున్ = అని సంకల్పించుకొని, జ్ఞాన ఆశ్రయుండు ఐ = బ్రహ్మజ్ఞానమునకు అవలంబమై (బ్రహ్మజ్ఞానము నవలంబించి), నియతిన్=నియమముతో (పా. నిరతిన్= శ్రద్ధతో), మఖ అనీకంబులు = జన్నముల ('యజ్ఞః సవోఽధ్వరో యాగః సప్తతన్తు ర్మఖః క్రతుః' అమ.) పరంపరను, రచియించుచున్ =కావించుచు, అందున్ =ఆజన్నములో, ఒకటికిన్ = ఒకజన్నమునకు, దీక్షించి = దీక్షవహించి, తాను, ఉన్నచోన్ = ఉండఁగా.

ఇట్లు రెండురాజ్యములును తనకే చేరఁగా, ఆకేశిధ్వజుఁడు త్వరగా శ్రౌతకర్మచేత స్వాభావిక ప్రమాదమును జయించెదనుగాక, జననమరణ ప్రవాహరూపమై దుఃఖదంబయిన యీసంసారమును దాఁటుదుంగాక, అనఁగా అపవర్గముం బొందెదఁగాక యని, అందులకై బ్రహ్మజ్ఞానాశ్రయుఁడై, స్వర్గభోగాది ఫలాపేక్షమాని, యజ్ఞములు సేయుచుండి, అం దొక్కటికి దీక్షితుఁడై యుండఁగా:—

'కాఙ్క్షన్తాం కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా.'
'న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా;
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.
యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పణ్డితం బుధాః.
త్యక్త్వా కర్మ ఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి యః.' భగవద్గీత.

ఇందువలన కర్మఫలము కోరి చేయువారికి ఆఫలము కలుగును, దానిం గోరక చేయు బ్రహ్మజ్ఞానులకు అపవర్గము కలుగును అని తెల్లము.

అవిద్యచే మృత్యువును జయించును, విద్యచే (=జ్ఞానముచేత) మోక్షముం బొందును:—

'విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే.' ఈశోపనిషత్తు.

చ. పులు మఖశాలికానికటభూముల మేయుచు నేటివెంటఁబె
ల్లలమెడునీరముం దఱిసి యామ్యపతాకన ఘర్మధేను వా
కెళవున నాడువాలభుజగిం గని గోండ్రని యంగలార్చుచున్
గళగతఘంట మ్రోయ నుఱుకం బిడుగుం బలె దాఁకి యుద్ధతిన్. 19

ఘర్మధేనువు = జన్నంపుగోవు ('యజ్ఞః...ఘర్మః - ఇతి పఞ్చదశ యజ్ఞనామాని' - నిరుక్తము), మఖ శాలికా నికట భూములన్ =యజ్ఞశాలకు చెంగటి ప్రదేశములందు, పులు=(రూ. పుల్లు, పిల్లు) పచ్చికను, మేయుచున్, ఏటి వెంటన్ =నది పొడుగునను, పెల్లు=మిక్కుటముగా, అలమెడు=క్రమ్ముకొనియున్న - ఈఱమున్ =పొదను, తఱిసి=సమీపించి, ఆకెళవునన్ =ఆప్రక్కయందు, యామ్యపతాకన్ అ=యమసంబంధియైన ధ్వజమునే (దానివలె ప్రాణభీతిం గొల్పుచున్నదాని ననుట. - రూపకాలంకారము.), ఆడువాల భుజగిన్ =చలించుచున్న ఆఁడుఁబాముంబోలిన (పులి) తోఁకను (ఉపమేయము), కని=చూచినదై, గోండ్రు అని అంగలార్చుచున్ =అఱచుచు, గళగతఘంట = మెడనుబొందిన (అలంకారార్థము మెడలో వ్రేలఁగట్టిన) గంట, మ్రోయన్ = మ్రోఁగునట్లుగా, ఉఱుకన్ = (ఆవు) దుముకఁగా, (ఆపులి), పిడుగుంబలెన్ = పిడుగో యనునట్లుగా (ఉత్ప్రేక్ష), దాఁకి = కొట్టి, ఉద్ధతిన్ = ఉరుటుతో (అని ముందఱికన్వయము).

యజ్ఞశాల సమీపమున ఏటివెంబడి యజ్ఞధేనువు గడ్డిమేయుచుంబోయి ఒక దట్టంపుం బొదను దఱిసి ఆచెంత యముని జెండాయో యన చలించుచున్న పులితోఁకను, ఆఁడుఁద్రాచుం బోనిదానిని కాంచి ప్రాణభీతిచే అఱచుచు దాఁటెను. పులియు పిడుగువలె గోవుం దాఁకెను.

'పతాకన' - 'పతాక అనన్' అని ఛేదించుటలో సంస్కృతీయంబునకు సంధి ప్రశస్తము గాదు, కావున వ్యస్తరూపకముగా గ్రహింపఁబడియె. 'ఘర్మ' శబ్దము ఇట యాగపరముగా వైదికార్థమునం బ్రయోగింపఁబడినది:—'ఘర్మస్వేదేభి ర్ద్రవిణం వ్యానట్' (ఋ. సం. 8. 2, 16, 1), 'సత్యైః కవ్యైః పితృభిర్ఘర్మశా' (ఋ. సం. 7, 6, 18, 4). ధర్మశబ్దము అధ్వరవాచకంబును అగునుగాన 'ధర్మః' అని యేనియు పఠించుకొనవచ్చును - 'అథ ధర్మోఽస్త్రీ పుణ్యే సామాన్య

భావయోః । చాపన్యాయాధ్వరాహింసాయజ్ఞాచార యమేషు వా'. నానా. 'కోళవునన్' - 'కొల వునన్' అని పూ. ము. పా. ఏకవచనమే మేలు, 'భుజగిన్' స్త్రీత్వము చలనా ద్యతిశయోచితము.

ఇచట యాగపశువుగా గోవుం జెప్పుట త్రేతాయుగచరిత్రమున అవిరుద్ధము. గవాలంభము కలియుగమునకు నిషిద్ధ మని స్మృతి:—

'అశ్వాలమ్భం గవాలమ్భం సన్న్యాసం పలపైతృకమ్
దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పఞ్చ వివర్జయేత్.'

పూర్వయుగములలో మహారాజులు పెల్లుగా గవాలంభములు సేయుచుండిరి. చర్మణ్వతీనది ఆకారణముననే ఆనామముం బొందినది.

'వ్యాలమ్బేథాః స్సురభితనయాలమ్భజాం మానయిష్యన్
స్రోతోమూర్త్యా భువి పరిణతాం రన్తిదేవస్య కీర్తిమ్'. మేఘ. ౧ - ౪౯.

ఉ. గబ్బు సమక్షికం బయి మొగం బడువ, న్దరుపర్ణము ల్పడన్
ద్రొబ్బుచుఁ, గార్మొగిళ్లరొదతోఁ జెఱలాడెడు బొబ్బరింతగా
డ్పుబ్బి విసంజ్ఞగాఁగఁ జెవు లూఁదిన, వల్లవుఁ డుర్విఁ ద్రాలఁగా,
బెబ్బులి గొంతుక్రోల్గఱచి పెల్లున మార్మెడ ద్రెళ్ల దాఁటుచున్. 20

గబ్బు = పులినోటిగవులు, సమక్షికంబు = ఈఁగలతోఁ గూడుకొన్నది, అయి, మొగంబు అడువన్ = ఆయావునకు మొగమును మొత్తుచుండఁగాను (శ్వాసమును నిరోధింపఁగా), తరు పర్ణముల్ = చెట్లయాకులు, పడన్ = రాలునట్లుగా, ద్రొబ్బుచున్ = (ఆవును చెట్లబోదెల మీఁదికి) పడఁద్రోయుచు, కార్మొగిళ్లరొదతోఁ జెఱలాడెడు (పా. బురణించెడు) బొబ్బరింత గాడ్పు = నీలమేఘముల యుఱుముతో సాటివచ్చెడు గర్జనగాలి, ఉబ్బి = ఉబికి, విసంజ్ఞగాఁగన్ = విగత సంజ్ఞయగునట్లుగా (సంజ్ఞపోవునట్లుగా - చేతన యెడలునట్లుగా), చెవులు ఊఁదినన్ = (గొల్ల వాని) చెవులలోఁదూఱి శబ్దించుటవలన, వల్లవుఁడు = గొల్ల ('వల్లవః సూపకారే స్యాద్భీమసేనే చ గోదుహి' విశ్వ.), ఉర్విన్ = నేలమీఁద, వ్రాలఁగాన్ = పడిపోవుడు, బెబ్బులి = ఆయుగ్ర వ్యాఘ్రము, గొంతుక్రోల్ = ఆవుయొక్క కంఠనాళమును, కఱచి = కొఱికి, పెల్లునన్ = చెంగున, మార్మెడ = మెడ వేఱుప్రక్కకు తిఱుగునట్లుగా, త్రెళ్లన్ = ఆవు నేలంగూలునట్లు, దాఁటుచున్ = (ఆపులి) దాఁటువైచుచు (ముందటికన్వయము.)

'గబ్బు' - పచ్చిమాంసమే ఆహారమై తల్లేశములు దంతములసందున నిలిచికొని చిరకాల ముండుటచేత గవులు; అందు జనించియుండు పురువులనేని దానినయేని తినుటకై ఈఁగలు ముసురుకొనుటచే 'సమక్షికము'. - చూ. మను.

సీ. 'సెలవుల వనదంశములు మూఁగి నెత్తెవెట్టఁ ।
గ్రోల్పులు ల్పొదరిండ్ల గుఱుకు లిడఁగ.'

'కార్మొగిళ్ల' - నీరుండుటచే నలుపు, నీరిచేతనే ఉఱుము, నీరులేని శరదభ్రమునకు ఉఱు ముండదు; నీరెక్కువయగుకొలఁదిని ఉఱుమునకు గాంభీర్యముహెచ్చు. బహువచనము పులి యొలుంగునంబోలె నానాధ్వనిభేద మిశ్రార్థము. 'చెరలాడెడు బబ్బరింత' - అని బ్రౌనుదొరగారి

పా., వ్రాఁత ప్రతులపాఠమును, - 'పురణించెడు బొబ్బరింత' పూ. ము. పా. 'బబ్బరింత' శబ్దరత్నాకరమందు లేదు, 'విసంజ్ఞ' సంజ్ఞానాశము కలిగినందుననే పల్లవుఁడు వ్రాలుట. 'వ్రాలఁగా' - వ్రాఁత పుస్తకముల పా, 'కూలఁగా' - పూ. ము. పా.; 'క్రోలు' - రూ. క్రోలి. 'మార్తెడ ద్రెళ్ల దాఁటుట' - రక్తము అధికముగా మొత్తముగా తననోటిలోనికి వచ్చుటకును, ఆవుకొమ్ములు తనకు తగులకుండుటకును, ఆవు త్వరగా చచ్చుటకును.

'బెబ్బులి' - దీనికి 'పెద్ద+పులి' అని సీతారామాచార్యులవారి వ్యుత్పత్తి. చిఱుతపులి పెద్దపులి యనునవి పులిజాతులు. 'బెబ్బులి' శబ్దము జాతిమాత్ర వాచకముగాఁ దోఁపదు, ఉగ్ర వ్యాఘ్ర వాచకముగాఁ దోఁచుచున్నది; పులిశబ్దము బహుదేశభాషాసాధారణము. ప్రాకృతమందలి దేశీభాగములోనుం గలదు. 'వగ్ఘ - సీహయా - పుల్లీ.' హేమ. దేశీనామమాల 'పుల్లీ వ్యాఘ్రః సింహ శ్చ' తట్టీక. అఱవమందును తెనుఁగునందును వేఁడిమి యర్థముగా 'వెప్ప' అని శబ్దము కలదు; 'ఉప్ప వెప్పనుంగల యప్పిశితఖండంబులు' మను. 'వెప్పులి' అని ఉగ్ర వ్యాఘ్ర వాచకము అఱవమునం గలదు. అందలి 'వ' వు ఇందు 'బ' యౌండుటయుం గలదు - తె. బెండకాయ - అ. వెండక్కా. తె. బండి - అ. వండి. అట్లే అ. 'వెప్పులి' ఇందు 'బెప్పులి' యై బసాహచర్యముచేతను, ఆంధ్రోచిత సారళ్యముచేతను, 'బెబ్బులి' యైయుండును.

పులి తాఁకఁగానే ఆవునకు దానినోటి గవులుచేతను దానినోటిమీఁది యీఁగలు తన మొగాన ముసురుకొనుటచేతను రోఁతగలిగి ఊపిరి తిరుగకుండెను. దానిని పులి పడఁద్రోయుటలో అది చెట్ల బోదెలమీఁద పడఁగా వానియాకులు రాలుచుండెను. బెడిదంపు టుఱుమువంటి దాని గర్జన చెవులలో ఘూర్ణిల్లినంతట ఆయావును మేపుచున్న గొల్లవాఁడు విసంజ్ఞుఁడై నేల వ్రాలెను. పులి ఆవుగొంతుకపీకను ('పీక' అని శ. ర.) కొఱికి మార్తెడ పడునట్లు చేసెను. స్వభావోక్తి. పద్యభావము ప్రత్యక్షమువోలె నద్భుతముగా నున్నది.

ఆ. తనువుఁ గొమ్ము గొరిజ గొనకుండ మలఁపుచుఁ,
జప్పు డెసఁగఁ దోఁక నప్పళించి,
శోణితంబు గ్రోలుచునె నేర్పుమై ఘర్మ
గవిని గవికి నీడ్చు నవసరమున. 21

(పులి), తనువుఁన్ = తనదేహమునకు, కొమ్ము = ఆవుకొమ్ము, గొరిజ = ఆవుగిట్టయు, కొనకుండన్ =తగులకయుండునట్లుగా, మలఁపుచున్ =ఆవుదేహమును త్రిప్పుచు, చప్పుడు ఎసఁగన్ = శబ్దము కలుగునట్లుగా, తోఁకన్ = తోఁకతో, అప్పళించి = చఱచి, శోణితంబు = రక్తమును ('రుధిరే஽సృగ్లోహితాస్రరక్తక్షతజశోణితమ్.' అమ.), క్రోలుచునె,= త్రాగుచునె, నేర్పుమైన్ = నిపుణతచేత, ఘర్మగవిన్ = యజ్ఞధేనువును, గవికిన్ = గుహకు, ఈడ్చునవసరమునన్ = ఈడ్చుకొనిపోయెడి సమయమునందు.

పిమ్మట ఆపులి తనదేహమునకు ఆగోవుయొక్క కొమ్ముగాని గొరిజగాని తగులకుండునట్లు ఉపాయముగా దానిని త్రిప్పుచు, శబ్దమగునట్లుగా తోఁకతోఁ గొట్టుచు దానిని నిర్వ్యాకులముగా భుజించుటకై గుహలోని కీడ్చుకొని పోవుచుండెను. ఆసమయమునందు,

'అప్పళించు' తద్భవము, 'ఆస్ఫాలించు' తత్సమము.

చ. పొలమరు లంది కూఁత లిడ, భూసురు లన్నదిలోన వార్చి, మ్రాఁ
కుల తుద లెక్కి, చప్పటలు గొట్టి యదల్పఁగ, సాహిణీలు మా
వులఁ బఱపంగ, వైచి సెలవు ల్వెస నాకుచుఁ బోయె వృకమం
డలికయి తేలుచున్ గుటగుటధ్వని సారె మలంగి చూచుచున్. 22

పొలమరులు = పొలము కాపరులు ['పొలమరియనఁగఁ గాపును విశమరిదోఁచు' ఆం. శ (నానా. 49)], అంది = సమీపించి' కూఁతలిడన్ = కేకలు వేయుట చేతను, భూసురులు = బ్రాహ్మణులు, అన్నదిలోనన్ = ఆయిత్తుమతియందు, వార్చి,... సాహిణీలు = రౌతులు, మావులన్ పఱపంగన్ = గుఱ్ఱముల నెక్కి పులిరాకకు వేగముగా తఱిమినందునను, వైచి = (పులి గోవును) విడిచిపెట్టి; సెలవుల్ = పెదవుల మూలలను, నాకుచున్, గుటగుటధ్వని. సారెన్ = మాటిమాటికి, మలంగిచూచుచున్ = వెనుకకుఁదిరిగి పరికించుచు, వృకమండలికయి = చెట్లజీబునుగూర్చి, తేలుచున్ = పొడనూపుచు, వెసన్ పోయెన్ = వడిగా నేఁగెను.

పొలము కాపరులుకూడి యఱచినందునను, బ్రాహ్మణులు ఆపన్నివారణార్థము కృతాచమనులై చెట్లతుదలకెక్కి చప్పటలుకొట్టి బెదరించుట చేతను, రౌతులు గుఱ్ఱముల నెక్కి తనమీఁదికి తఱుముకొని వచ్చుట చేతను, పులి గోవును వదలి మాటిమాటికి వెనుకకుఁదిరిగి చూచుచు, గుటగుట ధ్వని సేయుచు, పెదవిమూలలను నాకుచు, తటాలున చెట్లజీబులోనికి పాఱిపోయెను. 'వార్చుట' - ఆపన్నివారణేప్సిత సిద్ధ్యర్థము.' 'సాహిణీలు' - దీర్ఘాంతరూపము మఱెచ్చటను గనఁబడలేదని శబ్దరత్నాకరము. 'మావుల' - 'తూపులన్' అని పా. 'సెలవు...చూచుచున్' - ఇందుస్వభావోక్తి కలదు, 'సెలవులు నాకుట' తిండికై నోరూఱుట చేత - 'ధ్వని' కోపముచేత, 'మలంగి చూచుట' - మరలంబోయి తెచ్చుకొనుట సాధ్యమో యని కనుంగొనుటకు, 'మండలికి' - కానరాక తప్పించుకొనుటకు - 'గుటగుట ధ్వని' - ఇది సిద్ధసమాసము; కాదేని రెండవటాకు గురుత్వమురాదు. 'ఘుటఘుటధ్వని' - పూ. ము. పా.

క. జొఱజొఱకని నెత్తురు వెలి
కుఱుకుచు రొదసేయ, నఱితి యొడపిన యూర్పుల్
పఱవ, మిడిగ్రుడ్ల వణఁకుచుఁ,
గొఱప్రాణముతోడఁ దన్నుకొను నమ్మొదవున్. 23

జొఱజొఱక అని = జొఱక జొఱక అను శబ్దముతో, నెత్తురు, వెలికిన్ = దేహము నుండి, బయటికి, ఉఱుకుచున్ = ఉబికిపాఱుచు, రొదసేయన్ = చప్పుడుగావించుచుండఁగా, అఱితి యొడపిన్ ఎ=గొంతుగండినుండియే, ఊర్పుల్=నిశ్వసితములు, పఱవన్ = వడివడిగా ప్రసరించుచుండఁగా, మిడి గ్రుడ్లన్ = ముందఱికుఱికిన కనుగ్రుడ్లయందు, వణఁకుచున్ = కంపిల్లుచు, కొఱప్రాణముతోడన్ = కొనయూపిరితో, (గుడిగుడిజీవముతో), తన్నుకొను, అమ్మొదవున్ = ఆధేనువును - స్వభావోక్తి.

'జొఱజొఱ కని' - బ. సీ. పా. 'చుఱుచుఱుకన' పూ. ము. పా. ఈశబ్దము ఈయర్థమున శబ్దరత్నాకరములో లేదు.

సీ. విన్నవించుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త
మడిగె రా; జడిగిన నడుగు మనిరి
వారు కసేరువుఁ దా నెఱుంగక పోయి;
యతఁడును శునకుని నడుగు మనియె;
నతఁడు దాను నెఱుంగ నని పల్కి, 'నృప, విను;
మా ఋత్విజులపిండు నాకసేరు
వేను నెఱుంగ లే; మిఁక నొక్కఁడే మొకా,
దిల మఱి యెవ్వాఁడు నెఱుఁగఁ; డెవ్వఁ
తే. డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్లు
వట్టి పెన్రాలతిప్పలు వట్టి తిరుగు,
నట్టిఖాండిక్యుఁ డొక్కఁడ యరయ నెఱిఁగె
నే నెఱుఁగు; వేఁడు మది కర్జమేని' యనిన. 24

ఋత్విజులన్ = యజమానునివలన ధనసత్కారము పొంది యజ్ఞముచేయించు బ్రాహ్మణులు, ప్రాయశ్చిత్తము = యజ్ఞపుమొదవిట్లు హత మయినదోషమును పోఁగొట్టుకొనునట్టి క్రియ, కసేరువున్ = కసేరు వను పేరి విద్వాంసుని, శునకునిన్ = శునకుఁ డను పేరి విద్వాంసుని, పిండు = సమూహము, సప్తాంగములు = స్వామ్యమాత్య సుహృత్కోశరాష్ట్ర దుర్గబలములు, నీకు నిచ్చి = నీకు లోఁబఱిచి (స్వామి యయినతాను లోఁబడుటయే స్వామినిచ్చుట), చెట్లు = వృక్ష సమూహములను - వట్టి = శూన్యములయిన - పెనురాలతిప్పలు = పెద్దశిలలకొండలను (పా. విరిగి!చెట్లుచెన్నాళ్లు తిప్పలు), పట్టి-ఆశ్రయించి, అరయన్ = మే మాలోచించి చూడఁగా, అది = అతని వేఁడుట, కర్జమేని = కార్యమేని = చేయఁదగినపనియేని, వేఁడుము = అతనిం బ్రార్థింపుము.

యజ్ఞగవి వ్యాఘ్రహత యైనందులకు రాజు ప్రాయశ్చిత్త మడుగఁగా ఋత్విక్కులును కసేరువును తమకు తెలియ దనిరి. శునకముని ఖాండిక్య నడుగు మనియె.

చ. నరపతి పల్కి, 'మౌని వర, నారిపు నిష్కృతి వేఁడఁబోయిన
ధ్వర హతుఁ జేసనేని సవనంపు ఫలం బొడఁగూడుఁ; గా కమ
త్సరగతిఁ జెప్పె నేని మఖతంత్ర మతంత్రముఁ గాక పూర్ణ మౌ;
నిరుదెఱఁగు న్మదీప్సితమె యేఁగెద' నంచు రథాధిరూఢుఁ డై. 25

మానివర = ఓశునకముని, నారిపున్ = నావైరిని (ఖాండిక్యుని), నిష్కృతి = ప్రాయశ్చిత్తము, వేఁడఁబోయినన్ = నే నడుగఁబోయినంతట, (అతఁడు నన్ను), ధరన్ హతుఁ జేసనేని = నేలంగూల్చె నేని (= చంపినయెడల), సవనంపుఫలంబు = యజ్ఞఫలము ('సవనం త్వధ్వరే స్నానే సోమనిర్దళనేఽపి చ' మేది.), ఒడఁగూడున్ = నాకుం జేకుఱును; కాక = అటుగాక (నన్ను చంపక), అమత్సరగతిన్ = ఒకరిమేలును ఓర్చుమార్గమున (ద్వేషబుద్ధిలేక - 'మత్సరోఽన్యశుభద్వేషే తద్వత్కృపణయో రపి' అమ.), చెప్పెనేని = ప్రాయశ్చిత్తమును తెలిపినయెడల, మఖ

తంత్రము = నాయజ్ఞప్రయోగము; అతంత్రము = వికలము, కాక,...మత్ ఈప్సితమె = నాకు ఇష్టమె,...అంచున్ పల్కి = అని వచించి, రథ అధిరూఢుఁడు = తేరు ఎక్కినవాఁడు...ఐ - (ముందటి కన్వయము).

కేశిధ్వజుఁడు 'ఓ మునీంద్రా, నేను ఖాండిక్యుని ప్రాయశ్చిత్త మడుగం బోఁగా అతఁడు నన్ను చంపెనా నాకు క్రతుఫలము దక్కును, సాధుత్వముచే ప్రాయశ్చిత్తము చెప్పెనా నాక్రతువు సంపూర్ణముగా ఈడేఱును. రెండువిధములను నాకు మేలే, కావున అతనికడకే పోయెదను' అని పలికి రథ మెక్కెను. - వికల్పాలంకారము.

ఈపద్యములో 'పల్కె.' అని సమాపకక్రియగా పూ. ము. పా.; ఆపాఠమున 'రథాధిరూఢుఁడై' అనుచోట అగుధాతువునకుం గర్త యుండదు; పల్కుటయే పూర్వకాలికము గావలయు, కావున 'పల్కి' అని మార్పుచేయఁబడినది.

క. హరిణాజినోత్తరీయుఁడు
నిరాయుధుఁడు నగుచు నతని నెల వగు నడవిన్
జొరఁ, గొట్టికాండ్రు డెక్కెముఁ
బరికించి, యెఱింగి, కలయఁబడి, కూఁత లిడన్. 26

హరిణ...డు. - హరిణ అజిన = జింకతోలు - ఉత్తరీయుఁడు = పైవస్త్రముగాఁ గలవాఁడును, నిరాయుధుఁడును = కైదువులులేనివాఁడును, అగుచున్ (కేశిధ్వజుఁడు కర్త), అతని నెలవు = ఖాండిక్యునిమనికి, అగు = అయిన - అడవిన్ = అరణ్యమును, చొరన్ = ప్రవేశింపఁగానే, కొట్టికాండ్రు = వేగులవాండ్రు [పా. కోటి], డెక్కెమున్ = ఇతనితేరిజెండాను, పరికించి = కని, ఎఱింగి = ఇతఁడని తెలిసికొని, కలియఁబడి = కలసి మొత్తముగా, కూఁత లిడన్ = వలసవారికి తెలియునట్లుగా కూఁతలు పెట్టఁగా.

కేశిధ్వజుఁడు జింకతోలు ఉత్తరీయముగాఁ దాల్చి, కైదువులేక ఖాండిక్యుని నివాసమయిన యడవి కేఁగఁగా, కొండకొనల నున్నకొట్టికాండ్రు జెండాను చూచి యితఁడని యెఱిఁగి కూఁతలిడి వలసవారికిం దెలియఁబఱిచిరి.

ఆ. వలస బెదర, నృపతి కలఁగక ప్రజవగ
లార్పఁ బనిచి, కనుమలందు నిలువ
వేలు వేఱ యేర్చి విలుమందిఁ బనిచి, తాఁ
దడుకు పెండె మలుక వాడమ వెడలి. 27

వలస = వలసవచ్చియున్న జనులు, బెదరన్ = భయపడఁగా, నృపతి = ఖాండిక్యుఁడు, కలఁగక = కలఁతపడక, ప్రజవగలు = ప్రజయొక్క దుఃఖములను [- పొగలు పా. పొగలు అని నామవాచకము వ్యగ్యము], ఆర్పన్ = పోఁగొట్టుటకు, పనిచి = తగినవారిని నియమించి, కనుమలందున్ = కొండలసందుత్రోవలందు, నిలువన్ = వైరులను ఎదురుటకై కనుపెట్టుకొనియుండుటకు, వేలువేఱ = వెవ్వేలుగా, విలుమందిన్ = విలుకాండ్రబలమును, ఏర్చి = ఏర్పరించి (ఈయాకనుమయందు వీరువీరు ఉండవలసిన దని నిర్ధారించి), పనిచి = ఆయా కనుములకుంబంపి,

తాన్. అలుక, పొడమన్ = పుట్టఁగా (కోపముతోఁ గూడుకొన్నవాఁడై), తఱుకు పెంఱెము వెడలి = వెలుగునకు వైచిన పలుగాఁడితలుపును తెఱచికొని వెలువడి.

వలసవచ్చియున్నవారు తమ్ము సంహరింప శత్రువు వచ్చుచున్నాఁ డని భయపడఁగా ఖాండిక్యుఁడు వారిభయమును తీర్చుటకు కొందఱ నియమించి వైరిసేనలరాక నడ్డగించుటకై వేఱువేఱు కనుమలకు వేఱువేఱు విలుకాండ్రను పంపి తాను కోపోద్దీపితుఁడై కంపకోటయొక్క పెంఱెముం దెఱచికొని వెడలినవాఁడై.

క. వచ్చు రిపుఁ జూపులనె చుఱు
వుచ్చుచు, సిరిఁ గొనుట మగుడఁ బొడముట రుష ము
చ్చిచ్చున లావెచ్చఁగ వి
ద్యుచ్చలచాపమునఁ దూపు దొడుగుచుఁ బలికెన్. 28

వచ్చు (చున్న) - రిపున్ - పగతుని, చూపులనె=తనదృష్టులచేతనే, చుఱువుచ్చుచున్ = కాల్చుచు, సిరిన్ = (తన అనఁగా ఖాండిక్యుని యైశ్వర్యమును, కొనుటన్=హరించుటచేతను, మగుడన్ = వెండియు, పొడముటన్ = జనించుట (వచ్చుట) చేతను, రుషన్=కోపముచేతను, ముచ్చిచ్చునన్ = ఈమూఁడు ననెడి మూఁడుచిచ్చులచేత, లావు ఎచ్చఁగన్ = బలము అతిశయింపఁగా, వి...నన్ - విద్యుత్ = మెఱుపువలె - చల = చలించుచున్న - చాపమునన్ = వింటియందు (ఒండె - చాపలతన్ = తీఁగవంటి వింటియందు), తూపు దొడుగుచున్ = అమ్మును సంధించుచు, పలికెను.

వచ్చుచున్న శత్రువును చూపులచేతనే దహించుచు, తనసిరిం గొనుటచేతను, మరల తన మీఁదికి వచ్చుటచేతను, తనకోపముచేతను - ఈమూఁడునిప్పులచేతను కలిగిన బలముకలవాఁడై మెఱుపువలె చంచల మయినవింట నమ్మేర్చుచుం బలికెను. 'సిరిఁగొనుట...ముచ్చిచ్చునన్' వ్యస్త రూపకము.

'ముచ్చిచ్చునను వెచ్చమరి' పూ. ము. పా. (వెచ్చ = వేఁడి - అమరి = కలిగి. - 'ముచ్చిచ్చున లావెచ్చఁగ' అనియు పా.); 'చాపలత' - 'చాపజ్య' పూ. ము. పా. ఇందు 'జ్యా'శబ్దము ఏకాక్షర మగుటచేత 'జ్య' - అని హ్రస్వము అశాస్త్రీయము. మఱి 'చాపలతన్' అనుపాఠములో నారిని చెప్పవలదా యనిన, వలదు; 'వింట నమ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుమ' అని పాండురంగమాహాత్మ్యము. 'విద్యుచ్చలధను మూర్వి' అనియేని పఠింపవచ్చును. ధనుశ్శబ్దము ఉకారాంతమును గలదు. 'ధనుః పుమాన్ రాశిభేదే ప్రియాళద్రౌ శరాసనే' ఇతి నానార్థేషు మేదినీ.' - అని రామాశ్రమి. పీఠికయందు దీనిచర్చం గనుఁడు.

మ. ధన ధాన్య ద్విర దాశ్వ గోగణ సమేతం బెల్ల సామ్రాజ్యమున్
గొనియుం జాలక తాటకేయ పలభు కృటాకృతిం జింకతో
లున నాచ్ఛన్నుఁడవై ప్రశాంతుగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులున్
గొన నేతెంచెదె? దుర్మతీ, కెడపెద స్గూరంపు భల్లంబునన్'. 29

దుర్మతీ = ఓరిదుష్టబుద్ధీ, ధన...బు = ధనములు ధాన్యములు ఏనుఁగులు (ద్వౌ రదౌ యస్య సః = రెండుకోఱలు కలది) గుఱ్ఱములు పసులమందలు - వీనితో కూడుకొన్నట్లుగా, ఎల్ల

సామ్రాజ్యముఁ = సకలైశ్వర్యమును, కొనియుఁ = హరించియును, చాలక = తనివి తీఱక, తా...తిఁ - తాటకేయ = తాటకాసురుఁడగు మారీచుఁ డను - పలభుక్ = పొలదిండియొక్క ('పల మున్మానమాంసయోః' నానా.) - కూట ఆకృతిఁ = మాయ రూపుతో

['మాయానిశ్చలయన్త్రేషు కైతవానృతరాశిషు।
అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గే కూటమస్త్రియామ్.'],

జింకతోలునఁ, అచ్ఛన్నుఁడవు = కప్పఁబడినవాఁడవు, ఐ, ప్రశాంతుగతిఁ = కామక్రోధాద్యరిషడ్వర్గము ఉడిగినవానివలె,...కొనఁ = హరించుటకు, ఏతెంచెద = వచ్చుచున్నావా? క్రూరంపుభల్లంబునఁ = తీక్ష్ణమయిన బల్లెములో, కెడపెదఁ = నిన్ను పరిమార్చెదను.

ఓయిదుష్టుఁడా, ధనధాన్యాదికమయినమదీయైశ్వర్యము నంతయు హరించియుం దనియక, మారీచాకృతిగా జింకతోలు దాల్చి ప్రశాంతవేషంబున మాలోఁ జొచ్చి తఱివేచి మాప్రాణములంగూడ హరింప వచ్చుచున్నావా? ఇదె నిన్ను వాఁడిబల్లెముతోఁ గూల్చెదను.

'గోగణ' - 'గోధన' అను పూ. ము. పాఠమున ధనశబ్దము రెండుమార్లు వచ్చిన దని ఇందు 'గణ' అని మార్పఁబడినది. 'సామ్రాజ్య' - పా. 'సామగ్రి.' 'తాటకేయ పలభుక్కూటాకృతిఁ'- పదార్థవృత్తి నిదర్శన. మారీచుఁడు జింకవేషమున వచ్చి శ్రీరాములను వంచించినకథ నిట నను సంధించుకొనవలయును. 'ఏతెంచెద' - పా. 'ఏతెంచితె'

మహాస్రగ్ధర

అనినం, జేయెత్తి, "యోహో, యలుగక విను; కా నాతతాయి, న్బ్రమాదం
బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ, నే భూసురశ్రేణి వేఁడఁ,
నిను నావేదించి పంపె; 'న్నృప, యతఁడెఱుఁగు న్నిష్కృతి; న్వేఁడు పోపొ'
మ్మని, కోప మ్మైన రోప మ్మయిన విడువు; మె గ్గైన మే లింక" నన్నఁ. 30

అనినఁ = ఖాండిక్యుఁడు ఇట్లు పలుకఁగా. (కేశిధ్వజుఁడు), చే = హస్తమును,...కాను ఆతతాయిఁ=చంపవచ్చినవాఁడను ('ఆతతాయీ వధోద్యతః' అమ.) కాను, ప్రమాదంబునఁ = మాయేమఱుపాటు చేత, యాగంబున వైకల్యంబు పొడమినఁ, నేఁ...శ్రేణిఁ = సమూహమును, వేఁడఁ = (ప్రాయశ్చిత్తమును) అడుగఁగా, (ఆభూసుర సమూహము),. నినుఁ ఆవేదించి = నిన్ను నిర్దేశించి, పంపెఁ = నన్నుపంపెను,...రోపమ్ము = బాణము ('పత్త్రీ రోప ఇషు ర్ద్వయోః' అమ.)...

ఖాండిక్యుఁ డిట్లు పలుకఁగా, కేశిధ్వజుఁడు చే యెత్తి ఇట్లు బదులు చెప్పెను;—నేను నిన్ను చంప రాలేదు. నాకు ప్రమాదంబున యాగములో వైకల్యము సంభవించినది. అందు లకుం బ్రాయశ్చిత్తము నేను ఋత్విగాదుల నడుగఁగా, వారు నీ వయినం జెప్పఁగల వని తెలిపి నీకడకు న న్నంపిరి. ఇది వృత్తాంతము; నీవు నాపై కోపము విడిచి ప్రాయశ్చిత్తము చెప్పినను సరియే, వైరి నగుట నన్నుఁ జంపినను సరియే.

'చేయెత్తుట' - హెచ్చరికతెలుపు. 'పంపెఁ' - శ్రేణి కర్తగాన ఏకవచనము.—'కోపమ్మయిన రోపమ్మయిన విడువుము' - వికల్పాలంకారము.

ఆతతాయిని కా నని చెప్పుకొనుట యేలన, ఆతతాయిని అవిచారితముగా పరిమార్పవలయు నని ధర్మశాస్త్రము.

'గురుంవా బాలవృద్ధౌవా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్
ఆతతాయిన మాయాన్తం హన్యా దే వావిచారయన్.' మనుస్మృతి.
(ఈ క్రింది యాఱుగురకు ఆతతాయిసంజ్ఞ—
'అగ్నిదో గరద శ్చైవ శస్త్రోన్మత్తో ధనాపహః
క్షేత్రదారహర శ్చైతాన్ షడ్విద్యా దాతతాయినః.' శుక్రనీతి).
'పోపొమ్ము' = పొమ్ముపొమ్ము - 'ఆమ్రేడితమందు మధ్యమ ముదుగ్గులకు లోపము విభాష నగు.' బా. వ్యా. సం. 48.—ద్విరుక్తి ఆదరాతిశయముచేత.

వ. అనిన, నతండు తరుషండంబు సొచ్చి, మంత్రి పురోహిత ప్రభృతి సుహృజ్జనంబులకుఁ దద్వృత్తాంతం బంతయుం జెప్ప, మంతనంబునకుం జొచ్చిన మంత్రు లి ట్లనిరి. 31

అతండు = ఖాండిక్యుఁడు, తరు షండంబు = వృక్షముండలిని ('షణ్డః స్మృతో బలీవర్దే షణ్డం తు కాననే భవేత్' అజయ.),...మంతనంబునకున్ = ఆలోచనకు,...

క. "పాలుగలవాఁడు మన కొక | జాలి యిడక తానె తారసానకు వచ్చెన్;
వేళ యిదె, లెమ్ము, నృప, కృప | చాలు, న్గారాకు మేసి చంపకు ప్రజలన్. 32

పాలుగలవాఁడు = దాయాదుఁడు, ... జాలి = ఖేదమును, ఇడక = కలిగింపక, తారసానకున్ = సమీపమునకు,...కృప చాలున్ = వైరిమీఁద కరుణ వహింపకుము,...గారాకు = ముదురాకులు.

దాయాదుఁడు మన కేశ్రమయు కలిగింపక సమీపమునకు వచ్చియున్నాఁడు, వానిం గూల్చుట కిదియే సమయము; ఓరాజా, వానిపై కరుణింపకుము. వానివలన ఈ ప్రజలు ఇట బ్రదుకకై గారాకులు మేయుచున్నారు. వానిం గూల్చి వీరి కీకష్టమును తొలఁగింపుము.

'గారాకు' - అడవిలో మంచిభోజనము దొరకక ఆకలములు మేసి జీవించుచున్నా రనుట.

ఉ. అంటలు గట్టి చెల్కలకు నాండ్రును బిడ్డలుఁ గూరఁగోయఁ బోఁ,
గంటకము ల్పదాబ్జములఁ గాఁడ నొదర్చిన నొప్పిఁ గూయిడన్,
గంటికి నిద్రగానకొదుఁగంబడి వేఁగెద మిందు; నొక్కమా
కంటయ కాదు; నీవు నడునట్టియవస్థ వచింప శక్యమే? 33

ఆండ్రును = (మా) భార్యలును, బిడ్డలును, అంటలు గట్టి = గుంపులు కూడి, చెల్కలకున్ = చెలకలకున్ = బీటి నేలలకు,...కంటకముల్ = ముండ్లు, పద అబ్జములన్ = అడుగుఁదమ్ములయందు, కాఁడన్ = గ్రుచ్చుకొనఁగా, ఒదర్చిననొప్పిన్ = ఊడలాగినబాధచేత, కూయిడన్ = ఏడ్చుచుండఁగా, ఒదుఁగంబడి = ఒదిఁగి, వేగెదము = తపించుచున్నాము, ఇందున్ = మనలో, ఒక్కమాకున్ అంటయకాదు = మాకుమాత్రమే ఈకడగండ్లనుటయే గాదు....

మాభార్యలును బిడ్డలును బీళ్లకు కూరఁ గోసికొనుటకు పోఁగా, కాళ్లలో ముండ్లు గ్రుచ్చుకొనఁగా, వానిని ఊడలాగిన నొప్పిచే వారు రాత్రి అంతయు నేడ్చుచుండుటచేత, మాకు నిద్ర

పట్టుట లేదు. ఈకష్టము మాకుమాత్రమే అని మేము చెప్పుకొనుటగాదు, నీవు పడుచున్న దురవస్థను వర్ణింపఁదరమా? - మాకొఱకును నీకొఱకునుంగూడ ఈపగతుని సంహరింపు మనుట. - స్వభావోక్తి.

'చెల్కలకున్' - 'చేలకును' పూ. ము. పా. 'పదాగ్రముల' పూ. ము. పా. 'పదాబ్జముల' సీ. పా. - స్త్రీలయొక్క బిడ్డలయొక్క పాదములుగాన మృదుత్వమును సూచించుటకు అబ్జోపమ; అగ్రముననే కంటకములు గ్రుచ్చుకొను నను నియమము లేదు. 'కాఁడ నొదర్చిన' - వ్రాఁత ప్రతులపా., సీ. పా.; 'కాఁడఁగఁదూసిన' పూ. ము. పా. 'కూయిడన్' - ఇత్వసంధి - 'కూయుడున్' అని పఠించిన సరిపడును. 'అయ్యోడున్' అని యొక పా.

తే. స్వామ్యమాత్య సుహృత్కోశ జనపద బల
దుర్గములు స్వామి గలిగినఁ దొలుతఁ గలవు;
అంగి సుఖియైన నంగంబు లటకు మును పె
చాల సుఖు లౌట మనకు దృష్టంబు గాదె? 34

స్వా...లు - స్వామి = ఱేఁడు ('స్వామీ త్వీశ్వరః పతి రీశితా' అమ.), అమాత్య = మంత్రులు ('మన్త్రీ ధీసచివోఽమాత్యః' అమ.) - సుహృత్ = మిత్రులు ('అథ మిత్త్రం సఖా సుహృత్' అమ. - సుహృద్దుర్హృదౌ మిత్త్రామిత్రయోః' సూ. - అన్యత్రి సుహృదయః దుర్హృదయః' - అని సి. కౌ.) - కోశ = బొక్కసము ('కోశోఽస్త్రీ కుట్మలే ఖడ్గపిధానేఽర్థౌఘ దివ్యయోః' అమ.) - జనపద = రాష్ట్రము - బల = చతురంగబలములు ('బలం సైన్యం' రామాశ్రమి.) - దుర్గములు = కోటలు, (అనునివి), స్వామి గలిగినన్ = ఱేఁడు ఉండెనేని, తొలుతన్ కలవు = అంతకుముందే సిద్ధముగా నుండును; అంగి = అవయవి (శరీరి = ఆత్మ), సుఖి ఐనన్ = సుఖముగా నుండినయెడల, అంగంబులు=అవయవములు,...దృష్టంబు = ప్రత్యక్షాను భూతము...

సప్తాంగములలో రాజు కలిగినేని కడమయంగములు అప్పుడే కలవు. ఆత్మ సుఖముగా నున్న అవయవములు సుఖముగా నుండుట ఎఱిఁగినదేగదా. - కావున నీసిద్ధిని ముందుగా చూచుకొనవలసిన దని భా. - అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసంబును.

క. అతనిపని దీర్ప రాజ్య । ద్వితయము నినుఁ జేరు; నెట్టివెరవున నైనన్
క్షితిపుల కరిజయము ధనో । న్నతియుఁ బ్రజాసదయరక్షణము ధర్మంబుల్. 35

అతనిపని దీర్పన్ = ఆతనిం జంపినయెడల, రాజ్య ద్వితయము = రాజ్యములదోయి= రెండు రాజ్యములును,... వెఱవునన్ = ఉపాయముచేత,... క్షితిపులకున్ = భూపతులకు, అరిజయము= శత్రువులను జయించుటయు, ధన ఉన్నతియున్ = ధనవృద్ధియు, ప్రజా సదయ రక్షణమున్ = ప్రజలను దయతోఁ గాపాడుటయు, ధర్మంబుల్ = విహితకృత్యములు.

అతనిం గెడపెదేని రెండురాజ్యములును నీకే వచ్చును. ఏయుపాయముననేని వైరులం దునుముటయు, ధనవృద్ధి కావించుకొనుటయు ప్రజలను దయతోఁ గాచుటయు రాజధర్మములు.— కావున అవి నీకును ధర్మములు అనుట. అప్రస్తుతప్రశంస.

'సదయ' వ్రాఁతపా. - 'నీతి' పూ. ము. పా.

క. అన్యాయంబున దుస్సహమన్యుం । డగు ప్రబలరిపుని మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి । సన్యాయంబుగఁ బ్రజాళి సంరక్షింపన్. 36

దుస్సహమన్యుండు=సైఁపరాని క్రోధముగలవాఁడు ('మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి' అమ.)' అగు - ప్రబలరిపుని=బల్లిదుఁ డయినశత్రువును, మడియించిన ధర్మన్యక్కృతికిన్ = పరిమార్చినందుచేత నగు నధర్మమునకు (ధర్మ - ధర్మముయొక్క - న్యక్కృతి = క్రిందుపఱుచుట), ప్రజా ఆళిన్ = జనసమూహమును. సన్యాయంబుగన్ = సమంజసముగా, సంరక్షింపన్ = పరిపాలించుటచేత, నిష్కృతి = ప్రాయశ్చిత్తము, అగున్.

ద్రోహియు బల్లిదుఁడు నయిన శత్రువును అన్యాయముగా వధించినపాపము ప్రజలను చక్కఁగా పాలించుటచేత తొలఁగును. సామాన్యముగా చెప్పినమాట విశేషముగా ఈరాజునకును ఇతని యావైరికిని అన్వయించుచున్నదిగాన అప్రస్తుత ప్రశంసాలంకారము.

'అన్యాయంబునన్' - ఇచట నఞ్ఞునకు విరోధ మర్థము - న్యాయవిరుద్ధముగా ననుట.

క, తనరాష్ట్రము చెడ వచ్చిన । ననిమిషపతి విప్రుఁ డనక యాచార్యుఁ ద్రిశీ
ర్షునిఁ దునుమఁడె? విడువుము దయ; । నిను నమ్మిన ప్రజలు నవయ నీదయ యేలా?

అనిమిషపతి=ఇంద్రుఁడు, తనరాష్ట్రము = ఇంద్రునిదేశము, చెడన్ వచ్చినన్=చెడునట్లు సంభవింపఁగా, విప్రుఁడు అనక = బ్రాహ్మణుఁ డని సంకోచింపక (బ్రహ్మహత్యకు వెఱవక), ఆచార్యున్ = గురువైనట్టి, త్రిశీర్షునిన్ = విశ్వరూపుని, తునుమఁడె = చంపలేదా ('తం హేన్ద్రౌ ఉవాచ ...యస్త్వాం విజానీయాం త్రిశీర్షాణం త్వాష్ట్రమహానమ్' అని కౌషీతకి బ్రాహ్మణోపనిషత్తు.), దయన్ = పగతునిమీఁది కృపను, ...నవయన్ = (అన్నములేక) కృశించుచుండఁగా, ...

ఇంద్రుఁడు త్రిశీర్షునిచేత తనదేశమునకు చేటు కలుగనుండఁగా, వానిని విప్రుఁ డనియేని గురుఁ డనియేని విచారింపక తునుమలేదా? అట్లే నీవును ఇతనిం దునుమవలయును. నీజనులకు ఇతనివలన అన్న లోపము కలుగుచుండఁగా ఇతనియందు నీవు దయయుంచుట సరిగాదు. సమయాన నుపయోగపడని నీదయ నీ ప్రజలమీఁద నీకు ఉన్నమాత్రాన నేమి ప్రయోజనము?

క. శిష్టు నిను నింతఁ జేసిన । దుష్టాత్మునిఁ బిలుకు మార్చి, దురితము పిదపన్
నష్టంబుగ, భూవల్లభ, । యిష్టాపూర్తములు సేసి యొసఁగఁగ రాదే? 38

భూవల్లభ = ఓరాజా, శిష్టున్ = సదాచారసంపన్నుని, ...పిలుకుమార్చి = పరిమార్చి, దురితము = ఆపాపము, పిదపన్ = పిమ్మట, నష్టము కాన్ = పోయిన దనునట్లుగా (తొలంగుటకుఁగాను), ఇష్టాపూర్తములు = క్రతువులును తటాకాది నిర్మాణములును, ('ఇష్టం చ పూర్తం చ = ఇష్టాపూర్తే - 'క్రతుకర్మేష్టం పూర్తం ఖాతాది కర్మచ' అమ.),...

మహారాజా, సదాచారసంపన్నుని నిన్ను ఇట్టి పాటొందించిన యాదుష్టుని రూపుమాపి ఆపాపమును పిమ్మట ఇష్టాపూర్తములచేత పోఁగొట్టుకొమ్ము.

'దురితము' పోరనివానిని నిరాయుధుని దీక్షితుని చంపుటగాన.

తే. ఇంక రెన్నాళ్లు సూచి, నీవంకఁ దెగువ
గలుగ కుండినఁ బ్రజ లూళ్లు దలఁచి పోవ,

మౌని వగుటయె యొండె, విహీనసంధి
నతనిఁ గను టొండె గా కొండు మతము గలదె? 39

రెన్నాళ్లుచూచి = కొన్నిదినములు ప్రతీక్షించి, నీవంకన్ = నీవలన, తెగువ = సాహసము,... ఊళ్లు తలఁచి = వారివారి గ్రామములను స్మరించుకొని, పోవన్ = పోయినపిమ్మటన్; మౌనివి = అడవిలో తపస్సుచేసికొనుచుండు వాఁడవు, అగుటయె ఒండెన్ = అగుటయెగానీ, విహీనసంధిన్ = ఎదిరికి మహాఫలంబును తనకు అల్పఫలంబును అగు నొడంబడికచేత,...ఒండు మతము = వేఱుమార్గము (ఆరెండుమార్గములును సరిగానందున ఇపుడు తెగువ వహించి వైరిం బరిమార్పుము అని భా.), - వికల్పాలంకారము.

'రెన్నాళ్లు' కొలఁదిదినము లనుటకు లోకోక్తి. 'రెన్నాళ్లు' - 'అన్యంబులకు సహితమికార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.' బా. వ్యా. సం. 38. ఇట్లే 'రెన్నెల్లు', 'మూన్నాళ్లు.'

క. జనవర, తపమునకుం జొ । చ్చినఁ గన్నులు మూసికొంటె నెల; వింటియకా
క నిదిధ్యాసకు బ్రహ్మం । బెనయునె? పరిభవపుశల్య మెదలో మెఱమన్. 40

జనవర = ఓరాజా, పరిభవపుశల్యము = అవమాన మనెడి యలుఁగు ('శల్యం శఙ్కౌ శరే వంశే కమ్బి కాయాం చ తోమరే' విశ్వ.), ఎదలోన్ =గుండెలో, మెఱమన్ = మెదలుచుండఁగా, తపమునకుం జొచ్చినన్ = తపస్సు చేయం బూనినచో,... నెలవు = ఉపయోగము,...నిదిధ్యాసకున్ = ఏకాగ్రధ్యానమునకు, బ్రహ్మంబు = పరమాత్మ, ఎనయునె = చేకూఱునా.

ఓరాజా తపస్సునకుం బూనెదవేని, అవమాన మనెడియలుఁగు హృదయములో మెదలుచుండఁగా, కన్నులు మూసికొన నగునేగాని ధ్యానమునకు బ్రహ్మము నిలుచునా.—ఈయవమాన దుఃఖము నీతపస్సునకు బాధకము కావున నీకు తెగువకన్న వేఱుమార్గము లేదని భా. - పరిసంఖ్యాలంకారము. 'పరిభవపుశల్యము' - రూపకము. 'మెఱయు' సకర్మకము, ఇట అకర్మకము.

క. అవమతిఁ బితృఘ్ను లగు భూ । ధవుల వెదకి పిల్లపిల్లతరము దునిమి భా
ర్గవుఁడు ముని యయ్యె; మఱి వై । భవము వలదు శాంతికైనఁ, బగ దెగకునే?

భార్గవుఁడు = పరశురాముఁడు ('భార్గవః పుంసి రేణుకాసుత శుక్రయోః' నానా.), అవమతిన్ = అవమానముచేత, పితృఘ్నులు = (తన) తండ్రినిచంపినవారు, అగు - భూధవులన్ రాజులను, వెదకి, పిల్లపిల్లతరము=పిల్లలనుసయితము వరుసగా, తునిమి = చంపి, ముని=తపముం బూనినవాఁడు,...వైభవము = ఐశ్వర్యము....

పరశురాముఁడు తనతండ్రిం జంపిన రాజులను ఆయవమానముచేత పిల్లపిల్ల వరుసగా వెదకి వెదకి సంహరించి పగ దీర్చుకొని తర్వాత తపస్సునం బ్రవేశించినాఁడు. అట్లే పగతీర్చుకొనంతకాలము వైభవము కలుగదు సరియేగదా. శాంతి సయితము కలుగదు. కావున నీవు వైభవమును వదలుకొని శాంతినే కోరుదువేనియు పగతీర్చుకొనక తప్పదు. కావున ఈతనిని వెంటనే తునుముము. - అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసంబును. పగతుం దునుమక భద్రము లేదని కామందకము:—'రూఢవైరి ద్రుమోత్ఖాత మకృత్వైవ కుతః సుఖమ్?'

తే. పగయు వగయును లేక యేపాటి గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు;
మఱి తగిలెనేని శాంతిచే మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చిన రాజునకును. 42

...,వగయున్ = దుఃఖమును, లేక = వహింపక,...కన్నన్ = పొందినను (దొరకినదానికే)' అలరు = సంతోషించునట్టి - సామాన్యసంసారి = సాధారణ గృహస్థుఁడు,...అటుగాక, రాజ్యభూమికన్ = దొరతన మనెడు వేషమును ('అన్యరూపై ర్యదన్యస్య ప్రవేశః సతు భూమికా.' భరతుఁడు.),...తగిలెనేని = పగయు వగయుం గలిగినయెడల, శాంతిచేన్ = ఓర్పుచేత, మఱవఁదగదు = మఱచుట ఉచితముగాదు.

సామాన్యగృహస్థుఁడు పగను వగను మఱచి యథాలాభసంతుష్టుఁడై యుండుట తగును గాని, దొరతనము వహించిన రాజు ఆప్రకారము పగను వగను ఓర్పుచే మఱచుట తగదు.—నీవు సామాన్యగృహస్థుఁడవు కావు, రాజవు, కావున శాంతిచే పగను వగను మఱచుట నీకు తగదు అని అభిప్రాయము. పరిసంఖ్యాలంకారము, అప్రస్తుతప్రశంసయు.

'మఱి' అని వ్రాఁత పా. 'మదిన్' పూ. ము. పా.

క. పులి మల డిగి యూళ్లకు న
క్షులరుజరా జనము మాన్పు కోఁ బనిచి, గవిన్
నెలకొన సురియలు గొని చని
పొలియునొ? యూరఁ గుయి రేఁగి పొడుచునొ? చెపుమా. 43

పులి, అక్షులరుజన్ = కనులవ్యాధిచేత [కనులకలఁకచేత ననుట, 'స్త్రీరుగ్రుజాచోపతాప రోగ వ్యాధిగదామయాః' అమ.' మలన్ = కొండనుండి, డిగి = దిగి, ఊళ్లకున్, రాన్ = వచ్చినంతట, జనము = ఊళ్లజనులు, మాన్పుకోన్ = ఆకన్నులకలఁకను నివారించుకొమ్మని, పనిచి = మరల కొండకుం బంపి, గవిన్ నెలకొనన్ = (అది కనులకలఁక మాని స్వస్థముగా తన) గుహలో నివసించియుండఁగా, సురియలు = చురకత్తులు, కొని, చని = ఆపులితో పోర నేఁగి, పొలియునో = నాశమొందునో, (లేక దానిని పొడిక), ఊరన్ = గ్రామమందు, కుయి రేఁగి = కేక లిడుచు లేచి, పొడుచునో = పొడిచి చంపునో, చెపుమా = చెప్పుమా.

పులికి ఊనినప్పుడు కనులకలఁక వచ్చును, అప్పుడు అది కొండనుండి ఊళ్లలోనికి దిగి వచ్చును; అప్పుడు ఊరిజనులు దానిని 'అమ్మా, నీవు పోయి కన్నుల కలక కుదుర్చుకొమ్ము' అని బోధించి పంపినవారై, అది పోయి కన్నులు స్వస్థమై గుహలో నివసించియున్నప్పుడు చురకత్తులు గొనిపోయి దానిం జెనకి దానిచేత చత్తురో, లేక - ఊరిలోఁ గనఁబడఁగా లేచి దానిని మడియింతురో చెప్పవయ్యా. - నీవు ఇప్పు డితనిని చెనకక పంపి పిమ్మట ఇతనియాగమై ఇతఁడు మహోన్నతదశలో నుండునప్పుడు ఇతనిమీఁదికి పోయి ఇతనిచే మడియుట సరిగాదు, ఇపుడే ఇతనిని రూపుమాపుము. అని ప్రస్తుతమర్థము. - అప్రస్తుతప్రశంస.

'రుజరా' - 'రుజఁజన' పా. - 'నెలవుకొన సురియ చేఁగొని' పా.

క. ఈవేళ బలియు నతనిం । బో విడిచితి పొమ్ము పాఁడి, బోయినరాజ్యం
బేవిధిఁ గ్రమ్మఱు? నావెర । వీవెర వని వ్రేలు మడిచి యేర్పడఁ జెపుమా. 44

బలియుణ్ = బల్లిదుని,...పాడిణ్ = ధర్మముప్రకారము, పోవిడిచితి పొమ్ము = పోనిత్తు
వేని,...వెరవు = ఉపాయము,...

ఇప్పుడు నీవు బలవంతు నతనిని, ధర్మము నవలంబించినవాఁడ వై పోనిత్తువేని, పిమ్మట నీ నష్టరాజ్యము నీకు మరల వచ్చునట్టి యుపాయాంతరమేమో చెప్పుము. - ఇప్పు డితనిం జంపి నచో నీరాజ్యము నీకు వచ్చునుగాని వేఱు విధమున రా దనిభా. - 'వ్రేలు మడిచి' - లోకోక్తి.

'బలియుణ్' - పిమ్మట నాతని నీవు జయింపలే వని భా.

'పాడిఁబోయిన' - 'వాఁడు పోయిన' పూ. ము. పా.

తే. అలసతఁ బరున్న మనుజుండు కలియుగంబు;
ద్వాపరం బెన్నఁ గూర్చున్న వాఁడు; త్రేత
యుత్థితుఁడు; యాయి మఱి కృతయుగ; మ టన్న
నముచిదమనోక్తి ఋగ్బ్రాహ్మణమున వినమె? 45

అలసతణ్ = సోమరితనముచేత,...ఎన్నణ్ = ఆలోచింపఁగా. ద్వాపరంబు = ద్వాపరయుగము....ఉత్థితుఁడు = లేచినవాఁడు, త్రేతాయుగము, మఱి = అటుగాక, యాయి = నడచుచున్నవాఁడు,...నముచి దమనఉక్తి = ఇంద్రవచనము ('జమ్భభేదీ హరిహయః స్వారాణ్ణముచిసూదనః' అమ.),...ఋక్బ్రాహ్మణమునణ్ = ఋగ్వేదముయొక్క బ్రాహ్మణ మనెడి భాగములో,...వినమె = మనము వినలేదా.

పనిచేయక పరున్నసోమరి కలియుగమువంటివాఁడు, కూర్చున్నవాఁడు ద్వాపరమువంటివాఁడు, లేచినవాఁడు త్రేతవంటివాఁడు, నడచుచున్నవాఁడు కృతయుగమువంటివాఁడు; సోద్యముఁడు సర్వోత్కృష్టుఁడు, నిరుద్యముఁడు సర్వాధముఁ డనియు భా. కావున నీవు సోద్యముఁడవు గావలసినదని యుపదేశము. అప్రస్తుత ప్రశంసా రూపకములు.

'కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్.' విష్ణుపురా.

క. ఛిద్రప్రహారి, రాష్ట్రో । పద్రవ పరిహారి, యాప్తభాషణ రుచి, వే
ళోద్రిక్తుండు, నవేళా । నుద్రిక్తుఁ, డనల్పకాల ముర్వి భుజించున్. 46

ఛిద్రప్రహారి = దోషస్థానమందు కొట్టువాఁడు, రా...రి - రాష్ట్ర = (తన) దేశముయొక్క - ఉపద్రవ = హానిని - పరిహారి = తొలఁగించుకొనువాఁడు, ఆ...చి - ఆప్త = యథార్థవక్తలయొక్క - భాషణ = మాటలయందు - రుచి = ఇచ్ఛగలవాఁడును, వే...డు - వేళా=(తన కనుకూల మయిన) కాలమందు - ఉద్రిక్తుండుణ్ = వైరిమీఁదికి లేచువాఁడును, అ...డు - అవేళా = అనుకూలముకానిసమయమున - అనుద్రిక్తుఁడు = లేవనివాఁడు, అనల్పకాలము = చిరకాలము, ఉర్విణ్ = భూమిని, భుజించుణ్ = ఏలును.

వైరిని అతఁ డెదిరించి పోరుటకు శక్తుఁడు గానట్టిదోషస్థానమందు కొట్టువాఁడును, తన రాష్ట్రమునకుం గలిగెడి యుపద్రవములను తొలఁగించుకొనువాఁడును, ఆప్తులమాటను వినువాఁడును,

తన కనుకూల మయినసమయమున వైరిమీఁద విక్రమించువాఁడును, తనకనుకూలము కానిసమయమున విక్రమింపనివాఁడును, చిరకాలము భూమి నేలును. పూర్వముద్రణవ్యాఖ్యయందు 'ఛిద్రప్రహారి' అనఁగా 'తనరాజ్యమందుఁ బుట్టిన దోషంబులను పోఁగొట్టువాఁడు' అని యర్థము వ్రాయఁబడియున్నది. ఈయర్థము గాదు, ఎట్లన;—'ఛిద్రం వివరరన్ధ్రవత్ గర్హే దోషే' హేమ.

'అపకాలం త మాసాద్య లవణం లక్ష్మణానుజః
రురోధ సంముఖీనోహి జయో రన్ధ్రప్రహారిణామ్.' రఘు. 15-17.

'రన్ధ్రప్రహారిణాం రన్ధ్రప్రహారణశీలానామ్; అపకాలత్వమే వాత్ర రన్ధ్రమ్' అనిమల్లి వ్యా. దీనికే—"తదా యాయా ద్విగృహ్యైవ వ్యసనే చోత్థితే రిపోః' ఇతివచనాత్ పరవ్యసనే అక్రమణం విజిగీషోః సిద్ధికారకమ్ । యథామాఘే - 'ఆత్మోదయః పరగ్లాని ర్ద్వయం నీతి రితీయతే.' అథవా - 'స్వశక్త్యుపచయే కేచిత్ పరస్య వ్యసనేఽపరే.' తథాహి - 'అవృణోత్యాత్మనో రన్ధ్రం రన్ధ్రేషు ప్రహరన్ రిపూన్' " - అని హేమ. వ్యాఖ్య.

వ. లే లె" ష్షనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. 47

క. "మీ నొడివినయది కార్యం । బౌ; నిప్పుని సేయ రాజ్య మంతయు మనకున్,
వానికిఁ బరలోకము జిత । మౌ నొక్కట; నిందు వాసు లరయఁగ వలయున్. 48

మీ నొడివిన యది = మీరుచెప్పినపనిని, కార్యంబు బౌన్ = చేయవలసినదే; ఇప్పుని = ఈశత్రుహననమును, చేయన్ = కావించుటచేత, ఒక్కటన్ = ఏకకాలములో, రాజ్యమంతయున్ = ఇరువుర రాజ్యంబును, మనకును, పరలోకము = స్వర్గము, వానికిన్ = వానికిని, జిత మగును = లభించును; ఇందున్ = ఈరెండుఫలములయందును గల, వాసులు=తారతమ్యములను, అరయఁగ వలయున్ = ఆలోచింపుఁడు.

అతనిం జంపుటచే, ఒక్కమాటే మనకు సర్వరాజ్యమును, అతనికి స్వర్గమును వచ్చును; ఈరెండు ఫలములలో అతనికిం గలుగునదే ఉత్కృష్టమో మనకుం గలుగునదే యుత్కృష్టమో అరయుఁడు.—ఆవానినే అనంతరపద్యమందు చెప్పుచున్నాఁడు.

క. పరలోక సుఖము శాశ్వత । మరయ; మహీరాజ్యసౌఖ్య మల్పానేహః
పరిభోగ్యం; బిందులకై । దురితము కావించి తొలఁగుదునె పరమునకున్. 49

అరయన్ = ఆలోచింపఁగా, పరలోకసుఖము, శాశ్వతము = చిరకాలము ఉండునది, మహీరాజ్యసుఖము = భూమియందలి దొరతనపుసౌఖ్యము, అ...బు - అల్ప = కొంచెమయిన - అనేహః = కాలమే - పరిభోగ్యంబు = అనుభవింపఁ దగినది; ఇందులకై = ఈయల్పకాలరాజ్యసౌఖ్యముకొఱకు, దురితము = పాపమును ('అంహో దురిత దుష్కృతమ్' అమ.), కావించి = చేసి, పరమునకున్ = స్వర్గమునకు, తొలఁగుదునె = దూరమగుదునా.

మీరు చెప్పినపాపకృత్యమును నేను జేసినచో నాపగతునికి శాశ్వతమయినపరలోకసుఖమును, నాకు స్వల్పకాలభోగ్య మగుమహీరాజ్యసుఖమును కలుగును, స్వర్గము నాకు తప్పును, కావున ఆపాపమును నేను చేయను.

శాశ్వతత్వమును అల్పానేహః పరిభోగ్యత్వంబును ఆదురితము గావింపమికి కారణంబులు గాన కావ్యలింగాలంకారము.

క. 'బద్ధాంజలిపుటు దీనుఁ । గ్రుద్ధుండై శరణు చొరఁగఁ గూల్చుట కడుఁ గీ,
డుద్ధతి పరలోకార్జన । బుద్ధికి' నను కణ్వవాక్యములు దలఁప రొకో?" 50

దీనుఁ = గర్వ ముడిగినవానిని, బ...టుఁ - బద్ధ = కూర్పఁబడిన, అంజలిపుటుఁ = మోడ్పుకేలిదొన్నె గలవానిని (దొన్నెవలె కేలుమోడ్చినవానిని), శరణు చొరఁగఁ = శరణు చొచ్చినప్పుడు, క్రుద్ధుండు = కోపించినవాఁడు, ఐ, కూల్చుట = చంపుట, పరలోకఅర్జన బుద్ధికిఁ = స్వర్గమును గడించుటయందు తలంపు గలవానికి, కడుఁ కీడు = మిక్కిలి చెఱుపు, అను - కణ్వ (మహాముని) వాక్యములు, తలంప రొకో = మీరు తలంపరా యేమి.

శరణాగతుని దీనుని చంపుట మహాపాప మనెడు కణ్వమహాముని వచనములను స్మరింపుడు. - ఇది సామాన్యోక్తి - ఈదీనుని తాను చంపుట మహాపాతక మని విశేషము - అప్రస్తుత ప్రశంస. 'క్రుద్ధుండై శరణు' - 'పా. క్రుద్ధతఁ దనమఱుఁగు,' 'క్రుద్ధుండైమఱుఁగు.'

ఆ. అనుచు వెడలి వచ్చి, యారాజు నడిగి, త
ద్ఘర్మనైచికీవధక్రమంబు
దెలిసి, తగిన నిష్కృతి వచింప, నాతండు
మగుడఁ గ్రతువు సాంగముగ నొనర్చి. 51

... వెడలి= (మంత్రాలోచనకై చొచ్చినతెరుపండమునుండి) వెలువడి,...ఆ రాజుఁ = కేశిధ్వజుని,...త...బు - తత్ = ఆతని - ఘర్మనైచికీ = యజ్ఞధేనువుయొక్క ('ఉత్తమా గోషు నైచికీ' అమ.) - వధ = కొలయొక్క - క్రమంబు = ప్రకారమును, తెలిసి = ఎఱిఁగి, ... నిష్కృతి = ప్రాయశ్చిత్తమును, ... మగుడఁ = వెండియు, ... క్రతువుఁ = యజ్ఞమును, సాంగముగఁ = సంపూర్ణముగా, ఒనర్చి = చేసి (ముందటి కన్వయము).

ఆ. అవభృథాప్లుతోత్తమాంగుఁ డై, ఋత్విక్స
దస్యగణముఁ బూజఁ దనిపి, పిదప
సూత మగధ వంది వైతాళికప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. 52

అ...డు - అవభృథ = యజ్ఞాంతస్నానముచేత ('మేధ్యే నావభృథా దపి' రఘు. 1 (84). 'అవభృథాదపి - అవభృథస్నానాదపి' మల్లి. వ్యా.) - అప్లుత = చక్కఁగా తడుపఁబడిన - ఉత్తమాంగుఁడు = శిరస్సు కలవాఁడు ('ఉత్తమాఙ్గం శిర శ్శీర్షమ్' అమ.), ఐ, ఋ ... ముఁ - ఋత్విక్ = ఋత్విజులయొక్కయు, - సదస్య = సభ్యులయొక్కయు - గణముఁ = సమూహమును, పూజఁ = సత్కారముచేత, తనిపి = తృప్తి నొందించి, పిదపఁ = తర్వాత, సూతవంది మగధ వైతాళిక ప్రభృతి అర్థికోటికిఁ = సూతాదియాచకసమూహమునకు, అభిమత అర్థము = ఇష్టమయిన ధనమును, ('అర్థోభిధేయ రైవస్తు ప్రయోజన నివృత్తిషు' అమ.), ఒసఁగి = ఇచ్చి.

కేశిధ్వజుఁడు యజ్ఞము ముగించుకొని ఋత్విక్కులను దక్షిణలచేతను సదస్యులను సంభావనలచేతను తనియించి సూతాదియాచకసమూహమునకు ఇష్టధనము లొసంగెను.- సూతాది భేదము:-

'సూతాః పౌరాణికాః ప్రోక్తా । మాగధా వంశశంసకాః
వన్దిన స్త్వమలప్రజ్ఞాః । ప్రస్తావసదృశోక్తయః'.
'వైతాళికా బోధకరాః.' అమ.

తే. మఱియుఁ గోరినవారియక్కఱలు దీర్చి
యును మనఃపూర్తి చాల కొయ్యనఁ దలంచి,
'యకట గురుదక్షిణ యొసంగ నయితి' నంచు
మగుడఁ జని, శంక నతఁడు సంభ్రమపడంగ. 53

మఱియుఁన్ = ఇంతియగాక,...మనఃపూర్తి = తనమనస్సున సంతుష్టి,...ఒయ్యనన్ = క్రమముగా, ... ఆఖాండిక్యుఁడు, శంకన్ = భయముచేత ('శఙ్కా త్రాస వితర్కయోః' నానా.), అతఁడు = ఆఖాండిక్యుఁడు, సంభ్రమపడంగన్ = తొట్రుపడుచుండఁగా ('సహా సంవేగసంభ్రమౌ' అమ.)

ఇంకను కోరినవారి కోరిక లెల్ల దీర్చినప్పటికిని, ఆకేశిధ్వజునికి మనస్సు సంతుష్టి చెంద కుండినది. అంత నాతఁడు గురుదక్షిణ యీయనైతి నని జ్ఞప్తికి తెచ్చుకొని, యిచ్చుటకై మరల ఖాండిక్యునికడ కేఁగెను. ఇతఁడు తనతో పోరవచ్చె నేమో యని భయపడి ఖాండిక్యుఁడు త్రొక్కటపడసాగెను.

క. వారించి, 'నీకు నెయ్యది । కోరిక? యే తెంచినాఁడ గురుదక్షిణ యీ,
భూరమణ, వేఁడు' మనుటయు, । నారాజన్యుండు మఱియు నాప్తులతోడన్. 54

కేశిధ్వజుఁడు ఆఖాండిక్యునిసంభ్రమమును ఆఁపి 'ఓరాజా నీకు గురుదక్షిణ యిచ్చుటకై వచ్చితిని; నీ కేమి వలయునో వేఁడు' మనెను. అంత ఖాండిక్యుఁడు తనహితైషులతోఁ గూడి (ఆలోచించెను).

క. 'గురుదక్షిణ యిచ్చుట కీ । నరవరుఁ డేతెంచె; మీరు నా కనురక్తుల్;
పరికించి పదింబదిగా । నరయుఁడు మది నెద్ది మేలు ప్రార్థించుటకున్. 55

......పదింబదిగాన్ = చక్కఁగా, పరీక్షించి, అరయుఁడు = విచారింపుఁడు.

ఈరాజు గురుదక్షిణ యిచ్చుటకై వచ్చియున్నాఁడు, మీరు నాకు ఆప్తులు, చక్కఁగా పరీక్షించి మనకు వేఁడుటకు ఏది మంచిదో ఆలోచించి చెప్పుఁడు.

అతనిరాకయు వీరియనురక్తియు పరికించుటకు నరయుటకును కారణములు గావున కావ్యలింగాలంకారము.

ఉ. నావుఁడు, వార లమ్మనుజ నాథున కిట్లని రుబ్బి; 'నేఁడుగా
దైవము గల్గె? వేగ గురుదక్షిణగాఁ జతురర్ణవీవృతో
ర్వీవలయం బశేషమును వేఁడుము, భూవర ; మన్ము నందఱన్
బ్రోవుము ; బాంధవాప్తజనపోషణకన్నను బుణ్య మున్నదే? 56

దైవము=భాగ్యము, వేగ = శీఘ్రముగా, చతు...బు - చతురర్ణవీ = నాలుగుసముద్రములచెుత్తముచేత - వృత=ఆవరింపఁబడిన - ఉర్వీవలయంబు = భూమండలమును, అశేషమును= సమస్తమును, ప్రోవుము = పోషింపుము.

ఖాండిక్యుఁడు ఇట్లు చెప్పఁగా, ఆయాప్తులు మిక్కిలి సంతోషించి ఆయన కిట్లు ఉత్తరము పలికిరి; – ఓరాజా, ఈదినమునఁగదా, అదృష్టము ఫలించినది? ఈక్షణమె ఆతనిని నాలుగు సముద్రములచే పరివేష్టింపఁబడియున్న యీసమస్తభూమండలమును గురుదక్షిణగా వేఁడుము; మమ్ము నందఱను పోషింపుము. బంధువులను ఆప్తులను పోషించుటకంటె పుణ్యము కలదా? – పుణ్యమగుట ప్రోచుటకు కారణముగాన కావ్యలింగాలంకారము.

వేగ – ఇదికళ – 'వేగ తెగంబాఱకు' భార. లుప్త మువర్ణక మయిన 'వేగ' శబ్దమే ఇట్లు ప్రయోగింపఁబడుచున్నది. 'చతురర్ణవి' = చతుర్ణా మర్ణవానాం సమాహారః – ద్విగుసమాసము. 'బాంధవ' – బంధువే బాంధవుఁడు. 'కన్నను బుణ్య' – 'కంటెనుధర్మ' పూ. ము. పా.

ఉ. ఎన్నఁడు లావు గూడు మన? కెన్నఁ డగు న్దఱి? యయ్యె నేని పో
రెన్నిక యానె? పోరిన జయింపనె చెప్పిరె? నీదుభాగ్యసం
పన్నతఁ జేరె: గార్య మిటు;బంధు సుహృత్తతి కొక్కకీడు రా
కున్నటు లుండఁగానె. సిరు లూరక చావక నోవ కబ్బునే?. 57

ఎన్నఁడు = ఎప్పుడు, లావు = బలము, కూడుక = కలుగును [తనకు బలము కలిగినప్పుడు దండెత్తు మని శాస్త్రము. – మాఘములో శ్రీకృష్ణులవారింగూర్చి బలరామ వచనము —
'స్వశక్త్యుపచయే కేచిత్, పరస్య వ్యసనేఽపరే,
యాన మాహు; స్త దాసీనం త్వా ముత్థాపయతి ద్వయమ్.' మాఘ.
'ఉత్కృష్టబలవీర్యస్య విజిగీషో ర్జయైషిణః
గుణానురక్తప్రకృతే ర్యాత్రా యాన మితి స్మృతమ్.' కామందకము.].
తఱి = అనుకూలకాలము;
('రాత్రా వులూకో వినిహన్తి కాకం, కాకోఽప్యులూకం రజనీవ్యపాయే,
ఇతీవ కాలం ప్రసమీక్ష్య యాయాత్, కాలే భవ న్తీహ సమీహితాని.' కామంద.),
ఎన్నిక = యోగ్య మని గణింపఁబడినది (పోరు యోగ్యము కా దని కామందకము:—
'సంధి మిచ్ఛే త్సమే నాపి, సందిగ్ధో విజయో యుధి,
న హి సంశయితం కుర్యా, ది త్యువాచ బృహస్పతిః,'),
పోరినక = యుద్ధముచేసినయెడల, జయింపనె చెప్పిరె = జయమే కలుగు నని శాస్త్రకారులు చెప్పినారా, భాగ్యసంపన్నతక = అదృష్టము కలసి వచ్చుటచేతను, కార్యము = నీవు సాధింపు కొనవలసినట్టిది, ఇటు = అశత్రువే నీవు కోరిన దెల్ల నీకిచ్చునట్లుగా, చేరెక = చేకూడి యున్నది,...తతికిక = సమూహమునకు.

మనకు పగతునిపై తరలుటకు ఎప్పుడు బలము కలుగును? అనుకూలకాల మెప్పుడు వచ్చును? వచ్చినను, పోరు ప్రశస్త మెట్లగును? ఏలయన పోరిలో జయమే కలుగు నని నిశ్చయమేమి? నీబంధుసుహృత్సమూహము చావక గాయపడక నీకు వచ్చునట్లుగా నీకార్యము చేకూడి యున్నది.

చ. అనవుఁడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను:- 'మీర లర్థసా
ధనపరతంత్రకోవిదులు దక్క, మహాసుఖదాయి మోక్షమా

ర్గనయవిచారకోవిదులు గా, రతిచంచల రాజ్యలక్ష్మి నే
మని చని వేఁడు వాఁడఁ బరమార్థము వేఁడక యమ్మహామతిన్? 58

అనవుడున్ = ఇట్లు ఆప్తులు చెప్పఁగా, అల్లన్ నవ్వి = మందహాసము చేసి, మనుజ అధిపుఁడు = రాజు,...మీరలు = మీరు, అ...కన్ - అర్థ = ప్రయోజనముయొక్క - సాధన = సాధించుట - పర = ముఖ్యముగాఁగల దైన - తంత్ర = శాస్త్రమందు - కోవిదులు, దక్కన్ = పండితులు గాని, మ...లు - మహాసుఖ = గొప్పసుఖమును - దాయి = ఇచ్చునదైన - మోక్షమార్గ = కైవల్యముయొక్క దారికి - నయ = కొనిపోవునట్టి - విచార = చింతయందు - కోవిదులు గారు, చని = నేఁబోయి, ఆమహామతిన్ = ఆమహానుభావుని, పరమ అర్థము = సర్వోత్కృష్ట ప్రయోజన (మైనమోక్ష) మును, వేఁడక ; అతి చంచలన్ = అత్యంతము అస్థిర మగుదానిని, రాజ్య లక్ష్మిన్ = దొరతనపుశ్రీని, ఏమని వేఁడువాఁడన్ = ఎట్లు వేఁడుదును.

అందులకు రాజు చిఱునవ్వు నవ్వి యిట్లనియె. - అయ్యామీరు అర్థశాస్త్రపండితులుగాని మోక్షమార్గవిచారపండితులు గారు. నేను పోయి ఆమహానుభావుని మహాసుఖము నిచ్చు మోక్షమార్గము నడుగక అతిచంచల మయిన రాజ్యలక్ష్మి నెట్లడుగుదును. - మహాసుఖదాయిత్వము వేఁడుటకును, అతిచంచలత్వము వేఁడమికిని, కారణములు గావున పదార్థహేతుకకావ్యలింగము.

క. నిమివంశోత్పన్నుల మఁట,
మముబోఁటుల కకట రాజ్యమా లక్ష్యము? వాఁ
డమలిన యోగాశ్రయుఁ; డు
త్తమయోగము గొనుట యురవొ, ధరఁ గొను టురవో? 59

నిమివంశ ఉత్పన్నుల మఁట = నిమిచక్రవర్తిసంతానమందు పుట్టినవార మఁట,...అమలిన యోగ ఆశ్రయుఁడు = పొచ్చెములేని రాజయోగమునకు తావలమైనవాఁడు,...ఉరవొ = ఉచితమొ,......నిమివంశమునఁ బుట్టినవార మనుటచే మిక్కిలి జ్ఞాన వైరాగ్యాది దివ్యగుణసంపన్ను లని భా. ఆవంశపువాఁడు జనకుఁడు. పలువురు మునులకు బ్రహ్మవిద్యాగురు వని రామాయణమున ప్రసిద్ధము. శ్రీరాములవారు పిమ్మట విఱిచిన వింటిని నిమికి ఆఱవతరమువాఁ డయిన దేవరాతునియొద్ద మహేశ్వరుఁడు ఇల్లడ యుంచుటగూడ ఆవంశమువారి ప్రభావమునకు తార్కాణము.—'ఉరవొ' - 'ఎరవొ' అనివూ. ము. పా. ఎరవు శబ్దము ఈయర్థమున నిఘంటువులందు కనఁబడదు.

సీ. విడుఁ.' డనివీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ,
డారాజుఁ గనుఁగొని గారవమున,
'గురునిష్క్రియంబు నిక్కువముగా నొసఁగదే?'
యని పల్కి, 'యిత్తుఁ దథ్యముగ' నన్న ;
'నవనీతలేంద్ర, నీ వధ్యాత్మరతుఁడవు;
దక్షిణ గురున కీఁ దలఁచితేని,

సకలభవక్లేశ సంక్షయం బెయ్యది
యవ్విద్య బోధింపు' మనిన, నవ్వి,
తే. 'యహాహా! నిష్కంటకాస్మదీయాధిరాజ్య
మడుగ నొల్లక యిది యేటి కడిగి తిపుడు?
క్షత్రియుల కెల్ల రాజ్యంబు కంటె మఱి ప్రి
యంబుగలదె?' యటన్న ని ట్లనియె నతఁడు. 60

...ఆరాజున్ = కేశిధ్వజుని - గురునిష్క్రియంబు = గురువుయొక్క వెలను (గురుదక్షిణను). నిక్కువముగా = నిక్కముగా = సత్యముగా. తథ్యముగన్ = సత్యముగా. అవనీతలేంద్ర = ఓభూతలపతీ (రాజాయనుట), అధ్యాత్మగతుఁడవు = బ్రహ్మవిద్యాతత్పరుఁడవు. స...బు - సకల = అఖిలమైన - భవక్లేశ = సంసారదుఃఖములయొక్క ('భవః క్షేమేశసంసారే సత్తాయాం ప్రాప్తి జన్మనోః' మేది.) - సంక్షయంబు = నాశకము, ని...ము - నిష్కంటక = శత్రురహితమైన - అస్మదీయ = నాదు - అధిరాజ్యము = సామ్రాజ్యమును, ఒల్లక = వలవక = కోరక, ఏటికిన్ = ఏమిటికి = ఏల.

మ. 'విను, కేశిధ్వజ, ధాత్రి వేఁడమికి నావేదించెద న్హేతు; వ
జ్ఞునకుం గాక వివేకి కేల జనియించున్ లౌల్య మెందున్? రణం
బునఁ బాడిన్ రిపు గూల్చువాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
జున కౌ; నైన నశక్తుఁ ద్వద్విజితరాజ్యు న్న న్నఘంబంటునే? 61

...ధాత్రిన్ = భూమిని, వేఁడమికిన్ = వేఁడనందులకు, హేతువు, ఆవేదించెదన్ = తెలిపెదను; ఎందున్ = ఎచటనైనను, అజ్ఞునికిన్ దక్కన్ = అవివేకికేగాని, వివేకికిన్ = దేహాత్మభేద జ్ఞానముకలవానికి, లౌల్యము = ఆశ ('లోలశ్చల సతృష్ణయోః' అమ.),...రణంబునన్ = యుద్ధములో - పాడిన్ = ధర్మముచే (ధర్మయుద్ధముచే ననుట), రిపున్ = వైరిని, గూల్చువాఁడియున్ = కూల్చునట్టి పరాక్రమమును, ప్రజాపోషంబు = ప్రజలను పోషించుటయు, రాజునకు, ధర్మంబు ఔను, అయినన్ = అట్లయినను, అశక్తున్ = శక్తిలేనివానిని, త్వ...జ్యున్ = నీచేత జయింపఁబడిన రాజ్యము కలవానిని, నన్ను, అఘంబు = పాపము, అంటునే = తగులునా.

వినవోయి కేశిధ్వజుఁడా; నేను రాజ్యము వేఁడమికిం గారణము చెప్పెదను, రాజ్యతృష్ణ అవివేకికి కలుగును గాని వివేకికి కలుగదు. మఱి పరాక్రమంబున వైరులం గూల్చుటయు ప్రజలం బ్రోచుటయు రాజునకు ధర్మములే యైనను అట్లు చేయనిదోషము నీచేత విజిత రాజ్యుఁడనైననన్ను అంటగు.

సీ. నరనాథ, యీరాజ్యపరిపాలనారాతి
హననాదికృతరూప యగునవిద్య
యనధికారికి విసర్జనముఁ గావింపంగఁ
గలుషంబు రా; దధికారి యైన

వాఁడు విసర్జింప వచ్చు వర్ణాచార
లోపంబుచే నగు పాపలేప;
మైన నేనిత్తుఁ గొ మ్మనఁ గొనుధరణి భో
గమునకుఁ గాక ధర్మమున కగునె?
తే. కాన సత్క్షత్త్రియులకు భైక్షంబు కీడు;
మత్ప్రధానులు వేఁడు సామ్రాజ్య మనెడు
పలుకు ధర్మచ్ఛలంపులోభం, బయుక్త?
మిది యెఱిఁగి రాజ్య మడుగ నే నిచ్ఛగింప. 62

నరనాథ = ఓకేశిధ్వజుఁడా, (వినుము), ఈ...ద్య - ఈ - రాజ్యపరిపాలన = రాష్ట్రము నేలుట - అరాతిహనన = శత్రుసంహారము - ఆది = లోనగుకృత్యములచేత - కృత రూప = చేయఁబడిన స్వరూపము గలది - అగు - అవిద్యన్ = అజ్ఞానమును ('అవిద్యాహమ్మతిః స్త్రియామ్' అమ.), విసర్జనము కావింపన్ = త్యజించుటచేత, అనధికారికిన్ = అసమర్థునికి, కలుషంబు = పాపము, రాదు = కలుగదు; అధికారి = సమర్థుఁడు - ఐనవాఁడు, విసర్జింపన్ = త్యజించెనేని, వ...ము - వర్ణ = క్షత్త్రియజాతియొక్క - ఆచార = (రాజ్యపరిపాలన శత్రుహననాది రూప) స్వధర్మముయొక్క - లోపంబుచేన్ = అననుష్ఠానముచేత - అగు (నట్టి) - పాపలేపము = కిల్బిషముయొక్కపూఁత, వచ్చున్ = (అధికారికి) కలుగును; ఐనన్ = అటులైనను,... భైక్షంబు = భిక్ష = యాచన. ... మత్ ప్రధానులు = సామంత్రులు ('మహామంత్రాః ప్రధానాని' అమ. 'మహామాత్రః సమృద్ధే చామాత్యే హస్తిపకాధిపే' మేది.),...ధర్మచ్ఛలంపు లోభంబు = ధర్మమనెడి మిషతోడి కాంక్ష,...ఇచ్ఛగింపన్ = కోరను.

ఓరాజా, ఈ రాజ్యపరిపాలనము శత్రుసంహారము అనురూపముల విలసిల్లుచున్నయవిద్యను త్యజించుటచేత అధికారికి క్షత్త్రియధర్మలోపపాపము కలిగినను అనధికారికి కలుగదు. పైగా క్షత్త్రియునికి దానముగా నైకొన్నభూమి భోగమునకు అగును గాని ధర్మమునకు కానేరదు; ఇట్లు ధర్మమునకుఁ గాక భోగమునకు మాత్రమె యగుటచేత నీరాజ్యభిక్ష క్షత్త్రియులకు చేటు. నా ప్రధానులు వేఁడు మనెడి యీసామ్రాజ్యము ధర్మ మనెడి మిషకలిగిన రాజ్యకాంక్ష, నాకు అనర్హము అని యెఱుఁగుదును గాన, రాజ్య మడుగుట నే నంగీకరింపను.

'ఈరాజ్య పరిపాలనారాతి హననాది కృతరూప' - సిద్ధసమాసగతపదములతో తద్భిన్న పదంబులు అన్వయించుట కవిత్రయేతర గ్రంథములందు చూపట్టెడి నని ప్రౌఢవ్యాకరణము. 'రాజ్య...విద్య' - వ్యవహారమెల్ల అవిద్యా విలాస మని జ్ఞానిమతము. క్షత్త్రియునికి స్వభావజ మయిన ప్రజాపరిపాలనాదికమును మానుటవలన చేటు గలుగును:- భగవద్గీతయం దిట్లున్నది.—

'శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్.'
'శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనమ్।
దాన మీశ్వరభావ శ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్'

'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.'
'అథ చేత్ త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి'. భగవద్గీత.

క్షత్రియునికి 'దానము' చెప్పఁబడినది. ఆదానము చెప్పఁబడలేదు, కావున 'ఆదానము' భయావహము. 'ప్రధానులు' - 'ప్రధాను'డు' అని ఏకవచనము - మిత్రాది గణములో చేరినందున విభాషగా పుల్లింగ తుల్యత; ఒండె, ప్రధాన శబ్దము 'మహామాత్రః ప్రధానః స్యాత్' అని పుంస్కాండమందు వోపాలితుఁడు పఠించినందున పుల్లింగమును కల దని రామాశ్రమి.

తే. ఆసపడుదురె బుధులు రాజ్యంబు, మమత
మానని జడాత్ములట్లహంమానపాన
మత్తులకుఁ గాక యది యేల, మాదృశులకు ?'
ననిన హర్షించి మెచ్చి యజ్జనకుఁ డనియె. 63

బుధులు = కోవిదులు ('స మ్సుధీః కోవిదో బుధః' అమ.), మమత = మమకారము (నాదియను భావము),...జడ అత్ములట్లు = మూఢమతులవలె, అహమ్ మాన=అహంకార మనెడి-పాన= త్రాగుడు చేత - మత్తులకున్ = కైపెక్కినవారికి. అది = రాజ్యము, మాదృశులకున్ = మాబోంట్లకు.

మమకారము ఉడుగని మూఢమతులవలె పండితులు రాజ్యమునకు ఆసపడుదురా? అహంకార మమకారము లుడిగిన మాబోంట్లకు రాజ్యమేల? - అని ఖాండిక్యుఁడు చెప్పెను. అందులకు ప్రీతుఁడై ఆకేశిధ్వజజనకుఁడు ఇట్లు ఉత్తరము చెప్పెను. - బుధత్వము ఆసపడమికిని, మమత. జడాత్మత, ఉక్తమత్తతయు ఆసపడుటకును కారణములు గాన పదార్థహేతుక కావ్యలింగము.

ఆ. "ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప,
ననఘ, రాజ్యములు మఖాదికములుఁ
జేయుచున్నవాఁడ; క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగభుక్తిచేత. 64

అనఘ = పాపరహితుఁడా, ఏన్ = నేను, అవిద్యవలనన్ = మఖాదికర్మచేత, మృత్యువున్ = ప్రమాదమును, తరియింపన్ = దాఁటుటకై, రాజ్యములున్, మఖ ఆదికములున్ = యజ్ఞములోనగు కర్మలును, చేయుచున్నవాఁడన్ = చేయుచున్నాను; పుణ్యఫలమున్ =(కర్మవలని) శుభాదృష్టముయొక్క ఫలమును, భోగభుక్తి చేతన్ = భోగముల ననుభవించుటచేత, క్షీణింపఁ జేయుదున్ = నాశ మొందించెదను.

నేను స్వాభావికమైన బ్రహ్మనిష్ఠనుండి కలిగిన ప్రమాదమును దాఁటం గోరి, అందులకు సాధనముగా యజ్ఞములు చేయుచున్నాను. అయినను పూర్వకృతకర్మఫలము సంసారమును బలపఱుచుచుండదా, దానివలననుండి ముక్తియెక్కడిది, అనిన, ఆఫలమును భోగముచేత క్షయ మొందించుటకై రాజ్యము లేలుచున్నాను.

అవిద్యయనఁగా మఖాదికర్మ. 'అవిద్యవలన' - కరణార్థమున 'వలన' సాధువుగాదు, అవిద్య 'చేత' అనఁదగును.

'ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి' అను సనత్సుజాతీయవాక్యముచేతను,

'ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన ।
ప్రమాదో మృత్యు రిత్యాహు ర్విద్యాయాం బ్రహ్మ వేదినః.'

ఇత్యాద్యధ్యాత్మోపనిష ద్వాక్యాదులచేతను మృత్యు వనఁగా బ్రహ్మనిష్ఠనుండి పరాకుపడుట. నరుఁడు అవిద్యచేత మృత్యువుం దరించు ననుటకు—

'విద్యాం చావిద్యాం చ య స్తద్వే దోభయగ్ సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే.' ఈశా. ఉ. 11.

'యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే.' భ. గీ. 5. 11.

'యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్.' భ. గీ. 18,5.

మఖాదులు చేయుటచే తత్ఫలానుభవరూప మయిన సంసారము బలపడును గదా యనిన, 'సఙ్గం త్యక్త్వా' అనుటచే ఫలాపేక్ష లేక చేయువానికి ఫలానుభవ రూపబంధము ఉండదు. ఇంతకు ముందు చేసియున్న కర్మయొక్క ఫలము—

క. 'విను కర్మం బొనరించును । జననము మరణంబు, నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించును, దనచే । సినదానం బడకపోవ శివునకు వశమే ?'

'జ్ఞానోదయా త్పురాఽఽరబ్ధం కర్మ జ్ఞానా న్ననశ్యతి
అదత్త్వా స్వఫలం, లక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్.
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చా త్తు గోమతౌ
న తిష్ఠతి ఛిన త్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్.' అధ్యాత్మోపనిషత్తు

అన్నట్లు, తనకు తప్పదు గదా, ఆరూప మయిన సంసారమునకు క్షయ మెట్లనిన, అందులకే, 'ప్రారబ్ధం భోగతో నశ్యే' త్తనుకారణంబున రాజ్యభోగములచే దానిని క్షయ మొందించు చున్నాను, అని చెప్పినాఁడు.

క. మన యీ నిమివంశము పా । వన మగుభాగ్యమున, మనుజవర, తత్త్వవివే
చనచింత నీకుఁ బొడమెను; । విను మిఁక వినిపింతు నే నవిద్యావిధముల్. 65

మనుజవర = మనుష్యశ్రేష్ఠుఁడా. పావనము = పవిత్రము ('పవిత్రం పావనం పూతమ్' హేమ.), భాగ్యమునన్ = అదృష్టముచేత, త...త - తత్త్వ = పరమాత్మయొక్క ('తత్త్వం పరాత్మని వాద్యభేదే స్వరూపేచ' హేమ.), అవిద్యావిధముల్ = అజ్ఞానముయొక్క ప్రకార మును.

'నేను విద్యా' అని పూ. ము. పా. 'నే నవిద్యా' అని వ్రాఁతప్రతుల పా. ఇదియే సమం జసముగాఁ గాన్పించుచున్నది. చూ. 8౨ (2).

ఆ. ఆత్మకాని మేన నాత్మబుద్ధియును న । స్వంబునందు మిగుల స్వత్వమతియు,
నవనివర, యవిద్య యను మహాతరువు ను । త్పత్తి కీద్వయంబు విత్తు మొదలు.

అవనివర = ఓరాజా, ఆత్మ = తాను
('ఆత్మా కళేబరే యత్నే స్వభావే పరమాత్మని ।
చిత్తే ధృతౌ చ బుద్ధౌ చ పరవ్యావర్తనేఽపి చ' ధరణి.),

కాని మేనన్ = కానట్టి దేహమందు, ఆత్మ బుద్ధియున్ = తా నసెడితలంపును, అస్వంబు నందున్ = తనదిగాని దానియందు ('స్వోఽజ్ఞాతా వాత్మని స్వం త్రి ష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అమ.), మిగులన్ = మిక్కిలి, స్వత్వమతియున్ = తనది యసెడు భావంబును, ఈ - ద్వయంబు = దోయి, అవిద్య = అజ్ఞానము, అను = అసెడు - మహా తరువు నుత్పత్తికిన్ = గొప్ప వృక్షముయొక్క పుట్టుకకు, విత్తు మొదలు = ఆది బీజము.

ఓరాజా, తానుగానట్టి దేహమందు తా నసెడి తలంపును, బంధుమిత్రకళత్రపుత్రాదులు తనవి అను తలంపును, ఈరెండును అజ్ఞానమహావృక్షమునకు ఆదిబీజము. - రూపకాలంకారము.

ఈపద్యమునకు మూలమైన విష్ణుపురాణశ్లోకము:—

'అనాత్మ న్యాత్మబుద్ధి ర్యా అస్వే స్వ మితి యా మతిః
అవిద్యా తరుసంభూతి బీజ మేత ద్ద్విధా స్థితమ్'.

బీజము దళద్వయరూపముగా నుండును గాన అహంకార మమకారములు రెండును బీజ మనుటచే అవి ఒకటొకటియు ఒక్కొక్కదళ మని భా.

క. నరనాథ, పాంచభౌతిక । శరీరమున దేహి మోహ సాంద్రతమతమః
పరివృతుఁ డై, 'యే, నిది నా । పరికర' మని యవధి లేనిభ్రమఁ బడి తిరుగున్.

నరనాథ = ఓరాజా, పాం....నన్ = పృథి వ్యప్తేజో వా య్వాకాశము లసెడి పంచభూతముల పరిణామ మగుదేహమందు, దేహి = జీవుఁడు, మో...డు - మోహ = అవిద్యవలని ('అథ మోహో నృలిఙ్గః స్యా దవిద్యాయాం చ మూర్ఛనే' మేది.) - సాంద్రతమ = మిక్కిలి దట్టమైన - తమః = చీకటిచేత - పరివృతుఁడు = ఆవరింపఁబడినవాఁడు, ఐ, ఏను = నేను అసెడి భావమును (అహంకారమును), ఇది నాపరికరము = ఈవస్తువు నాసొత్తు, అని = అసెడి - అవధి లేని = హద్దులేనట్టి - భ్రమన్ = తిరుగుడులో ('భ్రమో భ్రమా' అమ.), పడి, తిరుగున్ = సుడియుచుండును.

ఓ రాజా పంచభూతాత్మకమయిన శరీరమందు జీవాత్మ అవిద్యవలని దట్టంపు టిరులుచే ఆవరింపఁ బడినవాఁడై అహంకార మమకారము లసెడి యనవధికభ్రాంతిలో పడి తిరుగుచుండును. అవిద్యచే తమస్సునం బడు నని శ్రుతి.—

'అన్ధం తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే.' ఈశా.

క. జలవసుధాంబరపవన । జ్వలనంబులకంటెఁ దా నజస్రంబు వెలిన్
వెలుఁగొందునాత్మ యుండఁగఁ । గళేబరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్?

ఆత్మ = జీవుఁడు, జల వసుధా, అంబర పవన జ్వలనంబులకంటెన్ = నీరు మన్ను ఆకాశము గాలి అగ్ని అను వానికంటె, తాను, వెలిన్ = వేఱయి, అజస్రంబు = సర్వదా, వెలుఁగొందుచున్ = ప్రకాశించుచు, ఉండఁగాన్, కళేబరమున్ = (జలాది వికారమయిన) దేహమును, ఆత్మగాన్, ఎవ్వఁడు, తలపోయున్.

ఆత్మ పృథివ్యప్తేజోవాయ్వాకాశములకంటె వేఱయి సర్వదా ప్రకాశించుచుండఁగా, పృథివ్యాదిమయ మయిన దేహమే ఆత్మయని యెవ్వడును తలంపఁడు.

సీ. వపు రుపభోగ్యముల్ నృప గృహక్షేత్రాదు;
లవి బొంది వౌఁగాక యాత్మ వగునె?
య ట్లన పుత్త్రపౌత్త్రానీకములు నాత్మ
కాని మైఁ బుట్టుటఁ గావు తనవి;
గాన మృత్యువుఁ గను కాయంబున జనించు
పుత్త్రాదులెడ స్వత్వబుద్ధి దగదు;
ఎపుడేని యాత్మ వేఱే యనునప్పుడె
యడరు భోగంబు లీయాత్మకంట;
తే. వట్లుగా కీయొడలె యాత్మ యన్న నంటు;
మృద్గృహము నిల్చు నె ట్లట్లు మృజ్జలాది
నట్లు భౌతికభోగాశనాది భౌతి
కాంగములు నిల్చు; భోగ మిం దాత్మ కెద్ది? 69

1. నృప = ఓరాజా, గృహ క్షేత్ర ఆదులు = ఇండ్లు భార్యలు (లేక - పొలములు) లోనగునవి ('క్షేత్రం పత్నీశరీరయోః' అమ.), వ...ల్ - వపుః = దేహమునకు - ఉపభోగ్యములు = అనుభవింపఁదగినవి: అవి = ఆగృహక్షేత్రాదులు, బొందివి = దేహమువి, వౌఁగాక = అవును గాని, ఆత్మవి = జీవునివి, అగునె = కావు;

2. అట్లన = ఆప్రకారముగానే, పుత్త్రపౌత్త్ర అనీకములున్ = కొడుకులయు కొడుకుల కొడుకులయు సమూహములు, సైతము, ఆత్మ కాని మైన్ = జీవుఁడు కానట్టి దేహమందు, పుట్టుటన్ = జనించుటవలన, తనవి = జీవునివి, కావు.

3. కానన్ = కావున, మృత్యువుఁ గనుకాయంబునన్ = మృతిం బొందున దైన దేహమునందు,...స్వత్వ బుద్ధి = తనవా రనెడి తలంపు, తగదు;

4. అడరు భోగంబులు=అతిశయించు విషయానుభవములు, ఆత్మ మేనికి వేఱే ఎపుడేని, అపుడె = ఆత్మ దేహమునకన్న భిన్నుఁ డయిన కారణంబున నే,...

...అట్లు...మృత్ జల ఆదిన్=దేనితో నలుకుదురో - మన్ను నీళ్లు లోనగు నావస్తువుచేత, మృత్ గృహము=మట్టియిల్లు, ఎట్లునిల్చున్=ఎట్లునిలుచునో, అట్లు, భౌ...దిన్ - భౌతిక=పంచభూతమయమయిన - భోగ=భోగ్యవస్తువులును - అశన=అన్నమును - ఆదిన్ = లోనగుదానిచేత, భౌతిక అంగములు = పంచభూతవికారము లగునట్టివి దేహములు, నిల్చున్.

ఓరాజా, ఇండ్లు కళత్రములు లోనగునవి దేహమునకు భోగ్యములు, కావున అవి దేహమునకే చెందునుగాని, ఆత్మకు చెందవు, అట్లేదేహమువలన జనించిన పుత్త్రపౌత్త్రాదికము దేహముదే గాని ఆత్మది గాదు. కావున జీవాత్ముఁడైన తనకు మృతినొందున దైన దేహమున జనించిన పుత్త్రాదులయందు తనవారు అనెడి తలంపు తగదు. దేహమే ఆత్మయగునెడల దేహముయొక్క భోగములు ఆత్మ కంటునుగాని, దేహము ఆత్మ కానందున అవి ఆత్మకు అంటవు. మట్టియిల్లు

మట్టితో అలికిన నిలుచును, అట్లే పాంచభౌతిక మయిన శరీరము పాంచభౌతిక భోగానుభవముల చేత నిలుచును. భౌతికము కానట్టి యాత్మకు భౌతికములయిన యాభోగములు అంటవు.

మ. జనిసాహస్రబహుప్రయాణ మగు సంసారంపుఁ ద్రోవ న్సదా
చనుచుండు న్ఘన మోహఖేద మలమ న్సంసారి పాంథుండు, వా
సన లన్ ధూళి ముసుంగు గాఁగ; నెపుడేన్ జ్ఞానంపుటుష్ణోదకం
బునఁ దత్క్షాళన సేయు, వాని కపు డమ్మోహశ్రమంబు న్జనున్. 70

సంసారి పాంథుండు = సంసరణశీలుఁ డనెడి నిత్యపథికుఁడు, జ...ము - జని = పుట్టువుల యొక్క - సాహస్ర = వేలసమూహము లనెడి - బహు = పెక్కు - ప్రయాణము = పయనములు (మజిలీలు) గలది, అగు = సంసారంపుఁద్రోవన్ = జననమరణ ప్రవాహమనెడు మార్గములో, వాసనలు = అనాదికర్మ సంస్కారములు, అన్ = అను = అనియెడి - ధూళి = పరాగము, ముసుంగు కాఁగన్ = పైకప్పు కాఁగా, ఘనమోహఖేదము = దట్టమయిన యవిద్యవలని శ్రమ, అలమన్ = ఆక్రమించుచుండఁగా, సదా, చనుచుండున్ = నడచుచుండును; ఎపుడేని = ఎప్పుడైనను, జ్ఞానంపు టుష్ణోదకంబునన్ = విద్య యనెడి వేడినీళ్లతో, త...న - తత్ = ఆవాసనాధూళి ముసుఁగుయొక్క - క్షాళన = కడుగుటను, చేయున్ = కావించునో, అపుడు, వానికిన్ = ఆసంసారి పాంథునికి, అమ్మోహశ్రమంబున్ = ఆయవిద్యారూపమోహమువలని యాశ్రమకూడ, చనున్ = తొలఁగును.

సంసారియైన జీవుఁడు వేలకొలంది జన్మము లనెడి పెక్కు పయనములు (మజిలీలు) గల సంసార మార్గమందు అనాదికర్మవాసన లనెడి ధూళిలో బ్రుంగుచు అవిద్యయనెడి సొలపువలని శ్రమలో మునింగి సర్వదా పయనము నడచుచుండును. ఎప్పుడు విద్యయనెడి వేఁడినీళ్ల (స్నానము) చేత ఆకర్మవాసనాధూళిని కడిగికొనునో అప్పుడు అవిద్యారూపమయిన సొలపువలని యాబడలికయు తీఱిపోవును. - అనాదికర్మ వాసనంజేసి అవిద్యావశుఁడై సంచరించుచున్న జీవుఁడు విద్యచే ఆవాసనను జయించి ఆనందముం బొందును; అని భా. రూపకాలంకారము.

ఈయర్థమే గీతయందు ఇట్లు చెప్పఁబడినది:—
'యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.' భ. గీ. 4, 37.
'జ్ఞానంలబ్ధ్వా పరాంశాన్తి మచిరే ణాధిగచ్ఛతి.' భ. గీ. 4, 39.

తే. అట్టి మోహశ్రమం బాఱ నాశరీరి
స్వస్థుఁడై తా ననన్యాతిశయ మబాధ
మనఁగ విలసిల్లు నిర్వాణమును భజించు;
ననఘు తొల్లియు నిర్వాణ ఖనియ కాన. 71

అనఘు = పాపరహితుఁడా, తాను, తొల్లియున్ = ఆదిలోఁగూడ, ని...య - నిర్వాణ= ముక్తికి ('ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిఃశ్రేయసామృతం । మోక్షోపవర్గః' అమ.)— ఖనియ = గనియే ('ఖనిః స్త్రియా మాకరఃస్యాత్' అమ.), కానన్ = అగుటం జేసి, అశరీరి = అజీవుఁడు, అట్టి - మోహశ్రమంబు = అవిద్యారూప మయిన యలపట, అఱన్ = తీఱిపోఁగా,

స్వస్థుఁడై = నిర్వికారుఁడై, అనన్య అతిశయము = తనకంటె నధికము లేనిదియు, అబాధము = దుఃఖములేనిదియు, అనఁగ విలసిల్లు = అని వర్ణింపఁబడినదై యొప్పుచున్న - నిర్వాణము = మోక్షమును; భజించుఁగా = పొందును.

అట్టి యీయవిద్యాశ్రమ తీఱఁగానే జీవుఁడు తొలుత తానెట్లుండెనో అట్లే స్వస్థుఁడై నిరతిశయ నిర్బాధమయిన మోక్షసామ్రాజ్య మనుభవించుచు ఉండును.

వ. (1) విను జనేశ్వర; జలం బస్పృష్టదహనం బయ్యుఁ దదీయ యోగంబునఁ గలశోదరంబున నునికిం దా నతిశీతలం బయ్యు నుడికి, శబ్దోద్రేకాది ధర్మంబులం బొందున, ట్లాత్మయుం బ్రకృతి సంబంధంబున నహమ్మానాది దూషితుండై, ప్రాకృతంబు లగు ధర్మంబులం బొందు; (2) వీని కత్యంత విలక్షణుండు నక్షయుండు నాత్మ; య ట్లగుట నింత యనర్థమూలం బగు నీ యవిద్యాబీజంబు నీ కెఱింగించితి. నేవం విధంబు లగు సకల క్లేశంబులకును సంక్షయకరంబు యోగంబుదక్క మఱియొం డుపాయములే." దనుటయుఁ బ్రీతుం డై, ఖాండిక్యుండును "మహాత్మా, యిన్నిమి వంశంబున విజ్ఞాత యోగ శాస్త్రార్థుండ వీవు; నాకు న య్యోగంబు సమస్తంబు విస్తరింప వలయు." ననినఁ, గేశిధ్వజుండు కృపాళుం డై, "మహీపాలా, విను మెందేని సంస్థితుండై ముని మఱి పునర్భవంబునకు రాక బ్రహ్మసాధర్మ్యంబుఁ బొందు నట్టి యోగంబుఁ జెప్పెద, సావధానుండవై విను." మని యిట్లనియె. 72

1. జనేశ్వర - ఓరాజా...అస్పృష్టదహనంబు అయ్యుఁగా = తాఁకఁబడని నిప్పు గలది అయినను (నిప్పునకు తగులకయే యుండియు), తదీయయోగంబునఁగా = దాని కూడికలో, (నిప్పుమీఁద నున్న) కలశ ఉదరంబునఁగా = కుండకడుపులో, ఉనికిఁగా = ఉండుటచేత, తాను = జలము, అతిశీతలంబు = (స్వభావముచేత) మిక్కిలి చల్లనిది, అయ్యుఁగా = అయినప్పటికిని, ఉడికి, శబ్ద ఉద్రేక ఆది ధర్మంబులఁగా = (గుడగుడ) ధ్వని - పై కుబుకుట లోనగు గుణములను, పొందునట్లు, ఆత్మయుఁగా = జీవుఁడుకూడ, ప్రకృతి సంగంబునఁగా = ప్రధానముతోడి కూటమిచేత, అహమ్మాన ఆది దూషితుండై = అహంకారము మమకారము లోనగు ధర్మములచేత మలినుఁడై, ప్రాకృతంబులు = ప్రకృతిసంబద్ధములు, అగు - ధర్మంబులఁగా = గుణములను, పొందుఁగా; (ఉపమాలంకారము - ఆత్మకును జలమునకును, ప్రకృతికిని అగ్నిసంయుక్త కలశమునకును, అహంకారాదులకును క్వథన శబ్దోద్రేకాదులకును సామ్యము.)

2. ఆత్మ = జీవుఁడు, వీనికిఁగా = అహంకారాది ప్రాకృత ధర్మములకు, అత్యంత విలక్షణుఁడు = కేవలము విరుద్ధమయిన లక్షణములు కలవాఁడు, అక్షయుండుఁగా = నాశములేనివాఁడును ('నిలయాపచయాక్షయా' అమ.); అట్లు అగుటఁగా = ఆత్మయొక్క వాస్తవ స్వరూపంబు అట్టిదై యున్నందున, ఇంత - అనర్థమూలంబు = చెఱుపునకు కారణమైన - అవిద్యాబీజంబు = అజ్ఞానవృక్షము దేనినుండి మొలచినదో ఆబీజమును (అహంకార మమకారము లనుట), ...ఏవంవిధంబులు = ఇట్టిప్రకారము కలవి, అగు = సకల - క్లేశంబులకును = దుఃఖములకును ('అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః' అని పాతంజల సూత్రము.), సంక్షయకరంబు =

ధ్వంసము చేయునది,...యోగంబు = అష్టాంగము,...విజ్ఞాతయోగశాస్త్రుండవు = ఎఱుఁగఁబడిన యోగశాస్త్రము కలవాఁడవు (యోగశాస్త్రము నెఱుంగువాఁడవు),...కృపాళుండు = దయగల వాఁడు,...సంస్థితుండై = మృతుఁడై ('పరాసు ప్రాప్తపఞ్చత్వ పరేత ప్రేత సంస్థితాః। మృత ప్రమీతౌ త్రిష్వేతే' అమ.)...ముని=జ్ఞాని ('మన జ్ఞానే' ధా. పా.),...పునర్భవంబునకుఁ రాక=పునర్జన్మమునకు రాక (మరలఁ బుట్టక), బ్రహ్మసాధర్మ్యంబు = బ్రహ్మతో సమానధర్మము కలవాఁ డగుటను (బ్రహ్మధర్మములను), పొందు నట్టి యోగంబు = ఏయోగమువలనఁ బొందునో ఆ యోగమును, స అవధానుండవై = హెచ్చరిక కలవాఁడవై,...

పూర్వముద్రణమున 'ఎందేని సంస్థితుఁడై = ఏయోగ శాస్త్రమందైన నున్నవాఁడై' అని వ్యాఖ్య. ఇట్టి ప్రకరణములో చావును చెప్పుటయు ప్రసిద్ధమే అయి యున్నది:—

'జీవన్ముక్తశ్చ భవతి దేహాన్తే తమసః పరం ధామ ప్రాప్నుయాత్...న చ పునరావర్తతే.' అక్ష్యుపనిషత్.

'తనుం త్యజతు వా తీర్థే శ్వపచస్య గృహేఽథవా
జ్ఞానసంప్రాప్తి సమయే ముక్త ఏవాఽమలాశయః.
న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే
సర్వాశా సంక్షయే చేతఃక్షయో మోక్ష ఇతి శ్రుతేః.' సాంఖ్యసార.
'జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే
విశ త్యదేహముక్తత్వం పవనోఽస్పన్దతా మివ.' [యోగకుం. ముక్తికోప. మహోప.]

ఆ. "ప్రాణికోటి కెల్ల బంధంబు మోక్షంబు। చేరుటకును మనసు కారణంబు;
విషయసంగి యైన, విను బంధకారి; ని। ర్విషయ మైన, ముక్తివిభవకారి. 73

విను, ప్రాణికోటికిఁ ఎల్లన్ = జంతువుల సముదాయమున కంతటికిని, బంధంబున్ = సంసారరూప మయిన కట్టును, మోక్షంబున్ =ఆకట్టునుండి విడుదలయును, చేరుటకున్ = కలుగుటకు, మనస్సే, కారణంబు; (ఆమనస్సు), విషయసంగి=విషయములతోఁ గూడినట్టిది, ఐనన్ = అయి నేని, బంధకారి = (పైనిచెప్పిన) బంధమును చేయును, నిర్విషయము = విషయరహితము, ఐనన్=అయి నేని, ముక్తి విభవకారి=మోక్షరూప మయిన యైశ్వర్యమును కావించును.

ప్రాణులకు బంధమోక్షములకు మనస్సే కారణము, ఆమనస్సు సవిషయ మైనచో బంధముం జేయును, నిర్విషయ మైనచో మోక్షముం జేయును.

ఈపద్యము శాట్యాయనీయాది బహూపనిషత్తులందుఁ గల యీశ్లోకమునకు అనువాదము:—
'మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః;
బన్ధాయ విషయాసక్తం; ముక్త్యై నిర్విషయం స్మృతమ్.'
సీ. విజ్ఞానమునఁ జేసి విషయాదివలన నె
మ్మన మాహరించి బ్రహ్మముఁ బరేశుఁ
జింతింపవలయు నిశ్శ్రేయసంబున; కట్లు
చింతింప నతఁడు తచ్చింతకునకు

నాత్మభావం బిచ్చు, నాకర్షకము వికా
రశ్మసారముఁ దార్చునట్లు; యోగ
మన, యమాదివిషయమైనది యాత్మ ప్ర
యత్నంబున కధీన మైన సాత్త్విక

తే. వపుమనోగతి యెయ్యది గలదు దాని
బ్రహ్మసంబంధినిఁగఁ జేయు ప్రౌఢి సూవె:
యిట్టి వైశిష్ట్యధర్మ మెందేని గలుగు
నట్టి యోగంబు గలిగిన యతఁడె యోగి. 74

నిఃశ్రేయసంబునకున్ = ముక్తికై, విజ్ఞానమునఁ జేసి = విశిష్టమయిన మోక్షోపయోగి జ్ఞానముచేత ('మోక్షే ధీర్జ్ఞానమ్' అమ.), నెమ్మనము = నిండుమనమును, విషయాదివలనన్ = రూప గంధాదులగు నింద్రియార్థములవలననుండి ('రూపం గన్ధో రస స్పర్శ శబ్దాశ్చ విషయా అమీ। గోచరా ఇన్ద్రియార్థాశ్చ' అమ.), ఆహరించి = వెనుకకు లాగి, పరేశున్ = పరమేశ్వరుఁడైన - బ్రహ్మమున్, చింతింపవలయున్ = ధ్యానింపవలయును; అతఁడు = బ్రహ్మము, తచ్చింతకునకున్ = ఆ బ్రహ్మధ్యాయికి, ఆకర్షకము=సూదంటురాయి ('ఆకర్షకస్త్వయస్కాన్తో విశేషాశ్మ్యుమ్బకాదయః'), వి...మున్ - వికారి. = (శస్త్రాది రూపముగా) మార్పువొందునదైన-అశ్మసారమున్ = ఇనుమును ('లోహో స్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిణ్డం కాలాయసాయసీ। అశ్మసారః' అమ.), తార్చునట్లు = తనకడకు ఈడ్చుకొనునట్లు, ఆత్మభావంబు = తన స్వరూపమును, ఇచ్చున్;

యోగము అనన్ = యోగ మనఁగా, యమాదివిషయము = యమాదులను గూర్చినట్టిది (యమాదులను సాధించుటకుఁ గాను చేయఁబడుచున్నట్టిది), ఐన - ఆత్మ ప్రయత్నంబునకున్ = తన (జీవుని) జతనమునకు, అధీన = వసము, ఐన - సా...తిన్ - సాత్త్వికపు = సత్త్వగుణముచేత నిర్వృత్తమయిన - మనోగతి = మానసవృత్తి, ఎయ్యది; కలదు = ఉన్నదో, దానిన్ = ఆసాత్త్వికవృత్తిని, బ్రహ్మసంబంధినిగాన్ = బ్రహ్మకు చెందినదానినిగా, చేయు (నట్టి) - ప్రౌఢి చూవె = నేర్పుసుమా.

ఇట్టి - వైశిష్ట్యధర్మము = బ్రహ్మానుసంధాన రూపమయిన విశిష్టత్వ మనెడు లక్షణము, ఎందేని గలుగున్ = ఏయోగములోఁ గలుగునో, అట్టియోగి = ఉత్తమసాధకుఁడు.

మోక్షముకై సాధకుఁడు శబ్దస్పర్శాదివిషయభోగమునుండి మనస్సును వెనుకకు లాగుకొని, పరమాత్మను ధ్యానించెనేని, కత్తిగా కటారిగా మాఱునదైన యినుమును సూదంటురాయి ఏవిధముగా ఆకర్షించునో, ఆవిధముగా ఆపరమాత్మ ఆధ్యాయికి తనస్వరూపము నొసంగును. యోగ మనఁగా నేమో వినుము - యమనియమాదులచే నిర్మలీకృతమయిన సాత్త్వికచిత్తవృత్తిని బ్రహ్మముమీఁదికి నడపుట (-అనఁగా ఇతర చింతలేక బ్రహ్మమునే చింతించుటయందు నేర్పు) యోగ మనఁబడును. అట్టి విశిష్ట బ్రహ్మధ్యానము ఏయోగమునం గలుగునో ఆయోగము గలవాఁడే యోగి.

'యమాది' - ఆదిశబ్దముచేత 'నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణా సమాధులు' గృహీతములు. 'సాత్త్వికపు' - మనస్సు సత్త్వ రజ స్తమస్సులని మూఁడుగుణముల

మొత్తమై యున్నది; సత్త్వము ప్రకాశసుఖధర్మము, రజస్సు ప్రవృత్త్యసుఖధర్మము, తమస్సు స్థితిమోహధర్మము;

'ధర్మాభిపం జ్ఞాన సమాహ్వాయం చ । వైరాగ్య మైశ్వర్య మదో విరోధాః
ధర్మాధికానాం. పురత శ్చతుర్ణాం । సత్త్వాంశతో భూతి రుదీ రితైషా,
తత్త్వద్విరోధైకజుషా మధర్మా । దీనాం చతుర్ణాం తమసః సకాశాత్
సత్త్వాత్ సుఖం స్యా ద్రజసోఽతిదుఃఖ । మాచ్ఛాదకత్వాత్ తమసో విమోహః.' వి. త.

వ. (1) మఱియు, బ్రహ్మచర్యాదులగు యమంబు లేనును, స్వాధ్యాయాదులగు నియమంబు లేనును, నిష్కాముండై యోగి యగు వాఁడు మనోనైర్మల్య సంపాదనకు నాచరింపవలయు; నివి కామ్యంబులైన, విశిష్టఫలదంబులు; నిష్కాములకు ముక్తిదంబు, లగు. (2) నట్టి యమనియమంబులు వదలక భద్రాసనాదులందు నొకటి నవలంబించి ప్రాణాభిధానం బగు పవనంబు నభ్యాసవశంబున వశ్యంబు సేయవలయు; నదియె ప్రాణాయామ మనంబడు; నట్టి ప్రాణాయామంబు సబీజ నిర్బీజ సంజ్ఞలం బరఁగు; నదియె ప్రాణాపానంబుల మిథోనురోధంబుల నుభయ నిరోధనంబున రేచకాది త్రైవిధ్యంబునుం బొందు; (3) మొదల నాచెప్పిన సబీజనిర్బీజ సంజ్ఞలందు నంతస్స్థూల రూపావలంబి యగునదియ సబీజం, బితరం బబీజంబు; మఱి శబ్దాది విషయంబులం బ్రవణంబులగు నింద్రియంబులం ద్రిప్పి మానసంబున కధీనంబులు సేయుట ప్రత్యాహారం; బిట్టి ప్రత్యాహారంబు ముముక్షున కవశ్యకర్తవ్యంబు; దీనివలన నతిచంచలంబు లగు నింద్రియంబులకు నాత్మవశ్యత గలుగు; నివి గన వశ్యంబులు గాకుండిన నాయోగి యోగసాధకుండు గానేరండు; ప్రాణాయామంబునఁ బవనంబులు, ప్రత్యాహారంబున నింద్రియంబులు, వశంబులైన పిమ్మటఁ జిత్తంబు శుభాశ్రయంబునం దిడునది." యనుటయు ఖాండిక్యుఁ డిట్లనియె. 75

1. బ్రహ్మచర్య ఆదులు = ఉపస్థనియమము లోనగునవి, యమంబులు = అహింసాదులు,' ఏనును = అయిదును ('అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః' - పాతంజలము.) స్వాధ్యాయ ఆదులు = ప్రణవపూర్వము లైనమంత్రములను జపించుట లోనగునవి ('స్వాధ్యాయఃస్యాజ్జపః' అమ. ప్రణవపూర్వాణాం మన్త్రాణాం జపః' అని రాజమార్తండము. 'శౌచ సంతోష తపః స్వాధ్యా యేశ్వరప్రణిధానాని నియమాః' పాతంజ.),...నిష్కాముండై = కోరికలు లేనివాఁడై,...మనోనైర్మల్యమునకుఁ = చిత్తశుద్ధికొఱకు. ఇవి = ఈ యమనియమములు; కామ్యంబులు = ఫలవిశేషముకొఱకు ఆచరింపఁబడినవి. విశిష్టఫలదంబులు = ఎక్కుడయిన ఫలముల నిచ్చునట్టివి. నిష్కాములకుఁ = కోరిక లేనివారికి, ముక్తిదంబులు = మోక్షము నిచ్చునట్టివి.

2. భద్రాసనము - ఆసనములు అనంతములు - అందు 84 ప్రధానములు, అందు ప్రధానతమములు 4.

'ఆసనాని చ తావన్తి యావన్త్యో జీవజాతయః....
సిద్ధం భద్రం తథా సింహం పద్మం చేతి చతుష్టయమ్.' ధ్యానబిందూపనిషత్తు.
'గుల్ఫౌ తు వృషణ స్యాధః సీవన్యాః పార్శ్వయోః క్షిపేత్,
పార్శ్వపాదౌ చ పాణిభ్యాం దృఢం బద్ధ్వా సునిశ్చలః
భద్రాసనం భవే దేతత్ సర్వవ్యాధి విషాపహమ్.' వసిష్ఠ.

ప్రాణ అభిధానంబు = ప్రాణ మను పేరు గలది—

'హృది ప్రాణో గుదేఽపానః సమానో నాభిసంస్థితః
ఉదానః కణ్ఠదేశస్థో వ్యాన స్సర్వ శరీరగః'.— అని అంతరవాయు భేదములు.

పవనంబు = వాయువును. అభ్యాసవశంబునన్ = అలవాటుచేత, వశ్యంబు = స్వాధీనము. ప్రాణాయామంబు = ప్రాణవాయువుయొక్క నిరోధము—
('ప్రాణాఖ్య మనిలం వశ్య మభ్యాసాత్ కురుతే తు యత్ ।
ప్రాణాయామః స విజ్ఞేయః రేచపూరక కుమ్భకైః.'),
సబీజ నిర్బీజ సంజ్ఞలన్ = (ఇవి మూలములోనే వివరింపఁబడినవి.), ప్రాణాపానంబుల = ప్రాణవాయువుయొక్కయు అపానవాయువుయొక్క - మిథోనురోధంబులన్ = ఒకటిచేత నొకటిని అనుసరించుటచేత—

'పరస్పరే ణాభిభవం ప్రాణాపానౌ యదానిలౌ ।
కురుతః స ద్విధా తేన తృతీయః సంయమా త్తయోః'. విష్ణుపురాణము.
'అపానేఽస్తంగతే ప్రాణో యావ న్నాభ్యుదితో హృది ।
తావత్ సా కుమ్భకావస్థా యోగిభి ర్యానుభూయతే.
బహి రస్తంగతే ప్రాణే యావన్నాపాన ఉద్గతః ।
తావత్పూర్ణాం సమావస్థాం బహిష్ఠం కుమ్భకం విదుః.' ముక్తికోప.

3. రేచకాది త్రైవిధ్యంబును = రేచక పూరక కుంభకము లనెడు మూఁడు ప్రాణాయామములను, - ఊర్పును వెలిఁబుచ్చుట రేచకము, పీల్చుట పూరకము, ఆఁపివైచుట కుంభకము. అంతః స్థూలరూప అవలంబి = స్థూలరూపమును ధ్యానించునది. సబీజంబు = స్థూలరూపధ్యేయము గలది. అబీజంబు = స్థూలరూపధ్యేయములేనిది. ప్రవణంబులు = ఆసక్తములు ('ప్రవణో నా చతుష్పథే । త్రిషు తు క్రమనిమ్నోర్వ్యాం ప్రహ్వే తత్పరదక్షయోః' నానా.), ఆత్మవశ్యత = తనకు (సాధకునికి) అధీనములై యుండుట. చిత్తంబున్ = స్వార్థానుసంధాన పరమైన చేతస్సును, శుభ = కల్యాణమయిన, ఆశ్రయంబునందున్ = అవలంబంబునందు (ధ్యేయమునందు).

మలినచిత్తమున వస్తుస్వరూపము స్ఫుటపడదుగాన, శుభాశ్రయమునందు చిత్తమును ప్రాణాయామాది యోగాంగాభ్యాసముచే శుద్ధమైన పిమ్మటనే యుంపు మని యుపదేశించుట.

'సంభవ త్యుత్తమే ప్రాజ్ఞః ప్రాణాయామే సుఖీ భవేత్ ।
ప్రాణాయామేన చిత్తం తు శుద్ధం భవతి సువ్రత ।
చిత్తే శుద్ధే శుచిః సాక్షాత్ ప్రత్యగ్జ్యోతి ర్వ్యవస్థితః ।
ప్రాణశ్చిత్తేన సంయుక్తః పరమాత్మని తిష్ఠతి.' దర్శనోప.

క. 'మననమున కెద్ది శుభాశ్రయ, మనఘ, యెఱింగింపు, మఱి సమస్తాధారం
బనఁ జను యద్వస్తువు? య న్మనన మశేషోరుదుఃఖ మండలిఁ జెఱుచున్?' 76

అనఘ = ఓయి పాపరహితుఁడా, మననమునకున్, శుభ ఆశ్రయము = మంగళ మయిన తావు (ధ్యేయము), ఎద్ది = ఏదో, మఱి = ఇంతియగాక, సమస్త ఆధారంబు అనన్ = ఎల్లవస్తువులకును తావలము అనునట్లుగా, యత్ వస్తువు = ఏపదార్థము, చనున్ = ఒప్పుచున్నదో, యత్ మననము = దేని చింతనము, అ...లిన్ - అశేష = సమస్తమయిన - ఉరు = గొప్పవైన - దుఃఖ = శోకములయొక్క - మండలిన్ - సమూహమును, చెఱుచున్ = పోనడచునో, ఆ ధ్యేయ పదార్థమును, ఎఱింగింపుము = తెలుపుము.

ఓపుణ్యాత్ముఁడా, మనస్సునకు మంగళ మయినధ్యేయ మేదో, ఏది అఖిలమునకును ఆధారమో, దేనిని చింతించిన సకల మహాదుఃఖములును శమించునో దానిం జెప్పుము.

తే. అనినఁ, గేశిధ్వజుఁడు వాని కనియె; 'బ్రహ్మ
మాశ్రయంబు మనంబున; కదియ పరము
నపరము ననంగఁ బొలుచు; నం దపర మనఁగ
మూర్తము, పరం బనంగ నమూర్త మనఘ. 77

పరము = పైది; అపరము = క్రిందిది; మూర్తము = దేహము కలది ('మూర్తం స్యాత్రిషు మూర్ఛాలే కఠినే మూర్తిమ త్యపి' మేది. 'స్త్రియాం మూర్తి స్తను స్తనూః' అమ.)
మూర్తము అమూర్తము వని బ్రహ్మమునకు రెండు తెఱంగులు—
'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చై వామూర్తం చ...' బృహ. ఉ. 4, 3, 1.

మ. మును నాచెప్పిన రెంటిలోఁ బర మనన్ ముక్తాత్మ; దూరం బుపా
సనఁ గావింప నమూర్త; మింక పరసంజ్ఞం; బబ్జగర్భాది బ
ద్ధనికాయం బది మూర్త మైనను బరిత్యాజ్యంబు శశ్వత్త్రిభా
వనలం గూడుట నారురుక్షున కసేవ్యం బీద్వయంబు న్తుదన్. 78

...నా చెప్పిన = నేను చెప్పినట్టి - పరము = పరబ్రహ్మము, అనన్ = అనఁగా, ముక్త ఆత్మ = ముక్తి ననుభవించుచుండు (ప్రకృతియోగము లేని) బ్రహ్మము, అమూర్తము = దేహము లేనిది, ఉపాసన = ధ్యానాదిరూప మయినభజనము, కావింపన్ = చేయుటకు, దూరంబు = అశక్య మయినది; ఇంకన్ = ఇది గానిది, అది అపరసంజ్ఞంబు = అపరబ్రహ్మ మని పేర్కొనంబడినట్టిది, అ...బు - అబ్జగర్భ = హిరణ్యగర్భుఁడు - ఆది = లోనగునట్టి - బద్ధ = బంధమునం బడియున్న (=అముక్త) జీవులయొక్క - నికాయంబు = సమూహము ('నికాయస్తు పుమా న్లక్ష్యే సధర్మిప్రాణిసంహతౌ' మేది.), అది = అపరబ్రహ్మము, మూర్తమైనను = తనువుగలదియైనను, శ...లన్ - శశ్వత్ = మాటిమాటికిని - త్రిభావనలన్ = వక్ష్యమాణ భావనాత్రయముతో, కూడుటన్ = చేరుటచేత (అభావనలు కలదై యుండుటచేత), పరిత్యాజ్యంబు = విడువఁదగినట్టిది; ఈద్వయంబు = ఈపరాపరబ్రహ్మము, ఆరురుక్షునకున్ = (ఎక్కంం గోరువానికి) ముముక్షునకు, తుదన్ = పర్యవసానమందు, అసేవ్యంబు = ఉపాసనకు అర్హము కాదు.

పరము అపరము నని బ్రహ్మము ఇరుదెఱంగుల నుండు నని చెప్పియుంటిని గదా; అయినను, అందు, పరము - అనఁగా ముక్తమైయున్న యాత్మ - అమూర్త మగుటంజేసి ఉపాసనకు శక్యము గాదు; మఱి హిరణ్యగర్భాదిరూపంబుల నుండు బద్ధజీవ సంఘాత మగు నపరబ్రహ్మ మన్ననో మూర్తిమంత మగుటం బట్టి ఉపాసింప శక్య మయినను భావనాత్రయముకలదై యుండుటం జేసి ఉపాసనార్హము కాదు, త్యక్తవ్యమ యగును. - ఇట్లు ముముక్షువునకు పరాపరములు రెండును త్యక్తవ్యములే అగును, ఇటఁ జెప్పిన భావనాత్రయ స్వరూపము:—

'త్రివిధా భావనా, భూప, విశ్వ మేత న్నిబోధ తామ్;
కార్యాఖ్యా బ్రహ్మసంజ్ఞా చ తథాచై వోభయాత్మికా.
కర్మభావాత్మికా హ్యేకా, బ్రహ్మభావాత్మికా పరా.
ఉభయాత్మికా తథై వాన్యా, త్రివిధా భావభావనా.
సనన్దనాదయో బ్రహ్మ భావభావనయా యుతాః.
కర్మభావనయా చాన్యే దేవాద్యా స్థావరావరాః;
హిరణ్యగర్భాదిషు చ బ్రహ్మకర్మాత్మికా ద్విధా;
అధికారబోధయు క్తేషు విద్యతే భావభావనా,
అక్షీణేషు సమ స్తేషు విశేషజ్ఞానకర్మసు.'

'అనుష్ఠేయవిషయః ఆన్తరప్రయత్నః భావనా,' 'భావః అనుష్ఠేయః, అనుష్ఠేయవిషయా [భావనా] ఆన్తర ఉద్యోగః [భావభావనా]. సా [కర్మభావాత్మికా] కర్మరూపానుష్ఠేయవిషయా, [బ్రహ్మభావాత్మికా] ఉపాసన రూపానుష్ఠేయవిషయా [ఉభయాత్మికా] కర్మోపాసనరూపోభయానుష్ఠేయవిషయేతి [త్రివిధా] ఇత్యర్థః' అని వేదార్థసంగ్రహతాత్పర్యదీపిక.

వ. ఆభావనాత్రయం బెద్ది యనినఁ జెప్పెద:—(1) బ్రహ్మభావనయుం గర్మభావనయు బ్రహ్మకర్మోభయభావనయు; నందు బ్రహ్మభావనాయుతులు సనందనాదులు, దేవాది స్థావరావరు లగుప్రాణు లందఱు కర్మభావనాభావకులు, హిరణ్యగర్భాదు లుభయభావనాపరు; లీమూఁడు తెఱఁగులవారు భావనాత్రయాన్వితులు గావున నీత్రివిధాత్మక రూపంబ నేవ్యంబు; సనందనాదులునుం బ్రాగ్బ్రహ్మ కల్పంబుల సంసరించుట భావనాబద్ధులె; యిబ్భావనాత్మకం బగు విశ్వంబు సంస్థితికి నవధి; దేవమనుష్యాది విశేషజ్ఞాన కర్మంబులు క్షీణించుటయ; (2) యట్టి విశ్వంబై తోఁచు హిరణ్యగర్భాదులకంటె నన్యంబు పరాఖ్యం; బిది ముక్తరూపంబమూర్తంబై యుండు నని మొదల సూచించితిం గదా; తదాకారంబుఁ దేటపఱిచెద: పూర్వోక్త దేవాది భేదరహితంబై తద్భేదరాహిత్యంబున నిట్టి దట్టిదని వచించుటకు గోచరంబుగాక యపక్షయాది రహితంబును సచ్ఛబ్దవాచ్యంబును నాత్మసంవేద్యంబును నై, జ్ఞానైకనిరూపణీయం బగుచు జ్ఞానశబ్ద వాచ్యంబునుం దానయై బ్రహ్మాత్మకం బగుట బ్రహ్మసంజ్ఞయుం గాంచి యొప్పు; (3) మఱి భావనాత్రయాత్మక విశ్వవై లక్షణ్యంబె లక్షణంబుగాఁగల యీరూపంబభ్యస్యమాన యోగుండగు

యోగికిం జింతింప నశక్యంబు; మఱి యపరంబని చెప్పంబడిన హిరణ్యగర్భుండు వాసవుండు ప్రజాపతులు మరుత్తులు వసువులు రుద్రులు ఆదిత్యులు తారకంబులు గ్రహంబులు గంధర్వ యక్ష రక్షో దైత్యాది సమస్త దేవయోనులు మనుష్యులు పశువులు అద్రులు సముద్రంబులు ద్రుమంబులు వెండియు నేకపాద ద్విపాద బహుపాదాపాదంబు లగు నితర భూతంబులుం దదుత్పత్తి హేతువులునుగా విలసిల్లునట్టి ప్రధానాది విశేషాంత చేతనా చేతనాత్మక ప్రపంచభావం బగు స్థూలరూపం బుపక్రాంత యోగునకుఁ జింతింప శక్యంబు. (4) శక్యమేనియుఁ దద్భావనా త్రయాత్మకం బగుట నశుభాశ్రయంబుగావున ముక్తిసాధనంబుగా; దీ చెప్పఁబడిన సకల ప్రపంచంబును విష్ణుశక్తి సమన్వితంబై యతనికి శరీరంబునై యుండు; నట్టి విష్ణుశక్తులు మొదల నేఁజెప్పిన పరాపరాఖ్యలను దదతిరిక్తయగు కర్మాఖ్యనుం ద్రివిధములై యుండు; నందుఁ గర్మాఖ్య శక్తిచేత వేష్టితయై యపరాఖ్య యగు క్షేత్రజ్ఞశక్తి జన్మ జరామరణా ద్యనేక సంసార తాపంబు లనుభవించుచుఁ దత్తత్కర్మానుగుణ శరీరంబు లెత్తి విజ్ఞాన తారతమ్యంబుల నొందుఁ; దత్ప్రకారం బాకర్ణింపుము. 79

1. బ్రహ్మభావన = బ్రహ్మమును భావించుట,...సనందన ఆదులు = సనందనుఁడు మొదలగు మహాయోగులు. బ్రహ్మభావనాయుతులు = బ్రహ్మభావనతోఁ గూడుకొన్నవారు (బ్రహ్మచింతనపరులు). దేవ ఆది స్థావర అవరులు = దేవతలు మొదలుగా స్థావరములు కడపటివిగాఁ గలవారు (స్థావరము అనఁగా ఉన్నచోటనుండి ఆవలికి పోనివి - స్థావరప్రాణులు వృక్షాదులు - 'స్థావరో జఙ్గమేతరః' అమ). కర్మభావనా = కర్మభావనచేత - భావకులు=భావించుచుండువారు. ఉభయభావనాపరులు = బ్రహ్మభావనయందును కర్మభావనయందును రెంటియందును ఆసక్తులు,...త్రివిధాత్మక=సనందనాది హిరణ్యగర్భాది దేవాది భేదములచేత త్రివిధస్వరూప మయిన-రూపంబు= అపరబ్రహ్మరూపము,...ప్రాక్ బ్రహ్మకల్పంబులన్ = తొంటి బ్రహ్మకల్పములందు, సంసరించుటన్ = సంసారులే అయి యుండినందున, భావనా ఆత్మకంబు = భావనయేస్వరూపముగాఁ గలది (భావనానుగుణముగా పుట్టుచుం జచ్చుచు సతత ముండునట్టిది). విశ్వంబు = ప్రపంచముయొక్క ('విశ్వం కృత్స్నేచ భువనే' విశ్వ.),...అవధి= మేర. దేవ...లు - దేవ = దేవతలు - మనుష్య = నరులు - ఆది = లోనగు - విశేష = భిన్నప్రాణులయొక్క - జ్ఞానకర్మంబులు = జ్ఞానమును కర్మయు.

2....తోఁచు = అగపడెను. దేవాది = సురనరతిర్యక్స్థావరాదు లనెడి - భేద = భేదముచేత - రహితంబు = కొఱవడినది (ఆభేదములు లేనట్టిది). రాహిత్యంబునన్ = లేమిచేత (లేనందున). అపక్షయ = నాశము. సత్ శబ్దవాచ్యంబును = సత్ అను శబ్దమునకు అర్థభూత మయినట్టిది (సత్ = ఉనికి గలది - భావపదార్థ మనుట).

['దేవాది' - 'ఇట్టిదట్టిది', 'అపక్షయాది' -
'రూపవర్గాది నిర్దేశ విశేషణ వివర్జితః'
'అపక్షయ వినాశాభ్యాం పరిణామర్ధి జన్మభిః
వర్జిత శ్శక్యతే వక్తుం య స్సదా స్తీతి కేవలమ్.' వే. సం. తా. దీ.

“వర్గః = జాతిః, దేవవర్గో మనుష్యవర్గ ఇతి వర్గరూపత్వాత్తస్యాః...షడ్భావవికారరాహిత్యమాహ ‘అపక్షయ’ ఇతి.”], ఆత్మ = జీవునికి - సంవేద్యంబు = ఎఱుంగనగునట్టిది. (ఇంద్రియాదులకు గోచరింప దనుట.). జ్ఞానైక నిరూపణీయంబు = కేవలజ్ఞానముచేత (జ్ఞానముచేత మాత్రమే) కనఁదగినది. జ్ఞానశబ్దవాచ్యంబును = జ్ఞాన మను శబ్దమునకు అర్థము అయి యున్నదియు (ఇందులకు ‘ప్రజ్ఞానం బ్రహ్మ’ ఐ. ఉ. 3, 3; ‘సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ’ తై. 2, 1; ‘జాత ఏవ నజాయతే కోన్వేనం జనయేత్పునః। విజ్ఞాన మానన్దం బ్రహ్మ’ బృ. ఉ. 5. 9, 28. ఇత్యాది శ్రుతులు ప్రమాణము).

(3)...విశ్వవైలక్షణ్యంబె = విశ్వముయొక్క లక్షణములకు విరుద్ధము లయిన లక్షణములు కలిగియుండుటయే. ఈరూపంబు = అమూర్త బ్రహ్మ స్వరూపము. అభ్యస్యమాన యోగుండు = నేర్చుకొనఁబడుచున్న యోగముకలవాఁడు (యోగమును నేర్చుకొనుచున్నవాఁడే గాని ఇంకను అందు కడతేరినవాఁడు కాఁడు.). వాసవుండు = ఇంద్రుఁడు. ప్రజాపతులు = దక్షాదులు. మరుత్తులు = మరుత్తు లనెడి యొకతెగ దేవతలు (‘మరీచి ర్మరుతా మస్మి’ భ. గీ.), (అష్ట) వసువులు, (ఏకాదశ) రుద్రులు, (పన్నిద్దఱు) ఆదిత్యులు, తారకంబులు = నక్షత్రములు (‘నక్షత్ర మృక్షం భం తారా తారకా ప్యుడు వా స్త్రియామ్’ అమ. ‘తారక’ అని నపుంసకలింగముం గలదు; ‘సంధ్యానట స్తారకరాట్కిరీటః’ నైష.), (సప్త) గ్రహంబులు=గగనగతిలో నక్షత్రములకన్న వెనుకఁ జిక్కు సూర్యాదులు. గంధర్వ = హాహా హూహూ ప్రభృతిదేవగాయనులు (‘గన్ధర్వో దేవగాయనే’ అమ.), యక్ష = కుబేరుని ప్రజలగు దేవయోని విశేషములు - రక్షః = రాక్షసులు - దైత్య = అసురులు...దేవయోనులు = దేవాంశకులు. అద్రులు = కొండలు. ద్రుమంబులు = చెట్లు. అపాదంబులు = పాదములులేని జంతువులు (‘యుక్తే క్ష్మాదా వృతే భూతం ప్రాణ్యతీతే సమే త్రిషు’ అమ.),...తత్ ఉత్పత్తి=హిరణ్యగర్భాదితరభూతాంతము లయిన సకలమునకును పుట్టుటకు. ప్రధానాది విశేషాంత = ప్రకృతిమొదలుగా ఏకైకవ్యక్తియందుమాత్ర ముండెడి (మఱియొక వ్యక్తియందు ఉండనట్టి) గుణములు తుదిగాఁ గలవియగు - చేతన అచేతన ఆత్మక = చేతనములును అచేతనములు స్వరూపముగాఁ గలదైన - ప్రపంచ = ప్రపంచముయొక్క - భావంబు=స్వరూపమె తన స్వరూపముగాఁగలది (ప్రపంచరూపముగా నున్నట్టిది),...ఉపక్రాంత యోగునకుఁ = ఆరంభింపఁబడిన యోగము కలవానికి (యోగాభ్యాస మారంభించినవానికి).

‘చెప్పంబడిన’ - ఇది ‘స్థూలరూపము’ నకు విశేషణము - ఇందలి సందర్భయోగ్యపద వ్యవధానమునకు ప్రౌ. వ్యా. సమా. 18. చూ.

(4) అశుభాశ్రయంబు = అశుభ మయిన నెలవు.

‘హిరణ్యగర్భో భగవాన్ వాసవోఽథ ప్రజాపతిః
అశుద్ధా స్తే సమస్తా స్తు దేవాద్యాః కర్మయోనయః.’ వి. పు. 6. 7 - 77.

“అతనికి శరీరంబు లైయుండున్”—

‘జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలమ్.’ రా. యు. కా. 20-26.

‘యత్కిఞ్చి త్సృజ్యతే యేన సత్త్వజాతేన వై ద్విజ
తస్య సృజ్యస్య సంభూతౌ తత్సర్వం వై హరే స్తనుః.’ వి. పు. 1. 22 - 38.

...పర అపర ఆఖ్యలన్ = పరము అపరము అను పేరులచేతను, తత్ అతిరిక్త = వానికంటె

వే అయినది. కర్మ ఆఖ్యన్ = కర్మము అను పేరిచేతను, కర్మ ఆఖ్య శక్తిచేతన్ = కర్మయను పేరి
శక్తిచేత (కర్మశక్తిచేత), వేష్టిత = చుట్టఁబడినది. క్షేత్రజ్ఞశక్తి = ఆత్మశక్తి = ('క్షేత్రజ్ఞ ఆత్మా
పురుషః' అమ.). జరా = ముదిమి - విజ్ఞాన తారతమ్యంబునన్ = జ్ఞానమందు ఎక్కువ తక్కు
వలను (కర్మకృత జన్మానుగుణముగా ఎక్కువగాని తక్కువగాని అగు జ్ఞానమును).

సీ. ఉండు నప్రాణులం దొక్కించు కాశక్తి;
స్థావరశ్రేణిం దజ్జాతికంటె;
నెట్టి రోఁకటిబండ జెట్టి మన్దిండిము
న్నగు సరీసృపములం దంతకంటె;
ఖగముల యందంత కంటె మృగావలి
యందు నూహింపంగ నంతకంటె;
దంతి గోముఖ పశుతతి నంతకంటె, మ
ర్త్యకదంబకములయం దంతకంటె,
తే. యక్ష గంధర్వ నాగాళి నంతకంటె,
నంతకంటె నిలింపులం, దంతకంటె
హరిహయునియందు, దక్షునం దంతకంటె,
నాద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె. 80

1. ఆశక్తి = క్షేత్రజ్ఞశక్తి....స్థావరశ్రేణిన్ = తావు దలఁగని వగు తరు గుల్మాది ప్రాణి
యందు, తజ్జాతికంటెన్ = అప్రాణిజాతియం దున్నంతటికంటె ఎక్కువగా, (ఉండు నని
అధ్యాహార్యము);

2. మన్దిండి = (మనుదిండి = మన్నుదిండి) ఒకజాతిపాము, మున్నగు = మొదయిన -
సరీసృపములందున్ = పాములయందు, అంతకంటెన్ = స్థావరములందున్నంతటికంటె ఎక్కు
వగా నుండును.

3. ఖగములయందున్ = పక్షులయందు ('శకుంత విహగాః ఖగాః' అమ.)...మృగ
ఆవళియందున్ = పశు సమూహమునందు (లేక - లేళ్లయందు—'పశవోఽపి మృగాః' అమ.).

'ఖగముల మఱివానికంటె' అని పూ. ము. పా. ఇందు 'ఖగములన్' అని అజడమునకు
సప్తమ్యర్థమందు ద్వితీయయు, 'అంతకంటె' ననుప్రక్రమమునకు భంగంబును, 'వానికంటెన్'
అనగా 'వానియందలియాశక్తికంటె' అని డొంక తిరుగుడుగా అర్థము నాకర్షించుటయుం గలవు:
అజడమునకును బహుత్వమున తృతీయా సప్తమ్యర్థములందు ద్వితీయకలదుగాని, కరము విరళము.

'ఈశ్వరః స్వరూపే నైవ సుర నర తిర్యక్స్థావ రాది భేదే నావస్థితః' అని వేదార్థ
సంగ్రహమందు చెప్పఁబడియున్నది. ఇట అయిదును తత్తదవాంతరభేదములును విపరీతక్రమ
మునం జెప్పఁబడినవి. ఆదిశబ్దముచేత అప్రాణిగ్రహణము.

4. దంతి = ఏనుఁగు ('దన్తీ దన్తావళో హస్తీ' అమ.) - గో = ఆవు - ముఖ = లోనుగాఁ
గల - పశు తతిన్ = చతుష్పాత్సమూహమందు,...మర్త్యకదంబకములయందున్ = మనుష్య

సమూహములందు ('మనుష్యా మానుషా మర్త్యా మనుజా మానవా నరాః', 'స్త్రియాం తు సంహతి ర్బృన్దం నికురమ్బ కదమ్బకం' అమ.).

...నిలింపులందుఁ = దేవతలయందు ('నిలిమ్పా దేవశబరా')...హరిహయునియందుఁ = ఇంద్రునియందు ('జమ్భభేదీ హరిహయః స్వారా ణ్ణముచిసూదనః' అమ.),...ఆద్యుఁడు = ఈవిశ్వమునకెల్ల మొదటివాఁ డయిన, హిరణ్యగర్భునందుఁ = బ్రహ్మయందు ('హిరణ్యగర్భో లోకేశః స్వయంభూ శ్చతురాననః' అమ.).

ఆ. ఇట్టిరూపకోటు లెల్ల నవ్విష్ణుని । తనుచయంబు సుమ్ము ధరణినాథ,
యతఁ డచింత్యశక్తి నఖిలభూతముల నా । కసమువోలె నిండి యెసఁగుఁ గాన.

ధరణినాథ = ఓరాజా, అతఁడు = ఆవిష్ణుఁడు, అఖిల భూతములన్ = సకలవస్తువులందును ('భూ సత్తాయామ్' ధా. పా. - సత్త = ఉనికి - ఉన్నదెల్ల భూతము), ఆకసమువోలెన్ = ఆకాశమువలె, అచింత్యశక్తిన్ = అపరిమేయప్రభావముచేత, నిండి, ఎసఁగుఁగానన్ = ఒప్పుచుండును గావున, ఇట్టి - రూపకోటులు = మూర్తవస్తువుల మొత్తములు, ఎల్లన్ = అన్నియు, అవ్విష్ణుని - తనుచయంబు సుమ్ము = శరీరసముదాయము సుమా.

ఆకాశ మెట్లు సకలమందును నిండియుండునో, అట్లే విష్ణుదేవుఁడును సకలమూర్తముల యందును తనయప్రమేయప్రభావముచేత నిండియుండును, కావున ఇట్టిమూర్తము లన్నియు అతని శరీరములు సుమా. - ఉపమ.

ఈశ్వరుఁడు శరీరి, చేతనాచేతనాత్మక మెల్ల నతని శరీరము అని భా.—

'ఏకస్యైవ బ్రహ్మణః శరీరతయా ప్రకారభూతం సర్వం చేతనాచేతనాత్మకం వస్త్వితి సర్వస్యాత్మతయా సర్వప్రకారం బ్రహ్మై వావస్థితమ్'. స. ద. సం.

పద్యోత్తరార్ధము 'ఆకాశవత్సర్వగతశ్చనిత్యః' అనుశ్రుతిని అనుసంధించుచున్నది.

సీ. మున్నెన్నిన పరాఖ్యమునకు ద్వితీయమై
విష్ణుసంజ్ఞనకు నుర్వీతలేశ
యోగిహృద్ధ్యేయమై యొప్పు నమూర్తరూ
పం బొందు; సత్సంజ్ఞఁ బ్రాజ్ఞకోటి
దాని వచించు; నేతద్రూపమె సమస్త
శక్తుల కెల్ల నాశ్రయతఁ బొంది,
ప్రాగుక్త విశ్వరూపవిలక్షణతఁ గాంచి,
కల్యాణ గుణభూతి గరిమఁ దనరి,

తే. యతిమహత్త్వంబుచే వెల్గు; నట్టి శక్తి
నలరు బ్రహ్మంబు దేవతిర్యఙ్మనుష్య
నామచేష్టావదవతరణముల నాత్మ
లీల జగదుపకృతికిఁ గల్పించుచుండు.

ఉర్వీతలేశ = ఓరాజా, విష్ణుసంజ్ఞునకున్ = విష్ణునామముగల బ్రహ్మమునకు, మున్న = మునుపు, ఎన్నిన = వచించినట్టి - పరాఖ్యమునకున్ = పరసంజ్ఞక మయినయమూర్త (బ్రహ్మ) మునకు, ద్వితీయమై = రెండవదియై, యోగి హృద్ ధ్యేయము = యోగులకు హృదయమందు ధ్యానింపఁదగినది, ఐ, అమూర్తరూపంబు = తనువులేని యాకారము, ఒండు = ఒకటి, ఒప్పున్ = కలదు; ప్రాజ్ఞకోటి = జ్ఞానిసముదాయము, దానిన్ = అద్వితీయరూపమును, సత్ సంజ్ఞన్ = సత్తు అనెడి నామముచేత, వచించున్ = పేర్కొనును; ఏతద్రూపమె = ఈరూపమే, సమస్తశక్తులకు ఎల్లన్ = సకల మయినసామర్థ్యములకును, ఆశ్రయతన్ పొంది = తావల మగుటను పడసి=తావలమై, ప్రా...తన్-ప్రాక్=మున్న = ఉక్త= చెప్పఁబడిన-విశ్వ= ప్రపంచ మనెడి రూప = అబ్రహ్మరూపముకంటె, విలక్షణతన్ = విపరీతలక్షణములు గల దగుటను - కాంచి = పొంది, క...మన్ - కల్యాణగుణ = మంగళధర్మములు - భూతి = ఐశ్వర్యములు - అను - వీని యొక్క - గరిమన్ = అతిశయముచేత, తనరి = ఒప్పి, అతిమహత్త్వంబుచేన్ = మితిలేని మహిమగలదై, వెల్గున్; అట్టిశక్తిన్ అలరు బ్రహ్మంబు = అట్టిసామర్థ్యముతోఁ గూడుకొన్నదై యుండు బ్రహ్మము, ఆత్మలీలన్ = తనవిలాసముచేత, జగత్ ఉపకృతికిన్ = లోకోపకారార్థమై, దే...లన్-దేవ = దేవతలయు - తిర్యక్ = అడ్డముగాఁబోవు జంతువులయు - మనుష్య = నరులయు - నామచేష్టావత్ = సంజ్ఞలును వ్యాపారములును కలవైన - అవతరణములన్ = అవతారములను, కల్పించుచుండున్.

పూర్వము నేను చెప్పిన పరసంజ్ఞకమునకు రెండవదియై యోగులకు హృదయమునందు ధ్యానోపయోగియై అమూర్తమైనమఱియొక రూపము విష్ణునామకము కలదు. దానినే ప్రాజ్ఞులు సత్తని వ్యవహరింతురు. ఆరూపమే సమస్తశక్తులకును ఆశ్రయమై మున్న వచించిన ప్రపంచరూపమునకంటె విపరీతలక్షణము కలదై కల్యాణగుణములు అనంతవిభూతులును గలదై మహిమాతిశయముచే నొప్పుచుండును. అట్టిశక్తిగలదైన యాబ్రహ్మము లోకరక్షణార్థము తనలీలమెయి దేవతిర్యఙ్మనుష్యాది నామ రూప చేష్టలతో నానావతారము లెత్తుచుండును.

'విష్ణుసంజ్ఞునకు' - 'సమస్తహేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్.' వి. పు.

'భగవత్స్వరూపం పరమప్రాప్యత్వా దేవ పరమం పదమ్.' అని వేదార్థసంగ్రహము.

'విష్ణునామా స వేదేషు చ గీయతే.' వి. పు.

'సమస్తశక్తులును' - 'పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే,

స్వాభావికీ జ్ఞానబలక్రియా చ.' శ్వే. ఉ. 6-8.

'సమస్తాః శక్తయ శ్చైతాః నృప యత్ర ప్రతిష్ఠితాః।

తద్విశ్వరూపవైరూప్యం రూప మన్య ద్ధరే ర్మతమ్.' వి. పు.

'విశ్వరూపవిలక్షణత'-ఇదియే 'విశ్వరూప వైరూప్య' మ్మని చెప్పఁబడినది. మఱియు-

'ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ

క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః

యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.' భ. గీ. 15 - 16.

'కల్యాణగుణ' -

'స సర్వభూత ప్రకృతిం వికారాన్ గుణాదిదోషాం శ్చ మునే వ్యతీతః,
అతీతసర్వావరణోఽఖిలాత్మా తే నాస్తృతం యద్భువనాన్తరాళే,
సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ స్వశక్తిలేశోద్ధృతభూతవర్గః.' వి. పు.

'దేవ....జగదుపకృతికిన్'—

'ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితోఽసౌ,
తేజోబలైశ్వర్యమహావబోధ సువీర్యశక్త్యాదిగుణైకరాశిః,
పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయ స్సన్తి పరావరేశే,
స ఈశ్వరో వ్యష్టిసమష్టిరూపః వ్యక్తస్వరూపః ప్రకటస్వరూపః;
సర్వేశ్వరః సర్వదృక్సర్వవేత్తా సమస్తశక్తిః పరమేశ్వరాఖ్యః
సంజ్ఞాయతే యేన తదస్తదోషం శుద్ధం పరం నిర్మల మేకరూపం
సందృశ్యతే వా ప్యధిగమ్యతే వా తజ్జ్ఞాన మజ్ఞాన మతోఽన్యదుక్తమ్.' వి. పు.

'భూతిగరిమ'—

'శుద్ధే మహావిభూత్యాఖ్యే, పరే బ్రహ్మణి శబ్ద్యతే।
మైత్రేయ భగవచ్ఛబ్దః సర్వకారణే.' వి. పు. 6 - 5 - 72.

'దేవ' - ఉపేంద్రావతారము: 'తిర్యక్' - మత్స్య కూర్మ వరాహావతారములు, 'తిర్యఙ్మనుష్య-' నరసింహావతారము, 'మనుష్య' - పరశురామాద్యవతారములు. 'జగదుపకృతికిన్'-

'యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్'.
'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం!
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.' భ. గీ. 4.

ఆ. కర్మభుక్తికొఱకుఁ గా దిట్టి తల్లీల; । యతఁడు సకలజాతులందుఁ బుట్టుఁ;
బుట్టినట్టి యతని భూరిచేష్టితము ల । వ్యాహతములు రావణాదివలన. 83

ఇట్టి - తల్లీల = అతనిక్రియ ('లీలా విలాస క్రియయోః' అమ.), కర్మభుక్తికొఱకున్ = కర్మఫలము ననుభవించుటకై,...సకలజాతులందున్ = దేవతిర్యఙ్మనుష్యాది సమస్తజాతులందును, భూరిచేష్టితములు = అనంతవ్యాపారములు, రావణాదివలనన్ = రావణాదులయెడ, అవ్యాహతములు = భంగపడనివి.

ఆపరమేశ్వరుఁడు దేవాదిరూపములం బుట్టుట అస్మదాదులవలె పూర్వకర్మఫలానుభవార్థము కాదు, ఆతనిని కర్మలు అంటవు. మఱి యాతనికి ఎట్టి బలవంతునిమీఁద నయినను జయమే కాని భంగము లేదు.

ఇందలి పూర్వార్ధమునకు 'జగతా ముపకారాయ న సా కర్మనిమిత్తజా' అని వి. పు.
'న మాం కర్మాణి లిమ్పన్తి నమే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.' భ. గీ.

అత్ర 'స్వలీలయా జగదుపకారాయ స్వేచ్ఛావతారః' అని వే. సం. అందులకు ''అస్యేషాం జన్మనో హేతుఫలే కర్మతత్ఫలానుభవౌ,...'స్వలీలయా జగదుపకారా యే' తి హేతుప్రయోజన వైలక్షణ్య ముక్తమ్, నతుకర్మణా తత్ఫలానుభవా యే త్యర్థః'' అని తాత్పర్యదీపిక.

వ. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాది రూపంబు లనేకంబులు గలిగిన ముముక్షునకు జ్ఞానసిద్ధికిఁ బరమవ్యూహ విభవాది రూపంబులే చింతనీయంబులు; ప్రజ్వలిత శిఖుం డగుపవనసఖుండు నీరస నికుంజంబు నెట్లు దహించు, నట్లు చిత్తస్థుం డగు నవ్విష్ణుండు యోగిజనంబుల సకలకిల్బిషంబులు నిర్దహించుఁ, గావున సకల శక్త్యాశ్రయుం డైన యప్పరమాత్మునియందుఁ జిత్తంబు నిల్పుట విశుద్ధయగు ధారణ యనంబడు; సర్వసంగంబునఁ జలాత్మకం బగు చిత్తంబునకుఁ ద్రిభావభావనాతీతుం డగు నద్దేవుండు శుభాశ్రయుండై ముక్తికరుం డగు; నేతద్వ్యతిరిక్తు లగుబ్రహ్మాదిదేవతలు కర్మయోను లగుట నశుద్ధులు గావునఁ జిత్తంబున కవలంబనీయులుగారు; మఱి నిరవలంబధ్యానంబు పొందుపడదు గావున, ధారణాధ్యాన విషయంబై శుద్ధంబగు స్థూలరూపాంతరం బయ్యనంతునకుం గలదు, దాని సవిస్తరంబుగాఁ జెప్పెద నాకర్ణింపుము.

బద్ధ ముక్త ఆది రూపంబులు - (౭౨ వ పద్యమును చూ.) - బద్ధ = 'అపరసంజ్ఞంబు అబ్జగర్భాదిబద్ధనికాయంబు మూర్తము' - ముక్త = 'పరము ముక్తాత్మ అమూర్తము' - ఆది = 'పరాఖ్యమునకు ద్వితీయ మై యోగివ్యాధ్యేయ మై యొప్పు నమూర్తరూపంబొండు' (౭౩ వ - పద్యమును చూ.) - రూపంబులు=స్వరూపములు. పర...లే - పరమ=ఉత్కృష్టము లయిన - వ్యూహ = వ్యూహములు - విభవ = విభవములు - ఆది = ఆదిగాఁగల - రూపములే. (ఆదిశబ్దముచే సూక్ష్మమయిన యంతర్యామి గ్రాహ్యము.), చింతనీయంబులు = ధ్యానింపఁ దగినవి;—

[''వాసుదేవః స్వభక్తేషు వాత్సల్యా త్తత్తదీహితమ్
అధికారానుగుణ్యేన ప్రయచ్ఛతి ఫలం బహు.
తదర్థం లీలయా స్వీయాః పఞ్చ మూర్తీః కరోతి వై;
ప్రతిమాదిక మర్చా స్యా, దవతారా స్తు వైభవాః;
సంకర్షణో వాసుదేవః ప్రద్యుమ్న శ్చానిరుద్ధకః
వ్యూహ శ్చతుర్విధో జ్ఞేయః; సూక్ష్మం సంపూర్ణ షడ్గుణమ్,
త దేవ వాసుదేవాఖ్యం పరం బ్రహ్మనిగద్యతే.
అంతర్యామీ జీవసంస్థో జీవప్రేరక ఈరితః;
య ఆత్మ నీతి వేదాన్త వాక్యజాలై ర్నిరూపితః;
అర్చోపాసనయా క్షిప్తే కల్మషేఽధికృతో భవేత్,
విభవోపాసనే పశ్చా, ద్వ్యూహోపాస్తౌ తతః పరమ్,
సూక్ష్మే తదను శక్తః స్యా దన్తర్యామిణ మీక్షితుమ్.''] స. ద. సం.

ప్రజ్వలిత శిఖుండు = మండుచున్న జ్వాలలు గలవాఁడు,...పవన సఖుండు = అగ్ని ('రోహితాశ్వో వాయుసఖః శిఖావాన్ శుశుక్షణిః' అమ.), నీరసనికుంజంబున్ = తడిలేని (ఎండు) పొదను ('నికుఞ్జ కుఞ్జౌ వా క్లీబే లతాది పిహితోదరే' అమ.)...దహించుచున్ = కాల్చునో, చిత్తపుండు = చిత్తమందు ఉన్నట్టివాఁడు,...సర్వసంగంబునన్ = నిఖిలవస్తువులతోడి సంపర్కము చేత, చల ఆత్మకంబు = చంచల స్వభావము గలది ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.),...త్రిభావభావనాతీతుండు=(2౯ చూ.) బ్రహ్మభావన - కర్మభావన - తదుభయ భావన - అని త్రివిధభావనను దాఁటినవాఁడు. ... ['వ్యతిరిక్తలు' అని స్త్రీలింగము. 'దేవతలు' అనువిశేష్యము స్త్రీలింగముగాన]...కర్మ యోనులు = కర్మమే కారణముగాఁ గలవారు (యోనిః కారణే భగ లోయయోః' హేమ.) అశుద్ధులు 8౭ (౪) చూ.]...సవిస్తరంబుగాన్ = విరివితోఁగూడుకొన్నట్లుగా ('విస్తారో విగ్రహో వ్యాసః స తు శబ్దస్య విస్తరః' అమ.). 'ధారణా...గలదు' —

'స్యాద్రూపం కృతక మనుగ్రహార్థమ్ తచ్చేతసామ్ ఐశ్వర్యాత్ -
రూపం వాఽతీన్ద్రియ మన్తః కరణ ప్రత్యక్షనిర్దేశాత్'. వే. స. లో వాక్యకారవాక్యమ్.
'న చక్షుషా గృహ్యతే నాపి మనసా తు విశుద్ధేన.' వే. సం. లో శ్రుతి.

సీ. శరదిందుచకచకస్మయజిత్ప్రసన్నాస్యు,
దొడ్డకెందమ్మికన్దోయివాని,
నతికమ్రగల్లభాగాభోగఫాలాఢ్యు,
మకరాంకరత్నకర్ణికలవానిఁ,
గాంబవోద్యచ్ఛ్రీవిడంబివృత్తశిరోధి,
సిరి పొల్చుమచ్చ పేరురమువాని,
నతనాభియుత వళిత్రితయశాతోదరు,
జానులంబిచతుర్భుజములవానిఁ,

తే. కరివరకరోరు, రుచిరజంఘామనోజ్ఞు,
సమతబొందిన పదపల్లవములవాని,
హైమవసనుఁ గిరీటహారాంగదాది
కలితు, శంఖరథాంగాదు లలరువాని. 85

1 శర....స్యున్ - శరత్ = శరదృతువునందలి - ఇందు = చంద్రునియొక్క - చకచక = ధాళధళ్యముయొక్క - స్మయ = గర్వమును - జిత్ = గెలుచునట్టి - సానుగ్రహమయిన - ఆస్యు = ముఖము గలవానిని, దొ...నిన్ - దొడ్డ = పెద్దవయిన - కెందమ్మి = ఎఱ్ఱదామరల వంటి - కన్దోయివానిన్ = కన్నుఁగవ గల వానిని;—

'శరత్' - శరదృతువున చంద్రునికి ధాళధళ్యమధికము.—
'పశ్చా దావాం విరహగణితం తం త మాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణతశరచ్చన్ద్రికాసు క్షపాసు'. ఉ. మే.

'కెందమ్మి' - 'తస్య యథా కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ'. (ఛా. 1 - 6.) అనిశ్రుతియందు పుణ్డరీకము అనఁగా 'పుణ్డరీకం సితామ్భోజే' అను నమరోక్తిప్రకారము తెల్లదామర శ్రీవిష్ణు నేత్రమునకు ఉపమానముగా చెప్పఁబడియుండఁగా, ఇట 'కెందమ్మిం' జెప్పుట విరుద్ధ మని తలంపంజనదు; ఏలయన, పుండరీకశబ్దము కమలమాత్రవాచక మని వ్యాడి వచనము.

2. అతి...ధుర్యున్ - అతి = మిక్కిలి - కమ్ర = కమనీయమైన - గల్ల = చెక్కిళ్లయొక్క - భాగ = ప్రదేశములతోను - ఆభోగ = పరిపూర్ణతగలదైన ('ఆభోగః పరిపూర్ణతా' అమ.) - ఫాల = లలాటముతోను - ఆధుర్యున్ = కూడుకొన్నవానిని, ఝ...నిన్ - మకర అంక = మొసలి చిహ్నములు గలిగినట్టి - రత్నకర్ణికలవానిన్ = మణులు తాపించిన కుండలములు గలవానిని (కర్ణికా కర్ణభూషణే' అమ.);

[గల్లశబ్దప్రయోగమును ఆలంకారికులు గ్రామ్య మని దోషములలోఁ జేర్చిరి;
'పామరుల భాష గ్రామ్యము । భామిని కటిగల్లములు విభాసిల్లునవన్.' నరస.

అయినను మహాకవులు సరకుసేయక ప్రయోగింతురు;—

'పాతాళప్రతిమల్లగల్లవివర ప్రక్షిప్తసప్తార్ణవం
వన్దే నన్దితనీలకణ్ఠపరిష ద్వ్యక్తర్ధిణః క్రీడితమ్.' మాలతి.].

3. కాం...ధిన్ - కాంబవ = శంఖసంబంధియైన ('శఙ్ఖః స్యా త్కమ్బురస్త్రియా' అమ.) - ఉద్యత్ = ఒప్పారుచున్న - శ్రీ = శోభను - విడంబి = వెక్కిరించుచున్నట్టి (అంత కన్న అందమైన) - వృత్త = వట్రువయైన - శిరోధిన్ = మెడగలవానిని, ('గ్రీవాయాం శిరోధిః కన్ధ రేత్యపి' అమ.), సిరి=లక్ష్మి, పొల్చు=ప్రకాశించుచున్న - మచ్చ=శ్రీవత్స మనెడుచిహ్నము తోడి - పేరు ఉరమువానిన్ = విశాలవక్షము కలవానిని (విశాలవక్షమున లక్ష్మియు శ్రీవత్సమును గలవానిని);

[శ్రీవత్సము = శ్రీతోడివత్సము - వత్సమనఁగా మహత్త్వలక్షణము - 'వదతిమహత్త్వమ్ వత్సః - శ్రీయుక్తోవత్సః శ్రీవత్సః - మహత్త్వలక్షణం శ్వేతరోమావళివిశేషః' రామాశ్రమి.]

4. నత...దున్ - నత = లోఁతయిన - నాభి = పొక్కిటితో - యుత = కూడుకొన్న- వళి = ముడుఁతల - త్రితయ = మూఁడుగల - శాత = సన్నని ('నిశిత క్ష్ణుత శాతాని తేజితే' అమ.) - ఉదరున్ = కడుపుగలవానిని, జా...నిన్ - జాను = మోకాళ్లవఱకు-లంబి = వ్రేలుచున్న - చతుర్ = నాలుగు - భుజములవానిన్ = బాహువులు గలవానిని;

కరివర కర ఊరున్ = గజేంద్రముయొక్క తొండమువంటి తొడలు గలవానిని, రుచిర జంఘామనోజ్ఞున్ = సుందరమైన పిక్కలచే ('జఙ్ఘాతు ప్రసృతా' అమ.) మనోహర మయిన వానిని, సమతన్ = సమత్వమును (ఒండొకటికి సమముగా నుండుటను) - పొందిన - పదపల్లవములవానిన్ = చిగురుటాకులవంటి చరణములు కలవానిని, హై...తున్ - హైమ = బంగారపుదైన - వసన = వస్త్రమును - కిరీట (ము) - హార (ములు) - అంగద = బాహుపురులు ('కేయూర మఙ్గదం తుల్యే' అమ.) - అని = లోనుగాఁగలవానితో - కలితున్ = కూడియున్న వానిని, శంఖ రథాంగ ఆదిన్ = పాంచజన్యశంఖంబును సుదర్శనచక్రంబును లోనగువానిచే, అలరువానిన్ = ఒప్పుచున్నవానిని, శ్రీవిష్ణున్ = శ్రీయుక్తుఁడయిన విష్ణుదేవుని - [అని అనంతర పద్యములోనికి అన్వయము.]

శరత్కాలచంద్రుని ధావళ్యగర్వము నడంచునట్టి ప్రసన్నవదనమును, గొప్ప యెఱ్ఱ దామరలవంటి కనుదోయియు, అతిసుందరము లయిన చెక్కిళ్లును, విశాల మయిన లలాటంబును, రత్నఖచిత మకరకుండలమును, శంఖసౌందర్యముగల వట్రువమెడయు, శ్రీదేవి శ్రీవత్స లక్ష్మములచే శోభించుచున్న విశాలవక్షమును, లోఁతయిన పొక్కిటితోడి వళిత్రయముచే శోభించు సన్నపొటికడుపును, ఆజానులంబి చతుర్భుజములును, గజేంద్రముయొక్క తుండమువంటి తొడలును, సుందరములైన పిక్కలును, సమము లయి చివుళులం బోలిన యడుగులును, బంగారు వస్త్రము, కిరీటము, హారములు, కేయూరములు, ఇత్యాద్యాభరణములును, శంఖచక్రాద్యాయుధములును, కలవానినిగా శ్రీవిష్ణుదేవుని ధ్యానింపవలయు నని భావము.

'రుచిరజంఘామనోజ్ఞః' అని వ్రాఁతప్రతులం దెల్ల పా. 'రుచిరజంఘరమణీయః' అని పూర్వముద్రణ పా. జంఘాశబ్దము కలదుగాని జంఘశబ్దము లేనందున ఈ పా. సరిగాదు. ... జంఘేన = ... జంఘచేత అని వ్యస్తముగా చేసికొనుటయు, ఏకత్వమునకు జాత్యేకత్వము కల్పించుకొనుటయు, లోనగు సరళాన్వయము ప్రక్రమానుగుణము వలసియున్నది.

ఇది వర్ణనోద్యమముగాక వస్తుకథనోద్యమమాత్రమైనందున 'మానవా మౌళితో వర్ణ్యాః దేవా శ్చరణత స్తథా' అను సమయ మిట ననుసరింపబడలేదు.

మఱియు, 'దేవాః' అను బహువచనముచే కర్మబద్ధదేవసామాన్యము చెప్పఁబడినది; కావున తద్విలక్షణుఁ డయిన పరబ్రహ్మమునకు ఆకవిసమయము చెల్లదు. పరబ్రహ్మమునకు భక్తానుగ్రహార్థమైన రూపము వే. సం. లో శ్రుతి స్మృతి రామాయణాదులనుండి ఇట్లు చెప్పఁబడియున్నది:...

“పరస్య బ్రహ్మణో రూపవత్త్వం సూత్రకారోఽపి వదతి అన్తస్తద్ధర్మోపదేశాదితి - యోఽసా వాదిత్య మణ్డలాన్తర్వర్తీ, తప్తకాఞ్చనగిరివరప్రభః, సహస్రాంశు శతసహస్రకిరణః, గమ్భీరామ్భస్సముద్భూతసుమృష్టనాళరవికరవికసితపుణ్డరీకదళాఽమలాఽఽయతేక్షణః, సుభ్రూలలాటః, సునాసః, సుస్మితాధరవిద్రుమః, సురుచిరకోమలగణ్డః, కమ్బుగ్రీవః, సమున్నతాంసవిలమ్బిచారురూపదివ్యకర్ణకిసలయః, పీనవృత్తాయతభుజః, చారుతరాతామ్ర కరతలానురక్తాఙ్గుళీభి రలంకృతః, తనుమధ్యః, విశాలవక్షస్స్థలః, సమవిభక్త సర్వాఙ్గః, అనిర్దేశ్య దివ్యరూపసంహననః, స్నిగ్ధవర్ణః, ప్రబుద్ధపుణ్డరీకచారుచరణయుగళః, స్వానురూపపీతామ్బరధరః, అమలకిరీటకుణ్డలహార కౌస్తుభకేయూరకటకనూపురోదరబన్ధనాద్యపరిమితాశ్చర్యానన్త దివ్యభూషణః, శఙ్ఖచక్రగదాసిశార్ఙ్గ శ్రీవత్సవనమాలాలంకృతః, అనవధికాతిశయసౌన్దర్యాహృతాశేషమనోదృష్టివృత్తిః, లావణ్యామృతపూరితాశేషచరాచరభూతజాతః, అత్యద్భుతాచిన్త్యనిత్యయౌవనః, పుష్పహాససుకుమారః, పుణ్యగన్ధవాసితానన్తదిగన్తరాళః, త్రైలోక్యాక్రమణప్రవృత్తగమ్భీరభావః, కరుణానురాగమధురలోచనావలోకితాశ్రితవర్గః, పురుషో దృశ్యతే - సః నిఖిలజగదుదయవిభవలయలీలః, నిరస్తసమస్తహేయః, సమస్తకల్యాణగుణనిధిః, స్వేతరసమస్తవస్తువిలక్షణః, పరమాత్మా, పరం బ్రహ్మ, నారాయణ, ఇత్యవగమ్యతే.”

సీ. శ్రీవిష్ణు నీగతిఁ జింతింప వలయుఁ ద
న్మయుఁ డయి యోగి క్రమంబుతోడ;

నొక్కయంగమె మున్ను చిక్క లో భావించి,
యధి దృఢం బగుటయు నవలియంగ
కము మఱి చింతింపఁ గాఁదగు; నట్టి య
భ్యాసంబువలన నయ్యవయవి మఱి
నడచిన నున్న మానక యెద్దియేనియుఁ
జేయుచున్నను మదిఁ బాయఁడేని,

తే. యతనిసామ్యంబు గని ముక్తుఁ డగు; సురాది
భేదసంజనకాజ్ఞాన మేదఁ బిదప
నలము కల్యాణగుణముల హరికిఁ దనకు
లేని భేద మెవ్వాఁడు కల్పింపఁగలఁడు ? 86

యోగి = ధ్యానించువాఁడు (భక్తుఁడు - 'యోగ స్సన్నహ నోపాయ ధ్యాన వైరాగ్య యుక్తిషు' అమ), శ్రీవిష్ణుఁ దన్మయుఁడు అయి=తదేకచిత్తుఁ డయి... ఈగతిఁ=పూర్వపద్యములో చెప్పిన రూపముకలవానినిగా, క్రమంబులోడఁ = ఒకవరుసతో, చింతింపవలయుఁ = ధ్యానము సేయవలయును; అంగము = అవయవము,...చిక్కఁ = స్వాధీనపడునట్లు, లోఁ = మనస్సులో,...అయ్యవయవి = అవయవములు గలవాఁడైన యాశ్రీవిష్ణుఁడు, నడచినఁ = [తాను యోగి శ్రీవిష్ణుని పూర్వపద్యములో చెప్పిన రూపమున తదేకచిత్తుఁడై క్రమముగా ధ్యానింపవలయును; ఆక్రమ మెట్టి దనిన; ముందుగా భగవంతుని యవయవము నొకదానిని ధ్యానాభ్యాసపాటవముచేత మనస్సున స్థిరీకరించుకొని, తర్వాత దానివెంబడి నింకొకయంగమును సాధింపవలయును. ఇట్లే క్రమముగా సకల మూర్తిని చేతస్సులో నాటుకొనవలయును; అనంతరము ఆయోగి] నడచుచున్నను, ఊరకున్నను అవిరామముగా ఏదైనం బనిచేయుచున్నను ఆతనిచిత్తమును ఆయవయవములుగలవాఁడైన యాభగవంతుఁడు పాయఁడేని ఆయోగికి తాను అమరుఁడు నరుఁడు అను నిత్యాదిభేదములను (సంజనక =) పుట్టించునదైన యావిద్య (ఏదఁ =) నశింపఁగా పిమ్మట ఆనారాయణునియొక్క సామ్యము కలిగి ముక్తి కలుగును. అటుపిమ్మట తనకు (అలము =) కలిగెడునట్టి కల్యాణగుణములచేత తనకును హరికిని భేదము లేక యుండఁగా, లేనిభేదమును ఎవఁడును కల్పింప నేరఁడు.

'అవయవిమఱి' - వ్రాఁతప్రతులందలి పా. 'అవయవములు' పూ. ము. పా.

క. నరవర, యిటు బంధచ్యుతి। కర మగు నంగాష్టకాఖ్య ఘనయోగము వి
స్తరముగఁ జెప్పితి, నింకఁ। గరణీయం బెద్ది నాకుఁ గల్పింపు' మనఁ. 87

నరవర = ఓయిరాజా ఖాండిక్యుఁడా, ఇటు, బంధచ్యుతికరము = అవిద్యాబంధమునకు విడుదల చేయునది (సంసారమును తొలఁగించునది), అగు...అం...ము - అంగ = అంగముల యొక్క - అష్టకము = ఎనిమిదిసంఖ్య పరిమాణముగాఁ గలది అను-ఆఖ్య = పేరుగలదైన - ఘన = ఉత్కృష్టమయిన - యోగము = చిత్తవృత్తినిరోధవిద్యను, విస్తరముగఁ = విరివిగా, ఇంకఁ =

వేఱుగా, కరణీయంబు = నీకై చేయవలసినది, యేమేని, నాకుఁ, కల్పింపుము. యోగాంగములను ౨౩౫ లో చూ.

'కొఱకగు నంగాష్టకాఖ్య గురుయోగము' అని పూ. ము. పా. దీనియందు ర ఱ ప్రాసమగును. 'గిఱికొను గోపురాగ్ర...'౨ఆ.౧౭., 'పరిఖందత్పుర'-౨ఆ. ౯. 'స్థిరసౌధాగ్ర'-౨.౧౧ ఇత్యాదులందు పెక్కెంట గురు లఘు రేఫములను ప్రాసమందు ఒండొంటితో సంకీర్ణముగాని యట్లు రచించిన కవి యిటను దద్విరుద్ధ మాచరించి యుండఁ డను తలంపుచే 'కరమగు... ఘనయోగము' అని మార్పుచేయఁబడినది.

తే. 'నృప, కృతార్థుండ నైతి; నా కింతకంటె
నర్థనీయంబు మఱి యెద్ది?' యనుచు నతని
నర్చఁ గావించి వల దన్న నతఁ డొసంగు
తనదు తొంటిరాజ్యంబునఁ దనయు నిలిపి. 88

అంతట ఖాండిక్యుఁడు 'ఓ రాజా, నీవు గావించిన యుపదేశముచేత కృతార్థుఁడ నయితిని; ఇంతకన్న వేఱుగా నాకు (అర్థనీయంబు=) కోరఁదగినది ఏమియును లేదు' అని వచించి ఆ కేశిధ్వజునికి గురుపూజ యొనర్చెను. అంతట ఇతఁడు వలదన్నను కేశిధ్వజుఁడు ఇతని తొంటిరాజ్యమితనికే యాగ పశువాళి ప్రాయశ్చిత్త కథనమునకు దక్షిణగా నిచ్చెను. అంతట నితఁడు ఆ రాజ్యమునందు తన కుమారుని నిలిపి—

వ. (1) పురోహిత ప్రధానుల నప్రాప్తయావనుం డగు నతని వినీతుఁగా మెలపికొం డని నియోగించి; వారల దానసన్మానాదులం బ్రోవు మని కుమారునకు నప్పగించి; గోవింద చరణారవింద విన్యస్తమానసుండై ఖాండిక్యుం డుభయ కర్మంబు లుడిపి; యవ్వనంబ తపోవనంబుగాఁ గొంతకాలంబు కేశిధ్వజోపదిష్ట భక్తియోగానుసంధానంబున మధుమథన సాధర్మ్యంబునొందెఁ, (2) గేశిధ్వజుండును దత్పుత్రునిఁ దత్ప్రధానులఁ దదీయ రాజ్యపరిపాలన కనిచి, మగిడి మిథిలాపురంబు ప్రవేశించి, యోగాశ్రయుఁడై భోగంబులం బుణ్యంబులు, తదితరంబుల దురితంబులు, ప్రక్షీణంబులుగా క్షోణీతలం బేలుచుండెం; (3) గావున మునుముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు; పాండ్యక్షితీశా, నీ వతని భజియింపు, మిదియె భక్తియోగంబు, దీనియందు నొక్క కొఱఁతెగల, దంతరాయంబు నొందినఁ బునర్భవంబుఁ బొందించి మఱి ముక్తిఁ జేర్చు; నట్లగుట నింతకంటె సులభోపాయం బాయోధనంబున నయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన శరణాగతధర్మంబ నిరపాయధర్మం." బని పరిణతాంతఃకరణుం డగు నతనికి మూలమంత్రపూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగవత ప్రధానుం గావించిన. 89

1. పురోహిత ప్రధానులన్ = పురోహితుఁడు లోనగువారిని, అప్రాప్త యావనుండగు = యావనము పొందినవాఁడు కానట్టి - అతనిన్ = తనయొక్క యాకుమారుని, వినీతుఁ

గాన్ = ఆన్వీక్షిక్యాది విద్యలను నేర్పఁబడినవానినిగా, మెలపికొండు = నడిపించుకొండి, అని, నియోగించి = ఆజ్ఞాపించి, వారలన్ = ఆపురోహిత ప్రముఖులను, దానసమ్మాన ఆదులన్ = ఈవి సత్కారము లోనగు వానిచేత, ప్రోవుము = పోషింపుము, అని,...గోవిందచరణ అరవింద విన్యస్త మానసుండు = నారాయణుని పాదకమలములందు ఉంపఁబడిన చిత్తముకలవాఁడు,... ఉభయకర్మంబులు = పుణ్యపాప కర్మములను రెంటిని, ఊడిపి = క్షయమొందించికొని ('డులిపి' పా.)...అనుసంధానంబునన్ = అనుష్ఠానముచేత, మధుమథనసాధర్మ్యంబున్ = నారాయణుని తోడి సామ్యమును, ఒందెన్ = పొందెను.

2. ...తత్పుత్త్రునిన్ = ఖాండిక్యునియొక్క తనయుని, తత్ - ప్రధానలన్ = మంత్రులను, తదీయ = ఆతని (ఆబాలునియొక్క)...అనిచి = పంపి,...భోగంబులన్ = సుఖములు అనుభవించుటచేత, పుణ్యంబు = పురాకృతపుణ్యకర్మలయొక్క పుణ్యఫలములును, నాత్ ఇతరంబులన్ = కిష్టములు అనుభవించుటచేత, దురితంబులు = పాపఫలములును, ప్రక్షీణంబులు = నశించినట్టివి, కాన్ = అగుచుండఁగా, క్షోణీతలంబు = భూవలయంబును,...

3. ... ముముక్షునకున్ = మోక్షముంగోరిన వానికి, అధోక్షజుండు = నారాయణుఁడు ('అధోనక్షీయతే జాతు యస్మాత్తస్మా దధోక్షజః' ఉద్యోగపర్వము.) ... అంతరాయంబున్ = విఘ్నమును ('విఘ్నోన్తరాయ ప్రత్యూహాః' అమ.)...పునర్భవంబున్ = పునర్జన్మమును,... ఆయోధనంబునన్ = యుద్ధమునందు ('యుద్ధ మాయోధనం జన్యమ్' అమ.)...అయ్యధోక్షజుండు = శ్రీకృష్ణుఁడు, గాండీవికిన్ = అర్జునునికి (అర్జునునికి అగ్నిదేవుఁడు ఖాండవదహనమందు తిన్ను ఇంద్రునివలననుండి కాచినందులకై బహుమానముగా నిచ్చినధనుస్సుపేరు గాండీవము, దానింబట్టి యర్జునునికి గాండీవి సంజ్ఞకలిగినది.)...శరణాగతిధర్మంబ = శ్రీకృష్ణుని శరణుఁ జొచ్చుట యనెడి యోగమె, నిరపాయధర్మంబు=పునర్జన్మ మనెడి యపాయము రానట్టియోగమును, ...పరిణత అంతఃకరణుండు = పరిపక్వచిత్తము కలవాఁడు...అతనికిన్ = ఆపాండ్యరాజునకు, మూలమంత్ర పూర్వకంబుగాన్ = ముందు మూలమంత్రము (శ్రీమదష్టాక్షరీమంత్రము) కలుగునట్లుగా, ద్వయంబు=వాక్యద్వయమును, ప్రసాదించి = అనుగ్రహముచే నుపదేశించి......

మ. వకుళాలంకృతయోగిహృన్నిలయ, భాస్వత్పాండుభాస్వన్మయాం
బక, నాభీజలజాతసూత విధి సంప్రాప్తస్మరారిష్ట, ము
ష్టికతోరార్పణ కర్కటీఫలిత కేశి క్రూర రక్షోంగకా,
కృకవాకుధ్వజ దీర్ఘికాప్లవతప క్రీడోత్సవాద్యుత్సుకా. 90

వ...య - వకుళ=పొగడపువ్వులచేత ('కేసరే వకుళః' అమ. వృక్షవాచకము పుల్లింగము, పుష్పవాచకము నపుంసకలింగము - 'ద్విహీనం ప్రసవేసర్వమ్' అమ.) - అలంకృత = కైసేయఁబడిన - యోగి=నమ్మాళ్వారనెడి యోగియొక్క - హృత్ = హృదయము - నిలయ=ఇల్లుగాఁగలవాఁడా, భా...క - భాస్వత్ పాండు భాస్వత్ మయ = సూర్యచంద్రులే అయిన - అంబక=నేత్రములు కలవాఁడా ('భాస్వద్వివస్వత్సప్తాశ్వ హరిదశ్వోష్ణరశ్మయః' అమ. పాండుభాస్వాన్ = తెల్లనికాంతులు కలవాఁడు - చంద్రుఁడనుట - అటుపై మయట్ప్రత్యయము - 'అమ్బకం నయనం దృష్టిః' హలా.), నా...ష్ట - నాభీ = పొక్కిటియందలి - జలజాత = తమ్మిచేత - సూత = కనఁబడిన - విధి = బ్రహ్మచేత - సంప్రాప్త=పొందఁబడిన - స్మర అరిష్ట=(మదనునికి చేటయిన)

శివుఁడు కలవాఁడా ('స్మరారాతిః' పా.), ము...శా - ముష్టి = పిడిగ్రుద్దుయొక్క - కఠోర = క్రూరమయిన - అర్పణ = ఇచ్చుటచేత - కర్కటీఫలిత = దోసపండుగాఁ జేయఁబడిన - కేశి = కేశియనుపేరుగల - క్రూరరక్షః = దారుణుఁడైన రాక్షసునియొక్క - అంగకా = దేహముకల వాఁడా, కృ...కా - కృకవాకుధ్వజ = *కోడి చిహ్నముగాఁ గలవాఁ డయిన కుమారస్వామి యొక్క ('పతాకా చిహ్న ఖట్వాఙ్గ మేఢ్రేషు ధ్వజ మస్త్రియామ్' నానా.) - దీర్ఘికా = పుష్కరిణియందు - ప్లవ = తెప్పచేతనగు - తపక్రీడా = వేసవియాట యనెడు ('ఊష్మాగమః తపః' అమ.) - ఉత్సవ = పండువునంగు - అత్యుత్సుకా = అత్యంతాసక్తికలవాఁడా.

నమ్మాళ్వారు నిన్ను సదా ధ్యానించుచుండును, సూర్యచంద్రులు నీనేత్రములు, నీనాభీ కమలమునుండి పుట్టినబ్రహ్మవలన స్మరహరుఁ డైన రుద్రుఁడు జనించినాఁడు, నీపిడికిటి పెనుగ్రుద్దునకు బల్లిదుఁ డయిన కేశిరాక్షసుఁడు దోసపండువలె చిదిగిపోయినాఁడు, నీవు స్కందపుష్కరిణిలో వేసవిలో తెప్పయుత్సవమును అతిప్రీతితో ననుభవింతువు - అట్టి యోభగవానుఁడా - వేంకటేశ్వరుఁడా - ఈమూఁడుపద్యములకును నాలవదానితో నన్వయము.

క. ఊరీకృతపాండవరథ । సారథ్య, సయూథ్యగోపశాబకసహ కే
లీరత, భక్తప్రహ్లా । దారచితస్తోత్రపులకితాంచితగాత్రా. 91

ఊ....థ్య - ఊరీకృత = అంగీకరింపఁబడిన - పాండవ = అర్జునుని - రథ = తేరి - సారథ్య = సూతత్వముకలవాఁడా ('సూతః క్షత్తా చ సారథిః' అమ. = రథముతోలువాఁడు - తత్కృత్యము సారథ్యము), స...త - సయూథ్య = తోడిచెలికాండ్రయిన - గోప = గొల్ల - శాబక = బాలకులతోడి - సహకేళీ = కూడియాడుటయందు - రత = ఆసక్తుఁడా, భ...త్రా - భక్త = ఉపాసకుఁడైన - ప్రహ్లాద = హిరణ్యకశిపుతనయుఁ డైన - ప్రహ్లాదునిచే - ఆరచిత = నిండుగా చేయఁబడిన - స్తోత్ర = స్తుతిచేత - పులకిత = గగుర్పాటు గలదైన - అంచిత = ఒప్పుచున్న - గాత్రా = దేహముకలవాఁడా.

అర్జునునికి రథముతోలినవాఁడా, తోడిగొల్లబాలురతో ప్రీతితో ఆడుకొన్నవాఁడా, నరసింహావతారమందు ప్రహ్లాదుఁడు చేసినస్తుతిచేత కోపము శమించి అనుగ్రహించి సంతోషభరితుఁడ వైనవాఁడా -

ఇందలి విశేషణములు మూఁటిచేతను భగవంతుని భక్తవత్సలత ద్యోతితము - 'ఊరీకృత' అనుటచే అది ధ్వనితము - వాత్సల్యముచే రథచోదకకృత్యమును అంగికరించుటయేగాని, కానిచో అర్జునుఁ డెక్కడ? పరబ్రహ్మావతారుఁ డయినశ్రీకృష్ణుఁ డెక్కడ? అని భా. 'ప్రహ్లాద' - హిరణ్యకశిపుం జీల్చిభగవంతుఁడు అక్షీణక్రోధభయంకరుఁడయి యుండఁగా భక్తాగ్రేసరుఁ డయిన ప్రహ్లాదుఁడు భగవంతునిం దఱిసి స్తుతించి శాంతుం జేసె నని భాగవతమందుం గన నగు.

'సయూథ్య' - యూథశబ్దము - 'యూథం తిర్యక్సమూహేఽస్త్రీ' మేది., 'యూథ స్త్రిరశ్చాం పున్నపుంసకమ్' అమ. - అని తిర్యగ్జంతువులకే రూఢ మైయున్నను - గొల్లపిల్లలు అట్టివారే అగుటచేతను అట్టివారియందుఁగూడ భగవంతుఁడు వయస్యభావమును వహించె నని భగవంతుని కరుణావిశేష స్ఫూర్తికొఱకును గౌణముగా నిట ప్రయుక్తము.

---

* కోడియు నెమలియు కుమారస్వామి వాహనములు, చూ. "హా! కుమారస్వామి యాప వాహ్యములార...కోడిపుంజులార" క్రీడాభిరామము.

స్రగ్విణి. ఆస్థితాహీంద్రశయ్యా, దవీయస్తర
ప్రస్థితాంఘ్రీ, శ్రితవ్రాతచేతోఘదా,
కస్థలప్రస్పృశత్కాళియక్ష్వేళమూ
ర్ధస్థలీనృత్తమత్తల్లిహల్లీసకా. 92

ఆ...య్యా - ఆస్థిత = అధిష్ఠింపఁబడిన - అహి ఇంద్ర = నాగేంద్రుఁ డనెడి - శయ్యా = పాన్పు గలవాఁడా, ద...ఘ్రీ - దవీయస్తర = మిక్కిలిదూరతరముగా - ప్రస్థిత = ఏఁగినట్టి - అంఘ్రీ = పాదములు కలవాఁడా, శ్రి...దా - శ్రిత = ఆశ్రితులయొక్క - వ్రాత = సమూహముయొక్క - చేతః = హృదయములయొక్క - అఘ = పాపమును - దా = ఖండించువాఁడా ['అగదా' అనుపాఠాంతరమున - అగదా = మందయినవాఁడా 'భేషజౌషధభైషజ్యాన్యగదో జాయురిత్యపి' అమ.], క...కా - క = నీటియొక్క - స్థల = నేలను - ప్రస్పృశత్ = అంటుచున్న - కాళియ = కాళియుఁ డనెడి నాగునియొక్క - క్ష్వేళ = విషముతోడి మూర్ధ = ఔదల యనెడి - స్థలీ = నేలప్రదేశమందు - నృత్త = ఆడఁబడిన - మత్తల్లీనృత్యమును - హల్లీసకా = మండల నృత్యమును కలవాఁడా.

స్వామీ, నీవు, నాగేంద్రుఁ డయిన యనంతునిపై పవళించువాఁడవు, వామనావతారమందు నీపాదమును పాతాళమునుండి స్వర్గమువఱకుం జాఁచితివి, భక్తసమూహములమానసపాపములను ఖండించువాఁడవు (- పా. మనోరోగములకు నీవే మందుగ నున్నావు - నిన్ను ధ్యానించుటచే వారిమానసదోషము లన్నియు శమిల్లును), యమునాహ్రదములో క్రింది నేలవఱకు నిగుడఁ దన్నుకొని నిలిచియున్న కాళియనాగునియౌదల లనెడి యపూర్వప్రదేశమున నేలయు నీరును గానిచోట మత్తల్లీ హల్లీసక నృత్యము లాడినవాఁడవు, అట్టి యో వేంకటేశ్వరుఁడా - (అవధరింపుము).

స్రగ్విణీవృత్తము - స్రగ్విణిన్ రారరల్ శైలవిశ్రాంతియున్.

దవీయస్తర - అతిశాయనార్థకమయిన 'ఈయస్' ప్రత్యయముమీఁద తదర్థకమే 'తర' ప్రత్యయమును ఇట్లు ప్రయోగింపఁ దగునా ? యనిన, పెద్దలు ప్రయోగించి యున్నారు కావున అంగీకరింప వచ్చును,

"యావన్తి భువి శస్త్రాణి తేషాం శ్రేష్ఠతరం ధనుః
ధనుషో గోచరే తాని న తేషాం గోచరే ధనుః" య. తి. 3 (465).

"శ్రేష్ఠతమాయ కర్మణే" శ్రుతి. "నాణీయస్తరతారహారులు" పారి. 2 (90). మదీయ విమర్శవినోదము 52, 53, 54 పుటలం గనుఁడు.

"విభూషితాస్థానసభం కుభైషీ శ్రీజైత్రసింహం రిపుకుమ్భిసింహమ్
గత్వా కుమారోఽథ ముదానమస్యామాసానణీయస్తరభక్తినమ్రః" హమ్మీర. 8 (36).

'మత్తల్లి' - ఇదియొకనృత్యవిశేషము. పూర్వవ్యాఖ్యాతలు దీనితత్త్వము నెఱుఁగక ఈశబ్దమును 'మతల్లికా' శబ్దమునకు రూపాంతర మని తలంచి శ్రేష్ఠార్థము వ్రాసినారు - మత్తల్లీనృత్యమునకుం బ్రమాపకములు—చూ. అనుబంధము.

"మ. తృయకాలంబున సీధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రికర

ద్వయతాళానుగతిం బ్రమోదమున మత్తల్లీ మహానృత్యముల్
ప్రియమొప్పారఁగఁ జేయు భైరవుఁడు గల్పించుఁ మహైశ్వర్యముల్."
కాశీఖం. 5 - 83. ప్రబంధరత్నావళి. 547

'వామదక్షిణపాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః
ఉద్వేష్టితాపవిద్ధైశ్చ హస్తైర్మత్తల్ల్యుదాహృతమ్'
స్ఖలితాపసృతౌ పాదౌ వామహస్తశ్చ రేచితః
సవ్యహస్తః కటిస్థ స్స్యాదర్ధ మత్తల్లి తత్స్మృతమ్.'

'హల్లీసకనృత్యము' - కోలాటము.—

"ఆటయుంచనఁగ నాట్యంబొప్పఁ గోలాట
మనఁగ హల్లీసకం బలరుచుండు". ఆంధ్రభాషార్ణవము. (130).

"గగన కల్లోలినీ కల్లోలమాలికా। హల్లీసకములతో నవఘళించి" శృం. నైష.

"మణ్డలేనతు య న్నృత్యం హల్లీసక మితి స్మృతమ్
ఏకస్తత్ర తు నేతా స్యా ద్గోపస్త్రీణాం యథా హరిః." హేమచంద్రుఁడు.

మ. ఇది పాత్రప్రహారేశ్వరప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్త దివిస్పృక్పటుయంత్రకొండపలి హృద్బాహాసి కద్రూజదీ
వ్యదుదారోద్యమకృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగుఁన్. 93

హృద్యపద్యము = మనోహరములైన పద్యములుగలది - ఇది = ఈపూర్వోక్తగ్రంథ భాగము, పా...దన్ - పాత్రప్రహారేశ్వర = ప్రహారేశ్వరపాత్రుఁడు - ప్రభృతి = లోనగు - బంహిష్ఠ = మిక్కిలి పలువురయిన - ఉత్కల = ఓఢ్రుల - అనీక = సమూహముచేత = గుప్త రక్షించుకొనఁ బడినదియు, దివిస్పృక్ = మింటినంటుచున్నదియు, పటు = సమర్థములయిన - యంత్ర = యంత్రములు గలదియు - అగు - కొండపలి = కొండపల్లి దుర్గమును - హృత్ = హరించెడు - బాహా = భుజమునందలి - అసి = కత్తియనెడు - కద్రూజ = పాముచేత ('నాగాః కాద్రవేయాః' అమ.) - దీవ్యత్ = వెలుఁగుచున్న - ఉదార = గొప్ప - ఉద్యమ = ప్రయత్నము కలిగిన - కృష్ణరాయ నృపసంజ్ఞ = కృష్ణరాయఁడనుపేరి - అస్మత్ = నాచేత - కృత = రచింపఁబడిన - ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యనెడి ప్రబంధమునందు, తృతీయంబు ఆశ్వాసము ఐ = మూఁడవ యాశ్వాసమై, మహిన్ = భూమిలో పొల్పుఅగున్ = ఒప్పారును.

'పాత్ర' - ఒడ్డె క్షత్రియులకు పాత్రులని గౌరవబిరుదము, 'బంహిష్ఠ' బహుళశబ్దమునకు తరబర్థమున 'బంహీయస్' అనియు, తమబర్థమున 'బంహిష్ఠ' యనియును రూపంబులు గలవు. 'దివిస్పృక్' - అలుక్సమాసము, 'దివి' అని సప్తమ్యేకవచనము. 'దీవ్యత్'-'దీప్యత్' అని పూ. ము. పా. దీపధాతువు ఆత్మనేపదిగావున 'దీప్యమాన' అని వచ్చునుగాని 'దీప్యత్' అని రాదు, కావున అది త్యక్తమై పరస్మైపదియైన 'దివు' ధాతువు స్వీకరింపఁబడినది.

తృతీయాశ్వాసము
సమాప్తము.

---

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## చతుర్థాశ్వాసము

క. శ్రీమందిరభుజమధ్యమ, । గోమండలకర్షి వేణుగుంభన, దృప్య
ద్భౌమాహృతసురజనయి । త్రీమణితాటంక, వృషగిరిస్థ, ఖగాంకా. 1

శ్రీ...మ-శ్రీ=లక్ష్మికి - మందిర = ఇల్లయిన - భుజమధ్యమ = వక్షము కలవాఁడా ('వ నా క్రోడం భుజాన్తరమ్' అమ. - మధ్యమ - 'మధ్యాన్మః' సూ.) గో...న - గో = గోవుల యొక్క - మండల = సమూహమును, - కర్షి = ఆకర్షించునట్టిదైన - వేణు=పిల్లనగ్రోవియొక్క యొక్క - గుంభన = ఊఁదుట గలవాఁడా, దృ...క - దృప్యత్ = గర్వించుచున్న - భౌమ = భూపుత్త్రుఁ డయిన నరకాసురునినుండి - ఆహృత = తేఁబడిన - సు...క - సురజనయిత్రీ = దేవ మాత యయిన యదితియొక్క - మణితాటంక = మణులుచెక్కిన కర్ణభూషణములు కలవాఁడా. వృ...స్థ - వృషగిరి = వేంకటాచలమందు - స్థ = వెలసియున్నవాఁడా, ఖగ అంకా = పక్షి లాంఛనా = గరుడధ్వజా.

మహాలక్ష్మి నారాయణుని వక్షఃస్థలమునందు వసించును; శ్రీకృష్ణుఁడు వేణు వూఁదునపుడు తన్నాదాకృష్టములై ఆలమందలు అతనిం బరివేష్టించి యుండిన వని భాగవతమున స్పష్టము. నరకాసురుఁడు అదితికుండలములను హరింపఁగా శ్రీకృష్ణుఁడు వానిని సంహరించి ఆకుండలములం దెచ్చి పారిజాతముం దేర దివికేఁగినపుడు ఆమెకు సమర్పించె నని భాగవతకథను *పారిజాతాప హరణకావ్యమందుం గన నగును. ఇందలి విశేషణములు పైవిషయముల ననుసంధించున్నవి.

మణిఖచితములైన తాటంకములు మణితాటంకములు అనిమధ్యమపదలోపి సమాసము. "టంక - గాంకా" యని అంత్యానుప్రాసము.

'శ్రీమందిర' - అట్టియాతనిం గొలుచుటచేత భక్తులకు లక్ష్మీకటాక్షము సిద్ధ మనుట. 'కర్షి' - ఆవేణుగానము వినఁబడఁగానే గోవులు మైమఱచి మేఁతమాని వచ్చి శ్రీకృష్ణులవారిని చుట్టువాఱుకొను ననుట; ఆవేణుగానము అట్లు వానిని మైమఱవఁ జేయఁగల యట్టిది అని తన్మ హిమ సూచితము. - "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ" యనుసూక్తి ననుసంధించుకొన వలయును - 'దృప్యత్' - అదితితాటంకములను నరకుఁడు హరించినందులకు కారణము వానిదర్ప మని (గర్వము) చెప్పఁబడినది. 'సుర'-తమతల్లి తాటంకములను నరకునివలననుండి ఇంద్రాదిదేవతలు కాపాడుకొనను తెచ్చుకొనను నేరరైరి, వానిని శ్రీకృష్ణులవారు తెచ్చి యిచ్చి రనుటచే ఎల్లదై వతములకన్న శ్రీకృష్ణులవారు పైదైవతమని సూచితము. 'వృష' - వృష మనఁగా ధర్మంబును

---

* 'అదితి మెఱుంగి కుండలము లానరకుండు హరించె...' పారి. ఆ. ౧ - ౫౨

కావున నారాయణమూర్తి ధర్మమం దుండువాఁ డనియు సూచన. ధర్మము స్థిరము గావున గిరివంటిది.

వ. అవధరింపు మాసమయంబున. 2

అవధరింపుము = చిత్తగింపుము, ఆసమయంబునన్ = విష్ణుచిత్తుఁడు వైష్ణవమతమును నెలకొల్పి పాండ్యునికి శరణాగతిధర్మం బుపదేశించిన యావేళయందు.

—* విష్ణుచిత్తుని విజయము. *—

మ. బలిమిం ద్రెంపఁగఁ బోలెఁ బాయపడుచుం బర్యాయభంగంబుగాఁ
గలనూ లెల్లను నంటు మోవఁ దెగి రాఁగాఁ గొంతసే పుండి, తాఁ
బెలుచ న్గంటు పుటుక్కనం దునిసి వే పృథ్విం బడె న్జాలె, మి
న్నుల మ్రోసె న్సురదుందుభుల్, గురిసెఁ బె న్సోనై విరు ల్వోరునన్. 3

బలిమిం ద్రెంపఁగఁబోలెన్ = బరువుచేత త్రెగుట గాదు. - మఱియే మన - అదృశ్యరూపుఁ డెవఁడో దారములను తనబలమంతయు వైచి త్రెంపుటగా, పాయ పడుచున్ = రెండుగా వీడిపోవుచు, పర్యాయ భంగంబునన్ - పర్యాయ = క్రమముచేత (క్రమముగా ఒకదారము తర్వాత నొకటిగా - 'పర్యాయోఽవసరే క్రమే' అమ.) - భంగంబుగాన్ = తునియుటవలన, కలనూలు ఎల్లన్ = ముడిలోని పోఁగు లన్నియు, అంటు మోవన్ = తుదిపోఁగు సయితము తెగియు ఇంచుకంత అంటుకొని మాత్రము ఉండునంతవఱకు, తెగిరాఁగాన్ = ఛిన్న మయిన యనంతరము, జాలె తాను = ఆవరపోలచిక్కము, కొంతసేపు ఉండి = పైని త్రాటిపట్టు లేకున్నను తాను బరువయ్యును క్రిందఁ బడక మునుపటియట్లు అంతరాళమున నిలిచియుండినదై, అంతట, గంటు=వరపోలసంచిని దూలమునకు వ్రేలఁగట్టిన త్రాటిముడి, పెలుచున్ = బిగ్గరగా (ఈయర్థమునకుం బ్రయోగము. - 'పెలుచ నోకర్ణ యోకృప యోసుయోధన...అని పలికి' భార. ద్రో. ౫ ఆ. - 'పాంచజన్యంబు పెలుచఁబూరించి' నిర్వ. 3, ఆ. - ఈశబ్దము నల్లాదులవంటిది - పెలుచనిది.), పుటుక్కనన్ = పుటుక్కను ధ్వనితో, తునిసి = తెగిపోయి (గంటు కర్త), వే = తటాలున, పృథ్విన్ పడెన్ = క్రిందఁ గూలెను, (జాలె కర్త); సురదుందుభుల్ = వేల్పులభేరులు, మిన్నులన్ = ఆకాశభాగములయందు, మ్రోసెన్ = శబ్దించెను. విరులు = (నందనోద్యాన వృక్షముల) పువ్వులు, పెనుసోన ఐ = వ్యాపించినదన్న వానగా ('అల్పవర్షము సోన యనఁగఁబరఁగు' ఆం. భా.), కురిసెన్ = వర్షించెను.

వాదారంభనియమముప్రకారము జయ మేర్పడినంతట వరపోలజాలె జేతకుం జెందవలసినదేగాని వ్రేలుచుండవలసినదిగాదు గావున, సర్వసాక్షియై యదృశ్యభూతుఁ డైన శ్రీమన్నారాయణుఁడు సభాసదులకు అప్పటికి ఎఱుకపడియే యున్న యాజయమును మఱింత దృఢపఱుచువాఁడై, జాలెను, రాజాజ్ఞనొందిన సేవకులు పైముడివిప్పి దింపుటగాఁ గాక, ఎవరో అదృశ్యులు పైత్రాటిముడిని చూపఱకుఁ దోఁచునట్లుగా త్రెంపిరని తెగి క్రిందఁ బడంజేసెను. అనఁగా, ఎవరేని ప్రయత్నపూర్వకముగా త్రెంపునప్పుడు, త్రాటిని క్రిందినుండి మీఁది కెత్తుట ప్రక్కలకు లాగుట ఇత్యాదికృత్యములు జరుగునుగదా, అట్టివి ఆసమయమున ఆత్రెగుటలో జరిగిన

వని తాత్పర్యము. - త్రాటిపట్టు లేనియప్పుడుగూడ జాలె క్రిందఁబడక కొంతసేపట్లె అంతరాళమందు వ్రేలుచుండుట ఆజయనిశ్చయము ఎల్లవారికిని మఱింత హృదయములందు నాటుటకును, భగవదంగీకారానుగ్రహములు ప్రసిద్ధము లగుటకును. ఇందులకు హర్షాతిరేకముచేత దేవతలు దుందుభులను మిక్కుటముగా వాయించి, చాలసేపు విరులవాన గురియించిరి.

'బలిమిం ద్రెంపుట' - ఇఁక క్షణమేని వ్రేలవలసిన పని లే దని తెలుపుటకు. 'పోలెన్' అనుట ఆత్రెంపినవా రగపడమిచేత.- 'అంటుమోవఁ దెగి' నను 'కొంతసేపు' వ్రేలుచు నేయుండుట పరమపురుషునియనుగ్రహము సభ్యులకు తార్కాణపడుటకు. - 'పెను సోనై' - 'అల్పవర్షము సోన యనఁగఁ బరఁగు' అని ఆంధ్రభాషార్ణవమందుఁ జెప్పఁబడియున్నది, 'ఇట 'పెను' అనువిశేషణముచేత ఆయల్పత పోయినది. సంతతత్వముచేత ఆయల్పతయే యనల్పతగా పరిణమించిన దని యభిప్రాయము.-'సుర'అనుట సురలు అదృశ్యులై వాదముం బరికించుచుండి రనియు, జాలె క్రిందఁ బడిన యావిధములో భగవదిచ్ఛాంగీకారమును వారు గ్రహించి రనియు భావము. 'మిన్నుల'- బహువచనముచేత గగననానా భాగగతులై 33 కోట్ల దేవతలును ఉక్తహర్షసూచనము చేసి రని భావము. - 'త్రెంపఁగఁబోలెన్' - ఇట సాదృశ్యమాత్రమే ఉద్దిష్టముగాని సాదృశ్యలక్ష్మి కానందున ఉపమ గాదు. - 'జాలెపడుట' దుందుభిధ్వన్యాదికమునకు హేతువుగావున వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారము. - గంటు - పా. గట్టు, గుట్టు.

శా. ఆవేళ న్పతి పారితోషికము లీ నందంద పంపన్, భ్రమ
త్సేవివ్రాతముచే ద్రుతస్ఖలిత దీవ్యన్మణిస్వర్ణభూ
షావాసశ్ఛటజానుదఘ్న యగుచు న్సంసచ్చతుశ్శాలికా
రై వేశ్మాంతరపద్ధతి న్నెరసె గోత్రాచిత్రమాల్యం బనన్. 4

ఆవేళన్ = విష్ణుచిత్తుని యావిజయసమయమందు, పతి = ఆపాండ్యరాజు, పారితోషికములు=బహుమానములు [పరితోషః ప్రయోజన మస్య ఇతి పారితోషికమ్ - దేనికి పరితోషము ప్రయోజనమో అది పారితోషికము], ఈన్ = ఇచ్చుటకు, అందంద = అప్పుడప్పుడే, పంపన్ = (సేవకులను) పంపినంతట, భ్రమ...చేన్ - భ్రమత్ = తిరుగుచున్న (పోయివచ్చుచున్న) - సేవి = సేవకులయొక్క - వ్రాతము = సమూహముయొక్క ('స్తోమౌఘ నికర వ్రాత వార సంఘాత సంచయాః' అమ.) చేన్ = హస్తములనుండి (జాత్యేకవచనము), ద్రుతస్ఖలిత - ద్రుత = పరుగుచేత, [వారు వడివడిగా సంచరించుచుండుటచేత - ఇట భావార్థమందు క ప్రత్యయము - 'ద్రు గతౌ' ధా. పా.], స్ఖలిత=జాఱినది, ఐ, దీవ్య...ట - దీవ్యత్ = మెఱయుచున్న - ('దివు క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద మద స్వప్న కాన్తి గతిషు' ధా. పా.) - మణి=రత్నాలయొక్కయు [రత్నాలు ప్రధానముగాఁ గలవియు ననుట - కడియములు లోనగు కొన్నిట రత్నాలు తాపింపఁబడియుండును.]-స్వర్ణ=బంగారముయొక్కయు (బంగారములోఁ జేయఁబడినవి యనుట- అట్టివైన), - భూషా = నగలయొక్కయు - వాసస్ = వలువలయొక్కయు ['వస్త్ర మాచ్ఛాదనం వాస శ్చేలం వసన మంశుకమ్' అమ.] - ఛట=సమూహము, గో...బు - గోత్రా=భూదేవియొక్క ('గోత్రా కుః పృథివీ పృథ్వీ' అమ.) - చిత్ర = పలువన్నెలుగల (చిత్రం కిర్మీర కల్మాష శబలై తాశ్చ కర్బురే' అమ.) - మాల్యంబు=సిగబంతియో (మాల్యం మాలా ప్రజౌ మూర్ధ్ని' అమ.),

అనన్ = అనునట్లుగా, సంస...ద్ధతిన్ - సంసత్ చతుశ్శాలికా = సభామందిరముయొక్కయు (‘సభా సమితి సంసదః’, ‘చతుశ్శాలం తు మన్దిరమ్’ అమ.) - రై వేశ్మ = ధనాగారముయొక్కయు (=బొక్కసముయొక్కయు - ‘రాః పుంసి స్వర్ణ విత్తయోః’ మేదిని.-‘గృహం గేహో దవసిత వేశ్మ సద్మ నికేతనమ్’ అమ.) అంతర = మధ్యదియైన

(‘అన్తర మవకాశావధి పరిధానాన్తర్ధి భేద తాదర్థ్యే
ఛిద్రాత్మీయ వినా బహి రవసర మధ్యేఽన్తరాత్మని చ.’ అమ.) -

పద్ధతిన్ = దారియందు (‘సరణిః పద్ధతిః పద్యా’ అమ.), జానుదఘ్ని = మోఁకాటిబంటి (‘దఘ్నచ్’ ప్రత్యయము నిలువుకొలతం దెలుపును.), అగుచున్, నెరసెన్ = వ్యాపించెను.

విష్ణుచిత్తునికి జయము కలిగిన యాసమయమందు పాండ్యరాజు విద్వాంసులకు పరితోషార్థము బహుమానములు ఇచ్చువాఁడై ఒక్కొక్కరికొఅకును మణికనకవస్త్రాదికమును బొక్కసపు గృహమునుండి తెమ్మని మాటిమాటికిం బంపిన సేవకులు తత్క్షణమే పోయి వానిం గొనివచ్చు త్వరలో వారిచేతులనుండి ఒకటి రెండుగా జాఱి బొక్కసమునకును సభాభవనమునకును నడిమి దారిపొడుగునను మోఁకాలిలోఁతుగా పడిన యామణిభూషాదిశ్రేణి యె ట్లుండెననఁగా - భూదేవి యుత్కర్షోత్కర్షముచే ఆసమయమున నానావర్ణముల పుష్పములమాల్యమును శిరమునం దాల్చెనో యనున ట్లుండెను. ‘జానుదఘ్న’ అనుటచే ‘సరకుసేయఁబడక రాలినవే యింత మిక్కుటమై యుండఁగా, వినియోగము నొందినవి యెంతమిక్కుటములో’, యని వాని పెక్కువ మితిలేని దని తెలియ నగుచున్నది. ఉత్ప్రేక్షాలంకారము.

‘(సేవివ్రాతము) చేన్’ - చే అని చేయిశబ్దమునకు రూ. దాని కిది ద్వితీయారూపము - చేతినుండియని యర్థము, ‘ఘటా’ శబ్దము, మహతీతర స్త్రీలింగ మగుటచేత తద్విశేషణములకు ‘ప్రస్ఖలిత’ ‘జానుదఘ్ని’ అను వానికి వికల్పముగా స్త్రీత్వము వచ్చినది. ‘జానుదఘ్న’ యని పూర్వ ముద్రణము అపశబ్దము. ‘టిడ్ఢాణ ఞ్’ ఇత్యాదిసూత్రముచే జీప్పు రావలయును. ‘చతుశ్శాలికా’ - చతుశ్శాలమే చతుశ్శాలిక; స్వార్థమున క ప్రత్యయము; స్వార్థికములు ప్రకృతిలింగముకంటె భిన్నలింగము దాల్చుటయుం గలదు గావున స్త్రీలింగము. ‘మాల్యంబు’ - అమరమందలి ‘మూర్ధ్ని’ యను పదము అతంత్రమయినను ఇచట మాల్యమును శిగపూదండ గానే గ్రహించుట సముచితముగా నున్నది - ‘దీప్యన్మణి’ అని పరముద్రణపాఠము - దీపధాతు వాత్మనేపదిగావున ‘దీప్యత్’ అని రూపసిద్ధి లేమింజేసి - ‘దీవ్యత్’ అని పరస్మైపది ‘దివ’ ధాతువు గ్రహింపఁబడినది.

ఆ. వేదవేద్య మైన విష్ణుతత్త్వం బిట్లు। వాది గెలిచి, తెలిపి, వసుమతీశు
భక్తి నోలలార్చి, భగవత్ప్రపన్నుఁగాఁ। జేసి, లోకహితము సేయుటయును. ౫

ఇట్లు = పూర్వోక్తవిధమున, వాది = వాదముచేయుచున్న యావిష్ణుచిత్తుఁడు, గెలిచి = ఇతరమతస్థులను ఓడించి, వేదవేద్యము - వేద = వేదములచేత (ఉపనిషత్తులచేత ననుట) - వేద్యము = తెలిసికొనఁబడినది, ఐన - విష్ణుతత్త్వంబు = సర్వాంతర్యామి (అయిన నారాయణుని) స్వరూపమును, తెలిపి = బోధించి, వసుమతీశున్ = (ఆపాండ్య) రాజును, భక్తిన్ = భగవంతునియందలి తాత్పర్యమునందు, ఓల లార్చి = క్రీడించునట్లు చేసి, భ...గాన్-భగవత్ = శ్రీమన్నారాయణునియందు - ప్రపన్నుఁగాన్ = శరణాగతునిఁగా, చేసి, లోక హితము = జగత్తుకొఅకు మేలు, చేయుటయున్ = చేసిన యంతట.

'ఓలలార్చి' - 'ఆడు' నకు ప్రేరణము 'ఆర్చు'; - ఓల యనునది జలక్రీడాసమయమందు ప్రేరేపించుటకై వాడెడు శబ్దము. తత్ప్రయోగముచేత 'భక్తి' యనునది యొక మహారస ప్రవాహమువంటి దని స్ఫురించుచున్నది. 'భక్తి' నవవిధములు. - శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము. 'వేదవేద్యము' అను విశేషణముచేత వేదబాహ్య ప్రమాణము కా దనియుఁ సూచిత మగుచున్నది.

'వాది' - పా. 'వాదు'. 'లోకహితులు' - లోకు లెల్లరును 'యథారాజా తథాప్రజా' యను న్యాయముచేత, పూర్వోక్తములచేత ఈమతమునే విశ్వసించి ఇతరమతములను త్యజించి క్షేమపడుదురు గావున ఒక్కరాజునకు చేసిన హితమే లోకమున కెల్ల చేసిన హిత మయినది.

శా. అద్ధావాగ్విబుధం, బహోవచన కవ్యాహార, మాహోవచ
స్సిద్ధం, బాః కృతతాం గతః కలి రితి శ్రీసూక్తివిద్యాధరం,
బిద్ధౌద్ధత్య మగా ల్లయం హి కుధియా మిత్యున్నద త్కిన్నరం,
బద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునం దయ్యె న్నభం బంతయుఁ. 6

అద్ధి...దుఁ - అధీరాగ్రణి = విద్వచ్ఛ్రేష్ఠుఁ డయిన యావిష్ణుచిత్తునియొక్క ['ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞః సంఖ్యావాన్ పణ్డితః కవిః' అమ. 'అగ్రేసరం సత్తమ ముత్తమం చ గ్రామణ్య మగ్రణ్య ముదాహరన్తి' హలా.] - గెలుపు = జయముయొక్క (జయమువలని) - ఉత్సవమునందుఁ = ఉద్రేకమునందు (ఉద్రేకముచేత ననుట - 'ఉత్సేకామర్షయో రిచ్ఛా ప్రసవే మహ ఉత్సవః' - అమ.) - నభంబు = ఆకాశము, అంతయుఁ = సమస్తంబును, - అద్ధా...బు - అద్ధా = సరి! అనెడి ('తత్త్వే త్వద్ధాఽఞ్జసా ద్వయమ్' - అమ.) - వాక్ = మాటగల - విబుధంబు = దేవతలు గలది, అహో...ము - అహో = ఆశ్చర్యము అనెడి - వచన = పలుకులు గల - కవ్యాహారము = పితృదేవతలు గలది (కవ్యాహారులు అనఁగా పితృదేవతలు - 'హవ్యకవ్యే దైవపైత్రే' అమ. పిత్రన్నమునకు కవ్య మని పేరు), అః....బు - అః = ఆహాహా (ఆశ్చర్యము), కలిః = కలియుగము - కృతతామ్ = కృతయుగత్వమును - గతః = పొందినది - ఇతి = అనెడి - శ్రీ = శోభతోడి, ('శ్రీ ర్వేష రచనా శోభా భారతీ సరళ ద్రుమే' మేదిని.) - సూక్తి = మంచి మాటగల - విద్యాధరంబు = విద్యాధరులు గలదియు, కుధియామ్ = చెడుబుద్ధిగల వారియొక్క (అద్వైతాది మతస్థులయొక్క యనుట), ఇ...మ్ - ఇద్ధ = ప్రకాశితమయిన - ఔద్ధత్యమ్ = గర్వము - ('ఉల్బణ ముద్ధతి ముత్కట ముద్భట మితి నాతి నానార్థాః' హలా.), లయమ్=నాశమును ('లయ స్తూర్య త్రయీసామ్యే సంశ్లేషణ వినాశయోః' హైమ.) - అగాద్ధి (అగాత్ + హి) = పొందెను గదా ('హి హేతా వవధారణే' అమ. - హి అను నవ్యయము నిశ్చయమును తెలుపును.) - ఇతి=ఇట్లని - ఉన్నదత్ (ఉత్+నదత్)=బిగ్గరగా అఱచుచున్న - కిన్నరంబు= కిన్నరులు గలది ('స్యాత్ కిన్నరః కింపురుష స్తురఙ్గవదనో మయుః' అమ.), అయ్యెఁ.

విష్ణుచిత్తుని జయమునకు హర్షించి ఆకాశమం దంతటను దివ్యులునిండి ఈక్రిందియట్లు సాధువాదములు పలికిరి.—దేవతలు *'బళిబళి'* యనిరి; *పితరులు* 'అహో' యనిరి; సిద్ధులు 'ఆహా' యనిరి; విద్యాధరులు 'ఆహా కలియుగము కృతయుగ మయినది' అనిరి; కిన్నరులు 'దుర్మతుల యొక్క పొంగిన పొగరు నాశ మయినది గదా' అని యఱచిరి. - కలియుగము కృతయుగ

మయిన దనుటచే అద్వైతాది కుమతములు కలిమాయచే నుత్పన్నము లనియు, వైష్ణవమతమే సత్యయుగమందు నెక్కొని యుండె ననియు భా.

'ఇత్థంవదత్' పూర్వముద్రణ పా. ఇది 'ఇత్యున్నదత్' అనుదానికి ప్రామాదికము గానోపును. అద్ధీరాగ్రణి' - ఇందు - 'అధీరాగ్రణి' అని యుండఁగా గలిగిన వ్యాకరణ కార్యములో, పూర్వ ధకారము దకారముగా మాఱుటకు తెనుఁగు వ్యాకరణములో సూత్రము లేక పోయినను మొత్తమున పూర్వ ధకారముయొక్క యొత్తు వినఁబడక ఉత్తర ధకారముయొక్క యొత్తుమాత్రమే వినంబడుటచేతను, అట్టి కారణముచేతనే సంస్కృతమందు పూర్వ ధకారము దకారముగా మాఱునట్లుగా వ్యాకరణసూత్రము లుండుటం జేసియు, మహాకవులును.—

"క. వృద్ధు లాకలత్మ యున్నను। బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా,
నిద్ధరణీశులలో గుణ। వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్." సభాపర్వము.

అని యిట్టి ప్రాసములం బ్రయోగించుటచేతను, ప్రక్రియా లాఘవార్థమై ఆంధ్రంబునను పూర్వ వర్ణమునకు ఒత్తు లేనిదిగా మార్పు అంగీకర్తవ్యము. దీనిచే ఇబ్బంగిత్యాదులును రక్షితంబు లగును.

సీ. సెలవులు నాకుచు వెలియరంగులు సూడ
 కరిగి పాదూవాహు నరయువారు;
తమమ్రోల నుండునందలముఁ గానక దాఁటి
 పేరెలుంగిడి బెస్తఁ జీరువారు;
నగరు వెల్వడుదాఁకఁ దెగి పోయి మఱి నిల్చి
 తోడివిద్వాంసులఁ గూడువారు;
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వాఁ
 డనునవి తప్ప నూఁకొనెడివారు;
తే. 'వాద మేమాయె?' నన్న, 'భూవరునిపత్మ
పాత మాదసరికిఁ గల్గి బ్రతికె', ననెడు
వారు; 'నౌ లెం, డిటు విమర్శ దూరమైన
వాకిట వసించు నెవ్వఁ' డన్వారు నగుచు. 7

తర్వాతి పద్యములోని 'విద్వాంసులు' అనుపదముతో నన్వయము.—

1. విద్వాంసులు=(ఓడిపోయిన) పండితులు, సెలవులు=పెదవుల మూలలను, నాకుచున్= నాలుకతో తడుపుకొనుచు - వెలియరంగులు = బయటి తిన్నెలను, చూడక, అరిగి = పోయి, పాదూవాహున్ = తమచెప్పులు మోచువానిని ('అథ పాదుకా పాదూ రుపానత్ స్త్రీ' అమ.), అరయువారు = వెదకువారు;

2. తమమ్రోలన్ = ఎదుట, ఉండు = ఉన్నట్టి - అందలమున్ = ఆందోళికను (అందళ మనఁగా - పార్శ్వములందు మూఁతలేని పల్లకి - టామ్జాన్), కానక, దాఁటి = అవలికి పోయి, పేరెలుంగు ఇడి = పెద్దకేక వేసి [మిక్కిలి బిగ్గఱగా - పా. చేవెలుంగిడి = (చేవ + ఎలుంగు)

పటిమగల కంఠస్వరము చేసికొని - పా. చేయెలుంగిడి=చేతితో కూడుకొన్న యెలుఁగు కావించి - చేయెత్తి కూకవేసి అనుట, మఱియు లక్ష్యము—

క. "దీవించి, యతని వదనము । చేవెలుఁగిడి చూచి యేమి చెప్పెదు, చెపుమా,
యేవీనుల వినఁ గావున । నీ వొత్తుచుఁ జెప్పు చెప్పెదేని మహాత్మా." హరవిలా.],

బెస్తల్ = బోయను (జాత్యేకవచనము - బోయల ననుట, 'భారవాహకపేరు పరఁగుచుండును బెస్తమోపరి బోయఁడు బోయి నాఁగ' - ఆం. ద్వి. 288.), చీరువారల్ = పిలుచునట్టివారును;

3. నగరు వెల్వడుదాఁక = రాజగృహమునుండి వెలికిపోవువఱకు, తెగిపోయి = ఒకరి నొకరు విడిపోయి; మఱి = వెల్వడిన యనంతరము, నిల్చి, తోడివిద్వాంసులఁ గూడువారల్;

4. ఎదురు అయిన (=ఎదురుపడిన) - తమవానిల్, గృహకృత్యము = తమ యింటిపనిని, అడిగి, వాఁడు, అనునవి = చెప్పునట్టి యుత్తరములను, తప్పక్ = ఒకటిచెప్పిన మఱియొకటిగా, ఊఁ కొనెడువారల్ = 'ఊఁ' 'ఊఁ' అనుచు వినువారు;

వాదము ఏమి ఆయెల్ = వాదములో ఎవరు జయించినారు, అన్నల్ = అని ఎవరే నడిగినంతట, భూవరుని = తేనియొక్క - పక్షపాతము, ఆదాసరికిల్ = అపాడు వైష్ణవునికి (దాసరి యనఁగా విష్ణుభక్తుఁ డయిన శూద్రుఁడు, ఇట బ్రాహ్మణుఁ డగు విష్ణుచిత్తుని ఇతరమతస్థులు దాసరి యనుట తిరస్కారముచేత), కలిగిన=కలిగినందున, బ్రతికెల్=(ఆదాసరి) మా వాదములనుండి తప్పించుకొనెను, అనెడువారును, ఔల్ లెండు = ఔను లెండి, ఇటు, విమర్శ = విచారణ, దూరము అయినవాకిటల్ = లేనిహజారమందు, ఎవ్వాఁడు వసించును = ఎవఁడు నిలుచును, అనువారును, అగుచుల్ = అయి.

ఓడిన పండితులు వాదమందయిన యోటమిదుఃఖముచే పెదవిమూలలను నాలుకతో మాటిమాటికి నాకుకొనుచు, తమసేవకుని తమపాదరక్షలను చేత నుంచికొనియుండు వానిని, ఆస్థాని వెలుపలి యరంగులమీద తమకై కనుపెట్టుకొనియున్నవానిని, తమ తత్తఱపాటులో చూడకయే దాఁటిపోయి, అక్కడ వెదకుచుండిరి; తమతబ్బిబ్బులో ఎట్టయెదుట నేయున్న తమయందలమును చూడక దాఁటిపోయి అక్కడ బిగ్గరగా బోయీలను పిలువఁదొడంగిరి; రాచనగరు వెలువడువఱకు తమతోడి పండితులను విడిపోయి అచటనిలిచి మరల కలసికొనిరి; కొందఱు తమయింటివాఁ డెవఁడేని అగపడఁగా, వానిని ఇంటిపను లడిగి వానియుత్తరమును ఒకటిచెప్పిన మఱియొకటిగా వినిరి: - 'వాద మేమయిన దయ్యా? అని ఎవరేని యడిగిన, 'ఆ రాజు అపాడువైష్ణవుని మీఁద పక్షపాతము వహించినాఁడు, గావున్న వానిని నోరత్తనిత్తుమా?' అనిరి. 'ఏమిప్రయోజనము విమర్శలేనియీతేని యాస్థానికి ఇఁక నెవఁ డేఁగును?' అనియు పల్కిరి.

ఇందు తృతీయపాదము - పెక్కువ్రాతప్రతులలో చతుర్థపాదముగా నగపడుచున్నది. - స్వభావోక్త్యలంకారము.

తే. కలిసి యొకకొంతసేపు శృంగాటకముల
నగరిదెసఁ జూచుచునె మంతనంబు లాడి,
చనిరి విద్వాంసు లిండ్లకు. కజ్జనవిభుండు
రూఢి కతని మహాగజారూఢుఁ జేసి. 3

శృంగాటకములన్ = చదుకములయందు, ('శృఙ్గాటక చతుష్పథే' అమ.), నగరిదెసన్ = రాజగృహమువైపు,...మంతనంబులు = ఆరహస్యములు,...అజ్జనవిభుండు = ఆరాజు, యాధికిన్ = ప్రకటనకై,...మ...ధున్ - మహత్ = గొప్పదైన, గజ = ఏనుంగును, ఆరూఢున్ = ఎక్కినవానిఁగా, చేసి, - (ఏనుఁగు మీఁదనెక్కించి అనుట).

మ. 'పురి యేఁగించి తదీయ మైననగరంబుం జేర్పుఁ' డంచు న్బడిన్
దొరలన్ రాజకుమారులన్ బనుపఁగాఁ, దూర్యస్వనంబుల్నిరం
తరవందిస్తుతులుం గజేంద్రహయఘంటావారకాంతాంఘ్రినూ
పురముల్మ్రోయఁగఁ, గొల్చి వా రిరుగడం బో మార్గమధ్యంబునన్. 9

పురియేఁగించి = ఊరేఁగించి, తదీయము అయిన నగరంబున్ = ఆవిష్ణుచిత్తునిది అగుపురమునకు (విల్లిపుత్తూరికి), చేర్పుఁ డంచున్, బడిన్ = ఆతనివెంబడిని, దొరలన్ = సామంతరాజులను, రాజకుమారులన్, పనుపఁగాన్ = ఆపాండ్యరాజు పంపినంతట, తూర్యస్వనంబులు = వాద్యధ్వనులును, నిరంతరవందిస్తుతులున్ = ఎడతెంపు లేని స్తుతిపాఠకుల స్తోత్రములును, ['వన్దినః స్తుతిపాఠకాః', 'స్తవః స్తోత్రం స్తుతి ర్నుతిః' అమ.], గజే...ముల్ - గజేంద్ర = ఉత్తమము లయిన ఏనుఁగులయు - హయ = గుఱ్ఱములయు, - ఘంటా = గంటలును, వారకాంతా = వేశ్యల - అంఘ్రి = పాదముల, నూపురముల్ = అందెలును, ['స్యురుత్తరపదే వ్యాఘ్ర పుఙ్గవర్షభ కుఞ్జరాః సింహశార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అమ. - ఆద్యశబ్దముచేత ఇంద్రాదిశబ్దములు గ్రాహ్యములు - 'వారస్త్రీ గణికా వేశ్యా', 'పదఙ్ఘ్రి శ్చరణోఽస్త్రియామ్' - 'పాదాఙ్గదం తులాకోటి ర్మఞ్జీరో నూపురోఽస్త్రియామ్' అమ.], మ్రోయఁగన్ = శబ్దించుచుండఁగాను, వారు = ఆదొరలును రాజకుమారులును, ఇరుగడన్ = ఆభక్తునిరెండుపార్శ్వములయందును, కొల్చి = సేవించుచు, పోన్ = కూడఁజనుచుండఁగా, మార్గమధ్యంబునన్ = నడిదారిలో. - (పైపద్యముతో నన్వయము.)

పాండ్యరాజు విష్ణుచిత్తుని పూర్వోక్తప్రకారంబున గొప్పయేనుఁగుపై నెక్కించి, ఊరేఁగించెను; అర్వాత అట్లే ఆయునను తద్వాసస్థాన మయిన విల్లిపుత్తూరికి చేర్పుఁ డని ఆయనవెంట సామంతరాజులను రాజకుమారులను పంపఁగా, వాద్యధ్వానములును, ఎడతెంపులేని స్తుతిపాఠకుల స్తోత్రములును, ఏనుఁగులయు, గుఱ్ఱాలయు గంటలును, వేశ్యాయువతుల యందెలును మ్రోఁగుచుండఁగా, ఆదొరలును రాజకుమారులును ఆభక్తునివెంట ఇరుపార్శ్వములందును, గొలిచి పోవుచుండఁగా, నడిదారిలో (ఈవక్ష్యమాణము జరిగెను.). - వారకాంతలను గజేంద్రహయములతో చేర్చి చెప్పుటచే వారకాంతలు గజేంద్రగామినులును గజ్జలగుఱ్ఱములునుగా నుండి రని సూచన. మధ్యమధ్య సానిమేళముల నాడించుచు నడచి రనియు భావము. - రాజాదులను కూడఁ బంపుట ఆభక్తునియందలి భక్త్యతిశయముచేత. 'నిరంతర' అనుటచే ఆవందులే భక్త్యావేశ పారవశ్యముచే తెంపులేక నుతించి రనుట.

'బడిన్' - పూ. పా. వడిన్; - 'ఇరుగడ' - ద్విగుసమాసము. - 'పురియేఁగించి' ఊరేఁగించుట యనువ్యావహారమున 'ఊరు'నకుంబోలె ఇట 'పురి' కిం బ్రథమ అర్థభావనచేత వచ్చినది. ఇట్టిచో ద్వితీయ కలదు. - పరమయోగివిలాసమున 8 (308)

క. 'నిచుళేశుఁడు నద్భుత మొం । దుచు నావిప్రునకు భక్తితో మ్రొక్కి నుతిం
చుచుఁ దాను బల్లకీమో । చుచు నేఁగించెన్ విభూతి శోభిల్లఁ బురిన్'.

ఇట 'పురిన్' సప్తమ్యర్థకము గాఁదగు. పరమయోగివిలాసముననే ఇట్టిపట్టునం బ్రథమయుం గలదు.

గీ. 'మఱియునిజవైభవం బెల్ల మెఱసి తనరు । పట్టపేనుంగు మీఁదటఁ బెట్టి యతనిఁ
బురము గలయ నేఁగింపఁగ వారి సమస్త । సురలుగొలువఁ దద్విభవంబుఁ జూడవచ్చె'.4(35)

—* విష్ణుచిత్తునకు భగవంతుఁడు సాక్షాత్కరించుట *—

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపు రెంటెమో యన
న్నింగి గరుత్పరంపరలనిగ్గున లేఁదొగ రెక్కె; నంత వీ
చెం గలశాబ్ధిమీఁగడల జిడ్డెఱిఁగించెడు కమ్మగాడ్పు; నిం
డెం గడు మ్రోఁత; పెన్దిరువడిం గని; రాఖగరాజు మూఁపునన్. 10

ఇంగిలికంబునన్ = ఇంగిలీకమునందు, (ఇంగిలీకము కలిపిననీటియందు అనుట), తడిపి = తోఁచి, ఎత్తుకసీసపురెంటెమో = ఎత్తుచున్న నల్లనిజంట నేఁతవస్త్రమో, అనన్ = అనునట్లుగా. నింగి = ఆకాశము, గరు...నన్ - గరుత్ = (వక్ష్యమాణుఁడైన ఖగరాజుయొక్క) ఱెక్కలయొక్క ('గరుత్పక్షచ్ఛదాః పత్త్రం పతత్త్రం చ తనూరుహమ్' అమ.) - పరంపరల = పంక్తులయొక్క - నిగ్గునన్ = ధాళధళ్యముచేత, లేఁదొగరు ఎక్కెన్ = లేఁతయెఱుపుం బొందెను. అంతన్ = వెంటనే, కలశాబ్ధి మీఁగడలజిడ్డు=పాలసముద్రపు మీఁగడలజిడ్డుస్పర్శను, ఎఱిఁగించెడు కమ్మగాడ్పు= తెలుపుచున్న తావిగాలి, వీచెన్ = ప్రసరించెను. (అంతన్), కడున్ మ్రోఁత=గొప్పధ్వని, నిండెన్ = పర్వెను, (అంతన్), పెన్దిరువడిన్ గరుత్మంతుని, (ఆజనులు) కనిరి. (అంతన్), ఆఖగరాజుమూఁపునన్ = ప్రసిద్ధుఁడయిన యాగరుత్మంతునిబుజముల మీఁది ('గరుత్మాన్ గరుడస్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః' అమ.), తరువాతి కన్వయము. - (ప్రథమపాదమున - 'దడిపి యెత్తినసీసపురెంటెమో' అని పా. - ఆపాఠములో 'రెంటె'మనఁగా జేవ అని వ్యాఖ్యయున్నది.

వా రట్లు పోవుచుండఁగా మధ్యదారిలో మహావిష్ణువు వారికి ఆభక్తునిమూలముగా దివ్యదర్శన మొసంగెను. దానివివర మెట్లనఁగా - మొదట ఆకాశము భగవద్వాహన మయిన గరుత్మంతుని ఱెక్కల యెఱ్ఱకాంతిచేత ఇంగిలీకపునీటఁ దడిపియెత్తుచున్న నల్లదుప్పటియో యన లేఁతయెఱుపుం బొందెను; పిమ్మట ఆయనఱెక్కలగాలి వానియందలి పాలసంద్రపు మీఁగడలజిడ్డును వారియొడళ్లకు ఇంచుకతగిలించుచు ఆపరిమళమును వారిమీఁదికి వీచెను. ఆతఁడు ఇంకను సమీపింపఁగా రింగని యాఱెక్కలమ్రోఁతఁ వినబడం దొడంగెను. పిమ్మట ఆతఁడు కనులకుం దోఁచెను. ఇంకను సమీపగతుఁడైనంతట ఆతనిమీఁదఁ గూర్చున్న భగవంతుఁడు ప్రత్యక్షుఁడాయెను.

'ఎత్తు' అను తద్ధర్మార్థకరూపముచేత క్రియ జరుగుచునే యున్నదశ తెలుపఁబడినది; అందువలన ఆకాశమున క్రమముగా క్రిందినుండిపైకి అంతటను తొగరు పర్వె నని భా. పాల సముద్రపు మట్టమునుండి పైకి లేచుటవలన ఆయెఱుపు క్రిందినుండి పైకి పర్వినది.

'ఎతిఁగించెదు' అనుటచేత విస్తారముగాఁ గాక ఇంచుకయే తగిలించెదు అని భా. - 'కష్మ' - ఆజిడ్డు తావి గలది యనుట - పద్యమందు క్రముగా గరుత్మంతుఁడు దూరమునుండి వారి తావుపైకి వచ్చుటయు, పైనుండి క్రిందికి వచ్చి వారికి సమీపగతుఁ డగుటయు దెలుపఁబడినవి. 'కసీసపు' - కసీసము అనఁగా నల్లనిది, దీనికి ప్రకృతి 'కాసీసము.' కాసీస మనఁగా మైలుతుత్తము; అది నలుపుగాన దీనికి ఈయర్థము వచ్చినది. ఆకాశమున వర్ణము కసీస మని మనువులోనుం గలదు:—

క. 'కుంజరశతాంగ హయభట । రంజితమై పైరజఃపరంపర లలమన్
మంజులకాంతిఁ గసీసపు । మాంజిష్ఠమువోలె గగనమండప మమరెన్'. 5 (42).

'పరంపరల' అనుటచేత ఱెక్కలను చాఁపి మింటం బర్వుచున్నాఁ డని భా. 'ఎక్క' అని శబ్దరత్నాకర పా. దానికి పా. ఎక్కు - 'పోన్' అని పూర్వపద్యమం దున్న తుమున్నర్థకమునకు 'ఎక్కన్', 'వీచెన్' అను సమాపకక్రియలతో నన్వయము. 'జిడ్డు' - ఇది గరుత్మంతుని ఱెక్కలకు, అతఁడు సర్వదా పాలసముద్రపుమీఁగడలమీఁద శేషశాయిసన్నిధిలో వేచియుండుటచేత అంటుకొన్నట్టిది. వానినాడించుటచేత ఆజిడ్డును ఆపరిమళమును ప్రసరించినవి. 'కలశాబ్ధి' - కలశము (రూ. కలసము) అనఁగా పాలకడలియొక్క యమృతమును పోసియుంచుటకై విశ్వకర్మచే సృజింపఁ బడిన ఘటము, దానికి సంబంధించినది గాన కలశాబ్ధియన పాలకడలి. 'పెన్దిరువడి' - ద్రావిడభాషయందు - పిరియ = పెద్దవాఁడైన - తిరు = శ్రీ = పూజ్యమయిన - అడి = పాదముగలవాఁడు, - పెద్దపూజ్యపాదుఁడు అనుట - ఇది గురుత్మంతునికి పేరు, ఇట్లే ఆంజనేయునికి సిఱియతిరువడి యనిపేరు 'గెంటెమోయనన్' - ఉత్ప్రేక్షాలంకారము: పద్యములో స్వభావోక్తియు స్ఫురించుచున్నది.

సీ. చివురుఁబొట్లపుదోయి జెందమ్ము లనఁ దార్క్ష్యు
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర,
నునుఁగప్పుమేనఁదోఁచిన తదూర్ధ్వచ్ఛాయ
లీలఁ దాల్చుపసిండిచేల మెఱయ,
వ్రాలిన యోగివర్గము నిర్మలాంతఃక
రణములువోలె హారములు దనర,
సిరికిఁ బుట్టింటినెచ్చెలు లౌట మనవికి
డాసె నా మకరకుండలము లమర,
తే. శ్రిత సిత చ్ఛద వాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలో యనంగ
శంఖచక్రాంచితోరుహస్తములు దనరఁ,
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. 11

(శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమగుటను కవి వర్ణించుచున్నాఁడు). - చివురుఁబొట్లపుదోయి చెందమ్ములు అనన్ = చిగుళ్ల పొట్లాలజంటలోని యెఱ్ఱదామరలు అనునట్లుగా, తా...లు -

తార్క్ష్య = గరుత్మంతునియొక్క ('గరుత్మాన్ గరుడ స్తార్క్ష్యః' అమ.) - హస్త = చేతుల యొక్క - ఉదరములు = తలములయందలి - (అరచేతులయందలి అనుట) - దివ్యఅంఘ్రులు = లోకాతీతము లయిన పాదములు ('పదఙ్ఘ్రిశ్చరణోఽస్త్రియామ్' అమ.), అమరన్ = ఒప్పుచుండఁగాను;

నునుఁగప్పుమేనన్ = నున్నని నల్లదేహమందు, తో...లీలన్ - తోఁచిన = అగపడిన - తత్ = ఆతార్క్ష్యునియొక్క - ఊర్ధ్వచ్ఛాయలీలన్ = మీఁదికిఁ బ్రసరించుకాంతిపోయన [పా. తదర్వ - తత్ = ఆ - అర్వ = గుఱ్ఱముయొక్క (వాహన మయిన గరుత్మంతునియొక్క యనుట-'వాజి వా హార్వ గన్ధర్వ హయ సైన్ధవ సప్తయః' అమ.)-ఛాయ=ప్రతిబింబముయొక్క ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.), లీలన్ = విలాసముతో] తాల్చుపసిండిచేల = ధరించిన బంగారువలువ, మెఱయన్ = ప్రకాశించుచుండఁగాను;

వ్రా...వోలెన్ - వ్రాలిన = వచ్చి పైఁబడినవైన - యోగివర్గము = సంయముల సమూహముయొక్క ('బృన్దభేదా స్సమై ర్వర్గః' అమ.) - నిర్మల = పరిశుద్ధము అయిన - అంతఃకరణములు వోలెన్ = మనస్సులో యనునట్లుగా, హారములు = ముత్యాలపేరులు, ('హారో ముక్తావళీ' అమ.) తనరన్ = ఒప్పుచుండఁగాను;

సిరికిన్ = మహాలక్ష్మికి, పుట్టింటినెచ్చెలులు = పుట్టినిల్లయిన సముద్రమందలి యనుఁగుఁ జెలులు, ఔటన్ = అయినకారణమున, మనవికిన్ = ఏమో చెప్పుకొనుటకై, డాసెన్ నాన్ = సమీపించినవో (సమీపించిన మకరములో) యనునట్లుగా, మకరకుండలములు = మకరాకారము గలవైన కర్ణాభరణములు, అమరన్;

శ్రి...లా - శ్రిత = ఆశ్రయించిన - సితచ్ఛద = హంసలు గలవి - ('హంసాస్తు శ్వేతగరుతః' - అమ.) - వాత్యా = సుడిగాలిచే (వాతానాం సమూహో వాత్యా) - అభిహత = లేపఁబడిన - పరాగ = పుప్పొడియొక్క - వలయ = చక్రముచేతను, మండిత = అలంకరింపఁబడినవియు నగు - కల్పశాఖలా = ఈవిమ్రానికొమ్మలో, అనంగన్ = అనునట్లుగా, శం...లు = శంఖ = పాంచజన్యంబును - చక్ర = సుదర్శనమును ('శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రం సుదర్శనమ్' - అమ.) - అనువానిచే - అంచిత = ఒప్పుచున్న - ఊరు = గొప్ప - హస్తములు = చేతులు, తనరన్, కమలేక్షణుండు - కమల = పుండరీక (ములవంటి) - ఈక్షణుండు = నేత్రములు గలవాఁడైన, చతుర్భుజుండు = (నాలుగుచేతుల దేవుఁ డయిన) నారాయణుఁడు, తోఁచెన్ = ప్రత్యక్షుఁడాయెను. (౧౦ వ పద్యములో 'మూఁపునన్' అను పదము ఈక్రియా పదముతో నన్వయించును.)

తార్క్ష్యుని మూఁపునం గూర్చుండియున్న శ్రీమన్నారాయణుని దివ్యపాదములను తార్క్ష్యుఁడు తన యరచేతులయందు మోచుచుండెను. పాదములు ఎఱుపులై యెఱ్ఱని తామరసములవలె నుండెను. వానికి సుఖస్పర్శగా అతికోమలము లై యెఱ్ఱవియు నై తార్క్ష్యుని అరచేతులు చిగుళ్ల పొట్లములవలె నుండెను. తార్క్ష్యుఁడు అరచేతులను ఆదివ్యపాదములకు సుఖస్పర్శకై, అట్లు గావించుకొనె ననుట.

తళతళని నల్లని తన(మేని)నిగ్గులో సువర్ణచ్ఛాయుఁడైన తార్క్ష్యుని ప్రతిబింబము తోఁచుచున్న దా యన భగవంతునిమేన పీతాంబరము వెలుగొందుచుండెను.

భగవంతునిపై వ్రాలిన వైన యోగీశ్వరులపరిశుద్ధాంతఃకరణముల పరంపరలో యన భగవంతుని యురమునందు అణిముత్యాల హారములు వెలుఁగుచుండెను. ఒక్కొకముత్తెము ఒక్కొక్కయంతఃకరణమువలె నుండె ననుట, ఇత్యాది. సముద్రములోనే పుట్టిన వగుటచేత శ్రీదేవికి పుట్టినింటి వెచ్చాలు అగుటచేత, ఆచారవచేత ఏమో మనవిచేసికొనుటకై చెవులఁ దఱిసిన మకరములో యన మకరాకారము లయిన కుండలములు భగవంతునికర్ణములందు భాసిల్లుచుండెను. (వరములిచ్చున వయిన) దీర్ఘ బాహువులు కల్పశాఖలవలెను, అందలి శంఖచక్రములు హంసలవలెను సుడిగాలికి రేఁగిన పుప్పొడి చక్రమువలెను ఉండెను.

నేత్రములు కమలములవలె నుండెను. ఈతీరున నాలుగు భుజములు గలవాఁడైన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమాయెను.

ఇందు అంతటను ఉత్ప్రేక్షాలంకారము. 'చేల'-పాక్షికముగా హంసాదిగణకార్య మయిన ములోపము. మకర కుండలములు - మధ్యమపదలోపిసమాసము. గీతాదిలో - 'శ్రితసిత మరాళ' అని ఉపలబ్ధ పాఠము. - అందు 'సితమరాళ' యనునది అపుష్టార్థతాదోషోపహత మగుటచే లేఖకాది ప్రమాదజనితమై యుండనోపు ననుతలంపున నాచే 'సితచ్ఛద' అని మార్పఁబడినది.

క. ఎప్పుడు హరి గని రమరులు । ముప్పదియును మూఁడుకోట్లు మునిఁ గనుఁగొనువా
రప్పుడు తత్కరములతో । విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్. 12

మింటన్ = ఆకాశమందు, మునిఁ గనుఁగొనువారు = విష్ణుచిత్తునిఁ జూచుచున్న, ముప్పదియును మూఁడు కోట్లు అమరులు,—ఎప్పుడు = ఏక్షణమున, హరిన్, కనిరి = చూచినారో అప్పుడు = అక్షణమందే, తత్కరములతోన్ = వారి చేతులతోఁగూడ, విప్పిన గొడుగులును = వారు విప్పి ధరించియున్న ఛత్త్రములును, వేగమ = తటాలున, మొగిడెన్ = ముకుళితములాయెను.

ఆకాశమందు వచ్చి నిల్చి విష్ణుమత స్థాపకుని ఆవిష్ణుచిత్తుని కాంచుచున్న ముప్పది మూఁడు కోట్ల దేవతలును శ్రీహరి కనఁబడఁగానే తమ తాల్చియున్న గొడుగులను ముడిఁచి అంజలి చేసిరి. - సహోక్త్యలంకారము:—

'వరసహిత సహోక్తి; మహీ । వరుకీర్తి దిగంత మేఁగె వైరులతోడన్'. అలం.

'కోట్లు' = కోటులు—'తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు.' బా. వ్యా. ఆ. 7 వృత్తి. ఈకార్యంబు అనఁగా ఉత్వలోపము.

తే. సమ్మదదిదృక్షుఖస్థరక్షఃపిశాచ । పుంజ మహిభుక్పతత్త్రప్రభంజనములు
సోఁకఁ వెలిఁ బాఱెఁ గల్గాన శూర్పవాత । ఘట్టనల బాఱు పెనుఁబొల్లకట్టు వోలె.

సమ్మ...ము - సమ్మద = హర్షముచేత (లేక హర్షమును) - దిదృక్షు = చూడఁగోరి(న) - ఖస్థ - ఖ = ఆకాశమందు స్థ = ఉన్నట్టి-రక్షఃపిశాచపుంజము = రక్కసులయు దయ్యములయు సమూహము('పుఞ్జ రాశీ తూత్కరః కూట మస్త్రియామ్' అమ.), అహి...లు = అహిభుక్ = నాగభోజి యయిన తార్క్ష్యునియొక్క (' నాగాన్తకో విష్ణురథః' అమ.)- పతత్త్ర = ఱెక్కలయొక్క ('గరుత్పక్ష చ్ఛదాః పత్త్రం పతత్త్రంచ తనూరుహమ్' అమ.) - ప్రభంజనములు = వాయువులు ('నభస్వ ద్వాత పవన పవమాన ప్రభఞ్జనాః' - అమ.), సోఁకన్ = తగులఁగానే,

వెఱన్ = భయముచేత, కళ్లానన్ = ధాన్యము నుఱిచెడుచోట, శూ...లన్ - శూర్ప = చేటల యొక్క - వాత = గాలియొక్క - ఘట్టనలన్ = దెబ్బలచేత, పా...లెన్ - పాఱు = ఎగిరిపోవు నట్టి - పెను = పెద్ద - పొల్లకట్టువోలెన్ = గింజపట్టని ధాన్యముయొక్క (తఱుకలయొక్క) మొత్తమువలె, పాఱెన్ = పలాయిత మాయెను.

విష్ణుద్వేషులయిన రక్షః పిశాచాదులు ఆచిత్రమును దేవతలతోఁగూడ చూచుచున్నవారై అంతలో గరుడుని ఱెక్కలగాలి సోఁకఁగానే భయపడినవారై చేటలగాలికి కళ్లాన తఱుకలుం బోలె పరారి యైరి.

ఇట పద్యాదిలో 'సామర దిదృక్షు' అని పాఠాంతరము కలదు. - సామర = దేవతలతోఁ గూడుకొన్నవారై - దిదృక్షు = చూడఁగోరువారైన, అనియర్థము, ఈపాఠమున - స + అమర అను ఛేదము కలదు; 'క్షః' అనుదోట శబ్దచ్ఛేదములేదు, కాన యతిభంగము. 'పిశాచ' అను శబ్దమున 'పిశిత మశ్నాతి' అను వ్యుత్పత్తిచేత - 'పిశ + అచ' - అని శబ్దచ్ఛేదము కలదు గావున - 'సామర దిదృక్షు రక్షః పిశాచ ఖగ' అని పఠించిన యతి సరిపడును. 'సామర' పాఠపక్షమున మంచిధాన్యమువలె దేవతలు నిలిచినా రనియు, పొల్లువోలె రక్షః పిశాచులు పాఱిపోయిరనియు భావము. 'కళ్లానన్' - 'కళ్లమునన్' అనుటకు 'మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా। ణానం గలుగంగ' అను నిత్యాది ప్రయోగములంబట్టి వచ్చిన రూపాంతరము. 'పాఱు పెనుఁబొల్ల'-పా. పాఱి చనుపొల్ల.

క. నీరంధ్రకుసుమధారా। సారచర చ్చంచరీక సంకుల కల ఝం
కారానుకారి సంస్తవ। కారి మునిస్తోమ సామగానం బెసఁగెన్. 14

నీరం...బు - నీరంధ్ర=దట్టమయిన (నీర్ + రన్ధ్ర=సందులేని=దట్టమయిన) - కుసుమ = పువ్వులయొక్క - ధారా ఆసార = తెంపులేని వర్షమందు ('ధారా సంపాత ఆసారః' అమ.) - చరత్ (పా. సరత్) = సంచరించుచున్న - చంచరీక = తుమ్మెదలయొక్క ('ఇన్దిన్దిర శ్చఞ్చరీకః' - అమ.) - సంకుల = కలగొనిన ('అథసంకులం। పరస్పరాహతవచ స్యుత్క్రాన్తే వ్యాకులేఽపిచ' - నానా.) - కల = అవ్యక్త మధురమైన - ఝంకార = ఝుంఝుం ఝమ్మనెడి ధ్వనిని, - అనుకారి = పోలిన (సామగానమునకు విశేషణము) - సంస్తవకారి = స్తోత్రములు చేయుచున్న ('స్తవః స్తోత్రం స్తుతి ర్నుతిః' అమ.) - మునిస్తోమ = నారదాదియోగిబృందముయొక్క ('స్తోమః స్తోత్రేఽధ్వరే బృన్దే' అమ.) - సామగానంబు = సామవేదముయొక్క పాట ('సామ క్లీబ ముపాయస్య భేదే వేదాన్తరేఽపి చ' అమ.), ఎసఁగెన్ = ఒప్పెను.

ఆసమయమందు మహామును లచ్చోటికి విచ్చేసి భగవంతుని దర్శించి సామగానము చేసిరి. దేవతలు పూలవానలు గురిసిరి. ఆగానము అప్పుడు ఆపుష్పవర్షములోని తుమ్మెదల ఝంకారమునకు అనుకరణమువలె నుండెను.

'వేదానాం సామవేదోఽస్మి' - 'అనఁగా వేదములలో నేను సామవేదమను' అని గీతలో భగవంతుఁడే చెప్పుకొనియుండుటచేత సర్వవేదశ్రేష్ఠ మయిన సామవేదమును, భగవంతుఁడు సామగానలోలుఁ డగుటచేత, తత్ప్రీత్యర్థము భక్తిచే పాడి రనుట. తుమ్మెదలు ఎట్లు శ్రుతి హెచ్చించుచును, తగ్గించుచును శబ్దించునో, అట్లే మునులును గానములో శ్రుతి మార్చుచుండి రనియు, ఎల్లతుమ్మెదల రావములును ఒకచేరావ మైనట్లు ఎల్లమునులును ఒక రారంభించిన

సామమునే కడమయందఱును పాడిరనియు, సామ్యసంపద, ఆపాటలలో మాధుర్యమమాత్రమే కాక, తుమ్మెదలు సంకులముగాను స్తోమముగాను పాడుట సామ్యమును మఱియు పోషించుచున్నది. - ఉపమాలంకారము; వృత్త్యనుప్రాసము.

తే. అట్లు ప్రత్యక్షమైనపద్మాక్షు నంత
రిక్షమునఁ గాంచి, ముని ప్రమోదాక్షిజలము
నిగుడఁ బులకించి, కరటిఘంటికల తాళ
ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె. 15

అట్లు, ప్రత్యక్షమైన పద్మాక్షున్ = కనులకుం దోఁచిన శ్రీహరిని ('దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిందో గరుడధ్వజః' అమ.), అంతరిక్షమునన్ = ఆకాశమందు కాంచి, ముని = విష్ణుచిత్తుఁడు, ప్రమోద అక్షిజలము = ఆనంద బాష్పములు ('ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః। స్యాదానన్దథు రానన్దః శర్మ శాత సుఖాని చ' అమ.), నిగుడన్ = ఉప్పతిల్లఁగా, పులకించి = గగుర్కొని, కరటిఘంటికలె = ఏనుఁగుయొక్క ఘంటలనాదములే ('కరటో గజగణ్డే స్యాత్' మేది. - కరట మనఁగా ఏనుఁగుయొక్క గండస్థలము, అది కలది గావున ఏనుఁగుకరటి - ఘంటికాశబ్దమునకు లక్షణచేత తన్నాద మర్థము.), తాలములన్ = (స్తోత్రముం బాడుటలోని) కాలక్రియలయొక్క కొలఁత కాఁగా ('తాలః కాల క్రియామానమ్' అమ.), ఇట్లు అని = ఈవక్ష్యమాణ పద్యార్థములచేత, ఆమహాత్మునిన్ = పరమాత్మయైన యా మహావిష్ణువును, నుతించెన్.

'కరటిఘంటికలె తాళములుగన్' - ఆముని ఏనుఁగుమెడలో వ్రేలుచున్న గంటలనే తాళముగా చేతులం దాల్చి వాయించుచు భగవంతుని స్తుతులు పాడెను - అనుట. ఆకరములయం దట్లే యున్నది:—

'తాలాన్గృహీత్వా కరిరాజఘంటే తన్మఙ్గళాశాసనగేయ మాహ.' దివ్యసూరిచ. 5 (69).

'ఈసాబ గీవిలాసకళ లీసిరు లింతవహించు నీగుణో
ద్భావికి దృష్టిదోషములు దాఁకక పోవలె నంచుఁ బ్రేమవి
శ్వాసమువాప్తిఁ దాళములుగా గజఘంటలు పూని మంగళా
శాసనముప్పు డిట్లనుచుఁ జల్పె మనోహరగానలీలలన్'. పరమయోగి. 4 (37).

'ఘంటికను' - అని ఏకవచనపాఠమే పెక్కువ్రాఁతప్రతులయందు అగపడుచున్నది. కాని అది మూలమునకు విరుద్ధము.

—* విష్ణుచిత్తుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట *—

కవిరాజ విరాజితము

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా,
జయ జయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా,
జయ జయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా,
జయ జయ కేశవ కేశినిషూదన శౌరి శరజ్జలజాక్ష హరీ. 16

దా...రా - దానవ = అసురులయొక్క ('అసురా దైత్య దైతేయ దను జేంద్రారి దానవాః' అమ.) - దారణ = చీల్చుటకు (సంహారమునకు) - కారణ = కరణములయిన (సాధనము లయిన - 'కారణం ఘాతనే హేతౌ కరణే' - హైమ.) - శార్ఙ్గ = (శృంగ) ధనుస్సు ('చాపః శార్ఙ్గం మురారేస్తు' అమ.) - రథాఙ్గ = (సుదర్శన) చక్రము ('చక్రం రథాఙ్గమ్' అమ.) - గదా = (కౌమోదకియనెడి) గుదియయు - అసి = (నందక మనెడు) కత్తియు - వీనియొక్క (వీనిని) - ధరా = తాల్చువాఁడా, జయజయ = సర్వోత్కృష్టుఁడవుగా నుండుము. [ఆదరాతిశయముచేత రెండు మారులు చెప్పుట]; చంద్ర - చంద్రులయొక్కయు, ...దినేంద్ర = సూర్యులయొక్కయు- శత = నూరులయొక్క (నూఱులకొలఁది) - అయుత = అయుతములవంటి (అయుత మనఁగా పదివేలు) - సాంద్ర = దట్టమయిన - శరీర = దేహముయొక్క, మహః = తేజస్సుయొక్క ('మహస్తూత్సవతేజసోః' - అమ.) - ప్రసరా = వ్యాప్తికలవాఁడా, జయజయ. తా ... రా- తామరస = పద్మముయొక్క ('తామరసం పద్మే తామ్ర కాఞ్చనయో రపి' - మేది.) - ఉదర = లోపలనికి, సోదర = తోఁబుట్టువైన (అనఁగా తత్తుల్య మయిన) - చారు = అంద మయిన - పద = అడుగు చేత, ఉజ్ఝిత = వెలువరింపఁబడిన - గాంగ = గంగాసంబంధియైన - ఝరా = ప్రవాహముకల వాఁడా, జయజయ; కేశవ = బ్రహ్మశివులకు ఉత్పత్తికారణమైనవాఁడా [కః = బ్రహ్మ - ఈశః = శివుఁడు - కేశౌ = బ్రహ్మశివులను - వాతి = పొందువాఁడు, - వాగతౌ. - ('శంభోఃపితామహో బ్రహ్మపితా' అని పద్మపురాణములో మహావిష్ణువర్ణనము), కేశి - నిషూదన = కేశి (యనురక్కసుని) సంహరించినవాఁడా, శౌరి = శూరుఁ డనువాని వంశమునఁబుట్టినవాఁడా, శరత్ జలజ అక్ష = శరత్కాలంపుఁ గమలములవంటి నేత్రములు గలవాఁడా, హరీ = నారాయణుఁడా;

దానవులను సంహరించుటకు సాధనము లగు చాప చక్ర గదా ఖడ్గములు ధరించువాఁడా, చంద్రసూర్యుల నూఱులకొలఁదియయుతముల కాంతితో సమాన మయిన దేహకాంతి గలవాఁడా, గంగానదికి జన్మస్థానమయిన యడుగుఁ దామరగలవాఁడా, బ్రహ్మశివులకు మూలమైనవాఁడా, కేశియను దానవుని సంహరించినవాఁడా, శూరుఁడను యాదవుని వంశమున జనించినవాఁడా, శరత్కాలఁపుఁ దామరలవంటి నేత్రములు కలవాఁడా, పాపమును హరించువాఁడా, నీవు సర్వోత్కృష్టుఁడవుగా నుండుము.

'ధరా' 'ప్రసరా' ఇత్యాది సంబుద్ధి దీర్ఘములచేత ఈపద్యము తెలుఁగేగాని సంస్కృతము గాదని తెలియ నగుచున్నది. అట్లుండఁగా, 'జయ' అనునది మాత్రము తెలుఁగుకవులు ఇట్టి స్తోత్రములందు వాడిన సంస్కృతపదము - ఇందు ద్వితీయపాదమున దండిమతమున అభూతోపమ, దర్పణకారాదిమతమున ఉత్ప్రేక్ష.

'సర్వపద్మ ప్రభాసారః సమాహృత ఇవ క్వచిత్
త్వదాననం విభా తీతి తా మభూతోపమాం విదుః.' దండి.

ఇది కవిరాజవిరాజిత వృత్తము, ఇందులకు అప్పకవిలక్షణము—

'రహి న జషడ్వ ములన్ గవిరాజవిరాజిత మష్టధరాధ్రిగిరుల్' - నజ జజ జజ జ వ గణములు - ౮, ౭, ౭. అక్షరములయందు యతులు. ఈపద్యము మనుచరిత్రమందునుం గలదు. యతి ఒకటియే.

## —*మత్స్యావతారము*—

మ. దివిజద్వేషి సుదారవారిచరమూర్తిం జించి, చాతుర్య మొ
ప్ప వడిం జౌకపుఁదెల్ల కౌచుగమి దంభం బొంద మైఁ దాల్చి, వే
దవిశుద్ధాక్షర పంక్తిఁ గ్రమ్మఱఁగ వేధం జేర్చెదో నాఁగఁ, ద
ద్భువనం బబ్ధిసితాంబుబిందు లలమం బ్రోద్యద్రుచి న్దాఁటవే. 17

దివిజద్వేషిన్ = సురశత్రువగు సోమకుని, ఉ... ర్తిన్ - ఉదార = గొప్పదైన ('ఉదారో దాతృ మహతోః' - అమ.) - వారిచర = మీనముయొక్క - మూర్తిన్ = దేహముచేత ('స్త్రియాం మూర్తి స్తను స్తనూః' అమ.) - చించి = చీల్చి, చాతుర్యము = నేర్పు, ఒప్పన్ = తగియుండఁగా - చౌకపుఁదెల్లకౌచుగమిదంభంబు ఒందన్ = చతురశ్రమైన తెల్లని పొలసుల సమూహముయొక్క మిషకలుగునట్లుగా ('కపటోఽస్త్రీ వ్యాజ దమ్భోపధయశ్ఛద్మ కైతవే' అమ.), మైన్ = (నీ) దేహమున, తాల్చి = ధరించి, వేదవిశుద్ధ అక్షరపంక్తిన్ = వేదములయొక్క తెల్లనైన వర్ణముల వరుసను, వడిన్ = శీఘ్రముగా, క్రమ్మఱఁగన్ = మరల - వేధన్ చేర్చెదో నాఁగన్ = బ్రహ్మకు కొనిపోయి యిచ్చెదవో యనునట్లుగా, తద్భువనంబు = ఆ బ్రహ్మయొక్క లోకమును ('అథో జగతీ లోకో విష్టపం భువనం జగత్' అమ.), అబ్ధి సిత అంబుబిందులు=సముద్రముయొక్క తెల్లని ('అవదాత స్సితో గౌరో వలక్షో ధవళోఽర్జునః' అమ.) నీటిబొట్టులు, అలమన్ = కమ్మునట్లుగా, ప్రో...చిన్ - ప్రోద్యత్ = మిక్కుటముగా పైకి పర్వుచున్న - రుచిన్ = కాంతితో, దాఁటవే = దాఁటిపోవా.

స్వామీ, నీవు వేదచోరకుఁడైన సురారిని సోమకుని మహామత్స్యాకృతిం దాల్చి సంహరించి సత్యలోకముమీఁదుగా నీలోకమైనవైకుంఠమునకుం జన్న నాఁటి నీవృత్తమెట్లుండె ననఁగా; - వేదవిశుద్ధాక్షర పంక్తులను తెల్లని చచ్చవుకపుఁ బొలసుబారుల రూపమున నీవు నీమేనఁదాల్చినవాఁడవై, మహార్ణవమునందలి నీయాడాంట్లచేత లేచి బ్రహ్మలోక మెల్ల నలమిన నీటిబొట్లరూపమున బ్రహ్మకు వెండియు ఇచ్చుటయో యనునట్లుగా నొప్పారుచుండెను.

'చౌకపు' - దేవనాగరాక్షరములు చచ్చవుకముగా నుండును గావున ఆసామ్యముకై యీవిశేషణము పెట్టఁబడినది. - 'సిత' - 'అభాస్వరం శుక్లం జలే' అని తార్కికులు చెప్పుదురు. ఆశుక్లవర్ణమును ఇటం జెప్పుట అక్షరములు శుద్ధములు గావున తత్సామ్యబోధకొఱకు. - 'ప్రోద్యద్రుచిన్' - ఆయుప్పునీటి మెట్లచేతను వైకుంఠమున కేఁగుచున్న యీమహాతేజముచేతను బ్రహ్మాదులకు మహావిష్ణువు సోమక సంహారముం గావించి నిజలోకమున కేఁగినాఁ డని యెఱుకపడుటయు, అంతట వారికి వేదములు మరల ఆవిర్భవించుటయుం, గలిగె నని భావము. - సాపహ్నవోత్ప్రేక్షాలంకారము. ఈపద్యము మనువులోనుం గలదు.

చ. ఎలమి యుగాంతవారి కెదురెక్కుతఱిన్ వడిఁ దాలుగవ్వారం
బులఁ జనునీటివెల్లి బడిఁ బోవు సపక్ష నగోరువాశ్చరం
బులు దనుఁ దాఁకఁ దద్గతత మ్రోయు నజాండమ దైత్య వేదపం
క్తులు గొని కూల్చినట్టి జయదుందుభిఁ జేసితి కా మురాంతకా. 18

మురాంతకా = మురాసురుని సంహరించినవాఁడా, (నీవు), ఎలమిన్ = సంతోషముతో, యు...కిన్ - యుగాంత = ప్రళయమందలి ('సంవర్తః పరివర్తః క్షయో యుగాన్తో జగద్వినాశశ్చ' హలా.) - వారికిన్ = నీళ్లకు, ఎదురెక్కు తఱిన్ = ఎదురుగా నీదెడు సమయమందు, వడిన్ = వేగముగా, తా...లన్ - తాలు = దవుడలయొక్క - గహ్వరంబులన్ = గుహలలోనికి (గుహలవంటి పుక్కిళ్లలోనికి అనుట - 'గుహాదమ్భౌ గహ్వరే ద్వే' - అమ.), చనునీటివెల్లిబడిన్ = ప్రవహించుచున్న నీళ్లవెల్లువతోఁగూడ, పోవు సపక్ష నగ ఉరు వార్చరంబులు = ప్రవేశించుచున్న ఱెక్కలతోడి కొండలును గొప్ప జలచరములును ('శైల వృక్షౌ నగా వగౌ' - 'ఆపః స్త్రీ భూమ్ని వార్వారి' అమ.), తద్గతతన్ = దానిని పొందిన దగుటవలన (ఆపుక్కిటియందున్న దగుటవలన), తనున్ - బ్రహ్మాండమును, తాఁకన్ = తగులఁగా, మ్రో...మ - మ్రోయు = మొరయుచున్నట్టి - అజాండమ = బ్రహ్మాండమనే, దైత్యున్ = వేదముల హరించిన సోమకాసురుని, వేదపంక్తులు గొని = వేదములవరుసలను (ఎల్లవేదముల ననుట) ఒడిచికొని, కూల్చినట్టి జయదుందుభిన్ = సంహరించినందులకైన గెలుపుం దెలిపెడు, భేరినిగా ('భేరీ స్త్రీ దున్దుభిః పుమాన్' అమ.), చేసితికా = ఒనర్చితివికదా.

నీవు మత్స్యమూర్తివై సోమకాసురునివలననుండి వేదములం దివిచికొని వానిని సంహరించి ప్రళయజలప్రవాహమునకు ఎదురీఁదుచున్నప్పుడు, అప్పటివఱకు సముద్రములో దాఁగియుండిన ఱెక్కలతోడి మైనాకాది పర్వతములును తిమి తిమింగిల తిమింగిలగిలాది మహామత్స్యములును ఆప్రవాహముచే వివశములై కొట్టుకొనివచ్చి గుహలవంటి నీపుక్కిళ్లలోనికిఁ జొచ్చి, నీవు నీ పుక్కిళ్లలోనే పిమ్మటికై పదిలముగానుంచుకొనియున్న బ్రహ్మాండమునకే దబాలునం దగులఁగా, ఆమొరయుట ఆవేదగ్రహణసోమకాసురసంహారరూపజయమునకైన దుందుభి వాదనముగా నొప్పెనుగదా. - ఆబ్రహ్మాండధ్వానముచేత నీవిజయము ప్రకటమాయె నని భా.—

పూర్వము పర్వతములకు ఱెక్కలుండిన వనియు, ఇంద్రుఁడు వజ్రాయుధముతో ఆఱెక్కలను పడఁగొట్ట దొరకొనఁగా, మైనాకాదిపర్వతములు సముద్రములో దాఁగి, తమ ఱెక్కలను కాపాడుకొన్న వనియు, పురాణకథ. ప్రస్తుత జలప్రవాహము ప్రళయసంబంధి యైనను శ్రీహర్యవతారమైన మహామత్స్యము మత్స్యజాతిస్వభావోచితముగా దానికి ఎదురెక్కినదిగాని, ఆవెల్లి సర్వనాశక మగుటచేత, ఇతరమహామత్స్యములు అట్లు ఎదురు పోలేవాయెను సరియేగదా, అవశములై దానితోఁగూడఁ గొట్టుకొని పోయినవాయెను; - అని స్వభావోక్తి. జయప్రకటన రూపక్రియార్థమై అజాండమునకు దుందుభిరూపపరిణామము చెప్పినందున పరిణామము.

తద్గతత - పా. (1) గద్గదత, (2) గ్రక్కదల. ఈపద్యము మనువులోనుం గలదు.

చ. మితి గడవం దిమింగిలత మెయ్యెయిఁ బెంచిన నీదు వాతఁ గు
త్సితపలలాశియైనచిఱుఁజేఁ పడి ద్రెళ్లట నీవు మ్రింగుటే?
శ్రుతు లగునూరుపుల్ గుడఁ జొచ్చుతఱి న్భవదేధనైధనై
ధిత జవశక్తి నీడ్చికొని తెచ్చుటకాక తదల్పతాల్పతన్. 19

తిమింగిలతన్ = మహామత్స్యత్వమున - (మహామత్స్యమూర్తిని అని భావము), - తిమింగిలాది స్వరూప మిట్లు చెప్పఁబడి యున్నది.—

'అస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన మాయతః,
యస్తం గిళతి మత్స్య స్స తిమిఙ్గిల ఇ తీరితః,
తిమిఙ్గిల గిలోఽప్యస్తి తద్గిలోఽప్యస్తి రాఘవః.'

మితిగడవన్ = కల్పము ముగియఁగా, మెయ్మెయిన్ = అవలీలగా, పెంచిన (నీవు), నీనువాతన్ = నీనోటిలోపలికి, ఉత్సిత పలలాశి ఐన చిఱుఁజేఁప అది = ముక్కుడి రక్కసుం డయిన యాచిన్న చేఁప ('పలాశీ వ్యతుః రక్షసోః, మేది. - 'పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్'. 'స్యాచ్చామిషే పలమ్' అమ.), త్రెళ్లుట = దొరకుట, (ఏమనఁగా?), శ్రుతులు అను ఊర్పుల్ = వేదము లనెడు (నీ) నిశ్వాసములు ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః' అమ.), మగుడన్ చొచ్చుతఱిన్ = మరల నీ నోటం బ్రవేశించునప్పుడు, భ... క్తి - భవత్ = నీయొక్క - ఏధనవిధన = ఒక్కొక్క పెంపుచేతను (పెరిఁగిన కొలఁదియు) - ఏధిత = పెంపఁబడిన ('ఏధ వృద్ధౌ' ధా. పా.) - జవ = వేగముయొక్క ('రంహ స్తరసీ తు రయః స్యదః జవః' అమ.) - శక్తిన్ = బలముచేత, త...తన్ - తత్ = ఆపలలాశియొక్క - అల్పతాల్పతన్ = మఱియు మఱియు చిన్నదగుటచేతను, ఈడ్చికొని తెచ్చుటకాక = నీనోటిలోనికి బలాత్కారమున కొట్టుకొని వచ్చుటగా నున్నదిగాని, నీవు, మ్రింగుటే = మ్రింగుట యేమోగాదు (ఏకారము ప్రశ్నార్థకము).

ప్రళయకాలమందు నీవు నీతిమింగిలమూర్తిని అపరిమేయముగా అవలీలగా పెంచుకొన్నవాఁడవై, మహావిపులమైన నీనోట వేదచోరకుఁ సాత్ముద్రరక్కసుని ఒక చిన్న చేఁపంబోలె మ్రింగుట ఎట్లుండెననఁగా - మ్రింగుటవలె నుండలేదు, వాఁడు చోరించిన వేదములైన నీయూర్పులం నీవు మహత్తరముగా పెరిఁగిన కొలందియు ప్రవాహవేగముచే హెచ్చినవై మరల నీనోరం బ్రవేశించునప్పుడు వానినిగూడ నీనోటిలోనికి కొట్టుకొనివచ్చుటగా నుండెను. వేదములు భగవంతుని తొలియూర్పులనుండి వెడలినవని పురాణములందు ప్రసిద్ధము. 'తస్మా త్తేఽపానాత్త్రయో వేదా అజాయన్త' అని శ్రుతి. - సాపహ్నవోత్ప్రేక్షాలంకారము. - 'మెయిమెయి' అనుచో 'చెద్దము' లోనగుదానియందుంబోలె ఇత్వలోపముచేప 'మెయ్మెయి' అని అయినది. - 'మేటిమగల్బలంబెడలి మెయ్మెయి మార్కొనలేక పాఱినన్' ఇత్యాది ప్రయోగములు నిర్వచనోత్తర రామాయణ భారతాదులందు కలవు.

## —* కూర్మ మూర్తి *—

మ. జలపూరప్లవమానమృణ్మయమహీసంరక్షకై గార యీ
బలె ముక్తామణిశుక్తిశంఖనికురంబం బెల్లఁ జూర్ణంబుగా
బలభిద్వజ్రసదృక్షజోపరిపరిభ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టిఘురట్టమైనకమఠస్వామి న్నినుం గొల్చెదన్. 20

జల...క్షకై - జలపూర = నీటి ప్రవాహమందు ('పూరో జలప్రవాహేస్యాద్ వ్రణసంశుద్ధి భత్స్యయోః' - మేది.) - ప్లవమాన = తేలుచున్న - మృణ్మయ = మట్టియొక్క వికారమైన - మహీ = భూమియొక్క - సంరక్షకై = కాపుదలకొఱకు, గారయీబలెన్ = గచ్చుచేయుటకో యనునట్టుగా, ముక్తా...ంబు - ముక్తామణి = ముత్తెము లనెడి మణులు - శుక్తి = ముత్తెపుఁజిప్పలు - శంఖ = సంకులు (అను వీనియొక్క) - నికురంబంబు - సమూహము ('స్త్రియాం తు సంహతి

ర్భృన్దం నికరమ్బం కదమ్బకమ్' అమ.), ఎల్లన్ - సమస్తమును, చూర్ణంబుగాన్ = నున్నమగునట్లుగా ('చూర్ణో ధూళౌ క్షారభేదే' మేది.), బల...ము - బలభిత్ = ఇంద్రునియొక్క - వజ్ర=వజ్రాయుధములో - సదృక్ = సమానమైన - నిజఉపరి = తనపైభాగమందు - పరిభ్రామ్యత్ = తిరుగుచున్న - మహత్ = గొప్పదైన - మందరాచల=మందరపర్వతములోడి - సంఘృష్టి= ఒరయికకు, - ఘరట్టము = (క్రింది) తిరుగలి ('గోధూమాదిపేషణ పాషాణో ఘరట్టః' అని నైషధవ్యాఖ్య.) - ఐన - కమఠస్వామిన్ = తాఁబేటి దొరను ('కూర్మే కమఠ కచ్ఛపౌ' అమ. 'స్వామీ ప్రభువిశాఖయోః' మేది.) నిను, కొల్చెదన్.

సాగరమథనకాలమందు ఆదికూర్మము వీఁపుపై మందరపర్వతము తిరుగుడువడుచుండుటయు వానినడుమ ముత్తెములు ముత్తెపుంజిప్పలు శంఖములును నున్నమువలె నలిగిపోవుటయుంజూడఁగా నెట్లుండె ననఁగా, మట్టి మొత్తమయినభూమి నీటివెల్లిలో తేలుచుండుటచేత దినదినమునకు వాని కరఁగి పోవునే యని, స్థిత్యధికృతుఁడవైన నీవు శంకించినవాఁడవై, అట్లు కరంగనీక కాపాడుటకై భూమికి గారపూయుటకై, ఓస్వామీ, నీవు, కమఠరూపివై వజ్రాయుధమువలె కఠినమైన నీ వీఁపును క్రింది తిరుగలిగా నుంచి మందరమును పైతిరుగలిగా చేసి ఆముక్తాశుక్తి శంఖములను నున్నముగా నూరించుచున్నావో యనునట్లుండెను. - ఉత్ప్రేక్ష.

ముక్తాశుక్తిశంఖములు నున్నమగుట ప్రసిద్ధము. 'బలభిద్వజ్రసదృక్' - అంతకఠినము కాదేని అది మందరపర్వతమునకును దానియొరయికకును ఆఁగదు. తాఁబేటివీఁపుయొక్క కఠినత విదితమే. ఈపద్యమును మనువులో కలదు.

—* వ రా హ మూ ర్తి *—

చ. ఒకమఱి బుడ్డగింప విలయోదకము ల్పయి కుబ్బి, చిప్ప ప్ర
చ్చుకొని, మహాభ్రవీథిఁ జన, సూకరత న్మెయి పెంచి, వెండి క్రిం
దికిఁ గయివ్రాలు తత్సలిలనిర్మలధార నదఃపరస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమునె బంగరు ముంగఱఁగా నొనర్పవే. 21

(స్వామీ నీవు) - సూకరతన్ = వరాహత్వమందు - మెయి = శరీరమును, పెంచి, ఒకమఱి = ఒక్కమాఱు, బుడ్డగింపన్ = ముట్టెతో కెళ్లగింపఁగా, విలయోదకముల్ = ప్రళయజలములు, పయికిన్, ఉబ్బి = లేచి, చిప్ప = బ్రహ్మాండపు గుల్లను, ప్రచ్చుకొని = దుస్సి, మహాభ్రవీథిన్=ఆవెలుపలియాకాశమార్గమందు, ('అభ్రం మేఘే చ గగనే ధామభేదే చ కాఞ్చనే' మేది.), చనన్ = పోఁగాను, వెండి = మరల, క్రిందికిన్, క...రన్ - కయివ్రాలు = వంపుగా వాలిపడుచున్న - తత్ సలిల నిర్మలధారన్=ఆనీటియొక్క స్వచ్ఛమైన పడుచున్న పరంపరచేత ('సలిలం కమలం జలమ్' అమ.- 'ధారా పూః కాపి సేనాగ్రం పతదమ్బ్వాది సంతతిః' నానా.), అ...కిన్ - అదః=బ్రహ్మాండముకంటె - పర=అవలిదై - స్ఫురత్=ప్రకాశించుచున్న - ప్రకృతికిన్ = మాయకు, ఈయజాండమునె = ఈబ్రహ్మాండమునే, బంగరు ముంగఱగాన్ = బంగారపు ముక్కఱగా, ఒనర్పవే = చేసితివిగదా.

భగవంతుఁడు వరాహావతారమందు దేహమును మహత్తరముగా పెంచుకొని ప్రళయంపు నీటివెల్లిని ఒకమాఱు ముట్టెతో పొడిచి యెగమీటఁగా, ఆనీళ్లు ఆమీటినవేగముచేత మీఁది

బ్రహ్మాండపుగుల్లను దున్ని పైకి ఎగసి వంగి క్రిందికి పడుచున్నప్పుడు, ఆ తేటనీటి ధారతోడి యీ బ్రహ్మాండము సకలసృష్టికిం గారణభూతురాలై దానికి వెలిగానున్న ప్రకృతికాంతకు భగవంతుఁడు చేయించిపెట్టిన బంగారపు ముంగఱయో యన నొప్పుచుండెను.- ఉత్ప్రేక్షాలంకారము. అతిశయోక్త్యనుప్రాణితము.

ఇట 'ముంగఱ' అనునది - సన్నపాటి బంగారపుఁగాఁడకు కాఁడ కనఁబడనియట్లుగా సన్నముత్తెములు గ్రుచ్చి నడుమ పెద్దబంగారపుఁ బూసను గ్రుచ్చినదిగా నుద్దేశింపఁబడినది. 'నిర్మలధార, అనుటచేత సన్నముత్తెములు గ్రుచ్చినది యని లభించుచున్నది. కాఁడకుం బూసకుం జేర్చియు ముంగఱ యని వ్యవహారము; ప్రాధాన్యముచేత పూసకు మాత్రమె ఆవ్యవహారము కలదు.—'అధర మాధుర్య భిక్షాగతం బగుసుధా ఘుటికనా ముంగఱ కదురుపఱిచి' - శృం. నై. బంగరుకాఁడకు ముత్తెములు గ్రువ్వకయే పెద్దపూసగామాత్రము ఒకపెద్ద ముత్తెముం గ్రుచ్చుటయుం గలదు. ఇట బంగరుపూసగా చెప్పుటకుం గారణ మే మన బ్రహ్మాండము బంగారుగ్రుడ్డు-

'అప ఏవ ససర్జాదౌ, తాసు వీర్య మపాసృజత్,
త దణ్డ మభవ ద్ధైమం, సహస్రాంశు సమప్రభమ్.' మనుస్మృతి.

'బుడ్డగించుట' వరాహచేష్ట - దానిని భగవంతుఁడు కావించుట ప్రళయజలమును తీర్చి భూమిని రక్షించుటకు. వశీకృతయైనభగవంతుని కాంతునిఁ గాను, ప్రకృతిని తత్కాంతఁగాను, భావించుట ప్రసిద్ధము; కాంతుఁడు కాంతకు నగలుచేయించి పెట్టుటయుం బ్రసిద్ధమే. 'మెయివెంచి'- ఒకమాఱు బుడ్డగించినమాత్రాన ప్రళయజలమెల్ల ఎరిగిపోవునంతటి మహత్తరరూపమును వరాహభగవంతుఁడు దాల్చె నని భావము. - 'బుడ్డగించుట' - బుడ్డవలె అనఁగా తోరంపుముత్తముగా లేచునట్లు పొడిచి యెత్తుట. - 'మహత్' అనుటచే బ్రహ్మాండమునకు లోనిదైన యాకాశము గాదు, వెలుపలిది అని భావము. మనువులోని సూకరావతారవర్ణనము దీనింబోలియున్నది.

## —* నృసింహమూర్తి *—

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్గామదీ
ర్ఘసటాఘాటముఁ బెల్లగించుగతి నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జు సితక్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. 22

మర్త్యపంచాననా = ఓనరసింహా - ('మనుష్యా మానుషా మర్త్యా మనుజా మానవా నరాః' - 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యః' - అమ.), అసు...యన్ - అసురేంద్ర = దానవ రాజయిన హిరణ్యకశిపునియొక్క - ఆశయ = హృదయ మనెడు ('ఆశయా స్థాన తాత్పర్యే' నానా.- లక్షణచేత తాత్పర్యస్థాన మగు హృదయమును చెప్పుచున్నది) - కుండికా = కుండమునందలి ('కుణ్డం పిఠరే తోయాధారవిశేషేచ వహ్నిగర్తేచ' - నానా.) - అచ్ఛ = తేటయయిన - రుధిర = నెత్తుటియందు - వ్యాప్త = పర్వియున్న - స్వక = తనదైన ('స్వో జ్ఞాతా వాత్మని స్వం త్రి ష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అమ. స్వైవస్వకా.) - ఛాయన్ = ప్రతిబింబమును ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.) - కాంచి = చూచి, స...ష్టన్ - సముద్యత్ = (తన) మీఁదికి వచ్చుచున్న - ప్రతిసింహ = వైరిసింహమనెడి-మత్సర = క్రోధముతో ('మత్సరా

మక్షికాయాం స్యాన్మాత్సర్య క్రోధయోః పుమాన్' మేది.) - మిళత్ = కూడుకొన్న, చేష్టన్ = వ్యాపారముగా, త...ము - తత్ = ఆప్రతిసింహముయొక్క - ఉద్ధత = ఉత్కటమయిన - దీర్ఘ = నిడుదలైన - సటా = జూలుయొక్క ('సటా జటా కేసరయోః' మేది.) - ఘాటమున్ = సమూహమును, పెల్లగించుగతిన్ = పెఱికివైచురీతిగా, అం...ణిన్ అంత్ర = ప్రేవులయొక్క ('అన్త్రం పురీతత్' అమ.) - శ్రేణిన్ = వరుసను, కిన్కన్ = కోపముతో వె...లు - వెరంజు = జవురుకొనుచున్న - సిత = తెల్లని - క్రూర = కఠినమైన ('క్రూరా నృశంస ఘోరోష్ణ కఠినాః' హైమ.) - భవత్ నఖ = నీగోళ్లయొక్క, అవళులు = పంక్తులు ('వీథ్యాళి రావళిః పఙ్క్తిః' అమ.) - ప్రోచున్ = (మమ్ము) రక్షించునుగాక.

నరసింహమూర్తి హిరణ్యకశిపునిగుండియం జీల్చి, ప్రేవులం బెల్లగించివైచుట యెట్లుండె ననఁగా, విశాలమును లోఁతు నయిన భగవంతునిచేష్టచేత చర్మాదిరూపయిన పైకప్పు ఎడలిన యాతని యాహృదయము ఒకనెత్తుటి కుండ అనునట్లుగా నుండెను; అందునుండి భగవంతుఁడు అంత్రములం బెకలించి వైచుట, అందు తన ప్రతిబింబమునే తాఁగాంచి, అది తనకు వైరి సింహమనియు తనమీఁదికి దుముక నుంకించుచున్నదనియు భ్రమిసి దానిజూలును తాఁ బెకలించుట యనునట్లుగా నుండెను.

'కుండిక' యనుటచే హృదయముయొక్క విరివియు పెల్లును లోఁతును నెత్తుటిపెక్కువయు వానిచే అసురుని మహాబలాఢ్యతయు తెలియుచున్నవి. - 'అచ్ఛ' అనుట ఛాయాసిద్ధికి. - 'సముద్యత్' - తాను అరుధిరమున కభిముఖుమైనప్పుడు తనఛాయ తన కభిముఖ మగును. తా నెట్లు చేష్టించిన నదియునట్లే చేష్టించును. - 'సిత' - ఉత్తరకాయము సింహమగుటచేత; నరుఁడుగానే యుండిన ఎఱుపుగలిగి యుండును. 'క్రూర'తయు సింహముగోళ్లగుటచేత. - ఉత్ప్రేక్ష - భ్రాంతిమ దనుప్రాణితము.

ఉ. మునుము న్దెల్పును, దూఱఁదూఱ మఱి కెంపు, న్వెండియుం దూఱఁ గం
దనగాయం గలనల్పుఁ, దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁ డుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీతేజముం
గొను లీల న్విదళింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ. 23

మిథ్యాహరీ = ఓమాయాసింహమా ('మృషా మిథ్యా చ వితథే' - 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః' అమ.), మునుమున్ = మొదలమొదల, తెల్పును, మఱి = అనంతరము, తూఱఁదూఱన్ = చొచ్చినకొలందియు, కెంపున్ = ఎఱుపును, వెండియున్ తూఱన్ = ఇంకనుం జొచ్చి పోఁగా, కందనగాయున్ = గుండెకాయయందు, కల (=ఉన్నట్టి), నల్పును, తోఁపన్ = అగపడుచుండఁగా, విక్రమంబునన్ = పరాక్రమముచేత, వాఁడు=ఆహిరణ్యకశిపుఁడు, ఉగ్రతన్ = భయంకరత్వముచేత, కొ...మున్ - కొన్నయట్టి = అపహరించిన - విలసత్ = ఒప్పుచున్న - మూర్తిత్రయీ - ముమ్మూర్తులయొక్క (బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యొక్క - 'త్రయీ త్రివేద్యాం త్రితయే పురన్ధ్య్రాం సుమతావపి' హైమ.)- తేజమున్ = తేజస్సులను, కొనులీలన్ = మరలఁ బుచ్చుకొనుచున్నవో యనునట్లుగా, నఖకోణశ్రేణిచేన్ = గోటినదుల వరుసతో ('కోణోఽశ్రౌ లగుడే ర్కజే' నానా.), అ...త్తిన్ - అసుర = ఆదానవునియొక్క -

వక్షోభిత్తిన్ = గోడవంటిదైన, ఱొమ్మును - ('భిత్తిః స్త్రీ కుడ్యమ్' అమ.), విదళింపవే = చీల్చితివిగదా.

ఱొమ్ముం జీల్చునపుడు తోలుత చర్మపుంగోత తెల్లఁగాను, దానివెంబడిమాంసము ఎఱ్ఱఁగాను, దానివెంబడి గుండెకాయ నల్లగాను, ఉండును గావున, నరసింహమూర్తి హిరణ్యకశిపుని ఱొమ్ముగోడను చీల్చినప్పుడు ఆవరుసను అవర్ణములు అగపడుట యెట్లుండె ననఁగా - ఆరక్కసుఁడు విక్రాంతుఁడై ఔద్ధత్యముచేత హరించి తనయం దిముడ్చుకొన్నవానిని - తెల్లని శివతేజమును, ఎఱ్ఱని బ్రహ్మతేజమును - మరల గోటికొనలచే కైకొనుటయోయన నొప్పారెను. - ఉత్ప్రేక్షాలంకారము.

—* వామనమూర్తి *—

మ. బలిదైతేయభయాంధకారభరితబ్రహ్మాండగేహంబులోఁ
పలఁ బై మండెడితత్ప్రతాపమయదీపజ్వాల డింద, న్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయునుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గలనీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా ! 24

వామనా, బలి...పలన్ - బలి = బలిచక్రవర్తి యనెడు - దైతేయ = అసురునివలన, ('అసురా దైత్య దైతేయ దను జేన్ద్రారి దానవాః' అమ.) - భయ = వెఱపనెడి - అంధకార = చీకటిచేత - భరిత = నిండిన - బ్రహ్మాండ = బ్రహ్మాండ మనెడి - గేహంబులోపలన్ = ఇంటియందు, పైన్ = ఊర్ధ్వభాగమందు, మం...ల - మండెడి = వెలుఁగుచున్న, తత్ = ఆబలియొక్క - ప్రతాపమయ = తేజోరూప మయిన - దీపజ్వాల = దివ్వెమొగ్గ, డిందన్ = ఆఱిపోఁగా, కడున్ = మిక్కిలి, దలమై = దట్టమై, మింటికిన్ = ఆకాశమునకు, గ్రక్కునన్ = తటాలున, నెగ...య - నెగయు = లేచునట్టి - ఉద్యత్ = పైకిలేచి పోవుచున్న (ఆఱిపోవుచున్న) - తత్ = ఆదీపముయొక్క - మహాచ్ఛాయ = గొప్పచీకటి, నాన్ = అనునట్లుగా, కలనీలాంగమున్ = ఒప్పుచున్న నల్లనిదేహమును, శింశుమారము = మొసలియాకృతినున్న, జ్యోతిశ్చక్రమునకు - ఒరయంగాన్ = రాచుకొనునట్లు, పెంపవే = వర్ధిల్లఁ జేసితివి గదా.

ఓ వామనమూర్తీ! బ్రహ్మాండ మనెడియింటిలో బలిచక్రవర్తివలనిభయ మనెడియంధకారము నిండియుండఁగా, నీవు నల్లనిదేహమును క్రిందినుండి పైశింశుమారచక్రమువఱకును పెంచి వ్యాపించుట యెట్లుండె ననఁగా-ఆదానవుని ప్రతాపము-బ్రహ్మాండగేహములో ముల్లోకములపైని ప్రకాశించుచున్నట్టిది - ఉన్నట్టేయుండి యాఱిపోఁగా దాని క్రీనీడ పెన్జీకటియై పైకిం బర్వుట యనునట్లుగా నుండెను. వామనవిజృంభణముచేత భయాంధకారము పోయి ప్రతాపనిర్వాణాంధకారము వ్యాపించె నని భా. - రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

'శింశుమారము' - శ్రీమన్నారాయణుఁడు నక్షత్రమండలములో మొసలియాకారపునక్షత్రసంఘరూపమున యోగనిద్రం బొందుచున్నాఁడని విష్ణుపురాణ శ్రీమద్భాగవతములందు చెప్పఁబడియున్నది. 'శిశూన్ మారయతీతి శింశుమారః ... శిశువులనుచంపునది.' రూ. శిశుమారః. 'శింశుమార' అను రూపమున అనుస్వారము పృషోదరాదిత్వముచే సాధ్యము. మదీయశృంగారనైషధవ్యాఖ్య 8. (28) చూ.

—* పరశురామావతారము *—

మ. శమితక్షత్త్రకళత్త్రనేత్త్రజలవర్షావేళ నీకీర్తిహం
సము క్రౌంచస్ఫుటతావకాంబకసుషిం జాఁగంగ నీక్షించి, వ
ర్షము రా నంచలు నంద నేఁడుఁ జను నిచ్ఛ న్నాటి తచ్చేష్ట వా
యమిఁ; దిర్యక్తతి దా గతానుగతికం బౌఁగా కుఠారీ హరీ. 25

కుఠారీ హరీ = గండ్రగొడ్డలికలవాఁడ వయిన ('ద్వయోః కుఠారః స్వధితిః పరశుశ్చ పరశ్వథః' అమ.), శమి...వేళన్ - శమిత = సంహరింపఁబడిన, క్షత్త్ర = క్షత్త్రియులయొక్క, కళత్త్ర = భార్యలయొక్క ('కళత్త్రం శ్రోణి భార్యయోః' అమ) - నేత్త్రజల = అశ్రులచేతనైన ('అస్రు నేత్త్రామ్బు రోదనం చాస్ర మశ్రుచ' అమ.), వర్షావేళన్ = వర్షాకాలమందు (ఆయశ్రువులు వర్షములవలె నమితముగాఁ గురిసినందున ఆకాలమున వర్షాకాలమువలె నుండె ననుట - 'స్త్రియాంప్రావృట్ స్త్రియాంభూమ్ని వర్షాః' - అమ.) - నీకీర్తిహంసము = నీయొక్క విజయఖ్యాతి యనెడి హంస ('యశఃకీర్తిః సమజ్ఞాచ' - అమ.), క్రౌం...షిన్ - క్రౌంచ = క్రౌంచపర్వతమునందు - స్ఫుట = స్పష్టమయిన, తావక = నీదైన, అంబకసుషిన్ = బాణంపు రంధ్రమునందు ('రన్ధ్రం శ్వభ్రం వపా సుషిః' అమ.), చాఁగంగన్ = ఏఁగఁగా, ఈక్షించి = చూచి, వర్షము రాన్ = వానవచ్చినప్పుడు. ('వృష్టిర్వర్షమ్' - అమ.) - అంచలు = హంసలు, ఇచ్ఛన్ = మనస్సునందు, - తత్ = ఆకీర్తిహంసయొక్క - చేష్ట = క్రౌంచ రంధ్రమార్గగమన వ్యాపారము, నాటి = పాదుకొని (అనఁగా స్వాభావికమై), పాయమిన్ = వదలిపోకుండుట చేత, అంద = ఆదారినే, నేఁడున్ = ఇప్పటికిని, చనున్ = పోవుచున్నవి. తిర్యక్తతి - తిర్యక్ = కడుపును నేలపై పెట్టుకొని చరించు (నవైన పశుపక్ష్యాది) జంతువులయొక్క, తతి = సమూహము, తాను, గతానుగతికంబు = పోయినదానివెంబడిం బోవునది, హౌఁగా = అగునుగదా.

ధనుర్విద్యలో శివశిష్యుఁడైన పరశురాముఁడు తనసహాధ్యాయియు శివపుత్త్రుఁడును ఐన కుమారస్వామితోడి పందెములో, క్రౌంచమనుపర్వతమును ఒక్కబాణమున తూఁటుపడ చేసెను. ఆతూఁటువలన అతని కోదండవిద్యాపాండిత్యకీర్తి వ్యాపించుటను కవి ఇట కీర్తిహంసము ఆరంధ్రముదారిని నిర్గమించుటగా వర్ణించినాఁడు; హంస తెలుపుగావునను - 'మాలిన్యంవ్యోమ్ని పాపే యశసి ధవళతా వర్ణ్యతే హాసకీర్త్యోః' - సా. ద. అను కవిసమయముంబట్టి, కీర్తియు తెలుపుగావున కీర్తినిహంసగాఁ జెప్పుట. - ('జలధర సమయే మానసంయాన్తి హంసాః' సా. ద.-అనఁగా - 'వర్షాకాలమందు హంసలు మానససరోవరమునకుం బోవును' అనియు, కవిసమయము; - 'వీరః క్రౌఞ్చస్య భేదాత్కృతధరణితలాపూర్వహంసావతారః'' మహావీర. - ''హంసద్వారం భృగుపతియశోవర్త్మయత్ క్రౌఞ్చరన్ధ్రమ్'' మేఘసం. - ఇత్యాదివ్యవహారముచేత హంసములు క్రౌంచరంధ్రము మార్గముగా రాకపోకలు గావించుననియు కవిసమయము. - వీని నెల్ల నిట ననుసంధింపవలయును.) 'ఓపరశురామమూర్తీ, తిర్యగ్జంతువులు స్వతంత్రమార్గముల నవలంబింపక, పోయినదానివెంబడినే పోవునవి, అట్లే మున్ను నీకుఠారముచే నిహతులయినరాజన్యులకై తద్భార్యలు వెల్లుగా నేడ్వఁగాఁ గల్గినతదీయబాష్ప ధారావర్షములు గురియుచుండినకాలమనెడు వర్షాకాలమందు నీకీర్తిహంస క్రౌంచరంధ్రమార్గమున వెడలుటంబట్టి హంసజాతి యిప్పటికిని

వానలు రాఁగానే ఆక్రౌంచరంధ్రమార్గముననే చనుచున్నవి. ఓస్వామీ; నీవుబాల్యముననే లోకోత్తరమహావీరుఁడవై పిమ్మట దుష్టక్షత్రియ సంహారముంగావించినదేవుఁడవు; కావున నినుఁ గొల్చెదను' - అనిసారాంశము - రూపకానుప్రాణితమైన హేతూత్ప్రేక్షయు సామాన్యముచే విశేష సమర్థన రూపమయిన యర్థాంతరన్యాసంబునుం గలవు.

వర్షాశబ్దము ఆ. స్త్రీ. నిత్యబ. వర్షర్తువాచకము; వర్షశబ్దము. అ. నపుం. వానకు వాచకము; మాంసము - రూ. మాంస. కా - కళ. అవ్య. కదార్థకము.

—* శ్రీ రా మా వ తా ర ము *—

మ. పవిధారాపతనంబుఁ గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా; సప్తసా
లవిభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగు న్సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. 26

రఘుకులస్వామీ = రఘువంశప్రభూ, రమావల్లభా = లక్ష్మీకాంతుఁడా (శ్రీరాముఁడా యనుట), ప ... బున్ = పవి = వజ్రాయుధముయొక్క - ధారా = వాదరయొక్క - పతనంబున్ = పాటును (వ్రేటు ననుట), కై ...లన్ - కైకొనని=సరకుసేయని (మైకి విశేషణము) - ఆపౌలస్త్యు = ఆరావణునియొక్క - మై = దేహముయొక్క - సప్తధాతువులన్ = వస (= కడుపులో బొడ్డుక్రింద ఉల్లి పొరవలెనుండు క్రొవ్వు) నెత్తురు మాంసము ఎముకలోని నేయి ఎముక మెదడు శుక్రము అనెడు ఏడుధాతువులను - (సకలదేహమును అనుట), దూఱుపరిశ్రమంబునకున్ = చొచ్చెడు నలవాటునకు, ఉద్యోగించెన్ నాన్ = దొరంకొనెనో యనునట్లుగా, స... బు - సప్త = ఏడైన - తాళ = (తాటి) చెట్లయొక్క - విభేదంబు = చీల్చుటను, ఒనరించి = జేసి, నిల్వక, సలీలన్ = క్రీడగా, చన్న...స్త్రంబు - చన్న = పోయిన - యుష్మత్ = నీయొక్క - మరుత్ = గాలివలె జవన=వడిగలదైన - అస్త్రంబు=బాణము, సిరుల్ =సంపదలను, ఒసఁగున్ = ఇచ్చును గాక.

రఘువంశమున శ్రీరాముఁడవుగా అవతరించిన యోమాధవా, ఇంద్రుని వజ్రాయుధంపు వాదరలపెట్టును సరకుకొనని దైన యారావణాసురునిదేహమందలి సప్తధాతువులను చొచ్చి చీల్చెడునేర్పును ముందుగా అలవాటు సేసికొనుచున్నదో యనునట్లుగా ఏడుతాటిచెట్లను ఒక్కుమ్మడి దుస్సి అటునిలువక వడిగా వెలువడిన నీవాయువేగి బాణము సంపదల నిచ్చుఁగాక.

ఇట కిష్కింధాకాండములోని యీకథ ననుసంధించుకొనవలయును. - వాలిం గూల్చి సుగ్రీవునికి కపిరాజ్య మొసంగఁగల మహావీరుఁ డని శ్రీరామునితో సఖ్యము చేయింప ఆంజనేయుఁడు యత్నింపఁగా, సుగ్రీవుఁడు రాముని బలమందు సందేహము గొన్నవాఁడై 'ఈయున ఇవిగో ఈయేడు తాటిచెట్లను ఒక్కబాణహతిం గూల్చినచో వాలిం గూల్చుపాటి బల్లిదుఁ డని నమ్మెద' నని చెప్పఁగా, శ్రీరాముఁడు అట్లే అతనితార్కాణకై ఒకటే అలుగువ్రేటున ఆయేడు తాళములను గూల్చెను. ఆబాణము వానియందు నిలువక ఉచ్చి పాటి రసాతలమంటివచ్చి యాతని యంపపొదిం జొచ్చెను. సుగ్రీవునికి సిరులిచ్చుటయే భక్తులకెల్ల నిచ్చు ననుటకు తార్కాణము. ఉపాయము ఉపేయమునకు కొఱవడం గూడదు గావున, ఏడుధాతువులను దూయునదై ఏడు

తాళములను దూయుట; రామబాణము అతిపవి యనుట; రావణునిం జంకలో నుంచుకొని జపముసేయువానిని గొట్టఁగలదైన బాణము ఆరావణుం గూల్చుటలో సందేహమా అని యానుషంగికము. 'సలీలక్' అనుటచే భోగవత్యవగాహము సూచితము.

పులస్త్యునియొక్క గోత్రాపత్యము పౌలస్త్యుఁడు. 'వసాసృఙ్మాంసమజ్జాస్థి మేదశ్శుక్రాణి ధాతవః.' భావప్రకాశము. ఇప్పద్యము మూఁడవ పాదములోని దుష్టయతితప్పు కడమయెల్ల మను చరిత్రములోనిదే [6-110]; 'సలీలక్' అనుట యతిని సరిపఱుచుటకు. (చూ. పీఠిక, 'వెసం జన్నట్టి' పూ. ము. పా.)...ఉత్ప్రేక్షాలంకారము.

సీ. (1) స్యందనస్థితబిడౌజఃక్షత్తృజాడ్యకృ
ఝ్ఝంఝామరుద్గరుజ్ఝాత్కృతములు,
(2) క్రవ్యాశిరాడ్గాత్రకనదసృగ్గాహన
స్ఫుటశల్యహవ్యభుఙ్ఘాత్కృతములు,
(3) యోధవర్మితహృత్పుటోత్క్రాంతనిజపాత
సాలాశ్మకృతముహుఠ్ఠాత్కృతములు,
(4) పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తి
భుగ్నభోగఫణీంద్రఫూత్కృతములు,
తే. శ్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు,
దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు,
కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
ణాంబరచలత్కలంబకదంబకములు. 27

1. [దేవా = ఓ స్వామీ (శ్రీరామా)] - స్యం...లు - స్యందన = తేరియందు, స్థిత = ఉన్నట్టి, బిడౌజఃక్షత్తృ = ఇంద్రసారథి (యైన యామాతలి)కి - జాడ్య = జడిమను (జడతను - బమ్మెరను) - కృత్ = చేయునట్టి - ఝంఝా = తుపానువంటి - మరుత్ = గాలిగలదైన - గరుత్ = ఱెక్కలయొక్క, ఝాత్కృతములు = ఝాత్కారము అనఁగా ఝాత్ అనెడు మ్రోఁత గలవియు;

2. క్ర...లు - క్రవ్యాశి = రాక్షసులయొక్క - రాట్ = ప్రభువయిన రావణుని యొక్క - గాత్ర = దేహమందు - కనత్ = వెలుంగుచున్న - అసృక్ = నెత్తుటిని - గాహన = చొచ్చుటచేత - స్ఫుట = స్పష్టమయిన - శల్య = అలుఁగుల - హవ్యభుక్ = నిప్పుయొక్క - ఘాత్కృతములు - ఘాత్ ఘాత్ అనెడు మ్రోఁతగలవియు;

3. యోధ = జోదులయొక్క - వర్మిత = కవచముగలిగిన - హృత్ = గుండియల - పుట = సంపుటమునుండి - ఉత్క్రాంత = దుస్సిన - నిజ = తమయొక్క (= తాము) - పాత = పాటు చేత (= పడుటచేత) సాల = ప్రాకారముయొక్క - అశ్మ = ఱాలయందు - కృత = చేయఁబడిన - ముహుః = తఱచైన - ఠాత్కృతములు = ఠాత్ అనుశబ్దముకలవి;

4. ప...లు - పతిత = కూలిన - ఉగ్ర = భయంకరములైన - రక్షఃకబంధ = రాక్షసుల మొండెములయొక్క - భార = బరువుచేతనైన - భృశ = మిక్కుటమైన - ఆర్తి = పీడచేత -

భుగ్న = వంగిన - భోగ = పడగలుగల - ఫణీంద్ర = శేషాహియొక్క - ఫూత్కృతములు = ఫూత్ అనెడు ధ్వనులు (బుసలు) కలవియు__

శ్రాం...లు - శ్రాంత = డస్సిన - రథ్య = తేరి గుఱ్ఱములకు - నిరంతర = దట్టము లయిన తరుయొక్క - ఛాయ = నీడను - దములు = ఇచ్చునవియు, (వైన) - తా...లు - తావక = నీయొక్క - కార్ముక = వింటినుండి - ఉత్ప్రేరితములు = ప్రయోగింపఁ బడినట్టివి. లం...లు - లంకా = లంకయనెడి - పుర = పట్టణముయొక్క - అంగణ = ముంగిటియొక్క - అంబర = ఆకాశమందు - చలత్ = సంచరించుచున్న - కలంబ = బాణములయొక్క, కదంబకములు - సమూహములు, కలుషములు = పాపములను, అడంచుఁగాతక = పోఁగొట్టునుగాక.

రామ రావణయుద్ధమందు రావణునితోఁ బోరుటకై శ్రీరాములవారికి దేవేంద్రుఁడు తన రథమును తనసారథి మాతలి వశమునం బంపెను. అందుండి శ్రీరాములవారు పోరుచుండిరి. అప్పుడు వారివింటినుండి ప్రయోగింపఁబడిన బాణపరంపర లెట్లుండె ననఁగా - బాణములకు పిడికడ ఱెక్కలు కట్టుదురు. ఆకాశములో ఆబాణములు రైయని పోవునప్పుడు ఝుంఝూమారుతములం బోలిన యాఱెక్కఝూత్కారములచేత రథము తోలుచున్న మాతలికి చెవులు గింగురు మని బుదికి జడత సంభవించెను. ఆబాణముల యలుగులనుండి ఆకసమున గాలితోడి రొరయికచేత పొడమిన యగ్నిజ్వాలలు రావణాసురుని నెత్తుటం జొచ్చి, చుంయిచుంయి అని స్ఫుటముగా శబ్దించుచుండెను. జోదుల మైమఱువుతోడి హృదయములను భేదించుకొని అవలికి దుస్సి ప్రహారిలోని శిలలకుం దగిలి- ఠాత్ ఠాత్ అని మాటిమాటికి మ్రోఁగుచుండినవి. చలించుచున్నట్టే ఉండి భయంకరపు రక్కసిమొండెములు నేలం జాఁపకట్టుగాఁ బడఁగా ఆభారమునకుఁనొప్పిఁ జెంది పడగలు క్రుంగి ఆదిశేషుఁడు పెల్లుగా బుసకొట్టుచుండెను. ఆపోరాటపు హుటాహుటి పరువులలో బడలనీయక తేరిగుఱ్ఱములకు ఆబాణములు క్రిక్కిఱిసిన తమ నీడల నొసంగుచుండినవి. అట్లు లంకాపట్టణంపు ముంగిటి యాకాశంబున చరించుచున్న యాబాణపరంపరలు పాపములను పోఁగొట్టునుగాక. అట్టి యారక్కసులను, వారి జేనిని గూల్చినట్టివి గావున తప్పక కలుషములనుగూడఁ గూల్చునని సూచన.

పా. 'బుభుక్షుక్షత్త్ర' - ఈపాఠమును హృద్యమే - 'బుభుక్షు' శబ్దము ఇంద్రవాచకము అకారాంతము కలదు. 'క్షత్త్ర' - 'క్షత్తా స్యా త్సారథౌ ద్వాస్థే క్షత్త్రియాయాం చ శూద్రజే' అమ. 'ఝుంఝామరుత్' - ఝుంఝుమంటి గాలిగలవి అని గరుత్తులకు విశేషణము. ఇందలి సీసపాదములు బహువ్రీహులు, కదంబకములకు విశేషణములు. 'ఛాయదములు' - ఇందు ఛాయా శబ్దమున హ్రస్వ మెట్లయినది? 'ఇక్షుచ్ఛాయ నిషాదిన్యః' ఇత్యాది ప్రయోగంబు లందుంబోలె నిరంతరములయొక్క ఛాయ = నిరంతరచ్ఛాయము - అని షష్ఠీసమాసముగా గ్రహింపవలయు__

'షష్ఠ్యన్త ప్రాక్పదా స్సేనా చ్ఛాయా శాలా సురానిశాః
స్యు ర్వా నృసేనం శ్వనిశం గోశాల మితరే చ దిక్.' అమ.
'విభాషా సేనా సురా చ్ఛాయా నిశానామ్' సూ.

మఱియు-

'ఆధారి పద్మేషు తదఙ్ఘ్రిణా ఘృణా । క్వ తచ్ఛయచ్ఛాయలవోఽపి పల్లవే.' నైష.

'తస్య నలస్య శయో హస్తః తస్యచ్ఛాయా తచ్ఛయచ్ఛాయం తస్యలవో లేశః...'తచ్ఛయచ్ఛాయ' ఇతి 'విభాషాసేనా' ఇత్యాదినా నపుంసకత్వమ్' అని నారాయణటీక.

ఏతత్సదృశ వర్ణనము. మాఘకావ్యము 20 (16).

'వినివారితభానుతాప మేకం సకలస్యాపి మురద్విషో బలస్య
శరజాల మయం సమం సమస్తా దురుపద్మేవ నరాధిపేన తేనే.'

'పతితోగ్రరక్షః కబంధ' – ఇటువిమ్మట భారాతిశయమును చెప్పినందున ఈయుగ్రతను మహాకాయతచేతం గలిగినదానినిగానే ఎన్నుట యొప్పును గావున 'ఉగ్ర' అనుటకుమాఱు 'ఉరు' అని పఠించుట మెఱుఁగుగాఁ దోఁచెడిని. 'ఊర్ధ్వ' యని పఠింతుమేని బాణములచే పైకి చిమ్మఁబడిన మొండెము లనిగాని, మింటనుండియే పోరువారి తలదెగి క్రిందపడుచున్న మొండెము లనియేని యర్థమగును. ఆపక్షమున క్రొత్తబరువు తటాలునంబడుటయు అందువలన శేషునికి తటాలున తలలకు దెబ్బ మెడకు విఱుపును సంభవించుటయు ఒప్పారును. 'వర్తిత' – అనుటచేత ముందు ఉక్కుజీరాను చించుకొని తర్వాత పుటము (అనఁగా డొప్ప) వంటి గుండెను భేదించి తర్వాత మరల జీరాను భేదించి తర్వాత ప్రహరిపణఁకులకు తగిలి పెనుతాత్కారము చేయునంతటి విసరు గలది అని బాణప్రయోగ బలాతిశయ వర్ణనపరము. మాతలికి 'జాడ్యకృత్' అనుటచేత ఇంద్రుని యుద్ధములలో ఇట్టి శరపరంపరా ప్రయోగములను ఆయన యెఱుంగఁ డని సూచితము.– 'ఝుంఝూ' సాదృశ్యముచేత ఆకాశమెల్ల అట్లు మ్రోఁగుచుండెననుట.

## —* బలరామావతారము *—

చ. 'క్షితి హాలకృష్టిఁ బుట్టి యడఁగెన్ క్షితియందునె సీత' యంచుఁ ద
త్సతి విరహార్తిఁ బాండిమముఁ దాలిచి రామశరీర మెత్తి, యా
క్షితిఖననక్రియ న్మగుడఁ జెందఁగఁ గాక, కళిందజాతటిన్
క్షితి దున నేటికి న్హలమ చేఁగొని నీకవశాత్మత న్హలీ? 28

హలీ=ఓ బలరామస్వామీ, సీత = జానకి, క్షితిన్ = భూమినుండి, హాలకృష్టిన్ = హాల = నాఁగటి చేతనైన - కృష్టిన్ = దుక్కిచేత, పుట్టి = జనించి, క్షితియందునె = భూమియందే, అడఁగెన్ = లయమొందెను, అంచున్ = అనెడి తలంపుఁగొన్నవాఁడవై, విరహార్తిన్ - విరహ = ఎడఁబాపుచేతనైన - ఆర్తిన్ = నెగులుచేత, పాండిమమున్ = వెల్లందనమును (పాలిపోవుటను అనుటయు), తాలిచి = ధరించి, రామశరీరము = బలరామ దేహమును (శ్రీరామదేహము ననుటయు) ఎత్తి = తాలిచి, తత్సతిన్ = ఆపతివ్రతను, ఆక్షితిఖననక్రియన్ - క్షితి = భూమిని - ఖనన=త్రవ్వుట యనెడి, ఆ=మునుపటి, క్రియన్=వ్యాపారముచేత, మగుడన్=మరల, చెందఁగఁ గాక మఱి = పొందుటకే కానియెడల, కళిందజాతటిన్=యమునయొడ్డున, హలమ=నాఁగటినే, చేన్=చేతియందు, కొని = గ్రహించి, నీవున్, అవశాత్మతన్ - అవశ = స్వాధీనముకానట్టి - ఆత్మతన్=మనస్సుకలవాఁడవై (త్రాగుడుచే ఒడలు తెలియనివాఁడవై అనుట; గట్టిపూనిక కలవాఁడవై యనుటయు), క్షితిన్ = భూమిని - దున నేటికిన్ = ఏల దున్నవలసివచ్చినది.

పూర్వము జనకమహారాజు జన్నముసేయువాఁడై అందులకై శాలనిర్మించుటకై భూమిని దున్నింపఁగా నాఁగేటిచాలులో నొక కన్నియ దొరకెను. నాఁగేటిచాలునకు సీత యనిపేరు.

గావున అందుపుట్టినందున ఆమెకు సీత యని పేరుపెట్టిరి. ఆమె పిమ్మట శ్రీరామునికి భార్యయై భూమియందే లయమొందెను. - నారాయణుని పదియవతారములలో శ్రీరామావతారమునకు వెంబడిది బలరామావతారము. బలరాముఁడు తెల్లనివాఁడు, ఆయనకు నాఁగలి ముఖ్యాయుధము, ఆయన సురాపానపరాయణుఁడును. సాంబుఁడను కృష్ణపుత్త్రుఁడు సుయోధనునికూఁతును లక్షణ యనుదానిని హస్తినాపురినుండి బలసాహసంబులంజేసి యెత్తుకొని పోవుచుండెను. దానిం గని కౌరవులు వెంటనంటి పట్టితెచ్చి చెఱం బెట్టిరి. వానిని విడిపించుకొని వచ్చువాఁడై బలరాముఁడు హస్తినాపురంబున కరిగి వారిని నెయ్యంబున నడుగ వారు కయ్యంబునకే కడంగిరి. బలరాముఁడు వారిని దండించువాఁడై కరిపురిని గడ్డగానే యమునలోనికిం ద్రోయుటకై నాఁగటికఱ్ఱు గ్రుచ్చి యీడ్చెను. ఊరు ఒడ్డగెడవై పౌరులు ఘోషిల్ల భీష్మాదులు వడిం జనుదెంచి బలునిపాదములకుం డ్రెళ్లి వస్తువాహనాదిసత్కారపూర్వకంబుగా లక్షణా సాంబులను దెచ్చి ఆయన కప్పగించి తదనుగ్రహంబు వడసిరి. - ఈకథల నిట అనుసంధానము సేసికొనవలయును.

ఇట ఈతనిపాండిమ సీతావిరహపాండిమగాను, నాఁగటితో భూమిని కర్షించుట భూమిలో నడంగియున్న యీమెను వెలువరించుటకైన జతనముగాను, తానును రాముఁడగుట ఆమె రామానురక్త గావున రాముఁడు తనకై పాటుపడుటం గాంచిన ఆమె ఒప్పరికింపక తప్పక వచ్చునను తలంపుచేత ననియు, పానమత్తత విరహవైవశ్యముగాను ఉత్ప్రేక్షితములు. 'హాలమ'- ఏవకారార్థకమైన అకారము ఏల యన - ఏసాధనమున మున్ను సిద్ధిగల్గెనో ఇపుడు ఆసాధనమే యగుటకు. 'కళిందజాతట' మన నేల యనిన-పావనప్రదేశముగాన, నటనైనయెడల నాపావని సీత పాడమ నిచ్చగించును, కార్యము సిద్ధించును. అని; హాలము అనఁగా నాఁగలి, అది యాయుధ ముగాఁ గలవాఁడు గావున బలరాముఁడు 'హాలి' యనంబడెను. కళిందమని యొక పర్వతమునకుం బేరు. అందు జనించినదిగాన యమున 'కళిందజ'; 'దునక్' - దున్నన నలోపమునకు పీఠికం గనుఁడు. 'తటిక్ + క్షితి' - ఇట ద్రుతమునకు క్షితిశబ్దమందలి కకారము పరమైయున్నది; ద్రుతకార్యము వచ్చినచో - తటిక్ గ్షితి, తటింగ్షితి, తటిఁగ్షితి అను మూఁటిలో నొకరూపము వచ్చును. అంతియ కాని తటిక్ క్షితి అనురూపము ఉండదు. ఇట వ్యవస్థ యెట్లు? ఇది సంయుక్తాక్షరము - గాని వర్ణాంతరముగాదు - కావున నేవృక్షము, పక్షము, అను పదములు భగణములు. ఇందు కకార షకార ములు కలవు. ద్రుతకార్యము రావలసినదే, 'సారిదిక్షకారముఁ గూడఁగఁ। సరి నేఁబదియయ్యె వర్ణసంఖ్యధరిత్రిక్' అను ననంతునిమతము అగ్రాహ్యమనియు, ఆగమికులు క్షాను వర్ణాంతర ముగాఁ జేకొనిరి గాని అది శబ్దసరణి గాదనియు అప్పకవి తెల్పినదే సాధువు. అట్లున్నను క్షకార స్థలమున ద్రుతకార్యమురామికి శిష్టాచారమే ప్రమాణము. ఇట్టివే ఛందశ్శాస్త్రమున తత్సమము లందలి పరసవర్ణానునాసికమునకు నున్న చుట్టుట శిష్టాచారము. ఇదియు నట్టిదేయని గ్రహించుట యొప్పును. ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యంబు లగుట, అద్రుచువిద్రుచు ఇత్యాదులందు సంయోగ పరకమునకు గురుత్వము లేమియు, అను విశేషములు భాషలోఁ గలవు.

హాలి యేమి యంత తెలియనివాఁడా? అప్పుడు ఏకారణ విశేషముచేత నాఁగటి చాలున జనించెనోగాని ఇప్పుడును అట్లు జనించునా? జనింప దని అంతమాత్రము ఊహించుకొనలేఁడా? యను ప్రశ్నకు - కవి 'అవశాత్మతక్' అని యుత్తర మొసంగినాఁడు. 'కామార్తాహి ప్రకృతి

కృపణా శ్చేతనాచేతనేషు.' అను కాళిదాసోక్తికి ఇది సమానము. - 'హాలము చేకొని' - పా. 'హాలముచే మఱి.'

అట్టి దివ్యచారిత్రుఁడవు నీవు మమ్ముఁ గావుము అని భావము.

—* కృష్ణావతారము *—

ఉ. ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంతవారిధా
రాయుతచంద్రకాంతఫలకావళిబింబిత యై చెలంగ, నా
రాయణమూర్తివత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నోయదువీర, వృష్టిఁ బసి నూఱడఁ బ్రోవవె సప్తరాత్రముల్. 29

ఓ యదువీర = ఓ యాదవశ్రేష్ఠుఁడా (శ్రీకృష్ణా యనుట), ఆయ...తి - ఆయత = పొడవైన - యుష్మత్ = నీయొక్క - ఆకృతి = స్వరూపము, కరా...బిత - కర = (నీ) చేతి - అగ్ర = తుదయందలి - నగ = (గోవర్ధన) పర్వతముయొక్క - అంచల = అంచుచేత - వాంత = క్రక్కఁబడిన (అంచునుండి క్రిందికి ఉరులుచున్న - కురియుచున్న - అనుట) - వారి = నీళ్లయొక్క - ధారా = క్రిందికిపడు చాలులయొక్క - అయుత = దశసహస్రములనెడు - చంద్రకాంతశిలలయొక్క - ఫలక = పలకలయొక్క - ఆవళిన్ = వరుసయందు - బింబిత = ప్రతిబింబములుగలది, ఐ చెలంగన్ = కాఁగా, నా...చేన్ - నారాయణమూర్తిమత్ = నారాయణుని శరీరముగలదైన - కవచరత్నముచేన్ = మేలి మైమఱువుచేత (నారాయణకవచ మను పేర పాఠ్యముచేత), పరిరక్షన్ = సంరక్షణను, కాంచెన్ నాన్ = పొందినదో యనునట్లు - పసిన్ = గోగణమును సప్తరాత్రముల్ = ఏడు అహోరాత్రములు, ఊఱడన్ = సుఖముగా నుండునట్లు - ప్రోవవె = కాపాడలేదా (కాపాడితివిగదా యనుట).

గోకులంబున నందాదులు ప్రతివత్సరము ఒకనాఁడు ఇంద్రుం బూజించుచుందురు. శ్రీకృష్ణులవారు ఆయింద్రయాగసమయమున నందాదులకు ఇంద్రపూజ వల దనియు తమకును తమ గోవులకు సమస్తము నిచ్చుచున్న గోవర్ధనగిరినే పూజింప వలసిన దనియు బోధించిరి. గొల్లలందఱును వారిమాటనే నెఱవేర్చిరి. అంతట ఇంద్రుఁ డలిగి ఏడు అహోరాత్రములు వారికి సర్వనాశము కలుగునట్లు జాలతోడి గాలివాన కొట్టించుచుండెను. అంతట శ్రీకృష్ణులవారు ఆ గోవర్ధన పర్వతమును తన వ్రేలం గొడుగుంబోలె నెత్తిపట్టి దానిక్రింద గోవులను నిలిపి ఆమహావృష్టినుండి రక్షించి యింద్రుని పినతుం గావించిరి. — ఈకథ నిట అనుసంధించుకొనవలయును.

గొడుగు నంచునుండియుం బోలె ఆకొండయంచునుండి క్రిక్కిఱిసి దిగఁబాఱుచున్న వర్షధారలు సందులేకుండ ఒండొకటితోఁ గూడి శ్రీకృష్ణులవారిచుట్టును చంద్రకాంతపుటద్దముల వరుసవలె నుండుటయు, అందులో వారి ప్రతిబింబములు నారాయణునిమూర్తులవలె నుండుటయుం జూడఁగా - ఇక్కట్లు తొలంగుటకై భక్తులు నారాయణకవచమును పారాయణము సేయుట ప్రసిద్ధముగావునను, అట్లుచేయు భక్తులకు ఆనారాయణుఁడు అన్నివైపులందును తానిలిచి వారిని రక్షించుటయు ప్రసిద్ధముగావున, ఆప్రకారము ఆగోవులు నారాయణకవచమును ధరించినవో యనునట్లుండెను. - ఉత్ప్రేక్ష. - భక్తవత్సలుఁడవు మమ్ముఁ గావు మనుట.—

'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః.' మనుస్మృతి.

నారాయణుఁడు నీట నుండువాఁడు గావున నారాయణమూర్తి గలది నీరు. నారాయణసమేతమైన యానీరే కవచముగా ధరించినవో అనునట్లుగా అనియును స్వారస్యము. నారాః = నీరు, అయనమ్ = తావుగాగలవాఁడు, అను వ్యుత్పత్తి చేత కలుగుచున్నది.

'ఆయతి' - కడు నుచ్ఛ్రాయముగల తనువుం దాల్చుట తత్కరాగ్రమున నున్న గోవర్ధనము క్రింద ఆరోగ్యహర్షప్రదమయిన మిక్కుటంపుటవకాశ ముండుటకును, 'భయములేదు, రక్షింపఁగలవాఁడే' యని గొల్లలు ఊఱడిల్లుటకును. - 'కాంతి' - గౌణవృత్తియందు అతిసుందరము, అన్యత్ర గ్రామ్యకత్వావగాహి. —

'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.' దండి.

'సాకిలాశ్యానితా స్నేహ భర్తుః తత్సంశ్రుతో వరా
ఉద్వహా మేన్సనిక్తా భూర్యాలమగ్నా వివోరగా.' రఘు.

'వారిధారాయుతి' - ఇందు 'యుతి = కూడియున్న' అను ఛేదము సరిగాదు, అందువలన యతి భంగము కలిగియున్నది. ధారాశబ్దములోని రాకారమునకును 'ఫలకావళి' లోని కాకారము మీఁద యా (ఆ) వళిశబ్దాద్యకారమునకును యతిచెల్లదు; కావున ఆవ్యాఖ్య త్యక్తవ్యము. - 'ఆకృతి' స్త్రీలింగము గావున తద్విశేషణము 'బింబిత' అని తెనుఁగున పాక్షికముగా స్త్రీలింగము. 'ఆయుతి' అనుట సంఖ్యానియమమునకొఱకుం గాదు. అపరిమితత్వార్థప్రాయకము. ప్రతిబింబమూర్తులకు కనంబడుటకు వెలుతురు వలయును, మునుములో వెలుతురెక్కడిది ? అనిన - ఎంతమునుఁగియునను పగలు వెలుతురు గలదు, రాత్రులందు ఆయింద్రుఁడు కల్పించుచున్న మెఱుపుఁదీఁగలవెలుతురే మఱియు స్ఫుటముగాఁ దోఁపంపఁజేయును. - 'వీర' - 'వీరో జనే ధరేశ్రేష్ఠే' అని హేమచంద్రుఁడు. 'సప్తరాత్రములల్ ' - ఏడురాత్రుల మొత్తము సప్తరాత్రము. - 'అహః సర్వైకదేశసంఖ్యాత పుణ్యాచ్చ రాత్రేః' అను సూత్రముచేత రాత్రిశబ్దమునకు సమాసాంతము అచ్ప్రత్యయము వచ్చినది. - సమాహారద్విగువు 'సప్తరాత్రమ్' అని ఏకవచనాంతముగా నుండ వలయును. 'సప్తరాత్రములల్ ' అను బహువచనము లక్షణోక్తముకానట్టి తెనుఁగుమర్యాద ఏకవచనంబు నరయే. 'నారాయణ...నిత్ర్నము' - నారాయణశబ్దమున 'నార + అయన' (నీరు తావుగాఁ గలవాఁడు) అను పరిచ్ఛేదము ఉన్నను - నిత్యసమాసయతిగా ఇట నిరుకాలంగులను యతి రావచ్చును. 'ఘన' ఏకవచనాంతము సోగణ వాచకంబు నగు.

—* బౌద్ధావతారము *—

మ. తరుణత్వోత్సుతబాణపంచకముసంస్థైత్యాబలాశ్రేణి త
త్పౌరసందోహము యుష్మదాత్మకజపద్బాణం బొకింటు నైజతే!
ద్వారం గాపించిన నేలకో? యహాహా, బుద్ధం బయ్యె సభావ మ
త్తరుణశీలతనుత్ర మేరికి నసాధ్యం బౌటంగా కేశవా ? 30

కేశవా = ఓ నారాయణుఁడా, తరు...నక - తరుణ = యౌవనవంతులైన - త్వత్ = ని-
సుత = కొమరుని (అనఁగా మన్మథునియొక్క) - బాణ = అలుఁగుల - పంచకమునక = ఏనింటి

గమిచేత, దై...ణి - దైత్య అబలా=అసురకోమలల - శ్రేణి=రాజియు, యు...బు - యుష్మత్ = నీవే - ఆత్మక = స్వరూపముగాఁ గలదైన - జరత్ = ముది - బాణంబు = ములికి, ఒకొంటన్ = ఒక్కదాననే, త...ము - తత్ = ఆయసురకోమలల - వర = భర్తల - సందోహము = సంహతియు, చెడన్ = ధ్వంసమొందునట్లు, త్వరకావించితివి = వడిగొంటివి, ఏటికో = ఏకారణమునకో, అహహ = ఆశ్చర్యము, నీభావము = నీయొక్క యభిప్రాయము, బుద్ధంబు అయ్యెన్ = తేటపడినది, అ...ము - ఆ - తరుణీ = యువతులయొక్క - శీల = ఆచారమనెడి - తనుత్రము = కవచము, ఏరికిన్ = ఎవరికిఁగాని, అసాధ్యంబు = అభేద్యము, ఔటన్ కా = అగుటవలనఁ గదా! [పా. ఒకొంటన్ = ఒక + ఒండు - తృ. = ఒకటినే ఒకట ననుట.]

కేశవుఁడు = మంచికేశములు కలవాఁడు అని వ్యుత్పత్తి, క = బ్రహ్మయు - ఈశ = శివుఁడును. పుత్త్రుఁడుగాను పౌత్త్రుఁడుగాను గలవాఁడు అని యొండె, వ వర్ణము మత్వర్థీయప్రత్యయము - సూ. 'కేశాద్వః'. అబలలైన దైత్యాంగనలమీఁదికి తనపుత్త్రుని బల్లిదుని యౌవనవంతుని

('అరవిన్దమశోకం చ చూతం చ నవమల్లికా
నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.' అమ.)

అను పెక్కుబాణములతోఁ బంపిన తాత్పర్య మేమన - వారు అబలలైనను వారిశీలము ఎవ్వరికిని అభేద్యము గావున. మఱియు వారిపైకి కాముని బంపుట ఏలయన - కామునిమాయలకు లోఁబడని వా రుండరుగావున; కామావేశముచేత వారిని వ్యభిచారముపాలు సేసి యని తాత్పర్యము. మఱి సమర్థులైన తద్భర్తలమీఁదికి తన్నే ఒకనే ముదుక చివుక బాణముగాఁ గొని అభియోగము సేయుటయందు తాత్పర్యమేమన తదంగనల శీలము భ్రంశమొందినంతట ఆ వీరులు నిష్ప్రభావులును నిష్ప్రాణులును అగుదురు. అప్పుడు వారిని కూల్చుట సుకర మని. - 'తనుత్రము' - తనుం త్రాయతే = తనువును కాచునది, కవచము. - 'దైత్య' - 'దానవాసురదైత్యానా మైక్యమేవాభిసమ్మతమ్.' కావ్యకల్పలత. హేతూత్ప్రేక్ష. 'బుద్ధంబయ్యె' నను వాక్యములో నీవు బుద్ధదేవుఁడవుగదా ! అని సూచ్యార్థ సూచనము ముద్రాలంకారము.

'ప్రకృతగ పదములచే సూ। చ్యకథనమె ముద్ర, పతియె సతి కంద మనన్.' అలం.

—* కల్క్యవతారము *—

శా. ఘోరాపారమహాఘపంచకముఁ జక్కు ల్సేయఁగా నేర్పు నా
ధారాపంచక ధావనం జెలఁగుగంధర్వంబుఁ ద్రొక్కించు బ
ల్బీరంపున్నెఱరౌతుఁ గీకటశరాళీవారవాణీభవ
ద్దోరుద్భ్రాంతకృపాణికాద్వితయవిద్యుద్గ్రంథి నిన్ గొల్చెదన్. 31

ఘో...మున్ - ఘోర = దారుణమును - అపార = మేరలేనిదియు - అగు - మహాఘ (మహాత్ + అఘ) = మహాపాతకముల - పంచకమున్ = ఏనింటిగమిని, చక్కుల్ సేయఁగాన్ = చక్కాడుటకు, (నుఱుమాడుటకు - నాశముసేయుటకు), నేర్పున్ నాన్ = నేర్పుచున్నాఁడో యనునట్లుగా, ధా...నన్ - ధారా = (గుఱ్ఱపు) గతులయొక్క - పంచక = ఏనింటిగమిచేనైన - ధావనన్ = పరుగున, చెలఁగన్ = ఒప్పునట్లుగా, గంధర్వంబున్ = గుఱ్ఱమును, త్రొ...తున్ - త్రొక్కించు = నడిపించునట్టి - బలు = మేటి - బీరంపు = పరాక్రమముగల - నెఱరౌతున్ = నిండు

రాహుత్తును, కీ...థల్ - కీకట = మ్లేచ్ఛులయొక్క - శర = బాణముల - ఆళీ = పరంపరవలన నుండి - వారవాణీ = కవచముగా - భవత్ = ఆచరించుచున్న - దోః = బాహువులచేత - ఉద్భ్రాంత = ఉత్కటముగా తిరుగుడు గొనుచున్న - కృపాణికా = పట్టాలయొక్క - ద్వితయ = జంటయనెడు - విద్యుత్ = మెఱుపులయొక్క - గ్రంథల్ = ముడికలవాఁడవైన, నిల్, కొల్చెదల్.

కలియుగము ముదిరినంతట లోకమెల్ల మ్లేచ్ఛులవతరించి సాధువులను చంపుచు సకల దురాచారములను కావించుచు అధర్మమును నడుపుచుందురు. ఆసమయమున విష్ణువు కల్కియను పేర బ్రాహ్మణ శిశువుగా నవతరించి, అశ్వారూఢుఁడై, పుడమియందు మ్లేచ్ఛులనెల్ల సంహరించి మరల ధర్మమును నెలకొలుపును - అను పురాణకథ నిట ననుసంధించుకొనవలయును.

'మహాఘములు' - మహాపాతకములు. అవి యైదు.—

'బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమః
మహాన్తి పాతకాన్యాహు స్తత్సంయోగశ్చ పఞ్చమమ్.'

బ్రాహ్మణునిఁ జంపుట, సారాయి త్రాగుట, బంగారును దొంగిలుట, గురుభార్యను గవయుట, అట్టివారితో సావాసము సేఁతయు, పంచమహాపాతకములు.

'ధారాపంచకము' - గుఱ్ఱముయొక్క యైదుగతులు, ఆస్కందితాదులు:—

'ఆస్కన్దితం ధౌరితకం రేచితం వల్గితం ప్లుతమ్
గతయోఽమూః పఞ్చ ధారాః' - అమ.

వానికి వరుసగా తెనుఁగున రవగాలు, జోడన, బవిరి, చౌకళింపు, దువాళము, అని పేరులు.

'రవగా ల్రవాలు నా రాజిల్లు నాస్కంది । తము జోడన యనంగ ధౌరితకము;
నెలయును బేరము వేడెయు జాలెము । బవిరి నా రేచితంబు విలసిల్లుఁ;
కొంకళిం పనఁగను దూకు డనంగను । వల్గిత మ్మగును, దువాళి మన దు
వాళి యనఁగను బ్లుతముగా వఱలుచుండు.' ఆం. భా. 2 (198).

'కీకటులు' - ఒకతెగ మ్లేచ్ఛులు - 'కీకటా మగధాహ్వయాః' హేమ. - 'తావత్కీకట దేశః స్యాత్తదన్తర్మగధో భవేత్' అని శక్తిసంగమ తంత్రము. - 'కీకటేషు గయాపుణ్యా' అని పురాణవచనము. పద్యములో కీకటశబ్దము మ్లేచ్ఛసామాన్యపరము. - దశావతార చరితము (కల్క్యవతారము).

'దగ్ధతురుష్కయవనావ (ఫ) గానశకనగ్నైః
సంకోచ మేష్యతి మహీ భుజగై రివ విసర్పిభిః. 10 (34)
మ్లేచ్ఛాచ్ఛాదితసర్వాశా కృపణా క్రన్దనాదినీ
మేదః కర్దమినీ క్లేదం రక్తై ర్యాస్యతి మేదినీ. (35)
తస్మిన్ కాలే నిరాలోకే లోకే పాపతమోమయే
ఉత్పత్స్యతేఽర్కసంకాశః శిశుః కల్కి ర్వలేద్విజః. (36)
విష్ణు ర్భూభారశాన్త్యర్థే సోఽథ విష్ణుయశాః క్షితౌ
చరిష్య త్యశ్వ మారుహ్య మ్లేచ్ఛసంక్షయదీక్షితః.' (37)

'కృపాణికా' - కృపాణమే కృపాణకము - అది స్త్రీలింగమున కృపాణిక.

కల్కిదేవుఁడు గుఱ్ఱమెక్కి దానిచే అయిదు తెఱంగుల గతులను ద్రొక్కించుట దానికి అయిదు మహాపాతకములను నుఱుమునేయ నేర్పుటయో యనున ట్లుండెను. కల్కిదేవునిగుఱ్ఱము

తరలఁగానే పాపములు పలాయన మగును, పాపులు నశింతురు అనుట. మఱి మ్లేచ్ఛులు తనపై బాణములం బ్రయోగించుచో ఆయన రెండుచేతులతోను తనచుట్టు ద్రిప్పుచుండు పట్టాకత్తులు మెఱపులయల్లికవలె వెల్గుచు ఆదేవుని దేహమును కనఁబడనీక మఱుఁగు పఱుచుచు కవచమువోలె ఆబాణ నిచయములను వారించుచుండును.

'నేర్పునాన్' - ఉత్ప్రేక్ష. 'వారవాణీభవత్' - పరిణామాలంకారము.—
'ప్రకృత మితరాత్మతం బెఱ । ప్రకృతాత్మతఁ గోరఁగ్రియకుఁ బరిణతి యగు మా;
నకిఁ దేర్ప మనువు నానుడి । నకి నన్నుఁ బ్రసన్న నేత్ర జలజములఁ గనెన్.' అలం.

చ. అని వినుతింపఁగా హరి సుధాశనవర్ధకిఁ జూచి 'పాండ్యుఁడి
చ్చినధన మిమ్మునీశ్వరుఁ డశేషము భాగవతాప్తదీయగే
హనివహసాత్కరించి, యకటా! కడు రిక్తత నొందు; నేతదీ
యనిలయ మప్పురి న్మణిమయంబును సార్థముఁ జేయు' నావుడున్. 32

అని, వినుతింపఁగాన్ (విష్ణుచిత్తుఁడు) స్తుతిసేయఁగా. హరి = ప్రత్యక్షుఁడైయున్న నారాయణుఁడు, సుధాశనవర్ధకిన్ = దేవశిల్పిని = విశ్వకర్మను, చూచి, (ఓయి విశ్వకర్మా), ఇమ్మునీశ్వరుఁడు = మునివరేణ్యుఁ డయిన యీవిష్ణుచిత్తుఁడు, పాండ్యుఁ డిచ్చిన ధన మశేషము = పాండ్యరాజు ఒసంగిన ధనము నంతయు, భాగ...రించి - భాగవత = భగవద్భక్తులయొక్కయు (మాధ్వ భక్తులయొక్కయు - వైష్ణవులయొక్కయు ననుట) - ఆప్త దీయ = మాదైన - గేహ = ఇండ్ల యొక్కయు (విష్ణ్వాలయములయొక్కయు ననుట) - నివహ సాత్ కరించి=సందోహముల యధీనము చేసి (అనఁగా వైష్ణవులకును విష్ణ్వాలయములకును ఇచ్చి), అకటా = పాపము! కడున్ రిక్తతన్ = మిక్కిలి దారిద్ర్యమును, ఒందున్ = అనుభవించెడును ['ఒందె' యను పాఠమున - ఇప్పటికే అధన మెల్ల నేమియు మిగులనీయక ఇచ్చి వైచినాఁడు, అనియర్థము.], (కావున), అప్పురిన్ =అపురిన్ = ఆనగరమందు (అనఁగా విల్లిపుత్తూరునందు, ఏ...ము - ఏతదీయ = ఇతనిదైన - నిలయము = ఇంటిని, మణిమయంబును = రత్నసమృద్ధమును - సార్థమున్ =పదార్థములతో కూడినదానినిగాను, చేయుము, నావుడున్ = అని అనఁగా.

'నుతియించు' - నామధాతువు. 'సుధాశనవర్ధకి' = సుధ యనఁగా నమృతము, అది అశన ముగా అన్నముగాఁ గలవారు - అమృతపానముచేఁ జీవించువారు సుధాశనులు - దేవతలు అనుట - 'సాత్' - సంప్రదానముపై వచ్చుప్రత్యయము. మూఁడవపాదమున ప్లుతయతి.

తే. విశ్వకర్మయు నట్ల కావించె; నంత । నంబుజాక్షుఁడు నమ్ముని నాదరించి,
యాక్షణాగోచరుం డయ్యె; ఋషియు నేఁగి । పౌరులు భజింపఁగానె పుత్తూరికరిగె.

అంబుజాక్షుఁడు = నారాయణుఁడు...ఆదరించి = అనుగ్రహించి, ('ఆమంత్రించి' అని యుండెనేమో, ఆమంత్రించి = వీడుకోలు పలికి) - ఈ ... డు - ఈక్షణ = చూపులకు - అగోచరుండు = అవిషయుఁడు (అగపడనివాఁడు) - ఋషియున్ = విష్ణుచిత్తుఁడును, ఏఁగి = ఊరేఁగి (ఊరేఁగింపునొంది) - పౌరులు భజింపఁగానె = మధురాపురపౌరులు విల్లిపుత్తూరి వఱకు అమునితోఁగూడ వచ్చుచునే యుండి రనుట, పుత్తూరికిన్ = విల్లిపుత్తూరికి. 'విశ్వకర్మయున్' -

'ఋషియోఙ్' - సముచ్చయద్వయము విలంబులేని కార్యసిద్ధిం దెలుపును. ఇట్టిదే 'తేచ ప్రాపు రుదన్వన్తం బుబుధే చాది పూరుషః' కుమార.

## —* విష్ణుచిత్తునిస్వపురప్రవేశము. *—

క. స్థానికులు దన్ముని దిదృ। క్షానందితు లగుచుఁ బురము గైసేసి, ప్రజ
లోనడువ నాగవాసము। తో నెదురుగ నేఁగి; రంత తూర్యము లులియన్. 34

స్థానికులు (=స్థానమందు నియుక్తులు విల్లిపుత్తూరి దేవస్థానమందలి యధికృతులు, త...లు - తత్ = ఆ - ముని = విష్ణుచిత్తునియొక్క - దిదృక్షా = దర్శనేచ్ఛచేత (విష్ణుచిత్తుం జూడ నైన కోరికచేత) - నందితులు = ఉత్సాహవంతులు, అగుచున్ = అగుచు, పురము = విల్లిపుత్తూరి నగరమును, కైసేసి = అలంకరించి. ప్రజలు = విల్లిపుత్తూరిజనులు, తోన్ = కూడ, నడువన్ = నడచిరాఁగా, నాగవాసముతోన్ = వేశ్యలమేళముతోఁగూడ, ఎదురుగన్, ఏఁగిరి, అంతన్, తూర్యములు = వాద్యములు, ఉలియన్ = శబ్దింపఁగా.

విష్ణుచిత్తముని చూడ నువ్విళ్లూరుచు విల్లిపుత్తూరిదేవస్థానాధికృతులు నగరాలంకారములు చేయించి, పౌరబృంద సమేతులై వేశ్యల మేళముతోఁగూడ ఆయనకు ఎదురేఁగిరి. అంతట వాద్యములు మ్రోఁగుచుండఁగా.

'నాగవాస' మనఁగా వేశ్యాసమూహము:—

సీ. 'ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి,
మహిమఁ గోల్పడియె నే మాండకర్ణి.' మను. 2 (73).

మాండకర్ణి యనుమునీంద్రుఁడు ఏవు రచ్చరలం గూడి పంచాప్సరం బనుసరోవరంబున వినోదముల ననుభవించుచుండును. - ఈకథకై రామా. ౧ వ అ. ౧౧ సగ.

వ. (1) ఇట్లెదుర్కొని పట్టవస్త్ర భగవత్ప్రసాదతీర్థంబు లుపాయనంబులుగాఁ బ్రణామంబు లాచరించి లేచి, ప్రాంజలులై, ధర్మపరికర్మవర్తితం బగుబ్రహ్మరథంబున నబ్భాగవతవతంసంబు నునుచుకొని పోవుసమయంబునఁ, బరస్పరసమేతంబు లగు పౌరజానపదజనంబులు గలసి మెలసి నడచునెడ; (2) మృదంగం బుపాంగం బానకంబు దండె తాళం బురుము కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణె వాసె గ్రోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటం బుడుక్క ఢక్కి చుయ్యంకి లోనగు నసంఖ్యాతవాదిత్రతతియుఁబరంపరలు మొరయ; (3) నెడనెడఁ బడఁతుకలు మలఁపుఁగొనఁ, బట్టణాగతగజఘట్టఘోట్టాణఘోటక ఘంటాకదంబఘర్ఘరఘోషంబుల కనుప్రాసంబులై, విలాసినీ మంజు మంజీరంబు లెలుఁగియ్య నల్లనల్లనం జాఁగుతఱిఁ; (4) గెలంకులఁ గవచితకుథాకర్బుర లగు కరివరకరేణుకంధరలం గనకాంకుశంబులు కేలంబూని సేవించి పోవుసామంతభూకాంతకుమారఘట్టంబులంబిట్టు గాంచి, యొండొరుఁ గడవ సంభ్రమించుచు, మ్రొక్కి నిక్కి చేయెత్తి యొత్తిలి నేత్రంబు లుత్తానతరళతారకంబులుగా మడిఁగి మగిడి పొగడుచుం బోవుతఱిఁ;

(5) వద్రాజకదంబకిం బచ్చటిపడంతుకలకుం దమకుం బురికిం జనుదెంచునప్పు డెల్ల నెడకాం డ్రగుట మేలమాడంబోలు నాప్రోలిమేళంపుం గళావతుల వైచునెపం బునం గ్రామగ్రామగ్రామణు లొసంగు నారంగమాతులుంగ జంబీర కుంద కందు కాదులం బూర్వానుభుక్త లగునక్తంకరముఖుల వైవ; (6) ధళధళత్తరళతాటం కంబును నంకురితవిస్మయంబునుగా, నాతస్ముఖప్రేంఖోళితస్మిత సాకూతవిభ్రమాకేక రాపాంగ విలోకనంబును నాచలితధమ్మిల్లంబునుంగా, మొగంబులు తివిచికొని సమ్మర్దంబునం జనుమార్దంగికుల మూఁపుల మఱుఁగులం డాఁగి, యన్నాగవాసం బులు నాగరక విలోకనంబునం జెలఁరేఁగి, మొగంబులు బిగించికొని, వేదు రెత్తిన గతి నరిదిమొత్తఁ బ్రతిపదంబును మర్దలముఖాపమర్దనకుఁ గ్రుంగుటయు, బయటఁ బడ చేయునది లేక యాకడకు మగిడి తులుము దిద్దుచుఁ, దద్వారణాభినయవత్ప రాచీనకరాబ్జులై సుడివడు నెడం బోడము కర్ణకుసుమావతంసకపోల ఖురళీకించిచ్చ లనోపలత్య్య వైరత్య్యహాసకుందంబులు సాంద్రతరచంద్రికాకంపంబులం బీటు కొలుపఁ; (7) జాటుయుక్తినాచాట లగుజరఠవనితలు తమను మ్రొక్కం దాప మ్రొక్క కొక్కించుక యోహోమోమిడి, వారియిరుపక్కియల నొదిఁగి తొంటు యంటు వలంచి తలవాంచిన, వంచసంగటాతించి యొక్కసక్కెంబునకుఁ బమచేత మ్రొక్కించుకొను వేడ్క నక్కడం బుడమిఱేఁడు లేమి సామాన్యమానవులం గైకొ నక, సుమాళంబు వెయ్యంబుగా విద్యావయోవృద్ధుల రగుమిారు మ్రొక్కఁగా దాప మ్రొక్కమి యెట్లు మ్రొక్కింపుం డనుటయు; (8) గ్రక్కనం బోడము మొలకనగవుల మోముఁదమ్ములకు వేఱొక్కవింత తెలివి యెక్క, మ్రొక్క నక్కడఁ గడఁగూడి నడచుతోడి చేడియల కద్దొరలకుఁ దమకుం బద్దయుం బొందు గల దనుపద్దళీకం బెఱుకపఱుపఁ గెమ్మోవులు మలంచి లోలోన నొయ్యనొయ్యన నుచుక్కన నక్కలెలిఱింగి దక్కొ సొమ్మని తమ్ము నమ్ముదుసళ్లు ముందఱికి నూకి 'యక్కక్క, మ్రొక్కవే మనపాలివేలు' పని బుజ్జవించియు బొమలుగొని జంకిం చియు నెట్టకేలకు నొడంబఱిచినఁ; (9) ద్రపాతరళనయనలై విరళవిరళాంగుళాం జలి బంధంబుగా మ్రొక్కి, కక్కసాన నిట్లు మ్రొక్కించి, పొచ్చి, యచ్చియ్యాట మొదపడకయుండఁగాఁ జిగురుగండెలువోలె నల్లుకొని గొల్లన నగు నల్లొలాంగనలఁ గల్లకోపంబునం గొట్టకసరుఁజూపునా రాజసంఘంబుమిాఁద సిగుడ, వగుడ మఱు పడు కొామిరెహారిణలోచనలచలితకంకణసంకులక్రేంకారంబు లాలనామోద మేదు రాళి ఝుంకారంబులబింకంబు లడంపఁ; (10) జెవులసగకులు లోనంకభుజంబులు కొంకి సిగలు గావిదుప్పటులు నొప్ప, గమ్ము దెప్పరంబై ముప్పున నప్పురంబుఁ జేరి, రసికజన

బాంధవంబున బంధువియోగంబుమఱచి, గంధకలనాకుసుమస్రగ్గ్రథనాదుల నాంధ్యంబులే కలరు నంధ్రదేశీయులగు గంధకారులు పాటిపాటి పద్యంపుమ్రుక్కలతో వెట్టివెట్టి కైవారంబులు గౌరుతత్తడులపై వచ్చు రాచవారిపై నాఁడు వారిపై నాళువారిపైఁ జల్లగాఁ జల్లఁ, బెల్లెగసి సృష్టియెల్లను ముష్టికరించుచు, నస్పష్టభేదముగుపరిమళసముష్టింబెట్టు పిష్టాతకంబు నభోమండలికిం జండాతకంబై చండకరకిరణంబుల మాటు పఱుపఁ, బన్నీరు నించిన తన్నీరుతిత్తులొత్త; వియత్తలంబునం బొఱికై త్రాలు ధూపల వాద్యంబులు వడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాఁచనగ్గిరోయుచుండ; (11) నత్యుత్తమతఱి నృత్తంబుఁ జూడ నిలిచి మెత్తమెత్తన నడచుచుండ సుందతండంబునుం బాదు నప్పిండు పుండరీకాస్య లసకాశంబు గాంచి కాశకుసుమప్రతిఫలనపాండురంబులై పద్యాతిహృద్యపార్శ్వద్వయోద్యాన పాదపంబులకుబొలు చెంగలువకొలఁకులకుడిగ్గి, కాసరీదధిమండమాసరంబులుగాఁ బిసికి యూరంబెట్టిన నారంగశృంగబేరభంగంబులతోఁ గట్టిన కలమాన్నంపుఁజలిది పోకపొత్తులం గుడువఁ గూర్చుండి వీక్షించి; (12) కుక్షింభరిత్వంబున బుభుక్షులై తిరిగితిరిగి వేసరి యోసరిలిన దాసరిగుంపు వారిపాల గోపాలభిక్ష భక్షించి భక్షింపఁ బేరక్షోణుల నిలిపినతోరంపు దివెదారికోలల రంధ్రగోళంబుల నుత్కలంబులై మండు భగభగని జగజ్జ్యోతిదీపజాలంబులమధ్య ధూపకుండికాంగారంబుల నీరాజనఁ గ్రాఁచి, నాదుఁ బరికింప వాయించు ధిమిధిమిధ్వానంబుల కుంబెదరి యీవలియుపవనశుకంబు లావలి కావలి యుపవనశుకంబు లీవలికి వట్టంబుగాఁ గట్టినితోరణంబులై పఱవఁ, బలలు విసరుటయు నోరు దెఱచుటయుఁ గేలు సఱచుటయుఁ బక్క మిక్కుటం బగు న క్కోలాహలంబున నేపాటియుం బాట వినరాక మూఁకగట్టిన భాగవతజాతంబు లేతేర; (13) నూఁకూరిసంతకుం దిరుగఁ బెట్టి లింటింటసంతరించిన పిలుకువాటుగోడిగల జావడంబులకుం బుట్టి కొల్లొట్టి విడువ నెత్తంబున మెత్తని గఱిక మేసి పోసరించి మాపుమాపున మేపుసజ్జకవణంపు మేపునఁ బిడుక గొఱపంబు తోమకంబునఁ బుటపుటనై కఱియకఁబడి స్రాఁతఁ గనినైన నీడం గసిరియైనం బెదరు కొదమతట్టుపగుంపు కాలికోలందికి వ్రేలు లాలుకుంచెలు గీలించిన గవ్వదంటల గంటల నలంకరించి, మోలుగుమడ్డిం దోఁచి మూరకొక్కండును జేనకొక్కండునుగాఁ గుట్టినడొల్లు టుల్లాసు ఉల్లసిల్లంబల్లించిన పల్లంబులపైఁజిల్లతైలంబును వాసనకొడుపులం బూసినమణుంగుఁ జంద్రికచేలలె రవణంబులుగా నెదురుగా వేడుకం జూడవచ్చిన యవ్వీటి మేటిసాలె యగసాలె పటుసాలె వానెనై జాతి సాఁతు లేతులకొమరులు తుములమై వచ్చు తచ్చుమూసామజంబులం

జూచి యేచినవెఱం దమయొక్కరింత లెక్కకొని వాగె లిరుగేలం గుదియంబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింపవచ్చిన ప్రజలం ద్రొక్కుచుంబోవఁ; (14) దన్మథ్యవృద్ధ వధ్వాతురాదులు దిట్ట నిట్టట్టనలేక ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచు, నవీన నవిధకేదారంబులం బ్రెళ్లి చట్టలు దిగంబడి వెడలలేకుండం దారు దిగ నిమ్ములేక పమ్ముటఁగొని నలుదెసలంజూడం, జూచి కేలు సఱచి కోహో యని గేలిసేయు గణి కాకదంబంబుల చప్పటులు నిబిడనిష్కుటవిటపిఘాటంబులం బ్రతిశబ్దంబులు పుట్టింప; (15) నిట్లనూన విభవంబు చిగురొత్త నత్తురుపతి సొచ్చి యచ్చక్రధరునగరి మోసల నిలుచుటయు, నవ్విష్ణుచిత్తుండు ప్రఘాతతరణంబు చేసి, ధరణీధవస్థానిక సమూహంబు వెంటరా నవ్వైకుంఠు సేవించి, తత్ప్రసాదలబ్ధం బగు పరివట్టంబున నలంకృతుండై, నానాలంకారసహితంబును రత్నకాంచనమయంబు నగు నాత్మీయ భవనంబుం గాంచి విస్మితుండై పుండరీకాక్షుమహిమాభిలబ్ధవైభవంబుగాఁ దెలిసి తత్రత్యధాత్రీకళత్రవర్గంబుల ననిపి ప్రవేశించి, తొంటికంటె శతగుణంబుగా భాగవతపూజాప్రవణుండై యుండె నంత. 35

1. (స్థానికులు) ఇట్లు = ప్రజలు కూడరాఁగా నాగవాసములును కూడరాఁగా తూర్యములు ఉలియఁగా, ఎదురుకొని = ఎదురునని, పట్ట...బులు - పట్ట = తిరుప్పరివట్టము (విష్ణుప్రసాదముగా గ్రహించి తలం జుట్టుకొను పట్టు)ను - పవిత్ర = పాపహరములయిన - భగవత్ప్రసాద తీర్థంబులు - భగవంతుని యభిషేకోదక నిర్మాల్యములును, ఉపాయనంబులు కాన = వేకానుకలుగా సమర్పింప, ప్రణామంబులు = నమస్కారములు, ఆచరించి = చేసి, ప్రాంజలులై = మోడ్పఁ బడిన చేమోడ్పు గలవారై, కర్మ...ంబు - ధర్మ = బంగారముయొక్క (బంగారముతోఁ జేయఁ బడిన) - పరికర్మ = అలంకారముచేత - కల్పితంబు = కల్పితము - అగు - బ్రహ్మరథంబునకు = బ్రాహ్మణులు మోసెడువాహనమందు, అభ్యాగతవతతంసంబునకు = భగవద్భక్తశేఖరుఁడైన యావిష్ణుచిత్తుని, ... పరస్పరసమేతంబులు = ఒండొకటితోఁ గూడుకొన్నవి, అగు - పౌర ... బులు - పౌర = పట్టణసంబంధులు - జానపద = పల్లెటూళ్లి సంబంధులును అగు - జనంబులు,...

2. మృదంగంబు = మద్దెలలు, ఉపాంగంబు = సుతిపోసెడు తిత్తి, ఆవజము = రుంజ ('ఆవజంబనఁ బర్వు నావజంబు' ఆం. భా. 1-127), దండె = తంబుర ('దండె దండియయను దండవాద్యం బొప్పు' ఆం. భా. 1-127), తాళంబు = తాళమువైచెడు కంచువాద్యము ఉడుము = చర్మవాద్యవిశేషము, కిన్నెర = తంత్రీవాద్య విశేషము, సన్నగాళె = తిరుచ్చిన్నము ('కాళె కాళెయనంగఁ గాహళి విలసిల్లు' ఆం. భా. 1-128.), వీణె = వీణ, ముఖవీణె = మొగవీణ, వాసగ్రోలు = పిల్లంగ్రోవి ('కాహళీ భేదము ల్గాలిఁ బిల్లనగ్రోవి, వాసగ్రోలనఁగను వంశనాళము' ఆం. భా. 1 - 129.). డోలు = ప్రసిద్ధ చర్మవాద్య విశేషము ('డోలనాఁగను విలసిల్లు డోలకేను.' ఆం. భా. 1-127.), సూరె = నాగస్వరము, భేరి = దుందుభి, గౌరు = పెద్దకాళె ('గౌరన నెనుఁగు కాహళి విలసిల్లు' ఆం. భా. 3-44), గుమ్మెట (=గుమ్మెత) = తుడుము ('గుమ్మెత యనఁగను గుంభవాద్యము దోఁచు' ఆం. భా. 1-128.),

గుమ్మెటంబు = డప్పు, డుక్క - డక్కి - చక్కి = వాద్యవిశేషములు, చుయ్యంకి = తాళము, ('తనరఁ జుయ్యంకి కైముడి యనఁగఁ దాళము' ఆం. భా. 1-128.), ...అసంఖ్యాతవాదిత్ర త్రితయ పరంపరలు = లెక్కకు మీఱిన వాద్యత్రయములయొక్క వరుసలు, మొరయఁగ = శబ్దించుచుండఁగా;

3. ఎడనెడఁ = నడుమ నడుమ, పడఁతుకలు = నట్టువచెలువలు, మలఁపుఁగోనఁ = ఎదురు తిరిగి నాట్యము సేయుచుండఁగా, పట్ట...బులకుఁ - పట్టణ = నగరములనుండి - ఆగత = వచ్చిన - గజఘట్ట = ఏనుఁగు తండములయొక్కయు - ఘోట్టాణ ఘోటక = ఘోట్టాణ దేశపు గుఱ్ఱములయొక్కయు - ఘంటాకదంబ = గంటల సమూహములయొక్క - ఘుర్ఘుర ఘోషంబులకుఁ = ఘుర్ఘురధ్వనులకు, అనుప్రాసంబులై = సమానధ్వనులుగా, విలా...బులు - విలాసినీ = ఎమ్మెకత్తెలయొక్క - మంజు = మనోహరములయిన - మంజీరంబులు = అందియలు, ఎలుఁగు ఇయ్యఁగ = శబ్దించుచుండఁగా, అల్లనల్లన = మెల్ల మెల్లఁగా, చాఁగుతఱిఁ = పోవుచున్న సమయమందు;

4. కెలంకులఁ = పార్శ్వములందు, కవ...లు - కవచిత = కవచములుగా చేయఁబడిన - కుథా = (ఏనుఁగుపై పఱుచు) రత్నకంబళములచేత - కర్బురలు = చిత్రవర్ణముగలవి, అగు - కరివర కరేణు కంధరలఁ = మేటి మగ యేనుఁగులయు పిడియేనుఁగులయు మెడలయందు, కనక అంకుశంబులు = బంగారపు టంకుసములు, కేలఁ బూని = చేతం దాల్చి (ఇదిసేవా చిహ్నము), సేవించి పోవు - సామంత కుమారఘట్టంబులఁ = సీమను చుట్టుకొనియుండు జమీందారులైన రాజకుమారుల సమూహములను, బెట్టు = ఎక్కువగా, కాంచి = చూచి, ఒండొరుఁ = ఒకరినొకరు, కడవఁ = అతిక్రమించి ముందు పోవుటకు, సంభ్రమించుచుఁ = త్వరపడుచు, మ్రొక్కి = నమస్కరించి, నిక్కి = నిగిడి, చే ఎత్తి = ఉద్ధృత హస్తులై, ఒత్తిలి = ఓసరిల్లి - ఒదిఁగి, నేత్రంబులు = కన్నులు, ఉ...గాఁ - ఉత్తాన = వెదకిలిన - తరళ = చంచలమైన, తారకంబులుగాఁ = కనుపాపలు గలవి యగునట్లుగా, మగిడి మగిడి = తిరిగి తిరిగి, పొగడుచుఁ = స్తుతించుచు;

5. తత్ రాజకదంబకంబు = ఆరాజుల సమూహము, అచ్చటి పడంతుకలకుఁ = ఆపట్టణంపు వెలయాండ్రకును, తనకును, పురికిఁ చనుదెంచునప్పుడెల్లఁ = ఆవిల్లిపుత్తూరికి ఎప్పుడు వచ్చినను, ఎడకాండ్రు = తార్పుకాండ్రు, అగుటఁ = అగుటవలన, మేలమాడఁ బోలు = పరిహాసముసేయుట కుచితమైన - ఆప్రోలి మేళంపుఁ గళావతులఁ = ఆనగరపు నాట్యపు మేళముల విద్యావతులను, వైచు నెపంబునఁ - కొట్టెడు మిషచేత (ఆరాజకుమారులు), పూర్వానుభుక్తలగు - పూర్వము తా మాయూరికి వచ్చినప్పుడు అనుభూతలైన - నక్తంకరముఖులఁ = నిశాకరవదనలను (చంద్రముఖులను), గ్రామ గ్రామ గ్రామణులు - ఊరూరి నాగరికులు. ఒసంగు = కానుక పెట్టెడు - నారిం...దులఁ - నారంగ = నారింజపండ్లు - కుంద = మొల్లలు - కందుక = బంతులు - ఆదులఁ = లోనగు వానిచేత, వైవఁ = కొట్టఁగా;

6. ధళ...బును - ధళధళిత = ధళధళమని - తరళ = మెఱయు - తాటంకంబును = కమ్మలుగలవియు, అంకురితవిస్మయంబును = మొలకెత్తిన దరహాసముకలవియు. కాఁ = అగునట్లుగా, ఆ...బును - ఆతన్ముఖ = ఆవిటులవదనములవఱకు - ప్రేంఖోళిత = డోలాయమాన

మయిన (ముందువెనుకలకు చలించుచున్న) - స్ఫీత = విశాలమయిన - సాకూత = సాభిప్రాయమైన - విభ్రమ = విలాసముతోడి - ఆకేకర = ఇంచుక ఓరగా చూచుచున్న - అపాంగ = నేత్రాంతములయొక్క - విలోకనంబును = చూపులుగలవియు, ఆచలిత ధమ్మిల్లంబునన్ = ఇంచుక కదలుచున్న కొప్పుగలవియు, కాన్ = అగునట్లుగా, మొగంబులు = ముఖములను, తిగిచికొని = త్రిప్పుకొని (త్రిప్పుకొన్నవారు నక్రంకిరముఖులు), సమ్మర్దంబునన్ = గుంపులో, చను = పోవుచున్న - మార్దంగికుల మూఁపులమఱుఁగులన్ = మద్దెలగాండ్ర బుజముల చాటులందు, డాఁగి = లీనులై, అన్యాగవాసంబు = ఆయాటకత్తెలు, నాగ...నన్ - నాగరిక = ఊరివిలాసవతులయొక్క - విలోకనంబునన్ = చూచుటచేత (ఊరియొమ్మెకాండ్రు చూచినందున), చెలరేఁగి = ఎక్కువగా ఉత్సాహించి, మొగంబులు బిగించికొని = ముఖములు ముడుఁచుకొని, పేదురు ఎత్తినగతిన్ = పిచ్చిపట్టినదా యనునట్లు ('వెఱ్ఱి యనంగను బిచ్చియనంగ నున్మాద మనంగ నున్మాదసంజ్ఞ' ఆం. భా. 1-136.), అరిది ఎత్తన్ = ఆశ్చర్యమగునట్లుగా (పా. అరులెత్తన్ = వాత్సల్యము గలుగునట్లుగా - 'అర్మిలి యంచన నరులు నా నర్లన, వాత్సల్య సంజ్ఞయై పరఁగుచుండు.' ఆం. భా. 1 - 137. 'దరువు పట్టుటకు' అని కొందఱు.), ప్రతి పదంబును = అడుగడుగునకును, మర్ద...కున్ - మర్దలముఖ = మద్దెలయొక్క ముఖముయొక్క, అవమర్దనకున్ = వాయించుటకు, క్రుంగుటయున్ = క్రుంగఁ బాఱుటవలన (అనఁగా మార్దంగికులు దిగువకు వదియుటవలన వారిచాటున నుండిన యావేశ్యలు), బయటఁబడి = (మార్దంగికులచాటు తొలఁగినందున ఆరాజాదుల) కన్నులకు గోచరించినవారై, చేయునది లేక = అదృశ్యతం బొందుటకు మఱే యేయుపాయంబును లేనందున, ఆకడకున్ = ఆనారంగాదులను వైచినవారికి అభిముఖముగా, మగిడి = తిరిగి, తుఱుము దిద్దుచున్ = కొప్పు చక్కఁజేసికొనుచు, తద్వా...లు - తత్ = ఆనారంగ కందుకాదులయొక్క - వారణ = తప్పించుకొనుటయందలి - అభినయవత్ = అంగహారము (కాయికచేష్ట - లేక - అంగవిక్షేపము) కలదైన - పరాచీన = పెడమువెట్టిన - కరాబ్జలు = కేలుదమ్మిగలవారు, ఐ, సుడివడునెడన్ = ఘూర్ణిల్లునవసరంబున, పాడము...దంబులు - పాడము = గోచరించిన - కర్ణ = చెవియందలి - అవతంస = ఆభరణ పుష్పంబులయు, కపోల = గండస్థలమునెడు - ఖురళీ = గరిడీయొక్కయు - చలన = కదలికతో - ఉపలక్ష్య = కనఁబడుచున్న - వైలక్ష్య = అచ్చెరువుతోడి - హాసకుందంబులు = నవ్వుమొల్లలు [అనఁగా - ఘూర్ణిలినతఱిని కర్ణకుసుమావతంసమునకు గరడీయైన చెక్కుల కదలికతోఁ గూడి వారివైలక్ష్యస్మితములు (వెడనగవుమొల్లలు) అగపడిన వనిభా.], సాం...లన్ - సాంద్రతర = మిక్కిలి దట్టమయిన - చంద్రికా = వెన్నెలలయొక్క - కందంబులన్ = గుంపలను, దీటుకొలుపన్ = సరిపోలుచుండఁగా;

7. చా...లు - చాటు = చతురములైన - ఉక్తి = మాటలయందు-వాచాటలు = బహుభాషిణులు (గర్హితార్థము ఇచట నవివక్షితము), అగు - జరఠవనితలు = ముదిచెలువలు, తమకున్ = విటులైన యారాజకుమారులకు, మ్రొక్కన్ = కేలుమోడ్వఁగా, తారు = చెండుదెబ్బలుతిన్న యాగుబ్బెతలు, మ్రొక్కక = దండముపెట్టక, ఒక్కించుక = కొంచెము, ఓరమోమిడి = మోము మరల్చి, వారియిరుపక్కియలన్ = ఆముదుక చెలువలకు రెండుప్రక్కలను, ఒదిఁగి = ఒత్తిగిల్లి, తొంటియంటు = తమకు ఆరాజకుమారులతో పూర్వము కలిగియుండిన మరుసంగాతమును,

తలంచి = తలపోసి, తల, వాంచినన్ = వంపఁగా, వంచనన్ = తమకు (ఆరాజకుమారులకు), భోగపుజవరాండ్రు నమస్కరింపక అట్లు నిలిచిన యాతీరును, కటాక్షించి = ఓరచూపులం గాంచినవారై, ఎక్కసక్కెంబునకున్ = పరిహాసమునకై, తమచేతన్ = ఆయువతులచేత, మ్రొక్కించుకొనువేడ్కన్ = దండము పెట్టించుకొను నుత్సాహముచేత, అక్కడన్, పుడమిఱేఁడు = సర్వదేశాధీశ్వరుఁ డైనమహారాజు, లేమిన్ = లేనందున, సామాన్యమానవులన్ = సామాన్యజనులను, కైకొనక = సరకుసేయక, సుమాళంబు = చిత్తోత్సాహము, వేద్యంబుగాన్ = తెలియునట్లుగా, వి...లు - విద్యా = నాట్య గీత సాహిత్యాదులచేతను - వయః = వయస్సుచేతను - వృద్ధలు = పెద్దవారు, మీరు = ఆ ముదుకవేశ్యలు, మ్రొక్కఁగా = నమస్కరింపఁగా, తారు = జవరాండ్రయినతాము, మ్రొక్కమి యెట్లు = నమస్కరింపకుండుట తగునా ? మ్రొక్కింపుఁడు, అనుటయున్ = ఆయువతులచేత వృద్ధలయినమీరు మాకు దండము పెట్టింపుఁడు అని యా రాజకుమారులు హెచ్చరింపఁగా;

8. గ్రక్కునన్ = తటాలున, పొడము మొక్కనగవులన్ = మొలక నవ్వులచేత, మోము దమ్ములకున్ = ముఖపద్మములకు. వేఱొక్కవింత తెలివి = అప్పటికేయున్న దానికంటె ఎక్కువగా ఒక యపూర్వ మయిన తేజము కలుగఁగా, మ్రొక్కక, అక్కడన్. కడఁగూడి=ఒకపార్శ్వమునఁ గలసి, నడచు తోడిచేడియలకున్ = కూడవచ్చుచున్న తోడిచెలికత్తెలకు [దీనికి 'ఎఱుకపఱుపన్' అను దానితో నన్వయము], ఆదొరలకున్, తమకున్ = ఆదొరలతో నమస్కరింపని యాజవ్వనులకు. తద్దయున్ పొందు గల దనుపెద్దఱికంబు = ఎక్కుడు తగులము ఉండెనన్న సౌభాగ్యాతిశయమును, ఎఱుకపఱుపన్ =ఆతోడిచేడియలకు తమ సౌభాగ్యాతిశయమును తెలియఁజేయుటకుగాను, కెమ్మోవులు=ఎఱ్ఱని పెదవులు, మలంచి=విఱిచి, లోలోనన్, ఒయ్యనొయ్యన్ = మెల్ల మెల్లఁగా, ఊచుక్కనన్ = అనాదరశబ్దము సేయఁగా, అక్కెలు = అసందర్భమును, ఎఱింగి = గ్రహించి, అమ్ముదుసళ్లు, సొమ్ము = ధనము, మనకుదక్కెన్ = దొరకినది (ఈదొరలు మన కపారధన మిత్తురు), అని = అనిపలికి, తమ్మున్ = వయసుగుబ్బెతలను, ముందఱికిన్. నూకి = త్రోసి, అక్క-అక్క-మ్రొక్కవే = ఓసి అక్కా - అక్కా - మ్రొక్కవే, మనపాలివేలుపు = ఈదొర మనకు సకలభాగ్యము లిచ్చుదేవుఁడే, ('అక్కక్క' మొదలు 'వేలుపే' అనువఱకు ఆకొమరాండ్రంగూర్చి ముదుసళ్లు పలుకువాక్యము), అని = అనుచు, బుజ్జవించియు = లాలించియు, [illegible]ములు = కనుబొమ్మలు, కొసి = ముడిచి, జంకించియు = జంకెనలు గావించియు (బెదరించియనుట), ఎట్టకేలకున్ = మహాకష్టముచేత, ఒడంబఱిచినన్ = ఒప్పింపఁగా;

9. త్ర...నలు - త్రపా = సిగ్గుచేత - తరళ = చంచలములైన - నయనలు - నేత్రములు కలవారు, ఐ, (ఆకొమరాండ్రు), విరళవిరళ అంగుళిబంధంబుగాన్ = వ్రేళ్లు ఎడమెడముగా కూడునట్లుగా ['విరళవిరళాంజలిబంధంబుగాన్' అని పా. = ఎడమెడ మయిన (వ్రేళ్లుగల) కేల్మోడ్పుగునట్లుగా], మ్రొక్కి నట్లు, కక్కసానన్ = బలవంతముగా. మ్రొక్కించి = మ్రొక్కఁజేసి, హెచ్చి = అతిశయించి, ఆసయ్యాటము = ఆ ప్రణయము, ఎడపడక ఉండఁగాన్=మఱుపడకయుండునట్లు, జిగురుగండెలువోలెన్ - పక్షులంబట్టుటకై జిగురుపూసిన కొయ్యలవలె, అల్లుకొని = చుట్టవైచికొని, గొల్లనన్ నగు = గొల్లుమని నవ్వుచున్న - ఆలోలాంగనలన్ = ఆ వృద్ధవేశ్యలను, కల్లకోపంబునన్ = అబద్ధపుఁగోపముతో, కొట్టి (కొట్టినవారు ఆకొమరాండ్రు),

కసరుఁజూపు = కోపదృష్టి, ఆరాజసంఘంబుమీఁదన్ = ఆరాజకుమారసమూహముమీఁద, నిగుడన్ = పర్వఁగా, మగుడన్ = మరల, మఱు...బులు - మఱుపడు = ఆరాజకుమారుల కగపడకుండ చాటున కేఁగునట్టి - కొమిరె = ప్రాయపు - హరిణలోచనల = లేడికన్నులవంటి కన్నులుగల యాయింతులయొక్క - చలి...బులు = చలిత = కదల్పఁబడిన - కంకణ = చేతి కడియములయొక్క - సంకుల = ఒండొకటిం గూడుకొన్న - క్రేంకారంబులు = క్రేమ్ క్రేమ్ అనెడిధ్వనులు, ఆన...పన్ - ఆనన = ముఖములయొక్క - ఆమోద = పరిమళముచేత - మేదుర = దట్టమయిన - అళి = తేంట్లయొక్క - ఝుంకారంబుల = ఝుంఝుం ధ్వనులయొక్క - బింకంబులు = అతిశయములను, అడంపన్ = అతకరింపఁగా; (ఇప్పటికి కొమిరెవేశ్యలవృత్తము సరి).

10. (బుక్కావాండ్రవర్ణన.) - చెవులసంకులు = శంఖనిర్మితకర్ణాభరణములును, లోవంక భుజంబులు = లోపలి ప్రక్కకు వంగిన బాహువులును, కొంకిసిగలు = వంకరజుట్టుముడులును, కావిదుప్పట్లున్ = జేగురువన్నె కప్పడములును, ఒప్పన్ = సొంపుపడియుండఁగా, ఇమ్ము = తమతొంటి నివాసస్థానము, దెప్పరంబు = ఆపత్ప్రాప్తము, ఐ = అయినందున, ముప్పనన్ = ముసలితనమందు, అప్పురంబు = ఆవిల్లిబుత్తూరియందు, చేరి = ప్రవేశించి, రసికజనబాంధవంబునన్ = రసజ్ఞు లయినవిల్లిబుత్తూరిజనులచెలిమిచేత, బంధువియోగంబు = తొంటిస్థానమందలి బంధువులతో ఎడఁబాపును, మఱచి = స్మరింపక, గంధ...లన్ - గంధకలనా=పరిమళ ద్రవ్యములం గూర్చుట - కుసుమస్రక్ = పూదండలయొక్క - గ్రథన = కూర్చుట - ఆదులన్ = లోనగు పనులయందు, ఆంధ్యంబు = గ్రుడ్డితనము (పొరఁబాటు), లేక, అలరు = ఒప్పుచున్న - ఆంధ్రదేశీయులు = తెలుఁగునాఁటివారు, అగు - గంధకారులు = బుక్కావాండ్రు, పాటి...లతోన్ - పాటిపాటి పద్యంపు = చిన్నచిన్న పద్యముతోఁ గూడిన - మ్రొక్కులతోన్ = నమస్కారములతో, వెఱ్ఱివెఱ్ఱి = వికృతచేష్టాసమేతమయిన - కైవారంబులున్ = స్తోత్రములు చేయుచు (చేయువారు ఆబుక్కాదాసరులు), గొరుతత్తడులపైన్ - ఏనుఁగులమీఁదను గుఱ్ఱములమీఁదను, వచ్చు - రాచవారిపై = దొరలమీఁదను, ఆళువారిపైన్ = విష్ణుచిత్తస్వామిమీఁదను, ఆడువారిపైన్ = ఆయనసమ్రోల నాడుచువచ్చుచున్న ఆటగత్తెలమీఁదను, చల్లగాన్ = శీతలముగా, చల్లన్ = చల్లినంతట, పెల్లు ఎగసి = మిక్కుటముగా రేఁగి, సృష్టియెల్లన్ = ప్రపంచమంతయు, ముష్టీకరించుచున్ = పిడికిటం బట్టినట్లుగా చేయుచు - అస్పష్టభేద = వస్తుభేదము తెలిసియుండెలియనట్లుగా అంతయు బుక్కాగానే చేయుచున్నది, అగు - పరిమళసముష్టిన్ = సుగంధములమొత్తములో, పెట్టు = ముంచుచున్న - పిష్టాతకంబు = బుక్కాము, నభోమండలికిన్ = ఆకాశచక్రమునకు, చండాతకంబు = చల్లాడము, ఐ, చండకర కిరణంబులన్ = సూర్యుని వెలుఁగులను (ఎండ ననుట), మాటుపఱుపన్ పన్నీరునించిన యన్నీరుతిత్తులు (తన్నీరను పా. ప్రామాదికము) = హిమాంబు పూరితములైన ప్రసిద్ధములైన నీటిసంచులను (పన్నీటికూజాలకు బదులుగా నుపయుక్తములయిన తోలుసంచులు సరంధ్రములు), ఒత్తన్ = పిసుకఁగా, వియత్తలంబునన్ = మింటికి, పాఱి = ఎగసి, కైవ్రాలు = వంపుగా పడుచున్న - ధారలన్ = పన్నీటిబొట్టులపాటుచేత, వాద్యంబులు (మద్దెళ లోనగునవి) తడిసినన్ (తడిసినవాద్యములు చక్కగా శబ్దింపమి ప్రసిద్ధము), విద్యా ఉపజీవులు = ఆవాద్యములను వాయించువిద్దెచేత జీవించువారైనజనులు, పుష్కరంబులు = వాద్యముఖములను, కాఁపన్ = కాఁచుకొనుటకు, అగ్గి గోయుచుండన్ =

నిప్పు వెదకుచుండఁగా. ఆమొత్తము = ఆజనసమూహము, అత్తఱిన్ = వాద్యగాండ్రు వాద్యములం గ్రాఁచుకొనుచుండు సమయమున; (ఇంతవఱకు బుక్కాదాసరులవృత్తము.)

11. నృత్తంబు = బోగమాటను, చూడన్ = చూచుటకై, నిలిచి, మెత్తమెత్తనన్ = మెల్లమెల్లఁగా, నడచుచుండు = నడచుచుండిన - మిండతండంబును = విటసమూహమును, తారున్ = తమరును (అనఁగా ఆ దాసరులును), అప్పిండు పుండరీకాక్షులు = ఆగుంపునందలి కమలాననలు, అవకాశంబు గాంచి = తెలిపి గనిపట్టి, కాశ కుసుమ ప్రతిఫలన పాండురంబులై = రెల్లుఁబువ్వుల ప్రతిబింబముల చేత తెల్లనివై, పద్యా...లకున్ - పద్యా = దారులయొక్క - అతి హృద్య = కడు మనోహర మయిన - పార్శ్వద్వయ = ఇరుప్రక్కలయందలి - ఉద్యానపాదపంబులకున్ = తోఁటచెట్లకు, పాఱుచెంగలువ కాలువలకున్ = ప్రవహించు నెఱ్ఱగలువ కాలువలకు, డిగ్గి = దిగి (దిగినవారు ఆమిండ తండము పుండరీకాక్షులును), కాసరీ...గాన్ - కాసరీదధి = గేదెపెరుగుయొక్క - మండ = మీఁగడ చేత - మాసరంబులుగాన్ = ఒక్కనగా, పిసికి, ఆరం బెట్టిన - నారంగశృంగబేరభంగంబులతోన్ = నారింజపండ్లయొక్కయు అల్లముయొక్కయు తునియలతో, కట్టిన కలమాన్నంపుఁ జలిది = మూటకట్టిన వరియన్నపుఁ జలిదిని, పోకపొత్తులన్ = పోకపట్టలలో, కుడువన్ = భుజించుటకై, కూర్చుండన్ = (ఆమిండతండము) ఉపవేశింపఁగా, వీక్షించి (చూచినవారు దాసరిగుంపు);

12. కుక్షింభరిత్వంబునన్ = పొట్టఁబోసికొను భావముచేత, క్షుత్క్షాములై - క్షుత్ = ఆఁకటి చేత - క్షాములై = కృశించినవారై, తిరిగితిరిగి = వలసినంతయు ఒకచోట నే దొరకనందున పలు తావులకు పలుమాఱు పోయిపోయి, వేసరి = విసికినవారై, ఓసరిలిన దాసరిగుంపు = ఒక ప్రక్కకొదిఁగియున్న దాసరులసమూహము, వారిపాలన్ = ఆచలిది భుజించుచున్నవారివలన, గోపాల భిక్షన్ = మధుకరమును (దాసరులు తమకు ఇడిన యన్నకబళము చే గోపాలదేవునికి ప్రీతియగు ననుభావమున - 'గోపాలభిక్ష,' 'గోపాలభిక్ష' యని కబళము యాచింతురు; దానినే సంకెగోపాల మనియు పలువురు పేర్కొందురు.), భిక్షించి = యాచించి, భక్షింపన్ = భుజించువారై, తీర క్షోణులన్ = ఆకాలువల దరినేలలయందు, నిలిపిన = ఉంచిన - తోరం...లై - తోరంపు = లావు పాటి, దివెదారికోలల = దివ్వెకంబములయొక్క [పా. తిరువిళక్కోలల - తిరు = శ్రీ - విళక్కు = వెలుఁగు = దీపముయొక్క - కోలల = కఱ్ఱల (కంబముల) యొక్క] - రంధ్రగోళంబులన్ = గుండ్రని బొక్కలయందు, ఉత్ కీలంబులు = ఉద్ధృతమయిన జ్వాలలు కలవి, ఐ, ధగ...ధ్యన్ - ధగధగని = ధగధగ యనుచు - మండు = వెలుంగుచున్న - జగజ్జోతి = ఆపేరం బ్రసిద్ధమయిన - దీప = దివ్వెల - జాలంబులమధ్యన్ = సమూహముల నడుమను (జగజ్జోతి యని ప్రమిదెలో నూనెకును వత్తులకును బదులుగా నూనియం దడిపిన వస్త్రఖండములను వైచి వెలింగించు దీపము. - 'జగజ్జోతి' యని తద్భవశబ్దము - జగజ్జోతిపేరి దీపజాలములు అని మధ్యమపదలోపి సమాసము), ధూపకుండికా అంగారంబులన్ = పరిమళ ధూపార్థమైన పాత్రములలోని నిప్పుకలమీఁది, నిరాఱన్ = తడిపోవు నట్లు, కాఁచి, నాదు పరికింపన్ = నాదమును పరీక్షించుటకై, వాయించు ధిమధిమి ధ్వానంబులకున్ = పూర్వము చెప్పిన పన్నిటికి తడిసిన వాద్యములను ఆవాద్యజీవులు వాయింపఁగా నయిన ధిమిధిమి శబ్దమునకు, బెదరి = భయపడి, ఈవలి యుపవన శుకంబులు = ఈ ప్రక్కనున్న తోఁటలోని చిలుకలు, ఆవలికిన్ = అప్రక్కకును, ఆవలి యుపవన శుకంబులు ఈవలికిన్, దట్టంబుగాన్, కట్టని

తోరణంబులై = ఒకరు గ్రువ్వని తోరణములుగా (చిలుకలు పచ్చని వగుటచే మామిడియాకులవలె నుండును, గాన వానిబారు మామిడియాకుల తోరణంబులవలె నుండును, గాన కవి వర్ణించినాఁడు); ... [తలలు విసరుట స్వారస్యగ్రహణచేత, నోరు తెఱచుట ఆశ్చర్యానందములచేత, కేలుసఱచుట తాళమునకై], కోలాహలంబు = కలకలధ్వని, మూక గట్టిన = మూఁగతనము వహించిన [ఎంతబిగ్గఱగా పాడినను వినఁబడనందున పాటమాని యూరకుండి రనుట], భాగవత జాతంబులు = భగవద్భక్త సముదాయంబులు. ఏతేరన్ = రాఁగా;

13. ఊరూరి సంతసంతకున్ = ప్రతియూరి ప్రతిసంతకును, తిరుగన్ = పోవలసినవారగుటం జేసి పోవుటకై, పెద్దలు, ఇంటింటన్, సంత...లకున్ - సంతరించిన = పెంచియుంచిన - పిలుకువాటు గోడిగల జావడంబులకున్ = పిల్లలను ఈనెడి యాఁడుగుఱ్ఱపుఁదట్లకు, పుట్టి, కాలు గట్టి విడువన్ = నిడుపైన త్రాటిని కాలికి కట్టి వదలివైవఁగా, నెత్తంబునన్ = ఊర నెల్లవారికిని సామాన్యమయిన ప్రదేశమందు, మెత్తని = మృదువైన - గఱికన్ = దూర్వను, మేసి = భక్షించి, పొసరించి = పొతరించి = పొగరెక్కి, మాపు మాపునన్ = ప్రతిసాయంకాలమందును, మేపు = మేపునట్టి - సజ్జకవణంపు మేపునన్ = గంటుదాణా తినుటచేతను, పిడు...నన్ - పిడుక = పసికి గుండ్రగా తట్టి యెండఁబెట్టిన పేఁడ - గొఱపంబు = గుఱ్ఱమును తోముసాధనము - వీనితోడి - తోమకంబునన్ = తోముటచేత, పుటపుటనై = నిగనిగయై. కఱియకంబడి పాఁత = నల్లని గొంగళిపేలికను, కనిరియైనను = మాంచినను, నీడం గనిరియైనను, బెదరు తట్టువ గుంపు = భయపడునట్టి లేఁత కత్తిరితొళ్వముల సమూహముయొక్క - కాలికొలందికిన్ = కాలి పొడుగునను, వ్రేలు లాలుకుంచెలు = వ్రేలాడుచుండు నెఱ్ఱకుచ్చులు, కీలించిన గవ్వదంటలన్ = కట్టినగవ్వదండలతోను, గంటలన్ = గంటలతోను, అలంకరించి. మోలుగు (రూ. ములుగు) మడ్డిన్ = నల్లవాయ చెక్కను త్రాఁపఁగా నేర్పడు చిక్కని నల్లమడ్డిలో, తోఁచి = [illegible], మూరకున్ = మూరెఁడు మూరిమునకు, ఒక్కండును = ఒకటియు, జేనకున్ = జేనెఁడు మూరిమునకు, ఒక్కండునుంగా, కట్టిన సోల్లుటుల్లాసులు = కట్టినట్టి వ్రేలుడు [illegible], ఉల్లసిల్లన్ = శోభిల్లునట్లుగా, పల్లించిన పల్లంబులపైన్ = పన్నినట్టి పల్యాణంబుల మీఁద (జీనుల మీఁద అనుట), చిల్లతెలంబు = ఇండుపుగింజలనూనెను, వాసనకొడుపులన్ = పరిమళద్రవ్యమును వస్త్రాగ్రులకు పట్టించెడు కుంచెలతో, పూసిన మణుంగురుంద్రిక చేలలై = పట్టించిన యుఁగ్కన ధవళవస్త్రములై, రవణంబులుగాన్ = అలంకారములు కాఁగా, ఎదురుగాన్ = ఆజన సమూహమునకు అభిముఖముగా, వేడుకన్ = సంబరమును, ...ఆవ్వీటి = ఆయూరియొక్క - మేటి = గొప్ప - సాలె = తంతువాయులు (వస్త్రములు నేయువారు) - అగసాలె - సౌనార్యులు - పట్టుసాలె = పట్టుసాలీలు - వాని = ఒకజాతి కోమటులు - వైజాతి = పలుపవాండ్రు (కోమటులు అని కొందఱందురు?) - సాఁతులు = గోనెలు నేయువారు (పెరికెలు) - ఏతుల = చాప లల్లువారు - ఈజాతుల - కొమరులు = వయసువాండ్రు [పా. కొమిరెలు = వయసుస్త్రీలు], తుములమై = గుమిగూడి, వచ్చు - తత్ చమూ సామజంబులన్ = ఆ (రాజులతోడి) సేనలయందలి యేనుంగులను, చూచి, ఏచిన వెఱన్ = ఉద్రిక్తమయిన భయముచేత, తమ - ఎక్కిరింతలు వాహనములు, (వానిని తాము) ఎక్కికొని = అధిరోహించి, వాగెలు = వల్గలు (ప్రగ్గములు = కళ్లెములు), ఇరుగేలన్ = రెండు చేతులతోను, కుదియం బట్టినన్ = బిగియలాగినను, నిలువక = నిలువనివై (ఇందులకు 'ఎక్కిరింతలు' కర్త.)...త్రొక్కుచున్ పోవన్ (కర్త 'ఎక్కిరింతలు');

14. తన్మ...లు - తత్ = ఆప్రజలయొక్క - మధ్య = నడిమిప్రదేశమందున్న - వృద్ధ వధూ ఆతుర ఆదులు = ముదుసళ్లు స్త్రీలు రోగులు లోనగువారు, తిట్టన్ = అశ్వములను తమ మీఁదికి ఎక్కించినా రని ఆయశ్వారోహకులను శపింపఁగా, ఇట్టు అట్టు అనలేక = ఏల మమ్ము తిట్టెదరు అని యాక్షేపింప న్యాయములేక, ప్రాణంబులు పిడికిటం బట్టుకొని పోవుచున్ = గుఱ్ఱములమీఁదనున్న యాపురుషులు తమ్మెక్కడ నవి యేయాపదలో త్రోయునో అని దిగులు పడుచు, నవీన సవిధ కేదారంబులన్ = క్రొత్తవైన చెంగటి వరిపొలములలో, పడి దొరలి, చట్టలు = పిలుఁగులు, దిగంబడి = చేనిలో పూడిపోయి, వెడల లేకుండన్ = పైకి లేచి రాలేనివారై, తారు దిగుటకు ఇమ్ములేక = గుఱ్ఱములమీఁదనున్న యావస్త్రకారాదులు ఎటువైపునను గుఱ్ఱమునుండి దిగుటకు చోటు లేనందున, పిమ్మటఁగొని = వ్యథపడుచు, నలుదెసలం జూడన్ = ఆసాలెరౌతులు చేయునదిలేక అన్నివైపులను చూచుచుండఁగా, చూచి = (ఆవేశ్యలు) కని, కేలుసఱచి = చేతులు తట్టి, కోహో (ఇది పరిహాసశబ్దము) యని గేలి (= హేళనము) సేయుగణికా (= వేశ్యా) కదంబంబుల (= సమూహముల) చప్పటులు (= కరతాడధ్వనులు), నిబి...బులన్ - నిబిడ = దట్టమయిన - నిష్కుట = ఉపవనములయొక్క - విటపి = చెట్లయొక్క - ఘాటంబులన్ = సమూహములందు, ప్రతిశబ్దంబులు = ప్రతిధ్వనులను, పుట్టింపన్ = కల్పింపఁగా;

15. ఇట్లు, అనూనవిభవంబు = కొఱవడని యైశ్వర్యము, చిగురొత్తన్ = విజృంభింపఁగా, అతిరుపతిన్ = దివ్యక్షేత్రమైన యావిల్లిపుత్తూరు, చొచ్చి = ప్రవేశించి, ఆవిష్ణుచిత్తుండు = ఆపెరియాళ్వారు, తత్ రథ అవతరణంబు = ఆబ్రహ్మరథమునుండి దిగినవాఁడై, ఆచక్రధరు = ఆనారాయణునియొక్క - నగర = మందిరముయొక్క - మొగలన్ = ముఖశాలయందు, నిలుచుటయున్ = నిలిచి, ధర...ంబు - ధరణీధవ = రాజులయొక్కయు - స్థానిక = దేవాలయాధికారులయొక్కయు - సమూహము = బృందము, వెంట రాన్, ఆవైకుంఠున్ = ఆమహావిష్ణువును, సేవించి, తత్ = ఆవైకుంఠునియొక్క - ప్రసాద = అనుగ్రహముచేత - లబ్ధంబులు = పొందఁబడినవి, అగు, పరివట్టంబునన్ = భగవత్ప్రసాదముగా దత్తమై శిరమునకుం జుట్టుకొనునదియైనపట్టుతో, అలంకృతుండై = కైసేయఁబడినవాఁడై, నానా అలంకార సహితంబును = అనేక భూషణములతోఁ గూడుకొన్నదియు, రత్నకాంచన మయంబును = మణిహేమ వికారంబును, అయిన - ఆత్మీయ భవనంబున్ = తనయింటిని, కాంచి, విస్మితుండై = ఆశ్చర్యపడినవాఁడై, పుండరీ...గాన్ - పుండరీకాక్ష = ఆవైకుంఠునియొక్క - మహిమ = ప్రభావముచేత - అలబ్ధ = పొందఁబడిన - వైభవంబుగాన్ = ఐశ్వర్యముగా, తెలిసి = గ్రహించి, తత్ర...లన్ - తత్రత్య = అటనున్న - ధాత్రీకళత్ర = భూనాయక (రాజ) - వర్గంబులన్ = సముదాయములను, అనిపి, ప్రవేశించి = (యథావిధిగా) చొచ్చి,...శతగుణంబుగాన్ = నూఱుమడుంగులుగా, భాగవత = భగవద్భక్తులయొక్క (శ్రీవైష్ణవులయొక్క) - పూజా = అర్చయందు - ప్రవణుండు = తత్పరుండు, ఐ, ఉండెన్ ...

ఈవచనములో - స్థానికులు ఆవిష్ణుచిత్త స్వామిని ఎదుర్కొని పరమభక్తి పురస్సరంబుగా సత్కరించి, బ్రహ్మరథంబున పట్టణములోనికిం గొనిపోయి, మహావిష్ణుని యాలయమున తత్సేవ చేయించి, భగవదనుగ్రహావశంబున మహావైభవసమృద్ధమైయున్న యాభక్తునియింటం జేర్చిరి. వరుసగా సాగనంపవచ్చిన రాజకుమారులు, నానానగరజనపదములనుండి తద్దర్శనార్థము వచ్చిన

రాజకుమారులు, మేళములుగట్టి విష్ణుచిత్తమహాయోగిని సేవింపవచ్చిన వేశ్యలు, గ్రామగ్రామ గ్రామణులు, రాజకుమారులు ఆవేశ్యలతో తచ్చనలాడుట, ఆంధ్రదేశాగతులైన బుక్కాదాసరులు, మిండగాండ్ర తండములు, చలిదిభోజనములు, అగసాలెలు లోనగువారు వారెక్కిన గుఱ్ఱములు సేనాగతములైన కుంజరబృందములం గని వెఱచి సకల జనములం ద్రొక్కిళ్లం బెట్టుట, ఆసాలె పీయలే గుఱ్ఱములతోఁగూడ పొలములలో పడి కొంత దేహము పూడుకొనిపోవుట, పిమ్మట ఆమహాయోగిని స్థానిక ప్రభృతులు తన్మందిరముం జేర్చుటయు లోకాతీతప్రజ్ఞతో వర్ణింపఁబడినవి.

మ. ఉలుపాల్వట్టినయిండ్ల మజ్జనన్నృపార్హోదారభుక్తిక్రియో
జ్జ్వలులై, రే హరికోల్వునన్ వివిధలాస్యస్పర్ధిసుభ్రూభ్రుకుం
సులవాదు ల్సరిదేర్చి పుచ్చి, మణివాసోభూషణగ్రామముల్
జలజాతాక్షునకున్ సమర్పణము నిష్ఠం జేసి, యవ్వేకువన్. 36

ప్రభువులు,=దొరలు, (తరువాతి పద్యమునుండి తెచ్చుకోవలయును), ఉలుపాలు=కానుకలు, పట్టినయిండ్లన్ = ఎవరు పెట్టి దర్శించినారో వారియిండ్లయందు, మ...లు - మజ్జన = స్నానము - నృప = రాజులకు - అర్హ =తగిన - ఉదార = శ్రేష్ఠమయిన - భుక్తి క్రియా = భోజనకృత్యము అనువీనిచేత - ఉజ్జ్వలులు = మెఱయుచున్నవారు, ఐ, రే = ఆరాత్రియందు, హరికొల్వునన్ = నారాయణుని సేవయందు, (గుడిలో భగవత్సేవగా జరుగు నృత్యములో), వివి...దుల్ - వివిధ = పలుతెఱంగులైన - లాస్య = నర్తనములందు - స్పర్ధి = ఒండొరుల నోడింపఁ గోరుచున్న - సుభ్రూ = లావణ్యవతులయు - భ్రుకుంసుల = నట్టువులయు - వాదుల్ = వాదములను, సరి తేర్చి = సరియైనదానిని ఏర్పఱచి, పుచ్చి = వారిం బంపి, ఆజలజాతాక్షునకున్ = ఆనారాయణునకు, మణి...ముల్ - మణి = రత్నములయు - వాసః = వస్త్రములయు - భూషణ = నగలయు - గ్రామముల్ =సమూహమును, నిష్ఠన్ = భక్తితో - సమర్పణము=అర్పణము. చేసి, ఆ వేకువన్ =రాత్రి వేగునప్పుడు - ('అరిగిరి' అను ననంతర పద్యములోని క్రియతో నన్వయము).

విష్ణుచిత్తమునిని సాగనంప వచ్చిన దొరలు మాయింట విందునంగీకరింపవలయునను ప్రార్థనగా తమ్ము కానుకలుబెట్టి దర్శించిన యాయావిల్లిపుత్తూరి పౌరులయిండ్లయందు రాజార్హములయిన మజ్జనభోజనాద్యుపచారముల ననుభవించి ఆరాత్రి యచ్చటి భగవత్సన్నిధిలో అన్యోన్యజయేచ్ఛచే తమప్రావీణ్యములను నిజలాస్య విద్యానైపుణిం జూపించుకొన్న యాటకత్తెలయు అట్టి నట్టువులయు తారతమ్యములను నిర్ధారించి చెప్పి వారిని సమాధానపఱచి బహుమతులిచ్చి పంపినవారై ఆభగవంతునికి భక్తిపూర్వకముగా రత్నవస్త్రభూషణసంహతుల నర్పించి తెల్లవాఱుచున్నంతట తమ నగరములకుం దరలిపోయిరి.

'ఉలపా' - (ఉలుపా) అన్యదేశ్యము 'రే' - కాలవాచకముగావున సప్తమ్యర్థమున వికల్పముగా ప్రథమ. 'రేన్' అనిసప్తమ్యర్థద్వితీయగా సేని ఛేదము చేసికొనవచ్చును. 'లాస్య' - 'తాణ్డవం నటనం నాట్యం లాస్యం నృత్యం చ నర్తనే' అమ. లాస్యము సుకుమారము తాండవము ఉద్ధతము, అనిభేదము; భరతసూత్ర మిట్లున్నది:—

'తత శ్చ భరతః సార్ధం గన్ధర్వాప్సరసాం గణైః,
నాట్యం నృత్యం తథా నృత్త మగ్రే శమ్భోః ప్రయుక్తవాన్;

పర్యాప్త ముద్ధతం స్మృత్వా స్వప్రయుక్తం తతో హరః
తద్గానా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీదిశత్,
లాస్య మస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యా సముదీదిశత్.'

'సరిదేర్చి' - ఆదొరలు ఇట్టి కళావిశేషములందు కుశలు లని సూచన. సంపన్నులయిన విలాసులకు ఇది సిద్ధమేగదా. 'సుభ్రూః' - సుభ్రువు - శోభనమైన కనుబొమలు కలది - అందగత్తె యనుట - 'భ్రుకుంసుఁడు' - 'భ్రువా కుంసో భాషణ మస్య - భ్రువాకుంసయతి వా' రామాశ్రమి. "భ్రకుం సశ్చ భ్రుకుంసశ్చ భ్రూకుంస శ్చేతి నర్తకః । స్త్రీవేషధారీపురుషః" అని అమరమున ఈశబ్దము స్త్రీవేషధారి పురుషునికే పేరుగా పఠితమైనను, లోకములో నటమాత్రపరముగాఁ గనఁబడు చున్నది: - "సర్వం తిష్ఠతు సంసదః పతి రసౌ సంధ్యాభ్రుకుంసో హరః" - మల్లికా.

'వాడు' - వాదశబ్దమునకు వైకృత మనికొందఱు.

తే. ప్రభువు లరిగిరి క్రమ్మఱఁ బాండ్యనగరి. । కమ్మునియు నట్లు వైష్ణవాభ్యర్చనంబుఁ
దన చిరంతన తులసికాదామకరణ । దాస్యమును జేసికొనుచుఁ దత్పరత నుండె.

క్రమ్మఱన్ = మరల, పాండ్యనగరికిన్ = పాండ్యదేశరాజధానియైన మధురాపురికి, అరిగిరి = పోయిరి. అమ్మునియున్ = ఆవిష్ణుచిత్తుఁడును, అట్లు = యథాపూర్వముగా, వై...బున్ - వైష్ణవ = విష్ణు భక్తులయొక్క - అభ్యర్చనంబున్ = పూజను, తన...మును - తన = భగవంతునికి తానుచేయుచుండిన - చిరంతన = చిరకాలమునుండి జరుగుచున్న - తులసికాదామ = తులసీమాల్యముల - కరణ = రచన (గ్రుచ్చుట) యనెడు - దాస్యమును = సేవను, చేసికొనుచున్, తత్పరతన్ = భగవత్పరాయణత్వముతో, ఉండెన్.

'చిరంతనము' - 'చిరంభవమ్' భవార్థమున ట్యుల్ప్రత్యయము. ఇట్లే సాయంతనము, సాయంభవము - ఇవి విశేష్యనిఘ్నములు, కావున 'ప్రతిపూర్ణమా సాయంతనమునఁ బ్రకటింపఁ బడును' అనుట దుష్టము. 'దాస్యము' - దాసస్య కర్మభావో వా. 'చేసికొనుట' = ఫలమును భవింపఁ గోరిచేయుట గావున ఆత్మనేపదము.

వ. ఒక్కనాఁడు మధ్యాహ్నసమయ మాలికా సమారోపణానంతరంబున మందిరంబునకు బోవునతనిం బ్రసాదమందస్మిత సుందరవళక్షం బగుకటాక్షంబున వీక్షించి పక్షిపుంగవకేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. 38

ఒకనాఁడు, మ...నన్ - మధ్యాహ్నసమయ = నడిపగలింటికాలపు - మాలికా = దండయొక్క - సమారోపణ = (స్వామికంఠంబున) చక్కఁగా నుంచుటకు - అనంతరంబునన్ = తర్వాత, మందిరంబునకున్ = తనయింటికి, పోవునతనిన్ = చనుచున్న యాపెరియాళ్వారును, పక్షి...నుండు - పక్షిపుంగవ = పక్షిశ్రేష్ఠుఁడైన గరుత్మంతుఁడు - నికేతనుండు = చిహ్నముగా గలవాఁడు - ఐన నారాయణుఁడు, ప్రసా...బు - ప్రసాద = కరుణతోడ - మందస్మిత = చిఱునగవుచేత, సుందర = అందంబుగా, వళక్షంబు = తెల్లనిది, అగు, కటాక్షంబునన్ = కడకంటిచూపుతో, వీక్షించి = చూచి, పుం...కున్ - పుండరీక = తెల్లదామర - నికేతనకున్ = ఇల్లుగాఁ గలదైన లక్ష్మితో, ఇట్లు = ఈచెప్పఁబోవు ప్రకారమున, అనియెన్ = వచించెను.

ఒకనాఁడు ఆవిష్ణుచిత్తుఁడు వాఁడుక ప్రకారము మధ్యాహ్నకాలంపు దండను భగవంతుని కంఠంబున నలంకరించి యింటి కేఁగుసమయాన ఆయనను భగవంతుఁడు కరుణతోడి మందహాస

ముచే వెల్లదనము మీఱుచున్న కడకంటి చూపులతో విలోకించి మహాలక్ష్మితో నిట్లు వక్కాణించెను.

'మాలికా' మాలయే మాలిక - 'మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని' - 'అమ. ఇట్లు ఈశబ్దములు సిగదండకు పేర్లుగా కోశమం దున్నను దండకే పేర్లుగా వ్యవహరింపఁబడుచున్నవి.

"మన్దాక్షనిష్పన్దతనోర్నతోర్వీమభ్యాయయతి స్మ తస్యాః
మధూకమాలామధురం కరంసా కణ్ఠోపకణ్ఠం వసుధాసుధాంశోః." నైషధ. 14 (47).

"అన్తరత ప్రార్థన మనిష్కప్రం జయన్త ముద్వీక్ష్య దరస్మితేన
అమృష్టవక్షోహరిచన్దనాఙ్కా మన్దారమాలా హరిణాపినద్ధా." శాకున్తల. అం. 7.

"దూర్వాఙ్కురాభ్యాం నలకణ్ఠనాళే వధూర్మధూక స్రజ ముత్ససర్జ."

"సా నిర్గలే తస్య మధూకమాలా । హృది స్థితా చ ప్రతిబిమ్బితా చ
కియ త్యమగ్నా కియతీ చ మగ్నా పుష్పేషుబాణాళి రివ వ్యలోకి."

'స్మిత'ము ధవళ మని కవిసమయము -

"యశసి ధవళతా హాసకీర్త్యోశ్చ తద్వత్" సా. ద.

'పక్షిపుంగవ' - పుమాంశ్చాసౌ గౌశ్చేతి పుఙ్గవః - ఎద్దు - ఆశబ్దము ఇట శ్రేష్ఠార్థగోచరము:-

'స్యు రుత్తర పదే వ్యాఘ్ర పుఙ్గవర్షభ కుఞ్జరాః
సింహ శార్దూల నాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' - అమ.

'నికేతనము' - ఇల్లు - "గృహం గేహోదవసిత వేశ్మ సద్మ నికేతనమ్" అమ. 'వళక్ష' - 'వళక్షో ధవళోర్జునః - అమ. 'పుణ్డరీక' - 'పుణ్డరీకం సితామ్భోజే' అమ. పుండరీకశబ్దమును కోశకారులు తెల్లదామరకే పేరుగా పఠించినను మహాకవులు కమల సామాన్యవాచకముగాఁ గూడ వ్యవహరింతురు; 'సింహాసనము చారుసితపుండరీకంబు' అని శృంగారనైషధాదిలో సరస్వతీస్తుతి.

## —* యామునాచార్యచరిత్రము *—

తే. 'యామునాచార్యుఁ డొక్కఁడు నీమహాత్ముఁ
డొక్కఁడును గాదె దర్శనం బుద్ధరించి
రస్మదీయకృపాతిశయమున,' ననిన
నిందిరాదేవి తనభర్త కిట్టు లనియె. 39

మహాత్ముఁడు - మహత్ = గొప్పదైన - ఆత్ముఁడు = చిత్తము గలవాఁడు (జ్ఞానియనుట), ('ఆత్మా యత్నో ధృతి ర్బుద్ధిః స్వభావో బ్రహ్మ వర్ష్మ చ' అమ.) దర్శనంబు = (సత్యమైన) నామతమును (అనఁగా విష్ణువ నైన నేనే పరమాత్మను అనెడు మతమును), ఉద్ధరించిరి = లేవనెత్తిరి (శైవాదికుమతములనడుమ అడుగంటిన విష్ణుపారమ్యమతమును సాధువుల యాచరణమునం దెచ్చిరనుట). ఇందిరా = లక్ష్మి.

క. 'ఇతనికథ యెఱిఁగినది కా, । యతఁ డేమి యొనర్చె?' ననిన నబ్జాక్షుం డా
శతపత్త్రనిలయ కిట్లను, । 'నతివ' కలం డొకఁడు మత్పదాశ్రితుఁ డాతన్. 40

కా = కాదా, అబ్జాక్షుండు = పద్మనయనుఁడు - విష్ణువు, శతపత్త్రనిలయకున్ = లక్ష్మికి (శతపత్త్ర మనఁగా నూఱు రేకులు గలది. పద్మ మనుట, అది నిలయముగా అనఁగా ఇల్లుగాఁ గలది

లక్ష్మి). అలివ = ఓయింతీ, కలండు = ఉండెను, అదిఁ = తొల్లి, మత్పద ఆశ్రితుఁడు = నాపాదములను కొలుచువాఁడు - నాథకృఁ డనుట.

ఆ. అతఁడు చిఱుతనాఁడె యాచార్యకులమున
వేదశాస్త్రముఖ్యవిద్య లభ్య
సించు చుండ, నపుడు చెలువ, యిప్పటి పాండ్య
నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు. 41

అతఁడు, చిఱుతనాఁడె = బాల్యమందే, ఆచార్యకులమునఁ = గురువునింట, వేదశాస్త్రముఖ్యవిద్యలు = వేదములును శాస్త్రములును ప్రధానముగాఁ గల విద్యలను - అభ్యసించుచుఁ = నేర్చుకొనుచు, ఉండఁ - ఉండఁగా, చెలువ=ఓయింతీ (ఓలక్ష్మి యనుట), అపుడు=ఆకాలమందు, ఇప్పటి యీపాండ్యనృపతి పూర్వవంశ్యుఁడు=ఈపాండ్యరాజునకు పూర్వుఁడు ఈవంశమువాఁడే.

వేదములు - ఋగ్యజుస్సామాథర్వములు ౪, వేదాంగములు ౬ - శాస్త్రములు - మీమాంసా న్యాయ పురాణ ధర్మశాస్త్రములు ౪ - అని విద్యలు ౧౪—

'శిక్షా వ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా
కల్ప శ్చేతి షడఙ్గాని వేద స్యాహు ర్మనీషిణః.'
'అఙ్గాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ.'

విద్యలు ౧౮ అనుమతమున ఈనాలిగింటిని చేర్చుకొనవలయును:—

'ఆయుర్వేదో ధనుర్వేదో గాన్ధర్వ శ్చేతి తే త్రయః
అర్థశాస్త్రం చతుర్థం తు విద్యా అష్టాదశ స్మృతా.' విష్ణుపు.

విష్ణుచిత్తుఁడు యామునాచార్యులకన్నం బూర్వుఁ డై యుండఁగా నిట భగవంతుఁడు యామునాచార్యుఁడే పూర్వుఁ డని చెప్పినందులకు - 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అనఁగా 'బ్రహ్మ మునుపటివలెనే మరల సృజించెను' అను ప్రమాణముచే, ఆపూర్వసృష్టిలోని యామునాచార్యుఁడు ఇప్పటి యీవిష్ణుచిత్తునికన్నం బూర్వుఁడే కావున స్వామి యట్లువచించె నని పెద్దలు సమాధానము చెప్పుదురు.

తే. వెఱ్ఱిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు,
నతి యొనర్పఁడు మామకప్రతిమలకును,
హరుఁడె పరతత్త్వ మను, మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నట్లె. 42

వెఱ్ఱిశైవంబు - వెఱ్ఱి = చిత్తవిభ్రమమైన - శైవంబు = శివుఁడే పరమాత్మ యనెడు మతము, ముదిరి = బలపడి, మత్వినుతిఁ = నాస్తుతిని, వినఁడు, మామకప్రతిమలకుఁ = నా వైనవిగ్రహములకు, నతి = నమస్కారము, ఒనర్పఁడు = చేయఁడు, హరుఁడె = శివుఁడె, పరతత్త్వము - పర = శ్రేష్ఠమైన - తత్త్వము = ఆత్మ, అనుఁ = అనిపలుకును. మదీయ ఆలయములఁ = నావైన గుడులందు, ఉత్సవంబులకుఁ = తిరునాళ్లకు, ఉలుకుఁ = భయపడును, నెయ్యురు = వానిమిత్రులుకూడ, అట్లె = వానివలెనే.

దుర్బోధనలు సేయున దైన శైవమతమును ఆరాజు కడుదృఢముగా అవలంబించి నాపొగడ్తలు విన నొల్లఁడు, నావిగ్రహములకుఁ మ్రొక్కఁడు, హరుఁడే పరమాత్మ యనివాదించును, నాదేవళ్ళములందలి యుత్సవములకు ఉలికిపడును, అతనిమిత్రులును అట్లే చేయుచుండిరి.

'వినఁడు', 'ఒనర్పఁడు'-భూతకాలవిశిష్టమైన వ్యతిరేకార్థములు. 'అనున్', 'ఉలుకున్' భూతముం జెప్పుతద్ధర్మార్థకములు. - 'పరఃశ్రేష్ఠారిదూరా । న్యోత్తరే క్లీబం తు కేవలే' మేదిని. 'తత్త్వం పరాత్మని । వాద్యభేదే స్వరూపేచ.' హైమము.

సీ. అశ్రాంత జంగమార్చాసక్తి వర్తిలు
వేదవిద్ద్విజపూజ వీటిఁ గలిపి;
భౌమవారపు వీరభద్ర పళ్లెరమిడు
గృహదైవతంబు లిట్టెంకు లింక;
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు సం
కరదాస మయ్య భక్తప్రతతికి;
నాద్యంబు లైన దేవాలయంబులు వ్రాల
నవని నిరాళ మఠాళి నిలుపుఁ;
తే. జందె ముత్తరశైవంబుఁ జెంది త్రెంచుఁ;
బతితు లారాధ్య దేవళ్లె ప్రాప్యు లనుచు
నుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు,
వెండి యే జంగ మెత్తిన వెరఁగుపడును. 43

వే...జ - వేద = వేదములను - విత్ = ఎఱుంగువా రైన - ద్విజ = బ్రాహ్మణులయొక్క - పూజ = సత్కారము, వీటిఁ గలిపి = నష్టము కావించి, అ...క్తిన్ - అశ్రాంత = తెంపులేని - జంగమ = జంగముదేవరలయొక్క - అర్చా = పూజయందలి - ఆసక్తిన్ = అభినివేశముతో - ('అత్యంతజంగమా' అను పాఠమందు - జంగమార్చయందు అత్యంత మయిన అనఁగా మిక్కుటమైనయాసక్తితో అని యర్థము.), వర్తిలున్ = వ్యవహరించును; గృహదైవతంబులు = ఇలువేల్పులు, ఇట్టెంకులుఇంకన్ = నిప్పస్తులచే ఇగిరిపోవుచుండఁగా, భౌమవారపువీరభద్రపళ్లెరము = ప్రతియంగారకవారమునను వీరభద్రునికి నైవేద్యపుఁబళ్లెము ఒసంగి ప్రమథగణముల కర్పించుటగా జంగములకు సంతర్పణ సేయును; సంకరదాసమయ్య భక్తప్రతతికిన్ = శంకరదాసమయ్య లని పేర్కొనంబడు శివభక్తుల సమూహమునకు. ఆరన్ = తృప్తికరముగా, [ఆఱన్ = నశింపఁగా అని కొందఱు] షణ్ణవతిశ్రాద్ధచయము = తొంబదియాఱు శ్రాద్ధములసమూహమును, పెట్టును; ఆద్యంబులు = ఆదికాలంబునుండి యున్నట్టివి ఐన, దేవాలయంబులు = దేవళంబులు, వ్రాలన్ = పూజానైవేద్యములు లేక పడి పోఁగా, అవనిన్ = భూమియందెల్ల, నిరా...ళిన్ - నిరాళ = నిరాళసంజ్ఞ లైన జంగాలకు - మఠ ఆళిన్ = మఠముల సమూహములను, (నిరాళమఠములని వీరశైవులలో ఒక తెగవారిమఠములు) నిలుపున్ = కట్టించును.

ఉత్తరశైవంబు = శైవమతమునందలి పైపడికట్టును, చెంది = పొంది (గురూపదేశము వలన నవలంబించి), జందెము త్రెంచుచు = యజ్ఞోపవీతమును త్రెంపివైచును; పతితులు = సదాచారమునుండి పడిపోయినవారైన, ఆరాధ్య దేవళ్లు = లింగధారి బ్రాహ్మణస్వాములే, ప్రాప్యులు = శుశ్రూషింప నర్హులు, అనుచుచు = అనిభావించి, వారిచేత = లింగధారులవలన, ఉపనిషత్తులు = వేదాంతములను, ఉబ్బి = సంతోషించి, వినుచుచు, వెండి = మఱి, ఏజంగము= బ్రాహ్మణేతరుఁడైన శైవుఁడు, ఎత్తినచు = (ఉపనిషదర్థములు చెప్పుటకు) పూనుకొన్నను, వెఱఁగుపడును = ఆశ్చర్యమొందును.

దక్షయాగధ్వంసానంతరము పరమశివుఁడు వీరభద్రుని అంగారకగ్రహముగాఁ గావించి నాఁడు. భౌముఁ డనఁగా భూపుత్త్రుఁడైన యంగారకుఁడు గావున భౌమవార మనఁగా అంగారకవారము. అట్లు ఆదినము వీరభద్రునివార మగుటచేత నాఁడు అతనికి పళ్లెర మెత్తుట.

'షణ్ణవతి' - తొంబదియాఱు. శైవము లేనప్పుడు 96 దినముల శ్రాద్ధములను వేద విద్ద్విజముఖముగా కావించుచుండినవాఁడు, పిమ్మట శైవంబుకతన జంగాలముఖముగా చేయు చుండె ననుట.

'అమాయుగమనుక్రాన్తి ధృతిపాత మహాలయాః
తిస్రోఽష్టకాశ్చ విజ్ఞేయాః షణ్ణవత్యః ప్రకీర్తితాః,'

'సంకరదాసమయ్య' అనుచో శవర్ణమునకు సవర్ణ మిడుట దుర్వ్యస్థలని వారపైఁగల తిర స్కారముచేత. 'ఎత్తిన' - ఇట నిపదము ద్రావిడమందు గల స్తుతిపర మని కొందఱనిరి. స్తుతి కన్నపూనికయే ప్రకరణోచితముగా నున్నది. ఇందులకు సదృశమైన ప్రయోగము.

తే. 'తండ్రి యిది యొక యత్యద్భుతంబు వినుము, దయ యొకింతయు లేక యుదగ్రవృత్తి
శాప మిచ్చె; నెక్కడనైన జనని ప్రజల కింతకీడొనరింపంగ నెత్తికొనునె?'

మార్కం. 5. 346.

'జంగము' లనఁగా సంచరించుచుండువారు, సంచరించుచుండు పరమశివులు, అని శైవులలో తొలుతం గలిగిన భక్తిపూర్వకవ్యవహారము లోకమునం బర్వినది. 'గృహదైవతంబులిత్తిం డులు' - ఋకారమునకును ఇంకుశబ్దములోని యికారమునకును యతి.

'వీరభద్రపళ్లెరము', 'శంకదాసమయ్య', 'ఆరాధ్యదేవళ్లు' - ఇవి ఆమతమువారి సాంకేతికపదము లగుటచేత వీనియందలి లక్షణదోషములు కవిని బాధింపవు.

ఆరాజు వేదజ్ఞులైన బ్రాహ్మణులను పూజించుటమాని జంగముదేవరలను పూజించుటయందు అమితాసక్తి వహించెను. ఇలువేల్పులను పస్తుపెట్టి ప్రతిమంగళవారమునను వీరభద్రునికి పళ్లెరముపెట్టెను. షణ్ణవతి శ్రాద్ధములందు భోక్తలనుగా బ్రాహ్మణులకు బదులు శంకరదాసమయ్యలను కూర్చుండఁబెట్టెను. బహుకాలమునుండి యున్న దేవళములను పాడుపెట్టి స్థిరజంగములకు మఠములు కట్టించెను, శైవములోను పైశైవమునం బ్రవేశించి జందెమును త్రెంపి వైచెను. పాపాత్ము లయిన యారాధ్య దేవరలే గురుత్వార్హు లని వారివలన ఉపనిషత్తులను వినుచుండెను. జంగ మెవఁడైన వానిని వచింపఁ బూనెనా ఆశ్చర్యపడి వినుచుండెను.

క. శివలింగముఁ దాల్చినజన | నివహం బేమైనఁ జేయనిది పాపము దా
నవుఁగా దనఁ డాసమయము | నవు నను విప్రులక యగ్రహారము లిచ్చున్. 44

జననివహంబు = మనుజులసమూహము, చేయనిదిపాపము = చేయకపోవుటయే వారిలోపము; అవుఁ గాదు అనఁడు = ఒప్పు తప్పు అని భేదము పలుకఁడు, ఆసమయము = ఆయాచారము (శైవుల చెడుకృత్యములందు తప్పు పట్టకయుండుట), అవును = సరి (ఉచితము); విప్రులకున్ = బ్రాహ్మణులకు, అగ్రహారములు = నల్లిండ్లు.

ఎవఁడైనను శివలింగమును ధరించినం జాలు; అట్టివాఁడు ఏపాపకృత్యముగాని చేయకుండుటయే వానిపాపము గాని చేసినచో ఆరాజు అందు తప్పెన్నఁడు; ఆనడువడి సరియే యని చెప్పెడు బ్రాహ్మణులకు అగ్రహారము లిచ్చును.

'నివహం బేమయినఁ జేయనిదిపాపము' - ఇట 'చేయక +ఇది' (చేయఁగా ఇది) అను పదచ్ఛేదము సరిగాదు. అందు యతిభంగము. ఇట 'చేయని యట్టియది' (= చేయమి) అని యర్థముగా 'చేయని' అనువ్యతిరేకార్థకవిశేషణమునకు 'అది' యను తచ్ఛబ్దార్థకముతోడి కర్మధారయసమాసమున సంధిలో తచ్ఛబ్దార్థకాకారమునకు లోపము రాఁగా విశేషణము తుదినున్న నివర్ణముతో యతిగా గ్రహింపవలయును.

'చేయనిది పాపము' - ఏయకృత్యమైనను నిర్భయముగాఁ జేయవచ్చును, ఏమిచేసినను నాక్షేపించువారు లేరు, అనుటకు ఇది వాడుకశైలి. - 'సమయ' మనఁగా ఆచార మనుటకు 'సమయాశ్శపథాచార కాల సిద్ధాన్త సంవిదః' అమ.

'అగ్రహారములు' - 'అగ్రః బ్రాహ్మణభోజనం తదర్థం హ్రియన్తే రాజధనాత్ పృథక్ క్రియన్తే తే క్షేత్రాదయః' సిలక్షణ.

తే. అతఁడు రాజ్యంబుఁ బాలించునవసరమునఁ | దనవశం బైనయట్టి తామ్రపర్ణిఁ
గలుగు నలపుట్టరాని ముక్తామణికు | లంబు మాహేశ్వరుల కంధరలకె తీఱెన్. 45

అతఁడు = ఆరాజు. రాజ్యంబు = తనయేలుబడిదేశమును, పాలించు అవసరమునన్ = ఏలెడుకాలమందు, తనవశంబు = అతనిస్వాధీనము, ఐన - తామ్రపర్ణిన్ = ఆతామ్రపర్ణీనదియందు, అల = ఆ, పుట్టరాని = మఱి యెక్కడను పుట్టని దైన - అనఁగా భూమిలోని ముత్తెములమొత్తములలో నెల్ల శ్రేష్ఠమైన - ముక్తామణికులంబు = ముత్తెపుఫలముల మొత్తము, మా... లకె = మహేశ్వరభక్తులయొక్క కంఠములకే, తీఱెన్ = సరిపోయెను.

[పా. 'ముక్తామణివర కులము మాహేశ్వరుల కంధరలకుఁ దీఱె.' - ముక్తామణివర = శ్రేష్ఠమయినమౌక్తికఫలములయొక్క - కులము = మొత్తము,...కంధరలకున్ = కంఠములకు అనఁగా మెడలోఁ దాల్చు రుద్రాక్షతావళములలో నడుమనడుమ గ్రుచ్చుకొనుటకు].

ఆరాజు పాండ్యదేశమును ఏలుచుండఁగా ఆదేశమందు ప్రవహించెడి తామ్రపర్ణినదిలో పుట్టెడు ముత్తెముల మొత్తమును లోకములోని ముత్తెములన్నిటిలోను శ్రేష్ఠమయినట్టివానిని శివభక్తులు అతనివలనం బడసి గొంతులలో అలంకారార్థము కట్టించుకొనుచుండిరి, అనఁగా అట్టి యమూల్యపూర్వవస్తువులను అన్నిటిని అతఁడు వారికే ఇచ్చివైచుచుండెను; అని అతనియపాత్రవినియోగమును దుర్మతాభిమానమును సూచించుట.

తామ్రపర్ణియందు ముత్తెములు పుట్టుట ప్రసిద్ధము.

ఉ. 'చూతమె డాని పక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక
వ్రాతములై వెలుంగు గరువంపుఁగోటూరుల నొప్పు తామ్రప
ర్ణీతటమట్లు జీర్ణదళబృంద సమావృతపాండురప్రసూ
నాతిమనోజ్ఞమూలముల నర్థి నెసంగు మహాకసాలముల్.' మను. 3 (80).

'నియమో యథా। ముక్తా స్తామ్రపర్ణ్యామే వాబ్ధి ష్వేవ మకరా నపి' అని కవిసమయములందు కావ్యకల్పలత.

'మణీః' - 'మణీ' అని రూపాంతరము. మహేశ్వరునియందు 'భక్తులు మాహేశ్వరులు.' 'తీరెన్' అనుటచే ఇచ్చివైచెనని భా.

'అలపుట్టరానిముక్తామణికులంబు' - 'అల' అనుపదము కులమునకు విశేషణము; నడుమ పుట్టన్, అనివ్యస్తపదము కలదు. కొందఱు మహాకవు లట్లు ప్రయోగించిరి గాని యది శాస్త్రసమ్మతము గాదు.

తే. అప్పు డిచ్ఛకులగుచు బ్రాహ్మణులు కొంద
ఱాత్మజనిభూమి విడువలే కలికభూతి
గడ్డముల నాన రుదురాక లిడ్డసంది
సూతసంహిత లీక్షించి చొరఁ దొడఁగిరి. 46

అప్పుడు = అంతటిట్లు శైవపక్షపాతము వహించినయాదినములలో, కొందఱు బ్రాహ్మణులు, ఆత్మ ... మి - ఆత్మ = తమయొక్క - జని = పుట్టువుయొక్క - భూమి = దేశమును, విడువలేక, ఇచ్ఛకులు = అతనియిచ్ఛప్రకారము నడచుకొనువారు, అగుచున్ = అయి, అలికభూతి = నుదుటివిభూతి, గడ్డములన్ అనన్ = గడ్డములకు తగులుకొనుచుండఁగా, రుదురాకలు = రుద్రాక్షలు, ఇడ్డ సందిన్ = ధరించినసందిటియందు, సూతసంహితలు = సూతసంహిత యను పేరిశైవగ్రంథంపుఁ బుస్తకములను, ఇఱికించుకొని, చొరఁదొడఁగిరి = అతనియోలగమునం బ్రవేశింప సాగిరి.

ఆ శైవోత్కర్ష దినములలో కొందఱు బ్రాహ్మణులు ఆమతము నొల్లనివారైనను జన్మభూమి వదలి పోలేక అతనికి ఇచ్ఛకముగా తాము మెండుశివభక్తిం జూపుటకై దండిగా ఫాలంబున గడ్డము వఱకు విభూతి పెండెకట్లు ధరించి సందిటఁగూడ రుద్రాక్షలు కట్టుకొని, సందిటిలో సూతసంహితా పుస్తకముల నిఱికించుకొని అతనిదర్శనమునకు తత్సభాభవనంబున దినదినము ప్రవేశించుచుండిరి.

'ఇచ్ఛకులు' - ఇచ్ఛాశబ్దవైకృతము. 'ఇచ్ఛగులగు బ్రాహ్మణౌఘమెల్ల' అని యొక పా. అందు విశేషణవిశేష్యములకు భిన్నవచనతాదోషము; ఉపలబ్ధములైన వ్రాఁతప్రతులయందు 'అగుచు బ్రాహ్మణులు కొందఱు' అనియేయున్నది. 'జని రుత్పత్తి రుద్భవః, లలాట మలికం గోధిః' 'భూతి ర్భస్మని సంపది' అమ.— 'రుదురాక' - రుద్రాక్షశబ్ద వైకృతము.

'సంది' - సందిలి - సందిదండ, సందికడియము ఇత్యాదులు వృత్తివశమున లివర్ణలోపముచే నేర్పడినవని యొకమతము; 'సందిలి' కి 'సంది' యని రూపాంతర మని యొకమతము. 'సూత సంహిత' - ఇది స్కాందపురాణములో నొకభాగము. శంకరాచార్యులవారు ప్రస్థానత్రయ భాష్యములురచించుటకు పూర్వము దీనిని తొమ్మిదిమాఱులు పఠించిరని తన్మతస్థులయైతిహ్యము. దాని నిఱికించుకొని పోవుట నిరంతరము దానినే చదువుచున్నట్లు తోఁపించుటకు.

క. శీలముఁ బట్టియు గంజా | హాల లుపాంశున భుజించునధముల బైటం
జాలఁడు వైవఁ విప్ర | స్ఖాలిత్యము బైలుసేసి కనుగిఱపు సభన్. 47

(ఆరాజు), శీలము=జంగమాచారమును, పట్టియున్ =స్వీకరించినవా రయ్యును, ఉపాంశువన్ = రహస్యముగా, గంజాహాలలు = గంజాయిని సారాయులను, భుజించునధములన్ = సేవించెడి నీచులను, బైటన్ వైవన్ జాలఁడు = వీరు ఇట్టి దురాచారము చేయుచున్నారు అని వారిని ప్రకటించుటకు అశక్తుఁ డగును (లేక - శైవమండలినుండి తొలఁగింప నేరఁడు). విప్రస్ఖాలిత్యము = బ్రాహ్మణులపొరఁబాటును, సభన్ = కొలువులో, బయలు సేసి = ప్రకటించి, కనుగిఱపున్ = శైవసభ్యులకు కన్నుగీటును.

శైవదీక్ష వహించినవా రయ్యును నీచులు లోలోపల గంజాయిని సారాయులను సేవించుచుండుట తా నెఱింగియు అతఁడు ఆగుట్టు బయటవైవఁడు; మఱి బ్రాహ్మణులయందు ఏపాటి పొరఁబాటు గలిగినను దానిని సభలో ప్రకటించి వారిని హేళనము చేయుఁడని శైవులకు కన్నుగీటును. 'పట్టియున్' - ఇందలి 'యు' శబ్దము ఆశీలమునకును గంజాహాలలసేవ నిషిద్ధమే యని తెలుపుచున్నది. 'గంజాహాలలు' - హాలాశబ్దము దేశభాషాపద మయ్యును సంస్కృతమున అతిప్రయుక్తమగుటచేత గ్రాహ్య మయినది. 'అతిప్రయుక్తం దేశభాషాపదమ్' అని వామన సూత్రము; - 'అతీవ కవిభిః ప్రయుక్తం దేశభాషాపదం ప్రయోక్తవ్యమ్ । యథా - యోషి దిత్యభిలలాప న హాలామ్ ఇత్యత్ర హాలేతి దేశభాషాపదమ్.' - 'హిత్వా హాలామభిమతరసాం రేవతీలోచనాఙ్కామ్' అని మేఘములో కాళిదాస ప్రయోగము. - 'సురాహాలిప్రియాహాలా పరిస్రుద్వరుణాత్మజా' అమ. ఇట్లీపదము సంస్కృతమందుం జేరినందున 'నామంబులతుది దీర్ఘమునకు హ్రస్వం బగును' అను సూత్రముచేత 'హాల' అను రూపము నిష్పన్నమైనది. కావున దీనిని తత్సమముగా గ్రహింపవలయును. అట్లయిన, 'గంజాహాలలు' అని అచ్చతెలుఁగు పదముతో దీనికి ద్వంద్వసమాస మెట్లు అని యాక్షేపమేని, దీనిని, వ్యస్తముగానే కైకొనం దగును. 'గంజా' - 'గంజాయి' అని ప్రసిద్ధరూపము, కలంజశబ్దమునకు వైకృతము.—'గంజాయి దినసేమి కల్లు ద్రావసేమి । యంజక ధనమిచ్చునతఁడె నా మెచ్చు' - హరిశ్చంద్ర ద్వి. 2.

'ఉపాంశునన్' - 'ఉపాంశు ర్జపభేదే స్యా దుపాంశు విజనేఽవ్యయమ్' మేదిని. రాహ్వాగులలో చేర్చుకొని 'వు' లోపమును సాధింపవచ్చును. ఇట్టిదే 'పరశు' - 'తునియునో పరశుచేఁ గుసియదో వృక్షంబు' - ఉ. హ. ఆ. 2 (176).

క. ఆరాజమహిషి యేని మ | దారాధనపరత నుండు; నట్లుండియు దు
ర్వారవ్యథకుం గానదు | పారము, విభుఁ డస్మదంఘ్రిభక్తుఁడు గామిన్. 48

ఆరాజుమహిషియేని = ఆతేనిపట్టపుదేవియన్ననో, మ...తన్ - మత్ = నాయొక్క - ఆరాధన = ఉపాసన - పరతన్ = ముఖ్యముగాఁ గలదానిభావమునందు (నాకొలువునందు అత్యంతాసక్తురాలై నన్ను దృఢభక్తితోఁ గొలుచుచు అనుట), ఉండున్ = వర్తిల్లును. అట్లు ఉండియు, ప్రియుఁడు = తనవల్లభుఁడు, - అస్మ...డు - అస్మత్ = నాయొక్క - అంఘ్రి = అడుగులయందు - భక్తుఁడు = తత్పరుఁడు, కామిన్ = కానందున, దుర్వారవ్యథకున్ = తొలఁగింపరాని దుఃఖమునకు, పారము = అవలిదరిని, కానదు.

అతని పట్టపురాణి అతనివలెఁ గాక నాయందు భక్తురాలై నన్నుకొలుచుచుండెను. అయినను కాంతుఁడు మత్పదభక్తుఁడు కానందులకై నిరంతరము మిక్కిలి వెతగుడుచుచుండెను.

'కృతాభిషేకా మహిషీ' అమ. మదారాధనం పరం యస్యాస్సా తస్యాభావః మదారాధనపరతా - "దూరానాత్మోత్తమాః పరాః," - 'పీడాబాధావ్యథాదుఃఖమ్'; "పారావారేపరార్వాచీ తీరే" అమ.

వ. మఱియు నప్పురంధ్రీరత్నంబు. 49

పురంధ్రీరత్నంబు = ఆయుత్తమకుటుంబిని. "స్యాత్తు కుటుంబినీ పురంధ్రీ," "రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి" అమ.

సీ. వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టుఁ దాన;
దశమినాఁ డేకభుక్తము సేసి, యవలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిట్రు;
బారసి పోసీదు, పైనిద్రఁ బాఱుట
క్కలుపాడు మత్పుణ్యకథలఁ ద్రోయు;
నేమంపుమూనాళ్లు కామింప దధినాథు;
మఱునాఁడు కన్నును మనసుఁ దనియ
తే. నారజపువన్నెఁ బ్రియుసెజ్జ కరుగుఁ గూర్మి;
నరుగుచో నాభిఁ దుడిచి కప్పురపు నాభిఁ
బెట్టు; నిట్టుల మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్ట మగుట. 50

వింగడము = సుందరము, ఐనట్టి (బృందావనికి విశేషణము) - ముంగిటన్ - నెలకొన్న బృందావనికిన్ = ప్రాంగణమందు నున్నట్టితులసీవనికి, తాన = తాను స్వయముగానే. ముగ్గుపెట్టును. దశమినాఁడు = దశమీతిథియందు, ఏకభుక్తము చేసి = ఒక్కపూట భోజనము చేసి - అవలినాఁడు = దానిమఱునాఁడు అనఁగా ఏకాదశినాఁడు, ఓర్చి = సహనముకలిగి, జాగరముతోన్ = నిద్రపోక, నిట్రు = శుష్కోపవాసము. ఉండును. బారసి = ద్వాదశీ వ్రతమును, పోసీదు = మానదు. పైన్ = వ్రతానంతరము, వచ్చునట్టినిద్రను, పాఱుటక్కలు = బ్రాహ్మణస్త్రీలు, పాడు (నట్టి) - మత్పుణ్యకథలన్ = పావనములైననాచరిత్రములను వినుచు, త్రోయున్ = పోఁగొట్టుకొనును. నేమంపుమూనాళ్లు = దశమి ఏకాదశి ద్వాదశి యనెడు నావ్రతదినములు మూఁటను, అధినాథున్ = పతిని, కామింపదు = పొందదు. మఱునాఁడు = అనంతరదినమున (అనఁగా త్రయోదశియందు), కూర్మిన్ = అనురాగముతో, కన్నును మనస్సునున్, తనియన్ = సంతుష్టిఁజెందునట్లుగా, ఆరజపువన్నెన్ = మనోహరమయిన శృంగారముతో, ప్రియుసెజ్జకున్ = కాంతునిశయ్యకు, అరుగున్ = పోవును; అరుగుచోన్, నాభిన్ = కస్తూరీ తిలకమును, తుడిచి (వైచి) కప్పురపునాభిన్ = కర్పూరపు బొట్టును, పెట్టున్ = ధరించును,

ఇట్టులన్ = ఈవిధముగా, మద్భక్తి = నాయందు ప్రపత్తి, పుట్టియున్ = కలిగియు, నిజేశు నెడన్ = తనపతియందును, భక్తి = తాత్పర్యమును, మదిష్ట మగుటన్ = పతిభక్తి నాకు ప్రియ మయినకారణముచే, చెడదు = వదలదు.

అతని పట్టపురాణి ముంగిట నున్న యందంపు బృదావనమునకు తానే ముగ్గులు పెట్టును. దశమినాఁడు ఒక్కప్రొద్దు ఉండి, ఏకాదశినాఁడు ఓపికతో శుష్కోపవాస ముండును; ఆరాత్రి జాగరము సేయును; ద్వాదశీవ్రతము తప్పక జరుపును. ఆపై వచ్చెడి నిద్రను బ్రాహ్మణస్త్రీలు పాడెడు నాపుణ్యకథలచే తొలఁగించుచుండును. ఇట్లు దశమ్యేకాదశీద్వాదశీతిథులందు నియమస్థయై పతిని పొందదు. మఱునాఁడు చక్షుర్మనఃప్రియ మగునట్లుగా మనోహర మయిన సింగారము చేసికొని అనురక్తితో ప్రియుని శయ్యం జేరును. అట్లు చేరునప్పుడు కస్తూరినామము తుడిచి వైచి కర్పూరతిలకము ధరించును. అంతియగాని విభూతి తిలకముం బెట్టదు. ఈవిధముగా నాయందు భక్తి గలిగియు పాతివ్రత్యము నాకిష్ట మగుటచేత పతిభక్తిని వదలదు.

'వింగడము' – వికటశబ్దమునకు వైకృతము – బృందావనికి విశేషణము. ఈయన్వయమును 45–వ పద్యములో 'అలపుట్టరాని' ఇత్యాది వాక్యమునందుంబోలె గ్రహింపవచ్చును. 'బారసి' – ద్వాదశికి వికృతి. 'అక్క'. పూజ్యస్త్రీపరము. 'కన్నును మనసు దనియన్' – 'యస్యాం మన శ్చక్షుషోర్నిబన్ధ స్తస్యామృద్ధిః' అని యంగిరోవచనము. 'సెజ్జ' – శయ్యకు వైకృతము. 'చెడదు' – సకర్మకమువోలె ప్రయుక్తము. 'కరుణ కలుగుమమ్మ కమలనయన' అన్నట్లు. 'నాంభి' – (కస్తూరి) నామము వైష్ణవచిహ్నముగాన పతి కప్రియ మని దానిని తుడుచుట. 'కర్పూరపుబొట్టు, విభూతి యని యాతఁడు తలంచుటకు. 'భక్తి చెడదు' – భక్తిద్వితీయార్థ.

క. వనజజరుద్రాదులు మ । త్తనువులె; తత్పూజనంబు తథ్యము మత్పూ
జనమె; తదీప్సితఫలదా । తను నేనె; యట్లైనఁ గలవు తరతమవృత్తుల్. 51

వన...లు – వనజజ = బ్రహ్మ – రుద్ర = శివుఁడు – లోనగువారు, మత్తనువులె = నా దేహములే, తత్పూజనంబు = వారియర్చన, తథ్యము = వాస్తవముగా, మత్పూజనమె = నా యర్చనయే, త ... తను – తత్ = ఆబ్రహ్మ శివాద్యుపాసనయొక్క – ఈప్సిత = కోరఁబడిన – ఫల = సిద్ధియొక్క – దాతను = ఇచ్చువాఁడను, నేన, అట్లైనను, తరతమవృత్తుల్ = తారతమ్యములు – క్రిందుమీఁదులు, కలవు.

బ్రహ్మ శివాదిదేవతలు నాశరీరములే, కావున వారి నుపాసించుట వాస్తవముగా నన్ను ఉపాసించుటయే, వారియాయుపాసనలకు కోరిన ఫలముల నిచ్చువాఁడను నేనే. అట్లయినను వారిని కొలుచుటకన్న నన్నే కొలుచుట మేలు.

'తరతమవృత్తుల్' – తరప్ తమప్ ప్రత్యయద్యోతితార్థములు భావములు – 'వనజజ' – వన జము = నీటఁ బుట్టినది – కమలము, దానినుండి – జ = పుట్టినవాఁడు – బ్రహ్మ.

క. కేవలశరీరదృష్టిన । దేవతల న్వేఱ కలుగఁ దెలిసినజడులన్
నావాసుదేవతాస్థితి । భావింపనిపూజ సాంత ఫలమై త్రిప్పున్. 52

కేవలశరీరదృష్టిన – కేవల = ప్రధానమయిన – శరీర = బ్రహ్మ రుద్రాదిదేవతల దేహముల యొక్క – దృష్టిన = పరికించుటచేతనే – బ్రహ్మ రుద్రాది దేవతలదేహములఁ చూచుటచేత –

దేవతలన్ = ఆదేవతలను, వేఱ = నాకన్న భిన్నముగా, కలుగన్ = ఉన్నట్లు, తెలిసినజడులన్ = తలంచిన మూర్ఖులను, వాసుదేవతాస్థితి = ఎవనియందు సమస్తమును వసించునో సమస్తమునందు ఎవఁడు వసించునో అట్టివాఁడ నై యుండుటునికిని, భావింపనిపూజ = తలంపనియర్చన, సాం ... ము - సాంత = అంతముతోఁ గూడిన, (శాశ్వతము గాని దనుట) - ఫలము = సిద్ధి కలది, ఐ, త్రిప్పన్ = మరల పూర్వస్థితికే తెచ్చును.

ఇతరదేవతల దేహములం గని వారు వాస్తవముగా నాకన్న వేఱుదేవతలు అని తలఁచి, వారు నాశరీరములేగాని, నాకన్న వేఱుగా రని యెఱుంగక, సమస్తమునందును నేనును నాయందు సమస్తమును కల దని తలంపక, ఇతరదేవతలను ఉపాసించి సిద్ధులుపొందువారికి ఆసిద్ధులు శాశ్వతములు గావు, అంతము గలవి; తదనుభవ మైనపిమ్మట ఆయుపాసకులు మరల తమతొంటి హీనదశకే వత్తురు:—

'వాసుదేవుఁడు'—

'సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః
తతోఽసౌ వాసుదేవేతి విద్వద్భిః పరిగీయతే.' విష్ణుపురాణము.
'త్రిప్పన్' - 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి.'

వ. మఱియు సింహాస్యంబుఁ దెలియక బ్భూపతి తామసుండై, మామకీనంబులగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుఁ, దద్వృత్తుల కగునుపద్రవంబుల నుపేక్షించుచు, రక్షావిముఖుండై యుండ వీక్షించి; కలియుగంబున ద్రవిడ మండలంబునఁ గృతమాలా తామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను, తద్దేశంబున కొడయం డతం డగుటను, రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ దత్ప్రతీక్షేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాని పొడమమియు, నాయాభిముఖ్యంబు సంవాదంబునంగాని పుట్టమియు, నే విచారించి, తదాభిముఖ్య కరణార్థంబుగ నాస్థానంబెక్కి వాదిజయంబు సేయవలయు ననుతలంపు విప్రకుమారునకుం బుట్టింప; నతం డేఁగి నానాదేశాగతసేనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు, పటువ్రణులకుం బెంపిండ్లు, కనుకనీతుల కుపనయనంబులకుఁ, బధిరాంధబధిరాదులకు సౌంపభేషజాదియానంబులు; మఱియుఁ జెఱువు గడపడియె ననియు, బేదగుడులకుఁ బూజ నడువ దనియు, నెడవునం జలిపంది రిడియెద మనియుఁ, దిథి చిక్కె ననియుఁ దీర్థయాత్రఁ జనియెద మనియును, వ్రతోద్యాపన కనియును, వ్యాధి మాన్పుకో ననియును, జెప్పి పంప, నారాణివాసంబు గుప్తాగుప్త ప్రకారంబులం బంపు ద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చుచుఁ దుస్సంగునపద్ధరులచేతులకుం గ్రంపకొని చే సాఁచిన సంచితతోరణంబు లై తోఁచు నేకదండి త్రిదండి బ్రహ్మచారుల యున్నమితసందంబుల నిండారు కాషాయవస్త్రవస్త్ర కౌపీనపటంపటలం గ్రమ్మి, కావళ్లవడగలజాడఁగొని, కేవలకార్పణ్యంబ విద్యగాఁ దక్కనవిద్య

లెఱుంగక వేఁడు నీదృగ్విధానేకప్రాణుల కాధారంబగు పడమటిద్వారంబుఁ జేరి; ప్రతిదినాస్మత్పాదభజన కథాశ్రుతపూర్వ యగు నాయుర్వీధవుదేవి కాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి; 'వైదేశికుండ, వైష్ణవ వటుండ, వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బనివాదించి గెలిచెద, వసుధావరుండు విష్ణుభక్తివిముఖుండు, గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వారు వెఱతురు; నీవు విష్ణుభక్తిపరాయణవు, పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి; నీవిభుఁడు నీకు విధేయుండు, విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి, నీదుభర్తకు భగవద్భక్తి పుట్టించి కృతార్థుం గావించెద, నని విన్నవింపంబంచిన. 53

రహస్యంబు='ఇతర దేవత లందఱు నాశరీరంబులే' అను నిత్యాది, తామసుఁడు=తమోగుణ ప్రధానుఁడు, మామకీనంబులు = మద్భక్తులు,...సామాన్యబుద్ధిన్ = ఉత్కర్ష లేనివారనుతలంపుతో, వృత్తులకు = జీవనములకు (క్షేత్రాదికమును), అగు నుపద్రవంబుల్ = సంభవించునట్టి కీడులను, ఉపేక్షించుచున్ = ప్రతీకారముచేయక విడిచివైచుచు, రక్షావిముఖుండై = రక్షించుట మాని,...కృతమాలా తామ్రపర్ణులు రెండునదులు, తటంబులన్ = తీరదేశములందు, తఱచు = పెక్కురు, అగుటను = అగుటవలనను...ఒడయండు = ఏలిక..., రాజముఖంబునన్ = రాజుచేత చేయింతునేగాని, నేన సాక్షాత్కరించి చేయమియున్ = నేనే ప్రత్యక్షముగా చేయను గావునను, (ఆతని హృదయమందు) తద్రక్షణేచ్ఛ = ఆమద్భక్తుల జీవనములను రక్షింపవలయు నను కోరిక, అస్మత్ అభిముఖ్యంబునం గాని పొడమమియున్ = నాయందుభక్తుఁడైననే గాని పుట్టదు గావునను, అయాభిముఖ్యంబు = మత్ప్రవణత, సంవాదంబునంగాని పుట్టమియున్ = నాతత్త్వము ఎట్టిదో తెలిసి మనస్సునకు ఎక్కిననేగానిజనింపదు గావునను, నేన్, విచారించి = తలపోసి, తత్ అభిముఖ్యకరణ అర్థంబుగన్ = ఆతని మత్ప్రవణునిం గావించుటకై, ఆస్థానంబు ఎక్కి = రాజసభం బ్రవేశించి,...అజిన = (కృష్ణాజినములోనగు) తోళ్లు - పట = వస్త్రములు - వటువులకున్ = బ్రహ్మచారులకు, అనుపనీతులకున్ = ఉపనయనము కానివారికి, పంగు అంధ బధిర = కుంటి గ్రుడ్డి చెవిటి - సౌరభేయ ఆదియానంబులు = ఎద్దు లోనగువాహనములు, కడమపడియెన్ = కొంతపనియై నిలిచిపోయినది, ఎడవునన్ = మరుదేశమందు, [ఎడవు - పా. ఎడరు దీనికి ఎడారి యర్థము. కొందఱు ఎడవునకు ఎడారియర్థ మును గ్రహింతురు] తిథచిక్కున్ = శ్రాద్ధము మునిఁగి పోవును, వ్రతఉద్యాపనకున్ = వ్రతమును ముగించుకొనుటకు, గుప్త అగుప్త ప్రకారంబులన్ = రహస్యముగాను ప్రకటముగాను, వర్షధరుల = హెగ్గడికాండ్రయొక్క..., క్రందుకొని=మూఁగి, చేసాఁచిన = హస్తము నిగుడించినట్టి - సందిటితోరణంబులై = హెగ్గడికాని సందిటికిం గట్టిన తోరణము లనునట్లుగా (ఆయాచకులచేతులే మామిడియాకులుఅనుట), ఏకదండి త్రిదండి బ్రహ్మచారి = స్మార్తసన్న్యాసులు - వైష్ణవసన్న్యాసులు - వటువులు వీరియొక్క - ఉన్నమితదండంబులన్ = ఎత్తినకోలలయందు - నిండారు = నిండుగా కట్టియున్నట్టి - కాషాయ = కావి - కద్రు = పసిమి - వస్త్ర = కాటికలయు - కౌపీన = గోచులయు - పరంపరలన్ = సమూహముల చేతను, క్రమ్మి = మూసి, కావళ్లపడగల జాడఁగొని = కావలియుండెడు ధ్వజములగుఱు తెఱఁగి,

కేవలకార్పణ్యంబ= దారిద్ర్యముమాత్రమే,... వేఁడు= ప్రార్థించువారయిన - ఈదృక్ విధ= ఈప్రకారముగల - అనేకప్రాణులకుఁ = పలువురునరులకు, ఆధారంబగు = ప్రాపయిన - పడమటి ద్వారంబుచేరి (కర్త ఆవిప్రకుమారుఁడు), ప్రతి...ర్వ - ప్రతిదిన = దినదినంబును - అస్మత్ = నాయొక్క - పాద = చరణముల - భజన = సేవయొక్క - కథా శ్రుతపూర్వ = శ్రుతపూర్వములయినయట్టికథలు కలది అగు - అయుక్ష్వేధవుదేవికిఁ = ఆమహారాజు పట్టపురాణికి, ఆశీర్వచన అక్షతంబులు = దీవెనఁబ్రాలు;...

తే. గ్రీష్మసమయనిరుత్సాహకేకిరమణి । నవఘనధ్వని కలరుచందమున నలరి,
యేకతము నర్మగోష్ఠిఁ బ్రాణేశుతోడ । నతని విధ మెఱిఁగింప, నిట్టట్టు నడుచు.

(ఆరాణి), గ్రీ...ణి - గ్రీష్మసమయ = వేసవికాలమందు - నిరుత్సాహ = ఉల్లాసము లేనట్టిదియైన కేకిరమణి = నెమలికోమలి (ఆఁడునెమలి), నవఘనధ్వనికిఁ = క్రొత్తమేఘంపు ఉఱుమునకు, అలరుచందమునఁ = సంతోషించువిధముగా (అంతసంతోషముతో ననుట), ఏకతము = ఏకాంతమందు, నర్మగోష్ఠిఁ = మేలంపు సల్లాపమందు, ప్రాణేశుతోడఁ = ప్రాణప్రియుఁడయినభర్తతో, అతనివిధము = ఆయామునాచార్యుని ప్రకారమును, ఎఱిఁగింపఁ = చెప్పఁగా, (భూవల్లభుఁడు), ఇట్టట్టుపడుచుఁ = తత్తఱమొందుచు.

ఆరాణి ఆవృత్తాంతమునకు అనఁగా తనభర్తకు విష్ణుభక్తి పుట్టింప నొకఁడు వచ్చె నన్న వార్తకు - వేసవికి నసిచెడియున్న నెమలికొమ్మ తొలకరి మేఘంపుటుఱుమునకు ఎంతసంతోషించునో అంతసంతోషించినదై - ఒకప్పుడు భర్తతో ఏకాంతమున సరససల్లాపములు సల్పుచున్నదై ఆనడుమ ఈవార్తను అతనికిం దెలిపెను. అది తనశైవమతమునకు విరుద్ధమగుటచేత దానికి ఆరాజు తత్తఱపడుచు.

ఇచట - వర్షము భర్తకుంగలుగనున్న విష్ణుభక్తిని, దానిందెలుపునదైన యుఱుము యామునాచార్యవార్తకును, అతని విష్ణుభక్తిలేమికి డీల్పడియున్నరాణి నెమ్మికొమ్మకును, ఉపమేయములు.—రమణిని చెప్పుట లింగవ్యత్యయదోషముం దప్పించుటకు; ఇంతియగాక, రమణి యగుటచే అబలగావున మగదానివలె గ్రీష్మబాధకు ఓర్వదు గావున ఆట్లే రాణియు అబల గావున పైనిచెప్పిన కారణముచేత అత్యంతము ఖిన్నురాలై యుండె నని సూచించుటకును.

'కేకి' = కేకగలది - నెమలి - 'కేకావాసీ మయూరస్స్యా' అమ. 'నిరుత్సాహ' - వ్యస్తపదము విధేయార్థకము. 'నవ' - తొలి యుఱుమును తొలిమబ్బును ప్రియతమములు. 'నర్మగోష్ఠిఁ' - ఆసమయమున నైన అభిముఖుఁడై వినును అని అప్పుడు ప్రస్తావించుట. 'ప్రాణ' - ప్రాణప్రియుఁడుగావున నతని శ్రేయమునకై యింతలాలస.

క. భూవల్లభుఁ 'డెట్టట్టూ! తా వాదము సేసి శివమతంబు జయింపం
గా వచ్చెనొ? చూతముగా, రావింపు' మటన్న నాఁటిరాత్రి చనంగన్. 55

రాజు, 'ఏమీ ఏమంటివి? నీబ్రహ్మచారి తాను వాదముచేసి శివమతమును జయింప వచ్చినాఁడా? చూతముగాక, అతనిని రప్పింపుము.' అని బదులు పలికెను. అట్లు ఆరాత్రి కడచెను.

'ఎట్టట్టూ' - ఎట్టూ - ఎట్టట్టూ - అని ప్రశ్నార్థమందు దీర్ఘాంతముగా ప్రయోగాంతరములు కలవు. ఎట్టూ అనుపదము ఆమ్రేడితమందు 'ఎట్టట్టూ', 'ఎట్టెట్టూ' అనియు అగును.

'అనుటయు నెట్టిటూ తెలుపు మయ్యా మహాత్మక.' కళా. 7. ఆ.
'ఎట్టిటూ విన మైతి నింక నొక మాశేర్పాటుగాఁ జెప్పుమా.' కాశీ. 7. ఆ.

వ. ప్రభాతంబునం బరిమితజనం బగు నాస్థానంబునం గొలువున్న భర్త మ్రోలఁ దా నుండి యయ్యిందువదన యతనియనుమతిం బ్రతీహారిచేతఁ బిలువఁ బంచిన, నబ్భూనిలింపకుమారుండు. 56

ప్రభాతంబునన్ = (మఱునాఁడు) ప్రాతఃకాలమందు, పరిమితజనంబు - కొలఁదిపాటి జనులుగలది, అగు - ఆస్థానంబునన్ = రాజసభయందు, కొలువు ఉన్నభర్త మ్రోలన్ = ఓలగం బున్న పతియెదుట, తాను ఉండి, ఆ - ఇందువదన - చంద్రునివంటి ముఖముగలదైన యీపట్టపు రాణి, అతని యనుమతిన్ = అతని యంగీకారము నొంది. ప్రతీహారిచేతన్ = ద్వారపాలక ముఖముగా, పిలువం బంచినన్ = పిలిపింపఁగా, ఆ - భూనిలింప కుమారుండు = భూమిదేవ (బ్రాహ్మణ) పుత్త్రుఁడు ('ద్వారిద్వాస్థ్సే ప్రతీహారః ప్రతీహా ర్య ప్యనన్తరే' అమ.).

'అబ్భూనిలింప' అనుచో పూర్వాధికారమునకు బకారాదేశము వచ్చును. 'అద్ధరాగ్రణి' ఇత్యాదులయందుంబోలె నెఱుంగునది. 'నిలిమ్పా దేవతాబరా' నానా.

—* యామునాచార్యుఁడు పాండ్యసభం జేరుట *—

క. ద్వారంబు సొచ్చి, కీలిత । గారుడమహీ వజ్రవేదికం జివురులఁ గెం
పారు నొకపిప్పలముఁ గని, । యా రావి న్వాదసాక్షికై వలగొనుచున్. 57

ద్వారంబు సొచ్చి = రాజగృహద్వారమునం బ్రవేశించి (కడప దాఁటివచ్చి యనుట), కీ... హిన్ - కీలిత = తాపింపఁబడిన - గారుడ = గరుడపచ్చలుగలదైన - మహిన్ = నేలయందు, వజ్ర వేదికన్ = వజ్రపుటరంగునందు, చివురులన్ = చిగురుటాకులతో, కెంపారునొకపిప్పలమున్ = ఎఱ్ఱగానొప్పుచున్న యొకరావిచెట్టును. కని ఆరావిని, వాదసాక్షికిన్ ఐ = వాదమునకుసాక్షిగా నుండు మని, వలగొనుచున్ = ప్రదక్షిణీకరించి.

ద్వారము దాఁటగానే అచట గరుడపచ్చలు తాపించిన నేలయందు చుట్టును వజ్రపుఁదిన్నె గలదై, యెఱ్ఱని చిగుళ్లతో నొకరావిచెట్టు సొంపారుచుండెను. ఆయామునాచార్యుఁడు ఆరావిని తాఁ జేయఁబోవు వాదమునకు సాక్షిగా నుండు మని వేఁడుకొని ప్రదక్షిణము గావించెను.

'కీలిత' - 'బద్ధేకీలిత సంయతౌ,' - 'బోధద్రుమశ్చలదళః పిప్పలః కుఞ్జరాశనః' అమ. 'ఆరావిన్ వాదసాక్షికై వలగొనుచున్' - అనుపాదమున 'సాక్షికిన్ + ఐ, అను ఛేదముచే స్వరయతి - కై ప్రత్యయమునకు స్వరయతి చెల్లుటకును ఈచెప్పినదే సమాధానము. అట నశ్వత్థమును పెంచుట ప్రదక్షిణార్థము. దానిని సాక్షిగా నుండు మనుట, అది 'వృక్షాలలో నెల్ల విశేషమైన । యశ్వత్థవృక్షంబు నేనే కిరీటి'; అను కృష్ణవాక్యముచే అశ్వత్థము నారాయణుఁడే గావున. 'అశ్వత్థం సర్వవృక్షాణామ్' అనఁగా 'వృక్షములలోను నేను అశ్వత్థవృక్ష మను' అని గీతలో భగవద్వాక్యము. ఆనారాయణుని మతమునే తాను స్థాపింపఁ బోవుచున్నాఁడు గావున ఆదేవుఁడు తప్పక తన ప్రార్థనను నెఱవేర్చు నని విశ్వాసము. 'గారుడమహీ వజ్రవేదికన్' - అది దేవత

గావున దానిని భక్తిచే ఇంతవిభవముతో నెలకొల్పుట. 'విషశాస్త్రే తు గారుడం । మణిభేదేఽపి' నానా. అశ్వత్థవృక్షము గృహాంగణమున శుభకరము—

'పున్నాగ శ్చమ్పకో౽శోకః పిప్పలో దాడిమీ శమీ
ఏతే గృహాఙ్గణే వృక్షా ఆరోప్యా మఙ్గళ ప్రదాః.' ముహూర్తప్రదర్శిని.

సీ. పసిఁడిగ చ్చమర సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలితయుఁ జిత్రితయు నైన
సభ మహాకుథముపై శార్దూలచర్మఖం
డావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టురా, హారసంధి రు
ద్రాక్షాయుతముఁ దాల్చి యళికభూతి
సురటిగాడ్పుల రాల, నరుణాయతాక్షుఁడై
కులుకగద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి,
నంది ముద్రితపాణి యందుఁ జెక్కూఁది యా
గమములు వినుచు, హేమము పొదివిన

తే. యలఁతి రుద్రాక్షగమి కుట్టులందు మెఱయ,
వలితపారంబు మించ దువ్వలువ గప్పి,
యడపమును వాఁడివా లొక్కయతివ దాల్ప,
భార్గ్య వింజామ రిడ, నొప్పుపాండ్యుఁ గనియె. 58

పసిఁడిగచ్చు = బంగారపుగార, అమరన్ = ఒప్పుచుండఁగా, సోపానముల్ మూఁటన్ = మూఁడుమెట్లచేత, తుంగిత విశాలిత యున్ = ఎత్తుసేయఁబడినదియు, విశాలముసేయఁబడినదియు, చిత్రితయున్ = చిత్తరువులుగలదియు, ఐన-సభన్ = కొలువుకూటమునందు, మహాకుథముపైన్ = రత్నకంబళిమమీఁద, శార్దూల చర్మఖండ ఆవృతుల్ = పులితోలు రేకుచే (దుప్పటిరే కన్నట్లు) కప్పఁబడినవారు (పులితోలు కప్పుకొనియున్నవారును), జటిలులున్ = జడలుగలవారును, ఐన-జరఠమాహేశ్వరులు = ముసుకశైవులు, చుట్టున్ = తనచుట్టును, రాన్ = ఉండునట్లుగా, హారసంధిన్ - హార = ముత్తెపుంబేరులయందలి - సంధిన్ = ఎడమున, రుద్రాక్షఆయుతమున్ = రుద్రాక్షల పెల్లిదమును (పెక్కురుద్రాక్షలను), తాల్చి = ధరించి, అళికభూతి = లలాటమందలి విభూతి, సురటిగాడ్పులన్ = వింజామర వాయువులచేత, రాలన్ = రాలుచుండఁగా, అరుణ ఆయత అక్షుఁడు = ఎఱ్ఱనివిశాలమైన నేత్రములుగలవాఁడు, ఐ, కులుకగద్దెన్ = కులుచపీఠము నందు. బిల్లన్ = గుండ్రపుఁ దలగడయందు, ప్రకోష్ఠము = మోఁచేతిని, ఉనిచి = ఉంచుకొని, నందిముద్రితపాణిన్ = నందీశ్వరుని ప్రతిమగలదైన యుంగరముతోడి యరచేతియందు, చెక్కు = గండస్థలమును, ఊఁది = ఊనుకొని, ఆగమములు = శైవశాస్త్రములు, వినుచున్, హేమము = బంగారము, పొదివిన అలఁతి రుద్రాక్షగమి = చుట్టిన చిన్నరుద్రాక్షలపిండు, కుట్టులందున్ =

చెవుల కుట్టులయందు, మెఱయన్ = తళతళ లాడుచుండ, వెలితపొరంబు = తెల్లనిపాగాను, మించన్ = అతిశయించునట్లు (పాగామీఁదికి వచ్చునట్లు), దువ్వలువ = దుప్పటమును, కప్పి, అడపమును = తాంబూల కరండమును, వాఁడివాలును = పదనుగలకత్తిని, ఒక్క అతివ = ఒకస్త్రీ, తాల్పన్ చేతఁబట్టుకొనియుండఁగా, భార్య = ఇల్లాలు, వింజామర ఇడన్ = తెల్లచామరమును వీచుచుండఁగా, ఒప్పు - పాండ్యున్, కనియెన్,

యామునాచార్యుఁడు పాండ్యరాజును కాంచెను. ఆరాజు మూఁడు మెట్లుగలదై ఉన్నతమును విశాలమును చిత్రములుగలదియునైన కొలువుకూటమునందు పెద్దతివాసిమీఁద నున్నకుఱుచ గద్దెమీఁద కూర్చుండియుండెను. చుట్టురా అతివాసిమీఁద వృద్ధులు జటాధారులు నయి పులితోలు ఉత్తరీయముగా ధరించిన వృద్ధశైవులు కూర్చుండియుండిరి. రాజు ముత్తెపుఁబేరులతోఁ గూడ నడుమనడుమ లెక్కలేని రుద్రాక్షలను ధరించియుండెను; లలాటంపువిభూతి సురటీల గాలికి రాలుచుండెను. అతని నేత్రములు రాగయుక్తమై విశాలములై యుండెను. ఆయన ఒక గుండ్రని దిండుపై మోఁచేతిని నందీశ్వర ప్రతిమం జెక్కిన యుంగరముతోడి చేతియందు గండస్థలమును ఊనుకొనియుండెను. చెవులయందు బంగారము చుట్టినచిన్నరుద్రాక్షలయంటుజోడు మెఱయుచుండెను; తెల్లనిపాగను దాల్చి దానిమీఁదికి వచ్చునట్లుగా దుప్పటము కప్పుకొనియుండెను. చెంత నొకబోటి అడపమును వాఁడికత్తిని చేతఁ బట్టుకొనియుండెను. పట్టపుదేవి వింజామర వీచుచుండెను. ఈతీరున నున్న యారాజును యామునాచార్యుఁడు కాంచెను.

'తుంగిత' - 'విశాలిత' - నామధాతువులు క్తాంతములు; 'చిత్రిత' - సంజాత చిత్ర అని యర్థముగా ఇతచ్ప్రత్యయాంతము. కుథము - 'కుథః స్త్రీ పుంసయో ర్వర్ణకమ్బళే పుంసి బర్హిషి' మేదిని. 'సోపానము' - 'ఆరోహణం స్యాత్ సోపానమ్'. 'ఖండ' - 'కంథా' అని పా. [illegible]ంత - 'కన్థామృణ్మయభిత్తౌ స్యా త్తథా ప్రావరణాస్తరే' మేదిని. 'జరఠ' - 'జరఠౌ జీర్ణకర్కశౌ' నానా. 'చుట్టురాన్' - ఇది చుట్టూర అను వాడుకకు మూలము. చుట్టిరాన్ అను పా. వాస్తవ మనితోఁప లేదు. 'అయుత' - 'శతం సహస్ర మయుతం లక్ష మానన్త్యవాచకమ్.' 'అరుణ' - నేత్రారుణ్యకరమయిన కోపకారణము ఇంకను గలుగలేదు; కావున ఐశ్వర్యలక్షణ మయిన నేత్రసహజారుణ్యమే యిట వివక్షితము.

చ. 'ఉరమున నున్న కుంకుమ ముదుజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజమని బొంకితి, కన్గవకెంపు భాగ్యబం
ధురసహజారుణత్వ మని నూల్కొన నాడితి వెట్లు; దాఁచె దీ
పరిమళ వాసనాలహరి పర్వెడుమేన నృసింహభూవరా.' నరస.

'కుఱు' - 'చిఱు' అనుపాఠమున యతిభంగము. 'ప్రకోష్ఠః కూర్పరాదధః' అమ. 'నందిముద్రిత' - 'సాక్షరాఙ్గులిముద్రా సా' అమ. 'అడపమును వాఁడివా లొక్కయతివ దాల్ప' - ఇవి రా[illegible] చిహ్నములు.

'కుకుర కాశ కురు కరూశ కోస లాంధ్ర సింధు బా
హ్లిక శ కాంగ వంగ సింహళేశ కన్యకామణి
ప్రకరపాణిఘటితరత్నపాదుకాకలాచికా
ముకురవీటికాకరండ ముఖ్యరాజలాంఛనా' మను. ౧-౭౩.

'అందలంబు గొడుగు నడపంబు మేల్కట్టు...
ఎసఁగు రాచపదవు లెల్లఁ బడసె.' కేతన దశకుమార. 8.

'రాజునకు' - 'కిరాతీ చామరధరా యవనీశస్త్రధారిణీ' అని శబ్దార్ణవము. 'వింజామర' - తెల్లజల్లి, ఇదియు రాజచిహ్నము.

'ప్రీతః శ్వేతాతపత్రం కనకవిరచితం దణ్డ మాఖణ్డలాభో
వ్యోమ్ని క్షౌమం వితానం సకలనృపజన ప్రార్థ్య సింహాసనార్ధమ్.
నానావాదిత్రశఙ్ఖధ్వనిభి రభినుతాం మఙ్గళాలప్తికాం చ
ప్రాదా దర్థాత్మజోఽస్మై తుహినరుచిసితే చామరే చారుహాసే.' ప్రా. లే. మా.

"వెల్ల+చామర... సంధినివర్ణ వికారము - అజవమున వెంజామర మందురు - ఇది ముంగోపము వంటిది.)" అని. శ. ర. 'వింజామరడు' - ఇట తత్సమాకారమునకు సంధిగనఁబడుచున్నది. 'వింజామరము' మిశ్రమయినను, జా తాలవ్యముగానే ఉచ్చరింపఁబడుచుండుటచేత తత్సమత్వము చెడలేదు, 'చామరమునకు' చామరము చామర అని తత్సమమున రెండు రూపములు. ఇట సమాధానమెట్లు? 'భార్య చామర మిడ నొప్పు', అనియేని భార్య వింజామరం' బిడు అని యేని పాఠమైన నిర్దోషము. శ్వేతత్వము అనుక్తమయినను దోషముకాదు. 'శశిప్రభం ఛత్త్ర, ముభేచ చామరే,' 'ఏతాసా మరవిన్దసున్దరదృశాం ద్రాక్చామరాన్దోళనా । దుద్వెల్లద్భుజవల్లికఙ్కణఝణత్కారః క్షణం వార్యతామ్.' ఇత్యాదులందు శ్వేతత్వము ఉక్తముగాదు, ఏతద్గ్రంథ ముద్రకుల పీఠికలో 'మూలమును లేఖకప్రమాదాదులచేత నానావిధపాఠములుగా నుండెను.' అను వాక్యము సరియవచ్చును. మనుచరిత్రలో ఇందీవరాక్షుఁ డనుగంధర్వరాజు మునిశాపముచే స్వరోచిచే నిహతుఁడై మరల తొంటిసిరిని నందినప్పటి యతనిసిరిని వర్ణించు లయవిభాతిలో 'మృగనాభి ఘుమఘుమ లెసఁగఁ జామరలు మగువ లిడ' ననుచో 'చామరలు=వింజామరలు' అని జూలూరి యప్పయ్యపంతులవారిటీక. అందే ప్రథమాశ్వాసము - 'ఇందీవరంబుల నీను క్రాలుగన్నుల । శరదిందు ముఖులు చామరము లిడఁగ' - ఇటను 'చామరములు = వింజామరలును' అనియే వా. అ. టీక.

వ. కని వినీతుండై చేరనరిగి యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న నాదరింపక సంరంభియై యవ్విశ్వంభరాభర్త యిట్లనియె. 59

(యామునాచార్యుఁడు), కని - రాజును చూచి, వినీతుండు ఐ = వినయముగా, చేరన్ అరిగి = సమీపించి, యజ్ఞోపవీతంబు = జన్నిదము, కానుక ఇచ్చి = ఉపహారముగా నొసంగి, కూర్చున్నన్ = ఉపవిష్టుఁడు కాఁగా, విశ్వంభరాభర్త = భూపతి, ఆదరింపక = గౌరవింపక, సంరంభి = వేగిరపాటుగలవాఁడు, ఐ, ఇట్లు = చెప్పఁబోవు ప్రకారము, అనియెన్ = పలికెను.

'కానుక' యిచ్చుట 'శూన్యహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుమ్' అను స్మృతి ననుసరించి. 'యజ్ఞోపవీతము' త్రైవర్ణికులవలన బ్రాహ్మణునికే దానస్థానయోగ్యత సిద్ధించును గావున బ్రాహ్మణుఁడు రాజున కిచ్చుటకు మిక్కిలి తగినకానుక. దీనికి - 'నీవు వైదికకర్మనిష్ఠుఁడ వగుదువుగాక' యని యాశీర్వచనము భావము. జందెము త్రెంపినవాఁడు గావున రాజు దీనిని సరకుగొనక మతిద్వేషముచేత ఉత్తలంపడెను. 'ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే,' - 'భూర్భ్యామి రిచ లానస్తారసా విశ్వమ్భరా స్థిరా,' అమ.

తే. 'సంగతియె యోయి, యిసుమంత ౘింగణావు,
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు?
నోడితేనియుఁ బట్టి మొఱ్ఱో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొడువు. 60

ఓయి=ఓవడుగా, సంగతియె=ఇది యుక్తమా, (నీవు) ఇసుము అంత ౘింగణావు=రవంత చిన్నవాఁడవు. నీకున్, త...బు - తత్త్వ=పరమాత్మయొక్క (పరమాత్మను) - నిర్ణయ=నిర్ధారించుటయొక్క - వాదంబు=వాదు, తరమె=సాధ్యమా, ఓడితేనియున్=నీవు ఓడినట్లాయెనా, నిన్ను, పట్టి=బలాత్కారమున పట్టుకొని, మొఱ్ఱో అనంగన్=మొఱ్ఱో యని నీవు ఏడ్చుచుండఁగా, లింగమును, కట్టక = నీ మెడకు కట్టక, ఉడుగము = మానము, ఎఱింగి, నొడువు = పలుకుము.

ఓయి నీకు ఈ సాహసము తగదు, నీవు చిన్నబాలుఁడవు. శివుఁడే పరతత్త్వమో విష్ణువే పరతత్త్వమో వాదించినిర్ణయించుటకు నీతరముగాదు. నీవుగనుక ఓడితివా నిన్ను బలాత్కారమునఁ బట్టుకొని నీ మెడకు లింగమును కట్టక మానముసుమా. ఆమాట ఎఱిఁగి పిమ్మట వాదమునకుఁ దిగుము.

'ఇసుమంత' = ఇసుకరవపాటి (కడుబాల్యమును దెలుపుట). 'ౘింగణా' - టాంక్వేను అని యొక దేశము. దానినుండి యీ దేశమునకు ఒకజాతి పొట్టిగుఱ్ఱములు దిగుమతి యగుచుండినవి. టాంక్వే నే ౘింగణా. సాధారణముగా గుఱ్ఱములకు వానియుత్పత్తి దేశనామములే నామములు. అట్లు ఆజాతి పొట్టి గుఱ్ఱములపే రయిన ౘింగణా శబ్దమునకు పొట్టివాఁడు, చిన్నవాఁడు, అనునర్థములు వచ్చినవి. ఇట్టిపదము అన్యదేశ్యము. 'మొఱ్ఱో' = మొఱ్ఱ + ఓ (మొఱ్ఱపెట్టుకొనుచున్నాము వినుండో అని భా.).

తే. వాదుల మటంచుఁ జెప్పించి వత్తు; రోట। మైన దయ నీరె యేమైన నని విలజ్జ
జూటుఁదనమున సభ లెక్కఁ జూరవకాంద్రు;। పాఱువారలసుద్ది సెప్పంగ నేల? 61

(పాఱువారలు), వాదులము=శాస్త్రవాదము సేయువారము, అటంచు, చెప్పించి=చెప్పించుకొని, (రాజసభలకు), వత్తురు, ఓటము=(తమకు) అపజయము, అయినన్=కలిగినచో, దయన్=పాపము ఇంతదూరము వాదించినాఁడు అని కనికరించి, ఏమయినన్ ఈరే = ఏదైనను కొంచెము ధనము ఇయ్యరా, అని, యాలోచించుకొని, విలజ్జన్=లజ్జలేమిచేత, జూటుఁదనమునన్ = మోసముచేతను, సభ లెక్కఁ జూరవకాంద్రు = రాజాస్థానములందు చొచ్చునట్టి సాహసికులు, పాఱువారలసుద్ది = బ్రాహ్మణులమాట, చెప్పంగ నేల = చెప్పవలయునా.

బ్రాహ్మణులు సాహసికులు, శాస్త్రవాదము చేసెద మని సిఫారసులు చేయించుకొని వత్తురు. ఓడితిమా అప్పుడును దయచేత ఏమయిన ఇయ్యరా? అని మోసపుఁదలంపుతో లజ్జాహీనులై రాజసభలందు ప్రవేశము సంపాదింతురు. వారిమాటచెప్ప నేల యెల్లవారికిని తెలిసినదే.

'ఓటమైన' - ఇత్వసంధిగా వాదింపం బనిలేదు. ఓటము అని మువర్ణకాంతము గలదు. 'దురోదరపరాయణుండైన యన్నారాయణుండు గెలుపు నోటంబు సరిగా నద్దేవిద్యయంబుతో వినోదించుచు' ఉ. హరి. ౩. శ. ర. 'కందర్పుఁ డోటం బెఱిఁగి తలిమి వీపేసెనానంటుతోటన్' అము. 'విలజ్జన్' - ప్రగతః ఆచార్యః ప్రాచార్యఃఅన్నట్లువిగతాలజ్జా విలజ్జా అని విగ్రహము చేసికొనవలయును. అట్లే 'నిరాశ' యు; 'నిరాశచేసికొని' అని చిన్నయసూరి నీతిచంద్రికలోఁ బ్రయోగములు. 'జూటుఁదనంబు'-స్వార్థమున 'తన' ప్రత్యయము అని. శ. ర. 'సుద్ది'-సం. సూక్తిః.

వ. అని పలికి దరహాసంబుతో దేవిదెసఁ జూచి యి ట్లనియె. 62

**దరహాసంబుతోన్** = చిఱునగవుతో - 'దరో స్త్రియాం కమ్బుభయయోర్గర్తేఽపిచ గుహా దరీ। దర త్వవ్యయ మల్పార్థే,' నానా.

క. 'అస్మన్మతస్థుఁడోడిన । భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ సాప్తము ముర । ఘస్మరచక్రాంకితుండఁ గాఁ గలవాఁడన్. 63

అస్మత్ మతస్థుఁడు = మామతమందున్నవాఁడు (శైవమతమువాఁడు), ఓడినన్, (నేను), భస్మము = విభూతియు, రుద్రాక్షములును, పాసి = త్యజించి, విస్మయముగన్ = ఆశ్చర్యముగా, ఇతనిచేన్ = ఈనీవాదిచేత, సాప్తము = నాయాప్తు లయినశైవులతోఁగూడ, ము...తన్ - మురఘస్మర = విష్ణువుయొక్క, చక్ర = చక్రముచేత, అంకితుండన్ = చిహ్నితుఁడను, కాఁగలవాఁడన్ = అయ్యెదను.

ఈవాదమున నామతమువాది ఓడెనేని, నేను, అందఱు నాశ్చర్యపడునట్లు, విభూతిరుద్రాక్షలను త్యజించి, నాయాప్తులతోఁగూడ నీతనివలన తప్తముద్రాంకనముం బొందెదను. శైవదీక్ష త్యజించి వైష్ణవుఁడ నయ్యెద ననుట.

'మురఘస్మరుఁడు' - మురి = మురుని (మురుఁ డనెడి యసురుని) యొక్క, ఘస్మరుఁడు = భక్షకుఁడు - మురదానవసంహారి - మురారి - నారాయణుఁడు అనుట. 'భక్షకో ఘస్మరోఽద్మరః, అమ. 'చక్రాంకము' - వైష్ణవచిహ్నము.

తే. ఉవిద, యీసీదువిద్వాంసుఁ డోడెనేని । నీకు నితని కేనన్న పూనికయ' యన్న,
'నొప్పితిమి దేవ రానతి దప్పకున్నఁ । జాలు మఱి పంచభూతము లసాక్షిగాఁగ.'

ఉవిద = ఓయువతీ, ఈసదు విద్వాంసుఁడు = నీవు తెచ్చిన యీపండితుఁడు, ఓడెనేని = పరాజితుఁడాయెనా, ఇతనికి ఏను అన్నపూనికయ = ఇతనికి లింగము కట్టించెద నని చెప్పితినిగదా ఆప్రతిజ్ఞయే, నీకున్ = నీకుఁ గూడ (జరుపుదుము), అనన్ = అని రాజు పల్కఁగా, పంచ భూతములు = పృథివ్యాదు లయిన యయిదు భూతములును, సాక్షిగాఁగన్ = సాక్షులై కనుచుండఁగా, ఒప్పితిమి, మఱి, దేవర = ఏలినవారు, ఆనతిన్ = ఈచేసిన ప్రతిజ్ఞను, తప్పకున్నఁ జాలును.

రాజు - 'ఓచెలువా, నీవాది యైన యీతఁడు ఓడినయెడల మున్ను నే నీతనికిం జెప్పిన శివమత ప్రవేశమే నీకును కావించెదను. ఇందులకు నీవు ఒప్పుకొందువేని, ఇతనిని వాదమునకు దిగు మనుము' అని వక్కాణించెను. అంతట రాణి 'దేవరా, పంచభూతములును సాక్షులుగా మీరు చేసిన యీనియమమునకు ఒప్పుకొంటిని. మఱి మీరును అట్లే ఈమీనియమమును తప్పకుండ వలయును' అని యుత్తరము చెప్పెను.

'ఉవిద' - సం. యువతిః. 'నీదు' - దుగాగమము-చూ. బాలవ్యా. సమా. ౧౧. 'నీకున్ + (ను)' - ఇందు సముచ్చయమునకు ముందున్నవిధి క్రుతమునకు స్థిరపరత్వముచే సంధిలో లోపము వచ్చినది. 'పూనికయ' = పూనిక + అ - అశబ్దము అవధారణార్థము.

వ. అని పలుకు నయ్యిరువుర ప్రతిజ్ఞలాకర్ణించి. 65

తే. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగ, బసుపు
గోఁచి కట్టిన మోదుగుఁగోల నెగయఁ,
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బటంచు
నర్ధముక్తాసనతనిట్టు లనియె ధృతిని. 66

అతఁడు = ఆయామునాచార్యుఁడు, మృగకృత్తి = కృష్ణాజినము, పెళపెళ యనఁగన్ = పెళపెళ యనుశబ్దము చేయుచుండఁగా, పసుపు గోఁచి కట్టిన - మోదుగుఁగోల = ఆషాఢదండము, నెగయన్ = పైకి లేచుచుండఁగా, ప్రాంజలి = మోడ్చుఁగేలు గలవాఁడును' వినీతుఁడు = వినయవంతుఁడును, ఐ, విన్నపంబు అటంచున్, అర్ధయుక్త ఆసనతన్ = సగము విడువఁబడిన పీఠము గలవాఁడు అగుచు, ధృతిని = సంతోషముతో (లేక ధైర్యముతో), ఇట్టులు = వక్ష్యమాణ ప్రకారముగా, అనియెన్.

అంతట యామునాచార్యుఁడు తా ధరించిన కృష్ణాజినము పెళపెళ యని శబ్దింప, పసుపు గోఁచికట్టియున్న మోదుగు దండము చేతితోఁగూడ లేవఁగా, తనయాసనమునుండి కొంచెము లేచి కేలుమోడ్చి, వినయముతో 'దేవరా, విన్నపము జేసెదను, చిత్తగింప వలయును' అని పలికి, వక్ష్యమాణ ప్రకారమున చెప్పందొడంగెను. 'అజినం చర్మకృత్తిః స్త్రీ' అమ.

'మృగకృత్తి' - మృగ మనట కృష్ణమృగము - నల్లయిఱ్ఱి. 'కార్ష్ణ రౌరవ బాస్తాని చర్మాణి క్రమశో ద్విజాః వసీరన్నాను పూర్వ్యేణ;' అని మనుస్మృతి.

'ధృతిని'-సంతోషము తన వాదము వినుటకు అంగీకరించినాఁడు గదా యని; ధైర్యము తనకు జయము కలుగు నను నిశ్చయబుద్ధి చేత. 'ధృతి ర్యోగాన్తరే ధైర్యే ధారణాధ్వర తుష్టిషు' విశ్వ.

క. 'దేవా, యిట్లని యానతి। యీ వల, నేఁ గడుపుఁగూటికిట రా, నాడం
బేవారిఁ బ్రోవ? భిక్షా। జీవిక వర్ణికిని విధి సృజించెనె గాదే? 67

దేవా = ఓప్రభూ, ఇట్లని = 'జూదమున డబ్బు సంపాదించుకొనుటకై వాది నని వచ్చితి' నని, ఆనతి యీవలదు = సెల వీయకుము, ఏన్ = నేను, ఇటన్ = ఈసభకు, కడుపుఁగూటికిన్ = కడుపునకు అన్నము సంపాదించుకొనుటకై, రాన్ = వచ్చినవాఁడను గాను, నాడంబు = నా వేషము, ఏవారిన్ = ఎవరిని, ప్రోవన్ = కాపాడుటకు, విధి = బ్రహ్మ, వర్ణికిన్ = బ్రహ్మచారికి, భిక్షాజీవికన్ = యాచన యనెడు బ్రదుకుఁదెరువు, సృజించెనెగాదే = పుట్టకముందే విధించియున్నాఁడుగదా.

నేను కుటుంబినిగాను, బ్రహ్మచారిని, ఒకరిని పోషించుటకై మోసపువేసము వేయవలసినపని నాకులేదు. నాపొట్టకు నేను పుట్టకమునుపే బ్రహ్మచారిక బ్రహ్మవిధించిన మధుకరవృత్తియున్నది. కావున డబ్బు గడించుకొనుటకై వచ్చితి నని దేవరవారు తలంపవలదు.

'యాచ్ఞా భిక్షార్థ నార్దనా', 'వర్ణనో బ్రహ్మచారిణః' అమ. కడుపుఁగూ డనుపదములచే దానితుచ్ఛత స్ఫురించుచున్నది.

తే. ఎవ్వఁడే సర్వభూతస్థుఁ డిత్తెఱంగు। నడును బ్రేరేఁచె, నతనియానతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నొడువ నేమేని లెస్స;। యతఁడ బొంకిన నేమిసేయంగ వచ్చు?

సర్వభూతస్థుఁడు = సమస్తప్రాణులం దున్నవాఁడు లేక పృథివ్యాది - సకలభూతములం దున్నవాఁడు, ఎవ్వఁడేని = ఎవ్వఁడైన, ఈ తెఱంగునకుఁ = ఈ ప్రకారమునకు, (అనఁగా ప్రపంచము ఈరీతికి వచ్చునట్లుగా), ప్రేరేఁచెఁ = ప్రేరణచేసినాఁడో, అతని, ఆనతియె = ఆజ్ఞయే, తెచ్చెఁ = నన్ను ఇటకు వాదమునకై కొనివచ్చినది, ఆతఁడు = ఆసర్వాంతర్యామియే, బోంకినఁ =అసత్యమాడెనేని, ఏమిసేయంగ వచ్చుఁ = నే నేమి చేయ నేర్తును, ఎఱిఁగినవి, నాల్గు= కొన్నివాదములు, నొడువఁ = చెప్పినంతట, ఏమేని లెస్స = ఏమిపర్యవసించినను మంచిదే.

సర్వభూతములకు అంతర్యామియై యీవిశ్వమును ఈతీరున నడువ నెవ్వఁడు ప్రేరేఁపించుచున్నాఁడో ఆభగవంతుఁడు, నన్ను ఇందులకుఁ దెచ్చినాఁడు. నేను స్వతంత్రుఁడను గాను, నాముఖంబుగా నాతఁడే పలుకును. ఆతని యాపలుకులు బొంకు లయిన నే నేమి చేయుదును. కావున నాకుఁ దెలిసిన కతిపయవాదములను నేను గావించెదను, అందులకు ఏపర్యవసాయము కలిగినను సంతోషమే.

'ఎవ్వఁడేసర్వ' - (ఎవ్వఁడు + ఏని సర్వ) - ఇట 'విడిచిన నల తే విను' అను ప్రయోగంబునందుంబోలె ఏనిశబ్దమందు ఏకారము శేషించినది. 'భూత' - 'యుక్తే క్ష్మాదావృతేభూతం ప్రాణ్యతీతే సమే త్రిషు' - అమ.

తే. పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర, । యుక్తులను నిగ్రహస్థాన మొదవెనేని,
యమ్మ దెచ్చినవిద్వాంసుఁ డనఁగ వలవ, । దెట్లు గావింప వలయు నట్లట్ల చేయు'

పార్థివ ఇంద్ర = రాజోత్తమా, పంతమైనను = నేను స్వతంత్రించి పంతగించుచున్నాననియే తలంతువేని, కానిమ్ము = అట్లే తలంపుము. ఉక్తులఁ = నామాటలయందు, నిగ్రహస్థానము = పరాజయహేతువు, ఒదవెనేని = కలిగినయెడల, నన్ను, అమ్మ = దేవిగారు, తెచ్చిన విద్వాంసుఁడు, అనఁగ వలదు = అని కనికరింప నక్కఱలేదు...

ఓరాజోత్తమా నానోట భగవంతుఁ డుండి పలుకు నని బొంకుచున్నా ననియు, నేనే పంతమున వాదమునకు వచ్చితి ననియు తలంతువేని, మంచిది. అట్లే తలంపుము. మఱియు నావాదమునందు నాయపజయమునకు కారణ మగపడెనేని, అమ్మగారు తెచ్చినవాఁడ నని ఆమె కొఱకు నన్నుఁ గనికరించి వదలక నీయిచ్ఛప్రకారము చేయుము.

'పార్థివ + ఇంద్ర' - పృథివికి ఈశ్వరుఁడు పార్థివుఁడు. పార్థివుఁడును ఇంద్రునివంటి వాఁడును నని పార్థివేంద్రుఁడు పార్థివశ్రేష్ఠుఁ డనుట. 'పరాజయహేతు ర్నిగ్రహస్థానమ్' అని తర్కభాష. 'ఉక్తులను' - 'యుక్తులను' అనియేని - ఆపక్షమున యుక్తివాదములయందు అని యర్థము.

వ. అని యులుకు విడిచి పలికి,మగుడం గూర్చుండి,యతని యనుమతి వాదం బునకుంబోడంగి, 70

ఉలుకు (పా. అలుకు) = జంకు. అనుమతిఁ = అంగీకారముచేత, తొడఁగి = పూని.

—* అన్యమత ఖండనము. *—

* సీ. అందులో నొకమేటి కభిముఖుండై యాతఁ
డనిన నన్నియును మున్నునుపదించి;

* విష్ణుచిత్తుని పద్యమే పునరుక్తము చూ. ఆ 3 - 6.

తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొడఁబడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్న కొక్కొకమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలివానికినె మగిడి;
తే. మఱి శ్రుతిస్మృతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగమెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టె. 71

మేటికిన్ = సమర్థునికి. అభిముఖుండు = ఎదురువాది, అనినవి = వచించినట్టియుక్తులను. మున్న = ముందుగా, తొలుతన్, అనువదించి = తాను మరల చెప్పి, తొడఁగి = ప్రారంభించి; తత్సభ ఒడఁబడునట్లుగ = ఆసభలోనివారెల్ల సరి యనునట్లుగా, అన్నిటికిన్ = అన్నియుక్తుల లోను, అన్నిదూషణంబులు = అన్నిదోషములు, వేగపడక = తొందరపడక, చెప్పి, ప్రక్కమాటలన్ = ప్రక్కనున్నవారు పల్కుయుక్తులను, ఎన్నక = లక్ష్యపెట్టక, ఒక్కొకమాటనె = ఒక్కొక్కయుక్తిచేతనే, నిగ్రహస్థానము = పరాజయహేతువును, అనుగ్రహించి = ఒసంగి, క్రందుగా రేఁగినన్ = ఏకకాలమందే పలువురు దొమ్మిగా విజృంభింపఁగా, కలఁగక = కలఁత పడక, అందఱను = ఆరేఁగినవారినెల్ల, తేర్చి = ఉద్రేకము శమించునట్లు పలికి, నిలిపి = ఊర కుండునట్లు చేసి, అమ్మొదలివానికినె = ఆమొదటిమేటినేగూర్చి, మగిడి = మరల వాద మారంభించి. మఱి = రెండియు, శ్రు...కున్ - శ్రుతి = ఉపనిషత్తులయు - స్మృతి = ధర్మశాస్త్రములయు - సూత్ర = బ్రహ్మసూత్రములయు - సమాజమునకున్ = సమూహమునకు, ఐకకంఠ్యంబు = ఐక మత్యమును, కల్పించి = సాధించి, ఆత్మమతము = తనదైన వైష్ణవమతమును, రాద్ధాంతముగన్ = సిద్ధాంతముగా, ఒనర్చి = చేసి, విజితుఁ గావించి = (ఆమేటిని) ఓడించి; దయన్ = కరుణచే.

ఆవాదులలో నొక ప్రౌఢునికి తాను బదులువాఁడయ్యె అతఁడు పల్కినయుక్తులలో నొక్కొ క్కదానియందును తమకపడక ఒక్కొక్కదోషమును సభ్యులెల్ల సమ్మతించునట్లుగా చూపించి. పార్శ్వవర్తులు నడుమనడుమ పలుకు యుక్తులను ఒక్కొక్కయుక్తితోనే ఖండించినవాఁడై, వారు పలువు రొక్కుమ్మడి, విజృంభించి పలుక తాను కలంగఁబాఱక వారిని శాంతపడంజేసి నిలిపి, రెండియు, ఆమొంటి వాదితోనే పూనుకొని, శ్రుతి స్మృతి సూత్రసమూహములో పరస్పర భేద ములు లేవు, అవన్నియు ఒక్కటేవస్తువును చెప్పుచున్న వని సాధించి, తనమతమును సిద్ధాంత ముగా ఒప్పుకొనునట్లు చేసి, వానిని దయతో విడిచిపెట్టె (నాఁడు).

'సమాసిద్ధాన్త రాద్ధాన్తౌ' అమ. రాద్ధ = సిద్ధమయిన - అన్తః = అంతము గలది.

క. *'సీ వేమంటివి రమ్మం' । చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి; యొకఁడొకఁడు రా । నావిప్రుఁడు వాదసరణి నందఱఁ గెలిచెన్. 72

*అ 3 - 7 మరల.

సుగమము.

వ. ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు నగుటయుం బ్రతిష్ఠించిన. 73

విశిష్టాద్వైతంబు విశిష్టములయొక్క యైక్యము - అనఁగా స్థూలచిదచిద్విశిష్టమైన పరమాత్మునకును సూక్ష్మచిదచిద్విశిష్ట పరమాత్మునకును ఐక్యము.

క. ఆయెడను నొక్కపలు కెదు। రై యుండెడు పిప్పలమున నాయెను విన, 'నో
హో, యిది నిక్కము నృప, నా। రాయణుఁడె పరంబు, గొల్వు మతని' నటంచున్.

ఆయెడన్ = ఆసమయమున, అట్లు = మున్ను చెప్పినప్రకారము, ఎదురు ఐ యుండెడు పిప్పలమునన్ = ఎదుటఁ గనఁబడుచున్న రావియందునుండి, ఓహోనృప = ఓయిరాజా, వినుము, ఇది నిక్కము = యామునాచార్యుఁడు చేసిన యీసిద్ధాంతము వాస్తవము, నారాయణుఁడె - పరంబు=సర్వనియామక మయిన తత్త్వము - అతనిం గొల్వుము అటంచున్, ఒక్క - పలుకు= వాణి, ఆయెను = జనించెను. (పా. విననాయెను = వినఁబడెను).

వ. అప్పలుకులు విని ఖిన్నంబై యక్కూడినపాషండషండంబు దలవంచుకొని పోయిన, నాయుర్వీధవుండు నతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి, హర్షాద్భుతరసోత్తరంగితాంతరంగుండై, భుజగశయన చరణకుశేశయ భక్తి వొడసు కృతార్థతం బొంది, పాండ్యమండలమునకు భాగినేయుండ పట్టాభిషేకుండవు గావునఁ బౌత్రంబని బ్రహ్మచారి యగునతనికిఁ దనకడగొట్టు చెలియలిం బరిణయంబుసేసి, యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి, యువరాజుం జేసి, యధీతసాంగవేదుండగునతనికి నథర్వశిరస్సుభ్యస్తం బని యెఱింగి, యందు దివ్యాస్త్రమంత్రంబుల కలిమియుం దెలిసి, యమ్మహాత్మున కెచ్చరించి దుస్సాధంబగువిరోధియూధంబు సాధింపు మని దండయాత్రం బనిచిన, నయ్యార్యముసుండును సన్నద్ధుం డగుతఱిఁ బత్పురోహితప్రధానమంత్రివర్గంబు సన్నిహితంబు లగునివ్వార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయంబు సేయు మనుటయు, నట్లెఱుంగు రాజన కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. 75

పాషండ షండంబు = వేదబాహ్యమతస్థులసంఘము. [పాం=వేదధర్మమును - ఖణ్డయన్తి = ఖండింతురు - కావున పాఖణ్డాః - పా. పాఖండులు. పృషోదరాది 'పాషణ్డ' అనియును.
'పాలనాచ్చ త్రయీధర్మః పాశబ్దేన నిగద్యతే
తం ఖణ్డయన్తి తే యస్మాత్ పాఖణ్డాస్తేన హేతునా.'].

ఎఱఁగి = నమస్కరించి, సాష్టాంగంబు—
'కరయుగములు చరణంబులు। నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
పరిధరణిమోప మ్రొక్కినఁ। బరువడి సాష్టాంగ మండ్రు పరమునీంద్రుల్.'

ఉత్తరంగిత = అలలులేచుచున్న, భుజ... క్తి - భుజగశయన = పాపసెజ్జ వానియొక్క - చరణ వశేశయ పదనీరజములయందు - భక్తి = తాత్పర్యము. భాగినేయుండ = సోదరీ పుత్త్రుఁడే, పట్ట అర్హుండు = పట్టమునకు (పట్టాభిషేకమునకు = రాజ్యమునకు) తగినవాఁడు (అధికారి - పట్ట మనఁగా పలుధర్మ శాస్త్రోక్త పద్ధతిప్రకారము పలుచఁగాను నిడుపుగాను చేయఁబడి రాజునకును రాణికిని రాజ్యాభిషేకసమయమందు లలాటమున అడ్డముగా కట్టునట్టి బంగారపురేకు.), పాత్రంబు = తగినవాఁడు. కడగొట్టు = కడపటి. పరిణయంబు = వివాహము. అధర్వశిరస్సు = నాలవవేదము. అరణంబు = యౌతకము (వివాహసమయమునందు అల్లునికి మామగారు ఇచ్చు ధనాదికము.), అందున్ = అధర్వ శిరస్సునందు. వార్షిక = వర్షాకాలపు.

—* వర్షాకాలవర్ణనము *—

ఉ. కర్కశుఁ డంట కోర్వ, కుదకంబులు వాఃపతి గూర్చినట్లు న
య్యర్కుఁడుఁ దానుగూర్చి, మఱి యాసలాధిపచిహ్న వాహతం
బేర్కలగంగ నాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్న నీర్ష్యఁ దాఁ
గర్కటకస్థుఁ డయ్యె ననఁ గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. 76

అత్తఱిన్ = గ్రీష్మసమయానంతరంబున, అర్కుఁడు = సూర్యుఁడు, కర్కశుఁడు అంటకున్ = తాను (సూర్యుఁడు) తీక్ష్ణుఁడు అని లోకులు పలుకుటను, ఓర్వక = సహింపక, వాఃపతి = వరుణుఁడు, ఉదకంబులు = జలములను, కూర్చినట్లు = కూడఁబెట్టినరీతిగా, తానున్ = సూర్యుఁడును. కూర్చి = ఆవిరిరూపమున సేకరించుకొని, మఱి = ఇంక, ఆతఁడు = ఆవరుణుఁడు, ఆ - స ... తన్ - సలిలాధిప = వరుణునియొక్క - చిహ్న = గుర్తయిన మొసలి - వాహతన్ = తనకు వాహనముగాఁగలది, అని, పేరు = నామము, కల గంగన్ = వహించినదైన (ప్రసిద్ధయైన) గంగానదియందు, ఎలమిన్ = ప్రీతితో, మకరస్థితిన్ = మొసలియందు ఉనికిని, కన్నన్ = పొందఁగా. ఈర్ష్యన్ = వరుణునిమీఁద నసూయవహించి, తాన్ = సూర్యుఁడు, కర్కటకస్థుఁడు = ఎండ్రియందు ఉన్నవాఁడు, అయ్యెన్, అనన్ = అనునట్లుగా, ఎలమిన్ = ప్రీతితో, కర్కటకస్థితిన్ = కర్కటకరాశియందు ఉండుటను, కాంచెన్ = పొందెను.

ఆ ఱట్టిదపు టెండల తర్వాత సూర్యుఁడు కర్కటకరాశికి వచ్చుట యెట్లుండెనన - సూర్యునికి ఆగ్రీష్మకాలమందు క్రూరుఁ డనునింద రాఁగా, ఆతఁడు దానికి కంటగించి, వరుణునికి వచ్చిన చల్లనిదొర యనుపేరు తానును తెచ్చుకొనఁ గోరినవాఁడై, ఆవరుణుఁడు ఎట్లుగా, 'నదీనాం సాగరోగతిః' అన్నప్రకారము నదులన్నియు సముద్రమునఁ బడుటంజేసి, సముద్రరూపమున జలములను కూడఁబెట్టుకొనునో, అట్లే తానును పుడమిలోని నదులు చెఱువులు లోనగు జలాశయముల జలమునెల్ల ఆవిరిరూపమున మింటం గూడఁబెట్టుకొన్నవాఁడై అంతటితో తనియక ఆవరుణునితో ఇంకను పోటీకై ఆవరుణుఁడు గంగలో గంగకు వాహనమైన మకరము తనకును వాహనమగుట చేత గంగయందు సుఖముగా నుండఁగా, (సూర్యుఁడు) తానును గంగచెంత మొసలివలెనే జలజంతువైన కర్కటకమందుఁ బ్రవేశించి సుఖముగా నున్నాఁడో యనున ట్లుండెను. వర్షఋతువు వచ్చె నని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

'కర్కశుఁడు'-'కర్కశో నిర్దయః క్రూరః ఖరస్పర్శశ్చ సాహసీ' నానా. 'వాఃపతి'-'సలిలాధిప' - సముద్ర వరుణ పర్యాయములలో 'ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః'

అని అమ. 'అర్కుఁడు' - 'అర్కో మఘోని స్ఫటికే జ్యేష్ఠభ్రాతరి భాస్కరే' నానా. - 'సలిలాధిపచిహ్న' - వరుణునికిని సముద్రునికిని మకరము, అయినను ఇట వరుణచిహ్నార్థమే ఉచితతరముగాఁ గనఁబడుచున్నది.

'సంప్రాప్తం మకరధ్వజేన మరణం త్వత్తో మదర్థే పురా
తద్వ్యక్తం బహుమార్గగాం మమ పురో నిర్లజ్జ వోఢుం స్తవ
తా మే వానునయస్వభావకుటిలాం హేకృష్ణకణ్ఠగ్రహం
ముఞ్చే త్యాహ రుషా య మద్రితనయా లక్ష్మీశ్చ పాయాత్సవః.' రత్నావళి.

వేల్పులకు ప్రాయికముగా వాహనమే ధ్వజము - ఉ. గరుడధ్వజుఁడు, వృషధ్వజుఁడు. వరుణునికి మొసలి వాహనంబును సిడమును.

మ. మరుదీశద్విపదానశోభ, శిఖిధూమ్యారోచిఁ, గీనాశకా
సరదేహప్రభ, రాక్షసాళితిలకాంచద్దీధితిన్, వారిధీ
శ్వరకేతుద్యుతి, మాతరిశ్వ హరిణచ్ఛాయన్, ధనాధ్యక్షస
లరుచిన్, ధూర్జటికంఠకాంతిఁ దమముల్ వ్యాపించె దిగ్భిత్తులన్. పారి 4 (46).

'చిహ్న' - 'కళఙ్కాఙ్కౌ లాఞ్ఛనం చ చిహ్నం లక్ష్మ చ లక్షణమ్'. అమ. 'చిహ్నం లక్ష్మ పతాకయోః' మేదిని. 'వాజి వాహార్వ గన్ధర్వ హయ సైన్ధవసప్తయః' అమ. 'ఆసలిలాధిప చిహ్నవాహతం బేర్కుల గంగన్' - ఈసమాసమున ఆశబ్దము గంగకు విశేషణము. నడుమ వ్యస్తపదంబుల కలిమికి; ప్రౌఢవ్యా. సమాస. ౧౫ వ సూ. ను జూచునది. అందు 'ఈ కన్నులు తెఱవని శిశువు' భోజ. ౬ ఆ. అని త్రికమునకును, 'గగన మనురుద్రభూమి నేకతమ తిరుగు । నదరులుమిసెడు కొఱవిదయ్యంబు వీఁడె' అని నైష. ౨. ఆ., 'బలిమిఁ గుబేరునిన్ గెలిచి బాగుగఁ గొన్న రవిప్రకాశమై । యులరుచు నున్న పుష్పకమునందు రమింపుము కోర్కు లారఁగన్,' రామా. అర. ౨ ఆ., అని ధాతుజవిశేషణములకును, ప్రయోగములం జూపినారు. మకరము గంగకు వాహనమనుటకు - 'మకరేశ్వర పృష్ఠాధిశయిత చరణకిసలయే' అని గంగాస్తుతిలో, క. క. ల.

'ఆలిఖ్య సఖ్యాః కుచపత్త్రభఙ్గీ । మధ్యే సుమధ్యా మకరం కరేణ
యత్రాలపత్తామిద మాళి యానం । మన్యేత్వదేకావళినాకనద్యాః' నైష. 6 (69).

అందు టీకలలో మల్లినాథ నారాయణులు 'గఙ్గామకరి వాహినీ ఇతి ప్రసిద్ధిః' అని వర్ణించినారు. వరుణునికి మకరము వాహనము - 'వరుణాయ జలాధిపతయే మకరవాహనాయ పాశహస్తాయ' అని వరుణప్రార్థనగితము.

'నవోద్య దమ్భోధర ఘోరదర్శనే । యుద్ధాయ రూఢో మకరే మహత్తరే
దుర్వారపాశో వరుణోరణోల్బణస్తమన్వియాయ త్రిపురాన్తకాత్మజమ్॥' కుమార. 4(9).

గంగయందు తద్వాహనము మకర మున్నది గాన మకరవాహనుఁడు వరుణుఁడు నున్నాఁడనుట. అట్లు గంగయందు సూర్యుఁడు లేఁడే యన్న? 'గంగన్' అనఁగా ఈపక్షమందు 'గఙ్గాయాం ఘోషః' అనువాక్యమందుంబోలె 'గంగకడ' అని సామీప్యార్థమును చెప్పకోవలయును. మఱియు నిట నదిలోనికర్కటమునకును కర్కటరాశికిని అభేదోపచారము. నాలుగు వ్రాఁత ప్రతులయందు ఇతరత్ర భేదములు మెండుగానే యున్నను, ఇచటమాత్రము పాఠము 'పేర్కులగంగ' అనియే యున్నది.

'సితమకరనిషణ్ణాం శుక్లవర్ణాం త్రినేత్రాం । కరధృతకమలోద్యత్సూత్పలాభీష్టముద్రామ్
విధిహరిహరరూపాం సేన్దుకోటీరచూడామ్ । కలితసితదుకూలాం జాహ్నవీం త్వాం నమామి'.
గంగాధ్యానము.

తే. వనతతివరాహవాహారివాయుభుగ్వి
రోధివారణవర్షాభు లాధిఁ దొఱఁగె
నెండ్రిఁ రవి చేర; మూఁడవ యెడకుఁ జేరు
తరణి ధరణిం బ్రమోదసంధాయి గాఁడె? 77

ఎండ్రిన్ =కర్కాటకరాశిని, రవి=సూర్యుఁడు, చేరన్ = ప్రవేశించినంతట, వన...భులు - వన తతి = అడవుల సమూహములు - వరాహ = (అడవి) పందులు - వాహ అరి = దున్నలు - వాయుభుక్ విరోధి = (గాలిని భుజించునవైన) పాముల - శత్రువులు - వారణ = ఏనుఁగులు - వర్షాభులు = కప్పలును, ఆధిన్ = మనోవ్యాధిని, తొఱఁగెన్ = విడిచినవి, ధరణిన్ = లోకములో, మూఁడవయెడకున్=జన్మరాశినుండి మూఁడవదియగు రాశిని, చేరు, తరణి=సూర్యుఁడు ప...యి - ప్రమోద = సంతోషమును - సంధాయి = కూర్చువాఁడు, కాఁడె = కాఁడా - అగు ననుట.

వనాదికముల జన్మరాశియైన వృషభమునకు మూఁడవదైన కర్కాటకమందు సూర్యుఁడు ప్రవేశింపఁగానే వానివెగులు తీఱినవి. జన్మరాశికి మూఁడవరాశియందుండు సూర్యుఁడు శ్రేయః కరుఁ డగుట లోక ప్రసిద్ధమేగదా! వనములు వానచే అలరుటయు, వరాహాదులు మిక్కుటముగా వానను చలువను గోరుటయు, ప్రసిద్ధము. సామాన్యముచేత విశేషసమర్థనరూప మయిన యర్థాంతరన్యాసము.

క. 'భాషింపఁగ సామాన్య వి । శేషము లర్థాంతరాఖ్యఁ జెన్నగుతోడ న్;
పూషునిఁ బాము గ్రసించున్ । భాషాపతివ్రాలు దాఁట వశ మెవ్వరికిన్.' అలం.

గ్రహస్థితిని విచారించుటకు జన్మనక్షత్రము తెలియనప్పుడు దానికిబదులు నామనక్షత్రమును అవలంబించుట జ్యోతిశ్శాస్త్రసమ్మతము. జన్మరాశికి మూఁడవ రాశియందుండు సూర్యుఁడు మేలు సేయు నని జ్యోతిశ్శాస్త్రోక్తము. 'షట్త్రిదశస్థో భానుః'...అప్పుడు సూర్యుఁడు కర్కాటమునకు వచ్చెను. అది వృషభమునకు మూఁడవది. వనతత్యాదులనామముల యాద్యక్షరము వా యగుటచేత (హ్రస్వదీర్ఘభేదము అవివక్షితము); 'ఓవావీవో రోహిణీ' అను సూత్రముచేత వానినామ నక్షత్రము రోహిణి యగును. 'కృత్తికాపాదత్రయం రోహిణీ మృగశీర్షార్ధం వృషభః' అను సూత్రముచేత రోహిణి వృషభరాశిలోనిది.

'ఆధి' - 'పుంస్యాధి ర్మానసీ వ్యథా' అమ. వనతతికి మన స్సెక్కడిది? దానికి మానసవ్యాధి యనుట అసంబద్ధము కాదా? యనిన - లతావృక్షముల సముదాయమే వనము, వానికి చైతన్యమును సుఖదుఃఖములను మనువు చెప్పియున్నాఁడు. 'అన్తస్సంజ్ఞా భవన్త్యేతే సుఖదుఃఖసమన్వితాః' అన్లే కాళిదాసుఁడు:—

'త్వాం రక్షసా భీరు యతోఽపనీతా । తం మార్గమేతాః కృపయా లతా మే.
అదర్శయ న్వక్తు మశక్నువత్యః । శాఖాభి రావర్జితపల్లవాభిః.' రఘు. 13 - 24.

'వాహారి' - 'లులాయో మహిషో వాహద్విషత్కాసరసైరిభాః' అమ. 'వాయుభుగ్విరోధి' - సర్పనామములలో 'ఉరగః పన్నగో భోగీ జిహ్మగః పవనాశనః' అనియు, నెమలిపేరులలో -

'నీలకణ్ఠో భుజఙ్గభుక్' అనియు అమ. 'భేకే మణ్డూక వర్షాభూ శాలూర ప్లవ దర్దురాః' అమ. - వర్షా = వర్షాకాలమందు - భూః = పుట్టినట్టిది - కప్ప.

తే. వనధిగమనజగ ర్భార్కజనిత ఘృణులు
మఱి ప్రసూతికి నతనిధామంబుఁ జేరె;
ఘనతఁ జొచ్చినయిండ్లను దనుజ లుండి
కాన్పునకుఁ బుట్టిని ల్చేరుక్రమము గనమె? 78

వన...లు - వనధి=సముద్రునియొక్క (సముద్రుని) - గమన=పొందుటచేత - జ = పుట్టిన - గర్భ = చూలుగలవైన - అర్క = సూర్యుని వలననుండి - జనిత = పుట్టినవైన - ఘృణులు = కిరణములు, మఱి = మరల, ప్రసూతికిన్ = కాన్పుకై, వర్షించుటకై, అతని - ధామంబున్ = స్థానమును, (ఇంటిని అనియు - మింటిని అనుట), చేరెన్; తనుజలు = కొమారితలు, ఘనతన్ = గౌరవముతో, చొచ్చిన యిండ్లన్ = భర్త్రియింట, ఉండి = కాపురముచేసి, కాన్పునకున్ = బిడ్డను గనుటకు, పుట్టినిల్లు = కన్నవారియింటికి, చేరుక్రమమున్ = పోవురీతిని (పోవుటను), కనమె = ఎఱుఁగమా.

సూర్యునిఘృణులు సముద్రునిం గవసి గర్భముఁ దాల్చి ప్రసవమునకు మరల సూర్యునియింటికి చేరినవి. లోకములో కొమారితలు అల్లునింట గౌరవముగా కాఁపురముచేసి గర్భిణు లయినంతట కన్నవారియింటికి కాన్పుకై వచ్చుట ప్రసిద్ధమేగదా. - సముద్రోదకము సూర్యకిరణములచే (ఎండచే) ఆవిరియై యెగసి మింట నిండియుండినది, వర్షము గురియుచున్నది; అని భావము.—అర్థాంతరన్యాసము.

'గమన' - గముధాతువు గత్యర్థకంబును రత్యర్థకంబు నగు. 'గర్భ' - ఇట జలరూపము. 'ధామంబు' - 'గృహ దేహ త్విట్ప్రభావా ధామాని' అమ. 'ఘృణులు' - ఇది పులింగము. ఇట తనయాభావమునకు బాధకమైనందున 'అర్కజని ఘృణితతి' అని పఠించుట యుచితము - అర్క = సూర్యునివలన - జని = పుట్టుకకలదైన, ఘృణితతి = కిరణసమూహము, 'జనిరుత్పత్తిరుద్భవః' - 'కిరణోఽస్రమయూఖాంశు గభస్తి ఘృణి ఘృష్టయః' అమ. లేదా 'ఘృణులు' అనుటకు 'రుచులు' అని పఠించినను సరిపడును. 'రుచి స్త్రీ కిరణే కాన్తా వభిష్వఙ్గాభిలాషయోః' నానా. సంవాదార్థము ఈ క్రిందిమయూరోక్తిం గనఁదగు.—

'ఆవృత్తిభ్రాన్తవిశ్వాః శ్రమమివ దధతః శోషిణః స్వోష్మణేవ
గ్రీష్మే దావాగ్నితప్తా ఇవ రస మసకృ ద్యే ధరిత్ర్యా ధయన్తి ।
తే ప్రావృష్యాత్తపానాతిశయరుజ ఇవోద్వాన్తతోయా హిమర్తౌ
మార్తణ్డస్యాప్రచణ్డా శ్చిర మశుభిను దేఽభీశవో వో భవన్తు.'

ఇక్కడ గర్భధారణము చెప్పలేదు గావున కిరణపరముగా స్త్రీలింగపదము ప్రయుక్తము కాదు, దానిం జెప్పుసందర్భమున స్త్రీలింగపదములను ప్రయోగించిన కాళిదాసుని రసికతం గనుఁడు.

'గర్భం దధ త్యర్కమరీచయోఽస్మాత్' రఘు. 14 (4)

'తాభి ర్గర్భః ప్రజాభూత్యై దధ్రే దేవాంశ సంభవః
సౌరీభి రివ నాడీభి రమృతాఖ్యాభి రమ్మయః.' రఘు. 10 (58).

సూర్యకిరణములయొక్క క్రియాభేదములు:—

'తాసాం శతాని చత్వారి రశ్మీనాం వృష్టిసర్జనే,
శతత్రయం హిమోత్సర్గే తావద్గర్భస్య సర్జనే,
ఆనన్దా, శ్చ, హి, మేధ్యాశ్చ, నూతనాః పూతనా ఇతి
చతుశ్శతంవృష్టివాహా స్తా స్సర్వా అమృతాః స్త్రియః.' యాదవః.

తే. ఉర్విఁ గాదంబినుల యలయుమ్మనీరు। దొరుఁగఁ గేకులు కేకలు తోన సేసె,
ద్విజత నారణ్యకధ్వని వినఁగఁ జేసి।గర్భము సుఖచ్యుతము సేయఁ గడఁగెననఁగ.

ఉర్విన్=భూమిమీఁదికి, కా...రు - కాదంబినుల = మేఘపంక్తులయొక్క - అల=ప్రసిద్ధమైన - ఉమ్మనీరు = ఉబ్బునీరు (ప్రసవజలము), తొరుఁగన్ = స్రవించినవెంటనే, కేకులు = నెమళ్లు, ద్విజతన్ = తాము బ్రాహ్మణు లగుటవలన (పక్షు లగుటవలన), ఆరణ్యకధ్వనిన్ = ఆరణ్యక మనెడి వేదభాగముయొక్క శబ్దమును, వినఁగఁజేసి = వినిపించి, గర్భము = కాదంబినుల యొక్క గర్భమును (అనఁగా వృష్టిని); సుఖచ్యుతమున్ = సుఖముగా జాఱినదానినిగా, చేయన్ = చేయుటకు, కడఁగెన్ అనఁగన్ = ఆరంభించెనో యనునట్లు, తోన (తోన్+అ) = వెంటనే, కేకలు చేసెన్ = కూఁతలను గావించినవి (కూయం దొడంగినవి).

'కాదమ్బినీ మేఘమాలా' అమ. 'కేకా వాణీ మయూరస్య' అమ. నెమలికూఁతకు కేకయని పేరు. 'దన్త విప్రాణ్డజా ద్విజాః' అమ. 'కేకులు' - కేకగలది కేకి 'మయూరో బర్హిణో బర్హీ నీలకణ్ఠో భుజఙ్గభుక్ । శిఖావళః శిఖీ కేకీ మేఘనాదానులాస్యపి' అమ. 'ఆరణ్యకధ్వని' - వేదభాగవిశేషణము - 'అరణ్యేఽధ్యయనా దేవ ఆరణ్యక ముదాహృతమ్' - అరణ్యమందు అధ్యయనము సేయవలసిన దగుటచేత ఆరణ్యక మనఁబడును. దీనిని ఇంటిలో చెప్పరు. ఏలయన దీనిని విన గర్భిణులకు గర్భస్రావ మగును. ప్రసవసమయమందు స్త్రీ వినునట్లుగా దీనిని పఠించిన సుఖప్రసవ మగును. ప్రసవమేకాక, నొప్పులేపడుచున్నను, అప్పుడు బ్రాహ్మణులు దీనిం బఠింతురు. దీనిని వినుటచేత శీఘ్రమే సుఖప్రసవ మగును. 'ఉమ్మ' - ఉష్మశబ్దవైకృతమని సీతారామాచార్యుల వారి యభిప్రాయము. ఉల్బశబ్దము సంస్కృతమునం గలదు, దానికి మావి యర్థము. ఇది తత్ప్రకృతికమునుంగా నొప్పు నని నాతలంపు, 'ఉబ్బ' - ఉబ్బనీరు పడఁగానే నెమళ్లు హర్షముతో కూయందొడంగును. మేఘపంక్తులనుండి యుమ్మనీరు, నేలకు స్రవింపఁగానే, నెమళ్లు కూయం దొడంగుట - తాము (ద్విజతన్) పక్షులగుటచేత (బ్రాహ్మణు లగుటచేత) ఆరణ్యక వేదభాగమును కాదంబినులకు వినిపించి సుఖప్రసవము చేయించుటకో యనున ట్లుండెను.

నెమళ్లు ఉన్నతప్రదేశములం జేరి కూయును. అట్లుచేయుట తమకేక ఆకాదంబినులకు సామీప్యముచే వినంబడునుగాక యనున ట్లుండె ననుటయుం గలదు. - ఉత్ప్రేక్ష.

ఈపద్యమున గర్భిణిని (స్త్రీని) చెప్పుటలో కాదంబినులు అని స్త్రీలింగశబ్దప్రయోగము సముచితముగా నున్నది.

వర్షర్తువునందు నెమళ్లు కూయం దొడంగును, శరత్తున మానును.

'వర్షాసు ఘనశిఖిస్తుయ । హంసగమాః పఙ్కకన్దళోద్భేదా
జాతీ కదమ్బ కేతక ఝఞ్ఝానిలనిమ్నగా హాలిప్రీతిః.' కా. క. ల.

ఉమ్మ ప్ర. ఉల్బమ్. - "అతనిం బొదివిన యుల్బంబు మేరునగంబును, జరాయువు పర్వతంబులును, ఆయుమ్మనీరు సముద్రంబులు నయ్యె." మార్కండేయపు.

మ. అలపర్జన్యుఁడు భానుఁ డన్కొలిమిలో నభ్రంపుఁ బెన్గొప్పెరన్
జల మాఁగన్ బిడుగుక్కుజాత్యపుటయస్కాంతంపు నత్తున్కలో
పలఁ జూప, న్మహిమీఁదిలోహరజముల్ పైఁ బర్వెనా, లేచె వా
త్యలఁ బ్రాగ్దావమషు ల్మొగి ల్మొదల గ్రద్దంతై దివిన్ లేచినన్. 80

అలపర్జన్యుఁడు = ప్రసిద్ధుఁడైన దేవేంద్రుఁడు, భానుఁడు = సూర్యుఁడు, అనుకొలిమిలోన్, అభ్రంపుఁబెన్గొప్పెరన్ = ఆకాశ మనెడి పెద్ద యినుప కటాహమందు, జలము ఆఁగన్ = నీటిని కాఱిపోకుండ నిలుపుకొనుటకై, పిడు...క్కన్ - పిడుగుక్కు = పిడుగుసంబంధియైన కృష్ణాయసముయొక్క, జాత్యపు = ఉత్తమజాతిదియైన - అయస్కాంతంపు = సూదంటురాతి యొక్క - అతున్కన్ = (అ) తునియను, లోపలన్ = ఆకటాహములోపల, చూపన్ = పెట్టఁగానే, మహిమీఁది లోహరజముల్ = నేలయం దున్న యినుపరేణువులు, పైన్ = మీఁదికి (ఆకప్పెరలోనికి), పర్వెన్ నాన్ = వ్యాపించినవో యనునట్లుగా, మొగిల్ = మేఘము, మొదలన్ = ఆదిలో, గ్రద్ద అంత ఐ = గద్దంత యాకారముగలదిగా, దివిన్ = ఆకాశమందు, లేచినన్ = లేవఁగానే, వాత్యలన్ = సుడిగాడ్పులచేత, ప్రా...ల్ - ప్రాక్ = మునుపటి (వేసవికాలపు) - దావ = కార్చిచ్చులయొక్క - మషుల్ = మసులు, లేచెన్ = పైకెగసెను.

సూర్యుఁడు వెలుంగుచుండఁగా, ఆకసములో నొక్కెడ రవంత (గద్దంత) మొగిలు ఏర్పడెను; వెంటనే విసరుగాలి లేచి సుడియుచు పైకి వీవందొడంగెను. దానిచే కడచిన వేసవికాలపుఁ గార్చిచ్చులమసులును భూతలమునుండి మింటికెగసిపోయెను. ఇదియెల్లం జూడ నెట్లుండె ననఁగా, సూర్యుఁడు కొలిమి గాను, ఆకాశము వర్షాధిదేవత యైనయింద్రుఁడు యథాకాలము యథామతి వృష్టి నొసంగుటకై నీరుపెట్టుకొన్న యినుపకళాయి గాను, ఉండెను. మఱి పదినెలలనుండి నీరునింపక పడవైచియున్నందున త్రుప్పుమయినంబట్టి బెజ్జములుపడి అతుకులు నోరు దెఱచియున్నయెడల కళాయిలోనినీరు నిలువక కాఱిపోవునుగాన కళాయిని ఆకొలిమిలో కాల్చి మరమత్తుసేయుటలో కరము దిట్టపఱుచుటకై దానిలో పెట్టిన పిడుగుజాతియుక్కుసంబంధియైన సూదంటురాయిగాను, వెంటనే సుడిగాలి వీచుటయు దానిచే భూతలమునుండి కడచిన వేసవికార్చిచ్చులమసులు మింటికి (ఆమొగిలుకడకు) ఎగసిపోవుటయు ఆసూదంటురాతిచే ఆకృష్టములై భూమిమీఁది యినుపరజములు ఎగసిపోయి ఆరాతితునుకమీఁదపడి దానికంటుకొనుటయు, అను నట్లుగాను ఉండెను. రూపకోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

'పర్జన్యుఁ'డన ఇంద్రుఁడు, ఆయన వర్షాధిదేవత; 'పర్జన్యో మేఘనిర్ఘోషే వాసవే గర్జదమ్బుదే' నానా. 'తవ భవతు బిడౌజాః ప్రాజ్యవృష్టిః ప్రజాసు' అనిశాకుంతలము. 'నవవర్ష వర్షాణిద్వాదశ దశశతాక్షః' దశకుమార. 'భానూ కిరణభాస్కరౌ,' 'నభః స్వర్గామ్బుదే ష్వభ్రమ్' నానా. 'లోహోఽస్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిణ్డం కాలాయ సాయసీ । అశ్మసారః' అమ. 'వాత్యా వాతస్య మణ్డలీ' హలాయుధుఁడు. 'వాత్యానామ్ మణ్డలాకార వాతానామ్' అని మాలతిటీకయందు త్రిపురారి. 'ఆఁగన్'-అకర్మకమయిన జలము కర్త, సకర్మకమైన ఇంద్రుఁడు కర్త. ఇంద్రునియందు కమ్మరితనము నారోపించుట సమంజసముగాదు, జలమాఁచికొనుట స్వార్థమే, కటాహము తనదే. ఈకర్తయందు కమ్మరితనమునే చెప్పం దలంచేని (ఇంద్రాజ్ఞచేత) కాలపురుషుఁ డను లోహకారుఁ డిట్లు చేసె నని వర్ణించియుండఁదగును. 'పెను' - లోకమునకంతయు చాలినంతనీరు నింప

వలయును గావున. 'అయస్కాంతము'-ఇనుములో విశేషము. పిడుగుకూడ ఉక్కే యని ప్రసిద్ధి. అది పడినచోట ఉక్కుముక్కగా దొరకు ననియు వాడుక. 'అయస్కాన్త' - 'అయసాం మధ్యే కాన్తః రమణీయః' సర్వశబ్దసంబోధిని. అది యినుమునే ఆకర్షించును, ఇనుపపాడిని చెప్పవలసినదే లేదు. 'తున్క' - అదిచిన్నదైనను దానిశక్తి చిన్నదిగాదు. 'అయోధాతుం యద్వత్ పరిలఘు రయః స్కాన్తశకలః' ఉ. రా. చ. (4. 21). శకలమనుటం బరికింపుఁడు. 'రజముల్' - ఆకర్షణ సులభము. 'చూపక' - లోపలఁ బెట్టినం జాలును, అగుక నక్కఱలేదు; దానియాకర్షణశక్తిచేత అది కటాహంబునకు అంటుకొనియే యుండును, కటాహమును ఎక్కడిభాగము అక్కడ అంటుకొనియే యుండును. ఎండ కాయుచుండుట, రవంతి మొగిలు మింటఁ దోఁచుట, విసరుగాలి వీడముట, బుగ్గుమారము లేచుటయు, వరుసగా కలిగినవి. 'అఁగక' అనుటచే ఇంకను వర్షము కురియలేదని భావము' 'అభ్రంపుఁబెన్గొప్పరి' - రూపకసమాసము; కర్మధారయవిశేషముగాన మువర్ణమునకు పుంప్వాదేశము.

తే. ఇలకు డిగి, చుట్టిచుట్టి, దుమ్మెత్తి, యెగసి
పోయి, తము ముంచుసుడిగాలిపుష్కరములఁ
గడలిసి రభ్రకలభము లార్చె, ధరణి
నభ్రకరిశిశుల్ దివిఁ గాంచినట్టికరణి. 81

ఇలకున్ = నేలకు, డిగి = తగిలి, చుట్టిచుట్టి = వర్తులాకారముగా ముణుఁచుకొని. ఎగసిపోయి = పైకిలేచి. తమున్ = అభ్రకలభములను, ముంచు = కముసట్టి - సుడిగాలి పుష్కరములన్ = సుడిగాలి యనెడు తుండాగ్రములతో, అభ్రకలభముల్ = కొదమమేఘము లనెడి స్వర్గకరియువలు, దివిన్ = ఆకాశమందు. (ఆకాశగంగయందనుట), అభ్రకరిశిశుల్ = నాకగజ మయిన యైరావతముయొక్క యుపదేశమును, (కాంచెనో యన్నవిధముగా), కడలిసిరు - సముద్రోదకమును, ధరణిన్ = భూమిమీఁద, క్రాసెన్ = వెడల నుమిసెను.

తుండాగ్రములతో జలాశయములనుండి నీరని గ్రహించుటయు, మరల వెడలఁ గ్రాయుటయు, ఏనుఁగులకు స్వాభావికము. స్వాభావికవ్యాపారమయినను అదిలో తడఁబాటుగానే యుండును. పెద్దదానిశిక్షచేత చిన్నదానికి దృఢపడును. అట్లే కొదమమబ్బులనెడు స్వర్గపు గున్న ఏనుఁగులు సముద్రోదకమును తుండాగ్రములతోఁ బీల్చి భూమిపైఁ జల్లినవి. అదియెట్లు? కొదమమబ్బులు గున్న యేనుఁగు లెట్లగును? వీనికి తొండములు లేవే? యనిన - లేకేమి? నేలకు తగులునట్లుగా క్రిందికి పీచి దుమ్మెత్తుకొనిపోయి ఆకొదమ మబ్బులపై నించు సుడిగాడ్పులే వాని తొండములు. అటయిన సరియే; మఱి యివి యింకను తడబాటులోనే ఉండవలసినట్టి లేఁబ్రాయముచే సముద్రోదకమును ఆతుండాగ్రములతో పిల్చి భూమిపై ఏతడఁబాటును లేక యెట్లు వెడలఁ గ్రాసినవి? అనుదురేని, అవి ఆపనిని మింటియందు అచటి ముదురు గజమైన యైరావతమువలన అలవాటు పడినవి. గంగోదకమును ఐరావతము తుండాగ్రములోఁ బీల్చి క్రాయుచుండఁగా, మాటిమాటికిం గాంచి తామును అట్లు సేయ నేర్చినవి.—రూపకానుప్రాణితమైనయుత్ప్రేక్ష.

'డిగి' - దిగినట్టివి - సుడిగాలిపుష్కరములు. 'దుమ్మెత్తి యెగసి' - తమ్ము ముంచుటం జెప్పుట పుష్కరత్వసిద్ధికేగాని, దుమ్మెత్తి చల్లుట యభ్రకరియొద్ద నేర్చిన దని చెప్పటకుఁగాదు. మఱి దానియొద్ద నేర్చినదెల్ల సముద్రోదకమును పీల్చి చల్లుటయే. అది యెట్లనిన, అది ఆకాశగంగలో

చేయునట్టి చేష్టలను తఱచుగా చూచుటచేత. 'అది వీనికేల నేర్పినది? ఇవి దానికడ నేల నేర్చినవి?' అని యడుగుచున్న గాంబోలు? దానిశిశువులే యివి. అదియభ్రకరి, ఇవి యభ్రకలభములు - అని స్వారస్యము.

'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖే జలే
వ్యోమ్ని ఖడ్గఫలే చైవ తీర్థౌషధివిశేషయోః' అమ.
'నభః స్వర్గామ్బుదే ష్వభ్రమ్' నానా. 'కలభః కరిశాబకః' అమ.

మేఘపక్షమున కలభ శబ్దప్రయోగము ఎట్లు సరిపడుననఁగా - గౌణలక్షణచేత సరిపడును - ఉదా:-

'కవీనాం సందర్భస్తబకమకరన్దైకరసికం
కటాక్షవ్యాక్షేపభ్రమరకలభౌ కర్ణయుగళమ్
అముఞ్చన్తౌ దృష్ట్వా తవనవరసాస్వాదతరళౌ
అసూయాసంసర్గాదళికనయనం కిఞ్చిదరుణమ్.' సౌన్దర్యలహరీ. 50.

'యద్యపి కలభశబ్దః కరిడిమ్భవచనః, మహాకవిప్రయోగప్రాచుర్యవశాత్ విశేషసామాన్యలక్షణౌ భ్రమరకలభావితి.' వ్యాఖ్య.

'కరణిఁ' = వలెఁ; ఇదిసంస్కృతశబ్దము:—

'అథ చైత్రసింహస్పృతౌ ధరణిం । కరణిం దివః శ్రితహరేః స్వజతి
ఉదజృమ్భత ప్రియసుహృత్సురభేః । సుమసాయకస్య కిల విశ్వజితః.' హమ్మీరకా. (5.1)
[కరణిమ్ = ప్రతిచ్ఛందంబుగా].

ఈశబ్దము ప్రాకృతమందునుం గలదు:—

'అహసరసదన్తమణ్డలకపోలపడిమాగఓము అచ్ఛిఏ
అన్తోసిన్దూరిఅసంఖవత్తకరణింవహఇ చందో.' గాధాసప్తశతి. 3 (100).

ఛా. 'అనౌసరసదన్తమణ్డలకపోల ప్రతిమాగతోమృగాక్ష్యాః
అన్తః సిన్దూరితశఙ్ఖపాత్రసాదృశ్యంవహతి చన్ద్రః.

మేఘములు సముద్రోదకమును త్రాగుట ప్రసిద్ధము:—

'ప్రవృత్తమాత్రేణ పయాంసి పాతు । మావర్తవేగా త్భ్రమతా ఘనేన.
ఆభాతి భూయిష్ఠ మయం సముద్రః ప్రమథ్యమానో గిరిణేవ భూయః'. రఘు 13 (14).
'సాటోపముర్వీ మనిశం నదన్తో । యైః ప్లావయిష్యన్తి సమన్తతోఽమీ
తాన్యేకదేశా న్నిభృతం పయోధేఽస్సోఽమ్భాంసి మేఘాన్ పిబతోదదర్శ.'

తే. కృతపయఃపాననవమేఘపృథుకములకు
రాలె నొయ్యన వడగండ్లపాలపండ్లు;
మఱి బలాకాద్విజాళిసంప్రాప్తి గలిగెఁ,
బెరుఁగ బెరుఁగంగ ధ్వనియు గంభీర మయ్యె. 82

కృ...కుఁ - కృత = చేయఁబడిన - పయః పాన = నీరు ద్రాగుట (పాలుఁ ద్రాగుటయు) కలవైన - నవ = క్రొత్త (పసితనంపు) - మేఘపృథుకములకుఁ = మబ్బుపిల్లలకు (పిల్లమబ్బులకు) - ఒయ్యనఁ = క్రమముగా, వడగండ్ల పాలపండ్లు = పాలు త్రాగు వయస్సులో మొలచు

నవి వడగండ్లనెడి దంతములు, రాలెన్ = ఊడిపోయెను. మఱి = వెండియు, బలాకాద్విజ ఆళి = బెగ్గురుపక్షు లనెడి దంతములయొక్క - సంప్రాప్తి = లాభము, కలిగెన్; పెరుఁగఁ బెరుఁగంగన్ = క్రమముగా వర్ధిల్లినకొలఁది, ధ్వనియున్ = ఉఱుముకూడ (వాక్కుకూడ), గంభీరము = బిగ్గర, అయ్యెన్.

స్తన్యపానము మానినపసిబిడ్డలకు క్రమక్రమముగా పాలపండ్లు రాలునట్లుగానే, నీరుత్రాగి యైన క్రొత్తమబ్బులకు క్రమక్రమముగా వడగండ్లు రాలుచుండెను. తర్వాత ఆశిశువులకు మరల పలుపరుసలు మొలచునట్లే ఈక్రొత్తమబ్బులకు బెగ్గురుపక్షులవరుసలు వచ్చి కూడుకొన్నవి. ఆశిశువులకు వయస్సు వచ్చినకొలఁది నోరు హెచ్చినట్లు ఆమబ్బులకు ఆకారము హెచ్చినకొలఁది ఉఱుము బిగ్గర యగుచుండెను. - శ్లేషానుప్రాణితమయిన రూపకాలంకారము.

'పయః పానీయ దుగ్ధయోః,' - 'పృథుకః శాబకః శిశుః' - అను - వడగండ్ల పాలపండ్లు - రూపకసమాసమున షష్ఠీసమాసకార్యము; లేదా, పక్షాంతరమున కనకవలయాదులయందుంబోలె షష్ఠీసమాసముగానే గాని ప్రకృతార్థనిర్వాహము చేయవచ్చును. శ్వేతిమాది సామ్యముచేత వడగండ్లను పాలపండ్లనుట. 'బలాకా బిసకణ్ఠికా' అను. బలాకా శబ్దము పుంలింగంబును కలదు.

> 'మేఘో జలార్ద్ర మహిషోదర భృఙ్గ నీలో విద్యుత్ప్రభారచిత ధౌతపటోత్తరీయః
> ఆభాతి సంహత గృహీత బలాకశఙ్ఖః । ఖంకేశవోఽపర ఇవాక్రమితుం ప్రవృత్తః.'
>
> మృచ్ఛ. 5 - 2.

మ. తనతోయం బినరశ్ము లెత్త, నిల వాత్యారేణుమూర్తి న్మహేం
ద్రునకుం జెప్పఁగ, మ్రుచ్చుఁ బట్ట దివమందు న్విల్లుఘటింప, భయం
బునఁ దద్రశ్మిసహస్రము న్వెస డిగెం బో డాఁగి వే క్రుమ్మరిం
ప, ననం ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బుల న్వెల్లిపై. 83

ఇల = భూమి, తన - తోయంబు = జలమును (వింతవస్తువును), ఇనరశ్ములు = సూర్యకిరణములు, ఎత్తన్ = అపహరింపఁగా, వాత్యారేణుమూర్తిన్ = సుడిగాలిలోని దుమార మనెడి రూపము దాల్చిపోయినదై, మహేంద్రునకున్ = దేవేంద్రునితో, చెప్పఁగన్ = ఫిర్యాదుచేసికోఁగా, అతఁడు. మ్రుచ్చున్ = సూర్యరశ్ము లనెడి యాదొంగలను, పట్టన్ = పట్టుకొనువాఁడై దివమందున్ = మింటియందు, విలు = ధనస్సును, ఘటింపన్ = తాల్పఁగా, తత్ రశ్మి సహస్రమున్ = ఆవేయి కిరణంబులును, భయంబునన్ = (మరణదండన యగునని) భయపడినవై, వే = వడిగా, క్రుమ్మరింపన్ = ఆతోయమును క్రిందికి పోసివైచుటకై, డాఁగి = తాము కనఁబడక, డిగెన్ పో = దిగినవి సుమా; అనన్ = అనునట్లుగా, మబ్బులన్ = మేఘములయందునుండి, మించున్ = మెఱుపును, వెలిఁగింపన్ = జ్వలింపఁజేయఁగా, వెల్లిపైన్ = జలపూరముమీఁద, ధారలు = నీటియోడికలు, తోఁచెన్ = అగపడినవి.

లోకములో చౌర్యము జరుగఁగానే చోరితులు ప్రభువునొద్ద (ఫిర్యాదు) సేయుటయు, అంతటఁ దొంగను వధించి చోరితులకు ఆచోరితకమును ఇచ్చువాఁడై ప్రభువు సాయుధుఁడై తరలుటయు, ఆయుద్యమమునెఱింగి దొంగ వెంటనే తాను తప్పించుకొనుటకై అగపడకుండ ఆచోరి

తకమును తెచ్చి చోరితులయింటనే వైచుటయు, ఇంతలో దీపము వెలిఁగించినయెడల తాను దిచ్చుమొగం బగుటయును సుసంభవమే. అట్లే ప్రకృతమున భూమియొక్క జలమును (అమూల్యమయినవస్తువును) సూర్యునికిరణములు దొంగిలించినవి. అంతట భూమి సుడిగాలికి లేచిన ధూళిరూపమున మింటికిం బోయి దేవేంద్రునితో చెప్పుకొన్నది. అంత నాతఁడు ఆదొంగలను సంహరించి భూమికి ఆతోయమును మరల తెచ్చియిచ్చువాఁడై ధనుస్సుతాల్చి తరలెను. ఆసం చెఱింగి ఆకిరణములు తాము ప్రాణము తప్పించుకొనునవై ఆయన కగపడకుండ మబ్బులో డాఁగి అందుండి చోరితతోయమును ధారలుధారలుగా క్రమ్మరించి క్రింద వెల్లువ గావించుచుండినవి. ఇంతలో దీపము వెలిఁగింపఁగా కిరణములు డాఁగినవి. తోయంపువెల్లి మాత్రము ఉండెను. - వర్షాధిదేవతయైన దేవేంద్రుఁడు సువృష్టిం గురిపించె ననుట - ఉత్ప్రేక్ష.

'రేణుమూర్తిన్' - రూపాంతరమున నేఁగుట దొంగలకు తెలియకయుండుటకై; సూర్యునితో చెప్పుకొనమి అతనికిరణములపై అతఁడు పక్షపాతము వహించు నని; ఇంద్రునితోఁ జెప్పుకొనుట ఆయన ముల్లోకములకును దొరయగుటవలనను, సూర్యునికింగూడ దొర గావునను. 'దివమందున్' - ఇనరశ్ములు ఉండెడి తావగుటవలన; 'మ్రుచ్చున్' - సామాన్యముగాఁ జెప్పుట. 'విల్' - విల్లుశబ్దములో క్రింది లకారము లోపింపఁగా విలు - 'తుదినులుల క్రిందినలలకు లోపంబు బహుళంబుగ నగును.' బాల. ప్రక్రి. 7. 'విల్ - సహస్రమున్' - పదాంతాసంయుక్త లువర్ణంబుగాన ఉత్వలోపము. బాల. ప్రక్రి. 16. 'హో' - నిశ్చయార్థకము.

'వే' - ఇది కళ - ద్రుతప్రకృతికము గాదు - 'వే చనియిచటికిఁ గొనిర। మ్మా చూతము గాక నీగమనవేగంబున్' భార. విరా. 'వెల్లి' - అప్పటికి క్రమ్మరించినజలము. 'ధారలు' - ఆకిరణములు క్రమ్మరింపఁగా క్రిందఁబడుచున్న జలము - కిరణములు వేయియేగదా ధారలు - అసంఖ్యేయములే? అనిన - ఒక్కొక్కకిరణము ఎన్నెన్నియో ధారలం గురియుచున్న దని తలంపవచ్చును. 'మబ్బులన్' - మబ్బులలో కిరణములు డాఁగినవి. దీనికి మ్రబ్బు అని రూపాంతరము; అదియే తొలిరూపముగా నుండును. 'వెలిఁగింపన్' - దీపము వెలుఁగఁగా ధారలు దోఁచిన వనుటచే రాత్రి సమయముగా భావితము. కావుననే సూర్యకిరణములు డాఁగిన వని చెప్పినాఁడు. రాత్రికాలమున ఇంద్రధను స్సుండునా యనిన:—

'జలమధ్యేఽనావృష్టి, భువి సస్యవధ స్తరౌ స్థితే వ్యాధిః,
వల్మీకే శస్త్రభయం, నిశి, సచివవధాయ ధను రైన్ద్రమ్.' బృహత్సంహిత.

ప్రాయికముగా గడిదొంగలుపురుషులే గాన నిచట పుంలింగం బయినరశ్మిశబ్దము సొంపుగా ప్రయుక్తము.

భూమిలో నీళ్లిగురుట, సుడిగాలి లేచుట, గుమారు మెగయుట, ఇంద్రధనుస్సు తోఁచుట, మబ్బులు, ధారలు, వెల్లి అను నీక్రమము స్వభావోచితముగానే యున్నది.

చ. తొలితొలి వచ్చుధారల నెదుర్కొని, తచ్ఛటఁ దేఁగచుట్టుగా
నలముచు, ధాత్రి లేచి, పొలుపారె మలీమసబాష్పవల్లు; ల
త్తొలితొలిధారకే వెఱచి, తోన ఘనౌఘము వానకాళ్లకుం
బలరిపుఁ డాలయాభ్రముల భంగినె సంకెల లూన్చెనో యనన్. 84

మలీమస బాష్పవల్లులు = మలినములైన యావిరి తీవలు, ధాత్రిన్ = భూమినుండి, లేచి, తొలితొలి = మొదలమొదలనే, వచ్చుధారలన్ = దిగుచున్న ధారలను, ఎదుర్కొని, తత్ = ఆధారల - ఘటన్ = సమూహమును - ఆవానకాళ్లను, తీఁగచుట్టుగాన్ = తీఁగచుట్టుకొన్న రీతిగా, అలముచున్ = పరివేష్టించుచు, (ఎట్లుశోభించె ననఁగా;) బలరిపుఁడు = ఇంద్రుఁడు, ఆతొలితొలిధారకే=ఆమొదటిమొదటిధారలకే, వెఱచి=భయముఁ జెంది, తోన (తోన్ + అ) = వెంటనే, ఘ...కున్ - ఘన = మేఘముల - ఓఘము = సమూహముయొక్క - వానకాళ్లకున్= వర్షధార లనెడికాళ్లకు - ఆ లయాభ్రములభంగినె = ప్రసిద్ధము లయిన ప్రళయకాలపు మేఘములకాళ్లకుం బూన్చినరీతిగానే, సంకెలలు = నిగళములు, ఊన్చెనో = తగిలించినాఁడో, అనన్ = అనునట్లుగా, పొలుపారెన్ = శోభిల్లెను.

మేఘములనుండి తొలితొలివర్షధారలు నేలకు దిగఁగానే, నేలనుండి, నల్లనియావిరి యెదురు లేచి యావర్షధారలయడుగుభాగములకు తీఁగలుచుట్టుకొన్నట్లు అలముకొన సాగినవి. అట్లగుట ఎట్లుండెనో వినుఁడు. - ప్రళయకాలమందు పుష్కరములు, ఆవర్తకములు, నను మేఘములు ఎల్లెడలను సంచరించుచు మహావర్షములచేత లోకమును ఏకార్ణవము సేయును; ఇతరకాలమునందు అట్లు చేయకుండునట్లుగా దేవేంద్రుఁడు ఆసంచారమును మాన్పుటకై వానికాళ్లకు సంకెలలు వైచియుంచును. అట్లే ఇప్పుడును ఇంద్రుఁడు మేఘముల తొలి తొలి ధారల జలవిస్తారముం గని, వీనిని ఉపేక్షించితినా ఇవి ఆపుష్కరావర్తకములవలె పుడమియెల్ల ఏకార్ణవ మగునట్లు అనఁగా జలప్రళయ మగునట్లు వర్షించునుబో యని భయపడినవాఁడై, ప్రకృత మేఘసమూహములయొక్క వానకాళ్లనెడు కాళ్లకు, పూర్వము ఆప్రళయ మేఘముల కాళ్లకు వైచినట్లు, ఇనుపసంకెలలు వైచెనో యనున ట్లుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'ఘటన్' - 'హేతిచ్ఛటాచ్ఛాయలిరులుఁగొనఁగ' - మను. ౧. 'మలీమస' అనుట ఇనుప (సంకెల) వర్ణముకొఱకు - 'మలీమసం తు మలినమ్' అమ. 'వల్లులు' - సంకెలవలయముల సామ్యముకొఱకు. 'బాష్ప' - 'బాష్పమూష్మాశ్రు' అమ. ఘనౌఘము - 'ఘనో మేఘే మూర్తిగుణే త్రిషు మూర్తే నిరన్తరే', 'ఓఘో బృన్దేఽమ్భసాం రయే.' అమ. 'బలరిపుఁడు' - 'వాస్తోష్పతి స్సురపతి ర్బలారాతి శ్శచీపతిః'అమ. 'లయాభ్రములు' - 'నాశే సంశ్లేషణే తౌర్యత్రికసామ్యే భవేల్లయః' నానా. ప్రళయాభ్రములకు - పుష్కరావర్తకసంజ్ఞ.

'పుష్కరా నామ తే మేఘా బృహన్త స్తోయ మత్సరాః।
పుష్కరావర్తకా స్తేన కారణే నేహ విశ్రుతాః॥ వి
నానారూపధరా స్తే తు మహాఘోరస్వనా స్తథా।
కల్పాన్తే వృష్టికర్తారః సంవర్తాగ్నే ర్నియామకాః॥' బ్రహ్మాండపు.

సంకెలలకు.—

'ఇత్థం మఘవ తాజ్ఞప్తా మేఘా నిర్ముక్తబన్ధనాః।
నన్దగోకుల మాసారైః పీడయామాసు రోజసా॥' శ్రీమద్భాగవతమ్.

మఘవతా ఇన్ద్రేణ - నిర్ముక్తం బన్ధనం యేషాం తే - ప్రళయభియా యే బద్ధా ఆసన్ తే నిర్ముక్తబన్ధనాః సన్తః...' శ్రీధరీయవ్యాఖ్యా.

'సంకెల' - 'శృంఖల'కు వై. 'శృంఖలనామంబు చెలఁగు సంకెల యన' ఆం. భా. ఊన్చెన్' - పూను అ. క్రి., పూనుచు స. క్రి., రూ. - ఊన్చు,

'పూనె నెగసెఁ బొదవెఁ బొనరెఁ బొందె నటన్న । పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లుండు వలయుచోఁ, నేఁగును.' అప్పకవి. –

పూనుపాదవుల కాదిలోపం బొకండు వక్కాణించె, నది నిరాకరంబు; అను బాల వ్యాకరణ వచనమునకు కారణ మగపడలే దని సీ. వారు. శ. ర. లో తెలిపియున్నారు.

చ. ఎడపక మున్ను మింటిపయి నేతగులంబును లేక మూకతన్
వెడలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డము వడ్డ, వానిమే
యిడియ జవోష్మఁ బొఱెడు రవీందులవట్టపుబండికండ్లచ
ప్పుడుగతి, మ్రోసె రేపగలు భూరిభయంకరగర్జ లత్తఱిన్. 85

ఎడపక = వారక (ఎల్లప్పుడు), మున్ను = పూర్వము. (వర్షర్తువు రాకముందు), మింటి పయిన్ = ఆకాశముమీఁద (ఆకాశము పైభాగమున), ఏతగులంబును = అడ్డు ఏదియును (ఎదురుపాటు ఏమియు) లేక, మూకతన్ = నిశ్శబ్దముగా, వెడలెడుచోన్ = చనునట్టి ప్రదేశముల యందు, క...లు – కఠోర = కఠినమయిన – ఘన = మేఘములయొక్క – బృందములు = సమూహములు, ఇప్పుడు, అడ్డము – పడ్డన్ = రాఁగా (కాఁగా), (పోనియక యెదురొడ్డఁగా), వానిమే = ఆమేఘబృందముల దేహములు, ఇడియన్ = చిదిగిపోవునట్లుగా, జవ ఊష్మన్ = వేగముయొక్క వేఁడితో, పొఱె...గతిన్ – పొఱెడు = ఉరవడిగాఁ జనియెడు – రవి ఇందుల=సూర్యచంద్రుల యొక్క – దట్టపు = సంహతములైన (దృఢములైన) – బండికండ్ల = రథచక్రముల, చప్పుడు గతిన్ = మ్రోఁతలో యనునట్లు, ఆతఱిన్ = అవర్షారంభదినములలో, భూరి...లు – భూరి = మెండయిన – భయంకర = బెట్టిదమయిన – గర్జలు = ఉఱుములు, రే పగలు = రేయుం బవలు, మ్రోసెన్ = ఉలియుచుండెను.

వర్షాకాలము రాకముందు లేని యుఱుములు, ఇప్పుడు, అనఁగా వర్షాకాలమందు, మ్రోయుచుండుట ఎట్లు తలంపనైయుండె ననఁగా – సూర్యచంద్రులరథములు పూర్వము మింట ఏచోటను ఏమియు దారికి అడ్డముగా తమకు తగులనందున నిశ్శబ్దముగా చనుచుండినవి. ఇప్పుడు ఆచోట్లనె మేఘసమూహములు అడ్డపడుటవలన వానిం జీల్చుకొని ఆరథములు దాఁటుటలో జనించిన మ్రోఁతలో యనునట్లు, ఉఱుములు భయంకరముగాను మెండుగాను రేయుంబవలు వినఁబడుచుండెను. – వస్తూత్ప్రేక్ష.

'ఎడపక'___

'సదా చరతి ఖే భానుః, సదా వహతి మారుతః,
సదా ధత్తే భువం శేషః, సదా ధీరోఽవికత్థనః'.

'మింటిపైన్' మింట ఘనరవీందుల వేఱు వేఱు;

'గిరౌ మయూరాః, గగనే పయోదాః; లక్షాన్తరేఽర్కశ్చ, జలే చ పద్మమ్,
ఇన్దుర్ద్విలక్షం కుముదస్య బన్ధుః; యో యస్య మిత్రం న హి తస్య దూరమ్.'

సీ. 'పక్షులు చరియించుపదవి నుల్లంఘించి, । ఘనములు దిరుగుమార్గంబు గడచి,
విద్యాధరశ్రేణి విహరించుపథ మెక్కి, । కరువలి యేఁగెడుకక్ష్య సొచ్చి,
గ్రహరాజు వాఱెడుఘంటాపథము దాఁటి, । చుక్కలు పొడతెంచుచక్కి వెడలి,
చదలేఱు ప్రవహించుచాయను దిగనాడి, । ధ్రువమండలంపుఁ బెంద్రోవ నడచి,

తే. ఊర్ధ్వలోకంబునకుఁబోవుచున్నవారు, వాసవుండాదియైనగీర్వాణవరులు.' నైష. 7 (37).

ఇట్లుండ రవీందుల తేరులకు ఘనబృందము లడ్డపడెననుట ప్రల్లదముగాదా యనిన - ప్రల్లదమయినను ఉత్ప్రేక్షలో సహ్యమే. ఇదిగాక కవీశ్వరులు యథాదృష్టముగా వర్ణింతురు. 'చోఁ' - జాత్యేకవచనము. ఇట్లే 'మే' కూడ. 'ఇడియఁ' - ఇది ద్రావిడదేశీయ మని పూర్వటీకలో నున్నది; కాని అట్లు తలంచుటకు నిమిత్త మగపడదు. 'ఇండ్లు ఇడియఁగొట్టుట', 'గోడలు ఇడియఁగొట్టుట', అను వ్యవహారము ఆంధ్రదేశమున సిద్ధమే. తెనాలిరామలింగకవియు అఱవదేశమునకు దూరమువాఁడు దీనిం బ్రయోగించినాఁడు:- 'మారుతాహతి రాలునారికేళఫలాళి । నిడిసిజల్లించు పుండ్రేక్షువులను' శ. ర. పాండురంగ. ౧. ఆ. అట్లే వేంకటపతికవియు;—'ఇవి చిల్కపోటుల నిడియుదాడిమఫలం । బులజాలురసముచాల్ పారలువాక (లు)' చంద్రభానుచరిత్రము. శ. ర.

'ఊష్మఁ' - వేఁడిమి మంచుగడ్డనుంబోలె మేఘమును సైతము కరఁగించి భేదించును; 'ఊష్మ' శబ్దము నకారాంతము - 'నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచన లోపంబు లేదు,' అను బాలవ్యాకరణవృత్తింబట్టి - ఊష్మమునఁ అనిరావలయును; అయినను ఈశబ్దము లుప్త 'ము' వర్ణకముగా పెక్కుతావులం బలువురు కవులచేతి ప్రయుక్తంబగుటంబట్టి దీనిని చరితాదులలో చేర్చుకొనుట యుక్తము. కర్తృశబ్దమును ఇట్టిద - కర్త - కర్తలు అని శిష్టవ్యవహారముబహుళము. - 'రవీందులబండికండ్లు' - రవికి తేరుండుట ప్రసిద్ధము, చంద్రునికి తేరు గలదా అనిన - కలదు: ఇతఁడును ఆతేర ఎడపక చనుచునే యుండును:—

'రవిహయమ్ములట్ల కువలయాప్తునివారు । వమ్ము లొక్కమఱి రథమ్మునకుఁ ద
గుల్పఁ గడఁక నొక్కకల్పము చనుదాఁక । బడలుపడక తేరు గడపుచుండు.' విష్ణుపు.

'రేవగలు' - రాత్రి చంద్రుఁడు లేనప్పుడును ఉడుములు మ్రోయును, పగలు చంద్రుఁడును మింట నేఁగుచుండును. కావున పగలే రవియు రాత్రియే చంద్రుఁడును ఏఁగుదు రని నియమము లేనందున రవీందు క్రమమున రేవగళ్లు నిర్దిష్టములుగావు.

చ. దినములవెంబడిం జడనిధిస్థను గ్రోలినసీరిలోనఁ జే
రినలవణంపుఘట్టముల దృప్యదిరమ్మదదావము ల్దవు
ల్కొని పెటిలించునార్భటు లొకో, యన సో సతటిద్భయంకర
స్తనితముల౯ సృజించె నతిసాంద్రఘనాఘనగర్భగోళముల్. 86

అతి...ల్ - అతి = మిక్కిలి - సాంద్ర = దట్టమైన - ఘనాఘన = వర్షించుచున్న మేఘములను - గర్భగోళముల్ = ఉదరమండలములు, దినములవెంబడి౯ = అనేకదినములనుండి, మును = పూర్వము, జడనిధి౯ = సముద్రమునందు, క్రోలినసీరిలోన౯ = త్రాగినజలములోనుండి, చే... ల౯ - చేరిన = అడుగునంజేరి పెరిగిన - లవణంపు = ఉప్పుయొక్క - ఘట్టముల౯ = ప్రదేశములను, దృ...ల్ - దృప్యత్ = విజృంభించుచున్న - ఇరమ్మద = మేఘజ్యోతులనెడు - దావముల్ = కార్చిచ్చులు, పెటిలించు ఆర్భటులు ఒకో = కాల్చి పగిలించునపుడు గలుగు మ్రోఁతలా యేమి, అన౯ = అని తలంచుటకు, సో...ల౯ - సో = తగినట్టి - సతటిత్ = మెఱుపులతోఁ గూడిన - భయంకర = బెట్టిదపు - స్తనితముల౯ = గర్జితములను, సృజించెను = కలిగించెను.

అప్పుడు వర్షించుచున్న మేఘములయొక్క కడుదట్టములైన యుదరమండలములనుండి మ్రోయుచున్న యుఱుములు ఎట్టివిగా నుండె ననఁగా, - ఆమేఘములు పెక్కుదినములనుండి

ప్రతిదినము త్రాగుచువచ్చిన సముద్రపు టుప్పునీటిలో తీయనినీరును ఉప్పును కలవుగదా, అందు, చింటలో ఇందుపుగింజగంధము కలిపిన వండునీటిలోని మంచినీరు పైకి తేరి వండు క్రిందికి దిగినట్లుగా, దినదినము తీయనీరు పైకి తేరఁగా, (అదియే వాననీరు), దినదినము అడుగునకు దిగిన యుప్పు - మొన్నటిదానితో నిన్నటిది నిన్నటిదానితో నేఁటిది యిట్లు మెండుకొని చిట్టెముగట్టినట్లు కాఁగా, మేఘములకడుపులోపలి యాచిట్టెములకు మేఘజ్యోతు లనెడుదావాగ్నులు అంటుకోఁగా, ఆయుప్పుచిట్టెములు కాలి పగులునప్పుడు పుట్టినట్టి యగాదులో యనఁదగినవిగా నొప్పుచుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.

నిప్పుచేత ఉప్పు కాలి పేలుట అనుభవసిద్ధము; కావుననే ద్వేషమున 'ఉప్పునిప్పు' అను సామెత. 'పేరుట' యనఁగా నిట నీరు చలిచే గడ్డగట్టినట్టు గడ్డకట్టుట యర్థముకాదు, మఱి ఏమన, కొంతతో ఇంకకొంత, దానితో మఱికొంత, చేరి, పెంపడగుట. అదియు ఒకటేమొత్తముగా నుండుటచే గడ్డగానే యగును. 'దృప్యదిరమ్మదదావముల్' - 'దృప్యత్' అనుటచే 'ఉన్నచోట నుండక దుముకుచు దాఁటుచు నున్న' యని యర్థము. అగ్ని దావాగ్ని సామ్యముకొఱకు - 'మేఘజ్యోతి రిరమ్మదః' అమ. 'దవ దావౌ వనారణ్యవహ్నీ' అమ. ఇట దావశబ్దమును లక్షణచే అగ్ని సామాన్యవాచకముగా నెని గొనవలయును. మఱి తటిత్తులే ఇరమ్మద దావములుగాను, గర్జితములే ఉప్పు పెటిలు నార్భటులుగాను, సంభావన. 'భాభాభయంకరార్భటీదీర్ణ దిగ్భిత్తులు', 'దుర్భరానకార్భటీ ఘూర్ణమాన కొండవీటి కొండపల్లి మండలా' అనియు మను. 'స్తనితం గర్జితం మేఘనిర్ఘోషే రసితాదిచ' అమ.

మ. ఇనరశ్ముల్ తృష వార్ధిఁ జేరి జల మొక్కింతాన, నాత్మోష్మఁ జు
యుయ్యాని వెంటం బొగ ముంచికో నెగసి, వాతాఘూతతత్సంధులం
గన నౌచుం, గళదశ్రులై వడఁకురేఖం దిక్తటప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచలల్మెఱసె నాసారంబు దోరంబుగన్. 87

ఇనరశ్ముల్ = సూర్యకిరణములు, తృషన్ = దప్పిచేత, వార్ధిన్ = సముద్రమును, చేరి = తఱిసి, జలము = నీటిని, ఒక్కింత = ఇంచుక, ఆనన్ = క్రోలఁగా, వెంటన్ = తత్క్షణమే, ఆత్మోష్మన్ = ఆత్మ = తమయొక్క ఊష్మన్ = వేఁడి (యనెడి నిప్పుచేత), ముయ్యాని = నిప్పుమీఁద నీరు పోసినం గలుగునట్టి చుయ్యి శబ్దము చేయుచు, పొగ, ముంచికోన్ = తమ్ము (చంచలలను) క్రమ్ముకొనఁగా, ఎగసి = పైకిలేచినవై, వా...లన్ - వాత = గాలిచేత - ఆఘూత = కొంచెము కదలింపఁబడిన - తత్ = ఆపొగయొక్క - సంధులన్ = నడిమిసందులయందు, కనన్ ఔచున్ = కనఁబడుచు, గళ...లు - గళత్ = రాలుచున్న - అశ్రులు = కన్నీళ్లుగలవి, ఐ, వడఁకురేఖన్ = వణఁకురీతిగా (వణఁకుచున్నవో అనునట్లుగా), ది...లు - దిక్ = దెసలయొక్క - తట = దరులయందు, ప్రోత్థిత = లేచిన, స్తనయిత్ను = మేఘములయొక్క - ఛటన్ = సమూహమునందు, చంచలల్ = మెఱుపులు, ఆసారంబు = ధారాసంపాతము, తోరంబు = మెండు, కాన్ = అగుచుండఁగా, మెఱసెన్ = ప్రకాశించెను.

ఆసమయమున దిక్తటములయందు మేఘములు లేచుట, మేఘమున నడుమనడుమ సందులు పడి అందుండి మెఱుపులు చలించుచు మెఱయుటయు, ధారలు కురియుటయుం, జూడ నెట్లుండెననఁగా - సూర్యకిరణములు తాము వేసవి వేండ్రమునకు దప్పికొన్నవై సముద్రమునకు దిగి నీరు

కొంచెముగా త్రాగుడు తమకేఁడియనెడు నిప్పు సోఁకి సముద్రపునీటినుండి పొగలేచి వీనిని క్రమ్ముకొనఁగా వీనికన్నులు ఎరియందొడంగుడు, ఇవి, నిలువలేక తప్పించుకొనుటకై పైకెగసినవై పిమ్మట ఆపొగమొత్తములు గాలియూఁపులచే సందులుపడఁగా, ఆసందులలో ఆసూర్యకిరణములు కంటిమంటచేత వణఁకుచు కన్నీరువిడుచుచు, కానిపించుచున్నవో యను నట్లుండెను.

'తృషన్' - ఉప్పునీళ్లు త్రాగిన తృష హెచ్చునేగాని తీఱునా యనిన - సూర్యకిరణములు వానిని ధారాళముగా త్రాగునవేగావున వానికి అవి డప్పితీర్చు ననియే యెన్నవలయును. సూర్యకిరణములు నిప్పా? అవి తగిలిననీటినుండి పొగ లేచునా? అనిన - 'దగ్ధుం విశ్వం దహనకిరణై ర్నోదితా ద్వాదశార్కాః' వేణీసంహారము. 'వడఁకు' - చంచలాశబ్ద ద్యోతితము - చంచలయందుఁ గల చాంచల్యమునకు ప్రతి. - 'ప్రోత్థిత' - పొగయు పైకిపోవు స్వభావముగలది, మేఘములును సముద్రమునుండి పైకి లేచునవి అని సామ్యము. 'దిక్తట -' భూమిచుట్టును సముద్ర మున్నది, కావున నే భూమికి అబ్ధిమేఖలయని పేరు, 'జగతీ రత్నగర్భాచ భూతధాత్ర్యబ్ధిమేఖలా' అమ. శే. 'ఉదధిశ్యామసీమాం ధరిత్రీమ్' అని శాకుంతలము. కావున సూర్యకిరణములు యీపద్యమున సముద్రోదకమును పిల్వవచ్చును, కావున చుట్టును మేఘములు లేచిన వనుటయు పొగలేచిన దనుటయు సంగతిపడును. - 'తోరంబు' - స్థూలశబ్దవైకృతము.

మ. ఇలకుం గల్గినజీవనంబుల నిజానిష్టోగ్రమార్తాండమం
డల మానం, దన వైరివైరి సఖుఁ డౌటం దద్రవిం బీల్చి, య
య్యిల కొక్కుమ్మడిఁ గుమ్మరింపఁ దగుఁదా నెంతైన, నంతైన మం
డలముల్ రాహు పొసంగఁ దాల్చుగతి *మింటంబర్వెఁ గాలాభ్రముల్. 88

రాహు = రాహుగ్రహము, ఇలకున్ = భూమికి, కల్గినజీవనంబులన్ = ఉన్నట్టియుదకములను, (బ్రదుకుసాధనములయిన ధనాదికములను), ని...ము - నిజ = తనకు (అనఁగా రాహువునకు) - అనిష్ట = వైరియైన - ఉగ్ర = క్రూరమయిన - మార్తాండ = సూర్యునియొక్క - మండలము = బింబము, ఆనన్ = త్రాగఁగా (అపహరింపఁగా), దయన్ = భూమిమీఁది దయచేత, వైరివైరి= ద్వేషియొక్క ద్వేషి (రాహువునకు ద్వేషియైన సూర్యునికి ద్వేషిణియైనభూమి), సఖుఁడు = (రాహువునకు) మిత్త్రము, ఔటన్ = అగుకారణముచేత, తద్రవిన్ = ఆసూర్యుని, పీల్చి - తాను చప్పరించి, అయిలకున్ = అభూమికై, ఒక్కుమ్మడిన్ = ఒక్కమాఱుగా, కుమ్మరింపన్ = కుమ్మరిలంజేయుటకు, తాను = రాహువు, ఎంతయినన్ తగున్ = ఎంత ఆకారము తాల్చిన శక్యమగునో, అంత, ఐన మండలముల్ = అంతటిది అయినట్టి బింబములను (ఆకారములననుట) పొసంగన్ = బాగుగా, తాల్చుగతిన్ = ధరించుచున్నాఁడో యనునట్లుగా, కాలఅభ్రముల్ = నల్లమొగిళ్లు, మింటన్ ఆకాశమందు, పర్వెన్ = వ్యాపించెను.

భూమియొక్క జలరూపమయిన సొత్తును, సూర్యబింబము త్రాగివైవఁగా - లోకములో ఒకరాజునకు వైరి ఎవఁడో వానివైరి ఆమొదలివానికి మిత్త్రుఁ డగుట సహజము - కావున ఆప్రకారము రాహువు వైరియయిన సూర్యబింబమునకు వైరిణియైనభూమి రాహువునకు ఆప్తురాలు అయినదిగావున ఆభూమిమీఁద దయవహించినవాఁడు, ఆభూమికి శత్రువయిన సూర్యబింబమును కబళించి, పిప్పిఁగాఁ బిల్చి అది మున్ను త్రాగిన యాజలమును మరల తాను ఒక్కుమ్మడిగా క్రుమ్మరించుటకై తాను ఎంతపెద్ద యాకారములను దాల్చిన సులభ మగునో అంతపెద్ద యాకారములను

* 'నింగింబర్వెనీలాభ్రముల్' నన్నెచో. 6-96.

దాల్చెనాఁడా యనునట్లు ఆకసమున నల్లమబ్బులు వ్యాపించెను. సూర్యబింబము మఱుఁగుచుండెను. మహావర్షము గురియనుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.

తే. పుట్ట వదలి నభోభిత్తిఁ బట్టు శక్ర
కార్ముకపుఁ బెద్ద పలువన్నె కట్లజెట్టి
దైన నడచెడి కాళ్లగుం పనఁగ గాలి
*గార్కొని దిగంతముల వానకాళ్లు నడచె. 89

పుట్టన్ = వల్మీకమును, వదలి = త్యజించి ['పుట్ట వెడలి' పా. = వల్మీకమునుండితరలి], నభోభిత్తిన్ - నభః = ఆకాశమనెడి, భిత్తిన్ = గోడను, పట్టు...ది - పట్టు = ఎక్కుడి, శక్ర కార్ముకంపు = ఇంద్రధనుస్సనెడు - పెద్ద = గొప్పదైన, - పలువన్నె = పెక్కువర్ణములు గల దైన - కట్లజెట్టిది = కట్లుగల జెట్టికి చెందినది, ఐన - నడచెడి కాళ్లగుంపు = ప్రాకుచున్న కాళ్ల సమూహమో - అనఁగన్ = అనునట్లుగా, వానకాళ్లు = వర్షధారలు, గాలిన్ = వాయువుచేత, కార్కొని = దట్టమై, దిగంతములన్ - దిక్ = దెసయొక్క, అంతములన్ = తుదలయందు, నడచెన్ = చరించెను.

అప్పుడు, పుట్టనుండి యింద్రధనుస్సు లేచుటయు, దాని క్రింద ఆకసమున నలువైపులను వానకాళ్లు గాలితోపుడుచేత దట్టపడుచు-చీకట్లు గ్రమ్ముచు, కంపిల్లుచు నడచుచునుండుట ఎట్లుండె ననఁగా - మహత్తరాకారముఁగలదైన నానావర్ణముల కట్లజెట్టియొకటి (రోదసియనెడి యింట) తనబొక్కలోనుండి వెలువడి ఆకాశమనెడి గోడమీఁద ప్రాకుచున్నదో యనునట్లును క్రింద దాని కాళ్లగుంపు క్రిక్కిఱియుచు ఇరులుగొనుచు చలించుచు నడచుచునున్నదో యనునట్లును ఉండెను. - రూపకోత్థాపితమయిన యుత్ప్రేక్ష.

'పుట్టవదలి' - ఇంద్రధనుస్సు పుట్టనుండియుఁ బుట్టును. 'వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుః ఖణ్డ మాఖణ్డలస్య' అని మేఘసందేశంబున కాళిదాసు. ఇట వల్మీకమనఁగా పుట్ట గాదనియు, ఇట పుట్టనుండి యింద్రధనుస్సు వెడలుట అబద్ధము, 'వల్మీక స్సాతపో మేఘః' అని నిఘంటువు కలదు, ఇట వల్మీకశబ్దమునకు సాతపమేఘార్థము గొనవలసినది, అనియు నాక్షేపము. 'వల్మీకే శస్త్రభయం నిశి సచివవధాయ ధనురైన్ద్రవమ్' అనుబృహత్సంహితా వచనముచేత రాత్రిసయితము ఇంద్రధనుస్సు జనించుటచేత పైయాక్షేపమునిరస్తమైనది; కాన నిట వల్మీకము పుట్టయే యనుట నిరాక్షేపము. జెట్టిపక్షమున పుట్ట యనఁగా దానితావలమైన గోడక్రిందిబొఱియ. 'ఇన్ద్రాయుధం శక్రధను స్తదేవ ఋజు రోహితమ్,' అమ.

'నభోభిత్తి' - భిత్తి నెత్తిమీఁద నుండదు గావున, భూమ్యాసన్నమయిననభోభాగమే, అక్కడి దిగంతమే, ఇట నిర్దేశింపఁబడినది. 'పలువన్నె' - ఇంద్రాయుధమును పలువన్నెలు గలదే.

'రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్య మేత త్పురస్తాత్
వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుః ఖణ్డ మాఖణ్డలస్య—.' మేఘ'

'పెద్ద' - మింటిగోడకు చాలినంత; ఇంటిగోడకు మింటిగోడ ఎన్నిరెట్లో అన్నే ఇదియు ఇంటి జెట్టికి అన్నిరెట్లు. 'నడచెడు' - వర్షధారలు గాలికి కదలుచుండును. ఆకంపమునకును జెట్టి నడకకును సామ్యము. ఈసామ్యము మిక్కిలియు పొందియున్నది. కట్లజెట్టికాళ్లు నడచునపుడు వేఱు వేఱుగా కనఁబడక మొత్తముగాఁ గనఁబడును; వానకాళ్లును అన్లే. జెట్టికాళ్లును వన్నె

* చూ. నన్నెచో. 6 - 97. '...కాళులనెల్లదెస వానకాళులమరె.'

చేతను చలనముచేతను ఇరులువలెనే యుండును, వానకాళ్లును అట్లే. 'కార్కొను' - 'కార్కొన్న కటికి చీకటి మొగి క్షాత్రంబు గరిసిన వడగండ్లగుం పనంగ' పారి. 'కట్లజెత్తి' - (శతపదీ - సం.) ఇట కట్లశబ్దము ఉద్దిష్టమయినజెత్తిజాతి యిది యని విశేషము తెలియుటకే గాని, కట్లు సామ్య ములోఁ జేరినవి గావు.

'దిగంతమునన్' - ఏకకాలమున పెక్కు శక్రధనుస్సులు ఉండవు గావునను, జెత్తియనియు ఏకవచనమే కలదు గావునను, దిగంతమునన్ అని ఏకవచనమే సమీచీనము. 'శక్రకార్ముకపుఁ బెద్ద పలువన్నెకట్లజెత్తి' - రూపకసమాసంబును కర్మధారయవిశేషమె గావున ఇట పుగాగమము వచ్చినది.

చ. ఒకచినుకు న్ససస్య యగు నుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకము, లటంచు లోఁ గనలి దట్టముగా నలమేఘుఁ డాడు చుం
డక చన నూఁదఁగాఁ దొరఁగు నాళపుటుండలు వోలె రాలెఁ ద
క్కక పడువర్షధారల ముఖస్థము లై కరకానికాయముల్. ౧౦

చాతకములు = వానకోయిలలు, మూఁగి = తనచుట్టును దట్టముగాఁ గ్రమ్ముకొన్న వై, ససస్య = పైరులతోఁ గూడుకొన్నట్టిది, అగు - ఉర్వికిన్ = భూమికి, ఒకచినుకున్ = ఒక బొట్టునైనను, డిగ్గఁగన్ ఈవు=దిగనీయ కున్నవి, అటంచున్ =అనుకారణముచే, అలమేఘుఁడు= ప్రసిద్ధుఁడైన జలధరుఁడు, లోన్ = మనస్సులో, కనలి = కోపగించినవాఁడై, దట్టముగాన్ = చినుఁకులు నేల రాలుటకు సందులేనియట్లుగా. ఆడుచుండక = ఇటునటుం జరించుచుండుటను మాని, చనన్ =పోవునుగాక యని, ఊఁదఁగాన్ =ముఖవాయువుతోఁ బ్రేరణ సేయఁగాఁ, దొరఁగు నాళపుటుండలువోలెన్ = రాలుచున్న గొట్టపు గుళికలో యనునట్లుగా, క...ల్ - కరకా = వడగండ్లయొక్క - నికాయములు సమూహములు, పడు వర్ష ధారలన్ = కురియుచున్నవర్ష ధారల యందు, ముఖస్థములై = అగ్రమున నున్నవై, తక్కక = వారక, రాలెన్ = పడెను.

వానకోయిలలు చినుకులకై మేఘముకడ మూఁగుటయు, వడగండ్లు తాము ముందును తమ వెంట వర్ష ధారలునుంగా రాలుటయు నెట్లుండె ననఁగా, మేఘుఁడు 'ఈవానకోయిలలు నన్ను దట్టముగాఁ జుట్టుకొని ఒకచినుకునైనను ససస్యయయినభూమికి దిగనీయక నావాన నంతయు తామే కాఁజేయుచున్నవి', అని వానిపైఁ గోపగించి, వాన క్రిందికి దిగునట్లు వానిని ఎడమెడముగా తఱుమువాఁడై, నోటిగాలితో గొట్టపుగుళికలను ఊఁదఁగా ఆగొట్టములనుండి ఆగుళికలు రాలు టయో యనున ట్లుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.

'ఒక చినుకున్' - భక్ష్యలేశవిశేషసామ్యభావన. 'ససస్య యగునుర్వి' - బిడ్డలతల్లివంటిదని ధ్వని, లేదా, గర్భిణివంటి దనియేని. 'డిగ్గఁగనీవు' - ఎంతదట్టముగా నున్న వనఁగా పైని వెల్లువ గొన్నను నీటిచుక్క క్రిందికి జాఱనంత; 'నువ్వులు చల్లినం గ్రిందరాలనట్లు' అన్నట్లు. 'లోన్' - పైకి చెప్పలేదనుట, ఉఱుము లేదనుట. 'దట్టముగా ఆడుచుండక చనన్' - మేఘుఁడు చాతకములయందును సదయుఁడే, వానిని వర్షమున కడ్డపడక యుండునట్లుగా ఎడమెడముగా నుండునట్లు నిలుపుటకే అతనియుద్యమముగాని, వానికి జలమే లేకుండంజేయ దొరంకొన్నవాఁడు కాఁడు అని భా. చాతకములు వానచినుకులకు మేఘునిం జుట్టుకొన నేల? ఏళ్లలో నీళ్లు త్రాగ రాదా యనిన, వానికి నేలఁ బడిననీరు వ్యాధికరము. అట్లే మేఘటీక - ''సర్వంసహాపతితమమ్బున

చాతకానామ్' ఇతిశాస్త్రా న్భూస్పృష్టోదకస్య తేషాం రోగహేతుత్వాత్.'' 'అడుచు' - ఎక్కడ చినుకుపడునో అక్కడికెల్ల చరించుచుండుటచేత. 'నాళపు టుండలు' - పిట్టవేటకాండ్రు నోటఁ గొన్ని యుండల నుంచుకొని, వానిని ఒకకొన నోటం బెట్టుకొన్న యొకగొట్టము ద్వారముగా ఊపిరిగాలి త్రోపుడుచే పిట్టలమీఁదికి ఊఁది వానిని గూల్చుట ప్రసిద్ధము. ఆవిధముగా మేఘుఁడు ధారలనెడిగొట్టములతో వడగండ్లనియెడి యుండలను వానకోయిలలను గుఱిపెట్టి యూఁది వానిం జెదరఁగొట్టె నని భావము.

'కవజక్కవలు వాయఁ గరనాళములఁ జందు। రుండూఁదుపటికంపు టుండ లనఁగ.' పారి. ధారలే నాళములయ్యుండు రేని ధారలు లెక్కకు మిక్కుటములు, అన్ని నాళములను చెప్పినట్లు గదా అగును; వేఁటరి ఒక నాళముతో నేగదా పిట్టలం గూల్చును; అనిన మేఘుఁడు మహాకాయుఁడగుటచే సన్నగొట్టములే చాలియుండుటచేత ఒక్కమ్మడినె పెక్కుసన్నగొట్టములను నోట నూఁదఁగలఁడనియు, సన్నగొట్టములేగాన ధారలకు సాటియే యనియు, తలంపవచ్చును. 'ముఖ' - ఇది గొట్టమునుండి వెలువడుటను సూచించుచున్నది. 'పడు' - నాళసాదృశ్యవిషయమున అధోముఖముగా గుఱిపెట్టఁబడిన - 'వర్ష ధారలన్' - అని వ్యస్తము చేయుటచే ముఖశబ్దముతో నేకదేశాన్వయము తప్పను. 'ముఖస్థములై' - వేఁటరినోటనే నాళ ముండఁగా, ఉండమాత్రమే గుఱిమీఁదికిం బోవును; (ఇట క్రిందఁబడును అనుదము.) ఆసాదృశ్యము వడగల్లు ముందుగానే పడునేని కలుగును. అట్లు ధారనుపీడి ముందుగా వడగల్లు పడునా? అనిన - వాస్తవముగా బరువు - తేలిక, గడ్డ - ద్రవము, అనుభేదము లేక సకలపదార్థములును పైనుండి క్రిందికి సమకాలములోనే పడును. అయినను బరువెక్కువది త్వరగానే పడు ననియు, బరువుతక్కువది ఆలస్యముగా పడు ననియు విమర్శహీన మయిన భ్రమ. గొప్పగణకులకును ఈభ్రమయుండినది.

'భూః ఖేఽధః ఖలు యాతీతి బుద్ధిర్బౌద్ధ ముధా కథమ్
జాతా యాతం తు దృష్ట్వాపి ఖే యత్ క్షిప్తం గురు క్షితిమ్.'

యది భూరధో యాతి తదా శరాదిక మూర్ధ్వం క్షిప్తం పునర్భువం నైష్యతి। ఉభయోరధోగమనాత్। అథ భూమేర్మందా గతిః శరాదేః శీఘ్రా। తదపి న। యతో గురుతరం శీఘ్రం పతతి। ఉర్వ్యతి గుర్వీ। శరాదిరతిలఘుః। హే బౌద్ధ ఏవం దృష్ట్వాపి భూరధో యాతీతి బుద్ధిః కథ మియం తవ వృథోత్పన్నా।' అని గోళాధ్యాయములో భాస్కరాచార్యుని వచనము. 'కరకా' - 'వర్షోపలస్తు కరకా' - అమ.

సీ. ఎలగోలుజల్లు మున్నెళపెళ నేటవా
ల్పడి గాలి నట్టిండ్లఁ దడిపి చనఁగ;
నట్టెతో వడగండ్లకట్టావులు దుమార
మావుల రేఁచి రెండవదియుఁ జన;
మఱి మూఁడవది నిల్చి మెఱసి బిట్టుఱిమి శీ
కరవారి సృష్టిఁ జీకటిగ నలమ;
నుయ్యెలచేరుల యోజఁ బైఁబైనె వెండి
జల్లుపైజల్లు పెల్లల్లుకొనఁగ;

తే. భూభిదాపాది దుర్భరాంభోభరంపు
వడి మరుజ్ఝంఝఁ దెరలక కడవ వంచి
నట్లు హోరని ధారౌఘ మైక్య మొంది
విన్ను మన్నును నొకటిగా వృష్టి బలసె. 91

ఎలగోలు జల్లు = మొట్టమొదటివాన, మున్ = ముందుగా, పెళపెళ = పెళపెళ, ధ్వనితో, గాలిన్ = గాలికారణముగా, ఏటవాలుపడి = అయిమూలగా దిగి, నట్టిండ్లన్ = ఇంటిమధ్యప్రదేశములను, తడిపి = తడియఁజేసి, చనన్ = నిలిచిపోఁగా, తోన్ = వెంటనే వడగండ్ల కట్టావులు = వడగండ్లయొక్క (వడగండ్లవలనం గలుగునట్టి) ఆవిరులను, దుమారము= దుమ్మును, ఆవులన్ = (చాలియుం జాలని చినుకులు రాలి నేల తడిసియుం దడియక యుండఁగా మట్టివాసన కొట్టుచు లేచునట్టి) యావిరులను, రేఁచి = రేఁగఁజేసి (లేపి), రెండవదియున్ = రెండవజల్లును కూడ, అట్టె = ఆతొలిజల్లువలెనే, చనన్ = నిలువకయే పోఁగా, మఱి = అటు గాక, మూఁడవది = మూఁడవజల్లు, నిల్చి = నిలుకడగా నుండి, మెఱసి = మెఱుపులు దాల్చి, బిట్టు = పెల్లుగా, ఉఱిమి = గర్జించి, శీకరవారిన్ = తుప్పరనీటిచేత, సృష్టి = విశ్వము, చీకటిగన్ = ఇరులుకొనునట్లు అలమన్ = ఆవరింపఁగా, ఉయ్యాలచేరులయోజన్ = ఉయ్యాల గొలుసులవైఖరిగా (అనఁగా - ఇటువాలిన జల్లు ఇటే నిలువక అటు జరుగుచు, అటునుండి మరల నిటు జరుగుచు), పైపైన్ = మీఁదమీఁద, వెండి = మరల, జల్లుపైన్ = వానమీఁద, జల్లు = వాన, పెల్లు = మిక్కుటముగా, అల్లుకొనఁగన్ = పెనఁచుకొనఁగా, భూ...డిన్ - భూ = నేలకు - భిదా = భేదనమును - ఆపాది = కలిగించునట్టి - దుర్భర = సహింపరాని, అంభః = నీటియొక్క - భర = పెల్లిదముయొక్క - వడిన్ = వేగముచేతను, మరుత్ఝంఝన్ = గాలియొక్క విసరుచేతను, తెరలక = తెఱపిలేకుండ, కడవ = బానను, వంచినట్లు = వంచినరీతిగా, ధారా ఓఘము = నీటి బృందము, ఐక్యము = ఏకభావమును, ఒంది = పడసి, విన్ను = ఆకసంబును, మన్నును = నేలయు, ఒకటిగాన్ = ఐక్యమొందునట్లుగా, వృష్టి = వాన, బలసెన్ = అంతటను వ్యాపించెను.

మొదట ఒకవాన పెళపెళధ్వనిపూర్వకముగా వచ్చి గాలిచే ఏటవాలై, ఇండ్లలోనికిచొచ్చి, నట్టిండ్లను తడిపి, పోయినది; పిమ్మట రెండవది వడగండ్లతోఁగూడ వచ్చి వడగండ్లచలువయు భూమియొక్క కాఁకయుం గలియఁగా జనించునావిరితోడి మట్టిఘుమ్మని, (మట్టివాసనతో లేచెడి యావిరిని రేఁగఁజేసి), ఆతొలివానవలెనే తానును అంతటితో నిలిచిపోయినది; మూఁడవజల్లు ఆరెండింటివలెఁగాక నిలుకడవహించి మెఱుపులు మెఱసి పెల్లుగాగర్జించి, తుప్పరచే విశ్వమంతయు ఇరులుకొనునట్లు కమ్ముకొన్నది. పిమ్మట క్రిందిజల్లు ఎక్కువవిరివియు దానిమీఁదిజల్లు అంతకన్నం దక్కువవిరివియు, ఆమీఁదిజల్లు మఱియుం దక్కువవిరివియుం గలిగి, ఉయ్యాలచేరు లేవిధముగా ఊర్ధ్వమున ఒకముడిగా కలసియుండి క్రిందికివచ్చినకొలఁదియు విశాలత హెచ్చి, ఇటునుండి యటు, అటునుండి యిటు ఊఁగుచుండునో, ఆప్రకారము జల్లులదొంతర డిగి అన్నియు నొండొంటితో పెనఁచికొని మబ్బుమొదలుకొని యొకటే జల్లయినవి, అనంతరము నేలను బ్రద్దలు సేయు నట్టి నీటిమొత్తంపు భారముయొక్క వేగముచేతను గాలియొక్క విసరుచేతను, పెక్కుపెక్కు ధారలుకూడి ఒక్కొక్క మహాస్థూలధారగా అగుచు అట్టి స్థూలధారలు నీటికడవ వంచినట్లు

హోరు మనుధ్వనితోఁ బడుచు, తామును నడుమ సందులేనియట్లుగా క్రిక్కిఱియుచు, ఆకసమునకును నేలకును నడుమ యెడముపోయి ఆరెండు ఒకటేయగునట్లు వర్షము కురిసినది.— స్వభావోక్త్యలంకారము. 'ఉయ్యాలచేరులయోజన్' - నిదర్శన, 'భూభిదా' - అతిశయోక్తి, 'కడవ వంచినట్లు' - ఉత్ప్రేక్ష. 'విన్ను...ఒకటిగా' - అతిశయోక్తి.

'ఎలగోలు' - ప్రథమప్రసరణము - ఈపదము ఆదిలో సేనాముఖప్రసరణమునకుం బేరుగా నుండి పిమ్మట గౌణలక్షణచే ఇంచుక యర్థభేదములం బొందిన దని తోఁచుచున్నది. 'నట్టిండ్ల' వఱకునుచొచ్చుట ఏటవాలు చేత.

'అవులు రేఁచి రెం × డవదియుఁజన' - అవగాగమమునకు స్వరయతి;—

చ. 'గవిలో బెబ్బులిడాఁగి గృధ్రము మెఱుముం గాఁ గాంచి రాజేసి నే
యవడి న్బాణము వెంటనే నిగిడి పైకెత్తేచి రానేసె రెం
డవకాండంబుఁ దదస్త్రముం గొనక డాయన్ వచ్చి కాత్మేయుక
ప్రవిభిన్నం బయి నేలఁ గూలెఁ బవిధారాభిన్నశైలాకృతిన్. మను. ౪. ఆ.

'అట్లు' - సామ్యము చనుటయందే; 'అదియున్' - ఇందలి యుశబ్దంబునకును చనుటయందే అన్వయము, 'మఱి' - భేదార్థకము: 'సృష్టి' - ఇట సృజింపఁబడిన ప్రపంచము అర్థముగాని, సృజించుట అర్థముగాదు. 'ఉయ్యాలచేరులయోజన్'—

'ఉయ్యాలచేరు లనఁగా । నయ్యిరువాగులను దాఁటు యటు దిరుగుచు బ
ల్కయ్య మొనరించి యించుక । డయ్యక యొడ్డపయిఁ బెట్టుటయు నట్టియెడన్.
కువలయాశ్వ. 2. 132.

'ఓహారి సాహారి నుయ్యాలచేరుగా
వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగు నెడలు.' భార. విరా. 3 (165).

'భరింపువడి' - బరు వెక్కువయినకొలఁది క్రిందికి పడుటలో వడి యెక్కువ యగు నని కవియభిప్రాయము. 'మరుజ్ఝంఝ' - 'ఝంఝావాతః సవృష్టికః' అమ. వానతోడిగాలికి ఝంఝ యని పేరు.; కావున నిట మరుచ్ఛబ్దము ఎక్కువ, కావున ఝంఝకు విసరు అని లక్ష్యార్థము చెప్పవలసి వచ్చినది. 'కడవ వంచినట్లు' - కడవకు నోరు కడుపుకన్నం గాని కడుపునంత గాని వెడల్పుగావున, దానిని వంచినచో లోనిసిరెల్ల ఎంతవంచిన నంత క్రిందికి కుమ్మరిల్లును. - అవిధముగా అతిస్థూలముగా మబ్బులోని నీరంతి ఒక్కుమ్మడి నే కుమ్మరిల్లునట్లు అని భావము.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘమం
డలపున్ మద్దెళ గ్రుంగ లేవను, మరున్మార్దంగికుం డర్థినొ
త్తి లలిన్ నేలకు వ్రాలుచు న్నెగయుచుం దారాడున త్రెల్లజ
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె, ధారలును దల్లోలేం బ్రగోపంబులన్. 92

అలపర్జన్యుఁడు = ప్రసిద్ధుఁ డయిన యింద్రుఁడు, కే...పు - *కేకి = నెమ్మి నెడు - పాత్రముల = నట్టువులయొక్క - గుంపు = సమూహమును, ఆడించుచున్ = నాట్యమాడించునప్పుడు, మేఘమండలపున్మద్దెళ = మబ్బుల మొత్తము నెడుమృదంగమును, మరున్మార్దంగికుఁడు = గాలి యనెడుమద్దెళగాఁడు (దేవమార్దంగికుఁడనియు), అర్థిన్ = ఉత్సాహముతో, క్రుంగన్ = క్రిందికి

* చూ. నన్నెచో '...కేకీపాత్రములాడె...' 6 - 103.

వచ్చునట్లును, లేవను = పైకిలేచునట్లును. ఒత్తన్ = త్రోయఁగా, ధారలును, త...లన్ - తత్ = ఆధారలయందు - లోల = సక్తములయిన - ఇంద్రగోపంబులన్ = ఆరుద్రపురుగులును, లలిన్ = అందముగా, నేలకున్ = భూమివైపు, వ్రాలుచున్ = దిగుచును, ఎగయుచున్ = పైకిపోవుచును, తా...లు - తారాడు = జీరాడు (చుండునట్లు), ఆతెల్లజల్లులన్ = తెల్లని యాజాలరులుగాను, కెంగుచ్చులన్ = ఎఱ్ఱనికుచ్చులుగాను, అయ్యెన్ = ఒప్పినవి.

దేవేంద్రుఁడు నెమళ్లనెడి పాత్రములను గుంపుగా నాట్యమాడించునప్పుడు మద్దెలగాఁడు మేఘమండలమనెడి మద్దెళను నటనానుసారముగా క్రిందికిని మీఁదికిని దించుచును ఎత్తుచును ఉండఁగా, ఆమేఘమండలముతోఁగూడ క్రిందికి వచ్చినప్పుడు (భూమికి) చేరువనుండియు అది పైకిం బోయినప్పుడు (భూమికి) దవ్వుననుండియు, మేఘమండలములనుండియే వ్రాలుచుండు వర్ష ధారలును వానితుదినుండెడి యారుద్రపురుగులును, మృదంగము క్రిందికివచ్చినను పైకిపోయినను మృదంగమునుండియే వ్రేలుచుండు తెల్లజాలరులును వానితుదినుండెడి యెఱ్ఱనికుచ్చులుంగా నొప్పు చుండినవి. రూపకాలంకారము. 'క్రుంగను లేవను,' 'వ్రాలుచున్నెగయుచున్'అని యథాసంఖ్యా లంకారము.

'మేఘమండలపున్మద్దెళ' - ముగంతపూర్వపదము, కర్మధారయవిశేషముయిన రూపకసమా సము: కర్మధారయముగాన ముపర్ణకంబునకు పుంప్వాదేశము. - (బాల. సంధి 31). నుగాగమంబు పుంపులకు పరుషసరళములకుముందే విహితమైనను 'గరువపున్మరువు' అను ప్రయోగంబునందుం బోలె నిటవచ్చినది. (బాల. సంధి. 24). 'ఇంద్రగోపంబులు' - ఇంద్రుఁడు గోపుఁడుగా (రక్ష కుఁడుగా) కలవి - వర్షాకాలమందు పుట్టునట్టివిగాన ఆపేరు. 'కెంగుచ్చులు' - కెంపు+కుచ్చులు - ప్రాతాదికార్యము.

ఉ. ఓహరిసాహరిం బ్రథమ మొల్కెడుధారల గాడ్పు లేటవా
ల్గా హతి సీడ్చి, పేఁగుప్రజలం గలఁప, న్మొగి లొందె నంబుభృ
ద్వాహచలత్ప్రథత్వము, మొదల్మెఱుఁ గన్ ధ్వజ మెత్త నోటఁగా
నాహదనం జెలంగుజన మాంతము నూళ్లకుఁ బోవ రామియున్. 93

ఓహరి సాహరిన్ = తండోపతండములుగా, ప్రథమము = తొలుత, ఒల్కెడుధారలన్ = పడుచున్ననీటిధారలను, గాడ్పులు = వాయువులు, హతిన్ = కొట్టుటచేత (వడిగా వీచుటచేత), ఏటవాలుగాన్ = వంపుగా, ఈడ్చి = లాగుచు, పేఁగుప్రజలన్ = దిట్టలుగాని జనులను, కలఁ పన్ = కలఁతపెట్టఁగా, మొగిలు = మేఘము, అం... - అంబుభృద్వాహ = మేఘవాహనుఁ డయిన యింద్రునియొక్క - చల ద్రథత్వము = నడచుచున్న తేరితనమును - ఒందెన్ = పొంది నది, మొదల్ = ప్రథమమందే, మెఱుఁగు అనుధ్వజము = మెఱుపనెడి టెక్కెమును, ఎత్తనోటఁ గాన్ = ఎత్తుటచేత, ఆహదనన్ = ఆసమయమందు, చెలంగుజనము = అటనున్నజనులు, ఆంతము = తుదివఱకు, ఊళ్లకున్, పోవరామియున్ = పోఁగూడక యుండుటను సయితము, (ఒందెన్).

విశేషముగా తొలుతం గురియుచున్న ధారలను గాలికొట్టి యేటవాలుగా లాగఁగా మేఘము ఇంద్రుని సంచరించుచున్న రథమో యనునట్లుండెను. దిట్టలుగాని జనులు వర్షమునకుం గలంగఁ బడుట ఆరథ మీడ్చుత్రొక్కుడునకు జడియుటయో యనునట్లుండెను. వర్షప్రతిబంధకముచే జనులు ఊళ్లకుపోక నిలుచుట మొదటనే మెఱుఁ గనుధ్వజము నెక్కించినందున ఆయుత్సవము

ముగియువఱకు పోఁగూడమిచేత ఉల్లసం బోవమియో యన నొప్పుచుండెను.—రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

ఇట మేఘము ఇంద్రరథముగాను ధారలు దానిని లాగుటకైన మ్రోకులుగాను, వాయువులు ఈడ్చుజనులుగాను, ధారలు సాగుదెసకే మేఘము గమించుచుండుట రథము నడచుచుండుటగాను, చినుకులచే జనులు తడిసి కలఁతఁబడుట, రథమీడ్చు త్రొక్కటమునకు జడిసి అవలికి జరుగుటగాను, వర్షము వెలియువఱకు బయటికిరాక ఒదిఁగియుండుట ఉత్సవాంతమువఱకు ఉల్లసపోక ఉత్సవస్థలమందే ఉండుటగాను ఉత్ప్రేక్షితము.

'ఓహరిసాహరిన్'—

'అహమహమిక సేయ రహి నెక్కు నోహరి సాహరి యనఁగను' ఆం. భా. 2 (221)

అంబువు=నీరు - అంబుభృత్తు=మేఘుఁడు - తద్వాహుఁడు=(తద్వాహనుఁడు) ఇంద్రుఁడు, 'సంక్రన్దనో దుశ్చ్యవన స్తురాషాణ్మేఘవాహనః' అమ. - 'అద్ధ్వజము' = అనుధ్వజము, తద్ధారక విశేషణము లగు నను కొనులకు ఉత్వలోపము ప్రయోగసిద్ధము—'సార్వభౌముఁడ హరిశ్చంద్రుఁడన్వాఁడ' గౌ. హరి. 'ఆంతము' - ఆ + అంతము - అవ్యయీభావ సమాసము. 'ఆ'శబ్దము అభివిధివాచకము.—సూ. 'ఆఙ్మర్యాదాభివిధ్యోః' - 'మర్యాదాయా మభివిధౌ క్రియాయోగే షదర్థయోః। య ఆకారః స ఙిత్ప్రోక్తో వాక్యస్మరణయో రఙిత్॥. ఆత్మబోధా ద్యైకదేశా దాలోక్య పరత్రైవ రిః। ఆ ఏవం తత్త్వమర్యాదా ఆ ఏవం తత్కృతం మయా॥'

తే. మిగుల నామనిఁ బచ్చచాంపేయకముల
నమ్మి, కడపటఁ దము వైచి, నాఁడు మగుడ
నాసపడువారి నవ్వున ట్లల్ల విచ్చెఁ
గలయ మూతులు కేతకీగహనతతులు. 94

ఆమనిన్ = వసంతర్తువునందు, పచ్చచాంపేయకములన్ = పసుపువన్నె సంపెంగలను, మిగులన్ = అధికముగా, నమ్మి = తమకు ఎప్పటికిని అవి యుండు నని నమ్ముకొని, తమున్ = గేదంగులను, కడపటన్ = అంతిములందు (ఆరామముల వెలుగులయందు), వైచి = పాఱవైచి, నాఁడు = ఆవర్షర్తు దినములయందు, మగుడన్ = మరల, ఆసపడువారిన్ = కోరెడువారిని, నవ్వునట్లు = పరిహసించుచున్నవో యనునట్లు, కేతకీగహన తతులు = మొగలివాటికలసమూహములు, కలయన్ = ఎల్లెడలను, మూతులు = నోరులను, అల్లన్ = ఒయ్యన, విచ్చెన్ = తెఱచినవి.

పూర్వము వసంతములో సంపెంగలు పూవఁగా వానిని ధరించి, అవి శాశ్వత మని నమ్ముకొని గేదంగులను తిరస్కారముచే దూరముగా వైచినవారు ఇప్పుడు సంపెంగలు లేనందున తెలివితెచ్చుకొని, ఇప్పటి యీ గేదంగులనే కోరుటం గని గేదంగివనవాటికలు వారిని చూచి హేళనముగా నవ్వుచున్నవో యనునట్లు కంచెలలో నెల్లయెడలను గేదంగులలో పూలు వికసించెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'ఆమని' - 'పంట యొబ్బిడి సేయించుపని వసంత। మనువిభాసిల్లుచుండు నామని యనంగ' ఆం. భా. 3(51). 'చాంపేయకములన్'—'చామ్పేయశ్చమ్పకే' అమ, చంపకము అనఁగా సంపెంగ, వసంతర్తువునం బూచును. 'కడపటన్' - ముండ్లయాకులదిగాన మొగలి తోఁటలసరిహద్దు కంచెలలో నాటఁబడును. అట్లు నాటుటనే దూరానవైచుటగా చమత్కరించుట. కేతక

వర్షాపుష్పము: 80వ పద్యముటీకం జూచునది. మొగలిపువ్వు తెలుపు - నవ్వునుం దెలుపు కావున చేరికనమునకైన నవ్వుగా నుత్ప్రేక్షితము.— 'యాశసిధవళతా వర్ణ్యతే హాసకీర్త్యోః' సా. ద. - 'మూతులు' - మూతులయాకారముగలవైన పుష్పములు.

చ. అనయము నందనంపు దివియందునె యుండి, ప్రసూనవాసనల్
గనిఁ పఱతెంచి పోవునలకారుమెఱుంగులె పోవ రాక చి
క్కెనొ నవగంధలుబ్ధభుజగీపరివేష్టన నా, మొగళ్లపిం
డునఁ జెలఁగెం బసిండితగడుం దెగడుం బువ్రేకు మొత్తముల్. 95

అనయము = ఎల్లప్పుడు, నందనంపు దివియందునె = నందనవనముతోడి యాకాశమందె (స్వర్గమందే యనుట), ఉండి = కాలము గడపి, ప్రసూనవాసనలు = నందనవనపుష్పముల పరిమళములను, కని = పొంది, పఱతెంచి = పఱుగునవచ్చి, పోవు అలకారు మెఱుంగులె = మరలమింటికేఁగ నుద్యమించిన యావర్షాకాలపు మెఱుపులే, నవ...నన్ - నవ = క్రొత్తవైన, గంధ = పరిమళములయందు - లుబ్ధ = ఆసగొన్నవైన - భుజగీ = ఆఁడుఁబాములయొక్క, పరివేష్టనన్ = చుట్టుకొనుటచే, పోవరాక = పోవశక్యముగాక, చిక్కెనో = భూమియందే నిలిచినవో, నాన్ = అనునట్లుగా, మొగళ్లపిండునన్ = మొగలిడొంకల సమూహమునందు, పసిండితగడున్ = బంగారపురేకును, తెగడుంబువ్రేకమొత్తముల్ = నిందించునట్టి పువ్వులరేకుల సమూహములు, చెలఁగెన్ = సొంపారినవి.

ఆసమయంబున మొదంగిపొదలయందు బంగారువన్నె పువ్వులు మెండుగా పూచినవి; వానిరేకలెట్లుండె ననఁగా - వర్షాకాలపుమెఱుపులు నందనవనముతోడిదైన యాకాశమందు చిరకాలము ఉండి ఆనందనోద్యానపుదివ్యపుష్పములపరిమళములను సంగ్రహించుకొన్నవై, తము కాధారములయిన మేఘములు వర్షించుటకై నేలకు ఈ మొగలిడొంకలకడకు దిగినప్పుడు, వానితోఁగూడ తాము వచ్చి, యిట తమ యాయపూర్వదివ్య పుష్పసౌరభమున కాసగొన్న మొగలినాగుపులు ఆఁడువి తమ్ముం జుట్టుకొనఁగా మఱిపోవుటకు శక్తిలేనివై, యిటనే నిలిచిపోయినవో, అనునట్లుండెను. - ఉత్ప్రేక్షాలంకారము. 'పసిండితగడుం దెగడుం బువ్రేకమొత్తముల్' - ఉపమ.

మొగలిడొంకలలో మొగలినాగుపులును మల్లెతోఁటలలో మల్లెనాగుపులును అని సర్పవిశేషముండుట ప్రసిద్ధము. 'పఱతెంచు' - అమరద్రవ్యాపహారణముకావించినంగులకు అమరులు దండింతురను భయముచేత వడివడిగా పలాయనమగుటయు, మెఱుపుయొక్క అతిశీఘ్రమయిన గతియు సూచితములు. - 'భుజగీ' - స్త్రీలింగముచేతను, ఆలింగనార్థకమయిన పరివేష్టనశబ్దముచేతను, ధనముసంపాదించుకొని వచ్చినవానిని కవ్వుచు జుఁగుకొను చేడియలవ్యాపారము ఆఁడుఁబాములందును, వారివలలలోఁబడి వదలిపోలేక చిక్కుకొను లంపటుని వ్యాపారము మెఱుంగులయందును ధ్వనించుచున్నది. - 'పసిండి' - ఇటకాంచనకేతకి చెప్పఁబడినది; దానిపువ్వులరేకులు బంగారువన్నెగలవి.— తెగడు - ఇది యుపమా వాచకము.

'స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి
ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిన్దతి.
తస్య చానుకరోతీతి శబ్దాః స్సాదృశ్యవాచకాః;
ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః.' దండి.

'తెగడుంబువు' – 'తెగడు' అనుపదము తద్ధర్మార్థక క్రియాజన్యవిశేషణము, అట్టి యుదంతమునకు అచ్చు పరమగునపుడు నుగాగమము విహితముగాని, హల్లుపరమైనపుడు విహితముగాదు. చూ. బాల. సంధి. 32 – మఱి దీనికి గతియేమన:—

'ప్రభలు నభోవిటంకమున భానుమరీచులఁ బ్రోదిసేయఁ గా
స్తుభనిభనూత్నరత్నపరిశోభిత మై గరుడాశ్మవేదిక
గ్విభవము పొల్పగుం జవిక విద్రుమపాద సువర్ణపీఠమైఁ
బ్రభుత దలిర్ప మాను వసుపన్ వసియించె నుదంచితస్థితిన్.'

అను మనుచరిత్ర పంచమాశ్వాససప్తతితమపద్యమందలి 'పొల్పగుంజవిక'కు ఏగతియో దీనికిని అదే గతి. దానిని 'పొల్చుక్రొంజవిక' యనిమార్చెద రందురేని, ఇట 'తెగడెడుంబువు' అని మార్చికొని, తెగడుటకై అని అర్థము చెప్పుకొని తెగడునట్టివి యనిభావము గ్రహింపవచ్చును. 'పోరుంగాయాలు'ను ఇట్టివే. మార్పు నిష్టమేని 'తెగడున్న క్రొంబువు' అనిమార్చుకొనుఁడు.

చ. బలుసెక నించువిల్లడుగుఁ బట్టినదే యిపు డాకుబూదికెం
పులఁ ద్రిరుచిత్వ మూఁది, మరుముష్టిబిగిన్ దివిఁ గ్రాయుమౌక్తికం
బులజడి జొమ్మనం దొరఁగుఁ బో; యిది యింద్రునిదేని, పుట్టరాఁ
గెలసమొ నాఁగఁ బోల్విలుజిగిం గరకాస్రుతి నొప్పె మేఘముల్. 96

ఇంచువిల్లు = మన్మథుని విల్లయిన చెఱకుగడ, బలుసెకన్ = దుస్సహమయిన వేసవి వేండ్రములో, అడుగుఁబట్టినదే = నాశమైనట్టిదే (నేలఁ బాతఁబడినట్టిదే), ఇపుడు = వర్షర్తువునందు, ఆకుబూదికెంపులన్ = ఆకులచేతను బూడిదచేతను ఎఱ్ఱనితోలుచేతను, త్రిరుచిత్వము = మూఁడువర్ణములు కలది యగుటను, ఊఁది = వహించి, మరుముష్టిబిగిన్ = మన్మథుని పిడికిటి యొత్తుచేత, దివిన్ = మింటియందు, క్రాయుమౌక్తికంబులు = వెలిగ్రక్కుముత్తములే, జడిన్ = వానయందు, జొమ్మనన్ = జొమ్మనెడు శబ్దముతో, తొరఁగుఁబో = రాలుచున్నవి సుమా; ఇది = ఈధనుస్సు, ఇంద్రునిదేని = ఇంద్రునిదే అగునేని, పుట్టన్ = వల్మీకమునుండి, రాన్ = లేచుటకు, కెలసమొ = పనియేమి, నాఁగన్ = అనుటకు, పోల్ = తగినట్టి – విలుజిగిన్ = ధనుఃకాంతితోను, కరకాస్రుతిన్ = వడగండ్లురాలుటచేతను, మేఘములు, ఒప్పెను.

ఆవర్షర్తువునందు మేఘమున మూఁడువన్నెలతోఁడి యింద్రధనుస్సు ఒప్పారుటయు, వానితోఁగూడ వడగండ్లురాలుటయు, నెట్లుండె ననఁగా? – గ్రీష్మర్తువులో నాటిన చెఱకు ఇపుడు ఆకులపచ్చవన్నె – కణుపులం గ్రముకొనియుండు బూడిదయొక్క తెలుపు – తోలుయొక్క యెఱుపు – అనెడు మూఁడువన్నెలతో పెద్దగడగా ఎదుఁగఁగా, అది తన విల్లగుటచేత మన్మథుఁడు దానితో నొక్కుమ్మడి లోకమునెల్లం గుఱిపెట్టుటకై దానిం దైకొని పిడికిట బిగువుగాఁ బట్టుకొనఁగా, ఆబిగువుచేత అందుండి ముత్తెములు వెలి కురలి మింటినుండి వర్షముతోఁగూడ రాలుచున్నవి. తెలియనివారు ఆమువ్వన్నెవింటిని ఇంద్రుని దందురు. ఇంద్రుని దైనచో పుట్ట నుండి యేల వచ్చును? వడగండ్లతత్త్వము నెఱుంగరు; అవి మదనుని యాచెఱకువింటిముత్తెములు; ఇట్లని వచించుటకు తగియుండెను. హేత్వపహ్నవానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

'సెక' – చెఱకును ఎండఁగొట్టి నాశము చేసిన దనుట – సెగ వేసవిధర్మము, చెఱకును వేసవిలో నాటుదురు. 'అడుగుఁ బట్టుట' – నేలంబాదుకొనుటయు నాశమగుటయును. 'బూది' –

తెల్లగా బూడిదవలె నొకవిధమయిన ధూళి చెఱకుగడ కంటుకొనియుండును, తుడిచిన మన చేతికి అంటుకొనును. 'త్రిరుచిత్వము' - ఇంద్రధనుస్సామ్యమునకు. ముష్టిబిగిచే బాణప్రయోగసమయము సూచితము. అప్పుడు విల్లు వంగియుండును, ఇదియు ధనుస్సామ్యమునకు. లోకమునంత ఒక్కమాఱు గుఱియిడువాఁడై మరుఁడు దివిం జేరినాఁడు; కావున అతనివిల్లును దివియం దున్నది. ఇదియు ఇంద్రధనుస్సామ్యార్థము: గడలు మిక్కిలి నిడుపుగా ఎదిగిన వని సుభిక్షోక్తియు. 'మౌక్తికంబుల' - చెఱకున ముత్తెములు పుట్టును:—(చూ. పద్య. 1-70, 2-11, 4-45, 163 వ్యాఖ్య.)

సీ. 'జలజముల్ స్థలజాతములు నాఁగ మౌక్తిక । జాతి ద్వివిధ మయి జగతి వెలయు;
బలదానవుని దంతపంక్తి వస్త్రోద్ధత । ధూతి ప్రకీర్ణమై భూతలమునఁ
బడు మూఁడు తావులఁ బడియె; 1శంఖంబున । 2మీనశిరస్థలమున 3జలధరమునఁ
గామినీవరహారికంఠ 4వంశ వరాహ । 5దంష్ట్రాగ్ర 6ఫణిశీర్ష 7దంతములను

గీ. క్రౌంచ 8గళములఁ 9బుండ్రేక్షు 10ఘన సుపర్వ । శాలి సు11స్తంబ12శుక్తుల సైంధవకర
ట13భుజములయందు బహువర్ణనిధము లయ్యె । వానిఁ దెలిపెద నని పల్కు వైశ్యవరుఁడు.'

'వంశజము కరకాభంబు వరము, పోత్రి । దంష్ట్రజాతంబు రక్తంబు, దందశూక
జంబు నీలప్రభంబు, కుంజరవరేణ్య । దంత పుండ్రేక్షుజంబు పీతప్రభంబు.' హాలాస్యము. 3. ఆ.

ఇంద్రధనుస్సు పుట్టం బుట్టు ననుటకుం బ్రమాణమును ౪౯వ టీకలోఁ జూ. 'కలసము' - పని యర్థము 'పని' శబ్దమువలెనే సందర్భవశమున హేతువుం జెప్పను. 'పొమ్ము' - ఇది పోవుధాతువుయొక్క ప్రార్థనార్థకైకవచనము. క్రియాపదములకు అనుప్రయుక్తమై నిశ్చయముం దెలుపును; హాలకసానంబులు పరంబు లగునపుడు 'పో' యనియు నగును.

చ. అతిజల మబ్ధిఁ గ్రోలె నితఁ, డంతయు రా నతివృష్టిదోష మౌ;
మితి నిపు డబ్దతం బరిణమించినతోయమె చాలుఁ బంట; క
ట్టమతి నలధాత గట్ట గగనంబున, వర్తులత న్సమంతతో
వృతి యగు సేతుమండలము శ్రీ పరివేషము చుట్టె భానునిన్. 97

ఇతఁడు = ఈసూర్యుఁడు, అబ్ధిన్ = సముద్రమునుండి, అతిజలము = మిక్కుటమయిన యుదకమును, క్రోలెన్ = త్రాగినాఁడు, అంతయున్ = ఆయుదకమెల్ల, రాన్ = వచ్చినయెడల (కురిసినయెడల), అతివృష్టిదోషము = అతివర్షమనెడుచెఱుపు, ఔను = సంభవించును, ఇపుడు, మితిన్ = పరిమితముగా, అబ్దతన్ = మేఘరూపమున, పరిణమించినతోయమె = మాఱినజలమే, పంటకున్ = సస్యపరిపాకమునకు, చాలును = సమృద్ధము, అను మతిన్ = అనుతలంపుచేత, అలధాత = ఆబ్రహ్మ, గగనంబునన్ = ఆకాశమునందు, కట్టన్ = నిర్మింపఁగా, వర్తులతన్ = గుండ్రముగా, సమం...తి - సమంతతః = చుట్టురా - వృతి = ఆవరణము, అగు - సేతుమండలము శ్రీన్ = వలయాకారమయిన యానకట్టో యనునట్లుగా, పరివేషము = గాలిగుడి; భానునిన్ = సూర్యుని, చుట్టెన్ = పరివేష్టించెను.

ఈసూర్యుఁడు సముద్రమునుండి చాలనీరు త్రాగియున్నాఁడు, అందు ఇప్పటికి మితముగా మేఘరూపమున పరిణమించిన నీరే సస్యములకు చాలును, ఇంకను మేఘములై కురియునేని వర్షమమితమై భూమికి చేటు గలుగును; అని యూహించినవాఁడై బ్రహ్మదేవుఁడు కడమజలము

సూర్యునినుండి వెలువడకుండుటకై అతనిచుట్టును కట్టినయానకట్టో యనునట్లు మింటియందు సూర్యునిచుట్టును అన్నివైపులను గాలిగుడి పరివేష్టించినది. - ఉత్ప్రేక్షాలంకారము.

'అతివృష్టి' - ఈతిబాధలలో నొకటి, ఈతులు కృష్యుపద్రవములు:—

'అతివృష్టి రనావృష్టి ర్మూషకాః శలభాః శుకాః
అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయ స్స్మృతాః'

'పరివేషము' - 'పరివేష స్తు పరిధి రుపసూర్యకమణ్డలే.' అమ. 'సేతు' - 'సేతురాళీ స్త్రియాం పుమాన్' అమ.

తే. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి
మమునఁ గాళిక నీలికోలము నటింపఁ,
బోరి మొగంబున రాలునిప్పుక లనంగ
గుంపులై రాలె మహి నింద్రగోపకములు. 98

గగ...నన్ - గగన = ఆకాశమనెడి - రంగస్థలంబునన్ = నాట్యప్రదేశమందు, కాళిక = మేఘజాల మనెడికాళికాదేవి, మిగులన్ = ఎక్కుడు, ప్రౌఢిమమునన్ = నేర్పుతో, నీలికోలము నటింపన్ = నీలిచీరకట్టుకొని నాట్య మాడఁగా, పోరిన్ = మెండుగా, మొగంబునన్ = ముఖమునుండి, రాలు నిప్పుకలు అనంగన్ = పడుచున్న యగ్నికణములో యనునట్లుగా, ఇంద్రగోపకములు = ఆరుద్రపురుగుల సమూహములు, గుంపులై = ముత్తములై, మహిన్ = నేలమీఁదికి, రాలెన్ = పడెను.

అపుడు మిన్ననెడునాట్యభవనమునందు మేఘతతి యనెడికాళికాదేవి ఎక్కుడు కౌశలముతో నీకట్లు గ్రమ్ముచు నరించుట యనెడి నీలవస్త్రధారణపూర్వక నాట్యమును ఆడఁగా మెండుగా ఆమెముఖమునుండి రాలెడు నిప్పుకణములో యనునట్లుగా ఇంద్రగోపకీటకములు ముత్తము ముత్తముగా నేలరాలినవి. - రూపకోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

'రంగము' - 'రఙ్గం త్రిపుణి రఙ్గో నా రాగే నృత్తస్థలే రణే' నానా; 'ప్రౌఢమము'- ప్రౌఢశబ్దముపై ఇమనిచ్ప్రత్యయము రాదు, అనఁగా ఈశబ్దము సాధువుగాదు; - అని వామనసూత్రము. ఆంధ్రకవులు కొందఱు దీనిం బ్రయోగించుట పొరఁబాటు. - దీనికిబదులు 'కౌశలమున' లేక 'పాటవమున' అని పఠించిన నిర్దోషము. 'కాళిక' - 'మేఘజాలేచ కాళికా' అమ. 'శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వమఙ్గలా అపర్ణా పార్వతీ దుర్గా మృడానీ చణ్డికాఽమ్బికా. ఆర్యా దాక్షాయణీ చైవ గిరిజా మేనకాత్మజా చాముణ్డా కాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీశ్వరీ' అమ. కాళ్యేవ కాళికా. 'నీలికోల' మనం జెప్పుట మేఘజాలము నీలముగావునను, కాళికయు నీలవస్త్రము ధరింపనిచో సంపూర్ణసామ్యము కలుగదు గావునను. 'కోలము' = వేషము - శ. ర., 'నీలికోల' మనియే శ. ర. పాఠము. 'నిప్పుకలు' రాలుట ఉగ్రదేవతగాన నాట్యమందలి రౌద్రావేశముచేత ఆమెకు సుసంభవము. మా. 'అప్పుడు క్రోధము కన్నుల నిప్పులు రాల్పంగ' భా. శ. ర. 'నిప్పుకలు' - కప్రత్యయము స్వార్థమున విహితమయినను ఈశబ్దమున పాక్షికముగా అల్పార్థమున వచ్చును, అట్లే ఇట అగ్నికణములు అర్థము. కణములు కావేని ఏకైకేంద్రగోప సామ్యోక్తి సరిపడదు. 'గుంపులు'-'తతులు' అనుపాఠమున పౌనరుక్త్యము తోఁచుచున్నది, అత్యంత ప్రాచుర్యమును చెప్పుటయందు వర్ణనాసౌభాగ్యంబును గానిపింపదు; కావున 'ఇంద్రగోపకములు' అని పఠించుట మేలని యట్లు మార్పు చేయఁబడినది; ఇంద్రగోపమే ఇంద్రగోపకము. - స్వార్థమున కప్రత్యయము. ఈరూపము మహాకవిప్రియమే.—

'బిభ్రాణా మృదుతాం శిరీషకుసుమశ్రీహారిభిః శాద్వలైః
సద్యః కల్పితకుట్టిమా మరకతక్షోదైరివ క్షాళితైః,
ఏషా సంప్రతి బన్ధనా ద్విగళితై ర్బన్ధూకపుష్పోత్కరై
రద్యాపి క్షితి రిన్ద్రగోపకశతై శ్ఛన్నేవ సంలక్ష్యతే.' ప్రియదర్శిక.

శతశబ్దముచేత ఇవి గుంపులుగా రాలుటయు సూచితము.

ఇట్లే కణాగ్రమునకు - 'అవి నిప్పుకలుగావు మిడుంగురుం బురువులు' చిన్నయ్యసూరి. నీతిచంద్రిక. 'కురిసెన్ । గనగనగన మనుచు నిప్పుకలు కుప్పలుగాన్'. పాండు. శ. ర.

క. ద్యుమణికరాళి మొగిళ్లయి
*యమవస శశి గలయఁ గూర్చి వానబోటయు, న
య్యమృతపుబిందులె క్రమ్మఱ
నుమిసెడు ననఁ గలయఁ గరక లుడుగక రాలెన్. 99

ద్యుమణి కర ఆళి = సూర్యుని కిరణములసమూహము, మొగిళ్లు అయి = మేఘములుగా పరిణమించి, అమవసన్ = అమావాస్యనాఁడు, శశి = చంద్రుఁడు, కలయన్ = తమ్ము (అనఁగా సూర్య కిరణములను) కూడినప్పుడు, (అతనివలననుండి), కూర్చి = సేకరించికొని, వానను బోటయున్ = వర్షణ సమయము వచ్చినందున, ఆయమృతపు బిందులె, క్రమ్మఱన్ = మరల, ఉమిసెడున్ = క్రాయుచున్నవి, అనన్ = అనునట్లు, వానన్ = వృష్టియందు, కరకలు = వడగండ్లు ఉడుగక = ఎడతెగక, రాలెన్.

ప్రతియమావాస్యయందును చంద్రుఁడు సూర్యునియందుం బ్రవేశించును; ఆసూర్యకిరణములు ఆసమయమున చంద్రునియమృతము త్రాగినవై, పిమ్మట మేఘములుగా పరిణమించి, వర్షాకాలము వచ్చినప్పుడు వానతో ఆయమృతపుబిందువులనుగూడ ఉమియుచున్నవో యనునట్లు వడగండ్లు అనవరతము రాలుచుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.

'మొగిళ్లయి' - 'దత్తానన్దాః ప్రజానాం సముచితసమయాకృష్టసృష్టైః పయోభిః' సూర్యశతకమున సూర్యకిరణవర్ణనము; దీనిచే సూర్యకిరణములు మేఘము లగుట చెప్పఁబడినది. చంద్రునియందు అమృతము గలదు. చంద్రుఁడు అమావాస్యయందు సూర్యమండలముం బ్రవేశించును.

ఉ. 'వంచనఁ బొంచి చేరువకు వచ్చినచంద్రునిజింక నేనిహా
రించియుఁ దత్సుధారసనిషేచనచే నది చావకున్కి నీ
క్షించియు, నేటు దప్పె నని చేవిలు నమ్ములుఁ బాఱవైచి ల
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరిసానుభూములన్.' పారి. హిమవద్వర్ణనము.

'కలాః షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవిః
అమృతే నామృతం కృష్ణే పీయతే దైవతైః క్రమాత్ ...
కలావశిష్టో నిష్పీతః ప్రవిష్టః సూర్యమణ్డలమ్
అమాయాం విశతే రశ్మౌ అమావాసీ తతః స్మృతా.' దేవీపురాణము.

* 'ఏమిదిని చెప్పితివి కపితము... యమవసశశి యనెడుమాటను అలసనిపెదనా' తెనాలిరామ. చాటువు. చూ. పీఠిక.

'బిందులై'-వడగండ్లు బిందువులుగాఁ జెప్పఁబడినవి. బిందువులు ద్రవముగానుండును, వడగండ్లు గడ్డగానుండును. కావుననే వడగల్లు అని పేరు, కల్లనఁగా ఱాయి, అమృతబిందువులు నీళ్లతో గలసిపోక వేఱుగానుండునా? అనిన మేఘమందలి జలశైత్యముచేత అవి ఘనీభవించి గుటికలై వేఱుగానే ఉండి వేఱువేఱుగానే రాలు నని ఎఱుంగునది; కావున సామ్యము స్పష్టమె.

చ. స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బోల్చి, జలస్రుతి నాఁడునాఁటికిం
గరఁగుచుఁ బుట్టుచుండుమణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గ
న్నురువులు గట్టినట్టులు గనుంగొన నొప్పెఁ దదింద్రగోపముల్
గరఁగినవిండ్లయప్పసరుకై పడిఁ దెట్టువగట్టుపచ్చికన్. 100

మొదలన్ = ఆదిలో, మొగిళ్లపైన్ = మబ్బులమీఁద, స్ఫురణన్ = ప్రకాశముతో (డాలుతో), పోల్చి = ఒప్పారి, జలస్రుతిన్ = నీటిస్రవణముచేతను, నాఁడునాఁటికిన్ = ఏదినమునకు ఆదినము, కరఁగుచున్ = నీరైపోవుచు, నాఁడునాఁటికిన్ = ఏదినమున కాదినము, పుట్టుచున్, ఉండు (నట్టిదైన) - మణికార్ముకరక్తిమ = ఇంద్రధనుస్సులయొక్క యెఱుపు, ఎల్లన్ = అంతయును, వెల్లిన్ = జలపూరమునందు, కరఁగిన విండ్ల యప్పసరుకై పడిన్ = అట్లే దినదినము నీరైపోయిన యామణిధనువుల పసరువన్నెయో యనునట్లుగా, తెట్టువగట్టుపచ్చికన్ = ఒక ప్రక్కకు చేరుకొనియున్న తృణజాలమందు, కన్నురువులుగట్టినో = ఎఱ్ఱనినురువు లాయెనో యనునట్లుగా, తత్ ఇంద్రగోపముల్ = ఆవెల్లువలోని యాయారుద్రపురువులు, కన్గొనన్ ఒప్పెన్ = చూడ రమణీయములుగా నుండెను.

ఏదినమున కాదినమే పుట్టుచు కరఁగిపోవుచు నున్న యింద్రధనుస్సుల బహుదినముల పసరంతయు వెల్లియందు తెట్టువగట్టినదో యన తృణజాలంపుఁదెట్టువ యొప్పుచుండెను; అట్లే కరఁగిన బహుదినముల యెఱుపంతయు ఎఱ్ఱనురుగులైనదో యన నాజలపూరమందలి పచ్చికతెట్టువల యందు ఇంద్రగోపములు దర్శనీయములుగా నొప్పుచుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.

'నాఁడునాటికిన్' - నాఁటికినాఁడు - ఏదినమునకు ఆదినము; ఆమ్రేడితముగాఁ గొన్నచో కొన్నినాళ్లకు అని యర్థము కలుగును - 'నానాఁటికిఁ దీసికట్టు నాగంబట్లూ.' అన్నట్లు; అది యిటం బొసఁగదని అనామ్రేడితముగా నన్వయించుట. 'పుట్టుచుండు మణికార్ముకరక్తిమ' - కార్ముకములట్లేయుండి రక్తిమమాత్రము ఏదినమున కాదినము పుట్టుటలేదు గావున 'ఉండు' అనుతద్ధారక విశేషణ మిట కార్ముకముతో మాత్రము అన్వయింపవలయును; ప్రౌఢవ్యాకరణమందు సమాసపరిచ్ఛేదమున - 'కొన్నియెడల సిద్ధసమాససమర్థ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడు' అని సూత్రంబును (౧౮౮), 'వార యస్తదీయోరుచమూసమూహములు' అని హరివంశమునందుండి యుదాహరణంబును గలవు. ఈయుదాహరణముతోడి యితరోదాహరణముల వలన ఈసూత్రమందలి 'మధ్య' శబ్దమునకు ఆదిశబ్దముకూడ అర్థమయినను, ఈయన్వయము మనోహరముగాదు; కావున ఈయేకదేశాన్వయమును తప్పించుటకై 'మణికార్ముక సంతతి కెంపు' అని పఠించుట రమణీయము. 'కన్నురువులు' - ప్రాఁతాదికార్యము.

చ. పెళపెళ మబ్బు బిట్టుఱుమ, భీతి విదూరశిలాంకురచ్ఛటో
త్పులకిని యై ప్రియు న్నిదురవోవుహరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ,

దలరి ధరిత్రి సాఁచుగఱుదాలుపుఁగేల్లనఁ గంకణంపుమ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ దాల్చి నదుల్వెసఁ జొచ్చె వారిధిన్. 101

మబ్బు = మేఘము, పెళపెళ = పెళపెళయని, బిట్టు = పెల్లుగా, ఉఱుమన్ = గర్జింపఁగా, ధరిత్రి = భూదేవి, విదూ...ని - విదూరశిలా = వైదూర్యములయొక్క - అంకుర = క్రొమ్మొలకల - ఛటా = సమూహములచే - ఉత్పులకిని = మొలతెంచిన పులకములు కలది, ఐ, ప్రియున్ = కాంతుని, నిదురవోవుహరిన్ = (సముద్రమందు) నిద్రించుచున్న నారాయణుని, వడిన్ = తటాలున, కౌఁగిలింపఁగాన్ తలరి = ఆలింగనము సేయుటకై యూంకించి, చాచుఁగఱుదాలుపుఁగేల్లు అనన్ = (భూదేవి) చాఁపుచున్న గగుర్పాటువహించిన చేతులో యనునట్లుగా, కంకణంపుమ్రోఁతలన్ - కంకణంపు = కంకణాయు (లను పేరిజలపక్షు) లనెడి (పసిఁడి) గాజులయొక్క, మ్రోఁతలన్ = రొద లనెడిశింజితములతో. పులు = పచ్చిక, తేలన్ = తేలియుండఁగా, (తేలియున్నట్టి), వండు = వండలినీటిని, పయిన్ = ఉపరిభాగమునందు, తాల్చి = ధరించి, నదుల్ = ఏళ్లు, వెసన్ = వడిగా, వారిధిన్ = సముద్రమునందు, చొచ్చెన్ = ప్రవేశించినవి.

ఉన్నట్లే ఉండి నదులు పెచ్చుపెరిఁగినవై సముద్రముం జొచ్చుటను వర్ణించుచున్నాఁడు:- మేఘము పెళపెళయని కఠోరముగా నుఱుమఁగా భూదేవి భయముచే నదరినదై వైదూర్యమణి మొలకలనెడి పులకలు మేనంగలదై తనప్రాణేశ్వరుని సాగరమందు నిద్రించుచున్న శ్రీహరిని తటాలున కౌఁగిలించుటకై చాఁచెడుచేతులో యనునట్లుగా గందపుంబూఁతవలె చిక్కని వండు నీరొప్ప, ఆపూఁతయందుదలయెత్తిన గగుర్పాటువోలె ఆవండు నీటిమీఁద పచ్చిక తేలుచుండఁగా, పసిఁడిగాజులమ్రోఁతవోలె కంకణాయు లను పేరి నీటిపులుఁగులరొద మించఁగా, నదులు వడిగా సముద్రముం జొచ్చినవి.

స్త్రీలు భీరువులుగావున ఆకస్మికమహాధ్వనికి దద్దరిల్లుట సహజము: అట్టితఱిని కాంతుఁడు చెంతనున్న, నాతనిం దటాలున భయముతోఁ గౌఁగిలించుటయు సహజము. అట్టిప్రియాస్వయంగ్రాహమునకు కాంతులు మిక్కిలి హర్షము నొందుదురు;—

‘త్వా ముద్వీక్ష్య స్తనితసమయే మానయిష్యన్తి సిద్ధాః,
సోత్కణ్ఠాని ప్రియసహచరీ సంభ్రమాలిఙ్గితాని.’ మేఘ.

‘పఠపఠా యటంచుఁ బవి మ్రోఁగ భీరువు
ఉలికి తావు దప్పుటుర్వి నిజము;
అట్లె యుఱికెమి నీవు ననఘాత్మ యూరలింపు
ముషను నాదు పేరుటురమునకును.’ మదీయముషానాటకము.

‘విదూరశిలా’ - వైదూర్యమణి మేఘధ్వనిచే నంకురించునఁట—

‘విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాకయేవ.’ కుమార.

విదూర మని యొకపర్వతమునకుం బేరు, అందు వైదూర్యము లుద్భవించును. ‘ఉత్పులకిని’ - ఉత్ = ఉద్గతములైన (మహాశబ్దము విన్నవెంటనే దేహమునం బొడమిన). ‘నిదుర’ = నారాయణుఁడు వర్షాకాలమునందు నిద్రలో నుండును; ఆషాఢశుద్ధైకాదశి మొదలు కార్తికశుద్ధైకాదశి పర్యంతము నారాయణునికి నిద్రాసమయము. ఆషాఢశ్రావణభాద్రపదాశ్వయుజకార్తికమాసములలో శ్రావణ భాద్రపదమాసములు వర్షర్తువుగావున, వర్షర్తువు ఆ నిద్రాకాలములోనిది.

'గఱు' - ఇదే పులు. 'కంకణంపు' - కంకణాయి జలపక్షి గావున దానికి జలాతిశయముచే ఉత్సాహము, దానిచేత కూఁత లెక్కువ. 'పండు' - మున్నె తాల్చియున్నట్టి దని మంచిగందంపుమైపూఁత పక్షమున భావించుకొనవలయును; నీటిపక్షమున అప్పుడేవచ్చిన దని భావించుకొనవలయును; భేదమును గణింపఁగూడదు. ఇట ఏకదేశవివర్తిరూపకము. 'తేలన్' - పండుచిక్కనిది గావున దానియందు పుల్లు తేలును. 'పయిన్' - క్రింద ప్రాఁతనీరు తేఁటదియున్న నుండుఁగాక యని 'పయి' ననుట; మఱి యిట నిది చర్చనీయము.

ఆలింగనార్థమై బాహువులను ముందఱికిఁ జాఁచిన నవి కడమదేహమునుండి కొంతదవ్వు చనును. ఇట సంద్రమువఱకు భూమియేకావున సంద్రంబునం బడినపిమ్మట నదియే రూపఱును గావునను, చాఁచె ననుట యెట్లు ఘటిల్లును? అని యాక్షేపము. సంద్రములోఁగూడ కొంతదవ్వు నదీప్రవాహము చొచ్చుకొని పోవుచునేయుండును; పసిమిచే వండలి తెలియవచ్చుచునే యుండును; కావున చాఁచె ననుట సంగతమే. 'వారధి' - వారిని ధరించుతావు:—

'క్షీరామ్భోధే ర్జఠరమఖిలో దేహభాసాం ప్రరోహైః
కాలోన్మీలత్కువలయదళాద్వైత మాపాదయన్తమ్.
ఆతన్వానం భుజగశయనే కా మపి క్షేమగారే
నిద్రాముద్రాం నిఖిలజగతీరక్షణే జాగరూకామ్.' భోజ. చం.

తే. కేకిషడ్జంబె దక్కఁ గోకిలపుఁబంచ
మం బఱుటఁ, దోయిపదరులు మఱి పొసఁగమి,
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో నమృత మయ్యెఁ
బ్రోషితల చేరువకు నంపుబోటివోలె. 102

కేకిషడ్జంబె = నెమలియొక్క షడ్జస్వరము, దక్కన్ = మిగిలియుండఁగా, కోకిలపుఁబంచమస్వరంబు = కోకిలయొక్క పంచమస్వరము, అఱుటన్ = నశించిపోయి నందునను, తోయిపదములు = మేఘునియొక్క గద్దింపుమాటలు, మఱి = అటుగాక, పొసఁగమిన్ = అప్రియము లగుటచేతను, నదులచోన్ = నదులకు, ప్రోషితలన్ = దేశాంతరగతభర్తృకలైన చెలువలను, చేరువకున్ = భర్తకడకు, అంపుబోటివోలెన్ = పంపెడుచెలివలె; అదియు = ఆకేకిషడ్జము సైతము, ప్రియున్ = కాంతుఁడైన సముద్రుని, కూర్పన్ = పొందించుటకు, అమృతమయ్యెన్ = హితమాయెను.

లోకములో భర్త దేశాంతరగతుఁడై రాకుండెనేని, తద్విరహాసహయైన భార్యను కుంటెనకత్తె యవతెయేని తోడ్కొనిపోయి అతనితోఁగూర్చును; లేదా కోకిలకూజచే నుద్దీపితకామయై యాభార్య తానే తరలి యాతనికడకుం బోవును. ఆపక్షమున ఆకోకిలకూజయే దూతి.-అట్లు, గ్రీష్మవశంబున నిగిరిపోయినవై, సముద్రమువఱకుం బోక నడుమనే యిగిరిపోయిన నదులు ప్రోషితభర్తృకలే - జలము తఱిఁగినందున విరహకృశలే-నదీభూతలైన యీప్రోషితభర్తృకలను తద్భర్తయైన సముద్రునికడకుం దోడ్కొని పోవుటకు కుంటెనకత్తెగా మఱియొకనది లేనందున కోకిలకూజాదియే విరహోద్దీపనముం గావించి భర్తకడకుం జేర్చుకృత్రిమదూతిగా నాచరింపవయును. అది ఆకోకిలకూఁత యీఋతువున లేదాయెను. మఱి మేఘధ్వనులకే అట్లు ఈనదులు తరలిపోయి సముద్రుని కూడరాదా యనిన, అట్లుతరలించువస్తువులు అతిమనోహరములుగా నుండవలయును.

వానిఁ దర్శన శ్రవణాదులచే సంభోగేచ్ఛ జనింపవలయును, అందువలన భర్తకడకుం బోవుట సంభవించును. మేఘధ్వనులు ఈఋతువున నున్నను కటువులేగాని ఇంపుగావు, కావున వానిని వినుటచేత తరలుట సంభవింపదు: మఱి సముద్రముకడకుం బోయినవే, దేనిచే పోయినవి అనిన, నెమలి కూఁతచేత ఉద్దీపితకామలై తరలి సముద్రునిం గలసినవి కావున కేకికేకయే వీనికిదూతి యైనది. - అనఁగా యీఋతువున కేకికూజ పికరుతియంత యింపుగా నున్నను, ఒకపాటి యింపుగానే యున్నది. ఉఱుము కటువుగా మ్రోయుచుండినది, నడుమనడుమనే యిగిరి పోయిన నదులు వెల్లిగొని సముద్రునం బడినవి; అనిభావము - ఉపమాలంకారము.

'నిషాద ఋషభ గాన్ధార షడ్జ మధ్యమ ధైవతాః।
పఞ్చమశ్చేత్యమీ సప్తతన్త్రీకణ్ఠోత్థితాః స్వరాః॥
షడ్జం మయూరో వదతి పికః కూజతి పఞ్చమమ్.' అమ.

షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము, అని సంగీతశాస్త్రమున ఏడుస్వరములు చెప్పఁబడినవి. ఆసప్తస్వరములే 'సరిగమపదని' యను నక్షరములచే వ్యవహరింపఁబడుచున్నవి. అందు షడ్జమును నెమలి కూయును, పంచమమును కోకిల కూయును. 'తోయి' - తోయము అనఁగా జలము, అది కలదితోయి - మేఘము. 'అదియుఁగా' - అది కూడ అనుటచే పంచమస్వరముకన్న షడ్జస్వరము ఇంపు తక్కువది యని సూచితము. అట్లే అనుభవంబును, కవివచనంబులును:—

'దాత్యూహాః సరసం రసన్తు, సుభగం గాయన్తు కేకాభృతః,
కాదమ్బాః కల మాలపన్తు, మధురం కూజన్తు కోయష్టయః,
ధైవాద్యావదసౌ రసాలవిటపిచ్ఛాయామనాసాదయన్
నిర్విణ్ణః కుటజేషు కోకిలయువా సంజాతమౌనవ్రతః.' సు. ర. భా.

'అమృతము' - మహోపకారిక మనుట - గౌణలక్షణ - 'ప్రోషిత' - 'దేశాన్తరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా' - ప్రోషితభర్తృక యనుటకే ప్రోషితయనుట. నెమళ్లు వర్షర్తువునం గూయునని ఇంతకుముందే ప్రమాణము దత్తము. కోకిల వసంతర్తువునం గూయును:—

'కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః?
వసన్తకాలే సంప్రాప్తే, కాకః కాకః పికః పికః'.
'సురభౌ దోలాకోకిలమారుత సూర్యగతి తరుతలోద్భేదాః
జాతీతరపుష్పచయామ్రమఞ్జరీ భ్రమరఝఙ్కారాః.' కా. క. ల.
'కలకంఠనికురుంబకములకు వాకట్టు విడిపింపవచ్చిన వైజ్ఞనంగ...
వసంతమే తెంచె సంతతోత్సవ మెలర్ప.' విక్రమార్క. 5. (3)
'భద్రం కృతం కృతం మౌనం కోకిలైర్జలదాగమే,
దర్దురా యత్ర వక్తారస్తత్ర మౌనం హి శోభనమ్.'
'తథా వసన్త ఏవాన్యభృతానాం ధ్వనిరుద్భవమ్,
వర్షాస్వేవ మయూరాణాం రుతం నృత్తం చ వర్ణయేత్.' కా. క. ల.

తే. తతతనువు రాహు సోమామృతంబు ద్రాంగఁ
జక్రి దునిమిన మెడగంటిచాయఁ బోలిచె,

నసితమేఘస్థమణిధను వాసుదర్శ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్యబింబ మలరె. 103

అసి...వు - అసిత = నల్లని - మేఘ = మబ్బునందు - స్థ = ఉన్నట్టి - మణిధనువు = ఇంద్రధనుస్సు, (ఎట్లొప్పె ననఁగా), తతతనువు - తత = విస్తీర్ణమయిన - తనువు = దేహము గల వాఁడయిన - రాహువు, సోమామృతంబున్ = చంద్రుఁ డనెడియమృతమును (అని మేఘపరము), చంద్రుఁడు సన్నచే శ్రీహరికి తెలియఁబఱిచిన యమృతమును (అని రాహుపరము), మ్రింగఁగన్ = కబళింపఁగా, చక్రి = నారాయణుఁడు, తునిమిన మెడగంటిచాయన్ = ఖండించిన రాహు కంఠపుగాయంబో యనునట్లుగా, పొలిచెన్ = ఒప్పెను, అసుదర్శనంబు = నారాయణునియొక్క యాచక్రాయుధము, అనంగన్ = అనునట్లుగా, నింగిన్ = ఆకాశమందు, ప్ర ... ము - ప్రతి సూర్యబింబము = సూర్యబింబముయొక్క ప్రతిబింబము, అలరెన్ = ఒప్పెను.

మహాకాయ మయిననల్ల మేఘము అమృతమువంటి చంద్రునిం గబళించుట, మహాకాయుఁడైన రాహు వనెడి నల్లని రాక్షసుఁడు మోహినీ రూపంబున నున్న శ్రీహరికి సన్నచే చంద్రుఁడు ఎఱుకపఱిచిన యమృతమును పానముచేయుటయో యనునట్లుగాను, ఆమేఘమునందలి యింద్ర ధనుస్సు శ్రీహరి చక్రాయుధముతో ఆరాహువు కంఠమును దెగఁ జేయఁగా నయిన గంటియో యనునట్లుగాను, మింట ఆచెంతనున్న సూర్యుని ప్రతిబింబము రాహుకంఠమును శ్రీహరి తెగఁజేసిన యాయుధమైన సుదర్శనచక్రమా యనునట్లుగాను, ఒప్పుచుండెను. - ఉత్ప్రేక్షలు.

శ్రీహరి మోహినీరూపమున దేవతలకు అమృత మొసంగుచుండఁగా రాహు వనురాక్షసుఁడు దేవతలపంక్తిలో వారివేసమునం గూర్చుండి తానును అమృతపానము సేయుచుండఁగా, సూర్యచంద్రులు ఆమోసమును ఆమోహినీరూపంపు శ్రీహరికి సన్నలచే తెల్పఁగా నాతఁడు చక్రముచే వానిని మెడదునిమి రెండుతుండెములు గావించె ననియు, తునుమునపుడు అమృతము గొంతు దిగక ముందే తునిమినందున, శిరముమాత్రము అమృతపానముచేత యమరత్వ మొందెననియు, మొండెము నేలం బడెన దనియు భాగవతకథ, నిట ననుసంధానము చేసికొనవలయును.

'అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజుండై రాహు పీయూషపా
నము సేయం, గని, చంద్రభాస్కరులు సన్న ల్సేయ, నారాయణుం
డమరారాతిశిరంబు చక్రహతిఁ దున్మాడెన్; సుధాసిక్తమై
యమరత్వంబును గాంచె మూర్ధము; తదన్యాంగంబు నేలం బడెన్.'

ఆంధ్రభాగవతము. ౮. స్కం. 321

'చక్రి' - చక్రముతోఁ దునిమె నని ధ్వని, 'గంటి' - ఇంద్రధను స్సంత పెద్దదిగా నుండునా యనిన, అందులకే 'తతతను' వనుట, మేఘుఁడును తతతనువే. మేఘుఁడు అమృతసదృశుని చంద్రుని మ్రింగుట యనఁగా చంద్రు నగపడనీయక మఱుఁగుపఱుచుటయే. 'అసిత' - రాహుసామ్యముక్తి; రాహువు నల్లనివాఁడు - 'కృష్ణాని కేశవః సీరి శీర చన్ద్రాత్రిజ్కా రాహవః' కా. క. ల. 'మెడ' - మెడ గుండ్రముగాన దానిగంటి వలయాకారము, ఇంద్రధనుస్సును అట్టిదే. ఇంద్రధనుస్సు అర్ధవలయమే యనిన, - గంటి మన కెదురుగా నున్నది, అడిగలమొండెము నేలంబడి యున్నది. అందలి యాగంటిలో పైభాగమే మన కగపడును, క్రిందిభాగము నేల కంటుకొని యుండునట్టిది పర్వతాదులయడ్డముచేత మన కగపడదు; అని యూహించుకొనవలయును. 'తతతనువు'

అనుటచే మొండెము పెద్ద దని తెలియుచున్నది. అందువలననే గంటియు విశాలమని యేర్పడుచున్నది. - చక్రాయుధముగా సూర్యుం జెప్పక ప్రతిసూర్యకమును చెప్పుటయేమి? సూర్యునికి ఉదయాస్తమయసమయములం దప్ప నెత్తుటం దోఁగినరూప ముండదు. ప్రతిసూర్యకమందయిననో రక్తము అంటి జాఱిపోవుచు వాదరయందు దోఁచుచును ఉన్నరూపము సిద్ధము. 'గంటి'ం జెప్పుట దానికి మణిధనువునకుంబోలె మూఁడువన్నె లుండును గావున; ఇంద్రధను రౌపమ్యముచే గంటియందు ఆవన్నెలు తోఁచుచున్నవి; అవి ఎండినగంటియం దుండవు, మచ్చకట్టినదానియందు చెప్పనే అక్కఱలేదు, కావున ఖండించినవెంటనే ఉండుతీరు చెప్పఁబడినది. ప్రతిసూర్యక లక్షణము.—

'ప్రతిసూర్యకః ప్రశస్తో దివసకృదృతువర్ణసప్రభః స్నిగ్ధః
వైడూర్యనిభః స్వచ్ఛః శుక్లశ్చ క్షేమసౌభిక్షః.
పీతో వ్యాధిం జనయ, త్యశోకరూపశ్చ శస్త్రకోపాయ,
ప్రతిసూర్యాణాం మాలా దస్యుభయాతఙ్కనృపహన్త్రీ,
దివసకృతః ప్రతిసూర్యో జలకృ, దుదగ్దక్షిణే స్థితోऽనిలకృత్,
ఉభయస్థః సలిలభయం నృప ముపరి నిహ న్త్యధో జనహా.' బృ. సం.

'సోమామృతంబు' - సోమునిం జెప్పిన కతమున రాత్రివృత్తమే యిటం జెప్పఁబడిన దని తలంప వలసినది లేదు. పగలును ఒకకొంతసేపు సోముఁ డగపడుటయుం గలదు.

చ. స్వరుఖరతాబ్రసాహిరిపుజాలమదాచిరరుక్శిఖిప్రభా
కరకబకాచ్ఛవాస్స్రుతులకై లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు నాఁ గలయట్టి సప్తసా
గరములు మేఘుఁడానెనొకొ కా యనఁగాఁ గనుపట్టె వీనిచేన్. 104

మేఘుఁడు, స్వరు...లకై - స్వరు = పిడుగునకు - ఖరతా = తీక్ష్ణతయు - అప్ = జలమునకు - రస = స్వాదుతయు - అహిరిపు = పాములశత్రువులైన నెమళ్లయొక్క - జాల = సమూహమునకు - మద = పొగరును - అచిరరుక్ = ా మెఱపునకు - శిఖి = అగ్నికి - ప్రభా - దీప్తియు - కరక = వడగండ్లును - బక = కొంగలును - అచ్ఛవాః = శుద్ధోదకముయొక్క - స్రుతులకై = కురియుటయు - అను వీనికొఱకు, లవ...లన్ - లవణ = ఉప్పు - ఇక్షు = చెఱకు - సురా = కల్లు - ఆజ్య = నేయి - దధి = పెరుఁగు - ఉదాకరములు = (వీనియొక్క) సముద్రములును, దుగ్ధ...యు - దుగ్ధ = పాలయొక్కయు - శుద్ధజల = మంచినీళ్లయొక్కయు - కంధులు = సముద్రములు, నాన్ = అని, కలయట్టి = ప్రసిద్ధములయిన - సప్తసాగరములున్ = ఏడుసముద్రములను, ఆనెనొకొకా = త్రాగినాఁడేమోగదా, అనఁగాన్ = అనియూహింపఁ దగినట్లుగా, వీనిచేన్ = పూర్వోక్తమైనస్వరుఖరతాదులచేత, కనుపట్టెన్ = తోఁచెను.

పిడుగు తీక్ష్ణతయు, నీటిమాధుర్యంబును, నెమళ్లమదంబును, మెఱపుటగ్నుల దీప్తియు, వడగండ్ల (సంభవము), బకముల (యభివృద్ధి), స్వచ్ఛోదకవర్షణంబును, ఎట్లొప్పుచుండె ననఁగా, వానిని మేఘుఁడు లవణేక్షు సురా ఘృత దధి క్షీర శుద్ధోదక సముద్రములను త్రాగుటచే సాధించెనో యనునట్లొప్పుచుండెను. - హేతూత్ప్రేక్ష - యథాసంఖ్యాలంకారమును గలదు.

'లవణేక్షు సురా సర్పిర్దధి క్షీర జలార్ణవాః' అని సప్తసముద్రములు పురాణప్రసిద్ధములు. వర్షర్తువున కాకులకును కొంగలకును కాంతి హెచ్చుట అనుభవసిద్ధము. 'వాఃస్రుతులకై' - ఇట 'వాఃస్రుతికిఁగా' అనిపూర్వముద్రక పాఠము. ఇందలియేకవచనము 'వీనిచేత' అనుబహువచనాంతపదపరామర్శకు తగియుండదు కావున దానిని 'దీనిచేత' అని మార్పవలయును. ఆమార్పుచే అర్థగ్రహణమున ప్రయాసకలుగు నని 'వాఃస్రుతికిఁగా' అను నేకవచనపాఠము అందుసిద్ధమై యున్న బహుత్వముం బట్టి, బహువచనముగా 'వాఃస్రుతులకై' అనిమార్పఁబడినది. మతఃపూర్వముద్రకులు నాలుగువ్రాఁతపుస్తకములందు 'లోనగు' ననియున్న పాఠమును 'నాఁగల' యని మార్చినారు. నేను ఈయేకవచనపాఠమును బహువచనముగాఁ బఠించినాఁడను. 'కరక', 'బక' అనుచో రాలుటయు శోభిల్లుటయు అనుక్తములే సందర్భానుసారమున నూహ్యములు. 'అనేనోకో'- ఖరతాగులు వేఱుప్రకారమున నలవడనియంత స్ఫుటముగా నుండె నని భావము.

మ. తనిమం బచ్చ మెఱుంగుఁగోఁచియు మహేధనుర్జ్వలాషాఢముం
గొని, పుట్టం గొడుగబ్బ నెమ్మిపురియాకుల్ విప్పి శబ్దంబు మిం
చ, నతస్ఫారరజోబలిత్వమున నుచ్చస్ఫూర్తి మిం దన్ని వే
ఘననీలాంగుఁడు గాంచెఁ బాదపతితౌఘంబుల్ మరుత్సృష్టముల్. 105

ఘననీలాంగుఁడు = మేఘుఁ డనెడు నల్లనయ్య (నారాయణుఁడు - వామనమూర్తి యనుట) తనిమన్ = సన్నఁదనముతోడి (సన్నపాటి దైన), పచ్చ మెఱుంగు గోఁచియున్ = పసుపువన్నె గల మెఱపనెడి (పసుపుకాంతిగల) కౌపీనంబును, మ...ముల్ - మహేధన్వ = ఇంద్రధనుస్సనెడి, ఉజ్జ్వల = ప్రకాశమానమయిన, ఆషాఢముల్ = మోదుగుఁగోలలయును, కొని = గ్రహించి, పుట్టన్ = పుట్టయందు - గొడుగు పుట్టగొడుగనెడి గొడుగు, అబ్బన్ = దొరకఁగా (దానిని ధరించి), నెమ్మి పురియాకుల్ = నెమలిపురి లనెడి (పుస్తక) పత్త్రములను, విప్పి, శబ్దంబు మించన్ = బిగ్గరగా ఉఱుముట యనెడి చదువుటతో కూడుకొన్నవాఁడై, నత...నన్ - నత = అణఁగిన - స్ఫార = మిక్కుటమైన, రజః = దుమారమనెడి (రజోగుణముగలవాఁడైన) - బలిత్వమునన్ = బలిచక్రవర్తి కలవాఁ డగుటతోఁ గూడుకొని, ఉచ్చస్ఫూర్తిన్ = ఉన్నతమయిన స్ఫురణముతో (ఉన్నతముగా పెరుఁగుటతో), మిన్ = ఆకాశమును, తన్ని = అధఃకరించి, వే = శీఘ్రముగా, మ...ముల్ - మరుత్ = గాలియనెడి (దేవతచేతను - బ్రహ్మదేవునిచేత నగుట), సృష్టముల్ = సృజింపఁబడినవైన, పాద...ఘంబుల్ - పాద = వానకాళ్లచే (పాదములయందు) - పతిత = పడిన - ఓఘంబుల్ = జలప్రవాహమును, గాంచెన్ = పడసెను.

నీలమేఘుఁ డనెడు వామనమూర్తి మెఱపనెడిపచ్చగోచి దాల్చి, ఇంద్రధనుస్సనెడుప్రకాశమాన పాలాశదండంబులం బూని, పుట్టగొడుగనెడుగొడుగు ధరించి నెమలిపురు లనెడుపుస్తకపత్త్రములను విప్పి, ఉఱుమనెడిపఠనధ్వని మించుచుండఁగా, రేఁగిన పెనుధూళి యనెడి రేఁగిన రజోగుణాతిశయముగల బలిచక్రవర్తిని అణంచి, ఎత్తుగా మింటం జెలంగుట యనెడి యూర్ధ్వముగా మింటిపైకిఁ బెరుఁగుట కలవాఁడై, గాలి కదిలించుటచేత వానకాళ్లుగా రాలుచున్ననీటివాల్లు యనెడి దేవదత్తమయిన పాద్యజలప్రవాహమును పొందెను.—రూపకాలంకారము.

'తనిమ' - 'సూక్ష్మం దభ్రం కృశం తను' అమ. 'మహేధ' - రూ. మహేర్ - 'ధను శ్చాపౌ ధన్వ శరాసన కోదణ్డకార్ముకమ్' అమ. 'నీలాంగుఁడు' - కేశవుఁడు నీలాంగుఁడు - 'కృష్ణాని కేశవః సీరి

చీర చన్ద్రార్కజ్వ రాహవః' కా.క.ల. 'ఓఘంబు' - జలప్రవాహము. 'పాదసలిలౌఘంబున్' - ఓఘ శబ్దములోనే సలిలార్థ మున్నందున 'పతిత' యనుపాఠము స్వీకరింపఁబడినది; 'ఓఘో బృన్దేఽమ్బువేగయో' అమ. 'మరుత్సృష్టుఁడున్' - బలినిబర్హణార్థము వామనమూర్తి పాదమును స్వర్గము పైకెత్తినప్పుడు బ్రహ్మ ఆయనపాదములను తనకమండలూదకముతో కడిగినాఁడు:-

'తనపుట్టిల్లిది పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుం జూచి తత్పాదసే
చనముం జేసెఁ గమండలూదకములం జల్లించి, తత్తోయముల్
వినువీథిన్ బ్రవహించె దేవనదినా విశ్వాత్మకీర్తిప్రభన్.' భాగవతము. ౮ (౬ - ౨౫).

క. ఘనవృష్టికి తన ఘణు లే । పున నలవల్మీకరంధ్రములు మూయఁగ నె
త్తినగొడుగు లనఁగ ఛత్త్రా । కనికాయం బవని నెల్లకడలం బొడమెన్. 106

ఫణులు=పాములు, ఘనవృష్టికిన్ = పెనువాన కారణముగా. ఏపునన్ = పొచ్చుగా, అలవల్మీకరంధ్రములు = వానిపుట్టలబొక్కలను, మూయఁగ నెత్తినగొడుగు లనఁగన్, ఛత్త్రాకనికాయంబు - పుట్టగొడుగుల సమూహము, అవనిన్ = భూమియందు, ఎల్లకడలన్ = అంతటను, (పుట్టలంతెల్ల), పొడమెన్ = మొలచినది.

పాములు వానవెల్లువ తమపుట్టలలోనఁ జొరనీయక వాని రంధ్రములను మూయుటకు పూనికతో నెత్తినగొడుగులో యన పుట్టలంతెల్ల పుట్టగొడుగులు పొడమినవి. — ఉత్ప్రేక్షాలంకారము.

'ఏపునన్' - సమయస్ఫూర్తితో నని భావము. 'వల్మీక' - అవి తమయిండ్లు గావున, అవి వెల్లి యయిన నివసించుట కష్టమగు నని; 'నికాయో నిలయో లక్ష్యే సముదాయే సధర్మిణామ్.' నానా.

ఉ. సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణం బఱఁ గ్రూర మౌపురో
గారకయోగ మూఁది తిరుగ, న్సకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ నంతలును నింతలు నై పడు తన్నభశ్చ్యుతాం
గారశిశుప్రతానములకైవడి రాలె సురేంద్రగోపముల్. 107

మేఘుఁడు, మింటన్, సారెకున్ = మాటిమాటికి, నిజస్ఫురణంబు = తనయొక్క యేపు, అఱన్ = నశించునట్లుగా, క్రూరము=కీడు గలిగించునది, ఔ=అగునట్టి - పురోంగారకయోగము= పురోంగారక మనుపేరిగ్రహయోగము, ఊఁది = పూనికతో, తిరుగన్ = తనకెదురుగా సంచరించుచుండఁగా, ఎంతేని రుషన్ = అమిత కోపముతో, తద్గ్రహంబు = ఆయంగారకగ్రహమును, సకుటుంబము = కుటుంబముతోఁగూడ, ద్రొబ్బన్ = పడఁద్రోయఁగా, అంతలును = పెద్దగుంపులును, ఇంతలును = చిన్నగుంపులును, ఐ, పడు = పడుచున్న - తత్ నభః చ్యుత అంగార శిశు ప్రతానముల కైవడిన్ = ఆయాకసమునుండి అంగారకగ్రహముయొక్క నిసుఁగుల సమూహములు జాఱినవో యనునట్లు, సురేంద్రగోపముల్ = ఆరుద్రపురుగులు, (ఇంతలును అంతలును ఐ = చిన్న మొత్తములును పెద్దమొత్తములునుంగా), రాలెన్ = నేలకు రాలినవి.

పురోంగారకయోగముచేత అనావృష్టి కలుగును, అది మేఘునికి చేటు. అట్లు అతనికి చేటగునట్లు అంగారకుఁడు మాటిమాటికిఁ బురోంగారకయోగముగా చరించుటం గాంచి మేఘుఁడు

క్రోధముచే ఆగ్రహమును సకుటుంబముగా నేలకు పడనూకఁగా గ్రహమాత్రము మిగిలి శిశువులు చిన్నగుంపులుగాను పెద్దగుంపులుగాను నేలం గూలినవో యనునట్లు ఆరుద్రపురుగులగుంపులు రాలినవి. - ఉత్ప్రేక్ష.

పురోంగారకగ్రహము గుండ్రముగా ఎఱ్ఱఁగా దబ్బుడియంత యుండఁగాను, దాని శిశువులు దానికన్నం జిన్నవిగాను, అట్లే గుండ్రనివిగాను, దానికన్న ఎఱ్ఱఁగాను ఉండును; ఆరుద్రపురుగులును, గుండ్రముగా చిన్నవిగా ఎఱ్ఱఁగాను నుండును. కావున, వానిని ఆశిశువులకే పోల్చుట మిక్కిలి సొంపు. శిశువులు తునియలేని, తునియలు ఆరుద్రపురుగులవలెనె గుండ్రముగా నుండునని నిశ్చయము లేదు. మఱియు క్రిందఁబడి యివి చలించుచున్నవి, తునియలు చలింపనేరవు. కావున 'ఇంతలు నంతలు' అనుపదమునకు తునియలను అర్థముగాఁ జెప్పుట సరిపడదు. అంగారకేంద్రగోపములు రక్తవర్ణములు. "శోణాని ఘర్మభీమానాః ... తామ్రంవిద్రుమకుబ్జమే। ...।నఖేన్ద్రగోపస్ఫుఖద్యోతాః ... శుకమర్కటయోర్ముఖమ్." కా. క. ల. 'పురోంగారకయోగ' - 'పురోఙ్గారే త్వనావృష్టిః పురః శుక్రే ప్రవర్షతి.'

క. కాకోదరాహితుల వ। ల్మీకంబులఁ దూర్చె మెఱసి మేఘుం, డని గుం
పై కవగొని పొగడె ననన్। భేకధ్వను లెసఁగె వృత్తభేదానుకృతిన్. 108

మేఘుఁడు, కాకోదర అహితులన్ = తమకు శత్రువు లయినపాములను, మెఱసి = మెఱుపొంది, వల్మీకంబులన్ = పుట్టలయందు, దూర్చెన్ = దూఱునట్లు కావించెను, అని = అనెడు కృతజ్ఞతగలవై, గుంపు ఐ = సంఘీభవించి, కవగొని = రెండు తరగతులుగా ఏర్పడి, పొగడెను అనన్ = మేఘుని స్తోత్రము చేయుచున్నవో యనునట్లుగా, భేకములు = కప్పలు, వృత్తభేద అనుకృతిన్ = వేఱువేఱు ఛందోవృత్తములను అనుకరించుచు, ధ్వనించెన్ = అఱచెను.

మేఘుఁడు కప్పల శత్రువు లయినపాములను మెఱపు మెఱయించి పుట్టలోఁ దూర్చె నని కృతజ్ఞతవహించినవై కప్పలు గుంపై మేఘునిఁగూర్చి సంఘమై రెండు బృందములుగా ఏర్పడ ఒక బృంద మొకయించుక పలుకఁగా రెండవబృందము మఱియొకయించుక పలుకుటయు, మరల మరల నట్లే స్తుతించినవో యనునట్లుగా వేఱువేఱు వృత్తముల నవలంబించు ధ్వనింపం దొడంగినవి. —ఉత్ప్రేక్ష.

ఆసమయమున కప్పలు ఎదురెదురు బృందములుగా అఱచుచుండుట యెట్లుండె ననఁగా - మునిపీడాకరుని లవణాసురుని శత్రుఘ్నుఁడును, అట్టివానిని నరకాసురుని శ్రీకృష్ణులవారును, వధించిరే. అట్లే ఏప్రభు వేని సాధుబాధకులను తెగటార్చిన, బాధపడిన యాసాధువులు సంఘముగా పోయి యాప్రభువు నెదుర్కొని, తాము రెండుబృందములై వేదానువాకములను చిన్నచిన్న భాగములుగా త్రుంచుకొని, ఒకబృందము ఒకభాగము బలికినవెంటనె రెండవబృందము రెండవభాగము బలుకుటగాను, ఒకబృందము పలుకునప్పుడు రెండవది విశ్రాంతిక యూరకుండుట యుండఁగా, ఆపాలకుని ఎట్లు స్తుతింతురో అట్లే మహోపకారిని మేఘుని కప్పలు తమశత్రువులయిన పాములను పుట్టలలోఁ దూర్చె నైచినందులకుఁగాను కృతజ్ఞతచే నుతించుచున్నవో అనునట్లుండెను; అని తెలివిడి.

'వల్మీకంబులఁదూర్చె' - పుట్ట నెక్కుట = పరాజయమును ఒప్పుకొని శరణు వేఁడుటయే. రణరంగములో మొఱవినఁబడదు గావున ఇటివాడుకలు కల్పింపఁబడినవి. కావున నిట పరాజయ

మొందించి యనిభావము. ఈజేత బెట్టిదముగా షోరాడియిట్లోర్చె నాయనిన - 'మెఱసి' (తళుక్కని), అనఁగా దృష్టమాత్రుఁడై; కనఁబడఁగానే కాకోదరుల నెడి భేకశత్రువులు పరాజయమొప్పుకొని శరణు వేఁడందొడంగిరని యితని ప్రతాపోత్కర్షవర్ణనము; మెఱపును పాములు చూడలేవు, దీపపు వెలుతురుంగూడఁజూడలేవు. రాత్రి యింటం బాము కనఁబడిన, అది ఎటుకదలినటు దీపము నడ్డునూపి, పోనీయక ఆఁపి, కొట్టుట కెవరేని వచ్చునందాఁక రెండుగోడలమూల నిలిచియుండునట్లు చేయుట ప్రసిద్ధము. మెఱపు మెఱయఁగానే చూడలేక పాములు పుట్టలలోఁ జొచ్చును. 'గుంపై' - భేకజాతికెల్ల ఏకైక కాకోదరంబును ప్రబలశత్రు వగుటచేత ఆజాతివి అన్నియుఁ బోగడం జేరెననుట. వృత్తభేదము లెట్లనఁగా - 'సుద్దపప్ ముద్దపప్' - ఇవి మృగీవృత్తమున రెండు పాదములు; 'తీసుకరా, తీసుకరా' - ఇవి బింబవృత్తమున రెండుపాదములు; 'తేరాపో తేరాపో' - ఇవి నారీవృత్తమున రెండుపాదములు. మండూకవృత్తములు ప్రాయికముగా సమవృత్తములుగానే యుండును. 'వాయు దుగ్ధ దీప మయూరాదీనాం సర్పాః శత్రవః' అని కా. క. ల.

తే. మొగిలు మైచీకటుల నెక్కు జిగిమెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె;
సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్ర
పుచ్చుఘనునకు నిట్టి దద్భుతమె తలఁప? 109

మొగిలు = మేఘము, మైచీకటులన్ = తన మేనియిరులచేతను (నైల్యముచేత ననుట), ఎక్కు జిగిమెఱుఁగులన్ = నిగుడుచున్న వైనడాల్గల మెఱపులచేతను, పగలు = పగటిని, రాతిరి = రేయిగాను, రాతిరి = రేయిని, పగలుగాను, చేసెన్ = కావించెను, తలఁపన్ = ఆరయఁగా, సకలమును = సమస్తమును, నిద్రపుచ్చు కేశవునిన్ = నిద్రింపఁజేయు (లయమొందించు) నారాయణుని, నిద్రపుచ్చుఘనునకున్ = నిద్రింపఁజేయు మేఘునికి (అతనికన్నను మహిమోన్నతుని కనియు), ఇట్టిది = ఈపాటికాలవిపర్యయము గావించుట, అద్భుతమె = ఆశ్చర్యమా (అశక్యము కాదనుట).

మేఘుఁడు తనయొడలినలుపనెడి చీకటిచేత పగటిని రాత్రిగా మార్చెను; అట్లు నిగుడుచున్న తన జిగి మెఱపులచేత రాత్రిని పగలుగా చేసెను. ఆలోచింపఁగా ఎల్లలోకములను నిద్రపుచ్చువాఁడైన శ్రీహరిని నిద్రపుచ్చు మహిమోన్నతునికి మేఘునికి ఈపాటి కాలవిపర్యయ కరణము ఒక యెక్కువ పనిగాదు. - కావ్యార్థాపత్త్యలంకారము - యథాసంఖ్యంబునుం గలదు.

మబ్బునలుపుచే పగలు రాత్రివలె చీకటిగా నుండెను. మెఱపులచే రాత్రి పట్టపగటివలె వెలుతురు గలిగియుండెను - అని భావము. నిద్రపుచ్చుట కేశవ పక్షమున లయమొందించుట.

'నాభిప్రరూఢామ్బురుహాసనేన। సంస్తూయమానః ప్రథమేన ధాత్రా
అముం యుగాన్తోచితయోగనిద్రః। సంహృత్య లోకాన్ పురుషోఽధిశేతే.' రఘు.
'సంభక్ష్య సర్వభూతాని కృత్వా చైకార్ణవం జగత్
బాలః స్వపితి యశ్చైక స్తస్మై మాయాత్మనే నమః.'

కావ్యార్థాపత్త్యలంకారము:—

'కైముత్యముచే నన్యా। ర్థామనము కావ్యపూర్వ కార్థాపత్తిన్
నీమోవి బంధుజీవము। నే మోడుచు నన్యజీవ మెడపు టదిరియే.' అలం.

మేఘము కేశవుని నిద్రపుచ్చు ననుట - వర్షర్తువున ఆదేవుఁడు నిద్రించుచుండును. ఇందులకు ౧౦౧. టీక చూ.

తే. ధూళి యడఁగిన మఱి మింటఁ దోఁచె శంప,
జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి
ఖనది ఖశ్రీవిభూషేచ్ఛఁ గడుగ మెఱయు
మృదుమహీగతవసురజోరేఖ యనఁగ. 110

ధూళి = దుమ్ము, అడఁగినన్ = రూపణఁగా, మఱి = వెంటనే, పర్జన్యుఁడు = ఇంద్రుఁడు, జ...ణిన్ - జలధర = మేఘమనెడు, ద్రోణిన్ = దోనెయందు, మన్ను = మట్టిని, ఎత్తి = ఎత్తిపెట్టుకొని, ఖ నదిన్ = మిన్నేటియందు, ఖ శ్రీవిభూషా ఇచ్ఛన్ = ఆకాశలక్ష్మికి భూషణముచేయఁ గోర్కిగలవాఁడై, కడుగన్ = జలగడుగఁగా, మె...ఖ - మెఱయు = అందులో మెఱయుచుం గానిపించిన - మహీగత = భూమియం దుండినదైన - మృదు వసురజః = మెత్తని పసిఁడి పరాగముయొక్క - రేఖ = చాలు, అనఁగన్ = అనునట్లుగా, మింటన్ = ఆకాశమందు, శంప = మెఱపు, తోఁచెన్ = అగపడెను.

భూమిలో ధూళి ఎగసిపోవుటయు, అనంతరము మేఘమున మెఱపు మెఱయుటయు ఎట్లుండె ననఁగా - దేవేంద్రుఁడు ఆకాశలక్ష్మికి నగలు చేయించుటకై భూమిలోనిమంటిని ఎత్తి మేఘమనెడు దోనెలోఁ బెట్టుకొని ఆకాశగంగలో జలగడుగఁగా, అందలిబంగారపు రేణువులు ఒక్కెడం గూడుకొని రేఖగా మెఱయుచుం గానిపించెనో యనునట్లుండెను. - ఉత్ప్రేక్షాలంకారము, రూపకానుప్రాణితము.

'శంప' - 'శమ్పా శతహ్రదా హ్రాదిన్యైరావత్యః క్షణప్రభా' అను. 'ద్రోణి' - దోనె - జలగడుగువాఁడు మన్నుం దీకొని నీళ్లు మాటిమాటికిం బోయుచు గాలించుటకు ఆధారభూతమై కొన్నెయాకారముగా నుండునొకపాత్రవిశేషము. - ఆకాశలక్ష్మికి నగలు ఇంద్రుఁడు చేయింప నేమి యన - ఇంద్రుఁడు ఆకాశమునకు పతి:—

'రజ్జువల్లరి మీఁదఁ బ్రణయంబు గలదేని । యంతరిక్షంబేలు హరివరించు.' శృం. నై. 4(78).

'యది త్వ ముద్బధ్నుమనా వినా నలం । భవే ద్భవన్తీం పతి రన్తరిక్షగామ్,
దివి స్థితానాం ప్రథితః పతి స్తతో । హరిష్యతి న్యాయ్య ముపేక్షతే హి కః' నై. 9.

'ఖలక్ష్మి' - 'నభోన్తరిక్షం గగన మనన్తం సురవర్త్మ ఖమ్' అను. 'ఖనదిన్' - ఆకాశగంగయందే - ఆకాశలక్ష్మియెదుటనే.

తే. స్థూలపరిపక్వకాననోదుంబరాగ్ర
రంధ్రముల వాననీరు సోరంగ వెడలె
మశకపంక్తులు దావధూమంబు లనఁగ
రచ్చ సేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. 111

స్థూ...లన్ - స్థూల = వలుదలు - పరిపక్వ = పండినవియునైన - కానన ఉదుంబర = అడవిమేడిపండ్లయొక్క - అగ్ర = ఊర్ధ్వభాగమందలి, - రంధ్రములన్ = కన్నములనుండి,

వాననీరు, చోరంగన్ = దూఱంగానే, మశక పంక్తులు = దోమలవరుసలు - దావధూమంబులు = కార్చిచ్చుల పొగలు, అణంగన్ = రూపఱంగానే, విశ్రాంతికై = శ్రమదీర్చుకొనుటకై, రచ్చ సేయంగన్ - వెలువడినవో యనునట్లుగా, వెడలెన్ = వెలువడినవి.

లావులై పండిన యడవి మేడిపండ్లలోనికి వాననీరు నెత్తికన్నుపుదారిని దిగఁగా, అందున్న దోమలు ఆబొక్కలలోనుండి బారులుగా వెలువడుట యెట్లుండె ననఁగా, దావాగ్నులు చల్లాఱి వానిపొగ లణఁగిన వని తెలిసికొన్నవై ఆదోమలు సుఖముగా విశాలప్రదేశములందు శ్రమతీఱ రచ్చచేయుద మని వెడలినవో యనున ట్లుండెను.

'స్థూల' - వర్షోదకము దోరగాయమీఁదం బడి యుంకుటచే కాయ పెద్దదిగా ఎదుగును.
'కాననోదుంబర' - వర్షాకాలపుఁ జల్లగాలికి అడవిమేడి పండును.

'త్వన్నిష్యన్దోచ్ఛ్వసితవసుధాగన్ధసంపర్కరమ్యః
స్రోతోరన్ధ్రధ్వనితసుభగం దన్తిభిః పీయమానః
నీచై ర్వాస్యత్యుపజిగమిషో ర్దేవపూర్వం గిరిం తే
శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణామ్.' మేఘ.

'ఉదుమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గో హేమదుగ్ధకః' అమ. జంతుఫల మనుటకే 'మేడిపండు చూడ మేలిమై యుండును। పొట్ట విచ్చి చూడఁ బురుగు లుండు' అనుట. 'అగ్ర' - వానకురియుట పైనుండి గాన ఊర్ధ్వభాగమునందలి బిలములదారినే నీరు సొచ్చును. 'చోరంగ వెడలె' - నీరు నిండిన నిలువం జోటుండదు గావునను, నిలిచిన, నీరుచేతనో చలిచేతనో చావు గలుగును గావునను. 'పంక్తులు' - కన్నము సన్నము గావున ఒకటి వెంబడి నొకటిగానే వెలువడవలయును. - 'ధూమంబులణఁగెన్' ధూమములు వానికి ప్రాణహారములు గావున.

'అటు నాఁడు మతని బాహారణికలు వైరధరణీశమశకసంహారమునకు...... ।
కారణం బైనధూమశేషయినుబోని । ఘనశరాసనగుణకిణాంకము ధరించు.' ప్రం. ౫ (౯౬)

'అణఁగెన్' - అడఁగిన వని దోమలకు ఎట్లు తెలిసిననఁ వాననీరు చొరఁగా తెలిసినది. 'ధూమంబు లడఁగెన్' అంతవఱకు పొగచే కన్నులు మండు నని వెలుపల దాఁగియుండినవి. 'రచ్చ' - పూర్వము పండ్లలో ఇఱుకటములో నుండునవిగావున సుఖగోష్ఠి లేదు; వెలుపల నిపుడు కలిగినది. 'విశ్రాంతి' - పండ్లలో నున్నంతసేపు ఇఱుకటముచేత శ్రమమే. 'రచ్చ' - రథ్యాశబ్దభవము.

స్రగ్ధర. గ్రావాలం గేతకీకోరకకుటజరజోరాజి దూర్వాంకురశ్రీ
తో వీక్షింపన్ దినానుత్రుటి మెఱుఁగుడుచుం దోఁచు, చిట్లో తిరోభా
వావిర్భావంబులం బాయక పొరయ నభస్యాభ్రము ల్గప్పి, పైనెం
తే విప్పి పింఛికల్ బర్హిణులు తిరుగఁ, బెట్లింద్రజాలంబుఁ జూపెన్. 112

నభస్యాభ్రముల్ - నభస్య = భాద్రపదమాసంపు - అభ్రముల్ = మేఘములు, (పా. 'నభస్సభ్రముల్' - అభ్రముల్ = మేఘములు, నభస్సు = ఆకాశమును), కప్పి = ఆవరించి, గ్రావాలన్ = కొండలయందు, పైన్ = ఊర్ధ్వప్రదేశమందు, బర్హిణులు = నెమళ్లు, పింఛకలు = తమపురులు, ఎంతేని = మిక్కిలి, విప్ప ఐ = విప్పఁబడినవై (పురులను విప్పుకొని), తిరుగన్ = సంచరించుచుండఁగా, వీక్షింపన్ = జనులు చూచుచుండఁగా, దిన అనుత్రుటిన్ = పట్టపగలు ప్రతిక్షణమునను, కేత...ల - కేతకీకోరక = మొగలిమొగ్గలయొక్క (పువ్వులయొక్క

యనుటయే) - కుటజ=కొండమల్లెలయొక్కయు - రజః = పరాగముయొక్క - రాజి = మొత్తము, దూ...తోన్ - దూర్వా = గరికయొక్క - అంకుర = మొలకయొక్క - శ్రీతోన్ = శోభతో, మఱుపడుచున్ = కనఁబడకపోవుచును, తోఁచుచున్ = కనఁబడుచును, ఇట్లు = మఱుపడునట్లును దోఁచునట్లును, ఔ = అగుటయనెడు, తిరోభావ = రూపఱుటను, ఆవిర్భావంబులన్ = పొడముటను, పాయక=నిరంతరము, పొరయన్=పొందునట్లుగా, (పొందించుట యనెడి) ఇంద్రజాలంబు = కనుకట్టువిద్దెను, పెల్లు = అగ్గలముగా, చూపెన్.

మేఘము ఆకాశము నావరించుటయు, నెమళ్లు పురివిచ్చి ఆడుటయుం గలిగినయాసమయమునందు కొండలలో మొగలి కొండమల్లెల పుష్పాడియు గరికయొక్క పసరువన్నెయును పట్టపగలే చూచుచుండఁగానే క్షణము మఱఁగిపోవుట,క్షణములో మరలం గనఁబడుటయు నెట్లుండెననఁగా, మేఘము గారడీవానివలెను, పురులువిప్పిన నెమళ్లసంచలనము వాఁడు నెమలికుంచె నాడించుటవలెను, ఆపుష్పాడియు గరికవన్నెయు పగలే క్షణక్షణము దృశ్యాదృశ్య మగుచుండుట వాఁడు తనవిద్యావిశేషముచే వానింబుట్టించుటవోలెను మాయముచేయుటయుం బోలెను ఒప్పుచుండెను. బసుమంబును గరికయు నెమలికుంచెలును ఇంద్రజాలసాధనములు.—రూపకాలంకారము.

ఆపుష్పాడియు ఆగరికవన్నెయు అదృశ్య మగుట మేఘము వర్షించుచున్నప్పుడును వానికి ఎండ వెలుతురు తగులనప్పుడును. దృశ్యము లగుట వర్షణము లేనప్పుడును ఎండవెలుతురు అందినప్పుడును అని యూహించునది. 'గ్రావాణౌ శైల పాషాణౌ' అను. 'కోరక' - మొగ్గలోని పుష్పాడి పర్యాను, వికసిల్లి విస్తృతమైనపువ్వులోనిది పర్యాను, కావున లక్షణచే పువ్వని యర్థము చేసికొనవలయును. 'కలికా కోరకః పుమాన్' అను. కేతకి వర్షాకుసుమ మని చెప్పినున్నాము. కుటజంబు నట్టిదే:—చూ. కావ్యానుశాసనము.—

'దళత్కుటజకుట్మలః స్ఫుటితనీపపుష్పోత్కరః। నవప్రసవబాణభః ప్రసృతమంజరీ ఖర్జురః
కదమ్బకలుషామ్బరః కలితకేతకీకోరకః। చలన్నిచుళసంకులో హరతిహా న ఘర్మాత్యయః'-

'నభస్యము'-'స్యుర్నభస్య ప్రోష్ఠపద భాద్ర భాద్రపదాః సమాః' అను. - 'నభోనభస్యములు' - శ్రావణభాద్రపదమాసములు రెండును వర్షర్తువగుటచేత ముదిరినవర్షామేఘము లనుట. మాకు దొరకిన వ్రాఁతపుస్తకములం దన్నిటను ఈపాఠమె యున్నది. 'ఇంద్రజాలము' - ఇంద్రునిమాయ అని వ్యుత్పత్త్యర్థము. 'జాలం గవాక్ష ఆనాయే క్షారకే దమ్భ బృన్దయోః' మేది.

తే. గిరులఁ దటజంబుతరువులఁ దొరఁగుపండ్లఁ
బుట్టె జంబూనదులు; గానఁ బొదవు మొగిలు
మేన నవి సోఁకునెడలు గామితిఁ దటిచ్ఛ
లంబునను శుద్ధజాంబూనదంబు లయ్యె. 113

గిరులన్ = కొండలయందు, తట జంబు తరువులన్ = దరులయందలి నేరేడు వృక్షముల నుండి, తొరఁగుపండ్లన్=రాలుఫలములనుండి, జంబూనదులు=జమ్మేఱులు, పుట్టెఁగానన్=జనించినవి గాన, పొదవు మొగిలుమేనన్=ఆగిరులను కమ్ముకొనెడిమేఘము నొడలియందు, అవి=ఆపండ్లు, సోఁకునెడలు=తగిలినట్టిప్రదేశములు, గామితిన్=శ్రేష్ఠముగా, తటిత్ ఛలంబునన్ = మెఱపనెడి మిషచేత, శుద్ధజాంబూనదంబులు = మేల్మిబంగారములుగా, అయ్యెన్=మాఱినవి. [కొండఱు -

కదం...లు - కదంబ = కడిమి - కుటజ = కొండమల్లె - నీప = ధారాకదంబము - కకుభ = మద్ది - యూథికలు = అడవిమల్లెలు, (ఈపువ్వులు), అను - సాయకములు = బాణములు, ఏను= ఐదు, కలిగి = లభించి, గేదఁగిసురె = బంగారుమొగలి (రేకు) కటారి, ఎక్కుడు = అధికము (అఱవయాయుధము), అయ్యెన్.

ఈఋతువులో మదనునికి విరహులగుండియల నవియించుటకు వసంతర్తుబాణభూతము లయిన నవమాలికాది పుష్పములు అయిదును లేకపోయినను, వానియంతజయము కలిగించు బాణములుగా కదంబాదికుసుమములు, ఐదు కలిగెను; ఇవిగాక కరకర కోయుటకు పసిండి మొగలియను చురకత్తి యొకటికూడ దొరకెను.—పరిణామాలంకారము. ఆయామని పువ్వులు ఐదింటివలె ఈవానకారుపువ్వులు అయిదును కామోద్దీపకము లనియు, పైగా మొగలి వాని కన్నను నుద్దీపక మనియు భా. వసంతముకన్న వర్షర్తువే విరహిదుస్సహముగా నుండె ననుట.

'అరవిన్ద మశోకం చ చూతం చ నవమాలికా
నీలోత్పలం చ పఞ్చైతే పఞ్చబాణస్య సాయకాః.' అమ.

మొగలిపూవులకు - 'విరహిజనహృదయచ్ఛేదనక్రియా క్రకచంబులు వియోగి మర్మవిదారణ వ్యాపారకర్ణినారాచంబులు పాంథజనహృషీకసూచకశలాకలు నగు కనకకేతకీజాతంబులఁ జేరం జనుదెంచి' అని నైషధములో మొగలిపూవువర్ణన. 'ధారాకదమ్బో నీపః స్యా ద్వృత్తపుష్పస్తు కదమ్బకః' అని నీపకదంబములకు భేదము. మఱియు - 'త్వత్సంపర్కా త్పులకితఇవ ప్రౌఢపుష్పైః కదమ్బైః'; 'నీపం దృష్ట్వా హరితకపిశమ్', 'వ్రజ వననదీతీరజాతాని సిఞ్చ న్నుద్యానానాం నవజలకణై ర్యూథికాజాలకాని' అను మేఘవచనములచేత నివి వార్షికము లని స్పష్టము. - 'కకుభమును' వార్షికమే;

'సోఽయం శైలః కకుభసురభి ర్విన్ధ్యపాదో న్నమ యస్మిన్
నీలః స్నిగ్ధః శ్రయతి శిఖరం నూతన స్తోయవాహః.' ఉ. రా. చ. 1

'సురెకటారి పిడెం బనశోభిలునుగ । రాసి నామంబులై నిటలాగ్నినేత్ర' ఆం. భా. 2 - (214)

క. నటనపరకేకిపాత్ర । స్ఫుటయవనికలన మొగిళ్లు పొడవెన్ భూభృ
త్తటులన, నవి యాకు దను చిట । పొటపవము నెలంగెఁ దాళములచప్పుడు నాన్.

నట...లు - నటనపర = నాట్యమందు వ్యాపృతము లైనట్టి (నటించుచున్న - అనుట) - కేకి = నెమ్మిలనెడి, పాత్ర = నట్టువులయొక్క - స్ఫుట = వ్యక్తమైన, యవనికలు = పరదాలు, అనన్ = అనునట్లుగా, మొగిళ్లు = మేఘములు, భూ...లన్ -భూభృత్ = కొండలయొక్క (ఱేండ్లయొక్క అనియు) - తటులన్ = చఱియల (నెడునాట్యశాలల)ను, పొడవెన్ =కప్పెను, అవి = ఆమేఘములు, ఆకు దిను చిటపాటగినవము = చెట్లయాకులను భక్షించుటలో కలుగునట్టి చిటపాట యనెడుశబ్దము, తాళములచప్పడు నాన్ = కాలక్రియామానముల శబ్దములోయనట్లు చెలంగెన్ = ఒప్పెను.

కొండ లనెడిరాజుల చఱియ లనెడి ప్రేక్షాగృహములందు ఆడుచున్న నెమ్మిలనెడిపాత్రముల తెరలో యనునట్లు మేఘము లొప్పచుండెను; అవి చెట్లయాకులను మేసెడిచిటపాటశబ్దము తాళమువేయు చప్పుడో యన నొప్పుచుండెను.—రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

'యవనికలు' - 'ప్రతిసీరా జవనికా స్యా త్తిరస్కరిణీ చ సా' అమ. 'యవనికా' అని యాంధ్రలిపిపుస్తకములోనిపాఠము - 'యువ న్త్యస్యామ్' దీనియందు కలసికొందురు - అని, వ్యుత్పత్తి. 'యుల్ మిశ్రణేఽమిశ్రణే చ' కవికల్పద్రుమము. - 'జవనికా' - 'జవ న్త్యస్యామ్' దీనియందు త్వరపడుదురు. - 'జురంహాసి' క. క. ద్రు. యవనికాశబ్దమునుబట్టి హూణవిద్యాప్రవిష్టులిదానీంతనులు కొందఱు రూపకరచనాప్రయోగములను మనపూర్వులు యవనుల (గ్రీకుల) నుండి నేర్చినా రని వచింతురు. కాని యీరెండుశబ్దములను సంస్కృతధాతువులనుండియే వ్యుత్పన్నములనుగా పూర్వులు తెలిపియున్నారు. 'భూభృత్' - 'భూభృ ద్భూమిధరే నృపే' అమ. 'తటులన్' - ఈశబ్దముచేత ఏకదేశవివర్తిరూపకమర్యాదచే రంగప్రదేశములు సూచితములు.

'ఆకుదిను' - పెద్దలు ఒకానొకరు, మబ్బు ఆకులను తినునా? యని శంకించి, 'ఆకుదను' అని పఠింపఁదలఁకొనిరి. 'తిను' పాఠమే సరిగాని 'తను' పాఠము సరిగాదు. 'మేఘములు కొండలలో మేయును, సముద్రములో నీరు ద్రావును' అని లోకులు చెప్పుదురు. తదనుగుణముగా నిటం గవనము. తినుట వాస్తవమే; ఎట్లన - కొండజనులు వర్షాకాలమున విస్తరులకుఁగాను అమ్ముకొనుటకు ఆకులకట్టలం దెచ్చిన, అయ్యాకులయందు మొఱ్ఱులును ఉండును; కడమకాలములందు అవి యుండవు; వారిని మంచియాకులను తెమ్మన్న, 'దొరకవు, ఇప్పుడన్నియు మబ్బుతిన్నయాకులే' అని చెప్పుదురు. మేఘములయొక్క జలబిందుల శైత్యాతిశయముచే అవి పడినచోట్ల ఆకు మాడును; మాడినచోట్ల బొక్క లేర్పడును. 'తాళముల' - ఒక్కొక్కదానిశబ్దంబును ప్రత్యేకముగా తెలియునట్లు రాలుచున్న వానచినుకులను చిటపొటచినుకు లందురు. ఆకులమీఁద పడినచో ఆశబ్దము అట్లే (చిటపొట) అనియే తప్పక వినఁబడును. వానిని తినుశబ్దమును లోకవ్యవహారము ననువదించి కవి తాళధ్వనిగా నుత్ప్రేక్షించినాఁడు. మఱి యీతాళములు ఖంగు ఖం గనిమ్రోఁగు కంచుతాళములు గావు; మ్రానిపలకతోఁ జేసిన చిటితాళములు, అట్లని చిటపొటధ్వనిసాదృశ్యముచేఁ దెలియుచున్నది.

చ. జలధర ముప్పుతోఁ బులు పొసంగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి, పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ, బ్రాఁచి దౌటఁ బె
న్బులుసుఁ గరుళ్లు గ్రాయ, నవివో వడగండ్లన రాలెఁ, గానిచో
నిలఁ బడ వానిఁ దిన్నయపుడే చలిపండ్లు వడంగ నేటికిన్? 116

జలధరము = మేఘము, ఉప్పుతోన్ = ఉప్పుగలిపిన, పులుసు = పులుపు, రసం బొసంగు నని = రుచిని ఇచ్చును (రుచిగానుండును) అని, అప్పయోధిన్ = ఆ(యుప్పునీటి) సముద్రమును, ఇంపు ఒలయన్ = ప్రీతి వ్యాపించునట్లుగా (ప్రీతిపూర్వకముగా), క్రోలి = త్రాగి, పైన్ = దానిమీఁద, దధిపయోధియున్ = పెరుఁగుసముద్రమునుగూడ, క్రోలఁగన్ = త్రాగి, ప్రాఁచిదిపౌటన్ = (ఆదధిసముద్రము) పురాతనముది అయినందున, పెనుబులుసుఁగరుళ్లు = రొడ్డుఁబులుపుగల గడ్డలను, క్రాయన్ = వెడలనుమియఁగా, అవివో = అగడ్డ సుమా, వడగండ్లు అనన్ = వడగండ్లను పేర, రాలెన్ = పడినవి; కానిచోన్ = ఆమాటసరిగాదేని. ఇలన్ = భూమిమీఁద, పడఁగానే, వానిన్ = ఆవడగండ్లను, తిన్నయపుడే = భక్షించినతత్క్షణమే, చలిపండ్లుపడంగన్ = పండ్లు గిట్టుకొనిపోవుటకు, ఏటికిన్ = వేఱుకారణములేదు.

పుల్లనిభోజ్యము ఉప్పుతో మిశ్రమయినచో కరము రుచించును గావున, ఆతలంపుతో సముద్రుఁడు ముందుగా ఉప్పుసముద్రమును త్రాగి పిదప పెరుఁగుసముద్రమును జుఱ్ఱఁగా, ఆపెరుఁగు ఏనాఁటిప్రాఁచిదో అగుటచేత దానిపులుపును ఆసముద్రపునీటియుప్పు భేదింపలేమిచేతను, ఆప్రాఁచివాసనయు ప్రాఁచిరుచియు దుస్సహ మగుటచేతను, వెంటనే మేఘుఁడు దానికరుళ్లను (అనఁగా త్రాగునప్పుడు పెద్దపెద్దగడ్డలచే పెరుఁగుగడ్డ గండము రాకుండ నమలి చిన్నచిన్న కండలుగాఁ జేసి మ్రింగిన యాకండలను) వాంతిచేసికొనఁగా, అవే వడగండ్లను పేర నేల రాలినవి. ఈమాట నిజముకానిచో ఆవడగండ్లను నోట వైచికొనఁగానే చలిపండ్లు పడుటకు కారణము లేదు.

'అప్పయోధిన్' - 'అ + పయోధిన్' అని ఛేదము చేయవలయును, 'అప్ + పయోధిన్' అను ఛేదము సరిగాదు. శుద్ధోదకసముద్రము వేఱే యున్నందున, పయోధిశబ్దము రూఢిచే సముద్రమాత్ర వాచకముకావున 'దధిపయోనిధి' యనుట నిరాక్షేపము. పయస్ + ధి=పయోధి='ఇంపు' - పెరుఁగును రుచిరుచిగా జుఱ్ఱవచ్చునను నాశచేఁ గలిగిన ప్రీతి - 'ఒలయు'...ఇంపొలయు, 'రసంబు' - 'రసో గన్ధరసే స్వాదే తిక్తాదౌ విషరాగయోః। శృఙ్గారాదౌ ద్రవే వీర్యే దేహధాత్వమ్బుపారదే.' మేదిని. 'క్రాయు' - గౌణవృత్తిప్రయుక్త మగుటచే నిష్ఠ్యూతోద్గీర్ణాదికారికోక్త ప్రకారంబున అతిసుందరముగా నున్నది. 'పెన్బులుసు' - ప్రాఁతాదికార్యముచే సరళాదేశము. 'పో' నిశ్చయార్థకము - ఉత్ప్రేక్షావాచకము. 'చలిపండ్లు పడుట' - చలివస్తువుతో సంపర్కముచేత పండ్లు దుస్సహవేదనాది వికారములపాలగుటకు చలిపండ్లుపడుట యని వ్యవహారము; కావున 'చలిఁబండ్లు' అని పఠించుట సమంజసముగాదు.

తే. అపు డసల్లకు డిగక మేఘాళి పొదువు
నచలములపైనె దొడ్డికట్టగుమృగాళి
జాడ చూపట్టె మీఁదిపర్జన్యధన్వి
నృపున కగుతెరవేఁటయాయిత మనంగ. 117

అపుడు = ఆవర్షములలో, అసల్లకున్ = క్రింది బురదనేలలకు, డిగక = దిగిరానిదై (మృగాళికి విశేషణము), మేఘ అళి పొదువు అచలములపైనె = మేఘముల పంక్తి కప్పియున్న కొండలమీఁదనే, దొడ్డికట్టు అగు మృగ అళి జాడ = దొడ్డిలో అఁపుదల చేసినట్లు నిలిచియున్నట్టి జంతువుల సమూహముయొక్క ప్రకారము, (ఎట్లు చూపట్టెననఁగా), మీఁది పర్జన్యధన్వి నృపునకున్ = ఆకాశమందున్న యింద్రుఁడనెడి రాచవిలుకానికి (విలుకాఁడైన యింద్రుఁడను పేర ఆకాశమందున్న రాజునకు), అగు = ఏర్పడిన - తెరవేఁట యాయితము = తెరవేఁట సిద్ధమగుటయో, అనంగన్ = అనునట్లుగా, చూపట్టెన్ = కనఁబడెను.

ఆవర్షాదినములలో, క్రిందినేలలు బురదతో నిండియుండుటంబట్టి, బురదలో నుండలేని మృగములు క్రిందికిదిగక గుంపులుగా కొండలమీఁదనే దొడ్డిలో నున్నట్లు ఉండుటయు, ఆగుంపులచుట్టును కొండపై మేఘములు ఆవరించికొని యుండుటయును, ఎట్లుండె ననఁగా - మీఁద విల్లు ధరించి వేఁటాడ సిద్ధముగానున్న యింద్రుఁడనెడిరాజునకు తెరవేఁటకై చేసినయాయితమో యనునట్లుండెను. - ఉత్ప్రేక్ష.

'అసల్లు' - ఏ వ. అసలు. 'దొడ్డికట్టు' - పశుస్వాములు పసులను దొడ్డిలోనికిం దోలి పెండెము బిగించుట ప్రసిద్ధము. 'పర్జన్యో రసదబ్దేన్ద్రౌ', అమ. ధన్వము గలవాఁడు 'ధన్వి'; ధన్వన్'

'ధన్విన్' అని నకారాంతములు. 'నృపునకున్' - రాజులకే ఇట్టిది సాధ్యము, సామాన్యులకు సులభముకాదు. 'తెరవేఁట' - ఱేఁడు వేఁటాడుటకై పరిజనులు కొంత ప్రదేశమును తెరలతో నావరించి అందులోనికి జంతువులను తోలియుంతురు. ఆవేఁట తెరవేఁట. 'ఆయితము' - ఇది ప్రాయికముగా విశేష్యనిఘ్నము, ఇచ్చటంబోలె విశేష్యముగానయితము వ్యవహరింపఁడును. 'చూడ (బర్జన్యధన్వి)' యను పూర్వపాఠమున యతిభంగము.

చ. తడి తల డిగ్గి ముంప, జడతం దుద ఱెప్పలఁ గన్ను వీడి, పు
ల్లొప్పడుచుచు నీరు ముంగఱలపోలిక ముక్కులఁ గూడ, నోరఁ గొం
తొడియుచు గూఁటికఱ్ఱ సగ మొత్తుచు ఱెక్కవిదుర్పు మున్నుగా
వడఁకుటె గాక చేష్ట డిగె వక్షము పక్షులు జానువుల్ చొరన్. 118

ఆవర్షములలో గూండ్లలో పక్షులస్థితి - తడి=నీరు, తల డిగ్గి=తలమీఁదుగా జాఱి, ముంప=ఒడలంత వ్యాపింపఁగా, జడతన్ = కదలలేమిచే, తుదఱెప్పలన్ = ఱెప్పలతుదలయందు, కన్ను వీడి = వివృతముకాఁగా [పా. విచ్చి = తెఱచి], పుల్లొప్పడుచుచున్ = ఱెప్ప వేయక చూచుచు, నీరు, ముంగఱలపోలికన్ = ముంగఱ లనెడుయాభరణవిశేషములవలె, ముక్కులన్ = ఊపిరి రంధ్రములయందు, కూడన్ = చేరఁగా, నోరన్ = నోటిదారిని, కొంతి=సగము (కొంతపాటి నీటిని), ఒడియుచున్ = స్వీకరించుచును, సగము = అశేషించిన నీటిని, గూఁటికఱ్ఱన్ = గూఁటికఱ్ఱయందు, ఒత్తుచున్ = అద్దుచు, వడఁకుటె గాక = వణఁకుచుండుటయే గాక, ఱెక్కవిదుర్పు మున్నుగాన్ = ఱెక్క విదిలించుట సయితము లేకుండ, పక్షులు, జానువుల్ = మోఁకాళ్లు, వక్షము, చొరన్ = దూఱఁగా, చేష్ట = సంచలనాది క్రియను, డిగెన్ = మానినవి.

గూండ్లలో పక్షులు ఒడలంత ముణుఁచుకొని చలితీఱుటకుగా మోఁకాళ్లను ఱొమ్మునం బెట్టుకొని ఱెక్కనైనఁ గదలింపక ఏచేష్టయు లేక యుండినవి. అందుల విస్తరము - వాననీరు మున్నుగా తల తడిపి, పిమ్మట తలమీఁదుగా ఒడలంతయుం దడిపినది. అందువలన వానికి ఒడలు కొయ్యవాఱినది; ఆనీరే తలమీఁదుగా కన్నులం జొరఁగా అట దానినిసహింపలేకున్నను, వార్చివైచుటకు కన్ను తెఱవలేకుండినవి. లోని నీటిపోటుచే ఱెప్పలు కొంచెము తుదలను వీడఁగా పక్షులును ఆనీరు వడియుటకుఁగాను రవంతసేపు కనుదెఱచికొనియే యుండఁగా, ఆనీరు ముక్కు రంధ్రములమీఁదికి దిగఁజాఱి ముంగఱలవలె నచట నిలిచినది. అందువలన ఊపిరితిరుగక ఆనీటిని నోరుదెఱచి అందులోనికి కొంతస్వీకరించి తొలఁగించినవి; నోటిలోనికి రాక మిగిలి ముక్కు రంధ్రములకడనే యున్ననీటిని గూఁటికట్టియకు అద్దివైచినవి. చలికి వణఁకుచుండినవి. - స్వభావోక్త్యలంకారము.—'ముంగఱల పోలికన్' - ఉపమ.

'పుల్లొప్పడుచుట' నీరువడియుటకు. 'ముంగఱ' - సాధారణముగా ఒకటే ముత్తెముతో లేక ముక్తాదికముల మొత్తముగా, నుండును. పక్షికి శ్వాసము నాఁపుటకు ఒకబొట్టేచాలును. పెద్ద బొట్టేని చెప్పవలసినదే లేదు. - 'ఒడియుచు' - ఒడియుట వెలువరించుటకే - ఒడిసి వెలువరించు నని భావము. 'చేష్టుడిగె' నని యొక పూర్వపాఠము - (ఉడిగెన్=మానెను) తత్సమాకారమునకు సంధి దుష్టము), ఈరెండుపాఠముల గుణదోషపరీక్షను పీఠికయందుఁ గనునది. 'జానువుల్' - పక్షులకు మోఁకాళ్లువెనుకకు వంగును, అవి వక్షముం జొచ్చుటయెట్లు? అనిన ఆమోఁకాలికోణము ఱొమ్మునకు దగులునట్లుగా నని భా. గుడ్డకు గతిలేనివానికి జానువులచే సైతము చల తీఱును.

'రాత్రౌ జాను ర్దివా భానుః కృశాను స్సంధ్యయో రపి ।
ఏవం శీతం మయా నీతం జానుభానుకృశానుభిః.'

*పుల్పొడుచు' - 'పులపొడుచు' [=ఱెప్ప వేయక మాచు] అని పూర్వరూపము.

క. 'చప్పుడుసేయక సంజ్ఞలఁ । జప్ప ట్లిడుకొంచుఁ గొండ సరియలవెంటన్
జప్పాళ్లకు బులబొడుచు చుఁ । జొప్పరయుచుసెలవెట్టుచును శబరభటుల్॥' భల్లా. 3 ఆ. శ. ర.

క. చెందు నెఱసంజ కుంకుమ । క్రందునఁ గెంపెక్కు దివికి గాశ్మీరత రా,
నిందుశిలాత్వము రవి గని । యెం; దోయముఁ గురియ నేల యిటు గాకున్నన్?

చెం...నన్ - చెంది=ప్రాపించిన - ఎఱసంజ=ఎఱ్ఱని సంధ్య (సంధ్యారాగము) అనెడు - కుంకుమ = కుంకుమపువ్వుయొక్క - క్రందునన్ = దట్టంపుఁదనముచేత, కెంపు ఎక్కు = ఎఱ్ఱబాఱుచున్న - దివికిన్ = ఆకాశమునకు, కాశ్మీరత = కాశ్మీరదేశత్వము, రాన్ = కలుగఁగా, రవి = సూర్యుఁడు, ఇందుశిలాత్వము = చంద్రకాంతమణి భావమును, కనియెన్ = పొందెను; ఇటు గాకున్నన్ = ఈమాట మీరు సరిగా దంగుకను, తోయము గురియ నేల=(సూర్యుఁడు) నీళ్లను దొఱఁగుటకు కారణ మేమి?

సంధ్యారాగమనెడు కుంకుమగానుండుటంబట్టి ఆకాశము కాశ్మీరదేశ మాయెను. అందువలన సూర్యుఁడు చంద్రకాంతశిల యాయెను. కాకున్న నీటిని గురియుటకు కారణమేమి?

కుంకుమపువ్వు కాశ్మీరంబునం బుట్టును, అందుననే దానికి కాశ్మీరజన్మ, కాశ్మీరము అని పేరులు వచ్చినవి. 'అథ కుఙ్కుమం । కాశ్మీరజన్మాగ్నిశిఖం వరం బాహ్లీకపీతనమ్' అమ.

"కాశ్మీరే జన్మాస్య ... 'కాశ్మీరం కుఙ్కుమేఽపిస్యాత్ టఙ్కపుష్కరమూలయోః'" మేదిని.—ఇందుశిలయు కాశ్మీరదేశోద్భవమే.

ఇందుశిల రాత్రిగదా స్రవించును; సూర్యుఁ డుండఁగా నదియెట్లు? అనిన సూర్యుఁడే ఇందుశిల యైనందున సూర్యుఁడు లేమిచే పగలు కానందున స్రవించుటకు ఆక్షేపములేదు. 'ఇందుకాంతంబుల నెబ్బంగిఁ గురిసెనో । నిష్యంద కీలాలనిర్ఝరములు.' శృం. నై. 8. (198).

చ. అలజలరాశినీటఁ బగ లర్కకరావళి చూలు దాల్పఁగా,
నలమిన యీర్ష్య రాత్రి ధవళాంశుకరాళులు తాము దాల్ప, న
జ్జలముల నాన మూఁగికొనుచాడ్పున నాడి వహించెఁ జూలు మ
బ్బుల నిల ముంచునీలఘనపుంజమువల్ల బలాకమాలికల్. 120

పగలు=పగటియందు, అర్క కర ఆవళి=సూర్య కిరణ సమూహము, అలజలరాశి నీటన్ = ఆసముద్రుని నీటిచేత, చూలు దాల్పఁగాన్ = గర్భము ధరింపఁగా, అల...ర్ష్యన్ - అలమిన = ముంచిన - ఈర్ష్యన్ = ఈసుచేత, రాత్రి = రాత్రియందు, ధవళాంశు కర ఆళులు = చంద్ర కిరణ సమూహములు, తామును, తాల్పన్ = చూలు ధరింప గోరినవై. అంబులన్ = నీళ్లచేత, ఇలన్ = భూమిని, ముంచు నీల ఘన పుంజము వల్లన్ = నిండునట్టి నల్లని మేఘముల సమూహముచేత, తజ్జలములకున్ = మేఘములలోని యాసంద్రంపు నీళ్లకు, ఆనన్ = త్రాగుటకు (లేక తగులునట్లుగా), మూఁగికొను చాడ్పునన్ = క్రమ్ముకొనుచున్నవో యనునట్లుగా, బలాక మాలికల్ = బెగ్గురు బారులు, ఆడి = సంచరించి (కామకేళిం దేలి అనియు), చూలు వహించెన్ = గర్భము దాల్చినవి.

పగలు సూర్యకిరణపంక్తి సముద్రోదకమువలన గర్భము ధరించుట కని, రాత్రి చంద్ర కిరణపంక్తులు తాము కూడ జలముచే భూమిని ముంచెడి మేఘములు త్రాగి తెచ్చిన యాసముద్రో దకముచేత గర్భముదాల్చుటకై ఆమేఘముల యాజలములకు తగులునట్లు (జలములను త్రాగుటకై) మూఁగినవో యనునట్లు బలాకాశ్రేణులు మేఘములకడ నాడి (మేఘములతోఁ క్రీడించి) చాలులం దాల్చినవి.—ఉత్ప్రేక్షాలంకారము.

జలరాశినీట అర్కకరావళి చూలుదాల్చును. - 'గర్భం దధత్యర్కమరీచయోఽస్మాత్' అని రఘు. 13వ సర్గలో సముద్రవర్ణనము. 'ధవళాంశు' - 'విధు స్సుధాంశుః శుభ్రాంశుః' అమ. 'శుభ్రాంశుండు సహస్రధారకలశస్ఫూర్తిన్ విజృంభించె' శృం. నై. 8. ఆ. 'తజ్జలములన్' - మేఘమండలిజలము సముద్రము దే.

'ప్రవృత్తమాత్రేణ పయాంసి పాతు । మావర్తవేగా ద్భ్రమతా ఘనేన
ఆభాతి భూయిష్ఠ మయం సముద్రః । ప్రమథ్యమానో గిరిణేవ భూయః.' రఘు. 13 (14)

'జలములనానన్ ' అని పూర్వముద్రణ పా. 'జలముల కానన్ ' అని మూఁడువ్రాఁతపుస్తకముల పా. ఇందలి కవిసృష్టియొక్క స్వారస్యము తెలియుటకై,—

'గర్భం బలాకా దధతేఽభ్రయోగా న్నాకే నిబద్ధావళయ స్సమస్తాత్.'

అను ప్రమాణమందలి 'యోగ' శబ్దమును—

'గర్భాధానక్షణపరిచయా న్నూన మాబద్ధమాలాః
సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః.'

అను మేఘశ్లోకమందలి 'గర్భాధాన' ప్రయోగమునుం బరికింపందగును. 'బలాక' - అమరకోశ మందు 'బలాకా బిసకణ్ఠికా' అని స్త్రీలింగము పఠితమైనను, ఇట పుంలింగముగా నున్నది. ఇందుల కను బ్రయోగంబులు గలవు.-

'మేఘో జలార్ద్రమహిషోదరభృఙ్గనీలో । విద్యుత్ప్రభారచితపీతపటోత్తరీయః
ఆభాతి సంహతగృహీతబలాకశఙ్ఖః । ఖం కేశవోఽపర ఇవ క్రమితుం ప్రవృత్తః.'మృచ్ఛ.

'అంబుల నిల ముంచు'-సముద్రముకూడ ప్రళయకాలమందు నీటిచే భూమిని ముంచునదే; చూలు దాల్చు ప్రస్తావముగాన, కవి 'ఆవళి,' 'అళులు,' 'మాలికల్ ' అని స్త్రీలింగశబ్దములం బ్రయోగించి నాఁడు. 'వల్ల' - ఇది పంచమీ ప్రత్యయముగాదు, ప్రదేశవాచక మయినవలనుశబ్దమునకు రూపాం తరము; - పజ్జ, చెంత, కడ - అనువానివలె సామీప్యవాచకమైన శబ్దవిశేషము; - 'వల్లకాడు' - ఊరిప్రక్కనుండు కాడు అని వ్యుత్పత్త్యర్థము. 'చలిమల వల్ల (నుల్లసిలు చల్లఁదనంబు)' - 'మంచు కొండ ప్రదేశమందు' అని యర్థముగాని 'మంచుకొండ కారణమున' అని యర్థముగాదు. 'ధవ ళాంశుకరావళి' అని ఏకవచనపాఠము 'తాము' అను బహువచన సర్వనామముతోడి పరామర్శకు అనుకూలము గాదు, కావున కరాళులు, అని మార్పు చేయఁబడినది.

క. ఉఱుము విని యలకకై దివి । వెఱఁ బఱచుమరాళపటలి విడిచినఁ బడుస
కక్కఱచిన బిసలవవిసరము । తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. 121

ఉఱుము విని, అలకకై = అలకాపురముంగూర్చి, దివిన్ = ఆకాశమందు, వెఱన్ = భయము చేత, పఱచుమరాళపటలి = వేగముగం బోవుచున్న హంసలసమూహము, విడిచిన = వదలిన, ఆక

ఱచిన బిస లవ విసరము చెఱఁగునన్ = కఱచినట్టి యా తామరతూఁటి ఖండముల సమూహమో యనునట్లుగా, వడగండ్లు, ధవళ దీధితిన్ = తెల్లని కాంతిగలదై, రాలెన్ = రాలినవి.

ఉఱుమును విని దానికి భయపడి అలకాపురమునకు మింట వడివడిగా పఱతెంచుచున్న హంసల సమూహములు, తినుటకై కఱచియు, భయకారణముచేత తినక క్రిందికి వదలిన తమ్మికాఁడల తునియలమొత్తములో యనునట్లుగా వడగండ్లు తెల్లఁగా రాలినవి.—ఉత్ప్రేక్ష.

'హంసా నదన్మేఘభయాద్ద్రవన్తి', 'హంస సంసదపి మానసం ప్రతి ప్రస్థితా వియతి మానసం ప్రతి' - ఘటకర్పరుఁడు. అలకానగరంబును మానససరస్సును కైలాసమం దున్నవి. 'అస్యోద్యానం చైత్రరథం పుత్రస్తునలకూబరః। కైలాసః స్థాన మలకా పూః' అమ.

'కైలాసశిఖరే రామ మనసా నిర్మితం సరః।
బ్రహ్మణా ప్రాగిదం యస్మాత్ తదభూ న్మానసం సరః.'
'హేమామ్భోజ ప్రసవి సలిలం మానస స్యాదదానః...।
నానాచేష్టై ర్జలద లలితై ర్నిర్విశే స్తం నగేన్ద్రమ్.' మేఘ.
('నగేన్ద్రం కైలాసమ్.' టీక.)
'తస్యోత్సఙ్గే ప్రణయిన ఇవ స్రస్తగఙ్గాదుకూలాం।
న త్వం దృష్ట్వా న పున రలకాం జ్ఞాస్యసే కామచారిన్॥' మేఘ.
('తస్య కైలాసస్య' అని టీక.)

క. తటిదుత్సారితఫణభృ । త్పటలి నిరన్నంబు లయ్యుఁ దక్కవు బర్హుల్
నటన; మతిహర్ష హేతూ । త్కటలాభం బిడునె మది క్షుధ నీర్వట్టున్? 122

బర్హుల్ = నెమళ్లు, తటి...లిన్ - తటిత్ = మెఱపులచేత - ఉత్సారిత = తఱిమివైవఁబడిన - ఫణభృత్ = పాములయొక్క - పటలిన్ = సమూహముచేత, నిరన్నంబులు = అన్నహీనములు, అయ్యున్, నటనము = ఆటను, తక్కవు మానవు, మఱి = అట్లయిన, అతి...బు - అతి = మిక్కుటమయిన - హర్ష = సంతోషముయొక్క - హేతు = కారణముయొక్క - ఉత్కట = మెండయిన - లాభంబు = ప్రాప్తి, క్షుధన్ = ఆఁకటిని, నీర్వట్టున్ = దప్పిని, ఇడునె = కలిగించునా.

నెమళ్లకు పాములు ఆహారములు; ఆపాములు మెఱపులకు వెఱచి బొఱియలందు దాఁగినవి అందువలన నెమళ్లకు మేఁత లేకపోయినది. అట్లు పస్తులోనుండియు నెమళ్లు నటనము మానలేదు. అది ఎట్లన - అతిసంతోషకారణము కలిగినప్పుడు ఆఁకలిదప్పులు తోఁపవు. అట్లేవానికి మేఘోదయము, ఉఱుములు, మెఱుపులు, వానలుం గలిగినందున ఆఁకలి దోఁపలేదు. - అర్థాంతరన్యాసాలంకారము, విభావనాలంకారంబునుం గలదు

'కొమరుగ సామాన్య విశే । షము లన నర్థాంతరన్యసనభూషణ మా
ద్యుమణిని బాము గ్రసించున్ । గమలభవుని వ్రా లెవండు గడవఁగ నేర్చున్.' అలం.
'కారణములేక యుసకల । కారణమునకు బ్రతిబంధకంబుండ నత
త్కారణమునను విరుద్ధపుఁ । గారణమునఁ గృతి జనింపఁగ విభావన యా.' అలం.

సీ. (క). రవిఁ జూచి కుడుచువారలకును గృకలాస
ములకును వృష్టి మిన్నులలె నిలిచె;
(ఖ). సంధ్యార్ఘ్యదాయిద్విజశ్రేణి కిలు సేరు
మొదవులకును భ్రాంతి మది జనించె;
(గ). హాలజీవిసందోహములకు బలాకికా
విసరంబులకు మంచి వేదలు దొరకె;
(ఘ). నెలమిఁ బోల్పయయాధికలకు సంతలపాట
ములకును మఱి విచ్చుమొగ్గ లొదవె;
తే. (ఙ). నతిథిసంఘంబునకు నీనినట్టిగొనుచు
కడుపులేఁగలగుమికి వాకట్టు లెసఁగె;
(చ). మట్టమిన్నెలవారికి మడుపనులకు
నెలఁతఁ బాసినవారికి నిదుర చెడియె. 123

(క). రవిన్ = సూర్యుని, చూచి. కుడుచువారలకును = భుజించువారికి (సూర్యుని చూచి నకే గాని కుడుచనివ్రతము గలవారికి అనుట), కృకలాసములకును = తొండలకును, వృష్టి = చూడ్కి, మిన్నులనె = ఆకాశమునందె, నిలిచెన్ = ఉండెను;

పూర్వోక్తవ్రతవంతులు మేఘావరణము తొలఁగినదేమో సూర్యుఁడు పొడచూపుచున్నాఁడేమో కనుంగొనుటకు మింటిని మాటిమాటికి చూచుచుండిరి; ఈఋతువున నున్నతప్రదేశము లెక్కి సూర్యుని చూచుచుండుట తొండలకు సహజప్రవృత్తి; దీనిచేత ఆసన్నవృష్టి సూచితము; -

'తరుశిఖరోపగతాః కృకలాసాః । గగనతలస్థితదృష్టినిపాతాః
యది చ గవాంరవిపిశుఖ మూర్ధ్వం । ప్రపతతి వారి తదా న చిరేణ'. బృ. సం. 27 (8)

(ఖ). సం...కిన్ - సంధ్య = సంజతీఱయందలి - అర్ఘ్య = అర్ఘ్యోదకమును - దాయి = ఇచ్చువారైన - ద్విజ = విప్రులయొక్క - శ్రేణికిన్ = పఙ్క్తికిని (సమూహమునకు ననుట), ఇల్లుచేరు - మొదవులకునున్ = పాడియావులకును, మదిన్ = మనస్సునందు, భ్రాంతి = సంధ్యాకాలముయొక్క భ్రమము, జనించెను.

'శుచిర్వాప్యశుచిర్వాపి కాలే సంధ్యాం సమాచరేత్' అనువిధిచేత ద్విజులకు కాలమున సంధ్యవార్చుట ప్రధానముగావునను, పాడియావులు సంజవేళ దూడలకు పాలిచ్చుటకై త్వరపడుచుండునుగావునను, ఆధ్యానముచేతను సూర్యుఁడగపడమిచేతను ఆభ్రమ కలుగును.

(గ). హాల...కున్ - హాల = నాఁగటిచేత - జీవి = జీవించువారియొక్క (సేద్యగాండ్రయొక్క) - సందోహములకున్ = సమూహములకును, బలాకికావిసరంబులకున్ = బెగ్గురులసమూహములకును, మంచి వేదలు = అనుకూలమైన చల్లకములును (ఇవి హాలజీవులకు), గర్భాధానంబులును (ఇవి బలాకలకు), దొరకెన్ = లభించినవి.

సేద్యగాండ్రు భూమి తడిసియుండుటచేత చక్కఁగా దున్ని విత్తనములు చల్లిరి; బలాకలు వలపులేక మేఘములు వర్ధిల్లుచున్నందున చక్కఁగా గర్భముధరించినవి. - 'వేద' యనుశబ్దము తిర్య

జంతువుల గర్భాధానమునకే పేరుగాని మనుష్యాదుల గర్భాధానమునకు పేరుకాదు. 'బలాక' యే బలాకిక. 'సమూహ నివహవ్యూహ సందోహ విసరవ్రజాః' అమ.

(ఘ). మఱి = మఱియు, ఎలమిన్ = ఇంపుగా, పొల్పు అగు యూధికలకున్ = చెన్నారెడు నడవిమొల్లలకును, సంతలకూటములకును = సంతలకూడికలకును, విచ్చుమొగ్గలు = (మొల్లల పక్షమున) వికసిల్లుటయు - (సంతలపక్షమున) జనులు సంతవదలి ఎక్కడివారక్కడకి పోవుటయు, ఒదవెన్ = కలిగెను.

యూధికలు వార్షికము లని నిరూపితమే. 'కూటములు' - ఏ. వ. కూటమి - కూడుధాతువునకు కృదంతము.

(ఙ). అతిథి సంఘంబునకున్ = భోజనార్థమై ఒకరియింటికిం బోవు తెరువరుల సమూహము నకును, ఈనినట్టి - ఎనుప కదుపు లేఁగల గుమికిన్ = గేదెల మందయొక్క లేఁగదూడల మొత్తమునకును, వాకట్టులు = నోటికట్టులు, ఎసఁగెన్ = కలిగినవి.

వర్ష ప్రతిబంధకముచేత అతిథులు అన్నమిడుగృహస్థులయిండ్లకు పోలేక ఏచావడిలోనో పస్తు పడియుండిరి. గేదెల లేఁతదూడలు చలిక దవుడలును నాలుకయు జడనుపడినందున పాలు కుడుచుకొనలేక పస్తుండినవి.

'అతిథి' - 'స్యురావేశిక ఆగన్తు రతిథిర్నా గృహాగతే' అమ., 'అతతి గచ్ఛతీ త్యతిథిః' అని వైయాకరణులు; అస్థితిచే అతిథి యనఁబడు నని మనువు;

'ఏకరాత్రం తు నివస న్నతిథి ర్బ్రాహ్మణః స్మృతః
అనిత్యం హి స్థితో యస్మా త్తస్మాదతిథి రుచ్యతే.' 3 (102).

'కదుపు' = ఏకజాతి పశుపక్ష్యాది సమూహము; 'ఈనినట్టి' - దూడలు మిక్కిలి లేఁత వనుట.

(చ). మట్టిమిద్దెల వారికిని, మరుపనులకున్ = మదనవ్యాపారములకై, నెలఁతన్ = కాంతను, పాసినవారికిని,...

గచ్చుచేసిన మిద్దెలు వానకు ఉరయవు; మట్టిమిద్దెలలో క్రిందఁబరున్నవారిపై ఆమట్టితోడి వాననీళ్లు పడుచుండును. అందువలన వారినిద్ర చెడును. అన్ని ఋతువులలోను వర్షర్తువు ఎక్కుడుగా కామోద్దీపకము గావున ఆఋతువులో కాంతావియుక్తులకు నిద్రపట్టదు.

సీసమందలి ప్రతిపాదమందును గీతార్థములందును తుల్యయోగితాలంకారము, పద్యమున ఇ మాఱులువచ్చినది. సీసద్వితీయపాదమున భ్రాంతిమంతము కాదు, సాదృశ్యకారణముచేత ఒక వస్తువును మఱియొకవస్తువుగాఁ గొనుట భ్రాంతిమదలంకారముగాని భ్రమయెల్ల భ్రాంతిమదలంకారము కాదు.

'ఒకటనె ధర్మము నుడువుట । ప్రకృతములకె యితరములకు; ప్రగుణుల కెనచే
యుకథన; మఱిమిత్రులయెడ । నొక కేవర్తనము, తుల్యయోగిత నాఁగన్.
తొగ విరహివగయుఁ బ్రబలెన్ ,। మగువజిగికి మెఱుఁగు నెలయు మసకలు, నిచే
నగు దానమె చెలి కరికిన్ ,। దొగ చెలి మరుఁడీవు రూపఘుర్యులు భూపా.' అలం.

ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నా, మహా
కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,

హాలికు లెన్నఁడుం దెగనియౌరులచేలును జౌకుమళ్లునుం
గా లలి నేరు సాఁగి రిలఁ గల్గుపసిం గొని పేద మున్నుగన్. 124

కాలునిదున్న=యముని దున్నపోతు, నందిని అయి=(నేను) నందీశ్వరుఁడ నయి, గంటలు= అవురుదుబ్బులను, దున్నక, మంటిన్ = బ్రతికితిని, నాన్ = అనునట్లును, మహాకాలుని = శివునియొక్క - నంది - దున్నను అయి = (నేను) దున్నపోతనుగా నుండి, క...త - కర్దమ = బురదయందు - మగ్నత = దిగఁబడుట, లేక, మంటిన్ = బ్రతికితిని, నాన్ = అనునట్లుగా, హాలికులు = సేద్యగాండ్రు, పేద మున్నుగాన్ = పేదలు సయితము, ఎన్నఁడున్ = అంతకు పూర్వ మెప్పుడును, తెగని ఔరులచేలును = నాఁగటికి పెల్లగిల్లని యవురుగడ్డిగలపొలములును, జౌకు మళ్లునున్ = బురదకయ్యలును అగునట్లుగా, ఇలన్ = పుడమిలో, కల్గుపసిన్ = ఉన్నపసరము లను అన్నిటిని, కొని = పూంచి, లలిన్ = సంతోషముతో, ఏరు సాగిరి = ఏరువాక గావించిరి.

ఆసువృష్టులచేత పల్లపునేలలుమాత్రమే గాక మెఱకచేళ్లుగూడ మెత్తఁబడినందున, భూమి యెల్ల దుక్కికి అలవియైనది. అందువలన, మెఱకచేలైన యపరిమితపు దుక్కి యె ట్లుండెననఁగా:— యమునిదున్న తాను నందియై యుండెనేని సేద్యగాండ్రు తన్నుం బోలుకొనిపోయి నాఁగటికి కట్టి యవురుగంటలు దున్నింతురు, నందిని కానందున ఆకష్టము తనకుఁ దప్పినదనియు; పరమ శివునినంది తాను దున్నయై యుండిన తనచేత దమ్ము దున్నింతురు, అది కానందున ఆకష్టము తనకు తప్పినదనియు, సంతసించుచుండిన వనునట్లుగా ఎక్కడెక్కడి పసరములనుం బోలుకొనివచ్చి నాఁగటికి కట్టి దున్నుటలో ఎన్నఁడును నాఁగటికి తెగనియవురుగడ్డిదుబ్బుల పొలములను దున్ను టకు పరమశివునివాహన మయిననందినిం గూడను, దమ్ముదుక్కికిఁగాను యమునివాహనమయిన దున్నను సయితము, కొనిపోయికట్టి దున్నిరి;—అను నట్లుండెను.

దున్నలకు మెఱకదుక్కి కష్టము, ఎడ్లకు రొంపిదుక్కికష్టము. వెలిదుక్కికి ఎడ్లను ఎక్కడెక్కడివానిని హాలికులు తెచ్చుకొనువిధమును చూడఁగా నంది తన్నుంగూడఁ గొనిపోవుదురని భయపడునట్లును; రొంపిదుక్కికి దున్నలను కొనిపోవువిధము చూడఁగా యమునిదున్న తన్నుం గూడఁ గొనిపోవుదు రని భయపడునట్లును ఉండెను. భూమిలో నొక్కదున్న నేని ఒక్కయెద్దు నేని వదలక ఉన్నవానినెల్ల కట్టి దున్నిరని భావము. తన్నుం గొనిపోవుదు రని యీరెండును తలం చెనోయనునట్లు అనుట.—ఉత్ప్రేక్ష.

ఈబుద్ధిచే శ్రీయామునాచార్యులవార ధర్మపరిపాలనమును పాండ్యాదులు వైష్ణవులైనం దులకు తద్దేశముపై శ్రీహరికిం గలిగిన కృపాతిశయమును సూచితములు.

'హాలికులు' - 'ఖనతి తేన తద్వోఢా స్యేదం హాలిక సైరికౌ' అమ. (హలముతో త్రవ్వెడు వాఁడు అని వ్యు.). 'గంట యనఁ బైరుదుంపయు ఘంట యొప్పు' ఆం. భా. నానా. (53). 'వీరణాభిద మౌరునా వెలయు' ఆం. భా. 2 (75).

క. వరఁజూబడి రొంపిఁ ద్రొక్కఁ, | జరణంబులఁ జొట్టి పసిఁడి చాయకడుపులం
బొరి సీరుకట్లు లమరెను, | బిరుదులు హాలికులు దున్నఁ బెట్టిరొ యనఁగన్. 125

హాలికులు = నాఁగటితో దున్నెడు వాండ్రు, దున్నన్ = దున్నుటకు, బిరుదులు = ఉత్కర్ష చిహ్నములైన పెండేరములను, పెట్టిరో = తొడిగినారో, అనన్ = అనునట్లుగా, (రొంపి

దుక్కిలో), పరఁజూబడిన్ = గనిమ వెంబడి, రొంపిన్ = బురదను, త్రొక్క = త్రొక్కఁగా, నీరుకట్టెలు = నీరుతుట్టపాములు, చరణంబులన్ = హాలికులపాదములకు, చుట్టి = చుట్టుకొని, పసిఁడి చాయకడుపులన్ = బంగారువన్నెగల కడుపులతో, పారిన్ = మిక్కిలి, అమరెన్ = ఒప్పారెను.

హాలికులు రొంపిదుక్కిలో గనిమ వెంబడి దున్నుచుం బోవుచుండఁగా, నీరుకట్టెపాములు వారిపాదములకు చుట్టుకొన్నవి. వానికడుపులును బంగారువన్నెగా నుండెను; అవి కడుపు వెలికగపడునట్లు చుట్టుకొనెను. ఆస్థితిలో అవి యెట్లుండెననఁగా - ఆహాలికులు దున్నుటలో తమకు సాటిలేరని ధరించిన బంగారపు గండపెండేరములో యనునట్లుండెను.—ఉత్ప్రేక్ష. ఆహాలికులు దున్నుటలో కరము నేర్పరులనియు, హాలికులు సయితము బంగారపుఁ బెండేరములు ధరింపఁగలిగినంత సుభిక్షముగా ఆదేశము ఒప్పుచుండెను, అనియు, భా.

'పరఁజూబడి' - నీరుతుట్టెలు గనిమవెంబడి నంటుకొనియుండును; రొంపిలోనే ఉండును. మెట్టపొలములలో నుండవు. 'బిరుదు' - బిరుదశబ్దమునకు వైకృతము.

క. నాని శిఖ వంటచెఱకుల । చే నఱి, నవి వెండి వంటచెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కుల। బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి పొగయమి వృష్టిన్.

శిఖి = నిప్పు, వంటచెఱకులచేతన్ = (తడిగల) వంటకట్టియలచేతను, నాని = తడిసి, అఱన్ = నశింపఁగా (ఆఱిపోఁగా), అవి = ఆవంటచెఱకులు, వెండి = మఱి (ఆలోచింపఁగా), వంటచెఱకులే = బెల్లము వండుటకుఁ దగినరసముగల యిక్షువులే అగుటచేత (వానిని ప్రొయ్యిలో నుంచుటచేత), ప్రొయ్యి, పొగయమిన్ = రాఁజనందున, ప్రజకున్ = జనులకు, బోనములు = భోజనములు, జక్కులబోనంబులె = విష్ణుపాద్భవులయిండ్ల వివాహోద్యుత్సవసమయములందు జక్కులవాండ్రు శూన్యంపుటరవేణికుండలను నెత్తినుంచుకొని 'బోనాలో బోనాలో' యని పల్కుచుం బోవు నబద్ధపు బోనములుగా నుండెను.

వర్షములలో వంటచెఱకులు ఎందువి దొరకక బెల్లపువంటకై మంచి రససమృద్ధిగల చెఱకుగడ లనునర్థముచే సన్యార్థము లయినతడివంటచెఱకులే దొరకఁగా, వానిచేత ప్రొయ్యి రాఁజుటకు బదులుగా నిప్పు ఆఱిపోఁగా, ప్రజలకు బోనములు జక్కుల బోనము లాయెను, అనఁగా లేకపోయెను.—సముచ్చయాలంకారానుప్రాణితమైన మిథ్యాధ్యవసిత్యలంకారము.

క. 'యోగముచే నామములకు । బాగగు నన్యార్థకల్పి పరఁగు నిరుక్తిన్;
ఈగతి వేఁపుదు వీవు వి । యోగుల దోషాకరాఖ్య యొప్పఁగ నీకున్?' అలం.

క. 'మిథ్యాధ్యవసితి కించి । న్మిథ్యార్థసాధనకు సమీహా పాదమినన్
మిథ్యార్థాంతర మల్లుట । మిథ్యయె త్రయి నీవు నన్ను మించెద వేనిన్.' అలం.

సీ. ఇల్లిల్లు దిరిగ నొక్కింత యిబ్బు శిఖి; యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులుకొ ల్పావాలఁ
గాని కల్గదు;మఱి దానఁ గలిగె

నేని కూడగుట మం; దైనఁ బెన్పొగ సుఖ
భుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న;
తే. మాజ్యపటముఖ్యలయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్న రంతిక; కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బడుక మఱఁడు
వెడవెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహులు. 127

ఆజ్జడిని = ఆవర్షములయందు, ఇల్లు ఇల్లు = ప్రతియిల్లు (ఎన్నియోయిండ్లకు), తిరుగన్ = పోయిన, శిఖి = నిప్పు, ఒక్కింతి = కొంచెపాటి, అబ్బన్ = దొరకును, అబ్బెనేని = అబ్బినప్పటికిని, ఇంటిపూరి = ఇంటికప్పులోనిగడ్డిని, ఇడి = ఆనిప్పులేశముమీఁదఁబెట్టి, విసరక = విసరిననేగాని, రాఁజదు = పొగరాదు, రాఁజినన్, రవులుకోలు = రగులుకొనుట, వాసాలన్ గాని = ఇంటివాసములు విఱిచి ప్రొయిలో పెట్టిననేగాని, కల్గదు, మఱి = పిమ్మట, దానన్ = అట్లు వాసాలు విఱిచిపెట్టుటచేత, కలిగెనేని = రగులుకోలు అయినచో (రగుల్కొనినయెడల), కూడగుట మందు = అన్నము పచన మగుట దుర్ఘటము, ఐనను = అన్నమాయెనేని, పెనుఁబొగన్ = అధికధూమముచేత, సుఖభుక్తి = సుఖముగా భుజించుట, చేకూరదు = సమకూరదు, ఆభుక్తికిన్ = ఆయసుఖభోజనమునకు, ఇడినన్ = పెట్టఁగా, బహుజన అన్నము = పలువురికై వండినవంట, ప్రాగ్భోక్తలకె = తొలిపంక్తివారికే, తీఱున్ = అయిపోవును, తీఱన్ = అట్లు అయిపోఁగా, నారులకున్ = స్త్రీలకు, పునఃప్రయత్నము = మరలవంటచేయుట, ఒదవున్ = సంభవించును, (ఆనారులు), అంతికకున్ = ప్రొయ్యికై, ఆజ్యపటముఖ్యలయము= నేతిగుడ్డలులోనగువాని నాశము, ఎన్నరు=గణింపరు, ఆలయ అంగ దారు లయము=ఇంటి యవయవము అయిన కొయ్యల నాశమును, ఎన్నరు, ఆ...ణి - ఆరజనిక = రాత్రివఱకును - పచన = ఇతరులకే వండుటచేత, న అంధస్ = అన్నములేని - గృహిణి = ఇల్లాలు, రామిన్ = పడుకకురానందున, మఱఁడు = మన్మథుఁడు, పడుకన్ = శయనమందు, వెడవెడన్ = వెక్కిరించుచునే, ఆర్పన్ = ఆడింపఁగా, గృహులు = గృహస్థులు, నొగిలిరి = నొచ్చిరి.

ఆవర్షములయందు స్త్రీలు వంటకై పడుపాట్లను చెప్పుచున్నాఁడు.—ఎన్నియో యిండ్లకు తిరిగిననేగాని యించుకనిప్పు దొరకదు, దొరకినదిపో, ఇంటియొందుపూరి పెట్టక అది రాఁజదు; పూరిపెట్టం దామసించిన అది యాఱిపోవును: రాఁజినను ఇంటివాసాలు ప్రొయ్యిలో పెట్టిననేగాని ఆనిప్పు రగుల్కొనదు, రగుల్కొన్నను దానిచే అన్నము పచనముగాదు: అయ్యెనేనియు, ఆయన్నము క్రొత్తవారెవరైన వత్తురోయని పలువురకై చేసినదేయైనను తొలిపంక్తికే సరిపోవుటచేతను, స్త్రీలు తమయాఁకటికై వెండియు రాత్రిపడువఱకు వంటచేసికొనుచుందురు. ఆవంటలో ఇంటియంగము లగు కొయ్యలను సయితము ప్రొయిలోవైచుటకు వెనుదివియరు. గుడ్డలను నేతిలోఁ దడిపి ప్రొయిలో వైతురు. పిమ్మట వారికి ఎంగిళ్లెత్తుట, ఇల్లుశుద్ధిచేసి అలుకుకొనుట, (అంట్లు తోముకొనుట), తలుపులు వేసికొనుట, లోనగుపనులచే ఎంతరాత్రికిని తనభోజనము కానందున

ఇల్లాలు పడుకను రానందున మగఁడు వెడవెడ నాడించుచున్నందున గృహస్థులు వేదనంబడిరి. - స్వభావోక్త్యలంకారము.

క. 'పన్నిన జాత్యాదికసం । పన్న మగుస్వభావ మా స్వభావోక్తి యనన్;
తిన్నఁగ ఱిక్కించి చెవుల్ । గన్నులు సుడియంగ నన్నుఁ గనియె మృగంబుల్.' అలం.

ఏకావళ్యలంకారంబునుం గలదు.—

క. 'ఏకావళి యర్థావళి । కైకొన ధృతముక్తభంగిఁ, గనుసీరజముల్
ఆకర్ణంబులు, కర్ణము । లాకలితభుజములు, భుజము లాజానువు, లా
యాకృతిచే జానువులు ని । రాకృతమణిదర్పణంబు లానరపతికిన్.' అలం.

ద్వి. తృ. పాదములం బాఠభేదము: - 'రవులు కొల్పానలెకాని కల్గదు కూడు దానఁగలిగ నేని కూరగుట మందగు.' 'కూడు' - అట్లు సిద్ధమైనయన్నము సౌష్ఠవహీనంబును వ్యంజనాదిహీనంబును అగుటచే దానిపై తిరస్కారముగాన 'కూడు' అనుట. 'బహుజనాన్నము ప్రాగ్భుక్తలకే తీఱుట' - వారికి భోజనకాలము అతీత మగుటవలనను, పూర్వదినమందును మంచిభుక్తి లేమియే ప్రాయికము గావునను, ఆఁకలి మెండగుటం బట్టియు, అయిల్లాండ్రు వీరికి తృప్తిగాఁ బెట్టుదు రేగాని, తమకు మిగుల దని చూడరు గావునను, ఆకస్మికముగా భోజనసమయమున వచ్చిన యతిథులకుం జుట్టాలకును పెట్టుటచేతను. 'అశ్నన్తు ముద్ధాన మధశ్శ్రయంచ మల్లికస్తికా' అను. 'భిస్సా స్త్రీ భక్తమన్ధోన్న మోదనోఽస్త్రీ సదీదివిః' అమ. 'అర్వన్' - 'అషోడశకూడుల తకారంబునకుం జక్కుపరంబగునపుడు రేఫంబగు. బా. వ్యా. క్రి.

చ. పిడుగుల కల్కి లోఁ దోలఁచి భీరులు కంచముఁ, జల్లుదీధితు
ల్గడపల వెళ్ళరాఁ, బొగలకావిరి క్రుంగిన పుల్లగృహంబు లె
ల్లెడఁ గనుపట్టె నీళ్ల నిలయెల్లను ముంచి రసాతలంబుపై
విడియఁగ దండు డిగ్గనసవిద్యుదురుస్తనయిత్నులో యనన్. 128

భీరులు = భయస్వభావలగుస్త్రీలు, పిడుగులకున్ అలికి = వెలువలపడుచున్న పిడుగులకు భయపడి, కంచమున్ = భోజనపుఁగంచుపాత్రను, లోన్ = ఇంటిలోపలనె, తోలఁచి = కడిగి, జల్లు దీధితుల్ = ఆకడిగిననీరు గడపవెలుపలికి పాఱఁబోయు (నప్పుడు పిసాళించు) కంచుపుఁగాంతులు, కడపలన్ = దేహళులనుండి, వెళ్లరాన్ = బయటికి దాఁటిపడఁగా, పొగలకావిరిన్ = ధూమములయొక్కనలుపులో, క్రుంగినపుల్లగృహంబులు = మునిఁగియున్న పూరియిండ్లు, (ఎట్లు కనుపట్టె ననఁగా), నీళ్లన్ = జలములతో, ఇల ఎల్లన్ = భూమినంతయు, ముంచి, రసాతలంబుపైన్ = పాతాళము మీఁద, విడియఁగన్ = పోయిపడుటకై - దం...లో = దండు డిగిన, (మధ్యదారిలో) ససైన్యముగా మజిలీ చేసినట్టి - సవిద్యుత్ = మెఱుపులతోడి - ఉరు = గొప్ప - స్తనయిత్నులో = మేఘములో, అనన్ = అనునట్లు, ఎల్లెడన్ = ఎల్ల తావులందును, కనుపట్టెన్ = కనఁబడినవి.

భయస్వభావలైన కోమలులు, అక్కడక్కడ పడుచున్న పిడుగులకు భయపడి, కంచములను తోలఁచుటకు ద్వారము వెడలిరాక, ఇంటిలోపలనె వానిని తోలఁచి, వెలికి ఆతోలఁచిన నీటిని, విసరి పాఱఁబోయునపుడు, తీండ్రించిన యాకంచములకాంతులు ద్వారములవెలికి వచ్చు

చుండఁగా, పొగలనలుపులో మఱుఁగియున్న పూరియిండ్లు ఎల్లచోట్లను ఎట్లుండిన వనఁగా, నీళ్లచే పుడమియెల్ల ముంచి, యిఁక పాతాళమును ముంచుటకై పయన మేఁగుచు నడుమ సస్యైన్యములుగా విడిసినట్టి మెఱపులతోఁడి గొప్ప మేఘములో యనునట్లుండెను:—ఉత్ప్రేక్ష.

భూలోకమునకెల్ల వాన పెల్లుగాఁ గురిసిన దనుట - పొగ గప్పినపూరియిండ్లు మేఘములవలెను, కంచముల దీధితులు మెఱుములవలెను, ఉండెను. భీరువులుగాన ఎక్కడనో పడుచున్న పిడుగులకు భయపడుట, ఈభీరువులు మబ్బును పగిల్చుకొని వెలువడక లోలోపలనె మెఱయుచున్న విద్యుదంశములు, కంచములకాంతులు మబ్బునుండి వెలువడిన విద్యుదంశములు. తోలఁచిన కంచమునకు కాంతి హెచ్చు. 'కడపల' - ద్వారమునుండియే వెళ్లవచ్చినను కూర్చుండియో వంగియో యుండి పోయుదురు గావున ఆనీరు కడపకే చేరువుగా వెలువడుటం బట్టి కడప అనుట; పుల్లపాంబులు పొగ గ్రమ్మిన ట్లుండుట స్వభావోక్తి. 'దండుడిగ్గిన' - దండుతో విడిసిన అనునర్థముగా రెబ్బపల్లవము. 'పిశేషాస్త్వజ్ఞనా భీరూః కామినీ వామలోచనా' అమ. 'వెళ్లు' - దీనికి 'వెడలు' తోంటిరూపము. - 'అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్.' అమ.

చ. గొడుగుల గాలిఁ గూల్చి, మఱి కోలలతోడనె పాఱ, నాన్చి జే
డ్వడ జడి మేఘుఁ; డక్కట పాంథులపైఁ దన కెంతవైరమో?
తడిసిన మేన నింక యది దాఁ బ్రియవియోగజవహ్నిఁ గొంత కొం
తుడిపె, విధాతరక్ష విష మొక్కొకమా టమృతంబు సేయఁగన్. 129

మేఘుఁడు, గొడుగులన్ = పాంథుల ఛత్త్రములను, గాలిన్ = వాయువుచేత, కూల్చి = ఎగురఁగొట్టి, మఱి = పిమ్మట, కోలలతోడనె = వట్టికాములతోనే, పాఱన్ = ఆపాంథులు పఱతెంచుచుండఁగా, జడిన్ = వానచేత, చేడ్వడన్ = చేఁగుందునట్లుగా, నాన్చెన్ = నానఁజేసెను. అకట = అయ్యో పాపము, అట్లు = ఆవిధముగా (చేయుటకు), తనకున్ = మేఘునికి పాంథులపైన్ = తెరువరులమీఁద, ఎంత - వైరమో = ద్వేషమో; (అయినను), తడిసినన్ = అట్లు నానఁగా, అది = ఆజడి, మేనన్ = దేహమందు, ఇంకి = దిగి, విధాతరక్ష = బ్రహ్మచేయు సంరక్షణము, ఒక్కొకమాటు = కొన్నిసమయములలో, విషమున్ = (చంపునదైన) గరళమును, అమృతంబు = (బ్రదికించునదైన) సుధగా, చేయుటన్ = కావించుటం బట్టి, దార...హ్నిన్ - దార = భార్యతోడి - వియోగ = ఎడఁబాపువలన - జ = పుట్టిన - వహ్నిన్ = చిచ్చును, కొంత, కొంత = ఒకపాటిగా, ఉడిపెన్ = తగ్గించెను.

జడిలో పాంథులపాట్లను వర్ణించుచున్నాఁడు. - ఎంతత్వరలోఁ బోయి ప్రియసింగలయుదునా యని ఆతురపడుచు వియోగిబాటసారి వానలో గొడుగువైచికొని దారి నడచుచుండఁగా మేఘుఁడు పాంథులపై పగఁబూనినవాఁడుంబోలె, ముందుగా వారి గొడుగుకప్పులను గాలిచే ఊడఁగొట్టి యెత్తుకొని పోయి దూరాన పాఱవైచినాఁడు; పిమ్మట వట్టికాములతోనే పోవుచుండఁగా, ఒడలెల్ల నీళ్లలో నానిపోవునట్లు జడి గురిసినాఁడు; కాని బ్రహ్మదేవుఁడు రక్షించువిధములో విషమునయితము ఒక్కొక్క సమయమందు అమృతముగానే పరిణమించును గావున, ప్రకృతమందు వారికి ఆజడి మేలే చేసినది; ఎట్లన అది వారిదేహములలో ఇంకి ప్రేయసీవియోగాగ్నిని ఒకపాటి ఆర్పినది.

ఇందు 'ఎంతవైరమో' అనుచోట ఉత్ప్రేక్షయు, మేఘుఁడు పాంథులను పీడింప నెంచి చేసిన చెఱుపు వారికి మేలే యగుటచే విషమాలంకారభేదమును, పాంథపరమైనవిశేషమునకు తుదిని సామాన్యమును చెప్పుటచే అర్థాంతరన్యాసంబును గలవు:—

'ఇష్టముకై యత్నింపఁగ । నిష్టము గలుగమియును ననిష్టసంప్రాప్తియునున్.' అలం.
అని యొక విషమభేదము. ద్వేష్యుఁ డయిన పాంథునికి అనిష్ట మనితలంపఁదగును.

'కొంత కొంత' - అటుగాక నీళ్లకే శమించు వియోగవహ్ని ఏపాటిది? 'విధాతరక్షు విష ముక్కొకమా టమృతంబుసేయుటన్' - ఇందులకు సంవాదము:—

'స్రగియం యది జీవితాపహా హృదయే కిం నిహితా న హన్తి మామ్?
విష మప్యమృతం క్వచి ద్భవే దమృతం వా విష మీశ్వరేచ్ఛయా.' రఘు. 8(46).

'దారవియోగ' - 'దారాఃపుంసి చ భూమ్న్యేవ' దారశబ్దము పుల్లింగమును నిత్యబహు వచనాంతంబును. - 'రక్షు' - చేయుటకు కర్త.

తే. దవులఁ జల్లని తూఱ నంతక మునుపటి
జల్లునీ రూని వచ్చునాజల్లు, మొదలి
గాలి యొలగోలుచేఁ గొమ్మగదలి జల్లు
దలపడకమున్న వంగుళ్లఁ దడిపెఁ దరులు. 130

దవులన్ = దూరమందు, జల్లు = వానవచ్చుచున్నది, అని, తూఱన్ = (చెంతనున్న చెట్ల క్రింద) చేరఁగా, అంతక మునుపటి జల్లునీరు = అంతకు మునుపే కురిసినజల్లుయొక్క జలమును ఊని = వహించినదై, వచ్చునాజల్లు మొదలిగాలి యొలగోలుచేన్ = దూరాన వచ్చుచున్న యా జల్లునకు ముందుగా వచ్చు గాలియొక్క దెబ్బచేత, కొమ్మ గదలి, తరుల = చెట్లు, జల్లు = దూరానవచ్చుచున్నయాజల్లు, తలపడకమున్న = కురియ దొరకొనకముందే, వంగుళ్లన్ = నీటి బొట్లతో, (పాంథులను) తడిపెను.

తెరువరులు మింట దూరమునుండి జల్లు దిగనుండుటం గాంచి, అవలచె క్షేమియు లేనందున ఆజల్లులో తడియవలసివచ్చు నని ఊహించినవారై, తా మున్నచోటనే చెట్లుండఁగా వానిక్రింద ఆజల్లునఁ దడియకుండుటకై చొచ్చిరి. ఇంతమాత్రాన వారి కెక్కువ మేలు కలుగలేదు, ఏలన ఆజల్లు రాకముందే తత్పూర్వము వచ్చిన జల్లులనీరు కొమ్మలందుండినది; ఇప్పుడామూరపు జల్లునకు ముందు వచ్చుచున్నగాలిచే ఆకొమ్మలు కదలఁగా అందున్న పూర్వపు జల్లుయొక్క జలము వారిపై వంగుళ్లుగా రాలి వారిని తడిపినది. ఇందు స్వభావోక్తియు నొకవిషమభేదముం గలవు.

'వంగుళ్లన్' - 'తే. వాన వెలసియుఁ జూరునఁ బడిననీరు । బొట్లు వంగుళ్లు నాఁగ నట్లొట్లు నాఁగఁ । బేరులు వహించు నొర కర్పూరగౌర.' ఆం. భా.

చ. రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై, విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాధిని
ర్ణయముల మొత్తులాడుదురు, ప్రబ్బక యింతయు విప్ప విచ్చుమొ
గ్గయి మఱి పాసిపోదురు సమస్తదిశాగతులైనయధ్వగుల్. 131

సమస్త దిశా ఆగతులు = ఎల్ల దిక్కులనుండియు వచ్చినవారు, ఐన - అధ్వగుల్ = తెరువరులు, వృష్టికై = వచ్చుచున్నవానకై, రచ్చలపైన్ = రచ్చచావడులయందు, రయమునన్ = వేగముగా, ఒరఁగి = ఇమిడికగా (చేరి, పిమ్మట వృత్తాంతములం జెప్పఁగొనం దొడంగి), ఉగ్రతన్ = ఆగ్రహముతో, హయపతిమీఁదన్ = అశ్వపతిమీఁద, దంతిపతిన్ = గజపతిని, అతనిపైన్ = ఆగజపతిమీఁద, నృపతిన్ = నరపతిని, విధియింతురు = చెప్పుదురు, గజ ఆది నిర్ణయములన్ = ఏనుఁగులు గుఱ్ఱములు కాల్బలము ఇత్యాదులయొక్క సంఖ్యను నిర్ణయించుటలో, ముత్తులాడుదురు = కొట్టుకొందురు, మ్రబ్బు = మేఘము, ఒకయింతయున్ = కొంతపాటియేని, విప్పన్ = చెదరిపోయినయెడల, మఱి = వెంటనే, పాసి = ఒండొరులను విడి, పోదురు.

నానాదేశపుబాటసారులును మేఘము వర్షింపం దొడంగినా, తటాలున ఒకరచ్చచావడిలో ఇముడుకొనియుండి, అటుపై లోకవృత్తాంతములు భాషింపం దొడంగి, అశ్వపతికన్న గజపతి గొప్పవాఁడనియు, గజపతికన్న నరపతి గొప్పవాఁడనియు, పట్టుదలతో పలుకుదురు. వారివారి గజాది సంఖ్యలు నిర్ణయించుటలో ఒకరుచెప్పినసంఖ్య నొకరు కాదని వాదించి కొట్టుకొందురు. ఇంతలో మేఘము కొంచెము చెదరెనా, ఒండొరులంబాసి ఎవరిదారిని వారు పోవుదురు.—'స్వభావోక్తి.'

'రచ్చలపై' - పై యనుటచే కప్పులేనిచావళ్లు గావలయు, కప్పు ఉన్నను గోడలు ఉండవు. 'హయపతి' - ఆగ్రాప్రభువు; దంతిపతి = కటకరాజు; నృపతి = నరపతి; 'నరపతివిజయము' గనునది. - 'అధ్వనీనోధ్వగోధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి.' అమ. ఇట పూర్వముద్రణములో 'మ్రబ్బు' అనుటకు మాఱుగా మబ్బని యున్నది, అందువలన యతిభంగము. ఆశబ్దమునకు రెండు రూపములుం గలవు. చూ. శ. ర.

క. తనరె బలిభుక్తతులు నిం । డిన గ్రామశ్రీల కళితినీలము లగుటం
గనియెం దృణగ్రాహిత ననఁ । గొనుకసవులఁ జైత్యతరుల గూండ్లిడు భ్రమణన్.

బలిభుక్ తతులు = కాకుల సమూహములు, చైత్యతరులన్ = రథ్యావృక్షములందు, గూండ్లు ఇడు భ్రమణన్ = గూండ్లు కట్టుకొనుటకై సంచరించుటయందు, కొనుకసవులన్ = (నోటం) గొనిపోవునట్టి తృణములచేతను, నిండిన గ్రామశ్రీలకున్ = సంపన్నులయిన గ్రామలక్ష్ములకు, అళితి నీలములు = కంఠంపునీలమణులు, అగుటన్ = అగుటచేత, తృణగ్రాహితన్ = కసవును గ్రహించెడుభావమును, కనియెన్ = పొందినవి, అనన్ = అనునట్లుగా, తనరెన్ = ఒప్పెను.

వర్షర్తువున కాకులు కసవుతోను పుల్లలతోను గూండ్లు కట్టుకొనును. అట్లు గూండ్లు కట్టుకొనుటకై అవి కసవును గఱచుకొని పెద్దవీథులందలి చెట్లమీఁదికి రాకపోకలు సేయునప్పుడు, ఎట్లు ఒప్పారెననఁగా - తాము భాగ్యవంతురాండ్రయిన గ్రామలక్ష్ములకు మెడలోనిహారంపునీలములు అగుటచేత తృణగ్రహణము సేయుచున్నవో యనునట్లుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

“ధ్వాఙ్క్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసా అపి' అమ. 'చైత్య మాయతనే బుద్ధబిమ్బే చోద్దేశపాదపే' విశ్వ. నీలములు తృణమును ఆకర్షించును. 'అళితి' - అల్లు శబ్దము. 'గ్రామశ్రీలకున్' - 'లక్ష్మీసంపదలకు' అభేదము కవిసమయము.

'కమలా సంపదోః కామధ్వజే మకరమత్స్యయోః...
దానవాసురదైత్యానాం మైక్యమేవాభిసమ్మతమ్'. శా. క. ల.

తడియగును, పైట నుంచిన నది క్రిందికి కూలి అడుగై లోనసయితము తడిసి పోవును; 'గుడిసె' - ఇది 'గొడుగు' అని యుండవలయును. గ్రంథవిస్తరభీతిచే ఉపపత్తిని సంక్షిప్తముగాఁ జెప్పెద; అంబటిచేయి బరువయి నొప్పికలిగిన రెండవచేతికి గొడుగును గాలిలో మోచుకొనిపోవుట కష్టము. గొడుగుం దాల్చిన ఒకచేయి దాని కర్పిత మగును, అంబటిని మార్చుకొనుటకు ఆరెండవచేత గొడుగుండుటవలన శక్యముగాదు. గొడుగు తానుగా తానే తలమీఁద అని నిలువదు. గూడయేని యీకష్టమేమియు నుండదు. దానిం దాల్చిన రెండుచేతులు స్వాధీనముగానే యుండును. కావున 'గొడుగుమోవక' అని పఠించుకొనుట శ్రేయము. గుబ్బెత లగుటచేతనే పిసికిళ్లు గలుగును. 'పునాసలు' - జొన్నలు చోళ్లు సజ్జలు లోనగు ధాన్యములు. సూర్యుఁడు పునర్వసు నక్షత్రములో నుండఁగా చల్లునవి గావున వానికి ఆపేరు. అవియిప్పుడు కాపు కాచుచున్నపంటకు ముందేపండినవి. పునాసకంకులను నలిపి ఊచబియ్యమును రాల్చుచున్నా రని భా. ఇప్పుడు కాచుచున్నవి వరిచేలు. 'పిసికిళ్లు' - ఇది నిత్యబహువచనాంతము; 'నులుచు' నుండి 'నులిపిడి' ంబోలె 'పిసుకు' నుండి 'పిసికిడి' అని ప్రాతిపదికమును కల్పించుకొనవలయును.

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం జింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ, గట్టావికుట్టారుగో
గిరము ల్మెక్కి, తమిం బసుల్వొలము వోఁ గ్రేఁపు ల్మెయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రె డ్లజ్జడిన్. 134

ఆజడిన్ = ఆవర్షములో, రెడ్లు = రెడ్డి అనుబిరుదు గలకాఁపులు, ప్రభుత్వ ఏక ఆప్తిన్ = దొరతనముయొక్క ముఖ్యప్రాప్తిచేతను, గురుగున్ = గురుగాకును, చెంచలిన్ = చెంచలి యాకును, తుమ్మిన్ = తుమ్మియాకును, లేఁదగిరిసాకున్ = లేఁత తగిరిసయాకును, తింత్రిణీ పల్లవ ఉత్కరమున్ = చింతచిగురు మొత్తముతో, కూడన్ = చేర్చి, నూనియలతోన్ = తిలతైలసమృద్ధితో, పొరంటి = నీ రిగురఁ బొగిచి వండి, కట్టా...ల్ - కట్టావి = వేఁడివేఁడిగానున్న - కుట్టారుగ ఓగిరముల్ = చిన్నారుగ బియ్యపుటన్నమును, మెక్కి = తృప్తిగా భుజించినవారై, పసుల్ = గొడ్లు, పొలము = పొలమునకు, పోన్ = పోయియుండఁగా, క్రేఁపుల్ = దూడలు, మెయిన్ = (రెడ్ల) దేహమును, నాకన్ = నాకుచుండఁగా, మేఁక ఎరువుకుంపటిమంచము = మేఁక యెరువుతో రాఁజుచున్న కుంపటితోడి మంచమును, ఎక్కిరి.

ఆవర్షములలో రెడ్డిదొరలు నిశ్చింతమైన స్వతంత్రభూజీవనము కలవారై సుఖముండు వృత్తమును వర్ణించుచున్నాఁడు:-అప్పుడు వారు చిన్నారుగయన్నమును గురుగాకు చెంచలాకు తుమ్మియాకు లేఁతతంటెపాకు అనెడియాకులతో చింతచిగురు చేర్చి సమృద్ధిగా నూనె పోసి కూరలు కలుపుకొని తృప్తిగా భుజించినవారై, క్రిందమేఁకెరువుతో కుంపటి రాఁజుచున్నమంచముపై పరుందురు. సేవకులు వీరి పశువులను పొలములకు మేఁతకై తోలుకొని పోవుదురు. దూడలు వీరిదేహమును నాకుచుండును. అట్లు అవి నాకుట వీరికి అలవాటును, హితమును. - స్వభావోక్తి.

'గురుగు' లోనగునాకులన్నియు ఒక్కటిగానే వండుదురా? వేఱువేఱుగా నాలుగు కూరలా? యనిన, వెవ్వేఱయిన అన్నిటను చింతచిగురు వేయరు; రుచిభేదమునకై కొన్నిట మానుదురు. ఇం దొకటియేని చింతచిగురులేక రుచింపదు, కావున ఒక్కటే కూర యని యెఱుంగవలయు.

ఇది దప్పళమువలె పులుసుం గాదు, ప్రప్పువలె తీపుం గాదు, ఆ రెండింటి బదులు ఇది యొక్కటే. దీనిని అత్యంతరుచ్యముగాఁ జేయునది నూనెతో పొరంటుట. 'నూనియలతో' అను బహువచనము సమృద్ధిని తెలుపును. రెడ్డిదొరలకు సమృద్ధి గాక యేమి కొదువ? సామాన్యపుఁగృషీవలులైన నూనె చూపకయో చూపియుం జూపకయో ఉడుకవైచికొని తినుదురు; నేయియేలగాదు? నూనెచే రుచి కరము హెచ్చును; దేహమునకు బలమునుం కలుగును. ఆరుగయన్నము తిననేల? రాజనములోనగు శ్రేష్ఠ ధాన్యములను పండించువారు తామే వానియన్నమును మాని ఈపాడు బియ్యపుటన్నముం దిననేల? అనిన - రుచి యెఱుఁగని నాజూకు లేని అనాదిసిద్ధమైన మోటుఁదనముచేతను, లోభముచేతను. 'కట్టావి' - కడు + ఆవి. 'కట్టారుగ' - కఱు + ఆరుగ. 'కఱు చిఱు కడు నడు నిడు శబ్దముల డల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగు.' బా. వ్యా.

'లేఁతతగిరిస' - ముదిరెనేని భోజనమునకుఁ బనికిరాదు. 'ఓగిరంబులు' - అని సౌష్ఠవసూచకమైన శబ్దముం బ్రయోగించుటచే వారికి ఆభోజనము ప్రియముగాను రుచిమంతముగాను ఉన్నదనుట ద్యోతితము. - 'ఓగిరంబులు మంచి మేలోగిరంబు లాశటించెదఁ బదఁడు మీరారగింప' శ్రీకాళ.మా. 'మెక్కి' - ఇష్టముగా తృప్తిగా భుజించి యనుట - హేళనముకై యీ పదముం బ్రయోగించుట. పశుప్రాయు లనుట యగునుగాన 'మేసి' యని పఠంచుట సరిగాదు. 'మేఁకెరువుంగుంపటి' - మేఁకది సర్వము అత్యంతారోగ్యకరము—ముఖ్యముగా క్షయరోగనివారకము; ఆకుంపటి మండక ఆఱక హితమితోష్ణముగా రగులుచునే యుండును; దానివలన చలి పోయి ఇంచుక వేఁడి కలిగి హాయిగా నిద్రపట్టును. వారికి మేఁకల సమృద్ధియుం గల దనియు సూచితము; వరిపొలములు లోనగువానికి ఎరువుకట్టుటకై రెడ్లు మేఁకలమందలను ఉంచుకొందురు. 'మెయిన్నాక' వానకుఁ దడియకుండ దూడలను మంచముకడకే పిలుచుకొందురు. అవి మంచము మీఁది వారియొడలిని నాకుచుండును; అలవాటులేనివారు సహింపలేరు. 'క్రేఁపులు' - ముఖ్యముగా పాఁడియావుల దూడలు; తల్లితోడఁ దోలినచో ఇవి నిరంతరము పాలు కుడుచుచునే యుండును, అది వానికి మంచిదిగాదు: పైగా ఇంటివారికి పాలుండవు, కావున వీనిని ఇంటనే కట్టుట. 'పసుల్' - పా. కొమల్ - ఆపక్షమున పైరుపంట గొడ్డుగోద విచారించుటకు రెడ్డిసానులే పొలమునకుం బోవుచుండి రని భావము.

సీ. గుఱు గటం చన్నను గుఱి యటన్న । ములు గటంచన్న నచ్ఛదశాల మనుచుండు'
'చను మాషపర్ణి చెంచలి యనఁగను' ఆం. భా. 2 (64)

ఇచట సీపద్యములలో కవి రెడ్లను హేళనముచేయుటయు రాజులం బొగడుటయుం బరికింపుఁడు; విస్తరము పీఠికలోఁ గనుఁడు.

సీ. మణియష్టిఁ గేలిబర్హిణపఙ్క్తిసుధ వీసు
లోలాడఁ బ్రొద్దెక్కి మేలుకాంచి,
గమగమవత్సుమగంధరాజాంగమ
ర్దనపైఁ జిరోష్ణమజ్జనము లాడి,
మిసిమిదువ్వలువ బన్నసరంబు మొగలితే
కులు దాల్చి జామెక్కి కోలు వొసంగి,

జాంగలామిషముతో శాల్యన్న మధికహై
యంగవీనంబుగా నారగించి,
తే. మృగమదము మించుతములంపుటిరులమోవి
దళముగా సాగరుహసంతివెలుఁగ, సౌధ
శిఖరవాతాయనాగతాచిరరుగంశు
నతదృగవరోధములతోడ నగరి నృపులు. 135

నృపులు = రాజులు, మణి...ధరన్ - మణియష్టి = స్ఫటికంపు దండముండలి - కేళిబర్హిణ = ఆటనెమలియొక్క - షడ్జసుధన్ = షడ్జస్వరమనెడి యమృతముతో, వీనులు = కర్ణములు, ఓలాడన్ = జలకమాడఁగా (శ్రవణామృతముగా షడ్జస్వరము విని), ప్రొద్దెక్క, మేలుకాంచి = నిద్రనుండి లేచి, గమ...పైన్ - గమగమవత్ = గమగమయని పరిమళించుచున్న - సుమ = పువ్వులతోఁ జేయఁబడిన - గంధరాజ = గంధరాజ మనెడి పరిమళద్రవ్యముయొక్క - అంగమర్దన పైన్ = ఒడలినలుఁగునకు తర్వాత, చి...లు - చిర = చాలసేపు - ఉష్ణమజ్జనములు - వేఁడి (నీళ్ల) స్నానము, ఆడి = కావించి, మిసిమిగువ్వలువ = కాంతిగల దోవతియు, బన్నసరంబు, నానావిధమణుల హారంబును, మొగలిరేకులు, తాల్చి, జాము ఎక్క = జాము ప్రొద్దెక్కినంతట, కొలువు ఒసంగి = సేవకసమయము అనుగ్రహించి; శాల్యన్నము = రాజనపు భోజనమును - జాంగల ఆమిషముతోన్ = కౌఁజు పూరేఁడు అడవిపంది లోనగు నడవి జంతువులమాంసముతో, అధికహైయంగవీనంబుగా = నిన్నటివెన్న గాచిన నేయి మెండగునట్లుగా, ఆరగించి, మృగమదము = కస్తూరి, మించుతములంపుటిరులు = అతిశయించుచున్న తాంబూలముయొక్క నలుపు, మోవిన్ = పెదవియందు, దళము = దట్టము, కాన్ = కాఁగా, సాగరుహసంతి = అగరుచెక్కలతోడి - బండిబంపట్, వెలుంగన్ = ప్రకాశించుచుండఁగా, సౌధ...డన్ - సౌధ = మేడలయొక్క, వాతాయన - కిటికీలవలన - ఆగత = వచ్చిన - అచిరరుక్ = మెఱుపులయొక్క అంశు = కిరణములవలె - నత = వ్రాలిన - దృక్ = చూపులుగల, అవరోధములతోడన్ = అంతఃపురస్త్రీలతో, నగరి = ఆనందించిరి.—స్వభావోక్తి.

'మణియష్టి' - (స్ఫాటికి)—
'తన్మధ్యే చ స్ఫటికఫలకా కాఞ్చనీ వాసయష్టి
ర్మూలే బద్ధా మణిభి రనతిప్రౌఢవంశప్రకాశైః
తాలైః శిఞ్జావలయసుభగైర్నర్తితః కాన్తయా మే
యా మధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః'. మేఘ.

'వృక్షేశయా యష్టినివాసభఙ్గాన్ । మృదఙ్గశబ్దాపగమా దలాస్యాః
ప్రాప్తా దవోల్కాహతశేషబర్హాః । క్రీడామయూరా వనబర్హిణత్వమ్॥' రఘు. 16 (14).

'షడ్జసుధన్' - 'షడ్జం మయూరో వదతి' అమ. 'గన్ధరాజ ... న...చన్దనే కణగుగ్గులౌ స్వనామఖ్యాతే పుష్పవృక్షే చ,' సర్వశబ్దసంబోధిని. 'చిర' - 'శీఘ్రభోజీ చిరస్నాయీ'. 'బన్నసరంబు' - పంచసరశబ్దమునకు వైకృతము. 'మొగలిరేకులన్' - వర్షిష్ఠపుగుటవలన. 'కొలువు' = 1. సేవ, 2. ఆస్థానము - అందు అందఱును రాజును సేవింతురు గావున. 'జాము' - యామశబ్దవైకృతము. 'జాంగల' - 'జాఙ్గలం నిర్జలస్థానే త్రిషు మాంసే నపుంసకమ్' నానా. 'పలలం క్రవ్య

మామిషమ్' అమ. 'లఘవో జాఙ్గలా హితాః,' 'వర్షాసు ... భజేత్ ... జాఙ్గలం పిశితమ్ - కున్దేన్దు ధవళం శాలిమక్షీయాజ్జాఙ్గలైః పలైః' వాగ్భట. 'సౌధ - శాల్యన్నము' - 'హర్మ్యపృష్ఠే వసేద్బాష్ప శీతశీకరితే దివా' వాగ్భట. — 'నతదృక్' - భీమత్వముచేత, తత్తు హైయఙ్గవీనం స్యాద్ధ్యోగోదోహోద్భవం ఘృతమ్' అమ. ఆరగించు - ఆహారశబ్దమునకు వైకృతము; ఆహారించు - తత్సమము. 'మృగనాభిర్మృగమదః కస్తూరీ చ', 'అఙ్గారధానికాఙ్గారశకట్యపి హసన్త్యపి' అమ. గడ్డకుంపటి చెప్పి రాజులకు హసంతికం జెప్పుటలో విశేషము కలదు, గడ్డకుంపటి మట్టిది, రాజుల హసన్తికయొక్క స్వరూపము:—

'కపిముఖరివ బహులోహా సుఘటితచక్రా ప్రభాతి వేశేన
హారమూర్తిరివ హసన్తీ భాతివిభోర్మానసోల్లాసేతా.'

'అగరు'-పరిమళమునకు. 'అచిరరుచి'-'శమ్పా శతహ్రదా హ్రాదిన్యైరావత్యః క్షణప్రభా' అమ.

'అచిరరుచా విలసన్త్యా ... వ్యాప్తాని ...
పయోముచా ప్రసవనుచా । విరుచా కిం నాపి తారహారముచా'.

'అనఘోఘములలోడఁ' - 'ఘస్రాంత త్ర్యహమఘౌఘశ్చ' అమ.-అఘౌఘ ముఁ గా ఘోరపాత్రి - ఘోరపాయాచారము మనుస్మృతిలోనే చెప్పఁబడినది. తుదకలం గని హింసువులు నేర్చుకొన్నా రని చెప్పుట సరి గాదు, చూ. మనుస్మృతి. (374-378).

వ. ఇట్లు సాంద్రసలిలధారాసారమానసంబులగు వార్షికవాసరంబులు ప్రశాంతం బగుటయుఁ; దదనంతరంబ. 136

సాంద్ర...లు - సాంద్ర = దట్టమయిన - సలిలధారా = నీటిబొట్టులకోవలయొక్క - ఆసార = తెంపులేని పాతముచేత - మానసరంబులు = అతిశయముకలవి,..., వార్షికవాసరంబులు వర్షాకాలపు దినములు, ప్రశాంతంబులు = కడచినట్టివి. - 'మానసరంబులు' —

'సుహిమ హిమవేళలంగు సమ్మానవతికి । మానసము లయ్యెఁ దలఁపంగ వాసనములు.' వైష.1(75).

'ఆసార' - 'ధారా సంపాత ఆసారః' అమ. 'వాసరంబులు' - 'ఘస్రో దినాహనీ వాతు క్లీబే దివస వాసరౌ' అమ.

—* శరదృతువర్ణన *—

ఉ. రాజమరాళలబ్ధగిరిరంధ్రము, శాలివనీశరావలీ
వైజననంబు, యజ్వహుతవాజహుతాశము, భాస్వదిందిరాం
భోజసమాగమం, బుదితబోధభుజంగశయోపచారసీ
రాజసఫుల్లహల్లకసరం, బుదయించె శరద్దినం బిలన్. 137

రాజ...ము - రాజమరాళ = రాజహంసలచేత - లబ్ధ = పొందఁబడిన - గిరి = క్రౌంచ పర్వతముయొక్క - రంధ్రము = సొరంగముకలదియు, శాలి...బు - శాలివనీ = వరిపొలములకును - శర ఆవళీ = రెల్లుసమూహములకును - వైజననంబు = పుట్టుకనెల (అయినదియు), యజ్వ...ము - యజ్వ = యజమానులచేత - హుత = వేల్వఁబడిన - వాజ = అన్నము గలదైన - హుతాశము = అగ్నిగలదియు, భాస్వ...బు - భాస్వత్ = ప్రకాశము గలిగిన - ఇందిరా = లక్ష్మియొక్క - అంభోజసమాగమంబు = కమలములలోనికి వచ్చుట కలదియు, ఉది...బు - ఉదిత = కలిగిన -

బోధ = మేలుకువగలవాఁడైన - భుజంగశయ = నాగతల్పుఁడైన నారాయణునికి - ఉపచార = సేవార్థమయిన - నీరాజన = నివాళియైన - ఫుల్ల = వికసించిన, హల్లక = ఎఱ్ఱగలువలు (గలదైన) - సరంబు = సరస్సుగలదియునైన, శరత్ దినంబు = శరత్కాలము, ఉదయించెన్ = అవతరించినది.

శరత్కాలము వచ్చినది, క్రౌంచరంధ్రముదారిని హంసలు రాఁదొడంగినవి; వరి పండను తెల్లు పూవను ఆరంభించినవి; యజమానులు అగ్నియందు అన్నము వేల్చిరి; తామరతీవలయందు పూవులు పొడమి వికసింపమొదలిడినవి; దానంజేసి మహాలక్ష్మి వానియందు నివసింపంజొచ్చినది. ఎల్లెడలను అప్పుడు పొడమి వికసిల్లిన యెఱ్ఱగలువలతో ఆ సరస్సులు అప్పుడే నిద్రమేల్కాన్న శ్రీమన్నారాయణమూర్తికెత్తిన నివాళి పళ్లెరంబులో యన నొప్పుచుండినవి.—కడపటి విశేషణమున ఉత్ప్రేక్ష.

శరదృతువునఁగలుగు విశేషములు కొన్ని యిట వర్ణితములు:—

'శరదీన్దు రవి పటుత్వం। జలాచ్ఛతాఽగస్తి హంసవృషదర్పాః
సప్తచ్ఛదపద్మసితా। భ్రధాన్యశిఖిపక్షమదపాతాః.' కా. క. ల.

'రాజమరాళిలబ్ధగిరిరంధ్రము' - మహావీరచరిత్రములో జామదగ్న్యవర్ణనము:—

'సోఽయం త్రిస్సప్తవారా నవికలవిహతక్షత్రతన్త్రప్రచారో
వీరః క్రౌఞ్చస్య భేదా త్కృతధరణితలాపూర్వహంసావతారః.'

'వైజననంబు'-'సూతి మాసో వైజననమ్' అమ. 'వరి' యనుట సమృద్ధిం దెలుపును. 'శరావళీ':—

'కాశాః క్షీరనికాశాః దధిసరవర్ణాని సప్తపర్ణాని
నవనీతనిభ శ్చన్ద్రః శరది తక్రప్రభా జ్యోత్స్నా.' శార్ఙ్గధరపద్ధతి.

'పుణ్డరీకాతపత్రస్తం వికసత్కాశచామరః
ఋతుర్విడమ్బయామాస న పునః ప్రాప తచ్ఛ్రియమ్.' రఘు. 4.

'యజ్వహుతవాజహుతాశము' - 'యజ్వాతు యజమానః స్యాత్' అమ. 'ఇందిరా...బు' - 'శరత్పఙ్కజలక్షణా' రఘు. 'లక్ష్మీః పద్మాలయా' అమ. 'ఉదితబోధ' - నారాయణుఁడు ఆశ్వయుజశుద్ధైకాదశినాఁడు నిద్రమేల్కానును; ఆశ్వయుజకార్తికమాసములు శరదృతువు. 'నీరాజన' - దీపజ్వాల ఎఱుపుగావున హల్లకసామ్యము - 'హల్లకం రక్తసంధ్యకమ్' అమ. 'సరంబు' - పయస్సరశ్శబ్దములకు సలోపము లేదని బా. వ్యా. తత్స. ౪౦. అందులకు ఉపసర్జనత్వమందుఁ గలుగు నని వ్యవస్థచేసికొనవచ్చును; లేదా, ఇట మాలావాచకమయిన సరశబ్దముగాఁ గొనవచ్చును; 'అయంకణ్ఠే బాహు శ్శిశిర మసృణో మౌక్తికసరః' ఉ. రా. చ. 'వాజో ... ఘృతయజ్ఞాన్నవారిషు' మేదిని.

క. కరము పొగ రెక్కె నంబర, । మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణఁ బొగచూరె ననఁగా । హరిమణిజంబూఫలాసితామలరుచులన్. 138

అంబరము = ఆకాశము, ఉరు విద్యుత్ దీప కళికలు = గొప్పవైన మెఱపు లనెడి దీపపు మొగ్గలు, ఉమిసిన = వెలిఁబుచ్చిన, ధూ...ణన్ - ధూమ = పొగయొక్క - స్ఫురణన్ = ఔత్కట్యముచేత, పొగచూరెన్ అనన్ = పొగచేత నలుపు ఎక్కెనదో యనునట్లుగా, హరిమణి జంబూఫల అసిత అమలరుచులన్ = ఇంద్రనీలములును నేరేడుఁబండ్లును అనువానియొక్క నల్లని కాంతులతో, కరము = మిక్కిలి, పొగరు ఎక్కెన్ = నలుపుమీఱెను.

శరదృతువులో ఆకాశము నైల్యాతిశయమునొంది ఇంద్రనీలమణు లయు నేరేడుఁబండ్లయు కాంతివంటి నల్లని నిర్మలకాంతి గలదై మెఱపు లనెడి పెద్ద పెద్ద దివ్వె మొగ్గలు వెలిఁబుచ్చిన పొగ వ్యాపించుటచేత పొగ చూరినదో యన నొప్పుచుండెను. రూపకానుప్రాణితోత్ప్రేక్షయు, నిదర్శనయు సంకీర్ణములు.

'బింబ ప్రతిబింబత్వా। ప్తంబు లగువిశేషణములు దాల్చిన యిరుధ
ర్మంబుల కైకోక్తియు, న। న్యంబున సామాన్య మన్యమం దిడుట, స్వకృ
త్యంబులచేఁ గీడును మే। లుం బోధంచుటయు రాజిలు నిదర్శన లై.
ఎది దాతసౌమ్యతయె యా। ల్లదె నెఱ శశి మచ్చలేమి; యబ్జరుచి న్నీ
వదనము దాల్చును నెలరాఁ। జదిసె నిరులు రాజవైరి సమయు నటంచున్.' అలం.

'పొగరు' = గర్వము - శ. ర., అంగులకు అందలి ప్రయోగము - 'అగరు ధూపపుఁ బొగల్ పొగ రారు కురులుగా., రామా. ౫ ఆ. ఈ రెండుతావులను నలు పని గ్రహించుటయే ప్రకరణోచిత ముగాఁ గనఁబడుచున్నది. 'హరిమణి' _ ఇంద్రనీలమునకు ఈ పేరు వచ్చుటకుం గారణము - 'ఏ నీలంబులకు మధ్యభాగమున నింద్రాయుధసంకాశం బగుకాంతి రాజిల్లు నవ్వి యింద్ర నీలఖ్యాతి గాంచి బహుమూల్యంబులును, దుర్లభంబులును నవు.' హాలాస్యము, ౩. ఆ.

ఆ. సాంధ్యరాగలహరి సామిరంజితము లై। తిరిగె మింట నిదుర తెలిసినట్టి
యిందిరాధిపతికి నెత్తుకర్పూరనీ। రాజనంబు లన శరద్ఘనములు. 139

శరత్ ఘనములు = శరత్కాలపు మేఘములు, సాంధ్యరాగ లహరిన్ = సంజకెంజాయ యొక్క పెద్దయలచేత, సామి రంజితములు = సగముభాగము ఎఱుపు చేయఁబడినట్టివి, ఐ, నిదుర తెలిసినట్టి = అప్పుడే నిద్రమేల్కొన్నవాఁ డైన, ఇందిరా అధిపతికిన్ = మాధవునికి, ఎత్తు కర్పూరనీరాజనంబులు = ఎత్తినట్టి కపురంపు నివాళులో, అనన్ = అనునట్లుగా, మింటన్ = ఆకాశమందు, తిరిగెన్ = సంచరించెను.

సంధ్యారాగమహాతరంగముచేత సగముభాగము ఎఱ్ఱఁబాఱినవై కడమసగము స్వాభావిక మయిన ఆ తెలుపువన్నెయే గలవై, శరత్కాలమేఘములు ఆకాశమున సంచరించుచు ఎట్లుండె ననఁగా—అప్పుడు నిద్రమేల్కొన్నట్టి శ్రీహరికి ఎత్తఁబడి త్రిప్పఁబడుచున్న కర్పూరపు హారతులో యన నొప్పుచుండెను.—ఉత్ప్రేక్ష.

'లహరి' - 'మహాతరఙ్గే' సర్వ. సం.

'కరేణోత్క్షిప్తాస్తే జనని విజయన్తాం లహరయః' గంగాలహరి. 40.

'ఇమాం పీయూషలహరీం జగన్నాథేన నిర్మితామ్' ,, 53.

'సామి' - 'సామి త్వర్ధే జుగుప్సితే' అమ. కర్పూరపు బిళ్లను వెలిఁగించిన ఒకభాగము ఎఱ్ఱఁగా జ్వలించుచుండఁగా, కడమభాగము సహజధావళ్యముతో వెలుంగుచుండును. 'మింట' - మిన్ను విష్ణుపదముగాన - 'వియ ద్విష్ణుపదం వా తు పుం స్యాకాశవిహాయసీ' అమ.

'ఏకాదశ్యాం శుక్లపక్షే హ్యాషాఢస్య సురోత్తమః
స్వమాయయా పవిత్రాఙ్గ్యా నిద్రయా వర్తతే ప్రభుః'. శేషధర్మ.

'అర్ధం సుప్త్వా నిశాయాః సరభససురతాయాసపన్నశ్లథాఙ్గః
ప్రోద్భూతాసహ్యతృష్ణో మధుమదవిరతో హర్మ్యపృష్ఠే ప్రబుద్ధః
సంభోగక్లాన్తకాన్తా శిథిలభుజలతావర్జితం కర్కరీతో
జ్యోత్స్నాభిన్నాచ్ఛధారం న పిబతి సలిలం శారదం మన్దపుణ్యః.'

'అలఁతిగ' - పండు పగిలిన లోపలి భాగమునకు గాఢరక్తిమ యుండదు; అట్లే శరన్మేఘములకును.

క. ఘుణగణవిహరణఁ జివికిన। మణిధనువునఁ దొరుఁగు నుసి సమానములై ద
ర్పణనిభనభమునఁ బరిణత। శణకణహారిణములు పాండుజలదము లొలసెన్.

పరి...లు - పరిణత = నెఱముదిరిన - శణ = జనుముయొక్క - కణ = లేశములవలె - హారిణములు = తెల్లని వైన, పాండు జలదములు = తెల్లమేఘములు, దర్పణ నిభ నభమునన్ = అద్దముతో సమానమైన యాకాశమందు, ఘుణ...ణన్ - ఘుణ = మ్రానుతొలుపుడు పురువుల యొక్క, గణ=సమూహములయొక్క, విహరణన్ = తొలుచుటచేత, చివికిన మణిధనువునన్ = నానుటచేత సారముచచ్చిన యింద్రధనుస్సునందుండి, తొరుఁగు నుసిసమానములు ఐ = రాలునట్టి ధూళియో యనునట్లుగా, ఒలసెన్ = పర్వెను.

అద్దమువలె నిర్మలముగా నున్నయాకాశమందు, జనుపకాఁడం ద్రుంచిన ఆలోనం గనుపట్టు పీచువోలె తెల్లనైన మేఘములు, కొయ్యదొలుపుడు పురుగులు దొలువఁగా రాలుచున్న యింద్రధనుస్సుయొక్క చివుకుడు వెదురుపిండిమొత్తములో యన పర్వుచుండెను.—ఉపమోత్ప్రేక్షలకు సంసృష్టి. 'సమాన' శబ్దము ఉపమయే యనఁగూడదు; ఏలన, లోకసామాన్య మయిన నుసిం జెప్పక ప్రకృతిసిద్ధ మయిన మణిధనువునుసిం జెప్పనందున తాదాత్మ్య సంభావనమందే తాత్పర్యముగాని కేవలౌపమ్యకథన మందుం గామిచేత. ఇందువృత్త్యనుప్రాసము నున్నది.

'దర్పణ' - 'దర్పణే ముకురాదర్శౌ' అమ. 'కణ' శబ్దము లక్షణచే కణాంతర్గతధవళతూలపరము. 'పాండు' అని చెప్పియు 'హారిణము' లనుటచే ఆపాండిమయొక్క విశేషము చెప్పఁబడినది.—'హరిణః పాణ్డురః పాణ్డుః' అమ.

క. రవిశశిముకురములు శర। ద్యువతి మెఱుఁగుఁబెట్టుభూతియో యనఁ బర్వెన్
బవనాహతసప్తచ్ఛద। నివహపరాగంబు దివికి నిర్మలకాంతిన్. 142

దివికిన్ = మింటికి, పవ...బు - పవన = గాలిచేత, ఆహత = కొట్టఁబడిన - సప్తచ్ఛద నివహ = ఏడాకులయరంట్లసమూహముయొక్క - పరాగంబు=రజస్సు, శరత్ యువతి = శరదృతువనెడియువిద, రవి శశి ముకురములు = సూర్యచంద్రులనెడి యద్దములకు, మెఱుఁగుఁ బెట్టు భూతియో అనన్ = మెఱుఁగిడునట్టి బూడిదయో యనునట్లుగా, నిర్మలకాంతిన్ = స్వచ్ఛమయిన ప్రకాశముతో, పర్వెన్ = వ్యాపించెను.

శరదృతువనెడి జవరాలు సూర్యచంద్రులనెడియద్దములకు మెఱుఁగుపెట్టుచున్న బూడిదయో యనునట్లుగా నిర్మలకాంతితో ఏడాకుల యరఁటులరజస్సు గాలిచేత ఆకాశమున పర్వుచుండెను. - రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

'శరత్కాలమున' - 'రవీందుపటుత్వ' మనుకారికను చూ. ౧౩౪ టీక. - 'శరదుదయప్రభావమునఁ జంద్రదినేంద్రుల తేజమెక్కె.' వి. చ. 'భూతి'-

'హస్త ఇవ భూతిమలినో । యథాయథా లఙ్ఘయతి ఖల స్సుజనమ్,
దర్పణమివ తం కురుతే తథాతథా నిర్మలచ్ఛాయమ్.'

'ముకురములు' - పూర్వకాలమున అద్దములను ప్రాయికముగా కంచుతో చేసికొనుచుండిరి. వానిని సన్నపాటివిభూతితో తోమి నిర్మలీకరించుకొనుచుండిరి. విభూతి కడుంగడుసన్నము కాదేని దర్పణము గీఱలుపడి పనికిరాక పోవును. 'సప్తచ్ఛద'-'దధిసరవర్ణాని సప్తపర్ణాని.' మా. ౧౩౪ టీక. 'కపురపుటనఁటి నాఁ గాను గేదాకుల యనఁటి నా సప్తపర్ణాఖ్య దనరు.' ఆం.భా. 2 (42).

స్రగ్ధర. సంభూతజ్ఞప్తి వాతాశనశయనము విశ్వంభరుం డూఁది లేవం,
గంభీరప్రక్రియామగ్నత డిగు జగతిం గ్రిందుగాఁ దోఁచువర్షా
దంభోళిస్థూలరంధ్రోద్గతసితపృథుపాతాళజాతాంబుధారా
స్తంభంబు ల్పోలె నెన్ను ల్ధవళరుచి శరస్తంబపంక్తిం జనించెన్. 143

సంభూతజ్ఞప్తిన్ = సంజాత మయిన మెలఁకువచేత (నిదుర మేల్కాంచి), విశ్వంభరుఁడు = నారాయణుఁడు, వాతాశనశయనమున్ = పాఁపసెజ్జను, ఊఁది = ఊనుకొని, లేవన్ = లేచి నిలువఁగా, గంభీ...తన్ - గంభీర = లోఁతయిన - ప్రక్రియా = ప్రకారముచేత - మగ్నతన్ = మునిఁగినదయినందున, డిగుజగతిన్ = క్రిందికిపోవుచున్న భూమియందు, క్రిందుగాన్ = దట్టముగా, తోఁచు... పోలెన్ - తోఁచు = అగపడుచున్న - వర్షా = వర్షాకాలపు - దంభోళి = పిడుగులయొక్క (పిడుగులు చేసిన) - స్థూల = లావైన - రంధ్ర = బొక్కలనుండి - ఉద్గత = పైకి లేచిన - పృథు = గొప్ప - సిత = తెల్లనివైన, పాతాళజాత = పాతాళమందుఁ బుట్టిన - అంబుధారా = నీటిధారలయొక్క - స్తంభంబుల్ పోలెన్ = కంబములో యనునట్లుగా, ఎన్నుల్ = పుష్పములు, ధవళరుచిన్ = తెల్లకాంతితో, శరస్తంబ పంక్తిన్ = రెల్లుకాఁడల వరుసయందు, జనించెన్ = పుట్టినవి.

శ్రీహరికి మెలఁకువ రాఁగానే పాఁపసెజ్జను వదలి క్రింద పాదమూని నిలువఁగా, ఆయన విశ్వంభరుఁ డగుటచే (అనఁగా కడుపులో లోకములను మోచువాఁడగుటచే ఆతనిబరువువలన) భూమి లోఁతుగా దిగిపోయినది; అంతట కడచిన వర్షర్తువులో పడినపిడుగులు పాతాళమువఱకు చేసినబొక్కలలోనుండి లావుపాటి తెల్లని యాపాతాళగంగనీటికంబములు లేచినవో యను నట్లుగా ఎటఁజూచినను తెల్లనికాంతులతో రెల్లుకాఁడలయందు వెన్నులు పుట్టినవి. ఉత్ప్రేక్షా లంకారము.

శ్రీహరి శరత్తులో మేల్కొను నని ఇప్పటికే టీకలో చూపఁబడియున్నది. 'వాతాశన' - పరుండుటకు గాలి యూఁదిన రబ్బరుపఱుపువలె మెత్తగా నుండు నని సూచించుటకు. శయన మును విడిచి శ్రీహరి లేచును.

'నాగాఙ్కం మోక్తు మిచ్ఛో శ్శయన మురుఫణా చక్రవాళోపధానం
నిద్రాచ్ఛేదాభితామ్రా చిర మవతు హరే ర్దృష్టి రాకేకరా వః.' ముద్రా. 3

'వాతాశనశయనము' - నారాయణునికి శయనము శేషాహి.

'ఏకా భార్యా ప్రకృతికరినా, చఞ్చలా చ ద్వితీయా,
పుత్రో ఽనఙ్గ స్త్రిభువనజయీ మన్మథః పఞ్చబాణః

శేష శ్శయ్యా శరణ ముదధి ర్వాహనం పన్నగారిః
స్మారంస్మారం స్వగృహచరితం దారుభూతో మురారిః.'

'సిత పాతాళజాతాంబు' - పాతాళనది యైన భోగవతియు గంగయే గావున దానిజలమును తెలుపే; కావున నది శరపుష్పములకు మంచి యుపమానము. 'స్తంబ' - 'అప్రకాణ్డే స్తమ్బ గుల్మౌ' అమ. - 'శరో దధ్యాద్యగ్రసారే బాణే కాణ్డే తృణాన్తరే' నానా.

'స్రగ్ధర.—చాలన్ మర్భన్యయా లప్తయతియుగళమున్ స్రగ్ధరావృత్త మందున్.'

తే. నీరజేక్షణుం డవ్వేళ నిద్ర దెలిసి
యడుగుఁ దనమీఁద మోపనో యవనిరమణి
కంటకితగాత్రి యయ్యె నాఁగా విపాక
పరుషకంటకశాలిమంజరులు పొలిచె. 144

ఆవేళన్ = ఆశరదారంభంబునందు, నీరజ ఈక్షణుఁడు = పుండరీక నేత్రుఁడయిన శ్రీహరి, నిద్ర దెలిసి = నిదురనుండి మేల్కొని, తనమీఁదన్ = భూదేవిమీఁద, అడుగు మోపనో = పాదం బూనినకతంబుననా యేమి, అవనిరమణి = భూకాంత, కం...త్రి - కంటకిత = గగుర్పాటు గొన్న - గాత్రి = దేహముగలది, అయ్యెన్ = అయినది, నాఁగాన్ = అనునట్లుగా, విపా...లు - విపాక = పంటచేత - పరుష = గట్టిపడిన - కంటక = ముండ్లుగలవైన - శాలి = వరి యొక్క - మంజరులు = వెన్నులు, పొలిచెన్ = ఒప్పెను.

ఆసమయాన వరియెన్నులముండ్లు పంటచే గట్టిపడి యెల్లెడల నొప్పుచుండుటం జూడఁగా నెట్లుండె ననఁగా, నారాయణుఁడు నిద్రలేచి, శేషపర్యంకమును వీడువాఁడై భూమిపై పాద ముంచినకారణంబున నాభూదేవియొడలు గగుర్కొన్నదా యనున ట్లుండెను.— ఉత్ప్రేక్షాలంకారము.

'అవనిరమణి' - నారాయణుని రమణియైన యవని, కానిచో గగుర్పాటుం బొందదు. 'కంటకిత'— సంజాతకంటకమైన - తారకాదిక చెప్పఁబడిన ఇతచ్ప్రత్యయము. ''కణ్టకః పులకే వేణౌ ద్రుమాఙ్గే క్షుద్రవైరిణి'' నానా. తారకాదులు:— 'తారకా పుష్పకల్లోల తరఙ్గ శరపల్లవాః । బుభుక్షకణ్టకాఙ్గార శృఙ్గారజ్వరకన్దరాః...'; 'గాత్రం ప్రతీకే దన్త్యగ్ర జఙ్ఘాభాగే వపుష్యపి.' నానా.

మ. స్ఫుటభూయోహృతిశంకఁ వార్ధి నినరశ్మిన్ మిన్ను చేర్పం, దటి
చ్ఛటఁ గౌర్వంబుగఁ గారుకొంచు, ఘనమై క్ష్మాఁ దీఱ వర్షింప, న
చ్చోటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు! గాకున్న నో
కొట్టఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై తోఁచునే? 145

స్ఫుట...కన్ - స్ఫుట = ఉత్కటమైన - భూయః = మరల - హృతి = (అగస్త్యులు) హరింతు రను - శంకన్ = భయముచేత, ఇనరశ్మిన్ = సూర్యకిరణములు, తటిత్ఛటలు = మెఱపులసమూహములు, ఔర్వంబుగన్ = సముద్రమునందలి బడబాగ్ని యగునట్లుగా, వార్ధిన్ = సముద్రమును, మిన్ను చేర్పన్ = మింటఁ జేర్పగా, (మింటంజేరినయా సముద్రము) కారుకొంచున్ = నల్లఁబాఱి, ఘనము ఐ = మేఘముగా మాఱి, క్ష్మాన్ = భూమియందు, తీఱన్ = (ఆసము

ద్రము) అంతయు, వర్షింపఁ౯ = వర్షమైరూపఱఁగా, (ఎట్లుండెననఁగా), అచోటనుఁ౯ = అక్కడను (అనఁగా మింటను) కూడ, తోఁచి=అగపడి (ప్రవేశించి), కలశీసూనుండు = అగస్త్యుఁడు, గ్రసింపఁబోలుఁ౯ = వార్ధిని త్రాగియుండును, కాక ఉన్నఁ౯ = అటుకాదేని, ఒక్కటఁ౯ = ఒక్కమాఱుగా, తారాగ్రహ భాస్కర ఇందు మణిశుక్తుల్ = నక్షత్రములు అంగారకాదిపంచగ్రహములు సూర్యచంద్రులు ననెడు రత్నములును ముత్తెపుఁజిప్పలును, వ్యక్తమై = స్పష్టముగా, తోఁచునే = కనఁబడునా, (అను నట్లుండెను).

అగస్త్యనక్షత్రోదయ మాయె ననియు, నీటిమబ్బులు వర్షించి రూపుమాసి పోయిన వనియు, నక్షత్రములకును సూర్యచంద్రాదిగ్రహములకును దీప్తి వచ్చినదనియు భావము. - సూర్యకిరణములు తమకు త్రాగుటకు వలసియున్న సముద్రమును అగస్త్యమహాముని మునుపటివలెనే మరల త్రాగివేయు నని భయపడినవై ఆసముద్రమును తమతావైన మింటం జేర్చుకొనఁగా, మెఱపులే బడబానలముగా ఆసముద్రము భూమియందంతటను వర్షించి మాయమగుటయు, నక్షత్రములకును అంగారకాది పంచ గ్రహంబులకును సూర్య చంద్రులకును దీప్తి హెచ్చుటయు నెట్లుండె ననఁగా - ఆమహాముని నక్షత్రరూపమున అప్పుడు మింట నుదయించినాఁడుగావున ఆయన అట గూడ ఆసముద్రమును త్రాగివైచినాఁడు సుమా - అనునట్లును, ఆనక్షత్రాదులే ఆసముద్రము నడుగుననుండు రత్నములును ముత్తెపుంజిప్పలునుంజుమా యనునట్లును ఉండెను. - ఉత్ప్రేక్షాలంకారము; తుదిపాదమున రూపకము. మత్తేభవిక్రీడిత వృత్తము:—'మను విశ్రాంతియు సభ్రనమ్యవములుఁ౯ మత్తేభవిక్రీడయా.' 'భూయః' - ఇంతకుముందు అగస్త్యమహాముని సముద్రమును త్రాగివైచినాఁ డని సూచన. ఒకమాఱు త్రాగెను గావుననే మరలత్రాగు నను శంక. 'శఙ్కోత్ప్రేక్షావితర్కయోః' నానా.

కాలకేయు లను నసురులు సముద్రమునందు దాఁగియుండి, అప్పుడప్పుడు వెలువడుచు దేవతలను బాధించుచుండఁగా, దేవతలప్రార్థనచే అగస్త్యమహాముని సముద్రమును అరచేతంగొని ఆపోశనించెను. సూర్యమరీచులకు వార్ధితో నేమిపని? అవి యాతనివలన గర్భమును ధరించును; సముద్రజలమును అవి త్రాగునవి. కారుకొంచుఘనమై తీఱ వర్షించుటయే సమయాట. 'అచ్చోట' - దీని రూపముల క్రమము—ఆచోట - అచ్చోట - అచ్చోట - అచ్చట - అచట - అట.

'ఔర్వము'-'ఔర్వస్తు। బాడబో బడబానలః' అమ. 'క్ష్మావని ర్మేదినీ మహీ' అమ. "ఔర్వుఁడు చ్యవనమహర్షి పుత్త్రుఁడు, భృగువంశ్యుఁడు; కార్తవీర్యులు భార్గవవంశము నెల్ల నాశము చేయ సమకట్టి స్త్రీలగర్భములనుసయితము ఛేదముసేయం దొడంగిరి. వారిలో చ్యవనభార్య తనగర్భమును తొడలో దాఁచుకొన్నది. దానం జేసి ఆగర్భము శిశువుగా జనించి ఔర్వుఁడను పేరం బరఁగినది. అతనిం గన్నంత కార్తవీర్యులకుం గన్నులు పోయినవి. అతనిదేహమునుండి అగ్నిజ్వాల పొడమి లోకము నెల్ల భస్మీకరింపనుండినది. అంత నాతఁడు తనపితృదేవతలైన భార్గవులు వేడఁగా దానిని సముద్రమున వైచెను. అట నది గుఱ్ఱపుమొగముం బొందియున్నది. అందువలన దానికి (ఔర్వానలము) బడబానలము అనియు పేర్లు" అని పురాణకథ. 'కలశీసూనుండు' - 'అగస్త్యః కుమ్భసంభవః' అమ. శరత్తున అగస్త్యోదయమునకు చూ. ౧౩౪ టీక. 'తారలు' - "నక్షత్ర మృక్షం భం తారా' అమ. గ్రహములు రాసులయందు సంచరించునట్టి సూర్యాదులు ఏడు. ఇట సూర్యచంద్రులను వెండియుం జెప్పుట శుక్తిసాదృశ్యమునకొఱకు; రత్న - సముద్రుఁడు రత్నాకరుఁడుగదా. 'రత్నాకరోజలనిధిః' అమ. 'ఒక్కొట' - ఒక్క కు ఒక్కొ

అనియు, ఒకకు ఒకొ అనియు రూపాంతరములు గలవు.—"ఇటఁ బాండవ కౌరవు లొ। క్కొట నందఱు గురుననుజ్ఞఁగొని" భార. ఆది. ౫ ఆ. "ఇట నవ్వరూథినియు నొ। క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ;" మను. ౩. (70).

చ. అలమలయాద్రి కుంభభవుఁ డన్కతకంబు శరత్తు కుండమం
డలి ప్రతిబింబకైతవమునం దమ కిచ్చిన, వారిదేవత
ల్తొలఁకులకేలఁ దాప నిడి తోమఁ, గలం కడఁగెం, దదీయత
త్ఫలతకు హ్రస్వమౌటె కరి, తారక లంబువుఁ దేర్చునే యనన్. 146

శరత్తు = శరదృతువు. అలమలయాద్రి కుంభభవుఁ డను కతకంబున్ = మలయపర్వతమందలి యగస్త్యుఁ డనుపేరి యొయిండుపుగింజను, కుండమండలీ ప్రతిబింబకైతవమునన్ = సరస్సుల సమూహమందలి (యగస్త్యనక్షత్ర) ప్రతిబింబమను మిషచేత, తమకున్ = జలదేవతలకు, ఇచ్చినన్ = ఈయఁగా, వారిదేవతల్ - (ఆ) జలదేవతలు, తొలఁకులకేలన్ = అలలనెడిచేతితో, తాపన్ = మెట్టుమీఁద, ఇడి = ఉంచి, తోమన్ = అరగఁదీయఁగా, తదీ...కున్ - తదీయ = ఆయగస్త్యుని దైన, తత్ఫలతకున్ = ఆకతకఫల మైయుండుటకు, హ్రస్వమౌటె = చిన్నదిగా నుంటయే, కరి = సాక్షి, తారకలు = నక్షత్రములు, అంబువున్ = నీటిని, తేర్చునే = నిర్మలముగా చేయఁగలవా, అనన్ = అనునట్లుగా, కలంకు = మాలిన్యము, అడంగెన్ = క్రిందికిపోయెను.

శరదృతువులో అగస్త్యనక్షత్రోదయము కాఁగానే భూమిలోనంతటను పంకు క్రిందికి అణఁగిపోయి నీళ్లు తేరుట యెట్లుంటె ననఁగా - నక్షత్రములు నీటిని తేర్చుట వట్టిమాట, శరదృతువే మలయపర్వతమునుండి అగస్త్యుఁ డనుపేరం బరఁగునట్టి యొకయిండుపుగింజను తెచ్చి కొలఁకులలోని అగస్త్యనక్షత్రప్రతిబింబము అనుమిషచేత జలదేవతలకు ఇయ్యఁగా, వారు ఆకొలంకుల మెట్టుమీఁద పెట్టి అరగఁదీయఁగా వచ్చినగంధము కలియుటచేత నీరు తేరినది - ఆప్రతిబింబము అగస్త్యుఁ డనుటకు గుర్తేమనిన, అగస్త్యుఁడు హ్రస్వుఁడని వినలేదా, ఆప్రతిబింబము హ్రస్వమే గదా? ఇదేగుర్తు అనునట్లుగా నుండెను.-రూపకానుప్రాణితకైతవాపహ్నుత్యుత్థాపితోత్ప్రేక్ష.

మలయపర్వతము దక్షిణదిక్కున నున్నది; దానం దామ్రపర్ణి పుట్టుచున్నది. అందే అగస్త్యులవారు నివసింతురు.—

'యస్యోత్తమాం మౌక్తికకామధేను రుపత్యకా మర్చతి తామ్రపర్ణీ
రత్నేశ్వరో రత్నమహానిధానం కుమ్భోద్భవ స్తం మలయం పునాతి.' అని మల్లినాథటీక.
'వ్యక్తచిహ్నైర్యుతో జాతిశబ్దోఽపి వ్యక్తివాచకః
యథాగస్తినివాసా దిక్ దక్షిణాశా ప్రకీర్త్యతే.' కా.క.ల.

అగస్త్యుఁడు మలయవాసి గావున అతనిని మలయాద్రిలోని కతకముగా కవి చెప్పినాఁడు. 'శరదు' అని వ్రాఁతపుస్తకముల పాఠము. ఆపక్షమున 'ఔల్లు పూచుఋతువు - అనఁగా శరదృతువు' అని యర్థము చేసికొనవలయును. 'శరదుకుండమండలిన్' అని యొకటే సమాసముగాఁగొని, 'మలయాద్రి'ని కర్తం జేసికొనవలయును. అయినను శరదుపలక్షణమును చెప్పినఫల మేమియు లేదు గావున 'శరత్తు' అనుపాఠమే శ్రేయము. శరదృతువునే కర్తగా అన్వయించుకొనుపక్షమందును, ప్రథమైకవచన (వు విభక్తి) లోపమునకు గతిని రాహుబాహులకుంబోలె కల్పించుకొన

వలయును. అగస్త్యోదయము శరత్తులో నని ౧౩౭ టీకలోనికారికవలనం దెలియును. తదీయాస్తమయకాలములు - బృ.సం.అగస్త్యచారమున:—'దృశ్యతే స కిల హస్తగతేఽర్కే రోహిణీముపగతేఽస్తముపైతి.' అగస్త్యోదయ మగుడు, జలాశయములందలి నీరు తేటపడును;

'ప్రససాదోదయా దమ్భః కుమ్భయోనే ర్మహౌజసః' రఘు. 4.

'కతకము' నీటిని దేర్చుగింజ యనుటకు - ఉపోద్ఘాతమున శబ్దముల పట్టికను చూ.

'కుణ్డం పిఠరే తోయాధార విశేషే చ వహ్నౌ గర్తే చ.' నానా.

'స్యా న్మణ్డలం ద్వాదశరాజకే చ దేశే చ బిమ్బే చ కదమ్బకే చ.' విశ్వ.

'కొలఁకుల కేలన్' 'రూపక సమాసమున షష్ఠీసమాస కార్యము' - 'వడగండ్ల పాలపండ్లు' అనుప్రయోగమువలె. - 'కరి' - 'శ్యామలవర్ణంబు సాక్షియు మర్యాద। పరఁగుచునుండును గరి యనంగ;' ఆం. భా. 3.(61) 'ఈమాట నొరపాచ్చెము। లేమికి నీశ్వరుఁడ కరి నిలింప విరోధీ.' అను. 6 (53).

చ. ఇలకు సుధాసమత్వము రహింప శరజ్జలజాక్షి కుండమం
డలి సలిలంబుఁ గల్మష మడంగ మొగిల్విరియెండఁ గాఁచుచోఁ
జిలుకు నిశారజఃపటలి చెన్ను వహించెఁ దరంగపంక్తిపై
దళదరవింద కైరవకదంబక డారపరాగపూగముల్. 147

దళ...ముల్ - దళత్ = వికసించుచున్న - అరవింద = కమలములయు - కైరవ = తెల్లఁగలువలయు - కదంబ = సమూహముయొక్క - కడార = పసుపుఁ బచ్చనైన - పరాగ = పుప్పొడియొక్క - పూగముల్ = మొత్తములు, తరంగపంక్తిపైన్ = అలలవరుసమీఁద, (ఎట్లొప్పె ననఁగా), శరత్ జలజాక్షి = శరత్తనెడిచెలువ, ఇలకున్ = భూమికి - (రలల కభేద మగుటం బట్టి - ఇలకున్ = ఇరకున్ = నీళ్లకు అనియు), సుధాసమత్వము - సుధా = అమృతము చేత - సమత్వము = దేవలోకతుల్యత, రహింపన్ = సొంపారునట్లుగా, కుండ...ము - కుండ = కొలంకు లనెడి కుండలయొక్క - మండలిన్ = సమూహమునందు - సలిలంబున్ = నీటిని, కల్మషము = కాలుష్యము, అడంగన్ = పోవుటకుఁగాను, మొ...డన్ - మొగిలు = మబ్బు - విరి = తొలఁగినదైన - ఎండన్ = ఆతపముచేత, కాఁచుచోన్ = ఆనీటిని కాఁగఁజేయుచుండఁగా, చిలు...న్న - చిలుకు = చల్లుచున్న - నిశా = పసుపుయొక్క - రజః = పొడుముయొక్క - పటలి = మొత్తము యొక్క - చెన్ను = రీతిని, వహించెన్ = తాల్చెను.

శరదృతువున మబ్బువిడిచినయెండ తీక్ష్ణముగా కాయుచుండుటయు, సరస్సులలో తామరలయు కలువలయు పసుపువన్నె పుప్పొడిమొత్తములు (గాలికి రేఁగి) అలలపై పడుచుండుటయు, నెట్లుండె ననఁగా,—శరదంగన భూమికి (నీళ్లకు) సుధయొక్కయుత్కర్షను సంపాదించునట్లు (స్వర్గమునకు సుధచేకల్గినయుత్కర్షను భూమికి నీళ్లచే సంపాదించునట్లు), సరస్సు లనెడి కుండల సమూహములో నీటికాలుష్యము తొలంగి యది అమృతతుల్యమగునట్లుగా మబ్బువిరియెండచేత ఆనీటిని కాఁచుచు, అందు పసుపుఁబొడుమును రాల్చుచున్నదో యనునట్లుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

అప్పుడు నీళ్లు తేటలై అమృతమువలె స్వాదువులును ఆరోగ్యకరములును అయె నని భా. 'కుండ' - చూడు. ౧౩౭ టీక. 'ఇరా భూ వాక్సురాప్సుస్యాత్' అమ. 'సమత్వము' = ''సమా

స్త్రీ వత్సరే సాధు సర్వర్తుల్యేషుతు త్రిషు.'' నానా. 'రహింప' - 'వహింప' అని పూర్వముద్రణ పాఠము. 'నిశా' - ''నిశా రాత్రౌ హరిద్రాయా మర్ధో దుర్నామరోగయోః'' నానా. రాత్రి పేరు లన్నియు పసుపునకుం జెల్లును - ''నిశాహ్వా కాఞ్చనీ పీతా హరిద్రా వరవర్ణినీ'' అమ. 'కైరవ' - మొగిల్విరియెండలో కైరవము వికసిల్లునా? వికసిల్లక దానిపుప్పొడి పర్వుట ఎట్లు? అని ఆక్షేపము. కైవరము రాత్రి వికసిల్లఁగా అప్పుడందుండి వెలువడినరజస్సు కొలనిమీఁద అప్పటినుండి గాలికి రేఁగుచు, అణఁగుచు నుండిన దని తలంపవచ్చును. ''కడారః కపిలః పిఙ్గ పిశఙ్గే కద్రు పిఙ్గళౌ,'' ''పూగః క్రముక బృన్దయోః'' అమ. బావినీటికి మాధుర్యముకలిగించుటకు వైద్యము మిడియెండవేళలో పసుపుఁబొడుమును దానిలో చల్లుట; ఇంక నిట్టియోగము లనేకములు గలవు.—

''అఞ్జనముస్తోశీరైః సరాజకోశాతకామలక చూర్ణైః
కతకఫలసమాయుక్తైర్యోగః కూపే ప్రదాతవ్యః
కలుషం కటుకం లవణం విరసం సలిలం యదివా శుభగన్ధి భవేత్ ।
తదనేన భవత్యమలం సురసం సుసుగన్ధి గుణైరపరైశ్చ యుతమ్॥'' బృ. సం.

ఉ. హెచ్చినమైత్రిఁ బద్మినుల కెల్ల ఘనాత్యయకారుకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయుటకునై యలక్రౌంచనగంబుపేరి క
మ్మచ్చున నీడ్చుశర్వగిరియందలి వెండిశలాకపిండు నా
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁ గొలంకులఁ జక్రచంకృతిన్. 148

ఘనా...డు - ఘనాత్యయ = శరత్కాల మనెడు - కారుకుండు = శిల్పి - (కంసాలి - విశ్వకర్మ), హెచ్చినమైత్రిన్ = అధికప్రేమతో, పద్మినులకెల్లన్ = తమ్మికొలంకులకు (పద్మినీజాతిస్త్రీలకు) అన్నింటికిని (అందఱకును), అచ్చుపడంగన్ = చక్కఁగా, సొమ్ము = ఆభరణములను, చేయుటకునై, అల క్రౌంచనగంబుపేరి కమ్మచ్చునన్ = ఆక్రౌంచగుబ్బలియను పేరుగలదైన బెజ్జములయుక్కుఁదగటి (బెజ్జము) లోనుండి, ఈడ్చు = ఈడ్చుచున్న - శర్వగిరియందలి = కైలాసములోని - వెండి = రజతముయొక్క - సలాక = తీవలయొక్క - పిండు = మొత్తము, నాన్ = అనునట్లుగా, మరాళమాలికలు = హంసలబారులు, వచ్చి = అరుదెంచి, కొలంకులన్ = సరస్సులయందు, చక్రచంకృతిన్ - చక్ర = వలయాకారగతిచేతనైన, చంకృతిన్ = చంశబ్దముతో (పా. ఝుంకృతిన్ = ఝుమ్మను శబ్దముతో), వ్రాలెను.

శరదృతువునందు క్రౌంచరంధ్రముదారిని హంసలు వచ్చి తమ్మికొలంకులలో వ్రాలుట యెట్లుండె ననఁగా.—శరత్కాల మనెడు విశ్వకర్మ పద్మసరస్సు లనెడి పద్మినీజాతి స్త్రీలమీఁద ఎక్కువ మక్కువ వహించినవాఁడై, (వారికై), కాళ్లకు కడియములు, చేతులకు వెండిగాజులును, చేయుటకై కైలాసంపువెండిని క్రౌంచశిఖర మను కమ్మచ్చులోఁ బెట్టి కమ్ములు లాగి ఎవరికై లాగిన కమ్ములు వారికడ నుంచుచున్నాఁడో యనున ట్లుండెను. - శ్లిష్టరూపకానుప్రాణితోత్ప్రేక్ష.

'పద్మినులకున్' - 'పద్మినీ కరిణీ శ్రీ స్త్రీ సరోజ్జ నళినీషుచ' నానా. - 'ఘనాత్యయ' - ఆరోప్యమాణుఁడు పురుషుఁడు గావున స్త్రీలింగమైన శరచ్ఛబ్దముం జెప్పక ఈపుల్లింగశబ్దమును చెప్పినాఁడు. ఘన = మేఘములయొక్క - అత్యయ = విరామము - కారకుండు = అగసాలవాఁడు, అని పాఠంబును టీకయుం గలవు; అయినను శిల్పిపరముగా 'కారు' శబ్దము ఉపలబ్ధము

గాని, కార - కారక శబ్దములు గావు, కావున నీ మార్పు చేయఁబడినది. - 'కారుశ్శిల్పివిశ్వకర్మా' నానా. అటుపై స్వార్థమున క ప్రత్యయము. 'క్రౌంచనగంబు' - 'హంసద్వారం భృగుపతి యశో వర్త్మయత్ క్రౌఞ్చరన్ధ్రమ్' మేఘ. 'వీరఃక్రౌఞ్చస్య భేదాత్కృతధరణితలాపూర్వహంసావతారః' మహావీరచరిత్ర. 'శర్వుఁడు' - 'ఈశ్వరశ్శర్వ ఈశాన శ్శంకరశ్చన్ద్రశేఖరః' అమ. అతనికి నివాసమైన గిరి కైలాసము, వెండికొండ; - 'కైలాసస్య స్ఫటికత్వా ద్రజతత్వా ద్వా బిమ్బగ్రాహిత్వే నేదముక్తమ్' అని మేఘటీకలో మల్లినాథుఁడు, 'చక్ర' - పక్షులు నేలకు దిగునప్పుడు చక్రప్రమాణముగా దిగును - 'దమయంతీ వదనచంద్రబింబంబు సేవింపం బనిబూని వచ్చుపరివేషంబు చాడ్పున వలయాకారంబున నవతరించుచు... వ్రాలిన' అని నై. 1. (44). లో దమయంతికడ హంస వ్రాలినవిధము వర్ణితము.—వెండికమ్మియు కమ్మచ్చున లాగినవెంటనే చుట్టచుట్టుకొనును. కావునసామ్యము.—"కమ్మి యటం చనఁగా లోహలతయొప్పుఁ గమ్మచ్చు నాఁగఁ దత్కరణయంత్రమొప్పు." ఆం. భా. 2 (500)

తే. కుంభజుఁడు వార్ధితోఁ గ్రోలి కుక్షి నున్న
మించుముక్తాచ్ఛటలె క్రుమ్మరించె ననఁగ
జలజదళములఁ దేటలుఁ జవులు నయిన
యంబుకణములు వొలిచెఁ బద్మాకరముల. 149

కుంభజుఁడు = అగస్త్యుఁడు నక్షత్రరూపమున మింట నున్నవాఁడు, వార్ధితోన్ = సముద్రముతో, క్రోలి = త్రాగి, కుక్షిన్ = కడుపులో, ఉన్న - మించుముక్తాచ్ఛటలె = ప్రకాశమానములైన ముత్తెములసమూహమును మాత్రమే, క్రుమ్మరించెన్ అనఁగన్ = క్రిందికి దిమ్మరించెనో యనునట్లుగా, పద్మాకరములన్ = తమ్మికొలఁకులయందు, జలజదళములన్ = తామరాకులయందు, తేటలున్ = స్వచ్ఛమైనవియు, చవులున్ = స్వాదిమయు తూనికయుగలవియు. కణములు = నీటిబిందువులు, పొలిచెన్ = సొంపారెను.

అప్పుడు తమ్మికొలంకులయందు తామరాకులమీఁద తేటలును స్వాదువులును ఐననీటిబిందువులు ప్రకాశించుచుండుట ఎట్లుండె ననఁగా, అగస్త్యులవారు సముద్రజలముతోఁగూడ అందులోని ముత్తెములను త్రాగి, పిమ్మట నీటిని కడుపులోనే ఉంచుకొని, కడుపులోనుండి స్వచ్ఛములును తూనికగలవియు ప్రకాశమానములును అయినట్టి యాముత్తెములనుమాత్రము క్రిందికి ఈకొలంకులలోనికి క్రుమ్మరించినారా యేమి అను నట్లుండెను.-శ్లేషానుప్రాణితోత్ప్రేక్ష.

'జలజదళముల'—చూ. 2 (8) టీక. 'ముక్తాచ్ఛటలె' - ఎకారముచేత ముత్తెములను మాత్రమే తా నిచ్చెనుగాని వానితోఁగూడ ఉప్పునీటిని రానీయలేదు - అని భా.

'కుంభజుఁడు' (ముక్తాచ్ఛటలు గుమ్మరించెన్) అనుట కుంభజోదయ దినములలో నీరు తేటపడుటవలన. 'మించు' అనుటచే ధావళ్యము సూచితము. అభావముచే జలబిందువులస్వాదుత్వము వర్ణితము. 'తేటలు' - మేలైన ముత్తెములయందలి ఛాయాతారళ్యమునకును నీ రనివ్యవహారము; అది గలవి యని ముక్తాపక్షమున నర్థము:—

'సుఖాయ గ్రీష్మసమయో మహారాజస్య! సంప్రతి—
సత్పానీయ మితి ప్రఖ్యాతేః స్వభవనే పూర్వం పరీక్షావిధౌ
త్వద్వైరిక్షితిపాల పత్న్యుదృశ స్సంప్తాతుకాః కాననే

బాష్పామ్భఃకణ చక్రవాళ రచనా చఞ్చత్కపోలాన్తరం
ముక్తాదామ విలోకయన్తి గమనవ్యగ్రాః కుచాగ్రస్థితమ్.' కర్పూరమఞ్జరి. 4 (7).

'చవి' - ముత్తెముల తూనికకు పేరు: —

సీ....'మౌక్తికం బొప్పను। ముత్తెము ముత్యము ముత్తియ మనఁ,
దద్విశేషాభిధల్ దనరుఁ దార మనంగ,। వాణి యం చనఁగ, సుపాణి యనఁగ;
తే. నదియె యరదైన గొగ్గి యం చనఁగ వెలయుఁ, జిప్పముత్తెం బటం ద్రదే చేయఁబడిన.
వీనితూనిక చవి యని వెలయుచుండు.' ఆం, భా.

చ. కెరలు ప్రవంతిఁ బైయిసుక క్రిం దగువేళ నినుండు మేఘపుం
దెర సనఁ జల్లఁగా, విరహదీప్తకరప్లుత మౌ సజీరకో
త్కరగుడ మట్ల పద్మినులఁ గ్రమ్ముఁ సకేసరమాధ్వి పొల్చెఁ, బైఁ
గర మరుదారెఁ దేంట్లు సెకఁగందినముత్తెపుసేసలో యనన్. 150

కెరలు ప్రవంతిన్ = విజృంభించుచున్న యేటియందు (డమరుకరూపమైన యిసుకగడియారమం దనియు స్ఫురించుచున్నది), పైయిసుక = ప్రవాహములోని పైభాగమందలి యిసుక, క్రిందు అగువేళన్ = క్రిందికి దిగుసమయమున (గడియారములో పైసగమందలి యిసుక నడిమి బెజ్జముదారిని క్రిందిసగమునం జేరు సమయాన అనియు), ఇనుండు = సూర్యుఁ డనెడురాజు, (పెండ్లికుమారుఁడు), మేఘపుందెర = మబ్బనెడు తెరచీర, చనన్ = పోయినంతట, చల్లఁగా = ఉంపఁగా, విర...ము - విరహ=వలవంత చేత (అయోగవిప్రలంభము చేత) - దీప్త=వేఁడియైన - కర=అరచేతియందు - ప్లుతము=ద్రవీభూతమై వెలికొలుకుచున్నట్టిది, ఔ సజీరక ఉత్కర గుడము అట్లు = జీలకఱ్ఱ మొత్తముతోఁగూడిన బెల్లమోయనునట్లుగా, పద్మినులన్ = తామరతీవ లనెడు పద్మినీజాతిస్త్రీలను, క్రమ్ము సకేసర మాధ్వి = అలముకొన్న యకరువుకొనలతోడి మకరందము, పొల్చెన్ = సొంపారెను, పైన్ = ఆతీవలమీఁద, తేంట్లు = తుమ్మెదలు, సెకన్ = ఆపద్మినుల విరహాగ్ని చేత, కం...లో - కందిన = నల్లఁబడిన - ముత్తెపుసేసలో = ముత్యాలతలంబ్రాలో, అనన్ = అనునట్లుగా, కరము = మిక్కిలి, అరుదు ఆరెన్ = వింత నొల్పుచుండెను.

మున్ను పొంగి పొరలి పాఱుచుండిన యేట్లలో పైవఱకుం గలసి కొట్టుకొనిపోవుచుండిన యిసుక, శరదృతువునందు నదీవేగము తగ్గుటచేత క్రిందికి అడఁగిపోవును. మబ్బులు తొలఁగును; మఱియు ఏటిలో తామరలు పొడమి వికసిల్లి, అకరువులతోడి మకరందంబు పొంగి పొరలి నీటిపై తేలుచుండును. తామరతీఁగలపై నల్లఁగా తేంట్లు ముసురుకొనుచుండును. అట్టియాశరత్తును కవివర్ణించుచున్నాఁడు. ఏటిలోని పైయిసుక క్రిందికి దిగి అడంగిపోవుసమయమే గడియారములోని పైగిన్నెయందలి యిసుక క్రిందికి దిగిపోవు సమయముగా నొప్పఁగా, అనఁగా, సుముహూర్తము రాఁగా, సూర్యుఁ డనెడిరాజు, అతఁడే వరుఁడు, పద్మలత యనెడు పద్మినీజాతి స్త్రీని పెండ్లియాడుటలో మబ్బనెడు తెరతొలఁగఁగా, తనకొఱకైన వలవంతచిచ్చుచే దీపించుచున్న పెండ్లికూఁతురైన పద్మలత యనెడిపద్మినీజాతిసుందరియొక్క తమ్మికేల, వివాహాంగముగా జీలకఱ్ఱతోడి బెల్లము నుంపఁగా, అది యాచేతి విరహదీప్తిచే కరఁగి పాకమై పొరలి ఒలుకుచున్నదో యనునట్లుగా, ఆతమ్మియందలి యకరువులతోడి మకరందము ఒప్పుచుండెను. పైని ముసురుకొనుచున్న

తేంట్లు ఎట్లుండెననఁగా ఆపెండ్లికుమారుఁడు ఆపెండ్లికూఁతు శిరమందు పోయఁగా తదీయవిరహోష్మచేత కందిన (అనఁగా నల్లఁబడిన) ముత్యాలతలంబ్రాలో యను నట్లు ఒప్పుచుండెను.- శ్లిష్టరూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

నళినీసూర్యులకు నాయికానాయకభావము- "ఇనోఽభిగోర్ధామనిధిః పద్మినీవల్లభో హరిః" అమ. అధికపా. శరత్తున నదులందలి పైకాలుష్యము క్రిందికి పోవుటయే నది ప్రసన్నమగుట - 'గఙ్గాం శరన్నయతి సింధుపతిం ప్రసన్నామ్.' అని ముద్రా. 'స్రవన్తీ నిమ్నగాపగా' అమ. 'స్రవన్తీ' అనఁగా స్రవించునది అని వ్యు: ఇసుకగడియారము బుడబుడక్కల వారిచేతి (డమరు) వాద్యము నాకారముగా నుండును; క్రిందను మీఁదను మూయఁబడియుండును; దానిసన్నపాటి నడుమునందు సన్నపాటిబెజ్జము ఉండును. దానిలో సమభాగములగు రెండుగిన్నెలలో ఒకటి నిండునట్లుగా ఇసుకయుండును; పైగిన్నెలోనియిసుక యంతయు, ఆబెజ్జముదారిని క్రిందిగిన్నెలోనికి దిగఁగానే దానిని తలక్రిందుచేసి పెట్టుచుందురు. ఒకమాఱు క్రిందిగిన్నె నిండిన ఒకఘటిక యని కొలఁతి యేర్పఱుచుకొందురు. దీనివలన సజీరకగుడనిక్షేపమునందలి గడియలను లెక్కించుకొందురు. అట్లే వివాహప్రయోగమునం జెప్పఁబడియున్నది:—

'సావధాన - సుముహూర్తే - దైవజ్ఞోఘటికాయన్త్రేణ ముహూర్తం సమ్యగవలోక్య... సుముహూర్తే వధూ వరయోశ్శిరసి సజీరకగుడం నిక్షిపేత్ - 'ధ్రువం తే రాజా వరుణో...శన్నో భవద్విపదే శం చతుష్పదే - (ఆవరణవస్త్ర ముపాస్య).' ఇందు - ఉపాధ్యాయుఁడే వధూవరుల శిరమునందు సజీరకగుడమును నిక్షేపించి మంత్రము పఠించును. అనంతరము వధువు నావరించియున్న తెరం దొలఁగింతురు' అనియున్నది, ఆచారములందు ఇంచించుక భేదములును కలవు. 'కిఞ్జల్కః కేసరోఽ స్త్రియామ్.' అమ. 'ఆకరువు'లతుదలు లావుగా జీలకఱ్ఱవలెను, కడమ సన్నిభాగములు జీలకఱ్ఱయొక్క ముండ్లవలెను ఉండును. 'విరహదీప్త' - దీనిం జెప్పుట బెల్లము కరఁగుటకు, జీరకగుడంబులు కేల నుంచుట:—ఇందే 6 (131) యందును, ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము 578 లోను, చంద్రికాపరిణయము 6 (68) లోను, చూ. 'మాధ్వీ' - సం. వి. ఈ 1. మద్యము; 2 మకరందము.' శ. ర. 'సీస'—శీసాశబ్దవైకృతము.

నదులయందుతామరయుండుట కవిసమయము. - 'సరిదుదధిగతం పఙ్కజేన్దీవరాది.' సా. ద. 7. పరి.

చ. జలజదళస్థతోయములు సందులఁ గ్రందుగఁ దోఁచుమింటిసీ
డలుఁ గనుపట్టె నత్తఱిఁ దటాకముల న్లఘిమంబు రెంటిలోఁ
దెలియఁ దరంగ బైకెగయు తేఁటులచేరులఁ దూన్పఁ దోయము
ల్పలుచనఁ దేలె; మి న్నడుగుఁబట్టెఁ గడుం దళమౌటనో యనన్. 151

జలజదళస్థతోయములన్ = తామరాకులయందున్న నీళ్లును, సందులన్ = (తటాకములలో) అవిలేని తావులయందు, క్రందుగన్ = దట్టముగ, తోఁచుమింటిసీడలును (ఎట్లు కనుపట్టిన వనఁగా), అత్తఱిన్ = ఆశరదృతువునందు, తటాకములన్ = కొలఁకులయందు, రెంటిలోన్ = తోయాకాశములలో, లఘిమంబు = తేలికతనమును (ఏది తేలికయో), తెలియన్ = ఎఱుంగంగోరి, తరంగ = అల, పైకిన్ ఎగయు తేఁటుల చేరులన్ = మీఁదికి లేచుచున్న తేంట్లతో నల్లిన గొలుసులుకట్టి,

తూన్పన్ = తూనిక చూడఁగా, తోయముల్ = నీళ్లు, పలుచనన్ = పలుచఁదనముచేత, తేలెన్ = పైకిలేచెను, మిన్ను = ఆకాశము, కడున్ దళము = మిక్కిలి చిక్కన, ఔటన్ = అగుటవలన, అడుగుపట్టెనో = అడుగునకుం బోయినదో యనునట్లుగా, కనుపట్టెన్ = అగపడెను.

ఆసమయమున తటాకములలో నీళ్లుగల తామరాకులు పైకి తేలుటయు, వానినడుమ ప్రతిబింబితమైనయాకాశము క్రింద నుండుటయు నెట్లుండెననఁగా, - ఆకాశమే తేలికయో నీళ్లే తేలికయో చూతము గాక యని పైకిలేచుచున్న తేంట్లచేరులతో తరంగ తూన్పఁగా, పలుచన యగుట చేత నీళ్లుపైకి తేలినవో యనునట్లును, చిక్కనైనందున ఆకాశము క్రిందికి పోయినదో యనునట్లును, ఉండెను. — నీరు అతిస్వచ్ఛమై కరము తేలికగా నుండె నని భావము. - ఉత్ప్రేక్షాలంకారము.

'జలజదళ',— చూ. 2 (6) టీక. 'తేఁటులచేరులు'— రూపకసమాసముగా సాధించుట సులువుగాదు, మధ్యమపదలోపిసమాసముగా గ్రహింపవచ్చును. తటినే కర్త గాఁ గొనిన తరంగ హస్త స్థానీయ మగును. జలజపత్త్రగతజలము పైకి తేలినను కడమతటాక జలమెల్ల క్రిందనే యుండలేదా యనిన, లేదు, ఆకాశప్రతిబింబమే అగపడును గాని దానికి ఆధారమైన జలము అగపడదు; ఆకాశము నీటనెల్లం బ్రతిబింబిత మగును. పైకెగయుట తరంగచేత ననునన్వయము సొంపుగాదు, తరంగను తూఁచుకర్తనుగా నేని అట్టికర్తయొక్క హస్తమునుగా నేని కొనుటకుఁ దగినట్లు అన్వయించుకొనవలయును. తేంట్లు చేరులైనవి. తులయొక్క గిన్నె లేవి? తామరాకులు - ఇవి - నీరుంచినగిన్నెలు; ఆకాశ ముంచినగిన్నె లేవి; బరువుచే క్రిందికి పోయినవిగానఁ గనఁబడకున్నవి. 'నీడలుఁ గనుపట్టెనత్తఱిఁ దటాకములన్' - ఇట 'తటమ్ అకతి - అకవక్రగతౌ' అనువ్యుత్పత్తి పక్షమున 'తట+అక' అని పదచ్ఛేద ముండఁగా వ్యంజనయతి యెట్లు? అని ప్రశ్నమేని అప్పకవి జెప్పిన నిత్యసమాసయతిగాఁ గొనవలయును.

మ. ఇలకున్ వ్రేఁగుగఁ బండితీరవనపుండ్రేక్షుచ్ఛటల్ తీపు ల
గ్గలమై వ్రాల, నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రిప్పు రాట్నంపు గుం
డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పాఱ న్విచ్చు పంకేరుహాం
బుల నాడెం దొలుసంజఁ దేఁటివలయంబు ల్తారఝంకారముల్. 152

ఇలకున్ = భూమికి, వ్రేఁగుగన్ (కాన్) = భారమగునట్లుగా, పండి = ఎదిగి, తీరవన పుండ్రేక్షుఛటల్ = (కొలంకుల) దరియందలి చెఱకుఁదోఁటలలోని నామాల చెఱకుల సమూహములు, తీపులు అగ్గలమై = మాధుర్యము మెండై (అనఁగా చక్కఁగా పండి), వ్రాలన్ = వంగి కొలంకులలోని కమలములమీఁద పడఁగా, విచ్చుపంకేరుహంబులన్ = వికసిల్లుచున్న కమలములనుండి, తేనె = ఆకమలములయందలి మకరందము, పొరలి = కమలములనుండి వెలికిపొంగి, పాఱన్ = ప్రవహించుచుండఁగా, తారఝంకారముల్ = బిగ్గరయైన ఝంకారశబ్దము కలవైన, తేటివలయంబుల్ = తుమ్మెదల చక్రములు, తొలుసంజన్ = ప్రాతస్సమయమందు, (ఎట్లు ఆడెననఁగా), ఉరుస్వనంబులు = బిగ్గరయగుధ్వనులు, ఎసఁగంగాన్, ఒప్పుచుండఁగా, = త్రిప్పురాట్నంపు గుండ్రలు నాన్ = (కమలము లనెడి ఆచెఱకురాట్నములలో ఆ వ్రాలినచెఱకుల రసములను పిండుటకై) త్రిప్పఁబడుచున్న చెఱకుగానుగకంబములో యనునట్లు, ఆడెన్ = సుడిసినవి.

కొలంకులయందు కమలము లుండినవి; వానిదరులందు చెఱకుఁదోఁటలలోని నామాలచెఱకులు నేలకు బరు వగునట్లుగా మధురతమమైన మెండురసముతో పండి తమబరువునకు తామే వంగి

పోయి, ఆకమలములమీఁదికి, వ్రాలినవి. అందువలన, ఆకమలములలో నిండియున్న మకరందము పొరలి పాఱుచుండినది. ప్రాతః సంధ్యయందు ఆతేనెకై ఆకమలములమీఁద బిగ్గరగా జుం జుం జుమ్మనిమ్రోయుచు, తేంట్లగుంపులు సుడియందొడంగినవి. ఆకమలములు ఆచెఱకులను ఆడుటకైన గానుగలుగాను, అందుండి పొరలి పాఱుచున్నమకరందము ఆచెఱకులమధురతమరసముగాను, కొలంకులే ఆచెఱకురసంపుఁ గటాహములుగాను, పైసుడియుచున్న తేఁటికూటువలు ఆగానుగలలో త్రిప్పఁబడుచున్న గానుగకంబములుగాను, ఉత్ప్రేక్షింపఁబడినవి.—ఉత్ప్రేక్షాలంకారము.

'వ్రేఁగుగఁబండి' - పెద్దపెద్దగడలుగా ఎదిగి; రససంభృతము లగుటచేత వ్రేఁగగును; 'తీర' - తీర మగుటచే వానికి జలసమృద్ధి. అందువలననే వ్రేఁగుగ బండును; 'వ్రేఁగు లన బరువులపేరు వెలయుచుండు' ఆం. భా. ౪ (40). 'తీపు లగ్గలమై' - పుండ్రేక్షువు గావున.

'తత్ర పౌండ్రిక । శైత్యప్రసాద మాధుర్యైర్వర స్తమను వాంశికః
శాతపర్వతకాన్తార నైపాళాద్యా స్తతః క్రమాత్' అష్టాంగహృదయము.

కావుననే ఇక్షువిశేషమును జెప్పవలసినప్పుడు దానినే చెప్పుదురు.

'చతుర్భుజే చంద్రకళావతంసే । కుచోన్నతే కుఙ్కుమరాగశోణే
పుణ్డ్రేక్షుపాశాఙ్కుశ పుష్పబాణ।హస్తేనమ స్తేజగదేకమాతః.' శ్యామలాదండకావతారిక.

'పూవుందూపులజోదు పుచ్చుకొనియె న్బుండ్రేక్షుకోదండముల్.' శృం. నైషధ.

'ఉరుస్వనంబులు' - చెఱకు నలుగునప్పుడు గానుగతో గుండ్ర ఒరసికొనుటచే నగునట్టి నిడుదకీఱు ధ్వనులు. 'తార' - 'తారోత్యుచ్చైః' అమ. 'విచ్చు' తొలుసంజకావున; - 'తొలు సంజల్' - తొలుసంజవికసించుసమయముగావున; అప్పుడు వికసింపఁగానే తటాలున మకరందమును త్రాగుటకై తమకముతో తేంట్లు ముసరును; ముందువచ్చినతేంట్లు త్రాగివైచుటలోనగు కారణములచేత పిమ్మట తమకు తేనెదొరకునో దొరకదో అనుశంకచే అన్నియు ముందే మూఁగుటకు జాగ్రత్తపడు ననుట. 'వలయంబుల్' అనుట రాట్నములో తిరుగుచుండు గుండ్రలసాదృశ్యముకొఱకు.

సీ. (క). హాల నమత్కదళీ కందాభ తిర్యఙ్ఞతా
స్యమునఁ గొ మ్మొకటి మో సనఁగఁ గ్రుంగఁ;
(ఖ). గటముల డిగి చిబుకమున రే పేరిన
మద మంజనగ్రంథిమాడ్కి మెఱయ;
(గ). ఛిద్రోత్థహాతవలత్కద్రూజ మనఁ జుట్టు
తో విప్పుతో దరిఁ దొండ మాడ;
(ఘ). తెల్లుఁబెళ్లలు నీటఁ ద్రెళ్లి ఫేనము వండు
నయి పునఃప్రావృడాశయము నొసఁగ;
తే. (జ). ఘనరజోవృష్టికై మీఁదికన్ను మొగుడఁ,
గటి దెసలు నిక్క, బరితోలు గదలఁ, గీలు
మదము తిక్తత నదుల కీఁ, దదనుకృద్వ్రా
పాళితోఁ దేంట్లు పఱవఁ, గోరాడెఁ గరులు.

(క). హల...నఁ - హల = నాఁగటిచేత, - నమత్ = వంగుచున్న - కదళీ = అనంటి యొక్క - కంద = దుంపయొక్క - అభ = ప్రకాశమువంటి ప్రకాశము కలదైన - తిర్యక్ = అడ్డముగా - నత = వంగిన - ఆస్యమునఁ = ముఖమందు, కొమ్ము ఒకటి = ఒక్క విషాణము (దంతము), మోసు అనఁగఁ = మోవు అనునట్లుగా, క్రుంగఁ = నేలం గ్రుచ్చుకొనఁగా;

(ఖ). కటములఁ = గండములనుండి, దిగి = క్రిందికిజాఱి, చిబుకమునఁ = గడ్డమునందు, రే = రాత్రియందు, పేరినమదము = ముద్దకట్టినదానము, అంజనగ్రంథిమాడ్కిఁ = కాటుక కరుడోయనునట్లు, మెఱయఁ = ప్రకాశించుచుండఁగా; తొండము, దరిఁ = నదియొడ్డుమీఁద, ఛిద్రో...ము - ఛిద్ర = బొక్కనుండి - ఉత్థ = లేచినట్టిదై - హత = కొట్టఁబడినదై - వలత్ = చుట్టుకొనుచు కొట్టుకొనుచు నున్న, కద్రూజము = పాము, అనఁ = అనునట్లుగా, చుట్టుతోఁ విప్పుతోఁ = చక్రాకారముగా చుట్టుకొనుచును నిడివిగా విడిపోవుచును, ఆడఁ = చలించుచుండఁగా;

(గ). తెల్లఁబెళ్లలు = తెల్లుతోడి మట్టిగడ్డలు, నీటఁ = నీటిలోనికి, త్రెళ్లి = దొరలిపడి, ఫేనను వండును అయి = తెల్లఁబువ్వుల నురుగుగానై - పెళ్లకరఁగి నీరువండలియై పునః ప్రావృట్ ఆశయమునఁ = మరల వర్షాకాలము (వచ్చినదో) అనుతలంపు, - ఒసఁగఁ = కలిగించుచుండఁగాను;

(ఘ). ఘనరజః వృష్టికై = దట్టమయిన పుప్పొడియొక్క వర్షమును కంటిలో పడకుండ నివారించుటకై, మీఁదికన్ను = మింటివైపు నున్నకన్ను, మొగుడఁ = మూసికొనఁగా, కటి = పిఱుఁదు, దెసలు నిక్కఁ = దిక్కులవైపు నిగుడుచుండఁగా, బరితోలు = ప్రక్కచర్మము, కదలఁ = చలించుచుండఁగా, కీలుమదము = ఓడకీలువలె నల్లనిదియు చిక్కనిదియునైన దానము, నదులకు = ఏళ్లకు, తికతఁ = సుగంధితను (చేఁదుదనమును), ఈఁ = ఒసఁగుచుండఁగా, తత్ అనుకృత వృష అళితోఁ = ఆయేనుఁగులను అనుకరించుచున్న యాఁబోతులతోఁగూడ, తేంట్లు = మదమునకై యేనుఁగుచెక్కులను ముసురుకొనుచుండు తేంట్లు, పఱవఁ = పలాయనమగునట్లుగా, కరులు = ఏనుఁగులు, కోరాడెఁ = దంతములను అడ్డముగా త్రిప్పుకొని వానితో నదులయొడ్లను కెళ్లగించుచుండినవి.

ఏనుఁగులు నదులయొడ్లను కోరాడుచుండినవి. ఎట్లనఁగా, ఒకకన్ను క్రిందను ఒకకన్ను మీఁదను ఉండునట్లుగా శిరస్సును వంచినవి. ఆస్థితిలో ఆశిరము నాఁగటికి పెళ్లగిల్లి ఒరగిపడిన యరఁటిదుంపయోయననుండెను; ఏనుఁగు క్రిందివైపుననున్నకొమ్మును నేలలో గ్రుచ్చినది. అంత నా కొమ్ము ఆయొఱగిన దుంపయొక్క మోవు నేలకు తగులుచున్న దను నట్లుండెను; తొండమును చుట్టుచు విప్పుచు దరిమీఁద వైచి చాఁచినప్పుడు, అది అప్పుడే బొక్కనుండిలేచి దెబ్బ తిని చుట్టుకొనుచు చుట్టవిప్పుకొనుచు నున్న పామో యనునట్లుండెను; ఈయేనుఁగులవలెనే దరులం గోరాడుచున్న యాఁబోతులు వీనిం గని పఱతెంచుచుండఁగా, వీనికటములను మదమునకై యాశ్రయించిన తేంట్లుగూడ నలుఁగుడునకు వెఱచి ఆయాఁబోతులతోఁగూడ పఱవఁగా ఈయేనుఁగులు నదీతటములను కోరాడుచుండినవి. సీసపాదములందు ఉత్ప్రేక్ష - గీతమందు స్వభావోక్తి.

'కదళీవారణ బుసారమ్భామోచాంశుమత్ఫలా' అమ. 'కదళః' అనిపుల్లింగము - గౌరాది [జీష్ప్రత్యయము]; 'కదళీ' యని స్త్రీలింగరూపము, 'కదళీకదళో పునః రమ్భావృక్షే' మేదిని

కావున 'కదళి కంద' అని ఇకారము (హ్రస్వము) సిద్ధింపదు, అందువలన 'కదళీ కందాభ' అని పఠింపవలయును. 'మోసనఁగఁ గ్రుంగ' - వ్రాలిపడిపోయిన యనఁటి దుంపయొక్క మోసుకూడ నేలకు తగులుచుండును. 'అంజన గ్రంథమాడ్కిన్' - కాటుకకరుడోయను నట్లుండెను, అని యర్థము.—'కద్రూజము' - కద్రువ (కద్రూశబ్దము) నాగమాత - ఆమెవలనం బుట్టినవి గావున కద్రూజములు నాగములు; 'అనన్' ఉత్ప్రేక్షావాచకము. 'తెల్లు...నొసఁగ' - రజః = సప్తచ్ఛదాదుల పుప్పొడి-చూ. 143. 'తిక్త' - ఏనుఁగుమదము ఏడాకుల యరఁటిపాలతావి గలది.

'సప్తచ్ఛదక్షీరకటుప్రవాహ। మసహ్య మాఘ్రాయ మదం తదీయమ్।
విలఙ్ఘితాధోరణతీవ్రయత్నాః। సేనాగజేన్ద్రా విముఖా బభూవుః.' రఘు.

[వ్యాఖ్య - 'కటుః సురభిః'-'కటుతిక్తకషాయాస్తు సౌరభ్యేఽపి ప్రకీర్తితాః' ఇతియాదవః]

'తస్యాస్తిక్తై ర్వనగజమదై ర్వాసితం వాన్తవృష్టి
ర్జమ్బూకుఞ్జప్రతిహతరయం తోయ మాదాయ గచ్ఛేః.' మేఘ.

[వ్యా. 'తిక్తైః — సుగన్ధిభిస్తిక్తరసయుక్తైశ్చ.']

'పొగడపూవంటి కంపుల మదాంబువులను' అని గంభీరవేది గజవర్ణనమున వసుచరిత్ర.

మదవర్ణములు.—'భద్రస్య వర్ణో హరితో మదస్య మన్ద్రస్య హారిద్రకసన్నికాశః
కృష్ణో మదశ్చాభిహితో మృగస్య సంకీర్ణనాగస్య మదో విమిశ్రః.' బృ. సం.

'కోరాడెన్' - 'కోరాడెఁ జరిమెను గొండాడె నాగను దుమ్ము రేఁచె నటం మెఁదోఁచుచుండు,' ఆం. భా. ౩. 132. గీతమందు స్వభావోక్తి.

శా. గండద్వంద్వగళత్కరాళమదరేఖల్ ఫుల్లసప్తచ్ఛదా
ఖండక్షోదసితప్రకీర్ణకము లై కర్ణద్వయి న్మించఁగాఁ,
గొండల్ద్రవ్వినమున్ను కత్తులగతిం గొమ్ముంగొనల్ ముంప, వే
దండంబుల్ చవుదంతు లౌటఁ దెల్పెం దండెత్త భూపాలికిన్. 154

గండ...ఖల్ - గండ = చెక్కిళ్లయొక్క - ద్వంద్వ = జంటయందు (రెండుచెక్కులయందు) - గళత్ = జాఱుచున్న - కరాళ = దట్టమైన - మద = దానముయొక్క - రేఖల్ = చాళ్లు, ఫుల్ల...ర్ - ఫుల్ల = వికసించిన - సప్తచ్ఛద = ఏడాకులయరఁటి పూవులయొక్క - అఖండ = విస్తారమయిన - క్షోద = ధూళిచేత - సితల్ = తెల్లనై నట్టివి, ప్రకీర్ణకములు ఐ = చామరములై (వ్యాప్తములై అనియేని), కర్ణద్వయిన్ మించఁగాన్ = గండములకు ఎక్కువై రెండు చెవులపొంఁదికంగూడ వ్యాపింపఁగా, కొండల్ త్రవ్వినమున్ను = కొండలను గోరాడఁగా నంటుకొనినమన్ను, కత్తులగతిన్ = కత్తులవలె, కొమ్ముం గొనల్ = కొమ్ములయొక్క యగ్రములను, ముంపన్ = కప్పియుండఁగా, వేదండంబుల్ = ఏనుఁగులు, భూప ఆళికిన్ = రాజుల సమూహమునకు, దండు ఎత్తన్ = దిగ్విజయార్థము తరలుటకు, చవుదంతులు = తాము నాలుగు దంతములు గల యైరావతగజములు, ఔటన్ = అగుటను, తెల్పెన్ = బోధించినవి.

అప్పుడు ఏనుఁగులు ఇంద్రుని యైరావతగజమువలె నాలుగు దంతములు గలవై యుద్ధసన్నాహముగా కోరలకొనలందు కత్తులందాల్చి, చెవులందుఁ జామరములు గలిగినవై ఆతీరుచేత, రాజులను 'లెండి వైరివిజయమునకు తరలుఁడు, దండయాత్ర కిది సమయము' అని బోధించినవి. అది

ఎట్లన వికసించిన యేడాకుల యరఁటిపూవులయొక్క ధవళధూళి ఇరుగండములందును ఓడుచున్న దట్టంపు మదరేఖలకు అంటుకొనఁగా, ఆరెండు రేఖలును హెచ్చుగా రెండు నూతన దంతములు కలిగినవన నొప్పుచుండెను. ఆతెల్లని రేఖలే మాటిమాటికి చెవులను ఏనుఁగు ముందునకును వెనుకకును వీచుచుండుటచేత ఆగండములనుండి చెవులకు సంక్రమించిన ధవళచామరములుగా నొప్పుచుండెను. కొండలం గోరాడఁగా కొమ్ముల కొనలయందు నిండుగా అంటుకొనియున్న మన్ను ఎండి కత్తులుగా నుండెను. ఈతీరుచేత ఏనుఁగులు రాజులకు 'లెండి.—దిగ్విజయమునకు తరలుఁడు మీకు జయమునొడఁగూర్చుటకై ఈశ్వరుఁడు మమ్ము ఐరావతములనుగావించినాఁడు; మాకొమ్ములకు కత్తులనుగూడ కట్టినాఁడు.' అని బోధించునట్లొప్పినవి. 'కొండల్ద్రివ్విన' యనుటచే వజ్రాయుధముతోడి సాటి సూచితము. - ఉత్ప్రేక్షాలంకారము.

'కరాళ' - కరాళో దన్తురే తుఙ్గే,' అమ.—దట్టమనుట లావుగా విషాణములవలె నుండుటకు. 'ఫుల్ల' - వికసించినందుననే ఛేదము విస్తారముగా నున్నది. 'సితల్' - ఏడాకులయరఁటి పుష్పాదివర్ణము తెలుపు; చూ. ౧౮౩ '(నిర్మలకాంతిలో).' 'దధిసరవర్ణానిసప్తపర్ణాని,' - విషాణము తెలుపు - తత్సామ్యముకై దానిం జెప్పుట. 'ప్రకీర్ణములు' - ప్రకీర్యతే స్మ - కౄ విక్షేపే - 'ప్రకీర్ణకం చామరే స్యా ద్విస్తరే నా తురఙ్గమే' - మేదిని. ఇందువలన దానికి రెండర్థములు.

'అరుగుదెంచెఁ గాశినగరికి నికటభాగ ప్రకీర్ణ । గగనగంగాతరంగిణీకనకకమల ।
పరిమళోద్గారిణికి మహాభైరవుండు.' కాశీ. 5 (21).

ఏనుఁగుల చెవులకు అలంకారముగా ధవళచామరములం గట్టుదురు. 'కత్తులగతిన్' - యుద్ధమునకుం బోవు నేనుఁగులదంతములకు కత్తులం గట్టుదురు. 'చవుదంతులు' - నాలుగు దంతములు గలయేనుఁగులు - ఐరావతమునకు నాలుగు దంతములు; అది యింద్రుని గజము - తల్లక్షణముం దాల్చుటచేత అప్పుడు తమ్ముం బురస్కరించుకొని దండెత్తువారికి ఆయనకుం బోలె వైరిజయమును అఖండైశ్వర్యమును లోకాధిపత్యంబును గలుగు ననుట.—'కలిజేజేయన్న విను ప్రో । ద్దార చౌదంతియొకిమీఁదు తూరుపువోర' ఆం. భా. 'వేలుపులగాయ చౌదంతి వెల్లయేనుఁ । గనఁగ నైరావతంబున కాఖ్య లమరు,' ఆం. నా. సం. 'వేదండంబుల్' - వేదము అండముగా అనఁగా తమ జన్మస్థానముగాఁ గలవి. సామవేదమునుండి యేనుఁగులు పుట్టినవి; అందువలన వానికి సామజము లని పేరు - వేద+అండ = శకంధ్వాదిత్వమువలన 'వేదండ' అని పరరూపసంధి వచ్చినది.

తే. అప్పు డన్యోన్యవిజిగీషు లైనదొరల
కవ దొనలనుండి లబ్ధలక్ష్యతఁబడసిన
స్వకులశరపాళిచేఁ గీర్తి చాలఁగనెనో
యన వనాళిఁ బ్రఫుల్లశరాళి మెఱసె. 155

అప్పుడు = ఆశరత్సమయమందు, అన్యోన్య విజిగీషులు = ఒండొరులను జయింపఁ గోరినవారు, ఐన - దొరల కవదొనలనుండి = రాజుల యమ్ముల పొదుల జంటలనుండి, లబ్ధలక్ష్యతన్ = తగిలినగురి గలవి యగుటను, పడసిన = పొందిన - స్వకుల శరపాళిచేన్ = తమవంశమువి అయిన బాణముల సమూహముచేత ['స్వాన్వయశరాళిచేఁ జాలయశము' అని పా.], చాలన్ = మెండుగా, యశము = కీర్తిని, ఎనసెనో = పొందెనో, అనన్ = అనునట్లుగా, వనాళిన్ = అడవులవరుసయందు, ప్రఫుల్ల శర ఆళి=నిండార వికసించిన ఱెల్లుల సమూహము, మెఱసెన్ = ప్రకాశించెను.

ఆశరత్సమయము వనములో తెల్లుకాండలయందు విస్తారమైన తెల్లనిపూఁత ఎట్లుండె ననఁగా - ఆతెల్లుకాండలకు, తమ వంశమునం బుట్టినవైన బాణములు గుఱిని బొంది భేదించుటచేత, విస్తారముగా వచ్చినకీర్తియో - యనున ట్లుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'కవదోనలు' - ఈబుజముమీఁద నొకటి ఆబుజముమీఁద నొకటి. 'స్వకుల శరపాళి' తెల్లుకాండలతో బాణములం జేయుదురు, అందువలననే రెంటికిని శర మనియే పేరు:—

'అతఃపరం ప్రవక్ష్యామి శరాణాం లక్షణం శుభమ్;
స్థూలం నచాతి సూక్ష్మం చ న వక్రం న కుభూమిజం,
హీనగ్రన్థి విదీర్ణం చ వర్జయే త్తాదృశం శరమ్;
పూర్ణగ్రన్థి సుపక్వం చ పాణ్డురం సమయాహృతం
కఠినం వర్తులం కాణ్డం గృహ్ణీయా త్సుప్రదేశజమ్.' శార్ఙ్గధరుఁడు.

ఈపద్యమున ఉపలబ్ధపాఠముల 'లబ్ధలక్ష్యంబు లయిన...శరాలి' అనుచో విశేషణ విశేష్యములకు వచనభేదంబును, తృతీయపాదమున - 'స్వాన్వయ...జాలఁగ నెన్నొ' - యతిభంగంబునుం గలవు; అవి యీపాఠమున సవరింపఁబడినవి. 'దానాదిప్రభవా కీర్తిః ప్రతాపప్రభవం యశః' అనుటచే ఇట ప్రతాపప్రభవమే ఉద్దిష్టమైనను 'యశోయాదస్యాజని' అన్నందులకు 'జనించినమహాకీర్తిప్రవాహంబు' అన్నట్లుం బోలె కీర్తి యశఃపరమే యని గ్రహించునది. యశము తెలుపని కవిసమయము గావున తెల్లుఁబూతను యశముగా నుత్ప్రేక్షించుట:—'యశసి ధవళితా వర్ణ్యతే హాస కీర్త్యోః' సా. ద.

తే. దరులతడివండు పొదువుమూఁపురము లంటు
తెల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె,
గిరుల మోరుల నవి సముద్గీర్ణసలిల
జలధరచ్ఛేదములు వ్రాలఁ మెలఁగుకరణి. 156

దరుల తడి వండు = ఏళ్ల యొడ్డుల యార్ద్రమృత్తిక, పొదువు మూఁపురంబులు = కమ్ముకొనియున్న కకుత్తులకు, అంటుతెల్లు గంటలన్ = అంటుకొన్న తెల్లుదుబ్బులచేత - 'గంటయనఁ జైరు దుంపయు ఘంటయొప్పు' ఆం. భా. 3 (53), ఆఁబోతులు = మహోక్షములు, (ఎట్లు ఉల్లసిల్లిన వనఁగా), గిరులమోరులనవి = కొండల శిఖరములే అని, సముద్గీర్ణ సలిల జలధర చ్ఛేదములు = వెలువరించిన నీరుగల మబ్బులయొక్క ఖండములు, వ్రాలన్ = మీఁద దిగఁగా, (వానితోనే), మెలఁగుకరణిన్ = సంచరించుచున్నవిధమున, ఉల్లసిల్లెన్ = ఉత్సహించుచుండినవి.

ఆసమయమున ఆఁబోతులు ఏళ్లదరులను కోరాడఁగా, అందలి పచ్చివండు మూఁపురములకుం బొదువుటయు, దానిమీఁద తెల్లుదుబ్బులు అంటుకొనియుండుటయు, ఈతీరుతో ఆఁబోతులు సంచరించుచుండుటయు, నెట్లుండె ననఁగా - వానిని కొండ లనియు వాని మూఁపురములను తచ్ఛిఖరము లనియు తలంచి నీరెడలిన తెల్లని శరత్కాల మేఘఖండములు వచ్చి ఆమూఁపురములపై వ్రాలఁగా, వానితోనే ఆయాఁబోతులు సంచరించు చున్నవో యనున ట్లుండెను. - ఉత్ప్రేక్షాలంకారము.—ఆఁబోతులు కొండంత లనియు, వానిమూఁపురములు శిఖరములంత లనియు, వానిపై తెల్లుగంటలు మబ్బులంత లనియు వర్ణన.—'తడి' యేల యనఁగా - గంట

లంటుకొనుటకు; 'సముద్గీర్ణ సలిలములు' గానిచో తెల్లుగంటలవలె తెల్లగా నుండవు. 'ఛేదములు' - ఒక్కొక్క ఖండము ఒక్కొక్క గంట, శరత్తున మేఘములు సంహితముగా నుండక, పలు తుండెలుగా నుండుట ప్రసిద్ధము.

'వ్యోమ క్వచి ద్రజతశఙ్ఖమృణాళిగౌరై
స్త్యక్తామ్బుభి ర్లఘుతయా శతశః ప్రయాతైః
సంలక్ష్యతే పవనవేగచలైః పయోదైః
రాజేవ చామరవరై రుపవీజ్యమానః.' ఋ. సం. శరత్తు.

ఇందు 'శతశః ప్రయాతైః' అనుటం గనునది.

కరణి—ఇది సంస్కృతసమము. 'మోరులసవి' ఇది సమాసముగాదు, చూ. ౪ (౭౧) 'సవి' దే. అవ్య. అని, ఎ. గీ.—

'నాకు నిచ్చియున్న నామెడ హారంబు।
నిజనఖాంకురముల నిగిడికొనుచు
సరభసముగఁ జనియె సవి రాత్రి నేఁగల।
కంటి, నపుడ మేలుకంటి ననఘ.' లక్ష్మీ. ౩ ఆ. ౬. ౮.

తే. గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు వియన్నది జలములఁ గడుగఁ బిసుక,
నెఱయు కుంకుడుఁబండులనుఱువు లనఁగఁ
బలపలనిపాండురాంబుదపంక్తు లమరె. 157

గగనలక్ష్మి = ఆకాశశ్రీ, నిజ ఊరు నక్షత్ర మాలికలు = తనవైన గొప్ప చుక్కల సమూహము లనియెడి యిరువదియేడు ముత్యాల పేరులను, వియత్ నదిన్ = మిన్నేటియందు, కడుగన్ = శుద్ధిచేయుటకై, పిసుకన్ = చేతితో మర్దింపఁగా, నెఱయు = వ్యాపించుచున్న, కుంకుడుఁ బండుల నుఱువులు అనఁగన్, పలపలని పాండుర అంబుద పంక్తులు = ఇంచించుక ఎడ మెడముగా నున్న తెల్లమబ్బు వరుసలు, అమరెన్ = ఒప్పెను.

ఆసమయమున నక్షత్రములు మెఱుఁగెక్కుటయు మింట ఇంచుక విరళములుగా తెల్లని మబ్బులు పర్వుటయు నెట్లుండె ననఁగా,-ఆకాశలక్ష్మి తనయిరువది యేడేసి ముత్యాలుగల నక్షత్ర సంఘముల నెడి ముత్తెపుంబేరులను ఫులు గడుగుటకై ఆకాశగంగలో కుంకుడుఁగాయలను పిసుకఁగా వాని నుఱుగు మింటనెల్ల దగ్గఱ దగ్గఱఁగా గాలిక వ్యాపించుచున్నదో యనున ట్లుండెను.- శ్లేషానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము. అశ్విన్యాది నక్షత్రములు ఇరువదియేడుగావున, ఇరువదియేడుముత్యాలహారమునకు నక్షత్రమాల యని పేరువచ్చినది. 'సైవ నక్షత్రమాలా స్యా త్సప్తవింశతి మౌక్తికా.' అమ. 'ఊరు' లక్ష్మికి పెద్దముత్యముల పేరులకేమి కొదువ; ముత్తెములు పెద్దవి గానిచో ఇంత దూరమునకు అగపడవు, పైగా నక్షత్రములు సామాన్యపు ముత్తెములకన్నఁ బెద్దవిగానే అగపడును. పండులకును నుఱు గెక్కువగా వచ్చును. నుఱువు గావున పలపలన (పలుచం దనము). 'అంబుద' - ఇటరూఢిచే మబ్బును మాత్రము చెప్పును గాని జలము నిచ్చునని తెలుపును. 'పలపల యన వెలితి యనన్ పలుచన యన విరళి సంజ్ఞ భాసిల్లును'. ఆం. భా.

శా. అప్పుల్వారిధిచేతఁ బుచ్చికొని, కార్యంబైన, మున్గొన్నయ
య్యప్పుల్ దా చనియు న్సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా,
నప్పుణ్యాత్యతివిశుద్ధజీవులు నిజాచ్ఛాంగంబులం దోఁచు న
ట్లొప్పారె న్శశిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్. 158

అప్పుల్=జలముల (ఋణముల)ను, వారిధిచేతన్=సముద్రునివలన, పుచ్చికొని=కైకొని, కార్యంబు ఐనన్=ఎందులకై అప్పు పుచ్చుకొన్నాఁడో యా కార్యము నెఱవేఱినపిమ్మట, మున్ కొనిన అయ్యప్పుల్ = తొలుత పుచ్చుకొన్న యా జలములను (ఋణములను), దా = దవ్వు = దూరదేశములకు, చనియున్=పోయియు, సవృద్ధికముగాన్=పుచ్చుకొన్న దానికన్న హెచ్చుగా (వడ్డితోఁగూడ), అవార్ధికే = ఆసముద్రునకే, తీర్పఁగాన్ = ప్రత్యర్పణముచేసి, అప్ పుణ్య అతివిశుద్ధ జీవులు = జలమే పవిత్రమైన యతినిర్మలమైన ప్రాణముగా గలవారైన, అనఁగా జల ప్రధానములైన మేఘులు (పుణ్యమును అతి విశుద్ధమైన యాత్మ గలవారైన యాయధమర్ణులు - అనఁగా ఋణస్థులు), నిజ అచ్ఛ అంగంబులన్ = (అద్దమువలె) నిర్మల మయిన తమదేహములతో, తోఁచునట్లు = అగపడురీతిగా, శశిబింబ గర్భితములు ఐ = లోపల చంద్ర మండలము కలవై, ద్యోచారి శుభ్ర అభ్రముల్=మింటం జరించుచున్న తెల్లమబ్బులు, ఒప్పారెన్=ప్రకాశించినవి.

నీరే ప్రాణముగాఁ గలవారైన మేఘులు, సముద్రునివలన నీళ్లను ఋణముగాఁ గైకొని, సముద్రునికి దూరముగా మిన్ననెడి దేశాంతరమున కేఁగియు, వెట్టం దీర్చుట, చాతక బలాకాదులకు మేలుసేయుట, ఇత్యాది కార్యమయిన యనంతరము, తొలుత కొన్నదానికంటె ఎక్కువగా అనఁగా వడ్డితోఁ గూడ ఆనీటి ఋణమును తీర్చినవారై, ఆకారణంబున, విశుద్ధాత్ములును, విశుద్ధ దేహులును ఐ, గౌరవముగా ఉన్నతులై సంచరించుచున్నారో యను నట్లుగా, చంద్రబింబాధిష్ఠితములై శుభ్రాభ్రములు మింటం జరించుచుండెను.—శ్లేషానుప్రాణితోత్ప్రేక్ష.

అప్పుగొని వడ్డితోఁదీర్చి శుద్ధాత్ముఁడై శుద్ధదేహుఁడైన సజ్జనుని సామ్యము మేఘములయందు చెప్పఁబడినది. ఆత్మశుద్ధి యాకారమం దగపడును; సుకృతముచే ఆత్మశుద్ధియు ఆకారశుద్ధియు కలుగును.

ఎన్ని శుభ్రాభ్రములో అన్నిటియందును చంద్రబింబ మున్నదా యనిన, ఒక్కొక్క దానికిని చంద్రుని కడ్డముగా వచ్చినప్పటి తీరె యిట వివక్షితము.

'దా' = దవు = దవ్వు - "ఇత్యాదు లక్కటూదులు" అనుటంబట్టి దీనిని అందుం జేర్చుకొనవచ్చును.—'వృద్ధి'కి వైకృతము 'వడ్డి'; 'వార్ధికే' - ఇచ్చినవానికే, తదీయులకుఁ గాదనుట.—'ద్యోచారి' - ఋణవిముక్తుఁడు నలుగురలో తలయెత్తుకొని తిరుగుట సూచితము; ఋణము తీఱక ముందు ఆత్మ శుద్ధము కాదు. కావున దీపింపదు, అట్లే నీటి మ్రబ్బులోని చంద్రుఁడు అగపడఁడు; నల్లమబ్బు తెల్లఁబడుటయే ఋణవిముక్తి, సుకృతముచేత నైన భవ్యాకారము.

చ. విశద పయోదపుంబొరలవేష్టనచే నొకమై నభోమణిన్
లశునపటంబు నొందుట మనంబున నారసి, కాంచి, విష్ణుఁ డ
య్యశివతకై పదంబు వలయంబునఁ బాపి, యవస్తులోభక
త్కశతఁ బ్రబోధ మొంది, సిరిఁ గాంచి చెలంగెఁ బయఃపయోనిధిన్. 159

విష్ణుఁడు = నారాయణుఁడు, నభోమణిన్ = సూర్యుఁ డనెడి, మణిన్ = పద్మరాగమునకు, విశ...చేన్ - విశద = తెల్లనైన, పయోదపు = మేఘము లనెడు - పొరల = ఆవరణ విశేషములయొక్క - వేష్టనచేన్ = చుట్టుకొనుటచేత, - ఒకమైన్ = ఒక ప్రక్కను, లశునపటంబు = లశునపట మనెడు దోషము, ఒందుటన్ = కలుగుటను, (కలిగినదని) మనంబునన్ - ఆరసి = ఆలోచించి, కాంచి = తెలిసికొని, ఆ, యశివతకై = చెడుగును పాపుకొనుటకుఁ గాను, పదంబు= తన పాదమయిన యాకాశమును, వలయంబునఁ బాపి= గాలిగుడియను నందియ లేనిదానినిగాచేసి, అవ...తన్ =వస్తువునందలి లోభముచేతనైన కఠినతలేమిచేత (వస్తులోభముమాని సంతుష్టుఁడై), ప్రబోధ మొంది = నిద్ర మేల్కొనుట యనెడు తెలివిని పొంది, పయఃపయోనిధిన్ = పాలసముద్రమందు, సిరిన్ =లక్ష్మీదేవిని (భాగ్యమును), కాంచి= చూచి (పడసి), చెలంగెన్ =సుఖముండెను.

తా - లోకములో బుద్ధిమంతుఁడు తన పాదమందలి పెండాగములోని పద్మరాగమున లశునపట మను దోషమున్నదని తెలియవచ్చినా, వెంటనె యాపెండారమును వదలి, లోభములేక సంతుష్టి గలవాఁడై, తెలివి గలిగి, భాగ్యమొంది సుఖముండును. అట్లే శ్రీనారాయణుఁడు తన పాదమయిన యాకాశములో, పరివేషమను నందియలో, సూర్యుఁడనెడి పద్మరాగమున ఒక ప్రక్కను తెల్లమబ్బుల యావరణమనెడి లశునపట దోషముం గనిపట్టి, వెంటనే పరివేష మనెడి యాయందియను తన పాదమయిన యాకాశమునుండి, తొలఁగించి, వస్తులోభములేక సంతుష్టుఁడై తనతావలమయిన పాలసముద్రమునందు నిద్ర మేల్కొనుట యనెడి తెలివింబొందినవాఁడై మహాలక్ష్మి యనెడి భాగ్యముం బడసి సుఖముండెను.—రూపకము.

'ఒకమైన్' - సూర్యునికి క్రిందిప్రక్కను మాత్రమే మేఘములుండుటచేత. "ద్యుమణిస్తరణిర్మిత్రః" అమ. 'లశునపటంబు' - "లశునము...1 వెల్లుల్లి; 2 కెంపునందలి దోష విశేషము (అనఁగా పాలు పైఁబూసినట్లుండెడు తెల్లడాలు)," శ. ర.; ఉల్లిపొరవంటి తెల్లడాలు లశునపట మనఁబడును. అట్టి రత్నమును ధరించిన సిరి తొలఁగును, దానిని ధరించుటమానిన సిరికలుగును; కావుననే దానిని పదమునకుం బాపి సిరిఁ గాంచినాఁడు. 'లశున పటత్వము' - ఇటత్వాద్యోత్యార్థములేదు, కావున లశునపటంబు పొంద అనిమార్పు. "పరివేషస్తు పరిధి రుపసూర్యకమణ్డలే" అమ.

ఉ. అంబరవాసు లగ్నిఁ గ్రియకై ద్యుమణిస్ఫటికోపలంబునం
దుం బడయ న్శరజ్జలదతూలపరంపరఁ గొంత పై ఘటిం
పం, బెలుచం జనించి, యొక మట్టున నిల్వక యాక్రమించెఁ గాఁ
కం బరితాప మూన, ననఁ గాసె మొగిల్వ్రిరిమొండ లత్తఱిన్. 160

అత్తఱిన్ = ఆశరత్కాలమందు, అంబరవాసులు = మింటికాపురులు, (అనఁగా దేవతలు). క్రియకై = అగ్ని కార్యములు నెఱవేర్చుకొనుటకై, ద్యుమణి స్ఫటిక ఉపలంబునందున్ = సూర్యకాంతశిలయందున్, అగ్నిన్ = నిప్పును, పడయన్ = పొందుటకుఁగాను, పైన్ = సూర్యకాంతశిలకుమీఁదుగా, కొంత = ఒకపాటిగా, శరత్ జలద తూల పరంపరన్ = శరత్కాలపు మేఘము లనెడు దూదియొక్క దొంతిని, ఘటింపన్ = కూర్పఁగా, (అగ్ని) పెలుచన్ = మెండుగా, జనించి = పుట్టి, మఱి = తర్వాత, (ఆయంబరవాసులు), కాఁకన్ = ఆవేఁడికి, పరితాపము

ఊనన్ = ఖేద మొందునట్లుగా, ఒకమట్టునన్ = పరిమితిలో, నిల్వక, ఆక్రమించెన్ = వ్యాపించెను, అనన్ = అనునట్లుగా, మొగిల్విరియెండలు = మబ్బువిడిచిన యెండలు, కాసెన్.

దేవతలకు హవ్యముం గొనిపోవువాఁడైన యగ్ని వర్షర్తువునందు మందగింపఁగా, వారు శరదృతువున ఆయాయగ్నికార్యములకై అగ్నిని సంపాదించువారై మండుచున్న సూర్యకాంతశిలలకు కొంతమీఁదుగా తెల్లనిశరన్మేఘము లనెడి దూదిని పలచపలచఁగా పట్టుకొనఁగా అందు నిప్పు జనించి, మఱి వారు కోరిన పరిమితిలో నిలువనిదై, 'ఏల దీనిని పుట్టించితిమా' యని వారు ఖేదపడునట్లుగా, అంతటను కాఁకలు చల్లుచు వ్యాపించినదో యనునట్లుగా దుస్సహములై, మబ్బువిడిచినయెండలు కాయుచుండెను.—ఉత్ప్రేక్షాలంకారము; రూపకానుప్రాణితము. సూర్యకాంతశిల ఎండకు మండందొడంగును.

సీ. 'రవికరస్పర్శమాత్రంబున వహ్నినిఁ। గ్రక్కుడునది సూర్యకాంత మనెడి
స్ఫటికంబు;శశికరస్పర్శమాత్రంబున।జలము గ్రక్కుడుశిల చంద్రకాంతము.' హాలాస్య.3.

'ప్రత్యగ్రజ్వలితైః పతఙ్గమణిభి ర్నిరాజితా భానవః
సావిత్రాః కురువిన్దకన్దళరుచః ప్రాచీ మలంకుర్వతే'. అనర్ఘ.

'ప్రాచీం వాసకసజ్జికా ముపగతే భానౌ దిశాం వల్లభే
పశ్యైతా రుచయః పతఙ్గదృషదా మాగ్నేయనాడిన్ధమాః.' అనర్ఘ.

'న తేజ స్తేజస్వీ ప్రసృత మపరేషాం విషహతే,
స తస్య స్వో భావః, ప్రకృతి నియతత్వా దకృతకః;
మయూఖై రశ్రాన్తై స్తపతి యది దేవో దినకరః,
కి మాగ్నేయో గ్రావా నికృత ఇవ తేజాంసి వమతి?' ఉ.రా.చ.

'వ్యా. తేజాంసి = అగ్నిజ్వాలాః, ఆగ్నేయో... గ్రావా = సూర్యకాన్త ఇత్యర్థః.'

క. కంజహితాస్తోదయముల। సంజ కడల, నడుమఁ గప్పు, సంధిల, మి న్నొ
ప్పెం జూడఁ బ్రకృతిశబరి। గుంజానాసావిభూష కొమరు భజింపన్. 161

కంజహిత అస్త ఉదయములన్ = సూర్యుని క్రుంకుటయందును పొడుపునందును, కడలన్ = (మింటి) యెనిమిది దిక్కులందును, సంజ = సంధ్యారాగంబును, నడుమన్ = మధ్యప్రదేశమునందు (అనఁగా మింటి యూర్ధ్వభాగమునందు), కప్పన్ = నైల్యంబును, సంధిలన్ = సమకూడఁగా, మిన్ను = ఆకాశము, ప్రకృ...రు - ప్రకృతి = మూలప్రకృతియనెడు - శబరీ = చెంచెతయొక్క - గుంజా = గురిగింజతోఁ జేయఁబడిన - నాసావిభూష = ముంగఱయొక్క - కొమరు = సొంపును, భజింపన్ = పొందఁగా, చూడన్ = చూచుటకు, ఒప్పెన్ = ప్రియముగా నుండెను.

ఆఋతువునందు ఆకాశము అష్టదిక్కులయందును సాయంప్రాతస్సంధ్యారాగముల చేత ఎఱ్ఱనై ఊర్ధ్వభాగమునందు నీలమై మాయయనెడు చెంచెత ధరించిన గురిగింజ ముంగఱయో యన నొప్పుచుండెను.

అష్టదిక్కు లనియు దశదిక్కు లనియు చతుర్దిక్కు లనియు మతములు. ఇట అష్టదిక్కులనుమతము స్వీకృతము:—

'ఏకం జ్యోతి ర్దృశౌ ద్వే త్రిజగతి గదితా న్యబ్జజాస్యై శ్చతుర్భిః
భూతానాం పఞ్చమం యా న్యల మృతుషు తథా షట్సు నానావిధాని।

యుష్మాకం తాని సప్తత్రిదశమునినుతా న్యష్టదిగ్భాఞ్జి భానో
ర్యాని ప్రాహ్ణే నవత్వం దశ దిశతు శివం దీధితీనాం సహస్రమ్.' మయూరుడు.

'కడ' - కాష్ఠాశబ్దవైకృతము - 'దిశస్తు కకుభః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః' అమ.-'సంజ.' - సంధ్యాశబ్దవైకృతము, సంధ్యాకాలవాచకమ యయినను లక్షణచే తదీయారుణ్యమును చెప్పుచున్నది:

'సంధ్యా శోణామ్బరజవనికా, కామినోః ప్రేమ నాట్యం,
నాన్దీ భ్రామ్యద్భ్రమరవిరుతం, మారిషః కోఽపి కాలః,
తారాః పుష్పాఞ్జలి మివ కిరన్, సూచయన్ పుష్పకేతో
ర్నృత్యారమ్భం, ప్రవిశతి సుధాదీధితి స్సూత్రధారః.' రసతరఙ్గిణి.

'ప్రకృతి' - పరమాత్మను ఆశ్రయించినదై అనాదియై ప్రపంచమునకు మూలభూతమై ప్రపంచ రూపముగా పరిణమించినట్టిదైన మూలతత్త్వము. 'గుంజా' - మిన్ను ఊర్ధ్వమందు నలుపు క్రింద ఎనిమిదివైపులను ఎఱుపునుం గల గురిగింజవలె నున్నదనుట. గుంజ ఇంచుక, మిన్ను అతిమహత్తు, సాటి యొప్పునా ? యనిన, అందులకే ప్రకృతిని చెప్పుటయు, ఆమె ప్రపంచస్వరూపురాలు గావున తనయాకారమునకు తగినంత పెద్ద గుంజను తానే కల్పించుకోఁగలది గావునను ఆమె ధరించిన గుంజం జెప్పుటయు; ఆప్రకృతిని మింటియూర్ధ్వమున శిరంబును, భూమికి సమానముగా నడుము, భూమిక్రింద నెటనో పాదములునుంగా భావింపవలయును. 'సంజ' - తూర్పు సంజకెంపు నడిమివఱకును వ్యాపించును, పడమటి సంజకెంపును నడిమివైపు వ్యాపించును, వీనిచే మింటి నెత్తముదప్ప కడమయెల్ల నరుణ మగును, గావున నలుపు పైకుండునట్లుగా ధరింపఁబడిన గుంజతో సామ్యము చెప్పఁబడినది.

'అస్తోదయవేళసంజ' అను పాఠమున టుగాగమము రామి ప్రశస్తము గాదు. 'శబరీ' - చెంచెతలులోనగు నడవిమెలఁతలే గుంజాభూషణంబులను ధరింతురు.

తే. గూండ్లకే శాలిమంజరు ల్గొనుచు, మూఁగి,
యంబరంబునఁ బఱచు కీరాళు లొప్పెఁ,
బసరుటొండొంటియాకుతోఁ బండఁ బొటి
ఛేదభయమున నెగసిన చే లనంగ. 162

శాలిమంజరుల్ = వరివెన్నులను, గూండ్లకే = తమ గూండ్లకు, గొనుచున్ = గొనిపోవుచు, అంబరంబునన్ = ఆకాశమందు, మూఁగి = ఒకదాని కొకటి దగ్గఱఁగా కూడుకొని, పఱచు = వడిగా నెగయుచున్న - కీర ఆళులు = చిలుకలగుంపులు, పసరు టొండొంటి యాకుతోన్ = పసరువన్నె మాఱునట్టి యొక్కొక్క యాకుతో, పండఁబొటి = పండినవై, ఛేదభయమునన్ = కోఁతవలని (కోఁత కోయుదు రను) వెఱపుచేత, ఎగసినచేలు = ఎగిరి పోవుచున్న వరిపొలములో, అనంగన్ = అనునట్లుగా, ఒప్పెన్ = చెన్నారినవి.

అప్పుడు నోట వరివెన్నులం గఱచికొని గుమిగుమిగా గూండ్లకు ఆకాశమున నెగిసిపోవుచున్న చిలుకల సమూహము ఎట్లొప్పె ననఁగా, వరివెన్నులు పండి ఒక్కొక్క పసరుటాకుతో నొప్పుచు తమ్ము కాఁపులు ఇఁక వచ్చి కోఁత కోయుదు రని భయపడి యెటకేనియు నిరపాయమైనతావునకు ఆకాశమార్గమున వలసపోవుచున్న వరిచేలో అనునట్లు ఒప్పుచుండెను.-ఉత్ప్రేక్ష.- 'మూఁగి'—స్వభావోక్తి.

'మూఁగి' - ఆకాశమున ఎన్నియో వేలువేలు గుంపులుగా పోవుచుండినవి. ఒక్కొక్క గుంపు ఒక్కొక్క వరిచేనివలె నుండె నని భావము. మూఁగనిచో చిలుకలకు సస్యము క్రిక్కిఱిసి యుండు వరిచేనిసాదృశ్యము రాదు. - 'గూండ్లకై' - గూండ్లలో పెట్టుకొని దినముల వెంట తినుచుండును. ఒండొంటి యను కొట్లు? తొక్కులు రెండేసిగదా? యనిన దూరమునకు ఆవిభజన తెలియదు. 'చేలు' - ఏ. వ. చేను: ఇట్లే మీను-మీలు. వరివెన్నులం గూండ్లలో సేకరించి పెట్టుకొనుట చిలుకలకు స్వభావము.—'నీవారాః శుక గర్భకోటరముఖభ్రష్టాస్తరూణా మధః' అని కాళిదాసు. - ఒక కవియు భారవియు వీనిని ఇంద్రధనుస్సుగా వర్ణించినారు.

'స్ఫుటం స్ఫుటపలాశవత్సుభగభాసి చఞ్చుచ్ఛదే
విపాకకపిశీకృతాః కలమమఞ్జరీ ర్బిభ్రతీ.
బభౌ దివి శుకావళిః శకలయ న్ఛవి ర్గ్రాముమా
స్వభావహృదయఙ్గమా విబుధచాపలక్ష్మీరివ.'
ముక్తై రసౌ విద్రుమభఙ్గలోహితై । శ్శిఖాం ఎశఙ్గైః కలమస్య బిభ్రతీ
శుకావళి ర్వ్యక్తశిరీషకోమలా । ధనుఃశ్రియం గోత్రభిదో౽నుగచ్ఛతి.'

సీ. శ్రీలు దా రౌట నాశ్రితపద్మకర్ణికా
కృతిఁ జెవుల్ కమలకర్ణికల మెఱయఁ;
నతనుసారథ్యకృద్రతిరేఖ మంచెపై
నవలించు గొడ చిల్కసమదుపుఁ బఱపఁ;
దోగమొగ్గలను జైవ దార మేఁగమిఁ బెట్టు
చప్పుడుఁ జన్నులు జడలు గదల;
వెడఁద్రోవ ముచు చెప్పి, నడచి నవ్వ, విరుగున
ధ్వగుఁ గోలందినె యనఁ ద్రోయయు మరల;
తే. నధర రదనప్రభాంబు నడుగ నోరు
దెఱచె నన బంటి ప్రతి ముక్తెములు తోఁచు
చెఱకు జంఘులఁ బోలమి సిసు హాల్బు
రాజసముఁ గాఁపు గోపికారాజ వారిక. 163

చెఱకుఁ దోఁటలయు వరిపొలములయు కావలిపడంతులను వర్ణించుచున్నాఁడు: - చెవుల్ = వారివీనులు, తారు = తాము, శ్రీలు - మహాలక్ష్ములు, (శ్రీ యనునక్షరమువలె నుండునవి అనుటయు), అగుటన్ - అగుటంజేసి. ఆశ్రి...తిన్ - ఆశ్రిత = ఆశ్రయింపబడిన (మహాలక్ష్మికి ఆశ్రయమైన) - పద్మ = కమలములయొక్క - కర్ణికా = దుద్దులయొక్క - ఆకృతిన్ = ఆకారముతో (లక్ష్మీనివాసకమల కర్ణికలో యనునట్లుగా నొప్పుచున్న) - కమలకర్ణికలన్ = అలంకారార్థము ధరించిన తామరదుద్దులతో, మెఱయఁగ = ప్రకాశించుచుండఁగా;

అత...ఖన్ - అతను = మన్మథునికి - సారథ్యకృత్ = తేరు దోలెడుపనిం గావించుచున్న - రతిరేఖన్ = రతీదేవియో యనున ట్లుండఁగా, మంచెపైన = పిట్టలం దోలుటకై వేసిన

యొత్తు చప్పరమునుండి, అదలించురొద = చిలుకలను తోలెడు హెచ్చరికశబ్దమో యనునట్లుగా నొప్పుచున్న యదలింపు, చిలుకపదుపుల్ = చిలుకలగుంపును, పఱపన్ = పఱతెంచునట్లు చేయుచుండఁగా;

తోఁగమొగ్గలను = కలువకళికలను, పైవన్ = ఆచిలుకలంగూర్చి వేయఁగా, దూరము వోఁగమిన్ = ఆకలువ మొగ్గలు దూరమునకు పోనందువలన, పెట్టుచప్పట్లన్ = పొలములోని దూరపుఁ జిలుకలను తోలుటగా చప్పట్లు చఱవఁగా, చన్నులును జడలును, కదలన్ = చలించుచుండఁగా; (తెరువరికి) మును = మొదట, వెడత్రోవన్ = తప్పుదారిని, చెప్పి, వడిన్ = (ఆమాట నమ్మికొని ఆతప్పుదారిని ఆతెరువరి పోయిన) వెంటనే, నవ్వన్ = (తమ కుచ్చితము నెఱవేఱినందులకు తాము) నవ్వఁగా, తిరుగు అధ్వగు కొలంది నె = వెనుకకు బాటసారి మరలిన కొలఁదిగానే, అపత్రపయున్ = (తప్పుదారిని చెప్పినప్పుడు పోయిన) లజ్జకూడ, మరలన్ = తమకడకు రాఁగా;

అధ...బు - అధర = తమ మోవియొక్కయు - రదన = దంతములయొక్కయు - ప్రసాదంబున్ = అనుగ్రహంబును, అడుగన్ = వేడుకొనుటకు, నోరుదెఱచెన్ అనన్, పండి = నిండుగా పక్వమై, ప్రీలి = పగిలి, ముత్తెములు, తోఁచు = అగపడుచున్న - చెఱకున్ = ఇక్షువును, జంఘలను పోలమిన్ = తమపిక్కలకు సాటి కానందున, శిరసు = తలను, వాల్చు = తమ పాదముల కడ చేర్చుచున్న - రాజనమున్ = రాజనపు కాఁడలను, కాచు = (మన్నించుచున్న) రక్షించుచున్న, గోపికారాజి = కావలి యింతులయొక్క సమూహము, పొలిచెన్ = ఒప్పెను.

తా.-వారు తమచెవులు శ్రీ (కారము) లగుటచేత శ్రీదేవి తమ్మిదుద్దుసింహాసనమున కూర్చుండునుగాన అగుద్దో యనునట్లు చెవులయందు అభరణములుగా దాల్చిన తమ్మిదుద్దు మెఱయుచుండఁగా, (ఉత్ప్రేక్షాలంకారము); మదనునికి తోడుపోలుచున్న రతీదేవి అతని తేరిగుఱ్ఱము లైన చిలుకలను తేరు వడిగా లాగుఁడని హెచ్చరికగా నదలించు శబ్దమోయన నొప్పుచున్నట్టి వారి కంఠశబ్దములకు చిలుకలు పఱతెంచుచుండఁగా, (ఉత్ప్రేక్షాలంకారము); చేనిలోని చిలుకలను తోలుమఁ గొట్టుటకై వానిపైని విసరిన కలువమొగ్గలు అంతదూరముపోక నడుమనే పడినందున చప్పట్లచే నైన తోలుమఁగోరి చప్పట్లు చఱచుటచే చన్నులును జడలును కదలఁగా, (స్వభావోక్తి); తెరువరి దారి యడుగఁగా నతనికి తప్పుదారి చెప్పి అతఁడు ఆతప్పుదారిని బోఁగా పక్కున నవ్విన వారై ఆనవ్వుచే నాతఁడు అతిచ్చన నెఱిఁగి వెనుకకు మరలఁగా లజ్జపడుచు, (తుల్యయోగిత); వారియధరమందలి మాధుర్యమును వారదంతముల కాంతియు తమపాలయందును తనముత్తెముల యందును లేనందున వానిని ఇంచుక దయచేయుండని వేఁడుచున్నవో యన నిండుగా పండి పిగిలి రస ములుకుచు ముత్తెములు గానవచ్చుచున్న చెఱకుల తోఁటలను, (ఉత్ప్రేక్ష); వారి పిక్కలను తమపొట్టులు పోలలేమికి లజ్జితములై, తమ గర్వమును మన్నింపుఁడనుచు వారి పాదములకు నమ్రములైనవో యన తలవాల్చియున్న వరికాఁడలు గల వరిచేలను, (ఉత్ప్రేక్ష); రక్షించుచున్న (అనఁగా ఆచెఱకులను మన్నించుచున్న)ట్టియు ఈవరిపైనిను దొంగలపాలు పక్ష్యాదులపాలుం గానీక కాచుచున్నట్టియు, కావలిచెలువలు చెన్నారుచుండిరి.

'కర్ణికా కర్ణభూషణే హస్తమధ్యాఙ్గుళౌ హస్తిహస్తాగ్రే చ వరాటకే' నానా.—ఈ కావలి చెలువల యదలింపును విని మదనరథరథ్యము లైన చిలుకలు రతీదేవిగొంతుసవ్వడి యని

తలంచి, వడిగా పఱతెంచుచున్న వని స్వారస్యము. 'మంచె' - ఇది తేరికి బదులు. 'హ్రీర్లజ్జా సా పత్త్రపా వ్రీడా' రత్నకోశము. పండినపైరు తలవ్రాల్చును:—

'కలమాః పాకవినమ్రాః శూకశిఖాఘ్రాతిసురభికహ్లారాః
పవనాకమ్పితశిరసః ప్రాయః కుర్వన్తి పరిమళశ్లాఘామ్.' భో. ప్ర.

'నమితాః ఫలభారేణ న మితాః శాలిమఞ్జరీః
కేదారేషుహి పశ్యన్తః కేదారేషు వినిస్పృహాః॥' సు.ర.భా.

చెఱకు ముత్తెములకు చూ. ౪౮. టీక.

తే. నింగి యత్తఱిఁ దా మహానీల మైన
గరిమకుం దగ బహుతృణగ్రాహి యయ్యె,
ననఁగఁ బరిణత కలమాది యవసరాశి
తతులు గిరు లన నభ్రంకషతఁ దెలంగె. 164

అత్తఱిఁ - ఆశరదృతువునందు, నింగి = ఆకాశము, తాఁ, మహానీలము = మిక్కిలి నల్లనిది (గొప్పనీలమణి). ఐన గరిమకుం దగఁ - అయినట్టి పెంపకమునకు తగినట్లుగా. బహుతృణగ్రాహి=విస్తారము కసవు నాకర్షించునట్టిది, అయ్యెను, అనఁగఁ =అనునట్లుగా, పరి...లు - పరిణత = పండిన - కలమ = వరి - ఆది = లోనగువానియొక్క - యవస గడ్డియొక్క - రాశి = మేటులయొక్క - తతులు = సమూహములు, గిరులు అనఁ = కొండలంత లేవిగా, అభ్రంకషతఁ = మింటి నొరయుటచేత, తెలంగెఁ = ఒప్పియుండెను.

ఆశరదృతువునందు మింటి నంటుచు కొండలంతగా వరి లోనగుపైరుల గడ్డిమేటులు (వాములు) మెండుకొన్నవి.

'మహానీలము' - చూ. ౧౩౨ - నీలము తృణగ్రాహి - గరిమకుం దగినట్లుగా - అనఁగా త్రైరాశికగుణితమునకు సరిగా - నీలము తృణగ్రాహి యైన మహానీలము బహుతృణగ్రాహి యని త్రైరాశికగుణితసిద్ధము. - 'శాలయః కలమాద్యాశ్చ షష్టికాద్యాశ్చ.' - 'ఘాసో యవసమ్' అమ. 'అభ్రఙ్కషః - అభ్రంకషతి పిడయాతి తుఙ్గత్వాత్ (ఖాల ము మాగము శ్చ - మింటనొరయు) అనఁగా అత్యంతోన్నత మయినది అని యర్థము.

మ. అయనిష్కన్ ధవళాతపత్త్రి యగునయ్యాస్యగంధిక్ సాగంగ, సం
పి యమిత్రీలు రాఁగఁ, బురఁగవనకుఁ స్తంభ సంకు సస్త్రాపనా
త్యయరాముంపు సలక్ష్మిబుం డిడున కావా ద్రిగా, పెల్లు సి
ద్ధయుతం గ్రొంగు, బ్రభగ్నశాల్యనయ వేనాలపు గాకుండునే. 165

అయనిష్కన్ - ఆయా శుభకర్మాదియందు - నిష్కన్ = కదుమపాటుతో, ధవళాతపత్త్రి - ధవళ = తెల్లని - ఆతపత్త్రి = (పుండరీకము మాదిరి) గొడుగుగల దైన శరదృతువునకు సంబంధించినట్టిది (ఇట ధవళచ్ఛత్రము లక్షణచేత పుండరీకమును తెలుపుచున్నది. - పుండరీకమును శరదృతువునకు గొడుగుగా కాళిదాసు వర్ణించినాఁడు - శ్వేతచ్ఛత్త్రము రాజచిహ్నము గావున ధవళాతపత్రి యనఁగా రాజు - కవివివక్షితే రాజయిన జనకుఁడు - ఆయన కాపించినట్టిది, అగు - ఆయాగంబు (శరత్కృతుమున) ఆవాజపేయాదికము (శరత్కాలమున బ్రాహ్మణులు గావించుచున్న యాగములు)

క. మొగిలువిరియెండవేఁడిమి । నిగుడ, శుకశ్రేణి పసరు నింగి న్నిండఁగన్,
  బెగడెఁ బ్రజ, హరితవాజుల । గగనమణిస్యందనంబు గదిసెనె యనుచున్. 166

మొగిలు విరియెండవేఁడిమి = మబ్బు విడిచిన యాతపముయొక్క వేఁడి, నిగుడన్ = తమ మీఁదికి వ్యాపింపఁగా, నింగిన్ = మింట, శుకశ్రేణిపసరు = చిలుకలగుంపుయొక్క పసరువర్ణము, నిండన్=వ్యాపింపఁగా, ప్రజ=జనము, హరి...బు - హరిత=పసరువర్ణంపు - వాజుల= గుఱ్ఱములు గలదైన - గగనమణి = సూర్యునియొక్క - స్యందనంబు = రథము, కదిసెనె అనుచున్ = చేరువకు వచ్చినదా యని, బెగడెన్ = భయపడెను.

మబ్బు విడిచినయతితీక్ష్ణంపు శరత్కాలపుటెండ తమపై కడువేఁడిగా కాచుచుండుటయు, మింట ఆకుఁబసరువన్నె గుఱ్ఱాలు పూంచినదైన సూర్యుని రథము చేరువకు వచ్చినదో యని జనులు భయపడిరి.—అసంబంధమున సంబంధముం జెప్పుటయును నతిశయోక్తిభేదము; లేనిబెగడుట ఉన్నట్టు చెప్పఁబడినది.

సూర్యాశ్వములు శ్యామములు. 'పత్త్రశ్యామా దినకరహయ స్పర్ధినో యత్ర వాహాః' మేఘ.
'సాదృశ్యాదృశ్యమూర్తి ర్మరకతకటకే క్లిష్టసూతా సుమేరోః
మూర్ధ న్యావృత్తిలబ్ధ ధ్రువగతి రవతు బ్రధ్నవాహావళి ర్వః.' సూ.శ.
'శ్యామాః'—'పలాశశుకశైవాల దూర్వాబాలతృణం బుధః ।
వంశాఙ్కురో మరకత శ్చైన్ద్రి నీలార్కహయాదయః.' కా.క.ల.
సూర్యాశ్వములు ఏడు—'సప్త పాతాళ భువన ముని ద్వీ పార్కవాజినః ।
వా రాబ్ధి స్వర రాజ్యాఙ్గ వ్రీహి వహ్నిశిఖాదయః.' కా.క.ల.
'గగనమణి' - 'ద్యుమణి స్తరణి ర్మిత్రః' అమ. స్యందనంబు - చూ. 2 (49) సూర్యస్యందన మిట్లు వర్ణితము:—
'రథ స్యైకం చక్రం భుజగయమితా స్సప్త తురగాః
నిరాలమ్బో మార్గ శ్చరణవికలః సారథి రపి ।
రవి ర్యాత్యే వాన్తం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే.' భో. ప్ర.

తే. భువి సరఃకైరవశ్రేణి పోవఁ దోల,
  దివిఁ గనద్గ్రహనక్షత్రదీప్తి దఱుమఁ,
  గృష్ణపక్షపువాసి లే కిరులు దనదు
  నలుపునను గూడె నన నైల్య మొలసె నభము. 167

భువిన్ = భూమినుండి, సరఃకైరవ శ్రేణి = కొలఁకులయందలి తెల్లగలువలయొక్క వరుస, పోవఁదోలన్ = తఱిమివైవఁగా, దివిన్ = ఆకాశమునుండి, కన...ప్తి - కనత్ = ప్రకాశించుచున్న - గ్రహ=అంగారకాది రాశిచరములయొక్క - నక్షత్ర=తారకలయొక్కయు - దీప్తి= కాంతి, దఱుమన్ = వెడలనడువఁగా, ఇరులు = చీకటి, కృష్ణపక్షపు = బహుళపక్షపురేల - వాసి = బలిమి, లేక = లేనందున, తనదునలుపునన్ = తననీలిమయందు, కూడె ననన్ = చేరిపోయినదో యనునట్లు, నభము = ఆకాశము, నైల్యము = నలుపును, ఒలసెన్ = పొందెను.

ఆసమయమందు ఆకాశమునకు నలుపు హెచ్చెను. ఆ హెచ్చుట ఎందువలన ననునట్లుండె ననఁగా; - కృష్ణపక్షపురాత్రులందు అంధకారము లోకమంతట ఆక్రమించి గాఢమై ఉండును, ఇప్పుడు ఆరాత్రులయందే దానిని భూమినుండి కొలఁకుల తెల్లగలువలు తఱిమినవి, మింటినుండి గ్రహనక్షత్రములు తఱిమినవి. కావున అంధకారము ఎక్కడను నిలుచుటకు ఆస్పదములేక ఆకాశముయొక్క నలుపులో కలసిపోయినందుననో యనునట్లు ఆకాశమునకు నలుపు హెచ్చెను.— హేతూత్ప్రేక్ష. భువి, దివి - భూ దివ్ శబ్దములకు తత్సమములు.

క. క్రేపుఁదలఁచి పసి మేయుచుఁ । జేపినపా ల్గలయ నెండచేఁ బాంథజనుల్
దూపింపమి కజుఁ డంపిన । యాపాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్. 168

పసి = ఆవుల సమూహము, మేయుచున్ = పొలాన పచ్చిగడ్డి తినుచు, క్రేపున్ = దూడను, తలఁచి = స్మరించి, చేఁపినపాల్ = స్రవించిన క్షీరము, కలయన్ = నదులలో చేరఁగా, ఎండచేన్, పాంథజనుల్ = తెరువరులు, దూపింపమికిన్ = దప్పిచే పీడనొందకుండుటకై, అజుఁడు= బ్రహ్మ, అంపిన ఆపాగా = పంపినట్టి తనగుఱ్ఱపుఁదబేలా (అనఁగా తనతబేలాలోని గుఱ్ఱము లన్నియు), అనఁగన్ = అనునట్లుగా, నదులన్ = ఏళ్లయందు, అంచలు = హంసలు, మెఱసెన్ = ప్రకాశించెను.

ఎండలో దప్పిగొన్నవారు పాలు త్రాగినచో దప్పి తీఱమియేగాక రోగముకూడ కలుగును. కురిసిన నిండువానలచేత ఎల్లెడలను మంచిపచ్చిక సమృద్ధిగా నుండును, ఏళ్లయొడ్డున పచ్చిక మఱియు ప్రశస్తముగాను, సమృద్ధముగాను ఉండును. అట్టిపచ్చికను మేయుటచేత ఆవులు మిక్కుటముగా పాలుపడి, ఏళ్లయొడ్డున మేఁతసమయములో ఇంట నున్న లేఁగలు జ్ఞప్తికిరాఁగా పొదుగులు చేపి ఏటిలోనికి ప్రవహించును. పాలుగలిసిన యానీళ్లను దప్పిగొన్న తెరువరులు త్రాగినచో వారికి పైఁజెప్పినచెఱుపు గలుగు నని ఆపాలను అందుండి వేఱు చేసి త్రాగివైచుటకై బ్రహ్మ తనగుఱ్ఱములు హంసలుగావున తనగుఱ్ఱపుసాలలోని హంసల నన్నిటిని, ఈయేళ్లకు పంపినాఁడో యనునట్లు వీనియందు హంసలు మిక్కుటముగా మూఁగియుండెను.—ఫలోత్ప్రేక్ష.

'చేఁపు' ఇందు శ.ర.లో అరసున్నముద్రితమేగాని అందులకు ప్రమాణము దర్శితముగాదు.

తే. వెదమొదవుకూడఁ బోలేనివెచ్చ గ్రొవ్వు
కల్ప మెడచాఁప వెడలెనో యనఁగ, నెట్ట
కేలకును గ్రుంగి తెచ్చు అంకెలు నిగుడఁగ
మందగతి గున్కె వృషభము ల్మందపిఱుఁద. 169

వృషభముల్ = ఆఁబోతులు, వెద మొదవు కూడన్ = ఋతువులో నున్న పాడియావులతో కూడ, పోలేనివెచ్చ=పోలేనందునఁ గలిగినతాపము, క్రొవ్వు= మెడనఱకు లోపలనున్న క్రొవ్వును, కల్పన్ = కరఁగునట్లు చేసినంతట, మెడచాఁపన్ = కంఠమును దీర్ఘకరించినందున, వెడలెనో= (అంకె) బయటికి వచ్చినదో యనునట్లు, ఎట్టకేలకున్ =ఎంతయు ప్రయాసపడి, క్రుంగి=క్రిందికి తలవంచి, తెచ్చు అంకెలు = బయటికి రప్పించుకొను వృషభధ్వనులు, నిగుడఁగన్ = వెలువడుచుండఁగా, మంద పిఱుఁదన్ = పసులగుంపునకు వెనుక, మందగతిన్ = మెల్లని నడకతో, గునికెన్ = పోయెను.

ఆవు వెద అయ్యును (ఎద్దును కోరిన దయ్యును) కొంచెము తప్పించుకొని పోవుచుండును, తుదకు దానికి వశపడును. మందలో ఆవు సులువుగా ముందు వడిగాఁబోవును, అఁబోతు స్వదేహభారముచేత అంతవడిగాఁ బోలేక వెనుఁజిక్కును. కడమ పసులన్నియు తేలికగా పోవుటచేత అఁబోతు ప్రాయికముగా మందకంతయు వెనుక నుండును. దానికి అంకె సులువుగా రాదు. అంకె వేయునప్పుడు అది మెడ చాఁచి తల నేలవైపు వంచి అంకెతో ఎత్తును. ఆ చేష్టచేత అంకె వచ్చుట యెట్లుండె ననఁగా - వెదమొదవుతోఁగూడ అది పోలేని యందులకు కలిగిన తాపము, ఆకంఠపరిపూర్తిగా దానికి దేహములో ఉండి కంఠమున శబ్దద్వారమునకు అడ్డపడియున్న క్రొవ్వును సందువిడునట్లు కరఁగింపఁగా, అప్పటికి అడ్డుతీఱి, మెడ సాఁగఁగా, శబ్దము ఆసందున వచ్చెనో యనున ట్లుండెను.—అంకె వచ్చుటకు తాపము క్రొవ్వును కరఁగించుట హేతువుగాదు, దానిని హేతువుగా చెప్పినందున హేతూత్ప్రేక్ష; ఉత్తరభాగమున స్వభావోక్తి. 'వెడలెనో యనఁగ నెట్టు'—ఇట యతిభగ్నము. 'వెడలెఁగాక యననెట్టు' అని పఠింపవచ్చు నని తోఁచెడిని.

తే. శరధిజల మెల్ల రిత్తగాఁ గురియ, నుప్పు
డొక్కఁ జేరిన, న త్తెల్పె చిక్కి మీఁద
గాన నగుచున్న దచ్ఛతచే, ననంగఁ
బఱచు శరదభ్రములమేని పాండు వమరె. 170

పఱచు శరత్ అభ్రములమేని పాండువు = (మింట) వడిగాఁ బోవుచున్న శరత్కాలపు మేఘములయొక్క దేహధావళ్యము, (ఎట్లు అమరె ననఁగా), రిత్తగాన్ = తమకడుపు వట్టిది యగునట్లుగా, శరధిజలమెల్లన్ = సముద్రోదకము నంతయు, కురియన్ = వర్షింపఁగా, ఉప్పు, డొక్కన్ = కడుపులో, చేరినన్ = సాంద్రీభూతము కాఁగా, ఆ తెల్పె = ఆయుప్పుయొక్క ధావళ్యమే, చిక్కి = శేషించి, అచ్ఛతచేన్ = ఆమేఘములయొక్క స్వచ్ఛగుణముచేత, కానన్ అగుచున్నది = వెలికి (మనకు) కనఁబడుచున్నది, అనంగన్ = అనునట్లుగా, అమరెన్ = ఒప్పెను.

శరదభ్రములు తెల్లఁగానుండుటకు కారణమును కల్పించుచున్నాఁడు.—మేఘములు తాము సముద్రములో త్రాగిన జలమునెల్ల ఉప్పుమాత్రము శేషముగా తమకడుపులో మిగతలేకుండ వానగా కురియఁగా, ఆ శేషించిన యుప్పు ఆనీటినుండి క్రిందికి డొక్కలో ప్రతిదినము కొంతకొంతగా చేరి దట్టంపు మొత్తమై, ఆమేఘముల యద్దమువంటిస్వచ్ఛదేహములనుండి వెలికి కనఁబడుచున్నదో యన ధవళదీధితులతో ప్రకాశించుచుండెను.—హేతూత్ప్రేక్ష.

సముద్రోదకములోనియుప్పు విఱిగి డొక్కలో నిలిచిపోయినందుననే మనకు తియ్య నీళ్ల వానలు కురిసినవి. 'శరం తు నీరే' నానా. జలవాచకశబ్దములకు 'ధి' చేర్చిన సముద్రవాచకము లగును:-

'అబ్ధౌ నదీభ్యో వారిభ్యః స్రోతసో యాదసోఽధిపః
అదోభ్యశ్చ నిధ్యాశయా రాశి ర్ధి రుద్గాదేః పరేఽర్ణవాః' కా.క.అ.

'రిత్త'—'రిక్త' శబ్దవై. 'ప్రసన్నోఽచ్ఛః' అమ. 'పాండిమమరె' అనుపాఠమున సంధి దుష్టము. 'పాండువమరె' అని పఠించుట సరి. పాండువు = పాండిమము:—

'శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్యేత పాణ్డరాః।
హరిణః పాణ్డురః పాణ్డు రీషత్పాణ్డు స్తు ధూసరః।
గుణే శుక్లాదయః పుంసి గుణిలిఙ్గా స్తు తద్వతి.' అమ.

క. శరనిధి మును గ్రోలిన ని
ర్ఝరజలములు గురిసి, మేఘభావం బఱి, య
క్కరములు కరములె కా, జిగి
నొరిమె, ననన్ రవియు మెఱసె, నుడిగెను మొయిలుల్. 171

శరనిధిన్ = సముద్రములో, మును = పూర్వము, గ్రోలిన నిర్ఝరజలములు = త్రాగినట్టి మిక్కుటపు నీళ్లను, కురిసి = వర్షించి, మేఘభావంబు = మేఘత్వము, అఱి = నశించి, ఆకరములు = ఆ కిరణములు, కరములె = వట్టికిరణములే, కాన్ = కాఁగా, జిగిన్ = కాంతిచేత, ఒరిమెన్ = చుఱుకెక్కినాఁడు, అనన్ = అనునట్లుగా, రవియున్ = సూర్యుఁడు, మెఱసెన్ = తేజరిల్లెను, మొయిలున్ = మేఘంబును, ఉడిగెన్ = రూపఱెను.

వర్షర్తువులో తన కిరణములు మేఘములుగా మాఱినందున సూర్యుఁడు తేజోహీనుఁడుగా నుండి, శరదృతువులో ఆమేఘముల నీరంతయు వర్షరూపమున తమ్ము వదలిపోవుటచే ఆమధ్య కాలములో వచ్చియుండిన మేఘభావము పోవుట కాఁగా, తాము మరల ఎప్పటి కిరణములుగా మాఱినందున సూర్యునికి ఆవర్షర్తువులో తగ్గియుండిన తేజస్సు ఇప్పుడు మరల కలిగినదో యనునట్లుగా సూర్యుఁడు మిక్కిలి చుఱుకెక్కి తేజరిల్లుచుండెను. మేఘముల కలిమిలేములు కారణమై యుండఁగా కిరణముల మేఘత్వామేఘత్వములు కారణములుగా కల్పింపఁబడినవి గావున హేతూత్ప్రేక్ష. 'పరఁగుఁ జుఱుకయ్యె ననుమాట యొరిమె ననఁగ' ఆం. భా.

క. ప్రాశించిననీ రంతయుఁ । బో, శరదభ్రములు మగుడఁ బూరింపఁగ, నా
వేశించెఁ గొలంకుల ననఁ, । గాశప్రతిబింబపటలి కడు నొప్పారెన్. 172

శరదభ్రములు = శరత్కాల మేఘములు, ప్రాశించిననీరు = త్రాగినజలము, అంతయున్ = సర్వమును, పోన్ = వ్యయితము కాఁగా, మగుడన్ = మరల, పూరింపఁగన్ = నీరు త్రాగి కడుపు నింపుకొనుటకై. కొలంకులన్ = చెఱువులయందు, ఆవేశించె ననన్ = ప్రవేశించిన వనునట్లుగా, కాశ ప్రతిబింబ పటలి = (చెఱువుగట్టులోని) ఱెల్లు (మొత్తము)ల యొక్క ప్రతిబింబముల సమూహము, కడున్ ఒప్పారెన్ = మిక్కిలి సొంపొందెను.

ఆశరత్కాలమందు మేఘములు తాము మున్ను సముద్రములోఁ ద్రావిన జలమంతయుఁ దమకు నిలువక పోయినందున రిత్తలై, మరల కడుపునిండ నీరు త్రాగుదుముగాక యని చెఱువులలో ప్రవేశించిన వేమో యనునట్లుగా, చెఱువులయందు వానిగట్టులలోని ఱెల్లుల ప్రతిబింబముల మొత్తములు ఒప్పుచుండెను.

'పటలి' - జాత్యేక వచనము, ఒక్కొక్క పటలి ఒక్కొక్క శరన్మేఘ మని భావన. 'కాశ' - వికసించిన పువ్వులే ఇట ప్రధానము గావునను, పువ్వు మిక్కిలి నిడుపుగా నుండుటచేతను, ధావళ్యాతిశయముచేత ప్రతిబింబమందు అదియే యుత్కటముగా కనిపించును గావునను, పద్యమున పుష్పమునే ప్రత్యేకించి చెప్పలేదు; మఱియు ఈమేఘములు సముద్రమునకే పోరాదా యనిన, సముద్రజలము నెల్లను పూర్వమే త్రాగి వైచినవిగావున ఇఁక నచట జలము లేదని ఆటకుం బోలేదు.

తే. కొలనఁ గరిదంపతులు పద్మకళిక లొకటి
కొకటి యీ నెత్త, మకరంద మొలుక, నమరె
నల శరత్పద్మనిలయకు నెలమితోడఁ
గవగ నభిషేకమున కెత్తు కడవ లనఁగ. 173

కొలనన్ = తమ్మిచెఱువునందు, పద్మకళికలు = తామరమొగ్గలు (అమరెనను క్రియకుఁ గర్త), కరిదంపతులు = భార్యాభర్తలయిన యేనుఁగులు, ఒకటికొకటి = భార్యకు భర్తయు భర్తకు భార్యయు, ఈన్ = ఇచ్చుటకై, ఎత్తన్ = ఏకసమయమందే ఎత్తఁగా, మకరందము = తేనె, ఒలుకన్ = ఆకళికలనుండి క్రిందికి కుమ్మరిల్లుచుండఁగా, (ఆకమల కళికలు ఎట్లు అమరిన వనఁగా), ఎలమితోడన్ = ప్రీతితో (భక్తితో ననుట), అభిషేకమునకున్ = స్నానము చేయించుటకై, ఎత్తుకడవలు అనఁగన్ = ఎత్తిన ఘటములో యనునట్లు, అమరెన్ = ఒప్పారెను.

కొలనిలో దంపతు లయినయేనుఁగులలో పిడి మగదానికిని మగది పిడికిని ఇచ్చుటకై ఏకకాలమున తామరమొగ్గలను ఎత్తినవి. ఏకకాలమున అట్లు చేసినందున రెండింటి తుండాగ్రములును ఆకళికలతోడివి పైకి నిగిడి ఒక్కచోట కలసికొనినవి. ఈయఁబోవునప్పుడు ఆకళికలు నిలువుగానే ఉండవు గావునను, ఉత్పాటనమందును వానికి కలిగెడి కదలికలచేతను, అందుండి మకరందము కుమ్మరిల్లుచునే యుండెను. అప్పుడు ఆజంటకళిక లెట్లొప్పె ననఁగా, ఆగజములు ప్రీతితో కవగూడి శరల్లక్ష్మికి అభిషేకము గావించుచున్న కడవల జంటయో యనున ట్లుండెను.— ఉత్ప్రేక్ష.

'లక్ష్మీర్దివ్యైర్గజేన్ద్రైర్మణిగణఖచితైః స్నాపితా హేమకుమ్భై
ర్నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాఙ్గల్యయుక్తా' అని శ్రీసూక్తము.

శరల్లక్ష్మి కొలనిలో నున్నదా యనిన. 'శరత్పఙ్కజలక్షణా,' 'లక్ష్మీః పద్మాలయా' అను వచనముల ననుసంధింపవలయును. గజద్వంద్వము సూక్తములో చెప్పలేదే యనిన ఎలమిగల దాంపత్యభాగ్యమును కోరినవై ప్రకృతకరేణుకరులు అట్లు గావించిన వని తలంచునది.

తే. పంక మడుగంటఁ దేఱిన బావు లెల్లఁ
బంకములె చేసెఁ గ్రమ్మఱఁ బంకజములు
గళితమకరందయుతరజఃకర్దమమునఁ;
గారణగుణంబు గలుగదే కార్యమునను. 174

పంకము = వండు, అడుగు అంటి = క్రిందికిపోఁగా; తేఱినబావులు ఎల్లన్ = నీరు తేటపడినట్టి డిగ్గియల నన్నిటిని, పంకజములు = తామరపువ్వులు, గళి...నన్ - గళిత = ఒలికిన - మకరంద = తేనెతో - యుత = కూడుకొన్న - రజః = పుప్పొడియొక్క - కర్దమమునన్ = బురదచేతను, క్రమ్మఱన్ = మరల, పంకములన్ = బురదగానే, చేసెన్; కార్యమునన్ కారణగుణంబు కలుగదే = జన్యమందు జనకముయొక్క గుణము తప్పక కలుగును.

శరత్కాలమందు డిగ్గియలలో వం డంతయు క్రిందికి దిగి నీరు తేరినది. అయినను ఆ తేట నీటిని తామరలు తమ పుప్పొడి మకరందముచేత మరల బురదగానే కావించినవి. ఇది న్యాయ్యమే. లోకములో కారణముయొక్క గుణము కార్యమం దుండుట నియతము. ఎట్లన - బంగారుకడియ

మందు బంగారుగుణము, మట్టిగోడయందు మట్టిగుణమును ఉండుట నిదర్శనముకాదా; అట్లే ప్రకృతమున తామరసము పంకజము కావున అనఁగా బురదనుండి పుట్టినది (పఙ్కాత్ జాతమ్) కావున తనకారణ మయిన పంకముయొక్క గుణమును తానుం జూపినది. అనఁగా కొలనియెల్ల మకరందరజఃపంకముం గావించినది. "కారణగుణాః కార్యే సంక్రామన్తి" అని న్యాయము.— సామాన్య విశేషములను చెప్పుటచే అర్థాంతరన్యాసము.

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం । గొసరి జను, ల్వార్ధినీరు గ్రోలితి వీనీ
ర్పసికై మా కిమ్మని క । న్కసు డుడుగం గావ నప్పగించెదుకరణిన్. 175

జనులు = లోకులు, ఈవు = నీవు, వారిధినీరు = సముద్రోదకములను, గ్రోలితివి = త్రాగినాఁడవు, ఈనీరు = భూమిలోనున్న యీనీటిని, మాకున్, పసికై = పైరులకై (లేక క్షేమముకై), ఇమ్ము = త్రాగక వదలిపెట్టుము; అని, కసుకసరు = ఒకరికలిమిని చూచుటచే కలిగెడు కోపవికారము, ఉడుగంగాన్ = శమింపఁగా, కావన్ = భూమిలోని నీటిని తాను త్రాగకుండ వదలుటకై, అప్పగించెడు కరణిన్ = అందులో కొంతకప్పముగా నొసంగుచున్నారో యనునట్లుగా, కొసరి = తమకముతో, అగస్త్య అర్ఘ్యములన్ = (నక్షత్రరూపమున ఉదయించిన) యగస్త్యుల వారికైన యర్ఘ్యోదకాంజలులను, ఒసఁగిరి = ఇచ్చిరి.

జనులు "స్వామీ; అగస్త్యుఁడా, నీవు సముద్రజలమును త్రాగివైచితివి. నీవు దానితో సంతుష్టిఁజెంది భూమిమీఁదనున్న యీమిగతజలమును పైరులకై (లేక మా క్షేమముకై) మా కుండ నిమ్ము, దీనిని నీవు త్రాగకుము," అనిప్రార్థించుటగా, వీరికి ఇంత నీ రుండనేల? యనెడి యోర్వలేమితోఁ గూడుకొన్న తదీయకోపవీక్షణదోషము శాంతించునట్లుగా ఆయనకు కప్పముగా కొంతజలము ఇచ్చుచున్నారో యనునట్లు అప్పుడు నక్షత్రరూపమున దక్షిణదిక్కున నుదయించి యున్న యగస్త్యులవారికి అర్ఘ్యప్రదానముం గావించిరి.—ఫలోత్ప్రేక్ష.

'అగం వింధ్యాచలం స్త్యాయతి స్తభ్నాతి ఇత్యగస్త్యః' - వింధ్యాచలమును స్తంభింపఁ జేసినవాఁ డని వ్యు. అగస్త్యునికి (నక్షత్రరూపునికి) అర్ఘ్యమిచ్చుటచేత మహాఫలము చెప్పఁబడి యున్నది. ఆయనకు అట్టిమహిమ విష్ణువరమునం గలిగినది:—

"పురా యుగసహస్రం తు విష్ణుర్వారుణినా మునే
ఆరాధితః ప్రసాదార్థం; తస్మై ప్రాదా ద్వరం హరిః.'
'దక్షిణాశాం పురస్కృత్య త్వం ప్రతిష్ఠస్వ వారుణే,
వారుణే తే భవిష్యన్తి లోకేఽస్మిన్నర్ఘదా స్తవ,
అప్రాప్తే భాస్కరే కన్యాం త్రిభి ర్భాగై స్త్రిభి ర్దినైః
పుష్పై ర్ధూపైః ఫలై ర్నైవేద్యైః శారదైశ్చ సుగన్ధిభిః
పఞ్చరత్న సమాయుక్తం హేమరూప్య సమన్వితమ్
సప్తధాన్యం సమాదాయ అర్ఘ్యం దద్యు ర్ద్విజాతయః,'
'కాశ పుష్ప ప్రతీకాశ అగ్ని మారుత సంభవ
మిత్రావరుణయోః పుత్ర కుమ్భయోనే నమోస్తు తే'...
దత్వార్ఘ్యం మునిముఖ్యాయ తోషయిత్వా జనార్దనం
విష్ణులోక మవాప్నోతి నరో నా స్త్యత్ర సంశయః." రాజమార్తాండము.

'పసి' - 'పసి యనఁగాను సస్యము చెలంగు' ఆం. భా.

క. పరుషాతపతప్తం బగు । ధరణీపాత్రమునఁ బడుట దళ మయ్యెఁ జుమీ,
పరిపక్వంబై, యనఁగా, । శరదిందుజ్యోత్స్న రేల సాంద్రతఁ గాసెన్. । 176

శరత్ ఇందు జ్యోత్స్న = శరత్కాలపు జంద్రుని వెన్నెల, పరుష ఆతపతప్తంబు = తీవ్రమయిన యెండచేత వేఁడెక్కినది, అగు = అయిన - ధరణీ పాత్రమునన్ = భూమి యనెడు పాత్రమందు, పడుటన్ = పడినందువలన, పరిపక్వంబై = చిక్కఁగా గ్రాఁగినదై, దళము అయ్యెన్ చుమీ = చిక్కఁబడ్డది సుమా, అనఁగాన్ = అనునట్లుగా, రేలన్ = రాత్రులయందు, సాంద్రతన్ = దట్టముగా, కాసెన్ = ప్రకాశించెను.

గట్టినిప్పుచే కాఁగిన పెనముమీఁద అట్లపిండి పోసిన అదియెట్లు పక్వమై చిక్కఁబడునో, ఆవిధముగా తీవ్రాతపముచే పగలెల్లం గ్రాఁగిన ధరణీపాత్రమునం బడుటచే క్రాఁగి, చిక్కఁబడెనో యనునట్లు రాత్రులయందు శరత్కాలపు వెన్నెల దట్టముగా కాయుచుండెను.— హేతూత్ప్రేక్ష.

తే. వృష్టికాలన్ నిడ్డజెనఁ ద్రావఁ గ్రింది నుండి
తేట నదినీటఁ దనవెంటఁ దేలుమీల
తళ్కుతోఁ నాఁచులతి దోఁచె వెలికి, జమిడి
కెంపి మీ లెక్కు వెండ్రుకవిల్లువోలె. 177

నాఁచులతి = నాఁచుతీఁగ, వృష్టికాలన్ = వానకాలమందు, ఇడ్డజెనన్ = పెట్టిన గ్రుడ్ల సమూహమును, త్రావన్ = త్రాగుటకై, తేట నది నీటన్ = స్వచ్ఛమయిన యేటిజలమందు, క్రిందనుండి = అడుగునుండి, తన వెంటన్ = నాఁచుతీఁగ వెంబడి, తేలుమీలతళుకుతోన్ = పైకి వచ్చుచున్న చేఁపల ధావళ్యముతో, (నాఁచుతీఁగ) వెలికిన్ = బయటికి, (ఎట్లు తోఁచె ననఁగా), జమిడికన్ = జమిడి యను వాద్యమందు, వెండిమీలు, ఎక్కు = ఎక్కెడు - వెండ్రుకవిల్లువోలెన్ = వెండ్రుకవిల్లు యనునట్లుగా, తోఁచెన్ = అగపడెను.

వర్షాకాలములో నాఁచుతీఁగ పొడుగునను చేఁపలు జెన (గ్రుడ్లు) పెట్టును; వానిని తర్వాత శరత్కాలమునందు భక్షించివేయును. చేఁపలు అట్లు తినుచు ఏటిలోని తేటనీటిలో తళతళలాడుచు నాఁచులతి పొడువునను క్రిందనుండి పైకి వచ్చుచుండఁగా నాఁచులతి యెట్లుండె ననఁగా— జమళిక వాద్యములోని వెండ్రుక పొడువునను క్రిందినుండి పైకి తళతళలాడుచు వెండిచేఁపలు ఎక్కినట్టి వెండ్రుకవిల్లో యనునట్లుగా నొప్పెను. ‘తేట’ - వెలికిం గనఁబడుటకు. అన్యతాదాత్మ్య సంభావన కనఁబడుచున్నది గావున ఉత్ప్రేక్ష. ఉపమయే యని కొందఱు తలంతురు.

క. హంసము క్రౌంచములోలన్ రా,
మాంసలరుచి వచ్చెఁ దాను మలయము కేఁగన్; బోల్
హంస విలున, నీ ర్వెలిచెను,
హంసమున కగస్త్రి పరమహంసం బగుటన్. 178

హంసమునకున్ = హంసకన్న ఎక్కువవాఁడుగా, అగస్త్రి = అగస్త్యమహాముని, పరమహంసం బగుటన్ = శ్రేష్ఠహంసము (పరమహంస యనెడి యుత్తమసన్న్యాసి) యగుటచేతను, హంసము = హంస, క్రౌంచములోలన్ = క్రౌంచరంధ్రముదారిని, రాన్ = రాఁగా, తాన్ (అగస్త్రి);

మాంసలరుచిన్ = పుష్కలమయిన కాంతితో, మలయము శిఖన్ = మలయముయొక్క శిఖరము నుండి, వచ్చెన్, హంస = హంసము, పాల్ విఱువన్ = (పాలలోని నీటిని త్రోసివేయఁగా) నీళ్లతోఁ గలసిన పాలను వేఱుసేయఁగా, (తాను), నీరు విఱిచెన్ = వండునుండి నీటిని వేఱు చేసెను. (నీటిని తేర్చె ననుట).

హంసము వట్టిహంసము - అగస్త్యుఁడు పరమహంసము, కావున హంసమునకన్న అగస్త్యుఁడు ఎన్ని మడుంగులో గొప్పవాఁడు. అందువలన హంసముకన్న ఎక్కువ ప్రభావమును చూపించినాఁడు; అది యెట్లనఁగా—హంసము క్రౌంచాద్రియొక్క శిఖరమువఱకు నెగయలేక నడుమ నేదోయొక రంధ్ర ముండఁగా ఆదారినే వచ్చినది, ఈయన మలయాద్రియొక్క శిఖరమునుండి వచ్చినాఁడు; హంస పాలు విఱువఁగా, తాను అంతకన్న పలుచనయిన నీటినే విఱిచినాఁడు. వ్యతిరేకాలంకారము.

'చతుర్విధా భిక్షవ స్తే కుటీచక బహూదకౌ
హంసః పరమహంస శ్చ యో యః పశ్చాత్స ఉత్తమః.' మహాభారతము.

అగస్త్యుఁడు భిక్షువు గాఁడే యనిన, ఆశ్రమముకన్న యోగ్యత ముఖ్యము గాన యోగ్యతనుబట్టి పరమహంసగా గణనీయుఁడు.

తే. క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు గాంచె మింట,
నవి యహంసచ్ఛదాచ్ఛాదనానుభూతి
హంసతతు లయ్యెఁ; గా దన్న, నరుణచూడ
గుప్తభుజగాశనాండము ల్గుఱులు గావె? 179

క్రౌంచము = క్రౌంచపర్వతము, మింటన్ = ఆకాశమున, ఒకకొన్ని గ్రుడ్డులు = కొన్ని యండములను, కాంచెన్ = పడసెను, అవి = ఆయండములు, అ...తిన్ - అహంస = హంసేతరపక్షులయొక్క - ఛద = ఱెక్కలయొక్క - ఆచ్ఛాదన - కప్పుటయొక్క, అనుభూతిన్ = అనుభవముచేతను, (ఇతరపక్షులచేత పొదుగఁబడినవై), హంసతతులు = మరాళసమూహములు, అయ్యెన్, కాదు అన్నన్ = అదివాస్తవము కా దని ఆక్షేపింతురేని, నరుణ...ముల్ - నరుణ చూడ = కోళ్లచేత - గుప్త = పొదుగఁబడిన - భుజగాశన = నెమళ్లయొక్క - అండముల్ = గ్రుడ్లు, గుఱులు కావే = తార్క్ష్యణము కావా?

క్రౌంచరంధ్రములో (పరశురాముఁడు క్రౌంచాద్రిలో చేసినరంధ్రముదారిని) హంసలు ఇక్కడికిని మానససరోవరమునకును రాకపోకలు గావించును గాన, నడుమ ఆ రంధ్రములో కొన్నిహంసలు గ్రుడ్లుపెట్టఁగా, ఆగ్రుడ్లు హంసేతరపక్షులు పొదుగఁగా, హంససమూహము లైనవి. అట్లు జరుగునా, ఒకజాతి పక్షిగ్రుడ్లు మఱియొకపక్షి పొదిగినచో పిల్ల లగునా యని ఆక్షేపమేని, కోళ్లు పొదుగఁగా నెమలిపిల్ల లయిన నెమలిగ్రుడ్లు నిదర్శనము చూచుకొనుఁడు.

ఇట్లు శరత్తులో హంసలు జలాశయములం దెల్ల సంఖ్యాతీతము లగుటకు కారణ మేమనఁగా- మానసములోని హంసలు మాత్రమే గాక క్రౌంచాద్రిలోనివి సయితము వచ్చుట; క్రౌంచములో హంస లెక్కడి వనఁగా - మానసమునకును పోవుహంసలు కొన్ని క్రౌంచములో గ్రుడ్లిడఁగా, వానిని క్రౌంచములోని యితర జాతిపక్షులు పొదుగఁగా, అచట కొన్ని హంసతెగలు పుట్టి సంఖ్యాతీతముగా వర్ధిల్లినవి. అవియును వచ్చుటచేత ఇపుడు ఇట్లు మెండుకొన్నవి. కడమ చెప్పినదే.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం
బులపయి దట్టపుంజిలుము వోవఁగఁ దా మలకంచు గీయఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువు
ల్కెలఁకులఁ బాసి పోఁ జెలఁగి క్రేంకృతు లిచ్చు మరాళమాలికల్. 180

కలయఁగన్ = ఎల్లెడలను, వారిదేవతలు = జలదైవతములు, కాంచు సరోవరదంభ దర్పణంబులపై దట్టపుంజిలుము = ముఖమును చూచుకొనునట్టి సరః శ్రేష్ఠము లనెడు వ్యాజముగల యద్దముల మీఁది సాంద్రంపులోహమాలిన్యము, పోవఁగన్ = తొలఁగునట్లుగా, తాము = మరాళమాలికలు, అల కంచున్ = ఆ కంచుటద్దములను, గీయఁగా బలెన్ = కీచుమని ధ్వనిచేయునట్లుగా తోముచున్నవో యనునట్లు, నలువంకలన్ = సరస్సులలోని నాలుగు ప్రక్కలయందును, కలయన్ = తోముట నెఱవేఱునట్లుగా, పాయక = మధ్యలో విరమింపక, తేలుచున్ = సరస్సులో మునుఁగక నీటిపైనే యుండి, కెలఁకులన్ = తమ పార్శ్వములయందు, పద్మరేణువుల్ = తామరల పుప్పొడి, పాసిపోన్ = చెదరి యెడలునట్లుగా, చెలఁగి = వర్తించి, మరాళమాలికల్ = హంసపంక్తులు, క్రేంకృతు లిచ్చెన్ = క్రేంకారముం గావించెను.

సరస్సులు సరస్సులుగావు. మఱియే మన్న జలదేవతలు ముఖముం జూచుకొనెడు కంచుటద్దములు; వానిపై (వర్షరువులో) దట్టముగా చిలుము చేరినది. హంసశ్రేణులు ఆచిలుమును తోముచున్నవో యన ఆసరస్సులలో మునుఁగకయే ఇటునటు అంతటం గలయునట్లుగా సంచరించుచుండినవి. అట్లు తోముటవలన చిలుము ఎడలి యెగిరి పోవుచున్నదో యనునట్లుగా పద్మరజస్సు ఇవి పోయినకడ నెల్ల రేఁగుచు కొలఁకుల వెలికి ఎగసి పోవుచుండినది. ఇవి కడుదిటవుగా తోముటచేఁ గలిగిన కీచుశబ్దములో యన వీని క్రేంకారములు ఒప్పుచుండెను. - కైతవాపహ్నుత్యుత్థాపితో త్ప్రేక్షాలంకారము.

ఈ దేశములో పూర్వకాలమున కంచుటద్దములు ప్రసిద్ధములు. సదాచార పరాయణులు గాజుటద్దములు మట్టివిగావున మడుంగు గావని వానిని తాఁకక కంచుటద్దములనే యుపయోగించుచుండిరి. వానిని దినదినము సన్నని బూదితో తోమి నిర్మలీకరించుకొనుచుండిరి. ఆయాచారము నిట ననుసంధించి కవి యిట్లు వర్ణించినాఁడు.— మా. వాసవదత్త —

'హస్త ఇవ భూతిమలినో। యథా యథాలఙ్ఘయతి ఖల స్సుజనమ్,
దర్పణ మివ తం కురుతే। తదాతదా నిర్మలచ్ఛాయమ్.'

'దంభ' అనుటచే కైతవాపహ్నుతి, 'కాబలెన్' - ఉత్ప్రేక్షావాచకము. 'కాంచు' = మొగముం జూచుకొను. 'తేలుచు' - తోమునవి కంచులో మునుఁగవు గావున మునుక నివారితము. 'పద్మరేణువుల్' - తోముటచే లేశలేశముగా ఊడి యెగసి పోవుచున్న చిలుము. 'కంచుగీయుట' - 'అకాంచన హంసంబు కంచుగీసిన తెఱంగున నెలుంగించుచు' శృం. నై. 1 (103).

సీ. అర్కమండలి కభ్ర మడ్డమైనంతనే,
యెఱమాని మోము బి ట్టెత్తి చూచి;
ఘుమఘుమధ్వని గాలి గుహఁ జొరఁ, బురి యొకిం
చుక యెత్తి కని తలంచుకొని వంచి;

నిష్పుష్ప కేతకి నేత్రాంబు వొత్తి, భే
కపుఁడెంకి పడియచోఁ గర్ణ మొగ్గి;
కేకకుఁ ద్ర్యవనతగ్రీవ మై రాక యొ
క్కింత ఆర్చి, వాత నేమేమొ కమిచి;
తే. వెడలు బీటెండకును శరద్వృక్ష మీఁగి,
వార్షికమె యెక్కి, త్రోటి నిర్వంకఁ బక్ష
తులను నివురుచు, వెఱ్ఱిచూపుల నురంబు
కెలఁకులఁ గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె. 181

శరదృతువు నందలి కేకుల యవస్థను వర్ణించుచున్నాఁడు:—కాననన్ = అడవియందు, కేకులు = నెమళ్లు, అర్కమండలికిన్ = సూర్యబింబమునకు, అభ్రము = మేఘము, అడ్డము ఐనంతనె, ఎఱ = మేఁత, మాని, మోము = వదనమును, బిట్టు = మిక్కిలిగా, ఎత్తి, చూచి; ఘుమఘుమ ధ్వనిన్ = ఘుమఘుమ యనుశబ్దముతో, గాలి, గుహన్ = గుహలోనికి, చొరన్ = ప్రవేశింపఁగా, పురి = కుంచె, ఒకించుక = కొంచెము, ఎత్తి, కని = చూచి, తలంచుకొని = ఉఱుము గాదని తెలిసికొని, వంచి = కుంచెను దించి, నిష్పుష్ప కేతకిన్ = పూవులు లేనిదైన మొగలియందు, నేత్ర అంబువు = కన్నీళ్లను, ఒత్తి = అద్ది (తుడుచుకొని), భేక...చోన్ - భేకపు = కప్పల యొక్క - టెంకి = నివాసమైన - పడియచోన్ = పల్వలముదగ్గఱ, కర్ణము ఒగ్గి = చెవి యొడ్డి, కేకకున్ = కూఁతకూయుటకు, త్ర్య...ము - త్రి = మూఁడు (మాఱులు) - అవనతి = వంపఁబడిన - గ్రీవము = మెడగలది, ఐ, రాక = కేక సరిగా రానందున, ఒక్కింత = కొంచెము, ఆర్చి = శబ్దించి, వాతన్ = నోటితో, ఏమేమొ = ఏదేదో (నోటికి దొరకిన దానిని), కమిచి = పట్టి (కఱచుకొని); వెడలు బీటెండకును = మబ్బు విడిచి కాయుచున్న మిడియెండకు, శరద్వృక్షము = శరత్కాలమునఁ బూచినదైన యేడాకుల యరఁటిని, ఈఁగి = వదలి (పా. డిగి=వదలి), వార్షికమె = (వర్షఋతువులో ఫలించునదైన) గుమ్ముడు చెట్టునే, ఎక్కి, త్రోటిన్ = చంచువుతో (ముక్కుతో ననుట), ఇర్వంకన్ = రెండు ప్రక్కలను, పక్షతులను = ఱెక్కల మూలములను, నివురుచున్ = నిమురుచు (సవరించుచు), వెఱ్ఱిచూపులన్ = వికారపు దృష్టులతో, ఉరంబు = ఱొమ్ముయొక్క - కెలఁకులన్ = ప్రక్కలను, కనుంగొనుచున్, ఉండెన్.

ఆసమయమున అడవిలో నెమళ్లు ఎట్లుండిన వనఁగా:—సూర్యబింబమునకు మేఘము చాటయిన మాత్రాన మంచి మేఘము వచ్చినదేమో, వర్షించునేమో, అనెడి యాశచేత మేఁత మాని, మొగమును పైకి నిగుడ్చి చూచుచుండును. ఘుమఘుమ యను శబ్దముతో గుహలలోనికి గాలి చొచ్చుచుండఁగా ఆశబ్దము ఉఱుమని భ్రమపడి సంతోషించి నృత్యము చేయుటకై కుంచె కొంచెము ఎత్తి ఇంతలో మీఁద చూచి, 'మేఘము లేదు ఉఱుము గాదు' అని తెలిసికొని కుంచెను వంచుకొనును; పూఁత నిలిచిపోయిన మొగలిం గని దుఃఖించి, వచ్చిన కన్నీళ్లను ఆ మొగలి చెట్టునకే అద్దివైచి, కప్పలు మ్రోయు నేని వర్షము వచ్చును గావున వానికూఁత యేమేని వినఁబడునా యను నాశచే కప్పలుండు తావయిన పడియకడ చెవియొగ్గును;—కూఁత కూయుటకుఁగాను మూఁడు మాఱులు మెడవంచియు కూఁత రానందున, ఏమో యించుక అఱచి

నోటితో ఏదేని చెంత నగపడిన దానిని కవ్వుచుండును;—మబ్బు విడిచి కాయుచున్న మిడియెండ నోర్వలేక, నీడకై శరత్కాలమందు పుష్పించి విజృంభించునది యైన యేడాకుల యరఁటికడకుం బోక, వర్షర్తువునందు రెక్కనున దైన గుమ్ముడువృక్షము ఎక్కును;—ముక్కుతో ఇరువంకలను రెక్కల మొదళ్లను సరిదిద్దుకొనుచు, అర్థములేని వెఱ్ఱిచూపులతో బొమ్మ ప్రక్కలను చూచు కొనుచు, ఉండును.—స్వభావోక్తి; ద్వితీయ పాదమున భ్రాంతిమంతము ధ్వనితము.

'ఎఱమాని' - ఎఱకన్న మేఘము ప్రియ మగుటచేత. 'మోము' - చూచుటకుఁ గావున, తల యనక మో మనుట. 'బిట్టు' - ఆత్రముచేత. 'ఘుమఘుమ' - మేఘముయొక్క మంద్రధ్వని యట్లుండును. 'నిష్ప్రష్ప' - వర్షాకాలమందు మాత్రమే పూచునది గాన;

'వర్షాసు ఘన శిఖిస్తుయ హంసగమాః పఙ్క కన్ద భేద్భేదా!
జాతీ కదమ్బ కేతక ఝంఝానిల నిమ్నగా హాలిప్రీతిః' కా.క.ల.

దానిం జూచుట దాన నేమేని పువ్వు లున్న ఇంకను వర్షర్తువు కల దని, లే కున్న లే దని యెఱుంగుటకై. 'నేత్రాంబువు' - కేతకిలో పువ్వులేనందున ఋత్వపగమనము నెఱింగి అందునం గలిగిన దుఃఖముచే కన్నీళ్లు విడిచె ననుట; పైగా తనదుర్దశవంటి దుర్దశయే ఆకేతకికిని కలిగినందు లకై తనకు కలిగిన కనికరముచేతను కన్నీళ్లు వచ్చిన వనుట. 'భేకపుఁడెంకి' - 'భేకే మణ్డూక వర్షాభూ శాలూర ప్లవ దర్దురాః' అమ. కప్పలయఱపులు సద్యోవృష్టిని సూచించును.

'పవన విగమః పోప్లూయన్తే ఝషాః స్థల గామినః
రసన మసకృ న్మణ్డూకానాం జలాగమహేతవః.' బృ.సం.

'డిగి' - దిగియని యర్థముగాదు, నెమలి దానిమీఁద ఎక్కనే ఎక్కదు. 'శరద్వృక్షము' - 'సప్త పర్ణే విశాలత్వక్ శారదో విషమచ్ఛదః' అమ. 'శరది పుష్ప్య తీతి శారదః' అని రామాశ్రమి. 'వార్షికమె' - 'వార్షికం త్రాయమాణా స్యా త్త్రాయన్తీ బలభద్రికా' అమ. 'వర్షాసు భవం వార్షికమ్' అని టీక. ఎకారము ఏవకారార్థకము, తనవలెనే వర్షాప్రియ మని దానియం దభిమానమును శారదమందు ద్వేషమును ఎకారము తెలుపుచున్నది.—శారదమును చెప్పుట - అది ఎండను నివారింపఁ గలది. 'విశాలత్వక్కు' - వెడలుపయిన యాకులుకలదైనను దాని నొల్లమిం దెలుపుటకు.

క. వెలుతు రస లంటి యెండియు, । లలి, విప్పమిఁ, జెడక, శిఖికలాపము వని వ
ర్తిలెఁ, బర్జన్యుఁడు నటన । మ్ముల మెచ్చి మెఱుంగుఁగాసె ముద్రించె ననన్. 182

వనిన్ = అడవియందు, శిఖికలాపము = నెమలిపుంచె, వెలుతురు = ప్రకాశముగల నీడ, అంటి = తగులుటచేత, అసలు = తనయం దంటుకొన్న యడుసు, ఎండియున్ = ఇగిరినదై, లలిన్ = హర్షముతో, విప్పమిన్ = (నెమలి) విప్పకోనందున (హర్షహీన మగుటచే నెమలి అపుంచెను విప్పకయే యున్నందున), చెడక = ఆయసలు చెడక అట్లే యున్నందున (ఎట్లుండిన దనఁగా), పర్జన్యుఁడు = వర్షాధిదైవత మైన దేవేంద్రుఁడు, నటనమ్ములన్ = ఆశిఖియొక్క నాట్యమును, మెచ్చి, మెఱుంగుఁ గాసెన్ = ప్రకాశమాన మయిన కాసె కొంగును, ముద్రించెను అనన్ = ముద్రాంకితము చేసెనో యనునట్లుగా, వర్తిలెన్ = ఒప్పెను.

వనములో నెమలికి మురిఁగిన పుంచెపై బురద అంటుకొన్నది, అది చెట్ల నీడలలో క్రమ క్రమముగా ఇగిరినది. శరదృతువులో వర్షము లేమిచేత నెమలి ఆడందలంపమి కారణంబుగా, పుంచెను విప్పనందున దాని కంటుకొనియున్న యాబురద అట్లే చెడక యుండినది. అది చూడ

నెట్లుండె ననఁగా, నెమలియొక్క ఆటను మెచ్చి దేవేంద్రుఁడు తన మెప్పుదలకు సూచక మయిన ముద్రను నెమలియొక్క కాసికొంగుపయిని లక్కలో నొత్తినాఁడో యనున ట్లుండెను.— ఉత్ప్రేక్షాలంకారము.

విప్పమికి కర్త శిఖి,—చెడనిది అసలు.—'కలాపో భూషణే బర్హే తూణీరే సంహతా వపి' అమ. 'వర్తిలెన్' - ఇందుల కర్త కలాపము. 'వనిన్' - అడవినెమలిగాక పెంపుడు దైన యెడల పెంచువారు ఆయడుసును తొలఁగింతురు. 'పర్జన్యుఁడు' - 'పర్జన్యో మేఘనిర్ఘోషే వాసవే గర్జదమ్బుదే' నానా. - 'మెఱుంగుఁ గాసెన్' - ఆమెఱుఁగుతోఁగూడ ఈముద్రయుం బ్రకాశించుటకు. 'కాసెన్' - 'అచటి వెలయాండ్రు రంభాదు లైన నొరయఁ గాసెకొంగున వారించి గడపఁ గలరు.' మను. 'అడుసు' - లక్కముద్రవలె నున్న దనుట. 'కలాపము' జల్తారు, పట్లు, పువ్వులబుటాలు లోనగువాని మెఱుంగు గల కాసెవలె నున్న దనుట. ఎండ యనక 'వెలుతు' రనుట శిఖి యెండ నోర్వదు, ఎండలో నుండదు, కాన నయ్యడుసు ఛాయాశుష్క మైన దనుట. ఎండ కెండినచో పగిలి ఊడి పోవును, ఊడకున్నను ముద్ర సరిపడదు.

సీ. చక్రస్తనప్రకాశమునకు ఫేనంపుఁ
గొంగిడి గొనగొనఁ గోళ్ల గొణఁగి;
యశ్మనితంబంబు హంసహారమును బ
రాగరేఖాస్వర్ణరశనముగను
జలశాటిపులినంపుజఘనంబుపై జాఱ
వ్యస్తవేతసభుజస్వస్తిక మిడి,
తనిమతో వెచ్చనై తటశరప్రతిబింబ
హాసాళి బొప్పు లుచ్ఛ్వాసములకు
తే. నగుఁచు, జెందొవకంటను నలిగి, తమ్ము
లంటు కై యెత్తు పదనతి నలరి, కువల
మధులహరి నర్థిఁ జెంది పైమగతనముల
నొక్కెడలఁ గూడుచు స్రవంతు లుబ్బు పెనిచె. 183

స్రవంతులు=నదులు, చక్రస్తన ప్రకాశమునకున్=(కవ) జక్కవలు అను కుచముల ప్రకటనకై (అనఁగా - అవి కనఁబడుటకై), ఫేనంపుఁగొంగు=నురు వనెడి పయ్యంటను, ఇడి=జార్చి, గొనగొనన్=గొనగొన అని అవ్యక్తముగా, కోళ్లన్=బొల్లికోళ్లను పేరి నీటికోళ్ల చేత, గొణఁగి=అస్పష్టముగా పలికి, అశ్మనితంబంబు=(చాఁప)రా లనెడు పిఱుందులు గలుగునట్లు (గాను), హంసహారమును = అంచ(బారు) లనెడి ముత్యాలపేరులు గలుగునట్లుగాను, పరాగరేఖాస్వర్ణ రశనము గను = పూఘూళి రాజ యనెడి బంగారపు మొలత్రాడు గలుగునట్లుగాను, జలశాటి = నీ రనెడు పావడ, పులినంపు జఘనంబుపైన్ = ఇసుకదిన్నె యనెడు మొలమీఁదనుండి, జాఱన్ = స్రస్తముగుచుండఁగా, వ్యస్త వేతస భుజ స్వస్తికము = చెదరిన (బంధమునకు విశేషణము) నీటిప్రబ్బలనియెడు బాహువులయొక్క బంధవిశేషమును, ఇడి=కావించి, తనిమతోన్=నీరుతగ్గుట యనెడి

విరహకార్శ్యము కలిగి, వెచ్చనై = శరదాతపమువలన నయిన కాఁగుట యనెడి విరహతాపము కలవై, తట...లు - తట = ఒడ్డులయందలి - శర = జెల్లుయొక్క - ప్రతిబింబ = ప్రతిఫలనములు (నీటిలోని నీడలు) అనెడి - హాసా = నవ్వుగలవియు - అళి = తుమ్మెద లనెడు - బాష్పలు = (కాటుకచే నల్లనయిన) కన్నీళ్లు కలవియు, ఉచ్ఛ్వాసములకా = కలుజు లనెడి ఊపిరి వెలి బుచ్చుటలకు - అగుచుకా = అనుకూలించుచు, చెందొవ కంటను = ఎఱ్ఱగలువ లనెడికనులచే, అలిగి = కోపగించి, తమ్ములు = తమకిషలములను, అంటు = తాఁకెడు - కై = సముద్రపుఁగాలువ యనెడు చేతితోడి - ఒత్తు = పట్టుటయనెడి - పదనతికా = తమ పాదములకు (సముద్రుఁడు చేయు) ప్రణామముచేత, అలరి = సంతోషమొంది, కువలమధులహరికా = కలువలయొక్క మకరందముయొక్క పెద్దయలచేత, అబ్ధికా = సముద్రుని, చెంది = కలసి, పైముగతనములకా = పైనిదేలుట యనెడి పూఁపపాయితములచేత, ఒక్కెడలకా = ఒక్కొక్కసమయాన, కూడుచుకా = కలయుచు, (సముద్రునికి), ఉబ్బు = (పొంగు సంతోషమును), పెనిచెకా = వర్ధిల్లఁ జేసినవి.

సముద్రుఁడు 'సరిత్పతి' యగుటంజేసి, నదీ సముద్రులకు నాయికా నాయకభావము. శరన్నదులు ఒక్కొక్కతావున అతనిచిత్తము నాకర్షించుటకై చక్రవాకము లనియెడి స్తనముల ప్రకాశము అతనికనుఁగవం దనియించునట్లుగా నురు వనెడి పయ్యంటను ఎడలించి బొల్లికోళ్ల గొనగొనధ్వను లనెడి వ్యాజమున అవ్యక్తముగా ఏమో గొణఁగుచుఁ దఱిసి, ఆబండ లనెడి పిఱుందులుగా హంసశ్రేణు లనెడి ముత్యాలపేరులను పూఁపవాళిరేఖ యను బంగారు మొలత్రాళ్లను గలవై. మొలమీఁదినుండి నీ రనెడి పావడ జాఱిపోవుచుండఁగా ప్రబ్బలిచేతులు ఆలింగనార్థము చాఁచి, శారదకార్శ్య మను విరహకార్శ్యముతోను, శరదాతపమువలని వేఁడియనెడు వలకాఁకతోను, తుమ్మెద లనెడుసాంజనంపు లానందబాష్పములతోను, కూడుకొన్నవై, పంటకాలువలకొఱకైన కలుజు లనెడు నిట్టూర్పుగలవై, ఎఱ్ఱగలువలనెడి యలుకచూపులుదాల్చినవై, సముద్రుఁడు తనకాలువ యనెడుచేతితో తను తామర లనెడి పాదములను తాఁకుట యనెడి నమస్కారము చేయఁగా సంతోషపడినవై. కలువల మకరందపుఁ బెద్దయలచేతపోయి యాతనిపైఁ బడి, పూఁపుపాయితక్రీడచే నాతనికి నీరు ఉబుకుట యనెడి యుబ్బులాటను పెంచినవి. - రూపకాలంకారము.

'ఫేనంపుఁ గొంగు జాఱు' ఁను చెప్పుట, శరదృతువునందు ఫేనము తగ్గిపోవును గాన; లేదా, ఫేనము జక్కవలపై నిలువదు గావున అందుచేత; అట్లుచేయుట సముద్రుని వలపించుటకు. 'కోళ్లకా' - ఇట నజడంబు తృతీయకు ద్వితీయ. చూ. ప్రౌ. వ్యా. కా. ౧౮. అంగులకు నిమిత్తము హీనమయిన సాధనమాత్రముగా నుపయోగపడుటయే.__అశ్మనితంబాది సమాసత్రయ మిట సంకల్పక్రియావిశేషణముగాఁ బ్రయుక్తము. "అశ్మనితంబలు హంసహారలును బ౹ రాగరేఖాస్వర్ణరశనలు నయి" అని పఠించుట మేలు.__శాటి = శాటః = శాటకః -

'గత్తో హి జాయతే భోగ్యో నారీణాం శాటకో యథా
ఘృష్యతే యో దశాలమ్బో నితమ్బే వినివేశితః.' పంచతంత్రము.

'జలశాటి పులినంపు జఘనంబుపై జాఱ' -

'దర్శయన్తి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
నవసంగమసవ్రీడా జఘనానీవ యోషితః.' రామాయణము.

'భుజస్వస్తికము' - వ్యత్యస్త సంకుచితస్వస్తికాకారభుజయుగళము. చూ. మాలతి. 4(10)

'జలనిబిడిత వస్త్ర వ్యక్తనిమ్నోన్నతాభిః । పరిగత తటభూమిః స్నానమాత్రోత్థితాభిః ।
రుచిరకనకకుమ్భ శ్రీమదాభోగతుఙ్గ । స్తనవినిహితహస్తస్వస్తికాభి ర్వధూభిః॥'
'అంశుకం హృతవతా తనుబాహు । స్వస్తికాపిహితముగ్ధకుచాగ్రా।
భిన్నశఙ్ఖవలయం పరిణేత్రా । పర్యరమ్భి రభసా దచిరోఢా॥'  మాఘ. 10(43).

'వేతస' - 'అథ వేతసే । రథాభ్ర పుష్పవిదుల శీతవానీరవఞ్జులాః' అమ. వేతసమును హస్తముగా కాళిదాసుఁడుకూడ వర్ణించినాఁడు—

'తస్యాః కిఞ్చిత్కరధృతమివ ప్రాప్తవానీరశాఖం
హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధోనితమ్బమ్
ప్రస్థానం తే కథ మపి సఖే లమ్బమానస్య భావి
జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః.'

తటశరప్రతిబింబహాసాశ్చ తా ఆలిబాహ్వా శ్చ అని విశేషణోభయపదకర్మధారయము.—'జలోచ్ఛ్వాసాః పరీవాహాః' అమ. 'కువల' - 'కువలం బదరే ముక్తాఫలే కువలయేఽపిచ' నానా. 'మధులహరి నద్ధిపైఁ జెంది'—మకరందము నీటిపై తేలునుగాన పైనిబడుట, 'స్రవంతులు' - సాభిప్రాయము. 'నుగతనములన్' = ఏటినీరు సముద్రములో వచ్చిపడిన వేగములో తొలిదొలి పైనే యుండును గావున. 'ఉచ్ఛ్వాసములకు నగుచున్' - వడిగావచ్చిన వలపుగత్తె గావున నిట్టూర్పులు.- 'చెందొవకంట అలుగుట' - అలుకచే కంట నెఱుపు. 'అలుక' - తాను తమకడకురాక తమ్ము అలయించినందులకు ఇది శరత్ప్రియుక్తనిమకార్యవర్ణన.

## —* యామునప్రభుని దిగ్విజయము *—

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృతక్షత్త్రధర్ముండు గావున దిగ్విజయయాత్ర ధర్మం బని యానీతబలషట్కంబుగా నాకృష్టసామంతరాట్కంబు గా వెడలి.

ఎసంగినన్ = ప్రవర్తిల్లఁగా. అంగీకృతక్షత్త్రధర్ముండు = స్వీకరింపఁబడిన క్షత్త్రియధర్మము కలవాఁడు (వైరివిజయ ధర్మస్థాపనాది క్షత్త్రియధర్మము నవలంబించినవాఁడు). యాత్ర=ప్రయాణము, ఆనీతబలషట్కంబుగాన్ = తోడ్కొనఁబడిన బలముయొక్క యాఱువిధముల మొత్తము గలవాఁడుగా (ఆఱువిధము లయిన బలముం దోడ్కొని).

'మౌల భృత్య సుహృ చ్ఛ్రేణి ద్విష దాటవికం బలమ్'

అని బలము షడ్విధము. దానిం దోడ్కొని పోవలయు నని నీతిశాస్త్రము:—

'దేవా నభ్యర్చ్య విప్రాం శ్చ గురూం శ్చ శుభవాసరే ।
షడ్విధం తు బలం వ్యూహ్య ద్విషతోఽభిముఖం వ్రజేత్.  నీతిశాస్త్రము.

ఆకృష్టసామంతరాట్కంబుగాన్ =ఆకర్షింపఁబడిన సామంతరాజులు గలుగునట్లుగా;-'సామన్తః'- 'కతిపయ గ్రామాధిపతిః' హేమచంద్రుఁడు; యామునాచార్యుఁడు అధీశ్వరుఁడు - 'రాజా తు ప్రణతాశేషసామన్తః స్యా దధీశ్వరః' అమ. సామన్తాః—'స్వదేశాన న్తరరాజాః' అని, 'సమన్తాయాః స్వదేశావ్యవహితభూమే రిమే రాజానః' అనియు, రామాశ్రమి.

మ. స్ర. గజఘోటస్యందనాళీకబళితధరణిం గా స్రవేయా ధిరాట్ప్రా
ర్థజరత్నశ్రేణు లంతర్మణులసవతు లై మ్రగ్గఁ, బాదాతకుంత

ధ్వజవాతాఘాతఘూర్ణద్వనధులరవము ల్వాద్యముల్మీఱఁగాఁ, ద
ద్ద్విజరాజన్యుఁడు విద్విడ్విదళన మనిఁ గావించె దిగ్జైత్రయాత్రన్. 185

గజ...ణిన్ - గజ = ఏనుఁగులు - ఘోట = గుఱ్ఱములు - స్యందన = తేరులు - అనువాని యొక్క - ఆళీ = సమూహముల చేత - కబళిత = మ్రింగఁబడిన (ఆక్రాంతమైన) - ధరణిన్ = భూమియందు, కాద్ర...లు - కాద్రవేయ = నాగులయొక్క - అధిరాట్ = ఏలికయైన (వేలు పయిన) శేషునియొక్క - మూర్ధ = శిరములందు - జ = పుట్టినవైన - రత్నశ్రేణులు = మణిపంక్తులు, అంతర్గణుల సవతులై = భూమిలోని మణులకు తోడులై, న్యగ్గన్ = భూమియందు చొచ్చికొని నష్టములుకాఁగా, పాదా...ముల్ - పాదాత = కాల్బలములయొక్క - కుంత = ఈఁటెలయొక్క (ఈఁటెలకుఁ గట్టిన) - ధ్వజ = టెక్కెపు వస్త్రములయొక్క - వాత = గాలియొక్క - ఆఘాత = దెబ్బలచేత - ఘూర్ణత్ = కల్లోలపడుచున్న - వనధుల = సముద్రముల - రవముల్ = శబ్దములను (మ్రోఁతలను), వాద్యముల్ = వాద్యధ్వనులు, మీఱఁగాన్ = అతిశయించుచుండఁగా, ఆ ద్విజరాజన్యుఁడు = బ్రాహ్మణుఁ డయినయా రాజు (యామునాచార్యుఁడు), దిక్ జైత్ర యాత్రన్ = దిగ్విజయయాత్రయందు, అనిన్ = యుద్ధమందు, విద్విట్ విదళనము = శత్రువులయొక్క ఛేదనమును, కావించెన్ = చేసెను.

అంతట రాఁ డయిన యాబ్రాహ్మణుఁడు అనఁగా యామునాచార్యుఁడు, రథగజహయ సేనలు భూమినెల్ల నాక్రమింపఁగా వానిభారముచేత శేషుని పడగలయందలిమణులు భూమి లోనికి చొచ్చి భూమిలోని మణులకు తోడుగా నిలిచిపోఁగా, కాల్బలములయొక్క యీఁటె లకుం గట్టిన టెక్కెపువస్త్రముల గాలిదెబ్బలకు ఘూర్ణిల్లుచున్న సముద్రపు హల్లకల్లోలపు మ్రోఁతను నిజసేనావాద్యములమ్రోఁత మించఁగా, దిక్కులందుక్రమమయిన విజయయాత్రం గావించి యుద్ధములు చేసి శత్రువుల సంహరించెను. - శేషునిమణులు మ్రగ్గుట వట్టిది, అట్లే ఈఁటెల వస్త్రములగాలికి సముద్రములు హల్లకల్లోలములై మ్రోఁతమ్రోఁగుటయు వట్టిదే, - కావున అసంబంధంబున సంబంధము చెప్పుటయను నతిశయోక్తి.

'నాగాః కాద్రవేయాః' అమ. నాగులయీశ్వరుఁడు శేషుఁడు. 'తదీశ్వరః ౹ శేషో౽నన్తః' అమ. 'అంతర్గణుల' సవతులు - భూమి రత్నగర్భగావున - 'జగతీ రత్నగర్భా చ భూతధా త్ర్యబ్ధిమేఖలా' అమ. 'వాద్యముల్' - యుద్ధమునకుం దరలుసేనలో వాయించువాద్యములు - భట్టికావ్యము. 14 సర్గ

'కమ్బూ నథ సమాధ్ముః కోణై ర్భేరీ ర్నిజఘ్నిరే,
వేణూ న్నపూరిరే గుఞ్జా జుగుఞ్జుః కరఘట్టితాః,
వాదయాంచక్రిరే ఢక్కాః పణవా దధ్వను ర్హతాః,
మృదఙ్గా ధీర మాస్వేను, ర్హతైః స్వేనే చ గోముఖైః,
ఘణ్టాశ్శిశిఞ్జిరే దీర్ఘం, జహ్రాదే పటహై ర్భృశమ్.' (2-4).

'ద్విజరాజన్యుండు' - యామునాచార్యుఁడు రాజాపత్యము కాకున్నను మూర్ధాభిషిక్తుఁడు గావున ఔపచారికముగా రాజన్యుఁ డనుట - 'దిక్' - ప్రాగాది క్రమమున భూప్రదక్షిణముగా జైత్ర యాత్ర చేయవలయు నని ధర్మశాస్త్రము. 'పాదాత' = పదాతులసమూహము.

(5). అతు...బులు - అతుల్య = సమముకాని వానిని - తులనా = సమముసేయుట - ఆది = లోనుగాఁగల - ఇచ్చుకోలులోను పుచ్చుకోలులోను సరిపఱుచుట - ఘర్షణ ఒరయికచే వన్నె నెఱుఁగుట లోనగునవియు - అగుదోసంబులు - అనఁగా, రూపాయతూనికయని అర రూపాయతూనికయే యిచ్చుట. జాంబూనద పరీక్షాదులయందు = స్వర్ణశోధనాదులయందే.

(6). కన్నువేయుట = అన్యులవస్తువును అభిలషించుట (మృదంగాదులకు వాద్యముఖము నడునడుమ నల్లగా బిళ్లవలె నొకగట్టి పూఁత వేయుట).

(7). ధాతువాదంబులు = మోసములు (భూవాది ధాతువులను గుఱించినవాదములు), శాబ్దికులు = వైయాకరణులు....

తే. తత్పితామహుఁ డైననాథముని శిష్యుఁ
డైనశ్రీపుండరీకాక్షుననుఁగుశిష్యుఁ
డైనశ్రీరామమిశ్రాఖ్యుఁ డార్తిఁ దనదు
పరమగురుపౌత్త్రునకు నిట్టిబంధ మెట్లు? 188

తత్ పితామహుఁడు = ఆయామునాచార్యుని తండ్రితండ్రి, ఐన - నాథమునిశిష్యుఁడు = నాథమున్యాచార్యునికి ఛాత్త్రుఁడు, ఐన - శ్రీరామమిశ్రాఖ్యుఁడు = శ్రీరామమిశ్రుఁ డను పేరు గలవాఁడు, ఆర్తిన్ = పీడతో (మనంబున నెగులొంది), (ఇట్లుచింతించెను), తనదు పరమ గురుపౌత్త్రునకున్ = తన యాచార్యుని యాచార్యునిపుత్త్రపుత్త్రుం డయినయామునాచార్యునికి, ఇట్టి బంధము = ఇటువంటి రాజ్యభోగ రూపమయిన సంసారబంధము, ఎట్లు = ఏలాగున సంభవించినది. 194 లో 'అని వితర్కించి' అనుదానితో నన్వయము.

ద్రావిడములో పుండరీకాక్షయోగికి 'అయ్యక్కొండాన్' అనియు, శ్రీరామమిశ్రునికి 'మనక్కాల్నంబి' యనియు పేరులు.— 'ఛాత్త్రాన్తేవాసినౌ శిష్యే', 'ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ చ' అను.

వ. యోగసామ్రాజ్యంబు మఱచి సామ్రాజ్యంబునం దాసక్తుఁ డయ్యె; నట్టి మహాత్మునంశంబునం బుట్టినట్టి యితం డిట్లగుట యతివ్యతిక్రమంబు. 189

(ఈ యామునుఁడు), యోగసామ్రాజ్యంబు = శక్తిజ్ఞానప్రపత్తులచే త్రివిధమైనయోగము యొక్క యైశ్వర్యమును, మఱచి = స్మరింపక, సామ్రాజ్యంబునందున్ = సమ్రాట్టుభావమందు, ఆసక్తుఁడు = తగులు కొన్నవాఁడు, అయ్యెన్ = అయినాఁడు, అట్టిమహాత్మువంశంబునన్ = అట్టి మహాత్ముండైన శ్రీమన్నాథమునిసంతతిలో, పుట్టినయితఁడు, ఇట్లగుట = యోగము మాని రాజ్య తంత్రమందు తగులుకొనుట, అతివ్యతిక్రమంబు = మిక్కిలి అతిక్రమము.
'సమ్రాట్టు' — 'యేనేష్టం రాజసూయేన మణ్డలస్యేశ్వరశ్చ యః
శాస్తి యశ్చాజ్ఞయా రాజ్ఞః స సమ్రాడితి కథ్యతే.' అను.

సీ. వృషశైలఝరవారిఁ ద్రిషవణస్నానంబు | నిష్ఠఁ గావించి, యాహ్నికముఁ దీర్చి,
యేకాంతగుహఁ దత్తటకుశాసనమున | నుండి, లక్ష్మీశాంఘ్రిపుండరీక
మంకురత్పులక హర్షాశ్రువై దహరపు | ష్కరమున భావించి, సవితఁ దిరుగ
యజ్ఞోపవీతపద్మాక్షమాలికలతో | యోగపట్టికఁ గూడి యురము మెఱయ,

తే. శౌరిఁ దద్ధరణీధ్ర వాస్తవ్యుఁ గొలిచి, । సతియు నాలర్కశాక మంచితము వండ,
నిల్లుముందున కర్పించి, వేల్మిఁ దీర్చి, । యిట్లు తనుయాత్ర నడపు మున్నితనితాత.

మున్ను = పూర్వము, ఇతనితాత = ఈయామునుని పితామహుఁడైన శ్రీమన్నాథముని, నిష్ఠన్ = నియమముతో, వృషశైల స్ఫురద్వారిన్ = ఘటికాచలముయొక్క సెలయేటి నీటను, త్రిషవణస్నానంబు - మూఁడు సవనంబులయందును (వేళలయందును) స్నానమును, కావించి = చేసి, ఆహ్నికము = పగలు చేయవలసిన సంధ్యావందనాదికృత్యమును, తీర్చి = నెఱవేర్చి;

ఏకా...నన్ - ఏకాంతగుహా = విజనమైన గుహలు కలదైన - తత్ = ఆవృషశైలముయొక్క - తటీ = దరులయందు - కుశ ఆసనమునన్ = దర్భాసనమునందు, ఉండి = కూర్చుండి, లక్ష్మీ... ము - లక్ష్మీశ = మహాలక్ష్మికి భర్తయైన శ్రీమన్నారాయణునియొక్క - అంఘ్రిపుండరీకము = పద్మమువంటి పాదమును, అంకు...వు - అంకురత్ = మొలచుచున్న - పులక = గగుర్పాటును - హర్ష అశ్రు = ఆనంద బాష్పములను గలవాఁడు, ఐ, దహరపుష్కరమునన్ = హృత్పుండరీకమునందు, భావించి = ధ్యానించి, సవితె = సూర్యుఁడు, తిరుగన్ = పడమటికి మరలఁగా, యజ్ఞో... తోన్ - యజ్ఞోపవీత = జన్నిదముయొక్కయు - పద్మాక్ష = తామరగింజల - మాలికలతోన్ = నేవళిములతో, యోగపట్టికన్ = యోగధార్యమయిన పట్టుపట్టెడను; కూడ, ఉరము = రొమ్ము, మెఱయన్ = ప్రకాశింపఁగా, తత్...దు - తత్ = ఆ - ధరణీధ్ర = కొండయొక్క - వాస్తవ్యున్ = నివాసియైన - శౌరిన్ = నారాయణుని (సుందరబాహుస్వామిని), కొలిచి = సేవించినవాఁడై, సతియున్ = పతివ్రత (యైన తద్భార్య), అంచితము = ప్రశస్తమయిన, ఆలర్క శాకము = ముండ్లముస్తె కూరను, వండన్ = పచనము సేయఁగా, (దానిని) ఇల్ల ముందునన్ = ఇంటి (తనగృహదేవతార్చనలోని) నారాయణమూర్తికి, అర్పించి = అర్పణము చేసి = నివేదన గావించి, వేల్మిన్ = హోమమును (అగ్నిహోత్రమును), తీర్చి = నెఱవేర్చి, ఇట్లు = ఈప్రకారముగా, తనుయాత్రన్ = దేహయాత్రను, నడపున్ = జరుపును.

ఇతనితాతయైన శ్రీమన్నాథమునియోగి ప్రతిదినము ఘటికాచలమందు సెలయేట నిష్ఠతో మూఁడువేళలయందును స్నానము చేయును. ఆహ్నికముం దీర్చుకొని, ఆకొండదరిని ఏకాంతగుహయందు దర్భాసనమునందుఁ గూర్చుండి, లక్ష్మీపతియొక్క చరణకమలములను ఆనందముచే ఒడలు గగుర్పొడుచుచుండ బాష్పములు రాలుచుండ హృదయకమలమందు ధ్యానించి, అపరాహ్ణము రాఁగానే జన్నిదముతోను తామరపూసలతావళముతోను యోగపట్టముతోను రొమ్ము ప్రకాశించుచుండఁగా నేఁగి, ఆకొండలో నివాసియైన సుందరబాహుస్వామిని సేవించుకొని వచ్చినవాఁడై, ఇంట పతివ్రతయైనభార్య ముండ్లముస్తెకూర వండఁగా తనదేవతార్చనలోని నారాయణమూర్తికి దానిని నివేదన చేసి, అగ్నిహోత్రముం గావించుకొని, యీవిధమున దేహయాత్ర నడుపుచుండును.

'త్రిషవణము' = మూఁడుసవనములు = మూఁడుస్నానములు; 'ఆహ్నికము' - అహస్సున (=పగలు) చేయువలసినకర్మ. 'పుండరీకము' - ఇచట కమలమాత్రపరము. 'పుష్కరము' - 'పుష్కరం కరిహస్తాగ్రే వాద్యభాండముఖే జలే । వ్యోమ్ని ఖడ్గఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః' అను. 'సవిత' - 'తపనః సవితా రవిః' అను. సవితృశబ్దము. 'యజ్ఞోపవీత పద్మాక్షమాలికతోడ' - మాలికలతోడ యని ప్ర. ప. ఉండవలయును; అట్లు పఠించిన ఛందస్సు తప్పును; కావున 'మాలికలతో' అని మార్పుచేయఁబడినది. 'శౌరి' - శూరుఁ - డనెడి యాదవుని గోత్రాపత్యముగాన.

శ్రీకృష్ణుఁడే నారాయణుఁడు - 'ధరణీధర' - 'శైలే భూభృద్ధరాః క్రోడేఽపి' శా.క.అ. 'అలర్కాశాకము' - ముండ్లయుచ్చింత అని కొందఱు; ఇది జ్ఞానవైరాగ్యకారి.

క. తోడిఁబడి, విషయాతురు నవి । విడు మనియొసఁగకుంటఁ గలదె వేఱే పగ? నే
ర్పడరఁ గథాదుల నొకవెం । బడి దోఁపం బలికి మైత్రిఁ బాపుట యొప్పున్. 191

తోడిఁబడి = తొట్రుపడి. విషయ ఆతురున్ = శబ్దాదు లయినయింద్రియార్థముల చేత, ఆతురున్ = రోగియైనవానిని (అనఁగా - అవి లేనియెడ దుఃఖపడువానిని - విషయాసక్తుననుట), అవి = ఆవిషయములను, విడుము అనియొసఁగకుంటన్ = వదలుము ని యుపదేశించుటకంటె, వేఱే పగ = ఇతరమైన ద్వేషము, కలదే = లేదు. నేర్పు = నిపుణత, అడరన్ = ఒప్పునట్లుగా, కథాదులన్ = కథలు లోనగువానిచే, ఒకవెంబడిన్ = ఒకక్రమమున, తోఁపన్ = అతనికే తెలివి వచ్చునట్లు, పలికి = వచించి, మైత్రిన్ = విషయములమీఁది యాసక్తిని, పాపుట = తొలఁగించుట, ఒప్పున్ = తగును.

విషయాసక్తుని ఏవిధముగా బాగుచేయం దగును. త్వరపడి వానిని (= విషయములను) వదలవోయి అనిబోధించుటవలన అతనికి ఆదేశికునిమీఁద గాఢమయిన ద్వేషము కలుగును. మఱి ఏమి చేయవలయు ననఁగా అతనికే తెలివికలిగి వానిని విడిచిపెట్టునట్లుగా కథలు లోనగు వాని మూలముగా బోధింపవలయును. విషయములు ఐదు. – శబ్దస్పర్శరూపరసగంధములు.

క. వసుధం బుత్రాదికదు । ర్వ్యసనము సైతమును దండ్రి వారించుటకున్
వసపడ దఁట, పరుని రాజ్య । వ్యసనము వారింప నెంతవాఁ డెవ్వాఁడున్? 192

వసుధన్ = లోకములో, తండ్రి, పుత్త్ర ఆదిక దుర్వ్యసనము సైతమున్ = కుమారుఁడు లోనగువారియొక్క చెడు నాసక్తి కూడను, వారించుటకున్ = మాన్పించుటకు, వసపడదఁట = వశముగాక యుండఁగా, రాజ్యవ్యసనమున్ = రాజత్వాసక్తిని, వారింపన్, ఎవ్వాఁడున్ = ఎవఁడైనను, ఎంతవాఁడు = ఏపాటిసమర్థుఁడు.

లోకములో, కన్నతండ్రియే తనపుత్త్రాదుల స్వల్పదుర్వ్యసనములను మాన్పలేక యుండఁగా, పరుఁ డెవఁడో రాజ్యవ్యసనమును మాన్పుటకు శక్తుఁ డగునా? కాఁడని భావము.— కావ్యార్థాపత్త్యలంకారము.

'కైమత్యముచే నర్థా । గమనము కావ్యపూర్వకార్థాపత్తిన్
నీమోవి బంధుజీవము । నే మాలుచు నన్యజీవ మెడపుట యరుదే.' అలం.

'వ్యసనములు' ఏడు - 'పానం స్త్రీ మృగయా ద్యూతం వాక్పారుష్యం దణ్డపారుష్య మర్థదూషణమ్.'

ఆ. నల్ల గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి । నోరి జింకఁ దివియు నేర్పు పొదవు
వేఁటకాఁడువోలె విషయాళివలనఁ ద । త్తృష్ణఁ దీఱ నిచ్చి త్రిప్పు టొప్పు.

నల్ల = రక్తమును, గ్రోలనిచ్చి = త్రాగనిచ్చి, మెల్లనె = నింపాదిగా (త్వరపడక యనుట), చివ్వంగినోరిజింకన్ = సివంగినోటనున్న యిఱ్ఱిని, తివియు నేరుపు = లాగునట్టి నైపుణి, ఒదవు వేఁటకాఁడువోలెన్ = కలిగియున్న మృగయునివలె, విషయ ఆళివలనన్ = విషయ సమూహము వలననుండి, తత్ తృష్ణన్ = ఆతనియాసను, తీఱనిచ్చి = తీఱువఱకు ఊరకుండి పిమ్మట, త్రిప్పుట = మరలించుట, ఒప్పున్ = మంచియుపాయము.

జింకను గొంతు కొఱికి నెత్తురు త్రాగుచున్న సివంగిని త్రాగుచున్నప్పుడే తఱుముఁ బోయిన నది జింకను ఈడ్చుకొనియే పోవును, తఱుమువానిని మీఁదఁబడి చంపనుం జంపును; కావున అది

తనివితీఱ నెత్తురు త్రాగినపిమ్మట జింకం దెచ్చుకొనుట మంచిది. దానికాటుచే నయిన గాయమునకు మందుచేసి జింకను చావకుండం గాచుకొనవచ్చును.—ఉపమాలంకారము.

ఇట. వక్త తాను వేటకాని వంటివాఁడు, విషయగ్రామము ఘాతకమైన సివంగివంటిది, యామునప్రభువు జింకవంటివాఁడు రక్షణీయుఁడు; విషయగ్రామము ఇతనిని లోఁగొనుట సివంగి నెత్తురు త్రాగుటవంటిది, విషయగ్రామము ఇతనిని వదలుట సివంగి తినిసి జింకను వదలుట వంటిది - అని సాదృశ్యమున కవివివక్షను అనుసరింపవలయును.

వ. కావున, నట్లయిన నితని నింక నుపేక్షింపరాదు; దుపాయంబునం జొచ్చి యొక్క రీతిం ద్రిప్పవలయు; నుర్వి నాహార దోషంబు విజ్ఞాననాశంబునకు మూలం బని వితర్కించి. 194

కావునన్, అట్లయినను = అట్లు ఓర్చియుండుట మంచిదుపాయమే అయినను..., చొచ్చి = మనస్సునకెక్కి,... ఉర్విన్ = లోకములో, ఆహారదోషంబు = తినువస్తువుల చెడుగుణము, విజ్ఞాననాశంబునకున్ = తెలివిచెడుటకు, మూలకారణంబు = మొదటిహేతువు, అని వితర్కించి = ఇట్లని యాలోచించుకొని. ఈవితర్కము ౧౮౯వ పద్యములో నారంభమయినది, ఇందు ముగిసినది.

క. ముల్లు దలకొనని నవకపుఁ। బల్లవములతోడ ముక్తిభామచెవులకుం
బల్లేరుంబువ్వులగు పువు। లుల్లసిలు నలర్క శాక మొదుగుగఁ గొనుచున్. 195

తే. తెచ్చి, యొకవైష్ణవుఁడు కానుకిచ్చె ననుచు
బానసపు బాడబులచేతఁ బంపుటయును,
నతఁడు ప్రియపడి వందించి యారగింపఁ
దెచ్చు నిచ్చఁ, గొన్నాళ్లిట్లు తెచ్చుచుండ. 196

ముల్లు, తలకొనని = తలచూపని (పొడమని) - నవకపుఁబల్లవములతోడన్ = మృదువులైన చిగుళ్లతో, ముక్తిభామచెవులకున్ = ముక్తి (మోక్షము) అనెడి సుందరియొక్క కర్ణములకు, పల్లేరుంబువ్వులు = పల్లేరుంబువ్వు లనెడి తొడవులు, అగు - పువ్వులన్ = పుష్పములతో, ఉల్లసిలు అలర్క శాకము = చెలువారుచున్న ముండ్లయుచ్చింతకూరను, ఒదుగుగన్ = సమృద్ధిగా, కొనుచున్ = సమకూర్చి; - రూపకాలంకారము.

తెచ్చి, ఒకవైష్ణవుఁడు కానుక ఇచ్చెన్ అనుచున్, బానసపు బాడబులచేతన్ = వంట బ్రాహ్మణులచేత నిచ్చి, పంపుటయును = (ఆశ్రీరామయోగి యామునప్రభువునకు) పంపఁగా, అతఁడు = ఆయామున ప్రభువు, ప్రియపడి = ఆసగొని, వందించి, ఆరగింపన్ = భుజింపఁగా, నిచ్చన్ = ప్రత్యహము (దినము తప్పక), కొన్నాళ్లు, తెచ్చున్ = (శ్రీరామయోగి) తెచ్చుచుండెను; ఇట్లు, తెచ్చుటయున్ = తేఁగా.

ముక్తికాంతవీనులకు పల్లేరుంబువ్వు లనెడి యాభరణములైన పువ్వులతోడి ముండ్లయుచ్చింత కూరను, ముల్లు ఇంకను మొలవనట్టి లేఁతదానిని, సమృద్ధిగాఁ గొనిపోయి యామున ప్రభుని వంట బ్రాహ్మణుల చేతి కిచ్చి, 'ఇదియొక బ్రాహ్మణుఁడు ఏలినవారికి కానుకవెట్టినాఁడు' అని వారిచేత చెప్పింపఁగా, ప్రభువు దానిపై ప్రియపడి వందించి భుజించెను. ఈ ప్రకారము ఆయోగి దినము

తప్పక ఇచ్చుచుండెను. ఇట్లు కొన్నాళ్లు జరుగఁగా, 'నవకము - ఉ.భ.దే.వి. = మృదుత్వము' శ.ర. 'అలర్కము=ముండ్లయుచ్చింత' శ.ర.— బానసము మహానసశబ్దమునకు వై. - 'బాడబులు, - 'ద్విజా త్యగ్రజన్మభూదేవ బాడబాః । విప్రశ్చ బ్రాహ్మణః' అమ.

వ. ఒక్కనాఁ డతండపు భోజనసమయంబున సకలశాకాస్వాదనంబు సేయుచు వచ్చి, తచ్ఛాకంబు సంజాచుం దలంచుకొని, 'యేతదానేతయగు భాగవతు భోజనానంతరంబ యిమ్ముం గొన్పింపుం' డని పలికి, పాణిపాదప్రక్షాళ నాచమనానంతరంబ యతనిం గొన్పించుకొని, నమస్కరించి, వచ్చిన ప్రయోజనం బడుగుటయు, నతం డిట్లనియె. 197

ఆస్వాదనంబు = రుచి చూచుట. తత్ శాకంబు = అయాలర్క శాకమును, సంజాచుక = సంజాకొనుచు. ఏతత్ ఆనేత = దీనిని తెచ్చువాఁడు. భాగవతుక = భగవద్భక్తుని. పాణిపాదప్రక్షాళనము = (ఎంగిలి) చేతులను పాదములను కడుగుకొనుట. ఆచమనము = మూఁడుమాఱు పాడవుగా నిండిన పుడిసెడు జలము గ్రహించి మూఁడుమార్లు పుచ్చుకొనుట. ఈయలర్కశాకదానవృత్తాంతము నిక్కసూరి చరితంబున, సించుక భిన్నముగా నున్నది.

'తం రాజపుత్రో భృగనం ద్వ నేతుం స్వయ త్తథల త్సామాన్య దానాత
అలర్కపత్రం తదభక్ష్య మాపజ్ఞానం కతే ప్రాదితి పాచకస్య.
విలోకనం శైవపశా స్త త స్య యాస్తన చాపం సుహా తేతి భిన్నః
యా త్రిహిన్న నాదిష్టు దలర్కపత్రం తస్మిక న పారోగవ మి త్యువాచ.
నాస్మిక జనే దత్త మలర్కపత్రం త్వయా కథం వాభ్యవహార హేతోః...'

[ఎప్పుడు యామునప్రభుఁడు పాచకునివలనఁ బత్రా నేతను విని రప్పించి అతనితో సంభషించెను. అనంతర వృత్తాంతమిందు]

'స్వస్తో నిగూఢం భవదీయపూర్వ । ర్నిధ ర్మయి న్యాస్యతి తం గృహాణ,
న యామునేయేన సుఖం మహాత్మా । సమాసద ద్రష్టుపురం గరీయాః,
తం నేవధం వో జగ దేకకన్దం । రత్నేషు ముద్రామదయామ్బురాశిమ్
ప్రాదర్శయ త్తం భవదీయపూర్వ । స్సమార్జితో యం నిధ రి త్యముష్మై'.

మీ పెద్దలు గూర్చిన దనుట యామునప్రభువు తన నాత్రేగదా అని శ్రద్ధతో విని నాఁటమటుక్కై తప్పక కడంగునుగాక యని.

క. 'మీ పెద్దలు గూర్చినని । క్షేప మొకటి సహ్యజాత సింధు జలాంత
ర్ద్వీపమున నుండ నీకుం । జూపంగా వచ్చితిని వసుమతీనాథా. 198

వసుమతీ నాథా = పుడమిఱేఁడా, మీ పెద్దలు = మీపూర్వులు, కూర్చిననిక్షేపము = కూఁడబెట్టి (భక్తితోఁ గొంచి అనియు) ఉంచిననిధి, సహ్య...నక - సహ్య = సహ్యపర్వతములో - జాత = పుట్టిన - సింధు = నదియొక్క - జల = నీటి - అంతః = నడిమి - ద్వీపమునక = దీవిలో;...'సేవించుచేవుఁడు' అను వాక్యార్థమునకు మాఱుగా కూర్చిననిధి యని ప్రతిబింబమును ప్రస్తుతమందు చెప్పినందున లలితాలంకారము.

'వచనీయ ప్రతిబింబము । రచియించినఁ బ్రకృతమునఁ బరఁగు లలిత మనక.
విచికిలగంధగ నేతువు । రచియించెద నీవు గత శరమ్మున కనఁగాక.' అలం.

క. నా కేటికి నిక్షేపము । నాకు, నిధియు నాకరంబు నవనాథుల సొ
మ్మే కాన విన్నవించెద, । నాకర్ణింపుము తదీయ మగువిధ మెల్లన్. 199

నాకు నిక్షేపము ఏటికి నాకు = నేను ప్రభువను నాకు సమస్తంబును కలదు - ఈనిక్షేపము నాకేల - అనకుము..., ఆకరంబు = గని..., తదీయము = దానికిం జెందినది...

'నాకుము' - 'అనకుము'నకు నామాంతరము చూ. "ఓ. నావే భవబంధముల్ దెలుపవే యోదేవకీనందనా" - ఉ. హరి 2(129). 'అగునకనుకనులకు సుస్వరములు పరంబులగునపుడు కానా కానలు విభాషనగు'. బా.వ్యా. క్రి. ౯౬.

సీ. స్ఫటిక మణుల్ క్రాలఁ శాంత మై శ్వేత మై । నట్టి త్రాఁ చొక్కటి చుట్టియుండు;
రక్షోగృహీత మన్ప్రథ తొల్లి గల, దది । పొలయు నేండ్లేడు నెలలు గాని;
యేపాటిబలి యైనఁ జేపడుఁ బ్రాణిహిం । సాదిపూజనముల కాసపడదు;
తనవెలుం గొగి నిరంజనదృష్టికనె లక్ష్య । మై యుండు, నయ్యు నింతంత గాదు;
తే. రత్న మొక్కటి పై ననర్ఘంబు మెఱయుఁ;
గలదు పద్మంబు శంఖంబు; పలుకు లేటి
కక్షయ, మనంత, మాద్య మేకాంతమందు,
భూప; నీ కొక్కనికె కాక చూపరాదు'. 200

శ్రీరంగనాథుని నిధిగా చెప్పినాఁడు గావున నిధిధర్మములను ఆయనయందు శ్లేషభంగిచే వర్ణించుచున్నాఁడు:— పాము చుట్టుకొనియుండుట, రాక్షసులు స్వీకరించియుండుట, బలిం గోరుట, వెలుంగు కలిగియుండుట, సాంజనవిశేషదృష్టి కగపడుట, రత్నము లుండుట, మహా సంఖ్యగల ధనము అం దుండుట.— ఇవి నిధిధర్మములు:—

భూప=ఓయిరాజా, (పయుక్తమయిన యానిధిని), స్ఫటికల్=పడగలయందు, మణుల్= రత్నములు, క్రాలన్ = ప్రకాశించుచుండఁగా, శాంతమై = ప్రసన్నమై, శ్వేతమైనట్టి త్రాఁచు ఒక్కటి = ఒక తెల్లత్రాఁచుఁబాము, చుట్టియుండున్ = పరివేష్టించియుండును, (శ్రీరంగనాథ స్వామి మణి ప్రభాభాసమున సహస్రఫణాధరుఁడును, శ్వేతవర్ణుఁడు నై చుట్టుచుట్టుకొని యుండు శేషాహిపై శయనించియుండు ననుటయు);

రక్షోగృహీతము=రక్షస్సుచేత స్వీకరింపఁబడినది, అనుప్రథ = అనెడు ప్రసిద్ధి, తొల్లి = పూర్వము, కలదు = ఉండెను, (అయినను ఇప్పుడు), అది = ఆరక్షస్సు, అందున్ = ఆనిధికడకు, ఏడు ఆఱు నెలలు గాని=సంవత్సరమునకో ఆఱుమాసములకో గాని, పొలయును=(కడను కాలముల యందు), చేరును. (విభీషణుఁడు దానిని సంవత్సరమునకో ఆఱునెలలకో ఒకనాఁడువచ్చి సేవించు కొని పోవు ననుటయు);

ఏపాటి బలి యైనన్ = ఏమాత్రపు పూజకైనను, చేపడున్ = వశ మగును, ప్రాణిహింసా ఆది పూజనములకున్ = జంతువులను చంపి ఉపహార మొసంగుట (నరప్రభృతిబలులవైచుట) లోనగు నర్చనలకు, ఆసపడదు; భక్తిపూర్వకమైన సాత్త్వికపూజ, కొంచెమే అయినను దానికి సంతసించి వర మిచ్చునుగాని తామసపూజకు ఎంత ఎక్కుడుదానికైనను అనుగ్రహింపఁ డనుటయు);

తనవెలుంగు, ఒగిన్=చక్కఁగా, నిరంజన దృష్టికనె=నిర్వ్యంజనము లేనికంటికే, లక్ష్యమై= అగపడునదై, ఉండున్, అయ్యును = అటులైనను, ఇంత అంత కాదు = కొంచెము గాదు,

వ. అని విన్నవించిన సంతసించి, సేనాసమేతుండై యతండు మున్నుగా శ్రీరంగంబున కరిగి కావేరీచంద్రపుష్కరిణులఁ దీర్థం బాడి రంగనాథు సేవించి సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతం డిట్లనియె. 201

క. 'మీ పెద్దలు గూర్చిన ని | క్షేప మ్మిదిగో' యటంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁ జూపిన | నాపృథ్వీపతియుహఠనిరస్తభ్రముఁడై. 202

గూర్చిన = కూడఁబెట్టిన (ప్రేమతో భక్తితో కొలిచిన). శ్రీరంగపతి శ్రీపదయుగ్మము = లక్ష్మీసమేతుఁడైన రంగనాథునియొక్క శోభాయుక్తపాదద్వంద్వమును. ఆపృథ్వీపతియు = యామునభూపతియు, హఠనిరస్తభ్రముఁడు = బలాత్కారమున ఎడలింపఁబడిన భ్రమాదము కలవాఁడు.

పూ. ము. 'హఠాదపాస్త' - 'ప్రసభం తు బలాత్కారో హఠః' అమ. కాని 'బలాత్' అని యవ్యయము 'బలాత్ ఇతి నిపాతో హఠార్థకః' ఇతి స్వామీ' - అని రామాశ్రమి, కావున 'బలాదపాస్తభ్రముఁడై' అని పఠించుట యొప్పును. హఠశబ్దము వలయు నన్న - 'ఆ పృథ్వీపతియు హఠనిరస్తభ్రముఁడై' అని పఠింపఁదగును: 'శ్రీర్వేష రచనా శోభా సంపత్సరళ శాఖిషు। వాణీ లక్ష్మ్యలవఙ్గేషు విషే బిల్వేపి.' నానా.

వ. గ్రక్కునఁ దనపూర్వదశఁ దలంచి యున్నాళ్ళ దన ప్రమాదంబునకుం బరమనిర్వేదన నొంది 'నీ వెవ్వండవు?' అనుటయు, 'నే మీ పితామహుం డగు నాథముని ప్రశిష్యుండ, నయ్యోగివరుండు భావి భవజ్జన్మం బెఱింగి భాగవతవతంసంబ వగు నీచేత నవ్విశిష్టాద్వైతంబు సకలభూతహితంబుగా వెలయంగలయది యని నిశ్చయించి, నీకు ద్వయం బుపదేశింపు మని, తనశిష్యుండగు పుండరీకాక్షున కుపదేశించిన, నతండు భోగాసక్తుండవైన నిన్ను పాయంబున దెలిపి, నీ కుపదేశింపు మనుటయుఁ, బనివింటి.' యనిన, సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి, యతనిచేతం బంచసంస్కారసంస్కృతుండై, యంత నిలువక తురీయాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగిడి వచ్చి, కుమారునందు రాజ్యభారంబుఁ బెట్టి, బంధుమిత్త్రామాత్యసమేతం బగు బలచతుష్టయంబును బ్రస్థానార్థంబుగా నతని కొప్పగించి యిట్లనియె.

ప్రమాదంబు = బ్రహ్మనిష్ఠావిస్మరణము. నిర్వేదన = దుఃఖము. ప్రశిష్యుండన్ = శిష్యుని శిష్యుఁడను, భావి = రాఁగల ద్వయమంత్ర లక్షణము.

'నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనం చో
పాయం కర్తవ్యభాగం త్వథ మిథునపరం ప్రాప్యమేవం ప్రసిద్ధం।
స్వామిత్వం ప్రార్థనాంచ ప్రబలతరవిరోధిప్రహాణం దశైతాన్
మన్తారం త్రాయతే చేత్యధిగతనిగమాం షట్పదోఽయం ద్వ్యఖణ్డః'.

నిన్నుఁ దెలిపి = నీకు నిన్నుఁగూర్చిన జ్ఞానముం గలిగించి. పనివింటిన్ = వచ్చితిని. పంచసంస్కారంబులు = తాప పుండ్ర నామ మంత్ర యాగములు—

'తాపః పుణ్డ్ర స్తథా నామ మన్త్రో యాగశ్చ పఞ్చమః.
అమీ పరమసంస్కారాః పరమైకాన్తిహేతవః.'

తురీయాశ్రమంబు=వానప్రస్థాశ్రమము. స్కంధావారంబునకున్=పాళెమునకు, బలచతుష్టయము= రథ గజ తురగ పదాతులు.

—* రా జ నీ తి *—

క. 'ఏపట్టున విసువక రక్షాపరుఁడవు గమ్ము ప్రజలచక్కి; విపన్నుల్
గూపెట్టిన విని తీర్పుము; కాపురుషులమీఁద నిడకు కార్యభరంబుల్. 204

ఏపట్టునన్ = ఏసమయమునందైనను. విసువక = వేసరక, ప్రజలచక్కిన్ = జనులయెడ, రక్షాపరుఁడవు = సంరక్షణయందు ఆసక్తుఁడవు. కమ్ము = అగుము. విపన్నుల్ = ఆపన్నులు, కూపెట్టినన్ = మొఱయిడఁగా. విని = విచారించి, తీర్పుము = ఆపదను తొలఁగింపుము. కార్యభరంబుల్ = పనులనిర్వాహములను. కాపురుషులమీఁదన్ = దుర్జనులమీఁద, ఇడకు = మోపకుము.

ఎట్టికష్టమునందియేనియు విసుగుకొనక ప్రజలను కాచుచుండుము. ఆపదలో పడ్డవారు మొఱపెట్టుకొన్నప్పుడు, ఆమొఱను చక్కఁగా విని ఆపదలం దొలంగింపుము; కార్యముల నిర్వాహమునకు దుర్జనులను నియోగింపకుము.

'రక్షాపరుఁడు' - రక్షా = కాచుట - పరుఁడు = శ్రేష్ఠముగాఁ గలవాఁడు —

'శ్రేష్ఠాన్య దూర జ్యేష్ఠేషు పర స్స్యా ద్వాచ్యలిఙ్గకః।
పరోఽరిః పరమాత్మా చ కేవలే పర మవ్యయమ్.' నానా.

'కూపెట్టు... కూయి+పెట్టు' వి.ర. 'కాపురుషః' - రూ. కుపురుషః.

తే. రాష్ట్రవర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు; దానఁ గార్యమె యనంగ
రాదు; బ్రహ్మోత్తరము లైన ప్రజలయేక
ముఖపుఁగోర్కిఁ బరంతరాత్ముం డొసఁగఁడె? 205

రాష్ట్రవర్ధనము = ప్రజలయొక్క శ్రేయస్సును. ఎదన్ = హృదయములో, కోరు రాజు మేలున్ = అభిలషించెడి రేని శ్రేయస్సును, రాష్ట్రమును, ప్రజలును, కోరున్ = అభిలషింతురు, దానన్ = అందువలన, కార్యమె = ప్రయోజనమా. అనఁగన్ రాదు = అని యాక్షేపింపఁగూడదు, బ్రహ్మోత్తరములు = బ్రాహ్మణులు ముఖ్యముగాఁ గలవారు. ఐన - ప్రజల ఏకముఖపుఁగోర్కిన్ = జనులయొక్క ఏకరూప మయిన యభిలషితమును. పరంతరాత్ముండు - వారి లోపలి పరమాత్ముఁడు, ఒసఁగఁడె = ఇయ్యఁడా (ఇచ్చు ననుట).

రాజు ప్రజల మేలు కోరిన, ప్రజలును రాజుమేలు కోరుదురు; అందువలన రాజున కేమి ప్రయోజనము, అని యడుగుట సరిగాదు. ఏల యన ఏకరూపముగా బ్రాహ్మణాదిప్రజలు కోరు కోరికను తదంతర్యామియైన పరమాత్ముఁడు తప్పక తీర్చును. 'రాష్ట్రం స్యా దుపవర్తనే ఉపద్రవే క్లీబపుంసోః.' మేదిని. లక్షణచేత రాష్ట్రగతు లయిన ప్రజలు అర్థము. 'ఉప ర్యుదీచ్య శ్రేష్ఠే ష్వప్యుత్తరః స్యాత్' అమ.

ఆ. ఆజ్ఞ వలయు నృపతి, కాభీరభిల్లాది కంపకోల నూల నాజ్ఞ చెల్లు
నంటు; సార్వభౌముఁ డైనభూపతియాజ్ఞ కెల్లవారుఁ జెల్లడిల్ల వలదె? 206

నృపతికిన్ = రాజునకు, ఆజ్ఞ = ఉత్తరువు, వలయున్ = ఆవశ్యకము, ఆ...కిన్ - ఆభీర= గొల్లలు - భిల్ల = బోయలు - ఆదికిన్ = మొదలయినవారికి, అంపకోలన్ = బాణపుఁ గట్టెచేతను,

డలుగుఁ, గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ
బెనిచి, వేళవేళఁ బనులు గొనుము. 208

ఎంతమంచివాని నేని మొదలనే గొప్పస్థితిలో ఉంచి తర్వాత స్థితి తగ్గించినచో వాఁడు ఆ గొప్పస్థితి రాకమునుపటి తనహీనదశను స్మరింపఁడు; మఱి తనకు ఇప్పుడు స్థితి తగ్గించినందులకై ప్రభువును ద్వేషించును. కావున ఎవని నేని వానినడవడిం గనుపెట్టుచు క్రమముగా వృద్ధికి తెచ్చుచు, సమయములయందెల్ల పనిగొనుచు, ఉండవలయును.—

పెనిచి = గొప్పస్థితికి తెచ్చి, కుదియింపక = తక్కువస్థితికి దించినయెడల; శీలము = నడువడి, పనులు గొను = పనిచేయింపుము.

ఆ. అనభిజాతుఁ, గీకటాలయు, నశ్రుతు, । నలుకు మాని బొంకు పలుకువాని,
నాతతాయి, గడుసు నన్యదేశ్యు, నధర్ము, । విడుము విప్రు నేల వేఁడితేని. 209

ఏలవేఁడితి ఏనిన్ = నీరాజత్వమును కాపాడుకొనుటకు కోరుదువేని, విప్రున్ = బ్రాహ్మణునైనను, అనభిజాతుకన్ = ఉత్తమకులజుఁడు కానివానిని (నీచకులజుని), కీకట ఆలయుని = బోయపల్లె నివాసముగాఁ గలవానిని. అశ్రుతున్ = శ్రుతములేనివానిని (గురువులవలన వినికి లేనివానిని), అలుకుమాని = భయమువిడిచి..., ఆతతాయిన్ = చంపనున్ముకుఁడయినవానిని, గడుసున్ = ధృష్టుని (సాపరాధుఁడై యలుకనివానిని), అన్యదేశ్యున్ = పరదేశిని. అధర్మున్ = ధర్మవర్తనహీనుని, విడుము = విడువుము.

నీదొరతనము నీకే ఉండవలయు నని కోరదవేని బ్రాహ్మణుడైనను, నీచకులజుఁడు, బోయల నడుమ జీవించువాఁడు. గురుశుశ్రూష చేయనివాఁడు, అనృతవాది, చంప నున్ముకుఁడు, తప్పు చేసియు అలుకనివాఁడు, పరదేశాగతుఁడు, అధర్మపరుఁడు, అగు వానిని చేర్పకుము.

'అభిజాతః'—'అభిజాతస్తు కులజే బుధే' అమ.

'కీకట'—'అశ్వే మితమ్పచే నీచే దేశభేదే చ కీకటః' నానా.

'చరణాద్రిం సమారభ్య గృధ్రకూటాన్తికం శివే
తావత్కీకటదేశ స్స్యాత్తదన్తర్మగధో భవేత్॥

అని శక్తిసంగమతంత్రమునఁ జెప్పఁబడినది. - 'ఆలయః' = గ్రామము. 'పక్కణః శబరాలయః' 'ద్వే భిల్లగ్రామస్య.' - అని రామాశ్రమి. 'ఆతతాయి'—'ఆతతాయీ వధోద్యతః' అమ.

'అగ్నిదో గరద శ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః
క్షేత్రదారాపహర్తా చ షడేతే హ్యాతతాయినః.'

క. తక్కుము మిగులఁ బథిచ్యుత । పక్కణవర్ధితులఁ; దొల్లి భ్రష్టగువిప్రుం
డొక్కండలుగఁడె ప్రోచిన । కొక్కెరపై నొక్కపూఁట కూటికిఁ గాఁగన్?

పథి...లన్ - పథ - దారికి - చ్యుత=ఎడలిన - పక్కణ = బోయపల్లెలో - వర్ధితులన్ = పెరిఁగినవారిని, మిగులన్ = తప్పక, తక్కుము = (బాపనవారినైనను) వదలుము (చేర్పకుము), తొల్లి = పూర్వము, భ్రష్టు = చెడిపోయినవాఁడు, అగు - విప్రుండు = బ్రాహ్మణుఁడు, ప్రోచిన కొక్కెరపైన్ = తనకు అన్నమిడిన కొంగమీఁద (కొంగను చంపువాఁడై), ఒక్కపూఁట కూటికిఁగాఁగన్ = ఒకపూఁట ఆహారము నిమిత్తమై, అలుగఁడె = కోపావేశము తెచ్చుకొనలేదా; - సామాన్యవిశేషములు చెప్పినందున అర్థాంతరన్యాసము.

గౌతముఁ డని యొక బ్రాహ్మణుఁడు భ్రష్టుఁడై, బోయలం గలసి, బోయత యిల్లాలుగా, బోయపల్లెయందు జీవించుచు, ధనాతురుఁడై, యొకసాతుం గలసి, కాశం బోవుచు, వనగజముచే సాతు మథితముకాఁగా, నొక్కవటముం దఱియఁగా, అందు నాళీజంఘుఁ డను కొంగయుండి, ఆ బ్రాహ్మణునికి ధన మిచ్చి, యన్న మిడెను; పిమ్మట నాతఁడు మఱునాఁటి పయనమునకు అన్నముకై ఆకొంగను నిద్రితముగను చంపి ఱెక్కలూడ్చి మాంసము గడ్డలో మూటకట్టికొనిపోయెను. - ఈకథ భార. శాంతి. 6 ఆ.లో నున్నది. దీనినిట ననుసంధించుకొనునది — జాతి భ్రష్టుఁడైన బ్రాహ్మణుఁడు అధర్మపరుఁడే అయి, పరులకు ద్రోహమే చేయుచుండును, గావున, వానిం జేర్పవల దనుట.

'భ్రష్టు' - (రూ. భ్రష్టుఁడు) - వృద్ధు, నిము. మూర్ఖు ఆనువానివలె రూపసిద్ధి. 'పక్వాః కేశరాలయః' అను. 'పథచ్యుతి' = ఎప్పుడును సత్సంగతికి అవకాశములేక యని భా.

చ. చదివి యధర్మభీతి నృపశాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు దె
బ్బదిటికి లోను నేఁబదికిఁ బాహ్యము నై యరుజస్వపూర్వులై,
మదమఱి రాజుప్రార్థన నమాత్యతఁ గైకొని యేచ్చు పాఱువా
రొదవిన నంగము ల్మిగుల నూర్జిత మౌటకుఁ బూఁట చాలదే. 211

చదివి = విద్య నేర్చి, అధర్మభీతి నృపశాస్త్రవిధిజ్ఞతలన్ = అధర్మమునకు వెఱపుతోను రాజనీతి విధానముయొక్క ఎఱుకకలిమితోను (కూడి), వయస్సు, ఏఁబదికి బాహ్యము = ఏఁబది యేండ్లకు పైఁబడ్డదియు, దెబ్బదిటికి = డెబ్బదికి, లోను = తక్కువయు, ఐ = కలవారై, అరుజస్వపూర్వులై = రోగములులేని తమపూర్వులు గలవారై, మదము అఱి = అహంకారము ఉడిగి, రాజు ప్రార్థనన్ = తేని వేఁడికోలుచేత, అమాత్యతన్ = మంత్రిపదమును, కైకొని = అంగీకరించి, తేచ్చు పాఱువారు = (రాజకార్యములు) నెఱవేర్చెడు బ్రాహ్మణులు, ఒదవినన్ = దొరకినయెడల, అంగముల్ = రాజ్యాంగములు, మిగులన్ = ఎంతయును, ఊర్జితము = బలపడినట్టిది. ఔటకున్, పూఁట = ఒకదినము, చాలదే = చాలును.

'నృపశాస్త్రము' - శుక్రనీతి చాణక్యనీతి కామందకనీతి ఇత్యాదిరాజనీతి. 'చదివి' - 'బాహ్యమునై' అనుదానం గలక్త్వార్థకముతో చేరును. ఏఁబదింటికి బుద్ధి చక్కఁగా పరిపాకముం జెంది డెబ్బదివఱకు పటిమ గలిగియుండు నని భావము. - 'అరుజస్వపూర్వులు' - శాశ్వత రోగములు లేని సంతతిలోనివాఁ డగుట చేత నతనిపూర్వులు పాపులు గారు, అతఁడునుం గాఁడు, అనుటయు, అతనికి కార్యపటిమ కొఱవడ దనియు భావము. - 'అరుజత్' అని పా. నఞ్ + రుజ్ - భ్వాది - శతృ. - లేక 'అరుజ' అనుబహువ్రీహి - నామధాతువు - శతృ. - అర్థతాత్పర్యములందు విశేషము లేదు; నరుజన్తః = అరుజన్తః; ఒండె, అరుజా ఇవ ఆచరన్తః = అరుజన్తః. రాజు ప్రార్థనచే వచ్చినవాఁడు స్వార్థపరుఁడు గాఁడు, కావున అధర్మము చేయఁడు, రాజహితము మానఁడు, రాజవైరుల భేదోపాయములకు లోనుగాఁడు, అనుట, 'పాఱువాఁడు' - శ్రోత్రియుఁ డనుట. ఇట్టినే నియమించుకొనుటకు ఉపపత్తికై చూ. 210. 'అంగములు' 'స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్ర దుర్గ బలాని చ; రాజ్యాఙ్గాని ప్రకృతయః' అను.

వ. అట్టిమంత్రివర్గంబు దొరక దేని. 212

శా. నీతిం దాన తలంచి చేయఁ బని గాక కాకపోనీ, బల
వ్రాతార్థాఢ్యత నెమ్మినుండ కొరుఁ బ్రోవన్ మంత్రి యంచుం గుణా
తీతుం, గుమ్మడి కాయ యంత యగుముత్తెం బై మనం బేర్చ, న
ట్లే తా నాతనిచేతిలో బ్రదుకువాఁడే యౌఁ జుమీ మీఁదటన్. 213

తాన = రాజే, నీతిన్ = రాజనీతిని, తలంచి = మనంబున నుంచుకొని, పనిచేయన్ = పనులు కావించుకొనవలయును, (అట్లు చేసికొన్నచో ఆయాపనులు), కానీ కాకపోనీ = అయినను కాకున్నను అట్లే చేసికొనవలయును, (అట్లుగాక), బలవ్రాత అర్థ ఆఢ్యతన్ = సేనలసమూహము చేతను ధనముచేతను సంపన్నుండై, నెమ్మిన్ = సుఖముగా, ఉండక, మంత్రియంచున్, ఒరున్ = అన్యుని, గుణ అతీతున్ = గుణములను దాఁటినవానిని (గుణహీను ననుట), ప్రోవన్ = పోషింపఁగా, (అతఁడు), గుమ్మడికాయ యంతయగుముత్తెంబు ఐ = ధరించుటకు శక్యముగాని మణి - అనఁగా ఆజ్ఞాపించి పనిగొనుటకు వశ్యుండు గానియధికారిగా పరిణమించి, మనంబు ఏర్పన్ = మనస్సును ఎరియఁ జేయఁగా, అట్లే, మీఁదటన్ = వాఁడు నాటుకొన్న తర్వాత, తాను = ప్రభువు, ఆతని చేతిలోన్ = ఆమంత్రి వశములో, బ్రతుకువాఁడే ఔను జుమీ.

అట్టి దొడ్డమంత్రులు దొరకరేని, రాజు తానే రాజనీతి శాస్త్రము ననుసరించి పనులు గావించుకొనవలయును; ఆపనులు నెఱవేఱినను నెఱవేఱకున్నను సరియే, అట్లుగాక, పూర్వ పద్యములలో చెప్పిన గుణములు లేనివానిని పసుని తెచ్చి మంత్రి యని పోషించినయెడల, వాఁడు త్వరలోనే ఆజ్ఞకు లోఁబడక సర్వమునకుం దానే స్వతంత్రుఁ డగును. రాజు వాఁడు నడిపినట్లు నడచుకొనుచు వాని నాశ్రయించి బ్రతుకవలసినవాఁ డగును. కావున, మంత్రి లేకయే యుండ వచ్చునుగాని గుణహీనుని మంత్రియధికారమున నుంచుకొనం గూడదు.

'గుమ్మడికాయయంత ముత్తెమై' - లలితాలంకారము. 'కానీ', 'పోనీ' - ఇందలివి ఈకారములు హల్లు పరంబగుచు మువర్ణకలోపం బొందిన యిచ్చుధాతు ప్రార్థనాద్యర్థకమధ్యము పురుషైకవచనములు.— గుమ్మడికాయ యంతముత్తెంబు ఎట్లును ధర్తవ్యము గాక మనం బేర్చును.

క. ఒక్కనిపిరివికిని దొర । లెక్కుండ్రే, నొక్కనొకని వెంబడి ననుఁగు
లెక్కుండ్రప్పు, నిలువఁ బను లగుఁ; । గక్కసము గుదింపఁ, బెంపఁగాఁ గాకుండున్.

ఒక్కని - పిరివికిని = కార్యాతిశయమునకే, దొరల్ = అధికారులు,...అనుఁగుల్ = వానివాని యాశ్రితులు,...నిలువన్ = తోడ్పడి పనిసేయఁగా...కుదింపన్ = (అధికారమునుండి) తగ్గించినచో, కక్కసము = కష్టము, (అగును) పెంపఁగాన్ కక్కసము ఉండదు.

ఒకదొరయే సేయవలసిన గొప్పకార్యమునకు పలువురుదొరలను నియమించుట మంచిది. ఆపలువురలో ఒక్కొక్కనికి వానివానియాప్తులు తోడ్పడుటవలన పనులు చక్కఁగా నెఱవేఱును; క్రమముగా దొరల సంఖ్యను హెచ్చించినచో వారు హర్షింతురు, తగ్గించినచో తగ్గిన వారు దుఃఖింతురు. ఇతరులును పనియంతయు తమమీఁదనే పడిన దని దుఃఖింతురు. - పూర్వార్థోక్తమునకు, (అనఁగా, పెక్కుండ్రను నియమించుటకు) నిమిత్తమును ఉత్తరార్థము సూచించుచున్నది గావున వాక్యార్థహేతుక కావ్యలింగము. 'కక్కసము' - 'కర్కశ'మునకు వై.

క. ధనముఖ్యము కేవల మే । పనియుం గా, దాప్త గలిగి పలువురు ప్రభువుల్
పనిసేయక, తద్వశ్యం । బునకు నలోభానృశంస్యముల్ ఋతముఁ జెలుల్. 215

పలువురు - ప్రభువులు = దొరలు (అధికారులు), ఆస్థగలిగి = అక్కఱతో, పనిసేయక = పని సేయవలయును గాక ఒండు విధముగా, ఏపనియున్ = ఏపనియైనను, కేవలము ధన ముఖ్యము = ధనమే ప్రధానముగా (కేవలధనసాధ్యముగా), కాదు = నెఱవేఱదు, తత్ వశ్యంబునకున్ = వారిని వశపఱుచుకొనుటకు, అలోభ ఆనృశంస్యములు = (వారికి ధన మిచ్చుటలో) పిసినితనము లేమియు కూళతనము లేమియును, ఋతమున్ = సత్యమును, చెలుల్ = మిత్రములు (అనఁగా తోడ్పడు వనుట).

గొప్పపని యేదియు కేవలధనముచేతనే సాధ్యము కాదు, పలువురు దొరలు పనివడి దానిని సాధింపవలయును. వారు తనకు వశ్యు లగుటకు వారికి జోఁడు ధనము హేరాళముగా నీవలయును, వారియెడల తాను కూళతనమును వహింపఁగూడదు, సత్యముగా వ్యవహరింపవలయును. 'తత్ వశ్యంబునకున్' (వారివశీకరణమునకు.) వశ్యశబ్దమునకే వశీకరణార్థమున బహుళ వ్యవహారము కలదు.

'కుణ్డం సులక్షణం కృత్వా మేఖలాత్రయశోభితమ్
యోనివృత్తం త్రిమాత్రైః స్యా త్తత్ర హోమ స్తు కారయేత్.
వశ్యే తు చతురస్రం చ ఆకర్షణే త్రికోణకమ్
తథై వోచ్చాటనే ప్రోక్తం షట్కోణం మారణే స్మృతమ్.
వశ్యే మేషాసనం ప్రోక్తం కర్షణే వ్యాఘ్రచర్మణి,
శాన్తౌ మృగాసనం ప్రోక్తం, గోచర్మ స్తమ్భనే స్మృతమ్.'
'సంరమ్భే చౌరసఙ్ఘే ప్రహరణసమయే బన్ధనే వారిమధ్యే
వహ్నౌ వాదే వివాదే ప్రకుపితనృపతౌ దివ్యకాలే నిశాయామ్।
వశ్యే వా స్తమ్భనే వా రిపువధసమయే నిగ్రహే వా వనే వా
గచ్ఛం స్తిష్ఠం స్త్రికాలం యది పఠతి శివం ప్రాప్నుయా దాశు ధీరః.'

ఇట్టి యుదాహరణము లెన్నియేని దొరకును. 'వశాయ = వశీకరణాయ సాధు' = వశీకరించుటకు తగినది. అందులకు సాధనము అలోభాదికము.

క. భాండాగారహయాద్యము | లుండియు నను వగుమనుష్యు లొదవమి నవియన్;
మండలి నవయ నరి కొదిఁగి | యుండిన సింహాసనంబు లుర్విన్ వినమే? 216

ఉర్విన్ = లోకములో, భాండ ఆగారహయ ఆద్యములు = మూలధనముయొక్క గృహములు గుఱ్ఱములు మొదలుగాఁ గలవి, ఉండియున్ = ఉన్నప్పటికిని, అనువు - అనుఁగులు (ఆప్తులు), అగు మనుష్యులు, ఒదవమిన్ = దొరకనందున, అవియన్ = (ఆభాండాగార హయాద్యములు) క్షయింపఁగా, మండలి = దేశము, (ఆకారణముచేత), నవయన్ = చెడిపోఁగా, అరికిన్ = శత్రువునకు, ఒదిఁగి = అణఁగి, ఉండిన - సింహాసనంబులు = (లక్షణచే) సింహాసనస్థులను (రాజుల ననుట), వినమే = మనము వినలేదా.

ధనములు సైన్యములు మొదలయిన రాజ్యాంగములు కలిగియు, తగిన మంత్రులు లేమింజేసి శత్రువులకు లోఁబడి పడియుండెడు రాజులను మనము వినియున్నాముగదా. రాజు మంచి యమాత్యాదులను సంగ్రహించుకోవలయు ననుట. 'భాండ'—'స్యా ద్భాణ్డ మశ్వాభరణేఽమత్రే మూలవణిగ్ధనే' అమ. 'మనుష్యు లొదవమి నవియున్ ...మండలము నవియ నరి కొదిఁ | గుండిన' అని పూర్వముద్రణ పాఠము.

తే. బాహుజాంఘ్రిజముఖవిడంబనకు నయినఁ
గొలిచి మనువిప్రధర్మంబు దెలిసినైనఁ,
బూని సంకటముల నిల్పుఁ గానఁ దఱచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము. 217

బాహుజ అంఘ్రిజ ముఖ విడంబనకున్ ఐనన్ = క్షత్రియులు శూద్రులు లోనగువారి పరిహాసమునకు (వెఱచి) యైనను, కొలిచి = సేవించి (సేవచే ననుట), మను = జీవించెడు - విప్రధర్మంబున్ = బ్రాహ్మణులవృత్తిని. తెలిసినైనన్ = ఎఱింగియైనను, పూని = భారము వహించి (పూనిక గలవాఁడై), సంకటములన్ = ఇక్కట్టు వచ్చినప్పుడు...

రాజు బ్రాహ్మణుని గొప్ప యధికారమందు నియమించుకొనుటచేత మేలగును; ఏలయన బ్రాహ్మణుఁడు తానుసంకటములలో నిలువక తప్పినచో తన్ను క్షత్రియశూద్రాదులు పరిహసింతు రనియు. తనకు రాజులకడ దొరకి సేవించు నిత్య బ్రాహ్మణుల వర్తనమును జూచి దాని నవలంబించియు, సంకటములయందు పూనికతో నిలిచి వానిని తొలఁగించును.

'ఐనన్' అని సముచ్చయార్థకముగా చెప్పుటలో ఒక్కొక్కటియు అతని పూనికను దృఢపఱచుటకు చాలు నని భావము. 'విడంబన'—

'ఇయం చ తే౽న్యా పురతో విడమ్బనా । యదూఢయా వారణరాజహార్యయా
విలోక్య వృద్ధోక్షమధిష్ఠితం త్వయా । మహాజనః స్మేరముఖో భవిష్యతి.' కుమా.
'విడమ్బనా పరిహాస ఇత్యర్థః' - మల్లి. టీక.

'కొలిచి మను విప్రధర్మంబు' - మనునట్టి విప్రులయొక్క యని గ్రహించిన ఏకదేశాన్వయము. విప్రధర్మముచే కొలిచి మనునట్టి విప్రధర్మము అని యన్వయించుకొనిన ఏకదేశాన్వయము కానేరదు. విరాట్పురుషునియొక్క ముఖబాహూరుపాదములనుండి క్రమముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు జనించినా రని శ్రుతి.

ఇచట ఊరుజనులను చెప్పమికి కారణ మరసి కొనునది.

ఉ. ఆయతికాని కీను మఠసురాలయముఖ్యము, లాతఁ డర్థతృ
ష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం బొరల్చి, రా
జాయతనంబుఁ జేర్చు; మఱి యట్టి దపథ్యము, కాన నొంటిగాఁ
డే యధికారి గావలయు, నించుక తిన్నను వాఁడె రూపఱున్. 218

మఠ ఆలయముఖ్యములు = దేవగృహములు లోనగునవి, ఆయతికానికిన్ = నిక్కై ధన మార్జింపవలసిన వానికి. ఈకుము, అతఁడు, అర్థతృష్ణాయుతుఁడై = ధనార్జనాశతోఁ గూడుకొన్నవాఁడై, నిజ ఉర్విన్ = రాజుయొక్క భూమియందు, అగునష్టికిన్ = కలుగునట్టి లోటునకు, తత్ ధనమున్ = ఆదేవాలయాదుల సైకమును, పొరల్చి = పూర్తిచేసి, రాజ ఆయతనంబున్ = రాజునియింటికి, చేర్చున్ = పంపును, మఱి అట్టిది = అట్టిదైననో, అపథ్యము = అహితము, కానన్ = అగుటంజేసి, ఒంటిగాఁడే = ఏకాకియే, అధికారి = దేవాలయములమీఁదిదొర, కావలయున్, ఇంచుక, తిన్ననున్ = స్వామిసొత్తు ననుభవించినను, వాఁడే, రూపఱున్ = నశించును.

నిక్కై ధనమార్జింపవలసిన యధికారమును దేవాలయాదిధర్మాధికారమును రెంటిని ఒకనికే ఈకుము. అతఁడు, ధనార్జనకై తనభూమిలో నష్టివచ్చెనా, అనఁగా - అందుండి ధనార్జన లేక

పోయెనా, దేవాలయాది ద్రవ్యమును ఆనష్టికి బదులుగా తనయింటికి పంపును. కావున ఆయత్యధికారములేని వానికి ధర్మవిచారణ యనునొంటియధికారమే ఇమ్ము. అతఁడు చెడుబుద్ధి పుట్టి దేవాది ద్రవ్యమును కొంత హరించెనా, వాఁడే చెడును; గాని ఆదేవాదిద్రవ్యము బొక్కసము చేరదు గావున నీకుఁ జెఱుపు కలుగదు.

'దేవద్రవ్యోపజీవీ చ స భవేదపబాహుకః
దేవద్రవ్యం స్వయం యేన భుక్తం స తు సదా భవేత్.
రసజ్ఞావిధురః కుబ్జః కణ్డూ సర్వాఙ్గదుఃఖితః.' శివధర్మోత్తరము.

'ఆయతనము' - 'స్నేహ స్త దేశాయతనం జగామ.' కుమార 7. (5).

'ఆయతి స్తు స్త్రియాం దైర్ఘ్యే ప్రభావాగామి కాలయోః.' మేదిని.

ఆయతికాఁడు = ధనార్జనము సేయువాఁడు—'ఆయతికాఁడు వలయు నర। నాయకునకు; వాని కెల్లనరులుం గేటుం, జేయఁ దలంతురు; దానవ। ధ్యాయకుఁడై కావవలయు ధరణిపుఁ డతనిన్' శాంతి. 2 (363). 'తృష్ణా' - తృష్ణే స్పృహాపిపాసే ద్వే' అను.

చ. మును దనసీమ చేసికొని, ముల్లిడి, గుద్దట వెండి చేనిమె
త్తనకయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వుకర్షకునట్లు, శత్రుతో
నెనసియ యైన దుర్గబలమే కొని యైన, నిజాత్మ చింత లే
క నెగడఁ జేసి, లోన మఱి కంటకశోధనఁ జేయు టొప్పగున్. 219

మును = ముందుగా, తన - సీమ = క్షేత్రముగా, చేసికొని = స్వాధీనపఱుచుకొని, ముల్లు ఇడి = సరిహద్దుగా ముండ్లకంచెను నాటి, వెండి = తర్వాత, చేని మెత్తనకయి = పొలము మెత్తఁబడుటకొఱకు, వేరు వెల్లఁకియున్ = మూలములును గడ్డలును, గుద్దటన్ = గుద్దటితో, త్రవ్వుడు - కర్షకునట్లు = సేద్యగానివలె, (రాజు) శత్రుతోన్, ఎనసియయైన = కూడియే యైనను, దుర్గబలమే కొనియైనను=గడిదుర్గములసేనాబలముచేతనే యేనియు, [మును తనసీమ=తన హద్దును, చేసికొని=రూఢిగా ఏర్పఱుచుకొని, పదిలపఱిచికొని], నిజాత్మ=తన మనస్సు, చింతలేక నెగడన్ = నిర్విచారముగా నుండునట్లు, చేసి, మఱి=పిమ్మట, లోనన్=తనదేశములో, కంటకశోధన = క్షుద్రశత్రువులను వెలార్చుటను, చేయుట, ఒప్పగున్ = తగును.

సేద్యగాఁడు ముందుగా పొలమును స్వాధీనము చేసికొని, తర్వాత దానికి ఎల్లఁగా ముండ్ల వెలుగు నాటి, అనంతరము చేను దుక్కికి అలవడుటకై దానిని మెత్తఁబఱుచుటకుఁగాను వేరులును గడ్డలును గుద్దటితో త్రవ్వివైచును; అట్లే ఱేఁడును ముందుగా దేశమును స్వాధీనము చేసికొని, ఎల్లలం గాపాడుకొని దానిపై బయటి రాజులు రాకుండునట్లుగా శత్రువులతో చెలిమి గావించియేని, తనదుర్గముల బలమునే ఆశ్రయించియేని, బయటిభయము లేనివాఁడై తనరాష్ట్రము లోని క్షుద్రశత్రువులను నిర్మూలింపవలయును. - ఉపమాలంకారము.

ఇందు - పొలము, కర్షకుఁడు, కంపవెలుగు, గుద్దలి, వేరువెల్లఁకి, ఇవి యుపమానములు - వీనికి క్రమముగా - రాష్ట్రము, రాజు, చెలిమినొందినవైరిరాజు - లేక - గడిదుర్గములసేనాబలము, అభియోగము, కంటకులును, ఉపమేయములు. 'సీమ' - 'సీమ సీమే ఇమే క్షేత్ర కూల మర్యాద

యోఽరపి.' నానా. * 'వెల్లఁకి' - 'వెదకి తేరాపోయి వేరు వెల్లంకి' (గర్భమొందినకన్య విటుని వేఁడుకొనుట). క్షేత్రజ్ఞ.—

'ఆత్మా యత్న ధృతి స్వాన్త స్వభావ పరమాత్మసు। జీవ బుద్ధి శరీరేషు' - నానా.

'సూచ్యగ్రే క్షుద్రశత్రౌ చ రోమహర్షే చ కణ్టకః' అమ.

క. మొదలనె యొరుదలకానిం। జెదరంగా నాడ కాత్మఁ జింతింపు; పదిం
బదిగ మృష యేని మఱి విడు। ముదస్తుఁగాఁ గాక యుండ నొక్కమతమునన్.

ఒరుదలకానిన్ = కొండెగానిని, మొదలనె = తొలుతనె, చెదరంగా నాడక = నీకడకు రాకయుండునట్లు, తూలనాడక, ఆత్మన్ = నీమనస్సులో, చింతింపుము = అరయుము, పదింబదిగన్ = అన్నివిధములను నిశ్చయముగా, మృషయేని = వానిమాట అసత్యమేయైనచో, మఱి = అంతట, ఉదస్తుఁగాఁగాక = పనినుండి తొలఁగింపఁబడినవానిని చేయక (వానిపనినుండి వానిని తొలఁగింపక), ఒక్కమతమున నుండన్ = ఒకపక్షముగా నుండునట్లు, విడువుము.

కొండెగానిని అసత్యము పలుకుచున్నాఁడని నీవు దోఁపఁగానే, తూలనాడి నీకడకు రాకుండం జేయకుము. వానిమాట సత్యమో కాదో నీమనస్సులో చక్కఁగా ఆలోచించి పయిగా పలుమాఱు పరిశోధించి అసత్యమే అని నిశ్చయ మాయెనేని వానిని వాని నియోగమునుండి తొలఁగింపక పక్షాంతరముగా నుంపుము.

క. ధరణి నసాధ్యనగాటవు। లిరవుగ భూపీడ సేయునెఱుకుల పొరుగూ
ళ్లిర వగు నస్థితిశూరుల। కెరవుగ నిచ్చునది మిథము నెట్లయిన నురున్. 221

ధరణిన్ = భూమిలో, అసాధ్య నగ ఆటవులు = సాధింపశక్యముగాని కొండలును అరణ్యములును, ఇరవుగన్ = నివాసస్థానములుగాఁ గలిగి, భూపీడ = రాష్ట్రమునకు బాధ, చేయు ఎఱుకుల పొరుగు ఊళ్లు = కావించునట్టి కిరాతులకు ప్రక్కనుండు గ్రామములును, ఎరవు అగు = అన్యములయిన (అనఁగా నీవాండ్రు గానట్టి) అస్థితిశూరులకున్ = స్థితిలేని వీరులకు, ఎరవుగన్ = తాత్కాలిక జీవనముగా, ఇచ్చునది = ఇమ్ము, మిథము = వారును ఎఱుకులును పరస్పరము. ఎట్లైనన్ = ఏమయినను, ఉరున్ = ఒప్పను.

చొచ్చి సాధింప శక్యముగాని పర్వతారణ్యములయందు నివసించుచు రాష్ట్రపిడ చేయుచుండునట్టి కిరాతుల నివాసములపొరుగు గ్రామములను, స్థితిలేని పరాయిశూరులకు తాత్కాలిక జీవనార్థము ఇమ్ము. ఆయెఱుకులును ఈశూరులును పరస్పరము ఏమయినను అనఁగా వారిచే వీరు మడిసినను వీరిచేతవారు కెడసినను నీకు మంచిదే.

'అస్థితిశూరులు'=ఒకచోట సేవలో కుదురుపడి స్థిరముగా నుండువారు గారు. 'పొరుగూళ్లు' - సామీప్యముచేత ద్వేషములు రాక మానవు. 'ఎరవుగన్'=శాశ్వతముగా ఇచ్చినచో వారును తద్వాంశ్యులను జేనికే కంటకు లగుదురు. - 'శూరో వీర శ్చ విక్రాన్తః' అమ. 'సాంతంబులతుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' బా. శ. ౮౦ అనుసూత్రమునం గల బహుళగ్రహణముచే మిథశ్శబ్దమునకు అవ్యయమునకు సలోప మువర్ణకములు. 'మిథోఽన్యోన్యం రహస్యపి.' అమ.

* చూ. నన్నెచో. 'పాయక వేరువెల్లఁకియుఁ బండులు నొండులు' కుమా. 6 - 35 చూ. నన్నెచోడ కవిత్వము పు. 168.

వ. విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గూడకయు రాజునకుఁ బ్రజాబాధ దఱుఁగ; దెట్లని యేవరు వారి వారలం జేకూర్చుకొనవలయు; నవిశ్వాసంబును విశ్వాసంబును, నలుకయు నెలమియు, నతివైరంబును నత్యానుకూల్యంబును, నల్పులగుట నల్పంబునన యగు; నెట్లంటేని. 222

విశేషించి = ముఖ్యముగా, ఆపార్వతీయబలంబు = ఆకొండవాండ్ర సేన, లోనంగూడక ఉన్న రాజునకు = తనలో చేరనట్టివానికి, ... తఱుఁగదు = తగ్గదు, ఎట్లని = ఏయుపాయమునం గాని, ... అవిశ్వాసంబు = నమ్మికలేమి (నమ్మమి), విశ్వాసంబు = నమ్ముట, ... ఎలమి = ప్రీతియు, అతివైరంబును = ఎక్కువపగయు, ... అల్పంబునన = స్వల్పకారణముచేత నే....

శా. విల్లుం దానును భిల్లుఁ డొక్కఁ డరుగ, న్విం దింట దుగ్ధాన్నముల్
భిల్లుం డన్యుఁడు పెట్ట, నార యిడుక న్వీక్షించి, దొబ్బంచు వాఁ
డెల్ల న్వమ్ముగఁ జేసి, తన్ననుప రా, నెందేఁ దెగం జూడఁగా
నుల్లంబై, 'చన నంపు, నార చెడు' నా, నూహించి పో నంపఁడే. 223

భిల్లుఁ డొక్కఁడు - ఒక్క బోయ, విల్లుం దానును = తాను విల్లు కేలఁ బూని, అరుగన్ = పోఁగా, భిల్లుండన్యుఁడు = వేఱుబోయ, ఇంటన్ = తనయింట, దుగ్ధ అన్నముల్ = పాలతోడ యన్నమును, విందుపెట్టన్ = ప్రీతి పూర్వకమయిన భోజనముగా ఇడఁగా, వాఁడు = ఆయాగంతుకుఁడు, నార యిడుకన్ = (ప్రొయ్యిమీఁద) నార యుడుకుచుండఁగా, వీక్షించి = చూచి, దొబ్బ అంచున్ = అది ఉడుకుచున్న మాంసమే యని తలంచి, ఎల్లన్ = తనకు పెట్టిన విందంతయు, వమ్ముగఁ జేసి = గణింపక, తన్నున్ అనుప రాన్ = (విందుపెట్టిన బోయ) తన్ను సాగనంపుటకుఁ గూడ రాఁగా, ఎందేని తెగం జూడఁగా ఉల్లంబు ఐ = వానిని ఎక్కడనో ఒక చోట తెగటార్ప నుద్దేశించినవాఁడై యుండఁగా, చనన్ అంపుము నార చెడున్ నాన్ =(సాగనంపవచ్చిన యాభిల్లుఁడు) 'నన్నుఁ బంపుము' _ అనఁగా _ 'నే నింటికి పోయెదను. నాకు సెలవిమ్ము _ ఇంట ప్రొయ్యిమీఁద నుడుకుచున్న నార ఎక్కువఁగా ఉడికి చిముడి పోయెడును' అని పలుకఁగా, ఊహించి = (ఆయాగంతుక భిల్లుఁడు తాను ప్రొయ్యిమీఁద నుడుకుచుండం జూచినట్టిది నారగాని మాంసముగా దని, యెఱింగి, పో నంపఁడే = ఆయన్న మిడినవానిని చంపక ఇంటికి పోవ సెలవొసంగ లేదా.

ఒకబోయ విల్లు కేలఁ బూని మిత్రు నింటి కరిగెను. మిత్రుఁడు వీనికి తనయింట పాలతోడి యన్నము విందుపెట్టెను. ప్రొయ్యిమీఁద కుండలో నార యుడుకుచుండెను. ఆగంతకుఁడు అది మాంస మనియు ఉడుకుచున్న దనియు తలంచెను. ప్రీతితో పెట్టినదెల్ల గణింపక ప్రొయి మీఁది దానిని తనకు పెట్టఁడాయెఁగదా యని ఆగంతుకుఁడు పగఁబూనెను; పిమ్మట వానిని సాగనంపుటకు ఆమిత్రుఁడు కూఁడపోఁగా, విందు గుడిచినభిల్లుఁడు వానిని దారిలో తెగటార్ప నిశ్చయించుకొని పోవుచు, ఒక్కెడ అందులకు ఉంకించు తఱిని, మిత్రుఁడు 'ప్రొయ్యిమీఁద నార చిమిడిపోయెడిని, నాకుం బోవ సెల విమ్ము' _ అని పలికెను. అంతే నాయాగంతకుఁడు తాను మాంసమని తలంచినట్టిది నార గాని మాంసము గాదనియు తనమిత్రుఁడు తన కేమియు కొదువ చేయలే దనియు తెలిసికొన్నవాఁడై వానిని చంపక ఇంటికి పోవుటకు సెలవిచ్చెను.—అది దీనికి

పూర్వమందున్న (౨౨౨) వచనములో చెప్పినట్లు ఆటవికులకు అల్పకారణంబుననే అవిశ్వాస విశ్వాసాదులు కలుగు, నన్నందులకు ఉదాహరణము.

క. ఆపాలకూటనే నిజ । మేపాటియుఁ దప్ప రాడిరే; నెరసునఁ గొం
తేపాటి గన్న నలుగుదు; । రీపని యెంతనక వెడఁగు లెద నాటవికుల్. 224

ఆటవికుల్ = అడవిమనుష్యులు (బోయలు చెంచులు లోనగువారు), ఆపాలకూటనే = ఆక్షీరాన్నమునకే, ఆడిరేని = ఒకమాట పలికిరా, నిజము, ఏపాటియుఁ దప్పరు, నెరసునన్ = దోషము విషయమై, కొంత ఏపాటి కన్నన్ = ఎంత కొంచెము గపడినను, వెడఁగు ఎదన్ = వికృతపుబుద్ధిచేత, ఈపని ఎంత అనక = ఇది ఏపాటిపని యని ఆలోచింపక, అలుగుదురు = ద్వేషింతురు.

బోయలు చెంచులు లోనగు నడవిమనుష్యులు పాలన్నము పెట్టిన మాత్రాననే ఆ పెట్టినవారియెడ సత్యము తప్పక ప్రవర్తింతురు. అయినను ఏయించుక అతిక్రమము కనఁబడినను వెఱ్ఱిబుద్ధిచే - ఇది యొకతప్పా అని దానిని ఉపేక్షింపక పగపట్టుదురు - వారికి స్వల్పముననే స్నేహద్వేషములు కలుగు ననుట.

తే. ఆటవికవశ్యకలన సత్యమున, వైరి । మనుజపతిమైత్రి దూతసమ్మానమునను,
గూర్మి దఱిభృతిఁ గాల్వురకును, సపారి।తోషికపుసేవ నెలమి రౌతులకుఁ గలుగు.

ఆటవికవశ్యకలన = భిల్లాదులయొక్క వశ్యస్థితి, సత్యమునన్ = వారియెడ మాట తప్పమిచేత, కలుగును, వైరి మనుజపతి మైత్రి = శత్రురాజుయొక్క చెలిమి, దూతసమ్మానమునను = అతని దూతను సత్కరించుటచేతను, (కలుగును), కాల్వురకున్ = కాల్బంట్లకు, కూర్మి = (తేనియెడల) అనురక్తి, తఱిన్ = సమయమందు, భృతిన్ = జీత మిచ్చుటచేతను, (కలుగును). రౌతులకున్ = అశ్వారోహులకు, కూర్మి = తేని మీఁదప్రేమ, సపారితోషికపు సేవన్ = బహుమానములతోఁ గూడిన కొలువుచేతనుం (గలుగును).

సత్యము తప్పనిరాజునకు ఆటవికులు వశ్యులుగా నుందురు, వైరిభూపుని దూతను సమ్మానించినచో ఆభూపుఁడు చెలిమివహించును, అనఁగా - దూతను సమ్మానించినచో దూతపోయి ఈరాజుగుణములను తనరాజునొద్ద పొగడి ఆయనను ఈతనికి అనుకూలునింగావించును. కాలుబంట్లకు సమయాన జీత మిచ్చుచున్నయెడల వారు రాజునం దనురక్తులుగా నుందురు, రౌతులకు బహుమానములతోఁ గూడినకొలువు పెట్టుచున్నచో వారు రాజుపై కూరిమి వహింతురు.

'భృతి' - 'కర్మణ్యాతువిధా భృత్యా భృతియో ధర్మ వేతనమ్', అమ. 'పారితోషికము' - పరితోషము దీనికి ప్రయోజనము.

క. మే లగుఘోటకమును శుం । డాలంబును నాప్తసుభటునకె యిమ్ము; తఱి
న్మే లగు మెలపున మందురఁ । బాలింపుము; దొరలపాలు పఱుపకు మెపుడున్. 226

ఘోటకమును = గుఱ్ఱమును. శుండాలంబును = ఏనుఁగును. ఆప్తసుభటునకె = ఆప్తుఁడయిన జోదునకే ... మందురన్ = తబేలాను. మెలపునన్ = జాగ్రత్తతో....

ఉత్తమాశ్వమును ఉత్తమ గజమును నీయాప్తయోధునికే యిమ్ము. అందువలన సమయము వచ్చినప్పుడు నీకే మేలు గలుగును. అనఁగా, దానిని అతఁడు నీసేవకే తెచ్చును. అశ్వశాలను గజశాలను జాగరూకతతో కాపాడుము; ఎప్పుడును వానిని అధికారుల వశమున విడిచిపెట్టకుము.

'ఘోటకము' - 'ఘోటకే వీతి తురగ తురఙ్గాశ్వ తురఙ్గమాః' - అమ. శుండ (=తొండము) కలది శుండాలము (=ఏనుఁగు).

తే. కార్య మొకఁడు గనిన మాత్సర్యమున నొ
కండు గా దని ఖండించుఁ; గన్నెఱింగి,
యిరువురను గాదనక కొల్వు విరిసి, మీఁద
నల్లవాఁ డెన్నినది సేయ నగు శుభంబు. 227

మాత్సర్యమునన్ = ద్వేషముచే. కన్ను = జాడను. కొల్వు విరిసి = సభను చాలించి.

ఒకఁడు ఒకపనిని సరిగా కనిపట్టి సభలో నీకు తెలుపఁగా, వానిమీఁది ద్వేషముచే మఱి యొకఁడు దానిని కా దనె నేని, ఆజాడను కనిపట్టి ఆ యిరువుర మాటలను నిరాకరింపక, సంభావించి, పిమ్మట ఆమొదటి వాఁడు చెప్పినదానినే అవలంబించినచో మేలు కలుగును.

క. పగ వెలిఁ గొని, లో దస్యులఁ । జిగిరింపఁగఁ జేసి, నృపతి చిక్కఁ బడఁ బను
ల్దెగి సేయక, తామే ది । క్కుగ నడతు రశంక నల్లుకొని దుస్సచివుల్. 228

దుస్సచివుల్ = చెడుమంత్రులు, వెలిన్ = రాష్ట్రమునకు బయటనున్న, పగన్ = ద్వేషమును (ఒండె - ద్వేషిని), కొని = వశపఱచుకొని (పా. కని = తెలిసికొని), లోన్ = రాష్ట్రము లోపల, దస్యులన్ = దొంగలను, (కొల్లగాండ్రనుట), చిగిరింపఁగన్ = వర్ధిల్లునట్లు, చేసి, నృపతి, చిక్కఁబడన్ = రాజు తమకు వశుఁ డగునట్లుగా, పనుల్ = తాము చేయవలసినరాజ కార్యములను, తెగి = తెటాలున చేయక, తామే, దిక్కుగన్ = శరణముగా, అల్లుకొని = అంతటం బ్రవేశించి, అశంకన్ = నిర్భయులై, నడతురు = వర్తింతురు.

దుష్టసచివులు తమయేలికమీఁదికి రాష్ట్రముబయటివైరిరాజులను నంపి, రాష్ట్రములోపల కొల్లగాండ్రను పెంచి, రాజును తమచేతులలో ఇఱుకుకొనునట్లు చేసి, అతనికి తాము తప్ప వేఱు రక్షకులు లేనియట్లుగా చేసికొని, భయములేక వ్యవహరింతురు. వారి నేమి చేయవలయునో ౨౩౦ యందు చెప్పినాఁడు.

"పగ. వై. వి. 1. విరోధము; విరోధి; 'క. ఘనకున్ । బగ యింద్రుఁడ కాఁడె యెల్ల ఫంగులఁ దలఁపన్.' నిర్వ. ౫. ఆ.'

క. ఇప్పింతు రాత్మవశులకుఁ । దప్పింతురు పరుల; కార్చి తప్పింతురు; రా
జిప్పగిది వాఁడె యని వే । చెప్పినఁ బెఱవారు నమ్మి చేరకయుండన్. 229

దుష్టసచివులు ఆత్మవశులకున్ = తమకు వశమయినవారికి, ఇప్పింతురు, - మఱియు నేమి సేయుదు రనఁగా, - ఆర్చి = ఆడించి = రాజుచేత మాటయిప్పించి, తప్పింతురు = రాజు దానిని నెఱవేర్పక యుండునట్లు చేయుదురు. వే = త్వరగా, నమ్మి;...

దుష్టసచివులు తమవారికి రాజుచేత ఇప్పింతురు. 'రాజు ఇట్టివాఁడు సుమా, కేవలము అయోగ్యుఁడు', అని తాము చెప్పినచో సాధువులు నమ్మి రాజుకడ చేరకయుండుటకై ఇంకను ఏమేమి చేయుదు రనఁగా—తమవారు కానియన్యులకు రాజుచేత మాటయిప్పింతురు, మాట యిప్పించి దానిని చెల్లింపనీయరు.'

'ఆర్చి' - 'ఆడ్డోడుకూడుల డకారంబునకుం జుక్క పరంబగునపుడు రేఫం బగు'—బా. వ్యా. క్రి. (81).

ఆ. వాఁడిఁ బొదలు జఠరవైశ్వానరుఁడు గఫ। ప్రముఖదోషయుక్తి బలిమి చెడిన,
వెలి మహౌషధంబు బల మిచ్చుగతిఁ, బ్రతి। సేయ, వారిమదముఁ జెఱుచుఁ బరుఁడు.

వాఁడిన్ = తైక్ష్ణ్యముతో, పొదలు జఠరవైశ్వానరుఁడు = వర్ధిల్లుచున్న యుదరాగ్ని, కఫప్రముఖదోషయుక్తిన్ = శ్లేష్మము లోనగు దోషములయొక్క కూడికచేత, బలిమి చెడినన్ = మందము కాఁగా, వెలిమహౌషధంబు = బయటి గొప్పమందు (సొంటియేని), (జఠరాగ్నికి) బల మిచ్చు గతిన్, ప్రతిసేయన్ = బదులుగా మఱొకని సమర్థుని నియమించిన, పరుఁడు = ఆ యితరుఁడు, వారి మదమున్ = వారిపొగరును, చెఱుచున్ = అణఁచును.

చక్కఁగా దీపించుచుండిన జఠరాగ్ని కఫాదిదోషప్రకోపముచే మంద మయినప్పుడు బయటిమందు ఆదోషము నణఁచి ఆమాంద్యమును పోనడఁచి పెండియు జఠరాగ్నికి దీప్తి కలిగించునట్లుగా, ఱేఁడు తన కుపద్రవకారులైన దుష్టసచివులస్థానములో సమర్థు నొకని యోగ్యుని నియమించిన, ఆనవీనుఁడే వారి నణఁచి రాజును తొంటియట్లు దేజరిల్లం జేయును,—ఉపమాలంకారము. రాజు జఠరాగ్నివలె, దుస్సచివులు కఫాదిదోషములవలె, సమర్థుఁ డగు నవీనసచివుఁడు మందువలె - నని తెలివిడి. - 'అథ శుంఠీ మహౌషధమ్' అమ.

'పిచండకుక్షీ జఠరోదరతుందమ్', 'అగ్ని ర్వైశ్వానరో వహ్నిః' అమ. 'దోషః'—
'వాయుః పిత్తం కఫ శ్చేతి త్రయో దోషా స్సమాసతః;
వికృతా ఽవికృతా దేహం ఘ్నన్తి తే వర్తయన్తి చ
'రోగ స్తు దోషవైషమ్యం దోషసామ్య మరోగతా.'—వాగ్భటము

వాతపిత్తశ్లేష్మములకు దోషము లని పేరు; అవి సమముగా నుండిన రోగ ముండదు, వానిలో నేదేని మితిని మీఱిన, రోగము కలుగును. కఫప్రకోపముచే అగ్నిమాంద్యము కలుగును, - 'శ్లేష్మాగ్నిసదన ప్రసేకాలస్య గౌరవమ్.' 'వాగ్భటము - (వృద్ధి స్తు కురుతే అని అధ్యాహార్యము.)

వ. వారిమిగిలి ప్రతిసేయనె ట్లంటేని. 231

ఆదుష్టసచివుల నతిక్రమించి వేఱొకనిం దెచ్చి వారికి బ్రతిసేయుట యెట్లనఁగా.—

క. భండారముతో హయమద। శుండాలఘటాళి దనదు స్వామ్యై, పాగా
నుండిన, నాతడ పాయదె। పండితుఁడును విభుఁడు నైన జనపతికిని బయలై. 232

పండితుఁడును = ప్రజ్ఞావంతుఁడును, విభుఁడును = వీరుఁడును, జనపతికిన్ = అగు రాజునకు, భండారముతోన్ = బొక్కసముతో, హయమదశుండాలఘటాళి = గుఱ్ఱములయు మదపుటేనుఁగులయు సమూహముల వరుసలు, తనదు స్వామ్యై = తన ధనమై (తనస్వాధీనమై), పాగాన్ ఉండినన్ = తబేలాలో నుండినయెడల ['పాగా యనఁగా సర్వపంక్తి విరాజిల్లు' ఆం. భా. (౧౯౬)] ఆ తడ=దుష్ట సచివులవలని యా నిరోధము, బయలై=బట్టబయలుగా, పాయదె=పోదా.

ప్రజ్ఞావంతుఁడును పరాక్రమియు నైనరాజునకు తనబొక్కసమును తనగుఱ్ఱపుదాయల తబేలాలును, తనయేనుఁగుతండములయొక్క శాలలును తనకుస్వాధీనముగా నుండఁగా, ఆదుష్టసచివుల వలని నిరోధము మాయామైపోదా! అనఁగా రాజు చతురంగబలమును వశములో నుంచుకొన్నచో ఆదుష్ట సచివులను ఆబలముల చేత పట్టించి తెప్పించి, తగిన దండన సేయవచ్చును కదా! అనఁగా రాజు ఎప్పుడును దండమును తనవశములో నుంచుకొన్నచో దుష్టనిగ్రహసమర్థుఁడగును - అనుట.

క. కడుపున నొక్కకడి దఱిఁగినఁ । జెడఁ జూచుఁ, గాక పతికిఁ జెలియుం గలఁడే?
ఒడిదండ విడువఁ జెల్లునె? । నడప వలయు నేర్చినట్లు నమ్మికయుఁ గృపన్. 233

కడుపునన్ [పా. కడుపునకున్=భోజనమునకు,] ఒక - కడి=కబళము. ఒడిన్=ప్రక్క నుండి, దండన్=పట్టువడినవాని భుజమును...[ఒడిదండ - పా. ఇడ నని]. 'విడువఁ' - పా. విడువం.

అధికారులు తమజీవనమునకై ఱేనిం గొలుతురు, వారిరాబడిలో నేమాత్రము తగ్గించినను ఏలికను చెఱుప యత్నింతురేగాని, వాస్తవముగా అతనికి మిత్రులు గారు; వారిదౌష్ట్యము భరింపలేక వారి నణంచినను వారిని స్వతంత్రులుగా పోనీయఁగూడదు; పట్టికట్టిన దొంగను దండ విడిచిన, వాఁడు తప్పించుకొనిపోవును. అట్లు పోనీయక వానిదండను పట్టుకొనియే వానిని నేర్పుగా నడిపించుకొనిపోవునట్లు వారిని నడుపుచుండవలయును. వారిని మరల నమ్మికయే వ్యవహరించుచు నుండవలయును. జీవనభంగము చేయక ప్రియముతో కాపాడుచు నే యుండవలయును.

చ. ఒకటికి రోయకుంటఁ గను మున్నపియుం, ద్రుపదుండు మారణే
ష్టికిఁ బసిఁ జూపి వేఁడ, మునిసింహుఁ డొకండు తమన్న వేల్చుఁ? బం
డొకఁ డపవిత్రభూమిఁ గని యొల్లక యేఁ జనఁ దా గ్రహించె రో
యక నియెఁ. దాన నట్లెఱుఁగ నోఁ జనుసర్వముఁ గాన శక్యమే? 234

ఒకటికిన్ = ఒక యకార్యమునకు, రోయక ఉంటన్ = ఏవగింపక యుండుటను, కని = ఎఱింగి, ఉన్నపియున్ = కడమవర్తనములను గూడకనుము = ఊహించుకొనుము, (అది ఎట్లన-) ద్రుపదుండు,=ద్రుపదరాజు, మారణ ఇష్టికిన్=ఒకానొకనిచంపుటకైనయజ్ఞమునకై, పసిన్ = గోగణమును, చూపి=(ఇచ్చెదనని) చూపించి, వేఁడన్ = ప్రార్థింపఁగా, మునిసింహుఁడొకండు= ఒకానొకమునీంద్రుఁడు (ఉపయాజుఁడనుమునీంద్రుఁడు తాను ఆయజ్ఞమును చేయించుటకు ఒప్పుకొనక), అన్న = తనజ్యేష్ఠభ్రాత (యాజుఁడు), వేల్చున్ = ఆహోమము చేయును, (అది యెట్లనఁగా), పండొకఁడు = ఒకపండు, అపవిత్రభూమిన్ = అశుచియైన నేలయందు, కని, ఏన్ = నేను, ఒల్లక=దానిని గోరక (పుచ్చుకొనక), చనన్=పోఁగా, తాన్=మాయన్న, రోయక= ఏవగింపక, గ్రహించెన్, అని అనెన్ కానన్=అని చెప్పినాఁడు గావున, అట్లు=ఆప్రకారము ఒకటి చూచి కడమ యన్నియు, ఎఱుఁగ నోన్ = తెలిసికోవలయును, అంతియకాని, జను సర్వము = జరుగుచుండుసమస్తమును, కానన్ = చూచి యెఱుంగుట, శక్యమే = సాధ్యముగాదు.

ఈకథ భారతము, ఆదిపర్వము సప్తమాశ్వాసారంభమునం గలదు:—ద్రుపదరాజు ద్రోణాచార్యుం జంపఁగల కుమారుఁడు తనకు జనించునట్లు తనకై యొక క్రతువు చేయుమని, లక్ష గోవులను దక్షిణ ఇచ్చెద నని, యాజోపయాజు లనుముని భ్రాతలలో నుపయాజుని వేఁడఁగా, ఆతఁడు తాను ఆమారణక్రతువును చేయుటకు ఒప్పుకొనక, తనయన్న యాజుఁడు చేయు నని చెప్పెను. అనంతరము యాజుఁడు ద్రుపదప్రార్థితుఁడై ఆక్రతువుం గావించెను. దానిచే అగ్నికుండమునుండి ధృష్టద్యుమ్నుఁ డుద్భవించెను. అన్న చేయు నని తా నెఱింగినందులకు తార్కాణగా ఉపయాజుఁడు ద్రుపదునికి ఈకథను చెప్పెను.—ఒకటి చూచి కడను యెల్ల నూహించు కొనవలయు ననుట.—అర్థాంతరన్యాసము.

క. వీఁ డెడపునఁ గీ డెన్నిన । వాఁ డని, జయమైన, హింస వదలి కొనుము శ్రీ
పోఁడి; యహి యేమి గొఱు బ । ల్వాఁడి సెడిన, నట్టిదయకు వైరియు నమ్మున్. 235

ఎడరునన్ = ఇక్కట్టులో, కీడు ఎన్నినవాఁడు = చెట్ట చేయఁ దలపెట్టినవాఁడు....జయము ఐనన్ = నీవు ఆయిక్కట్టు తీఱి గెలుపు కలిగినంతట. హింస = (ఆకీడు దలఁచిన వానిని) చంపుట....శ్రీపోఁడి=సిరియొక్క సొంపును, కొనుము=హరింపుము. అహి=పాము....పల్వాఁడి= కోఱల తెక్కువ్వము...

నీయిక్కట్టులో నీకెవఁడు చెఱుపు సేయ నుద్యమించునో వానిని, నీవు ఆయిక్కట్టు తప్పి గెలుపు కలిగినయంతట, హింసింపకుము. మఱి వానిసిరిమాత్రము కైకొనుము, అంతట వాఁడు మద మణఁగి, కోఱలు వెఱికిన పామువలె మఱేమియు కీడు చేయలేక పడియుండును. అట్టి నీదయకు నీవైరియు నిన్ను నమ్మును, నీపక్షము వాఁడె యగును. – దృష్టాంతాలంకారము, దుష్టుని ధనమును హరించుటకును పాముకోఱలు పెఱుకుటకును బింబ ప్రతిబింబభావము.

'కృతి దృష్టాంతము బింబ। ప్రతిబింబతఁ గీర్తి నీదె; ప్రభ చంద్రునిదే.' అలం.

'ఎడరు నా సందు కట్టెసఁగుచుండు' ఆం. భా. ౨ (౩౨).

'పోఁడిమహి' అని పూర్వముద్రణము, సంధిప్రశస్తముగాదు; పోఁడి = పోఁడిమి – 'చచ్చి యుంబోఁడి దొఱఁగ కున్నవాఁడు' భార. స్త్రీ. ఆ. ౨.

తే. దేశవైశాల్య మర్థసిద్ధికిని మూల,। మిల యొకింతైన, గుంటకాల్వలు రచించి,
నయము పేదకు నరిఁ గోరునను నొసంగి,। ప్రబలఁ జేసిన నర్థధర్మములు పెరుఁగు. 236

దేశవైశాల్యము = రాష్ట్రపు విరివి, అర్థసిద్ధికిని మూలము = ధనప్రాప్తికి కారణము, ఇల ఒక ఇంత ఐనన్ = చిన్నభూప్రదేశములకు నయితము, గుంట కాల్వలు = చెఱువులను పంటకాలు వలను, రచించి = త్రవ్వించి, పేదకు, అరిన్ = ధనరూపమైన పన్నునందు, కోరునను = సస్య రూప మయిన పన్నునందును, నయమును ఒసంగి = సులువు అనుగ్రహించి, ప్రబలన్ = పేద పరిఢవిల్లునట్లు, చేసినన్, అర్థధర్మములు=అర్థము ధర్మము రెండును, పెరుఁగున్ = అతిశయించును.

దేశ మెంత విస్తీర్ణమయిన అంత ఆదాయ మెక్కువ. ఆయాదాయమునకుఁగాను ఎంతచిన్న భూభాగమందైనను జలాధారములు నిర్మించి పంటకాల్వలు త్రవ్వింపవలయును. పేదకు అరి గోరులు ఇతరులకన్న తక్కువగా నిర్ణయింపవలయును. అట్లు చేసి వానిని వర్ధిల్లఁజేసిన, వానివలన నిండుగానే అరిగోరులు వచ్చును. వానిని బాగుచేసినధర్మముకూడ జేనికి అబ్బును.

తే. ప్రజ నవసి చన్నఁ బిలువ, కప్పసులఁ గొలుచు।నమ్మ, యిండ్లింధనంబుల కాయె,ననెడి
కలనిన క్కైన యధికారిగల నృపతికి। నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. 237

ప్రజ = కాపులు, నవసి = నాదారుపడి, చన్నన్ = సేద్యము మానుకొని పోయిన తర్వాత, పిలువక=వారలను మరల రప్పింపక, ఆపసులన్=వారు వదలిపోయిన గోగణమును, కొలుచున్ = ధాన్యమును, అమ్మి, ఇండ్లు = వారిగృహములు, ఇంధనంబులకున్ = వంటచెఱకులకు, ఆయెన్ = పనికివచ్చెను. అనెడు – కలనినక్క = రణరంగజంబూకము...ఏడుదీవులున్ = సప్త ద్వీపములును (పృథివి అంతయు ననుట), కొన్నన్ = జయించినను, సమృద్ధి = సంపద, లేదు = ఉండదు.

నష్టపడి సేద్యములు మాని పసులను ఇండ్లను ధాన్యమును వదలుకొని పోవుజనులను అధి కారులు ఉపేక్షింపఁ గూడదు. వారిని రప్పించి సాయపడి సేద్యమునకు సులువు లొసఁగి, కోల్కొనం జేయవలయును. అంతియకాని వారిని రప్పించి ఆదుకొనక పసులను ధాన్యములను అమ్మి వారియిండ్లు కలప వంటచెఱకుగా నుపయోగింపవచ్చునని సంతసించునధికారిని కలనినక్క

యనుట - అట్టి యధికారులున్న ప్రజలు త్వరలో చెడిపోవుదురు, రాజునకు ఆయతియు త్వరలో నే సున్నయగును. అట్టివారిచేతిలో ఏడు దీవులను జయించియిడినను ఊనికి సంపద కలుగదు. ఒకపాటి రాష్ట్రమువలన కలుగదని చెప్పవలయునా?..అధికారిని కలనినక్క యనుట లోకోక్త్యలంకారము.

మ. స్ర. ఉరవౌ చాగంబు భోగం బుభయము నొకపా లుగ్రసేనావనార్థం
బిరువా ల్నిండారుబండారిలు చొర నొకపా లిట్లుగా నాయ మొప్పం,
జరదృష్టి న్వైరిపక్షేక్షణము సచివషట్స్వపక్షేక్షణంబుం [238
ధరణీనాథుం డొనర్పం దగుఁ, దగుఁ దునుమం దస్కరాళి న్నిజోర్విన్.

ధరణీనాథుండు = రాజు, ఆయము = తనయాదాయము, ఉరవు=గొప్పది, ఔచాగంబు= అగునట్టిత్యాగము, భోగంబు = స్వానుభవము, ఉభయమునకున్ = అను నీ రెండింటికిని, ఒక పాలు = నాలవభాగము, ఉగ్రసేనా అవన అర్థంబు = తీక్ష్ణమైనదండుయొక్క రక్షణకొఱకు, ఇరువాల్ = రెండుపాళ్లు, (అనఁగా ఆయతిలోసగము), నిండారు బండారు ఇలు=నిండియుండు భాండాగారము, చొరన్ = ప్రవేశించుటకు, ఒకపాలు = నాలవపాలు, ఇట్లుగాన్, ఒప్పన్= వినియుక్తము కాఁగా, చరదృష్టిన్=చారు లనెడి చూడ్కిచేత, వైరి పక్ష ఈక్షణము=శత్రువుల యందు అనురక్తులగువారిని చూచుటయు, సచివ షట్ స్వ పక్ష ఈక్షణంబున్ = మంత్రులు ఆఱవ యంగముగాఁ గల తనపక్షమువారిని (అమాత్యాది షడంగములను - పా. 'సచివముఖ్య') చూచుటయు, ఒనర్పం దగున్ = చేయవలయును, నిజ ఉర్విన్ = తన భూమియం దుండునట్టి, తస్కర ఆళిన్ = దొంగలసమూహములను, తునుమం దగున్ = సంహరింపవలయును.

రాజు తనయాదాయమును సమముగా నాలుగుపాళ్లు చేసి, అందు సమృద్ధమైన త్యాగమున కును స్వానుభవమునకును ఒకపాలును, జైత్రములగు చతురంగబలముల భరణార్థము రెండు పాళ్లును, సకల ధనసమృద్ధమయిన బొక్కసము నిండించుటకు ఒకపాలునుం గా, వినియోగము సేయవలయును; చారులమూలముగా, వైరిపక్షమువారియొక్కయు, తనమంత్రులు మొదలయిన వారియొక్కయు, రహోవృత్తమును పరికించుచుండవలయును. తనరాష్ట్రములోని దొంగలను తును మాడవలయును. 'చాగంబు'— త్యాగశబ్దమునకు వై. 'త్యాగో విహాపితం దాన ముత్సర్జన విసర్జనే' అమ. 'ఇరువాల్' - ద్విగువు. _ 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు, మిశ్రం బునకుఁ గాదు' బా.వ్యా. స. ౧౫. 'బండారు' - బండారము - 'భణ్డారశబ్దవైకృతి' మని సీతా రామాచార్యులవారు; కాని భణ్డార శబ్దము సంస్కృతములో నెచటం గానిపింపదు; భాణ్డార శబ్దము ఆప్తిలోఁ గలదు కావున బండారము భాండారశబ్దమునకు వైకృతము గానోపు.| తెనుఁగున సిద్ధసమాసములయందు కొన్నిచోట్ల 'భండార'యని యున్నది. కాని అప్రయోగములు విచార ణీయములు. 'చాతుర్యములు లేవే శారదాభండార చోరకార శ్రీకిఁ జోరవుగాక' - నరస రాజీయము. ఇట్టి ప్రయోగముల నే సీతారామాచార్యులవారు లక్ష్యములుగాఁగొన్నారు గావలయు. ఇట 'శారదా భాండార' అనియు పఠంప వలను కలదు. స. శ. సం. లో 'భాణ్డారిన్' శబ్దము కలదు; దానికి 'భాణ్డ మిచ్ఛతి' అని వ్యుత్పత్తి దత్తము.-'ఆయము' - 'అర్థాగమో భవే దాయః'- అపస్పశ శ్చరః స్పశః । చార శ్చ గూఢ పురుషః' _ అమ.

ఇప్పద్యమున తృతీయపాదమున పూర్వపాఠమున యతిదుష్టము.

క. లాలన నారక్షులగమి నేలి, తెలిసి మ్రుచ్చు, నాజ్ఞ యిడ కతఁడు చెఱం
బో, లాఁతి నిడ, నయశ మెంతే లేవదె శూలపృథువణిఙ్న్యాయమునన్.

లాలనన్ = బుజ్జవముతో (బహుమతులతో), ఆరక్షులగమిన్ = తలవరుల సమూహమును, ఏలి = ప్రోచి, (వారివలన), మ్రుచ్చున్ తెలిసి = దొంగను తెలిసికొని, ఆజ్ఞ యిడక = దండన చేయక ఆసడ్డచేసినయెడల, అతఁడు = ఆ దొంగ, చెఱన్ = కారాగృహమునుండి (పా. సెలన్ = శూలమునుండి), తప్పించుకొని, పోన్ = పోయినయెడల, లాఁతిన్ = అన్యుని, ఇడన్ =(వానికి బదులుగా ఆరెకులు) చెరలో నుంచినచో, శూలపృథువణిఙ్ న్యాయమునన్ = కొఱుత స్థూలకాయుఁడైన వణిజుని వైచిన విధమునంబోలె, ఎంతేని = మిక్కిలి యధికముగా, అయశము = అపకీర్తి, లేవదె = అల్లుకొనదా.

ఆరెకులను బహుమతులతో బుజ్జగించి వారివలన దొంగను తెలిసికొని వెంటనే వానిని దండింప వలయును. అట్లు చేయక వానిని తెలిసినవెంటనే చెఱయందుమాత్ర ముంచి, దండన విధించుటలో ఆలస్యము చేసినచో, వాఁడు ఈలోపల కొఱుతప్పించుకొని పాఱిపోవును. పోనిచ్చిన యజాగ్రత్తకై తమ్ము రాజు దండించునని వెఱచి ఆతలవరులు మఱి యెవనినైనం దెచ్చి చెఱ నుంతురు. ఆమార్పు తెలియక రాజు దండన విధించిన, ఆదండనకు ఆబదులువానిని పాత్రను సేయుదురు. ఇట్లు జరిగిన కొఱుతను వైవఁబడిన లావుపాటిసెట్టి న్యాయంబునంబలె రాజునకు అమితమయిన యపకీర్తి కలుగును. కావున దొంగ దొరకినవెంటనే వానిని దండింపవలయును.— ఉపమాలంకారము.

పంచమహాపాతక పట్టణంబులో, అవకతవక ప్రభువుకడ, నొకఁడు తాను ఇల్లుకట్టుకొనుటకు మట్టిగోడ పెట్టుకొనఁగా, వర్షము గురిసి గోడ కూలిపోయిన దనియు, అపరాధిని దండింప వలయుననియు, మొఱయిడెను. ఈ తప్పు ఎవరి దని రాజడుగఁగా, మేఘుని దని అవివేకపుఁ బ్రధానము చెప్పెను. మేఘుని కొఱుత వేయుఁ డని రాజు తలారులకు ఆజ్ఞాపించెను. 'పొగవలన మేఘుఁ డయినాఁడు, పొగది తప్పుగాని మేఘునిది గాదు,' అని ఆరెకులు చెప్పిరి. 'పొగను కొఱుత వేయుఁ డని రాజు ఆజ్ఞాపించెను.' 'పొగకు కారణము కుమ్మరయావము' అని యొకసభ్యుఁడు చెప్పెను. 'ఆవమును వేయుఁడు' అని రాజు ముదల యిడెను. 'ఆవము లేదు, దానిని బెట్టిన కుమ్మరి యున్నాఁడు' అని మఱియొక సభ్యుఁడు చెప్పెను. అంత కుమ్మరి కాజ్ఞ అయినది. కుమ్మరి— 'అయ్యా! వారియింటి పెండ్లి, నేను అరివేణికుండలకై ఆవ మిడితిని, మీరు పెండ్లికుమారుని వైవ వలయును గాని, నన్ను వైచెద రేమి?' అని యారెకులతో వాదించెను. వారీమాట రాజుతోఁ జెప్పఁగా రాజు పెండ్లికుమారుని కాజ్ఞయిడెను. పెండ్లికుమారుని పీఁటమీఁదినుండి కొర్తికిం గొని పోయిరి. అతఁడు కొర్తిం జూచి—'అయ్యా, కొఱ్ఱు లావుగా నున్నది, నేను సన్నపాటివాఁడను, నన్ను వైచెద రేమి?' అని వాదించెను. ఆవాదమును ఆరెకులు రాజుతో చెప్పఁగా, రాజు ఆలోచించి, 'అవును, ఆకొర్తికి తగిన లావుపాటి వానినే వైవవలసినది, ముమ్మాటికి ఇదే సెలవు. మఱి రాకుఁడు.' అని ముగించెను. అంతట ఆరెకులు లావుపాటివానిని సెట్టి నొకనిని కొర్తికడకుం గొనిపోయిరి. అతఁడు ధన మిచ్చెద నన్నను 'మేము రాజాజ్ఞ మీఱుదుమా? లంచము గొందుమా? ధర్మస్థాపన జరుగవలదా?' అని వాదించి వానిని కొఱుతం దివిచిరి.— ఇదయ్యా శూలపృథువణిఙ్న్యాయము.

చ. ఎఱుఁగ నగున్ స్వశక్తి నవనీశుఁడు నాలుగుపాళ్ల మూఁడుపా,
ళ్లెఱుఁగక మోచినట్టిపని కిష్టసుహృత్తతి దెల్ప నొక్కపా,
లెఱుఁగ నగు న్నయాఢ్యమతి, నిట్లు నిరాగ్రహుఁడైనఁ జేయు నె
త్తఱి విపదుగ్రదండపరతంత్రుఁడు గాక చిరంబు రాజ్యమున్. 240

అవనీశుఁడు = రాజు. నయాఢ్యమతిన్ = నీతిచేత ధనవంతమైన (నీతినిపుణతకల) తెలివితో, నాలుగు పాళ్లన్ మూఁడుపాళ్లు = (తెలిసికోవలసిన) విషయములలో ముప్పాతిక పాలు, స్వశక్తిన్ = తనసొంతప్రజ్ఞచేత, ఎఱుఁగ నగున్ = తెలిసికోవలయును. ఎఱుఁగక మోచినట్టి పనికిన్ = తత్త్వము తెలియక సంభవించిన పనిం గూర్చిన, ఒక్కపాలు = అశేషించిన నాలవ భాగమును, ఇష్ట సుహృత్ తతి తెల్పన్ = ఆప్త మిత్ర బృందము తెలుపఁగా, ఎఱుఁగ నగున్ = ఇట్లు = ఈవిధముగా తెలిసికొనుచు, ఎత్తఱిన్ = ఏసమయమందును, నిరాగ్రహుఁడు ఐనన్ = స్వాభిమానములేనివాఁడాయెనా, విపత్ ఉగ్రదండ పరతంత్రుఁడు = ఆపదలకును క్రూరదండనకును అధీనుఁడు, కాక, చిరంబు రాజ్యముం జేయును.

రాజెప్పుడును నీతిమార్గమును వదలఁగూడదు. ఎఱుఁగవలసిన విషయములలో ముప్పాతిక పాలు తానే స్వయముగా ఎఱుఁగవలసినది, అప్పటికని తెలియక సంభవించిన విషయములం గూర్చి అశేషించిన నాలవపాలు ఆప్తమిత్రబృందమువలనం దెలిసికొనవలయును. ఇట్లు చేయుచు తన మాతమే జరుగవలయు ననునభిమానము ఎప్పుడును వహింపక, తనకు ఆపద అయినచో పరాధీనుఁడునుం గాక, దండన చేయుటయందు ఉగ్రత వహింపకయు నుండెనేని చిరకాలము సుఖముగా రాజ్య మేలును.

తే. కన్నొకటి నిద్రపోఁ బెఱకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబుమీఁది
యచ్ఛభల్లంబుగతి భోగ మనుభవించు
నెడను బహిరంతరరులపై దృష్టివలయు. 241

(రాజునకు), భోగము అనుభవించు నెడను = (రాజ) భోగములను అనుభవించుచు ఉండు నప్పుడే, కన్ను ఒకటి నిద్రపోన్, పెఱకంటన్ = రెండవకంటితో, జాగరంబు = మేలుకొని, గావించు - భూరుహ అగ్రంబుమీఁది అచ్ఛభల్లంబు గతిన్ = చెట్టుకొనమీఁది యెలుఁగు బంటి విధమున, బహిః అంతః అరులపైన్ = బయటి (తనదేశమునకు వెలుపలి) శత్రువుల మీఁదను (తన దేశము) లోపలి శత్రువులమీఁదను, దృష్టి వలయున్.

ఏవిధముగా యెలుఁగుబంటి చెట్టుకొనను పరుండి ఒకకన్ను మూసి నిద్రించుచునే ఒక కన్ను తెఱచి మేల్కొనియుండునో, ఆవిధముగా రాజు రాజభోగముల ననుభవించుచునే వెలి శత్రువులమీఁదను లోపలిశత్రువులమీఁదను దృష్టి యుంపవలయును. రాజు భోగములను అనుభవించుచు ప్రమత్తుఁడై యుండునేని అంతశ్శత్రువులును బహిశ్శత్రువులును అతనిం జైకొందురు, ఆవిషయమున రాజు జాగరూకత కలవాఁడై వాని నెల్ల నెఱుంగుచు తప్పించుకొనుచు నుండవలయును.- భోగము లనుభవించుట ఒకకంట నిద్రపోవుటవలె, అంతర్బహిశ్శత్రువులను కనుపెట్టియే యుంట ఒకకంట జాగరము సేయుటవలె, రాజు భల్లూకమువలె నని యుపమ.

'అథ భల్లూకే ఋక్షాచ్ఛభల్ల భాలూకాః' అమ.

ఉ. అక్షరపక్షపాతమున నర్థము నూళ్లు నొసంగ, నుబ్బునన్
భిక్షుజటాధరాదికులు భిన్ననిజవ్రతు లౌదు; రైన దు
ర్భిక్షరుజా శిశుచ్యుతులు పెక్కగు; భక్తియ చాలు, దానఁ ద
త్ప్రక్షుభితత్వ మేయఘముఁ దార్పదు, శంకఁ దలంగు మయ్యెడన్. 242

అక్షరపక్షపాతమునన్ = విద్యయందలి ప్రీతిచేత, అర్థమున్ = ధనమును, ఊళ్లన్ = గ్రామములను, ఒసంగన్ = ఇచ్చినయెడల, ఉబ్బునన్ = గర్వించి, భిక్షు జటాధర ఆదికులు = సన్న్యాసులు జడదారులు లోనగువారు, భిన్న నిజవ్రతుల్ = చెడిన తమ నియమము కలవారు, ఔదురు, ఐనన్ = వా రట్లగుటచేత, (దేశములో), దుర్భిక్ష రుజా శిశుచ్యుతులు = కఱవులు రోగములు బాలమరణములు, పెక్కు అగున్ = పెల్లుగా సంభవించును, (కావున, వారియందు), భక్తియ = పూజ్యభావమే, చాలున్, (అంతియకాని వారికి అర్థములు గ్రామములును ఈనక్కఱ లేదు), దానన్ = వాని నీయమిచేత, తత్ ప్రక్షుభితత్వము = (కలుగునట్టి దైన) వారియాయాస పడుట, (రాజునకు), ఏయఘమున్ = ఏ పాపమును గాని, తార్పదు = కలిగింపదు, అయ్యెడన్ = ఆవిషయమున, శంక = భయము (లేక సంశయము), తలంగుము = వదలుము.

సన్న్యాసులు జడదారులు లోనగు నేకాంగులకు వారి విద్యకు మెచ్చి ధనములు గ్రామములు ఈకుము. ఇచ్చితివేని వారు గర్వించి బ్రహ్మచర్యప్రభృతు లగునిజనియమములం బాయుదురు. పాసిన నేమి? యనిన - దేశమందు కఱవులు రోగములు శిశుమరణములు, ఇట్టి కీడులు సంభవించును; కావున, అట్టివారిని ధనాదు లీయక యే పూజించుటయే చాలును. వారు తృష్ణాపరులై నీవేమియు గొప్పగా ఈలే దని నీమీఁద క్షోభపడుదురేని ఆక్షోభ నిన్నేమియుం జేయదు. ఆ విషయమందు సందేహము లేదు.

'అక్షర' - లక్షణచేత విద్య యర్థము. 'భిక్షు' - 'భిక్షుః పరివ్రాట్ కర్మన్దీ పారాశ ర్యపి మస్కరీ' అమ. 'కృషి తో నాస్తి దుర్భిక్షమ్' అని సూక్తి - 'స్త్రీరుగ్రుజా చోపతాప రోగవ్యాధి గదామయాః' అమ. 'భక్తి' - 'పూజ్యేష్వనురాగో భక్తిః'. 'ప్రక్షుభితత్వము' - 'క్షుభ సంచలనే' ధా. పా.- ఈపద్యమున నాలవపాదమున 'దానఁ ద । తక్షుభితత్వ' అనుపూర్వపాఠమున క్షత్ర ప్రాసమై ప్రాసభంగ మైనది. కావున, మార్పు చేయఁబడినది. 'చాలుఁ దత్ప్రభూ। తక్షుభితత్వ' అనియేని పఠించికొన వచ్చును; - తత్ = వారి యొక్క - ప్రభూత = ఎక్కుడైన,... అని యర్థము.

క. మును వారత్రయవిజ్ఞా । పన కోర్వుము వధ్యకోటిపట్టునఁ జెదరం
దన కప్పుడె కీడగు నను । జనముం బట్టుటకుమునుపె శస్త్రముచాలున్. 243

మును = ముందుగా, వధ్యకోటి పట్టునన్ = వధార్హు లయిన యపరాధుల సమూహముల విషయమున, వారత్రయ విజ్ఞాపనకున్ = ముమ్మాఱు మన్నింపు వేఁడుటకు, ఓర్వుము = క్షమింపుము, చెదరన్ = తప్పించుకొని పోయెనా, తనకున్ = నీకు,... మునుప = మును పే, శస్త్రము = ఆయుధమే....

వధదండన కర్హు లైనయపరాధులు మన్నింపు వేఁడుకొనుటకు మూఁడుమాఱులు అవకాశ మిమ్ము. ఏవధ్యుఁడు తప్పించుకొనిపోయినచో వానివలన వెంటనే అపాయము కలిగెడునో అట్టి వధ్యునికి అట్టిముమ్మాఱు సెలవు ఈ నక్కఱలేదు. వానిని పట్టియుం బట్టకమునుపే తల గొట్టింప వలసినది. 'నివహావసరౌ వారే' అమ.

'సో౽యం త్రిస్సప్తవారా నవికలవిహతక్షత్రతన్త్ర ప్రచారః' మ. వీ. చ.
'వారాం స్త్రీ నభిషుణ్వతే విదధతే వహ్న్యేః శరీరస్థితీః'. ఆ. రా.

క. శూరాలాపములకు నతి। శూరుఁడు దా నయ్యు నృపతి సోఁకోర్వఁ దగున్;
వా రుబ్బుదు రందున, నిజ। శూరత దొరలందుఁ గనుట సూ కార్యమిలన్. 244

నృపతి = రాజు, తాను, అతి శూరుఁ డయ్యున్, శూర ఆలాపములకున్ = వీరులయొక్క బంటుందనంపు గరువంపు మాటలకు, సోఁకు ఓర్వఁ దగున్ = విసుగు నోర్వవలయును, అందునన్ = అట్లు ఓర్చుటవలన, వారు = ఆశూరులు, ఉబ్బుదురు = ఉత్సాహము తగ్గకయుందురు, ఇలన్ = లోకములో, నిజశూరతన్ = తనవీరమును, దొరలందున్ = తన యధికారులయందు, కనుట సూ కార్యము = చూచుట సుమా పని.

రాజు తాను అతిశూరుఁ డయ్యును తనకొలువున నుండుదొరలు తమ వీరము పొగడుకొన్నచో వారియాపల్కులను విసువక వినవలయును. అట్లు విననియెడల వారి యుత్సాహము తగ్గిపోవును; విన్నచో వర్ధిల్లును. తన యధికారులు పరాక్రమము చూపుటయే, అనగా - తన పరాక్రమమువలన వారిని పరాక్రమింపం జేయుటయే - రాజు చేయవలసినపని.

'సోఁకోర్వ' - ఇది శ. ర. లో లేదు. - ఇందే రెండియు 285 వచనములో వచ్చును.

శా. రేవుల్ మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తాదియున్
రా, వాణిజ్యము పెంచి యేలఁగ నగు; వర్షంపుటేవన్ రుజన్
హోవళ్లన్ దిగు నన్యభూప్రజల రా జాయాయిజాత్యోచితిన్
బ్రోవంగాఁ దగుఁ; దోఁట దొడ్డి గను లాప్తుల్ చూడఁ బంపం దగున్. 245

మావు = గుఱ్ఱములును, మతంగజంబును = ఏనుఁగులును, మణి శ్రీఖండ ముక్తా ఆదియున్ = రత్నములు చందనదారుఖండములు ముత్తెములు లోనగునవియు, రాన్ = దిగుమతి యగునట్లుగా, వాణిజ్యము పెంచి = వార్తను వృద్ధిచేసి, రేవుల్ = రేవులను, రాజు, ఏలఁగన్ అగున్ = పరిపాలింపవలయును; వర్షంపు ఏవన్ = వర్షము లేమిచేతను, రుజన్ = రోగములచేతను, హోవళ్లన్ = ఉపద్రవములచేతను, దిగు నన్యభూప్రజలన్ = ఓడలమీఁద వచ్చి ఆ రేవులలో దిగునట్టి యితర దేశముల జనులను, ఆయాయిజాతి ఔచితిన్ = వచ్చినవారిజాతులకు తగినట్లుగా, ప్రోవంగాన్ తగున్ = ఏలవలయును, తోఁట = ఆరామములను, దొడ్డి = పసులపట్టులను, గనులు = ఆకరములను, ఆప్తుల్ = తన హితైషులు, చూడన్ = విచారించునట్లుగా, పంపందగున్ = పంచి ఒప్పగింపవలయును.

రాజు, తనదేశమునకు వెలిదేశములనుండి గుఱ్ఱములు, ఏనుఁగులు, రత్నచందన మౌక్తికాదులును వచ్చునట్లు వర్తకమును పెంచి, రేవులయందు దిగుమతికి సౌకర్యములు కలుగఁజేయవలయును. అనావృష్టివలనను, రోగములవలనను, ఉపద్రవములవలనను, బయటిదేశముల జనులు తనదేశమునకుం దిగివచ్చినచో, వారిని వారివారిజాతికి తగినట్లు ప్రోవవలయును. తన యారామములను, పసులమందలను, స్వర్ణరత్నాది ఖనులను, ఆప్తులు విచారించునట్లుగా పంచి వారిస్వాధీనము చేయవలయును. మావు, మతంగజంబు, రుజ—ఇవి జాత్యేకవచనములు. 'హోవడి యావడి। యన నుపద్రవసంజ్ఞ యలరుచుండు' ఆం. భా. ౨ (౨౨౬).

ఆ. హదను వచ్చుదాఁక నపరాధిపై రోష। మాఁగి చెఱుపవలయు హదను వేచి,
లక్ష్యసిద్ధి దాఁక లావున శర మాఁగి। కాఁడ విడుచు నంపకాఁడువోలె. 246

హదను = సమయము, ఆఁగి = ఆఁపుకొని, లక్ష్యసిద్ధి = గుఱివశపడుట, లావునన్ = బలముచే, శరము = బాణమును. ఆఁగి = విడువక పట్టి. కాఁడ = బాణమును. అంపకాఁడు [పా. వింటివాఁడు] = విలుకాఁడు, - ఉపమ.

హదను వచ్చుట లక్ష్యసిద్ధి తాఁకుటవలె, అపరాధ లక్ష్యమువలె, రోషము బాణమువలె. చెఱుచుట బాణము విడుచుటవలె, రాజు విలుకానివలె, అని సాదృశ్య ప్రపంచము.

శా. పోవం బోలు లఘుప్రయాణతతి దినంబుల్ గొన్ని, యొండొంట నే
కావైరిక్షితి కంబువుల్వలెఁ దాఁగా నిల్చు జాలుంబలెం,
ద్రోవన్ సైన్యము గూడ వైరి బలసాంద్రుం డైనఁ బూజాదులం
బోనం బోలుఁ, జరోక్తిచేత నసదేని బో కావరింపం దగున్. 247

(జిగీషు వైనరాజు) వైరిక్షితికిన్ = శత్రునిభూమికి, కొన్నిదినంబుల్ అంబువుల్వలెఁ దాఁగా నిల్చుజాలుంబలెన్ = వెనుకనుండి వచ్చు వఱద తాఁకువఱకు నిలుచుచు, తాఁకినంతట పాఱుచునుండు ప్రవాహమువలె; సైన్యములు, ఒండొంట నేకాన్ = ఒకటొకటిగా నే అగునట్లు, త్రోవన్ గూడన్, లఘుప్రయాణతన్ = చిన్నమజిలీలుగా, పోవంబోలున్ = నడవవలయును, వైరి. బలసాంద్రుండు = దండుచే దట్టమయినవాఁడు (అనఁగా - గొప్పదండు గలవాఁడు), ఐనన్ = అగునేని, పూజా ఆదులన్ = ఆ వైరి కావించునట్టి సేవ లోనగువానిచేత నే, పోవంబోలున్ = తానును మరలి స్వదేశమునకుం బోవలయును; చర ఉక్తిచేతన్ అసదు ఏని = వేగుల పల్కుచేత వైరి అల్పుఁడని తెలిసెనా = కాక మరలి యరుగక, ఆవరింపం దగున్ = అతనిని ముట్టడింపవలయును.

రాజు అల్పుఁడయిన వైరి జేనిదేశము మీఁదికి తాను దండెత్తిపోవునప్పుడు కొన్నిదినములు చిన్నచిన్న పయనములు చేయుచు, వెనుకనుండి వఱదవచ్చుచున్నయేఱు ఆవఱద వచ్చి తాఁకువఱకు నిలుచుచు తాఁకినంతట ప్రవహించుచు నుండునట్లుగా, తనసైన్యములు ఒకటొకటిగావచ్చి దారిలోఁ గలియువఱకు ఆఁగుచు, కలసినంతట తరలుచు, పోవలయును. ఆవైరి బలవంతుఁడాయెనా, అతఁడు చేయు సత్కారమునకు సంతసించి తాను వెనుకకు మరల వలయును. చారులవలన అల్పుఁ డని తెలిసెనా, పోయి వానిని చుట్టవేసికొనవలయును.—ఉపమాలంకారము.

'అసదు' - 'అసత్' శబ్దవైకృతము.

చ. ద్రవిణము నొవ్వఁ గొంట, నొఱ ప్రాబలతో నిడుచుంట, భూమి గొం
తవలికి నిచ్చుచుంటఁ, బ్రథమాప్తతఁ జూడక శంక నుంట, లోఁ
బొసఁగు నృపాళికై యుభయము స్వకభూపలు గుట్టుఁ బంప, భూ
ధవుఁ డరియం చడం దగు భయం, బనయం దివి మాన్పుకోఁ దగున్. 248

ద్రవిణము = ధనమును, నొవ్వన్ = బాధపెట్టి, కొంటన్ = గ్రహించుటచేతను, ప్రాబలతోన్ = సేమలతో, ఒఱ నిడుటన్ = ఆలోచనచేయుచుండుటచేతను, భూమి కొంత అవలికిన్ ఇచ్చుచుంటన్ = కొంతకొంతగా తనదేశభాగములను ఇతరరాజులకు ఇచ్చుచుండుటచేతను, ప్రథమ ఆప్తతన్ = మొదటి హితైషిత్వమును, చూడక = ఎన్నక, శంకన్ ఉంటన్ = శంకించు

చుండుట చేతను, లోన్ = మనస్సులలో, పావయు నృపాళికై = రాజుచున్న సామంతరాజులకు, అభయమున్ = అభయదానమును, మణిభూషలున్ = రత్నాభరణములును, గుప్తిన్ = రహస్యముగా, పంపి, భూధవుఁడు = రాజు, అరియందున్ = శత్రువునందు, భిదన్ = భేదమును, ఇడన్ తగున్ = కల్పింపవలయును, తనయందున్, అవి = పూర్వోక్తదోషములను నాల్గింటిని, మాన్పుకోఁ దగున్ = తొలగించుకొనవలయును.

వైరినృపుఁడు—బాధించి ధనము కైకొనుట, నీచులతో ఆలోచనచేయుట, తన దేశములో భాగములను తనమీఁక దండెత్తి వచ్చినవారికి ఇచ్చి సమాధానపఱుచుకొనుచుండుట, పూర్వము తనకు హితము కావించినవారిని అహితమును మఱచి తనకు అహితు లని శంకించుచుండుట, - ఈ దోషములు కలవాఁ డగుటచేత, అట్టి యావైరినృపునిమీఁద అతని సామంతరాజులు లోలోపల రాజుచు నుండఁగా, వారికి జిగీషు వయినరాజు రహస్యముగా అభయోక్తిపూర్వకముగా రత్నాభరణములు పంపి వారిని ఆవైరినుండి చీలఁదీయ వలయును; తనయందు అట్టి దోషములు లేకుండఁ జూచుకోవలయును.

క. అహితుఁడు వేఁడిన, నేలెడు । మహి సగమే నిచ్చి, తెగనిమైత్త్రి గొని, విభుం
డహిభయము మాన్పికోఁ దగు; । నహిభయ మహిభయముకంటె నధికము గాదే.

మహి = భూమి; తెగని = దృఢమైన; కొని = సంపాదించికొని; అహిభయమున్ = తన పక్షమువారివలని భయమును; అహిభయముకంటెన్ = పామువలనిభయముకంటె.

రాజునకు బయటిశత్త్రుఁడు చేయఁగల చేటుకన్న తనపక్షమువారే పగఁబూనినని, వారు చేయఁగలచేటు అధికము; అది పామువలని భయముకన్నను చెడుది. కావున బయటివైరి కోరినేని రాజు తా నేలు భూమిలో సగ మిచ్చియైనను అతనితో దృఢసఖ్యము చేసికొని, ఆబయటిభయమును మాన్పుకొని, స్వపక్షమువలని భయమును ఉన్మూలించుకొనవలయును.

'అహి ర్వృత్రాసురేసర్పే' - విశ్వ.,
'రాజ్ఞా మహీభయం ప్రోక్తం స్వపక్షప్రభవం భయమ్' - అమ.
'దృష్ట స్సాక్షా దసురవిజయీ నాకినాం చక్రవర్తీ,
మాతో న్యాయః కథయతి యథా వాయుశీ దణ్డనీతిః;
పాతాళే ద్రాగహిభయ మథా స్త్వేవ నిత్యానుషక్తం,
తస్మాః పుణ్యై రజని భవతా వీర రాజన్వతీ భూః' ఆ. రా.

చ. పలుకులు వేయు నేమిటికిఁ? బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా
తలమున గుట్టుకీడు బహుధా యరయించి యడంచి, చంచలా
క్షులగమిలో మెలంగు పురుషుండును బోలె నశంక నించుచున్
మెలఁగఁడ యేని, రాజ్యఫలమే యది? రాజ్యము దుఃఖలబ్ధికే? 250

పలుకులు వేయు నేమిటికిన్ = వేయిమాట లేల, పార్థివుఁడు = రాజు, ఆత్మభుజాభృతక్షమాతలమునన్ = తాను ఏలుచుండెడు భూమి మీఁద, గుట్టుకీడు = గూఢశత్త్రువులను, బహుధా = పలు దెఱంగుల, అరయించి = వెదకించి తెలిసికొని, అడంచి = కడపి, చంచలాక్షుల గమిలో మెలంగు పురుషుండును బోలెన్ = క్రొల్గంటులబృందములో చరించుచుండు వానివలె, అశంకన్ = నిర్భయమును,

నించుచుఁ = మనంబున వహించి, మెలఁగఁడయేని = వర్తింపఁడేని, అది = అట్టిసభయవర్తనము, రాజ్యఫలమే = దొరతనపుంబ్రయోజనమా, రాజ్యము, దుఃఖలబ్ధికే = దుఃఖప్రాప్తి కొఱకా?

వేయిమాటలేల? రాజు ఎన్నియుపాయములనేని తనరాజ్యములోని కంటకులను వెదకి కనుంగొని అణఁచి సుందరీబృందంబు నడుమనుంబోలె నిర్భయముగా మెలంగుచుండవలయును. అట్లుచేయఁడేని తనకు దొరతనమువలన సుఖములేమియేగాక దుఃఖమే కలుగును.—ఉపమ.

'గుట్టుకీడు'—ఇది బ్రౌనుదొరగారి పాఠము; పా. 'కుట్టుపేడు.' ఆంధ్రభాషార్ణవమున ముద్రితపుస్తకములో కంటకులకు 'కుట్టుతేళ్లు' అని పేరు కలదు.—"కుట్టుతేళ్లనఁ గంటకక్షుద్రులగుదురు." ఈతేళ్లు పేళ్లనుటకు వచ్చినదేమో విచారణీయము.—ఒండె - నేలలో గూఢమై యుండి గ్రుచ్చుకొనెడుపేడు - గ్రుచ్చుకొనెడి నని ముందుగా తెలియనట్టిది.—అట్టివాఁడు గాన కంటకుఁడును కుట్టుపేడు.

తే. బెదరి చేరని బలియుని బిగియఁ బట్ట
కతనిమైవడినే వచ్చి హత్తఁ జేతఁ
క్రమము, పెనఁగెడు బలుమీను త్రాటఁ జేఁదు
నొడ్డుగాలంపువేఁటకాఁ డుపమ గాఁడె? 251

బలియునిఁ = బలవంతుని, ఆలిగియుఁ, అతని మైవడిఁ ఏ = ఆ బలియుని సమ్మతిచేతనే, హత్తఁ = చేరునట్లు, చేఁత = చేయుట, క్రమము = నీతి, పెనఁగెడు బలుమీనుఁ = వెనుకకు లాగుచున్న బలిష్ఠమైన మత్స్యమును, త్రాటఁ = గాలపుఁద్రాటితో, చేఁదు...డు - చేఁదు = లాగికొనెడు, ఒడ్డు = నిడుదయైన - గాలంపు = గాలముగల - వేఁటకాఁడు = చేఁపవేఁటకాఁడు, ఉపమ = సాటి.

ఏప్రకారము గాలంపుఁజేఁపవేఁటకాఁడు బలిష్ఠమైనచేఁప గాలానఁ బడి వెనుకకు లాగికొనుచుండెనా, దానిని అట్లే వెనుకకుం బోనిచ్చి, అది కదుల్కొని మరల ముందునకు వచ్చినప్పుడు లాగి, గట్టున వైచికొని, గ్రహించునో, ఆప్రకారముగా, బలవంతుఁ డొకఁడు తనతోఁ జేరక బెదరి కేడించుచుండెనేని, వాని నప్పుడట్లే ఉండనిచ్చి, పిమ్మట వాఁడే వచ్చునట్లుగాఁ జేసి, అట్లు వాఁడు వచ్చినంతట చేర్చుకొనుట నీతి.—ఉపమ.

సీ. (1). దండపారుష్యంబు, కొండెంబున నతర్క,
మరిసంధి కెడయాక మరలఁబడుట,
(2). యవలిత ప్పెన్ని కన్న విదేశ్యుఁ జెలుచుట,
ప్రతిప్రవస్తకున కే ర్పడఁగఁ జేఁత,
(3). జనునవిశ్వాసంబు గనుఁగొని మెలఁగుట,
విశ్వసనీయుని వేర్పఱుచుట,
(4). మోమోట మంత్రంబుచో మిక్కిలిడుకొంట,
మంత్రభేత్తకు నాజ్ఞ మఱచియుంట,
తే. (5). వింత పుట్టినఁ గనుగట్టి చింతసేయ
కుంట, మానుష్యలపట్టున నొక్క చూపె
చూడకుంట, విహీనులఁ గూడుకొంట,
వ్యసనినగ్గౌ యుంట, చలముంట, వలదు పతికి. 252

(1). రాజు ఈవక్ష్యమాణ దోషములను చేరనీయఁ గూడదు:—దండపారుష్యంబు=దండనయందు క్రౌర్యము (అనఁగా క్రూరత వహించి తప్పిదమునకు మించిన దండన విధించుట), కొండెంబునన్ అతర్క్యము = కొండెగాండ్రు కొండెము చెప్పినప్పుడు ('వీరిమాటలు సత్యమా? వీరు గిట్టక చెప్పినారా?' అని) ఆరసికొనమి, అరిసంధకున్ =శత్రువుయొక్క సమాధానపడుటకు (అనఁగా శత్రువు సంధ కోరినప్పుడు), ఎడయీక మరలఁబడుట = అందులకు అవకాశ మొసఁగక వికటించుట.

(2). అవలితప్ప = తనకు దేశాంతరరాజు చేసిన చెఱుపును, ఎన్ని కన్న విదేశ్యున్ = పరికించి చూచి వచ్చి తనకుం జెప్పిన పరదేశపుజనుని, చెఱుచుట=అపకరించుట - వానిని వానిదేశపు రాజునకు పట్టియిచ్చుట లోనగు విధమున వానికి చెట్టచేయుట, ప్రతిప్రవర్తకునకున్ = తనకు విఘటించిన మంత్రికి, ఏర్పడఁగన్ = తెలియునట్లుగా, చేఁత = తాను పనులుచేయుట.

(3). జనునవిశ్వాసంబు = జనునియొక్క నమ్మకములేమిని (తనయందు విరక్తుఁడుద్వేషి అని), కనుఁగొని = ఎఱింగియు, మెలఁగుట = వానితోఁ గలసి వ్యవహరించుచుంట, విశ్వసనీయునిన్ = నమ్మఁదగినవానిని, వేఱుపఱుచుట = దూరముసేయుట.

(4). మంత్రంబుచోన్ =మంత్రాలోచనయెడల, మిక్కిలి=ఎక్కువగా, మోమోట ఇడుకొంట=దాక్షిణ్యము వహించుట (అనఁగా మంత్రులు చెప్పిన మాటను వారిమనస్సు నొచ్చునను భయముచే చక్కఁగా చర్చింపకయే అంగీకరించుట), మంత్రభేత్తకున్ = మంత్రాలోచనను వెలిఁబుచ్చిన వానికి, ఆజ్ఞ మఱచియుంట = దండనచేయక యుపేక్షించుట.

(5). వింత = ఉత్పాతము, పుట్టినన్ = కల్గెనేని, కనుగల్గి = దానిని చక్కఁగా పరికించి - చింత సేయకుంట=అందులకు శాంతి చేయింపం గడంగమి [అనఁగా...పరికింపమియు...కడంగమియు], మాన్యులపట్టునన్ = పూజ్యులవిషయమున, ఒక్కచూపె చూడకుంట = ఒక్కవీక్షణమయినను చాఁగింపకుండుట (పూజ్యుల నెప్పుడును పూజింపకుండుట), విహీనులన్=నీచులతో, కూడుకొంట = చేరుట (నీచులను సాహసగాండ్రనుగా చేర్చుకొనుట), వ్యసనియై యుంట = పానాదిసప్తవ్యసనములలో పడియుండుట, చలము ఉంట = మాత్సర్యము వహించియుండుట, పతికిన్ = ఱేనికి, వలదు = పనికి రాదు.

ఇందు ఒక్కొక్కటియును కూడదు అనునభిప్రాయమున 'వలదు' అని యేకవచనప్రయోగము. పైఁజెప్పిన దోషము లున్నయెడల రాజ్యము దక్క దని భా. 'ప్రతి' - ఇదియట 'సదా' ఇత్యాదులవలె తెలుఁగుపదముగా ప్రయుక్తము. 'ప్రతిప్రవర్తకునకు' - ఇదిసాధ్యసమాసము గావున 'తిప్ర' అనుచో, 'తి' గురువుగాదు. 'వ్యసనములు' - పాన స్త్రీ మృగయా ద్యూత వాక్పారుష్య దండపారుష్యార్థ దూషణములు.

క. త్రివిధోత్పాతము లొదవిన, । నవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖ సురముఖ। పవనసఖముఖముల భుక్తి బలిహోమవిధిన్. 253

త్రివిధ ఉత్పాతములు = దివ్యములు ఆంతరిక్షములు భౌమము లనెడు మూఁడువిధముల వింతలు, ఒదవినన్ = పుట్టెనేని, అవనివిభుఁడు = భూపతి, అధిక ద్రవ్యంబు = ఎక్కువధనమును, అవ...లన్ - అవనీసురముఖ = బ్రాహ్మణ ముఖముగాను - సురముఖ = దేవతా ముఖముగాను - పవనసఖముఖ = అగ్నిముఖముగాను - భుక్తి = భోజనములు - బలి = పూజలు - హోమ=వేల్మలు - విధిన్ = వీనిచేఁతచేత, విడువవలయున్ = వ్యయము సేయవలయును.

త్రివిధోత్పాతములు కలిగినప్పుడు తచ్ఛాంతికై రాజు బ్రాహ్మణులకు భోజనములు, దేవతలకు పూజలు, అగ్నికి హోమములు, చేయించుటకుఁగాను బహు ద్రవ్యమును వినియోగింప వలయును.—యథాసంఖ్యాలంకారము. 'త్రివిధోత్పాతములు' – "ప్రకృతేరన్యత్వముత్పాతః" బృ. సం. "లోకస్వభావమునకు విపరీతమైనది ఉత్పాత మనంబడును". – తత్స్వరూప శాంత్యాది బృ. సం. లో నిట్లు చెప్పఁబడినది.—

"అపచారేణ నరాణా ముపసర్గః పాపసంచయా ద్భవతి,
సంసూచయన్తి దివ్యాన్తరిక్షభౌమా స్త ముత్పాతాః;
తత్ప్రతిఘాతాయ నృపః శాన్తిం రాష్ట్రే ప్రయుఞ్జీత.
దివ్యం గ్రహర్క్షవైకృత, ముల్కానిర్ఘాతపవనపరివేషాః
గన్ధర్వపుర పురన్దరచాపాది యదాన్తరిక్షం తత్,
భౌమం చర స్థిరభవం తచ్ఛాన్తిభి రాహతం శమ ముపైతి.
నాభస ముపైతి మృదుతాం, శామ్యతి నో దివ్య మి త్యేకే.
దివ్య మపి శమ ముపైతి ప్రభూతకనకాన్నగోమహీదానైః;
రుద్రాయతనే భూమౌ గోదోహాత్ కోటిహోమాచ్చ.
ఆత్మ సుత కోశ వాహన పుర దార పురోహితేషు లోకేషు
పాక ముపయాతి దైవం పరికల్పిత మష్టధా నృపతేః".

'దివ్యోత్పాతము' – అపూర్వములైన గ్రహనక్షత్రాదులు అగపడుట. – 'అంతరిక్షము' – ఉల్కానిర్ఘాతగంధర్వనగరాదులును, అకాలమున ఇంద్రాయుధ పరివేషాదులును. 'భౌమము' – అపూర్వములైన స్థలజల చరజంతూత్పత్త్యాది, చరస్థిరవైకృతము. —

'బలిఃపూజోపహారే చ కరే దైత్యాన్తరేఽపి చ' నానా.

'విధ ర్విధానే దైవేఽపి' అమ.

ఉ. స్పర్థ పరస్పరంబు దొరపట్టున యోధునిపట్టున న్నృపుల్
వర్ధన మొందఁ జేయఁదగు; వారిహితాహితచర్య లొంది వం
తర్థి; మిథోవ్యథావహ హిత ప్రథమానసమానతా ప్రథా
ధూర్ధరతాదులం దగిలి ద్రోహపుఁజింతఁ దలంప రేమియున్. 254

నృపుల్ = రాజులు, దొరపట్టునన్ = దొరలలోను, యోధునిపట్టునన్ = జోదులలోను, పరస్పరంబు = ఒకరిమీఁద నొకరికి (ఒకదొరమీఁద నింకొకదొరకును, ఒకజోదుమీఁద నింకొక జోదునకును), స్పర్థ = పోటిని, వర్ధనము ఒందన్ = పెరుఁగునట్లు, చేయఁదగున్ = చేయవలయును, (అట్లుచేయుట వలనిప్రయోజనము లేదన), వారి హిత అహిత చర్యలు = ఆదొరలయు ఆజోదులయు రాజానుకూలములు రాజప్రతికూలములును అగువ్యవహారములు, అంతర్ధిన్ ఒందవు = దాఁగవు, (మఱియు), (వారు), మిథో...లన్ = మిథః = పరస్పరము – వ్యథాఆవహ = వెతగూర్చునట్టి – హిత = రాజహితము చేయుటచేత – ప్రథమాన = ఖ్యాతిపొందుచున్న – సమానతా=రాజకృతసత్కారముతో కూడియుండుటయొక్క – ప్రథా=కీర్తియు – ధూర్ధరతా=ధురంధరత్వము – ఆదులన్ = లోనగు వ్యాసంగములయందు, తగిలి = తగుల్కొని, ద్రోహపుఁజింత = రాజద్రోహముచేయు నుద్యమము, ఏమియున్ = కొంచెమైనను, తలంపరు.

రాజు తన గొప్పయధికారులయందును గొప్పజోదులయందును, ఒకరిమీఁద నొకరికి, పోటీలు పెట్టవలయును. అందువలన వారు రాజునకుం జేయునట్టి హితములును అహితములును బయటం బడుచుండును - అనఁగా, వారే వానిగుట్టు వీఁడును వీనిగుట్టు వాఁడును రాజునకెఱుక పఱుచుచుందురు. మఱియు వారు ఒకరినిమించి యొకరు రాజునకు హితమాచరించి సన్మానములు పొందవేఁడనవారగు అతనికి అహితము సేయం దలంపకయుందురు.—

'దొర' - 'యోధుని' - ఇవి జాత్యేకవచనములు.

"అన్తరాత్వవధా పుంసి త్వన్తరపవారణోష్మ." - అమ.

చ. ధరణిపుఁ డెందు నేఁ బగడు తాఁ జన, నూఱట కొక్కనిం బగుం
దొరఁ బొనరించి పంప, నరి దుర్బలుచేఁ జెడఁ, డాతఁ డర్థభూ
కరితురగద్యుపేక్ష గొఱగాఁ, డటు సేయ ద్విజాన్యుఁ డల్కకున్
నెరపగు, నాతఁడుం గలయు, నిండినదుర్గబలోర్వి యీఁ దగున్. 255

ధరణిపుఁడు = రాజు, ఎందు నేనియుఁన్ = ఎల్లతావులకును, తాన్, చనఁదగదు = పోఁగూడదు. ఊఱటకున్ = తనకు విశ్రాంతికై, ఒక్కనిన్, దొరన్ ఒనరించి = అధికారినిగా నియమించి, పంపఁదగున్ = పంపవలయును, అరి = వైరి, దుర్బలుచేతన్ = బలహీనునిచేత, చెడఁడు = నిహతుఁడుకాఁడు, ఆతఁడు = వైరిమీఁదికిఁ బంపఁబడినట్టి యాయధికారి, అర్థభూకరితురగద్యుపేక్షన్ = ధనము భూమి ఏనుఁగులు గుఱ్ఱములు అనువాని సమృద్ధి లేక, కొఱగాఁడు = కార్యసమర్థుఁడు కానేరఁడు, అటుచేయన్ = అవన్నియు ఇచ్చి కార్యసమర్థుం గావించినచో, ద్విజాన్యుఁడు = బ్రాహ్మణేతరుఁడు, అల్కకున్ = (రాజుమీఁదనే) కోపమునకు, నెరవు = ఆగ్రము, అగున్ = అగును; ఆతఁడున్ = అద్విజాన్యుఁడును, కలయున్ = కలసియేయుండును. (వైరిమీఁదికంపఁబడిన బ్రాహ్మణునికి), నిండిన = సమగ్రమైన - దుర్గబలయుతోర్విన్ = దుర్గములతోను దండుతోను కూడుకొన్న భూమిని, ఈఁదగున్ = ఇయ్యవలయును.

ఎల్లయూరుల మీఁదకిని, రాజు తాను స్వయముగా వెడలం గూడదు; అందువలన తనకు విశ్రాంతిగా, తనకు సౌఖ్యముగా, దండెత్తిపోవుటకు నొకని దొరగా నేర్పఱుపవలయును. అదొరకు వలయు సాధనములు లేవేని అతనిచేత వైరి నిహతుం డెందుఁడు, కావున నా దొరకు సర్వవస్తుసమృద్ధమౌ దుర్గము దండులగల భూమిని ఈయవలయును; అధికారమును బ్రాహ్మణేతరుని కిచ్చినచో, నాతఁడు రాజుమీఁద కే కోపించి తిరుగఁబడును, కావున దానిని బ్రాహ్మణునికే ఈవలయును; ద్విజాన్యుఁడైన కలసియే యుండును, కావున, అతనిం గూడ చేపట్టియే యుండవలయును.

క. అడవులు గడిదేశములం, దడవులుగాఁ బెంపు; మాత్తధరణిస్థలికిన్
నడుములవి పాళ్లుపాళ్లుగ, బడిపెంపుము సస్యబాధ వొందకయుండన్. 256

గడిదేశములవి = ఎల్ల (సరిహద్దు ప్రదేశములందయిన) - అడవులు = వనములను, పడవులుగాన్ = దట్టములుగా, పెంపుము = వృద్ధి చేయుము. ఆత్తధరణీస్థలికిన్ = నిన్నైనభూప్రదేశమునకు, నడుములవి = మధ్య మధ్య నుండునట్టి యడవులను, సస్యబాధ = పైరుపాడగుట, పొందకయుండన్ = లేకయుండునట్లుగా, పాళ్లుపాళ్లుగాన్ = వేరువేరుగా, పొదలుగా చేయింపుము.

నీదేశపు టెల్లలయందలి యడవులను వృద్ధి చేయింపుము. నీ దేశము నడిమి యడవులను అందు నెలకొని దారిదొంగలు బందిపోటుదొంగలు ఇత్యాదులు జనులకు బాధ కలిగింపకుండునట్లుగా, ఛేదించి బయలు చేయింపుము. 'గడి'—

"పొలిమేర యన గడి యనఁగాఁ। బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా।
స్థల నామధేయములు." ఆం. భా. – 'గడికొల్లలు' (257), 'గడినృపులు' (259).

చ. క్షమఁ గుఱుమన్నెపుం గహనచారి జనంబెడ దోషదృష్టి కు
డ్యము గడుగంగఁ బూన్కి; దెగ నల్గిన సర్వము; బాస నీగి వ
శ్యముగ నొనర్ప దాడికగు; నొ గడి కొల్లలకు; న్శతాపరా
ధమును సహస్రదండము నతర్క్యము సర్వము నేలువానికిన్. 257

క్షమన్ = లోకములో, కుఱు మన్నెపుం గహనచారి జనంబెడన్ = చిన్న మన్నెములలో నుండెడు వనచరజనుల యెడల, దోషదృష్టి = తప్పెన్నుట, కుడ్యముల్ కడుగంగన్ పూన్కి = మట్టి పోవుటకై మట్టి గోడను కడుగు ప్రయత్నము వంటిది, అల్గినన్ = కోపించి దండించినయెడల, సర్వము = దోషమెల్ల, తెగదు = నిర్మూలము కాదు, బాసన్ = సత్యవాక్కు చేతను, ఈగిన్ = ఈవి చేతను, వశ్యముగ నొనర్పన్, దాడికిన్ = ధాటికని (దండెత్తి పోవుటకును), అగున్ = పనికి వచ్చును, గడికొల్లలకున్ = సీమా దేశములను దోఁచుకొనుటకును, ఔన్ సర్వమున్ ఏలువానికిన్ = సమస్తమును పరిపాలనచేయు రాజునకు, శతాపరాధము = నూర్గుర నేరమియు (అనఁగా పెక్కురు చేయు నేరములును), సహస్రదండమును = వేగురు జనులకు దండనయు, అతర్క్యము = ఊహింప నలవిగానివి.

అడవిలో దుర్గమప్రదేశములయందు తిరిగెడు మన్నెపు జనులయందు తప్పిదములు ఎన్ని యేనియుండును. మట్టి గోడను ఎంతకడిగినను మట్టి నిశ్శేషము కాని యట్లు వారిని ఎంత దండించినను తప్పిదము నిశ్శేషముగాదు. అట్లుగాక వారితో వస్తువాహనములు బహుమతి యిచ్చి సత్యము తప్పక వర్తించి చెలిమి చేసికొనుట మంచిది. అట్లు చేసికొన్న తాను వైరులపై దాడి వెడలు నప్పుడు వారిమన్నెపుదండు తోడుగా వచ్చును. మఱి తనవైరు లయిన పొలిమేర రాజులభూములను వీరిచేత కొల్ల పెట్టింపవచ్చును. ఇంతేగాని జనశతములు అపరాధు లగుటయు జనసహస్రములను దండించుటయు, సర్వము నేలెడురాజునకు తలపెట్టఁదగినది గాదు.— నిదర్శనాలంకారము.

'బింబ ప్రతిబింబత్వా।ప్తంబులగు విశేషణములఁ దాల్చినయిరు ధ
ర్మంబుల కైకోక్తియు నా।న్యంబున సామాన్య మన్య మందిడుట స్వకృ
త్యంబులచేఁ గీడును మే।లుం బోధించుటయు రాజిలు నిదర్శనలై.'
'ఎదిదాత సౌమ్యతయె యల్లదె నెఱశశి మచ్చలేమి; యబ్జరుచి న్నీ
వదనము దాల్చును నెలరాఁ।జదిసె నిరులు రాజవైరి సమయునటంచున్।
ఉదయంబందుచు నేయి।చ్చెదినేంద్రుఁడు పద్మములకు సిరి నధికముగాన్
విదితంబుగఁ జేయుచును సు।హృదనుగ్రహమే ఫలము సమృద్ధుల కనుచున్'. అలం.

'క్షమ' – 'క్షితిక్షాన్త్యోః క్షమా యుక్తే క్షమం శక్తే హితే త్రిషు' – అమ.

'మన్నె మన మండె మనఁగను మాడె మనఁగ
దుర్గమస్థలనామ మై తోఁచుచుండు.' ఆం. భా.

'అట వ్యరణ్యం విపినం గహనం కాననం వనమ్',
'భిత్తిః స్త్రీ కుడ్యమ్' అను.

'శతాపరాధమును సహస్రదండమును' - లోకోక్త్యలంకారము - బహ్వపరాధము బహుతర దండనము నని భావము.

తే. సింధుర మహాశ్వముఖ్యము ల్చేర్చు దొల
దీవి వణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత
వారిఁగాఁ జేయు నరి నవి చేరకుండ. 258

సింధురమహాత్ అశ్వముఖ్యముల్ = ఏనుఁగులు గొప్ప గుఱ్ఱములు లోనగువానిని, చేర్చుదొలదీవి వణిజులకున్ = తెచ్చునట్టి దూరపు ద్వీపాంతర వర్తకులకు, అరిన్ = నీవైరికి, అవి = ఆసింధురాదులు, చేరకుండన్ = చెందకయుండునట్లు, ఊళ్లు = గ్రామములు, పురిన్ = నీరాజధానియందు, సద్గృహములు = మంచిలోఁగిండ్లు, కొలువున్ = నీదర్శనంబును, తేజంబున్ = ఉన్నతమయిన మర్యాదలును, వెలన్ = వెలయందు, మేలు = లాభంబును, కలుగన్ = నీవలన చేకూడునట్లుగా, ప్రాఁతవారిఁగాన్ = చిరపరిచితులంబోలె (మిత్రులనుగా), చేయు = వివేకియైనరాజు చేయును;

దొ = దవు = దవ్వు - "అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు' బా. వ్యా. ప్ర. ౫.
'దీవి' - ద్వీపశబ్దమునకు వై.

తే. గడి నృపులరాయబారులయెడఁ గొలువున
సరససల్లాపములు రాజు సలుపవలయుఁ;
గార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక
వలయు; నవి మైత్రిఁ దాఁ దేలఁ బలుకవలయు. 259

రాజు, కొలువునన్ = ఓలగంబునందు, గడినృపుల రాయ బారులయెడన్ = ప్రక్కదేశముల రాజులదూతలతోడ, సరస సల్లాపములు = చెలిమితోఁ గూడిన మాటలు, సలుప వలయున్ = ఆడవలయును, అనుచరుల్ = తననియోగులు, కార్యఖడ్గముల్ = కర్తవ్యాంశములను యుద్ధ ప్రసక్తులను (అనఁగా - ఆ గడిరాజులు తనకు చేయవలసియుండి చేయకున్నట్టి కార్యములను - వారిపై అందునిమిత్తము తనకుం గలయుద్ధప్రసక్తిని), కానఁ బలుకవలయున్ = తనమాటలచే హెచ్చరిక చేయవలయును, అవి = ఆహెచ్చరిక మాటలను గూర్చి, మైత్రిన్ = తాను నటించుచున్న చెలిమిచేత, తాను, తేలఁబలుకవలయున్ = 'అవి ఏదో పొరఁబాటున అట్లు జరిగిపోయినవేగాని, వారు (ఆగడినృపులు) మనకు వలయునని చేసిన యపకృతులుగావు' అని అసడ్డగా మాటలాడ వలయును.

'రాయబారి'—రాజ్యభారి శబ్దమునకు వై.

తే. తా నవంబుగ దొరఁజేయువాని మంత్ర
మునకు వేగమె లోఁజేయఁ జనదు; వాఁడు
క్రొత్తమన్నన రహి నను(గులకుఁ జెప్ప,
నయిన నదిచెడు, మఱి వాఁడు నడఁగుఁ గాన. 260

పతులనుగా చేర్పఁబడవలయును; ఆదుర్గములందు పులిజుంటివంటి యపూర్వవస్తువులతోఁగూడ కావలసియుండు సకలపదార్థములను గాదెండ్లకు సరిపడునట్లుగా నిండింపవలయును. ఇంచుకయేనియు హెచ్చుతక్కువలు రాకుండ సామంత రాజులకు భరాము నీయవలయును. బొక్కసమును ఎట్లు కూర్పవలయు ననఁగా,— అందులోనికి వచ్చు ధనము హెచ్చుగాను, అందుండి వ్యయమగునది తక్కువగాను, దానికై ప్రజలను పీడింపకయు, కూర్పవలయును; వైరిరాజును, అతఁడు క్షయించియున్నాఁడని, వెగులవలన ఎఱింగి, తాను నొవ్వకయు, తనప్రజయు నొవ్వకయు కొంగ (లటుక్కన) చేఁపం బట్టునట్లు ఆకస్మికముగా పోయి పట్టి అతని రాజ్యాంగములే స్వీకారపడునట్లు చేయవలయును. అట్లు చేయురాజు అత్యంతసౌఖ్యము ననుభవించుచు నిశ్చింతగా నుండును.

'పులిజున్ను' - ఇది కడుదుర్లభము, దీనిం జెప్పుటచే అట్టి దుర్లభవస్తువులం గూడ నని భావము. పురుషునియొక్క యాయుస్సు 'పురుషాయుష' ము. అది నూఱేండ్లని శ్రుతి.

"పురుషాయుష జీవిన్యో నిరాతఙ్కా నిరీతయః
యన్నదీయాః ప్రజాస్తస్య హేతుస్త్వద్బ్రహ్మవర్చసమ్." రఘు. 1(63).

'బండరువు' - బండారు, బండారము, ప్రకృతి "భండారః" అని వైకృతదీపిక. పూ. 238 టీక.

'చరదృష్టి' - 'రాజానశ్చార చక్షుషః' - 'యథార్హవర్ణః ప్రణిధి రపసర్ప శ్చరః స్పశః। చారశ్చగూఢపురుషః' అమ.; 'అమిత్రజిన్ మిత్రజి దోజసా స యద్। విచారదృక్ చారదృగప్యవర్తత.' నైష.

'గాత్రములు' - అంగములు - రాజ్యాంగములు. - 'దెందానం జేయుడీ' - లోకోక్త్యలంకారము - 'లోకోక్తి లోకవాదం। ఒక కన్నులు మూసికొని సహింపు మిరుసెలల్' అలం.

క. ఎచ్చోట గజఘోటక్రయ। తచ్చర్వణసుభటజీవితద్విజసురపూ
జోచ్చనిజభోగములకగు। వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్. 262

విత్తంబునకున్ = తనధనమునకు, ఎచ్చోటన్ = ఎక్కడను, గజ...కున్ - గజ = ఏనుఁగులయు - ఘోటక = గుఱ్ఱములయు - క్రయ = కొనుగోలునకును - తత్ = వాని - చర్వణ = మేఁతకును - సుభట - బంట్లయొక్క - జీవిత = జీతములకును - ద్విజ = బ్రాహ్మణులయు - సుర = దేవతలయు - పూజా = సత్కారమునకును, ఉచ్చ = ఉత్కృష్టమైన, నిజ = తనయొక్క భోగములకున్ = సుఖానుభవములకును, అగు, వెచ్చము = వ్యయము, వెచ్చంబు గాదు.

గజహయముల వెలకు, వాని మేఁతకు, బంట్ల జీతములకు, బ్రాహ్మణసత్కారములకు, దేవపూజలకు, ఆత్మభోగములకును అగునట్టి ధనవ్యయమును. వృథావ్యయ మని తలంపఁగూడదు. ఆవ్యయమును ధారాళముగా చేయవలసినదే.

ఆ. ప్రతిన పలుదు వైరిపట్టున నృపతికి, । పంపు వెడలఁ దీఱకుండుఁ దీఱుఁ;
గాక యుండియుండ కాలాంతరమున నొఁ। గార్యకాఁడొ యంతకాఁడొ నృపుఁడు.

రాజు వైరిమీఁద ప్రతిజ్ఞ చేయఁగూడదు; వైరిమీఁదికి సేనను నడుపుకొనిపోయినచో, ఆకార్యము తీఱనం దీఱును, తీఱకపోయినను పోవును; కాక అట్లేయుండి యుండిన కాలాంతరమునఁ దీఱును. అట్లు అనుకూలకాలము వేచుచు నుండుట మంచిది. రాజు కార్యపరుఁడుగా నుండఁదగునే కాని కలహప్రియుఁడుగా నుండఁ దగదు.

'ప్రతిన' - వై. ప్రతిజ్ఞ. 'కాలాంతరము' - అన్యమయిన కాలము - వేఱుసమయము. *'అంకకాఁడు' - (అంకము+కాఁడు) - అంకము = యుద్ధము - లేక - చలము; అంకకాఁడు = చలపాది.

'అఙ్కో నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం యుద్ధభూషణే
సమీపే రూపకే స్థానే మన్తూత్సఙ్గ చిహ్నయోః.' నానా.

క. పోరానిపట్లఁ బొడుచుట । వైరిబలము దిరుగ జయమొ స్వర్గమొ యగు నా
నారూపయంత్రతత్ప్రా । కారాదులపట్లఁ బ్రజనె కవియింప నగున్. 264

పోరాని పట్లన్ = అవలికి పోవ దారిలేనితావులకు శత్రువును తత్సైన్యమును తఱిమి, పొడుచుటన్ = కొట్టుటచేత, వైరిబలము = శత్రుసైన్యము, తిరుగన్ = మరలఁబడినా, జయమొ స్వర్గమొ అగున్ = గెలుపైనను వీరస్వర్గమయినను (రణమరణ మనుట) కలుగును; నానారూపయంత్ర తత్ ప్రాకార ఆదుల పట్లన్ = బహువిధము లయిన మారకయంత్రములు కలిగిన ఆవైరి యొక్క కోటయును దాని ప్రాకారమును లోనగు తావులకు, ప్రజనె = తనదండునే. కవియింప నగున్ = తగిలింపవలయును.

జిగీషు వయిననరాజు తనవైరిని అతఁడు తప్పించుకొని పోవుటకు దారిలేని మూలలకు తఱిమి కొట్టవలయును; అట్లుచేయుటచేత అతనిసైన్యము చేయునది లేక తిరుగంబడి పోరం దొడంగినచో ఆపోరియందు జిగీషువు గెలిచినను గెలుచును, చచ్చినను జచ్చును; జయ నిశ్చయము లేదు. మఱియు, వైరులకోటలలో బహువిధముల మారణయంత్రము లున్న తావులకు జిగీషుఁడు తాను పోఁగూడదు. తన దండునే తగుల్కొలుపవలయును.—అభిప్రాయము సుగమము.

చ. మనమున కొండు రెండు మఱుమంత్రముల న్సరిపోవఁ జెప్పినం
జనపతు లాతనిం బిలువ సాగుదు; రాగతి సారెఁ బిల్చున
చ్చనువునకే ధనాదిఁ గొని సంగతి గానివి గ్రొవ్వి చేయఁ జె
ప్పు; నృపతి తద్బహిశ్చరితముం జరుచేఁ బరికింపఁగాఁ దగున్. 265

రాజులు, మనమునకున్, సరిపోవన్ = నచ్చునట్లుగా, ఒండు రెండు = ఒకటి రెండు, మఱుమంత్రములన్ = రహస్యాలోచనలను, చెప్పినన్ = తమకు ఎవఁడేని చెప్పినయెడల, పిలువ సాగుదురు = వానినే రహస్యాలోచనకై రప్పించుచుందురు; ఆగతిన్ = ఆవిధముగా, సారెన్ = మాటిమాటికిని, పిల్చునచ్చనువునకున్ = రాజులు పిలిచెడి చనవు మాటసాగుబడికి, ధన ఆదిన్ = ధనము లోనగు వానిని, ఈన్ = రాజునెడ కార్యముగలవారు తమకార్యము నెఱవేర్చుటకుఁగాను లంచము లీయఁగా, కొని = గ్రహించి, (అతఁడు), గ్రొవ్వి = గర్వముచేత, సంగతికానివి = ఉచితము కానట్టిమంత్రములను, చేయన్ = చేయుమని, చెప్పున్ = రాజునకుం బోధించును, (కావున), నృపతి = రాజు, తత్ బహిశ్చరితమున్ = అతనిబయటి వృత్తమును, చరుచేన్ = చారులమూలముగా, పరికింపఁగా, దగున్ = విచారించుకొనవలయును.

* తులామ్యాతమందు యుద్ధమొనరించువాఁడు. చూ. రాజశేఖరుని బాలరామాయణము
"త్వత్తోఽఙ్కకారవిజయే త్వయిరామలక్ష్మ్యాః, । సీతా చ తే పునరియం భవతోఽస్తు దారాః,
మత్తోఽఙ్కకారవిజయే తు మహాధిపత్యం, । తస్యాం చ తే పురి కలత్రజనే చ తత్ర."
ఇటీవారు ప్రాచీన రాజాస్థానములలో పలువురుండిరి. వీరే రాజుల లెంకలు. 'కన్నులం బుట్టిన కొడుకులు'

ఎవ్వఁడేని ఒకటిరెండు ఆలోచనలు మనస్సునకు నచ్చునట్లుగాఁ జెప్పెనేని రాజులు వానిని మంత్రాలోచనకై మాటిమాటికిం బిలుతురు. దానిం గని రాజుకడ కార్యముకలవారు తమకార్యములు రాజుతో చెప్పి సాధింపు మని ఇతనికి ధనాదికములను లంచ మిత్తురు; దానిం బుచ్చుకొని యీతఁడు తనమాట సాగు ననుగర్వముచే రాజునకు వారి నిమిత్తమై యసంగతపు మంత్రములం జెప్పును. కావున రాజు అట్టివాని పరోక్షవృత్తమును తన చారులమూలముగా కనిపట్టుచుండ వలయును.

'మఱు' - 'మఱుఁగు' (చాటు) శబ్దమునకు వృత్తియందు 'మఱు' అనిరూపము. - 'సరి' - సదృశ శబ్దమునకు వికృతి.

క. గడివాఁడు చెడునయేనిఁ దగుఁ। జెడఁ జేయుట; చెడఁడయేని చెల్మియె తగుఁ; బై
గడివాఁడే పనికగుఁ దన। గడి వాఁ డరియైనఁ, దనకె గడి కావఁబడున్. 266

గడివాఁడు = తన యెల్ల కవలిరాజు, చెడునయేని = తప్పక చెడునెడల, చెడఁజేయుట తగున్ = చెడునట్లు చేయుట నీతి, చెడఁడయేని = చెడనివాఁడుగా నుండెనేని, చెల్మియే తగున్ = వానితో స్నేహమే తగును, తన గడివాఁడు = తన యెల్లనంటినరాజు, అరియైనన్ = తనతోడి చెలిమి నొల్లక తనకు విరోధియైనచో. పనికిన్ = వానిని అణఁగఁ గొట్టుటకు, పైగడివాఁడే = వానిదేశమునకు ఆవలనుండు రాజే. అగున్ = ఉండును, తనకు గడి కావఁబడున్ = తనకై యె గడిరక్షింపఁబడును.

నీదేశము వెంబడి నుండురాజు నీయనంతరుఁడు చెడునేని వానిం జెడనిచ్చుటయే సరి. చెడఁడేయేని వానితో చెలిమియే సరి; వాఁడు విరోధించెనేని తదనంతరుఁడు వానిని పని దీర్చును, తదనంతరుని విరోధించి వానితో పోరాటములో చిక్కుకొనిన యనంతరుఁడు తన యెల్లజోలికి రాఁడు.

'అరి ర్మిత్ర మరే ర్మిత్రం మిత్ర మిత్ర మతః పరం।
తథారిమిత్ర మిత్రం చ విజిగీషోః పురః స్థితాః.' కామంద.

తే. రాష్ట్ర మెరియింపు, కొనుము దుర్గములు, తదవ
రోధ మగపడ్డఁ బుట్టింటిరూఢి నెరపు,
పరుసములు శత్రుపురాయబారు లెదుటఁ
బలుకకుము, సంధి యొకవేళ వలసియుండు. 267

రాష్ట్రము = పగతుని దేశపుఁ బ్రజలను, ఎరియింపుము = కష్టములపాలు జేయుము, (అతని) దుర్గములు, కొనుము = పట్టుకొనుము, తత్ అవరోధము = వారరాణులు, అగపడ్డన్ = దొరకిరేని, పుట్టింటిరూఢిన్ = వారికి వారిపుట్టింట నెట్లు జరుగునో ఆమర్యాదను, నెరపు = జరుపుము, ఒకవేళ శత్రురాజుతో, సంధి = చెలిమి, వలసియుండును, (కావున), తత్ రిపుల రాయబారుల ఎదుటన్ = ఆ శత్రురాజులరాయబారులతో, పరుసములు = (ఆ రాజులం గూర్చి) క్రూరవచనములు, పలుకకుము.

'అవరోధము' - 'అవరోధ స్త్రిరోధానే రాజదారేషు తద్గృహే' మేదిని. - జాత్యేకవచనము. 'అగపడు' - అగ్గపడు - స్వాధీనపడు - ''మంగిక్ గూబకు నగపడి। యంగంబులు వడఁకు చున్నయవి'' - శాంతి. 3(206) అని శ. ర. — ''హితుఁడగు మంత్రిం గుటిలుల। యతి కపటో

పాయములకు నగపడి చెఱుప। స్మృతిఁ దలఁతురె'' శాంతి. 3(73)_అగపడు _ అగ్గపడు=అగ్గమగు - “అగ్గమయ్యెను లోనయ్యె ననఁగ స్వవశ। మయ్యె ననుట దనరు వేదాంతవేద్య''. ఆం. భా. “చిక్కుపడియె దొరకెఁ జేపడె నగపడెఁ। దవిలెఁబట్టువడియెఁ దగులువడియె। నబ్బె నన గృహీత మయ్యె ననం దగు'' ఆం. భా. “వైరియవరోధ మగ్గమయిన పుట్టింటి రూఢినడపు'' అను నీతి వాక్యము నతిక్రమించి కృష్ణరాయని యల్లుఁడు రామరాజు ఏమయినదియు అతని పాటువలన దక్షిణాపథ హిందూరాజ్యము ఏమయినదియు లోకవిదితము. హిందువుల కందఱకును శోచ్యమును అవమానకరమును అగు నాతని యీ యపకృష్టవర్తనమును నాటకి మల్లి యీడించుచున్న కవి తెల్లజులయొక్క రసజ్ఞతకు వలసినంత యాశ్చర్యపడఁగలమా!

ఆ. అభిచారి ఘనగరాంబుదూషితరుఙ్ని। రంతరాద్రిగహనదంతురోగ్ర [268
కీకటోర్వి మేరుగిరిసమార్థము వచ్చు। నేనిఁ జొరకు, పంపె యిడుము కొనఁగ.

అభి...ర్విన్ - అభిచారి = మారణాదిక్రియలు సేయువారిచేత - ఘన = సాంద్రమును - గరఅంబు=విషయుక్తమయిన నీళ్లచే - దూషిత = చెఱుపఁబడినదియు - రుఙ్నిరంతర=రోగముల చేత క్రిక్కిఱిసినదియు - అద్రిగహనదంతుర=కొండల చేతను వనముల చేతను నిండుకొన్నదియు - ఉగ్ర=క్రూరమయిన - కీకట=మ్లేచ్ఛులు కలదియు (నైన)- ఉర్విన్ - భూమియందు,(దేశమందు) మేరు గిరి సమ అర్థము=మేరు పర్వతముతో సమానమయిన ధనము, వచ్చునేని(న్)=దొఱకునట్లున్నను, చొరకు = ఆదేశములో నీ వడుగు పెట్టకుము. కొనఁగన్ = ఆదేశముం బట్టుటకు, పంపె ఇడుము = ఒకసేనాభాగమునే పంపుము.

‘అభిచార’ - ‘హింసాకర్మాభిచారః స్యాత్’ అమ. _ ‘ద్వేమారణాదిక్రియాయాః’ రామాశ్రమి. అభిచారమే ఆభిచారము; అది కలవాఁడు ఆభిచారి, హోమాదిక్రియలచేత చంపువాఁడు._ ‘గరము’.—‘స్థావరం జఙ్గమం చేతి విషం ప్రోక్త మకృత్రిమం। కృత్రిమం గరసంజ్ఞం తు క్రియతే వివిధౌషధైః’ వాగ్భటము.

క. రాణింపఁ బల్కి తనపని। జాణై కొనుఁ, గొలుచు సంతసపుఁదశఁ, దొలఁగుం
త్రాణ చెడఁ గవుడుమానిసి; । నాణె మెఱుఁగ బచ్చుగాఁగ నరపతికిఁ దగున్.

కవుడుమానిసి = కపటము గలమనుష్యుఁడు, రాణింపన్ = మనోరంజకముగా, పలికి = ఇచ్చకము లాడి, జాణ ఐ= నేర్పరియై, తనపని కొనున్=తనకోరికను నెఱవేర్చుకొనును, సంతసపుదశన్ = ప్రభువు ఉత్సాహవంతుఁడై యున్నప్పుడు (అనఁగా తనవలన నేమియు ప్రభువునకు కావలసినపని లేక-తనకోర్కెలను ప్రభువుతీర్చు సమయమున), కొలుచున్=ప్రభువును సేవించును, త్రాణచెడన్=ప్రభువు బలిమి తప్పినా, తొలఁగున్ = ప్రభువును విడిచిపోవును, నాణెము = అట్టిసేవకుని యోగ్యత అనెడు నాణకమును, ఎఱుఁగన్ = ముందే తెలిసికొనుటకు, నరపతికిన్ = రాజు, బచ్చు కాఁగన్ తగున్ = నాణెము చెల్లునో చెల్లదో చూచినవెంటనే తెలిసికొనునట్టి సరాబువలె, నేర్చియుండవలయున్. _ పరిణామాలంకారము.

‘త్రాణ’ _ త్రాణము _ హంసాదిగణోచితమగు పాకీకములోపము - ‘ఆర్తత్రాణాయ వః శస్త్రం న ప్రహర్తు మనాగసి.’ శాకుంతల. ‘నాణెము’-నాణకశబ్దభవ._‘ఏసా నాణకమోషికాముకశికా మత్స్యాశికా లాసికా’ మృచ్ఛకటి. _ ‘తులా శాసన మానానాం కూటకృన్నాణకస్య చ’ _ ఇతిస్మృతిః _ అని స. సం.

సీ. తజ్జ్ఞమండలిఁ గూర్చి, ధాతువుల్ దెలిసి, హే। మాదులఁ గొని, ప్రకృత్యనుగుణాల్ప
జీవనాహృతులచేఁ జెలఁగి, మహాబలో। ద్రేకంబు మర్దన రిత్తఁ జేసి,
స్నేహార్ద్రుఁ డగుచు నశేషంబుఁ బోషించి, । నరవర్ణములతప్పుసరణు లుడిపి,
సతతద్విజప్రతిష్ఠాశాలియై బలి। యించుపట్టులు బలియించి, పలుచఁ
తే. జేయుపట్టులు పలుచఁగాఁ జేసి తేజ। మెసఁగ శోధన మఱవక యెసఁగ వలయు
సాంగరాజ్య మొకెత్తుగ స్వాంగరాజ్య। మొక్కయెత్తుగ నృపతి యాయుష్యపరత.

నృపతి = రాజు, ఆయుష్యపరతన్ = తన యాయుస్సుయొక్క హితము కోరినవాఁడై - తజ్జ్ఞ = దాని దాని నెఱిఁగిన వారియొక్క (లోహాదుల స్వరూపాదుల నెఱిఁగిన వారియొక్క, రోగస్వరూప చికిత్సాదుల నెఱిఁగిన వైద్యులయొక్క) - మండలిన్ = సమూహమును, కూర్చి = రప్పించి, ధాతువుల్ = కనకలోహాదులను - వాతపిత్తశ్లేష్మములను, తెలిసి, హేమాదులు = (ఖన్యాదులనుండి) సువర్ణాదులను - స్వర్ణభస్మము లోనగుమందులను, కొని = స్వీకరించి (సేవించి), ప్ర... చేన్ - ప్రకృతి = ప్రజలకు - దేహతత్త్వమునకు - అనుగుణ = అనుకూలమయిన - అల్పజీవన = జీవన స్వల్పభాగములను - మితభోజనములను - ఆహృతులచేన్ = గైకొనుటచేత - భుజించుటచేతను, చెలఁగి = వర్తించి, మ...బు - మహాబల = కడుబల్లిదులయొక్క - వాతముయొక్క - ఉద్రేకంబు = ఉద్రిక్తవర్తనమును - ప్రకోపమును, మర్దనన్ = దండనచేతను - ఒడలు పట్టించుకొనుటచేతను, రిత్త చేసి = వ్యర్థపఱచి - నిర్మూలింపంజేసి, స్నే...డు - స్నేహ = అనురాగముచేత - నూనెచేత, ఆర్ద్రుఁడు = చల్లనివాఁడు - తడిసినవాఁడు - (అనఁగా అభ్యంగము చేయించుకొన్నవాఁడు), అగుచున్, అశేషంబు = ఎల్లజనులను - ఒడలినెల్ల, పోషించి = పోచి. పుష్టి పొందించి, నర = మనుజులయొక్క - వర్ణముల = జాతులయొక్క - తప్పుసరణులు = దుష్ప్రవర్తనములను - (నరన్ = పలితమును - వర్ణముల = ఒడలి వన్నెలయొక్క - తప్పుసరణులు = తప్పిన విధములను), ఉడిపి = మాన్పి, స...లి - సతత = ఎల్లప్పుడును - ద్విజ = బ్రాహ్మణులయొక్క - ప్రతిష్ఠా = ఘన చేత - శాలి = ఒప్పుచున్నవాఁడు (సతత = అమరణము - ద్విజ = దంతములయొక్క - ప్రతిష్ఠా = స్థిరత్వముచేత - శాలి = ఒప్పెడువాఁడు), బ. బలియించు పట్టులు = జనులను హెచ్చుచేయ (= చేర్ప) వలసిన ప్రదేశములను - పుష్టి నొందింపవలసిన దేహావయవములను, బలియఁజేసి = జనసమృద్ధములం గావించి - పుష్టి నొందించి, పలుచఁజేయు పట్టులు = జనములు తగ్గింపవలసిన తావులను - కృశములుగా నుండవలసిన దేహావయవములను, పలుచఁజేసి = అల్పజనంబులం గావించి - కృశములనుగాఁ జేసి, తేజము ఎసఁగన్ = పరాక్రమము మీఱ - దేహదీప్తి యొప్ప. శోధన = దేశమును నిష్కంటకముగా చేయుటను - దేహమును శుద్ధి చేసికొనుటను, మఱవక, సాంగరాజ్యము = స్వామ్యాద్యంగములతోఁ గూడుకొన్న దొరతనము ఒకయెత్తును, స్వాంగరాజ్యము = తనదేహముపై దొరతనము (అనఁగా దేహము బడలక కష్టము నుగుట), ఒకయెత్తుగన్ = రెండును సమానముగా, ఎసఁగవలయున్ = వర్ధిల్లవలయును.

'హేమాదులు':—

'సువర్ణం శీతలం వృష్యం బల్యం గురు రసాయనం
కాన్తికృ చ్ఛావి షోన్మాద త్రిదోష జ్వర శోష జిత్' - మదనసా.

'ధాతువులు':—

'వసాదయస్సప్త కఫాదయ స్త్రయో...లోహం స్వభావః కనకం చ ధాతవః' - నానా. 'ప్రకృతి'—'ప్రకృతి ర్గుణసామ్యే స్యా దమాత్యాది స్వభావయోః। యోనౌ లిఙ్గే పౌరవర్గే'—మేదిని. - 'స్నేహ' - 'అభ్యఙ్గశేషగుణే స్నేహ స్తైలసౌహార్దయో రపి' - నానా. 'మహో...జేసి' - ''అభ్యఙ్గ మాచరే న్నిత్యం స జరాశ్రమవాతహా'' వాగ్భట. 'ద్విజ'-'దన్త వి ప్రాణ్డజాః'-అమ. 'నరల్' - 'చూర్ణం శ్వదంష్ట్రామలకామృతానాం లిహన్ ససర్పిర్మధుభాగ మిశ్రం। వృషః స్థిరః శాన్తవికారదుఃఖః సమాః శతం జీవతి కృష్ణకేశః' వాగ్భట.

రాజు తన జీవితకాలమున సుఖముగా రాజ్యము జరుగుటకు గాను, తెలిసినవారివలన, తన దేశములో, స్వర్ణాది లోహముల గనులెక్కడ నున్నవో, కనిపట్టి, స్వర్ణాదిలోహములను గ్రహించి, ప్రజలయాదాయములో కొంచెపాటియే పన్ను గొనుచు, పొగరెక్కిన బల్లిదులను దండనచేత అణఁగఁ ద్రొక్కుచు, దయ గలవాఁడై, ఎల్లవారిని పోషించుచు వర్ణాశ్రమధర్మములను తప్పి పోకుండ కాపాడుచు సతతము బ్రాహ్మణులను గౌరవించుచు, జనహీన ప్రదేశములకు జనసమృద్ధి కలిగించి, చోటుచాలని ప్రదేశము లందలి జనులను జనులు లేని ప్రదేశములకుఁ బంపుచు. క్షుద్ర శత్రువులను నాశనముచేయుచు, సమృద్ధ మయిన రాజ్యమును తన దేహముతో సప్తాంగసమానముగా కాపాడుకొనవలయును.

రాజు తనయాయుస్సునకు హితము కోరినవాఁడై ధాతువులు తెలిసిన వైద్యులచేత ధాతుస్థితిని తెలిసికొని, స్వర్ణభస్మాది భైషజ్యములు సేవించుచు, దేహమునకు అంతటికిని పుష్టి కలిగించుకొనుచు, బలియవలసిన భుజహృదయా ద్యవయవములు బలియునట్లును, కృశముగా నుండవలసిన మధ్యాద్యవయవములు సన్నపడునట్లును, వ్యాయామాదులు గావించుచు, దేహశుద్ధి యేమఱక, తన దేహమును తన రాజ్యమును సమానముగా కాపాడుకొనవలయును. - శ్లేషోపమాలంకారము.

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కల్య। వేళఁ గార్తాంతిక ద్విజులగోష్ఠి,
జాము వోవ నమాత్య సామంతపూర్వకం। బర్థార్జనస్థకాయస్థగోష్ఠి,
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం। బగు సూదసూపకృన్మృగయుగోష్ఠి,
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం। బార్యధర్మాధికృద్వ్రతులగోష్ఠి,
తే. భుక్తిమీఁదవిదూషక పూర్వకము పు। రాణకవిగోష్ఠి, చారపూర్వకము సంజ
జాము గాయకగోష్ఠి, నిశాసుషుప్తి। పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసఁగుఁ బతికి.

పతికిన్ = రాజునకు, కల్యవేళన్ = ప్రాతఃకాలమునందు, సౌ...ము - సౌఖశాయనిక = సుఖముగా శయనించితివా అని యడుగువారు - భిషక్ = వైద్యులు _ పూర్వకము = మొదలుగా, కార్తాంతిక ద్విజుల గోష్ఠి = దైవజ్ఞులైన (జ్యోతిష్యులైన యనుట) బ్రాహ్మణులతోడి సల్లాపము - జాము = ఒకయామము, పోన్ = జరిగిన తర్వాత, అ...బు - అమాత్య = మంత్రులు - సామంత = దొరలు - పూర్వకంబు = మొదలుగా, అ...ష్ఠి - అర్థ = ధనముయొక్క - అర్జన = సమకూర్చుటయందు - స్థ = ఉన్నట్టి, కాయస్థ = కరణాలయొక్క - సల్లాపము, దినమధ్యమునన్ = రెండు జాములతర్వాత, మర్దనమల్ల పూర్వకంబుగన్ = ఒడలునలుపుట, జెట్టులు మొదలుగా, సూ...ష్ఠి - సూద = వంటవాండ్రు - సూపకృత్ = పప్పువండువాండ్రు - మృగయు = వేటకాండ్రు - వీరితో -

సంగతి; అపరాహ్ణమునన్ = మధ్యాహ్నమునిూఁద, దేవతార్చన పూర్వకంబు = దేవతాపూజ మున్నుగా, ఆ...ష్ఠి - ఆర్య = పెద్దలయొక్కయు - ధర్మాధికృత్ = ధర్మాధికారులయొక్కయు - యతుల=సన్న్యాసులయొక్కయు - గోష్ఠి=సాంగత్యము; భుక్తిమీఁదన్ - భోజనమైన తర్వాత, విదూషక పూర్వకము = హాస్యగాఁడు మున్నుగా, పురాణ కవిగోష్ఠి = పురాణములు చెప్పువారి యొక్కయు కవులయొక్కయు సభ; సంజజాము = సంధ్యాయామము, చారపూర్వకము = వేగులు మొదలుగా, గాయకగోష్ఠి = గాణలసభ, నిశన్ = రాత్రియందు, సుషుప్తిపూర్వకము = నిద్ర మొదలుగా, ప్రేయసీ గోష్ఠి = కాంతతో సల్లాపము, పొసఁగున్ = ఒప్పును.

రాజునకు దినచర్య ఇట్లుండవలయును - ప్రాతఃకాలమందు సుఖనిద్ర నడుగువారును వైద్యులును, జ్యోతిష్కులగు బ్రాహ్మణులును రాజును దర్శింపవలయు. రాజు వారితో సల్లపించి యారోగ్యమునకును గ్రహానుకూల్యమునకును వలయు విశేషములు ఎఱుంగవలయు; తాను ప్రొద్దు ఎక్కినంతట మంత్రిసామంతులతోను ధనార్జననియుక్తులయిన కరణాలతోను కొంతసేపు గోష్ఠినుండి మంత్రాలోచనాదికము కావించి ఆయవ్యయవిశేషము తెలుంగవలయును. అంగమర్దనము, మల్లురతో వ్యాయామము, వంటవాండ్రతోను వేఁటకాండ్రతోను, తెచ్చిన మాంసములను తేవలసిన వానిని విచారించుకొని, తెచ్చినవానిని వండవలసిన ప్రకార విశేషములనుగూర్చి యాజ్ఞాపింపవలయును; అపరాహ్ణమున దేవతార్చన సమయాన పెద్దలతోను ధర్మాధికారులతోను సన్న్యాసులతోను సల్లాపము, భోజనానంతరము విదూషకుని వినోదమును, పౌరాణికులతో కవులతో గోష్ఠి; నాలవజామున చారులకు దర్శనము, పాటకచ్చేరి; రాత్రి సుఖనిద్ర ప్రేయసీ సల్లాపములు.

'సౌఖశాయనిక'- సుఖశయనం పృచ్ఛతీతి సౌఖశాయనికః. ఇట్లే సౌఖసుప్తికః- సౌస్నాతికః.

'యోగనిద్రాన్తవిశదైః పావనైరవలోకితైః
సృగ్వాదీ ననుగృహ్ణాన్తం సౌఖశాయనికా నృషీన్.' రఘు. 10 (14).

'ఇతి సౌఖశాయనికానాం సూక్తగీతామృతరసం కర్ణపూరతాం నయన్' యశస్తిలకను. 2 (22 - 23) గద్యము. 'రోగహార్యగదఙ్కారో భిషగ్వైద్యశ్చికిత్సకే'— అమ.

'కార్తాన్తికో లక్షణజ్ఞః'' వైజయంతి. 'స్యుర్మౌహూర్తిక మౌహూర్త జ్ఞాని కార్తాన్తికా అపి' అమ. 'సభాసల్లాపయోర్గోష్ఠీ' నానా. 'ప్రత్యూషోఽహర్ముఖం కల్యమ్' అమ. 'కాయస్థుఁడు' - 'లిపికరవృత్తౌ జాతిభేదేచ' సర్వ. సం. "కాయస్థ ఇతి లస్యమాత్రా" ముద్రా. 'కాయస్థో లేఖకః' అని దానిటీక.

'స్యా న్మర్దనం సంవాహనమ్.' అమ. - 'మల్లః పాత్రే కపోలే చ మత్స్యభేదే బలీయసి'. మేదిని.

'సూపకారాస్తు వల్లవాః । ఆరాలికా ఆన్ధసికాః సూదా ఔదనికా గుణాః' - 'మృగయుర్లుబ్ధకశ్చ సః' - అమ.

సూదసూపకారులకు భేదము నిఘంటువులలోఁ గనఁబడకున్నను, ఇట రెండుపదములు భిన్నవాచకములుగాఁ బ్రయుక్తములు - సూప మన్నం బ్రప్పుగాన తదాదులు సూపకారుఁడును భక్ష్యవిశేషములు సూదుఁడును చేయునట్లుగా భేదము గ్రహింపవచ్చును.

'ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నే స్త్రిసంధ్యమ్,'
'యే నిర్జితేన్ద్రియగ్రామా యతినో యతయశ్చ తే' - అమ.

బనసపండ్లు దిగిన పరిగ, స్వప్నము గన్న
నెఱిగ, నొసఁగి వెఱఁగుపఱచు టొప్పు. 274

పాత్రభూతుఁ=సత్కారమునకు అర్హుఁడగునని, లెస్స పరికించి=చక్కఁగా కనిపట్టి, చెప్పకయునుఁ మునుపు=రాజు తనకు సత్కారము చేయునన్నాఁడని అతనితో ఎన్నఁడును చెప్పకమున్నే, పనసపండ్లు దిగిన పరిగఁ=ఉన్నట్టుండి ఒకతోఁటయందలి పనసచెట్టునిండ పనసపండ్లు దిగఁబడిన చెట్లుండునో ఆవిధముగాను, ఒసఁగి=ఇచ్చి, వెఱఁగుపఱచుట=ఆశ్చర్యపెట్టుట, ఒప్పుఁ=తగును.

పాత్రమయినవానిని అట్టివాఁడని చక్కఁగా తెలిసికొని, అతనికి, ముందుగా ఏవిధమును తెలియనీక, ఒక్కుమ్మడిగ తలంపునకు అందనంత ద్రవ్యజాతమును, ఒసంగి, ఆశ్చర్యమగ్నుని చేయుట తగును. అభూతోపమ. 'పనసపండ్లుదిగిన పరిగ' - కడుమెండుగా కోర్కెమించిన ప్రియద్రవ్యజాత మనుట.—'స్వప్నము గన్న నెఱిగ' - ఆకస్మికముగా ననుట. - ఉపమ.

ఈ యుపదేశము కృతయుగ ధర్మాతీతముగా నున్నది:—

"అభిగమ్య కృతే దానం, త్రేతా స్వాహూయ దీయతే
ద్వాపరే యాచమానాయ, సేవయా దీయతే కలౌ." పరాశర.

"కృతే ప్రదీయతే గత్వా త్రేతాస్వానీయతే గృహే.
ద్వాపరే చ ప్రార్థయత, కలౌ వనుగమాన్వితే" బృహస్పతి.

"అభిగమ్యోత్తమం దాన, మాహూయైవ తు మధ్యమమ్
అధమం యాచమానాయ, సేవాదానం తు నిష్ఫలమ్" పరాశర.

క. పితృదేవక్రియలను విధిఁ । బితృక్రియలె సూక్ష్మ లగుటఁ బితృభక్తుఁడవై
శ్రుతిశీలతపశ్శాంతా । చ్యుతభక్తుల కొసఁగి పనుపు మున్నతగతికిఁ. 275

విధిఁ=శాస్త్రముచేత, పితృదేవక్రియలఁ=పితృక్రియలు (కవ్యములు)ను దేవపూజలు=(హవ్యము)ను అను నీరెండు తెఱఁగుల కర్మలలో, పితృక్రియలె=పితృప్రీతికరములైన శ్రాద్ధములే, సూక్ష్మలు=సూక్ష్మబుద్ధితో నిర్వహింపవలసినవి, అగుటఁ=అగుటవలన, పితృభక్తుఁడవు ఐ=పితృదేవతలయందు భక్తిగలవాఁడవై, శ్రుతి...కుఁ - శ్రుతి=వేదాధ్యయనము - శీల=సదాచారము - తపః=వ్రతానుష్ఠానము - వీనిచేతి - శాంత=శమముగలవారయిన - అచ్యుతభక్తులకుఁ=విష్ణుభక్తులకు, ఒసఁగి=శ్రాద్ధదేయమును ఇచ్చి, (నీపితృదేవతలను) ఉన్నతగతికిఁ పనుపుము=ఊర్ధ్వలోకములకు పంపుము.

హవ్యములకన్న కవ్యములే సూక్ష్మధర్మము లగుటచేత, వేదాధ్యయన సదాచార చాంద్రాయణాదివ్రతములచే శాంతచిత్తు లయిన వైష్ణవులకు శ్రాద్ధ(దేయ)ముల నిచ్చి నీపితృదేవతకు ఉత్తమగతిం గలిగింపుము, అధముల కిచ్చినయెడల శ్రాద్ధము ఫలింపదు; పితరులకు ఉత్తమగతి కలుగదు. కవ్యము నుపేక్షించిన మహాప్రత్యవాయము కలదు; హవ్యము ఫలింపదు. యజ్ఞముసేయనివాని నేమియు ననరుగాని తద్దినము మానినవానిని ఇంటికి రానీయరుగదా.

'పితృపూజనమగ్ర్యము దై । వతపూజనమునకు మనుజవల్లభ, పితృదే
వతలఁ గొనియాడుదురు దే । వతలాదిగఁ గల్గు నెల్లవారలు భక్తిఁ.' అనుశా.

'దైవికకృత్యంబులను। భూవర భూసురుల సూక్ష్మముగ శోధింపం
గావలదు గాని పితృపూ। జావిధికి బరీక్షవలయు సమ్యగ్భంగిన్.' అనుశా. 3 (171.)

క. దానము ద్విజరక్షణకును। జ్ఞానము నిజరక్షణకుఁగ శరణము చొరు మెం
తే; నారాయణు 'రాజ్యా। న్తే నరకం ధ్రువ' మటంట దీఱునె యొంటన్. 276

దానము=ఉదకస్పర్శ పూర్వకముగా నీవు ఇచ్చెడియీవి, ద్విజరక్షణకున్ = బ్రాహ్మణుల ప్రోపునకును, జ్ఞానము=పరతత్త్వస్వరూపము నెఱుంగుట, నిజరక్షణకునున్ =ఆత్మరక్షణమునకును, కాన్ = అగుచుండఁగా, ఎంతేని = మిక్కిలి, భక్తితో, నారాయణున్ శరణము చొరుము= శ్రీవిష్ణుని రక్షకునిగా నాశ్రయింపుము; రాజ్యాన్తే=రాజ్యము తుదియందు, నరకం=రౌరవాది నరకప్రాప్తి, ధ్రువమ్=తప్పదు, అటంట=అనువాక్యమునం జెప్పఁబడిన యనుష్ఠానము, ఒంటన్= నారాయణాశ్రయణమునం దక్క మఱియొక యుపాయముచే, తీఱునె=తప్పిపోదు.

నీవు ధారాపూర్వకముగా చేయునట్టి షోడశమహాదానములు బ్రాహ్మణ పోషణమునకును నీయొక్క పరతత్త్వజ్ఞానము నిక్షేమమునకును అగునట్లుగా, వర్తించుచు, రాజవైనందున జ్ఞానాజ్ఞానపూర్వకరాష్ట్రకృత స్వకృతాది బహుపాప సముచ్చయము కతంబున నీకు రాజ్యాంతమునందు తప్పక కలుగునట్టిదైన నరకపాతమునకు నివృత్తికొఱకు శ్రీమన్నారాయణుని చరణములను శరణముఁ జొందుము. దానం దప్ప వేఱొంట ఆనరకము తప్పదు.—

"దశ సూనాసహస్రాణి అహ్న రాజా కరోతి వై।
తాన్యేవ వరుతే రాత్రౌ ఘోరః స్తస్య పరిగ్రహః" —హారీతస్మృతి.

తే. ఆలిఁ దితిభక్తి, స్త్రీపుంసపాళి వావి,। యతి వశిత్వము, దిగుజాతు లగ్రజాతి
ననుసరించుట, హితవృత్తి నధిపునకు। భృత్యుఁడొదవుట, నృపదండభీతిఁ జుమ్ము.

ఆలిపతిభక్తి=భార్యభర్తను భక్తితో ననువర్తించుట, స్త్రీపుంసపాళివావి = స్త్రీపురుషుల సంబంధము వావి (నతిక్రమింపకుండుట), యతి వశిత్వము = సన్న్యాసి ఇంద్రియనిగ్రహము కలవాఁడై యుండుట, దిగుజాతులు = క్రిందిజాతివారు, అగ్రజాతిన్ = తొలిజాతివానిని, అనుసరించుట = అనువర్తించుట, భృత్యుఁడు = సేవకుఁడు, అధిపునికిన్ = దొరకార్యమునకు, హితవృత్తిన్ = అనుకూలమైన వర్తనతో, ఒదవుట = ఉపయోగపడుట, ఇవన్నియు, నృపదండభీతిఁ జుమ్ము=రాజదండనవలని భయముచేతఁ జుమా - కావున అతిక్రమములను తప్పక దండించుచుండ వలసిన దనుట.

"అదణ్డ్యాన్ దణ్డయన్ రాజా దణ్డ్యాం శ్చైవా ప్యదణ్డయన్
అయశో మహ దాప్నోతి నిరయం చాధిగచ్ఛతి."

సముచ్చయాలంకారము:—

"అగువర్ణింపననేకము। యుగపద్భావాశ్రయము సముచ్చయమున ని
పగతురు వెఱతురు పఱతురు। వగతు రసి విడుదురు పుట్టమై నిలుతు రనిన్." అలం.

ఆ. చంపి ధార్మికుండు, సతిఁ బొంది మఱి బ్రహ్మ। చారి, బొంకి సత్యశాలి, యారగించి సదుపవాసి, కేడించి శూరుఁడు,। చింది ధనియు, నగు విచిత్రసరణి. 278

(రాజు), విచిత్రసరణిన్ = వింతప్రకారముచేత (వింతగా), చంపి=(వధ్యులను) సంహరించి, ధార్మికుండు=ధర్మమాచరించువాఁడును (వధ్యులను వధించుటయే ధర్మాచరణ మనుట),

మఱి = మఱియు - సతిన్ = సాధ్వియగు భార్యను, (పర్వాది వర్జముగా ఋతుకాలమందు) - పొంది - బ్రహ్మచారి = బ్రహ్మచర్య వ్రతస్థుఁడును (అట్లు నియతి గలిగియుండుట బ్రహ్మచర్యమే యనుట), బొంకి = (ఒకని ప్రాణము కాపాడుటలో నగు సన్నిమిత్తములచే), అనృతమాడి, సత్య శాలి=సత్యముచే ప్రకాశించువాఁడును - (ఆబొంకు సత్యమువలె ఫలప్రదమనుట), ఆరగించి = (ఎప్పుడుపట్టిన నప్పుడెల్ల భోజనము చేయక రెండుపూటలే) భోజనము చేసి - సదుపవాసి = మంచి యుపవాసములు చేయువాఁడు - (అనఁగా ఆభోజననియమము ఉపవాసముతో సమానఫల మనుట), కేడించి = (పెద్దలమీఁదికి నడవక) తొలఁగి - శూరుండున్ = వీరుఁడును (పెద్దలమీఁద పోరకుంట శూరులను కూల్చుటతో సమానమనుట), చింది=ధనమును (సత్కార్యములకై) వ్యయించి - ధనియు=ధనవంతుఁడును (రాజు సద్వ్యయము చేసినధనముచేత ధనిగాని, బొక్కసములో ధనము మూల్గుచుండుటచేత ధనిగాఁడు-అనుట) - విరోధాభాసాలంకారము.

"తొలుత నగపడి విరోధ ము। వల నన్వర్థాకలనమువలన నడఁగినన్
బొలుచు విరోధాభాసము। చెలఁగు శివుం డయ్యు నితఁడు శ్రీపతియై నాన్." అలం.

'చంపి ధార్మికుండు'—

"వధ్యాయే ఉదఘ్నాన్ యః సమ్యగ్ధ్వన్ఛ్యాంశ్చ ఘాతయేత్
ఇష్టం స్యాత్ క్రతుభి స్తేన సమాప్తవరదక్షిణైః." యాజ్ఞవల్క్యః.

"గరదుని గృహదాహకు మం। త్రరహస్యవిభేది నాతతాయిఁ బరసతీ
హారు బంధుఘాతిఁ బరధన। హరణపరునిఁ జంపి పుణ్యుఁడగు నృపుఁ డనఘా" శాంతి.

"తనతోఁ దుల్యం డైనను। మనుజాధిప యధికబలసమగ్రత్వము గ
ల్గిన నని శత్రు నివధియించి నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. శాంతి. 5 (516)

"పరబలముపై నడరి సొత్తురు వట్టులు వాఁడిఁజంపుదురు దురమునన
ప్పురుసఁదనంబును; బుణ్యో। త్తరమని వేదములు సెప్పు దనుతరిమధ్యా" అను శా. 5 (64).

'సతిఁబొంది సద్బ్రహ్మచారి':—

"పంచదశిని జతుర్దశిఁ బద్మమిత్ర। వసుతిథుల జన్మతిథులందు వలయు బ్రహ్మ
చర్య. మడుగులాం గొంటితోఁ జనదు తోమ, । దోషములు కొంటియముకూరభాషణంబు".

"ఋతౌ స్వదారేషు సంగతి ర్యా విధానతః।
బ్రహ్మచర్యం త దేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్।
రాజ్ఞ శ్చైవ గృహస్థస్య బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్." - యాజ్ఞవల్క్యోపనిషత్తు.

'బొంకి సత్యశాలి':—

సీ. "సత్యంబు పలుకుట సర్వధర్మములకు మిక్కిలి, యనృతంబు మేటిపాత
కము; తద్విశేషంబు గలదు; చెప్పెద, నొరునర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచుపాతకులతో సూనృతం బాడుట పాపంబు. బొంకులు పలికి యట్టి
వారి హింసించుట పరధర్మ; మిది యొక్కఁ డేలి భూతములకు హితము సేయు
తే. బొంకు లెల్లను ధర్మముల్; భూతబాధకంబు లగునిక్కములు పాతకములు వినుము.
శాంతి. 3 (45).

'ఆరగించి సదుపవాసి'—

వ. "అనశనవ్రతంబులందును జూలకని తెఱం గెఱింగించెద.—

చ. "పగలును రేయుఁ గుడ్చి, జలపానము లోనుగఁ గుడ్చునప్డె తు
ష్టిగ నొనరించి, మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మఱియెప్డు నంటకే
మి గతిని బాపముం బొరయమిం దలకొల్చుచు హోమకార్యముం
దగు మెయిఁ జేయుచున్న దిను తంగటిజు న్నగు నూర్ధ్వలోకముల్." అనుశా. 4 (164)

ఆ. ప్రణిధి స్వపురగృహియు, భాషావిదుఁడు ప్రణి। ధ్యంతరావిదుండు నగు; నతండు
లింగమాత్రకృశుఁడు లిప్సాతిగద్రవ్య। దానధనియుఁ గాక తఱియఁ జొరఁడు.

ప్రణిధి=వేగువాఁడు, స్వపురగృహియున్ = తేని నగరమందు ఇల్లు గలవాఁడును, భాషావిదుఁడున్ = పెక్కు భాషలు తెలిసిన వాఁడును, ప్రణిధ్యంతర అవిదుండు = కడమ వేగులెవరో ఎఱుఁగనివాఁడును, అతండు = ఆజనుఁడు, లింగమాత్రకృశుఁడు = ఎల్లలింగములును (అనఁగా గుర్తులును) లేనివాఁడును, అగున్ = కావలయును, (అతఁడు) లిప్సా అతిగ ద్రవ్యదానధనియున్ =కోరికను దాఁటి పోవునట్టి ధనముయొక్క యీవిచేత ధనికుఁడును (అతనిని రాజు వానికోరినంతకన్న హెచ్చుగా ఇచ్చి ధనికునిఁ గావింపవలయును), (అమితధన మిచ్చిననేగాని), తఱియన్ = అవృత్తియంగుఁ జొచ్చుటకు, చొరఁడు = ఇచ్ఛగింపఁడు, - వేగుఁదనమునకు తగినవాఁడైయుండి విశేషధనముం గొన్నవాఁడేగాని యావృత్తికిరాఁడు. 'ప్రణిధిః ప్రార్థ నేచరే' అమ.

చరుఁడు తేనియూరనిల్లు గలవాఁడును నానాభాషావిదుఁడును తేనియితరచరుల నెఱుంగనివాఁడును వారికి ఎఱుకపడని వాఁడునుంగా నుండవలయును. అతఁడు నానా వేషములు ధరింపఁ గలవాడునుం గావలయు. అట్టివాఁడు అమిత ధనమిచ్చిననే గాని ఆపనికిరాఁడు; ఎంతధనమైన నిచ్చి అట్టివేగులను సంపాదించుకొనవలసినది అనుట.

ఇప్పద్యమున 'లింగమాత్ర కృశుఁ' డను పాఠంబును 'ప్రణి...దుండు=దేశాంతరపు వేగరులనుదాఁ దెలిసినవాఁడును' అను టీకయు విచారణీయములు. వేగులు సర్వలింగధారులుగాను ఒండొరుల నెఱుంగకయుండు నది యని నీతిసారము. ఈవిషయములు ముద్రారాక్షస నాటకమున సునిరూఢములు.

'అరులకడ నిజభూమియం దనుజతనుజ। బాంధవామాత్యమిత్రులపాల వేష
ధరుల వేగులఁ గాఁ బెట్టి ధరణిపునకు। వలయు నొండొరు నెఱుఁగనివారిఁ గాఁగ.' శాంతి.

"తపస్విలిఙ్గినోధూర్తాః పణ్యశిల్పోపజీవికాః। చరాశ్చరేయుః పరితః పిబన్తోజగతాంమతమ్।
జడమూకాన్ధబధిరచ్ఛద్మానః షణ్డకా స్తథా।కిరాతావామనాఃకుబ్జా స్తద్విధాయేచకారకాః।
భిక్షుకాశ్చారణాదాస్యోనానాకార్యకళావిదః।అన్తఃపురగతావార్తామాహరేయురలక్షితాః"

"తీక్ష్ణః ప్రవ్రజితశ్చైవ సత్త్రీ విషద ఏవచ
ఏతేజ్ఞేయా స్తు సఞ్చారాః సర్వేనాన్యోన్య వేదినః." కామందకి.

'లింగమాత్ర'—"మాత్రంస్యా। దవధారణ కాత్స్న్యయోః." నానా.

"శ్రియఃకురూణా మధిపస్యపాలనీం। ప్రజాసువృత్తిం యమయుఙ్క్త వేదితుమ్
సవర్ణిలిఙ్గీ విదితః సమాయయౌ యుధిష్ఠిరం ద్వైతవనేవనేచరః." భారవి.

"వర్ణిలిఙ్గీ... బ్రహ్మచారి వేషవా నిత్యర్థః" అని మల్లి-టీక.

క. తనుభృశ దమనజ సుకృతము। ధనదత్తిన కొనఁగవలయుఁ దత్తద్భృతుకమ
ర్దన మజ్జన భోజన లే। పన వసన ప్రసవవహన పరతం బతికిన్. 280

పతికిన్ = ధర్మపరిపాలన చేయు ప్రభువు, తత్త...తన్ - తత్తత్ = ఆయా - ఋతుక = ఋతువునందు తగిన - మర్దన = సంవాహనము - మజ్జన = స్నానము - భోజన = ఓగిరము - లేపన = మైపూఁత, వసన = వస్త్రములయు - ప్రసవ = పువ్వులయు - వహన = తాల్చుట - వీనియందు, పరతన్ = ఆసక్తుఁ డగుటచేత, (ఆసక్తుఁడైయుండి), తను...మున్ - తను = దేహముయొక్క, భృశ = అధికమయిన - దమన = క్లేశపెట్టుటవలన - జ = పుట్టునట్టైన - సుకృతమున్ = పుణ్యమును, ధనదత్తిన = ద్రవిణముయొక్క యీవిచేతనే, కొనఁగవలయున్ = ఆర్జింపవలయును.

రాష్ట్రమును యథాధర్మముగా పరిపాలనచేయు రాజు సకలభోగములను సదా అనుభవించుచునే యుండవచ్చును, దేహదమనకారియగు తపస్సుచేయ నక్కఱలేదు, అందులపుణ్యమును దానములచేతనే ఆర్జింపవలయును. 'దత్తి = దానము' - "ఐదు పది సేయరు దత్తిన దక్కన్" 2(34)

"తపః పరంకృతయుగే। త్రేతాయాం జ్ఞాన ముచ్యతే
ద్వాపరే యజ్ఞ మిత్యాహు। ర్దానమేకంకలౌ యుగే" పరాశర.
"అధ్యాక్రాన్తా వసతి రమునాప్యాశ్రమే సర్వభోగ్యే
రక్షాయోగాదయమపితపః ప్రత్యహం సంచినోతి." అని కాళిదాసుఁడు.

'పతి' - "పాతి రక్షతీతి పతిః." రక్షించువాఁడని వ్యు.

"పుణ్యకర్మముల్ నేయుచు భూసురులకు। వివిధధనములు ప్రీతితోవినయ మొప్ప
నొసఁగుచుండెడువారుపూర్వోపచితము। లైనకిల్బిషములఁబాతురవనినాథ." శాంతి.1(318)
"తపోమూల మిదం సర్వం దైవ మానుషకంసుఖమ్" మనువు.
"య ద్దుస్తరం య ద్దురాపం య ద్దుర్గం య చ్చ దుష్కరం.
సర్వం తు తపసా సాధ్యం తపోహి దురతిక్రమమ్." - మను.
"బ్రాహ్మణస్యతపోజ్ఞానం। తపఃక్షత్రస్య రక్షణమ్"
"న దానా దధికం కిఞ్చి ద్దృశ్యతే భువనత్రయే।
దానేనప్రాప్యతే స్వర్గః శ్రీర్దానేనైవ లభ్యతే -
దానేన శత్రూ ఞ్జయతి వ్యాధి ర్దానేన నశ్యతి।
దానేన లభ్యతే విద్యా దానేన యువతీజనః
ధర్మార్థ కామ మోక్షాణాం సాధనం పరమం స్మృతమ్" ఆదిత్యపురాణము-పరాశర. 32.

క. నానావిధషాడబముల। నాను నృపాహార మెపుడు, నపరాహ్ణమునం
గాని మఱి శుద్ధకోష్ఠతఁ।గాని, తమి న్భుక్తియెపుడుఁ గడుఁ బథ్య మగున్. 281

నానావిధ షాడబములన్ = పలుదెఱంగుల రుచులతో, అను నృప ఆహారము = భుజింపఁబడు రాజభోజనము, ఎపుడున్ = ఎప్పుడును, అనున్ = కూడియుండును. అపరాహ్ణమునన్ = మధ్యాహ్నమునకు అనంతరమేగాని, మఱి = మఱియు, శుద్ధకోష్ఠతఁగాని = ఆమాశయపక్వాశయశుద్ధిం జెందిగాని, తమిన్ = ఆఁకటితో, భుక్తి = తినుట, ఎపుడున్ = సదా, కడున్ = మిక్కిలి, పథ్య మగున్ = దేహమునకు హిత మగును.

రాజ భోజనములు నానావిధ మధురాది రసయుక్తము లయిన గురుపదార్థములతో నిండియుండు నవి గావున, అపరాహ్ణముననేగాని ఆమపక్వకోశశుద్ధి చెందిగాని, ఆఁకటితో భుజించుట రాజునకు మిక్కిలి హితకారి; ఆఁకలిలేక భుజింపఁగూడదు, ఆఁకటితో భుజించినది చక్కఁగా జీర్ణమై దేహమునకు బలారోగ్యములు కలిగించు ననుట. —

'పాడబము' - ఉపోద్ఘాతమందలి శబ్దపట్టికం జూచునది.

క. విను, వర్గసమత నృపుఁ డు । న్నను, ధర్మాంశంబె హెచ్చెనా, పెఱమడి కె
త్తినసీరును దెగి యలరా । జనపుమడికి నెక్కినట్లు చను ముద మందన్. 282

విను = ఈ చెప్పఁబోవు మాటను చక్కఁగా గ్రహింపుము, నృపుఁడు = నరపాలకుఁడు, వర్గసమతన్ = మూఁడు పురుషార్థములయందు సమదృష్టికలిమితో, ఉన్ననున్ = ఉన్నప్పటికిని, ధర్మ అంశంబె = ధర్మమునకు వ్యయమగు ధనభాగమే, హెచ్చెనా = అధికమైనయెడల, పెఱమడికిన్ = వేఱుచేనికి, ఎత్తినసీరును = ఏతముతో చల్లిన జలముకూడ, తెగి = గనిమ కోఁతఁబడి, ఆలరాజనపుమడికి నెక్కినట్లు = ఆరాజనపువరిచేనికి పాఱిన ట్లో అట్లు, ముదము = సంతోషమును, అందం జనున్ = పొందవలయును.

మూఁడు పురుషార్థములకును రాజు సమముగా ధనవ్యయము చేయవలయును; అందు ధర్మార్థమైన వ్యయము హెచ్చెనా అందులకు మిక్కిలియు సంతోషింపవలయును; మూఁటిలోను ధర్మమందే అధికాసక్తి నుంపవలయు ననుట. - ఉపమాలంకారము.

"త్రివర్గో ధర్మకామార్థైశ్చతుర్వర్గః సమోక్షకైః" — అమ.

"ధర్మార్థకామాః సమమేవ సేవ్యా యోహ్యేకసక్తః స్సజనో జఘన్యః" భారవిటీక.

"అసక్తమారాధయతో యథాయథం । విభజ్య భక్త్యా సమపక్షపాతయా,
గుణానురాగాదివ సఖ్యమీయివాన్ । నబాధతేఽస్య త్రిగణః పరస్పరం." భారవి. (11)

"ధర్మార్థావిరోధేన కామం సేవేత । ...సమం వా త్రివర్గం సేవేత...।

"ధర్మార్థకామానాం యుగప త్సమవాయే పూర్వః పూర్వో గరీయాన్" సోమదేవుఁడు.

"అర్థసిద్ధికంటెఁ నరయ నెక్కుడు ధర్మ । సిద్ధి, దాన సకలసిద్ధులును । బ్రహ్మశస్త్రఫంగిఁ జేరు, శాశ్వతకీర్తియు । సంభవించుఁగలుగు సద్గతియును." శాంతి. 2(103) చూ(274) "పాత్రభూతు" టీక

క. వెలయించునట్టి యొకమణి । వెలుఁ గానం గొనుము, ధరణి వెండి సువేషో
జ్జ్వలతకు వలదే వాసర । ముల మణులవిభూషణములు భూపతి దాల్పన్. 283

వెలయించునట్టి యొకమణిన్ = శ్రేయఃప్రదమైన యొకరత్నమును, వెలుఁగు ఆనన్ = వెలుఁగొందుటకై, భూమిలో, వెండి(యున్) = పైగా, భూపతి = రాజు, సువేష ఉజ్జ్వలతకున్ = మంచి కైసేఁతచేత వెలుఁగొందుచుండుటకై, వాసరముల మణులవిభూషణములన్ = ఏడువారముల రత్నాభరణములను, తాల్పన్ వలదే = తప్పక ధరింపవలయును.

నీవు ఉజ్జ్వలుఁడవై యుండుటకుగాను, మేలు కలిగించునదైన యొకమణిని ధరింపుము; ఇంతియగాక రాజు వారవారము వేఱువేఱు రత్నాభరణముల మంచి కైసేఁతచే వెలుంగుచుండవలయును.

"రత్నేన శుభేన శుభం భవతి నృపాణా మనిష్ట మశుభేన ।
యస్మా దతః పరీక్ష్యం దైవం రత్నాశ్రితం తజ్జ్ఞైః" బృ. సం.

"ఏమి చేయవలయు నిఁకమీఁద రత్నమె । క్కటియుఁ గానరాదు, కడువిచార
కరముగాదె, యితఁడు కడువడి రాజ్యాధి । పత్య మూనకున్న, వసుధ చెడదె?"

"యజ్ఞారి యమాత్యులార, యతిహారిసువర్ణల రత్నరాజి మీ
రారసికై । కొనుండనిన హర్షమునన్ వరమౌళిరత్న సంభార మను గ్రహింపుఁ డన"

దృష్టంబు లుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచరించుచు నశక్యంబున కార్తశరణాగత రక్షకుం డగు పుండరీకాక్షుమీఁద భారంబిడి యనహంకృతిఁ బ్రవర్తిల్ల నెల్లసంసిద్ధులు కరస్థంబులగు. నది యట్లుండె, నట్లయిన పట్టబద్ధుండగు రాజు ధర్మంబునందదృష్టియిడి నడవవలయు; వరుణ వైశ్రవణ వాయు వైశ్వానర వాసవాదులజన్మంబులును బహుభవార్జిత క్రియాలబ్ధంబుల భూభువస్స్వరాదులగు నిజగంబులును ధర్మప్రతిష్ఠితంబులు కావునఁ దదాచరణచణుండవై ఋణత్రయంబును నీఁగి సమానులం దుత్తమశ్లోకుండవై రాజ్యపరిపాలనంబు సేయుమని యభిషిక్తుం జేసె. నిది మదీయభక్తప్రభావం" బని యంబుజాలయకాంతతిచ్చె.

మను దండధరాదులు=మనువు యముఁడు లోనగువారు, ప్రజానాథుఁడు=రాజు, విరాట్ సమ్రాట్ ప్రభృతి=విరాట్టు సమ్రాట్టు మొదలుగాఁగల, వేద ఉదిత శబ్ద వాచ్యుండు=వేదమందు చెప్పఁబడిన శబ్దములచే చెప్పఁబడినవాఁడు, సోఁఢోర్చి = ప్రయాసను సహించినవాఁడు. అలజళ్లు = ఉపద్రవములు, కేవ...మ్ములక్ _ కేవల ఇంద్రియ = ఇంద్రియమాత్ర _ ప్రీతి = హార్ద ముకై - బందీకృత = బందిగా చేయఁబడిన _ పరకళత్ర _ పరభార్యలయు _ పథిక = బాటసారుల _ పరిషత్ = సమూహమును - ప్రహరణ = కొట్టి దోఁచుకొనుటచేత - ప్రాప్త = పొందఁబడిన _ విత్తములక్ = ధనములచేత, పాటచ్చర ప్రభులకున్ = దొంగదొరలకు,...లాంపట్యము= లోలుభత్వము ... ఏమి పనియని = ఏలయని, ... అవనియెడక్ = భూమివిషయములో, అవన వైముఖ్యంబు = రక్షించు విషయమున విముఖత - ఆజ్ఞ యిడుక్ = దండించును. ఆ ట్లాజ్ఞయిడ శక్యంబుగాదు అని యన్వయము. భూమిదివిజులకుక్ = బ్రాహ్మణులకు, బాడబుండు = బ్రాహ్మణుఁడు (అగస్త్యుఁడు), బ్రహ్మదండంబునక్ = బ్రాహ్మణులపై దురాయిపెట్టుటచేత, ఒక బ్రాహ్మణుండు=వసిష్ఠమహాముని, శ్రుతదృష్టంబును=విన్నవియు, కన్నవియు - బహు...ల _ బహు = పెక్కు - భవ = జన్మములందు _ ఆరబ్ధ _ కావించిన - క్రియా = తపః క్రియాచేతను - లబ్ధంబుల = పొందఁబడినవే. ఆచరణ చణుండవు = ఆచరించుటచేతఁ బ్రసిద్ధుండవు (ఆచరించుటలో సమర్థుఁడవు), ఋణత్రయంబుక్ = దేవఋణ ఋషిఋణ పితౄణములను.

ఆశ్వాసాంతము

శా. దుగ్ధాంభోధిమహాగృహోత్సుక, సుధాంధోబృందచూడామణి
ద్యుగ్ధారాశబలీకృతాంఘ్రియుగ, కారుణ్యాంబుసింధూభవ
ద్దృగ్ధామా, ధృతమంథ, సింధురవరార్తిక్షేపిదోశ్చక్ర, శ్రీ
ముగ్ధాలాపరసాపరా, కృతపలాన్ముఖ్యస్వనోద్వర్గరా. 286

దుగ్ధ అంభోధి మహాగృహ ఉత్సుక = పాలసముద్ర మనెడు గొప్పయింటికై ఉవ్విళ్లూగడువాఁడా, సుధా...గ _ సుధాంధస్ = దేవతలయొక్క - బృంద = సమూహములయొక్క - చూడ = సిగలయందలి _ మణి = రతనములయొక్క _ రుక్ = ప్రభయొక్క - ధారా=ప్రవాహములచేత - శబలీకృత = పలువన్నెలుగలదిగాఁ జేయఁబడిన - అంఘ్రి = పాదములయొక్క - యుగ = ద్వంద్వముకలవాఁడా, కారు...మా _ కారుణ్య = కనికర మనెడి - అంబు = జలమునకు - సింధూభవత్ =సముద్రముగా నొప్పుచున్న - దృక్ _ చూపుయొక్క - ధామా= తేజస్సు కలవాఁడా, ధృతమంథ=మోయఁబడిన కవ్వము (మందర మనుట) కలవాఁడా, సింధురవర ఆర్తి

క్షేపివోః చక్ర=గజేంద్రునియొక్క పీడను మాఁటివైచునట్టి చేతి గుడుసువాలు కలవాఁడా, శ్రీముగ్ధ ఆలాపరస ఆదరా = లక్ష్మియొక్క మనోహరవాక్కుల స్వారస్యమందు తగులము కలవాఁడా, కృత ... రా - కృత = చేయఁబడిన - పలాత్ = రాక్షసులయొక్క - మూర్ఛ = సొమ్మసిల్లుట కలదైన - స్వన=మ్రోఁతతో - ఉద్యత్ =విజృంభించుచున్న - దరా=శంఖము (పాంచజన్యము) కలవాఁడా. [ఈసంబుద్ధులకు 5(2)లోని "అవధరింపు"ము అను క్రియతో నన్వయము].

క్షీరాబ్ధిమహాగేహప్రియా, ప్రణతులైనసురల సిగ రతనముల వెలుఁగు జాలుల చిత్రవర్ణములతో నీపాదములు తేజరిల్లుచున్నవి, నీక్రేఁగంటి దీప్తియందు కడలియంత కనికరము ప్రవహించుచున్నది. కవ్వపుఁ గొండయైన మందరమును మోచి అమృతము దొరకునట్లు గావించి దేవతలం బ్రోచితివి, నీచేతి చుట్టువాలు విసరి గజేంద్రుని యార్తిని మాఁటివైచితివి, మహాలక్ష్మియొక్క మనోహర సరసాలాపములను విన్నకొలఁదియు వినఁగోరుచున్నావు, నీచేతి శంఖమును ఊఁది ఆమ్రోఁతచే రక్కసులను మూర్ఛిల్లఁ జేసెదవు, (అట్టి నీకు మమ్ముం బ్రోచుట యేపాటి అని కవి ప్రార్థన). ఇందు రెండురూపకములు కలవు.

"అమర్త్యా అమృతాంధసః", — స్యు - ప్రభారుగ్రుచిస్త్విడ్భా భాశ్ఛవిద్యుతి దీప్తయః," "చిత్రకిర్మీర కల్మాష శబలైతాశ్చ కర్బురే", "దేశే నద విశేషే2బ్ధౌ సింధుర్నా సరితి స్త్రియామ్" "గృహాదేహాత్విట్ప్రభావా, ధామాని". అమ. "ఆర్తిః పీడాధనుః కోట్యోః", "ముగ్ధ స్సుందరమూఢయోః" అమ. "దరో2స్త్రీ కన్దరభయయోః" నానా. పలాత్ - పల=మాంసమును - అద్=భక్షించువాఁడు. నారాయణుని చక్రము 'సుదర్శనము', శంఖము 'పాంచజన్యము', "శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రం సుదర్శనమ్" అమ. గజేంద్రుం బట్టిన మకరమును నారాయణుఁడు చక్రాయుధముతో ఖండించె నని భాగవతకథ.

"కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్వరతాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరచక్రమున్ బహువిధబ్రహ్మాండ భాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్."
"భీమంబై తల ద్రుంచి ప్రాణములఁ బాపెన్ జక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధరదేహమున్ జకితవన్యేభేంద్ర సందోహమున్
గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్". భాగ. ౮(111).

క. కరధృతదరారివితరణ। పరిపాలిత తొండమాన్నృపాలక, పునరు
త్తరిత నరనప్తృబాలక, । శరణాగతసేవధీ, భుజంగాశరథీ. 287

కర...లక - కర=నీచేతియందు - ధృత=తాల్పఁబడిన - దర = శంఖముయొక్కయు = అరి=చక్రముయొక్కయు - వితరణ = ఈవిచేత - పరిపాలిత = కావఁబడిన - తొండమాన్ = తొండమాన నెడు - నృపాలక=రాజుగలవాఁడా, పు...క - పునః=మరల - ఉత్తరిత = ఉజ్జీవితుఁడైన - నర=అర్జునుని, నప్తృ=మనుమఁడైన-బాలక=బాలుఁడు గలవాఁడా, శరణఆగత శేవధీ - రక్షణార్థులై వచ్చిన వారియొక్క నిధానమా, భు...థీ - భుజంగాశ = గరుడునిచేత - రథీ = అరదము కలవాఁడా.

స్వామీ, నీవు నీ భక్తుఁడైన తొండమానురాజును నీచేతి శంఖ చక్రములను ఇచ్చి రక్షించితివి; అర్జునుని మనుమఁడైన పరీక్షిత్తుఁ తల్లిగర్భములో అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరో

నామక మహాస్త్రముచే మృతుఁడు కాఁగా ఆ శిశువును బ్రతికించితివి, శరణాగతులకు నిధివి, గరుడు నెక్కి నీవు ఎల్లెడలకుం జరింతువు.

"అరం తు శీఘ్రే చక్రాఙ్గే శీఘ్రగామినిషు త్రిషు" నానా. 'అరములు' = చక్రాంగములు=చక్రపుటాకులు - అవి కలది అరి చక్రము—దరారి దర అరి-"అరిదర కరుఁడై" అని వరిస రాజీయము, - ఉత్తరిత, తౄప్లవన తరణయోః-తరణం తరః - తరము=దాఁటుట - లక్షణచే - చైతన్యము - ఉత్తరుఁడు = ఉద్గతమయిన చైతన్యము కలవాఁడు - పునరుత్తరితుఁడు = పునఃప్రాప్త చైతన్యుండుగాఁ జేయఁబడిన వాఁడు, నామధాతువు - మరల బ్రదికింపఁబడినవాఁడు. "నప్తృ - నపత న్న్యనేన నప్తా పౌత్రో దౌహిత్రశ్చ" సి.కౌ.ఉణాది—"నిధర్నా సేవధిః" అమ.

చంద్రవంశ్యునికి సుధర్ముఁడను రాజునకు పట్టమహిషి యందు ఆకాశరాజను పుత్త్రుండును, ఒకానొక నాగకన్యయందు తొండమాన చక్రవర్తియు జనించిరి, ఆకాశరాజునకు పుత్త్రకామేష్టిచేత పద్మావతియను నయోనిజయు వసుధానుండను సుతుండును జనించిరి. వేంకటాచలమందు ఎఱుకవారిగా నుండి శ్రీనివాసమూర్తి పద్మావతిం బరిణయ మాయెను, ఆకాశరాజు ననంతరమందు పితృవ్యభ్రాతృవ్యులు రాజ్యముకై పోరాడు నపుడు శ్రీనివాసుఁడు తన భక్తుఁడైన తొండమానునకు విజయార్థము తన శంఖచక్రము లిచ్చెను, చక్రముతో తొండమానుఁడు వైర నోడించెను.

ఉత్తరాగర్భస్థుని అభిమన్యుపుత్త్రుని పరీక్షిత్తును అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరమను నస్త్రమునుండి శ్రీకృష్ణులవారు కాపాడకిచేఁ గాచిన కథను భాగవతంబునం గనవచ్చును.

మత్తకోకిల. కుండలిద్విషదుగ్రకేతన, గోత్రభిద్ద్రుమ హారి దో
ర్చండిమోత్పులకీకృతాంగకసత్య, దౌత్యకురూక్త వా
క్పండితత్వ, యశోనిధీకృతపాండవేయ, కపర్ది కో
దండఖండనపాటవాంచదుదారదారసమాగమా. 288

కుం...న - కుండలిద్విషత్ =నాగశత్రువు (గరుత్మంతుఁడు) - ఉదగ్ర=ఉన్నతమైన, కేతన = ధ్వజమునందుఁగలవాఁడా, గోత్ర...త్య - గోత్రభిత్ = ఇంద్రుని - ద్రుమ = వృక్షమయిన పారిజాతమును - హారి=హరించినదైన - దోశ్చండిమ=బాహువులయొక్క తీవ్రతచేత - ఉత్పులకీకృత - ఉద్గతమైన గగుర్పాటు కలయవయవములు కలదైన - సత్య = సత్యభామ కలవాఁడా, దౌ...త్వ దౌత్య=దూతభావమందు (రాయభారమందు) - కురు = కౌరవులచేత, ఉక్త=ప్రశంసింపఁబడిన - వాక్=భాషణమందలి - పండితత్వ=పాండిత్యము కలవాఁడా, య...య - యశః=కీర్తికి - నిధీకృత=నిక్షేపముగాఁ జేయఁబడిన - పాండవేయ=పాండుపుత్త్రుఁడయిన ధర్మరాజు కలవాఁడా, కప...మా కపర్ది=శివునియొక్క, కోదండ=వింటియొక్క - ఖండన=త్రుంచుట యందలి - పాటవ=నేర్పుచేత - అంచత్=ఒప్పుచున్న - ఉదార=మహాత్ములయిన - దార = భార్యయొక్క - సమాగమా = ప్రాప్తి కలవాఁడా, [5 (2) "అవధరింపుము," అను క్రియతో నన్వయము].

ఓ నారాయణమూర్తి, ఎత్తయిన నీ టెక్కెమందు గరుడుఁడు వెలుఁగుచున్నాఁడు; నీవు నీ బాహుబలముచేత నందనమునుండి పారిజాతవృక్షమును పెల్లగించి ఇంద్రు నోడించి తెచ్చి యిచ్చి ఒడలెల్ల గగురుపొడుచునట్లు సత్యభామను అలరించితివి. రాయబారమున నీ వాక్పటిమను

కౌరవులుకూడ మెచ్చుకొనిరి. పాండుపుత్త్రుఁడయిన ధర్మరాజునకు కీర్తి కలిగించితివి. అట్టి యోపరమపురుషా, మమ్ముం బ్రోవుము.

"కుణ్డలీగూఢపాచ్చక్షుః శ్రవాః కాకోదరః ఫణీ;" 'గరుత్మాన్ గరుడస్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః। నాగాన్తకో విష్ణురథ' - "ఉచ్చ ప్రాంశూన్నతోదగ్రోచ్ఛ్రితాస్తుఙ్గే" - అమ. - "కేతనం గేహ చిహ్నధ్వజ కృత్యామన్త్రణ కేతుషు," నానా., "సుత్రామా గోత్రభిద్వజ్రీ వాసవో వృత్రహా వృషా -" అమ. "చణ్డో దైత్యవిశేషే యమదాసే త్రిషు తీవ్రకోపనయోః" నానా. 'ఉగ్రః కపర్దీ శ్రీకణ్ఠః శితికణ్ఠః కపాలభృత్' అమ. "ఉదారో దాతృమహతోః" - అమ. పాండవేయ = పాండవ.—

"సురలవరప్రసాదమునఁ జూవె సుపుత్త్రులఁ బాండు రాజు భా
సురముగఁ గాంచెఁ దత్సుతులఁ జూతము రం డని పౌరులెల్ల నొం
డొరులకుఁ జెప్పుచుం బరలి యొండొరులం గడవంగ వచ్చి చూ
చిరి భుజ విక్రమాధరితసింహకిశోరులఁ బాండవేయులన్". ఆది. 5. (150).

శా. ఇది సింహాచలదంభకేసరిపదాభీష్టార్చనాపుణ్యల
బ్ధదురుట్టంకణ పొట్టునూరివిజయస్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాక్షర కృష్ణరాయనృపసంజ్ఞాస్మత్కృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్. 290

ఇది = ఈయాశ్వాసము, సిం...దన్ - సింహాచల = సింహాద్రి యను క్షేత్రమందలి - దంభకేసరి = నృసింహావతారము యొక్క - పద = చరణములయొక్క - అభీష్ట = ప్రియమైన - అర్చనా = పూజచేతనైనట్టి - పుణ్య - సుకృతము చేత - లబ్ధ = పొందఁబడినట్టి - దురుట్టంకణ = చెక్కుటకు శక్యముకాని - పొట్టునూరి = పొట్టునూరను గ్రామమందలి - విజయ = గెలుపును సూచించునట్టి - స్తంభ = కంబమైన - ఉపల = రాతియందు - ఉట్టంకిత - చెక్కఁబడిన - అంక = చిహ్నమైన - దృఢ = స్థిరమైన - ఇష్ట = ప్రియమైన - అక్షర = వర్ణములు కలిగిన - కృష్ణరాయ నృపసంజ్ఞ = కృష్ణరాయ భూపతి యను పేరు కల్గిన - అస్మత్ = నాచేత - కృత = రచింపఁబడిన - ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద యను ప్రబంధమందు, నాలవయాశ్వాసము, హృద్యంబై = మనోహరముగా, మహిన్ = భూమిలో, పొల్పగున్ = ఒప్పుచుండును.

శ్రీకృష్ణదేవరాయలు కటకమును జయించినప్పుడు దారిలో ఈపొట్టునూరికడ తన విజయాంకమైన శాసనమును చెక్కించెను. మా. మను. 'అభిరతిఁ గృష్ణరాయ ... ఇత్యాది పద్యమందు చెప్పఁబడియున్నది.

ఈసింహాద్రి విశాఖపట్టణము జిల్లాలోనిది. ఆస్వామికి అప్పఁడని సంజ్ఞ. కావుననే ఆ సీమలోని నేకులకు అప్పఁడను పేరు ఇప్పటికిని ఎప్పటికిని ప్రసిద్ధము.

'అంక...క్షర' - అంక 'దృఢేష్ట' అని పా. అగపడుచున్నది. 'ద్రఢిష్ఠ' అని సాధురూపము. 'శార్ఙ్గమివ ద్రఢీయః' మాఘ.

చతుర్థాశ్వాసము
సమాప్తము.

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## పంచమాశ్వాసము

క. శ్రీ నీళా జాంబవతీ । మానస తామరస విహారమాణమిళిందా
భా నద్యుదయ కళిందా । నానాంఘ్రిశిరోక్షి శేషనగ హర్యక్షా. 1

శ్రీ...దా - శ్రీ = మహాలక్ష్మి - నీళా = నీళాదేవి - జాంబవతీ=జాంబవతీదేవి - వీరియొక్క - మానస = హృదయములనెడి - తామరస = కమలములయందు - విహారమాణ = క్రీడించుచున్న - మిళిందా=తుమ్మెదా, భా...దా - భా=(దేహ) కాంతియనెడి - నది=(యమునా) నదియొక్క - ఉదయ=పుట్టుకకు - కళిందా = కళిందపర్వతమైనవాఁడా. నా...క్షా - నానా=పెక్కులయిన - అంఘ్రి=పాదములు - శిరః=తలలు - అక్షి=కన్నులు గలవాఁడా, శే...క్షా - శేష=శేషుఁడనెడు (పేరుగల) - నగ = కొండయందలి (అనఁగా శేషాద్రియందలి) - హర్యక్షా = సింహమా:— ఇవన్నియు వేంకటాచలపతికి విశేషణములు.

తా.— శ్రీదేవి నీళాదేవి జాంబవతీదేవి యనెడి ముగ్గురుదేవుల హృదయములయందు తుమ్మెద యెట్లు తామరలయందు (మకరందార్థము) విహరించుచుండునో అట్లు విహరించుచుండువాఁడా (వారిచే ధ్యానింపఁబడుచుండుననుట); కళిందపర్వతమునుండి నల్లని యమునానది జనించి ప్రవహించురీతిగా దేహమునుండి జనించి వ్యాపించెడు నల్లకాంతికలవాఁడా; లెక్కలేని పాదములు, లెక్కలేని తలలు, లెక్కలేని నేత్రములుం గలవాఁడా; ఏదేని కొండయందు సింహముండునట్లు వేంకటపర్వతమందు ఉండువాఁడా.- రూపకాలంకారములు. శ్రీకృష్ణభగవంతునికి రుక్మిణీ - సత్యభామా - జాంబవతీ - కాళిందీ - భద్రా - సుదంతా - మిత్రవిందా - లక్షణలు అని ఎనమండ్రు పట్టమహిషులు. అందు రుక్మిణి శ్రీదేవియొక్క యవతారము; జాంబవతి జాంబవంతునికూఁతురు; నీళాదేవి యనియొక గొల్లకూఁతురును శ్రీకృష్ణులవారిభార్య. ఆమె తండ్రి కుంభుఁడను గొల్లదొర యాలమందలలో కాలనేమి యను దానవుని కొడుకులు ఏడుగురు ఆఁబోతులుగానుండి జనుల కపాయము చేయుచుండఁగా వారిం బరిమార్చు వానికి తన కూఁతునిచ్చి పెండ్లిచేసెదనని యాతఁడు ప్రతిజ్ఞచేసి అట్లు ప్రకటించెను. ఎవ్వరును కోడెలంగూల్ప నేరరైరి. అంతట శ్రీకృష్ణుఁడు వచ్చి వానిరెంటిం బరిమార్చి నీళను పెండ్లియాడెను. వైకుంఠవాసి నారాయణుని దేవేరులలోను నీళ గలదు.

"అచ్చెరువుగ నా చెంతకు । వచ్చెను సిరి వచ్చె నీళ వచ్చెను గిరియున్
వచ్చెను పరివారము నా । కిచ్చట సంసారమింక నిచ్చ నటించుగా.
అని యజ్ఞవరాహస్వామి సంతసించుచున్నంతి" అని వేంకటాచలమాహాత్మ్యము.

హృదయము అధోముఖ పద్మాకారముగా నుండును.

"హృది స్థానే స్థితం పద్మం, తస్య వక్త్ర మధోముఖమ్
ఊర్ధ్వనాళ మధోబిన్దు తస్య మధ్యే స్థితం మనః." ఉపనిషత్తు

నారాయణమూర్తి నల్లనివాఁడగుటచేత ఆయనయందు ఆరోపితమయిన భృంగత్వము మిక్కిలి సొంపుగానున్నది. విశ్వరూపమునందు శిరోంఘ్ర్యక్షులు సంఖ్యాతీతములు.

యమునానది కళిందపర్వతమునుండి పుట్టునుగాన కాళిందియనఁబడును; యమున నలుపు:—

అట్లు వీఁపున నంటుకొన్న యామావిలేఁజివుళ్లతో వారు మెలంగుట యెట్లుండెననఁగా, వారు మరు కలనిలో పరాజయమొందినందులకు మరుఁడు వారిని తఱిమి వీఁపునంగొట్టెనో యనునట్లుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'ఏసెనాఁ', వీఁపున నంటుకొనియున్న యెఱ్ఱని మావిచిగురు కత్తిపెట్టుచేతనయిన పెద్ద గాయమో యనునట్లుండె ననుట. రణమునుండి తొలఁగుబంటులను వారి సేనాపతులు వెనుకనుండి ఏయుట ప్రసిద్ధము. 'ఉరు' - ఉదరశ్రోణికిఁగాని కుడంగమునకుగాని విశేషణము. 'కుడంగకము' - "వృక్షలతాగృహ మితి స్వామీ" రామాశ్రమి. రూ. కుటంగకము. "తల్పంశయ్యాట్టదారేషు" అమ. 'వీఁపు' - వెన్నున గాయము పలాయన సూచకము. 'ఒకనాఁడు' - దీనికి తర్వాతి పద్యములో "కనుంగొనెఁ" అను క్రియతో నన్వయము. ఇట్లు ౨. ౩, 4 - ఇవి మూఁడును ఏకవాక్యము. ఇప్పద్యములో నాయికలు క్రమముగా సమ విరాయిత సమరతములను మూఁటిని అనుభవించినట్లు వర్ణన. "ప్రకర" మనుటచే వేలువేలురతము వేలువేలు తల్పమున ననుభూత మని ధ్వనితము. "మఁ" - పదరి, పాటించి, అటి అనుక్త్వార్థకములతో నన్వయించును.

## గోదాదేవి

ఉ. వింగడమైన యొక్క వన వీథిఁ గనుంగొనె నీడ సున్నపుఁ
రంగుటరంగు పచ్చల యరంగయిపో వెలిదమ్మి బావికిం
జెంటగ నుల్లసిల్లు తులసీ వనసీమ శుభాంగి నొక్క బా
లం గురువింద కందళ దళ ప్రతిమాంఘ్రి కరోదరాధరఁ. 4

వింగడము = విశాలము, వన - ఒక్క వనవీథిఁ = ఉద్యానవృక్షశ్రేణుల నడిమిబాట యందు, వెలిదమ్మిబావికిఁ = తెల్ల తామరలడిగ్గియకు, చెంగటఁ = సమీపమున, నీడఁ = ఆకుజొంపముల ప్రతిఫలనముచేత, సున్నపు రంగుటరంగు = పాలగారచేత తళతళలాడుచున్నట్టి తిన్నె, పచ్చల యరంగు అయిపోఁ = మరకతపు వేదికవలె నొప్పుచుండఁగా, ఉల్లసిల్లుతులసీవనసీమఁ = సొంపారుచున్న బృందావన ప్రదేశమందు, (అట్టి యరంగుమీఁద), శుభాంగిఁ - శుభ = మంగళకరములయిన లక్షణములతోఁ గూడుకొన్న - అంగిఁ = అవయవములుగలదానిని, కురు - రఁ - కురువింద = పద్మరాగముయొక్క - కందళ = మొలకయొక్క - దళ = కోఁతకు - ప్రతిమా = సాటియైన - అంఘ్రికరఉదర = పాదములయు చేతులయు లోపార్శ్వములును మోవియు కలదానిని, ఒక్క బాలఁ = ఒక్కయాఁడు శిశువును, కనుంగొనెఁ = చూచెను.

తా.—ఆవిష్ణుచిత్తుఁడు విశాలమయిన యొక వృక్షవాటికయందు ఒక తెల్లతామరకొలని చెంత తులసితోఁటయందు చెట్లనీడల ప్రతిబింబముచేత పచ్చరాలవేదికయోయన నొప్పుచున్న పాలగచ్చు తిన్నెమీఁద నొక చిన్ని యాఁడునిసుఁగును సద్యోదళితపద్మరాగాంకురవర్ణములగు నఱకాళ్లును అఱచేతులును మోవియుంగలదానిని చూచెను:—తద్గుణము, ఉపమయు.

"స్వగుణము విడిచి యొకటియ । న్యగుణంబుం గొనుట తద్గుణాలంకృతి యా
మగువసరం బధరంపు । న్జిగిచేతం గొనియెఁ గెంపుసింగారంబుఁ." అ. సా. సం.

ఆకనఁబడిన శిశువు దేవత గావునఁ దదుచితమైన యునికిలో దొరకినది. "పచ్చలయరంగయిపోఁ" మణిహేమమయప్రాసాదములయందు వసింపఁదగినదని సూచన. 'వెలిదమ్మి' పుండరీకనిలయ

యొక్క సాన్నిధ్యముం జూపుచున్నది. 'బావి' - వాపీశబ్దవైకృతము. 'చెంగట' - తులసీవృక్షములకు జలసమృద్ధి కలుగునట్టుగా. 'తులసి' - ఆశిశువు వేల్పు గావున తదీయపావనతం దెలుపును. మఱియు, తోమాలెకై తులసిం దెచ్చుకొనఁబోయినప్పుడు దొరకినదని సూచన. 'శుభాంగిన్' - శుభలక్షణ యగుటంబట్టి కొనిపోయి పెంచుకొనె ననుట. 'అంఘ్రి - రదన్' - దంతములను జెప్ప వందున స్తన్య మెఱుఁగనిదిగా దొరకిన దని భా. 'దశ' - మఱులకు దళనమయిన కడలందు తేజ మెక్కువ; చూ:—

"ఇన్ద్రాయుద్ధళి తేన్ద్రనీల శకలశ్యామం దనీదృశ్యతే ।
తత్సాన్ద్రం నిశి పీతమన్తముసం కుక్షిస్థ మాచక్షహే." బిల్హణ.
"పాదౌ (తథా) కమలకాన్తి తలౌ చ యస్యా ।
స్తా ముద్వహే ద్యది భువోఽధిపతిత్వ మిచ్ఛేత్." బృ. సం.
"మత్స్యాఙ్కుశాబ్జయవ వజ్రహలాది చిహ్నౌ
వస్వేదనౌ మృదుతలౌ చరణౌ ప్రశస్తౌ." —,,—
"బన్ధుజీవ కుసుమోపమోఽధరో । మాంసలో రుచిర బింబరూపధృత్
కున్దకుట్మల నిభా స్సమా ద్విజా । యోషితాం పతి సుఖామితార్థదాః" —,,—

కురువిందము పద్మరాగభేదము, అది నృపజాతి పద్మరాగము, "కురువిందము నృపజాతి" హాలాస్యము "సిందూరసంతప్తలోహరుచులు, పుడమిశేరి రక్త గుంజాభములగు నృపులు" హాలాస్యము. 'సున్నపురంగు' - ఇట నుగాగమమును 'గరువపుస్మరుపు' అను ప్రయోగంబునం బోలె సాధించునది. "అరంగు" - వాడుకలో "అరుగు" అనిరూపము.

చ. కనుఁగొని విస్మయంబొదవఁగాఁ గదియంజని సౌకుమార్యముం
దను రుచియు న్సులక్షణ వితానముఁ దేజముఁ జెల్వుఁ గొంత సే
పనిమిష దృష్టిఁ జూచి యహాహా! యనపత్యున కమ్ముకుందుఁడే
తనయుఁగ నాకు నీశిశువుఁ దాఁ గృప సేసె నటంచు హృష్టుఁడై. ౯

కనుఁగొని = ఆ శిశువునుచూచి, విస్మయంబు = ఆశ్చర్యము, ఒదవఁగాన్ = జనింపఁగా, కదియంజని = దగ్గఱంబోయి (సమీపించి), సౌకుమార్యమున్ = కోమలత్వమును, తను రుచియున్ = మేనివన్నెను, సులక్షణ వితానము = శుభలక్షణముల సమూహమును, తేజమున్ = ప్రకాశమును, చెల్వున్ = సౌందర్యమును, కొంతసేపు, అ నిమిష దృష్టిన్ = రెప్పపాటు లేని చూపుతో, చూచి, అహహా = ఎంతపుణ్యము, అనపత్యునకున్ = బిడ్డలులేని వాఁడనైన, నాకున్, అమ్ముకుందుఁడే = ఆ నారాయణుఁడే, తనయుఁగన్ = కూతుఁనుగా, ఈశిశువున్ = ఈనిసుఁగును, తాన్, కృపసేసెన్ = ఇచ్చినాఁడు, అటంచున్, హృష్టుఁడై = సంతోషించి.

తా.—ఆ శిశువును జూచి యాశ్చర్యమొంది, చెంతకేఁగి, ఆకోమలత్వమును, మేనివన్నెను, శుభలక్షణముల సముదాయమును, తేజును, కొంతసేపు రెప్పవాల్పక పరికించి, 'అహహా! ఏమి నాపుణ్యము, నేను బిడ్డలు లేనివాఁడనని నామీఁద కరుణించి ఆ నారాయణమూర్తి నాకు కూఁతుంగా ఇచ్చినాఁడు' అని తలంచి, సంతోషముతో—

"విస్మయో ద్భుత మాశ్చర్యమ్" అమ - "అస్త్రీ వితానముల్లోచవిస్తారమఖసద్మసు । తుచ్ఛే మన్దే త్రిషు" నానా. "ముకుమిత్యవ్యయం మాన్తం నిర్వాణమోక్షవాచకం । యస్తద్దాతి

ఒరులసంపర్కమును సైఁపక (అనఁగా దగ్గఱకు రానీక, తాఁకనీక) — (మాలిన్యమునొల్లక అనుటయు), ఇటు = ఈవిధముగా (ప్రత్యక్షముగా), లోఁగఁ బొమ్మెన్ = ముడుఁచుకొని దాఁగినది;

నాభి = పొక్కిలి, పటిగాంభీర్య మెక్కుడు పెట్టుకొనియెన్ = లేని బెట్టు ఒకటి వహించినది (శూన్యతారూపమయినలోఁతును దాలిచినది. యౌవనముచే పొక్కిలి లోఁతయినదనుటయు), ఈ గతిన్ = ఈవిధముగా, నానాఁటికిన్ = దినక్రమమున, నాఁటిపొందు = మునుపటిచెలిమి, చవుకయైనట్టి యిచ్చటన్ = పలుచనయైనట్టి యీ బాలయందు, నిలువఁ జనదనుచున్, జాఱినకరణిన్ = సన్నసన్నగా వదలి దూరమేఁగినదో యనునట్లుగా, బాల్యంబు జాఱెన్ = శైశవము అపసరిల్లినది.

ఇందు యౌవన ప్రాగల్భ్యలక్షణములు శ్లేషభంగిచేత బాల్యమును తిరస్కరించు నడవడిగా వర్ణింపఁబడినవి గావున శ్లేషోత్థాపితోత్ప్రేక్షాలంకారము.

'చాము' - మొదటిరూపము 'చాన్ము.' 'కోము' - మొదటిరూపము కోన్ము. 'పాణి పాదములు' - ప్రాణ్యంగముల సమాహార ద్వంద్వమగుటచేత పాణిపాదము అని ఏకవద్భావము గావలయును. అట్లే 'పాణిపాదం బెట్టివాఁడు కోడఁడె?' అని ప్రయోగమున్నను గాని, ఆంధ్రకవులు పెక్కింటిని సమాసాశ్రయవిధులను పాటింపుట లేదు.

శా. హేమాభాంగవిభాధరారుణిమవక్త్రేందుప్రభాశ్రేణిచేఁ
ద్భామారత్నము పొందదయ్యె మును తత్తద్వర్ణయుక్త్యాఖ్యలన్,
శ్యామాంకం బళిగర్వభారవహకచచ్ఛాయాఘటం గాంచె, నే
గా మున్నుర్వి 'శిరఃప్రధాన' మను వాక్యం బేమెయిం దప్పునే. 8

తత్ భామా రత్నము = ఆ నాయిక, మును = మొదలను, హేమాభ - అంగ = హేమము ఆభ - బంగారమువంటి వన్నెకలదైన - అంగ = దేహముయొక్క - విభా = ప్రకాశము - అధరారుణిమ = మోవి కెంపు - వక్త్ర ఇందు ప్రభా = ముఖచంద్రుని వెలుఁగు - వీనియొక్క - శ్రేణిన్ = శోభలచేత, తత్ తత్ వర్ణయుక్త్యాఖ్యలన్ = ఆయావర్ణములతోఁ గూడుకొన్న పేరులను, పొందదయ్యెన్ = పొందలేదు. అళి - ఉన్ - అళి = తుమ్మెదలయొక్క - గర్వ = పొగరుయొక్క - భారః = భారమును - వహా = వహించెడు - కచ = కేశపాశముయొక్క, ఛాయా = వన్నెయొక్క - ఘటన్ = సమూహము వలనఁగా, శ్యామాంకంబున్, శ్యామా = నల్లనిది (యౌవనమధ్యస్థ యనుటయు) - అంకంబున్ = అనెడి పేరిని, కాంచెన్ = పొందెను; ఏఁగా = ఇది యుక్తమగునుగదా, మున్ను = పూర్వము, ఉర్విన్ = లోకములో, శిరః ప్రధానమ్ = 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్' అనఁగా సకల దేహములోను శిరము ప్రధానమైనది. అను వాక్యంబు = అని పెద్దలు చెప్పినమాట, ఏమెయిన్ = ఏవిధమునను, తప్పునే = తప్పిపోవునా (పోదనుట.)

భా.— ఆమెకు మొదటినుండియున్న దేహసువర్ణచ్ఛాయచేతఁగాని, మోవికెంపుచేతఁగాని, ముఖచంద్రధావళ్యముచేతఁగాని, అనఁగా పసుపు ఎఱుపు తెలుపు అను వన్నెలలో దేనినిగాని తెలుపునట్టి పేరు రాదాయెను. ఇప్పుడు యౌవనోదయమువలన శిరోజముల కెక్కిన నీలిమాతిశయముచేత శ్యామ యని పేరు వచ్చినది. ఇది యుచితమే. 'దేహమున కెల్ల శిరస్సు ప్రధానము' అనెడు నానుడి తప్పునుగదా. యౌవన ప్రాదుర్భావముచేత శిరోజములయందు నీలిమ హెచ్చెనని భా. హేతూత్ప్రేక్షాలంకారము.

'శ్యామాయౌవనమధ్యస్థా' అను వాక్యమునం జెప్పినట్లు యౌవనముచేవచ్చిన శ్యామాసంజ్ఞను కవి శిరోజనైల్యాతిశయముచే వచ్చినట్లు చెప్పినాఁడు. అర్థాంతరన్యాసంబును వృత్త్యనుప్రాసంబును.

'శ్యామాత్వంబళిగర్వ' అని పూర్వపాఠము; అందు పుంవద్భావాప్రాప్తికి ప్రక్రియ కడుం బెరుగుడుగాక ఘటిల్లదుగావున 'శ్యామాంకంబళిగర్వ' అని పఠింపనయినది. అంక శబ్దమును ఈకవి నామధేయపరముగా ప్రయోగించియున్నాఁడు.

"భూసురవంశ్య పుణ్యజన పుణ్యజనాంకము తావకీనమే
పో సమకూడెడిం గులముపొత్తున దైత్యులకెల్ల నంకతన్" 6 (51)

"భామారత్నము - 'రత్నంస్వజాతి శ్రేష్ఠేపి' 'కృష్ణే నీలాసితశ్యామకాలశ్యామలమేచకాః,' అమ.

క. ఆయత భుజైకచక్రుం । డా యదుపతి దోష్కు గెలువ నడరు మరుని కా
లాయసచక్రపరంపర । లోయన నుంగరపుఁగురులు యువతికి నమరున్. ౯

ఆయతభుజ ఏకచక్రుండు = దీర్ఘమయిన బాహువునందలి యొకచక్రముకలవాఁడైన, ఆయదుపతిన్ = ఆశ్రీకృష్ణుని, దోష్కున్ = క్రిందుకయ్యమున, గెలువన్ = జయించుటకు, అడరు మరుని కాలాయస చక్రపరంపరలో అనన్ = తిరలుచున్న మదనునియొక్క యుక్కుఁగుడుసుఁ గైదువులయొక్క వరుసలోయనునట్లుగా, ఉంగరపుఁగురులు = కుటిలకుంతలములు, యువతికిన్ = ఆదేవికి, అమరున్ = చెన్నారెను.

తా.—ఆమెయొక్క యుంగరపుఁగురులు నలుపుమిగిలినట్టివి ఎట్లు ఒప్పెననఁగా ఆమెవల చిన నారాయణుని దీర్ఘబాహువునందు ఒక్కచక్రాయుధము దాల్చియున్నవానిని దోష్కుపోరిలో గెలువఁ గోరినవాఁడై మదనుఁడు పెల్లుగా నలపరించుకొన్న యుక్కుఁజక్రాయుధముల వరుసలో యనునట్లు ఒప్పారెను. ఆ యుంగరపుఁగురులు నారాయణునికి కడుంజిత్తమోహకములుగా నుండెనని భా. ఉత్ప్రేక్ష.

'దీర్ఘమాయతమ్. అమ. యదుపతి = శ్రీకృష్ణుఁడు, ఆయన నారాయణుఁడే, నారాయణుఁడె విలుపుత్తూరి పెరుమాళ్లు, అతఁడే రంగనాయకుఁడును; 'దోష్కు' - ఒక్కపక్రము నతఁడు వైచులోపల ఇన్నిటితో నతనింగొట్టి వశపఱచుకొనుటకై; 'కాలాయసమ్' = కాలం చ తత్ అయశ్చ = నల్ల యినుము = ఉక్కు.

తే. సకల సీమంతినీలోక సమతిశాయి । భాగ్యవర్ణావళులు వ్రాసెఁ బద్మగర్భుఁ
డనఁగ కర్పూరతిలక రజోవదాత । ఫాలమునఁ గుంతలశ్రేణి పడఁతికలరు. 10

పద్మగర్భుఁడు = బ్రహ్మ, పడఁతికిన్ = ఆచెలువకు, సక - లు - సకల = ఎల్ల - సీమంతినీలోక = సుందరీ జనులను - సమతిశాయి = మించునట్టి - భాగ్య = అదృష్టముయొక్క - వర్ణ = అక్షరముల - ఆవళులు = పంక్తులను, వ్రాసెనన్ = లిఖించినాఁడనునట్లుగా, క...న్ - కర్పూర = కప్పురంపు - తిలక = బొట్టుయొక్క - రజః = ధూళిచేత - అవదాత = తెల్లనయిన - ఫాలమునన్ = లలాటమందు, కుంతలశ్రేణి = కురులపంక్తి, అమరున్ = ఒప్పుచున్నది.

తా.—కప్పురంబుబొట్టుయొక్క దీధితిచేత ధవళమైయున్న యామెలలాటముందు ముంగురుల వరుసలు భాగ్యములో ఈమె ఎల్లయంగనాజనులను అతిశయించునని బ్రహ్మవ్రాసినయక్షర పంక్తులో యనునట్లు చెన్నారును;—తెల్లకాగితముమీఁద నల్లసిసిరాతో వ్రాసినట్లు అనుట. ఆమె వరులు లోకాతీతభాగ్య సూచకములుగా నుండెనని భా.—ఉత్ప్రేక్ష.

'సీమంతినీ' = పాపటకలస్త్రీ, 'సీమన్తమస్త్రియాం మస్తకేశవీథ్యాముదాహృతమ్; వీథ్యాళిరావళిః పఙ్క్తి' 'భాగ్య స్త్రీనియతి ర్విధిః.' 'పద్మగర్భుఁడు' - 'ధాతాబ్జయోని ర్ద్రుహిణః' అమ. 'అవదాతస్సితో గౌరో వళక్షో ధవళోఽర్జునః' అమ.

శా. సైరంధ్రు ల్పయికెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికం దీర్ప వా
లారుం గన్నుల మీఁదు చూచు తఱి ఫాలాంచచ్చతుర్థీనిశా
స్ఫారేందుం గనె వక్త్ర; మక్కనుటఁ గాఁ బర్వేందుఁ డాత్మప్రభా
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభాచోరం బనుర్ లోకముల్. 11

వక్త్రము = ఆ సుముఖము, సైరంధ్రుల్ = అలంకరించెడు చెలువలు, పైకెత్తి = మీఁదికి త్రిప్పి, కజ్జలము = కాటుకను, పక్ష్మశ్రేణికన్ = ఱెప్పలపొడుగునను, తీర్పన్ = దిద్దుచుండఁగా, వాలారుంగన్నుల, మీఁదు చూచుతఱిన్ = (ఆముఖము) పైకి చూచునప్పుడు, చతుర్థీనిశాస్ఫారఇందున్ = చవితినాఁటిరాత్రియొక్క స్ఫుటమాయిన జాబిల్లిని (అనఁగా అలంకరించుచున్న సైరంధ్రి ముఖమును), కనెన్ = (ఆమె ముఖము) చూచినది; అక్కనుటన్ కాన్ = అట్లు చూచినందు వలనఁగదా, ఆత్మప్రభాచోరుండు=తనయొక్క (ఆదేవివక్త్రముయొక్క), కాంతియొక్క దొంగ, పర్వఇందుఁడు=పూర్ణిమాచంద్రుఁడు, ఉండన్ =ఉండఁగా, (వానినిదొంగయనక) లోకముల్ = జనులు, తన్నున్ =ఆమె ముఖమును, తత్ గతవిభాచోరంబు=ఆతనిని చెందియున్న కాంతియొక్క దొంగ, అనున్ = అని వచించును.

తా.—అలంకరించు చెలువలు ఆమెముఖమును వెదకిలం ద్రిప్పి కనుఱెప్పలవెంటఁ గాటుక తీర్చుచుండఁగా, ఆ ముఖము వారముఖమునఁ జెడిచవితిరాత్రి చంద్రుని చూచినది, ఆదోషముచేత ఆమె ముఖమునకు దానికాంతిని దొంగిలించిన చంద్రుఁడుండఁగా అతనికి ఏనిందయు రాక, తానాతని కాంతిని దొంగిలించిన దని లోకములో నింద కలిగినది. రూపకాపహ్నుత్యనుప్రాణితోత్ప్రేక్ష.

'అఞ్జనంకజ్జలేచాక్తౌ' మేదిని, 'వాలారుంగన్ను'లు, ఇటను గాగమమునకు ఉపపత్తియిట్లు, 'వాలారులైనకన్నులు' అని విగ్రహము, 'వాలారు' శబ్దము సుబంతము, 'వాలారులై కరజంబుల్ సిగిరించె' పారి. 5 (46); పెద్దనగారును 'వాలారుం గొనగోళ్ల నీవలసతిన్ వాయించుచో' అని ప్రయోగించియున్నారు. 'ఫాల' ఫాలము మాత్రమే కనఁబడుటకొఱకు పైకి కజ్జలము తీర్చెడి యీసమయవిశేషము చెప్పఁబడినది. 'చతుర్థీ' ముప్పాతిక బింబము వెలుఁగుచుండు కృష్ణపక్షచంద్రునికిని ఫాలరేఖకును నిండు సామ్యములేదు, కావున, శుక్లచతుర్థి యిట నుద్దిష్టము, అందును భాద్రపద శుక్లచతుర్థి, నాఁడు వినాయకవ్రతకల్పోక్త కథను చెప్పకొనక చంద్రదర్శనము చేయువారికి నీలాప నిందవచ్చును. వ్రతకల్పమందు ఆకథంగాంచునది. 'సైరంధ్రి' యనఁగా పరగృహనివాసినియై అందఱి వారికై గంధములవఱుచుట పూలుగ్రుచ్చుట కైసేయుటలోనగు శిల్పములు గావించుచుండు నట్టి స్వతంత్రురాలు. 'శ్రేణికన్' శ్రేణియనుట దైర్ఘ్యాభిప్రాయముచేత, లేదా గంటను అనియే.

చ. కనుఁగవఁ దన్ను గెల్వఁగ మృగం, బలసూడున కిందు రేఁతు నే
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ, దా
నినుపఁ జనన్, బగం బనఁదు నెత్తుటఁ బొట్టిడుకొంట కాక వా
సనకు యనస్సగం బమరఁ జానకు ఫాలము పచ్చికస్తురిన్. 12

మొగంబు = ఆమెవదనము, కనుఁగవన్ = నేత్రయుగళముచేత, తన్నున్ = కస్తూరిలేడిని, గెల్వఁగన్ = జయించినందున, మృగంబు = కస్తూరిలేడి, అలసూడునకున్ = ఆపగసాధించుటకై, నేను ఇందున్ రేఁచుక అని = తాను ఆ మొగముమీఁదికి చంద్రుని పురికొల్పుదును గాక

యని సంకల్పించినదై, అతండు=ఆచంద్రుఁడు, రుచితక్కన్ =(తనకు ఆముఖముయొక్క) కాంతిమాత్రమే యున్నదిగాని, తత్ పరిమళ ఆఢ్యత లేమిన్ = ఆ ముఖముయొక్క సౌరభ్యసంపన్నత్వము లేదే అని, కొంకన్ = మొగముమీఁద వైరమూనుటకు వెనుదివియఁగా, తాన్ = కస్తూరిమృగము, నినుపన్ =ఆతనియందు పరిమళమును నిండించుటకై, చనన్ =పోయి ఆతనియందు ప్రవేశింపఁగా, పగన్ =అట్లుచేసినందులకై ఆలేడిమీఁదిద్వేషముచేత, తనదు నెత్తుటన్ =ఆలేడియొక్క రక్తముతో బొట్టు ఇడుకొంటగాక = (ఆ ముఖము) తిలకము ధరించుటయేకాని, వాసనక = దానిపరిమళము కొలఁదికా (కాదనుట), అనన్ =అనునట్లుగా, చామమోమ్ =ఆశ్యామముఖము, ఫాలము పచ్చికస్తురిన్ = లలాటమందు మొదటితడియారనికస్తూరి (బొట్టు) చేత, అమరున్ =(ఆమె మొగము) ఒప్పుచున్నది.

[కస్తూరి ఒకజాతి లేడియొక్క యండకోశమందు జనించును. దానిని అశ్లీలతా పరిహారార్థము నాభిజమందురు. వేఁటరులు ఆ మృగమును చంపి కస్తూరిం దెచ్చియిత్తురు. ఆ కస్తూరికి అధికముగు పరిమళము హెచ్చు, దానిని బుద్ధిమంతులు లలాటమందు బొట్టు పెట్టుకొందురు. లోకములో పగఁబూనినవారు వైరిని చంపి వాని నెత్తుటితో బొట్టు పెట్టుకొనుట ప్రసిద్ధము. లోకులు చంద్రుని మచ్చను లేడియందురు. ఈ విషయముల నిట ననుసంధించుకొనవలయును.]

తా.—ఆ మోముఖము తన కనుఁగవచేత మృగమును జయించినది, అనఁగా దానికనుఁగవకన్న ఆ ముఖమందు కనుఁగవ తారళ్య వైపుల్యాది గుణములచేత నుత్కృష్టముగానుండెను. అందువలన మృగము ఆ ముఖముపై పగఁబూని, దానిని గెలువుమని చంద్రుని పురికొల్పినది. అతఁడు ఆ ముఖమందలి కాంతిమాత్రమే తనకు కలదుగాని అందలి పరిమళము తనకు లేదు అని తెలివిగలిగి ఆ ముఖము మీఁద వైరము వహించుటకు ఒప్పుకొనఁడాయెను; అంతట మృగము 'ఇదిగో ఆ పరిమళలోపమును నేను తీర్చెదను, దానిచే సమృద్ధుఁడవై నీవు ఆ మొగముమీఁదికి దాడి తరలుదువుగాక,' అని చంద్రుని బోధించి, తానేపోయి ఆతనియందు ప్రవేశించినది. అంతట మొదట తనపై మృగము అంత పగసాధించినందులకై దానిపై అధికద్వేషము పూని దాని నెత్తురయిన పచ్చికస్తూరితో ఫాలమున బొట్టు పెట్టుకొన్నది. అంతియకాని పరిమళము ఆ ముఖమున సహజముగా నేయున్నది. ఉత్ప్రేక్ష.

'పచ్చి' యనుటచే, ఆమెయొక్క దివ్యత్వకారణంబునను, విష్ణుచిత్తస్వామికి శ్రీమన్నారాయణమూర్తి యొసంగిన యఖండైశ్వర్యముచేతను, ఆమెకు లేని భోగ్యవస్తువు లోకములో లేదని సూచన.

తే. కడఁదివిలుచేఁది గుఱికిఁ గీలుకఱచినిలుపు । మరునికువలయశరముకంపములఁబోలుఁ
దారకడకంటిపై సారెచేరిచేరి । వేగ మగుడ సలజ్జదృగ్విభ్రమములు. 13

సలజ్జదృగ్విభ్రమములు = లజ్జాన్వితములయిన చూడ్కులవిలాసములు, తార = కంటి నల్లగ్రుడ్డు, సారెన్ =మాటిమాటికి, కడకంటిపైన్ =కంటితుదమీఁదికి, (పా. కడకంటికై) చేరిచేరి, వేగ=వడిగా, మగుడన్ =యథాస్థానమునకు మరలఁగా, కడఁదివిలు=దృఢమయినవింటిని, చేఁది= ఆకర్షించి (అనఁగా వింటినాఱినిలాగి), గుఱికిన్ = లక్ష్యము సరిగా కుదురువఱకు, కీలుకఱచి = ప్రాణము బిగఁబట్టుకొని, నిలు—లన్ - నిలుపు=బాణమును వదలక నారియందే పట్టుకొనియున్న - మరుని = మన్మథునియొక్క - కువలయశరము కంపములన్ = కలువబాణముయొక్క చలనములను, పోలున్ = అనుకరించును.

తా.—ఆమెయొక్క కనీనిక కంటితుదకు నిగుడుచు మగుడుచు నున్న లజ్జాన్వితదృష్టివిలాసములు ఎట్లుండెననఁగా, మదనుఁడు లక్ష్యవేధనముచేయుటకై దిట్టమయిన వింటిని ఎక్కుపెట్టి

గుటకంగూర్చి ఊపిరి బిగఁబట్టుకొని నిలిపియున్న కలువతూపుయొక్క చలనములను (అనఁగా చలించుచున్న కలువ తూపును) పోలియుండెను.—ఉత్ప్రేక్ష.

'ఈలకలఱచు'—రూ. ఇలకలఱచు. చూ. శ. ర.—స్త్రీనేత్రములకు కువలయసామ్యము కవిసమయప్రసిద్ధము. నీలోత్పలసామ్యము అత్యంతసమ్మతము. ఇట్టి నదియే కవిహృదయము. 'తార' = 'తారకాక్ష్ణః కనీనికా.' అమ. మదనబాణసామ్యము చెప్పుటచేత ఆదృగ్విభ్రమములు రంగధామునికి అత్యంత కామోద్దీపకము లగునని భా.

తే. నవవయస్సీధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
నిడియె శృంఖల లనఁ గాటు కిడిన దీర్ఘ
పక్ష్మరేఖలఁ గనుదోయి పడఁతి కొనరు. 14

పడఁతికిన్ = ఆదేవికి, కనుదోయి = కనుఁగవ. కాటుక ఇడిన దీర్ఘపక్ష్మరేఖలన్ = కజ్జలము తీర్చినవియు నిడుపులును రేఖలవంటివియు నయిన ఱెప్పలచేత, (ఎట్లు ఒప్పారెననఁగా), నవవయః సీధుమదముచేన్ = క్రొత్తగాకల్గిన ప్రాయమనెడు సురచేతఁగలిగిన కైపుచేత, శ్రవణకూపములన్ = కర్ణములనెడి నూతులలో, పడెడుశంకన్ = పడునని యూహచేత, చాపలములు = తుంటరిచేఁతలు, ఉడుగన్ = నిలిచిపోవునట్లుగా, నలువ = బ్రహ్మ. శృంఖలలు ఇడియెనా అనన్ = సంకెలలు వైచెను అనునట్లుగా, ఒనరున్ = ఒప్పును.

తా.—యౌవనోదయము చేత కనులకు విభ్రమమును చాంచల్యమును కలుగుటయు, అవి ఆకర్ణాంతాయతములును అగుటయు. శ్రవణములవఱకు నిగుడుచుండుటయు, వాని కాటుకరేఖలును, ఎట్లుండెననఁగా—యౌవనమనెడి మద్యమును సేవించి ఆ కన్నులు కైపుచే ఒడలు మఱచి చాపల్యముచేత పోయి ఆ చెవినూతులలోఁ బడియెదునని, నలువ భయపడినవాఁడై వానిని ఆ బావులలోఁ బడనీక అడ్డుపెట్టుటకై సంకెలలు వైచెనో యనునట్లుండెను. ఉత్ప్రేక్ష. రూపకానుప్రాణితము. మదమెక్కిన యేనుఁగును గొలుసుల బంధించినట్లు అని ఉపమాధ్వని.

'శీధుః రూ. సీధుః' 'మైరేయమాసవః సీధుః' అమ. ''శీధు రిక్షురసైః పక్వైః, రపక్వై రాసవో భవేత్ । మైరేయం ధాతకీపుష్ప గుడధానామ్బు సంహితమ్''. అని రామాశ్రమీయము.
''శృంఖలలు'' - 'అథ శృఙ్ఖలా । అన్దుకో నిగళోఽస్త్రీ స్యాత్' అమ.

చ. అనయము రాగ మొప్ప సహజానన చంద్రకటాక్షపంక్తి ప
ర్విన నఘశంకఁ గన్ దనను శ్రీ మఱుపెట్టుఁ జెలంగి చెందఁ గొ
ట్టననిఁ బడ్డ కష్ట మగుడం గొను నంతను సంపపాళి నం
గన యిది దాఁచు నేరఁ బెర కర్ణము కప్పు పయిం పెసొక్కినన్. 15

సహజ ఆనన చంద్రకటాక్షపంక్తి = తోఁబుట్టువైన ముఖచంద్రునియొక్క కడగంటి చూపుల వరుస, అనయము = అత్యంతము, రాగము = అనురక్తి (సౌభాగ్యసూచకమయిన యెఱుపు రంగులు అనియు), ఒప్పన్ = చెన్నుమీఱఁగా, పర్విన = (శ్రీదేవిమీఁద) పొలసినయెడల, అఘశంకన్ = (ఆ చంద్రునికి) పాపము కలుగునను వెఱపుచేత, అంగన = ఆదేవి, చెలంగి = ఉల్లాసముతో,

చెండుఁగొట్టన్ = బంతిని (నేలఁ) గొట్టినపుడు, అవనిన్ = భూమియందు, పడ్డకమ్మన్ - రాలిన కర్ణపూరమును, కొనునంతకున్ = తాను వెండియుఁ గైకొని కర్ణమందు ధరించువఱకును, వెఱకర్ణము కమ్మ = రెండవ చెవియందలి కర్ణపూరము, పయిన్, తళుక్కు అనన్ = తళతళలాడుచుండఁగా, అంసపాళిన్ = భుజాగ్రమునందు, ఇడి = ఉంచి, దాఁచు పేరన్ = దాఁచుటయను మిషచేత, కర్ణము అను శ్రీన్ = (కమ్మ రాలిపోయిన) చెవియనెడి లక్ష్మిని (శ్రీకారమును), మఱుఁబెట్టున్ = ఆ (ముఖ) చంద్రునికి కానరానీయక చాటుసేయును.

తా.—బంతియాటలో ఒకచేతితో బంతిని గొట్టునప్పుడు దానియవలిబుజముమీఁద చెవి మోయునట్లుగా శిరమును వాంచుట సహజము. కర్ణాభరణహీనురాలైన సహోదరిని సహోదరుఁడు చూఁడ గూడదు; చూచిన నతనికిం బాపము కలుగును. ఆదేవికర్ణము రూపసామ్యముచేత శ్రీకారము - 'శ్రీ' అనఁగా మహాలక్ష్మియే. ఆమెవదనము మహాలక్ష్మికి అన్నయైన చంద్రుఁడే. కనుక ఆకర్ణము కమ్మలేనప్పుడు ఆముఖము చూడఁగూడదు. అందువలన ఆమె బంతియాటలో విసరుగా బంతిని నేలకుం గొట్టునప్పుడు చెవిలోనికమ్మ జాఱిపడిపోయినంతట కమ్మలేని చెల్లెలి (చెవి)ంజూచు దోషము (ఆ శ్రీకిఁ దోఁబుట్టువయినముఖ) చంద్రునికి కలుగకయుండునట్లుగా, ఆమె తా నాటనిలుపకయే ఆటమిషచేత శిరమును ఒఱగంజేసి కమ్మనొఱయు రెండవచెవి పైకి వచ్చి అతనికిం గానవచ్చునట్లుగాను, కమ్మలేనిచెవి అతనికిం గనఁబడకుండ బుజముమీఁద మోచునట్లుగాను, చేయునో యనునట్లుగా తీరయి, ఆటక్రమములోనే కమ్మను గైకొని ఆ చెవిలోఁ దాల్చును.—రూపకోత్థాపిత కైతవాపహ్నుతిసంసృష్ట గమ్యోత్ప్రేక్ష.

'ఇమ్ములఁ బేరగుఁ దాటం। కమ్ములకున్ లేఖలకును గమ్మలనన్.' ఆంధ్ర.

'రాగోనురాగే మాత్సర్యే లాక్షాదౌ రక్తమత్వియోః। గాన్ధారాదౌ రఞ్జనే చ'—నానా.

శా. నాసా చంపకత న్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోల సం
త్రాసం బందియుఁ బల్కుచో నలము వక్త్రం బేల నా నేటి కం
దే సౌరభ్యము లేదు కుందములు గా వే దంతము ల్గానినాఁ
డా సక్తిన్ బ్రతిబింబ దంభమున నేలా వ్రాలఁ దజ్జాతికిన్. 16

నాసాచంపకతన్ = నాసిక సంపెంగ యగుటవలన, అచటన్ = అందు, సుగంధము = పరిమళము, రాన్ = రాఁగా, గ్రోలన్ = ఆనుటకు, భృంగముల్ = తుమ్మెదలు, సంత్రాసంబు = భయమును, అందియున్ = పొందినవయ్యును, పల్కుచోన్ = ఆమె భాషించునప్పుడు, వక్త్రంబు = నోటిని, ఏల అలమున్ = ముసురుకొనుటకుఁ గారణమేమి, నాన్ ఏల = అని ప్రశ్నింపవలసిన పనిలేదు, అందున్ = ఆనోటియందు, ఏ సౌరభ్యము = ఏ సెత్తావి, లేదు, దంతములు, కుందముల్ గావే = మొల్లలు గావా, కాని నాఁడు = కానిచో, తత్ జాతికిన్ = ఆతుమ్మెదజాతి, ఆసక్తిన్ = తగులముతో, ప్రతిబింబకైతవమునన్ = ప్రతిఫలనమనెడి మిషచేత, వ్రాలనేల = ఆదంతములయందు ఏల వ్రాలును.

తా.— ఆమెయొక్క నిశ్వాసమందు దివ్యసౌరభము వచ్చినను నాసిక చంపకముగుటం బట్టి తుమ్మెదలు ఆసౌగంధ్యమును గ్రోలక అపసరిల్లియు, ఆమె సంభాషించునప్పుడు నోటిపై నలమును; ఇందులకు కారణ మడుగనేల? ఆనోటియందు సకల సౌగంధ్యములుం గలవు. అందులకొక నిదర్శనము ఆదంతములు మొల్లమొగ్గలగుటయే. అందులకేమి తార్కాణమని ప్రశ్నయేని ఆ తుమ్మెదలు తమ ప్రతిబింబములనెడు మిషచేత అందు వ్రాలుటయే. నాసిక చంపకమువలెను, దంతములు మొల్ల

మొగ్గలవలెను, ఉన్నవనియు; నిశ్వాసమందును నోటిమారుతమందును దివ్యసౌరభములుకలవనియు, దంతములు తమయందు తుమ్మెదల ప్రతిబింబములు సంక్రమించునట్లు స్వచ్ఛములై నిగనిగ మెఱయుచున్నవనియు భా.—రూపకము, ఉత్ప్రేక్ష, సంబంధాతిశయోక్తి, కైతవాపహ్నుతియు నలంకృతులు.

'సౌరభ్యము'—'సురభిస్తు గవి స్త్రీ స్యాం। వసన్తే చైత్రయోః పుంసి త్రిషు సౌమ్యసుగన్ధినోః' నానా. 'మాఘ్యం కున్దమ్' అమ. 'మొల్ల యనం గుందను చెలంగును' ఆం. భా. తుమ్మెద సంపెంగ తావికి సొమ్మసిల్లును—

'చరన్ వనాన్తే నవమఞ్జరీషు న షట్పదో గన్ధఫలీం అజిఘ్రత్
సా కిం న రమ్యా స చ కిం న రన్తా బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా.'

'వెలఁది యిచ్చటి సంపెంగవిరులు గనుచు। దేవతల యిండ్ల నెత్తిన దీపశిఖలు
కాకయుండినఁ బంచబంగాళి మగుచుఁ। బోవునే మత్తమధుకరపటలితమము.' మను.

'తనుఁ గనుఁ బ్రామి యొంగి కలతెంబటి వేఁటకు లేఁటిబోటి నా
త్తున పిరిదేస గ్రోలఁగ నెదుర్పడి సంపెఁగ తావి పెల్లిలోఁ
గనలునఁ గూలఁబోవు నళికామిని సాహస మేమిచెప్పు! న
య్యనుఁగుఁ బ్రియుండు నెచ్చెలులు నాఁగిన మాన దరాళికుంతలా.' పారి.

కుందములమీఁద తుమ్మెదలు మకరందముకొఱకు వ్రాలును.

'భ్రమర ఇవ విభాతే కున్దమన్తస్తుషారం
న చ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్.' శాకుం.

'కపటోఽస్త్రీ వ్యాజదమ్భోపధయశ్ఛద్మకైతవే'—అమ.

దంతములకు కుందసామ్యము మహాసంపచ్చిహ్నము—

కున్దకుట్మలనిభాస్సమా ద్విజాః। యోషితాం పతిసుఖామితార్థదాః' బృ. సం.

తే. శంఖసామ్యంబు రా మున్ను జలజభవుఁడు।సరసిరుహపత్త్రనేత్ర కంధర యొనర్చె,
జవ్వనము వచ్చి వెండి సాక్షాత్కరించు।శంఖమున చేసె నును గంధసారచర్చ. 17

జలజభవుఁడు=తమ్మిచూలి, మున్ను=మొదల, సరసిరుహ పత్త్ర నేత్ర కంధర=ఆకుమల దళాక్షి యొక్క కంఠమును, శంఖసామ్యంబురాన్=కంబువుతో సాటివచ్చునట్లుగా, ఒనర్చెన్=సృజించినాఁడు, వెండి=పిమ్మట, జవ్వనము=యౌవనము, వచ్చి, నునుగంధసారచర్చన్=పలుచని చందనపుఁ బూఁతచేత, సాక్షాత్కరించు శంఖమున = ప్రత్యక్షమయిన కంబువుగానే, చేసెన్.

తా.—ఆమె కంఠము పుట్టుకలో కంబువువలె నుండినది. పిమ్మట యౌవనమున చందనంపుఁ బూఁతచేత కంబువే అయినది. యౌవనము బ్రహ్మను మించినదని స్వారస్యము. ఉపమా గమ్యోత్ప్రేక్షలు.

'గ్రీవాయాం కన్ధరా మతా' విశ్వమ్.' 'శఙ్ఖః స్యాత్కమ్బుర స్త్రియామ్' 'సాక్షాత్ప్రత్యక్ష తుల్యయోః' అమ. 'శంఖమున' (అ = అవధారణార్థకము). 'చర్చాతు చార్చిక్యం స్థాసకః.' 'గ్రీవాచకమ్బునిచితార్థసుఖాని ధత్తే' బృ. సం. ''రేఖాత్రయాఙ్కితా గ్రీవా కమ్బుగ్రీవేతి కథ్యతే'' ''రేఖాత్రయవత్వాత్ కమ్బుకణ్ఠ దమయన్తీతి భావః'' మల్లి.

వోలెన్ - వివాహ = పెండ్లియందు - అంచత్ = ఒప్పుచున్న - మనోజాత = మన్మథునియొక్క - పాటల దంతచ్ఛద = కెమ్మోవి గలదానియొక్క (అనఁగా భార్యయయిన రతీదేవియొక్క) - బోడబాసికము = శిఖరములేని బాసికముయొక్క - దండల వోలెన్ = దండలో యనునట్లుగా, తనుకొత్తున్ = ప్రకాశించును.

తా. — ఆమె బాహువులను వర్ణించుచున్నాఁడు. ఆమె బాహువులయందు బాహుపురులుండెను; వానియందు వజ్రములుండెను; ఆ వజ్రముల కిరణములు కుచములమీఁది పూసరముల కలికలలోనికి సూత్రములం బోలె చొచ్చుకొనియుండినవి. అందువలన ఆసరములు ఆ బాహువునుండి ఆబాహువునకును బాహువులనంటి కుచములపై నుండినవి. కుచములకు ఉపరిగా గళమునకును ఉరోభాగము వెడల్పు తక్కువగా ఆదే బాహువులనడుమ దీర్ఘముగాను బంగారుపుందగటీవలె వెలుంగుచుండెను. అందువలన ఆతిర్యగురోభాగము రతీమన్మథుల వివాహమందలి రతీదేవియొక్క బోడబాసికముగాను, భుజములు ఆ బాసికపు దండలుగాను, ఒప్పుచుండెను — ఉత్ప్రేక్ష.

రతి మదనునికడ నుండును. మదనుఁడు జనహృదయనివాసి, కావున ఆమెయు ఆయువతి హృదయమునందుండుటచేత ఆ హృదయ భాగము రతియొక్క బోడబాసికముగా చెప్పఁబడినది. బాహుపురులందు వజ్రములుండుట ప్రసిద్ధము.

"ఉరవడి నేఁగుచోట నొక యుగ్మలియొల్లె దెలుంగు మేసని
ర్వ్వయుని భుజావిభూషణము వజ్రములం దవులంగఁ బాసినక." ప్రం. నైష.
'వజ్రం న కిఞ్చిదపి ధారయితవ్య మేకే । పుత్ర్యార్థినీభి రబలాభి రసూస్తి తన్త్రా'

ఆను శాస్త్రము నుల్లంఘించి ఆనాఁడు బాహుపురులందు వజ్రముల నేల ధరించిరి, అని శంకరాదేని, ఇంకను వివాహము కానందున పుత్రార్థినియను ప్రసక్తి లేమిచేత నని యెఱుంగునది. 'ఘృణి సూత్రసూత్రత' అనుటచే ఆ బాహువులను కుచములమీఁది పూలసరంబులను అన్నియు నొక్క పేసరముగా నుండె నని యభిప్రాయము. 'బోడబాసికము' "వివాహకాలమునందు వధూవరులకు నొసటఁగట్టెడు మూఁడుప్రక్క లేర్పడిన మూక్తికాది పరివిశేషము, లలాటికము." శ. ర. పూర్వమిది మూఁడుప్రక్క లేర్పడినదిగా నుండెననియు, ఇప్పటి వాడుకయందు అర్ధచంద్రాకారముగాఁ గనఁబడుచున్నదనియు. శ. ర. చూ. - "వసురాజన్యకిరీట..." వసు. "బోడబాసికపు - శిఖరములేని ఫాలపట్టికయొక్క" అనియు, పురుషులు ధరించుదానికి బాసికమనియే పేరనియు. స్త్రీలు ధరించునది బోడబాసికమనియు, బ్రౌను దొరగారి నిఘంటువు. చూ. బోడబాసికము. ఇందువలన పురుషధార్యమునకు శిఖరము లుండుననియు స్త్రీధార్యమునకు ఉండదనియు విశదము. 'కేళ్లు' - శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు 'ఇరులు' 'కేలు' శబ్దములు బహువచనాంతంబులు - అనుమతము అసాధువని ప్రౌఢవ్యాకరణంబున నుచ్చరించి కేలునకు కేలులు అని బహువచనము నుదాహరించినారు.

"ఉపధానవినిమయం బొండొండు మాపుటఁ । బెలుకేలు లణఁకువఁ బ్రిదిలి బిగియ" - కవిక. ర.

[ఇప్పద్యము ఇప్పటి ముద్రణమున ౧౨౦ యవది; అందు అణఁకువ'కు 'అక్కున' అని ముద్రితము.] కావున 'కేళ్లు' అను బహువచనము అంగీకర్తవ్యము.

చ. ఒదవెను జవ్వనంబు వెలి కొత్తఁగఁ, బయ్యెద సిగ్గుఁ గూడి బి
ట్టదుమఁగ, లేఁత లౌట దిగ నాఁకను మీఱను లేక, వడఁ వుం

యుగము తోలుత ఎడమెడముగా నుండినట్టిది క్రమప్రవృద్ధమై దఱిసి దఱిసి క్రిక్కిఱియుట రాముశాపము క్రమక్రమముగా తీఱిన కొలంది చక్రవాక మిథునము చేరువకు జరగుట యనునట్లును, ఒండొంటిం గవ్వుట ఆశాపము బొత్తిగా తీఱిపోయినంతట ఆచక్రవాకమిథునము ఒండొంటిం గవ్వుట యనునట్లుగాను, ఉండెను. చనుఁగొనలు వాని ముక్కులవలె నుండెను.—ఉత్ప్రేక్ష.

"త్యజచక్రవాకశోకం । బధాన ధైర్యం సహాస్వ సమయ మముమ్,
అయమేవ వాసరమణిః । హరిష్యతి శాప మాత్మానం తే."

'పృథుచూచుకముల' అని పూర్వముద్రణపాఠము. పృథుచూచుకత్వము బాలెంత లక్షణము గాన ఆపాఠము త్యక్తము. కన్యకు చూచుకములు ఇంచుకయే నీలిమం బొరసియుండును, కావున 'లేఁగప్పు' అనుట.

స్తనములకు చక్రవాకసామ్యము ఆకారణముందేగాక వర్ణమందు సయితము కలదు.—కర్పూరమంజరినుండి—(ఛాయ).—

"హంసీం కుఙ్కుమ పఙ్కపిఞ్జర తనుం కృత్వా యదవ్యాసితః
తద్భర్తాకల చక్రవాక గృహిణ్యే వేతి మన్యమానః
ఏతత్ త్వమ దుష్కృతం పరిణతం దుఃఖానాం శిక్షకమ్
ఏకస్థో౽పినయాతియేన విషయం దృష్టి త్రిభాగస్యాపి."

కుచములు హేమవర్ణములు—బిల్హణీయమునుండి—

"ఖగా వా గుచ్ఛా వా కనకకలశా వా కిము కుచౌ."

క. తారెట్లట్లుగఁ దమ్ముం। జేరిన ముత్తెంపు సరులఁ జేడియ చన్నుల్,
లోరెంట లుడిపె ఘన మగు। వారు నిజార్జవముఁ జేరువారికి నీరే? 23

చేడియచన్నుల్ = ఆయింతికుచములు, తారుఎట్లు అట్లుగన్ = తామెట్లో అట్లే తమ్ముం జేరిన ముత్తెంపుసరులన్ = తమ్ము నాశ్రయించిన (తాము తాల్చినయనుటయు) ముత్యాలపేరుల యందు, లోరెంటలు=లోపలి విరోధములను (ఎడమెడముగా నుండుటననుటయు), ఉడిపెన్ = పోఁజేసెను, ఘనమగువారు=గొప్పవారు (సాంద్రమయినవారు అనియు), నిజఆర్జవము=తమ సాధువర్తనమును, చేరువారికిన్ = తమతో సాంగత్యము చేసినవారికి, ఈరే = ఒసఁగరా?

తా.—లోకములో ఒద్దికకలిగియుండు దొడ్డవారు తమ సంగడీలంగూడ తమవలెనే ఒద్దికకలవారినిగాను దొడ్డవారినిగాను చేయుదురు. అట్లే గొప్పవయిన యామె కుచములు తమలో తాము ఎట్లు వెలుపాట్లులేక – ఎడమెడముగా నుండక – ఒద్దికకలిగి ఒకటితోనొకటి క్రిక్కిఱిసియున్నవో అట్లే తమ్ము నాశ్రయించిన అనఁగా తాము ధరించియున్న ముత్తెపుసరములను ఒద్దికకలిగి కలసిమెలసి యుండునట్లుగా అనఁగా సరములు ఎడమెడముగానుండక ఒకటిగా కలసియుండునట్లుగా కావించినవి.—స్తనములు క్రిక్కిఱియఁగానే వానిపై నుండు ముత్యాలసరములును వాని సందులోఁ బడి పేటలన్నియు కలసి ఒక్కటే అయినవని భా.—అర్థాంతరన్యాసము. 'ఆర్జవ'—'ఋజావశిష్టాప్రగుణౌ'—అమ.

సముదృత్త సాంద్రస్తనములు అర్థసుఖప్రదములని స్త్రీలక్షణము:—

"మధ్యం స్త్రియాస్త్రివళిసార్థ మరోమశం చ । వృత్తౌ ఘనా వవిషమౌ కఠినావురస్యౌ
రోమాపవర్జిత మురో మృదుచాఙ్గనానాం । గ్రీవాచకమ్బునిచితార్థ సుఖానిధత్తే" బృ. సం.

"పరిచ్యుతస్తత్కుచకుమ్భమధ్యాత్ । కిం శోష మాయాసి మృణాళహార
నసూక్ష్మ తన్తోరపి తావకస్య । తత్రావకాశో భవతః కథంస్యాత్." రత్నావళి.

తే. విరహితతిమీఁదఁ గోపాన మరుఁడు దివియ
వేగనైన పైఁడి యొఱతోన విసరఁ, గుట్లు
దునిసి బైటికి నసిధార దోఁచె ననఁగఁ
గనకరుచి మధ్యలత నారు కాంత కలరు. 24

కాంతకున్ = అనుగుదకు, విరహి తతి మీఁదన్ - వియోగుల గుంపు పై, కోపానన్ = క్రోధముచేత, మరుఁడు = మన్మథుఁడు, తివియన్ వేగము ఐ = ఒరనుండి వెలికీడ్చుటకు కలుగునట్టి కాలవిలంబము నోర్వలేనంత త్వరగలిగి, పైఁడియొఱతోన = బంగారపుఁ గోశముతో నే, విసరన్ = విసరివైవఁగా, కుట్లు = ఒఱయొక్క దారపుఁగుట్లు, తునిసి = తెగిపోఁగా, అల అసిధార = ఆ లోపలి కత్తివాదర, బైటికిన్ = వెలికి, తోఁచెననఁగన్ = అగపడినదో యనునట్లు, కనకరుచిన్ = బంగారపుఁ గాంతిగలదైన, మధ్యలతన్ = కౌఁదీఁగయందు, ఆరు = రోమావళి, అలరున్.

తా.—మన్మథుఁడు విరహిసమూహముమీఁద అతికోపము వహించినవాఁడై కత్తిని పైఁడి యొఱనుండి తివియుటకు అగునట్టి విలంబము నోర్వక త్వరాతిశయముచేత పైఁడి యొఱతో నే విసరివైవఁగా దాని కుట్లు తెగిపోయి లోని నల్లనికత్తివాదర పైకి కనఁబడుచున్నదో యనునట్లు ఆ దేవియొక్క బంగరువన్నె కౌఁదీఁగయందు నూఁగారు వెలయుచుండెను. ఉత్ప్రేక్ష.

'కనక' 'పైఁడి' యను విశేషణములను బరికించునది. 'పైఁడి' యని విశేషించుట సామ్యసిద్ధికై, 'లత' యనుట సన్నఁదనముం దోఁపించుటకు, సన్నఁదనము ఒఱతోడి సామ్యపుష్టికి, కత్తివాదరకుం బోల్చుట నలుపు తళతళకొఱకును, సూక్ష్మతకొఱకును; ఋజుత్వముకొఱకును, సూక్ష్మత శుభలక్షణము.—

"తస్యాః ప్రవిష్టా నతనాభిరన్ధ్రం రరాజ తన్వీ నవరోమరాజిః,
నీవీ మతిక్రమ్య సితేతరస్య తన్మేఖలామధ్యమణేరివార్చిః." కుమార. 1 (38)
"తన్వీ=సూక్ష్మా" మల్లి, టీక. । 'కోపానన్'=కోపమునన్. హా. ౪. ఆ. ౧౩. టీక.

క. అండజ గామిని యూరుపుఁ । బిండు వలపు లాన నాభిబిలము వెడలి చ
న్గొండల నడుముగఁ బ్రాఁకెడు । కుండలియో యనఁగ నారు కొమరొప్పారున్. 25

అండ...లు - అండజగామిని = హంసవలె నడచునదైన యా కోమలియొక్క - ఊరుపు = నిశ్వాసములయొక్క - పిండు = సమూహముయొక్క - వలపులు = పరిమళములను, ఆనన్ = క్రోలుటకై, నాభిబిలమున్ = పొక్కిలియనెడు కలుగునుండి, వెడలి = తలసూపి, చన్గొండలనడుముగన్ = స్తనములనెడి పర్వతముల మధ్యమార్గముగా, ప్రాఁకెడు కుండలియో యనఁగన్ = అయగారుపులవైపు ప్రాఁకుచున్న పామో అనునట్లుగా, ఆరు = నూఁగారు, కొమరు ఒప్పారున్ = సొంపుమీఱును.

తా.—ఆమెయొక్క నూగారు తదీయ శ్వాసవాయువుల పరిమళమును క్రోలుటకై నాభి యను కన్నములోనుండి వెడలి చన్నులనెడి కొండలనడుముగా ప్రాఁకుచున్న పామోయనునట్లు కొమరారెను.—రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

'అండజగామిని' - అండజము = గ్రుడ్డునుండి జనించినట్టిది. 'పక్షిసర్పాదయో౽ణ్డజాః' అమ. పక్షిగావున హంసయు అండజమే. హంసగామిత్వము 'వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ' అని పద్మినీజాతి లక్షణమందు చెప్పఁబడినది.

లేఁగౌఁదీఁగన్=కౌనసెడు లేఁతతీఁగను, నితంబము=పిఱుంగు, వ్రేగునన్=తనబరువుచేత, త్రెంపుటయున్=త్రెంపఁగా, విరించి=బ్రహ్మ, కని=చూచి, బిగింపన్ లోఁగి=బిగువుగా ముడివెట్టుటకు వెనుదివిసి, వదలుగన్ ముడియిడియెన్ నాన్=సడలికగా ముడివైచినాఁడో యనునట్లుగా, కో...భి - కోక=జక్కవలవంటి - స్తని=కుచములుగల యామెయొక్క - గభీర=లోఁతయిన - నాభి = పొక్కిలి, చెలంగున్ = శోభిల్లును.

తా.—నడుమనెడు లేఁదీఁగ పిఱుందుబఱువుచేత తెగిపోఁగా చూచి బ్రహ్మదేవుఁడు ముడిని బిగించినచో ఆ బిగించుటలోనే ఆ తీఁగ మరల తెగి మఱి ముడి కందదోయను జంకుచేత వదులు వదులుగా వైచిన ముడియో యనునట్లుగా ఆమెకు లోఁతయిన పొక్కిలి చెన్నారుచున్నది.—ఉత్ప్రేక్ష.

స్త్రీకి గురునితంబమును గభీరనాభియు ప్రశస్తములు.—

“విస్తీర్ణమాంసోపచితో నితమ్బో గురుశ్చ ధత్తే రశనాకలాపమ్
నాభిర్గభీరా విపులాఽఙ్గనానాం ప్రదక్షిణావర్తగతా ప్రశస్తా.” బృ. సం.

‘లేఁదీఁగ’ - గావుననే త్రెచ్చుట. ‘విరించి’ - చేసినవాఁడు కావున మొదటికే మోసము రాకుండ సరిచేసికొన్నాఁడు. ‘త్రెంపుటయున్’=త్రెంపుడున్=త్రెంపిన యనంతరము. ‘వదులు’ గావుననే ‘గభీర’ ము - బిగువయినచో నాభిరంధ్రమేయుండదు. ‘కోకస్తని’ - యువతిగావున. స్థితికర్త విష్ణువుగదా, ఆయన ఆపొక్కిటిని సరిచేయక బ్రహ్మచేయుటయేమి? అనిన - బ్రహ్మ ఇంకను యౌవనసృష్టిని ముగింపలేదు ఇంకను దిద్దుచుఁ దీర్చుచునే యున్నాఁడు - ఆమె ఉదయద్యౌవన, వయస్సంధి ప్రాప్త.

క. వెలఁది కటిపేర నిల నొక । పులినము డిగఁబడియె సింధు పులినపుఁ బఙ్క్తిన్
నలువ యది వడఁగఁగాదే । తెలియుటకం దంచపదము దిరముగ నిలిపెన్. 29

సింధుపులినపుఁబంక్తిన్ = నదులయొక్క (లేక సముద్రములయొక్క) యిసుకదిన్నెల శ్రేణియందు చేరినట్టి, ఒక పులినము = ఒక యిసుకదిన్నె, వెలఁదికటిపేరన్ = ఆ చెలువయొక్క పిఱుందనెడు మిషచేత, ఇలన్ = భూమిలో, డిగఁబడియెన్ = నిలిచిపోయినది, అది పడుటన్ కాదే = ఆ పులినము అట్లు నష్టమాయిన కారణమునఁ గాదా, నలువ=బ్రహ్మ, తెలియుటకున్ = అనష్టి బోధపడుటకై, అందున్=శేషించియున్న యిసుకదిన్నెల శ్రేణియందు, అంచపదమున్ = హంసపాదమును, తిరముగన్ = అనిశమును, నిలిపెన్ = వ్రాసెను.

తా.—నదులలోని యిసుకదిన్నెలలో ఒకదిన్నె ఆ తరుణి పిఱుఁదనెడు వ్యాజమున నది నుండి యివలికి వచ్చి యిట నేలమీఁదనే నిలిచిపోయినది. ఆవిధముగా ఒకదిన్నె నదులలో నష్టమయి పోయినదని తెలియుటకై బ్రహ్మదేవుఁడు ఆ దిన్నెలయందు హంసపాదమును వ్రాసి స్థిరముగా అటనుండునట్లు పెట్టినాఁడు.—సాపహ్నవోత్ప్రేక్ష.

వ్రాఁతలో పంక్తినడుమ ఏదేని కొంత నష్టమయినచో అచట+ఈగుర్తును వ్రాయుట వాడుక. ఇది హంసపదచిహ్నమువలె నుండును, కావున దీనికి వ్రాఁతలో హంసపాదమని పేరు. ఏళ్లయందు పులినములలో హంసలు సంచరించుట సహజము.=చూ. శాకుంత. ౬ అం.—“కార్యా సైకత లీనహంసమిథునా స్రోతోవహా మాలినీ.” ‘దేశే నదవిశేషేఽబ్ధౌ సిన్ధుర్నా సరితి స్త్రియామ్’—అమ.

తే. కదళి దివియించె నాగ్రాంఘ్రికంబు తోడల
పెనుపు నెట్లన్నఁ బొరల సోదన నడంచు

కొన్న యాఁదోఁక పాటును గొప్ప విప్ప
మెఱయు గోళ్ళ్ముచ్చులును గెంపు గుఱులు గావె. 30

కదళి=అరఁటి, అగ్రాంఘ్రికంబు=మునిపాదములతోఁగూడ (పాదముల తుదివఱకు అనుట), తొడల పెనుపున్ = ఆమె యూరువులయొక్క భాగ్యమును, తివియించెన్ = దోఁపించినది, ఎట్లన్నన్ = అందులకు తార్కాణ మేమనఁగా, పొరల సోదనన్ = పట్టులను (వస్త్రపు ముడుఁతలను అనియు) ఒలిచి సోదా చూచినయెడల అందులో, అడంచుకొన్న యాఁదోఁకపాటును=దాఁచుకొనియుండెడి యానుపూర్వత్వమును (ఆవుతోఁకవలె క్రమముగా స్థౌల్యము తగ్గియుండుట అనుట), కొప్పున్ = కొప్పువలెనుండునదైన యరఁటిపువ్వును (ఇంటికప్పును అనుటయు), విప్పన్ = విడఁదివిసి చూడఁగా, మెఱయు=ప్రత్యక్షమగుచున్న - గోళ్=గోళ్లున్=గద్దగోళ్లనియు గోళ్లనియు వ్యవహరింపఁబడు కదళీపుష్పావయవములును (గద్దగోళ్లను పేరి చౌర్యసాధనములును అనుటయు), ముచ్చులును = దొంగలని వ్యవహరింపఁబడు కదళీపుష్పావయవములనెడు చోరులును, కెంపున్ = పూరెప్పలలోని యెఱుపును (పద్మరాగంబును అనుటయు), గుఱులు = గుర్తులు, కావె = కావో.

తా. — అరఁటి యనెడి దొంగలయేలికసాని ఆ దేవి యూరువుల సౌందర్యమున ఒక లేశమును మునిపాదముల తుదివఱకును దోఁపించి తెప్పించికొన్నది. అందులకు గుర్తేమి యనఁగా — దొంగిలిన వస్తువులతోఁగూడ దొంగలును దొంగలపనిముట్లును అరఁటికడ దొరకుటయే. అది యెట్లన, అరఁటి పొరలను ఒలిచి సోదా చూడఁగా (అదే వస్త్రపు ముడుఁతలను తివియించి సోదా చూచుట, అట్లు చేయఁగా), ఆ పొరలలోపల ఆమె యూరువుల యాఁదోఁకపాటు దొరకినది, ఆ యరఁటియొక్క కొప్పువంటి పువ్వును రెప్పలు విడఁదివిసి చూడఁగా, (అదే దానియింటి నడికొప్పును వెలుతురుకై విప్పి అటకపై సోదా చూచుట - అట్లు చూడఁగా నచట) గోళ్లు గద్దగోళ్లు అను పేర్లుగల యరఁటి పుష్పావయవవిశేషములనెడివి గోళ్లు - గద్దగోళ్లు - నని పేళ్లుగల చౌర్యసాధన విశేషములు దొరకినవి; దొంగ లను పేరు గల యరఁటి పుష్పావయవములనెడి దొంగలు దొరకినారు; అరఁటి రెప్పల యెఱ్ఱఁదనమనెడిది ఆమె యడుగుఁదమ్ముల కెంపును అదే తదీయధనములోనిదైన పద్మరాగము - అదికూడ దొరకినది.

ఇవె ఆచౌర్యమునకు గుర్తులు. — అనుమానాలంకారము.

ఆమెయూరువులయందు ఆఁదోఁకపాటును, అడుగులయందు కెంపును, అట్లే ఉన్నవే, చోరితము లాయె ననుట యెట్లనఁగా — ఆమెయందు అవి అతుల్యములని యెఱుంగునది. మఱి యాపట్టుఁబడినట్టివి యానువే యని తెలియుట యెట్లన — వాని యుత్కర్షచేత అట్టి తత్తదుత్కర్ష ఆమెయందుఁగాని మఱియెందును ఉండదని నిశ్చయముగాన. — 'కదళీ' శబ్ద స్త్రీలింగస్వారస్యముచేత దొంగలరాణి యని స్త్రీత్వము చెప్ప నొప్పుచున్నది. 'తివియించె' నను ప్రేరణార్థక రూపముచేత దొంగలచేత చౌర్యము చేయించిన దని చెప్పుట; అంఘ్రిగతమయిన కెంపును తుదిని చెప్పుటయు ఊరుగతమయిన పెనుపును ముందు చెప్పుటయు వ్యుత్క్రమ దుష్టముగాదా యనిన, — కాదు. 'అగ్రాంఘ్రికంబు' అనుపదము 'తివియించె' నను క్రియకు విశేషణము, పెనుపునకు విశేషణము గాదు; ''అగ్రాంఘ్రికంబు తొడల'' అని ద్వంద్వసమాసము కుదురదు, వ్యస్తముగా 'పెనుపు'తో నన్వయింపదు. కావున 'అగ్రాంఘ్రికంబు' అనుపాఠము సాధువుగాదు. వ్రాఁతపుస్తకములలో ''అగ్రాంఘ్రికంబు'' అని పాఠము ఉన్నది. ''అగ్రాంఘ్రికము'' — అవ్యయీభావసమాసము —

ఇట 'ఆ' అనునది అభివిధ్యర్థకము, "ఆబాలగోపాలము" అన్నట్లు.—పెనుపు = సిరి - కెంపు— 'కురువిందకందళదళప్రతిమాంఘ్రికరోదరాధరన్' అని 8 పద్యములోను,—'పాణిపాదము లెఱ్ఱ వాఁడుఁ దోడఁ...' అని 7 లోను, ఉన్నదిగదా.

"స్నిగ్ధోన్నతాగ్రతను తామ్రనఖౌ కుమార్యాః । పాదౌ సమోపచితచారునిగూఢగుల్ఫౌ
శ్లిష్టాంగులీ కమలకాంతితలౌ చ యస్యాః । తాముద్వహేద్యది భువోఽధిపతిత్వమిచ్ఛేత్."
బృ. సం.

"అనుమాన మగును సాధ్యంబును దర్శింగమును మాత్రము వచింపంగా" అలం.

తే. వసుధలో నెట్టి శ్రీ గల వారివేని
కరభములు దాస్యములు సేయు సరసిజాక్షి
యూరువుల కెట్లు టన్నఁ బైఁ దారు మోచు
గొడుగులును నల్లకలశముల్ గుఱులు గావె? 31

వసుధలోన్ = లోకములో, ఎట్టి శ్రీగలవారవేని = ఎంతటి శ్రీమంతురాండ్రవయినను, కరభములు = మునికట్టు మొదలు చిటికెన వ్రేలివఱకుంగల చేతిబయటిభాగము, సరసిజాక్షి యూరువులకున్ = ఆనాయిక తొడలకు, దాస్యములన్ చేయున్ = సేవలొనర్చును. ఎట్లు అటన్నన్ = ఇంతులకు తారెట్లు సేవచేయుటేమి యనఁగా, తారు = ఆకరభములు, పైన్ = మీఁద, మోచుగొడుగులున్ = మోచుచున్న ఛత్రములును (ఛత్రరేఖలనుట). అల్లకలశముల్ = ఆ కుంభములును (కలశరేఖలనుట), గుఱులు గావె = గుర్తులు కావా.

తా. సేవకులు ప్రభువును గొడుగుపట్టియు జలకలశమును తెచ్చియు సేవించుట ప్రసిద్ధమే. ఆట్లే మహాభాగ్యవంతురాండ్ర కరభములలో రేఖారూపముగా గొడుగులును కలశములును కనఁబడుచున్నవి, కావున నాకరభము లామెయూరువులకు సేవసేయుననుట స్పష్టము—ఊరువులు కరభసదృశములనుట,—అనుమానాలంకారము; చూ. 30 టీక.

'మణిబంధాత్కనిష్ఠాంతం కరస్య కరభో బహిః' అమ.

"కదళీ కదళీ కరభః కరభః । కరిరాజకరః కరిరాజకరః
భువనత్రితయేఽపి బిభర్తి తులా । మిదమూరుయుగం న చమూరుదృశః" - ప్రస. రాఘ.

రాజ్ఞీపదమధిష్ఠించువారిచేతులలో గొడుగురేఖ కలశరేఖ ఇత్యాదిరేఖా విశేషములుండును:—

"[illegible] వాజికుఞ్జర రథ శ్రీవృక్షయూపేషుభి
ర్మాలాకుణ్డల చామరాఙ్కుశయవైః శైలై ర్ధ్వజై స్తోరణైః
మత్స్యస్వస్తిక వేదికావ్యజనకైః శఙ్ఖాతపత్రామ్బుజైః
పాదే పాణితలేఽపి వా యువతయో గచ్ఛన్తి రాజ్ఞీపదమ్."—బృ. సం.

ఈ చిహ్నములు మహాభాగ్యమును సూచించునుగదా, అవికలవారు ఒకరికి దాస్యము చేయుట యెట్లు ఘటిల్లును: అని ప్రశ్నయేని ఆమెకై యూడిగముసేయుట అట్టి రేఖలుగల భాగ్యవంతురాండ్రకే గాని ఎల్లవారికని దొరకదనుట. మోయు - తమకై వహించుటగాను, కొలువుగా వహించుట కావున 'తాల్చు' అనక 'మోయు' అనుట.

క. వలరాజు కుటుంబము సగ్గలముగఁ బోషించుకలిమి గర్భము లయ్యెన్
బోలఁ దొలక జంఘ లవిశ్రాంతమల సౌందర్యనిబిడ మనతకాంతిన్. 32

పొలఁతుక జంఘలు=ఆ యువిదయొక్క పిక్కలు, అతి...తిన్ - అతి=మిక్కిలి-శ్యామల=ఆకుఁబచ్చనిదైన - మంజీర=అందెలయందు - స్థ=ఉన్నట్టి - నిబిడ=దట్టమయిన - మరకతకాంతిన్=పచ్చల కిరణముల చేత, వలరాజుకుటుంబమున్=మన్మథుని యాలుబిడ్డలులోనగు బృందమును, అర్గలముగన్=అవ్వారిగా, పోషించు కలమగర్భములయ్యెన్=ప్రోచు రాజనపు వరిపొట్టలాయెను.

తా.—స్వర్ణచ్ఛాయములైన యామె పిక్కలు నాకోకాండ్రలోను నాకోకాఁడయిన వలరాయని కుటుంబమునకు భోజ్యమయిన ఉత్తమోత్తమంపు రాజనపు వరిపొట్టలవలెను, వానిచుట్టును అందియలనుండి పైకి పొలసిన దట్టంపు మరకతకాంతులు ఇంకను పసిమి తిరుగని వరిపూవులవలెను ఉండెను.—ఉత్ప్రేక్ష.

వరిపొట్టలు నిండుకొని పండునప్పుడు ఆకులు కొన్ని పసుపు తిరుగకయు నుండును:—

"కూండ్లకై శాలిమంజరుల్ గొనుచుఁబోఁగ। నంబరంబునఁబఱను కీరాళి పోలిచె
బసరుటాకుం గొంటి యాకుతోఁ బండఁబారి। ఫేదభయమున సెగపేన చేలనంగ" ర (౧౬-౨).

కావున నిట మరకతకాంతికి పసుపువన్నెతో అభేదమును సాధించుట యనావశ్యకము. "జఙ్ఘే చ రోమరహితే విశదే సువృత్తే" అని ప్రశస్త జంఘాలక్షణము; ఇది కలమగర్భోపమానము చేత నిగూఢము. 'పాదాఙ్గదం తులాకోటి ర్మఞ్జీరో నూపురోఽస్త్రియామ్'-అను.

తే. ఉవిద నిద్దంపుజంఘల సవతుఁ గోరి
కలమగర్భంబు లడఁగు లోఁ గంటకములు,
చాతురుల మించి మఱి దివసక్రమమున
నిలువ కవి బాహిరము లైనఁ దలలు వంచు. 33

కలమగర్భంబులు=వరిపొట్టలు. ఉవిద నిద్దంపు జంఘల సవతున్=ఆయువ్వగ్గలికయొక్క నున్నని పిక్కల సామ్యమును, కోరి=అపేక్షించి, చాతురులన్=నేర్పులచే, మించి=అతిశయించి, కంటకములు=ముండ్లను, లోన్=పొట్టలో, అడఁచున్=అణచికొనును, మఱి=పిమ్మట, దివసక్రమమునన్=కొన్ని దినములకు, అవి=ఆముండ్లు, నిలువక=లోపల అణఁగియుండక, బాహిరములు=బయలుపడినట్టివి, ఐనన్=కాఁగా, తలలువంచున్=(ఆయవమానమునకు) శిరములు వాంచును:—

తా.—ఆమె పిక్కలు అరోమశములు, కలమగర్భములు సకంటకములు; ఆ పిక్కలతోడి సాటికై వరియెన్నులు నేర్పుమీఱి ముండ్లను కడుపులోనే దాఁచుకొనును. ఆ ముండ్లు లోపల నిమడక వెలికివచ్చినంతట పిక్కలతో తాను సాటియని విఱ్ఱవీగుటయెల్ల పరిహాసాస్పదమాయనని అవమానమునకు తలలు వంచుకొనియుండును.—ఫలోత్ప్రేక్షా హేతూత్ప్రేక్షల సంసృష్టి.

'నిద్దము'.—ప్ర. స్నిగ్ధము. 'బాహిరము'—ప్రాకృతము 'బాహిరమ్.'

చ. ఇలఁగల వస్తుసంతతుల కెల్లను గచ్చిడు మాస్వభావ పా
టల రుచి కేమొ వేఱ యొకఁడా లిఁక వచ్చునె? లక్కసీటు మ
మ్మలమిన దెంత ముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగు నట్లు మించునఖము లెఱియన్ గొమరారు నింతికిన్. 34

ఇంతికిన్=ఆయెలనాగకు, పదాబ్జములు=తామరలవంటి యడుగులు, ఇలన్=భూమిలో, కలవస్తుసంతతులకున్ ఎల్లన్ = ఉన్నట్టి పదార్థసమూహముల కన్నిటికని, గచ్చు = పూఁతను, ఇడు మాస్వభావ పాటలరుచికిన్ = పెట్టునదైన మా నిసర్గశ్వేతరక్తకాంతికి, ఏమొ వేఱ ఒక

డాలు=ఏదో వేఱే హెచ్చుతళుకు, ఇఁక, వచ్చునె = రాదు, ఇది = ఈ చెలువ, లక్క నీటను = లత్తుకజలముతో, మమ్ముఁ, అలమినది అని, అంగుళీముఖంబులను = వ్రేళ్లనెడు వదనములతో. నగునట్లు మించునఖముల్ = నవ్వుచున్నట్లు తళుకుగోళ్లు, మెఱయన్ = ప్రకాశించుచుండఁగా, కోమ రారున్ = సొంపుమీఱును.

తా.—మేము లోకములోని యెల్లవస్తువులకును మాస్వాభావిక పాటలకాంతిచేత ఎఱ్ఱవన్నె యొసంగుదుము, అట్టిమాకు ఇంతకన్న హెచ్చుడాలు ఏ యుపాయమునను గలుగదు. ఈ యువిద మాకు వన్నె హెచ్చునని లత్తుకనీరు పూయించుచున్నది! ఎంత తెలియనిది! అని అలంకరణార్థమై లత్తుక నీటిపూఁత నొందుచున్నయామె పాదములు వ్రేళ్లనెడు ముఖములతో నవ్వుచున్నవోయన తళుకుగోళ్ల ధవళప్రకాశముచే నొప్పారుచుండెను.—ఉత్ప్రేక్ష.

ఆమె పాదములు పాటలిమ మించియున్నవి: గోళ్లు ధవళితరములై యున్నవి. — అని భా.

'స్వభావ'—''అవ్యలాక్షారసాసిక్తం రక్తం తచ్చరణద్వయమ్.'' చంద్రాలోకము. 'శ్వేతిరక్తస్తు పాటలః...' అను. నఖములు రక్తగణపతితములు ''స్నిగ్ధోన్నతాగ్రతను తామ్రనఖౌ కుమార్యాః. పాదౌ...'' అని మహాభాగ్యవతీలక్షణమునఁ జెప్పఁబడియున్నది. హాసితము శ్వేతగుణతము— ''నిర్లోకచీరడిణ్డీర చన్దనం హాసితం హిమమ్.'' ఇట్లుండఁగా నఖములను హాసితములుగా నుత్ప్రేక్షించుట యెట్లు? అని ప్రశ్న. గణపాణిమగాక పైగా లాక్షారసమంగీకాద పూసియున్నారు; అయినను స్వాభావికపాటలిమయే గణపాటలిమకు ప్రాయము; స్వభావముచేతను వాని కాంతి కేవలము శ్వేతము గానందున ఆ నవ్వును తాంబూలము నములిన నోటినవ్వుగా నెన్నందగును.—'ముగ్ధః సున్దరమూఢయోః' అను. లత్తుకనీటిచేత వన్నె హెచ్చదనుట అతిశయోక్తి. 'అలమినది'—ఆమె స్వయముగా పారాణి పూసికొన్నదా? అని ప్రశ్న. అలముంచుకొనుటయే అలముట యని ఔపచారికప్రయోగముగా నెన్నవలయు.

క. లలనాపరిపద కచ్ఛప ములు బలిమి మెయిన్ గజ ప్రభూతగతి శ్రీ
విలసనముఁ గొనఁగఁగాదే కలిగెన్ గజకచ్ఛపోగ్ర కలహం బుర్విన్. 35

లల...లు - లలనా = ఆరమణి యొక్క - పరిపద = మీఁగాళ్లనెడు - కచ్ఛపములు = తాఁబేళ్లు, గజప్రభూతగతి శ్రీవిలసనమున్ = ఏనుఁగులయొక్క యుత్కృష్టమయిన నడకయొక్క సంపదయొక్క విలాసమును, బలిమి మెయిన్ = బలాత్కారముచేత, కొనఁగన్ గాదే = హరించినందు వలనఁగదా, ఉర్విన్ = లోకములో, గజకచ్ఛప ఉగ్రకలహంబు = ఏనుఁగునకును తాఁబేటికిని ఘోరమయిన పోరు, కలిగెన్ = సంభవించెను.

తా.—ఆమెయొక్క మీఁగాళ్లనెడు తాఁబేళ్లు ఏనుఁగుయొక్క నడకసొంపును బలాత్కారమున హరించినందున నాఁటినుండి లోకములో గజకచ్ఛపకలహమను పేరఁ ప్రసిద్ధమయిన పోరు గజములకును కచ్ఛపములకును గలిగినది.—మీఁగాళ్లు తాఁబేళ్లవలెను, నడక యేనుఁగునడకవలెను. ఉన్నవని భా.—హేతూత్ప్రేక్ష రూపకోత్థాపిత.

గజకచ్ఛప కలహమునానుడికి అవాస్తవమయిన కారణ మిటం జెప్పఁబడినది.— 'ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహుళంబహు''—అమర. ఉత్కృష్టార్థము 'ప్రభూత' శబ్దమునకు లాక్షణికము; ప్రభూతి ముద్ధతే ప్రాజ్య - హేమ. శ్రీ - లక్ష్మీసంపదలకు అభేదము నిపనుయనిదేరు. —

వర్ణనము. ‘కూర్పరబద్ధ’ అని పా. ‘మోఁచేతికిఁ గట్టఁబడిన’=‘ఖేటక’ మనుటచేత నే నీలిమ స్ఫురించునని యీపాఠమున హృదయము, ‘‘ఖేటః కఫే గ్రామభేదే చర్మణ్య స్త్ర్యర్వతి త్రిషు’’-మేదిని. ‘నిబద్ధ’ యనుటచే మోహకముగా నున్నదనుట; ఎక్కడనో గట్టుటకన్న చేతికి కట్టినచే ఉపయుక్తికి సులభతరము గావున చేతికేయని గమ్యమగుచున్నది. ‘ఎడమకుఁ’ - ఇది ద్రావిడాచారము. కుడికి ఒఱఁగుట ఆంధ్రాచారము. ‘అడుగునందుఁ’=సులువుగా ఉంచుటకును తీయుటకును, నలుగక యుండుటకును. ‘కూప’ - అద్దపుఁబిళ్ల మడి గాదు, అందుఁ జూచికొనుటలో ఒరులకుం దెలిసిపోవును.

ఉ. ఆ నవలా యలంతి పసు పాడి, దుకూలముఁ దాల్చి, గుబ్బచన్
గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ తేటల నిగ్గు దేరఁ గ
ప్రాసన నాభిఁ దీర్చి, పితృ బద్ధ లతాంతము లర్థిఁ గొప్పునన్
బూని యొకింత సేపునిచి పుచ్చి చెలిం గని వెచ్చ నూర్పుచున్. 39

ఆనవలా=ఆ యొలనాగ, అలంతి పసుపు ఆడి = కొంచెమే పసుపు పూసికొని జలకమాడి, (పా. నవలావలంతి=స్త్రీరత్నము), దుకూలము = సన్నవలువను, తాల్చి = ధరించి, గు...లన్ - గుబ్బ=గుండ్రమయిన - చన్=చన్నుల - కోనలన్ =కొనలయందు, తావులు=పరిమళములు, ఉప్పతిలన్ = జనించునట్లుగా, కుంకుమ తేటల నిగ్గుదేరన్ = తేటగా (కడుంబలుచనఁగా) కలంచిన కుంకుమపూఁతయొక్క కాంతి పర్వుచుండఁగా, కప్రాసన=కప్పురముతో నే, నాభిన్=తిలకమును, తీర్చి=సవరించి, పితృబద్ధ లతాంతములు=తండ్రిచేతఁ గ్రువ్వఁబడిన పువ్వులను, అర్థిన్=అభిలాషతో, కొప్పునన్ పూని=కొప్పుముడియందు ధరించి. పుచ్చి=తీసినదై, చెలిం గని, వెచ్చన్ ఊర్పుచున్=వేఁడి నిట్టూర్పు నిగిడించుచు (తరువాతి పద్యములో నన్వయము.)

తా.—ఆమె కడుఁసన్నముగా పసుపుఁ బూసికొని జలకమాడి, సూక్ష్మవస్త్రము దాల్చి, తావులు పర్వునట్లుగా వక్షోజముల యగ్రములందు కుంకుమ నిగ్గులుకొల్ప, కప్పురముతో తిలకము తీర్చుకొని, స్వామికై తండ్రి గ్రుచ్చిపెట్టియున్న విరిదండను ప్రియపడి కొప్పునం జెరివి, కొంచెము సేపు ఉంచి, తివిచి, చెలిం గని వెచ్చనూర్పుచు (నిట్లు పలికెను).

‘అలంతి’-దట్టముగాఁ దాల్చుట నాగరికము గాదు-‘ఒరసి యొత్తిన మాడ్కిఁ గందక మేన సిగ్గులువాఱఁ బసుపాడి జలకమాడ’ అని (60)లో ఉండలేదా? అట్లే ‘నిగ్గులు దేరన్’ అనుటయు. ‘దుకూలము’-దుకూలం క్షౌమే సూక్ష్మాంశుకే చ తత్’ నానా.—‘కప్రాసన్’=కపురాసన్ - కప్పురానన్-కప్పురమునన్. — ‘లతాంతము’=పువ్వు-కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చుమధుపమ్ముల సుగీత నినదమ్ములెసఁగన్’’ అని నన్నపార్య ప్రయోగము. ‘కోన’=‘కొన’ నాల; కొండయందలి మఱుఁగుచోటు, దేశవిశేషము. అడవి - ‘కోణః’ అని వైకృతదీపిక. నాభి=తిలకము అని శ. ర.

క. మీ పాడిన హరిచందము । లే పాడిగఁ దలఁప వచ్చు? నితఁ డేసతులం
గాపాడినవాఁ డనుఁగై । త్రో పాడినఁ దన్ను వలచి తొయ్యలులారా? 40

తొయ్యలులారా=ఓ చెలువలారా, మీపాడిన హరిచందములు=మీరు గానముచేసిన హరియొక్క ప్రకారములు, ఏపాడిగఁ దలఁపవచ్చున్=ఏమి ధర్మముగా నెన్నఁదగును (ధర్మ్యములు గావనుట), ఇతఁడు=హరి, తన్ను, వలచి=కామించి, త్రోపాడినన్ =తన్నుఁ బైకొనఁగా, ఏసతులన్ = ఏ కామినులను, అనుఁగై = చెలిమి వహించి, కాపాడినవాఁడు = రక్షించినాఁడు, (వలచి వచ్చిన స్త్రీలను ప్రేమింపక రక్షింపక తిరస్కరించినాఁడనుట)—పా. ‘తనకుఁ గలిమిన్’ = తనకు

కలసినందఱు చెలువలున్నారన్న గర్వముచేత - కడమ యథాపూర్వము, స్త్రీలయందును గనికరము లేనివాఁడు కఠినుఁడని భా. ఆ కాఠిన్యమును వక్ష్యమాణ గ్రంథముచే వివరించుచున్నది.

తే. తాను సురనరాలి నృపతనుల్ దాల్చి యకట । కామినీతతి నుడికించుకంటె నట్టె
గండెయును నల్లదాసరిగాఁడు కిరియు।హరియునై పోవుటయ మంచిదనుయుగంబు.

తాను = హరి, అనుయుగంబు = ప్రతియుగమందును. సురమౌని నృపతనుల్ = దేవ ఋషి రాజదేహములను (అనఁగా వామన పరశురామ రామదేహములను), దాల్చి=ధరించి, అకట= అయ్యోపాపము, కామిని తతిన్=వలచిన చెలువలను, ఉడికించు కంటెన్=గుఃఖపెట్టుటకంటె,- అట్టె=అటువలెనే, గండెయున్ =మత్స్యంబును. నల్లదాసరిగాఁడున్ = తాఁబేలును, కిరియున్ = వరాహంబును. హరియున్ =సింహంబును, ఐ పోవుట=ఐ ఉండిపోవుట, మంచిది= మేలు.

ఆ. అయ్యో! ఈయన ప్రతి చతుర్యుగమందును దేవ తాపస రాజావతారములు అనఁగా వామన జామదగ్న్య శ్రీరామావతారములెత్తి తన్ను వలచిన సుగుదలను వలవంతపాలు సేయుట కన్న అంతకు మున్నెత్తిన మాత్స్య కూర్మ వరాహ నారసింహావతారములలోనే శాశ్వతముగా నుండిన మేలుగా నుండును.—లేశాలంకారము.

క. ''దోషమున గుణము గుణమున । దోషత ఫలముఁగని చెప్పుదురు లేశముగా;
కడుమవిహంగము లెల్లన్ । బుడమిన్ స్వేచ్ఛావిహారభూతి వహింపన్
వడిఁ బంజరబంధంబున్ । బడసితి శుక, మధురవచన ఫల మిదియ కదా.'' అలం.

'అనుయుగంబు' = ప్రతియుగమందును, అవ్యయీభావసమాసము. గండె. నల్లదాసరిగాఁడు అను నామములలోనే తిరస్కారము స్ఫురించుచున్నది. అట్లే కిరియుహరియు ననుప్రాసమందును.

క. ఆతనువుల లేరు గదా నాతులు; మఱి కాక కలిగిన, నగఁ దిర్య
గ్జాతికి నీజాతికిఁ గల । యాతిప్రతి గలదె యెఱుఁగక యిట్లంటిన్? 42

ఆ తనువులన్ = ఆ మత్స్యాది దేహములయందు (ఆ మత్స్యాద్యవతారములయం దనుట), నాతులు = (ఆ మత్స్యాది మూర్తులను వలచిన మత్స్య ప్రభృతి) స్త్రీలు. లేరు గదా; మఱికాక = అట్లుగాక, కలిగినన్ = ఉండిరేనియు, నగన్ = వలవంతయందు, తిర్యగ్ జాతికిన్ = (నిలువుగాఁ గాక) అడ్డముగాఁ బోవు జంతువులకు. ఈ జాతికిన్ = ఈ మనుష్యజాతికి, కల యాతిప్రతి = ఉన్నట్టి యింత వేగిరపాటు, కలదె=ఉండదు. (ఆ! అట్లుగాదు). ఎఱుఁగక = తెలియనిదాననై. ఏల ఇట్లంటిన్ = ఏల యిట్లు పలికితిని.

తా.—శ్రీహరి మత్స్యాద్యవతారములందే శాశ్వతముగానుండినచో వలపుకత్తెల నేఁచుట యుండదు. ఆ తనువులను ఆయన దాల్చినప్పుడును ఆయా తిర్యగ్జాతి వలపుకత్తెలే (మత్సీ కమఠీ వరాహీ సింహీ స్వరూపపుఁ గామినులు), ఉండరుగదా! అట్లుగాక ఒకవేళ ఉన్నను తిర్యగ్జంతువు లగుటచేత వానికి ఈ నరజాతి స్త్రీలకుం గల కామాతిరేక ముండదుగదా! ఆ! ఉండకేమి తెలియని దాననై ఉండదని తలఁచి అట్లంటిని; అది పొరఁబాటు - ఆక్షేపాలంకారము.

క.''తనమాటఁ దా నరసి వల । దన నాక్షేపము, నిషేధ మాభాసింపం
గ నదె, నిషేధము గమ్యం । బును విధి వాచ్యమయిన నదె యూఁడగు నెల్లన్.''
కనఁబడు మోయి కళానిధి, । పని లే దున్నయని దయితవదనం బిదిగో;
విను నే మాతిని గా నల । వనితవిరాళిఁ గనలేక వచ్చితిఁ దెలుపన్;

శ్రీమన్నారాయణునికి భార్యావియోగదుఃఖము గలుగునట్లు వాల్మీకి శాపంబును గలదు—. 'మానిషా' దేత్యాది శ్లోకమునకు ఆ శాపమును అర్థ మనియు, ఆ వేఁటకాఁడు నారాయణుఁడే అనియు, స్కాందమున వివృతము. "వాల్మీకి నాథ భృగుణా శప్తోస్మి కిల లక్ష్మణ" అని పాద్మమందు రామవాక్యము. ఇట ననంతరవిష్ణుచిత్తీయపద్యములో పా. "లావెద వటువయ్యె" (=దృఢచిత్తముతో బ్రహ్మచారియయ్యెను) అనుటచేత (అనఁగా వటువనుటచేత) భృగుశాపఫలము వామన పరశురామావతారములయం దనుభూతముగా పద్యభావ మగపడుచున్నది. పై యాకరములయందు శ్రీరామావతారమందే భృగుశాపము అనుభూత మయినట్లు చెప్పఁబడియున్నది. ఈ విరోధము నరసికొనునది. వాల్మీకి శాపఫలము శ్రీరామావతారమందే పైకొన్న దనుట నిర్వివాదము.

చ. మొదల నుపేంద్రుఁడై యితఁ డమోఘహతిన్ భృగుపత్నిఁ ద్రుంచి, య
మ్ముదుసలి గేహినీ విరహముం బన యట్లన పొందు మన్న, నా
కడియును దేవకార్యమున కయ్యెడు నంచు వహించి, త్రోఁచు లా
గెద వటువయ్యె లచ్చి మది కెన్నఁడుఁ బాయని జాలి నింపఁడే? 46

ఇతఁడు=ఈ హరి, మొదలన్=తొలుత - ఉపేంద్రుఁడై=వామనమూర్తియై, - అమోఘహతిన్ = వమ్ముగాని వ్రేటుచేత, భృగుపత్నిన్ = భృగుముని భార్యను, త్రుంచి = సంహరించి, ఆముదుసలి=వృద్ధుఁడైన యా భృగువు, తనయట్టులె=తనవలెనే, గేహినీ విరహమున్ =ఇల్లాలితోడి (= ఇల్లాలినుండి) యెడఁబాపును, పొందుము అన్నన్ = అనుభవింపు మని శపింపఁగా, నాకడన్. ఆదియును = భార్యావియోగముకూడ, దేవకార్యమునకే = దేవతల ప్రయోజనముకొఱకే అయ్యెడున్ అంచున్ = ఉపయోగపడును అని, వహించి=ఆ వియోగమును అనుభవించి, త్రోఁచులాగు ఎదన్=క్షయమొందించెడు ప్రకారము కలిగినమదితో, వటువు అయ్యెన్=బ్రహ్మచారియై, లచ్చి మదికిన్=లక్ష్మీదేవి మనస్సునకు, ఎన్నఁడున్ బాయనిజాలిన్=శాశ్వతమయిన వంతను, నింపఁడే= నిండింపఁడా.

"జగదపకారిణి యగుచు । భృగుపత్నిం దునిమె శౌరి పృథ్వి హరింపం
దగినవిరోచనసుత యగు । మగువఁ బురందరుఁడు దునిమె మఱియు ననేకుల్." భా. రా.

"శృణు రాజన్ ప్రవక్ష్యామి తదా దైవాసురే యుధి । దైత్యాః సురైః భర్త్స్యమానా భృగుపత్నీ ముపాశ్రితాః । తయా దత్తాభయా స్తత్ర న్యవస న్నిర్భయా స్తదా; । తయా పరిగృహీతాంస్తాన్ దృష్ట్వా క్రుద్ధ స్సురోత్తమః । చక్రేణ శితధారేణ భృగుపత్న్యాః శిరోఽచ్ఛినత్; । తత స్తాం నిహతాం దృష్ట్వా పత్నీం భృగుకులోద్వహః । శశాప సహసా క్రుద్ధో విష్ణుం రిపుకులార్దనమ్; । యస్మా దవధ్యాం మే భార్యా మవధీః క్రోధమూర్ఛితః । తస్మా త్త్వం మానుషే లోకే జనిష్యసి జనార్దన । తత్ర పత్నీ వియోగం త్వం ప్రాప్స్యసే బహువార్షికమ్..., । తతోఽబ్రవీ ద్దేవదేవః ప్రీతిమాన్ భక్తవత్సలః,...లోకానాం తు హితార్థాయ శాపం తం గ్రాహ్య ముక్తవాన్, । ఇతిశప్తోమహాతేజా భృగుణా పూర్వజన్మని ఇహాగతోఽపి పుత్రత్వం తవ పార్థివసత్తమ, । రామ ఇత్యభివిఖ్యాత స్త్రిషు లోకేషు మానద।తత్ఫలం ప్రాప్స్యతే చాపి భృగుశాపకృతం మహత్ । అయోధ్యాయాః పతీ రామో దీర్ఘకాలం భవిష్యతి । తత్రపత్నీవియోగం చ దీర్ఘకాలం భవిష్యతి." ఇతి ఉత్తరకాణ్డే 51 సర్గే.

ఈయర్థమే ఉ. రామాయణమున దుర్వాసుఁడు దశరథునితో వక్కాణించుట.

మ. "ధరణీజన్ బెడఁబాసి రామవసుధాధ్యక్షుండు పెక్కేండ్లు త
ద్విరహం బొందెడి కారణంబు గల దావృత్తాంత మేమంటివా?
పరిపాటి న్వినిపింతు విన్ము దివిజుల్ భంగించినన్ దైత్యు లా
తురులై మున్ భృగుపత్నిమర్వు సార నెంతో గూర్మి నక్కాంతయున్.

ఆ. వారి కభయ మిచ్చి వైరుల వారింప । నసురవైరి చేరి యప్పురంధ్రి
శిరము చక్రధార ఛేదించి దైత్యుల । సంహరింప భృగువు చాలఁగినిసి.

ఉ. దేవుఁడ వంచు నిన్ను వినుతింపుదు రందఱు, నింతక్రూరతన్
స్త్రీవధ యెట్లు చేసితివి, శ్రీధర యీకొల చెంద వుండఁగాఁ
బోవునె? మానవత్వమున భూమిని నీ విఁకఁ బుట్టి యాత్మప
త్నీవిరహార్తి వందురు మనేకదినంబు లటంచుఁ దిట్టినన్.

క. ఆభృగుశాపము వారిజ । నాభుఁడు వహియించి నీవు నందనుఁ డయ్యెన్;
నీభాగ్య మెంచఁ దగునె క । దా భూవర, రాముఁ డొంగుఁ దత్ఫల మింకన్".

మ. ప్రళయార్కోగ్ర కుఠార కోణము నృపత్రైవిధ్యవత్పీఠికా
ఖ్యల త్రిస్థానము లేడుమార్లు వరుసన్ ఘట్టించు దోశ్శక్తిఁ గీ
ర్తిలసద్వల్లకి మ్రోయ రక్తయయి యొంతే వశ్యయౌ భూసతీ
తిలకంబుం దుదిఁ ద్రోవఁ గశ్యపున కార్తిం బిడ్డయైపోవదే? 47

ప్ర...ము - ప్రళయ=లయకాలపు - అర్క=సూర్యునివలె - ఉగ్ర=తీక్ష్ణమైన - కుఠార=గొడ్డలి యనెడు - కోణము=వీణవాయించు కొడుపు, నృప...లు - నృప=రాజులయొక్క - త్రైవిధ్యవత్=శత్రుమిత్రోదాసీనులనెడు మూఁడు విధములుగల - పీఠికా=సింహాసనములనెడు—ఆఖ్యల=పేరులుగలిగిన - త్రిస్థానములు=మంద్ర మధ్య తారములనెడు స్వరస్థానములు,ఏడుమారులు—ఏడుపర్యాయములు (ఏడు స్వరములకును ఏడుపర్యాయములు), వరుసన్ = క్రమముగా, ఘట్టించు శక్తిన్ = బాహువుయొక్క యేశక్తిచేత కోణము ఘట్టించునో ఆ శక్తిచేత, కీర్తిలసత్ వల్లకి = యశస్సనెడి ప్రకాశమానపు వీణ, మ్రోయన్=శబ్దింపఁగా, రక్తయయి=అనురక్తురాలై (నెత్తుట నెఱ్ఱనిదై), ఎంతేని=కరము, వశ్య=వశవర్తిని (వలచినట్టిది), ఔ - భూసతీ తిలకంబున్=సాధ్వులకు బొట్టయిన అనఁగా సాధ్వుతల్లియయిన భూమిని, తుదిన్ = చివరను, త్రోవన్ = తొలఁగించుకొనఁగా, కశ్యపునకున్ = కశ్యపమహామునికి, ఆర్తిన్ = వంతచేత, బిడ్డయైపోవదే = కూఁతురైయుండలేదా.

తా.—పరశురాములవారు శత్రుమిత్రోదాసీనులుగా ముత్తెగలై సింహాసనాధిష్ఠాతలయిన రాజులను ఒక్కొక్క తెగను ఏడుమాఱులుగా మొత్తమునకు ఇఱువదియొక్కమాఱులు, ప్రళయకాలపు సూర్యునివలె తీక్ష్ణమయిన గొడ్డటి వాదరతో, బాహుబలంబు మెయి మోఁది సంహరించి భూమినెల్లను వారిరక్తమును పాఱింపఁగా ఆయనకీర్తి ఎల్లెడలను మ్రోఁగి భూమియెల్ల ఆయనకు వశమయినది; ఇట్లు వశమయిన భూమిని ఆయన కశ్యప ప్రజాపతికి దానము చేయఁగా ఆ భూమి నాఁటినుండి కశ్యప పుత్త్రియై కాశ్యపియను పేరంబరఁగుచున్నది. ఈ వృత్తాంతమును పరశురాముని యందు దోషారోపణముగా విష్ణుచిత్తపుత్త్రి వర్ణించుచున్నది: ఎట్లనఁగా ఆయన మంద్ర మధ్యమ తారములనెడి మూఁడేసి స్వరస్థానములందును ("వ్యవహారేత్వసౌ త్రేధా హృదిమన్ద్రో ఖిధీయతే ।

కణ్ఠేమధ్యోమూర్ధ్ని తారో ద్విగుణశ్చోత్తరోత్తరః" అని సంగీతరత్నాకరము. ఏడు స్వరములను మొత్తము ఇరువదియొక్క మాఱులగునట్లుగా ప్రళయకాల సూర్యునివలె తీక్ష్ణమయిన కొడుపుతో కీర్తియనెడి వీణను వాయింపఁగా ఆ హస్తలాఘవమునకును ఆ వాదనమునకును మెచ్చి అనురక్తయై వశ్యయయినభూదేవిని తుదకు స్వీకరింపక తొలఁగించుకొనువాఁడై కశ్యప ప్రజాపతికి ఇచ్చివేయఁగా, ఆ సాధ్వీమతల్లి ఆయనకు దూఁతురై ఈతనితోడి విరహభారమును అనుభవింపలేదా.— శ్లేషోత్థాపితమైన లేశాలంకారము. రూపకోజ్జీవితము.

పరశురాములవారు నారాయణుని ఆఱవ యవతారము. ఈయన జమదగ్నియను మహాముని కుమారుఁడు. జమదగ్నిని కార్తవీర్యుఁడను రాజుకొడుకులు చంపివైవఁగా ఆ పగచే నితఁడు లోకమెల్ల నిఃక్షత్రియము చేయం దొడఁగి ఇరువదియొకమార్లు రాజులను సంహరించి, వారిరక్తము శమంతపంచక మను నైదుమడుగులు కాఁగా దానితో పితృతర్పణము గావించెను. ఇట్లు పుడమినెల్ల జయించి అశ్వమేధయాగము చేసి అందు గురుదక్షిణగా కశ్యప ప్రజాపతికి భూమినంతయు దానము చేసెను. తానేఁగి పడమటి కనుమలనంటియుండిన సముద్రమును ఒక బాణమున దూరముగా తఱిమి అట్లు బయలయిన యా నేలయందు పడమటి కనుమలకుం బడమట నివసించుచుండెను. ఆయన శాశ్వత బ్రహ్మచారి. పిమ్మట శ్రీరాములవారికి తన విష్ణుతేజమును సంక్రమింపఁజేసి తాను తపస్సు గావించుచున్నాఁడు. ఆ కథ నిట ననుసంధించుకొనవలయును. ఇందలి ప్రధానవిషయములు ఈ శ్లోకమున నున్నవి!:—

"ఉత్ఖాతక్షితిపాలవంశగహనా త్రిస్సప్తకృత్వో దిశః
కృత్వా విశ్రుతకార్తికేయ విజయశ్లాఘ్య శ్చ బాహ్వో ర్బలాత్
సద్వీపా మథ కశ్యపాయ గురవే దత్త్వాశ్వమేధే మహీ
మస్త్రన్యస్త సముద్రదత్తవిషయం లబ్ధ్వా తప స్తప్యతే."—మహావీరచరిత్ర. 3 (17).

'సంవర్తః ప్రళయః కల్పః క్షయః కల్పాన్త ఇత్యపి', 'ద్వయోః కుఠారః స్వధితిః పరశు శ్చ పరశ్వధః' 'క్వాణో వీణాది వాదనమ్,'—'వీణా తు వల్లకీ' 'సతీ సాధ్వీ పతివ్రతా,'— 'క్షోణీ జ్యా కాశ్యపీ క్షితిః;' – అమ.

మ. తన సౌందర్యము చెప్పఁగాఁ గరఁగి పద్మాకాంత రప్పించి మో
హనకంజంబున వైచి తియ్య మిడు నెయ్యం బొప్పఁ బైకొన్న, మీ
ఱి నృశంసత్వమునం దొలంగి చని వెల్తిం జేసె, గాకుత్స్థుఁడై
న నిలింపారివిదారిచందములు డెం దాన న్విచారింపుఁడా. 48

(ఓ చెలులారా, ఈహరి). తన సౌందర్యము = ఈతని సొబగును, చెప్పఁగా = చెలికత్తెలు వర్ణింపఁగా, విని=విన్నదై, పద్మాకాంత=లక్ష్మీదేవి, రప్పించి=తన కడకు పిలిపించుకొని, కరఁగి= ద్రవీభూతమైన హృదయముకలదై (ఇతనిని వలచినదై), మోహనకంజంబునన్=మోహింపఁ జేయు కమలముతో, వైచి=వేసి, తియ్యము ఇడు నెయ్యంబు ఒప్పన్=ప్రియము గావించునట్టి యనురక్తి మీఱ, పైకొన్నన్=కవయరాఁగా, మీఱి=ఆ దేవిని అతిక్రమించి, నృశంసత్వమునన్=క్రూరత చేత, తొలంగి=త్యజించి, చని=పోయి, వెల్తిన్=ఉన్మత్తురాలినిగా, చేసెన్=కావించినాఁడు, కాకు...ములు – కాకుత్స్థుఁడు = కకుత్స్థవంశోద్భవుఁడు – ఐన – నిలింప అరి విదారి = (దేవశత్రువులయిన) యసురులను పరిమార్చిన రామునియొక్క – చందములు = ప్రకారములను, డెందానన్ – మీ హృదయములందు, విచారింపుఁడా – పరామర్శించుకొనుఁడు.

తా.—ఈయన కకుత్స్థ వంశములో శ్రీరాముఁడుగా అవతరించినప్పుడు ఇతని గుణ సంపదచే ఇతనియందు అనురక్తిమెయిం బ్రజలు ఇతనికి రాజ్యలక్ష్మిం గూర్ప యత్నింపఁగా పట్టాభిషేక మహోత్సవము సర్వసిద్ధమై యుండఁగా (అదియే రాజ్యలక్ష్మి యితని సౌందర్యమును విని మరులుకొని రప్పించి కంజమునవైచి కవయనుంకించుట), ఆ రాజ్యలక్ష్మిని క్రూరహృదయుఁడై తొలంగి కాటికింజని ఆమెకు (ప్రజలకు) ఉన్మాదముం గలిగింపలేదా, చక్కఁగా ఆలోచించుకొనుఁడు, ఈతని కఠినత మీకే తెలియును.— లేశాలంకారము.

'నృశంసో ఘాతుకః క్రూరః'—అమ. 'నిలిమ్పా దేవశబరా.'

చ. చెలువముఁ దాల్చి త న్గవయఁ జేరిన రాగిణి రావణస్వసన్,
నలువురు నవ్వ న ట్లెఱఁ గొనర్పక యేలిన, వియ్యమై యతం
డలుగఁడ, సీత కిట్టి తలఁ పాత్మఁ దలంపక యాయమ న్వృథా
కలహమునం దనుం దొలఁగు కాఁకకు నాఁకకు లోను సేయఁడే. 49

చెలువమున్ = సౌందర్యమును (సుందర రూపమును), తాల్చి = ధరించి, తన్ (తన్ను) = రాముని, కవయన్ = పొందుటకు, చేరిన రాగిణిన్ = వచ్చిన కాముకురాలిని, రావణస్వసన్ = రావణుని చెల్లెలైన (శూర్పణఖను), నలువురున్ = ఎల్లవారును, నవ్వన్ = పరిహసించునట్లుగా, అట్లెఱఁగు = ఆ విధమును (అనఁగా నాసాకర్ణచ్ఛేదమువలని వైరూప్యమును), ఒనర్పక = చేయక, ఏలినన్ = భార్యనుగా పొందినయెడల, అతఁడు = రావణుఁడు, వియ్యము ఐ = వివాహసంబంధముఁ జుట్టమై (అనఁగా బావమఱఁదియై), సీతకున్ = సీతమీఁద - అలుగఁడ = కోపింపనే కోపింపఁడు (అనఁగా పగతీర్చుకొనుటకై సీతను హరింపఁడు), (రాముఁడు) ఇట్టి తలఁపు ఆత్మన్ తలంపక = ఇట్టి యాలోచన మనస్సులో చేసికొనక, వృథాకలహమునన్ = శూర్పణఖతోడి వ్యర్థపు జగడముచేత, ఆయమన్ = ఆ సీతను, తనున్ = రాముని, తొలఁగు కాఁకకున్ = ఎడఁబాసియుండెడు వలవంతకును, ఆఁకకున్ = ఆ రావణుని కావించిన నిరోధమునకును, లోనుచేయఁడే = పాలు కావింపలేదా?

తా.—రావణుని చెల్లెలు శూర్పణఖ రాముని వలచినదై అతఁడు తన్నుం గామించుటకు తగినట్లుగా తాను తన రక్కసిరూపమును వదలి అద్భుతమయిన సుందరరూపమును ధరించి, ఆతనిం గవయరాఁగా, అతఁడు ఎల్లవారును నవ్వునట్లుగా దానికి ముక్కుం జెవులుం గోయించి, విరూపం జేయించినాఁడు; తన్ను సరకుగొనక తనచెల్లెలికి ఇట్టిచెట్టం గావించినందులకు రావణుఁడు రామునిపై పగఁబూని రామభార్యను సీతను కొనిపోయెను. అందువలన ఆమె రామవియోగమును రావణకృతనిరోధమునుఁ బొంది దుఃఖములలో మునింగెను. రాముఁడు ఆశూర్పణఖం బొందుట కంగీకరించియుండిన యెడల ఆయనకు రావణుఁడు బావమఱఁది యై ఆయనతో చెలిమి గలిగియుండును, సీతకు ఆకడగండ్లు కలుగవు. ఆమెక్షేమమునకై శ్రీరాముఁడు అపాటియాలోచన చేసికొన్నవాఁడు కాఁడాయెను. ఇందువలనం దెలిసికొనుఁడు, అతనికి ఆమెపైఁగల యసడ్డయు, చిత్తకాఠిన్యమును.—లేశాలంకారము.—

'రాగిణి'=రాగముకలది - కామిని. 'భగినీ స్వసా' అమ. అక్కగాని చెల్లెలుగాని, ఇక్కడ చెల్లెలే. 'చెలువము,'—

శూర్పణఖ రాఘవులకడకు వచ్చినతీరు:—

"దధానా వలిభం మధ్యం కర్ణజాహవిలోచనా। వాక్త్వచే నాతిసర్వేణ చన్ద్రలేఖేవ పక్షతౌ; సుపాద్ద్విరదనాసోరూ ర్మృదుపాణితలాఙ్గులిః। ప్రథిమానం దధానేన జఘనేన ఘనేన సా ఉన్నసం దధతీ వక్త్రం శుద్ధదల్లోలకుణ్డలం। కుర్వాణా పశ్యత శ్శంయూః స్రగ్విణీ సుహా[సాననా." భట్టి.

'అలుఁగఁడ' = అలుఁగఁడు + అ (ఏవార్థకము.)

శా. ఫీట్కార స్రవదస్రమై పెదవి గంపింప, న్మొఱ ల్గిట్టి ప్రా
వృట్కాలాంబుద గర్జ గెల్వఁగ, వల చ్ఛ్రీఖండశాఖాసిత
త్విట్కుంభీనసరేఖఁ గే లసిలతా ధృద్బాహు వేష్టింప, మున్
రాట్కంఠీరవమై యొనర్చె వడి సోణా, లంట ఘోణాచ్ఛిదన్. 50

ఫీట్కార స్రవత్ అస్రము = (ముక్కుయొక్క యెముక తెగునట్టి ఫీట్టనెడిశబ్దముతోఁ గూడ కాఱుచున్నరక్తము కలది, ఐ=అగుచు, పెదవి = శూర్పణఖ పెదవి, కంపింపన్ = వణఁకు చుండఁగా, మొఱల్ = దాని యార్తాలాపములు, కిట్టి = తగిలి, ప్రావృట్ కాల అంబుద గర్జన్ = వర్షా సమయంపు మేఘంపు ఉఱుమును, గెల్వఁగన్ = అతిక్రమింపఁగా, కేలు = దానిచేయి, వల...ఖన్ - వలత్ = చుట్టుకొనుచున్న - శ్రీఖండ = చందనపు - శాఖా = కొమ్మయందలి - అసిత = నల్లని - త్విట్ = కాంతిగల - కుంభీనస రేఖన్ = పాము తీరున, అసి లతా ధృత్ బాహున్ = తీగ వంటి కత్తిని ధరించియున్న భుజమును, వేష్టింపన్ = చుట్టవైచికొనఁగా, మున్ = పూర్వము, రాట్ కంఠీరవమై = రాజ సింహుఁడై, వడిన్ = తటాలున, సోణాలు అంటన్ = ముక్కు నెముకలు తగులు వఱకు (అనఁగా ముక్కును సమస్తమును అనుట,) ఘోణా ఛిదన్ = ముక్కుయొక్క కోఁతను, ఒనర్చెన్ = కావించెను.

తా.—శ్రీరాముని యాజ్ఞచేత లక్ష్మణుఁడు కత్తిం గేలఁ గొని శూర్పణఖముక్కును తన్మూల మందలి యెముకతోఁగూడ ఫీట్టనుశబ్దము కలుగునట్లుగా తటాలునం గోసివైచెను. ఆచేఁతలో ముక్కునెత్తురు దొడదొడ పెదవిపై కాఱుచుండెను. పెదవి కంపిల్లుచుండెను. అది పెట్టిన మొఱలు వర్షాకాలపుమేఘముయొక్క గర్జనలవలె బిగ్గరగా నుండెను. కోయనీయకుండ అఁపుటకై అది లక్ష్మణునిచేతిని తన చేతులతో చుట్టి పట్టుకొనఁగా కత్తితోఁడి యాతని యాచేయి లతతోఁడి చందన శాఖవలెను, దానిం జుట్టుకొన్న యారక్కసిచేయి ఆశాఖం జుట్టుకొన్న నల్లత్రాచువలెను, ఉండెను. ఇది సుమా రాజాధిరాజుగా లోక మేలుచు శ్రీరామమూర్తి చేయించినపని - లేశాలంకారము, ఉపమలును.

'ఫీట్కారము' = ఎముకకు కత్తి దగిలినందున - 'అస్రశోణితయో రస్రమ్' - నానా. - 'పెదవి కంపింపన్' - స్వభావోక్తి - 'ప్రావృట్కాల' - అప్పుడే ఉఱుములు బలము. 'గెల్వఁగన్' - ఉపమావాచకము. - 'వలత్' కుంభీనసమునకు విశేషణము. 'శ్రీఖండ' = చందన, - "చందనాచల తటీ శ్రీఖణ్డసంవేష్టితృ। వ్యాళస్ఫారఫణాకఠోరవిష నిశ్వాసాగ్నిపాణింధమం। వేలానాపయి దక్షిణానిలము" - శృం. నై. 'కృష్ణే నీలాసిత శ్యామ కాల శ్యామల మేచకాః' 'స్యుః ప్రభా రుగ్రుచి స్త్విడ్భా భా శ్ఛవి ద్యుతి దీప్తయః-' అమ. "అథాబ్ధిష్ఠో ద్విరసనః సమకోల శ్చ భేకభుక్ కుమ్భీనసః కుణ్డలీచ-" త్రికాండ శేషము; లక్ష్మణబాహువును చందనశాఖకును శూర్పణఖాబాహువును సర్పమునకును పోల్చినస్వారస్యముం గనునది. వృక్షశాఖలమీఁద ప్రాయికముగా లతలుం బర్వనుగాన, కత్తిని అట్టిలతకుం బోల్చుట హృద్యముగా నున్నది. 'బాహు' - రాహు

బాహ్వాదిశబ్దములకు కొన్నిటికి ఏకత్వమందు సైతము వులోపము వైకల్పికము; "బాహుప్పళించి" అని భారత ప్రయోగము. "రాక్కంఠీరవము" - ఇది దెప్పరము. ఆతని గొప్పతనమునకు అపని అనుచితమని భా; 'సోణాలంటన్' - క్రూరతరత్వ సూచన. 'నాసాచ్ఛిదన్' అని బ్రౌనుదొర గారిపాఠము. ఇట 'షీట్' అను పాఠమందలి యొత్తును, "సోణాఘోణా" అను ణకారముతోడి వృత్త్యనుప్రాసంబును సుకుమారములు గానందున గోదాదేవివాక్కునకు అర్హములుగావు. ముట్టిలు అక్కఅకు రామి రామలక్ష్మణక్రూరత చేత; కోసినవాఁడు లక్ష్మణుఁడే యయినను ప్రభువు రాముఁడు గావున రాముఁడే చేసినట్లు చెప్పట.

తే. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె, తా నుల్లసముల
నేఁప? నది రక్కసియయాట యొగ్గె? వలచి
స్త్రీలు దలవంపఁ దాన వచ్చె, నది చాల
కాటదాని బజీతు సేయఁగవలయునె? 51

ఉల్లసములన్ = పరిహాసములచేత, తాను = రాముఁడు, ఏఁపన్ = ఏఁచుటకు, ఒల్లను = నిన్ను నేను కామింపను, పొమ్ము అనన్ పోదె, అది = ఆ శూర్పణఖ, రక్కసియ = రాక్షసియే అగుట, ఎగ్గె=దోషమా! స్త్రీలు తలవంపన్ = స్త్రీజాతి కెల్ల అవమానము కలుగునట్లుగా, ఆ శూర్పణఖ తాన వలచి వచ్చెన్, అది చాలక = ఆ యవమానముతో పోనీయక, ఆటదానిన్ = స్త్రీని, బజీతు చేయఁగ వలయునె = అల్లరిచేయవలయునా?

తా.—అది పొమ్మన్నం బోనియెడల దానిని గేలిసేయుట న్యాయ్యముగానుండును, అట్లు దానిని పొమ్మనను లేదు, అది పోక పోను లేదు. మఱి అది రక్కసియగుటయే యపరాధమా? రక్కసియని యిట్లు క్రూరముగా భంగపఱుచుట న్యాయ్యముగాదు. స్త్రీజాతికెల్ల అవమానముగు నట్లుగా అది తనయంతట తాను వలచి అతని మీఁదికిం బోయినది. దానికి ఆచర్యవలని యవమానము చాలదా! ఇంకను దానిదోషమును ఇట్లు అల్లరి చేయవలయునా? - అర్థాంతరన్యాసము, లేశాలంకారంబును. 'ఒల్లను' - వలచు ధా. రూ. వలతును. 'ఆట దాని' - "ఆటదానికి వసమమ్ము యీమేటి, కోటలు దాఁట నీ గోడలు దాఁట" - గౌరన. 'బజీతు' - 'బజీతి' అని బ్రౌను దొర గారు - 'భఙ్గిత' అనుదానివైకృత మని వైకృత దీపిక - అన్యదేశ్య మని బ్రౌను దొరగారు; పా. బజాఱు. 'చేయఁగవలయునె' _ పా. 'సేయంగ నగునె.'

మ. తను నంటన్ సతు లౌటఁ గోరు మునిబృందంబుం దదాపాది ప
ద్వనజక్షోదము గల్గియు, న్నెలజనిం దా వల్లవస్త్రీలుగా
జననం బందఁగఁ జేసి కూడియు, స్వసంసక్తాత్మలం గాందినీ
తనయప్రేరణఁ బాసె భోజపుర యాత్రారంభ సంరంభి యై. 52

తనున్ = శ్రీరాములను, అంటన్ = కవయుటకై, సతులు ఔటన్ = స్త్రీత్వమును, కోరు ముని బృందంబున్ = అభిలషించిన తాపస సమూహమును, తత్ ఆపాది పత్ వనజ క్షోదము = ఆస్త్రీత్వమును కలిగించెడు పాదకమలంపు దుమ్ము, కల్గియున్ = తనకుండినను, తాన్ = ఆరాముఁడు, వెలి జనిన్ = వేఱు జన్మంబున (కృష్ణజన్మమెత్తినప్పుడు), వల్లవ స్త్రీలు కాన్ = గొల్ల కొమరాండ్రుగా, జననంబు అందఁగన్ చేసి = పుట్టునట్లు గావించి, కూడియున్ = పొందియు, స్వ సంసక్త

ఆత్తలన్ = తనయందు తగుల్కొన్నట్టి చిత్తముగలవారైన యావల్లవాంగనలను, గాందినీ తనయ ప్రేరణన్ = గాందిని యనునామెపుత్త్రుఁడైన యక్రూరుని బోధనచేత, భోజ పుర యాత్రా దంభ సంరంభియై=కంసుని పట్టణ మయినమథురకు పోవుట యనెడుమిషచేత త్వరగలవాఁడై, పాసెన్ = విడిచి పోయెను.

తా.—శ్రీరాముని దేహసౌందర్యము పురుషులనుసయితము సాక్షించుచుండినది. అట్లే పలువురు మునులుసయితము అతనిని గవయంగోరిరి. ఆయన వారికోరికను జన్మాంతరమందు దీర్చెద నని వర మిచ్చి, కృష్ణావతారమునందు వారిని గొల్లభామలుగా జనింపఁజేసి వారితో వలరాయని క్రీడలం దేలుచుండెను. ఆరీతిని తానే లోకముగా తనయం దాసక్తలైనయాగొల్లకొమ్మలను ఉన్నట్టెఉండి అక్రూరునిబోధనచేత మథురాపురమునకుం బోవుట యనెడువ్యాజముచేత వదలి పోయినాఁడు.—లేశాలంకారము, కైతవాపహ్నుతి యు.

'సతులు'-వేఱొకపురుషునిం దలఁపనివారుగా రాముని భర్తనుగా శుశ్రూషించుచుండెడు పతివ్రతలు.—'సతీసాధ్వీపతివ్రతా'—అమ. 'తదాపాదిపద్వనజక్షోదము'—శిలం దాఁచి యహల్యంగాఁ జేసినతారాణముచే నిట్లు చెప్పుట—అనఁగా ఆజన్మముందే వారిని తనపాదధూళిచే స్త్రీలంగావించి వారమనోరథముం దీర్చియుండుట శక్యమే అయినను అట్లుచేయఁడాయెను; కని కరములేనివాఁడు అని నింద. 'పెఱజనిన్'—ఆయినంతవిలంబమగును గాకయని—'పల్లవస్త్రీలు గాన్'—కపటకుచోద్యము లెఱుఁగని యుత్తానహృదయలుగా ననుట, సులువుగా నమ్మించి వంచించుట కని భావము;—'కూడియును'—కూడకున్న అంతదుఃఖము గాదు, కూడి సక్తిఁ బుట్టించి వంచించుట దుర్భరదుఃఖకారణమని భావము—కన్నుపోయినవానిదుఃఖము పుట్టుగ్రుడ్డికి ఉండదు. 'గాందిని' అని అక్రూరునితల్లిపేరు (కాందిని గాదు), కంసుఁడు బృందావనమునుండి రామకృష్ణులను మథురకుఁ దనకడకు తోడ్కొని రమ్మని అక్రూరునిం బంపినాఁడు. ఆతనితో వా రటకుం బోయిరి.

కంసుఁడు భోజవంశమువాఁ డయినందున నతనికిని 'భోజుఁ' డని పేరు. అతనిపురము 'మథుర', శూరసేనదేశమునకు రాజధాని, దానికే మధుపురియనియుం బేరు. "గోపపాలః— అహహ. అసమఞ్జసమ్! కథం వినిహత ఏవ కువలయాపీడః! కువలయాపీడో మహారాజవిజయ వైజయన్తీ. త దిదానీం నాశంసే భోజకులకుశలాయ." కంసవధనాటకము.

'కూడియునుసక్తస్వాంతలన్'—అను పూర్వముద్రణపాఠమున యతిభంగము. యతికై కూడయు స్వసంసక్తాత్మలన్' అని మార్పు. 'పదఘ్రి(శ్చరణోఽస్త్రియామ్'. 'కపటోఽస్త్రీవ్యాజ దమ్భోపధయ శ్ఛద్మకైతవే' అమ.

చ. హాతలనొనర్చె మోహితల నల్ల యయోముఖి నాపులస్త్యభూ
సుతను, విరూప లౌట ననుచో, ముసలి న్వెను నిట్టు తాటిపై
యతివ రమించెఁ డా ముసలి యయ్యు, రహిం న్కుబుగుజ్జ ప్రేష్యకై
ధృతిసెడి యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది యేలఁడే? 53

మోహితలన్ =వలపుగొన్నవారయిన - అల్ల అయోముఖిన్ = అయోముఖి = (ఇనుపమొగము) (అనునారక్కసి)ని - ఆ పులస్త్య భూ సుతన్ =పులస్త్యుని కొడుకయిన విశ్రవసుని పుత్త్రియైన శూర్పణఖను, విరూపలు ఔటన్ = కురూపలు అయిన కారణమున, హాతలన్ ఒనర్చెన్= కొట్టఁబడినవారని చేసెను (అనఁగా కొట్టిపంపెను), అనుచోన్ = అని వాదింతురేని, ముసలిన్ =

వృద్ధను, పెను నిట్ట తాటి మైయతివన్ = పెద్ద నిడివిగల తాటిచెట్టుతీరు గల స్త్రీని, తాన్, ముసలి అయ్యున్ =(ఆమెతోడ సామ్యము కొఱకును, భార్యకన్న భర్త చిన్నవాఁడుగా నుండఁగూడదు గావునను)=వృద్ధుఁడు కూడనై (రోఁకలి యాయుధముగాఁగలవాఁడై), రమిన్ = రమితో, రమించెన్ =కూడెను. మఱుఁగుజ్జు ప్రేష్యకై = కుబ్జయైన సేవకురాలికై, ధృతి సెడి = ధైర్యము తూలి, (దానితో సామ్యము కొఱకును తల్లబ్ధి కొఱకును). ఉగ్రసేనునకున్ = క్రూరమయిన దండుగలవానికి (ఉగ్రసేనుఁ డను పేరిరాజునకు అనఁగా కంసునితండ్రికి), ప్రేష్యతన్ =దాసత్వమును, ఒందియున్ =సంపాదించికొనియు, దిద్ది- దానికుబ్జత్వమును చక్కఁబఱిచి (పోనడఁచి), ఏలఁడే=పొందలేదా.

తా.—ఇప్పద్యమందుం జెప్పిన తొలి యిరువురు రక్కసిపొలఁతులు లక్ష్మణదండితలు, మూఁడవది బలరామభార్య, నాలవది కుబ్జ శ్రీకృష్ణానుగృహీత; లక్ష్మణబలరాములు ఇరువురును శేషాహియవతారము లగుటచేతను, రామకృష్ణులు ఇరువురును శ్రీహరియే యగుటం బట్టియు, అన్నదమ్ముల యైకమత్యముచేత వారిలో ఎవ రేమిచేసినను అది ఇతరుఁడును చేసినట్లే; ఇట్టి భావముచే ఆదేవి పలుకుచున్నది.—అయోముఖిని శూర్పణఖను రక్కసిపొలఁతు లనియు ఘోరరూప లనియు దండించి తలమెనని వాదమేని, బలరాముఁడు రేవతి నేల గ్రహించినాఁడు? తనకన్న ఆమె వయస్సున పెద్దది తాటియంత పొడవుదియుంగదా. ఆమెకై ముసలి తానును ముసలియైనాఁడు. ఆకుబ్జ యొక సేవకురాలు, దానికై శ్రీకృష్ణుఁడు ఉగ్రసేనునకు సేవకుఁడై దానివంకరలు దిద్ది దానిం గూడినాఁడు. ఇట్టివాని నీతులను మెచ్చుట యెట్లు? కావున ఈహరి నింద్యవర్తనుఁడే యనుట, లేశాలంకారము. అయస్సు అనఁగా ఇనుము. దానివంటి ముఖముగలదిగాన అయోముఖి, అయోముఖిని లక్ష్మణుఁడు ముక్కు చెవులు స్తనములుంగూడ కోసివైచెను. [శూర్ప = చేటలవంటి - నఖ=గోళ్లు గలది] శూర్పణఖను స్తనములు కోయలేదు, ఈ వృత్తాంతములను రామాయణము అరణ్యకాండయందుం గనవచ్చును.—బలరాముని కన్న రేవతి ఇరువదియేడు చతుర్యుగములు పెద్దది. 'రేవతీరమణో రామః కామపాలో హలాయుధః' అమ., కకుద్మి యనువానికూఁతురు. బ్రహ్మనియోగమున బలరామున కీయఁబడినది. 'కుబ్జ' పేరు 'త్రివక్ర' - కంసుని సేవకురాలు, దానికథ భాగవతమునం గనవచ్చును. 'నిట్ట తాటివంటతివ' అని పూర్వులు కొందఱు ఇత్వసంధికై పఠించుకొన్నపాఠము.— 'నియోజ్య కిఙ్కర ప్రేష్య భుజిష్య పరిచారకాః' అమ.

తే. తనకు నందఱుఁ గూర్పఁ బృందావనమున,
నొకతె రతిఁ దేల్చి, కాఁక నొం డొకతెఁ బ్రేల్చి,
యంత రాధకు మేలువాఁ డై మురారి
యెల్ల సతులకు నెద నుడుకే యిడండె. 54

మురారి = (మురదానవునికి శత్రువైనయా) హరి, బృందావనమునన్ = బృందయను పేరి యడవియందు, అందఱున్ = గొల్లయువతు లెల్లరును - తనకున్ గూర్పన్ = తనయం దనురక్తురాండ్రై యుండఁగా, (వారిలో), ఒకతెన్, రతిన్ = కామక్రీడయందు, తేల్చి = పూర్ణానుభవము కలదానినిగాఁజేసి, ఒండొకతెన్ = ఇంకొకదానిని, కాఁకన్ = వలవంతచేత, ప్రేల్చి = వేఁగఁజేసి, అంతన్ = ఉన్నట్టేయుండి, రాధకున్ = రాధయను గొల్లదానికి, - మేలువాఁడై = వలపుకాఁడై, ఎల్లసతులకున్ = ఆగొల్లయువతుల కందఱకును, ఎదన్ = మదిలో, ఉడుకే = దుఃఖమునే, ఇడండె = పెట్టలేదా.

ఈహరి, బృందావనములోని గొల్లయువతులు అందఱు తనయందు అత్యంతానురక్తలై యుండఁగా, తాను వారిలో పక్షపాతములువహించి, కొందఱను సంభోగములం దేల్చి, కొందఱను విరహతాపములపాలు గావించి, తుదకు రాధకు కాముకుఁడై, పూర్వోక్తల నందఱను, దుఃఖమునముంపలేదా. _ లేశాలంకారము. బృందయని మథురకు కొంతదూరమున నొకవనము. దానికడ యశోదానందులు బలరామకృష్ణులును నివసించిన గోకులము. _ మురారి = మురుఁడను నసురుని శత్రువు. 'మేలువాఁడు' _ 'నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన । రెలమి మేల్కూరిమి చెలిమి యరతి । బాళిప్రేముడిమచ్చికమక్కువయనఁ బ్రేమదోఁచును'. ఆం. భా.

వ. అని యిట్లు త్రపాభరంబున నుపాలంభదంభంబుగాఁ జేయు పునఃపునస్స్మరణంబున నంతఃకరణరాగంబు దేటపడం దెలిసి బోటులీబోటి కైటభారియెడ నాటుకొన్న కన్నెకూర్మి లజ్జావశంవద యై వెలివిరియంగానీక పుటపాక నికాశం బగు కాఁకఁ జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్ల గిటగిటనగుచున్నదింత నియ్యింతి యెనవు మాన్చి మనలను గుట్టెఱుంగనీయని యింగితం బెఱుక పఱుచుకొని చింతాపనోదనంబు సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు నర్మగర్భంబుగా నిట్లనిరి. 55

త్రపాభరంబునన్ = లజ్జాతిశయముచేత, ఉపాలంభ దంభంబుగాన్ = నిందామిష చేత,... పునఃపునస్స్మరణంబునన్ = మాటిమాటికిని జ్ఞప్తిసేసికొనుటచేత, అంతఃకరణ రాగంబు= హృదయములోని యనురక్తి, తేటపడన్ = ప్రకటముకాఁగా, తెలిసి=ఎఱింగినవారై, బోటులు= చెలికత్తెలు, ఈ బోటి = గోదాదేవి, కైటభారి= శ్రీహరి (కైటభుఁ డనునసురునికిశత్రువు)... కన్నెకూర్మి = క్రొత్త నెయ్యమును, లజ్జావశంవద=సిగ్గునకులోఁబడినట్టిది (సిగ్గుచేత అనుట); వెలివిరియంగానీక=బయల్పడనీయక, పుటపాక నికాశంబు= పుటమున వండుటతో సమానమైనట్టిది;

వన్నె హెచ్చుటకై బంగారమును పుటము వేయుదురు. పుటపాకంబు__

"అనిర్భిన్నగభీరత్వా దన్తర్గూఢమహావ్యథః
పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః." ఉ. రా. చ.

"వెలికిఁ బ్రిదులదు గాంభీర్యవృత్తికతన, గూఢముగ లోన వెతఁ బెట్టు రూఢగరిమఁ,
బుటమునం బాకముం బొందుదిటము దోఁప, నెరయుచున్నది రామునికరుణరసము."
ఉ. రా. చ. మదీయము.

నాఁడునాఁటికి = దినదినమునకు - రూ. నానాఁటికిన్, నగుచున్నట్ల = నవ్వుచున్నట్లె, గిటగిటన=కృశము,... ఎరవు=మనలను గుట్టెఱుంగనీయమిని (వేఱిమినిఅనుట), రహస్యములో చేర్చుకొనమి - లాఁతితనము__ చూ.

క. "చిరకాలమైత్రి నీయెడ । జరగంగా నింటి కరుగఁజాలక నేఁ డ
ట్లరిగిన నచ్చటినాయి । ల్లెరవై మదిఁ దోఁచె నిలువ నెట్లగుఁ జెపుమా॥ పం. తం. లబ్ధ. 36.

క. "తనబిడ్డల సంభావిం । చినక్రియ సంభావనంబు సేయక యుపలా
లనలీలాదుల సంజ్ఞాం । గనబిడ్డలవలన నెరవకాఁ జరియించున్." మార. 5. ఆ. 341.

ఇంగితంబు = మదిలోనిభావము (గుట్టు-'ఇఙ్గితంహృద్గతోభావః' అమర శేషము,) చింతాఅపనోదనంబు=దుఃఖనివారణము,... ప్రమాదంబు=చెట్ట, ...నర్మగర్భంబుగాన్ =పరిహాససమేతముగా ('ద్రవకేళిపరీహాసాః క్రీడా ఖేలా చ నర్మ చ'-అమ.)

ఉ. ఎవ్వరు నట్లపో నెరసు లెన్నకమానరు ప్రాణభర్తలం
దవ్వుల నున్నఁ గాఁకకతన, న్మఱి వారలు వశ్యులైనఁ దా
రెవ్వరి నొల్లకొక్కటయి యింద్రుఁడు చంద్రుఁ డటంద్రు, బోటిదా
నివ్వలఁ దేరకత్తె యగు, నిట్టివి నీతలవేగనే చెలీ. 56

చెలీ=ఓ చెలికత్తియా, ఎవ్వరున్ = ఎల్లస్త్రీలును, అట్లపో = ఇట్లేసుమా, ప్రాణభర్తలన్ = ప్రాణేశ్వరులను, దవ్వులన్ = దూరమందు. ఉన్నన్ = ఉన్న సమయమందు. కాఁకకతనన్ = విరహతాపముచేత, నెరసు లెన్నక మానరు = తప్పు పట్టుచునే యుందురు, మఱి = అటుపిమ్మట, వారలు = ఆ ప్రాణేశ్వరులు, వశ్యులు = స్వాధీనులు, అయినన్ = అయినప్పుడు, తారు = ఆ స్త్రీలు, ఒక్కటి అయి = ఆ ప్రాణనాథులతో ఐక్యమయిపోయి, ఎవ్వరిన్ = ఒరులను (చెలికత్తెలు లోనగువారిని), ఒల్లక = ప్రేమింపక, ఇంద్రుఁడు చంద్రుఁడు అటంద్రు = తన ప్రాణనాథుని ఇంద్రునంతవాఁడు చంద్రునంతవాఁడు అని పొగడుచుందురు, ఈవలన్ = ఇటు పిమ్మట, బోటి = తమ్మిరువురను గూర్చిన చెలికత్తె, తేరకత్తె = పనిలేనిది (అక్కఱలేనిది), అగున్, ఇట్టివి = ఇట్టినడవడులు, నీతలన్ = నీయొక్కతె శిరమునందే. వేగనే = తెల్లవాఱెనా?

తా.—ఉవిదలెల్ల ఇట్లే దూరగతుఁడైన ప్రాణనాథునియందు విరహతాపము సహింపలేక తప్పులు చెప్పుచుందురు. విరహము తీఱి ప్రాణేశ్వరుఁడు వశుఁడైనపిమ్మట తా మతనితో స[illegible]లై కడమ ఎవ్వరిం దలపెట్టక ఆతనిని అంతవాఁడు లేఁడు ఇంతవాఁడు లేఁడు అని పొగడుము[illegible]రు. తమ్ము క్లేశపడి కూర్చిన చెలి అటుపిమ్మట పనిలేనిదగును. ఇట్టినడవడి సాధారణమే. నీయం[illegible]త్రమే గలయట్టిది కాదు—నీవును ఆతనిం గూడినపిమ్మట మమ్ము సరకుగొనవు.—అప్రస్తుతప్రశం[illegible]కారము; లోకోక్తియు.

"నెరసులెన్ను"—సకర్మకధాతువుపోలె ప్రయుక్తము, కావున 'ప్రాణభర్తలన్' అని ద్వితీయ. 'ఇంద్రుఁడు చంద్రుఁడు' అనుట గొప్పవాఁడు సరసుఁడు అనుటకు లోకోక్తి.

"లోకోక్తి లోకవాదం। బె కన్నులు మూసికొని సహింపు మిఱు సెలల్". అలం.

క. అనుటయు నెలనగ వడఁచుచుఁ। గనలించుక తెచ్చి యౌడు గఱచుచు నయ్యం
గనలన్ కందుక నికరముఁ। గొని వ్రేయుచుఁ గెలను చూచుకొను చుంబలికెన్. 57

అనుటయు = వారట్లు చెప్పిపోవుచుఁగా, ఎలనగవు = మందహాసమును, అడఁచుచున్ = వారికి తెలియనీయక అఁపుకొని, కనలు = కోపము, ఇంచుక = కొంచెము, తెచ్చి = కల్పించుకొని, ఔడు గఱచుచున్ = క్రిందిపెదవి క్రిందిచోటు కఱచుచు, అయ్యంగనలన్ = ఆసుభాంగులను. కందుక నికరమున్ = చెండుల మొత్తమును, కొని వ్రేయుచున్ = కొట్టుచు, కెలను = పార్శ్వము.

తా.—వారిట్లు చెప్పఁగా ఆయమ్మవారు లేఁతనవ్వు బైటంబడనీక అఁపుకొని వారిపై కోపము కల్పించుకొని, పెదవిం గఱచుకొనుచు, ఆచెలువలను బంతులతో కొట్టుచు ఇటునటుం జూచుకొని ఇట్లు వక్కాణించెను.—స్వభావోక్తి.

'ఎలనగవు'—తనగుట్టు వారు కనిపట్టిరిగదా అని దాని నణఁచుట ....వారిమాట సత్యమని తా నొప్పనట్లు కనఁబడుటకు—'ఇంచుక'—చెలులుగావున, తెచ్చి = వాస్తవకోపము గాదు గావున తెచ్చుకోవలసివచ్చినది; 'ఔడు కఱచుట'—కోపమును సూచించుటకు, 'వ్రేయుచు' = కల్లపల్కిరని దండించుట; 'కందుక'—సుకుమారసాధనముతో; కెలను చూచుట తనరహోభాషితమును ఎవ్వరేని పరులు వినువా రున్నచో తాను పలుకక యూరకుండుటకు.

క విడువక మీ గానము సొగ । సిసుటయు, మఱి పాడుఁ డనుట యెగ్గే? పాసెం
బడిగిన వారే పేదలె? । కొడిమెలు గట్టకుఁడి యతనిఁ గొని పని యేలా? 58

మీ గానము, విడువక, సొగసుటయున్ = ప్రియముగా నున్నందున. మఱి=ఇంకను, పాడుఁడనుట, ఎగ్గే=తప్పా, పాసెం బడిగినవారే పేదలె=పాయస మడిగినవారే దరిద్రులా, కొడిమెలు కట్టకుఁడి=నిందలు మోపకుఁడు, అతనిఁగొని పనియేలా=అతనితో నాకేమియు పనిలేదు.

'పాసెంబడిగినవారే పేదలె'- పేద లయ్యు అడుగకయున్నచో వారు పేదలు గారా? పేదలు కాకున్నను పాయసము బాగుగా నున్నదని ఇంకకొంచెము వడ్డింపు మనువారు పాయసముకై మొగము వాచినదరిద్రులా? లోకోక్తి—అట్లే పాట బాగుగా నున్న దని మరలం బాడు మన్నందున ఆపాటలో వర్ణితుఁ డైనయాతనిపై నాకు తగులము కట్టెదరా? అట్లు చేయకుఁడు, పాటకై యడిగితినిగాని తగులుచే అడుగలేదు, అనుట.

కొడిమెలు-చూ. పదపట్టిక, అచ్చతె, "బూతు నా బూమె నా బూక నాబూటక । మ్మనఁగను వేడబ మనఁగఁ గొడిమె । యనఁగను నబద్ధసంజ్ఞయై యలరుచుండు." ఆం. భా.

శా. పోనిం డన్న, వయస్యలిట్లని రగుం బో నిక్క, మిం కిప్పుడే
కాని, మ్మిం కొక కొంతసేపటికి నే కానీ సఖి, యెల్లియే
కానీ నీనుడిఁ దన్మనోజ్ఞ గుణము ల్గానీ, తదన్యాయము
ల్గానీ, చిందినఁ జింత నీ కతనిపైఁ గా కెవ్వరిం దేల్చె దే? 59

పోనిండు=అతనిమాట మానుఁడు, అన్నన్=అని యాదేవి పలుకఁగా వయస్యలు=చెలులు, ఇట్లనిరి=ఈ చెప్పఁబోవుమాటలను పలికిరి, సఖీ=చెలీ, అగున్ పో నిక్కము = నిశ్చయముగా నీమాట సత్యము సుమా; ఇంకన్=ఇటుతర్వాత, ఎప్పుడేని కానిమ్ము, ఇంకొక-కొంత=రవంత-సేపటికి నేకానీ, ఎల్లియేఁగానీ=ఱేపైనను గానీ, తత్ మనోజ్ఞ గుణముల్ గానీ = అతని కల్యాణ గుణము లేని, తత్ అన్యాయముల్ కానీ=అతనివి న్యాయము దప్పినపనులైనంగానీ, నీనుడిన్= నీవాక్కున, చిందినన్=రాలెనా, చింత=తలపోఁత, నీకు అతనిపైఁ గాక=అతనిమీఁద నున్న దని చెప్పవచ్చునుగాని (అట్టి యేతార్కాణంబును లేక యిపు డెట్లు చెప్పవచ్చును), ఎవ్వారిం దేల్చెదే= ఇట్లుటక్కులు పలికి నీ వెవ్వరిని భేలుపఱిచెదవు?

తా.—ఇఁక నతనిమాటమానుఁడు, అని యామె పలుకఁగా, చెలు లనిరి; 'సఖీ' నీమాట వాస్తవమే, నీ వేమయిన అతనింగూర్చి స్తుతిగాని నిందగానీ, ఇప్పుడేగానీ, ఇంక ఇంచుకసేపటికిఁ గానీ, ఱేపేగానీ పలుకుదువేని అప్పటికి నీచింత అతనిమీఁదనే ఉన్నదని, మేము చెప్పవచ్చును గాని, ఇప్పు డెట్లు చెప్పనగును? అనఁగా, నీగుట్టు మే మెఱుఁగమా, అతనిమాటవల దని మాకు ఆఁక పెట్టితివి; చక్కఁగా బొంకఁగలజాణవే. ఇప్పుడే గాని, ఇఁకను రవంతసేపటికేని ఱేపేగానీ నీవతనింగూర్చి మరల గుణదోష ప్రస్తావములు చేయకయుండఁగలవా? నీ చిత్తము ఎప్పుడును తదేకాయత్తమై యున్నది, మమ్మునా తేలఁబలికి ఏమార్చెదవు?

సీ. నఖముఖోజ్ఝిత పరాఙ్ముఖముక్తబాష్పాంబు । పటిమ దీపపుఁజిటచిటలు దెలుపఁ,
బోరినుపాంశూత్సృష్టఘూత్కృతుల్కృశమధ్య । పార్శ్వముహుఃప్రకంపములు దె
నొదవెడు గాద్గద్య మరిదిపాటునఁ బల్క । రింపఁ బుట్టెడు కేకరింత దెలుప, [లుప,

వలవంత విసువు కాంతల పుట్టు దూషించు। కారణంబుల తొంటి కతలు దెలుపఁ,
తే. నలఁతఁ బానుపుపైఁ బొరలాట దెలుపఁ,। దెగువ లోలోననే నవ్వునగవు దెలుపఁ,
కలఁక మామీఁది పనిలేని కసరు దెలుపఁ,।బొలఁతి రేలు నీయునికియే పులుగుగాదె.

పొలతి=ఓకలికీ, నఖ...మన్ - నఖముఖ=గోళ్లకొనల చేత - ఉజ్ఝిత=తొలఁగఁ జిమ్మఁబడిన-పరాఙ్ముఖ=అవ్వలిమోముగా_ముక్త=విడువఁబడిన-బాష్ప అంబు=కన్నీళ్లయొక్క,- పటిమన్ = పెనుపును, దీపపు చిటచిటలు = దీపశిఖయందు జనించిన చిటచిటశబ్దములు. తెలుపన్ = తెలియఁజేయుచుండఁగాను;

2. పొరిన్ =వరుసగా, ఉపాంశు ఉత్సృష్ట ఘూత్కృతుల్ =రహస్యముగా (ఎవరికిం దెలియకుండ) విడువంబడిన నోటి యూర్పులను, కృశ...లు_కృశ = సన్నమయిన - మధ్య = నడుము యొక్క-పార్శ్వ = ప్రక్కలయొక్క-ముహుః=తఱచయిన - ప్రకంపములు=వణకులు, తెలుపన్ = చెప్పుచుండఁగాను;

3. ఒదవెడు గాద్గద్యమున్ =పుట్టుచున్న గద్గదస్వరమును, అదిరిపాటునన్ =ఆకస్మికముగా, పల్కరింపన్ = మాటలాడించినప్పుడు, పుట్టెడు - కేకరింత = గొంతుసరిచేసి కొనెడు శబ్దము, తెలుపన్;

4. వలవంతవిసువున్ =విరహశోకమువలని వైరాగ్యమును, కాంతల పుట్టు=స్త్రీ జన్మమును, దూషించు కారణంబుల తొంటి కతలు=దూషించుటకై యేర్పడిన పూర్వకథలు, తెలుపన్;

అలఁతన్ =విరహాయాసమును, పానుపుపైన్ =సెజ్జమీఁద, పొరలాట=పొరలుట, తెలుపన్; తెగువన్ = మరణోద్యోగ సాహసమును, లోలోననే = నీలోనీవే అప్రకటముగా, నవ్వునగవు = నవ్వెడుహాసము, తెలుపన్; కలఁకన్ =బుద్ధికి కలిగినకలఁతను, మామీఁది= చెలికత్తెలమైన మమ్ముం గూర్చిన, పనిలేని కసరు = నిమిత్తము లేనికోపోక్తి, తెలుపన్; రేలు = రాత్రులయందు, నీయునికి = నీవు పడునవస్థయే. పులుగు కాదె = హరిమీఁది నీమరులునకు గుర్తు గాదా.

తా.—నీవు దాఁచినను రాత్రులందు నీయవస్థ మాకు తెలియుచునే యున్నది:—అది యెట్లన-మాకు తెలియకుండుటకై అవ్వలిమొగమై నీవు విడుచుకన్నీళ్లను నీవు కొనగోటితో చిమ్మఁగా అవి దీపముమీఁద పడినప్పుడు కలుగు చిటచిటశబ్దమే వానిని మాకు బ్రకటించుచున్నది; నీవు రహస్యముగా బుసకొట్టుట సన్నని నడుము ప్రక్కలకంపముచేత తెలియుచున్నది; నీగద్గదస్వరము మేము ఆకస్మికముగా పలుకరించునప్పుడు నీవు గొంతు సరిచేసికొనుశబ్దముచేత తెలియుచున్నది; నీవు విరహశోకము భరింపలేక వహించువైరాగ్యమును స్త్రీజన్మము దూషించునవిగా నీవు చెప్పెడి పురాణకథలే తెల్పుచున్నవి; విరహాయాసము పాన్పుపై నీవు పొరలుటచేతనే తెలియుచున్నది; నీ ప్రాణత్యాగోద్యమసాహసము నీలో నీవే నవ్వుకొనుటచేతనే తెలియుచున్నది; నీవు మమ్ము వృథాగా కసరుటచేతనే నీ బుద్ధిలోని కలఁక తెలియుచున్నది; —ఈతీరున రాత్రులందు నీ పడునవస్థయే నీవలవంతకు గుర్తుగాదా?_అనుమానాలంకారము.

'రహశ్శ్చోపాంశు చాలిఙ్గే' - అమ.-'గాద్గద్యము' -గద్గదముయొక్క భావము:—

"ఏతే తే కుహరేషు గద్గదనదద్గోదావరీవారయః
మేఘాలమ్బితమౌలినీలశిఖరాః క్షోణీభృతో దక్షిణాః" ఉ. రా. చ.

ఇందు క్రమముగా అశ్రు-విషాద - వైస్వర్య - నిర్వేద-ఆలస్య - సాహస - చపలతా-భావములు వర్ణితములు.

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము నీచెలి దీర్ఘికఁ దీర్థ మాడ నా
యఱుతఁ దగిల్చి పోవుఁ దన హారము; వోయిన నేనుఁ బోవుదు
న్మఱకువ వెంటఁ బోవ జలమగ్నత నా నది సున్న, మైనఁ దాఁ
గఱకఱిఁ బెట్టి సొమ్మడుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్. 61

ఒకసఖి కడమసఖులతో చెప్పుచున్నది.—ఒక అద్భుతమున్=ఒకవింతను, ఎఱుఁగరుగా=మీరెఱుఁగరుగదా, ఈచెలి, దీర్ఘికన్=దిగ్గియందు, తీర్థము ఆడన్=నీరాడుటకు (పోవుచు), తన హారమున్ = తన మెడలోని ముత్యాలపేరును, నాఅఱుతన్=నా మెడలో, తగిల్చి = వ్రేలవైచి, పోవున్=పోయినది, పోయినన్=పోఁగానే, నేనున్=నేనుకూడ, పోవుదున్ = పోయితిని, మఱకువన్ = (నా మెడలో ఆముత్తెపుంబేరుండుటను) మఱచి, వెంటఁబోవన్ = నేను ఆమె వెనుకఁ బోఁగా, జలమగ్నతన్ = (పోయి) నీటమునుంగుటచేత, అది = హారము, సున్నము, ఔన్ = అయినది, ఐనన్ = సున్నమైనందులకు, (ఈమె), నన్=నన్ను, కఱకఱిఁబెట్టి సొమ్ము అడుగున్ కాని = తననగను (హారమును) తెమ్మని నిక్కచ్చి చేయునుగాని, ఏమియున్=ఇంచుకైనను, నిజఆర్తిన్=తననెగులును, ఎఱుంగదు.

తా.—ఈమె దిగ్గియందు జలకమాడఁబోవుచు, తన (ముత్యాల)హారమును నా మెడలో వైచి పోయినది. నేనును ఈమెవెంటనే హారము నా మెడనున్కి మఱచి నీరాడ దిగ్గియలోనికి పోయి మునింగితిని. అంత నాముత్తెసరములోని ముత్తెములు సున్నమై పోయినవి. అటుపైని ఈమె తన హారము తెమ్మని నన్ను ఇబ్బందిసేయ నారంభించినదే గాని తనదేహము ఎట్లు ఉడికిపోయినదో యాకాఁకను ఎఱుంగదాయెను.—అతిశయోక్తి.

ఇందు అప్రాసము నిరూఢము.—'అఱుతన్'-అఱుతశబ్దము 'కఱకఱి' 'బాధ (కరకరి=క్రౌర్యము). ఏమియున్-అత్యంతము ముగ్ధరాలనుట; కాలినసున్నపురాలను నీట వైచిన సున్నమగును, అట్లే ఇటను నెఱుంగునది. 'మఱకువ'-మెడలో హారమున్నజ్ఞప్తి యున్నచో దానిని తీసి పెట్టి నీటిలో దిగును. తీసిపెట్టుట చిక్కులు పడకయు తెగిపోకయు నుండుటకు;—చూ.—

"ఆకమలాకరంబున విహారము సల్పఁగ నుత్సహించి శో
భాకరనూత్నరత్నసముదంచితకాంచనదివ్యభూషణా
నీకములం దొలంగ నిడి నీరజలోచన లొప్పి రోలిఁ గా
రాకుల నుజ్జగించి చెలువారెడు మవ్వపుఁదీవలో యనన్"-జక్కన. విక్ర. 5(44).

'మఱవక' అని శ. ర. పా. 'కఱకఱిఁబెట్టి'-కేవలము ముగ్ధయనుట.

చ. అనిన మరాళి పల్కు, విన వా హారిణీ, యొకనాఁడు కస్తురిం
గొని యిడు బొట్టు నా కనుచుఁ గూర్మి నొసంగినఁ, బెట్టు చుండఁ, జు
ఱ్ఱనుచు మొగంబు వ్రేసినటు లౌ తనయూర్పుల నింకి యింకి పో
యిన పలు బేంట్లు గోరఁ గొని యెత్తనె పట్టెను మాటిమాటికిన్. 62

అనినన్ = ఆచెలి యట్లు పలుకఁగా, మరాళి = మరాళి యను చెలికత్తె, పల్కున్=ఇట్లు చెప్పెను, హారిణీ = ఓహారిణీ, వినవా=వినుము, ఒకనాఁడు, కస్తురిన్ కొని=కస్తూరిని తెచ్చినదానవై, నాకున్, బొట్టు ఇడు అనుచున్=ఆ కస్తూరితో తిలకము పెట్టుమని, కూర్మిన్=నెయ్యముతో, ఒసంగినన్=తనచేతికి ఇయ్యఁగా, పెట్టుచుండన్=ఈమె నాకు బొట్టు పెట్టుచుండఁగా, చుఱ్ఱు

అనుచున్ = కాల్చు రీతిగా, మొగంబు వ్రేసినటులు = మొగానఁ గొట్టినట్లుగా, ఔ తన యూర్పులన్ = నాకు తగులుచున్న తన శ్వాసములచేత, ఇంకి పోయిన; పలుఁబేంట్లు-పలు = పెక్కులయిన-పేంట్లు=బెల్లులను, మాటిమాటికిన్=పలుమాఱు, గోరన్=గోటితో, కొని=పట్టి, ఎత్తనె = ఎత్తుటకే, పట్టెను = కాలము సరిపోయెను.

తా.—మరాళి చెప్పుచున్నది:—వినవే హారిణీ; ఒకనాఁడు నేను కస్తూరి ఈమెచేతి కిచ్చి నాకు బొట్టు పెట్టుమంటిని; ఈమె పెట్టం దొడంగినది. ఆ పెట్టుటలో ఈమె వేఁడిశ్వాసములే చుఱ్ఱుమని నా మొగమునకు వ్రేటులుగా తగులుచును, ఈమె పెట్టిన బొట్టు ఆ కస్తూరిని ఇగురఁ గొట్టుచును, ఉండినవి. ఎంతసేపు పెట్టినను బొట్టు ఇగిరిపోవుటయు ఆ యిగిరిన పేంట్లను గోళ్లతో ఎత్తివైచి మరల వేఁడే యిగురని కస్తూరితో బొట్టు పెట్టుటయు ఇదేపనిగా నుండెను. అంతియకాని ఎంతసేపటికిని బొట్టు కుదర దాయెను.—ఈమెదేహమందు అంతకాఁక యుండెను. ఆ కాఁకను ఈమె యోపలేక యుండెను.—అతిశయోక్తి.

'కస్తురి' - ప్ర - కస్తూరీ - 'కూర్మి' = కూరిమి, కూరుచు కృ. - 'చుఱ్ఱు' - కాలుటయం దగు ధ్వని కనుకరణము.

మ. అనినన్ స్రగ్విణి పల్కెఁ, దన్నుఁ జెలులారా, నే లతాడోలఁ జి,
కృన నూపం దెగి వ్రాల, దీని చనువ్రేకంబే క్రియం దాల్తునో
యని పట్టం, దిన మధ్య మార్క రుచి శీర్యన్మంజరు ల్పోని వా
డిన పాలిండ్లను బెండుబొమ్మగతి నుం డెన్సందిటం జుల్కనై. 63

అనినన్=మరాళి యట్లు పలుకఁగా, స్రగ్విణి=స్రగ్విణి యను చెలి, పల్కెన్ = ఈ క్రింది యట్లు వచించెను, చెలులారా, నేను, తన్నున్ = ఈమన నెచ్చెలిని, లతాడోలన్ =తీఁగ యుయ్యెల యందు ['ఉయ్యాల యనఁగను నుయ్యెల యనఁ దొట్ల । యన లాలి యన డోల దనరుచుండు. ఆం. భా.], చికృనన్ =విసరుగా, ఊఁపన్ =ఒక వేళ ఊఁపుదు నేని, తెగి = ఆయుయ్యెల త్రుంగి, వ్రాలన్ = ఈమె క్రిందికి జాఱె నేని, దీని చనువ్రేకంబు = (ఈమెను ఎత్తుకొనునపుడు) ఈమె కుచముల భారమును, ఏ క్రియన్ దాల్తునో = నేను మోవఁగలనో లేనో, అని = కను గొనుటకై, పట్టన్ = ఈమెను ఎత్తుకొని చూడఁగా, (ఈమె), సందిటన్ = నా సందిటియందు, దిన...రుల్ - దిన మధ్యమ = పగటి నడిమి, - అర్క = సూర్యుని - రుచిన్ = తేజముచేత - శీర్యత్ =వాడు చున్న-మంజరుల్ = పూగుత్తులను, పోని వాడిన పాలిండ్లన్ =పోలిన వాడిన కుచములతో, బెండు బొమ్మగతిన్ =బెండుతో చేసిన బొమ్మ వలె, చుల్కన ఐ= తేలికగా, ఉండెన్ .

తా.—మరాళి ఆ యమ్మవారి విరహతాపమును వర్ణింపఁగా, స్రగ్విణి తదీయవిరహకార్శ్యమును వర్ణించుచున్నది:—చెలీ! ఈయమపాలిండ్లభారము చూడఁగా నామనస్సులో ఒక శంక గలిగినది. ఏమనఁగా, ఈమెను నేను తీఁగయుయ్యాలలో ఊఁపుదు నేని, అప్పుడు ఈపాలిండ్లబరువుచే ఆ తీఁగెలు తెగి యీమె క్రిందికి జాఱు నేని, అంతట నేను ఆపాలిండ్లభారముతోడి యీమెను ఎత్తుకొనఁ గలనో లేనో అని;అంతట ఆసందేహము తీర్చుకొనుటకు ఈమెను నేను నాసందిట నెత్తుకొని చూచితిని. అట్లు చూడఁగా ఈమె పాలిండ్లు మట్టమధ్యాహ్నపుటెండకు వాడిన పూగుత్తులవలె వాడి బరు వెడలి యుండెను; ఈమె నా సందిట బెండుబొమ్మ వలె తేలికయై యుండెను.—ఉపమలు.

ప్రథమపాదమున ప్లుతయతి.—'తెగి' - తెగుటకు చికృన నూఁపుట యొక కారణము, చనువ్రేకం బింకొక కారణము; వట్టి యుయ్యెల ఎంత యూఁపినం దెగదు గదా. 'దీని' —

దీని అనుట చెలులయొక్క సమత్వముచేత. 'మధ్యమ' - తైక్ష్ణ్యాతిశయము కొఱకు. 'మంజరుల్' -సహజకోమలత్వముం దెలుపును. 'వాడిన పాలిండ్లన్'-కాళిదాసు ఈ తీరునే - "కాఠిన్యముక్తస్తనమ్" అని వర్ణించినాఁడు.

"క్షామక్షామకపోల మాననం, మురః కాఠిన్యముక్తస్తనం,
మధ్యః క్లాన్తతరః ప్రకామవినతా వంసౌ, ఛవిః పాణ్డురా,
శోచ్యా చ ప్రియదర్శనా చ మదనక్లిష్టేయ మాలక్ష్యతే,
పత్త్రాణా మివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ".—శాకుంతలము.

మదీయ విమర్శవినోదము పుట 17, కాఠిన్యముక్తస్తనమ్" అనుశీర్షికం దిలకింపుఁడు.—

వ. అని తన యవస్థఁ దోఁప నాఁడిన ననాదరయుంబోలె వారల కిట్లనియె.

అవస్థ = విరహదశ, తోఁపన్ = స్ఫురించునట్లుగా, ఆడినన్ = పలుకఁగా, అనాదరయుంబోలెన్ = ఆ మాటలను సరకు సేయనిది వోలె.

క. ఆర్పఁగఁ దీర్పఁగ మిక్కిలి । నేర్పు గల వయస్య లట్లు నెలఁతలు మీ మీ
నేర్పునఁ బలికెద రక్కఱ । యేర్పడ మీ కీ విచార మేటికిఁ జెప్పుఁడీ. 65

నెలఁతలు = ఓ చెలువలారా! ఆర్పఁగన్ = శమింపఁ జేయుటకును, తీర్పఁగన్ = సరిచేయుటకును, మిక్కిలి నేర్పుగల వయస్య లట్లు = ఎక్కువ నైపుణ్యము గల చెలులవలె, మీ మీ నేర్పునన్ = మీరు ఒకొకరికిం గల నేరిమితో, అక్కఱ = ఆదరము, ఏర్పడన్ = స్పష్టపడునట్లు, పల్కెదరు = వచించుచున్నారు.

వ. అని మేలంబు సేసికొని తెలి పోఁబలికి పుటపాక ప్రకారంబగు వియోగ దవథుభరం బవ్వధూరత్నం బడంచికొనియుండియు నుండలేక నిశాసమయంబుల నొక్కొకమాటు తనలోన. 66

మేలంబు = పరిహాసము. తేరిపోఁ బలికి = ఆ ప్రస్తావము మానునట్లుగా వచించి. పుటపాకప్రకారంబు = పుటములో కాల్చిన విధము గలది. అగు.....బు - వియోగ = ఎడఁబాపుచేతనైన, దవథు = కాఁక యొక్క, భరంబు = అతిశయమును, ఆ వధూరత్నంబు = ఉత్తమురాలైన యా బోటి, ........"క్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన । గేలి యన మేల మన మందెమేల మనఁగ, నాట యనఁ ద్రస్తరియనంగఁ హోళియనఁగఁ బొలుచుఁ బరిహాసములు మాత్రభూతలింగ." ఆం. భా. 'పుటపాక'—"పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః" ఉ. రా. చ.—"రత్నం స్వజాతిశ్రేష్ఠేఽపి"—అమ.

సీ. అభినవ కువలయ శ్యామకోమలమైన । డామూఁపు మకర కుండలముఁ దాల్ప,
నిస్తులాస్యశ్రీవయఃస్తంభ నిక్షిప్త । సంబచ్ఛద భ్రూవునిక్కుసుంత,
పరువంపు మంకెన విరి వంపు నరవంపు । వాతెఱ చెంద్రంపు వాన గురియ,
నద్దంపు మెఱుఁగువా లారు కన్గవచూడ్కి । శ్రవణకుండల కాంతి సవతుగాఁగ,
తే. సప్తభువ నాంగ నానురంజనకు సప్త । విధ పరీవాహముగ గాన సుధ వెలార్చు
మాడ్కి వేణువుపై వ్రేళ్లుమార్చిమార్చి । మురులు కొలిపితె గోవింద మంపసతుల.

(1) గోవింద = ఓ గోపాలుఁడా! అభి—లము-అభినవ = వికసించుచున్న - కువలయ = నీలోత్పలమువలె - శ్యామ = నల్లనిదియు - కోమలము = మృదులంబును, ఐన - డామూఁపు = ఎడమ

భుజము,-మకరకుండలములన్ = మొసలియాకృతిగల కర్ణాభరణమును, తాల్పన్ = ధరింపఁగా, (2) నిస్తు...వు-నిస్తుల=సాటిలేని-ఆస్య=వదనముయొక్క-శ్రీ=శోభయనెడు-శ్రీ=లక్ష్మియొక్క - వయః = ఎలఁబ్రాయముయొక్క - స్తంభ = స్తంభనము కొఱకు అనఁగా స్థిరీకరణము కొఱకు - నిక్షిప్త = ఉంపఁబడిన-నింబచ్ఛద = వేఁపాకునట్లుగా - భ్రూవు = కనుబొమ్మ, సుంత=ఇంచుక, నిక్కన్=ఎగురఁగా (3) పరు...లు-పరువంపు=చక్కఁగా వికసించిన-మంకెనవిరి=బంధూకపుష్ప మునకు-వంపు=అవమానమయిన-నెఱవంపు=పూర్ణమైన యర్ధవలయముగా నున్న-వాతెఱ=ఓష్ఠము, చెంద్రంపువానన్ = సిందూరవర్షమును, కురియన్ = వర్షించుచుండఁగా, (4) అ...డ్కి - అడ్డంపు=అడ్డముగా నున్నట్టిదియు, మెఱుఁగు=తళుకు గలదియు - వాలారు=తీక్ష్ణమును (అయిన)- కన్గవ = కనుదోయియొక్క-చూడ్కి = చూపు, శ్రవణకుండలకాంతి సవతు గాఁగన్=కర్ణకుండలముయొక్క కాంతికి సమానముగా నొప్పచుండఁగా;

స...కున్-సప్త=ఏడయిన-భువన = లోకములయొక్క - అంగనా = శుభాంగులయొక్క - అనురంజనకున్ = ప్రీణనమునకు, సప్తవిధ పరీవాహములన్ = ఏడు తెఱఁగుల పొర్లుకలుజాలు గలుగునట్లుగా, గానసుధన్ = పాట యనెడి యమృతమును, వెల్లార్చు చూడ్కిన్ = వెలిఁబుచ్చు రీతిగా, వేణువుపైన్ = పిల్లనగ్రోవి మీఁద, వ్రేళ్లు = వ్రేళ్లను, మార్చిమార్చి = పలుమాఱు రంధ్రములమీఁదికిని రంధ్రములనుండియు పోనిచ్చి, మందసతులన్ = గొల్ల వెలఁదులను, సురలు కొలిపితే = వలపించితివే.

తా.—ఓయి గోపాలుఁడా! నీవు వికసించుచున్న నల్లగలువవలె శ్యామలమును కోమలమును ఐన నీ యెడమబుజముమీఁద నీ యెడమచెవి యందలి మకరకుండలము మోచునట్లుగా, శిరమును ఎడమప్రక్కకు వంచినవాఁడవై సాటిలేని నీ ముఖశోభను ఎప్పటికిని ప్రకాశించుచునే యుండునట్లు స్తంభనము చేయునట్టి వేఁపాకో యన నొప్పుచున్న నీ కనుబొమ్మను ఇంచుక నిక్కించినవాఁడవునై పరువమందున్న మంకెనపూవు వంపునకు తలవంపు నొసంగునట్టి వంపు గలదైన నీ కెమ్మోవి సిందూరము వర్షించుచున్నదియుం బోలె ప్రకాశించుచుండఁగా, నీ నెడంద మెఱుఁగు వాఁడి కన్గవ చూపు శ్రవణములమీఁదికి ప్రసరించి అందలి కుండలపుఁ గాంతితో దానియుద్దిగా నొప్పారుచుండఁగా, ఏడు లోకములయు సుందరీమణులను వలపించుటకై నీ గానామృతపువెల్లిని ఏడు విధముల పొర్లుకలుజాలం బాఱించుటయో యనునట్లుగా వేణురంధ్రములపై వ్రేళ్లను నానా క్రమంబుల నిగిడ్చి నిగిడ్చి ఏడు స్వరములం బుట్టించుచు వలపించితివి గదా. తెలియని యువిదలను ఇట్లు బుద్ధిచెఱుచుట నీకు తగదనుట. ఇందు వరుసగా నాలుగు పాదములందు ఉపమ, ఉత్ప్రేక్ష, 3 పా. ఉపమ, ఉత్ప్రేక్ష; ఉపమ; గీతమున ఉత్ప్రేక్ష.

'కువలయ'-'స్యా దుత్పలం కువలయమ్' - అని ఉత్పలమాత్రపర్యాయముగా పఠితమయినను ఈ శబ్దము నీలోత్పలపర్యాయముగాఁ గూడ ప్రయోగములందుఁ గానఁబడుచున్నది.

"కువలయదళశ్యామోఽప్యఙ్గం దధ త్పరిధూసరం
లలితవికటన్యాసః శ్రీమాన్ మృగాఙ్కనిభాననః"—మాలతీ.

'అభినవ'=వాడని=ఉత్కట స్వకాంతియయిన; 'నింబదళము' - సంస్కారవిశేషముచేత వేఁపాకు వయస్స్తంభము చేయునని ప్రసిద్ధి.—'భ్రూవు'-'భ్రూశబ్దము, భ్రుకుటి, భ్రకుటి, భ్రుకుంస, భ్రకుంసశబ్దము లందు భ్రూశబ్దమునకు హ్రస్వమును అత్వమును పాక్షికముగా విహితములు, అంతియగాని భ్రుశబ్దము లేదు; ఈకారణముచేత 'నిక్షిప్తనింబచ్ఛదభ్రు వల్పంబు' అను పాఠము నష్టలిపి.

ప్రతినిధిగా నెవరో కల్పించిన దనుతలంపున నిట్లు మార్పు సేయఁబడినది. 'వాతెఱ' - (వాయి+తెఱపి.) 'వాలారు'-తదధరాగ్రకవిశేషణము గాదు.—"వాలారులై కరజంబుల్ సిగిరించె" - పారి.- సప్తభువనములు-భూర్భువస్సువర్మహోజనస్తపస్సత్య లోకములు. - షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదములు సప్తస్వరములు.—'గోవిందుఁడు' - (గాః విన్దతి = ఆవులను పొందువాఁడు, వాని యొడయఁ డనుట.)

"నిస్తులాస్య శ్రీవయస్తంభ"—ఇందు ఒకవిధ మయిన సంయోగప్రాసవిశేషము. గణభేదము లేని యట్లు శ్రుతిభేదము తెలియని యట్లును కొన్ని ప్రాసములందు ద్విత్వము కలిమియు కొన్నిఁట లేమియు భంజకములు కావు.

ఉ. అక్కట రాధ నీకుఁ దగ వా మగవారల నత్తమామలం
దక్క ముకుంద వేణు కలనాదపు టీలకు లేటిమొత్తమై
త్రెక్కొను కాఁకనై సడికి రేలరుదెంచిన గోపికావళిన్
బొక్కఁగఁ జేసి తద్రుచిర భోగము గుత్తగ నీవ కైకొనన్. 68

రాధ=ఓ రాధా, మగవారలన్ = భర్తలను, అత్తమామలన్, తక్క=విడిచి, ము...కున్ - ముకుంద=కృష్ణునియొక్క - వేణు=పిల్లనగ్రోవియొక్క - కల=మధురమైన - నాదపు=నాదము నెడి-ఈలకున్ = సంకేత నినదమునకు, లేటిమొత్తము ఐ=లేళ్లమందవలెనై, త్రెక్కొను కాఁకనైన్ = ఒడలిని త్రుంగించుచున్న కామతాపముచేత, సడికిన్ = పగలువచ్చిన పలువురు నెఱింగి నిందింతురను భీతిచేత, రేలు=రాత్రులయందు, అరుదెంచిన గోపికా ఆవళి = కృష్ణునిఁగూర్చి వచ్చిన గొల్లభామలసమూహమును, పొక్కఁగఁ జేసి=దుఃఖముపాలు గావించి, తత్ రుచిర భోగమున్ =ఆతని మనోహరమయిన పొందును, గుత్తగన్ = మొత్తపుఁ గొనుగోలుగా, నీవ=నీ వొకతెవే, కైకొనన్ = స్వీకరించుట, నీకున్, తగవా=న్యాయ్యమా, అక్కట=అయ్యో.

తా.—అయ్యో; రాధా నీ వెంత అన్యాయ మాచరించితివి ! ఈ నీ శ్రీకృష్ణుని వేణునాదముచే కామోద్రేకము నొందినవారై ఆ నాదమే రమ్మని పిలిచెడి యీలగా గొల్లయువతులు భర్తలను అత్తమామలను కనుమొఱంగి వేఁటకాని గీతమునకు లోభపడి లేటిమొత్తములు వానిం దరిసినట్లు వేణునాదముచే నాకృష్టలై పగలు పోయిన వెల్లడియై నిందపాలు గావలసి వచ్చునని రాత్రివేళ గొదగొని మొత్తముగాఁ బోయి చేరఁగా, వారిని తద్వియోగదుఃఖమున ముంచి నీ వొక్కతెవే తదీయభోగమును గుత్తమొత్తపుబేరముగా ననుభవించితివి ! ఇది నీకు తగునా—రూపకము. లేళ్లు గీతము విన నిచ్చగించుట అనుభవసిద్ధము.

"శుచిః శష్పాఙ్కురాహారో విమారక్రమణక్షమః
లుబ్ధకాద్గీతలోభేన మృగో మృగయతే వధమ్"—కామంద.

'అక్కట'- ప్ర. అః కష్టమ్. 'రాధ' - శ్రీకృష్ణుని పెంచిన నందుని చెల్లెలు. అత్తమామ లనుట ఆడుబిడ్డలు లోనగువారికి ఉపలక్షణము.—'ముకుందుఁడు' = ముకుం దదాతీతి ముకున్దః = భక్తులకు మోక్షము నిచ్చువాఁడు.

"ముకు మిత్యవ్యయం మాన్తం నిర్వాణమోక్షవాచకం
యస్తద్దదాతి భక్తేభ్యో ముకున్ద స్తేన కీర్తితః."

'కల మవ్యక్తమధురధ్వనౌ స్యా ద్వాచ్యలిఙ్గకః' - నానా.

"ఊళ యన జంబుకధ్వని యొప్పు నీల యనఁగఁ దస్కరసంకేతనినద మెసఁగు."_ఆం. భా.

''ఆడికె యేవ మీసడ మీసడింపు తెగడు తెగడిక । యాబడి యపసడి యగడౌరు దూఱు దూ।రు దిసంతు సడి రోయి రోఁత రొచ్చు। సేగింపు సెగ్గము సెగ్గవగింపు నా। నపవాదసంజ్ఞలై యాలరుచుండు.''—ఆం. భా. ['నడికిరేలు' అనుట మెఱుఁగు]

ఉ. అక్కమలాక్షుఁ డొక్కతె ని జాంసమునం దిడి కుంజపుంజపుం
జక్కికిఁ గొంచుఁ బోవఁ బెఱ చాన లినాత్మజవెంట వ్రేఁగున
న్మిక్కిలి డిగ్గు పాదసరణిం జని రోయుదు రట్టె రోసి తా
రక్కడఁ గాంచు టేమి వల దా యభిమాన మొకింత యింతికిన్? 69

ఆ కమలాక్షుఁడు=ఆ హరి, ఒక్కతెన్=ఒక గొల్లబోటిని, నిజ అంసము నందున్=తన దైన బుజముమీఁద, ఇడి=ఉంచుకొని, కుం...కిన్ - కుంజ=పొదరిండ్ల యొక్క, పుంజపు = సమూహము యొక్క, చక్కికిన్=తావునకు, కొంచున్ పోవన్=కొనిపోఁగా, పెఱచానలు=కడమయెలనాగలు, ఇన ఆత్మజ వెంటన్=సూర్యపుత్త్రి యైన యమునానది వెంబడిని, వ్రేఁగునన్=బరువుచేత, మిక్కిలి దిగ్గు పాదసరణిన్=మిక్కిలి లోఁతుగా దిగిన యడుగుజాడను బట్టి, చని=పోయి, రోయుదురు = వెదకుదురు, అట్టె = ఇది యాశ్చర్యముగా నున్నది. రోసి = వెదకి, తారు = తాము, అక్కడన్ = ఆ కుంజపుంజము చక్కియందు, కాంచుట ఏమి = ఏమి చూతురు? ఇంతికిన్ = స్త్రీలకు, అభిమానము = ఆత్మగౌరవము, ఒకింత = కొంచెము, వలదా = అక్కఱలేదా!

తా.—ఆ కృష్ణుఁడు ఒక యెమ్మెలాడిని బుజానఁ బెట్టుకొని యమునదరిని దట్టంపుఁబొదరిండ్ల కడకుం గొనిపోఁగా కడమయువతులు, యమునవెంట యిసుకలో ఇరువుర బరువుచే కడు లోఁతుగా దిగఁబడిన యాతని యడుగుజాడఁ బట్టి పోయి వెదకి అట నా పొదరిండ్లయందు ఏమి చూతురు! ఆశ్చర్యము; అట్లు పోయి చూచుటకు వారికి మన స్సెట్లొప్పినది. ఇంతులకు రవంత యాత్మగౌరవము వలదా!—అట్టి యా లోలత ఆ స్త్రీలకు అట్లు అప్రియపర్యవసాయి యైనది. స్త్రీజాతి కెల్లను లోలత చెట్టయే కదా.—అర్థాంతరన్యాసము.

చ. ఇలుగలనైన వెల్వడని యీలువుటాండ్రకుఁ దాఁపికత్తెవై
యులు కెడలించి శౌరి తను యోగపు వాచవిఁ జూపి మీఁదఁ బె
ల్లలము వియోగవహ్ని భవ దంతర సైకతపంక్తి పొంత వం
తలఁ బొరలించి తౌదు శమనస్వస వుగ్ర మయూఖనందనీ? 70

ఉగ్రమయూఖ నందనీ=వేఁడివెలుఁగులవాని కొమారె యైన యో యమునా, కలనైనన్=స్వప్నములో నయినను, ఇలు వెల్వడని=ఇంటినుంచి వెలికి రాని, ఈలువుటాండ్రకున్=మానవతులకు, తాపికత్తెవై = (ప్రియులం గూర్చు) కుంటెనకత్తెవై, ఉలుకు = జంకు, ఎడలించి = తీర్చి శౌ...విన్ - శౌరి - శ్రీకృష్ణునియొక్క - తను=దేహముతోడి - యోగపు=కూటమియొక్క - వాచవిన్=రుచిని, చూపి=ఆస్వాదింపఁ జేసి, మీఁదన్=అటుపిమ్మట, పెల్లు= అతిశయముగా, అలము వియోగవహ్నిన్=చుట్టుకొనుచున్న యెడఁబాపునిప్పుచేత (విరహతాపముచేత ననుట), భ...తన్ - భవత్=నీయొక్క - అంతర=నడిమి - సైకత=ఇసుకదిన్నెలయొక్క - పంక్తిన్ = వరుసయొక్క - పొంతన్=పార్శ్వమందు (నీటికి చేర్పయిన చల్లని భాగములందు) వంతలన్ = దుఃఖములలో (దుఃఖావిష్టలను గా), పొరలించితివి=పొరలునట్లు చేసితివి, శమనస్వసవు=యముని సహోదరివి, ఔదు=అగుట నిశ్చయము.

తా.—ఓ యమునా ! నీవు ఎప్పుడు ఇలు వెడలని మానవతు లయిన గొల్లసతులకు దూతివై ఆ కృష్ణునిపొం దొనఁగూర్చి, పిమ్మట వారిని వియోగతాపమునపాలు గావించి, నీ యిసుకదిన్నెల కచ్ఛములలో పొరలు చుండునట్లు చేసితివి గదా! ఈ క్రూరకృత్యము నీకు వేఁడికిరణములవాని కూఁతురవును చంపెడువాని చెల్లెలవును వినందులకు తగియే యున్నది. – ఇట యమునానిందచేత ఆ కృష్ణుఁడు అంత ధూర్తుఁడు ఆ గొల్లమానవతులను ఆకర్షించి పొంది విడనాడి వియోగార్తలం గావించినాఁడు. – అని తన్నింద స్ఫురించుటచేత వ్యాజనిందాలంకారము.

"నిందను నింద బయల్పడ। వంద మగుఙ్ వ్యాజనింద యనఁదగువానిఙ్
సుందరి నీకెవఁడంగం। బుం దలిరులఁ జేసి చేసె బుద్ధిని రాతఙ్"

'శమనస్వస వౌదు' అనుట విధ్యలంకారము.—

"విధియింపఁగ సిద్ధము నే। విధి యగు మధుమాసమందుఁ బికము పిక మగుఙ్." అలం.సా.సం.

'ఉగ్రమయూఖనందనీ', శమనస్వసవు,— తండ్రిగుణము సంతతి కుండుటయు, సోదరులకు తల్లిదండ్రుల మూలముగా, ఒకరిగుణము లొకరి కుండుటయు, సహజము.—'ఈలువు టాండ్రు' – 'కర్తధారయంబులందు' అను బహువచనసామర్థ్యముచే షష్ఠీసమాసమున టుగాగమము; ఇట్లే 'మదపుటేనుఁగు,' 'వేల్పుటావు,' ఇత్యాదులు; 'తాపికత్రె' - మహద్రూపము 'తాపికాఁడు,' "తాపికాఁడైన పాదలి మందడీఁడు" నవనాథోపాఖ్యానము. 'వాచవి' – నోటికి రుచి అను ప్రకృత్యర్థము.—'అంతర' =లోపలి అనుట చలువకొఱకు. 'పొంత' – నీటివైపు – చలువకై. 'పంక్తి' – చిత్తముయొక్క అనవస్థితిని తెలుపుచున్నది, ఏకచ్ఛమునను తాపము తీఱదాయె ననుట – 'పొరలించితివి–' పొరలుట వంతచే సహజము, దేహమునకెల్ల చలువ యంటుటకును పొరలుదురు. "సైకతం సికతామయమ్" – "కాళిన్దీ సూర్యతనయా యమునా శమనస్వసా" – అమ.

వ. అని యొంటి పాటునం దనలోనం బలుకు పలుకు లాలించి పొంచియున్న వయస్య లాస్యంబు లపహాస్యచంద్రికాతుందిలంబులుగాఁ దోఁచి 'భామ, యే మేమి? నీ మనం బెఱింగియే కదా మును మున్న యతనిమాటలు మానలేవంటి' మని మూఁదలించినం గించి దవనతాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి మఱి మొఱంగ ననువుపడక యందంబుగూడుకొని వారి కిట్లనియె. 71

వయస్యలు=చెలులు (వయస్సుచే తుల్య లని వ్యు.), ఆస్యంబులు=ముఖములు, అప...లు – అపహాస్య=పరిహాసమనెడు – చంద్రికా – వెన్నెలచే, తుందిలంబులు=బలుపు చెందినవి (నిండినవి – తుంద మనఁగా బొజ్జ – బొజ్జ గలది తుందిలము) – కాఙ్ =అగుచుండఁగా – తోఁచి=అగపడి (పరిహాసముగా నవ్వుచు ఎదుటికిం బోయి అనుట), భామ=ఓ భామినీ, ఏ మేమి = ఏమంటివి, మునుమున్న = తొలుతనే ('అంటిమి' అను క్రియకు విశేషణము), మానలే వని = అతని ప్రస్తావము నీవు విడువలే వని, మూఁదలించినఙ్ =ముదలకింపఁగా (జ్ఞప్తి సేయఁగా), కిం...న – కించిత్ = ఇంచుక – అవనత = వంగిన – ఆనన = ముఖము గలది, ఐ (మొగ మించుక వంచుకొని), నె... ట్లుఙ్ – నెమ్మొగంబు = నెమ్మోమునందలి – వెలవెలపాటుఙ్ = వెల్లంబోవుటను (అనఁగా తాను వారిని వంచించి వందులకుం దన మొగంబున నిపుడు గలిగిన వెలవెలపాటును), లేనగవునఙ్ = మందహాసముచేత, అడంచి = కప్పిపుచ్చి, మఱి మొఱంగఙ్ = ఇంకను తనగుట్టును దాఁచుటకు, అనువుపడక = వలనుగామి చేత, అందంబుగూడుకొని = వారిని తనతోఁ గలుపుకొని.—

'అందంబుగూడుకొని'-చూ.-''అందంబుఁగూడుకొని ఛందోవర్తనపరుండై....''ఆము.6(36).

తే. 'నాఁడు మన మున్న నెట్లో పూఁ బోఁడులార,'
యనిన, వారలు మగుడ నా యమకు ననిరి
'యింతి, నాఁ డుండ కెందుఁ బో యితివి నీ?' వ
టన్న నచ్చెరువడి వారి కతివ పలికె. 72

పూఁబోఁడులార = ఓ కుసుమకోమలాంగులారా! నాఁడు = ఆ గోపికాకృష్ణుల సహవాస కాలమందు, మనము, ఉన్నన్ = ఉంటి మేని, ఎట్లో = ఎట్లుండునో, అనినన్ = అని యామె చెప్పఁగా, - మగుడన్ = మరల, ఇంతి = ఓ చెలువా!

'నాఁడు' - ఇందలి ఆకారము నుచ్చరించు (ప్లుత) ప్రకారవిశేషముచేత 'ఆదినము' అను నర్థము వచ్చుచున్నది; 'మనము' - అనుట అందంబుకూడుకొన్నందున; 'పూఁబోఁడి' = పూవు వంటి మేనుగల స్త్రీ,—ఇట మేనునకు పోఁడి యాదేశము, అటుపై సమాసకార్యము (అర)సున్నయు బకారాదేశమును; 'అచ్చెరువడు' = అచ్చెరువుపడు (వులోపము పాక్షికము. - 'అచ్చెరువు' - ప్ర. - ఆశ్చర్యమ్ (సం.), అచ్చేరమ్ (ప్రా.)

తే. సకియలార, త్రైకాలిక జ్ఞానవంతు
లైన ఋషులట్ల పలికెద రంత యెఱుక
యెదఁ గలిగెనేని యెఱిఁగింపుఁ, డేను మొదల
నెవ్వతె నటన్న; మఱి వార లిట్లు లనిరి. 73

సకియలార = ఓ చెలులారా! - త్రై...లు - త్రైకాలిక = మూఁడుకాలములది యైన (వర్తమాన భూత భవిష్యత్తు లనెడి మూఁడుకాలములకును సంబంధించిన) - జ్ఞానవంతులు=జ్ఞానము గల వారు, ఐన - ఋషులట్ల=సత్యవచనులవలెనే, పలికెదరు=వచించుచున్నారు, అంత, ఎఱుక= జ్ఞానము, ఎదన్ = మీ హృదయమందు, - మొదలన్ = తొలుత (అనఁగా ఆ కాలమందు).—

'ఋషయ స్సత్యవచసః' అమ. - ఋషులు పల్కినది తప్పదు - ''ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి.'' అని ఉ. రా. చ. లో శ్రీరామవాక్యము. తప్పని వారికి త్రైకాలిక జ్ఞానము సిద్ధ మగుటంబట్టి - అప్పుడు నే నుంటినని మీకు తెలిసెనేని ఎవ్వతెనుగా నుంటినో అదియుం దెలియఁదగును గావున దానిం జెప్పుఁడు, అనుట;

మ. దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి, చూ పోవ, కిం
తవుజిల్లుంబని యంత సేసి, మది నీ ర్ష్యాక్రోధము ల్సందడిం
ప, విరిం బోక, ద్రుమంబుకై కొని, పతి న్సందన్న మ్రా నెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య వీ వహహా! కా వా? భామినీ నావుడున్. 74

భామినీ=ఓ భామా! అహహా=ఆహా, ఈవు=నీవు, ది...బు - దివిజ = వేల్పులయొక్క - ద్రు=చెట్టుయొక్క - ప్రసవంబున్ = పువ్వును, కాంచిన సపత్నిన్=పొందినసవతిని (రుక్మిణీ దేవిని), చూచి, చూపు ఓపక = ఓర్వలేమిచే, ఇంత అవు జల్లుంబని అంత చేసి=సరకుసేయఁదగని స్వల్పకార్యమును మహాకార్యముగా కావించి, మదిన్ = మనస్సులో, ఈర్ష్యాక్రోధముల్ = ఈసును కోపంబును, సందడింపన్ =సమ్మర్దపడుచుండఁగా, విరిన్ = పువ్వుతో, పోక=విరమింపక,

ద్రుమంబుకై = చెట్టే కావలయు నని, కొని = హఠమూని, పతిన్ = భర్తయైన శ్రీకృష్ణుని, మందు అన్నన్ మ్రాను ఎల్లన్ = మందు వలసి యుండ మ్రాని నంతయును, తేన్ = తెచ్చునట్లు, అవధిన్ = హద్దులో (నిర్బంధముచే), పెట్టిన సత్యవు పనిగొన్న సత్యభామవు, కావా = అగుదువు కదా, నావుడున్ = అని చెప్పఁగా.

తా.—రుక్మిణీదేవి యింట శ్రీకృష్ణులవారికి నారదమహాముని ఒక పారిజాతపుష్పమును కానుకయిచ్చెను. దానిని ఆయన రుక్మిణీదేవికి ధరింప నిచ్చెను. ఒక చెలివలన సత్యభామ అవృత్తాంతము నెఱింగి, ఆ పువ్వును ఆమె కియ్యనేల, తెచ్చి తనకేల యియ్యలేదు, అని శ్రీకృష్ణులవారిపై యలిగి ఆయనచే ఒక పువ్వునకు బదులు స్వర్గమునుండి ఆచెట్టును చెట్టుగానే తెప్పించుకొని తన పెరటిలో నాటించుకొన్నది. ఆ కథ నిట ననుసంధించుకొన వలయును, అట్లుచేసిన యా సత్యభామవు నీవేసుమా అని చెలులు ఆమెకు బోధించిరి.

“మందన్న మ్రానెల్ల” - లోకోక్తి - ‘అవధి’ - హద్దు అనఁగా - దానిని తెచ్చి యిచ్చువఱకు నీతోనాకుం బనిలే దను నిర్బంధము. - ‘సత్య’ - సత్యభామ - నామమునకు బదులుగా నామైకదేశమును వ్యవహరించుటగా నెఱుంగునది; రఘువంశములో - “అత్రానుగోదం మృగయానివృత్తః” అను శ్లోకమునకు చారిత్రవర్ధనవ్యాఖ్యలో నిట్లున్నది:—“శబ్దా అవయవే ష్వపి వర్తన్తే” - ఇతి న్యాయాత్ అనుగోదమితి పదైకదేశప్రయోగోఽయమ్ - భీమో భీమసేనః సత్యా సత్యభామా ఇతి.” అట రఘువులో గోదావరీ అనుటకు గోదా అని ప్రయోగము - “గోత్రభిద్గుర్వి మహారివోశ్చండిమోత్పుల కీకృతాంగక సత్య.” ఆము. 4(288). ద్రు - రూ. ద్రుమ - ‘పలాశీ ద్రుద్రుమాగమాః,’ ‘అక్షాన్తి రీర్ష్యా’ - అమ. - భామినీ - అనఁగా కోపస్వభావురాలు - ఈ పదముచే నిచట ఆమెయొక్క కోపస్వభావము సూచితము. ‘కోపనాసైవ భామినీ’ - అమ.

వ. గ్రక్కునం బ్రత్యుత్పన్నవిజ్ఞానయై, గృహదీపికారోపణంబునం గృహగతపదార్థంబు లొక్కమాఱె దృగ్గోచరంబు లగునట్లు, జన్మాంతరంబున నయ్యనంతునితోడి క్రీడాప్రపంచంబు సద్యస్సమనుభూతం బైన తెఱంగునం దోఁచిన. 75

గ్రక్కునన్ = తటాలున, ప్రతి ఉత్పన్న విజ్ఞాన = స్ఫుటముగా ఉదయించిన (పూర్వజన్మ) జ్ఞానము కలది, ఐ, గృహదీపికా ఆరోపణంబునన్ = ఇంటి దీపమును ఉంపఁగానే (వెలిఁగింపఁగానే), దృక్ గోచరంబులు = కంటికి విషయములు (అగపడునట్టివి),... అనంతునితోడి = కృష్ణునితోడి,... క్రీడాప్రపంచంబు = ఆటలయొక్క పెల్లిదము, సద్యః సమనుభూతంబు = జ్ఞానోదయమయిన కాలమందే చక్కఁగా అనుభవింపఁబడి నట్టిది పూర్వ మెప్పుడో అనుభవించినట్లు గాక అప్పుడే అనుభవించినట్లు అయిన దని భావము.—‘గృహదీపికా... తెఱంగు’ - ఉపమాలంకారము.

ఉ. వాలిక కన్నులం బొడము వారి సకజ్జల మాశ్రితశ్రవో
గోళక మై తదంతికపుఁ గుంతలవల్లికిఁ దల్లితోడుగా
మైలవలి న్నన ల్నిగుడు మైఁ బులక ల్నిగుడన్ శ్లథాంగియై
సోలినఁ జూచి డెందములు సుఱ్ఱన హాయనిబోటు లర్మిలిన్. 76

వాలికకన్నులన్ = విశాలము లైన నేత్రములయందు, పొడము వారి = జనించిన (బాష్ప) జలము, సకజ్జలము = కాటుకతోఁ గూడుకొన్నట్టిది, ఆ...ము - ఆశ్రిత = పొందఁబడిన - శ్రవః = చెవులయొక్క - గోళకము = రంధ్రములు కలది (కర్ణరంధ్రములలోఁ బడి వానిని నించినది), ఐ,

తత్ అంతికపు కుంతలవల్లికి౯ = వాని సమీపమందలి తీఁగలవంటి తలవెండ్రుకలకు, తల్లితోడు గా౯=పోషకమును ప్రాపకమును గాఁగా (తన నైల్యముచే వాని నైల్యమును పెంచుచుండఁగా), మై లవలి౯=ఏలకితీఁగవంటి దైన దేహమందు, ననల్=మొగ్గలు, నిగుడు మై౯=పొటమరించు రీతిగా, పులకల్=గగుర్పాటు, నిగుడ౯=పొడువఁగా, శ్లథ అంగి=సడలిన యవయవములు గలది, ఐ, సోలిన౯=పడిపోఁగా, బోటులు=ఆ చెలులు, చూచి, డెందములు=హృదయములు, ఝల్లు అన౯=ఎరియఁగా, హో=అయ్యో, అని=అని పలికి, అర్మిలి౯=ప్రేమతో.

తా.—తాను ఆ సత్యభామ యని తెలియఁగానే, ఆమెకు కృష్ణునితోడి క్రీడలస్మరణచే ఏలకి తీఁగలో మొగ్గలు పొటమరించునట్లు తన దేహ మంతటను పులకలు నిగుడఁగా, ఆయనతోడి యిప్పటి వియోగము మనంబున స్ఫురించి దుర్భరము గాఁగా ఆమెకు బాష్పము లుప్పతిల్లి కాటుకచే నలుపులై ఆయత నేత్రముల తుదలనుండి ప్రవహించి కర్ణరంధ్రములు నిండి ఆ చెంగటి తల వెండ్రుకల నీలిమను పెంచుచుండఁగా, ఆమె సోలి పడిపోయినది. అంతట ఆ చెలులు దిగులుపడి ప్రేమతో (ఆవలి పద్యమందు చెప్పినట్లు శైత్యోపచారములు గావించిరి.) - ఉపములు. లవలి - ఏలకితీఁగ యని కొందఱు చెప్పుదురు, ఇది తెల్లగా నుండును:—

"లింగనిషిద్ధుఁ గల్వలచెలిం గని, కర్దమదూషిత స్మృణా
లిం గని, సంగతాళిలవలిం గని నీలకచ౯ విధాత్మనా
లిం గని, కృష్ణచేలుని హలిం గని, మేచకకంధరుం, త్రిశూ
లిం గని, రామలింగకవిలింగనికీర్తి, హసించు దిక్కుల౯." అని చాటువు.

ఈలత కరము మనోహర మైనది:—

"అభినవరాగరసోఽయం । భవతోః కృతకౌతుకః పరిష్వఙ్గః
లవలీలవఙ్గయో రివ । నియతిమహోవాత్యయా నిహతః." మాలతి.

ఇందు అశ్రువు పులకము అను సాత్త్వికభావములును మూర్ఛయను మదనావస్థయు చెప్పఁబడినవి. స్తంభ ప్రళయ రోమాంచ స్వేద వైవర్ణ్య వేపథు బాష్ప స్వరభంగములు అని సాత్త్వికభావములు ఎనిమిది. మదనావస్థలను ౪౭ ప. టీకలోఁ గనునది.

ఉ. ఎంతకుఁ దెచ్చెనే సరసిజేక్షణ చెయ్దము! లిందుమీఁద జ
న్మాంతర వర్తనంబు హృదయంబున కిత్తఱి నెచ్చరించి గో
రంతలు గొండలంత లగు నట్లుగఁ జేసితి, మంచుఁ గూపికో
ద్వాంత సతాళవృంత మృదు వాత హిమాంబుకణాళిఁ దేర్చిన౯. 77

సరసిజేక్షణ చెయ్దములు = తామరసాక్షి యైన యీ చెలియొక్క చేఁతలు, ఎంతకు౯ తెచ్చెనే=ఎంత యాపదను గలిగించినవే (మొదలనే ఈచెలి దుస్సహవిరహతాప మనెడి యాపదలోఁ బడియుండినది), ఇందుమీఁద౯ = ఇంతటితో నుండనీక మనము హెచ్చుగా, జన్మాంతర వర్తనంబు=ఈమెయొక్క పూర్వజన్మ చరిత్రమును, ఇత్తఱి౯=ఈసమయాన, హృదయంబునకు౯= ఈమె మనస్సునకు, ఎచ్చరించి=జ్ఞప్తి చేసి, గోరంతలు=స్వల్పక్లేశములు, కొండలంత లగునట్లుగ౯= మహాక్లేశము లగునట్లుగా, చేసితిమి, అంచు౯, కూ...ళి౯ - కూపికా=కూజా నుండి - ఉద్వాంత= పైకి చిలికింపఁబడినవియు - స తాళవృంత మృదు వాత = వీవనల మెల్లని గాలితో కూడుకొన్నవియు నైన - హిమ అంబు=పన్నీటి - కణ=బొట్టులయొక్క - ఆళి౯ = మొత్తముచే, తేర్చిన౯= మూర్ఛ తేర్పఁగా.

తా.—ఆమె యిట్లు మూర్ఛిల్లఁగానే చెలులు "మొదలనే ఈమె హరిపై మరులుకొని విరహవేదనం బొగులుచుండినది. మనము అందుపై పూర్వజన్మమందు తాను సత్యభామ యని తెలిపి ఈమెను ఇంతయాపదకుం దెచ్చితిమి" అని దిగులుపడి త్వరపడి కూజాలతో పన్నీరు చల్లి వీవనలతో చల్లఁగా వీచి మూర్ఛఁదేర్చిరి. "గోరంతలు కొండలంత లగునట్లు"—లోకోక్తి.

'చెద్దము' - 'చైదము' అనురూపము సాధువు గాదు - మొదటి రూపము 'చెయిదము', 'ఇందు' మీఁద - 'ఇది' శబ్దమునకు కొన్నియెడల ఇందు అని యాదేశము పాక్షికము - 'దీనిమీఁద' అనియు నగును. 'జన్మాంతరము-' అన్యమయినజన్మము - అని విగ్రహము. 'గోరంతలు' = గోటి యంతలు - ఇట మిన్నేలు ఇత్యాదులయందుంబోలె ఔపవిభక్తికము రాలేదు; 'ఉద్వాంత' - ఇది గౌణవృత్తి ప్రయోగమగుటచేత, అనఁగా క్రక్కిన యని యర్థము గానందున గ్రామ్యముగాదు.

"నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే"—దండి.

క. తెలిసి కను దెఱచి వెండియు । జలజేక్షణ తన్ముకుంద చరణస్మృతిని
శ్చలతఁ గను మొగిచి మఱి య । శ్రులు తెప్పలఁ ద్రోవఁ దెఱచి చూచి సఖులతోన్.

తెలిసి=మూర్ఛఁదేరి, కను దెఱచి, వెండియున్ = మరల, జలజ ఈక్షణ=కమలములవంటి కన్నులు గలదైన యా యమ్మవారు, త...తన్ - తత్ = ఆ - ముకుంద = శ్రీకృష్ణునియొక్క - చరణ=పాదములయొక్క, స్మృతి=ధ్యానముయొక్క - నిశ్చలతన్=ఏకాగ్రతచేత, కను=కన్నులను, మొగిచి = మూసి, మఱి = పిమ్మట, అశ్రులు = బాష్పములు, తెప్పలన్, త్రోవన్ = పైకి త్రోయఁగా, తెఱచి = కన్నులు దెఱచి, చూచి, సఖులతో (ఇట్లనియె నని పైకన్వయము).

క. మీ రెవ్వ రనుటయును, శృం । గారిణి, మే మురగకన్యకల, మింతకు ము
న్ధారుణి కేతెంచితి; మన । నా రామలఁ గౌఁగిలించి, యార్తి న్బలికెన్. 79

మీరు ఎవ్వరు, అనుటయున్ = అని యామె యడుగఁగా, (వారు), శృంగారిణి = ఓ. శృంగారవతీ (ఓ సుందరీ), మేము, ఉరగ కన్యకలము=నాగ కుమారికలము, ఇంతకు మున్=ఇప్పటికి పూర్వమే, ధారుణికిన్=భూలోకమునకు, ఏతెంచితిమి=వచ్చితిమి, అనన్=అని చెప్పఁగా, (ఆ యమ్మవారు), ఆ - రామలన్=బోటులను, కౌఁగిలించి, ఆర్తిన్=(అట్టి యా మురారిని బాసి తా నున్నందుల కైన) నెగులుతో, పలికెన్.

ఉ. అట్టి మురారి కప్పు డనుఁగై, మఱి యీకలివేళఁ గ్రమ్మఱం
బుట్టి వియోగవేదనలఁ బొక్కెడు నీ తను వేల? తండ్రి దా
నిట్టగు నన్ను నిం కొకని కియ్యక తొల్తన యోగశక్తిఁ బోఁ
బెట్టెద దీని, వెండియు నుపేంద్రపదాంబురుహంబె పట్టెదన్. 80

అట్టిమురారికిన్ = అనంతకల్యాణగుణుఁడైన యాకృష్ణునికి,...అనుఁగు ఐ = అనుఁగనై = ప్రేయసినై యుండి, మఱి = అందులకు విపరీతముగా, ఈ కలివేళన్ = పాపభూయిష్ఠమయిన యీ కలియుగమందు, క్రమ్మఱన్=మరల, పుట్టి=తనువెత్తి, వియోగ వేదనలన్=విరహబాధలచేత, పొక్కెడు ఈ తనువు=పొగులుచున్న యీ దేహము, ఏల=ఏ ప్రయోజనమునకు, ఇట్టగు నన్ను= ఇట్టి శ్రీకృష్ణానురక్తనైన నన్ను, తండ్రి తాను=మా నాయన, ఇంకొకని కియ్యక తొల్తన=వేఱొకనికి ఇయ్యకముందే, యోగశక్తిన్=యోగబలముచేత, దీనిన్=ఈ తనువును, పోఁబెట్టెదన్=

మాయించెదను, వెండియున్ = మరల, ఉపేంద్ర = ఆ నారాయణునియొక్క - పద అంబురుహంబె = పాదకమలములనే, పట్టెదన్ = ఆశ్రయించెదను.

తా.—ఆకాలమందు ఆశ్రీకృష్ణులవారికి ప్రియతమనై యుండి ఈ కలికాలములో జనించితిని. ఆయనం బాసిన దుఃఖము ననుభవించుచున్న యీ దేహమేల? నన్ను మానాయన ఇంకొకనికి ఇచ్చుటకుముందే యోగవిద్యచేత ఈ దేహమును మాయించెద; ఆమురారిపాదములనే వెండియు నాశ్రయించెద.

'మురారి' - మురుఁడనెడి దానవునికి అరి. 'కలివేళ' - శ్రీకృష్ణులవారు ఈలోకమునుండి నిర్యాణమయిన దినమందే కలియుగము ప్రారంభమైనది; "యస్మిన్ కృష్ణో దివం యాత స్తస్మిన్నేవ తదాహని । ప్రతిపన్నం కలియుగం, తస్య సంఖ్యాం నిబోధత." విష్ణుపురాణము.

'యోగశక్తి' - తాను సత్యభామ యని యెఱింగినవెంటనే తానే భూదేవియుం గావున తన దివ్యశక్తు లన్నియు తనకు నావిర్భవించినవి. 'పోఁబెట్టెదన్' - పూర్వము దక్షయాగమున సతీదేవి యోగముచే తనదేహమును మాయించినట్లు.

క. అది యొండె భక్తి, యెవతే । నెద విశ్లేషైకభీరు వృత్తిఁ బ్రియాలా
భదశన్మెయిఁ దొరఁగించిన । హాదనన యదిగాక యున్న యవి వైశికముల్. 81

ఎవ్వతెన్ = ఏ స్త్రీయైనను, ఎదన్ = మనస్సులో, విశ్లేష ఏక భీరు వృత్తిన్ = ఎడఁబాపునకు మిక్కుటముగా వెఱచిన భావముచేత, ప్రియ అలాభ దశన్ = వల్లభుఁడు ప్రాపింపని యవస్థయందు, మెయిన్ = దేహమును, హాదనన = ఆసమయాననే (అనఁగా తత్క్షణమే), తొరఁగించినన్ = త్యజించినచో, అది ఒండె = అచిత్తవృత్తియొకటే, భక్తి = తత్పరత్వ మనఁదగును, అది కాక, ఉన్నయవి = కడమ చిత్తవృత్తులు. వైశికముల్ = టక్కులు.

తా.—ఎవ్వతెయేని ప్రియునిఁ బాసిన యప్పుడు తద్వియోగమహాభీతిచేత తత్క్షణమే దేహమును త్యజించెనేని దానిచిత్తవృత్తిని భక్తి యనందగును. అదిగాక కడమయనురాగము లన్నియు మాయలేగాని భక్తి గావు.—విధియు, ఆక్షేపమును.

"త్రస్నో భీరు భీలుక భీలుకాః—" అమ. 'తొరఁగు' = పడు - దానికి ప్రేరణార్థకము 'తొరఁగించు' = (పడఁజేయు - అనఁగా రాల్చివేయు - త్యజించు.)—'హాదనన్' - ఔపవిభక్తికము. 'భక్తి' - భక్తిలక్షణము నవవిధము - శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.

విధియింపఁగ సిద్ధమునే । విధురుగు మధుమాసమునఁ బికము పికమగున్ ।
(1) "తనమాట తానరసి వల । దన నాక్షేపము (2) నిషేధ మాభాసత నొందినను,
(3) నిషేధము గమ్యంబును విధి వాచ్య మయిన నది । మూఁడగు నెల్లన్."
(1) కనఁబడు మోయికళానిధి । పనిలే దున్న దిదె దయితవదనం బిదిగో.
(2) విను నే దూతినిగా నల । వనితవిరాళి గనలేక వచ్చితిఁ దెలుపన్.
(3) చను నీవు చనినపైక్షణ । మున దయిత మదీయతాపము శమించు వెసన్. అలం.

తే. అనిన వారలు పల్కి, రా యదుపతింప
యెందుఁ జన్నాఁడు? విను రంగ మందె నిల్చె;
వేగపా టేల? యతఁడ నీ విభుఁ డగుటకు
నచ్చునాదుల నిచ్చోటి హరి భజింపు. 82

ఆ యదువతంసము = యాదవశ్రేష్ఠుఁ డయిన యా శ్రీకృష్ణుఁడు, ఎందున్ = ఎక్కడికి, చన్నాఁడు = పోయినాఁడు,...రంగమంద = శ్రీరంగమందే, నిల్చెన్ = నెలకొని యున్నాఁడు, వేగపాటు ఏల = దేహము త్యజించుటకు త్వరపడ నేల, అతఁడె, నీ - విభుఁడు, = పతి,...ఇవ్విటి వారిన్ = ఈయూరి(అనఁగా విల్లుపుత్తూరి)వడపెరుంగోవి లుడయరును (అనఁగా ఆ పేరి శ్రీహరిని), అర్చన ఆదులన్ = పూజ లోనగు కైంకర్యముల చేత, భజింపు = కొలువుము.

తా.—'నీవు ప్రాణత్యాగసాహస మేల చేసెదవు; నీవల్లభుఁ డయిన శ్రీహరి శ్రీరంగక్షేత్రమం దున్నాఁడు; అతఁడు నీ కిపుడు పతియగునట్లుగా ఈయూరి శ్రీహరిని భక్తితో సేవింపుము' అని చెలులు చెప్పిరి.

చ అలుకకు మన్నఁ దేఱె; మఱి యంతటనుండియు వేళవేళ నె
చ్చెలు లిడు తెల్వులు న్మగుడఁ జింతల సంతమసంబులు న్సమా
కలితత మించె సొమ్మిడని కార్శ్యమునన్ హృదయంబున న్సదా
పలపలగాఁగ నీలముల బన్నసరం బయి నిర్మలాంగికిన్. 83

అలుకకుము = వెఱవకుము, అన్నన్ — అని వారు చెప్పఁగా, తేఱెన్ = (ఆయమ్మవారు) స్వస్థపడెను, మఱి = పిమ్మట, అంతటనుండియున్ = ఆ తేఱినప్పటినుండియు, వేళ వేళన్ = సర్వదా, నెచ్చెలులు ఇడు తెల్వులన్ = చెలులు కలిగించు నెఱుక లనెడు - తెలువులన్ = వెలుంగులను, మగుడన్ = ఆ తెలివిని తప్పించి వెండియుం గమ్ముకొను - చింతల సంతమసంబులున్ = వితర్కము లనెడి పెనుజీకటులును, సమాకలితతన్ = వరుసఁగా (సోలికఁగా) కూడుకొనుటచేత, సొమ్ము ఇడని కార్శ్యమునన్ = నగలు ధరింపని యా కృశత్వమందు, నిర్మలాంగికిన్ = శుభ్రదేహ యయిన యాయమ్మవారికి, సదా = ఎల్లప్పుడును, హృదయంబునన్ = మనస్సునందు (ఉరమునందు - స్తనముల పైని అనుట), పలపలగాఁగన్ = ఎడమెడముగా, నీలముల బన్నసరంబు = నీలములతో కూర్చినహారము. ఐ, మించెన్ = ఒప్పెను.

తా.—చెలు లెల్లు చెప్పఁగా ఆమె స్వస్థచిత్తురా లాయెను. కాని అప్పటినుండియు 'నీకు శ్రీరంగనాథుఁడు పతి యగునులే' అని చెలులు కొలిపెడు తెలివి యనెడు స్వాభావికదశయు, మరల ముంచుకొని వచ్చెడు వియోగదుఃఖము లనెడి చీకటులను, ఆ నిర్మలగాత్రికి అలంకార మొల్లని యా కార్శ్యావస్థయందు, హృదయమందు నీలములను ఎడమెడముగా గ్రుచ్చిన బన్నసరమో యన నొప్పుచుండెను.

కైసేఁత యనెడి ప్రకృతక్రియార్థము ఎడమెడమైన నీలమణుల బన్నసరముగా పరిణతి నపేక్షించినందున పరిణామాలంకారము. ఇందు అరతి యను మదనావస్థ చెప్పఁబడియున్నది.

పలపల యన వెలితి యనన్ । బలుచన యన విరళసంజ్ఞ భాసిల్లును'' ఆం. భా.— 'ధ్వాన్తే గాఢేఽన్ధతమసం క్షీణేఽవతమసం తమః । విష్వక్సన్తమసమ్' - అమ. 'బన్నసరము' - ప్ర. 'పఞ్చసరః' - అని వైకృతదీపిక.

తే. ఎలసి యే ప్రొద్దుఁ గనువాంపె నిక మఱుఁపు
కలహమున కంకకాఁ డయి కాలుద్రవ్వఁ
బొందుబవాళ్ళకుపాపరంపరలు వెడల
కింటిలో నేదుముల్లయ్యె నిందుముఖికి. 84

ఎలసి = పొంచియుండి, ఎప్రొద్దున్ = ఎల్లప్పుడును, కనుమోందనీక = నిద్రఁజెందనీక, మరుఁడు=మదనుఁడు, అంకకాఁడు అయి=చలపాదియై, కలహమునకున్ కాలుద్రవ్వన్=జగడమునకు పిలిచెడు పాదసంజ్ఞను చేయఁగా (అనఁగా జగడమునకు డీకొనఁగా - అనఁగా ఏచుచుండుటచేత), పొండు బహుళక్షపా పరంపరలు = శుక్ల కృష్ణ పక్షముల వరుసలు, వెడలక=వదలిపోక, ఇందుముఖికిన్ =ఆయమ్మవారికి, ఇంటిలో ఏదుముల్లు = ఇంటంగ్రుచ్చిన ఏదుముల్లుగా, అయ్యెన్ = పరిణమించినవి.

తా.—ఏదుముల్లు ఉన్నయింట కలహంబులు కలుగుచుండుట ప్రసిద్ధము. ఆమెకై మన్మథుఁడు రాత్రులందు నిద్రపోనీయక పోరాడుచుండుటకు ఆశుక్లకృష్ణపక్షరాత్రిపరంపర ఇంటిలోని యేదుముల్లైనది.—ఆమెకు రాత్రులందు విరహతాప మధికముగా నుండెను. నిద్ర రాదాయెను అని భావము. ఇట మదనుని పోరుట యనెడి ప్రకృతక్రియకొఱకు, ప్రకృతమైన శుక్లకృష్ణపక్షక్షపాపారంపరీ పరిణామ మపేక్షితమగుచున్నది - పరిణామాలంకారము.

"ప్రకృతం బప్రకృతాత్మతఁ । బ్రకృతాత్మత నప్రకృతము పరిణతిఁ గోరన్
బ్రకృతక్రియోపయోగం । బుకొఱకుఁ బరిణామయోగము పొలుపువహించున్" - అలం.

ఇందు జాగరమను మదనావస్థ చెప్పఁబడి యున్నది. మదనావస్థలు—దృక్సంగ మనస్సంగ సంకల్ప జాగర కృశతారతి హ్రీ త్యాగోన్మాద మూర్ఛా మరణములు అని పది. - ఇందు కవులు వ్యర్థమని (మనస్సంగాదివర్ణనచే గతార్థ మగునని) దృక్సంగమును వదలుదురు, విరసమని మరణమును వర్ణింపరు.

మ. తలిరుంగైదువుజోదునానతి వధూధైర్యంపుఁ బెన్గోటఁ గం
దళితాహార్యముఖయంత్రకారుఁ డలుక న్నానాఁటికిం ద్రెళ్లఁ గో
మలమార్తాండమరీచిదీపకళికోష్ణం జూఁడి యేయుం దళ
ద్దళపాథోరుహలోహనాళకుహరోద్యచ్చంచరీకాశ్మముల్. 85

తలిరుంగైదువు జోదు నానతిన్ = చిగురాకు ఆయుధముగాఁ గలవాఁడైన మన్మథుఁడు అను జిగీషునియొక్క యాజ్ఞచేత, కందళిత ఆహార్యముఖయంత్రకారుఁడు = పొటమరించిన (ఉత్సాహము వహించిన) ప్రాతఃకాల మనెడి ఫిరంగివాఁడు, వధూధైర్యంపుఁ బెన్గోటన్ = ఆ యమ్మవారి ధైర్య మనెడి కడిందికోటను, - త్రెళ్లన్ = డొల్లిపడం జేయుటకై, నానాఁటికిన్ = దినదినము, అలుకన్ =కోపముతో, కో...ష్ణన్ -కోమల=మృదువయిన - మార్తాండమరీచి=సూర్యకిరణమనెడి- దీపకళికా = దివ్వెమొగ్గయొక్క - ఉష్ణన్ = వేఁడితో, చూఁడి=కాల్చి, దళ...ముల్ - దళత్ = విరియుచున్న - దళ=రేకులుగలదైన - పాథోరుహ = తామరలనెడి - లోహనాళ = నిడుదయుం బోలు నయిన యినుపయంత్రముయొక్క (అనఁగా ఫిరంగియొక్క) - కుహర = గొట్టమునుండి- ఉద్యత్ = దూఁకుచున్న - చంచరీక = తుమ్మెదలనెడి - అశ్మముల్ =గుండ్లను, ఏయున్ =ప్రయోగించుచుండెను.

తా.—ఆమెకు, సూర్యోదయములయందు తమ్మికొలంకులలోని తమ్ములపై సూర్యకిరణములు నిగుడుటయు, ఆతమ్ములు వికసిల్లుటయు, వానినుండి తుమ్మెదలు వెలువడుటయుం, జూడఁగా వలరాజునానచే వేకువయను ఫిరంగివాఁడు ఆమె ధైర్యమనెడి కోటను గూల్పఁ బ్రతిదినము కోప

ముతో బాలసూర్యునికిరణ మనెడు సన్నని దివ్వెమొగ్గను తనచేతితో ఆ తామర లనెడి ఫిరంగుల చెవుల కంటించి, అందునుండి ఆ తుమ్మెద లనెడి యినుపగుండ్లను ప్రయోగించుచుండెనా యను నట్లుండెను. దానంజేసి ఆమెకు విరహతాప మతిశయించుచు ధైర్యము తూలిపోవుచుండెను. రాత్రులం దెట్లో అట్లే ప్రాతఃకాలములందును, వియోగభారము దుస్సహముగానే యుండెనని భావము.—రూపకాలంకారము. 'జోదు' - ప్ర. యోధః; 'ఆనతి'-ప్ర.-ఆజ్ఞప్తిః; 'వధూ'-''వధూర్జాయా స్నుషా స్త్రీచ''-అమ. 'కోట'-ప్ర. కోట్టః-ప్రౌ.వ్యా. సంజ్ఞా. ౧౧. 'యంత్రకాఱుఁడు' = యంత్రముం బ్రయోగించువాఁడు; 'అలుకన్' - ఎన్నాళ్లకును త్రెళ్లదాయె ననియు, చిగురుతోఁ ద్రెళ్లించువానిబంటనై ఫిరంగులతోఁ ద్రెళ్లింపలేకున్నా ననియును, అలుక. 'పెను' - గొప్పది కావు వనే కూలకున్నది. కామతాపము ఎంతమిక్కుటమైనను, మహనీయురాలైన యమ్మవారు, ఆత్మనిగ్రహమును సడలింపదు, అనుట. 'కోమల' - నిప్పువలె నెఱ్ఱఁగా నుండుటకు, 'మార్తండ' = మృతమయిన యండమున పుట్టినవాఁడు 'మార్తండుఁడు'-'మార్తాండుఁడు'ను; - 'వికర్తనార్క మార్తణ్డ మిహి రారుణ పూషణః' - 'భానుః కరో మరీచిః' అమ. 'ఊష్మన్' - నకారాంతశబ్దము- ''నాంతంబులకు అస్త్రీవిషయంబులకు ప్రథమైకవచనలోపంబు లేదు.'' - కావున ఊష్మము అనఁదగును, అయినను చరితాదిగణపాఠముచే ము లోపము పాక్షికముగా నగును, ఈ గ్రంథమునం బలుమాఱు ము హీనముగానే ప్రయుక్తము.— ''ఊష్మాతప నిదాఘయోః 'ఇతి నాన్తే వోపాలితః' - అని రామాశ్రమి. 'పాథోరుహ' - పాథసి రోహతీతి. 'అథ కుహరం సుషిరం వివరం బిలమ్'-అమ. ''నాళం తు నస్త్రియాం కాణ్డే'' నానా. ''ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలమ్బో బమ్భరోఽపి సః'-అమ. తుమ్మెదలను వర్తులత్వనైల్యములంబట్టి ఫిరంగిగుండ్లకుం బోల్చుట మనోహరముగా నున్నది. గుండు వెనుక జ్వాల యగపడును, అదే ఆ వికసిల్లిన తామరలోపలినుండి తటాలునం గానిపించునట్టి యెఱ్ఱకాంతి. 'మరీచి' అనుట నిడుదయై అగ్నిశిఖాగ్రమయిన జానకిత్రాటివలె నుండుటకు.

తే. పొంత ఘటయంత్రసరముఁ ద్రిప్పుచు జపించు
మఁగువధృతి దూల మధ్యాహ్న మంత్రవాది
సురుచిరవితానదంభకౌసుంభధారి
తుహినధారాగృహాంగి బిందువులు సెదర. ౮౬

మఁగువధృతి = ఆ ముగ్ధయొక్క ధైర్యము, తూలన్ = చలించునట్లుగా, పొంతన్ = సమీపమున, మధ్యాహ్నమంత్రవాది = మధ్యాహ్న మనెడి మాంత్రికుఁడు, తు...గి - తుహిన= మంచువలెచల్లనైన-ధారాగృహ=కేళాకూళి-అంగి=దేహముగాఁగలవాఁడును, సు...రి-సురుచిర= ప్రకాశమానమైన - వితాన=మేలుకట్టనెడు-దంభ=మిషగల - కౌసుంభ=కుసుంబావర్ణ మద్దిన వస్త్రమును - ధారి=ధరించినవాఁడును, ఐ, ఘటయంత్రసరమున్ =కుండలయేతా మనెడు జపమాలను, త్రిప్పుచున్ = లెక్కకై జరిగించుచు, బిందువులు = ధారాగృహజలబిందువు లనెడి జపోచ్చారణ ద్రప్సలు (తుంపర లనుట), చెదరన్ = రేఁగుచుండఁగా, జపించున్ =జపమొనరించుచుండెను.

తా.—మధ్యాహ్నకాలమందు సేవింపఁబడునవి—కుండల పరంపరచే కృతము లయిన యేతములయు ధారాగృహములయు శీతలోపచారములును, తదర్థమై ధారాగృహమునందు కట్టంబడిన కాషాయంపుమేలుకట్లును, చలువలు వెదచల్లు చల్లని కేళాకూళులును, అందు తొనకుచున్న చలినీటిబొట్లును, ఆమెవిరహతాపమును ఆర్చుటకు మాఱుగా, దానిని పెంచుచునే యుండినవి.—రూపకాలంకారము.

ఘటయంత్ర మనఁగా ఒక్కత్రాటికి వరుసఁగా కట్టియుండు పెక్కు ఘటములలో ఒక ప్రక్కనుండు ఘటములు తటాకములోని నీటిని ముంచుకొనుచుండఁగా, రెండవ ప్రక్క నుండు నవి క్రమ్మరించుచుండుటయు, ఆ ప్రక్క ఘటములు పైకివచ్చి క్రమ్మరించుచుండు నపుడు ఇవి క్రిందికిదిగి ముంచుకొనుచుండుటయునుం గా, చేతి జపసరమువోలె ఒక చక్రముపై తిరుగుచుండు పెక్కు ఘటముల యేతము. కుండలతోడి యా త్రాడు ఏతములో ఒక చక్రముపై దొరలుచుండును. కుండలు పూసలవలె నున్నవని హృదయము.—'ప్రత్యూషో ఽహర్ముఖం కల్యమ్'-అమ.— కుసుమ్భేన రక్తం కౌసుమ్భమ్-ఇది వశ్యకర్మప్రయోగము గావున కౌసుంభవస్త్రమును ధరించుట; వశ్యకర్మయందు ధ్యేయముసైతము రక్తవర్ణముగా నుండవలయును. 'వశ్యాకర్షణయో ర్ధ్యానమ్' అని శా. క. ల. యందు రక్తగణములో పఠితము; సాధ్వాచారమందు శ్వేతవస్త్రము ధార్యము - "సర్వారాగవాసాంసి వర్జయేత్" ఆపస్తమ్బః-అస్యార్థః-కుసుమ్భాదయః సర్వారాగవాసాంసి వర్జనీయాః"-అని స్మృతిముక్తాఫలము. ఇది యాభిచారికకృత్యము గావున ఇందు కౌసుంభవస్త్రము చెప్పఁబడినది:—

"వసనం లోహితం ప్రోక్త ముష్ణీషం లోహితం స్మృతమ్
జపహోమాదౌ సంకల్ప్య తదావరణ మాచరేత్".

అని షట్కర్మదీపికయందు ఆభిచారికకర్మకం జెప్పఁబడియున్నది.—'వితాన'-ధారాగృహమున మేలుకట్టు చలువకై కౌసుంభముగాఁ గట్టఁబడును. "చెంగావుల మృణాలభంగంబుల నంగంబులకుం జలువఁ బుట్టింప"—మనుచ. "వలిపంపుఁ జెంగావికలువఁ గప్ప చకోరి" అని దమయంతీ శైత్యోపచారము. బిందువులు నెదురునట్లు జపించుట అభినివేశమును త్వరను సూచించును. ప్రాతఃకాలమే గాక మధ్యాహ్నకాలము గూడ విరహోద్దీపకముగానే యుండె ననుట. 'తుహినధారాగృహా'-తుహినశీతలం ధారాగృహమ్ అని విగ్రహము.-మధ్యమపదలోపిసమాసము.

ఉ. తామరసాప్తతామ్రముఖి దంష్ట్రిత విస్ఫుట మల్లి హాల్లక
స్తోమరజశ్ఛటాంగక మధుద్యుతితార వియద్ద్రుచంక్రమో
ద్దామ పితృప్రసూ ప్లవగి దైన్యయుతోత్థ రథాంగ పోత చిం
తామయ నిద్రలం బొలసి తాపముసేయఁ దొడంగె నింతికిన్. 87

తా...ఖి-తామరసాప్త=పద్మబంధువయిన సూర్యుఁడనెడి-తామ్ర=ఎఱ్ఱని,-ముఖి=మొగము కలదియు, ద...ల్లి-దంష్ట్రిత=దంష్ట్రలుగా చేయఁబడిన-విస్ఫుట=వికసించిన-మల్లి=మల్లెపువ్వులు గలదియు. హా...క-హాల్లక = ఎఱ్ఱగలువలయొక్క-స్తోమ=సమూహముయొక్క - రజః = పరాగము యొక్క-ఛటా=మొత్తమనెడి - అంగక = దేహముగలదియు, మ...ర-మధుద్యుతి=తేనెవర్ణమువంటి వర్ణముగలదైన - తార=నక్షత్రములనెడి - తార=కనుగ్రుడ్లుకలదియు, వి...మ - వియత్ =ఆకాశమనెడు-ద్రు=చెట్టునందు-చంక్రమ=భ్రమణమందు-ఉద్దామ=విశృంఖలయును - దైన్యయుత ఉత్థ= దైన్యముతోడి కూఁతతో లేచినట్టి - రథాంగ = జక్కవలనెడి - పోత = శిశువులుగలదియు నైన,-పి...గి - పితృప్రసూ=సాయంసంధ్య యనెడి - ప్లవగి=ఆఁడుఁగోఁతి, ఇంతికిన్ =ఆ గోదాదేవికి, చింతా ఆమయ నిద్రలన్ = చింతవలని వ్యాధియనెడి నిద్రయందు, పొలసి = అగపడి, తాపముసేయఁ దొడంగెన్.

తా. — ఆమెకు సంధ్యావేళకూడ పీడాకరముగానే యుండెను. — స్వప్నమందు క్రోఁతి కనఁబడుట చెఱుపు, అట్లే సంధ్యావేళ ఆమెకు పీడగలిగించినదిగావున క్రోఁతిగా వర్ణింపఁబడినది. ఎఱ్ఱగలువలపుప్పొడిమొత్తము దానిదేహము, సాయంసూర్యుఁడు దానియెఱ్ఱనిమొగము, మల్లెపువ్వులు దానిపండ్లు, తేనెవన్నెనక్షత్రములు దానికన్నులు, ఆకాశము దానిచెట్టు, అందు అది ప్రసరించుట దానికొమ్మలపై దుముకుట, ఏడ్చుచున్నచక్రవాకములు దానిశిశువులు, ఆమెయొక్క చింతావ్యాధియే ఆమెయొక్క నిద్ర, అందు ఈసాయంసంధ్య తోఁచుట కలలో క్రోఁతి వచ్చుట. — రూపకాలంకారము.

'తామరసాప్త' - సాయంసూర్యుఁడుగాన యెఱ్ఱఁగా కోఁతిముఖమునకు సాటిగా నుండును "కియాహో హంసచఞ్చ్వఙ్ఘ్రి శుకమర్కటయో ర్ముఖమ్" శా. క. ల. అని రక్తగణపఠితము. "కోఽయం తామ్రముఖః కపిః" అని హనుమంతుం గూర్చి సీతాదేవ్యుక్తి. 'దంష్ట్రిత' యనుటచే 'పితృప్రసూప్లవగి' మల్లీరూపదంష్ట్రలను ఇగిలించుచున్న దని భావము. మల్లి సాయంకాలమందు పూచి దంష్ట్రాసామ్యముం బడయును. శృంగారనైషధములో — "చరమసంధ్యాకాలసంఫుల్లమల్లికా। స్తబక పంక్తులతోడ సరసమాడి" అని మామిడిసింగనామాత్యునికీర్తివర్ణనము; 'హల్లక' - 'హల్లకం రక్తసంధ్యకమ్' - అమ., హల్లకము కలువజాతిగావున రాత్రియందు (సాయంకాలము మొదలుగానే) వికసించును, వికసించినప్పుడు పుప్పొడిదొరఁగునుగావున హల్లకము చెప్పఁబడినది. ఆ పుప్పొడిపెల్లిదము (స్తోమచ్ఛటా) వ్యాప్తమగును గాన ప్లవగీదేహముగాఁ జెప్పఁబడినది; "అహ్న్యమ్భోజం నిశాయాం వికసతి కుముదం చన్ద్రికా శుక్లపక్షే." సా. ద. ప్రాతస్సాయారంభంబుల కొన్నికొన్నియే నక్షత్రములు మధుద్యుతులుగా నగపడును. — హల్లకపరాగము పిశంగవర్ణము, అదియు క్రోఁతివర్ణమునకు సమమే - 'మధువు' - "హిఙ్గులం మధురత్నాని స్ఫులిఙ్గా హస్తిబిన్దవః" అని రక్తగణపఠితము, మధుద్యుతితార - సంజకెంజాయ వ్యాప్తిచే ప్రథమోదితకతిపయ నక్షత్రములు మధువర్ణములుగా నుండును. — 'ద్రు' - "పలాశీ ద్రు ద్రుమాగమాః" అమ. 'దైన్యరుతము' - ఇఁక వియోగము కలుగు ననుదుఃఖముచేత. — "శోకవ్యాధిగదామయాః" - అమ. స్వప్నములో కోఁతిదోఁచినం జెఱుపనుటకు సుందరకాండలో సీతావాక్యము. — "స్వప్నే మయాఽయం వికృతోఽద్య దృష్టః। శాఖామృగః శాస్త్రగణై ర్నిషిద్ధః." "జనకతనయా తస్యాం శాఖాయాం శాఖామృగ ముద్వీక్ష్య దుఃస్వప్నబుద్ధ్యా చకితహృదయా" అని భోజచంపువు, 'కోక శ్చక్ర శ్చక్రవాకో రథాఙ్గాహ్వయనామకః' అమ.; 'ప్లవగి' - ఆఁడుది గాన శిశువులు చెప్పఁబడినవి. క్రోఁతి చెట్లపై దుముకునప్పుడు పిల్ల తనతల్లి కడుపును పట్టుకొనియుండును. "స్వప్నారిష్టా న్యేవ మామ్నాయన్తే। అథ స్వప్నాః - పురుషం కృష్ణం కృష్ణదన్తం పశ్యతి స ఏనం హన్తి, మర్కట ఏన మాస్కన్దయతి..." పరాశరమాధవీయము. 'సంధ్య' స్త్రీలింగము గావున ప్లవగి యని స్త్రీని జెప్పుట; అంతయేగాని స్వప్నమందు చెట్టను సూచించువిషయములో ఆఁడుఁగోఁతియొక్క విశేష మేమియు లేదు. నిషేధవాక్యములందు మగదానిం జెప్పుట ఆఁడుదానికిని ఉపలక్షకమే.

సీ. పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమును మౌన। నియతి మేల్కని, సఖీచయము మ్రోల
హేమపాత్రిక హరిద్రామలక్యాదిక। స్నానీయవస్తువ్రజంబుఁ గొనుచు,
ధౌతాంశుకంబులు తడి యొత్తులును దేర,। నంతఃపథంబున నరిగి, నిజగృ
హారామదీర్ఘిక ననుసంహితద్రావి। డామ్నాయమై స్నాన మాచరించి,

పర్జనీలేశ పూర్ణ సౌభాగ్యదాంగ । ఘూర్ణి చకచక లీరెండతోడ మాఱు
మలయ, నిడువెండ్రుకలగుంపు మలఁచివైచి । వేగ వెడవెడ దడియొత్తి, విధియుతముగ.

పద్మాస్య-పద్మ=పద్మమువంటి-ఆస్య=ముఖముగలదైన గోదాదేవి, ప్రతిదినప్రత్యూషమున=ప్రతిదినమును ప్రాతఃకాలమందు, మౌననియతిన్ - మౌన=పలుకకయుండుటయను - నియతిన్ = నియమముతో (ఎవరితోను ఏమియుం బలుకక), మేల్కొని, మ్రోలన్=తనయెదుట, సఖీచయము=చెలికత్తెగుంపు (అనఁగా ఆ నలువురు చెలికత్తెలును), హేమపాత్రికన్ = బంగారపుఁ బళ్లెరమందు, హారి...బున్-హారిద్రా=పసుపు - ఆమలకీ - ఉసిరికపొడుము - ఆదిక=లోనగు - స్నానీయ=స్నానోపయోగములయిన - వస్తు=ద్రవ్యములయొక్క - వ్రజంబున్ = మొత్తమును, కొనుచున్ = చేతఁగొనియు, ధౌత అంశుకంబులున్=ఉదికిన వలిపంబులును, తడియొత్తులున్ = స్నానానంతరము తడితుడుచుకొనుటకు వలసిన వస్త్రములును, తేరన్ = కొనిరాఁగా, అంతఃపథంబునన్=(తోఁటయొక్క) లోపలిత్రోవలో, అరిగి = పోయి, నిజగృహ ఆరామ దీర్ఘికన్ = తనయింటి తోఁటలోని దిగుడుబావియందు, అనుసంహిత ద్రావిడ ఆమ్నాయ ఐ=పఠింపఁబడిన యఱవవేదము కలదై (అనఁగా తిరువాయిమొళ్లిని పఠించి), స్నానము ఆచరించి=జలకమాడి, పర్జ...లు-పర్జనీ=పసుపుయొక్క-లేశ=ఇంచుకపు-పూర్ణ సౌభాగ్య=సమగ్ర సౌందర్యమును-ద=ఇచ్చునట్టి-అంగ=అవయవములయొక్క-ఘూర్ణి=చలనముచేతనయిన - చకచకలు = నిగనిగలు, ఈరెండతోడన్ = ప్రాతఃకాలపు నీరెండతో. మాఱుమలయన్ = ఎదిరించుచుండఁగా (అనఁగా వానిం బోలుచుండఁగా), నిడువెండ్రుకలగుంపున్ = దీర్ఘమయినకేశపాశమును, మలఁచి వైచి = వెనుకకు కట్టివైచుకొని, వేగ=త్వరత్వరగా, వెడవెడ=కొంచెకొంచెముగా, తడియొత్తి=తడితుడుచుకొని, విధియుతముగన్=శాస్త్రోక్తమార్గమున (ఈ క్రియా విశేషణమునకు అనంతరశ్లోకముతో నన్వయము.)

తా.—ఆ గోదాదేవి ప్రతిదినము వేకువను మౌనముతో మేల్కొన్నదై, సఖులు తన ముందు బంగారుపళ్లెరములో పసుపు, ఉసిరికయటకలి, లోనగు స్నానార్థవస్తువులను, ఉదికిన మడుఁగు వలువలను, తడి తుడుచు వస్త్రములను, కొనిరాఁగా, తమయింటి తోఁటలోనే లోపలిదారిని పోయి అందలిదిగుడుబావిలో ద్రావిడవేదమును పఠించి జలకమాడి, తాఁ బూసికొని స్నానమాడినయించుక పసుపునకు తనదేహప్రభ నిండుసౌభాగ్యము నొసంగుచుండ, తన యవయవముల నుండి తచ్చలనముచేత ఒలయుచున్న నైగనిగ్యము తత్కాలపు నీరెండకాంతిని మించుచుండఁగా కేశపాశమును వెనుకవైపునకుం ద్రోచి, తడియొత్తులతో వడివడిగా తడి తుడుచుకొని, పిమ్మట విధ్యుక్తముగా వక్ష్యమాణముం గావించును.—గీతమందు ఉపమలు.

‘ప్రత్యూషమునన్’ - ‘ప్రత్యూషోఽహర్ముఖం కల్యమ్’ - అమ. ఇట *బ్రాహ్మముహూర్తమని భావము. అప్పుడు మేల్కొనుట సిద్ధికరము-“యదీచ్ఛే చ్ఛాశ్వతీం సిద్ధిం యమ స్యాదర్శనం తథా । సతతం తేన కర్తవ్యో బ్రాహ్మే కాలే ప్రజాగరః । ప్రత్యూషకాలే నిద్రాంచ కురుతే సర్వదా తు యః । అశుచిం తం విజానీయా దనర్హ స్సర్వకర్మసు । బ్రాహ్మే ముహూర్తే యా నిద్రా సా పుణ్యక్షయకారిణీ” అని స్మృతి. సూర్యోదయమునకు ముందరి యరజాములో రెండుముహూర్తములు, అందు తొలిది బ్రాహ్మము, రెండవది రౌద్రము, అని పరాశరవచనము.—నిద్ర లేవఁగానే ఇష్టదైవమును మనస్సున నమస్కరింపవలసినట్లు స్మృతిగావున ‘మౌననియతి’ వలయును.—

* చూ. రాయవాచకము.

'హేమ పాత్రిక' - నారాయణ ప్రసాదలబ్ధమయిన యైశ్వర్యాతిశయముచేత.— దీనిం జెప్పుట యుదాత్తాలంకారము. 'ఆమలకీ' సంపన్నులు తలరుద్దుకొనుటకు (సీకాయకు బదులు) దీనినే ఉపయోగింతురు.

"తామరదోయిలోఁ దగిలి దాఁకొడు తేఁటులఁ బోలఁ బెన్నెఱుల్,
వేమఱు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లిచల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్ ",పారి. ఆ. ౨-౧౦.

ఆదిశబ్దముచే సున్నిపిండి లోనగునవి గ్రాహ్యములు. 'ధౌతాంశుకంబులు'- నిన్న ఆఱవైచినవి, ఇది ద్రావిడాచారము. అంఘ్రులకు నేఁటివేగాని పనికిరావు. 'అంశుక సూక్ష్మవస్త్రే స్యాద్వస్త్రమాత్రోత్తరీయయోః'-మేదిని.—'అంతఃపథము'.—అంతర్గతమైన పథము అని విగ్రహము; అంతఃపదంబున నరుగుట పామరజన దృష్టిని పరిహరించుటకు. ద్రావిడ వేదపఠనమునకు మహాపావనత్వము చెప్పఁబడినది:—"ద్రవిడోపనిషద్గాథాం పఠతశ్చ ద్విజస్య వై । యో వై పాదోదకం పాతి స పునాతి వసుంధరామ్" 'శ్రుతిస్తు వేద ఆమ్నాయః' అమ.

'పర్జనీ' శబ్దము మ్రానిపసుపునకుం బేరు, ఇట లక్షణచే పూఁతపసుపునకే చెప్పఁబడినది; దీనిం గూర్చి పీఠకం జూచునది.—'లేశ'-అనుట నాగరకతావిశేషమును సూచించుచున్నది,ఆ దేహమునకు ఎక్కువగా అక్కఱలేమియును సూచితము; "అలంతి—పసుపాడి" అని 3!!.-'వేగ'-అనంతర కర్తవ్యమయిన పూజాదికమునకు విలంబము కాకుండుటకును, ఆరోగ్యార్థంబును.

ఉ. కుందరదాగ్ర నెన్నొసల గుమ్మడిగింజతెఱంగు పాండుమృ
త్బిందువుఁ దీర్చి, చెందిరము పేచకిశీర్షముపై బలె న్కటిం
జందురకావిజీ బమరఁ జల్లని రేయిటి తట్టుపున్గళి
న్విందులఁ దేల్పు, నూనెముడి వెండ్రుకలున్ దడితావు లీనఁగన్. 90

కుందరదాగ్ర - కుంద = మొల్లమొగ్గవంటి - రద=దంతములయొక్క - అగ్ర=తుదలుగలదైన-యాదేవి, నెన్నొసలన్ - నెఱ=అందమైన - నొసలన్ =ఫాలమందు, గుమ్మ...వు-గుమ్మడిగింజ-తెఱంగు = రూపముగల - పాండు = పాండురవర్ణమయిన - మృత్ = మట్టియొక్క - బిందువున్ = బొట్టును, తీర్చి = చక్కఁగా పెట్టుకొని, పేచకి శీర్షముపైన్ = ఏనుఁగుయొక్క కుంభద్వయిమీఁద, చెందిరంబుబలెన్ = సిందూరము వోలె, కటిన్ = నితంబముపై, చందురకావిజీబు = సిందూరవర్ణపు జిలుఁగు వలువ, అమరన్ =ఒప్పుచుండఁగా, నూనెముడిన్ =దూముడియందు, చల్లని రేయిటితట్టు పున్గు= రేయిధరించిన మేలిపునుఁగుయొక్క చలువవాసనలు, అళిన్ = తుమ్మెదలను (జాత్యేకవచనము), విందులన్ = ఆతిథ్యములో, తేల్పన్ = తృప్తినొందించుచుండఁగాను [పా. అళుల్ విందులఁ దేల], నూనెముడి = నూనెపూసి ముడిచిన - వెండ్రుకలున్ = కేశపాశంబును, తడితావులు = తడివలపులను [పా. వెండ్రుకలన్ - అని, వెండ్రుకలయందు, తడి (కర్త)- తావులు = పరిమళములను], ఈనఁగన్ = వెలువరించుచుండఁగా.

తా. ... మొల్లమొగ్గలవంటి దంతాగ్రములు గలదైన యాదేవి అందమయిన ఫాలమునందు విధ్యుక్తప్రకారము నిలువుగా గుమ్మడిగింజయాకారముగా బొట్టు దిద్దికొని, గజకుంభములకు సిందూరముం జమరినరీతిగా పిఱుందులపై చందురకావివలువ ధరించి, కేశపాశము తడివలపులు చల్లు

చుండఁగా దానితుదిదూముడి అందు అలంగినపుష్ప ఇపుడు స్నానార్ద్రమై చలువవాసనలు గ్రమ్ము టచే తుమ్మెదలకు విందు లొసంగుచుండఁగా (గుడికేఁగును అని యనంతరోక్తములో నన్వయము.)

స్వభావోక్తి.—ఉపమలు. "నూనె... ఈనఁగన్" ఈనఁగన్ - గ్రామ్యముగాదు, గౌణ వృత్తిచే మనోహరము.

'కుందరదాగ్ర' - శిఖరిదంతయనుట - "దన్తాశ్శిఖరిణో యస్యా శ్చిరం జీవతి తత్పతిః" - అని సాముద్రికము. 'పాండుమృద్బిందువు' - "మృదులతర గౌరమృద్బిందువదనచంద్ర" - అని స్నానమయిన నలునివర్ణన; -'పాండు' = గౌర, 'పాండుమృత్' = గంగాతీరానీతమైన గోపీచందనాదికము. 'పేచకి'= పేచకముకలది - (కుంభిఅన్నట్లు)-'ఉలూకే కరిణః పుచ్ఛమూలోపాన్తే చ పేచకః'-అను. 'గుమ్మడిగింజ తెఱంగునన్'-తిలకమునకు ఈయుపమానము మహాకవిమార్గసిద్ధము—"గిరుచు గుమ్మడిగాజు నామము దీర్చు" అని కువలయాశ్వవిలాసము 4 (188) [ఇందు 'గాజు' అని 'గింజ' కు ప్రామాదికముగా నుండును.] 'తెలుపున్' - ఈ పదంబును మహాకవిప్రయోగసిద్ధము.—చూ. కువల. 4 (137)

> చ. హడపము వీడె కిన్నెర హిమాంబువు నించినగిండి చల్వపా
> వడలుఁ గురంగనాభియు జవాదియుఁ దట్టుపునుంగు వీవనల్
> ముడివిరు లద్దముల్ సురటులుం దెలిదంతపుదువ్వెనల్ ముదం
> బడర ధరించి యూడిగపుటబ్బురపుఁ జెలిగుబ్బెతల్ దగన్."

'కొయిటి' — ఔపవిభక్తికమును పరికించునది. 'నూనెముడి' — "నిడుద వేనలినూనెముడి పిడికిఁ జిగురాకుఁ బోదఁ దూరు, గార్చిచ్చుఁ గదియు కరణి"-మనుచ.

> తే. బోటి గట్టిన చెంగల్వ పూవుటెత్తుఁ
> దరు పరిణతోరు కదళీ మంజరియుఁ గొనుచుఁ,
> బోయి, గుడి నంబి విజనంబుఁ జేయఁ జొచ్చి
> మ్రొక్కి వేదికఁ బలువన్నె ముగ్గు వెట్టి. 91

కట్టిన చెంగల్వ పూవుటెత్తు = ఆ దేవి తాను స్వయముగా గ్రుచ్చిన యెఱ్ఱగలువపూవుల దండను, తరు పరిణత ఉరు కదళీ మంజరిని = చెట్టునం బండిన పెద్ద యరఁటి గెలను, బోటి = చెలి, కొనుచున్ = తేఁగా, పోయి = తానేఁగి, గుడి = కోవెలను, నంబి = అర్చకుఁడు, విజనంబు సేయన్ = జనులు లేని దానినిగా నొనర్పఁగా, చొచ్చి = లోపల ప్రవేశించి, మ్రొక్కి = స్వామికి నమస్కరించి, వేదికన్ = తిన్నెయందు, పలువన్నె ముగ్గు = పెక్కువర్ణములు గలదైన రంగవల్లిని, పెట్టి = రచించి (అని అనంతర పద్యముతో నన్వయము).

తా.—గోదాదేవి తాను రచించిన హల్లకమాల్యమును, చెట్టునం బండిన పెద్దయరఁటి గెలను, తనచెలి కొనిరాఁగా, గుడికిఁబోయి, అంత నట నంబి గుడిలో మఱియెవ్వరును లేనియట్లు చేయఁగా స్వామికి నమస్కరించి, తిన్నెయందు పంచవర్ణముల ముగ్గులు పెట్టును.

'చెంగల్వ'-తామరలం గ్రుచ్చుట కింకను అవకాశము లేనందునను, ప్రాతఃకాలము కావున హల్లకము లింకను ముకుళించుకోనందునను, అవిస్వామికి గ్రాహ్యములేగావునను, చెంగల్వదండ నర్పించుట.— 'తరుపరిణత' - చెట్టునంబండినపండు మధురతరము. 'ఉరు'-భగవత్ప్రీత్యతిశయా

ర్థము. 'కదళీమంజరి'_ఇట 'కదళి' యను పాఠమున ఇకారమునకు గతి కనఁబడలేదు, శబ్దము 'కదళీ' అని; ''నదిసుత గురుకర్ణ శల్య నాగపురీశుల్''-అనుపాదమున-''నదీజగురు'' అనియుం బఠింపఁదగియుండుటంబట్టి, దానిని ప్రమాణీకరించి ''కొన్నియెడల దీర్ఘసమాసములందు జీప్పునకు హ్రస్వమగును.'' అని కల్పించుకొనుట సమంజసము కాదని కొందఱమతము.—'కదళ' పాఠము నిర్బాధము—

''కదళాకదళీ పృశ్న్యాం కదళీకదళీ పునః
రమ్భావృక్షే చ కదళీ పతాకా మృగభేదయోః'' - మేదిని.

మ్రుగ్గులువెట్టుట లోనగునది భగవత్కైంకర్యము. 'పూవుబెత్తు' - టుగాగమము 'నెత్తురుటేఱు' నందుంబోలె. 'కొనుచు' అను పాఠమున దేవి మోచునదియు బోటి చేయునదియు నగును, సమంజసము కాదు.

తే. కపిలగవి సర్పిఁ బృథుదీప కళిక దీర్చి । ద్వయముతో వక్షమునఁ గల్వదండ సేర్చి
యగరు ధూపంబు లిడి శర్కరాజ్యయుక్త । హృద్యకదళీఫలాళి నైవేద్య మొసఁగి.

క...ర్పిన్ _కపిలగవి=పుల్లావుయొక్క-సర్పిన్ = నేతితో, పృ...కన్ - పృథు=దొడ్డ-దీపకళికన్ =దీపపుమొగ్గను, తీర్చి=రచించి, ద్వయముతోన్ = ద్వయమంత్రోచ్చారణపూర్వకముగా, వక్షమునన్ =స్వామియురమందు, కల్వదండన్ = తాను గ్రుచ్చిన యా చెంగల్వసరమును, చేర్చి= అర్పించి, అగరుధూపంబున్ = అగరుతోడి ధూపమును, ఇడి=పెట్టి, శర్క...ళిన్ _ శర్కరా = చక్కెరతోను - ఆజ్య= నేతితోను _ యుక్త =కూడుకొన్న - హృద్య=మనోహరమయిన-కదళీఫల= అరఁటిపండ్లయొక్క - ఆళిన్ =వరుసను, నైవేద్యము ఒసఁగి = నివేదనగావించి.

'కపిల' - ''మొదవులలోపలం గపిలవరిష్ఠ'' - బాల. వ్యా. కావున తద్ఘృతముతో చేసినం బుణ్యమెక్కుడు. అశ్లే పృథుత్వము చేతను. 'ద్వయము' _ 2 (87) టీకం జూ. అగురు - రూ. అగరు 'సర్పి' సర్పిస్-శబ్దము.

క. ఖండిత పూగీ నాగర । ఖండంబులు ఘన శశాంక ఖండంబులచే
హిండితమగు తాంబూల । మఖండస్థిరభక్తి నొసఁగి కదలి చెలులతోన్. 93

ఖండి...లు - ఖండితపూగీ = తునకలుగావించిన వక్కలును (అనఁగా పోకచెక్కలును)_ నాగర=సొంటియొక్క-ఖండంబులు=తునియలును, ఘన...చే_ఘన= పెద్ద-శశాంక=కర్పూరపు - ఖండంబులచేన్ =తునియలచే, హిండితము=వ్యాప్తము (అనఁగా వానితోఁగూడినది-తన్మిశ్రము), అగుతాంబూలము=ఐనతాంబూలమును, అఖండ స్థిర భక్తిన్ =సంపూర్ణ నిశ్చల తాత్పర్యముతో, ఒసఁగి=స్వామి కర్పించి, చెలులతోన్, కదలి=తరలి (అని తరువాతి కన్వయము,)

తా.—ఆమె పోకచెక్కలను సొంటితునియలను కర్పూరపుఁబెళ్లలతో కలిపిన తాంబూలమును స్వామి కర్పించి, చెలులతోఁగూడి తరలెను.

'ఖండితఖండంబులు' అనుచో పౌనరుక్త్యము గాదా? 'పూగః క్రముక బృన్దయోః'-అమ. క్రముకవాచక పూగశబ్దము స్త్రీలింగంబునుం గలదు. ''పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం । కర్పూరచూర్ణసంయుక్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్''. పూగఫల నాగరఖండ కర్పూరఖండ తాంబూలదళముల సమాహారమునకును తాంబూల మనిపేరు—''నాగరం ముస్తకే శుణ్ఠ్యాం విదగ్ధే నగరోద్భవే -'' మేదిని. 'శశాంక' - 'ఘనసార శ్చన్ద్రసంజ్ఞః'-అమ. ఇందువలన

చంద్రుని పేరు లన్నియు కర్పూరమునకుం జెల్లును.—'హిండితము' - దీనింగూర్చి పీఠికం జూచునది.—ఈపద్యమున పూర్వముద్రణములలో "హిండితములు గావించి య। ఖండస్థిర" - అని యున్నది; ఆ పాఠములో ఆమె ఒసఁగినది 'తాంబూల' మన్నమాట లేదు.

తే. చెలువ గర్భగృహ ప్రదక్షిణముఁ జేసి, వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణతీర్థముఁ గొని తత్ప్రసాదలబ్ధ, మయిన మాల్యముఁ దాల్చి గేహమునకరుగు.

చెలువ = గోదాదేవి, గర్భగృహప్రదక్షిణము చేసి=స్వామి యుండెడు గృహమును వలగొని, వినతయై = వంగినదై, మౌళిన్ = శిరమునందు, శఠకోపమును ధరించి = శఠకోపమును స్వీకరించి, చరణతీర్థము గొని = స్వామియొక్క పాదతీర్థమును పుచ్చుకొని, తత్ ప్రసాదలబ్ధ మయినమాల్యమున్ = స్వామియొక్క యనుగ్రహముచే ప్రాప్తమయిన పూదండను, తాల్చి, గేహమునకున్ = ఇంటికి, అరుగున్ = పోవును.

క. ప్రతిదినము నిట్లు చనియ। చ్యుత పూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుతధైర్య యగుచు నయ్యదు। పతిగుణములు ద్రవిడభాషఁ బాడుచునుండున్.

అచ్యుత = వడపెరుంగోవిలుడయరుయొక్క ... సుదతి = ఆయింతి, వియోగచ్యుతధైర్య= విరహముచేత జారిపోయిన దిట్టతనము గలది; అయదుపతి=యాదవనాథుఁడయిన యాహరియొక్క.

ఆమె శ్రీకృష్ణునింగూర్చి తిరుప్పావై నాచ్చియార్ తిరుమొళ్ళి అను ప్రబంధములను రచించి పాడినది:—

"గోపికాభావ మాస్థాయ తద్వృత్తార్థప్రకాశకమ్
ప్రబన్ధం ప్రాహ సా గేయం త్రింశద్గాథాభి రుజ్జ్వలమ్,
కామేన భూయసా భూయో గోదా చక్రే యథాశ్రుతమ్
గాథాద్విగుణసప్తత్యా ప్రబన్ధం రసబన్ధురమ్."
"కన్యయా విష్ణుచిత్తస్య కలితాఽభూత్ కృతిద్వయీ
జన్యర్థ్వ ఖేదనోదాయ జగదుజ్జీవనాయ చ." - దివ్యసూరిచరితము.

## వసంతర్తువు

తే. మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి పెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్ట మాఁడు ననుచుఁ
దొలఁగె నన నుత్తరాశకుఁ దొలఁగెఁ దరణి. 96

తరణి = సూర్యుఁడు, మొదలన్ = అప్పటికే, ఆము...ట్టన్ - ఆముక్త = తాను ధరించిన - మాల్య = దండను - ద = శ్రీహరికి ఇచ్చునదైన యా యమ్మవారియొక్క - మదనతాప = కామజ్వరమనెడి - తరణి = సూర్యునియొక్క - పెనువెట్టన్ = బలువేఁడిచేత, వేఁగినదక్షిణ ఆశ = తప్తమైన దక్షిణపుదిక్కు (మంచిదిక్కనుటయు), మత్ కృత ఊష్మకున్ = నాచేత (అనఁగా సూర్యునిచేత) చేయఁబడిన వేఁడికి, తుదముట్టన్ = నిశ్శేషముగా, మాఁడున్ అనుచున్ = కాలిపోవునని వెఱచిన

వాఁడై, తొలఁగెన్ అనన్=దక్షిణదిక్కును విడిచి పోయినాఁడో యనునట్లుగా, ఉత్తర ఆశకున్ = ఉత్తరదిక్కునకు, తొలఁగెన్ = వెడలిపోయెను.

ఉత్తరాయణవర్ణనము.—సంవత్సరములో సూర్యుఁడు ఆఱుమాసములు నిరక్ష రేఖనుండి ఉత్తరమునను ఆఱుమాసములు దక్షిణమునను సంచరించును. ఆ సంచారమునకు ఉత్తరాయణము దక్షిణాయనము, నని సంజ్ఞలు. మకరసంక్రాంతి మొదలుకొని ఉత్తరాయణము: కర్కాటక సంక్రాంతి మొదలుకొని దక్షిణాయనము.

తా.—అప్పుడు ఉత్తరాయణము వచ్చెను. సూర్యుఁడు ఉత్తరదిక్కునకు పోయెను. అది యెట్లుండె ననఁగా:—'దక్షిణాయనము, చల్లనికాలము, అట్టికాలములోనే ఆముక్తమాల్యదాదేవి యొక్క విరహమహాతాపముచేత ఈ దక్షిణదిక్కు వేఁగియున్నది. ఇఁక రాఁగలది వేండ్రపుఁ గాలము, అప్పుడు నాకు వేఁడి ఎక్కువ, అప్పుడు ఆవిరహతాపమునకు నావేఁడియుం దోడ్పడి ఈదిక్కు మిగులు లేకుండ మాడిపోవును అని తలంచుకొని సూర్యుఁడు ఆచెఱుపును మాన్పుటకై ఆదిక్కును వదలిపోయినాఁడో యనునట్లుగా ఉత్తరాశకుం బోయెను. రూపకోత్థాపితఫలోత్ప్రేక్ష.

దక్షిణశబ్దమునకు మంచిస్వభావము గలదియు నర్థముగావున ఆదిక్కుయొక్క మంచితనము చేత సూర్యుఁడు దానిపై కనికరించె నని స్వారస్యము. 'ప్రాచ్యవాచీ ప్రతీచ్యస్తాః పూర్వదక్షిణపశ్చిమాః'-'దక్షిణే సరళోదారౌ,' 'ఆశా దిగతితృష్ణయోః'-'ద్యుమణి స్తరణి ర్మిత్రం చిత్రభాను ర్విభావసుః-'అమ.

'ఉత్తరఆశకున్'=దక్షిణదిక్కు కాలిపోకయుండునుగదా యని పిమ్మటికి ఆసవహించుటకుఁ గాను, అని స్వారస్యము. 'తాపతరణి'_అనుటచే ఆమె తాపము సూర్యతుల్యముగా నుండె ననుట. ఇరువురు తరణులలో ఒకఁడు తగ్గుట దక్షిణదిక్కునకు మిక్కిలి క్షేమకారి యని స్వారస్యము.— 'ఊష్మకున్_ములోపమునకు గతి చరితాదులకుంబోలె. వేఁగుటకును 'తుదముట్టమాఁడుట' కును తారతమ్యమును అరయునది; ఒకతరణికి 'వేఁగును', ఇరువురు తరణులకు 'మాఁడును' అని భేదము. విరహతాపము అంతమిక్కుటముగా నుండె నని భావము.

చ. తెలియఁగ వచ్చె నట్టితఱిఁ దిగ్మకరుండు ధనాధిపాశకై
తొలఁగినకారణం, బతివ దుర్వహ దీర్ఘవియోగవహ్ని పె
ల్లలమిన తద్దిశం దగిలి నట్టి తనూష్మ ఘనీభవన్మహా
జలమయశంకర శ్వశుర శైలము కోనల చల్వఁ దీర్చుకోన్. 97

తిగ్మకరుండు=వేఁడివెలుఁగు (అనఁగా సూర్యుఁడు), అట్టితఱిన్ = ఆ సమయమందు, ధనాధిప ఆశకై=కుబేరుని దిక్కునకు (అనఁగా ఉత్తరదిక్కునకు), తొలఁగిన కారణంబు=వెడలిపోయినందులకుంగల నిమిత్తము, తెలియఁగవచ్చెన్=బోధపడినది. అతివ దుర్వహ దీర్ఘ వియోగవహ్ని= అనవలాయొక్క ఓర్వరాని చిర విరహాగ్నియొక్క, పెల్లు = అతిశయము, అలమిన తత్ దిశన్ = క్రమ్ముకొన్నట్టి యాదక్షిణదిక్కునందు, తగిలినట్టి - తను ఊష్మన్ = తనకు (అనఁగా సూర్యునికి) సోఁకినదైన మేనికాఁకను, ఘనీ...ల్వన్ - ఘనీభవత్ = గడ్డకట్టుచున్న - మహాజలమయ = నీటిపెల్లుయొక్క మాఱురూపమయిన - శంకర శ్వశుర శైలము = ఈశ్వరుని మామయైన పర్వతము (హిమవంతుని) యొక్క - కోనల = మఱుఁగు ప్రదేశములయొక్క - చల్వన్ = శైత్యముచేత, తీర్చుకోన్ = ఆర్పుకొనఁ గోరుట (యే ఆ నిమిత్తము.)

తా.—వేఁడివెలుఁగు అప్పుడు దక్షిణాశను వదలి ఉత్తరాశకుం బోయినందులకుం గలిగిన నిమిత్తము, అహో తెలియవచ్చినది. ఆయమ్మవారి విరహతాపము వ్యాపించిన దక్షిణదిక్కునందు తానుండినందున ఆమెదేహతాపము తనకు సయితము తగులఁగా ఓర్వలేక అతఁడు దానినార్పుకొనుటకుఁ గాను పలాయితుఁడై కరడుగట్టినజలమే అయిన హిమవత్పర్వతంపు మఱుఁగుఁ బ్రదేశములలో, పడి దొరలుటకై యట్లు పోయినాఁడు.—ఫలోత్ప్రేక్ష.

ఆమెయొక్క వియోగజనితదేహతాపము సూర్యునికి, తానే వేఁడివెలుఁ గయినను, తాను భరింపలేనంత వేఁడిగానుండె నని తెలుపుటకు 'తిగ్మకర' శబ్దప్రయోగము, తిగ్మ=తీక్ష్ణములయిన-కరుండు=కిరణములుగలవాఁడు. 'ధనాధిపాశ' - ధనాధిపుఁడు కుబేరుఁడు, అతఁడేలుదిక్కు ధనాధిపాశ, అదే ఉత్తరము:— 'ఇన్ద్రో వహ్నిః పితృపతి ర్నైరృతో వరుణో మరుత్ । కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్' - అమ.

'కోన' - ప్ర. కోణః - 'ఊష్మన్' - ములోపము. చరితాదికార్యము. 'జలమయః' = జలస్య వికారః - 'ఉత్తరదిక్కు' - 'హిమాలయము' అనక 'ధనాధిపాశ' - 'శంకరశ్వశుర శైలము' - అనుటయందు విశేషమేమన:—కుబేరుని సిఫారసుచేత ఈయనను శంకరుఁ డవలంబించును, ఆయనకు కుబేరుఁడు సఖుఁడు గావున, "కుబేర స్త్ర్యమ్బకసఖః" - అమ. శంకరుని సిఫారసుచేత ఆయన మామ మంచుకొండ ఈయనకు తాపమార్చుకొనుటకు చోటిచ్చును; అని స్వారస్యము. మొదల కుబేరుఁ డేల ఈయన నవలంబించును? అని యాక్షేపమేని, ఈయన ఆరోగ్య మిచ్చువాఁడు- "ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్" అని స్మృతి, మఱి కుబేరుఁడు ఆరోగ్యవిషయములో కొదువ గలవాఁడే గదా; కనుక ఆరోగ్యాశచే కుబేరుఁడు ఈయన నవలంబించును; అని సమాధానము. ఇందువలన ఎల్లవారికి ఆరోగ్యమీఁగలవాఁడు సయితము ఆరోగ్యార్థము పరుగులిడునట్లు చేసినట్టిది అది యెంతతాపమో అని తదతిశయము స్ఫురించుచున్నది.

తే. కినిసి వలఱేఁడు దండెత్తఁ గేతు వగుట
మీన మిలఁ దోఁచు టుచితం బ, మేష మేమి
పని యనఁగనేల ? విరహాఖ్యఁ బాంథయువతి
దాహమున కగ్గి రాఁగఁ, దత్తడియు రాదె ?. 98

కినిసి = విరహులమీఁద కోపం బూని, వలరాజు (పా. వల ఱేఁడు) = మదనుఁడు, దండెత్తన్ = దాడివెడలుడు, కేతువు = అతనిటెక్కెము, ఔటన్ = అయినందున, ఇలన్ = భూమిలో, మీనము = మత్స్యము (మీనరాశి యనియు), తోఁచుట = అగపడుట, ఉచితంబ = న్యాయ్యమే, మేషము = మేఁక (మేషరాశి), ఏమిపని = ఎందులకు వచ్చినది, అనఁగనేల = అనియడుగ నక్కఱ లేదు, అగ్గి = వహ్ని, విరహ ఆఖ్యన్ = వియోగమనెడు పేర; పాంథయువతి దాహమునకున్ = వియోగినులైన గుబ్బెతలను చూడుటకు, రాఁగన్ - తత్తడియున్ = అగ్నికిగుఱ్ఱమయిన మేషము కూడ, రాదె = రాదా, (గుఱ్ఱము నెక్కి రౌతు వచ్చు ననుట).

తా.—సూర్యుఁడు ముందు మీనరాశిలోను, పిమ్మట మేషరాశిలోను, ప్రవేశించుటయే ముందు మీనరాశి వచ్చుటగాను, పిమ్మట మేషరాశి వచ్చుటగాను, చెప్పఁబడును. ఉత్తరాయణము వచ్చినప్పటినుండి క్రమముగా మదనునికి బల మెచ్చిన దనియు తత్కృతవిరహబాధ దుస్సహ మయిన దనియు భావము. మదనుని టెక్కెమున మీన ముండును, అగ్నికి వాహనము మేషము.

ఉత్తరాయణమందు మీనమేషరాసులువచ్చును (అనఁగా రవి మీనమేషరాసులం జొచ్చును); తనపెక్కు మెత్తి దాడివెడలుట ఆచారము, కావున మీనోదయమునకు కారణముకలదు, అట్లే రౌతు గుఱ్ఱమునెక్కి వచ్చుట కలిగినదే కావున, విరహ మను పేరియగ్ని తనవాహనమయిన మేషము నెక్కి వచ్చినాఁడు.—మీనమేషరాసుల యుదయములకు కారణము కానట్టి మదన వైశ్వానరాగమనములను కారణములనుగాఁ జెప్పినాఁడు, కావున హేతూత్ప్రేక్ష, వాచకము అప్రయుక్తము గాన గమ్య;

"కేతు ర్గ్రహే ధ్వజే చిహ్నే కిరణోత్పాతవహ్నిషు"-నా.నా. పాంథుఁడనఁగా ఎప్పుడును దారినడచుచుండువాడు,—"పన్థానం నిత్యం గచ్ఛతి" అని విగ్రహము. "పన్థో ణ నిత్యమ్" అని సూత్రము. అట్టివానిభార్య ఎప్పుడును వియోగినియే గదా. అందులోను యువతి యాయెనేని దాని దుఃఖము చెప్పవలయునా? కడమ ఋతువులకన్న వసంతము కామోద్దీపకతరముగాన వసంతమున మదనుఁడు దండెత్తునట్లు కవి రచించినాఁడు—ఇలన్ = ఇలనున్నవారి కగపడుటచేత ఇలందోఁచినట్లు చెప్పినాఁడు, అంతియకాని మీనమేషము లనెడు నక్షత్రరాసులు భూగతములుకావు. ఇట దండెత్తుటయు దహించుటయు క్రమముగా మీనమేషమాసములయందుఁ జెప్పఁబడినవి. పాంథభార్య మీనమాసమంతయు వేచినది. పాంథుఁడు రాఁడాయెను, ఇఁక మేషములోను ఆమెకు దాహముకాక మఱియేమున్నది.

చ. ప్రియ పరిరంభణ ద్రఢిమ పెల్లిఁక నామని వచ్చి చేయుఁగా
వ్యయ మని సీతునంద చెలువ ల్పెదవు ల్తడుపంగ వచ్చెఁ దా
రయమునఁ బేర్చి యా ఋతువు రాఁ జలి విచ్చి తొఱంగి ర య్యవ
స్థ; యుచితమే కదా 'విపది ధైర్య' మనం జనుమాట యింతకున్. 99

ఇఁకన్ = ఇటుతర్వాత, ఆమని = వసంతుఁడు (పా. చైత్రుఁడు), వచ్చి, ప్రియ...ల్లి - ప్రియ = వల్లభులయొక్క - పరిరంభణ = కౌఁగిలింతయొక్క - ద్రఢిమ=బిగువుయొక్క - పెల్లు=అతిశయమును, వ్యయము సేయుఁగా = పోఁగొట్టునుసుమా, అని = అనుభయముచేత, సీతునంద = చలికాలమందే, చెలువల్ = ఇంతులు, పెదవుల్ తడుపంగన్ = దిగులుపడుచుండఁగా (చలికి చీలినపెదవులను నాలుకతో తడుపుకొనుచుండఁగా అనియు), ఆఋతువు = వసంతర్తువు, రయమునన్ = వడిగా, తాన్ = తాను, పేర్చి=విజృంభించి (మలయమారుత కోకిలకూజిత భృంగరావ పుష్పదళంబులతో ననుట,) వచ్చెన్ = అరుదెంచెను, రాన్ = వచ్చినంతట, చలి విచ్చి = భయము తీఱి (చలి లేనందున అనియు,) అయ్యవస్థ = ఆపెదవులు తడుపుచుండునునికిని, తొఱంగిరి = మానిరి, ఇంతకున్ = ఇందులకు, విపది = ఆపదవచ్చినప్పుడు, ధైర్యమ్ = ధైర్యమూనవలయును, అనన్ చనుమాట = అను ప్రసిద్ధసూక్తి, యెంతయున్ = మిక్కిలి, ఉచితమేకదా = యుక్తమేకదా.

తా.—చలికాలములో ఇంతులు 'ఇటుపిమ్మట వసంతర్తువు వచ్చును, చలిచేత నిప్పుడు లభించుచున్న ప్రియగాఢాలింగనములు అప్పటివెట్టదినములలో సడలువడిపోవును', అని భయముచే పెదవులు తడుపుచుండిరి. ఇట్లుండఁగానే ఆఋతువు పూర్ణవిజృంభణతో రానే వచ్చినది. అంతట, ఆ యాపద రాకముందు భయపడినయాయింతులు ఆయాపద వచ్చినపిమ్మట ధైర్యమే అవలంబించి, పెదవులు తడుపుట మానిరి. విపత్తువచ్చినప్పుడు ధైర్య మవలంబింపవలసిన దను సూక్తి కడుదొడ్డదిగదా - శ్లేషోత్థాపితమయిన యర్థాంతరన్యాసాలంకారము.

పెదవులను నాలుకతో తడుపుకొనుట భయముచేతనుం గలుగును. కవి చలికార్యమును భయకార్యముగా చమత్కరించినాడు, చలి వచ్చుట యన భయము తీఱుటయు శీతర్తు వంతమొందుటచే వెట్టదినములు వచ్చుటచే చలిపోవుటయు, ఇట కవి ఋత్వపగమకార్యమును భయాపగమకార్యముగా చమత్కరించినాఁడు.—'పరిరంభణము'-'పరిరమ్భః పరిష్వఙ్గః సంశ్లేష ఉపగూహనమ్'-అమ. 'ద్రఢిమ' దృఢముయొక్క భావము,- నకారాంతము- ఇమని చ్ప్రత్యయాంతము - రూ. ద్రఢిమము_సీతు. రూ. సీతువు, ప్ర. శీత. "ఆహారంబిడుఁ డీతునన్ "-1 (82); "సృష్టబహువ్రణం బయిన సీతునకల్కి"5 (100); వ్యయము సేయు=వ్యయించు; ఆ ఋతువు-"ఋత్వ వర్ణంబులు రల తుల్యంబులు" - బా. వ్యా.—"విపది ధైర్యమ్":—"విపది ధైర్య, మథాభ్యుదయే క్షమా। సదసి వాక్పటుతా, యుధి విక్రమః, యశసిచాభి రుచి, వ్యసనం శ్రుతౌ। ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్" అని సంపూర్ణవాక్యము.

ఉ. సృష్ట బహువ్రణం బయిన సీతున కల్కి నిజోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁ గొన్న దిమ్మధు వి సీయన కింతులు మోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్న యొచ్చె మఱఁ జేసిన, వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొనర్చిరి వసంతున కూఱట దోహదంబులన్. 104

ఇంతులు = మగువలు, సృ...కున్ - సృష్ట = చేయఁబడిన _ బహు = పెక్కు - వ్రణంబు - గాయములుగలది (అనఁగా మోవియందు పెక్కుగాయములు కావించినట్టిది), _ ఐన సీతునకున్ = అయినట్టి చలికి, అల్కి - వెఱచినవారై - నిజ...ముఁ _ నిజ = తమదైన - ఓష్ఠపల్లవ = మోవిచిగురుయొక్క - ఉచ్ఛిష్టమున్ = ఎంగిలిని, ఇమ్మధువు = ఈ తేనె, కొన్నది = అనినది, ఇసీ=ఇస్సీ. అనక = అనిరోయక, మోవిన్ = తమ పెదవియందు, తత్ మధూచ్ఛిష్టమున్ = ఆ తేనెయొక్క యెంగిలి (మైనము ననుట), కొన్నయొచ్చెము = గ్రహించినహీనతను, అఱఁజేసినన్ = (వసంతుఁడు) పోఁగొట్టఁగా, వారు = ఆస్త్రీలు, కృతంబు = వసంతుఁడు చేసినయుపకారమును, ఎఱింగి = చక్కఁగా మనస్సున భావించి, వసంతునకున్ = ఆమనికి, ఊఱటన్ = విశ్రాంతికలుగునట్లుగా, దోహదంబులన్ = పుష్పోత్పాదనక్రియలను, విస్పష్టముగాన్ = స్ఫుటముగా, ఒనర్చిరి = కావించిరి.

తా. చలికాలమున స్త్రీలు పెదవులందు చలివలనిపగుళ్లకు నివారకముగా మైనము పూసికొందురు. మైన మన మధూచ్ఛిష్టము - [మధూచ్ఛిష్టం తు సిక్థకమ్' అమ. 'మయినము' తేనెం గొనఁగా మిగిలిన తేనెపెఱ గావున దానికి మధూచ్ఛిష్ట మని పేరు. "మదనాః సిక్థ ధుత్తూర వసన్తద్రుమ మన్మథాః" - నానా.—"మదన _ పు. ఇదిమైనమునకు ఉమ్మెత్తచెట్టునకును, వసన్తఋతువునకును, మ్రంగచెట్టునకును, మన్మథునకును పేరు." — అని వావిళ్లవారి పాపయశాస్త్రులవారిటీక.] అనఁగా తేనె యెంగిలి, మఱి యా తేనెయెట్టిదన, తాము పానము సేయునపుడు తమ మోవియెంగిలిచే మధురిమం బొందినట్టిది. అట్లు అది తమయెంగిలి దిన్నదై యుండ, దానియెంగిలిం దాము మరల పెదవులందు స్వీకరించుట ఆయింతులకు నిక్కలి లజ్జాకరముగాదా. ఇంతలో వసంతర్తువు వచ్చి చలిని పోఁగొట్టును, మఱి పెదవులు పగులవు; కావున మఱి పెదవులకు మైనముం బూసికో నక్కఱలేదు, ఆవిధముగా మైనమును మాన్పించి, దానిం దాల్చెడు నవమానమును తమకు వసంతుఁడు తప్పించినందులకుఁగాను, వారు కృతజ్ఞత గలవారై అతనికి విశ్రామముకలుగునట్లుగా చెట్లను పూవం జేయుటయనెడి యతనిపనిని, తాము పాద తాడనాదిదోహదములచేత నెఱవేర్చుచున్నారు. అన్యోన్యాలంకారము.—

"అన్యోన్యోపకృతియు యు। నోన్యన్యము కవిచేత నృపతి యయుఁ గవి నృపుచేత." అలం.

"మధు మద్యే పుష్పరసే క్షౌద్రేఽపి" - అమ. ఇంతులు చలికాలమున మోవియందు మైనమురాల్చుటయు వసంతము రాఁగానే మానుటయు ప్రసిద్ధము:—కర్పూరమంజరి ౧-వ జవనికాంతరము.

శ్లో.—"బిమ్బోష్ఠే బహుళం న దదతి మదనం, నో గన్ధతైలావిలా
వేణీ ర్విరచయన్తి, దదతి న తథాఙ్గేఽపి కూర్పాసకమ్,
య ద్బాలా ముఖకుఙ్కుమేఽపి ఘనే వర్తన్తే శిథిలాదరాః
త న్మన్యే శిశిరం వినిర్జిత్య బలా త్ప్రాప్తో వసన్తోత్సవః."

'దోహదంబులన్.'—

"తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం.
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యా చ్చ తత్క్రియా."

ఆ క్రియలు దశవిధదోహదములు:-ఎట్లన:—

"అశోక శ్చరణాఘాతా, ద్వకుళో ముఖసీధునా,
ఆలిఙ్గనా త్కురవకః, సిన్దువారో ముఖానిలాత్,
కరస్పర్శేన మాకన్దః, ముఖరాగేణ చమ్పకః,
గీతాత్ ప్రియాళు ర్నితరాం నమేరు ర్హాసితేన చ"

'ఒచ్చెము' = పొచ్చెము-ప్ర. పుచ్ఛమ్.

మ. మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుంగమ్మ లేగాడ్పుఁదే
రున నేతెంచు లతాంత బాణునకు సూర్యుండు న్మహిం గ్రొత్తగా
ననుకూలించెఁ జలంబున న్విరహిణీప్రాణాపహారంబు సే
యన యూహించు విధాత కృత్య మది యేలా మాను నెప్పట్టునన్? 101

మునుపే = మొదలనే, చంద్రబలంబు = గ్రహసంచారవశమునఁనైన చంద్రబలము-కల్గి=కలవాఁడై (చంద్రమిత్రుఁడగుటచేతను చంద్రునియందు కలవాఁడై అనియు), మల...రునన్ - మలయంపున్=మలయగిరిదైన (మలయగిరినుండి వచ్చుచున్న)-కమ్మ=పరిమళవంతమైన-లేగాడ్పు=మందమారుతమను - తేరునన్=రథమందు, ఏతెంచు లతాంత బాణునకున్ = వచ్చుచున్న పూవిల్తునికి, సూర్యుండున్ = సూర్యుఁడుకూడ, మహిన్=భూమిలో, అనుకూలించెన్=సాయపడెను, (గ్రహగతిచే ననుకూలుఁడాయెను - శిశిర ఋతువునలేని తైక్ష్ణ్యమును ఇప్పుడు పొంది దాహకుఁ డాయెనను టయు), చలంబునన్ = పగపట్టి,-విరహిణీప్రాణ అపహారంబు = వియోగినులయొక్క ప్రాణముయొక్క హరణమును, చేయన = చేయుటకే, ఊహించు విధాత కృత్యము = ఉద్యోగించుచున్న బ్రహ్మయొక్క పని, అది, ఎప్పట్టునన్=ఏ సమయానఁనైనను, ఏలా తప్పున్=తప్పక నెఱవేరును.

తా.—ఏదైనను కార్యము తలపెట్టుకొన్నవారికి గ్రహగతి ప్రకారము చంద్రబలము లేక అది సిద్ధింపదు. ప్రకృతమందు విరహిణీబాధనమునకుం దొడంగిన మన్మథుని నెచ్చెలియగుటంబట్టి చంద్రుఁడు తనబలముతో తోడ్పడుట సిద్ధము.—అదియే గ్రహసంచారరీతిచేత నయిన చంద్రబలముగా నిటం జెప్పఁబడినది. ఇదియుం గాక శిశిర ఋతువునందు సూర్యచంద్రులు మంచుమూలముగా మందప్రకాశులై యుందురు. ఇప్పుడు-అనఁగా - వసంతములో, మంచడంగుటంబట్టి,—చంద్ర

సూర్యులకు తేజ మెచ్చునుగావునను, చంద్రుఁడు వియోగినులను గ్రాఁచువాఁ డగుటంబట్టియు, చంద్రునిబలము మన్మథునికి ఇనుమడి యైనది. ఇట్లు చంద్రసహాయసంపదగలవాఁడై మదనుఁడు విరహిణులపై వారికి దుస్సహ మయినమందమలయానిల మనెడి తేరిని నెత్తావితోడిదానిని ఎక్కి దాడితరలినాఁడు; అట్టి యాతనికి పాపగ్రహమయిన సూర్యుఁడుకూడ, శిశిర ర్తువులో మంద తేజుఁడై యుండినవాఁడు, ఇప్పుడు క్రొత్తగా భూమిలో విరహిణులకు శీతలోపచారములం గూడ ఫలింపనీయని చిచ్చుఱయెండం దాల్చి, తోడ్పడినాఁడు; అట్లు అతఁడనుకూలించుటయు గ్రహసంచారవశముచేత నే; కావున ఆతఁడును గ్రహగతివశమునను తనకార్యముచేతను రెండు తెఱంగులను మన్మథునికి సహాయుఁడే అయినాఁడు. ఇందువలన విరహిణీప్రాణనాశమును దైవము సంకల్పించినాఁ డని స్పష్టముగా తెలియుచున్నది, ఇఁక నది నెఱవేఱక తప్పునా? కావున ఆ కాలమందు ఆ యమ్మవారు అత్యంతమదనపీడ నొంగుచుండినదని విశదము.—ఇట అప్రస్తుతసామాన్యోక్తి ప్రస్తుత విష్ణుచిత్తపుత్త్రీ రూపవిశేషపరముగాన అప్రస్తుత ప్రశంసాలంకారము, దానికి అర్థాంతరన్యాసము అంగముగానున్నది.

'మలయంపు' - గాలి దక్షిణదిక్కునుండి వచ్చుచున్నదనుట....'కమ్మ' - మలయమునందలి చందన ద్రుమములయు నడిమియుద్యానముల నానాపుష్పములయు పరిమళముం దెచ్చుచున్నదనుట,-'లే' - అనుటచే తుషారాదిభారముచేత, మందముగా సంచరించుచున్నదనుట: — అని మలయవాయువునందు వర్ణ్యము లైన శైత్య మాంద్య సౌరభములు చెప్పఁబడినవి.'తేరునన్''తేరన్', అనునవి ఔపవిభక్తికము వచ్చినరూపము, అరుదుగా ఔపవిభక్తికములు అనౌపవిభక్తికములుగానుం బ్రయుక్తము లగుట కలదు:- 'లతాంత'- ''కమ్మనిలతాంతములకు మ్రొనసివచ్చు మధుపమ్ముల సుగీతనినదమ్ములెసఁగెన్-''ఆదిపర్వము. - 'చలంబు'- ప్ర. ఛలమ్. చతుర్థపాదమున ప్లుతయతి.

క. మలయ కట కోటజస్థిత । కలశీసుత సేవ నిట్టు గనెనో తదాశా
నిలుఁ డనఁగ నలసవృత్తిన । మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిన్. 102

మల...వన్ - మలయ = మలయాద్రియొక్క-కటక = నెత్తమందలి - ఉటజ=పర్ణశాలలో-స్థిత=నివసించుచున్నట్టి - కలశీసుత = కుంభసంభవునియొక్క = (అగస్త్యునియొక్క) - సేవన్= శుశ్రూషచేత, తత్ ఆశా అనిలుఁడు=ఆ కుంభసంభువుని దిక్కునుండి వచ్చుగాలి (అనఁగా దక్షిణపుగాలి,) ఇట్లు కనెనో అనఁగన్ = ఈవిద్యను నేర్చెనో అనునట్లుగా, అలస వృత్తిన=మందతతోనే, మెలఁగుచున్=సంచరించుచు, మిహికా జలధిన్=మంచుసముద్రమును, ఆపోశనించెన్= ఆచమించెను (అనఁగా త్రాగివైచెను.)

తా.—మలయమారుతము మెల్లఁగానే వీచుటయు సముద్రమంతటిమంచు మాయమగుటయు నెట్లుండెననఁగా - మున్ను సముద్రమును అరచేతిలోఁ గొని ఆపోశనము పుచ్చుకొన్న యగస్త్యులవారు ఆ మారుతమునకు జన్మభూమి యైనమలయపర్వతము నెత్తమున పర్ణశాలలో నివసించుచుండుటంబట్టి వారియొద్ద ఆ మలయమారుతము ఆ సముద్రపానవిద్యను శుశ్రూషాపూర్వకముగా నేర్చినదై తమ కగపడకయే అవలీలగా ఆ మంచుసముద్రమును ఒక్క గ్రుక్కతో ఆపోశనము పుచ్చుకొన్నదో యనునట్లుండెను.—రూపకానుప్రాణితమయిన యుత్ప్రేక్ష.

''కటకోఽస్త్రీ నితమ్బోఽద్రేః''.— పర్ణశాలోటజోఽస్త్రియామ్'' - ''అగస్త్యః కుమ్భసంభవః-అమ.— అగస్త్యులవారు సముద్రమును అరచేతిలోనికి గ్రహించి త్రాగివైచినకథ ప్రసి

ధము:—"అగస్త్యః పాథోధిం యదకృత కరామ్భోజకుహరే క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే" భోజప్రబంధము. 'అగస్త్యులు మలయవాసి, యనుటకు చూ. 4 (147) టీక.

'ఆపోశనించె'-నామధాతువు-ఆపోశనము-అప్పకవిలో నీక్రిందివి యుదాహృతములు:—

"తత్తరమున నాపోశన మెత్తఁబోయి భూసురుం డెత్తు నుత్తరాపోశనంబు" శృంగారషష్ఠము.

"ఓశశిముఖి లోపాము। ద్రేశుఁడు కలశభవుఁ డుండు నిట నతఁడు తపో
రాశి మహాత్ముఁడుమును పాపోశనముగఁ గొనియె సాగరాంబువు లెల్లన్."-చమత్కారరామా.

'అవశ్యాయ స్తు నీహార స్తుషార స్తుహినం హిమం
ప్రాలేయం మిహికాచాథ హిమానీ హిమసంహతిః' - అమ.

క. మలయతరు న్యాయమ యిలఁ। గల తరువులకెల్లఁ జేయఁగా వలచెఁ జుమీ
యలరించునెపంబునఁ బరి। మళితములుగ ననఁగ నచటి మారుత మొలసెన్. 103

మలయతరున్యాయము - మలయములోని చెట్లగుణమే (అనఁగా పరిమళమే), ఇలన్ గలతరువులకున్ ఎల్లన్ = భూమిలోని చెట్లకన్నిటికిని, చేయఁగాన్ = కావించుటకు, అచటి మారుతము = ఆ మలయపర్వతపు గాలి, వలచెన్ చుమీ = కోరినది సుమా, అనఁగన్ = అనునట్లుగా, అలరించు నెపంబునన్ = చెట్లను పుష్పింపఁజేయు మిషచేత, పరిమళితములు కాన్ = సంజాతపరిమళములు అగునట్లుగా, ఒలసెన్ = వీచెను.

తా.—మలయపర్వత మారుతము—ఆ మలయములోని చందనతరువుల గుణమును అనఁగా పరిమళమును లోకములోని తరువుల కన్నిటికిని కలిగింపం గోర్కి వహించినదో యనునట్లుగా చెట్లనన్నిటిని పరిమళవంతములగునట్లు పుష్పింపఁజేయుచు వీచెను.— దక్షిణమారుతము వీచెను. చెట్లు పూచి పరిమళవంతము లైనవి అని, భా. 'మలయతరున్యాయము' - మలయతరువులు చందనవృక్షములు, చందనములకు కవులు పుష్పములను వర్ణింపరు, "న చ కుసుమఫలే గన్ధసారద్రుమాణామ్," సా. ద. కావున వాని పరిమళము కొయ్యది గాని పువ్వులది గాదు.—'పరిమళితములు'— సంజాతార్థమందు ఇతచ్ ప్రత్యయము, "విమర్దోత్థే పరిమళో గన్ధే జనమనోహరే." - అమ. 'అలరించు' -ప్రేరణార్థకము. కన్ = కాన్ = అగునట్లుగా.

ఉ. కుప్పసము ల్వదల్చి, వలి గుబ్బల నొత్తిరి హత్తి వేగుజా
మిప్ప లలర్చు గాడ్పుల కధీశుఁ, గ్రమంబున ఘర్మ శంక మై
నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి, ఎక్కి రూష్మముల్
దెప్పరమైన లోహాశకటీ ప్రకటీకరణంబుఁ గామినుల్. 104

(ఆ ఋతువునందు), కామినుల్ = వలపుగత్తెలు, వేగుజాము = రాత్రి చరమ యామమున, ఇప్పలు = ఇప్పచెట్లు, అలర్చుగాడ్పులకున్ = పూచెడు తెమ్మెరకు (అనగా ఇప్పలను పూవఁజేసి ఆ పూవుల నెత్తావిని తెచ్చుచున్న వేగుజాము తెమ్మెరలచేత నుద్దీపితకాములై), కుప్పసముల్ వదల్చి = రవికలను ముడి విప్పి యెడలించి, అధీశున్ = కాంతుని, హత్తి = కవ్వి, వలిగుబ్బలన్ = చలువగల కుచములతో (పా. ఇఱిగుబ్బలన్ = క్రిక్కిరిసిన బిగువుకుచములతో), ఒత్తిరి = అదిమిరి (పా. ఒత్తిలి = ఒత్తిగిల్లి), క్రమంబునన్ = కొంతసేపటికి, మైన్ = మేనియందు, ఘర్మశంక = చెమట పోసినదను సందియము, ఉప్పతిలంగన్ = జనింపఁగా, దోమతెరలు = దోమలను లోనికి రానీకుండుటకై మంచముచుట్టును వ్రేలఁగట్టిన తెరలను, ఉప్పరము = పైకి, ఎత్తిరి = వైచిరి,

ఊష్మముల్ = వేఁడి, దెప్పరమయినన్ = గాటము కాఁగా, లోహ శకటీ ప్రకటీకరణంబున్ = ఇనుపబండి (కుంపటిని) ఉపయోగించు కొనుటను, తక్కిరి = మానిరి.

తా.—ఆమనిలో కామినులు ఇప్పచెట్ల నలరంజేసి, వాని పువ్వులపరిమళమును తమవంకకుఁ దెచ్చుచున్న వేగుజాముగాలిచే నుద్దీపితకాములై అలిక సడలించి భర్తను కలిసి వలిగుబ్బలతో నొత్తిరి. ఆ పెనఁకువచేత చెమరుప్పతిల్లె నని శంకించి దోమతెరలను మంచపుమేలుకట్టుపైకి ఎత్తివైచిరి. వేట్టలు గాటములు కాఁగా, మంచముక్రింద ఇనుపకుంపటులను పెట్టుకొనుట మానివైచిరి.—స్వభావోక్తి.

వలిగుబ్బలు—

"కూపోదకం వటచ్ఛాయా తాంబూలం చేష్టకాగృహం
శీతకాలే భవే దుష్ణ ముష్ణకాలే తు శీతలమ్."—

అనునూక్తిప్రకారము ఆమనియందు తరుణీకుచములు చలువగా నుండును.—ఇప్ప వసంతమునం బూచును:—

"తత్తేజ స్తరణే ర్నిదాఘసమయే, తద్వారి మేఘాగమే,
తజ్జాడ్యం శిశిరే, య దేకశరణై స్సోఢం పురా యైర్ద్రుమైః,
ఆయాతోఽప్యధునా ఫలస్య సమయః కోఽయం విపాకై రతి
స్మృత్వా తాని ను చేవ రోదితి గళత్పుష్పై ర్మధూకద్రుమః."

'కుప్పసము'-ప్ర. కూర్పాసః - 'జాము' - ప్ర. యామః - 'శంక' - అప్పుడప్పుడే ఋతువులో నూతనముగా నుప్పతిల్లుటచేత - ఇంక కొన్నాళ్లు జరిగిన, శంక గాదు, నిశ్చయమే కలుగును. - 'ఉప్పరము' - ప్ర. అభ్రమ్ - అని వైకృతదీపిక - 'ఉప్పరము' - ఉప్పరమునకు అని షష్ఠ్యర్థమున ప్రథమ 'లోహశకటి' - చిన్నయినుపబండిగానుండు కుంపటియని యెఱుంగునది; - కుంపటికి చక్రములుండుటకు:—

"కవిమతి రివ బహులోహా సుఘటితచక్రా ప్రభాతవేళేవ
హరమూర్తి రివ హసన్తీ భాతి విధూమానలోపేతా."—భో. ప్ర.

"బండికుంపటి (చిల్కు పరఁగు గొల్లెమనంగ)" ఆం. భా. 'కామినుల్' - అనుట సంభోగేచ్ఛ కలవారని తెలుపుటకు.

మ. అరుణాంశుండు హిమర్తునన్ రజని డీలై క్రుంకి పుష్పర్తువా
సరకల్యోదితుఁ డౌచు మున్న యిడుట న్శ్యామాకుచాలేప సం
కరసాంద్రాగ్ని శిఖారుణప్రభఁ గొనెన్ గాకున్నఁ గాలజ్ఞ
తి రతం బెట్లు చెలంగు మానకుపితస్త్రీ కర్ణసంభోగినిన్. 105

అరుణాంశుండు - అరుణ = ఎఱ్ఱని - అంశుండు = కిరణములు గలవాఁడైన సూర్యుఁడు, హిమర్తువు = హిమఋతువు = చలికాలము, అన్ (అను) రజనిన్ = అనెడి రాత్రియందు, డీలువై = డిల్లపడి, క్రుంకి = అస్తమించి, పు...డు - పుష్పర్తు = పుష్పఋతువు = వసంతకాలము - అనఁగా వసంతము అనెడు - వాసర = పగటియొక్క - కల్య = ప్రాతఃకాలమందు (అనఁగా వసంతారంభమందు) - ఉదితుఁడు = ఉదయించినవాఁడు, ఔచున్ = అయి, మున్న = పూర్వమే (అనఁగా తాను అస్తమించునప్పుడే - అనఁగా చలికాలము మొదలనే), ఇడుటన్ = ఇల్లడ యుంచినందున, శ్యామా...

భఁగన్ - శ్యామా = జవ్వనులయొక్క - కుచ = స్తనములయొక్క, - ఆలేప = కలపముయొక్క - సంకర = మిశ్రమందలి - సాంద్ర = దట్టమయిన - అగ్నిశిఖ = కుంకుమపువ్వనెడి - అగ్నిశిఖా = అగ్నికీలయొక్క - అరుణప్రభఁగన్ = ఎఱ్ఱనికాంతిని, కొనెన్ = మరల స్వీకరించెను, కాక ఉన్నన్ = అట్లు అది రాత్రి తెల్లవాఱుట కానియెడల, మా...లి - మాన = ఈసుచేత - కుపిత - కినిసిన - స్త్రీ = చెలువలయొక్క, - కర్ణ = చెవులకు, దంభోళి = పిడుగు, ఐ, కాల...బు - కాలజ్ఞపత్త్రి = కాలమెఱిఁగిన పక్షియొక్క (అనఁగా కోకిలయనెడు కోడియొక్క) - రుతంబు = కూఁత, ఎట్లు, సెలంగున్ = ఉప్పతిల్లును ?

తా.—ఆసాయము పాటుపడి అలసిసొలసినవాఁడు తనయమూల్యాభరణమును ఆప్తునికడ ఉంచి తెల్లవాఱఁగానే వెండియుం గైకొని ధరించి వెలువడుటయు, మానకుపితస్త్రీలకు వేగుఁతఱి కోడి కూఁత వినఁగా అయ్యో ఈ రాత్రి యంతయు అలుకచేత పొందు పోఁగొట్టుకొంటిమి గదా యని దుఃఖించుటయు, కోకిలకూఁతను వినఁగానే కాముకులకు విరహ ముద్రేకించి కఠోరదుఃఖమునుం గలుగుటయు, కామినులు చలికాలమందు కుచములకు కుంకుమతోడి యంగరాగమును ధరించుటయు, వసంతము రాఁగానే యంగరాగమును కుంకుమను మానుటయు. వేగుఁతఱిని కోళ్లుకూయుటయు, వసంతము రాఁగానే కోకిలలు కూయ నారంభించుటయు ప్రసిద్ధములు: సూర్యుఁడు చలికాలమందు మందతేజుఁడై యుండి, వసంతము రాఁగానే మరల స్ఫుటతేజస్కుఁ డగుటయు, దినాంతమందు తనతేజస్సును అగ్నియం దుంచుటయు శాస్త్రసిద్ధములు.— ఈ వృత్తము లిట నుపజీవింపఁబడి యున్నవి. అట్లే అరుణకిరణుఁడైన సూర్యుఁడు శరత్కాలమనెడి పగలెల్ల దీపించి యలసి శీతర్తువనురాత్రియెల్ల నిద్రితుఁడై, వసంత మనెడి పగటియొక్క వేకువను మేల్కొన్న వాఁడై శరత్తను పూర్వదినము కడపట తాను నిద్రింపఁబోవుచు చామలపాలిండ్ల కలపమందు ఉంచిన కుంకుమ యనెడి వహ్నిజ్వాల యొక్క యరుణతేజమును మరలం బుచ్చుకొని దీపింపం దొడంగెను. అట్లు వసంతారంభము వేకువ ప్రొద్దు కాదనఁగూడదు, అది యా వేకువప్రొద్దే యనుటకు మానకుపితయువతులకు కర్ణకఠోరముగా అప్పు డుప్పతిల్లుచున్న కోకిలరుత మనెడి కోడి కూఁతయే తార్కాణము. రూపకము, తదుత్థాపితమైన యనుమానంబును.

'హిమర్తువు' - హిమమును చలియు హేమంతశిశిరముల రెంట నుండుకు గావున ఇట హేమంత శిశిరఋతువులు రెండును గ్రాహ్యములు. 'డీలై' - డీలగుట క్షీణమేని విరామములేని సంచారముచేత, పా. (రజనిఁ) దీలై, "సదా చరతి ఖే భానుః",-"భాను స్సకృ ద్యుక్తతురఙ్గ ఏవ".—

"మొగ్గ డొంకెఁ గుంటెఁ దగ్గెఁ దీలయ్యెను। స్రగ్గ మూడిఁగె డొంగ సమసె సుక్కెఁ
గ్రుంగె డస్సె డిందెఁ గుదిసెఁ దూలె నణంగె। నవఁగఁ దగ్గనుట యలరు సభవ." ఆం. భా.

'పుష్పర్తు'- 'వసన్తః పుష్పసమయః సురభిః'. 'ఘస్రో దినాహనీ వా తు క్లీబే దివసవాసరౌ' 'ప్రత్యూషో ఽహర్ముఖం కల్యం' అమ. 'శ్యామా' - "శ్యామా షోడశవర్షా స్త్రీ" - నానా.-లక్షణముచేత తగునీమాత్రమునకు పేరు. 'అగ్నిశిఖ' - "అ థాగ్నిశిఖ ముద్దిష్టం కుసుమ్భే కుఙ్కుమే ఽపి చ"- మేదిని. అరుణాంశుఁడు గావున అరుణప్రభ నుంచినాఁడు, అరుణప్రభనే పుచ్చుకొన్నాఁడు; సాయం ప్రాతస్సమయములందు సూర్యుఁడు ఎఱ్ఱగా నుండును గాన అరుణ యనుట; మఱియు విశేషము ఏమన శ్యామలు చలికిఁగాను కుంకుమపూవుల యంగరాగమును కుచములయందు చలికాలములోనే తాల్తురు.

''ప్రాలేయశైలశిఖరానిలసంప్రయోగః। ప్రోత్ఫుల్లకుందమకరందహృతాలిబృందః
కాలోఽయ మాపతతి కుక్కుటపక్కపిఙ్గ। ప్రోత్తుఙ్గరమ్యరమణీకుచ సఙ్గయోగ్యః.'' సు.ర.భా.

అమని రాఁగానే మానుదురు గావున, కుంకుమ మానవప్పుడు దాని యరుణప్రభయు దానితో పోయినదేగావున. అపోకనే సూర్యుఁడు వెండియుం గైకొనుటగా కవి వర్ణించినాఁడు. ''సౌరం తేజః సాయ మగ్నిం సంక్రమతే। ఆదిత్యో వా అస్తం యన్నగ్ని మనుప్రవిశతి। అగ్నిం వా ఆదిత్యః సాయం ప్రవిశతి'' అని శ్రుతి.

''స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ।
దినాన్తే నిహితం తేజ స్సవిత్రేవ హుతాశనః.'' రఘువు.

ఆకారణముచేతనే అగ్నికి పగలు లేనితేజము రాత్రి కల్గునని యుక్తి. 'కాలజ్ఞపత్రి'-కోడి జాముజామును ఎఱిఁగి తదంతములందు కూయుట విదితమే. కోకిలయు వసంతమునందు కూయుచుండు:-

''కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః।
వసన్తే సముపాయాతే కాకః కాకః పికః పికః.''__

అది రాఁగానే కూయుటచే అదియు అకాలమును ఎఱిఁగినదనియే తలంపవలయును. ''కాలజ్ఞౌ పికకుక్కుటౌ'' శాశ్వతుఁడు. వేగుతఱిని కుక్కుటరుతము కాంతుని కౌఁగిలిని విడిచిపోవలసినదని కాంతను హెచ్చరించును.__

''అయి విజహీహి దృఢోపగూహనం, త్యజ నవసంగమభీరు, వల్లభం,
అరుణకరోద్గమ ఏష దృశ్యతే, వరతను, సంప్రవదన్తి కుక్కుటాః.''_జానకీహరణము.

కోకిలరుతము స్త్రీలకు విరహతాపముం బెంచి మానభంగము గావించును.__

''చూతాఙ్కురాస్వాదకషాయకణ్ఠః। పుంస్కోకిలో యన్మధురం చుకూజ
మనస్వినీమానవిఘాతదక్షం। తదేవ జాతం వచనం స్మరస్య'' - కుమారసంభవము.

తే. మృగమదాలేపమును మానిరగరుకలనఁ। జన్నుఁగవ మీఁదికొప్పిరి బన్నసరము,
నొంటికురువేరు పోఁచకుఁ గంటగింప। గైరి తుఱుమెడు సరపువ్వులం దతివలు.

అతివలు = స్త్రీలు, అగరుకలనన్ = అగరుమైపూఁతవలన, మృగమద ఆలేపమును = కస్తూరి మైపూఁతను, మానిరి = వదలివైచిరి, చన్నుఁగవమీఁదికిన్, బన్నసరమున్ = ముత్యాలపేరును, ఒప్పిరి = అంగీకరించిరి. తుఱుమెడు సరపువ్వులందున్ = కొప్పులో చెరువుకొనుటకై దండగాఁ గ్రుచ్చిన పువ్వులనడుమ, ఒంటి కురువేరుపోఁచకున్ = ఒక్కటే కురువేరుపోఁచకు, కంటగింప గైరి = అప్రియపడకుండిరి.

తా.__స్త్రీలు పూర్వము చలికాలమందు నెచ్చఁదనమునకై సేవించుచున్నవానిని ఇప్పుడు మాని, సమశీతోష్ణములను దాల్పందొడంగిరి. అందువలన అగరుచందనముతోడి కలపమును అలందందొడంగి, కస్తూరికలపమును మానిరి; చన్నుఁగవమీఁద శిశిరర్తువులో మానిన ముత్యాలపేరును ఇప్పుడు వసంతమున తాల్ప నిచ్చగించిరి; తుఱుములోఁ దాల్చు పూదండలలోపల కురువేరుపోఁచను ఇంచుక చేర్చుకొనుటకు అప్రియపడగైరి.__స్వభావోక్త్యలంకారము.

'కంటగింపగైరి'-ప్రియపడిరనక ఇట్లు చెప్పుట అది సురభిశీతమయినను పోఁచయగుటచేత. అందువలననే ఒక్కపోఁచనే చేర్చుట. అట్లే ఒప్పిరనుట యర్ధాంగీకారమును తెలుపుచున్నది. అందులకు కారణము ఎండ లింకను ముదురమియే.__'కంటగించు' - ప్ర. కంటకము (తెటూలునం గలిగిన యప్రీతికనోమహర్షణము కలుగును;)-'సరపువ్వులు'-'దిన వెచ్చము' నంబోలె మాలాపము.

"మృగనాభి ర్మృగమదః కస్తూరీచ" - అమ. - 'అగరు' - రూ. అగురు:—

"అగురు రితి వదతు లోకో। గౌరవ మత్రైవ పున రహం మన్యే

దర్శితగుణైవ వృత్తి। ర్యస్య జనే జనితదాహేఽపి" - సు. ర. భా.

చ. చిలువసుధారసాధరల చెల్వపుఁ బుక్కిటితావిఁ దీయ నై,
వలపుల నందు తత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొఱ్ఱ నై,
వెలువడి తద్గుణద్వితయ వేధఁ జుమీ యన మ్రానుపట్టుటల్
తలిరులు పుట్టుటల్ గలుగఁ దార్కొనెఁ జందనశైలవాతముల్. 107

చందనశైలవాతముల్=మలయమారుతములు, చిలు...విన్ - చిలువ సుధా రస అధరల = అమృత రుచితోడి యధరోష్ఠముగలవారైన త్రాచుకోమలులయొక్క - చెల్వపు=మనోజ్ఞమైన - పుక్కిటితావిన్ = పుక్కిళ్లయొక్క పరిమళముచేత, తీయన ఐ=మాధుర్యము కలదై, వలపులన్ = ఆనాగాంగనల తీయని పుక్కిటితావిలోని పరిమళములను, అందు = అనుచున్న - తత్...ష్మన్ - తత్ = ఆనాగాంగనలయొక్క - ప్రియుల=వల్లభులయొక్క - వక్త్ర = నోటి-విషజ్వాలలయొక్క - ఊష్మన్=వేఁడిచేత, ఒఱ్ఱన ఐ=కారపురుచిం బొందినదై, వెలువడి=అగందపుఁ గొండనుండి తరలి, తత్ గుణ ద్వితయ వేధన్=ఆ రెండుగుణములను సోఁకుట, చుమీ, అనన్=అనునట్లుగా, మ్రాను పట్టుటల్ = ఆకులు రాలి చెట్లు మోడులగుటయు, తలిరులు పుట్టుటల్ = చిగుళ్లుపొడముటయు, కలుగన్=సంప్రాప్తించుచుండఁగా, తార్కొనెన్=సమీపించెను.

తా.—చందనశైలవాయువులు వీవందొడంగుడు, చెట్లు ముందున్నయాకులు రాలిపోవుటచే వట్టిమ్రాడులగుటయు చిగిర్చి పొంపొందుటయు ఎట్లున్న దనఁగా, ఆవాయువులు చందనశైలమందలి చందన వృక్షములయందున్న యాఁడుఁబాముల యమృతరసములమోవినుండి వాని పుక్కిళ్లపరిమళముచేత తీపొంది, ఆపరిమళమును తమ ప్రియులపుక్కిటి దగుటచేత తమితో నానిన వానియనుంగుమగలయిన పాములనోటి విషజ్వాలలచేత కారమై, ఈరెండుగుణంబులతో ఆచెట్లకు సోఁకుటచే ఆ చెట్లయందు పూర్వోక్తమయిన యారెండుకార్యములు అనఁగా ఆకులు రాలుటయు తలిరులుపెట్టుటయుం గలిగెంజుమీ యనునట్లుండెను.—హేతూత్ప్రేక్ష.

చందనశైలము మలయమే, అయినను ఇట మలయమనక చందనశైల మనుట వక్ష్యమాణ సర్పములు ఆ తరువులయందలి వని తెలుపుటకు:—"గందపుమ్రానితావి గొనఁగాఁ బెనగొన్న భుజంగికైవడిన్ -" జై. భా.

"మూలం భుజఙ్గైః, శిఖరం ప్లవఙ్గైః, శాఖా విహఙ్గైః, కుసుమాని భృఙ్గైః,
నా స్త్యేవ త చ్చన్దన పాదపస్య, య న్నాశ్రితం సత్త్వవరైః సమన్తాత్."

ఈపద్యమున కారణములను చెప్పినక్రమమున కార్యములను చెప్పలేదు. తలిర్చుట అధర సుధా కార్యము, మ్రోడులగుట విషజ్వలనోష్మకార్యము, ఇందువలన నిట యథాసంఖ్యాలంకారము తప్పిపోయినది.

మ. మదనస్యందనతా స్వవృత్తిఁ దెలిపెం బాటీర భూభృద్వల
న్మృదువాతం బతిపక్వ పాదప లతా వృంతావళీ మూల రం
ధ్ర దళ త్పంకజకర్ణికాగణ హరిద్రాభంగ భా భాసుర
చ్ఛదన చ్ఛద్మవివర్తి కాంచన కన చ్చక్రచ్ఛటాచీత్కృతిన్. 108

పా...బు - పాటీరభూభృత్ = చందన శైలమునుండి (అనఁగా మలయపర్వతమునుండి) వలత్ =సంచరించుచున్న - మృదువాతంబు = మందమారుతము, అతి...తిక్ -అతిపక్వ = మిక్కిలి పండినట్టువంటి-పాదప = చెట్లయొక్కయు-లతా = తీఁగలయొక్కయు-వృంత=తొడిమలయొక్క-ఆవళీ = సమూహములందలి - మూలరంధ్ర (తమకు అనఁగా ఆకులకు) మూల=పుట్టుతావు లైన-రంధ్ర=గండ్లనుండి-దళత్ = కూడిపోవుచున్న (ఆకులకు విశేషణము) - పంకజకర్ణికా = తామర దుద్దుల - గణ=సమూహముయొక్కయు - హరిద్రాభంగ = తునియించిన పసుపుయొక్క తునియల యొక్కయు-భా=కాంతితో - భాసుర = ప్రకాశించుచున్న-ఛదన=ఆకులనెడి - చద్మ=మిషచేత-వివర్తి = సుడియుచున్న-కాంచన = బంగారముయొక్క-కనత్ = ప్రకాశమానమైన-చక్ర=బండికండ్లయొక్క (అనఁగా ప్రకాశమానమైన బంగారపు బండిగండ్లయొక్క) - ఛటా=సమూహముయొక్క - చీత్కృతిక్ = చీత్కారముచేత, మద...త్తిక్ - మదన = మన్మథునియొక్క-స్యందనతా=రథత్వమునందలి - స్వ=తనయొక్క (అనఁగా మలయానిలముయొక్క) - వృత్తిక్ = వ్యాపారమును, తెలిపెక్ =వెల్లడిచేసెను.

తా.—చందనశైలమునుండి వీతెంచుచున్న మందమారుతము-చెట్లనుండియు తీఁగలనుండియు తమతొడిమలగండ్లనుండి యూడి, తామరదుద్దుల కాంతితోను, పసుపుఁగొమ్మును విఱిచిన విఱుపులో మెఱసెడి కాంతితోను, ప్రకాశించుచున్న-పండుటాకులనెడు బంగారపు బండిచక్రముతో గిఱగిఱసుడియుచుం జేయుచున్న చీత్కారశబ్దముచేత - తాను మదనునికి రథమయిన తనవ్యాపారమును చాటుచున్నట్లుండెను. కైతవాపహ్నవోత్థాపితగమ్యోత్ప్రేక్ష. నిదర్శనాసంసృష్ట. పంకజకర్ణికా హరిద్రాభంగముల భా చందనమందు చెప్పఁబడినది గావున పదార్థవృత్తినిదర్శన.

వ. తదనంతరంబ. 109

మలయమారుతము మదనునిరథ మని కవిసమయము; కామోద్దీపకము గావునను, దాని సుళ్లు చక్రములవలె నుండును గావునను, అట్లు సమయ మేర్పడినది.

“ధనుః పౌష్పం, మౌర్వీ మధుకరమయీ, పఞ్చ విశిఖాః,
వసన్తః సామన్తో, మలయమరు దాయోధనరథః,
తథా ప్యేకః సర్వం హిమగిరిసుతే, కామపి కృపా
మపాఙ్గాత్తే లబ్ధ్వా జగ దిద మనఙ్గో విజయతే.” సౌందర్యలహరి.

పా. ‘స్యందనిత’=స్యందనముగాఁ జేయఁబడిన-నామధాతువు-నిష్ఠాంతము.— ‘స్వవృత్తి’-చక్రభ్రమణముచే సంచరించుట, అతిపక్వము లగుటచేత తమంతట యూఁడినవి. బంగారువన్నెనుం బొరసినవి. ‘కాంచనచక్ర’-లక్ష్మీపుత్రునికి లేనిసిరి మఱియెవరి కుండును? శ్రీమంతుఁడు గావున తనబండికి బంగారుచక్రములు చేయించుకొన్నాఁడు.—‘చీత్కృతి’-బండి నడచునప్పుడు చక్రములలో గల్లు చప్పుడు, కందెన లేమిచే నగు కిఱ్ఱుశబ్దము గాదు.

సీ. ధ్మావశారక్తరాంకవ, మరణ్యానీమ। ధూమాది తారుణిమ, వల్లుల్యపగరసని
కోద్గతి, తరుగరుత్మద్గరుద్గణము, క్రీ। డాహార్యజీమూత రోహితంబు,
నవమిళిందప్రాహుణకనిమంత్రణ శోభ। నాకుతప్రతతి, వాయస విభక్త
పరభృతౌఘప్రాప్త పత్త్రిక, మాలతీ। గ్రాసామయావహార్ద్రికుతజము,

తే. ప్రమదవన వనదేవతా సముదయాంగ। రాగ, మినజ హారిజ్జగ త్ప్రాణ శాణ
కషణదళితదళాంతసంక్రాంత కాంతి। ఘనమణిశిలాక, చిగురాకుగలయ మొలిచె.

చిగురాకువర్ణనము. (1) క్ష్మా...ము_క్ష్మా=భూమియనెడి-వశా=పిడియేనుఁగుయొక్క - రక్త=ఎఱ్ఱని_రాంకవము=బూర్నీసు, అర...ము - అరణ్యానీ=మహారణ్యమనెడి సుందరియొక్క-మధు=చైత్రమాసమనెడి - మధు=సురచేత - ఉదిత=జనించిన - అరుణిమ=ఎఱుపు, వ...తి - వల్లి=తీఁగలనెడి - ఉరగ=పాములయొక్క - రసనికా=నాల్కలయొక్క - ఉద్గతి=వెలికి నిగుడుట, (2) తరు...ము-తరు=చెట్లనెడు_గరుత్మత్=గరుడులయొక్క - గరుత్=ఱెక్కలయొక్క - గణము=సముదాయము, క్రీడా...బు - క్రీడా ఆహార్య=క్రీడా పర్వతము లనెడి - జీమూత=మేఘములయొక్క - రోహితంబు=కొరడు, (3) నవ...తి-నవ=క్రొత్త (గావచ్చిన) - మిళింద=తుమ్మెద లనెడి-ప్రాహుణక=అతిథులయొక్క (అతిథులను) - నిమంత్రణ=భోజనార్థము రమ్మని యిచ్చెడు-శోభన=మంగళమైన-అక్షత=పగులని బియ్యపుగింజలయొక్క - ప్రతతి=సమూహము, (4) వా...క_వాయస=కాకుల నుండి-విభక్త=వేఱుపోయిన, పరభృత=కోయిలల_ఓఘ=సమూహముచేత - ప్రాప్త=పొందఁబడిన-పత్త్రిక=విభాగలేఖము, మా...ము - మాలతీ=జాజికి - త్రాస=భయమనెడి - ఆమయ=వ్యాధిని - ఆవహ=కలిగించెడు - ఆర్ద్రీకృతజను=పచ్చిరక్తము. ప్ర...ము - ప్రమదవన=అంతఃపురోద్యానముల-వనదేవతా=వనదేవతల-సముదయ=సమూహముయొక్క -అంగరాగము=మైపూఁత, ఇన...క-ఇనజ=సూర్యపుత్త్రుఁడయిన యముని-హారిత్=దిక్కైన - జగత్ప్రాణ=గాలియనెడి - శాణ=సానచేత - కషణ=ఒరపిడిచేత - దళిత=ఊడిపోయిన - దళ=(పండిన) ఆకులనెడు - దళ=పేటులయొక్క - అంత=నాశముచేత - సంక్రాంత=కూడుకొన్న - కాంతి=తేజుగల - ఘన=గొప్ప - మణిశిలాక=రత్నపుఁగోపు. (అయినట్టి) చిగురాకు. కలయ=ఎల్లెడలను, మొలచెను.

తా.—భూమి యనెడి యేనుఁగునకు ఎఱ్ఱకంబళియు, మహారణ్యమనెడి విలాసినికి మధుమాసాగమన మనెడి మద్యపానముచేతనయిన యారుణ్యంబును, తీఁగలనెడి పాములు క్రోయుచున్న నాలుకలును, చెట్లనెడి గరుత్మంతుల ఱెక్కలసమూహములును, క్రీడాపర్వతము లనెడి మేఘముల యందలి తిన్నని యింద్రధనుస్సులును, క్రొత్తగా వచ్చిన తేంట్లనియెడు నతిథులకు (మకరంద) భోజనమునకు రమ్మని పిలుచుచు ఇచ్చెడి మంగళాక్షతలు, కాకులతో వేర్లుపోయిన కోకిలలకు విభాగపత్త్రికలు, మాలతిని జడిపించుటకుఁ బోసిన పచ్చిరక్తమును, ప్రమదవనములందలి లేక ప్రమదవనము నెడి వనదేవతలు ధరించిన మైపూఁతలు, దక్షిణానిలము నెడు సానం బెట్టఁగా, పండుటాకు లనెడు పైపై పేటులు ఎగిరిపోఁగా, వన్నెమీఱిన పద్మరాగశలాకలును, అయినట్టి చిగురాకులు ఎక్కడఁ జూచినను పొడసూపినవి. మాలాపరంపరితరూపకము.

'వశా' - ఆఁడేనుఁగుం జెప్పట క్ష్మా తో నేకలింగతకొఱకు, "గోత్రా కుః పృథివీ పృథ్వీ క్ష్మా వని ర్మేదినీ మహీః", - "కరిణీ ధేనుకా వశా"-అమ. 'రాంకవము' = రంకుసంబంధ మైనది - రంకు వనఁగా_హరిణవిశేషము, దాని బొచ్చుతో నేసినదనుట.—'రాఙ్కవం మృగరోమజమ్' - అమ.

"కృష్ణసార రురు న్యఙ్కు రఙ్కు శమ్బర రౌహిషాః।
గోకర్ణ పృషతైణర్శ్య రోహితా శ్చమరో మృగాః" - అమ.

అరణ్యానీ - 'మహారణ్య మరణ్యానీ' - అమ. మధు -

"మధు క్షౌద్రే జలే క్షీరే మద్యే పుష్పరసే మధుః।
చైత్రే దైత్యే వసన్తే చ జీవాశోకే మధుద్రుమే" - విశ్వః.

అరణ్యానీశబ్దగత స్త్రీలింగముచేత స్త్రీత్వము భావనీయము. సురాపానముచే మొగము మెఱుఁగు బాఱుట ప్రసిద్ధము.—"క్రోధః ప్రద్ధవపు ర్మదః" - కా. క. ల.—

"గణ్డభిత్తిషు పురా సదృశీషు। వ్యాజ్ఞి నాజ్ఞితదృశాం ప్రతిమేనుః
దావపాటలితకాన్తిషు పశ్చా। ల్లోధ్ర మార్ధతిలకాకృతి రాసీత్." మాఘము ౧౦ (౩౧).

వసంతము రాఁగానే కోకిలకూఁతలచేత కోకిలలును కాకులును వేఱుపడును.

'రసనికా'-రసనా-'రసజ్ఞా రసనా జిహ్వా'-అమ. గరుత్మంతుఁడు ఎఱుపు:—"కుంకుమా ఙ్కితవర్ణాయ కున్దేన్దుధవళాయ చ। విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః."

'ఘన జీమూత ముదిర జలముగ్ధూమయోనయః' "ఇన్ద్రాయుధం శక్రధనుస్తదేవ ఋజు రోహితమ్,"-అమ. "కొరడన రోహితంబు దోఁచు" - ఆం. భా.

ప్రాహుణక = ప్రాఘుణక = ప్రాఘుణిక = ప్రాఘూర్ణక = ప్రా[illegible]ర్ణక = ప్రాఘుణ; శోభనము గావున ఎఱ్ఱనియక్షతలు. వృక్షాదులు తుమ్మెదలకు చిగుళ్లనొసంగుచు, పిమ్మట పుష్పరసమును భుజింపం బెట్టునని భావము.—"ఆవేశికః ప్రాఘుణికః ఆగన్తురతిథిస్తథా"-హలాయుధుఁడు. "ప్రాఘుణికస్త్వతిథిర్ద్వయోః", - త్రికాండశేషము.—'నవ' - అతిథి క్రొత్తవాఁడుగా నుండవలయును, 'వనప్రియః పరభృతః కోకిలః పిక ఇత్యపి,' 'సుమనా మాలతీ జాతిః,' 'రుధిరేఽసృగ్లోహితాస్ర రక్త క్షతజ శోణితమ్,' అమ. జాతి వసంతమునందు పూవదని కవిసమయము-"నస్యాజ్జాతి ర్వసన్తే"-సా. ద. మెండు రక్తము కనిన భయజ్వరము కలుగుట సహజము. ఎక్కడను అది పూవకుండుటకై ఎల్లెడలను నెత్తురులు చల్లఁబడినవి.—'ఆర్ద్ర'-పచ్చిరక్తమైన అప్పుడే ఎల్లెడలను చావు నంపు లగుచున్నవి గాన తాను తలవాఁచిన తనకును వెంటనే మృతి కలుగునని భయపడును; 'స్యాదేవ ప్రమదవన మన్తఃపురోచితమ్.' అమ. ఈవిశేషణములు జాత్యేకవచనము లని యరయునది. 'మణి'-సామాన్యగ్రహణంబున రత్నములకు ఎఱుపువర్ణమే.—చూ. 144 టీక. ఇట ప్రకరణవశంబున లక్షణచే పద్మరాగమునే గ్రహింపవలయును. విభాగపత్రికను మాధ్యవర్తులు మంగళార్థమై కుంకుమ పూసి యిత్తురు. అంగరాగము చందనకుంకుమాదిమిశ్రమగుటంబట్టి యెఱ్ఱగా నుండును.

తే. శరనిధుల మాఘ్యములు వీఁగా మరున, కిట్టి
యనరున జయింతు మని కదా యద్దినాళిఁ
గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ దద్వైరిఁ గనియుఁ
బెద్ద లివురాకుఁ బట్టెన పెట్టువడిరి. 111

మరునకుఁ=మన్మథునికి, శరనిధులఁ = అమ్ములపొదులయందు, మాఘ్యములు = మొల్లలు, వీఁగా=వ్యయమై పోయినవి (మాఘ్యము లనఁగా మాఘమాసము నుండునవి, అనఁగా శిశిర ఋతువు నందుండునవి, వసంతమం దుండవు), ఇట్టియనరునఁ = ఈ సంకటమునందు (ఆయుత్తమ బాణము లేని యిబ్బందిసమయమందు), జయింతుము=(దీనిచేత మన్మథుని) గెలుతుము, అని కదా= అను కోరికచేతఁ గదా, పెద్దలు అద్దినాళిఁ=మాఘ్యములుండని యామధుమాసదినములలో, క్రూరతిథిఁ=మహామాంసవిక్రయములు ప్రాణిబలులు ఇత్యాదిక్రూరవిధానములకు ఏర్పడిన తిథియైన, కృష్ణరజనిఁ=కృష్ణచతుర్దశీరాత్రియందు, తద్వైరిఁ=ఆమన్మథునికి వైరియైన శివుని, కనియుఁ= దర్శనము చేసికొనియు, ఇగురాకుఁ బట్టెన=చిగురుటాకనెడి పలకచేతనే, పెట్టువడిరి=దెబ్బ తినిరి.

తా. — కుందములు మాఘమాసమందు పూచునవి. మాఘఫాల్గునములు శిశిరర్తువు. ఆవెంబడి చైత్రవైశాఖములు వసంతర్తువు. వసంతర్తువున కుందము లుండవు. కుందములు అనఁగా మొల్లలు, అవి మదనునికి జయప్రదములైన యుత్తమబాణములు; అవి లేనప్పుడు, అనఁగా వసంతదినములలో సాధనహీనుఁ డయినమన్మథుని తాము జయింపవలయు నని, పెద్దలు ఇక్కట్టులోని వైరిని జయించుట నీతి శాస్త్రోపదిష్టము గావున. అట్లే అందులకు ఉపాయముగా తాము కోరిన యాజయము క్రూరకృత్యము గాన క్రూరోద్యమములకు సిద్ధిప్రదమై ప్రాణిబల్యాదివిధానములచే క్రూరమయిన కృష్ణచతుర్దశి యైన శివరాత్రియందు ఆ మదనుని వైరియైన శివునిదర్శనము చేసికొనిరి. ఎప్పుడును వైరికివైరి యైనవాఁడు తనకు మిత్త్రుఁడు గదా. అందులో ఈవైరివైరి ఆమదనుని జయించినవాఁడు కూడ. ఇట్లు ఆదేవుని యనుగ్రహమున అనుకూల్యమును వారు పడసినను, పిమ్మట వసంతము రాఁగా, అతనికి కుందములు లేకపోయిన నేమి? అతని ప్రభావము అవ్యాహతము. అతఁడా వసంతమందు చిగురాకుఁబట్టెతోనే ఆపెద్దలకు పెట్లు పెట్టి తనయాజ్ఞలో నిలిపినాఁడు. వసంతమందు చిగురాకు అతి కామోద్దీపకముగా నుండినది, అని భావము. — విషాదనాలంకారము.

'అలరారు విషాదన మై । వెలయింపఁగ నిష్యమాణవిపరీతాప్తిన్

ఎలుక యొకఁడు భక్ష్యేశ న । హాలుబుట్టం గొరికి వాని కోగిర మయ్యెన్ ' అలం.

'శరనిధులు'-''దేవం వన్దే శరధిశరధిమ్'' అని శివస్తుతి. ''ఇషుధి.'' కి పర్యాయము 'శరధి' (శరనిధి) బహువచనముచేత మాఘ్యములు సత్తిగా లేనని సూచన. — 'మరుఁడు' - ప్ర. స్మరః- 'అనరు'-పా. 'అడరు' — 'పట్టెన' - పలకతోనె-తాటికమ్మతో గొడ్డను బాదినట్లు బాది పెద్దలపాగ రణఁచినాఁడని ధ్వని. — అపజయము అంత యవమానము గాదుగాని గొడ్డవలె కొట్టుపడుట అత్యంతావమానము; వారి యుద్యమమునకు ఫలముగా అది కలిగినదనియు ధ్వనితము. 'మాఘ్యం కున్దమ్'- అమ. పా. 'అడరునన్ '-ఈశబ్దమునకు శ. ర. లో ఆధిక్యము అర్థముగా నున్నది. మరునికి సాధనహీనత కలుగుటయే పెద్దలకు అధిక్యము, ఆయాధిక్యము తమకుఁ గలిగిన యా దినములయందు అని గ్రహింపవచ్చును.

తే. అవని నపుడు నవోదితుం డైన యట్టి। మరునకుం గుసుమర్తువ మ్మంత్రసాని
బొడ్డుగోసిన కొడవలి వోలె విరహి। దారకం బయ్యెఁ గింశుక కోరకంబు. 112

అపుడు=ఆ చైత్రమాసమందు, అవనిన్=భూమిలో, నవోదితుండు-నవ=నూతనముగా=ఉదితుండు=పుష్పాయుధసమృద్ధిచేత అభ్యుదయము నొందినవాఁడు (జనించినవాఁడనియు), ఐన=ఐన యట్టి - మరునకున్=మన్మథునికి, కుసుమఋతువు = వనకారు, అను మంత్రసాని=సుఖముగా ప్రసవింప నుపాయము చేసెడి చికిత్సకురాలు, బొడ్డుకోసిన - కొడవలివోలెన్ = కొడవలి యనునట్లు, కింశుకకోరకంబు=మోదుగుమొగ్గ, విరహిదారకంబు=వియోగులను కోయునది, అయ్యెన్.

తా. — అప్పుడు భూమిలో క్రొత్తగా పుష్పశరసమృద్ధిచేత నైన యభ్యుదయ మనెడి జననమును పొందిన - (అనఁగా అభ్యుదయములో అప్పుడే పుట్టిన) మన్మథశిశువునకు పుష్పర్తువనెడి మంత్రసాని బొడ్డుకోసిన కొడవలియో యన మోదుగుమొగ్గ వియోగులగుండెలను కోయం దొడంగినది, అనఁగా వారికి దుస్సహతాపమును కలిగించినది. — రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

శిశువు జనింపఁగానే బొడ్డుగోయుట ప్రసిద్ధము. మోదుగుమొగ్గ కొడవలియుంబోలె వంపుగానుండును. — ''కలికా కోరకో ఒ స్త్రియామ్''-అమ. ఈకుసుమము నిర్గంధము. — అప్పుడే కోసినందున నాళరక్తముచే తడిసి యెఱ్ఱగా నున్నదని భా.

"రూపయౌవనసంపన్నా విశాలకులసంభవాః।
విద్యాహీనా న శోభన్తే నిర్గన్ధా ఇవ కింశుకాః." హితోప.

'కొడవలి'-కత్తితో కోయు నొప్పికన్న కొడవటితో కోయు నొప్పి హెచ్చు. శిశువునకు నాళమును చెఱకు్కని కోసివైచుట గాన నొప్పి తెలియదు.-"పలాశే కింశుకః పర్ణో వాతపోథః"-అమ. పలాశకుసుమమును కాళిదాసు వక్రతను శోణతనుం బట్టి నఖక్షతమునకు పోల్చినాఁడు.

"బాలేన్దువక్రాణ్యవికాసభావాత్ । బభుః పలాశాన్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం । నఖక్షతానీవ వనస్థలీనామ్" - కుమార.

"పలాశముకుళిభ్రాన్త్యా శుకతుణ్డే పతత్యళిః । సోఽపి జమ్బూఫలభ్రాన్త్యా తమళిం హర్తుమిచ్ఛతి"
అని యొకకవి దానిని చిలుకముక్కునకుం బోల్చినాఁడు,

చ. కుసుమము లెల్లఁ గామినుల కొప్పుల నుండ నటుండ లేమి సి
గ్గునఁగఁగ వంగినట్లు జనియించె ననల్మతి వంగి, జీవితే
శ సమితి గొమ్ములం గరఁచి చల్లఁ గుచక్షణి కాంగరాగ మౌ
టసదె యటంచు రాగిలిన యట్టులు రాగిలి విచ్చెఁ గింశుకీ. 113

కుసుమములెల్లన్ =కడమ పువ్వులన్నియు, కామినుల కొప్పులన్ =ఎమ్మెలాండ్ర తురుముల యందు, ఉండన్ =ఉండఁగా, అటు ఉండలేమిన్ = తాము ఆప్రకారము ఉండలేనందునకు, కింశుకంబునన్ =మోదుగునందు, ననల్ =మొగ్గలు, సిగ్గు ఎసఁగఁగన్ =లజ్జ కలుగఁగా, వంగినట్లు, మతి=మిక్కిలి, వంగి=వంపు గలవై, జనియించెన్ =పొడమెను, జీవిత ఈశ సమితి=ప్రాణనాథుల సమూహము, కరఁచి=తమ్ము (ఆననలను) నీళ్లలో నూరి కలిపి, ఆ యెఱ్ఱనీటిని, కొమ్ములన్ =చిమ్మన గ్రోవులతో, చల్లన్ =వసంతము లాడుటయందు కామినులమీఁద చల్లగా, కుచక్షణిక అంగరాగము= స్తనములయందు క్షణకాలపు మైపూఁత, ఔట=అగుట, అసదె=స్వల్పభాగ్యమా (మహాభాగ్యము కాదా), అంచున్ =అని, రాగిలినయట్లు=రంజిల్లినవో యనునట్లుగా, రాగిలెన్ =ఎఱ్ఱఁబాఱినవి.

తా.— కింశుకములయందు మొగ్గలు కడమపువ్వులవలె తమ్ము కామినులు కొప్పులందు ధరింపరను సిగ్గుచేత వంగినవో యన వంపుగలవై జనించినవి, అయినను తమ్ము నీటంగరంచి ప్రాణనాథులు కామినులకుచములపై చిమ్మన గ్రోవులతో వసంతములు చల్లుటచేత ఆ కుచములయందు తాము క్షణకాలము మైపూఁతగా నుండెడు మహాభాగ్యము తమకు కలిగినది గదా యను గౌరవముచేత రాగిల్లినవో యనునట్లు రాగిల్లినవి. మోదుగుముగ్గలు వంపుగాను ఎఱ్ఱగాను ఉన్నవని భావము.—హేతూత్ప్రేక్షాద్వయసంసృష్టి.

'కామినులు'-కామములేనిచో కుసుమముల ధరింపరు. వారి కొప్పులందు కూర్చుండుట గౌరవము. అది లేమి లజ్జాకరము. లేమికి కారణము తమగంధహీనత. 'జీవితేశ' - వారిప్రాణనాథులు తమ్ము ఉపయోగించుట ఎట్టిభాగ్యము! అందులోను, కుచాంగరాగము కావించుట ఎట్టిమహాభాగ్యమో చెప్పవలయునా? చిరము కొప్పుమీఁద నెక్కుటకన్న క్షణము కుచమెక్కుట భాగ్యము గాదా! 'వంగు'=లోఁబడు - వంపుఁజెందు; రాగిలు=హర్షించు, ఎఱ్ఱఁబాఱు; 'కుచ' - విలాసులు విలాసినుల కుచములను గుఱిసేసి చిమ్మనగ్రోవితో వసంతము కొట్టుట ప్రసిద్ధము. మనంబున వహించు రాగంబును ఎఱుపే-" "రక్తా చక్రోధరాగా" - కా. క. ల.

ఉ. నైపుణిఁ జందనాద్రి గహనద్రుమ సౌరభ వీచిఁ దామ్రప
ర్ణీపరిలబ్ధ మౌక్తికమణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శాపవనుండు సల్లువెదఁ జల్ల జనించెన కాక వీనికే
లా పొడమంగ నప్పొలప మప్పుడు నా వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. 114

దక్షిణ ఆశా పవనుండు = దక్షిణ దిగ్వాయువు, నైపుణిన్ = నేర్పుతో, తామ్ర...బులు-తామ్రపర్ణీ=తామ్రపర్ణీ యను నదియందు-పరిలబ్ధ = దొరకిన-మౌక్తికమణి = ముక్తాఫలములయొక్క. ప్రకరంబులు = సమూహములను, చం...చిన్-చందన అద్రి =చందనశైలముయొక్క, (అనఁగా మలయాచలముయొక్క) - గహన=అడవులయందలి - ద్రుమ = చెట్లయొక్క - సౌరభ=పరిమళము యొక్క,వీచిన్=లహరియందు, - తోఁచి=నాన్చి, సల్లు వెదచల్లన్=ఆముత్తెములనే విత్తనముగా పిడికిళ్లతో సంతటం గలయఁ జల్లునట్టి చల్లకముగా చల్లినందున, జనించెన = మొలచినవే, కాక= అటుగాక, వీనికిన్ = ఈననలకు, అప్పొలపము = అందమైన వర్తులరూపంబును పరిమళంబును అనెడి పొలుపు, అప్పుడు=ఆ వసంతకాలమందు, పొడమంగ నేలా=కలుగుటకు కారణ మేమియు లేదు, నాన్ = అనునట్లుగా, వనిన్ = వనములయందు, క్రొన్ననల్ = క్రొత్త మొగ్గలు, తోఁచెన్ = అగపడినవి.

తా.—వసంతమందు తత్పూర్వఋతువులలో వనములయందు లేని పరిమళముతోను గుండ్రని యాకారముతోను క్రొత్త మొగ్గలు ఎల్లెడలను పొడముట యెట్లుండె ననఁగా, దక్షిణానిలుఁడు తోఁటమాలిగా తనపుట్టుతా వయిన చందనశైలమునందలి తామ్రపర్ణిలోని ముక్తాఫలములను మొత్తము మొత్తముగా చందనముల పరిమళలహరులందు నేర్పుతో నానఁబెట్టి తెచ్చి ఎల్లెడలను గొర్తివెదగాఁ గాక చేతిచల్లకముగా వెదచల్లఁగా ఆ మొత్తములే సపరిమళముగా గుండ్రక్రొన్న నలుగా మొలచినవి: ఇది నిశ్చయము: కానిచో ఇప్పటి యీననలకు పూర్వర్తువుల ననలకు లేని యీ సువృత్తరూప పరిమళాతిశయములు ఏల కలుగును? అనునట్లు ఉండెను.—హేతూత్ప్రేక్ష.

మలయము చందనవృక్షములకును తామ్రపర్ణీనదికిని స్థానము, ఆనదిలో ముత్తెములు పుట్టుట ప్రసిద్ధము, కవిసమయము.— "భూర్జద్రుమా హిమవత్యేవ, మలయేహ్యేవ చన్దనమ్, । తామ్రపర్ణ్యా మేవ ముక్తాః । మకరా వర్ణవే తథా-" క. క. ల.

ముక్తాసామ్యము వర్ణమందు ఘటింప దని ఆక్షేపింపఁగూడదు. సామాన్యోక్తియందు పుష్పములకు శ్వేతవర్ణము కవిసమయసిద్ధము:—"సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వ మేవ హి । రక్తత్వ మేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్య మేవ చ-" కా. క. ల.

'చల్లువెద' గొర్తివెద అని చల్లకము ద్వివిధము-చల్లువెద పిడికిళ్లతో నెత్తిచల్లుట. గొర్తివెద అధోరంధ్రవంతము లైనపాత్రములందు విత్తనములుపోసి, వానిని ఒక దున్నెడు యంత్రములో నమర్చి, ఆయంత్రమును అనఁగా గొర్తిని, దున్నిన పొలముమీఁద సాగించుట. అట్లు చేయుటలో ఆ పాత్రములోని గింజలు పొలమునందు చాలుగా పడును. బీజములను కొన్ని ద్రవ్యములతో భావనచేసియు సంస్కరించియు నాటుట ప్రసిద్ధము, అట్టిదే యిట చందనపరిమళలహరియందు భావనచేయుట. 'పొలప మప్పుడు' -అన్ని ఋతువులయందును ఏవో కొన్ని పువ్వులున్నను వానికి వసంతపుష్పముల పొలపము లేనందున వసంతమునకు మాత్రమే 'పుష్పర్తు' వను పేరు వచ్చినది. అప్పుడు కలిగినది గనుకనే దక్షిణాశాపవనునిచేతగా తర్కితము.

క. వీరుద్ద్రుమిథునమేళన । కై రతిపతి యేయ దూసి హారితద్యుతిఁ బై
నారెగయఁ బొటమరించిన । నారసముల తుద లనంగ నన లవి మించెన్.

వీరు...కై - వీరుత్ = తీఁగలయొక్కయు - ద్రు = వృక్షములయొక్కయు - మిథున = ద్వంద్వములయొక్క - మేళనకై = సంయోజనముకొఱకు, రతిపతి = మన్మథుఁడు, ఏయన్ = ప్రయోగింపఁగా, దూసి = వానిదేహములందు దూసి, హారితద్యుతిన్ = పసరువన్నెతో, పైనార = దేహమున త్వక్కుగానున్న నార, ఎగయన్ = తమకు మొనకప్పుగా లేచునట్లు, పొ...లు - బాణము గ్రుచ్చికొన్న వైపునకు వెనుకటివైపున (అనఁగా అవ్వలి గాడ నేసినచో వీఁపున) - పొటమరించిన = తలసూపిన - నారసముల = బాణముల - తుదలు = మొనలు, అనంగన్ = అనునట్లుగా, ననలు అవి = ఆ మొగ్గలు, మించెన్ = అతిశయించెను.

తా.—లత యను భార్యను వృక్షమను భర్తనుం గూర్చుటకై మదనుఁడు బాణములు ప్రయోగింపఁగా, అవి యాలతా వృక్షదంపతుల దేహములయందు తగిలిన వైపునుండి అవ్వలివైపునకు దూఱఁగా అచట వానియలుఁగులు ఆదేహములకు పైనున్న పసరువన్నె నార తమకు మూఁత యగునట్లుగా నెగయఁగా పొటమరించినవో యనునట్లు, క్రొన్ననలొప్పారినవి.-రూపకోత్థాపితోత్ప్రేక్ష.

'వీరుత్ ద్రు' శబ్దముల స్త్రీలింగ పుంలింగములం బట్టియు వానిస్వరూపములం బట్టియు వానియందు జాయాపతిభావము చెప్పఁబడెను. 'వీరుత్'-విశేషేణ రోహతీతి వీరుత్ అప్పుడప్పుడే పొటమరించిన ననలు ఇంకను పసరువన్నె మాఱకయే యుండును; 'నారస' - ప్ర. నారాచః (ఉక్కు బాణము) 'పాలాశో హారితో హరిత్' - 'లతా ప్రతానినీ వీరుద్గుల్మిన్యులప ఇత్యపి' - 'పలాశీ ద్రు ద్రుమాగమాః' - 'స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వమ్' - అమ.

చ. తనయుదరంబునం బొడమి తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁ గో
ల్కొను ధరణిజ సంతతికిఁ గోరక దంతము లించుకంత ని
క్కినయది యాదిగాఁగఁ జెలఁగెన్ వనలక్ష్మి; గడుం జెలంగఁగాఁ
జనుఁ బ్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్. 116

వనలక్ష్మి-వనశోభ యనెడిలక్ష్మి, తన ఉదరంబునన్ పొడమి=తనకడుపునం బుట్టి, (వనమున జనించినవనియు తనకు బిడ్డలై యనియు), తామ్ర...లు-తామ్ర = ఎఱ్ఱని - రుచి=కాంతియొక్క - ఛటలు=మొత్తములు (చిగుర్చుటచే చెట్లు ఎఱ్ఱగా నుండును-శిశువులు సహజముగా ఎఱ్ఱగానుందురు), ఉల్లసిల్లన్ = ప్రసరింపఁగా, కోల్కొను=పరిఢవిల్లిన - ధరణిజ=భూమిజములయొక్క - సంతతికిన్ = సమూహమునకు, - (భూమిజము లనెడిబిడ్డలకు అనియు), కోరక దంతములు=మొగ్గ లనెడి దంతములు, ఇంచుక అంత=కొంచెము, నిక్కినయది యాదిగాఁగన్ = నిగిడినప్పటినుండియు, చెలఁగెన్ = ఉత్సాహముం గొనెను, మీఁదటన్ = అటుపిమ్మట, ప్రియుఁడైన - మాధవుని సంగతి=వసంతునితోడి కూటమి (హరితోడి సంగమము అనియు), చాలన్ = మెండుగా, కల్గుటన్ = లభించును గావున, కడున్ = మిక్కిలి, - చెలంగఁగాఁ జనున్ = ఉత్సహించుట యుచితమే.

తా.—స్త్రీలు తమకడుపునం బుట్టిన బిడ్డలకు దంతములు మొలచినపిమ్మట వెండియుం బురుషసంగమముం బొందుదురు, అందువలన సంతోషము గలుగును. అట్లే వనలక్ష్మి యనెడి మహాలక్ష్మి తనభూమి యనెడి నిజగర్భమున, జనించిన వృక్షముల వరుస యనియెడి తనసంతతి, చిగుళ్లనెడి ఎఱ్ఱనికాంతి పెరిఁగి, కోల్కొని, మొగ్గ లనెడి దంతములను కొంచెము పడయఁగానే,

శోభాతిశయ మనెడి సంతోషాతిశయమును, పొందెను. అట్లు మిక్కిలియును పొందవచ్చును, ఏల యన, అప్పటినుండియే వసంతుఁ డనియెడి వారితోడి పొందు సమృద్ధిగాఁ గలుగును గావున-శ్లేషానుప్రాణితరూపకములు.

వనమునకు ఉదరము వనభూమియే, తామ్రరుచి వృక్షములకు చిగుళ్లచేత-అన్యత్ర శైశవము చేత, 'ధరణీజ' అనుటచే 'వనధరణీజ' అని యేర్పడి వనమునకు బిడ్డ అను భావమునకు పోషణ కలుగుచున్నది. 'కోరకములు' దంతములవలెనే ఉండును, అందువలననే దంతకుట్మలములు దంత కోరకములు అని కవులు వర్ణింతురు.—మాధవ—మధువే మాధవుఁడు - అనఁగా - వసంతుఁడు; మా అనఁగా లక్ష్మి-ఆమెయొక్క ధవుఁడు 'మాధవుఁడు' శ్రీహరి. 'కోల్కొను' = కోలుకొను, కోలునకు కొను ప్రకృతి [ఇచ్చుకోలు పుచ్చుకోలు.]

సీ. మును నన ల్దమిఁ బట్టి ముంగాళ్ల, ముక్కుజో । డనలఁ బీలిచి పసర్కొనిన విడిచి,
పరువంపు విరిగొందు లరసి, చాలై త్రోవఁ । బెట్టి యీరము లీఁగు పిండుఁ దగిలి,
క్రొవ్విరి దొలుత నొక్కఁడు గని యది వ్రాలు । తఱి దాని నిలఁ బడఁ దాఁకి గ్రోలి,
యాకురాలుపుగండ్ల నానెడు నాస నిం । తడుగూఁది బంకంటి యంగలార్చి,
తే. యెట్టకేలకు నొకఁ డబ్బఁ బొట్టనిండఁ । గ్రోలి యది గాలిఁ గదలినఁ గూలు నగుచుఁ
బ్రమదవనపాలికలు వేడ్కఁ బట్టనగుచు । మధుదినాదిక్షుధాభ్రమన్మధుపచయము.

(1) మధు...ము-మధుదిన=వసంతకాలములో-ఆదిన్ = తొలుత - (అనఁగా-వసంతారంభమందు)-క్షుధా=ఆఁకటిచేత-భ్రమత్=తిరుగుచున్న - మధుప=తుమ్మెదలయొక్క - (చయము పా. కులము)=సమూహము, మును, ననల్=మొగ్గలను, తమిన్=ఆసతో, ముంగాళ్లన్=ముందటి కాళ్లతో, పట్టి=పట్టుకొని, ముక్కుజోడనలన్=జంటముక్కులతో, పీలిచి=(ఆ ననలలోని రసమును) నోటిలోనికి ఆకర్షించుకొని, పసర్కొనినన్=పసరువాసన రాఁగా, విడిచి=(ఆననలను) వదలి;

(2) పరువంపు విరిగొందులు=పక్వములైన పూవులుగల చాటు ప్రదేశములను, అరసి=కని పట్టి, చాలు ఐ = బారై, త్రోవఁబెట్టి=దారి ఏర్పఱచి, ఈరములు=ఆ విరిగొందు లున్న పొదలను, ఈఁగు పిండున్ = దూరెడు గుంపును, తగిలి = కలసికొని చని.

(3) ఆ గొందిలో, ఒక్కఁడు=ఒక తుమ్మెద, క్రొవ్విరిన్ = క్రొత్తపువ్వును, తొలుతన్ = తక్కిన తుమ్మెదలకన్న ముందుగా, కని=కనిపట్టి, అది=ఆ తుమ్మెద, వ్రాలుతఱిన్ = ఆ విరిమీఁదికి దిగుసమయమున, దానిన్=ఆ తుమ్మెదను, ఇలన్ పడన్ తాఁకి=క్రింద పడునట్లుగా ముట్టి, క్రోలి= ఆ విరిలోని రసమును త్రాగి;

(4) ఆకురాలుపు గండ్లన్ = రాలినయాకుల తొడిమలుండిన బిలములను (అందలి ద్రవము ననుట), ఆనెడు ఆసన్ = త్రాఁగఁగోరి, ఇంత=ఇంచుక, అడుగు ఊఁది = కాలు మోపి, బంక= తొడిమ యూడిన యాగండిలో ఊరియున్న జిగురు, అంటి=కాలి కంటుకొని (కాలు రాకయుండఁగా), అంగలార్చి = భయముచే నఱచి;

ఎట్టకేలకున్=అతిప్రయాసమున, ఒకఁడు=ఒకపూవు, అబ్బన్=దక్కఁగా, పొట్టనిండన్ =కడుపు తనియునట్లుగా, క్రోలి = అందలి మకరందమును త్రాగి, అది = ఆపుష్పము, గాలిన్= గాలికి, కదలినన్ = చలింపఁగా (పొట్టనిండం ద్రాగిన యాయాసముచేత చివ్వన ఎగిరిపోలేక), ప్రమదవనపాలికలు = అంతఃపురోద్యానములను కాచెడు యువతులు, వేడ్కన్ = వినోదార్థము,

నగుచున్ =దొరకినవి గదా యని హసించుచు, పట్టన్ =పట్టుకొనుటకు, అగుచున్ = వశపడుచు, కూలున్ = ఆ పువ్వునుండి జాఱిపడును.

తా.—వసంతారంభములో ఆఁకలిగొని తిండికై తిరుగుచుండు తుమ్మెదలు ఈ క్రిందియట్లు వర్తించును.—ముందుగా మొగ్గలమీఁదికిం బోయి వానిని ముందటికాళ్లతో పట్టుకొని, అందలి రసమును తమ జంటతొండముతో పీల్చి, అందు పసరువాసనయు పసరురుచియు రాఁగా దానిని విడిచిపెట్టి;

అనంతరము మొగ్గలలో మంచిరసము ఉండ దని వానిని ఒప్పరికించి, గొందిగొంది వెదకి, పక్వమైన పుష్పములుండెడు గొందిం గనిపట్టి, బారుగట్టి, పొదలం దూరెడు గుంపుతోఁ గలసి చని, ఆగొందిలో తొలుత నొక తేఁటి ఒక క్రొవ్విరిని కనిపట్టి దానిపై వ్రాలునాలోన ఆ తేఁటిని నేలఁబడునట్లు తటాలున త్రోసి, ఆ విరిలోని రసమును తాము త్రాగి;

తొడిమలతోకూడ ఆకులు రాలిపోఁగా ఆతొడిమ లుండిన గండ్లయందు ఊరియున్నట్టి బంకను రస మనుకొని దానిం ద్రాగుటకై ఆ గండ్లలో కాలుమోపఁగా ఆబంక కాలికంటుకొనుటయు కాలు రాక అఱచి ఎట్లో కాలు లాగికొని ఎగిరిపోయి;

అతి ప్రయాసముమీఁద ఒకపువ్వు దక్కఁగా దానిరసమును కడుపార త్రాగి, అంతలో ఆ పువ్వు గాలికి కదలఁగా, పొట్ట నిండిన యాయాసముచేత తటాలున ఎగిరిపోలేనివై, అదే సమయమని తోఁట కావలియువతులు తుమ్మెదలు తమచేతికి దొరకినవని సంతోషముచేత నవ్వుచు పట్టుకొనునట్లు వారికి కైవస మగుచుఁ, గూలును.—స్వభావోక్తి.

'తమి'_తిండి లేక ఆఁకట నెంతుచుండుటచేత. 'ముంగాళ్ల' నుట; ఆఱుకాళ్లలో ముందటివనుట - 'ముందు+కాళ్లు' = ముంగాళ్లు (ప్రాఁతాదికార్యము); ముక్కుజోడన-ఇట్టి తెక్కపురుగులకు ముక్కు జంటతొండమువలె నుండును, - 'జోడన' జంట, 'పీలిచి' -ఒకొక్కతొండంబును సన్నగొట్టముగా నుండును. 'పసగొక్కనుట' ఇంకనుం బక్వము కానందున, పక్వమయినచో రసము మధుర మగును; 'చాలగుట _ విశాలమయిన దారిలేనందున; 'తగులుట' వెనుకఁబడినచో తనకు దొరక దనుభయముచేతను, ఆఁకటిపెల్లుచేతను; 'క్రొవ్విరి' - ఏ తుమ్మెదయు అప్పటికి తాఁకని విరి - రస మెడలనిది:—'తాఁకి' - నీచజంతువులకు తమకడుపే కావలసినది గాని ధర్మాధర్మచింత యెక్కడిది?—'ఇలఁబడన్ '= నేలమీఁద వెదకిలం బడునట్లు - వెదకిలంబడినట్టిది సులువుగా తెప్పరిల్లి లేచిరాలేదు, అది యట్లు నసిపడి వచ్చునంతలో ఆ త్రోసిన తేఁటి ఆ పువ్వులోని మకరందమును త్రాగివైచును, అట్లు చేయుటకే అది ఆవలికి నెట్టక నేలంబడునట్లు నెట్టినది; 'బంక' - ఈబంక ఊరుటయే ఆకునకు పట్ట విడుటకును అది రాలిపోవుటకును కారణము, అదియు ద్రవరూపముగా మెఱయుటచేత మకరందమో యనుభ్రమ తుమ్మెదకుం గలుగును. 'ఎట్టకేలకున్ ' - పేరుటామని గాక తదారంభకాల మగుటచేత ఇంకనుం బుష్పవికాసమరందసమృద్ధి అవ్వారి గానందున; - 'పొట్టనిండన్ '_కఱవు దీఱునట్లు - కఱవులో అన్నాతురులు అన్నము లేక లేక దొరికినప్పుడు మితిమీఱం దిని అపాయము చెందుదురు. 'పట్ట నగుచుం గూలుట' - భుక్తాయాసముచేత; భుక్తాయాసము క్రొత్తఁగా బ్రాహ్మణార్థము చేసినవారికి చక్కఁగా తెలియును; ఎలు మ్రింగినపాము ఆయాసముచే కదలక పడియుండును, అప్పుడు దానిని సులువుగా కొట్టి చంపుదురు. 'వేడ్కన్ ' - పెంచుటకుఁగాని అమ్ముటకుఁగాని కాదనుట.

సీ. మరుదూఢ మలయాహా గరధూమ్య లనుగళ । న్మనసిజ ప్రథప దాంజపకళికలు
త్రాసధావచ్ఛిశిరత్యక్తబాష్పముల్ । పికపంచమస్వరోద్భేద వీణ

లబ్దాగమన్మరం దాసార జంబువుల్ । హిందోళ సాక్షా న్ముకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీలగుళికలు । జాత్యనుల్లసనాత్త శాపతతులు
తే. చైత్ర సంజీవనౌషధీ జాతచేత । నాత్మజని హేతు తరు పునర్యాయి యువతి
కరవిధూతహసంతికేంగాలచయము । లళుల పంక్తులు వనుల నట్టాడఁ దొడఁగె.

త్రిమ్మరుచున్న తేఁటిపిండు వర్ణనము.—

(1) మరు...లు-మరుత్ =(దక్షిణపు) గాలిచే - ఊఢ = మోచి తేఁబడిన-మలయఅహి = మలయములోని (చందనవృక్షములయందలి) పాములయొక్క - గర = విషముయొక్క - ధూమ్యలు = పొగమొత్తములు, అను...లు-అనుగళత్ = మాటిమాటికి పడుచున్న (కణికలకు విశేషణము)- మనసిజ= మన్మథునియొక్క - రథపద = తేరిచక్రములయొక్క - అంజన = కందెనయొక్క - కణికలు = లేశములు;

(2) త్రాస...ల్ - త్రాస = (వసంతమువలని) భయముచేత - ధావత్ = పాఱిపోవుచున్న - శిశిర = చలిచేత - త్యక్త = విడువఁబడిన - బాష్పముల్ = కన్నీళ్లు (కాటుకకన్నీటి బిందువు లనుట), పిక...లు-పిక = కోయిలలయొక్క - పంచమస్వర = పంచమ మని సంగీతశాస్త్రమందు సంజ్ఞగలదైన స్వరముతోఁ గూడుకొన్న ధ్వనియొక్క - ఉద్భేద = ఉచ్చారణకు అనుగాములైన - వీణలు = కోయిలలు వాయించు చిన్న నల్లవీణెలు.—

(3) అబ్దా...ల్ - అబ్ద = మేఘములయొక్క - ఆగమత్ = రాకగా (అనఁగా వర్షఋతువుగా) నొప్పుచున్న - మరంద ఆసార = మకరంద ధారాసంపాతముయొక్క (అనఁగా మకరందవర్షమనెడి వర్షాకాలముయొక్క) - జంబువుల్ = నేరెడుఁబండ్లు, హిం...లు - హిందోళ = హిందోళరాగము పాడినంతట-సాక్షాత్ = ప్రత్యక్షమయిన - ముకుంద = నారాయణునియొక్క - రోచులు = (దేహ) కాంతులు;

(4) అభి...లు-అభిసారికా = కాంతునిగూర్చి సంకేతస్థానమునకు పోవు కామినులయొక్క - అంశుక = వలువలయందు-ఉద్యత్ = ఉదయించుచున్న - నీల = నీలిమ గలవైన (అనఁగా నీలిమను కలిగించుచున్న) - గుళికలు = సిధగోళకములు, జా...లు - జాతి = జాజితీఁగలచేత - అనుల్లసన = పూవనిహేతువుంబట్టి-ఆత్త = (వసంతునిచే) పొందఁబడిన-శాప = తిట్లయొక్క - తతులు = సమూహములు;

చైత్ర...లు - చైత్ర = చైత్రమాసమనెడి-సంజీవన ఓషధీ = ప్రాణమొసంగెడి తీఁగచేత - జాత = వచ్చిన - చేతన = చైతన్యము గలవై - ఆత్మ = తమకు_జనిహేతు = జన్మకారణములైన - తరు = వృక్షములంగూర్చి - పునః = మరల - యాయి = పోవుచున్నవైన-యువతి కర విధూత = ఉవిదల చేతులచే పాఱఁబోయఁబడిన - హసంతికా = కుంపట్లయందలి - ఇంగాల = బొగ్గులయొక్క - చయములు = సమూహములు, (ఐనట్టి) - అళుల పంక్తులు = తుమ్మెదల బారులు, వనులన్ = వనములయందు. అట్టాడఁ దొడఁగెన్ = సంచరింప సాఁగినవి.

తా.—అప్పుడు వనములయందు సంచరించుచున్న తుమ్మెదగుంపు లెట్లుండిన వనఁగా-ఇవేమి దక్షిణపుగాలి తెచ్చిన మలయశైలమందలి చందన తరువులలోని పాముల విషధూమచయములా? ఆ మదనుని బండిచక్రమునుండి జాఱిపడుచున్న కందెన ముద్దలా? వసంతమునకు వెఱచి యేడ్చుచు పలాయన మగుచున్న శిశిరఋతుయువతియొక్క కాటుకకన్నీళ్లా? కోయిలలు పంచమస్వరమునం బాడుచు తోడుగా వాయించు తదుచితపరిమాణ తద్వర్ణ వీణలా? మకరందపుజడి యనెడి వర్షఋతువున జనించిన నేరేడుఁబండ్లా? యువతులు పాడెడు హిందోళ రాగమునకు మెచ్చుకొని ప్రత్యక్షమైన

నారాయణుని దేహకాంతులా ? అభిసారికలు అదృశ్యకరణిగా వలువలయందుఁ దాల్చిన సద్యోనీలి మోత్పాదక సిద్ధనీలగోళములా ? జాజితీఁగలు తమ్ము వసంతుఁడు పూవనీయలేదని పెట్టిన సాపెన పరంపరలా ? చైత్రమనెడి సంజీవనౌషధి సోఁకఁగా మరల ప్రాణముం బొందినవై తమకు కారణ భూతములైన వృక్షములంగూర్చి మరల వచ్చుచున్నట్టివై యువతులు చలిలేమిచే ఇండ్ల వెలుపల పాఱఁబోసినట్టి కొయ్యబొగ్గులా ? అనునట్లు ఉండినవి.—మాలారూపకము.

పొగయే నలుపు-పొగ మొత్తము కారునలుపు; కావున 'ధూమ్య' యనుట-'ధూమ్య' -ధూమానాం సమూహః—పీఠికయందలి పట్టికం జూచునది. 'మనసిజరథము' మలయమారుతము, అది ఇప్పుడిప్పుడే తరలినదిగావున, దీనికి ఇప్పుడే వైచినకంకెన ప్రయాణారంభములో ముద్దుముద్దగా పడుచున్న దనుట - 'బాష్పములు' అళిసామ్యముకై నల్లనివిగా అనఁగా కాటుకకలవిగా నుండవలయుంగావున, శిశిరర్తువునందు స్త్రీత్వము నారోపింపఁబడవలయును. వసంతము రాఁగానే శిశిరధర్మములు పోవుననుట యనుసంధేయము; పికములు చిన్నస్వరూపము గలవి గావున, అవి తాము నోటంబాడునట్టి పంచమ స్వరస్వనమునకు అనుసరణముగా వాయించుకొనులును వానికి తగినవిగా చిన్నవిగా నుండవలయును; మఱియు తమవర్ణమే తమకు ప్రియము గాన, ఆ వర్ణమే, పికాలకును సాధింపబడిన దనుట - 'పికః కూజతి పఞ్చమమ్' - అమ. కోయిల పంచమస్వరమును కూయును:—వర్షర్తువున నేరేడు చెట్లు పండును.

"ఫలభరపరిణామశ్యామ జమ్బూనికుఞ్జ । స్ఖలితతనుతరఙ్గా ముత్తరేణ స్రవన్తిమ్
ఉపచితఘనమాలః ప్రౌఢతాపిఞ్ఛనీలః। శ్రయతిశిఖర మద్రేర్నూతనస్తోయవాహః." మాలతి.

* 'హిందోళ' _వసంతాదియందు హిందోళరాగమునఁ బాడుదురు.—"శిశిరస్య వసన్తస్య వనౌ హిన్దోళరాగకః"_"హిందోళంబునఁ బాడిరి। బృందారకసతులు, విరహిబృందార్తికరేఁ। చెంచేటులు, వాసంతిక। విందునఁ, బికశిశువు దాదిపదలం ద్రోచెన్"— వసంతంబున ఇష్టదైవతమును హిందోళరాగంబునం గీర్తింతురు.

"సంధుగార్ణవ చంద్రమండలశిఖిజ్వాలాతటిద్వల్లరీ
కందర్పేంద్ర శరాసనాచ్యుతతనూగంధర్వవంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమవాటియందు సుమనోమైత్రేయముల్ గ్రోలుచున్". భీమేశ్వరపురాణము.

షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవతనిషాదములు అని సంగీతమున సప్తస్వరములు ప్రసిద్ధములు నిరుక్తములును; హిందోళరాగమున ఋషభ పంచమములు ఉండవు; కడమ అయిదును ఉండును. అయిదు ఆఱు ఏడు స్వరముల రాగములకు క్రమముగా ఔడవ షాడవ సంపూర్ణము అని పేర్లు. ఏతదనుగుణముగా వసుచరిత్రలో వసంతవర్ణనలోని యీపద్యముం బరికించునది;—

"అరిగాఁ బంచమ మేపగించి నవలా లవ్వేళ హిందోళవై
ఖరిఁ జూపం బికజాత మాత్మరవ భంగవ్యాకులం బై వసి
ధర నాలంబిత పల్లవవ్రతవిధుల్లాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్."

ఆరాగముచే ఇష్టదైవతమును గీర్తింతురుగాన నిట హరిని కీర్తించినట్లు గ్రహింపవలయును.

* సమగమధనిస _ సనిధమగస.

'నీలగుళికలు'-గుళికాసిద్ధిచేత అదృశ్యతం బొందుట ప్రసిద్ధము. అట్లే అళులు అభిసారికల వలువలను మెండుకొని చీకటిగా క్రమ్మినవై వారిని ఒరులకంటి కగపడకుండఁ జేసెనని భా. అదృశ్యతకై గుళికను సాధించు నొక విధానము:—"శ్వేతాపరాజితామూలం గ్రాహ్యం చన్ద్రగ్రహే సతి, బాలాక్షుద్రేణసంయుక్తాం గుటికాం మూర్ధ్ని ధారయేత్ । వక్త్రే హస్తే చ సా గ్రాహ్యా దేవైరపి న దృశ్యతే." - సిద్ధనాగార్జునకక్షపుటి. 'శాపము'-పాపము గావున నలుపు:—"మాలిన్యం వ్యోమ్ని పాపే"-సా. ద.-'హసన్తికా'- పిఠకయందలి పట్టికం జూచునది.- 'ఇంగాల'-ఇదిసంస్కృతశబ్దము గాదు, అంగారశబ్దమునకు ప్రాకృతము; "ఆదేరతః"- "ఇదీషత్పక్వస్వప్న వేతసవ్యజనమృదఙ్గాఙ్గారేషు" అను వరరుచిసూత్రద్వయముచే నిష్పన్న మయినది. సంస్కృతము కాకపోయినను మహాకవి శ్రీహర్షునిచే నైషధమునం బ్రయుక్తము.

> "స్ఫురద్ధనుర్నిస్వన తద్ఘనాశుగ ప్రగల్భవృష్టివ్యయితస్య సంగరే ।
> నిజస్య తేజఃశిఖినః పరశ్శతా వితేను రిఙ్గాలమి వాయశః పరే॥"

'ఇంగాలో భాషాశబ్దః' అని నారాయణటీక. "అతిప్రయుక్తం దేశభాషాపదమ్"- వామనసూత్రము; "అతీవ కవిభిః ప్రయుక్తం దేశభాషాపదం ప్రయోజ్యమ్ । యథా-'యోషి దిత్యభిలాష న హాలా' మి త్యత్ర హాలేతి దేశభాషాపదమ్"— అని వృత్తి.— హాలాశబ్దమువంటిదే ఇంగాలశబ్దంబును; సంస్కృతమున మహాకవిప్రయుక్తముగావున నిట తెనుఁగుప్రబంధమున సిద్ధసమాసమధ్యమునం బ్రయుక్తము.—'ఇఙ్గాలః' - వై. ఇంగలము. - "అఙ్గారః - ఇంగాలో - ఇంగలము" అని ప్రాకృతభవములందు బాలవ్యాకరణము.

తే. ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక । జాతిఁ బాసిన తేంట్లనిస్వనము గూడు
కొనుటనో యనఁ గోకిల స్వనము సెలఁగెఁ । దనకుమఱి పంచమత్వంబు దప్పకుండ.

ద్విజతఁ గాంచియుఁ = విప్రత్వమును పొందినదయ్యు (అండజమయ్యు ననుటయు - ఇది కోకిలకు అన్వయించును-తర్వాతిది తేంట్లవలుకు 'తేంట్ల'కును అన్వయించును), ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక=విప్రత్వ మొందినదయ్యు మద్యపానమును మానలేనివై (అండజములై మకరందపానమును మానలేనివై), జాతిఁబాసిన = అవిప్రతను కోలుపోయిన [తేంట్లకు విశేషణము-వసంతమున జాతి (అనఁగా జాజి)పూవరు గాన దానిని త్యజించిన అనియు]-తేంట్ల నిస్వనముఁ= తుమ్మెదలయొక్క శబ్దమును, కూడుకొనుటనో, యనఁ =చేరుటవలననో యనునట్లు, కోకిలస్వనము= కోయిలకూఁత, తనకుఁ, మఱి=ఇఁక, పంచమత్వంబు=అయిదవ మహాపాతకి భావము (సప్తస్వరములలో పంచమ మను పేరి స్వర మగుట), తప్పకుండఁ=మానక యుండునట్లుగా, చెలఁగెఁ = వర్తించెను.

తా.—బ్రహ్మహంత, సురాపాయి, స్వర్ణస్తేయి, గురుభార్యాగామి, అగు ద్విజులు నలువురు మహాపాతకులు; వీరితోఁ జేరుద్విజుఁడు పంచమ మహాపాతకి; శాస్త్రమిట్లుండుటచేత:— తేంట్లు అండజములయ్యును మరందపానము మానినవి గావు, వసంతమునం బూవని దగుటచేత జాతిని (జాజిని) త్యజించినవి, వీని స్వనముతో అండజమయిన కోకిలయొక్క స్వనము కూడుకొన్నది, ఆ కోకిలస్వనమునకు పంచమస్వరత్వము తప్పినదిగాదు; ఈవృత్తమును కవి యిట్లు ఉత్ప్రేక్షించుచున్నాడు:— ద్విజ మయిన (అనఁగా విప్రజాతియైన) కోకిలయొక్క స్వనము ఏమిచేసిన దనఁగా - ద్విజముతే (అనఁగా విప్రజాతివే) అయ్యును సురాపానమును మానక జాతిని పోఁగొట్టుకొన్న (జాతి బహి

ష్కారము పొందిన) తేంట్లయొక్క స్వనముతోఁ గూడుకొన్నది. అందువలనన గాఁబోలు దానికి పంచమ మహాపాతకిత్వము తప్పినది గాదు.—శ్లేషోత్థాపిత మయిన హేతూత్ప్రేక్ష.

మద్యపాన మను నర్థమున మధుసేవను కోకిలకుం జెప్పుటలో స్వారస్యము లేదు; ఏలయన - మధుసేవచేతనే సాక్షాన్మహాపాతకిత్వము సిద్ధమైయుండఁగా దానిం బ్రధానీకరింపక సంయోగమాత్రకార్యమగు పంచమ మహాపాతకిత్వముం బ్రధానీకరించుట సమంజసము గాదు.-మధుసేవయే పంచమహాపాతకములందు చెప్పఁబడినది గాని జాతింబాయుట కాదు, జాతిం బాసినవారి సాంగత్యము పంచమహాపాతకిత్వకారణముగాఁ జెప్పఁబడలేదు, అట్లుండఁగా నిట పంచమత్వకారణముగా జాతింబాయుటం జెప్పనేల? ఏలయనఁగా, జాతింబాసిన అనుటచే శుద్ధికై ప్రాయశ్చిత్తములు చేసికొనక మరల స్వజాతిం బడయక అని భావము-అందువలన మద్యపానమహాపాతకము చేయుచునే యుండుట సూచితము.- కావున తేంట్లయందు అనపోహితమహాపాతకములయందు అది సిద్ధమగుటచే తత్సంయోగికి పంచమమహాపాతకిత్వము తప్పదు. పంచమహాపాతకములలో సురాపానము ముఖ్యముగా ద్విజులకు మనువు నిషేధించినాఁడు. "సురా వై మలమన్నానాం। పాప్మా చ మలముచ్యతే। తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్."

మఱియు మధుసేవ విడువనిది తేఁటి గాని దాని స్వనముగాదు. తేఁటిం గూడినచో పంచమహాపాతకిత్వము కలుగును గాక. దానిస్వనముతోఁ గూడిన నెట్లు గలుగును? అట్లే ద్విజత్వ గాంచినది కోయిలగాని దానిస్వనము గాదు. ఇటనుం గూడ సమాధాన మెట్లు? అనిన తేఁటికిని తత్స్వనమునకును, అట్లే కోయిలకును తత్స్వనమునకును, అభేదము గ్రహింపవలయును-"దన్తవిప్రాణ్డజా ద్విజాః"-"మధు మద్యే పుష్పరసే క్షౌద్రేఽపి,"-అమ. కోకిలపంచమస్వరమునకు:—

"షడ్జం రౌతి మయూరస్తు గావో నర్దన్తి చర్షభమ్। అజావికం తు గాన్ధారం
క్రౌఞ్చో నదతి మధ్యమం। పుష్పసాధారణే కాలే కోకిలో రౌతి పఞ్చమమ్"-నారద.

పంచమహాపాతకములు:—"బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వఙ్గనాగమం। మహాన్తి పాతకాన్యాహుస్తత్సంయోగం చ పఞ్చమమ్".

ఉ. పూచినమావులం దవిలి పూవిలుబోదున కమ్మె మాధవుం
డేచిన శంక; నాతఁ డవియే కొనియెం బథికావళీజయ
శ్రీచణుఁ డయ్యె; నట్టిద; యకృత్యముచే నగునట్టిపీడయుం
గోచర మౌనె, దైవ మనుకూలము నైన, పరుమేలుఁ దీఱినన్. 120

మాధవుండు=వసంతుఁడు, పూచినమావులన్=పుష్పించిన మామిడిచెట్లనెడు-పూచినమావులన్=వన్నెమాఱిన గుఱ్ఱములను, ఏచిన శంకన్=(వానిని తా నుంచుకొన్నయెడల తనకు కీడు గలుగునని) ప్రబలమైన భయముచేత, తగిలి=పూనుకొని, పూవిలుబోదునకున్=పుష్పచాపుఁ డనెడి యోధునికి, అమ్మెన్=విక్రయించెను. ఆతఁడు=ఆ పూవిలుబోదు, అవియే=ఆ పూచిన మామిడిచెట్లనెడి పూచిన గుఱ్ఱములనే, కొనియె=సాధనములనుగా నవలంబించియే, పథ...డు-పథిక=పాంథుల యొక్క-ఆవళీ=సమూహములయొక్క - జయశ్రీచణుఁడు=గెల్పుసిరిచేత ప్రసిద్ధుఁడు, అయ్యెన్; అట్టిద=అది సరియే, దైవము=పూర్వజన్మకలితకర్మఫలము, అనుకూలమునైన=అనుకూలము కూడ అయి, పరుమేలు=ఎదిరియొక్క శ్రేయము (మంచికాలము), తీఱినన్=ముగిసెనా, అకృత్యములన్=తప్పుపనిచేత, అగునట్టి పీడయున్=కలుగఁదగిన కీడు సయితము, గోచరము ఔనె=కనఁబడదు (ప్రాప్తింపదు.)

తా.—వసంతునికడ వికసించినమామిడిచెట్లనెడి వన్నెమాఁజిన గుజ్జములు ఉండినవి. గుజ్జమునకు వన్నెమాఁజిన (అనఁగా ఎఱ్ఱవెండ్రుకల నడుమ తెల్లవెండ్రుకలు పొడమిన), ఒడయనికి కీడుకలుగునని ప్రసిద్ధి. అందువలన ఆ మావులచేత తనకు కీడు గలుగునని వెఱచి వసంతుఁడు వానిని మదనునికి అమ్మివైచినాఁడు. అతఁడు వికసితసహకారము లనెడి యా వన్నెమాఁజిన గుజ్జములనే కొని, పాంథసమూహములను జయించినాఁడు. అది యుచితమే, ఏలన, దైవ మనుకూలముగా నున్న యెడలను, వైరికి మంచికాలము తీఱిపోయినను, తప్పుకార్యములని కీడు కర్తను బాధింపదు. అట్లే ప్రకృతమందు మదనునికి మావుల నమ్మిన మాధవుఁడు (వసంతుఁ డనెడు నారాయణుఁడు) అనుకూలుఁడు గావునను, పరులైన పాంథులకు మేలు తీఱిపోవుటచేతను, (అనఁగా వారు తమ ప్రియలం జేరక యున్నందునను) ఆ పూచినమావులం గొన్నదోషము మదనుని బాధింపలేదు, పయిగా జయసాధనమే అయినది. వసంతమున వికసితసహకారములు పాంథులకు మిక్కుటముగా విరహతాపము గావించిన వనుట.—శ్లిష్టరూపకానుప్రాణితమైన యర్థాంతరన్యాసము. దానికి పూర్వార్ధమందు వ్యాఘాతము అంగము.

"చను వ్యాఘాత మతత్సా। ధనమును దత్సాధనముగఁ దగిలించుటయున్
పనికి విరుద్ధం బగుపని। ననుకూలతఁ జేర్చి చే సమర్థించుటయున్."

"ఎవి జగముల రంజించునొ। యవె శరములు సేసి నొంచు నసమాస్త్రుఁడు, బా
ల్యవయస్కుఁడ నని దయయే।ని విడువఁగాఁజనునె యొంటి, నీవే చెప్పుమా."అలం.

"కుసుమితామ్రంబులును మచ్చగుజ్జములును। మనుచు నుండును బూచినమావులనఁగ"-ఆం. భా.

"మావు లనం దగు హయములు। మావు లనంబరఁగు నామ్రమహీజంబు లిలన్."-ఆం. సం.

"విష్ణౌ వసన్తే వైశాఖే మాధవః."-"శఙ్కాత్రాసవితర్కయోః"-నానా.

'జయశ్రీచణుఁడు'-చణప్ ప్రత్యయము-'దానిచేత ప్రసిద్ధుఁడు' అను నర్థమున వచ్చును-"తేన విత్తశ్చుఞ్చుప్చణపౌ"-విద్యయా విత్తో విద్యాచుఞ్చు ర్విద్యాచణః-అని. సి. కౌ.

మ. ఉరుశక్తి న్మధుమాసదోగ్ధ పిదుకన్ జ్యోత్స్నాగవీచంద్రమస్
స్ఫురదూధః ప్రవిముక్తమైన నిబిడజ్యోత్స్నాపయఃపూరమున్
విరియంబాఱినగొజ్జఁగ ల్గురియ మున్నీరైన యక్కమ్మనీ
రు రహిం గూడిన నేర్పరించు గముళ్లై రోలంబకాదంబముల్. 121

మధుమాసదోగ్ధ = వసంతమాస మనెడు పాలుపిదుకువాఁడు, ఉరు శక్తిన్ = ఎక్కువబలముతో (పాలు పిదుకుటకు నిండుబలము వలయును), పిదుకన్ = పిదుకఁగా, జ్యో...ము-జ్యోత్స్నాగవీ= వెన్నెలరాత్రి యనెడి యావుయొక్క-చంద్రమస్ = చంద్రుఁడనెడు-స్ఫురత్ = గొప్పదైన-ఊధః = పొదుగుచేత - ప్రవిముక్తము = విడువఁబడినది, ఐన - నిబిడ జ్యోత్స్నా పయఃపూరమున్ = చిక్కనైన వెన్నెల యనెడి పాలయొక్క ప్రవాహమును, విరియంబాఱిన గొజ్జఁగల్ = వికసించిన గొజ్జంగిపువ్వులు, కురియన్ = వర్షింపఁగా, మున్నీరు ఐన ఆ కమ్మనీరు = సముద్రమైన (అనఁగా విస్తారమయిన) మకరంద మనెడి యా మంచినీళ్లు, రహిన్ = చక్కఁగా, కూడినన్ = కలసికొనఁగా, రోలంబకాదంబముల్ = తుమ్మెద లనెడి హంసలు, గముళ్లై (పా. గుములై) = గుంపులై, ఏర్పరించున్ = వేఱు సేయును.

తా.—వసంతకాల మనెడి దోగ్ధ (పాలు పిదుకువాఁడు) వెన్నెలరాత్రి యనెడి యావును కడుబలముతో పిదుకఁగా, చంద్రుఁ డనెడు దాని పెద్దపొదుగునుండి వెన్నెల యనెడి చిక్కని పాలవెల్లువ రాఁగా, దానితో గొజ్జంగి పూఁబొదలు గురియునట్టి మకరంద మనెడి మంచినీళ్ల ప్రవాహము భేదము తెలియకుండునట్లుగా కలిసిపోఁగా, తుమ్మెద లనెడు హంసలు ఇది పాలు ఇది కమ్మనీరు అని భేదమును స్పష్టీకరించుచున్నవి.—వసంతమందు వెన్నెలరాత్రులలో వెన్నెల చిక్కనిపాలవలె మహాప్రకాశముతో కాయుచుండె ననియు అ వెన్నెలలో గొజ్జంగిపూవులనుండి కురియుచు మున్నీటివలె వెల్లిగొనుచున్న మకరందము కలిసిపోయి రెండు నేకమై వర్ణభేద మేర్పడనందున రెంటిభేదము కనఁబడక పోయినదనియు, ఆభేదమును, పాలునీరు కలసినచో వానిభేదము నెట్లు హంస లేర్పఱుచునో అట్లే, తుమ్మెద లేర్పఱిచిన వనియు, భావము.—రూపకోత్థాపిత మైన యున్మీలితాలంకారము.

"అగపడ భేదవిశేషము । లగు లున్మీలిత విశేషకాలం కృతుల్;
ఇగము దగుల నెఱుఁగుం దా । నగజాపతి కీర్తిఁ గోప నడఁగినమాటన్;
మొగము మొగంబుగఁ దోఁచెన్ । దొగరాయఁడు సోఁకువఁ దమ్ముటుములు ముగుడన్.—అలం.

'జ్యోత్స్న' - 'జ్యోత్స్నా చన్ద్రికయాన్వితా' - అమ. 'జ్యోత్స్న' - రూ. "జ్యోత్స్నా, 'జ్యోత్స్నాదిభ్య ఉపసంఖ్యానమ్' - వా. సంజ్ఞాపూర్వకత్వాత్ వృద్ధ్యభావే 'జ్యోత్స్నా'" ఇత్యపి-అని రామాశ్రమి. కావున ప్రథమపాదంబున యతిభంగము లేదు. 'దోగ్ధ'-దోగ్ధృశబ్దము ఋకారాంతము. నిబిడజ్యోత్స్న—

"కొలుతుఁ మద్గురు విద్యా । నిలయుని గరుణాకటాక్ష నిబిడజ్యోత్స్నా
దళితాశ్రిత జనదురిత । చ్ఛలగాఢ ధ్వాంతసమితి శఠకోపయతిన్"-మనుచరిత్ర.

"పయః పానీయదుగ్ధయోః" - నానా. 'మున్నీరు'=మును+నీరు. 'కమ్మనీరు' - శ.ర.లో మకరందము అని యర్థంబును ఉదాహరణంబుగా ఇదే పద్యంబును కలవు. 'రోలంబకాదంబముల్'—కాదంబములు పాలను ద్రావును, రోలంబములు కమ్మనీటిం ద్రావును, ఇట సామ్య మెట్లు? అనిన, రోలంబములు త్రాగుచున్నట్టిది కమ్మనీ రని భేద మేర్పడును, భేద మేర్పడుటయే అలంకారార్థము వివక్షితము గాని దేనిని త్రాగునో దేనిని త్యజించునో అది వివక్షితము గాదు. రెండును భేద మేర్పఱుచునవే.—'ఇన్దిన్దిర శ్చఞ్చరీకో రోలమ్బో భ్రమరో౽లి సః.'—'కాదమ్బాః కలహంసాః స్యాత్' - అమ.—'గమ్మై' యనుటచే కమ్మనీరు విస్తారముగా సముద్రమంతగా వర్ణించుచున్నదని భా.

ఉ. దిగ్గియ నంచ దూఁడు గొని తీర వనేక్షువు వంకమీఁదుగా
నగ్గడ ఫుల్లకేసరమునందు వసింపఁగ నెక్కునాలి ను
న్వగ్గ్రము నంపఁగా నరు వనంపు సరోమకరంద గోష్ఠికిన్
వెగ్గల మౌడు తెంట్లు మరు వింటికిఁ బూనె గుణాన్వయోన్నతిన్. 122

డిగ్గియన్=దిగుడుబావియందు, అంచ=హంస, తూఁడుకొని=తూఁటిని (త్రుంచి అందలి యగ్రభాగమును) నోటఁ గఱచుకొని, తీర...గాన్ - తీర=గట్టునందలి - వన=ఉద్యానములోని) (అందునుండి డిగ్గియమీఁదికి వంగిన) - ఇక్షువు వంకమీఁదుగాన్ = వంపయిన చెఱకు పైఁదుగా (ఆ చెఱకుయొక్క కొనకు తగులుచు), అ...దుగ్ - అగ్గడ=అచ్చోటనున్న - ఫుల్ల=వికసించిన -

కేసరమునందుఁ=పొన్నచెట్టునందు, వసింపఁగన్=వ్రాలియుండఁగా, ఎక్కు...మున్-ఎక్కు=దిగ్గియలోని తూఁటితునియకొననుండి హంసనోటిలోని తూఁటితునియవఱకు పైకి వ్యాపించియున్న-నూలి నుస్వగ్రమున్ = పోఁగు అనెడి నున్నని త్రాటిని, అందఁగాన్=తగులునట్లుగా, (ఆ త్రాటివెంట), తరు...కిన్ - తరుమరంద=ఆ పొన్నచెట్టులోని తేనెయొక్కయు - సరస్మకరంద=కొలని కమలముల తేనెయొక్కయు-గోష్ఠికిన్=పానగోష్ఠికై, పెగ్గలమాడు తేంట్లు=మిక్కుటముగా రాకపోకలు సేయు తుమ్మెదలు, మరువింటికిన్=మదనుని చాప మయిన యీ వంజెఱకునకు. గుణద్వయత్వమున్ = జంటనారితనమును, పూనెను=వహించెను. 'తరుమరందసరస్సరవింద' అనియుం బఠింపవచ్చును.

తా.—ఉద్యానవనములో నొకదిగ్గియ కలదు; దానితీరమునుండి చెఱకొకటి దానిమీఁదికి వంగియుండెను. ఆచెఱకు ప్రక్క వికసితమై పొన్న యొకటి యుండెను. అంచ యొకటి దిగ్గియనుండి తమ్మికాఁడను త్రుంగించి, అగ్రభాగమును నోటఁ గఱచుకొని, ఆతూఁటి యిరుదునియల నడుమ సాఁగుచున్న తత్సూక్ష్మసూత్రము ఆచెఱకుతుదకు తగులునట్లుగా ఎగిరిపోయి, ఆపొన్నచెట్టుమీఁద కూర్చున్నది. అంతట ఆసూత్రమువెంట దిగ్గియలోని తుమ్మెదలు పొన్నపూవుల మకరందగోష్ఠీపానమునకై బారుగా పోఁదొడఁగినవి; అట్లే పొన్నలోనితుమ్మెదలు దిగ్గియతమ్మితేనెను గోష్ఠీపానముగా త్రాగుటకు ఆసూత్రమువెంటనె బారుకట్టి దిగుచున్నవి. అందువలన ఆతుమ్మెదబారులు రెండును మదనుని విల్లయిన యాచెఱకునకు జంటనారిగా నొప్పారుచుండెను.-గమ్యోత్ప్రేక్ష.

"అగ్గడ యక్కడ యచట యచ్చట యాడ। యందుల హంసపాన యయ్యెడ యట
అందు నాఁ దత్రార్థమై విరాజిలుచుండు''—ఆం. భా.

'తూఁటి నూలిపోఁగు'-దాని వెంబడి తుమ్మెదలు బార్లు సాఁగుటకు-చెట్లనుండి దిగెడు బారొక నారి-చెట్టున కెక్కెడు బారొక నారి.—'తమ్మినూలిపోఁగు' తుమ్మెదలకు రాకపోకలకు నూటిదారిఁ జూపుటకుఁ గాదేని, అవి రెండవనారిగా దాని వెంబడినే యేల వచ్చును? పయిగా, ఇచట "ఇంచువిల్తుఁడు"-"పూవుందూపులజోదు పుచ్చుకొనియెన్ బుంద్రేక్షుకోదండమున్"-అను కవిసమయమునందుం గల యిక్షుచాపము సిద్ధమై యుండఁగా-"మౌర్వీ రోలమ్బమాలా" అను కవిసమయముం బట్టి రోలంబమాలలే రెండునారు లగుట సమంజసము-రెండుబారులకొఱకే రెండుచోట్ల చెట్టునను అరవిందమునను గోష్ఠులు చెప్పఁబడినవి. ఉపలబ్ధము లైన పెక్కు వ్రాఁతపుస్తకములందు "నందఁగాదరుమరందసరస్సరవింద," అని పాఠమున్నది; అది సున్న లేమి ప్రామాదికము గావచ్చును.— 'దిగ్గియ' - ప్ర. దీర్ఘికా. 'అంచ' - ప్ర. హంసః - 'తూఁడు' - "తోఁచు మృణాళము తూఁడు నాఁగ'.-ఆం. భా.—'నూలి-'

"ఏషా మనో మే ప్రసభం హరన్తీ। పితుః పదం మధ్యమ ముత్పతన్తీ
సురాఙ్గనా కర్షతి ఖణ్డితాగ్రాత్। సూత్రం మృణాళాదివ రాజహంసీ."-విక్రమోర్వశీ.

జంటనారిలో తూఁటినూలు కనఁబడకపోయె ననియు భా.-'జంటనారిం బూనుట'-విరహులపైఁ బాణప్రయోగము సేయుటయందు పటిమ హెచ్చుటకై. 'తరుమరంద'-మరందము కొఱకే "ఫుల్ల" అనుట;-'పున్నాగః పురుషస్తుఙ్గః కేసరో దేవవల్లభః'-అమ.

చ. నిదుప మధూళికల్ దుమునే కొని తీఁగలు సాఁగఁ జుట్టుకొం
చదరి కడాఁక కాచకటకాకృతి సుళ్లు మెలంగె గాడుపుల్

జడగతి నధ్వనీనపరిషత్పటునిశ్వసితానలం బెదు

ర్పడ మఱి సార్చులై చుర చురం దూడ సుళ్లుగ స్రుక్కెనో యనన్. 123

గాడుపుల్ = వాయువులు, అధ్వ...బు - అధ్వనీన = పాంథులయొక్క - పరిషత్ = సమూహముయొక్క - పటు నిశ్వసిత = నిట్టూరుపనెడి - అనలంబు = చిచ్చు - ఎదుర్పడన్ = తమ కెదురుగా రాఁగా, మఱి = మిక్కిలి, సార్చులు = జ్వాలలతోఁ గూడుకొన్నవి, ఐ = (అగుచు - గాలి నుండుచు), తుదన్ = కొనలయందు, చురచురన్ = చురచుర యను ధ్వనితో (ఇది అక్కడ గాలులనప్పుడు అగుధ్వని కనుకరణము), సుళ్లుగన్ = సుడులువడఁగా, స్రుక్కెనో అనన్ = ముడుఁచుకొని పోయెనో అనునట్లు, నిడు...ల్ - నిడుద = దీర్ఘములైన - మధూళికల్ = తేనెయోడికలను, నడుమనే = నేలపైఁ బడక ముందే, కొని = గ్రహించినవై, తీఁగలుసాఁగన్ = జిగటగుణముచే తెగక పర్వుచుండఁగా, చుట్టుకొంచున్ = వానితో సుడులుపడుచు, ఊడరి = పితెంచి, కడా...ళ్లన్ - కడార = గోరోజనపు వన్నెగల - కాచకటక = గాజువలయముల (స్త్రీల చేతుల మట్టిగాజుల యనుట) ఆకృతి = ఆకారము గల, సుళ్లన్ = సుడులుగలవై, జడగతిన్ = మందసంచారముచే, మెలంగెన్ = వర్తించెను.

తా.—మలయ మారుతములు నిడివియైన తేనెయోడికలను నేలంబడకముందే గ్రహించి వీచుచుండును, ఆయోడికలు జిగటగుణము కలవగుటచేత తెగిపోక సన్నసన్నముగా గాలితోఁ గూడ సాఁగుచునే యుండును, గాలి చిన్నచిన్న సుడులు సుడియును, అంతట స్త్రీల చేతులలోని మట్టిగాజుల యాకారముతో గోరోజనపువన్నెతో చుట్టలుచుట్టుకొనుచుండెడి యోడికతీఁగలసుళ్లు గలవై యా గాడ్పులు సంచరించుచుండును.-అవ్విధముగా నుండఁగా-ఈ మలయానిలములకు పాంథులనిట్టూర్పు నిప్పులు ఎదురుపడఁగా వానిచేత నివి దగిలి యిట్లు చురచుర మండిపోవుచు, సుడులు పడఁగా, ముణిఁగి పోయినవో అనునట్లుండెను.-ఉత్ప్రేక్ష.

'మధూళికల్'-మధూళీ వ మధూళికా. "గిరాం దేవీ నద్యః శ్రుతికలితకహ్లారకలికా మధూళిమాధుర్యం క్షిపతి పరిపూర్త్యా భగవతీ."—భోజ. ప్ర.

'కడారః కపిలః పింగపిశంగౌ కద్రుపింగళౌ'-అని. కడారశబ్దమునకు పీఠికలో నిఘంటుకం జూచునది. కటకో వలయో ఒస్త్రియామ్'-అను.-'కాచః' వై. గాజు.

"కాచః కాఞ్చనసంసర్గా ద్ధత్తే మారకతీం ద్యుతిమ్

తథా సత్సన్నిధానేన మూర్ఖో యాతి ప్రవీణతామ్." 'హితోపదేశ.'

'కటకాకృతి'-పదార్థవృత్తినిదర్శన.-'అధ్వనీన' - 'అధ్వనీనో ఒధ్వగో ఒధ్వన్యః పాన్థః పథిక ఇత్యపి'-పీఠికలో పట్టికను చూ. 'పరిషత్'-'సమజ్యా పరిషద్గోష్ఠీ సభా సమితి సంసదః'-అను. ఇట సమూహమాత్రపరము.-'సార్చులు'-సార్చిస్-శబ్దము. "సుళ్లుసుళ్లన్"-అనుపాఠము సాధువయితి దుష్టము. 'చురచుర'-పీఠికలో యతివిమర్శం గనునది.

చ. కురిసిన క్రొంజివుప్పొడులఁ గొంచు నగంబుల మీఁదికై పిశం

గరుచులఁ గొన్ని పెల్లెగసె గాడ్పులను క్ష్మాతి మాధవుండు రా

నెరవుగఁ బూవు సొమ్ములిడి వనేందిర భూమికి వెంచి మెట్టవా

మరచనంబు తాఁ గొన, భ్రమ్మ ఘునా మయుమట్టులో యనన్. 124

వనేందిర = వనలక్ష్మి, పతి = భర్తయైన మాధవుండు = విష్ణుమూర్తి (వైశాఖమాస మనుటయు)రాన్ = రాఁగా, ఎరవుగన్ = స్వల్పకాలోపయోగార్థము, భూమికన్ = వనభూమిక (భూదేవికి అను

టయు), పూవుసొమ్ము ఇడి=తనపుష్పాభరణము పెట్టి (పెట్టుటకును), వెండి=తా నిచ్చిన యెరవునకు బదులు ఎరవుగా, మెట్టతామరరవణంబు = నేలతామరతొడవు, రాన్=విడివచ్చినంతట (పా. తాన్), కొనన్=తాను పుచ్చుకొనుటకును, భ్రమత్ గతులు=తిరుగునట్టి గమనము గలవి (అనఁగా కడియములు అడ్డిగలు మొలత్రాళ్లు ఒడ్డాణములు ఇత్యాద్యాభరణములను దేహమునం దిడుటకును, అందుండి వెలికితివియుటకును వానియందలి సన్ననిరంధ్రములలో త్రిప్పఁబడునట్టి, మలుచుట్టులో=తిరుగుడుమఱలలో, అనునట్లుగా, గాడ్పులసుళ్లు కొన్ని=కొన్ని గాలిసుడులు, కురిసిన క్రిందిపుప్పొడులన్=దట్టముగా క్రిందికిరాలిన పూధూళులను, కొంచున్ = గ్రహించి, పిశంగరుచులన్=పసుపువన్నెలు గలవై, నగంబులమీఁదికై = చెట్లపైకి, పెల్లు= మెండుగా, ఎగసెన్ = లేచి సాఁగినవి.

తా.—చెట్లు నిండ పువ్వులు పూఁచియుండెను, మెట్టతామర వికసించియుండెను, చెట్లలోని పువ్వులనుండి క్రిందికి పూధూళులు వానవలె దట్టముగా రాలినవి. వానిని గాలిసుడులు ఎత్తినవి. ఆ ధూళులు ఆసుడులలో కలియఁగా తన్మయములయిన యాసుడులు గిరగిర తిఱుగుచు పసుపువన్నెలతో చెట్లమీఁదికి ఎగయుచుండినవి, అంతట ఆసుడులు పెల్లుండె ననఁగా,—వనలక్ష్మి యనెడి మహాలక్ష్మి తనకును వనభూమియనెడు భూదేవికిని ఇరువురకును పతియైన వైశాఖమాస మనెడు విష్ణువు రాఁగా, ఆయనయెదుట మనోహరాకారిణులై యగపడుటకై తనపుష్పాభరణములను కొన్నిటిని ఎరవుగా భూదేవికి ఇయ్యగా, భూదేవియొక్క మెట్టతామరతొడవును తాను ఎరవుగా కైకొనను, వానిని తమదేహములనుండి తీయుటకై త్రిప్పు బంగారపుఁదిరుగుడుమఱలలో యనునట్లుండెను:—వస్తూత్ప్రేక్ష.

'కురిసిన'—దీనిచే పెల్లుగా అని తెలియవచ్చుచున్నది.—ఇంకను వనసుందరియొక్క పుష్పాభరణములు ఆమెదేహమునుండి విడలేదు. భూదేవియొక్క మెట్టతామరయాభరణంబును ఆమె దేహమునుండి విడలేదు. విడఁదీయుటకై మఱలు త్రిప్పుదశయే యిట వర్ణితము. కావున ఆ యాభరణములు చోట్లు మాఱకియే యున్నవి. 'ఎరవుగన్'-తత్కాలోపయోగమునకు, 'మెట్టతామర' - మెట్టశబ్దము భూప్రదేశవిశేషవాచకము గావున మెట్టతామరను కవి భూదేవ్యాభరణముగాఁ జెప్పినాఁడు.—'కురిసినపుష్పొడులు'-ఇచట క్రిందికి రాలినట్టు చెప్పఁబడినట్టివి పుప్పొడులు గాని పువ్వులు గావు. 'మరచుట్లులు' - శ. ర. ప్రా. 'మలుచుట్టులు' - శ. ర. లో లేదు. ప్రాచీనులలో కలదు. సుళ్=సుళ్లు.

చ. తరుణు లదోనిదాన మధు ధారఁ దనర వకుళాళి నింపఁగాఁ,
దరుణుల మేము గామె యని తద్గతలౌ వనదేవతల్ ధరన్
ధర వకుళౌఘ మెల్లను ననల్ గనఁ గ్రాయఁగ నించుబుగ్గలన్
దొరసె మధుప్రపూర్ణత మధూకములం బృథు పాండుపుష్పముల్. 125

తరుణులు=యువతులు, అదో...రన్-అదః=ఈపువ్వులకు - నిదాన=ఆది కారణమైన-మధుధారన్=సురా(గండూష)ధారచేత, వకుళ ఆళిన్ =పొగడల సమూహమందు, ననల్=మొగ్గలను, నింపఁగాన్ = నిండింపఁగా, ఏము=మేము, తరుణులము గామె = యువతులము గామా, అని=అని శోటీవహించు, తద్గతలు - తత్=ఆ వనములను - గతలు=పొందినవారలు, వనదేవతల్, ధరన్ = భూమిలోనున్న, వకుళ ఓఘము = పొగడల సమూహమును, ఎల్లను = అంతయు, ననల్ కనన్ = పూచునట్లుగా, క్రాయఁగన్ =ఉమియుటకై, సురన్ =మద్యముతో, నించు బుగ్గలన్ =నిండించు

కొనియున్న పుక్కిళ్లను, మధూకములన్ = ఇప్పచెట్లయందు, పృథుపాండు పుష్పములు = దొడ్డవై పాండురవర్ణములైన పువ్వులు, మధుప్రపూర్ణతన్ = మకరందముతో నిండుటచేత, దొరసెన్ = సరిపోయెను.

తా.—వసంతములో ఇప్పపూచుట, ఆ పూతను కవి వర్ణించుచున్నాఁడు:—ఇప్పలయందు మకరందముతో నిండినపుష్పములు ఎట్లుండెననఁగా, యువతులు తమసురాగండూషమును పొగడల మొదళ్లయందు ఉమిసి వానిని పుష్పింపఁజేయఁగాఁ గని, పోటికై వనదేవతలు భూలోకములోని పొగడల నన్నిటిని పుష్పింపఁజేయుటకై వాని మొదళ్లయందు ఉమియుటకై సురతో నిండించుకొన్నట్టి వారిపుక్కిళ్లో యనునట్లుండెను—వస్తూత్ప్రేక్ష.

'నిదానం త్వాదికారణమ్' - 'మధు మద్యే పుష్పరసే క్షౌద్రేఽపి' - అమ. 'వకుళో ముఖశీధునా' అని దోహదము; 'తరుణులను' - దేవతలు నిత్యయౌవనలు. సురకును మకరందమునకును ఒక శ్వేవర్ణము, (తెలుపు గాదు), ఎఱుపువంటిది; "పద్మరాగ సురారక్తచన్ద్రనాలక్తకద్రవాః... హింగుళం మధురత్నాని స్ఫులిఙ్గా హస్తిబిన్దవః"-కా. క. ల.

ఏతదనుగుణముగానే ౧౨౩లో మాధూలికలు కదారవర్ణములుగా వర్ణితములు.—చెలువల కపోలములను ఇప్పపూమొగ్గలకు మనుచరిత్రములో మహాకవి పోల్చియున్నాఁడు. "ఒప్పులకుప్పలగు నిప్పపూమొగ్గలలోని బుగ్గలందు" ౪(28); స్త్రీలయవయవములకును ఇప్పపూవర్ణనము చెప్పఁబడును.

"ఆతఙ్కక్రమసాహస వ్యతికరోత్కమ్పః క్షణం సహ్యతా ।
మన్దైర్ముగ్ధమధూకపుష్పమధురైర్లావణ్యసారై రయమ్".

అని మహావీరచరిత్రలో సీతం గూర్చి రామవాక్యము:—పాండువనఁగా కేవలము తెలుపు గాదు;—'హరిణః పాణ్డురః పాణ్డుః' అమ. ఇందులకు రామాశ్రమి-'పీతసంవలితశుక్లస్య'-'పాణ్డుస్తు పీతభాగార్ధః కేతకీధూళిసన్నిభః'-అని శబ్దార్ణవము. సారాయికిని కల్లునకును వర్ణభేదము కలదు—సారాయిలు ప్రాయికముగా రక్తకల్పములు, కల్లు తెలుపు; సురాశబ్దము రెండింటికిని పేరు. కావున శంకరమండనమిశ్రుల వికటవాదమందలిది "అహో పితా కిము సురా । నైవ శ్వేతా యతః స్మర" అనువాక్యము బాధింపదు.

"మూర్తిమన్తమివ రాగరసౌఘం తే పరస్పరసమర్పితవక్త్రాః ।
ఆననాసవముషేణ తదాని మక్షిపన్త హృదయేషు యువానః"-సు. ర. భా.

'క్రాయఁగన్'-ఒయ్యారముగా ఉమియుట గాన గ్రామ్యముగాదు.—* "శుకవాణిబుగ్గలు ముకురంబు లనరాదు" అని బుగ్గశబ్దమును అప్పకవి వలదనెను; మఱి పెద్దనగారు సయితము ప్రయోగించిరి. వ్యవస్థ యేమన, కపోల సౌభాగ్యవర్ణనామాత్రప్రధానమగుచోట కూడదని భావము.

పృథుత్వపాండుత్వములు బుగ్గలసాటికొఱకు "కపోలకాన్తిమాధుర్యస్పర్ధిషు ప్రబోధవత్సు మధూకపుష్పేషు"-యశస్తిలకము ౩ (441-2.)

చ. తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ము వృథా విరులెత్తఁ జేసె మో
పరులుగఁ జైత్రుఁ డంచుఁ దదభావమనోభవవహ్ని వెచ్చి ని
ర్భరమధుపాళిధూమము పరాగపు నీఱును దేనెగప్పిచాఁ
దరుదుగఁ దాల్పఁగాఁ గొంకవులై యొఱుగంబడెఁ గొన్నిభూజముల్. 126

* చూ. తిక్కనసోమయాజివిజయము.

తరుణుల కౌఁగిటన్ =యువతుల యాలింగనము చేత, ననుచు=ననలెత్తునట్టి - తమ్ములన్ =గోరంటలను, చైత్రుఁడు=మధుఁడు, మోపరులుగన్ =బరువు మోచువారినిగా, వృథా=అనావశ్యకముగా, ననలెత్తన్ = మొగ్గలు తాల్చునట్లు, చేసెన్ =కావించినాఁడు - అంచున్ =అని ఖేదపడుచు, కొన్ని-భూజములు=చెట్లు, తద...ప్తిన్ - తత్ = ఆతరుణ్యాలింగనముయొక్క - అభావ = లేమివలని - మనోభవ=మదనోద్రేక మనెడి - వహ్నిన్ =నిప్పులో, వెచ్చి=కాలి, నిర్భ...ము-నిర్భర=పెల్లయిన, మధుప=తుమ్మెదల - ఆళీ=సమూహమనెడి - ధూమము=పొగను, పరాగపుఁదుమును=పుప్పొడి యనెడి నిగుడును, తేనెకట్టెచాఁదు = (కొఱవికి మండనితుదిలో ఊరునట్టి) మకరంద మనెడి చమురును, అపురుగ=వింతగా, తాల్పన్ =ధరించునట్లు, కాన్ = సంభవింపఁగా, కొఱవులై = కొఱకచ్చులై (కొరవులై=కురవకవృక్షములై అనఁగా గోరంటచెట్లులై), ఒఱగంబడెన్ =సోలిపోయెను.

తా.—వసంతమందు గోరంట (కురవకము, లేక కొరవి) పూచును; "ఆలిఙ్గనాత్కురవకః" అను దోహదశాస్త్రము ప్రకారము తరుణీజనాలింగనము చేతను బూచును. అట్టి యాలింగనభాగ్యమును పొందనీయక వసంతుఁడు ఆ కొరవులను పూభారము తాల్చునట్లు గావించెను. అంతట వాని యందు ఆ పుష్పసమృద్ధిమూలముగా తుమ్మెదలగుంపులు ముసరుకొనం జొచ్చినవి, పుప్పొడి పెల్లుగా నుప్పతిల్లినది, తేనియ క్రమ్ముకొనం దొడంగినది. ఇదియెల్లం బరికింపఁగా, ఆ యాలింగనము కోల్పోయినందున జ్వలించిన మదనాగ్ని చేత ఆకొరవిచెట్లు కాలిపోయి పొగ లుద్భవించి, నిగుడు గవిసి, మండనితుదలందు కట్టెచమురు గ్రక్కుచు కొఱకచ్చులైనవో యనునట్లుండెను.—రూపకోత్థాపిత గమ్యహేతూత్ప్రేక్ష శ్లేషానుప్రాణితము.

'వృథా'-తెనుఁగున రూ. వృథ;-'మోపరులుగన్' - మోఁతచేటుగా, -"వెచ్చ ననఁ గందె ననఁగను వేఁగ ననఁగఁ। గమలె ననఁగను దనరు నేకార్థములుగ" ఆం. భా. -"వేఁడివేలుపు డిగి వెచ్చి ద్వీపమ్ము। లే డేర్పరీతి"—హరిశ్చంద్ర ద్విపద. 'కొరవి'-కురవకవృక్షపర మయినప్పుడు లఘురేఫము, ఉల్కాపర మయినప్పుడు గురురేఫము, శ్లేషగావున శ్రవణమే ప్రధాన మయినందున అభేదము. 'ఒఱగంబడుట' - వృక్షస్వభావము చేతను కాలిపోయినందునను కలుగును.—'కట్టెచాఁదు'-కట్టెలో సారముండిన కాలునప్పుడు కాలనితుదను చమురు దిగుచుండును. దీనిని ప్రాయిక కట్టెలలో కనవచ్చును.

ఆ. ఫలశలాటు లురుల, నళులకై తమకూఁత। జెలుఁగ, మావు లంటి చెలువ పిండు
మగుడ ననలు నింప, మొగముఁ గన్నులు నెఱ్ఱఁ। బాఱె మిగుల శుక పికములకును.

('కర స్పర్శేన మాకన్దః' అని దో.) చెలువపిండు=తరుణీసమూహము, అళులకై=తుమ్మెదల కొఱకు, ఫల శలాటులు=కాయలును చిగుళ్లును, ఉరులన్ =రాలిపోవుట చేత. తమకూఁతన్ = చిలుకలయు కోకిలలయు కూఁతను, చెలఁగన్ =ధ్వనించుచుండఁగాను, మావులు=మాకందములను, అంటి=చేతితో తాఁకి, ననలు నింపన్ = పూవులతో నిండింపఁగా, శుక పికములకున్ = చిలుక పిండునకును కోకిల పిండునకును, మొగము కన్నులును, మిగులన్ = మిక్కిలిగా, ఎఱ్ఱఁబాఱెన్ = (కోపముచేత) ఎఱుపెక్కెను.

తా.—యువతులు అప్పటికే చిగిర్చి కాచి యున్న మామిడిని చేతం దాఁకిరి, అందువలన, "కరస్పర్శేన మాకన్దః"-మామిడికి కరస్పర్శము దోహదము గావున, అది యా మునుపటి కాయలను చిగుళ్లను రాల్చివైచి క్రొత్తఁగా పూచినది; అందువలన తేంట్లకు పూఁదేనెబోనము దొరకినది,

చిలుకలకు కాయలబోనము, కోయిలలకు చిగుళ్లబోనమును, నష్టమయినవి; ఆ కారణంబున కోపములు కలిగి చిలుకలకు మొగమును, కోయిలలకు కన్నులును ఎఱ్ఱఁబాఱినవి.—హేతూత్ప్రేక్ష; అందులకు యథాసంఖ్యాలంకారము అంగము; కోయిలలకు చిగుళ్లు ఆహార మనుటకు - "పల్లవగ్రాసకషాయకంఠ కలకంఠవధూకలకాకలీ ధ్వనిః." - పారిజా. "శలాటుః పక్వే పర్ణే ధాత్ర్యామ ఫలయో రపి' - విశ్వ. బ్రౌనుదొరవారు ఇప్పద్యావము టీకయందు ఈ నిఘంటువునే యుదాహరించి అవు లనియే యర్థము వ్రాసినారు.-'అళులకై 'చెలువఁ, అనుటచే చెలువపిండునందు పక్షపాతపూర్వక మయిన గురుద్యమును తోఁచుచున్నది. అనియును కోపకారణమే. శుకములసమూహము శౌకము, పికములసమూహము పైకము. చిలుకలకు మొగంబును కోయిలలకు కన్నులును స్వభావముననే ఎఱ్ఱఁగానుండును. చూ. వసు:—

సీ. "ఫలభంగములు సేయుచిలుకకు సాంగమై। క్రోధరసంబు ముక్కునను యుండు।
కాలభేదికి మహాకాలమూర్తికి దంట। కోయిల కెఱమంట గురియుఁగంట." చూ. రత్నగణము-
"చకోరసారస పారావత కోకిలదృష్టయః। కిరాహారి హంసచక్షువ్వ (జీ) శుకమర్కటయోర్ముఖమ్"

'మిగులఁ' - చెలువలదొడ్డన్యము కారణము; 'ఎఱ్ఱఁబాఱుట' - తమయున్నమం బోఁగొట్టిన కోపముచేత; పికములును పండ్లను తినును.—

'మహ దపి పరదుఃఖం శీతలం సమ్యగాహుః। ప్రణయ మగణయిత్వా యన్మమాపద్గతస్య
అధరమివ మదాన్ధా పాతు మేషా ప్రవృత్తా। ఫల మభినవపాకం రాజజమ్బూద్రుమస్య.' వి.ఊ.

మ. అతులప్రేమరసార్ద్ర యోర్తు ప్రియహాస్యక్రీడ సంకేత వం
చిత యై తత్క్షణజాంగజజ్వరమిళ చ్చిత్తభ్రమం బూన్ప నా
పతి నోవృక్షమ కానవే యన సపుష్పం బయ్యెఁ గోఁ గంతలో
నతఁడు న్దోఁచిన నవ్వుడు న్విరిసెఁ బ్రాంతాంచ న్నమేరుద్రుమున్. 128

అతు...ర్ద్ర-అతుల=సాటిలేని-ప్రేమరస=అనురాగభావము చేత - ఆర్ద్ర=సరసయైన-ఓర్తు=ఒక చెలువ, ప్రియహాస్యక్రీడన్ = కాంతునిపరిహాసకేళిచేత, సంకేతవంచిత ఐ = (తమకూటమికై యేర్పఱుచుకొన్న) సంకేతస్థానము విషయమున మోసగింపఁబడినదై (అనఁగా అతఁడు ఆతావునకు వచ్చియు పరిహాసార్థము దాఁగియున్నందున). త...బు-తత్క్షణ=ఆనిముసమున-జ=పుట్టిన-అంగజ=మదనునివలని-జ్వర=వేఁడిచేత-మిళిత్ =కూడిన-చిత్త భ్రమంబు=మనస్సుయొక్క-తబ్బిబ్బు-ఊప్పన్-ప్రేరింపఁగా, ఓవృక్షమ నాపతిన్ కానవే, అనన్-అనఁగా, గోఁగు=కర్ణికారము, సపుష్పంబు=పూవులతోఁ గూడుకొన్నట్టిది, అయ్యెన్; అంతలోన్ =అంతమాత్రాన, (అనఁగా ఆపూతియొక్క వెలుఁగుచేత). అతఁడున్ =ఆదయితుఁడును, తోఁచినన్ = కనఁబడఁగా, నవ్వుడున్ =ఆచిత్రమునకు ఆమె నవ్వఁగా, ప్రాం...వున్-ప్రాంతి = ఆచెంత-అంచత్ = ఒప్పుచున్న - నమేరుద్రువున్ =సురపొన్న చెట్టుకూడ, విరిసెన్ =పుష్పించెను.

తా.—భర్తపై అత్యంతప్రేమార్ద్రహృదయ యొకతె అతనిం గవయుటకు సంకేతస్థానమునకుం బోయినది. అతఁడు వచ్చియుండియు పరిహాసముకై చెంతనే చాటున దాఁగియుండెను. అంతట నామె తత్క్షణమే కలిగినవియోగవ్యథాజాత మయిన మదనజ్వరము చేత ఉన్మాదావస్థం బొంది అచ్చటియొక చెట్టును 'ఓ చెట్టా, నా ప్రియుని నీవు చూచితివా?' అని యడిగెను. ఆచెట్టు ఒకగోఁగు-అనఁగా కర్ణికారము-"సల్లాపతః కర్ణికారః"-దానికి సల్లాపమే దోహదము - గావున-ఆమె చేసిన

యాసల్లాపమునకు అదివికసించినది. కర్ణికారపుష్పములు బంగారువన్నె గలవై మిక్కిలి ప్రకాశించును గావున ఆ వెలుఁగుచేత ఆచాటున దాఁగియున్న దయితుఁడు కానంబడెను. ఆచిట్టకమునకు ఆమె నవ్వినది. "నమేరుర్హసితేన చ" అని చెప్పినప్రకారము నవ్వు నమేరువునకు దోహదముగాన, దానిచేత ఆచెంతనున్న నమేరువుకూడ వికసించినది. ప్రహర్షణాలంకారము.—

"యతనము లేకయ యుత్కం। ఠితవస్తుప్రాప్తి, కోర్కికిన్ మించెడునా
తతసిద్ధి, యుపాయార్థో। ద్యతికై ఫలసిద్ధియును, బ్రహర్షణము లగున్." అలం.

ఇందలి నాయిక అభిసారిక. కాంతునికై సంకేతస్థానమునకై పోవు నాయిక అభిసారిక యనంబడును-"కాన్తార్థినీ తు యా యాతి సంకేతం సాభిసారికా" దశరూ. "ఊన్పన్" వ్రాఁత ప్రతులందెల్ల ఇదే పాఠము. ఇదే శ్రేయము, పూనునకు ప్రేరణార్థకము. 'గోఁగు' - కర్ణికారపుష్పమును దీపికకుం బోల్తురు, అది అట్టివెలుఁగు గలది. అందువలన. అది పూవఁగానే, చీకటి యెడలుటచేత, చెంగట జీబులో దాఁగియున్న దయితుఁడు ఆవెలుతురులో అగపడె ననుట మిక్కిలి హృదయంగమముగా నున్నది.

"పరిజనవనితాకరార్పితాభిః। పరివృత ఏష విభాతి దీపికాభిః
గిరిరివ గతిమా నపక్షలోపా। దనుతటపుష్పితకర్ణికారయష్టిః"—విక్రమోర్వశి.

ద్రువు=ద్రుశబ్దము ఉకారాంతము కావున వుగాగమము.

తే. స్థాణు వొక్కండు మగవాఁడు తలఁక కుమియ
ఫల మొసఁగె నట్టె కినియక, పద్మవదన
వదనసురఁ గూర్మి నొసఁగ నీవలదె పుష్ప
మైన ననుమాడ్కి నుమిసిన నలరెఁ బొగడ. 129

స్థాణువు=మోఁడు (శివుఁడును), మగవాఁడు ఒక్కఁడు=పురుషుఁ డొకఁడు (కన్నప్ప యను బోయవాఁడు), తలఁకక=వెనుదివియక (జంకక), ఉమియన్=ఉమ్మివేయఁగా, (పుక్కిటిజలమును పూజార్థమై శివలింగముమీఁద నుమియఁగా), కినియక=కోపగింపక, ఫల మొసఁగెన్=పండునిచ్చినది. (కామితము నిచ్చినాఁడు), అట్టె = ఆశ్చర్యము; పద్మవదన = కమలమువంటి ముఖముగలది (ఐనసుందరి), వదనసురన్ = పుక్కిటి మద్యమును, కూర్మిన్=అనురక్తితో, ఒసఁగన్=అర్పింపఁగా, పుష్పమైనన్=పువ్వయినను, ఈవలదె= ఈయనక్కఱలేదా, అనుమాడ్కిన్=అనువిధమున, ఉమిసినన్=సురను ఉమియఁగా, పొగడ=వకుళము, అలరెన్=పుష్పించెను.

తా.—కన్నప్ప (తిన్నఁడు) అనుబోయ శివలింగముపై స్నపనార్థము పుక్కిటిజలము నుమిసెను. అందులకు మెచ్చి పరమశివుఁ డాతనికి ఇష్టఫల మొసంగెను. ఏతద్విస్తరమును శ్రీకాళహస్తిమాహాత్మ్యములోఁ గననగును. స్థాణువనఁగా శివుఁడును మ్రోడును. దీని నాశ్రయించి కవి యిట్లు వర్ణించుచున్నాఁడు.—మగవాఁడొకఁడు తనపైనుమియఁగా స్థాణువు కోపగింపలేదు సరిగదా మఱి కామితఫల మొసంగెను; ఆశ్చర్యము! నేను ఆకులు కొమ్మలు కల సంపన్న వృక్షమును. నాకు అనురక్తితో పద్మవదన తనపుక్కిటి సురాగండూషమును వలపుకత్తెయుంబోలె నొసంగుచుండఁగా నేనొక పువ్వయినను ఈవలదా-యని తర్కించుకొన్నట్లు, పొగడచెట్టు సురాగండూషమును సుందరి యొసంగఁగా, పువ్వులు పూచెను.—ఉత్ప్రేక్ష-అర్థాపత్త్యుత్థాపిత.

"స్థాణుః పుమాన్ మహాదేవే శఙ్కౌ వస్త్రీ స్థిరే త్రిషు,"-నానా.

“కినియక”- ఉమియుట యనునపరాధమునకు కోపించుటయు దండించుటయు సహజమై యుండఁగా, అట్లుచేయక ఫలమొసంగుట అన్యాదృశమయిన దొడ్డతనమును తెలుపుచున్నది. ‘అట్టె.’—“నలుసకాని నలినదళనేత్ర వరియింప దట్టె! చూతమనుచు సమీరవరులు”-భా. ఆ.

ఇట తారతమ్య మరయునది—‘స్థాణువు’×‘వకుళము;’ ‘మగవాఁడు’×‘పద్మవదన;’ ‘తలఁకమి’×‘కూర్మి;’ ‘ఉమియుట’×‘వదనసుర నొసంగుట;’ ‘ఫలము’×‘పుష్పము’.-“వకుళో ముఖసీధునా” అని దోహదముగదా. ఒక టీకలో తిన్నఁడు శివలింగమున కొసంగినట్టిది సుర యనియున్నది; కాళహస్తిమాహాత్మ్య ప్రబంధములో స్నానార్థము గండూషజలము నొసంగిన ట్లున్నది;

మ. “అన, మోదించి హరిద్విజుం డొదుఁగఁ, జెంచ వ్వేళ నేతెంచి, పా
వననిర్మాల్యముఁ జెప్పుఁగాలికొనఁ బోవం ద్రోచి, గండూష జీ
వనసేకం బొనరించి, పత్త్రి రిడి, త్రోవ ల్గాచి తా నేసి తె
చ్చిన క్రోలామిషఖండముల్ దనకు భిక్షింపంగ నందిచ్చినన్. 3 (105.)

‘ఉమియు’-ఇది గ్రామ్యము కాదా యనిన, కాదు; ఒక్కెడ భక్తిరసభరితపూజాంగముగా కథ యుల్లేఖయైనందునను, ఒక్కెడ హర్షోత్కర్ష సంప్రీతత్వంగారి చేష్టగా హృద్యాంగము మగుకతనను గ్రామ్యముగాదు: గ్రామ్యమునకు రోఁత వలయును, ఇటరోఁత యెక్కడిది? కనుక నిది యిట గౌణవృత్తివ్యాపారము మై యతిమనోహరమై యున్నది.—‘నసుచె’ అనుపాఠమున యతిభంగము. ‘నలచె’ అని పఠించిన సరిపడును.

తే. మధువుఁ గాంతలపుక్కిటి మధువుఁ, జెల్లి
యార్పఁ, బస చూపఁ, బొగడపై నెలయ, దాన
విరిసెఁ దొల్లిటి దళములు, విరులు జడిసె
దీన, నగ్గల్పునకు నుబ్బి తేటు లార్చె. 130

మధువున్ — చైత్రమాసమును, కాంతల పుక్కిటి మధువున్ = వనితలయొక్క గండూష సురయు, జెల్లి యార్పన్ = రెండింటికిని మధువనియే పేరుగలిగిన యీసుచేత, పసన్ = స్ఫురణమును, చూపన్ = నిరూపించుటకై. పొగడపైన్ = వకుళవృక్షముమీఁద, ఎలయన్ = వ్యాపించఁగా. దానన్ = మధుమాసముచేత, తొల్లిటి దళములు = ముసుపటియాకులు, విరిసెన్ = ఊడిపోయెను, దీనన్ = కాంతలపుక్కిటిమధువుచేత, విరులు జడిసెన్ = పువ్వులు జడిగాకురిసెను, అగ్గల్పునకున్ = కాంతలపుక్కిటి మధువుయొక్క ఘనమునకు, ఉబ్బి = సంతోషముతో ఉప్పొంగి, తేఁటులు = (ఆపువులలోని మకరందమును త్రాగుచున్న) తుమ్మెదలు. ఆర్చెన్ = హర్షధ్వనులు కావించెను.

తా. సమానులలో ఈసు ప్రసిద్ధము. చైత్రమాసమును కాంతలపుక్కిటిసురయు రెండును మధువను పేరుగలవగుటచేత సమానములై యున్నందున, వానికి పరస్పరము “నేనెచ్చు నేనెచ్చు” అని ఈసు కలిగినది. అంతట అవి తమతమ యౌత్కర్ష్యము ప్రకటముగా స్థాపించుటకై రెండును వకుళవృక్షముపైఁ బర్వఁగా, ఆపరీక్షలో మాధుమాసమువలన వకుళమునకు అప్పటికున్న యాకులు సయితము రాలిపోయినవి, సురవలన విరులజడి గలిగినది. కాంతాగండూషమధువే జయమందినందులకు తుమ్మెదలు హర్షధ్వనులు చేయసాఁగినవి.—హర్షమేలయన తమకు సమృద్ధిగా తేనె దొరకునుగదా యని.

వసంతము రాఁగానే పొగడకు పండుటాకులు రాలినవనియు, పిమ్మట కామినీవదనసురాదోహదముచేత, పెల్లుగా పూఁత గలిగినదనియు వస్తువు. దానిని కవి పైయట్లు ఉత్ప్రేక్షించినాఁడు. హేతూత్ప్రేక్షాలంకారము-వ్యతిరేక యథాక్రమ సంకీర్ణము.

వసంతము రాఁగానే పండుటాకులు రాలుట ప్రసిద్ధము:—

ఉ. "పండినయాకు డుల్ల, నవపల్లవముల్ తిలకింపఁ, బూఁబొదల్
నిండఁగఁ బర్వ, లేఁగొమలు నిద్దములై నిగుడంగ, మ్రాఁకు లొం
డొండ తలిర్చె, నామని సముజ్జ్వలయోగరసాయనక్రియం
గొండికపాయముల్ మగుడఁ గొరి భజించినసిద్ధుఁడో యనన్" (ఎఱ్ఱాప్రగడనృసింహపు.

"పస యన స్ఫురణంబు పరఁగుచుండు." ఆం. భా.

'దళములు విరిసెన్' - ఉన్న దానినే పోఁగొట్టినది, ఎంతపనికిమాలినది! అని భా. పుక్కిటి మధువుతోడి తారతమ్యములో అత్యంతహీనమును విపరీతగుణము ననుట. 'పసదూపుటకు' యత్నింపఁగా పసలేదు సరియేగదా' పయిగా ఇది చెట్ట చేయునది యని యేర్పడినది. 'విరులు జడిసెన్ '= దానిమహిమకు మెచ్చి వనదేవతలు విరులవాన కురియించి రనియు ధ్వని,-'జడిసెన్'-జడియు ధా.- "దీనికి అర్థము 'వర్షించు' అని 'శబ్దార్థకల్పతరువు'నందు వ్రాయఁబడియున్నదిగాని ప్రయోగము కనఁబడలేదు." అని. శ. ర. నంగున్నది. కాని ఇదే ప్రయోగము.—"దళఃఖడ్గే దళం పర్ణే," నానా. తేఁటులకు ఉబ్బెల యన ఆ పూవులమకరందము వానిభాగ్యము గాన. బ్రౌనుదొరగారు 'జడియు'నకు పుష్పించుటనుగూడ అర్థముగా వ్రాసియున్నారు.

ఉ. మేకొని తాఁచినం భృగువు మెచ్చిన వానికి మర్త్య భార్య యౌ
శ్రీకి నివాస మై చెలిమి సేయుట నిట్టిప్రశాంతి గల్గెనో
కా కన, నాతి దన్నిన వికాసము నొంది, వనస్థలస్థితా
శోకము సేసె మెచ్చునఁ బ్రసూనరజఃకనకాభిషేకమున్. 131

మేకొని = పూనుకొని, తాఁచినన్ = తన్నినందులకు, భృగువున్ = భృగుమునిని, మెచ్చిన వానికిన్ = అనుమోదించిన నారాయణునికి, మర్త్యభార్య = మనుష్యజాతి కళత్రము (అనఁగా రామావతారమందు భార్య), ఔ శ్రీకిన్ = అయినట్టి లక్ష్మికి (అనఁగా సీతాదేవికి), నివాసమై= నెలవై, చెలిమి సేయుటన్ = మైత్రి గావించినందున, ఇట్టి ప్రశాంతి = ఇంత శాంతస్వభావము, కల్గెనో కాక = కలిగినది కాఁబోలు, అనన్ = అనునట్లు, వనస్థల స్థిత అశోకము = ఉపవనములో నున్న కంకేళి, నాతి=పడఁతి, తన్నినన్ =తన్నఁగా, వికాసము నొంది = సంతోషించి (పుష్పించి అనియు), మెచ్చునన్ = ప్రీతిచేత, ప్ర...మున్ - ప్రసూన=పూవులయొక్క - రజః = పరాగమనెడి - కనక = బంగారపు నాణెములయొక్క (వరాలయొక్క) అభిషేకమున్ = స్నపనమును, చేసెన్ = కావించెను.

తా.—పూర్వము భృగుమహాముని శ్రీమన్నారాయణుని అజ్ఞానకృతముగాఁగాక బుద్ధిపూర్వకముగా కాలితో తన్నెను. అందులకు ఆభగవంతుఁడు ఆమునిని మెచ్చి మిక్కిలి సత్కరించి పంపెను. అట్టి యాశాంతగుణమును అశోకవృక్షము ఆ దేవునికి రామావతారమందు కళత్రమయిన సీతాదేవికి లంకలో నివాసమై ఆమెతో చెలిమి గావించినందులకు ఫలముగా పొందెనా యను నట్లుగా యువతి యోర్తు తన్ను తన్నఁగా ఆయువతికి తాను మెచ్చుచేత పుప్పొడి ముత్తమానెడి కనకాభిషేకముం గావించెను.— రూపకానుప్రాణిత హేతూత్ప్రేక్ష, 'మేకొని' పూనికతో అనునర్థమునకు-

క. "మేలున సంతసిల్లునెడ మేకొని యాపదలొందు, నాపదల్
దూలఁగ భూరిసౌఖ్యములు దోఁచుఁ, గృతంబులు దప్ప వెమ్మెయిన్."—భా. ఆ.5 (34).

భృగువు త్రిమూర్తులయొక్క సత్త్వగుణ తారతమ్యమును నిరూపించుటకై మహర్షుల నియోగమునం బోయి త్రిమూర్తులం బరీక్షించెను. వారిలో నారాయణుం బరీక్షించినవిధము ఆయనను తన్నుట. ఆపరీక్షలో నారాయణుఁడొకఁడే పరమప్రీతితో నతని సత్కరించెను. అందువలన నతఁడే త్రిమూర్తులలో పూజ్యుఁడని ఆఋషులు నిశ్చయించిరి. ఇట్లు ఈయన పూనికతో పోయి తన్నినవాఁడే గావున—'మేకొని' అనఁగా 'పూనుకొని' అని అర్థము చెప్పవలయును. 'మేకొనుట' యనఁగా 'అంగీకరించుట' యనునర్థము ఇచ్చట పొందదు. అంగీకరించి తన్నెనా? అంగీకరించి మెచ్చెనా?—'కనకాభిషేకము'.-ప్రసూనరసోదర్యము కనకవర్ణము గావున.

మ. అళు లేతద్వదనేందురాగ మిళనాప్రాదుర్భవత్కోరకం
బుల తేనె ల్సుధ లంచు రా నొకతె నెమ్మో మెత్తఁ, జైత్రంపుఁబు
వ్వులలోఁ దగ్గుణు లయ్యె గంధఫలిఁ బువ్వు ల్పుట్టి పోఁదోలె నొ
చ్చెల చేఁదై, తఱచెందఁ దల్లిబడికిం బుట్టోటయేకా మహిన్. 132

ఒకతె నెమ్మోము ఎత్తన్=ఒకానొక చెలువ ముఖమును ఎత్తఁగా, (ఆముఖరాగముచే), గంధఫలిన్=సంపెంగయందు, పువ్వుల్, పుట్టిన, ఏత...ల్-ఏతత్=ఆచెలువయొక్క-వదన=ముఖమనెడి-ఇందు=చంద్రునియొక్క - రాగ=రక్తిమయొక్క-మిళనా=కూడిక చేత, ప్రాదుర్భవత్=(సంపెంగనుండి) పొడముచున్న - కోరకంబుల = మొగ్గలయొక్క - తేనెల్ = మకరందములు, సుధలు = సుధవలె అతిమధురములును ముదిమిలో మృతిని తప్పించునవియును, అంచున్=అని తలంచి, అళులు=తుమ్మెదలు, రాన్=(ఆమకరందమును ఆనుటకై) రాఁగా, చైత్రంపుఁ బువ్వులలోన్=చైత్రమాస కృతగంధఫలీ పుష్పముల నడుమ, ఒచ్చెల=అక్కటా, తద్గుణులు=ఆచైత్రకృతగంధఫలీ పుష్పగుణమే కలవియు, చేఁదై=తిక్తములును ఐ, పోఁదోలెన్=(ఆయళులను) తఱిమివేచినవి, తఱచు=ప్రాయికముగా, మహిన్ = లోకమందెల్ల, తల్లిబడికిన్ బుట్ట=తల్లి పోలికలోని దుర్గుణము, బోటయేగా=బోఁటులకు తప్పదు గదా.

తా.—సంపెంగయందు చైత్రముచేత ఉత్పన్నములయిన పువ్వులు ఉండనే యుండినవి. ఇట్లుండ, ఒకానొకతరుణి సంపెంగవైపు నెమ్మోమెత్తఁగా 'ముఖరాగేణ చమ్పకః' అనుదోహదశాస్త్రము ప్రకారము ఆమెయొక్క ముఖచంద్రరాగముచేత సంపెంగయందు క్రొత్తఁగాఁ బువ్వులు పుట్టెను. ఆపువ్వులు ముఖేందురాగజనితములు గావున, వానితేనెలు సుధాగుణము గలవిగా నుండును, అనఁగా మధురతమములుగాను జరామరణ నివారకములుగాను, ఉండును, చైత్రునివలనఁ బుట్టినట్టి సంపెంగలవలె చేఁదుగా నుండవు, తమ్ము తఱుమవు, అని ఆశపడి ఆపువ్వులకై తుమ్మెదలు వచ్చినవి. అట్లే సంపెంగయందు ముఖరాగముచే పుట్టిన పువ్వులు, అక్కటా అవియు చైత్రకృతములవలెనే చేఁదై ముగిమడిచి, వానిని తఱిమినవి. ఆపువ్వులకు తండ్రియయిన ముఖచంద్రుని గుణము రాలేదు, మఱి ఏమి వచ్చినదన, తల్లియైనగంధఫలియొక్క దుర్గుణమే వచ్చినది. అది న్యాయమే. ఎట్లన, లోకములో ప్రాయికముగా తల్లిపోలికగల బిడ్డలకు, తల్లియొక్క చెడుగుణములు రాక మానవు. వీనికి తల్లిపోలిక యెట్లనఁగా, ఇవి తండ్రివలె చంద్రులుగా పుట్టక తల్లియైన గంధఫలిగానే పుట్టినవి. కావున వీనికి తల్లిపోలిక; అందువలన దాని చెట్టతనము తప్పినదిగాదు.—అర్థాంతరన్యాసము.

పువ్వులంగూర్చి గంధఫలికి శబ్దగత స్త్రీలింగముం బట్టియు. గంధఫలియందే అవి యుత్పన్నము లగుటంబట్టియు మాతృభావము చెప్పంబడినది. ఇందునికి సిద్ధమైన పురుషతచేత పితృభావము చెప్పఁబడినది. తల్లిబిడిలో లనుటలో సంపెంగచెట్టునకును పువ్వునకును అభేదభావన కలదు, అందువలన పూవులగుణమే అనఁగా తుమ్మెదలఁదలుముగుణమే చెట్టునకుం జెప్పఁబడినది. 'సుధ'_తండ్రియైన చంద్రుని పోలిక వచ్చినచో కలుగఁదగినది.—'చైత్రంపుఁబువ్వులు'— ముఖరాగజనితము సయితము, చైత్రజనితంపుగుణమునే చూపినది. అళి చంపకపుష్పముం దరిసిన మూర్ఛిల్లు నని ప్రసిద్ధి. చూ. 16 టీక. 'ప్రాదుర్భవత్' అనుచో కొంద ఱెన్నిన యతి దోషమునకు సమాధిని పీఠికలో పుట 24 కనునది.

చ. అలరెఁ బ్రియాళు వోర్తు ప్రియ మాట వసంతముఁ బాడ, నప్పుడ
వ్వెలఁది సపత్ని 'భక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగమన్
ఛలమునఁ దన్నుఁ బాడఁగ వసంతుఁడు దా దయసేసెఁ గాక, యా
యలె నిజశక్తినా' యనుచు నాపసకుం గొదవెట్టె నీసునన్. 133

ఓర్తు, ప్రియ మాటన్ = తనకు ఇష్టమగుటచేత, వసంతమున్ = వసంత మనురాగమును. పాడన్ = గానము సేయఁగా, ప్రియాళువు = ప్రేంకణపుఁజెట్టు, అలరెన్ = పుష్పించెను, అప్పుడు. ఆవ్వెలఁదిసపత్ని = ఆపాడిన లేమయొక్క సవతి, వేల్పులు = దేవతలు, భక్తికిన్ = తమకు చేయుసేవకు, మెత్తురు = అనుగ్రహింపుదురు, కానన్ = ఆ కారణంబున, రాగము అను ఛలమునన్ = వసంతరాగ మనెడి మిషచేత, తన్నున్ = తన (వసంతుని) ప్రభావమును, పాడఁగన్ = ఆలేమ గానముసేసి నందున, వసంతుఁడు = ఆమని, తాను, దయసేసెన్ = ఆలేమయందు, అనుగ్రహము తాల్చి ప్రియాళువును పూవంజేసెను, కాక = అంతియగాని, ఆయాలె = ఇసీ, నిజశక్తినా = దీనిస్వశక్తిచేత దోహదమున వికసించినదా, అనుచున్ = అని పలుకుచు, దాని ఆ పసకున్ = ఆ లేమయొక్క దోహద ప్రభావమునకు, ఈసునన్ = ఈర్ష్యచేత, కొదవెట్టెన్ = లోపము కల్పించెను.

తా.—ఒక లేమ గానదోహదముగా తనకు ప్రియమయిన వసంతరాగమును పాడి ప్రేంకణపుఁజెట్టును పుష్పింపఁజేసినది; దానికి ఈసుచేత ఓర్వలేక ఆమెయొక్క సవతి తదీయ దోహదసిద్ధికి కొదువ పెట్టినది. ఎట్లు పెట్టినదన, 'వేల్పులు భక్తికి మెత్తురు, అందువలన ఈమె వసంతరాగము పాడుటయను మిషచేత వసంతునే పాడఁగా, అందులకు ఆయన యనుగ్రహించి ఈమె యత్నించిన దోహదము ఫలించినట్లు కాగపడని అని, ప్రేంకణమును పూవఁజేసినాఁడు, అంతియగాని, ఈమెపస మే మెఱుఁగమా?' అని ఆపసకు కొదువవెట్టినది. కైతవాపహ్నుతి.

"గీత్యా ప్రియాళుః" అని ప్రియాళుదోహదము. "వసన్త స్సహాయ స్తు వసన్తర్తౌ ప్రగీయతే" అని సంగీతశాస్త్రము. వసంతమందు వసంతరాగము పాడుదురు. మా. వసు. 1 (131.)

'ఆయాలె' = "ఆ+ఆ+లెమ్ము - అనాదరమును తెలిపెడిని." శ. ర.

తే. అధరసుధ బ్రాణజతిఁ బ్రోవ యగుచు మాక్త
కాంచమాలిక నిడెను నా సాగ్రహోక్తి
కంబ యునఁ జాలునన లిచ్చు గతజనత్వ
మంపు వావిలి మొగ మూర్పు నింపనోక్త. 134

వావిలికి సుందరీముఖవాయువు దోహదము; దానిని వర్ణించుచున్నాఁడు:—ఓర్తు = ఒకత, మొగము ఊర్పు = ముఖవాయువును, నింపన్ = నిండింపఁగా; (ఊదఁగా,) నాసా అగ్రమౌక్తికంబ = ముక్కుకొననున్న (బులాకీ) ముత్తెమే, ప్రాణిజతన్ = ప్రాణము గలిగియుండినదైన ముత్తెపుఁజిప్పనుండి పుట్టిన దగుటచేత, అధరసుధన్ = మోవియందలియమృతము (సోఁకుట) చేత. ప్రాణి = ప్రాణము గలది (బ్రదికినట్టిది), అగుచున్, మౌక్తిక అండమాలికన్ = ముత్తెములనే గ్రుడ్లపరంపరనుగా, ఇడెన్ = పెట్టినది (ఇడెననుట గ్రుడ్లనుగావున), అనన్ చాలు ననలు = అనఁదగిన మొగ్గలను, గత...లి_గత = రాలిపోయిన - జరత్ = ప్రాఁత-సుమంపు = పూవులుగలదైన (అనఁగా పూలు రాలిపోయిన) - వావిలి = సిందువారము, ఇచ్చెన్ = పూచెను.

తా.—ఒకవావిలిలోని పూవులు రాలిపోయినవి, అంతట ఒకలతాంగి దోహదార్థమై వావిలిమీఁదికి తనముఖవాయువును నిగిడ్చినది, అంతట, అది పువ్వులతో నిండినదాయెను. అట్లగుట ఎట్లుండెననఁగా, ఆమెయొక్క బులాకీముత్తెము ప్రాణియైన ముత్తెంపుఁజిప్పకడుపునఁ బుట్టినదగుటం జేసి యిపుడు ఆమెయొక్క యధరంపుటమృతము సోఁకినంతట పెంపేమి ప్రాణమొందినదై ముత్తెపుగ్రుడ్లపరంపరను పెట్టినదో యనునట్లు ఉండెను.—వస్తూత్ప్రేక్ష.

"సిన్దువారో ముఖానిలాత్" అని వావిలికి దోహదము. 'గతజరత్సుమంపు'-వావిలిపువ్వులు రాలిపోవుట కవిసమయసిద్ధము-"శేఫాలికాసుమే భ్రంశం వర్ణయే న్న సదప్యదః"—కా. క. ల. ఇట భ్రంశము లేనప్పుడుగూడ ఉన్నట్లు వర్ణించుట కవిసంప్రదాయమని భావముగానున్నది; మధుర్మాధవశ్చవసన్తః -

"అయం ప్రసూనోత్సుకకర్ణికారః। పుష్పప్రపఞ్చాఞ్చితకాఞ్చనారః।
విజృమ్భణాశోకవిదకోవిదారః। కాలోవికాసోద్ధతసిన్దువారః" ఋతు.

ప్రాఁతవి రాలక క్రొత్త వెట్లుపొడముసు? - సిందువారము = వావిలి; శేఫాలిక = నల్లవావిలి; కావున అనయు వావిలియే, - గతరజస్సుమంపు" అని పా. దానికి - "రజస్స" నెడి స్త్రీఋతువు తీరిన అనఁగా 'ఋతుస్నాతయైన' అని యర్థము చెప్పనగును. "కుసుమం స్త్రీరజో నేత్రరోగయోః ఫలపుష్పయోః," మేదిని.—'కుసుమమ్'-సుమమ్-"గతజరత్సుమంపు"- 'ముదిమిచే ఆర్తవ ముడిగిన' అనియు భా.—'మౌక్తికాండ' - ముత్తెములనే గ్రుడ్లనుగా పెట్టినదని భావము. 'మాలిక' - చెట్టంతయుం బూచినదనియు భావము.

చ. ఘన మగు నాకు రాలి, తిలకం బతిరిక్తత నున్న, నోర్తు, లోఁ
గనికర మూని, కన్నుఁగవఁ గాయజుఁ డిల్లడ యిడ్డ తూపులే
యనువుగ నించెఁగాక, మఱి యంటక ముట్టక యొక్క చేష్ట లే
క నెగడఁ జేసె నంట యిది కల్లనఁగా, వలరించెఁ జూపులన్. 135

ఘనము అగు ఆకురాలి = దట్టమైనయాకులు రాలిపోయి (ఒడలినిండ ధరించియుండిన యాభరణములను కోలుపోయి అని), తిలకంబు = బొట్టుగుచెట్టు (దీనికి చూపే దోహదము) అతిరిక్తతన్ = అత్యంతమయిన లేమిలో (దారిద్ర్యములో), ఉన్నన్ = ఉండఁగా, ఓర్తు = ఒకయువతి, లోన్ = మనస్సులో, కనికరము = కరుణను, ఊని = వహించి, కన్నుఁగవన్ = తనకన్నుదోయియందు, కాయజుఁడు = మదనుఁడు. ఇల్లడ ఇడ్డతూపులె = (పదిలముగా కాపాడుమని) న్యాసముగా నుంచినట్టి బాణములే, అనువుగన్ = సుందరముగా, (గకారము వకారమగుటయుం గలదు గావున-చెలికత్తెగా అనియు), నించెన్ కాక = అబొట్టుగుచెట్టునందు నిండించినదిగాని, మఱి = అటుగాక, అంటక =

తాఁకనైనందాఁకక, ముట్టక=కదలింపనైనను కదలింపక, ఒక్క చేష్టలేక=ఏచేష్టయులేక, నెగడఁ జేసెన్=వికసించునట్లు జేసినది, అంట ఇది = అనెడుమాట, కల్ల=అబద్ధము, అనఁగాన్ = అనునట్లుగా, చూపులన్=చూడ్కులచేతనే, అలరించెన్=ఆబొట్టుగును పూవంజేసెను.

తా.—బొట్టుగుఁజెట్టునకు "తిలకో వీక్షణేన" అని దోహదము; బొట్టుగు చెట్టొకటి ఆకులెల్ల రాలి కేవలము రిక్తముగా నుండఁగా, ఒకబోటి కనికరించి, చూపుదోహదముచేత దానిని పూవులతో తటాలున నిండించెను. ఆ వింత యెట్లుండె ననఁగా, 'ఈమె ఆ బొట్టుగును తాఁకలేదు. కదపలేదు, ఏచేష్ట లేక అలరంజేసిన దనుట నమ్మరానిమాట, ఇది అలరంజేఁత కాదు, మఱి ఏమన ఈమె తనకనుఁగవయందు మదనుఁడు దాఁచుకొని పోయిన యాతనిబొట్టుగు పూఁబాణములే ఆ బొట్టుగుమీఁద నిగిడ్చినది-అనునట్లుగా నుండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'ఘనమగు'-గొప్పదైన. మహామూల్యమయిన యనియు ధ్వని. - 'ఘనమగు నాకు'-పూర్వము ఒడలెల్ల భూషణభూషితురాలై యుండెనని ధ్వని, కలవారికి లేమివచ్చినం గనికరించుట ఉదాత్తచిత్తులకు మొదటిపని గదా.-'లోన్'-పైకేమియు. చెప్పక-'కామజుఁడు'-తన దేహమునం బుట్టినవాఁడు గావున ఆ నమ్మకముచేత తనకంటియందే ఇల్లడయుంచినాఁడనుట - నెగడెఁజూడ్కిన్. అనుపాఠమున - 'ఈమె చూపుచే బొట్టుగు వికసించినది.' అని యర్థము - కృశులను కోలుకొనం జేయువారు పైకి ఎన్నియో యుపచారములు చేయుదురు, లోనికిని మందులను భోనములను ఒసంగుదురు, అట్టి కేమియు నిట జరుపలేదని యాశ్చర్యము. స్త్రీకటాక్షములు మదనబాణములని కవులు వర్ణింతురు :—

"పశ్య నీలోత్పలద్వన్ద్వా న్నిస్సరన్తి శితా శ్శరాః."

"ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చఞ్చలదృశాం
దృశాం కోణో బాణః సుహృ దపి జడాత్మా హిమకరః"-భో. ప్ర.

'అనువు' - అనుఁగు-'గా'కు 'వా' స్థిరము ఆ దేశమయినంతట స్థిరమునకు ముందు అర్ధబిందువుండదు గాన, అది లుప్తమయినది.

తే. సాంద్రమకరందవృష్టి రసాతలంబుఁ,
దొరఁగు పువ్వుల భువియుఁ, బూధూళి నభము,
నీక్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహోష్మ మడఁగ. 136

మాధవుఁడు=వసంతుఁడు (వామనమూర్తి యనియు) ఉరు...ము-ఉరు=బల్లిదుఁడైన, విరోచనజనిత=సూర్యునివలన జనించినదైన (విరోచన పుత్త్రుఁడయిన బలిచక్రవర్తియొక్క అనియు)-మహోష్మము=కడిందివెట్ట (మహాప్రతాపము), అడఁగన్=(ఉడుగన్)=తగ్గిపోవునట్లుగా, సాంద్రమకరంద వృష్టిన్=దట్టమయిన పూఁదేనెవానచేత, రసాతలంబున్=పాతాళలోకమును, తొరఁగు పువ్వులన్=రాలుచున్న పుష్పములచేత, భువియున్ = భూలోకంబును, పూధూళిన్ = పుప్పొడిచేత, నభమున్=దివిని, ఈ క్రమత్రయిన్=ఈ యంశలు మూఁటిచేత (మూఁడుపాదవిన్యాసములచేత - మూఁడడుగులలో), ఆక్రమించెన్ = వశపఱుచుకొనెను.

తా.—వామనమూర్తి మూఁడడుగులలో మూఁడులోకములను ఆక్రమించినవాఁడై అందు వ్యాపించియున్న బలిచక్రవర్తి ప్రతాపమును అడంచిన విధమున, వసంతుఁడు మరందవర్షముచేత పాతాళలోకమును, రాలిన పూముత్తములచేత భూలోకమును, పుష్పపరాగముచేత దివిని, ఆక్ర

మించినవాఁడై, అందు దీపించుచున్న దానిని బలవంతుఁడైన సూర్యునివెట్టను తగ్గించెను.— శ్లేషోత్థాపితమయిన రూపకాలంకారము.

'సాంద్రమకరందవృష్టి' - భూమియంతయు తడిసి పాతాళమునకు ఊటదిగిన దని భా. విస్తారము గానిచో అట్లు ఊట దిగదుగావున, 'సాంద్ర' అనుట. 'పువ్వుల భువి'- నేల యగపడకుండ పువ్వులు క్రమ్మిన వనుట;-'నభము'-నభ మంతయు పరాగమయ మాయె ననుట; ఇందువలన సురభిమాసము యొక్క అపూర్వమహాసంపద చెప్పఁబడినది, ఇందువలన సుభిక్షము సూచితము.- 'అధోభువన పాతాళ బలిసద్మ రసాతలమ్'- అమ. 'భువి'-ప్ర. భూః, - "శక్తౌ చరణవిక్షేపే పరిపాట్యాగమే క్రమః" నానా.-"విరోచనః ప్రహ్లాదస్య తనయేఽర్కేఽగ్నిచన్ద్రయోః"- మేదిని. "గ్రీష్మోష్మ బాష్ప ఊష్మాణః"-నానా.

క. ఊడుకొనఁ బడు మధూళిక । యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్
నీడలు తిరిగియుఁ దిరుగని । జాడం బొలిచె నవ్వసంతపువేళన్. 137

ఊడుకొనన్=ఊటుపట్టునట్లు, పడు మధూళిక యోడికలకున్=తొరఁగుచున్న తేనెనిష్యందములచే, క్రిందన్=చెట్లక్రింద నేలమీఁద, క్రమ్మియుండెడు తేంట్లన్=పొదువుకొని యుండునట్టి తుమ్మెదపిండుచేత, అవ్వసంతపువేళన్=ఆ పేరుటామనియందు, నీడలు=చెట్లచాయలు, తిరిగియున్=తూర్పుప్రక్కనుండి పడమటిప్రక్కకు, జరిగినవయ్యును, తిరుగనిజాడన్=జరగక అట్లేయున్నవో యనునట్లుగా, పొలిచెన్=ఒప్పారెను.

తా.— ఆ వసంతకాలమున తరువులనుండి మకరందము వర్షముగాఁ గురిసినది. దానితో తోఁటలోని నేలయంతయు ఇవక పుట్టి, ఇంకిన తేనె ఊటుకొను చుండినది. ఆయూటుం ద్రాగుటకై ఆ నేలమీఁద తుమ్మెదలపిండులు వ్రాలి నేలగానరానియట్లుగా కమ్ముకొనియుండెను. అందువలన ఆ పిండున్న చోటినీడలు అవలిదిక్కునకు జరిగిపోయినను పోలేదనునట్లుండెను. తుమ్మెదలపిండ్లే ఛాయలవలె చెట్లక్రింద నొప్పచుండెను.- పూర్వరూపాలంకారము.

"తొలిదశయ యుండు వస్తువు । పొలిసినను బూర్వరూపమున, మరల నగుం
దొలిగుణము; దీప మాఱియు । వెలుఁగు గలిగెఁ గాంచిరత్నవితతులచేతన్;
తెలు పయ్యె నధరరుగరుణ । ములు కలికి నగంగ మగుడ ముత్తెసరంబుల్"-అలం.

'తేంట్లన్'-గమియే భావముగాన, అజడంబునకైనను, జడత్వభావనగా, తృతీయార్థమందు ద్వితీయ ప్రయుక్తము.

చ. శతదళమంజరి ధవళ చైత్రనిశామల చంద్రికౌఘముల్
ధృత వియదంత కేళి వన వృక్ష లతాంతరజశ్ఛట న్గళం
కితఁ గని కామినీ కమన కేళియుఁ బోఁ జెడవా నగాటవీ
కలిక పరాగ మొక్కదెసఁ గ్రమ్మి యనచ్ఛత మాన్పకుండినన్. 138

శత...ము-శతదళ=తెల్లదామరలయొక్క-మంజరీ=గుత్తులవలె - ధవళ=తెల్లని-చైత్రనిశా=చైత్రమాసపురాత్రుల-అమల=స్వచ్ఛమైన-చంద్రికా=వెన్నెలలనెడు-ఓఘముల్=జలపూరములు, ధృత...టన్-ధృత = పట్టుకొనఁబడిన (అందుకొనఁబడిన) - వియత్ అంత=మింటితుద కలవైన-కేళివన=ఉద్యానవనముయొక్క-వృక్ష = చెట్లయొక్క-లతాంతరజః = పుష్పపరాగమనెడి-రజః=దుమారముయొక్క-ఛటన్=మొత్తముచేత, కళంకితన్=కల్మషము కలదియగుటను, కని=పొందిన

పై, నగా...ము-నగ = కొండలలోని-అటవీ = అరణ్యములయందలి - కతకపరాగము=చిల్లపువ్వుల ధూళియనెడి చిల్లగింజపొడి, ఒక్కదెసన్ = ఒక్కదిక్కున, క్రమ్మి = చుట్టుకొని, అనచ్ఛతన్ = వెన్నెలపూరములలోని యాకాలుష్యమును, మాన్పక ఉండినన్ = తొలఁగింపనియెడల, కామి... యుక్-కామినీ=వలపుకత్తెలయొక్కయు - కమన=వలపుకాండ్రయొక్కయు - కేళియుక్ = క్రీడసహితము, పోన్ = నశించునట్లు, చెడవా=పనికిరాకపోవా.

తా.—చైత్రమాసపు వెన్నెల రాత్రులయందు తెల్లదామరల రాసులను అంతటం బేర్చినట్లు వెన్నెల ధవళితముగా కాయుచుండెను. మింటిసిగను పట్టుకొన్నట్టిదైన-అనఁగా - అత్యంతోన్నతము లయిన యుపవనవృక్షముల పువ్వులనుండి పరాగము అమితముగా తొరఁగుచుండెను. అట్లే కొండలమీఁది యడవులలోని యిండుపుఁ జెట్లనుండి పుప్పొడియుం దొరఁగుచుండును. ఆ యచ్చవెన్నెలలో కామినీకములు పరమాహ్లాదముతో క్రీడలం దేలుచుండిరి. దీనినెల్లను కవి వర్ణించుచున్నాఁడు. ఆవెన్నెలయనెడుజలప్రవాహములందు అవృక్షముల పరాగమనెడి మట్టిదుమారము కలయఁగా దానిచే నాప్రవాహము అడుసుకాఁగా ఆయడుసును ఆచిల్లపుప్పొడి యనెడి చిల్లగింజలపొడి తేర్చినందున, ఆ నిర్మల ప్రవాహమందు కామినీకమనులు చంద్రికాక్రీడ లనెడి జలక్రీడల ననుభవించిరి.—ఉపమారూపకాతిశయోక్తులకు సంసృష్టి.

'శతదళ'-అని కమలసామాన్యమునే చెప్పినను సందర్భమునుబట్టి తెల్లదామరలనే గ్రహింపవలయును, 'ధృతవియదంత'-వియదంతముకన్న ఉన్నతములనుట; 'కళంకిత'-కళంకముకలది కళంకి-దానిభావము 'కళంకిత; 'కామినీకమన'-అనురక్తికి పెండ్లి కారణముకాదు గావున, 'దంపతి'అనలేదు; కామించునది కామిని, కామించువాఁడు కమనుఁడు. 'కాముకే కమి తానుకః కమ్రః కామయితాభీకః కమనః కామనోఽభికః' అమ. - 'నగాటవీ' - చిల్ల సహజముగా పెల్లుగా నగములందును అటవులందును ఉండును, ప్రకృతమందు మహాప్రవాహమును తేర్చుటకు మహాపరిమాణ మయిన కతక పరాగపుంజము వలయునుగాన, 'నగ' 'అటవి' యనుట "ఇందుగ యనఁ జిల్ల యనఁ గతకంబగు"-ఆం. భా.

సీ. శైత్యపాండిమలు దుషారాంతమునఁ జేర
నిరులకో స్వాఁకుపం దిరుల విరుల,
వలయగానము లయుక్తలకార్శ్యమునఁ జేరె
మలయంపుఁ గమ్మవీవలుల నలుల,
సౌరభోల్లాసము జ్జాతి గ్రుంగఁగఁ జేరె
నలరారె గొదమ క్రోవులను నెలను,
స్ఫుట జటామస్కరంబులు ప్రతిచ్యుతిఁ జేరె
నందన ప్లక్ష సంతతుల వృతుల,
తే. స్వభృతపరభృత వినుత రసాలపరిష
దహరహఃక్లిప్త బహురహః ప్రహారవిహార
మాణ మానవతీ పరిమ్లాని మాని
వారి హారిజవన గంధవాహ మొలసె. 139

(1) తుషార అంతమునన్ = మంచుయొక్క నాశమందు, (మంచు నశింపఁగానే అంతవఱకు అందుండినవైన), శైత్య పాండిమలు = చలిమిరియు ధావళ్యంబును, ఇరులుకొను ద్రాక్షపందిరులన్ = జీబై చీకట్లు గ్రమ్ముచున్న దాఁకపందిళ్లను, విరులన్ = పూవులను, (శైత్యము దాఁకపందిరులందును, పాండిమ పూవులందును, అనిక్రమముగా అన్వయించుకొనవలయును, ఇట్లే ఉత్తరత్ర,) చేరెన్ = ప్రవేశించెను.

(2) అయుక్తలకార్శ్యమునన్ = విరహిణులకృశత్వమం (వసంతము వచ్చి మదనార్తిచేత విరహిణులు కృశింపఁగా), తత్పూర్వము వారియందున్నధర్మములైన)-వలయ గానములు = కంకణములును (సుళ్లనియు) పాటలును, మలయంపుఁ గమ్మవీవలులన్ = చందనశైలమునుండి వీతెంచుచున్న నెత్తావి తెమ్మెరలను), అలులన్ = తుమ్మెదలను, చేరెన్ ;—

(3) జాతి = జాజి, క్రుంగఁగన్ = అణఁగినంతట, సౌరభ ఉల్లాసముల్ = పరిమళంబును వికాసంబును, అలరారు కొదమ క్రొవ్వులనున్ = వికసించిన గున్న గోరంటలను, నెలను = చంద్రుని, చేరెన్.

(4) వ్రతిచ్యుతిన్ = వ్రతమునకు వారియాచారభంగమందు, స్ఫుట జటా మస్కరంబులు = (వారివైన) స్పష్ట జటాధారణంబును వేణుదండములును, నందనప్లక్షసంతతులన్ = ఉద్యానవనములోని జువ్విచెట్లసమూహములను, వృతులన్ = కంచెలను, చేరెన్.

స్వభృ...ము - స్వ = తమచేత (మానవతులచేత ననుట) - భృత = పోషింపఁబడిన - పరభృత = కోయిలలచేత (కోయిలలు ఉండుటచేత) - వినుత = శ్లాఘనీయములైన (సొంపొందుచున్నవైన - రసాల = మామిడుల - పరిషత్ = గుబురులందు - అహరహః = ప్రతిదినమును - క్లృప్త = రచింపఁబడిన (కడపఁబడినయనుట) - బహు = పెక్కు, - రహః = ఏకాంతపు - ప్రహర = జాములయందు - విహరమాణ = క్రీడించుచున్న - మానవతీ = ఆలువుటాండ్రయొక్క - పరిమ్లాని = బడలికయొక్క - మా = అతిశయమును - నివారి = తొలంచునదైన (లేక పరిమ్లానిమ = బడలికను - అనివారి = చక్కఁగా తొలఁగించెడి), వారిజ = తామరలయొక్క - నవగంధవాహము = క్రొత్తకమ్మతెమ్మెర, ఒలసెన్ = వీచెను, (పా. వారిజ వన = తామరతంపరలయొక్క.)

తా.—వసంతమున మంచుడంగినది, దానివలె చల్లఁగా ద్రాక్షపందిళ్లజీబులును, దానివలెనే తెల్లఁగా పువ్వులును మెండుకొన్నవి; ఆయుక్తలకు కార్శ్యకారణమున చేతిగాజులు ఊడిపోయినవి, వారిపాటలు నిలిచిపోయినవి; మలయంపుఁగమ్మవాయువులు, వారివలయములవంటిసుళ్లతో వీవం దొడంగినవి; జాజి పరిమళింపక పూవక అణఁగిపోయినగ, దానికి బదులు గున్నగోరంటలు పూచి పరిమళించుచుండినవి, దాని (జాజి) వికాసమునకు బదులుగా చంద్రునివికాసము సొంపారుచుండెను, యతులు కామాతురులై వ్రతమును కాపాడుకోలేక, జటాబంధనమును వేణుదండములను ఉజ్జగించిరి, వారిజటలకు మాఱుగా జువ్వులయందు ఊడలుదిగినవి, వారిదండములకు మాఱుగా కంచెలయందు వెదుళ్లు కట్టంబడినవి. రసాలవృక్షములు మానవతులు పెంచినకోకిలలచేత శోభిల్లుచుండినవి; ఆవృక్షముల నడుమ ఆమానవతులు పెక్కుజాములకాలము రహఃక్రీడలయందుఁ గడపి యలయుచుండిరి; వారి యాయాసలయికను తామరకొలంకులతావిగాలి తీర్చుచుండినది. - పద్యపాదములందు యథాసంఖ్య పర్యాయంబులు; అంతటను స్వభావోక్తియు.—

1 "క్రమముగ నొక్కటి వెక్కటి, । సమరుట పర్యాయ, మొకట నటు పెక్కులు గాన్ ;
రమణీముఖకాంతి చేరెన్ । గమలము విడి రేమొగమునఁ గమలారాతిన్ ;

మురజవిపంచీరవములు। వరగణికాగానములును వర్ధిల్లెను నీ
యరిపురుల సదా ము న్నట। వారి వేణు శివా రవంబు లనయ మిపు డటన్".

'మాలే లగ్నకచే జటాః,' 'వేణు మస్కర తేజనాః,'-'ద్వౌ యామ ప్రహరౌ సమౌ,' అమ. 'నవ'_హేమంతశిశిరములయందు లేనట్టిది.'పాండిమ'-రూ.'పాండిమము,'-ఇమనిచ్ప్రత్యయాంతము.

ఉ. సారెకుఁ గీరము ల్ఫల రసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం
గా రహిఁ దన్మధూళికకుఁ గా నళిపంక్తులు వెంట గ్రుమ్మరం
గా రొద మించె నందుఁ జిలుక ల్వనలక్ష్మియుఁ దద్వచస్సుధాం
ధోరుచు లానఁగా సరపణు ల్జనుల ట్లిడి పెంపఁగా బలెన్. 140

సారెకున్ = మాటిమాటికి, కీరముల్ = చిలుకలు, ఫల రసాలము శాఖలలోనన్ = పండ్లతోడి తీయమామిడి కొమ్మలలో, త్రిమ్మరంగా = సంచరింపఁగా, రహిన్ = ఆసక్తితో-అళిపంక్తులు = తుమ్మెద బారులు, తన్మధూళికకుఁ గాన్ = అందులతేనెకై, వెంటన్ = ఆ చిలుకలవెంబడి, క్రుమ్మరంగాన్ = సంచరింపఁగా, అందున్ = వానిలోను, చిలుకలు, (ఏమి చేసిన వనఁగా), వనలక్ష్మియున్ = వనలక్ష్మికూడ, జనులట్లు = నరులవలె, తద్వ...లు-తత్ = ఆ చిలుకలయొక్క-వచః = పలుకుల-సుధాంధః = అమృతపు బోనముయొక్క - రుచులు = చవులను, ఆనఁగాన్ = ఆస్వాదించుటకై, సరపణుల్ = ఇనుప గొలుసులు, ఇడి = వైచి, పెంపఁగాబలెన్ = పెంచిన కతముననో యనునట్లుగా, రొదన్ = శబ్దముచే, మించెన్ = అతిశయించినవి.

తా.—చిలుకలు మాటిమాటికి పండ్లతోడి తీయమామిడి కొమ్మలమీఁదికి పోవుచుండినవి; ఆచిలుకలు కొట్టినప్పుడు ఆ పండ్లనుండి కాఱునట్టి యమృతప్రాయ మైన రసమును, త్రాగుటకు తుమ్మెదలు ఆ చిలుకలను వెంబడించి పోవుచుండినవి. అట్లు ఫలభక్షణహృష్టములై చిలుకలు మిక్కుటముగా రొదగావించుచుండినవి. ఇది యెల్లం బరికింప నెట్లుండెననఁగా, వనలక్ష్మికూడ మనుష్యులవలెనే ఆ చిలుకలయొక్క అమృతమధురము లైన వాక్కులను ఆస్వాదింపఁగోరి వానిని ఆ తేంట్లబారు లనెడి యినుప గొలుసులతో కట్టి యారసాలవాటికలందు తదీయ ఫలములతో పెంచుచున్నదో యనునట్లును, ఆ గౌరవముచేతను పెనుపుచేతను హృష్టము లై ఆ చిలుకలు కడు శబ్దించుచున్నవో యను నట్లును ఉండెను.—ఉత్ప్రేక్షాలంకారము.

'సరపణి'_పీఠికలో పట్టికం జూ. 'సారెకున్' -'గొలుసు'-అందినంత దూరము పోయి ఫలములు తిని నివాసమున కేఁగుటయు మరల తినుటకు వచ్చుటయు భా. 'రసాలము'-పండ్లు తీపుగాన ముఖ్యమని నిర్దిష్టము. 'వెంటం బోవుట'-చిలుక కొట్టినపండు శ్రేష్ఠమును తద్రసము స్వాదిష్ఠమును గావున, 'అళిపంక్తులు'_నల్లనిబారులు గాన ఇనుప గొలుసులవంటివి. (లక్ష్మి) 'యున్'-అనుటచే మనుష్యులే గాక అని. భా.

సీ. ప్రతిహాంత్యతాత్తకీటత చన్న భృంగసం
ఘపు టంగములచేతఁ గాయమెత్తి,
యమదిశాగత మరు త్ప్రాణినై దవళిరం
గ స్థలాబ్జినిఁ దమ్మికన్ను దెఱచి

ప్రాంతఫుల్లామ్ర సంశ్రయి తచ్ఛటాహతో
ద్గతి లేచి చెలిఁజైత్రుఁ గౌఁగిలించి,
యురు పరాగపుశాటి నుద్దండ వాప్యుత్ప
లస్రవత్సీధు రత్యస్ర ముడిపి,
తే. క్రమ్మఱఁ బలాశ కటకాముఖమునఁ గీర
చలితశాఖాస్ఫుటాశోకశరముఁ గూర్చెఁ
దద్రతికిఁగాఁగఁజలికాలఁదన్ని మంచు
పాండురాంగుండు విడిచిపో బ్రతికి మరుఁడు. 141

మం...డు - మంచు = (చలికాలపు) మంచు అనెడు - పాండుర అంగుండు=ధవళదేహుఁడైన శివుఁడు, తత్ రతికిన్ కాఁగన్ = ఆ రతీదేవికొఱకు (రతీదేవిమీఁదికనికరముచేత), (మారుని), చలి కాలన్ = చలియనెడుపాదముతో (చల్లని = అనఁగా - దయగల - అనఁగా - తప్పుమన్నించినపాదముతో), తన్ని=ఒకతాఁపుమాత్రము తన్ని, విడిచిపోన్ =సంహరింపక వదలిపోఁగా, మరుఁడు= మన్మథుఁడు, బ్రదికి= బ్రదికినవాఁడై;—

(1) ప్రతి...త-ప్రతి=ప్రతిపరులయొక్క (ప్రతిపరులను - హంతృతా = చంపినవాఁడగుటచేత - ఆత్త=పొందఁబడిన (ప్రాప్తించిన) - కటుత = పరుసఁదనము (పరుషత్వము), చన్నన్ = పోయినపిమ్మట, భృం...ము - భృంగ=తుమ్మెదల - సంఘపు - సమూహములనెడి - అంగములన్ = అవయవములతో, పెఱకాయము= వేఱుదేహమును, ఎత్తి =ధరించి;

(2) యమ...త్-యమదిశా=యమునిదిక్కునుండి (అనఁగా దక్షిణపుదిక్కునుండి)-ఆగత = వచ్చిన-మరుత్ =గాలిచేత - ప్రాణీ=ప్రాణముగలవాఁడు (దక్షిణమారుతమే ప్రాణముగాఁగలిగినవాఁడు), ఐ, తద...నిన్ _తత్ ఆళి=తనకు అంగభూతములైన తుమ్మెదలకు-రంగత =నాట్యప్రదేశముగా (సుఖవిహారస్థానముగా) ఆచరించుచున్న - స్థల అబ్జినిన్ = మెట్టదామర తీఁగలయందు, తమ్మి కన్ను దెఱచి= మెట్టదామరపూవే కన్నుగాఁ దెఱచినవాఁడై;

(3) ప్రాం...తిన్ - ప్రాంత=ఆచెంతను - ఫుల్ల=వికసించిన- ఆమ్ర=మావిని - సంశ్రయి= చేరియున్న- తత్ = ఆతుమ్మెదలయొక్క - ఛటా = సమూహముయొక్క - హత=ఆకస్మికమయిన,- ఉద్గతిన్ = లేచుటచేత - లేచి - (అనఁగా _ మామిడిమీఁదితుమ్మెదలు తటాలున లేచుటయే తాను లేచుటగా - తుమ్మెదలే అతని కిపుడు దేహమయినందున నిట్లుచెప్పుట), చెలిన్ చైత్రున్ = చెలికాఁడైన మధుమాసమును, కౌఁగిలించి=ఆలింగనము చేసికొని;

(4) ఉరు...టిన్ - ఉరు = విస్తీర్ణమయిన - పరాగపు = పూధూళియనెడి - శాటిన్ = వస్త్రముతో, ఉద్దం...ము-ఉద్దండ=నిగిడిన తూఁడుగల-వాపి=దీర్ఘికలోని-ఉత్పల=కలువపూవునుండి- స్రవత్ = ఓడుచున్న - సీధు = మకరందమనెడు-రతి = రతీదేవియొక్క - అస్రము = కన్నీళ్లను, తుడిపి = తుడిచివైచి, క్రమ్మఱన్ =మరల, పలా...నన్ -పలాశ=మోదుగుమొగ్గ యనెడి - కటకాముఖమునన్ =బాణప్రయోగము చేయునపుడు బాణముం బట్టునట్టియాకృతివిశేషము గల పిడికిటితో, కీర...ము‌న్ - కీర=చిలుకలచేత - చలిత=కదలింపఁబడిన - శాఖా=కొమ్మయందు - స్ఫుట = పూచిన - అశోకశరము=కంకేళిపువ్వనెడి బాణమును, కూర్చెన్ =తొడిగెను.

తా.—ఇందు క్రమముగా వసంత ధర్మప్రాదుర్భావమును తదనుగుణముగా మదన (బల) ప్రాదుర్భావాదికమును వర్ణించుచున్నాఁడు:-చలికాలమున మరుఁడు చావు దప్పించుకొనుటయు మంచు తగ్గిపోవుటయు నైనపిమ్మట, భృంగపరంపరయు, దక్షిణమారుతము, మెట్టతామరవికాసము, మావిపూత, అందు తుమ్మెదలు (ముసరి) ఎగురుట, చైత్రమాసవిజృంభణము, పరాగవ్యాప్తి, ఉత్పలమధూత్పత్తి, పలాశపసుమోద్గతి, కీరసంచారము, అశోకవికాసమును - క్రమముగా మదనోద్దీపకములు; ఇందు, మంచు శివుఁడుగాను, చలి అతనికాలుగాను, ఆ రెండును పోవుటయు ఆ కాలమున మదనుఁడు దుర్బలుఁడుగా నుండుటయు, మదనుని శివుఁడు ప్రాణముతో వదలి తన్నిపోవుటగాను, తుమ్మెదబారులు మదనునికి వ్రతులను గొట్టిన పాపముచేతఁ గలిగిన కీటాదిక్షుద్రజన్మములు పోయినపిమ్మట వచ్చిన చండాల జన్మముగాను, దక్షిణానిలము అతని ప్రాణవాయువు వచ్చుటగాను, అళితోడి మెట్టదామరపూవు అప్పుడే అతఁడు కన్నువిచ్చుటగాను, పూచినమావిశిఖునుండి తుమ్మెదలు లేచుట అతఁడే కీటాది జన్మములు అతిక్రమించు యీపాటి వైజన్మము నొంది మరల మిత్రుని వసంతునిం గనులతోఁ గాంచినహర్షముచేత నాతనిం గవుంగిలించుటగాను, పర్వుచున్న పరాగము అతని వస్త్రముగాను, అదిపోయి కలువ మకరందము పైఁబడుట నిజవియోగముచే నేడ్చుచున్న రతిదేవికంటనీరు తనవలువతో తుడుచుటగాను. మోదుగుమొగ్గలో అశోకపుమొగ్గ కూడుట రెండియు నతఁడు ఈపాటి కోల్కొని. పాంథులపై కటకాముఖముష్టితో బాణప్రయోగము చేయుటగానుఁ. జెప్పఁబడినవి. - రూపకాలంకారము.

'హంత్ర'-మన్మథావస్థలు పది:—'దృఙ్మనస్సఙ్గ సంకల్పా జాగరః కృశతాఽరతిః। హ్రీత్యాగోన్మాద మూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ'-అందు మరణ మొకటి. తత్కారకుఁ డగుటచే మదనుఁడు వ్రతిహంత. బ్రహ్మహంత్రాదిపాపులు నరకము ననుభవించి పిమ్మట క్రిమికీటాదిజన్మములు క్రమముగా ఒకదానిపై దొకటిగా ఎత్తి, అనంతరము నరజాతిలో చండాలాదిక్రమమున తొంటిజన్మమునకు వత్తురని ధర్మశాస్త్రము. ఆశాస్త్ర మిచట ననుసంధింపఁబడినది.—శివుఁడు మదనుని తన్నుటయు వ్రతిహననాపరాధమునకే. శివధర్మోత్తరంబున:—

"ఏవం పాపవిశుద్ధాశ్చ పాపశేషేణ కర్మణా। తతః క్షితిం సమాసాద్య జాయన్తే దేహినః పునః; తత్రానుభూయ దుఃఖాని జాయన్తే కీటయోనిషు। నిష్క్రాన్తాః కీటయోనిభ్యః జాయన్తే పక్షిణః క్రమాత్; సంక్లిష్టాః పక్షిభావేన జాయన్తే మృగయోనిషు; । మృగదుఃఖమతిక్రమ్య జాయన్తే పశుయోనిషు। పశుయోనిం సమాసాద్య పునర్జాయన్తి మానుషాః."

నందిపురాణంబున:—

"మృగేషు జాయతే మర్త్యో ఛేద్యరగణైస్తతః।తత్రాపి భుక్త్వా స్వం కర్మ జాయతే పశుయోనిషు. తత్రాపి భౌతికం భోగం భుక్త్వాన్తే గోత్వమాప్నుయాత్।ముక్త్వా పశుత్వం ప్రాప్నోతి మానుషమ్, తత్రాపి నియమో నాస్తి శ్వపచాదిషు జాయతే।ప్రాన్తేషు మనుష్యేషు జాయతే పాతకీ నరః."

"శ్వపచాదిషు" అనుటచే నరజన్మములలో తొలుతచండాలజన్మము వచ్చుననుట. చండాలురు నలుపు, అళులును నలుపు:-ఇట వర్ణముంబట్టి జాతినిర్ణయము; "తదళి...తమ్మికన్ను"-అళితోడితమ్మియే తారకతోడికన్ను. 'శాటి'-వస్త్రమాత్రము. 'తెలుపుదుకూలశాటిఁ గటిఁదాల్చి'—మను. 5 (73)

కటకాముఖహస్తస్వరూపము:—

"తర్జనీమధ్యమామధ్యే పృష్ఠేఽఙ్గుష్ఠేన పీడ్యతే।యస్మిన్ననామికాయోగాత్స హస్తః కటకాముఖః."

బాణమూలమును చూపుడువ్రేలికిని నడిమివ్రేలికిని సందున బొటనవ్రేలితో అనామికయుం దగులునట్లుగా పట్టినహస్తము కటకాముఖము.

చ. చిగురుఁ బికాళికి, న్ఫలముఁ జిల్కలగుంపునకు, న్మధూళిఁ దేఁ
టిగమికిఁ, దావి గాలికి, విటీవిటకోటికిఁ బువ్వులుం, దలం
బుగఁ గృప నీవియు న్సురభి పుంస్త్వముఁ బాంథులచోటఁ బూనె; న
ట్లగుఁ బ్రజ కోర్కు లిచ్చుతన కాత్మఁ దలంచిన దబ్బ దేయనన్. 142

సురభి=వసంతఋతువు (కామధేను వనియు), పిక ఆళికిన్ = కోయిలల సమూహమునకు, చిగురున్ =చిగురుటాకులను, చిల్కలగుంపునకున్, ఫలమున్ = పండ్లను, తేఁటిగమికిన్ = తుమ్మెద సమూహమునకు, మధూళిన్ = తేనియను, గాలికిన్ = మలయమారుతమునకు, తావిన్ =పరిమళమును, విటీ విట కోటికిన్ =విటకాండ్రయు విటకత్తెలయు సమూహమునకు, పువ్వులున్, దలంబుగన్ =పెల్లుగా, కృపన్ =కరుణతోన్, ఈనియున్ = ఇనియును (కామధేను ధర్మముగా ఈనియనుట-ఇచ్చియు నని భా.) ప్రజల కోర్కులు=లోకుల యాపేక్షితములను, ఇచ్చుతనకున్ = ఒసంగెడు తనకు, ఆత్మన్ తలంచినది = తనమనస్సులో కోరుకొన్న కోరిక, అబ్బదే = దొరకదా, అట్లగున్ = కోరినది తప్పక కలుగును, అనునట్లుగా, పాంథుల చోటన్ = పథికుల యెడ, పుంస్త్వమున్ =పౌరుషమును (కార్కశ్యమును), పూనెన్ =వహించెను.

తా.—సురభి కామధేనువుగా, పిక శుక మధుప మారుత విటులకు పల్లవ ఫల మధు పరిమళ పుష్పములను యథేచ్ఛముగా ఈని, తాను సురభి (అనఁగా కామధేనువు), అని రూఢి కెక్కించినది. అనఁగా, వానియెడ కామధేనువుగా స్త్రీత్వమును జూపినది. 'అట్లు ఎల్లవారికోర్కులం దీర్చుతనకు తనయభీష్టమైనపుంస్త్వము మాత్రము కలుగ దా? తప్పక కలుగును;' అనునట్లుగా, పాంథులయెడ పౌరుషమును (కార్కశ్యమును) చూపెను. అనఁగా, ఆమని పికాదులకు క్షేమకర మైనను పాంథులకు వ్యథాకరముగా నుండెను. కావ్యార్థాపత్త్యంగక మయిన యుల్లేఖాలంకారము.

(1) "పలువగల నొకనిఁ దలఁతురు। పలువురె, యుల్లేఖ; (2) నొకఁడె పలువిషయములన్;
తలఁతురు సతులు మరుఁగ, న। మ్మలు కల్పకముగను, రిపులు మృత్యుగ నిన్నున్;
అలకవ్వడివి గెలుపునన్, । జలుక హుమాదొర నొఱపున, శ్రీహరివి కృపన్."-అలం.

ఇక్కట, అధికరణ భేదము చేతను, సంబంధ భేదము చేతను, ఉల్లేఖ నూహించునది. ఇట, కవి ఆమనియందు పికాదులయెడ స్త్రీత్వమును, పాంథులయెడ పురుషత్వమును, ఉల్లేఖించినాఁడు.

"సురభి స్తు గవి స్త్రియామ్। వసన్తచైత్రయోః పుంసి త్రిషు సౌమ్యసుగన్ధినోః.", నానా.

సీ. సహకార ఫలరస సౌరభ్యములఁ గూడి
మాధ్వీ మోవులఁ గదంబముగ వలవ,
మలయజోదరత జంభల ఫలత్వగ్గత
శ్రీ మించు చెవులఁ గొజ్జెఁగలు మెఱయ,
శశికదళోదర చ్ఛదపుఁ బావడ లూరు
చకచకఁ బట్టి పాలికఁ బెనంగఁ,
ద్రాక్షా తేంట్లకుఁ గాఁక లెక్కింపఁ జెరివిన
గంధఫలీపంక్తిఁ గబరు లలరఁ,

తే. కేలఁ గలవంటకపుఁదావికిని బులిమిన
ఘుసృణములు మించ, ననలఁబే రెసఁగుపవన
ములు నమేరురజోవృష్టిఁ బూదిఁజఱవ
నింతు లెనసిరి పూఁబొదరిండ్లఁ బతుల. 143

(1) ఇంతులు = ఉవిదలు, మోవులన్ = (తమ) పెదవులయందు, మాధ్వి=సుర, సహకారఫలరససౌరభ్యములన్ =మామిడి పండ్లరసములయొక్క పరిమళములతో, కూడి = కలసికొని, కదంబముగన్ =పలుపరిమళములయొక్క మిశ్రముగా, వలవన్ =పరిమళించుచుండఁగాను;

(2) మల...తన్ - మలయజ = చందనపంకము, - ఉదరతన్ = లోనంగలవై యుండుటచేత (లోనంబూసి యుండుటచేత), జంభల ఫల త్వక్ గత శ్రీన్ =నిమ్మపండు తోలును పొందియున్న చెలువును, మించు చెవులన్ =అతిశయించుచున్న కర్ణములయందు, గొజ్జఁగులు=గొజ్జంగపువ్వులు, మెరయన్ = వెలుఁగుచుండఁగా;

(3) శశి...లు-శశికదళీ=కర్పూరపుటరఁటియొక్క- ఉదరచ్ఛదపు=లోపలియాకు (మోసు) యొక్క (అనఁగా అట్టి యంశుకముతో నిర్మితమైన) - పావడలు = పరికిణీలు, ఊరుచకచకన్ = తొడలయొక్క ధాళధళ్యమును, పట్టి=పట్టుకొని, పాలికిన్ =తమకొక భాగము, ఇమ్మని, పెనఁగన్ = లాగులాడుచుండఁగా;

(4) త్రొక్కు తేంట్లకున్ =(వదనాదులయందు పద్మాది భ్రాంతిచేత తమయందలి నానాపరిమళములకొఱకు) తమమీఁద కాలిడెడు తుమ్మెదలకు, కాఁకలు ఎక్కింపన్ = వేఁడి కలిగించుటకు, చెరివిన గంధఫలీపంక్తిన్ = గ్రుచ్చిన సంపెంగల వరుసతో, కబరులు=కొప్పులు, అలరన్=ఒప్పారుచుండఁగా;

కేలన్ = చేతియందు, కలవంటకపు తావికిన్ =కొన్ని ద్రవ్యములుకలిపివండిన భోజ్యములను భుజించిన పరిమళమును పోఁగొట్టుటకై, పులిమిన ఘుసృణములు=(చేతులు) కడుగుకొనునప్పుడు పూసినకుంకుమపువ్వులు- మించన్ = ప్రకాశించుచుండఁగా, ననలన్ = పువ్వులతో, పేరు=మిక్కిలి, ఎసఁగు పవనములు=ఒప్పుచున్న తెమ్మెరలు, నమేరు రజో వృష్టికిన్ =సురపొన్న పుప్పొడి జడిచేత, బూదిచఱవన్ =బూజు పట్టినట్లు చేయుచుండఁగా, పూఁబొదరిండ్లన్ =పూవులతోడి పొదరుటిండ్లయందు, ఎనసిరి=కూడిరి.

తా.—స్త్రీలు, మామిడిపండ్ల రసముం గ్రోలి, సుర సేవించి ఆతావియు ఈతావియు నోట మిశ్రమై పరిమళించుచుండఁగా, లోపల చందనముంబూసికొన్నందున నిమ్మపండువర్ణముగా శోభిల్లుచున్న వీనులమీఁద గొజ్జంగ (రోజా=గులాబి) పువ్వులను ధరించి కప్పురపుటరఁటిలోని మోసులంబోలి మృదుధవళములై తమతొడలధాళధళ్యమునకు ఈడుజోడయిన పావడలనుధరించి, తమయందలి నానాపరిమళములకై ముసురుకొను తుమ్మెదలు తమమీఁద వ్రాలకయుండునట్లు వానికి కాఁకలు పుట్టించుటకై కొప్పునందు సంపెంగసరములను దాల్చి, భుజించినభోజ్యముల నెత్తావులను చేతినుండి తొలఁగించుటకై కడుగ నుపయోగించిన కుంకుమపువ్వు చేతియందు ఎఱుకవడుచుండఁగా, పువ్వుల భారములచేత సొంపారుచున్న పవనములు సురపొన్న పుప్పొడిని తమయంగములపై బూజుపట్టినవిధమున వర్షించుచుండఁగా, పూచినపొదరిండ్లయందు - ప్రియులం గలసిరి.—స్వభావోక్తి, దానికి ద్వితీయ తృతీయ సీసపాదములందును "బూదిచఱవ" అను భాగమందును ఉపమ యంగము.

"తృణతా తు ధనుష్యపి,"-నానా. 'అభ్రం మేఘో వారివాహః స్తనయిత్నుర్వలాహకః,' అమ. 'అచిరద్యుతి'-'శమ్పా శతహ్రదా హ్రాదిన్యైరావత్యః క్షణప్రభా,' అమ.-'కడిమి కడపయటం చనఁబడుఁ గదంబము.' ఆం. భా. 2 (46)

తే. అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మశాలఁ
దెండి యతఁ డందు నినుమడి తేండ్రఁ దోఁప
మింటిపయి నుంటగాదని యింటిపైకిఁ
దెచ్చుకొంటి నటంచుఁ బెన్ ఱెచ్చువెడలు. 146

అతివ=అమ్మవారు, పూర్ణ ఇందుభీతిన్=నిండుచంద్రునివలని భయముచేత, తత్ అశ్మశాలన్=ఆ చంద్రునిరాతి (అనఁగా చంద్రకాంతశిలామయమైన) భవనమందు, తెండి (పా. తేఁడి)-పరుండినదై, అందున్=ఆ చంద్రకాంతశాలయందు, అతఁడు=చంద్రుఁడు, ఇనుమడి=(మింటి చంద్రుఁడొకఁడు ఇంటి ప్రతిబింబచంద్రుఁ డొకఁడును నై) రెట్టిగా, తేండ్రదోఁపన్=వేఁడిమి చూపఁగా, మింటిపైన్ ఉంట=(చంద్రుఁడు) ఆకాశమందు ఉండుట, కాదు=చెడుగు, అని=అని తలంచి, ఇంటిపైకిన్=గృహములోనికి, తెచ్చుకొంటిని, అటంచున్, పెన్ ఱెచ్చన్=అధికమయిన దిగులుతో, వెడలున్=లేచిపోవును.

చంద్రుఁడు విరహిదాహకుఁడు-"రాజీవాక్షుల నేఁచుపాతకి"-కావున, అతనికి వెఱచుట, చంద్రకాంతమణి చలువ:—

"ఇందుకాంతంబుల నెబ్భంగిఁ గురిసెనో। నిష్యంద కీలాలనిర్ఝరములు."-నైష.

అయినను అది స్ఫటికవిశేషమగుటంబట్టి ప్రతిఫలించును, చంద్రకిరణములకు కరంగును; కావున, దానికి 'చంద్రకాంతము', 'చంద్రశిల', ఇత్యాదినామములు.

"నెలకరము సోకినంతనె। జలపూర్ణములై వెలుంగు శశిమణిపాదుల్
గలిగి జలసేకయత్నముఁ। బాలియించును భీమతనయపాఁదోటతరుల్."-అలం.

విషమాలంకారము; లలితాలంకారంబును.

తే. భ్రమరగీతిక మాయ విపంచి మీట,
దాన శ్రుతిఁగూడి మిగులఁ దద్రక్తి హెచ్చ,
వే నివారించి లేచి, 'దైవికము నెదుట
యుక్తులు ఫలింప' వనుచు బిట్టూర్చి నవ్వు. 147

(ఆదేవి), భ్రమరగీతిక=తుమ్మెదలపాట, మాయన్=నిలిచిపోవుటకై, విపంచిన్=వీణను, మీటన్=వాయింపఁగా, దానన్=ఆ వీణానాదముచేత, శ్రుతిగూడి=శ్రుతికలసి, తత్ రక్తి=భ్రమరగీతియొక్క స్వారస్యము, హెచ్చన్=అతిశయింపఁగా, వే=వెంటనే, నివారించి=(వీణ మీటుటనుమాని) వీణాశబ్దమును మానిపించి, లేచి, దైవికము నెదుట=దైవకృతము ముందఱ (తప్పని దానిముందఱ), యుక్తులు=ఉపాయములు, ఫలింపవు=నెఱవేఱవు, అనుచున్, బిట్టు=మిక్కిలి, ఊర్చి=విషాదసూచకమయిన నిట్టూర్పు నిగిడించి, నవ్వున్.

తా.—తుమ్మెదలపాట విన లేక దానిని మాన్పుటకై ఆమె వీణవాయింపఁ దొడంగినది. వీణావాదనముచేత తుమ్మెదపాట కరము రక్తిపొంది, ఆమెను మఱియు బాధింపందొడంగినది. అంత

నామె వీణావాదమును నిలిపివైచి, 'దైవికము తప్పదు, దానిముందఱ యుక్తులు నెఱవేఱవు', అని పలికి విషాదపు నిట్టూర్పు నిగిడించి నవ్వినది.—విషమాలంకారము,

ఇందు అరతి యను మన్మథావస్థ చెప్పఁబడినది:—"అన్యత్రాప్రీతి రరతిః"—

శ్లో. "దూషయతి చన్ద్రసృష్టిం। నిన్దతి మలయానిలస్య మాహాత్మ్యమ్,
ఉత్సవపరాఙ్ముఖీసా। సుభగ త్వాం కిన్ను మన్త్రయతే?"—ప్రతాపరుద్రీయము.

తే. వెలఁదికతి తాపదం బయ్యె విరులపాన్పు;
మును తదంఘ్రిహతాది భర్త్సనలుగన్న
తరులఁ బొడమిన పూఁబంట దన కొసఁగునె,
పొంచి తలవేచి మిగులనొప్పించుఁ గాక. 148

వెలఁదికిన్=ఆదేవికి, విరులపాన్పు=పుష్పశయ్య, అతితాపదంబు — అతి=ఎక్కువ-తాప=కాఁకను-దంబు=ఇచ్చునది, అయ్యెన్; మును, తద...లు-తత్=ఆమెయొక్క, అంఘ్రి=పాదము యొక్క — హతి=తన్ను — ఆది=లోనగు — భర్త్సనలు=బెదరింపులు, కన్నతరులన్ = పొందినవైన చెట్లయందు, పొడమినవి=పుట్టిన పువ్వులు, పొంచి=దాఁగి, తలవేచి=తమకనుకూలమైన కాలమునకై కనిపెట్టియుండి (ఆసమయము వచ్చినప్పుడు), మిగులన్ = మిక్కుటముగా, నొప్పించుఁగాక = బాధించునే గాని, తనకున్ = ఆమెకు, పూఁటబంట=ఆశ్వాసములు, ఒసఁగునె=ఇచ్చునా?

తా. — విరహతాపశాంతికై, ఆమె, పూఁబాన్పునం బవళింపఁగా, ఆపాన్పు ఆమెకు అమిత తాపముం గలిగించినది. ఇది న్యాయ్యమే, ఎట్లన్న? ఈమెచేత దోహదార్థమై నడుములందు తన్నులు లోనగుతిరస్కారములు పొందినయశోకాదివృక్షములందు పొడమినపూవులు తమసమయము వచ్చినప్పుడు ఈమెను మిక్కిలి బాధించి పగతీర్చుకొనునే గాని ఈమెకు మేలుసేయునా?—విషమము, కావ్యలింగమునకు అంగము, కావ్యలింగముచే ఉత్ప్రేక్ష ధ్వనితము.

శా. పూజాదంభమున న్బరాకుమెయి ము న్పూఁబోఁడి నేర్పూఁది చే
తోజాతానల మార్పఁ శాస్త్రసరణిన్ దూలి న్హరి న్వ్రాసి ల
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయవేక్షం జేయుచో వెండి వ
క్షోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీసు న్దాపమున్ మీఱఁగన్. 149

పూఁబోఁడి=పువ్వువంటి మేనుగల కాంతామణి, చేతో...ము — చేతోజాత=మన్మథుఁడనెడి-అనలమున్=నిప్పును, ఆర్పన్=చల్లార్చుటకుఁగాను, పూజాదంభమునన్ = పూజయనెడి మిషచేత, పరాకుమెయిన్ = తెలివితెల్వియుచేత, మున్=మును=మొదట, శాస్త్రసరణిన్ = శాస్త్రమార్గమున, నేర్పు = నైపుణ్యము, ఊఁది = అవలంబించి (వినియోగించి), తూలిన్ = వాగరతో (అనఁగా చిత్తరువు వ్రాసెడికుంచెతో), హరిన్ = నారాయణుని, వ్రాసి = లిఖించి, లజ్జా...ష్టిన్ — లజ్జా = సిగ్గుచేతనయిన — జాడ్య=జడ్డుచేత (జడతచేత) — ఆకుల=అవశమైన — దృష్టిన్ = చూపుతో, వెండి= మరల, ప్రత్యవయవ ఈక్షన్ = ఒక్కొక్కయంగముయొక్కయు చూచుటను — చేయుచోన్ = కావించుటలో, వక్షో...మన్ — వక్షః=స్వామియురంబున-జాగ్రత్ = దీపించుచున్న-రమన్ — లక్ష్మిని, కాంచి=చూచి, ఈసున్ = ఈర్ష్యయును, తాపమున్=కాఁకయును, మీఱఁగన్=అతిశయింపఁగా, తల్లడిలున్ = ఆరాటపడెను.

తా.—ఆమె తన విరహతాపమును పోనడుచుటకై దయితుఁడైన శ్రీహరియొక్క పటమును పూజకొఱకనెడి మిషచేత, నేర్పుతో శాస్త్రము ప్రకారముగా చిత్తరువు కుంచెతో వ్రాసినది. పిమ్మట తనకు హృదయప్రీతికై లజ్జాపూర్వకముగా ఱెప్పలేక ప్రసన్నతతో ఒక్కొక్క యంగమును జూచినది. అట్లు చేయుటలో ఆ దేవుని హృదయస్థానమందు దీపించుచున్న మహాలక్ష్మి కనఁబడినది. అంతట నామె సవతిమీఁది యీసుచేత కాఁకఁ జెంది ఆరాటపడినది.—విషమాలంకారము, దానికి కైతవాపహ్నవము అంగము.

దంభము ఏల యనఁ? చిత్రఫలకమందు తత్ప్రతిమను వ్రాయుకొనుట మదనతాపశాంతికై యని తెలియనిచ్చినచో, చెలికత్తెలు హేళనము చేయుదురు. పూజకని చెప్పినచో ఆ హేళనముండదప్పను, వారును సంతోషింతురు. 'పరాకు' - పరాకు లేక హెచ్చరిక కలిగి వ్రాసినచో లక్ష్మీప్రతిమను వ్రాసియుండదు. 'ముక్' - మొదట వ్రాసినది, 'వెండి' - పిమ్మట పరికించినది, అని సంబంధము. 'నేర్పు' - నేర్పుగలదిగాన. దేవతగాన - "ప్రస్థేపరే ప్రాక్తనజన్మవిద్యాః" అనునూక్తిప్రకారము సకలవిద్యలును సులువుగానే వచ్చినవి. 'పూఁనుట' ఆసక్తిచేత; 'చేళోజాతానల మార్పన్' - తత్ప్రతిమను వ్రాయుట. చిత్రగత దర్శనము తదంగస్పృష్ట స్పర్శనము తద్గుణగానము ఇత్యాదులు రమణవిరహమందు అంగనలవినోదములు. "వియోగే యోగే వా ప్రియజనసదృశానుభవనం। తతశ్చిత్రం కర్మ స్వపనసమయే దర్శనమపి। తదంగస్పృష్టానాముపనతవతాం స్పర్శనమపి। ప్రతీకారో నఙ్గవ్యథితమనసాం కోఽపి గదితః"-గుణపతాక; 'శాస్త్రసరణి' గావుననే లక్ష్మిని వ్రాసినది; లక్ష్మీనారాయణులకు అవినాభావము శాస్త్రోక్తము. 'వక్షో జాగ్రత్' - 'సర్వమఙ్గళమాఙ్గళ్యే విష్ణువక్షఃస్థలాలయే। ఆవాహయామి. దేవి, త్వాం, సుప్రీతా భవ సర్వదా.' అని వరలక్ష్మ్యావాహనము. 'తూలిక' - "ఏషి కా తూలికా నమే" - అమ. "ద్వే పీఠికాదికే తూలికాయాః" అని రామాశ్రమి.

చ. కుముదసర స్తట స్ఫటిక కూల నవోత్పలశయ్య వ్రాలి, పు
న్నగములఁ బికాళిఁ గుట్టుసురు త్రెక్కొన ధర్మపుదార పట్టు శే
షము రెయి మల్లికాళి సతి చక్కఁగఁ జేయక యుండ నిల్వ నా
యమ మఱునాఁటికిం గలుగ నాంతగళచ్ఛ్రుతి గుంభితాశ్రువుల్. 150

ఆదేవి, పున్నగములన్ = పున్నాగములయందు, కుము... య్య - కుముద సరః = తెల్లగలువ కొలంకు యొక్క - తట = తీరమందలి - స్ఫటిక కూల = స్ఫటిక శిలామయమైన గట్టునందలి - నవ ఉత్పల శయ్యన్ = క్రొత్త కలువల పాన్పునందు, వ్రాలి = త్రెళ్ళినదై, పికాళిన్ = కోయిలల సమూహము, గుట్టుసురు = కొఱప్రాణములను, త్రెక్కొనన్ = ఖండించి కొంచు హరింపఁగా, ధర్మపు దారపట్టు శేషము = దానముగాఁ గొనునట్టి పుణ్యపు (ఇచ్చినవారికి పుణ్యము నొసఁగు) కొఱప్రాణంపుమిగితను, రెయి = ఆ పున్నమరాత్రియందు, మల్లికా అళి సతి = మల్లె పువ్వులలోని తుమ్మెదల స్వనము, చక్కఁగ చేయక యుండన్ = ముగింపకయుండునట్లు, ఆయము, మఱునాఁటికిన్, కలుగన్ = జీవించి యుండునట్లు, అంత...వుల్ - ఆ+అంత = రాత్రితుదివఱకు (రాత్రియల్ల) - గళత్ = కంటి నుండి కాఱుచున్నవై - శ్రుతి = చెవియందు-గుంభిత = ముత్తముగా కూడుకొన్న - అశ్రువుల్ = కన్నీళ్లు, నిలుపున్ = ఆఁపును.

తా.—ఆదేవి పున్నమలయందు కోయిలలు తన ప్రాణమును కుహూరుతములచే హరించుచుండఁగా, 'మీకు పుణ్యము కలుగును, నా ప్రాణము నంతయు హరింపకుఁడు, కొంచెము నాకు

విడిచిపెట్టుఁడు;' అని వేఁడుకొన్నది. అవి యట్లే కొంత కొనయూపిరి వదలినవి. ఆకట్టూపిరితో ఆమె ఆ రాత్రులందు తెల్లఁగలువకొలనిదరి నుండుస్ఫటికపుగట్టున అప్పుడే వికసించినకలువలతో రచించిన శయ్యలో త్రెళ్లియుండెను. అంతట వికసిత మల్లికా మకరంద పాన మత్తములగు తుమ్మెదలు తమరుతులచే ఆ కట్టునుఱును హరింపఁజొచ్చినవి; కాని ఆమె మఱునాఁటికి సేమముగా నుండునట్లు రేయెల్ల ఆమె కనుంగొనలనుండి జాఱఁగినబాష్పములు కర్ణగోళములు నిండి, ఆరుతములను ఆమెకు వినంబడకుండునట్లుగా, అడ్డపడి యాఁగినవి; ఆ రుతులు వినఁబడియే యున్నయెడల మఱునాఁటి వఱకు జీవింప దని భావము.—అతిశయోక్తి.

కోయిలలు కొంత ప్రాణమును హరించిన దనుటచే వానికూఁతలకు చిక్కుపడి నోరిలి నిస్సహాయైనదని భావము. పూర్ణిమలం జెప్పుట ఉత్పలముల యత్యంత వికాసమునకొఱకు. 'పికాళి' పెట్టిన బాధ పగలు, 'మల్లికాళి' - మల్లికలు సాయంకాలము మొదలు రాత్రియెల్ల వికాసము. తన్మకరంద పానముచేత మొత్తములై తేఁటులు ఆమెకు చిక్కుపడి కర్ణకఠోరముగా [illegible] భా.

'అశ్రువుల్'=నీటిలో మునింగినవానికి బయటి ధ్వనులు వినంబడని యట్లు అశ్రువుల యందుఁ గూడ మగ్నమయిన శ్రవణేంద్రియమునకు అళిరుతి గోచరింప దని భావము.

'దారవట్టు' - దార - ప్ర. ధారా. ఏదేని దాన మిచ్చువాఁడు 'ఇదిగో నీకు దీనిని ఇచ్చుచున్నాను' అని పలుకుచు. పుచ్చుకొనువాని చేతిలో ఉదకధారను బోయుచుండును. గావున 'ధారా పట్టుట'. ధర్మపుదారి-అనఁగా యుద్ధము నిలుపుదల చేయుటకు సూచకము [illegible] అని కొందఱు. (అస్త = అ+అస్త = అంతి—అన్వయి. తెల్లవాఱినంతట సుస్థితిగాక యుండును, గావున, అళులకు మకరందపానము నుండదు; కావున, తెల్లవాఱు వఱకును వాని బాధ తప్పించుకొన్నచో మఱునాఁటికి వానిక్షయము నుండదని అని, స్వారస్యము. ఇందు అశ్రు లనెడు సాత్త్విక భావము చెప్పఁబడినది:-"స్తమ్భః ప్రళయరోమాఞ్చాః స్వేదో వైవర్ణ్యవేపథూ। అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః."

తే. నెలఁతఁ గుచకుంభ యుగళి యుండియు వియోగ
జలధి యీఁదింప లేదయ్యె; సఖులు వంచు
చున్న పన్నీటి వెల్లి లోఁగొన్నకతన,
ముంప కది లాఘవమునఁ దేలింపఁగలదె. 151

నెలఁతన్ = ఆయింతిని, కుచకుంభయుగళియు = స్తనములనెడి కుండలజంట, ఉండియు, వియోగజలధిన్ = విరహమనెడి సముద్రమును, ఈఁదింపలేదయ్యె = (దాఁటునట్లు) యీఁదుటకు, సాయపడకపోయినది, (ఏలయన), సఖులు = చెలికత్తెలు, వంచుచున్న పన్నీటి వెల్లి = శీతలోపచారార్థము గిండులతోఁ బోయుచున్న హిమాంబు పూరమును, లోఁగొన్నకతనన్ = లోపలికి స్వీకరించినందున, అది = ఆకుంభయుగళము, ముంపక = వియోగసముద్రములో ఆమెను మునిఁగిపోవునట్లు చేయక, లాఘవమునన్ = తేలికతనముచేత, తేలింపఁగలదె = నీటిపై తేలుచుండునట్లు చేయఁగలదా?

తా.—కుండలను సాయముగా నుంచుకొని యీఁది నీళ్లను దాఁటవచ్చును, అటయినను ఆ కుండలలోనికి నీళ్లుచొచ్చినా, అవి తేలింపక ముంచివైచును; అట్లే ఆమెకు కుచములనియెడి జంటకుండలు ఉండియు చెలులు చలువ గొలుపుటకై పోయుచుండిన పన్నీటివెల్లు వానిలోనికి చొచ్చినందున, అవి ఆమెను వియోగసముద్రములో ముంచినవే గాని తేలించినవి గావు.—రూపకోత్థాపిత—

విశేషోక్తియు; కావ్యలింగమును; స్తనములు ముంచినవనుట చేత వానిపై శీతలోపచారముగా పోసిన పన్నీటిచే అవియు ఆమెకు వియోగభరమునే హెచ్చించిన వని భావము. ఎంత శీతలోపచారములు గావించినను విరహతాపము తగ్గదాయె ననుట.

ఉ. చంచలనేత్ర దాల్చు జలజాతమృణాలసరంబు వేగ స
ళ్లించినఁ బాఱుతెంచి కబళించి తదూష్మకు నంగలార్చు రా
యంచ కుచేష్టఁ గాంచి, యిఁక నైనను గందుమొ యంచు మోము వీ
క్షించినఁ, దోఁచు లేనగవు సేరుచు బోట్లకొకింత ప్రాణముల్. 152

చంచలనేత్ర=కాన్తంటి, దాల్చు జలజాత మృణాళసరంబు=ధరించునట్టి తామరతూండ్ల హారము, వేగ=వడిగా, సళ్లించినన్=వదలింపఁగా, పాఱుతెంచి=పరువునవచ్చి, కబళించి=మేసి, తత్ ఊష్మకున్=ఆతూండ్ల వేఁడికి, అంగ...ర్చుచు -అంగలార్చు=హాహాకారములు సేయు-రాయంచ=రాజహంసయొక్క - కుచేష్టన్=వికృతచేష్టను, కాంచి-చూచినవారై, (ఆమెయు దానిం గాంచి నది గావున), ఇఁక నైనను=ఈచిత్రమును ఈమె చూచిన మీఁదట నైనను, కందుమొ-(ఈమె మొగంబున నవ్వును) చూతు మేమో, అంచున్ = అనుకోరికతో, మోము = ఈమెయొక్క ముఖమునే, వీక్షించినన్ =చెలులు పరికింపఁగా, (వారికి), తోఁచు లేనగవు=రాయంచకుచేష్టకై యామె మొగంబునం గానిపించు మందహాసలేశము, బోట్లకున్ = ఆ చెలికత్తెలకు, ఒకింత ప్రాణముల్ = ఈమె బ్రతుకు నని యించుక ధైర్యమును, సేరుచున్ = కలిగించును.

తా.—విరహాధిలో ఆమె చిరకాలము నవ్వనే లేదు, ప్రకృతము ప్రాణసంశయదశకు వచ్చియున్నది. అందువలన చెలికత్తెలు ఆమె ప్రాణమునకై దిగులుపడుచుండిరి. అప్పుడు ఆమె చలువకై తాల్చిన తామరతూండ్ల హారములు నయితము ఆమెకు తాపమునే పెంచినందున వానిని ఆమె యూడ్చివైచినది. అవి ఆమె మేనునుండిన స్వల్పకాలములోనే దానికాఁకచేత ఉడుకుచున్నట్లుండినవి. హంసలకు ఆ తామరతూండ్లు భక్ష్యము గావున, వానిని, ప్రోదిరాయంచలు వచ్చి కబళించినవి. అందువలన వానినోరు కాలినది. అంత నవి హాహాకారము చేయుచు కావించిన వికృతచేష్ట వింతగాను హాస్యకరముగాను ఉండినది. దానిం గనియేని ఆమె నవ్వదా యని చెలికత్తెలు ఆమె మోమును తిలకింపఁగా, ఆమెయు ఆ వికృతచేష్టకు మందహాసితలేశముం గావించినది. లోకములో 'ప్రాణసందేహములోనున్నవారు నవ్వి రేని బ్రతుకుదు' రని పెద్దలు చెప్పుదురు గావున, ఆహాసితలేశమును గన్నయా చెలికత్తెలు, తమ చెలి బ్రదుకు నని యించుక దిగులుతీఱి యుండిరి పూర్వభాగమున అతిశయోక్తి ఉత్తరభాగమున స్వభావోక్తి.

'మృణాళం బిసమ్,'—అమ. నర౪-౪. స్రం.హారము.—"అయం కణ్ఠేబాహుః శిశిరమసృణో మౌక్తికసరః"-ఉ. రా. చ. 'వేగ [ = వేగముగా; వేగన్ = తెల్లవాఱఁగానె' అని యొకటీక.]

ఉ. శ్రీపతిమీఁది గీతముల ప్రేమ విపంచిక నంటఁ బాణి సం
తాపము సోఁకి మెట్టుమయినంబు గరంగిన, డించి, పాడు నా
లాపనిఁ దాల్చు, వెజ్జెమటల న్వెతఁ దంత్రులు జజ్జరింపఁ గలా
లాపిని దాన పాడును, గళంబును గద్గద మైన. ప్రస్ఫుడున్. 153

శ్రీపతిమీఁదిగీతములప్రేమన్ = శ్రీహరిస్తుతులయిన పాటలమీఁది యభిలాషచేతను (ఆ పాటలం బాడుటలో తోడుగా వాయించుటకై), విపంచిన్ =వీణను, అంటన్ =తాఁకఁగా, పాణి

సంతాపము=చేఁతివేఁడి, సోఁకి=తగిలి, మెట్ల=సరకట్లయొక్క - మయినంబు కరంగినన్, డించి = వీణను ఆవలఁబెట్టి, ఆలాపినిన్ = శ్రుతిమాత్ర మొసంగునదైన తంబురాను, తాల్చి = కైకొని (మీటుచు), పాడున్, మఱి=అంతట, పెజ్జెమటలన్ = ఎక్కుడయిన స్వేదముచేత, తంత్రులు= తంబురాతంతులు, జజ్జుకోన్ = సరిగా శబ్దింపక జబ్బుపడఁగా, కల ఆలాపిని = మధురవాణియైన యానవలా, తాన= (జంత్ర మేదియుంగొనక) గాత్రముగానే, పాడును=గానము సేయును; గళంబును=కంఠమున్నూడ, గద్గద మయినన్=డగ్గుత్తికపడఁగా, మ్రాన్పడున్ = నిశ్చేష్టురాలగును; విరహతాపము మెండగుచుండె నని భా.—విషమాలంకారము.

ఇందు స్వేద వైస్వర్య స్తంభము లనెడు సాత్త్వికభావములు చెప్పఁబడినవి.—'పెజ్జెమటలన్'='పెజ్జెమటు శ్రీహరిని భావమందు దర్శించుటచేత, నీరుతగిలిన తంతులు సరిగా శబ్దింపవు:—

"సిద్ధద్వన్ద్వై ర్జలకణభయా ద్వీణిభి ర్ముక్తమార్గః." మేఘ. "జలసేకస్య వీణాక్వణన ప్రతిబన్ధకత్వా దితి భావః".—మల్లి.

'తంత్రులు జజ్జుకోఁ (?) గలాలాపిని' అని. శ. ర. పాఠము. 'మయినంబు' - ప్ర. మదనః; "మదనః సిక్థకే స్మరే। రాధే వసన్తే ధత్తూరే"-పా. జబ్బుగా, 'జజ్జుకో', 'జజ్జుగా'.

తే. ప్రతికుసుమతల్పమునఁ జాఱి పడిన తప్త
వలయ మలినాంకయుగము వర్తులతఁ బొలిచెఁ,
జూడ నిఁక మానధైర్యము లున్న లనుచు
సుదతి బోట్లకుఁ ద్రప వ్రాసి చూపె ననఁగ. 154

సుదతి = శోభనములైన దంతములు గలదైన యాపడఁతి, చూడన్ = ఆలోచింపఁగా, ఇఁకన్=ఇటుతర్వాత, మానధైర్యముల్ = ఈలువును తేఁకువయు, సున్నలు = లేవు, అనుచున్= బోట్లకున్ = చెలులకు, త్రపన్ = లజ్జచేత. వ్రాసిచూపెన్, అనఁగన్ = అనునట్లుగా, ప్రతికుసుమ తల్పమునన్=ఆమె శయనించినపూఁబాన్పు లన్నిటియందును, జాఱిపడిన, త...ము-తప్త= క్రాఁగిన - వలయ=కడియములయొక్క - మలిన = నల్లని - అంక=గుర్తులయొక్క - యుగము=జంట, వర్తులతన్ = గుండ్రతనముచేత, పొలిచెన్ = ఒప్పెను.

తా.—ఆమె శయనించిన ప్రతిపూసెజ్జలోను ఆమెచేతులకడియములు దేహతాపముచేత క్రాఁగి, కార్శ్యమువలన చేతులనుండి జాఱి, పడుచుండినవి; అవి కాగినవగుటచేత అవి తగిలినచోట్ల పూసెజ్జయందు మాడిననల్లనిగుర్తులు రెండు ఏర్పడుచుండినవి. ఆ నల్లగుర్తు లెట్లుండినవనఁగా, ఆమె చెలులతో తన మన్మథావస్థను చెప్పుకొనుటకు లజ్జితురాలై ఇంక తనకు మానము దక్కదు, ధైర్యము ఉండదు, అని రెంటి నాశంబును వ్రాసిచూపిన, రెండుసున్నలో యనునట్లుండెను.- ఉత్ప్రేక్ష.

'జాఱిపడిన'-"కనకవలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః అని విరహుర్తని యక్షునిగూర్చి కాళిదాసు. యుగము-ఒకసున్న మానమునకు, ఒకటి ధైర్యమునకు, ఇఁక నామానమును కాపాడుకోలేను, ఇఁక ధైర్యముతో నుండఁజాలను.—'సున్న'-ప్ర. శూన్యము. త్రప యేల యనఁగా ఈయవస్థ మదనకృతము గావున; వ్యాధికృత మాయెనేని త్రప యుండదు.

ఉ. ఆ వనజాక్షి కాఁకఁ బొరలాడ, నలంగిన సొమ్ముఁ జీరలున్
వే వెస నూడ్చి యూడ్చి మఱి వేఱ వహించుట, వాసన్నష్టముల్

వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయా తనుగ్లానికి నత్యంత దుఃఖితుండై తత్కారణం బెఱుంగక వల దని మౌగ్ధ్యంబున వారించి చూచి యంత కంత కగ్గలం బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కారణానంతరంబునఁ, దన మనోనిర్వేదనం బన్నగరివెన్నునకు విన్నవింపం బునర్నమస్కృతిం జేసి, "దేవా దేవరదాసి యగు మదీయపుత్త్రి యేమిగుఱించియో విచిత్రంబగు వ్రతచర్యం గాత్రశోషంబు సేయుచున్నది, వల దన్న విన, దపుత్త్రకుండ నగునాకుం బుత్త్రిగానను బుత్త్రకుండైనను దాన, యే నేమిసేయుదు! మఱి తన తపశ్చర్య లెఱుంగు మా తపశ్చర్య లెఱుంగు గాదు, ఏము భవద్దివస భవజ్జనిదివస రాత్రులం దక్క గణరాత్రజాగరంబు లెఱుంగ, మేము బిసబీజాక్ష వలయంబులు దక్క బిసవలయంబు లెఱుంగ, మేము ప్రసాద కుసుమంబుం జెవిం జెరువుటం దక్క నవి గప్పుకొన నంటి శయనింప నెఱుంగ, మేము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినం దా నంగంబులు వడిపకొను, నేము చాంద్రాయణంబులం జంద్రవృద్ధి బడిం గడిగొక్కించినం దాఁడించు, నేము నిదిధ్యాస నిశ్వాస నిరోధంబు సేసినం దాం దద్ధ్యానపదవి వెలికి నిగిడించు, నేము చిన్ముద్రకై హృదయంబునం గేలు సేర్చినం దాం గపోలంబునం జేర్చు, వల్కలోత్తరీయంబు లేము ధరియించినం దాం గిసలయోత్తరీయంబులు వహించు, నేము సితపక్ష నూత్నేందుం గీర్తించినం దాం బూర్ణేందు నుపాలంభించు; నిట్లుగాం బ్రవర్తిల్లుచున్న యది; యిది యేటితపం బున్మాదంబు గానోపు, నెంత భవదీయభక్తి గలిగిన మాదృశులకుం బ్రకృతి సంబంధంబు విడువ; దంతర్యామివి నీవెఱుంగని యది లేదు; దీని నెఱింగింపవే;" యనవుడు, ననుకంపాతిశయంబునం దచ్చాపలంబునకు మందస్మితంబు సేసి మందరధరుం డిట్లనియె. 157

తనయా తను గ్లానికిన్ = కూఁతురియొక్క దేహాయాసమునకు, మౌగ్ధ్యంబునన్ = తెలియనివాఁడయినందున, ...అగ్గలంబు = అధికము, అగుడున్ = కాఁగా, గాత్రశోషంబు = దేహము నెండఁగొట్టుట, భవద్దివస=మీదినము (అనఁగా హరివాసరము)-భవజ్జనిదివస=నీ జన్మదినములయొక్కయు; గణరాత్రము=పెక్కురాత్రులు, చాంద్రాయణంబు= చంద్రవృద్ధిక్షయంబులంబట్టి కడిని హెచ్చించుచు తగ్గించుచు చేయు వ్రతము, నిదిధ్యాసన్ = బ్రహ్మధ్యానమందు, చిన్ముద్ర = జ్ఞానముద్ర; వల్కల=నార, కిసలయ=లేఁతయాకు, సితపక్ష=శుక్లపక్షమందలి-నూత్నేందున్ =క్రొత్తచంద్రుని, ఉన్మాదంబు=పిచ్చి, అనుకంపా=కనికరము, మందరధరుండు=నారాయణుఁడు.

—* ఆశ్వాసాంతము *—

ఉ. కంధర నీలవర్ణ, మధుకైటభ నాగ సుపర్ణ, యోగిహృ
ద్గ్రంథిభిదోత్థ భోగివనితా స్తనవచ్ఛ్వసన ప్రవచ్ఛిర
స్పంధి వసన్నిశాటిపస స్రుతి దగ్ధపయోధి వీచికా
మంథనకేళికాపర సమాశ్రిత పంక్తిశిరోధిసోదరా. 158

కం...ర్ణ - కంధర = మేఘమువలె - నీల = నల్లనైన - వర్ణ = దేహచ్ఛాయకలవాఁడా (ఉపమ), మధు...ర్ణ - మధు = మధుఁడు - కైటభ = కైటభుఁడు - అనెడు - నాగ = పాములకు - సుపర్ణ = గరుడుఁడవైనవాఁడా (రూపకము), యో...ర - యోగి = హఠయోగము లంబికాయోగము రాజయోగము గల తపస్వులయొక్క - హృత్ గ్రంథి = హృదయంపుముడియొక్క - భిదా = భేదనముచేత - ఉత్థ = హృచ్చక్రముపైకిలేచిన - భోగి వనితా = ఆఁడుఁబాముసాకారమున నుండెడి కుండలినీ శక్తియొక్క - స్వనవత్ = ధ్వనిగలదైన - శ్వసన = ఊర్పుచేత - స్రవత్ = ఓడుచున్న - శిరస్సంధి - శిరస్సులోని బ్రహ్మరంధ్రమందు - వసత్ = ఉన్నట్టి - నిశాపతి రస = అమృతముయొక్క - స్రుతి = ప్రవాహమనెడి - దుగ్ధపయోధి = పాలసముద్రముయొక్క - (రూపకము) - వీచికా = అలలయందు - అమంథర = అలసముకాని - కేళికా = క్రీడయందు - ఆదర = ప్రీతికలవాఁడా, సమా...రా - సమాశ్రిత = శరణుఁజొచ్చినవాఁడైన - పంక్తిశిరోధ సోదరా = దశకంఠుని సహోదరుఁడుకలవాఁడా.

తా.—నారాయణమూర్తి నీలమేఘశ్యాముఁడు, గరుడుఁడు పాములను చంపునట్లుగా మధుకైటభులనెడియసురులను చంపినవాఁడు. [కల్పాంతమున నారాయణుఁడు యోగనిద్రలోనుండఁగా వారు అతనిచెవులనుండి పొడమి తన్నాభికమలమునుండి పొడమియున్న బ్రహ్మను బాధింపఁ దొడంగిరి. అతని మేల్కొలుపు మేల్కొని నారాయణుఁడు వారిని సంహరించెను.] యోగి నాభియందలి మణిపూర చక్రమందు నాగాంగనారూపమున నిద్రించుచుండెడి కుండలినీశక్తి యోగవిశేషముచేత మేల్కొని లేచి హృదయగ్రంథిని భేదించుకొని యోగి శిరస్సునందలిసహస్రారకమలముం బొడుచును; అందుండి అమృతము దుగ్ధపయోధివలె నుప్పతిల్లును; అందు శ్రీమన్నారాయణుఁడు క్రీడాసక్తుండైయుండును; రామావతారమైన నారాయణమూర్తిని రావణునితమ్ముఁడు విభీషణుఁడు శరణుఁజొచ్చినాఁడు, అట్టి యా నారాయణుఁడవే అగునో వేంకటేశ్వరా, అని సంబుద్ధి; దీనికి 'అవధరింపుము' 6 (2) అను క్రియతో నన్వయము.

ఇందు న్ధ న్థ లకు ప్రాస మున్నది; అప్పకవి దీనిని అంగీకరించి స్వవర్గజప్రాస మని పేర్కొని, ప్రాసములో అంధక, బాంధవ, గ్రంథ, అంఘులు అను పదములుగల పద్యమును భారతము నుండి ప్రమాణీకరించినాఁడు.

క. ప్రపదానిశ నతిచర్యా, । త్రిపదావనవర్య, నాకదేవాద్యమర
ద్వీప, దానవాహితోదిత । విపులాత్మభవా, భవారివిశ్రుతనామా. 159

ప్రప...ద్వీప - ప్రపద = పాదాగ్రములకు - అనిశ = ఎల్లప్పుడును - నతి = మ్రొక్కుట యొక్క - చర్యా = చేఁతచేత - త్రిపద = స్వర్గమర్త్యపాతాళములనెడి మూఁడుస్థానములందును - అవన = జీవించువారిలో - వర్య = ముఖ్యులయిన - నాకదేవ = స్వర్గపతియైన యింద్రుఁడు - ఆది = లోనుగాఁ గల - అమరద్వీప = సురోత్తములు కలవాఁడా (ఉపమ), దాన...పా - దానవ = అసురులకై - అహిత = చేటునకై - ఉదిత = జనించిన - విపులా. ఆత్మభవా = భూపుత్త్రి గలవాఁడా, భవా...మా - భవ = సంసారమునకు - అరి = శత్రువైన - విశ్రుత = ప్రఖ్యాతమయిన - నామా = పేరుగలవాఁడా.

తా.—శ్రీమన్నారాయణుని పాదాగ్రములకు అనిశము మ్రొక్కుచుండుటచేత నింద్రాద్యమరవరులు మూఁడులోకములలోను ఉత్తములై యున్నారు. (మహాలక్ష్మి) రామావతారమందు నారాయణునికి భార్యగా (సీతాదేవిగా) అసురవినాశకారణార్థము జనించినది. నారాయణ నామోచ్చారణచేత జననమరణ ప్రవాహము తప్పిపోవును. అట్టి నారాయణుఁడవైనయో వేంకటాచలపతీ, అని సంబుద్ధి - 'అవధరింపుము' 6 (2) అని యన్వయము.

## తోటక వృత్తము.

ద్రుహిణాండకరండక ధూర్వహగ । ర్భ, హరార్భక దుర్భర పక్వతపః
కుహనార్భక, వార్భృత కోనిరి హా । రి హిరణ్మయ హర్మ్య చరిష్ణుపదా. 160

ద్రు...హ - కరండక = కరవటములవంటి - ద్రుహిణ అండ = బ్రహ్మాండముల యొక్క - ధూః = భారమును - వహ = మోచునదైన - గర్భ = కడుపుకలవాఁడా, హరా...క - హర = శివుని - అర్భక = కుమారుఁడైన కుమారస్వామియొక్క - దుర్భర = భరింపశక్యముగాని - పక్వతపః = (తపః ఫలమయిన) - కుహనా అర్భక = కపటబాలుఁడా, వా...దా - వాః = నీళ్లతో - భృత = నిండిన - కోనిరి = స్వామికోనేరు అను నాంధ్రనామముగల స్వామిపుష్కరిణియందు - హారి = మనోహరమయిన - హిరణ్మయ - కనకవికారమయిన - హర్మ్య = సౌధమందు - చరిష్ణు = సంచరించెడు - పదా = చరణములు కలవాఁడా.

తా.—నారాయణుని గర్భమందు కరవటమువంటి బ్రహ్మాండములు లెక్కకు మీఱియున్నవి. వానిభారము నెల్ల ఆయన ఆ కడుపులో మోచుచున్నాఁడు. కుమారస్వామి చేసినతపస్సునకు ఫలముగా నారాయణుఁడు బాలుఁడుగా జనించినాఁడు. జలసమృద్ధమై మనోహరమైన స్వామిపుష్కరిణియందలి సౌధములోనికి నారాయణుఁడు వేంకటాచలపతిగా వేంచేయును. అట్టి యో వేంకటాచలపతీ - 'అవధరింపుము.' 6 (2) అని యన్వయము.

మ. ఇది యంధ్రోక్తియథార్థనామ యవనాసృక్పూర్ణ కెంబావి వా
రిద పద్ధత్యవరోధి వప్రవలయ శ్రేణీవిఘాతక్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్. 161

ఇది = ఈ = ఈ గ్రంథభాగము, ఆంధ్ర...దన్ - ఆంధ్ర ఉక్తి = తెనుఁగుమాటచేత - యథార్థనామ = సార్థకనామమై - (కెంబావి తెనుఁగుమాటగా విడఁదివిచికొన్నచో - కెంపుబావి - ఎఱ్ఱనిబావి = రక్తవాపి అని యర్థ మగును. - అందులకు ఉపపత్తి అనంతరవిశేషణమున నున్నది). - యవన = తురకలయొక్క - అసృక్ = రక్తముతో - పూర్ణ = నిండినదైన - కెంబావి = కెంబావిపట్టణము యొక్క - వారిద = మేఘములయొక్క - పద్ధతి = దారిని - అవరోధ = అడ్డగించునట్టి - వప్రవలయ = చుట్టుకోటలయొక్క - శ్రేణి = వరుసయొక్క - విఘాతక్రియా = పడఁగొట్టు పనికి - ఆస్పద = నెలవయిన - సేనా = దండునకు - అగ్రగ = ముందు నడచువాఁడయిన - కృష్ణరాయమహీభృత్ సంజ్ఞ = కృష్ణరాయ పృథివీపతి యను పేరి - అస్మత్ = నాయొక్క - ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యద (యను కావ్యమున) యందు, పంచమంబు = ఐదవదైన - ఆశ్వాసము = కావ్యవిభాగము, హృద్యంబైనపద్యంబులన్ = మనోహరము లగుపద్యములతో, అమరున్ = ఒప్పును.—నిరుక్త్యలంకారము, అతిశయోక్తియు.

“యోగముచే నామములకు । బాగుగ నన్యార్థకల్పి పరఁగు నిరుక్తిన్;
ఈగతి వేఁపుదు వీవు వి । యోగుల దోషాకరాఖ్య యొప్పదె నీకున్?” అను.

వారిద పద్ధత్యవరోధ = అత్యున్నతమైన యనుట.—అతిశయోక్తి.

వప్రవలయశ్రేణీ - ప్రాకారములు పెక్కు లనుట - హృద్యంబైనపద్యంబులన్ - “సువర్ణకాంతి విశేషణంబుల బహువచనంబులకు ఏకవచనంబు బహుళముగా నగు”-బాల. కారక. 20.

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## షష్ఠాశ్వాసము

క. శ్రీకారి కృపార్ద్రేక్షణ, । వైకుంఠ యకుంఠ, భక్తవరదపదాబ్జా
స్తోక మరందాయిత గం। గా, కాకోదర నగోదయస్థ పతంగా. 1

శ్రీకా...ణ-శ్రీ = సంపదను - కారి= చేయునదైన-కృపా = కరుణచేత - ఆర్ద్ర=తడిదైన-ఈక్షణ=చూపు గలవాఁడా, వైకుంఠ=వికుంఠాదేవియొక్క యపత్యమా, అకుంఠ=భంగములేనివాఁడా, భక్తవరద=భక్తులకు వరములను ఇచ్చువాఁడా, పదా...గా-పద అబ్జ = కమలములవంటి యడుగులకు-అస్తోక = బహుళమైన-మరందాయిత = మకరందమువలె నాచరించుచున్న-గంగా = గంగానది కలవాఁడా, కా...గా-కాకోదర నగ=శేషశైలము (వేంకటాద్రి) యనెడి-ఉదయ = పొడుపుమలయందు-స్థ=ఉన్నట్టి-పతంగా=సూర్యుఁడా, (అవధరింపుము అని తర్వాతికి అన్వయము).

పదాబ్జమరందాయితగంగా - పూజలో 'కృష్ణపాదసముద్భూతే గఙ్గే త్రిపథగామిని' అని గంగాసంబుద్ధి. గంగ విష్ణుపాదమందుఁ బుట్టినది.—ఉపమాలంకారము; 'కాకోదరనగోదయస్థ పతంగా'-రూపకాలంకారము. శ్రీమన్నారాయణుని కృపాకటాక్షముచేత సంపదలు కలుగును; ఆయన వికుంఠాదేవికుమారుఁడు 'కుణ్డలీ గూఢపాచ్చక్షుశ్శ్రవాః కాకోదరః ఫణీ'-'శైల వృక్షౌ నగా వగౌ' - 'ఉదయః పూర్వపర్వతః' - 'పతఙ్గౌ పక్షిసూర్యౌచ' - 'విష్ణుర్నారాయణః కృష్ణో వైకుణ్ఠో విష్టరశ్రవాః' అమ.

వేంకటాద్రికి నిమిత్తవిశేషములచే-చింతామణి, జ్ఞానాద్రి, తీర్థాచలము, పుష్కరశైలము, కనకాచలము, నారాయణాద్రి, వైకుంఠాద్రి, నరసింహాద్రి, అంజనాద్రి, వరాహాద్రి, నీలగిరి, శ్రీనివాసాచలము, ఆనందాచలము, శ్రీసద్గిరి, క్రీడాచలము, గారుడాద్రి, శేషాచలము, వృషాద్రి, అని పేరులు కలవు; శ్రీవేంకటాచలమాహాత్మ్యమును చూ. చతుర్థపాదమున గంగా అను సంబుద్ధిం బట్టి ప్లుతయతి గానోపు.

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. 2

—* మాలదాసరి. *—

చ. కలఁ డొకరుండు పేరుకొనఁ గాని కులంబు మదీయభక్తుఁ, డి
య్యిల మును వాఁడు వామనత నే వసియింపనొ పుణ్యభూమి, నం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి, పాడు మము లాలస మంగళనామ కైశికిఁ. 3

ఒకరుండు, పేరుకొనఁగానికులంబు = చెప్పరానిజాతి (వాఁడు), మదీయ భక్తుఁడు = నాయొక్క డింగరీఁడు, కలఁడు=ఉండెను, వాఁడు, మును=పూర్వము, ఈయిలన్ = ఈలోకములో,

ఏన్ = నేను, వామనతన్ = వామనావతారమందు, పుణ్యభూమిన్ = ఒకపావనక్షేత్రమందు, వసియింపనో = నివసించియుండలేదా, అంగులకున్ = ఆ యాశ్రమమునకు, యోజనత్రయపు దూరపుటూరన్ = మూఁడామడల దూరపు గ్రామమందు, వసించి = నివాసముండి, బ్రాహ్మవేళలన్ = రాత్రికడపటిజాములోని పూర్వార్ధమందు, చనుదెంచి = వచ్చి, మనున్ = నన్ను (నా స్తుతులను) లాలసన్ = మహాభిలాషతో, మంగళనామకైశికిన్ = మంగళ మను పేరికైశికితో (మంగళ కైశికీరాగమున ననుట), పాడున్ = గానముసేయును.

తా.— నాభక్తుఁ డొకఁడు మాలదాసరి యుండెను. వాఁడు పూర్వము వామనావతారమున నేను వసించిన పుణ్యాశ్రమమునకు మూఁడామడలదూరమున నొక గ్రామములో వసించుచుండి, ప్రతిదినము బ్రాహ్మముహూర్తమున ఇచ్చటికి వచ్చి నాస్తోత్రములు మంగళకైశికి యను రాగమునం బాడుచుండును.— అని వస్తునిర్దేశము.

శ్రీవామనమూర్తి నివసించిన దివ్యదేశమునకు అరవమున 'కురుంగుడి' యని పేరు. మాలదాసరి *కైశికీరాగముం బాడినందులకు—

"యస్త్వయా పశ్చిమం గీతం స్వరం కైశికసంజ్ఞకం
ఫలేన తస్య భద్రం తే మోక్షయిష్యామి కిల్బిషాత్."

శ్రీభగవానువాచ:—

"యస్తు గాయతి సంయుక్తం కైశికం విష్ణుసంసది
స తారయతి దుర్గాణి శ్వపాకో రాక్షసం యథా."—కైశికపురాణము.

ఇంకను పట్టికలో కైశిక (వైశిక) శబ్దము క్రింద చూడునది.

వ. అహరహంబు నన్నుపాస్తుండు. 4

అహరహంబు = ప్రత్యహము - ప్రతిదినము.

క. జాత్యుచితచరిత్రము। మత్ప్రీత్యర్థం బూఁది తనదు హృదయము శుచితా
నిత్యంబుగఁ దత్తనుసాం। గత్యము మసిపాఁత మానికంబై యొదుఁగన్. 5

జా...ము - జాతి = (తనదైన) చండాలజాతికి - ఉచిత = తగినదైన - చరిత్రము = నడవడియే, మ...బు - మత్ = నాయొక్క - ప్రీత్యర్థంబు = సంతోషమునకొఱకు, ఊఁది = అవలంబించి, తనదు హృదయము = తన మనస్సు, శుచితా నిత్యంబుగన్ = శుద్ధత్వమందు స్థిరము అగునట్లుగా, త...ము - తత్ = ఆ - తను = దేహముతోడి - సాంగత్యము = కూడిక, మసిపాఁతమానికంబు = మసిగుడ్డపేలికలో ముడిఁచిన కెంపు (చందము), ఐ, ఒదుఁగన్ = ఓసరిల్లియుండఁగా (అనఁగా ఆత్మశుద్ధికి కొదువ సేయనిదై యుండఁగా).

తా.—వాఁడు నాప్రీతికొఱకు తనమాలజాతికి ఏర్పడిన ధర్మమే ఆచరించుచు, మనస్సును ఎప్పుడును శుచిగా నుంచుకొని, తనకు ఆ మాలదేహము, మానికమునకు దానినిముడిఁచిన మసిపాఁత యెట్లో అట్లే ఏ దోషమును చేయనేరనిదై యుండఁగా.—

వాక్యార్థగత నిదర్శనాలంకారము.—

"బింబ ప్రతిబింబత్వా। ప్తంబు లగు విశేషణములఁ దాల్చిన యిరు ధ
ర్మంబుల కేకత్వము కథి। తం బగు వాక్యార్థగత నిదర్శనయందున్;
ఎది దాతసౌమ్యతయు య। ల్లదియే సంపూర్ణశశికి నకళంకత నాన్."

* 15 మేళకర్త, సమగమప - సనిధపమగరిస.

క్షత్త్రధర్మమైనయుద్ధమును మాని విప్రధర్మమైనశాంతి నవలంబింప దొరకొన్న యర్జునునికి శ్రీకృష్ణులవారు జాత్యాచారము నతిక్రమింపఁగూడ దని ఇట్లు ఉపదేశించినారు.

శ్రేయాం త్స్వధర్మో విగుణః। పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః। పరధర్మో భయావహః.

అభిజ్ఞాన శాకుంతలములో చెంబడివాఁడు ఈ యర్థము నే
"శహావి కిల జే విణింది యే। ణ హు జే కమ్మ వివజ్జణీయ యే."

అని యనువదించినాఁడు. 'మణిపాఁతి మానికంబు'-మసిపాఁతిలో కట్టియుంచిన మాణిక్యమునకు నలుపు కలుగినట్లు, చండాలదేహమునం దున్నను తనశుద్ధహృదయమునకు పాపము సోఁకకుండె ననుట.—మానికంబు—ప్ర. మాణిక్యమ్.

సీ. చమురైన తోల్కుబుసంబు టెక్కియును ని
త్తడి శంఖ చక్ర కుండలము లమర,
దివెదారికొమ్ముఁ దోల్తిత్తియు జోడమ్ము
మెడ మీఁది మొగలాకు గొడుగుఁ దనర,
మత్పాదరక్షయు మావు పెన్వెఱకఁ గు
ట్టిన యోటి తిపిరిదండెయును మెఱయఁ,
జిటితాళములు సంక పుటిక నొక్కొకమాటు
గతిరయంబునఁ దాఁకి కలసి మొరయ,
తే. వలుద వనమాలకంఠియు మలిన తనువుఁ
బట్టెతిరుమన్ను బెదరుఁ గెంబట్టుఁ జూపుఁ
బసుపుఁబోఁడితోలువల్లంబు నెనక మెసఁగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. 6

మాలదాసరియొక్క సరికరమును వర్ణించుచున్నాఁడు:—

(1) సురియాళు వైష్ణవుండు = విష్ణుభక్తుఁ డైనయామాలవాఁడు (మాలదాసరి యనుట), చమురు ఐన తోలు కుబుసంబుల్ = చమురు తగిలిన తోలుచొక్కాయును, టెక్కియును = (చమురైన) టోపియును, ఇత్తడి శంఖచక్రకుండలములు = శంఖప్రతిమతో నొకటియు చక్రప్రతిమతో నొకటియుఁగా ఇత్తడితోఁ జేయఁబడిన చెవికమ్మలును, అమరఁగ్ = ఒప్పుచుండఁగా;

(2) దివెదారికొమ్ము = దీపస్తంభంబును (లేక ఆపేరియాయుధ విశేషంబును), తోలు తిత్తియు = చర్మపుసంచియు, జోడమ్ము = చేయమ్మును (బోడమ్మను పాఠమున - ములికి లేని బాణంబును), మెడమీఁద, మొగలి ఆకు గొడుగుఁ, తనరఁగ్ = ఒప్పఁగా;

(3) మత్ పాదరక్షయుఁ = నా పాదుకయు, మావు పెను వెఱకఁ = గుఱ్ఱపు నిడుద వెండ్రుకలతో, కుట్టిన ఓటి తిపిరి దండెయును = కుట్టినట్టి చీలిన యల్పపుఁ గిన్నెరయును, మెఱయఁగ్ = ఒప్పుచుండఁగా; ['మావుపెన్నెఱక' శ. ర. పా. 'మావుపెన్వెఱక' శ. ర. పా. తాదిపదములలో 'తిబిరి' కలదు; 'తిపిరి' లేదు, 'వెఱక' క్రింద 'తిపిరి' కలదు; నాదులలో - నెఱక = వెండ్రుక;]

యందు (చెక్కిళ్లనిండ), ముత్ అశ్రులహరుల్ = ఆనందబాష్పప్రవాహములు, కప్పన్ = కమ్ముకొనుచుండఁగా, నుతుల్ = మదీయస్తోత్రములు, పాడి = గానముచేసి, భక్తి...బు - భక్తి = మత్పరత్వముచేత - జనిత = పుట్టినదై - ఉద్యత్ = విజృంభించుచున్న - తాండవంబు = నాట్యమును, ఆడున్ .

తా.—జాతిచేత చండాలుఁడైనను ఉత్తమోత్తములయొక్క యాచారమందు ఉన్నట్టి యీ దాసరి (ప్రతిదినము తనబరువులు ఆచెంతను దింపి ఎండను గాలిని ఆఁకటిని తలంపక మధ్యాహ్నమువఱకు ఒడలంతయు గగుర్కొనుచుండఁగా, రాలు గరఁగునట్లు, తనచండాలవీణను వాయించుచు, ఆనందబాష్పములు చెక్కిళ్లను నిండుగా కమ్మివైచుచుండఁగా, నాస్తోత్రములు పాడి భక్త్యుద్రేకముతో తాండవ మాడును.—

ఇందు బాష్పరోమాంచము లనెడు సాత్త్వికభావములు చెప్పఁబడినవి.—'గణ్డౌ కపోలౌ,' 'ఆభోగః పరిపూర్ణతా,' ము త్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః। స్యాదానన్దథురానన్దః,' - అమ. లహరి - ''నభోవాహినీ లహరీ శీతలగంధవాహ...'' మను. 'చణ్డాలికా తు కణ్డోలవీణా చణ్డాలవల్లకీ' - అమ. - గుండు లీనుగన్ - లోకోక్తి - శ్రోతలకు గానరస మెఱుఁగనివారికి సైతము అపరిమితానందము కలుగునట్లుగా.

'ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్న స్త్రిసంధ్యమ్' - అమ.—

ప్రాహ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము అని పగటిని మూఁడుసమభాగములు చేసినచో ప్రాహ్ణము తొలిపదిగడియ లగును. ఆ ప్రాహ్ణమున్ - ఆ పదిగడియలసేపును - అవ్యయీభావ సమాసము. 'ఉత్పులకియై' - ఉత్పులకుఁడై అని పఠించినచో కర్మధారయముపై మత్వర్థీయము తొలఁగును, బహువ్రీహిచేతనే కార్యమగును.

తే. అట్లు తడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగి
గర్భమంటపిఁ గడిగిన కలఁకజలము
లోని జాల్తొట్టి నిండి కాలువగఁ జాఁగి
గుడి వెడలి వచ్చునది శూద్రుఁ డిడఁగ గ్రోలి. 8

అట్లు = ఆప్రకారముగా, తడవుగన్ = చాలసేపు, కొల్చి = నన్ను సేవించి, సాష్టాంగము = ఎనిమిది యంగములు నేలకు తగులునట్లుగా, ఎఱఁగి = మ్రొక్కి, గర్భమంటపిన్ = గర్భగృహమును. కడిగిన కలఁకజలము = కడిగిన మలినోదకమును, లోని జాల్తొట్టి నిండి = గుడిలోపలి జాలితొట్టి పూర్తియై, కాలువగన్, చాఁగి = పాఱి, గుడి వెడలి వచ్చునది = గుడినుండి వెలికి పాఱుచున్నట్టి దానిని, శూద్రుఁడు, ఇడఁగన్ = తనకు ఒసంగఁగా, గ్రోలి = త్రాగి; - తర్వాతి వాక్యముతో నన్వయము.

సాష్టాంగము—

''కరయుగములుఁ జరణంబులు । నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కినఁ । బరువడి సాష్టాంగమండ్రు పరమమునీంద్రుల్.''

గర్భ...నది = తొట్టితీర్థమును, శూద్రుఁడు - అతఁడు సమీపమునకు రావచ్చును గాన; బ్రాహ్మణాదులకు అర్చకుఁడే హరిపాదోదకమును ఇచ్చును. కలఁక - భక్త్యతిరేకముచే కలఁకయు అతిప్రియమే అగును.

"చణ్డాల ప్లవ మాతఙ్గ దివాకీర్తి జనఙ్గమాః"-"అర్తిః పీడాధనుష్కోట్యోః,"-"పక్కణః శబరాలయః" - అమ.

"తూపరాణపు టమ్ము తూ మొప్పరము జల । దారి యనంగను దనరును జల । నిర్గమము తన్ను ఖంబున నీటితోడ । వచ్చు తృణములఁ బోరగొనిపలక పేరు । లాఁపరా యనంగ జనులు పల్కఁగను వెలయు." - ఆం. భా.

క. అద్దమరే యద్దాసరి । యద్దండ బిడాలగాహి తాలయ కృకవా
కూద్దండ రవము విని చను । ప్రొద్దాయె నటంచుఁ బాడఁ బోవుచు త్రోవన్. 11

అద్దాసరి, అద్దమరే(యి) =అర్ధరాత్రంబున, అద్దండన్ = ఆ సమీపమున, బిడా...మున్ - బిడాల = పిల్లి చేత - గాహిత = చొరఁబడిన - ఆలయ = ఇంటిలోని - కృకవాకు - కోళ్లయొక్క - ఉద్దండ=బిగ్గరయైన - రవము=కూఁతను, విని, చనుప్రొద్దు ఆయెనటంచున్ =(స్వామిసేవకు) తరలు వేళ అయినదని (తలంచుకొని), పాడన్ = సాస్తుతులు పాడుటకై, పోవుచున్, త్రోవ = మార్గమందు (అవతలికి అన్వయము).

తా.—ఒకనాఁడు ఆదాసరి అర్ధరాత్రమున ఆచెంత నొకయింట పిల్లి చొరఁగా, దానికి వెఱచి కోళ్లు కూయఁగా, ఆ కూఁతలు వేగుప్రొద్దుకోడికూఁత అని తలఁచినవాఁడై వెంటనే లేచి సన్నుం బాడుటకై వచ్చుచు దారిలో.—

"నడిరాతిరి యన । నడిరేయి యనఁగఁ గాం । చా మాంసార ప్రొ । ద్దన సరిప్రొద్దన నద్దమరెయి । యన నిశీథాఖ్య దగు" ఆం. భా.

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యొడు తమిస్రఁ గాడుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్యగహనవాటిఁ జొచ్చి చనుచు. 12

మరులుఁ దీఁగన్ = మన్నుమాతంగి తీఁగను (దీనిని త్రొక్కినవారు దారితప్పుదురు), మెట్టి=త్రొక్కి, ఇరులు = ఓ చీకటీ, అన్నన్ = అని పిలిచిన, ఓఅనియెడి తమిస్రన్ = ఏమి అని బదులు పలుకునట్టి చీకటి రాత్రియందు, కాడుపడి = దారితప్పి దిగ్భ్రమగొని, పొలంబులు= చోట్లు...శూన్యగహనవాటిన్ = నిర్మానుష్యపుటడవి ప్రదేశమును,..."చీకటి యిరులునాఁ జెలువొందు"-ఆం. భా.

'ఇరులన్న నో యనియెడు' - అతిశయోక్తి - గాఢాంధకారముగల యని భా. "తమిస్రా తామసీ రాత్రిః" అమ. ఇరులు-సంబుద్ధి - పలుకుము అనుమధ్యమ పురుషము ఊహ్యము. మరులుఁ దీఁగ-చూ. పట్టిక. "ఓ యన నేమి నా నొప్పఁగి మర్ధమై"-ఆం. భా.

సీ. ఇడిసిన యిడుపుల యొడలఁ బొత్రము త్త
రేను గసెంద కోరింద పొదలఁ
గెడసిన గరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యడవకాఁపురముండు నాఖుతతుల

సగము దుమ్మునఁ బూడి చిగిరింత వామూయఁ
  బెరిఁగిన నూతిపాఁతర బొాటియలఁ
చీమలు ప్రాలీడ్వఁ జివికిన వెలుగుప
  ట్టునఁ బండి యెండి క్రుంగిన గునుకులఁ
తే. పెంటదొాగ్గళ్లలోఁ గడుపంటి శ్మశ్రు
  చలనములఁ గ్రుక్కు జీర్ణోతువులఁ బొాలంపు
  దుండుగల మళ్ల యూరులఁ దూలి రాడు
  చిక్కనేతాల పాడఱు సీమఁ జనుచు. 13

(1) ఇడి...లన్ -ఇడిసిన=కూలిపోయిన - ఇడుపుల=ద్వారపార్శ్వములయొక్క - ఎడలన్ = ప్రదేశములయందు, పొాత్రే...లన్ -పొాత్రేను=పొట్టిరేఁగు - ఉత్తరేను=అపామార్గము - కసింద= కాసమర్దము - కోరింద = జటూక - అనువాని - పొదలన్ = పొదరులచేతను; (2) కెడసిన గరిసెల క్రిందన్ =పడిపోయిన గాదెలకు అడుగున, ఆఁకటన్ = క్షుధచేత, కృస్సి=కృశించి, అదవకాఁపు రము=ఆసిరనివాసముగా, ఉండు - ఆఖు తతులన్ = పందికొక్కుల గుంపులచేతను; (3) సగము = (నూతిగోతులయు పాఁతగోతులయు) అర్ధభాగము, దుమ్మునన్ = ధూళిచేత, పూడి = నిండి, చిగిరింత, వామూయన్ = (ఆ గోతుల నోళ్లకు) మూఁతగా, పెరిఁగిన నూతి పాతర బొాటియలన్ =బలిసిన బావులయు ధాన్యపుగోతులయు పల్లములచేతను, (4) చీమలు = పిపీలికలు, ప్రాలు = గింజలను, ఈడ్వన్ = లాగికొనిపోఁగా, చివికిన వెలుగు పట్టులన్ = సారము చచ్చిన కంచెల తావులయందు, పండి = (గునుకుధాన్యము) పక్వమై. ఎండి = శుష్కించి, క్రుంగిన గునుకులన్ = అణఁగిపోయిన గునుకు సస్యముచేతను;

పెంట దొాగ్గళ్లలోన్ = పెంటలలోని దొాగ్గలిచెట్లయందు, కడుపు అంటి = (తిండిలేమిచే ఆఁకటి) కడుపు వెన్నునకు అంటుకొనిపోయి, శ్మశ్రు చలనములన్ =మీసాల కదలికను - క్రుక్కు జీర్ణోతువులన్ = అణఁచుకొనుచున్న ముసలి పిల్లులచేతను, పొలంపుదుండుగలన్ =చేలయందు బలియు కలుపు మొలకలచేతను, మళ్ళయూరులన్ = మడులయందలి బొారుగంటలచేతను, రాడు చిక్కు ఏతాలన్ =నిట్రాడు మిగిలియున్న యేతాలచేతను, పాడఱు సీమన్ =పాడుపడిన ప్రదేశమందు, చనుచున్ = పోవుచు.

తా.—ద్వారపార్శ్వములు కూలిపోఁగా, అచ్చోట, పొట్టిరేఁగులు - కసివెందలు - కోరిందలు-పొదలుగా బలిసినవి; గాదెలు పడిపోఁగా వాని క్రింద బొాక్కలలో ఆఁకట నకనకంబడుచు పందికొక్కులు తత్తాక్కులనున్నవి కాఁపురముండినవి; బావులును పాఁతగోతులును దుమ్ముపడి సగము పూడిపోఁగా వాని నోళ్లకు మూఁతగా చిగిరింత పెరిఁగియుండినది; చీమలు గునుకువరి గింజల నీడ్చుకొనిపోవు దారిలో సారము చచ్చిన కంచెలతావున ఆ గునుకుగింజలు పడి మొలచి వెన్నులు పెరిఁగి పండి ఎండి రాలి అణఁగి పోయినవి; పెంటలమీఁద పెరిఁగిన దొాగ్గలిచెట్లలో ముసిపిల్లులు ఆఁకట నొగిలి కడుపు మాడుకొనిపోయి మీసాలనుగూడ కదపక పడియుండినవి; పొలములున్న తావుల గాదము పెరిఁగినది; మళ్లలో బొారుదుబ్బులు మొండుకొన్నవి; ఏతాలు నాశమై, అవి యుండిన తావులందు వాని రాడులుమాత్రము మిగిలి ఒరిగిపోయి యుండినవి; అట్టి పాడు ప్రదేశములో ఆ దాసరి పోవుచుండెను.—స్వభావోక్తి.

సీ. ఎలనీటి బొండలంబులు వోలె మెదడెల్ల
 జుట్టి వ్రేచిన డొల్లు పుఱ్ఱెగములు,
నెఱచి గీఱిన జీర లేర్పడఁ దుదముట్టఁ
 జీకిన నులిపచ్చి కీకసములు,
దొనదొన యను నీఁగెతుట్టెల రూపేరు
 పడక క్రొంపలను బ్రేలెడు గరుసులు
దూళ్ల మక్కిక్కి మంగళ్లతిప్పలు రేఁగు
 నడుపున గాలి నాడెడు నెఱకలుఁ,
తే. దునిసిన నరాంగకములఁ బొత్తులను గమిచి
 పోక యొండొంటితోఁ బోరి పీకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి బ్రస్సి వలుచు
 వరుగు దఱచగు ముఱుత్రోవ నరిగి యెదుట. 17

ఎలనీటి బొండలంబులువోలెన్ = లేఁతవి యుండినవై బలువకయే తలఁగొట్టిన లేఁత టెంకాయల వలె, మెదడు ఎల్లన్ = మస్తిష్క మంతయు. జుట్టి=పీల్చి, వ్రేచినన్=పాఱవైవఁగా, డొల్లు పుఱ్ఱెగములున్ = దొరలుచున్న పుఱుక పిండులును, (2) నెఱచి=మాంసమును, గీఱిన జీరలు=గీఁకకొనఁగా కలిగిన గీఱలు, ఏర్పడన్ = స్ఫుటపడునట్లు, తుదముట్టన్ = నిశ్శేషముగా, చీకి...లు - చీకిన = పండ్లతో గీఁకి చప్పరించిన - నులిపచ్చి కీకసములున్ = కొంచెము పచ్చిగల యెముకలును, (3) దొనదొన అను ఈఁగ తుట్టెలన్ = దొనదొన యనుశబ్దముతో ముసరుకొనునట్టి యీఁగల క్రిక్కిఱిసిన గుంపుల చేత, రూపు ఏఱుపడక=స్వరూపము కానరాకుండ, క్రొంపలను=మొండ్లకొమ్మల మీఁద. ప్రేలెడు గరుసులన్ = వ్రేలాడుచున్న పచ్చితోళ్లను, (4) దూళ్లన్ = దుమ్ములచేతను, మక్కిక్కి = మాలిన్యముకప్పు, మంగళ్లతిప్పలు = మంగలవాండ్రు గొరిగిన వెండ్రుకతిప్పలు, రేఁగు నడుపునన్ = ఎగసి వ్యాపించు రీతిగా, గాలిన్ = గాలిలో, ఆడెడు నెఱకలున్ = నెగయుచున్న వెండ్రుకలును,

తునిసిన నర అంగకములన్ = తుండ్రగపడియున్న మానవావయవములను, పొత్తులన్ = రెండు మూఁడుశ్వాపదములు కలసి తినుటగా, కమిచి = నోటఁగఱచుకొని, పోకన్ = పోవుటలో, ఒండొంటితోన్ = ఒక శ్వాపదము ఇంకొక శ్వాపదముతో, పోరి=కొట్లాడి, పీఁకు...తిన్ - పీఁకులాడు = పెనఁగులాడెడు - శ్వాపదంబులున్ = ఘాతుకజంతువులును - పదహతిన్ = వాని కాళ్ల త్రొక్కుడుచేత, బ్రస్సి = నలిగి, వలుచు = వాసన రేఁగుచున్న - వరుగన్ = ఎండమాంసపుఁదునియలును (లేక వాసన కొట్టుచున్నదైన త్రోవకు విశేషణముగా నొకపక్షము) - వరుగు = ఒక తెగ గడ్డలు - (జాత్యేకవచనము), తఱచగు ముఱుత్రోవన్ = దట్టముగానున్న దుర్గంధపు మార్గమున, అరిగి=పోయి, ఎదుటన్ (అవలి కన్వయము.)

తా.—ఆ దాసరి ఆ దుర్గంధపుదారిని ఆమడ్డిని దరిసెను. దానినిండ ఎలనీటిని త్రాగి మీఁగడ నంటి లేఁతకొబ్బెరను గీఁకిగీఁకి తిని పాఱవైచిన టెంకాయబొండ్లములవలె లోని మెదడంతయు జుట్టి పాఱవైచిన పుఱుకలు మెండుగాఁబడియుండినవి.—[ఉపమాలంకారము.] అట్లే పండ్లతో

పినికి చోరవయి జేత్తును ఎక్కువకావున ఇవి ముందువచ్చును. ఆ కొమ్మరాకాసి గ్రుచ్చి పెట్టుకొనియున్న మాంసఖండములతోడి తోరెమును గ్రద్దలు తన్నుకొనిపోవుచో, కొమ్మకుఁ దగులుకొని తోరెము రాక, కొమ్మ, మీఁదికి క్రిందికి ఊఁగులాడఁగా, లేక, అతఁడు చిన్నకొమ్మతో ఆ గ్రద్దలను వ్రేటు వేయఁగా, అవి ఆ తోరెమును వదలుకొని ఎగిరి తొలంగుచు గోద పెట్టుచుండె నని భా.— 'అడ్డంబు'-వచ్చుచున్న దాసరిని పరికించుచున్న రాకాసికి సుమ్ముఁగా. 'కరాహతి'-కరము రాకాసిది. 'గాండి'-చేతిదెబ్బ తగిలినచోటు. 'గాంచి'-చెట్టులో బయలుగా నున్నచోట నేమో చేయుచు, రాకాసి ఆ బయలిని మఱుఁగుచేసను, ఇంతలో అటనుండి తొలఁగి మఱియొక బయల నేమో చేయుచుండెను. 'నరుఁడుగామి'-మాయచేతి యీపదంబు కొన్నందున. ఒకవేళ నరుఁడే అందుమేని, నరునియున్కికి అది సమయము గాదు, పైగా పొలగాలిచే రాకాసి పొలవవ తోఁచుచున్నది; క్షణమయినను అట నుండఁదగదు; తనదారి కనుంగొని పోవుటకు తన చేటకు కడు దూరము. ''ఎవ్వఁడో యొక్కఁడున్న వాఁడు'' అనుపాఠమున, షద్దపాదముల తుది ద్వితీయలను తృతీయార్థకములనుగాఁ గొనవలయును. అధున్యాదులచేత ''అను దినా'' - ఊహించుచు అని యన్వయము. తృతీయార్థమందు ద్వితీయా ప్రయోగము జడవాచకములకు విహితము (బా. బాల. కారక. ౨౨.) అయినను, ''కొన్నియెడల నజడంబు తృతీయాస్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి''-ప్రౌ. వ్యా. కారక. ౧౫. సూ. ''అతని దోర్దర్ధగ్యసరణి నోలాడుచున్న ఘనతరస్తనచక్రవాకముల నలరు, నంబ నసురేంద్రు నూఁతురింపారఁ గనియె.'' హరి. ఉ. ౭. ఆ.—అని యుండుట వలన ''శునులఁగా'' ''కపులఁగా'' అను రెంటను, ద్వితీయ సాధువుగా ప్రౌఢవ్యాకరణమతమున నంగన్పట్టెడి; కాని-భాషాస్వాభావ్య విరుద్ధంబగుటచే ఈ మతమును, దాననే ఈ పాదమును, అప్రశస్తములు. 'భామిక'-'భామికి నెరికె మ్మైమికి యనసెగడు సస్యఫలధాన్యము'-ఆం. భా. 'శుని'-స్త్రీలింగము-శ్వానము పుంలింగము, పలలము-''పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్''-అమ. 'తోరణము'-''తోరణో౽స్త్రీ బహిర్ద్వారమ్''-అమ. ఇది బహిర్ద్వారవాచకము. వాడుకలో దానికంగట్టెడు మామిడాకు లోనగువానిం గ్రుచ్చిన (లేక కట్టిన) త్రాటికి పేరు, ఆ సాదృశ్యమున చిన్న చిన్న వస్తువులను ప్రేలఁ గ్రుచ్చిన త్రాటికి పేరయినది. ఘాతి-పా. హాతి (= దెబ్బ); - ''కద్యాళ్ళద్విద్వజే ఖ్యాతో లోహపృష్ఠకృతాన్తయోః-'' మేదిని. ''వగవెదురుపిల్లె వందునఁ బల్లటిల్లెఁ। బొక్కనన నంగలార్చ నాఁ బట్ట్యయుండు''-ఆం. భా. ''పఁగు నాకస్తింబు డబ్బాటునంగ''-ఆం. భా. ''ప్రబలు ముఱుగ్రోవ నాఁగ దుర్గంధపదవి''-ఆం. భా.

సీ. మ్రుశమున్నట రెంటూన నిద్దఁ జాలక నెత్రు
    రంజిల్లు పెనుపొట్ట ముంజివానిఁ,
బల్లచీమల వక్త్రభల్లాతకియుఁ బోలె
    నెల్లెడనుప్పతి నొప్పు కల్లవాని,
వ్యాఘ్రోష్ఠ హస్తను స్ఫూర్ఛఁ బొయగు గడ్డ
    మును పంక్తికలుఁ బోల్చు మొగమువానిఁ
గడుఁడుగ్గ నిడు తుట్టెగలిఁ బోఁగ లోఁ బొండు
    రత మించు కపిలకూర్చంబువానిఁ,

తే. నెఱకుఁదెఱువరిఁ గన శాఖ లెక్కఁ జాఱు
ప్రేవుజందెంబుఁ గసరి పైఁ బెట్టువాని,
ప్రేలు డగుబొజ్జ గల బూర గాలివానిఁ,
జెంబుతలవాని నవటు కచంబువాని. 19

౧౯, ౨౦ పద్యములకు ఒక తే యన్వయము. ఇట్లు ఏకాన్వయముగల రెండుపద్యములను కులక మందురు. (1) మృతమర్త్యున్ = చచ్చిననరుని (నరశవమును), రెంటానన్ = గోఁచిగా, ఇడన్ - పెట్టుకొనఁగా, చాలక=(పొడవు) చాలనందున, నెత్తు= నెత్తురు, రం...నిన్ - రంజిల్లు=ఎఱ్ఱ నగు చున్న - పెను= పెద్ద - బొడ్డు = నూతిగోడవంటి (పొక్కిటిలోడి) - ముంగివానిన్ = మొలత్రాడు గలవాఁడును;

(2) పల్ల...యుఁన్ పోలెన్ - పల్లచీమల=పొటలవర్ణముగల పిపీలికలుగల-వక్రభల్లాతకియుఁ బోలెన్=వంపుగింజల జీడిచెట్టువలె (ముంతమామిడిచెట్టు=మొక్క జీడిచెట్టువలె), ఎఱ్ఱనుప్పటిన్= రక్తవర్ణమయిన కప్పడముచేత, ఒప్పు - కఱ్ఱివానిన్=నల్లనివాఁడును;

(3) వ్యత్య...భన్ - వ్యత్యస్త=తలక్రిందుసేయఁబడిన- హస్తిమస్త=ఏనుఁగుతలయొక్క - ఆభన్ = తీరుతో, పాయ అగుగడ్డమున్ = రెండు పిండములుగా నేర్పడిన చిబుకమును, దంష్ట్రికలున్=కోఱలును, పొల్చు మొగమువానిన్;

(4) కడుఁదుర్గ నిడు తుట్టె గతిన్ = కడుఁదురిఁగలయొక్క నిడుద గుమివలె, చొంగ లోన్, పాండురతన్= శ్వేతపీతవర్ణము, మించన్ = అతిశయించునట్లుగా, కపిలకూర్చంబువానిన్= గోరోచనవర్ణపు శ్మశ్రువులు (అనఁగా గడ్డమును మీసములును) కలవాఁడును;

ఎఱకున్=తిండికై, తెరువరిన్ కనన్ = మార్గస్థుఁడు ఎవఁడేని అటువైపు వచ్చుచున్నాఁడేమో కనుంగొనుటకు, శాఖలు=కొమ్మలు, ఎక్కన్, జాఱు ప్రేవు జందెంబున్ = భ్రంశమొందిన ప్రేవుల జన్నిదమును, కసరి=కోపించి, పైన్=బుజముమీఁద, పెట్టువానిన్ = మరల నుంచుకొను చున్నవాఁడును, ప్రేలుడు=ప్రేలుచున్నట్టిది, అగు-బొజ్జ=పొట్ట, కల - బూరగాలివానిన్=శ్లీపదము కలవాఁడును, చెంబుతలవానిన్ = చెంబునాకారపు శిరముకలవాఁడును, అవటు కచంబువానిన్= పెడతలయందు తలవెండ్రుకలుగలవాఁడును,

తే. కండకన్నులవాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నాముఁ గుంభ
జాను ననునొక్కద్విజనిశాచరునిఁ గనియె. 20

కండ కన్నుల వానిన్ = కండలు పెరిగిన నేత్రములు గలవాఁడును, ఆఁకటన్=ఆఁకటి చేత, బేతాళికలన్=పిశాచికలను సారెన్ = మాటిమాటికి, బండబూతులన్ = కాఱుఁదిట్లచేత, తిట్టువానిన్=శపించుచున్నవాఁడును, నగ గరిమ వానిన్=కొండంత బరువుగల వాఁడును, అన్వర్థ నామున్ = సార్థక నామధేయుఁడును (అయిన), కుంభజానువు =కుండ మోఁకాలివాఁడు - అను - ఒక్క - ద్విజనిశాచరునిన్=బాపనరక్కసుని (బ్రహ్మరాక్షసు ననుట), కనియెన్.

తా.__ఆ దాసరికి ఆ చెట్టుమీఁద నొక బ్రహ్మరాక్షసుఁ డగపడెను. అతఁ డెట్లుండె ననఁగా:__అతఁడు ఒకనరశవమును గోఁచి పెట్టుకొనఁగా అది పొడుగు చాలనందున మొలత్రాటికి

బిగించి తగిలించుటలో దాని నెత్తురు బొడ్డుమీఁదికి జాఱి గోడవంటి మొలత్రాటిపొట్ట మీఁదికి చిలికియుండెను.—స్వభావోక్తి.

ఆతఁడు తన నల్లని శరీరమును ఎఱ్ఱని దుప్పటి కప్పుకొని బాపనచీమలు దట్టముగా పైఁబర్విన వక్రభల్లాతకివలె నుండెను.—ఉపమాలంకారము.

వాని మొగము తలక్రిందు చేసిన యేనుఁగుతలవలె నుండెను; ఎట్లన - పెదవిక్రిందినుండి కంఠము వఱకు లోవపడి రెండుపిండములుగా నున్నగడ్డము ఏనుఁగుయొక్క తలక్రిందైన కుంభములవలెను, నోటినుండి చెవులకడ క్రిందికి వంగిన నిడుదకోఱలు రెండును తలక్రిందైన యేనుఁగు తలలోని రెండు కోఱలవలెను ఉండెను.—ఉపమాలంకారము.

వ్రేలుగడ్డంబును మీసములును అంతయు ఒకటిగా నిలువుగా పెరిఁగి కఱుఁదురుల నిడుద తుట్టెవలె గోరోజనపు వర్ణముగా నుండెను, అందులో పొగచే మఱుఁగుపడినభాగము కొంత పాటలవర్ణముగాను ఉండెను.—ఉపమాలంకారము.

తనకు ఆహారముకై ఆతఁడు ఎవఁడైన తెరువరి దారి తప్పి తన చెట్టుకడకు వచ్చుచున్నాఁడో కనుంగొనుటకై పైకొమ్మల కెక్కి చూచుత్వరలో ప్రేవుబంధము బుజములనుండి జాఱి పోఁగా, దానిని కోపముతో మరల బుజమున కెక్కించుచుండెను; — స్వభావోక్త్యలంకారము.

ఆతనికి వ్రేలుబొజ్జ, బూరగాలు, చెంబుతలయు నుండెను. పెడతలయందలి గుంటలో (ముచ్చిలిగుంటలో) కొంచెము జుట్టు మొలచి యుండెను. కన్నులలో కండలు పెరిఁగియుండినవి. ఆతఁడు ఆఁకటిపెల్లున పిశాచికలను మాటిమాటికి కాఱుఁదిట్లు తిట్టుచుండెను. కొండంతబరువు వాఁడు, పేరు కుంభజానుఁడు; పేరికి తగినట్లే మోఁకాళ్లు కుండలవలె నుండెను.—స్వభావోక్తి.

“పాటలాఖ్యలు చెలంగుఁ। బల్ల యనఁ బచ్చ యనఁగను బయ్య యనఁగ” ఆం. భా. “కతి కత్తి కాఱియ కతియు నల్లన। కప్పు కందనఁగను నొప్పుఁ గృష్ణవర్ణంబు” ఆం. భా. ‘దంష్ట్రికలు’- “దంష్ట్రాకోటివిశఙ్కటాస్యకుహరః” వాసవ. “కూర్చ స్త్వస్త్రియాం కచే। శ్మశ్రుకైతవపి శేషు భ్రూమధ్యేఽప్యపికత్థనే”- నానా.—‘వక్ర’-వక్రత - బొజ్జసాటికొలకు. ‘పాయగు గడ్డముల్’-పా. పాయలగడ్డముల్. ‘పాండురత’-“హరిణః పాణ్డురః పాణ్డుః” అమ. “త్రిణి పీతసంవళితశుక్లస్య” అని అంగులటీక-రామాశ్రమీయము. ‘జంజెము’ - రూ. జన్నిదము - ప్ర. యజ్ఞోపవీతమ్. “అవటు ర్ఘాటా కృకాటికా”-అమ. “బూరకాల వాఁడనఁగ బ్రవృద్ధపాదుఁడు దనరారు.” ఆం.భా.

ఉ. వాఁడను గంటిఁ బోకు మని వ్రాలె మహిన్ విటపాళి నుగ్గుగా,
వీఁడును మున్ను రేపగటి వేళకు మానిసి యౌటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట, లావరి యౌట, నిప్పు యా
వాఁడిశరంబుచే నడువ, వాఁ డని ద్రుంపుచు వీఁడు నుడ్వితిన్. 21

వాఁడును=ఆబ్రహ్మరాకాసియు, కంటిన్ = నిన్ను చూచితిని, పోకుము అని, విటపఆళి = కొమ్మలసమూహము, నుగ్గుగాన్ = చూర్ణమగునట్లుగా (నలిగిపోఁగాననుట), మహిన్ = నేలకు వ్రాలెన్=దుమికెను: వీఁడును=దాసరియు, మున్ను, రేపగటి వేళకన్ = రేయుంబగళ్లకు, మానిసి ఔటన్=మానుఁడగుటచేతను, పోరిలోన్ = యుద్ధములో, వాఁడిమిన్ = మగఁటిమితో కొంత కాలము, ఇలన్=భూమిలో, వ్రాలుటన్ = ప్రసిద్ధిపొందినవాఁడయినందున, లావరి = బల్లిదుఁడు, ఔటన్=అయినందునను, నిప్పు=పోకకాలాఁడి, ఆవాఁడిశరంబుచేన్ = మున్ను చెప్పినపదనుగల

జోడమ్ముతో (చేయమ్ముతో), అడుకఁ = రక్కసునిం గొట్టఁగా, వాఁడు = ఆరక్కసుఁడు, అది = ఆజోడమ్మును, త్రుంపుడుఁ = ఖండింపఁగా, వీఁడుఁ = దాసరియు, ఉద్ధతిఁ = గర్వముతో.- తర్వాతికన్వయము.

"విటపోఽస్త్రీ ద్రు విస్తారే పల్లవే స్తమ్బశాఖయోః"-నానా. మానిసి-"మానిసి మనిసి నా మనుజసామాన్యంబు" ఆం. భా.-ప్ర. మానుషః-లక్షణచే పరాక్రమశాలి. వాఁడిశరంబు-కర్మ ధారయము - స్త్రీసమపూర్వపదము; "కర్మధారయంబు త్రిక స్త్రీసము ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు"-బాల. సమ. ర.

సీ. తిగిచిన నడుగులు దెమలక ఱొమ్మప్ప
ళించి యవ్వలికిఁ జండించి దాఁటి
చఱచిన వంచించి చరమభాగమునకై
తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి
పైఁబడ్డఁ జనుమఱపట్ల కొడ్డుచునుండు
పిడికిళ్ల బలిమి లోఁబడక నిలిచి
చొరఁజూడ గ్రుంగి ముష్టులబిగి కోటగాఁ
జొరనీక తిరిగెడు చోన తిరిగి
తే. యసుర వధసాధనము రోయు నపుడు గ్రుద్ది
తాఁచి తిరిగినఁ గృతముష్టి వండ నిలిచి
యొడకొలఁది వెన్క నడ నొయ్య నడిచి యడిచి
మత్పరస్మృతి యాత్మ నేమఱక యతఁడు. 22

(1) తిగిచినఁ = రక్కసుఁడు తన్ను లాగఁగా, అడుగులు తనపాదములను, తెమలక = ఉన్నచోటినుండి కదలనీక, ఱొమ్ము=రక్కసునివక్షమును, అప్పళించి=ఆస్ఫాలనముచేసి (చఱచి), అవ్వలికిఁ = అవతలికి, చండించి = తొలఁగి (పా. కేడించి) దాఁటి = లంఘించి (కర్త దాసరి); (2) చఱచినఁ =రక్కసుఁడు తన్నుఁ గొట్టఁగా, వంచించి = ఆదెబ్బను ఉపాయవిశేషముచేతను తప్పించుకొని, చరమభాగమునకై = వాని వెన్ను వైపు, తిరిగి, తత్క్రియకుఁ = వాని చేఁతకు, అగుదృష్టిఁ = వలసినచూపును, నిలిపి = వానివైపు ఉంచి (కర్త దాసరి); (3) పైఁ =తనమీఁద, పడ్డఁ =రక్కసుఁడు పడఁగా, చనుమఱపట్లకుఁ =వాని చనునలుపు లుండెడు తావులకు, ఒడ్డుచు నుండు పిడికిళ్లబలిమిఁ = గుఱి పెట్టుచున్నట్టి తనముష్టుల బలముచేత, లోఁబడక = రక్కసునికి లోఁగక, నిలిచి (కర్త దాసరి); (4) చొరఁజూడఁ = రక్కసుఁడు తన ఱొమ్ముమీఁదికి చొచ్చుటకు ఉంకింపఁగా, క్రుంగి = తాను క్రిందికి తగ్గి, ముష్టులబిగి = తనపిడికిళ్ల బిగువు, కోటగాఁ = తనకు ప్రాకారముగా (పరిమాణాలంకారము), చొరనీక=వానిని తనఱొమ్ముమీఁదికి రానీక, (పా. చొరవీక = చొరవ ఇయ్యక,) తిరిగెడు చోన = వాఁడు ఎటు తిరిగిన నటెల్ల, తిరిగి (కర్త దాసరి);

అసుర=రక్కసుఁడు, వధసాధనము=చంపుటకు ఏదేనొక పోటుముట్టు (రాయి గాని రప్ప గాని), రోయునప్పుడు = వెదకు సమయమందు, గ్రుద్ది = వానిని పిడికిటితో గొట్టి, తాచి = తన్ని,

తిరిగినన్ = వాఁడు వెనుకకు తిరుగఁగానే, కృతిముష్టిన్ = అమర్చుకొన్న పిడికిటితో (పిడికిలి బిగియఁ బట్టుకొని), దండన్ = సమీపమున, నిలిచి, నడకొలఁది = కొలఁదికిని సందునకు తగినట్లు, వెన్కనడన్ = వెనుక నడక చేత, (పా. వెనుక నడుము - వెనుకన్ = వీఁపున, నడుము = మధ్యమున), ఒయ్యన్ = వారక, అడిచి = కొట్టి, నడిచి, మత్పద స్మృతిన్ - నా పాదముల ధ్యానమున. అప్పుడు = మానస్సులో, ఏమఱక = మఱచిపోక, (అతఁడు = ఆ దాసరి). (అవలి కన్వయము).

తే. తాఁచి పోఁజూడఁ దనరాక్షసీచయంబు
నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ,
బోయె నదె వాఁడు రారె రారె యటంచుఁ
బాఱి వారును దానును బట్టికొనుడు. 24

తాఁచి = తన్ని, పోఁజూడన్ = నిర్గమింప నుంకింపఁగా (కర్త దాసరి). తన రాక్షసీచయంబున్ ఎల్లన్ = (రక్కసుఁడు), తన రాక్షసీ సమూహము నంతయు, చీరినన్ = పిలువఁగా, వారు, డిగ్గి = చెట్టు దిగి, ఏఁగుదేరన్ = రాఁగా, అదె వాఁడు పోయెన్ రారె రారె అటంచున్ - (ఇది రక్కసుని వాక్యము) ఓ మగువలారా ఆ దాసరి పోయినాఁడు రండె రండె అని, పాఱి = పరువెత్తి, తానును వారును పట్టికొనుడున్ = పట్టుకోఁగా (కర్త దాసరి).

అప్పళించు - వై. ఆస్ఫాలించు తత్సమ.— "పృష్ఠం తు చరమం తనోః" - అమ. అసుర- రూ. అసురుఁడు.— తాఁచి పోఁజూడఁ దన రాక్షసీచయంబు - చఁప ప్రాసము. అప్పకవి దీనిని ఒప్పి వరాహమునుండి యుదాహరణము నిచ్చినాఁడు.

క. బంబోతు దద్దాసరి య।ప్పుడు పదహాతులను గపోణి పోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగుచుఁ బో।వం, బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్.

బంబోతు = బలిసినవాఁడైన, అద్దాసరి, అప్పుడు = అట్లు రక్కసుఁడు పట్టుకొన్నను, పదహాతులను = కాళ్ల తాఁపుల చేతను, కపోణి పోటులన్ = మోఁచేతుల (తో) పొడుచుటల చేతను, ఇరుమైలన్ = రెండు ప్రక్కలను, పొడుచుచున్, పెనఁగుచున్ = పోరుచు, పోవన్ = పోవుచుండఁగా, పట్టి వటంబు చేర్చి, వాఁడు = ఆ రక్కసుఁడు, ఇట్లనియెన్.

తా.— ఆ రీతిని వారు పట్టుకొన్నను ఆ దాసరి బలీయుఁడగుటచేత ఆ రక్కసుని కాళ్లతో తన్నుచు మోఁచేతులతో వానియొడలిని రెండు ప్రక్కలను పొడుచుచు, పెనఁగులాడుచు పోవుచుండెను. అయినను రక్కసుఁడు ఆతనిం బట్టి తెచ్చి యిట్లనియె.

"బంబోతు నా నెద్దువలెను మిక్కిలి యొడ। ల్బలిసి యుండెడివాఁడు పెరుఁగుచుండు" - ఆం. భా. "కపోణిస్తు కూర్పరః" - అమ. 'పెంబోతు' అను పాఠమున పెను+పోతు - పెద్దపోతు - బలిసినవాఁడు అని యర్థము.

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి సంతృప్తిగా
స్ఫారింబో నసిఁ ద్రుంచి పొంగెడు భవ త్తుండంబు ధారోష్ణముం
బారం గ్రోలి, పిశాచి నీదు కఱకు ల్లంపే, నపస్మాల కాం
తారాంత ర్న్రుకపాల కుండ విగళ న్నైరేయముం ద్రాగెదన్. 25

సార ఆస్వాదనన్ = శ్రేష్ఠమయిన రుచిచేత, తృష్ణన్ = దప్పిని, పాసి = తీర్చుకొని, సంతృప్తిన్ = తనియించుటచేత, ప్రాణపంచకము = పంచప్రాణములను, స్ఫారిన్ = విజృంభించు.

నట్లుగా, (అతిశయించునట్లుగా), పొంగెడు భవత్ ముండంబుఁ = గర్వమెక్కియున్న నీ తల కాయను, అసిన్ = కత్తితో, త్రెంచి = నఱకి, ధారా ఉష్ణము = వేఁడి యాఱని (నీ మొండెంపు) నెత్తుటిని, ఇంపు ఆరన్ = ప్రీతి యొప్పునట్లుగా, క్రోలి = త్రాగినవాఁడనై, పిశాచి = నా భార్య యయిన దయ్యపుసాని, నీదు కఱకుట్లు = కఱ్ఱకుఁగాని (కఱ్ఱునకుఁగాని) గ్రుచ్చి నిప్పులమీఁద త్రిప్పుచు పచనము చేయు నీ మాంసములు, అంది ఈన్ = నాకు అందింపఁగా, అద...మున్ - అదః = ఈ - తాల కాంతార = తాటిచెట్ల తోపుయొక్క - అంతః = లోపలి - నృకపాల = మానిసిపుఱ్ఱెల నెడి - కుండ = లొట్టులయందు - విగళత్ = ఓడుచున్న - మైరేయమున్ = కల్లును, త్రాగెదన్ = పానము చేసెదను.

తా.— పొంగరేఁగిన్న నీతలకాయను కత్తితో మెడనుండి నఱకివైచి నీబొండుగనుండి దుమికెడు నీమొండెంపు రక్తమును వేఁడియాఱనీకయే, దప్పితీఱ పంచప్రాణములును దనియునట్లుగా, బలేరుచితో త్రాగెదను. అంతట నీమాంసములను కఱుకుట్లుగా వండి నాభార్యపిశాచి నాకు తెచ్చి యిచ్చును, అంతట వానిని నంజుకొనుచు ఇదె యీతాటితోఁపులో గుత్తలుగా కట్టియున్న మానిసి పునుకలలోనికి ఓడుచున్న తాటికల్లును త్రాగెదను. నృకపాలకుండ-పరిణామాలంకారము.

'మైరేయము'-మా. పట్టిక.— 'సారో బలే స్థిరాంశేచ న్యాయ్యే క్లీబే వరే త్రిషు' అమ. 'ఆస్వాదనమ్' = ఆస్వాదః - "ఆస్వాదవద్భిః కబళైః తృణానామ్"-రఘు 2 (5). "ఆస్వాదవద్భిః స్వాదయుక్తైః రిత్యర్థః"-మల్లి. టీక. 'ప్రాణపంచకము.'— "ప్రాణోపాన స్సమాన శ్చోదానవ్యానౌ చ వాయవః, హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభిసంస్థితః ఉదానః కణ్ఠదేశస్థో వ్యాన స్సర్వ శరీరగః" అమ. "పఞ్చప్రాణమనోబుద్ధిదశేన్ద్రియ సమన్వితమ్। అపఞ్చీకృతభూతోత్థమ్ సూక్ష్మాఙ్గం భోగసాధనమ్" ఆత్మబోధ. మూరింబోన్ - దీనికి అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు, సఫలమగు, నశించు అనునర్థములు సప్రయోగములుగా శ. ర. మందు ఉన్నవి. "తనయబంధుకళత్ర మిత్రములమీఁద మూరిఁబోవంగఁ బ్రాఁకినమోహలతను" శృం. శాకుం. 4 ఆ. "దేవోత్తంసుఁడు భక్తవత్సలుఁడు చిత్తేజః స్వభావుండు గా। రీవామాంగుఁడు శంకరుండు దయమూరింబోవఁ గొంకేలునన్ । జావన్వచ్చినపుర్వుఁబట్టి తగు నీసద్భక్తికిన్ మెచ్చితిన్ । నీ వే యర్థము నన్ను వేఁడెదవు దానిం జెప్పుమా నావుడున్." శ్రీకాళ. మా.

వీని నెల్లం బరికింపఁగా "సంతోషించు" అను నర్థము కనఁబడలేదు, "అతిశయించు" అను నర్థము పొసఁగుచున్నది. - కఱుకుట్లు - "గనగన నిప్పులం జమురుచిప్పిలం గాల్చిన కమ్మకఱుకుట్లన్" - మను. ర (౬) - ఇంగులకు "...కాల్చిన = ఇనుపశలాకలకు గ్రుచ్చి వ్రేలఁబట్టి పక్వముగాఁ గాల్చిన - కమ్మ = సంబారు చేర్చుటచేఁ బరిమళించుచున్న - కఱుకుట్లన్ = శూల్యములతో - కఱ్ఱులతోఁ గుట్టిన మాంసఖండంబులతో - ('కఱుకుట్లు' - 'కఱ్ఱుకుట్లు' - 'కఱకుట్లు' - 'కఱ్ఱకుట్లు' - అనియును వీనిని వాడుదురు.) అని జూలూరి యప్పయ్య పంతుల టీక. అందిన్ - ఇది శబ్దపల్లవము. సంధికి పేతకంజూచునది. వాఙ్మయమందు ఈ శబ్దపల్లవము నూర్లకొలఁది దొరకియున్నది. శబ్దపల్లవము కాని క్త్వార్థేకారసంధికి పదునెనిమిది పర్వముల మహాభారతములో "ఎఱిఁగించిపుడే" అను నొకటే ప్రయోగము దొరకుట క్త్వార్థేకారసంధి ప్రియుల ప్రభావంబునం గాదేని యాశ్చర్యము గాదు. ఈ పద్యము మాకలవడిన ముద్రణంబున "ఇతఁడు మదీయాగ్రపురో। హితుఁ డితనికి నెల్ల తెఱఁగు లెఱిఁగించి లగన్ । ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు చతురవచనరచన గలిగి సంప్రీతి మెయిన్," అని యున్నది.

క. నన్నిం తలయించిన ఖలు
నిన్నే ఋజువిధి వధింతు నే యని యార్పుల్
విన్నందఁగ బుస కొట్టుచు
నన్నీచుఁడు దగ వెలువడు నవ్యక్తోక్తిన్. 26

నన్నున్ - ఇంత - అలయించిన=శ్రమపెట్టిన - ఖలున్=దుష్టుని, నిన్నున్, ఏన్ = నేను. ఋజువిధిన్ = సరళ ప్రకారమున, వధింతునే = చంపుదునా, అని, ఆర్పుల్ = బొబ్బలు - విన్ను అందఁగన్ = ఆకాశమును రాయుచుండఁగా (మిక్కిలి బిగ్గరగా అఱచుచు అనుట), బుసకొట్టుచున్=నిట్టూర్పులు ఊర్చుచు, ఆ నీచుఁడు = నీచుఁడయిన యా బ్రహ్మరాక్షసుఁడు, దగ=దప్పి, వెలువడు నవ్యక్త ఉక్తిన్ = తెలియనగుచున్న యస్పష్ట భాషితముతో (తరువాతి పద్యముతో నన్వయము).

తా.—"నన్ను ఇంతబాధపెట్టితివి గాన నిన్ను తిన్నఁగా చంపక చిత్రవధ చేసెదను", అని యార్చుచు బుసకొట్టుచు ఆ పాపాత్ముఁడు, అలయుట చేతను, అఱచుట చేతను దగ తోఁచి అస్పష్ట వాక్యములచే.—(పైపద్యములో పంచి అనుపదముతో అన్వయము).

ఏఋజు (ఏన్నృజు) - "ఋలువర్ణంబులు రలతుల్యంబులుం" గావునఁ గ్రుతిలోఁప వికల్పము.

తే. అసియుఁ బాత్రియుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలగ గ్గరఁ ద్రోయ నక్కుజముతోడ
నొరగి రక్కసుతో దైన్య విరహితముగ
ధర్మ మెఱిఁగించుసూక్తి నాతండు పలికె. 27

అసియున్=కత్తిని, పాత్రియున్=భాజనమును, తేన్ పంచి=తెమ్మని పిశాచికలను అజ్ఞాపించి, అంత్రవల్లిన్ = తీఁగవంటి ప్రేవుతో, కోలగ గ్గరన్ త్రోయన్ = పగ్గమును కట్టి త్రోయునట్లు కట్టి త్రోయఁగా, అతండు=ఆ దాసరి, ఆ కుజముతోడన్ = ఆ చెట్టుపైఁ దికి, ఒరగి = సోలి, దైన్యవిరహితముగన్=దిగులు లేనియట్లుగా, ధర్మము = ధర్మమును, ఎఱిఁగించు సూక్తిన్ = తెలుపునట్టి మంచిమాటను, పలికెన్ =(ఇట్లు) వచించెను.

తా.—రక్కసుఁడు దాసరిని ఖండించుటకు కత్తిని, వానిరక్తమును పట్టుటకు పాత్రమును, తెమ్మని పిశాచికలం బంపి, అతనిని ప్రేవుత్రాళ్ల కోలగ గ్గరతో పడఁద్రోయఁగా నాతఁడు ఆ చెట్టుమీఁది కొరగి రక్కసునితో దిగులులేక ఈ క్రింది ధర్మసూక్తమును చెప్పెను.

'ఖడ్గేతు నిస్త్రింశచన్ద్రహాసాసి రిష్టయః'-అమ. 'త్రిషుపాత్రీ పుటీ పేటి వాటీకువలదాడిమా'-అమ. "పాత్ర్యమత్రే త్రిషు క్లీబం స్రువాదౌ రాజమన్త్రిణి తీరద్వయాన్తరే యోగ్యే"-అని రామాశ్రమి ధృతము.—"ఎద్దులను కాళ్లుగట్టి క్రిం దేయుటొప్పఁ। గోలగ గ్గర యనఁగ" - ఆం. భా. "శ్రుతి, స్త్రీ వేద ఆమ్నాయ స్త్రయీధర్మస్తు తద్విధిః" - అమ. "సూక్తికి సుద్ది" - అప్పకవి.

చ. విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి ? నిన్ జయింతురే
యనిమిషులైన ? భాజనగ తాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్ ?
బెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప, మిందుకై
కనలకు నాకు మేనియెడఁ గాంక్షయు లే దిది వొవ్వులే యురున్. 28

రాత్రించర=ఓయి రేద్రిమ్మరీ (రక్కసుఁడా యనుట) - అనిమిషులు = దేవతలు, భాజనగత అన్నమును = నేను నీకుంచములోని యాహారమును,... పెనఁగక = పోరక,... ఉపేక్ష యొనర్చుట= ఉపేక్షించుట,... కనలకు=కోపగింపకుము,... ఇది= ఈ దేహము,... ఉరుక్ - తగును.

'రాత్రిఞ్చరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః' అమ. ''అనిమేష శ్చానిమిష శ్చైతౌ ద్వౌ-సురమత్స్యయోః'' - నానా. 'సర్వ మావపనం భాణ్డం పాత్రా మత్రంచ భాజనమ్' -అమ. ఉరుక్ చూ. పట్టిక. ఇచ్ఛా కాఙ్క్షా స్పృహేహా తృ డ్వాఞ్ఛా లిప్సా మనోరథః' అమ.—

''హన్తు మభ్యాగతం శత్రుం య శ్శక్త్యా న నివారయేత్ । స ఆత్మఘ్న ఇతి ఖ్యాతో రౌరవం నరకం వ్రజేత్'' 'అందుకై - దాని దీని కనులకు అందిందింగులు పెక్కువిభక్తులందు ఆదేశములగును. ఉ. అందుకై - అందువలన ఇత్యాది.

ఆ. హీనజన్మ మఱుట, యెవ్వఁడే నొకప్రాణి
సంతసిలుట, ముక్తి సంతగనుట,
మేలెకాదె శిబియ మేల్బంతిగాఁడె న
శ్వరపుదేహ మమ్మి పరముగొనుట. 29

హీనజన్మము=నీచపుఁబుట్టుక, అఱుట=నశించుటయు,... సంతసిలుట =(నేను వాని కాహారమగుటచేత) సంతోషపడుట, ముక్తిసంత = మోక్షముయొక్క సామీప్యమును,... నశ్వరపు దేహము=నశించుస్వభావము గలదైన కాయమును, అమ్మి=వెలగానిచ్చి, పరముక్ =స్వర్గమును, కొను టకు =కలుగుటయందు, శిబి=శిబిచక్రవర్తి, మేలుబంతి=ఒరవడి సర్వశ్రేష్ఠుఁడు, కాఁడె=కాఁడా.

తా.— నా దేహమును నీకు ఆహారముగా నొసంగుటచేత నాకు కడుంగడు మేలు కలదు; ఎట్లన, ఈ పంచాలజన్మము తొలఁగును, ఒకప్రాణి అన్నముతిని, సంతోషించును, నాకు మోక్షము కలుగును; అందులకు దెగికై పావురమునకు బదులుగా ఆహారార్థము తనదేహము కోసికోసి యిచ్చిన శిబిచక్రవర్తి ఉత్తమోదాహరణముగదా. అర్థాంతరన్యాసము పరివృత్త్యలంకృతియు అప్రస్తుత ప్రశంసయు.

శిబి మహాదాత యని పేర్వడసి యుండెను. ఆతనిఁ బరీక్షించుటకు ఇంద్రాగ్నులు డేగయు పావురమునై, డేగ పావురమును ఆహారార్థము తఱుముకొనివచ్చినట్లు వచ్చిరి. పావురము శిబిని శరణుఁజొచ్చెను. శిబి పావురముపాటి మాంసమును తన దేహమునుండి కోసియిచ్చుటకు కడంగి, అందులకు డేగ నొడంబఱిచెను. కవాటాలో ఎంతమాంసము కోసివైచినను పావురమే మొగ్గ చూపుచుండెను. తుదకు శిబి తానే కవాటాలోఁ బడెను. అంత ఇంద్రాగ్నులు నిజరూపములం దాల్చి శిబిని నుతించి ఆయనకు శాశ్వతకీర్తితోడి దివ్యపదము నొసంగిరి.—

చ. తెవు లయినం, గ్రహం బయినఁ, దే లయినం, గర మైన, నాత్మపెం
పెవు లయిన, న్జలం బయినఁ, దెక్కలి యైన, మృగాగ్ను లైన, మే
ల్తవు లయిన, న్వ్రణం బయినఁ, ద్రాఁచ యిన, న్పిడుగైనఁ, దీర్చు పే
లవ తను పూరకే చెడక యిల న్గృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే. 30

తెవులు=రోగము, గ్రహంబు = దయ్యము, తేలు=వృశ్చికము, గరము=విషము, ఆత్మపెద్దపులు = గొప్పమనోవ్యాధి, తెక్కలి = బందిపోటు, మృగాగ్నులు - మృగ=వ్యాఘ్రాదిజంతువులు - అగ్నులు-అగ్ని=నిప్పు... మేలు తవులు=కడుదుష్టమయిన వ్యసనము, వ్రణంబు=పుండు, త్రాఁచు=పాము, పిడుగు=అశని, తీర్చుపేలవతనువు = చంపునట్టి సన్నలశరీరము, చెడక=నశింపక, ఇలక్ = భూమిలో, కృశుక్ =కార్శ్యమొందిన వానిని (ఆఁకలి గొన్న వానిని), ప్రోచుట=రక్షించుట.

గ్రతువుల చరుపురోడాశాహుతులభుక్తులం బవిత్రులై యమర్త్యత మీకంటె నతిదీర్ఘకాలంబు వారు జీవించెద. రప్పావనత చూచి కదా సదా చతుర్ముఖాంశజుం డగుసుధాంశుండు గరంగి సకల రసముల కవధి యగు సుధారసంబున నాప్యాయనం బొనరించుచున్నవాఁ. డేతదర్థంబు మా కుచ్చరింపరాదుఁగాని వేదంబు ప్రథమకళ యనలుండు త్రావు నని చెప్పు. మఱియు నాయాకళ లాయావేల్పులకుం గ్రమంబునం జెప్పు, నింత విచారించి రుచించినట్లు నడువు; మనినఁ, గహకహ నవ్వి యద్దాసరికి సురద్రోహి యిట్లనియె. 31

మాధ్యస్థ్యంబకాక = మధ్యస్థునిమాటగా (నిష్పక్షపాతవాక్యముగా), వృక = తోడేలు, శరారువులయందుక = ఘాతుకమృగములలో, తిర్యక్కువు = కడుపు భూమిపై పెట్టుకొని చరించు జంతువవు, దేవయోనివి = దేవతాజన్మము కలవాఁడవు, స్థావరంబులు = ఉన్నచోటనే ఉండుప్రాణులు (చెట్లు లోనగునవి), పతంగ = పక్షి, కరణ కళేబర ఆది = ఇంద్రియములు దేహము లోనగు, ఏకాంత కత్సా (అ) వహంబు = కేవల నిందా కరము, బీభత్స = రోఁతయైన, పేయ అపేయ వివేకంబులు = త్రాఁగదగినది త్రాఁగదగనిది అనుభేదజ్ఞానములు, దురిత అవతంస = పాపములలో ఎక్కుడైనది, గీర్వాణులు = దేవతలు, జముచేత నే = యమునిచేత నే, చండాంశుసుతునివీటక = సూర్యపుత్త్రుని (యముని) పురమున, సౌరి ముఖ = సూర్యపుత్త్రుఁడు (యముఁడు) లోనగు, బర్హిర్ముఖులు = దేవతలు, తైజసంబు = తేజస్సంబంధి, ఆహృతులు = ఆహారములు, వ్యాహృతులక = భూర్భువస్స్వరాది మంత్రములచేతను, చరు = అన్నము, పురోడాశ = హవిస్సు, చతుర్ముఖాంశజుండు = బ్రహ్మాంశ మునంబుట్టినవాఁడు, సుధాంశుండు = చంద్రుఁడు, ఆప్యాయనంబు = తృప్తి, ప్రథమకళ = చంద్రునిలోలికళను, వేదంబుచెప్పుచుక అని యన్వయము, ఆయాకళ లాయా వేలుపులకుక — 'ద్వితీయాం పిబతేరవిః' ఇత్యాది.

క. చంపకు చదువుల మేము ప|ఠింపని శాస్త్రములె? మాపఠింపని శ్రుతులే?
యింప వవి నమ్మవేఁ 'బ్రథ|మాం పిబతే వహ్ని' యనెడుమా టవుఁ గాదే. 32

చదువులక = శాస్త్రోక్తులచేత, చంపకు = బాధింపకుము; మేము పఠింపని - శాస్త్రములె = ధర్మములా, మాపఠింపని శ్రుతులే = మేము చదువని వేదములా, అవి = అశాస్త్రములు, ఇంపవు = ప్రియములు గావు, నమ్మవేని, వహ్నిః ప్రథమాం పిబతే = (అగ్ని) మొదటిచంద్రకళను త్రాగును, అనెడు - మాట = వాక్యము, అవుఁగాదే = తప్పదుగదా.

తా. — నేనును శాస్త్రములు చదివినవాఁడనే, నేనును వేదములు చదివినవాఁడనే, అవ న్నియు నాకు ప్రియముగా నుండలేదు. నీవు ఆ యమర్త్యుల గుణమును కొనియాడితివి. వారు బ్రహ్మాంశసంభూతులంటివే, ఆ చంద్రునికళలను అగ్ని మొదలుకొని గుంటిపెట్టి తినువారే గదా. వారికి యోగ్యత యెక్కడిది? — వ్యాఘాతాలంకారము.

మాపఠింపని శ్రుతులే = మా = మేము; కర్తృప్రథమ తత్క్రియావాచక ధాతుజవిశేషణ ముతో షష్ఠీసమాస మగుటకు — "నీ చెప్పిన పద్ధతి ద్రో| ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా|రై చన్నవారలం గొని| యే చక్కం బెట్టువాఁడ నేఁ బాండవులక" — భార. ఇంచు — "ఇంచిన భక్తి నొక్కతరలేక్షణ నైషధభూమిభర్త మన్నించువరూథినీ పతికి" - శృం. నై. 6 (117). —

"ప్రథమాం పిబతే వహ్నిః" - దేవీపురాణము. వహ్ని యనెడు - "విసర్గంబున కనుకరణంబున లోపంబగు" - బాల.

మ. నిలు మోహో మము వారి భ్రాత లనుచుఁ నీవంటి, వార ల్సుధా
శు లపూతాశులు గా రటంటి. ప్రతిపత్సోమాంసము ల్గ్రోలు ముఁ
జ్వలనుం డం, టిఁక నొండు నిన్నడిగెదఁ? సర్వాశి గాఁడా యతం,
డిలఁ దన్న్యాయము చాలు, మాకు నఘ మే? వృద్ధానుచారం బిఁకన్. 33

నిలుము=నిలువుము (ఉండుము), ఓహో=ఆశ్చర్యము! మముఁ, వారి భ్రాతలు=వారి భ్రాతలము, అనుచుఁ, నీవు, అంటి = అంటివి, వారల్=దేవతలు, సుధా ఆశులు = అమృతభోజనులు, అపూత+ఆశులు = అపవిత్రమయిన భోజనము కలవారు, కారు అటంటివి=కారని పల్కితివి, జ్వలనుండు=అగ్ని, ప్రతిపత్ సోమ అంశముఁ = పాడ్యమినాఁటి సోముని కళను, క్రోలుఁ అంటి, ఇఁకఁ - ఒండు=ఒకటి, నిన్నడిగెదఁ, అతండు=ఆయగ్ని, సర్వ ఆశి=సర్వభక్షకుఁడు, కాఁడే = అయియుండలేదా, ఇలఁ=భూమిలో, తత్ న్యాయము=అతని యాచారమే. మాకుఁ = రక్కసులమయిన మాకు, చాలుఁ =ప్రమాణము, ఇఁకఁ=మఱి, వృద్ధ అనుచారంబు = పెద్దలయొక్క నడవడి ప్రకారము నడుచుకొనుట, అఘమే=పాపమా (కా దనుట.)

తా.—మేము వారి భ్రాతల మంటివి, వా రమృతాశనులుగాని మావలె శవాద్యపవిత్ర భోజనులు కారంటివి. చంద్రకళలను భక్షించుటలో మొదలివంతువాఁ డయినయగ్ని సర్వభక్షకుఁడు గదా, మేమును అతని యాచారమునే యవలంబించితిమి, కావున మాయందు దోషమేమియు లేదు.

నిలుము-రూ. నిలువుము-"పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ వ్రాయి బహుళంబుగ లోపించు" - బాల. క్రియా. ౧౦౧. భ్రాతలు - పూర్వదేవాస్సురద్విషః" - అమ. రెండు తెగలవారును కశ్యప ప్రజాపతిసంతతి యగుటంబట్టి. సుధాశులు-"అమర్త్యా అమృతాంధసః"-అమ. అపూతాశులు (రాక్షసులు అపూతాశులు దేవతలు గారు.)

తే. హరికి సఖుఁడును రథమును నగు గరుడుఁడు
దొరకి నమృతంబు సురలకు మరల నిచ్చి?
యహులు కూడుగ వరమున నడిగికనఁడె?
యమృత మైనను జవుల జాత్యన్న సమమె? 34

హరికిఁ =నారాయణునికి, సఖుఁడును=చెలికాఁడును, రథమును=వాహనమును, అగు-గరుడుఁడు=గరుత్మంతుఁడు, దొరకిన అమృతంబు=ఇంద్రుని ఓర్చి, తాఁదెచ్చినసుధను, మరలఁ=వెండి. సురలకుఁ = దేవతలకు ఇచ్చి, (తనకు), కూడుగఁ = ఆహారముగా, అహులు = పాములను, వరమునఁ=వరముగా, అడిగి, కనఁడె=పొందలేదా, అమృతమయినను, చవులఁ=రుచులచేత, జాతి అన్న సమమే=ఆయాజాతికి స్వాభావికమయిన యాహారముతో సమానమా (కా దనుట.)

తా.—ఎవరికిని ఏయన్నమైనను జాత్యన్నముతో సమానము గాదు; అందులకు దొడ్డవాఁడైన తార్క్ష్యుఁడు ఉత్తమాన్నమయిన యమృతమును ఇచ్చివైచి బదులుగా పాములను ఆహారముగాఁ గోరుకోలేదా—అర్థాంతరన్యాసము.

గరుడుఁడు హరికి సఖుఁడైనందులకుం బ్రమాణము:—"వితానదాసవ్యజన మిత్రకేతురథాదినా వైనతేయేన పురతః సేవితః శ్రుతిరూపిణా"-ది. సూ. చ. 1 (65).

చ. నిదురయుఁ గూడుఁ బోఁ జదివి, నే నిటఁ గన్నది యేమి? యెవ్వఁ డీ
చదువుల యర్థవాదపు మృష ల్విని పెల్పడు, నీవు మాయెడం
జదువులమాట లాడి కనఁ జాల వొకానొక మెచ్చు, నొక్కఁ డీ
చదివిన కూర వింతచవి, చాలఁగఁ, దె మ్మను మెచ్చు దక్కఁగన్. 35

కన్నది ఏమి=అనుభవించినది ఏమియు లేదు, అర్థవాదపున్మృషల్ = ఉదాహరణార్థమయిన మిథ్యాకల్పనలను, ఎవ్వఁడు పెల్పడున్ = ఎవ్వఁడును మోసపోఁడు, (నేను) మోసపోనని హృదయము, చదువుల మాటలు = శాస్త్రములలోని వచనములను, కనన్=పొంద, మెచ్చు=శ్లాఘ, ఈ చదివినకూర=భోజ్యమయిన యీ చదివినదాసరి, వింతరుచి = అద్భుతమయిన రుచిగానుండును,... అను మెచ్చు ఒక్కఁడు తక్కఁగన్=అనెడు రుచి శ్లాఘ తప్ప.--వ్యాఘాతాలంకారము. (?)

"కామాతురాణాం నభయం న లజ్జా। విద్యాతురాణాం నసుఖం న నిద్రా
క్షుధాతురాణాం నరుచి ర్న కాలః। అర్థాతురాణాం న గురు ర్న బన్ధుః"

మృషల్-ప్ర-మృషా-అవ్యయము-వృథా వలె తెలుఁగున రూపసిద్ధి.

వ. అని గీష్పతి మతం బవలంబించి నిజాలాపహేళనపరుం డైన దక్కసు కుతర్కోక్తులకుం గృష్ణస్మరణంబు సేసి, యిందులఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన, బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో, మీఁదం గార్యంబు గల మాకు వీనిఁ గాదనం బని లే, దని యంతరంబుఁ గూడుకొని, ఛందోనువర్తనపరుండై, నీచసంస్కృతికి నోసి, తన్ముఖోల్లాసంబునకు శబ్దచ్ఛలంబున సంతర్గతంబున సుగతు నిడుకొని నీవు సర్వజ్ఞుఁడవు, నేను నపుఁడవు, హీనకులుండవు, ననభ్యస్తశాస్త్రుండవు, నీకుత్తరం బీ శక్తుండ నే, మద్వచనస్ఖాలిత్యంబులు సహించి దయచేసి నన్ను మఱి ప్రార్థనంబు గావింపుము. 36

గీష్పతిమతము=చార్వాకమతము (నాస్తికమత మనుట). గెలకినన్ = జర్బించిన, అంతరంబు గూడుకొని = వానితో తాను జేరి, ఛలంబునన్ = వ్యాజముచేత, సుగతున్ = బుద్ధదేవుని, సర్వజ్ఞుఁడు=సర్వ మెఱింగినవాఁడును బుద్ధుఁడును.

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మును, పా పైనొక్క నీకా యశో
భిఖ్య న్నేనును జేర్తు, మే యొసఁగుఁ దప్పింపక, న్వ్రతం బొక్కఁడే
ముఖ్యంబై యొనరింతు, దాని సఫలంబు న్సేయఁగా లేవుగా?
'సఖ్యం సాప్తపదీన' మ న్మన మిథ స్సాంగత్య మూహించుచున్. 37

(నీవు), మునుపు=మొదలనే, దైత్యులందున్ =రక్కసులందు, ప్రఖ్యాతుండవు=ప్రసిద్ధుడవు, ఆపైన్ =దానికి తోడుగా, నేనును, నీకా=నీకన్ననో, యశః అభిఖ్యన్ =కీర్తి యొక్క శోభను, చేర్తున్ =కూర్చెదను, మే ఒసఁగున్ =దేహముయొక్క యీవిని, తప్పింపన్ =మానను, ముఖ్యంబై = ప్రధానముగా, వ్రతంబు ఒక్కఁడే=ఒక వ్రతమునే, ఒనరింతున్ =ఆచరింతును, సఖ్యమ్ = చెలిమి, సాప్తపదీనమ్ = ఏడు అడుగులు కూడ నడచిన నివ్వటిల్లునది; అను - మన - మిథస్ సాంగత్యము=

...దరహాసితన్ = చిఱునవ్వుగల వాఁడగుటతో (చిరునవ్వునవ్వుచు), చెక్కిలి = దాసరి యొక్క చెంపపయి, ...దాసరి=ఓ దాసరీ, లెస్స=చక్కఁగా, పండించితివి ఓయి = వంచించితివి రా, వనిన్ =అడవిలో, తెరవాటులు = (తెరువరులను కొట్టి దోఁచుకొనుటయును), దారిదోపుళ్లను కొట్టికొట్టి=నిత్యముం గావించి, మే=దేహమును, పెంచి=బలిపించి, నిన్నున్ కదా, విరక్తిన్ =వైరాగ్యము చేత, దాసరివి=హరిదాసుఁడవు, అయినాఁడవు, ఈ-మమున్ =నన్ను, కొంచెము చేసి = బేలుపఱచి (వంచించి), త్రాడుకొఱకికోన్ = (జంతువేదేని తన్నుకట్టిన త్రాటిని కొఱికితప్పించుకొని పాఱిపోవునట్లు) తప్పించుకొని పోవుటకు, తలపోసెదు=కోరుచున్నావు, నిన్నున్ మెచ్చితిన్.

తా.—నిన్ను నమ్మరాదు, నీవు శక్తి కలంతకాలము దార్లు గొట్టినవాఁడవు. ఈ నాఁటికి ఇది సులభజీవన మని లేని వైరాగ్యము నటించుచు దాసరివేసము వేసినాఁడవు. మోసము చేయుటకు మంచి పొందికగా మాటలు కల్పించితివి. నన్ను పరమజాగరూకుని తప్పించుకొని పోఁజూచుచున్నావు. నీకు నేను మోసపోను జుమా.

దరహాసము హేళనము చేత. చెక్కిలి గొట్టుట - లాలన చేసినట్లుగానే తన శక్తిని చూపుటకును, నోగు మాయు మనుటయు;—పండించితివి-"వంచించె ననుటకు బండించె ననఁగను గిఱిరించె ననఁగను గెలుచుండు"-ఆం. భా. "మార్గచోరక సంజ్ఞ మనుఁ బొలపరియనఁ। దెరవాటుకాఁ డనఁ దేజరిల్లు"-ఆం. భా. "నిరంతర తాళీదళ సంపుట ప్రకర కాంతారంబున దర్పఫుం। దెరవాటుల్ తెగి కొట్టి"-మను. తెరవాటు కొట్టి= తెరవాటుగా కొట్టి, "(తెరవు ఆటు)" శ. ర. తెరవు+వాటు (వైఁచుట=కొట్టుట) అని నేఁ దలంచెద. "వాటు దాఁకి మఱక్క ప్రయ్యలై పడెనని। ముదిత కోక కొంగు మూసికొంచు"-పంచ. మెచ్చితిన్ నినున్=నీటక్కు నేఁ గనుగొంటి నని భా.

శా. ఏరాజ్యంబు నరుండు నోరికడివో నీబోధ మాలించు? నిం
కేరాజ్యంబు నరుండు బాసకయి మే నీఁ దాన యేతెంచుఁ? దీ
పార న్నేఁ జననీమియు న్నగిడి నీవా రామియుం దెల్ల; మే
లా రంతుల్, పలుపల్కు లంత్యకుల, యేలా చింత లేలా వగల్. 41

ఏ రాజ్యంబునరుండు=ఏ దేశపు మనుష్యుఁడు, నోరికడి=నోటిలోని కబళము, పోన్ =తప్పిపోవునట్లుగా, ఈ బోధము=ఇప్పటికి పోనిమ్మనెడి యీ యుపదేశమును, ఆలించున్ = వినును,... బాసకయి=తన ప్రతిజ్ఞను నిలుపుకొనుటకై, మేను ఈన్ = తనదేహమును ఇచ్చువాఁడై, ...తీఁపు ఆరన్ =నీకు సంతోషము కలుగునట్లుగా,...చననీమియున్ = పోనీయననియు, నీవా=నీవన్ననో, రామియున్ =రానియు, తెల్లము=స్పష్టము. అంత్యకుల = కడపటిజాతివాఁడా (మాలవాఁడా), రంతుల్ =రచ్చలును, పలుపల్కులు=పెక్కుమాటలును, ఏలా=ఎందులకు, చింతలు=విచారములు, ఏలా...వగలు=దుఃఖములు, ఏలా.

తా.—ఎవ్వఁడును నోటిముందటి కబళమును వదలుమన్న వినఁడు, ఎవఁడును తన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకు దేహ మిచ్చువాఁడై మరలరాఁడు, నేను పోనీయ ననుటయు, నీవు పోవనుటయు నిశ్చయము. పెక్కుమాటలాడి రచ్చచేయుట చేత ప్రయోజనము లేదు, నీవు ఎంత విచారించినం బ్రయోజనము లేదు, అట్లే ఎంతదుఃఖించినను ప్రయోజనము లేదు.

రంతు-"రట్టు రటడి రద్దిర ద్దుప్పత। రంతు గొహారు గోరనఁగ వెలయు। నాఘోషణ సమాఖ్య"-ఆం. భా.

తే. అనినఁ జెవిమూసి నారాయణా యటంచు
నతఁడు నను నమ్మవేఁబిశితాశి ? యొక్క
శపథమున నమ్ము మని వాఁడు సమ్మతింప
వేనవే ల్సత్యములు పల్కి వినకయున్న. 42

అనినన్=రక్కసుఁ డన్నయామాటకు, చెవిమూసి=(వినఁగూడనివి ఇంక నేమి పల్కునో యని) చెవులు మూసికొని, నారాయణా అటంచు=అదురుక్తి విన్నపాపము పోవుటకై నారాయణ నామోచ్చారణముచేసి, అతఁడు=ఆ దాసరి, పిశితాశి=ఓయిపొలదిండీ, నను, నమ్మవేన్=నమ్మవి యెడల, ఒక-శపథమునన్=ఒట్టుచేత, నమ్ముము అని, వాఁడు=రక్కసుఁడు, సమ్మతింపన్=ఒప్పు కొనఁగా, వేనవేల్ = వేలకొలఁది, సత్యములు, ప్రమాణములు, పల్కి, వినక యున్నన్ = ఆ ప్రమాణములకు రక్కసుఁడు ఒప్పుకొనకుండఁగా, (అని యనంతరమున కన్వయము).

ప్రథమపాదమున ప్లుతయతి. 'నమ్మవేఁబిశితాశి' - ఏనిశబ్దము నికారమునకు నచ్చుని హల్లేని పరమైనప్పుడు లోపంబు వైకల్పితంబు;- రెంటను లోపమున కుదాహరణములు.

"ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రత న్నిర్వృతిన్ ।
జెందుం గుంభగతప్రదీపకళికా శ్రీదోఁప నెందెందుఁ బో ।
కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మమా ।
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా."-ము.

పిశిత=మాంసమును-ఆశి=తినువాఁడు.

"శపనం శపథః పుమాన్," "సత్యం శపథతథ్యయోః"-అమ. "వేనవేలు... వేలు+వేలు. పెక్కువేలు. 'వేనవేలు మస్తకములు వేనవేలు కన్నులును వేనవేల్నాలుకలును. గ. ఆగ. సూరి" - హరి. పూ. ౪ ఆ శ. ర.

ఉ. ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మఱి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన ని న్గదియనేని, యన న్విని బంధ, మూడ్చినన్. 43

నేఁడ=ఈదినమే, నేను, ఎవ్విధినైనన్=ఏవిధానమునఁగాని, నిన్, కదియనేని=చేరకుంటినా, ఎవ్వని చూడ్కిఁ జేసి = ఏ విష్ణువుయొక్క కటాక్షముచేత, జగంబు = లోకము, జనియించున్ = పుట్టునో, ఇజ్జగంబు=ఈ లోకము, ఎవ్వనియందున్=ఏ విష్ణువునందు. వసించున్ = నివసించునో, మఱి=పిమ్మట, ఇది = ఈలోకము, ఎవ్వనియందున్ = ఏ విష్ణునియందు, డిందున్ = అణఁగునో, అట్టి విష్ణుతో = సర్వవ్యాపకుఁడైన యా విష్ణుదేవునితో, ఇవ్వలన్ = తదన్యుఁడయిన, ఒక్క వేల్పున్=ఒక దేవతను, గణియించిన పాతకిన్=లెక్కపెట్టిన పాపాత్ముఁడను, ఔదున్ =అగుదును, అనన్=అని దాసరి శపథముపల్కఁగానే, విని=రాక్షసుఁడు ఆలకించి, బంధము=కట్టును, ఊడ్చిన న్=విప్పివైవఁగా (అవతలి కన్వయము).

"తా.- నేను ఏవిధానమైనను ఈ దినము మరల నీ కడకు రాకపోయితినా సృష్టిస్థితిలయ కారుఁడైన విష్ణువుతో వేఱువేల్పును సాటి చేసినపాపానం బోదును" అని యాదాసరి శపథము

రజనీచర=ఓరి రేద్రిమ్మరీ (రక్కసుఁడా), నీచెఱన్=నీ బందినుండి, పాసి=ఎడసి, పోయి=ఏఁగి, చక్రిన్=హరిని, భజింపన్=సేవింపఁగా (నాకు), ముక్తిపొంగు=మోక్షానుభవము, ఏచెన్=వర్ధిల్లినదిరా, నేను, ఇంకన్, ఏ చెఱన్=ఏ నిర్బంధమునను, తగులన్=చిక్కను, పంచుచోన్=నన్ను కట్టువదలించి పంపునప్పుడు, ఏ చరణంబులు=ఏ పాదములు, ఏ ఉదరము= ఏ కడుపు, ఏ ఉరము=ఏ ఱొమ్ము, ఏ కరంబులు=ఏ చేతులు, (ఉండినవో), ఈవు, ఆ చరణంబులు...ఉండఁగన్ చూడు=సరిగానుండఁ జూచుకొమ్ము.

తా.—నా వ్రతము నెఱవేఱినది, నాకు ముక్త్యనుభవము చేకూడినది. ఇఁక నాకు చెఱ భయము లేదు. నావలన ఏ హానియు లేదని నీవు పంపునప్పుడు ఎట్లుండినవో నా యవయవములను అట్లుండఁ జూచుకొమ్ము.—వృత్త్యనుప్రాసము.

తే. అనినఁ దత్సత్యమునకు నేత్రాంబు లురులఁ
బ్రమద పులకితగాత్రుఁడై పాలుటసుర
యినుని మధ్యందినపుటెండ దనదు పెద్ద
బట్టతల మించఁ బ్లవుఁ జేరఁ బాలు తెంచి. 46

అనినన్=ఇట్లు దాసరి చెప్పఁగా, పాలుటసుర=ఆ బ్రహ్మరాక్షసుఁడు, తత్ సత్యమునకున్=ఆ దాసరియొక్క ప్రతిజ్ఞానిర్వహణమునకు, నేత్రాంబులు=ఆనందబాష్పములు, ఉరులన్ = రాలుచుండఁగా, ప్ర...డు-ప్రమద = హర్షముచేత-పులకిత = గగుర్పొన్న-గాత్రుఁడు = దేహముకలవాఁడు, ఐ, ఇనుని మధ్యందినపుటెండ=సూర్యుని మధ్యాహ్నపు టాతపము, తనదు పెద్దబట్టతలన్ = వెండ్రుకలులేని తన పెద్దశిరోభాగమందు, మించన్ = మెఱయుచుండఁగా, ప్లవున్ =మాలవానిని, చేరన్=కలయుటకు, పాలు తెంచి=పరుగున వచ్చి. (పైకన్వయము).

తా.—దాసరి యిట్లు చెప్పఁగా, అతనిసత్యమునకు ఆ బ్రహ్మరాక్షసి ఆనందబాష్పములు కురియుచు ఒడలెల్ల గగుర్కొని తన పెద్దబట్టతలపై మధ్యాహ్నపుమిడియెండ మెఱయుచుండ, ఆ దాసరిం గూడుటకు పరుగున వచ్చెను.

పాలుటసుర=(పాలుఁడు+అసుర); "పాలుఁడనఁ బుడమివేల్పన బాఁపఁడనఁగ। జన్నిగట్టన విప్రుఁడు జగతిఁబరఁగు." ఆం. సం. వృత్తియందు డుమ్ము పోఁగా పాలు శేషించును. "పాలువాఁడు," తర్వాత కర్మధారయ టుగాగమముచే "పాలుటసుర."

ఉ. కొండయుఁబోలె భక్తి వలగొంచునె, వాఁడు నిజద్రుమభ్రమీ
హిండన వ్రాలుపాకలవు లేనుఁగుఁబోలె, నొసల్ తదంఘ్రులం
దుండ, రొదన్ స్వహాగికలు హారొరనఁ, బ్రస్తుతి వ్రాలి, దంష్ట్రికా
దండము లెత్తి పట్టిన కరం, బొకఁ డొక్కఁడ నెత్తఁ జేర్చుచున్. 47

వాఁడు=ఆ రక్కసుఁడు, కొండయుఁబోలెన్ = తానొక కొండయోయనునట్లు, భక్తిన్ = ప్రపత్తితో, వలగొంచునె=(దాసరికి) ప్రదక్షిణము సేయుచునె, నిజ...నన్ - నిజ=తనయొక్క (తన్నుఁగట్టియున్న) ద్రుమ=వృక్షమునంగు (వృక్షముక్రింద) - భ్రమీ=చుట్టిగా - హిండనన్ = తిరుగుటచేత, వ్రాలుపాకలవు ఏనుఁగువోలెన్ = పడెడు పాకలవ్యాధియుక్తమైన యేనుఁగువలె, నొసలు=తన ఫాలము, తత్ అంఘ్రులందున్ - ఆ దాసరియొక్క - అంఘ్రులందున్ =పాదములందు,

(ఏనుఁగుపక్షమున ఆ వృక్షమూలములందు), ఉండక = తగులునట్లుగా, రొదన్ = పెనుమ్రోఁతచేత, మహాగిరుల్ = పెద్దకొండలు, హోరు అనన్ = మాఱుమ్రోఁగఁగా, (ఇదియు ఏనుఁగునకు అన్వయించును), ప్రస్తుతిన్ = స్తోత్రముతో (స్తుతించుచు), వ్రాలి = త్రెళ్లి, దంష్ట్రాకాదండములు = కత్తుల వంటి కోఱలను, ఎత్తి = పైకి ఎత్తి, పట్టినపదంబు = (ఆకోఱలతో) పట్టుకొన్న పాదము, ఒకఁడొక్కఁడ = ఒక్కటొక్కటిగా, నెత్తిన్ = తనశిగమందు, చేర్చుచున్ = ఉంచుచు (పైకన్వయము.)

తా.—ఆరక్కసుఁడు కొండ తిరిగినట్లుగా దాసరికి భక్తితో ప్రదక్షిణముగావించినవాఁడై (ఉత్ప్రేక్ష), పాకలపుటేనుఁగు ఏవిధముగా తనకట్టుకంబ మైనచెట్టుచుట్టును బమ్మెరతిరిగి, గిరులు మాఱు సెలంగునట్లు రొదవెట్టుచు దాని వేరులకు తననొసలు తగులునట్లు పడునో, ఆతీరున దాసరిపాదములకు తననొసలు తగులునట్లుగాను కొండలు మాఱు సెలంగునట్లు రొదతో నాతని స్తుతించుచును, వ్రాలి (ఉపమ), కోఱలతో ఆతనిపాదముల నెత్తి ఒకటొకటిగా తనశిరంబునం జేర్చి.

'భ్రమీ' అని ఈకారాంతము. - "భ్రమిః, స్త్రీ, (భ్రమ+బాహుళకాత్ ఇః), 'భ్రమణమ్ భ్రమః' ఇత్యమరః, 3 ౨ ౬॥ భ్రమీ ఇతి భరతః॥ (మణ్డలాకారగతిః)" అని రాధాకాంతీయము. "వలగొను-దే. స. క్రి. (వలను+కొను) ప్రదక్షిణించు. 'వ. యజ్ఞోచితప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి." సం. 'కృష్ణం కృత్వా ప్రదక్షిణమ్.' భార. ఉద్యో 3. ఆ. శ. ర. "గదాహతికి నాత్మఁగొంకక యెదిర్చి రాఁగా నిదో। గదా యనుచుఁ ద్రిప్పిరాక్షసుఁడు వైచె గాఢభ్రమీ। నదత్కనక కింకిణీనటనజాగ్రదుగ్రార్భటీ। పదావదమహాగుహావలభి యైనశూలంబునన్" మను. "లోలైరరిత్రైశ్చరణైరి వాభితో। జవాద్వ్రజన్తీభి రసౌ సరిజ్జనైః। నాభిః ప్రతేరే పరితః ప్లవోచిత భ్రమీనిమీ లల్లలనావలమ్బితైః।" మాఘ. 2 (71) ["భ్రమీ=భ్రాన్తిః" అని మల్లి. టీక.] "నొసలు నెన్నొసల్ నుదురు నెన్నుదు రనంగఁ దనరు ఫాలంబు." ఆం. సం.— "అఙ్ఘ్రిర్నా పాదమూలయోః" మేదిని.—"ఒప్పు ధ్వనిపేళ్లు రొద యాన నులివునాఁగ" ఆం. సం. 'భ్రమాహిండని' అనుపాఠమున ఆహిండన - (ఆ+హిణ్డ) - "హిణ్డన్తే చ పథా రాత్రౌ" హలాయుధ.; - చూ. పీఠికలో "హిండిత".

శా. ఈసర్వంసహ దేవదానవమహీభృన్మౌనివాచాతప
శ్శ్రీసర్వస్వము నేతదన్యకృతులం జెప్పంబడు. న్ఘోర మౌ
నీసత్యం బురరీకృతాంత, మిల నెంతే వృద్ధనై మంటి నే,
నాసత్యం బిఁక నిన్నుఁబోలెఁ గృతసంధా ధూర్వహుల్ లేమికిన్. 48

ఈసర్వంసహన్ = ఈభూలోకములో, దేవ...ము - దేవ = దేవతలయు - దానవ = అసురులయు - మహీభృత్ = భూపతులయు - మౌని = తపస్వులయు - వా...ము - వాచా = వాగ్రూపమయిన - తపః = వ్రతముయొక్క - శ్రీ = సమృద్ధియొక్క - సర్వస్వము = సకలధనంబును, ఏ...లన్ - ఏతత్ = ఈశరీరదానము కంటె - అన్య = వేఱయిన - కృతులన్ = పనులయందు, చెప్పంబడున్ = ప్రశంసింపఁబడును, ఘోరమౌ నీసత్యంబు = ఇంతదారుణమైన (అనఁగా శరీరప్రదానరూపమయిన) నీ ప్రతిజ్ఞ, ఉరరీకృత అంతము = అంగీకరింపఁబడిన (నెఱవేర్పఁబడిన) నిశ్చయముకలది (నిశ్చయముగా నెఱవేర్పఁబడినది), నేన్, ఎంతేన్ = మిక్కిలి, వృద్ధను ఐ = ముసలివాఁడనై, మంటిన్ = జీవించియున్నాను, ఇఁకన్, నిన్నున్, పోలు...ల్ - దొరయునట్టి - కృత = చేయఁబడిన - సంధా = ప్రతిజ్ఞయొక్క - ధూర్వహుల్ = సాధకులు, లేమికిన్ = లేరనుటకు, నాసత్యంబు = నా ప్రతిన.

'ఆదృతౌ సాదరార్చితౌ'-నానా. "దేశే నదవిశేషేఽబ్ధౌ సింధుర్నా సరితి స్త్రియాం," 'ఉడుపం తు ప్లవః కోలః,'-అమ. "ప్రథమశ్రవణాచ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః సా శ్రుతిః సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా," - అని సంగీతశాస్త్రము. 'తతం వీణాదికం వాద్యమ్,' 'తుమ్బ్వలాబూరుభేసమే' - అమ.

తే. అనిన నాతనిఁ గౌఁగిట నునిచి పలికె
వ్రత మొనర్చించి తని భాగవత వతంస
మోయి రజనీచరేంద్ర నీ యురుకృపాక
టాక్షమునఁ జేసి ధన్యుఁడ నైతి ననఘ. 50

అనినన్ = రక్కసుఁడిట్లు పలికినంతట, భాగవత వతంసము = విష్ణుభక్త శేఖరుఁడయిన యా దాసరి, ఆతనిన్=ఆ రక్కసుని, వ్రతము ఒనర్పించితి=నా వ్రతమును చేయించితివి, అని, కౌఁగిటన్ ఉనిచి=కవుంగిలించి, పలికెన్=ఇట్లు వచించెను, ఓయి, రజనీచరేంద్ర=ఓయి రాక్షసోత్తముఁడా, అనఘా=పాపరహితుఁడా, నీ... చేసి-నీ=నీయొక్క-ఉరు=ఎక్కుడైన-కృపా=కరుణతోడి-కటాక్షమునఁ జేసి=కడగంటి చూపువలన, ధన్యుఁడన్=కృతకృత్యుఁడను, ఐతిని.

తా.—రక్కసుఁ డిట్లు పలుకఁగా, దాసరి "ఓయి అసురవరేణ్యుఁడా, అనఘుఁడా, నీవు ఈ దినము నా వ్రతమును నెఱవేర్పించితివి. నేను నీ యత్యంత దయాపూర్ణ కటాక్ష వీక్షణము చేత నా పని నెఱవేర్చికొంటిని," అని పలికెను.

"పుంస్యుత్తంసావతంసౌ ద్వౌ కర్ణపూరే తు శేఖరే"-అమ. "భువి దివి నెవలనఁ జూడ మెఁఱుపు వతంసా" అని యుండుటచేత 'భాగవత వతంసుఁ డని'యుం జెప్పనొప్పు.—"చేతవిభక్త్యర్థక వర్ణకంబులకును వలనవర్ణకంబునకును తఱచుగ చేసి అను ప్రయుక్తంబగు"-ప్రౌ.వ్యా. కార.౪.

ఉ. బాసలు బండికండ్లు, మఱి ప్రాణభయంబున లక్ష సేసినం,
గ్రాసము కృచ్ఛ్రలబ్ధ, ముడుగ న్వసమే? యిది నీకఁ జెల్లె, నో
భూసురవంశ్య, పుణ్యజన పుణ్యజనాంకము దావకీనమే
పో, సమకూరెడిం గులము పొత్తున దైత్యులకెల్ల నంకతన్. 51

బాసలు=ప్రతిజ్ఞలు, బండికండ్లు=నిలుకడలేనివి, మఱి=అటుపైని, ప్రాణభయంబునన్ = తన ప్రాణముపోవు ననుభయముచేత, లక్ష=లక్ష ప్రయాణములు, చేసినన్ = (ఆ పన్నుఁడు) చేసినప్పటికిని, కృచ్ఛ్రలబ్ధము = క్లేశముచేత పొందఁబడినదైన, గ్రాసము=ఆహారమును, ఉడుగన్ = వదలుట, వసమే=శక్యమా, ఇది = ఇట్లు దొరకిన యాహారమును వదలుట, నీక=నీకే, చెల్లెన్ = సాధ్యమైనది, ఓ భూసురవంశ్య=ఓయి బ్రాహ్మణకులమున జనించినవాఁడా, పుణ్య...ము - పుణ్యజన=రాక్షసులయొక్క-పుణ్యజన అంకము = పుణ్యములనెడి పేరు, తావకీనమేపో=నీదే సుమా, కులముపొత్తునన్ =జాతియొక్క యుమ్మడిచేత, దైత్యులకెల్లన్ = రాక్షసులకందఱకును, అంకతన్ = పేరుగా, సమకూరెడిన్ =కలిగినది.

తా.—ప్రతిజ్ఞలను నమ్మవచ్చునా? ఆపన్నుఁడు ప్రాణము తప్పించుకొనుటకై లక్ష ప్రమాణములైనను, చేయును, వానిని నమ్మి క్లేశముచే దొరకిన యన్నమును వదలుకొనువాఁడు కలఁడా. నీవు ఒక్కఁడవే అట్టిపుణ్యాత్ముఁడవు. బ్రాహ్మణవంశమందు జనించినయోమహాత్ముఁడా, పుణ్యజను

అని రాక్షసులకుం గలిగిన పేరు నీయొక్కనిదే సుమా, నీమూలముగా కులమునుముష్ఠింజేసి వారికిని పేరయినది. నీయంతపుణ్యాత్ముఁడు లేఁడని భా. —విరుద్ధలక్షణచే ప్రసిద్ధమయిన పుణ్యజనశబ్దమునకు యోగముచే పుణ్యులయినజనులు అని అన్యార్థకల్పన చేసినందున నిరుక్త్యలంకారమును, తదుత్థాపిత మైన యుత్ప్రేక్షయు.

"యాతుధానః పుణ్యజనో నైరృతో యాతురక్షసీ" అమ. బండికండ్లు - బండిచక్రములు తిరుగుడువడుచుండును గాన ఆపదమునకు నిలుకడలేనివి యని యర్థము గలిగినది. - రూపకాలంకారము. అంకము=చిహ్నము (పేరును చిహ్నమే గావున ఇట పేరు అర్థము.)

చ. కడుపు మహాక్షుధ న్నకనకంబడ న న్గృతకృత్యుఁ జేయఁ బో
విడిచితి, వేము జాత్యముగ వేధ విధించిన కూడు మీకు, నీ
యెడ నొకకీడు గల్గ, దిఁక నే మనిన, న్నీకు నాన సుమా,
బడలిక దీఱ నీతనువుఁ బారణసేయుము మైత్రి గల్గినన్. 52

(టీ) కడుపు, మహాక్షుధన్ = పేరాఁకటిచేత, నకనకంబడన్ =వాడిపోవుచుండఁగా, నన్ = నన్ను, కృతకృత్యున్ =(నేను) చేయవలసినహరిభజనను చేసినవానినిగా, చేయన్ = చేయుటకై, పోన్ =పొమ్మని, విడిచితివి, వేము=మనుష్యులమైన మేము. మీకున్ = రక్కసులకు నాహారము, జాత్యముగన్ =జాత్యుచితముగా, వేధ= బ్రహ్మ, విధించినకూడు= నియమించిన యాహారము, ఈయెడన్ = ఈవిషయమందు (అనఁగా మమ్ము భక్షించుటయందు), ఒకకీడుగల్గదు = మీదోషమును గాని సంభవింపదు, ఇఁకన్ = ఇట్లు సేయక, మఱి ఏమనినన్ = అంగులకు విపరీతముగా నీవేమి పలికినను, నీకున్ ఆనసుమా=అట్లు పలుకవలదని నీకు నాయొట్టు సుమా, మైత్రి కల్గినన్ =నీకు నాయందు చెలిమి కలదేని, బడలిక తీఱన్ = ఆయాసము పోవునట్లుగా. ఈతనువున్ = ఈ నా దేహమును, పారణ చేయుము = భుజింపుము.

"అశనాయా బుభుక్షా క్షుత్" - అమ. "భాగురి మతే ఽపి స్యాద్ధాచ"-అని నానార్థ. "స్రష్టా ప్రజాపతి ర్వేధా విధాతా"-అమ. ఆన-ప్ర. ఆజ్ఞా. మా= సుమా. "పారణా పారిధః= అభ్యవహారకర్త" మల్లి. కుమార. 5 (22).

క. ఈమాట నొప్పఁ బొచ్చెము | లేమికి నీశ్వరుఁడె కరి నిలింపవిరోధీ,
నామెయి మేదోమయదృ | ప్తామిషములు మెసవు మన్న, నతఁ డార్తి నిట్లనున్. 53

ఈమాటన్ = నేను పల్కిన యీవచనమందు, పొరపొచ్చెము = కపటమేమియు న్యూనతయేమియు, లేమికిన్ =లేనందునకు, ఈశ్వరుఁడె=భగవంతుఁడే, కరి= సాక్షి, నిలింపవిరోధీ =ఓయి సురవైరీ (రక్కసుఁడా అనుట), నామె...లు-నామెయిన్= నా శరీరమందలి-మేదోమయ= మెదడు నిండుగాఁగల-దృప్త=క్రొవ్విన-ఆమిషములు=మాంసములను, మెసవుము=భక్షింపుము, అన్నన్ = అని దాసరి చెప్పఁగా, అతఁడు=రక్కసుఁడు, ఆర్తిన్ =దుఃఖముతో, అనున్ - ఇట్లుపలికెను.

తా.—"ఓ రక్కసుఁడా, నామాటలో కపటముగాని లోపముగాని లేనందులకు-అనఁగా- ఈమాట నేను త్రికరణశుద్ధిగా చెప్పినందులకు భగవంతుఁడే సాక్షి. కావున నీవు నా దేహమునందు సమృద్ధిగా నున్న మెదడును క్రొవ్వినమాంసములను భక్షింపుము."- అని దాసరి చెప్పఁగా, రక్కసుఁడు దుఃఖముతో నిట్లు పలుకుచున్నాఁడు.

"శ్యామలవర్ణంబుసాక్షియు మర్యాదఁ పరఁగుచునుండును కరి యనంగ''-ఆం. భా. "శాభ్రా నిలిమ్పా ద్యుసద స్స్వర్గిణశ్చ నభశ్చరాః''-త్రికాండశేషము.—"పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్''-అమ.

శా. ఎట్టా? యి ట్టగునయ్య పల్క దయలే? కిన్నాళ్లు నీకూడె యీ
పొట్టం బెట్టి, మహాఘలబ్ధిఁ దనువుం బోషించి, యెన్నాళ్ల కే
నెట్టే నొక్కతపస్వి యొక్కవ్రతి రాఁడే, చూడఁడే, తత్కృపన్
బుట్టు న్వీఁగెడు దీని, నానొదవి, యో పుణ్యాత్మ యిట్లంటివే! 54

ఎట్టా=ఏమంటివి, ఇట్టు దయలేక పల్కన్, అగునయ్యా=తగునఁటయ్యా, ఇన్నాళ్లున్=(జన్మప్రభృతి) ఇంతకాలంబును, ఈకూడె=ఈనరమాంసాహారమునే, ఈపొట్టన్=ఈ (పాడు) కడుపులో, పెట్టి, మహత్ అఘలబ్ధిన్=గొప్పపాపముయొక్క సంప్రాప్తిచేత (మహాపాపముచేసి), తనువున్=ఈదేహమును, పోషించి=పెంచి, ఎన్నాళ్లకేని=ఎంతకాలమునకైనను, ఎట్టేని=ఏకారణమునసైనను, ఒక్కతపస్వి=ముని, ఒక్కవ్రతి=వ్రతస్థుఁడు, రాఁడే=(ఈదారిని)రాఁడా, చూడఁడే=నన్ను కటాక్షింపఁడా, తత్కృపన్=అతనికనికరముచేత, దీనిన్ పుట్టున్=ఈరాక్షసజన్మమును, వీఁగెడన్=తొలఁగించుకొనెదను. నాన్=అని నేను ఆశించియుండఁగా, ఒదవి=వచ్చియు, ఓపుణ్యాత్మ=ఓపుణ్యాత్ముఁడా, ఇట్లు అంటివే—ఈవిధముగా వచించితివే.

తా.—అయ్యా పుణ్యాత్ముఁడా, నీ విట్లు చెప్పఁగూడదు; నేను పుట్టినప్పటినుండి ఈ నరమాంసమే ఈ పొట్టను పెట్టి దేహమును పెంచి మహాపాపము సంపాదించి, పిమ్మట అందులకు దుఃఖితుఁడనై ఏనాఁటికైనను ఒక మహామునియో, వ్రతియో, ఎవరో ఒక మహాపురుషుఁడు ఈదారిని రాఁడా, అతనికరుణాకటాక్షముచేత ఈజన్మమును తొలఁగించుకొందును గాక అని చిరకాలము ఆసించుకొని వేచియున్నందులకు, నీవు వచ్చియు ఇట్లు నిన్ను భుజింపు మని పల్కితివే! అట్లు పల్కకుము మహానుభావుఁడా.

ఎట్టా... ఈపాఠము ౪. ౯. మంగువ్యాఖ్యాతము. దీనికి ఆమ్రేడితమందు "ఎట్టెట్టా" అని రూపమనియు అందున్నది—వీఁగెదన్-నకారాది-పిఠికను చూ. ఎన్నాళ్లు-(ఎన్ని+నాళ్లు). చూ. ప్రౌ. వ్యా. సమా. ౩౬.

క. మీవంటి భాగవతులుం। బావనులుగఁ జేయ రేని మఱిగతి యేదీ
మావంటివారి కిఁక మా। యేవము వెనుకకిడి చూడక రక్షింపు కృపన్. 55

మీవంటి భాగవతులున్=మీబోఁటి వైష్ణవులుగూడ, పావనులుగన్=పవిత్రులనుగా, చేయరేని=చేయనియెడల, మఱి=పిమ్మట, మావంటివారికిన్, గతి ఏదీ=దారియొక్కడిది, ఇఁకన్. మా యేవము వెనుకకిడి=వెనుకకిడి మా హేయవృత్తిని, చూడక=గణింపక, కృపన్=దయతో, రక్షింపు=కాపాడుము (దయచేసి నన్నుం గడతేర్పు మనుట).—కావ్యార్థాపత్త్యలంకారము.

భాగవతుఁడు - భగవంతునియందు భక్తుఁడు. పావనులు = ఇతరులను పవిత్రులనుగా చేయువారు అని దీనికి వాచ్యార్థము. తాను పవిత్రుఁడు గాక ఒరులం బవిత్రీకరింప నేరఁడు గావున, పావనుఁడు పవిత్రుఁడే, కాఁబట్టి పవిత్రార్థమందు ఇచట ప్రయుక్తము.-ఏదీ - "నీకుఁ బొరుపు మేదీ'' - భార. ఉద్యో. ౪. ఆ. ౭. ౧. వంటి—"మావంటిదైత్య కావలికెల్లన్ । మీవంటి గృహస్థుల'' - మను. ఏవము-రూ. ఏవ.

తే. స్వధితియైనను ద్విజుఁ దిన్న శస్త్రమైన
సరియకాఁ గాంచనము చేయుఁ బరుసవేది,
యీయసాధారణన్యాయ మెన్నవలదె
మాదృశులచోటఁ గదియు భవాదృశులను? 56

పరుసవేది = స్పర్శవేధి (యను రసవిశేషము), స్వధితియైనను = యజ్ఞపశువుని నరుకునదైనను, ద్విజున్ = బ్రాహ్మణుని, తిన్న శస్త్రముయినన్ = చంపిన కత్తియైనను, సరియగాన్ = తుల్యముగానే, కాంచనము = బంగారముగానే, చేయున్, మాదృశులచోటన్ = నావంటివారల, కదియు భవాదృశులకున్ = చేరునట్టి, మీబోంట్లకు (మీబోంట్లు). ఈ యసాధారణన్యాయము = ఈ యుత్తమ న్యాయమును, ఎన్నవలదె = పాటింపవలదా.

తా.—పరుసవేది నిరపరాధియైన గొడ్డలియైనను, బ్రహ్మహత్య గావించిన మహాపాపియగు కత్తియైనను, సమముగానే బంగారముగ చేయును. ఈ యుత్తమన్యాయమును నావంటివారియందు మీబోంట్లు అవలంబింపవలదా? మీకు నుండవలసిన పాత్రము, పాపి పాత్రము కాదు, అనుభేదము కూడదు; ఎల్లవారిని మీరు తుల్యముగానే అనుగ్రహింపఁదగును. కావున పాపినైనను నన్ను కడతేర్చుట మీకు నుచితము.—దృష్టాంతాలంకారము.

పరుసవేది—ప్ర. స్పర్శవేధిన్—ఇనుము లోనగువానిని బంగారు చేయునట్టి సిద్ధరసము—'స్వధితిః పరశుశ్చ పరశ్వధః'—అమ. ద్వయోః కరాంతః "అనేన రసేన సంస్పృష్టాని తామ్రధాతవః సువర్ణాని భవన్తి"—విక్రమచరితము. స్వధితి = యజ్ఞకర్మలో వాడఁబడు క్షురమని గ్రహింపఁదగును. యాగములో "ఓషధే త్రాయస్వైనగ్ం స్వధితే మైనగ్ం హింసీః" అను మంత్రమును పఠించి యజమానునికి అధ్వర్యుఁడు వపనము సేయును. మంత్రార్థము "హే ఓషధే త్వం ఏనం యజమానం రక్షస్వ. హే స్వధితే క్షుర ఏనం మా హింసీః, అస్య యజమానస్య హింసాం మాకార్షీః" ఇందువలన నిచట యాగోపకరణమైన క్షురమును చెప్పుటయే శ్రేయము.

తే. అనిన దేహార్పణము నొల్ల కార్తిఁ బలుకు
కృపణాత్మకతఁ డభిప్రాయ మెద్ది యనిన,
నిత్తుఁ దను నంట యనుకంప యే? మదాత్మ
కసటుఁ బాపుటయే యనుకంప గాక. 57

అనినన్ = రక్కసుఁ డిట్లు పలుకఁగా, దేహఅర్పణమున్ = శరీరముయొక్క అర్పణమును, ఒల్లక = అంగీకరింపక, ఆర్తిన్ = దుఃఖముతో, పలుకు కృపణాత్మకున్ = వంచించిన దైన్యమునకు, అతఁడు = ఆ దాసరి, అభిప్రాయము ఎద్ది = నీ తాత్పర్యమేమి, అనినన్ = అని పలుకఁగా, మదాత్మ కసటు = నా జీవుని పాపమును, పాపుటయే = నివర్తిల్లఁజేయుటయే, అనుకంప గాక = దయగాని, తనువు = దేహమును, ఇత్తును అను మాట, అనుకంపయే = దయయా.

తా.—ఇట్లు కుంభజానుఁడు పలుకఁగా, దాసరి, 'నా దేహమును అర్పించెదనన్న, వలదని దుఃఖముతో నివారించుచున్నావు, మఱి నీకు కావలసినదేమి?' అని యడిగెను. అంత నారక్కసుఁడు ఇట్లు పలుకుచున్నాఁడు—'అయ్యా, నా జీవుని పాపమును తొలఁగించి నన్ను శుద్ధుని చేయుట నాయందు దయ చూపుట యగును గాని, నీ దేహమును నాకు తినుటకిచ్చెద ననుట

దయచూపుటయగునా ?—నీదేహము నాకు వలదు, నన్ను శుద్ధునిం జేసి నాకువచ్చిన యీపాడు జన్మమును తొలగింపుము; ఇది నా ప్రార్థన.' అని యుత్తరము చెప్పెను.

ఒల్లక - వలచు ధాతువు - రూ. వలవక—'ఆర్తిః పీడాధనుష్కోట్యోః,' 'కారుణ్యం కరుణా ఘృణా కృపా దయానుకమ్పా స్యాత్'-అమ. 'దోస మనంగను దొసఁగు దోసంగు నాఁ । గసటు నాఁ బాపంబుగాఁ దనర్చు' ఆం. భా.

శా. ఘంటాకర్ణుని మించుకర్మ మొకొ నా కర్మంబు? మౌనీంద్రులం
దుంట ల్సేయఁడె? మాన్పి యీఁడె భగవం తుం డట్టి శ్రీ? యట్టి శ్రీ
కంటె న్భాగవతుండు మించ నొసఁగం గాఁడే? యీ మేలు నా
కంటింప న్మతి రాదె? పూజనము గాదా ప్రాణిమే ల్చక్రికిన్. 58

నాకర్మంబు=నా చేఁత, ఘంటాకర్ణునికన్ =ఘంటాకర్ణుఁడను రక్కసుని చేఁతను, మించుకర్మముకొ=అతిక్రమించు చేఁతయా, (అతఁడు), మౌని ఇంద్రులన్ = సంయమి శ్రేష్ఠులను, తుంటల్ సేయఁడె=తుంటెములుగా చేయలేదా, భగవంతుఁడు=నారాయణుఁడు, మాన్పి = అతనికర్మమును పొలియించి, (అతనికి), అట్టిశ్రీ=అటువంటి సంపదను, ఈఁడె=ఇయ్యలేదా, భాగవతుండు=భగవద్భక్తుఁడు, అట్టి శ్రీకంటెన్ =ఘంటాకర్ణునికి నారాయణుఁడిచ్చిన సంపదకన్న, మించన్ =అధికముగా, ఒసఁగంగాలేఁడె=ఇయ్యలేఁడా, మతి=ఇఁకను, ఆమేలు=ఆశ్రేయమును, నాకున్ అంటింపన్ రాదె=నీవు నా కొసంగఁగూడదా, ప్రాణి మేల్ =ఒక ప్రాణికి చేయుశ్రేయము, చక్రికిన్ = భగవంతునికి, పూజనము కాదా=అర్చన గాదా.

తా.—నే నేమి ఘంటాకర్ణునికన్న ఎక్కువపాపము చేసితినా! అతని యాపాపమును పోనడిచి శ్రీహరి అతనికి మోక్షసామ్రాజ్యము నీయలేదా. ఆ హరిభక్తులు హరికన్నను హెచ్చుగా ఈయఁగలరు గదా. కావున నీవు నాకు ఆ ఘంటాకర్ణునికి ఆయన యొసంగినమేలును ఒసంగుము, ఏదే నొకప్రాణిని సంతోషపెట్టుట హరిపూజనమే గావున, నాకు మేలుసేయుటయు, నీకు హరిపూజనమువలె మహాపుణ్యప్రద మగును.—అర్థాంతరన్యాసము.

ఘంటాకర్ణుఁడు పిశాచనాయకుఁడు; అతనికి శ్రీకృష్ణుఁడు ఇంద్రపదవిని, తదనుభవము కొంతకాల మయినతర్వాత, పరమాత్మైక్యంబును అనుగ్రహించెను. అని హరివంశకథ. - "అట్టి మేలు చక్రికి పూజనముగాదా ?" - "సంతోషం జనయేత్ ప్రాజ్ఞ స్త దే వేశ్వరపూజనమ్,".

వ. అనిన విని మాతంగుం డాతెఱం గెఱింగ్గైన సంగతం బగు ననిన, నాతం:—"డే నొక్క బ్రహ్మరాక్షసుండఁ, గుంభజానుసంజ్ఞుండ, నుగ్రకర్ముండనై, యీ న్యగ్రోధం బాశ్రయించి పంచనం బఘన పంచజనచర్వణంబు సేయుచుండుదు. పూర్వంబున సోమశర్మ యను భూబర్హిర్ముఖుండఁ, బ్రాఙ్నిద్విజుండఁ గాన దయసీ యుండవె; యొక్క పక్కర్ఘంబున నిక్కృతి నీవు కైటభారిం బాడిన నేఁటి పాట ఫలంబు సజలంబుగా నాకిచ్చితేని బీభత్సకులార్హం బగు నీజన్మంబు వేఁగు, నీకు నార్తరక్షణంబున నగు సుకృతం బనంతంబు సిద్ధించు, నత్యంత ధర్మసాధనం బగు నిమ్మేను నిల్లు సేరు;" ననిన, నమ్మేని మాటలకుఁ గలకల నవ్వి యవ్విష్ణుదాసుం డిట్లనియె. 59

న్యగ్రోధంబు=వటవృక్షమును, పంచజన=మనుష్య! చర్వణంబు=తినుట, భూబర్హిర్ముఖుండన్=భూసురుఁడను, ప్రాగ్జని=పూర్వజన్మ, కైటభారిన్ = నారాయణుని, సజలంబుగా నాకిచ్చితేని=నాకు ధారాదత్తము చేసితివేని, బీభత్స=రోఁత, కుత్సా=నింద, వేఁగున్=తుద ముట్టును.

క. ఇటువంటివి యిటకెక్కుడు । నిటదిగుడువి యొందనెన్ని యే నిదియును నొ
క్కటి యొకనాఁటిది కాదొక । త్రుటిగీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్? 60

ఏను, ఇటువంటివి=ఇట్టి శరీరములు, ఇటకున్ ఎక్కుడు=ఇంతకన్న ఉత్కృష్టదేహములును, ఇటన్ దిగుడువి=ఇంతకన్న అధమదేహములును, ఎన్ని ఒందన్=ఎన్ని దేహములను పొందలేను. ఇదియును=ఈ చండాలదేహంబును, ఒకటి=ఆ మదీయ దేహపరంపరలో నొకటి, (ఇట్లు పోయిన వెంటనే మరల వచ్చునదైన), ఇమ్మెయికిన్ = ఈ దేహమును రక్షించుకొనుటకై, ఒకనాఁటిది కాదు=ఒక దినము పాడినస్తోత్రంపు ఫలమును (ఇయ్యను సరియే గదా), ఒక త్రుటి గీతఫలంబున్ = ఒక చిటికకాలపు హరిస్తోత్రగానఫలము నైనను, ఒసఁగుదునె=ఇత్తునా (ఇయ్యననుట).

తా.—నాకు దేహము ప్రియము గాదు, ఇప్పటికి నేనెత్తిన దేహములకు లెక్క లేదు. ఇంతకన్న ఉత్తమజన్మములను అధమజన్మములను ఎన్నిటినో ఎత్తినాఁడను, ఆపరంపరలో నిది యొకటి. ఇట్టి దేహముల పుట్టువునకు విరామమును గోరవలసి యుండఁగా, ఈదేహముకై అనశ్వరమైనహరినామకీర్తనఫలమును ఒకనాఁటి ఫలమును కాదు గదా ఒక త్రుటికాలపు ఫలము నేనియు నొసంగను.

త్రుటి యనఁగా అరక్షణము-"స్త్రియాం మాత్రా త్రుటిః పుంసి లవలేశకణాణవః"-అమ. "క్షణద్వయం లవః ప్రోక్తః నిమేషస్తు లవద్వయమ్."—చతుర్థపాదమున ప్లుతియతి.

సీ. దిక్పాలతను వెత్తి తిరిపతనువుఁ దోన
యెన్నిమార్లెత్త మీ మేను నీవుఁ?
గేసరి తను వెత్తి కీటతనువుఁ దోన
యెన్నిమార్లెత్త మీ మేను నీవు?
మాతంగ తను వెత్తి మశకతనువుఁ దోన
యెన్నిమార్లెత్త మీ మేను నీవు?
ధరణీశ తను వెత్తి దాసతనువుఁ దోన
యెన్నిమార్లెత్త మీ మేను నీవు?
తే. సోమయాజులమెన్నిమార్లము, శ్వపచ
ఖగకులుల మెన్నిమాఱులు గాము, పాము
గాములము నెన్నిమాఱులు గాము వెండి
కంసరిపుభక్తుల మొకండె కాము గాని. 61

వెండి = అట్లుగాక (అనఁగా దిక్పాలకాదులముగాక), కంసరిపుభక్తులము ఒకండె = హరిభక్తులము మాత్రమె, కాము గాని = కామైతిమిగాని, ఈయేనున్ (ఈ) నీవున్, ఎన్నిమార్లు, దిక్పాలతనువు = లోకపాలదేహమును, ఎత్తి = వహించి (లోకపాలురముగాఁ బుట్టి), తోన = వెంటనే, తిరిపతనువున్=బిచ్చపు (బిచ్చగాని) దేహమును, ఎత్తము=ఎత్త లేదు - [మనము ఇరువుర

మును హరిభక్తులముగా పుట్టమైతిమిగాని లెక్కలేనిమార్లు దిక్పాలురముగా పుట్టి వెంటనే బిచ్చగాండ్రముగా పుట్టితిమి-ఇట్లే కడమపాదములందును అన్వయ మెఱుంగునది - ధరణీశ=భూనాయకునియొక్క, దాస=దాసునియొక్క, కేసరి=సింహముయొక్క, కీట=పురుగుయొక్క, మాతంగ=ఏనుఁగుయొక్క, మశకంపు=దోమయొక్క, సోమయాజులము=సోమయాగము చేసినవారము, శ్వపచఖగ కులులము=చండాలపక్షి జన్ములము, పాము గాములము=పాములమును పిశాచములమును.

తా.—విష్ణుసేవ ప్రార్థనీయము, దుర్లభమును; తనువు క్షుద్రము; ఈ క్షుద్రముకై విష్ణుసేవ నొసంగఁ జాల ననుట. ఈ సంసారచక్రములో విష్ణుభక్తికి వెలి యయినయల్పపుణ్యములచే ఉత్తమజన్మములును, పాపములచే అధమజన్మములును వచ్చును; విష్ణుభక్తి యుండిన, నధోజన్మములు రావు; మఱి ఉత్తమజన్మములకన్నను జన్మాభావమె అనఁగా మోక్షమే ఎక్కుడు గావున, అదియె కలుగును. 'సోమయాజులము' అనుటచేత శ్రౌతకర్మనిష్ఠకన్న విష్ణుసేవయే ఎక్కుడని భావము. ఇతరజన్మపరంపరకన్న విష్ణుభక్తజన్మము ఎక్కుడనుటచే వ్యతిరేకాలంకారము.

'దిక్పాలురు' ఇంద్రాగ్ని యమ నైరృత వరుణ వాయు కుబే రేశానులు ఎనమండ్రు ఎనిమిది దిక్కులకును అధిపతులు. "ఇన్ద్రో వహ్నిః పితృపతి ర్నైరృతో వరుణో మరుత్ । కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్"-అమ.-"భిక్షు తిరిపము బికిరము బిచ్చ మాయవారమును జోగు నాఁగను వఱలు నభవ" ఆం. భా. 'తిరిపంపుఁదనున్' 'కీటంపుఁదనున్' 'మశకంపుదనున్', 'దాస్యంపుఁదనున్'-అని పా. 'తనున్'-ఇందు వు వర్ణలోపమునకు శాస్త్రము కల్పనీయము. ఆధునికమైన ప్రౌ. వ్యా. మందు రాహుబాహుశబ్దములకే ఈ లోపము చెప్పఁబడియున్నది. తోన్ = వెంటనే. శ. ర. "అళికంబునయక్షిని డాఁచినట్టి సర్వజ్ఞుఁడు" ఉ. హ. 2 (176)లో "తునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు" అని ప్రయోగించినాఁడు. కావున రాహ్వాదిని ఆకృతిగణముగా కల్పించుకొనుట శ్రేయము. 'ఈయేను, నీవు'-ఇచట ఈశబ్దము నీవునకును ముందు అధ్యాహార్యము.

కేసరి-"సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః," మాతంగ-"మతఙ్గజో గజో నాగః కుఞ్జరో వారణః కరీ," అమ. "మశకంబు దోమ యనఁగ వెలయును" ఆం. భా. సోమయాజి = సోమరసముతో యజించువాఁడు - 'సోమపీథీ తు సోమపః' 'నిషాద శ్వపచా వన్తేవాసి చాణ్డాల పుల్కసాః' - అమ. "గాము సోఁకు సత్తి గాలి దయ్యము బూత। మనఁ బిశాచసంజ్ఞలలరు నభవ"-ఆం. భా. 'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః'-అమ.

ఆ. ఊఁతనీరు చెలఁది నేఁత మూటాయిఁటి
దూది యెండపసుపు దొఱ్ఱియక్క
రంబు మేను, దీని రహిఁ బుణ్య మమ్ముట
కప్పురంబు పెట్టి యుప్పు గొనుట. 62

మేను=దేహము, ఊఁతనీరు=చేఁపలనుబట్టెడి యూఁతలో గ్రహించిన జలము - క్షణమయినను నిలువ దనుట, చెలఁది నేఁత మూట ఆయిటి దూది=సాలెపురుగు నేసిన నేఁతలో ముడిచిపెట్టిన బూరుగుదూది, ఎండ పసుపు=ఎండలోని పసుపు, తొఱ్ఱియక్కరంబు = దూలములో పురుగుదొలిచిన యక్షరము; దీని రహిన్=దీనిమీఁది మమతచేత, పుణ్యము అమ్ముట = హరిస్తుతిగీత ఫలమును వెలగా నిచ్చుట,-కప్పురంబు వెలగా నిచ్చి ఉప్పుగొనుటవంటిది.

తా.—ఈ దేహము ఊఁతసీటివలె నిలువనిది, సాలెపురుగు నేసిన నేఁతలో (కట్టుటకే రాదు, దానితో కట్టినది కట్టనిదే, అట్లు) కట్టినబూరుగుదూదివలె స్థితి లేనిది. ఎండలోనిపసుపు వర్ణహీనమగును, ఎండలో వర్ణాధికమువోలె నాభాసించును; దేహము అట్టియాభాసము, ఘుణాక్షరమువలె ఆభాసమాత్రము. దీనికి వెలగా పుణ్యము నిచ్చుట ఉప్పునకు వెలగా సరికిసరిగా కప్పురము నిచ్చుటవంటి తెలివితక్కువపని.—రూపక నిదర్శనలకు సంసృష్టి.

"ఊఁతనఁ గువేణి చెలఁగు"-అం.భా. "జాలకాఁడు వెలఁది సన్నపిల్లి। పాదొట్టనఁగ లూతి పరఁగు"-అం. భా.

వ. అనిన దనుజుం డిట్లనియె. 63

దనుజుండు=రాక్షసుఁడు "అసురా దైత్యదైతేయ దనుజేంద్రారి దానవాః"-అమ.

క. సంగీతఫలంబునఁ గో। సంగీ సగమైనఁ దయ పొసఁగ నీవే; మ్రి
మ్రింగిన గ్రుక్కన్వారిధి। కిం గొఱఁతయె? కొదయె విష్ణుకీర్తన కనినన్. 64

గోసంగీ=ఓ మాలదాసరీ, దయపొసంగఁగన్ = దయచేసి, సంగీతఫలంబునన్ = (నేఁటి) హరిస్తుతిగానపుణ్యములో, సగమైనన్, ఈవే=ఈయవా (ఇమ్మనుట), మీను మ్రింగిన గ్రుక్కన్= చేఁప త్రాగిన గ్రుక్కెఁడునీళ్లచేత, వారిధికిన్ కొఱఁతయె = సముద్రము తక్కువపడునా (పడదనుట), విష్ణుకీర్తనకున్ కొదయె=(ఒకనాఁటి హరికీర్తన ఫలములో సగము నాకిచ్చుటచేత నీయపార) విష్ణుకీర్తనఫలము తక్కువపడదు, అనినన్ (అవలి కన్వయము).

తా.—ఓయి దాసరీ, చేఁప మ్రింగిన గ్రుక్కెఁడు నీటిచే సముద్రము తక్కువపడనట్లు ఏక దినగీత ఫలములో సగము నా కిచ్చుటచే నీయపార హరికీర్తనఫలము తగ్గదు; కావున దయచేసి నేనడిగిన దినగీత ఫలార్థమును నాకు ఒసంగుము.—ప్రతివస్తూపమ

'ప్రతివస్తూపమ వాక్య। ద్వితయంబునఁ జెప్ప వేఱువేఱ నుభయసం
గతమా సమానధర్మము;। నతిజుల హరి ద్రుంచు, నృపుఁడు దృప్తులఁ జించున్.'

గోసంగి-"అసాది గోసంగి మాదిగ గూబరి యన మాతంగుఁడగు."-ఆం. భా. అని నిఘంటువున నున్నను, గోసంగిపదము మాలనికినిం గవులు ప్రయోగింతురు.—

"ఓరోరి రాచవాఁడా,। రారా, నావెంటఁ దిరుగురా గోసంగివై,
పోరాడి మాడ నిచ్చెదఁ;। గోరా నియుప్పు దీర్చుకోరా పెలుచన్." హరిశ్చ. ర. అ.-శ. ర.

ఈ దాసరినే దివ్యసూరిచరితమందు "శ్వపచం కైశిక గానలస్ఫుటమ్" అని తడవియున్నారు. అమరమందును "చణ్డాలప్లవమాతఙ్గ దివాకీర్తి జనఙ్గమాః" అని చండాల(=మాల), మాతంగ (=మాదిగ) పదములును, పర్యాయములుగానుం బఠితములు. ఇందువలన ఆ రెండు జాతులభేదము ప్రకృతమున అవివక్షితమని యేనియుం దలంప నగు.

శా. ఏలా నొంచె దదేహ? మి ట్లడిగి, గొం తే బాస మేనం బలం
బో, లీలావటు గీతకీర్తనఫలం బో, నీయెడ న్మున్న? పా
తాళప్రశ్నలు మాని మే న్గొనుము; బేతాళ చ్ఛలో క్తిన్ రుషం
దూలింపం దలఁ తేని, ఫుట్లు మఱి నూతు ల్గ్రొవ్వి బేతాళముల్. 65

అదేహము = దేహాన్యమును (గీతఫలమును), అడిగి, ఏలా ఇట్లు, నొంచెదు = పీడించెదవు, ఎంతేన్ =ఎంతయైనను (పీడించినను), మున్ను= మొదట (అనఁగా నన్ను వినిచినప్పుడు), నీయెడన్

బాస = నీకు నాప్రతిజ్ఞ (ప్రతిజ్ఞాతమనుట), మేనన్ పలంబో = నామేనిలోని మాంసమా, లీలావటు=లీలార్థమై వటువైన వానియొక్క (వామనమూర్తియొక్క-నారాయణునియొక్క యనుట)- గీత=గానరూపమయిన - కీర్తనఫలంబో = స్తుతియొక్క పుణ్యమా, పాతాళప్రశ్నలు=లోఁతయిన చర్చలంగలిగించు పృచ్ఛలను, మాని = అడుగక, మేను=నాదేహమును, కొనుము = కైకొమ్ము, బే... క్తిన్ - బేతాళ=నీదైన పిశాచజాతికి సాధారణమైన- ఛల=వంకరమాటల-ఉక్తిన్=వచించుట చేత, రుషన్=కోపముచేత, తూలింపన్=బెల్లుదునట్లు, తలఁతువు ఏని = యత్నించెదవేని, మఱి= అంతట, నూతుల్ త్రవ్వన్ బేతాళముల్ పుట్టున్=నూయిద్రవ్వి బేతాళుని లేపినట్లగును.

తా.—దాసరి చెప్పుచున్నాఁడు.-ఓయి రక్కసుఁడా, నీవు నాదేహముకంటె వేఱొకటి యడుగుట సరిపడదు. మొదట నీవు నన్ను హరికీర్తనమునకు పోనిచ్చినప్పుడు నాచే చేయించుకొన్న ప్రతిజ్ఞ నాదేహము నిచ్చెదననియేగాని గానఫల మిచ్చెద నని గాదు. నీవు ఈ లోఁతు ప్రశ్నలు మాను, నా దేహమును పుచ్చుకొమ్ము. నీవు నీ పిశాచజాతికి సులభ మయిన ఛలవచనముల చేత నాకు కోపము తెప్పించిన ఆ కోపాన నేను గీతఫలమును ఇచ్చినచోఁ గొనంజూచుచున్నావా యేమి? ఆ పక్షమున బావి త్రవ్వఁగా భూతము వెలువడినట్లగు నేగాని, నీ యుక్తిమాత్రము ఫలింపదు.-విషమభేదము, లోకోక్తి తదంగము. ''బావి త్రవ్వఁగా భూతము బయలుదేఱినట్లు'' అను సామెత ప్రసిద్ధము. ''కూపం ఖనతా బేతాళ ఉత్థాపితః' అని న్యాయము. ''పల మున్మాన మాంసయోః'' - హైమము.

'పాతాళప్రశ్నలు' - కొన్ని పుస్తకములందు 'బేతాళప్రశ్నలు' అని యున్నది. ఆపాఠమునకు 'విక్రమాదిత్యునికి శ్మశానములో బేతాళుఁడు వేసిన కఠినప్రశ్నలవంటి ప్రశ్నలు ఉత్తరము చెప్పుటకు మిక్కిలి కష్టమయిన ప్రశ్నలు' అని భావము.

వ. అనిన సాలకటంకటేయుండు సాలఁ గటకటంబడి, కార్శ్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని, కటకటా! కైటభారి కనుంగులగు డింగరీలు దయాళువులు గావలవదే? తొల్లి దర్శన ప్రవర్తకుండై వైయాసికంబు లగు సూత్రంబులు వివరించి విస్తరశ్రవు నద్వైతవైశిష్ట్యంబుఁ బ్రతిష్ఠించిన లక్ష్మణాఖ్యయోగీంద్రుండు, చిరకాలసేవా సంతుష్టుండై నిజదేశికుం డగు పూర్ణాహ్వయుం డనధికారుల కీకు మని విధియుక్తంబుగాఁ దనకుఁ బ్రసాదించిన గీతాచరమార్థంబుఁ, గృపాతరంగితుండై రంగేశధామదామోదరనామ చామీకరగోపురం బెక్కి, యుచ్చైస్స్వనంబున నుచ్చరించినఁ గురుం డలిగిన. ''దేవా! దేవరయాజ్ఞ మీఱి యే నొక్కరుండ రౌరవంబునం బడుట మేలో? భాగవతపరిషత్తునకుఁ బరమపద మగపడుట మేలో? యని వితర్కించి నీ వుచ్చరించుట గా నుచ్చరించితి'' నని తదభినందితుం డయ్యె. నతండ నిజచ్ఛాత్ర సత్త్రంబునకుఁ బ్రత్యహంబును గల్యంబున మూల్యంబొల్లక గవ్యంబు సమర్పించి వేఁడిన వల్లవీవల్లవులకుఁ బరమ పదంబుఁ బ్రసాదించె; నతండ బంధముక్తుం డయ్యు నవతారాంతరంబునఁ గాలాంతరంబున సంకుచితజ్ఞానులై విషయపరు లగు నరులకుం బరమునం దలితీ పొదవ సుందరజామాతృ నామంబున నర్చిరాదిగతి విశదీకరించె; నతండ యిట

మీఁద యాదవగిరి టెంకణంబు పాషండసంకులంబుగా వచ్చినం దచ్చ్యుతికి శఠకోప సమాఖ్య సంభవించి నిరంధ్రవాదంబున నంధ్రాదివిషయ విద్వజ్జనంబుల నధోక్షజ విషయవాద భిక్ష వేఁడి దిగ్విజయంబు సేసి గరుడకుధర గుహాకుంత నృకంఠీరవంబు కుహనాత్రిదండిద్వై బ్రుసీ కుసుంభాంబరాంభః కుండిక లొసంగ నంగీకృతాంతిమాశ్రముండై, ఫణిప కణభు గక్షపాద బాదరాయణ కపిల జైమిని శాసనంబులు మఱ మహానస మహీసురులు మున్నుగా నెంతేవాసి నంతేవాసులకుఁ దెలివి పఱుపం బరమహంసాసుష్ఠాన పరకాష్ఠయై, పదయుగ ప్రపన్న భువనప్రపంచపంచజనహృదయ భవనంబులం బద్మాపద్మాక్షులు పర్ణోద్య దుడిచి పాడెక్క భక్తి బోధించి భూతలంబుఁ బావనంబు సేయఁగలవాఁడు; మఱియు హయవదనపదారాధకుండై వేంకటేశుండను నింకొక్క మనీషి మధుమథనమతప్రతిపాదకం బగు ప్రబంధశతంబు రచించి త్రిలోకాన పత్తనంబునం దపంబు సేయం దనకు జరచ్ఛదన శాకదానంబు సేయు నగస్త్యోర్వీరుహంబునకు నిర్వాణం బొసంగం గలం; డిట్టి యోష్యంబులు మదీయ దివ్యబోధంబున నెఱింగియుండు నేతాదృశం బగు త్రైకాలిక జ్ఞానంబు కలిమి నిస్సీను మానసీయంబు గదా యంటేని యది జాత్యంబుదక్కఁ దపస్సత్యశమదమాది లబ్ధంబుగాదు; నిషాది భవిష్యదర్థంబులఁ జెప్పుచున్నది, అది శుచియే? కౌశికంబు డబ్బగాటి గబ్బులుఁగు గౌళి కనుంబెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులై యున్నయవి; యవి తపస్వులే? యట్లు మావిజ్ఞానంబును; నెట్లనిన, నాస్తిక్యంబువలన శాస్త్రంబులెడ నధీతిబోధంబులు దక్క నాచరణప్రచారంబులు లేమిధర్మంబు దూరం, బది నిమిత్తంబుగా నిత్తెఱం గెఱుంగక భవోత్తారకంబుగాదు, గావునఁ గలుష రహిత కాయంబునంగాని కల్యాణంబు లబ్ధంబుగాదు గాఁబట్టి యివ్విరూపవిగ్రహం బనుగ్రహంబున నుడిపి కృతార్థం జేయు; మని పాదంబుల వ్రాలి పాటం బాతిక పాలేని యీవే యనిన, నతం డదియును నీలేనన్నఁ బోని మ్మీ ప్రభాతసమయంబునం బాడిన చరమగీతంబైన నిచ్చి ప్రసన్నుండ నగు నన్ను విపన్నుం జేయుమని లేవ కున్నం, బరమదయార్ద్రహృదయుండై, 'యట్ల కానిమ్ము లె' మ్మని యతని లేవనెత్తి, యత్తను ప్రాప్తిప్రకారంబు సవిస్తరంబుగాఁ జెప్పుమనిన నవధరింపుమని యప్పాలదిండి దుఃఖార్తుండై యిట్లనియె. 66

సాలకటంకటేయుండు=రాక్షసుఁడు (సాలకటంకటుఁ డని యొకయాదిమ రాక్షసుఁడు), కటకటంబడి=దుఃఖపడి, డింగరీలు=భక్తులు, దర్శన=శాస్త్ర, వైయాసికంబులు=వ్యాసరచితములు, వైయా...సూత్రంబులు = బ్రహ్మసూత్రములను, విష్టరశ్రవు = నారాయణునియొక్క, లక్ష్మణాఖ్య యోగీంద్రుండు = శ్రీ రామానుజాచార్యులవారు (శేషాహియొక్క, అందువలననే లక్ష్మణస్వామి యొక్క యవతారము), పూర్ణార్యుండు = పూర్ణాచార్యు లనువారు (పెరియనంబి యని వారికి ద్రావిడనామము - వారు శ్రీ రామానుజులవారి గురువు), గీతాచరమార్థంబు = భగవద్గీత కడపటి

శ్లోకము భావమును ("సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోచయిష్యామి భారత" అనునది గీతాచరమ శ్లోకము), రంగేశధామ దామోదరనామ చామీకర గోపురంబు = రంగనాథుని యాలయమున దామోదరమను పేరి బంగారు గోపురమును, తదభినందితుండు=ఆ గురువుచే అంగీకరింపఁబడినవాఁడు, ఛాత్త్ర=శిష్య - సత్త్రంబులకున్ = కూటములకు, కల్యంబు=ప్రాతఃకాలము, మూల్యంబు=వెల, ఒల్లక=ఇచ్ఛగింపక (పుచ్చుకొనక), గవ్యంబు=ఆవులపాఁడి (పాలు పెరుఁగు నేయి లోనగునది), వల్లవీ=గొల్లది - వల్లవుఁడు=గొల్లవాఁడు, సంకుచితజ్ఞానులు=కొఱవడిన జ్ఞానముకలవారు, సుందరజామాతృ = అందగాఁడైన యల్లుఁడు, అర్చిరాదిగతిన్=ముక్తులు సూర్యమండలము ఛేదించుకొనిపోవు మార్గవిశేషమును, యాదవగిరి టెంకణంబు=తిరునారాయణపుర ప్రాంతము, పాషండసంకులంబు=వేదబాహ్యులచేత నిండినది, నీరంధ్ర=దట్టమైన, అంధ్ర ఆదివిషయా=త్రిలింగము లోనగు దేశములందలి, అధోక్షజ విషయ = శ్రీహరియే విషయముగాఁ గలదైన, గరుడ భూధర=గరుడాచలముయొక్క - గుహన్ = అహోబలమునందు, నృకంఠీరవ=నరసింహ, కుహనా త్రిదండి=కపటసన్న్యాసి, బృసీ=జపాసనము, కుసుంభాంబర=కాషాయవస్త్రము - అంభఃకుండికా=జలకమండలువు, (పా. కౌసుంభరాంభఃకుండికలు = కాషాయవేణుదండకమండలువులు); అంతిమాశ్రమము = యత్యాశ్రమము, ఫణిప = శేషుఁడు (అష్టాధ్యాయీ మహాభాష్యకర్త) కణభుక్ = కణాదుఁడు (వైశేషికశాస్త్రకర్త), అక్షపాద = గౌతముఁడు (న్యాయశాస్త్రకర్త), బాదరాయణ=వేదవ్యాసులవారు, కపిల=కపిలమహర్షి (సాంఖ్యశాస్త్ర ప్రవర్తకుఁడు), జైమిని=వ్యాసశిష్యుఁడు (పూర్వమీమాంసా శాస్త్రకర్త), శాసనంబులు=శాస్త్రములు, మఠ=తమమఠముయొక్క - మహానస = వంటయిల్లు - మహీసురులు = అందలిపరిచారకులయిన బ్రాహ్మణులు (వంటవాండ్రు లోనగువారు), ఎంతే వాసిన్=మిక్కిలి యుక్తముగా, అంతేవాసులకున్=శిష్యులకు, పరమహంస = యతీశ్వరులయొక్క - అనుష్ఠాన = ఆచారమునకు - పర కాష్ఠ = తుదిహద్దు, (యతీంద్రుల యుత్తమోత్తమాచారము), పదయుగ = పాదయుగళమునకు - ప్రసన్న = భక్తులైన - భువనప్రపంచ = లోకసముదాయమందలి - పంచజన = జనులయొక్క - హృదయ భవనంబులన్ = మనస్సులనియెడు నిండ్లయందు, పద్మాపద్మాక్షులు = లక్ష్మీనారాయణులు, పల్లేర్లు = కామక్రోధాద్యరిషడ్వర్గమనెడు ముండ్లను, తుడిచివైచి=పోనడిచి, పాదు ఎక్కన్ = అట్లుశూన్యములైన యాప్రదేశములందు ప్రవేశింపఁగా (పా. పాదెక్కన్ = పాదెక్కఁగా = నెలకొనఁగా), భక్తిన్=ప్రపత్తిని, బోధించి=దృఢముగా నుపదేశించి, హయవదన = హయగ్రీవస్వామియొక్క, వేంకటేశుండు=వీరే వేదాంతదేశికులవారు, మనీషి=జ్ఞాని, మధుమథన=నారాయణుని - మత ప్రతిపాదకంబు = మతమును చెప్పునది (నారాయణుఁడే పరతత్త్వము అని బోధించునది), ప్రబంధశతంబు = నూఱుగ్రంథములు, శిలోంఛ వర్తనంబునన్ - శిల = "కోఁతకోసిన మళ్లయందు జాఱిపడిన వెన్నులోనగు వానిని ఏఱుకొని వానిచే జీవించుట" - ఉంఛ = రాలిన నీవారాది ధాన్యమేఱుకొని బ్రతుకుట "(లేకిబ్రదుకు)" అనెడు - వర్తనంబులన్=బ్రతుకులచేత [శిలము - రూ. సిలము; "ఉఞ్ఛః కణశ ఆదానం కణిశాద్యర్జనం శిలమ్" యాదవ. "శిల మనఁగా నియతగృహోపాదానము."] తనకున్ = ఆవేదాంతదేశికులవారికి, జరత్ ఛదన = ముదురాకుల. అగస్త్యోర్వీరుహంబునకున్=అగిసె చెట్టునకు (పా. అలర్కోర్వీరుహంబునకున్ =ముల్లుచ్చిత చెట్టునకు), నిర్వాణంబు=మోక్షము, ఏష్యంబులు=రాఁగలవి (భవిష్యదర్థములు), శమ = అంతరింద్రియనిగ్రహము -

దమ=బహిరింద్రియనిగ్రహము, నిషాది=ఎఱుకత, అది=ఆ యెఱుకత, కౌశికంబు=గుడ్లగూబ, డబ్బ గాటి-గబ్బులుఁగు=ఇవి పక్షివిశేషములు, గౌళి=బల్లి, కనుంబెంటి-పైఁడికంటి = పక్షి విశేషములు, భవోత్తారకంబు=సంసారమును దాఁటించునది (భవనాశము నొనరించునట్టిది). అధీతి బోధంబులు= చదువుటయు గ్రహించుటయు, అవిపన్నుఁ=ముప్పులేని వానిని.

మ. అజ చౌర్యాపహృతాత్మ తోక సముదా యాభీరకాంతామణీ
వ్రజగోరాజిమనఃప్రమోదకర తద్వత్ప్రాప్తరూపానురూ
ప జని ప్రాభవ, ద్రౌణిజోదర కన ద్బాణాగ్ని వృత్తి ప్రకో
ప జలాసార, సరోజ బాంధవ శశి ప్రాంచ ద్విశాలాంబకా! 67

అజ...వ - అజ=బ్రహ్మచేత - చౌర్య=దొంగతనమున - అపహృత = హరింపఁబడిన - ఆత్మ= తమయొక్క - తోక=బిడ్డలయొక్క (గోపబాలురయు ఆవుదూడలయు) - సముదాయ=సమూహము గల - ఆభీరకాంతామణీ=గొల్ల - కామినీరత్నముల - వ్రజ = సముదాయమునకును - గోరాజి=ఆవుల మందలకును - ప్రమోదకర = సంతోషకరమైన - తద్వత్ = ఆ బిడ్డలవలె (దూడలవలెను బుడుతల వలెను), - ప్రాప్త=తనచేత పొందఁబడిన - రూప=రూపములకు - అనురూప-సదృశమైన- జని=పుట్టువులయొక్క - ప్రాభవ=మహిమకలవాఁడా, ద్రౌ...ర- ద్రౌణిజ = అశ్వత్థామవలని, ఉదర=ఉత్తరా గర్భమందు-కనత్ = వెలుంగుచున్న - బాణాగ్ని=అపాండవాస్త్రవహ్నియొక్క - వృత్తి=ప్రజ్వలన వ్యాపారముయొక్క - ప్రకోప=ఉద్రేకమునకు - జల ఆసార=నీటి జడివైనవాఁడా, సరో...కా- సరోజబాంధవ = (తమ్మిచెలియైన) సూర్యుఁడును - శశి = చంద్రుఁడును - అనెడు - ప్రాంచత్ = మిక్కిలి యొప్పుచున్న - విశాల= వెడందలైన - అంబకా= నేత్రములుకలవాఁడా.

తా.—నారాయణుని కృష్ణావతారమందు శ్రీకృష్ణునిమహిమను పరీక్షించుటకై బ్రహ్మ గోకులంపుఁ గోవులదూడలను గొల్లయిల్లాండ్రబుడుతలను అంతర్ధానము నొందించెను. అంతట శ్రీకృష్ణుఁడు బ్రహ్మగర్వ మడంప, తానె ఆ దూడలై, ఆ బాలురునై, ఆ గోవులకును ఆ గొల్లయిల్లాండ్రకును బ్రహ్మకృత్యమును తెలియనీక వర్తించుచు, ఆ గోవులను ఆ చెలువలను సంవత్సరము సంతోషపెట్టెను. అంతట బ్రహ్మ వచ్చి శ్రీకృష్ణునిమహిమను స్తుతించి, తా నపహరించిన వత్ససముదాయమును, మరల నిచ్చి, పోయెను. అశ్వత్థామ పాండవవంశోన్మూలకమైనయస్త్రముం బ్రయోగింప, దానిజ్వాలలు అభిమన్యుని భార్యయైన యుత్తరయొక్క గర్భమందుఁ జొచ్చి యట నున్న భ్రూణరూపుని పరీక్షిత్తుని దహింప దొరకొనఁగా, శ్రీకృష్ణులవారు నిజప్రభావంబున ఆ యస్త్రాగ్నిని చల్లార్చివైచి, ఆ శిశువును రక్షించిరి. ఆయన నారాయణుఁడే గావున ఆయనకు సూర్యచంద్రులు నేత్రములు.—'అట్టియో నారాయణుఁడా' యని తదీయసంబోధనము.

'అజా విష్ణు హరచ్ఛాగాః,' 'అపత్యం తోకం తయోః సమే,' 'గోపే గోపాల గోసంఖ్య గోధు గాభీరవల్లవాః,' అమ. "వ్రజా గోష్ఠాధ్వసంచయాః" - నానా.

క. అనవరత నవ రతాదృత । వినుతప్రేమాత్తవల్లవీజనజాలా
మననపర మౌనిమానస । వన వసిత్ర మరాళవర సుహాసితమూర్తీ. 68

అన...లా - అనవరత = సర్వదా - నవ = నూతనమైన - రత = కామక్రీడలచే - ఆదృత = సంతోషితలై - వినుత=శ్లాఘితమైన (=ఉత్కటమైన) - ప్రేమ=అనురాగముచేత - ఆత్త=పొందఁబడిన - వల్లవీజనజాలా=వ్రజాంగనాసమూహముకలవాఁడా, మన...ర్తీ - మననపర=ధ్యానతత్పరు

లైన - మౌని=తాపసులయొక్క - మానస=మనస్సులనెడి - (మానస=మానససరస్సులయొక్క) - వన=సమూహమనెడి - (వన=సమూహమందు) - వసిత్వ=వసించుచుండు - మరాళవర=హంసశ్రేష్ఠుఁడా, సు...ర్తి - సువాసిత=లెస్సగా సురభీకృతమైన - మూర్తి=ఆకృతికలవాఁడా, - (ఆశ్వాసాంతపద్యములో నన్వయము.)

తా.—సర్వదా నవనవసురతక్రీడలచే సంతోషపెట్టఁబడినవారై యుత్కటప్రేమను వహించిన గొల్లయువతులు గలవాఁడా, మననశీలురైన మౌనులమానసములనెడి మానససరస్సులందు వసించు రాజహంసమా, ఉత్తమమైనపీతాంబరమును ధరించువాఁడా.—రెండవవిశేషణమున రూపకము.

'చిత్తే సరసి మానసమ్' - నానా.

ఉత్సాహ. నలము ఖాదిచక్రవర్తి నాథ నవసమర్పితా
త్యలఘుమకుట ముఖ్య హా ర్యుపాయనా యనావిలా
జిల సురారిహరణ నిజ వశీకృతాఖిలాండ ని
ర్మలగుణా! యమేయరూప రంజితార్యపోషణా. 69

నల...జిల - నలముఖ=నలుఁడు లోనగు - ఆదిచక్రవర్తి=తొంటిచక్రవర్తులైన - నాథ = రాజులచేత - నవ=నూతనమైన - సమర్పిత=ఒసంగఁబడిన - అత్యలఘు=మిక్కిలి యమూల్యములైన- మకుటముఖ్య=కిరీటములోనుగాఁగల - హారి=మనోహరమైన - ఉపాయనా=కానుకలుగలవాఁడా, అనావిల=అకలుషమైన (దేదీప్యమానమైన) - అజిల = దేహముకలవాఁడా, సురారి హరణ=దేవశత్రువులను పరిమార్చువాఁడా, నిజ...డ - నిజ=తనచే - వశీకృత - స్వాధీనము చేసికొనఁబడిన - అఖిల - సకలమయిన - అండ = బ్రహ్మాండములు కలవాఁడా, నిర్మలగుణా=స్వచ్ఛమయిన (కల్యాణములైన) గుణములు కలవాఁడా, అమే...ణా - అమేయరూప = ఇంతయని యెఱుంగనలవిగాని స్వరూపముచేత - రంజిత=ఆనందితులయిన - ఆర్య=పెద్దలను - పోషణా=ప్రోచువాఁడా.

నలుఁడులోనగు చక్రవర్తులు తమకాలమందు క్రొత్తగా సమర్పించినవియు, అమూల్యములును, మనోహరములును, ఐన కానుక లగు కిరీటాదికములను ఇప్పటికిని ధరించునట్టి వేంకటాచలపతీ, దేదీప్యమాన విగ్రహుఁడా, దేవశత్రువులను సంహరించువాఁడా, సకలబ్రహ్మాండములకును నాథుఁడా, అనంతకల్యాణగుణ సంపన్నుఁడా, ఇంతయని తెలియని విశ్వరూపముచేత పెద్దలను సంతోషపెట్టి ప్రోచుచున్నవాఁడా.

అజిల - 'అజిర' యని ప్రసిద్ధము - విషయేఽఙ్గేఽఙ్గణేఽజిరమ్', - నానా. రలలకు నభేదము—"రలయో ర్లడయో స్తద్వ జ్జయయోః ర్బవయోరపి । శసయో ర్నణయో శ్చాన్తే సవిసర్గావిసర్గయోః । సబిన్దుకాబిన్దుకయోః స్యా దభేదేన కల్పనమ్."

మ. ఇది నైరామన యావనావనిధ వాహీనాభ్రచుంబి స్ఫుర
ద్విదితాభీల మణీగృహాళి దళనోద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్య దనీకాగ్రగ కృష్ణరాయమహిభృ త్సంజ్ఞాస్వదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్. 70

ఇది=ఈ యాశ్వాసము, నైరా...దళ్ - నైరామన=నైరామన పురమందలి - యావన అవని ధవ=తురక భూపాలునియొక్క - అహీన=గొప్పదైన - అభ్రచుంబి=మింటినంటుచున్న - స్ఫురత్ =

ప్రకాశమానమైన - విదిత=ప్రసిద్ధమైన - అభీల=కష్టసాధ్యమైన - మణీగృహ=రత్నమయములైన లోఁగిండ్లయొక్క (రత్నహర్మ్యములయొక్క) - ఆళి = పంక్తియొక్క - దళన=పగుల్చుటయందు - ఉద్వేల=మితిమీఱిన - ఉగ్ర = భయంకరములైన - హస్తి= ఏనుఁగులయొక్క - వ్రజ=గుంపుతో - ఉద్యత్ = తరలుచున్న - అనీక = సేనకు - అగ్రగ = మొనయందుఁబోవుచున్న - కృష్ణరాయ మహీభృత్ = కృష్ణరాయ భూపాలుఁడనెడి - సంజ్ఞ = పేరుగలవాఁడైన - అస్మత్ = నాయొక్క - ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యదయనెడి గ్రంథమందు, హృద్యంబైన పద్యంబులన్ = హృదయంగమములైన పద్యములతోడిది, ఆశ్వాస వరేణ్యము ఆఱవది = ఉత్తమమైన షష్ఠాశ్వాసము.

తా. కృష్ణరాయఁడు నైరామన పట్టణపు సుల్తానుయొక్క మహోన్నతము లైన మణిమయ సౌధములను తాను నడపుకొనిపోయిన యేనుఁగులదండుచేత పడఁగొట్టించినాఁడు. అట్టి యా ప్రభువు రచించిన యాముక్తమాల్యదా ప్రబంధంబునందు ఇది యాఱవయాశ్వాసము, మనోహరము లైనపద్యములతో నొప్పుచున్నది.

* ['నైరామన'-ఇట్లు వ్రాఁత ప్రతులయందున్నది, ఇది నగరము పేరో సుల్తాను పేరో నిశ్చయించుకొనవలసియున్నది.]—'ఆభీలౌ కృచ్ఛ్రభీషణౌ' - నానా.



* 'నైరామన' - దీనింగూర్చి చర్చించి శ్రీ డా. నేలటూరు వేంకటరమణయ్యగారిట్లు వ్రాసినారు. (భారతి, వికృతి, జ్యేష్ఠము పు. ౬౨౮) "తాళపత్రప్రతులందును ముద్రితగ్రంథములలోను 'ఇది నైరామన యావనావనిధవ' అనియే సర్వత్ర కానవచ్చుచున్నది. నైరామనాఖ్య నగరముగాని యాపేరిటి సుల్తానుగాని యన్యత్ర యెచ్చటను పేర్కొనబడియుండలేదు. అట్టిపురము దక్కనులోఁగాని మఱి రాయలకందుబాటుగల దేశములందుగాని కానరాదు. కావున 'నైజామన' యని సవరించితిని. మఱియు నీపద్యము వ్రాతప్రతు లన్నిటియందును గాన్పింపదు. శ్రీనివాసవ్యాఖ్యతో గూడిన ప్రతులయందే కానవచ్చుచున్నది. ఆముక్తమాల్యద యేడాశ్వాసముల గ్రంథమని పెక్కువ్రాతప్రతులయందు జెప్పియున్నది. ఈపద్యమును ద్రోసిపుచ్చిన ఆఱాశ్వాసాంతములే మిగులును, యేడవ యాశ్వాసమున కాశ్వాసాంతపద్య ముండదు. ...కావున బ్ర. శ్రీ. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులవారి మార్గము నవలంబించుట యుక్తము... 'నైజామన' యహమ్మదునగరపాలకుడగు నిజామునిశాహు కావచ్చును. కొంబావియుద్ధమునకును నైజామన యావనప్రభుని మణీగృహాళినిర్మూలనమునకు నెద్దియేనియు సంబంధ ముండియుండును."

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## సప్తమాశ్వాసము

క. శ్రీమదుమాసులభాంగక। సామజహర నక్ర దళన చక్ర సదాళీ
క్షేమంకర చరణాంబుజ। హైమోజ్జ్వలవాస! వేంకటాచల రమణా! 1

శ్రీ...క - శ్రీమత్=శోభాయుక్తమయిన - ఉ=శివునికి - మా=లక్ష్మికిని - సులభ=(శివునికి బాణముగాను - లక్ష్మికి నివాసముగాను) సుఖముగా దొరకిన - అంగక=దేహముకలవాఁడా, సా...ర - సామజ=కువలయాపీడమను కంసుని గజమును - హర=సంహరించినవాఁడా, నక్రదళనచక్ర=(గజేంద్రునింబట్టిన) మకరమునుచీల్చు (చీల్చిన) చక్రాయుధముగలవాఁడా, సదా...జ - సత్=సాధువులయొక్క - ఆళీ=సమూహమునకు - క్షేమంకర=మేలుసేయునదైన - చరణాంబుజ=పాదకమలములు కలవాఁడా, హై...స- హైమ=బంగారపు - ఉజ్జ్వల=మెఱయుచున్న-వాస=వస్త్రము గలవాఁడా, వేంకటాచలరమణా=వేంకటపర్వతపతీ,— 'అవధరింపు' మను ననంతరవాక్యముతో నన్వయము. ['ఉ'—'ఉకారో ఽస్త్రియే నేత్రే హరమాళో హరే హరో' - నానా.]

శివుఁడు త్రిపురదహనార్థమై బాణముగా విష్ణుమూర్తిని ప్రయోగించె నని పౌరాణికకథ.— దీనిని మహాకవులు అనుసంధింతురు.—

"ఏత త్తద్దుర్విగాహం తుహినగిరిమయం కార్ముకం, యత్ర జజ్ఞే
మౌర్వీ దర్వీకరాణాం పతి, రుదధిసుతానాయకః సాయకశ్చ,
దోర్దణ్డై శ్చన్ద్రమౌళే ర్నత మపి యద భూ దున్నతం కార్ముకాణాం,
బాష్పామ్భోవృష్టయే చ త్రిపురమృగదృశా మైశ మప్యైన్ద్రమాసీత్."-ప్రసన్న.3. (30).

మహాలక్ష్మి విష్ణువక్షఃస్థలాలయాయగుట సుప్రసిద్ధము.—

—* బ్రహ్మరాక్షసుని వృత్తాంతము *—

వ. అవధరింపు మప్పాలసుదిండి దుఃఖార్తుండై యిట్లనియె. 2

పాలసుదిండి=మాంసాశనుఁడైన యాబ్రహ్మరాక్షసుఁడు. "పాలసుదిండ్లు రక్కసులు తోలుఁ వేలుపు। లనఁగ నసురసంజ్ఞ యలరు" ఆం. భా. పాలసు రూ. పాల.

ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్చండిమఁ జర్చ గెల్తు ఘటశాసుల, శ్రోతులఁ దప్పు వట్టుదున్,
ఖండలముష్టి విప్పఁ గని నవ్వుదు, వెండి ప్రయోక్తలన్ సుధీ
మండలి గ్రాంథికత్వ మవమానము సేయుదు జల్పవాదినై. 3

చోళభూమిన్=చోళదేశములో, ఒక - ఊరన్=గ్రామమందు, ఉండుదున్=ఉంటిని, పదునాల్గు, కళల్=విద్యలను, నేర్చి, వాక్చండిమన్=నోటియాడంబరముచేత, ఘటశాసులన్=

తార్కికులను, చర్చన్ = వాదములో, గెల్తున్ = గెలుచుచుంటిని, శ్రౌతులన్ = యాగతంత్రజ్ఞులను, తప్పుపట్టుదున్ = వారు చేయుపొరఁబాటులను ఆక్షేపించుచుంటిని, వెండి = మఱియు, ప్రయోక్తలన్ = స్మార్తప్రయోగము నడిపించువారిని, ఖండలముష్టిన్ = ఖండకారికల పుస్తకములను, విప్పన్ = వారు విప్పఁగా, కని, నవ్వుదున్ = పరిహసించుచుంటిని, సుధీ...ము - సుధీ = విద్వాంసులయొక్క - మండలి = సమూహముయొక్క - గ్రాంథికత్వము = గ్రంథజ్ఞతను, జల్పవాగ్మినై = జల్పమనెడి విజిగీషుకథను ప్రయోగించినవాఁడనై, అవమానము సేయుదున్ = అవమానించుచుంటిని.

తా.—పూర్వజన్మమందు నేను చోళదేశములో నొకయూరనుంటిని, పదునాల్గు విద్యలను నేర్చితిని. వాగ్మినై పల్కుచు వేత తార్కికులను జయించుచుంటిని, శ్రౌతక్రియానిపుణుల పొరఁబాట్లు బైట వేయుచుంటిని, స్మార్తకర్మప్రయోక్తలు ఖండకారికా పుస్తకములను విప్పఁగానే పరిహాసము చేయుచుంటిని, విద్వాంసుల గ్రంథపరిచయమును జల్పవిధానమున అవమానపఱుచుచుంటిని.

చోళదేశము అఱవదేశము; పూర్వము దానికి కాంచీపురము రాజధానిగా నుండెను. కళలు వేలు, వ్విదలు వేలు; కళలు అఱువదినాలుఁగు, విద్యలు పదునాల్గు; ఇచట కళాశబ్దము లాక్షణికముగా విద్యాపరముగా ప్రయోగింపఁబడినది. ఆఱంగములు, నాల్గు వేదములు, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రమును, అని పదునాలుగువిద్యలు—'శిక్షా వ్యాకరణ చ్ఛందో నిరుక్త జ్యోతిష కల్పములు షడంగములు.—"శిక్షా వ్యాకరణం ఛన్దో నిరుక్తం జ్యోతిషం తథా। కల్ప శ్చేతి షడఙ్గాని వేదస్యాహుర్మనీషిణః;" "అఙ్గాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః। పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ." 'యూరను విద్యలనెల్ల నేర్చి' అన్న నిర్బాధము.

ఘటశాసులు = తార్కికులు. ఉదాహరణార్థము ఘటము పటము అని మాటిమాటికిని చెప్పుచుందురు, కావున వారికి వాచకము. శ్రౌతులు = శ్రుత్యుక్తప్రకారమున జన్నములు చేయువారు, చేయించువారును ప్రయోక్తలు - నిషేకాది శ్మశానాంతములైన షోడశ స్మార్తకర్మలు చేయించువారు. జల్పము - 'ఉభయసాధనవతీ విజిగీషుకథా జల్పః' - అని తర్కశాస్త్రము.

ఈ పద్యమందు తద్ధర్మారోకరూపము భూతార్థసాతత్యమందు ప్రయోగింపఁబడినది.

వ. ఇన్నడవడిం బ్రభిన్నగండం బగు వేదండంబునుంబోలె మదాంధుండనై, యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె, నచ్చదువె పరబ్రహ్మంబై, పెద్దలం జెనకి యోడియు సరి గెల్తి ననియును, సరిపోయి జయించితి ననియు, నబద్ధంబు లాడి చిల్లరప్రభువులం భ్రమియించుచుండి, దీక్షితులం జూచి యియక్షువాఁడమి ద్రవ్యభిక్షార్థినై మధురకుం బోయి యప్పురంబున. 4

ఇన్నడవడిన్ = ఇట్లువర్తించుచు, ప్రభిన్నగండంబు = కపోలములనుండి మదము వెల్లిగొడుచు చున్నట్టిది, అగు - వేదండంబు = ఏనుఁగు (వేదము గ్రుడ్డుగాఁగలది - వేదమునుండి పుట్టినది - దానం జేసి సామజమనియుం బేరు), అల్పవిద్యాలబ్ధిన్ = కొంచెపాటివిద్య యలవడినంగులకు, విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె - (రెడ్లు పేదలని వారిని శోషణముచేయుటకు ఈకవి వేసరఁడు. చూ. గురుగుంజెంచలి 4 (134) - అట్లే రాజులను పొగడుటయందును ఈ కవికి ఉత్సాహము మిక్కుటము). దీక్షితులన్ = యజ్ఞము సేయుదొరకొన్నవారిని, యియక్షు = యజించు (యజ్ఞములు చేయవలయునను) కోరిక, పొడమి = పుట్టి, ద్రవ్యభిక్షార్థిని = ధనముయొక్క బిచ్చము కోరినవాఁడను, మధురకున్ = పట్టణము కావున యాచనచే నచట ధనము దొరకు నని.

సీ. బహివడ్డద్విజున కల్పపుఁ బాచితం బిడి,
  పసిఁడికై తా వాని బంతిఁ గుడిచి,
కలసి వణిక్పురోధలతోడఁ బుణ్యాహ
  ముల బియ్యములకునై మొత్తులాడి,
శశి రవి గ్రహ జపస్నానాదికము లెల్ల
  దొరలవాకిండ్లకే దొడ్డ యిచ్చి,
పచ్చిఇత్తోల్ బత్తిచుచ్చాలమెట్లంది,
  కొనఁ దాన యూరెల్లఁ గుత్తపట్టి,
తే. దర్భపోటులఁ దిని, లేని తఱుల మైత్రి
నంటి పితృశేషము భుజించి, యదియు నెడల,
నక్కవాడల నరకూళ్లు మెక్కి, మీఁద
వీని శేఖర మొకతులార్త్విజ్యము కొని. 5

(1) బహివడ్డద్విజునకున్ = వెలి వేయఁబడిన బ్రాహ్మణునికి, అల్పపుఁ బాచితంబు = (వ్యయాది కష్టములు తక్కువగానుండునట్టి) లఘుప్రాయశ్చిత్తము, ఇడి = పెట్టి (వానిచేత చేయించి), పసిఁడికై = ఆ ద్విజుఁ డిచ్చు బంగారము (ధనము)కై, తాన్ = తాను, వానిబంతిన్, కుడిచి = భుజించి; (2) వణిక్ పురోధలతోడన్ = వైశ్యులయొక్క పురోహితులతో, కలసి = చేరి, పుణ్యాహముల బియ్యమునకునై = పుణ్యాహవాచనములందు పురోహితునికి వచ్చునట్టి బియ్యము కొఱకు, మొత్తులు ఆడి = ఆ పురోహితులతో దెబ్బలాడి; (3) శశి...లు-శశి = చంద్రునియొక్కయు-రవి = సూర్యునియొక్కయు-గ్రహ = గ్రహణకాలములయందు నేను చేసెడి - జప = జపములు - స్నాన = స్నానములు = ఆదికములు = లోనగు కర్మలఫలములను, ఎల్లన్ = అంతయు, దొరల వాకిండ్లకే = ధనిక ద్వారములకే, దొడ్డయిచ్చి = కొల్లయిచ్చి (అనఁగా-ధనికులయిండ్లు తిరిగితిరిగి వారికి చంద్రసూర్య) గ్రహణములందు నేఁ గావించిన జపస్నానములు సుందరకాండాది పారాయణములు లోనగు కర్మలఫలమును ధనముకై ధారాదత్తము గావించి); (4) పచ్చిఇత్తోల్ = ఎండని జింకతోళ్లను, బత్తి చుచ్చు ఆలమెట్లు = గేదెలయు మేఁకలయు ఆవులయు తోళ్ల సాదరకులను, అందికొనన్ = దానము గ్రహించుటకు, ఊరు ఎల్లన్ = ఊరిలోనంతయు, తానె-గుత్తపట్టి = కృష్ణాజినాదిక దానములు ఊరిలో ఎవరుచేసినను వానిని తనకొక్కనికే ఇచ్చునట్లుగా అందఱను స్వాధీనపఱచుకొని;

దర్భపోటులన్ = శ్రాద్ధభోజనములను, తిని, లేని తఱులన్ = శ్రాద్ధనిమంత్రణ దొరకనిదినములందు, మైత్రిన్ = శ్రాద్ధకర్తలతో మైత్రి చేసికొని, అంటి = వారియిండ్లకేఁగి, పితృశేషము-పితృదేవతలకై వండి శ్రాద్ధభోక్తలకుఁ బెట్టఁగా మిగిలినయన్నమును, భుజించి = తిని, అదియున్ ఎడయన్ = ఆ పితృశేష మయినను దొరకనివాఁడు, అక్కవాడలన్ = అమ్మలక్కల వీధులయందు (అనఁగా వీధివీధి కేఁగి అమ్మా అక్కా అని స్త్రీలను మంచిమాటలాడి స్నేహముచేసికొని ఆ దాక్షిణ్యముచేత వారియింట) అరకూళ్లు = సగముకడుపునకు - అనఁగా కడుపునకు చాలనియన్నములను, మెక్కి = తిని, మీఁదన్ = ఇంతటితోపోక, వీని శేఖరము = వీనిశిరోమాల్యముగా (వీనికన్నిటికంటె అధమకృత్యమయిన) ఒక తులా ఆర్త్విజ్యము = తులాభారదానమును, కొని = గ్రహించి (పైకి అన్వయము.)— స్వభావోక్తి.

బహి-బహిస్ (=బహిష్కారము-వలములోనుండి వెలి), 'బహి వెట్టి నతని యన్నమును... అగ్రాజ్యమండ్రు' - భార. (శాం. ౧ ఆ.) శ. ర. ద్విజునకు - ద్విజశబ్దము బ్రహ్మక్షత్రియ వైశ్యులకు ముగ్గురకును వాచకమ యైనను బ్రాహ్మణపరముగానే సామాన్యముగా ప్రయోగింపఁబడును, కావున నే 'దన్తవిప్రాణ్డజాద్విజాః' అని యమరము. పాచితంబు - ప్ర. ప్రాయశ్చిత్తము-ఇది తాఁ జేసిన పాపము పోవుటకు చేయునట్టి కర్తవిశేషము; బంతి-ప్ర.-పఙ్క్తిః; 'వాకిండ్లకు' అనుటచే ఈజపాదుల ఫలము ఆ దొరలు ధనమిచ్చికొనునట్లుగా బోధించుటకు వారిని పలుమాఱు దర్శించుట సూచితము. 'పచ్చిఱితోలు' ఇందలి యిత్వసంధి 'సవతాలు'లోనగు వానియందుంబోలె సాధువు. ఆర్ద్రికృష్ణాజిన దానము సర్వవ్యాధి వినాశకము. "ఆర్ద్రికృష్ణాజినం దానం సర్వవ్యాధి వినాశనమ్ । ఆయుష్కరం ప్రియం మృత్యోః స్వర్గదం స్వర్గ మిచ్ఛతామ్." - శేషధర్మములు. 'మెట్లు' - పాదరక్షా దానము చేయు వాఁడు సర్వలోకములందును చరించును:—"ఉపానహౌ ప్రదాతా చ సర్వలోక చరో భవేత్," - శే. ధ. కొందఱు మెట్లనఁగా వరుస లని లాక్షణికముగా అర్థము చెప్పుదురు; అట్టి యెడ 'బఱ్ఱె చుచ్చాల మెట్లు' అనఁగా మహిషీ మేషీ ధేనువుల వరుసలు అర్థము. 'బఱ్ఱె నాఁగను దనరు మహిషి' - 'మేఁక చుచ్చును జంబు మీఱు చాగి' ఆం. భా. "దదాతి చ సువృత్తాయ మహిషం చ పయస్వినీమ్ । అపమృత్యుం జయ త్యేవ యమేన సహ మోదతే । దద్యా ప్రసూతికాం గాం చ మహిషం చ ద్విజోత్తమ । అపమృత్యుం దరిద్రాయ దత్త్వా తీర్త్వా దినం వ్రజేత్ ॥" మహిషీదానమువంటిదే మేషీదానము కాఁదగును. ధేనుదానమహిమ అనంతమని ప్రసిద్ధము. కావున గోదానమునే చెప్పిన ధేనుదనస్కృతి పాదరక్షాదానమును చెప్పుటలో విశేష మేమియుఁ గానఁబడదు. కావున 'బఱ్ఱెచుచ్చాలమెట్లు' అనిపాఠ ముండెనని యూహింపఁదగియున్నది. అయినను దానవిశేషములకు ఫలవిశేషములవలెనే గ్రహీతలకు దోషవిశేషములును ఉండును. దానికే మహిష్యాదిదానములును, పాదరక్షాదానములను అర్థమగును. బఱ్ఱె=బఱ్ఱెలను, చుచ్చు=మేఁకలను (సాహచర్యముచేత అఁడుమేఁకయే కాఁదగును), ఆలన్=గోవులను-అని ద్వంద్వసమాసము; తుదిబహువచనము "కాలు సేతులు" అనువానింబోలె కడమవానికిని అన్వయించును,

దర్భపోటు=(దర్భయొక్క పోటు) శ్రాద్ధము. శ్రాద్ధమున దర్భతో పొడుచుదురుగాన శ్రాద్ధమునకు ఈ పేరు చమత్కారముగా వ్యవహరింతురు; 'దర్భ'-ములోపము చరితాదిగణకార్యము. పితృశేషమును ఆపితలకు అత్యంతసన్నిహితులుగాక ఇతరులు భుజింపరు. ఇందు చెప్పిన ప్రతిగ్రహము లన్నియు క్రమముగా అత్యంతపాపకృత్యములు; దాత తులలో తాను సరి తూఁగినంత బంగారము గాని అట్టిది మఱియేదిగాని దానము సేయుట తులాదానము.

ఉ. ఇట్టొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి, చన న్మఱి పుచ్చి, చౌకము
లొట్టుచు, వడ్డిలెక్క లటు వెట్టుచు, ధారణవాసికై కొదల్
వెట్టుచు, వాఁడు రేఁగి మఱి 'పెట్టుదుఁ బెట్టు' మనంగ, మిట్టఁ గూ
ర్చెట్టుచు, నిట్టు పోరఁ, గని పెట్టుచు, నొక్కరుఁ డుండి వెండియున్. 6

ఇట్టు=పూర్వపద్యములో చెప్పినట్లు నానా దుష్ప్రతిగ్రహాదులచేత, ఒనఁగూర్చి = (ధనమును) కూడఁబెట్టి, (అధనమును), వైశ్యునకున్ = ఒక కోమటికి, ఇచ్చి=వడ్డికిచ్చి, మఱి=పిమ్మట. చనన్ = నా యూరికి పోవుటకు, పుచ్చి=మరల కైకొని, చౌకముల్ = నాలుగేసిగా, పెట్టుమన్ = లెక్కనిమిత్తమై ఉంచుచు, వడ్డిలెక్కలు, అటు = అట్లే, పెట్టుచు, ధారణవాసికై = వియ్యాను

లోనగు ద్రవ్యములను రొక్కముగా మార్చుటలో, కొదలు పెట్టుచున్ = తక్కువ ధరలు వేసితి వని ఆ కోమటితో ఘర్షణపడుచు, మఱి = అంతట, వాఁడు = ఆ కోమటి, రేఁగి = కోపించి, పెట్టుదున్ = సరియేలే నీ లెక్క చొప్పున నే ఇచ్చెదను. పెట్టను = ఇయ్యను, అనంగన్ = ఇట్లు మాట నిలుకడ లేక పలుకఁగా. మిట్టన్ = రచ్చచావిడికడ, కూపెట్టుచున్ = మొఱయిడుచు, ఇట్టు = ఈవిధాన, పోరన్ = జగడించుచుండఁగా, ఒక్కరుఁడు = ఒకానొకఁడు, కనుపెట్టుచు = పరికించుచు, ఉండి, వెండియున్ = ఇంకను.

తా.—ఆ ప్రకారము నానా దుష్ప్రతిగ్రహములచే నార్జించినధనమును ఒక కోమటికడ వడ్డికై చితిని; తర్వాత నాయూరి కేఁగ నుద్యుక్తుఁడనై, అతనికడనుంచిన యాధనమును మరల పుచ్చుకొంటిని; పుచ్చుకొనుటలో పుంజీలు పుంజీలుగా వరహాలను విభజించి పెట్టుచు, వడ్డి లెక్క చూచుకొనుచు, ద్రవ్యరూపముగా నే నతనికిచ్చినదానికి అతఁ డేర్పఱిచిన రొక్కపుధర తక్కువ యని జగడమాడుచు, నాచేయు నల్లరికి అతఁడు కోపగించి, నీవు చెప్పుచొప్పున ఇయ్య నని, ఇచ్చెద నని, నిలుకడ లేకుండ పలుకఁగా, అతనిమీఁద రచ్చచావడిలో మొఱయిడుచును, ఇట్లు నేను పోరాడుచుండఁగా, ఒకఁడు కనుపెట్టుచుండెను.—స్వభావోక్తి.

సీ. వెలివాడఁ బనిక్రొత్త మలకడాల్ గొని నూనె
యిడి తంగెడాకు గట్టుడుతహతహ,
కూర్చంబు గొరిగించుకొని యుష్ణతోయంపు
టంగడిఁ దలగడు గాడు తడవు,
వంట పూఁటింటి కెప్పంటికంటెను బాలు
పెరుఁగు నే గూర లంపెడు తెగువలు,
సంబెళ విడలించి తాంబూలపళ్ళ పూఁగ
నివహంబుఁ జాలఁగ నించు నుబ్బు,
తే. బ్రహ్మచారిభుజంబు మాత్రకు సహింపఁ
బ్రాలు, నాలికి మేలుచీరలు గొనియెడు
సంభ్రమంబును, బెఱపాంథజనులఁ బయన
మడుగు ప్రశ్నలుఁ, గని మత్ప్రియాణ మెఱిఁగి. 7

(1) వెలివాడన్ = మాలవాడయందు (అక్కడనే మాదిగలును ఉందురుగావున), పని క్రొత్త మలకడాల్ = క్రొత్తగా కుట్టిన చెప్పులు, కొని = విలిచి, నూనె ఇడి = (కాలు కఱవకుండ మెత్తఁ బఱుచుటకై) వానికి నూనెపట్టించి, తంగెడాకు కట్టెడు తహతహ = (తోలు మెత్తనగుటకై) ఆ చెప్పులకు తంగేడాకు కట్టెడి వేగిరపాటు; (2) కూర్చంబు = శ్మశ్రువులను (కనుబొమలు నడిమిసందు-లేక-మాసిన మీసగడ్డమును) గొరిగించుకొని = క్షౌరము చేయించుకొని, ఉష్ణతోయంపుటంగడిన్ = పైక మిచ్చిన వేఁడినీళ్లతో అభ్యంగస్నానము చేయించెడి యంగడియందు, తల గడుగు = అభ్యంగస్నానము, ఆడుతడవు = కావించెడి విలంబము (= హాయిగా విలంబముగా దరువులమీఁద దరువులతో తలయంటించుకొనుట); (3) వంటపూఁట యింటికి = పూఁటకూళ్లమ్మ యింటికి, ఎప్పంటికంటెన్ =

ఎప్పుడును పంపుచున్న పరిమితికంటె ఎక్కువగా, పాలు, పెరుఁగు, నే= నేయి, కూరలు=కూరగాయలును, అంపెడు తెగువలు = పంపెడి యుత్సాహములు; (4) సంబెళ = అడపమును, విదలించి= దులిపి, (అందులో), తాం...బుల్ - తాంబూలదళ = తములపాకులయు - పూగ=వక్కలయు - నివహంబుల్ = మొత్తమును, చాలంగల్ =చాలినంత, నించు ఉబ్బుల్ =నిండించెడి సంతోషంబును, బ్రహ్మచారి భుజంపు మాత్రకుల్ =నా శిష్యుఁడైన బ్రహ్మచారి బుజానమోచెడి యసిమిసంచిలోనికి, సడింపుఁబ్రాలుల్ =ఎసటిపోఁతలుగా దంచినబియ్యమును, ఆలికిల్ =నా భార్యకు, మేలి చీరలు = శ్రేష్ఠమైనకోకలును, కొనియెడు సంభ్రమంబును = విలిచెడి యాదరంబును, వెఱపాంథజనులల్ = లాఁతి పథికులను, పయనము=ప్రయాణముంగూర్చి, అడుగు ప్రశ్నములును,... తెలుపల్ = ఎఱిఁగింపఁగా, (ముందఱి కన్వయము.)

తా.—మాదిగవాడలో క్రొత్త చెప్పులు కొని, వానికి నూనె పట్టించి తంగేడాకులు కట్టిన వేగిరపాటును, పెరిఁగినమీసగడ్డములు గొరిగించుకొని, వలకు నేన్నీళ్లతోడ యభ్యంగస్నానము చేయించెడి యంగడిలో, తలంటుకొని స్నానము చేసిననింపానియు, వంటపూఁటింటికి ఎప్పుడును పంపెడునంతకంటె ఎక్కువగా పాలు పెరుఁగు నేయి కూరగాయలను పంపినయుత్సాహమును, అడపము దులిపివైచి దానినిండ తములపాకులయు వక్కలయు మొత్తమును విస్తారముగా నిండించిన సంతోషంబును, నాశిష్యుఁడైన బ్రహ్మచారిబుజముమీఁద అసిమిసంచికి ఎసటిపోఁతలుగా దంచిన బియ్యమును కొనెడుత్వరను, నాభార్యకై మేలికోకలు కొనెడుసమ్మోదమును, ఇతరపథికులను 'మీ పయన మెప్పుడు? మీరు ఎచటికింబోయెదరు?' అనునిత్యాదిప్రశ్న లడుగుటను, దీని నెల్లను, వాఁడు పరికించి, నాపయనము నెఱింగెను. అనుమాలంకారము.—

'మలకడాలు' దారినడచుట గావున రాయిరప్ప ముళ్లు పల్లేరుకాయలు గ్రుచ్చుకొనకుండుటకు, 'పాదరక్షాభిద పరఁగును జెప్పన। మలకడ మ్మనఁగ నమ్మాళి యనఁగ'. ఆం. భా. 'కూర్చంబు'- "కూర్చ స్త్వస్త్రియాం కుశే। శ్మశ్రుకైతవ పీశేషు భ్రువో ర్మధ్యె వికత్థనే" నా. నా. 'కూర్చమూ ఉపలక్షణము. 'తలయుం టవంగను దలగడు గనినను నభ్యంగనామమై యతిశయిల్లు' ఆం. భా. 'అంగడి' - వెలకు వేఁడినీళ్లతో స్నానముచేయించు నంగళ్లు పూర్వము ఆదేశములం దుండిన వని శ్రీనాథుని క్రీడాభి రామమందుఁ జెప్పఁబడినది. 'పాలు' పాయసాదికమునకు: కడమవి దండిగా భుజించుటకు; దండిగా మృష్టాన్నము భుజించుట ఇంటికిం బోవుసంతోషాతిశయము చేత; 'నే' రూ. 'నేయి'; సడింపు=బసచేసినతోడ నే వండుకొనుటకు.

క. హత్తుకొని యొక్కకొంపలఁ
నత్తెరువుం గట్టఁ బనిచి, యందఱక్రియఁ దాఁ
దిత్తి యొకటి గొని, త్రేణి, మ
ఱుత్తర ముత్తర మటంచు నొకప్రొద్దుకడల్. 8

హత్తుకొని=(వాఁడు నాతోడి బాటసారులలోఁ దాను నొకఁడుగా) కలసికొని, అత్తెరువుల్ = మేము పోవలసినదారిని, కట్టల్ =అరికట్టుటకు, ఒక్క కొందఱల్ = తనయిష్టు లగుకొంతమందిని, పనిచి=పంపి, అందఱ క్రియల్ =మాయందఱవలె, తాల్ =(ఆ దొంగ)తానును, తిత్తి ఒకటి=సంచి నొకదానిని, కొని= తెచ్చుకొని, త్రేణి=పరుండిలేచి, మఱి=అనంతరము, ఒక ప్రొద్దుకడల్ = ఒక

సమయవిశేషమున, ఉత్తరము ఉత్తరము=మనము ఉత్తరదిక్కుగా పోవలయును, అటంచున్=అని పలుకుచు, లేచి పోవంగన్ = కదలి నడవందొడంగుడు - అని తర్వాతిపద్యములోని పదములతో నన్వయము.

తా.—ఆ దొంగయు మాస్తోమములోఁ జేరి, తనవారిని కొందఱను మాదారి నడ్డగించుటకై ముందు పంపి, తాను నొకతెరువరిగా సంచి యొకటి తెచ్చుకొని వచ్చి, మాతోఁగూడ పరుండి, రాత్రి యొకానొకసమయాన లేచి. ఉత్తరము ఉత్తరము మనము ఉత్తరముగా పోవలయును అని పలుకుచు, నడవసాగెను.

'హత్తు' - ''పొందె హత్తెఁ గలసెఁ జెందెఁ దార్కొనెఁ గూడె । బెరసెఁ గ్రిక్కిఱిసెను బెనఁగె దొరసె। నందెఁ గదిసెఁ జేరె నన నంటె నని తోఁచు'' ఆం. భా. 'తిత్తి' - తనసామానులు అందుంచి తెచ్చుకొనుచున్నట్లు ఇతరులకుఁ దోఁచుటకును, పిమ్మటచోరితమును కొంత అందు పదిలపఱుచుకొనుటకును 'తేండి'-దొరికిన వ్రాఁతప్రతు లన్నింటను 'త్రేణి' అని యున్నది. 'త్రేణి' యని 'తెంపి' (=లేయునించి) అనుటకు ఈవ్రాఁతపుస్తకములలో తఱచుగఁ గలదు; 'తేఁడు' ధాతువు 'తెండు' ధాతువునకు రూపాంతరముగా శ. ర.లో నున్నది. కొన్ని దేశ్యశబ్దములందు తొలియక్కరమునందలి ర్రావడులు అంతరించుట ప్రసిద్ధమే. డకారముతోవున ణకారము నిలుచుటయు సిద్ధమే; ఉ. అణఁగు×అడఁగు, పోణిమి×పోఁడిమి, ఇత్యాదులు. కావున నిట కవి ప్రయోగించిన పదము 'త్రేణి' అనియుండు నని యూహింపఁబడినది. ఆ వ్రాఁత పుస్తకములో టీకయుం గలదు. అందు - 'త్రెణి మఱి=నిద్ర మేల్కాంచి' అని యర్థమును వ్రాయఁబడియున్నది. 'మఱి' శబ్దమునకు 'ఏమ్యాది' సంధి వచ్చును.

''పా. 'తిత్తొక్కటియు' - ఇత్వసంధి - 'తిత్తి'కి సంధి 'తిత్తొలిచి'' అని ప్రచురము - వలయు నేని 'తిత్తియొకటి గొని తెండి మఱుత్తర' - అను నిత్యాదివిధముల సులువుగా మార్పులు చేసికొనవచ్చును.

తే. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి
వారు సన నేను ముడెమోపు వటున కెత్తి
పోవ వాఁ డిందు రండని త్రోవ యడవిఁ
బెట్టి యొకవాఁగు డిగ నీల వెట్టుటయును. 9

లేచి పోవంగన్=వాఁ డట్లు లేచి తరలఁగానే, తోడివారు = నా తోడితెరువరులు, తత్తఱము=తొట్రుపాటు, ఏచి=పెరిఁగి, చనన్ = పోఁగా, నేనున్ = నేనుగూడ, ముడెమోపున్ = మూటబరువును, వటునకున్ ఎత్తి = బ్రహ్మచారియొక్క బుజము మొదలగు చోట్లకు ఎక్కించి, పోవన్ = నడవఁగా, వాఁడు=ఆ చోరుఁడు, ఇందున్ = ఈదారిని, రండు, అని, త్రోవన్ = దారిని, అడవిన్ = అడవిలోనికి, పెట్టి=నడపించి, ఒక - వాఁగున్ = సెలయేటిలోనికి, డిగన్ = మేము. చొరఁగానే, ఈల పెట్టుటయును = ఈలవేయఁగా.

తా.—ఇట్లు మేము నడుచుచుండఁగా, వాఁడు మాకు దారిచూపువాఁడై, ఇటు రండి ఇటు రండి, అని మమ్ము ఒకయడవిలోనికి నడపించెను. అట నొకసెలయే ఉండెను, మేము దానిని దాఁటుటకై అందులోనికి దిగితిమి. దిగఁగానే వాఁడు ఈల వైచెను.

ముడె, రూ - ముడియ. తత్తఱము - తడసిన ఎండయొక్కనని తత్తఱము. చనన్ నేనును - ఒంటి చిక్కుదు నని వెఱచి నేనును తరలితిని. వటునకున్ - 'ఉకారాంతమహత్తునకు వువర్ణకంబు బహుళంబు' కావున నిట రాలేదు. వాఁగు - తెరువరులను మర్దించి దోఁచుకొనుటకు ఇమ్మయిన చోటు; ముందుగఁ బోయిన దొంగలు అచ్చట దాఁగియున్నారు; వారిని బయటికి రమ్మనుసంజ్ఞగా ఈలపెట్టుట.-'ఊళయన జంబుకధ్వని యొప్పు, నీల యనఁగఁ దస్కరసంకేతనినద మొప్పు'ఆం.భా.

క. అఱచేత వ్రాలు గను న। త్తఱిఁ బడె నొకయంపకట్టె, దానికి నిలువం,
బిఱుబిఱ్ఱున ఱాలువడెం। దెఱపియుఁ గనలేమి సాతు దిరుగుడువడియెన్. 10

అఱచేతన్=కరతలమందు, వ్రాలు=గీఱలు, కనఁబడుతఱిన్=అగపడుపాటి వెలుతురు వచ్చిన సమయాన (తూర్పు తెల్లవాఱునప్పుడు), ఒక - అంపకట్టె=బాణము, పడెన్=ఆ తెరువరుల గుంపు మీఁదఁబడెను; దానికిన్ = ఆ యంపపాటునకు, నిలువన్ = పథికబృందము మఱిముందు నడువక ఆఁగగా, బిఱ్ఱుబిఱ్ఱునన్=బిఱ్ఱుబిఱ్ఱు అను మ్రోఁతతో, ఱాలు=శిలలు, పడెన్=వచ్చిపడినవి. సాతు= బిడారు, (తెరువరుల గుంపనుట) తెఱపియున్ గనలేమిన్=ముందుఁ బోవుటకు సందుకూడ కనఁబడనందున, తిరుగుడువడియెన్=త్రొక్కటపడసాగెను.

తా.—ముందుగా పథికసమూహముపై అంపకోల యొకటి పడెను. అంతటితో ఆ బిడారు మఱి ముందడుగు వెట్టక ఆఁగిపోయెను. వెంటనే బిఱ్ఱుబిఱ్ఱు మను మ్రోఁతతో రాలు వచ్చి పడసాగెను. అంతట ముందు పోవ సందు గనఁబడనందున సాతు ఉన్నచోటనే త్రొక్కట పడుచుండెను.—స్వభావోక్తి.

అంపకోల - మీసొత్తులను వెంటనే మాకప్పగింపరేని మిమ్ము సంహరించి కైకొనెదము, సాయుధులము సుమా, అను హెచ్చరిక; వెంటనే రాయివైచుట - తడయకుఁడు, సొత్తులు తత్క్షణ మొసంగుఁడు, అనునాజ్ఞ; 'బుఱ్ఱుబుఱ్ఱు మనుట'= పెద్దపెద్ద రాలనే వైచెదము, ఏల తల పగిలి చచ్చెదరు, అని బెదరింపు; తిరుగుడుపడునపుడు దొంగలకు మంచిసమయము; ఇట్టి యిక్కట్టులోఁ బెట్టినచో బల్లిదులు సయితము లోఁబడిపోవుదురు. సాతు. ప్ర. సార్థః.

(మహాస్రగ్ధర)

కపిసె న్గల్పాంతజంతుగ్రసన భృశ బుభుక్షా త్వర త్ర్యక్ష పార్శ్వ
ప్లవమానోత్పాత భూతప్రకర పటిమ హాలాహల స్పర్ధి హేతి
చ్ఛవి రేఖానేక రాహూచ్చలిత రవులు రక్షశ్చమూజిత్త్వళింద
ప్లవబృందంబుల్వని న్నల్గడఁ బొడుపొడు మన్పల్కులు స్సల్కులు వ్రాన్. 11

కల్పా...మున్ - కల్పాంత = ప్రళయకాలమందు - జంతు = ప్రాణులయొక్క - గ్రసన= భక్షణమందు - భృశ = పెల్లిదమైన - బుభుక్షా = ఆఁకటియొక్క - త్వర = వేగముగలవారైన - త్ర్యక్ష=ముక్కంటియొక్క - పార్శ్వ=ప్రక్కలయందు - ప్లవమాన=దుముకుచున్న - ఉత్పాత= ఉల్కాపాతాది వైకృతములతోడి - భూత=పిశాచుల - ప్రకర=సమూహముయొక్క - పటిమన్= దిట్టతనముతో, హాలా...లు - హాలాహల = కాలకూటముతో - స్పర్ధి = పోటిసేసెడు - హేతి = కత్తులయొక్క - ఛవి=కాంతులయొక్క - రేఖా=వరుస లనెడి - అనేక=పెక్కులయిన - రాహు = రాహుగ్రహములనుండి - ఉచ్చలిత = ఎగసిపోవుచున్న - రవులు = సూర్యులుగలవి, (అయిన),

రక్షః...ల్ - రక్షః=రక్కసులయొక్క - చమూ=సేనను - జిత్ = గెలుచునట్టి - పుళింద=బోయల యొక్కయు - బృందంబుల్=సమూహములు, వనిన్ =అడవిలో, బల్విడిన్=అతివేగమున, పొడు పొడుము = బల్లెము బాకు కత్తి కటారి ఇత్యాద్యాయుధములతో పొడువుము పొడువుము, అను - పల్కులున్ - వాక్యములును, ములుకులున్=బాణములును, రాన్ =వచ్చుచుండఁగా, కవిసెన్ = పొదువుకొనెను.

తా.—ఇట్లు వారు త్రొక్కటపడుచుండఁగా వారిని అడవిలో బలువేగమున దొంగల దండువచ్చి కమ్ముకొన్నది. ఆ దొంగలు ప్రళయకాలమందు ప్రాణికోట్లను భక్షించుటకై పేరాఁకటితో వేగిరించుచు ముక్కంటిపార్శ్వములందు ఉల్కాపాతాద్యుత్పాతసమేతులై గుములాడు చున్న భూతముల దిట్టతనము గలిగియుండిరి; వారిపోటుముట్లనీలకాంతులు కాలకూటపుఁగాంతు లకు పోటిగా నుండెను. ఆ నల్లకాంతులవరుసలం గాంచి రాహువు లని యడలి సూర్యుఁడు దద్ద రిల్లి పోవుచుండెను; మఱియాదండు రక్కసులదండును సరకుగొననిదై యుండెను.

'పటిమన్' - పదార్థవృత్తి నిదర్శనాలంకారము. 'హాలాహలస్పర్ధి హేతిచ్ఛవి' - ఉపమ; 'ఛవిరాహు' - రూపకము; 'ఉచ్చలిత' - అతిశయోక్తి.

కవిసెన్' - ఎటనుం బోనియ్యక చుట్టువెచికొనెను. భూతములబుభుక్షకు సాటియీదొంగల ధనతృష్ణ; క్షయకాలమందు తమభుజించు ప్రాణులను రక్తమాంసములకై హింసించుటయందు ఆ బూచులు ఎంతనిష్కరుణులో ఎంతబలిష్ఠులో, ఈ దొంగలును తమచారిం బడినబాటసారులను ధనాదికముకై హింసించుటయందు అంతనిష్కరుణులును, అంతబలిష్ఠులునుగాను ఉండి రని భావము. 'సంవర్తః ప్రళయః కల్పః క్షయఃకల్పాన్త ఇత్యపి' అమ. 'బుభుక్షా' భోక్తుమిచ్ఛా, 'అశనాయాబుభుక్షా క్షుత్' అమ. త్ర్యక్ష = త్రి+అక్ష. ఉత్పాత - ప్రకృతే రన్యత్వముత్పాతః. ప్రకృతికి వే ఱయినది ఉత్పాతము -కొఱవులు రాలుట, అపూర్వనక్షత్రము లగపడుట, అపూర్వ స్థావరజంగమము లుప్పతిల్లుట ఇవి యుత్పాతములు. ఉత్పాతభూత - అనఁగా ఉల్కాదులం గురి యుచు పఱతెంచుభూతములు; బాణములు ప్రయోగించుచు కత్తులతో నఱకుచు వచ్చి పైబడిన దస్యువులు ఆభూతములకు ఉపమేయములు, హాలాహలము నలుపు గావున కత్తులతళతళలును నలుపు గావున సాదృశ్యస్వారస్యము - పైగా కత్తులును హాలాహలమును రెండునుం జంపునవే. రాహు వును నలుపు, కావున కత్తినీలిమతో సాటి; రాహువును కత్తియు రెండును జంపునవే. రక్షస్సు లును నలుపు, బలిష్ఠులు, ఘాతుకులు; అట్టివారే దస్యుపుళిందప్లవులు. "కృష్ణాని కేశవః సీరిచీర చన్ద్రాబ్జకరావాపః । సర్ప రాక్షస శన్య శ్చ శివకణ్ఠఘనాశ్శిఖీ । విషామ్బర కుహూ శస్త్రాగురు పాప తమో నిశాః । మకరః కృష్ణసార శ్చ భిల్లాశ్ఛాయా చ గోమయమ్." రాన్ కవిసెన్ - ముందువారియామాటలు వినఁబడినవి, పిమ్మట వారగపడిరి, అనుట. 'చణ్డాలప్లవమాతఙ్గదివాకీర్తి జనఙ్గమాః.'-'భేదాః కిరాతశబరపుళిన్దామ్లేచ్ఛజాతయః' అమ. 'హాలాహలో హాలహలో హాల హాలో హాలాహలః' । 'పుంసి క్లీబే చ కాకోల కాలకూట హాలాహలాః.'

స్పర్ధి -జిత్ -ఉపమావాచకములు, నల్గడన్ -'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁ గాదు' బాల. సమా. 'ధ్వజినీవాహినీ సేనా పృతనాఽనీకినీ చమూః' అమ. పొడుము - రూ. పొడువుము - చూ. బాల. క్రియా. ౧౦౧. ములోపమున ఆమ్రేడితకార్యము, చూ. బాల. సంధి ౪౭.

'బేతాళకుల' - 'బల్వడి' - అనుపాఠములు పూర్వముద్రణములో 'భూతప్రకర' 'నల్గడ' అని యుండినవి. ఈమార్పులకు కారణము ఉపోద్ఘాతమునం గనునది.

వ. ఇట్లు చెట్లు వెడలి విండ్లు వంచుకొని మ్రుంచుకొను నన్నల్లప్రజం జూచి హల్లకల్లోలంబై విఱుగంబడు నెడ. 12

వంచుకొని=ఎక్కువెట్టుకొని, ముంచుకొను=మీఁదికి వచ్చుచున్న - అన్నల్లప్రజన్=ఆనల్లని జనులను (చోరులను), హల్లకల్లోలమై=ఆతలకుతలమై, విఱుగంబడునెడన్ = పలాయనమై పోవునపుడు; సాతులోనివారివిధమును వర్ణించుచున్నాఁడు.

సీ. పసలేదు నిలఁగోయి పాపులారా యని
దేవాయుధంబులు దూవువారు
పైఁడి బాసముఁ జెట్లఁ బడవైచి దుడ్డుపె
ట్లకుఁ బాఱుచునె యొలెల్ వైచువారు
బరువు డించి కటారి పరుఁజించి నిల్చి యిం
దెందు వచ్చెద రని యెదురువారు
వస్త్రంబు గొండు దేవర యోయి యిది చన్నఁ
బస్తని దయపుట్టఁ బలుకువారు
తే. కలవి మామూఁక నిప్పింతుఁ, వోలఁగుఁ, డొకటి,
యీఁడుదానిఁ జేనంటకుఁ డనుచుఁ బెద్ద
తనము నభిమానమును దెంపు గనఁగఁ బలికి
నిలిపి దోఁపిచ్చువారు నై తొలఁగి రపుడు. 13

(1) అపుడు=ఆసమయమునందు, (కొందఱు), పసలేదు = (దొంగగుంపులో) బలములేదు, పాపులార=ఓరిపాపాత్ములారా, నిలఁగోయి=నిలువుండోయి, అని=అట్లని తోడి తెరువరులను హెచ్చరించుచు (ఆ దొంగలమీఁదికి), దేవాయుధంబులు - దేవ=యజ్ఞమందు ఉపయోగింపఁ బడు-ఆయుధంబులు=పోటుముట్లను (అనఁగా కొయ్య గొణత - రాయి రప్ప-ఇట్టివానిని), దూవువారు=విసరవైచెడువారును; (2) పైఁడిబాసమున్=బంగారుగలజాలెను, చెట్లన్=వృక్షములజీబులో,పడవైచి=పడునట్లుగా విసరివైచి, దుడ్డుపెట్లకున్=గుద్దుఁగిఱ్ఱల మోఁదులువడి,పాఱుచునె=పరుగునం దప్పించుకొనిపోవుచున్న సమయముమందే,ఒలెల్=పైపంచెలను, వైచువారు=పాఱవైచువారు కొందఱును; [బాస మన జాలె యని.శ.ర. - పైఁడిబాసము = 'బంగారుమొదలుగాఁగల వస్తువులు' అని బ్రౌను నిఘంటువు.] (3) బరువు=తాము మోచుచున్న భారమును, డించి = దింపుకొని, కటారిన్=కత్తిని పరుఁజించి=సిద్ధము చేసికొని, నిల్చి=పాదావష్టంభనముతో నిలువంబడి, ఇందున్ ఎందున్ వచ్చెదరు=ఇక్కడికి ఎట్లువచ్చెదరో రండి తుండించివైచెదము అని, ఎదురువారు = పోరుటకు ఉంకించువారు కొందఱును; (4) ఓయి, వస్త్రంబుఁగొండు = దేవతార్చనసజ్జకు కట్టినయీవలువను గైకొనుఁడు, దేవర = ఇది మేము పూజించుకొనువిగ్రహము. దీనిని కొనకుఁడు, ఇది చన్నన్ ఇది పోయె నేని, పస్తు=మేము ఉపవాసము పడియుండవలయును, అని, దయ=కనికరము, పుట్టఁ బలుకువారు;

కలవి=మాయొద్దనున్నవస్తువులు, మాయూఁకన్ =మాగుంపులో, ఇప్పింతున్, తొలఁగుఁడు= అపసరిల్లుడు, ఒకటి = ఒకమాట వినుఁడు, ఆఁడుదానిని, చేన్ = చేతితో, అంటకుఁడు = తాఁకకుఁడు, అనుచున్, పెద్దతనము = ఆగుంపులో తమకుఁగలగౌరవము, అభిమానమును = స్త్రీలవిషయమున తమపరువును, తెంపు=ఆతెగువను, కనఁగన్ = ఆదొంగలు తెలిసికొనునట్లు, పలికి = వచించి, నిలిపి=ఆదొంగలను మీఁదపడకుండ ఆఁపి, దోఁపు ఇచ్చువారున్ =కొల్ల యొసంగువారు కొందఱును, ఐ, తొలఁగిరి=జరిగి పోయిరి.

తా.—కొందఱు తోడివారిని ఓరిపాపులారా ఏల భయపలాయితు లయ్యెదరు, ఈదొంగదండు అంత బల్లిదము గాదు, వీరిని కొట్టి తఱుమవచ్చును, అని హెచ్చరించి మరల్చి, దొంగల మీఁదికి రాలురప్పలు కొయ్యలు కొణతలును విసరసాగిరి; కొందఱు పిమ్మట మరల వచ్చి వెదకి కైకొనవచ్చునని తమయొద్దనున్న ముల్లె ముట్ర గుడ్డలో కట్టి, చెట్లజీబులో పాఱవైచి, దుడ్డుదెబ్బలు పడి పైపంచెలనుకూడ వెనుకకు వైచి పాఱిపోవుచుండిరి. కొందఱు బుజముమీఁద నెత్తిమీఁద నున్నబరువులను దిగువకు దించుకొని కత్తిదూసి కాలూఁది నిలిచి 'రండి, నఱకివైచెదము,' అని దొంగలపై తిరుగఁబడిరి; కొందఱు - 'ఓరీ ఇది మా దేవతార్చనమూట, దీనిం గట్టియున్న యీవస్త్రముం గైకొనుఁడు, దేవతావిగ్రహములసజ్జను తాఁకకుఁడు, ఇది పోయిన, మాకుమఱియుపవాసమే,' అని దొంగలకు కనికరము కలుగునట్లుగా చెప్పుకొనిరి. కొందఱు, 'అయ్యా, మాగుంపులో కలవన్నియు నేను మీ కిప్పించెదను, ఒకమాటమాత్రము వినుండు. ఆఁడువారిదేహములమీఁదినగలను మీచేతితో మీరు ఒలువకుఁడు; మీఁదికి రాకుఁడు,' అని తమయూఁకలో తమమాట చెల్లు ననియు తాము స్త్రీలవిషయమున మిక్కిలి పరువుగలవా రనియు, దొంగలకు తెలియునట్లుగా పలికి కొల్ల యిచ్చిరి. ఇట్లు కావించి వారందఱును సాగి పోయిరి.

'నిలర ఓయి' _ నిలుచున కడవ్రాయికి ముత్తున లోపంబు- బాల. క్రియా. ౧౦౧. 'ఓయి'_ ఏదాదుల లోనిది కావున ముజ్జునకు (వుజి) రుజి యగును. బాల. క్రియా. ౩౪. 'పాతకులారని' అనుపాఠంబున సంబోధనాంతంబునకు సంధి దుష్టము. దేవాయుధంబులు - మనుష్యులు చేసినట్టి కత్తి కటారి లోనగునవి కావు; మఱి, దేవుఁడు చేసిన రాలు కట్టెలు లోనగునవి. దేవాయుధము అనఁగా శాపములు అని కొందఱు చెప్పుదురు - దేవతలు గీర్వాణులు గదా. ఊపు, రూ. ఊవ్వు. ఒలె _ ఒల్లె - ద్విత్వలోపము _ 'ఒల్లె పంచె యనంగ నొప్పు నర్ధవస్త్రంబు, ఆం. భా. వస్తు _ 'పస్తిల్లి కుంకు నిప్పస్తు ని ట్రనఁగను నుపవాససంజ్ఞలై యొప్పుచుండు.' ఆం. భా. చేన్-చేశబ్దము, తృతీయార్థమున ద్వితీయ _ 'దోఁపుడు నాఁగను దోఁపు నాఁగ । దొంగఱిక మనంగ' ఆం. భా.

సీ. తోడువింటివాఁడు సన్త్రోవఁ బోవక యెదు
 ర్పడువాండ్రఁ దోడీఁబడఁ బదరి పొడిచి
పినుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యెఱ్ఱఁ
 బాఱించి చేఁ గలవాని నాఁచి
యాయితంబై చించి యరిగెడువాఁ డేటు
 నకు మీఱె చన్న వెన్ దవులు టుడిగి
పొదువు చే లేకయ పుటపుటయును నైన
 వాని శోధింప నవ్వలికిఁ బనిచి

తే. పొదలఁ దూఱిన నీఁటె చాఁపుల వెడల్చి
గట్టుబట్టలు గొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి గనపరాకులు నిగిడ్చి
చెప్పుటట్టలు శోధించి సిగలు విప్పి. 14

ఈ పద్యములో ననంతరవచనములోని 'పాటచ్చరులు'=(దొంగలు) అనునది కర్తృపదము. (1) తొడువింటివాఁడు=విల్లెక్కువెట్టి బాణముసంధించుకొని నడుచుచున్న తెరువరి, చను త్రోవన్ = పోవుచున్న దారిని, పోక=చనక (ఈచననివారు దొంగలు), ఎదురుపడు వాండ్రన్=ఎదిరిన బాటసారులను, తొడిఁబడన్ = తొట్రుపడునట్లుగా, పదరి = త్వరపడి, పొడిచి = పోట్లుగావించి; (2) పినుఁగు=లోభి, ఈక=తనధనమును ఇయ్యక, పెనఁగినన్=పెనఁగులాడఁగా, (వానిని), పెద్ద=ఎక్కువగా నొంపక=హింసింపక, నెత్తుఱుఁబొఱలించి=కత్తులతో గాయపఱచి రక్తము కాఱించి, చేన్=వానిచేతియందు (అనఁగా ఎక్కువ దాఁపఱికము గాకుండ), కలపాటి = ఎంతధనము దొరకిన అంతయే, నాఁచి=కైకొని. (పా. దోఁచి); (3) ఆయితంబై=దొంగలకు స్వాధీనుఁడుగా నుండియు, చించి=పట్టువదలించుకొని (పట్టుకొన్న చోరుని చేతిలో కొంత నిలిచిపోవునట్లు తనగుడ్డను చింపుకొని), అరిగెడువాఁడు=పాఱిపోవు తెరువరి, ఏటునకున్=ప్రహారమునకు, మీఱి=అందక, చన్నన్=పోయెనేని, వెనుదవులుట=వెంటఁదఱుముట, ఉడిగి=మాని; (4) పొదువు=ధనము, చేన్=తనయొద్ద, లేకయ=ధనమేమియు నగపడకయే, పుటపుటయునన్ ఐనవానిన్=బలిసియున్నవానిని, శోధింపన్=గుడ్డ గుడుసు విప్పి సోదా చూచుటకు, అవ్వలికిన్=గుంపునకు ఎడగా, పనిచి=పంపి, పొదలఁదూఱినన్=పొదలలో దాఁగినచో, ఈఁటెచాఁపులన్=ఆ దాఁగినచోటులకు ఈఁటెలను నిగిడించుటచేత, వెడల్చి=పొదలనుండి వెలువడి వచ్చునట్లు కావించి, కట్టుబట్టలు=వారు ధరించిన వలువలను, కొని=హరించి, దయన్=కనికరముచేత, గోఁచులకున్=గోఁచిపెట్టుకొమ్మని, ప్రాఁతబట్ట = జీర్ణవస్త్రమును, ఇచ్చి; గనపరాకులు = గన్నెరాకులవంటి బాణములను, నిగిడ్చి = లోనికిఁదూర్చి, చెప్పుటట్టలు=పాదరక్షల యట్టతోళ్లను, శోధించి=సందుచేసి పరీక్షించి, సిగలు=జుట్లను, విప్పి (అవలి కన్వయము).

తా.—ఆతెరువరులలో విల్లెక్కువెట్టుకొని కోలతోఁ గూలనేయుటకు సన్నద్ధుఁడై నడచి తనదారినిపోవుచున్న తెరువరిజోలికి ఆదొంగలు పోరైరి; మఱి తమ్మునెదిరించినవారిని తత్తఱపడునట్లుగా, వడివడిగాఁ బొడిచిరి. తమసొత్తును ఎంతసేపటికిని ఇయ్యక పెనఁగులాడులోభిని మిక్కిలి హింసింపక వాని నెత్తురు వానికంటి కగపడుచు పాఱునట్లు గాయములుచేసి, వానియొద్ద ఆపాటికే దొరకినదానిని కైకొనిరి; తమచేత చిక్కియుండియు, ఉన్నట్టుండి దూసికొని పాఱిపోయిన వాఁడు ఏటున కందనంత దూరమున పోయెనా, వానిని తప్పించికొని పోనిచ్చిరిగాని వెంటఁదఱుమరైరి. చేత సొత్తేమియు లేనివాఁడై బలిసియున్న వానిని గుంపునుండి అవలికి పంపిరి. అక్కడ కొందఱు దొంగ లుండి వానిని సోదా చూచిరి. పొదలలోఁ దూఱి దాఁగినవారిని ఈఁటెపోటులతో వెడలించి వారివస్త్రములను దోఁచుకొని, ప్రాఁతగుడ్డలు గోచులకై యిచ్చిరి. గన్నెరాకుల వలె పలుచనియుక్కురేకు లగునట్టి యలుఁగులు గలబాణములను తెరువరుల చెప్పుల యట్టలలోనికి చొప్పించి సందుచేసి, అట నేమయిన దాఁచికొనియున్నారో యని పరీక్షించిరి. జుట్లు విప్పియు సోదాచూచిరి.—స్వభావోక్తి.

తోడు=తోడుగు - 'తోడు' అనునదియు నొక క్రియ. చన్ త్రోవ-'హరిశ్చంద్రుఁడన్వాఁడ,' అను ప్రయోగంబునందుంబోలె, ఇట 'చను' ధాతువునకు 'ఉ' లోపము - చూ. ప్రౌ. వ్యా. సంధి. ౧3. తోడువింటివాఁడు చోరుని ప్రాణమును హరించినను హరించును. పినుఁగు - రూ. పిలుఁగు; ఎఱ్ఱఁ బాఱించుట భయముగొల్పుటకు. ఆయితము - ప్ర. ఆయత్తః - చేఁ - సప్తమ్యర్థద్వితీయ. క (గ) నపరాకులు - చూ. ఉపోద్ఘాతమున పట్టిక. 'ఇనుపరాగోలల నిఱికించి యంతట' భోజరాజీయము 5 (321); ఇచ్చట 'ఇచ్చి యినుపరాగోల నిఱికి' అని యున్నను సరిపడును. ఇఱికి = ఇఱికించి 'ఉఱికి కొక్కెర కంఠంబు నిఱికి చంపె' - పంచ. నా. ౧. ఆ. ౪. ౮. 'గనపరాకోల లిఱికి' అని పఠించుట శ్రేయము. గనప = పెద్ద - రాకోలలు = రాతియాలుఁగుబాణములు.

వ. ఇట్లు పాటచ్చరులు పెచ్చుపెరిగి విచ్చలవిడి నుచ్చావచంబులగు సార్థంబు నర్థంబు లపహరించు సంకులంబున. 15

పాటచ్చరులు = దొంగలు, ఉచ్చావచంబులు = నానాభేదములు గలవి, సార్థంబు = బిడారు (యొక్క) - 'చోరజీర్ణపటయోః పాటచ్చరః,' ఇతి నామానుశాసనమ్ - అని రామాశ్రమి. 'ఉచ్చావచం నైకభేదమ్' - 'సార్థో వణిక్సమూహే స్యాదపి సంఘాతమాత్రకే,' - అమ.

సీ. కటినుండి చనుమొఱ గడి గాఁగ బిగియించి
కట్టిన నిడు నీలికాసె మెఱయఁ
బిల్లిగడ్డము మించఁ బెరిఁగి మీసలు కుక్షి
గోళంబుమీఁద నుయ్యాల లూఁగ
బూఁది బ్రుంగిన మొగంబున గౌదకట్టు మై
నపుమైల ప్రాఁజొత్తు నాఁజెలంగఁ
జిటివ్రేలి పూసపై ఘటియిల్లు వెడఁబట్టు
చిమ్ముల సురియ డా లుమ్మరముగ
తే. నూరనుండియుఁ గను పెట్టియున్నవాఁడు
దప్పిపో నన్ను డబ్బాటు దాఁ బొడగని
యట్టివేళఁ గాకశ్మశ్రు వనెడు నొకప్ర
చండ చండాల చోరభటుండు పఱెమి. 16

(1) కటినుండి = పిఱ్ఱఁదికడనుండి, చనుమొఱ = చనునలుపులు, గడిగాఁగఁ = హద్దుగా, బిగియించి=బిగుతుగాలాగి, క... సె - కట్టిన=బంధించిన - నిడు=దీర్ఘమైన - నీలి=నల్లని - కాసె= దట్టి, అమరఁ =ఒప్పుచుండఁగా; (2) పిల్లిగడ్డముఁ =పిల్లిగడ్డమువంటి తనగడ్డమును, మించఁ = అతిక్రమించునట్లు, పెరఁగి; మీసము=మీసములు; కుక్షిగోళముమీఁదఁ =గుండ్రని కడుపుమీఁద, ఉయ్యాల లూఁగఁ =ఉయ్యాలవలె ముందు వెనుకలకు ఊఁగుచుండఁగా; (3) బూదిఁ =తాఁ బూసికొన్న బూడిదయందు, బ్రుంగిన మొగంబునఁ =మఱుఁగుపడిన ముఖమందు, గౌదకట్టు= చెంపలను మూసికట్టినగుడ్డ, మైనపు మైల ప్రాఁజొత్తునాఁ = మైనపుమడ్డిం బూసినముఱికి ప్రాఁతబొల్లాయి యనునట్లుగా, చెలంగఁ = ఒప్పఁగా; (4) చిటి...పైఁ - చిటివ్రేలి = కనిష్ఠికాంగుళి యొక్క - పూసపైఁ =గనుపుమీఁద, ఘటి...య - ఘటియిల్లు=కూడునట్లుగా, వెడఁ =సడ

లుగా, పట్టు=పట్టుకొనియున్న, చిమ్ముల=చిమ్ముటలుగలదైన - సురియ=చురకత్తియొక్క - డాల్ - తళతళలు; ముమ్మరముగన్=పెల్లిదమగుచుండఁగా, (5) ఊరనుండియున్ = నేను తరలిన గ్రామము నుండియు, కనుపెట్టి యున్నవాఁడు=నన్ను దృష్టిలో నుంచుకొనియున్నవాఁడు, కాకశ్మశ్రువు - కాకిమీసాలవాఁడు; అనె...డు - అనెడు=అను పేరుగలవాఁడైన - ఒక - ప్రచండ=అతిభయంకరుఁడైన - చండాలచోర భటుండు=మాలదొంగబంటు, అట్టివేళన్=ఆసమయాన, నన్నున్, తప్పిపోన్=నేను తప్పించుకొనిపోవుచుండఁగా, డబ్బాటు=అకస్మికముగా; తాన్ - పొడఁగని=చూచి, తఱిమి = తఱుముకొనివచ్చి.

తా.—ఇట్లు పాతు విఱిగి పరారి యగుచుండఁగా, నేనును తప్పించుకొని పోవుచుంటిని. ఆసమయాన ఆకస్మికముగా నన్ను - మేము ఏ గ్రామమునుండి వచ్చితిమో యా గ్రామమునుండియే దృష్టిలో నుంచుకొని వెంబడించి వచ్చినయాదొంగయే కనిపట్టి తఱుముకొనివచ్చినాఁడు. వాఁడు మాలదొంగ, శూరుఁడు; వానిపేరు కాకశ్మశ్రుఁడు; వాఁడు నిడుపైన నీలికాసెను పిఱుఁదు మొదలు చనుమొలలవఱకు దేహమునకు బిగుతుగా చుట్టుకొని యుండెను. గడ్డము పిల్లిగడ్డమువలె నుండెను. మీసాలు దానిని దాఁటి గుండ్రనికడుపుమీఁద ఉయ్యాల యూఁగుచుండెను. మొగము బూడిదలో మఱుఁగుపడి యుండెను. మైనపుముద్ద పూసినట్లోపి యనునట్లుగా, చెంపలు మూఁతపడునట్లుగా తలకు రుమాలు కట్టుకొనియుండెను. చిటికెనవ్రేలిగనుపుమీఁదకి వచ్చునట్లుగా వదులు వదులుగా ఒకసురెకత్తి చేతఁదాల్చి, దానిని తళతళలు పెల్లుగా డాలుకొట్టునట్లు చిమ్ముచుండెను.— స్వభావోక్తి, తృతీయపాదమున ఉత్ప్రేక్షయు; పిల్లిగడ్డము ఉపమ.

నిడు - కడుపుచుట్టురా ఎన్నిమాఱులో తిరిగివచ్చుటకు చాలినంత నిడుపనుట. ఆమీసాలు ఒక్కొక్క ప్రక్క నొక్క కాకపక్షమువలె నుండుటంబట్టి 'కాకిమీసాలవాఁడు' అని పేరువచ్చినది. ఉయ్యాలలూఁగ - మిక్కిలి నిడుపు లగుటచేత అడుగున ముడివైవని యుయ్యాలవలె నుండినవనుట. బూడిద బ్రుంగిన - సజ్జనుఁడుగాఁ గనఁబడుటకు విభూతిఁ దాల్చినాఁడు. ప్రాఁగొఱు-ప్రాఁతదనుట మాలిన్యముకొఱకు - 'ప్రబలు వస్త్రమునకటము నుల్లొ నలాయి। యనఁగ దక్షేదము దపాఁగ మనఁగఁ దెక్కి। యనఁగఁ గొ తనఁ దోపి దానలరు నభవ.' ఆం. భా. 'చెంపలను మూసికట్టుట చెలఁగు గాద। కట్టసంగను.' ఆం. భా. 'పరఁగు నాకస్మికంబు డబ్బాటనంగ' ఆం. భా. చిమ్ములు చిమ్ముచు డాలొలయించుట ఆబ్రాహ్మణుని భయపెట్టుటకు. 'సురె సురియ చూరి యనంగ ఛురిక దనరు' ఆం. భా.

చ. కపవటుఁ డించి యేఁగుసుకఁగా. సురెఁ గొంకులఁ దార్చి, కూలుడు,
న్విడిచిన బొజ్జపై మిగులు నిద్దపు దోవతి దట్టి డొల్లిరాఁ,
దివిచి, పెనంగ, వల్లువముఁ ద్రెంచి, యనంతుని గంట్ల కానపుం
జెవులుగ గౌదకట్టు గసెచేరుల కెక్కియు దోఁపు నొల్చి పోన్. 17

కపవటున్ = నాతోడి బ్రహ్మచారిని, డించి = విడిచి, ఏన్, గుసుకగాఁన్ = చిన్నిపరుగున (తప్పించుకొని) పోఁగా, (కాకశ్మశ్రుఁడు), సురెన్ = సురియను, కొంకులన్ = మడమల మీఁది వెనుక భాగములకు, తార్చి=కూర్చి (అనఁగా సురియతో మడమలమీఁది కొంకులను నఱికి), కూలుడున్ = నేనొరగిపడిపోఁగానే, నివిడిన బొజ్జపైన్ = పైకుబికియున్న బొజ్జమీఁద, మిగు...ట్టి - మిగులు=పైకి వచ్చియున్న - నిద్దపు=నున్నని - దోవతి=కట్టువలువమీఁది - దట్టి=కాసెకట్టు, డొల్లి

రాన్=ఊడివచ్చునట్లు, తివిచి=లాగినవాఁడై, పెనంగన్=నేను లాగనీయక పెనఁగులాడఁగా, వల్లువము = వరాలసంచిని, త్రెంచి = తెంపుకొని, అనంతుని గంట్లవన్ = నాగుఁబడగయంటు పోఁగులు ధరించెడు కర్ణరంధ్రములకు, ఊనపుం జెవులు గన్=చెవులు కొఱవడునట్లుగా (అంటు పోఁగు లిడునట్లు కడవఱకు తెగిపోయిన వనుట), గౌదకట్టు = గౌదలు (=చెంపలు) మూఁతవడు నట్లుగా తలకు టోపివలె కట్టుకొన్న తుండుగుడ్డకట్టును, కసెచేరుల కెక్కియున్=గుఱ్ఱపుఁగొరడా చేరులవంటిచేరులను గడ్డముక్రిందికి తార్చి ముడిచినవల్లాయిని, దోఁపున్ = కొల్లగా, ఒలిచి = (నాతలనుండి) ఊడలాగికొని, పోన్ = (వాఁడు) పోఁగా.

తా.—అంతట నేను నాశిష్యుఁడైన బ్రహ్మచారిని వానిగతి వానిది అని విడిచిపెట్టి, నాపొట్ట చేతను వరాలసంచిచేతను వడిగా పరువిడలేక ఒకపాటిపరుగుగా పాఱిపోవుచుంటిని. అంతట కాకశ్మశ్రుఁడు వచ్చి నామడమలపై కొంకులను సురియతో నఱికెను. నేను క్రిందఁ బడిపోయితిని; అంతట వాఁడు నాపొట్టమీఁద దోవతిని లాగి అందలివరాలసంచిని తివిచెను, నేను పెనఁగులాడితిని; నామొలత్రాటికి సంచిని గట్టియున్న త్రాళ్లు మొలత్రాటనే నిలిచిపోవునట్లుగా వాఁడు సంచినిత్రెంపి కైకొనెను; పైగా, నాకట్టుకొన్న గౌదకట్టులో ఏముండెనో యని దానిం బీఁకుకొనెను. నేను నాటోపిని తలకుఁ దొడిగికొని దానిదారములను గడ్డముక్రింద ముడివైచికొని యుంటిని; ఆటోపిలో ఏమి దాఁచుకొనియున్నానో యని వాఁడు ఆటోపిని పరికించుటకై లాగుకొనెను, ఈ టోపిని గౌదగట్టును లాగుకొనుటలో పోఁగుల రంధ్రములవఱకు నాచెవుల రెంటిని త్రెంచివైచినాఁడు. ఇట్లు కావించి వాఁడు పోవుచుండెను.—స్వభావోక్తి.

'వటున్' - వటువు=వటుఁడు. 'గునుక' - 'గునుకు డనంగను గును కనఁగా నల్ప। ధావన సంజ్ఞ యై తనరుచుండు,' ఆం. భా. 'దోవతి యం చనఁ దోఁచుఁ గటీపటము.' ఆం. భా. దోవతి- ప్ర. ధౌతమ్. 'నివిడిన'=నిగిడిన - తెనుఁగున గావా కొన్నిట వచ్చును. 'వినుము నరేంద్ర, విప్రుఁ డలివెన్' భార. ఇట్లే తివిచి=తిగిచి-'కసె'- ఈశబ్దము బ్రౌను శ. ర. లలో లేదు; 'కసము' (చేరుకోల) అని కశాశబ్ద వైకృతముగ వైకృతదీపికలో నున్నది. కసెము=కస్సెము - ప్ర. కచ్ఛః (అనూపము); కసము+కోల=కసకోల - దినవెచ్చము, చప్పర మంచము, లోనగువానియందుంబోలె ము లోపము. 'వల్లువము' - 'వల్వంబు పోనాడు వైశ్యునితేవను' హంస; పా. వల్లముడి.

క. నోరిసని నుండ, కే 'నో। గోరి, యకట! మా సమీప పూరనె మనియుం,
దూరము వోయితివే! సొ। మ్మేరీతిని నీకు దక్కునే కానీరా.' 18

నోరిసనిన్=నానోటిలోనిశని చేత, ఏను=నేను, ఉండక=ఊరకయుండలేక, ఓగోరి, అకట, మాకున్, దాఁపుటూరనె=సమీపగ్రామమందే, మనియున్=నివసించియు, దూరముపోయితి వే= మిక్కిలియుం గీడును మాకే యొనర్చితివి. సొమ్ము = ఈదోఁచుకొన్నధనము, నీకున్, ఏరీతిన్=ఏ విధాన నైనను, దక్కునే=దక్కునా (దక్క దనుట), కానీ రా=కానిమ్ము (ని న్నేమి చేయించె దనో చూడు.)

తా.—వాఁడు మాపొరుగూరివాఁడే అని గుర్తించితిని. అంతట నానోట శనియుండి నాచేత ఈమాట లాడించినది; 'ఓరీ, నీవు మాపొరుగూరివాఁడవే అయ్యును, ఇంతఘాతకుఁడవై నాకే ఇంతఘాత చేసితి వేమి రా! అయ్యో! ఏవిధాన నైనను ఈధనము నీకు దక్కునా! చూడు. నిన్ను ఏమి చేయించెదనో' అని.

'సని' - ప్ర. - శనిః - శనిగ్రహము, చెఱుపు చేయును గాన చెఱుపుం గలిగించిన యీ (చెప్పఁబోవు) మాటను శని చెప్పించినాఁ డనుట. ఇట శనికి 'సని' అనుట మనుచరిత్రలో 'శ్రీరాము' అనుటకు 'సీరాము (సేన)' అనుటవంటిది. 'ఓగోరి' ఆమ్రేడితము గాన సంధి యైనది. 'ఓరి' - ఇది నీచ సంబుధిలో వచ్చును. చోరుఁడు నీచుఁడు గాన తత్సంబుద్ధిలో వచ్చినది.

తే. అనిన లాఁతుగఁ గోల్పోక యతఁడు రడ్డి
రాజుఁ గను నని కొదయుఁ దీర్పంగ మగిడి
యంత పరియును పై ప్రజ కలికి పాఱి
పోవ వాఁడును వెడపోట్లు వొడిచి చనియె. 19

అనినన్ = నే నట్లు పలుకఁగా, (ఆదొంగ తనమనస్సులో తలపోయుట), అతఁడు = ఆ బాపఁడు (అనఁగా నేనే), లాఁతుగన్ = అధికముగా (అధికధనము ననుట), కోల్పోకన్ = కోల్పోయినందున, రడ్డిన్ = రెడ్డిని (పటేలును), రాజున్=రాజును, కనున్=చూచును, (పోయి రాజుతోను రెడ్డితోను చెప్పుకొందును), అని=ఆలోచించుకొన్నవాఁడై, కొదయున్=శేషమును గూడ (అనఁగా నా ప్రాణమును సయితము), తీర్పంగన్=పుచ్చుకొనుటకై, మగిడి=వెనుకమరలి వచ్చినవాఁడై, అంతన్=అంతలో, పరియును=వానితోడి దొంగదండుకూడను, పై ప్రజకున్= పైనుండి వచ్చిన బాటసారసమూహమునకు, అలికి=భయపడి, పాఱిపోవన్=పలాయితము కాఁగా, వాఁడును=ఆదొంగయు, వెడపోట్లు=తప్పటపోట్లు, పొడిచి, చనియెన్=పోయెను.

తా.—అట్లు నేను పలుకఁగా, ఆదొంగ యిట్లు తలపోసెను;-"ఓహో, ఈ బాపఁడు విస్తారము ధనము - పోఁగొట్టుకొన్నాఁడు. కావున రాజుతోను రెడ్డితోను చెప్పుకొని నన్ను పట్టింపక మానఁడు. కనుక ఈతనిం దెగటార్చుట మంచిపని.'—ఇట్లని ఆలోచించుకొని మరల నన్నుం దెగటార్ప వచ్చుచుండఁగా, పైనుండి బాటసారులబిడారు వచ్చినది; దానిం గని వెఱచి, వీనితోడిదొంగపిండు పాఱి పోయినది; అంతట వీఁడును నన్ను ఆదరబాదర చేతికి వచ్చినట్లు పోట్లు పొడిచి పాఱిపోయెను.

పద్యాదిని 'ఇట్టు లన, లాఁతుఁ గోల్పోక నితఁడు రాజు, రడ్డి' అని పఠించుట మేలు.

లాఁతుగన్ - లాఁతుశబ్దము శ. ర. లోనున్నది, ఇప్పద్యమున బ్ర. సీ. పతితము. ఇది బ్రౌఢ్యములో లేదు. 'పౌఁజు చేరువ మొత్తంబు బారు తుటుము । దండు పరిగమి కూటువ దిండుదాఁటు : మూఁక దళమును బెల్లు సమూహమునకు.' ఆం. సం.

రడ్డి-ప్ర. రాష్ట్రమ్. 'ఎడ్డెతనపుఁ గైసేఁతల । రడ్డులు నడచిరి పురస్సరద్భార్యముగా.' పాండు.

ఉ. అంతటఁ బొంతఁ బెద్దెరువునం దరుదెంచు పిఱిందిమంది మ
త్కాంత సహోదరుండును నొకం డరుదెంచుచు సాతు పడ్డ వృ
త్తాంత మెఱింగి న న్నరసి తాఁ గని యార్తి నొకండు దా నతి
శ్రాంతుని నన్నుఁ గావటి దిసంతులు గొట్టుచు మోచు చేఁగుచోన్. 20

అంతటన్=ఆ సమయమున, పొంతన్=సమీపమున, పెద్దెరువునందున్=పెద్దబాటయందు, అరుదెంచు పిఱిందిమందిన్=వచ్చుచున్న వెనుకటి (జన) సంఘములో, మత్కాంత సహోదరుండును=నా ప్రేయసియొక్క తోఁబుట్టుకూఁడ, అరుదెంచుచున్, సాతు=బిడారు, పడ్డవృత్తాంతము= దోఁపుడుపోయిన వార్తను, ఎఱింగి=విని, నన్నున్, అరసి=వెదకి, తాన్, కని, ఆర్తిన్ = వెతతో,

ఒకండు=ఒకఁడె, నన్ను, తాన్, అతి శ్రాంతునిన్=మిక్కిలి బడలినవానిని, కావటన్=కావటి బుట్టయందు, దిసంతులు కొట్టుచున్ = చీవాట్లు పెట్టుచు, మోచుచున్, ఏఁగుచోన్ = పోవు నప్పుడు (అవ్వలి కన్వయము.)

తా.— నే నాస్థితిలోఁ బడియుండఁగా, వెనుకనుండి ఆ సమీపపుఁ బెద్దబాటలో వచ్చిన బిడారులో నా యిల్లాలితోడఁబుట్టినవాఁ డొకఁ డుండెను. అతఁడు అక్కడ నాతు దెబ్బలు తిన్న వార్త విన్నవాఁడై నన్ను వెదకి కనిపట్టి ఒకకావటిబుట్టలో నన్నుం బెట్టుకొని నాచేఁతకు నిందించుచు నన్ను మోచికొని పోయెను.

'పొంతన్'-'దండ చేరువ చెంగట యండ సరస। ప్రాపు చక్కి కుఱంగట పజ్జ చెంత। కెలన దాఁ పంజ దగ్గఱ క్రేవ పొంత। యంచె యొద్ద నా నికటాఖ్య లగు మహేశ.' - ఆం. భా.
'ఆర్తి' స్నేహముచేత కలుగును 'దిసంతులు కొట్టుచున్'-స్యాలకపరిహాసముగా కూడ.—

"ఆఱడి యవసడి యగడొంపు మాఱు మా। రు దిసంతు నడి కోయి కోఁత రొచ్చు
సేగింపు సెగ్గము సెగ్గవగింపు నా। నపవాదసంజ్ఞ యై యలరుచుండు."-ఆం. భా.

'చెలి నేఁచి తని దిసంతులు గొట్టె మేనక'-మను. 3 (109),

సీ. కొంగవాల్నఱకు లంగుళులఁ బట్టుచు జబ్బ
లంటఁ గుట్టిడ వెజ్జు నరయువారు,
తలఁ బడ్డగుదియ వ్రప్పలఁ బ్రాఁత మసి యిడి
యంబలి గంజిండ్ల నడుగువారు,
తమసేఁగిఁ జెప్ప లోఁ దయమీఱ విని చీరఁ
జించి యియ్యంగ దీవించువారు,
నొలఁబడ్డ నెపమునఁ గలలేని సిరిఁ జెప్పి
చుట్టలపై దాడి వెట్టువారు,
తే. నైన పాంథులచేతఁ గ్రొంనైన యూళ్ల
జాడగా నిటఁ దెచ్చి యిన్నీడ డించి
పాఱు నీ రానఁ బోన నూర్పాఱె మగిడి
వచ్చునాలోన నీరూపు వచ్చె నాకు. 21

(కొందఱు పాంథులు), (1) కొంగవాల్ నఱకులు = కొంగవా లనుపేరి మాదిగకత్తిచే నయిన గాయములను, అంగుళులన్=వ్రేళ్లతో, పట్టుచున్=గాయపునోరు మూఁతఁ బడునట్లుగా పట్టినవారై, జబ్బలు=బుజములు (లేక తుంట్లు), అంటన్ = గాయము మూసికొనిపోవునట్లుగా, కుట్టు ఇడన్ = దారముతో కుట్టిపెట్టుటకై, వెజ్జున్ = వైద్యుని, అరయువారు = వెదకుచుండిరి, (2) (కొందఱు), తలన్=శిరమున, పడ్డగుదియవ్రప్పలన్=పడినట్టిగుదియ (వ్రేటులచే నయిన) చీలికలయందు, ప్రాఁతమసి=గుడ్డప్రేలిక కాల్చినమసిని, ఇడి=పెట్టి, ఇండ్లన్=(గృహస్థుల) గృహములయందు, అంబలి=అంబటిని, గంజి=గంజిని, అడుగువారు = యాచించుచుండిరి; (3) (మఱి కొందఱు పాంథులు), తమసేగిన్=తమపడిన యిడుమను, చెప్పన్=వర్ణింపఁగా, లోన్= మనస్సులో, దయ మీఱన్ = కనికరము అతిశయింపఁగా, విని, చీరన్ = వస్త్రమును, చించి;

ఇయ్యంగన్ = ఇచ్చినందులకు, దీవించువారన్ = ఆశీర్వదించుచుండిరి. (4) (కొందఱుపాంథులు) ఒలఁబడ్డ నెపమునన్ = దోఁపుడుపోయినమిషచేత, కల లేనిసిరిన్ = ఉండిన సంపదను లేని సంపదను, చెప్పి, చుట్టలపైన్ = బంధువుల యిండ్లమీఁదికి, దాడిపెట్టువారు = దండెత్తి పోవుచుండిరి. ఐన పాంథులచేతన్ = ఇట్లున్న తెరువరులచేత, (క్రంగు = తఱచు, ఐన - ఊళ్ల జాడగాన్ = గ్రామాల మీఁదుగా, ఇటన్ = ఇచ్చోటికి (ఈ చెట్టుక్రిందికి), తెచ్చి = నన్నుం గొనివచ్చి, ఇన్నిడన్ = దీని యీ ఛాయయందు. డించి = దింపి, పాఱునీరు = ప్రవాహోదకము (ప్రవహించుచున్న వాఁకజలమును), ఆనన్ = త్రాగుటకై, పోవఁ = అనాస్యాలకుఁడుపోఁగా, ఊర్పు = నాశ్వాసము, ఆఱి = నశించి, (నాప్రాణము పోయి), అతఁడు, మగిడివచ్చు నాలోనన్, ఈ రూపు = ఈ రాక్షసజన్మము, నాకున్, వచ్చెన్.

తా.—అట్లు బందిపోటు వడినయా తెరువరులలో కొందఱు మాలకత్తివ్రేటులకు బుజములు (లేక తుంట్లు) చీలినవారు ఆ గాయములను మూసికొని పోవునట్లుగా వ్రేళ్లతో పట్టుకొని అంటఁగుట్టించుకొనుటకై వైద్యుని వెదకికొనసాగిరి. కొందఱు గుదియవ్రేటులచే తల చీలిపోఁగా ఆచీలుడుగాయములకు గుడ్డ కాల్చినమసి ద్రుక్కి, అంబలియు గంజియు గృహస్థులయిండ్లలో అడిగికొని త్రాగి ప్రాణములను గాపాడుకొనిరి; కొందఱు తమపడ్డపాట్లు చెప్పుకోఁగా విన్నవారు ఎవరైన కనికరించి గుడ్డలేనివారికి తమగుడ్డను కొంత చింపియిచ్చినంతట వారిని దీవించి దానిని ధరించిరి. కొందఱు కుత్సితులు దోఁపుడుపోవుట ఒకమిషగా చేసికొని, తమకడ మెండుగా ధనముండిన దనియు, దానిని దొంగలు కైకొనిరనియు, అసత్యము లాడి బంధువులయిండ్లమీఁద పోయి పడి హాయిగా ఇదే సందని భుజించుచుండిరి. ఈప్రకారము ఈ తెరువరులు మెండుకొన్న యూళ్లమీఁదుగా అనాస్యాలకుఁడు నన్ను మోచికొని పోయి మార్గవశాన ఈ చెట్టుక్రింద నీడలో పెట్టి, పాఱుచున్నయేటినీరు తాను త్రాగుటకై పోయెను. అతఁడు పోఁగానే నాప్రాణంబును పోయెను. మరలి యాతఁడు వచ్చునంతటికి నాకు ఈ బ్రహ్మరాక్షసరూపము వచ్చియుండినది.—స్వభావోక్తి.

కొంగవాలు - చూ. పట్టిక. (మాతంగుఁడు=మాదిగ, సురియాళి=మాల.) 'మాతంగుఁ డగు వానిచేత నుండెడికత్తి కొంగవా లనఁగఁ జెలంగుచుండు' ఆం. భా. ఇట్టి సామాన్యవ్యవహారముల యందు మాలమాదిగలభేదమును పాటించుట లేదు. కావుననె 'సురియాళి చేతికత్తికి నరు లందఱు పేరు పెట్టినారు ధరిత్రిన్ । మరి కొంగవా లనంగను । సిరుములపై నుండుదేవ దేవ ముకుందా' అని దేశ్యనామార్థకోశము; వెజ్జు - ప్ర. వైద్యః. 'వ్రప్పు' వ్రచ్చునకు కృదంతము. మెచ్చునకు మెప్పువోలె. మసి - ప్ర. మషీ. ఒలఁబడ్డ=ఒలుకఁబడ్డ - కడవ్రాయిలోపమునకు ఒలుచును పిలుచ్వాదులలో చేర్చుకొనవలయును. బాల. క్రియా. ౧౦౧. నెపము=నెవము - ప్ర. నిభః - 'కల లేని సిరి' - కలదియు లేనిదియు నైన సిరి అని విగ్రహము - చుట్టలు - రూ. చుట్టాలు, చుట్టములు; ఇట్లే - మీగలు, రూ. మీసాలు, మీసములు. దాడి - ప్ర. ధాటీ. 'దాడి' యనుటలో వీరరాక ఆమట్టులకు కడు నప్రియంబును ఘాతుకమును అని స్వారస్యము.

వ. కయ్యంబునఁ బొఱఁబొఱ గాయంబు నేసి వెఱవేఁకిఁ గొలిపిన కాకశత్రు నామధేయచండాలు కరాళవేషంబు గన్నులం గట్టినట్లుండఁ గడఁ గనుట నిట్టి కరాళవేషంబు గలిగెఁ; గైశికీగాన ఫలదానంబున దీని మాసుపవే? అనిన నతం డేను

ఫలంబెఱుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబ, యాజ్ఞాకైంకర్యంబులకు ననుమతి
కైంకర్యంబులకు ఫలపరిమాణగణన ప్రపన్నుల కెక్కడియది? కాన బంధకంబగుట
ఫలం బింతంత యందుఁ గొంతఁ గొమ్మన వెఱతు, భగవంతుండ రక్షించు నూఱడిలు
మన్న నన్నోరిమాట నోరన యుండ నతండు. 22

కయ్యంబునన్ = ఆ దొంగలతోడి పోరాటములో, పాఱఁబాఱన్ = నేను పారిపోయిన కొలంది, గాయంబు చేసి=నాయొడల నఱకులుగావించి, వెఱవేఁకిన్=భయజ్వరమును, కొలిపిన=కలిగించిన, కాకశ్మశ్రు నామధేయ చండాలు కరాళ వేషంబు=కాకి మీసాలవాఁ డనుమాలవాని భయంకర స్వరూపము, కన్నులం గట్టినట్లుండన్=నేను మిక్కిలి స్ఫుటముగా భావించుచుండిన సమయాన, కడన్=మృతిని, కనుటన్=పొందితినిగావున, (నాకు), ఇట్టి కరాళ వేషంబు=ఘోర స్వరూపము, కలిగెన్=వచ్చినది. కైశికీగానఫలదానంబునన్=మంగళకైశికరాగంబున శ్రీహరి స్తుతులు పాడిన పాటయొక్క ఫలముయొక్క యీవిచేత (ఆ ఫలము నాకిచ్చి యనుట), దీనిన్= ఈరాక్షసజన్మమును, మానుపవే=పొలియింపుము; అనినన్=అని బ్రహ్మరాక్షసుఁడు వచింపఁగా, అతండు=ఆ దాసరి, (ఇట్లనియె), ఏను, ఫలం బెఱుంగన్, ప...బ - పరమేశ=ఆ పరమేశ్వరుని - ముఖ=వదనమునందలి - ఉల్లాసంబ=వికాసమే (శ్రీహరివదనము భక్తునిఁగూర్చి వికాసమొందుటయే), ఆ ఫలంబు=ఆ భక్తుఁడు చేసికొన్న సేవకు ప్రయోజనము, ఆజ్ఞాకైంకర్యంబులకున్=ఆజ్ఞారూపముగా వేదచోదితములైన సేవలకును, అనుమతి కైంకర్యములకును=ఆజ్ఞప్తములుగాక అంగీకృతములగు సేవలకును, ఫల పరిమాణ గణన ఫలము = ఫలముయొక్క కొలఁదియొక్క లెక్క, ప్రపన్నులకున్ ఎక్కడియది = భక్తులు చేయవలసినది కాదు. కానన్ = కావున, బంధకంబు = ఆఫలము బంధకారణము (వారల జన్మమును కలిగించునట్టిది) - దేహపరంపరలో జీవుని కట్టివైచెడిది; అగుటన్=అయిన హేతువుచేత, ఫలంబు ఇంత అంత=ఆ ఫలము ఈపాటి ఆపాటి, అందున్= అందులో, కొంత=ఒక భాగమును. కొమ్ము=గ్రహింపుము, అనన్=అనుటకు, వెఱతున్=సంకోచించుచున్నాను, (అనఁగా కర్మఫల మెప్పుడును బంధకారణముగావున దానిని నీ కొసంగుటకు నాకే ఇచ్ఛ పొడమకున్నది), భగవంతుండ=ఆ నారాయణుఁడే, రక్షించున్=నిన్నుఁ గడతేర్చును, ఊఱడిలుము=సమాశ్వాసమొందుము, (విష్ణుభక్తాగ్రేసరుఁడైనయతఁడు 'భగవంతుండ రక్షించును' అని యనుగ్రహపూర్వకముగా వచించినంతట), ఆ నోరిమాట=అతని నోటిలోని యామాట, నోరన=అతనినోటనే, ఉండన్=ఉండఁగా, (అతఁ డట్లు వచించినతత్క్షణమే అతనిభక్తి తీవ్రతచేత), [తదాశీస్సు అంత యవిలంబితముగా ఫలించిన దనుట.]

మరణసమయంబున ఏరూపమును భావించిన, మృతునికి వెంబడిజన్మమున ఆరూపమే కలుగునని శాస్త్రము:—'యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్। తం త మే వైతి కౌన్తేయ, సదా తద్భావభావితః'. భ. గీత 18 (6); కయ్యంబు - ప్ర. - కలహః - 'కరాళో దన్తురే తుఙ్గే భీషణే చాభిధేయవత్' మేదిని.

సీ. స్నిగ్ధ త్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ,
హిమధవళోపవీతములతోడఁ,
బుణ్యమృద్ద్వితయోర్ధ్వ పుండ్ర వల్లులతోడఁ,
దులసికాబ్జస్రగావళులతోడఁ,

కౌపీన కటిసూత్ర కాషాయయుగితోడ,
జలపూర్ణ శుభకమండలువుతోడఁ,
బాణిస్థ దివ్యప్రబంధసంపుటితోడ,
నుత్తరవా క్పూర్వ కోక్తితోడఁ,
తే. బసిఁడిజిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁ డై నిల్చె సోమశర్మ. 23

సోమశర్మ వైష్ణవుఁ డై నిలిచెను; తద్వర్ణన. (1) స్ని...డఁగ—స్నిగ్ధ = నున్నఁగా - త్రిభాగ = (నాలిగింట) మూఁడుపాళ్లు - ముండిత = గొఱుగఁబడిన - శిరః = తలయందలి - శిఖతోడఁగ = జుట్టుతో (జుట్టుకలవాఁడై), హి...డఁగ - హిమ = మంచువలె - ధవళ = తెల్లనైన - ఉపవీతముల తోడఁగ = జన్నిదములతోను; (2) పుణ్య...డఁగ - పుణ్య = పావనమయిన - షట్ ద్వితయ = ఆఱు రెండ్లయిన (పండ్రెండగు) - ఊర్ధ్వపుండ్రమ్ములతోడఁగ = తీఁగలవంటి నిలువునామములతోను, తుల...డఁగ - తులసికా = తులసిపూసలయొక్కయు, - అబ్జ = తామరపూసలయొక్కయు - స్రక్ = మాలికలయొక్క - ఆవళులతోడఁగ = సమూహముతోను; (3) కౌపీ...డఁగ - కౌపీన = గోఁచియు - కటిసూత్ర = మొలత్రాడు - కాషాయ = కావిశాటులయొక్క - యుగితోడఁగ = జంట - అనుపరికరములతోను, జల...డఁగ - జల = తీర్థముతో - పూర్ణ = నిండిన - శుభ = మంగళమైన - కమండలువు తోడఁగ = కుండికతోను; (4) పాణి...డఁగ - పాణి = చేతియందు - స్థ = ఉన్నట్టి - దివ్యప్రబంధ = ద్రావిడవేదముయొక్క - సంపుటితోడఁగ = పుస్తకముతోను, ఉ...డఁగ - ఉత్తరవాక్ = ద్వయముయొక్క యుత్తరభాగము - పూర్వక = మున్నుగాఁగలదైన - ఉక్తితోడఁగ = సంభాషణతోను (ద్వయముయొక్క యుత్తరవాక్యమును అనుసంధానముసేయుచు ననుట;) పసిఁడిజిగితోడఁగ = బంగారుడాలుతోను, బ్రహ్మవర్చసము = బ్రాహ్మణతేజము - పొల్చు = ప్రకాశించుచున్న [పా. ప్రోచు = బ్రహ్మవర్చసమును పోషించుచున్న] - భాగవతలక్ష్మితోడఁగ = వైష్ణవశోభతోను, ధూమపటలినుండి = పొగయొక్క మొత్తమునుండి, వెడలు శిఖపోలెఁగ = వెలువడునట్టి జ్వాలవలె, అమ్మేను = ఆరాక్షసు దేహమునుండి, వెడలి = వెలువడి, చూడఁజూడఁగ = కన్నులయెదుటనే, సోమశర్మ = సోమశర్మయను పేరి యాబ్రాహ్మణుఁడు, వైష్ణవుఁడు ఐ = విష్ణుభక్తుఁడుగా మాఱి, నిల్చెఁగ = నెలకొనెను.

తా.—సోమశర్మ వైష్ణవుఁడుగా మాఱెను; శిరమున మూఁడుపాళ్లు క్షౌర మై, ఒకపాలు జుట్టుండెను; జందెములు మంచువలె తెల్లఁగా వెలుఁగుచుండినవి; దేహమున పాఁపనములైన పండ్రెండు నిలువుబొట్లు ఒప్పుచుండెను; తులసిపూసల పేరులు తామరపూసల పేరులు హెచ్చుగా నుండెను; గోఁచి, మొలత్రాడు కావిశాటులు నుండెను; మంగళ మయినజలకుండిక తీర్థోదకముతో నిండియుండెను; ఆతఁడు ద్వయముయొక్క యుత్తరవాక్యమును అనుసంధానము చేయుచుండెను; దేహము సువర్ణచ్ఛాయతో ప్రకాశించెను; బ్రహ్మవర్చసమునకు వైష్ణవతేజము వన్నె హెచ్చించెను. అట్లు ఆరాక్షసదేహమునుండి ఆతఁడు పొగమొత్తమునుండి యగ్నిజ్వాలయుంబోలె వెలువడి ఎదుట నిలిచెను.—స్వభావోక్తి. 'ధూమ... వెడలి' - ఉపమ.

'ముణ్డితం పరివాపితమ్,' 'ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే' అమ. - 'పుణ్డ్రో దే శేక్షు తిలక భేదే క్రిమ్యతిముక్తయోః' నా. నా. ద్వాదశోర్ధ్వపుండ్రములు.—

"లలాటే కేశవం విన్ద్యాత్, నారాయణ మథోదరే। మాధవం హృది విన్యస్య, గోవిన్దం కణ్ఠకూపకే। ఉదరే దక్షిణే పార్శ్వే విష్ణుం, విన్ద్యా ద్ద్విజ స్తథా। తత్పార్శ్వే బాహుమధ్యే తు స్మరే త్తు మధుసూదనమ్। త్రివిక్రమం కణ్ఠదేశే, వామే కుక్షౌ తు వామనమ్। శ్రీధరం బాహుకే వామే, హృషీకేశం తు కణ్ఠకే। పృష్ఠే తు పద్మనాభం చ, కకు ద్దామోదరం స్మరేత్ ద్వాదశైతాని నామాని వాసుదేవేతి మూర్ధని। పూజాకాలే చ హోమే చ, సాయంప్రాత స్సమాహితః।
నామాన్యుచ్చార్య విధినా ధారయే దూర్ధ్వపుణ్డ్రకమ్."

'స్యాత్ కౌపీన మకార్యే చ గుహ్యాచీర ప్రభేదయోః' 'యుగి.'—'యుగో రథే హలాద్యఙ్గే న ద్వయో స్తు కృతాదిషు। యుగ్మే హస్తచతుష్కేఽపి వృద్ధినా మౌషధేఽపి చ.' మేదిని. 'యుగి' శబ్దము—ము. 'హృదయేశ ప్రమదంబుతోఁ గుచయుగీహారాళి నీలత్వసంపదతో' నిరంకుశోపాఖ్యానము 1 (86).

'వ్యాలోలత్కఙ్కణాళీ ముఖరకరతలా స్ఫాలనారమ్భహేలా।
ధారాళానల్ప జృమ్భన్మనసిజనిగమోత్తంసగాథా సహస్రమ్।
ఉత్ప్లుత్యోత్ప్లుత్య నృత్యత్కుచకలశయుగీమణ్డలం ధార్యమాణం।
చోళస్త్రైణం ప్రవీణం చులుకయతి యతివ్రాత చేతాంసి చైతత్.' పంచబా.

'ఆజహాత్తాలసౌన్దర్యం సురాగ శ్రీయుతం మనః। గీతం హరతి పద్మాక్షీ దేవ స్తనయుగీ చ నః.' శ్రీనివాసచంపువు 11-3 (13). 'కుచయుగీవ ఘనఘటాకార మఞ్జులా కున్తలాళీ కున్తలాళీక సారఙ్గత్రపాదాయినీ కుచయుగళి (యుగీ?) 1-5 (20-21).

'యుగళితో' అనుపాఠమున ప్రక్రమభంగదోషము; 'యుగ' శబ్దమునకు జీప్రసక్తి లేదు. కావున 'కాషాయములతోడ' అని పఠింపఁదగును. లేక [illegible] యుగ్మము గమ్యమే యగును. కషాయము(=కావివన్నె) అద్దినది కాషాయము.—కషాయేణ రక్తమ్ కాషాయమ్, - 'అస్త్రీ కమణ్డలుః కుణ్డీ' అమ. - బ్రహ్మయొక్క (అనఁగా బ్రాహ్మణునియొక్క) వర్చస్సు = బ్రహ్మవర్చసము - 'వేద స్తత్త్వం తపో బ్రహ్మ బ్రహ్మా విప్రః ప్రజాపతిః' అమ. విష్ణువునందు భక్తుఁడు వైష్ణవుఁడు.

పసిఁడిజిగి:—'బ్రాహ్మణాః క్షత్రియా శ్చైవ గౌరాః కార్యా స్తథైవ చ। వైశ్యాః శూద్రా స్తథా శ్యామాః కార్యా శ్చైవ హి సర్వతః.' భరత. 21 (91) 'ధూమపటలి' - రాక్షసదేహము పెద్దదైనందున 'పటలి'; నలుపయినందున ధూమోపమ.—'నారాయణో నర శ్చైవ సోమనాగ శ్చ వాసుకిః। దైత్యా శ్చ దానవా శ్చైవ రాక్షసా గుహ్యకా నగాః। పిశాచా జల మాకాశ మసితా వర్ణతః స్మృతాః.' భరత 21 (77)

వ. ఇట్లు భాగవతపరిచయప్రభావంబున బ్రాహ్మణ్యంబెకాక భాగవత
శ్రీయునుం గలిగి యుప్పు చింది యినుమడియగుచందంబునం బరమహర్షభరితుండై
స్వరూపాను రూపంబుగా నతనికిఁ బూజఁ గావించి. 24

చింది=రాలి-మట్టిలోఁ ఉప్పు రాలిన ఆ మట్టియు నుప్పగుట ప్రసిద్ధము-ఉపమాలంకారము.
అతనికిఁ=ఆ దాసరికి.

సీ. జయ దురుత్తరణ సంసరణాబ్జదళనీర,
జయజయ గాయక సార్వభౌమ,
జయ శౌరి గాథా రసజ్ఞ పుణ్యరసజ్ఞ,
జయజయ తత్త్వసంచయ పవిత్ర,
జయ జనార్వాచీన జని సంగ వంచక,
జయజయ దేశిక చరణ శరణ,
జయ యుక్తవాక్ప్రతిష్ఠా తృణీకృత దేహ,
జయజయ భగవదాజ్ఞాకృతిస్థ,
తే. జయ సకలజంతు సమచిత్త జయ దయార్ద్ర,
జయ ముకుందాన్య దేవతా శాస్త్రబధిర,
జయచతుర్ద్వయభక్తి లక్షణచితాంగ
జయ మురారిప్రపన్నాంఘ్రి జలజమధుప. 25

అను...ర_అనుత్తరణ=తరించుటలేని, (పా. గురుత్తరణ=తరింపశక్యముగాని) - సంసరణ=జననమరణప్రవాహ మనెడి - అబ్జదళ = తామరాకునందలి _ నీర = జలమైనవాఁడా, జయ=సర్వోత్కృష్టుఁడవుగా నుండుము. గాయకసార్వభౌమ = గాయనశ్రేష్ఠుఁడా, (2) శౌరి...జ్ఞ - శౌరి = హరియొక్క - గాథా=పాటలయొక్క - రస=మధురిమను - జ్ఞ=ఎఱిఁగిన-పుణ్య=పవిత్రమయిన - రసజ్ఞ=నాలుకగలవాఁడా; త...త్ర - తత్త్వ=పరమాత్మనుగూర్చిన - సంశయ=సందేహములకు - పవిత్ర=కొడవలియైనవాఁడా; (3) జనా...క - జన = నరులలో - అర్వాచీన=నీచమైన - జని=పుట్టువుతోడి - సంగ=కూడిక చేత - వంచక=మోసముచేయువాఁడా; దేశిక=తత్త్వము నుపదేశించు గురువరుని - చరణ = పాదములే - శరణ = రక్షకముగాఁగలవాఁడా; (4) ఉక్త...హ - ఉక్త=వాక్రువ్వఁబడిన - వాక్=ప్రతిజ్ఞయొక్క - ప్రతిష్ఠా=నిర్వాహముచేత - తృణీకృత =గడ్డిపరకగా నెన్నఁబడిన - దేహ=ఒడలు కలవాఁడా; భగ...స - భగవత్=నారాయణునియొక్క - ఆజ్ఞా = ఆనతియొక్క - కృతి=చేఁతయందు - స్థ= నెలకొన్నవాఁడా, సకలజంతు సమచిత్త=ఎల్లప్రాణుల యందును సమబుద్ధికలవాఁడా; దయా ఆర్ద్ర = దయారసముచేత తడిసినవాఁడా, ముకు...ర - ముకుంద = నారాయణునికంటె - అన్య = ఇతరుఁడైన - దేవః = ఈశ్వరుఁడు - అస్తి = కలఁడని చెప్పెడి - శాస్త్ర=ఉపదేశగ్రంథములకు-బధిర=చెవిటివాఁడా; చ...గ - చతుర్ద్వయ=అష్టవిధము లైన - భక్తి=ప్రపత్తియొక్క - లక్షణ = చిహ్నములచేత - చిత = నిండిన - అంగ = దేహముకల వాఁడా; మురా...ప - మురారి = శ్రీహరియందు - ప్రపన్న = భక్తులయినవారియొక్క - అంఘ్రికమల = అడుగుఁదామరలయందు - మధుప = తుమ్మెదవైనవాఁడా.

తా. _ఓమహానుభావుఁడా, నీవు సర్వోత్కృష్టుఁడవుగా నెగడుము. దాఁటశక్యము కానట్టి యీజననమరణరూపసంసారమందు నీవు తామరాకులో నీరుంబోలె అంటినట్లు కనఁబడియు అంటకున్నావు, (సంసారమును జయించినవాఁ డనుట). హరిమహిమను గానముసేయువారిలో నెల్ల నీవు ఉత్తముఁడవు. నీనాలుక హరిగీతమాధుర్యము నెఱింగి దానిచే పవిత్రమై యున్నది. తీఁగలు కొడవటికి తెగిపోయినట్లు తత్త్వసంశయములు, నీవలనం దెగిపోవును; నీ మహిమను నీచ జన్మముచే కాననీక లోకులను వంచించుచున్నావు. నీవు గురుచరణములే శరణ మని దృఢముగా

నేమ్ముకొనియున్నావు - (అనఁగా గురూపదేశమును విశ్వాసాతిశయముతో సమగ్రముగా అనుష్ఠించి తత్త్వమును అనుభవమునకు తెచ్చుకొన్నాఁడవు.) నీవు నీప్రతిజ్ఞను నెఱవేర్చువాఁడవై నీదేహమును తృణప్రాయముగా పాఱవైవ వచ్చినాఁడవు. భగవదాజ్ఞను నెఱవేర్చుటయే నీవ్రతము; ఎల్ల జంతువులందును సమదృష్టిగలవాఁడవు; దయార్ద్రహృదయుఁడవు; నారాయణునికంటె వేఱె దేవత కలఁడని యుపదేశించుశాస్త్రములను నీవు చెవిని చొరనీయవు. అష్టవిధభక్తి లక్షణములతో నొప్పచున్నాఁడవు; హరిభక్తులపాదకమలములను కొల్చువాఁడవు.

గాయక=గాయన=గాథక=పాడెడువాఁడు; సర్వభూమికిని ఈశ్వరుఁడు=సార్వభౌముఁడు. శౌరి=శ్రీకృష్ణుఁడు - శూరుఁడనుయాదవునిగోత్రాపత్యము, కావున, శౌరి=నారాయణుఁడు. ముకుందుఁడు=మోక్షమిచ్చువాఁడు. 'అనుత్తరణం...నీర', 'తత్త్వ...త్ర', 'మురారి...ప' - రూపకములు.

'భక్తి అష్టవిధము; ఎట్లన - 1. భాగవతవాత్సల్యము, 2. భగవత్పూజయం దనుమోదనము. 3. భగవదర్చన, 4. భగవద్విషయమునం దదంభము, 5. భగవత్కథాశ్రవణేచ్ఛ, 6. స్వరనేత్రాంగ వికారము, 7. సదాభగవదనుస్మరణము, 8. అమాంసభక్షణము.' శ. ర.

వ. అని ప్రస్తుతించి ప్రదక్షిణంబు గావించి పునర్భవభయంబున భవన భార్యా ప్రముఖ సుఖ విముఖుండై బదరీవనాదిపురుషోత్తమాధిష్ఠిత పుణ్యభూములఁ బౌనఃపున్యంబుగం దీర్థయాత్రఁ జరించుచుఁ బరమనిర్వృతిం బొందె. నిష్పుణ్యకథ వహనసమయంబునఁ గుహనావరాహంబువలన మహీమహిళ మదీయ పూజోచితోపచారంబుల విశేషఫలంబు గానంబ యన విని వైష్ణవియుం దాఁ గావునఁ దదాకలన కుతూహలంబునం గూఁతురై నీ కొంపవి యహరహంబును విప్రలంభదంభేరితాగాధగాథార్థసమేతగీతరసంబునం బ్రొద్దువుచ్చుటగాని వేఱొండుగా. దేమితపంబు సేయుచున్నదియో యం టింతకంటెం బరమతపంబున్నదే? యన్నియును మేల య్యెడు, శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొనిపోయి రప్పనుటయుఁ, బ్రసాదమ్మని ప్రణామమ్ము సేసి పసిండిపల్లకి నబ్బాలికారత్నంబునునిచి పరిచారికాశతంబును భాగవతపరిషత్తునుం గొలువఁ బ్రయాణపర్యాయంబులఁ బరమానురాగంబునంబోయి. 26

భవ=సంసారమువలని (జననమరణ పరంపరవలని) - భవన=ఇల్లు, బద...లన్=బదరీవన ఆది=రేఁగుటడవి లోనుగాఁగల - పురుషోత్తమ=నారాయణునిచే - అధిష్ఠిత = అధిష్ఠింపఁబడిన (నారాయణుఁడు వసించియుండెడి) - పుణ్యభూములన్=పావనక్షేత్రములందు; పౌనఃపున్యంబుగన్=మాటిమాటికి; నిర్వృతిన్=సుఖమును; వహనసమయంబునన్=సముద్రమునుండి కోఱమీఁద పైకెత్తినకాలమందు, కుహనా=మాయా - మహీ మహిళ=భూమియనెడు స్త్రీ (భూదేవి); తత్ ఆకలన=దానిని కావించుట (నానుతులను పాడుట); విప్ర...నన్ - విప్రలంభ=వియోగమనెడు - దంభ=మిష చేత - సమీరిత=పాడఁబడిన - అగాధ=లోఁతయిన - (గంభీరాభిప్రాయము గలవైన) - గాథా=పాటలయొక్క - అర్థ=భావములతో - సమేత=కూడుకొన్న - గీతరసంబునన్=గానమాధుర్యముచేత, ప్రసాదంబు=నాయందనుగ్రహము, ప్రమాణపర్యాయంబులన్=పయనములు (మజిలీల) వరుసచేత; భాగవతపరిషత్తు=భాగవతుల (వైష్ణవులయొక్క) సమూహంబు; పరిషత్, రూ. పర్షత్ 'సమజ్యాపరిషద్గోష్ఠీ సభాసమితి సంసదః' అమ.

## —* గోదాదేవి శ్రీరంగమున రంగనాథుని సేవించుట *—

మ. చని కాంచె న్విరజాభిధాంతర వపు స్సహ్యోద్భవాతీర నం
దనవాటీ వలయ ద్రుమావళి దళాంతర్దృశ్య పాపాళి భం
జన చాంపేయసుమాయమాన విషమస్వర్ణావృతి వ్రాత ర
శ్మి నభస్స్పృక్శిఖరాళి దీపకళికా శృంగంబు శ్రీరంగముౝ. 27

(విష్ణుచిత్తుఁడు), చని=పోయి; విర...బుౝ - విరజా=విరజయనెడి - అభిధాంతర=మాఱు పేరుగలిగిన - వపుః=దేహముతోడి - సహ్యోద్భవా=కావేరియొక్క - తీర=తటమునందలి - నందన వాటీ=ఉద్యానపంక్తియొక్క - వలయ=మండలమునందలి - (అనఁగా ఊరిచుట్టును అంతటను వరిల్లు చున్న యుద్యానపంక్తియందలి) - ద్రుమ = చెట్లయొక్క - ఆవళీ = పంక్తియొక్క - దళ=ఆకుల యొక్క - అంతః=సందులయందు - దృశ్య=కనఁబడుచున్న - పాప=పాతకములనెడి - అళి=తుమ్మెద లను - భంజన=భంగపఱుచుటయందు - చాంపేయసుమాయమాన=సంపెంగపూవులుగా ఆచరించు చున్న - విషమ=బేసియైన (ఏడయిన) - స్వర్ణ ఆవృతి=బంగారపు ప్రాకారములయొక్క - వ్రాత = సమూహముయొక్క - రశ్మి=కిరణముల చేత - నభస్=ఆకాశమును - స్పృక్=అంటుచున్న - శిఖర = అగ్రములయొక్క - ఆళి=వరుసయనెడి - దీపకళికా=దివ్వెమొగ్గలయొక్క - శృంగంబుౝ=కొనలు గలదైన - శ్రీరంగముౝ - శ్రీరంగక్షేత్రమును, కాంచెౝ=చూచెను.

తా.—విరజ యని వైకుంఠముచెంతం బాఱుదివ్యనది. దానితో సమమైనమహిమ కలది కావేరీనది. శ్రీరంగమును అన్నిప్రక్కలను పరివేష్టించి యున్నది. శ్రీరంగము కావేరిలోనిలంక. శ్రీరంగముచుట్టును వలయమువలె ఉద్యానవన మున్నది. అందలిచెట్లయాకుల సందులనుండి దూర మునకు శ్రీరంగనాథుని యాలయ సువర్ణప్రాకార శిఖరము ఇంచించుక కానిపించును; ఆప్రాకార ములు ఏడు, వానిశిఖరములు బంగారుకిరణములతో మిన్నులరాయుచుండును; వానిని చూడఁగనే తెరిఖలపాపములు సంపెంగపువ్వులను గన్నతుమ్మెదలువోలె తొలఁగిపోవును. ఆశిఖరములు దూర మునకు దీపపుమొగ్గల శృంగములువోలె కానిపించును. అట్టియాశ్రీరంగమును విష్ణుచిత్తుఁడు పోయి చూచెను. ఉపమాతిశయోక్తి రూపకములు.

'విరజా' - విరజ యనెడిదివ్యనదియొడ్డున వైకుంఠ మున్నది. అందు శ్రీహరి యుండును; 'విర జాభిధాంతరవపుః' అనుటచేత విరజయే కావేరి యని యర్థము. ఆరూపకముచేత విరజవంటిమహిమ గలది కావేరి యని భావము.

"అస్తి ప్రశస్తమహిమా వైకుణ్ఠోఽకుణ్ఠవైభవః।...యస్స్వావరణైస్తు పరస్తాత్ప్రకృతే రపి।
యదన్తే దివ్యతటినీ విరజా నామ విశ్రుతా। తత్ర దివ్యం మహద్ధామ వైకుణ్ఠాభిధ ముజ్జ్వలమ్।
తత్ర స్తమ్భసహస్రాఢ్యే దివ్యే శ్రీమణిమణ్డపే। సింహాసనేఽతిరుచిరే విభూతిద్వయచిత్రితే।
నిషణ్ణో నిర్భరానన్దో నిరఙ్కుశమహోదయః।సమస్తశేషీ భగవాౝ లక్ష్మ్యా భూమ్యా చ నీళయా."

దివ్యసూరిచరితము, ప్రథమసర్గము.

మఱియు, "కావేరీ విరజా సేయం వైకుణ్ఠం రఙ్గమన్దిరం పరవాసుదేవో రఙ్గేశః ప్రత్యక్షం పరమం పదమ్." అనువచనమును ప్రసిద్ధము.

"తచ్చాసనంబున (శ్రీహరియాజ్ఞచే) వారిజాసనుండును... అద్దివ్యవిమానంబును (=శ్రీరంగ మందిరమును) గొని సత్యలోకసీమాంతంబున విరజానదీప్రాంతంబున... ప్రతిష్ఠాపించి." శ్రీరంగము. అన్యమయినయభిధ=అభిధాంతరము.—'ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ చ,'- 'అథ కళేబరం గాత్రం వపుఃసంహననమ్,'-అమ. 'సహ్యోద్భవా'-కొడగుదేశములోని సహ్యపర్వతమునందుఁ బుట్టినది గాన ఆపేరు. నందన = ఇంద్రునియుద్యానము 'నన్దనం వాసవోద్యానే సుతే నా హర్షకే త్రిషు' నానా; తత్తుల్య మయినయుద్యానములకు లక్షణచే ఆనామమును వ్యవహరింతురు; 'చందనవాటి' అని పా. ద్రుమ – 'పలాశీ ద్రు ద్రు మాగమాః,' అమ. 'చాంపేయ' – 'చామ్పేయ శ్చమ్పకే స్వర్ణే కిఞ్జల్కే నాగకేసరే' మేదినీ.

"గురులీలన్ విరజోపకంఠమున వైకుంఠంబునన్ దివ్యభా
సురభోగంబుల నిందిరాసహితుఁడై శోభిల్లు నెట్లంగిఁ దా
హరి, యాభంగిన తత్కవేరతనయాభ్యర్ణంబునన్ మంగళా
కరరంగక్షణిధామముఖ్యముగ సౌఖ్యశ్రీలఁ జెన్నారెడిన్." శ్రీరం. మ. 4 (865)

కావేరికి విరజైక్యము చెప్పుటచే శ్రీరంగమునకు వైకుంఠైక్యము ఫలితము.

క. చోళీ హల్లక చిత కచ। పాళీ పాళీ భవ ద్విపంచీ స్వన భృం
గాళీ కవేరదుహితృ మ। రాళీ ధ్వను లెసఁగుగాడ్పు ప్రతివడ యుడిపెన్. 28

చోళీ...నులు – చోళీ = చోళాంగనలయొక్క – హల్లక=ఎఱ్ఱగలువలతో – చిత = పెంపు సేయఁబడిన (నిండుగా ఎఱ్ఱగలువలను జెరివిన) – కచపాళీ = తలవెండ్రుకలముత్తమందు – పాళీభవత్ = బారులుతీరుచున్నవై – విపంచీస్వన = వీణాధ్వనివంటిధ్వనిగల – భృంగ ఆళీ = తుమ్మెదల సమూహముల యొక్కయు – కవే...ళీ – కవేర=కవేరమనుపర్వతముయొక్క – దుహితృ=కూఁతురైన (అనఁగా కవేరమందు జనించిన) కావేరియందలి – మరాళీ = హంసాంగనలయొక్కయు – ధ్వనులు=నాదములు, ఎసఁగుగాడ్పు=ఒప్పుచున్న గాలి, ప్రతివడ=ఆవిష్ణుచిత్తునియొక్క దారి బడలికను, ఉడిపెన్=శమింపఁజేసెను.—

తా.—అంతట ఆ విష్ణుచిత్తునికి చోళాంగనల తుఱుములయందు ఎఱ్ఱగలువల పరిమళ మకరందములకై మూఁగినతుమ్మెదల నినాదంబులును, కావేరిలోని హంసభామల నినాదములును వినంబడినవి. వానిని ఆయనకడకు దెచ్చినచల్లగాలి తదీయమార్గాయాసమును శమింపఁజేసెను.

'చోళీ' – చోళదేశమునం గావేరి ప్రవహించును. "చోళమండలమునఁ జూడ నొప్పారు కా। వేరీమహానదీ తీరమునను। జంద్రపుష్కరిణీ లసత్పవిత్రదేశమున" – శ్రీ. రం. మ. 2 (322.)

'హల్లక' – ఆ పరిమళము గాలిలో నుండె నని భా. 'భృంగ' – తుమ్మెదలం జెప్పుటచే నవ హల్లకములు సూచితములు. 'మరాళీ' – స్త్రీజాతిం జెప్పుట నినదము కోమలతరముగా నుండుటకు; 'వడయుడిపెన్' – గంతవ్య ప్రదేశమునకు వచ్చితినిగదా యనుసంతుష్టిచేత సయితము ఆయనకు శ్రమ తీఱె నని భా. 'భృంగ మరాళీ నినదములను' చెప్పుటచేత ఎవరేని మహానుభావులు వచ్చినపుడు ఊరివారు మేళతాళములతో వారిని ఎదుర్కొని తెచ్చుటవోలె నని ధ్వనితము. 'పాళి' – అని "పాళిః కర్ణలతాగ్రే చ ప్రదేశాఙ్కశ్రిపఙ్క్తిషు। శ్మశ్రుచ్ఛదే చ యూకాయాం సంజాతశ్మశ్రుయోషితి"—నానా. 'హల్లకం రక్తసంధ్యకమ్' – అమ.

తే. అతఁ డఘమర్షణస్నాన మమ్మరుద్వృ
ధాంబువుల నాడి, మాధ్యాహ్నికాదిఁ దీర్చి,
స్నాతయు సలంకృతయు నౌతనయను
దోడుకొనుచు వైష్ణవపరిషత్తు గొలువ నరిగి. 29

అతఁడు=ఆ విష్ణుచిత్తుఁడు, ఆ-మరుద్వృధా అంబువులన్ =కావేరి నీళ్లయందు, అఘమర్షణ స్నానము=అఘమర్షణమంత్రోచ్చారణ పూర్వక మయినమజ్జనము, ఆడి, మాధ్యాహ్నిక ఆదిన్=మధ్యాహ్నసంధ్యావందన బ్రహ్మయజ్ఞ పితృతర్పణాదులను, తీర్చి=ముగించుకొని, స్నాతయున్=జలకమాడినదియు, అలంకృతయున్=కైసేయఁబడినదియు, ఔతనయను=ఐనకొమార్తను, తోడుకొనుచున్, వైష్ణవపరిషత్తు=భాగవతులబృందము, కొలువన్=సేవించుచు వెంటరాఁగా, అరిగి = పోయి.

పద్యోక్తి మెల్లను, అతిపవిత్రముగా శ్రీరంగనాథుని ప్రోల ప్రవేశించుటకు. - 'అఘమర్షణము' - పాపమును ధ్వంసము సేయుజప్యము - 'సర్వైనసా మపధ్వంసి జప్యం త్రిష్వఘమర్షణమ్' - అమ. 'సచ్ఛాత్త్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట నఘమర్షణస్నాన మాచరించి' మను.

సీ. చరణంపు సరపణి మొరపంబు విన్నదం
తులతోనె యెదురు నింతులకుఁ దొలఁగి,
యిడినట్టి మణిముష్టి గృహుల యారతి కెంపు
రాలనే కలయ ద్వారాలఁ జల్లి,
ప్రసవాది తావికిఁ బ్రతిగృహాశాచ్ఛట
ద్మ్యపువల్ప్వనకె పోలె శ్వాస ముడిపి,
నృత్తగీతోత్థశౌ రిస్తుతిఁ గీర శా
రిజయట్ల యర్థోపరికృతి విని,
తే. వలభి రత్నాంశువులఁ గట్టు తెలుపు చిత్ర
మగుట కోర్వక దిగదిగ నరిగి ధాన్య
మడిగెడు విరక్తభాగవ తాళి వలన
వెల్లదీవిని బోని యవ్వీడు సొచ్చి. 30

శ్రీరంగమందలి యతిథియపాత్రపరు లైన భాగవతీవతంసులచర్య.—(1) చర...బు - చరణంపు = పాదములయందలి - సరపణి = గొలుసులయొక్క - మొరపంబు = రవళి - విన్నన్ = విన్నచో, దంతులకున్ =ఏనుంగులకు, అట్లు=(ఆయేనుంగులకుఁ దొలఁగినట్లే), ఎదురు ఇంతులకున్ = ఎదురుగా చనుదెంచునట్టిపెదలులకును, తొలఁగి = ఓసరిల్లి, (2) ఇడినట్టి మణి సముష్టిన్ =(ఇండ్లయందు ఉపాదానముగా) పెట్టిన రతనాల పిడికిటిని (పిడికెఁడురత్నములను), గృ... నే - గృహుల = గృహస్థులయొక్క - ఆరతికెంపురాల నే = భగవంతునికి హారతియుత్తిన పద్మరాగముల తోనే, కలయన్ =కలసిపోవునట్లుగా, ద్వారాలన్ =వాకిళ్లకడను, చల్లి=వైచి; (3) ప్రసవ ఆది తావికిన్ =పువ్వులు లోనగుదాని పరిమళమునకు (పరిమళమును తొలఁగించుకొనుటకు), ప్రతి...

నకే పోలెన్ - ప్రతిగృహ=ఇంటింటియొక్కయు - ఈశ=దొరలయొక్క (దొరలుసేయునట్టి) - అర్చ=పూజయందలి - భక్ష్యపు=పణ్యారములయొక్క - వలపునకెపోలెన్=పరిమళమును తాము ఆఘ్రాణింపకుండుటకై ఎట్లు ఊపిరి బిగఁబట్టుదురో అట్లే - శ్వాసము=ఊపిరిని, ఉడిపి=నిలిపి. (4) నృ...తిన్ - నృత్త=ఆటతోను - గీత=పాటతోను - ఉత్థ=లేచిన - శౌరిస్తుతిన్=హరిస్తోత్రమును, కీర శారిజ యట్లు=చిలుకలవలనను గోరవంకలవలనను పుట్టినట్టిదానింబోలె, అర్ధ ఊరరీకృతిన్ = సగముసమ్మతితో, విని; - వల...లన్ - వలభి = మంజూరుయొక్క - రత్న = మణుల - అంశులన్ = కిరణములచేత, కట్టుతెలుపు = తాము ధరించిన తెల్లవస్త్రము, చిత్రము = పలువన్నెలు గలది, అగుటకున్, ఓర్వక=ఇచ్చగింపక, దిగదిగన్=వడివడిగా, అరిగి=పోయి, ధాన్యము= (రత్నములు ఒసంగకుఁడు) బియ్యము (ఒసంగుఁడు అని), అడి...నన్ - అడిగెదు=యాచించెదు - భాగవత ఆళివలనను=భాగవతుల సమూహముచేత, వెల్లదీవిని బోనియవ్వీడు=శ్వేతద్వీపమును పోలినదైన యానగరము. చొచ్చి=ప్రవేశించి (అవలి కన్వయము.)

తా.__శ్రీరంగనగరియందు భగవంతుని కైంకర్యములకై యేనుఁగులు పెక్కులు గలవు; వాని కాళ్లకు గొలుసులు తగిలించి యుండును. సంచారసమయమందు అలంకరణార్థంబును శబ్దార్థంబును చిన్నగొలుసులు అందెలకు మాఱుగా నుంతురు. యాయావరులైనయందలిభాగవతులు ఆయేనుఁగులకు ఓసరిల్లినట్లే సరపణు లనెడిపాదాభరణములు ధరించినచెలువలు ఎదురుపడినను దూరముగా తొలఁగిపోవుదురు. కేవలము నిష్కాము లనుట; ఇండ్లలో వారికి ఇల్లాండ్రు బియ్యము నిడక భక్తి విశేషముచేత రత్నములనే పిడికిళ్లం దెచ్చిపెట్టుదురు; అంతట వారు ఆరత్నములను తత్పూర్వము గృహ దేవతార్చనలో స్వామికి ఆరతియెత్తి కడపకడ వెలుపలవైచియున్న రత్నములతోనే కలసి పోవునట్లుగా వారివాకిండ్లకడనే వైతురు; అంతటినిస్పృహులు అనుట. పూవులు లోనగు వస్తువుల పరిమళము వచ్చినచో ఆఘ్రాణింపక, భగవన్నైవేద్యంపుఁ బణ్యారంపుఁబరిమళమునకుంబోలె శ్వాసమును ఆఁపుకొందురు. విషయాతీతు లనుట; ఆటతోడిపాట వినఁబడిన, శుకశారికల హరినామోచ్చారణముంబోలె దానిని హరిభజనలందు అర్ధాంగీకారముతో విందురు; ఆటపాటలరసమునకు అంగీకారము లేదు, హరినామమాత్రమునకే భక్తిరసముచే అంగీకారము కలదు, కావున అర్ధాంగీకారము; ఇండ్లకడ చూరులరత్నదీధితులు తమతెల్లవస్త్రములపై ప్రసరింపఁగా, వానికి చిత్రవర్ణము వచ్చుటం గని చిత్రవస్త్రధారణము సదాచారము గాదుగావున, ఆవన్నెలను దలంగుటకై విసవిసగా పోవుదురు. పోయి 'అమ్మలారా, రత్నా లిడకుఁడు, తండులంబులే యిడుఁడు' అని యడుగుదురు. భక్తికి ప్రతిబంధకమగుటంబట్టి ధనమును దగ్గఱకు రానీయరు. వైరాగ్యసంపన్నులైనయా భాగవతులవలన ఆపురము శ్వేత ద్వీపమువలె నొప్పుచుండెను. అట్టియాప్రోలిని విష్ణుచిత్తుఁడు చొచ్చెను.

పెద్దపాదములందు విషయము లన్నియు ప్రస్తుతములే అయినందున ఉపమాసంకీర్ణ మయిన తుల్యయోగిత, ఋద్ధిచరితమగు నుదాత్తాలంకారంబును. "ఇతరాంగనుత్యచరితము । తత్తదృద్ధిచరితమును రెం డుదాత్తంబు లగున్." అలం.

'సరపణి' -అనుబంధపట్టికలో చూ. "దన్తి దన్తావళో హస్తీ" అమ. వెల్లదీవిసాటిం జెప్పుట చేత ఆభాగవతు లందఱు నారాయణతుల్యులుగానుండి రనుట. వెల్లదీవియందు సర్వము శ్వేతము, అట్లే ఈభాగవతులును, వలువలును శ్వేతములే.

"శ్వేతద్వీపనివాసు లందఱు శరజ్జీమూతరేఖాసిత ।
స్ఫీతాకారులు ఘోరదుర్భరజరాపేతుల్ హరిధ్యానసం।

జాతానందనిరూఢు లూర్జితయశస్సంభావ్య లంభోజసం
భూతేంద్రాది సమస్తదేవపరిషత్పూజానమస్యోచితుల్." నృసింహ. పు. 1 (41)

'కీరశారిజ' యనుటచే అచట కీరశారికలు నిరంతర శ్రవణముచే నేర్చి భగవన్నామములను త్తుతులనుం బాడుచుండు నని తత్రత్యులభక్త్యుత్కర్షం జెప్పుట. "శారి రక్షోపకరణే తథా శకుని కాన్తరే" విశ్వ. – 'తెలుపు' – చిత్రమగుట కోర్వక "ఉత్థాయ వాససీ శుక్లే శుద్ధే తు పరిధాయ వై," మత్స్యపురాణము. "బ్రాహ్మణస్య సితం వస్త్రం నృపతే రక్త ముల్బణమ్" భృగువు; 'న రక్త ముల్బణం వాసో న నీలం చ ప్రశస్యతే,' యాజ్ఞవల్క్యులవారు.

ఒకానొకటీకాకారులు "శ్రీరంగమందు ఫేక్ష మెత్తు భాగవతులు శ్వేతద్వీపమునుండి యవతరించిన నిత్యసూరులే కాక, మనుష్యులేని యింద్రాదిదేవతలేనియు కారు" అనియు వ్రాసి, అందులకు పరాశరభట్టరు శ్రీసూక్తిని ప్రమాణీకరించియున్నారు. సూక్తి యేమన:—

"దివి దేవిషతి మానుష స్స చ తితద్విభూష త్యసౌ। శిశర్విషతి సర్వదా వినిధయిష్యతే తేన చ
ముముక్షిషతి తత్త్వగత్యవగతేస్స నిస్సంశయం। నినిత్యిషతి సర్వదా స న రిరఙ్గభిక్షూషతి."

ఉ. గోపురకందరాళికడకు న్శశిపుష్కరిణీ కణార్ద్రి సం
తాపహరానిలంబులు విమానరణ న్మణికింకిణీ కలా
లాపముల న్సుఖం బడుగ లాలసఁ జొచ్చి యకాండ గాహనా
చాపలకృన్మరుద్గణముఁ జండుఁ డదల్చెడు లోనివాకిటన్. 31

గో...కన్ – గోపురకందర=గుహలవంటిగోపురములయొక్క – ఆళికడకున్ =పంక్తుదకు శశి...లు – శశిపుష్కరిణీ =చంద్రపుష్కరిణియొక్క – జల = నీటిచేత – ఆర్ద్ర =తడిసిన – సంతాపహర=వడతీర్చెడు – అనిలంబులు=వాయువులు, వి...లన్ – విమాన= మేలుకట్లయందలి – రణత్ = మ్రోఁగుచున్న – మణి=రత్నముల – కింకిణీ = చిఱుగంటలయొక్క – కల=అవ్యక్తమధురములైన – ఆలాపములన్ = ధ్వనులనెడివచనములచేత, సుఖం బడుగన్ = 'సుఖముగా వచ్చినారా' అని ప్రశ్న సేయఁగా, లాలసన్ =తీవ్రకాంక్షతో, చొచ్చి = ప్రవేశించి, అకాం...మున్ – అకాండ= అసమయమందు – గాహనా = ప్రవేశించుటయందు – చాపలకృత్ = తొందరపడుచున్న – మరుద్గణమున్ = దేవతాసమూహమును, చండుఁడు = చండుఁ డను పేరి ద్వారపాలకుఁడు, అదల్చెడు లోనివాకిటన్ = 'నిలువుఁడు, మీ సమయము గాదు' అని నిర్భర్త్సించెడు లోపలిద్వారమునందు (తర్వాతి కన్వయము.)

తా.— తెమ్మెరలు చంద్రపుష్కరిణీజలశీకరములచే చల్లనై, (తద్ద్వారముచే మెల్లనై పుష్కరిణీ కమల సౌరభముం దెచ్చుచు) మేలుకట్లరతనంపుఁ జిఱుగంటల మ్రోఁతచేత "సుఖముగా వచ్చితిరా" అని యడుగుచు గుహలవంటిగోపురము లన్నిటను ఆవిష్టుచిత్తునిని ఎదుర్కొనుచుండెను. అతీరున ఆయన ఆఱుప్రాకారములు గడచి ఏడవప్రాకారంపుద్వారముకడకుం బోయెను. అచట త్వరపడి లోనం జొరఁబూను దేవగణములను చండుఁ డను ద్వారపాలకుఁడు 'నిలువుఁడు, సమయము గాదు' అని అదలించుచు ఆఁపుచు నుండెను —వ్యస్తరూపకము.

'గోపుర'–'పురద్వారం తు గోపురమ్' అమ. "కన్దరోఽఙ్కుశే వివరేచ గుహాయాం చ" మేదిని. గుహలవంటి వనఁగా గుహలయంత పెద్ద వని భా. 'శశిపుష్కరిణి' మహాపావనము గావున తదీయజలార్ద్రవాయువులును మహాపావనము లని భా. జలముచేత చలువయు తద్ద్వారముచేత మంద

తయు, పుష్కరిణిం జెప్పుటచేత సౌరభంబును సూచితములు. స తాప = కాయమనస్తాపములను రెంటిని, "పతాకరణత్" అని పా. ఆపక్షమున - పతాక = ధ్వజములయందలి యని జాత్యేకవచనముగా సాధ్యసమాసముం గావించుకొనవలయును. సిద్ధసమాసమయినచో "పతాకారణత్" అని యుండవలయును. 'అస్త్రీ వితాన ముల్లోచః' - 'పతాకా వైజయన్తీ స్యాత్కేతనం ధ్వజ మస్త్రియామ్' 'కిఙ్కిణీక్షుద్రఘణ్టికా.' "లాలస" యనుచో "నాటిట" అని పా. యతిభంగము, అందువలన ఈమార్పు మత్కృతము. 'కాణ్డోఽస్త్రీ దణ్డ బాణార్వ వర్గావసర వారిషు'' అమ. 'చండుఁడు': —

"నగ రావరణ ద్వార గోపు రావన కర్తృకః ।
చణ్డాద్యైః కుముదాద్యైశ్చ గజవక్త్రాదిభి ర్వృతః" వి. సూ. చ. (68)

ఉ. వేత్రముఁ గేలఁ బూని మణి వేదిఁ గుథంబు పయి న్సితాంబురు
ణ్ణేత్రుని ముద్రవ్రే ల్మెఱయ నిశ్చలులై యిరుమై మనాఙ్నమ
ద్గాత్రుల దంతివక్త్రులశతంబు వినీతి భజింప నొప్పు త
త్సూత్రవతీశు వందనముతోఁ గని యాతఁడు భక్తి సేయఁగన్. 32

వేత్రమున్ = బెత్తమును, కేలన్ = చేతిలో, పూని = ధరించి, మణివేదిన్ = రత్నమయమైన యరంగుమీఁద, కుథంబుపయిన్ = చిత్రకంబళముమీఁద, సి...ల్ - సిత అంబురుట్ = తెల్లదామర వంటి - నేత్రుని = కన్నులుగలవాఁడైననారాయణునియొక్క - ముద్ర = ప్రతిమగలయుంగరము తోడి - వ్రేలు, మెఱయన్ = ప్రకాశించుచుండఁగా, ఇరుమైన్ = తనకు ఇరువంకలయందును, నిశ్చలులై, మనాక్ నమత్ గాత్రుల దంతివక్త్రుల శతంబు = ఇంచుక వంగిన దేహముగలవారయిన గజముఖులు నూర్వురు, వినీతిన్ = వినయముతో, భజింపన్ = దన్నుఁ గొలుచుచుండఁగా, ఒప్పు - తత్ సూత్రవతీ ఈశున్ = సూత్రవతీదేవికిపతియైన యావిష్వక్సేనుని, వందనముతోన్, కని = చూచి నమస్కరించి, (కర్త విష్ణుచిత్తుఁడు), ఆతఁడు = ఆవిష్వక్సేనుఁడు. భక్తి సేయఁగన్ = తనకు (విష్ణుచిత్తునికి) పూజగావింపఁగా (అవలి కన్వయము.)

తా. — అచట మణిమయవేదికయందు తివాసిమీఁద రంగనాథుని సేనాపతి విష్వక్సేనుఁడు తన నియోగచిహ్నమైనబెత్తమును కేలఁబూని, రంగనాథప్రతిమతోడి ముద్దుటుంగరమును వ్రేలం దాల్చి, కూర్చుండి యుండెను. ఆతనిని ఇరువంకల ఈషన్నమ్రదేహులై నూర్గురు గజముఖులు కొలుచుచుండిరి. విష్ణుచిత్తస్వామి విష్వక్సేనుం గని వందనం బాచరించెను. ఆతఁడును విష్ణుచిత్తునికి భక్తి గావించెను.

వేత్రము - వై. - బెత్తము. "విద్యావేత్రలతాఢ్యేన విభూతియుగవృద్ధినా । విష్వక్సేనేన సైన్యానా మీశ్వరేణ నిషేవితః." వి. సూ. చ. 1 (66) 'కుథః స్త్రీపుంసయో ర్వర్ణకమ్బళే పుంసి బర్హిషి,' మేదిని. 'నిశ్చలులు' - వీక్షణములో ఏమియాజ్ఞ యిడునో యనునవధానముచేత నిశ్చలత. 'ఇరుమై' - ద్విగువు గావున ఏకవచనము. నమ్రత వినయముచేత. దంతివక్త్రులు విష్వక్సేనుం గొలుతు రనుటకు

శా. "ఆతీరంబునకున్ జతుర్దిశల రక్షార్థంబుగా ద్వ్యత్రగ
వ్యూతిక్షేత్రమునం జరించు కృతపుణ్యుల్ దుష్టశిక్షావిని ।
ష్ణాతుల్ దండధరుల్ ఘనాకృతులు విష్వక్సేనవాక్యోదితుల్ ।
భూతేశుల్ పటుదివ్యశక్తియుతు లంభోజాప్త తేజోధికుల్." 521 శ్రీరంగమహాత్మ్యము.

క. గజవదనాదులు గాంచిరి। నిజరక్షితసీమఁ గాలనియమితభృత్య
వ్రజకృతబహువిధబాధల। గిజిగిజి యగుశూద్రభక్తుఁ గిలితదేహుల్." 522.

"యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం
విఘ్నా న్నిఘ్నన్తి సతతం విష్వక్సేనం త మాశ్రయే".

తే. అవిదితపురందరాయుధం బైన కనక
శిఖరియునుబోలె నెఱకల జిగులు దెసల
నింగి నీరెండఁ గాయు వేదాంగు వినత
సుతుని నతిఁ గాంచి మగుడఁ దన్నుతియుఁ గాంచి. 33

అవి...బు - విదిత=ఎఱుంగఁబడిన - పురందర ఆయుధము=ఇంద్రునిపోటుముట్టు (వజ్రాయుధము) కలది - అట్టిది కానిది అవిదితపురందరాయుధంబు=వజ్రాయుధపువ్రేటు నెఱుంగనిది, ఐన కనకగిరియునుబోలెన్ = మేరువువలె, ఎఱకలజిగులు = ఱెక్కలనిగ్గులు, దెసలన్ నింగిన్ = దిక్కులయందును మింటియందును, నీరెండ=లేఁతయెండను, కాయు వేదాంగున్ = పర్వించుచున్న వేదస్వరూపుని, వినత సుతునిన్ = వైనతేయుని, (గరుడు నను), నతిన్ = ప్రణామపూర్వకముగా, కాంచి=దర్శించి, మగుడన్ =బదులుగా, తత్ నతియున్ =అతని నమస్కారమునుగూడ, కాంచి= పడసి (పైకన్వయము.)

తా.—అచట వేదస్వరూపుఁడు గరుత్మంతుఁ డుండెను. ఆయన ఇంద్రునివజ్రాయుధము సోఁకనందున ఱెక్కలు కోలుపోని మేరుపర్వతముంబోలె సువర్ణచ్ఛాయతో వెలుఁగుచుండెను అతని యాకాంతి అంతటను లేఁతయెండవలె వ్యాపించుచుండెను. అతనికి ఆవిష్ణుచిత్తుఁడు వందనం బాచరింపఁగా అతఁడును ఆయనకు ప్రతివందనము కావించెను.—ఉత్ప్రేక్ష.

తార్క్ష్యుఁడు వేదస్వరూపుఁడు.—చూ. ది. సూ. చ. 1 (65).

"వితాన దాస వ్యజన మిత్ర కేతురథాదినా। వైనతేయేన పురతః సేవితః శ్రుతిరూపిణా."

సువర్ణకాంతి గలవాఁడు.—"సుకుఙ్కుమాఙ్కితవర్ణాయ కున్దేన్దుధవళాయ చ। విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః." "పీతాః స్యుర్ద్వాపర బ్రహ్మ జీవ శక్ర మనఃశిలాః। గౌ గోమూత్ర గరుడ మణ్డూ కేశ్వర దృగ్గటాః." మందారమకరందచంపువు.

వ. అతనిచే విజ్ఞాపనంబు సేయించి యనుమతిం గాంచి చతుర్భుజులు జలధరశ్యాములు శతపత్రలోచనులు చపలాపిశంగవసనులు వనమాలికాబద్ధబాహుమధ్యులు నైన మధుమథన ప్రతిబింబంబులం బోని పారిపార్శ్వకులఁ బరాంకుశప్రభృతిముక్తుల సేవించుచుఁ బదభినందితు లై చని మహావకాశంబును మణిమయస్తంభ సంభృతంబును శాతకుంభకుంభ శోభితశేఖరంబును నై చిత్రనేత్రవితానలంబమాన నానాప్రసూనదామ ముక్తాగుళుచ్ఛాచ్ఛచామరంబును సుద్వేలకాలాగరుధూప ధూపితంబు నగు మహావిమానమధ్య విధుకాంతవితర్దికాతలంబునఁ జరణముఖ తత్త్వత్రితీకాధిష్ఠిత ధర్మాదిసూరి పరిషదాత్మకంబును దేజోమయంబును నగు విపుల విమల పీఠంబునఁ బరిమళాలోలరోలంబజాలం బగు నంబురుహంబు

జాంబూనద త్వి డుత్తమర్ణవిస్తీర్ణకర్ణి కోపరివీథి నూధస్యపాథోనిధానంబునకుఁ
ప్రథమహేతుభూతం బగు భూతతన్మాత్రయుంబోలెఁ బారద స్ఫటిక బటీర పాండు
రుచి పుండరీకంబుల పసకు మసమసక లెసకొల్పు మిసిమిగల భోగిభోగ భాగంబు
నకుం బరభాగంబు మిగులఁ దదాత్మకంబ యగు సుపబ్వాంబున మహోర్వా కేయూర
మణికర్బురం బగుకూర్పరం బూని మననపర ముని మనోరాగరస మార్జనం జేసి మిగుల
నరుణిమ వహించెనో యనఁజాలు కెంగేలు కపోలంబునం గదియం ద్రిదశ తరు
కుసుమ కంచుకిత కంచుకికంచుకాత్మకం బగు దుకూల నిచోళంబున నొత్తిగిలి
యున్న వానిం, గరిం గఱకఱంబెట్టి బిట్టు దనచేతి చక్రంబునం దెగిన నక్రంబు
పూజ్యం బగు సాయుజ్యంబు నొందెనో యన నుపరి పరిదృశ్యమాన గండస్థలస్థ
మణిమకరకుండల ప్రతిబింబ రుచి డంబరంబునం బరమ సౌందర్య మకరంద
నిష్యందియగు ముఖారవిందంబున నందంబగు వాని, నిర్నిమేషదృష్టినెట్టుకొని
చూచుతఱి నీలావదాతయు తెప్ప వట్టు తఱి బిట్టిదుర్కొను కలధౌత గౌరగౌర
మహోమహఃపూరంబున మునింగి దుర్నిరీక్షయు నగు నిజ రుచిర మూర్తివలనఁ
దనదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు రూపున దీపించు వానిఁ, గళత్రంబు
లగు శ్యామాచ్ఛాయలచేతఁ బ్రేముడిం బొదువంబడిన యట్లు కప్పులు దొంగలు
నగు పక్ష్మకాలికల నొప్పు సోమ సూర్యాత్మకంబు లగు వెడంద నిడువాలు టెక్కు
సెరల కన్నులం గెందమ్మిఱేకుల వెదఁజల్లువాని, మంకెన విరి బింకంబు నింకించు
నధరశోణిమ నెపంబున వెలుంగు ముఖజనితహుతాశనుతోఁ దత్సఖుం డగు
గంధవహుం గూర్చ నిక్కినన నొక్కింత నిక్కి చొక్కంపుఁ బొటమలఁ జూపట్టు తిల
కుసుమ విలసనాపహాసి యగు నాస భాసమానుం డగు వాని, నుదరజాత శ్వేత
ధామతామరసంబుఁ గనుంగొని మహదాశ్రయంబు గనిన పూర్ణిమాశశాంకుండను
శంక నాతనికి నాకు వైరంబు మాన్పు మని తత్సహోదరిగావున రత్న కాంచనంబులు
లంచంబులుగా నివేదించి యడుగు లొత్తు నిందిరకు వరముం బడియున్న రాహు
వనం గేయూరకటక మణి ముద్రికాంకితం బగు దీర్ఘబాహు పరిఘంబు కటితటో
త్సంగంబున మెఱయు వాని, నురఃస్థల న్యస్త నిస్తులాస్తోక కౌస్తుభ గభస్తి మండ
లంబున నిండోలగంబుండు పుండరీకనికేతన తనుచ్ఛాయ యన నచ్ఛాచ్ఛం బగు శ్రీ
వత్సంబున లోచనోత్సవంబుఁ గావించువాని, విజితమృగనాభి నాభిసౌరభ్యంబునకు
నెగయు నుత్తుంగ భృంగ మాలిక యన మెఱయు నసిత పేశలతులసీపలాశ దామం
బున నభిరామ కోమలాలంకృతి యగువానిఁ, గపట కరటి విరోధియై యసుర
యుసుఱుం గొని మగుడ మనుజాంగంబు సంగీకరించునెడఁ దలంపంబడమి నట్లన
యుండె నన బడు గగు నడుముపసఁ గడునొడిక మగువాని, ఘన జఘన చరమేతర

ధరాధరాధిత్యకాతలంబునం గాంచన కాంచికామణిమకుట గగనమణి గాయు నీరెండ మెం డనంబరఁగు మెఱుంగు పీతాంబరంబునం బొదువంబడి దాని సన్న దనంబునఁ దనరున్నఁదనంబు వెలుపలం దోఁపఁ గనక పుష్యరాగంపుఁ దెరవారు వైడూర్యమణిస్తంభ యుగంబునుంబోలెఁ గించిదామీలిత నీలిమం బగు నూరు యుగళంబు వానిఁ, త్రైవిక్రమం బగు విగ్రహంబుతో నాగ్రహంబున మీఁదికిం జాఁచు తఱిఁ జంక్రమణరయంబునం దగిలివచ్చిన మణిమయస్వర్భువన జాంబూనద ప్రాకారవలయంబనం దీండ్రించు నుద్దండ గండపెండెరంబునంబోడము నఖండ ప్రభామండలంబునం బరిహిండితంబులై మత్స్యకందుల పదువుగల మడమల బెడంగు పడి భావి నిజ కమఠావతార సూచకంబులుం బోలెఁ గొనమ తామ్మెల్ల మెల్లనగు మీఁగాళ్లతోఁ గోకనద మృదూదరంబు లమర మెఱుఁగు జక్కుల జిగి మొక్క పఱుచు నఖచక్రవాళ చంద్రికల భక్తజన మనస్తమోవిదళనంబుఁ గావించుచు హలకులిశ కలశ కమల మకరాంకు శాంకితంబులై లక్ష్మీకుచ కుంకుమాకలన నరు ణారుణంబులగు చరణంబులం దాపత్రయాప హరణంబు సేయువాని, నారా యణుం బురాణపురుషుఁ బురుషోత్తముఁ బ్రణతార్తిహరు వాసుదేవు హృషీకేశు నీశనుతు విభీషణవరదు ననంగజనకు రంగరమణుంగాంచి సహ సమాగత భాగవత పరిషత్సమేతంబుగాఁ దానుం దనుజాతయుం బ్రమద భయ భక్తిరసమగ్నులై జయ జయ శబ్దంబులతో సర్వాంగాలింగిత క్షోణీతలంబు లగు నమస్కారంబులు గావించి నిలిచి నిటలతటఘటితాంజలిద్వయై యిట్లని నుతియించె. 34

చపలా పిశంగ వసనులు = మెఱుపువలె పీతమైన వస్త్రములుగలవారు (పీతాంబరులు), వన మాలికా బద్ధ బాహుమధ్యులు = అడవులుపువ్వులుచేర్చి గ్రువ్వఁబడిన తోమాలెలతో కూర్పఁబడిన వక్షములుగలవారు, పారిపార్శ్వకులక = పార్శ్వవర్తులైన - పరాంకుశ ప్రభృతిముక్తులక =నమ్మా ళ్వారు లోనగు ముక్తులను, శాతకుంభ=బంగారు, చిత్రనేత్ర = పలువన్నెల వస్త్రముల - వితాన= మేలుకట్టునందు - లంబమాన = వ్రేలుచున్న - ప్రసూనదామ = పూదండలు - ముక్తాగుళుచ్ఛ= ముత్యాలగుత్తులు - అచ్ఛచామరంబును= తెల్లజల్లులుగలదియు, మహావిమానమధ్య = గొప్ప గర్భ గృహమునడిమి - విధుకాంత=చంద్రకాంత - వితర్ది కాతలంబునక = వేదికా ప్రదేశంబున, చరణ ముఖ = పాదములు లోనగు - తత్తత్ప్రతీక = ఆయాయవయవములచే అధిష్ఠింపఁబడిన - ధర్మాది= ధర్మవర్మ లోనగు - సూరి=జ్ఞానులయొక్క = పరిషత్ =సమూహము - ఆత్మకంబును=స్వరూపము గాఁగలదియు, పరిమళ= నెత్తావులవు - ఆలోల = ముసరుచున్న - రోలంబజాలంబు = తుమ్మెదల గుంపుగలది, అంబురుహంబు = కమలము. జాంబూనదత్విట్ = బంగారు కాంతియొక్క - ఉత్త మర్ణ =అప్పిచ్చునదైన - విస్తీర్ణ కర్ణికోపరివీథిక =విశాలమైన మిద్దె పై పార్శ్వమందు, ఊధస్య= పాల_పాథోనిధానంబునకుక = కడలికి [ఊధస్సు = పొదుగు], భూతతన్మాత్ర=సూక్ష్మావస్థయందలి భూతము (సూక్ష్మావస్థలోనున్న పాలు అనుట), పారద = పాదరసము, పటీర = శ్రీగంధము,

పుండరీకంబు = తెల్లదామర, పసమీఱ = పీనికాంతికి, మిసిమి = కాంతి, భోగిభోగ భాగంబునఁ = పాముయొక్క (శేషాహియొక్క) దేహ ప్రదేశమునకు, పరభాగంబు = వర్ణాతిశయము, తదాత్మకంబు = శేషాహిస్వరూపకంబు, ఉపబర్హంబునఁ = దిండునందు, మహోర్హ = అత్యుత్కృష్టమైన - కేయూర = బాహుపురియొక్క - మణి = రత్నములచేత - కర్బురంబు = పలువన్నెలుగలది, కూర్పరంబు=మోఁచేతిని, మననపర = మననశీలురైన - ముని=తాపసులయొక్క - మనః=మానసమందలి - రాగరస=అనురాగ భావమనెడు - (రాగరస = ఎఱుపురసముయొక్క) - మార్జనంజేసి=తుడుచుటచేత (అనఁగా, మునుల మనస్సులలో వైరాగ్యము పుట్టించుటచేత), అరుణిమ = ఎఱుపు, త్రిదశతరు = కల్పవృక్షములయొక్క - కుసుమ = పుష్పములచేత - కంచుకిత= ఆవరింపఁబడిన - కంచుకి = (కుబుసముగలవాఁడైన) శేషాహియొక్క - కంచుకాత్మకంబు = కుబుసమైనట్టిది, దుకూల నిచోళంబునఁ = తెల్లవలిపెంపు దుప్పటియందు, నక్రంబు = మొసలి, సాయుజ్యంబు = భగవంతుని విగ్రహముతోఁ గూడుకొనుట, మకర కుండల = మొసలి యాకృతిగల కర్ణాభరణము, ప్రతిబింబ రుచి డంబరంబునఁ = ప్రతిఫలిత రూపముయొక్క కాంతియొక్కయతిశయముచేత, పరమసౌందర్య మకరందనిష్యంది = ఉత్కృష్టమైనయందమనెడు పూఁదేనెను వర్షించుచున్నది, నెట్టుకొని = ఎట్టకేలకు, నీల అవదాత = నల్లనిదియు తెల్లనిదియు, ఱెప్పవట్టు తఱిఁ = ఱెప్పవాల్చి చూచునప్పుడు, కలధౌత = వెండివలె - గౌరగౌర = అతిధవళమైన - మహోమహః = అధిక తేజస్సుయొక్క - పూరంబునఁ = ప్రవాహంబునందు, సాకారనిరాకారతలు (నిర్నిమేషదృష్టితఱిని సాకారత - ఱెప్పవ్రాల్చి చూచుతఱి నిరాకారత అని వివేకము), వారికిఁ = సేవించుభక్తులకు. కళత్రంబులు = భార్యలు - చంద్రసూర్యులు భగవంతుని నేత్రములు - వారిభార్యలు శ్యామ చాయ యనువారు - శ్యామ = రాత్రి - చాయ (నీడ) - భగవన్నేత్రములఱెప్పలనలుపు చంద్రభార్యయగు రాత్రియోయనునట్లును, వానిధైర్యము సూర్యభార్యయగు చాయాదేవియో యనునట్లును, ఒప్పారుచుండెను. ప్రేముడిఁ = అనురాగముచేత, తొంగలులు = నిడుదలు, పక్ష్మాళికలఁ = ఱెప్పలనలఁపులచేత, సోమసూర్యాత్మకంబులు = చంద్రసూర్యస్వరూపములు, ఎఱ్ఱసెరల = అరుణరేఖలుగల, ముఖజనితహుతాశనుతోఁ = ముఖమునుండి పుట్టిన యగ్నితో (అగ్నిదేవుఁడు భగవంతునిముఖమునుండి పుట్టెనని శ్రుతి), తత్సఖుండు=అగ్నికి చెలికాఁడు, గంధవహుండు = వాయువు, పొటమలఁ = పుటములతో, తిలకుసుమ = నువ్వుఁబువ్వు, భగవంతుని కటీతటంబుపై కేయూరకటకమణిముద్రికా ద్యలంకృతంబగు దీర్ఘబాహువు ఒప్పుచుండుటయు, నాభీపుండరీకము దేదీప్యమానముగా వెలుంగుచుండుటయు మహాలక్ష్మి తదీయ పాదము లొత్తుచుండుటయు నెట్లుండెననఁగా, రాహువు తనవైరియైన పూర్ణచంద్రుఁడు మహత్తైన యాశ్రయముం బడసి యున్నాఁడని భయపడినవాఁడై ఆ చంద్రునికిని తనకునుగల వైరమును మాన్పుమని యాతనిసహోదరిని పుండరీకనిలయయైన మహాలక్ష్మిని భగవంతునిపాదము లొత్తుచున్న దానిని ప్రార్థించుచు వరముపడియున్నాఁడో యనునట్లుగా నుండెను; శ్వేతధామ తామరసంబు = తెల్లకాంతిగలతామర (పుండరీకము), రత్నకాంచనంబులు లంచంబులు = కేయూరకటకమణిముద్రికలను ఇట్లుచెప్పుట, బాహువే రాహువు, నివేదించి = సమర్పించి, బాహుపరిఘంబు = గడియమ్రానివంటి బాహువు, మహదాశ్రయము=గొప్పవానియొక్కయండను (నాభీపుండరీకమును భగవంతుని యాశ్రయముంబొందిన చంద్రునిఁగా భావించి ఆ యాశ్రయబలముచే తన్ను అతఁడు జయించునని రాహువు వెఱచెను అని భావము), నిస్తుల = సాటిలేని -

అస్తోక = గొప్ప - గభస్తి = కాంతి, పుండరీకనికేతన=పద్మాలయ (మహాలక్ష్మి), అచ్ఛాచ్ఛంబు= మిక్కిలి తెల్లనిది, శ్రీవత్సంబునన్ = శ్రీవత్సమను పేరిటి లాంఛనముచేత, విజిత మృగనాభి = కస్తూరిని జయించినదియైన - నాభి సౌరభ్యంబునన్ = పొక్కిటి పరిమళమునను, అసిత పేశల తులసీ పలాశ దామంబునన్ = నల్లని కోమల తులసీ పత్త్రమాలికచేత, కరటివిరోధి = ఏనుఁగునకు వైరి (సింహము), కపట కరటివిరోధియై = మాయాసింహమై, అసుర = హిరణ్యకశిపుని యొక్క, మనుజాంగంబు = నరరూపమును, తలంపంబడమిన్ = మఱచినందున, బడుగుబడుగగు= మిక్కిలి సన్ననైన - ఒడికము = అందము, ఘనజఘన = గొప్పపిఱుందగలదు - చరమేతరధరాధర = ఉదయపర్వతము యొక్క - అధిత్యకాతలంబునన్ = ఊర్ధ్వభూప్రదేశమునందు, కాంచన కాంచికా = బంగారు మొలనూలియొక్క - మణిముకుట = రత్నకిరీటము (తరళమణి) అనెడు - గగనమణి = సూర్యుఁడు, కాయుసిరెండ (యొక్క) - మెండు = అతిశయము, దాని = పీతాంబరముయొక్క, కనకపుష్యరాగంపు = ఆ పేరిమణియొక్క - తెరవారి = డాలులయు, కించిదామీలిత = ఇంచుక కప్పఁబడిన - నీలిమంబు = నలుపుగలది, త్రైవిక్రమంబు = త్రివిక్రముని (అనఁగా వామనమూర్తి) సంబద్ధమైన, క్రమణ = దాఁటుయొక్క, స్వర్భువన = స్వర్లోకము యొక్క - జాంబూనద = బంగారపు, పరిహిండితంబులై = మిశ్రములై, కోకనద మృదూదరంబులు = రక్తోత్పలములయొక్క కోమలమైన లోపలిభాగములు (అఱకాళ్లు), నఖచక్రనాళ = గోళ్లమండలము (వరుస) యొక్క, హల=నాఁగలి...కులిశ=వజ్రము - మకర=మొసలి - అంకుశ= అంకుసము (అను చిహ్నముల చేత) - అంకితంబులై = గుర్తింపఁబడినవై, తాపత్రయ=ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక తాపములను మూఁటిని.

తే. విధిగృహాక్షయవిత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకుపుణ్యరాశికిని బ్రణుతి
ధనపతి భ్రాతృకులదేవతకు జోహారు
నతమృడాదికసుమనస్సునకు నమస్సు. 35

విధి...కిన్ - విధి = బ్రహ్మయొక్క - గృహ = ఇంటియందలి - అక్షయ=తఱుఁగులేని - విత్త = ధనముయొక్క - సేవధికిన్ = నిధియైన శ్రీహరికి, శరణు = నమస్కారము. చిర...ని- చిర = దీర్ఘకాలము - కృత = ఆచరింపఁబడిన - కూడఁబెట్టఁబడిన - ఇక్ష్వాకు = ఇక్ష్వాకు మహారాజుయొక్క - పుణ్య = సుకృతములయొక్క - రాశికిని = ప్రోవునకు, ప్రణుతి = నమస్కారము. ధన...కున్ - ధనపతి = కుబేరునియొక్క - భ్రాతృ = తోఁబుట్టయిన (విభీషణుని యొక్క) - కులదేవతకున్ = ఇలువేల్పునకు, జోహారు = అంజలి, నత...కున్ - నత = ప్రణతులయిన - మృడ = శివుఁడు - ఆదిక = లోనుగాఁగల - సుమనస్సునకున్ = దేవతలుగలవానికి, నమస్సు = మ్రొక్కు.— పర్యాయోక్తములు.

శ్రీరంగధాముని తొలుత బ్రహ్మ తనలోకమున తనగృహదేవతార్చనగా పూజించుచుండెను. శ్రీహరియాజ్ఞచే బ్రహ్మ ఆ మూర్తిని ఇక్ష్వాకున కిచ్చెను. తద్వంశ్యుఁడు శ్రీరాముఁడు విభీషణుని కిచ్చెను. అతఁడు ఉభయకావేరినడుమ చంద్రపుష్కరిణీ తీరమున నుంచెను. చూ. కవికర్ణరసాయనము. సేవధ-పీఠిక చూ. పట్టిక-"నిధిర్నా సేవధిశ్చాదౌ పద్మశఙ్ఖాదయో నిధేః,"-అమ.నమస్సు- (దీనికి ఇతర గ్రంథములందుఁ బ్రయోగము మృగ్యము అని శ. ర.)

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
నప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నణుసమూహములకును న
ణీయు నిన్ను ననాధారు నిత్యు సత్యు. 36

సర్వ ఈశున్ = సర్వమునకు ప్రభు వైనవానిని, సర్వఆత్మకునిన్=సమస్తము తనస్వరూపముగాఁ గలవానిని (అనఁగా సర్వము తానే అయినవానిని), అనంతునిన్ = నాశములేనివానిని, అప్రకాశున్=గోచరింపనివానిని, అభేద్యున్=ఇట్టివాఁడు అట్టివాఁడు అని చెప్పుటకు అలవిగానివానిని, సమస్త లోక సముదయ ఆధారున్=ఎల్ల లోకములసముదాయమునకును తావలమైనవానిని (లోకము లెల్ల నతనియం దున్న వనుట), అణుసమూహములకున్ = సూక్ష్మతమవస్తువుల మొత్తములలో, అణీయున్=సూక్ష్మతముఁ డైనవానిని (సూక్ష్మవస్తువుల నెల్లను పరికించి చూచిన ఇంతకన్న సూక్ష్మము ఉండ దనుట), అనాధారున్ = ఆధారరహితుని, నిత్యున్ = శాశ్వతుని, సత్యున్= మాయాభూతుఁడు కానివానిని, నిన్నుఁ గొలుతున్.

ఈ శ్రుతిని పరికించునది:—"అణో రణీయాన్ మహతో మహీయా।
నాత్మా గుహాయాం నిహితోఽస్య జన్తోః."

క. నారాయణు భూ ప్రభృతిక
గౌరవవద్వస్తువితతికంటె మిగిలి పెం
పారు గరిష్ఠత గల పర
పూరుషు శరణంబు వేఁడి పొగడెద నిన్నున్. 37

నారాయణున్ = నరసమూహము నారము, అది అయనముగా, అనఁగా స్థానముగాఁ గలవాఁడు నారాయణుఁడు, సర్వాంతర్యామియైన శ్రీహరిని, భూ... టెన్-భూ=పృథివి-ప్రభృతిక= లోనుగాఁగల - గౌరవవత్=బరువుగల - వస్తు=పదార్థములయొక్క - వితతికంటెన్ = సమూహముకంటెను, మిగిలి=హెచ్చి, పెంపారుగరిష్ఠత=అతిశయించునట్టి యత్యంతగురుత్వము, కల - పరపూరుషున్=ఉత్కృష్టపురుషుని, నిన్నున్ శరణంబు వేఁడి = నీప్రాపు ప్రార్థించి, పొగడెదను.

తా.—బరువయిన పృథివ్యాది సమస్తములకంటె బరువైన వానిని పరమపురుషు నిన్ను శరణుఁజొచ్చి పొగడుచున్నాను.

తే. అజశివాదిక మగునీసమస్తజగము
నెందుఁ బ్రభవించు వర్తించు డిందు నట్టి
మహిమ కిమ్మైన నిత్యు సమస్తభూత
మయుఁ బరులకంటెఁ బరు మహామహునిఁ గొలుతు. 38

అజ శివ ఆదికము = బ్రహ్మ శివుఁడు లోనుగాఁగలది. అగు - ఈ - సమస్తజగమున్ = ప్రపంచ మంతయు, ఎందున్=ఎవ్వనియందు, ప్రభవించున్=పుట్టునో, వర్తించున్ = ఉండునో, డిందున్=లయించునో, అట్టి మహిమకున్ = మహత్త్వమునకు, ఇమ్ము = చోటు, ఐన - నిత్యున్= శాశ్వతుని, సమస్తభూతమయున్ = ఎల్లప్రాణులును తానే అయియున్నవానిని, పరులకంటెన్=

దేహేంద్రియాదులకంటె పయినైన, జీవులకంటెను, పరున్ = పైవానిని, మ...నిన్ - మహాత్ = గొప్పదయిన - మహునిన్ = తేజస్సుగలవానిని, కొలుతున్.

తా.—నీవు సర్వమయుఁడవు - బ్రహ్మవిష్ణ్వాది సకల ప్రపంచమునకు సృష్టిస్థితిలయములు నీయందే కలుగును. నీవు అట్టి మహిమకలవాఁడవై పరులకంటెను పరుఁడవై, మహాతేజస్సు గలిగి యున్నావు. అట్టి నిన్ను సేవించెదను.

"మ య్యేవ సకలం జాతం । మయి సర్వం ప్రతిష్ఠితం
మయి సర్వం లయం యాతి । తద్బ్రహ్మా ద్వయ మ స్మ్యహమ్"-వారాహము.

సీ. పరపురుషునికంటెఁ బరుఁడనాఁ జనువానిఁ,
బరమాత్ము, ముక్తికై పరమయోగి
పరిషత్తుచే సదా భావింపఁబడువాని,
నెవ్వనియందుఁ బ్రాకృతము లైన
సత్త్వాదిగుణముల సందడి లే దట్టి,
విమలుని సర్వభూతములకంటె
నాద్యుఁడు శుద్ధుండు నగువాని విభుఁ గళా
కాష్ఠానిమేషాది కాలసూత్ర

తే. మయినయెవ్వానిశక్తియింద్రియవితతికి
గోచరము గాదొ నిర్లేపుఁడై చెలఁగుట
నతివిశుద్ధుఁడు దానయ్యె నౌపచార
వృత్తిఁ బరమేశుఁ డగు నిన్నుఁ విష్ణుఁ దలఁతు. 3

(1) పరపురుషునికంటెన్ = దేహేంద్రియములకు పరుఁడైన జీవునికంటె, పరుఁడనాన్ = పైవాఁడు అనునట్లుగా, చనువానిన్ = ఒప్పువానిని, పరమ ఆత్మున్ = ఉత్తముఁ డయినయాత్ముని, ముక్తికై = సంసారవిముక్తికొఱకు, పరమయోగి పరిషత్తుచేన్ = ఉత్తము లయిన యష్టాంగయోగి నిష్ఠులసమూహముచేత, సదా = ఎల్లప్పుడును, భావింపఁబడు వానిన్ = ధ్యానింపఁబడు వానిని, (2) ఎవ్వనియందు, ప్రాకృతములు = ప్రకృతి సంబద్ధములు, ఐన - సత్త్వ ఆదిగుణముల సందడి = సత్త్వరజస్తమోగుణములయొక్క వ్యాపారము - లేదు = లేదో, అట్టి - విమలునిన్ = నిర్మలుని, సర్వభూతములకంటెన్ = ఎల్లపదార్థములకంటెను, ఆద్యుఁడు = ముందుండిన వాఁడును, శుద్ధుండు = నిష్కల్మషుఁడును, అగు వానిన్, విభున్ = సర్వవ్యాపకుని, కళా...ము - కళా = ముప్పదికాష్ఠల కాలము - కాష్ఠా = పదునెనిమిది ఱెప్పపాట్లకాలము - నిమేష = ఱెప్పపాటుకాలము - ఆది = లోనయిన - కాల = అనేహస్సుయొక్క (సమయముయొక్క) సూత్రము = క్రమనియమము, అయిన - ఎవ్వాని - శక్తి = ప్రభావము, ఇంద్రియ వితతికిన్ = ఇంద్రియసమూహమునకు, గోచరము = గ్రాహ్యము, కాదొ, (3) తాను, నిర్లేపుఁడు = అంటనివాఁడు, ఐ, చెలఁగుటన్ = వర్తించుటచేత, అతివిశుద్ధుఁడు, అయ్యెన్, ఔపచారికవృత్తిన్ = ఆరోప వ్యాపారముచేత, పరమేశుఁడు, అగున్ = అయి యున్నాఁడో (అట్టివానిని), విష్ణున్ = శ్రీహరిని, నిన్నున్, తలఁతున్ = భావింతును.

తా.—జీవులకంటె పైవాఁడు, సర్వవిలక్షణుఁడు, ఉత్కృష్టుఁడు నగునాత్మయు, మహాయోగులు మోక్షార్థులై సర్వదా ఎవ్వని ధ్యానింతురో అతఁడు, ఎవనియందు ప్రకృతిసంబంధులైన సత్త్వరజస్తమోగుణములవ్యాపారము లేదో, విమలుఁడు, ఎల్లభూతములకంటె ముందుండినవాఁడు, శుద్ధుఁడు, సర్వవ్యాపకుఁడు, నిమేషకాష్ఠాకలాద్యాత్మక మయినకాలమును నడిపించువాఁడు ఇంద్రియములకు అందనిమహిమకలవాఁడు, ఇట్టివాఁడయ్యును ఆరోపవ్యాపారముచేత పరమేశ్వరుఁడుగా నొప్పుచున్నవాఁడు అయినశ్రీవిష్ణుని నిన్ను భావించెదను.

పర-"యూరానాత్మోత్తమాః పరః" - అమ. - "పరోఽరిఃపరమాత్మా చ కేవలే పర మవ్యయమ్" - నానా. యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణసమాధులు ఎనిమిది యోగాంగములు.—ప్రకృతి యనఁగా సత్త్వరజస్తమస్సు లనెడిమూఁడుగుణములసామ్యము- "ప్రధానం ప్రకృతిః స్త్రియామ్." - సత్త్వము నిర్మలము, జ్ఞానప్రకాశాత్మకము-రజస్సు రాగాత్మకము తృష్ణాదికారణము - తమస్సు అజ్ఞానకార్యము మోహప్రమాదాదికారణము.

"సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్।
తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ।
రజో రాగాత్మకం విద్ధి తృష్ణాఽసఙ్గసముద్భవమ్।
త న్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్।
తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనమ్ సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత" భ. గీ. 14. (5, 6, 7, 8.)

"సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః." అమ. సర్వభూతములకంటె నాద్యుని- "ఏకోఽహ వై నారాయణ ఆసీ న్న బ్రహ్మా నేశానో న మే ద్యావాపృథివీ న నక్షత్రాణి నాపో నాగ్ని ర్నసోమో న సూర్యః" అని యుపనిషత్తు. 'కళాకాష్ఠానిమేషాదికాలసూత్రమయి' - కాలము శ్రీవిష్ణుస్వరూపము.— "కాలోఽయం భగవాన్ విష్ణు రనన్తః పరమేశ్వరః। తద్వ్యాప్తా పూజ్యతే సమ్యక్ పూజ్యః కోఽన్య స్తతోమతః"

క. "ఇలలోఁ గాష్ఠానిమిషం। బులు మఱియుఁ గలాముహూర్తములు రతిరాగం
బులు తృష్ణాలోభంబులు। జలధిసుతాశేషభోగశయనులు వత్సా." విష్ణుపురాణము.

వ. అని పరస్వరూప సురసేవ్య భవ్య దివ్యావతారలీలలం బ్రస్తుతించినఁ గౌస్తుభాభరణుండు కరుణాతరంగితంబు లగు నపాంగంబుల నమ్మునిం గనుంగొని కుశలప్రశ్నంబుఁ గావించి కంకణాలంకార క్రేంకారంబు లంకురింపఁ బదపంకజంబులకుఁ గుసుమాంజలులు సమర్పించు సకలసీమంతినీసీమంత ముక్తామణి యగు నాముక్తమాల్యదరూపు నెలఁబ్రాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన. 40

పర...లకున్ - పరస్వరూప = (నిత్యముక్తులకు సేవనీయమైన) పరస్వరూపముయొక్కయు; పదపంకజంబులకున్ = తనయొక్క (అనఁగా రంగనాథునియొక్క) పాదకమలములకు; కుసుమ అంజలులు = పువ్వులదోసిళ్లు, సక...ణి - సకల = ఎల్ల - సీమంతినీ = స్త్రీలయొక్క, సీమంత=

పాపటయందలి - ముక్తామణి = ముత్తెపుంబూస (అనఁగా ఎల్లస్త్రీలలోను ఉత్తమోత్తమురాలు);
...సాభిప్రాయంబుగా = మెచ్చుదలయు నభిలాషయుం గలవాఁడై.

సీ. దీనిచూ పుదుటెక్కఁ గానెకా సిరిపట్టి
  కిని బోర బిరుదుఁడెక్కెంబు గలిగె
దీనికౌ నల్లాడఁ గానెకా గర్వించి
  యుర్విఁ జైత్రునకుఁ గాలూఁదఁ గలిగె
దీనిపాలిం డ్లుబ్బఁ గానెకా రతిచేతి
  కిన్నెర మ్రోఁతకు వన్నె గలిగె
దీనిమో మొప్పారఁ గానెకా వాణి రా
  యంచ లేమకుఁ గులాయంబు గలిగె

తే. దీని పెన్నెఱు లేపారఁ గానెకా ప్ర
పోషితమయూరికి విరాలి పొందఁ గలిగె
దీనియడుగులు రంజిల్లఁ గానెకా పి
పాసఁ బడు తేఁటులకు నెట్టుకొంట గలిగె. 41

(1) దీని చూపు = ఈ నెలఁత యొక్క చూడ్కి, ఉదుటు ఎక్కఁగానెకా = ఉద్ధతింపఁగానే కదా, సిరిపట్టికిన్ = మన్మథునికి, పోరన్ = యుద్ధమందు, బిరుదుఁడెక్కెంబు = మీనుగల పడగ, కలిగెన్ = దొరకినది, (మదనునికి మాత్స్యము పడగ, ఆమె మచ్చెకంటి, యని యర్థము);

(2) దీని - కౌను = నెన్నడుము, అల్లాడఁగానెకా = అసియాడఁగానే కదా, చైత్రునకున్ = వసంతునికి, గర్వించి = పొగరుకొని, ఉర్విన్ = భూమియందు, కాలు ఊఁదఁ గలిగెన్ = అడుగు మోపుటకు వలను ఆయెను-(లతావికాసము వసంతధర్మము - ఆమె నడుము తీఁగవలె సన్నగిల్లి అందమొందినదనుట);

(3) దీని - పాలిండ్లు = కుచములు, ఉబ్బఁగానెకా = బటువయి విజృంభించినందువలననే కదా, రతిచేతికిన్నెరమ్రోఁతకున్ = రతీదేవి వాయించుచున్న వీణావిశేషంపు సునాదమునకు (నిర్హ్రాదమునకు), వన్నెగలిగెన్ = రంజన యలవడెను (తుంబిచేత కిన్నెరకు సునాదము - ఆమె పాలిండ్లు తుంబీఫలములవలె నిండారిన వనుట);

(4) దీని - మోము = వదనము, ఒప్పారఁగానెకా = పసమించినందుననే కదా, వాణి రాయంచలేమకున్ = వాగ్దేవి వాహనమయిన రాజహంసికి, కులాయంబు = గూఁడు, కలిగెన్ - (వాణిహంసికి పుండరీకము గూఁడు, ఆమె వదనము పుండరీకమువలె తేజరిల్లె ననుట);

దీని - పెన్నెఱులు = కేశపాశము, ఏపారఁగానెకా = వర్ధిల్లినందువలననేగదా, పోషితమయూరికిన్ = పెంపుడునెమలికోమలికి, విరాళి = వలపును, పొందఁగలిగెన్ = వహించుభాగ్యమబ్బెను (మయూరి మేఘమును, వలచును, ఆమె పెన్నెఱులు కారుమబ్బులవలె నయిన వనుట); దీని - అడుగులు = చరణములు, రంజిల్లఁగానెకా = ఎఱుపు మీరినందువలనఁగదా, పిపాసఁబడు

తేఁటులకున్ = దప్పిగొన్న తేనెటీఁగలకు, మెట్టపంటకలిగెన్ = సులువుగా త్రాగనలవడునట్టి మెట్టదామరపంట దొరకినది.

తా.—యౌవనము వచ్చునప్పటికి ఆ యమ్మవారికి నేత్రములకు మదనుని గెలుపుటెక్కెయంపు మీలశోభయు, కౌనునకు చైత్రంపులతామతల్లీ సౌభాగ్యంబును, పాలిండ్లకు రతిచేతికెన్నెరకాయల సొంపును, ముఖమునకు వాణీహంసీనివాసార్హ పుండరీకశ్రీయును, ఎఱ్ఱని నిద్దంపుటడుగులకు మెట్టదామరలయందంబును, కలిగెనని భా. మాలాపర్యాయోక్తాలంకారము. వివక్షితము లైన మీనాదులను వానివాచకములచే చెప్పక మనోహరభంగ్యంతరముచేఁ జెప్పుటచే పర్యాయోక్తము.

'ఉదుటు' - ఉదురునకు కృదంతము. 'సిరిపట్టి' మఱెవ్వరును అంతయందమైనటెక్కెము నలవఱుచుకొనరుగావున; 'చూపులు' లోనగునీవర్ణితము లన్నియు అత్యంతమదనోద్దీపకము లైనవని పద్యభా. 'గర్వించి' - తనకు నిలువరముగా అట్టిలోకోత్తరవల్లి దొరకినందులకు. 'రతిచేతి' - మఱియొకరు ఇంతయందమైనతుంబీఫలములం దెచ్చుకొనరు గావున. ఇట్లే గుణాతిశయముకొఱకే వాణీపోషితలయు మెట్టయొక్కయు ప్రస్తావము. 'కులాయో నీడ మస్త్రియాత్,'' అమ. 'డాలు టెక్కెంబు సిడంబు పడగ యనఁ। గేతునామంబులు కేతుచుండు' ఆం. భా.

తే. అనుచు నువ్విళులూరి మురారి తమక
మాఁప లే కాత్త దివ్యశుద్ధాంతసీమ
కన్నెలంతఁ దార్చి యొక్కమాయావధూటి
నట్ల కావించి వారున్నదనియ యుండ. 42

అనుచున్ = ఇట్లు తలపోయుచు, ఉవ్విళులూరి = కోరికమీరికలెత్తి, మురారి = శ్రీరంగనాథుఁడు, తమకము=ఆతురతను, ఆఁపలేక=అణంపఁజాలక, ఆత్తదివ్య శుద్ధాంతసీమకున్ = శ్రేష్ఠమైన తన యంతఃపురప్రదేశమునకు, అన్నెలంతన్ = ఆలేమను, తార్చి = ప్రవేశపెట్టి, ఒక్కమాయావధూటిన్ = ఒక మాయాయువతిని, అట్లు = ఆ గోదాదేవివలెనే, కావించి=చేసి, వారు= ఆ విష్ణుచిత్తాదులు, ఉన్నదనియ = ఆ గోదాదేవియే అక్కడనున్నదని, ఉండన్ = తలంచుచుండఁగా; "స్త్ర్యగారం భూభుజా మన్తఃపురం స్యా దవరోధనమ్,'' 'శుద్ధా న్తశ్చావరోధశ్చ' అమ.

వ. పూజకులచేఁ బాదతీర్థప్రసాదపరివేష్టనంబు లిప్పించి విడిది కనిపిన గుడి వెడలి శాంబరితనుసంభవం బాలకిం బెట్టి గృహంబునకుం జని పంజరంబు సడలించి యచ్చంచలాక్షిం గానక. 43

ప్రసాద = భగవదనుగ్రహ సూచకము లైన పుష్పమాలాదికములు. పరివేష్టనంబు=గుడిలో పూజాదిసమయ విశేషములయందు శిరమునకుం జుట్టెడు వస్త్రఖండ విశేషము, దానికి పరివట్ట మని వ్యవహారము. శాంబరీ తను సంభవన్ = మాయా శరీర పుత్త్రిని (మాయచే రంగధాముఁడు గోదాదేవిరూపమున నిర్మించిన కన్యను), పాలకీన్ = పల్లకియందు, పెట్టి = కూర్చుండఁజేసి, గృహంబునకున్ =విడిదికి, చని, పంజరంబున్ = బురకాను (గవిసెనను), సడలించి = వదలుచేసి, అచ్చంచలాక్షిన్ = ఆ క్రాల్గంటిని (గోదాదేవిని,) కానక (అవలికన్వయము )

శా. అబ్రహ్మణ్యము ! లోన వైచి కొనె నన్యాయంబున న్మత్సుతం
దా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూఁదియుం దోఁతురే

యీ బ్రక్కన్ ద్విజుఁ జూడ రయ్య సభవారీ రంగభర్తంచు దుః
ఖాబ్ధ్రాశిం బడి బాష్పకంఠుఁడు సముద్యద్దోఃపలాలుండునై. 44

అబ్రహ్మణ్యము=చంపఁగూడదు చంపఁగూడదు, ఈరంగభర్త=ఈరంగనాథుఁడు, తాన్, బ్రహ్మాదులన్ బ్రహ్మదేవుఁడు మొదలగువారిని, మేరన్ = వారివారి మర్యాదలో (హద్దులో), నిల్పియున్ = నెలకొలిపినవాఁడయ్యును, ప్రభుత్వంబు = పరిపాలనాధికారమును, ఊఁదియున్ = వహించినవాఁడయ్యును, మత్ సుతన్ = నాతనయను, అన్యాయంబునన్ = అధర్మవృత్తిచేత, లోనన్ = తనయంతఃపురములోపల, వైచికొనెన్ = దాఁచికొన్నాఁడు, ఈ ప్రక్కన్ ద్విజున్ = దీనుఁడును బ్రాహ్మణుండును ఐయిన యీనన్ను. దోఁతురే = దోఁచుకొనవచ్చునా, సభవారు = ఓసభాసదులారా, చూడరయ్య = అయ్యలారా విచారింపుఁడు. అంచున్ = ఇట్లు మొఱపెట్టుచు, దుఃఖ అప్ రాశిన్ = శోకసముద్రములో, పడి = మునిఁగి, బాష్పకంఠుఁడు=కన్నీళ్లతోడి గొంతు కలవాఁడు, స...డున్ - సముద్యత్ = పైకిలేచుచున్న (= పైకెత్తఁబడిన) - దోఃపలాలుండు = గడ్డివంటి (కృశములైన) బాహువులుకలవాఁడును, ఐ, (అవలి కన్వయము.)

తా.—అంతట ఆ విష్ణుచిత్తస్వామి పల్లకి శూన్యంబగుటం గని రంగనాథునిపై మొఱవెట్టుకొన సాగెను. "అయ్యలారా, ఈ యన్యాయమును విచారింపుఁడు. నాప్రాణములం గావుఁడు. ఈ రంగనాయకుఁడు నాకు ద్రోహముచేసినాఁడు. నాకొమార్తను అపహరించి తనయింట దాఁచుకొన్నాఁడు. నేను తపఃకృశుఁడను, బ్రాహ్మణుఁడను. ఈయన బ్రహ్మాదులకెల్ల నియామకుఁడయ్యును లోకములను పరిపాలింపం బూనుకొన్నవాఁడయ్యును, నన్ను దోఁచుకొనవచ్చునా? అయ్యా, ఓసభాసదులారా, ఈయధర్మమును విచారింపుఁడు" అని దుఃఖసముద్రములో మునిఁగి బాష్పములు అడ్డుపడిన యెలుంగుతో, తపస్సుచేత ఎండిపోయిన బాహువులు పైకెత్తి మొఱయిడసాగెను.

"అబ్రహ్మణ్య మవధ్యోక్తిః." అమ. 'అన్యాయంబునన్' - ఒకరు తప్పుచేసిన దండించువాఁడు తానే తప్పు చేయుట మిక్కిలి యధర్మము. 'ప్రభుత్వంబు' - పాలింపఁబూనుకొన్నవాఁడు దోఁచుకొనుట మఱియు నధర్మము. 'ప్రక్కతనము' - 'ద్విజత్వము' - వీనిచేత దోఁపుడుయొక్క దోషము హెచ్చును. 'రంగభర్తంచు' అనుపాఠము ఛత్రమాకారసంధి. "రంగభృత్తు"ని పఠించిన నిర్దోషము. 'అబ్ధ్రాశి' - అప్ =నీళ్లయొక్క - రాశి=కుప్ప - అనఁగా సముద్రము. 'బాష్పకంఠుఁడు'- "కణ్ఠః స్తమ్భిత బాష్పవృత్తికలుష శ్చిన్తాజడం దర్శనమ్," శాకుంత. "నాడీ నాళం చ కాణ్డోఽస్య పలాలో స్త్రీ స నిష్ఫలః." అమ.

శా. అంతే వేడుకయైనఁ బెండ్లగుటకే నా, దేహము న్ప్రాణముల్
సంతానంబు నిశాంతము న్ధనము సస్యంబు ల్పశుశ్రేణు లే
కాంతస్వస్వజనాప్తనంబునకఁ గాదా కూర్చుటే మీ కయో
వింతే యీ బుడుతెంత నన్నులుచఁ గావింపం దను న్నెత్తురే. 45

అంతే (ని) వేడుకయైనన్ =అంత ఎక్కువప్రీతి తనకుఁ గలిగినయెడల, పెండ్లగుటకున్ = వివాహమగుటకు, ఈ నా = నేను ఇయ్యకుండునా (తప్పక యిత్తు ననుట), దేహము = ఒడలిని, ప్రాణముల్ = అసువులను, సంతానంబున్ = సంతతిని, నిశాంతమున్ = ఇంటిని, ధనమున్ = ద్రవ్యమును, సస్యంబుల్ = పైరులును, పశుశ్రేణిన్ = పసులమందను. కూర్చుటే=సంపాదించుట

టయే, ఏ...క - ఏకాంత = ముఖ్యమైన - స్వ = తనవారైన - స్వజన = భక్తులయొక్క అర్చనంబునకు = పూజకొఱకే, కాదా, మీకుఁ, అయో = అకటా, వింతే = నూతనమా, (నా దెల్ల తద్భక్తసాత్కరించుటకే అన్నమాట తెలిసియే యున్నది అట్లుండఁగా), ఈ బుడుత = ఈపిల్ల, ఎంత = ఏపాటి, నన్ = నన్ను, కుఱుచ గావింపన్ = అవమానపఱిచినచో, తనున్ = ఈ రంగ భర్తను, మెత్తురే = లోకులు అభినందింతురా?

తా.—నాకొమారితమీఁద తనకు ఇంతమక్కువ గలిగినయెడల నేను తప్పకుండ దానిని తనకు వివాహార్థమై యిత్తునుగదా; నాసర్వస్వమును తనభక్తుల కిచ్చుటకే గదా. ఇట్లుండఁగా, తనకే ఈ బుడుతను ఇచ్చుట నాకేపాటి? నన్నడిగి కైకొనక యిట్లు నన్నవమానించిన తన్ను లోకులు మెత్తురా.—కావ్యార్థాపత్తి. పా. ఎంత వేడుక... బెండ్లగుట కనె'?

మీ రందఱుం జెప్పి నాపిల్లను నా కిప్పింపుఁడు అని భా. "పుంసి భూమ్న్యసవః ప్రాణాః," "వంశోఽన్వవాయః సంతానః," "నిశాన్తవస్త్య సదనం భవ నాగార మన్దిరమ్", "తీవ్రైకాన్త నితాన్తాని గాఢబాఢదృఢాని చ." అమ.

చ. శివుఁడు విరించి వాసవుఁడు జెప్ప నశక్తులు, కొల్చునట్టి వా
రవుట, నిరంకుశుండ వని యక్కట పాడిఁ దొఱంగఁ జెల్లునే?
భువనములెల్ల నీ వయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా
గవతులు లేరె? నా కొఱకుఁ గాఁగ వహించుకొనంగఁ గేశవా. 46

కేశవా = ఓశ్రీహరీ, శివుఁడు, విరించి = బ్రహ్మ, వాసవుఁడు = ఇంద్రుఁడును, కొల్చునట్టివారు అగుటన్ = నిన్ను సేవించుచుండువారగుటంబట్టి, చెప్పన్ = నీకు తప్పొప్పులు బోధించుటకు, అశక్తులు = అసమర్థులు - వెఱతురనుట, (కావున) నిరంకుశుండన్ = అడ్డులేనివాఁడను, అని = అనితలంచుకొని, అక్కట = అయ్యో, పాడి తొఱంగఁ జెల్లునే = ధర్మము తప్పవచ్చునా, భువనము లెల్లన్ = లోకము లన్నియు, నీ వయినన్ = నీవి అయినన్ = నీ స్వామ్యమే అయినను - లేక - నీకన్న అన్యములు కాకపోయినను, (నా వర్తనముపై పరులెవ్వరు విచారకులు?" అందువేని), పొంతన్ = నీచెంత, దయానిధి = కరుణాసేవధియైన - అమ్మ = లోకమాత మహాలక్ష్మి, లేదే = లేదా, భాగవతులు = నీభక్తులు, లేరె = లేరా, నాకొఱకుఁ గాఁగ వహించుకొనంగన్ = నాకై పూనికొని నీకుం జెప్పఁగలవారు నీభక్తులే యున్నారు; నీవుభక్తపరాయణుఁడవు: వారిని ఎట్లు తప్పించుకోఁగలవు; కనుక నన్ను మోసగించుట నీకు శక్యముగాదు.

'నిరంకుశుండవు' = అంకుశమును సరకుసేయనివాఁడవు. అడ్డువారు లేనివాఁడ వనుట - అంకుశము = మావటీఁడు ఏనుఁగును కుంభస్థలమునం గొట్టి నడపించు నాయుధము. "అఙ్కుశో స్త్రీ సృణిః స్త్రియామ్," అమ. 'నీవు అయినన్' అనుటకు—

'హరిమయము విశ్వ మంతయు। హరివిశ్వమయుండు, విశ్వమంతయు, హరి యా
హరిమయము గానివస్తువు। పరమాణువు లేదు వంశపావన వింటే'

"అమ్మ = 'ఇన్దిరా లోకమాతా మా,' - 'భార్గవీ లోకజననీ,' అమ.

ఉ. నెట్టన యల్ల లచ్చి యల నీళయు భూసతి యుండ, నీకు నీ
నెట్టుక సీలపై మనసు నిల్చుట కే మనవచ్చు? వెజ్జె యా

నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్క వింతచూ
పెట్టిది? దిద్దు నెవ్వఁ డిల నేఱులవంకలు వారిడొంకలున్. 47

ఇట్లు తలంచియు పెరియాళ్వారు మరల వికల్పంబులం బొందుచున్నాఁడు.—

నెట్టన = అనివార్యముగ - ఈ - నెట్టిక సీలపైన్ = సదాచార పరతంత్రమీఁద, మనసు నిల్పుటకున్ = కోరిక పుట్టినందులకు, ఏమనవచ్చున్ = ఆశ్చర్యమగుచున్నది. వెట్టి యానట్టుగన్ = వెట్టిబాగులవాఁ డగునట్లుగా, పేదన్ = దీనుని, నన్ను, పరిహాసము, చేఁతకున్ తక్కన్ = చేయుటకుఁ గాని, వింతచూపు ఎట్టిది = ఇంతకుముం దెన్నఁడును చూడని సౌందర్యమును ఈ పిల్లయందు చూచినాఁ డనుట అబద్ధము, ఇలన్ = లోకములో, ఏఱుల వంకలున్ వారి డొంకలున్ = నదులవక్రతను నీటిదారులను, ఎవ్వఁడు, దిద్దున్ = సవరించును (ఎవఁడును గొప్ప వారితప్పులను సవరింప నేరఁడు, ఈయనను న్యాయ్యమార్గమునకుం దేఁగలవారెవ్వరును లేరు, ఏమి చేయుదును అనుట.)

తా.—లోకాతీత లయినయట్టి మైలాండ్రు శ్రీభూనీళలు తనకుం దప్పక యుండఁగా, అతని మనస్సు ఈనైష్ఠికురాలిమీఁద నిలిచిన దనుట ఆశ్చర్యముగా నున్నది. వెట్టిబాగులవానిని నన్ను పరిహాసముచేయుటకై ఇతఁ డిట్లు గాపించినాఁడుగాని, వారియందు లేనిసొబగును ఈబాలికయం దీతఁ డేమి కన్నాఁడు? అక్కటా! ఇంతటివారే ఇట్టిపోకలం బోయిన చక్కఁబఱుచువా రెక్కడఁగలరు? పరిహాసకారణము చెప్పినాఁడు గావున విభావన గాదు. 'దిద్దు...డొంకలున్' - లలితాలంకారము.

నెట్టికసీల అని అడ్డిగలోని మఱకు వ్యవహరింతురు. అదియు నిట సరిపడును. ఇట చిన్న పిల్లయని నిందాగ్రకము గావచ్చును.

వ. అని యిట్లు ధరణీసురుం డదవెట్టు భాగవతక్షోభంబునకు భువనభర్తయు భయంపడి తచ్ఛాందసంబునకుఁ గేలిసేయు చున్నవాఁ డను భావం బతనికిఁ దోఁప మకరకుండలమండితంబు లగు గండదర్పణంబులం జిఱున వ్వెలర్ప నిట్లనియె. 48

అదవెట్టన్ = మొఱయిడఁగా - భయంకరమైన - భాగవత = విష్ణుభక్తునియొక్క - క్షోభంబునకున్ చిత్తోద్వేగమునకు, భువనభర్తయున్ = జగన్నాథుండును, ...తత్ = అతని - ఛాందసత్వమునకున్ = వేలతనమునకు,...మక...లు - మకరకుండల = మొసలివాతమ్మంటుల చేత, మండితంబులు = కైసేయఁబడినవి, గండ దర్పణంబులన్ = చెక్కుటద్దములందు, ఎలర్పన్ = వికసిల్లఁగా. - పా. అదవెట్టు - అద = విచారము.

చ. *ముదిమదిఁ దప్పితోటు మునిముఖ్య! భవత్తనయ న్గ్రహింబునన్
బదిలము చేసి యిచ్చి మఱి బట్టబయల్వెడదూరు దూరె, దా
సదన మిఁకొక్కమాటరసి చంచలలోచనఁ గానకున్న దూ
రెదు మఱి కాని, బుద్ధివికలతఁ బొందక పోయి చూడుమా. 49

* 'దానితల్లిగ నల్లసాని పెద్దన తెల్పె ముదిమదిదప్పి యాముక్తమాల్య' చూ. పీఠిక పు. 69.

మునిముఖ్య = ఓయిమునివరా, ముదిన్ = ముదిమిచేత, మది తప్పితి ఓటు=బుద్ధి చెడితివా ఏమి, పదిలము=భద్రము, బట్టబయల్=బహిరంగముగా - వెడదూరు మూరెదు=వట్టినింద నామీఁద మోఁపుచున్నావు=సదనము. ఇల్లు చంచలలోచనన్ = క్రాల్గంటిదైన నీతనయను. దూరెదు మఱి కాని=అప్పుడు (నన్ను) నిందింతువుగాక. బుద్ధి విపరీతతఁ బొందక=విపరీతబుద్ధి మాని...

ఇందు నాలవపాదమున-'దూ। రెదు విపరీతత' అని నిందార్థక దూరుధాతు గతరేఫమునకు లఘురేఫముతో యతి ప్రయోగింపఁబడినది. నిందార్థకదూఱుధాతువున గురురేఫము శ. ర. పతితము. ఆంధ్రభాషార్ణవమున దీన నుభయరేఫములును పఠితములు—

"అఱడి యవసడి యగ డారుదూఱు దూ
రు దెసంతు సడి రోయి రోఁత రొచ్చు
సేగింపు సెగ్గము సే సేవగింపు నా
నపవాదసంజ్ఞలై యలరుచుండు."

ఇందులకు ఈ నిఘంటుకర్తకు ఈ ప్రయోగమే శరణము గానోపును.

తే. అనిన నాతండ్రి యాయెనే యనియె నేమె
యెఱుంగమే యార్తిఁ గడుపు చల్లంగఁ బలికి
కరుణచేసితి విజయివి గమ్మటంచు
బాష్పజల మాఁగి యింటికిఁ బరువువాఱె. 50

నాతండ్రి=ఓయినాతండ్రీ (హర్షార్థకము). ఆయెనే = ఆయినదే - అనియెన్ = అయినదే (అనఁగా నీవు ఏమోటక్కు చేసి యిప్పుడు దిద్దుచున్నావు - అనుట), ఆర్తిన్ = దుఃఖమును (ఏ దుఃఖకారణముగాని), ఎఱుంగమే = ఎన్నఁడు నెఱుంగము, కడుపు చల్లంగన్ = నీకడుపు చల్లఁగా నుండునట్లుగా (అనఁగా చల్లనికడుపుతో - చల్లని హృదయముతో), పలికి, కరుణ చేసితి = నాయం దనుగ్రహము నెఱపితివి, విజయివి గమ్ము = నీకు మేలుగలుగుత, అటంచున్ = అని దీవించుచు, బాష్పజలము = మున్ను దుఃఖోద్రేకము చేత ఉబికియున్న జలమును, ఆఁగి = పైకి పొంగనీయకుండ అణఁచుకొని...

ఆ. మ్రొక్కినట్టి తనయ మూర్థంబు మూర్కొని
ప్రమదబాష్పములుల బ్రాహ్మణుండు
చేత వెన్ను నిమిరి నాతల్లి నిముఁ గంటిఁ
గా యటంచు నింటి కడ వసింప. 51

...మూర్థంబు = మొదలను, మూర్కొని = ఆఘ్రాణించి, ప్రమద = ఆనంద.

తే. రంగపతి బ్రహ్మరుద్రుల బ్రాహ్మి గౌరిఁ
దనకు నక్కన్య నడిగింపఁ బనుపుటయును
వారు సేనేశ సహితులై వచ్చుటయును
విష్ణుచిత్తుండు సంభ్రమా న్వితుఁ డగుచు. 52

రంగపతి = రంగనాథుఁడు, బ్రహ్మరుద్రులన్ = బ్రహ్మను శివుని, బ్రాహ్మిన్=సరస్వతిని, గౌరిన్ = రుద్రాణిని, అడిగింపన్ = అడుగుండని... సేనేశసహితులు = హరిసేనానాయకుఁ

డైన విష్వక్సేనునితోఁ గూడుకొన్నవారై...సంభ్రమ అన్వితుఁడు = ఆత్యాదరముతోఁ గూడుకొన్నవాఁడు,...

'అన్వీతుఁడు - 'అను' 'ఉపసర్గ' 'ఈ' ధాతువు; (అన్వితుఁడు' - అను+'ఇ' ధాతువు.) - "సంభ్రమోఽత్యాదరే భీతావావేశే" - నానా.

వ. విష్వక్సేనపూర్వకంబుగా వినయంబున నాతిథ్యంబు లొసంగి యుచితాసనంబుల నాసీనులై యున్నవారి యాగమనప్రయోజనం బడిగి తెలిసి ప్రమదరసభరితాంతరంగుండై యిట్లనియె. 53

విష్వక్సేనపూర్వకంబుగా = ముందు విష్వక్సేనునికి అగునట్లుగా. ఆగమనప్రయోజనము = రాకకు (కారణ మయిన) ఫలము.

## —* గోదాదేవీ రంగనాథుల వివాహము *—

క. ధన్యుఁడ నైతిం దన కీ
కన్యక నీఁగాంచి భృగువుగౌరవముఁ బయో
ధిన్యాయము నొదవె నిటే
నన్యాయంబే? చమూప హర విధులారా. 54

చమూప హర విధులారా = ఓ సేనాపతీ శివుఁడా బ్రహ్మదేవుఁడా, తనకున్ = శ్రీరంగనాథునికి, ఈకన్యకన్ = ఈ నాకొమరితను, ఈన్ గాంచి = ఇచ్చునట్టిభాగ్యము అబ్బినవాఁడనై, ధన్యుఁడను = కృతార్థుఁడను, ఐతిన్, నాకు, భృగువు గౌరవమున్ - ఆ భృగుమహామునికిం గలిగినయౌన్నత్యమును, పయోధన్యాయమున్ = సముద్రునియొక్క రీతియు, ఒదవెన్ = కలిగెను, ఇటేన్ = ఈ ప్రకారము అడిగి పుచ్చుకొన్నచో, అన్యాయంబే = అధర్మమగునా. పదార్థవృత్తి నిదర్శనాలంకారము.

'భృగువు...న్యాయము'—లక్ష్మి తొలుత భృగుసుతిగా నుండి, పిమ్మట పాలసముద్రునకు పుత్త్రిగాఁ బొడమినది. అందువలననే ఆమెకు "భార్గవి, క్షీరసాగరకన్య" యని పేరులు.

తే. "భృగువునకు ఖ్యాతికిని మున్ను దగఁ దనూజ। యై జనించినకమల యనంతరంబ
దివిజదానవు లమృతార్థు లవుచుఁ బాల। కడలిఁ దరువంగఁ గ్రమ్మఱఁ బొడమె నందు." విష్ణు పు.

క. వినుఁ డీఁదగు సంబంధపు
టెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చు
ల్కని నరులు; గాన మాపుర
మునకు న్విజయంబు సేయఁ బుత్త్రిక నిత్తున్. 55

వినుఁడు - ఈఁదగుసంబంధపు ఎనయికన్ = కొమారితను ఇయ్యఁదగిన వియ్యంపుఁబొందికను,...చుల్కనినరులు = అల్పులు, విజయంబు చేయన్ = వచ్చినయెడల...

తే. ప్రభుతఁ బరమేశ్వరుం డైనఁ బత్ప్రిపన్న
జనమున కొసంగు మీకు నీ చనవు, శౌరి
తానె కట్టినభూమికిఁ దాల్చు మాకు
ఘనత యిది మమ్ముఁ జేయుట తనదుఘనత. 56

శౌరి = శ్రీహరి, ప్రభుతన్ = దొరతనముచేత, పరమ ఈశ్వరుండు = ఎల్లవారికిని పైయేలిక, ఐనన్ = అయినప్పటికిని, ప...కన్ - పత్ = పాదములను - ప్రపన్న = ఆశ్రయించిన - జనమునకన్ = జనమయిన, మీకున్ ఈచనవున్ = ఈమాటచెల్లుబడిని, ఒసఁగున్ = ఇచ్చును (అనఁగా మీరు చెప్పినచో వల్లె యని రంగధాముఁడు పెండ్లికై మాయూరికి మా యింటికి తరలి వచ్చును), (అట్లువచ్చుట) తానె, కట్టినభూమికన్ = ధరించిన శ్వశుర వేషమును, తాల్చుమాకున్, ఘనత = గౌరవము, ఇది = ఈగౌరవమును, మమ్ముఁజేయుట = మాకుఁగావించుట, తనదుఘనత = తనకేగౌరవము.

'స్వామీ త్వీశ్వరః పతి రీశితా। అధిభూర్నాయకో నేతా ప్రభుః పరిబృఢోఽధిపః' అమ. 'భూమిక' - 'అన్యరూపై ర్యదన్యస్య ప్రవేశః స తుభూమికా' - భరత.

తే. అనినఁ జని విన్నవింప దయార్ద్ర
చిత్తుఁడై విశ్వభర్త పక్షిప్రధాన
పౌపవాహ్యంబు నెక్కి బ్రహ్మాదిసురలు
బలసి తమతత్తడుల నెక్కి కొలిచి రాఁగ. 57

అనినన్ =విష్ణుచిత్తుఁ డిట్లు చెప్పినంతట. చని=విష్వక్సేనాదులు మరల రంగధర్తకడకుం బోయి, విన్నవింపన్ = విష్ణుచిత్తునికోరికను ఆయనకు నివేదింపఁగా, విశ్వభర్త - విశ్వ=నిఖిలమునకు,-భర్త=ప్రభువైన రంగధాముఁడు, దయార్ద్రచిత్తుఁడు=కరుణచేత తడిసిన (కరఁగిన) డెందము కలవాఁడు, ఐ, పక్షిప్రధానపు ఔపవాహ్యంబున్ = గరుత్మంతుఁ డనెడులీలావాహనమును, బ్రహ్మ ఆదిసురలు, బలసి = పరివేష్టించి, తమతత్తడులన్ = తమతమవాహనములను, ఎక్కి, కొలిచి = సేవించుచు రాఁగన్.

క. నాసీరుఁ డగుచు సూత్రవ
తీసఖుఁ డుడువీథిఁ బౌజుఁ దీర్చిన ప్రజ భూ
షాసి శతకోటి శతకో
టీ సవితృప్రభలు దిశల దెప్పర మలమన్. 58

సూత్రవతీసఖుఁడు = సూత్రవతీదేవివల్లభుఁడయిన విష్వక్సేనుఁడు (సేనాపతి), నాసీరుఁడు = సేనలకుముందు పోవువాఁడు అగుచున్, ఉడువీథన్ = నక్షత్రమార్గమున (ఆకాశమున), పౌ...లు,-పౌఁజులు దీర్చిన = బారులుగా పన్నినట్టి - ప్రజ = జనులయొక్క - భూషా=ఆభరణములు - అసి = కత్తులు - అనెడి - శతకోటి శతకోటీ = వజ్రాయుధముల నూఱుకోట్లయొక్క - సవితృ = సూర్యులయొక్కయు - ప్రభలు = కాంతులు, దిశల = దిక్కులను, దెప్పరము = వెల్లుగా, అలమన్ = క్రమ్ముకొనఁగా.

తా.—విష్వక్సేనుఁడు తాను ముందఱ చనుచు పెండ్లివారి నందఱను వరుసలు తీర్చి తన వెంటం దరలించుకొనిపోయెను. ఆజనుల సంఘముయొక్క నగలు ఆయుధములును నూఱుకోట్ల యింద్రాయుధములవలెను నూఱుకోట్లసూర్యులుగాను వెలుంగుచు దిక్కులం గ్రమ్ముకొన్నవి.— రూపకము. 'శతకోటిః స్వరుః శమ్బో దమ్భోళి రశనిర్ద్వయోః' అమ. నాసీరశబ్దము అగ్రసరార్థమందు త్రిలింగము గావున, ఇట పుంలింగ మహాద్వాదక మయి డుమంతం బయినది.

వ. శ్రీవిల్లిపుత్తూరికిం జని విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి యయ్యాదిమవరుండు దివ్యాప్సరసలు హరిద్రాదిక స్నానీయ మంగళ ద్రవ్య మండనం బొనర్పఁ బెండిలికొడుకై దివ్యవాదిత్రంబులు నారదాది దివ్యముని గానంబులు వెలయం గలధౌత ధవళ దివ్య ధారాధరంబులు గురియు సుధాధారల నభిషిక్తుండై ముక్తావళీ కౌస్తుభాముక్త కంబుకంధరుండును కేయూరకంకణాలంకృతుండును మకరకుండల మకుటాది భూషావిభూషితుండును దివ్యాంగరాగ భూషితుండును బీతాంబర సంవీతుండును దులసీకల్పతరు ప్రసవస్రగ్రాశోభిష్ణుండునై యుండె నంత, నక్కడ నటకు మునుప గృహప్రవేశంబు నేసి సంభ్రమాయత్తుం డగు విష్ణుచిత్తు ప్రయత్నంబున. 59

విడిదిపట్టునన్ = విడిదియింటియందు, విడిసి = దిగి, ఆ ఆదిమ వరుండు = ఆ మొదటి పెండ్లి కొమరుఁడు, దివ్య అప్సరసలు = దివ్యాంగనలును అచ్చరలును, హరిద్రా...నంబు - హరిద్రా = పసుపు - ఆదిక = లోనుగాఁగల - స్నానీయ = స్నానమునకు తగినదైన - మంగళ ద్రవ్య = శుభ వస్తువులతోడి - మండనంబు = అలంకారమును, [ఆ దివ్యభామ లందఱును శ్రీహరిని పెండ్లి కొడుకుం గావించిరనుట] దివ్యవాదిత్రంబులు = దేవవాద్యములు, కలధౌత = వెండివలె - ధవళ = తెల్లనిదైన - దివ్యధారాధరంబులు = దేవసంబంధములైన మేఘములు, సుధాధారలన్ = అమృత ధారలచేత, ...ఆముక్త = అలంకరింపఁబడిన - కంబు = శంఖమువంటి - కంధరుండును = కంఠము గలవాఁడును, కేయూర = బాహుపురులు, ...అంగరాగ = మైపూఁతచేత - భూషితుండును = అలందంబడినవాఁడును - పీత అంబర సంవీతుండును = పచ్చని (బంగారపు) వస్త్రముచేత - ఆవరింపఁబడినవాఁడును, స్రక్ = మాల్యములచేత.

'విడిది' - 'విడియు'నకు కృ. 'ఆదిమవరుడు' = లోకమాతకు భర్త యయినందున ఆదిమూఁడు. కౌస్తుభము సముద్రము దచ్చినపుడు అందుండి యుద్భవించినపద్మరాగమణి, దానిని శ్రీహరి హృదయమందుఁ దాల్చినాఁడు. 'వాదిత్రంబులు' - 'తతం వీణాదికం వాద్య మానద్ధం మురజాదికం । వంశాదికంతు సుషిరం కాంస్యం తాలాదికం ఘనం । చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్' 'గుణిత భూషితే' - అమ.

క. శర్వాణీ వాణీ ముఖ
గీర్వాణీకోటి జానకీరఘుకులరా
ట్పూర్వాచరిత వివాహా
ఖర్వ సుగీతములు పాడఁగా విభవమునన్. 60

శర్వా...టి - శర్వాణీ = మృడాని - వాణీ=సరస్వతి - ముఖ= మొదలుగాఁగల - గీర్వాణీ కోటి = అమరీసమూహము, జాన...లు - జానకీ = సీతాదేవియొక్కయు - రఘుకులరాట్ =రఘు వంశపు రాజయిన శ్రీరామునియొక్కయు - పూర్వ = మున్ను - ఆచరిత = నెఱవేర్పఁబడిన - వివాహ = పెండిలియొక్క - అఖర్వ=శ్రేష్ఠములయిన - సంగీతములు=మంచిపాటలు, పాడఁగా, విభవమునన్ = ఐశ్వర్యముతో (పై కన్వయము.)

తా.—శచీ సరస్వత్యాది దేవాంగనాసమూహములు పూర్వము జరిగినసీతారాములవివాహగీతములను పాడుచుండఁగా.—

తే. నెమ్మి నేకావళియు స్రగ్విణియును జామ
రంబు లిరుగెడ నిడ హరిద్రాద్రవమునఁ
బెట్టిరి నలుంగు నక్కన్యఁ బెండ్లికూఁతుఁ
జేయు ఋషిపత్ను లర్థి నాశీర్యుతముగ. 61

నెమ్మిన్ = ప్రేమచేత, ఏకావళియున్ స్రగ్విణియున్ = ఆపేర్లుగలవారైన యామె చెలికత్తెలు, ఇరుగెడన్ = రెండుపార్శ్వములయందును, చామరంబులు ఇడఁగన్ = వింజామరలు వీవఁగా, ఋషిపత్నులు = అరుంధత్యాదిఋషిభార్యలు, అర్థిన్ = కోరికతో, ఆశీర్యుతముగన్ = దీవెనలతోఁగూడ, అక్కన్యన్ = ఆగోదాదేవిని, పెండ్లికూఁతుఁజేయన్ = హరిద్రాద్రవమునన్ = పసుపునీటితో, నలుంగులు పెట్టిరి = ఉద్వర్తనములు గావించిరి.

తా.—ఏకావళీస్రగ్విణులు ప్రేమతో ఇరుగెడలను వింజామరలు వీచుచుండ, అరుంధత్యాది ఋషిపత్నులు ఆగోదాదేవిని దీవించుచు పసుపునీళ్లతో నలుఁగులు పెట్టి పెండ్లికూఁతుం గావించిరి.

తే. అట్లు వైవాహికప్రదీక్షయమరఁ గమ్మ
నూనెఁ దలయంటి నెఱులు గందానఁ బులుమ
స్వర్ణమణికుంభహిమవారి జలక మాడి
నట్టి జగదీశ్వరికి వేల్పు టబల యొత్తు. 62

అట్లు, వైవాహికప్రదీక్ష = వివాహప్రయోజనకమయిన యారంభాచారము, అమరన్ = జరుగఁగా, కమ్మనూనె = పరిమళయుక్తమయిన తైలముతో, తల అంటి = అభ్యంజనము గావించి, నెఱులు = తలవెండ్రుకలను, గందానన్ = శ్రీచందనముతో, పులుమన్ = రుద్దఁగా, స్వర్ణమణికుంభ హిమ వారిన్ =కనకరత్నమయ మయిన ఘటములందలి శీతలోదకములతో (పన్నీటితో నని యొండె), జలకము = స్నానము, ఆడినట్టి - జగదీశ్వరికిన్ = లోకనాయికకు, వేల్పుటబల= దేవాంగన, ఒత్తు (అవలి కన్వయము.)

క. తడి యొత్తి సన్న వలిపం
బిడి మణిపీఠస్థయైన యింతి మెఱుఁగు పె
న్నిడుదకురు లార్చి ధూపం
బిడి తుఱుము ఘటించె నొకమృగేక్షణ నెమ్మిన్. 63

ఒక - మృగేక్షణ = హరిణాక్షి, తడి, ఒత్తి = అద్ది, సన్న వలిపంబు = సన్నని వలువను, ఇడి=కట్టి, మణిపీఠస్థ = రతనంపుఁ బీటపై గూర్చున్నట్టిది,...ఆర్చి = తడియారంజేసి,...తుఱుము= కొప్పు...[ఈచిన్నపద్యమున ఇడి అనెడి యొకటే పదము రెండుమార్లు ప్రయుక్తము. అట్లు చేఁత ప్రశస్యము గాదు.]

సీ. యాపకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తు
లభ్యక్తములు సేసె నతిప యొత్తు

నయకల ప్రేళ్లమట్టియలుఁ బిల్లాండ్లిడి
పాయవట్టముఁ బెట్టి పైనొకర్తు
నెఱికవట్టి పసిండి నీటివ్రాఁత చెఱంగు
వెలిపట్టు రహిఁ గట్టె వెలఁది యొకర్తు
కటిసీమఁ గనకమేఖలఁ జేర్చి తారహా
రములు గీలించెఁ గంఠమున నొకర్తు
తే. కటకములు హస్తసరము లంగదము లంగు
ళీయకములును బాహువల్లికల వ్రేళ్ల
నిలిపి తాటంకనాసామణుల నమర్చి
చొనిపె సీమంతవీథిఁ జేర్చుక్క యొకర్తు. 64

(1) అతివయొకర్తు, యావకద్రవమునన్ = లత్తుకనీళ్లతో, అరుణ అంఘ్రి నఖ పంక్తులు = ఎఱ్ఱని యడుగు గోరుల వరుసలను, అభ్యక్తములు = పూయఁబడినవానినిగా, [పారాణిపెట్టెననుట,]

(2) నయ = నయము, కల = నాణెమయిన...మట్టియలును పిల్లాండ్లును పాదాంగుళ్యాభరణవిశేషములు, పాయవట్టము = అందె (అందె లనుట);

(3) నెఱిక పట్టి=కుచ్చిళ్లు పెట్టి, పసిఁడి నీటి వ్రాఁత చెఱంగు వెలిపట్టు=బంగారు ద్రవంపుఁ జిత్తరువుపనిగలదైన చెఱంగుగల తెల్లపట్టుచీరను.

(4) కటిసీమన్ = పిఱుందుమీఁద, కనక మేఖలన్ = బంగారపు మొలత్రాటిని,...తారహారములు=ముత్యాలసరములు, కీలించెన్ = తగిలించెను; కటకములు=చేతికడియములు, హస్తసరములు = చేగొలుసులు, అంగదములు = బాజిబందులు, అంగుళీయకములు = ఉంగరములు, బాహువల్లికలన్ = తీవలవంటి బాహువులయందును, వ్రేళ్లన్ = చేతియంగుళులయందును, నిలిపి= పెట్టి, తాటంకనాసామణులన్ = కమ్మలను బులాకిని, అమర్చి = సవరించి, సీమంత వీథిన్ = పాపట రేఖయందు, చేర్చుక్క = పాపటబొట్టు, చొనిపెన్ = పెట్టెను.

యావక - 'యావోఽలక్తోద్రుమామయః', 'పదఙ్ఘ్రిశ్చరణోఽ స్త్రియామ్,' అమ. 'నయకల' - 'ము' లోపము శిష్టప్రయోగముచే సాధువు. ''తాటంకవాచకంబగుట గమ్మ యనఁగాను,'' ఆం. భా. ''పాపటబొట్టు జిలిబిలిజల్లియుఁ జేరుచుక్క,'' ఆం. భా. ''ములనూలనంగ నొప్పును. గటిసూత్రాఖ్య। మంగుళీయంబగు నుంగరమన,'' ఆం. భా. ''మను పీరమద్రె నా మట్టె యనఁగ। బిబ్బిలికాయ నాఁ బిల్లాణి యనఁ జెటి। బొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగు। ళివిభూషలు,'' ఆం. భా. ''కచ్ఛభేదాభిధాన మెసంగుఁ। గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పంజ। చుంగు రింగు నెఱికచింగు నెఱి యనంగ,'' ఆం. భా.

క. కలికి తెలిగన్నుఁ గవఁ గ
జ్జలరేఖలు దీర్చి మేన సారంగమదం
బలఁది లలామక మిడి చెం
గలువలు క్రొవ్వెదకు వేఱొకర్తు ఘటించెన్. 65

కజ్జల రేఖలు = కాటుక గీఱలు, సారంగమదంబు = కస్తూరి, అలఁది = పూసి, లలామకము = నొసటఁ గట్టెడుబాసికము, క్రొవ్వెదవన్ = కొప్పునను.

"కజ్జలేఽఞ్జనమ్" నా నా. 'మృగనాభి ర్మృగమదః కస్తూరీ చ,' అమ. 'మృగ=సారంగ;
"లలామకము - 'లలాటోపరి ముక్తాజాలవద్భాసురమాల్యభేదే' S. C. అని బ్రౌణ్యము; 'పురోన్యస్తం లలామకమ్'' అమ.

వ. ఇట్లలంకృతయై యుండ లగ్నం బాసన్నంబయ్యె నని విన్నవించుటయుఁ బన్నగశయనుండు మార్తాండ మండలంబులు పండ్రెండును దివియలై వెలుంగఁ, దారకలగుంపు జగజంపుగా శతపత్త్రశత్రుండాతపత్త్రత యంగీకరింప, సింధుపతి సౌగంధికదళోపహారసహితంబుగా విపణిఁ గలయంపిఁ జిలికింపఁ, బ్రకృతికాంత క్రంత సురకాంతలం గూడుకొని సంతరింప, హుతవహుం డగరుధూపంబు రేపఁ, బర్జన్యుం డుల్లెడయిడఁ, బ్రాచీనపాఠంబులు పాఠకఘోషంబు లయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీతమాంగల్యంబున నంతరంగంబునకింపొసంగ, విహంగపుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప, నప్రాకృతవైభవంబునం జని, పరమసంభ్రమంబున భాగవతవతంసంబు భక్తికలితబహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత డిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయిపయిం బడి గీర్వాణసిద్ధసంఘంబు లహంపూర్విం గుర్వనిర్వారిగా నూర్చుకొని ప్రాశింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనదపీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారుభృంగారుకంబులఁ గనకభాజననిక్షిప్తంబు లగు కుశేశయవేశల పదకిసలయంబులు గడిగి షోడశోపచారసహితంబును సపరిష్క్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయ నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబ. 66

జగజంపుగా = ప్రకాశమానమైన ముత్యాలజాలరుగా, శతపత్త్రశత్రుండు = చంద్రుఁడు, ఆతపత్త్రతయంగీకరింపన్ = గొడుగుకాఁగా, సింధుపతి = సముద్రుఁడు, సౌగంధికదళోపహార = కహ్లారంపురేకులకానుక, ప్రకృతికాంత = మాయయనునాతి, క్రంత = పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకు తీసికొనిపోవు ప్రధానద్రవ్యసముదాయము, పర్జన్యుండు = మేఘుఁడు, ఉల్లెడ=మేలుకట్టు, ప్రాచీనపాఠంబులు = వేదములు, అప్రాకృత = అలోకసామాన్యమైన, ఎక్కిరింత = వాహనము, అహంపూర్వికన్ = నేనుముందు నేనుముందు అని త్వరపడుచు, షోడశోపచారంబులు - ఆవాహన - ఆసన - పాద్య - అర్ఘ్య - ఆచమనీయ - స్నాన - వస్త్ర - యజ్ఞోపవీత - గంధ - పుష్ప - ధూప - దీప - నైవేద్య - తాంబూల - ఉత్తరనీరాజన - మంత్రపుష్పములు.

మ. కలధౌతద్రవ చిత్రము ల్మెఱయ ముక్తాస్యూత మామేచకాం
చలపుం బెండెలు వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁబె
ద్దలు పంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రీతి నన్యోన్య మం
జుల మస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిట్టుము ల్రాఁడఁగన్. 67

కల...ల్ - కలధౌత = బంగారపు - ద్రవ = నీటియొక్క - చిత్రముల్ = చిత్రపు వ్రాఁతలు, మెఱయన్ = తళతళలాడుచుండఁగా, ముక్తాస్యూతము = ముత్తెములచేఁ గుట్టఁబడినది (ముత్యాలు కుట్టినట్టిది), ఔ - మేచక అంచలపున్ = నల్లని యంచులుగల - బెన్దెరన్ = పెద్దతెరను, వారి = పట్టి, లగ్నము = సుముహూర్తము, సమాసన్నంబు కాన్ = సంప్రాప్తింపఁగానే, వేల్పుఁబెద్దలు = దేవతలయందలి పెద్దవారు, వంపన్ = తెరను క్రిందికి దింపఁగా, అర్థిన్ = కోరికతో, సముద్యత్ ప్రేమన్ = ఉప్పొంగుచున్న యనురక్తితో, కను మించుల్ = నేత్రధాళధళ్యంబులు, చిఱుసుఱ్ఱు ఆడఁగాన్ = సందడింపఁగా, అన్యోన్య మంజులహస్తంబులన్ = ఒండొరుల మనోజ్ఞ కరములయందు, గుడజీరకంబులు = బెల్లమును జీలకఱ్ఱయును, ఉంచిరి = పెట్టిరి. ['మస్తకంబుల నించిరి' - పా. శిరములందు నిండుగా పెట్టిరని యర్థము.]

తా.—ముత్యాలు కుట్టిననల్లనియంచులతోడి పెద్దతెరను ఆదంపతులనడుమ వేల్పుఁబెద్దలు పట్టుకొనియుండి, లగ్నము రాఁగానే క్రిందికి దింపిరి. అంతట నాదంపతులు ఒండొరులపై తమ చూపులు సందడింప ప్రీతిపెంపుతో ఒండొరులచేతులయందు (లేక ఔదలలయందు) జీలకఱ్ఱతోడి బెల్లమును ఉంచిరి. 'కలధౌతం రౌప్యహేమ్నోః,' అమ. గుడజీరకంబులు చేతియందిడుటకు—

"గీ. అచట మణిపీఠమునను శ్రీహరి వసించు। సమయమున జంద్రకళ యతిసంభ్రమమునఁ
గనకభృంగారు గొని యుదకములు పోయఁ। గడఁకఁ బదములు గడిగి భూకాంతుఁ డప్పుడు,
"గీ. అర్చనలు చేసి, గంధమాల్యాదు లొసఁగి,। జీరకగుడంబు హరి వలచేతఁ దాల్ప,
వైఖరి నొసంగి, జలములు వార్వఁ జేసి,। యట సుఖాసీనుఁ గావించినట్టియెడను.

చూ. చంద్రికాపరిణయము 6 (66)లో - గుడజీరకంబులను పెద్దలు వధూవరులశిరంబుల నుంతురని వివాహకల్పమం దున్నది. ఇందే 4 (151) చూ.

చ. మఱి వనమాలిచూడమును మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకిసల మేళనఁ జక్రి చెమర్ప రాలి మై
నఱిముఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా
ల్గిఱిగొన జాలు ధారల బలెన్ వడగండ్లబలె న్గనుంగొనన్. 68

మఱి = అనంతరము, మానిని = గోదాదేవి, వనమాలి చూడన్ = హరి శిరమునందు, మును = ముందుగా, [లేక వనమాలిచూడమునన్ = రంగనాథుని యౌదలయందు]. ముత్తెపుఁబ్రాలు = ముత్యాలతలంబ్రాలు, పోయుచోన్ = పోయునపుడు, అమ్మణులున్ = ఆముక్తాఫలములును, తత్...నన్ - తత్ = ఆదేవియొక్క - అంగుళీకిసల = చివుళ్లవంటి వ్రేళ్లయొక్క - మేళనన్ = తాఁకుడుచేత, చక్రి = రంగనాథుఁడు, చెమర్పన్ = చెమటం బొందఁగా, మైన్ = ఒడలియందు, అఱిముఱిన్ = దట్టముగా, రాలి = దేహమునుండి యూడి తొరుఁగుచు, ఘర్మబిందువులున్ = చెమటబొట్టులును, అమ్మణులున్ = ఆతలంబ్రాలముత్తములును, కనుంగొనన్ = చూడఁగా, మొగిలందునుండి = మేఘమునుండి, జాలు - ధారల బలెన్ = వానచినుకులవలెను, వడగండ్లబలెన్ = కరకలవలెను, డాల్ = తళుకు, గిఱికొనన్ = పర్వుచుండఁగా; మెఱయున్ = ప్రకాశించును.

తా.—గోదాదేవి రంగనాథునితలపై ముత్యాలతలంబ్రాలు పోయునప్పుడు ఆమెయొక్క చివుళ్లవంటిచేతులు ఆతనియౌదలకు సోఁకఁగా, ఆ స్పర్శప్రభావముచేత ఆతని దేహము చెమర్చినది.

అంతట ఆచెమటబొట్లును ఆతలంబ్రాల ముత్తెములు ఆతనియొడలినుండి క్రిందికి రాలినవిధ మెట్లుండె ననఁగా, మేఘమునుండి వానచినుకులును వడగండ్లును రాలుటవలె నుండినది.-ఉపమాలంకారము.

'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః,' అమ. 'శిఖాచూడాకేశపాశః' అమ. 'చూడమునన్' అనుపాఠమున మువర్ణమును సాధించుటకై చూడాశబ్దమును కంధరాదులందుఁ బఠించుకొనవలయును. ప్రాలు = బ. బియ్యము - దీనికేకవచనము ప్రాయి - హరి నల్లనివాఁడు గాన మేఘసామ్యము, స్వేదబిందువులు ద్రవరూపమున నుండునుగాన వర్షోదకబిందుసామ్యము, ముత్తెములు తెల్లగాను దృఢముగాను గుండ్రగాను ఉండుటంబట్టి కరకాసామ్యము.

తే. ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తుచోట
గుబ్బపాలిండ్లక్రేవ గ్రక్కున మురారి
గన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పైకెగురఁజల్లె. 69

ఇంతి = ఆచెలువ, దోయిటన్ = దోసిటితో, సేసఁబ్రాలు = తలఁబ్రాలు, ఎత్తుచోటన్ = ఎత్తెడుసమయాన, గుబ్బ = వట్రువలైన - పాలిండ్ల - క్రేవన్ = పార్శ్వములయందు, గ్రక్కునన్ = తటాలున, మురారి = రంగనాయకుఁడు, కన్నువేయుటన్ = పాలిండ్లక్రేవఁ జూంచి గాంచుచున్నాఁ డని, కని = ఎఱిఁగి, లజ్జ = సిగ్గు, కదురన్ = కలుగఁగా, బాహులు, (అతని శిరముమీఁదికి), ఎత్తక, కర అగ్రములన్ = చేతితుదలతోనే, పైకిన్ = అతని శిరముమీఁదికి, ఎగురన్ = ఎగిరిపోయిపడునట్లు, చల్లెన్.

తా.__ఆమె తలంబ్రాలదోసిటిని పైకెత్తినప్పుడు, చనుగ్రవలు చక్కఁగాఁ గనఁబడుంగాన, ఆసమయాన తటాలున వానిపైకి హరి చూడ్కిని నిగుడ్పఁగా, ఆమె ఆకిటుకుం గని లజ్జచేత దోసిటిని పైకెత్తకయే అతని శిరముమీఁదికి ఆతలంబ్రాలను ఎగఁజిమ్మెను. ఇందు లజ్జయను సంచారిభావము చెప్పఁబడినది.

'సేస' - ప్ర. 'శేషా నిర్మాల్యదానేస్యాత్.' హైమ.

క. గళమునఁ గట్టెను హరి మం
గళ సూత్రము పులక లతివ గాత్రముఁ బొదువన్,
నెలఁతయుఁ బతియును గరముల
నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. 70

హరి, అతివగాత్రమున్ = ఆయింతిదేహమును, పులకలు = గగుర్పాటు, అలమన్ = క్రమ్మునట్లుగా, గళమునన్ = ఆమెమెడయందు, మంగళసూత్రము, కట్టెను, నెలఁతయు=ఆచెలువయును, అన్యోన్యంబున్ = ఒండొరులకు, కరములన్ = చేతులయందు, (మనికట్లయం దనుట), కంకణంబులు = వివాహప్రతిసరములను, అలవఱిచిరి = కట్టిరి.

మంగళసూత్రము భార్యాభర్తలకు ఆయుఃప్రదము - "మాఙ్గల్యతన్తునానేన మమ జీవనహేతునా । కణ్ఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదః శతమ్" అని దానిం గట్టెడుమంత్రపర్యాయము.__కంకణము - వివాహదీక్షాతోరము - "కఙ్కణం కరభూషాయాం సూత్రమణ్డనయో

రపి,'' మేదిని.- మెడలోఁ గట్టఁగా భిన్నదేశమున గాత్రమునఁ బులకలు జనించుటచేత అసంగత్య లంకారము.

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి,
శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు
తెలివఁ గూడి యరుంధతీదర్శనముఁ జేసె,
బ్రహ్మరుద్రాది గీర్వాణకోటి
యర్పించు నుడుగర లనుకంపఁ గైకొని
యనిచెఁ బ్రసాదభాజనులఁ జేసి,
యాత్మపట్టణమున కతివఁ దోడ్కొని విజ
యంబు సేసెను మహావైభవ మొప్ప,
తే. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
కుంజముల నీలకుంతలఁ గుస్తరించి
కంతుసామ్రాజ్యమేలించి కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించుచున్న వాఁడు. 71

(1) శార్ఙ్గిన్=హరి, లలనచేన్=ఆలేముచేత, నిష్ఠతోన్=నియమానుసారముగా, లాజలు= పేలాలను, వేల్పించి = హోమము చేయించి, సప్తపదులు మెట్టించెన్ = వివాహాగ్ని చుట్టును ఏడు అడుగులు తన వెంట నడిపించెను;

(2) తెలివన్ = ఆయెల నాగను, కూడి, అరుంధతీవీక్షణము చేసెన్ = అరుంధతీనక్షత్రమును దర్శించెను; బ్రహ్మ రుద్ర ఆది గీర్వాణకోటి = పితామహుఁడు శివుఁడు లోనగు దేవసమూహము, (3) అర్పించు ఉడుగరలు = చదివించినట్టి కట్నములను, అనుకంపన్ = దయాపూర్వకముగా, కైకొని = పుచ్చుకొని, ప్రసాదభాజనులఁ జేసి=వారిని అనుగ్రహమునకుం బాత్రులం గావించి, అనిచెన్ = వారివారితావులకు అంపకము గావించెను, (4) అతివన్ = అయింతిని, తోడ్కొని = కూడంబెట్టుకొని, అతివైభవమ్మునన్ = మహాపరిభవముతో, ఆత్మపట్టణమునకున్ = తనపురమైన శ్రీరంగమునకు, విజయమ్ముచేసెన్ - వేంచేసెను.

సహ్యకన్యా తట ఉద్యాన చందనద్రు కుంజముల నీడన్ = సహ్యపర్వతుని కూతురైన కావేరీ నదియొక్క తీరమందలి యారామములోని చందనవృక్షములపొదలనీడలయందు, నీలకుంతలన్ = నల్లని తలవెంట్రుకలుగలదైన యాజాయను, కుస్తరించి = ఉపలాలనలుచేసి, కంతుసామ్రాజ్యము = మన్మథునియొక్క దొరతనమును, ఏలించి, కరుణ = కృప, చిత్తము = హృదయమును, ఒలయన్ = వ్యాపింపఁగా జగములన్ = లోకములను, పాలించుచున్న వాఁడు = ఏలుచున్నాఁడు.

పతి నూఱేండ్లు బ్రతుకుటకై వధువు లాజహోమము చేయును. సప్తపదులు ద్రొక్కించుట సఖ్యసిద్ధికొఱకు. అరుంధతీదర్శనము వధువునకు అరుంధతి సాటిగా పాతివ్రత్యాదికమును, ఆ దంపతులకు అరుంధతీవసిష్ఠుల దాంపత్యమువంటి దాంపత్యమును, సిద్ధించుటకు, 'సహ్యజా'-కావేరి సహ్యపర్వతమునంబుట్టినది. పాలించుట ఆయనయొక్క యధికారము.

ఉ. స్కందసరస్తటీరమణ కందర చందన కుందవాటికా
మందసమీరలోల వనమాలిక నిర్మలదివ్యవిగ్రహా
స్పందవిభాధరీకృత నభస్స్ఫుటకాళిక వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతి భేదన పేశల వంశవాదనా. 72

స్కంద...మాలిక - స్కందసరః = స్వామిపుష్కరిణియొక్క - తటీ = తీరములయందలి - రమణ = రమణీయములైన - కందర = గుహలయొక్కయు, చందనకుందవాటికా = చందనవాటికయొక్కయు - మొల్లవాటికయొక్కయు - మందసమీర = మృదువాయువుచేత - లోల=చలించుచున్న - వనమాలిక = వనమాలగలవాఁడా. నిర్మ...ళిక - నిర్మల = స్వచ్ఛమైన - దివ్య = శ్రేష్ఠమైన - విగ్రహా = మూర్తియొక్క - అస్పంద = తిరమయిన - విభా = కాంతిచేత-అధరీకృత = అతికరింపఁబడిన - నభః = ఆకాశముయొక్క - స్ఫుట = ప్రవ్యక్తమయిన - కాళిక= నైల్యముకలవాఁడా, వల్ల...దన - వల్లవాంగనా = గొల్లభామలయొక్క - బృంద=సమూహముల యొక్క - మనోభిమాన = ఆత్మగౌరవమును - ధృతి = ధైర్యమును - భేదన = పగుల్చునట్టి - పేశల = మంజులమైన - వంశ - పిల్లనగ్రోవియొక్క - వాదన = వాయించుటగలవాఁడా.

తా.—ఓ వేంకటేశ్వరస్వామీ, నీవనమాల స్వామిపుష్కరిణిచెంగటిగుహలనుండియు, చందన వాటికలనుండియు, కుందవాటికలనుండియు, వీచెడుపిల్లతెమ్మెరలచే కదలుచున్నది. నీదివ్యమంగళవిగ్రహము నీలచ్ఛాయయందు ఆకాశముం బురణించుచున్నది. నీవేణునాదములు చెవిం బడఁగానే గొల్లభామినులు బెట్టును తేఁకువను గోలుపోయి నిన్నుం జేరుదురు.

స్వామిపుష్కరిణి తిరుపతికొండలోనిది, గావున, దానిచేత శ్రీవేంకటాచలపతి సూచితుఁడు. 'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః,' అమ. 'ఆపాదపద్మం యా మాలా వనమాలేతిసా మతా' ఇతి కళిఙ్గః - అనిరామాశ్రమి; వనమాలయే వనమాలిక. ''కాళికా చణ్డికాభేదే కాష్ణ్యే'' మేదిని. వల్లవాంగనావంశవాదనములచేత కృష్ణావతారము సూచితము.

క. అరిధారాఖండిత మరు
దరిసంఘు, విహంగవాహనా; యుదరమహాం
బురుహ పుటభరిత మధుశం
బర భర జలమానుషాయమాణద్రుహిణా. 73

అరి...ఘ - అరి = చక్రముయొక్క - ధారా = వాదరచేత - ఖండిత = నఱకంబడిన- మరుత్ అరి = దేవశత్రువులయొక్క (అసురులయొక్క)- సంఘు = సమూహముకలవాఁడా, విహంగవాహనా = (గరుత్మంతుఁడు) వాహనముగాఁగలవాఁడా, ఉద...ణా - ఉదర = కడుపుయొక్క - పుట = దొన్నెయందు - భరిత = నిండిన - మధుశంబర = నీటివంటిదైన తేనెయొక్క - భర= పూరమునందు - జలమానుషాయమాణ = నీటిమానిసివలె నొప్పుచున్న - ద్రుహిణా = బ్రహ్మగలవాఁడా.

స్వామీ, నీవు నీచక్రాయుధంపువాదరతో అసురులను పరిమార్చితివి. పక్షియైన గరుత్మంతుఁడు నీకు వాహనము. నీ బొజ్జనుండి పొడమిన దొన్నెవంటిపుండరీకములో నిండియున్న తేనెవెల్లియందు నీటిపెల్లునందుంబోలె బ్రహ్మదేవుఁడు నీటిపాపవలె నొప్పుచున్నాఁడు. ఉపమ.

స్రగ్విణి. వాలినిర్భేదనా వారిజాతేక్షణా
శైలకన్యాస్తుతా శార్ఙ్గచంచద్భుజా
ఫాలదృక్పద్మభూపాకభేదిస్ఫుర
న్మౌళిమాణిక్యరుఙ్మండితాంఘ్రిద్వయా. 74

వాలినిర్భేదనా = వాలిని తెగటార్చినవాఁడా, వారిజాతఈక్షణా = తామరసాక్షుఁడా, శైలకన్యాస్తుతా = పార్వతిచేత పొగడఁబడినవాఁడా, శార్ఙ్గ చంచత్ భుజా = సింగిణివింటితో కదలుచున్న బాహువులు గలవాఁడా, ఫాల...యా - ఫాలదృక్ = నిటలాక్షుఁడైన శివుఁడు - పద్మభూ = తమ్మిచూలియైనవలువ - పాకభేది = పాకాసురుని సంహరించినయింద్రుఁడు (అను వీరియొక్క) - స్ఫురత్ = వెలుఁగుచున్న మౌళిమాణిక్య = మకుటామణులయొక్క రుక్ = కాంతులచే - మండిత = అలంకరింపఁబడిన - అంఘ్రి = చరణములయొక్క - ద్వయా - యుగళము కలవాఁడా.

మ. ఇది నీలాచలనీలచేలకసుభద్రేందీవరాభాక్షికో
ణదృగంచద్భుజవీర్యధుర్యజయసన్నాహార్భటీవాద్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయమహిజానుత్పాదితాముక్తమా
ల్యదనాశ్వాసము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్. 75

ఇది = ఈ గ్రంథభాగము, నీలా...వన్ - నీలాచల = నీలాద్రియందలి - నీలచేలక = నల్లనివస్త్రము గలవాఁడైనబలరామునితోను - సుభద్ర = సుభద్రయను చెల్లెలితోను (స సహ) = కూడుకొనువాఁడైన - ఇందీవర = నల్లగలువయొక్క - ఆభ = కాంతివంటి కాంతిగలవాఁడైన శ్రీకృష్ణునియొక్క - అక్షి = కంటి - కోణ = కొనయందలి - దృక్ = చూపుచేత - అంచత్ = ఒప్పుచున్న - భుజవీర్య = బాహుబలముయొక్క - ధుర్య = సమర్థమైన - జయసన్నాహ = గెలుపులకైన సరంజాముతోడి - ఆర్భటి = మ్రోఁతతోడి - వాద్య = వాదిత్రములవలని - భీతి = భయముచేత - ఉదిత = లేచినవాఁడు (అనఁగా పలాయితుఁడు) అయిన - ఇభేశ్వర = (కటకపురరాజయిన) గజపతికలవాఁడగు - కృష్ణరాయమహిజాని = కృష్ణరాయభూపతిచేత - ఉత్పాదిత = నిర్మింపఁబడిన (రచింపఁబడినయనుట) ఆముక్తమాల్యదన్ = ఆముక్తమాల్యదా మహాప్రబంధమునందు, సప్తమంబు ఆశ్వాసము = ఏడవయాశ్వాసము, హృద్యంబైన పద్యంబులన్, అలరున్.

తా.—నీలాద్రియని పురాణప్రసిద్ధమైన శ్రీజగన్నాథక్షేత్రమందు బలరామసుభద్రాసమేతుఁడైన శ్రీకృష్ణుని కటాక్షవీక్షణముచేఁ గలిగిన బాహుబలముతో కటకముమీఁదికి కర్ణాటమహీపతి కృష్ణరాయఁడు విజయధాటిం గావింపఁ గటకాధీశుఁడైన గజపతి వింధ్యారణ్యమునకు భయపలాయితుఁ డాయెను. అంతట నారాజ్యము కృష్ణరాయనికి వశమాయెను. ఓ వేంకటాచలపతీ, అట్టియావిజయమునం గృష్ణరాయఁడను నేను రచియించిన యాముక్తమాల్యదాప్రబంధమున ఇది ఏడవయాశ్వాసము హృద్యమయిన పద్యములతో నొప్పారుచున్నది.

శ్రీకృష్ణార్పణమస్తు. ఓం తత్ సత్.

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద - పద్యాదిసూచిక